# భారతదేశ
# స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర

దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా !
— *గురజాడ*

*ప్రచురణ :*

కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం
(రిజిష్టర్డ్ 69/74)
స్వాతంత్ర్య సమరయోధుల స్మారక భవనము, విజయవాడ-520 002



"అందరికన్నా అతిబీదవాళ్లు సైతం ఈ దేశం తమ దేశమని భావించాలి. ఆ దేశ నిర్మాణంలో వాళ్లవాణి కూడా వినపడాలి పై తరగతి, కింది తరగతి ప్రజలు అనే భేదం ఉండరాదు. అన్ని కులాల, మతాలవారు పరిపూర్ణ సామరస్యంతో జీవించాలి. ఇవన్నీ ఉండే భారతదేశం కోసం నేను కృషిచేస్తాను .... అలాంటి భారతదేశంలో అస్పృశ్యతకు తావులేదు .... పురుషులకుండే హక్కుల్ని స్త్రీలు కూడా అనుభవిస్తారు .... ఇదీ నేను కలలుగనే భారతదేశం".

— గాంధీజీ



దండీ యాత్రలో గాంధీజీ

# బ్రిటిష్ ప్రభుత్వాన్ని గడగడలాడించిన కొందరు ప్రముఖ విప్లవ వీరులు



పృథ్వీ సింగ్



చంద్రశేఖర్ ఆజాద్



సుఖదేవ్



భగత్ సింగ్



రాజగురు



ఉద్దామ్ సింగ్
(లండన్‌లో)

జలియన్ వాలా బాగ్‌లో 1919 ఏప్రిల్ 13 న హత్యలకు కారకుడైన పంజాబు గవర్నర్ ఓ డయ్యర్‌ను ఇరవై ఏళ్ళ తర్వాత పగబట్టి లండన్‌లో 1940 మార్చి 13 న తుపాకితో కాల్చి చంపి లండన్‌లో 1940 జూన్ 12 ఉరికంబాలకెక్కిన విప్లవవాద వీరయోధుడు ఉద్దామ్ సింగ్.



ఉద్దామ్ సింగ్
(అమృత్‌సర్‌లో)



వందేమాతరం ఉద్యమంలో ఆంధ్రలో
ప్రప్రథమ స్వాతంత్ర్య సమరయోధుడు
గాడిచర్ల హరిసర్వోత్తమరావు



మద్రాసులో ఉప్పు సత్యాగ్రహ దళంలో
గద్దె రంగయ్యనాయుడు, టంగుటూరి ప్రకాశం, కాశీనాథుని నాగేశ్వరరావు, దుర్గాబాయ్

స్వాతంత్ర్య సమరంలో
అసువులు బాసిన
అమరయోధులకు
అంకితం

# కృష్ణాజిల్లా ఉప్పు సత్యాగ్రహ ప్రథమ దళం

**శ్రీ కోటగిరి వెంకట కృష్ణారావుగారి నాయకత్వాన 1930 ఏప్రియల్ 9 వ తేదీన విజయవాడ నుండి (బందరు) చిన్నాపురం వరకు గ్రామాలలో ప్రచారం చేస్తూ కాలినడకన ఈ దళం వెళ్ళింది.**

*ప్రక్క ఫోటోలో ఈ దళంలో పాల్గొన్న వారిని గుర్తించవచ్చు :*

సర్వశ్రీ 1. గార్లపాటి సుబ్రహ్మణ్యం, 2. కోటగిరి వెంకట కృష్ణారావు, 3. కాట్రగడ్డ మధుసూదన రావు, 4. మేదరమెట్ల సీతారామయ్య, 5. ఘంటసాల సీతారామశర్మ, 6. పిడికిటి రామకోటయ్య, 7. రామినేని రాఘవయ్య, 8. పిడికిటి మాధవరావు, 9. పిడికిటి నారాయణమూర్తి, 10. శనగవరపు సుబ్బయ్యశాస్త్రి, 11. కాకాని వెంకటరత్నం, 12. చింతమనేని శ్రీరాములు, 17. పాటిబండ్ల వెంకట సుబ్బయ్య, 18. చొప్పదంటు భద్రయ్య, 19. అన్నె కేశవాచార్య, 20. కోటగిరి పార్థసారథి, 21. పరిమి నీలాచలం, 23. గూడపాటి వెంకటసుబ్బయ్య, 24. పొన్నలూరి రాధాకృష్ణమూర్తి, 27. కఠారు వీరాస్వామి, 30. సముద్రాలసత్యనారాయణ, 31. కోకా నాగేంద్రరావు, 32. గుళ్ళపల్లి లక్ష్మయ్య, 33. తటవర్తి రంగయ్య, 35. సంకా నిత్యానందం, 36. కాట్రగడ్డ భవానీ శంకరరావు, 39. సుంకర సత్యనారాయణ, 40. శంకర హనుమంతరావు, 41. చెన్నుపాటి మురహరిరావు, 43. బోలిసెట్టి సత్యనారాయణ, 44. పొన్నూరు వీరరాఘవగుప్త.

*మిగతా నంబర్లు గల వారి పేర్లు తెలియడంలేదు. ఈ దళంలో పాల్గొన్న మరికొందరు :*

సర్వశ్రీ వెలగా నర్సయ్య, చలమలశెట్టి కోటేశ్వరరావు, పుచ్చా కోటేశ్వరరావు, ఈడుపుగంటి వెంకట నారాయణ, గన్నె గంగాధరరావు, పెదర్ల ఆదినారాయణమూర్తి.



వెలిదండ్ల హనుమంతరావుగారి నాయకత్వాన బయలుదేరిన ఉప్పు సత్యాగ్రహ ద్వితీయదళం



అయ్యదేవర కాళేశ్వరరావుగారి నాయకత్వాన ఉప్పు సత్యాగ్రహానికి
బయలుదేరిన తృతీయ దళం

# ఇందులో ....

# రచయితల పరిచయం



శ్రీ తుమ్మల వెంకట రామయ్య

(భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర)



శ్రీ పరుచూరి కోటేశ్వరరావు

(తెలుగునాట స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర)



శ్రీ యలమంచిలి వెంకటప్పయ్య

(వివిధ జిల్లాలలో
ప్రముఖ స్వాతంత్ర్య యోధులు–కార్యకర్తలు)



శ్రీ యం. యన్. రాజలింగం

(తెలంగాణము)

# ముందు మాట

ఏ దేశం తన స్వాతంత్ర్య సమరయోధుల-దేశ భక్తుల - త్యాగమయ పాత్రను గుర్తించి, గౌరవించదో, సంస్మరించదో ఆదేశం తన స్వాతంత్ర్యాన్ని సార్థకం చేసుకోక పోగా దానిని సుస్థిర మొనర్చుకోజాలదని ప్రపంచ చరిత్ర చాటుతున్న పరమ సత్యం.

కనుకనే సోవియట్ యూనియన్ వంటి సోషలిస్టు దేశాలలోను, అమెరికావంటి పెట్టుబడిదారీ దేశాలలోను ఆయా దేశాల స్వాతంత్ర్య సమరయోధుల కళ్ళకు కట్టేటట్లు ప్రదర్శించే స్వాతంత్ర్య సమరయోధుల గాథలను కళ్ళకు కట్టేటట్లు ప్రదర్శించే స్వాతంత్ర్య సమరయోధుల సంస్మరణ భవనాలు, చరిత్ర గ్రంథాలు కోకొల్లలుగా కనిపిస్తాయి.

1974లో అన్ని పార్టీల స్వాతంత్ర్య సమరయోధుల సభ్యులతో మా జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం ఏర్పడినది. మా కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘాధ్యక్షులు శ్రీ కాట్రగడ్డ మధుసూదనరావు 1975 లో అమెరికా సందర్శించి నపుడు, అక్కడి స్వాతంత్ర్య సమరయోధుల సంస్మరణ భవనాలు, చిత్రాలు, చరిత్ర గ్రంథాలు వగైరా చూచినపుడు, తన మాతృభూమి భారత దేశంలో స్వాతంత్ర్య సమరయోధుల సంస్మరణకు బదులు, వారిని విస్మరించడం ఎంత ఎక్కువగా వున్నదో ఆయనకు అర్థమైంది. ఆ లోపం తీర్చడానికి కనీసం తన జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల చరిత్రనైనా గ్రంథస్థం చేసి, విజయవాడలో ఎక్కడైనా స్వాతంత్ర్య సమరయోధుల సంస్మరణ భవనం నిర్మించాలన్న భావన ఆయన మనస్సులో ఆనాడే బలంగా పాతుకుపోయింది. అందువల్లనే స్వదేశానికి తిరిగి రాగానే, ఆయన తన సహచరులతో సంప్రతించి, ఆపవిత్ర యత్నానికి ఉద్యమించారు.

కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల జీవిత చరిత్రతోపాటు, భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర, తెలుగునాట స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర, కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలను కూడ పొందుపరచి, చరిత్ర గ్రంథంగా సంకలనం చేసే బాధ్యతను శ్రీ తుమ్మల వెంకటరామయ్య, శ్రీ పరుచూరి కోటేశ్వరరావులకు అప్పగించ బడింది.

ఈ చరిత్ర గ్రంథ ప్రచురణకు అవసరమైన నిధుల సేకరణకు 21-10-80 తేదీ న కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘ సమావేశంలో శ్రీ నిమ్మగడ్డ వెంకటకృష్ణారావు కన్వీనరుగా శ్రీయుతులు కాట్రగడ్డ మధుసూదనరావు కీ॥ శే॥ వల్లభనేని రామబ్రహ్మం, చలసాని సూర్యప్రకాశ రావు, వై. వెంకటరావు, కీ॥ శే॥ కృత్తివెంటి కుటుంబరావు, జోశ్యభట్ల సత్యనారాయణ, పెనమకూరి కేశవరావు, ఈడ్పుగంటి లక్ష్మణరావు, వెనిగెళ్ళ వెంకటేశ్వరరావు, శ్రీమతి సూర్యదేవర అన్నపూర్ణమ్మగార్లతో ఒక ఉపసంఘం ఏర్పడింది.

నిధిసేకరణకు విరాళాల కోసం ప్రముఖులను కలుసుకొన్నప్పుడు ఊహించని ఆదరణ లభించింది. అనతి కాలంలోనే లక్షరూపాయలకు పైగా విరాళాలు వసూలయ్యాయి. విరాళాలు ఇచ్చిన దాతల పేర్లను వేరే పొందుపరచాం. వారికి మా హృదయపూర్వక అభినందనలు.

కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘానికి 1980 ఆగస్టునుండి వస్తున్న స్వాతంత్ర్య సైనిక సన్మానపెన్షను మొత్తంగాను ప్రతినెలా ఇచ్చి ఆర్థికంగా సహాయ పడుతున్న శ్రీ కాట్రగడ్డ మధుసూదనరావు, శ్రీ కాట్రగడ్డ వెంకటనారాయణ

రావు, కీ.శే. శ్రీ కాట్రగడ్డ భవానీ శంకరావుగారి సతీమణి అనసూయమ్మగార్లకు కృతజ్ఞతలు తెలుపుతున్నాం.

ఈ నిధి సేకరణలో ప్రధానంగా కృషిచేసిన ఉప సంఘ సభ్యులు నిమ్మగడ్డ వెంకటకృష్ణారావు, కాట్రగడ్డ మధుసూదనరావు, చలసాని సూర్యప్రకాశరావు, మండవ వెంకటకృష్ణారావు గార్లు, గుడివాడలోను ఇతర చోట్లను నిధిసేకరణలో యధాశక్తి సహాయపడిన ఉపసంఘ సభ్యులు కీ॥ శే॥ వల్లభనేని రామబ్రహ్మం, వై. వెంకట్రావు, ఈడ్పుగంటి లక్ష్మణరావు, వెనిగెళ్ళ వెంకటేశ్వరరావు కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల జీవిత చరిత్రకూ నిధి సేకరణ సంఘానికి ఇంతవరకూ ఆర్థికంగా ఏడువేల ఆరువందల తొంభైఆరురూపాయలు యిచ్చిన శ్రీ అట్లూరి వెంకటసుబ్బారావుగారికి ప్రత్యేక కృతజ్ఞతలు తెలుపుతున్నాం. అదే విధంగా కీ॥ శే॥ తుమ్మల పెద సత్యనారాయణ చౌదరిగారు మూడు వేలు యిచ్చినారు. కీ॥ శే॥. డాక్టర్ రావెళ్ళ రమణారావుగారి భార్య సూరాయమ్మగారు రెండువేల రూపాయలు యిచ్చి, తోడ్పడినందుకు కృతజ్ఞతలు తెలుపుతున్నాం. న్యూయార్క్ ఆంధ్ర సంఘం వారు పదివేలరూపాయలు విరాళమిచ్చినందుకు కృతజ్ఞులం.

అనివార్యమైన ఎన్నో ఇబ్బందులను ఎదుర్కొని, అత్యంత శ్రద్ధా సక్తులతో ఈ గ్రంథాన్ని రచించిన ప్రధాన రచయిత శ్రీ తుమ్మల వెంకటరామయ్య, సహ రచయితలు పరుచూరి కోటేశ్వరరావు, యలమంచిలి వెంకటప్పయ్య, యం.ఎస్. రాజలింగం గార్లకు మా కృతజ్ఞతలు.

ఈ చరిత్రకు అవసరమైన విషయ సేకరణకు సహాయపడిన వేటపాలెం సారస్వత నికేతన్ గ్రంథాలయం వారికీ, గుంటూరు జిల్లా గ్రంథాలయ శాఖ కొల్లూరు గ్రంథాలయం వారికీ, విశాలాంధ్ర గ్రంథాలయం (విజయవాడ) వారికీ, గ్రంథ ప్రచురణకు అవసరమైన తెల్ల కాగితం కొంత రాయితీగా సరఫరా చేసిన రాజమండ్రి ఆంధ్రా పేపరు మిల్లు అధిపతులకు కృతజ్ఞతలు తెలియచేస్తున్నాం.

విజయవాడలో బందరు లాకుల వద్ద స్వాతంత్ర్య సమరయోధుల భవన నిర్మాణానికి ఎంతో విలువైన స్థలాన్ని మంజూరు చేయించిన అప్పటి కృష్ణాజిల్లా కలెక్టరు శ్రీ ఎ.వి.ఎస్. రెడ్డి ఐ.ఎ.ఎస్. గారికీ, స్థలంలో వున్న భవనము ముండ్ల తీగె కంచెను స్వాధీనపరచినటువంటి ఆంధ్ర ప్రభుత్వానికి, ఆనాటి ఆర్.టి.సి. ఛైర్‌మెన్ శ్రీ కందుల ఓబులరెడ్డిగారికీ, ఆర్.టి.సి. మేనేజింగ్ డైరెక్టరు శ్రీ పెందుర్తి రామమోహన్‌రావుగారికీ మా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాం.

ఈ గ్రంథం నాలుగు భాగాలుగా విభజించబడింది. ఆయా భాగాలకు వేరుగా పుటల సంఖ్య ముద్రించాం.

1) భారత స్వాతంత్ర్యసంగ్రామచరిత్ర(తుమ్మల వెంకటరామయ్య) 2) తెలుగునాట స్వాతంత్ర్య ఉద్యమ చరిత్ర (పరుచూరి కోటేశ్వరరావు) [illegible] కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర (తుమ్మల వెంకటరామయ్య, పరుచూరి కోటేశ్వరరావు) భారతస్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో తెలంగాణా చరిత్రను శ్రీ యం. యస్. రాజలింగం రచించారు

తెలుగునాట స్వాతంత్ర్య సమర చరిత్రకు అనుబంధంగా ఇతర జిల్లాల్లో ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుల జీవిత చరిత్రలను యలమంచిలి వెంకటప్పయ్యగారు సమకూర్చారు. జీవిత చరిత్రల సంకలనంలో సాధ్యమైనంత జాగ్రత్త వహించాం. జైళ్ళ రికార్డులు లేనిచోట్ల అదివరకే ప్రచురించబడిన గ్రంథాలు, ప్రభుత్వ ప్రచురణలు ఆయా తాలూకాలలోని వృద్ధ స్వాతంత్ర్య సమరయోధులిచ్చిన సమాచారం, కొందరు స్వయంగా పంపిన భోగట్టానుఆధారంచేసుకొనిరచించాము.స్వాతంత్ర్యం వచ్చినతర్వాత జీవిత విశేషాలుగాని, జైళ్ళశిక్షలుగాని ఒక్క తెలంగాణా చరిత్రకు మినహాయించి ఇవ్వలేదు. ఇందులో ఏమైనా పొరపాట్లు దొర్లితే క్షీర — నీర న్యాయంగా స్వీకరించి మన్నించగోరుతాం.

స్వాతంత్ర్య సమరయోధుల చరిత్రలను గ్రంథస్థం చేస్తున్నపుడు ఎంతటి సుదీర్ఘ చరిత్రగల వారిదైనా క్లుప్తీకరించాలనీ, సామాన్యునికి కూడా కొద్ది పంక్తులైనా రాయాలనే భావాన్ని ఒక గ్రంథ ప్రచురణ సందర్భంగా 1960 లో కేంద్ర మంత్రి హుమయూన్ కబీర్ నిర్దేశించారు. ఈ గ్రంథ సంకలనంలో ఆ ఆదేశ సూత్రాన్నే సాధ్యమైనంతవరకు పాటించాం.

కొన్ని అనివార్య కారణాలవల్ల ఈ చరిత్ర గ్రంథం వెలువరించడానికి ఏర్పడ్డ ఇబ్బందులకు తోడు సంకలన కర్తల వ్యక్తిగత ఇబ్బందుల వల్ల కూడ చరిత్ర రచన ప్రచురణకు ఆలస్యమైనది. అందుకు మేమెంతో విచారించుతున్నాం.

ఈ గ్రంథాన్ని చక్కగా ముద్రించి ఇచ్చిన స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు (విశాలాంధ్ర) వారికీ, జిల్లా చరిత్రకు ఉపయోగపడే సమాచారాన్ని అందించిన కీ.శే. తటవర్తి వెంకటేశ్వరరావు, సుంకర వీరభద్రరావు, మురుకుంట్ల వెంకటప్పయ్య, ఆరికెపూడి నాగభూషణం, తాహ్మారి మంగపతిరావు, కూనపులి సుబ్రహ్మణ్యం, క్రోసూరి నరసింహమూర్తి, బొబ్బా ఆదినారాయణమూర్తి, బండి తిరుపతయ్య గార్లకు మాకృతజ్ఞతలు. శుద్ధ ప్రతిని తయారుచేయుటలోను, ప్రూపులు సరిదిద్దుటలోను సహాయపడిన పోలిపెట్టి నాగేశ్వరరావుగారికి— ఆర్టిస్టు మోహన్‌గారికి ఫొటోలను సమకూర్చడంలో శ్రద్ధ వహించిన బొంబాయి స్టుడియో వారికి, బ్లాకులు తయారుచేసి ఇచ్చిన స్వతంత్ర ఎంటర్ ప్రైజస్ (బ్లాకు మేకింగు కంపెనీ)కి మా కృతజ్ఞతను తెలియచేస్తున్నాం. ఇంకా ఈ గ్రంథ రచనలో అనేక విధాల తోడ్పడ్డ వారందరినీ పేరు పేరునా పేర్కొనడం సాధ్యంకాకపోయినా వారందరికీ మా కృతజ్ఞతను వెలిబుచ్చుతున్నాం. గ్రంథ రచనకు తగుసలహాలను యిస్తూ ఉత్సాహపరచుచూ వచ్చిన కీ. శే. కంభంపాటి సత్యనారాయణగారు (సీనియర్) మన మధ్య లేకపోయినందుకు విచారించుచున్నాం.

స్వాతంత్ర్య యోధుల ఈ సంగ్రామ చరిత్ర చదివి ఉత్తేజితులై, యువతీ యువకులూ, విద్యార్థినీ, విద్యార్థులు, ఉపాధ్యాయులు, భావి పౌరులు తమ భవిష్యత్తు జీవితాన్ని మాతృదేశానికి, మానవ సేవకు, మానవ కల్యాణానికి తోడ్పడే విధంగా రూపొందించుకుంటారని ఆశిస్తున్నాం.

ఇట్లు

విజయవాడ
1984, ఆగస్టు 15

కృష్ణాజిల్లా స్వాతంత్ర్య
సమరయోధుల సంఘం
రిజిష్టరు 69/74

# స్వాతంత్ర్య సమర చరిత్ర ప్రచురణకుగాను
# విరాళాలిచ్చిన దాతల పేర్లు

కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సన్మానసంఘం తాలూకు శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావుగారి ద్వారా 3525-90

శ్రీ ముత్తవరపు వెంకటేశ్వరరావు స్వర్ణ ఫైనాన్సు 2000-00

బందరు తాలూకా రైస్ మిల్లర్స్ అసోసియేషన్ 1500-00

## రు. 1116/- యిచ్చినవారు

| | |
|---|---|
| శ్రీ చలసాని సూర్యప్రకాశరావు | విజయవాడ |
| " వల్లభనేని రామబ్రహ్మం | జమీగొల్వేపల్లి |
| " వీరమాచినేని సుబ్బారావు | విజయవాడ |
| " కాట్రగడ్డ మధుసూదనరావు | " |
| " ముప్పా నారాయణరావు | " |
| లక్ష్మీఫిలింస్ | " |
| శ్రీఫిలింస్ | " |
| లక్ష్మీచిత్ర | " |
| విజయ పిక్చర్స్ | " |
| శాయికృష్ణ | " |
| పాపులర్ షూమార్టు | " |
| శ్రీ ధనేకుల రవీంద్రనాధ్ ఠాకూర్ | " |
| " కొల్లి గోవర్ధనరావు | " |
| " అనుమోలు శేషగిరిరావు | " |
| " కిలారు వెంకటసుబ్బయ్య | పెనమలూరు |
| " కోడూరు వెంకట్రామయ్య | విజయవాడ |
| " అనుమోలు వెంకటసుబ్బారావు | పునాదిపాడు |
| " పరుచూరి హనుమంతరావు | వక్కలగడ్డ |
| " పిన్నమనేని సత్యనారాయణ | మూజెళ్ళ |
| " పోలవరపు వెంకట సుబ్బారావు | విజయవాడ |
| " కోనేరు లక్ష్మయ్య | " |
| స్టాండర్డు ఏజన్సీ | " |
| " మాలెంపాటి వెంకట నర్సయ్య | " |
| " సామినేని విష్ణువర్ధనరావు | " |
| " నిమ్మగడ్డ నారాయణరావు | పటమటలంక |
| " వేమూరి వెంకటరత్నం | బందరు |
| " బోయపాటి అప్పారావు | విజయవాడ |
| " చెన్నుపాటి భాస్కరరావు | పటమటలంక |
| కృష్ణారైస్ & ఆయిల్ మిల్స్ & డిపో గాంధీనగరం | విజయవాడ |
| నేషనల్ లితో ప్రింటర్స్ | " |
| అన్నపూర్ణ ఫిలింస్ | " |
| " అడుసుమిల్లి సీతారామారావు | " |
| " కొడాలి సుబ్బారావు | " |
| " యలమంచిలి వెంకటేశ్వరరావు | పామర్రు |
| " వీరమాచినేని బుచ్చయ్య | విజయవాడ |
| సిరీస్ కంపెనీ | " |
| " పాలడుగు వెంకట శివరామకృష్ణయ్య | " |
| " కొమ్మారెడ్డి విమలాదేవి | " |
| " చిట్టూరి రామచంద్రరావు | " |
| " గరిమెళ్ళ వెంకటరత్నం | " |
| " కె.వి. గోపాలరావు | " |
| " చలసాని అజాద్‌కుమార్ | " |

## రు. 1000-00 యిచ్చిన దాతలు

| | |
|---|---|
| శ్రీ కామారి బాపయ్య | పడమట |
| " వీరమాచినేని సంతాన గోపాలరావు | విజయవాడ |

వల్లూరి వెంకట సుబ్బారావు విజయవాడ
" కడియాల కోటేశ్వరరావు విజయవాడ రు 600-00

రు. 558.00 లు యిచ్చిన దాతలు

శ్రీ వీరపనేని రాఘవయ్య విజయవాడ
" చుక్కపల్లి వెంకయ్య "
" బొబ్బా సుబ్రహ్మణ్యం "
అసోసియేషన్ ఏజన్సీస్ "
రామకృష్ణా ఆటోమొబైల్సు "
విజయా ఆటోమొబైల్సు "
" నార్ల వెంకటేశ్వరరావు "
" యెర్నేని జానకిరామయ్య "
" బోయపాటి నాగభూషణం "
గారపాటి గ్యారేజ్ "
బెజవాడ మోటార్ స్టోర్స్ "
అశోకా ఏజన్సీస్ "
శ్రీ కిలారు వెంకటేశ్వరరావు "
" కోగంటి గోపాలకృష్ణయ్య "
" వీరమాచినేని రంగారావు "
" పొట్లూరి సీతారామస్వామి "
" గుమ్మడదల వీరాస్వామి "
" కోనేరు రామచంద్రరావు "
" తాతినేని జనార్ధనరావు "
" గెల్లి నరసింహారావు "
" యలవర్తి తిరుపతిరాయుడు తాడిగడప
" కిలారు విద్యాసాగర్‌వర్మ "
" దుగ్గిరాల బలరామకృష్ణయ్య
" చెన్నుపాటి శేషగిరిరావు పటమటలంక
" జాగర్లమూడి వెంకయ్య విజయవాడ
" ఐలాపురపు వెంకయ్య "
" అల్లాపురం వెంకటరత్నం "
" వల్లభనేని సుబ్బారావు "
" పొట్లూరి సుబ్బారావు "
రుక్మిణి కృష్ణా రైస్‌మిల్స్ "

శ్రీ తాతినేని సూర్యప్రకాశరావు "
" మొవ్వ శివరామకృష్ణయ్య "
ఫార్మాన్ (మారుతీనగర్) "
రోహిణీ ఆయిల్ రైస్‌మిల్ "
ప్రతాప్ ఇండస్ట్రీస్ (ప్రసాదంపాడు) "
శ్రీ మునునూరి జగన్నాధరావు మచిలీపట్టణం
" కొల్లిపర నరసింహమూర్తి విజయవాడ
శ్రీ దుర్గా రైస్‌మిల్ "
అప్సర సినిమా హాల్ "
శ్రీ పోసాని భాస్కరరావు "
" అట్లూరి వెంకట్రామయ్య "
" యెర్నేని రామకృష్ణబాబు "
" మారం శివరామకోటి "
శ్రీ రామాంజనేయ ట్రాన్సుపోర్టు "
శ్రీ చెరుకూరి కృష్ణమూర్తి "
" కిలారు గోపాలరావు పెనమలూరు
" మొవ్వ కోటేశ్వరరావు విజయవాడ
" మండవ జానకిరామయ్య మొవ్వ
వెంకటేశ్వర కెమికల్ ఇండస్ట్రీస్ విజయవాడ
బృందావన్ మిఠాయి కమీషన్ ఆయిల్
అండ్ మర్చంట్సు మచిలీపట్టణం
డాక్టరు మునిరెడ్డి విజయవాడ
శ్రీ చదలవాడ రామారావు "
" నాదెళ్ళ కుటుంబరావు "
" దామెర శోభనాద్రయ్య "
" కొల్లి కోటేశ్వరరావు "
" గాలి చంద్రమోహన్ బెనర్జీ
" బి. గోవిందరాజులు
" వల్లూరి వెంకట నారాయణరావు
" వల్లూరి పూర్ణచంద్రరావు
" కూనల పూర్ణచంద్రరావు

రు. 511-00

శ్రీ వై. ఎస్. ఆర్. కె. ప్రసాద్
శ్రీ నిమ్మగడ్డ వెంకట కృష్ణారావు విజయవాడ

రు. 500/– ఇచ్చినవారు
శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావు "
" అడుసుమిల్లి రామచంద్రరావు
" సత్యనారాయణ ఫైనాన్సు కంపెనీ
" వల్లభనేని నారాయణరావు
వసంత ఆటోమొబైల్సు
శ్రీ అడుసుమిల్లి కృష్ణమోహన్‌రావు
" చెకూరి రామారావు
" జాలాది రాఘవేంద్రరావు
" వల్లూరుపల్లి కేశవరావు
" యెర్నేని రామచంద్రరావు
" యెర్నేని అంకినీడు
రావు అండ్ బ్రదర్సు
" యలమంచిలి బాలకోటయ్య, కనుమూరు
" తుమ్మల వెంకట కృష్ణారావు విజయవాడ
" పర్వతనేని శివరామకృష్ణయ్య విజయవాడ – 400-00
" కాకరప ర్తి వెంకటరత్నం విజయవాడ 326-00
" కాగితం వెంకటేశ్వరరావు బందరు 300-00
" తాతినేని మోహన్‌రావు విజయవాడ 258-00

రు 250/- లు యిచ్చినవారు
శ్రీ లక్ష్మి శానిటరీ విజయవాడ
" కామినేని సుబ్రహ్మణ్యం "
" గారపాటి పాండురంగారావు "
" తుమ్మల వెంకటేశ్వరరావు "
" యలమంచిలి రామకోటయ్య "
ప్రభాత్ ఆటోమొబైల్సు "
" ఆచంట రామబ్రహ్మం "
" వేములపల్లి గోపాలకృష్ణమూర్తి "
" బయిన భీమయ్య "
" ఆలూరి నాగేశ్వరరావు "
" వెంకట సుబ్బారావు, ప్యాక్సరింగు
గ్యాసు బందరు
" జాలాది రామారావు విజయవాడ
" నంద్యాల పాండురంగ విఠల్ "
" గుత్తికొండ గోపాలరావు "
" బాడుగు శేషగిరిరావు అండ్ సన్సు బందరు
సూరపనేని వెంకటేశ్వరరావు కొరిమెల్ల 200-00
వడ్డి సూర్యనారాయణరావు బందరు 200-00
అన్నె నాగేంద్రం విజయవాడ 200-00
గండివాడ వెంకటేశ్వర్లు " 200-00
పిడికిటి నారాయణమూర్తి విజయవాడ 166-00
శ్రీ సి. హెచ్. నాగేశ్వరరావు
స్వదేశీ గోల్డుకవరింగు వర్క్సు బందరు 150-00
శ్రీ కామినేని వెంకటప్పయ్య 150-00
శ్రీ శ్రీపేరంబూధూరి ఆనందరావు 150-00

రు. 125/–లు ఇచ్చినవారు
శ్రీ నాదెళ్ళ మాధవరావు విజయవాడ
శ్రీ వీరమాచినేని ప్రకాశరావు "
శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావు "
యూనివర్సల్ మార్కెటింగు "
శ్రీ మల్లెల సుబ్బయ్య "
శ్రీ బొప్పన కుటుంబరావు "
శ్రీ సూరపనేని రామకృష్ణయ్య "
తిరుమల ఎంటర్‌ప్రైజెస్ "
శ్రీ మహమ్మద్ ఇస్మాయిల్ తెనాలి 120-00

రు116/- ఇచ్చినవారు
శ్రీ వెనిగళ్ళ వెంకటేశ్వరరావు విజయవాడ
శ్రీ వల్లూరిపల్లి రామచంద్రరావు కొరిమెర్ల
శ్రీ సూరపనేని వెంకట్రామయ్య "
శ్రీమతి దావులూరి తులశమ్మ "
శ్రీ పోలవరపు ప్రసాదరావు కొరిమెర్ల
శ్రీ వెంకటరమణ విజయవాడ
శ్రీ వేమూరి కోటేశ్వరరావు "
ఛాయా ఫిలిమ్సు "
లక్ష్మి గోల్డు కవరింగు "
శ్రీ కంభంపాటి సత్యనారాయణ(సీనియర్) "

| | |
|---|---|
| శ్రీ రావి నాగభూషణం | బందరు |
| బృందావన్ మిఠాయి వర్తకసంఘం | " |
| శ్రీ పోలవరపు ప్రసాదరావు | విజయవాడ |
| విజయవాడ సోషల్ క్లబ్ | " |
| సెవెన్ స్టార్ లిక్కర్ బ్రాండ్ | " |
| శ్రీ పరుచూరి రాధాకృష్ణమూర్తి | " |
| శ్రీ అట్లూరి రామచంద్రరావు | " |
| శ్రీ కడియాల పిచ్చయ్య | " |
| బొప్పన వెంకట పూర్ణమాణిక్యారావు | గురజ |
| " వై. వెంకటరావు | గుడివాడ |
| మేకా నర్సయ్య | కోసూరు |
| జొన్నవిత్తుల పూర్ణయ్యశాస్త్రి | గొడవర్రు |
| ఆలపాటి సత్యనారాయణ | హనుమాన్ జంక్షన్ |
| " మురుకుంట్ల వెంకటప్పయ్య | తిరువూరు |
| శ్రీ జవ్వాజిరాములు | తిరువూరు |
| శ్రీ తుమ్మల పెద సత్యనారాయణచౌదరి | విజయవాడ |
| శ్రీ చింతమనేని శ్రీరాములు | ఎలుకలపాడు గుంటూరుజిల్లా |
| శ్రీ యలమంచిలి వెంకటప్పయ్య | విజయవాడ |
| శ్రీ వెలగపూడి సూర్యనారాయణ | " |
| శ్రీ వేములపల్లి వామనరావు | " |
| శ్రీ ఈడ్పుగంటి లింగయ్య | గుడివాడ |
| సంకా నిత్యానందం | విజయవాడ |
| " బొబ్బా ఆదినారాయణమూర్తి | కొత్తవరం |
| " మతి చెరుకూరి సౌభాగ్యమ్మ | జమీగొల్వేపల్లి |
| " యార్లగడ్డ బసవయ్య | మల్లాపురం (రాయచూర్ జిల్లా) |
| శ్రీ మండవ నాగభూషణం | నాగాయలంక |
| శ్రీ పెద్యాల వెంకటేశ్వరరావు | ముస్తాబాద |
| " యార్లగ శ్రీరాములు | విజయవాడ |
| "మతి యా గడ్డ మహాలక్ష్మమ్మ | " |
| " యార్లగ హరిశ్చంద్రప్రసాద్ | " |
| శ్రీమతి యా గడ్డ శశికుమారి | " |
| శ్రీ పిన్నమ ని వెంకటేశ్వరరావు | " |
| " పిన్నమనేని నరసింహారావు | గుంటూరు |
| " పిన్నమనేని రామారావు | విజయవాడ |
| " పిన్నమనేని కేశవరావు | " |
| " పిన్నమనేని సత్యనారాయణ | " |
| " కాట్రగడ్డ నర్సయ్య | " |
| " కాట్రగ భుక్తేశ్వరదత్తు | " |
| " కాట్రగ భగవత్‌సింగు | " |
| " కాట్రగ గంగయ్య | " |
| " కాట్రగ చిత్తరంజన్‌దాసు | " |
| " కాట్రగ సుభాష్‌చంద్రబోస్ | " |
| " నార్ల వి యకుమార్ | " |
| "మతి దేవినేని మాధవి | " |
| " పిడికిటి విజయకుమార్ | " |
| "మతి రావెళ్ళ సూరాయమ్మ | " |
| చల్లపల్లి కామ్‌ప్రసాద్ | గుంటూరు |
| " ముత్తవరపు ప్రకాశరావు | విజయవాడ |
| " బోయపాటి విఠోబాచౌదరి | హైదరాబాద్ |
| " మాగంటి మాధవరావు | " |
| " ఉప్పలపాటి సీతారామరాజు | " |

రు. 100–00 ఇచ్చినవారు

| | |
|---|---|
| శ్రీ అన్నం సాంబశివరావు | విజయవాడ |
| శ్రీమతి మైనేని బసవ పున్నమ్మ | విజయవాడ |
| శ్రీ వల్లభనేని కృష్ణయ్య | జమీగొల్వేపల్లి |
| శ్రీమతి పొట్లూరి వరలక్ష్మమ్మ | కొమరవోలు |
| శ్రీ చలసాని బాపయ్య | యలమర్రు |
| కామినేని సుబ్బారావు | పామర్రు |
| "మతి అట్లూరి వెంకటరత్నమాంబ | జమీగొల్వేపల్లి |
| "మతి చెరుకూరి శోభనాద్రమ్మ | " |
| " సూరపనేని గోపాలకృష్ణయ్య | గుడివాడ |
| "మతి పిడికిటి వరలక్ష్మమ్మ | విజయవాడ |
| వీరపనేని నారాయణ | కొమరవోలు |
| "మతి బొబ్బా అన్నపూర్ణమ్మ | కొత్తవరం |
| " దోనేపూడి రాజగోపాలరావు | " |
| "మతి పాద ర్తి సుందరమ్మ | గుంటూరు |

# కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం కార్యవర్గం

పేట్రన్సు

కీ. శే. కోటగిరి వెంకట కృష్ణారావు. గంపలగూడెం

కీ. శే. గొట్టిపాటి బ్రహ్మయ్య. ఘంటసాల.

కీ. శే. మానికొండ సత్యనారాయణశాస్త్రి. పురిటూరు

కీ. శే. కొడాలి ఆంజనేయులు. మచిలీపట్టణం

కీ. శే. పేట బాపయ్య—విజయవాడ

శ్రీ యలమంచిలి వెంకటప్పయ్య. విజయవాడ

కార్యవర్గ సభ్యులు :

అధ్యక్షులు : శ్రీ కాట్రగడ్డ మధుసూదనరావు

చైర్మెన్ : కీ. శే. వల్లభనేని రామబ్రహ్మం

ఉపాధ్యక్షులు : శ్రీమతి సూర్యదేవర అన్నపూర్ణమ్మ

శ్రీ గోవాడ నిరీక్షణరావు

శ్రీ బండి తిరుపతయ్య

శ్రీ దువ్వ వీరాస్వామి

ప్రధాన కార్యదర్శి : శ్రీ జోశ్యభట్ల సత్యనారాయణ

కోశాధికారి : శ్రీ చలసాని సూర్యప్రకాశరావు

సహాయ కార్యదర్శులు : శ్రీ యర్రపత్ని వెంకటరావు

శ్రీ వేములపల్లి వామనరావు

కార్యవర్గం : 1. శ్రీ రేజాల బుచ్చిరామ శేషయ్యశ్రేష్ఠి

2. శ్రీ ఈదుప్పగంటి లింగయ్య
3. కీ. శే. కృత్తివెంటి కుటుంబరావు
4. శ్రీ సూరపనేని వెంకటేశ్వరరావు
5. శ్రీ గుంటక పుల్లారెడ్డి
6. శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ
7. శ్రీమతి గుత్తికొండ సీతమ్మ
8. శ్రీమతి చెరుకూరి సౌభాగ్యమ్మ
9. శ్రీ వేమూరి నారాయణమూర్తి
10. శ్రీ అరికపూడి నాగభూషణం
11. శ్రీ అలపాటి లక్ష్మయ్య
12. శ్రీ బొబ్బా ఆదినారాయణమూర్తి
13. శ్రీ వెల్లంకి విశ్వేశ్వరరావు
14. శ్రీ కడియాల పిచ్చయ్య
15. శ్రీ పెరంబూదూరి ఆనందరావు
16. శ్రీ సుంకర వీరభద్రరావు
17. శ్రీ మురుకుంట్ల వెంకటప్పయ్య
18. శ్రీ మండవ వెంకట కృష్ణారావు
19. శ్రీ నందం లక్ష్మి పెరుమాళ్ళు
20. శ్రీ కొండపల్లి పాండురంగారావు
21. శ్రీ రామిసెట్టి నాగభూషణం
22. శ్రీ నిమ్మగడ్డ వెంకట కృష్ణారావు
23. శ్రీ మ ల శ్రీరామమూర్తి
24. శ్రీ నం నిత్యానందం
25. శ్రీ వేములపల్లి గోపాలకృష్ణమూర్తి

# భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో ప్రముఖ ఘట్టాలు

## జననీ జన్మభూమిశ్చ...

స్వ ం ఒక తియ్యటికల. ఆ కలల ప్రపంచంలో బాధలుండ . ఇనపగజ్జెల పెద్దమ్మ (దరిద్ర దేవత గంతులు యదు. కష్టాలు నష్టాలు కాపురంలో తి వేయవు. బానిసగా బాదర్రితుకు ఈడ్చవలసిన లేదు. సంకెళ్ళూ చట్టుబండలూ వుండవు. అక్కడంతా స్వేచ్ఛ, అక్కడంతా సుఖం, అక్కడంతా శాంతి — ఇదీ మానవుడు తరతరాలుగా ఊహించుకుంటున్న స్వర్గం.

కన్నతల్లి ముందూ, తాను పుట్టిన దేశంముందూ, ఈ 'స్వర్గం' దిగదుడుపే. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అని అందుకే అన్నారు.

కాని ఆ జన్మభూమి పరాయిదేశస్థుల పాలబడింది. స్వాతంత్ర్యం కోల్పోయి బానిస అయింది. ఈ దుస్థితి నుండి బయటపడాలి. సంకెళ్ళను బ్రద్దలు కొట్టాలి. స్వాతంత్ర్యం సాధించాలి. ఇదే ఆనాడు అందరి ఉమ్మడి లక్ష్యం.

ఈ లక్ష్యసిద్ధికి భారతీయులు అనేక బాధలు పడ్డారు. త్యాగాలు చేశారు. "విజయమో వీరస్వర్గమో" అంటూ అడుగడుగునా రక్తతర్పణం చేశారు ప్రాణాలను బలిపెట్టారు

"మహాప్రభో! మాదొక మహజరు" అంటూ మొదలై "స్వరాజ్యం ఇస్తావా, చస్తావా! లేకపోతే తన్నితగిలేస్తాం" అన్నంతవరకూ అనేక దశలు గడిచింది జాతీయ స్వాతంత్ర్య ఉద్యమం. మతపరంగా చైతన్యం కల్గించినవారు కొందరు. వ్యక్తులుగా ముందంజ వేసినవారు మరికొందరు. పదిమందినీ కూడగట్టికొని "పదండి ముందుకు" అన్నవారు ఇంకా కొందరు. "శత్రువు గట్టివాడు, మందీమార్బలం, మారణాయుధాలు అతడికి చాలా వున్నాయి. ఎదురుగా ఎదుర్కోలేం. రహస్య ఉద్యమాలద్వారా విప్లవాగ్ని రాజుకొనేట్టు చేద్దాం" అన్నవాళ్ళూ వున్నారు.

ఒక దేశంకాదు, ఒక ఖండంకాదు, ప్రపంచం నలుమూలలకూ వెళ్ళారు మన స్వాతంత్ర్య ప్రియులు. భారతదేశ స్వాతంత్ర్యానికి ఎవరు, ఏమూల, ఏమాత్రం సహాయ సహకారాలు అందిస్తున్నా అక్కడికి వెళ్ళారు. స్వరాజ్య సాధనకు వారిచ్చిన సహాయాన్ని, సహకారాన్ని, సలహాలను పొందారు. అందులో మంచివనుకొన్నవి స్వీకరించారు. మింగుడు పడనివి వదిలేశారు.

"ఇది నాదేశం, ఇది నాజాతి" అనే ఆత్మాభిమానం పెల్లుబికిన తర్వాత, శతాబ్దాలపాటు ఆవరించిన మొద్దు నిద్దర వదిలిపోయింది.

బ్రిటిష్‌వారి తూర్పు ఇండియా కంపెనీ, తన గులామ్‌లను సృష్టించుకోటానికీ, గుమాస్తాలను తయారు చేసుకోటానికీ ఏర్పరచిన స్కూళ్ళలో, కాలేజీలలో కొంతకాలం పరిపాలకుల లక్ష్యం నెరవేరింది ఉదరనిమిత్తం ఉద్యోగాలవేట, పదవుల నిమిత్తం పరాయి ప్రభువుల అడుగులకు మడుగులొత్తడం - ఇదీ కొన్నాళ్ళు బ్రిటిష్ విద్యావిధానం వల్ల ఏర్పడిన దుస్థితి. కాని తర్వాత ఆ పరిస్థితి మారింది. జాతీయత అనే భావం, చైతన్యం పెరిగింది. ఈ చైతన్యంతో విద్యాధికులు, ప్రపంచాన్ని అన్ని కోణాలనుంచీ చూడసాగారు. చరిత్ర పరిశీలించ మొదలు పెట్టారు. ఆయా దేశాలలో ఎన్నో స్వాతంత్ర్య పోరాటాలు జరిగాయి. తమ దేశంకోసం ఆత్మాహుతి చేసిన ఆయా దేశాల మహనీయులు వీరి కళ్ళముందు మెదలసాగారు. తమదేశ ప్రాచీన వైభవం తలుచుకొని గర్వపడసాగారు. తమదేశ చరిత్ర గురించి పరిశోధించారు. ఒకనాడు భారతదేశం ప్రతి రంగంలోనూ గొప్ప విజయాలు సాధించింది. తన సంస్కృతినీ, మతాన్నీ, నాగరికతనూ ఆసియా - ముఖ్యంగా ఆగ్నేయాసియా దేశాలకూ - చైనా,

జపాను దేశాలకు కూడా వ్యాపింప చేసింది. ఇదీ చరిత్ర అధ్యయనం, పరిశోధనల ఫలితం.

దీనితో ఆత్మాభిమానం, దేశాభిమానం, దేశభక్తి, స్వరాజ్య సంపాదనకు తహ తహ పెరిగాయి. స్వాతంత్ర్య సమరానికి పురికొల్పాయి. 18, 19 శతాబ్దాలలోని అమెరికా స్వాతంత్ర్య యుద్ధం, ఫ్రెంచి విప్లవం, తురుష్క సామ్రాజ్య వ్యతిరేక యుద్ధాలు, ఇటలీ జాతీయోద్యమం – ఇవన్నీ ప్రథమ దశలో మన స్వాతంత్ర్య పిపాసను తీవ్రతరం చేశాయి. 1857 నాటి విప్లవం, ఆ విప్లవ వీరుల సాహసాలు, అమోఘ త్యాగాలు గాఢముద్ర వేశాయి.

సంఘ సంస్కర్తలు, మత సంస్కర్తలు జాతీయ పునరుజ్జీవనానికి పునాది వేశారు. వారి ప్రబోధాలు దేశభక్తిని పెంపొందించాయి.

"భారతదేశం భారతీయులకే"

"రాజ్యం రైతులకే"

"స్వపరిపాలనే సుపరిపాలన"

"భారతదేశం తన ప్రాచీన వైభవాన్ని తిరిగి సంపాదించాలి. ఇది నా స్వప్నం. ఇది మీస్వప్నం కూడా కావాలి. ఈ స్వప్నం నిజమయ్యేవరకూ మనం విశ్రమించరాదు" అన్నాడు స్వామి వివేకానంద.

ఒకప్పుడు సిక్కులు, గాంధారీలు, కూకాలు (రంజిత్‌సింగ్ సైనికులు) మతంతోపాటు దేశ స్వాతంత్ర్య సంగ్రామ గానంకూడా చేశారు. సిక్కుల గురువు రామసింగ్ స్వదేశవస్తువులే్న వాడాలన్నాడు. బ్రిటిష్ విద్యాసంస్థల్ని, కోర్టుల్ని, రైళ్ళని, పోస్టాఫీసుల్ని, టెలిగ్రాఫ్ ఆఫీసుల్ని బహిష్కరించమన్నాడు.

"స్వరాజ్యం నా జన్మహక్కు. స్వరాజ్యం ప్రతి భారతీయుని జన్మహక్కు. ఆ స్వరాజ్యం సాధించడానికి, సర్వత్యాగాలు చేయడానికీ అతడు సంసిద్ధపడాలి." అన్నాడు లోకమాన్య బాలగంగాధరతిలక్.

ఆయాదశల్లో దేశభక్తినీ, మత సామరస్యాన్నీ, కులవిద్వేష నిర్మూలననూ ప్రబోధించినది రాజకీయ నాయకులేకాదు, కవులూ, రచయితలూ ఈ మహత్తర కర్తవ్య నిర్వహణలో ప్రముఖపాత్ర వహించారు.

వంగకవి బంకిమ్‌చంద్ర "వందేమాతరం" గీతం ఆలపించాడు. "సప్తకోటి (ఏడుకోట్ల) కంఠాలు "వందేమాతరం" నినాదం "త్రింశతి కోటి (30 కోట్ల) కంఠాల స్వాతంత్ర్యగానంగా మారిపోయింది.

"సారే జహాఁసే అచ్ఛా హిందూస్తాన్ హమారా" అని ఇక్బాల్ గర్వపడటమే కాదు—

"మజహబ్ నహీఁసిఖాతా ఆపస్‌మేఁ వైర రఖ్‌నా
హిందీ హైఁ హమ్
వతన్‌హై హిందూస్తాన్ హమారా"

"మతం పరస్పరం కలహించుకోమని బోధించటం లేదు. మనం హిందూదేశస్థులం. హిందూస్తాన్ మన జన్మభూమి," అని కూడా తొలిరోజుల్లో మత సామరస్యం ప్రబోధించాడు ఆయన. ఇంతే కాదు—

"ఖాకే వతన్‌కా ముఝ్‌కో
హర్ జర్రా దేవతా హై"

"జన్మభూమినీ, మాతృమూర్తినీ ప్రతిఫలింపచేయగలిగే ప్రతి అణువూ నాకు దేవతా స్వరూపమే" అని అన్నదీ ఆయనే.

మన తెలుగువారు తీసిపోయారా ? లేదు. "వందేమాతరం, మందే రాజ్యం" అన్నారు. "దేశమును ప్రేమించుమన్నా" అని ప్రబోధించాడు గురజాడ అప్పారావు. "దేశం అంటే మట్టికాదనీ, మనుజులనీ" నిర్వచించాగ.

"అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్
మతం వేరై తేను యేమోయ్
మనసు లొకటై మనుషులుంచే"

అని మతసామరస్యాన్ని ప్రబోధించాడు మహాకవి గురజాడ.

"ఏ దేశమేగినా, ఎందుకాలిడిన
ఏ పీఠమెక్కినా, యెవ్వరెదురయిన
పొగడరా, నీ తల్లి భూమి భారతిని
నిలుపరా, నీ జాతి నిండు గర్వమ్ము"

..................................

"అవమాన మేలరా, అనుమాన మేల
భరత పుత్రుడ నంచు భక్తితో బలుక"

అని రాయప్రోలు సుబ్బారావు మాతృదేశం గురించి గర్వపడమన్నాడు.

మాతృదేశ వైభవం, మాతృదేశస్తుతి, మాతృదేశ సందేశాలతోనే గాక, ఆయా దశలలో స్వాతంత్ర్య

ఉద్యమ భాగస్వాములు కావడానికి ప్రజల్ని ఉత్తేజ పర్చిన కవులెందరో వున్నారు.

'వందేమాతరం' నినాదంతో ప్రారంభమైన ఉద్యమ కాలం నుండి ఉప్పుసత్యాగ్రహకాలం నాటికి కాంగ్రెస్ లో ఎన్నో మార్పులు వచ్చాయి. ఈ కాలంలోనే రైతుల సత్యాగ్రహాలు, పన్నుల నిరాకరణోద్యమాలు, బ్రిటిష్ పాలకుల పాశవిక దమనకాండను ప్రతిఘటించ డానికి తలెత్తిన విప్లవకారుల వ్యక్తిగత, సామూహిక సాయుధదాడులు, సంఘటిత కార్మికోద్యమాలు, విదేశాలలో భారత జాతీయోద్యమానికి అండగా సాగిన అనేక రహస్య, బహిరంగ కార్యకలాపాలు, మన స్వాతంత్ర్య ఉద్యమాన్ని పటిష్టంచేశాయి. ఉద్యమం విస్తృత ప్రజానీకంలో వ్యాప్తి చెందింది.

ఉప్పు పిడికిలి బిగించి చట్టాల్ని ఉల్లంఘించిన వారు కొందరు. ఉరితాడు మెడను బిగిసినా చిరునవ్వుతో ఉరికంబాలను ఉయ్యాలలూగిన యోధులుమరికొందరు.

"పితూరీ"లు లేవదీసి బ్రిటిష్‌వాళ్ళ గుండెల్లో చిచ్చరపిడుగులై గర్జించిన విప్లవవీరులు ఇంకొందరు.

అన్నదాత రైతునీ, చెమటోడ్చే శ్రమజీవినీ ఐక్య పరచి జనసామాన్యంలో చైతన్యజ్వాల రగిల్చిన సాహసులు—ఎందరెందరో.

బ్రిటిష్‌వాళ్ళను, వాళ్ళ తొత్తులను ఎదిరించి. "కుట్రకేసు"లలో వందలాదిమంది బందీలయ్యారు. సంఘటిత కార్మిక, కర్షక ఐక్యశక్తి తన ప్రతాపాన్ని ప్రదర్శించింది. పోలీసులు తిరుగుబాటు చేశారు. దేశ భక్తులను కాల్చడానికి సిపాయీలు నిరాకరించారు. నావికులు తిరుగబడ్డారు. ఈ తిరుగుబాటుతో తారెత్తిన బ్రిటిష్ ప్రభుత్వం లంగరెత్తి ఉడాయించింది. జాతీయ నాయకులతో రాజీపడింది.

యూనియన్ జాక్ క్రిందికి దిగింది.
స్వతంత్ర పతాక వినువీధిని ఎగిరింది.
స్వరాజ్యం వచ్చింది.

ఈ స్వాతంత్ర్య సమరంలో ఎంతో రక్తం చిందింది. ఎంతో కన్నీరు వరదలా పారింది, ఎందరో త్యాగధనులు ఆత్మార్పణం చేశారు. వేరువేరు పాయలుగా ప్రవహించిన వివిధ జాతీయ ప్రజా ఉద్యమాల అవిరళ కృషిఫలితంగానే దేశానికి సంకెళ్ళు వదిలాయి. ఈ స్వరాజ్య సాధనకు పాలక దేశంలోని శ్రామిక ప్రజలలో చైతన్యవంతులైన వారి కొందరి అండదండలు మనకు లభించాయి. స్వాతంత్ర్య పిపాసులైన ప్రవాస భారతీయ యోధులకు ఎన్నోదేశాలు తోడ్పడ్డాయి.

ఈ చరిత్రను గాఢంగా పరిశీలించినపుడే, మన స్వాతంత్ర్య సమరగాథ పూర్వాపరాలు తెలుస్తాయి. ఈ స్వరాజ్యం ఒకరు "దేహీ" అంటే వచ్చింది కాదు. మరెవరో దయతో 'దానం' చేసిందీ కాదు. ఎన్నో శతాబ్దాలపాటు, ముఖ్యంగా ఈ శతాబ్దపు తొలి అర్ధభాగంలో ప్రజలు సాగించిన మహోజ్వల పోరాటాల ఫలితమే ఈ స్వరాజ్యం. ఈ చరిత్రే స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర. ఈ సమరంలో పాల్గొన్న వీరుల చరిత్రే స్వాతంత్ర్య సమరయోధుల చరిత్ర. ఈ మహోజ్వల చరిత్రలోని ప్రముఖఘట్టాలు ఏవో పరిశీలిద్దాం. మహాయోధుల మహోన్నత జీవితాలేమిటో తెలుసుకొందాం. ఈ స్వాతంత్ర్య సమరంలో తాము సైతం ఒకొక్క సమిధయై ఆహుతైన అమర వీరులను పరిచయం చేసుకొందాం.

*

# తొలి దండయాత్రలు

భారతదేశ గత వైభవాన్ని చాటిచెప్పే అనేక కథలూ గాథలూ ఉన్నాయి. వాటిలో దేశభక్తినీ, ప్రతాపాన్నీ, ప్రతీకారాన్నీ కీర్తించే ఘటనలు కోకొల్లలు. క్రీస్తు పూర్వం మూడువేల సంవత్సరాలనుండి భారతదేశం ఎన్ని ఆటుపోట్లకు గురైనా కొత్తగా ఏర్పడిన పరిస్థితులకు తగిన సర్దుబాటు చేసుకోగలిగింది. ఐహిక విషయాలు తుచ్ఛమనీ, పరలోకమే ప్రాధాన్యమనీ జీర్ణించుకుపోయిన మతమూ, వేదాంతమూ, తత్వమూ, జ్ఞానమూ కారణమని చెప్పేవారు లేకపోలేదు. కాని మొహంజదారో-హరప్పా నాగరికత గాని, వేదకాలపు ఆర్యుల "బ్రహ్మవర్తం" గాని పురాణ కాలంలోని వీరయుగంగాని, బుద్ధుని అనంతరం వచ్చిన సామాజిక, ఆర్థిక, రాజకీయ, మతజీవిత కార్యకలాపాల్లో-అన్నిటా కానవచ్చిన సంరంభంకానీ, తెలియజేసేదేమిటి ? భారతదేశం ఐహిక విషయాలను భౌతిక జీవితాన్ని విస్మరించలేదనే.

మన చరిత్రలోని ఆయా ఘట్టాలను స్మరించుకొన్నప్పుడు దేశమంటే మనం గర్వపడతాం. దేశభక్తిని పెంపొందించుకొన్నాం. బానిసతపు సంకెళ్ళను బద్దలుకొట్టడానికి స్వాతంత్ర్య సమరంలోకి దూకాం. చిట్టచివరకు స్వాతంత్ర్యం సాధించాం. ఐతే ఈ స్వాతంత్ర్య భారత అవతరణకు పూర్వగాథ ఏమిటి ? క్లుప్తంగా తెలుసుకుందాం.

గత కాలంలో భారతదేశంలోకి అనేక జాతులు, తెగలు చొరబడ్డాయి. అలాంటి చొరబాట్లు ఇరవైఆరుసార్లు జరిగాయి. క్రీస్తుపూర్వం సుమారు రెండువేల సంవత్సరాలనాడు ఆర్యుల దాడి ప్రారంభమైంది. గ్రీకులు, శకులు, పార్థియన్లు, తురుష్కులు, ఆఫ్ఘన్లు, మొగలులు మనదేశంలో చొరబడ్డారు. బ్రిటిష్‌వాళ్ళు దాడి ఆఖరిది. 15 వ శతాబ్దం అంతంవరకూ జరిగిన తక్కిన చొరబాట్లన్నీ భూభాగంగుండా జరిగాయి ఒక్క బాబరును మినహాయించి తక్కినవారంతా ఈనాటి రష్యన్ తుర్కిస్తాన్ గుండా 12 నుండి 16 వేల అడుగులదాకా ఎత్తునవున్న హిందూకుష్ పర్వతాలను దాటి, ఇరుకైన కైబర్‌పాస్‌గుండా సులేమాన్ పర్వత శ్రేణికీ, సింధునదీ తీరాలకూ ఆ పైకి చొచ్చుకు వచ్చారు.

క్రీస్తుపూర్వం 2200 ఏళ్ళ క్రితం అస్సీరియా రాణి 'సెమరామిస్' తుర్కిస్తాన్ గుండా భారతదేశం పైకి సైన్యాన్ని పంపింది. క్రీస్తుపూర్వం 530 లో పర్షియాకు చెందిన సైరస్ క్రీస్తుపూర్వం 326 లో 'అలెగ్జాండర్ ది గ్రేట్' భారతదేశంపై దాడి చేశారు. అలెగ్జాండర్ త్రోవలో అనేక దేశాలను పాదాక్రాంతం చేసుకొని, హిందూకుష్ పర్వతాలనుదాటి భారతదేశంలో చొరబడ్డాడు. 19 నెలలు ఈ దేశంలోఉండి, తర్వాత తిరిగి వెళ్ళిపోయాడు. సుప్రసిద్ధ తాత్వికుడు అరిస్టాటిల్ శిష్యుడైన అలెగ్జాండర్ స్వదేశానికి వెళ్ళేటప్పుడు అనేకమంది భారతీయ తత్వశాస్త్రజ్ఞులను తనవెంట తీసుకువెళ్ళాడు.

భారతీయుల పౌరుషానికి ప్రతీకగా నిలిచిన పురుషోత్తముని (పౌరస్) ఈ సందర్భంగా గుర్తుకు తెచ్చుకోవాలి.

అలెగ్జాండర్‌ను ఏమాత్రం ప్రతిఘటించకుండానే తక్షశిలరాజు దాసోహమన్నాడు. అలెగ్జాండర్ తక్షశిల ప్రవేశించినపుడు ఘనస్వాగత మిచ్చాడు. తక్షశిలలో అలెగ్జాండర్ దర్బార్ జరిపినపుడు చుట్టుపక్కల రాజులు, సామంతులు నజరానాలు, కానుకలు తెచ్చారు. కాని ఒక రాజు ఆ దర్బార్ ముఖం చూడలేదు. నజరానా పంపలేదు. అతడే పురుషోత్తముడు. తక్షశిలకు రమ్మని ఆహ్వానించిన అలెగ్జాండర్‌కు "దర్బారులో కాదు మనం కలుసుకునేది, యుద్ధరంగంలోనే" అని జవాబిచ్చాడు. పురుషోత్తముకిని శిక్షించాలని అలెగ్జాండర్ యుద్ధానికి సన్నద్ధుడయ్యాడు.

జీలంనది రెండు తీరాలలో ఉభయుల సైన్యాలు ముఖాముఖి కేంద్రీకరించబడ్డాయి. జీలంనదిదాటి తూర్పునవున్న పురుషోత్తముని సేనలను ఢీకొనటం అలెగ్జాండర్‌కు కష్టమైంది. తన సేనల్లో కొంతభాగాన్ని రహస్యంగా అర్ధరాత్రి తుఫానులో జీలంనదికి 16 మైళ్ళ ఎగువ భాగాన దాటించి, అలెగ్జాండర్ యుద్ధానికి సిద్ధపడ్డాడు. అలెగ్జాండర్ సేనలు నది దాటాకగాని ఈ వార్త పురుషోత్తమునికి తెలియలేదు. ఎనిమిది గంటల తీవ్రయుద్ధం తరవాత పురుషోత్తముని 35 వేల సైనికులలో 22 వేలమంది చనిపోయారు. ఏనుగులు చిందరవందరయ్యాయి అయినా గజారూఢు

దైన పురుషోత్తముడు శతృవులబారినుండి రక్షణ లేకున్నా వెన్నుచూపలేమ.

అలెగ్జాండర్ పురుషోత్తముని శౌర్యానికి ముగ్ధుడయ్యాడు. తక్షశిల రాజుద్వారా లొంగిపొమ్మని పురుషోత్తమునికి కబురంపాడు. "ద్రోహీ" అంటూ అంతన్ని చంపటానికి సిద్ధమయ్యాడు పురుషోత్తముడు. అలెగ్జాండర్ అనేకమంది దూతల్ని పురుషోత్తమునివద్దకు, పంపాడులొంగిపొమ్మని. చివరకుదాహబాధతో పురుషోత్తముడు ఏనుగుదిగి అలెగ్జాండర్వ కు వెళ్ళాడు. తల వంచని ఆ ధీరుణ్ణిచూసి అలె ండర్ సంబర పడ్డాడు. "నిన్నెలా చూడాలి?" అ ప్రశ్నించాడు. "రాజుకి తగిన హోదాతోనే నన్ను చూడు" అన్నాడు పురుషోత్తముడు. "అలాగే చూస్తాను. కాని నీ స్వంత విషయంలో ఏదైనా కావాలనుకొంటే కోరుకో?" అన్నాడు అలెగ్జాండర్. "నేను చెప్పిన జవాబులో అన్నీ ఇమిడివున్నాయి" అన్నాడు పురుషోత్తముడు. అప్పుడు అలెగ్జాండర్ పురుషోత్తముడికి, అతని రాజ్యాన్ని తిరిగిఇవ్వడమేగాక, మరికొంత భాగాన్ని-తాను జయించిన భూభాగాన్ని - అతనికి కలిపాడు కూడా.

భారతీయ పౌరుషాగ్ని ముందు ప్రచండవీరుని బీభత్సకాండ పనిచేయని మహోజ్వల ఘటన ఇది.

ఆయా కాలాల్లో విదేశ దండయాత్రల్ని వీరోచితంగా ఎదుర్కొన్న ఘటనలు ఎన్నోవున్నాయి. చంద్రగుప్తమౌర్య, గ్రీకుల్ని పంజాబు నుండి తరిమాడు. రెండవ చంద్రగుప్తుడు శకసాత్రపుల రాజ్యాన్ని మాల్వా (పశ్చిమ భారతదేశం)లో తుద ముట్టించాడు. రాజపుత్రులు తురుష్కుల్ని. ఆఫ్గన్లను తరిమివేసేందుకు వీరోచితంగా పోరాడారు. ఢిల్లీ సుల్తాన్లను ఎదిరించి బుక్కరాయలు, హరిహరరాయలు దక్షిణ భారతదేశాన్ని విముక్తి చేసి విజయనగర సామ్రాజ్యం స్థాపించారు. మొగలులను ఎదిరించి శివాజీ గెరిల్లా పోరాటం సాగించి మరాఠా రాజ్యం నిలబెట్టాడు. ఆఫ్గన్లను ఓడించి రంజిత్ సింగ్ సిక్కుల స్వతంత్ర రాజ్యం ఏర్పరిచాడు. మొగలుల బారినుండి రాజపుత్ర స్థానాన్ని రక్షించేందుకు 'రాణా ప్రతాప్' అద్భుత శౌర్య సాహసాలను ప్రదర్శించాడు.

గ్రీకులు ఆ తర్వాత రోమన్లు, భారతీయ విజ్ఞాన శాస్త్ర విజయాలను పాశ్చాత్య దేశాలకు తీసుకుపోయారు. అరబిక్ అంకెలని పిలువబడే అంకెలను భారతదేశమే కనిపెట్టింది. సున్నాకూడా భారతీయులదే. ఈనాడు అంకెల స్థాన పద్ధతిని భారతీయులే నిర్ధారించారని సుప్రసిద్ధరచయిత 'లూయీఫిషర్' అంటున్నాడు. ఉదాహరణకు 1 తర్వాత 4 వేస్తే 14 (పద్నాలుగు) అనీ,4 తర్వాత1 వేస్తే 41 (నలభై ఒకటి)అనీ-ఈ పద్ధతిని కనిపెట్టింది భారతీయులే. ఇది ఈనాడు ప్రపంచ వ్యాప్తంగా అమలులో వుంది.

భారతదేశ సంపద చూచి, ఆకర్షితులై దండయాత్ర చేసిన వారిలో జంగిష్ఖాన్, తామ న్, నాదిర్షా మొదలైన వారున్నారు. వీరంతా భారత శంపై దాడి జరిపి చేజిక్కినదంతా దోచుకుని తిరిగి వెళ్ళారు.

ఇవన్నీ భూ మార్గాన జరిగిన దండయాత్రలు. స్పానిష్ నౌకలతో బయలుదేరిన కొలంబస్ అమెరికాను కనిపెట్టిన ఐదేండ్లకుగాని, పాశ్చాత్యులు భారతదేశానికి సముద్రమార్గం కనిపెట్టలేదు. అలా కనిపెట్టిన తర్వాత దండయాత్రల స్వభావ స్వరూపాలే మారిపోయాయి.

యూరోపియన్ల రాకకుముందు భారతదేశంలోకి ఎన్నిజాతులు, తెగలు చొచ్చుకు వచ్చినా, వారిక్కడే స్థిరపడిపోయి భారత దేశాన్ని మాతృదేశంగా చేసుకున్నారు. ముస్లింలలో కూడా అనేక మతాలు ఇక్కడే స్థిరపడిపోయాయి భారతదేశ సంపదను వారు తమ మాతృదేశానికి తరలించుకుపోలేదు. మత విభేదాలున్నా ఒక రకమైన సాంస్కృతి సమైక్యత ఆవిర్భవించింది. కాని యూరోపియన్ల రాకతో బ్రిటిష్ వారి రాకతో భారతదేశ సంపద కొల్లగొట్టబడి దేశం నాశనమైంది. ప్లాసీ యుద్ధంలో బెంగాల్ నవాబు సిరాజుద్దౌలాను బ్రిటిష్ వాళ్ళు ఓడించడంతో భారతదేశ బానిసాధ్యాయం ప్రారంభమయింది. భారతదేశ బానిసత్వానికి దారితీసిన యూరోపియన్లరాక, వాళ్ళకంపెనీల స్థాపన. వర్తకులుగా నెమ్మదిగా చేరి దోపిడిగాండ్రయి, వివిధ రాజుల మధ్య తంపులుపెట్టి కుట్రలూ, గోతులు తవ్వడాలూ సాగించిన వాళ్ళ నీచప్రవర్తనా, మనదేశ దాస్యానికి దోహదం చేశాయి. ఆఘటన లేవో పరిశీలించుదాం.

పోర్చుగల్‌కి చెందిన వాస్కో-డిగామా 1497 జూలై 8 న భారతదేశ పశ్చిమ తీరంలో అడుగు పెట్టాడు. పోర్చుగీసులు కాలికట్‌లో తమ మొదటి ఫ్యాక్టరీని క్రీ. శ. 1500 సంవత్సరంలో స్థాపించారు. క్రీ. శ. 1510 లో 'గోవా'ను వశపర్చుకున్నారు. స్పెయిన్‌తో చేసుకొన్న ఒడంబడికమూలంగా ఆగ్నేయాసియాలో పోర్చుగల్‌కు వ్యాపార గుత్తాధిపత్యం లభించింది.

అయినా డచ్చివారు భారతదేశంలో వర్తక కేంద్రాలు నెలకొల్పుకోడానికి ఇదేమీ అడ్డురాలేదు. డచ్చివారు క్రీ. శ. 1602 లోను, ఫ్రెంచి వారు క్రీ. శ. 1664 లోను మన దేశంలో కాలు పెట్టారు. మిరియాలు, లవంగాలు, దాల్చినిచెక్క మొదలైన సుగంధ ద్రవ్యాలను వీరు తమ దేశాలకి తరలించుకు పోయేవారు.

బ్రిటిష్‌వాళ్ళు ఈస్టిండియా కంపెనీని క్రీ. శ. 1600 లో స్థాపించారు. 1609 లో ఆ కంపెనీ చార్టర్ పునరుద్ధరించబడింది కాల, ప్రాంత పరిమితి లేకుండా ఆసియాలో గుత్త వ్యాపారాధికారం దీని ద్వారా ఈ ం డియా కంపెనీకి లభించింది. 1698 లో బ్రిటిష్ పా మెంటు దీనికి ఆమోదముద్ర వేసింది. 1708 లో తి . ధృవీకరించింది.

యూరోపియన్ కంపెనీలు మొదట వర్తక కేంద్రాలు ఏర్పరచుకొన్నా, చివరి కవి యుద్ధ కేంద్రాలుగా మారాయి. దేశ భూభాగాలను ఆక్రమి-చుకొన సాగాయి. కుట్రలు, కుతంత్రాలు సాగించాయి. మిత్ర భేదాలను సృష్టించాయి. అంతఃకలహాలను రెచ్చగొట్టాయి. మరోప్రక్క తమ వర్తక ప్రాబల్యానికై యూరోపియన్ కంపెనీలు తమలో తాము కలహించుకొంటూ భారతీయుల్ని బలిపశువులు గావించాయి. వర్తక పోటీలు యుద్ధాలకు దారితీశాయి. భారతదేశంలోని పోర్చుగీసు స్థావరాలపై దాడిచేసి డచ్చివాళ్ళు బ్రిటిష్ వాళ్ళ సహాయంతో కొంత విజయం సాధించారు. ఆంగ్లో-డచ్ నౌకాదళాలు 1625 లో పోర్చుగీసులను ఓడించి వాళ్ళ ఆస్తిపాస్తులను పంచుకొన్నాయి. ఆ బ్రిటిష్‌వాళ్ళే 1642 లో డచ్‌వాళ్ళను వదలి పోర్చుగీస్ వాళ్ళ మిత్రులయ్యారు దానికి ప్రతిఫలంగా ఆసియాలో మకావో మినహా తతిమ్మా పోర్చుగీసు అధీన ప్రాంతాలన్నింటిలో నిరాటంకంగా వ్యాపార సౌకర్యాలు పొందారు. మరో పదేళ్ళకు భారతదేశంలోడచ్‌వాళ్ళపై ఆంగ్లో-పోర్చుగీస్ సేనలు పోరాడాయి. 1654 నాటికి డచ్చివాళ్ళను బలహీనపరచి తమ అధికారాన్ని బ్రిటిష్ వాళ్ళు ఇండియాలో పెంచుకున్నారు. బ్రిటిష్ రాజు చార్లెస్‌కు కుమార్తె కట్నంగా బొంబాయిని బహూకరించాడు పోర్చుగీసు రాజు. 1668 లో ఈస్టిండియా కంపెనీకి బొంబాయి రేవుపట్టణంతో సహా దక్కింది. అంతకుముందే మద్రాసు బ్రిటిష్‌వాళ్ళ వశమయింది. మొగలాయి చక్రవర్తులకు, మరాఠా రాజులకు యుద్ధాలు చెలరేగాయి. ఇదే అదనుగా 1687 డిసెంబరులో యీస్టిండియా కంపెనీ భావి సామ్రాజ్యపునాది అనదగిన పౌర, సైనిక సంస్థలను నెలకొల్పింది.

యు లు, కుతంత్రాలు భారతీయ రాజులమధ్య తంపులు పె డం ద్వారా బ్రిటిష్‌వాళ్ళ అధికారం అతి వేగంగా సరించింది. ఉదాహరణకు 1749 లో తంజావూరు యువరాజు షాజీని, అతని శత్రువు సింహాసనం నుండి తొలగించాడు. తిరిగి తనను గద్దెనెక్కిస్తే బంగాళాఖాతంలో కోలరూన్ నది కలిసేచోటున వున్న దేవీకొట్టైను ఇస్తానని షాజీ చెప్పాడు. బ్రిటిష్‌వాళ్ళ ముట్టడికి దేవీకొట్టై లొంగిపోయింది. కాని షాజీని గద్దెనెక్కించే సంగతిని ఎవరూ పట్టించుకోలేదు.

బ్రిటిషువాళ్ళ కుట్రలకు బలియైనవారిని ఫ్రెంచి వాళ్ళు దగ్గరకు తీసేవారు. అలాగే ఫ్రెంచివాళ్ళ కుట్రలకు గురైనవారిని బ్రిటిషువాళ్ళు బుజ్జగించేవారు.

ఢిల్లీలో మొగల్ చక్రవ ల అధికారం కూలి పోతున్న సమయంలో సిరాజు లా బెంగాల్‌ను వశ పర్చుకున్నాడు. యూరోపియ లను ఓడించి కల కత్తాలో నిర్బంధించాడు. 1752 జనవరి 2 న బ్రిటిషు అధికారి రాబర్టు యివ్ కలకత్తాను తిరిగి స్వాధీన పర్చుకొని సిరాజు లాను అవమానకరమైన షరతులకు అంగీకరించే ట్లు చేశాడు. అయితే ఫ్రెంచి వాళ్ళతో కుట్రలుచేయ ప్రయత్నించిన సిరాజుద్దౌలాను బ్రిటిషు సైనికాధికారి వాట్సన్ "మీ దేశంలో చిచ్చు పెడతాను. దాన్ని ఆర్పడానికి గంగానది నీళ్ళు యావత్తు పోసినా చల్లారదు" అని బెదిరించాడు. సిరాజుద్దౌలా నిస్సహాయుడయ్యాడు. దానితో ఫ్రెంచి వాళ్ళను బ్రిటిషువాళ్ళు కలకత్తా నుండి వెళ్ళగొట్టారు. ఐతే నవాబు అధికారంలోనే ఉన్నాడు. అతనికి కొంత మంది ఫ్రెంచి సలహాదార్లు ఉండనే ఉన్నారు.

బెంగాలు నవాబుకు ఎవరు వారసులన్న వివాదం 1756 లో ప్రారంభమయింది. ఓడిపోయిన నవాబు వంశీకుడు బ్రిటిషువాళ్ళను ఆశ్రయించాడు. అతన్ని అప్పగించవలసిందిగా అడిగిన సిరాజుద్దౌలా కోర్కెను తిరస్కరించిన బ్రిటిషువాళ్ళను సిరాజుద్దౌలా కలకత్తా నుండి తరిమివేశాడు. మద్రాసునుండి రాబర్టు క్లయివు, వాట్సన్ సైనికులతో దిగారు. జగత్‌సేట్, అమీచంద్ అనే వర్తకులతోను, వారిద్వారా నవాబు సేనాధిపతి మీర్జాఫర్‌తోను క్లయివ్ రహస్య సంబంధాలు పెట్టుకున్నాడు. తాము గెలిస్తే అతణ్ణి బెంగాలు నవాబుగా చేస్తామని వాగ్దానం చేశాడు. ఫోర్జరీ పత్రం ఒకటి సృష్టించాడు. 1757 జూన్ 23 న ప్లాసీ యుద్ధంలో మీర్జాఫర్ ద్రోహంచేసి నవాబుపై తిరగబడి క్లయివ్‌కు సహాయపడ్డాడు. ఇందువల్ల 50 వేల కాల్బలం, 18వేల గుర్రపుదళంగల నవాబు సైన్యాన్ని, క్లయివు కేవలం 3 వేలకు పైచిలుకు సైన్యంతో ఓడించగలిగాడు. క్లయివు సైన్యంలో 800 మంది మాత్రమే ఇంగ్లీషు వాళ్ళు. మిగతా 2,220 మంది భారతీయ కిరాయి సైనికులే. సిరాజుద్దౌలాను ఉరితీసి తమ కీలుబొమ్మ మీర్జాఫర్‌ను గద్దెనెక్కించారు బ్రిటిషువాళ్ళు.

నిజానికి ప్లాసీ యుద్ధం యుద్ధమా? జయించింది క్లయివా? కానేకాదు డబ్బుకు గడ్డితిన్న జగత్‌సేట్, మహతాబ్‌రాయీ, అమీచందూ, ద్రోహి మీర్జాఫర్, రాజామురభరాయీ మొదలైనవాళ్ళదే విజయం. ఏమైతేనేం ప్లాసీ యుద్ధంతో భారతదేశంలో బ్రిటిషు సామ్రాజ్య పాలనకు పునాది పడింది. మనదేశం బ్రిటిషువాళ్ళ వలసదేశంగా మారడానికి అంకురార్పణ జరిగింది.

మీర్జాఫర్ బెంగాలులోని 24 పరగణాలను, విపరీత ధన,కనక,వస్తు సంపదను బ్రిటిష్ వాళ్ళకు కట్టబెట్టాడు-యివు సంతోషానికి పట్టపగ్గాలు లేకపోయాయని రాబర్ట్ ఆర్మ్‌కి, అతడు రాసిన ఉత్తరమే చెబుతుంది: "నీ గ్రీత రచన కొనసాగింపుకు కావలసిన సామగ్రి సంపుటాల కొద్దీ నా వద్దవుంది. అందులో జగడముంది, జిత్తులున్నాయి. పితలాటకా లున్నాయి. కుట్రలున్నాయి. రాజకీయాలున్నాయి. ఇంకా ఏమున్నాయో ఆ దేవుడికే తెలియాలి"

1760 లో బెంగాల్ గవర్నర్, మీర్జాఫర్‌ను తొలగించి అతడి అల్లుడు మీర్‌ఖాసిమ్‌ను నవాబు చేశాడు. దానికి ప్రతిఫలంగా 2 లక్షల పౌన్లు, బెంగాలులోని సంపదవంతమైన బర్ద్వాన్, మిడ్నపూర్, చిటగాంగ్ లను పొందారు 1763 బక్సార్ యుద్ధంలో మీర్‌ఖాసిమ్‌ను ఓడించారు, తర్వాత 1765 లో ద్వంద్వ ప్రభుత్వం ఏర్పడింది. సివిల్, క్రిమినల్ పరిపాలన మొగల్ చక్రవర్తులది. రెవెన్యూ వసూళ్ళు ఈస్టిండియా కంపెనీది.

రాబర్టు క్లయివు అనుసరించిన పంథానే వారెన్ హేస్టింగ్సు కూడా కొనసాగించాడు. యుద్ధాలు, బలవంతంగా పన్నులవసూళ్ళు, కుట్రలుద్వారా అతడు కూడా రాజ్యాన్ని విస్తరింప చేశాడు.

క్రమంగా బ్రిటిష్‌వాళ్ళు తమ యూరోపియన్ పోటీదార్లను తొలగించ గలిగారు. పోర్చుగీసులకు కొద్ది రేవుపట్నాలు మిగిలాయి. డచ్చివాళ్ళను తరిమారు.

ఫ్రెంచి అధికారం క్రమంగా సన్నగిల్లింది. 1818 లో మహారాష్ట్ర సామ్రాజ్యాన్ని జయించడంతో బ్రిటిష్‌వాళ్ళు ప్రబల రాజకీయశక్తిగా రపద్దారు. ఈ కాలం నాటికి మొగల్ "చక్రవ " అనబడే "షా ఆలం" పరిపాలన ఢిల్లీకి మాత్రం రిమితమైంది.

# కొంపలు కూల్చిన కంపెనీలు

విదేశాల కంపెనీలొచ్చాయి. భారతదేశపు ప్రజల కొంపలు నిలువునా కూల్చాయి. వాటిలో బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీది ముఖ్యపాత్ర. ఈ కంపెనీలు రాక పూర్వం భారతదేశంలో వర్ణవ్యవస్థపై ఆధారపడిన గ్రామీణ వ్యవస్థ పాతుకుపోయి వుంది. అది స్వయం పోషకం, జీవిత అవసరాలలో అతి ప్రాథమికమైన వాటిని గ్రామసంఘాలు ఆయా గ్రామానికి సప్లయి చేసేవి. ఈనాటి స్వంతహక్కుతో పోలిస్తే, భూమిపై స్వంతహక్కంటూ ఎవరికీలేదు. అది గ్రామ ఉమ్మడిఆస్తి. పంటనుబట్టి పన్ను పాలకులు వసూలు చేసేవారు. అది కూడా గ్రామం మీద ఉమ్మడిగా రాబట్టే వారు. వసూలైన పన్నులో కొంత భాగం నీటిపారుదల వగైరాలకు వినియోగించేవారు. గ్రామ సంఘాలు గ్రామ సమస్యల్ని పరిష్కరించేవి. వ్యవసాయం, చేతి పరిశ్రమలను సమన్వయం చేసేవి గ్రామసంఘాలు. గ్రామాలను స్వయంపోషకంగా చూసేవి. కులాలనుబట్టి వృత్తుల్ని నిర్ణయించి వృత్తులమధ్య పోటీ నివారించేవి. ఆ ప్రాథమిక దశలోని అవసరాలను తీర్చడంలో అవి కొంతవరకూ ఉపయోగపడ్డాయి.

ఐతే దీని అర్థం అప్పుడంతా సుభిక్షంగా వుందనీ కాదు. ధర్మం నాలుగుపాదాలా నడిచిందనీ కాదు. రాజుల తాబేదార్లు, పురోహితులూ, క్షత్రియులూ, రైతులశ్రమ ఫలితాన్ని దోచుకునేవారు అగ్ర, హీన కులాల వివక్షతో 'హీన' కులస్తులను వారి నేరాలకు అమానుష శిక్షలు విధించేవారు

హిందూ రాజుల, మహమ్మదీయ చక్రవర్తుల కాలంలో పరిపాలన, రాజ్యాంగ విధానంలో ఎన్ని మార్పులు వచ్చినా, సామాజిక వ్యవస్థ విచ్ఛిన్నం కాలేదు. రాజులు దోపిడీచేసిన దానిలో కొంత ప్రజోపయోగ కార్యాలకు ఖర్చు చేసేవారు. చేతి పరిశ్రమలకు రాజభవనాలలో మార్కెట్ లభించేది. అదనపు సరుకులే విదేశాలకు ఎగుమతి అయేవి.

"...గతకాలం అంతటిలోనూ హిందూస్థాన్ అనుభవించిన బాధలన్నిటికన్నా, బ్రిటిష్‌వాళ్ళ చేతుల్లో హిందూస్థాన్ అనుభవించిన దారిద్ర్య దైన్యాలు మౌలికంగా వేరైనవనీ, చెప్పనలవి కానంత అపార తీవ్రతకల విధానానికి చెందినవనీ అనడంలో ఎట్టి సందేహమూలేదు." అని 1853 లోనే "ఇండియాలో బ్రిటిష్‌పాలన" అనే వ్యాసంలో కారల్‌మార్క్స్ స్పష్టం చేశాడు.

"ఆధునిక పారిశ్రామిక విధానానికి పుట్టినిల్లు అని చెప్పదగిన యూరప్‌లోని పాశ్చాత్య దేశాలలో అనాగరిక జాతులు నివసించుతున్న సమయంలో, భారతదేశ పరిపాలకులు ధనసంపదతో తులతూగుతుండేవారు. భారతదేశ వృత్తి పనివారల కళాకౌశల్యం వున్నత స్థాయిలో వుండేది. ఆ విధంగా ఆనాడే భారతదేశం ప్రఖ్యాతి చెందింది. ఆ తర్వాతకాలంలో కూడా పాశ్చాత్య దేశాలనుండి వర్తక దుస్సాహసికులు భారతదేశంలో మొట్టమొదటిసారి అడుగిడిన కాలంలో కూడా, ఈ దేశపు పారిశ్రామికాభివృద్ధి, బాగా అభివృద్ధి చెందిన యూరోపియన్ జాతులకు కనీసం ఏమాత్రం తీసిపోలేదు"

ఈ మాటలన్నది 1916-18లో బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పరచిన పారిశ్రామిక కమిషన్. ఆ నాటి ఈ కమిషన్ సభ్యులకు దేశభక్తిలాంటి సుగుణం అబ్బిందని అనలేం కదా!

"గొప్ప బందిపోటు దొంగ"గా మార్క్స్ వర్ణించిన క్లయివ్ 1757 లో ముర్షిదాబాద్ పట్టణాన్ని "విస్తీర్ణంలోను, జనాభాలోనే కాక సంపదలో కూడా లండన్‌తో తులతూగుతుంది." అన్నాడు. ఒక్క ముర్షిదాబాద్ మాత్రమే కాదు, అలాంటి పట్టణాలెన్నో బ్రిటిష్‌వాళ్ళ ప్రభావంతో నాశనమయ్యాయి.

మన వస్త్ర పరిశ్రమను బ్రిటిష్ వాళ్ళు నాశనం చేయకముందు పరిస్థితిని కూడా చూద్దాం.

చెట్టు బెరడులు, తోళ్ళు కప్పుకొని గుహలలో తొలి మానవులు నివసిస్తున్న సమయంలోకూడా భారతదేశంలో ప్రత్తివాడకం వుండేది. క్రీస్తుపూర్వం 445లో హెరొడొటస్ (Herodotus) అనే గ్రీక్ చరిత్రకారుడు "ఒకరకమైన గింజనుండితీసిన చక్కని 'పూలు'తో భారతీయులు అద్భుతమైన వస్త్రాలు తయారుచేసారు" అని రాశాడు. అలెగ్జాండర్ నౌకాధిపతి 'మార్కస్' క్రీ.పూ. 327 లో ప్రత్తిని గురించి "దీనినుండి దుస్తులు తయారుచేయబడతాయి" అన్నాడు. 19 వ శతాబ్దివరకూ యూరప్‌లో భారతదేశ నూలు వస్త్రాలకు ఎక్కువ గిరాకీ ఉండేది. మనదేశపు కాలికో, సిల్కు, ఢక్కా రవసెల్లాలు అత్యంత ప్రసిద్ధిగాంచాయి గజం వెడల్పు, 20 గజాల పొడవుగల

చీర, ఉంగరంలోంచి సునాయాసంగా దూరిపోయేదట. 400 నంబరు నూలు వడికేవారట.

తూర్పుదేశాలకు ముఖ్యంగా భారతదేశానికి ఇంగ్లాండునుండి ఎగుమతి అయిన నూలువస్త్రాల విలువ 1794 లో 156 పౌను కాగా 1813 లో 1,08,82 పౌన్లకూ, 1858 లో 47,82,698 పౌన్లకూ పెరిగింది. ఆ రోజుల్లో బ్రిటిష్ జనాభాలో ఎనిమిదో వంతు మంది, నూలు తయారీ పరిశ్రమపైన ఆధారపడి జీవిస్తూ వుండేవారు.

ఒక దశలో భారతదేశానికి అవసరమైన వస్త్రాలలో 10 శాతం భారతీయ మిల్లులు తయారుచేసేవి. 27 శాతం చేనేతమగ్గాలు వుత్పత్తి చేసేవి. మిగతా 63 శాతం విదేశాలనుండి, ముఖ్యంగా బ్రిటన్ నుండి దిగుమతి అయ్యేవి.

1813 వరకు భారత దేశంతోటి వర్తకంలో ఈస్టిండియా కంపెనీదే పైచేయిగా వుండేది. ఈ కంపెనీలో ప్రధానంగావాణిజ్య వర్గాలదే ప్రాబల్యం. కాని ఆ తర్వాత ఇంగ్లండ్‌లో అప్పుడే తలెత్తిన పారిశ్రామిక వర్గాలుకంపెనీ దోపిడిలో మకు భాగం కావాలన్నాయి. "స్వేచ్ఛా వర్తకం" అనే నినాదం చేపట్టాయి ఈ తగాదాలే క్లయివ్, వారన్‌హేస్టింగ్స్‌ల దురాగతాలపై విచారణకు దారితీశాయి. అంతేగాని భారతీయులపై దయదలచికాదు ఈ విచారణలు జరిపించింది. చివరకు పారిశ్రామిక వర్గాలు జయించాయి. 1813 లో కంపెనీ గుత్తాధికారాన్ని బ్రిటిష్ పార్లమెంట్ తొలగించింది.

కంపెనీ కాలంలో ఢక్కా, ముర్షిదాబాద్. సూరత్ మొదలైనచోట్ల నుండి మన చేనేత పారిశ్రామికులు ఉత్పత్తి చేసిన వస్త్రాలను దిగుమతి చేసుకునేది బ్రిటన్. కాని తర్వాత యీ పరిస్థితి తారుమారయింది.

17 వ శతాబ్ది చివరలోనూ, 18 వ శతాబ్దిఅంతటా ఈస్టిండియా కంపెనీ వ్యవహారాల్లో జోక్యం చేసుకోవలసిందిగా బ్రిటిష్ పారిశ్రామిక వర్గాలు తమ ప్రభుత్వాన్ని కోరాయి. భారతదేశంనుండి నూలు పట్టు వస్త్రాల దిగుమతి, బ్రిటిష్ పరిశ్రమాధిపతులకు నష్టమని వారు వాదించారు. భారతదేశం, పర్షియా, చైనా దేశాల చేనేత పట్టు వస్త్రాలు, అద్దకం, రంగు నూలు వస్త్రాలు ధరించడం బ్రిటన్‌లో నిషేధించబడింది. వాటిని తమవద్ద వుంచుకున్నా, అమ్మినా, నేరమే. అలాంటివానికి 200 పౌన్లు అపరాధం విధించేవారు.

భారతదేశంలోని కార్ఖానా సరుకులు ఇంగ్లీషు మార్కెట్‌నుండి నిషేధించారు, యూరప్‌లో తాము తిరిగి అమ్ముకోడానికి మాత్రమే ఈ సరుకుల్ని ఇంగ్లండ్‌కు ఎగుమతి చేసుకొనేవారు. 1813 వరకూ ప్రధానంగా ఎగుమతి దేశంగావున్న భారతదేశం, దిగుమతి చేసుకొనే దేశంగా మారిపోయింది. అనాదినుండి ప్రపంచానికంతా నూలు వస్త్రాలు తయారుచేసిన భారతదేశానికి, ఇంగ్లీషువాళ్ళు నూలు కట్టలు, నూలు వస్త్రాలు కుప్పలు తెప్పలుగా దిగుమతి చేయడం ప్రారంభించారు. భారతదేశపు సరుకులను నిషేధించారు. ఒకవేళ ఇంగ్లండుకు దిగుమతి చేసుకున్నా, అనేకమైన క్రూర షరతులకు లోబడి దిగుమతిచేసుకొన్నారు. దిగుమతి సుంకాలు అతి స్వల్పంగా, నామమాత్రంగా వుండేవి.

బ్రిటిష్ దిగుమతులు పెరగడానికీ, మనదేశ ఎగుమతులు తరగడానికీ, తనకొకన్యాయం, మనకొక న్యాయం నిర్ణయించారు బ్రిటిష్ పాలకులు. తమ దిగుమతులపై నామమాత్రంగా 2 లేక 3 శాతం సుంకం వేసేవారు. మనదేశం నుండి ఎగుమతి అయ్యే వస్త్రాలపైన, ఉన్నిపైన 10 నుండి 30 శాతం దాకా సుంకం విధించేవాళ్ళు. అందుచేతనే 1818–36 మధ్య ఇంగ్లండు నుండి భారతదేశానికి మిల్లు నూలు ఎగుమతులు 5200 రెట్లు పెరిగాయి. 1814–35 ల మధ్య ఇరవై ఏళ్ళలో పదిలక్షల గజాల నుండి 510 లక్షలకు భారతదేశానికి వస్త్రాల దిగుమతులు పెరిగాయి. అదే కాలంలో భారతదేశం నుండి, బ్రిటన్‌కు ఎగుమతులు 12½ లక్షల వస్త్రాల నుండి 63 వేలకు పడిపోయాయి.

ఇంగ్లండు తయారుచేసి ప్రపంచ మార్కెటులో తాను అమ్ముకొనే నూలు వస్త్రాలలో 4 వ వంతును భారతదేశానికే అమ్ముతుండేది. ఇది 1850 నాటి పరిస్థితి.

వివక్షతో కూడిన సుంకాల ఫలితంగా ఒక్క వస్త్రాల విషయంలోనేకాక, ఇతర భారతీయ పరిశ్రమలు కూడా దెబ్బతిన్నాయి.

భారతదేశపు ఉక్కుచరిత్ర ప్రసిద్ధమైనది. డమాస్కస్‌లోని కత్తులకు భారతదేశపు ఉక్కు వాడేవారు. ఢిల్లీ, ధార్‌పట్టణాలలో పెద్ద పెద్ద ఇనుపస్తంభాలు

వాడటం, కోనార్క్ దేవాలయంలో ఇనుపదూలాలు వాడటం ఏం తెలియచేస్తున్నాయి? యూరోపియన్లు 19 వ శతాబ్దిలో ఫౌండ్రీలలో ఇనుం కరిగించడానికి ముందే, మనదేశంలో లోహపరిశ్రమ ఉన్నతస్థితిలో వుందని తెలుస్తూంది. ఐనా బ్రిటిష్‌వాళ్ళు స్వీడెన్, రష్యాలనుండి ఉక్కును తెచ్చుకొని, భారతదేశానికి దిగుమతిచేసి లాభాలు గడించేవాళ్ళు.

నౌకా పరిశ్రమలో కూడా అంతే. 16 వ శతాబ్దంలో ఒక ఇటలీవాసి, దక్కన్ రేవులలో నిర్మించబడిన నౌక యూరప్‌లో ఉన్న ఏ నౌకకన్నా పెద్దదేనని చెప్పాడు. 19 వ శతాబ్దం తొలిభాగంవరకూ నౌకా నిర్మాణం పెద్ద పరిశ్రమగానేవుంది. కాని తర్వాత పరిస్థితి మారిపోయింది. కలకత్తాలో నిర్మించిన నౌకలు బ్రిటన్‌లో తయారైన ఓడలతో పోటీచేయలేక పోయాయి. ఈస్టిండియా కంపెనీతో సంబంధముండి, చైనాతో వర్తకం చేసుకోడానికి కంపెనీకి ఉపయోగ పడుతూఉన్న పార్సీల చేతిలోమాత్రం బొంబాయిలో నౌకాపరిశ్రమ 19 వ శతాబ్దం మధ్యకాలంవరకూ నెగ్గుకు రాగల్గింది.

అలాగే ఇంగ్లండులోని యంత్రాలద్వారా ఉత్పత్తి అయిన వస్తువులతో పోటీకి, మనదేశంలోని లోహ, తదితర వస్తువులు తట్టుకోలేక పోయాయి.

చేనేతపరిశ్రమ ఎలాపడిపోయిందో ఇదివరకే చెప్పాం. బ్రిటన్‌నుండి దిగుమతి అయిన మిల్లు వస్త్రాలపోటీ తట్టుకొనేందుకు వాళ్ళు అమ్మే ధరలకే తమ వస్త్రాలను కూడ భారతీయ నేతపనివారు అమ్ముకోవలసి వచ్చింది. 1815-44 మధ్య ఒక్క మద్రాసు రాష్ట్రంలోనే చేనేతపనివారి జీవనస్థాయి 100 కి 75 పాళ్ళు తగ్గిపోయింది. నేతపనివారికి నూలు సప్లయిచేసే దళారీలు, వడ్డీవ్యాపారుల మూలంగాకూడా వారి పరిస్థితి అధ్వాన్న మయింది.

1824 లో 60 లక్షల గజాల వస్త్రాలను బ్రిటన్ భారతదేశానికి ఎగుమతి చేసింది. 1837 నాటికి 6 కోట్ల 40 లక్షల గజాలకు ఎగుమతులు పెరిగాయి ఇదే కాలంలో చేనేత పరిశ్రమకు ప్రసిద్ధి చెందిన ఢక్కా లోని జనసంఖ్య లక్షా 50 వేల నుండి 20 వేలకు తగ్గి పోయింది. 1834 లో గవర్నర్ జనరల్‌గాఉన్న విలియం బెంటింక్ మాటల్లోనే ఆనాటి దుస్థితిని చూద్దాం: "వాణిజ్య చరిత్రలో ఇంతటి దైన్యస్థితిని పోలిన చరిత్రలేదు. భారతీయ నేతగాండ్ర బొమికలు భారతదేశ మైదానాలను చలవచేస్తున్నాయి."

సర్ జార్జి కారన్‌వాన్ లెవిస్, 1858 ఫిబ్రవరి 12 న కామన్సు సభలో ఇలా అన్నాడు: "1765-84 వరకూ వున్న ఈస్టిండియా ప్రభుత్వం కన్నా ఎక్కువ అవినీతికరమైన విశ్వాస ఘాతుకమైన, క్రూరంగా కొల్లగొట్టే నాగరిక మనిపించుకొనే ప్రభుత్వం ప్రపంచంలో ఎక్కడా ఏకాలంలోనూ లేదని నేను అత్యంత ఆత్మవిశ్వాసంతో చెబుతున్నాను."

# సామ్రాజ్యవాదం ఒకడిది, సోకు ఇంకొకడిది

భారతదేశంలో దోచుకొన్న డబ్బు, బ్రిటిష్ పారిశ్రామిక వర్గానికి పెట్టుబడిగా ఉపయోగపడింది. వ్యాపార పెట్టుబడి దశనుండి పారిశ్రామిక పెట్టుబడి దశకు ఎదగడానికి ఉపయోగ పడింది. ఆ విధంగా పారిశ్రామిక విప్లవం సాధించిన మొట్టమొదటిదేశం ఇంగ్లండ్ అయింది. ప్రపంచంలో అత్యంత శక్తివంతమైన పారిశ్రామిక దేశమయింది. దాదాపు ఒక శతాబ్దం వరకూ ఇంగ్లండ్ ఈ ప్రముఖస్థానం నిలబెట్టుకొంది. ఈ సందర్భంగా డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు 'కాంగ్రెస్ చరిత్ర'లో వెల్లడించిన అభిప్రాయాలు గమనార్హం.

"ఈస్టిండియా కంపెనీవారు హిందూదేశ మాక్రమించుకొనిన విధాన మనేక విశ్వాస ఘాతుక కృత్యాలతో, అనేక వాగ్దాన భంగాలతో, అనేక దురాశాపరత్వ హేయకార్యాలతో, అనేక వంచనలతో నిండివుంది. ఆ కళంక చరిత్రతో మనకిప్పుడు ప్రసక్తి లేదు.........స్టీమ్‌ఇంజన్, మెషీనులు కని పెట్టబడిసప్పుడు ఇండియానుండి తీసుకొని పోబడిన ధనరాసులే, ఇంగ్లాండుదేశం ప్రపంచంలో పారిశ్రామికాధిపత్యం సాధించుటకు మూలధనంగా ఉపయోగపడిందని మాత్ర మిచ్చట చెప్పిన చాలును."

వ్యాపారంలో ఈస్టిండియా కంపెనీకి ఉన్న గుత్తాధిపత్యాన్ని 1813 లో బ్రిటిష్ పార్లమెంటు రద్దు చేయడంతో బ్రిటిష్ పారిశ్రామికవర్గానిది పైచేయి అయింది. బ్రిటిష్ జౌళివస్త్రాలు భారతదేశానికి విపరీతంగా దిగుమతి కావడం మొదలయింది. ఇంగ్లండు జనాభాలో 8 వ వంతుకు జౌళి పరిశ్రమ ఉద్యోగాలు కల్పించింది.

వీటన్నిటి ఫలితంగా మన దేశ చేనేత పరిశ్రమ నాశనమయింది. ఈ పరిశ్రమకు స్థావరాలైన పట్టణాలు నాశనమయాయి. లక్షలాది చేనేత కార్మికులు నిరుద్యోగులయారు. ఇంగ్లండు యంత్రాలద్వారా చేసిన వస్తువులపోటీకి తట్టుకోలేక మన దేశ లోహ తదితర వస్తువుల ఉత్పత్తి పడిపోయింది.

లక్షలాది చేతివృత్తులవారు జీవనభృతికోసం వ్యవసాయానికి మళ్ళారు కాని వ్యవసాయరంగం కూడా అప్పటికే దుస్థితిలోవుంది. వ్యవసాయ రంగంలో ఈ ఒత్తిడి ఫలితంగా రైతుల దారిద్ర్యం పెరిగింది. కరువులు సంభవించాయి. 1825-1900 మధ్య మానవ కల్పిత క్షామాలవల్ల 2 కోట్ల మంది చనిపోయారు.

రైతాంగం, చేతిపనివారు, వృత్తిపనులవారు ఆనాడు ప్రధానంగా వలస పాలకుల దోపిడీకి గురై నాశనమయ్యారు. ఈ పరిస్థితిని కారల్ మార్క్స్ ఇలా వర్ణించాడు;

"వింత సంక్లిష్ట స్వభావంకల్గి, వేగంగా, విధ్వంసం కలుగచేస్తూ అంతర్యుద్ధాలు, దండయాత్రలు, విప్లవాలు, జయించడాలు, కరువుకాటకాలు, ఒకదాన్నివెన్నంటి ఒకటి వరుసగా హిందూస్థానంలో సంభవించాయి. ఐనప్పటికీ అవి భారతదేశసమాజపు ఉపరితలంకన్నా ఏమాత్రం చొచ్చుకుపోలేదు. కాని ఆ సమాజ పునర్నిర్మాణ చిహ్నాలు ఇంతవరకూ ఏమీ కనబడలేదు. తన పురాతన ప్రపంచాన్ని కోల్పోయి. దాని స్థానే తనకు నూతన ప్రపంచం లభించక పోవడంతో హైందవుడు (భారతీయుడనే అర్థంలో మార్క్స్ ఈ పదం వాడాడు - సం॥) ఇపుడనుభవించుతున్న దారిద్ర్య దౌర్భాగ్యానికి తోడు ఇంకా మరోరకం మనోవ్యాకులతను కూడా పొందుతున్నాడు. తన దేశ పురాతన సంప్రదాయ సర్వస్వం నుండీ,తనదేశ పూర్వ చరిత్ర నుండి,బ్రిటిష్ పరిపాలిత హిందూస్థాన్ వేరుపడి పోయేటట్టు ఇది చేస్తూంది."

# గుండె కోత - సర్జన్ కత్తి

"........పూర్వం విదేశ దండయాత్రలు జరిగినపుడు వాళ్ళు తాము దోచుకొని కొల్లగొట్టిన దానితో సంతృప్తి పడ్డారు. లేదా దేశపాలకులయ్యారు. ఆ సమయంలో భారతదేశానికి తీవ్రమైన గాయాలు తగిలినా అవి నయమయ్యాయి. పరిశ్రమించి, భారత దేశం తిరిగి కోలుకొంది. విదేశీ దండయాత్రకులు పాలకులైనపుడు, వారిక్కడ స్థిరపడ్డారు వారి పరిపాలన వారి రాజ్య స్వభావాన్నిబట్టి వున్నా, వారు దేశ భౌతిక, నైతిక సంపదను కొల్లగొట్టలేదు. దేశం ఉత్పత్తి చేసినదంతా దేశంలోనే ఉండిపోయింది. దేశ పరిపాలన నిర్వహణలో సంపాదించిన జ్ఞానం అనుభవమూ, అవి ఆ దేశీయుల్లో ఉండిపోయాయి. ఇంగ్లీషు వాళ్ళ విషయం వచ్చేసరికి ఇదంతా మారిపోయింది. యుద్ధాలవల్ల సంభవించిన పెద్ద గాయాల్ని మాన్పకుండా నిరంతరం ఇంకా ఎక్కువ చేస్తూ వచ్చారు. ఆ గాయాలు మరేవో కాదు, ప్రజల రుణ భారం. నిరంతర ప్రవాహంగా జీవనరక్తం తరలించబడుతూనే వచ్చింది. గతంలో పాలకులు కసాయి వాళ్ళలా ఎక్కడో ఒకచోట పొడిచేవాళ్ళు. కాని ఇంగ్లీషువాళ్లు శాస్త్రీయ పద్ధతిలో సర్జన్‌కత్తితో గుండె కోత కోసేవారు. ఐతే ఈ గాయం పైకి కనబడదు. నాగరికత, అభివృద్ధి అనే ఇలా ఏవేవో బ్రిటిష్‌వాళ్ళు అతిగా చెప్పే మాటల రూపంలోని 'ప్లాస్టర్' ఆ గాయాన్ని మూసిపెట్టి వుంచేది. భారతదేశ ద్వారంవద్ద ఇంగ్లీషు పాలకులు కావలివాళ్ళుగా వుంటూ, ప్రపంచాన్నంతా సవాలుచేస్తూ వుండేవారు ఎవరు దాడిచేసినా వారి బారినుండి భారతదేశాన్ని రక్షించడానికి తాము అక్కడ ఉంటున్నామని అనేవారు. కాని ఏ నిధి నిక్షేపాల సంరక్షణకు తాము కావలివాళ్లుగా ఉంటున్నామని చెబుతున్నారో. వాటినే పెరటి గుమ్మం ద్వారా తరలించుకు పోయేవారు—"

—దాదాభాయి నౌరోజీ

# 1857కి పూర్వరంగం

19వ శతాబ్ది మొదటి అర్ధభాగంలో, భారతదేశ మంతటా తిరుగుబాట్లు జరిగాయి. రైతులు, గిరిజనులు, పదవీ చ్యుతులైన సంస్థానాధీశులు—ఇలా ఎందరో వలసాధిపత్యాన్ని ధిక్కరిస్తూ వచ్చారు.

బ్రిటిష్ పాలకులపై ఈ అసంతృప్తికి కారణా లేమిటో చూదాం.

స్వతంత్ర సంస్థానాలను సామంతులుగా చేసుకొనే విధానంగా ఈస్టిండియా కంపెనీ "సైన్య సహకార విధానం"గా(సబ్సిడియరీ సిస్టం) చేప ట్టింది.సంస్థానాలు కంపెనీ సైన్యాలు ఉంచుకొని వాటి ఖర్చులు భరించాలి. ఆ ఖర్చుల పేరిట రుద్దిన అప్పులను సంస్థానాధీశులు తీర్చలేకపోతే సంస్థానాలను జప్తుచేసి భుక్తం చేసు కొనేవి.

బ్రిటిష్ వలస పాలకులు భారతదేశంలో తమ అధి కారాన్ని స్థిరపరచుకొన్నాక, వాళ్ళ దృష్టి సంస్థానాల్ని దిగమింగడ మెలాగా అన్న దానిపై పడింది. దీనికి ఒక సాధనంగా సంతతిలేని సంస్థానాధీశులు దత్తత చేసుకొంటే, వారికి ఆ రాజ్యాలు సంక్రమించరాదని అన్నారు. సంస్థానాధీశులకు ఆ విధంగా దత్తతాధి కారం నిరాకరించబడింది. 1848-58 మధ్య, సతారా, నాగపూర్, ఝాన్సీ, సంబల్‌పూర్ తదితర సంస్థా నాలు ఈ విధంగా కబళించ బడ్డాయి. తంజావూరు రాజు, కర్నాటక (ఆర్కాట్) నవాబులు చనిపోయాక అవి రద్దుచేయబడ్డాయి. నిజాంరాజు చెల్లించవలసిన బాకీలకుగాను బీరార్‌ను కట్టబెట్టుకొన్నారు. 1831లో మైసూరు రాష్ట్రం బ్రిటిష్ పాలన క్రిందికి వచ్చింది. ఐతే రాజుకు పెన్షన్ మాత్రం ఇచ్చేవారు. రెండవ పీష్వా బాజీరావుకి మాత్రం అది కూడా ఇచ్చేవారు కాదు. పరిపాలన సక్రమంగా లేదంటూ.1856లో అయో ధ్యను పూర్తిగా వశపరచు కొన్నారు.

సంస్థానాధీశులు తమ అధికారం అంతరించడంతో, తమ కొలువు కూటాలను రద్దుచేసుకొన్నారు. దానితో అక్కడి సిబ్బందికి ఉద్యోగాలు పోయాయి. వృత్తి పనివారికి వృత్తులు పోయి, చేతిలో చిల్లిగవ్వలేకుండా పోయింది. ఇక రైతుల విషయం — పంటలు పండకపోతే, ఇచ్చే పన్నుల మినహాయింపులను, ప్రభుత్వం ఇవ్వ నిరాకరించింది. తక్కావీలను ఇవ్వ లేదు. భారత సంస్థానాధీశులను మామూలు బ్రిటిష్ పౌరుల స్థాయికి దింపడం జాతిగర్వానికి పెద్దదెబ్బగా భావించారు. పూర్వపు సంస్థానాధీశుల నాయకత్వాన రైతుల తిరుగుబాట్లు కూడా జరిగాయి. గిరిజనులపట్ల అవలంబించిన వైఖరివల్లకూడా అసంతృప్తి పెరిగింది. వారిలో ఎక్కువమంది ప్రత్యక్షంగా పన్నులు చెల్లించ నవసరం ఉండేది కాదు. రోడ్డు రక్షణ ద్వారా, సైనికు లకు గార్డు డ్యూటీ చేసేవారు. కాని వారి సేవలు అన వసరమని, వారి ఆ విధులను రద్దుచేసి, వారి భూము లపై బ్రిటిష్ వాళ్ళు పన్నులు విధించారు. ఇది దేశ మంతటా గిరిజనుల తిరుగుబాట్లకు దారితీసింది.

19 వ శతాబ్ది ప్రథమార్ధ భాగంలో రైతులు, గిరి జనులు, పదవీచ్యుతులైన సంస్థానాధీశులు వలస పాల కులకు వ్యతిరేకంగా పోరాటాలుసాగిస్తూ వచ్చారు. ఆంధ్రలో పాలెయకార్లు తిరగబడ్డారు. 1813-14, 1831 లలో కూడా తిరుగుబాట్లు జరిగాయి. తిరుగుబాట్లను అణచివేయడానికి బ్రిటిష్ వాళ్ళకు చాలా సంవత్సరాలు పట్టింది.

1807 లో ఢిల్లీ ప్రాంతమంతా సాయుధ పోరాటం సాగించింది. 1814 లో వారణాసి వద్ద సాయుధ రాజ పుత్ర రైతులు, గ్రామ ప్రజా సముదాయాన్ని పరాయి వాడు వేలం ద్వారా అమ్మడాన్ని నిరోధించగలిగారు. 1817-18 లో ఒరిస్సా రైతులు పన్నుల విధింపుకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. 1826-29 లో పూనా జిల్లాలో మాజీ మరాఠా సైనికుల అండదండ లతో రాముసీలు తిరగబడ్డారు. తక్కువ రెవిన్యూ చార్జీలకు పాలకులు అంగీకరించారు.

పన్నుల పెంపుదలను వ్యతిరేకించిన గుంసూర్ (మద్రాసు రాజధాని)లో స్థానిక భూస్వామి ఎస్టేటును స్వాధీనపర్చుకుని బ్రిటిష్ పాలనను ప్రత్యక్షంగా విధిం చినందుకు నిరసనగా తిరుగుబాటు జరిగింది. 1842 లో ఇదే కారణాలతో సాగర్‌లో తిరుగుబాటు జరిగింది. 1846-47 లో కర్నూల్‌లో రైతులు స్థానిక 'పాలయ క్కార్' నాయకత్వాన తిరుగుబాటు చేశారు. 1844 లో బొంబాయి పరిహద్దులోని కొల్హాపూర్, సంతవాడి సంస్థా నాలలో, సంస్థానాధీశుల కష్టాలుచెల్లించేందుకు భూమి శిస్తు హెచ్చించినందుకు తిరుగుబాటు జరిగింది. నాగ పూర్‌లో 1818 లో రోహిల్లాలు సాయుధ పోరాటం సాగించారు. ఖాందేష్ (బొంబాయి రాష్ట్రం) భూమి

సర్వే అనంతరం భూమి శిస్తు పెంచినందుకు నిరసనగా రైతులు తిరుగుబాటు చేశారు.

బెంగాలు రాష్ట్రంలో చోటానాగపూర్‌లో హోస్ తెగ 1831-32 లో తిరగబడ్డారు. 1818-31 లో భిల్లులు, కోల్ తెగ తిరగబడ్డాయి. 1824 29 లో కిత్తూరులో రైతుల తిరుగుబాటు. 1832, 1835 లలో కచ్‌లో నిరంతరం అశాంతి ప్రబలింది. 1839, 1844-46 లలో సహ్యాద్రిలో కోలీ తెగ వారు తిరగబడ్డారు. 1820 లో రాజపుత్రస్థానంలో 'మెర్ జాతి' వారు తిరగబడ్డారు. 1836 నుండి 1855 వరకూ ఖోండులు(ఒరిస్సా) 1855 లో బీహార్‌లోని సంతాలులు తిరగబడ్డారు.

కొత్త పన్నులకు వ్యతిరేకంగా పట్టణాలలో కూడా అశాంతి ప్రబలింది. హర్తాళ్ళు జరిగాయి. వారణాసిలో కొత్త ఇంటిపన్నుకు వ్యతిరేకంగా, 1816 లో బెరైలీలో కొత్త పోలీసు లెవీలకు వ్యతిరేకంగా హర్తాళ్లు జరిగాయి.

కొన్ని సందర్భాలలో బ్రిటిష్ వ్యతిరేక ఆందోళనలు మతంతో ముడిపెట్టడం జరిగింది. 1810 లో బోహ్రా మహ్దీయులు, అబ్దుల్ రహ్మాన్‌అనే మాజీ సైనికాధిపతి నాయకత్వాన సూరత్ వద్ద ఒక కోటను పట్టుకొని తానే మెహ్దీ నని ప్రకటించుకొన్నాడు. (మెహ్దీ అంటే దైవ ప్రతినిధి లేక దైవ దూత–అని చెప్పుకోవచ్చు.) 1786-1831 లో వహాబీల తిరుగుబాటు జరిగింది. బెంగాలు, బీహార్‌లలోని ముస్లిం రైతులు ఎక్కువగా పాల్గొన్నారు. పట్టణాలలోని చేతి వృత్తులవారు దుకాణదార్లు కూడా పాల్గొన్నారు. 1824 లో బీహార్ నుండి బ్రిటిష్ పాలకులకు వహాబీలను తరిమి వేశారు. అపుడు వాయువ్య సరిహద్దు ప్రాంతంలోని సితానాలో స్థిరపడ్డారు. అక్కడ సిక్కులతో తలపడ్డారు. వారి నాయకుడు సయ్యిద్ అహ్మద్‌ను సిక్కులు చంపివేశారు. ఐనా బెంగాలు, బీహార్ లలో వహాబీల పోరాటం సాగుతూనేవుంది. 1831 లో మూడు నాల్గు వేల సాయుధ వహాబీలు బరాసత్ జిల్లాలో ఒక చిన్న పట్టణాన్ని పట్టుకొని కలకత్తా వైపు బయలుదేరారు. ఫిరంగులతో తీవ్ర యుద్ధం జరిగాక చెల్లాచెదురయ్యారు.

హాజీషరియత్ అల్లా నాయకత్వాన ఫరాయిజీ ఉద్యమంలో భూస్వాముల పై పోరాటం సాగింది. హిందువులు, ముస్లింలు, బ్రిటిష్ తోట యజమానులపై తిరుగుబాటు సాగించారు. ఇదికూడా "పవిత్ర ఇస్లాం" మత సంబంధమైనదే. దీనిప్రకారం "దేవుని ఎదుట అంతా సమానం. భూమి దేవునిది. ఎవనికీ భూమిపై పన్ను వసూలు చేసే హక్కు లేదు." ఈ పోరాటం 30 ఏళ్ళు సాగింది. 1846 లో కోయిల కుంట్లకు చెందిన వుయ్యాలవాడ నర్సింహారెడ్డి నాయకత్వాన గ్రామాధికారులు చేతివృత్తులవారు, [illegible]డి నౌకర్లు బ్రిటిష్ వ్యతిరేక సాయుధ తిరుగు[illegible] చేశారు. చాకిరీ ఈనాములను రద్దు చేసే పరిశీలన ప్రభుత్వం తలపెట్టగా ఈ తిరుగుబాటు జరిగింది. ఆంధ్రప్రదేశ్ లోని ఏజెన్సీ ప్రాంతాలలో శాశ్వత సెటిల్ మెంటు పెట్టిన 1803 నుండి 19 శతాం[illegible] అంతటా తిరుగుబా[illegible] జరిగాయి. జమిందా[illegible], ముఠాదార్లు, సాహూకా[illegible], మాత్రమే గాక గిరి[illegible] రైతులు చాలా తిరుగు[illegible]ట్లు చేశారు. అందులో రామభూపతి నాయకత్వాన రంప పితూరీ 1802-3లో జరిగింది. 1879లో చంద్రయ్య, తమ్మన్న దొర, అంబుల్ రెడ్డిల నాయకత్వాన కోయ ప్రజలు చేసిన తిరుగుబాటు ముఖ్యమైంది.

1952 లో బ్రిటిష్‌వాళ్ళపై వహాబీలు, పట్టణాల్లో మతయుద్ధం ప్రకటించారు. దీన్ని రైతులు, పట్టణవాసులు, బెంగాలు సైనికులుకూడా బలపరిచారు. రాయబెరేలీలో సయ్యద్‌అహ్మద్ సాగించిన తిరుగుబాటు అనేక సైనిక తిరుగుబాట్లకు దారితీసింది. వీటిలో అతి ముఖ్యమైనది 1806లో వెల్లూరులో జరిగింది. టిప్పు సుల్తాన్‌కొడుకులు వీటిని ప్రేరేపించారు. 1844లో 34వ పటాలం, 1849 లో 22 వ పటాలం, 1850 లో 66వ పటాలం, 1852 లో 38 వ పటాలం తిరుగబడ్డాయి. ఐతే ఈ తిరుగుబాట్లను అతి క్రూరంగా బ్రిటిష్‌వాళ్లు అణిచివేశారు. ఈ తిరుగుబాట్లకు కారణాలు ఏమిటి?

హిందూ సిపాయిలు బొట్టుపెట్టుకోరాదనీ, చెవులకు తమ్మలు (పోగులు) పెట్టుకోరాదనీ, ఇంగ్లీషు సైనికాధికారులు విధించిన ఆంక్షలు తమ మత స్వాతంత్ర్యాన్ని హరిస్తున్నట్లు భారతీయ సైనికులు భావించారు. ఈ ఆంక్షలకు వ్యతిరేకంగా వెల్లూరు సైనికులు 1806 లో తిరుగబడి తమ సైన్యాధికారిని హత్య చేశారు ఇదే సంవత్సరం బందరులో కూడా సిపాయిలు తిరుగబడ్డారు. తలపాగాలకు బదులు టోపీలు ధరించాలనే ఉత్తరువును ధిక్కరించారు. అం[illegible]కుగాను

నలుగురు సైనికులు కాల్చి చంపబడ్డారు. జీతభత్యాలు, సెలవులు, ప్రమోషన్లు మొదలయిన విషయాలలో బెంగాలు సైనికులలో తీవ్ర అసంతృప్తి వుండేది. బ్యారక్‌పూర్ పటాలాన్ని బర్మా యుద్ధంలో పోరా డేందుకు బలవంతాన తీసుకెళ్ళడానికి బ్రిటిష్ అధి కారులు ప్రయత్నించారు. దానికి సైనికులు తిరగ బడ్డారు. పటాలం అంతటినీ మృత్యువుపాలు చేశారు. అనేకమందిని కాల్చిచంపారు. మిగతా వారిని ఉరి తీశారు 1840 లో చైనా "నల్లమందు యుద్ధం"లో పాల్గొనేందుకు ఓడ ఎక్కడానికి రెండు పటాలాలు నిరాకరించాయి. 1844 లో సింధురాష్ట్రంలోని బెంగాలు సైనికులు, జీతనాతాల విషయమై తిరగబడ్డారు. 1849-50 లో పంజాబులోని బెంగాల్ పటాలాలు తిరగ బడ్డాయి. హైదరాబాదు సంస్థానంలో 1806, 1812, 1827 లలో నైజాం పటాలాలు తిరగబడ్డాయి. 1855 లో మొహరం సందర్భంగా ఇంగ్లీషు సైనికాధి కారి దురహంకార ప్రవర్తనను ప్రతిఘటించి బోలా రం (హైద్రాబాద్)పటాలం తిరుగబడింది.

భారతదేశంలోని హిందూ, ముస్లిం మత విశ్వాసా లకు, జాతీయ సాంప్రదాయాలకు వ్యతిరేకంగా ఇంగ్లీషు వాళ్ళ దుష్ప్రవర్తనతిరుగుబాట్లకుపురికొల్పింది. ఇంగ్లీషు సైనికులకు, భారతీయ సైనికులకు మధ్య వివక్షతో ప్రవర్తించడం అసలు కారణమైనా, ఇంగ్లీషు వాళ్ళు ఇక్కడివారి మతవిశ్వాసాలపై దాడి యడం, ఆయా దశల్లో తక్షణ తిరుగుబాట్లకు కారణం చేయింది.

## సన్యాసులే కాని 'సన్యాసులు' కారు

1764 లో బక్సర్ యుద్ధం తర్వాత బెంగాల్, బీహార్, ఒరిస్సాలలో బ్రిటిష్ పరిపాలన నెలకొన్న తర్వాత, బ్రిటిష్ వాళ్ళ దోపిడి రాక్షస స్వరూపం దాల్చింది. కొంతమంది పాత జమీందార్లు, రైతాంగ జనసామాన్యం, తమ ప్రాణాలు నిలుపుకోవాలంటే అడవుల్లోకి పోవలసివచ్చింది. కర్కశ బ్రిటిష్ దురా క్రమణదార్లపై కత్తి గట్టి మొట్ట మొదట తిరుగుబాటు జండా ఎత్తిన వాడు మజ్నూషా. ఈయన ఫకీర్ల దళ నాయకుడు. అలాగే సన్యాసులకు భవానీపథక్ నాయ కత్వం వహించాడు. ఈ తిరుగుబాటు 1763 లో తూర్పు బెంగాల్‌లో జరిగింది. 1800 వరకూ కొన సాగింది.

ఫకీర్లు ముస్లింలలో మదారియా తెగకు చెందినవారు. సన్యాసులు హిందువులలో శైవ తెగకు చెందినవారు. దేశమంతటా వ్యాప్తి చెందిన నిర్మాణం వాళ్ళకు లేకపోయినా బెంగాలు, బీహారులలో రైతాంగాన్ని తమ స్వాతంత్ర్యం, సంస్కృతి, మతం కోసం పోరాడేందుకు ఉత్సాహపరిచారు.

మజ్నూషా మంచిసామర్థ్యం కలవాడు, తమకంటే శ్రేష్టమైన ఎక్కువ ఆయుధాలు కలిగిన బ్రిటిష్‌వాళ్ళతో క్లిష్టపరిస్థితులలో నిర్మాణ దక్షతతో పోరాడిన సేనా నాయకుడు, మెకంజీ సైన్యాలను 1766 లో అనేక సార్లు ఓడించాడు. మరో పోరాటంలో ఇతని చేతుల్లో కమాండర్ కీత్ ఓడిపోయి చనిపోయాడు. లెఫ్టనెంట్ టేలర్ సైన్యాలను తప్పించుకొని మహాస్థాన్‌ఘడ్ లోని అడవులలో మజ్నూషా 1771 లో తిష్టవేశాడు, అక్కడినుండి బీహార్‌కు వెళ్ళాడు రైతులను, చేతి పని వృత్తులవారినీ, బ్రిటిషు వారిపై ఉసికొల్పాడు. 'ఫిరంగీ'లను తరిమివేయడానికి తమతో సహకరించా లని నాటోర్ రాణి భవానికి విజప్తి చేశాడు. కాని ఆమె నుండి జవాబు రాలేదు. 1776 నవంబరు 14 న ఇంగ్లీషు వాళ్ళకు తీవ్ర పరాజయం కల్గించాడు మజ్నూషా. వందలాది ఇంగ్లీషు వాళ్ళు చచ్చారు, లెఫ్టినెంట్ రాబర్ట్‌సన్ గాయపడ్డాడు.

ఐతే సన్యాసులకు ఫకీర్లకూ మధ్య తలెత్తిన విభే దాలు పెద్ద సమస్య అయింది. ఐనా మజ్నూషా వాటిని పోగొట్టడానికి తీవ్రప్రయత్నం చేశాడు. ఉత్తర బెంగాల్ అంతటా తన సైన్యాన్ని తిరిగి కూడ గట్టుకునేందుకై పర్యటించాడు.

1786 డిసెంబరు 29 న లెఫ్టినెంట్ బ్రైనాన్ సైన్యంపై మెరుపు దెబ్బతీయడానికి ముంద్రా అనే గ్రామంలో ప్రత్యక్షమయాడు. అక్కడ గాయపడ్డాడు. ఐనా కత్తి చేత బుచ్చుకుని గుర్రమెక్కి తప్పించుకు పోయాడు. మఖన్‌పూర్ అనే కుగ్రామంలో ఈ గాయం వల్ల మరణించాడు. వీర మరణం చెందిన మజ్నూషా స్థానంలో అతని శిష్యుడూ సోదరుడూ మూసాషా నాయకత్వం వహించాడు.

1787 లో భవానీపథక్, దేవిచౌధరాణీలు చేసిన వీరోచిత కృషికి మజ్నూషా ఇతర శిష్యులు సహాయ పడ్డారు. వీరు ఫెరాగుప్‌షా, బెరాగలీషా, మైమన్‌సింగ్, రంగపూరులలో తీవ్ర పోరాటాలలో ఇంగ్లీషు వాళ్ళకు,

వాళ్ళు తీవ్రనష్టాలు కల్గించారు. మరోదళం రాంజానీషా, జహూరీషాల నాయకత్వాన అస్సాం వెళ్ళింది. కాని పరస్పర హత్యా ఘర్షణలు వారి ఓటమికి దారి తీశాయి. చివరి దశలో శోభనలీ మొదలైన వాళ్ళు తమ అనుచరులను, తిరిగి సమీకరించడానికి ప్రయత్నించారు. కాని 1797 లో ఓడిపోయారు. 1799 లో శోభనలీ, నీగూషా, బుద్ధూషా, ఇమాన్‌షా మొదలైన వాళ్ళు ఆకలితో అలమటించిపోతున్న పీడిత రైతులను సమీకరించి తమ యుద్ధరంగాన్ని విస్తృత పరచడానికి ప్రయత్నించారు. 1799-80 లో దట్టమైన బొగురా అడవిలో కేంద్రం నెలకొల్పారు-కాని ఆధునిక ఆయుధాలు అపారంగాగల బ్రిటిష్ సేన వారిని చుట్టుముట్టి హతమార్చింది. ఫిరంగీలకు (ఇంగ్లీషు వాళ్ళకు) వ్యతిరేకంగా జరిగిన ఈ పోరాటంలో సన్యాసులు, ఫకీర్లు ఓడిపోయినా, వారు సన్యాసులు కాదనీ మహాయోధులనీ నిరూపించుకున్నారు.

సన్యాసుల, ఫకీర్ల పోరాటం ఓడిపోయినా 19, 20 శతాబ్దాలలో తర్వాత జరిగిన స్వాతంత్ర్య పోరాటాల పైన, ముఖ్యంగా వహాబీలపైన, తర్వాత టెర్రరిస్టులని పిలువబడిన విప్లవ యోధులపైన చెరగని ముద్ర వేసింది.

1774 లో భారతదేశానికి గవర్నర్ జనరల్ అయిన వారెన్‌హేస్టింగ్స్, సన్యాసుల గురించి ఇలా వర్ణించాడు - "వీళ్ళు హిందూస్థాన్ జిప్సీలు. ప్రకృతిని తట్టుకోగల దృఢకాయులు. సాహసులు. మితిమీరిన వుత్సాహవంతులు. మొండివాళ్ళు భారతదేశంలో కల్లా చురుకైన వాళ్ళు, టిబెట్ కొండలకు దిగువ కాబూల్ నుండి చైనా వరకుగల ప్రదేశంలో నివసించుతూ వుండేవారు ఆ ప్రదేశం వీరి వశంలో వుండేది."

ఈ సన్యాసులు ఒకచోటనుండి తిరుగుతూ వుండేవారు దాదాపు నగ్నంగా వుండేవారట, తమ దళాలు నశించిపోకుండా ఉండేందుకు ఆరోగ్యవంతులైన పిల్లల్ని ఎత్తుకుపోయేవారట. చాలామంది వర్తకులు, భూస్వాములు వీరిని పూజిస్తూ వుండేవారు. 1763తూర్పు బెంగాల్‌లో మొదట కనిపించారు. ఢాకాలోని ఇంగ్లీషు ఫ్యాక్టరీని వశపరచుకొన్నారు. 1764 లో బ్రిటిష్ వాళ్ళకు వ్యతిరేకంగా షుజాద్దౌలా 5 వేలమంది సన్యాసులను వుపయోగించాడు. 1774 నాటికి వీరిని బెంగాల్ నుండి తరిమివేశారు. 800 మంది సన్యాసులతో జరిగిన భీకర యుద్ధంలో మేజర్ రెన్నెల్ తీవ్రంగా గాయపడ్డాడు.

వీరిని కేవలం విచిత్ర వ్యక్తులుగా, గార్హస్థ్య జీవితాన్ని వదలివేసిన సన్యాసులుగా, పిల్లల్ని ఎత్తుకుని పోయేవారుగా మాత్రమే వర్ణించడం పొరపాటు.ఆనాటి సామాజిక పరిస్థితులిందుకు తోడ్పడి వుంటాయి. రాబర్టు క్లయివ్ వెళ్ళిన తర్వాత వారన్‌హేస్టింగ్స్ పరిపాలనకువచ్చే మధ్యకాలంలో 1767-72 సంవత్సరాల మధ్య కంపెనీ దుష్పరిపాలన గురించి ఇంగ్లీషుచరిత్రకారులే అంగీకరించారు. ద్వంద్వ పరిపాలన, కంపెనీ అధికారుల పేరాశ, వారి దుష్టపరిపాలన దిగ్భ్రమ కొల్పాయని వారు రాశారు.

1769-70 లో సంభవించిన పెద్ద కరువువల్ల 3 వ వంతు జనాభా చనిపోయారు. ఇలా కరువు వాతబడిన బెంగాల్ 1768 లో కంటే 1771 లో ఎక్కువ పన్నులు వసూలు చేసినట్లు వారెన్‌హేస్టింగ్స్ స్వయంగా అంగీకరించాడు.

సన్యాసులు విదేశీయులను, విదేశీని గర్హించేవారని బెంగాల్‌లో సాంప్రదాయకంగా చెపుతూ వచ్చేవారు.

సుప్రసిద్ధ నవలా రచయిత బంకించంద్ర చటర్జీని ఈ సన్యాసుల సాహసకృత్యాలు ప్రభావితం చేశాయి. ఆయన్ని ఉత్తేజపరచాయి. 1883 లో 'ఆనందమఠ్' అనే నవల రాశాడు. ఈనాడు సుప్రసిద్ధమైన 'వందేమాతరం' గేయం 'ఆనంద్‌మఠ్' లోనిదే.

వంగ విభజన కాలంలోను, స్వదేశీ ఉద్యమంలోను ఆ తర్వాత అనేక జాతీయ ఉద్యమ సమరఘట్టాల్లోను 'వందేమాతరం' అనేది దేశభక్తిగేయంగా, బ్రిటిష్ వాళ్ళను ధిక్కరించే నినాదంగా భారతదేశం నలుమూలలా దిక్కులు పిక్కటిల్లచేసింది.

# 1857 ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం

1857నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం. చరిత్రలో మరుపురానిదీ, మరచిపోవీలులేనిదీ, మహోజ్వలమైనదీ. సామ్రాజ్యవాద పునాదుల్నే కుదిపివేసిన పోరాటంఅది. తమ అంతిమఘడియలు సమీపించాయని ఆంగ్లేయ వలస పాలకులు అదరిపడిన ఘట్టం అది. చిరస్మరణీయమైన స్వాతంత్ర్య వీరభారత గాథలో తొలి పర్వం అది.

ఆనాటి బ్రిటిష్ చరిత్రకారులూ, వలస పాలకులూ ఈ స్వాతంత్ర్య సంగ్రామాన్ని కేవలం సిపాయిల తిరుగుబాటు అనీ, దేశభక్తిలేని కిరాయి సైనికుల పితూరీ అనీ, దీనికి ప్రజల తోడ్పాటులేదనీ చిత్రింప చూశారు. ఇలా చిత్రించడంలో వాళ్ళలక్ష్యంఒక్కటే- ప్రజలలో దేశభక్తి బీజాలు నాటుకోరాదనీ, సైనికులలో. తిరుగుబాటుతత్వం పెరగరాదనీ, హిందూ ముస్లిం మొదలైన జాతివిభేదం లేకుండా, వలస పాలకుల్ని ఏకోన్ముఖంగా ఎదుర్కొనే తెగింపు మళ్ళా తలయెత్త కూడదనీ, మనదేశంలో ఆంగ్లేయుల దుష్పరిపాలన నిజస్వరూపాన్ని మరుగుపరచాలనీ. కాని ఆ లక్ష్యం నెరవేరలేదు.

1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామాన్ని, సిపాయిల తిరుగుబాటుగా చిత్రించారు కొందరు బ్రిటిష్ చరిత్రకారులు. దేశభక్తిశూన్యమైన పితూరీ అన్నారు. దీనికి ప్రజల సహకారం లేదనీ, స్వల్ప కోర్కెల కోసం పరిమిత స్థాయిలో జరిగిన తిరుగుబాటుగా చిత్రించదలచారు. ఐతే ఇది వాస్తవ విరుద్ధం.

“ఒకవైపు అది ప్రజాపోరాటం, రెండోవైపు సిపాయిల తిరుగుబాటు — ఈ రెండూ కలసి ఒక సాంఘిక విప్లవంగా సంలీనమయ్యాయి. కేవలం సిపాయీల పితూరే దానికి కారణమని వాదించడమంటే రకాలంగా ఆ దేశంలో కొనసాగుతూన్న దుష్పరి లనను మరుగు పరచడమే అవుతుంది.” అని సర్ ర్ట్ గార్డినర్ 1858లో బ్రిటిష్ పార్లమెంటుకు పంపిన రహస్య నివేదికలో తెలియజేశాడు.

“అదొక బ్రహ్మాండమైన విప్లవం. కేవలం సైనిక తిరుగుబాటేకాదు.” అన్నాడు డాక్టర్ డఫ్ ‘భారతీయ తిరుగుబాటు’ అనే గ్రంథంలో.

1857 లో సిపాయీలు బ్రిటిష్‌వాళ్ళపై తిరగబడటానికి తక్షణ కారణాలు ఏమైనా కావచ్చు. కాని రెండేళ్ళపాటు సాగిన ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామాన్ని పరిశీలించితే, స్పష్టమయ్యే సత్యం ఏమిటి? దేశ స్వాతంత్ర్యానికై తెగించి సాగించిన సాహస ప్రయత్నమే ఆ సంగ్రామం. ఈ సంగ్రామంలో మునుపెన్నడూ లేనంతగా బ్రిటిష్ దురాక్రమణదారులకు వ్యతిరేకంగా విభిన్న శక్తులు ఐక్యంగా పోరాడాయి.

దిమ్మతిరిగేటట్లు చావుదెబ్బతిన్న బ్రిటిష్ అధికారులు, అమానుష హింసాకాండతో, భారతీయుల్ని రక్తపుటేరుల్లో ముంచెత్తిన తర్వాతగాని తిరిగికోలుకోలేకపోయారు. బ్రిటిష్ పాలకులు, కంపెనీ దోపిడి గుంపులు భారతదేశంలో ప్రవేశపెట్టిన అనేక అంశాలకు వ్యతిరేకంగా, అధికారానికి వ్యతిరేకంగా, ఉప్పెనలా పెల్లుబికిన వెల్లువ అది. తరుచు భయంకర రూపం దాల్చిన తిరుగుబాటు అది. పైకి కనిపించినట్లు కేవలం అది సైనికుల తిరుగుబాటు కాదు. ముస్లిముల ఎదురుతిరగడమూకాదు బ్రిటిష్ పరిపాలనకు వ్యతిరేకంగా ప్రజలు పెద్దపెట్టున పాల్గొన్న తిరుగుబాటు. అనేక విషయాలలో ఎంతో మొరటు స్వభావం కలిగివున్నా, భారతదేశ స్వాతంత్ర్య కాంక్షను మొట్టమొదటిసారి విస్తృత పరిధిలో ప్రదర్శించిన ఘటన అది. ఇంచుమించు ఆసియా అంతటా ఆ కాలంలో ప్రారంభమవుతూన్న వలస విధాన వ్యతిరేక స్వాతంత్ర్య పోరాటంతో ముడిపడివున్న చరిత్రాత్మక సంఘటన అది. బ్రిటిష్ దురాక్రమణదారుల బందిపోటు రాజనీతినీ, అమానుష వలస దోపిడీ విధానాన్నీ ఎదిరించడానికి చేసిన తొలి ప్రయత్నం అది.

1857 నాటికి భారతదేశ భూభాగాలను జయించి ఈస్టిండియా కంపెనీ ఏకైక విజేతగా స్థిరపడింది. ఆనాటి ఇరవైకోట్ల జనాభాను లొంగదీయడానికి, దేశీయ సైన్యాన్నే బ్రిటిష్‌వాళ్ళు ఉపయోగించారు. ఇంగ్లీషు అధికారుల క్రింద పనిచేసే ఈ దేశీయ సైన్యం, ప్రజల్ని లొంగదీసి, అణగిమణగి పడేటట్లు చూ పోలీసు విధుల్ని నిర్వర్తించడానికి ఉపయోగించబడింది. రెండు లక్షల దేశీయ సైన్యం, నలభై వేల ఇంగ్లీషు సైన్యం అమపాళ్ళల్లో వుండేది. 1853

లోనే కారల్‌మార్క్స్ ఈ విషయమై చేసిన వ్యాఖ్య గమనించదగింది-

"ఇండియా ఖర్చుతో, ఇండియన్లే సైనికులుగా వున్న ఇండియన్ సైన్యమే, ఈనాడు, ఈ నిమిషంలో ఇండియాను ఇంగ్లీషు బానిసత్వంక్రింద అణచిపెట్టి వుంచుతున్నది. ఈ బృహత్తర, నిర్వివాదమైన నిజం ఎక్కడికి పోతుంది?"

అలాంటి భారతీయ సైన్యంలో ఎందుకు అసంతృప్తి ప్రజ్వరిల్లింది? 'సిపాయి' అంటూ బ్రిటిషువాళ్ళు పిలుస్తూ వచ్చిన భారతీయ సైనికుల్ని వాళ్ళెప్పుడూ పూర్తిగా నమ్మలేదు. ఏమాత్రం స్వల్ప ధిక్కారం ప్రదర్శించినా తీవ్ర శిక్షలు విధించేవారు 1764 లో జరిగిన సైనిక తిరుగుబాటును ఫిరంగులతో 24 మందిని పేల్చివేశారు. ఇది 'మామూలు' శిక్షే అంటూ సర్ జార్జి మాక్‌మన్ వర్ణించాడు. మద్రాసు సైన్యంలో యూరోపియన్ పద్ధతులను, వేషధారణను అతిగా అమలుపరచినపుడు 1806 లో తిరుగుబాటు వాతావరణం నెలకొన్నది. 1824 లో బర్మా యుద్ధంలో పాల్గొనడానికి తిరస్కరించినపుడు 47 వ బెంగాల్ దేశీయపదాతి దళాన్ని, యూరోపియన్ దళం శిక్షించడమేగాక, దాన్ని రద్దుచేశారు. బెంగాల్ సైన్యంలోని 7 బెటాలియన్లు 1844 లో తిరుగుబాటు చేశాయి.

భారతీయ సైనికుల యీ అసంతృప్తికి కారణాలు ఆనాటి బ్రిటిషు ప్రభుత్వ విధానాలే. భారతదేశంలో క్రైస్తవ మతవ్యాప్తికి నానా తంటాలు పడేది. యుద్ధం లేని రోజుల్లో హిందూ ముస్లిం సైనికులలో మత ప్రచారం చేయడం, క్రైస్తవ మత కరపత్రాలు పంచడం. హిందూ ముస్లిం సైనికులలో అనుమానాలు రేకెత్తించాయి. తమ మతం, ఆచారాలు అడుగంటి పోతున్నాయని భావించారు.

మరొక కారణం జీతనాతాలలో వ్యత్యాసం- భార ‌ య సుబేదారు కన్నా, అప్పటికి కొత్తగా చేరిన ఆం య సైనికుడికి జీతం ఎక్కువ. బత్తాలలో ఇం షువాడికీ, భారతీయుడికీ తేడా వుండేది. భారతీయుల్కి ప్రమోషన్లు వుండేవికావు. మహా అయితే సు రు అయేవాడు. మొరటుగా బండ బూతులతో కవాతు సమయంలో భారతీయుల్ని అవమానపరి వారు. బ్రిటిషు సైనికులకు స్వంత వంటశాలలు, బంగళాలు వుండేవి. భారతీయ సిపాయిలకు, వాళ్ళ కుటుంబాలకు గుడిసెలలోనే కాపురం. మిలిటరీ కంటోన్మెంటులలో అందరికీ ఒకే వంటశాల ప్రవేశ పెట్టడంతో, సిపాయిలలో తమ మతాచారాలను మంట కలుపుతున్నారనే భావం ఏర్పడింది. 1806 లోనే బొడుగు గడ్డాలు, మీసాలు కత్తిరించాలనడం, బొట్టు పెట్టుకోకూడదని నిషేధించడం, పాత తలపాగాల స్థానే తోలుతో కూడిన తలపాగాలు పెట్టుకోవాలనడం, సిపాయిల మత విశ్వాసాలను భంగపరుస్తున్నారనే భావన కలుగజేసింది.

ఇవాళ అవన్నీ పెద్ద సమస్యలుగా కన్పించక పోవచ్చు. కాని ఆరోజుల్లో అవి వాళ్ళకు పెద్ద సమస్యే. కొందరు హిందువులు అసలు చర్మమే ముట్టుకోరు. గోచర్మం అంటే మరీ అభ్యంతరకరం. ఇక పందిచర్మం ప్రసక్తే ముస్లింలు సహించరు. అందు చేతనే వెల్లూరు సిపాయీల తిరుగుబాటుకు తలపాగాలలో తోలు చేర్చడం నాంది అయితే, 1857 నాటికి తూటాలను ఆవు, పంది కొవ్వులతో నునుపుచేసి వుపయోగించడం నాంది అయింది.

విదేశాలలో పనిచేయాల్సిన అవసరం ఉండదని రిక్రూట్‌మెంట్ కాలంలో చేసిన వాగ్దానాలు నీటిమూట లయ్యాయి. అవసరమైతే ప్రతి సిపాయి విదేశాలకు వెళ్ళాల్సి వుంటుందని 1856 లో ఒక చట్టం చేశారు. అసలే తమ మత సంప్రదాయాలు అడుగంటిపోతున్నాయన్న హైందవ సైనికులు యీ చట్టంవల్ల సముద్రాంతర ప్రయాణం చేయాల్సి వస్తుందని ఆవేదనచెందారు. 1856 నాటికి బ్రిటీషు సైన్యాలకు దాదాపు భారతీయ సైన్యాలు 5 రెట్లుండేవి. 2,23,300 భారతీయ సైనికులుంటే, 45,322 మంది బ్రిటీషు సైనికులుండేవారు. ఈ వ్యత్యాసంకూడా బ్రిటిషు సైనికుల్ని తుదముట్టించగలమనే ఆత్మవిశ్వాసాన్ని ఎక్కువ చేసింది.

బ్రిటిషు వాళ్ళను తరిమితన్నేయాలనే స్వాతంత్ర్య సంగ్రామానికి కొవ్వు పూసిన తూటాల సంఘటన 1857 లో నాంది అయింది. 1852 లో ఎన్‌ఫీల్డులో కొత్తరకం రైఫిల్‌తో ప్రయోగాలు చేశారు. 1853 లో క్రిమియా యుద్ధంలో దీన్ని ఉపయోగించారు. 1856లో దీన్ని భారతదేశంలో ప్రవేశపెట్టారు. ఈ రైఫిల్‌లో ఉపయోగించే తూటాలు కొన్ని ఇంగ్లండు నుండి దిగుమతి చేశారు. మరికొన్నిటిని కలకత్తా, డండమ్, మీరట్‌లలో తయారుచేశారు. ఈ తూటాలు రైఫిల్లో

ఉపయోగించేముందు పంటితో కొరకాలి. ఆవు, పంది కొవ్వు పూసిన కాగితాన్ని తూటాలకు ఉపయోగించారని హిందూ, ముస్లిం సిపాయిలలో తీవ్ర అసంతృప్తి వ్యాపించింది. 1857 ఫిబ్రవరి 26 న మొట్టమొదట బ ంపూర్‌లో యీ తూటాలను ఉపయోగించడానికి 1 వ దేశీయ రెజిమెంట్ సిపాయిలు నిరాకరించారు. ఈ సిపాయిలను అణగడానికి అందుబాటులో బ్రిటిషు సేనలు లేక, తాత్కాలికంగా సైనికాధికారులు వెనక్కి తగ్గారు. ఇంతకన్నా తీవ్రమైన సంఘటన మార్చి 29న బారక్‌పూర్‌లో జరిగింది.

## మహావీరుడు మంగళపాండే

1857 స్వాతంత్ర్య సంగ్రామంలో మొదట బలి అయిన అమరవీరుడు మంగళపాండే. అతని సాహస గాథ అణువణువునా రక్తం వుప్పొంగ జేస్తుంది. మంగళపాండే యువ సిపాయి. మంచి ప్రవర్తన కలవాడనే రికార్డులో వుంది. అదివరకు ఇద్దరు సిపాయీలకు 14 ఏళ్ళ కఠినశిక్ష విధించబడిన ఘటన అతన్ని కల్లోలపరచింది. జమేదార్ సాలిగ్రామ్‌ను, కొవ్వు తూటాల విషయమై తోటి సిపాయీలకు తెలియజేసి ఆక్షేపించినందుకు కోర్టు మార్షల్ చేసి డిస్మిస్ చేశారు. ఇవన్నీ మంగళపాండేని కలవరపరిచాయి. దీనికితోడు మరోకథ కూడా చెబుతారు.

మంగళపాండే బ్రాహ్మణుడు. తక్కువ కులానికి చెందినవాడని చెప్పబడే మరో వ్యక్తి పాండే వద్ద వున్న మంచినీళ్ళ పాత్రను ఇమ్మనమని అడిగాడు. మైలపడిపోతుందని పాండే నిరాకరించాడు. ఆవు కొవ్వు, పందికొవ్వు తూటాలను కొరికేటప్పుడు మీ ధర్మం ఎక్కడ మంటకలిసిందని అతడు ఎద్దేవా చేశాడట. దానితో ఉద్రిక్తుడయ్యాడు మంగళపాండే. తమ ధర్మాన్ని, మతాన్ని బ్రిటిష్‌వాళ్ళు మంటగలుపుతున్నారన్న అనుమానం ధృవపడింది. గుండె మండిపోయింది. "రండి తెల్లదొరల్ని నరకండి" అంటూ బాహాటంగా సైనికుల్ని ఆహ్వానించాడు. సార్జంట్ మేజర్ హ్యూసన్, పాండేని పట్టుకోమని తక్కిన సిపాయీలను ఆదేశించాడు. కాని ఎవరూ కాలు కదపలేదు. మంగళపాండే హ్యూసన్‌పై తుపాకి పేల్చాడు. ఈ సంగతి తెలిసిన ఇంకో ఇంగ్లీషు ఆఫీసర్ లెఫ్టినెంట్ బాఫ్ గుర్రం మీద పరుగెత్తుకు వచ్చాడు.

మంగళపాండే తుపాకి గుండుకు గుర్రం చచ్చిపడింది. కిందపడ్డ బాఫ్ పేల్చిన తుపాకీ గుండు గురితప్పింది. మంగళపాండేకు దెబ్బతగలలేదు. బాఫ్ కత్తిదూశాడు. మరో దొర అతనికిసాయానికివచ్చాడు. కత్తియుద్ధంలో కూడా మంగళపాండే ప్రవీణుడే. బాఫ్‌ను కత్తితో పొడిచాడు. రెండవదొర ఉడాయించాడు. షేక్ పల్టూ అనే సిపాయి మంగళపాండేని చేయిపట్టుకుని ఆపివేశాడు ఈ వార్తవిని కర్నల్ వీలర్ వచ్చాడు. అతడు పాండేని పట్టుకొమ్మని ఆజ్ఞాపించాడు. ఆ ఆజ్ఞను సిపాయిలెవ్వరూ ఖాతరు చేయలేదు. జనరల్ హియరే కు మొరపెట్టుకున్నాడు. జనరల్ హియర్సే తన ఇరు కుమాళ్ళతో, రక్షక దళంతో వచ్చాడు. తనను ప యివ్వకపోయినా, తనకు అండగా సిపాయిలు ముందుకురాకపోవడం చూసిన పాండే, శత్రుబలం అధికంగా వుందని గ్రహించాడు. తుపాకితో తన్ను ఎదురురొమ్ములో కాల్చుకున్నాడు. కాని ప్రాణం పోలేదు. మంగళపాండేని ఆస్పత్రికి పంపి, తర్వాత కొన్నాళ్ళకు సైనిక విచారణ చేసి ఉరిశిక్ష వేశారు. అయితే అతణ్ని ఉరితియ్యడానికి బారక్‌పూర్‌లో ఒక్క తలారీ దొరకలేదు. కలకత్తా నుండి రప్పించిన తలార్లతో మంగళపాండేని ఉరి తీశారు.

1857 స్వాతంత్ర్య సమరంలో తొలిగా బలిఅయిన అమరవీరుడు మంగళపాండే. భారతదేశమంతటా తిరగబడ్డ సిపాయీలకు ప్రతీకగా మంగళపాండేపేరు నిలిచిపోయింది. జమేదార్ ఈశ్వరి పాండే కూడా ఉరి తీయబడ్డాడు.

మంగళపాండే మరణంతో ఈ ఘటన ముగియలేదు. అతడు తిరగబడ్డప్పుడు చూస్తూవూరుకున్నారనే నెపంతో, 19 వ పటాలాన్ని 34 వ పటాలాన్ని రద్దు చేశారు. ఆయుధాల్ని, దుస్తుల్ని లాక్కొని ఇళ్ళకు పంపివేశారు.

మే 4 వ తేదీన 34పటాలాన్ని రద్దుచేసినపుడువాళ్ళ సైనిక దుస్తుల్ని లాక్కొన్నారు. కానిసిపాయిలు డబ్బు చెల్లించిన టోపీలను మాత్రం వదలిపెట్టారు. కాని బానిస చిహ్నంగా కనపడ్డ ఆ టోపీలను కూడా కాళ్ళ కింద తొక్కి అవతలపారేశారు. తమకు విధించిన శిక్ష దాస్య విముక్తికి చిహ్నంగా భావించి వారు ఇళ్ళకు వెళ్ళారు. ప్రతి సైనిక కేంద్రంలోను ఈ శిక్షను గురించి అధికారులు ప్రకటించారు. ఐతే వారు అపరా

ధులుగా గాక, వీరులుగా తక్కిన సిపాయిలు భావించ సాగారు.

ఏప్రిల్, మే మొదటివారంలో జరిగిన చిన్న చిన్న సంఘటనలే చిలికి చిలికి గాలివానలా తయారయ్యాయి. సిపాయిల అసంతృప్తి జ్వాలలు దొరల బంగాళాలను తగలపెట్టే అగ్నిజ్వాలలుగా మారాయి. బారక్‌పూర్, రాణీగంజ్, అంబాలాలలో అనేకచో దహనకాండ జరిగింది. మే 3 న లక్నోలో లెఫ్టినెంట్ మీకంను చంపడానికి సిద్ధమై, చివరకు దయతలచి వదలివేశారు. మీరట్‌లో మే 10 న జరిగిన సిపాయిల తిరుగుబాటుతో 1857 స్వాతంత్ర్య సమరం ప్రజ్వరిల్లింది.

## మీరట్ తిరుగుబాటు

కర్నల్ కార్మైకేల్ స్మిత్ అహంకారి మొండి వాడు. దేశీయ 3 వ రౌతుదళానికి అధికారి. సైనికులలో అసంతృప్తిని పసికట్టిన పైఅధికారులు స్మిత్‌ను మీరట్‌లో కవాతు ప్రదర్శన జరపవలసిందని సలహా ఇచ్చారు కాని అలా జరపకపోతే పిరికితనమని భావించాడు స్మిత్. తొంభైమంది రౌతులకు క్రొవ్వు తూటాలిచ్చి వుపయోగించమన్నాడు. ఐదుగురు మినహా తక్కిన వాళ్ళు నిరాకరించారు. ఇది తెలిసిన జనరల్ హ్యూయెట్ సైనిక విచారణ జరిపి, 8 నుంచి 10 ఏళ్ళ దాకా కఠిన శిక్ష విధించాడు. మే 9 న వారిని మైదానంలో నిలబెట్టి, కంసాలులచేత చేతులకు, కాళ్ళకూ బేడిలు వేయించారు ఈ కార్యక్రమాన్ని వాళ్ళు నెమ్మదిగా దాదాపు గంటకుపైగా కొనసాగించారు. తమ సోదరులకు జరిగే అవమానాన్ని కళ్ళారా చూస్తున్న తక్కిన సిపాయిలలో బాధ, క్రోధం, ఉద్రేకం కలిగించింది.

ఈ ఘటన జరిగిన తర్వాత మీరట్ వీధులలో తిరుగుతున్న సిపాయిలను, పట్టణంలో స్త్రీలు "తోటి సిపాయిలు జైళ్ళలోమగ్గుతూవుంటే, మీరిక్కడ వినోద విహారాలా!" అని ఎత్తిపొడిచారు. ఆ రాత్రికి రాత్రి సిపాయిలు సమావేశమై తిరుగుబాటుకు సన్నద్ధమయ్యారు.

1757 ప్లాసీ (అసలు పలాసీ అని పేరు. ఇంగ్లీషు వాళ్ళు "ప్లాసీ"అని పిలుస్తూ రావడంతో అదే మనకూ అలవాటయిపోయింది.) యుద్ధం జరిగిన వందేళ్ళకు భారతదేశం ఇంగ్లీషువాళ్ళ దాస్యం నుండి విముక్తి చెందుతుందని ఎవరో జోస్యం చెప్పారు. ఆ జోస్యం ఆనోటా ఆనోటా పడి తిరుగుబాటు గురించి పుకార్లు వ్యాపించాయి. 1857 మే 31 నిర్ణీత దినం. ఐతే అంతవరకూ ఆగలేదు. మే 9 న సిపాయీలకు జరిగిన అవమానంతో కుతకుతలాడిన సిపాయీలు మరునాడు ప్రతీకార చర్యలు ప్రారంభించారు. ఇంగ్లీషు దొరల ఇండ్లకు నౌకర్లు పనికిరావడం మానేశారు. పల్లెల నుంచి జట్టుజట్టుగా జనం పోగయ్యారు.పట్టణంలోని వీధులు తోడయ్యారు. సిపాయిలు తిరుగుబాటు ప్రారంభించారు. టెలిగ్రాఫ్ తీగలు తెంచేశారు. రైలు మార్గాలు కాపలాకాశారు. ఇంగ్లీషువాళ్ళ బంగళాలను, కార్యాలయాలను తగలబెట్టారు. తెల్లవాళ్ళని ముఖ్యంగా తమని పీడించిన ఆఫీసర్లను మొదట చంపివేశారు. జైళ్ళు బద్దలుకొట్టి సోదర సైనికుల్ని విడిపించుకొన్నారు. కంటోన్మెంటు తగలబెట్టారు.

సిపాయిలతోపాటు, ఇతర ఖైదీలు, అరాచక గిరిజన తెగలూ,పట్టణంలోని మురికివాడ ప్రాంతాలజనులూ చేరారు. చేతికందిన తెల్లవాళ్ళ నందర్నీ విచక్షణారహితంగా చంపివేశారు. కర్నల్ ఫిన్నిస్,కెప్టెన్స్ టెయిలర్, మాక్డనాల్డులనూ,లెఫ్టినెంట్ హెండర్సన్నూ,డాక్టర్ క్రిష్టినీ, పశువైద్యుడు ఫిలిప్పుని, చాంబర్స్ సతినీ చంపివేశారు. మరికొందరు ఆంగ్లేయస్త్రీలు, పిల్లలూ కూడా ఈ ప్రతీకార జ్వాలల్లో భగ్గుమని పోయారు. ఎందరో మారువేషాలతో తప్పించుకుపోయారు. మరికొందరు తమ భారతీయ నౌకర్ల సహాయంతో బయటపడ్డారు. గులాబ్ ఖాన్, గ్రీథెడ్స్‌ను మండే బంగళా నుండి రక్షించాడు. తన ప్రాణాన్ని ఒడ్డి బుకావర్ చౌకీదారు, మాక్డనాల్డ్ సతిని కాపాడినా, అతని ప్రయత్నాలు ఫలించలేదు. ఆమె చనిపోయినా ఆమె పిల్లల్ని నసీబా అనే నర్సు సహాయంతో కాపాడాడు. 3 వ రౌతుదళానికి చెందిన సిపాయిలు కోర్టినీ సతి జీవితాన్ని కాపాడారు-ఆంగ్లేయులుదాక్కొని వున్న తన బంగళాపై దాడి జరిపి, తనపై దౌర్జన్యానికి దిగినా అస్గర్ అలీ వారి ఉనికి చెప్పలేదు. స్థానిక భారతీయుల మానవతయే లేకుంటే ఇంకా ఎందరో హతులయే వారు.

మీరట్ నుండి 32 మైళ్ళలో వున్న ఢిల్లీకి సిపాయిలు బయలుదేరి వెళ్ళిపోగానే, నిస్సహాయులయిన ప్రజల్ని అనేక మందిని ఆంగ్లేయులు ఉరితీశారు. తాము చేసిన ఈ "ఘనకార్యాన్ని" ఒక

ఇంగ్లీషు సైనికుడు భార్యకు రాసిన ఉత్తరంలో బయట పడింది. ఉరి తీసే వేళలో తలారి ఉరిముడిని సవరించక ముందే ఒకడు తానే కంఠానికి బిగించుకుని ముందుకు దూకి నిర్భయత్వాన్ని చాటిన విషయం కూడా ఆ లేఖలో వుంది.

## బహదూర్ షా జఫార్‌కు పట్టం

మీరట్ నుండి సిపాయిలు వస్తున్న సంగతి తెలుసుకొన్న ఇంగ్లీషు సైనికాధికారి కర్నల్ రిప్లే, వారిని ఎదుర్కొనడానికి తన పటాలాన్ని సిద్ధంచేశాడు. తీరా ముఖాముఖి రెండు పటాలాలు ఎదురయ్యేసరికి ఢిల్లీ పటాలం తిరగబడి రిప్లేను ఇతర అధికా ను చంపివేశాయి. ఈ రెండు సేనలూ కాశ్మీర్ గేటు ద్వారా ఢిల్లీలో ప్రవేశించాయి మీరట్ ండి మరో పటాలం కలకత్తా గేటుగుండా ప్రవేశించి, యూరోపియన్ల ఇళ్ళను తగులపెట్టి, చేజిక్కిన ఆంగ్లేయులను చంపివేసింది. ఢిల్లీ కోటలోని సైనికులు తిరగబడ్డారు. తిరుగుబాటు నగరంలో వ్యాపించింది. రాజభవనం సమీపంలోని మందు గిడ్డంగిని ఇంగ్లీషు సైనికకాపలాదార్లు తాము రక్షించలేమని తోచగానే దాన్ని పేల్చి వేశారు. అందులో వాళ్ళూ మండిపోయారు.

తిరుగుబాటు నాయకులూ, ఇతర ప్రముఖులూ బహదూర్‌షాను చక్రవర్తి బాధ్యతను స్వీకరించమని కోరారు.

బహదూర్‌షా పేరుకు మాత్రమే ఢిల్లీలో రాజు. ఆయన అధికారం కోటగోడలు దాటిపోలేదు. బ్రిటిష్ వాళ్ళ తనిఖీ క్రింద ఆయన జీవించాలి. పేరుకు మాత్రం పూర్వపు రాజ లాంఛనాలున్నాయి. కాని బ్రిటిష్ వాళ్ళు ఇచ్చే పెన్షన్‌పై జీవితం గడుపుతున్నాడు. కాని ప్రజల దృష్టిలో బాబర్, అక్బర్‌ల వంశీయుడయిన బహదూర్‌షాయే తమ రాజనే భావం వుంది. 1837 లో బహదూర్ షా గద్దె ఎక్కాడు. చక్రవర్తి [బాదషా] అనే బిరుదు, ఘాజీ [పవిత్ర సైనికుడు] అనే బిరుదులు అప్పుడే లభించాయి, కాని వాస్తవంలో రాజ్యంలేని రాజ్యాధిపతి. సైనికానుభవం లేని సైనికాధిపతి, దాదాపు 80 ఏళ్ళ వృద్ధుడు. లార్డు ఎలెన్ బరో, బహదూర్‌షాకు నజరానా చెల్లించడం నిషేధించాడు. లార్డు డల్‌హౌసీ, రాచబిరుదును రదు చేసి, చక్రవర్తి కుటుంబాన్ని మరో చోటికి తరలించాలని, ఇంగ్లండులోని తమ పై అధికారులకు సూచించాడు. ఐతే ఈ సూచనను వాళ్ళు అంగీకరించలేదు. 1849 లో చక్రవర్తి వారసుడు చనిపోగా, తర్వాత వారసుడైన యువరాజు ఫకీరుద్దీన్‌తో రెసిడెంట్ రహస్య ఒడంబడిక చేసుకొన్నాడు. దీని ప్రకారం తండ్రి చనిపోయిన యువరాజు బిరుదుతో ఫకీరుద్దీన్ రాజకుటుంబ అధిపతి అవుతాడు. కాని కోటను, మందు గిడ్డంగినీ వదలి అతడు వేరే వుండాలి. కాని 1856లో ఫకీరుద్దీన్ చావటంతో ఆ పథకం కూడా షురుట్లోనే సంధి కొట్టింది. ఈ పథకం బయటకి పొక్కి, నవాబుల అసమ తి పెరగడానికి దారి తీసింది.

ఇలాంటి పరి తిలో మీరట్ తిరుగుబాటు సేనలు ఢిల్లీ కోటలో జొ బడటం తటస్థించింది. రాచప్రాసాద రక్షణ భటులు ఎలాంటి ప్రతిఘటన చూపలేదు. సిపాయిలతో కలిసిపోయారు. వారి చేతులలో కెప్టెన్ డగ్లస్, కల ర్ హచిన్సన్ మొదలైన యూరోపియన్లు హతమయా రు.

బహదూ షా మొదట తాను చక్రవర్తి పదవిని స్వీకరించలేనని జంకాడు. కుటుంబ సభ్యులు, తిరుగుబాటు సిపాయిల ఒత్తిడితో అంగీకరించాడు అర్థరాత్రి 21 ఫిరంగి గుళ్ళ కాల్పులతో బహదూర్‌షా చక్రవర్తి పదవిని స్వీకరించాడు. ఆ విధంగా ఢిల్లీ కోటపై స్వాతంత్ర్య జెండా– ఆనాటి మొగల్ చక్రవర్తుల చిహ్నమైన ఆకు పచ్చజెండా ఎగిరింది.

1857 మే 10 న ఢిల్లీలో ప్రారంభమైన స్వాతంత్ర్య పోరాటం సెప్టెంబరు 14 తో ముగిసింది. కొద్దిమంది బ్రిటిష్ సైనికులు జూన్ 8 న రిడ్జ్‌ని ఆక్రమించుకొన్నారు. అక్కడనుండి ఢిల్లీకి బ్రిటిష్ సేనలు ఆ తర్వాత చేరాయి. పంజాబునుండి బలమైన సిక్కు దళాలతో నికల్సన్ ఢిల్లీ చేరాడు. విల్సన్, స్మిత్, నెవిలీ చాంబర్లేన్ మొదలైన సేనానులతో కలిశాడు కాశ్మీర్‌గేటును బ్రద్దలు చేసుకొని ఢిల్లీని పట్టుకోగల్గారు. భారత సర్వసైన్యాధ్యక్షుడు భక్త్‌ఖాన్ అనేక సమస్యలను ఎదుర్కొవలసి వచ్చింది. ఢిల్లీలో శాంతి భద్రతలను కాపాడవలసి వచ్చింది. సైన్యానికి ఆహారపదార్థాల సప్లయిలు లభించక మరో సమస్య తయారయింది. మోరీ కబ్లీగేట్లు కూడా శత్రువశమవడంతో పరిస్థితి విషమించింది. మొగల్

చక్రవర్తి బహాదూర్‌షా ఎర్రకోట నుండి పారిపోయి, హుమాయూన్ గోరీలో దాక్కొన్నాడు. అక్కడ బహాదూర్‌షాను బంధించి విచారణచేసి యావజ్జీవ శిక్ష విధించారు. బర్మా జైల్లో బహాదూర్‌షా తన అంతిమ జీవితం గడిపాడు.

బెంగాల్‌లో ప్రారంభమైన తిరుగుబాటు మీరట్, ఢిల్లీలకు పాకింది. ఆ తర్వాత యు. పి. (ఈ నాటి ఉత్తర ప్రదేశ్)ని విప్లవ తరంగాలు ముంచెత్తాయి. అలీఘర్, నౌషెరా, ఎటావా, ఎటా, మధుర, రూర్కీ, బెరైలీ, షహజన్‌పూర్, మొరాదాబాద్, కాన్పూర్, అలాహాబాద్ మొదలైన పట్టణాలకు విప్లవం వ్యాపించింది. లక్నో పూర్తిగా విప్లవకారుల వశమయింది. మే 21న అలీఘర్, మే 31 న బెరైలీ, లక్నోలు, జూన్ 4 న కాన్పూరు, జూన్ 6 న అలాహాబాద్‌లు విప్లవకారుల వశమయ్యాయి. ఆయా పట్టణాలలో స్థానిక ప్రభుత్వాలను నెలకొల్పాయి. బీహారులో కూడా కొన్ని పట్టణాల్లో తిరుగుబాట్లు జరిగాయి. ఐతే ఢిల్లీ లక్నో కాన్పూర్, ఝాన్సీ, పాట్నాలు ప్రధానకేంద్రాలు. పంజాబ్, కాశ్మీర్‌లు విప్లవంలో చేరలేదు. నర్మద, వింధ్యదక్షిణాన కూడా ఎక్కువ అలజడిలేదు. రాజపుత్రస్థానం, పంజాబు, హైదరాబాద్ సంస్థానాధీశులు, సింధియా, గులాబ్‌సింగ్, సాలార్‌జంగ్‌లు బ్రిటిష్ పక్షాన నిలిచారు.

ఢిల్లీని పట్టుకొన్న సిపాయీలు ఎంత క్రమశిక్షణాపరులైనా, యుద్ధ వ్యూహంలో నిపుణులు కారు. ఢిల్లీ వశమైన తర్వాత కూడా వారు, విప్లవం తల యెత్తిన ప్రాంతాలకు వ్యాపించక, కేవలం ఆత్మరక్షణ వ్యూహంతో వుండిపోయారు.

బెంగాల్‌లో గవర్నర్ జర్నల్ కానింగ్ అక్కడి యూరోపియన్లను, బ్రిటిష్ పౌరులను సమీకరించి, అక్కడి సైనికదళాల్ని నిరాయుధుల్నిచేసి, మున్ముందు వాళ్లు తిరగబడకుండా, జాగ్రత్తపడ్డాడు. అక్కడక్కడ జరిగిన చిన్న చిన్న తిరుగుబాట్లను అణచివేశాడు. పంజాబులో కూడ తిరుగుబాటు జరగకుండా బ్రిటిష్ సేనానులు చూడగల్గారు.

ఐతే అయోధ్య, బుందేల్‌ఖండ్ రైతాంగం తిరుగుబాటు చేసింది. స్థానిక ప్రభుత్వ కార్యాలయాలపై దాడిచేశారు. ఆంగ్లేయులు నియమించిన భూస్వాములను తరిమివేశారు. పన్నులు చెల్లించ నిరాకరించారు. బ్రిటిష్ దురాక్రమణదారులు కాజేసిన గ్రామ సమిష్టి భూముల్ని వశంచేసుకుని, వాటిని సంరక్షించేందుకు సాయుధ దళాలను ఏర్పరచారు.

వృద్ధ సైనిక నాయకుడు ఖాన్ బహాదూర్‌ఖాన్ నాయకత్వాన బెరైలీలో ప్రభుత్వం ఏర్పడింది. రోహిలా ఖండానికి బరైలీ ముఖ్యపట్టణం. 1772 లో ఈస్టిండియా కంపెనీ సేనలకు వ్యతిరేకంగా పోరాడిన హఫీజ్ రహ్మత్‌ఖాన్ వారసుడు, ఖాన్ బహదూర్ ఖాన్. 1774 లో వారన్ హేస్టింగ్సు రోహిలా ఖండాన్ని కంపెనీ రాజ్యంలో కలుపుకున్నాడు.

శివాజీ స్థాపించిన మహారాష్ట్ర రాజ్యం పీష్వాల కింద వుండేది. రెండవ పీష్వా బాజీరావు దత్త పుత్రుడు నానాసాహెబ్. డల్హౌసీ ప్రవేశపెట్టిన దత్తత నిషేధం మూలంగా అతనిరాజ్యం ఇంగ్లీషువాళ్ళు కాజేశారు. నానాసాహెబుకు చెందవలసిన సతారా రాజ్యం ఇంగ్లీషు కంపెనీవాళ్ళ రాజ్యంలో కలిసిపోయింది. 1857 స్వాతంత్ర్య సమరం ప్రారంభం కాగానే, నానాసాహెబ్, తనను పీషా గా ప్రకటించుకొన్నాడు. ఆ నాటి మేటి వీరుల్లో ఒక న తాంతియా తోపే ఈయనకి సహాయంగా నిలి .. బిధూర్ [బహ్మవర్తం] నుంచి కాన్పూరు వరకు నానాసాహెబ్ అధీనంలోకి వచ్చింది. ఇంగ్లీషుసేనాని జనరల్ వీలర్ మూడువారాలపాటు కాన్పూరును సంరక్షించుకోగలిగాడు. కాని జూన్ 27 న రాజీ పడి లొంగిపోయాడు. తన అనుచరులు, స్త్రీలు, పిల్లలతో పాటు అలాహాబాదుకు తనను సురక్షితంగా పంపించుతామనేది రాజీ షరతులలో ఒకటి.

గంగానదిలో పడవల్లో ప్రయాణం చేస్తున్న ఖైదీలు, స్త్రీలు పురుషులను గంగానది రెండు తీరాల నుండి ఫిరంగులు పేల్చివేశాయి. ఈ హత్యాకాండ నానాసాహెబ్‌కు తెలియదనీ, అతని అనుచరులెవ్వరో చేశారనీ అంటారు బీబీఘర్‌లో కూడ ఒక బావిలో ఇంగ్లీషు స్త్రీలను పిల్లల్ని తోసి చంపిన మరో ఘటన కూడా వుంది. నీల్, హావ్‌లక్ తమకు విధేయులుగా వున్న గ్వాలియర్ సైనికుల సహాయంతో జనరల్ కాంప్‌బెల్ కాన్పూరుకు జులై 17 న వచ్చారు. డిసెంబర్ 6 న కాన్పూరును తిరిగి స్వాధీన పరచుకొన్నారు.

నానాసాహెబ్ ఇంగ్లీషువారికి చిక్కకుండా 60 వేల సైన్యంతో నేపాల్ చేరాడు. నేపాల్ రాజు వారికి ఆశ్రయం యివ్వ నిరాకరించాడు. పైగా విప్లవ సైనికుల్ని వేటాడేందుకు బ్రిటిషు వారికి సహాయ ప డు. ఈ పరిస్థితిలో వారు ఆయుధాల్ని దాచివేసి స దేశం వెళ్ళిపోయారు. తనను ద్రోహిగా చిత్రించిన । టిషు కమాండర్ హోప్‌కు రాసిన లేఖలో "మా శం ఆక్రమించుకొనేందుకు నీకు హక్కేమిటి? నన్ను ద్రోహి అనడానికి నీకేం హక్కుంది? భారత దేశాన్ని పాలించే హక్కు నీకెవరిచ్చారు? మా దేశంలో మేము దొంగలమూ, ఫరంగీలైన మీరు రాజులా?"

* * *

లక్నోలో 1857 మే 30 న తిరుగుబాటు ప్రారంభ మయింది. బ్రిటిషువాళ్ళకు అక్కడ జీవితం దుర్భర మయింది. సర్ హెన్రీ లారెన్స్ నాయకత్వాన రెసి డెన్సీలో ఇంగ్లీషువాళ్ళంతా తలదాచుకున్నారు. జూలై 4 న లారెన్సు బాంబు దెబ్బకు మరణించాడు. అతని స్థానంలో బ్రిగేడియర్ ఇంగ్లిస్ వచ్చాడు. విప్లవ సైని కుల ముట్టడిని 87 రోజులు తట్టుకొన్న వీళ్ళకి జనరల్ ఔట్‌రాం, హేవ్‌లాక్‌ల సహాయం అందింది. లక్నో పురవీధుల గుండా చొచ్చుకుని వీరు రెసిడెన్సీకి చేరారు. చిట్టచివరకు నవంబరులో సర్ కాలిన్ కాంప్ బెల్, ఇంగ్లీషువాళ్ళను అక్కడినుండి సురక్షితంగా తరలించాడు. సిక్కు సిపాయిలు ఇంగ్లీషువాళ్ళకు సహాయపడ్డారు.

లక్నోలో విప్లవ సిపాయీలకు నాయకత్వం వహిం చింది మౌల్వీ అహ్మదుల్లా, హజరత్ బేగం. లార్డ్ కానింగ్ సైతం విప్లవ సిపాయిలను ఇలా ప్రశంసించక తప్పలేదు, "పట్టణం లోపల, వెలుపల ప్రతి అంగుళం కోసం సిపాయిలు పోరాడారు, వారు తమ వీరోచిత కృత్యాలకు గర్వపడవచ్చు."

ఇక్కడే అత్యంత క్రూరుడైన జనరల్ నీల్, భారతీయ సిపాయిలతో జరిగిన యుద్ధంలో మరణిం చాడు. ఢిల్లీలోని బ్రిటిషు సేనలకు సహాయంగా కలకత్తా నుంచి వెళ్ళిన జనరల్ నీల్ తోవలో వారణాసి, అలహాబాద్‌లలో కనబడ్డ సిపాయీలను, పట్టణ ప్రజలను అతి క్రూరంగా చిత్రవధ చేసిన రాక్షసుడితడే. జనరల్ కాంప్‌బెల్ 45 వేల సైన్యాన్ని సమకూర్చుకొని తుది దాడి జరిపాడు. లక్నో పట్ట ణంలో ఆనాడున్న జనమంతా దాదాపు 2 లక్షలమంది కాంప్‌బెల్ సైన్యాన్ని ప్రతిఘటించారు. వారికి మంచి ఆయుధాలు లేవు. నెలరోజులకు పైగా ప్రతిఘటన జరిగిన తర్వాత 1858 మార్చి 19న లక్నో ఇంగ్లీషు సేనల వశమయింది. నేపాల్ రాజు, అతని గూర్ఖా సైనికులు కాంప్‌బెల్‌కు సహాయపడ్డారు. తర్వాత రెండు వారాలపాటు బ్రిటిషు సేనలు పట్టణాన్నివిచ్చల విడిగా దోచుకున్నాయి. హత్యాకాండ కొనసాగించాయి.

లక్నో పతనానంతరం బ్రిటిష్‌వాళ్ళపై ఎదురు మదురుగా గెరిల్లా పద్ధతిలో దాడులు సాగించారు. 1858 మార్చిలో జనరల్ కానిగ్, అయోధ్య తాలూకాదార్ల ఎస్టేట్లను వశపరచుకొంటామని ప్రక టించాడు. వారంతవరకూ తటస్థంగానే వున్నారు. ఈ ప్రకటనతో తమ ఎస్టేట్లను రక్షించుకోడానికి సిద్ధపడి, బ్రిటిష్‌వాళ్ళపై తిరగబడ్డారు. బెరైలీలోని బహదూర్‌ఖాన్‌తో కలిశారు. బెరైలీని మే నెలలో కాంప్‌బెల్ పట్టుకొన్నాక, సిపాయిదళాలు కొన్ని నానాసాహెబ్‌తోపాటు నేపాల్ వెళ్ళిపోయాయి. అహమ్మదుల్లాతోపాటు మరికొన్ని దళాలు, అయో ధ్యకు తిరిగి వచ్చాయి. అహమ్మదుల్లాను ఒక ద్రోహి, నరికివేశాడు.

## ఝాన్సీలక్ష్మీబాయి

ఝాన్సీ, బుందేల్ ఖండ్‌లో ఒక చిన్న సంస్థానం. దీన్ని ఈస్టిండియా కంపెనీ "రాజ్య" స్థాయికి పెంచింది సిపాయి విప్లవానికి ముందు, గంగాధరరావు ఝాన్సీకి అధిపతిగా వున్నాడు. ఇతని భార్య మహారాణి లక్ష్మీబాయి. ఆమె అసలుపేరు మణిక క. పెళ్ళిసమయంలో అత్తవారి కుటుంబ దేవత రు లక్ష్మీబాయిగా మార్చారట. ఆమెకొక బిడ్డకలిగి చని పోయాడు. 1853 నవంబరులో గంగాధరరావు చని పోయాడు. చనిపోయేముందు, ఆనందరావు అనే ఒక కుర్రవాణ్ణి, దత్తత చేసుకొన్నాడు. దామోదరరావు అని పేరు పెట్టారు. బ్రిటిష్ ప్రభుత్వం తన భార్యా బిడ్డల్ని సంరక్షించాలని కోరుతూ గంగాధరరావు వీలునామా రాశాడు. ఝాన్సీ స్వతంత్రరాజ్యం కాదనీ, మొదట పీష్వాలదనీ, తర్వాత బ్రిటిష్ వాళ్ళదనీ వాదిస్తూ, డల్హౌసీ 1854 మార్చి 2 న బ్రిటిష్ ఇండి యాలో ఝాన్సీ రాజ్యాన్ని కలిపివేసుకున్నాడు.

ఝాన్సీరాణికి 60 వేల రూపాయలు పెన్షన్ ఇస్తామన్నారు ఇంగ్లీషువాళ్ళు. నగరంలో వుండవచ్చు నన్నారు. ఆమె బ్రతికి వున్నంతకాలం బ్రిటిష్ కోర్టుల పరిధినుండి ఆమెను మినహాయిస్తామన్నారు. పరివారం వుంచుకోవచ్చు నన్నారు. దత్తత కూడా చెల్లుతుందట—కాని ఎంతవరకు? గద్దె ఎక్కనుఅనేంత వరకు. కుటుంబ ఖజానా, వ్యక్తిగత ఆస్తులకు మాత్రమే దత్తత కుమారుడు వారసుడట.

ఝాన్సీమహారాణి ఎన్నో విజ్ఞప్తులు చేసింది. తన తరపున వాదించడానికి వకీళ్ళను ఇంగ్లండుకు పంపింది. అవీ విఫలమయ్యాయి. ఝాన్సీ కలుపుకొన్నాక ఇంగ్లీషు వాళ్ళు యిచ్చిన పెన్షన్‌ను మొదట ఝాన్సీ లక్ష్మీ బాయి నిరాకరించింది. ఐనా గత్యంతరంలేక, గంగాధరరావు చేసిన అప్పులు తీర్చవలసివచ్చి అంగీకరించింది.

అసలే ఈ సంఘటనతో కుమిలిపోతున్న ఝాన్సీ రాణిని ఇంగ్లీషువాళ్ళు రెచ్చగొట్టారు. ఆమె పెన్షన్ కోత పెట్టారు. ఆమెనేగాక హిందువులను కూడా పుద్రికవరచిన సంఘటన అది. లక్ష్మీబాయి బ్రాహ్మణ వంశానికి చెందిన రాణి. బ్రాహ్మణ రాజుల పాలనలో ఝాన్సీలో గోవధ నిషేధించబడింది. బ్రిటిష్‌వాళ్ళు దీన్ని ఖాతరు చేయకుండా గోవధను అనుమతించారు.

కొడుకు యజ్ఞోపవీత ఉత్సవానికి అప్పు అడిగిన లక్ష్మీబాయిని, మైనారిటీ తీరిన తర్వాత అతడు తిరిగి ఆ అప్పు తీర్చగలడో లేదో అని నల్గురు హామీ ఇవ్వాలని ఇంగ్లీషు వాళ్ళు అడిగారు.

"ఝాన్సీరాణి ఉత్తమ ప్రవర్తనగలది. ఝాన్సీలో ప్రతివారూ ఆమెను గౌరవిస్తారు" అని మేజర్ మాల్కమ్ వంటివాడు ప్రశంసించిన లక్ష్మీబాయి హృదయంలో ఇంగ్లీషువాళ్ళు ద్వేషానలం రగుల్కొల్పారు.

ఇంతేగాదు. ఝాన్సీ సైన్యాల స్థానే ఇంగ్లీషు సైన్యాలను పెట్టారు. కోట విడిచి రాణి, రాజమహల్‌లో నివసించవలసి వచ్చింది. ఝాన్సీలోని మర ఫిరంగుల్ని ఇంగ్లీషువాళ్ళు నాశనం చేశారు. ఇలా రెండేళ్ళు గడిచిపోయింది. 1857 లో గురుభక్ష అనే హవల్దార్ నాయకత్వాన తిరగబడ్డారు. ఇంగ్లీషు అధికారులు కోటలో దాక్కున్నారు. తమను రక్షించవలసిందిగా వారు పెట్టుకొన్న మొర, రాణి చెవుల పడలేదు. కోట విప్లవ సిపాయిల వశమయింది. కొంతమంది బ్రిటిష్ వారిని చంపివేశారు. ఈ హత్యాకాండతో ఆమెకు సంబంధం లేదు. ఈ విషయాన్ని ఒక లేఖలో మార్టిన్‌దొరే అంగీకరించాడు.

ఝాన్సీలో ఇంగ్లీషు పాలన అంతమై మహారాణి పాలన ప్రారంభమయింది. ప్రజలను అదుపులో వుంచింది. ఐనా బ్రిటిష్ వాళ్ళు, ఝాన్సీలో జరిగిన హత్యాకాండను లక్ష్మీబాయికి అంటగట్టారు. బొంబాయి నుండి సర్ హ్యూరోజ్ కొంతసైన్యంతో ఝాన్సీపై 1858 మార్చి 23 న దాడి సాగించాడు. మొదట హత్యాకాండతో తనకు సంబంధంలేదని రోజ్‌ను ఒప్పించడానికి మహారాణి ప్రయత్నం చేసింది. కాని ఆ ప్రయత్నం విఫలం అయ్యాక తానే సేనాధిపత్యం వహించి దుర్గ రక్షణకు నడుంకట్టింది. ఝాన్సీ చుట్టుపట్ల అంతా బీడు చేసింది. బ్రిటిష్ సేనలకు సరంజామా దొరక్కుండా చేసింది. ఇందూర్, గ్వాలియర్ ధాజుల పుణ్యమా అని వాళ్ళకి సరంజామా లభించింది.

"పుట్టిన తర్వాత చావు ఎలాగూ తప్పదు. బ్రిటిష్ జెండా ఈ చుట్టుపక్కల కనపడకూడదు. విజయం సాధించండి. లేదా వీరమరణం చెందండి" అని ఝాన్సీ తన సైనికుల్ని ఉత్సాహపరచింది.

ఝాన్సీ కోట సంరక్షణకు భీకరయుద్ధం సాగించినా లాభంలేకపోయింది. ఝాన్సీ కోట ఇంగ్లీషు వాళ్ళ వశమయ్యాక, పురుషవేషంతో, ఎనిమిదేళ్ళ కొడుకును నడుముకి కట్టుకొని, ఇంగ్లీషువాళ్ళ కళ్ళుగప్పి గుర్రంపై కాల్పికి బయలుదేరింది. 102 మైళ్ళు ఏకదాటిని ప్రయాణం చేసింది. కాల్పికి ఝాన్సీ మహారాణిని చేర్చిన ఆ గుర్రం కుప్పకూలి పోయింది.

హ్యూరోజ్ సైన్యంతో తలపడి, అతని మతి పోగొట్టింది మహారాణి. విప్లవ సైన్యాలకు చిక్కిన గ్వాలియర్‌పై రోజ్ తిరిగి దాడి సాగించాడు. గ్వాలియర్‌కు అపుడు రావుసాహెబ్ (నానా సాహెబ్ ప్రతినిధి) రాజ్యాధిపతి. తాంతియాతోపే సైన్యాధక్షుడు. రోజ్‌కు సహాయంగా బ్రిగేడియర్‌స్మిత్, ఝాన్సీ మహారాణిపై దాడికి నాయకత్వం వహించాడు. కొద్దిమంది అశ్వికదళంతో అతన్ని వెనక్కి తరిమింది. మళ్ళీ స్మిత్ దాడిచేశాడు. గ్వాలియర్ కోట శత్రువుల వశమయింది. స్వాతంత్ర్య సమరంలో అసమాన శౌర్యం ప్రదర్శిస్తూ, శత్రుసంహారం చేస్తూ, మహారాణి

ఝాన్సీరాణిబాయి 1858 జూన్ 17 న వీరమరణం చెందింది.

నలుదిక్కులా శత్రువులు చుట్టుముట్టారు. ఆమెను అంటిపెట్టుకునివున్న ముందర బాయీ, కాశీబాయీ, కొద్దిమంది సిపాయిలూ మాత్రం వున్నారు. శత్రువుల్ని చీల్చుకొని విప్లవ సేనల్ని కలవాలని ఝాన్సీలక్ష్మీబాయి ప్రయత్నం. శత్రుసంహారం చేస్తూనే వుంది. ఒక తుపాకి గుండు ముందరబాయిని దూసుకుపోయింది. గుండు పేల్చిన తెల్లసిపాయిని ఒక్కవేటుతో లక్ష్మీబాయి నరికివేసింది. ఒక కాలవను దాటడానికి గుర్రాన్ని అదలించింది. ఒక్క గెంతుతో బయటపడవచ్చు. కాని గాయపడ్డ గుర్రం కదలలేదు. ఇంగ్లీషు రౌతులు వచ్చేశారు. ఒక తుపాకి గుండు తగిలింది. శిరస్సు కుడిచెంప తెగిపోయింది. కుడికన్ను తెగిపోయింది. ఐనా గుర్రంమీదనే వుంది. ఇంతలో గుండెమీద మరోదెబ్బ. స్పృహతప్పి పడిపోతూనే మరో శత్రుసైనికుని బలికొంది. తర్వాత కింద పడిపోయింది. ఆ వీరనారి శరీరం శత్రువుల చేతికి చిక్కకుండా, ఆమె అనుచరులు అగ్ని సంస్కారం చేశారు. ఝాన్సీరాణిని కొందరు బ్రిటిష్ చరిత్రకారులు చాంద్‌బీబీతో పోల్చారు. కవచం ఖడ్గం ధరించి, అక్బరు సేనలతో రణరంగంలోకి దూకిన వీరవనిత చాంద్ బీబీ. "శత్రుపక్షంలోకల్లా మంచి మగవాడు"గా కూడా ఆమెను అభివర్ణించారు. ఆమె వీరగాథలు పల్లెల జానపద గీతాలలో నేటికీ పాడుతూనే వున్నారు అని చరిత్రకారులు రాస్తున్నారు.

* * *

రాణి లక్ష్మీబాయి చరిత్రలాగానే చెప్పుకోదగిన మరో వీరనారి హజరత్‌మహల్ బేగమ్. అయోధ్య నవాబు దజెద్ అలీషా భార్య. ఈ నవాబును బ్రిటిష్ వాళ్ళు గద్దె దింపారు. మహారాణి లక్ష్మీబాయిలాగానే ఆమె బ్రిటిష్‌వాళ్ళపై తిరగబడింది, ఫైజాబాద్‌కు చెందిన మౌల్వీ అహమ్మదుల్లా, నానాసాహెబ్, తాంతియాతోపేలతోపాటు విప్లవ నాయకులలో చేరిపోయింది. లక్నో నగర సంరక్షణలో బ్రిటిష్ సైనికులకు వ్యతిరేకంగా స్వయంగా పాల్గొంది. లక్నో పడిపోయాక అహ్మదుల్లా సేనలతో కలిసి షాజన్‌పూర్ యుద్ధంలో పాల్గొంది. విక్టోరియారాణి 1858 నవంబరు 1 న ఈస్టిండియా కంపెనీ పరిపాలన రద్దుచేస్తూ, లండన్‌లోని బ్రిటిష్ ప్రభుత్వ ఆధీనంలోకి భారతదేశాన్ని తీసుకొంటూ చేసిన ప్రకటనను ఈమె సవాలు చేసింది. ఆ ప్రకటనకు జవాబుగా మరో ప్రకటన చేసింది. ఆ ప్రకటనలో భారతదేశ సంస్థానాలకు కంపెనీవాళ్ళు చేసిన ద్రోహాన్ని దుయ్యబట్టింది. యుద్ధంలో శత్రువులు నలుమూలలా చుట్టుముట్టినపుడు నేపాల్‌కు తప్పించుకుపోయింది. నేపాల్‌లోని పర్వత శ్రేణులలో బహుశా ఆమె మరణించి వుంటుంది. ఉత్తరప్రదేశ్ జానపదగేయాలలో, పాటలలో ఆమె ఇంకా జీవించేవుంది.

* * *

1857 విప్లవంలో బ్రిటిష్ సైన్యాలతో తలపడి వేలాదిమంది నేలకొరిగారు. విచారణచేసి కొందర్నీ, చేయకుండా కొందర్నీ దాదాపు పదివేలమందిని ఉరి కంబాలకు, ఫిరంగి అగ్నిహోత్రానికి గురిచేశారు. నవాబులేకాదు, సాధారణ ముమ్ము రైతులూ వున్నారు. హిందువులూ ముస్లిములూ కలిసి పోరాడారు. బ్రిటిష్ పాలనకు పూర్వం భారతదేశంలో హిందూముస్లిం సమస్య అంటూ లేదని, జాతీయ కాంగ్రెస్ నాయకుడు అబుల్‌కలాం అజాద్ నిర్ధారణకు వచ్చాడంటే, అందులో అతిశయోక్తిలేదు. అందుకనే 1857 విప్లవ కాలంలో ప్రత్యేకించి హిందూముస్లిం ఐక్యత అంటూ ప్రబోధించనవసరం లేకపోయింది. హిందూ ముస్లిం రాజులు, సేనానులు ఇంగ్లీషు కంపెనీ సేనలతో ఐక్యంగా పోరాడాయి. ఈ సందర్భంలో జి డబ్ల్యూ. ఫారెస్టు అనే సిపాయి, తిరుగుబాటు చరిత్రకారుడు రాసిన వాక్యాలు గమనార్హం.

"చరిత్రకారునికి, పరిపాలనాధికారికి కూడా భారతదేశ తిరుగుబాటు అందజేసిన అనేక గుణపాఠాలలో బ్రాహ్మణుడు - శూద్రుడూ మహమ్మదీయుడూ - హిందువూ మనకు వ్యతిరేకంగా ఐక్యమైనట్టి విప్లవం సాధ్యమే, అనేదితప్ప అత్యంత ముఖ్యమైన హెచ్చరిక మరొకటిలేదు."

## ఘోర దురంతాలు

1857 స్వాతంత్ర్య సంగ్రామ కాలంలో అనేక దురంతాలు జరిగాయి. బ్రిటిష్ రచయితలు సాధారణంగా భారతీయ సిపాయిల, వారి నాయకుల దురంతాల గురించి గోరంతలను కొండంతచేస్తూ వచ్చారు. ఢిల్లీ, కాన్పూర్, లక్నోలలో యూరోపియన్ స్త్రీల,

పిల్లల హత్యాకాండ సమర్థనీయంకానిమాట నిజమే. కాన్పూరు ఘటనలకు నానాసాహెబ్ బాధ్యుడు కాడనేది సువిదితమే. ఐతే అల్హాబాద్ మండలంలో బ్రిటిష్‌వాళ్ళు చేసిన హత్యాకాండకు ప్రతీకారంగానే ఇది జరిగిందన్నది స్పష్టమే. కాన్పూర్ ఘటనలకు పూర్వమే నీల్ సేనాని ఎన్నో ఘోర కృత్యాలు చేశాడు. మద్రాసు నుంచి కలకత్తామీదుగా కాశీలో అడుగుపెట్టిన నీల్ సేనాని, దారిపోయిన వాళ్ళనల్లా చంపించాడు. తుపాకులతో కాల్పించాడు. కత్తులతో నరికించాడు. ఉరికంబాలకు వేలాడతీయించాడు. ఉరి కంబాలు చాలకపోతే చెట్ల కొమ్మల్నే ఉరికంబాలుగా మార్చాడు. మనుషుల్ని తగలబెట్టించాడు. గ్రామాలకి గ్రామాల్నే నిప్పంటించి భస్మీపటలం చేశాడు. కాశీ తర్వాత అల్హాబాద్‌లో చేసిన అతని ఘోరకృత్యాలను ఇంగ్లీషు చరిత్రకారులే వర్ణించడానికి సిగ్గుపడ్డారు. ఈ దురాగతాల్ని ఖండించిన లార్డ్ కానింగ్‌ను "దయాళువు కానింగ్" అంటూ తోటి యూరోపియన్లు హేళన చేశారు. ఒకసారి ఈ దురాగతాలను ప్రకటించ వలసినదిగా కొందరు ఒత్తిడి చేసినపుడు అతడిలా అన్నాడు.

"అలా చేయను. ఎన్ని బూతులైనా తింటాను. కాని ప్రపంచం ముందు నా దేశాన్ని భయానకంగా అవమానపరచే, ఆ పని మాత్రం చేయలేను."

స్త్రీలు, పురుషులు, బాలురు చివరికి చంటిపాపలు కూడా నీల్ హత్యాకాండకు గురి అయ్యారు. భారత దేశం అంతటా విప్లవకారులు హతమార్చిన ఇంగ్లీషు వాళ్ళకంటే ఒక్క అల్హాబాదులోనే నీల్ చంపిన భార తీయుల సంఖ్య ఎక్కువ. అల్హాబాద్‌లో భార తీయుడు వేలాడుతున్న శవంలేని చెట్టంటూ ఒకటి కూడా లేదు. ముస్లింలను బ్రతికుండగానే పంది తోలుతో కుట్టారు. పంది మాంసం వాళ్ళ నోళ్ళలో కుక్కారు. హిందువుల నోళ్ళలో గోమాంసం కుక్కారు. గాయపడ్డ ఖైదీలన్ను బ్రతికుండగానే కాల్చి వేశారు. ఇలాంటి వాళ్ళా నాగరీకులు? ఇలాంటి సామ్రాజ్య దేశమా నాగరీక దేశం?

ఢిల్లీలో బహదూర్‌షాను బంధించిన హడ్సన్ అతని కంటె ఘనుడు. బహదూర్‌షాను తన చేతులతో చంపాలని హడ్సన్ కోరిక. పై అధికారులు బహదూర్‌షాను విచారించాలని నిర్ణయించారు. అందుచే అతని దుర్గాహం తీరలేదు. కాని ఇంతలో ఒకగూఢచారి బహదూర్‌షా ఇద్దరు కొడుకులూ, ఒక మనవడూ లొంగిపోలేదని హుమాయూన్ సమాధిలో దాక్కొన్నా రనీ చెప్పాడు. వందమంది గుర్రపు రౌతులతో హడ్సన్ బయలుదేరి వాళ్ళను బంధించాడు. రహ స్యంగా ఢిల్లీ బయట ఒకమైలు దూరం తీసుకెళ్ళి, వాళ్ళను వివస్త్రులను చేసి తుపాకితో మట్టు పెట్టాడు. వాళ్ళ తలలను నరికాడు. మీర్జామొఘల్, అబూబకర్, ఖైర్ సుల్తాన్లను అవిధంగా చంపి వారి తలలను నరికి ఒక పళ్ళెంలో పెట్టి, దానిపై రూమాలు కప్పాడు. "ఈస్టిండియా కంపెనీ మీకు ఇవ్వకుండా ఆపివేసిన నజరానా ఇదిగో" అంటూ ముందు పెట్టాడు. రుమాలు తొలగించాడు. బహదూర్‌షా వృద్ధుడే. పిరికివాడే. కాని ఆఖరి ఘడియలలో అతనికి జరిగిన ఈ ఘోరావ మానం అతనిలో పౌరుషాగ్నిని ప్రజ్వలింపచేసింది. అతడిలా సమాధానమిచ్చాడు. "భగవంతుడికి ధన్య వాదాలు! తైమూరు వంశ సంతానం ఉజ్వలమైన మొహాలతో తండ్రి దగ్గరకు ఇలాగే వచ్చేవాళ్ళు."

హడ్సన్‌ను ఒక ఇంగ్లీషు చరిత్రకారుడు, ఇలా వర్ణించాడు. "మానవుని బాధ అతనిలో ఎట్టి ఆవేదనా రేకెత్తించదు. రక్తపాతం అతనిలో ఏ మాత్రం నొప్పి కల్గించదు. ప్రాణం తీయడంవల్ల అతనికి మానసిక బాధ ఏమీ వుండదు.... (అతని ఆనందం) ఓడిపోయి పరారి అయే వారిని నరకడం, పరాజితుల ఆస్తులు కొల్లగొట్టడం" ఎన్నో యుగాలముందు అంటే ఏ మధ్య యుగాలలోనో అతడు పుట్టి వుండా ల్సిందని కూడా ఈ రచయితే సూచించాడు.

బహదూర్‌షా ఆ తర్వాత రంగూన్‌లో చని పోయాడు. హడ్సన్ చంపిన వాళ్ళుగాక బహదూర్ షాకు మరో కొడుకు ఫిరోజ్‌షా వీర సైనికుడు. భారతదేశం నుండి తప్పించుకొని మక్కా వెళ్ళాడు. అక్కడ బిచ్చగాడుగా జీవితం వెళ్ళబుచ్చడంకొందరు చూశారు. మరో కొడుకు ఫక్రుద్దీన్ బ్రిటిష్ అధికారి ఇంట్లో నౌకరుగా కుదిరాడు. అతనిపై నిఘా వుంచ డం కోసం నౌకరయ్యాడని కథనం. ఈ విషయం తెలిసి అతన్ని తుపాకితో కాల్చగా కాలుపోయింది. కుంటివాడయ్యాడు. చనిపోయాడని వదలివేశారు కాని ఢిల్లీలో ఇంగ్లీషు వాళ్ళకు అజ్ఞాతంగా ఫకీరుగా తిరి గాడు. ప్రజలు మాత్రం గౌరవిస్తూనే వుండేవారు. మొగల్ రాచవంశీకులలో ఒక్కడు "టికా" (బండిని) నడుపుకుంటుండగా కానాట్ ప్రభువు కారు కిందపడి చనిపోయాడని చెబుతారు. అలా అంత రించింది మొగలు సామ్రాజ్యం. రాచరికమూను.

1858 నవంబరు 1 న విక్టోరియా రాణి ప్రకటనతో ఈస్టిండియా కంపెనీ పాలన రద్దు చేయబడింది. ఈ మేరకు పార్లమెంటులో చట్టం ప్యానయింది. 1874 జనవరి 1 నుండి ఆ చట్టం అమలులోకి వచ్చింది. బ్రిటిష్ చక్రవర్తులే నేరుగా భారతదేశ పరిపాలకు లయ్యారు. విక్టోరియా రాణి కానింగ్‌ను మొదటి వైస్రాయిగా, గవర్నర్ జనరల్‌గా నియమించింది.

1857 విప్లవం ఓడిపోవడానికి కారణం భారతదేశ వ్యాప్తంగా ఏకీకృత నాయకత్వం లేదు. అలాగే ఐక్య సైనిక వ్యూహంలేదు. బ్రిటిష్ ఆయుధాల ఆధిక్యత మరో కారణం. దక్షిణాదిన నిజాం. పంజాబులోని ఫ్యూడల్ రాజులు. బ్రిటిష్ వాళ్ళు సృష్టించిన నూతన ఫ్యూడలు వర్గం ద్రోహంచేసి బ్రిటిషు వాళ్ళను బల పరిచాయి. ఏది ఏమైనా భారతదేశ స్వాతంత్ర్య సమ రంలో 1857 మహోజ్వల ఘట్టం. జవహర్‌లాల్ నెహ్రూ "డిస్కవరీ ఆఫ్ ఇండియా"లో చెప్పినట్లు- "తిరుగుబాటు ప్రత్యక్షంగా దేశంలోని కొన్ని ప్రాంతా లకే వ్యాపించినప్పటికీ, అది యావత్ భారతదేశాన్ని ముఖ్యంగా బ్రిటిషు పాలనను కదలించి వేసింది."

# కాంగ్రెస్ పుట్టుక, పెరుగుదల

1885 డిసెంబరు 28 న బొంబాయిలోని గోకుల్ దాస్ తేజ్‌పాల్ సంస్కృత కళాశాలలో "భారత జాతీయ కాంగ్రెస్" ఏర్పడింది. ఇండియన్ నేషనల్ యూనియన్ ప్రధాన కార్యదర్శి "అలాన్ ఆక్టోవియన్ హ్యూమ్ ఈ సంస్థ స్థాపనకు చొరవ తీసుకున్నాడు. సమావేశాన్ని మొట్టమొదట పూనాలో క్రిస్మస్‌లో జర పాలని ఇండియన్ నేషనల్ యూనియన్ భావించింది. పూనాలో కలరా చెలరేగడంతో ఆ ప్రయత్నం విర మించారు. బొంబాయిలో జరిగిన సమావేశంలో ఇండియన్ నేషనల్ యూనియన్ అనే పేరు చాలా మందికి రుచించలేదు. భారత జాతీయ కాంగ్రెస్ (ఇండియన్ నేషనల్ కాంగ్రెస్) గాపేరు మార్చారు. తర్వాత తర్వాత దాన్నికాంగ్రెసుగా జనబాహుళ్యం పిలుస్తూ వచ్చింది.

హ్యూమ్ మొదటి ఉపన్యాసకుడు. ఆయన బెనర్జీని అధ్యక్షునిగా ప్రతిపాదించాడు. డబ్ల్యు సి. బెనర్జీ బారిస్టర్. పాశ్చాత్యుల భావాలను జీర్ణించుకొన్నవాడు. కలకత్తా నివాసి. మొదటి కాంగ్రెస్ మహాసభకు, బెనర్జీ అధ్యక్షత వహించాడు. హ్యూమ్ ప్రతిపాదనను యస్. సుబ్రహ్మణ్య అయ్యర్, కె. టి. తెలాంగ్ గార్లు, బలపరుచుతూ ప్రసంగించారు.

ఈ కాంగ్రెస్‌కు మద్రాసు రాష్ట్రం నుండి హాజరైన వాళ్ళలో పి. రంగయ్యనాయుడు, పి. ఆనందాచార్యులు వున్నారు. వీరు 1884 లో ఏర్పడిన మద్రాసు మహా జన సభకు అధ్యక్ష, కార్యదర్శులు. వీరుగాక బరం పురం. మచిలీపట్టణం, కడప, బళ్ళారి, అనంతపురం మొదలైన పట్టణాల నుండి ప్రతినిధులు మొదటి కాంగ్రెస్‌కు హాజరయ్యారు.

హ్యూమ్ వ్యవసాయశాఖ కార్యదర్శిగా పనిచేసి రాజీనామా పెట్టి 1882 లో రిటైరయ్యాడు. కాంగ్రెస్ సంస్థాపకులలో ముఖ్యునిగా, భారతదేశ మిత్రునిగా హ్యూమ్‌ని వర్ణించటం అనేకుల రాతలలో కనబడు తుంది. భారతదేశ మిత్రుడనని 1883 మార్చి 1 న కలకత్తా యూనివర్శిటీ పట్టభద్రులకు రాసిన లేఖలో హ్యూమ్ స్వయంగా చెప్పుకున్నాడు కనీసం యాభై మంది నిస్వార్థపరులైన, నైతిక ధైర్యంగల. ఆత్మ నిగ్రహం కల్గిన. జాతీయ సేవాభావ తత్పరులై చురుకుగా పనిచేసేవారు కావాలని ఈ లేఖలో హ్యూమ్ కోరాడు.

"మీస్వీయ వ్యవహార నిర్వహణమందు ఎక్కువ భాగము సంపాదించుకొనుటకు, మీరు గట్టిగా పోరాడ లేని యెడల, మీ స్నేహితులమైన మేమందరమూ తప్పించేసితిమి" అని అన్నాడు.

—డా. పట్టాభిగారి కాంగ్రెస్ చరిత్ర

హ్యూమ్ కాంగ్రెస్ నిర్మాణంలో ప్రధాన పాత్ర వహించినమాట నిజమే. హ్యూమ్ వున్నా లేకపోయినా ఆనాటి పరిస్థితులలో జాతీయ సంస్థ ఏర్పడక తప్పదు. హ్యూమ్ ప్రభుత్వోద్యోగంలో ఉన్నపుడు పోలీసుల రహస్య నివేదికల్ని చదవడానికి అతనికి అవకాశం కల్గింది. ప్రజలలో వ్యాపించిన అసంతృప్తి, బ్రిటిష్ వాళ్ళకు వ్యతిరేకంగా రహస్య కుట్ర సంఘాలను స్థాపించి వ్యాపింపచేసే ప్రయత్నాలు ఆయన కంట పడ్డాయి.

హ్యూమ్‌ను "భారతీయ కాంగ్రెస్ పిత" గా వర్ణిస్తూ అతని జీవిత చరిత్ర రాసిన సర్ విలియం వెడ్డర్‌బరన్ ఆనాటి పరిస్థితిని ఇలా వర్ణించాడు. "దుర దృష్టకరమైన ఈ అభివృద్ధినిరోధక చర్యలు, రష్యన్ పద్ధతులతోకూడిన పోలీసు నిర్బంధకాండ కలిసి, లార్డ్ లిట్టన్ (వైస్రాయి) ఆధిపత్యంలో భారతదేశంలో విప్లవం బ్రద్దలవడం దాదాపు సమీపించింది. సరిగా తగు సమయంలో, హ్యూమ్, అతని భారతీయ సలహా దారులు జోక్యం చేసుకోవడం అవసరమనే ప్రేరణ పొందారు."

హ్యూమ్ కార్యకలాపాలకు ఆనాటి వైస్రాయి లార్డ్ డఫ్రిన్ ఆశీస్సు లున్నాయి. ఐతే కాంగ్రెస్, సాంఘిక సమస్యలకు మాత్రమే పరిమితం కావాలని డఫ్రిన్ సూచించాడు.

సాంఘిక సమస్యల నుండి రాజకీయ విషయాల వైపుకు కాంగ్రెస్‌ను మళ్ళించాలని డఫ్రిన్, హ్యూమ్‌కు సూచించినట్లు ఇటీవలి వరకు చరిత్రకారులు అభిప్రాయ పడుతూ వచ్చారు 1898 లో ఒక పుస్తకానికి రాసిన పీఠికలో డబ్ల్యు. సి. బెనర్జీ పొరపాటున చెప్పిన విషయం దీనికాధారమనీ, డఫ్రిన్ ప్రయివేటు పత్రాలను పరిశీలించగా అందుకు పూర్తి వ్యతిరేకంగా ఉన్నాయనీ ఇటీవలి పరిశోధకు లంటున్నారు.

బ్రిటిష్ గవర్నర్ల ఆధ్వర్యాన భారత రాజకీయ ప్రముఖులు క్రమబద్ధంగా సమావేశమవుతూ ఉండాలని హ్యూమ్ సూచించాడు, అలాంటి సమావేశం ద్వారా

ఏర్పడే సంస్థ కోర్కెల వేదికగా ఉండాలని ఆయన అభిప్రాయం. భారతదేశానికి స్వరాజ్యం తేవడంకాదు ఇలా ఏర్పడే సంస్థ లక్ష్యం భారతదేశంలో వ్యక్తమవుతున్న అసంతృప్తి విప్లవరూపం ధరించకుండా నిరపాయకరమైన మార్గం (సేఫ్టీవాల్వ్) ద్వారా వెళ్ళగక్కుకోడానికి వేదిక మాత్రమే. డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు రచించిన 'కాంగ్రెస్ చరిత్ర'లో ఇలా రాశారు.

"ప్రజలలో పొంగి పొరలిపోతున్న ఈ విప్లవ తరంగముల కొక్క అవధిని సృష్టింపవలయునని హ్యూమ్ తలచెను."

వైస్రాయి డఫ్రిన్, జాతియ సంస్థకు గవర్నర్లు కాకుండా అనధికారులు అధ్యక్షులుగా ఉండాలని సలహా ఇచ్చాడు అలా అయినప్పుడే భారతీయులు ఎక్కువ స్వేచ్ఛగా మాట్లాడగలరని అన్నాడు. ఈ సూచన లను భారతీయ ప్రముఖుల ముందు హ్యూమ్ వుంచాడు. అందుకు వారంగీకరించారు. దీనివెనుక డఫ్రిన్ ప్రచ్ఛన్నహస్తం వున్నదని వారికి తెలియదు. పైగా, ప్రభుత్వ సహకారంతో భారతదేశాభివృద్ధికి కృషిచేయవచ్చునని తలచే బ్రిటిష్ ప్రభుత్వ విధేయులు ఈ కాంగ్రెస్‌కు హాజరైన వారిలో కొంద రున్నారు కాంగ్రెస్ అధ్యక్షుడు బెనర్జీ వుపన్యాసం కూడా ఇదే తెలియచేస్తుంది.

"యూరప్‌లో వున్న ప్రభుత్వాల అభిప్రాయాలకు అనుగుణంగా (భారతదేశం కూడా) పరిపాలింపబడా లనే తమ కోర్కెకూ బ్రిటిష్ ప్రభుత్వం పట్ల సంపూర్ణ విధేయతకూ వైరుధ్యం ఏమీలేదు." అని అన్నాడు ప్రభుత్వ పునాదిని విస్తృతం చేయాలనీ, ప్రభుత్వంలో ప్రజలకు న్యాయమైన తగిన హక్కు ఇవ్వాలనీ భారత ప్రజలు కోరుతున్నారని ఆయన అన్నాడు. మొట్ట మొదటి కాంగ్రెస్ ముగింపు సందర్భంగా విక్టోరియా మహారాణికి అభినందనలు తెలియజేస్తూ హ్యూమ్ చేసిన ప్రసంగం తీరు చాలా ఏవగింపు కలిగిస్తుంది. మొదటి కాంగ్రెస్ అధికార నివేదికలో అతని ప్రసంగం అచ్చుపడింది. "విక్టోరియా రాణి కాలిబూటు లేసు తాళ్ళు ఊడ దీయడానికి కూడా అనర్హుడను" అని హ్యూమ్ దాసాను దాసునిగా తనను వర్ణించుకొన్నాడు. ఐతే ఆనాటి కాంగ్రెస్, మధ్య తరగతి మేధావులకు వేదిక అయింది. బెంగాల్, బొంబాయి, మద్రాసు, పంజాబులలోని మధ్య తరగతి వర్గాల ఐక్యసంఘటనగా తమ రాజకీయ అభిప్రాయాలను రూపొందించుకొనే ప్రయోగశాలగా అవకాశం కల్గించింది.

1907 వరకు హ్యూమ్ కాంగ్రెస్ కార్యదర్శిగా వున్నాడు. ఒకోసారి తానొక్కడే ఆపదవి నిర్వహించాడు. మరికొన్ని సార్లు భారతీయులతో కలిసి ఆపదవి నిర్వహించాడు. కాంగ్రెస్ అధ్యక్షపదవిని బ్రిటిష్ వాళ్ళు కూడా అధిష్టించారు. 1888 లో జార్జియూల్ అనే ఆంగ్లేయుడు అధ్యక్షుడు. 1894 లో బ్రిటిష్ పార్లమెంటు సభ్యుడైన ఐరిష్ జాతీయుడు ఆల్‌ఫ్రెడ్ వెబ్ అధ్యక్షుడు, ఐ. సి. యస్ ఉద్యోగిగావుండి రిటైరయిన సర్ హెన్రీ కాటన్ 1904లో అధ్యక్షతవహించాడు. బొంబాయి ప్రభుత్వ కార్యదర్శిగా పనిచేసిన సర్ విలియం వెడ్డర్‌బరన్ 1910లో అధ్యక్షుడయాడు. డఫ్రిన్, హ్యూమ్‌ల ఉద్దేశాలేమైనా, వారాశించినట్లుగానే కాంగ్రెస్ వుండిపోలేదు. రాజ్యాంగ సంస్కరణల ద్వారా, పరిపాలనా పద్ధతులలో మార్పులద్వారా భారతదేశ సంక్షేమాన్ని సాధించడమే, ప్రథమ దశలో కాంగ్రెస్ నిర్వాహకుల లక్ష్యం. ఏమైనా హ్యూమ్, వెడ్డర్‌బరన్‌లు, గాంధీజీ ప్రశంసలను అందుకో గలిగారు.

కాంగ్రెసు పుట్టుక తర్వాత, దాదాపు మొదటి ఇరవై సంవత్సరాలు విజ్ఞప్తులు, తీర్మానాలతో కూడిన మితవాద రాజకీయాలే ప్రాధాన్యత వహించాయి. ఐతే ఈ మితవాద నాయకులలో చాలామంది ఛాందసులు కాదు, మూఢ విశ్వాసాలను సమర్థించేవారూ కాదు. ఆధునిక పాశ్చాత్య దృక్పథం కలవారు.

దాదాభాయి నౌరోజీ, ఫిరోజిషా మెహతా, గోపాలకృష్ణ గోఖలే, బదురుద్దీన్ త్యాబ్జీ మొదలైన వారంతా గొప్పవారే. ఐతే, వారి దృష్టిలో ప్రజానీకం ఒక రాజకీయ శక్తిగాదు. వారు ప్రజా నాయకులు కారు. వీరి దృష్టిలో భారతదేశపు వెనుకబడ్డతనమే తమ శత్రువుగాని బ్రిటిషు పరిపాలన తమ శత్రువుకాదు.

ప్రభుత్వానికి విజ్ఞప్తులతోను, తీర్మానాలతోను వ్యవహరించినా, వీరు అభివృద్ధి నిరోధకులూ, విదేశ ప్రభుత్వ సాధనాలుగా ఉపయోగపడిన జాతీయ వ్యతిరేక శక్తులని అర్థంకాము. అపుడే తలెత్తుతున్న శైశవ దశలోని భారత పారిశ్రామిక వర్గానికి ప్రతి

నిధులు. ఆనాటికి కార్మికవర్గం యింకా గోచీ పెట్టుకో లేదు. దానికి నిజమైన నిర్మాణం లేదు. తమను పీడించిన బ్రిటిషువాళ్ళపై చేతికి దొరికిన మొరటు ఆయుధాలతో పోరాడి, ఓడిపోయి, అలసిన స్థితిలో వున్నారు రైతులు. జాతీయతా భావం గాఢంగావీరిలో యింకా నాటుకోలేదు. విద్యావంతులైన భారతీయులు, తామొక్కరే బ్రిటిషువాళ్ళతో పోరాడలేరు పోరాడాలనే ఉద్దేశం కూడా ఆ దశలో లేదు.

అందుచేతనే కాంగ్రెసు మొదటి యిరవై ఏళ్ళలో చేసిన తీర్మానాలలో ప్రధానాంశం శాసన సభలలో, శాసనసభా నిర్మాణంలో భారతీయులకు భాగం ఉండాలి. భారత పరిశ్రమలకు ప్రోత్సాహం, రక్షణ ఉండాలి.

ఐతే ఈ లక్ష్య సాధనకు 'పోరాటం'అనేది అప్పటి కింకా కాంగ్రెసు ఎజెండాలో లేదు.

అంత మాత్రాన కాంగ్రెసు పుట్టుక రోజు వలెనే యీ యిరవై ఏళ్ళూ స్తబ్దంగా వుందని అర్థంకాదు. కాంగ్రెసు సమావేశాలకు ఆనాటికానాటికి ప్రతినిధుల సంఖ్య పెరగడమే యిందుకు నిదర్శనం. కాంగ్రెసు తీర్మానాలను దేశం నలుమూలలా చర్చించడం కూడా గమనించదగిన అంశం.

"ప్రథమములో విద్యాధికుల కొకకాలక్షేపముగాను, తమాషాగాను నడచిన కాంగ్రెసు వెంటనే భారతజాతి కాశ్రయస్థానమైనది. వారి మహోద్యమాలకు కేంద్ర స్థలమైనది, వారి వాంఛా వాహినులకు సంగమ క్షేత్ర మైనది"—కాంగ్రెసు చరిత్రకారుడు డాక్టర్ పట్టాభి మాటలలో.

కాంగ్రెసు నిర్మాణానికి హ్యూమ్‌ను పురికొల్పిన లార్డు డఫ్రినే దానిని భారత జనాభాలో "అత్యంత స్వల్పమైన మైనారిటీకి ప్రాతినిధ్యం వహించిన సంస్థ"గా తేలికపరచాలని చూశాడు. మరికొన్ని సంవత్సరాలకు ప్రభుత్వ వర్గాలలో అది "విద్రోహ కార్య కలాపాల ఫ్యాక్టరీ"గా చర్చించబడుతూ వచ్చింది.

పాత నాయకత్వాన్ని, పాత పద్ధతులను వదలి 1905 లో కాంగ్రెసు నూతన రాజకీయ శక్తుల ఆవిర్భావానికి కారణమైంది. కర్జన్ ప్రభువు కర్కశత్వమూ, వంగ విభజనా యిందుకు నాంది పలికాయి.

## తొలిదశ

కాంగ్రెసు ప్రాథమిక దశలో జాతీయవాదులపై మితవాద రాజకీయాల ప్రాబల్యం వుండేది. తమ దేశ వ్యవహారాలను తాము చక్కదిద్దుకోగలమనీ పాశ్చాత్య ఆదర్శాలను ఆధారం చేసుకుని స్వపరిపాలన లక్ష్యానికి చేరగలమనీ వారు భావిస్తూ వుండేవారు. రాజ్యాంగబద్ధమైన ఆందోళనకే పరిమితమైనందున తొలి జాతీయవాదులకు మితవాదులని పేరు వచ్చింది. ప్రతి సంవత్సరం కాంగ్రెసు మహాసభలలో వీరు దేశ రాజకీయ, ఆర్థిక, పరిపాలనా సమస్యల్ని చర్చించేవారు. వీటిని గురించి ప్రజలలో ప్రచారం చేసి, ప్రజలలో చైతన్యం తేవాలనీ, ప్రజాభిప్రాయాన్ని ప్రభుత్వానికి తెలిసేటట్లు చేయాలనీ సంకల్పించారు. శాసనసభలను (లెజిస్లేటివ్ కౌన్సిల్సు) సంస్కరించి విస్తృత పరచాలనీ, న్యాయ వ్యవస్థను పరిపాలన యంత్రాంగం నుండి విడదీయాలనీ, ప్రభుత్వోద్యోగాలలో భారతీయులకు ఎక్కువ భాగం యివ్వాలనీ, పోలీసు శాఖను సంస్కరించాలనీ, పరిపాలనా వ్యయం తగ్గించాలనీ, బ్రిటన్‌కు తరలించుకుపోయే ధనాన్ని తగ్గించాలనీ, భూమి పన్ను భారాన్ని తగ్గించాలనీ — వీరు చర్చించిన కొన్ని అంశాలు. దక్షిణాఫ్రికా, మలయా, మారిషస్, ఫిజీ, వెస్టిండీస్, బ్రిటిషు గుయానా మొదలగు బ్రిటిషువలస దేశాలలో స్థిరపడిన భారతీయుల సంక్షేమం కోరుతూ కాంగ్రెసు మహాసభలలో తీర్మానించేవారు. సభలు జరిపి 1893 తర్వాత గాంధీ [మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ] మానవ హక్కులకై సాగించిన పోరాటాన్ని బలపరచారు. ఈ విషయాలపై ఉపన్యసించి తీర్మానించేవారు. పత్రికలలో ప్రభుత్వ విధానాలను విమర్శించేవారు. ప్రభుత్వానికి జాగ్రత్తగా తయారు చేసిన విజ్ఞప్తులు, నివేదికలు పంపేవారు. వీటిలో భారతీయుల కోర్కెల గురించి తెలియజేసేవారు.

భారతదేశంలో కాంగ్రెసు సంస్థ ఏర్పడిన తర్వాత భారత వ్యవహారాలలో సహాయపడటానికి బ్రిటన్‌లో "భారతీయ కమిటీ" ఏర్పడింది. దాని తరఫున "ఇండియా" అనే పత్రిక నిర్వహించబడింది.

బ్రిటిష్ ప్రజాభిప్రాయాన్ని భారతీయులకు అనుకూలంగా మార్చాలనీ, బ్రిటిష్ ప్రభుత్వ వైఖరిని మార్చగల పలుకుబడిని తాము సంపాదించాలనీ ఈ తొలి జాతీయవాదులు ప్రయత్నించేవారు. బ్రిటిష్ వాళ్ళ న్యాయంపైనా, బ్రిటిష్ రాజకీయ పద్ధతులపైనా, వీరికి విశ్వాసం వుండేది.

క్రమేపీ రాజ్యాంగపద్ధతులద్వారా స్వపరిపాలనసాధించ గలమని వీరి విశ్వాసం. అప్పటికి అమలులోవున్న లెజిస్లేటివ్ కౌన్సిల్‌ను విస్తృతపరచి, సంస్కరించాలని వీరు కోరుతూ వచ్చారు.

1861 ఇండియన్ కౌన్సిల్ ఆక్టు ప్రకారం వైస్రాయి లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు అదనంగా ఆర్గురు అధికార సభ్యులను నామినేట్ చేయడానికి ప్రభుత్వం వీలు కల్గించింది. ఈ నామినేట్ చేయబడిన వాళ్ళలో చాలా మందిని జాగ్రత్తగా ఎంపికచేసి మరీ నామినేట్ చేసేవారు. సాధారణంగా వీళ్ళు జమీందార్లు, పెద్ద పెద్ద వ్యాపారస్తులై వుండేవారు. ప్రభుత్వం ఏమంటే దానికి తాన తందానా అనేవారు. ఉదాహరణకు 1888లో ఉప్పు పన్ను హెచ్చింపును వీరు బలపర్చారు. 1883-84లలో స్థానికస్వపరిపాలనా చట్టాలు చేసింది ప్రభుత్వం. ఆ చట్టాల ద్వారా స్థానిక సంస్థలు గ్రామాల్లోను, పట్టణాల్లోను ఏర్పడ్డాయి. జిల్లా సమితులు కూడా ఏర్పడ్డాయి. 1892 ఇండియన్ కౌన్సిల్ ఆక్టు ప్రకారం పరోక్షంగా ఎన్నుకొనే అధికారమంటూ ఒక చట్టం తెచ్చారు.నిజానికి స్థానిక సంస్థలుగాని తదితర నియోజకవర్గాలుగాని శాసన సభ్యుల పేర్లను సూచించవచ్చు. ఈ పేర్లను త్రోసిపుచ్చే అధికారం ప్రభుత్వానికి వుంది. దానినే ఎన్నిక అనేవారు. ఇది కాంగ్రెస్ కోరిన శాసన సభలో ఎన్నిక ప్రాతిపదిక సూత్రాన్ని అనుసరించిలేదు. కౌన్సిల్ అధికారాలను విస్తృతపరచాలనీ, బడ్జెటును చర్చించే అధికారం, దైనందిన పరిపాలన గురించి ప్రశ్నించి విమర్శించే హక్కు ఉండాలనీ కోరారు. 1892 చట్టంలో బడ్జెటుపై ప్రసంగించే అధికారం సభ్యులకు కలిగింది. కాని వారు ఓటు చేయ వీలులేదు. 1892 ఇండియన్ కౌన్సిల్ ఆక్టు వట్టి బూటకం అని గ్రహించారు ఆనాటి కాంగ్రెసునాయకులు. కౌన్సిళ్ళలో ఎన్నుకోబడిన అనధికార మెజారిటీ వుండాలనీ, ప్రభుత్వ ఖజానాపై అనధికార భారతీయుల కంట్రోల్ వుండాలనీ వారు కోరారు. ప్రాతినిధ్యంలేకుండా పన్నులు విధించరాదన్నారు. కఠినమైన పదజాలం ఉపయోగించకపోయినా, నిగ్రహంతో విమర్శించేవారు. ఉదాహరణకు 1892 కౌన్సిల్స్ ఆక్టును 1899 లో కాంగ్రెస్ అధ్యక్షుడైన రమేష్‌చంద్రదత్తు విమర్శించిన విధానం ఈ విషయాన్ని స్పష్టం చేస్తుంది.

రమేష్‌చంద్రదత్తు ఇలా విమర్శించారు. "30 జిల్లాలు కలిగి, మూడుకోట్ల జనాభా కల్గిన రాష్ట్రానికి లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో కనీసం 30 మంది ఎన్నికైన సభ్యులుండవచ్చు." దీని అర్థం అలా లేదనేగదా!

ఆనాటి కాంగ్రెస్ నాయకుల ప్రయత్నాల ఫలితంగా, ప్రభుత్వ ఖజానా వినియోగం గురించి, విచారించడానికి 'వెల్బీ కమిషన్'ను నియమించింది ప్రభుత్వం. కేవలం రాజ్యాంగపరమైన సంస్కరణల కోసం మితవాదులు పట్టుబడుతూవుంటే, కాంగ్రెస్‌లో తలెత్తుతూ వచ్చిన అతివాద నాయకత్వం వారిని విమర్శిస్తూ వచ్చింది. చిలికి చిలికి ఈ తగాదా సూరత్‌లో 1907 లో చీలికకు దారితీసింది. అతివాదుల్ని, మితవాదులు బహిష్కరించారు. 1916 లో వీరిని తిరిగి కాంగ్రెస్‌లోచేర్చుకొన్నారు మాంటేగ్యూ-చమ్స్‌ఫర్డ్ రిపోర్టు 1918 లో ప్రచురింపబడగా, దానికి వ్యతిరేకంగా, కాంగ్రెస్ తీర్మానించింది. మితవాదులు, కాంగ్రెస్ అభిప్రాయంతో భేదించి తామే కాంగ్రెస్ నుండి వైదొలగి, 'ఇండియన్ లిబరల్ ఫెడరేషన్' స్థాపించారు. ఒకనాడు అతివాదులను బహిష్కరించిన మితవాదులు తామే కాంగ్రెస్ నుండి బయటికి పోయారు.

## అతివాదులు

ఎవరీ అతివాదులు? నేడు ప్రచారంలో వున్న అర్థంలో ఈ అతివాదులు నిజంగా అతివాదులు కాకపోవచ్చు. ఆనాటి ముందుకరం కాంగ్రెస్ నాయకులకంటే వీరే అతివాదులు. ఎవరువీరు? బ్రిటిష్ వాళ్ళను సమరశీల ఉద్యమాలద్వారా ఎదుర్కోవాలనడం వల్లనే వీరికి అతివాదులని పేరు వచ్చింది. వీరు ప్రచారంచేసిన జాతీయతలో మతసంబంధమైన ప్రచారం లేకపోలేదు. హైందవులు, భారతీయ సంస్కృతి, హిందూమతం, ఆర్యుల వారసత్వం- ఇలాంటి భావనలతో భారతదేశాన్ని చూడసాగారు. ఉదాహరణకు బాలగంగాధర తిలక్ శివాజీ, గణపతి ఉత్సవాలను ప్రేరేపించాడు. ఇవి ప్రధానంగా బ్రిటిష్‌వ్యతిరేక ప్రచారానికి దోహదం చేసినా, ఇవి ఇతర మతాల వారిలో కొంత అనుమానాలకు దారితీశాయి. దీని భావం తిలక్ హిందూమతోన్మాది అని కాదు. పైగా ఆయన హిందూ ముస్లిం ఐక్యతకు కృషి చేశాడు.

## లోకమాన్య బాలగంగాధర తిలక్

అతివాదులలో బాలగంగాధరతిలక్ అత్యంత ప్రముఖుడు. తిలక్ 1866 లో జన్మించాడు. బొంబాయి యూనివర్శిటీలో పట్టభద్రుడయ్యాడు. యావజ్జీవితం దేశసేవకు అంకితం చేశాడు. మొదట అగార్కార్, రనడే, దాదాభాయి నౌరోజీ చే ప్రభావితుడైన తిలక్ దేశీయులలో ఆత్మస్థైర్యాన్ని బలపరచే అనేక సంస్థలు నెలకొల్పాడు.

గోవధవ్యతిరేక సంఘాలు, అఖాడాలు, (వ్యాయామ కేంద్రాలు) లాఠీక్లబ్బులు నెలకొల్పాడు. గణపతి, శివాజీ ఉత్సవాలను నిర్వహించాడు. ఆయన స్థాపించిన 'కేసరి' అనే మరాఠీ పత్రిక, 'మరాఠా' అనే ఇంగ్లీషు పత్రిక, జాతీయోద్యమ ప్రచారానికి మొనగాళ్ళుగా నిలిచాయి. పిరికితనం వద్దనీ, స్వార్థత్యాగు వుండాలనీ, స్వాభిమానం, ఆత్మవిశ్వాసం కల్గి ఉండాలనీ ప్రబోధించాడు. వంగవిభజన తర్వాత విదేశ వస్త్ర బహిష్కరణ, స్వదేశీ ఉద్యమం, జాతీయ విద్య, స్వరాజ్యం అనే వాటిపై నొక్కి చెప్పాడు. భారత దేశ మిల్లుబట్టలపై వైస్రాయి ఎల్గిన్ ఎక్సైజ్‌పన్ను విధించినపుడు స్వదేశీ నినాదం ఇచ్చాడు. 1897 లో రాజద్రోహ నేరంక్రింద తిలక్‌ను అరెస్టుచేసి 18 నెలల కఠినశిక్ష విధించారు. కోర్టులో ఆయన ప్రవర్తించిన తీరు, క్షమాపణ చెప్పడానికి నిరాకరించడం, ఆయన ధైర్యసాహసాలు. జాతీయోద్యమంపై తీవ్ర ప్రభావం కల్గించాయి. 1908 లో రాజద్రోహకర వ్యాసాలు రాశాడని అరెస్టుచేసి, ఆనాడు భారతదేశంలో భాగమైన బర్మాలోని మాండలేకి ప్రవాసం పంపారు. ఈ అరెస్టుకు నిరసనగానే బొంబాయి కార్మికవర్గం మొట్టమొదటి సారిగా రాజకీయసమ్మె చేసింది. ఈ సమ్మెను గురించే లెనిన్‌మహాశయుడు విప్లవ ప్రాముఖ్య సంఘటనగా కీర్తించాడు. జైలునుంచి విడుదలై వచ్చాక 1916 లో తిలక్ 'హోం రూల్ లీగ్'ను ప్రారంభించాడు. 1916 లక్నో కాంగ్రెస్‌లో "స్వరాజ్యం నా జన్మ హక్కు" అని గర్జించాడు. ఆ మాటలు ప్రసిద్ధ నినాదంగా మారిపోయాయి.

తనను అవమాన పరచుతూ రాసిన బ్రిటిష్ జర్నలిస్టు వాలెంటైన్ చిరోల్‌పై కేసుపెట్టి, ఇంగ్లండులో న్యాయశాస్త్రపరంగా పోరాటం సాగించాడు. ఆ కేసులో గెలవలేదు తిలక్. కారణం అప్పటి బ్రిటిష్‌వాళ్ళ తీర్పు, న్యాయశాస్త్రాన్ని అనుసరించి గాక రాజకీయ దురుద్దేశ్యంతో కూడివుండటమే. తిలక్ పండితుడు జైలులో 'గీతారహస్యం' రాశాడు.

వర్షాభావం వల్లకానీ, కరువు కాటకాల వల్లగానీ, కీటకాలకు గురై కానీ పంటలు పండకపోతే, భూమి పన్ను చెల్లించవద్దని మహారాష్ట్రలోని రైతులకు మొట్ట మొదట సలహా ఇచ్చిన వారిలో లోకమాన్య తిలక్ అగ్రగణ్యుడు. 1920 ఆగస్టులో తిలక్ అస్తమించాడు.

నిజానికి మితవాదులు ఏ విషయాల్లో మితవాదులు ? అతివాదులు ఏ విషయాల్లో అతివాదులు ? పాశ్చాత్య సంస్కృతిలోని మంచిని గ్రహించి, మన దేశంలోని దురాచారాలను తొలగించాలని కృషిచేసినంత వరకూ ఈ మితవాదులు నిజంగా అభ్యుదయ వాదులే. కాని సమరశీల జాతీయ వాదులైన అతివాదులకు శాస్త్రీయ దృక్పధంలేని కారణంగా వారికి గతం, గత సాంప్రదాయం, గత ఆచారాలు, సంస్థలూ తలచుకొని ఉత్తేజితులయ్యేవారు. 'ఆర్య' సంబంధమైనదంతా అధికమనీ, ఆధునిక పాశ్చాత్య సంస్కృతిలోని విషయాలన్నీ తక్కువనీ అనిపించింది. ఈ మేరకు వీరు సాంఘికంగా మితవాదు లనవచ్చు.

## కర్జన్ 'ఘనకార్యాలు'

కర్జన్ 1899 లో వైస్రాయిగా, గవర్నరు జనరల్‌గా భారతదేశానికి వచ్చాడు. భారతదేశాన్ని కేంద్రంగా చేసుకుని తమ సామ్రాజ్యాన్ని బ్రిటిష్ వాళ్ళు బాగా విస్తరింపచేసుకుని మంచి ఉన్నత స్థాయిలోవున్న రోజులవి. కర్జన్ మూర్తీభవించిన సామ్రాజ్యవాది. రాచరిక ఉద్యోగులలో ఉండే నిరంకుశత్వం, దర్పం, అహంకారం అన్నీ అతడిలో పెనవేసుకొన్నాయి. బ్రిటిష్‌జాతి భారతీయులకన్నా గొప్పదని నమ్మేవాడు. భారతదేశాన్ని తమ గుప్పిట్లోనే, అట్టిపెట్టుకోవాలి లేకపోతే బ్రిటిష్ సామ్రాజ్యం మూడోరకం రాజ్యమవుతుందని అతని భయం.

కాంగ్రెస్‌పట్ల కర్జన్ వైఖరి 1900 సంవత్సరంలోనే వెల్లడయింది. "కాంగ్రెస్ కూలిపోడానికి సిద్ధంగావుంది. నేను భారతదేశంలో వుండగా అది శాంతియుతంగా చనిపోయేందుకు సాయపడటమే అన్నిటికన్నా నా పెద్ద కోర్కె" అని అన్నాడు.

సిపాయి విప్లవకాలంలో బ్రిటిష్‌వాళ్ళు యూనివర్శిటీలను నెలకొల్పారు. మళ్ళీ కొన్ని నెలకొల్పడానికి సంసిద్ధమయ్యారు. ఈ విద్యావిధాన ఆశయాలు మెకాలే మాటల్లో చెప్పాలంటే 'రక్తంలోను, రంగులోను, భారతీయులే అయినా, అభిరుచిలో, అభిప్రాయాలలో, నైతిక సూత్రాలలో, మేధస్సులో ఇంగ్లీషు వాళ్ళయివుండే భారతీయుల తరగతిని తయారు చేయడం, వాళ్ళు తమకు ఊడిగంచేసే గుమాస్తాలుగా తయారవడం "

మొదట క్రైస్తవులు తమ ప్రచారంకోసం ఇంగ్లీషు విద్యను ప్రోత్సహించారు. ఆ తర్వాత బ్రిటిష్ ప్రభుత్వ విధేయులను సృష్టించడానికి ఇంగ్లీషును ప్రోత్సహించారు. కాని తీరా ఇంగ్లీషు విద్యధికుల్లో కూడా రాజకీయ చైతన్యం వచ్చేసరికి కంగారు పడ్డారు. బ్రిటిష్ పాలకులు 1904లో యూనివర్శిటీ సంస్కరణలు ప్రవేశపెట్టారు. కర్జన్ నియమించిన యూనివర్శిటీ కమిషన్, బ్రిటిష్ వలస ఉద్యోగుల పెత్తనం కిందకు యూనివర్శిటీ కార్యకలాపాలన్నీ తేవాలని రికమెండ్ చేసింది. సెకండ్‌గ్రేడ్ కాలేజీలను, లా తరగతులను రద్దు చేయాలంది. ట్యూషన్‌ఫీజు హెచ్చించాలని సిఫార్సు చేసింది. సెనేటర్ల సంఖ్యను, వారి పదవీ కాలాన్ని తగ్గించాలన్నది. యూనివర్శిటీకి అనుబంధించే కళాశాలల విషయంలో తీవ్రమైన నిర్బంధాలు సూచించింది. ఈ సంస్కరణల మూలంగా భారతీయులు ఉన్నతవిద్యను అభ్యసించే అవకాశాలు, ఉద్యోగం పొందే అవకాశాలు తగ్గిపోయాయి. జీతాలహెచ్చింపు ద్వారా బీదలు చదువుకునే అవకాశం, గుమాస్తాగిరి లాంటి ఉద్యోగావకాశాలు సన్నగిల్లాయి. భారతీయులకు న్యాయవాద వృత్తిలో ప్రవేశించడానికి అడ్డంకి ఏర్పడింది.

ఈ సంస్కరణలను భారతీయుల అభిప్రాయాలను తీసుకొని చేయలేదు. భారతీయ యూనివర్శిటీలకు వైస్‌చాన్సలర్లను నియమించే అధికారం ప్రభుత్వానిది. కళాశాలలను యూనివర్శిటీలకు అనుబంధించే హక్కు ప్రభుత్వానిది. యూనివర్శిటీలలో ఇంగ్లీషు బోధనా భాషగా వుండాలి. మితవాద కాంగ్రెస్ నాయకులు సైతం యీ విద్యా విధానాన్ని వ్యతిరేకించారు. జాతీయ విద్య బోధించాలనే ఉద్యమం పుంజుకొంది.

స్థానిక స్వపరిపాలన అనే తొలి జాతీయవాదుల ధ్యేయాన్ని కర్జన్ ఖండించాడు. పత్రికా స్వాతంత్ర్యాన్ని హరించాడు. 1910 లో పత్రికా స్వాతంత్ర్యాన్ని నిరోధించే చట్టం అమలులోకి వచ్చింది. రాజద్రోహానికి ఉద్దేశించిన సమావేశాలను నిరోధించే చట్టం 1911 సంవత్సరంలో అమలులోకి వచ్చింది.

ఇండియన్ అఫీషియల్ సీక్రెట్స్ (అమెండ్‌మెంట్) ఆక్టు ద్వారా ప్రభుత్వోద్యోగులను ప్రజల విమర్శ నుండి రక్షించడానికి ప్రయత్నించాడు. విదేశ యాత్రలకు, దండయాత్రలకు భారతీయుల డబ్బును విపరీతంగా ఖర్చుపెట్టాడు.

విక్టోరియా రాణి 1901 జనవరి 22న చనిపోయింది. ఆమె స్మారక భవనాన్ని (విక్టోరియా మెమోరియల్) కలకత్తాలో కర్జన్ నిర్మించాడు. భారతీయులనుండి 'విరాళాలు' కూడా బాగానే వచ్చాయి. విక్టోరియా రాణి పెద్దకొడుకు వేల్సు యువరాజు, ఏడవ ఎడ్వర్డురాజుగా తర్వాత సింహాసనం ఎక్కాడు. ఈ పట్టాభిషేక మహోత్సవాన్ని పురస్కరించుకొని ఢిల్లీలో పెద్ద 'దర్బారు' తలపెట్టాడు. అప్పటికి దేశంలో కరువులు,అంటువ్యాధులు వ్యాపించి ప్రజలు మలమల మాడి చస్తున్నారు. అందుచే 'దర్బారు' విలాసాలకు డబ్బు ఖర్చుపెట్టరాదని దేశంలో ఆందోళన బయలు దేరింది. కరువుల కారణంగా ఇచ్చిన అప్పులపై వడ్డీపై మాత్రం యీ దర్బారు సందర్భంగా కొంత రెమిషన్ ఇచ్చింది ప్రభుత్వం.

కర్జన్ చేసిన 'ఘనకార్యాల'లో మరొకటి కలకత్తా కార్పొరేషన్‌లో భారతీయ కౌన్సిలర్ల సంఖ్యను తగ్గించి, వారు మైనారిటీగా అయేటట్లు చేశాడు. 28 కౌన్సిలర్లు కార్పొరేషన్‌కు రాజీనామా ఇచ్చారు. ఈ చట్టంద్వారా కలకత్తాలో స్థానిక స్వపరిపాలన పూర్తిగా నాశనమైందని సురేంద్రనాథ బెనర్జీ ఖండించాడు. ఈ విమర్శల ఆందోళన ఫలితంగా ఎన్నుకోబడిన సభ్యుల సంఖ్య ఐదింట నాల్గుపాళ్ళు వుండాలని చట్టాన్ని సవరించక తప్పలేదు.

కర్జన్ అహంభావానికి మచ్చుతునక బెంగాల్ ప్రముఖ పత్రికా సంపాదకుడు మోతీలాల్ ఘోష్ పట్ల అతడు ప్రవర్తించిన తీరు తెలియచేస్తుంది

ఘోష్. కర్జన్‌ను చూడటానికి వెళ్ళినపుడు ఆయన్ని వేరే గదిలో కూర్చోబెట్టాడు కర్జన్ ప్రయివేట్ సెక్రటరీ. వీరిద్దరి మధ్య ప్రశ్నోత్తరాల చీటీలను, ఇద్దరికీ అతడు అందించేవాడు. బ్రిటిష్‌వాళ్ళు మెచ్చి ఇచ్చిన బిరుదులు కలవారు మాత్రమే కర్జన్‌తో ముఖాముఖి మాట్లాడే అవకాశం వుంది. అంతేకాదు—

దేశీయ పత్రికలను నిందించుతూ 1902 ఫిబ్రవరిలో కలకత్తా యూనివర్శిటీలో కర్జన్ మాట్లాడాడు. దేశీయ పత్రికలు నమ్మదగినవి కావనీ, అతిశయోక్తులతో పూర్తిగా నిండివుంటాయనీ, ప్రభుత్వానికి దురుద్దేశాలు ఆపాదించుతాయనీ, పూర్తి దూషణలతో కూడి వుంటాయనీ నిందించాడు. పైగా 1905 లో ఇదే యూనివర్శిటీ స్నాతకోపన్యాసంలో, పాశ్చాత్యులే అంటే బ్రిటనే, ప్రాచ్యవాసులకు అంటే భారతదేశానికి నిజం చెప్పడం నేర్పారనే ధోరణిలో మాట్లాడాడు. సత్యసంధత తమదగ్గర నుండే భారతీయులు నేర్చుకొన్నారన్న ఈ మాటలు దేశమంతటా నిరసనకు దారి తీశాయి. తన వారపత్రిక- "పత్రిక"ను ఇంగ్లీషు దినపత్రికగా మార్చి దాన్ని నడుపుతున్న మోతిలాల్ ఘోష్ కర్జన్ ఎలాంటి 'సత్యసంధుడో' బట్ట బయలు చేశాడు. కొరియా వెళ్ళినపుడు, కర్జన్ ఎలా అబద్ధాలాడిందీ అతని పుస్తకంనుండే ఉటంకించాడు. దీనిపై "వీక్లీ టైమ్సు" అనే పత్రిక సత్యం పట్ల యీ మమకారం బహుశా ఆ తరవాతి జీవితంలో కర్జన్ అలవరచుకొని వుంటాడనీ, బహుశా అది యాంకీ (అమెరికా గుణగణం అయివుంటుందనీ ఆక్షేపించింది. (కర్జన్ పెళ్ళాం అమెరికన్ సంతతికి చెందిన వారి) బి పౌరవుద్యోగాలలోఅత్యున్నతపదవికి అర్హులు ఇంగ్లీషు వాళ్ళేకాని భారతీయులు కాదని కర్జన్ వాదన. ఈ త్యహంకారుని దృష్టిలో, "కొంతవరకు ఆనువంశికంగా, కొంతవరకు పెంపకం ద్వారా, కొంతవరకు విద్యద్వారా, చిత్తవృత్తిద్వారా నడవడిక పటిమ ద్వారా" ఇంగ్లీషు వాళ్ళే ఇందుకు అర్హులట. ఈ గుణాలన్నీ ఇందుకు అవసరమట. "భారతదేశ పరిపాలన బ్రిటిష్ వాళ్ళది. అందుచేత మరో రకం పరిపాలన అసాధ్యం. ఈ పరిపాలన స్థాపించినవారు, బాధ్యత వహించేవారు నెలకొల్పిన ప్రమాణంలోనే, ధోరణిలోనే అది వుండాలి." విక్టోరియా రాణి ప్రకటనలోని 'సమానత'ను ప్రస్తావించి ఆ స్థాయికి భారతీయులు ఎదిగినప్పుడే సమానత్వమని కర్జన్ అన్నాడు. "జాతిపరంగానో, ఆనువంశికంగానో కొని అర్హతలు వస్తాయి. అందుచేత, భారతీయులు ఇంగ్లీషు జాతివాళ్ళు కాలేరు గనుక, బ్రిటిష్‌వాళ్ళు భారతదేశాన్ని పరిపాలించి నన్నాళ్ళు, ఇంగ్లీషు వాళ్ళతో మీకు సమానతలేదు పొమ్మ"న్నాడు కర్జన్.

బెంగాలీ పత్రికలు తనను భారతదేశ శత్రువులలో కల్లా పరమ శత్రువని రాస్తున్నాయని, 1903లో తనపై అధికారులకు రాశాడు. తను చేసిన 'ఘన' కార్యాలన్నీ బ్రిటిష్ పాలనను దృఢంగా పాతుకునేట్లు చేయడానికేననీ, భారత స్వాతంత్ర్య దినాన్ని వాయిదా వేయించడమే తన లక్ష్యమనీ కర్జన్ రాశాడు. "నేను సామ్రాజ్యవాదిని. భారతీయుల పాలిట మృత్యువు సామ్రాజ్యవాదం" అని ధీమాగా చెప్పుకున్నాడు కర్జన్. పచ్చి మాంసాహారికూడా బొమికలు మెళ్ళో వేసుకుని తిరగడు. కాని కర్జన్ లాంటి పచ్చి సామ్రాజ్యవాది మాత్రం ఈ బాపతే. అందుకే-సివిల్ అండ్ మిలిటరీ గజెట్ (లాహోర్) - అనే పత్రిక ఆనాటి బ్రిటిష్ రాజనీతిని స్పష్టంగా ఈ క్రింది మాటలలో చెప్పింది. "మన స్త్రీల, పిల్లల, సామ్రాజ్య ప్రయోజనాలకోసం దేశాన్ని కత్తిబలంతో నిలబెట్టుకోవాలి. కత్తి అంచుపదును మొక్కపోకుండా చూడాలి. ప్రాచ్య దేశీయుడు గౌరవించేదల్లా ఒక్క అధికారాన్నే"

ఎంత దురహంకారం !

## వంగ విభజన

కర్జన్ చేసిన ప్రజా వ్యతిరేక చర్యలలో వంగదేశ విభజన అతి తీవ్రమైంది. భారతీయ ప్రయోజనాలకు అత్యంత హానికరమైంది. ఆనాడు వంగవిభజన ద్వారా అతడు నాటిన విషబీజాల ఫలితాన్ని ఇప్పటికీ అనుభవిస్తూనేవున్నాం.

వంగరాష్ట్రం పెద్దది కాబట్టి, పరిపాలనా సౌలభ్యం కోసం విభజించాలనే సూచన 1890 దశకంలోనే వచ్చింది. కాని ప్రజావ్యతిరేకత వల్ల ప్రభుత్వం ఆ ఉద్దేశాన్ని మానుకొంది. 1897లో సాధికారంగా ఆ సూచనను ప్రభుత్వం తిరస్కరించింది. రాష్ట్ర సరిహద్దుల సమస్య పేరిట 1902లో కర్జన్ తిరిగి ఈ ప్రతిపాదనకు ప్రాణం పోశాడు. 1903 సంవత్స

రానికల్లా ఒక పథకం తయారుచేశాడు. ఈ విషయం బయటికి పొక్కగా తీవ్ర నిరసన తెలియజేశారు. వంగ ప్రజలు.

ఇప్పటి వరకూ బెంగాలీ ప్రజలు ఒకటిగా నివసిస్తున్న బెంగాలి రాష్ట్రం కర్జన్ పథకం ప్రకారం రెండు భాగాలవుతుంది.

బెంగాలులోని తూర్పుజిల్లాలైన ఢక్కా, రాజ్‌షాహి, చిటగాంగ్ జిల్లాలు, అస్సాం కలిసి కొత్త రాష్ట్రం ఏర్పడుతుంది. ఇది 'తూర్పు బెంగాల్ – అస్సాం రాష్ట్ర'మని పిలువబడుతుంది. దీని రాజధాని ఢక్కా. మిగతా బెంగాల్‌లో ఒరిస్సా చేర్చబడుతుంది. దీనికి కలకత్తా రాజధానిగా వుంటుంది. ఇది బెంగాల్ రాష్ట్రమని పిలువబడుతుంది.

దాదాపు రెండేళ్లు ఈ పథకానికి తీవ్ర వ్యతిరేకత, ఆందోళన కొనసాగుతూ వచ్చింది రెండు వేలకు పైగా బహిరంగ సభలలో ఈ దుష్ట పథకాన్ని ఖండించారు. తూర్పు బెంగాల్‌కి చెందిన 70 వేల ప్రజలు సంతకాలతో తమ వ్యతిరేకతను తెలియజేశారు. ఈ పథకానికి రెండు ప్రత్యామ్నాయాలను కాంగ్రెస్ నాయకులు సూచించారు. బెంగాల్‌ని ఒకే గవర్నర్ కింద వుంచండి. లేదా బెంగాలీ భాష మాట్లాడే ప్రజల్ని చీల్చకుండా ఈ రాష్ట్రంలోని హిందీ, ఒరియా భాషలు మాట్లాడే ప్రజల్ని వేరుచేయండి.

1904 ఫిబ్రవరి 18న ఢక్కాలో ప్రసంగించినపుడు ఈ పథకాన్ని కర్జన్ ఇంకా విస్తరింపచేశాడు. దీని ప్రకారం బెంగాల్ 15 జిల్లాల్ని వదులుకోవాలి. 7 కోట్ల బెంగాలీ ప్రజల సంఖ్య 5 కోట్ల 40 లక్షలకు తరిగిపోతుంది.

ఐతే ప్రభుత్వం అధికారయుతంగా 1905 జూలై వరకు ఏ ప్రకటనా చేయక మూగనోము పట్టింది. హఠాత్తుగా ఓ రోజున మాత్రం 1905 అక్టోబరు 16 నుండి విభజన అమలులోనికి వస్తుందనీ, ఉత్తర బెంగాల్‌లోని ఆరు జిల్లాలు కొత్త రాష్ట్రంలో చేరతాయని ప్రకటించింది.

పరిపాలనా సౌలభ్యం కోసం అంటూ బ్రిటిష్ ప్రభుత్వం తలపెట్టిన వంగ విభజన అసలు ఉద్దేశం జాతీయోద్యమాన్ని అణచివేయడానికే. "విభజించు–పరిపాలించు" అన్న సూత్రంతో, బెంగాల్‌లోని హిందూ ముస్లింల మధ్య విభేదాలు సృష్టించి తమ పబ్బం గడుపుకోవాలని బ్రిటిష్ వాళ్ళు తలిచారు.

1904 ఫిబ్రవరిలో ఢక్కాలో కర్జన్ ఇచ్చిన ఉపన్యాస సారాంశం ఇది – "కొత్త జిల్లాలతో కూడిన ఈ రాష్ట్రంలో ఢక్కా కేంద్రంగా వుంటుంది. బహుశా రాష్ట్ర ముఖ్యపట్టణం కావచ్చు. ము ంప్రజలది సంఖ్యరీత్యా పై చేయి అవుతుంది. ము ంల సంస్కృతి ఇతరులకన్నా గొప్పది. అంచే వారి వాణికి ఈ రాష్ట్రంలో మొగ్గవుంటుంది ముస్లిం రాజులు, వైస్రాయిల కాలంలో లేని ఐక్యత ఇప్పుడు ఏర్పడుతుంది. మరొకరి కొలువులో వుంటే వారి స్థానిక ప్రయోజనాలు నెరవేరవు ఏ రకం పెరగదు. ముస్లిం నాయకులు భయపడి ఈ అవకాశాలన్నీ త్యాగం చేయాలని సలహా ఇవ్వడం మంచిదేనా? ఈ మంచి అవకాశాన్ని వదలుకొనే గుడ్డివాళ్ళా ముస్లింలు?"

ఇంతకన్నా రెచ్చగొట్టే దుశ్చర్య ఏముంటుంది? తనపై అధికారులకు రాసిన రెండు లేఖల్లో కూడా కర్జన్ అసలు వుద్దేశం నగ్నంగా బయటపడింది.

"బ్రిటిష్ వాళ్ళను తరిమివేసిన తర్వాత బెంగాలీ వాడు, కలకత్తా ప్రభుత్వ గృహంలో తిష్టవేయ చూస్తున్నాడు. ఈ కలను చెదరగొట్టే ఏ చర్యనైనా అతడు తీవ్రంగా నిరసించుతున్నాడు. ఇప్పుడు గనుక మనం బలహీనతతో లొంగిపోయామా, బెంగాల్ రాష్ట్రాన్ని చీల్చి, కుదించలేం. ఇప్పటికే ఈ తూర్పు భాగం బలంగావుంది. భవిష్యత్తులో మనతో పేచీకి మూలంగా వుండే వంగ రాష్ట్రాన్ని విభజించకపోతే, భారత దేశంలోని ఈతూర్పు భాగాన్నిగట్టిపరచి, దృఢపరచినవాళ్ళ మవుతాం."–ఇదీ ఆ ఉత్తరాల సారాంశం.

భారత ప్రభుత్వం హోం శాఖ కార్యదర్శి రిస్లే 1904 డిశంబరులో పంపిన అధికార నివేదికలో ఇలా అన్నాడు–"బెంగాల్ కలిసివుంటే బలంగా వుంటుంది. విభజింపబడితే అక్కడి ప్రజలు దాన్ని తలో మూలకూ లాగుతారు. ఇదీ కాంగ్రెస్ నాయకులు అనుకొనేది. వారి భయాలు పూర్తిగా సరైనవే. ఆ భయాలే ఈ పథకంలో వున్న గొప్ప సుగుణాలు. ఈ పథకంలోని మన ప్రధాన లక్ష్యం, మన పరిపాలనను ప్రతిఘటించే వారు ఒకే జట్టుగా ఉండకుండా చీల్చి. వాళ్ళను బలహీన పరచడమే."

కర్జన్ తర్వాత వచ్చిన లార్డ్ మింటో కూడ వంగ విభజన రాజకీయ కారణాలవల్ల అవసరం అన్నాడు : "బెంగాలీవాళ్ళు మేధావులు. ప్రజాభిప్రాయాన్ని ప్రభావితంచేసే చిలిపితనం, శక్తి వారికుంది. అంచేత బెంగాల రాజకీయ ఆందోళన శక్తిని బలహీన పరచాలంటే, వంగ విభజన అవసరం" —ఇదీ మింటో ఆలోచనా ధోరణి.

వంగ విభజన గురించిన ప్రకటన 1905 జూలై 20న వెలువడింది. 1905 అక్టోబరు 16న విభజన అమలులోకి వస్తుందని ప్రభుత్వం ప్రకటించింది.

బెంగాలీ ప్రజలపై సామ్రాజ్యవాద ప్రభుత్వం విసరిన ఈ సవాలును వెంటనే జాతీయ నాయకులు ఢీ కొన్నారు. కృష్ణకుమార్ మిత్ర ఆ రోజుల్లో బెంగాలులో ప్రజాభిమానం చూరగొన్ననాయకుడు. 'సంజీవని' అనే తన పత్రికలో ఫ్రెంచివిప్లవ నినాదమైన 'స్వాతంత్ర్యం, సమానత, సౌహార్దం' తమ ఆశయంగా ప్రకటించాడు. విదేశీవస్తువులను బహిష్కరించాలని, స్వదేశీవస్తువులను మాత్రమే వాడాలనీ అంటూ ఇలా ప్రకటించాడు— "దేశమాత పేరిట, దేశం కోసం, ఎలాంటి ఇబ్బంది ఎదురైనా, స్వదేశీ వస్తువులు లభ్యమైనప్పుడు, విదేశ వస్తువులను ఎన్నటికీ కొనబోమని శపథం చేద్దాం."

కలకత్తాలోను, చుట్టుపక్కలా జరిగిన అనేక సభలలో విదేశ వస్త్రాలను తీసిపారేశారు. రవీంద్రనాథ టాగూరు తన 'వంగదర్శన్'లో బెంగాలీ ప్రజలు ఐక్యంగా వుండాలనీ, తమ స్వతస్సిద్ధబలంపై ఆధారపడాలనీ, బెంగాలీల ఐక్యతపై సాగిన దాడిని తిప్పికొట్టాలనీ, అందుకు కృత నిశ్చయంతో పనిచేయాలనీ విజ్ఞప్తి చేశాడు. "ప్రభుత్వం మనల్ని విభజించడానికి నిశ్చయించుకొన్నది. కాని మన హృదయాలను విడదీయడం ఎన్నడూ సాధ్యంకాదు. అక్టోబరు 16 న 'రాఖీ'లను కట్టుకుందాం. ఎందుకంటే 'రాఖీ' ఐక్యతకు చిహ్నం." అని అన్నాడు.

ఆగస్టు 7న కలకత్తా టౌను హాలులోను, చుట్టుపక్కలా జనం కిక్కిరిసిన బ్రహ్మాండమైనసభ. ప్రదర్శన జరిగాయి. ఈ సభలో బ్రిటిష్ వస్తు బహిష్కార తీర్మానం ఆమోదించబడింది. బెంగాల్ విభజన వ్యతిరేకోద్యమం మున్నెన్నడూ లేనంత స్థాయికి పెరిగింది. రవీంద్రనాథ టాగూర్ తదితర కవుల దేశభక్తుల గేయాలు ఉద్రూత లూగించాయి. బిపిన్ చంద్రపాల్ చిచ్చుల పిడుగుల్లాంటి ఉపన్యాసాలు ప్రజలను ఉత్తేజ పరిచాయి. పత్రికలనిండా ఇవే గీతాలు, ఇవే ఉపన్యాసాలు

ఇంగ్లిషు వేషభాషలతో ఇదివరదాకా తిరిగిన పెద్దలు తమ ఖరీదైన విదేశ దుస్తులను వదలివేశారు. స్త్రీలు వంటఇళ్లు వదలి ప్రదర్శనల్లో పాల్గొన్నారు. విద్యార్థులు ఊరేగింపులలో, పికెటింగులలో పాల్గొన్నారు. అనేక మంది విలాసవస్తువులను విసర్జించారు. భూస్వాములు, పెద్ద పెద్ద వర్తకులు ఉన్నత వృత్తులలోపనిచేసేవారు అంతా ఈ ఉద్యమ ప్రవాహంలోకి కొట్టుకు వచ్చారు.

వంగ విభజనను, ముస్లింలను స్వాతంత్ర్య ఉద్యమం నుండి దూరం చేయాలనే దుష్ట సంకల్పంతోచేసినప్పటికీ, ప్రముఖ ముస్లిం నాయకులు విభజన వ్యతిరేక ఉద్యమంలో పాల్గొన్నారు. బారిష్టర్ అబ్దుల్ రసూల్, వర్తక ప్రముఖుడు గజ్నవి, ప్రముఖ ప్రచారకుడు లియాకత్ హుస్సేన్ లాంటి వారంతా ఇందులో చేరారు. కలకత్తా పరిసర ప్రాంతాలలో అనేక నూతన సంఘాలు తలెత్తాయి. 'ప్రతి - సమితి' 'వందేమాతరం' 'సనాతన సంప్రదాయ' మొదలైన సంఘాల వలంటీర్లు ఇంటింటికీ వెళ్ళి దేశవాళీ ముతక వస్త్రాలను అమ్మారు.

## శోకదినం

1905 అక్టోబరు 16ను బెంగాల్ అంతటా శోక దినంగా పాటించాలని నిర్ణయించారు. ఆ రోజున ఎవళ్ళూ తమ ఇళ్ళలో పొయ్యి రాజేయకూడదనీ, అందరూ ఆనాడు ఉపవాసం చేయాలనీ నిర్ణయించారు. తెలతెలవారు తుండగానే 'వందేమాతరం' గానంచేస్తూ స్త్రీలూ పురుషులూ వీధుల వెంట తిరిగారు. కనపడ్డ ప్రతివారూ పరస్పరం 'రాఖీలను – పసుపు దారాలను చేతులకు కట్టారు. దీన్నే 'రాఖీబంధన్' (రక్షాబంధనం) అని పిలచేవారు. సోదర భావానికి, సంఘీ భావానికి ఇది చిహ్నం. దేశభక్తిగేయాలను పాడుకొంటూ, వందేమాతరం నినాదాలిచ్చుకొంటూ, కాళ్ళకు జోళ్లు లేకుండా నడుస్తూవెళ్లి గంగా స్నానాలుచేశారు. హిందువులు ముస్లిములు పరస్పరం 'బెంగాలీలంతా ఒకరే' అనే భావం వ్యక్తీకరించడానికి రాఖీలను ఒకరికొకరు

కట్టుకొన్నారు. హర్తాళ్ జరిగింది. ఈ సందర్భంగా ప్రత్యేకంగా రవీంద్రుడు రచించిన 'స్వదేశీ' గేయాన్ని ప్రజలు పాడారు. ప్రజల ఆందోళనకు, ఆగ్రహానికి ప్రతీకగా రవీంద్రుడు తదితరులూ రాసిన గేయాలు నిల్చాయి, మాతృదేశంపట్ల గాఢ ప్రేమను ప్రదర్శించాయి. బెంగాలీ ప్రజల సంఘీభావ బంధాన్ని ఎవరూ తెంచలేరు అనేదానికి చిహ్నంగా 'రాఖీబంధన్' ఉండిపోయింది. వంగ విభజన రద్దు అయేదాకా ప్రతియేటా ఈ ఉత్సవం జరుగుతూనే వచ్చింది. 'రాఖీ బంధన్ పౌర్ణమి' పండుగ ఆచారాన్ని ఈ విధంగా తమ వంగదేశ సమైక్యతకు మరల్చి పాటించారు. । ఈఉద్యమంలో బాధలకు, త్యాగాలకు సంసిద్ధమయ్యారు. 50 వేల మందికి పైగా పాల్గొన్న పెద్ద సభ జరిగింది.

1905 అక్టోబర్ 16 న, 'అవిభక్త బెంగాల్'కు చిహ్నంగా భవనానికి శంకుస్థాపన, బెంగాల్ నాయకుడు ఆనందమోహన్‌బోస్ చేశాడు. దానికి 'ఫెడరేషన్ హాల్' అని పేరు పెట్టారు. ఫ్రెంచి విప్లవ కాలంలోని ఫెడరేషన్ ఉత్సవాలను దృష్టిలో పెట్టుకొని, ఆ విప్లవోత్తేజంతో బహుశా ఈ పేరు పెట్టి వుండవచ్చు. ఆ సభలో బెంగాల్ సమగ్రతను ఎటువంటి పరిస్థితులలోనైనా కాపాడతామని శపథం చేశారు. సాయంత్రం పెద్ద ప్రదర్శన జరిగింది. నేతపని నేర్పడానికి, చేనేత పరిశ్రమకు సాయపడటానికీ డబ్బివ్వవలసినదిగా ఆ సభలో కోరగా, అప్పటికప్పుడు 50 వేల రూపాయలు చందాలిచ్చారు.

ఆనాటి బెంగాల్ నాయకులు, కేవలం ఉపన్యాసాలు, సభలు ప్రదర్శనలవల్ల లాభం లేదనుకొన్నారు. సామ్రాజ్యవాదుల్ని దెబ్బతీసే కార్యాచరణకు సిద్ధం కావాలనుకున్నారు. దానికి మార్గం స్వదేశీ ఉద్యమం, విదేశీ వస్తుబహిష్కార ఉద్యమం అని భావించారు.

స్వదేశీ ఉద్యమం బలపడాలంటే విదేశవస్తు బహిష్కరణ జయప్రదం కావాలి. అందుకనే ఈ రెండు నినాదాలను ఇచ్చారు ఆనాటి నాయకులు. చరిత్రలో ఇవి కొత్తకాని మాట నిజమే. ఒకప్పుడు ఐరిష్‌వారు, మరోసారి చైనావారు విదేశవస్తు బహిష్కరణ నినాదం ఇచ్చారు. అమెరికా తమను వేరుచేసే ఒడంబడికను చేసినందుకుగాను 1905 మే లో అమెరికా దిగుమతులను చైనా నిషేధించింది. ఐతే పూర్వం భారత పరిశ్రమల అభివృద్ధికి ఆర్థికపరమైన నినాదంగా 'స్వదేశీ' ని. ఇదివరలో కొందరు మహారాష్ట్ర, బెంగాల్ ప్రముఖులు ప్రచారం చేశారు, 1870 లో భోలానాథ్ చంద్ర బ్రిటిష్ వాళ్ళపై ఒత్తిడి తెచ్చేందుకు 'బహిష్కరణ,' నినాదం ఇచ్చాడు. 1896 లో తిలక్ 'బహిష్కార' ఉద్యమాన్ని నడిపాడు. ఐతే ఇదివరకు మతపరంగానో, వేదాంతపరంగానో వ్యక్తమైన ఈ నినాదం ఇప్పుడు కొత్త అర్థాన్ని, కొత్త ఉత్తేజాన్ని సంతరించుకొంది. ఆధునిక, ఆర్థిక స్వరూపాన్ని తాల్చింది. "స్వదేశీ వస్తువులు కొనండి." అనే నినాదం దేశీయ పరిశ్రమలలో పెట్టుబడి పెట్టడానికి ప్రోత్సాహం ఇచ్చింది. జౌళిమిల్లులు, జాతీయ బాంకులు, ఇన్సూరెన్సు కంపెనీలు, సబ్బుఫ్యాక్టరీలు, తోళ్ళ పరిశ్రమలు మొదలైనవి నెలకొల్పబడ్డాయి. ఐతే ఇందులో చాలాభాగం నిలబడి జయప్రదం కాలేదు. సుప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు ప్రఫుల్ల చంద్రరాయ్ బెంగాల్ కెమికల్ స్వదేశీ స్టోర్సును నెలకొల్పాడు.

మితవాదులు కొందరు 'బహిష్కరణ'కు అభ్యంతరం చెప్పారు. అందులో గోఖ్లే ఒకడు. తక్షణం జరుగుతున్న అన్యాయాన్ని నివారించడానికి యిది ప్రత్యేక ఆయుధమని సురేంద్రనాథ్‌బెనర్జీ భావించాడు. ఐతే వంగ విభజన రద్దయితే ఆ నినాదం దానంతట అదే అంతరించి పోతుందని అభిప్రాయపడ్డాడు. బ్రిటిష్ పాలకుల జేబుల్లో బొర్రెపడి డబ్బు తగ్గితే కాని, బ్రిటిష్‌వారు భారతీయుల కోర్కెల గురించి ఆలోచించరని లజపతిరాయ్ అభిప్రాయపడ్డాడు తిలక్, బిపిన్ చంద్రపాల్, అరవిందఘోష్‌ల దృష్టిలో బహిష్కార ఉద్యమం బ్రిటిష్ వారిపై ఆర్థిక ఒత్తిడి తెస్తుందనీ అది సామ్రాజ్యవాద వ్యతిరేక రాజకీయ ఆందోళన అనీ, స్వరాజ్యసాధనలో మార్గంగా స్వయం సమృద్ధికి తర్ఫీదనీ భావించారు.

మితవాదులకు, అతివాదులకు ఎలాంటి అభిప్రాయ భేదాలున్నా, తాత్కాలికంగా వాటిని మరచి, స్వదేశీ ఉద్యమంలో ఏకమయ్యారు. ఈ ఉద్యమంలో పాల్గొన్న వారిపై సాగిన నిర్బంధకాండ కూడా మరో రకంగా స్వదేశీఉద్యమాన్ని పెంపొందించింది.

విద్యార్థులను జాతీయోద్యమం నుండి దూరం చేయడానికి ప్రభుత్వం నిషేధాజ్ఞలను జారీ చేసింది.

ప్రభుత్వం జారీచేసిన సర్క్యులర్లకు వ్యతిరేకంగా విద్యార్థులు ఉధృతంగా ఉద్యమంలో పాల్గొన్నారు.

1905 నవంబరు 6 న బోధ్‌చంద్ర మల్లిక్ జాతీయవిద్య అభివృద్ధికి లక్షరూపాయలు విరాళమిచ్చాడు. మైమెన్‌సింగ్ జమీందార్లు కూడా ఇలాగే విరాళాలిచ్చారు. 1906 ఆగస్టు 15 న కలకత్తా టౌను హాలులో జరిగిన సభలో 'జాతీయ విద్యాసమితి' ఏర్పరచబడింది. తూర్పుబెంగాల్‌లోనే 24 జాతీయ పాఠశాలలు ఏర్పడ్డాయి.

1905 అక్టోబరు 16 న ప్రజ్వరిల్లిన ఉద్యమాన్ని చూసిన ప్రభుత్వానికి గంగవెర్రులెత్తింది. తూర్పు బెంగాల్ లెఫ్టినెంట్ గవర్నర్ ఫుల్లర్ నాయకుల్ని పిలిచి బెదిరించాడు. ఉద్యమాన్ని అణచడానికి గూర్ఖా సైన్యాల్ని ఉపయోగిస్తానన్నాడు. 'వందేమాతరం' గేయాన్ని పాడటం నిషేధించాడు.

బంకిం చంద్ర రాసిన ఈ గేయం 'వందేమాతరం' బెంగాల్‌ను మాతృదేవతగా స్తుతించుతూ రాసినప్పటికీ ఒకరకంగా జాతీయగీతంగా అది పరిగణింపబడుతూ వచ్చింది. 'వందేమాతరం' దేశమంతటా జాతీయ వినాదమైంది. ప్రభుత్వం లాఠీలు, తుపాకులు, కొరడా శిక్షలు విధించినా ఉద్యమం ఆగలేదు. పట్టణాలతో జిల్లా కేంద్రాలు పోటీపడసాగాయి అందులో అగ్రగామి బారిసాల్ జిల్లా. బారిసాల్‌లో అశ్వనీకుమార్‌దత్తా, అతని అనుచరులది నాయకత్వం. ప్రజాకవి ముకుంద దాస్ గేయాలతో ఉత్తేజితులైన గ్రామీణ ప్రజలు, ఆ జిల్లా ఉద్యమంలో పాల్గొన్నారు. అశ్వనీకుమార్ దత్తా అభ్యర్థించితే బారిసాల్ పట్టణం యావత్తూ గుమిగూడేది. దీనికి పూర్తివిరుద్ధం ప్రభుత్వాధికారుల అనుభవం. రాష్ట్ర లెఫ్టినెంట్ గవర్నర్ ఫుల్లర్ పడవల కేంద్రాన్ని సందర్శించడానికి వెళ్ళితే, అక్కడ రేవు పనివాళ్ళంతా గైర్ హాజరయ్యారు. ఇంతకన్నా అవమానం ఏం కావాలి బ్రిటిష్ దొరలకు ?

1906 ఫిబ్రవరి 27 న కలకత్తాలో కాలేజి స్క్వేర్‌లో విదేశీ వస్త్ర దహనం జరిగింది. ఇలాగే పలుచోట్ల విదేశీ వస్త్ర దహనాలు జరిగాయి. 1906 ఏప్రిల్‌లో బారిసాల్‌లో బెంగాల్ రాష్ట్ర వార్షిక మహాసభ జరిగింది. ముస్లిం దేశభక్తుడు 'అబ్దుల్ రసూల్' అధ్యక్షత వహించాడు. మహాసభలో 'వందేమాతరం' పాడరాదని సభా నిర్వాహకులకు తెలియజేశారు పోలీసులు. వారంగీకరించారు. ఈ విషయం తెలిసిన ప్రతినిధులు కోపోద్రిక్తులయ్యారు. వారి అంగీకారాన్ని త్రోసిపుచ్చారు. ఏ పరిస్థితులలోనైనా 'వందేమాతరం' పాడతామని చెప్పి. అలాగే ఆ గేయాన్ని పాడుతూ వేదిక వద్దకు వెళ్ళారు. పోలీసులు వారిని చుట్టుముట్టి లాఠీచార్జీ చేశారు. తలలు పగిలాయి. ఐనా మరింత గట్టిగా "వందేమాతరం" పాడారు. వందలాది గాయపడ్డారు. సురేంద్రనాథ బెనర్జీని అరెస్టు చేసి, జరిమానా విధించారు. కోర్టులో ఆయన్ని దొంగలా నిలబెట్టి అవమానపరచారు. జరిమానా చెల్లించి మహాసభకు తిరిగి వచ్చాడు ప్రభుత్వ దమనకాండను ఆ సభలో ఖండించారు. రెండో రోజున "వందేమాతరం" పాడబోమని ప్రతినిధులు హామి ఇవ్వ నిరాకరించినందున సభ జరగలేదు.

"అతివాదం" ఛాయలకు కూడా దాదాపు రాని భూపేంద్రనాథ్ బసు లాంటి ప్రముఖ రాజకీయవేత్త "బ్రిటిషు పరిపాలన అంతానికి ఇది ఆరంభం" అని అన్నాడు.

విదేశీ వస్తు బహిష్కరణ, స్వదేశీ ఉద్యమాలను బలపరుస్తూ బెంగాల్‌లో వేలాది సభలు జరిగాయి. భారతదేశంలోని తదితర ప్రాంతాల్లో కూడ ముఖ్య పట్టణాల్లో సభలు జరిగాయి.

బ్రిటిషు వస్త్రాలను బహిరంగ ప్రదేశాలలో తగలబెట్టారు. బ్రిటిషు వస్త్ర, వస్తు దుకాణాలను పికెటింగ్ చేశారు. మిఠాయి దుకాణాలవాళ్ళు విదేశీ చక్కెరను ఉపయోగించ నిరాకరించారు. విదేశీ వస్తువులతో పూజలు చేయడానికి అర్చకులు నిరాకరించారు. విదేశీ గాజులను, గాజు సామగ్రిని స్త్రీలు బహిష్కరించారు. విద్యార్థులు విదేశీ కాగితం వాడడానికి నిరాకరించారు. బ్రిటిషు పరిశ్రమలతో సంబంధం వున్న వ్యక్తులను అభిమానించడం డాక్టర్లు, లాయర్లు మానివేశారు. రోగులు కొందరు ఎట్టి ఫలితానికైనా సిద్ధపడి బ్రిటిషు మందుల వాడకాన్ని మానివేశారు. బారిసాల్ లాంటి పట్టణాలలో వర్తకులే ఐచ్ఛికంగా విదేశీ ఉప్పును బజార్లలో పారేశారు. విదేశీ వస్త్రాలను తగలబెట్టడానికి వలంటీర్లకు యిచ్చారు. ఇది ప్యూనిటివ్ పోలీసుల ఆగ్రహానికి గురి చేసింది కూడా. ఈ ఉద్యమం జాతీయ పోరాట స్వరూపాన్నే మార్చివేసింది. కులమత ప్రసక్తి లేకుండా ప్రజలు ఉద్యమంలో

పాల్గొన్నారు. పత్రికలు నిర్భయంగా రాయడం మొదలుపెట్టాయి. విద్యార్థులు తిరగబడజొచ్చారు. రాజకీయ ఆర్థిక పరిస్థితుల గురించి ప్రజలు ఆలోచించ మొదలుపెట్టారు భయం పోయింది. ప్రభుత్వాన్ని ధిక్కరించడానికి, లాఠీదెబ్బలు తినడానికి, జైళ్ళకు వెళ్ళడానికి, అవసరమైతే దేశసేవలో ఉరికంబాలను కౌగలించుకోడానికి సంసిద్ధులయ్యారు.

బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమం క్రొత్త మలుపును తెచ్చిపెట్టిందని గాంధీజీ అభిప్రాయపడ్డాడు. ఈ ఉద్యమం దాదాపు "హోంరూల్" [స్వపరిపాలన] కోర్కెతో సమానమని అన్నాడు. ఇదివరకు దాకా మన కోర్కెలను బ్రిటిషు సింహాసనాధిపతులకు విన్నవించుకొనడం, వారు అవి తీర్చకపోతే మెదల కుండా కూర్చోడమో, లేక మరోసారి విజ్ఞాపన పత్రాలు సమర్పించడమో చేసేవారమనీ, యిపుడా పరిస్థితి మారిపోయిందనీ గాంధీజీ అన్నాడు. విజ్ఞాపన పత్రాలకు తోడుగా బలం కూడా ప్రదర్శించాలనీ, బాధలు పడడానికి సిద్ధపడాలనీ యీ నూతన భావం ఈ ఉద్యమ ఫలితంగా వచ్చిందని గాంధీజీ అన్నాడు. ఈ నూతన భావం గురించి గాంధీజీ యిలా వివరించాడు.

"పత్రికలు నిర్మొహమాటంగా రాయడంలో యీ భావం వ్యక్తమవుతున్నది. భయపడుతూ, వణుకుతూ, గుసగుసలాడుకుంటూ చెప్పుకొనే మాటల్ని బహిరంగంగా అంటున్నారు. బాహాటంగా రాస్తున్నారు. ఇంగ్లిషువాళ్ల ముఖం చూడగానే పరుగెత్తే ప్రజలు—పిలూ పెలూ కూడ—ఇపుడేం భయపడటం లేదు. ఘ ఐకు లుకు పోడానికి ప్రజలు భయపడటం లే . కేవలం విజ్ఞాపన పత్రాలు పెట్టుకోడానికీ దీనికీ తేడా వుంది. బెంగాల్‌లో ప్రభవించిన ఈ భావం ఉత్తరాన పంజాబు నుండి దక్షిణాన కన్యాకుమారి వరకూ వ్యాపించింది,"

బెంగాల్‌లోని స్వదేశీ వుద్యమం కాంగ్రెసులోనూ, బయటా అతివాద భావజాలానికి దారితీసింది. ఇతర రాష్ట్రాలలోని అతివాదులలో మైత్రీ సంబంధాలు పెరిగాయి. 1906 జూన్‌లో కలకత్తాకు తిలక్ వచ్చాడు. శివాజీ ఉత్సవాలు ఘనంగా జరిగాయి. అపుడే 'స్వదేశీ మేళా' జరిగింది. 'స్వదేశీమేళా' [ఎగ్జిబిషన్] తిలక్ ప్రారంభించాడు. పంజాబ్ కేసరి లజపతిరాయ్ కూడా వచ్చాడు. తిలక్ నాయకత్వాన ప్రదర్శకులు గంగా నదిలో స్నానం చేసి వచ్చారు. మతపరమైన ప్రభావం ఉన్నప్పటికీ ఈ ఉద్యమంలో సమరశీల సామ్రాజ్య వాద వ్యతిరేకత సుస్పష్టమే.

యువజన ఉత్సవాలు "వీరాష్టమి" ఉత్సవాలుగా సరళాదేవి అనే ఆమె ప్రారంభించింది.

వంగ విభజన ప్రతికూల వుద్యమం 1912 వరకు ముమ్మరంగా సాగింది. బెంగాల్‌కే పరిమితం కాక, ఇతర రాష్ట్రాలకు పాకింది ప్రభుత్వ దమనకాండ కూడా నానాటికీ తీవ్రమైంది. బెంగాల్లో 1906-1909 మధ్య 550 కేసులు పెట్టింది ప్రభుత్వం. యుగాంతర్, సంధ్య, అరవిందుని "వందేమాతరం" పత్రికల రాతలకు ప్రభుత్వం హడలిపోయింది. 1907 లో రాజ ద్రోహ సభల చట్టం ప్యాసయింది. మూడేళ్ళకని ఉద్దేశించబడిన యీ చట్టాన్ని 1911 లో తిరిగి ధృవీకరించింది. పత్రికా స్వాతంత్ర్యాన్ని హరించే కఠినమైన చట్టాలు 1908, 1910 లో వచ్చాయి. ప్రేలుడు పదార్థాల చట్టం 1908లోను క్రిమినల్ లా ఎమెండ్‌మెంటు ఆక్టు 1913 లోను వచ్చాయి.

పంజాబ్‌లో లాలా లజపతిరాయ్ అజిత్ సింగ్ లపై ఎట్టి విచారణా లేకుండానే ప్రవాస శిక్ష విధించారు, "వందేమాతరం" పత్రిక అప్పుడిలా రాసింది—

"పంజాబీయులారా! సింహంలాంటి జాతీయులారా! మిమ్మల్ని మట్టిలో అణగదొక్క చూస్తున్న బ్రిటిష్ వాళ్ళకు ఒకవిషయం తెలియచేయండి. ఒక లజపతిరాయ్‌ని మీనుండి తీసికెళ్ళితే, వందమంది ఆయన స్థానంలో ఉద్భవిస్తారని చెప్పండి. మీ యుద్ధ నినాదం "జై హిందుస్తాన్"ను వంద రెట్లు బిగ్గరగా వారి చెవులలో మారోగనివ్వండి."

బెంగాల్‌లో 1908 లో తొమ్మిది మంది నాయకులను విచారణ లేకుండా డిటెయిన్ చేశారు. బీహార్‌లోని ముజఫర్ పూర్‌లో ఒక బాంబు కేసు సందర్భంగా 'కేసరి' పత్రికలో ప్రచురించిన రెండువ్యాసాలకుగాను తిలక్‌కు ఆరేళ్ళ శిక్ష విధించబడింది. మద్రాసులో చిదంబరం పిళ్ళెను అరెస్టు చేశారు, భారతదేశాని' షరతులులేని స్వాతంత్ర ం కావాలనడమే ఆయన నేరం. ఆయన అరె . వార్తవిని తూత్తికోరిన్, తిన్నవెల్లి పట్టణాలలో మైన అల జడి ప్రారంభమయింది. ప్రజలపై పోలీసులు

తుపాకుతు కాల్చారు. తిన్నవెల్లిలో కాల్పులకు ఆర్డరిచ్చిన ఆష్ అనే అతనిని, వాంచి అయ్యర్ అనే అతను హత్యజేసి ,ఆత్మహత్య చేసికొన్నాడు. ఇతడు "భారతమాత" సంఘానికి చెందిన వాడు. ఆంధ్ర దేశంలో గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారిని, మరి కొందరిని అరెస్టు చేసింది ప్రభుత్వం.

1905 సెప్టెంబరులోనే మద్రాసులో జి. సుబ్రహ్మణ్య అయ్యర్ అధ్యక్షతను సముద్రవు వొడ్డున జరిగిన సభలో బెంగాల్ జాతీయోద్యమాన్ని బలపరుస్తూ తీర్మానించారు. ఆనాడు విద్యార్థులుగాఉన్న అయ్యదేవర కాళేశ్వరరావు, గాడిచర్ల హరి సర్వోత్తమరావు, గొల్లపూడి సీతారామశాస్త్రి, చక్కరయ్య చెట్టి, తమిళ మహాకవి సుబ్రహ్మణ్య భారతి, ఆ సభలో పాల్గొని స్వదేశీవ్రతం స్వీకరించారు. స్వదేశీ పరిశ్రమలను నేర్చుకొనే విద్యార్థుల సహాయార్థం దీపావళి పండుగ సందర్భంగా దీపావళి భిక్షను వసూలు చేశారు.

విజయవాడలో పింగళి లక్ష్మినారాయణగారు స్వదేశీ విక్రయశాల స్థాపించి 1909 వరకు నిర్వహించారు. 1906లో కాంగ్రెస్ ప్రతినిధిగా వీరు కలకత్తా వెళ్ళారు. సింపుర్ ఫ్లయ్ షటిల్ అనే కొత్తరకం నేత మగ్గాల ఫ్యాక్టరీని పెంచి, ఆంధ్రదేశంలో వ్యాప్తిచేశారు. పడుగుపో యంత్రాన్ని కనిపెట్టారు.

1907 లో బెంగాల్ నాయకుడు బిపిన్ చంద్రపాల్ విశాఖపట్నం, విజయనగరం, కాకినాడ, రాజమండ్రి, విజయవాడ, మచిలీపట్నం మొదలయిన నగరాలలో పర్యటనచేసి స్వదేశీ, జాతీయ విద్య ఉద్యమాలకు పరిపుష్టి సమకూర్చాడు.

జపానులో స్వదేశీ పరిశ్రమలలో శిక్షణ పొందడానికి వేళ్ళే విద్యార్థులకు చందాలు వసూలు చేశారు. 1906 లో సురేంద్రనాద్ బెనర్జీ అరెస్టు అయినపుడు గుత్తి, రాజమండ్రి, కాకినాడ, విజయనగరాలలో నిరసన సభలు జరిగాయి. మహారాష్ట్ర, బెంగాల్‌లో లాగానే 1906లో శివాజీఉత్సవాలుఆంధ్రలో జరిగాయి. రాజమండ్రిలో "బాలభారత సమితి" ఏర్పడింది. విద్యార్థులు "వందేమాతరం" బాడ్జీలతో క్లాసులకు హాజరయ్యేవారు. రాజమండ్రి ప్రభుత్వ ఆర్ట్సు కాలేజీకి, ట్రైనింగు కళాశాలకు కూడ మార్క్ హంటర్ ప్రిన్సిపాల్‌గా వుండేవాడు. రాజకీయాలలో పాల్గొనే విద్యార్థులను హంటర్ బెదరించుతూ వుండేవాడు.

ట్రైనింగు కళాశాలలో చదువుతున్న గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు, బిపిన్ చంద్రపాల్‌కి వీడ్కోలిచ్చే సభలో పాల్గొన్నారు. ఆయన ఉపన్యాసాలను మెచ్చుకొన్నారు వారి సందేశాలకు అనుగుణంగా నడుచుకొంటామని ఒక వుపన్యాసం చదివారు. ఏప్రిల్ 24 న ఆర్ట్సు కళాశాలలో వందేమాతరం బాడ్జీ ధరించి పరీక్షలు రాశారు. ప్రిన్సిపాల్ గదిలో వందేమాతరం నినాదం చేశారు. బాడ్జీలను తీసివేయవలసిందిగా ప్రిన్సిపాల్ చేసిన హెచ్చరికను మొదట ఎవరూ ఖాతరు చేయలేదు. హరిసర్వోత్తమరావు గారిని డిస్మిస్ చేశాడు హంటర్. కొందరు విద్యార్థులను సస్పెండ్ చేశాడు. మొత్తం 13మందివిద్యార్థులు ఈ సందర్భంలో దెబ్బతిన్నారు. కృష్ణా, హిందూ పత్రికలు హంటర్ చర్యను ఖండించాయి. అలా విద్యార్థి ఉద్యమంనుండి జాతీయ ఉద్యమంలోకి హరి సర్వోత్తమరావు గారు ఎదిగారు.

గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు సంపాదకులుగా, బోడి నారాయణరావుగారు ముద్రాపకులుగా, పింగళి లక్ష్మి నారాయణగారు అధిపతిగా "స్వరాజ్య పత్రిక" నెలకొల్పబడింది. ఈ పత్రిక ప్రభుత్వ చర్యలను విమర్శించుతూ వచ్చింది ప్రభుత్వం జూలై 13 వ తేదీన హరిసర్వోత్తమరావుగారిని, నారాయణరావు గారిని అరెస్టు చేసింది. మచిలీపట్నంలో విచారణ జరిపి ఆరేసి నెలలు కఠిన శిక్ష విధించారు. శిక్ష చాలదని ప్రభుత్వం అప్పీలు చేయగా గాడిచర్ల వారికి మూడేళ్ళకు శిక్ష పెంచారు. పింగళి లక్ష్మి నారాయణ, వీరమల్లయ్యగారలకు అరెస్టు వారంట్లు పుట్టాయి. పింగళి లక్ష్మినారాయణ ఫ్రెంచి ఇండియా భాగమైన పుదుచ్చేరికి తప్పించుకుపోయాడు. 1912లో ప్రభుత్వం రాజకీయ ఖైదీలను విడుదల చేసిన తర్వాతనే లక్ష్మి నారాయణగారు విజయవాడ రాగలిగారు. అంతవరకూ అరవింద్ ఘోష్, సుబ్రహ్మణ్యభారతిలతో పుదుచ్చేరిలో గడిపారు. స్వరాజ్యపత్రిక ఆకారణంగా 16 సంచికలు మాత్రమే వచ్చిన తర్వాత ఆగిపోయింది. ముట్నూరు కృష్ణారావుగారిపై అరెస్టు వారంటు రాగా ఆయన కృష్ణాపత్రిక సంపాదకత్వానికి రాజీనామా ఇచ్చారు. చిల్లరిగె శ్రీనివాసరావుపై అరెస్టు

వారెంటు రాగా ఆయన నడిపే "నవయుగ" పత్రిక నిలిచి పోయింది. మద్రాసులో తెలుగులో జాతీయోద్యమం గురించి ఉపన్యసించిన యతిరాజ్ సురేంద్రనాధ్‌కు జైలు శిక్ష పడింది.

1907 మే 31 న కాకినాడలో జిల్లా వైద్యశాఖాధికారి కెప్టెన్ కెంప్ వీధివెంట వెళుతుండగా "వందే మాతరం" అని కొందరు - లు అరిచారు. "కోపల్లె కృష్ణారావు" అనే అతన్నిప కొని కెంప్ చావబాదాడు. కోపోద్రేకులైన ప్రజలు ఆ కెంప్ వున్న క్లబ్‌కు వెళ్ళి దాన్ని పరిచాడు. పోలీసు బలగంతో అక్కడికి వచ్చిన కలె ర్‌కు కూడా దెబ్బలు తగిలాయి. ఈ విషయంపై జూ 5 న జరిగిన ఒక సభలో కొందరు పురప్రముఖులు పై సంఘటనలకు విచారం వెలిబుచ్చుతూ తీర్మానం చేశారు కాని స్థానికకళాశాల ప్రిన్సిపాల్, రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు మరో తీర్మానం ప్రవేశపెట్టారు.అందులోకె.ప్చర్యవల్లనే ఈ గొడవ ప్రారంభమైందనీ మామూలు పరిస్థితులు నెలకొనేందుకు ప్రజలు సహకరించాలనీ కోరారు. ఐనా ప్రభుత్వం 50 మందిని అరెస్టు చేసింది. అందులో కొందరు కార్మికులున్నారు. వారికి సానుభూతిగా కార్మికులు సమ్మె చేశారు. రేవు పని స్తంభించింది. ప్రభుత్వాధికారులు మరెవరనీ అరెస్టు చేయబోమని హామీ ఇచ్చిన తర్వాత సమ్మె విరమణ జరిగింది. అదనపు పోలీసులు వచ్చారు. 7 వారాలు కాకినాడ ఉద్రిక్త, భయానక వాతావరణంలో వుంది. నవంబరు నాటికిగాని వారిని ప్రభుత్వం తొలగించలేదు. అరెస్టయిన వారికి విరుద్ధంగా సాక్ష్యమివ్వడానికి ఎవరూ రాకపోతే పోలీసు జులుంతో సాక్ష్యమిప్పించారు. 13 మందికి శిక్షలు విధించారు. చివరకు కెంప్ చేతిలో దెబ్బలు తిన్న కృష్ణారావు 100 రూపాయల నష్టపరిహారం పొందాడు. కాకినాడ ఘటనలకు బిపిన్ చంద్రపాల్ అదివరలో ఇచ్చిన ఉపన్యాసాలే కారణమని ప్రభుత్వం ఆరోపించింది.

ఇలాగే ఇతర రాష్ట్రాలలో కూడ నిర్బంధకాండ కొనసాగింది. 1908 జూ 13 న తిలక్‌కు ఆరేళ్ళ శిక్ష విధించబడింది. బర్మా లోని మాండలేలో దాదాపు ఒంటరి కొట్టు జైలు జీవి ం గడిపాడు. పంజాబులో లాలా లజపతిరాయ్, సర్దార్ అజిత్‌సింగ్‌లకు ప్రవాస శిక్ష విధించారు. బెంగాల్‌లో "యుగాంతర్" పత్రికా సంపాదకుడు భూపేంద్రనాధ్ దత్తుకు దీర్ఘకాల శిక్ష విధించబడింది. ఈయన స్వామి వివేకానంద సోదరుడు. ఆయన శిక్షను విని, తల్లి ఆనందం వ్యక్తపరచగా అనేక మంది మహిళలు వెళ్ళి, ఆమెను అభినందించారు. "సంధ్య" సంపాదకుడు బ్రహ్మబాంధవోపాధ్యాయ విచారణ జరుగుతుండగా ఆస్పత్రిలో మరణించాడు. అరవిందఘోష్ మూడు కేసుల్లో చిక్కుకొని, చివరకు పుదుచ్చేరి వెళ్ళి, ఆశ్రమం స్థాపించుకొన్నాడు.

యుగాంతర్, సంధ్య, వందేమాతరం పత్రికలు నిషేధింపబడ్డాయి. 1909 లో సర్వ సేనాని లార్డ్ కిచ్నర్ మార్షల్‌లా ప్రకటించమని సలహా ఇచ్చాడంటే నిర్బంధ విధానం ఎంత తీవ్రంగా వుందో వూహించవచ్చు. భారత రాజ్యాంగ కార్యదర్శి లార్డ్ మోర్లే 1908 జూలై 14 న లార్డ్ మింటోకు ఇలా రాశాడు.

"రాజకీయ ద్రోహానికి విధించే భీతావహమైన శిక్షలను తీవ్ర ఆందోళనతోను, నేరపుతోను, గమనించుతున్నానని మీముందు ఒప్పుకుతీరాలి. భద్రత (ఆర్డరు) ఉండాల్సిందే. కాని అందుకు మార్గం అత్యంత కాఠిన్యం (నిర్బంధం) కాదు. పైగా ఆ కాఠిన్యం (నిర్బంధం) బాంబుకు మార్గం."

ఆ "బాంబు మార్గానికి" తోడ్పడింది ప్రభుత్వ దమనకాండే. ఒక ప్రక్క రహస్య విప్లవ(టెర్రరిస్టు) కార్యకలాపాలు, బ్రిటిష్ అధికారుల హత్యలు తీవ్ర సంచలనం కల్గించుతుండగా అనేక పరిణామాలు జరిగాయి.

భారత సర్వ సేనానికి, వైస్రాయికి లాగానే సమన్వయాధికారం వుండరాదని కర్జన్ అభ్యంతరం తెలిపాడు. దీనికి లండన్‌లోని సామ్రాజ్య ప్రభుత్వం అంగీకరించలేదు. కర్జన్ 1905 సెప్టెంబర్‌లో రాజీనామా చేశాడు. ఆ తర్వాత లార్డ్ మింటో వైస్రాయి అయ్యాడు. తీవ్ర నిర్బంధ చట్టాలనేకం అతడు ప్రవేశపెట్టాడు. "ఆగే లాఠీ, పీఛే బాత్" - మొదట లాఠీ తర్వాత సంప్రతింపులు-అనేది అతని సిద్ధాంతం. ఆ సిద్ధాంతమే "బాంబు మార్గాన్ని" సుగమం చేసింది.

ఈలోగా జాతీయ కాంగ్రెస్‌లో కొత్తపరిణామాలు సంభవించాయి. వంగ విభజనను కాంగ్రెస్‌లోని అతివాదులు, మితవాదులు వ్యతిరేకించారు. ఆ రోజుల్లో

మితవాద నాయకుడు గోఖ్లే కాంగ్రెస్‌కు అధ్యక్షుడు. భారతీయులను సానుభూతితో చూడవలసిందిగా బ్రిటిష్ ప్రభుత్వాన్ని అభ్యర్థించడానికి గోఖ్లే లండన్ వెళ్ళాలని నిశ్చయింపబడింది. కాని గోఖ్లే యాత్ర నిష్ఫలమైంది. కాంగ్రెస్‌లో అతివాద, మితవాద చీలిక మరింత లోతుకుపోయింది. కలకత్తాలో 1906 లో జరిగిన కాంగ్రెస్‌కు దాదాభాయ్ నౌరోజీ అధ్యక్షుడు. 81 ఏళ్ళ వృద్ధుడైన నౌరోజీ ఇంగ్లండు నుండి ప్రత్యేకంగా ఇక్కడికి వచ్చాడు. అధ్యక్షుడుగా ఉభయ వర్గాలకు ఆయనే ఇష్టుడయ్యాడు.

కలకత్తా కాంగ్రెస్, దేశ రాజకీయ వాతావరణ ప్రభావాన్ని తెలియచేస్తుంది. మొట్టమొదటి సారిగా కాంగ్రెస్ ధ్యేయం "స్వరాజ్యం" అని నిర్వచించింది. స్వరాజ్యం అంటే అప్పటి అవగాహన ప్రకారం — "స్వయం పాలిత బ్రిటిష్ వలస దేశాలలో వున్న లాంటి ప్రభుత్వ పద్ధతి" యే.

ఐతే 1907 లో సూరత్‌లో జరిగిన కాంగ్రెస్ మహా సభలో ఈ చీలిక మరింత విస్తరించింది. మొదట నాగపూర్‌లో జరగాల్సిన మహాసభ సూరత్‌కు మార్చబడింది. కాంగ్రెస్ అధ్యక్షుని ఎన్నికకై వివాదం వచ్చినపుడు కొందరు 'లాలాలజపతిరాయ్' పేరు సూచించారు. కాని ఆయన అందుకు అంగీకరించలేదు. అతివాదులు తిలక్ పేరును, మితవాదులు డాక్టర్ రసబిహారి ఘోష్ పేరును సూచించారు. సభలో గందరగోళం ఏర్పడింది. 1907 డిసెంబర్ 27 వ తేదీన ప్రారంభమైన ఈ సమావేశం మరునాటికి వాయిదా పడింది. మరునాటి సభలో ఘోష్‌ను అధ్యక్షుడుగా బలపరుస్తూ సురేంద్రనాధ్ బెనర్జీ ఉపన్యసించాడు. తిలక్ ముందుగా చీటీ పంపినప్పటికీ ఉపన్యసించడానికి అవకాశమివ్వలేదు. ఉపన్యసించడానికి గల తన హక్కును వినియోగించుకోవడానికై తిలక్ వేదిక వద్దకు వెళ్ళాడు. కాని తిలక్‌ను మాటాడనీయలేదు. సభలో గందరగోళమేర్పడింది. ఒక చెప్పు సురేంద్రనాధ్ బెనర్జీని రాచుకుని సర్ ఫిరోజిషామెహతాకు తగిలింది. కర్రలు పుచ్చుకొని తిలక్‌పై సభికులు దాడిచేయ ప్రయత్నించినపుడు గోఖలే అడ్డుపడి నిలిచాడు. అతివాదులే ఈ చెప్పులు విసిరారని, ఆ రోజుల్లో భావించారు. కాని మితవాద నాయకుడు యం.ఆర్. జయకర్ కథనం ప్రకారం మితవాద ప్రతినిధి ఒకరు ఈ చెప్పును తిలక్‌పైకి విసిరాడట. జి.యస్. ఖపార్డే డైరీ కూడా ఇదే అంశాన్ని బలపరచింది. అతివాదులు కాంగ్రెస్‌లో వున్న పక్షంలో ప్రభుత్వం కాంగ్రెస్‌ను నిషేధించుతుందనే భయం మితవాదులకు ఏర్పడింది. కొందరు రాజీకి ప్రయత్నించినా వారు వినలేదు. 1908 లో కలకత్తాలో అతివాదులు సమావేశమై, తాము కాంగ్రెస్‌లో ఎందుకు చేరడంలేదో వివరిస్తూ ఒక ప్రణాళికను ప్రకటించారు. తిరిగి 1916కు గాని వీరు కాంగ్రెస్‌లో చేరలేదు.

కాంగ్రెస్‌లోని ఈ చీలిక ప్రభుత్వానికి చక్కటి అవకాశం ఇచ్చింది. మితవాదులను దగ్గరకు రాబట్టడానికి శాసన సంస్కరణలను ప్రభుత్వం ప్రవేశపెట్టింది. అవే మోర్లే-మింటో సంస్కరణలు. 1909లో వీటిని ప్రవేశపెట్టారు.

ఈ సంస్కరణలను అనుసరించి, గవర్నర్ జనరల్ కార్యనిర్వాహక సమితిలో ఒక భారతీయుడు వుంటాడు. అలాగే రాష్ట్ర కార్య నిర్వాహక సమితిలో కూడ ఆయా రాష్ట్రాలలో ఒక భారతీయుడు వుంటాడు. కేంద్ర కౌన్సిల్‌కు, రాష్ట్ర శాసన కౌన్సిళ్ళ సభ్యుల సంఖ్య పెంచబడింది. ఎప్పుడూ అధికార సభ్యులకే మెజారిటీ వుంటుంది. 60 మంది సభ్యులలో 27మందికే ఎన్నిక లుంటాయి. ఆ ఎన్నికల విధానం కూడ చాలా సంకుచిత పద్ధతులపై జరుగుతుంది. రాష్ట్ర శాసన సభల్లో అనధికార సభ్యులకు మెజారిటీ వుంటుంది. కాని నామినేటెడ్ సభ్యులు ఎప్పుడూ ప్రభుత్వం తరఫునే వోటు చేసేవారు. కేంద్ర శాసనసభ వోటర్లు మూడు రకాలుగా వుంటారు. 1. రాష్ట్ర శాసన కౌన్సిళ్ళలోని అనధికార సభ్యులు—వీరు సాధారణ వర్గం. 2. ముస్లిములు, భూస్వాములు మొదలైన వర్గం. 3. విశ్వవిద్యాలయాలు, వాణిజ్యమండలి మొదలైన ప్రత్యేక వర్గం. రాష్ట్ర కౌన్సిళ్ళలోని అనధికార సభ్యులలో ఎక్కువ భాగాన్ని స్థానిక సంస్థలు, భూస్వాములు, వర్తకులు, యూనివర్శిటీలు ఎన్నుకుంటాయి. ముస్లిములకు, భూస్వాములకు, యూరోపియన్ పెట్టుబడిదారులకు రిజర్వు సీట్లు వుంటాయి. స్త్రీలకు ఓటు లేదు. రాజకీయంగా 'నమ్మదగని' వ్యక్తిని గవర్నర్లుగాని, గవర్నర్ జనరల్‌గాని ఎన్నికకు అనర్హునిగా ప్రకటించవచ్చు.

శాసనసభల హక్కులు స్వల్పం. ప్రశ్న అడిగిన వారే అనుబంధ ప్రశ్న వేయవచ్చు. దిగుమతులు, ప్రజా ప్రయోజన విషయాలు, సైన్యం, స్వదేశ సంస్థానాల లాంటివి-వీటిపై చర్చించే హక్కు శాసనసభలకు లేదు. బడ్జెటులో వేర్వేరు పద్దులపై చర్చ. వోటింగు అనుమతించినా, మొత్తం బడ్జెట్ పై వోటుచేసే హక్కు లేదు. ఒక్కమాటలో చెప్పాలంటే - ఇవి సలహా సంఘాలే కాని అధికార శూన్య సంఘాలు. ఉదారంగా లేకపోయినా, నిజమైన సంస్కరణలేనని మితవాదులు తృప్తిపడ్డారు. అతివాదులు వీటిని తిరస్కరించారు. కాంగ్రెస్ పార్టీ మొత్తంగా మత ప్రాతిపదికపై ఎన్నికలను తిరస్కరించింది. ఇవే ఆఖరు సంస్కరణలనీ, భారతదేశంలో పార్లమెంటరీ వ్యవస్థ ఏర్పరచడం తమ ప్రభుత్వ లక్ష్యంకాదనీ - మోర్లే ప్రకటించడంతో ఈ సంస్కరణల బూటకత్వం బయటపడింది.

హిందూ ముస్లిం విభేదాలకు బీజంవేసి, ఎఫణించి పరిపాలించాలనే దుష్ట పథకంలో ఒక భాగమే ఈ సంస్కరణలు.

1910 సంవత్సరాంతంలో లార్డ్ హార్డింజ్ భారతదేశ వైస్రాయిగా వచ్చాడు. అప్పుడు ప్రపంచ యుద్ధ వాతావరణం నెలకొనివుంది. భారతదేశ సహాయ సహకారాలు అవసరమని బ్రిటిష్ ప్రభుత్వం భావించింది. వంగ విభజనవల్ల ప్రజ్వరిల్లిన అశాంతిని చల్లార్చాలని లార్డ్ హార్డింజ్ తలిచాడు. 1911 డిసెంబర్ 11న ఢిల్లీలో పంచమ జార్జి చక్రవర్తి, మేరీరాణిల దర్బారు ఉత్సవాన్ని పురస్కరించుకొని, బెంగాల్ విభజనను రద్దు పరచాలని నిర్ణయించారు. దర్బారు వుత్సవాలు పెద్ద ఆడంబరాలతో జరిగాయి. ఈ దర్బారులోనే బెంగాల్ విభజనను రద్దుచేశారు. ఐతే తమ పరువు కాపాడుకోడానికి బెంగాల్‌ను పునర్వ్యవస్థీకరించారు. భారత రాజధాని కలకత్తా నుండి ఢిల్లీకి మార్చబడింది. బెంగాల్ ఒక రాష్ట్రంగాను, బీహారు ఒరిస్సాలు మరో రాష్ట్రంగాను, అస్సాం ఇంకొక రాష్ట్రంగాను ఏర్పడ్డాయి. ఒకప్పుడు మోర్లే బెంగాల్ విభజన తిరుగులేని శాశ్వత నిర్ణయంగా పేర్కొన్నాడు. కాని ఆ నిర్ణయాన్ని ప్రజా ఉద్యమ ప్రభావంగా తిరగతోడక తప్పలేదు.

# వ్యక్తిగత విప్లవ వాదంలు - రహస్య విప్లవ సంఘాలు

1857 స్వాతంత్ర్య సమరం విఫలమైనా, అది భారతీయులపై చెరగని ముద్ర వేసింది. ఆనాడు బ్రిటిష్ ప్రభుత్వ అమానుష హత్యాకాండ, ప్రతీకార జ్వాలల్ని రగుల్కొల్పింది. విదేశీ దుష్పరిపాలనను అంత మొందించడానికి, అవసరమైతే బలప్రయోగమైనా చేయాలనే ఆలోచనా ధోరణి యువకుల్లో కలిగింది. పైగా, మితవాదుల ధోరణి వారికి విసుగు పుట్టించింది. ప్రపంచంలోని వివిధ దేశాలలో జరిగే రాజకీయ హత్యలు కూడా వారిని ఉత్సాహపరిచాయి. రష్యా, ఇటలీ చక్రవర్తుల హత్యలు, ఆస్ట్రియా మహారాణి ఎలిజబెత్ హత్య, స్పెయిన్ ప్రధాని హత్య, ఫ్రెంచి అధ్యక్షుడు కార్నాట్ హత్య, రష్యన్ అంతరంగిక శాఖా మంత్రి హత్య, ఫిన్లాండ్ గవర్నర్ జనరల్ హత్య- ఇవన్నీ 1905 నాటికి, అంటే వంగ విభజనకు కొద్దికాలం ముందే జరిగాయి.

బెంగాల్ వ్యక్తివాద విప్లవ కారుల్లో "మాత", "వేదాంత" శాఖలు రెండు వుండేవి. బంకిం చంద్రుడి దుర్గమాత, శక్తి స్వరూపిణి మాతృ దేశానికి చిహ్నాలు. దేశ సంస్కృతినీ, మతాన్నీ రూపుమాపి దేశమాత బిడ్డల్ని నాశనం చేస్తున్న శ్వేత రాక్షసుల్నిసంహరించ వలసిందిగా దుర్గ తన భక్తుల్ని ఆదేశించిందని"మాత" అనుయాయులు భావించేవారు.అరవిందుడు తన భార్యకు రాసిన లేఖ కూడా దీన్నే బలపరుస్తుంది.

"ఇతర్లు భారతదేశాన్ని కేవలం భూములు, పచ్చిక బయళ్ళు, అడవులు, కొండలు, నదులు గల గడ్డగానే చూస్తారు. కాని నేను ఆమెను "మాత"గా చూస్తాను. తన తల్లి జీవితానికి ముప్పు కలిగించడానికి ఎవడో ప్రయత్నిస్తున్నప్పుడు, ఆమె కొడుకు కర్తవ్యం ఏమిటి? తనకేమి పట్టకుండా భోం చేస్తూనో, బిడ్డతో ఆడుకుంటూనో గడపాలా? లేక తల్లి రక్షణ కోసం పరుగెత్తాలా?"

ఇక "వేదాంత" వాదులు, స్వామి వివేకానంద రచనల ఉపన్యాసాల వల్ల ఉత్తేజం పొందినవారు. శ్రీ కృష్ణుడి "గీతోపదేశం" కూడా వీరిని ఉత్తేజ పర్చింది. లాలా లజపతిరాయ్ అన్నట్లు వీరు "నిహిలిస్టులు కారు; అరాచకవాదులు కారు, దేశభక్తులు. దేశ భక్తిని మతస్థాయికి పెంచినవారు."

మహారాష్ట్రలో సాయుధ విప్లవోద్యమం నడిపిన వారిలో ప్రముఖుడు వాసుదేవ్ బల్వంత ఫాడ్కే. ఆయన 1845 లో జన్మించాడు. 1876లో పూనాలో క్షామం తాండవించుతున్న సమయంలో పన్నులు విధించిన బ్రిటిష్ ప్రభుత్వ చర్య ఫాడ్కేను ఉద్రిక్త పర్చింది. ప్రభుత్వ ఉద్యోగానికి రాజీనామా యిచ్చి మహారాష్ట్ర అంతటా పర్యటించాడు. దేశం నుండి ఇంగ్లీషు వాళ్ళను తరిమి వేయడానికై ఆయుధాలను, మందు గుండు సామగ్రిని పోగుచేయడం మొదలు పెట్టాడు. ఇందుకు అవసరమైతే వడ్డీ వ్యాపారుల్ని దోచుకోడానికి వెనుకాడలేదు ఏడు జిల్లాలలో ఫాడ్కే పేరు హడలెత్తించింది.ప్రభుత్వాన్ని.ఆయన్నిపట్టుకొన్న వారికి బహుమతి ప్రకటించింది. 1879 జూలై 20 న అరెస్టు చేసి ఆయనకు యావజ్జీవ శిక్ష విధించాడు. ఏడెన్ జైలుకు పంపారు. 1880 అక్టోబరులో జైలు నుండి తప్పించుకొన్నాడు. కాని 17 మైళ్ళు వెంటబడి తిరిగి పోలీసులు ఆయన్ని పట్టుకోగల్గారు. 1883 ఫిబ్రవరిలో ఫాడ్కే మరణించాడు. ఫాడ్కేను సెషన్సు కోర్టులో విచారించినపుడు, ఆయన అన్న మాటలు స్వాతంత్ర్య ప్రియులు గమనించదగ్గవి; "అవమాన కరమైన ఈ దాస్యం కనా మరణం ఎంతో గౌరవ ప్రదమైనది.... స్వతంత్ర భారత రిపబ్లిక్ స్థాపించడం నా ఆశయం.... మహా ఋషి దధీచిలాగ నే నెందుకు బాధలు సహించకూడదు? నా త్యాగం, ధైర్యం మిమ్మల్ని బానిసత్వం నుండి విముక్తి చేసి పునర్జన్మ కల్గించితే, నే నెందుకు ఆ ప్రయత్నం చేయకూడదు?"

1897 లో పూనా ప్లేగు కమిషనర్ రాండ్,ఎమెర్స్టు అనే బ్రిటిష్ ఆఫీసర్లు ప్రభుత్వ భవనం నుండి తిరిగి వస్తుండగా, దామోదర్ చాపేకర్, బాలకృష్ణ చాపేకర్ అనే సోదరులు కాల్చిచంపారు. వారిని కోర్టులో విచారించుతుండగా, వారిని పట్టియిచ్చిన ద్రావిడ్ సోదరుల్ని కోర్టు ఆవరణలోనే చాపేకర్ సోదరులలో మూడవవాడు కాల్చి చంపాడు. వీరు ముగ్గురూ మరణశిక్షలకు గురయ్యారు. వారి కుటుంబ సభ్యులు ఇద్దర్ని విచారణ లేకుండా నిర్బంధించారు.

వంగ విభజన కాలంలో బ్రిటిష్ పాలకుల నిర్బంధ విధానం కూడా వ్యక్తివాద విప్లవోద్యమానికి దారి తీసింది. యువకులుబాంబులు, పిస్తోళ్ళ ద్వారా శత్రువును

హతామార్గాలనే నిశ్చయానికి వచ్చారు. అనేక రహస్యసంఘాలేర్పడ్డాయి. కొన్ని బహిరంగ సంస్థలు వీరి రహస్య కార్యకలాపాలకు ముసుగుగా ఏర్పడ్డాయి. కలకత్తాలో "వందేమాతరం" అని అరచినందుకు 15 ఏళ్ళ కుర్రవాడికి కింగ్సుఫర్డు అనే మేజిస్ట్రేట్ 16 కొరడా దెబ్బలు శిక్షగా విధించాడు. అతనిపై పగతీర్చుకోవాలని విప్లవకారులు శపథం చేశారు. కింగ్సుఫర్డు ముజఫర్‌పూర్‌కి బదిలీ అయ్యాడు. ఖుదీరామ్‌బోస్, ప్రఫుల్లచాకీలు అక్కడికి వెళ్ళారు. పొరపాటున వారు విసిరిన బాంబు ఇద్దరు యూరోపియన్ స్త్రీలను- శ్రీమతి కెన్నడీ, కుమారి కెన్నడీ అనే తల్లీకూతుళ్ళను చంపింది. ఈ ఘటన 1908 ఏప్రిల్ 30 న జరిగింది.

అంతకు ముందు, కింగ్సుఫర్డు వుపయోగించే ఒక పుస్తకంలో కాగితాలు చింపి, దొ చేసి ఒక బాంబు పెట్టారు. కాని అతడు ఆ పు న్ని తెరవ వలసిన అవసరం లేకపోవడంతో ఆ పు కం విఫలమయింది; మరోసారి అతడు వెళ్ళే బండిపైన బాంబు విసిరినా, ఆ సమయాన అతడు లేడు. ప్రఫుల్లచాకీ ఆత్మహత్య చేసుకొన్నాడు. ఖుదీరామ్ బోస్‌ను విచారించి మరణ శిక్ష విధించారు. మరణించిన ఆ వీర కిశోరం వయస్సు 15 సంవత్సరాలే. అతని మరణానికి నిరసనగా రెండు మూడు రోజులు స్కూళ్ళు మూసివేశారు. అతని ఫోటోలు విరివిగా అమ్ముడు పోయాయి. అంచులపై అతని బొమ్మలతో నేసిన ధోవతులను యువకులు ధరించడం మొదలుపెట్టారు. ఇతన్ని గురించి రాసిన వ్యాసానికే తిలక్‌కు ఆరేళ్ళ కఠిన శిక్ష విధించబడింది. ఒక మరాఠి భాషా పత్రిక సంపాదకుడు పరంజపాయ్‌కి కూడా ఇదే కారణంతో శిక్ష విధించబడింది. ఖుదీరాం, ప్రఫుల్లచాకీలను గురించిన జానపద గేయాలను బెంగాల్ పల్లెల్లో, పట్టణాల్లో బహిరంగంగా పాడేవారు.

బెంగాల్ లెఫ్టినెంట్ గవర్నర్ ఆండ్రూఫ్రేజర్ ప్రయాణం చేస్తున్న రైలుపై కొందరు బాంబు వేశారు. మరోసారి కూడా బాంబు విసిరారు. కాని అతడు తప్పించుకున్నాడు. ఢాకా జిల్లా మేజిస్ట్రేట్ అల్లెన్‌ను వెనుకనుండి తుపాకితో కాల్చగా మరణించాడు. 1908 ఏప్రిల్‌లో చంద్రనాగూర్ (ఫ్రెంచి వారి ఆధీనంలో వుండేది) లో ఫ్రెంచి మేయర్‌పై హత్యా ప్రయత్నం జరిగింది.

1908 మేలో కలకత్తా శివారు మనిక్ తలాలో బాంబులు తయారు చేస్తున్నట్లు పోలీసులు కనిపెట్టారు. జూన్ 2 న అనేక మందిని అరెస్టు చేశారు. మరాఠా, పంజాబీ విప్లవ కారులతో వీరికి సంబంధాలు వున్నట్లు కనుగొన్నారు. అరవిందఘోష్‌తోసహా 34 మందిని అరెస్టు చేసింది ప్రభుత్వం. ఇదే ఆలీపూర్ కుట్ర కేసుగా ప్రసిద్ధి చెందింది. ఈ కేసులో చిత్తరంజన్ దాస్ నిందితుల తరపున ఉచితంగా వాదించాడు. వాదించడమేగాక, ఖర్చులకోసం తన గుర్రపు బగ్గీని కూడా అమ్మివేశాడు. చిత్తరంజన్‌దాస్ ప్రతిభ ఈ కేసులో రాణించింది. ఈ కేసు జరుగుతుండగానూ ఆ తర్వాతా నరేంద్రగోసాయి అనే అప్రూవర్‌ను జైలులో కాల్చిచంపారు. గోసాయి హత్యకేసులో పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా పనిచేసిన అసుతోష్ బిశ్వాసునూ, ఖుదీరాంబోస్‌ను అరెస్టు చేసిన ఒక పోలీసు ఇనస్పెక్టర్‌నూ, మరో డిప్యూటీ పోలీస్ సూపరెండెంట్ షమ్‌సల్ ఆలాంనూ విప్లవకారులు చంపివేశారు. మనిక్‌తలా కేసులో వారి నాయకులకు యావజ్జీవ శిక్షలు విధించబడ్డాయి. వీరిలో అరవిందుని తమ్ముడు బరీంద్రకుమార్‌ఘోష్ కూడా వున్నాడు.

కనైలాల్‌దత్తా, యస్. యన్. బోస్‌లను వేరే విచారించి, 1908 నవంబరు 10న ఉరితీశారు. అప్రూవర్ నరేంద్రగోసాయిని ఆలీపూర్ జైలులో కనైలాల్ చంపాడు. క లాల్ ధైర్యసాహసాలను మోతీలాల్ రాయ్ అనే వి ల రచయిత ఎంతగానో వర్ణించాడు. కనైలాల్‌ను ఉరితీశాక అతని శవాన్ని చూడడానికి రాయ్‌కి అనుమతి లభించింది. ఆ సందర్భంగా, ఆ జైలులోవున్న యూరోపియన్ జైలర్ ఇలా చెప్పాడు: "తనకు మరణశిక్ష విధించారన్న వార్త విన్నప్పటినుండీ కనైలాల్ ముఖం నవ్వుతో కళ కళ లాడేది. అతనితో నేనిలా అన్నాను: "నీ ముఖం ఇవాళ నవ్వుతూవుంది. కాని రేపు నీ పెదవులపై చిరునవ్వు మాయమై నల్లగా మారిపోతాయి." కనైలాల్‌ను ఉరితీస్తున్నపుడు నే నున్నాను. కళ్ళకు గంతలు కట్టారు. ఉరి తీయడానికి ఉచ్చు బిగించ బోతున్నారు. హఠాత్తుగా నా వైపు వెనుదిరిగి "నేనిప్పు డెలావున్నాను?" అని ప్రశ్నించాడు. ఇలాంటి ధైర్యం మానవ మాత్రునిలో సాధారణంగా అసాధ్యం." మోతీలాల్‌రాయ్‌ని ఓదార్చుతూ "ఎందుకు ఏడుస్తున్నారు? ఇలాంటి

వీరులను కన్నదేశం ధన్యమైనది. ప్రతివారికి చావు తప్పదు. కాని ఇలాంటి చావు ఎందరికి లభిస్తుంది?" అని అన్నాడు.

కనైలాల్ అంత్యక్రియలకై శవాన్ని ఊరేగించే టప్పుడు వేలాది స్త్రీ పురుషులు, పిల్లలు పాదరక్షలు లేకుండా వెంట నడిచారు. ఇళ్ళపైనుండి స్త్రీలు శంఖా లూదారు. శవంపై పూలు మొదలైనవి చల్లారు. ఆ రోజున అనేకమంది ఉపవాసం చేశారు.

దక్షిణాదిన పుదుచ్చేరి (ఫ్రెంచి వారిది) కూడా విప్లవ కార్యకలాపాలకు కేంద్రంగా వుండేది. యం.పి. తిరుత్తల్ ఆచార్య, వి. వి. యస్. అయ్యర్‌లు నాయ కులు, అయ్యర్ యువకులకు రివాల్వర్‌ను వుపయో గించడం నేర్పేవాడు. 1911 జూన్ 17 న తిరునల్వేలి జిల్లా మేజిస్ట్రేటు ఆష్‌ను వాంచిఅయ్యర్ కాల్చాడు. ఇతను "భారతమాత" సభ్యుడు. తప్పించుకోడానికి వీలులేక తుపాకీతో కాల్చుకొని మరణించాడు. అతని సహచరులను కూడా తిరునల్వేలి కుట్రకేసులో విచా రించి వురితీశారు.

1918లో వెలువడిన రౌలట్ రిపోర్టు(ప్రభుత్వ)లో విప్లవ కార్యకలాపాలను గురించిన వివరణ చాలావుంది. 1906 నుండి 210 విప్లవ దురంతాలు జరిగాయనీ, అలాంటి ప్రయత్నాలే మరో 101 జరిగా యనీ, 1038 కి తక్కువ కాకుండా ఈ నేరాలలో పాల్గొన్నారనీ ఆ రిపోర్టు వెల్లడించింది.

ఢక్కాలో "సమితి"ని నిషేధించగా దాని ప్రధాన కార్యాలయాన్ని కలకత్తాకు మార్చారు. పంజాబ్, మహారాష్ట్ర, సంయుక్త రాష్ట్రాలు (యు.పి.), మధ్య రాష్ట్రాలు (మధ్యప్రదేశ్), ఒరిస్సా, అస్సాం, బీహారు లకు కూడా విప్లవ కార్యకలాపాలు విస్తరించాయి. బాంబులు తయారుచేసే విధానం గురించిన చిన్న పుస్తకం ప్రతులు కలకత్తాలోను, నాసిక్‌లో సావర్కార్ ఇంట్లోను, లాహోర్‌లో భాయి పరమానంద్ ఇంట్లోను దొరికాయి. నాసిక్, గ్వాలియర్, అహమ్మదాబాద్, సతారా, పూనా - విప్లవ కార్యకలాపాలకు కేంద్రా లయ్యాయి.

వినాయక్ దామోదర్ సావర్కార్ ఇంగ్లండులో విప్లవ కార్యకలాపాలు సాగించుతున్న సమయంలో అతని సోదరుడు గణేశ్ దామోదర్ సావర్కార్ నాసిక్‌లో విప్లవ కార్యకలాపాలకు నాయకత్వం వహిం చాడు. "అభినవ భారత సమితి"ని స్థాపించాడు. మాజినీ ఆత్మకథను మరాఠీ భాషలో అనువదించి 1907 ఏప్రిల్‌లో ముద్రించాడు. 1909 లో రచించిన అతని కవితలు రాజద్రోహాన్ని పురికొల్పుతున్నాయని ఆరో పించి, విచారించి యావజ్జీవ శిక్ష విధించారు. అతని ఆస్తిని స్వాధీనపరచుకున్నారు.

వినాయక దామోదర్ సావర్కార్ లండన్‌నుండి 20 ఆటోమాటిక్ పిస్తోళ్ళను భారతదేశానికి రహస్యంగా ఓడలో పంపాడు. అవి భారతదేశానికి చేరకముందే అతని సోదరుడు గణేశ్ దామోదర్ సావర్కార్ అరెస్టు అయ్యాడు. ఇతనికి శిక్ష విధించిన జిల్లా మేజిస్ట్రేట్ జాక్సన్‌ను 1909 డిసెంబరు 21 న కాల్చి చంపారు. ఈ కేసులో 37 మందిని అరెస్టు చేశారు. అందులో ముగ్గురికి మరణశిక్ష విధించారు. మిగతా వారికి వివిధ రకాల కఠిన శిక్షలు విధించారు.

లండన్‌లో భారత విద్యార్థులపై నిఘావుంచి గణేశ్ సావర్కార్‌ను అరెస్టు చేయవలసిందిగా జాక్సన్‌ను ప్రోత్సహించిన సర్ కర్జన్ వైలీని మదన్‌లాల్ ఢీంగ్రా 1909 జూలై 1 న కాల్చి చంపాడు. వైలీని రక్షించబోయిన ఒక భారతీయుడు డాక్టర్ లాల్‌కాకా కూడ చనిపోయాడు. సర్ కర్జన్ వైలీ లండన్‌లో భారతీయ కార్యాలయంలో ఉద్యో.. భారతీయ యువకు లను ఉరితీయడానికీ, యావజ్జీ శిక్షలకు గురిచేయ డానికీ నిరసనగా తాను హత్యచేసినట్లు మదన్‌లాల్ ఢీంగ్రా తెలిపాడు. అరెస్టయినపుడు అతని జేబులో వున్న చీటీలో ఇలా వుంది: "తుపాకీ సన్నీల బలంతో దాస్యంలో వుంచబడిన దేశం ఎప్పుడూ యుద్ధంలో వున్నట్లే లెక్క. నాకు తుపాకులు నిరాకరించినందున, నేను పిస్టల్‌తో హఠాత్తుగా ఈదాడి చేశాను. నే నెవరి తోనూ కుట్రచేయలేదు. ధనంలోను, విద్యలోను బీద వాడినైన నేను నా రక్తంతప్ప తల్లికి మరేమివ్వ గలను? నా తల్లి విముక్తిపొందేవరకూ తిరిగి నేను ఇదే దేశంలో జన్మించి, ఇలాంటి పవిత్ర ఆశయం కోసమే మరణించాలని దేవుని ప్రార్థించుతున్నాను. వందేమాతరం!"

1909 నవంబరు 9న అహమ్మదాబాద్‌లో లార్డ్ మింటో, అతని సతి కలిసి వెళుతున్న ఒక బండిపై కొబ్బరికాయ బాంబులు విసిరారు. కాని అవి పేలలేదు. ఈ సందర్భంలో సతారాలోని ముగ్గురికి శిక్ష విధించ

బడింది. గ్వాలియర్‌లో "నవభారత్ సమితి"కి చెందిన 22 మందిని శిక్షించారు.

పంజాబులో కాటక పరిస్థితులు, భూమిశిస్తు, నీటి తీరువాల విధింపు అక్కడి ప్రజలలో తీవ్ర అసంతృప్తి కలిగించాయి. బంజరు భూముల్ని సాగులోకి తీసుకు వచ్చిన రైతులకు, ఆ భూముల ఫలసంపద అంద కుండా "కాలనైజేషన్ ఆక్టు" అడ్డు తగిలింది. లాహోర్‌లోని "భారతమాత సమితి"కి చెందిన అజిత్ సింగ్ ఈ సమస్యలపై తీవ్ర ఆందోళన గావించాడు. 1857 ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామ 50 వ వార్షికోత్సవం దగ్గరకు వచ్చిన సందర్భంగా సిక్కు సైనికుల్ని తిరగబడవలసిందిగా ఉపన్యాసకులు కోరుతూ వచ్చారు. లాహోర్‌లో యూరోపియనను కొట్టి నందుకూ, లాలా లజపతిరాయ్ పత్రిక "పంజాబీ"పై నిర్బంధం విధించి శిక్షించినందుకూ రావల్పిండిలో అల్లర్లు చెలరేగాయి. ఈ ఉద్యమంలో అజిత్‌సింగ్‌ది ప్రధాన పాత్ర. ఆగా హైదర్, సయ్యద్ హైదర్, రిజాలు అతనికి సాయపడ్డారు. లాలా లజపతిరాయ్, అజిత్‌సింగ్‌లకు ప్రవాస శిక్ష విధించబడింది. ఈ శిక్షలపై తీవ్ర విమర్శ రావడంతో ప్రభుత్వం వారిని 1907 నవంబరులో విడుదల చేసింది. విడుదలైన తర్వాత కూడా బెంగాల్ విప్లవకారులతో అజిత్‌సింగ్ సంబంధాలు పెట్టుకొన్నాడు.

పంజాబ్ విప్లవోద్యమానికి కృషిచేసినవారిలో "భారతమాత" సంపాదకుడు సూఫే అంబాప్రసాద్, "తిలక్ భావాలు" అనే గ్రంథం రాసిన లాల్‌చంద్ ఫలక్, ధనపత్‌రాయ్ అనే మరొక ప్లీడర్ వున్నారు.

పంజాబ్, బెంగాల్ విప్లవోద్యమాలకు సంధాన కర్తగా రసబేహారి ఘోష్ పనిచేశాడు. ఇతడు డెహ్రాడూన్‌లో గుమాస్తాగా పనిచేసేవాడు.

వైస్రాయి లార్డ్‌హార్డింజ్ 1912 డిసెంబర్ 22 న ఏనుగుపై ఊరేగుతుండగా ఢిల్లీలోని చాందినీ చౌక్‌లో అతనిపై బాంబు విసిరారు. వైస్రాయి గాయపడ్డాడు, అతని అంగరక్షకుడు చనిపోయాడు. రసబేహారి ఘోష్ ఈ బాంబు విసిరాడు. ఈ బాంబు విసిరిన సందర్భంగా ఏర్పడ్డ గందరగోళంలో అతను తప్పించుకుపోయాడు. అతన్ని పట్టిచ్చిన వారికి రు. 7500 బహుమతి ప్రకటించింది ప్రభుత్వం. అనేక చోట్ల పోలీసులు అతన్ని తరిమారు. కాని పట్టుబడకుండా తప్పించుకుని జపాను వెళ్ళిపోయాడు. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో భారత జాతీయ సైన్యాన్ని(ఐ.ఎన్.ఏ) నిర్మించడంలో ప్రముఖ పాత్ర వహించాడు. 1945లో రసబేహారి ఘోష్ మరణించాడు.

పై సంఘటనను పురస్కరించుకుని ప్రభుత్వం ఢిల్లీ కుట్రకేసు పెట్టింది. 13 మందిని అరెస్టుచేసింది. వారిలో నలుగురిని ఉరితీశారు. ఇద్దరికి పదేళ్ళ శిక్ష విధించబడింది. 1914లో జరిగిన ఈ విచారణలో మాస్టర్ అమీర్‌చంద్ రాసిన లేఖను సాక్ష్యంగా ఉదహరించారు. ఆ లేఖలోని ఓ భాగం ఇలా వుంది:

"చట్టబద్ధ పోరాటాలు, ఆందోళనలు ఫలించలేదు.... మన దేశ విముక్తికి సాయుధ విప్లవమే మార్గం. పాలకులు స్వాతంత్ర్యాన్ని వెండి పళ్ళెంలో పెట్టి ఇవ్వరని చరిత్ర రుజువు చేసింది. కత్తి భయం వున్నప్పుడే వారు దాన్ని ఇస్తారు."

ఈ కేసులోనే మరో నింది దు అవధ్ బేహారీని ఉరితీయబోయే ముందు ఇం .షు ఉద్యోగి అతని ఆఖరి కోరిక ఏమిటని అడిగా . "బ్రిటిష్ పరిపాలనను తుదముట్టించమే" అని అతని జవాబు. ప్రశాంతంగా మరణించమని మళ్ళీ ఆ ఇంగ్లీషు ఉద్యోగి సలహాయిస్తే, అవధ్‌బేహారి ఇలా జవాబిచ్చాడు: "శాంతమా! బ్రిటిష్ పరిపాలనను ద ంచేసే దావానలం దేశంలో వ్యాపించాలని కోరుతునా ను. ఆ మంటల నుండి మా దేశం మేలిమి బంగా ంలా బయటపడాలని కోరుకుంటున్నాను."

కొందరు విదేశాలలో విప్లవ కార్యకలాపాల కేంద్రాలను నెలకొల్పి, అక్కడ నుండి పని చేయడం ప్రారంభించారు. పూనాలో రాండ్ హత్యతో సంబంధం వున్నదని శ్యాంజీ క వర్మను అనుమానించారు. ఇతడు కథియవాడ్ స నంలో ధనిక కుటుంబంలో జన్మించాడు. బారిష్టర్ రీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. రాండ్ హత్య కేసునుండి తప్పించుకొని లండన్ చేరాడు. ఇతడు సంస్కృత పండితుడు కూడా. ఉదయ్‌పూర్, జునాఘడ్ సంస్థానాలకు దివాన్‌గా పనిచేశాడు. "ది ఇండియన్ సోషియాలజిస్ట్" అనే మాసపత్రిక కూడా నడిపాడు. 1905లో "ఇండియన్ హోమ్‌రూల్ సొసైటీ" (భారత స్వపరిపాలన సమితి)ని లండన్‌లో స్థాపించాడు. వివిధ యూనివర్సిటీలలో చదువుతున్న లండన్‌లోని భారతీయులకోసం "ఇండియా హౌస్"

(భారత భవనం) నెలకొల్పాడు. ఇది విప్లవ కార్య కలాపాలకు కేంద్రంగా వుండేది. దీనిపై నిఘా ఎక్కువకాగా, కృష్ణవర్మ పారిస్ వెళ్ళాడు. ప్యారిస్‌లో వున్నా అతని పత్రిక "ఇండియన్ సోషియాలజిస్ట్" లండన్ నుండే వెలువడేది. ప్రభుత్వం ఆ పత్రికను అణిచివేశాక, ప్యారిస్ నుండి దాన్ని ప్రచురించాడు.

కృష్ణవర్మను ఆకర్షించిన విద్యార్థులలో వినాయక దామోదర్ సావర్కార్ ఒకడు. సావర్కార్ 1883 మేలో జన్మించాడు. చాపేకర్‌ని ఉరితీసిన ఘటన ప్రభావం సావర్కార్‌పై వుంది. అపుడే అతడు దేశ విముక్తికి సాయుధ విప్లవం సాగిస్తానని ప్రతిజ్ఞ చేసినట్లు చెబుతారు. 1900 సంవత్సరంలో అతడు "మిత్ర మేలా" (మిత్ర సంఘం) స్థాపించాడు. దేశం కోసం ప్రాణాలర్పించుతామని ఇందులో సభ్యులు ప్రతిజ్ఞ చేసేవారు. 1904లో దీన్ని "అభినవ భారత సమితి"గా మార్చారు. దేశానికి సంపూర్ణ స్వాతంత్రం కావాలనీ, అది సాధించేందుకు తమ సర్వస్వం ఒడ్డుతామనీ, అందుకు నిర్విరామంగా కృషి చేస్తామనీ, సంఘ రహస్యాలను బయటపెట్టమనీ "అభినవ భారత సమితి" సభ్యులు ప్రమాణం చేసేవారు.

సావర్కార్ 1906 నాటికే "జోసెఫ్ మాజినీ - అతని జీవితం - రాజకీయాలు" అనే గ్రంథ రచన పూర్తి చేశాడు. "భారత స్వాతంత్ర్య సంగ్రామం" అనే పేరుతో 1857 నాటి స్వాతంత్ర్య సమర చరిత్రను రచించాడు. దీన్ని ప్రభుత్వం నిషేధించింది. ఐనా, దీని ప్రతులు రహస్యంగా భారతదేశంలో ప్రచారమవుతూనే వుండేవి. 1930-32 నాటి జాతీయోద్యమ కాలంలో కూడ అనేకమంది ఆంధ్ర యువకులు ఈ గ్రంథాన్ని చదివి దృఢసంకల్పంతో జాతీయోద్యమంలో పాల్గొన్నారు. సావర్కార్ పారిస్‌లో వుండగానే లండన్‌లో సర్ కర్జన్ వైలీని మదన్‌లాల్ ధీంగ్రా హత్య చేయడం, ఆ తర్వాత అతన్ని ఉరితీయడం జరిగింది. సావర్కార్ అపుడు లండన్‌కు ప్రయాణం తలపెట్టగా, వద్దని శ్యాంజీ కృష్ణవర్మ, లాలా హరదయాళ్, మదాం కామా సలహా యిచ్చారు. వారి సలహాను త్రోసి పుచ్చి సావర్కార్ లండన్ వెళ్ళాడు. లండన్ చేరగానే 1910 మార్చి 13న అరెస్టు చేశారు. నాసిక్ కుట్రకేసులో సావర్కార్‌కు ప్రమేయం వున్నదనీ, భారతదేశంలో విచారించాలనీ బ్రిటిష్ ప్రభుత్వం ఆదేశించింది. సావర్కార్ ప్రయాణం చేస్తున్న ఓడ మార్సెయిల్స్ రేవు చేరినపుడు, తన వెంట స్కాట్లండ్ డిటెక్టివ్ అధికారి, భారతీయ పోలీసు సూపరెండెంట్ వున్నా, ఓడలోని మరుగుదొడ్డి నుండి సముద్రంలోకి దూకి, ఈదుకుంటూ ఫ్రెంచి తీరానికి చేరాడు. కాని అక్కడ బ్రిటిష్ అధికారులు చట్ట విరుద్ధంగా సావర్కార్‌ను స్వాధీనం చేసుకుని భారత దేశానికి తీసుకు వచ్చారు. దీనిపై బ్రిటన్, ఫ్రాన్సులలో పెద్ద ఆందోళన జరిగింది. దాని ఫలితంగా ఈ విషయాన్ని హేగ్ ట్రిబ్యునల్‌కు అప్పగించడానికి బ్రిటన్, ఫ్రాన్సులు అంగీకరించాయి. చివరికి హేగ్ ట్రిబ్యునల్ కూడా బ్రిటన్‌కు అనుకూలంగా తీర్పు యిచ్చింది. ఈలోగా భారతదేశం కోర్టు సావర్కారుకు 1911 మార్చి 22 న 50 ఏళ్ళ శిక్ష విధించి అండమాన్‌లకు ప్రవాసం పంపాలని తీర్పు ఇచ్చింది. "50 ఏళ్ళ జైలు శిక్షా?" అని ఒక జైలర్ ఆశ్చర్యపోయినపుడు "50 ఏళ్ళ దాకా బ్రిటిష్ ప్రభుత్వం నిలిచి వుంటే కదా?" అని సావర్కార్ అన్నాడు. 1924 లో సావర్కార్ సోదరులను అండమాన్‌ల నుండి భారత దేశానికి తీసుకు వచ్చారు. 1937 లో రత్నగిరి జైలు నుండి వారిని కాంగ్రెస్ ప్రభుత్వం విడుదల చేసింది.

భారత దేశంలోని విప్లవ కార్యకలాపాలకు యూరప్, రష్యాలలోని రహస్య సంఘాలు ప్రేరణ కలుగజేశాయి. రష్యాలో అప్పటికి ఇంకా జార్ ప్రభుత్వంపై హత్యలను ప్రోత్సహించే వ్యక్తిగత హింసావాదుల సంఘాలు వుండేవి వాటికి సంబంధించిన వారు యూరప్‌లో కూడా ప్రవాసముండే వారు. "యుగాంతర్" పార్టీకి చెందిన హేమచంద్రదాస్ 1907లో పశ్చిమ యూరప్‌లో ప్రవాసముంటున్న రష్యన్ విప్లవకారులతో సంబంధాలేర్పరుచుకొన్నాడు.

"వందేమాతరం", "ఇండియన్ ఫ్రీడమ్", "తల్వార్" అనే పత్రికలతో సంబంధమున్న సర్దార్ సైవాభాయ్ రాణా, హేమ్‌చంద్ర దాసుకు ధన సహాయం చేసేవాడు. బాంబులను తయారుచేయడం దాసు వారినుండి నేర్చుకొన్నాడు. ఇతడు భారతదేశానికి పిస్తోళ్ళను, తుపాకి గుళ్ళను రహస్యంగా పంపేవాడు.

అలా పంపిన ఒక తుపాకి గుండుతోనే జాక్సన్ హత్య చేయబడ్డాడు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో ఇతన్ని ఒక దీవిలో నిర్బంధించి, యుద్ధానంతరం గాని విడిచి పెట్టలేదు.

లండన్‌లో బ్రిటిష్ పోలీసులు వేధించడంతో, అక్కడ పనిచేసిన కృష్ణవర్మ, సావర్కార్, వీరేంద్రనాథ ఛటోపాధ్యాయ, యస్. ఆర్. రాణా, వి.వి.యస్.అయ్యర్ మొదలైన వారంతా 1909-10 లో పారిస్‌కు వెళ్ళి అక్కడ పనిచేయడం ప్రారంభించారు. పారిస్‌లో అదివరకే మదాం రుస్తుం కామా, హరదయాళ్ పని చేస్తున్నారు. రష్యా నుండి వచ్చి ప్రవాస జీవితం గడుపుతున్న సోషల్ డెమాక్రాట్లతోను, సోషలిస్టు ఇంటర్నేషనల్‌తోను సంబంధాలు పెట్టుకున్నారు. భారతదేశంలోని రహస్య సంఘాలతో సంబంధం పెట్టుకొని, పారిస్‌లో నివసిస్తున్న విప్లవకారులు మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభ మయ్యాక చెల్లా చెదురయ్యారు. మదాం కామా, యస్. ఆర్. రాణాలను "ఇంటరన్" (ఉన్నచోటునుంచి విడిచి వెళ్ళ రాదని నిర్బంధం) చేశారు. కృష్ణవర్మ స్విట్జర్లాండ్ వెళ్ళాడు. వీరేంద్ర ఛటోపాధ్యాయ బెర్లిన్ వెళ్ళాడు.

ఈ సందర్భంలో, వీరవనిత మదాం కామా గురించి కొంత చెప్పాలి. ఈమె బొంబాయిలో ఒక పార్శీ కుటుంబంలో జన్మించింది. బికాయిజీ రుస్తుం కామా అని ఆమె పేరు. 1885 ఆగస్టులో ఈమెకు వివాహ మయింది. 1902 లో అస్వస్థురాలై, జర్మన్, స్కాట్లండ్, ఫ్రాన్సులలో కొన్నాళ్లు గడిపి, 1905లో లండన్ చేరింది. అపుడు అక్కడ వున్న దాదాభాయి నౌరోజీకి అంతరంగిక కార్యదర్శిగా పనిచేసింది. బ్రిటిష్ ప్రభుత్వాన్ని విమర్శించుతూ లండన్‌లో తీవ్ర ధోరణిలో ఉపన్యాసాలిచ్చేది. భారత సంపదను తరలించుకు వెళ్ళే బ్రిటిష్ నౌకలను అడ్డగించ వలసిందిగా బాహాటంగా ప్రబోధించింది. సావర్కార్ రచించిన "భారత స్వాతంత్ర్య యుద్ధం" (1857) ను హాలెండ్‌లో ముద్రించడానికి ఏర్పాట్లుచేసింది. 1910లో కోపెన్ హాగన్‌లో జరిగిన సోషలిస్టు కాంగ్రెస్ మహాసభలో సావర్కార్ విడుదలకై ఒక తీర్మానాన్ని ఆమోదింప చేసింది.

యుద్ధ కాలంలో మదాం కామాను తమకు అప్పగించవలసిందిగా బ్రిటిష్ ప్రభుత్వం కోరిన కోర్కెను ఫ్రాన్సు అంగీకరించక, ఆమెను "ఇంటరన్" చేసింది.

భారతదేశ స్వాతంత్ర్య పతాకకు రూపకల్పన చేసి మొట్టమొదటి సారిగా దానిని 1907 లో జర్మనీలోని స్టట్‌గార్ట్‌లో జరిగిన ప్రపంచ సోషలిస్టు మహాసభ (ఇంటర్నేషనల్ సోషలిస్టు కాంగ్రెస్) లో ఎగుర వేసింది. 1917 ఆగస్టు 18 నుండి 24 వరకు జరిగిన ఈ మహాసభకు మొటమొదటిసారిగా ఒక భారత ప్రతినిధి వర్గం హాజరయింది. అందులోమదాం కామా, సర్దార్ రైవాభాయ్ రాణా వున్నారు. ఈ మహాసభలోనే వలస పాలకుల పట్ల మెత్తదనం ప్రదర్శించే మితవాద ధోరణిని అధిక సంఖ్యాకులు లెనిన్ నాయకత్వాన ఓడించారు. అతివాదులకు 108 ఓట్లు వచ్చాయి. ఈ సభలో మదాం కామా అద్భుతమైన ఉపన్యాస మిచ్చింది. అందులో భారత ప్రజల అగచాట్లను వర్ణించి, భారతీయుల న్యాయమైన కోర్కెను ఆమోదించవలసిందిగా కోరింది. "భారతదేశం జాగృత మయ్యే రోజు వస్తుందని నేను నమ్ముతున్నాను. రష్యన్ కామ్రేడ్ల మార్గాన్ని భారతదేశం అనుసరించుతుందని భావిస్తున్నాను. వారికి మా సౌహార్ద్ర అభినందనలు తెలియచేస్తున్నాను."

తర్వాత ఆమె ఒక సిల్కు త్రివర్ణ పతాకను ఎగురవేసింది. ప్రతినిధులంతా లేచి హర్షధ్వానాలు చేశారు ఆ విధంగా భారత జాతీయ పతాక మొట్ట మొదటి సారిగా యూరప్ గడ్డపై రెపరెపలాడింది. "అంతర్జాతీయ మహాసభ ప్రతినిధుల హర్షధ్వానాలు అంతులేకుండా మిన్నుముట్టా"యని లీప్‌జీగర్ జీటుంగ్ అనే జర్మన్ పత్రిక ఆనాడు రాసింది. మదాం కామా ఎగురవేసిన ఆ త్రివర్ణ పతాకనే కొద్ది మార్పులతో జాతీయ కాంగ్రెస్ ఆమోదించింది.

మదాం కామా జబ్బుపడి, జీవిత చరమ దశలో, 1934 లో, భారతదేశానికి వచ్చింది. దీర్ఘకాలం మృత్యువుతో పోరాడి జన్మభూమిలో 1936 ఆగస్టు 18 న మరణించింది.

యూరప్‌లోనే గాక, ఉత్తర అమెరికా, కెనడాలకు కూడా విప్లవ సంఘాలు వ్యాపించాయి. తారకనాథ్‌దాస్ అనే బెంగాలీ 1906 లో కెనడా వెళ్లాడు. బ్రిటిష్ వలస పరిపాలనకు వ్యతిరేకంగా అతడు నిర్వహించిన పాత్ర ప్రముఖమైనది. 1908 లో అతడు అమెరికా వెళ్లాడు;

అక్కడనుండి "ఫ్రీ హిందూస్తాన్"(స్వతంత్ర భారత్) అనే పత్రికను నడిపాడు. అమెరికాకు వలసపోయిన భారతీయులలో ఈ పత్రిక ఎక్కువ ప్రచారం పొందింది. తారకనాథ్‌దాస్ పునాది వేసిన విప్లవ కార్య కలాపాలు లాలా హరదయాళ్ రాకతో విస్తృతరూపం దాల్చాయి. అమెరికా కెనడాలలో ఫ్యాక్టరీలలోనూ, ఆఫీసులలోనూ పనిచేస్తున్న తమ సహచరులకు మాదిరి గానే, తమకూ సమాన హక్కు లివ్వాలని దేశాంతర వాసులైన భారతీయులు ఒక సంఘాన్ని స్థాపించారు. దానిపేరు "యునైటెడ్ ఇండియన్ లీగ్" (ఐక్యభారత సమితి). రానురాను భారత విప్లవకారుల ప్రభావంతో ఇలాంటి సంఘాలు రాజకీయ స్వభావాన్ని సంతరించు కొన్నాయి.

లాలా హరదయాళ్ 1911లో శాన్‌ఫ్రాన్సిస్కోకు వచ్చాడు. అమెరికాలో వలస వుంటున్న భారతీయు లలో ప్రముఖవ్యక్తి అయ్యాడు. ఆయన చొరవతో 1913 లో "గదర్" (తిరుగుబాటు) అనే పత్రిక నెల కొల్పబడింది. 1857-59 ప్రథమ భారతస్వాతంత్ర్య సంగ్రామ చిహ్నంగా ఈ పత్రికకు ఈ పేరు పెట్టారు. అమెరికాలో నివసించుతున్న భారతీయుల ప్రతినిధులతో 1913 లో దీని కాంగ్రెస్ (మహాసభ) జరిగింది. "భారత సమితి" (ఇండియన్ అసోసియేషన్) అనే పేరుతో ఈ కాంగ్రెస్‌లో ఒక సంఘం నెలకొల్ప బడింది. తర్వాత కొంతకాలానికి "గదర్‌పార్టీ" అని పేరు పెట్టారు. అమెరికాలో వేర్వేరు ప్రాంతాలలోనే గాక, జపాను, ఫిలిప్పైన్సు, ఇండోనేషియా, మలయా, చైనాలలో కూడా దీని శాఖలు ఏర్పడ్డాయి. వివిధ భార తీయ భాషలలో కరపత్రాలు, "గదర్" పత్రిక వెలు వడేవి. భారతదేశానికి కూడా వీటిని చేరవేసి పంచిపెట్టే వారు.

మొదటి ప్రపంచ యుద్ధ కాలంలోను, యుద్ధానంత రం 1920 దశకంలోను, విప్లవ సంఘాల స్థాయి, రాజ కీయ స్వభావం కొంత మారాయి. ఐతే, ఇప్పటివరకూ జరిగిన వ్యక్తిగత విప్లవ వాద చర్యలు అనేక అప జయాలు పొందాయి. ఈ అపజయాలకు ప్రధాన కార ణం ఈ ఉద్యమ నాయకులు మధ్యతరగతి వారు కావడం. వీరికి ప్రజానీకంతో సంబంధంలేదు. ఆర్థిక- సామాజిక కార్యక్రమం ఏమీ లేదు. వీరు ప్రధానంగా విద్యార్థుల, పట్టణ మధ్యతరగతి ప్రజల, మధ్యతరగతి మేధావులపైన ఆధారపడ్డారు. వీరికి తగిన ఆర్థిక తది తర స్తోమతులేదు. పోలీసుల క్రూర నిర్బంధ విధానం తీవ్రమయింది. దేశవ్యాపితంగా ఒకే కేంద్రనాయ కత్వాన విప్లవ సంఘాలను ఏకీకృతం చేయడానికి ప్రయత్నాలు జరిగినా, అవి కార్యరూపం ధరించలేదు. అపుడపుడు వివిధ కేంద్రాల మధ్య సంబంధాలు మాత్రమే నెలకొల్పబడ్డాయి.

ఆనాటి పరిస్థితులలో ఇలాంటి లోపాలెన్ని వున్నప్పటికీ, భారత స్వాతంత్ర్య ఉద్యమానికి ఈ విప్లవకారుల సేవ ప్రశంసనీయమైనది. వారి సాహస చర్యలు, పథకాలు, గుండెనిబ్బరం సడలని వీరోచిత కృత్యాలు, మృత్యువును లెక్కచేయకపోవడం- స్వాతంత్ర్య ప్రియులలో దేశభక్తిని రగుల్కొల్పింది. వారిపట్ల గాఢాభిమానాన్ని పెంపొందించింది వారి ఆదర్శం ఎంత మహోన్నతమైనదైనా, వారి త్యాగాలు ఎంత అమోఘమైనవైనా, వారి పద్ధతులు ఎంత వీరో చితమైనవైనా, అవి సామాన్య ప్రజానీకాన్ని సమీక రించలేకపోయాయి.

అందుచేతనే, సామ్రాజ్యవాద ప్రభుత్వం వారిని నిర్బంధ విధానంద్వారా అణచివేయ గలిగింది. కుట్ర కేసులు, తీవ్రశిక్షలు, వివిధ నిర్బంధ చట్టాలు, పత్రికలపై నిర్బంధాలు వారిని దెబ్బకొట్టాయి. రహస్య సంఘాలు కావడంతో వీరు అందర్నీ నమ్మడం సాధ్యమయేది కాదు. దాంతో సామాన్య ప్రజలతో సంబంధా లుండేవికావు. కార్మిక కర్షకులతో అసలే సంబంధాలు తక్కువ. మితవాద నాయకులు బహిరంగంగా వారితో తమ కెలాంటి సంబంధం లేదనేవారు. కాంగ్రెస్‌లోని

అతివాదులు సైతం, వారిని తమ వారుగా అంగీకరించడానికి సిద్ధపడలేదు. తీరిక వేళల్లో కులాసాగా కాలం వెళ్ళబుచ్చే కార్యకలాపాలుగా కొందరు రాజకీయాల్ని రూపొందించుతున్న రోజుల్లో ఈ విప్లవోద్యమ నాయకులు తమ యావత్తు కాలాన్నీ, జీవితాన్నీ మాతృదేశ సేవకు వినియోగించారు. తమను గురించి ఏమగురూ పొగుడుతారనిగానీ, తమను ఇతరులు హర్షించుతారనిగానీ వీరు ఆశించలేదు. బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలద్రోయడమే వారి ఏకైక ధ్యేయం. అందుకోసం స్వసౌఖ్యాలను వదలుకొన్నారు. త్యాగాలు చేశారు. చిత్రహింసలకు, చివరకు మృత్యువుకు గురయ్యారు. అందుకే భారతీయులు వీరి శౌర్యాన్నీ, ఉన్నతాశయాల్నీ, ఉదాత్త హృదయాన్నీ ప్రశంసిస్తూ, వీరు తమ జాతి సంతానమని గర్వపడుతున్నారు. భారత జాతికి పౌరుషాన్ని చేకూర్చిన ఈ అమరవీరులను భారత స్వాతంత్ర్య ఉద్యమం ఎప్పుడూ సంస్మరించుతూనే వుంటుంది. తర్వాత కాలంలో ఈ విప్లవ కారులలో ఎక్కువ మంది కాలంచెల్లిన తమ పద్ధతుల ద్వారా స్వాతంత్ర్యాన్ని సాధించలేమని గ్రహించి, నూతన ఉద్యమాలను నిర్వహించారు.

రహస్య విప్లవ కారుల "అత్యాచారాలు" అంటూ సామ్రాజ్యవాదులు, వారి బంట్లు తెగ గగ్గోలుచేస్తూ వుంటారు. కాని 1919 లో జలియన్‌వాలా బాగ్‌లో జనరల్ డయ్యర్ — అమాయకులూ నిరాయుధులూ అయిన పురుషులు, స్త్రీలు, పిల్లలపై జరిపిన హత్యాకాండతో పోల్చితే, 30 ఏళ్ళలో విప్లవ కారులందరూ చేసిన "హత్యలు" చాలా స్వల్పం. ఈ "హత్య"లకు కూడా బ్రిటిష్ పాలకుల క్రూర దమనకాండయే కారణం.

# యుద్ధమూ - అశాంతీ

మొదటి ప్రపంచ యుద్ధం 1914 లో ప్రారంభమైంది. 1918 లో ముగిసింది. ఈ నాలుగేళ్ళలో జరిగిన కాంగ్రెస్ మహాసభలన్నీ బ్రిటిష్ ప్రభుత్వానికి విధేయతను ప్రకటించుతూ తీర్మానించాయి. చివరకు 1918 లో కాంగ్రెసు జయప్రదంగా యుద్ధాన్ని ముగించినందుకు బ్రిటిష్ ప్రభుత్వాన్ని అభినందించుతూ తీర్మానించింది. ఒక ప్రక్క ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమాలను అణచివేస్తూ తీవ్ర నిర్బంధ విధానాలను అమలు పరచుతూనే, మరో ప్రక్క మితవాద నాయకత్వం పట్ల సామరస్య ధోరణిని ప్రకటిస్తున్నట్లు బ్రిటిష్ ప్రభుత్వాధినేతలు నటించ సాగారు. 1914 లో మద్రాసు గవర్నర్ లార్డ్ పెంట్‌లాండ్ కాంగ్రెస్ మహాసభకు హాజరయ్యాడు. 1915 లో బొంబాయి గవర్నర్ లార్డ్ విల్లింగ్‌డన్, 1916 లో ఉత్తరప్రదేశ్ లెఫ్టినెంట్ గవర్నర్ సర్ జేమ్సు మెస్టన్ కాంగ్రెస్ మహాసభలకు హాజరయ్యారు. 1914 లో మద్రాసు కాంగ్రెస్ మహాసభలో ఒక విచిత్ర సంఘటన జరిగింది. గవర్నర్ పెంట్‌లాండ్ మహాసభకు ఆలస్యంగా వచ్చాడు. మహాసభ లప్పటికే ప్రారంభమై చర్చలు జరుగుతున్నాయి. చర్చల్ని మధ్యలో ఆపి, బ్రిటిష్ ప్రభుత్వానికి విధేయత తెలిపే తీర్మానాన్ని ప్రవేశ పెట్టి నెగ్గింపజేశారు నాయకులు. తన అవసరం తీరిందని కాబోలు, గవర్నర్ చక్కగా మహాసభ నుండి నిష్క్రమించాడు.

మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమైనప్పుడు లండన్‌లోవున్న భారతీయ నాయకులు యుద్ధానికి తోడ్పాటును ప్రకటించారు. అప్పుడు లాలా లజపతి రాయ్, జిన్నా, సిన్హా మొదలైన నాయకులు లండన్‌లో వున్నారు. వారు బ్రిటిష్ సామ్రాజ్యం త్వరగా విజయం సాధించాలనీ, ఇందుకు భారతదేశంలోని సంస్థానాధీశులూ, ప్రజలూ సహకరించుతారనీ వాగ్దానంచేస్తూ బ్రిటిష్ ప్రభుత్వానికి లేఖ రాశారు.

యుద్ధం ప్రారంభమైన కొద్ది రోజుల్లోనే 1914 ఆగస్టు 4 న మహాత్మాగాంధీ దక్షిణాఫ్రికా నుండి లండన్ చేరారు. లండన్‌లో నివసించుచున్న భారతీయుల నుద్దేశించి వారు "సామ్రాజ్యంలోని పౌరులవలె ఆలోచించాలి" అని కోరాడు. భారతీయులతో ఒక అంబులెన్సు వలంటీరు దళాన్ని ఏర్పాటు చేశాడు. 1917 లో ఢిల్లీలో వైస్రాయి ఏర్పరిచిన "యుద్ధ సభ"లో పాల్గొన్నాడు. నీలిమందు తోటల యజమానులైన యూరోపియన్లకు వ్యతిరేకంగా చాంపరాన్‌లో సత్యాగ్రహం జరిపిన తర్వాత కూడా, 1918 జూలైలో గుజరాత్ రైతులు సైన్యంలో చేరడంద్వారా స్వరాజ్యం సంపాదించడానికి సహాయపడతారని ఉద్బోధించారు. బ్రిటిష్ పాలకులకు యుద్ధంలో సహాయపడటంద్వారా స్వరాజ్య సాధన సులభమౌతుందనే భ్రమలు ఆనాడు మన నాయకు లందరికీ ఉండేవి. ఇందుకు ఒక ఉదాహరణ: యుద్ధం ముగిసిన తర్వాత వెర్సైల్స్‌లో జరిగే శాంతి సమావేశానికి తన ప్రతినిధిగా తిలక్‌ను పంపాలని కాంగ్రెస్ నిశ్చయించింది. కాని తిలక్‌కు ప్యాస్‌పోర్టు ఇవ్వలేదు. వెర్సైల్స్ శాంతి సమావేశ అధ్యక్షునికి, అప్పుడు తిలక్ ఒక లేఖ రాశారు: "భారతదేశం ఆసియాలోగాని మరోచోటగాని శాంతిని భగ్నంచేసే వారికి, దురాక్రమణ దారులకు వ్యతిరేకంగా బ్రిటిష్ సామ్రాజ్య స్థిరత్వాన్ని కాపాడటానికీ, ప్రపంచ శాంతిని కాపాడటానికీ ప్రాచ్య భాగంలో నానాజాతి సమితికి శక్తివంతమైన నిగామా (స్టువర్డ్)గా వుండగలదు" అని తిలక్ ఆ లేఖలో రాశారు.

జాతీయ నాయకులు ఇలాంటి భ్రమలకు లోనుగావడానికి ఆనాడు బ్రిటిష్ పాలకులు, వారి మిత్రరాజ్యాలు చేసిన ప్రకటనలు, యిచ్చిన వాగ్దానాలు కొంత కారణం. స్వాతంత్ర్యం కోసమే మిత్రరాజ్యాలు పోరాడుతున్నాయని బ్రిటిష్ ప్రధాని లాయడ్‌జార్జి అన్నాడు. ప్రెసిడెంట్ విల్సన్ (అమెరికా) ప్రకటించిన 14 అంశాల ప్రకటన కూడా ఇందుకు అనుగుణంగానే వుంది.

1914 లో మద్రాసు కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించిన భూపేంద్రనాథ్ బసు "గౌరవం, స్వాతంత్ర్యం, న్యాయంకోసం బ్రిటన్ - భారతదేశాలు కలిసి పోరాడుచున్నాయి" అని అన్నాడు.

1914 కాంగ్రెస్ తీర్మానం ఇలా వుంది: "భారతదేశ ప్రజలు ప్రస్తుత సందిగ్ధ తరుణంలో ప్రకటించిన రాజభక్తిని గమనించి ప్రభుత్వంవా రిండియాలోను, విదేశాలలోను, చక్రవర్తిగారి పౌరులైన భారతీయుల మధ్యను, తదితర జాతుల మధ్యను చూపబడుతున్న అసహ్యాకరమైన భేదభావములను తొలగించి 1911

ఆగస్టు 25 న ఇండియా ప్రభుత్వం సీమకు పంపిన సూచనలలోగల రాష్ట్రియ స్వాతంత్ర్య వాగ్దానము లను చెల్లించుకొనుట వలనను, భారత దేశమును సంయుక్త సామ్రాజ్యములో స్వతంత్ర భాగస్వామిగా నొనర్చుట మూలముననను భారత ప్రజల రాజభక్తిని సామ్రాజ్య క్షేమము కోసము శాశ్వతముగా వర్ధిల్లునట్లు చేయవలెను." (కా. భోగరాజు పట్టాభి సీతారామయ్య గారి "కాంగ్రెస్ చరిత్ర" నుండి)

ఆనాటి కాంగ్రెస్ అధ్యక్షులు భూపేంద్రనాధ బసు అదే సమయంలో "భారతదేశంలో ఇంగ్లీషువారి పరి పాలన బ్యూరాక్రసిని వేద వాక్యంగా చేయడమే ఐతే, భారతదేశంపై నిరంతర పెత్తనం నిరంతర సంరక్షణమే ఐతే మానవత్వానికి మచ్చ, నాగరికతకు శాపమూ, భారతదేశ ఆత్మ (Soul)పై పెరుగుతున్న అత్యంత భారము" అని అన్నారు.

1922లో గాంధీజీని కోర్టులోవిచారించినపుడు ఆయన చేసిన ప్రకటన యుద్ధకాలంలో బ్రిటిష్ వారికి సహాయ పడటం ద్వారా తానాసించిన దేమిటో స్పష్టం చేసింది. ఆయన ఇలా అన్నారు: "ఈ సేవలన్నిటిద్వారా, నా దేశస్థులకు పూర్తి సమానత, హోదా లభించడం సాధ్య మనే నమ్మకం ఈ సేవా ప్రయత్నాలన్నిటిలో నన్ను ప్రేరేపించింది "

మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభం నాటికి బ్రిటిష్ వాళ్ళ పరిస్థితిఏమిటి ? తమ మనుగడకేభారతసైనికుల అవసరం యేర్పడింది. ఇంగ్లాండ్ క్షేమం కోసం, ఇండియాను "సంరక్షించే" బాధ్యత ఈ సైన్యానిది. కాని మొదటికే ముప్పు వస్తుంటే ఏం చేయాలి? "కాంగ్రెస్ చరిత్ర" రాసిన పట్టాభి గారి మాటల్లో "ఇంగ్లాండే సముద్రములో మునిగిపోవు నెడల ఇక ఇండియాలో నీ సైన్యమెందుకు అని యోచించి ఆయన (వైస్రాయి హార్డింజి ప్రభువు) ఒక్కరోజు విశ్రాంతి లేకుండ మార్సిలీసు నుండి ఫ్లాండర్సు యుద్ధభూమికి తక్షణము సైన్యమును నడిపించెను. ఆ పంపబడిన భారత సైన్యమే మిత్రమండలి వారిని వినాశము కాకుండ సంరక్షించినది."

ఫ్రాన్సు, ఫ్లాండర్సు, పాలస్టెయిన్ మొదలగు చోట్ల 5 లక్షలకుపైగా భారతీయ సైనికులు బ్రిటన్ తరపున పోరాడారు. చైనాలోను, ఇతర రంగాలలోను పది లక్షల మంది భారతీయ సైనికులు పోరాడినట్లు మరొక అంచనా. వీరిలో పదిమందికి ఒకరు చొప్పున చనిపోవడమో, అంగవైకల్యం చెందడమో జరిగింది. భారత దేశం భరించిన యుద్ధ ఖర్చులు 12 కోట్ల 70 లక్షల పౌనులు. భారత జాతీయ రుణం 30 శాతం పెరి గింది, ఈభారంఅంతా ప్రజలపైపడింది. యుద్ధకాలంలో విదేశీ దిగుమతులు దాదాపు ఆగిపోయాయి. యుద్ధం మూలంగా బ్రిటన్‌కు అవసరాలు పెరిగాయి. ఈ అవ సరాలను తీర్చడానికి భారతదేశం ఎక్కువ ఉత్పత్తి చేయవలసి వచ్చింది. ఆ విధంగా భారతదేశ వర్తకం, పరిశ్రమ కొంత అభివృద్ధి చెందిన మాట నిజమే. పారిశ్రామిక వేత్తలకు అధికలాభాలు, సంపదా లభిం చాయి. పారిశ్రామిక అభివృద్ధికి ప్రభుత్వం చురుకుగా పనిచేయాలని 1916 లో పారిశ్రామిక కమిషన్ సూచించింది. పారిశ్రామిక విధానంలో మార్పులు వస్తాయని భారతీయ పారిశ్రామిక వేత్తలు ఆశించారు.

మరొకప్రక్క పారిశ్రామిక వస్తువుల ధరలు పెరి గాయి. కాని వ్యవసాయోత్పత్తుల ధరలు పెరగలేదు. ఉక్కు, వస్త్రపరిశ్రమలలో విపరీత లాభాలు వచ్చాయి. భారతీయులలో ఎక్కువ మందికి ఉపాధి కల్పనకు అవకాశం ఏర్పడింది. ఐతే ఈ పరిస్థితు లను తమ కనుకూలంగా భారత పారిశ్రామికాధిపతులు వుపయోగించుకోలేక పోయారు. మెషీన్లు తయారు చేసేపరిశ్రమలు ఇక్కడలేవు. యుద్ధకాలపు కంట్రోళ్ల మూలంగాను, నౌకలకొరత కారణంగాను ఎగుమతులు తగ్గిపోయాయి, యుద్ధం చివరిరోజుల్లో ఉత్పత్తి తగ్గి పోసాగింది, పరిశ్రమలు మూతపడటం వల్ల నిరు ద్యోగం పెరిగింది. ధరలు కూడా పెరిగాయి.

రైతులు విపరీత పన్నులు చెల్లించవలసి వచ్చింది. ఎక్కువ కౌళ్ళు యిచ్చుకోవలసి వచ్చింది.

యుద్ధకాలంలో సైనికులను రిక్రూట్ చేయడంలో, యుద్ధనిధులను వసూలు చేయడంలో బ్రిటిష్ అధికారులు చాలా నిరంకుశ పద్ధతులు అవలంబించారు. యుద్ధం ముగిశాక పరిస్థితి మరింత అధ్వాన్నమయింది. విదేశ వస్తువుల దిగుమతి మళ్ళా ప్రారంభమైంది. విదేశ పెట్టుబడులు పెద్ద ఎత్తున ఈ దేశంలో పెట్టడం ప్రారంభించారు. భారత పరిశ్రమలు నష్టాలకు గురయ్యాయి. క్రమంగా మూతపడడం ప్రారంభమయ్యాయి. వీటన్నిటికీ తోడు ప్లేగు, ఇన్ఫ్లూయెంజా కోటీ 20 లక్షల మందిని బలిగొన్నాయి. కోటీ 40 లక్షల మంది అని మరో అంచనా. దీనితో ప్రజల అసంతృప్తి పెరిగిపోయింది. యుద్ధం ముగిసిన వెంటనే సామ్రాజ్యవాద నగ్నస్వరూపం బయట పడింది. భ్రమలు తొలగిపోసాగాయి. బాలగంగాధర తిలక్ - అనీబిసెంట్ల "హోంరూల్" ఉద్యమం, యుద్ధ కాలంలో దేశంలోను విదేశాలలోను బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలదోయడానికి వివిధ విప్లవ సంఘాలు నడిపిన ఉద్యమాలు, బ్రిటిష్ ప్రభుత్వ హత్యాకాండ, నిర్బంధ విధానాలు, ఖిలాఫత్ ఉద్యమం, హిందూ ముస్లిం సఖ్యత - ఇవన్నీ యుద్ధానంతరం గాంధీ నాయకత్వాన నడిచిన నాన్ కోపరేషన్ ఉద్యమానికి నాంది వాచకాలు.

వీటిని గురించి క్లుప్తంగా తెలుసు కుందాం.

# "హోం రూల్" ఉద్యమం

భారత జాతీయోద్యమాన్ని ప్రభావితం చేసిన దేశాల్లో, ఐర్లాండ్ ఒకటి. అది బ్రిటన్‌కు వ్యతిరేకంగా సాగిన పోరాటాలు, మన దేశంలో జాతీయోద్యమాన్ని అవి ఉత్సాహపరిచాయి. 1914 సెప్టెంబరులో ఐరిష్ ప్రజలు "హోం రూల్" (స్వీయపాలన) కావాలని ఆందోళన చేశారు. హోంరూల్ చట్టానికి బ్రిటన్ ఆమోదించింది. భారతదేశ స్వాతంత్ర్యానికి కృషి చేసిన విదేశీయులలో అనీబిసెంట్ ఒకరు. ఆమె ఐరిష్ జాతీయురాలు. 1847 అక్టోబరు 1 న లండన్‌లో జన్మించింది. రెవరెండ్ ఫ్రాంక్ బిసెంట్‌ను వివాహ మాడింది. ఆమె గార్హస్థ్య జీవితం సుఖప్రదంగా సాగలేదు. 1873లో భర్తనుండి విడాకులు పుచ్చుకుంది. ఆమెకు భారతీయ మతాలు, తత్వశాస్త్రాలు, సంస్కృతి-వీటిపట్ల గాఢాభిమానం వుండేది. దివ్యజ్ఞాన సమాజం, సాంఘిక సేవ, విద్యా విషయాలలో చేసిన కృషిద్వారా ఆమె ప్రముఖ వ్యక్తిగా రాణించింది. 1893-94 సంవత్సరాలలో దివ్యజ్ఞాన సమాజాన్ని భారతదేశంలో స్థాపించడానికి కృషిచేసింది. కాశీలో ఆమె "సెంట్రల్ హిందూ స్కూలు" స్థాపించింది. తరవాత అది కాలేజీగా మారింది. 1913లో దాన్ని మాలవీయకు అప్పగించింది. దాన్నే ఆయన తీర్చిదిద్ది "కాశీ హిందూ విశ్వవిద్యాలయం"గా పెంపొందించారు. 1915లో ఆమె హోంరూల్ లీగ్ స్థాపించింది. ప్రభుత్వ నిర్బంధానికి గురయ్యింది. 1917 కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించింది. ఆమె వాగ్ధాటిగల గొప్ప వక్త. ధైర్యశాలైన రాజకీయవేత్త, మంచిరచయిత్రి. 1878లో "ఇంగ్లండ్, ఇండియా - ఆఫ్ఘనిస్థాన్" అనే గ్రంథం రాసింది. "భారతదేశం బ్రతకాలా? చావాలా?" "భారతదేశం ఒక జాతి", "భారత రాజకీయాల భవిష్యత్తు", "బానిస భారత దేశమా? స్వతంత్ర భారత దేశమా?" మొదలైన గ్రంథాలు రాసింది. భారత దేశాన్ని మాతృదేశంగా చేసుకుని ఇక్కడే స్థిరపడింది. ఆమె 1933 సెప్టెంబర్ 21 న చనిపోయింది.

1914 లో ఆమె ఇంగ్లాండ్‌లో వుంది. పార్లమెంట్‌లో భారతీయ పార్టీని ఏర్పరచాలనే ఆమె ప్రయత్నం ఫలించలేదు. భారత దేశానికి స్వపరిపాలన ఇవ్వాలని ఇంగ్లాండ్‌లో ఆమె ప్రచారం చేసింది. అక్కడ "హోం రూల్ లీగ్" స్థాపించింది. యుద్ధ కాలంలోని "భారతదేశ విధేయత విలువ భారతదేశ స్వాతంత్ర్యమే" నని ఆమె ప్రచారం చేసింది.

భారతదేశానికి రాగానే "న్యూ ఇండియా" అనే పత్రికను, "కామన్ వీల్" అనే వార పత్రికను నిర్వహించింది. 1915 సెప్టెంబరులో బొంబాయి లోని ఆమె వుపన్యాసం "హోంరూల్" ఆశయాల సారాంశాన్ని స్పష్టం చేస్తుంది. "ప్రజలందరి చేత ఎన్నుకోబడిన కౌన్సిళ్ళ ప్రభుత్వమే స్వీయ ప్రభుత్వం. ఈ కౌన్సిళ్ళకు ఆర్థిక విషయాలలో కూడా అధికారం వుండాలి. ఎన్నికైన సభలకే ప్రభుత్వం లోబడి వుండాలి. సామ్రాజ్య శాసనసభలో (ఇంపీరియల్ కౌన్సిల్) కూడ ఎన్నికైన ప్రతినిధులు వుండాలి. వివిధ శాఖలకు బాధ్యులైన వారు ఎన్నికైన సభకు బాధ త కలిగి వుండాలి. ఇందులోని ప్రజాప్రతినిధులకు ఆ క విషయాలలో అధికారం వుండాలి రాష్ట్రాలలో. రా ష్ట్ర పార్లమెంట్‌లు (శాసన సభలు) ప్రజలచే ఎన్నుకోబడాలి. అవి ఆ పార్లమెంట్‌లకు (శాసన సభలకు) బాధ్యత వహించాలి. ఇంగ్లాండులో చక్రవర్తి లాగా పరిమిత అధికారాలతో గవర్నర్ వుండాలి"

1915 సెప్టెంబర్ 25 న ఆమె "న్యూ ఇండియా" పత్రికలో హోం రూల్ లీగ్ స్థాపన గురించి లాంఛన ప్రాయంగా ప్రకటించింది. దాని ఆశయం "భారత దేశానికి స్వీయపాలన (హోం రూల్)" అని ప్రకటించింది. ఈ సంఘం బ్రిటన్‌లోని హోంరూల్ కమిటీకి, భారతదేశంలో జాతీయ కాంగ్రెస్‌కు అనుబంధ సంస్థగా వుంటుందనీ, భారత దేశానికి సంబంధించి ఇంగ్లీషు ప్రజాస్వామ్యం గురించి ప్రచారం చేయడం దాని పని అనీ తెలియచేసింది. 1915 లో బొంబాయి కాంగ్రెస్‌లో ఈ అభిప్రాయాలతో కూడిన ఒక తీర్మానాన్ని అనీబిసెంట్ ప్రవేశపెట్టింది. కాని కాంగ్రెస్ నిబంధనావళికి ఇది విరుద్ధంగా వున్నదంటూ కాంగ్రెస్ అధ్యక్షుడు ఆ తీర్మానాన్ని త్రోసిపుచ్చాడు. ఐతే ఆలిండియా కాంగ్రెస్ కమిటీ ఈ విషయమై ఆలోచించి ఒక పథకం తయారు చేయడానికి కాంగ్రెస్ ఆమోదించింది అందుచే అనీబిసెంట్ "హోం రూల్ లీగ్" స్థాపనను వాయిదా వేసింది. మితవాద కాంగ్రెస్ నాయకులు దాని అమలుకు ఎలాంటి కృషీ చేయలేదు. అందుకని అనీబిసెంట్ మద్రాసును ప్రధాన కార్యాలయ

స్థానంగా పెట్టుకొని 1916 సెప్టెంబర్ 15 న "హోం రూల్ లీగ్"ను స్థాపించింది.

తిలక్ 1908 లో ఆరేళ్ళ శిక్షకు గురై, బర్మా లోని మాండలే జైలులో ఆ శిక్షను అనుభవించి 1914 లో భారతదేశానికి తిరిగి వచ్చారు. సూరత్ కాంగ్రెస్ నుండి తిలక్ విడుదల దాకా, ఈ ఏడేళ్ళ కాలంలో, కాంగ్రెస్ మితవాదుల చేతిలో వుంది. తిరిగి కాంగ్రెస్‌ను పటిష్టవంతంగా నిర్మించాలనీ, ప్రజా బాహుళ్యం ఆధారంగా శక్తివంతమైన ఉద్యమాన్ని నిర్మించాలనీ తిలక్ భావం. 191 లో ఈస్టర్ వద్ద జరిగిన ఐరిష్ తిరుగుబాటు తిలక్ "హోమ్ రూల్" ఉద్యమాన్ని గాఢంగా ప్రచారం చేయడానికి ఉత్సాహ పరచింది.

అనీబిసెంట్ గాని, తిలక్ గాని ఆనాటి పరిస్థితులలో మొదట బ్రిటిష్ ప్రభుత్వం పట్ల విధేయత ప్రకటించిన మాట నిజమే. "భారతదేశ విధేయత విలువ భారతదేశ స్వాతంత్ర్యమే" అని పలికిన అనీబిసెంట్ సైతం ఆ ఖచ్చితమైన వైఖరిని వీడి, యుద్ధ కాలంలో తిరుగులేని విధేయత ప్రకటించాలని కోరింది. తిలక్ కూడా, విపదలై రాగానే బ్రిటిష్ ప్రభుత్వానికి విధేయత ప్రటించారు "తన శక్తి మేరకు ప్రభుత్వానికి సహాయపడటం, దాన్ని బలపర్చడం ప్రతి భారతీయుని విధి" అన్నారు.

ఆనాడు జాతీయ నాయకులంతా, బెంగాల్ పంజాబ్‌ల లోని రహస్య విప్లవకారులు మినహా, బ్రిటన్‌తో సహకరించితే 'స్వపరిపాలన' ఆ తర్వాత సులభ సాధ్యమని నమ్మారు. అందుకనే ఈ ప్రకటన. దక్షిణాఫ్రికానుండి 1915 జనవరిలో భారతదేశానికి తిరిగి వచ్చిన గాంధీజీ యుద్ధానికి భారతీయులను రిక్రూట్ చేసే కార్యక్రమాన్ని ప్రారంభించాడు. ఈ విషయమై కొన్నాళ్ళ తర్వాత గాంధీ చేసిన ప్రవచనలోని ఒక వాక్యం చాలు ఆనాటి పరిస్థితులను అ ం చేసుకోవడానికి; "1914 నాటి నా మనస్తత్వాన్ని గురించి రాస్తున్నాను. అప్పుడు (బ్రిటిష్)సామ్రాజ్యం లోనూ, స్వాతంత్ర్య పోరాటంలో భారత దేశానికి సహాయం చేయడానికి సామ్రాజ్యానికి గల ఇష్ట పూర్వక సామర్థ్యంలోనూ నాకు నమ్మకం వుండేది."

అనీబిసెంట్ 1914 లో కాంగ్రెస్‌లో చేరింది. 1914-15 సంవత్సరాలలో కాంగ్రెస్‌లోని మితవాదులకు, అతివాదులకు మధ్య ఐక్యతకై ఆమె కృషి చేసినా అది ఫలించలేదు. బొంబాయిలో 1915 న జరిగిన కాంగ్రెస్ మహాసభ సూచించిన రాజీ షరతుల ప్రకారం, తిలక్ కాంగ్రెస్‌లో తిరిగి చేరడానికి మరో సంవత్సరం వేచి వుండవలసి వచ్చింది. బొంబాయి కాంగ్రెస్‌లో కాంగ్రెస్ నియమావళి మార్పు చేయబడింది. 1913 డిసెంబరు 31 నుండి పనిచేస్తున్న సంఘాలు తమ ప్రతినిధులను ఎన్నుకోవచ్చు. ఐతే "భారతదేశం సక్రమ మార్గముల తో బ్రిటిష్ సామ్రాజ్యానికి లోబడిన స్వపరిపాలన సంపాదించుట ఆ సంఘ ఉద్దేశ్యమై వుండాలి." కాంగ్రెస్ సగం ద్వారం తెరిచింది. దానిగుండానే తమ పక్షంవారు లోనికి వెళ్ళ డానికి యిష్టపడుతున్నారని తిలక్ అన్నారు.

ఆనాడు తిలక్ వాదనా పటిమ, చెప్పే ఉదాహరణలు ప్రజలకు సూటిగా అర్థమయేవి. ఆయన రాతలు, ఉపన్యాసాలలోని ఈ క్రింది భాగాలు చూస్తే, అవి ప్రజలకెంత తొందరగా హృదయానికి హత్తుకుంటాయో అర్థమౌతుంది.

"వందమైళ్ళ దూరములో యుద్ధం జరుగుతుండగా ఐర్లండుకు హోమ్‌రూల్ ఇవ్వాలా? వద్దా? అని ఇం ండులో చర్చ జరుగుతూవుంది. అలాంటప్పుడు యు ం ముగిసేదాకా భారతదేశం ఎందుకు ఆగాలి? ఆగకుం నే హోమ్‌రూల్ (స్వీయపాలన) అడగాలి. పూర్తి స్వీయపాలనకు గడువు నిర్ణయించుతూ పార్లమెంట్‌లో బిల్లు ప్రవేశపెట్టాలి."

* * *

"చక్రవర్తి స్వయంగా పరిపాలిస్తున్నాడా? వైస్రాయి, గవర్నర్లు, కలెక్టర్లు లాంటి సేవకులద్వారా పరిపాలి న్నాడు. అలాంటప్పుడు ఇప్పటి గవర్నరు లేక కల ర్ కావాలని మేం కోరితే, అది రాజద్రోహమా మేం ఇంగ్లీషు ప్రభుత్వాన్ని తరిమి వేయమనడంలేదే. సివిల్ అధికారులో, మా బ్రేల్వీసాహెబో పరిపాలన సాగించితే చక్రవర్తికి ఏమైనా నష్టమా? పరిపాలన అలాగే ఉంటుంది. చక్రవర్తి అలాగే ఉంటాడు.

"మేం స్వరాజ్యం ఎందుకు కావాలంటున్నాం?దానికి మేం అర్హులం కాదా? ఎందుకని? మాకు ముక్కులేదా? కళ్ళులేవా? చెవులు లేవా? బుర్రలేదా? మేం రాయలేమా? చదవలేమా? గుర్రాలపై స్వారి చేయలేమా? ఇంగ్లండు నుండి మొన ఒక 21 ఏళ్ళ కుర్రవాణ్ణి కలెక్టరుగా

తీసుకువస్తారు. అతనికేమైనా అనుభవం వుందా? రు. 150 ల నుండి రు. 400- లు సంవత్సరానికి జీతం పుచ్చుకొని 60 ఏళ్ళ అనుభవం వున్న మమలత్ దార్ కన్నా అతడు ఒక దెబ్బన అధికుడవుతాడా?

"బ్రిటిష్‌వాళ్ళు మేం పాలనకు అనర్హులమనీ, వారు మాకు నేర్పడానికి వచ్చామనీ అంటారు. ఎన్నాళ్ళు నేర్పడం? ఒక తరమా? రెండు తరాలా? మూడు తరాలా? దానికి అంతువుందా? ఎల్లప్పుడూ మీ కింద ఇలాగే బానిసలలాగా బతకాలా?

* * *

"మొత్తం సామ్రాజ్య వ్యవహారాలు అన్నీ చూస్తూ ఇంగ్లండులో వుండేవాడికి నెలకి 5 వేల రూపాయలు జీతం కాగా, ఇక్కడ ఇండియాలో ఆ పని నిర్వహించే వాడికి 20 వేల రూపాయలు జీతమా? 'ఇదుగో భారత దేశం-మెక్కండి' అని వ్యంగ్యధోరణితో విమర్శ.

"ఈనాడు జరుగుతున్న అన్యాయానికి పరిష్కార మార్గం—అధికారం ప్రజల చేతుల్లోకి రావడం-అది వారి చేతుల్లో ఉండాలి."

* * *

ఐతే, ఈ లోగా వూరికే కూర్చుండటం తిలక్ స్వభావంకాదు. హోమ్ రూల్ లీగ్‌ను స్థాపించాడు. 1916 ఏప్రిల్ 23 న పూనాలో స్థాపించిన హోమ్‌రూల్ లీగే మొట్టమొదటిది. అనీబిసెంట్ ఆ తర్వాత స్థాపించింది. ఈ రెండింటికీ తేడా తెలియజేయడానికై ఆమె తన సంఘానికి ఆలిండియా హోమ్‌రూల్ లీగ్ అని పేరు పెట్టింది. తిలక్ తన హోమ్‌రూల్‌లీగ్ కార్యకలాపాలను మహారాష్ట్రను, మధ్య రాష్ట్రానికి పరిమితం చేసుకొన్నాడు. మిగతా భారతదేశంలో అనీబిసెంట్ తన ఉద్యమాన్ని నిర్మించింది. ఈ రెండు సంఘాలు పరస్పర సమన్వయంతో పనిచేశాయి. కాంగ్రెస్‌లో అతివాదులకు, అనగా జాతీయ వాదులకు, హోమ్ రూల్ ఉద్యమం నిర్మాణ నివేదికగా ఉపయోగపడింది. మధ్యతరగతి ప్రజానీకం. మహిళలు ఈ ఉద్యమంలోకి ఆకర్షింపబడ్డారు.

"హోమ్ రూల్" ఉద్యమం దేశమంతా వ్యాపించింది. ఈ ఉద్యమ సందర్భంగానే అనీబిసెంట్ హోం రూల్ వలంటీరు దళాలను బాయ్‌స్కౌటు ఉద్యమాన్ని, జాతీయ విద్యా పథకాన్ని ప్రారంభించింది. ఆంధ్రప్రదేశ్‌లోనే సంవత్సరంలోపల 52 "హోంరూల్ లీగ్" శాఖలు ఏర్పడ్డాయి. ఆంధ్రలో అనీబిసెంట్ పర్యటన దానికి సహాయపడింది. హోంరూల్ ఉద్యమం మహిళల్ని కూడా విశేషంగా ఆకర్షించినట్లు అనీబిసెంట్ 1917 కాంగ్రెస్ మహాసభలో చెప్పింది. "అనేకమంది స్త్రీలు, తమ స్వభావానుగుణమైన త్యాగం, సహనం, ధైర్యసాహసాలతో సహాయపడ్డారు. అందుకే 'హోంరూల్ ఉద్యమం పదిరెట్లు తీవ్రరూపం దాల్చింది మద్రాసులో పోలీసులు పురుషుల ఊరేగింపులను ఆపివేసినపుడు స్త్రీలు ముందుండి నడిచారు. నిర్బంధితులను విడుదల చేయాలని వారు దేవాలయాల్లో ప్రార్థనలుచేశారు. వారి ప్రార్థనలే నిర్బంధితుల విడుదలకు కారణభూతమయ్యాయి."

అంతేగాక, మతంతో కూడ ముడి వేసుకున్న కారణాన ఈ ఉద్యమాన్ని సాధువులు, సన్యాసులు గ్రామ గ్రామాల్లో ప్రచారం చేశారు. భాషా ప్రయుక్త రాష్ట్రాలు అవసరమనే సిద్ధాంతాన్ని కాంగ్రెస్ కన్నా ముందుగా ఆమోదించినది ఈ ఉద్యమమే. అందువ కూడా దీనికి విశేష ప్రాచుర్యం లభించింది. సుప్రసిద్ధ పత్రికా సంపాదకుడు సి. వై. చింతామణి అనీబిసెంట్‌ను ఇలా ప్రశంసించాడు. "ఆమె (ఉపన్యాసంలోని) మాట ద్వారాను (పత్రికల్లో రాసిన రాతల్లోని) పదం ద్వారాను దేశాన్ని ఉర్రూతలూగించింది. బహుశా అలా చేయగల్గినవారు అరుదు."

అందుకే ప్రభుత్వం కన్నెర్ర చేసింది. విద్యార్థులు రాజకీయాందోళనలో జోక్యం కలుగ చేసుకోరాదంటూ పెంట్లాండ్ ప్రభువు జి.ఓ జారీచేయించాడు. ఆంధ్రలో కూడ విద్యార్థులు బహిరంగ సభలకు హాజరు కాకూడదనీ, విద్యా సంస్థల అధికారులు ఇది అమలు పరచకపోతే గుర్తింపు రద్దుచేస్తామనీ ప్రభుత్వం బెదరించింది. కాని యే ప్రిన్సిపాలూ దాన్ని అమలు పరచలేకపోయాడు.

అనీబిసెంట్ నడుపుతున్న "న్యూ ఇండియా" దిన పత్రిక, "కామన్ వీల్" వారపత్రికలు ప్రభుత్వానికి ధరావత్తు కట్టవలసి వచ్చింది. ఇందులో "న్యూ ఇండియా పత్రిక కట్టిన ధరావతు రెండువేల రూపాయలను 1917 లో ప్రభుత్వం వశపర్చుకొని, మరో పది వేల రూపాయల ధరావతు కట్టించుకుంది. మొత్తం ఇరవై వేల రూపాయల ధరావతును ప్రభుత్వం ఈ రెండు పత్రికల నుండి స్వాధీన పరచుకుంది.

తిలక్ విషయంలో కూడ ప్రభుత్వం ఇలాగే వ్యవహరించింది. 1916లో తిలక్ షష్ఠి పూర్తి ఉత్సవం జరిగింది. లక్ష రూపాయలు ఆ సందర్భంగా ఆయనకు ప్రజలు బహూకరించారు. ఆ మొత్తాన్ని ఆయన జాతీయోద్యమానికి ఇచ్చాడు. తిలక్‌ను ఏదో విధంగా ఉపన్యాసాలివ్వకుండా చేయాలని "సత్ప్రవర్తనకు పూచీపడా" లనీ మేజిస్ట్రేట్ కోరాడు. అందుకు ఆయన ఇరవై వేల రూపాయలు, మరో ఇద్దరు చెరొక పదివేల రూపాయలు పూచీ పడాలని కోరాడు. కాని 1916 నవంబర్ 9 న హైకోర్టు ఆ ఉత్తరువును రద్దుచేసింది. 1917 లో హోం రూల్ ఉద్యమం తీవ్ర రాజకీయాందోళన కొనసాగించింది. ప్రభుత్వం నిర్బంధ విధానం ప్రారంభించింది.

1917 జూన్ 15 న అనీబిసెంట్, అరెండేల్, బి.పి వాడియాలకు నిర్బంధ నివాస శిక్ష విధించారు. వాడియా "న్యూ ఇండియా" పత్రికకు సహాయ సంపాదకుడు. ఆరు స్థలాలను పేర్కొని, వాటిలో ఎక్కడైనా ఒక చోట వారు వుండాలని, ఆస్థలాల నుండి బయటికి పోరాదని ప్రభుత్వం ఇంటర్న్‌మెంటు ఆర్డరిచ్చింది. వీరు కోయంబత్తూరు, ఉదకమండలాలను ఎన్నుకొన్నారు. జిన్నా ఈ సమయంలోనే "హోం రూల్ లీగ్"లో చేరాడు. ప్రభుత్వ ఉత్తర్వులను, నిషేధాలను లక్ష్యపెట్టకుండా అనీబిసెంటు తన పత్రికలకు వ్యాసాలు రాస్తూ వుండేది. సి.పి. రామస్వామి అయ్యరు కూడా హోం రూల్ లీగ్ సభలకు, పత్రికా రచనకు తోడ్పడేవాడు.

అనీబిసెంట్ మొదలైన వారిని నిర్బంధించినందుకు ఆంధ్రదేశంలో కూడా నిరసన సభలు జరిగాయి. నిర్బంధం తొలగేవరకు లెజిస్లేటివ్ కౌన్సిలుకు సభ్యులు హాజరు కారాదని గుంటూరులో జరిగిన సభ కోరింది. అనీబిసెంట్ విడుదలకై సాత్విక నిరోధ ఉద్యమం ప్రారంభించాలని కొందరు సూచించారు. ఇది ఎంత వరకు ఆచరణ సాధ్యమో, ఎంత వరకు ఉపయోగకరమో ఆరు వారాల్లో తెలియజేయవలసిందిగా 1917 జూలై 28 న జరిగిన కాంగ్రెస్ ముస్లింలీగ్ సమిష్టి సమావేశం రాష్ట్ర కాంగ్రెస్ సంఘాల్ని, ముస్లింలీగ్ కార్య నిర్వాహకులను కోరింది. ఆంధ్రలో సాత్విక నిరోధానికి ఎక్కువమంది అనుకూలతను సూచించారు. మరి కొందరు వ్యతిరేకించారు. బెంగాల్‌లో బిసెంట్ మొదలైన వారి విడుదల కోరుతూ జరపవలసిన సభను బెంగాల్ రాష్ట్ర ప్రభుత్వం నిషేధించింది. కాంగ్రెస్ లీగ్ సమిష్టి సమావేశం దీన్ని గట్టిగా నిరసించింది. బెంగాల్ ప్రజలు తమ హక్కుల్ని కాపాడుకోడానికి న్యాయబద్ధమైన అన్ని మార్గాలు అవలంబించుతారనే ఆశాభావాన్ని ఈ సమావేశం వెల్లడించింది.

1917 ఆగస్టు, సెప్టెంబర్ మాసాలలో కొన్ని రాష్ట్రాలు సాత్విక నిరోధ ఉద్యమానికి అనుకూలంగానూ, కొన్ని వ్యతిరేకంగానూ అభిప్రాయాలిచ్చాయి. నిర్ణీతకాలంలో నాయకుల్ని విడుదల చేయని పక్షంలో సాత్విక నిరోధం ప్రారంభించాలని మరో రాష్ట్రం సూచించింది. అప్పటి భారత రాజ్యాంగ కార్యదర్శి మాంటేగ్యూ భారతదేశం వస్తాడన్న వార్త ఆధారంగా అతను భారతదేశం వచ్చేవరకూ సాత్విక నిరోధ ఉద్యమం ప్రారంభించరాదని కొన్ని రాష్ట్రాలు అభిప్రాయపడ్డాయి. 1917 ఆగస్టు 20 న మాంటేగ్యూ ఒక ప్రకటన చేశాడు: "బ్రిటిష్ సామ్రాజ్య అంతర్గత భాగం క్రమానుగతంగా బాధ్యతాయుత ప్రభుత్వాన్ని పొందేందుకుగాను, పరిపాలనలోని ప్రతి శాఖలోను భారతీయుల సంబంధాన్ని పెంచడమే గాక స్వపరిపాలిత సంస్థలను కూడా తమ ప్రభుత్వం అనుమతించుతుంది." అని మాంటేగ్యూ అన్నాడు.

ఇది జాతీయ నాయకులను తృప్తి పరచకపోయినా, వారి ఆగ్రహాన్ని కొంత తగ్గించింది. ఇందుకు ఉదాహరణ: మద్రాసు రాష్ట్రం బహిరంగ సభలను నిషేధించితే సాత్విక నిరోధ పద్ధతినవలంబించాలనిమద్రాసు రాష్ట్ర కాంగ్రెస్ తీర్మానించింది. కాని మాంటేగ్యూ ప్రకటన తర్వాత రాజకీయ వాతావరణం మారినందున 1917 సెప్టెంబరు 28 న సాత్విక నిరోధ ప్రయత్నాలు ఆపాలని తీర్మానించింది.

అనీబిసెంట్‌ను, ఆమె అనుచరులను అంతకు ముందే, సెప్టెంబరు 16 న విడుదల చేశారు ఆమె కూడా సాత్విక నిరోధఉద్యమానికి విముఖత చూపింది. ఇదియువకులకు ఆశాభంగం కల్గించింది. అఖిల భారత కాంగ్రెస్ సంఘం, ముస్లింలీగ్‌ల సమిష్టి సమావేశం అక్టోబరు 6 న సాత్విక నిరోధ ప్రయత్నాలను ఆపివేయాలని తీర్మానించింది.

అయితే కథ ఇంతటితో ఆగలేదు. 1917 కలకత్తా కాంగ్రెస్‌కు బిసెంట్ అధ్యక్షురాలయింది. ఇది హోమ్

రూల్ లీగ్ విజయంగా ప్రభుత్వం భావించింది. బిసెంట్, తిలక్‌లు కాంగ్రెస్ సంస్థను వశపర్చుకొన్నారనీ, కాంగ్రెస్‌లోని మితవాదపక్షం తుడిచిపెట్టుకు పోయిందనీ ప్రభుత్వం ఒక నివేదికలో పేర్కొంది.

1918 ఏప్రిల్‌లో వైస్రాయి ఢిల్లీలో యుద్ధ సభ జరిపాడు. దానికి ప్రభుత్వం జాతీయ నాయకుల్ని అందర్నీ ఆహ్వానించింది. తిలక్‌ను, బిసెంట్‌ను పిలవలేదు. ఆయన ఢిల్లీ రాకూడదనే ఉత్తరువును రద్దు చేయలేదు. ఢిల్లీ సభకు రావలసిందిగా గాంధీ తంతి పంపినా తనపై నిషేధపు ఉత్తరువులు రద్దు చేస్తేగాని రాలేనని ఆయన జవాబిచ్చాడు. ఈ విషయం ప్రభుత్వ దృష్టికి తెచ్చినపుడు, బొంబాయి గవర్నర్ తాను సమావేశపరచిన రాష్ట్ర నాయకుల సభకు తిలక్‌ను ఆహ్వానించాడు.

సైన్యంలో భారతీయులను రిక్రూట్ చేసే తీర్మానంపై తిలక్ మాట్లాడం ప్రారంభించాడు, బ్రిటిష్ ప్రభుత్వం "స్వయపాలన" ఇస్తామని వాగ్దానం చేస్తే, ప్రజల్ని బాగా ఉత్తేజపరచవచ్చని అన్నాడు. రెండు నిమిషాలన్నా తిలక్ ఉపన్యసించకముందే. గవర్నర్ తలబిరుసుగా తిలక్‌ను కూర్చోమని ఆజ్ఞాపించాడు. నిరసనగా తిలక్ సభ నుండి వెళ్ళిపోయాడు. గాంధీ, మరి కొందరు ప్రముఖులు తిలక్‌ను అనుసరించారు. గవర్నర్ చర్య బొంబాయి హోమ్‌రూల్ లీగ్‌లో తీవ్ర అసంతృప్తిని రేకెత్తించింది. 1918 జూన్ 16 న హోమ్ రూల్ దినోత్సవాన్ని పురస్కరించుకుని పెద్ద ప్రదర్శన చేశారు. దుకాణాలు మూసివేశారు. హోం రూల్ లీగ్ పతాకాలు నగరమంతా ఎగురవేశారు. నిధి వసూలు చేశారు. సాయంత్రం జరిగిన సభకు గాంధీజీ అధ్యక్షత వహించారు. గవర్నర్ చర్యను ఆయన నిరసించాడు, ప్రభుత్వ వాగ్దానాల నిజాయితీని శంకించుతూ జిన్నా సందేహం వెలిబుచ్చాడు. బొంబాయి గవర్నర్ విల్లింగ్‌డన్ అధ్యక్షత వహించే ఏ సభకూ, అతడు బహిరంగంగా తన మాటల్ని ఉపసంహరించుకొంటే తప్ప, హాజరు కాకూడదని తీర్మానించారు. గవర్నర్ రిటైరయినపుడు వీడ్కోలు పత్రం ఇవ్వరాదని కూడా బొంబాయి హోంరూల్‌లీగ్ నిశ్చయించింది.

ఇంగ్లాండులో అభివృద్ధి నిరోధకులు, భారత దేశానికి స్వపరిపాలన ఇవ్వరాదని చేస్తున్న ప్రచారాన్ని ఎదుర్కోడానికి అనీబిసెంట్ హోంలీగ్ ఒక ప్రతినిధి వర్గాన్ని ఇంగ్లండుకు పంపింది. 1917 జూలైలో జోసెఫ్ బాప్టిస్టా అక్కడికి వెళ్ళి విరివిగా భారత స్వపరిపాలన ప్రచారం చేశాడు. తిలక్‌లీగ్ కూడా పంపిన ప్రతినిధి వర్గం మధ్య మార్గంలో బ్రిటిష్ ప్రభుత్వం ప్యాసుపోర్టులు రద్దు చేసినందున ఒక వారములో తిరిగి భారతదేశానికి రావలసి వచ్చింది. తిలక్ తానే స్వయంగా ఇంగ్లండ్ వెళ్ళదలచాడు. బ్రిటిష్ మంత్రివర్గం, ఆయన బ్రిటన్‌లో రాజకీయ ఆందోళన్లో పాల్గొననని హామీ ఇచ్చే షరతుపై వెళ్ళనిచ్చింది. ఇంగ్లండ్ వెళ్ళగానే తనపై విధించిన షరతులు ప్రజాస్వామ్య విరుద్ధమని వాదించి రద్దుచేయించుకోగల్గాడు. ఒక జస్ పార్టీ ప్రతినిధికి లేని ఆంక్ష తనపై ఎందుకని ఆయన వాదించాడు. ఆ తర్వాత ఉపన్యాసాల ద్వారా, వ్యాసాల ద్వారా విస్తృత ప్రచారం చేశాడు.

"భారతీయుల రక్తాన్ని పీల్చే దోపిడీ నైతిక విరుద్ధమైనది. దీన్ని ఇంకా ఎన్నాళ్ళు సాగిస్తారు" అని తిలక్ అడిగాడు. ఈస్టిండియా కంపెనీ సాగించిన దురంతాలను వెల్లడించాడు. భారత చేనేత పనివారల బొటన వేళ్ళను నరికి వేసి, ఆ విధంగా తమతో పోటీ నివారించడానికి చేసిన ఘాతుక కృత్యాలను బయటపెట్టాడు. బ్రిటిష్ సామ్రాజ్యం, దాని మిత్రమండలి ప్రచారం చేస్తున్న ప్రజాస్వామ్య సూత్రాలను మొదట భారతదేశంతోనే ప్రారంభించాలని కోరాడు. భారతదేశం సంపూర్ణ స్వపరిపాలన పొందడానికి ఒక నిర్ణీతమైన గడువు పెట్టాలని బ్రిటిష్ జాయింట్ పార్లమెంటరీ కమిటీకి విజ్ఞప్తి చేశాడు.

అమెరికాలో లాలా లజపతిరాయ్ మొదలైనవారు హోంరూల్ లీగ్ శాఖను శాన్‌ఫ్రాన్సిస్కోలో ఏర్పరచి, అమెరికాలో భారతదేశ స్వాతంత్ర్య ఆశయాల గురించి విస్తృత ప్రచారం చేశారు. బ్రిటిష్ ప్రభుత్వానికి హడలెత్తి తమ తరఫున కూడా కొందర్ని పంపి, ప్రతికూల ప్రచారం చేయించింది. కాని అది జయప్రదం కాలేదు.

1920 లో గాంధీజీ హోంరూల్ లీగ్‌కు అధ్యక్షుడయ్యాడు.

యుద్ధ కాలంలో జరిగిన దురంతాలు, ప్రభుత్వం తలపెట్టిన అరకొర రాజ్యాంగ సంస్కరణలు, రౌలట్

ఆక్టు ద్వారా తీవ్రదమన నీతిని ప్రదర్శించిన ప్రభుత్వ చర్యలు - ఇవన్నీ నాన్ కోపరేషన్ ఉద్యమాన్ని ప్రారంభించాలనే నిర్ణయానికి గాంధీజీ రావడానికి తోవ తీశాయి. కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్‌లో ఈ విషయమై నిర్ణయం జరగబోతున్నది. ఆ కాంగ్రెస్ ఈ నిర్ణయాన్ని అంగీకరిస్తుందో లేదో నని గాంధీజీకి అనుమానం. అంచేత హోంరూల్‌లీగ్ ద్వారా ఆ నిర్ణయం చేయదలచుకున్నాడు. హోంరూల్ లీగ్ నిబంధనావళిని మార్పించి, "స్వరాజ్య సభ" అని పేరు పెట్టాడు. తర్వాత కలకత్తా కాంగ్రెస్ సహాయ నిరాకరణోద్యమ తీర్మానం ఆమోదించుటతో, "స్వరాజ్య సభ"కు దాని అవసరం తప్పింది. హోంరూల్ లీగ్ నిబంధనావళిని మార్చి కష్టతరం చేయడంతో పాటు సహాయనిరాకరణ 'నాన్‌కోపరేషన్' ఉద్యమ విజృంభణతో, హోంరూల్ లీగ్ ఉద్యమం కనుమరుగయింది.

హోంరూల్ ఉద్యమం తిలక్, అనీబిసెంట్‌ల నాయకత్వాన జరిగే స్వాతంత్ర్య ఉద్యమంలో కొత్త దశను ప్రారంభించింది. స్వీయపాలనకై నిర్దిష్ట పథకాన్ని దేశం ముందు వుంచింది. తీరిక వేళల్లో కులాసాగా రాజకీయాలను పట్టించుకొనే ధోరణిని తెగనాడింది. మాతృదేశానికి తమ యావత్ కాలాన్నీ, శక్తినీ ధారపోసే నాయకులు దేశానికి అవసరమని ఆచరణ ద్వారా నిరూపించింది. రాజకీయ నాయకుని జీవితానికి ప్రవర్తనకు కొత్త ప్రమాణాన్ని చూపింది. స్వాతంత్ర్యం సాధించడానికి జాతీయ వనరులను శక్తులను కేంద్రీకరించాలని తెలియ చేసింది. చిత్తశుద్ధితో నిర్భీతితో ఎవరి అనుగ్రహాలకు, ఆగ్రహాలకు లెక్కచెయ్యకుండా, రాజకీయ రంగంలో ప్రజాఉద్యమాన్ని చొప్పించాలని- ఇందుకు దారి చూపిన వాడు తిలక్, 1916-18 లో హోంరూల్ ఉద్యమ ఫలితంగా దేశమంతటా రాజకీయ సంఘాలేర్పడ్డాయి. రాజకీయ ఆందోళనా పద్ధతులలో క్రొత్త శైలిని రూపొందించింది. కొత్త కొత్త ప్రాంతాలలో ఉద్యమానికి ప్రజల మద్దతును సంపాదించింది ప్రజలలో కొత్త కొత్త శాఖలకు ఉద్యమం విస్తరించింది.

సామ్రాజ్యవాద ప్రభుత్వాలు ఎవరికి వాళ్ళు తామే విజేతలుగా రావాలని విశ్వ ప్రయత్నాలు చేస్తున్నాయి. ఒకదాని పీకను మరొకటి నులిమి వేసుకుంటున్నాయి దేశాన్ని విముక్తి చేయడానికి ఇదే అదను అని విప్లవకారులు భావించారు. ప్రజలు కూడా తమకు విముక్తి త్వరలో కలుగుతుందని ఆశిస్తూ వచ్చారు. స్వదేశంలో, విదేశాలలో బ్రిటిష్ సామ్రాజ్య వ్యతిరేక ఉద్యమాలు తలెత్తాయి.

# వహబీ్బలం

19 వ శతాబ్దం నాటి ముస్లిం తిరుగుబాటుదారులు "వహబీ్బ"లను పూర్తిగా అణచివేశామని బ్రిటిష్ పాలకులు భావించారు. కాని 1915 లో వాయవ్య రాష్ట్ర సరిహద్దులో వహబీ్బ ఉద్యమం తిరిగి తల యెత్తింది. వహబీ్బఉద్యమంఎంతవరకు మతపరమైంది? ఎంతవరకు జమీందారీ వ్యతిరేక ఉద్యమం? ఏ దశలో ఇది రాజకీయ స్వభావంసంతరించుకొంది అనే విషయా లలో చరిత్రకారులలో కొంత అభిప్రాయం వుంది. ఇటీవల చరిత్ర పరిశోధనలకు విస్తృత అవకాశాలు లభించినందున అనేక విషయాలు వెలుగులోకివచ్చాయి 1857 స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రను గురించి చెప్పినపుడు ఈ విషయమై ప్రస్తావించాము. ఇప్పుడు ఈ ఉద్యమం పూర్వాపరాలను 1915 ఘటనలను తెలుసుకొందాం.

18 వ శతాబ్దంలో అరబ్ మత సంస్కర్త అబ్దుల్ వాహెబ్ సిద్ధాంతాలను అనుసరించిన ముస్లిం తెగను వహబీ్బలు అంటారు అబ్దుల్ వాహెబ్ ఇస్లాం మత సిద్ధాంతాలకు భాష్యం చెప్పి, సంస్కరించిన శుద్ధ తత్వాన్ని ప్రవేశపెట్టాడు. వాహెబ్ అనుచరుల్ని వహబీ్బలంటారు. భారతదేశంలో ఈ ఉద్యమ సంస్థాపకుడు రాయబెరైలీకి చెందిన ఫకీర్ సయ్యద్ అహ్మద్ బ్రెల్వీ.

"వహబీ్బ" అనే పదాన్ని మనదేశ చరిత్రకు సంబంధించినంత వరకూ "ఇస్లాం వ్యతిరేకులు" అనే అర్థంలో ఉపయోగించినట్లు అనేక మంది ముస్లిములు భావిస్తున్నారు. విప్లవకారులను "టెర్రరిస్టులు"(వ్యక్తి గత హింసాకాండ జరిపే వారు)గా చిత్రించిన గానే బ్రిటిష్ పాలకులను, వారి తొత్తు న జమీం.. ను, వ వ్యాపారులను ఎదిరించిన ము ంలకు కూ.. ఇదే అ ం స్ఫురించే విధంగా బ్రిటిష్ లకులు, కొందరు చ త్ర కారులు వాడారు.

మన దేశంలో వహబీ్బల ఉద్యమం అసలు పేరు "మహమ్మదీయా తరీకా" దీని స్థాపకుడు సయ్యద్ అహ్మద్ బ్రెల్వీ బ్రిటిష్ వాళ్ళ పెత్తనం కూల్చడానికి జీహాద్ (పవిత్ర యుద్ధం) సాగించడానికి కృషిచేశాడు.

ఫ్యూడల్ యుగంలోను, అంతకు ముందు కాలం లోను మత ప్రాబల్యం ఉద్యమాలపై వుండేది. భారత దేశంలో ఇది మరీ స్పష్టం. అన్యాయాలను, పీడనను ఎదుర్కొనేందుకు ప్రజలను ఉత్తేజితం చేయడానికి మతాన్ని సాధనంగా చేసుకున్నారు కొందరు. ఇది ఆశ్చర్యపడవలసిన అంశం ఏమీ కాదు. మత ప్రమేయం కలిగి సామాజిక సంస్కరణ, మతంలోని చెడుగును తొలగించి క్షాళనం చేసే కార్యక్రమాలతో ప్రారంభమై చివరకు వ్యావసాయిక తిరుగుబాటుగా పరిణామం చెందిన ఘటనలు చరిత్రలో ఎన్నో వున్నాయి. చివరికవి బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో తలపడ్డాయి. అలాంటి వాటిలో వహబీ్బ ఉద్యమం ఒకటి. ఒక దశలో అది బెంగాల్, బీహార్, పంజాబ్, మద్రాసులకు వ్యాప్తి చెందింది 1857 స్వాతంత్ర్య సమరానికి ఈ ఉద్యమ అనుయాయులు పలుచోట్ల నాయకత్వం వహించారు. ఫరీద్‌పూర్‌కి చెందిన పీర్ షరియతుల్లా ఈస్టిండియా కంపెనీ మద్దతుగల బ్రిటిష తోట యజమానులకు, కొత్తగా ఏర్పడ్డ జమిందార్లకు, వడ్డీ వ్యాపారులకు వ్యతిరేకంగా "ఫరీజియా" ఉద్యమాన్ని నడిపాడు. "ఫరజ్" అంటే "అల్లా ఆజ్ఞ" అని అర్థం "ఫరైజీలేక ఫరాజీ" అంటే అల్లా ఆజ్ఞను పాలించే వాడని అర్థం.

మీర్ నజరలీ ఆధ్వర్యాన బెంగాల్‌లో కలకత్తాకు సమీపాన ఒక గ్రామంలో జరిగిన తిరుగుబాటుకు "బరాసత్" తిరుగుబాటు అంటారు. దానికి మీర్ నజరలీ నాయకత్వం వహించాడు. ఇతడిని "టిటూ మీర్" అనేవారు. కలకత్తా సమీపంలోని నార్‌కేల్ బెరియా గ్రామం కేంద్రంగా ఈ తిరుగుబాటు జరిగింది. మహమ్మద్ మాసుం సేనానాయకుడుగా రైతు యువకులు తిరుగుబాటు సైన్యంలో చేరారు. 1831 నవంబరు 17న జరిగిన తిరుగుబాటును ఫిరంగులు, గుర్రాలు మోసుకు వెళ్ళిన శతఘ్నులు, పది రెజిమెంట్ల పదాతి దళాలతో కూడిన సైన్యం డిసెంబరు 3 నాటికి ఓడించింది. ఆధునిక ఆయుధాలదే పై చేయి కావడంతో బ్రిటిష్ వాళ్ళు గెలిచారు. మాసూంను ఉరి తీశారు. అనేక మందికి యావజ్జీవ శిక్ష విధించబడింది. మొత్తం 300 మంది ఖైదీలయ్యారు. దీన్ని కూడా వహబీ్బ తిరుగుబాటు జాబితాలోనే చేర్చారు బ్రిటిష్ పరిపాలకులు.

బ్రిటిష్ వాళ్ళ ఆధీనంలో వున్న భారతదేశం "దారుర్ హరబ్" (శతృదేశం) అనీ "ఫిరంగి"లను (విదేశీయులను) తరిమి వేసి భారతదేశాన్ని "దారుల్ ఇస్లాం" (ఇస్లాందేశం)గా మార్చాలని ముస్లిం ఫెనటిక్స్ (మతోన్మాదులు)గా బ్రిటిష్ ప్రభుత్వం వర్ణించిన తిరుగుబాటు దార్లను కూడా "వహబీ్బ"లనే

చరిత్రకారు లన్నారు. దాదాపు అర్థ శతాబ్దం పాటు (1820 నుండి 1870 వరకు) జరిగిన ఈ పోరాటాలను బ్రిటిష్ ప్రభుత్వం అతి క్రూరంగా అణచివేసింది.

పఠాను జాతులు నివసించే వాయవ్య రాష్ట్ర సరిహద్దులో వారి సహకారంతో సితానాలో వహాబీలు ఒక కాలనీని నిర్మించుకొన్నారు. అక్కడ సైనిక శిబిరం ఏర్పరచుకొన్నారు. అదే తమ స్వతంత్రదేశ కేంద్రమనీ అన్నారు. అక్కడినుండి బ్రిటిషు వాళ్ళ బానిసత్వం క్రిందవున్న భారతదేశాన్ని విముక్తి చేయడానికి పథకాలు వేసుకొన్నారు. ఒకప్పుడు సిక్కులతో యుద్ధాలరోను, మరొకప్పుడు అంతఃకలహాలతో సతమతమైన వీరు, తిరిగి సమీకృతులై బ్రిటిషు ప్రభుత్వాన్ని హడలెత్తించారు. సితానా కేంద్రంగా వివిధ ప్రాంతాలకు ఆయుధాలను, వలంటీర్లను వస్తువులను సరఫరా చేస్తున్న వీరిని 1863 లో బ్రిటిష్ ప్రభుత్వం అతి క్రూరంగా అణచివేసింది. ఆ మరు సంవత్సరం పాట్నా, ఢిల్లీ లలో వహాబీలను అణచివేసింది. ఆ తర్వాత తిరుగుబాట్లపై అనేక విచారణలు జరిగాయి. 1864 లో అంబాలా విచారణ, 1865 లో పాట్నా విచారణ, 1870 సెప్టెంబర్‌లో మాల్దా విచారణ, 1870 అక్టోబరులో రాజమహల్ విచారణ, 1870-1871 లో దవారీ విచారణ జరిగాయి. "సామ్రాజ్య మహారాణికి వ్యతిరేకంగా యుద్ధం చేయడానికి కుట్ర చేశారు." అన్నదే ఈ ప్రతి విచారణలో ఆరోపణ.

వహాబీ ఉద్యమకారులు మంచి నిర్మాణదక్షతను ప్రదర్శించారు ఉద్యమాన్ని వివిధ ప్రాంతాలకు విస్తరింప చేశారు. అఖిల భారత స్థాయిలో బ్రిటిష్ వ్యతిరేక ఉద్యమ నిర్మాణానికి వహాబీ ఉద్యమం ప్రేరణ కల్గించింది. వహాబీ ఉద్యమాల చరిత్ర వినడంవల్లనే బిపిన్‌చంద్రపాల్‌కు మొట్టమొదటిసారి రాజకీయ చైతన్యం కలిగింది.

ఇక ప్రస్తుత విషయం. 1915 ఫిబ్రవరి లో లాహోర్ నుండి 15మంది విద్యార్థులు దేశాన్ని వదలి పెట్టిపోయారు. వహాబీ తెగకు చెందిన సయ్యద్ అహ్మద్ షా ఒక కాలనీని వాయవ్య రాష్ట్రంలోని స్వతంత్రప్రాంతంలో ఏర్పరచాడు. అక్కడ నివసించే వారిని ముజాహిదీ అనేవారు. రాజ ద్రోహకమిటీ రిపోర్టు వీరికి మతోన్మాదులు (ఫెనటిక్స్) అని పేరు పెట్టింది. లాహోర్ విద్యార్థులు వీరితో కలిశారు. (ప్రవక్త మహమ్మద్ ఉదాహరణను అనుసరించే వారిని అంటే, నిరంకుశత్వాన్ని భరించలేక తమ ఇండ్లనుండి వెళ్ళిపోయిన వారిని ముజాహిదీ అని అంటారు.) వారు కాబూల్ వెళ్ళారు. అక్కడ డిటెన్షన్‌కు గురయ్యారు. తర్వాత కొంత కాలానికి వారిని విడుదలచేశారు. కాని నిఘా మాత్రం వుంది. అందులో ఇద్దరు తిరిగి భారతదేశానికి వచ్చారు. రష్యా చేరిన ముగ్గుర్ని జార్‌ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వానికి అప్పగించింది. బ్రిటిష్ వాళ్ళు తమ శత్రువులు గనుక, ముస్లింల పవిత్రస్థలాలైన మక్కా, మదీనాలపై దాడి చేసి అవమాన పరుస్తారని టర్కీ సుల్తాన్ చేసిన ప్రకటనతో ఉద్రిక్తులయి, తామిక్కడికి వచ్చినట్లులాహోర్ విద్యార్థులు చెప్పారు. ఇదంతా ప్రభుత్వ రిపోర్టులలో ఉన్న విషయమే.

1917 జనవరిలో రంగపూరు, దక్కాలకు చెందిన ముస్లింలు కొందరు వాయవ్య సరిహద్దు ప్రాంతంలోని స్వతంత్ర ప్రాంతంలో ఏర్పరిచిన, కాలనీకి వచ్చి వహాబీలతో చేరారు. కొంత డబ్బు కూడా తెచ్చారు.

1916 ఆగస్టులో మరొక "కుట్ర"ను ప్రభుత్వం పేర్కొంది. దానికి "సిల్కు ఉత్తరాల" కుట్ర అని పేరు. వాయవ్య సరిహద్దులో బ్రిటిష్ వాళ్ళపై దాడి చేయాలనీ, దేశంలో ముస్లిములు ఒకేసారి తిరగబడాలనీ దీని పథకం.

1919 ఆగస్టులో ప్రభుత్వానికి ఈ కుట్ర గురించి తెలిసింది. వాయవ్య సరిహద్దులో బ్రిటిష్ వారిపై దాడి చేయడం, అదే సమయంలో భారతదేశంలో ముస్లింలు వారికి అండగా తిరగబడటం ఈ పథకంలో ముఖ్య అంశం. ఈ పథకాన్ని అమలు పరచడానికి మౌలానా ఒబేదుల్లా 1915 ఆగస్టు వాయవ్య సరిహద్దును దాటాడు. అతనితో పాటు మరికొందరు కూడా వున్నారు. సంయుక్త రాష్ట్రాల (యు. పి.) లోని షహరన్‌పూర్ జిల్లాలోని "దియోబంద్"లో ఒక ముస్లిం మత స్కూలులో మౌల్వీగా ఒబీదుల్లాతర్ఫీదు పొందాడు. ఇతడు సింధు రాష్ట్రానికి చెందినవాడు. సిక్కు జాతీయుడు. ముస్లిం మతం పుచ్చుకొన్నాడు. ఆ స్కూలులో బ్రిటిష్ వ్యతిరేక భావాలను అధ్యాపకులలోను, విద్యార్థులలోను వ్యాపింపచేశాడు. ఈ స్కూలులో ప్రధాన మౌల్వీ అయిన మౌలానా

మహ్మద్ హసన్ కూడా అతని ప్రభావానికి లోనయ్యాడు. ఈ విషయం గుర్తించి అతన్నీ, అతని సహచరులు కొందర్నీ స్కూలు అధికారులు ఉద్యోగం నుండి తొలగించారు. ఐతే మహ్మద్ హసన్‌తో ఒబీదుల్లాకు సంబంధాలు వుండేవి. అతని ఇంటికి వస్తూపోతూ వుండేవాడు. 1915 సెప్టెంబర్ 18 న మహ్మద్ హసన్‌కూడా భారతదేశం విడిచిపెట్టి వెళ్ళాడు అరేబియాలోని హెజాజ్‌కు వెళ్ళాడు.

మొదటి ప్రపంచ యుద్ధకాలంలో, ప్రభుత్వ అధికార పత్రాలలో సయ్యద్ ఒబీదుల్లా పేరుఅనేకసార్లు పేర్కొనబడుతూ వచ్చింది. ఢిల్లీలో, పంజాబ్ వాయవ్య రాష్ట్రాలలో విప్లవ పార్టీలను సంఘటితం చేశాడు. బ్రిటిష్ వాళ్ళకువ్యతిరేకంగా తాము సాగించే సాయుధ పోరాటంలో సహాయ పడవలసిందిగా ఆఫ్ఘనిస్తాన్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశాడు. కారణాలేమైనా సహాయపడలేక పోయింది. ఆఫ్ఘన్ ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వంతోటి మైత్రిని విడవాడవలసిందనీ, బ్రిటిష్ వాళ్ళకు వ్యతిరేకంగా భారతీయ దేశభక్తులు సాగించుతున్నపోరాటానికి సహాయ పడవలసిందనీ రష్యన్ జార్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశాడు.

ఒబీదుల్లా మరికొందరితో కలిసి పశ్చిమాసియాలో ముస్లిం సైనికులలో బ్రిటిష్ వ్యతిరేక తిరుగుబాటుకు ప్రచారం చేశాడు. టర్కిష్ గవర్నర్ ఘలిబ్ పాషా సహకారంతో ఈ ప్రచారం సాగించాడు. సింధ్‌లోని హైద్రాబాద్‌కు చెందిన మియా అన్సారీ, షేక్ అల్ రహ్మన్ కూడా వారితో కలిశారు. ఒబీదుల్లా మి డు హెజాజ్‌లో వున్న మహ్మద్ హసన్‌కు ర స్య సంకేత భాషలో సిల్కు గుడ్డపై ఉత్తరాలు నడిచాయి. పసుపు పచ్చని గుడ్డలపై చక్కగారాశారు ఆ ఉత్తరాలు. అందుచేతనే "సిల్కు ఉత్తరాల కుట్ర"గా దీన్ని వ్యవహరించారు.

ఒబీదుల్లా, ముస్లిం మతోన్మాదులని పిలువబడే వహాబీలతో మొదట చేరాడు. ఆ తర్వాత అక్కడ నుండి కాబూల్‌కిమిత్రులతో కలిసి వెళ్ళాడు. అక్కడ టర్కీ, జర్మనీ ప్రతినిధులను కలిశాడు. వాళ్ళతో మిత్రత్వం సాగించాడు. హెజాజ్‌లోని టర్కిష్ సైనిక గవర్నర్ ఘరీబ్ పాషా జారీచేసిన "పవిత్ర యుద్ధం" ప్రకటన (బ్రిటిష్ వాళ్ళపై) తీసుకొని ఒబీదుల్లాకు దియోబాంద్‌లో మిత్రుడైన మౌల్వీమహ్మద్ మియా అన్సారీ వచ్చాడు. 1916 లో ఈ ప్రకటన వెలువడింది. దాన్నే "ఘలీబ్ నామా" అంటారు. ఒబీదుల్లాకు దియోబంద్ స్కూలులో మిత్రుడైన హసన్ వెంట, హెజాజ్‌కు అన్సారీ వెళ్ళి తనతో ఈ ప్రకటన తీసుకొచ్చాడు. దీని నకళ్ళను తోవలో పంచుకొంటూ వచ్చాడు. వాయవ్య రాష్ట్ర సరిహద్దులోను, భారతదేశంలోను పంచిపెట్టాడు.

మౌలానా ఒబీదుల్లా కాబూల్‌లో ఏర్పడిన "తాత్కాలిక భారత ప్రభుత్వం"లో ఒక మంత్రి. ఈ ప్రభుత్వానికి అధ్యక్షుడు రాజా మహేంద్ర ప్రతాప్. అమెరికాలోని గదర్‌పార్టీ సభ్యుడైన బరకతుల్లా ప్రధాన మంత్రి. (గదర్‌పార్టీ, తదితర విప్లవ కారుల కార్యకలాపాలను గురించి మరొకచోట తెలుసుకుందాం ఈ తాత్కాలిక ప్రభుత్వం టర్కీ ప్రభుత్వంతో మైత్రి ఏర్పరచుకొని తమ లక్ష్యాన్ని సాధించాలనుకొంది. ఈ విషయాలన్నీ ఒబీదుల్లా తన మిత్రుడు మౌలానా మహ్మద్ హసన్‌కు ఒక ఉత్తరంలో రాశాడు. అలాగే హసన్‌కు అన్సారీ మరో వుత్తరం రాశాడు. ఈ ఉత్తరాలను బ్రిటిష్ ప్రభుత్వం గమ్యస్థానం చేరకుండానే పట్టివేసింది. మెక్కా షెరీఫ్ ద్రోహం చేశాడు. ఫలితంగా కుట్ర విఫలమైంది. దియోబంద్ స్కూలు ప్రిన్సిపాల్ షేక్-ఉల్-హింద్ యుద్ధఖైదీ అయ్యాడు. ఘలీబ్ పాషాను అనేక మంది ముస్లిం విప్లవ కారులను, ముస్లిం విద్యార్థులను, అనేక మంది సైనికులను అరెస్టు చేసి దీర్ఘకాల శిక్షలు విధించారు. 1918 వరకు మాల్టాలో మహ్మద్ హసన్‌ను మాల్టా కోటలో బంధించారు. 200 మంది తిరుగబడ్డ ముస్లిం సైనికులను బాస్రాలో కాల్చి చంపారు. ఈ తిరుగుబాటు ఫలితంగా పంజాబు వాయవ్య సరిహద్దు సింధు రాష్ట్రాలకు చెందిన వందలాది ముస్లిమ్ యువకులను అరెస్టు చేశారు.

# గదర్ పార్టీ పూర్వరంగం

"భారత దేశంలో గదర్ (తిరుగుబాటు) చేయడానికి సాహసంగల సైనికులు కావాలి.

"జీతం — మృత్యువు.
"విలువ — ఆత్మబలిదానం.
"పెన్షన్ — స్వాతంత్ర్యం.
"యుద్ధరంగం — భారతదేశం"

* * *

అమెరికా పశ్చిమతీరంలో ఒకానొక పార్టీ పై విధంగా పత్రికా ప్రకటన (అడ్వర్టయిజుమెంటు) చేసింది. ఆ పార్టే, గదర్ పార్టీ. అది ప్రవాస భారతీయుల పార్టీ. భారత స్వాతంత్ర్య సంపాదనకై ఉవ్విళ్ళూరిన పార్టీ. అందుకోసం అష్టకష్టాలుపడ్డ పార్టీ.

లాలా హారదయాళ్ 1911 లో అమెరికా చేరాడు. అమెరికా చేరకముందు ఆయన అనేక దేశాలను చూశాడు. 1912 లో లేలాండ్ స్టాన్‌ఫోర్డు యూనివర్శిటీలో తత్వశాస్త్రం, సంస్కృతం బోధించడానికి ప్రొఫెసర్ (అధ్యాపకుడు)గా నియమించబ డు. కాని సెప్టెంబరులో ఆ పదవికి రాజీనామాచేసి, వి వ కార్యకలాపాలు సాగించడానికి బెర్కెలే వచ్చా . హారదయాళ్ భారత స్వాతంత్ర్యానికి ఏదో ఒకటి చేయాలని తపనపడుతున్నాడు. బ్రిటిష్ సామ్రాజ్యంలో భారతీయుల బానిస పరిస్థితులను గురించి అమెరికాలో తెలియచేయడం, అమెరికా, కెనడాలకు వలసవచ్చిన భారతీయులు తమ మాతృదేశానికి చేయవలసిన విద్యుక్త ధర్మాన్ని గురించి చెప్పి, వారిలో చైతన్యం తీసుకు రావడం అవసరమని భావించాడు. అప్పట్లో వలస వచ్చిన భారతీయుల పరిస్థితులను తెలుసుకొందాం.

అమెరికా, కెనడాలకు వలస వెళ్ళిన వారిలో ప్రధానంగా పంజాబీలు. వారిలో ఎక్కువమంది సిక్కులు వున్నారు. వారెందుకు వలస వెళ్ళవలసి వచ్చింది ? ఈ రెండు దేశాలకే వారెందుకు వలస వెళ్ళారు . వలస వెళ్ళడానికి ముఖ్యకారణం ఆర్థిక పరిస్థితులే. ఇల్లూ వాకిలీ వదలి ఊరుకాని ఊరుకో, దేశంకాని దేశానికో వెళ్ళడం ఎవరికిమాత్రం ఇష్టం వుంటుంది ? బంధుమిత్రులను వదలి వెళ్ళడం ఎంత బాధాకరం ? ఆకలిబాధకు ఆగలేక, దారిద్ర్యానికి తట్టుకోలేకనే పుట్టిపెరిగిన భూమిని వదలి పరదేశాల పాలైనారు.

ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధం తర్వాత పంజాబు రైతుల పరిస్థితి అధ్వాన్నమైంది. భూమిశిస్తు పెరిగింది. పరోక్షపన్నులు భారమయ్యాయి. షాహుకార్లకు బాకీలు పెరిగాయి. ఉన్న కొంచెం కాస్తా ముక్కలు చెక్కలయింది. నెలకు తొమ్మిదీ పదీ రూపాయలకోసం బ్రిటిష్ సైన్యంలోచేరి ప్రాణాలు పణం పెట్టడంతప్ప పంజాబీ యువకులకు మరో గత్యంతరం లేదు.

గదర్ పార్టీ చరిత్రకారుడు సోహన్‌సింగ్‌జోష్ మాటల్లో చెప్పాలంటే— "సామ్రాజ్యవాదానికి మానవత్వంలేదు. మనసంటూ లేనేలేదు. మానవ విలువలు దానికి తెలియవు. దాని Motive force : దోపిడి, లూటీ, కొల్లగొట్టడం, చంపడం, మూకుమ్మడి హత్యాకాండ, యుద్ధాలు చేయడంద్వారా, రక్తసముద్రాలు పారించడంద్వారా అది డబ్బు పోగుచేసింది. బలహీన దేశాలను బానిస దేశాలుగా మార్చినందుకుగానీ, వాటిని దోపిడి చేసినందుకుగాని అది ఏమాత్రం పశ్చాత్తాపం చెందదు."

అటు సైన్యంలో చేరడమో, పరాయి దేశాలకు వలసపోవడమో తప్ప గత్యంతరంలేని పరిస్థితులలో పంజాబీలు, ముఖ్యంగా సిక్కులు అమెరికా, కెనడాలకు వలస వెళ్ళారు. తమిళ, మలయాళీలలోని పేదలు, బ్రిటిష్ అధీనంలోని ఆసియా, ఆఫ్రికా దేశాలలో తోట కూలీలుగా పనిచేయడానికి వెళ్ళారు. కాని పంజాబీలు అభివృద్ధి చెందిన బ్రిటన్, కెనడాలకు వెళ్ళారు.

పంజాబు ఆనాడు ఎందుకు అలా ఆర్థికంగా గానే కాక రాజకీయంగా కూడా వెనుకబడివుంది ? భారత దేశాన్ని బానిసగా వుంచాలంటే పంజాబు నిద్రపోతూ వుండాలి, వెనుకబడి వుండాలి. ఎందుకంటే పంజాబు, సైనికుల్ని రిక్రూట్ చేసుకొనేందుకు అవసరమైన కేంద్రం. దేశంలో ఆనాడు పదమూడో వంతువున్న పంజాబునుండే భారతదేశంనుండి మొత్తం రిక్రూట్ చేసిన సైన్యంలో 60 శాతాన్ని రిక్రూట్ చేసుకొనే

వారు. ఈ విషయాన్ని పంజాబు లెఫ్టినెంట్ గవర్నర్ మైకేల్ ఓడయ్యరే స్వయంగా అంగీకరించారు. సైన్యంలో రాజకీయ చైతన్యం తమకే ముప్పు గనుక అన్ని ఉద్యమాలనుండి పంజాబును దూరంగా వుంచాలని బ్రిటిష్‌వాళ్ళు తలచేవాళ్ళు. పంజాబులో సిక్కులు ఎక్కువ. సిక్కు సైన్యం బ్రిటిష్‌వాళ్ళకు చాలా ఉపయోగపడింది. 1857 స్వాతంత్ర్య ఉద్యమాన్ని అణచడానికి దీన్నే ఉపయోగించారు. భారతదేశంలో ఎక్కడ రాజకీయ ఉద్యమం తలెత్తినా, ఈ సైన్యాన్ని ఉపయోగించి అణచివేసేవారు.

బ్రిటిషు పాలకుల దృష్టిలో పంజాబీలు ఎంత బీదరికంలో వుంటే అంత మంచిది. పొట్ట పొడిచినా అక్షరం ముక్క రాకుంటే మరీమంచిది. అప్పుడేవాళ్ళు తాము చేసే దురాక్రమణ యుద్ధాలకూ, స్వాతంత్ర్య ప్రజాతంత్ర ఉద్యమాలను అణచివేయడానికీ వాళ్ళు సమిధలుగా పనికి వస్తారు. గ్రామాలో కొద్దిమంది పై తరగతులవార్ని తమ చెప్పుచేతల్లో ఉంచుకొనేవాళ్ళు. మున్సబులను, సైన్యానికి యువకులను రిక్రూట్ చేసే దళారీలను ప్రోత్సహించేవాళ్లు. వాళ్ళకి సర్దార్ సాహెబ్, సర్దార్, రాయ(వు) బహద్దర్ లాంటి బిరుదులిచ్చేవారు. లయల్ పూర్, సర్గోధా జిల్లాలలోని కెనాల్ కాలనీలలో భూములను ఇచ్చేవారు. 27 ఎకరాలు గల ఖండ్రికలను ఇచ్చేవారు. యుద్ధంలో చేరితే భవిష్యత్తులో వాళ్ళకు కూడా ఇలాగే 27 ఎకరాల ఖండ్రికల్ని ఇస్తామని ఆశ చూపెట్టేవారు. దానితో యుద్ధంలో చేరిన పంజాబీ సిక్కులు వివిధ దేశాలలోని అభివృద్ధిని చూశారు. అక్కడ తమ కన్నా కొంత బాగా వున్న పరిస్థితులను గమనించారు. ఇక బీద రైతులు తమకు మిగిలిన కొంపా కొంప్రా తాకట్టు పెట్టి మలయా, సింగపూర్, పెనాంగ్ మొదలైన చోట్లకు వెళ్ళేవారు. మరికొంతమంది తమకు తామే వలసవెళ్ళి, చైనా, మలయా వర్తకులకు చౌకీదార్లుగా పనిచేసేవారు.

లండన్‌లో విక్టోరియారాణి జూబిలీ ఉత్సవాలు ముగిశాక, సిక్కు సైనికులు బ్రిటిషు వలస దేశమైన కెనడాగుండా వెళ్ళటం తటస్థించింది. ఆ వేళ వాతావరణం, మైదానాలు, సంపద వంతమైన భూములు సిక్కు సైనికుల్ని ఆకర్షించాయి. అక్కడ వుండిపోవాలని, అపుడే కొందరు నిర్ణయించుకొన్నారు.

1905 నాటికి 45 మంది వున్న వీరి సంఖ్య 1908 నాటికి 5179 కి పెరిగింది. వీరికి తోడుగా చైనా, జపానుల నుంచి వలస వచ్చిన వాళ్ళ సంఖ్య 50 వేలదాకా పెరిగింది. యూరప్‌నుండి కూడా కెనడాకు వలస ప్రారంభమైంది. దీనితో క్రమంగాభారతీయుల వలసను నిరోధించే ప్రయత్నాలు ఆరంభమయాయి.

వలస వచ్చిన చైనా జపానీయులలో కొందరు కొంత డబ్బు గడించినవాళ్లు వున్నారు. భారతీయులలో కూడా అరకొరగా కొద్దిమంది ఇక్కడికి వచ్చి డబ్బు గడించినవాళ్ళు వున్నారు. వీళ్ళు తెల్లవాళ్ళ యువతుల్ని తమ ఆఫీసుల్లో గుమాస్తాలుగా నియమించుకొనేవాళ్లు. ఇది వాళ్ళ జాత్యహంకారాన్ని దెబ్బతీసింది. వాళ్ళని సంతృప్తి పరచేందుకు, తూర్పు దేశాలవాళ్ల తెల్లజాతుల ఆడపిల్లలను ఉద్యోగాల్లో పెట్టుకోరాదని నిషేధించింది. "కెనడాను తెల్లవాళ్ళ భూమి"గా పరిరక్షించండి అనే నినాదంతో అక్కడి శ్వేతజాతులవాళ్లు ఆందోళన చేయసాగారు, కెనడా ప్రభుత్వం ఒక విచారణ సంఘం తతంగం నడిపింది. దానికి భారత ప్రభుత్వం పరోక్షంగా వత్తాసు ఇచ్చింది.

సింహళం, సముద్ర తీరప్రాంత నివాసాలను దాటి భారతీయులు వెళ్ళరాదని ప్రభుత్వం నిషేధించింది. ఐనా ఎలాగో తిప్పలుపడి ధైర్యంగా కెనడా చేరుకుంటున్నారు. 25 డాలర్లు వుంటేగాని దేశంలోకి రానీయమని కెనడా ప్రభుత్వం ఆంక్ష విధించింది. ఈ మొత్తాన్ని తర్వాత 200 డాలర్లకు పెంచింది. దారిలో ఎక్కడా ఆగకుండా "నిరంతర ప్రయాణం" చేసిన వారికే, ప్రయాణపు టిక్కెట్లు వున్నవారికే కెనడాలో ప్రవేశం అనే నిషేధాలు విధించడంతో ప్రవాస భారతీయులలో అసంతృప్తి పెరగసాగింది. కెనడా, బ్రిటిష్ వలస దేశమే. భారతదేశమూ బ్రిటిష్ వలస రాజ్యమే. 1858 లో విక్టోరియా రాణి తమ సామ్రాజ్యం కింద వున్న అన్ని దేశాలపట్ల తమకుండే విధులూ, బాధ్యతలూ భారత దేశానికి కూడా వర్తిస్తాయని అన్నమాటలను వీరు విశ్వసించారు. "కుడుమిస్తే పండగ" అనే మనస్తత్వం పాపం వారిది. కాని భారతదేశంలో వైస్రాయి లార్డ్ విట్టన్ ఒకరహస్య నివేదికలో విక్టోరియారాణి, పార్లమెంటూ చేసిన ఈ వాగ్దానాల తంతును వివరించి నిజస్వరూపం బట్టబయలు చేశాడు. ఈ రహస్య నివేదిక 'రహస్యం'గా వుండి

పోలేదు. ఎవరి చేతుల్లోనో పడింది. లండన్‌లో అచ్చయింది. అందులో అతడు అన్నమాటలు ఇలా వున్నాయి.

"(వాళ్ళ) ఈ ఆశలూ, తమ హక్కులని వాదించే వాదనలూ ఎప్పటికీ పూర్తిచేయబడవు. వారిని (భారతీయుల్ని) నిషేధించడమో, మోసగించడమో ఈ రెంటింటిలో ఏదో ఒకటి మనం ఎన్నుకోవాలి. అందుకని అతితక్కువ సూటిమార్గాన్ని (Least Straight forward) ఎన్నుకున్నాం."

ఇంతకుముందే చెప్పిన కెనడా ప్రభుత్వ ఆంక్షల మూలంగా 1909 లో ఆర్గురు మాత్రమే వలస రాగల్గారు. వలస నిషేధాజ్ఞలు, చైనా జపానుల కన్నా భారతదేశాన్నే ఎక్కువ దెబ్బతీశాయి.

కాంగ్రెస్‌లోని అతివాదులకు సైతం బ్రిటిష్ ప్రభుత్వంపై భ్రమలు తొలగని కాలంలో, కెనడా ప్రభుత్వ చర్యలు అసంతృప్తి కలిగించాయి. భారతదేశంలో అసమ్మతిని వ్యక్తం చేయసాగారు. 1912లో బొంబాయి టౌన్‌హాలులో అసమ్మతి సభ జరిగింది. ఈ చర్యల్ని ఖండిస్తూ అనీబిసెంట్ 'థియోసిస్ట్' పత్రికలో వ్యాసం రాసింది. అల్హాబాద్ నుండి 'లీడర్' పత్రిక కూడా ఆందోళన వ్యక్తపరచింది. 1911 లో కాంగ్రెస్‌లో పంజాబీ ప్రతినిధి ఈ సమస్యను లేవనెత్తినా, చర్చకు నాయకత్వం అనుమతించలేదు. భారతదేశంలో వార్తాపత్రికలు కూడా నిరసిస్తూ వ్యాఖ్యానించాయి. 1911 అక్టోబరు 11 న బిపిన్ చంద్రపాల్ 'రివ్యూ ఆఫ్ రివ్యూస్' అనే పత్రికకు ఇంటర్వ్యూలో—స్వపరిపాలన పొందిన భారతదేశం ఈ విషయంలో ఏమిచేస్తుంది? అని అడిగినప్పుడు. ఆయన ఇలా జవాబిచ్చాడు.

"సమాన హక్కులపై సమానతను మేం కోరుతున్నాం. కాని మాకది నిరాకరించే పక్షంలో సమానంగా చెడుగులను ప్రాతిపదిక చేసుకొందామని వారికి చెబుదాం. దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా, కెనడాల నుండి వలస వచ్చేవారిని, ఆ దేశాలలో విధించేలాంటి విషమ షరతులనే విధించుతాం."

ఈ నిషేధాజ్ఞలచట్టం 1910లో పాసయింది. ఇందులోని 23 వ సెక్షన్ ప్రకారం, నిషేధాన్నిగాని, వలస వచ్చిన వారిని అరెస్టు చేయడంపైగాని, ప్రవాసం పంపడంపైగాని విచారించే హక్కు కోర్టులకు లేకుండా ప్రభుత్వం చేసింది.

దాదాపు కెనడాకు, అమెరికాకు భారతీయుల వలస ఒకేసారి ప్రారంభమైంది. 1904 లో భారతీయుల మొదటిజట్టు అమెరికాలో ప్రవేశించింది. 19 వ శతాబ్దం 70 వ దశకంలో చైనా, జపాను, కొరియా దేశీయులు అమెరికాకు వలస వచ్చారు. 1982 ఎక్స్‌క్లూషన్ యాక్ట్ 1807 లో జపాను ప్రభుత్వంతో చేసుకొన్న 'పెద్దమనుషుల ఒడంబడిక'ద్వారా వీరి రాకపై పరిమితులు ప్రారంభమయాయి.

1905 లోనే జపానీయులను, కొరియన్లను బహిష్కరించే సమితిని, శాన్‌ఫ్రాన్సిస్కో బిల్డింగ్ ట్రేడ్స్ కౌన్సిల్ స్థాపించింది. 1907 లో భారతీయుల వలస పెరుగుతూ వుండటంతో, ఈసంఘం పేరును"ఆసియా వాసులను బహిష్కరించే సమితి" గా పేరుమార్చింది. అమెరికాలోని శ్రామిక ప్రజానీకం హక్కుల్ని కాపాడటం ధ్యేయంగా చెబుతున్నా, నిజానికి వీరి లక్ష్యం జాతి వివక్షే.

1907 లో అమెరికా కెనడాలలో జరిగిన జాతి వివక్ష అల్లర్ల మూలంగా, భారతీయుల రాకకు ఆటంకాలు ఆరంభమయ్యాయి. ఆసియా వాసులను బహిష్కరించాలనే సమితి ప్రధానంగా జపాను వాళ్ళపై కేంద్రీకరించినా, భారతీయులకు కూడా ఆ రాకిడి తగిలింది.

కెనడాలో లాగానే 1917 ఫిబ్రవరిలో అమెరికా వలస రాకకు సంబంధించినఒకచట్టాన్ని ప్రవేశపెట్టింది. కెనడాలో లాగ ఇందులో భారతదేశం పేరు ప్రస్తావించకపోయినా, దాని ప్రధాన లక్ష్యం భారతీయుల ప్రవేశాన్ని నిషేధించడమే.

వలస వచ్చిన భారతీయులు స్థానిక కార్మిక సంఘాలతో పోటీ పడవలసి వచ్చింది. జాత్యహంకారంతో కూడిన వివక్ష కూడా వీరి ఇబ్బందులను పెంచింది. ఈ రెండు దేశాలతో స్వతంత్ర జీవనం గడుపుతున్న పౌరులకూ, బ్రిటిష్ ప్రభుత్వం క్రింద బానిసలుగా వున్న తమ జీవితానికి గల తేడాను వీరు గమనించసాగారు. కెనడా, అమెరికాలకు వచ్చి, భారతీయులలో రాజకీయ చైతన్యాన్ని కలిగించడానికి కృషిచేసిన కొందరు ప్రముఖులూ, వారు నడిపిన పత్రికలూ ఈ

విషయంలో ఎంతో సేవ చేశాయి. రాజకీయ చైతన్యం ఇలా భారతీయ వలస ప్రజలలో పెరగడం చూచి, భారత దేశంలోని బ్రిటిష్ ప్రభుత్వానికీ, లండన్‌లోని సామ్రాజ్య ప్రభుత్వానికీ కంగారు పుట్టింది. అందుచే వలస విరోధానికి అమెరికాపై ఒత్తిడి తేవడం ప్రారంభించాయి. ఈ ఒత్తిడికి కారణమైన మార్గదర్శక రాజకీయ ప్రబోధకులను గురించి తెలుసుకొందాం.

1906 లో పంజాబు నుండి రామ్‌నాథ్‌పురి అమెరికా వెళ్ళారు. భారతదేశ స్వాతంత్ర్యానికి సేవ చేయాలని తహ తహ లాడాడు. శాన్‌ఫ్రాన్సిస్కోలో హిందూస్థాన్ అసోసియేషన్ స్థాపించాడు. మరి రెండు నగరాల్లో శాఖలు ఏర్పరిచాడు. కుల మత,రంగు విచక్ష లేకుండటం యీ సంఘంలో సభ్యత్వానికి ముఖ్యమైన షరతు. ఈయన ఉర్దూలో కొన్ని కరపత్రాలు ప్రచురించాడు.సర్క్యులర్–ఇ–అజాద్ (స్వతంత్ర సర్క్యులర్) అనే ఉర్దూ పత్రికలో ఈ సంఘకార్యకలాపాలు ప్రచురింపబడుతూ వుండేవి. భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వంపై ద్వేషం కలిగించే వార్తలను భారతదేశ, ఐరిష్ పత్రికలనుండి సేకరించి దానిలో ప్రచురించేవారు. దాన్ని భారతదేశంలో నిషేధించారు. ఈసంఘానికి బెంగాల్ విప్లవకారుడు తారకనాధ్‌దాస్ కోశాధికారి. ఈ పత్రిక మూతపడిన తర్వాత అతడు ఇంగ్లీషులో "ఫ్రీ హిందూస్థాన్" (స్వతంత్ర హిందూస్థాన్) అనే మాస పత్రిక ప్రారంభించాడు. తారకనాధ్‌దాస్ 1903 నుండి విప్లవ సంఘాల్లో పనిచేస్తున్నాడు. 1906లో బెర్కిలీ యూనివర్శిటీలో విద్యార్థిగా చేరాడు. భారతదేశ స్వాతంత్ర్యానికి, ఈ రెండు దేశాలలో అపుడు నివసిస్తున్న పదివేల మందిలో రాజకీయంగా సన్నద్ధం చేయాలనేదే వీరి ఉద్దేశం. భారతీయులలో 95 శాతం సిక్కులు, పంజాబీలు. 1857లో పంజాబీలు సిక్కుల సహకారంతో బ్రిటిష్ వాళ్ళు ఆనాటి విప్లవం అణచగల్గారు. అందుకని ఇపుడిది పునరావృతంకాకుండా చేసేందుకు వీరిలో రాజకీయ చైతన్యం కలిగించాలని విప్లవకారులు భావించారు.

బ్రిటిష ప్రభుత ం ఒత్తిడితో "ఫ్రీహిందూస్థాన్" పత్రిక ఆపివేయబ ంది. మొదటదాన్ని నిషేధించడానికి వీలుందో దో చూడమని న్యూ యా ర్క్ గవర్నర్ న్యాయశాఖ సలహా అడిగాడు. నిషేధించ వీలులేదని అది సలహా ఇచ్చింది. 'ఫ్రీహిందూస్థాన్'కు సహాయపడుతున్న ఐరిష్ జాతీయుడు జార్జిఫ్రీమన్‌పై ఒత్తిడి తెచ్చారు. అతడు డబ్బులేదనే సాకుతో పత్రికను ఆపివేశాడు.

కెనడాలోని వాంకోవర్‌లోని సిక్కు దేవాలయంలో 1909 అక్టోబరు 3 న సర్దార్ నా ధా సిం గ్ భారత దేశంలోను, ఇతర బ్రిటిషు వలస దేశాలలోని పరిస్థితులను వివరించి ఒక తీర్మానం పెట్టాడు. "సిక్కు దేవాలయం కార్యనిర్వాహక కమిటీ సభ్యుడు ఎవరూ కూడా బానిస చిహ్నాలైన బ్రిటిషు మెడల్సు, దుస్తులు పట్టీలు, గుండీలు, ధరించరాదనీ, వాటిని బానిస పతకాలుగా భావించాలనీ"—ఆ తీర్మాన సారాంశం. ఏకగ్రీవంగాతీర్మానం అంగీకరించబడింది. ఒకరుమెడల్సు త్యజించారు. మరొకడు తనకిచ్చిన సర్టిఫికెట్లను తగలబెట్టాడు. గవర్నరు జనరల్ రాక సందర్భంగా జరిగే సైనిక కవాతుకు రావలసిందిగా వాంకోవర్ మేయర్ సిక్కు వెటరన్స్‌కు (యుద్ధవీరులను) ఆహ్వానించగా వారి అధ్యక్షుడు బాగాసింగ్ "రిటైరైన సై ని కు లు సైనిక కవాతులలో పాల్గొనరు" అని జవాబిచ్చాడు.

ఇవన్నీ ప్రమాద సూచిక (డేంజర్ సిగ్నల్)గా భారత ప్రభుత్వం భావించింది. కెనడాలోని వాంకోవర్‌లోనే పంజాబీ మాసపత్రిక "స్వదేశీ సేవక్" ను గురుముఖిలిపిలో గురుదత్తకుమార్ అనే పంజాబీ 1910లో ప్రారంభించాడు. వలసవచ్చిన భారతీయులపై ఆంక్షలు గురించి ఇ బ్బందులు గురించి 1910 మేలో ఒక వ్యాసం ఆ పత్రిక ప్రకటించింది.

సరాసరి భారతదేశ రేవుల నుంచి ప్ర యా ణ ం చేయాలనడం. కలకత్తా అసోసియేషన్ పంపిన జగదీశ్‌చంద్రమిశ్రా లాంటి విద్యార్థులకు ప్రవేశానుమతి నిరాకరించడం, కెనడాలో భూములున్న భారతీయుల్ని కూడా ఆ దేశంలో దిగినపుడల్లా 200 డాలర్లు కలిగి వుండాలనడం, వర్తకులపై కూడా ఆంక్షలువిధించడం, కెనడాకు వలస వచ్చిన ఇతర బ్రిటిషు సామ్రాజ్యంలోని పౌరులకు ఆరు నెలల తర్వాత వోటింగ్‌హక్కు లభించగా భారతీయులకు అలాంటి హక్కు లేకపోవడం—మొదలైన విషయాలను ఆ పత్రిక విమర్శించింది. గురుదత్తకుమార్ "సిక్కు కార్మికుల రాజద్రోహ సంఘానికి నాయకుడు" అంటూ బ్రిటిషు,

కెనడా ప్రభుత్వాలు చేసిన ఆరోపణను ఆయన ఖండించాడు.

భారతీయుల 'పీడ' ఎలాగయినా వదలించుకోవాలని తలచిన కెనడా ప్రభుత్వంఒకపన్నాగం పన్నింది. బ్రిటిష ప్రభుత్వ అధీనంలో వున్న హోండూరాస్‌కు వీరిని పంపాలని తలచింది. భారతీయులకు భద్రత కావాలన్నా, ఉద్యోగం కావాలన్నా హోండూరాస్ వెళ్ళవలసిందిగా ప్రభుత్వం కోరింది. హోండూరాస్‌కు వెళ్ళిన భారతీయుల స్థితి బాగాలేదు. యావజ్జీవితం కష్టపడి సంపాదించినా, వాళ్ళకు మాతృదేశం వెళ్ళడానికి డబ్బు మిగిలేదికాదు. ఇంకేమన్నా జవసత్వాలు మిగిలి వుంటే "యెల్లో ఫీవర్" అనే జ్వరం కాస్తా పీల్చిపిప్పి చేసేది.వారక్కడ కట్టుబానిసలుగా బతుకుతున్నారు.

హోండూరాస్ పరిస్థితులపై నివేదించేందుకు ఒక సంఘాన్ని ఏర్పరచి వారితో పాటు భాయీ సత్నగర్ సింగ్, భాయీ షాన్‌సింగ్ దోగ్రాలను పంపింది. వారి చేత అనుకూలమైన నివేదిక తయారు చేయించాలని కెనడా ప్రభుత్వ సంకల్పం. వాళ్ళకు లంచం పెట్టడానికి కూడా సిద్ధపడింది, కాని వారందుకు నిరాకరించారు. అక్కడ దుస్థితిని వివరించారు.

బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వానికీ, కెనడా, భారత ప్రభుత్వాలకు వాంకోవర్‌లోని గురుద్వార కమిటీ టెలిగ్రాములు పంపింది. అందులో "భారతీయులు హోండూరాస్ వెళ్ళరని, కెనడా ప్రభుత్వం బలవంతంగా వెళ్ళగొడితే, తమ మాతృదేశానికే పంపాలనీ" కోరింది.

భారతదేశంలో నివసించి ఉర్దూ, పంజాబీ భాషలు తెలిసిన హోండూరాస్ గవర్నర్ జనరల్ స్వేర్ సిక్కుల చేత ఎలాగైనా హోండూరాస్ వెళ్ళడానికి ఒప్పించాలని చేసిన ప్రయత్నం విఫలమైంది. అతడు 'వేంకోవర్ వరల్డ్' పత్రికకు ఇచ్చిన ప్రకటనలో ఇలా అన్నాడు. "సిక్కులు బ్రిటిష్ కొలంబియాను విడిచి పెట్టడానికి ఇష్టపడటం లేదు. దేశం నుంచి బలత్కారంగా వారిని పంపితే, భారతదేశంలోని 50 వేల సిక్కు సైనికులు అదుపు తప్పి పోతారు. వారిని అదుపులో పెట్టడానికి రెండు లక్షల తెల్ల సైనికుల్ని పంపాల్సి వస్తుంది."

దీనితో కెనడా ప్రభుత్వం తాత్కాలికంగా వెనక్కి తగ్గి ఆ పథకాన్ని వదలుకొంది. కాని భారతీయులపై దాడి సూత్రం మానలేదు.

భాయీ భగవాన్ సింగ్ 1913 జూన్‌లో కెనడా వచ్చాడు. ఆయన సిక్కు మత గురువు. ఆయన పట్ల సిక్కులకు అమిత గౌరవం వుండేది. మారుపేరుతో కెనడాలో ప్రవేసించాడని నేరం మోపి, తమ న్యాయ శాసనాలన్నిటినీ ఉల్లంఘించి ఆయన్ని అరెస్టు చేసింది

ఈ వార్త దావానలంలా వ్యాపించింది. ఆయన్ని విడుదల చేయించడానికి జరిగిన కోర్టు లావాదేవీలు ఫలించలేదు. చివరకు 1913 నవంబరు 19 న జపానుకు చెందిన యస్. యస్. ఎంప్రెస్ నౌకలోని కేబిన్‌లో చేతులూ కాళ్ళూ కట్టివేసి, నోట్లో గుడ్డలు కుక్కి పడవేసి కొట్టారు. ఆ తర్వాత జపానులో ఆయన్ని వదిలి వేశారు. లాయర్ సహాయంతో కొందరు భారతీయులు ఆ నౌక వద్దకు వెళ్ళారు. కేబిన్ తలుపులు బద్దలు కొట్టడానికి వుద్యుక్తులైన వారిని లాయర్ వారించాడు. వెళ్ళిపోయేముందు తన ఈ స్థితినిచూచి దిగాలుపడవద్దనీ, దేశంకోసంపాటుపడమనీ భగవాన్‌సింగ్ చెప్పినట్లు,తర్వాత పత్రికలలోప్రచురింపబడింది. "ఇవి సంకెళ్ళుకావు, ఆభరణాలు. మీరు మమ్మల్ని జైలుకు పంపవచ్చు – ఉరితీయవచ్చు" అని అధికారులను ఉద్దేశించి అన్నట్లు ఒక పత్రిక రాసింది. "గదర్ దీ గూంజ్" (విప్లవ ధ్వని) అనే పాటలో తనను అరెస్టు చేసిన ఉదంతాన్ని భగవాన్ సింగ్ వెల్లడించాడు. ఈయన గొప్ప విప్లవ కవి. గొప్ప ఉపన్యాసకుడు.

గదర్ పార్టీ ఏర్పడ్డాక అది ప్రచురించిన 'గదర్' పత్రికలో వెలువడ్డ కొన్ని కవితలు ఆ తర్వాత ఒక పుస్తకంగా వెలువడ్డాయి. అందులో "గదర్ దీ గూంజ్" కూడా ఒకటి. అందులో కొన్ని పద్యాలు మత సామరస్యాన్ని, దేశభక్తినీ ప్రబోధించాయి. వాటి తాత్పర్యం ఇది—

"పండితులూ ముల్లాలూ మనకు వ
ప్రార్థనలూ, దైవ సంకీర్తనలూ వ
ఇవి నడి సముద్రంలో నావను ముంస్తాయి.
కత్తిదూయ్, పోరాడేందు కిది సమయం

మనం హిందువులం, ముసల్మాన్లం, సిక్కులం-
ఎవరిమైనా కావచ్చు.
మనందరం భరతమాత బిడ్డలం
మీ వాద వివాదాల్ని ఓ రోజు వాయిదా వేయండి.
ఈ క్షణాన మీ కర్తవ్యం (శత్రువును) చంపడం.
ఒకే భూమిలోపుట్టినా మనం
కులాల మూలంగా హెచ్చు తగ్గుల వాళ్ళమయాం
ఈ బుద్ధిమాలిన తేడాలు సృష్టించింది మనమే
అనైక్యతా బీజాలు నాటింది మనమే.
కొందరు గోవును పూజిస్తారు
మరికొందరు పందిని ద్వేషిస్తారు
కాని తెల్లవాడో ఆ రెంటినీ తింటాడు.
నీవు హిందువని మరచిపో
నీవు ముసల్మాన్‌వని మరచిపో
మీదేశం కోసం, మీ జాతికోసం
పాటుపడతానని ప్రతిన చేయి"

భగవాన్ సింగ్ అరెస్టు, బహిష్కరణలాంటి ఘటనలు అడపా దడపా జరుగుతూనే వున్నాయి. ప్రభుత్వానికి రాయబారాల ద్వారా చేసిన విజ్ఞప్తులు కూడా ఫలించలేదు. క్రమక్రమంగా బ్రిటిష్, కెనడా ప్రభుత్వాలపైన భ్రమలు తొలగిపోవడం ప్రారంభమైంది. 1914 లో "కామగాట మారు" సంఘటనతో వీరి అసంతృప్తి అగ్నికణం భగ్గున మండింది

## "కామగాటమారు" నౌకాయానం

కెనడాకు వలసపోడానికి కొందరు భారతీయులు సిద్ధమయ్యారు. వీరిలో ఎక్కువమంది సిక్కులు, కొంత మంది పంజాబీ ముస్లిములు, వీరంతా హాంకాంగ్ చేరుకున్నారు. అక్కడ కెనడా, భారత ప్రభుత్వాలు సూచనల మూలంగా నౌకా కంపెనీలవారు వీరికి టికెట్ ఇవ్వ నిరాకరించారు. నెలల తరబడి అక్కడ వారు యమయాతనలు పడుతున్నారు.

కెనడాలో ఉంటున్న సర్దార్ గురుదత్‌సింగ్ ఈ విషయం విన్నాడు. ఇతడు సింగపూర్, మలయాలలో వడ్డీవ్యాపారం, రబ్బరు వర్తకం మొదలైన వాటిద్వారా విశేషంగా ధనం సంపాదించాడు. ఇతడికి బ్రిటిష్ న్యాయస్థానంమీద విశ్వాసం ఉండేది. ఏదైనా డబ్బువిషయమై తగాదాలువస్తే కోర్టులకు వెళ్ళేవాడు. తరుచు గెలుస్తూ ఉండేవాడు.

తన సోదర భారతీయుల దుస్థితిని చూచి కొంత జాలితోను, కొంత వ్యాపార దృష్టితోను అతడు నౌకలో భారతీయుల్ని తీసుకు వెళ్ళడానికి ఏర్పాటు చేస్తున్నాడు. ఇది హాంకాంగ్‌లోని అధికారులకి ఇష్టం లేదు. ఏదో మిషపెట్టి గురుదత్‌సింగ్‌ను అరెస్టుచేశారు. అక్కడున్న పంజాబ్ రెజిమెంట్ సిపాయిలకు ఇది తెలిసి అసమ్మతి తెలియజేశారు. పరిస్థితి చేయిజారి పోతుందనే భయంతో గురుదత్‌సింగ్‌ను విడుదలచేసి, నౌకను కెనడా వెళ్ళడానికి అనుమతి ఇచ్చారు. గురుదత్ సింగ్ కామగాటమారు అనే జపాన్‌నౌకను అద్దెకు తీసుకొని ఆనౌకలో భారతీయుల్ని కెనడాకు చేరవేస్తున్నాడు. 1913నవంబరులో వాంకోవర్‌లో దిగిన 39మంది సిక్కులపై ఆంక్ష విధించి దేశ బహిష్కారం చేసిన గవర్నర్ జనరల్ ఉత్తరువును చీఫ్‌జస్టిస్ హంటర్ చెల్లదని తీర్పు ఇచ్చిన విషయం గురుదత్‌సింగుకు తెలుసు. అంతేగాక హాంకాంగ్‌లోని ప్రముఖ న్యాయవాదుల సలహా కూడా తీసుకున్నాడు. వలసపోయేవారు ఎవరికిందా కాంట్రాక్టు ఉద్యోగంలో లేనట్లయితే, వారు వెళ్ళవచ్చునని చెప్పారు. లండన్, అట్టావా (కెనడా) ఢిల్లీ ప్రభుత్వాలకు — కెనడాకు వలసవచ్చే వారిని దిగటానికి అనుమతి ఇవ్వాలంటూ గురుదత్‌సింగు టెలిగ్రాములిచ్చాడు.కొన్నాళ్ళు జవాబు కోసంనిరీక్షించాడు. జవాబు రాలేదు. ఇక నౌకను ప్రయాణానికి సిద్ధం చేశాడు. అవసరమైతే న్యాయశాస్త్రపరమైన లావాదేవీలకు సిద్ధమౌదామనుకున్నాడు.

1914 ఏప్రిల్ 4 న హాంకాంగ్ నుండి కామగాటమారు నౌక ప్రయాణమయింది. మే 22 న విక్టోరియా (కెనడా)కు చేరింది. అందులో 376 మంది ప్రయాణీకు లున్నారు. వైద్యాధికారులు 90 మంది తప్ప తక్కిన వారంతా దేశంలో ప్రవేశించడానికి ఆరోగ్య విషయంలో ఎట్టి అభ్యంతరం లేదని నిర్ధారించారు. నౌక మే 22, 23 తేదీల నాటికి వాంకోవర్ చేరింది.

తోవలో గదర్ సాహిత్యం వారికి చేరినా, అప్పటికింకా వారిలో విప్లవాభిప్రాయాలు లేవు. మొట్టమొదట కెనడా చేరి ఏదో జీవనభృతి సంపాదించుకోడం

కర్తవ్యంగా వాళ్ళు భావిస్తూవచ్చారు. అయితే ఇమిగ్రేషన్ అధికారుల ప్రవర్తన వారిలో కొందరిని విప్లవ పంథాకు నెట్టింది.

కామగాటమారు నౌకను హార్బరు మధ్య నిలిపి వేశారు. జె. ఎడ్వర్డ్‌బర్డు అనే లాయరు ద్వారా గురుదత్‌సింగు అసమ్మతి తెలియచేశాడు నౌకల్ని ఎక్కడ ఉంచాలన్నది హార్బరు అధికారులదని జవాబు వచ్చింది. ఈ నౌక చుట్టూ పెట్రోలుబోట్లు తిరుగుతున్నాయని బర్డ్ అభ్యంతరం చెబితే, ఒడ్డున వున్నవారినుంచి రక్షణకంటూ జవాబు చెప్పారు. పంజాబీని గాని, సిక్కుని గాని ఎవరినీ నౌకలోనివారితో మాట్లాడడానికి అనుమతించలేదు. చివరకు లాయర్ బర్డ్‌ను కూడా అనుమతించలేదు. ఈ విషయంలో ఇమిగ్రేషన్ ఇనస్పెక్టరూ ఏజెంటూ అయిన మాల్కంరీడ్ కర్కోటకుడిలా వ్యవహరించాడు. కెనడాలోని భారతీయులు, నౌకలోని తమ సోదరుల దుస్థితిని గమనించి ప్రభుత్వానికి టెలిగ్రాములు పంపారు. "పశువుల్ని కూడా ఇంత హీనంగా చూడరు." అని వారు తెలియజేశారు. కాని వారి మొర ఎవరూ వినిపించుకోలేదు.

గురుదత్‌సింగు తన నౌకలో ప్రయాణికుల ఆరోగ్యం చూసేందుకు డాక్టరు రఘునాథ్‌సింగ్‌ను నియమించాడు. అతడు ప్రభుత్వ గూఢచారి అన్న విషయం గురుదత్‌సింగ్‌కు తెలిసివుండదు. అతడు హాంకాంగ్‌నుండి వాంకోవర్ వచ్చేవరకు త్రోవలో గురుదత్‌సింగ్‌పై అసంతృప్తి రెచ్చగొట్టడానికి ప్రయత్నించాడు. కాని ఆ ప్రయత్నాలు ఫలించలేదు. డాక్టరు రఘునాథ్‌సింగ్ "భార్యనూ, కుటుంబాన్నీ" కెనడాలో దిగడానికి అనుమతించారు. వీరి అనుమతికి ఏవోకుంటి సాకులు చెప్పారు. నౌకలోని ప్రయాణికులు 8 వారాల పాటు ఖైదీల్లా వుండిపోయారు. తిండీ, నీరు వీళ్ళకి సమస్య అయింది. నౌక యజమానే తిండి పెట్టాలని ఇమిగ్రేషన్ ఇనస్పెక్టర్ వాదన. డబ్బు చెల్లిస్తేనే వాళ్ళకి తిండీ, నీరూ సప్లయి చేయగలనని అతడు అన్నాడు. గురుదత్ సింగ్ కూడా ఈ నౌకలోని ప్రయాణికుడవడంవల్ల, అతనేమీ చేయలేకపోయాడు. ఒక రోజుకి డబ్బు చెల్లించాడు. మర్నాడు మళ్ళీ ఇదే సమస్య. గురుద్వార కమిటీ కొన్నాళ్ళు సహాయపడింది. ప్రయాణికుల దైన్యస్థితిని ఇమిగ్రేషన్ ఇనస్పెక్టరు రీడ్‌కు ఎన్ని ఉత్తరాలు, విజ్ఞప్తులు ద్వారా చెప్పినా ఫలించలేదు. ఇద్దరుస్త్రీలు, అయిదుగురు పిల్లలూ దాదాపు ఉపవాసం చేస్తున్నారని వివరించినా అతని మనసు కరగలేదు. వంకోవర్ మేయర్‌కు కూడా విజ్ఞప్తి చేశారు. అసలే అతను శ్వేతజాతి దురహంకారి. అతడు కూడా సహాయం చేయడానికి నిరాకరించాడు.

చిట్టచివరకు కామగాటామారు నౌక ఏజెంట్ బుప్పర్ ఒక సూచన చేశాడు. నౌక హాంకాంగ్‌కు బయలుదేరేముందు ప్రయాణికులు భోజనాది అవసరాలకు కెనడా ప్రభుత్వం డబ్బు చెల్లించాలని అతడి సూచన. ఆ సూచన ప్రభుత్వం ఆమోదించింది. కాని నౌక మూడుమైళ్ళ దూరం వెళ్ళాకనే భోజనం సమకూర్చుతామని ప్రభుత్వం అంది. కాని ఇమిగ్రేషన్ ఇనస్పెక్టర్ రీడ్‌లో తమకు నమ్మకంలేదని ప్రయాణికులు అందుకు అంగీకరించలేదు. నౌక కెప్టెన్ యాకుమోటో పైన, జపాన్ రాయబారి (కాన్సల్) వై. ఎ. హోరీపైన కూడా కెనడా ప్రభుత్వాధికారులు ఒత్తిడి తెచ్చారు. కాని అదేమీ ఫలించలేదు.

ప్రయాణికులు గవర్నర్ జనరల్‌కు కూడా అనేకసార్లు టెలిగ్రాములు పంపారు. కాని ఫలితం శూన్యం.

పైగా జూలై 19 న 125 మంది ఇమిగ్రేషన్ ఆఫీసర్లను తీసుకుని పోలీసు ఉన్నతాధికారి వచ్చాడు. మరో 35 మంది ప్రత్యేక ఆఫీస , ఇంకా మామూలు సిబ్బంది, న్యాయ సలహాదా కూడా వున్నారు. నౌకను అద్దెకు తీసుకొన్న గురుదత్‌సింగ్ తరఫున అధికారయుతంగా పనిచేస్తున్న భాగ్‌సింగ్, రహీమ్‌ల సంతకాలతో ఉత్తరవు లేనిదే తాము హార్బరు నుండి కదలబోమని ప్రయాణికులు స్పష్టం చేశారు.

సీ లయన్ (సముద్రసింహం) అనే టగ్‌మీదవచ్చిన పోలీసులను, అధికార్లను ఇటుకలతో యంత్ర సామగ్రితో, బొగ్గుతో, ఇనపక ల్తో, కొయ్యముక్కలతో, చిన్న గొడ్డళ్ళతో, ఎదుర్కొన్నారనీ, కాల్పులు కూడా సాగించినా ఎవరూ గా డలేదనీ ఇమిగ్రేషన్ అధికారుల కథనం. కాని ప్రయాణికుల కథనం వేరుగా వుంది. గురుదత్‌సింగ్‌ను బలవంతంగా పట్టుకుపోవాలని పోలీసులు ప్రయత్నించారు. రబ్బరు గొట్టం ద్వారా నీళ్ళు చిమ్మి బలవంతంగా నౌక మీదకి రావడానికి ప్రయత్నించారు. అప్పుడు సిక్కు ప్రయాణీ

కులు బొగ్గు ముక్కలతో టగ్ కిటికీలను బద్దలు కొట్టారు. పోలీసులు కాల్పులు సాగించారు. కాని అదృష్టవశాత్తు ఎవరూ చావలేదు. కోత పనిముట్లతో నలుగుర్ని పోలీసులు గాయపరచారు.

"అధికారుల ఈ ప్రవర్తనతో తాము చావడానికీ, చంపడానికీ సంసిద్ధంగా వున్నామనీ, అవమానకరంగా చావడానికి సిద్ధంగా లేమనీ" ప్రయాణికులు రాసిన ఒక లేఖలో వెల్లడయింది.

ఇమిగ్రేషన్ ఇన్‌స్పెక్టర్ రీడ్, అతని సిబ్బంది చివరకు వెనుదిరిగి పోవలసి వచ్చింది. ఈ ఘటన వల్ల కెనడా ప్రభుత్వ ప్రతిష్ఠ కూడా సన్నగిల్లింది. ఎరిక్ నికోప్ అనే రచయిత తన గ్రంథంలో "ప్రాచ్య దేశ భారతీయులు ఆనందించే విధంగా సీ లయన్ (సముద్ర సింహం) ఘోరంగా అపజయం పొందింది" అని రాశాడు. ఆ విధంగా "సముద్ర సింహం" తోక ముడిచింది. ఈ విషయంలో ప్రభుత్వం వ్యవహరించిన తీరును మరికొందరు, కొన్ని పత్రికలు విమర్శించాయి. భారతీయుల పట్ల సానుభూతి కలిగిన పత్రికలు కొద్దిగానే వున్నా, అవి ప్రభుత్వ చర్యలను తీవ్రంగా ఖండించాయి.

ఐనా ప్రభుత్వమూ, ఇమిగ్రేషన్ అధికారులూ పగతీర్చుకునే ధోరణిలో వ్యవహరించారు. "రైన్‌బో" అనే యుద్ధనౌకనూ, వివిధ పోలీసు సైనిక దళాలనూ సిద్ధంచేశారు. భారతీయుల్ని కామగాటమారు నౌక నుంచి తరలించి రైన్‌బో యుద్ధనౌకలో నిర్బంధించాలని ప్రభుత్వ పథకం. ఈ సన్నాహాలను కెనడా పత్రికలు విమర్శించాయి. చివరకు ప్రభుత్వం లొంగి వచ్చింది. నౌకలోని తమ సోదరులతో మాట్లాడటానికి కొందరికి అనుమతి నిచ్చింది. నౌకలోని వారికి ఆహార పదార్థాలు, మందులు ఇచ్చింది. జట్లుజట్లుగా ప్రభుత్వ లాంచీలలో నగరంలోని భారతీయులు వచ్చి కామగాటమారు ప్రయాణీకులతో మాటాడేందుకు అనుమతించింది. తాము భారతదేశానికి తిరిగి వెళుతున్నా నైతికంగా తాము విజయం సాధించామనే వుత్సాహం ప్రయాణీకుల్లో కనిపించింది.

నౌకలో 3 నెలల నిర్బంధం పడిన అగచాట్లు, అవమానాలు ఏ నిమిషాన మృత్యువు వాత పడతామో అన్న వాతావరణం, ప్రయాణీకుల నుండి నౌకను అద్దెకు తీసుకుని వ్యాపారం చేసిన వర్తకుల వరకు అందరూ పొందిన ధననష్టం, కెనడాలో స్థిరపడి ధనార్జన చేద్దామనే కలలు కల్లలవడం— ఇవన్నీ పంజాబీలలో తీవ్రమయిన మార్పుతెచ్చాయి. బ్రిటిష్‌ప్రభుత్వ నిజ స్వరూపం అర్థంకావడం మొదలయింది. బ్రిటిష వారిపై భ్రమలు తొలగిపోజొచ్చాయి. పశువుల్లాగ చానిసబ్రతుకు పనికిరాదనీ, స్వాతంత్ర్యం కోసం పోరాడాలనీ, కెనడా, అమెరికాలలోని నిజపరిస్థితులు తెలియచేయాలనీ వారు ఒక నిశ్చయానికి వచ్చారు.

1914 జూలై 23 న కామగాట మారు తిరుగు ప్రయాణమయింది. కెనడాలోని భారతీయులు, ఈ ప్రయాణీకులకు పిస్తోళ్లు, ఆయుధ సామగ్రి అందించడానికి చేసిన ప్రయత్నాలు జయప్రదం కాలేదు. అలా అందివ్వడానికి ప్రయత్నించిన వారిని కెనడా పోలీసులు పట్టివేశారు. ఆగస్టు 16 న కామగాటమారు జపానులోని యోకొహామా రేవు చేరుకుంది. గదర్ పార్టీ అధ్యక్షుడైన సోహన్‌సింగ్ భాక్నా వంద పిస్తోళ్ళను, మరికొంత ఆయుధ సామగ్రినీ రహస్యంగా అందచేశాడు.

ఆ ఆగస్టులోనే బ్రిటన్ ప్రథమ ప్రపంచ యుద్ధంలో చేరింది. అందుకని కామగాటమారు గొడవ ఎంత త్వరగా వదిలించుకొంటే అంత మంచిదని బ్రిటిష్ ప్రభుత్వం భావిస్తూ వచ్చింది.

కామగాటమారు నౌకను హాంకాంగ్‌కు రానీయబోమని హాంకాంగ్ ప్రభుత్వం తెలియచేసిందనే వర్తమానం యోకొహామాలో వుండగా గురుదత్ సింగ్‌కు అందింది. పూర్వం అక్కడ నివసించే వారిని కూడా అనుమతించబోరనీ, అక్కడ దిగితే అరెస్టు చేస్తారనీ తెలిసింది. సింగపూర్‌లో కూడా యిదే కథ, కోబేలో యీ ప్రయాణీకులకు ఘన స్వాగతం లభించింది. బ్రిటిష దౌత్య ఉద్యోగి, వీరెవ్వరూ ఓడ దిగరాదనీ, బయటివారు ఓడలోకి పోరాదని అన్నాడు. కాని గురుదత్‌సింగు అంగీకరించలేదు. కొందరు నౌక వదలి వెళ్ళారు. ఇద్దరు సింధీలు నౌకలో ప్రవేశించారు.

ముమ్ముందు కలకత్తాలో సోదాలు జరగవచ్చని గురుదత్ హెచ్చరించాడు. గదర్ సాహిత్యాన్ని, ఆయుధాల్ని సముద్రంలో పారవేయమని చెప్పాడు. కొందరు అలాగే చేశారు. కాని కొందరు పిస్తోళ్ళకు వాటర్‌ప్రూఫ్ ...గితం చుట్టి, నౌక నీటి టాంకులో

దాచారు. సెప్టెంబరు 26 రాత్రి నౌక కలకత్తాకు చేరింది. ప్రయాణీకులందర్నీ తిన్నగా పంజాబు తీసుకెళ్ళి, వాళ్ళని పూరిగా తనిఖీచేసి, ప్రశ్నించాలనీ, వారిలో కొందర్ని జైళ్ళలో పెట్టాలనీ భారత ప్రభుత్వం నిర్ణయించింది. రెండు రోజులు నౌక అంతా గాలించారు. సామానంతా వెదికారు. పంజాబీ, బెంగాలీ గూఢచారులు బ్రహ్మప్రయత్నం చేసినా అభ్యంతరకరమైనదేమీ దొరకలేదు. ప్రయాణీకులు సోదాకు అభ్యంతరం పెట్టలేదు. కాని లోలోన మండిపోతున్నారు. తమను నేరస్థులలాగ చూస్తున్న ప్రభుత్వ వైఖరిని ద్వేషిస్తున్నారు. బడ్జ్‌బడ్జ్‌లో దిగినపుడు తిరిగి సోదా చేశారు. పంజాబుకు తిన్నగా వెళ్ళే రైలును ఎక్కవలసిందిగా పోలీసులు వారిని కోరారు. కొద్దిమంది అలాగే చేశారు. గవర్నర్‌కు తమ ఇబ్బందుల్ని వివరించుకోవాలనీ, కలకత్తాలోని తమ మిత్రుల వద్ద ధన సహాయం పొందాలనీ తలచి కొందరు కలకత్తా వెళ్ళడానికి సిద్ధమయ్యారు. కాని పోనీయలేదు.

సాయంత్రం సిక్కులు ప్రార్థన చేసుకుంటున్నారు. ఒక ఆఫీసరు గురుదత్ సింగ్‌ను అవమాన పరచాడు. ప్రార్థన ముగిశాక గందరగోళం ప్రారంభమయింది. ఎవరో తుపాకి పేల్చారు. ఆ ఆఫీసరు చనిపోయాడు. దీనితో బ్రిటిషు సైనికులు 177 రౌండ్లు కాల్చారు. ఎంతమంది చనిపోయిందీ స్పష్టంగా తెలియదు. కాని 18 నుండి 40 మంది వరకూ సిక్కులు చనిపోయినట్లు అంచనా. గురుదత్ సింగ్, మరో 29 మంది తప్పించుకు పోయారు. 31 మందిని ఖైదు చేశారు.

మరో నౌక "తోషమారు" 1914 అక్టోబరులో కలకత్తా చేరుకుంది. అందులో 173గురు సిక్కులు వున్నారు. అందులో 100 మందిని కలకత్తాలో అడుగుపెట్టగానే అరెస్టు చేశారు. మిగతా 73గురిలో చాలామంది ఆ తర్వాత విప్లవకారులుగా తయారయారు.

## గదర్ పత్రిక — గదర్ పార్టీ

అమెరికా, కెనడాలలో నివసిస్తున్న పంజాబీలలో సాంఘిక సంస్కరణలకోసం, నైతిక సంస్కరణల కోసం కొందరు పనిచేస్తుండేవారు. పంజాబీ కుటుంబాలకు కెనడాలో ప్రవేశహక్కుకై న్యాయశాస్త్రం ద్వారా పోరాడటానికి కొందరు పాటుపడుతుండేవారు. మరికొందరు భారతదేశంలో బ్రిటిషు వాళ్ళ పరిపాలనను తుదముట్టించడం ప్రధాన సమస్య అని ప్రబోధించేవారు. కాని వీరందరికీ ఒక కేంద్రసంఘం లేదు.

1912 జూలైలో "పసిఫిక్‌తీర భారతీయసంఘం" (పసిఫిక్ కోస్టు హిందీ అసోసియేషన్) పోర్ట్‌లాండ్‌లో స్థాపించి, ఒక ఇల్లు అద్దెకు తీసుకొని అందులో కార్యాలయం పెట్టారు.

సోహన్‌సింగ్ భాక్నా దానికి అధ్యక్షుడు. 'హిందూస్తాన్' అనే ఉర్దూ పత్రికను ఈ సంఘం తరఫున తీసుకురావాలనే ప్రయత్నం కొన్ని ఇబ్బందులవల్ల ఆచరణలోకి రాలేదు. శాన్‌ఫ్రాన్సిస్కోలో పనిచేస్తున్న లాలా హరదయాళ్‌ను సెంట్‌జాన్‌లో పనిచేస్తున్న కార్మికులు ఆహ్వానించారు. 1913 మార్చి 25న లాలా హరదయాళ్, భాయీ పరమానంద్‌లు పంజాబీల సమావేశంలో పాల్గొన్నారు. బ్రిటిష్ వాళ్ళను భారత దేశంనుండి తరిమివేస్తే తప్ప వారి కష్టాలు తొలగిపోవని లాలా హరదయాళ్ తెలియచేశాడు. 1857 స్వాతంత్ర్య సంగ్రామ చిహ్నంగా గదర్ అనే పేరుతో ఉర్దూ, పంజాబీ భాషల్లో వారపత్రికను నడపాలని సూచించాడు. వివిధ కేంద్రాలలో ఈ సూచన గురించి వివరించారు. 1913 ఏప్రిల్ 21న అస్టోరియాలో జరిగిన సభలో లాలా హరదయాళ్ కొన్ని నిర్దిష్టసూచనలు చేశారు. ఈ సభకు వివిధ కేంద్రాల నుండి ప్రతినిధులు హాజరయారు.

లాలాహరదయాళ్ సూచన సారాంశం ఇది:— "అమెరికా పసిఫిక్‌తీర భారతీయ సంఘం" (హిందీ అసోసియేషన్ ఆఫ్ ది పసిఫిక్ కోస్ట్ ఆఫ్ అమెరికా) అని సంఘం పేరు. తర్వాత ఇదే హిందూస్థాన్ గదర్ పార్టీ పేరుతో ప్రసిద్ధి చెందింది. దీని ఆశయం సాయుధ పోరాటంద్వారా బ్రిటిష్ దాస్యాన్ని అంతం చేసి, సమానత న్యాయం అనే ప్రాతిపదికపై భారతీయ ప్రభుత్వాన్ని స్థాపించడం. గదర్ వారపత్రికను ఉర్దూ పంజాబీ హిందీ భాషల్లో ప్రచురించడం. కార్యాలయం శాన్‌ఫ్రాన్సిస్కోలో వుంటుంది. (ఆ రోజుల్లో ఆ రేవుపట్టణం విప్లవకారుల కేంద్రంగా వుండేది) పార్టీలోను పత్రికలోను పనిచేసే సోదరులకు జీతం వుండదు. తిండి, బట్టలు అందరికీ పార్టీ నిధినుండి ఇవ్వాలి. ప్రతి భారతీయుడు నెలకు ఒక డాలర్ చొప్పున చెల్లించాలి. ఫ్యాక్టరీ లేక ముఠా ప్రతినిధుల కమిటీని ఎన్ను

కాని కార్యనిర్వాహక వర్గానికి అనుబంధంగా వుంచాలి. ప్రతినిధులు ఎన్నుకొన్న కార్యనిర్వాహక వర్గం పత్రికను, ప్రెస్‌ను ఇతర కార్యకలాపాలను చూస్తుంది. రాజకీయ కార్యకలాపాలను, రహస్య కార్యకలాపాలను నిర్వర్తించేందుకు ముగ్గురితో కూడిన ఒక ఉపసంఘాన్ని తమలోనుండి కార్యనిర్వాహక వర్గం ఎన్నుకొంటుంది. మతం వ్యక్తిగత విషయం. మత విషయాలపై చర్చ జరగడానికి వీలులేదు. బానిసత్వానికి వ్యతిరేకంగా పోరాడటం ప్రతి పార్టీ సభ్యుని విధి. ఎక్కడ బానిసత్వ వ్యతిరేక పోరాటం సాగినా దాన్ని బలపర్చాలి, సంవత్సరానికి ఓసారి ఎన్నికలు జరగాలి."

దీన్నే తీర్మాన రూపంలో హర్షధ్వానాలమధ్య ఏకగ్రీవంగా అంగీకరించారు. సోహన్‌సింగ్ భాక్నా అధ్యక్షుడుగా, లాలా హరదయాళ్ కార్యదర్శిగా, మరికొందరితో కార్యనిర్వాహక వర్గం ఏర్పడింది. రహస్య కార్యకలాపాలు సాగించేందుకు వీరిద్దరూకాక కాన్షీరామ్‌తో కూడిన ఉపసంఘాన్ని ఎన్నుకొన్నారు.

అప్పటికప్పుడు 10 వేల డాలర్ల నిధి వసూలు చేయబడింది. కాని పత్రిక 1913 నవంబర్ 1 నాటికి గాని వెలువడలేదు. పత్రిక పనిభారం ఎక్కువైనకొద్దీ యితర చోట్లనుండి కార్యకర్తలు విద్యార్థులు వచ్చి సహాయపడేవారు. అలా వచ్చినవారిలో సుప్రసిద్ధ విప్లవవీరుడు పృథ్వీసింగ్ కూడా ఉన్నాడు. వీరందరూ ఎక్కడ కలుసుకున్నా "వందేమాతరం"అంటూ పరస్పరం అభినందించుకొనేవారు.

గదర్ పత్రిక మొదటి సంచిక నుండి బ్రిటిషు ప్రభుత్వంపై తిరుగుబాటుకు ప్రేరేపించుతూ వచ్చింది. వేలాది భారతీయులు తమకున్న కాస్త ఆస్తిపాస్తులూ అమ్ముకొని ఫిలిప్పైన్సు, నా, జపాన్, పనామా, మలయా, న్యూజిలాండ్, అ ంటైనా, మెక్సికో మొదలైన ఎన్నో దేశాలకు వెళ్ళి వారికి స్వాగతం లభించలేదు సరికదా ఎన్నో అవమానాలు, కష్టాలు పడవలసి వచ్చింది. గదర్ పార్టీ శాఖలను మలయా, బర్మా, సయాం, ఇండొనేషియా, హాంకాంగ్, ఫిలిప్పైన్సు, చైనా, జపాన్, కెనడా, అమెరికా, ఆఫ్రికా, ఈస్టిండీస్, గయానా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, ఆ ౖ నాలలో ఏర్పరచడానికి పై పరిస్థితులు తోడ్ప యి.

గదర్ పత్రిక ఇందుకు బాగా తోడ్పడింది. దర్ పత్రిక కట్టలు మలయా, హాంకాంగ్, పెనాంగ్, సింగపూర్, షాంగై, సయాం, పనామా, ఫిలిప్పైన్సు,అర్జెంటైనా, దక్షిణాఫ్రికా మొదలైన చోట్లకు వెళ్ళేవి. ఈ పత్రిక రాకముందు కూడా చిన్న ఎత్తున మరికొన్ని పత్రికలు వెలువడేవి, మదాం కామా 'వందేమాతరం' నడిపింది. బెర్లిన్ నుండి' తల్వార్' పత్రిక వచ్చేది. ఫ్రాన్సు నుండి 'సోషియాలజిస్టును' శ్యాంజీ కృష్ణవర్మ, వాంకోవర్ నుండి 'ఫ్రీ హిందూస్తాన్'పత్రికను తారకనాథదాస్ నడిపేవారు ఐతే గదర్ పత్రిక మరింత ప్రాముఖ్యం వహించింది. భారత ప్రజలను, సైనికులను తిరగబడవలసిందిగా అది ఉద్బోధించింది. 1915 నాటికి గదర్ పత్రిక మూడువేల కాపీలు వివిధ దేశాలకు వెళుతుండేవి. క్రమబద్ధంగా ఉర్దూ, పంజాబీలలో ప్రచురింపబడినా, హిందీ, గుజరాతీలలో కూడా అపుడపుడూ ప్రచురించబడేది. ఒకసారి పుస్తూ భాషలో కూడా ప్రచురించబడింది.

గదర్ పత్రికలో ఒకటి రెండు గేయాలు కూడా ప్రచురిస్తూ వుండేవారు, అవి జనరంజకమైన శైలిలో, జనానికి అందుబాటైన భాషలో భారతీయుల హృదయ విదారకర పరిస్థితిని సూటిగా తెల్పే విధంగా ఉండేవి. వాటిలో కొన్నిటిని గుదిగుచ్చి పుస్తకరూపంలో "గదర్-దీ గూంజ్" (విప్లవ ప్రతిధ్వని) అని ప్రచురించారు. మొదట పదివేల కాపీలు ముద్రించారు, అవి త్వరత్వరగా అమ్మకమయ్యాయి. ఇంతేగాక అనేక కరపత్రాలను కూడా ఉర్దూ, పంజాబీ భాషలలో గదర్ పార్టీ ప్రచురించింది. గదర్‌లో అచ్చయిన వ్యాసాలనే కరపత్రాలుగా ముద్రించి ప్రచురించారు.

భారతదేశంలో పోలీసులు, అరెస్టయిన వారి నుండి నేరాన్ని ఒప్పించేందుకు చేసే అమానుష హింసా పద్ధతులను, పోలీసు అధికారుల అవినీతినీ, కర్జన్ కమిషన్ రిపోర్టు నుండి, ఇతర అధికార పత్రాల నుండి సేకరించిన సమాచారంతో "లెక్కల సాక్ష్యం" అనే కరపత్రం వెలువడింది. హరదయాళ్ గదర్ పత్రికలో వరుసగా రాసిన "బానిసత్వ విషం" (గులామీ కా జహర్) అనేది మరో కరపత్రం. అమెరికాలోని విద్యావంతుల సానుభూతిని తమ ఉద్యమానికి పొందడానికై కొన్ని ఇంగ్లీషు భాషలో కూడా ప్రచురించారు. "నూతన ఆదర్శాలు, నూతన శకం"అనే కరపత్రంలో

భారతదేశంలోని రాజకీయ, మత, తదితర సంస్థల్ని హరదయాళ్ విమర్శించాడు. కాంగ్రెసులోని మిత వాదులు గోఖలే, ఫిరోజ్‌షా మెహతాలు ప్రభుత్వ నిర్మాణంలో భాగస్వాములయ్యారనీ, కాంగ్రెస్ సభ్యులు పదవుల కోసం, బిరుదుల కోసం చూస్తున్నారనీ హరదయాళ్ ఆరోపణ. అలాగే హిందూమతంలోని ప్రాచీన గ్రంథాలలో అసమానత ఆధారంగా సామాజిక నిర్మాణం ఏర్పడిందనీ ఆయన భావం.

"ఆర్యులు-దస్యులు, ద్విజులు - శూద్రులు, భూస్వామి-కౌలుదారు, రాజు-ప్రజ అనే అసమానతకు తరతరాలుగా హైందవులు అలవాటుపడిపోయారు. హిందూ సాహిత్యంలో పైన చెప్పిన అసమానతలు సుపరిచితమైన, వంశపారంపర్య సూత్రం సమాజ గతిని ని చినంత కాలంఆధునిక నాగరికతను హర్షించలేం ఇ రూ. మహమ్మదీయులైనా, సిక్కులైనా, వైష్ణవు నా, యజమానీ సేవకుల మధ్య సమానత ఉండదు. ధనికుడు బీదవాడిపై ఎప్పుడూ పెత్తనం చేస్తాడు. ఆర్థిక స్వాతంత్ర్యం లేనిదే సోదరభావం అనేది కల మాత్రమే" ఇదీ హిందూ మత సంస్థలపై ఆయన విమర్శ సారాంశం.

గదర్ పత్రిక, కరపత్రాలు, హిందూస్థానీ గదర్ పార్టీ కార్యకలాపాలు-బ్రిటిషు ప్రభుత్వ ప్రచారాన్ని, వారి ఏజంట్ల ప్రచారాన్ని ఆట కట్టించాయి. కెనడా, అమెరికాలలో భారతీయులలో విప్లవ చైతన్యం పెంపొందుతున్న వి ష య ం బ్రిటిష్ ప్రభుత్వానికి హడలు పుట్టించింది. గదర్ పత్రిక భారతీయ సైనికుల్ని నేరుగా ఉద్దేశించి రాయడం మొదలుపెట్టింది. "మీరెందుకు బ్రిటిష్ వాళ్ళ కోసం పోరాడుతున్నారు? ఏ ఆశయం లేకుండా మీరెందుకు మీ ప్రాణాలను బలి పెడుతున్నారు? మీరేమో యుద్ధ భూమి కందకాల్లో వుండాలని శాసించడమా? బ్రిటిష్ సైన్యాలు వెనుక భాగంలో రక్షణకై ఉండటమా?" ఈ ధోరణిలో రాయడమేగాక, సైనికుల జీతనాతాలు, ఇతర పరిస్థితులను పోల్చిచూపుతూ గదర్ పత్రిక వ్యాసాలు రాస్తూ వుండేది.

హరదయాళ్‌ను ఎలాగైనా కేసులో ఇరికించిఅరెస్టు చేయాలని బ్రిటన్ తెచ్చిన ఒత్తిడిపై కాలిఫోర్నియా రా ౹ ప్రభుత్వం అరెస్టు వారెంటు జారీచేసింది.గదర్ ప၊ లోని రాతలకు కాదు ఈ కేసు పెట్టింది. ఎ డో రెండేళ్ళ క్రితం రష్యాలోని జార్ చక్రవర్తికి విరుద్ధంగా ఇచ్చిన ఉపన్యాసాలలో "అనార్కిజం"ను (అరాచకవాదాన్ని) ప్రబోధించాడని. అమెరికా చట్టం ప్రకారం "అనార్కిజం" నేరం. హరదళ్‌ను అమెరికా నుంచి బహిష్కరించడానికి ఈ నేరం మోపి అరె చేశారు. వ్యక్తుల హత్యను గాని, అనార్కిస్టు సి ం తాలనుగాని తాను ప్రోత్సహించడంలేదనీ, తన వి తాశయం భారతదేశంలో విప్లవం తేవడమని ధైర్యంగా హరదయాళ్ ప్రకటించారు.

1914 ఏప్రిల్ 10 న హాజరవుతాననే షరతుపై వెయ్యిడాలర్ల పూచీతో హరదయాళ్‌ను విడిచిపెట్టారు. హరదయాళ్ స్విట్జర్లాండ్‌కు తప్పించుకుపోయాడు. ఢిల్లీ బాంబు కేసులో హరదయాళ్‌ను ఇరికించడానికి, ఆయన్ని భారతదేశానికి తరలించాలనే ప్రయత్నం ఆ విధంగా విఫలమయింది.

హరదయాళ్ వెళ్ళినతర్వాత సోహన్‌సింగ్‌భాక్నా తదితరులు సమష్టిగా పటిష్ఠవంతమైన నాయకత్వాన్ని నిర్మించి కార్యశైలిని అలవర్చుకున్నారు. అంతా సమష్టిగా కృషిచేశారు. వైమానిక శిక్షణ, ఫిరంగులు ఉపయోగించడంలో శిక్షణ, బాంబులు చేయడంలో శిక్షణకు వివిధ దేశాలకు తమ అనుచరుల్ని గదర్‌పార్టీ పంపింది.

1914 ఆగస్టు మొదటివారంలో బ్రిటిషు ప్రభుత్వం జర్మనీతో యు నికి తలపడింది. యూరోపియన్‌దేశాలన్నీ ఈ యు ంలో రెండు శిబిరాలుగా విడిపడ్డాయి. ఒక ప్రక్క జ ర్మనీ, ఇటలీ, ఆస్ట్రియాలు, మరో ప్రక్క రష్యా, ఇంగ్లాండ్, ఫ్రాన్సులూ వున్నాయి.

భారతదేశ విముక్తికి ఇదే అదనని గదర్ పార్టీ భావించింది, భారతదేశంలోని తెల్లసైన్యాలన్నీ యుద్ధ రంగాలకు పోతాయి. అందుకని భారతదేశానికి తిరిగి వెళ్ళి భారతీయ సైనికుల్ని తిరగబడవలసిందిగా ప్రచారం చేయాలని గదర్ పత్రిక, ఆ పార్టీ నాయకులూ ప్రబోధించుతూ వచ్చారు.

## సైనిక తిరుగుబాటు పథకాల వైఫల్యం

కామగాటమారు నౌకా సంఘటనలు అమెరికా, కెనడాల్లోని భారతీయుల్ని ముఖ్యంగా పంజాబీయుల్ని కలవరపెట్టాయి. భారతదేశంలోను, బ్రిటిషు వలస దేశాలలోను సైనిక తిరుగుబాటును లేవదీయాలని, గదర్ పార్టీ నాయకులు తలిచారు. బెంగాలు విప్లవ కారులు కూడా అమెరికాలోని గదర్‌పార్టీతో సంబంధాలు పెట్టుకొని, తిరుగుబాటుకు సన్నాహాలు చేస్తున్నారు. సుమారు 8 వేల మంది భారతీయులు చైనా, సయాం, బర్మాలగుండా భారతదేశానికి చేరారు. మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో బ్రిటన్‌కు శత్రువైన జర్మనీ నుండీ, టర్కీ నుండీ తమకు సహాయం లభించగలదని వీరాశించారు.

బ్రిటన్, టర్కీలోని తమ మతాధిపతి అధికారాన్ని తొలగించారని ముస్లిం దేశాలలోని ప్రజలలో తీవ్ర అసంతృప్తి ప్రబలివుంది. భారతీయ ముస్లిములు కూడా తీవ్ర ఆగ్రహాన్ని ప్రదర్శిస్తున్నారు. అందుచే ఇరాన్, అరేబియా, ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్‌లలోని ముస్లిముల సహాయంతో జర్మనీ, టర్కీ దేశాల నుండి వచ్చే సహాయంతో సాయుధ పోరాటం సాగించాలని గదర్‌పార్టీ నాయకులు, భారత విప్లవవాదులు భావించారు. భారతదేశంలోను, బ్రిటిష్ వలస దేశాలలోను సైనిక తిరుగుబాట్లకు పథకాలు వేశారు. ఇందులో నిర్ణయాత్మక పాత్రను బ్రిటిష్ ఆధీనంలో వున్న భారత సైనికులు వహించాలని గదర్ విప్లవ నాయకులు భావించారు. అందుచే ఆ సైనికులతో సంబంధాలు పెట్టుకొని తిరుగుబాటుకు పురికొల్పారు. ముఖ్యంగా ఉత్తర హిందూస్తాన్‌లో, వాయువ్య భారతదేశంలో సైనిక దళాలు తిరగబడాలని వారి పథకం. మొదట 1914 నవంబరులో యీ తిరుగుబాటు లేవదీయాలని అనుకొన్నారు. తర్వాత 1915 ఫిబ్రవరికి వాయిదా వేశారు. గదర్ నాయకులు, భారతదేశంలోని సైనికులతోనేగాక పశ్చిమాసియా, ఆగ్నేయ ఆసియా సైనికులతో కూడా సంబంధాలు పెట్టుకొని వాళ్ళని తిరుగుబాటు చేయవలసిందిగా ప్రేరేపించారు. రసబిహారీబోస్, సచీంద్ర సన్యాల్, గణేశ్‌పింగళే, బాఫీకర్తార్‌సింగ్ మొదలైన వారు ఇందుకు గొప్ప పథకం వేశారు.

జర్మనీ సహాయంతో విప్లవవాదులు సార్వత్రిక తిరుగుబాటు లేవదీయాలని ప్రయత్నించుచున్నారని పసికట్టిన బ్రిటిషు ప్రభుత్వానికి గంగ వెర్రులెత్తాయి. 1917 లో మామూలు చట్టాలద్వారాగాక, అసాధారణ చట్టాలు చేసి, అంతులేని నిర్బంధకాండను ఉపయోగించింది. 1918 నాటికి వందమందిని స్టేట్ ప్రిజనర్స్‌గా పట్టుకొంది. మరో చోటికి కదలరాదని 70 మందిని ఇంటరన్ చేసింది.

గదర్ వీరుల, బెంగాల్ విప్లవవాదుల పథకం ప్రకారం, జర్మనీ ఆయుధాలూ అమెరికాలోని భారతీయుల డబ్బూ భారతదేశ విప్లవకారులకు అందాలి. 1917 వరకు అమెరికా ప్రపంచ మహాయుద్ధంలో పాల్గొనలేదు. ఒకప్పుడు బ్రిటన్‌పై స్వాతంత్ర్య యుద్ధం సాగించి తమ దేశాన్ని విముక్తం చేసుకొన్న అమెరికా తమకు తోడ్పడుతుందని వీరాశించారు. అందుచేత వాషింగ్‌టన్‌లోని జర్మన్ రాయబారితో మంతనాలు జరిపారు. అతడి ఉత్తర్వుల ననుసరించి షాంగేలోని జర్మన్ కాన్సల్ జనరల్ భారత విప్లవకారులతో సంబంధాలు పెట్టుకొన్నాడు. జావాలోని బటేవియాకు అక్కడి జర్మన్ ప్రతినిధులతో వివరాలు చర్చించేందుకు బెంగాలీ విప్లవవాదులు వెళ్ళారు.

కాలిఫోర్నియా నుండి బటేవియాకు ఒక జర్మన్ స్టీమర్ బయలు దేరింది. అక్కడనుండి బెంగాలు సముద్రతీరంలోని సుందరవనాలు (Sunderbans) అని పిలువబడే ప్రాంతంలోని రాయ్‌మంగల్‌కు ఆ స్టీమరు చేరాలి. ఆ స్టీమరు ద్వారా అక్కడ దింపిన ఆయుధాలను కలకత్తాకు, ఒరిస్సా తీరంలోని బాలసోర్‌కు, ఆగ్నేయ బెంగాల్‌లోని నవకాళి సమీపంలోని హాటియాకు చేరవేయాలి. స్టీమరులో ప్రయాణంచేసి వచ్చే జర్మన్ అధికారులు భారత విప్లవకారుల సైన్యాలకు యీ ఆయుధాల తర్ఫీదు ఇవ్వాలి. అన్ని వైపుల రైలుమార్గాలపై నున్న బ్రిడ్జిలను బద్దలుకొట్టి, కలకత్తాను వేరుపర్చాలి. మరో దళం కలకత్తాలోని విలియం కోటను పట్టుకొని పట్టణాన్ని స్వాధీనం చేసుకోవాలి.

ఐతే యీ పథకం ఫలించలేదు. జర్మన్ ప్రభుత్వము ఆయుధాలు సప్లయి చేస్తుందని భారత విప్లవవాదులు ఆశించారు. అమెరికాలోని గదర్‌పార్టీ నాయ

కులు, ఇతర విప్లవవాదులు కూడా యీ విషయమై ఇలాంటి హామీనే ఇచ్చారు. కాని ఆయుధాలు అంద లేదు. భారత నాయకులు అందచేస్తామన్న డబ్బూ, దస్కమూ చేరలేదు. శాన్‌ఫ్రాన్సిస్‌కోలోని మరి కొన్ని చోట్ల విప్లవవాదులకు ఆయుధాలు, ధనమూ లభించాయి. కాని అవి భారతదేశానికి చేరలేదు.

యస్.యస్. మావరెక్ అనే ఓడలోకి చేరవేయ డానికని ఆయుధాలు తీసుకొని వస్తున్న ఒక బోటును అమెరికా ప్రభుతాధికారులు పట్టుకొన్నారు. రాయ మంగల్, బాలనో ఖు ఆయుధాలతో నిండిన ఓడలను పంపడానికి జర్మ చేసిన ప్రయత్నాలు విఫల మయ్యాయి. తి... బాటు పథకాన్ని గురించిన సమా చారం భారతదేశంలోనే కాక షాంగే, సింగపూర్, అమెరికాలలో బహిర్గతమైంది. గదర్ పార్టీకి రహస్య విప్లవ పార్టీకి వుండవలసిన నిర్మాణం లేకపోవడంతో సులభంగానే ప్రభుత్వ గూఢచారులు దాని నాయకత్వం లోకి చొచ్చుకుపోయారు. తిరుగుబాటు కుట్ర విఫల మైంది. బ్రిటిష్ ప్రభుత్వం అతిక్రూరంగా విప్లవ కారులను అణచివేసింది. పంజాబులోని మోగాలో ఖజానా కార్యాలయంపై దాడిచేసిన సందర్భంగా ఇద్దరు విప్లవవాదులు చనిపోయారు. మరికొందర్ని అరెస్టు చేసి ఉరి తీసింది ప్రభుత్వం. కృపాల్‌సింగ్ ప్రభుత్వా నికి లొంగి రహస్యాలు వెల్లడించాడు. పంజాబు అంతటా సోదాలు జరిగాయి. అనేక రహస్య పత్రాలు దొరికాయి. బాంబులు దొరికాయి.

## లాహోర్ కుట్రకేసుల పరంపర

మీరట్‌లో ఒక ద్రోహి కారణంగా గణేశ్ పింగ శేని అరెస్టు చేశారు. గదర్ వీరులపై బెంగాల్ విప్లవ వాదులపై వరుసగా అనేక కుట్రకేసులు పెట్టారు. వీటినే లాహోర్ కుట్రకేసులంటారు. వీటికి అనుబం ధంగా అదనపు కుట్రకేసుల్ని కూడా పెట్టారు. ఈ కేసులలో 291మందిపై నేరారోపణ చేశారు. అందులో 42 మందికి మరణశిక్ష విధింపబడి ఉరితీయబడ్డారు. 114 మందికి యావజ్జీవ శిక్ష విధింపబడింది. 93 గురికి వివిధ రకాల శిక్షలు విధించబడ్డాయి. 42 మందిని విడుదల చేశారు. 23 వ ఆశ్వికదళానికి చెందిన సైని కుల్ని మరో దూరప్రాంతానికి బదిలీ చేశారు. ఆ సంద ర్భంలో వారి సామాగ్రిని రైలులో వేసేటప్పుడు రహ స్యంగా ఉంచిన బాంబులు పేలాయి. దీనితో 18 మందిని కోర్టు మార్షల్‌చేసి అందులో 12 మందిని ఉరి తీశారు. మిగతా వారికి యావజ్జీవ శిక్ష విధించ బడింది ప్రముఖ విప్లవవాదులైన భాగి కర్తార్‌సింగ్ భాయీ పరమానంద్, జగత్‌సింగ్, హర్నామ్‌సింగ్, పింగళేలపై బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలదోయడానికి కుట్ర పన్నారని ఆరోపణ. 1915 సెప్టెంబర్ 13 న కోర్టు తన తీర్పు చెప్పింది. కోర్టులో వీరిలో కొందరు ప్రదర్శించిన ధైర్యసాహసాలు దేశంలోని యువ తరాన్ని ఉద్రూత లూగించాయి. వారి నిష్కళంక దేశ భక్తి పెద్దల మన్ననలకు గురయింది. శత్రు పక్షానికి చెందిన కోర్టు జడ్జీలుసైతం ముగ్ధులయ్యారు.

కర్తార్‌సింగ్, పింగళేలు ఈ కుట్రకంతా తామే బాధ్యులమని తమపైన బాధ్యత వేసుకొన్నారు. కర్తార్ సింగ్ గదర్ ఉద్యమాన్ని గురించి ఉత్తేజపూర్వ కంగా వస్తూ కోర్టులో వాఙ్మూలం ఇస్తున్నప్పుడు జడ్జీ నివె రపోయి నోట్సు తీసుకోవడం మరచిపోయి కథ విన ంలో నిమగ్నమైపోయాడు. "దీని పర్యవ సానాన్ని గురించి ఆలోచించి మరీ వాఙ్మూలం ఇవ్వు" అని జడ్జీ హెచ్చరించాడు. కర్తార్‌సింగ్ ఇచ్చిన జవాబు, చరిత్ర పుటలలో చెరగరాని ముద్ర వేసింది. కర్తార్‌సింగ్ ఇలా అన్నాడు.

"ఏమిటా పర్యవసానాలు ? మీరు నాకు మరణ శిక్ష విధిస్తారు అంతేగదా ! నేనందుకు భయపడటం లేదు. నా కోరికల్లా నా మాతృదేశం విముక్తి కావడమే. ఒక వ్యక్తికి గాని, జాతికిగాని, మతానికిగాని విరు ద్ధంగా దేషపూరిత భావంతో నేనేమీ చేయలేదు. నా వ్యక్తి యోజనం ఆశించి సంకుచిత కాంక్షతో కూడా నేనేమీ యలేదు. స్వాతంత్ర్యం నా ప్రగాఢ కాంక్ష, అది నా ఏకైక స్వప్నం."

1915 సెప్టెంబరు 13 న కోర్టు శిక్షలు విధించింది. భాయీ పరమానంద్, మరణశిక్షపట్ల ఎంత నిర్లక్ష్యంగా ఉన్నాడంటే ఆ మరునాడు ఎనిమిదిగంటల దాకా నిద్ర పోతూనే ఉన్నాడు. ఆ చివరి క్షణాలను అందరూ కలిసి దేశభక్తి గీతాలు ఆలపిస్తూ గడిపారు. కర్తార్ సింగ్, పింగళే, భాయీ పరమానంద్, జగత్‌సింగ్‌తో సహా 24 మందికి మరణశిక్ష విధించబడింది. యావ జ్జీవశిక్ష విధించబడిన వారు సైతం తమకు మరణశిక్ష విధించాలని కోరారు.

భాయీ పరమానంద్‌తో సహా 17 గురికి మరణ శిక్షను, యావజ్జీవ శిక్షగా వైస్రాయి మార్చాడు. ఇందులో దయాదాక్షిణ్యాలుకన్నా పంజాబ్‌లోని బ్రిటిష్ అధికారులు కేసుపెట్టిన తీరు, నడిపిన తీరు దేశ విదేశాలలో న్యాయశాస్త్రజ్ఞుల సమక్షంలో నవ్వులపాలై పోతామనే భయం పనిచేసింది. 1915 నవంబరు 16 న పింగళేను ఉరితీశారు.

జర్మన్ ఆయుధాలను పొందలేక పోయిన గదర్ వీరులు, పంజాబీయులు బెంగాలులోని విప్లవవాదులతో కలిసి పన్నిన పథకంలో జతీంద్రనాథ్ ముఖర్జీ, రస బిహారీబోస్, నరేంద్రనాథ బట్టాచార్య (యం. ఎన్. రాయ్) మొదలైన వాళ్ళున్నారు. సైనిక తిరుగుబాటు పోలీసుస్టేషన్ల పైన, ఖజానాలపైన దాడులు, పెషావర్ నుండి చిటగాంగ్‌వరకు ఒకేసారి చేయాలని సంకల్పించిన పథకంలో ప్రముఖపాత్ర వహించిన పింగళే జీవితం అలా అంతమొందింది. ఆఖరి క్షణాల్లో కూడా తన దేశ విముక్తికోసమే ప్రార్థిస్తూ పింగళే ఉరికంబాన్ని అలంకరించాడు

ప్రముఖ విప్లవవాదులలో జతీన్ ముఖర్జీ ఒకడు. రొడ్డా అండ్ కంపెనీకి మేజర్ పిస్తోళ్ళు సరఫరా చేయబడుతున్నాయని తెలుసుకొని వాటిని స్వాధీనం చేసుకొనేందుకు జతీంద్రనాథ్ ప్రయత్నించాడు. ఐదు గురు ఒక దళంగా ఏర్పడ్డారు. బాలసోర్‌వద్ద, బురి బాలంవద్ద సాయుధ పోలీసు దళంతో వీరోచిత పోరాటం సాగించారు. అందులో జతేంద్రనాధ్ మర ణించాడు. ఆయన చూపిన సాహసానికి "బెబ్బులి జతీన్" అని పేరుపొందాడు. రసబిహారీ ఘోష్ తప్పించుకొనా డు. యం. ఎన్. రాయ్ పట్టుబడలేదు. ఆయుధాలు వ వాదులకు అందచేయవలసిన కార్య క్రమంలో కీల పాత్ర వహించవలసిన అతని ప్రయ త్నాలు ఫలించలేదు.

జర్మనీనుండి ఆయుధాల్ని, ధనాన్ని, తర్ఫీదును పొందాలని గదర్ విప్లవకారులు తదితర విప్లవకారులు భావించినా, వారి ఉద్దేశం జర్మనీ చేతిలో కీలుబొమ్మ లుగా వ్యవహరించడం కాదు. ఈ విషయం బెర్లిన్‌లో స్థాపించబడిన భారత స్వాతంత్ర్య కమిటీలో ప్రముఖు డైన భూపేంద్రనాథ్ దత్తా జర్మనీనుండి పొందే సహాయం "జాతీయ రుణం" అనీ, విప్లవం విజయం పొందిన తర్వాత అది తిరిగి చెల్లింపబడుతుందనీ తెలియ చేశాడు. డాక్టర్ అబినీష్‌భట్టాచార్యకథనం కూడా ఇలాగే వుంది. భారత దేశంలోని సంస్థానా ధీశులు, విప్లవానంతరం తమ ప్రభుత్వాన్ని ఏర్పరచ డానికి ప్రయత్నించితే దానికి జర్మనీ సహాయపడ రాదని, విప్లవ రిపబ్లిక్‌కే సహాయపడాలని షరతు పెట్టి నట్లు భట్టాచార్య తెలియజేశాడు. ఐతే జర్మన్ సామ్రాజ్యవాదుల వ్యూహం వేరు. భారతదేశంపై ఒక కన్ను వేసే వుంచారుఆనాటి జర్మన్ సామ్రాజ్యవాదులు. కాగా తక్కినచోట్ల కూడా తిరుగు బాటు పథకాలు విఫలమయ్యాయి.

## సయాం – బర్మాపథకం

చికాగో, శాన్ ఫ్రాన్సిస్కోలలోని విప్లవకారులు సంయుక్తంగా రూపొందించిన సయాం (థాయ్‌లాండ్) బర్మాపథకం కూడా ఫలించలేదు. ఈ పథకం ప్రకారం పదివేలమంది భారతీయులకు సైనికులకు శిక్షణ ఇవ్వాలి. వారు తర్వాత భారతదేశంలో బ్రిటిష్‌వాళ్ళపై యుద్ధం చేయాలి. బాంకాక్ సమీపంలోని పాకోహ్ అనేచోట దీనికి కేంద్రంగా ఎన్నుకొన్నారు. ఆయుధాలను, మందుగుండు సామాగ్రిని దాచేందుకు ఇక్కడ సొరంగాలు తవ్వారు. అమెరికా నుండి, మెక్సికో నుండి ఆయుధాలు రావాలి. సయాంలోని చంద్రాయ్ అడవుల్లో జర్మన్ ప్రవీణులు భారతీయు లకు తర్ఫీదు ఇవ్వాలి. ఆ రోజుల్లో జర్మన్ ఇంజనీర్ల అజమాయిషీ క్రింద రైలుమార్గ నిర్మాణంలో భార తీయులు పనిచేస్తున్నారు. సయాంలోని ఇతర ప్రాంతాల నుండి మరి కొందర్ని రప్పించాలి. బర్మా మిలటరీ పోలీసులలోని భారతీయుల్ని కూడా కలుపుకొని వారికి కూడా తర్ఫీదివ్వాలి. బర్మాను విముక్తంచేసి, విప్లవ కారుల వశంలో ఉంచుకొని, భారతదేశ విముక్తికి దానిని స్థావరంగా చేసుకోవాలి.

ఐతే ఆయుధాలు తీసుకురావలసిన ఓడను మనిలా నుండి షాంగేకి పోనీయలేదు. మనిలాలోని అమెరికన్ ఇమిగ్రేషన్ అధికారులు ఎప్పటికప్పుడు బ్రిటన్‌కు ఫిలిఫ్పైన్సులోని బ్రిటిషు వ్యతిరేక కార్యకలాపాల గురించిన సమాచారాన్ని అందచేస్తూనే ఉన్నారు. అప్పుడు పేరుకు తటస్థంగా ఉన్నా అమెరికా, బ్రిటన్‌కు తోడ్పడుతూనే వుంది. ఈ విషయం జర్మన్

గూఢచారులకు తెలియదనేది ఇందువల్ల స్పష్టమవుతూనేవుంది. చైనా, జపానుల నుండి సహాయం పొందాలని గదర్ విప్లవకారులు చేసిన ప్రయత్నాలు కూడా విఫలమయ్యాయి.

పేరుకు సయాం స్వతంత్రదేశం. నిజానికి అది బ్రిటిష్ ప్రాబల్యం క్రిందనేవుంది. భారతదేశంలో రిటైరయిన పోలీసు ఉన్నతాధికారులు, సైనికాధికారులు అక్కడ పనిచేసేవారు. సయాంకు పంపబడిన విప్లవకారులకు జోధ్‌సింగ్ నాయకుడు. అతడు ద్రోహియై బ్రిటిష్‌వాళ్ళకు సమాచారం అంతా అందించాడు. ఫలితంగా సయాం-బర్మాపథకం విఫలమయింది.

1916మే న మాండెలే (బర్మా) కుట్రకేసు ప్రారంభమయింది. ఆ కేసులో 17 గురిని ఇరికించారు వారిలో ఏడుగురిని ఉరితీసింది బ్రిటిష్ ప్రభుత్వం. మరో ఆరుగురికి ద్వీపాంతర శిక్ష విధించింది.

జమేదార్ చిస్తేఖాన్, సుబేదార్ దుండేఖాన్ నాయకత్వాన సింగపూర్‌లో 5 వ లైట్ ఇన్‌ఫెంటరీలోని 700 మంది సిపాయిలు బ్రిటిష్‌వారిపై తిరగబడ్డారు. సంకుల సమరం జరిగింది. అనేకమంది చనిపోయారు. 37 గురిని బహిరంగంగా ఉరితీశారు. 41 మందికి యావజ్జీవ శిక్ష విధించబడింది. ఈ తిరుగుబాటును అణచడంలో జపాన్ బ్రిటన్‌కు సహాయపడి భారతీయుల విప్లవ సన్నాహాలకు వెన్నుపోటు పొడిచింది. ఇదేకాదు. మరికొన్ని సంఘటనలు కూడా, తమలో తమకెన్ని వైరుధ్యాలున్నా రక్తపిపాసులైన సామ్రాజ్యవాదుల మధ్య బాంధవ్యం ఒకటేనని నిరూపించాయి. అది విప్లవాన్ని అణచివేయడం.

కాబూల్‌లో రాజా మహేంద్రప్రతాప్ ఆధ్వర్యాన ఏర్పరచిన స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వం, జార్‌చక్రవర్తి అధీనంలోని రష్యానుండి సహాయాన్ని ఆశించింది. అక్టోబరు సోషలిస్టు విప్లవానికి ముందు ఏర్పడిన రష్యన్ తాత్కాలిక ప్రభుత్వం నుండి కూడా సహాయంకోసం విజ్ఞప్తి చేసింది. ఇలా మూడుసార్లు చేసిన విజ్ఞప్తులు ఏమాత్రం ఫలించలేదు. టర్కీ మతాధిపతి ముస్లిము పురుషులను సాయుధులై బ్రిటిష్ వాళ్ళపై తిరగబడండని ఫత్వా ఇచ్చినా టర్కీ సామ్రాజ్యవాదం మాత్రం ఏమంత పట్టించుకోలేదు.

ఆ విధంగా యుద్ధకాలంలోని మూడు ముఖ్య ధోరణులకు చెందిన కాంగ్రెస్ మితవాదులు, కాంగ్రెస్ అతివాదులు దేశ విదేశాల్లోని విప్లవకారులు స్వాతంత్ర్య హక్కుల సముపార్జనకు కావలసిన పరిస్థితులున్నా, అమోఘ త్యాగాలు చేసినా విజయాన్ని సాధించలేకపోయారు. బ్రిటిష్‌వాళ్ళనుండి ముఖ్యమైన హక్కులను రాబట్టలేకపోయారు. చెదురు మదురుగా తప్ప దేశవ్యాపితంగా, సామూహికంగా ప్రజానీకం ఈ సంఘటనలలో పాల్గొనలేదు. వైఫల్యాలకు అదొక ముఖ్యకారణం.

## గదర్ యోధులలో ఒక ఆంధ్రుడు

గదర్ ఉద్యమంద్వారా స్వాతంత్ర్య ఉద్యమానికి ఎంతో సేవచేసిన ప్రముఖులలో దర్శి చంచయ్యగారొకరు. గదర్ వీరులలో అద్భుత సాహసం ప్రదర్శించిన తెలుగు యోధుడు ఆయన. తన అనుభవాలను 1951 లోను, 1960 లోను గ్రంథస్థం చేశాడాయన. మృత్యుగహ్వరంలో చొరబడి సజీవంగా బయటికి వచ్చిన ఈ స్వాతంత్ర్య సమరయోధుడు 1948 వరకు అనేకసార్లు జైళ్ళకు వెళ్ళాడు. నిర్బంధాలకు గురి అయ్యాడు. స్వాతంత్ర్యం లభించాకనే తన అనుభవాలను పాఠక ప్రపంచానికి తెలియచేయడానికి చంచయ్యగారికి వీలయింది.

1890 లో నెల్లూరు జిల్లా కావలిలో జన్మించిన చంచయ్యగారు 1912 డిసెంబరులో ఉన్నత విద్యాభ్యాసంకోసం అమెరికాలో కాలుపెట్టాడు. బెర్కిలీలోని కాలిఫోర్నియా యూనివర్శిటీలో చేరాడు. లాలా హరదయాల్ ఉపన్యాసాలు, జితేంద్రనాధ్ లహరీ సాంగత్యంతో గదర్ పార్టీ నిర్మాతలలో ఒకడయ్యాడు.

గదర్ పార్టీ ప్రారంభంనుండీ విద్యార్థులుగా పాల్గొన్న ఆంధ్రులలో భాగవతుల సోమయాజి శర్మ (గుంటూరు ప్లీడర్) పి. జె. వెంకయ్య (హైద్రాబాద్) వున్నారు. ఐతే వీరిద్దరూ చివరివరకు గదర్ పార్టీ కార్యకలాపాల్లో పాల్గొనలేదు. చెంచయ్య మాత్రం ధైర్యంగా నిలిచాడు. యుద్ధకాలంలో భారతదేశానికి త్వరగా చేరి అక్కడ విప్లవ కార్యకలాపాలను సాగించాలని అత్యంత ఉత్సాహపడిన శర్మ, తీరా భారతదేశానికి వెళ్ళాక నిరుత్సాహ పడిపోయాడు.

విదేశాలలోని భారతీయులలో బ్రిటిష్ పాలకుల పట్లగల విద్వేష భావాలు భారతదేశంలో కన్పించ లేదు. "అమెరికాలో వున్న వేడి, భారతదేశంలో కనపడటంలేదు. ఇక్కడ చల్లగా వుంది" అని చంచయ్య గారికి రాశాడు.

చంచయ్య శాన్‌ఫ్రాన్సిస్కోలో పట్టభద్రుడయాక, బర్మాలో విప్లవం లేవదీసే కార్యక్రమంలో సహాయపడటానికి నియమించబడ్డాడు. అమెరికా, ఆసియాలలో వున్న గదర్ వీరులు సయాం గుండా బర్మాచేరి, బర్మా విముక్తికి కృషి చేయాలి, ఆఫ్ఘనిస్తాన్ మీదుగా జర్మనీ సైన్యం భారతదేశం చేరుకుంటుందనీ, అప్పుడు భారతదేశంలో తిరుగుబాటు చేయాలనీ నిర్ణయించారు. సయాం పర్వతాలమీదుగా బర్మామీద దండెత్తి, బర్మాను విముక్తి చేసేందుకు పథకం వేశారు.

జోధ్‌సింగ్, చటర్జీలతోపాటు స్టీమర్‌లో చంచయ ప్రయాణం చేస్తుండగా జపాన్‌లో కొన్ని రోజులు మర్ ఆగింది. చైనా జాతీయ నాయకుడు సన్‌యట సేన్‌ను కలిసికొనే అవకాశం చెంచయ్యకు కల్గింది. బ్రిటిష్‌వాళ్ళ అధికారాన్ని భారతదేశంలో ముందు కూలదోయాలి. అంతవరకూ బలహీన దేశాలకు ఎటువంటి ఆశారేఖ కన్పించదని సన్‌యట్‌సేన్ ఆయనకు సందేశ మిచ్చాడు.

ఫిలిప్పయిన్సు రాజధాని మనీలా చేరాక, జర్మనీ దౌత్యాధికారికి అందించవలసిందని రెండు లేఖలను గదర్ నాయకుడు రామచందర్ చంచయ్యకు అప్పగించాడు. ఆ పని ఆయన పూర్తిచేశాడు. తర్వాత గదర్ నాయకులు బాంకాక్ (సయాం) చేరారు. అక్కడికి వచ్చే విప్లవకారులకూ, బర్మా సరిహద్దులోని పర్వత ప్రాంతాలలోని విప్లవ దళాల క్యాంపుకూ మధ్య సంధానోద్యోగిగా చంచయ్యను నియమించారు. బాంకాక్‌లో వీరికి సి.ఐ.డీల బాధ ఎక్కువయింది.

సయాం కొండలమీదుగా గదర్ నాయకుల ఆధ్వర్యాన చిన్న సైన్యంతో బర్మాలోకి వెళ్ళి యుద్ధం ప్రారంభించగానే, భారత సైనికులు తమతో చేరిపోతామని హామీ లభించింది. కాని సయాం ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వం చెప్పుచేతల్లో వుంది. బ్రిటిష్‌వాళ్ళ గూఢచారులు జోధ్‌సింగ్ తదితరులను అరెస్టు చేశారు. జోధ్‌సింగ్ పిరికితనంతో రహస్యాలన్నీ చెప్పాడు చంచయ్య ఒక్కడే మిగిలాడు.

ఒక తెల్లవారుఝామున చంచయ్యను లేపి, ఆయన మిత్రులంతా అరెస్టయారని ఒక ఆర్యసమాజ మిత్రుడు చెప్పాడు. అడవులగుండా చైనా వెళ్ళే మార్గం చెప్పి తెల్లవారిన తర్వాత, సాయంత్రం 7 గంటలకుగాని రైలు లేదనీ, ఎలాగో అందాకా కాలక్షేపం చెయ్యాలనీ చెప్పాడు. చెంచయ్య చేతిపెట్టెలో అనేక రహస్య పత్రాలు, పథకాలు, ఉత్తరాలు, డైరీలు, రివాల్వరు వున్నాయి. తానిదివరలోవున్న ఒక యూరోపియన్ హోటల్‌కు వెళ్ళి, పెట్టె భద్రంగా ఉంచమనీ, తనకో రూమ్ ప్రత్యేకించి ఉంచవలసిందిగా చెప్పి చంచయ్య వెళ్ళిపోయాడు. ఆ పెట్టెను రైలులో తనకు ఆ మిత్రుడు అందించాలని పథకం. పగలల్లా ఎలాగో తల దాచుకోవాలి. అందుకు జపాన్‌వాళ్ళ బోగం ఇంట్లో మకాం చేయాల్సి వచ్చింది. అక్కడ తనని అనుమానించినట్లు చంచయ్య గ్రహించాడు. ఆ వాతావరణంలో అక్కడ ఉండటం దుర్భరమైంది. సాయంత్రం ఐదింటికే ఆ కొంపనుండి బయటపడ్డాడు. మూడు నాల్గుమైళ్ళ దూరం నడిచాక, ఒక ఇంగ్లీషు పోలీసు ఆఫీసరు వెంబడించి అరెస్టు చేసి కారులో తన బంగళాకు తీసుకు వెళ్లాడు. టీ పంపిస్తానని ఆఫీసర్ లోనికి వెళ్లాడు. ఒక పోలీసు మాత్రం కాపలా ఉన్నాడు. చంచయ్యను తన అధికారి స్నేహితుడేమోనని అతడు భావించాడు. ఈ అవకాశం చూసుకుని చంచయ్య తన డైరీని చించి చిత్తుకాగితాల బుట్టలో పారేశాడు.

చంచయ్యని విదేశీయుల్నివుంచే జైలులో ఉంచారు. అక్కడే వేర్వేరు గదులలో తన సహచరులంతా ఉన్నారు. అమరసింగ్ అనే ఆయన బయట విప్లవకారులతో సంబంధాలు పెట్టుకొన్నాడు. జెయిలు గోడలు బద్దలుగొట్టి పారిపోవాలనే అతని ప్లాను నెరవేరలేదు. ఆ ప్రయత్నం చేయకముందే, అంటే అరెస్టు అయిన రెండునెలలకు సింగపూర్ మిలటరీ పోలీసు దళం వచ్చి, చంచయ్యనూ, తదితరులనూ సింగపూర్ కోటకు తీసుకెళ్లారు. మలయా పోలీసుల ఎస్కార్టుతో స్టీమర్‌లో ప్రయాణం. ఒక్కొక్కరికి సంకెళ్లు, మళ్లా ఇద్దరిద్దరికీ సంకెళ్లు, ఒరుసుకుపోతున్న సంకెళ్ళతో

ఇరుకైన ప్రదేశంలో ఇద్దరిద్దరు వంతుల చొప్పున పడుకోవాలి. కాళ్లారజాపు కునేటంత జాగా లేదు. ప్రయాణం ప్రారంభమైన 36 గంటలదాకా తినడానికి ఏమీలేదు. రాత్రంతాచలి, కప్పుకోడానికి ఏమీలేదు. పొ న్నే ముఖం కడుక్కోడానికి కూడా నీళ్లు లేవు. దొ కికూడానంకెళ్లతో ఇద్దరేసి వెళ్లాలి. కడుక్కునేం దు నీళ్ల బదులు వార్తాపత్రికలు. ఈ బాధలు చాలక, తెల్లదొరల అవహేళనలు, తన్నులు, దెబ్బలు -వీటిని వీరెవరూ ఖాతరు చేయలేదు.

అంతకు ముందే సింగపూర్‌లో తిరుగుబాటు జరిగి తెల్లవాళ్ళు హతమై వుండటంవల్ల నిర్బంధకాండ అతి క్రూరంగా వుంది. మిలటరీ డిటెన్షన్ బారకాసులలో గదికి ఒక్కరి చొప్పున వీరందర్నీ నిర్బధించారు. చిన్న కంత మినహా వెలుతురూ, గాలీ లేదు. వారానికి ఒక బకెట్ నీళ్ళు, తుళ్లు లేవు. సబ్బు లేదు. పళ్ల తోముకోటానికి బ్రష్ లేదు. అద్దంలో తమ ముఖం కాదు గాని అసలు అద్దం ముఖమే వాళ్లు చూతలేదు. పుస్తకాలు చదవకూడదు. ఒకళ్లతో ఒకళ్లు మాట్లాడ కూడదు. పాడకూడదు-ఇలా.ఆర్నెల్లు సాగింది గడ్డాలు మీసాలు పెరిగాయి.నోరుదుర్వాసన పండ్లు గారపట్టాయి. తలలో పేలు. ఒకటి రెండునెలల తర్వాత వ్యాయామం పేరుతో మిట్టమధ్యాహ్నం సన్నటి గులకరాళ్ల మీద పాదరక్షలు లేకుండా నడవాలి. ఇలాంటి దుర్భర పరి స్థితులలో ఒకరికి పిచ్చి ఎక్కిందంటే ఆశ్చర్య మేముంది? ఐనా చంచయ్య ఇవన్నీ తట్టుకోగలిగాడు.

చంచయ్య మీద చేసిన నేరారోపణ, ఆయుధాలతో కూడిన స్టీమరునూ, అందుకు సంబంధించిన ఉత్త రాలనూ తెచ్చాడని - రెచ్చగొట్టీ, భయపెట్టీ, బుజ్జ గించీ కూపీ లాగాలని చేసిన ప్రయత్నాలన్నీ చంచయ్య పట్ల విఫలమయ్యాయి.

కోర్టు మార్షల్ చేసి, కాల్చివేస్తామన్న నిర్ణయాన్ని తెలాపరు - మూడురోజుల వ్యవధి. మానసిక క్షోభకు గురి చేశారు.

బల్వంత సింగునూ, ఆతరాత్య చెంచెయ్యనూ, ఇలా ఒక్కొక్కరినే కోటలో ఒక హాలు లోపలికి తీసుకు వెళ్ళేవారు. తుపాకీ కాల్చిన శబ్దం. మిగతా వాళ్ళని ఇప్పటికైనా రహస్యాలు చెప్పవలసిందని ఒత్తిడి. బల్వంతసింగ్ తర్వాత చంచయ్యను ఒక స్తంభం దగ్గర నిలబెట్టారు. ఆఖరిసారిగా ఒక్కనిమిషం ప్రైమిచ్చి రహస్యాలు చెప్పకపోతే కాల్చుతామని బెదరించారు. కాల్చుకోమన్నాడుచంచయ్య. ఐదుగురు సైనికులు తుపాకీలు ఎక్కుపెట్టి కాల్చారు. కాని గుండ్లు తగలలేదు. ఇదేం మంత్రంగాదు, తంత్రం మాత్రమే. ఖాళీ తూటాలు, మైనపు తూటాలు పెట్టి కాల్చారు. అవి కరిగిపోతాయి కాని బయట ఉన్న వాళ్ళకి ఖైదీ చచ్చిపోయాడనే భావం కలుగుతుంది. దాంతో భయపడి రహస్యాలు చెబుతాడని బ్రిటిష్ అధికారుల ఆశ. జోధ్‌సింగ్ విషయంలో ఆ ఆశ నెరవేరింది. చటర్జీకూడా అప్రూవరయ్యాడు. సింగ పూర్‌లో ఆరునెలల ఏకాంతవాస శిక్ష తర్వాత చంచయ్యకు ఇతర ఖైదీలతో కలిసే అవకాశం కల్గింది. నిర్బంధాలు కొంత సడలించారు. క్షవరం చేయించి, బట్టలు పుస్తకాలు ఇచ్చారు. సింగపూర్ నుండి స్టీమరులో ఎనిమిది రోజుల ప్రయాణం చేయించి కలకత్తాకు చేర్చారు ఖైదీలను. కలకత్తా ఆలీపూర్ సెంట్రలు జైలులో చంచయ్యను నిర్బం ధించారు. తర్వాత లాహోరు, ఢిల్లీ, కన్ననూర్, కోయంబత్తూరు జైళ్ళకు మార్చారు. కన్ననూర్ జైలులో వున్నపుడే బర్మా కుట్రకేసులో ఇరికించారు. లాహోరు కుట్రకేసులో కూడా ఇరికించడానికి ప్రయత్నం జరిగింది, కాని గదర్ నాయకుడు బల్వంత సింగ్ గాంధీ కుట్రకు తానే బాధ్యుడననీ చంచయ్య మొదలైనవారు కాదనీ నేరం అంతా తనమీద వేసుకుని, ఉరిశిక్ష పొందాడు. చంచయ్యను వివిధ జైళ్ళలో డిటెన్యూగా వుంచారు. జైలులో ఆయన ప్రవర్తన అధికారులను హడలెత్తించింది. 1919 డిసెంబరులో విడుదలయ్యాడు. ఆ తర్వాత ఆయన ప్రముఖ సంస్కర్తగా పని చేసినా జైళ్ళబాధ తప్పలేదు. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలోను ఆ తర్వాత అనేకసార్లు అరెస్టు అయ్యాడు 1940లో 1947, 48 లలో అరెస్టు అయ్యాడు. 1948 అక్టో బరులో రాజకీయాల నుండి విరమించుకున్నాడు. కొందరికి పుట్టుకతోనే క్షాత్రం. కొందరికి రక్తంలోనే పిరికితనం వుంటుందని కులాలపేరుతో కథలు కల్పిం చిన స్వార్థపరులకు చెంపపెట్టు పెట్టాడు చంచయ్య.

## ఒక చేత్తో సంకెళ్ళు
## మరో చేత్తో సంస్కరణలు

మొదటి ప్రపంచ యుద్ధకాలంలో జరిగిన సంఘటనలు భారతీయులలో రాజకీయ చైతన ం మరింత పెంచడానికి తోడ్పడ్డాయి. ప్రపంచ యు ంలో కొన్ని కీలక విజయాలు సాధించడానికి బ్రిటన్ తోడ్పడింది భారత సైన్యాలే. ఎనిమిది లక్షలమంది భారత సైనికులు యుద్ధంలోను మరో నాలుగు లక్షలమంది సైనికేతర కార్యకలాపాల్లోను పాల్గొన్నారు దీనితో భారతీయులలో ఆత్మవిశ్వాసం ప్రబలింది.

యుద్ధకాలంలోనే కాంగ్రెసులోని అతివాదులు మితవాదులు ఏకమయ్యారు. హిందువులు, ము ములు ఏకమయ్యారు. దేశంలోని, విదేశాలలోని వవాదులు సాయుధ సైనిక తిరుగుబాటు లేవదీయడా కి గొప్ప ప్రయత్నం చేశారు సామాన్య ప్రజానీకంలో కూడా జాతీయభావం ఉప్పొంగింది. యూరప్ పట్ల భారతీయులు అంచనాకూడా మారిపోయింది. ప్రాచ్య దేశాల కన్న పాశ్చాత్య దేశాలు మిన్న అనే భావం సున్నా అయింది. ప్రపంచ మహాయుద్ధం ప్రారంభించడానికి దాదాపు ఒక దశాబ్దం క్రిందటే జపాను చేతిలో జార్ చక్రవర్తి పాలనలోని రష్యా ఓడిపోయింది. ఒక ప్రాచ్యదేశం చేతిలో ఒక పాశ్చాత్య దేశం ఓడిపోవడంతో బ్రిటిషు వాళ్ళను తరిమివేయ గలమనే భావం ఆనాడే భారతీయుల్లో ప్రబలం కాజొచ్చింది. 1917 లో రష్యా విప్లవం, జాతీయ స్వాతంత్ర్య సమస్యను మరింత వేగిర పరచింది. రష్యన్ ప్రజలు ఒక సామ్రాజ్య ప్రభుత్వాన్ని కూల్చివేయగలిగినపుడు, తమ దేశంలో తాము మాత్రం ఎందుకు పరాయిపాలనను కూలద్రోయలేము ? అని వారు ఆలోచించ మొదలు పెట్టారు. అమెరికా అధ్యక్షుడు విల్సన్ ప్రకటించిన 14 సూత్రాలు కూడా కొ ఆశలను చిగురెత్తించాయి. ప్రజల వత్తాసు సంపాదించడానికి యుద్ధ కాలంలో బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సు, ఇటలీ, జపాను దేశాలు "ప్రజాతంత్రాన్ని రక్షించడానికే ఈ యుద్ధం" అని అన్నారు. అన్ని దేశాలకూ స్వయం నిర్ణయాధికారం ఇస్తామని వాగ్దానం చేశారు. రష్యాలో విప్లవం రాగానే, సోషలిస్టు ప్రభుత్వం ఆసియాలో అదివరలో తన దేశానికి గల సామ్రాజ్య హక్కు లన్నిటినీ ఐచ్ఛికంగా వదులుకుంది. శాంతి ఆవశ్యకత గురించి ప్రకటన చేసింది. భూములు లేనివారికి భూముల్ని పంచింది. విప్లవ తొలి దశలోనే సామ్రాజ్యవాద దేశాలన్నీ కలసి చేసిన దాడిని తిప్పికొట్టింది. ఇదంతా సామాన్య జనంలోనూ, మేధావులలోను గొప్ప ప్రభావాన్ని కలుగచేశాయి.

ఢిల్లీ కాంగ్రెసు, స్వయం నిర్ణయాధికారాన్నేగాక, భారత ప్రజల హక్కుల గురించి కూడా ప్రకటన చేయాలని ప్రభుత్వాన్ని కోరింది.

ఈ పరిస్థితులలో ముందుగానే మేల్కొనడం మంచిదని బ్రిటిషు ప్రభుత్వం భావించింది. పైగా యుద్ధంలో మిత్రమండలి విజయావకాశాలు సందిగ్ధావస్థలో పడివున్న సమయం. అందుచే భారతదేశ కార్యదర్శి ఎడ్విన్ ఎస్. మాంటేగ్ 1917 ఆగస్టు 20 వ ఒక ప్రకటన చేశాడు. అందులో భారతదేశాన్ని గురించి, "బ్రిటిషు సామ్రాజ్యంలో భాగంగా, భారతదేశంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని క్రమేపి ఏర్పరచే లక్ష్యంతో, స్వయపాలనా సంస్థలను క్రమక్రమంగా పెంపొందించడం" తమ లక్ష్యమని ప్రకటించాడు. దాన్నే "అధినివేశ ప్రతిపత్తి"గా కొందరు భాష్యం చెప్పారు. దీనితో పాటే హోం రూల్ ఉద్యమ ఖైదీలను విడుదల చేశారు. సైన్యంలో కమిషన్ పదవికి నల్లరంగు జాతీయులు పనికిరారనే నిషేధం తీసివేశారు.

ఈ సంస్కరణలు జాతీయవాదుల కోర్కెలను సంతృప్తి పరచలేదు. సంస్కరణలలో ఒక ముఖ్యాంశం, రాష్ట్రాలలో ద్వంద్వ ప్రభుత్వం. తక్కువ ప్రాముఖ్యం గల శాఖలు, విద్య, పారిశుధ్యం లాంటివి మాత్రం రాష్ట్ర శాసనసభలు ఎన్నుకొన్న ప్రతినిధుల కిస్తారు. కాని ముఖ్యమైన ఆర్థిక, పోలీసు, సాధారణ పరిపాలన మొదలైనవి వైస్రాయి కార్యనిర్వాహక సభ్యులకు "రిజర్వు" చేయబడతాయి. పైగా యీ సభ్యులు కేంద్ర ప్రభుత్వానికి, పార్లమెంటుకు మాత్రమే బాధ్యులు. శాసనసభ్యులకు బాధ్యులైన మంత్రులిచ్చే సలహాలను గవర్నర్ అంగీకరిస్తే అంగీకరించవచ్చు, లేకా తిరస్కరించవచ్చునూవచ్చు.

ఈ సంస్కరణల గురించిన ప్రకటన కాంగ్రెస్‌లో చీలికకు దారితీసింది. "ఎన్ని విపత్తులు వచ్చినా, ఎన్ని కష్టనష్టాలు కలిగినా బ్రిటిషు సామ్రాజ్యానికి అండగా నిలవాలి" అని 1917 లో తీరా నించిన కాంగ్రెసే, 1918 లో మాంటేగ్-చెమ్స్ఫర్డు నివేదిక ప్రకటించిన తర్వాత అందుకు భిన్నమైన వైఖరి తీసుకుంది. బొంబాయిలో జరిగిన ప్రత్యేక కాంగ్రెసు, హసన్ ఇమామ్ అధ్యక్షతన సమావేశమై ఈ సంస్కరణలు "అసమగ్రమైనవీ, అసంతృప్తికరమైనవీ, ఆశాభంగం కలిగించేవీ" అని తీర్మానించింది. కాంగ్రెసులో మితవాదుల సంఖ్య ఇప్పటికే తగ్గిపోయింది. ఆ కొద్దిమంది కూడా యీ కాంగ్రెస్‌కు హాజరుకాలేదు. 1918 నవంబరులో వారు వేరే సమావేశమయ్యారు. 1919 లో "నేషనల్ లిబరల్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా" పేరిట లిబరల్ పార్టీని ఏర్పరచుకొన్నారు. సురేంద్రనాథ్ బెనర్జీ దీనికి అధ్యక్షుడు ఒక రాజకీయ శక్తిగా వీరి ఉనికి ఉడిగిపోయింది. మొదట్లో గాంధీ కూడా అనుకూలంగానే ఉన్నాడు. 1919 అమృతసర్ కాంగ్రెస్‌లో గాంధీ కూడా బ్రిటిష్ ప్రభుత్వంతో సహకరించాలనే ధోరణినే ప్రదర్శించాడు. చిత్తరంజన్‌దాసు, జిన్నా, తిలక్‌లు యీ సంస్కరణలకు వ్యతిరేకమే. ఒకవేళ అంగీకరించినా వాటిని భగ్నం చేయడానికే అంగీకరించాలని తిలక్ వాదన. గాంధీ ఆ వాదనను అంగీకరించలేదు. అంగీకరిస్తే పూర్తిగా అంగీకరించాలి, లేదా తిరస్కరించాలి అని గాంధీ అన్నాడు. కాంగ్రెస్ ప్రతినిధులు గాంధీనే బలపరిచారు. ఐతే తిలక్‌ను ఓడించడం గాంధీకి ఇష్టం లేదు. తన ఖద్దరు టోపీని తిలక్‌పట్ల గౌరవసూచకంగా నేలపై పడవేసి, రాజీ తీర్మానానికి వోటు చేయవలసిందిగా కోరాడు. తిలక్ లొంగక తప్పలేదు. రాజీ తీర్మాన సారాంశం ఇది: సంస్కరణలు ప్రవేశపెట్టిన మాంటేగ్‌కు కృతజ్ఞతను తెలియచేయడం, సంస్కరణలను పూర్తి పార్లమెంటరీ ప్రభుత్వంగా మార్చడానికిగాను సహకరించడం.

ఐతే ఈ సహకారం తాత్కాలికంగా మాత్రమే నిలిచిపోయింది. ఒక చేత్తో సంస్కరణల్నీ, మరో చేత్తో సంకెళ్ళనీ పట్టుకొని వున్న బ్రిటిష్ ప్రభుత్వ వైఖరిలో మార్పు వచ్చింది. యుద్ధానంతరం కూడా నిర్బంధ విధానాల్ని కొనసాగించడానికి జారీ చేసిన రౌలట్ చట్టంతో, పంజాబు దురంతాలతో వీరి వైఖరి మారిపోయింది.

## రౌలట్ చట్టం — పంజాబులో బ్రిటిష్ హత్యాకాండ

1918 నవంబరుతో యుద్ధం ముగిసింది. యుద్ధకాలంలో సాగిన నిర్బంధ విధానానికి బ్రిటిష్ అధికారులు స్వస్తి చెబుతారని అందరూ ఆశించారు కాని దానికి పూర్తిగా భిన్నంగా జరిగింది.

సిడ్నీరౌలట్ ఆధిపత్యాన ఇంగ్లాండ్ నుండి ఒక కమిటీ భారతదేశానికి వచ్చింది. 1905 నుండి 1918 వరకు భారతదేశంలోని విప్లవ కార్యకలాపాల గురించి నివేదిక సమర్పించడం దీని పని ఈ కమిటీ 1917 లోనే ఏర్పడింది. రౌలట్ కమిటీ నివేదిక 1919 జనవరి 19 న ప్రకటించబడింది. భారత శాసనసభ (సుప్రీం లెజిస్లేటివ్ కౌన్సిల్)లో ఫిబ్రవరి 6 న రౌలట్ బిల్లు ప్రవేశపెట్టబడింది. మార్చిలో అంగీకరింపబడింది.

ఈ బిల్లును ప్రవేశపెట్టినపుడు దానిపై జరిగిన చర్చలను స్వయంగా గాంధీ విన్నాడు శాసనసభలోని భారతీయ సభ్యులు—ఎన్నికైనవారూ, నామినేట్ చేయబడినవారూ-అందరూ వ్యతిరేకించారు. శాసన సభలో బ్రిటిషు ప్రభుత్వంచే నియమితులైన సభ్యులదే మెజారిటీ అయినందున రౌలట్ బిల్లు పాసయింది. ఇదంతా చట్టబద్ధంగా తయారుచేసిన శాసనం అని చెప్పుకోడానికి చేసిన పార్సు అని గాంధీ వ్యాఖ్యానించాడు.

1919 మార్చి 18 న రౌలట్ చట్టం అమలులోకి వచ్చింది. ఎట్టి విచారణ లేకుండానే వ్యక్తులను జైలులో డిటెన్ చేయడానికి ప్రభుత్వానికి అధికారం ఇచ్చిందీ చట్టం. పౌర హక్కులు కాలరాస్తుందీ చట్టం. అనుమానించిన ఏ వ్యక్తినైనా అరెస్టు చేసి డిటెన్ చేయవచ్చు. రాజద్రోహ సాహిత్యాన్ని పంచాలనీ, ప్రచురించాలనీ అనుకోవడం కూడా ఈ చట్ట ప్రకారం నేరం అవుతుంది. జడ్జీలకు విపరీత అధికారాలు ఇవ్వబడ్డాయి. ఏ వ్యక్తినైనా ఇంటరన్‌చేసే

అధికారం (ఫలానిచోటనుండి కదలరాదనే అధికారం) వారికుంది. ఈ చట్టంలోని ఇంకా అనేక కఠిన అంశాలు ప్రతి దేశభక్తుడినీ కలవరపెట్టాయి. ఈ చట్టాన్ని "బ్లాక్ యాక్ట్" (దుష్ట చట్టం) అని పిలిచారు. మొదట రెండు రౌలట్ బిల్లులను ప్రవేశపెట్టినపుడు వాటిని గురించి గాంధీ ఇలా వ్యాఖ్యానించాడు:

"మన గొంతు పిసకడానికి గట్టి పట్టును అధికారులకు ఈ బిల్లులు సమకూర్చుతున్నాయి. ఇవి మనకు బహిరంగ సవాలని నేను భావిస్తున్నాను." రౌలట్ బిల్లులు చట్టరూపంగా వస్తే, సత్యాగ్రహం ప్రారంభించుతానని గాంధీ ముందుగానే హెచ్చరించాడు. అందుకు సత్యాగ్రహుల ప్రమాణ పత్రాలను కూడా సిద్ధం చేశాడు దేశమంతా ఇందుకోసం పర్యటన చేశాడు. ముస్లింలీగ్ అధ్యక్షుడు జిన్నా "ఈ బిల్లును ఆమోదించడంవల్ల ఇదివరకెన్నడూ లేనంత అసంతృప్తి, ఆందోళనా ప్రబలుతుంది" అని హెచ్చరించాడు. "ఈ బిల్లులోని అంశాలు నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేశాయి" అని గాంధీ అన్నాడు. ఇప్పటిదాకా గాంధీలో వున్న ఓర్పు అంతరించిపోయింది. "బ్రిటిష్ సామ్రాజ్యం, మంచికోసం వున్న ఒక అధికారం" అని భావించిన గాంధీయే "బ్రిటిష్ సామ్రాజ్యం నేడు సైతాన్ తత్వాన్ని ప్రతిబింబించుతోంది. దేవుని ప్రేమించేవా డెవ్వడూ సైతాన్‌ను ప్రేమించలేడు." అన్నాడు.

1918 చివరి మాసాల్లోను, 1919 లోను అశాంతి వెల్లువ పెల్లుబికింది. బొంబాయి మిల్లుకార్మికులు లక్షా ఇరవై వేల మంది సమ్మె చేశారు. ప్రజా సంరంభాన్ని గమనించిన రాజకీయ నాయకులు వారికంటే వెనుకబడటం సాధ్యంకాని పని.

రౌలట్ బిల్లుతో దేశంలో ఆగ్రహావేశాలు కట్టలు తెంచుకుంటున్న సమయంలో, గాంధీ రాజకీయ రంగంలో స్వాతంత్ర్య సమర రథ సారథి అయ్యాడు. దక్షిణాఫ్రికాలో తన సాత్విక నిరోధ ఉద్యమ అనుభవం దృష్టిలో పెట్టుకుని, రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా ఉద్యమాన్ని లేవదీశాడు.

1919 ఫిబ్రవరిలో "సత్యాగ్రహ సమితి" ఏర్పరచబడింది. ఆ తర్వాత రెండు నెలల్లో పెద్ద పెద్ద ప్రదర్శనలు, సమ్మెలు. అశాంతి, కొన్ని సందరాలలో కొట్లాటలు జరిగాయి. అత్యంత క్రూర దమకాండకు వీరోచిత ప్రతిఘటన కూడా జరిగింది. హిందూ ముస్లిముల మధ్య ఐక్యత అత్యంత ఉన్నతస్థాయికి చేరింది. ముస్లింల చేతినుండి మంచి నీరును హైందవులు తాగారు. అలాగే హిందువుల చేతినుండి ముస్లిములు మంచినీరు తాగారు. హిందూ ము మ్ ఐక్యతా నినాదాలు మిన్నుముట్టాయి. స్వామీ శ్ర నంద హిందూమత నాయకుడు. ఢిల్లీలోని జుమా మసీదునుండి ఆయన ప్రజలకు సందేశమిచ్చాడు.

1919 మార్చి 30 న దేశమంతటా హర్తాళ్లు, సభలు, ప్రార్థనలు, ఉపవాసవ్రతాలు, జరగాలని మొదట్లో నిర్ణయించారు. కాని అది ఆరవ తేదీకి వాయిదా వేయబడింది ఈ మార్పు తెలియనందున ఢిల్లీలో మార్చి 30 న హర్తాళ్, ఉత్సవాలు జరిగాయి. ఆనాడు ఉత్సవాన్ని నడిపిన శ్రద్ధానంద స్వామిని కాలుస్తామని యూరోపియన్ సైనికులు బెదిరించారు. ఎదురు రొమ్ముపై ఉన్న వస్త్రాలను తొలగించి కాల్చుకోమని నిలబడ్డాడు. ఆ బెదిరింపులు గాలికెగిరి పోయాయి. ఢిల్లీ రైల్వేస్టేషనులో జరిగిన చిన్న సంఘటనను పురస్కరించుకొని పోలీసులు కాల్పులు సాగించారు. ఐదుగురు మరణించారు. ఇరవై మంది గాయపడ్డారు. ఇంకా బొంబాయి, కలకత్తా, అహ్మదాబాద్‌లలో ఊరేగింపులు జరిపిన వారిపై పోలీసులు కాల్పులు సాగించారు. హర్తాళ్లు జయప్రదమయ్యాయి. గాంధీయే స్వయంగా ఇలా అన్నాడు: "బొంబాయిలో హర్తాళ్ పూర్తిగా జయప్రదమైందని వేరే చెప్పనక్కరలేదు. దేశవ్యాపిత హర్తాళ్ అత్యంత అద్భుతదృశ్యం." రౌలట్ చట్టం పట్ల దేశవ్యాపితంగా కల్గిన నిరసన భావానికి ఒక్క ఉదాహరణ జవహర్‌లాల్ నెహ్రూయే. ఆయన అప్పటికి ఏ సభలోనూ ఉపన్యసించి ఉండలేదు. కేంబ్రిడ్జిలో చదువుకునే రోజుల్లో ఉపన్యాస చర్చల్లో పాల్గొనందుకు జరిమానా చెల్లించాడు కూడా. అలాంటి నెహ్రూ రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా మొట్టమొదటిసారి సభలో ప్రసంగించాడు.

## రెండు తలల రాక్షసి

బ్రిటిష్ ప్రభుత్వ దమనకాండ పంజాబులో రాక్షస రూపం ఎత్తిందా అనిపించింది. అది రాక్షసి అయితే ఆ రాక్షసికి రెండు తలలున్నాయి. ఒకటి పంజాబు గవర్నర్ సర్ మైకేల్ ఓ డయ్యర్‌ది. రెండవది

బ్రిగేడియర్ - జనరల్ రెజినాల్డ్ ఎడ్వర్డ్ హారీ డయ్యర్‌ది. ఈ రెండు తలల రాక్షసి వికట తాండవ నాట్యంక్రింద పంజాబ్ ప్రజలు పడిన బాధలు ఇంతింత అని చెప్పలేము.

మైకేల్ ఓ-డయ్యర్ పంజాబ్ లెఫ్టినెంట్ గవర్నరుగా పనిచేశాడు. వట్టి కర్కోటకుడు. రాజకీయ సంస్కరణలపై నమ్మకంలేదు. రాజకీయ ఆందోళనాకారులపట్ల ఎలాంటి సానుభూతి కాని, దయాదాక్షిణ్యాలుగాని అతడికి లేవు. యుద్ధరుణాలు బలవంతంగా రు పంజాబు ప్రజల్ని పీల్చి పిప్పి చేశాడు. సైనికుల్ని రి ట్ చేసుకునే విషయంలో కూడా నిర్బంధ పద్ధతులు అవలంబించాడు.

అమృతసర్‌లో మార్చి 30 న, ఏప్రిల్ 6 న కూడా హర్తాళ్‌లు శాంతియుతంగానే జరిగాయి. యుద్ధకాలంలో శాంతిభద్రతలను కాపాడినట్లుగానే, శాంతికాలంలో కూడా శాంతిభద్రతల్ని కాపాడి తీరుతామంటూ ఏప్రిల్ 7 వ తేదీన గవర్నర్ ఓ డయ్యర్ బెదిరించాడు. ఏప్రిల్ 9 న డాక్టరు సత్యపాల్ (వైద్యుడు డాక్టరు సైఫుద్దీన్ కిచ్లూ (లాయర్) లను అరె · చేసింది ప్రభుత్వం. ఈ ఇరువురు నాయకులూ సిన అపరాధం కాంగ్రెసు మహాసభను అమృతసర్‌లో జరపడానికి సన్నాహాలు ప్రారంభించడమే. అమృతసర్ మేజిస్ట్రేట్ వీరిని తమ ఇంటికి పిలిపించి నిర్బంధించాడు.

తరవాత పోలీసులు వీరిని ఎక్కడకో తీసుకువెళ్ళారు. రాష్ట్రంనుండి వీరిని బహిష్కరించిన వా ర ప్రజ కోపోద్రిక్తుల్ని చేసింది. ఇందుకు నిరసనగా సంపూ హరతాళ్ జరిగింది. తమ నాయకుల్ని వదలిపెట్టా కోరుతూ ఊరేగింపుగా డిప్యూటీ కమీషనర్ వద్దకు ప్రజలు వెళ్ళారు. వారు నిరాయుధులుగానే వున్నారు. ఐనా రైల్వేలెవల్ క్రాసింగ్‌వద్ద వారిని ఆపివేసి సైనికులు తుపాకులు పేల్చారు. మరణించిన వారిని మోసుకుంటూ ప్రజాసమూహం ఊరేగింపు చేసింది. సైనికుల కాల్పులతో రెచ్చిపోయిన జన సమూహం, తోవలో నేషనల్ బాంక్ మేనేజరు స్టూవర్టునూ, అసిస్టెంట్ మేనేజరు స్కాట్‌నూ కొట్టి చంపారు. అలయన్సు బాంక్ మానేజరు జి. యం. థాంప్సన్‌ను కూడా చంపివేశారు. ఈ ఘటనలపై తర్వాత విచారణ జరిపిన హంటర్ కమిటి రిపోర్టు థాంప్సన్ "రివాల్వర్‌తో ఆత్మహత్య చేసుకోబోయాడనీ, కాని ప్రజలు చంపారనీ" తెలియచేసింది. ఈ సందర్భంగా ఐదుగురు ఆంగ్లేయులు మరణించారు. రైల్వే గూడ్సుషెడ్, బాంక్, కొన్ని ప్రభుత్వ భవనాలను ప్రజలు నాశనం చేశారు. సైనికుల రాకతో ప్రజలు చెల్లాచెదురయ్యారు. ఏప్రిల్ 10 న అమృత్‌సర్‌లో పౌరపాలన బదులు సైనిక పాలన ప్రారంభమైనది.

లాహోర్, కలకత్తాలలో కూడా బ్రిటిష్ ప్రభుత్వ దమనకాండకు ప్రజలు గురయ్యారు. ఢిల్లీకి ఏప్రిల్ 8 న ప్రయాణమైన గాంధీని అరెస్టుచేసి పంజాబుకుగాని, ఢిల్లీకిగాని పోరాదని ఆయనపై నిషేధం విధించారు. ఈ నిషేధాన్ని ధిక్కరించిన గాంధీని అరెస్టుచేసి బొంబాయికి పంపివేశారు. గాంధీ అరెస్టు వార్త విని అహ్మదాబాద్‌లో ప్రజలు ఉద్రిక్తులయ్యారు. కొందరు ఇంగ్లీషు ఉద్యోగుల్ని, మరికొందరు భారతీయ ఉద్యోగుల్ని చంపివేశారు. వీరంగం, నడయాడ్‌లలో కూడ ఉద్రిక్త సంఘటనలు జరిగాయి. కలకత్తాలో ఐదుగురు మరణించారు

కసూరులో ప్రజలను రెచ్చగొట్టే చర్యలను అధికారులు అవలంబించినందుకు ప్రతీకారంగా ఏప్రిల్ 12 న, జన సమూహం రైల్వే స్టేషన్‌కు నష్టం కల్గించింది. టెలిగ్రాఫ్ తీగలు తెంపివేశారు. మూనెషెడ్‌ను తగులబెట్టారు. యూరోపియ ఉన్న రైలు బండిని ముట్టడించారు. సిపాయి లి ర్ని చావబాదారు. ఒక బ్రాంచి పోస్టాఫీసును దోచు న్నారు. మరో పోస్టాఫీసును, మున్సబు కోర్టును తగులబెట్టారు. పరిస్థితులు ఈ విధంగా అగ్నిపర్వతంలా బ్రద్దలవుతున్న సమయంలో ఈ రెండు తలల రాక్షసి-డయ్యర్‌ద్వయం పంజాబులో ఘోరాతి ఘోర కృత్యాలు చేశారు. బ్రిటిష్ ఇండియా చరిత్రలోనే అమానుష దినంగా వర్ణింపబడిన రోజు ఏప్రిల్ 13. పంజాబులో బ్రిటిష్ పాలకుల రాక్షస పాలనకు పరాకాష్ఠ జలియన్‌వాలాబాగ్ హత్యాకాండ, బ్రిటిష్ సైనికాధికారుల మనస్తత్వానికి ప్రతీక ఆనాటి దారుణ మారణహోమం.

# జలియన్ వాలాబాగ్ హత్యాకాండ

1919 ఏప్రిల్ 13 వ తేదీ వైశాఖి పండుగ. పంజాబీయులకు సంవత్సరాది పండుగ. డయ్యరు సేనాని దుండగాలతో మృత్యు దేవతకు కూడా ఆనాడు పండుగే.

అప్పటికి రెండు రోజుల క్రితమే బ్రిగేడియర్-జనరల్ రెజినాల్డ్ ఎడ్వర్డు హారీ డయ్యర్‌కి అమృత్‌సర్‌లోని సైనికుల పటాలం అప్పగించబడింది.

డయ్యర్ 1864 లో సిమ్లాలో పుట్టాడు. ఐర్లాండ్‌లో చదువుకొన్నాడు. 1885 లో సైన్యంలో చేరాడు. వాయువ్య సరిహద్దు యుద్ధంలో, బర్మా యుద్ధంలో పాల్గొన్నాడు. మొదటి ప్రపంచ యుద్ధంలో పాల్గొన్నాడు. అమృత్‌సర్ రాక పూర్వం జలంధర్‌లో సైనిక కమాండర్‌గా వున్నాడు.

ఏప్రిల్ 11 వ తేదీన అమృత్‌సర్ వచ్చాడు. ఆ మర్నాడే సభల్ని నిషేధిస్తూ డయ్యర్ ఒక ప్రకటన చేశాడు. కాని ఆ నిషేధాజ్ఞను తెలియచేసే బాధ్యత పోలీసులది. కాని వాళ్ళెవళ్ళూ ఆ పని నిర్వర్తించలేదు. ఏప్రిల్ 13 న డయ్యర్ స్వయంగా ఆ నిషేధపు టుత్తర్వును చదువుకుంటూ అమృత్‌సర్‌లో తిరిగాడట. ఐతే చాలాచోట్ల చదవలేదు. అందుచేత అసలీ నిషేధం వున్నట్లే చాలామందికి తెలియదు. పంజాబులో సైనిక ప్రభుత్వాన్ని ఏప్రిల్ 10 న ప్రకటించింది, కాని అంతకుముందే అధికారయుతంగా కాకపోయినా సైనిక పాలనే ప్రారంభమైంది. జలియన్‌వాలాబాగ్ హత్యాకాండ జరిగిన రెండు రోజుల తర్వాత అమృత్‌సర్, లాహోర్‌లలోను, ఆ తర్వాత మరికొన్ని జిల్లాల్లోను లాంఛనంగా సైనిక పాలన ప్రకటింపబడింది. డయ్యర్ చేసిన నిషేధ ఉత్తరువు తెలియకముందు జలియన్‌వాలాబాగ్‌లో సభకు ఏర్పాట్లు చేయబడ్డాయి. 13 వ తేదీ సాయంత్రం నాలుగున్నర గంటలకు సభ వుంటుందని నిర్వాహకులు 12 వ తేదీనే ప్రకటించారు. కాని ఆ సభ జరగరాదని చెప్పేందుకు జనరల్ డయ్యర్‌గానీ, అధికారులుగానీ ఎలాంటి ప్రయత్నాలు చేయలేదు. సభ అనుకొన్నట్లుగానే 13 వ తేదీ సాయంత్రం నాలుగున్నర గంటలకు ప్రారంభమైంది. హంసరాజ్ అనే ఆయన ప్రసంగిస్తున్నాడు.

జలియన్‌వాలాబాగ్ అమృత్‌సర్ నగరంలో మధ్య భాగాన వుంది. బాగ్ అంటే తోట అని అర్థం, కాని నిజానికి అక్కడ ఏ తోటా లేదు. నలు చదరపు ఖాళీ స్థలం అది. మూడు వైపుల గోడలు, మరోవైపు ఇళ్లూ వున్నాయి. ఒక్కవైపున మాత్రమే సీసా మూతిలాగ సన్నపాటి తోవ వుంది. జనం బయటికిపోవాలంటే, ఆ ఇరుకు తోవనే పోవాలి. అక్కడ జరిగిన సభతో సుమారు ఇరవై వేల మంది స్త్రీలు, పురుషులు, బిడ్డలూ వున్నారు. ఫిరంగి శకటాలతో డయ్యర్ వచ్చాడు. కాని అవి లోనికి రాడానికి వీలులేనందున బయట వుంచాడు. బాగ్‌లోనికి డయ్యర్ ప్రవేశించగానే, ప్రవేశమార్గం వద్ద ఎత్తుగా వున్న స్థలంలో కొందరు సైనికుల నిలబెట్టాడు. దాని కెదురుగావున్న స్థలంలో మరి కొందరు సైనికుల్ని నిలబెట్టాడు. వీరిలో కొందరు నేపాల్‌కు చెందిన గూర్ఖాలు, బలూచిస్తాన్‌కు చెందిన బలూచీ సైనికులు వున్నారు. వీరుగాక మరికొందరు గూర్ఖాలు తుపాకులు లేకపోయినా కత్తులు చేతో పట్టుకొని నిలబడ్డారు. వీళ్ళ వెనక ఎత్తయిన ప్రదేశంలో బ్రిటిష్ సైనికులు నిలబడ్డారు.

ప్రజలను చెదరిపోవలసిందిగా ఎట్టి హెచ్చరిక చేయకుండానే డయ్యర్ కాల్పులకు ఉత్తరు విచ్చాడు. ప్రజలు చెదిరిపోయేందుకు వీలులేదు. ఒకే ఒక ఇరుకు తోవ. మొత్తం 1650 రౌండ్లు పేల్చారు. ఇంకా తూటాలు మిగల్లేదు. 379 మంది చనిపోయారని, దీనికి మూడు రెట్లు అంటే 1137 మంది గాయపడ్డారనీ ప్రభుత్వం అంగీకరించింది. అంటే వారి లెక్క ప్రకారమే 1650 తూటాలు పేల్చగా చనిపోయినవారు గాయపడిన వారు 1516 మంది వున్నారంటే, నిరుపయోగమైన తూటాలు 134 మాత్రమే నన్నమాట. అంటే ప్రతి గుండూ ఒకొక్కరి రక్తం చవిచూసిందన్న మాట. అన్నిటికన్నా ఘోరమైన విషయం భారత సైనికుల చేతనే కాల్పులు కాల్పించడం. ఒకవేళ వాళ్ళు నిరాకరిస్తే శిక్షించడానికి సిద్ధంగా వాళ్ళ వెనకనే బ్రిటిషు సిపాయీలను నిలబెట్టటం.

గాంధీ ఆధ్వర్యాన జరిగిన బహిరంగ విచారణలో 1200 మంది చనిపోయారనీ 3600 మంది గాయపడ్డారనీ తేలింది. నెత్తురు మడుగులలో పడివున్న వాళ్ళకి కెట్టి వైద్య సహాయంలేదు. ఆ రాత్రంతా గాయపడిన వారు అక్కడే వదలివేయబడ్డారు తాగడానికి గుక్కెడు నీళ్ళు కూడా పోసేందుకు అవకాశం ఇవ్వలేదు. ఆనాటి బీభత్స దృశ్యాలను లాలా గిరిధర్‌లాల్ అనే ఆయన హంటర్ కమిటీ ముందు సాక్ష్యం ఇస్తూ వివరించాడు. పంజాబ్ దురంతాలను మొదట్లో కప్పిపెట్టడానికి ప్రయత్నించినా లాభం లేకపోవడంతో, ఆరు నెలల తర్వాత లార్డ్ హంటర్ నాయకత్వాన ఒక కమిటీని ఏర్పరచింది ప్రభుత్వం. దాని ముందు సాక్ష్యం ఇస్తూ గిరిధర్‌లాల్ ఇలా అన్నాడు : అన్నిటి కంటే దారుణమైన విషయం ఏమంటే, ఇరుకు తోవను పరుగెత్తి పోతున్న వాళ్ళపైన కాల్పులు సాగించడం. ఆ తొక్కిడిలో కూడ కొందరు ప్రాణాలు కోల్పోయారు. రక్తం వరదలై పారింది. బోర్లాపడుకున్న వాళ్ళపైన కూడా కాల్పులు సాగించారు........ చనిపోయినవారిలో పెద్దవాళ్ళూ పిల్లలూ కూడా వున్నారు. కొందరి తలలు తెగిపోయాయి. కొందరి కళ్ళూ, కొందరి ముక్కులు, చెవులు, ఎదురు రొమ్ములు, కాళ్ళు, చేతులు తుపాకి గుండ్లకు ఛిన్నాభిన్నమైనాయి. మళ్ళీ కాలుస్తారనే భయంతో ప్రజలు గాయపడ్డవారిని అలాగే వదిలేసి పరుగెత్తుకు పోయారు."

ఈ కిరాతక చర్యలన్నిటినీ సమర్థించుకుంటూ, హంటర్ కమిటీ ముందు డయ్యర్ సాక్ష్యమిచ్చాడు.

జలియన్‌వాలాబాగ్‌లో ప్రవేశించిన వెంటనే డయ్యర్ కాల్పులకు ఉత్తరు విచ్చాడన్న విషయం జగద్విదితం. ఐతే తాను ప్రజల్ని చెదిరిపొమ్మని ఉత్తర్వు ఇచ్చినట్లూ, వెంటనే రెండు మూడు నిమిషాలలోనే కాల్పులు సాగించినట్లు డయ్యర్ స్వయంగా అంగీకరించాడు. రెండు మూడు నిమిషాలలో ఇరుకు తోవను ఇరవైవేల మంది జనం ఎలా చెదిరిపోగలరో డయ్యర్‌కు తెలియదా ? పైగా నిషేధాజ్ఞలను ధిక్కరించి ప్రజలు సభ జరపడం డయ్యర్‌కు అవమానంగా తోచింది కాబోలు. వాళ్ళకు గుణపాఠం నేర్పకపోతే తాను నవ్వుల పాలయ్యేవాడినని డయ్యర్ వాదన.

హంటర్ కమిటీలోని ఒక సభ్యుడైన రంకిన్, జలియన్‌వాలాబాగ్ సంఘటన భయంకరమైనది కాదా అని ప్రశ్నించాడు, దానికి డయ్యర్ చెప్పిన సమాధానం ఇది ;

"కాదు, కానేకాదు. నేను భయంకర ధర్మాన్ని నిర్వర్తించాల్సి వచ్చింది. అది చాలా దయతో కూడిన పని అని నా అభిప్రాయం. నాకు గానీ, మరొకరికిగానీ ప్రజలను మళ్ళీ కాల్చవలసిన అవసరం రాకుండా ఉండేటంత గట్టిగాను, బాగాను కాల్చాలని నేను భావించాను. కాల్చకుండా ప్రజలను నేను చెదరగొట్టి వుండేవాడినే. కాని అలా చేస్తే వాళ్ళు మళ్ళా వచ్చి నన్ను అపహాస్యంచేసి ఉండేవారు. నేను తెలివితక్కువపని చేసినట్లయ్యేది."

మందుగుండు సామాను అయిపోయింది కాబట్టి 1600 గుండ్లతోనే కాల్పులను సరిపెట్టుకొన్నాడట. లేక పోతే ఇంకా కాల్చేవాడట. సాయుధశకటం లోపలికి పోడానికి వీలులేకపోయింది కాని. వీలైతే దాన్ని కూడా లోపలికి తీసుకువెళ్ళి మెషిన్‌గన్‌లతో కాల్పులు సాగించేవాడట ఈ ప్రబుద్ధుడు.

జనరల్ డయ్యర్, అతనిలాంటి ఇతర సేనానుల మనస్తత్వాన్ని తెలుసుకోడానికి హంటర్ కమిటీ విచారణలోని కొన్ని విషయాలను ఉటంకించడం అవసరం. ఢిల్లీకి చెందిన జనరల్ డ్రేక్-బ్రాక్మన్ ఇలా అన్నాడు. "ఆసియా నివాసి గౌరవించే దల్లా ఒక్క బలప్రయోగాన్ని మాత్రమే". ఇక డయ్యర్ సరేసరి. అతని నోటినుండి రాలిన అవాకులు చవాకులు చూడండి.

ప్రశ్న : మాటిమాటికీ కాల్పులగురించి మారుస్తూ వచ్చావు. జనం బాగా గుంపుగా ఉన్న చోట కాల్పులు సాగించావు నిజమేనా ?

డయ్యర్ జవాబు : నిజమే

ప్రశ్న : సాయుధశకటాలు పోడానికి వీలైనంత తోవగనక ఉన్నట్లయితే, వాటిని లోనికి తీసుకువెళ్ళి మెషిన్‌గన్‌లతో కాల్చేవాడివేనా ?

డయ్యర్ జవాబు : బహుశా అలాగే చేసే వాణ్ణి అనుకుంటాను.

మరోప్రశ్నకు జవాబుగా డయ్యర్ : "నేనొక నిశ్చయానికి వచ్చాను. అందరినీ చంపేయాలని నిశ్చయించాను "

దీనిపై హంటర్ కమిటీ రిపోర్టు ఇలా వ్యాఖ్యానించింది. "మా విచారణలో చెప్పిన దాన్నిబట్టి, అతను (డయ్యర్) తన కారులో వస్తుండగానే క నిశ్చయానికి వచ్చినట్టు తేలింది. సభ జరపవద్దని తాను చేసిన ఉత్తరువులను గనుక ప్రజలు ఉల్లంఘించితే వెంటనే కాల్పులు జరపాలని అతను నిశ్చయించుకున్నాడు"

జనరల్ డయ్యర్, తన పైఉన్నత సైనికాధికారికి పంపిన నివేదికలోని అంశాలను కూడా హంటర్ కమిటీ వెల్లడించింది ఆ నివేదికలో డయ్యర్ ఇలా రాశాడు. "గుంపు చెదిరి పోయేదాకా కాల్చాను. కాల్చుతూనే వున్నాను. అవసరమైన ఫలితం కలగాలంటే, కనీసం ఈ మాత్రం కాల్పులనైనా చేయవలసిందే. నా చర్యను సమర్థించుకోవాలంటే, అలాంటి ఫలితాన్ని తప్పక కలుగజేయాలి. కేవలం జనాన్ని చెదరగొట్టటం ఒక్కటే కాదు సమస్య. అక్కడ గుమిగూడిన ప్రజలలో మాత్రమేగాక, ముఖ్యంగా పంజాబు అంతటా సైనిక దృక్కోణంనుంచి అవసరమైన గుణపాఠం నేర్పాలి. అందుచేత అనవసరమైన కాఠిన్యం ప్రయోగించాననే ప్రసక్తేలేదు."

నిర్దాక్షిణ్యమైన హత్యాకాండ గావించడంలో డయ్యర్ ఉద్దేశమేమిటో హంటర్ కమిటీ ముందు సాక్ష్యంలో ఇంకాఇలా వివరించాడు." బాగా కాల్చాలి. గట్టిగా కాల్చాలి. ఎంత బాగా ఎంత గట్టిగా కాల్చాలంటే, నేనుగాని మరొకరుగాని మళ్ళా కాల్చవలసిన అవసరం రాకూడదు"

"కాల్చకుండానే ప్రజలను చెదర గొట్టవచ్చు. కాని ప్రజల మనో నిబ్బరాన్ని అణచిపారేయాలని నేను భావించాను."

వైద్యసహాయం ఏమైనా బాధితులకు చేశావా అని ప్రశ్నించి నపుడు డయ్యర్ ఇచ్చిన సమాధానం ఇది. "లేదు. అది నాపనికాదు..........వాళ్ళు సహాయానికి వేడుకొంటే, నేను సహాయ పడటానికి సిద్ధంగానే వున్నాను."

జలియన్‌వాలాభాగ్ హత్యాకాండ గురించి జనరల్ డయ్యర్ ఒక్కముక్కలో తేల్చిచెప్పిన సారాంశం ఏమంటే "నేనుచాలా సంతోషదాయకమైన పనిని చేస్తున్నానని భావించాను"

జలియన్‌వాలాబాగ్ హత్యాకాండ వివరాలు పైకి పొక్కకుండా ప్రభుత్వం కట్టుదిట్టం చేసింది. కాంగ్రెస్ నాయకులకి కూడా నాల్గునెలల త— తనే ఈ హత్యాకాండ వివరాలు తెలిశాయి. 1919 జూ లో కలకత్తాలో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ ఘ సమావేశంలో కొన్ని వివరాలు తెలిశాయి. ప్రతినిధులు తమలో తాము గుసగుసలాడుకోడంతప్ప, బయటకు వెల్లడించలేదు. దాదాపు ఎనిమిది మాసాల వరకు, బ్రిటిష్ పార్లమెంటుకుగాని, బ్రిటిష్ ప్రజలకుగాని ఈ విషయాలు తెలియకుండా చేశారు. కాని దరిమిలా జరిగిన ఆందోళనవల్ల, కాంగ్రెస్ ఒక విచారణ కమిటీని నియమించడం వల్ల బ్రిటిష్ ప్రభుత్వం కూడా లార్డ్ హంటర్ ఆధ్యర్యాన ఒక విచారణ కమిటీని వేయవలసి వచ్చింది

జలియన్‌వాలాబాగ్ హత్యాకాండ ఒక్క డయ్యర్ పుర్రెలో పుట్టిన దురాలోచన మాత్రమేకాదు. పంజాబ్ ప్రభుత్వమే అందుకు కుట్రచేసింది. "జలియన్‌వాలా బాగ్ హత్యాకాండ - ముందుగా ఆలోచించి చేసిన పథకం" అనే పరిశోధక నివేదికను పంజాబ్ యూనివర్సిటీ 1969 ఏప్రిల్ 13న ప్రకటించింది. అందులో ఇలా ఉంది :

"1919 ఏప్రిల్ 9వ తేదీన లాహోర్‌లో ప్రభుత్వ భవనంలో జలియన్‌వాలాబాగ్ హత్యాకాండకు పథకం ఆలోచించబడింది. ఈ కుట్రలో ప్రధాన పాత్ర వహించింది పంజాబ్ లెఫ్టినెంట్ గవర్నర్ సర్ మైకేల్ ఓ డయ్యర్. పంజాబ్‌లోని ఉన్నత పౌర, సైనికాధికారులంతా హాజరయ్యారు. భారత ప్రభుత్వం కూడా ఈ పథకానికి తలవూపింది. పంజాబ్ ప్రజలకు గుణపాఠం నేర్పడానికి వైశాఖి దినంనాడు అమృతసర్‌లో ప్రజలను హతమార్చాలి." దాదాపు అర్థశతాబ్దం తర్వాతగాని ఈ కుట్రగురించిన వి ష యా లు సప్రమాణంగా నిర్ధారించబడలేదు. సామ్రాజ్యవాదులు తమ దురాగతాలను ఎంత పకడ్బందీగా దాచుకో ప్రయత్నిస్తారో ఇది ఒక ఉదాహరణ.

## పొట్టమీద పాకించిన ఉదంతం

డయ్యర్ దురాగతాలు ఇంతటితోనే ఆగలేదు. అమృత్‌సర్‌లో నీటి సప్లయి, విద్యుచ్ఛక్తి సప్లయి

ఆపివేశాడు. బహిరంగ ప్రదేశాలలో ముక్కోణాల పైన కొరడాలతో కొట్టడం సర్వసాధారణమైంది. అన్నిటికన్నా అమానుషమైన ఉత్తరువు, ప్రజలను నేలమీద పొట్టమీద పడుకొని పాకమని ఆదేశించడం. ఏప్రిల్ 10 న మిస్ షేర్‌వుడ్ అనే ఆంగ్లవనిత ఒక గొందిలో సైకిల్ వెళుతుండగా కొందరు ఆమెపై దాడిచేశారు డా౦ సత్యపాల్, డాక్టర్ కిచ్లూల అరెస్టుకు నిరసన ఆ రోజున హర్తాళ్ జరిగింది. ప్రభుత్వం రెచ్చగొట్టడంతో అమృతసర్‌లో కొన్ని దు టనలు జరిగాయి. వాటిలో ఒకటి షేర్‌వుడ్ అనే ఇం షు వనితపై జరిగిన దాడి. దీనికి ప్రతీకారంగా "ఆ దిలోని వాళ్ళందర్నీ పొట్టమీద పడుకునిపాకించే" శిక్ష విధించాడు. షేర్‌వుడ్‌ను ఆ సమయంలోరక్షించిన వారికి కూడా ఈ శిక్ష తప్పలేదు. ఆ సందులోంచి తమ ఇళ్ళకు వెళ్ళేవారికికూడా ఈ శిక్ష తప్పలేదు, జలియన్ వాలాబాగ్ హత్యాకాండకంటేకూడా మించిన దురాగతం ఇది అని గాంధీజీ భావించాడు. అలా పాకడం నిరాక రించినవారిని శిక్షించడానికి ముక్కోణం ఒకటిఏర్పరచి అక్కడ దానిపై పడుకోబెట్టి కొరడాదెబ్బలు కొట్టించే వాడు. కల్నల్ ఓబ్రియన్ ఉత్తర్వుల ప్రకారం గుజరన్‌వాలాలో బ్రిటిషు ఉద్యోగులు ఎదురైనప్పుడు భారతీయులు గుర్రాలమీదనుంచి దిగాలి. బండ్లమీద నుంచి దిగాలి. గొడుగులు వేసుకుని నడుస్తున్న భారతీయులు తెల్లదొరలను చూడగానే గొడుగులు ముడవాలి. వాళ్ళకు చేత్తో సలాం కొట్టాలి.

రైళ్ళలో మూడవ తరగతి టిక్కెట్లు ఇవ్వడం ఆపివేశారు. వీధి ప్రక్కల కాలిబాటపైన ఇద్దరికంటె కలసి పోరాదు. లాహోర్‌లో ఈ దురంతాలు మరీ పెచ్చరి యి. యూరోపియన్లని తప్ప మిగతా వాళ్ళందరి ద రనుంచి,కార్లు మోటారుసైకిళ్ళు లాక్కుని స్వాధీన ప కున్నారు. మూసివేసిన దుకాణాలను బలవంతంగా తెరిపించారు. సైనికాధికార్లు చెప్పిన ధరలకే సరుకులు అమ్మాలి. దుకాణాలు తెరవ నిరాకరించిన వారిని కాల్చి చంపారు. కొన్ని దుకాణాల్లోని సరుకుల్ని డబ్బివ్వ కుండా సైనికాధికార్లు పంచిపెట్టారు. హర్తాళ్‌లో పాల్గొన్న టాంగా బండ్లవాళ్ళని శిక్షించేందుకుగాను 300 బండ్లను సైనికాధికారులు స్వాధీనం చేసుకున్నారు. మిగిలిన బండ్లవాళ్ళు పట్టణం వెలుపల ఉన్న సైనికాధికారులవద్ద మస్తరు వేయించుకోవాలి. సైనికాధికారులు తమ ఉత్తర్వులను తెలియజేస్తూ ఇళ్ళకు అంటించిన కాగితాలు రక్షించే బాధ్యత కూడా ఇళ్ళ యజమానులదే. ధర్మశాలలు, భోజన సత్రాలను మూసి వేశారు. విద్యార్థులు నాల్గుచోట్ల సైనికాధికారులకు కనిపించాలి. లాహోర్ విశ్వవిద్యాలయ విద్యార్థులు కనీసం 19 మైళ్ళదూరం 108 డిగ్రీల ఎండలో నడ వాల్సి వచ్చేది. లాహోరులో కల్నల్ జాన్సన్ విద్యార్థులపైన తన దురంతాలను కేంద్రీకరించాడు. రాత్రి 8 గంటలు దాటిన తర్వాత వీధిలో కన్పడిన వాడినల్లా కాల్చివేయాలని ఉత్తర్వు. సైనిక శాసనం ప్రకటించిన కాగితం కళాశాలలకు అంటించబడింది. అది చినిగి పోయినదని ప్రిన్సిపాల్‌తో సహా కళాశాలలోని ఉపాధ్యాయు లందరినీ కోటవరకు నడిపించుకు వెళ్ళి మూడు రోజులు ఆ కోటలో నిర్బంధించారు.

అమృతసర్‌లో సైనిక న్యాయస్థానాలు విచారించి నప్పుడు ఒక నీతి, నియమమూ, శాసనమూ దేన్నీ పాటించలేదు. మొత్తం 298 మందిని విచారించారు. అందులో 51 మందికి మరణశిక్ష విధించబడింది. 46 గురికి యావజ్జీవ ద్వీపాంతరవాసశిక్ష, ఇద్దరికి పదేం డ్లు చొప్పున 79 మందికి ఏడేండ్లు, 10 మందికి అయిదేం 13 మందికి మూడేండ్లు, 11 మందికి ఇంకా తక్కు కాలం ఖైదుశిక్ష విధించబడింది. మార్షల్ లా క్రింద కూడా సివిల్ మేజిస్ట్రేట్‌లు విచారించి 105 మందికి శిక్షలు విధించారు. ఇవిగాక సైనికాధికారులు విచారించి 50 మందికి అప్పటికప్పుడు శిక్ష విధించారు.

## అతని కంటె ఘనులు

అమృతసర్‌లోని డయ్యర్ కు తీసిపోకుండా లాహోర్‌లో కల్నల్ జాన్సన్ ప్రవర్తించాడు. గుజరన్ వాలాలో కల్నల్ ఓబ్రియాన్, కసూర్‌లో, కెప్టెన్ డవుటన్, షేక్‌పురాలో సివిల్ అధికారి బాస్వర్త్‌స్మిత్‌లు "అతని కంటె ఘనులు ...." అని పించు కొన్నారు

ఏప్రిల్ 12 న కసూర్‌లో కొన్ని దౌర్జన్య సంఘ టనలు జరిగాయి. గుజరన్ వాలాలో రైలు వంతెన, రైలుస్టేషన్, టెలిగ్రాఫ్ పోస్టాఫీసులు, కలక్టరాఫీసు, చర్చి, ఒక స్కూలు, ఒక రైలుషెడ్, తగులబెట్టారు. ఒక ఆవుదూడను చంపి రైలు వంతెన దగ్గర వేలాడ దీశారనే వదంతి కూడా ఈ దౌర్జన్యాలకు ప్రోత్సాహ

మిచ్చింది. గుజరన్ వాలాలో ప్రజలపై విమానం నుండి బాంబులు విసిరారు. 200 అడుగుల ఎత్తునుండి తిరిగిన విమానం నుండి మెషిన్‌గన్‌లతో గ్రామస్థులను కాల్చారు. ఈ బాంబులవల్ల, కాల్పులవల్ల కేవలం తొమ్మిది మంది మాత్రమే చనిపోయారుట. ఇలా అని ప్రజల్ని నమ్మించేందుకు ప్రభుత్వం చాలా శ్రమపడింది.

## ఓబ్రియాన్ దౌర్జన్యాలు

అరెస్టు అయిన ఆరు వారాల వరకు ఎలాంటి విచారణ లేకుండా నిర్బంధించడం ప్రవేశపెట్టిన ఘనత కల్నల్ ఓబ్రియాన్‌దే. ఒక సందర్భంలో కొందరు ప్రముఖుల్ని అరెస్టుచేసి కొన్ని మైళ్ళు మండుటెండలో నడిపించాడు. ఆ తర్వాత వీరిని గూడ్సు రైలుబండిలో కుక్కి లాహోర్‌కు పంపాడు. కాలకృత్యాలు కూడా తీర్చుకొనే అవకాశం ఇవ్వకుండా 44 గంటలు ఆ గుడ్స్ పె లో వీరు ప్రయాణం చేయవలసివచ్చింది. వీరిని బజా లో నడిపించినపుడు చేతులకు సంకెళ్ళే గాక గొలు లకు లంకె వేసి కట్టాడు. ఒక హిందువును, ఒక ముస్లిమునూ, జంటగా సంకెళ్ళతో బంధించి నడిపించాడు. హిందూ-ముస్లిమ్ ఐక్యతను అపహాస్యం చేయడానికే ఈ పని చేశాడు. ఇతని దురాగతాలకు బలియైన వారిలో ఒక రాజభక్తుడు కూడా వున్నాడు. అతడు రాజుగారి భారతదేశ సందర్శనాన్ని పురస్కరించుకొని 10 వేల పౌనులు ఇచ్చి కింగ్‌జార్జి పాఠశాల నెలకొల్పాడు. యుద్ధ సహాయనిధిని పెద్ద మొత్తంలో ఇచ్చాడు. ఒక రైతు ఇద్దరి కొడుకులను బలవంతంగా ప్రభుత్వం రిక్రూట్ చేయగా, వారు కన్పడకుండా పోయారు. వారి జాడ తెల్పలేకపోయిన నేరానికి ఆ రైతును అరెస్టుచేసి ఆస్తి స్వాధీనం చేసుకున్నాడు. ఎవరైనా ఆ రైతుకు సహాయపడితే కాల్చివేస్తామని బెదిరించాడు.

కల్నల్ ఓబ్రియాన్ హయాంలో సమ్మరీ కోర్టుల ద్వారా 200 మంది, కొరడాదెబ్బల నుండి రెండేళ్ళ వరకు శిక్ష పొందారు. సైనిక కోర్టులు 22 మందికి మరణశిక్ష, 108 మందికి యావజ్జీవ ద్వీపాంతర శిక్ష విధించబడింది. మరో 19 మందికి వివిధ రకాల శిక్షలు విధించారు.

కసూర్ సబ్ డివిజన్ డప్యుటన్ సేనాని చేతిలో వుండేది. రైలుస్టేషన్ సమీపంలో 150 మంది మనుషులు పట్టే ఒక పెద్ద బోనును ఇతడు నిర్మించాడు. ఆ బోనులో నిర్బంధింపబడ్డవారి నందరినీ చూడటానికి ఏర్పాటు చేశాడు. టెలిగ్రాఫ్ స్తంభాలకు, ముక్కోణాలకు దిగంబరంగా కట్టివేసి కొరడాదెబ్బలు కొట్టించాడు. పైగా ఈ చిత్రహింసలు చూడటానికి నగరంలోని వ్యభిచారిణులను తీసుకొచ్చాడు. ఖైదీలచే రైలుస్టేషన్లలో రైలుపెట్టెల నుండి సామాన్లు దింపించడం, రైలుపెట్టెల్లోకి సామాను ఎక్కించడం లాంటి పనులు చేయించాడు. డయ్యర్ పొట్టతో ఖైదీలను పాకించితే, ఇతగాడు ఖైదీలు తమ నుదుటిని భూమికి ఆనించాలనే శిక్షను ప్రవేశపెట్టాడు.

షేక్‌పురాలో బాస్వర్తుస్మిత్ ఒక పక్షం రోజుల్లో 477 మందిని విచారించి శిక్షించాడు. యూనియన్ జాక్‌కు రోజుకు మూడుసార్లు వందనం చేయాలని విద్యార్థుల్ని నిర్బంధించాడు. అయిదారేళ్ళ పిల్లలకు కూడా ఇది వర్తించింది. మండుటెండలో చిన్నపిల్లలు మూర్ఛపోయారు. కొందరు వడదెబ్బ తగిలి చనిపోయారని వదంతి కూడా పాకింది. పిల్లలచే నేరం అంగీకరింపచేసి, బుద్ధి వచ్చిందని మూడేసిసార్లు అనిపించిన ఘటనలున్నాయి.

ఈ దురంతాలన్నిటినీ పై అధికార్లు మొట్టమొదట్లో సమర్థిస్తూనే వచ్చారు.

పంజాబ్ లెఫ్టినెంట్ గవర్నర్ మైకేల్ ఓడయ్యార్, జలియన్‌వాలాబాగ్ హత్యాకాండను సమర్థిస్తూ ఇలా తంతి పంపించాడు.

"నీవు చేసిన పని సరయినదే. లెఫ్టినెంట్ గవర్నర్ ఆమోదించుతున్నాడు" పైగా ఆ తర్వాత ఆఫ్ఘన్ యుద్ధంలో డయ్యర్‌కు ప్రమోషన్ వచ్చింది. ఆనాడు పంజాబులో జరిగిన ఘటనలను మైకేల్ ఓడయ్యార్ "తిరుగుబాటు"గా వర్ణించాడు.

ఆ తర్వాత ఏర్పడిన హంటర్ కమిటీ ఈ అభిప్రాయంతో ఏకీభవించలేదు. సిపాయి తిరుగుబాటు లాంటి తిరుగుబాటును డయ్యర్ నివారించాడన్న వాదనను కూడా ఈ కమిటీ తిరస్కరించింది. తిరుగుబాటుకు కుట్ర జరగాలి గదా. అలాంటి కుట్ర ఏమీ జరగలేదని కమిటీ అభిప్రాయపడింది. జనరల్ డయ్యర్ అవసరమైన దానికంటే ఎక్కువ బలప్రయోగం చేశాడనీ, అవసరమైన మేరకైనా మానవత్వం చూపలేదనీ కమిటీ అభిప్రాయపడింది. ఈ కమిటీ అభి

ప్రాయాలను భారత ప్రభుత్వం అంగీకరించింది. డయ్యర్‌ను భారత కార్యదర్శి అభిశంసించాడు. సర్వ సైన్యాధిపతి అతనిని రాజీనామా ఇవ్వవలసిందని ఆజ్ఞాపించాడు. సైనిక సమితి దాని నామోదించింది. 1920 మే 26 న భారత కార్యదర్శి మాంటేగ్ వైస్రాయికి పంపిన అధికార పత్రంలో ఇలా రాశాడు: "జలియన్ వాలాబాగ్ వద్ద డయ్యర్ జరిపిన చర్యకు ఆధారభూతమైన సిద్ధాంతాన్ని ప్రభుత్వం ఖండించుతూంది. పొట్ట మీద పరుండి పాకాలనే అతని ఉత్తరువు నాగరిక సూత్రాలన్నింటినీ ధిక్కరించుతుంది."

డయ్యర్ నేర్పదలచిన గుణపాఠాన్ని గురించి హంటర్ కమిటీ ఇలా వాఖ్యానించింది

"డయ్యర్ విస్తృత ప్రభావాన్ని కల్గించాడనడంలో మాకు సందేహంలేదు. గొప్ప గుణపాఠం కల్గించాడనడంలోనూ సందేహంలేదు. కాని ఐతే అతను అనుకొన్న స్వభావానికి పూర్తిగా భిన్నమైన గుణపాఠం కల్గించాడు."

అసంఖ్యాక ఆంగ్లేయులు సైతం డయ్యర్ చర్యను ఖండించారు. కాని అతన్ని సమర్థించినవారూ లేకపోలేదు. బ్రిటిష్ పార్లమెంటులోని ప్రభువుల సభ అతని చర్యల్ని ఆమోదించింది. సామ్రాజ్యవాదులు అతని ఘనకార్యాలకు మెచ్చి 20 వేల పౌన్లు, ఇంగ్లండ్ ఇండియాలలో తెల్లవాళ్ళ నుండి నిధిని పోగుచేసి ఇచ్చారు. ఉత్తర హిందూస్తాన్‌లో బ్రిటిషు రాజ్యాన్ని అతడు కాపాడాడని శ్లాఘించారు. మైకేల్ ఓడయ్యర్ పై పెట్టిన ఒక కేసు సందర్భంలో జస్టిస్ మెకార్డీ, డయ్యర్ చర్యను సమర్థించాడు.

లాహోర్‌లో డయ్యర్ లాగానే ఘనకార్యాలు చేసిన కల్నల్ జాన్సన్‌కు వీడ్కోలు విందు సందర్భంగా ఆ పట్టణంలోని యూరోపియన్లు అతనిని "పేదలపెన్నిధి" అని పొగిడారు. నిజానికి అతని ఆరు వారాల సైనిక పాలనలో పేదలు పొందిన దురవస్థలు ఇన్నన్ని కాదు.

ఐతే డయ్యర్ చర్యలకు అసంఖ్యాకమైన యూరోపుయన్లు సిగ్గుతో తలవంచుకొన్నారు. పార్లమెంట్‌లో ఆస్క్విత్ ఇలా అన్నాడు: "మన యావత్ చరిత్రలోను ఈ ఘటన అత్యంత దురాగతం."

ఆత్మాభిమానమున్న భారతీయుడెవ్వడూ ఈ దురాగతాన్ని ఖండించకుండా ఉండలేకపోయాడు.

మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి సుబ్రహ్మణ్య అయ్యర్ 1917 లో అమెరికా అధ్యక్షుడు విల్సన్‌కు ఒక ఉత్తరం రాశాడు. భారతదేశానికి స్వపరిపాలన కావాలని ఆ లేఖలో కోరాడు

సుబ్రహ్మణ్య అయ్యర్ అపుడు ఇండియన్ హోమ్‌రూల్ లీగ్ (మద్రాసు)కు అధ్యక్షుడు. ఈయన ఉత్తరం విషయం బ్రిటిషు పార్లమెంట్‌లో ప్రస్తావనకు వచ్చింది. సుబ్రహ్మణ్య అయ్యర్ చేసిన పనికి ఆశ్చర్యాన్నీ, విచారాన్నీ వెలిబుచ్చుతూ భారత ప్రభుత్వం ఆయనకు తెలియచేసిందని భారత కార్యదర్శి మాంటేగు అన్నాడు. అయ్యర్‌గారి వయస్సు, అనారోగ్యం, న్యాయశాఖకు ఆయన చేసిన సేవలు దృష్ట్యా, ఆయనపై ఎట్టి చర్య తీసుకోవడంలేదనీ, ఇకమీదట మరోసారి అలాచేస్తే ఊరుకునేది లేదనీ బెదిరించాడు.

దీనికి నిరసనగా సుబ్రహ్మణ్యఅయ్యర్ తన 'సర్' బిరుదాన్ని (కె. సి. యస్. ఐ) దివాన్ బహదూర్ బిరుదాన్ని వదలివేశాడు. పంజాబ్‌లో మార్షల్‌లా ప్రకటించిన ఓడయ్యర్ చర్యకు నిరసనగా వైస్రాయి కార్య నిర్వాహక సభ్యుడు సర్ శంకర్ నాయర్ తన పదవికి రాజీనామా చేశాడు. శంకర్ నాయర్ అత్యంత మితవాది. ఐనా బ్రిటిషు ప్రభుత్వ చర్యలను అతడు గర్హించక తప్పలేదు

## రవీంద్రుని ఆవేదన

పంజాబులో బ్రిటిషు ప్రభుత్వం సాగించిన ఘోర దురంతాలకు రవీంద్రనాథ్‌టాగూర్ సున్నిత హృదయం ఎంత కుమిలిపోయిందో ప్రొఫెసర్ ప్రశాంత చంద్ర మహాలనబిస్ ఒక వ్యాసంలో వివరించాడు.

"పంజాబ్ దురంతాల గురించి ఒక్కరూ గొంతు విప్పకపోవడంతో ఆయన సహించలేక పోయాడు. సి. యఫ్. ఆండ్రూస్‌తో గాంధీజీకి ఆయన ఒక సూచన చేశాడు. పంజాబులో ప్రవేశించడానికి ఆ సమయంలో నిషేధం ఉంది. గాంధీగారు అంగీకరించే పక్షంలో తాను ఢిల్లీలో ఆయన్ని కలుసుకుంటాననీ, ఆ తర్వాత తామిద్దరం కలిసి పంజాబ్ వెళదామనీ ఆయన సూచించాడు. ఒకవేళ అప్పుడు వారిద్దరినీ అరెస్టు చేస్తే అది తమ అసమ్మతిని తెలియజేసే విధానం అవుతుందని అన్నాడు.

ఆండ్రూస్, గాంధీని కలుసుకొని తిరిగి వచ్చాడు. టాగూర్‌ను ఏవో కుశల ప్రశ్నలు వేయబోయాడు. ఆయన రెండుసార్లు అడ్డుపడి "ఏమయింది? ఏమన్నారు?" అని ప్రశ్నించాడు. ఆండ్రూస్‌కు అసలు విషయం బయట పెటక తప్పలేదు గాంధీ ఆ సూచనను అంగీకరించలేదు. "ఇపుడు నేను ప్రభుత్వాన్ని ఇబ్బంది పెట్టదలచుకోలేదు" అని గాంధీ చెప్పినట్లు ఆండ్రూస్ వెల్లడించాడు. టాగూర్ ఇక మాట్లాడలేదు.

ఆ రాత్రి టాగూర్‌కి నిద్ర పట్టలేదు. ఈ సమయంలో దేశమంతా నోరు మెదపకుండా నిశ్శబ్దంగా ఉండటం భరింపరాని విషయమని టాగూర్ చిత్తరంజన్‌తో అన్నాడు. సభను ఏర్పాటు చేస్తే, తాను అధ్యక్షత వహించడానికి కూడా సిద్ధమేనని అన్నా— "మీరే అధ్యక్షత వహిస్తే మరో ఉపన్యాసకుడు అక్కర్లేదు. మీరే అధ్యక్షులూ ఉపన్యాసకులూ గనుక, మీ సభను ఏర్పాటుచేస్తే బాగుంటుంది"అని చిత్తరంజన్ అన్నాడు. టాగూర్‌కు వీళ్ల వైఖరి ఏమిటో అర్థమయింది. వాళ్ళేమీ చేయరని స్పష్టమైంది. "నా హృదయంలో ముల్లు గుచ్చుకొన్నట్లు అయింది" అని టాగూర్ బాధపడ్డాడు. తానే ఏదో ఒకటి చేయాలని నిశ్చయించుకొన్నాడు.

సర్ (నైట్‌హుడ్) బిరుదును వదలుకొంటూ వైస్రాయికి ఒక ఉత్తరం రాసాడు టాగూర్. ఆ ఉత్తరం రాసేటప్పుడు ఎవరినీ సంప్రదించలేదు. చివరికి తన కొడుక్కి కూడా చూపించలేదు. ఈ చర్య మూలాన భారత రక్షణ క్రింద అరెస్టు చేయవచ్చు. విచారించనూవచ్చు. ఆ ఉత్తరాన్ని సి. యఫ్. ఆండ్రూస్‌కి చూపినపుడు, కాస్త సౌమ్యంగా దాని శైలిని తగ్గించవలసిందని, ఆండ్రూస్ సూచించాడు. "అప్పుడు గురుదేవ్ (టాగూర్) నా వంక చూసిన చూపును అంతకు ముందుగానీ, ఆ తర్వాత గానీ ఎన్నడూ చూడలేదు" అని ఆండ్రూస్ రాశాడు

వైస్రాయికి రాసిన లేఖలో టాగూర్ ఇలాఅన్నాడు:

"పంజాబులోని మా సోదరులు పొందిన అవమానాల, బాధల వృత్తాంతాలు నిషేధాలతో కుక్కి మూసివేయబడ్డ గొంతుకల్ని చీల్చుకొని పెగిలి భారతదేశం నలుమూలలా వ్యాపించాయి. సర్వత్రా మా ప్రజలలో అవి రగల్చిన క్రోధాగ్నితోకూడిన వేదనను మన పాలకులు పట్టించుకోలేదు. వారు ఊహించుకొన్నట్లు తగిన గుణపాఠాలను నేర్పామని తమను తామే (పాలకులు) అభినందించుకొని వుండవచ్చు. మా విజ్ఞప్తులు వృధా అయినాయనీ, ప్రతీకారోన్మాదవాంఛ మనప్రభుత్వ రాజనీతిజ్ఞత యొక్క ఉదాత్త దృష్టిని గుడ్డిదిగా చేసిందనీ తెలుసుకున్నాను. తన భౌతిక బలానికీ, నైతిక సంప్రదాయాలకూ అర్హమైన విధంగా ఉదారవంతంగా ఆ రాజనీతిని వారు ఉపయోగించి ఉండవచ్చు. కాని అలా ఉపయోగించలేదని తెలుసుకొన్నాను. అందువల్ల భయోత్పాతంతో మూగవేదనకు గురిచేయబడిన కోట్లాది ప్రజలవాణిని వ్యక్తపరుస్తూ, దీని పర్యవసానాలన్నిటినీ భరించడం ఒక్కటే నా కనీస కర్తవ్యమని భావిస్తున్నాను.

"అవమానానికి చెందిన ఈ అసంగత సందర్భంలో గౌరవచిహ్నాలు మా అవమానాన్ని వెలుగుతో మరింత స్పష్టం చేస్తాయి. అంత ప్రాముఖ్యం కానివారు అనే పేరుతో మా దేశీయులు మానవమాత్రులకు తగని హీనదశకు నెట్టబడ్డారు. అలాంటివారి ప్రక్కన, ప్రత్యేక గౌరవ చిహ్నాలన్నిటినీ వదలుకొని నిలబడదలచుకొన్నాను. ఈ కారణాల వల్ల, ఈ కారణాలు బాధాకరంగా యిలా అడిగేటట్లు చేయడం వల్ల, నా సర్ బిరుదునుంచి నన్ను తప్పించవలసిందిగా ఘనతవహించిన మిమ్మల్ని, మీ పట్ల గౌరవంతోను, విచారంతోనూ కోరుతున్నాను"

చరిత్రాత్మకమైన ఈ లేఖ గురించి కాంగ్రెస్ నాయకులు ఆనాడు పట్టించుకోకపోవడం ఆశ్చర్యం కల్గించుతుంది. ఆ సంవత్సరం అమృతసర్‌లో కాంగ్రెస్ జరిగింది. అమల్‌హోమ్ అనే ప్రతినిధి ఒక తీర్మానం రాసి కాంగ్రెస్ అధ్యక్షుడు పండిత మోతీలాల్‌నెహ్రూకిచ్చాడు. విషయ నిర్ధారణ సభలో ప్రవేశపెట్ట వలసిందిగా ఆయన సూచించాడు. ఇలాంటి తీర్మానాన్ని ఒక ప్రముఖ నాయకునిచే ప్రవేశ పెట్టించాలని అమల్‌హోమ్ భావించాడు. అనర్గళ ఉపన్యాసకుడైన జితేన్ బెన అనే బెంగాలీ నాయకుని, ఆ తీర్మానాన్ని ప్రవేశపె వలసిందిగా కోరాడు, ఆయన మొదట అంగీకరించి త ్వత జారుకొన్నాడు. చిత్తరంజన్ దాసును కోరగా, ఆయన, బెంగాలీవాళ్ళు గాకుండా మరొకరు ఆ తీర్మానం ప్రవేశపెడితే బాగుంటుందని అన్నాడు. మరొకరి దగ్గరకు వెళితే, "ఇలాంటి తీర్మానం మంచి ఉద్రేకపూరిత ఉపన్యాసకుడు ప్రవేశ పెట్టాలని" సలహా

ఇచ్చాడు. చివరకు ఎలాగైతేనేం సయ్యద్ హుస్సేన్ ఆ తీర్మానంపై సంతకం చేశాడు. విషయ నిర్ధారణ సభలో ఆ తీర్మానం అందజేయబడింది. మోతీలాల్ నెహ్రూ ఆ తీర్మానాన్ని తీసుకొని, కళ్ళజోడు పెట్టె కింద పెట్టాడు. అమల్‌హోమ్ రెండు జ్ఞాపకం చేశాడు. చివరకు జవహర్‌లాల్ నెహ్రూ చెప్పుకొన్నాడు. ఆగవలసిందని ఆయన కోరాడు. మర్నాడు ఆ తీర్మానం గురించి జవహర్ ప్రస్తావించు తాడని అమల్ భావించాడు. అదీ జరగలేదు. పండిత మాలవీయను అడగ్గా, అధ్యక్షులు ప్రతిపాదించే తీర్మానాల్లో దాన్ని చేర్పించుతామన్నాడు. కానీ ఆ తీర్మానం రాలేదు. మహమ్మద్ ఆలీ జిన్నాతో ఈ విషయం ప్రస్తావించితే "నాకెందుకు చెప్పలేదు" అని ప్రశ్నించాడు.

ఏమైతేనేం ఆ తీర్మానం బుట్టదాఖలా అయింది. అమృత్‌సర్‌లోని 34 వ కాంగ్రెస్ రికార్డంతా వెదికినా ఆ ప్రస్తావన లేదు. కాని ఆ కాంగ్రెస్ ఆహ్వాన సంఘాధ్యక్షుడు స్వామి శ్రద్ధానంద స్వాగతోపన్యాసంలో మాత్రం ఈ విషయం ప్రస్తావించాడు. "పంజాబ్‌లో భయానక పరిపాలన సాగించిన ఘటనలతో సంబంధమున్న ప్రభుత్వంచే ఇవ్వబడిన బిరుదును ఒక్కరోజు కూడా ఇకపై ఉంచుకోడం పాపమని భావించి, దాన్ని అసమ్మతితో విసరివేసిన కవి రవీంద్రనాథ్ టాగూర్ లాంటి నిజమైన భారతమాత పుత్రులెందరువున్నారు?" అని శ్రద్ధానంద, టాగూర్‌ను ప్రశంసించాడు.

ఇది తప్ప అమృత్‌సర్ కాంగ్రెస్‌లో రవీంద్రుని ప్రస్తావన రాలేదు. వైస్రాయి కౌన్సిల్‌నుంచి శంకరన్ నాయర్ చేసిన రాజీనామాను హర్షిస్తూ తీర్మానం చేయబడింది. సరోజినీనాయుడు రాసిన "1919 పంజాబు" అనే గేయాన్ని "రౌలట్ బిల్లుకెవరూ న్యాయంగా అభ్యంతరం పెట్టవలసిన అవసరంలేదు" అని చెప్పిన అనిబిసెంట్ చదవడం ఆశ్చర్యకర విషయం.

"జనుల గుంపులు సిపాయిలపైన రాళ్ళు విసరినప్పుడు, వారు కొన్ని తుపాకీ రవ్వలను పేల్చటం అంతకంటే దయగలపనియే" అని ఏప్రిల్ 18 వ తేదీన ఆమె వ్రాసినట్లూ, ఆనాటినుంచి "రాళ్ళకు బదులు రవ్వల బారులు" అనే సామెత ఆమె పేరుతో వియ్యమందినట్లు ఆమె పలుకుబడి ఆనాటినుంచే సన్నగిల్లినట్లు కాంగ్రెస్ చరిత్రలో డాక్టర్ పట్టాభి తెలియ చేశాడు. (కాంగ్రెస్ చరిత్ర 242 వ పేజీ)

ఐతే పట్టాభిగారి కాంగ్రెస్ చరిత్రలోగాని, మహాత్ముని ఆత్మకథ (సత్యాన్వేషణలో నా ప్రయోగాల కథ)లో గానీ, జవహర్‌లాల్ నెహ్రూ ఆత్మకథలో గానీ, రవీంద్రుని లేఖ ప్రస్తావనకు రాకపోవడానికి కారణం ఏమిటి?

1919 జూన్ 6 వ తేదీన శ్రీనివాస శాస్త్రికి గాంధీ రాసిన లేఖలోని ఈ క్రింది వాక్యాలను బట్టి మనం గ్రహించుకోవచ్చు.

"పంజాబు దురంతాలు కవి (టాగూర్) నుండి ఒక భగ్గుమనే లేఖను సృష్టించాయి. అది సమయం పరిపక్వం కాకముందే వచ్చిందని నా వ్యక్తిగత అభిప్రాయం. కాని అందుకు ఆయన్ని, (టాగూర్‌ను) నిందించాల్సిన పనిలేదు."

టాగూర్ లేఖపై అలా వ్యాఖ్యానించడానికి గల కారణాలను తెలుసుకోవాలంటే ఆ రోజుల్లోని గాంధీ ప్రసంగ భాగాలను కూడా ఇక్కడ ఉటంకించడం అవసరం.

మార్చి 30 న, ఏప్రిల్ 6 న హర్తాళ్లు జయప్రదంగా జరిగాయి. ఐతే ఢిల్లీలో కొన్ని హింసాయుత ఘటనలు జరిగాయి. గాంధీని ఢిల్లీకి, తర్వాత పంజాబుకు రమ్మని నాయకులు ఆందోళనపడి పిలిచారు. ఏప్రిల్ 9 న ప్రభుత్వం పంజాబ్ సరిహద్దులో గాంధీని అరెస్టుచేసి బొంబాయికి తీసుకువెళ్ళి అక్కడ విడుదల చేసింది. గాంధీ అరెస్టు వార్తతో బొంబాయి అహ్మదాబాద్‌లలో సంఘర్షణలు జరిగాయి.

తన అనుచరులను గాంధీ మందలించాడు. అప్పటికింకా జలియన్‌వాలాబాగ్ హత్యాకాండ జరగలేదు. ఆ హత్యాకాండ రెండురోజులలో జరగబోతుందనగా, ఏప్రిల్ 11 న బొంబాయి సంఘటనల గురించి గాంధీ ఇలా అన్నాడు.

"మనం రాళ్ళు విసురుతున్నాం. ట్రామ్‌కార్లకు అడ్డంకులుపెట్టి అవరోధం కల్గిస్తున్నాం. ఇది సత్యాగ్రహం కాదు. హింసాయుత ఘటనలకుగాను అరెస్టు చేయబడిన 50 మందిని విడుదల చేయవలసింది కోరుతున్నాం. మన విధి ముఖ్యంగా మనం అరెస్టు కాబడడమే. హింసాయుత చర్యలను చేసిన వారి విడుదలకై ప్రయత్నించటం మనో ధర్మానికి గండికొట

డమే ...ఈ ఉద్యమాన్ని కొంచెంకూడా హింస లేకుండా నడపలేక పోయినట్లయితే ఉద్యమాన్నే ఆపి వేయవలసి వుంటుంది....అవసరమైతే ఇంకా కొంచెం ముందుకే పోవాల్సి వుంటుంది. మనవాళ్ళకి వ్యతిరేకంగా నేను సత్యాగ్రహం చేయాల్సిన సమయం కూడా రావచ్చు....కొందరు ఇంగ్లీషు పెద్దలు గాయపడ్డారు అని విన్నాను అలాంటి గాయాలవల్ల కొందరు చని పోయినా చనిపోయి వుండవచ్చు అలా జరిగినట్లయితే అది సత్యాగ్రహానికి పెద్ద మచ్చ నా దృష్టిలో ఇంగ్లీషువాళ్ళు కూడా మన సోదరులే."

తర్వాత ఏప్రిల్ 14 న అహ్మదాబాద్‌లో ఉపన్యసించాడు. అంతకు పూర్వం అహ్మదాబాద్‌లో కూడా హింసాయుత ఘటనలు జరిగాయి. వాటిని ఆయన తీవ్రంగా గర్హించాడు. "మనం భవనాలను తగల బెట్టాం, బలవంతంగా ఆయుధాలను వశపర్చుకొన్నాం, డబ్బు లాక్కున్నాం, రైళ్ళు ఆపాం, టెలిగ్రాఫ్ తీగలు తెంచాం. అమాయకులను చంపాం, దుకాణాలను ప్రయివేటు ఇళ్ళను దోచుకున్నాం" దీనికి తాను సిగ్గు పడుతున్నాననీ "ఇంతకన్నా నా దేహంలో కత్తితో పొడిచినా నాకు అంత బాధ కల్గించేదికాదు" అని అన్నాడు. తాను 72 గంటలు నిరశన వ్రతం చేశాడు. ప్రజల్ని 24 గంటలు నిరశన వ్రతం చేయమని చెప్పాడు.

యుద్ధానికి తాను స్వయంగా సైనికుల్ని రిక్రూట్ చేసిన 'నడియాడ్' పట్టణానికి గాంధీ వెళ్ళాడు. అహ్మదాబాద్‌కు సమీపంలోని పట్టణం ఇది. ఇక్కడ కూడా హింసాయుత ఘటనలు జరిగినవని విన్నగాంధీ, సత్యాగ్రహ ఉద్యమం గురించిన తాను వేసుకొన్న అంచనా "హిమాలయమంత తప్పు" అని అన్నాడు. ఏప్రిల్ 18 న ఉద్యమాన్ని ఆపివేశాడు.

ప్రభుత్వ దురంతాలకన్నా, ప్రజలు ఆగ్రహావేశంతో చేసిన చర్యలే గాంధీని విభ్రమపరిచాయని, గాంధీ జీవిత చరిత్రకారుడు డి. జి. టెండూల్కర్ అన్నాడు. టెండూల్కర్ ఉదహరించిన గాంధీ ఈ వాక్యాలు ఈ సందర్భంగా పేర్కొనాలి.

"చెడు శక్తులను నేను తక్కువ అంచనా వేశాను. హింసను ప్రోత్సహించడానికి, ఇంగ్లీషు వారికి భారతీయులకు మధ్య సంబంధాలను ద్వేషమయం చేయడానికి నా చర్యను దేనికైనా ఉపయోగించుకోడానికి అనుమతించినట్లయితే, అది సత్యాగ్రహానికి సత్యాన్ని చేకూర్చలేదు. అందుచేత ఇపుడు మనకు లభ్యమైన అన్నివిధాలా, అధికార్లకు శాంతి భద్రతలను పునరుద్ధరించడంలోను, అరాచకాన్ని నిగ్రహించడంలోను నిరంతరాయంగా సహాయ పడటమే మన సత్యాగ్రహ కార్యక్రమంలో భాగమై వుండాలి."

తర్వాత కొన్నాళ్ళకు జూలై 21 న పత్రికలకు రాసిన ఒక లేఖలో "సాత్విక నిరోధకుడు ఎన్నడూ ప్రభుత్వానికి ఇబ్బంది కలిగించడు" అని అన్నాడు.

1919 డిసెంబరు 27 న అమృతసర్‌లో కాంగ్రెస్ 34 వ మహాసభ జరిగింది గుజరాత్, పంజాబ్ రాష్ట్రాలలో ప్రజలు చేసిన దౌర్జన్యాలను కూడా నిరసించాలని గాంధీ కోరాడు. కాని విషయ నిర్ధారణ సభ దాన్ని త్రోసిపుచ్చింది. తన అభిప్రాయాలను అంగీకరించలేని పక్షంలో తాను కాంగ్రెస్‌లో వుండలేనని గాంధీ స్పష్టం చేశాడు. మర్నాడు గాంధీ అభిప్రాయాలను ఒక తీర్మాన రూపంలో ప్రవేశ పెట్టారు.

ప్రజలు ఆగ్రహం చెందడానికి తగిన కారణాలు వున్నప్పటికీ "పంజాబ్, గుజరాత్ రాష్ట్రాలలో కొన్ని చోట్ల ప్రజలు కొందరి ధన మాన ప్రాణాలకు భంగం కల్గించే అత్యాచారాలను చేసినందుకు కాంగ్రెస్ హృదయ పూర్వక విచారం వెలుబుచ్చుతూన్నది" అని ఆ తీర్మానం పేర్కొన్నది. ఈ తీర్మానంపై ప్రసంగించుతూ గాంధీ "ప్రజలను ప్రభుత్వం రెచ్చగొట్టినదని నేనూ అంగీకరిస్తాను. ప్రభుత్వం ఆ విధంగా ప్రవర్తించి యుండని యెడల నాటి దురదృష్ట సంఘటనలు జరిగి ఉండేవి కావు, అని కూడా నేను ఏకీభవిస్తాను. కాని ప్రభుత్వానికి అప్పుడు పిచ్చి ఎత్తినది. ప్రజలు పిచ్చివాళ్ళయ్యారు. పిచ్చికి పిచ్చి ప్రతిక్రియ కాదు. పిచ్చికి విరుగుడు వివేకం. ఇది తెలుసుకుంటే విశ్వం మీకు స్వాధీనమవుతుంది."

అమృతసర్ కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించిన కాంగ్రెస్ అధ్యక్షుడు మోతీలాల్‌నెహ్రూ తాము ప్రగాఢశోక వాతావరణంలో సమావేశమవుతున్నామని అన్నాడు. ఐతే కాంగ్రెస్ తీర్మానాలు భగ్గుమని మండిన ప్రజా హృదయాన్నిగాని, వారి ఆక్రోశాన్ని గాని, వెల్లువను గాని ప్రతిబింబించలేదు. కాంగ్రెస్‌కు అసంఖ్యాకంగా ప్రజలు, ప్రతినిధులు వచ్చారు. సభా ప్రాంగణంలో బ్రిటిషురాజు, రాణి చిత్రపటాలు

వేలాడతీయబడినాయి. రాజ్యాంగ సంస్కరణలను గురించి రాజుగారు చేసిన ప్రకటనకు ధన్యవాదాలు చేస్తూ ఒక తీర్మానం చేయబడింది. వేల్సు యువరాజు రాక గురించి ఢిల్లీ కాంగ్రెస్‌లో ఇతమిద్ధంగా ఏమీ చెప్పలేదు. కాని, ఈ మహాసభలో ఆయన రాకను గురించిన ప్రకటనను హర్షించింది. తర్వాత పరిస్థితుల ఒత్తిడివల్ల యువరాజు రాకను కాంగ్రెస్ బహిష్కరించింది. సంస్కరణల గురించి ఒక రాజీ తీర్మానం అంగీకరించబడింది. సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వాన్ని త్వరగా నెలకొల్పే దృష్టితో సంస్కరణ లను అమలుపరచాలని తీర్మానించిం . సంస్కరణ లను అమలు పరచడానికి దేశం ప్రశాంతంగా ఉండా లని గాంధీ కోరాడు.

గాంధీ ఆశించినట్లు ప్రశాంత పరిస్థితి నెలకొన్నదా? యుద్ధానంతర ఆర్థిక సంక్షోభం, ముస్లిం ప్రజలలో టర్కీకి జరిగిన అన్యాయాలపట్ల ఆగ్రహం, కార్మిక సమ్మెల వెల్లువ బ్రిటిష వ్యతిరేక ఉద్యమ ప్రారంభా నికి దారితీశాయి. ఆ విషయాన్ని వర్ణించేముందు మొదట మనం వర్ణించిన రెండు తలకాయల రాక్షసి-డయ్యర్, ఓడయ్యర్‌ల గురించి రెండు మాటలు చెప్పాలి.

జనరల్ డయ్యర్ సైనిక పదవికి రాజీనామా ఇచ్చిన తర్వాత స్వదేశం వెళ్ళిపోయాడు. బ్రిస్టల్‌లో 1927 జూలై 23 న సహజ మరణాన్నే పొందాడు. పంజాబ్ గవర్నర్ ఓడయర్‌కు మాత్రం ఆ అదృష్టం కల్గలేదు పగ న ఒక కోడెత్రాచు కాటుకు బలి అయ్యాడు. వవాది ఉద్దామసింగ్ రివాల్వర్ కాల్పులకు హతుడయ్యాడు.

## ఉద్దామ్‌సింగు అరని పగ

ఉద్దామ్‌సింగ్ పంజాబు వా స్తవ్యుడు. తలిదండ్రులు చనిపోయాక అమృతసర్‌లోని అనాధ శరణాలయంలో పెరిగాడు. జలియన్ వాలాబాగ్‌లోని హత్యాకాండ అతని పసిహృదయాన్ని కలచివేసింది. అతనిలో ప్రగాఢముద్ర వేసింది. ప్రతీకారవాంఛ అతని జీవి తంతోపాటే పెరుగుతూ వచ్చింది ఉద్దామ్‌సింగ్ లండన్‌లో ఇంజనీరింగ్ కోర్సులో చేరాడు. అక్కడ ఆరుగుండ్ల రివాల్వర్ సంపాదించాడు. లండన్‌లో కాక్ స్టన్‌హాల్‌లో ఒక సభ జరుగుతోంది. ఆఫ్ఘనిస్తాన్ సమస్యపై రాయల్ సెంట్రల్ ఆసియన్ సొసైటీ, ఈస్టిండియా అసోసియేషన్ ఈ సభ ఏర్పాటు చేశాయి. మైకేల్ ఓడయ్యరు ఈ సభలో ప్రసంగించి ఇంటికి వెళ్ళడానికి సిద్ధమయ్యాడు. ఉద్దామ్‌సింగ్ అతన్ని రివాల్వర్‌తో కాల్చి చంపాడు రెండు తలల రాక్షసి రెండోతల కూడా నేలవాలింది. ఈ సంఘటన 1940 మార్చి 13 న జరిగింది. అతణ్ణి అరెస్టుచేసి విచారించి మరణశిక్ష విధించింది కోర్టు. మాతృభూమికి స్వాతంత్ర్యం సిద్ధించాలని నినదిస్తూ, ఉద్దామ్‌సింగ్ 1940 జూన్ 12 న ఉరిని కౌగలించుకున్నాడు.

# ఖిలాఫత్ ఉద్యమం

మొదటి ప్రపంచ యుద్ధకాలంలో టర్కీ, మిత్ర మండలి రాజ్యాలకు వ్యతిరేకంగా యుద్ధంలో చేరగానే తాము ఆరాధించే పవిత్ర భూభాగాలపైన మిత్ర రాజ్యాలు దాడి చేస్తాయని ముస్లిములు భయపడ జొచ్చారు. భారతీయ ముస్లిములలో కూడా ఈ భయం వ్యాపించింది. యుద్ధకాలంలో భారతీయ ముస్లిములను ప్రతికూలం చేసుకోడం బ్రిటిష ప్రభుత్వానికి ఇష్టం లేదు. భారతీయ ముస్లిం సైనికుల సహకారం కూడా దానికి అవసరం. అందుచేత, ఆనాటి బ్రిటిష ప్రధాని లాయడ్‌జార్జి కొన్ని వాగ్దానాలు చేశాడు. బ్రిటిష సైన్యంలో భారతీయ ముస్లిములు ఎక్కువగా చేరి బ్రిటిష ప్రభుత్వంపట్ల విశ్వాసం ప్రకటించినట్లయితే, వారు తమతో సహకరించినట్లయితే, టర్కీ సుల్తాన్ ఏలుబడిలో వున్న సామ్రాజ్యాన్ని విచ్ఛిన్నం చేయ బోమని, లాయడ్‌జార్జి 1918 జనవరిలో వాగ్దానం చేశాడు. యుద్ధప్రారంభ దినాలలోనే 1914 నవంబర్ 9 న చేసిన వాగ్దానంలో ముస్లిమ్‌ల పవిత్ర ప్రదేశాలపై దాడిచేయబోమని, అక్కడ ఏ ఇబ్బందీ కల్గించబోమనీ హామీ ఇచ్చాడు. కాని ఈ వాగ్దానాల్ని మంట గలిపారు బ్రిటిష పాలకులు. సైప్రెస్ సంధిప్రకారం,

ఇస్లాంమత పవిత్ర మాతృభూమిని - జజీరత్ ఉల్ అరబ్-ను విభజించారు. సిరియా, పాలస్తీనా, మెసపొటేమియా భాగాలుగా గల "జజీరత్ ఉల్ అరబ్" ను విభజించారు. ఇందులో ఎక్కువ భాగం యుద్ధ విజేతల అధీనంలో ఉంచారు. ముస్లిం మతానుసారం ఈ ప్రాంతాలు ముస్లిమేతర పాలనలో ఉండటానికి వీలులేదు. మహమ్మదీయ మతపాలకుడైన ఖలీఫా నుంచి మహమ్మదీయ పవిత్ర క్షేత్రాలను లాక్కొన్నారు. ఇందులో మెక్కా, మదీనా, జరూసలెంలు ఉన్నాయి. టర్కీ సుల్తానే ఖలీఫా (ముస్లింమత పెద్ద) కూడ. టర్కీ సుల్తాన్ దాదాపు మిత్రరాజ్యాల ఖైదీ అయ్యాడు. మిత్రమండలి నియమించిన కమిటీయే టర్కీకి ప్రభువై, సర్వాధికారాలు చలాయిస్తూ వచ్చింది.

మెసపొటేమియాతోసహా జజీరత్ ఉల్ అరబ్, అరేబియా, సిరియా, పాలస్తీనాలు వాటిలోని పవిత్ర క్షేత్రాలూ ఖలీఫా ఆధ్వర్యాన వుండాలని మహమ్మదీయుల వాదన. కాని సైక్రెపెస్ సంధి ప్రకారం హెడ్జాజ్ అనే అరబ్ రాజ్యం నామకః స్వతంత్రం కలిగి వున్నా అది బ్రిటిష్ పెత్తనం క్రిందికి వచ్చింది. ఆర్మీనియాను క్రిష్టియన్ రిపబ్లిక్‌గా ఏర్పరచి అంతర్జాతీయ గ్యారంటీక్రింద వుంచారు. మెసపొటోమియా, ట్రాన్స్ జోర్డాన్, సిరియా, పాలస్తీనాలను టర్కీ ఆధిపత్యం నుంచి తొలగించారు. సిరియా ఫ్రాన్సుకు, పాలస్తీనా, మెసపొటోమియా, ట్రాన్సు జోర్డాన్‌లు ఇంగ్లాండ్‌కు నానాజాతిసమితి సంరక్షిత దేశాలుగా ఇవ్వబడ్డాయి. ఇలాగే వివిధ ప్రాంతాలు ఆయాదేశాల "వలుకుబడి ప్రాంతాలు"గా పరాధీనం చేయబడ్డాయి. ఇంతేగాక టర్కీ యుద్ధనష్టాలక్రింద పెద్దమొత్తాలను చెల్లించవలసి వచ్చింది.

బ్రిటిష్ ప్రధాని వాగ్దాన భంగం భారతీయ ముస్లిములనేగాక, తదితరులను కూడా క్రోధావేశపరులను చేసింది.

ఈ పరిస్థితులలో క్రమక్రమంగా ఖిలాఫత్ ఉద్యమంలోకి గాంధీ ప్రవేశించాడు. మౌలానా అజాద్, హకీం అజ్మల్‌ఖాన్, హసరత్ మొహానీల నాయకత్వాన ఖిలాఫత్ కమిటీ ఏర్పడింది. హిందువులను, ముస్లిములను ఐక్యపరచుటకు ఇది మంచి అవకాశమని, ఇలాంటి అవకాశం మళ్ళా వందేండ్లకు కూడా ఏర్పడదని గాంధీ భావించాడు. "అతడు (ముస్లిము) ఆపత్కాలంలో ఉన్నపుడు, అతని ఆశయం న్యాయమని నా కనిపించు తున్నపుడు, నాశక్తినంతా ఉపయోగించి అతనికి సహాయపడటం నా విధి" అని గాంధీ "యంగ్ ఇండియా" పత్రికలో రాశాడు.

1919 సంవత్సరాంతంలో మహమ్మదలీ, షౌకతలీ సోదరులు జైలు నుంచి విడుదలయ్యారు. మహమ్మదలీ తాను చిన్న జైలు నుంచి పెద్ద జైలులోకి వచ్చానని వ్యాఖ్యానించాడు అంతేగాదు తిరుగు టికెట్‌తో జైలు నుంచి వచ్చానన్నాడు ఇది ఆనాటి అతని సమరశీల స్వభావాన్ని తెలియచేస్తుంది. అలీ సోదరులు అప్పటికే భారత రాజకీయాలలో తలమునిగి ఉన్నారు. యుద్ధకాలంలో ప్రభుత్వం వీరిని నిర్బంధించింది. బ్రిటిష్ చక్రవర్తి శత్రువులకు సహాయపడేదేమీ చేయనంటే వారిని విడుదల చేస్తామని 1917లో ప్రభుత్వం సూచించింది. "ఇస్లాం మతం పట్ల విధేయతకు భంగం కానిరీతిలో" అనేమాటచేర్చి, తామందుకు సిద్ధమని వీరన్నారు. ప్రభుత్వం ఈ షరతుకు అంగీకరించక వారిని వదలిపెట్టలేదు.

పంజాబు దురంతాల కాలంలో లక్నోకు చెందిన అబ్దుల్ బారీ ఖిలాఫత్ ఉద్యమానికి అనేకమంది ఉలేమాల మద్దతును సంపాదించాడు. ఆ విధంగా అఖిలభారత ఖిలాఫత్ మహాసభ ఏర్పడింది అలీ సోదరులు, మౌలానా అబుల్ కలం ఆజాద్‌లు టర్కీకి న్యాయం చేకూర్చాలని ఉద్యమం ప్రారంభించారు. వారితో కలిసి గాంధీ దేశమంతటా పర్యటించాడు. బ్రిటిష్ ప్రభుత్వానికి సహాయనిరాకరణ చేయవలసిందిగా అభ్యర్థించాడు. 1919 అక్టోబరు 17న ఖిలాఫత్ దినం జరపాలని అన్నిమతాల వారికి, తెగల వారికి విజ్ఞప్తి చేయబడింది. మహమ్మదలీ నాయకత్వాన ఖిలాఫత్ కమిటీ శక్తివంతమైనదిగా తయారయింది. ముస్లిం మతనాయకులు బ్రిటిషు వ్యతిరేక ఉద్యమానికి తోడ్పాటు ప్రకటించారు. 1920 జనవరిలో ఖిలాఫత్ ప్రణాళిక ప్రకటింపబడింది.

1919 నవంబర్‌లో ఢిల్లీలో హిందూ ముస్లిముల మహాసభను ముస్లిం నాయకులు ఏర్పాటు చేశారు. దీనికి జాతీయవాదులు తోడ్పాటు ప్రకటించారు. మహాత్మాగాంధీ ఈ మహాసభకు అధ్యక్షత వహిం

చాడు. ముస్లిమ్ ప్రజల విశ్వాసాన్ని ఆయన చూర గొన్నాడు.

1920 జూన్‌లో అలాహాబాద్‌లో మరో ఖిలాఫత్ మహాసభ జరిగింది. సర్ తేజ్ బహదూర్ సప్రూ, మోతీలాల్ నెహ్రూ, అనిబెసెంట్‌లు కూడా హాజ రయ్యారు. కాని ఒక్క గాంధీ మాత్రమే ధైర్యంగా ఖిలాఫత్ కోర్కెలను సమర్థించాడు. జూన్ 9వ తేదీన ఏర్పడిన ఖిలాఫత్ కార్యనిర్వాహక వర్గంలోకి గాంధీని ఎన్నుకొన్నారు ఆయన ఒక్కడే ఆ కమిటీలో ముస్లి మేతరవ్యక్తి.

అల్హాబాద్‌లో జూన్ 9న జరిగిన ఖిలాఫత్ కమిటీ, సహాయ నిరాకరణోద్యమాన్ని నాలుగు దశలుగా విభజించింది.

1) బిరుదుల్ని, గౌరవ పదవుల్ని వదలు కోడం 2) ప్రభుత్వ సివిల్ సర్వీస్‌లో పదవులకు రాజీనామా చేయడం. 3) పోలీసు, సైన్య శాఖలలో ఉద్యోగాలకు రాజీనామా చేయడం 4) పన్నుల నిరాకరణ.

టర్కీకి జరిగిన అన్యాయాలను తొలగించకపోతే 1920 ఆగస్టు 1 నుంచి సహాయ నిరాకరణోద్య మాన్ని ప్రారంభించుతామని 1920 జూన్ 22 న ఖిలాఫత్ కమిటీ సభ్యులు, వైస్రాయికి ఒక సందే శాన్ని పంపారు. అంతకుముందు 1920 జనవరి 19న డాక్టర్ అన్సారీ నాయకత్వాన ఒక మహమ్మదీయ రాయబారవర్గం వైస్రాయిని కలిసికొని ఖిలాఫత్ సమ స్యను వివరించారు. మహమ్మదలీ నాయకత్వాన కొందరు 1920 మార్చిలో లండన్ వెళ్ళి భారత రాజ్యాంగ కార్యదర్శి ప్రతినిధిని, ప్రధానమంత్రిని కలుసుకొన్నారు. కాని ఈ రాయబారాలన్నీ విఫలమై నాయి.

ఖిలాఫత్ కమిటీ వైస్రాయికి, సహాయ నిరాకరణ ఉద్యమాన్ని సాగించుతామని హెచ్చరిస్తూ సందేశం పంపిన రోజునే (1920 జూన్ 22) వైస్రాయికి గాంధీ ఒక లేఖ రాశాడు. ఖిలాఫత్ కోర్కెలు ఎలా సమంజసమైనవో, తాను వాటిని ఎందుకు బలపరుచు తున్నాడో ఆ లేఖలో గాంధీ వివరించాడు హిందువుల ముస్లిముల కరవున జూలై 1 వతేదీన గాంధీ సహాయ నిరాకరణోద్యమం ప్రారంభిస్తామని, అంతిమ హెచ్చ రిక చేశాడు."బుద్ధిమాలిన ప్రణాళికలలో కల్లా మిక్కిలి బుద్ధిమాలిన ప్రణాళిక" సహాయ నిరాకరణోద్యమం అని వైస్రాయి హేళన చేస్తూ జవాబిచ్చాడు. జూలై 31 న ఉపవాసాలు, ప్రార్థనలు జరపాలని ఆ మర్నాడు ఆగస్టు 1 వ సహాయ నిరాకరణోద్యమం ప్రారంభ మవుతుందని గాంధీ ప్రకటించాడు. కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్ సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారం భించడానికి ముందుగానే, ఖిలాఫత్ నాయకులు ఆ విధంగా సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారంభించ నిశ్చయించారు. 1920 మే లోనే గాంధీ సహాయ నిరా కరణోద్యమాన్ని ఆలిండియా ఖిలాఫత్ కమిటీ అంగీ కరించింది. దీనికి ఆజాద్‌పాత్ర ప్రముఖంగా వుంది. సామ్రాజ్య సేవలకు మెచ్చి బహూకరించిన కైజర్-హింద్ బంగారు పతకాన్ని గాంధీ వాపస్ ఇచ్చివేశాడు. అంతకుముందు ఖిలాఫత్ నాయకులలో ఒకడైన హకీమ్ అజ్మల్‌ఖాన్ తన కిచ్చిన పతకాలన్నిటినీ వదలివేశాడు. "ప్రభుత్వం ఖిలాఫత్ లాంటి ఆశయం విషయంలో మనకు ద్రోహం చేసినపుడు, మనకు. సహాయ నిరాకరణం చేయడంకన్న ఇంకొక మార్గం లేదు." అని గాంధీ అన్నాడు. ఖిలాఫత్ ఉద మంలో గాంధీ ప్రవేశించడంతో, హిందువులకు ము ములకు కూడా క్రమేణా ఆయన నాయకుడయ్యా . 1920 సెప్టెంబరులో కలకత్తాలో సమావేశమైన ప్రత్యేక కాంగ్రెస్ చరిత్రాత్మక ని యాన్ని చేసింది "ఖిలా ఫత్ అనా యాలను సరిది వరకు, పంజాబు దురంతా లకు విరు ంగా న్యాయం కూర్చే వరకు, స్వరాజ్యం ఏర్పడేవ కు, అహింసాత్మక సహాయనిరాకరణ ఉద్యమాన్ని క్రమానుగతంగా కొనసాగించాలని" కలకత్తా కాంగ్రెస్ తీర్మానించింది.

మాంటేగ్-చెలమ్స్‌ఫర్డ్ సంస్కరణల వల్ల రేగిన అసంతృప్తిగాని, పంజాబ్ దురంతాల కాలంలో ప్రజల ఆగ్రహ జ్వాలలుగాని గాంధీని కార్యరంగం లోకి దుమికించలేదు. కాని ఖిలాఫత్ సమస్య అలా చేసింది. ఖిలాఫత్ సమస్యతోపాటు, ఆ రోజుల్లో ప్రజల్లో పెల్లుబికిన అసంతృప్తి వెల్లువ గాంధీని సహాయ నిరాకరణోద్యమంలోకి నెట్టింది.

ఖిలాఫత్ ఉద్యమంలోని మతపరమైన అంశాల కంటె, బ్రిటిష్ సామ్రాజ్య వ్యతిరేక స్వభావమే ముస్లిమ్ జనసామాన్యాన్ని ఎక్కువ ఆకర్షించింది. ఖిలాఫ్ అంటే వ్యతిరేకం. అంచేత ఖిలాఫత్ ఉద్య మము అంటే బ్రిటిష్ వ్యతిరేక ఉద్యమమని సామాన్య

జనంలో ఒక అభిప్రాయం ఏర్పడింది. కలకత్తా కాంగ్రెస్ తీర్మానాన్ని జమైతుల్- ఉలేమే- ఎ- హింద్ ఒక ఫత్వా (ఆదేశం) ద్వారా గట్టిగా బలపర చింది. ఎన్నికల్ని బహిష్కరించాలనీ, గవర్నమెంట్ స్కూళ్ళను, కాలేజీలను,లా కోర్టులను బహిష్కరించా లనీ, ప్రభుత్వం ఇచ్చిన బిరుదుల్నీ, హోదాలను త్యజించాలనీ కోరింది. ఈ ఆదేశంపై 900 మంది ఉలేమాలు (మత పెద్దలు) సంతకం చేశారు.

ఒక ప్రక్క ఖిలాఫత్ ఉద్యమమూ, సహాయ నిరాకరణోద్యమం ద్వారా స్వరాజ్యం కోసం కాంగ్రెస్ నడిపిన ఉద్యమమూ హిందూ ముస్లిములను "భాయీ భాయీ" అనిపించింది. దాదాపు 0 నెలలు సాగిన ఈ జంట ఉద్యమాలలో అనేక మహత్తర ఘటనలు జరిగాయి. వాటిలో కొన్నింటిని పేర్కొనడం అవ సరం.

1920 జూన్‌లో లక్నోకు చెందిన అబ్దుల్ బారి ఒక 'ఫత్వా' జారీ చేశారు. దానిపై అనేకమంది ముస్లిం మతపెద్దలు సంతకాలు చేశారు. బ్రిటిష్‌వాళ్ళ అధీనంలోని భారతదేశాన్ని "దారుల్- హరబ్"(శత్రు దేశం)గా ప్రకటించారు. మహమ్మదీయ మత విశ్వా సాల ప్రకారం, ఆ మత విశ్వాసాలకు విఘాతం కల్గినచోటును దారుల్- హరబ్ ప్రాంతంగా ప్రకటించి దానిపై పవిత్రయుద్ధం (జీహాద్) చేయడమో, దేశం నుంచి వెళ్ళిపోవడమో (హిజ్రత్) చేస్తారు ఇలా పరాయి ప్రభుత్వ నిరంకుశత్వాన్ని భరించలేక, దేశం విడిచి వెళ్ళేవారిని "ముజాహిదీ" అంటారు. 1920 నవంబర్‌లో, పైన ఉదహరించిన 'ఫత్వా'ను పునరు ద్ఘాటించారు. దీని ననుసరించి సింధు, వాయువ్య సరి హద్దు రాష్ట్రాలనుంచి సుమారు 18 వేల మంది ముస్లి ములు ఆఫ్ఘనిస్తాన్ వెళ్ళారు. వారిలో భోపాల్‌కు చెందిన షౌకత్ ఉస్మానీ ఒకడు. ముజాహిదీల మూడవ దళానికి ఈయన నాయకత్వం వహించాడు. ఆఫ్గన్ ప్రభుత్వం వీరికి సహాయపడకపోగా, దాదాపు మృత్యు గహ్వరంలోకి నెట్టింది. అనేక కష్ట నష్టాలకు లో వీరు ఆముదరియా నదిదాటి, రష్యాలో ప్రవేశించారు. అక్కడ రెడ్ ఆర్మీలో చేరారు. బోల్షివిక్ ప్రభుత్వాన్ని కూలద్రోయాలని దండెత్తిన సామ్రాజ్యవాద సైన్యాలతో, రెడ్ ఆర్మీ సైనికులతో కలసి వీరు పోరాడారు. వారిలో అనేకులు మరణించారు. (కొందరు భారత కమ్యూనిస్టు పార్టీ స్థాపనకు బీజంవేశారు అది వేరే కథ) మిగతావారు స్వాతంత్ర్య సాధనకు తమ మాతృదేశమే తగిన యు రంగం అని భావించి తిరిగి భారతదేశానికి చేరు కునా రు.

1 20 జూలై 8 న ఆలిండియా ఖిలాఫత్ మహా సభ కరాచీలో సమావేశమై, భారత సైన్యంలోని ముస్లిమ్ సైనికులు తమ ఉద్యోగాలు వదలుకోవాలని విజ్ఞప్తి చేసింది. ఆ ఉద్యోగాలలో కొనసాగడం మత విరుద్ధం అని చెప్పింది. దానికిగాను సెప్టెంబర్ 14 న మహమ్మదాలీని అరెస్టు చేసింద ప్రభుత్వం. గాంధీ కరాచీ ఖిలాఫత్ తీర్మానాన్ని బలపరచాడు. "ప్రభుత్వం క్రింద పౌర ఉద్యోగిగా, మరీ ముఖ్యంగా సైనికునిగా పనిచేయడం జాతీయ ప్రయోజనాలకు విరుద్ధం" అని గాంధీ అన్నాడు.

సాయుధ దళాలలోని పోలీసులు కరాచీ తీర్మా నాన్ని అనుసరించి కొందరు రాజీనామా చేశారు. ప్రాణాలకు ముప్పు వాటిల్లుతుందని తెలిసినా, కొందరు నిర్భయంగా తమ పదవులు వదలుకొన్నారు కొంద రిని ప్రభుత్వం సెలవుల్లో వున్న ప్రకటించి ఇళ్ళకు పంపింది. మరికొందరిని దీ కాలం జైళ్ళ పాలు చేసింది. కొందరు కొద్ది సం ్యలో అయినా కాంగ్రెస్ కార్యాలయాలకు వచ్చి ఉద్యమంలో చేరారు.

ఈ కాలంలో అలీ సోదరులే కాక అనేకమంది మహమ్మదీయ నాయకులు, డాక్టర్ కిచ్లూ, శారదా పీఠానికి చెందిన జగద్గురు శంకరాచార్యులు అరెస్టు అయ్యారు.

కరాచీలోని మహమ్మదలీ ఉపన్యాసం సాహస వంతమైనదనీ, అప్పటినుంచీ అది కరాచీ ఉప న్యాసంగా ప్రసి చెందినదనీ, డాక్టరు పట్టాభి వర్ణిం చారు. ఆ ఉపనా సాన్ని సభలలో చదివి, ప్రభుత్వాన్ని సవాల్ చేయవల ందిగా కాంగ్రెస్ తీర్మానించింది. 1921 అక్టోబర్ 16 న వేలాది సభలలో ఈ తీర్మానం చదవబడింది.

కరాచీ తీర్మానాలలో మరొక తీర్మానం బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఇలా హెచ్చరించింది. "అంగోరా ప్రభుత్వంపై బ్రిటిష్ ప్రభుత్వం ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ, బహిరంగంగా గానీ, రహస్యంగా గానీ, ఏమైనా సైనిక చర్యలు తీసుకొంటే, భారతీయ

ముస్లిములు కాంగ్రెస్‌తో కలిసి చట్టాలను ఉల్లంఘించ వలసి వసుంది. అంటే శాసనోల్లంఘనోద్యమం చేపట్టవలసి వస్తుంది. భారతీయులకు, భారత దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రకటించుతాం. భారత రిపబ్లిక్ ప్రభుత్వాన్ని నెలకొల్పుతాం."

ఒక కోటిమంది ఖిలాఫత్ సభ్యులను చేర్పించా లనీ, 40 లక్షల రూపాయల నిధిని పోగుచేయాలనీ తీర్మానించింది. 1923 వరకు ఖిలాఫత్ ఉద్యమ ప్రభావం బాగానేవుంది. కాని 1923 నవంబరు 17 న అంగోరా శాసనసభ ఖాలీఫా పదవిని రద్దుచేసింది. ఖాలీఫా (ఆరవ)-సుల్తాన్ మహమ్మద్, మాల్టాకు ప్రవాసం పంపబడ్డాడు. మర్నాడు అబ్దుల్ మాజిల్ అనే నూతన ఖాలీఫా పదవీ స్వీకారం చేశాడు. కాని అతనికి పారలౌకిక సంబంధ అధికారాలేమీ లేవు. కెమాల్ అటా తుర్క్ అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. అతనిదే నిజమైన అధికారం. దీనితో ఖిలాఫత్ సమస్యే అసందర్భమై పోయింది.

తర్వాత ఖిలాఫత్ ఉద్యమంలోని ఒక వర్గం జాతీ యోద్యమంలో స్థిరంగా ఉండగా, మరొక వర్గం కేవలం ముస్లింమత వర్గంగా మారింది. రాను రాను దీని ప్రాబల్యం హెచ్చింది. అలీ సోదరులు కూడా ఇందులో వున్నారు.

1926 నాటికి, ఉద్యమ వైఫల్యాల వల్ల కలిగిన నిరాశా నిస్పృహలవల్ల బ్రిటిష్ కుతంత్రాల వల్ల హిందూ ము ం విద్వేషాలు తిరిగి తలెత్తాయి. 1926 మే 8 నాటి లాఫత్ కమిటీ సమావేశంలో ఒక ఉప న్యాసకుడు హిందువులను "సోదరులు"గా పేర్కొ న్నందుకే పెద్ద గందరగోళం జరిగింది. హిందూ ముస్లిం సఖ్యతకు సమాధి కట్టబడిందనీ అంత్య క్రియల ఉపన్యాసం ఇచ్చేందుకే తామిక్కడ సమా వేశం అవుతున్నామనీ ఒక ప్రతినిధి అన్నాడు. క్రమంగా ఖిలాఫత్ ఉద్యమం సన్నగిలింది. 1927 ఫిబ్రవరిలో లక్నో సమావేశానికి, 600 మంది కన్నా సభలో ప్రజలు లేరు.

ఖిలాఫత్ ఉద్యమంపట్ల, గాంధీ ఆ ఉద్యమంతో పెట్టుకొన్న సంబంధాలపట్లరెండు భిన్న అభిప్రాయాలు వున్నాయి. రాజకీయ ఉద్యమంలో కొంతకాలంవరకైనా మతపరమైన సమస్యలను చొప్పించడం పొరపాటనీ, ఈ ఉద్యమం హిందూ ముస్లిం సఖ్యతను ఏర్పర్చ లేక పోయిందనీ కొందరి వాదన. ఇలా వాదించిన వారిలో అనిబిసెంట్ కూడా వుంది. ముస్లిములకు సంబంధించిన సమస్యలపై దేశం అంతా ఆందోళన చెందుతున్నదని నిరూపించడానికీ, ముస్లిములకు తెలియజేయడానికీ ఇదే అదను అని మరికొందరు భావించారు. ఆ అవకాశాన్ని ఉపయోగించుకోవా లన్నారు, అలాగే చేశారు. ఒక వర్గానికి లేదా ఒక మతపరమైన శాఖకు చెందిన ఇబ్బందుల గురించి జాతీయోద్యమం ఆందోళన చేయడంలో తప్పులేదని వీరు భావించారు. జాతీయ, ఖిలాఫత్ ఉద్యమాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమం ఉత్సాహంతో వెల్లి విరిసిన విషయం చరిత్ర రుజువు చేసింది

ఈ సందర్భంగానే మహమ్మదలీ, షౌకతలీ సోద రుల జీవితాలను క్లుప్తంగా ఇక్కడ ఉదహరించడం అవసరం.

మౌలానా షౌకతలీ సంయుక్త రాష్ట్రం (ఈనాటి ఉత్తరప్రదేశ్) లోని రాంపూర్‌లో 1873 లో జన్మిం చాడు. అలీఘర్ కాలేజీలో చదివాడు. తర్వాత అదే కాలేజికి ట్రస్టీ సభ్యుడయాడు. ఆ కాలేజీని యూనివర్సి టీగా మార్చడానికి నిధిని సేకరించడానికి కృషి చేశాడు. 17 ఏళ్ళు ప్రభుత్వ ఉద్యోగాలను చేసిన తర్వాత, వాటిని వదలి రాజకీయాలలో ప్రవేశించాడు. మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో, ప్రభుత్వాన్ని విమ ర్శించినందుకు తన సోదరుడు మహమ్మదాలీతోపాటు జైలు శిక్ష పొందాడు. ఖిలాఫత్ ఉదమ్యంలో ప్రముఖ పాత్ర వహించాడు. 1919 అమృతసరు కాంగ్రెస్‌లో పాల్గొన్నాడు. ఖిలాఫత్‌కమిటీకి అధ్యక్షత వహించాడు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించాడు. ప్రపంచ ము మ్ మహాసభ ఏర్పాటు సందర్భంగా 1931 లో ము మ్ దేశాలలో పర్యటిం చాడు. భారతదేశం గురించి, స్లాం గురించి 1933 లో అమెరికాలో పలు ఉపన్యాసాలు గావించాడు. 1938 లో కీర్తిశేషుడయ్యాడు.

మౌలానా మహమ్మదలీ 1878 లో మొరాదాబాద్‌లో జన్మించాడు, అలీఘర్, ఆక్స్‌ఫర్డ్‌లలో విద్యాభ్యాసం చేశాడు. భారతదేశానికి వచ్చాక రాంపూర్, బరోడా సంస్థానాలలో ఉద్యోగాలు చేశాడు. తర్వాత ప కా రచన ప్రారంభించాడు. "కామ్రేడ్" అనే ఇం షు వారపత్రికకు సంపాదకుడుగా ఉన్నాడు. ఖిలా త్

ఉద్యమానికి ఆ పత్రికను ఉపయోగించాడు. తర్వాత "హందర్ద్" అనే ఉర్దూ దినపత్రికకు సంపాదకుడుగా పనిచేశాడు. యుద్ధ వ్యతిరేక వ్యాసాన్ని రాసినందుకు నిర్బంధింపబడ్డాడు. 1919 లో విడుదలయ్యాక, అమృత్‌సర్ కాంగ్రెస్‌లో చురుకుగా పాల్గొన్నాడు. 1920 లో ఖిలాఫత్ సమస్యపై ఇంగ్లాండుకు రాయబారం వెళ్లాడు. కాని ఆ రాయబారం ఫలించలేదు ఖిలాఫత్ ఆందోళనను తీవ్రంగా సాగించాడు. సహాయ నిరాకరణ ఉద్యమానికి ప్రజాభిప్రాయాన్ని సమీకరించాడు. అలీఘర్ విద్యార్థులను, ఉపాధ్యాయులను కాలేజీని బహిష్కరించడానికి ప్రోత్సహించాడు. "జమైయా మిల్లియా ఇస్లామియా"ను నెలకొల్పాడు. దానికి మొదటి "షెక్-ఉల్-జమైయా" అయ్యాడు బ్రిటిష్ సైన్యంలో ముస్లింలు పనిచేయడం న్యాయ విరుద్ధమని ప్రకటించడంతో 1921 లో తిరిగి జైలు పాలయ్యాడు. 1923 లో "ప్రో చేంజర్సు", "నో చేంజర్సు" మధ్య రాజీ కుదిర్చాడు. కాకినాడ కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించాడు. 1924 లో ఐక్య మహాసభను ఏర్పాటు చేసిన వారిలో ఒకడు. 1928 లో సైమన్ వ్యతిరేక ప్రదర్శనలను నిర్వహించాడు.

1930 లో లండన్‌లో రౌండ్ టేబిల్ మహాసభకు ప్రతినిధిగా పాల్గొన్నాడు. ఆ సందర్భంగా మహమ్మదలీ ఇలా అన్నాడు. "స్వాతంత్ర్యం సారాంశాన్ని నా చేతిలో పెట్టుకొని వెళ్ళగలిగితేనే నా దేశానికి నేను తిరిగి వెళ్ళగోరుతున్నాను. భారతదేశానికి మీరు స్వాతంత్ర్యం యివ్వక పోయినట్లయితే, నాకొక సమాధినైనా మీ దేశంలో ఇవ్వండి" ఈ ప్రకటన చేసిన తర్వాత కొద్దికాలానికి ఆయన లండన్‌లో మరణించాడు. ఆయన మృతదేహాన్ని జెరూసలం తీసుకువెళ్ళి అక్కడ సమాధి చేశారు.

# మాప్లా తిరుగుబాటు

ఖిలాఫత్ ఉద్యమ ప్రభావం "మాప్లా"లో ఎంత గాఢంగా నాటుకుందో, మాప్లా తిరుగుబాటు ఘటనలు నిరూపించుతాయి. మలబారులో కౌలారీ రైతుల ఆందోళన ఉద్ధృతంగా సాగుతున్న కాలంలో ఖిలాఫత్ ఉద్యమం అక్కడ ప్రవేశించింది.

దక్షిణ భారతదేశంలో పడమటి సముద్రతీర ప్రాంతంలో వుంది మలబార్. అరేబియా నుంచి మలబారుకు వలస వచ్చిన అరబ్బులు స్థానికులను పెళ్ళాడి, స్థిరపడిపోయారు వారి సంతతే మాప్లాలు. వీరు మతరీత్యా మహమ్మదీయులు. ముస్లిములలో నాలుగింట మూడువంతులకుపైగా మాప్లాలు. వీరు దాదాపు 10 లక్షలమంది వుండేవారు. 1921 నాటి మలబారు జనాభాయించుమించు 31 లక్షలు. కొన్ని జిల్లలో మాప్లాల ప్రాబల్యం ఎక్కువగా వుండేది. మాలలో ఎక్కువమంది బీదరైతులు. చిన్న చిన్న వర్తకాలు చేసుకునేవారూ కొందరున్నారు. ప్రభుత్వ భూములు కౌలుకు తీసుకుని పనిచేసే మాప్లాలు పర్వత ప్రాంతాలలో కొందరున్నారు. వేళ్ళమీద లెక్కపెట్టతగిన కొద్దిమంది, కలప వర్తకు లున్నారు, దాదాపు భూస్వాములు వారిలో లేరనే చెప్పవచ్చు. ఉత్తర మలబారులో అరకొరగావున్నా అదొక లెక్కలోదికాదు.

మాప్లాలలో అధికభాగం బీదవాళ్ళు, ఆదాయం తక్కువ. అజ్ఞానం, ఆవేశం, ప్రాణాల్ని తృణప్రాయంగా అర్పించే ఉద్రేకం వీరి లక్షణాలు.

తెల్లదొరలు ప్రవేశపెట్టిన శాసనాలుగానీ, వాళ్ళ దమనశక్తిగానీ సామాన్య మలబారు రైతుకు తెలియవు. ప్రభుత్వ ఉద్యోగులు, జెన్మీలు (జమిందార్లు) వారి ఏజెంట్లు సాగించే క్రూరకృత్యాలను వీరు ఒంటరిగా ఎదిరించేవారు. అప్పటికింకా మాప్లాలను, రైతు సంఘాల లాంటివి ఏర్పరచి, సంఘటిత పరచలేదు. అందుచేత తమకు శత్రువు అక్కడ అమలులోవున్న జమీందారీ పద్ధతి అనిగానీ, బ్రిటిష్ నిరంకుశ ప్రభుత్వం అనిగానీ మాప్లాలు గ్రహించలేక పోయారు. అయితే మాప్లా రైతు, పీడించే వారికి ఎన్నడూ దాసోహం అంటూ కూర్చునేవాడుకాదు. అందుకే అనేక వ్యక్తిగత ప్రతిఘటనలు సాగించేవాడు. మలబారు ఉద్యోగ వర్గాల చరిత్రకారులు వీరిని "చట్టాన్ని ధిక్కరించే మొరటు గుంపు"గా వర్ణించారు.

"మాప్లా దురంతాల చట్టం" అంటూ ఒకటిపెట్టి ప్రభుత్వం వీరిని శిక్షిస్తూ వుండేది. 1836 నుంచి 1853 లోపల దాదాపు 22 సార్లు మాప్లాలు తిరుగుబాటు చేశారు. జమీందార్లకు, వాళ్ళ తొత్తులకు, రెవెన్యూ అధికారులకు వ్యతిరేకంగా జరిగే ఈ తిరుగుబాట్లను మతపరంమైనవిగా చిత్రించడం తరుచుగా జరుగు తుండేది. జమీందార్లు, రాజాలు, వారి అధికార్లూ సాధారణంగా హిందువులుగా వుండటం, వారికింద పనిచేస్తున్న మాప్లా వ్యవసాయదారులు ముస్లిములు కావటంవల్ల కూడా, ఇలా వక్రీకరించి చెప్పడానికి అవకాశం కలిగింది. 1836-98 సంవత్సరాల మధ్య, ఉత్తర పొన్నాని, వల్లువనాడు, ఎర్నాడు, తాలూకాల్లో మాప్లాలు "హిందువులకు" వ్యతిరేకంగా 45 నేరాలు చేసినట్లు అధికార్లు రికార్డు చేశారు.

ఈ తిరుగుబాట్లలో కొన్ని మతపరమైనవి లేక పోలేదు. అయితే వాటి పూర్వాపరాలను కూడా పరిశీ లించాలి. ఉదాహరణకు ఎర్నాడు ప్రాంతంలోని 'కాలికట్' రాజాగారికి ఒక సైనికాధికారి వుండేవాడు. అతనిపేరు పారానంబి. అతని ప్రధాన నివాసస్థలమైన 'మాలప్పురం'లో ఒక తగాదా వచ్చింది. మాప్లాలు ఆ ప్రాంతానికి వచ్చినపుడు అక్కడ కాపరం వుండ టానికీ, మసీదులు కట్టుకోడానికీ రాజా అనుమతించాడు. ఇపుడు వచ్చిన తగాదా మసీదు గురించే. పారానంబి మసీదును నాశనం చేయించాడు. నంబి సైనికులకు, మాప్లా సైనికులకు జరిగిన పోరాటంలో 47 గురు మాప్లాలు మరణించారు. ఇది 19 వ శతాబ్దంలో జరిగిన ఘటన. మరో ఉదాహరణ : చరుమా అనే హరి జనులు మొదట మహమ్మదీయ మతం పుచ్చుకుని, తిరిగి హిందూమతంలోకి మారినందుకు, వారిపై మాప్లాలు దాడిచేశారు. ఇలాంటి సంఘటనలు అక్క డక్కడా జరిగేవి. మాప్లాలు పీడకులకు వ్యతిరేకంగా సంఘటితం కాకుండా పక్కదారులు పట్టేందుకు వారి మతగురువులు కూడా కొంత కారణం. 1921 కి పూర్వం జరిగిన కొన్ని తిరుగుబాట్లను చూస్తే, నిరం కుశాధికార్లు వాటికి మతపరమైన రంగు ఎందుకు పులిమారో అర్థమవుతుంది.

1841 లో "తే రు ం ప ల్లి నంబూద్రి" అనే భూస్వామి, రైతులు పండించే భూముల్ని లాక్కుని, స్వాధీనం చేసుకోవడం మొదలుపెట్టాడు. 'కుంజోలన్' అనే మాప్లా రైతులకు నాయకత్వం వహించి భూస్వా మిని చంపి, ఇల్లు తగుల బెట్టారు. భూస్వామి పక్షాన వచ్చిన సైన్యం వందల కొద్దీ, మాప్లా రైతులను చంపింది. 1843 లో, రైతులను, కూలీలను పీడించే యజమానికి వత్తాసుగా ఉన్న గ్రామ పెద్ద "కప్రత్ కృష్ణ పనిక్కర్"ను చంపారు. అదే సంవత్సరంలో మరో బ్రాహ్మణ భూస్వామి 'కరుకామన్న మూజీ'ని హత్య చేశారు. 1851 లో కొట్టాయం తాలూకాలో ఒక భూస్వామి యావత్ కుటుంబాన్ని హత్య చేశారు. 1880 లో ఇద్దరు భూస్వాముల్ని ఎదిరించిన రైతులను సైన్యం కాల్చి చంపింది. 1885, 1894, 1896, సంవత్సరాలలో మాప్లా తిరుగుబాట్లు కొన్ని జరిగాయి. 1898 లో మాప్లా రైతులొక భూస్వామిని చంపారు. 1919 ఫిబ్రవరిలో 'మంకట్టవల్లిపురం' అనే బ్రాహ్మణ జమీందారు గ్రామంలో 'చెకాజీ' అనే రైతు కౌలు చెల్లించలేదు జమీందారు దావావేసి డిక్రీ పొందాడు. దానితో తృప్తిపడక, చెకాజీ తన కొడుకు పెళ్ళిని నిర్ణ యించుకొన్నాక జమీందారు ఆ పెళ్ళిని ఆపు చేయిం చాడు. ఆ కోపంతో చెకాజీ మరికొందరు రైతులూ కలిసి జమీందారునీ, అతని నౌకర్లనూ చంపారు. జమీందారుకు సంబంధించిన సైనికులు చెకాజీని, రైతు లను కాల్చి చంపారు

ఇది వరలోనే చెప్పినట్లు, ఖిలాఫత్ ఉద్యమం, మలబారులో కౌల్దారీ రైతుల ఆందోళన ఉధృతంగా సాగుతున్న కాలంలో ప్రవేశించింది. మలబారులో మొట్ట మొదటి ఖిలాఫత్ సభ 1920 లో మంజేరీలో జరిగింది.

ఈ సందర్భంలో మలబారు రైతుల చైతన్యానికి కారణమైన కొన్ని పరి తులను వివరించాలి. 1920 అక్టోబరులో రైతు ఉద మం ఒకటి కాలికట్ చుట్టు ప్రక్కల ప్రారంభమైం . దీనికి రాజకీయాలతో ప్రమే యంలేదు. మగతా రేట్లు హెచ్చించి, అలా ఇవ్వని వారి భూములను భూస్వాములు, లాక్కోవడం మొదలు పెట్టారు. దీనికి ప్రతిఘటనగా రైతు ఉద్యమం ప్రారంభమైంది. ఆ రోజుల్లో కాంగ్రెస్‌కు మలబారులో వున్న పలుకుబడి విస్తృతంగా వ్యాపించలేదు. రైతు ఉద్యమ నాయకుడైన నారాయణమీనన్ కాంగ్రెస్‌లో చేరేటప్పుడు ఈ రైతు వుద్యమంతో సంబంధాలు మానివేశాడు. కాగా భూస్వాముల దౌర్జన్యాలు

హెచ్చిన కొద్దీ రైతులలో కదలిక కల్గింది. వందలాది సభలు జరిగాయి. భూస్వాములను బహిష్కరించాలనే ఉద్యమం బయలుదేరింది. నిజానికి భూస్వాములకు రైతులను భూమి నుండి వెళ్లగొట్టే హక్కు లేదు. 19 వ శతాబ్దం చివరి కాలంలో ప్రభుత్వం రైతుల ఆందోళన గురించి విచారించవలసిందిగా ప్రభుత్వ సివిల్ ఉద్యోగి అయిన "లోగాన్"ను నియమించింది. ఆయన సమర్పించిన నివేదికలోని ముఖ్యాంశాలు గమనిస్తేగాని ఈ వుద్యమ స్వరూప స్వభావాలు అర్థం కావు. లోగాన్ నివేదికలోని క్రింది అంశాలు గమనించదగినవి.

1. మలబార్ భూస్వామ్య విధానాన్ని ఇంగ్లీషు న్యాయశాస్త్రజ్ఞులు అర్థం చేసుకోలేదు బ్రిటిష్ తరహా భూస్వామ్య పద్ధతినే, సర్వాధికారాలతో కూడినది ఆస్తిహక్కు అనే భావాన్ని మలబారులో దిగుమతి చేశారు.

2. మలబారులో భూమిపై పరిమితి లేని ఆస్తిహక్కు అంటూ ఏదీలేదు. వ్యవసాయ దారులు, వ్యవసాయ కార్మికులతో కలిసే జమిందారీ భూభామందు వుండే వాడు. ఫలసాయంలో మూడోవంతు జన్మభోగం క్రింద జమీందారు తీసుకునేవాడు. కౌలుదారును బేదఖలు చేసే హక్కుగానీ, తనవాటా పెంచే హక్కుగానీ జమీందారుకు వుండేదికాదు.

3. చట్టానికి తప్పుడు నిర్వచనం ఇచ్చి, కోర్టులు జమీందార్ల అనుకూలంగా వాళ్ళ వాటాను పెంచడానికి వీలుకలుగజేశారు

4. కౌలుదార్లకు శాశ్వతకౌళ్ళు, పాతరేట్ల ప్రకారం శిస్తునిర్ణయం, కౌలుదార్లకు నష్టపరిహారం ఇవ్వాలి.

రాజాల స్థానీల (సామంతుల) రాజకీయ ప్రాబల్యం, నంబూద్రీల, మతసంస్థల ప్రాబల్యం నశించి బ్రిటిష్ విద్యావిధానం వచ్చాక, ఇంగ్లీషు విద్యాభ్యాసంచేసిన కొత్త తరగతి ఒకటి తలెత్తింది. ఇదివరలో పైన రెండు ప్రాబల్యాలకు లోనై వారిపైననే ఆధారపడి వుండే కౌలుదార్లు, ఇతరులూ ఈ తరగతి లోకి వస్తారు. రాచరికవర్గాలూ, నంబూద్రీ మొదలైన వారు ఇంగ్లీషు విద్యను ఖాతరు చేయక వెనుకబడి పోయారు. ఆర్థిక, సాంఘిక ప్రాబల్యం వీరిదేఐనా, రాజకీయ వైజ్ఞానికాది విషయాలలో ఈ విద్యాధికులు వీరిని మించిపోయారు ఉద్యోగాలు సంపాదించారు. ఐనా వీరు బ్రిటిష్ చట్టాలను అమలు పరచడంలో సామాన్య ప్రజలకు, జమీందార్లకు, భూస్వాములకు ఒకే విధమైన సూత్రం పాటించేవారుకాదు. అనేక విధాల భూస్వామ్య వర్గాలపై ఆధార పడేవారు. ఆత్మగౌరవాన్ని నిలుపుకోకుండా పాక్షికంగా ప్రవర్తించేవారు. అదే సమయంలో పెట్టుబడిదారీ వర్గం ఒకటి తలెత్తడం ఆరంభించింది. శిథిలమౌతున జమీందారీ వ్యవస్థకూ, నూతన విద్యాధిక తరగతులకూ మధ్య, అలాగే భూస్వాములకూ కౌలుదార్లకూ మధ్య ఘర్షణలు రైతు వుద్యమానికి బలాన్ని ఇచ్చాయి. రైతు వుద్యమానికి నాయకత్వం వహించిన ప్రముఖవ్యక్తి శ్రీ శంకరన్ నాయర్.

మలబారులో రెండురకాల రైతు వర్గాలువున్నాయి. ఒకదాన్ని 'కనామాదారు' అంటారు. రెండోదాన్ని 'వరూం పటాందారు' అంటారు కనామా దారుకు కొన్ని ప్రత్యేక హక్కులేగాక శిస్తు తక్కువ. ఎక్కువ మంది స్వయంగా సేద్యం చేసేవారుకాదు. ఇతరులకు తాము కౌలుకు తీసుకొన్న భూమిని తిరిగి సేద్యానికిచ్చి కొంత మిగుల్చుకొనేవారు. ఒక విధంగా జమీందారుకూ, వ్యవసాయం చేసే వారికీ మధ్య దళారీ అన్నమాట. ఈ కనామాదార్లు ఆర్థిక పరిస్థితి మెరుగై, జమీందార్లకు పెట్టుబడి పెట్టగల స్థితిలో వుండేవారు.

మరో రైతువర్గం "వరూంపటాందార్లు". వీరు అటు జమీందారు క్రిందా, ఇటు కనామాదార్లు క్రిందా వుండేవారు. వీరికి ప్రత్యేక హక్కులు శూన్యం. పూర్తి శిస్తు చెల్లించాలి. సాలుసరి కౌలు పద్ధతిని వ్యవసాయం చేసుకోవాలి. ఆర్థికంగా జమీందారుతో సమాన ఫాయీలో వుండాలని 50 ఏళ్ళ పాటు సాగించిన పోరాటంలో కనామాదారు జయించాడు. చితికిపోయిన జమీందా నుంచి వచ్చినవారు, ఈ కనామాదార్లలో ధనిక వర్గమూ పెట్టుబడిదారీ వర్గంగా తలెత్తుతున్న రోజులలో, రైతు ఉద్యమం వేళ్ళూనుకొని బలపడజొచ్చింది. 1920 అక్టోబరులో ప్రారంభమైన ఈ రైతు ఉద్యమం భూస్వాముల బహిష్కరణకు దారి తీసింది. భూస్వామి గనుక ఒక రైతును పొలంనుంచి వెళ్ళగొడితే, ఆ పొలాన్ని ఎవరూ సాగుచేయకూడదనీ, అలా సాగుచేసిన వాళ్ళను వెలివేయాలనీ, భూస్వాములకు మగతా చెల్లించరాదనీ ఉద్యమం

ప్రారంభమయింది. కాలికట్‌లో జమీందారు తన రైతును పొలంనుంచి వెళ్ళగొట్టి నప్పుడు పెద్ద సమ్మె జరిగింది. కౌలుదార్ల సహాయక సంఘం ఏర్పడింది. పంటకు వచ్చిన పొలాల్లో ఎవరూ అడుగు పెట్టలేదు. పంట కోయలేదు, నూర్పిడి చేయలేదు. ఈ ఉద్యమం వివిధ ప్రాంతాలకు విస్తరించింది.

1920 లో మంజేరి అనే ప్రదేశంలో మొట్టమొదటి ఖిలాఫత్ మహాసభ జరిగింది. రైతుల కోర్కెలను బలపరుచుతూ ఈ సభలో తీర్మానాలు చేశారు. మాప్లాలు మహమ్మదీయ మతస్థులైనందువల్లా, మలబార్‌లో వారి సంఖ్య ఎక్కువగా వుండటంవల్లా కాంగ్రెస్, ఖిలాఫత్ ఉద్యమనాయకులు సరిగ్గా ఈ సమయంలోనే రైతు ఉద్యమంలో ప్రవేశించి వారి కోర్కెలను బలపరచసాగారు. కాంగ్రెస్, ఖిలాఫత్ ఉద్యమ నాయకుల్లో ఎక్కువమంది రైతు ఉద్యమ నాయకులే. మంజేరిలో జరిగిన అఖిల మలబారు రాజకీయ మహాసభలో, సహాయ నిరాకరణ ఉద్యమాన్నీ, కౌల్దారీ సంస్కరణలనూ బలపర్చుతూ తీర్మానాలు చేయబడ్డాయి. ఈ సమావేశం తర్వాత దక్షిణ మలబార్‌లో ఏర్పడినన్ని కాంగ్రెస్, ఖిలాఫత్ కమిటీలు సంఖ్యరీత్యా చూస్తే 1938-1940 లో కూడా లేవని ఇ. యమ్. యస్. నంబూద్రిపాద్ మలబార్ ఉద్యమ చరిత్రలో రాశాడు. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా, జమీందార్లకు వ్యతిరేకంగా రెండువైపులా పదునున్న కత్తిలా కాంగ్రెస్, ఖిలాఫత్ నాయకుల ఉపన్యాసాలుండేవని నంబూద్రిపాద్ రాశాడు. కాంగ్రెస్, ఖిలాఫత్ ఉద్యమ నాయకులు చేయి చేయీ కలిపి ఎర్నాడ్ వల్లవనాడ్ జిల్లాలలోని కాలికట్ తదితర పట్టణాలలోను అనేక సభలు పెట్టారు

దీనితో ప్రభుత్వానికి ఖంగారు పుట్టింది. 1921 ఫిబ్రవరి 5 న దక్షిణ మలబారుజిల్లా మేజిస్ట్రేట్ 144 సెక్షన్ విధించి రైతు సభలను నిషేధించాడు. "....అలాంటి మీటింగులు జరగడంవల్ల ప్రభుత్వానికి మాత్రమేగాక, ఈ జిల్లాలోని హిందూ జెన్మీల (జమీందార్ల)కు వ్యతిరేకంగా, అమాయకులైన మాప్లాల భావాలు చెలరేగుతాయి." అని అందులో పేర్కొని తన జమీందారీ అనుకూల స్వభావాన్ని బయటపెట్టుకున్నాడు. రైతు సంఘాలున్న ప్రతి చోటా ఇలాగే నిషేధాజ్ఞలు చెలరేగాయి.

ఈ అమానుషపు ఉత్తర్వుల్ని ధిక్కరించాలని నాయకులు నిర్ణయించారు. "కల్పకం చెరి" అనేచోట 20 వేలమంది నిషేధాజ్ఞను ధిక్కరించారు. పొన్నానిలో పోలీసులు ప్రజలను తీవ్రంగా చితకబాదారు. ఐనా రైతాంగం లొంగిపోలేదు. ఆత్మరక్షణ కోసం సాయుధ తిరుగుబాటుకు సన్నాహాలు ప్రారంభించారు.

"ప్రాణములను తృణప్రాయముగా చూచే ఉద్రేకపూరితులైన మాప్లాలలో అసహాయోద్యమమనే అగ్ని కణము పడకూడదని మొదటినుండీ ప్రభుత్వము వారెంతో ఆతురతతో నుండిరి" డాక్టరు పట్టాభిగారి కాంగ్రెస్ చరిత్ర నుండి ఉటంకించిన ఈ వాక్యం ఆనాటి పరిస్థితుల్ని తెలియచేస్తుంది.

ఆనాటికి ఇంకా భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా మద్రాసు రాష్ట్రాన్ని విడగొట్టలేదు. కాంగ్రెస్ మాత్రం భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా తమ సంస్థను విభజించింది. కేరళకు కాంగ్రెస్ రాష్ట్రం ఏర్పడింది. ఇది ప్రజలలో ఉత్సాహాన్ని కలుగజేసింది. సరిగా ఈ సమయంలోనే సి. రా జ గో పా లా చా రి, డి. యాకూబ్ హుస్సేన్ లాంటి నాయకులు అహింసా సందేశాన్ని వ్యాపింప చేయాలని కేరళకు వెళ్ళారు. అక్కడ పర్యటించి సన్నాళ్ళు తాను సహాయ నిరాకరణోద్యమం గురించి మాట్లాడనని యాకూబ్ హుస్సేన్ స్పష్టంగా చెప్పాడు. ఐనా 1921 ఫి బ్ర వ రి 16 న యాకూబ్ హుస్సేన్, మాధవనాయర్, గోపాలమీనన్, మొయుద్దీన్ కోయా మొదలగు నాయకులను ప్రభుత్వం అరెస్టు చేసింది. ఒట్టపాలెంలో కేరళ రాష్ట్ర మహాసభతో పాటు జరిగిన అనేక మహాసభలలో విద్యార్థి మహాసభ కూడా ఒకటి. ఆ సభ జరుగుతుండగా, కాంగ్రెస్ ఖిలాఫత్ నాయకులపైన, విద్యార్థులపైన, ప్రజలపైన రిజర్వు పోలీసులు లాఠీ చా చేశారు. ఐనా ప్రజ లెంతో నిగ్రహంతో ప్రవ ర్తిం రు. ఐతే ఆగస్టు నాటికి ప రి స్థి తు లెం తో తీవ్రంగా మారిపోయాయి.

రైతు, ఖిలాఫత్ ఉద్యమ నాయకులైన యం. సి. నారాయణమీనన్, మహమ్మద్ మూసా, అబ్దుల్లాహాజీ, ఇంకా నల్గురిపైన 1921 ఆగస్టులో అరెస్టు వారంట్లు పుట్టాయి. అందులో మాప్లాల ప్రియతమ నాయకుడైన

అలీ మూస్లాలియర్ ఉన్నాడు. వీరిని అరెస్టు చేయ దానికి జిల్లా మేజిస్ట్రేట్ థామస్, పోలీసు సూపరెంటెంట్, డిప్యూటీ సూపరెంటెంటుతోను, వంద మంది సైనికులు, ప్రత్యేక పోలీసు దళంతోను 'తిరుంగాడి' అనే ప్రదేశానికి వెళ్ళారు. అక్కడ మూస్లాలియర్ కన్పించలేదు. కాని ఈ దాడి వార్త కార్చిచ్చులా వ్యాపించింది. తమ నాయకుడున్న మసీదును ముట్టడించారనే వార్త వినగానే చేతికి దొరికిన ఆయుధ మల్లా పుచ్చుకొని 30 వేల మాప్లా రైతులు తమ నాయకుని సంరక్షణంకోసం వచ్చారు. తీవ్రంగా పోరాటం సాగింది. కున్హల్వి అనే వారి నాయకుడు పోరాడుతూ మరణించాడు. పోలీసుల కాల్పుల్లో తొమ్మిదిమంది చనిపోయారు. అనేకమంది గాయపడ్డారు. 41 మందిని పోలీసులు అరెస్టు చేశారు. ఈ వార్త విన్న మరో రైతుల దళం పోలీసులపై దాడి చేసింది. పోలీసులకు గత్యంతరం లేక ఒక కోర్టు బిల్డింగ్‌లో దాక్కున్నారు. కలెక్టర్ ఆస్టిన్, అసిస్టెంట్ పోలీసు సూపరెంటెంట్ " ", ఒక మిలటరీ ఆఫీసర్, ఇద్దరు పోలీసులూ రైతుల ఆగ్రహానికి గురై చంపివేయబడ్డారు. తీవ్రమైన పోరాటం జరిగాక, మలబార్ ఖిలాఫత్ కమిటీ కార్యదర్శి అయిన ఘనీఖాదర్‌ను పోలీసులు అరెస్టు చేశారు. తర్వాత అతణ్ణి ఉరి తీశారు.

దీనితో మాప్లాల తిరుగుబాటు విస్తృతరూపం దాల్చింది. ఆగస్టు 21 న పోలీసు సూపరెంటెంట్ "టాటన్‌హామ్" పారపనగడ్ అనే గ్రామానికి వచ్చిన సందర్భంగా రైతులు, ఆత్మరక్షణ కోసం సమీపంలోని రైలు పట్టాలను పీకి వేశారు. స్టేషన్లను నాశనం చేశారు. టెలిగ్రాఫ్ తీగల్ని తెంపివేశారు. వంతెనల్ని కూలగొట్టారు. పోస్టు, కోర్టు, రిజిస్ట్రేషన్ ఆఫీసులను దోచుకుని తగలబెట్టారు. కొంతమంది ప్రభుత్వ సేవకులను చంపివేసి, మరికొందరిని హెచ్చరించి వదలివేశారు. తిరుగుబాటు "తిరూర్ అంగడి" నుండి "తిరూర్"కు పారాపనంగడి, మంజేరి, రూలాపురం, నీలాంబర్, అంగడిపురం, చెరుపులచెరి మొదలైన ప్రదేశాలకు వ్యాపించింది. ఇక్కడ పది రోజుల పాటు రైతులదే రాజ్యం. మిలటరీ, పోలీసుల పత్తా ఎక్కడా కన్పించలేదు.

నీలాంబూర్ "రాజా", ఎర్నాడు, వల్లువనాడు జిల్లాలలో కల్ల పెద్ద భూస్వామి. ఆగస్టు 21న అతని ఇంటిని దోచుకున్నారు. దారిద్ర్యం, ఆకలితో కుంగి కృశించే మాప్లా రైతులకు అతని ధన ధాన్యాలు కను మిరుమిట్లు కలిగించాయి. గంజినీళ్ళకు నోచని రైతులు కడుపార భోం చేసి పది రోజులు అక్కడ రాజ్యం చేశారు. ఆ పది రోజులు పోలీసులు, మిలటరీ వాళ్ల పత్తాలేదు ఈ సంఘటనను బాగా అర్థం చేసుకోవాలంటే, గోపాల్‌నాయర్ రాసిన పుస్తకం బాగా తోడ్పడుతుంది. గోపాల్‌నాయర్ ప్రభుత్వ పెన్షన్ పుచ్చుకునే మాజీ ఉద్యోగి పైగా ఆనాటి కలెక్టర్ ఆ పుస్తకాన్ని తెగపొగిడాడు. కాబట్టి అతడు తిరుగుబాటు ఉద్యమాభిమాని అనలేము. అతడు ఇలా రాశాడు:

"నీలాంబూర్ తిరుమల్ పాదుగారి భవనం నుంచి ఎవరో ఒక తుపాకి దొంగిలించారు. పోలీసులు స్థానిక ఖిలాఫత్ పట్టణ కార్యదర్శి మహ్మద్ ఇల్లు సోదా చేయసాగారు. సమయం కోసం వేచివున్న మాప్లాలకు ఖిలాఫత్ ఉద్యమ బలాన్నీ, అధికారాన్నీ ప్రదర్శించ దానికి ఇది అవకాశమిచ్చింది. సోదా చేయడం అక్రమం, అనవసరం అంటూ, వందలాది మాప్లా రైతులు కత్తులు కఠార్లు మొదలైన చేతికందిన ఆయుధాలన్నింటినీ ధరించి ఒక్కక్షణంలో గుంపుగా పోగై రాజా భవనాన్ని చుట్టుముట్టారు. చుట్టుపక్కల స్థానికంగా వున్న మసీదులవద్ద తప్పెట్లు, నగారాలూ మోగించడం ద్వారా యీ గుంపులు పోగయ్యారు. ఖూనీ చేస్తామని బెదిరించి, భూస్వాముల నుంచి చోర శుల్కం (బలాత్కారపు పన్ను) వసూలు చేశారు."

అదే రచయిత ఆ గ్రంథంలో అమాయకులైన మాప్లా రైతులను తప్పుదోవ పట్టించిన అరాచక వ్యక్తుల గురించి కూడా ఇలా పేర్కొన్నాడు.

"వారియర్ కున్నాథ్ కున్హా అహ్మద్ హాజీ నేరస్థ కుటుంబాలకు చెందినవాడు. చిన్నతనంలోనే తండ్రితో పాటు శిక్షవిధింపబడినవాడు, శిక్ష పూర్తయ్యాక స్వగ్రామం చేరాడు. ఆ గ్రామంలో వుండ వీల్లేదని అతణ్ని వెళ్ళగొట్టారు. కొన్నాళ్ళయాక తిరిగి స్వగ్రామం వచ్చి, బండి తోలుకుని జీవించడం మొదలు పెట్టాడు. ఖిలాఫత్ ఉద్యమంలో చేరి ఎర్నాడులో ఆ ఉద్యమ నాయకుడయ్యాడు. తిరుగుబాటు రాగానే, తాను రాజునన్నాడు. ఖాన్‌బహద్దర్ చక్కుట్టే అనే రిటైర్డు

పోలీసు ఉద్యోగిని (ఇతడు కూడా మాప్లాయే) చంపి పట్టాభిషేకం చేసుకొన్నాడు.

"ఇతడు హిందువులకు రాజుగా మహమ్మదీయులకు మతగురువుగా, ఖిలాఫత్ ఉద్యమానికి సేనా నాయకుడుగా నటించాడు. ఖిలాఫత్ ఉద్యమ యూనిఫారం, బ్యా , టర్కీటోపీ, చేతిలో ఖడ్గం ధరించి వల్లువనాడు, ఎ‌ డు తాలూకాల్లో సంపూ స్వరాజ్యం అనుభవించా . చోపిడీల దొమ్మీలవ ప్రజలు చాలా బాధ లనుభవిస్తున్నారని, అందుచే ఆ సంవత్సరం (1921) యుద్ధ చందాలు తప్ప మిగతా పన్నులు వసూలు చేయబోనని చెప్పాడు. మరుసటేడు పన్నులు తప్పవని ప్రకటించాడు. తిరుమల్‌పాడు (నీలాంబూర్ రాజా) భూమిలోని పంటను పోగుచేసి తెమ్మని వ్యవసాయ కార్మికులను ఆదేశించాడు, అందుకు డబ్బు యిచ్చే ఏర్పాటు చేశాడు. ఆ ధాన్యం తన సైన్యాలకు అవసరం అన్నాడు. ఎవరైనా తన 'రాజ్యం' నుంచి బయటకు వెళ్ళదలి , తమ శక్త్యానుసారం డబ్బిస్తే బయటకు వెళ్ళదలి , తమ శక్త్యానుసారం డబ్బిస్తే బయటికి వెళ్ళేందు అనుమతి పత్రాలిచ్చాడు."

ఐతే ఇతని రాజ్యం ఎన్నాళ్ళో నిల్వలేదు. హాజీని 1922 జనవరి 6 న పట్టుకొని 20 వ తేదీన ప్రభుత్వం కాల్చివేసింది.

ఇంతటి ప్రసిద్ధి చెందకపోయినా, కొంచెం తక్కువ స్థాయిలో ఇలాంటి నాయకుడే అయిన "సెతి కోయా తంగళ్"ను గురించి కూడా తెలుసుకోవాలి. ఇతడు కుమారం పత్తూరు వాస్తవ్యుడు ఒక ఖిలాఫత్, రాష్ట్రానికి తనంతటతానే గవర్నర్‌నని ప్రకటించుకొన్నాడు. దేశం తన స్వాధీనమైంది కాబట్టి ఇకమీదట విధ్వంసక చర్యలు చేయవద్దనీ, లూటీలు చేయరాదనీ ఫత్వా (మతపరమైన ఆదేశం) ఇచ్చాడు. ఒకచోట దొమ్మీ చేసన ముగ్గురిని తన సొంత కోర్టులో విచారించి, శిక్షలు విధించాడు. తప్పు చేసినవారిని కాల్చివేయవలసిందిగా ఆజ్ఞాపించాడు. శిక్షితులను ఉత్తి తూటాలున్న తుపాకులతో కాల్పించాడు. భయంతో వాళ్ళు కిందపడిపోయారు, లేచిచూసుకొనేసరికి వారికెలాంటి గాయాలూ లేవు. ఇదంతా తన అద్భుతశక్తి మహిమ అనీ, ఇంగ్లీషువాళ్ళు దాడి చేసినా ప్రజలు చలించరనీ అతడన్నాడు. అయితే ప్రభుత్వం ఇతణ్ణి కూడా పట్టుకొని కాల్చి చంపివేసింది.

ఇలాంటి కోవకు చెందినవాడే "చెంబ్రాశేరీ ఇంబిచ్చి కోయా తెంగల్." తిరూర్-కరువారకుండు గ్రామాల మధ్య వున్న పర్వత ప్రాంతంలో కోర్టు పెట్టాడు. చుట్టుపక్కల గ్రామాల నుండి, నాల్గువేలమంది అనుచరులను సమీకరించాడు. ప్రభుత్వ సైన్యాలకు పాలు పళ్ళు యిచ్చి, సహకరించిన 40 మంది హిందువులను తలలు వెనక్కి విరిచి వీపులకుకట్టి కోర్టుకు రప్పించాడు. 38 మందికి మరణశిక్ష విధించాడు. తెంగాల్ స్వయంగా దగ్గరుండి శిక్ష అమలుపరచాడు. తలలు తరిగి దగ్గర బావిలోకి దొర్లిస్తున్నపుడు స్వయంగా చూశాడు. హతులలో ఒకడు పెన్షన్ పుచ్చుకుంటున్న కానిస్టేబుల్. తెంగాల్‌కు విరోధి. అతని తలను నడిమికి బ లు కొట్టించాడు. మేలట్టూరులో తెంగాల్ పట్టుబ డు. 1922 జనవరి 20 న అతణ్ణి ప్రభుత్వం - చ్చ చంపింది.

1921 ఆగస్టు 21 న మలబార్‌లో మార్షల్‌లా ప్రకటించబడింది. ఆగస్టు 26 న 75 మంది బ్రిటిష్ సైనికులూ, 30 మంది రిజర్వు పోలీసులూ పుక్కొట్టూర్ అనేచోట 10 వేలమంది రైతులపై దాడి చేశారు. 500 మంది రైతులను చంపివేశారు. తిరుగుబాటుదార్లు గెరిల్లా యుద్ధానికి పూనుకొని నీలాంబర్ సమీపంలోని 'వెలికుటూరి' వద్ద అద్భుత సాహసం ప్రదర్శించారు. కున్హా అహమ్మద్ హాజీ పోరాటాన్ని నడిపాడు. 14 మంది తిరుగుబాటుదార్లు చనిపోయారు. గూర్ఖా సైనికుల్ని, బర్మా సైనికుల్ని ప్రభుత్వం వినియోగించింది. వందలాది రైతులను మట్టుబెట్టిన సైనికుల నష్టాలు బహుస్వల్పం. 8 మంది ప్రభుత్వ సైనికులు చనిపోయారు.

నీలాంబూర్‌కు సమీపంలోని వెట్టికట్టూర్‌లో జరిగిన గెరిల్లా పోరాటానికి 'కున్హా అహమ్మద్ హాజీ' నాయకత్వం వహించాడు. తిరుగుబాటుదార్లు 14 మంది చనిపోయారు. బర్మానుండి సైనికదళం, మరో ఘూర్ఖా-దళం వచ్చాయి. నవంబరు 21 తిరుగుబాటు నాయకులలో ఒకడైన అలీ ముసాలియర్‌ను, ఇంకా 30 మందిని విచారించి 13 మందికి మరణశిక్ష, 15 మందికి ద్వీపాంతరవాస శిక్ష విధించారు. నవంబర్ 13 న జరిగిన పోరాటంలో 56 గురు రైతుల్ని సైనికులు చంపారు. ఆ మర్నాడు మరో 104 మంది మాప్లాలు హతమయ్యారు. 14 గురు ఖైదీలుగా పట్టుబడ్డారు.

నీలాంబూర్‌కు పదిమైళ్ళ దూరంలోని పాండికట్ అనేచోట జరిగిన పోరాటంలో ఇద్దరు సైనికులు చని పోయారు. 25 రైఫిల్స్‌ను తిరుగుబాటుదార్లు స్వాధీన పర్చుకొన్నారు. నవంబర్ 28 న ఘూర్కా రెజిమెం ట్‌ను 2 వేల మంది రైతులు ఎదుర్కొన్నారు. ఘూర్కా సైనిక శిబిరాల్లోకి చొరబడ్డ 58 మంది రైతులు తిరిగి బయటికి రాలేదు. అక్కడ సైనికులు వారిని చంపివేశారు. మొత్తం 25 మంది రైతులను చంపివేశారు. ఒకడు ఖైదీ అయ్యాడు.

నవంబరు నెలాఖరుకు తిరుగుబాటు అణచివేయ బడింది. నవంబర్ 28 న 127 మంది మాప్లా ఖైదీలను తిరూర్ నుంచి బళ్ళారి జైలుకు పంపించారు. వీరం దరినీ ఒక గూడ్సు రైలు పెట్టెలో కుక్కారు. 18 అడుగుల పొడవు, 9 అడుగుల వెడల్పుగల పెట్టెలో ఇంత మందినీ కుక్కారు. గాలి లేదు. ఊపిరాడటం లేదు. తెగ ఉక్క, దాహమైనా చుక్క నీరులేదు. కాలికట్ నుంచి బళ్ళారి వెళ్ళేలోపల ఇందులో 56 గురు ఊపిరాడక చచ్చిపోయారు. చనిపోయిన వారి సంఖ్య 70 అని మరొక అంచనా.

కలకత్తా చీకటి కొట్టులో బ్రిటిష్ వాళ్ళను కుక్కి చంపాడని సురాజుద్దౌలా గురించి బ్రిటిష్ చరిత్రకారులు రాశారు, అదే చరిత్రను మన పాఠశాలల్లో కూడా పూర్వం బోధించారు. అది చదివిన బ్రిటిష్ విద్యార్థుల లోనేగాక, భారతీయ విద్యార్థులలో కూడ, వారి పసి హృదయాలలో అమానుష హత్యాకాండపట్ల ఏవగింపు కలుగుతుంది. కాని ఆ కథ నిజమా అబద్ధమా అని చరిత్రకారులు మధ్యే వివాదాంశంగా వుంది. కాని వాస్తవంగా జరిగిన యీ దురంతాన్ని భారతదేశం ఎన్నడూ మరచిపోలేదు. ఎన్నడూ క్షమించజాలదు.

1921 అ బరు 3 న తిరుగుబాటుదా ను విచారిం చడానికి ఏర మార్షల్‌లాసమ్మర్ కో 2830మంది మాప్లా రైతు ను విచారించింది. అ దులో 807 గురిని సెషన్సు కోర్టు విచారణకు పంపింది. ఒక్క కోయంబత్తూర్ జైలులోనే 200 మంది తిరుగుబాటు దార్లను ఉరితీశారు.

తిరుగుబాటు చేసిన మాప్లా రైతులకు గుణపాఠం చెప్పాలని సైనికులు చేసిన అమానుష కృత్యాలు హృదయ విదారకంగా వున్నాయి. మాప్లా స్త్రీలను అవ మానించారు. వారి శీలాన్ని దోచుకున్నారు. ఇళ్ళల్లో వున్న వృద్ధులను చితకబాదారు. ఇళ్ళను దోచుకొని తగలబెట్టారు. తిరుగుబాటు ఘటనలు జరగకుండా హామీగా స్త్రీలను కాన్సెంట్రేషన్ క్యాంపులలో నిర్బం ధించారు. ప్రజలను భయపెట్టడానికి చెట్లకొమ్మలకు తిరుగుబాటుదార్లను ఉరితీసి, వేలాడుతున్న శవాలను అలాగే వుంచారు గాంధీ, మహమ్మదలీ, షౌకతలీ సోదరులు కల్లోలిత ప్రాంతంలో పర్యటించుతామని అంటే ప్రభుత్వం వారికి అనుమతి నిరాకరించి,తిరుగు బాటును మారణహోమంతో అణచివేయడానికి నిశ్చ యించింది.

సుమారు 5 నెలలపాటు సాగిన మాప్లా రైతుల ప్రతిఘటన చివరికి ఓడిపోక తప్పలేదు. మాప్లా రైతుల తిరుగుబాటు ప్రధానంగా రైతుల హక్కుల కోసం సాగినా అక్కడక్కడా జరిగిన కొన్ని సంఘ టనలు హిందూ మత వ్యతిరేక స భావం తాల్చాయి. శాస్త్రీయ పద్ధతులలో లౌకికంగా తువర్గాలను నడి పించే నాయకత్వం లేకపోయింది. ధనిక ఆయుధ బలంలో సాంకేతికంగా వారి శత్రువైన బ్రిటిషు ప్రభు త్వానికున్న వనరులు మాప్లాలకు లేవు. మాప్లాలకు ఆయుధాలందే మార్గాలన్నిటినీ బ్రిటిషు సైనికులు మూసివేశారు. ఎక్కువ కాలం మాప్లాలు పోరాటం కొనసాగించటం భౌతికంగా అసాధ్యమైంది. మూడు వేల మంది మాప్లాలు చనిపోయారు. వేలాదిమంది గాయపడ్డారు. 50 వేలమంది మాప్లా రైతులు లొంగి పోయారు.

మాప్లా తిరుగుబాటు వైఫల్యానికి బ్రిటిషు సామ్రాజ్యవాద అనుకూల చరిత్రకారులు విపరీత వ్యాఖ్యానాలు చేయడంలో ఆశ్చర్యంలేదు. వాలంటైన్ చిరోల్ "బాగా వెనుకపడ్డ, అదుపుచేయ నలవికాని" మాప్లాలు, హిందువులకు బాగా బుద్ధి చెప్పారని సంబరపడ్డాడు, అంతేకాదు పంజాబులో అంతకుముందు రెండేళ్ళనాడు జరిగిన సంఘటనలను జ్ఞప్తికి తెస్తూ "ఈ సందర్భంలో మహమ్మదీయుల హిందువుల సౌభ్రాతృత్వం" లేనందుకు చంకలు గుద్దుకొన్నాడు. కొందరు మతోన్మాదుల దుశ్చర్యలకు హైందవులు గురైన మాట నిజమే. వారు నిస్పృహాయంతో విభ్రాంతి చెందిన మాట కాదనలేము. మౌఢ్యంతో బరితెగే దశకు వచ్చినపుడు, ఉద్రిక్తత కట్టలు తెగి విచక్షణాజ్ఞానం నశించినపుడు, మాప్లా తిరుగుబాటు

దార్లకు, హిందువులలో ఎవరు జమీందార్లో, ఎవరు భూస్వాములో, ఎవరు తమ రక్తాన్ని పీల్చే వడ్డీవ్యాపారులో, ఎవరు ప్రభుత్వ అనుకూలురో విడదీసి చూపే నిబ్బరంలేదు.

వీరికి పోటాపోటీగా ఆర్య సామాజికుల ప్రచారం సాగింది. మాప్లాలు చంపిన ఫొటోలు సంపాదించి హిందువులపై జరిగిన ఘోరకృత్యాలంటూ ప్రచారం చేశారు. అంతేగాని ఉరితీయబడిన మాప్లా రైతుల ఫొటోలుగాని, అత్యాచారాలకు గురై శీలం పోగొట్టుకొన్న, అవమానాలకు గురైన స్త్రీల ఫొటోలుగాని, వీరెక్కడా ప్రదర్శించలేదు. వీరి ప్రవర్తన ప్రభుత్వ దమనకాండకు సహాయపడింది.

1921 సెప్టెంబరులో, కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ కార్యవర్గం మాప్లా తిరుగుబాటు గురించి చర్చించి ఇలా తీర్మానించింది.

"మలబారులోని కొన్ని ప్రాంతములలో జరిగిన మాప్లాల దౌర్జన్య కార్యములకీ సభవారు చింతిల్లుతున్నారు. భారతదేశ ప్రజలింకను కాంగ్రెస్, ఖిలాఫత్ సంఘముల సందేశమును సరిగా అర్థము చేసికొననట్లు ఋజువు అవుతున్నది. కాబట్టి కాంగ్రెస్, ఖిలాఫత్ ప్రచారకు లందరును, ఆసేతు హిమాచల పర్యంతమును గల భారతదేశములో ఎట్టి ఆగ్రహకారణము లున్నప్పటికి ప్రజలు అహింసా సిద్ధాంతమునే అవలంబించేటట్లుగా ప్రచారము చేయవలెను."

ఇంతేగాక "కార్యవర్గమువారి దగ్గరనున్న సాక్ష్య సాధనములనుబట్టి, మాప్లాలకు సహింపరానంత కోప కారణము కల్పింపబడినదనీ, ప్రభుత్వము వారి పక్షమున తయారు చేయబడి, వారిచే ప్రకటింపబడిన నివేదికలు పక్షపాత భూయిష్ఠములుగానూ, మాప్లాల తప్పిదముల గూర్చి అతిశయోక్తులతో నిండినదిగానూ ఉన్నవనీ, ప్రభుత్వమువారు శాంతిభద్రత అనే నెపముతో అనవసరముగా ప్రజలను సంహరించిన విషయము వాటిలో తగ్గించి వ్రాయబడినదనీ, ఈ సభవా రభిప్రాయపడుతూ మాప్లాల పక్షమున జరిగిన దౌర్జన్యములను నిరసిస్తున్నారు."

[డా. భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి కాంగ్రెస్ చరిత్ర, మొదటి భాగము 303 వ పేజీ]

అదే తీర్మానంలో హిందువులను బలవంతంగా మహమ్మదీయులలో కలుపుకొనబడిందని విని, కాంగ్రెస్ కార్యవర్గం విచారం వ్యక్తం చేసింది. అలాంటి ఘటనలను మూడుచోట్ల మాత్రమే జరిగినవని స్ప ం చేసింది, "ప్రభుత్వము వారును, తదితర స్వా పరులను చెప్పే మాటలను విశ్వసింపకూడదని" కూ కాంగ్రెస్ కార్యవర్గం స్పష్టం చేసింది. కాంగ్రెస్, ఖిలాఫత్ ఉద్యమాలను నిషేధించిన చోటనే ఈ అల్లర్లు జరిగాయని కూడా కార్యవర్గం తీర్మానించింది.

యాకూబ్ హుస్సేన్ అనే మలబార్ నాయకుడు మాప్లా రైతుల దుర్భర పరిస్థితులను వివరించుతూ, ఈ తిరుగుబాటు గురించి, గాంధీకి ఒక లేఖ రాశాడు. అందులో 'ఏ హిందువుకాని, ముస్లింకాని, క్రిష్టియన్ కాని ఆ పరిస్థితులలో ఆత్మరక్షణకోసం, తన క్షేమానికి ఏమి చేయాలో అదే మాప్లా రైతు కూడా చేశాడు' అని రాశాడు.

'యంగ్ ఇండియా' పత్రికలో గాంధీ కొన్ని వ్యాసాలు రాశాడు. ఒకదానిలో యాకూబ్‌హుస్సేన్ చెప్పిన పై వాక్యాలను విమర్శించుతూ "మలబారులో మాప్లాలు తమ హిందూ సోదరులపై గావించిన పనులకు హిందువులు దుఃఖిస్తారనీ, ఏ పరిస్థితులలోనైనా ఎంత రెచ్చగొట్టినా, బలవంతంగా మతం మార్పిడి చేయించడం న్యాయమని చెప్పలేము" అని గాంధీజీ, యాకూబ్ హుస్సేన్‌కు జవాబుగా రాశాడు. 1921 అక్టోబరు 21న యంగ్ ఇండియాలో రాసిన మరో వ్యాసంలో "మాప్లా తిరుగుబాటు హిందూ మహమ్మదీయు లిద్దరికీ పరీక్ష" అనీ, "బలవంతంగా మతాంతరాలను చేయటం, దోపిడీ చేయడం మొదలైన మాప్లా చర్యలకు మహమ్మదీయులు సహజంగా సిగ్గుపడి తల వంచుకోవాలి" అనీ అన్నాడు. మాప్లా తిరుగుబాటుకు ముందు ఫిబ్రవరిలో సి. రాజగోపాలాచారి, యం. డి. యాకూబ్ హుస్సేన్‌లు కేరళలో అహింసా సందేశాన్ని వ్యాపింప చేయడానికి వెళ్ళారు. యాకూబ్ హుస్సేన్ తానా రాష్ట్రంలో వున్నంతకాలం సహాయ నిరాకరణోద్యమం గురించి మాట్లాడనని బహిరంగంగా ప్రకటించాడు. ఈ విషయాన్ని ఈ సందర్భంలో గుర్తుంచుకోవాలి.

గాంధీజీ ఇలాంటి వ్యాఖ్యానాలు చేసినప్పటికీ, "మాప్లాలు సాహసోపేతులనీ, భగవంతుడంటే భయ పడేవారనీ" అన్నాడు. ఇందుకు ఆయన బహిరంగ విమర్శలకు గురయ్యాడు. "గాంధీ - అరాచకం" అనే పుస్తకంలో సర్ శంకరన్ నాయర్ నిశిత విమర్శ చేశాడు. మద్రాసు శాసన సభలో ప్రభుత్వంతో సహక రిస్తున్న శాసన సభ్యులు "ఎంతకాలం షౌకత్ అలీ మహ్మద్ అలీ సోదరుల యొక్క మందుగుండులా పేలే ఉద్రిక్తపూరిత ఉపన్యాసాలను అనుమతించు తారు" అని పరికితనంతో ప్రశ్నించారు.

మలబారుకు గాంధీవెంట వస్తున్న ఆలీ సోదరులను వాల్తేరు స్టేషనులో అరెస్టుచేసిన విషయాన్ని ఈ సంద ర్భంగా గుర్తుంచుకోవాలి. మాప్లా తిరుగుబాటు ప్రారంభకాలంలో ఆ ఉద్యమాన్ని ఆపివేయవలసిందిగా గాంధీ ఎక్కడా సూచించలేదు.

మలబారులో గాంధీజీ అనుయాయులైన కాంగ్రెసు వాదులు తమ సహజ పద్ధతిలో ఉద్యమ తీవ్రతను శాంతింపచేయడానికి, చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. ఇందుకు ఉదాహరణ నారాయణ మీనన్. ఈయన మొదట రైతు ఉద్యమ నాయకుడు. ఆ ఉద్యమం నుండి విడివడి పూర్తిగా సహాయ నిరాకరణోద్య మంలో నిమగ్నుడైన ప్రసిద్ధ గాంధీవాది. మలబార్ అంతటా కాంగ్రెసు సంఘాలు స్థాపించిన వ్యక్తి. మాప్లా రైతులను శాంతపర్చడానికి వెళుతున్నఆయనకు ప్రభుత్వం ప్రత్యేక అనుమతిపత్రం ఇచ్చింది. తమ పోరాటాన్ని ఆపి లొంగిపోవలసిందిగా ఆయన ఇచ్చే సలహాలు విని ఒక రైతు నాయకుడు ఇలా జవా బిచ్చాడు. "మీ రెందుకు వచ్చారో ఆ విషయం రైతులకు తెలిస్తే, మీ ప్రాణాలకు ముప్పు కలుగు తుంది. మీరు వెళ్ళిపోండి" అని ప్రార్థించాడు.

నారాయణమీనన్ తాను నమ్మిన పద్ధతిలోనే ప్రచారంచేసి నిరపాయకరంగా మలబారునుండి బయ టికి వెళ్ళాడు.

తమ పబ్బం గడవగానే నారాయణమీనన్‌ను కూడా ప్రభుత్వం అరెస్టు చేసింది. మొదట ఆయన్ని "స్టేట్ ఖైదీ" గా నిర్బంధించింది. 1922 లో ఆయన్ని రాజ ద్రోహం నేరం కింద విచారించి, యావజ్జీవ శిక్ష విధించింది. పన్నెండేళ్ళ శిక్ష అనుభవించాక 1934లో గాని, ఆయన్ని విడుదల చేయలేదు. వల్లువనాడు తాలూకాకు మూడేళ్ళవరకు వెళ్ళనని హామీ ఇస్తే, ఆయన అంతకుముందే విడుదలయ్యేవాడు. కాని ఆయన అందుకు నిరాకరించి శిక్షను అనుభవించాడు.

ఇంతకూ నారాయణ మీనన్ గురించి ఇంత వివరంగా ఎందుకు ప్రస్తావించవలసి వచ్చిందంటే, ఈయనే స్వయంగా మాప్లా తిరుగుబాటుదారులు మతపరమైన ఉద్దేశ్యంతో హిందువులపై దాడి చేయడం జరగలేదని స్పష్టం చేశాడు. కొన్నిచోట్ల అలాంటి సంఘటనలు చెదురుమదురుగా జరిగినపుడు, దోపిడీలు జరిగినపుడు వారిని తీవ్ర శిక్షలకు గురిచేశారు. ఒక్కొక్కప్పుడు అలాంటివారిని చేతులు నరికి తీవ్రంగా శిక్షించిన ఘట నలు కూడా ఉన్నాయి. లూటీ చేసిన వస్తువులను తిరిగి యజమానులకు అప్పచెప్పించారు. ప్రభుత్వ వ్యతి రేకులైన హిందువులను అవమానించలేదు. అనేకచోట్ల బీద హైందవ రైతులు కూడ మాప్లా తిరుగుబాటు దారులతో చేరారు.

తిరుగుబాటుదార్లను అప్రతిష్ఠపాలు చేయడానికి ప్రభుత్వమే హిందువుల ఇళ్ళపైన, దేవాలయాల పైన దాడులు జరిపిందని, కున్హా అహ్మద్ హాజీ అనే తిరుగు బాటు నాయకుడు మద్రాసు నుండి వెలువడుతున్న "హిందూ" పత్రికకు ఒక లేఖ రాశాడు.

మలబారు బ్రాహ్మణుల పత్రిక "యోగక్షేమ" 1922 జనవరి 6న ఇలా రాసింది. "తిరుగుబాటుదారులచేతుల్లో ధనికులు, భూస్వాములు మాత్రమే బాధపడు తున్నారు. కాని బీద రైతులు కాదు."

ఇదివరలోనే ఉదహరించిన గవర్నమెంట్ పెన్షనర్ గోపాలనాయర్, అధికార దృక్పథాన్ని సమర్థిస్తూ రాసిన పుస్తకంలో సైతం ఇలా అన్నాడు:

"పరిశ్రమలో మాప్లాతో ఎవ్వరూ పోటీ చేయ లేరు, సామాన్య జీవితంలో అతని మంచి ప్రవర్తన హర్షించ దగింది. హిందువులు ఈ తిరుగుబాటులో సహాయ పడినట్లు ఎన్నో ఉదాహరణలు వున్నాయి. కాని అవి స్వల్పమే. ఉద్యమ స్వభావాన్ని మార్చే టంతగా అవి జరగలేదు."

డబ్ల్యు. సి. స్మిత్ అనే చరిత్రకారుడు రాసిన ఈ క్రింది వాక్యాలు గమనించ దగ్గవి.

"ప్రస్తుతం రైతులు పూర్తిగా మేల్కొల్పబడ్డారు. పురాణ కథలలోని అద్భుత దృశ్యాలను ఊహించుకొని గాఢావేశంతో తమ స్వంత ఖిలాఫత్ రాజ్యం ఏర్ప

రచుకోడానికి వారు ప్రారంభించారు. చివరికి కనీసం అక్కడైనా స్వేచ్ఛను పొందుతామని భావించారు. వారు తమను అణచిపెట్టి వుంచేందుకు నియమింప బడిన పోలీసులను, సైనికులను ఎదుర్కొన్నారు. తమ భూస్వాములను, వడ్డీ వ్యాపారులను ఎదుర్కొన్నారు. కనిపించిన ప్రతివారినీ ఎదుర్కొన్నారు. కొద్ది కాలం తమ ప్రాంతాన్ని క్రోధావేశపరులైన వారు తమ స్వాధీనంలో వుంచుకొన్నారు. మాప్లాలు కఠినంగా వున్నారు. హిందువులకు, బ్రిటిష్‌వారికీ వ్యతిరేకంగా, కఠినంగా వున్నారు. తమకు దారిద్ర్యాన్ని మాత్రమే ప్రసాదించిన ప్రపంచంపట్ల కఠినంగా వున్నారు. వారి ఉత్సాహం తమ శత్రువులకు వ్యతిరేకంగా, పీడితవర్గం ప్రదర్శించిన ఉత్సాహం. పాపాన్ని నాశనంచేసి, మంచిరాజ్యాన్ని నెలకొల్పే మతోద్రేకంతో కూడిన ఉత్సాహం."

మాప్లా తిరుగుబాటు స్వభావాన్ని హింస- అహింస అనే కొలబద్దతో చూసినా బోధపడదు. హిందూ ముస్లింఅనే మత దురభిమాన ఆవేశంతో చూసినా అర్థంకాదు. "హిందువులు సైనికులద్వారా మాప్లా ఇళ్ళను మసీదులను తగలబెట్టించి పగతీర్చుకుంటు న్నారు" అని యాకూబ్ హుస్సేన్‌లాంటి స్థానిక నాయకులే ఈ విషయంలో పొరబడ్డారు. హిందువులుగా ఉండటం తటస్థించిన భూస్వాముల్ని మాప్లా రైతులు ఎదుర్కొన్నారనీ, ఆ భూస్వాములు తిరిగి రైతులపై పగ తీర్చుకొన్నారనీ యాకూబ్‌హుస్సేన్ అనివుంటే ఈ సంఘర్షణ స్వభావం బోధపడేది.

మలబార్ రైతు ఉద్యమచరిత్ర గురించి 1943 ప్రాంతంలో ఇ. ఎమ్. ఎస్. నంబూద్రిపాద్ రాసిన మాటల్లో చెప్పాలంటే - కొన్ని సందర్భాలలో మత వైషమ్యం, మతమౌఢ్యం ప్రదర్శింపబడినా "ఈ తిరుగుబాటు ముఖ్యశక్తి మతమౌఢ్యం, మతోద్రేకం కాదని ఎవరైనా స్పష్టంగా చెప్పవచ్చు."

# నాన్ కోపరేషన్ - గాంధీ శకం

నాన్ కోపరేషన్ ఉద్యమాన్నే సహాయ నిరాకరణ ఉద్యమం అనీ, అసహాయ ఉద్యమం అనీ పిలిచే వారు. గాంధీ నాయకత్వాన ఈ ఉద్యమం ప్రజలను ఎలా ఉత్సాహపరచి పరవళ్ళు తొక్కించిందీ, ఆయన రాజకీయ జీవితంలో తొలిదశలోని కొన్ని అంశాలను గుర్తుపెట్టుకుంటేనేగాని, ఆనాడు తిరుగులేని రాజకీయ నాయకుడుగా ఎలా ఆయన రూపొందినదీ అర్థం చేసుకోలేము.

గాంధీ 1869 అక్టోబరు 2న కథియవాడ్ సంస్థానంలోని పోర్‌బందరులో జన్మించాడు. 1891లో ఇంగ్లాండ్‌లో బారిష్టర్ అయ్యాడు. 1893లో దక్షిణాఫ్రికాకు వెళ్ళి అక్కడ రెండు దశాబ్దాలకు పైగా నివసించాడు. అక్కడ "శ్వేత" జాతి ప్రభుత్వం వలన వచ్చిన ప్రజలపై సాగించుతున్న జాత్యహంకార, జాతివివక్ష విధానాలకు వ్యతిరేకంగా పోరాటం నడిపాడు. నేటాల్ ఇండియన్ కాంగ్రెసును స్థాపించాడు. 'ఇండియన్ ఒపీనియన్' (భారతదేశ అభిప్రాయం) అనే పత్రికకు సంపాదకత్వం వహించాడు. దక్షిణాఫ్రికాలో స్థిరపడిన ఆసియావాసుల హక్కులను అక్కడి ప్రభుత్వం హరించుతున్నప్పుడు 1906, 1908 లలోఅహింసాయుత "సత్యాగ్రహం" సాగించాడు అనేకసార్లు జైళ్ళకు, అమానుష అవమానాలకు గురిఅయ్యాడు. కేవలం వ్యక్తిగతంగా ఆత్మగౌరవానికి భంగం కలగడమేకాక, తన సోదర భారతీయులను అవమానించడం, చూసి సహించలేక అసమ్మతి తెలియజేశాడు. భారతజాతి గౌరవాన్ని సమష్టిగా సంరక్షించుకోవాల్సిన అవసరం ఏర్పడింది. దక్షిణాఫ్రికా ప్రభుత్వం అవలంబించిన జాతి వివక్ష విధానానికి నిరసనగా 1913 లో నేటాల్ రాష్ట్రంలోని న్యూ కాజిల్ నుంచి ట్రాన్స్‌వాల్ సరిహద్దు గుండా భారతీయుల జైత్రయాత్రను నడిపాడు. సత్యాగ్రహులను ప్రభుత్వం నేటాల్‌కు పంపివేసేది. తిరిగి వారు ట్రాన్స్‌వాల్ వెళుతుండేవారు. చివరకు సత్యాగ్రహులను భారతదేశానికే పంపించి వేయడం మొదలుపెట్టింది. నిజానికి కొంతమంది భారతీయులకు

ఇక్కడ ఇల్లంటూ లేనేలేదు. వారేనాడో దక్షిణాఫ్రికాలో స్థిరపడ్డారు. ఈ చర్యకు భారతదేశంలో తీవ్రమయిన అలజడి కల్గింది. చివరకు భారతీయ కాంట్రాక్టు కార్మికుల్ని నేటాలుకు పంపడం నిషేధించింది. భారతీయుల్ని తమతో కలవకుండా వేరే ప్రదేశాలలో ఉంచి, బానిసలుగా చూస్తూ, వారిని దోపిడీ చేస్తున్న "తెల్లవాళ్ళ" కు పై తంఇది రుచించలేదు. ఈ ఉద్యమం చాలా సంవత్సరాలు నడిచింది. గాంధీ, ఆయన అనుచరులు అనేక పర్యాయాలు జైళ్ళకు పోయారు.

1913 లో సుప్రీంకోర్టు ఇచ్చిన ఒక తీర్పులో క్రిష్టియన్ పెళ్ళిళ్ళు మాత్రమే చట్టబద్ధమైనవని ప్రకటించింది. దీని ప్రకారం భారతీయస్త్రీలు ఉంపుడుకత్తెల స్థాయికి నెట్టివేయబడ్డారు. ఈ అమానుష అవమానాన్ని భారతీయ మహిళలు భరించలేక, సత్యాగ్రహ ఉద్యమంలోకి, వీరు కూడా చేరారు. గృహిణులుగా వంటింటి బానిసత్వాన్నేగాక "తెల్లవాళ్ళ" సంకెళ్ళను కూడా తుత్తునియలు చేయడానికి రణరంగంలోకి ఉరికారు.

ఇదే సమయంలో దక్షణాఫ్రికాలోని భారతీయ కార్మికులు, 3 పౌండ్ల పోల్ టాక్సుకు నిరసనగా ఎ. క్రిష్టఫర్ అనే క్రిష్టియన్ నాయకత్వాన సమ్మె చేస్తున్నారు. ఇదికూడా ప్రభుత్వానికి ఇరకాటం కల్గించింది.

న్యూ కాజిల్ బొగ్గు గనులలోని భారత కార్మికుల సమ్మెతో కూడా గాంధీకి సన్నిహిత సంబంధం ఉండేది. ట్రాన్సువాల్ కు వెళ్ళిన భారతీయ మహిళలకు కఠినశిక్ష విధించబడింది. న్యూ కాజిల్ బొగ్గు కార్మికులు 2 వేలమంది గాంధీతో కూడా యాత్రలో పాల్గొన్నారు మహిళలు చంకలో బిడ్డల్ని పెట్టుకొని ప్రయాణం చేశారు. ఈ యాత్రలో ద్దరు చనిపోయారు.

సరిహద్దు దాటగానే ట్రాన్స్ వాల్ లో వీరందరినీ అరె · చేశారు. కాలెన్ బాష్, హెన్రీ పోలక్ అనే తె వారు కూడా ఈ ఉద్యమంలో పాల్గొని జైలుకు ళ్ళారు. నేటాల్ అంతటా భారత కార్మికులు సమ్మె చేశారు. సమ్మెను క్రూరంగా అణచివేసి, బొగ్గుగనుల వద్దకు ఖైదీలను తీసుకువెళ్ళి, సాయుధులైన తెల్లవాళ్ళ అజమాయిషీక్రింద బలవంతంగా పని చేయించారు. వీళ్ళు పనిచేసేచోట్ల ముళ్ళ కంచెలు వేశారు. అదే సమయంలో యూరోపియన్ రైల్వే కార్మికులు సమ్మె చేస్తున్నారు. ఈ నల్ల, తెల్ల కార్మికులు ఏకమై, జాతి వివక్షకు తావులేకుండా పోరాడే అవకాశాన్ని గాంధీ చేయిజార విడిచాడు, 'తను వేసే ప్రతి అడుగూ శత్రువు పరిస్థితిని ఆలోచించి వేయడం సత్యాగ్రహి విధి' అని నమ్మిన గాంధీ, రైల్వే సమ్మెకు భారతీయుల తోడ్పాటును ప్రకటించేలేరని అన్నాడు.

భారతీయులపై జరుగుతున్న అత్యాచారాలకు ప్రపంచమంతటా నిరసనలు తెలియజేయడంతో ప్రభుత్వం లొంగిపోక తప్పిందికాదు. 1913 డిసెంబరులో భారతదేశ వైస్రాయి లార్డ్ హార్డింజ్ మద్రాసు సభలో, దక్షిణాఫ్రికా ప్రభుత్వ చర్యను తీవ్రంగా విమర్శించాడు. స్మట్సు ఒక విచారణ కమిషన్‌ను నియమించడానికి అంగీకరించాడు. నిష్పాక్షిక సభ్యులతో ఆ కమిషన్ ఏర్పడాలని కోరిన భారతీయుల కోర్కెను మాత్రం స్మట్సు అంగీకరించలేదు.

ఈ కమిషన్ పోల్‌టాక్సును రద్దు చేయాలనీ న్యాయశాస్త్రరీత్యా భారత వివాహిత స్త్రీలకు గల హోదాను పునరుద్ధరించాలనీ సలహా ఇచ్చింది. ఈ సలహాలను ప్రభుత్వం ఆమోదించింది. "ట్రాన్స్‌వాల్ ఇండియన్ పాస్ లా"(ట్రాన్సువాల్ లోకి భారతీయులు ప్రవేశించరాదనే చట్టం) కూడా రద్దు చేయబడింది. ఈ నిర్ణయాలు ప్రకటింపబడటానికి ముందే, ఇదివరలో ఒకసారి వాగ్దానభంగం చేసిన జనరల్ స్మట్సుతో తాత్కాలిక ఒడంబడికకు వచ్చారు. పోల్‌టాక్సు, భారతీయ వివాహిత స్త్రీల హోదాకు సంబంధించిన విషయాలపై కమిషన్ నిర్ణయం వచ్చేదాకా తానేమీ చేయలేననీ, సత్యాగ్రహ ఖైదీలను మాత్రం విడుదల చేస్తాననీ స్మట్సు హామీ ఇచ్చాడు. దీనికి బదులుగా సత్యాగ్రహాన్ని గాంధీ విరమించా లన్నాడు. గాంధీ అందుకు అంగీకరించాడు. గాంధీ అనుచరులు అనేక మంది స్మట్సు వాగ్దానంపట్ల సందేహాలు వెలిబుచ్చారు.

"అపనమ్మకం బలహీనత, బలహీనత లన్నిటినీ బహిష్కరించాలనే భావం సత్యాగ్రహంలో ఇమిడివుంది. శత్రువును నాశనం చేయడంగాక అతనిని తన

వైపు తిప్పుకోగల్గడమే (సత్యాగ్రహ భావం కొబట్టి) అపనమ్మకానికి తావులేదు." అని గాంధీ వాదించాడు.

గాంధీ తాత్కాలిక విజయం పొందాడు. దక్షిణాఫ్రికాలో జాతివివక్ష ఈనాటికీ కొనసాగుతున్నా, అది వేరే విషయం. 1913 నాటి ఘటనలు—సాహసం ఓపికతో కూడిన నాయకత్వం ఉన్నపుడు సాత్విక నిరోధక ఉద్యమానికి **(Passive resistance)** అవకాశాలున్నట్లు రుజువు చేశాయి. గాంధీ దక్షిణాఫ్రికాలో శ్వేత జాత్యహంకారులకు, బ్రిటిషు సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా భారతీయుల్ని ఆసియావాసుల్ని జాగృతం చేసిన పాత్రను శ్లాఘించాల్సి వుంది.

అబ్దుల్లా సేఠ్ వ్యవహారాలలో కోర్టులో వాదించడానికి బారిస్టర్‌గా గాంధీ దక్షిణాఫ్రికా వెళ్ళాడు. కో లో తలపాగా తీసివేయవలసిందిగా ఆజ్ఞాపించిన జ మాటలకు నిరసనగా కోర్టునుంచి బయటకు వ చ్చడు. నేటాల్ రాజధాని మారి బర్గ్. అక్కడ రైల్వేస్టేషన్‌వద్ద జాత్యహంకారుల ఆ మేరకు, రైలు పెట్టెలో మొదటి తరగతిలో కూ చ్చన్న గాంధీని మరో పెట్టెలోకి వెళ్ళ మ న్నా రు. గాంధీ తిరస్కరించాడు. గాంధీ సామాన్లను కింద పడవేసి, ఆయన్ని చేయిబట్టి కిందకు లాగిన తర్వాత రైలు కదలిపోయింది. తన చేతిలో ఉన్న సంచి మినహా మిగతా సామానును గాంధీ ముట్టుకోలేదు. రైల్వే అధికారులే జాగ్రత్త చేశారు. చలిలో ఓవర్‌కోట్ కూడా లేకుండా, రాత్రంతా స్టేషన్‌లో గడిపాడు. ఆ రాత్రి గాంధీ ఒక నిశ్చయానికి వచ్చాడు. ఆ నిశ్చయాన్నే ఆత్మకథలో ఇలా వివరించాడు.

"నా హక్కులకోసం పోరాడడమా ? లేక భారత దేశానికి తిరిగి వెళ్ళడమా ?....కార్యభారాన్ని నెరవేర్చకుండా భారతదేశానికి తిరిగివెళ్ళడం పిరికితనమనిపించుకొంటుంది. వర్ణవిభేదమనే ఘోరవ్యాధి ఇక్కడ ప్రబలిపోయింది. నాకు సంభవించిన ఇక్కట్లు ఈ వ్యాధికి బాహ్యచిహ్నం మాత్రమే. అవసరమైతే ఇలాంటి ఇక్కట్లను, ఎన్నిటినైనా భరించి, ఈ వ్యాధిని నిర్మూలించడానికి సాధ్యపడుతుందేమో ప్రయత్నం చేసి చూడాలి. జాతి విద్వేష నిర్మూలనకు, ఎంతవరకు అవసరమో, అంతవరకు వ్యక్తిగతంగా నాకు జరిగే అన్యాయాలను అరికట్టాలి."

ఇలాంటి కృత నిశ్చయంతో గాంధీ దక్షిణాఫ్రికాలో పని చేశాడు. మారిట్జ్‌బర్గు సంఘటన ఆయన కళ్ళు తెరచింది. దక్షిణాఫ్రికాలో సామాన్య ప్రజలతో ఆయన తాదాత్మ్యం చెందాడు. సరళ జీవితం సాగించాడు. అవమానాలు సహించాడు. దారిద్ర్యాన్ని భరించాడు. తన అనుచరులలో నిర్భీతిని ప్రబోధించాడు. దక్షిణాఫ్రికా సత్యాగ్రహంలో పాల్గొన్న వారిలో సామాన్య ప్రజలెందరో ఉన్నారు ఆ సత్యాగ్రహ వీరులలో కచ్చలియ్య, అడజానయ్య, నాగప్పన్, నారాయణస్వామి, వళ్ళియమ్మలున్నారు. ఆ విధంగా మట్టిలోంచి మాణిక్యాలను సృష్టించడానికి గాంధీ కారకుడయ్యాడు. అందుచేతనే, బోయర్ యుద్ధంలో గాంధీపాత్ర ఏమైనా, క్లిష్టమైన పోరాట సమయాల్లో అందర్నీ విస్మయపరిచే విధంగా, ఆయన రాజీలకు, ఉద్యమ విరమణలకు హఠాత్ నిర్ణయాలు తీసుకొన్నప్పటికీ, గాంధీ సేవాభావం, స్వాతంత్ర్యకాంక్ష, ఆత్మగౌరవం నిలబెట్టుకోవాలనే పట్టుదల, ఆయన్ని భారతీయుల దృష్టిలో ఉన్నత వ్యక్తిగా రూపొందించాయి.

1915 జనవరిలో గాంధీ భారతదేశానికి తిరిగివచ్చినపుడు, బొంబాయిలో ఘనస్వాగతం లభించింది.

గోఖ్లే సలహామేరకు, గాంధీ దేశమంతా పర్యటించాడు. రైలులో మూడో తరగతిలో పర్యటిస్తానని గాంధీ అన్నప్పుడు గోఖ్లే నవ్వాడు. ఐనా గాంధీ అలాగే పర్యటించాడు. గాంధీ ఒక ఆశ్రమం నెలకొల్పాలని నిశ్చయించుకొన్నపుడు, అనేక చోట్ల నుంచి ఆహ్వానాలు వచ్చాయి. ఐనా తాను జన్మించిన గుజరాత్‌లో అహమ్మదాబాదులోని కొచ్రాబ్‌లో 1915 మే నెలలో ఆశ్రమం స్థాపించాడు. దాన్ని తర్వాత రెండేళ్ళకు సబర్మతీనది వద్దకు మార్చాడు. ఈ ఆశ్రమంలో హరిజనులకు ఆశ్రయమిచ్చి, సనాతనుల ఆగ్రహానికి గురి అయ్యాడు. ఆశ్రమ జీవిత నియమాలలో సత్యం, అహింస, బ్రహ్మచర్యం, జిహ్వను అదుపులో పెట్టుకోవడం, దొంగతనం చేయకుండా ఉండటం, స్వంతం అనేది లేకపోవటం, మొదలైనవి. ఉన్నాయి స్వదేశీ, నిర్భీతికూడా ఈ నియమాల పర్యవసానంగా ఏర్పడ్డవే.ఆశ్రమవాసులు వివిధ ప్రాంతాల నుంచి వచ్చినా,సమష్టి జీవనం సాగించారు.ఈఆశ్రమానికి వివిధ వ్యక్తుల నుంచి అడగకుండానే నిధులు

వచ్చేవి. అంబాలాల్ సారాభాయ్ లాంటి మిల్లు యజమాని కూడా నిధిని ఇచ్చిన వాళ్ళలో ఉన్నాడు.

1915 జూన్ 3న బ్రిటిష్ చక్రవర్తి జన్మదిన సందర్భంగా టాగూర్‌కు నైట్‌హుడ్ (Knighthood) బిరుదు, గాంధీకి కైజర్-ఇ-హింద్ బంగారు మెడల్‌ను ఇచ్చారు. (జలియన్ వాలాబాగ్ దురంతాల తర్వాత వీటిని వీరిద్దరూ పరిత్యజించారు.)

అప్పటికి గాంధీ ఇంకా రాజకీయ నాయకుడిగా పరిగణింపబడలేదు. దక్షిణాఫ్రికాలోని తన ఉద్యమాన్ని నైతికమూ, సామాజికమూ అనే ఆయన భావించుతూ వచ్చాడు. కాంగ్రెస్ మహాసభలలో ఆయన పాల్గొంటూ వున్నా, దక్షిణాఫ్రికా భారతీయులకు మద్దతుగా తీర్మానాలను ప్రవేశపెట్టడం వరకే ఆయన పరిమితమైఉండేవాడు. అన్ని రాజకీయ ధోరణులకు, పార్టీలకు కాంగ్రెస్ "అనధికార పార్లమెంట్" అని ఆయన అభిప్రాయపడేవాడు.

1915లో బొంబాయి కాంగ్రెస్ మహాసభలో విషయ నిర్ధారణ సభకు గాంధీ ఎన్నుకోబడలేదు. అధ్యక్షుడు, తన ప్రత్యేకాధికారాన్ని వినియోగించి గాంధీని సభ్యునిగా నామినేట్ చేశాడు. "ఇది ఆనాడు జరిగిన యొక విచిత్ర సంఘటనము" అని పట్టాభిగారు రాశారు.

ఒకప్పుడు తన శిష్యునిగా భావిస్తున్న గాంధీని, సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ సభ్యునిగా చేర్చుకోవాలని సూచించాడు గోఖ్లే. ఈ సంఘం దృష్టిలో బ్రిటన్‌తో సంబంధం భారతదేశానికి మంచిదనీ, అందుకని దానినుండి విడిపడరాదనీ భావించేది. అలాంటి సంఘానికి కూడా గాంధీ అభిప్రాయాలు, వేషభాషలు విడ్డూరంగా కన్పించేవి. ఆధునిక నాగరికతను ఆయన నిరసించేవాడు. పార్లమెంటులు దాస్యచిహ్నాలనేవాడు. సామాన్య జీవితం, ఆహార పానీయాల్లో ఆయన అవలంబించే పద్ధతి, తరుచుగా ఆయన నిర్మొగమాటంగా ముక్కుకు సూటిగా మాట్లాడే పద్ధతి-ఇవన్నీ బహుశా ఆనాటి రాజకీయ నాయకులకు రుచించేవి కావు.

1916లో బెనారస్ హిందూ యూనివర్శిటీ శంకుస్థాపన ఉత్సవ సమయంలో ఆయన ఇచ్చిన ఉపన్యాసమే ఇందుకు నిదర్శనం. వైస్రాయి శంకుస్థాపన చేయాల్సివుంది. ఆ సభకు సంస్థానాధీశులు, విద్యాధికులు, రాజకీయవేత్తలు చాలామంది వచ్చారు. సంస్థానాధీశులు, రాజాలు అట్టహాసంగా ఆభరణాలతో తయారయ్యారు.

ఈ సంస్థానాధీశులకు ఈ క్రింది విధంగా చెప్పాలని భావిస్తున్నానని గాంధీ అన్నాడు:"మీరీ నగలునాణ్యాల్ని ఊడదీసి, భారత దేశంలోని మీ సోదరప్రజల సంక్షేమం కోసం నిధిగా ఏర్పర్చాలి. ఆపాదమస్తకం ఆభరణాలతో అలంకరించుకొని వస్తేనే గాని, మీ రాజభక్తిని, చక్రవర్తిగాని, లార్డ్‌హార్డింజ్ (వైస్రాయి)కిగాని చూపించిన కాదని వారు భావించడం లేదని నేననుకుంటున్నా." అదే సభలో పోలీసు డిటెక్టివ్‌ల నియామకాన్ని కూడా గాంధీ తీవ్రంగా గర్హించాడు. ఆ సభకు అధ్యక్షత వహించిన అనీబిసెంట్ అనేకసార్లు గాంధీని కూచోవలసిందిగా ఆజ్ఞాపించవలసి వచ్చింది.

అదే సంవత్సరం ఫిబ్రవరి 14న ఇచ్చిన ఉపన్యాసం కూడా ఆనాటి నాయకులకు చురకలాంటిదే. - "ప్రజల తరపున మనం ప్రతినిధులం కావాలనుకుంటున్నాం. కాని విఫలమవుతున్నాం. ఇంగ్లీషు ఉద్యోగస్తులకీ, మనకీ తేడాలేదు. వారిదృష్టిలో....వారి ఆశయాలు మనవి కావు. అందుచేతనే వారికీ మనకీ ఈ తేడా". భారతప్రజల దారిద్ర్యాన్ని గురించీ, స్వయంసమృద్ధి గురించీ గాంధీ మాట్లాడాడు. "ఇదంతా బుద్ధి మాలినదని నాన్సెన్స్) అని కొట్టివేయవచ్చు. కాని ఒక దయాళువ ముసల్మాన్ దాహంకోసం తపించే హిందువుకు మంచినీరు పోస్తానంటే, తాగకుండా గొంతులెండబెట్టుకోడం నాన్సెన్స్, ముసల్మాన్ ఇంట్లో నీరు తాగడం కంటే, చావడం మేలనే వేలాది హిందువులున్నారు. ఈ బుద్ధిమాలిన ప్రజలకే, తమ దేశంలో తయారు చేసిన దుస్తులు ధరించాలనీ, తన దేశంలో పండించిన పంట తినాలనీ వారి మతం కోరుతున్నదనీ, వారిని ఒప్పించగలిగితే వారు ఏ పరాయి దుస్తులను ధరించరు. ఇతర ఏ ఆహార పదార్థాలను భుజించరు" అని గాంధీ అన్నాడు.

ఇవన్నీ వింతగా తోచాయి. అసాధ్యమయినవిగా కన్పించాయి. పరస్పర విరుద్ధంగా కన్పించాయి. అందుచేతనే ఆనాటి జవహర్‌లాల్ నెహ్రూలాంటి యువకులకు ఆయన "చాలా దూరపు మనిషిగా, మరో తరహా వ్యక్తిగా, రాజకీయాలకు దూరమైనవాడు"గా కన్పించాడు.

ఐతే బ్రిటిష ప్రభుత్వానికి గాంధీ పూర్తిగా ఆనాడు కాకపోయినా కొద్ది సంవత్సరాలకే అర్థమయ్యాడు. 1919లో ప్రకటించిన ఒక ప్రచురణలో గాంధీని గురించి ఇలా ఉంది :

“అణచబడిన వారని ఆయన (గాంధీ) భావించిన ఒక వ్యక్తి లేక తరగతి తరపున నిలబడి పోరాడటానికి ఆయన సంసిద్ధత, దేశప్రజల మన్ననకు పాత్రమైంది”.

దక్షిణాఫ్రికా సత్యాగ్రహ అనుభవాన్ని పురస్కరించుకొని, భారత దేశంలో సాగించిన తొలి సత్యాగ్రహ ఘటన, స్వల్పవిషయం మీద జరిగింది.

1915 జనవరిలో భారతదేశానికి తిరిగి వచ్చినపుడు తన బంధువుల్ని చూడటానికి గాంధీ, రాజకోట, పోర్‌బందర్‌లకు వెళ్ళాడు. అక్కడ ప్రజలు వీరంగం సుంకాల (కస్టమ్స్) వల్ల కలిగిన బాధలను ఆయనకు తెలియచేశారు. “మీరు జైలుకు వెళ్ళటానికి సిద్ధమేనా?” అని గాంధీవారినడిగాడు. వాళ్ళు తమ సంసిద్ధతను తెలియజేశారు. ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి, సత్యాగ్రహం అవసరమైతే చేస్తానని చెప్పి, చివరకు వైస్రాయితో మాట్లాడి సుంకాలను రద్దు చేయించాడు.

1917లో భారతీయ వలస చట్టానికి వ్యతిరేకంగా గాంధీ కావించిన ఆందోళన, దానికి ప్రజల తోడ్పాటు ఫలితంగా, ఆ చట్టం ఉపసంహరింపబడింది.

## చాంపరాన్ సత్యాగ్రహం

త గాంధీ సాగించిన పెద్ద ఉద్యమం చాంపరాన్ తాంగ సత్యాగ్రహం. ఉత్తరబీహార్‌లో నీలిమం తోట యజమానులకు వ్యతిరేకంగా రైతాంగం సాగించిన పోరాటం. బీహార్‌లోని పశ్చిమోత్తర దిశగా ఉన్న జిల్లా చాంపరాన్. 19వ శతాబ్దం ప్రారంభంలో యూరోపియన్ తోట యజమానులు, జమీందార్ల భూములను, ఇతర భూములను కౌళ్ళకు తీసుకొని నీలిమందు పండించేవారు. రుణాలతో సతమతమవుతున్న బెట్టియా మహారాజునుంచి ఎక్కువ భూముల్ని కౌలుకు తీసుకున్నారు. రైతుల భూముల్ని కూడా తీసుకొన్నారు. కౌలు భూములలోనేగాక, ప్రక్కనున్న రైతులు కూడా తమ భూములలో కొంత భాగాన్ని నీలిమందు పండించే ఏర్పాటు చేయించారు. పరిపాలించేది తమవాళ్ళే గనుక ఈ పద్ధతిని నిర్బంధంగా ఆ తర్వాత కొనసాగించారు. ఈ నీలిమందు పండించే పద్ధతికి “తీన్‌కీ తియా”లేక మూడు ‘కొట్టాల’ పద్ధతి అనేవారు. 20 వంతుల బీగా భూమిలో మూడు (కొన్ని చోట్ల ఐదు) వంతుల భూమి నిర్బంధంగా నీలిమందు పండించాలి.

1859-61 సంవత్సరాలలో బెంగాల్లో రైతులు ఇలాంటి నిర్బంధ విధానానికి వ్యతిరేకంగా పోరాడి నీలిమందు తోట యజమానులపై విజయం సాధించారు. కాని బీహార్‌లో మాత్రం ఆ నిర్బంధం తప్పలేదు. రైతులకు నష్టంవచ్చినా నీలిమందు పండించాల్సిందే. ఇదీగాక కృత్రిమ రంగులను కనిపెట్టడంతో నీలిమందు వ్యాపారం తగ్గిపోయింది. తోట యజమానులకుకూడా నష్టంరావడం మొదలైంది. ఆ నష్టాన్ని రైతులపై రుద్దడానికి తోట యజమానులు ఒక పన్నాగం పన్నారు. రైతులు నీలిమందు పంట మానివేయవచ్చు. కాని శాశ్వత కౌలుకు తీసుకున్న భూములలో, భూఖామందులకు గాక, దఖారీలుగా వున్న తోట యజమానులకు ఎక్కువ శిస్తు చెల్లించాలి. ఇందుకు వారు బలవంతంగా రైతులచే ఒడంబడిక పత్రాలపై సంతకాలు చేయించుకొన్నారు. శాశ్వత కౌలు వర్తించని గ్రామాలకు సైతం నీలిమందు పండించే షరతులు వర్తించకపోయినా 12 లక్షల రూపాయలను బుకాయించి వసూలు చేశారు. రైతులకు కోర్టులకెక్కే సాహసంలేదు. పైగా అధికారులంతా తోటయజమానుల కొమ్ముకాసేవారే. హిందువులైన రైతులను ముర్గీఖానాలలో బంధించడం, పశువుల్ని బందిలిదొడ్లలో పెట్టించడం, ఇండ్లను దోయడం, సాంఘిక బహిష్కారం, అంటరానివాళ్ళుగా పరిగణింపబడుతున్న వారిని గుమ్మాలవద్ద కూర్చోబెట్టడం మొదలైనవి చేసేవారు. ఇంతేగాక సివిల్ క్రిమినల్ అధికారాలన్నీ తోట యజమానులే చెలాయించేవారు. వాళ్ళు రైతులపై విధించే పన్నులు విచిత్రంగా వుండేవి. యాభైరకాల పన్నులను వీళ్ళు వసూలుచేసేవాళ్ళు. పెళ్ళికి పన్ను, పొయ్యికి పన్ను, గానుగకు పన్ను, తెల్లదొరగారికి జబ్బుచేసి కొండమీద కాపురం పెట్టుకొంటే, దానికీ రైతులమీదే పన్ను. అలాగే ఆయన గుర్రంకొన్నా, ఏనుగు కొన్నా, కారుకొన్నా, రైతే పన్నుచెల్లించాలి.

ఈ పరిస్థితులను లక్నో కాంగ్రెస్‌లో గాంధీకి కొందరు వివరించారు. గాంధీ వారి కష్టనివారణకు

ఉద్యమించాడు. ఆ రోజుల్లో "హోమ్ రూల్" ఉద్యమం తీవ్రంగావుంది. తోట యజమానుల సంకెళ్ళనుంచి చాంపరాన్ రైతుల్ని విడిపించడం నిజంగా "హోమ్ రూల్"ను ఏర్పరుస్తుందని, గాంధీ అన్నాడు. 1917 ఏప్రిల్‌లో చాంపరాన్ జిల్లా ముఖ్య పట్టణమైన మోతీహారీకి గాంధీ వెళ్ళాడు. అక్కడ నుంచి మరో గ్రామం వెళుతుండగా, జిల్లా విడిచిపెట్టి వెళ్ళిపోవాలని అధికారులు నోటీసు జారీచేశారు. కాని ఆ ఉత్తర్వులను ఉల్లంఘించి, మేజిస్ట్రేట్ ముందు, ముద్దాయిగా నిలబడి, తాను నేరంచేసినమాట నిజమేనంటూ పె వాఙ్మూలం ఇచ్చాడు. ఇలా కోర్టులలో పెద్ద వాఙ్మూలాలు ఇవ్వడం ఆరోజుల్లో చాలా కొత్త. ప్రభుత్వం వరకు ఆయనపై కేసు ఉపసంహరించుకుంది. గాంధీ 20 వేలమంది రైతుల వాఙ్మూలాలను తీసుకొన్నాడు. వీటి ఆధారంగా ఒక విజ్ఞాపన పత్రం తయారు చేశాడు. చివరకు ప్రభుత్వం విచారణ సంఘాన్ని నియమించింది. అందులో రైతులు, తోట యజమానులు, ప్రభుత్వ ప్రతినిధులు, రైతు ప్రతినిధులు వున్నారు. రైతు ప్రతినిధిగా గాంధీ వున్నాడు. ఈ విచారణ సంఘ సూచనలమేరకు, కౌళ్ళ రేట్లు తగ్గించడానికీ, రైతులనుంచి అన్యాయంగా వసూలు చేసిన సొమ్ములో కొంత వాపస్ చేయడానికీ - ఈ విచారణసంఘం తమ నివేదికలో సిఫార్సు చేసింది. ఆ నివేదిక సిఫార్సులను ఒక చట్టంగా ప్రభుత్వం రూపొందించింది. నిర్బంధంగా నీలిమందు పండించవలసిన పద్ధతి నిర్మూలించబడింది

ఈ ఉద్యమంలో మజహర్ ఉల్ హక్, బ్రిజకిశోర్ ప్రసాద్, రాజేంద్రప్రసాద్, జె. బి. కృపలానీ, మహదేవ్ దేశాయ్ లాంటి గట్టి కార్యకర్తలు గాంధీకి అండగా నిలిచారు. ఆ తర్వాత వీరు కాంగ్రెస్ నాయకులుగా రూపొందారు.

1907-1909 నాటినుంచి రైతులు తోట యజమానులపై అనేక పోరాటాలు సాగించారు. అవి పూర్తిగా అహింసాయుతంగా సాగలేదు. గాంధీ తమ పక్షాన దృఢంగా నిలబడతాడనే విశ్వాసం కలగగానే, ఆయన వెంట రైతులు నిలబడ్డారు. భారతదేశంలో 1917 లో వున్న పరిస్థితులలో రాజేంద్రప్రసాద్ అన్నట్లు, ఈ ఉద్యమాన్ని కేవలం బలప్రయోగంతో బ్రిటిష్ అధికారులు అణచివేయలేక పోయారు. వంద సంవత్సరాలుగా నికృష్ట దారిద్ర్యాన్ని, తోట యజమానుల దోపిడి దౌర్జన్యాలను ఎవరూ నిర్మూలించలేకపోయారు. కాని ఈ ఆందోళనతో చాంపరాన్ రైతులకు విజయం లభించింది. చాంపరాన్ సత్యాగ్రహంతో గాంధీ కీర్తి మరింత విస్తృతమైంది.

చాంపరాన్ సత్యాగ్రహం తర్వాత చెప్పుకోతగింది ఖేడా సత్యాగ్రహం. గుజరాత్‌లోని కైరా జిల్లాలో 1918 లో పంటలు పండక క్షామ పరిస్థితులు ఏర్పడ్డాయి. ఐనా భూమి శిస్తుల్ని పూర్తిగా వసూలు చేయాలని రెవిన్యూ అధికారులు పట్టుబట్టారు. పంట నాలుగవ వంతుకు తక్కువ పండింది కాబట్టి శిస్తు ముజరా ఇప్పించాలని రైతుల వాదన. తక్కువకాదు, ఎక్కువే పండిందని అధికారుల మొండిపట్టు. శాసన సభ్యులు రైతుల పక్షాన విజ్ఞప్తులు పంపారు. ఇతర విధాల చేసిన విజ్ఞాపనలు కూడా ఫలించలేదు. సత్యాగ్రహం చేయవలసిందిగా రైతులకు గాంధీ సలహా ఇచ్చాడు. వారు శిస్తు చెల్లించడానికి నిరాకరించారు. దానివల్ల కలిగే ఫలితాలన్నిటికి సంసిద్ధమయ్యారు. భూముల్ని విడిచి పెట్టడానికి కూడా సిద్ధమయ్యారు. పేదరైతులకు శిస్తు ముజరా ఇస్తే, తాము పన్నులు చెల్లిస్తామని కూడా ధనికరైతులు తెలిపారు. ఈ సత్యాగ్రహ సందర్భంగా ప్రజలలో అద్భుత చైతన్యం కలిగింది. మొ మొదటి సారిగా ప్రభుత్వ పన్నుల విధానాన్నే ప్రశ్నించగల హక్కు తమకున్నదని తెలుసుకొన్నారు. అ కారులు ప్రజాసేవకులేగాని తమపై పెత్తందార్లు కాదనికూడా వారికి తెలిసివచ్చింది. ఈ సత్యాగ్రహంలోనే ఇందులాల్ యాజ్ఞిక్, గాంధీ ముఖ్య అనుచరుడు అయ్యాడు. నిర్బంధ విధానం, జప్తుల బెదరింపులు పనిచేయలేదు. చివరకు ప్రభుత్వం లొంగిరాక తప్పలేదు. వల్లభ్‌భాయిపటేల్ అప్పుడు అహమ్మదాబాద్‌లో బారిష్టరుగా ఉండేవాడు. ఖేడా సత్యాగ్రహ విజయంతో ఆకర్షితుడై, గాంధీకి సన్నిహితుడయ్యాడు. గాంధీ ముఖ్య అనుచరుడుగా మారాడు. ఈ సత్యాగ్రహ సందర్భంలోనే శాసనోల్లంఘన ఘటనలు కొన వచ్చాయి. న్యాయవిరుద్ధంగా ఒక పొలాన్ని జప్తు చేయగా, ఆ పొలంలోని ఉల్లిమడిని తీసివేయవలసిందిగా తన అనుచరులకు గాంధీ ఆదేశించాడు. మోహన్‌లాల్ పాండ్యా ఆధ్వర్యాన రైతులు ఆ పనిచేయగా ప్రభుత్వం వారికి చిన్న ఖైదు శిక్షలు విధించింది. ఈ

దెబ్బతో ప్రజలకు జైలు భయం పోయింది. వీరంతా విడుదల కాగానే ప్రజలు ఉత్సాహంగా వీరిని ఊరేగించారు.

ఖేడా సత్యాగ్రహం రైతులకు సంపూర్ణ విజయం కానిమాట నిజమే. రాజీ చేసుకున్నట్లు కనపడకూడదని ప్రభుత్వం తలచింది. శిస్తు మినహా కొద్దిమంది రైతులకే కలిగింది. ఐనప్పటికీ ఈ సత్యాగ్రహం ప్రజల రాజకీయ చైతన్యాన్ని పెంపొందించింది. ఖేడా ఉద్యమం మూలంగా గుజరాత్‌లో సత్యాగ్రహం వేరు నాటుకొన్నదని, గాంధీ ఆత్మకథలో పేర్కొన్నాడు.

## అహమ్మదాబాద్ మిల్లు కార్మికుల సమ్మె

1918 ఫిబ్రవరి, మార్చి నెలలలో అహమ్మదాబాదులో జౌళి కార్మికులు సమ్మె చేశారు. కార్మికులకిచ్చే దినసరి బోనస్ విషయమై వివాదం ఏర్పడింది. 1916 నుంచి కార్మికుల మధ్య విద్యా ప్రచారం చేస్తున్న శ్రీమతి అనసూయా బెన్‌సారాభాయి ఈ వివాదంలో గాంధీ సలహాను కోరింది. మధ్యవర్తిత్వ పరిష్కారానికి కార్మికులను గాంధీ ఒప్పించాడు. గాంధీ, వల్లభ్‌భాయిపటేలు మధ్యవర్తులు మధ్యవర్తిత్వ సమాచారం అందని కార్మికులు కొందరు సమ్మెకు దిగారు. గాంధీ విచారం ప్రకటించి, కార్మికులు యిందుకు పరిహారం యివ్వాలని కోరాడు. మధ్యవర్తులు యింకా పనిచేయడం ప్రారంభించకముందే, మిల్లు కార్మికులు లాకౌట్ ప్రకటించారు. 16 రోజుల తర్వాత మిల్లులు తెరిచారు. అపుడు కార్మికులు 50 శాతం వేతనాలు పెంచాలని సమ్మె చేశారు. గాంధీ మిల్లు యజమానుల లాభాలు, ప్రజల జీవిత వ యం, మిల్లు ఉత్పత్తి ఖర్చుల పెరుగుదల మొద నవన్నీ లెక్కకట్టి 35 శాతం పెరుగుదలకు -ర్మికులను ఒప్పించాడు. "న్యాయంగా కార్మికులకు కనీస వ్యయానికి కావలసిన సొమ్ము మాత్రమే, వి- యజమానుల నుంచి జీతంగా తీసుకోవాలని" కారి కులలో ప్రచారం చేయబడింది. ఈ విషయాన్ని ంగ్రెస్ చరిత్రకారుడు డాక్టర్ పట్టాభిగారే స్వయంగా ఉదహరించారు. ఐనప్పటికీ మిల్లు యజమానులు మొండిగా వేతనాలు పెంచేందుకు నిరాకరించారు. 20 శాతంకన్నా పెంచబోమన్నారు. ఫిబ్రవరి 22 వ తేదీన కార్మికుల్ని మి యజమానులు వెళ్ళగొట్టారు. కార్మికులకు సమె తప్ప గత్యంతరంలేదు. గాంధీ కూడా వారి పక్ష నిలబడక తప్పలేదు. ఆ సమ్మె నడుపుటకు గాంధీ కొన్ని షరతులు పెట్టాడు. ఆ షరతులు ఇవి :

"ఎన్నడూ హింసకు దిగరాదు. సమ్మె భగ్నం చేసే దొంగ కూలీలపై చేయి చేసుకోకూడదు. భిక్ష మెత్తుకోరాదు. సమ్మె ఎంత కాలం సాగినా గట్టిగా నిలబడాలి. సమ్మె కాలంలో గౌరవప్రదమైన ఏ యితర పద్ధతి ద్వారానైనా తిండి సంపాదించుకోవాలి."

కార్మికులు యీ షరతులను అంగీకరించారు. తమ షరతులంగీకరించేంత వరకు, లేదా మధ్యవర్తిత్వానికి యజమానులు అంగీకరించే వరకు పనికి వెళ్ళబోమని కార్మికులు శపథం చేశారు "ప్రమాణాన్ని నిలబెట్టండి" అని వీధులవెంట నినాదాలు చేశారు. అనేక చిన్నా పెద్ద సభలు జరిగాయి. కార్మికులకు అర్థమయ్యే వాడుక భాషలో గాంధీ రాసిన కరపత్రాలను కార్యకర్తలు పంచారు.

గాంధీ సూచించిన మార్గంలో సమ్మెను భగ్నం చేసే దొంగకూలీలను అరికట్టేందుకు మార్గం లేకపోయింది. ప్రజలనుంచి సమ్మె నిధిని కూడా పోగుచేయలేదు. వల్లభ్‌భాయిపటేల్ మొదలైనవారి సహాయంతో సబర్మతీ ఆశ్రమ భవన నిర్మాణానికి కొందరు కార్మికుల్ని తరలించినా, ఈ సమస్య అంతటితో పరిష్కారం కాలేదు. లూయీఫిషర్ ఆనాటి పరిస్థితుల్ని ఇలా తన గ్రంథంలో వివరించాడు :

"సమ్మె చాలరోజులుగా కొనసాగుతూ వుంది. సభలకు కార్మికులు హాజరవడం తగ్గింది. ప్రతిరోజూ ప్రతిజ్ఞను పునశ్చరణ చేయవలసిందిగా, గాంధీ కార్మికుల్ని అడిగినపుడు, వారి జవాబులో దృఢత్వం అంతగా కన్పించలేదు. కొన్ని మిల్లులలో దొంగ కూలీలు పనిచేస్తున్నారు. గాంధీ హింస ప్రజ్వరిల్లుతుందని భయపడ్డాడు. ప్రతిజ్ఞలు నిలవడంలేదనీ, కార్మికులు మిల్లులకి వెళ్ళిపోతారనీ గాంధీ భయపడ్డాడు."

15 రోజులదాకా కార్మికులు ఎలాగో సమ్మె కొనసాగించారు. పస్తులు పడివుండటం కష్టమైపోయింది. ఈ విషయాన్ని గాంధీకి తెలియజేశారు. ఇంతకన్నా తీవ్రరూపంలో సమ్మె కొనసాగించాల్సి వుంటుందని

కార్మికులు ఆలోచించసాగారు. కార్మికులు తమ ప్రతిజ్ఞ నెరవేర్చుకొనేంతవరకు, తాను భోజనం చేయననీ, ఎలాంటి వాహనం ఉపయోగించననీ గాంధీ ప్రకటించాడు. దీని అర్థం ఆమరణ నిరాహారదీక్షయే. నైతిక ఉద్దేశంతోనే ఈ నిరాహారదీక్ష సాగిస్తున్నానని గాంధీ అన్నాడు. గాంధీ ఇదివరలో నిరాహారవ్రతాలు చేసినమాట నిజమే. కాని భారతదేశంలో ప్రజల ఆశయం కోసం సాగించిన మొదటి నిరాహార వ్రతం ఇదే.

ఇది మిల్లు యజమానులపై ఒత్తిడి తేవడం అని కొందరు విమర్శించారు. తమకి ఇష్టం లేకుండా మిల్లు యజమానులు లొంగిపోతే ఈ విమర్శ కొంత సబబే నని గాంధీ అన్నాడు. కార్మికులు గాంధీని ఉపవాసం మానవలసిందిగా కోరారు. దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి నాయకులు మిల్లు యజమానులకు గాంధీ గురించి, తమ ఆందోళన వ్యక్తంచేస్తూ టెలిగ్రాము లిచ్చారు "భారతదేశం కొరకు లొంగిపోయి, గాంధీ ప్రాణాలు రక్షించండి" అని అనీబిసెంట్ తంతి నిచ్చింది మూడురోజుల ఉపవాస అనంతరం మిల్లు యజమానులు వివాదాన్ని మధ్యవర్తి పరిష్కారానికి అంగీకరించారు మధ్యవర్తి నూటికి 35 వంతులు బోనస్ యివ్వాలని తీర్పు యిచ్చాడు.

ఈ విజయం కూడా గాంధీ ఆశించిన నైతిక ప్రమాణాలను అందుకోలేదని, ఆయన ఆ తర్వాత వెలిబుచ్చిన అభిప్రాయాల్నిబట్టి తెలుతుంది.

"కార్మికులు తమ యజమానుల హృదయాలను తమవైపు తిప్పుకోలేకపోయారు. వారు అహింసా యుతంగా ఉన్నమాట నిజమే. వారు అలా ఉండటం నిజంగా మెచ్చదగిందే."

కార్మికుల న్యాయబద్ధమైన పోరాటాన్ని సాగించుటలో గాంధీ అవలంబించిన పద్ధతి, తక్షణం ప్రజలకు నచ్చుతుందనీ, సమరశీల చర్యలకు కార్మికులు దిగకుండా ఆపుతుందనీ మిల్లు యజమానులు అర్థం చేసుకొన్నారు. కార్మికుల ఓర్పుకు ఒక హద్దు ఉంటుందనీ, ఆ హద్దు దాటిపోయే ప్రమాదం ఉందనీ గ్రహించిన గాంధీ నిరాహార వ్రతానికి ఉపక్రమించాడు. ఒక సామాజిక సంఘర్షణ ఉత్పన్నమైనప్పుడు, ఆయా వర్గాల ప్రవర్తన ఏమిటో గాంధీ తెలుసుకోగల్గినా, బాధితులైన కార్మికులే మరింత అహింసాయుతంగా ప్రవర్తించాలని గాంధీ భావన. అదే తన ఉపన్యాసాల్లో వ్యక్త పరచాడు.

గాంధీ అనుసరించిన పద్ధతులేమైనా ఆయన అవలంబించిన సత్యాగ్రహ పద్ధతులు గ్రామీణ, పట్టణ కార్మిక, బీద ప్రజలతో కూడ ఆయన్ని సన్నిహితుణ్ణి చేశాయి. చాంపరాన్ సత్యాగ్రహం గురించి గాంధీ ఇలా అన్నాడు

"నేను చేసింది సామాన్యమైన విషయం. నా స్వంత దేశంలో బ్రిటిషువాళ్ళు నన్ను శాసించలేరని నేను ప్రకటించాను."

భారతీయులు తమ కాళ్ళపై తాము నిలబడి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పొందాలనే చైతన్యం రగల్చడంలో ఈ సత్యాగ్రహాలు జయప్రదమయ్యాయి. ఇంతవరకూ కాంగ్రెస్ నాయకులు ప్రజల కష్టాల గురించి విషయ సేకరణ చేశారు. వాటి నివారణకై బ్రిటిషు అధికారుల ముందు తిరుగులేని వాదనా పటిమ ప్రదర్శించారు, ఐనా కాంగ్రెస్, పట్టణాల్లోని క్రింది మధ్యతరగతి, మధ్యతరగతి, మేధావులకు మాత్రమే పరిమితమైంది. గాంధీ రాకతో జాతీయోద్యమంలో ప్రజలు పాలు పంచుకోవడం ప్రారంభమైంది. గాంధీ గ్రామీణ ప్రజలతో వేషభాషల్లో తాదాత్మ్యం చెందాడు, వారి జీవన సరళిని తానూ అవలంబించాడు. వారికి అర్థమయే భాషలో మాట్లాడాడు. హిందూ ముస్లిం ఐక్యత, అస్పృశ్యతా నివారణ' మహిళల సాంఘిక స్థితి ఉద్ధరణ కోసం పాటుపడితే తప్ప దేశానికి విముక్తి లేదని భావించాడు. తాను కలలు గనే భావి భారతదేశం గురించి గాంధీ ఇలా వర్ణించాడు :

"అందరికన్నా అతి బీదవాళ్ళు సైతం ఈ దేశం తమ దేశమని భావించాలి. ఆ దేశ నిర్మాణంలో వాళ్ళ వాణి కూడా వినపడాలి. పై తరగతి కింది తరగతి ప్రజలు అనే భేదం ఉండరాదు. అన్ని కులాల మతాల వారు పరిపూర్ణ సామరస్యంతో జీవించాలి.—ఇవన్నీ ఉండే భారతదేశంకోసం నేను కృషి చేస్తాను.... అలాంటి భారతదేశంలో అస్పృశ్యతకు తావు లేదు.... పురుషులకుండే హక్కుల్ని లు కూడా అనుభవిస్తారు.... ఇదీ నేను కలలు గ భారతదేశం."

ఇలాంటి లక్ష్యాలతో రాజకీయ రంగంలో ప్రవేశించి, పంజాబు దురంతాలకు చలించి, ఖిలాఫత్ ఉద్యమ

సందర్భంగా ముస్లిం ప్రజలతో సంఘీభావం నెరపి, బ్రిటిషు ప్రభుత్వం ప్రకటించిన మాంటేగ్ - చెలమ్స్ ఫర్డ్ సంస్కరణలను అమలు పరచాలనే సానుకూల ధోరణిని ప్రదర్శించిన గాంధీయే తుదకు సహాయ నిరాకరణోద్యమానికి ప్రారంభించవలసి వచ్చిన సంఘటనలు, పరిస్థితులు ఏమిటో తెలుసుకొందాం :

1905 లో రష్యా పై జపాను విజయం సాధించినపుడు, ప్రాచ్య ఆసియాయులు విదేశీయులపై విజయం సాధించగలరనే విశ్వాసం భారతీయుల్లో కల్గింది. అలాగే 1917 లో లెనిన్ నాయకత్వాన రష్యాలో జార్‌చక్రవర్తి నిరంకుశ పాలనను తుదముట్టించడం. మరో రకంగా భారతీయులకు ఉత్తేజాన్నికల్పించింది. రష్యాలోని అన్ని జాతుల వారికీ స్వయంనిర్ణయాధికారమూ జార్ సామ్రాజ్యాంతర్గత భాగంలోని దేశాలపై అధికారాన్ని సోవియట్ యూనియన్ వదలుకోడమూ వీరికి ఉత్సాహాన్ని ఇనుమడింప చేసింది, ఇందుకు భిన్నంగా యుద్ధానంతరం పాశ్చాత్య దేశాలు, తాము మొదట చేసిన వాగ్దానాలను కాలదన్ని వాటిని నీటిమూటగా చేశాయి.

ప్రపంచ పరిస్థితులను గమనిస్తున్న బ్రిటిష్ ప్రభుత్వం ఒక చేత్తో సంస్కరణలు, మరోచేత్తో సంకెళ్ళు పుచ్చుకొని జాతీయోద్యమాన్ని దెబ్బగొట్ట జూచింది.

1917 మేలో వైస్రాయి చెలమ్స్‌ఫర్డ్, భారత దేశంపట్ల బ్రిటిష్ విధానం మార్చుకోవలసిన ఆవశ్యకత అత్యవసరంగా ఉందని తెలియచేశాడు. అదే సంవత్సరం ఆగష్టు 20 న భారతదేశంలో బాధ్యతాయుత ప్రభుత్వానికి గల భూమికను సన్నద్ధం చేయడానికిగాను భారతదేశంపట్ల బ్రిటిష్ ప్రభుత్వ విధానాన్ని గురించి ఒక రిపోర్టును మాంటేగ్ (సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా) ఆగస్టు 20 న ప్రకటించాడు. ఈ ప్రకటనకు అనుగుణంగా మాంటేగ్ చెలమ్స్‌ఫర్డ్‌లు తయారు చేసిన నివేదికను 1918 జూలైలో ప్రకటించారు. ఇందులోని అంశాలు ఆ తర్వాత 1919 లో ఆమోదించబడిన ఇండియా చట్టంలో ఇమడ్చబడ్డాయి. వీటినే మాంటేగ్ చెలమ్స్‌ఫర్డ్ సంస్కరణలు అంటారు. వీటి మూలంగా భారతీయులకు ఇదివరకటి కన్నా ఎక్కువ బాధ్యతలను, ఎక్కువ స్వేచ్ఛనూ ఇచ్చామని బ్రిటిషువాళ్ళ వాదన. కాని ఇదెవరినీ సంతృప్తి పరచలేదు. ఈ సంస్కరణలు "ఇంగ్లండు ఇవ్వదగినంత గౌరవ ప్రదంగాను, ఇండియా పుచ్చుకునేటంత గౌరవప్రదంగానూ లేవు" అని అనీబిసెంట్ అన్నది. 1918 ఆగస్టులో బొంబాయిలో జరిగిన కాంగ్రెస్ ప్రత్యేక సమావేశం ఈ సంస్కరణలు "పూర్తిగా ఆమోదకరమైనవి కావు" అని తీర్మానించింది. తిలక్ కూడా "ఇది పూర్తిగా ఆమోదయోగ్యం కానిది" అన్నాడు. ఈ సంస్కరణలనే బ్రిటిష్ ప్రభుత్వం "ద్వంద్వ పరిపాలన" అన్నారు. పరిపాలనా నిర్వహణలో భారతీయులకు బ్రిటిష్‌వారికి అధికారం వుంటుందని అన్నది, నిజానికి ఇది బ్రిటిష్ వాళ్ళ ఏక పరిపాలనేకాని, ద్వంద్వపాలనకాదని భారతీయులు ఎక్కువ మంది అభిప్రాయ పడ్డారు. గాంధీ మొదట ఈ సంస్కరణలపట్ల అనుకూలంగా వున్నా రౌలట్ బిల్లులు చట్టమవడంతో గాంధీ ఓర్పు నశించింది. రౌలట్ చట్టాన్ని "మార్చన మారుస్తాను, లేదా హతమార్చనన్నా హతమారుస్తాను" అని గాంధీ అన్నాడు ఈసారి ఇది పరిమిత లక్ష్యంతో సాగిన స్థానిక ఉద్యమం కాదు. "ఈ సైతాను ప్రభుత్వంతో ఏ రూపంలోగాని, ఏ పద్ధతిలోగాని సహకరించినా అది పాపమే" అన్నాడు గాంధీ, స్వాతంత్ర్య ఉద్యమానికి ముస్లింప్రజలు ఆ ఉద్యమంలో పాల్గొనడం అవసరమనీ, హిందూ ముస్లిం ఐక్యత లేనిదే ఆ ఉద్యమం పటిష్ఠం కాదనీ భావించిన గాంధీ, ఇదివరకే ఖిలాఫత్ ఉద్యమంతో సన్నిహిత సంబంధాలు పెట్టుకొన్నాడు. 1919 నవంబరులో ఢిల్లీలో జరిగిన ఖిలాఫత్ కాంగ్రెసుకు గాంధీ హాజరయ్యాడు. ఆ మహాసభలోనే "సహాయ నిరాకరణం" గురించి ప్రసంగించాడు.

"బ్రిటిష్ వాళ్ళు (మనదేశానికి) ఎగుమతి చేస్తున్న వస్తువుల్ని బహిష్కరించితే చాలదు. బ్రిటిష్ స్కూళ్ళను బ్రిటిషు కోర్టులను, బ్రిటిషు పదవులను, బ్రిటిషు వాళ్ళిచ్చిన బిరుదులను, బహిష్కరించాలి, సహాయ నిరాకరణం చేయాలి."

"ఈ సహాయ నిరాకరణ" ఉద్యమాన్నే "అసహాయోద్యమ" మనికూడా పిలిచేవారు. "నాన్‌కోపరేషన్ మూవ్‌మెంటు" కూడా తెలుగు పదంలా వ్యాప్తి చెందింది.

సహాయ నిరాకరణ ఉద్యమం గురించి. తుది నిర్ణయం జరిగేలోగా కొన్ని పరిణామాలు జరిగాయి. బ్రిటిషు ప్రభుత్వం మాంటేగ్ - చెలమ్స్‌ఫర్డ్ సంస్కరణలను ప్రవేశపెట్టింది. ఈ సంస్కరణలు అసంతృప్తి కరంగా వున్నా, అమలు జరపాలని గాంధీ అన్నాడు. అమృత్‌సర్ కాంగ్రెస్ మహాసభలో దీనిపై తీవ్ర చర్చలు జరిగాయి. సహాయ నిరాకరణ ఉద్యమం గురించి నవంబరులో ప్రస్తావించిన గాంధీ, డిసెంబరులో ఈ సంస్కరణలను అమలుపరచి, బ్రిటిష్ ప్రభుత్వంతో సహకరించడానికి సిద్ధమయ్యాడు. 1921 ఫిబ్రవరి 9 నాటికి ఈ సంస్కరణలు భారత దేశ నూతన రాజ్యాంగంగా చట్టం చేయబడింది.

అమృత్‌సర్ కాంగ్రెస్ జరిగిన మూడు నెలల్లోనే గాంధీ తన అభిప్రాయాల్ని మార్చుకొనేటట్లు దేశ పరిస్థితులు ఒత్తిడి చేశాయి. అమృత్‌సర్ కాంగ్రెస్ కోరినట్లు రౌలట్ చట్టం ఉపసంహరింపబడలేదు. పంజాబు దురంతాలకు కారకుడైన కిరాతక హంతకుడు డయ్యర్‌ను శిక్షించకపోగా, అతనికి బ్రిటన్‌లో నిధి సమర్పణ జరిగింది. 1920 ఏప్రెల్‌లో హోం రూల్ లీగ్‌కు అధ్యక్షుడైన గాంధీ, ఆ లీగ్ సభా సూత్రాన్ని మార్పించాడు. దానికి "స్వరాజ్య సభ" అని పేరు పెట్టాడు ఈ సందర్భంగా కాంగ్రెస్ చరిత్రలో డాక్టరు పట్టాభి సీతారామయ్యగారి వాక్యాలను ఉదహరించడం అవసరం—

"అసలు నిజమేమిటనగా, కలకత్తా ప్రత్యేక కాంగ్రెసులో అసహాయోద్యమ తీర్మానమంగీకరింపబడునో, లేదో అని సందిగ్ధతలో నున్న సమయమున గాంధీ హోమ్ రూల్ సభ్యులందరినీ ఒకచోట చేర్చి హోమ్ రూలు సభా సూత్రమును మార్పించి, దానికి "స్వరాజ్య సభ" అని నామకరణ మొనర్చెను "

ఐతే కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్ "నాన్‌కోపరేషన్" తీర్మానాన్ని ఆమోదించింది. ఈ విధంగా హోమ్ రూల్ లీగ్, ఖిలాఫత్ ఉద్యమం, కాంగ్రెస్ అన్నీ కూడా సహాయ నిరాకరణ (నాన్‌కోపరేషన్) ఉద్యమానికి సర్వసన్నద్ధ మయ్యాయి.

1920 జూన్‌లో గాంధీ సలహాతో నాన్‌కోపరేషన్ విధానాన్ని ఖిలాఫత్ ఉద్యమం ఆమోదించింది. దాన్ని ఆధారం చేసుకొని వైస్రాయికి రాసిన లేఖలో గాంధీ "నేను ముస్లిం స్నేహితులను మీకు సపోర్టును ఉపసంహరించవలసిందిగా కోరాను. హిందువులను కూడా వారితో కలవవలసిందిగా సలహా ఇచ్చాను" అన్నాడు.

1920 ఆగస్టు 1 న నాన్ కోపరేషన్ ప్రారంభమౌతుందని గాంధీ ప్రకటించాడు. అంతకు ముందు రోజున అంటే జూలై 31 న ప్రార్థనలు, ఉపవాసాలు జరుగుతాయని చెప్పాడు.

ఐతే దురదృష్టవశాత్తు తిలక్ 1920 ఆగస్టు 1 న చనిపోయాడు. తిలక్ నిర్యాణంతో గాంధీ తిరుగులేని నాయకుడయ్యాడు. దామరాజు పుండరీకాక్షుడుగారు రచించిన పద్యం ఆనాటి స్వాతంత్ర్య పిపాసుల మనోభావాల్ని ప్రతిబింబించుతుంది.

"తతి గాంధీయుగ మేగుదెంచె, ఇక యేతత్ భారతీయ స్వరా
జ్య రథంబాతని సారథిత్వముననే సాగించుడంచున్ జగ
ద్గురు దేగెన్ దివి లోకమాన్యు, డవె యుద్ఘోషించు తూర్యధ్వనుల్
ఉరుతద్దివ్య రధంబు లాగుటకు రండో భారతీయ ప్రజల్ ।"

## కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్

కలకత్తాలో ప్రత్యేక కాంగ్రెస్ 1920 సెప్టెంబరు 4-9 తేదీల మధ్య జరిగింది. ఈ కాంగ్రెస్‌కు లాలా లజపతిరాయ్ అధ్యక్షత వహించాడు. మొదట బాల గంగాధర తిలక్ మరణానికి సంతాపం వెల్లడిస్తూ కాంగ్రెస్ మహాసభ తీర్మానించింది. మరో తీర్మానంలో పంజాబు దురంతాల గురించి విచారించడానికి బ్రిటిష్ ప్రభుత్వం నియమించిన హంటర్ కమిటీ నివేదికను జాతిద్వేషం, పక్షపాత వైఖరులతో కూడి వుందని ఖండించింది. "బ్రిటిష్ న్యాయంలో భారతీయులు పూర్తిగా విశ్వాసం కోల్పోయా"రని ఈ తీర్మానం పేర్కొన్నది. మరో తీర్మానంలో పంజాబు దురంతాల పట్ల అధికారుల ప్రవర్తన పేర్కొని "బ్రిటిష్ మంత్రి వర్గం భారత్ విశ్వాసం కోల్పోయింది " అని ప్రకటించింది. ఈ మహాసభలో ముఖ్యమైన నాన్‌కోపరేషన్ తీర్మానాన్ని గాంధీ స్వయంగా ప్రతిపాదించాడు. ఆ తీర్మానానికి అనుకూలంగా 1885 మంది, ప్రతికూలంగా 883 మంది ఓటు చేశారు.

తీర్మానానికి అనుకూలంగా గాంధీ మోతీలాల్ నెహ్రూ, ఖిలాఫత్ ముస్లిం నాయకులు షౌకదలీ మహమ్మదలీ సోదరులు ఉన్నారు. చిత్తరంజన్‌దాస్ శాసనసభల బహిష్కారానికి ప్రతికూలుడు. వాటిల్లో ప్రవేశించి వాటిని కూలద్రోయాలని ఆయన అభిప్రాయం. బిపిన్ చంద్రపాల్ జాగ్రత్తగా అడుగు వేయాలనే బాపతు. లజపత్‌రాయ్ యీ కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించినా, స్కూళ్ళ బహిష్కరణకు ఆయన వ్యతిరేకం. ఈ విషయంలో కొంత రాజీ జరిగింది. స్కూళ్ళు,కోర్టుల బహిష్కరణ క్రమక్రమంగా జరగాలన్నది రాజీపథకం. ఐతే శాసనసభకు నిలబడదలచిన అభ్యర్థులు తమ అభ్యర్థిత్వాన్ని ఉపసంహరించుకోవాలి. వోటర్లు వోటు చేయరాదు. కాంగ్రెస్ లక్ష్యం స్వరాజ్యమనీ, ఈ విషయాలన్నింటిపైనా నాగపూర్ కాంగ్రెస్‌లో తుది నిర్ణయం చేయాలనీ తీర్మానించబడింది. పంజాబు దురంతాలు, ఖిలాఫత్ అన్యాయాలను పేర్కొని "ఆ తప్పిదాలను సరిదిద్దుకొనేంత వరకూ స్వరాజ్యం స్థాపించబడే వరకూ మహాత్మాగాంధీచే ప్రారంభించబడిన అహింసాయుత సహాయ నిరాకరణ (నాన్ కోపరేషన్) ను క్రమక్రమంగా అవలంబించాలని తీర్మానించబడింది. ఆ తీర్మానంలోని ముఖ్యాంశాలివి—

"ఇంతవరకూ ప్రజాభిప్రాయానికి ప్రాతినిధ్యం వహిస్తున్న తరగతులవారు ఈ పనిని ప్రారంభించాలి. ప్రభుత్వం గౌరవ బిరుదులను ఇవ్వడం ద్వారా, పాఠశాలలు, శాసనసభలు, న్యాయస్థానాల మూలంగా తమ అధికారాన్ని బలపరచుకొంటూ వచ్చింది. ఇపుడు ప్రజలు సాధ్యమైనంత తక్కువ త్యాగంతో తక్కువ ప్రమాదం (Risk)తో ఉద్యమాన్ని నడిపి, తమ లక్ష్యాన్ని సిద్ధింప చేసుకునేందుకు కాంగ్రెస్ ఈ క్రింది కార్యక్రమాన్ని సూచించింది.

1) ప్రభుత్వ బిరుదులను, గౌరవోద్యోగాలను పరిత్యజించుట. స్థానిక సంస్థలనుంచి ప్రభుత్వంచే నామినేట్ చేయబడిన సభ్యత్వాలకు రాజీనామా చేయుట.

2) ప్రభుత్వాధికారుల చేతగాని, వారికోసం గాని ఏర్పాటు చేయబడిన దర్బార్లకు, సన్మానాలకు హాజరు కాకుండా వుండుట.

3) త్రివిధ బహిష్కారం (అ) అనగా ప్రభుత్వ పాఠశాలల నుంచి, ప్రభుత్వ సహాయం పొందుతున్న పాఠశాలల నుంచి పిల్లల్ని క్రమంగా మాన్పించడం, వాటి స్థానే జాతీయ పాఠశాలల్ని, కళాశాలల్ని నిర్మించడం. (ఆ) బ్రిటిష్ కోర్టులను లాయర్లు, వాద ప్రతివాదులూ క్రమంగా బహిష్కరించుట,వాటిస్థానే ప్రజల తగాదాలు పరిష్కరించేందుకు న్యాయవాదుల సహాయంతో గ్రామపంచాయితీలు స్థాపించుట. (ఇ) నూతన శాసనసభలకు ఎవ్వరూ అభ్యర్థులుగా నిలబడకూడదు, నిలబడినవారు ఉపసంహరించుకోవాలి. ఎవరైనా కాంగ్రెస్ తీర్మానానికి విరుద్ధంగా శాసనసభలకు అభ్యర్థిగా నిలిస్తే వారికి వోట్లు వేయరాదు.

ఇంకా విదేశవస్తు బహిష్కరణ, మెసపొటోమియాలో సైనికులుగా గాని, గుమాస్తాలుగా గాని పని చేయ నిరాకరించడం. దీనితోపాటు ప్రతి ఇంటా నూలు వడకడం, చేనేత ప్రవేశపెట్టడం కూడా యీ తీర్మానంలో వుంది. పన్నుల నిరాకరణకు గడువును భవిష్యత్‌లో నిర్ణయించడానికి తీర్మానించింది. "స్వరాజ్యం" ప్రకటించాలనీ, అందుకు తక్కువ ఏదీ సంతృప్తి కల్గించదనీ కాంగ్రెస్ ప్రకటించింది. గాంధీజీ సలహా మేరకు "సాధ్యమైతే సామ్రాజ్యాంతర్గత స్వరాజ్యాన్నే అంగీకరించుతాం. కాని అవసరమైతే, దానితో నిమిత్తం లేకుండానే స్వరాజ్యం కోరతాం" అని కాంగ్రెస్ తీర్మానించింది.

గాంధీ ప్రతిపాదించిన తీర్మానాన్ని డాక్టరు కిచ్లూ బలపరచాడు. బ్రిటిష్ ప్రధాని వద్దకు రాయబారం వెళ్ళాలనే ఈ తీర్మానానికి పెట్టిన సవరణ వీగిపోయింది.

సెప్టెంబరు 7 న విషయ నిర్ధారణ సభలో గాంధీ ఇలా అన్నాడు: "తన హక్కులు, గౌరవం గురించి నిరూపించేందుకు ఈ దేశం ఇప్పటివరకూ అవలంబించిన విధానంలో ఈ తీర్మానం మార్పు తీసుకువస్తుంది."

ఆ విధంగా కలకత్తా కాంగ్రెసు తీర్మానం మధ్య తరగతి వారిని, ఉద్యోగుల్ని,లాయర్లను, విద్యార్థుల్ని ఉద్యమంలోకి ప్రధానంగా ఆకర్షించింది. జన సామాన్యానికి రాట్నం వాడుకుట, నేత నేయడంలాంటి పనులకు పరిమితం చేసింది. పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని భవిష్యత్తులో చేపట్టుదామని వాగ్దానం చేయడంతో కింది తరగతి ప్రజలు, రైతులు,

కార్మికులు ఉద్యమంలో చురుకుగా పాల్గొనేందుకు వారికి అవకాశం ఇవ్వలేదు. నవంబరులో జరిగిన నూతన శాసనసభల ఎన్నికల బహిష్కారం స్పష్టంగా విజయవంతమైంది. మూడింట రెండువంతుల వోటర్లు ఎన్నికలలో పాల్గొనలేదు.

1920 డిసెంబర్ 26న నాగపూర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభ, కాంగ్రెస్ నిర్మాణ స్వభావ స్వరూపాలేన్నే మార్చివేసింది. 14,582 మంది ప్రతినిధులు హాజరయ్యారు. ఇందులో 1050 మంది ముస్లిములు, 169 మంది మహిళలు ఉన్నారు. ఈ మహాసభ కాంగ్రెస్ మౌలిక లక్ష్యాన్ని (Creed) మార్చివేసింది.

గతంలో "సామ్రాజ్యాంతర్గత వలసదేశ స్వపరిపాలన" అనే దానికి బదులుగా "శాంతియుత న్యాయబద్ధమైన సాధనాల ద్వారా స్వరాజ్యం స్థాపించడం"గా తన లక్ష్యాన్ని కాంగ్రెస్ మార్చింది. గతంలో కాంగ్రెస్ నిర్మాణం కట్టుదిట్టంగా ఉండేదికాదు. ఇపుడు దాన్ని ఆధునిక పార్టీగా రూపొందించింది. దాని శాఖ అన్ని గ్రామాలకు సైతం విస్తరించబడ్డాయి. 15గురితో వర్కింగ్ కమిటీని, 350 మందితో ఆలిండియా కమిటీని, రాష్ట్ర సంఘాలను, జిల్లా పట్టణ తాలూకా, గ్రామ సంఘాలను ఏర్పరచింది. వర్కింగ్ కమిటీ సంవత్సరం పొడువునా ఆయా సమస్యలపై నిర్ణయాలు తీసుకొంటుంది. మరీ ముఖ్య విషయాల్ని చర్చించవలసి వచ్చినపుడు అఖిల భారత కాంగ్రెస్ కమిటి (ఎ. ఐ. సి. సి.) సమావేశమవుతుంది. వర్కింగ్ కమిటీ నిర్ణయాల్ని చర్చించేందుకు, అవసరమైతే ఆ ని యాలు తిరగదోడేందుకు, దీనికి అధికారంవుంది.

- 9 సంఘాల్ని భాషాప్రయుక్త రాష్ట్రప్రాతిపదిక పై ఏర్పడాలి. గ్రామ కాంగ్రెస్‌కు 5 గురికి తక్కువగా ఉండాలి. ఫిర్కా, తాలూకా, జిల్లా శాఖలుంటాయి. 50 వేలమందికి ఒక ప్రతినిధి చొప్పున కాంగ్రెస్ మహాసభకు ప్రతినిధి ఎన్నికవుతాడు. సభ్యత్వం నాల్గణాలు మాత్రమే కొన్ని సమయాల్లో కాంగ్రెస్ లక్ష్యాలు అంగీకరించితే చాలు సభ్యుడు కావచ్చు. 18 ఏళ్ళ వయస్సు వచ్చినవారంతా సభ్యులు కావచ్చునని 1921 లో నియమావళిలో మార్పు తెచ్చింది. నాగపూర్ కాంగ్రెస్ నియమావళితో కాంగ్రెస్. గ్రామీణ ప్రజల చేరువయ్యింది.

నాగపూర్ కాంగ్రెస్‌లోని ఉపన్యాసాలు. తీర్మానాలు బ్రిటిష్ ప్రభుత్వంపట్ల గతంలోవలె మర్యాద ప్రదర్శన చేయలేదు. విధేయతను ప్రకటించలేదు. "ఏది ఏమైనా బ్రిటిష్ ప్రభుత్వంతో సంబంధమనేది శాశ్వతమని భావించడం జాతీయ ఆత్మగౌరవానికి భంగకరం" అని భావించారు "బ్రిటన్‌తో సంబంధం మా జాతీయ ఆత్మగౌరవంతో పొసగని పక్షంలో దాన్ని నాశనం చేయడం మా విద్యుక్త ధర్మం" అనే నిశ్చయానికి వచ్చారు.

"మిమ్మల్ని ఖైదీలుగా నిర్బంధించే జైలుగోడల్ని మీరుపటిష్టం చేయకూడదు. మీచేతులకు వేసే సంకెళ్ళను మీరే తయారు చేయవద్దు" అంటూ గాంధీచేసిన విజ్ఞప్తి ప్రజలకు ఉత్సాహాన్ని రేకెత్తించింది. అహింసాయుతంగా సహాయ నిరాకరణ చేసినట్లయితే స్వరాజ్యం ఒక సంవత్సరంలో లభిసుందని గాంధీ వాగ్దానం చేశాడు. దేశమంతటా ఈ సందేశాన్ని వ్యాప్తిచేశాడు. స్వరాజ్యం ఎప్పుడో సుదూరకాలంలో లభించేదికాదనీ త్వరలోనే సాధించగలమనీ ఒక భావం కల్గగానే ప్రజలు ఉత్సాహంగా పాల్గొన్నారు. 1921 డిసెంబరు 31 నాటికి స్వరాజ్యం సిద్ధించుతుందని గాంధీ విస్పష్టం చేశాడు. అహింసలో నమ్మకంలేని విప్లవకారులు సైతం గాంధీతో సహకరించడానికి పూనుకొన్నారు. నాగపూర్ కాంగ్రెస్ నిర్ణయాలలో మరొక విశేషం బ్రిటన్‌లో కాంగ్రెస్ తరపున నడుస్తున్న పత్రిక "ఇండియా" ను నిలిపివేయడం, బ్రిటిష్ కాంగ్రెస్ కమిటీని రద్దుచేయడం, బ్రిటిష్ ప్రజలలో భారత స్వాతంత్ర్యానికి అనుకూలంగా వారి అభిప్రాయాన్ని మలచడానికి ఇవి అంతగా ఇకమీదట ఉపయోగకరం కావని గాంధీ భావించాడు.

నాగపూర్ కాంగ్రెస్ తీర్మానాలు ప్రజలలో నూతన బాధ్యత, ఆత్మవిశ్వాసాలను పెంపొందించాయి. నవంబరులో జరిగిన శాసనసభలను విజయవంతంగా బహిష్కరించారు. కళాశాలలు, న్యాయస్థానాల బహిష్కరణ, అంత జయప్రదం కాకపోయినా. వాటి ప్రతిష్ఠ తగ్గింది. ప్రసిద్ధిచెందిన అత్యంతాదాయం గడిస్తున్న వకీళ్ళెందరో తమ

వృత్తిని త్యజించారు. జాతీయ విద్యాపీఠాలు. పాఠశాలలు వెలిశాయి

## బెజవాడలో అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశం

1921 మార్చి 31 ఏప్రిల్ 1 తేదీలలో బెజవాడలో అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సమావేశం. వర్కింగ్ కమిటీసమావేశం జరిగాయి. అఖిలభారత కాంగ్రెస్ సమావేశాలు మొట్టమొదటిసారిగా ఆంధ్రదేశంలో జరగడంచేత కాంగ్రెస్ నాయకుల్ని చూడాలనే ఉత్సాహంతో లక్షలాదిప్రజలు ఈ సభలకు వచ్చారు. వేలాది స్త్రీ పురుషులు గాంధీ భజనలు చేసుకొంటూ గుడిసెబళ్ళమీద, రైళ్ళమీద, కాలినడకను సభలకువచ్చారు. తిలక్ స్మారకంగా ఏర్పాటు చేయబడిన స్వరాజ్య నిధికి కోటి రూపాయలు వసూలు చేయాలనీ. కాంగ్రెస్‌లో కోటిమంది సభ్యుల్ని చేర్పించాలనీ, ఇరవై లక్షల రాట్నాలతో పని చేయించాలనీ తీర్మానించారు ఈ సమావేశంలో.

ఆరునెలలు అయ్యేసరికి తిలక్ స్వరాజ్యనిధి కోటి రూపాయలు దాటిపోయింది. 15 లక్షల రూపాయలు అదనంగా వసూలైంది. చిత్తరంజన్‌దాస్ మాటల్లో "చదువు కొన్నాళ్ళు ఆగుతుంది. కాని స్వరాజ్యం ఆగదు" అని భావించిన విద్యార్థులు ప్రభుత్వ స్కూళ్ళను బహిష్కరించారు. కొందరు జాతీయ పాఠశాలల్లో చేరారు.

సహాయ నిరాకరణ ఉద్యమం గురించి ప్రబోధించడానికి ఏడు నెల్లపాటు గాంధీ దేశమంతటా అహోరాత్రులు పర్యటించాడు. కొన్ని రాష్ట్రాలలో ఈయనకు తోడుగా మహమ్మదలీ ఉన్నాడు. అనేక సభలలో విదేశ వస్త్ర విసర్జనకు విజ్ఞప్తి చేశాడు. ప్రజలు ఉత్సాహంతో తమ ఒంటిపైవున్న విదేశ వస్త్రాల్ని విప్పి కుప్పలుగా పేర్చి నిప్పంటించారు. ఒకో సందర్భంలో స్వయంగా గాంధీయే నిప్పంటించాడు. 1921 సెప్టెంబర్‌నాటికి గాంధీ తన వస్త్రధారణ "కొల్లాయి" బట్టతో సరిపెట్టుకొన్నాడు. రాను రాను సహాయ నిరాకరణోద్యమం ప్రబలమవడం ప్రభుత్వానికి కంటకంగా తోచింది. నాయకులపైన క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 144. 108 సెక్షన్లు విధించింది. వీటిని ధిక్కరించవద్దని కాంగ్రెస్ ఆదేశించింది. చిత్తరంజన్‌దాస్ రాజేంద్రప్రసాద్, మౌలానా మజహర్-ఉల్-హక్, యాకూబ్ హుస్సేన్, లాలా లజపతిరాయ్‌లను కొన్ని ప్రాంతాలకు వెళ్ళరాదని ప్రభుత్వం నిషేధించింది. లాహోరు రాజద్రోహ సమావేశ చట్టంలోని అంశాలను అమలు పరిచింది.

నాన్‌కానాసాహెబ్ గురుద్వారా వ కు వెళ్ళిన తీర్థయాత్రికులు ఘోరంగా హత్య చేయబ రు. నాన్‌కానా సాహెబ్ గురుద్వారా వద్ద మహంతి వినీతిని అరిక ్డానికి ఉద్యమం బయలుదేరింది. మార్చి 5 న ı హింసండమైన ప్రదర్శనకు అకాలీలు సన్నాహాలు స్తున్నారు వారికి భోజనం, వసతి సమకూర్చేందుకు నియమింపబడిన 150 మంది సిక్కులు ఉదయం గురుద్వారాలో ప్రార్థన చేసేందుకు లోనికి వెళ్ళారు. లోనికి వెళ్ళినవారిని తలుపులు బిగించి 100 మందిని హత్య చేసి పెట్రోల్‌తో కాల్పించాడు మహంతి. ఈ సందర్భంగా మొత్తం 195 మంది చనిపోయారు. దేశమంతా ఈ దుర్ఘటనకు అట్టుడికినట్లు ఉడికిపోయింది. అహింసాయుత సత్యాగ్రహానికి కట్టుబడిన అకాలీలు సంయమంతో ప్రవ ంచారు. లేకపోతే పరిస్థితు లెంత తీవ్రమయేవో తెలియ . సహాయ నిరాకరణ ఉద్యమం తీవ్రమైన కొలదీ నిరుద్యోగ కార్మికులు, ఫ్యాక్టరీ కార్మికులు, పట్టణ బీద తరగతి ప్రజలు ఉద్యమంలో చేరారు. 1921 లో చరిత్రలో ఇదివరకు ఎన్నడూ కనీవినీ ఎరుగని విధంగా ప్రజలు కదిలారు.

1920-21 లో కార్మికోద్యమ నిర్మాణం ప్రారంభమైంది. లాలాలజపతిరాయ్ ఆధ్వర్యాన అఖిల భారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ ఏర్పడింది. కార్మికుల సమ్మెలు 1919 లో 19 కాగా, 1920 లో 200, 1921 లో 400 కి పెరిగాయి. కార్మికులలో ప్రచారం చేయడానికి 1921 జనవరిలో ప్రత్యేక కమిటీని కాంగ్రెస్ నియమించింది.

గ్రామీణ ప్రాంతాలలో కూడా రాజకీయ చైతన్యం పెరుగజొచ్చింది. 1921-22 లో సంయుక్త రాష్ట్రం (యు. పి) లో రైతుల తిరుగుబాట్లు జరిగాయి. ఫైజాబాద్, రాయబెరేలీలలో, కింది కులాలకు చెందిన వారుగా పరిగణింపబడు తున్న రైతులు జమీందార్ల పంట భూముల్ని నాశనం చేశారు. జమీందార్ల ఇళ్ళపైన వడ్డీ వ్యాపారుల ఇళ్ళపైన, చిన్న పట్టణాల్లోని వర్తకుల ఇళ్ళపైన దాడి చేశారు. 1921 మధ్య భాగం

వరకూ జరిగిన ఈ తిరుగుబాట్లను సైన్యమూ పోలీసులూ అతిక్రూరంగా అణచివేశారు. వేలాది మంది నిర్బంధింపబడ్డారు. ఇలాంటిదే సంయుక్త రాష్ట్రం (యు. పి) లోని సుల్తాన్‌పూర్‌లో జరిగింది. ఔధ్‌లో 1921 - 22 లో సాయుధ రైతాంగ దళాలు ('ఏక' దళాలు) తాలూకాదార్ల భూముల్ని ఆస్తినీ స్వాధీనం చేసుకొన్నారు. వారిని అణచడానికి పంపిన సైనిక పోలీసు దళాలను ప్రతిఘటించి చాలాకాలం నిలబడ్డారు. జవహర్‌లాల్ నెహ్రూ తు ఉద్యమ సంబంధంగానే మొదట సంయు రాష్ట్రం (యు. పి.) లో అరెస్టయాడు. మలబార్‌లో ఖిలాఫత్ ఉద్యమం గురించి ఇదివరలోనే ప్రస్తావించాం. నాన్‌కానా వద్ద జరిగిన ఘోరకలిని ఇదివరకే తెలియజేశాం. 1922 ఆగస్టులో గురుకా - బాఘ్ వద్ద వేలాది సిక్కులు మౌనంగా ప్రదర్శనలు జరిపారు. బ్రిటిష్ పోలీసులు వారిని రోజూ స్పృహ తప్పిపోయేటట్లుగా కొట్టేవారు. యుద్ధంలో వీరులైన సిక్కులనేకులు వీరిలో వున్నారు. ఐనా ఒక్కరూ చేయెత్తలేదు. ధిక్కారంగా శత్రువు వంకచూడలేదు. ప్రతిఘటనా రహిత ఉద్యమం సాగించారు. జీసస్ క్రీస్తు శిలువ జ్ఞాపకం వచ్చిందని సి. యఫ్. ఆండ్రూస్ అన్నాడు.

'అస్సాంలో టీ తోటల యజమానులైన బ్రిటిష్ వాళ్ళు విపరీతంగా లాభాలు గడిస్తున్నా 1921 మే లో అనేకమంది కూలీలను పని నుంచి తొలగించారు. వారి కొంపల నుంచే కార్మికుల్ని తరిమివేశారు. స్టీమర్లపై తమ ఇళ్ళకు పోదామని ఈ కార్మికులు నడుచుకొని చాంద్‌పూర్ చేరారు. కాని ప్రభుత్వం వీరికి ఎలాంటి సౌకర్యం కలిగించలేదు. కార్మికులు అక్కడ చిక్కుబడిపోయారు. స్టీమర్లు ఎక్కుతున్న కార్మికుల్ని స్త్రీలను సైతం నదిలోకి తోసివేశారు. దాంతో క్రోధావేశ అస్సాం బెంగాల్ రైల్వేలోని భారతీయులంతా సమె చేశారు. స్టీమర్ కార్మికులు కూడా సమ్మె చేశా . కాంగ్రెస్ వాదులు వారిని చివరికి వారి ఇళ్ళకు పంపగల్గారు.

ఇలాగే మిడ్నపూర్‌లో యూనియన్‌బోర్డు పన్నుల్ని చెల్లించ నిరాకరించారు. ఛోటానాగపూర్‌లో ఆదివాసులు చౌకీదార్ పన్ను చెల్లించ నిరాకరించారు. ఒరిస్సాలో కనికరాజ్‌కు చెందిన రైతులు "అబ్వాబ్"లు చెల్లించ నిరాకరించారు. ఆంధ్రలో గుంటూరు జిల్లాలో చీరాల ప్రజలు మున్సిపల్ పన్నులు చెల్లించ నిరాకరించి, మొత్తం గ్రామం గ్రామం అంతా కదలి, ఊరిబయట నివసించారు. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య దానికి నాయకత్వం వహించాడు. 1920 లో విజయవాడ మున్సిపాలిటీ ఎన్నికలను ప్రభుత్వం వాయిదా వేసింది. కాంగ్రెస్ గెలుస్తుందనే భయంతో ఈ పని చేసింది. 1922 లో పన్నుల నిరాకరణ ఉద్యమం ప్రారంభింపబడింది. మున్సిపల్ కౌన్సిలర్లు నాల్గింట మూడు వంతులు రాజీనామా చేశారు. పోటీ మున్సిపల్ కౌన్సిల్ ఏర్పరచి దానికే పన్నులు చె ంచవలసిందని విజ్ఞప్తిచేశారు. మున్సిపల్ పరిపాలన ంభించడంతో చివరకు ప్రభుత్వం ఎన్నికలు జరిపించిం . 24 స్థానాలలో 15 స్థానాలు కాంగ్రెస్‌కు లభించాయి.

ఉద్యమం తీవ్రస్థాయిలో వ్యాప్తిచెందుతున్నదన డానికి ఇవన్నీ ఉదాహరణలే. బొంబాయిలో 1921 జూలై 31 న జరిగిన సభకు గాంధీ అధ్యక్షత వహించాడు. అక్కడ విదేశీ వస్త్ర దహనం పెద్ద ఎత్తున జరిగింది.

ఇదే సంవత్సరంలో గాంధీ - టాగూర్‌ల మధ్య వివాదం తలెత్తింది. ప్రజా సమూహాల ఉద్రేకోత్సాహాన్ని టాగూర్ ఖండించాడు - భారతదేశం గాంధీ గారితో పాటు కేవలం ప్రాతికూల్య ధోరణినే జపిస్తూ వుండాలా ? ఇతర్ల తప్పుల్నే నిరంతరం ఉదహరిస్తూ ద్వేష ప్రాతిపదికపై స్వరాజ్యం కోసం ప్రయత్నించాలా? అని టాగూర్ ప్రశ్నించాడు. ఒక ప్రక్క భారత దేశం నగ్నంగా వణుకుతూ సిగ్గుపడుతూవుంటే వస్త్రాలను తగలబెట్టడం గురించి ఆలోచించండి. ఆర్థిక విషయాన్ని బయటికి నెట్టిపారేసి, కృత్రిమ నైతిక ఆజ్ఞల్ని వాటి స్థానే ప్రవేశపెట్టారు——అని టాగూరు విమర్శించాడు. భ్రమలు, మాయతో కూడిన బానిస మనస్తత్వాన్ని మన ఆసరాగా తీసుకోరాదని టాగూర్ నిరసించాడు. భారతదేశం చైతన్యవంతమైతే ,అది ప్రపంచ చైతన్యంలో భాగమే అవుతుంది, అని ఆయన అన్నాడు. తిలక్ అనుచరుడు బిపిన్ చంద్రపాల్, కూడా మొదట సహాయ నిరాకరణ ఉద్యమాన్ని బలపరచినవాడే. తాను మాజిక్‌ను నమ్మను, లాజిక్ (తర్కం)నే నమ్ముతానంటూ గాంధీ శిబిరం నుంచి తప్పుకొన్నాడు, గాంధీ దీనికి ఇచ్చిన జవాబు గమనించదగింది :

"యుద్ధం వచ్చినపుడు, ఇల్లు తగలుపడుతున్నపుడు అందరూ తమ తమ పనులు కట్టిపెట్టి, ఆ ఆపదల్ని ఎదుర్కొడానికి సిద్ధపడతారు.....నా విదేశ వస్త్రాలను దహించడం ద్వారా, నా అవమానాన్ని దగ్ధం చేస్తున్నాను."

ఉధృత మవుతున్న ఉద్యమాన్ని పక్కదార్లు పట్టించడానికి ప్రభుత్వం ఒక ఎత్తువేసింది. వేల్సు యువరాజు భారతదేశంలో పర్యటించితే, రాజభక్తి పరాయణులైన ప్రాచ్యదేశస్థులు, గత మంతా మరచి ఆయనకు జేజేలు కొడతారని బ్రిటిష్ ప్రభుత్వం ఆశించింది. కాని ఆ ఆశ నెరవేరలేదు.

1921 లో వేల్సు యువరాజు "యుద్ధకాలంలో భారతదేశ మొనర్చిన అపూర్వసేవ సహాయాలకు" కృతజ్ఞత తెలియజేయడానికి వచ్చాడు. నవంబరు 17 న బొంబాయిలో ఆయన కాలు పెట్టగానే హర్తాళ్ జరిగింది. ఆయన రాకకు నిరసనగా ఇళ్ళపై నల్లజెండాలు ప్రత్యక్షమయ్యాయి. అధికార ఉత్సవాలలో సహాయ నిరాకరణవాదులు పాల్గొనలేదు. అసమ తి సభలో గాంధీ తదితరులు పాల్గొని విదేశవస్త్ర దహనం చేశారు. గోడలపై నిరసన పోస్టర్లను అం ంచుతున వలంటీర్లను అంతకు ముందురాత్రే పోలీసులు అరె చేశారు. పోస్టర్లను పోలీసులు చింపివేశారు. స్వ సభ ఆఫీసులో చొరబడి పోస్టర్లను తీసుకుపోయా . రాజభక్తి పరాయణులకు, సహాయ నిరాకరణ వాదులకు మధ్య ఆ సాయంత్రం కొట్లాట జరిగింది. అనేక ప్రాంతాలలో దెబ్బలాటలు జరిగాయి. మిల్లుయజమానుల ఆజ్ఞను ధిక్కరించి కార్మికులు ఫ్యాక్టరీల నుంచి బయటికి వచ్చారు. ఊరేగింపులు జరిపారు. రైళ్ళను, ట్రాములను ఆపివేసి విదేశీ టోపీలను తొలగించారు. వేల్సు యువరాజుకు స్వాగత సన్నాహాలు చేస్తున్న పార్సీలపై ఎక్కువగా ఈ దాడి కేంద్రీకరించబడింది. కొందరు పార్సీ స్త్రీలు కూడా దెబ్బలు తిన్నారు. ట్రాముల్ని, మోటారు కారుల్ని, రెండు సారాదుకాణాల్ని తగులబెట్టారు. అగ్నిమాపక దళాన్ని పనిచేయకుండా నిరోధించారు. ఇంగ్లో - ఇండియన్లను గాంధీటోపీలు ధరించవలసిందిగా బలవంతపెట్టారు. ధరించని వారిని కొట్టారు. ఇలా ప్రజల ఆగ్రహానికి గురైన రాజభక్తి పరాయణులలో యూదులు, పార్సీలు, క్రిస్టియన్లు ఉన్నారు. ఈ ఘర్షణలలో 400 మంది గాయపడ్డారు. 53 గ్గురు మరణించారు. ఈ సంఘటనలు తన హృదయంలో బాణంగుచ్చినట్లయిందని గాంధీ అన్నాడు. 'స్వరాజ్యం కంపుకొడుతోంది' అని కూడా అన్నాడు. బొంబాయిలోని హిందువులు, ముస్లిములు, పార్సీలు, క్రిష్టియన్లు, యూదులతో శాంతియుతంగా ప్రవర్తించేవరకు తాను ఆహారం ముట్టననీ, నీరు తాగననీ గాంధీ 1921 నవంబరు 19 న శపథం చేశాడు.

వేల్సు యువరాజు బొంబాయి వచ్చిన రోజున దేశమంతటా హర్తాళ్ జరిగింది. మద్రాసులో కూడ వేల్సు యువరాజు రాకసందర్భంగా జనవరి 13 న కొట్లాటలు జరిగాయి. కలకత్తా వీధులు కాంగ్రెస్ వలంటీర్ల స్వాధీనమయినట్లు కన్పించుతోందనీ, ప్రభుత్వం పదవీత్యాగం చేసినట్లు కన్పించుతోందనీ, స్టేట్స్‌మాన్ పత్రిక రాసింది. కాంగ్రెస్, ఖిలాఫత్ వలంటీర్లు యూనిఫారాల్తో దళాలు దళాలుగా వెళ్ళి హర్తాళ్‌ను జయప్రదం చేయడం ఈ పత్రికకు కంటగింపయింది. వేల్సు యువరాజు 1921 డిసెంబరు 24 న కలకత్తా వెళ్ళాడు. ఆ రోజున గాంధీ ప్రజలకు ఒక విజ్ఞప్తి చేశాడు. అందులో ఇలా అన్నాడు :

"మేం ప్రభుత్వాన్ని కూలద్రోయాలనుకొంటున్నాం. ప్రజాభీష్టానికి ప్రభుత్వం తలఒగ్గాలని మేం కోరుతునా ం. సహాయనిరాకరణ వాదులు ' భుత్వంతో యు ంచేస్తున్నారన్న విషయం లా రీడింగ్ (వై సాయి) స్పష్టంగా అర్థంచేసుకోవా ."

ఈ గాంధీ విజ్ఞప్తిని కాంగ్రెస్, ఖిలాఫత్ వలంటీర్లు పంచిపెట్టారు. పనులు మానివేసి శాంతియుతంగా మౌనంగా నిరసన తెలియజేయాలని విజ్ఞప్తి చేశారు.

వేల్సు యువరాజు రాకకు ప్రజలు హర్షం తెలియ చేస్తున్నారని చిత్రీకరించడానికి ప్రభుత్వం కొన్నిచోట్ల తమ వాళ్ళకు ఖద్దరు దుస్తులిచ్చి నిలబెట్టారు. వారిలో కొందర్ని, ఖద్దరు, టోపీలుకూడా ధరించి హర్షం తెలియ చేస్తూ టోపీలు వూపేటట్లు చేశారు. ఐనా ఈ తతంగమంతా వ్యర్థమైంది.

జాతీయ వలంటీర్ల శక్తి ఏమిటో ఈ దెబ్బన ప్రభుత్వానికి తెలిసివచ్చింది. జాతీయ వలంటీర్లు యూనిఫారాలు ధరించారు. డ్రిల్లు చేశారు. దళాలుగా ఏర్పడ్డారు. పికెటింగులు, శాంతియుతంగా ఒప్పించ

డాలతో హర్తాళ్‌లను జయప్రదం చేశారు. విదేశవస్త్ర బహిష్కరణను జయప్రదం చేశారు.

ఇది ప్రభుత్వానికి కంటగింపయింది. వలంటీరు దళ నిర్మాణాన్ని ప్రభుత్వం నిషేధించింది. వేలాది మందిని అరెస్టు చేసింది. వారి స్థానాల్ని విద్యార్థులు, కార్మికులు నింపారు. 1921 డిసెంబరు నెలాఖరునాటికి గాంధీ మినహా ముఖ్యనాయకు లందర్నీ ప్రభుత్వం అరెస్టు చేసింది. 1922 సంవత్సరారంభానికి కనీసం 30 వేల మంది జైళ్ళ పాలయ్యారు.

వేల్సు యువరాజు బహిష్కరణను ఆపివేస్తే, వలంటీరు సంస్థలపై నిషేధం తొలగిస్తామనీ, రాజకీయ ఖైదీలను విడుదల చేస్తామనీ పండిత మదనమోహన మాలవీయద్వారా చేసిన రాయబారాన్ని గాంధీ అంగీక రించలేదు. రౌండ్‌టేబుల్ సమావేశం ఏర్పాటుచేసి, ఈ సమస లు చర్చించాలని ప్రభుత్వ సూచన. జైల్లో వున్న చి రంజన్‌దాస్, మౌలానా అజాద్‌ల సలహా లను కూ తిరస్కరించి, రౌండ్‌టేబిల్ సమావేశమై, ఫలితాలు కల్గితేతప్ప ఉద్యమాన్ని ఆపేదిలేదని గాంధీ స్పష్టంచేశాడు.

సహాయ నిరాకరణనుంచి మరోమెట్టు ముందుకు వెళ్ళి, శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించాలని జాతీయ వాదులంతా ఉత్సాహపడుతున్నారు. 1921 నవంబరు 4 న ఆలిండియా కాంగ్రెస్ కమిటీ ఢిల్లీలో సమావేశమై, దేశమంతటా ఒకేసారి అహింసాయుత శాసనోల్లంఘనం ప్రారంభించాలని తీర్మానించింది. ప్రతి రాష్ట్రమూ, తన స్వంతబాధ్యతపై పన్నుల నిరా కరణతోసహా శాసనోల్లంఘనం కొనసాగించడానికి ఎ.ఐ.సి.సి. అనుమతించింది. ఐతే సత్యాగ్రహులకు కాంగ్రెస్ ఎట్టి ఆర్థిక సహాయం చేయబోదని స్పష్టం చేసింది. ఐతే తన అనుమతి లేనిదే ఉద్యమాన్ని ప్రారంభించరాదని గాంధీ నాయకులనుంచి వాగ్దానం తీసుకొన్నాడు.

1921 డిసెంబరు చివరివారంలో అహమ్మదా బాద్‌లో కాంగ్రెస్ మహాసభ జరిగింది. కాంగ్రెస్ అధ్యక్షుడిగా ఎన్నికోబడిన చిత్తరంజన్‌దాస్ జైలులో వున్నందున, హకీమ్ అజ్మల్‌ఖాన్ అధ్వర్యాన కాంగ్రెస్ మహాసభ జరిగింది. "మరింత పటి ష్ఠంగా అహింసాయుత సహాయ నిరాకరణ ఉద్య మాన్ని,స్వరాజ్యం లభించేదాకా, అధికారం ప్రజలచే తుల్లోకి పోయేదాకా భారత ప్రభుత్వంపై సాగించాలని" కాంగ్రెస్ తీర్మానించింది. 18 ఏళ్ళకు పైబడిన వారంతా, నిషేధింపబడిన జాతీయ వలంటీర్ల దళంలో చేరి శాసనోల్లంఘన శపథం చేయాలని విజ్ఞప్తి చేసింది. సామూహికంగా గాని, వ్యక్తిగతంగా గాని, ఆత్మ రక్షణ (Defensive) కు లేదా దాడిచేసే స్వభా వంతో (Offensive) గాని ఈ ఉద్యమం వుండా లనీ, గాంధీ ఒక్కడే కాంగ్రెస్‌ను నడిపించే వ్యక్తిగా అంటే దాదాపు నియంతగా వుండాలనీ కాంగ్రెస్ తీర్మా నించింది.

అహమ్మదాబాద్ కాంగ్రెస్‌లో మౌలానా హస్రత్ మొహానీ, పై తీర్మానానికి ఒక సవరణ ప్రతిపాదిం చాడు. స్వరాజ్యానికి నిర్వచనం "విదేశీ పెత్తనం పూర్తిగా లేని సంపూర్ణ స్వాతంత్ర్యం"గా వుండా లన్నాడు. గాంధీ యీ సవరణను వ్యతిరేకించాడు. 'కాంగ్రెస్ ఆశయాన్ని (Creed) ఎప్పుడు పడితే అప్పుడు మార్చడానికి వీలులేదనీ, ఆయన బాధ్యతా రహితంగా వ్యవహరిస్తున్నాడనీ, ఇది తనకు బాధ కల్గించుతున్నదనీ" అన్నాడు. ఈ సవరణను వ్యతి రేకిస్తూ గాంధీ వాడిన భాష పరుషంగా వున్నదనీ, ఐనా వుండవలసినంత కఠినంగా ఉన్నదా అని డాక్టర్ పట్టాభిగారు ప్రశ్నించారు, కాంగ్రెస్ చరిత్ర గ్రంథ రచనలో. సైన్యాధిపతి సర్వసన్నద్ధం చేసుకొన్నాక ఒక సామాన్య సైనికుడు అతని వ్యూహాన్ని గురించి ప్రశ్నించడమా? అని ఆయన వ్యాఖ్య. "సైన్యాధిపతి తానెరుగని అజ్ఞాత భూములకు నికులను తీసుకొని పోజాలడు" అని కూడా పట్టా గారన్నారు. ఆ సైన్యాధిపతి గాంధీ ఈ ఉద్యమాన్ని ఎలా నడిపాడో చూద్దాం.

హజరత్ మొహానీ సవరణ వీగిపోవడం, శాసనో ల్లంఘనంలో పన్నులు చెల్లించరాదనే అంశం లేక పోవడం— ప్రభుత్వానికి హర్షం కల్గించింది. ఖిలా ఫత్‌లోని అతివాదులు "అహింసాయుత" మార్గాన్ని వదలివేయాలని చేసిన సూచనకూడా కాంగ్రెస్ తిరస్క రించినందుకు ప్రభుత్వం సంతోషించింది. వైస్రాయి, భారత రాజ్యాంగ కార్యదర్శికి ఈ విషయాన్ని తంతి పంపాడు.

వ్యష్టి, సమిష్టి శాసనోల్లంఘనాలకు తయారైన ప్రదేశాలలో పన్నుల చెల్లింపు నిరాకరణోద్యమం

ప్రారంభించవచ్చని గతంలో ఢిల్లీలో తీర్మానించ బడింది.

అహమ్మదాబాద్ కాంగ్రెస్ సందర్భంగా సభ పూర్తయ్యాక గాంధీ ఆంధ్రుల బసను సందర్శించాడు. ఆంధ్రలో పన్నుల నిరాకరణ సాగించే ప్రదేశంలో కాంగ్రెస్ వలంటీర్లు, పన్నులు నిరాకరించే రైతుల సంతకాలను కూడా తీసుకోవాలని చెప్పాడు.

ఇక్కడ ఆంధ్రదేశంలో పన్నుల నిరాకరణ ఉద్యమం పుట్టు పూర్వోత్తరాలు గమనించాలి. 1921 నవంబరు 5 న అఖిలభారత కాంగ్రెస్ కమిటీ, పరిస్థితులు సంతృప్తికరంగా ఉన్నచోట శాసనోల్లంఘనం, పన్నుల నిరాకరణ ప్రారంభించాలని తీర్మానించింది. 1921 జనవరిలోనే చీరాల పేరాల ఉద్యమం ప్రారంభమైంది. బెజవాడలో మున్సిపల్ పన్నులు చెల్లించ నిరాకరించే ఉద్యమం ప్రారంభమైంది. గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాలలో పన్నుల నిరాకరణకు నిర్ణయమైంది. పల్నాడు పుల్లరి చెల్లింప నిరాకరించారు. గోదావరి జిల్లాలో పన్నుల నిరాకరణ ప్రచారం చేసిన ఐదుగురు శిక్షింపబడ్డారు. నెల్లూరు, కడప జిల్లాలలో అటవీ నిబంధనలు ఉల్లంఘించ ప్రారంభించారు. అహమ్మదాబాద్ కాంగ్రెస్‌కుముందే ఆంధ్ర కాంగ్రెస్ సంఘం, డిసెంబరులో సమావేశమై పన్నులు చెల్లించ రాదని రైతులకు విజ్ఞప్తి చేసింది. ఈ పూర్వరంగంలో గాంధీ అహమ్మదాబాద్ కాంగ్రెస్ సమావేశ సమయములో ఆంధ్రుల బసలో పైనుదహరించిన సలహా కాంగ్రెస్ ప్రతినిధుల కిచ్చాడు.

గుంటూరుజిల్లా పెదనందిపాడు పన్నుల నిరాకరణ ఉద్యమం దేశాన్నంతటినీ ఆకర్షించింది. దీనివల్ల గాంధీ మొదట నుంచీ తటపటాయిస్తూనే వచ్చాడు. ఈ ఉద్యమం పట్ల కొన్ని పత్రికలూ, కొందరు నాయకులూ సందేహిస్తున్నారు. పెదనందిపాడు ఫిర్కా గ్రామోద్యోగులు రైతులకు మద్దతుగా ఉద్యోగాలకు రాజీనామా నిచ్చారు. నాలుగువేల మందితో శాంతిసేన దళం ఏర్పడింది. ప్రభుత్వాధికారుల్ని ప్రజలు వెలివేశారు. రాజీనామా ఇచ్చిన స్థానాన్ని ఎవరైనా నింపడానికి సంసిద్ధమైతే, వారిని వలంటీర్లు భయపెట్టేవారు ఉద్యమంలో బాగా ముందంజ వేసిన 18 గ్రామాల పైన ప్యూనిటివ్ చర్యలు అవలంభించింది ప్రభుత్వం. పోలీసులు నిస్సహాయులు కాగానే, ప్రభుత్వం నాలుగు సాయుధ శకటాలను, పదాతిదళ సైన్యాన్ని పంపింది. జనవరి అంతా పన్నుల నిరాకరణ జరిగింది. పన్నులు వసూలుచేసే రెవెన్యూ అధికారులను శాంతియుతంగా ప్రతిఘటించారు. పెదనందిపాడు ఫిర్కాలోనే గాక కొన్ని ఇతర గ్రామాలలో కూడా పన్నుల నిరాకరణ ఉద్యమం కొనసాగింది. జిల్లాలో మొత్తం రు. 14.75 లక్షలు వసూలు కావాల్సివుండగా 3 ½ లక్షల రూపాయలే వసూలైంది.

పన్నులు కట్ట నిరాకరించిన వారి చరాస్తినీ, స్థిరాస్తినీ కూడా వేలం వేశారు. కాని వేలం పాడటానికి ఎవరూ ముందుకు రాలేదు. మిలటరీ దళాల్ని తెచ్చి ప్రభుత్వం విన్యాసాలు చేయించింది. జనవరిలో 15 లక్షల రూపాయలు వసూలు చేయాల్సిన ప్రభుత్వానికి నాల్గు లక్షల రూపాయల కన్నా వసూలు కాలేదు. చివరకు తమ అనుమతి లేకుండా ఉద్యమం ప్రారంభమైనదన్న సాకుతో ఉద్యమాన్ని ఆపివేయవలసిందని గాంధీ, కొండా వెంకటప్పయ్యగారికి ఉత్తరం రాశాడు. బార్డోలీ ఉద్యమ ఫలితాలు తేలేవరకూ ఉద్యమాన్ని ఆపవలసిందిగా గాంధీ పై లేఖలో రాశాడు నిర్ణీత కాలంలో పన్నులు చెల్లించాల్సిందిగా కోరాడు.

బార్డోలీలో సామూహిక శాసనోల్లంఘనం సాగించుతానని గాంధీ 1922 ఫిబ్రవరి 1 న ప్రభుత్వానికి ఒక అల్టిమేటం (తుది హెచ్చరిక) పంపారు. ఆరోజుకు రాజకీయ ఖైదీలను విడిచిపెటకపోతే, నిర్బంధ విధానాల్ని ఉపసంహరించుకోకపోతే ఉద్యమం ప్రారంభించుతానని హెచ్చరించాడు.

గుజరాత్‌లో బార్డోలి, సూరత్ జిల్లాలోని ఒక తహసిల్ (ఫిర్కా లాంటిది) 137 గ్రామాలున్నాయి. వాటి జనాభా 8,700. అక్కడి ప్రజలు అహింసకు కట్టుబడి వుంటారనీ, అందుచే అది అహింసాయుత ఉద్యమానికి సరయిన చోటనీ గాంధీ భావించాడు.

బార్డోలీలో శాసనోల్లంఘన ఉద్యమం ప్రారంభించుతామని నిర్ణయించినపుడు, కాంగ్రెసు వర్కింగ్ కమిటీ ఒక విజ్ఞప్తి చేసింది. గాంధీ అనుమతి పొందకుండా ఎవరూ సామూహికంగాగానీ, వ్యక్తిగతంగాగానీ దాడి చేసే (**Aggressive**) స్వభావంగల శాసనోల్లంఘనం చేయరాదని వర్కింగ్ కమిటీ విజ్ఞప్తి చేసింది.

శాసనోల్లంఘన ఉద్యమాన్ని నడపడానికి బార్డోలి వెళ్ళిన గాంధీ, వైస్రాయికి పంపిన తుది హెచ్చరికలో

ఏడురోజుల్లోగా తమ కోర్కెల్ని తీర్చాలని కోరాడు. వైస్రాయి గాంధీ కోర్కెల్ని నిరాకరించడమేగాక, దేశంలోని అరాచకత్వానికి బాధ్యత కాంగ్రెస్‌దే అన్నాడు. దానికి జవాబు ఫిబ్రవరి 7 న గాంధీ పంపాడు. ప్రభుత్వ దమనకాండను వివరంగా వర్ణించాడు. కలకత్తాలో కాల్పులు. సివిల్‌గార్డుల పశుప్రవర్తన, డక్కా, ఆలిఘర్‌లలో సభలను బలవంతంగా చెదరగొట్టడం, లాహోర్, జలంధర్, డెహ్రాడున్‌లలో ప్రజలపైన వలంటీర్లపైన అకారణంగా దాడిచేయడం, సోనేపూర్‌లో కాంగ్రెస్‌కు చెందిన పత్రాలు, ఖద్దరు తగలబెట్టడం, కాంగ్రెస్ ఖిలాఫత్ కార్యాలయాల్లో అర్ధరాత్రి సోదాలు, అరెస్టులు-వీటన్నిటినీ గాంధీ పేర్కొన్నాడు. ప్రభుత్వ అరాచకానికి, పాశవికతకు ఇవి మచ్చు మాత్రమేనని ఆయన అన్నాడు.

గాంధీ తన జవాబు పంపిన మర్నాడే, (ఫిబ్రవరి 8 న) పత్రికలలో చౌరీచౌరాలో 5 న జరిగిన ఘటనల గురించిన వార్తలు పడ్డాయి. సంయుక్త రాష్ట్రం (యు పి.) లోని గోరఖ్‌పూర్ జిల్లాలోని ఒక గ్రామం చౌరీచౌరా. కొంతకాలంగా చౌరీచౌరాలో ఒక బజారులో తీవ్రంగా పికెటింగ్ జరుగుతోంది. విదేశ వస్త్రాల అమ్మకం ఆపివేయబడింది. సారా దుకాణాలకు ఎవరూ రావటంలేదు. ఈ బజారులోని దుకాణాల యజమాని, స్థానిక భూస్వామి. అతనికి సహజంగానే పికెటింగ్ అంటే యిష్టంలేదు. ప్రతిఘటించాడు. ఫిబ్రవరి 1 న ఒక పోలీసు ఆఫీసర్ పోలీసు దళంతో వచ్చి పికెటింగు చేస్తున్న వలంటీర్లను రైతులను బాదాడు. దాంతో చుట్టుపక్క గ్రామాల వలంటీర్లంతా ఫిబ్రవరి 4 న ఒకచోట గుమిగూడి, అక్కడనుంచి పోలీసుస్టేషన్‌కు వెళ్లారు. తమవాళ్ళను సబిన్‌స్పెక్టర్ ఎందుకు కొట్టాడో సంజాయిషీ ఇవ్వాలనీ, తాము పికెటింగు చేస్తే, ఆవేళ ఎవరు అడ్డం పడతారో చూస్తామనీ అడగడానికి వారు అక్కడికి వెళ్ళారు. కొంతమంది మధ్యవర్తులు ఆగ్రహావేశులైన ప్రజల్ని సముదాయించి పంపివేశారు వెనుక నిలిచిపోయిన కొందరిని పోలీసులు తిట్టి కొట్టారు. వారు రాళ్ళతో ఎదుర్కొన్నారు. పోలీసులు కాల్పులు సాగించారు. పోలీస్ స్టేషన్ సమీపంలో ఈ కాల్పులవల్ల మరణించిన ఇద్దరి శవాల్ని తర్వాత గమనించారు. తుపాకిగుళ్ళు అయిపోయాక కానిస్టేబుల్లు పోలీసులంతా స్టేషన్‌లోకి వెళ్ళిపోయి తలుపులు బిడాయించుకొన్నారు. పోలీసు కాల్పుల వార్తవిని వచ్చిన ప్రజా సమూహం ఆ స్టేషన్‌కు నిప్పంటించింది. పోలీస్ స్టేషన్ నుంచి బయటకువచ్చి పారిపోదామని ప్రయత్నించిన వారిని, కొందర్ని చంపి కిరోసిన్‌తో తగలబెట్టారు. మరి కొందర్ని మండుతున్న స్టేషన్ మంటల్లో పడవేశారు. సబ్‌ఇన్‌స్పెక్టర్ అతని కొడుకు కూడా హతులైన వారిలో వున్నారు.

వెంటనే శాసనోల్లంఘన ఉద్యమాన్ని నిలిపివేయాలని గాంధీ నిర్ణయానికి వచ్చాడు. ఫిబ్రవరి 11 న కాంగ్రెసు వర్కింగ్ కమిటీలో ఉద్యమం నిలిపివేసే విషయం చెప్పాడు. మొదట వారందుకు ఇష్టపడలేదు గాంధీ అభ్యర్థన మీద వారు అంగీకరించారు. శాసనోల్లంఘన ఉద్యమ స్థానంలో "నూలు వడకడం, మద్య నిషేధం, సంఘ సంస్కరణలు, విద్యా విషయ సంబంధమైన కార్యకలాపాల"తో కూడిన కార్యక్రమాన్ని వర్కింగ్ కమిటీ రూపొందించింది ఫిబ్రవరి 12 నుంచి ఐదురోజులపాటు గాంధీ నిరసన వ్రతం పూనాడు.

ఫిబ్రవరి 11, 12 తేదీలలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ అత్యవసర సమావేశం జరిగింది. చౌరీచౌరాలో జరిగిన హింసాకాండకు క్రోధాన్ని వెలిబుచ్చింది. దేశమంతటా శాసనోల్లంఘన ఉద్యమాన్ని ఆపివేయాలని తీర్మానించింది. చౌరీచౌరా ఘటనలేగాక, బొంబాయిలోను, మద్రాసులోను జరిగిన హింసాయుత సంఘటనలు కూడా ఉద్యమం ఆపడానికి కారణాలుగా బార్డోలీ తీర్మానంలో చెప్పబడింది. ఆ విధంగా బార్డోలీ శాసనోల్లంఘన యుద్ధం ముగిసింది.

అహమ్మదాబాద్ కాంగ్రెస్ సమావేశంలో సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానం ప్రవేశపెట్టిన హజరత్ మొహానీని విమర్శించుతూ కాంగ్రెస్ చరిత్రకారుడు డాక్టర్ పట్టాభి సైన్యాధిపతి తానెరుగని అజ్ఞాత భూములకు సైనికులను తీసుకొని పోజాలడు" అని రాశాడు. ఆ సైన్యాధిపతి (గాంధీ) నేతృత్వం అలా ముగిసింది.

శాసనోల్లంఘన విరమణ తీర్మానం కాంగ్రెస్ అనుయాయులలో, కొందరు ప్రముఖ కాంగ్రెస్ నాయకులలో సైతం తీవ్ర అసంతృప్తి రగిల్చింది. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సైతం ఉద్యమ విరమణకు మన

స్ఫూర్తిగా గాంధీని బలపర్చలేదని గాంధీ తర్వాత రాసిన వ్యాసాల్లో స్పష్టమైంది.

"జాతియావత్తుకు సంభవించిన విపత్తుకంటే ఇది ఏమాత్రం తీసిపోదు." అని సుభాసుబోస్ వర్ణించాడు. దేశబంధు చిత్తరంజన్‌దాస్, పండిత మోతీలాల్ నెహ్రూ, లాలా లజపతిరాయ్—వీరంతా జైల్లో ఉన్నారు. విరమణ నిర్ణయంపట్ల అసంతృప్తి వెలిబుచ్చారు. "నేను ఆ సమయంలో దేశబంధు వద్ద ఉన్నాను ఆయన కోపంతో, విచారంతో నిగ్రహం కోల్పోయే తుది దశకు వచ్చాడు" అని సుబాసుబోసు రాశాడు. మోతీలాల్‌నెహ్రూ, లజపతిరాయ్ మరి కొందరు. బా లీ విరమణ తీర్మానానికి అసమ్మతి తెలుపుతూ ఉ రాలు రాశారు. జైల్లో ఉన్నవారు పౌరులుగా ణించినట్లేనని కటువుగా జవాబు చెప్పాడు. జవహర్‌లాల్‌నెహ్రూ అభిప్రాయంలో కూడా ఉద్యమం విరమించకపోయినట్లయితే, అది అదుపుతప్పిపోయేదనీ, ప్రభుత్వ గెలిచేదనీ అభిప్రాయ పడ్డాడు. ఐనా ఈ ని యం "ఎన్నృహ కల్గించింది. హఠాత్తుగా గొప్ప ద్యమాన్ని నిలిపి వేయడం బహుశా దేశంలో విషాద పరిణామాలకు దారి తీసింది." అని తన ఆత్మకథలో రాశాడు.

ప్రజలలో అణచివేయబడ్డ హింసా ప్రవృత్తి బయట పడటానికి మార్గం వెతుక్కోవలసి వచ్చింది. ఆ తర్వాతి సంవత్సరాలలో మతకలహాలను రేపెట్టింది—అని జవహర్‌లాల్‌నెహ్రూ రాశాడు. కొండను తవ్వి ఎలుకను పట్టిన విధంగా ఫలించిందని అనేకులు భావించసాగారు. ఈ విమర్శలన్నిటికీ జవాబుగా గాంధీ "అహింసా సత్యాలకు ఖచ్చితంగా కట్టుబడి ఉండాలని. విధేయులై ఉండాలని దేశభక్తితత్వం కోరుతోంది. వాటిలో విశ్వాసం లేనివారు కాంగ్రెస్ నుంచి విరమించుకోవాలి."

ఇట్టి వాతావరణంలో ప్రభుత్వం దమనకాండ ప్రారంభించింది. చౌరీ చౌరా సంఘటనకు సంబంధించిన కేసులో 200 మందిని అరెస్టు చేశారు. 1923 లో సెషన్సుకోర్టులో విచారణ జరిగింది. 170 మందికి మరణశిక్ష విధించబడింది. మిగతావారికి దీర్ఘకాల కఠిన శిక్షలు విధింపబడ్డాయి. అల్హాబాదు హై కు వీరు అప్పీలు చేసుకోగా 19 మందికి మరణశిక్ష, 110 మందికి యావజ్జీవశిక్ష, ముగ్గురికి రెండేళ్ళ కఠినశిక్ష విధించబడింది.

కాంగ్రెస్ ఘన ఉద్యమం వెనకబట్టిందన్న భావం కల్గగానే ప్రాయి లార్డ్‌రీడింగ్, గాంధీని అరెస్టు చేయాలని కల్పించాడు. గాంధీని ఎప్పుడు అరెస్టు చేయాలనే విషయంపై, లండన్‌లోని బ్రిటిష్ ప్రభుత్వానికి వైస్రాయికీ మధ్య అనేక తర్జన భర్జనలు జరిగాయి." బార్డోలీ తీర్మానం సంఘానికి (కాంగ్రెస్‌కు) స్పష్టమైన, సులభంగా అర్థమయేటటు ంటి ఆదర్శం లేకుండా చేసింది. ఆ క్షణం నుంచి కాంగ్రెస్ క్షీణించ మొదలెట్టింది. నిర్మాణం విచ్ఛిన్నం కాజొచ్చింది. ఉత్సాహం సన్నగిల ప్రారంభించింది. పార్టీ అనుయాయులలో భ్రమలు తొలగడం, నిరుత్సాహం ప్రబలింది." అని రీడింగ్ భావించాడు.

1922 మార్చి 10 న గాంధీని అరెస్టు చేసంది ప్రభుత్వం. ఆయనతోపాటు శంకరలాల్ బాంకర్‌ను కూడా అరెస్టుచేసింది. ఆయన 'యంగ్‌ఇండియా' పత్రిక ముద్రాపకుడు. ఒకవారం తర్వాత, మార్చి 18 న అహమ్మదాబాద్‌లోని గవర్నమెంట్ సర్క్యూట్ హౌస్‌లో, సి. యస్. బ్రూమ్‌ఫీల్డ్ అనే ఆంగ్లన్యాయాధీశుని ముందు విచారణ జరిగింది. దీనికి "గొప్ప విచారణ" (Great trial) పేరు వచ్చింది. ప్రభుత్వం ఆరోపించిన నేరాలను గాంధీ అంగీకరించాడు. ఎంత ఎక్కువ శిక్ష విధించడానికి వీలుంటుందో అంత శిక్ష విధించమని గాంధీ కోరాడు. గాంధీకి తిలక్ వలెనే ఆరేళ్ళ శిక్ష విధించబడింది. ఈ విచారణలో గాంధీ ఒక వ్రాతపూర్వక వాఙ్మూలం ఇచ్చాడు. బ్రిటిషు ప్రభుత్వంపట్ల విధేయునిగా ఉండి, సహకరించిన తాను ఎందుకు మిత్రుడు గాకుండాపోయాడో సహాయ నిరాకరణవాదిగా మారాడో తెలియజేశాడు. దక్షిణాఫ్రికా సత్యాగ్రహం నుంచి తన రాజకీయ జీవితాన్ని వివరించాడు. భారతదేశంలో బ్రిటిషు పాలనను ఎందుకు తాను వ్యతిరేకించుతున్నాడో—ఆ వాఙ్మూలంలో గాంధీ చెప్పిన వాక్యాలు చిరస్మరణీయమైనవి.

"బ్రిటన్‌తో సంబంధం భారతదేశాన్ని మునుపటి కన్న రాజకీయంగా ఆర్థికంగా నిస్సహాయస్థితికి దిగజార్చిందని నేను నిర్ణయానికి రాకతప్పిందికాదు. నిరాయుధ భారతదేశం, ఎలాంటి దాడినైనా ప్రతిఘటించేశక్తిని కోల్పోయింది. అది ఎంత బీదదేశమైన

దంటే కరువుకాటకాలను ప్రతిఘటించేశక్తి దానికి తగ్గిపోయింది. అలితో అలమటించుతున్న భారత ప్రజానీకం క్రమంగా జీవం కోల్పోతున్న స్థితికి దిగజారుతున్నారనే విషయం పట్టణవాసులకు తెలియదు. తాము పొందుతున్న ఈ దౌర్భాగ్యపు సౌకర్యం కూడా విదేశీ దోపిడిగానికి తాము దళారిగా చేసినపనికి ప్రతిఫలమనీ, జనసామాన్యాన్ని పీల్చిపిప్పిచేయడంద్వారానే ఈ లాభాలూ ఈ దళారీ వాటాలు లభించుతున్నాయనీ వారికి తెలియదు. ఇండియాలో బ్రిటిష్ ప్రభుత్వం ప్రజానీకాన్ని దోపిడీచేయడానికి కొనసాగింపబడుతున్నదని వారికి తెలియదు. తెలివితేటలతో పెడదారులను పట్టించే ప్రయత్నంగాని, అంకెల గారడీగాని గ్రామాలలో కంటికి స్పష్టంగా కన్పించే కంకాళాలను గురించిన సాక్ష్యాన్ని వివరించజాలవు. ఆ విధంగా బుద్ధిపూర్వకంగానో కాకుండానో దోపిడీచేసేవాని లాభంకోసం న్యాయపాలన నైతికంగా దిగజారింది. దేశపరిపాలన సాగించుతున్న ఇంగ్లీషువాళ్ళు, వారి భారతీయ భాగస్వాములూ, నేను పైన వర్ణించిన నేరాన్ని చేస్తున్నట్లు తాము తెలుసుకోకపోవడం గొప్ప దురదృష్టం.... పైనే గనుక భగవంతుడుంటే బహుశా చరిత్రలోనే అసమానమైన, మానవజాతికి వ్యతిరేకమైన ఈ నేరానికి ఇంగ్లండూ, భారతదేశంలోని పట్టణవాసులూ జవాబివ్వవలసి వుంటుందనడంలో నాకెట్టి సందేహంలేదు."

న్యాయమూర్తి బ్రూమ్‌ఫీల్డ్ శిక్ష విధించేముందు, గాంధీపట్ల గౌరవ పురస్సరంగా శిరస్సు వంచాడు. ఆయన ఇలా అన్నాడు : "న్యాయం వ్యక్తులను గౌరవించదు. ఐనా నేను విచారించిన, ఇకముందు విచారించబోతున్న వ్యక్తులకూ మీకూ తేడావుంది. మీ దేశంలోని లక్షలాది ప్రజల దృష్టిలో మీరు గొప్ప దేశభక్తులూ, గొప్ప నాయకులూ అనే విషయాన్ని మరచిపోవడం అసాధ్యమైనపని. రాజకీయాలలో మీతో విభేదించేవారు సైతం మిమ్మల్ని ఉన్నతాదర్శ వ్యక్తిఅనీ, మీది మహత్తర సాధుజీవితమనీ పరిగణిస్తారు."

ఆరేళ్ళ కఠినశిక్ష విధిస్తూ, ఒకవేళ ఆ తర్వాత ప్రభుత్వం ఆ శిక్షను తగ్గించదల్చితే, తనకంటే సంతోషించేవాడు మరొకడు లేడని బ్రూమ్‌ఫీల్డ్ అన్నాడు.

శిక్షను గాంధీ గంభీరంగా స్వీకరించాడు. జైలుకు పోవడం ఆయన సహాయ నిరాకరణ ఉద్యమంలో ఒక భాగం - "జైలుగేట్లను విశాలం చేయాలి. పెళ్ళికొడుకు పెళ్ళికూతురు గదిలోనికి వెళ్ళినట్లు వెళ్ళాలి. జైళ్ళ గోడల లోపల కొన్ని సమయాలలో ఉరికంబాలపైన స్వాతంత్ర్యాన్ని ఆహ్వానించాలి. అంతేకాని కౌన్సిల్ సభలలోను, కోర్టులలోను, స్కూళ్ళ గదుల్లోను కాదు" అని గాంధీ అభిప్రాయం. ఐతే గాంధీ పూర్తి శిక్షను అనుభవించలేదు. ఎపిండిసిటిస్‌తో బాధపడుతున్న గాంధీని 1924 జనవరి 12 న యెర్రవాడ జైలునుంచి పూనాలోని సాసూన్ హాస్పిటల్‌కు తరలించి శస్త్రచికిత్స చేశారు. శస్త్రచికిత్స జయప్రదమైంది. ఫిబ్రవరి 5 న గాంధీని విడుదల చేశారు.

సహాయ నిరాకరణోద్యమాన్ని విరమించినందుకు గాంధీని తీవ్రంగా విమర్శించిన వారిలో మోతీలాల్ నెహ్రూ, లాలా లజపతిరాయ్ ఉన్నారు. సుభాస్‌బోసు ఈ నిర్ణయాన్ని దేశానికి తీవ్ర దురదృష్టం అన్నాడు. జవహర్‌లాల్ నెహ్రూ తర్వాత తర్వాత గాంధీని సమర్థించినా, మొదట అందరిలాగానే ఆయనా ఆశ్చర్యపోయాడు, ఆందోళన చెందాడు. "కేప్ కామరిన్‌వద్ద ఒక గ్రామం అహింసను అమల్లోపెట్టకపోతే, హిమాలయ పర్వతంవద్ద ఒక పట్టణాన్ని ఎందుకు శిక్షించాలి? చౌరిచౌరాను అవసరమైతే గోరఖ్‌పూర్‌ను వేరుచేసి వ్యష్టిసమష్టి పౌరశాసనోల్లంఘనాన్ని కొనసాగించవలసివుంది" అన్నాడు లజపతిరాయ్.

1922 లో చిత్తరంజన్‌దాస్ జైలునుంచి బయటికి రాగానే, గాంధీ ఉద్యమాన్ని గందరగోళపరచి సరిగా నిర్వర్తించలేక పోయాడని విమర్శించాడు. గాంధీని ఒక ప్రక్క జీసస్ క్రీస్తుగా వర్ణిస్తూనే, చిత్తరంజన్‌దాస్, 1921 డిసెంబరులో రాజీని తీవ్రంగా ఎదిరించిన గాంధీయే 1922 ఫిబ్రవరిలో పూర్తిగా తిరోగమించడం, నిలకడలేని తనాన్ని సూచించుతుందని అన్నాడు. 'ఇది నాయకత్వం బలహీనతేగాని, ప్రజానీకం బలహీనత కాదు' అని యం. యన్. రాయ్ అన్నాడు.

అయితే ఈ నిర్ణయంవల్ల ఊపిరి పీల్చుకొన్నది బ్రిటిష్ ప్రభుత్వమే. ప్రభుత్వం ఆనాడెంత గాభరా పడిందో వైస్రాయి, భారత రాజ్యాంగ కార్యదర్శికి ఫిబ్రవరి 9 న రాసిన లేఖ స్పష్టం చేస్తుంది.

"పట్టణాల్లోని క్రింది తరగతులు సహాయ నిరాకరణ ఉద్యమ ప్రభావానికి తీవ్రంగా లోనయ్యాయి.... కొన్ని ప్రాంతాలలో రైతాంగం ముఖ్యంగా అస్సాం లోయలోని కొన్ని భాగాలలో సంయుక్త రాష్ట్రం (యు.పి)లో బీహార్, ఒరిస్సా, బెంగాల్‌లోని కొన్ని ప్రాంతాలలో రైతాంగం దాని ప్రభావానికి లోనైంది.... పంజాబ్‌లో అకాలీ ఆందోళన....గ్రామాల్లోని సిక్కుల లోకి వ్యాపించింది. మహమ్మదీయ జనాభాలో అత్యధిక భాగం క్రోధంతో కుమిలిపోతున్నారు గతంలో కంటే మరింత దృఢమైన అరాచకాన్ని ఎదుర్కోడానికి భారత ప్రభుత్వం సంసిద్ధంగా వుంది. ఈ పరిస్థితి మూలంగా గొప్ప ఆందోళన చెందామనే విషయాన్ని తక్కువగా అంచనా వేయదలచుకోలేదు."

బొంబాయి గవర్నర్ లార్డ్‌లాయడ్, ఒక అమెరికా విలేకరికి ఇచ్చిన ఇంటర్వ్యూలో ఇలా అన్నాడు : "ఆయన (గాంధీ) మమ్మల్ని గాభరా పెట్టేశాడు; ఆయన కార్యక్రమం మూలంగా మా జైళ్ళు నిండి పోయాయి. ప్రజల్ని శాశ్వతంగా అరెస్టు చేయలేమనే సంగతి మీకు తెలిసిందే. 31 కోట్ల 90 లక్షలమందిని అరెస్టు చేయలేం గదా. ఆయనే గనక తర్వాతి కార్యక్రమాన్ని కూడా ఆచరించి, పన్నులు చెల్లించ నిరాకరించితే, మేం ఎక్కడ వుండేవాళ్ళమో దేవుడికే తెలియాలి!"

అయితే బార్డోలీ విరమణ తీర్మానంలోని 7 అంశాలలో మూడు అంశాలు తులు సత్వరం భూస్వాములకు, ప్రభుత్వానికి....చె ంచాలని నొక్కిచెప్పాయి. భూస్వాముల "చట్టబ మైన హక్కుల" గురించి ప్రస్తావించాయి.

ఈ విధంగా చూసినపుడు ఈ వుద్యమం విఫలమైనమాట నిజమే. ఇంతేగాక ముస్లిములలో నైరాశ్యం పెరిగింది. పోలక్ ఇలా అన్నాడు : "ముస్లిములు ఈ దెబ్బకు కుంగిపోయారు. హిందూ ముస్లిముల ఐక్యతకు ఈ కొద్దికాలంలో ఏర్పడిన సఖ్యత, విశ్వాసం తిరిగి నెలకొల్పడం సాధ్యంకాలేదు." ఈలోగా పరి తులు మారిపోయాయి. టర్కీలో కమాల్ పాషా భుత్వం వచ్చి, లౌకిక ప్రభుత్వాన్ని ఏర్పరచింది. 1 22 లో ఖలీఫాను రద్దుచేసి ప్రవాసం పంపించింది. ఈ నిరాశా వాతావరణంలో జవహర్‌లాల్ నెహ్రూ చెప్పినట్లు అణచివేయబడిన క్రోధం పెడదారిపట్టి హిందూ ముస్లిం ఘ ణలకు దారితీసింది.

ఈ ఉద మ వైఫల్యాలను ఇలా చూస్తూ, ఇది దేశంలో ర ల్చిన అపూర్వ స్వాతంత్ర్య పిపాసను, చైతన్యాన్ని మరచిపోకూడదు.

"1921 పూర్వం కాంగ్రెస్ కేవలం చ బద్ధమైన సంస్థ. ఉపన్యాసాలు, విజ్ఞప్తులతో సంతృ పడేది. గాంధీ దానికొక నిర్మాణ స్వరూపం ఇచ్చా . నిబంధనావళి తయారు చేశాడు. దేశవ్యాపిత పునాదిని దానికి ఏర్పరచాడు. పైగా విప్లవ సంస్థగా మార్చాడు. అన్ని చోట్ల ఒకే నినాదం వినబడేది. ఒకే విధానం, ఒకే సిద్ధాంతం ఆ మూలనుంచి ఈ మూలవరకు భారతదేశమంతా వ్యాపించింది. ఇంగ్లీషు బదులు హిందీ దేశభాష అయింది. ఖాదీ కాంగ్రెసువాదుల అధికారిక దుస్తులయ్యాయి" అని సుభాస్‌బోస్ అన్నాడు.

"పీడన, నిరాశ అనే పాత భావాలు పూర్తిగా పోయాయి. గుసగుసలు, ప్రభుత్వంతో ఎక్కడ చిక్కుల్లో పడతామోనని తప్పించుకొనేందుకు డొంక తిరుగుడుగా చట్టబద్ధ పదజాలాన్ని వాడటం పోయింది. మేం అనుకొన్నదేమో అనేశాం. అనుకొన్నదేదో బాహాటంగా ఇండ్లకప్పుల కెక్కి మరీ అరచాం," అని జవహర్‌లాల్ అన్నాడు. జైలంటే భయంపోయింది. జవహర్‌లాల్‌నెహ్రూ మాటల్లో "జైలు మాకు స్వర్గమయింది. తీర్థయాత్రికుల పవిత్రస్థల మయింది."

"గాంధీ భారతదేశానికి నూతనంగా ఆత్మగౌరవాన్ని నేర్పాడు. తమ దేశంకోసం బాధలనుభవించడానికి సంసిద్ధపడటానికి ఆయన తన దేశస్థులను ఉత్తేజ పరచాడు" అని గ్రిఫిత్స్ రాశాడు.

1922 లో జరిగిన గయ కాంగ్రెస్ మహాసభలో చిత్తరంజన్‌దాస్ ఇలా అన్నాడు — "ఉద్యమం గెలవడమో, ఓడిపోవడమో జరగాలని సాధారణంగా అందరి భావన. కాని వాస్తవమేమంటే, మానవ ఉద్యమాలు, నిజమైన ఉద్యమాలు పూర్తిగా ఓడిపోవడంగాని, పూర్తిగా జయించడంగాని జరగదు. ప్రతి నిజమైన ఉద్యమం ఒక ఆదర్శంకోసం ప్రారంభమవుతుంది. కాని ఆదర్శం ఎప్పుడూ ఉద్యమంకంటే పైనే వుంటుంది. సహాయ నిరాకరణ ఉద్యమం భారత దేశంలో విజయవంతమయిందా? అని ప్రశ్న. అవును. విజయవంతమైంది. స్వరాజ్యంకోసం కాంక్ష,

దేశం నలుమూలలా చైతన్యాన్ని రగిల్చిందని ఆలోచించినపుడు అది గొప్ప విజయం....పైగా విద్యా సంస్థలు, కోర్టులు, శాసనసభలు దేశమంతటా ప్రతిష్ఠను కోల్పోయాయి....కేవలం అంకెల్లో విజయాన్ని లెక్కవేయాలంటే మనం చేసింది తక్కువ. చేయవలసింది చాలా ఎక్కువ .... విమర్శకులకు నేచెప్పే దేమంటే అనేక విధాల మనం విఫలమయ్యాం. మనం విజయం పొందిన ఘటనలను మీరు విజయంగా అంగీకరించరా ?

హీరేన్‌ముఖర్జీ ఇలా రాశాడు : "ఉద్యమవైఫల్యం ఎంత విషాదకరమైనదైనా, ఆ ఉజ్వల దినాల్ని మరచిపోలేం. భారతదేశ చరిత్రలో ఇంతకు ముందు అలాంటి చైతన్య జీవం తొణికిసలాడలేదు. 'హిందూ-ముస్లింకీ జై' అని ఇంతకుముందు ఇంత ఉత్సాహంగా నినాదాలతో దేశం ప్రతిధ్వనించలేదు. గాంధీతో పోల్చదగిన నాయకుడు అంతకుముందు జనించలేదు. ఉద్యమంలో ఇంకా చాలా గండ్లున్నాయి. దృఢమైన పునాదిపైన హిందూ ముస్లిమ్ ఐక్యత ఏర్పడలేదు. కార్మికులు, కర్షకులు సోషలిస్టు సిద్ధాంతాన్ని, ఆచరణనూ అలవరచుకోలేదు. నాయకత్వం, ఆత్మవిశ్వాసం లేక ఊగిసలాడినప్పుడు, అలసిపోయినప్పుడు, ప్రజాసామాన్యం తమంతకు తాము ముందుకు సాగిపోయే దశకు రాలేదు.'

భారత ప్రభుత్వం బ్రిటిష్ పార్లమెంట్‌కు సమర్పించిన నివేదికలో చెప్పినట్లు "వచ్చే కొలది సంవత్సరాలలో అది (బ్రిటిష్ ప్రభుత్వానికి) అపాయాల్నీ, చిక్కుల్నీ అపారంగా పెపొందిస్తుంది అనడంలో ఎవరూ కాదనలేరు "

# స్వరాజ్య పార్టీ

సహాయనిరాకరణ ఉద్యమాన్ని విరమింపచేయటం ప్రజల్ని విభ్రాంతుల్ని చేసింది గాంధీని అరెస్టు చేశారనే వదంతితోనే 1920 లో అల్లర్లు జరిగాయి. కాని యీసారి గాంధీకి ఆరేళ్ళ శిక్ష విధించబడినా ప్రజలు కిమ్మనలేదు. ఇది అహింసాతత్వ విజయంగా కొందరు భావించినా,నిజానికి హతాశపరిణామాలు ప్రజల్ని నిశ్చేష్టుల్ని చేశాయి.

లక్నోలో 1922 జూన్‌లో ఆలిండియా కాంగ్రెస్ కమిటీ సమావేశమైనపుడు శాసనోల్లంఘనం తిరిగి ప్రారంభించాలనే చర్చ వచ్చింది. శాసనోల్లంఘనానికి దేశం తయారుగా వుందో లేదో తెలుసుకోడానికి ఒక విచారణ కమిటీని అది నియమించింది ఆ కమిటీ అధ్యక్షుడుగా హకీమ్ అజ్మల్‌ఖాన్, సభ్యులుగా పండిత మోతీలాల్ నెహ్రూ, డాక్టరు అన్సారీ, సి. రాజగోపాలాచారి, వి.జె. పటేల్, యస్. కస్తూరి రంగ అయ్యంగార్ వున్నారు. ఈ కమిటీ అన్ని రాష్ట్రాలలో పర్యటించి, ప్రస్తుతానికి శాసనోల్లంఘన ఆచరణ సాధ్యంకాదని తెలియచేసింది. ఈ కమిటీలోని ముగ్గురు సభ్యులు హకీం అజ్మల్‌ఖాన్, మోతీలాల్ నెహ్రూ, వి.జె. పటేల్, శాసనసభా సంస్కరణల్ని ధ్వంసం చేయడానికి, శాసన సభలలో ప్రవేశించాలని అన్నారు. ఇది శాసనోల్లంఘనను పోలిన ఉద్యమమే అన్నారు. ఇది ఆచరణ యోగ్యమైన, వాంఛనీయమైన మార్గం అనీ అన్నారు. తక్కిన ముగ్గురూ ఇందుకు వ్యతిరేకించారు. లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ స్థానాల్లో మెజారిటీ రావడం అసాధ్యమనీ, అందువల్ల అనుకున్న విధంగా ప్రతిష్ఠంభన కలుగచేయలేమనీ అన్నారు.

శాసనసభలలో ప్రవేశించి, వాటి ద్వారానే సహాయ నిరాకరణ నూతన కార్యక్రమాన్ని సాగించాలని చిత్తరంజన్‌దాస్, ఇతర బెంగాలీ నాయకులు అలీపూర్ సెంట్రల్ జైలులో వున్నపుడే భావించారు. 1922 మే లో చిట్టగాంగ్ కాంగ్రెస్ కార్యకర్తల సమావేశంలో చిత్తరంజన్‌దాస్ భార్య, దాస్ భావాలను తెలియజేశారు. నాటినుంచి శాసనసభా ప్రవేశం పట్ల మొగ్గు పెరగసాగింది. మోతీలాల్ నెహ్రూ, దాస్ అభిప్రాయాలతో ఏకీభవించారు. అయితే ఈ పంథాను వ్యతిరేకించేవారు, ఇది వరలో గాంధీ అన్న వాక్యాలనే ఉదహరిస్తూ, శాసనసభలలో ప్రవేశించి వాటిని

భగ్నపరచజూడటం- చేసిన ప్రమాణానికే వ్యతిరేక మనీ, చిత్తశుద్ధితో కూడిన పనికాదనీ వాదించారు. పైగా ప్రతిష్టంభన తొలగించేందుకు 'వీటో' అధికారం ప్రభుత్వానికున్నదని వీరన్నారు.

1922 అక్టోబర్‌లో విచారణ కమిటీ, నివేదిక వెలువడిన తర్వాత, దానిపై నవంబరులో జరిగిన ఆలిండియా కాంగ్రెస్ కమిటీలో తర్జన భర్జనలు జరిగాయి. అయిదు రోజుల చర్చ అనంతరం, పరిమిత స్థాయిలో శాసనోల్లంఘనానికి రాష్ట్ర కాంగ్రెస్ కమిటీలకు అధికార మిచ్చింది.

1922 డిసెంబర్‌లో గయలో జరిగిన కాంగ్రెస్, మహాసభలో శాసనసభా ప్రవేశంపై తీవ్ర చర్చలు జరిగాయి. శాసనసభలలో ప్రవేశించాలనే వారిని ప్రో చేంజర్సు (మార్పు కావాలనే వారు) గాను, అందుకు వ్యతిరేకులైన వారిని నో చేంజర్సు (మార్పుకోరని వారు- యథాతథవాదులు)గాను, ఆనాటి నుంచీ పిలుస్తూ వచ్చారు. ఈ కాంగ్రెస్‌కు అధ్యక్షుడు చిత్తరంజన్ దాస్. తన ఉపన్యాసంలో ఆయన శాసన సభా ప్రవేశ ఆవశ్యకత గురించి గట్టిగా వాదించాడు. శాసనసభా ప్రవేశాన్ని వ్యతిరేకిస్తూ రాజగోపాలాచారి ప్రవేశ పెట్టిన తీర్మానం విషయ నిర్ధారణ సభలోను, మహాసభలోను నెగ్గింది.

ఇంతేగాక శాసనోల్లంఘనానికి కాంగ్రెస్ కార్యకర్తలు సన్నాహాలు పూర్తి చేయాలని, 25 లక్షల రూపాయల తిలక్ స్వరాజ్య ఫండ్‌ను పోగు చేయాలనీ, అహ్మదాబాద్ శపథాన్ని అంగీకరించిన 50 వేల వలంటీర్లను, ఆలిండియా కాంగ్రెస్ కమిటీ నిర్ణయించే తేదీ నాటికి పోగుచేయాలనీ కాంగ్రెస్ తీర్మానించింది.

1922 డిసెంబర్ 31 నాటికి కాంగ్రెస్ మహాసభ పూర్తిఅయింది. మరునాడు 1923 జనవరి 1 న ఆలిండియా కాంగ్రెస్ కమిటీ సమావేశమైంది. చిత్తరంజన్‌దాస్ రాజీనామా సమర్పించాడు. కాంగ్రెస్‌లో ఆమోదించబడిన కొన్ని తీర్మానాలను తాను అంగీకరించడం లేదు గనుక తాను అధ్యక్షుడిగా ఉండటం భావ్యం కాదని అన్నాడు. అయితే కాంగ్రెస్‌ను విడిచిపెట్టడం లేదని ఆయన అన్నాడు.

శాసనసభా ప్రవేశం కోరేవారు, కాంగ్రెస్ లోపలే మరో పార్టీని పెట్టారు. దానికి "కాంగ్రెస్, ఖిలాఫత్ స్వరాజ్యపార్టీ" అని పేరు పెట్టారు. దీనికి చిత్తరంజన్‌దాస్ అధ్యక్షుడు. మోతీలాల్ నెహ్రూ మరో ఇద్దరు కార్యదర్శులు. వీరు ప్రకటించిన ప్రణాళికపై వందమందికి పైగా ప్రముఖులు సంతకాలు చేశారు.

1923 నవంబరులో వీరు ఎన్నికలలో పోటీ చేశారు. ఎన్నికల్లో మితవాద ఫెడరేషన్‌తో అవగాహనకు రావడానికి వీరు తిరస్కరించారు. ఎక్కువ వ్యవధి లేకపోయినా మితవాదుల్ని ఎన్నికల్లో చిత్తు చేశారు. మధ్య రాష్ట్రం (సి.పి)లో పూర్తి మెజారిటీ వచ్చింది. బెంగాల్ కౌన్సిల్‌లో అది పెద్ద పార్టీగా వచ్చింది. సంయు రాష్ట్రం (యు.పి) అస్సాంలలో రెండవ పె పార్టీగా వచ్చింది. కేంద్ర అసెంబ్లీకి గల 10 స్థానాల్లో 42 స్థానాలు వచ్చాయి.

1924 ఫిబ్రవరిలో గాంధీ జైలునుంచి విడుదలయ్యాక. మోతీలాల్‌నెహ్రూ గాంధీని కలుసుకొన్నాడు. సహాయ నిరాకరణోద్యమానికీ, శాసనసభాప్రవేశానికీ పొసగదని గాంధీ అభిప్రాయపడినా, స్వరాజ్యవాదులకు అడ్డంకి కలిగించరాదని భావించాడు. గాంధీ, చిత్తరంజన్‌దాసుల మధ్య ఒడంబడిక కుదిరింది. స్వరాజ్యపార్టీ శాసన సభలలోనూ, ఇతరులు శాసనసభల బయటా పనిచేయడానికి అంగీకరించాడు. దాన్ని 1924 డిసెంబర్‌లో బెల్గాంలో జరిగిన కాంగ్రెస్ ధృవీకరించింది.

నేషనలిస్టుపార్టీ, తదితర సభ్యులు కొంతమంది సహకారంతో స్వరాజ్యపార్టీ కేంద్ర అసెంబ్లీలో కొన్ని విజయాల్ని సాధించింది భారతదేశంలో సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పరచాలనే తీర్మానం 1924 ఫిబ్రవరి 18 న కేంద్ర అసెంబ్లీలో ఆమోదింపబడింది. భారతదేశ రాజ్యాంగాన్ని రూపొందించడానికి వివిధ ప్రతినిధులతో రౌండ్‌టేబుల్ సమావేశం జరపడానికి త్వరలో ఒక నిర్ణీత సమయాన్ని నిర్ణయించాలని స్వరాజ్యపార్టీ కోరింది. 1924-25 బడ్జెట్ అంశాలు కొన్ని, స్వరాజ్యపార్టీ కృషివల్ల, కేంద్ర అసెంబ్లీలో తిరస్కరింపబడ్డాయి. నాన్సు బిల్లు ప్రవేశపెట్టగా దానికి మొత్తంగా కేంద్ర అసెంబ్లీ తిరస్కరించిం . కొన్ని చట్టాల్ని ఉపసంహరించాలని వి. జె. పటేల్ పెట్టిన బిల్లు, ఒక్క మినహాయింపుతో నెగ్గింది. రాజకీయ ఖైదీల విడుదలకు ప్రవేశపెట్టిన తీర్మానం, స్వరాజ్యపార్టీ సహకారంతో నెగ్గింది.

ప్రభుత్వ విధానాలకు నిరసనగా అనేకసా స్వరాజ్య పార్టీ సభ్యులు వాకౌట్ చేశారు. ప్రభుత ం ఏర్పాటు చేసిన సభల్ని, ఆతిథ్యాల్ని వారు బహి ్కరించారు. రాష్ట్ర శాసన సభల్లోకూడా ఇదే విధంగా స్వరాజ్యపార్టీ సభ్యులు పనిచేశారు.

అయితే ఈ ఎత్తుగడలకు తోడుగా, బయట ఏవవ కార్యకలాపాలు లేకపోతే, వీటివల్ల లాభం లేదని సురేంద్రనాథ బెనర్జీ లాంటి వాళ్ళు సైతం విమర్శిం చారు. ఐనా "ఒక నిర్దిత కార్యక్రమంతో పనిచేసే పార్టీ, బాగా సుసంఘటితమైన, క్రమశిక్షణగలపార్టీ - స్వరాజ్యపార్టీ" అని సైమన్ కమిషన్ తన నివేదికలో రాసింది.

1925 జూన్‌లో చిత్తరంజన్‌దాస్ మరణించిన త త స్వరాజ్యపార్టీ ప్రతిఘటన సన్నగిల్లింది. లె టివ్ కౌన్సిల్‌లో స్వరాజ్యపార్టీ పక్షానికి అధ్య క్షుడు వున్న శ్రీపాదబలవంత తాంబే, గవర్నర్ కార్యనిర్వాహక వర్గ సభ్యునిగా నియమింపబడ్డాడు. దానికి ఆయన ఆమోదించాడు. ఈ చర్యను కొందరు ఖండించారు. కేల్కార్, జయకర్‌లు సమర్థించారు. స్వరాజ్యపార్టీ కార్యనిర్వాహక వర్గం నాగపూర్‌లో సమావేశమై తాంబే చర్యను ఖండించింది. కేల్కార్, జయకర్‌లు స్వరాజ్యపార్టీకి రాజీనామా నిచ్చారు. తర్వాత వీరిద్దరూ మూంజీ, శాసనసభ సభ్యత్వానికి కూడా రాజీనామా చేశారు. వి. జె. పటేల్ కేంద్ర అసెంబ్లీ స్పీకర్ అయ్యాడు. 1919 రాజ్యాంగచట్టం పనిచేసే తీరు తెన్నులను విచారించి, భవిష్యత్‌లో దాని అభివృద్ధికి సూచన లివ్వడానికిగాను, ఒక కమిటీ 1924 డిసెంబర్‌లో ప్రభుత్వం నియమించింది. దానికి అలెగ్జాండర్ మడ్డిమన్ అధ్యక్షుడు. ఈ కమిటీలో సభ్యునిగా వుండవలసిందిగా కోరినపుడు మోతీలాల్ నెహ్రూ తిరస్కరించాడు. కాని సైన్యాన్ని త్వరగా భారతీయం చేయాలనే అంశంపై స్కీన్ కమిటీని ప్రభుత్వం ఏర్పరచినపుడు, ఆ సభ్యత్వాన్ని అంగీక రించాడు. 1926 లో "బాధ్యతాయుత సహకార" పార్టీ, అలాగే మరొక "నేషనలిస్టుపార్టీ" ఏర్పడ్డాయి. స రాజ్యపార్టీలో తలెత్తిన విభేదాల్ని తొలగించే యత్నాలు విఫలమయ్యాయి. కేంద్ర అసెంబ్లీలో నిచేసే విధానంపై మోతీలాల్ నెహ్రూ, లజపతి రాయ్‌ల మధ్య ఏర్పడ్డ విభేదాలవల్ల, లజపతిరాయ్ కేంద్ర అసెంబ్లీలోని కాంగ్రెస్ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చాడు. 1926 మార్చిలో కేంద్ర అసెంబ్లీనుంచి వాకౌట్ చేయడానికి స్వరాజ్యపార్టీ నిర్ణయించింది.

1926 నవంబర్‌లో ఎన్నికలు జరిగాయి. స్వరాజ్య పార్టీయేగాక, ఇతర పార్టీలు కూడా ప్రత్యక్ష మయ్యాయి. ఇదివరలా "నిరంతర నిరోధక" విధా నాన్ని స్వరాజ్యపార్టీ జయప్రదంగా అమలు చేయలేక పోయింది.

గౌహతిలో జరిగిన కాంగ్రెస్ మహాసభ, కాంగ్రెస్ జాతీయ కోర్కెను ప్రభుత్వం అంగీకరించేంతవరకూ, మంత్రి పదవుల్ని కాంగ్రెస్ స్వీకరించరాదనీ, ఇతర పార్టీలు అందుకు ప్రయత్నించితే ఎదుర్కోవాలనీ తీర్మానించింది. బడ్జెట్‌ను, ప్రభుత్వం తన అధి కారాన్ని బలపరచుకొనేందుకు చేసే అన్ని శాసనాల్ని ఎదిరించాలనికూడా తీరా నించింది. స్పష్టమైన ఈ వైఖరికూడా స్వరాజ్యపా ని బలహీనపరచింది.

1926 మార్చిలో శాస సభలనుండి స్వరాజ్యపార్టీ వాకౌట్ చేసినా, కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ అనుమతితో, వీరు తిరిగి శాసనసభలలోకి వస్తూ వుండేవారు. స్వరాజ్యపార్టీ వారు ఇలా శాసన సభలో, వాకౌట్ చేయడం, మళ్ళా తిరిగి రావటం - ఇదంతా చూసిన ఒకరు "సంచార దేశభక్తులు" అని హేళన చేశారు. మరొకరు "ఒకచోట నుండి మరొక చోటికి కదిలిపోయే దేశభక్తి" అని హేళన చేశారు. చివరకు 1926 ఎన్నికల్లో స్వరాజ్యపార్టీ మద్రాసులో తప్ప తక్కినచోట్ల దెబ్బ తింది.

శాసన సభల్ని "మట్టు పెడతాం" అనీ, వాటిని అంతం చేస్తామనీ "శాసనసభా సంస్కరణల్ని విధ్వం సం చేస్తా"మనీ స్వరాజ్యపార్టీ తమ లక్ష్యంగా చెప్పు కొంది. కాని ఆ లక్ష్యం నెరవేరలేదు. సహాయ నిరా కరణ ఉద్యమాన్ని హఠాత్తుగా విరమించినప్పుడు ప్రజ లలో కల్గిన నిస్పృహను పోగొట్టి ఉత్సాహం కలిగించ డంలో స్వరాజ్యపార్టీ మంచిసేవ చేసింది. ప్రభుత్వం ప్రతిపాదించిన బడ్జెట్‌ను, బిల్లులను తోసివేయడం దా రా ప్రజలలో అస క్తిని రేకెత్తించింది. ప్రపంచ దృ లో భారత ప్రభుత్వాన్ని నవ్వులపాలు చేసింది. విదే ప్రభుత్వంపై ప్రతిఘటన తత్వాన్ని కూడా కొంతకాలం నిలపగల్గింది. కాని మహదేవ దేశాయ్ దృష్టిలో "శాసనసభా కార్యక్రమం, బాణాసంచాలలాంటి

అమృతిమైన ఉపన్యాసాల వరకూ. బాగానే విజయవంతమైంది. ప్రభుత్వం అపజయం తర్వాత మరో అపజయాన్ని పొందుతూ వచ్చింది. కాని ఇవేవీ మనం బలపడేలా చేయలేదు"

స్వాతంత్ర్య సమరంలో ఎక్కడా కన్పించని అవకాశవాదులు స్వరాజ్యపార్టీలో చేరారు. శాసన సభన్ని ప్రభుత్వాన్ని బట్టబయలు చేయడానికి ఉపయోగించుకోవాలనీ, సామ్రాజ్య పరిపాలకులకు వ్యతిరేకంగా ప్రచారం సాగించాలనీ అనుకున్న లక్ష్యాన్ని వారు విడనాడారు. సానుకూల సహకారం పేరుతో ప్రభుత్వంతో మిలాఖతై, తమ స్వంతగ్రూపుల్ని ఏర్పరచుకొన్నారు. ఇలా జారిపోయినవారు క్రమంగా మతతత్వ వాదులయ్యారు. ఇదంతా స్వరాజ్యపార్టీ క్షీణించడానికి దారితీసింది. ఇది అవకాశంగా తీసుకొని ప్రభుత్వం ఎదురుదాడి ప్రారంభించింది. 1927 కరెన్సీబిల్లు రూపాయి మారకం విలువను 1 షిల్లింగ్ 6 పెన్నీలుగా నిర్ణయించడం, 1927 ఉక్కు రక్షణ బిల్లు - మొదలైనవి ఈ దాడిలో భాగాలు. రాజ్యాంగ సంస్కరణల గురించి, అభిప్రాయ సేకరణకు అందరూ తెల్లవాళ్ళతో కూడిన సైమన్ కమిషన్‌ను నియమించుతున్న 1927 చివరిలో భారత రాజ్యాంగ కార్యదర్శి - బర్కెన్ హెడ్ ప్రకటించడం-ఈ దాడి పరాకాష్ట పోయిందన డానికి నిదర్శనం.

# 1923 - 30 మధ్యకాలంలో వివిధ ఉద్యమాలు

1923-30 సంవత్సరాల మధ్య శాసనసభా రంగం వెలుపల జరిగిన ఘటనలను స్థూలంగా పరిశీలించాల్సి వుంటుంది. సహాయ నిరాకరణ ఉద్యమ విరమణ తర్వాత, అంతకుముందు కన్పించిన హిందూ-ముస్లిమ్ ఐక్యత రానురాను క్షీణించసాగింది. మత కలహాలు వృద్ధి కావటం మొదలుపెట్టాయి. కొన్నిచోట్ల తమ వర్గహక్కులకోసం సాగి చిన పోట్లాటలు మతం ముసుగులో కూడా సాగాయి. 1917లో ఏర్పడిన ముస్లింలీగ్, హిందూ మహాసభలు తిరిగి తీవ్రంగా పనిచేయసాగాయి. 1919లో ఢిల్లీ జుమ్మామసీదునుంచి ఉపన్యసించవలసిందిగా ఆహ్వానింపబడిన స్వామి శ్రద్ధానంద ముస్లిముల ఆగ్రహానికి కారకుడయ్యాడు ఆయన ఒక వైపున జాతీయత అనే పదం వాడుతూనే, మతాంతరులైన ముస్లిములను "శుద్ధి" కార్యక్రమంద్వారా తిరిగి హిందువులుగా మతాంతరీకరణ ప్రారంభించాడు. హిందూ "సంఘటన" కార్యక్రమం కూడా సాగించాడు. ఇదే సమయంలో సుప్రసిద్ధ దేశభక్తుడైన సైఫుద్దీన్ కిచ్లూ, ముస్లిములను బలమైన శక్తిపంతమైన వారినిగా చేయడానికి "తాంజీమ్", "తబ్లిఘ్" ఉద్యమాలను ప్రారంభించాడు. ఢిల్లీ లక్నో, అలహాబాద్, జబల్‌పూర్, నాగపూర్‌లలో మతకలహాలు చెలరేగాయి. 19 4 సెప్టెంబర్ 9, 10 తేదీలలో వాయువ్య రాష్ట్రంలోని కోహట్‌లో జరిగిన మతకల్లోలంలో కాల్పులు, హత్యలు జరిగాయి. 36గురు చనిపోయారు. 145మంది గాయపడ్డారు. 4 వేలమంది హిందువులు ప్రత్యేక రైలులో ఇతర ప్రాంతాలకు తరలింపబడ్డారు. రెండు నెలలపాటు వీరు రావల్పిండి మొదలైనచోట్ల నివసించారు. అక్కడి పరిస్థితుల్ని విచారించడానికి గాంధీ వెళ్ళడానికి ప్రయత్నించగా ప్రభుత్వం అనుమతి నిరాకరించింది.

1924 సెప్టెంబర్ 18న గాంధీ హిందూ-ముస్లిమ్ సామరస్యం కోసం 21 దినాల ఉపవాసం ప్రారంభించి అక్టోబర్ 8న విరమించాడు. ఢిల్లీలోని మహమ్మదలీ ఇంట్లో ఈ నిరాహారవ్రతం ప్రారంభమైంది. కొన్నాళ్ళయిన తర్వాత గాంధీని నగరం వెలుపల మరోచోటికి తరలించారు.

నిరాహారవ్రత సమయంలోనే గాంధీ శయ్యపక్కన వివిధ నాయకులతో ఐక్యతాసభ జరిగింది. హిందూ ముస్లిం తదితర రాజకీయ నాయకులే గాక, కలకత్తా బిషప్ కూడా ఈ సమావేశానికి హాజరయ్యాడు. మత స్వాతంత్ర్యానికి, ఇతరుల అంతరాత్మకు నొప్పి కలిగించకుండా ప్రవర్తించాలని వీరు ప్రమాణం చేశారు. మత ఘర్షణలకు దారితీసే సున్నిత విషయాలలో, ఆ ఘర్షణలు ఉత్పన్నం కాకుండేదుకు కొన్ని నియమాల్ని ఏర్పాటు చేశారు.

ఐనా ఆ తర్వాత రెండేళ్ళలో కూడ మతకలహాలు సాగుతూనే వచ్చాయి 1925 లో పదహారు మత ఘర్షణలు జరిగాయి 1926లో కలక  లో మత ఘర్షణలు తీవ్రరూపం దాల్చాయి. పెద్ద ప ణాల నుంచి చిన్న పట్టణాలకు వ్యాపించాయి. 192 -27 సంవత్సరాల మధ్య 112 ఘర్షణలు జరిగాయనీ, 450 మంది ప్రాణాలు కోల్పోయారనీ, 5 వేలమంది గాయపడ్డారనీ సైమన్ కమిషన్ తెలియజేసింది.

1927 ఆగస్టులో సిమ్లాలోను, తర్వాత రెండు నెలలకు కలకత్తాలోను ఐకమత్యసభలు జరిగాయి. సిమ్లా సభలో పరిష్కారానికి వివరాలు తయారు చేసేందుకు ఒక కమిటీని నియమించారు. ఆ కమిటీ సభ్యులు కోరినపుడు తిరిగిసమావేశం కావాలని నిర్ణయించుకొన్నారు. కాని అలాంటి సమావేశం జరగాలనే అభ్యర్ధనను సభ్యులు మళ్ళా కోరలేదు. కలకత్తా సభలో కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీనివాస అయ్యంగార్ ఆధ్వర్యాన కొన్ని తీర్మానాలు చేశారు. ఐనా సామరస్యం కల్గలేదు. అన్ని పార్టీల వారిచేత మత రాజకీయాలనుంచి దూరంగా వుండే ప్రమాణంపైన సంతకాలు చేయించడానికి మోతీలాల్, ఆజాద్‌లు చేసిన ప్రయత్నాలుకూడా ఫలించలేదు. బ్రిటిష్ ప్రభుత్వం సైమన్ కమిషన్ గురించి ప్రకటించిన తర్వాత మళ్ళీ ఈ సమస్యకు శాశ్వత పరిష్కారం చేయాలని ప్రయ లు జరిగాయి. ఒకవైపు స్వాతంత్ర్య ఉద్యమ శ లు ఈ విధంగా చీలిపోతున్న సమయంలోనే  భుత్వ నిర్బంధ విధానం తీవ్రతరమైంది. రైతాంగ ఉద్యమాలను, కార్మిక సంఘాలను అణచడం మొదలుపెట్టింది. కుట్ర కేసులు బనాయించింది.

1924 చివరి భాగంలో స్వరాజ్యపార్టీపై ప్రభుత్వం దుష్ప్రచారం సాగించింది. చిత్తరంజన్‌దాస్ ఆయన అనుచరులు దేశానికి శత్రువులని నిందించింది. 1924 అక్టోబర్ 25 న బెంగాల్ గవర్నర్ ఒక ఆర్డినెన్సు ప్రకటించాడు. అరెస్టులు, విచ్చలవిడిగా సోదాలు జరిగాయి. 60 ప్రదేశాల్లో ఉదయం మొదలు సాయంత్రం దాకా సోదాలు జరిగాయి. కలకత్తా కాంగ్రెస్ కార్పొరేషన్‌లో ముఖ్య కార్యనిర్వాహణాధికారిగా వున్న సుభాష్ చంద్రబోసనూ, మరో 40 మంది కాంగ్రెస్ వాదులనూ అరెస్టు చేసింది. బాంబులు, రివాల్వర్లు ప్రేలుడు సామగ్రిని స్వాధీనపరుచుకోడానికి సోదాచేస్తున్నట్లు వారెంట్‌లలో ప్రభుత్వం తెలిపింది. వాటిలో ఒక్కటి కూడా యీ సోదాల్లో దొరకలేదు.

## అల్లూరి సీతారామరాజు తిరుగుబాటు

ఇదే సంవత్సరం బ్రిటిష్ ప్రభుత్వాన్ని గడగడలాడించిన సాయుధ తిరుగుబాటు ఆంధ్రలో జరిగింది. గోదావరి, విశాఖపట్నం జిల్లాలలోని గూడెం ఏజన్సీలో అల్లూరి సీతారామరాజు నాయకత్వాన ఈ తిరుగుబాటు జరిగింది. కొ ండ ప్రాంత ప్రజల, మన్యం ప్రజల దురవస్థలను నివారించడ మొక్కటే ఈ తిరుగుబాటు లక్ష్యంకాదు. బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలద్రోసి స్వరాజ్యం సాధించడం కూడా ఈ తిరుగుబాటులక్ష్యం. ఈ తిరుగుబాటు లక్ష్యం ప్రజా స్వాతంత్ర్యమనీ, యుద్ధం చే గాని స్వరాజ్యంరాదనీ, 19.3 ఏప్రిల్ 21 న ఆం పత్రిక విలేకరికి సీతారామరాజు చెప్పినట్లు చరి కారులు రాశారు.

అల్లూరి సీతారామరాజు అసలుపేరు శ్రీరామరాజు. సీతారామరాజుగా తర్వాత ప్రసిద్ధి చెందాడు. 1897 లో జన్మించిన సీతారామరాజు, చిన్నవయసులోనే మన ం ప్రజలను ప్రభుత్వంపై తిరుగుబాటుకు సన్న ం చేశాడు. 1922 ఆగస్టు 22 న చింతపల్లి పో స్టేషన్‌పై దాడితో యీ తిరుగుబాటు ప్రారంభమైంది. పోలీసు స్టేషన్లపై దాడిచేసి ఆయుధాలు స్వాధీనం చేసుకోవడం, తమపై దండెత్తి వచ్చిన వారిని గెరిల్లా యుద్ధపు ఎత్తుగడలతో హతమార్చటం, ముందుగానే హెచ్చరించి పోలీసు స్టేషన్లపై దాడి చేయడం సీతారామరాజు కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింప జేశాయి. అతని శౌర్య సాహసగాథలు కొన్ని కట్టుకథలతో కలసి విశేష వ్యాప్తి చెందాయి. రాజు మూడేళ్ళపాటు సాగించిన ఈ తిరుగుబాటులో గామ్ మల్లుదొర, గామ్ గంటందొర, అగ్గిరాజు (పేరిచర్ల సూర్యనారాయణ రాజు) గోగిరి ఎర్రేసు, మొట్టడం వీరయ్య, గోణంగి పండు పడాల్, సంకోజి ముక్కడు, బాలయ్యదొర, వీరయ్యదొర, మున్నగువారు సహాయపడ్డారు. ఈ సాయుధ తిరుగుబాటును అణచడానికి కాకినాడ నుంచి రిజర్వు పోలీసు దళాన్ని పంపారు. తర్వాత జయపురం రాజా ఏనుగుల సాయంతో ఒక తెల్లదొర క్రైమెన్ హేర్ చేసిన దాడి విఫలమై అతడు పారిపోయాడు. జాన్ అనే అతను కూడా తిరోగమించాడు,

పెదవలసలో టాల్బు కూడా పిక్కబలం చూపక తప్పలేదు. సామ్రాజ్య వాద యుద్ధాలలో ఆరితేరిన స్కాట్ కవర్ట్, హైటర్ లు వచ్చి రావడంతోనే బలి అయ్యారు. 1923 సెప్టెంబరులో గామ్ మల్లుదొర అరెస్టు అయ్యాడు. 1924 జనవరి 27 నాటికి అస్సాం రైఫిల్ (ఘూర్కా) దళం నర్సీపట్టణం చేరుకొంది. వీరికి గుడాల్ సైనికాధిపతి. మే నాటికి యీ దళం 200 కి పెరిగింది వీరు కొండలు ఎగబాకడంలో నిపుణులు. 1924 ఏప్రిల్ 17 న ప్రత్యేక కమిషనర్ గా రూధర్ ఫర్డ్ నియమింపబడ్డాడు. 1921 లో పలనాడులో అడవి పుల్లరికి పన్ను చెల్లించ నిరాకరించిన సందర్భంగా ఆ వుద్యమాన్ని అణచివేసి, కన్నెగంటి హనుమంతుని బలిగొన్న గుంటూరు జిల్లా కలక్టరే ఈ రూధర్ ఫర్డ్. తూర్పుతీర స్పెషల్ పోలీసు (తెలుగు, తమిళ మాజీ సైనికులు) దళాలు, రిజర్వు పోలీసులేగాక, మలబార్ పోలీసు దళం ఉపేంద్ర పట్నాయక్ నాయకత్వాన రంగంలోకి దిగింది మే 6 వ తేదీన మాదేరు నది సమీపంలో తిరుగుబాటుదార్లకు, మలబారు పోలీసులకూ పోరాటం జరిగింది. అగ్గిరాజు ఇక్కడ అరెస్టు అయాడు సీతారామరాజు కొద్దిమంది అనుచరులతో ముఖ్యదళం నుంచి విడిపోయాడు. మే 7 వ తేదీన మంపలోయలో సీతారామరాజు అరెస్టయాడు. కొయ్యూరుకు తీసుకువచ్చాక అక్కడ నుంచి "తప్పించుకొనడానికి ప్రయత్నించగా కాల్చి చంపారు." అని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రచురించిన "ఆంధ్రలో స్వాతంత్ర్య సమరం" గ్రంథకర్తలు రాశారు.

రిటైర్డు పోలీసు సూపరెంటెంటు టి. వి. ఆళ్వార్ నాయుడు చెప్పిన కథనం ఇంకో విధంగా వుంది. ఆయన చిత్తూరు జిల్లాలో నాలుగేళ్ళు సబిన స్పెక్టర్ గా పనిచేశాడు. ప్రత్యేకంగా మన్యంలో పనిచేయడానికి పంపబడ్డాడు. రామవరంవద్ద గస్తీ తిరుగుతుండగా రాజు అతని అనుచరులు కొండలోయకిందికి పాకి వెళుతుండగా ఆళ్వార్ నాయుడు పోలీసు సిబ్బంది తరిమారు. పరస్పరం కాల్పులు జరుపుకొన్నారు. సీతారామరాజు గాయపడి పడిపోయాడు. ఒక్కుమ్మడిగా వల్లుపు పైనబడి అతన్ని పట్టుకొన్నారు. తర్వాతగాని అతడు సీతారామరాజని ఇనస్పెక్టర్ కు తెలియలేదు. మంపలో గ్రామస్థులు బంధితుడు రాజేనని ధృవపరచారు. రాజును మంచంపై కట్టివేసి చింతలపూడికి తీసుకువెళుతుండగా, కొయ్యూరు సమీపంలో, మేజర్ గుడాల్ ఎదురయ్యాడు. మేజర్ గుడాల్ సీతారామరాజుని స్వాధీనపరచుకొన్నాడు.

"అస్సాం దళంలో 10 మందిని వెంటబెట్టుకొని నన్ను, నా జమేదారును తీసుకొని రాజును మంచము మీద అడవిలో కొంతదూరం తీసుకొనిపోయి అక్కడ రాజు కండ్లకు గుడ్డకట్టి చెట్టుకు కట్టివేసి 30-40గజాల దూరం నుండి అస్సాందళాన్ని కాల్చమని గుడాల్ జేబురుమాల్ తో సంజ్ఞ చేశాడు. మూడు నాల్గు గుండ్ల దెబ్బలకే రాజు చనిపోయాడు" అని ఆళ్వార్ నాయుడు తెలియజేశాడు. గుడాల్ తర్వాత ఈ ఇన్ స్పెక్టరును రూధర్ ఫర్డ్ వద్దకు తీసుకు వెళ్ళాడు. రూధర్ ఫర్డ్ గుడాల్ చెప్పినట్లు రిపోర్టు రాసి ఇవ్వమన్నాడు. "రాజును కొయ్యూరు తీసుకువచ్చిన తర్వాత కాలకృత్యాలు తీర్చుకోవాలని అడగ్గాకట్లు విడదీసి పంపాం. రాజు పరిగెత్తినాడు. అందు పైన నేను నా సిపాయిలను కాల్చమన్నాను. కాల్చిన పైన చనిపోయినాడు" అని ఆళ్వారునాయుడు రాసి యిచ్చాడు, అదేకథను ప్రభుత్వానికి పంపాడు. ఇలా ఎందుకు చేశాడో కూడా ఆయన ఇలా రాశాడు.

"ఒకే యుద్ధరంగంలో చిన్న నౌకరు పెద్ద ఆఫీసరు చెప్పిన ప్రకారము వినకపోతే వానిని ఒకటి రెండు గుండ్లతో వారే చంపి శత్రుదాడిలో దెబ్బతగిలి చనిపోయాడని వ్రాస్తారు. దానికి సాక్ష్యము లేదు. దేవుడే సాక్షి"

ఆ విధంగా ముగిసింది అల్లూరి సీతారామరాజు వీరగాథ.

## పెషావర్ కుట్రకేసు

1920 దశకంలో సోషలిస్టు, కమ్యూనిస్టు భావాలు వ్యాప్తి చెందాయి. జాతీయోద్యమంలోని యువకుల్లోను, తీవ్రవాదుల్లోను, కార్మికవర్గ సిద్ధాంతమైన సోషలిజం చొచ్చుకుపోవడం మొదలు పెట్టింది. సహజంగానే బ్రిటిష్ ప్రభుత్వం కమ్యూనిజాన్ని మొగ్గలో తుంచివేయాలని భావించింది. 1920లో హిజ్రత్ ఉద్యమ ప్రభావంతో భారతదేశాన్ని విడిచిపెట్టి ఆఫ్ఘనిస్తాన్ ఇరాన్ల గుండా సోవియట్ లోని మధ్య ఆసియాలోకి కొందరు ముస్లిం యువకులు చే

కున్నారు. వారు కమ్యూనిస్టు భావాలు అలవరచుకొని, స్వాతంత్ర్యం కోసం పోరాడటానికై తిరిగి భారత దేశం వస్తుండగా 1922 మార్చిలో వాయువ్య సరిహద్దులో అరెస్టయారు. రఫీక్ అహ్మద్, అక్బర్‌ఖాన్ మొదలైన పదిమంది యువ ముస్లిములపై కుట్రకేసు మోపబడింది. భారతదేశంపై బ్రిటిష్ సామ్రాజ్య చక్రవర్తి ఆధిపత్యాన్ని కూలదోయడానికి వీరు కుట్రచేశారని నేరం ఆరోపించబడింది ముగ్గురు అప్రూవరులను మినహాయించి తక్కిన వారందరికీ దీర్ఘకాల శిక్షల్ని విధించింది ప్రభుత్వం. దీన్నే మొదటి కమ్యూనిస్టు పెషావరు 'కుట్ర'. కేసు అంటారు.

1922 మే 31న మొదటి కుట్రకేసు తీర్పు ఇవ్వబడ్డది. ఈ కేసు 1927లో ముగిసింది. ఈ మధ్య కాలంలో అయిదు బోల్షివిక్ కుట్రకేసులు బనాయించబడ్డాయి. రెండవ కుట్రకేసులో అక్బర్‌ఖాన్‌కు ఏడేళ్ళ కఠినశిక్ష, మూడునెలల ఒంటరిఖైదు విధింపబడింది. మహ్మద్ హుసేన్‌కు మూడేళ్ళ కఠినశిక్ష, మూడునెలల ఒంటరిఖైదు విధింపబడింది. పెషావర్‌కు చెందిన గులాంమెహబూబ్‌కు మూడేళ్ళ కఠిన శిక్ష, మూడునెలల ఒంటరిఖైదు విధింపబడింది. 1923 మే 9న షౌకత్ ఉస్మానీని అరెస్టుచేశారు. షౌకత్ ఉస్మానీ బికనీర్ వాస్తవ్యుడు. హిజరత్ ఉద్యమంలో 1920లో భారత దేశాన్ని విడిచి పెట్టి వెళ్ళాడు. తాష్కెంట్ చేరాడు. యం. యన్. రాయ్‌తో అక్కడ సంబంధం ఏర్పడింది. 1921 ఆగస్టు 21లో మాస్కోలో జరిగిన భారతీయ విప్లవకారుల సమావేశంలో పాల్గొన్నాడు. ఈయనపై కేసు సందర్భంగా "లండన్ టైమ్సు" పత్రిక అనేక అభూత కల్పనలను సృష్టించింది. ఈ కుట్రకేసులో షౌకత్ ఉస్మానీపై అదనంగా ఒక కేసు బనాయించి రెండేళ్ళ కఠిన శిక్ష విధించారు. అబ్దుల్ మజీద్, హబీబ్ అహ్మద్, రఫీక్ అహ్మద్, ఫిరొజుద్దీన్ మన్సూర్, సుల్తాన్ అహ్మద్‌లకు ఏడాది కఠినశిక్ష, గోహార్ రహ్మన్‌ఖాన్, మియా అక్బర్‌షా కటక్‌లకు మూడేళ్ళ కఠినశిక్ష విధింపబడింది

## కాన్పూర్ కుట్రకేసు

ప్రధానమైన పెషావర్ బోల్షివిక్ కుట్రకేసులో తీర్పుచెప్పిన కొద్ది కాలానికే, బ్రిటిష్ ప్రభుత్వం కాన్పూర్ కుట్రకేసు బనాయించింది. అప్పటికి రాజకీయంగా చైతన్య వంతులైన భారతీయులపై రష్యన్ విప్లవ ప్రభావం హెచ్చుగావుంది. కమ్యూనిస్టు గ్రూపులు అన్ని రాష్ట్రాలలో ఆవిర్భవించాయి. భారత కమ్యూనిస్టుపార్టీ నిర్మాణం గురించి చర్చలు జరుగుతున్నాయి. ఈ పరిస్థితులలో కాన్పూరు కుట్రకేసు బనాయించబడింది 1923 మే 19న కలకత్తాలో ముజఫర్ అహ్మద్‌ని ప్రభుత్వం అరెస్టు చేసింది అంతకు కొద్ది కాలం ముందు షౌకత్ ఉస్మాన్‌ని అరెస్టుచేసింది. లాహోర్‌లో గులాం హుస్సేన్‌ని అరెస్టు చేసింది. బొంబాయిలో డాంగేను, మద్రాసులో సింగారవేలు చెట్టియార్‌లను అరెస్టు చేయవలసిందిగా భారత ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలను ఆదేశించింది, ఐతే డాంగేపై 1818 రెగ్యులేషన్ చట్టం ఉపయోగించడానికి బొంబాయి ప్రభుత్వం అభ్యంతరం చెప్పింది, ఇలాంటి కారణాల వల్లనే సింగారవేలు చెట్టియార్‌ను కూడా అరెస్టు చేయలేదు.

గులాం హుస్సేన్ భయపడి క్షమాపణ చెప్పుకొన్నాడు. 1923 డిసెంబర్ 20న నళినీగుప్తాను అరెస్టు చేసింది ప్రభుత్వం, అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థతో, భారతదేశంలోని కమ్యూనిస్టు గ్రూపులకు సంబంధమున్నదని నళినీ గుప్త ప్రకటించాడు. తర్వాత డాంగే, సింగారవేలుచెట్టియార్‌లను కూడా చేర్చి ప్రభుత్వం 1924 ఫిబ్రవరి 21న కుట్రకేసు మోపింది. నిందితులు యం. యన్. రాయ్, ముజఫర్ అహ్మద్. షౌకత్ ఉస్మానీ, యస్ ఎ. డాంగే. గులాం హుస్సేన్, నళినీ గుప్తా, సింగారువేలు చెట్టియార్, ఆర్. సి. యల్. శర్మ. ఇందులో గులాం హుస్సేన్‌ను కాన్పూర్‌కు తీసుకురాలేదు మార్చి 7న సింగారు వేలుచెట్టియార్‌ను బెయిల్‌పై విడుదల చేసి ఇంట్లో వుండటానికి అనుమతించారు. యం.యన్. రాయ్ జర్మనీలో వున్నాడు, శర్మ అండమాన్ నుండి విడుదలయ్యాక పోలీసుల నిఘా, వేధింపులకు గురయ్యాడు. పుదుచ్చేరి వెళ్ళి అతడు తల దాచుకొన్నాడు.

అందుచేత ముజఫర్ అహ్మద్, షౌకత్ ఉస్మానీ, ఎస్. ఏ డాంగే, నళినీ గుప్తాలపై కేసు కొనసాగింది. 1924 మార్చి 29న సెషన్సు జడ్జి వీరందరికీ నాలుగేళ్ళ చొప్పున కఠినశిక్ష విధించాడు.

## కాకోరీ కుట్రకేసు

వ్యక్తిగత విప్లవవాదులలో 1919 తర్వాత కొంత మార్పు వచ్చింది. అంతకుముందు మాజినీ, గారిబాల్డీ, ఐరిష్ విప్లవయోధుల ప్రభావం వుండేది. మన దేశంలోని భగవద్గీత, అరవింద, వివేకానంద, బంకించంద్ర రచనల ప్రభావం వుండేది. ప్రాచీన భారత ఔన్నత్యాన్ని గురించి పరవశించేవాళ్ళు కొందరుండేవారు. కాని రష్యన్ విప్లవం తర్వాత వీరిలో మార్పు వచ్చింది. పాత నినాదాల స్థానే "ఇంక్విలాబ్ జిందాబాద్" (విప్లవం వర్ధిల్లాలి) "సామ్రాజ్యవాదం నశించాలి", "శ్రామికవర్గం చిరస్థాయి అగుగాక" "భారతదేశం చిరస్థాయి అగుగాక" అని నినాదాలు ఇవ్వడం ప్రారంభించారు.

బెంగాల్ సంయుక్త రాష్ట్రం (యు పి) లలో వేర్వేరుగా పనిచేస్తున్న వ్యక్తిగత విప్లవవాద సంఘాలు, సంయుక్త రాష్ట్రంలో మొదట కొన్నాళ్ళు విడిగా పని చేశాయి. కాని తర్వాత రెండూ కలిసి పని చేయ ప్రారంభించాయి. 1924లో హౌరావ యోగీశచంద్ర ఛటర్జీ అనే విప్లవకారుడు అరెస్టు అయినపుడు, అతనివద్ద లభించిన ఒక పత్రం ప్రకారం సంయుక్తరాష్ట్రంలో 23 జిల్లలలో విప్లవపార్టీ శాఖలు వున్నట్లు స్పష్టమైంది. విప్లవవాదులకు తమ పార్టీ నిర్వహణకు, కరపత్రాల ముద్రణకు, ఆయుధాల కొనుగోలుకు డబ్బు అవసరమైంది. వ్యక్తిగతంగా తమ వద్ద వున్నదంతా తెచ్చి ఖర్చు పెట్టారు. డబ్బుకోసం దోపిడీలు చేయడం అనివార్యం అని వారు భావించారు. కాశీ కేంద్రంలో శచీంద్ర బక్షి నాయకత్వాన కొన్ని దోపిడీలుజరిగాయి. ప్రభుత్వానికి చిక్కకుండా వుండేందుకు ఇతడు పల్లెల్లో దోపిడీలు గావించాడు. కాని ఇందువల్ల ఎక్కువ సొమ్ము లభించలేదు. చివరకు రైళ్ళల్లో ఖజానా దోపిడీ చేయాలనే నిర్ణయానికి వీరు వచ్చారు. ఈ సలహా యిచ్చింది రామ్ ప్రసాద్ బిస్మిల్.

1925 ఆగస్టు 9న లక్నో-సహరన్‌పూర్ లైన్‌లో రైలు దోపిడీ జరిగింది. లక్నో వెళుతున్న బండిలో విప్లవవాదులు పదిమంది రెండు దళాలుగా ఎక్కారు. ముగ్గురు రెండవ తరగతి పెట్టెలో, ఏడుగురు మూడవ తరగతి పెట్టెలో ఎక్కారు. వీరివద్ద మౌజర్ పిస్తోళ్ళు ఇతర ఆయుధాలు, 300 తూటాలువున్నాయి. రైల్వే ఖజానా, ప్రభుత్వ ఖజానా కూడా ఆ బండిలోనే పంపబడుతున్నది. సాయుధ రిజర్వు పోలీసు దళం, తెల్ల సిపాయిలు సాయుధులై కాపలా కాస్తున్నారు తెల్ల సిపాయిల దళాధిపతి, రెండవ తరగతి పెట్టెలో కూర్చున్నాడు. కాకోరీ రైల్వేస్టేషన్ దాటినతర్వాత గొలుసు లాగి బండిని ఆపుచేశారు. విప్లవవాదులు కిందికి దిగారు. బండికి రెండు వైపులా కాపలా కాస్తున్నారు. బండినుంచి ప్రయాణీకులను ఎవరినీ దిగవద్దని హెచ్చరించారు గార్డు, బండి దిగి గొలుసు లాగిన పెట్టెవైపు రావటానికి ప్రయత్నించగా, అతన్ని నేలమీద పడుకోవలసిందిగా విప్లవవాదులు ఆజ్ఞాపించారు. ప్రయాణీకులు ఎవరూ దిగకుండా భయపెట్టేందుకు గాలిలో తుపాకులు పేల్చారు ఖజానా పెట్టెను బద్దలు కొట్టడం కష్టమైంది. చివరకు అష్ఫక్-ఉల్లా ఖాన్ సుత్తి దెబ్బలతో అతి ప్రయాసమీద ఇనుపపెట్టె బద్దలు కొట్టి ఖజానాసంచులు తీశారు. ఐతే వారికి లభించిన మొత్తం ఐదువేల రూపాయలు మాత్రమే. ఈ దోపిడీ జరిగేటప్పుడు లక్నోనుంచి మెయిల్ వచ్చింది. ఆ సమయంలో తమ ఆయుధాలు కనపడకుండా జాగ్రత్త పడ్డారు. మెయిల్ ఆగకుండా వెళ్ళిపోయింది. విప్లవవాదులు లక్నోకు పారిపోయారు. ఈ దోపిడీతో సంబంధమున్నదని విచారించిన కుట్రకేసే, కాకోరీ కుట్రకేసుగా ప్రసిద్ధిచెందింది

1925 సెప్టెంబరు 26న ఈ కుట్రకేసులో అనుమానింపబడిన 40 మందిని అరెస్టుచేశారు. పట్టుబడినవారిలో బనారసీలాల్, ఇందుభూషణమిత్ర అనేవారు అప్రూవర్లుగా మారి రహస్యాలు బయటపెట్టారు. రామ్ ప్రసాద్ బిస్మిల్‌కు వచ్చే ఉత్తరాలు ఇందుభూషణ మిత్ర ద్వారా వచ్చేవి. అప్పుడు మిత్ర ఒక విద్యార్థి. ఆమాకీ తెలిసిన వెంటనే మిత్రాకు వచ్చే వుత్తరాలన్నిటినీ పోలీసులు సెన్సార్ చేయ నారంభించారు. వీటి ఆధారంగా మరికొందరిని అరెస్టు చేశారు.

కాకోరీ కుట్రకేసు విచారణ 18 నెలలు సాగింది. ఐదువేల దోపిడీకేసుకు ప్రభుత్వం పది లక్షల రూపాయలు ఖర్చు చేసింది. ఈ కేసులో చేర్చబడిన చంద్రశేఖర్ ఆజాద్, శచీంద్రనాథ బక్షి, అసఫాకుల్లాఖాన్, రాజేంద్రనాథ్ లహరీలు పట్టుబడలేదు. లహరీ వేరొక కేసులో బెంగాల్‌లో శిక్షింపబడ్డాక, లక్నోకు తీసుకువచ్చారు. కాకోరీ కేసు విచారణ

పూ య్యాక అసఫాకుల్లాఖాన్ 1925 డిసెంబరు 8 న అ యాడు. శచీంద్ర బక్షికూడా తర్వాత అరెస్ట యా . వీరిని అనుబంధకేసులో విచారించి ఖాన్‌కు. ఉరిశిక్ష, బక్షీకి యావ వ ద్వీపాంతర శిక్ష విధించింది కోర్టు. 1927 ఏ॥ ల్ 7 న ఇచ్చిన తీర్పులో రాంప్రసాద్ బిస్మి , రాజేంద్రనాథ్ లహరీ, రోషన్ సింగులకు ఉరిశిక్ష విధింపబడింది. శచీంద్రనాథ్ సన్యాల్‌కు యావజ్జీవ ద్వీపాంతర శిక్ష విధింపబడింది. మన్మధనాథ గుప్తాకు 14 ఏళ్ళు, మిగతావారికి 4 ఏళ్ళనుంచీ 10 ఏళ్ళ దాకా శిక్ష విధింపబడింది. వీరికి శిక్ష చాలదని భుత్వం అపీ లు చేయగా హైకోర్టు పదేళ్ళ శిక్ష ప వారికి యావ వ ద్వీపాంతర శిక్ష, ఏడేళ్ళ శిక్ష ప వారికి 10 ళ్ళ శిక్ష విధించింది హైకోర్టు. పిన్న వయస్కుడని మన్మధనాథ్ గుప్తా శిక్షను హెచ్చించలేదు.

## మత మౌఢ్యానికి లొంగని అసఫక్ ఉల్లాఖాన్

అసఫక్ ఉల్లాఖాన్ ఢిల్లీలో అరెస్టయినపుడు, అతన్ని లక్నోకు తీసుకు వెళుతుండగా, అతనితో పాటు సయ్యద్ ఐనుద్దీన్ అనే మేజిస్ట్రేట్ ప్రయాణం చేశాడు. ఇతడు బ్రిటిష్‌వాళ్ళ తొత్తు. దేశానికి శత్రువు. ముస్లిమ్‌గా తాను అతన్ని లోబర్చుకొని రహస్యాలు సేకరించాలని సయ్యద్ ఐనుద్దీన్ భావం. గూఢచారి శాఖకు చెందిన డి. యస్. పి. ఖాన్‌బహదూర్ తసద్దుక్ హుస్సేన్ కూడా ఇదే భావంతో అసఫక్-ఉల్లాఖాన్‌కు ఇలా విజ్ఞప్తి చేశాడు.

"నీవు ముస్లిమ్ జాతివాడివి, మేమూ అంతే, రాంప్రసాద్ బిస్మిల్ హిందువు, బ్రిటిషువాళ్ళ స్థానంలో హిందూరాజ్యం స్థాపించాలని అతడి ఆశయం. నీవు గౌరవనీయమైన ముస్లిం కుటుంబం నుంచి వచ్చావు. నీ మతానికి వ్యతిరేకంగా, నీ మతం వారి ప్రయోజనాలకు వ్యతిరేకంగా కాఫిర్‌లతో ఎందుకు చేతులు కలుపుతావు ?"

ఐతే ఈ పప్పులేమీ అసఫక్-ఉల్లాఖాన్ ముందు ఉడకలేదు. ఆయన ఇలా జవాబిచ్చాడు. "రాంప్రసాద్ బిస్మిల్ నా దృష్టిలో హిందువు కాడు. అతడు హిందూస్థానీయుడు. అతని ఆశయం హిందూ స్వాతంత్ర్యం కాదు. హిందూస్థానీ స్వాతంత్ర్యం, ఒకవేళ అతడు హిందూ స్వాతంత్ర్యంకోసం ఉత్తేజితుడైనా, నేను అతడితో చేరి వుండేవాణ్ణి. హిందూ యజమాన్ల బ్రిటిషు యజమాన్ల మధ నీవు ఎవరిని ఎంచుకొంటావని నన్ను ప్రశ్ని నేను బ్రిటిషు వాడి కన్న హిందువునే యజమా గా స్వీకరిస్తాను. ఎంత లేదన్నా వారు భారతీయులు."

రాంప్రసాద్ బిస్మిల్. అసఫక్-ఉల్లాఖాన్ ఒకే పళ్ళెంలో తినేవారు. అందుకు అతణ్ణి కాఫిర్ అని నిందించినా లెక్క చేయలేదు.

అసఫక్-ఉల్లాఖాన్ 1900 అక్టోబర్‌లో సంయుక్త రాష్ట్రం (యు. పి.)లో షాజహాన్‌పూర్‌లో జన్మించాడు. 8 వ తరగతిదాకా చదివాడు. బ్రిటిషు ప్రభుత్వ వ్యతిరేక జాతీయ కార్యక్రమాల్లో పాల్గొన్నాడు. "మాతృవేది సంస్థ" అనే విప్లవ సంస్థ సభ్యుడయాడు. షేర్‌గంజ్, బిచ్‌పురీ, మైన్‌పురీ మొదలైనచోట్ల విప్లవవాదులు చేసిన దోపిడీలలో పాల్గొన్నాడు. 1927 ఏప్రిల్ 3 న ఫైజాబాద్ జైలులో ఉరికంబాలను కౌగిలించాడు. ఉరితీసే ముందు అసఫక్-ఉల్లాఖాన్ దేశ ప్రజలకీ కింది సందేశ మిచ్చాడు.

"మా దేశ రాజకీయ రంగస్థలంలో మా పాత్రను మేము నిర్వహించాము, మన దేశానికి స్వాతంత్ర్యం రావాలనే ఆశయంతోనే, మా చర్యలన్నీ-అవి తప్పో-ఒప్పో-చేశాం. నా చర్య గురించి కొందరు స్తుతించుతారనీ, మరికొందరు విమర్శించుతారనీ నాకు తెలుసు. కాని నిజమైన విప్లవకారునిగా వాటిని నేను లెక్క చేయను. నేను మరణించేముందు ఒక విషయాన్ని, స్పష్టం చేయదలచుకొన్నాను. మా విచారణ చాలా దీర్ఘ కాలం జరిగింది. ఐనా అపూర్వరనుగాని ప్రభుత్వ సాక్షులను గాని చంపడానికి ప్రయత్నించామా ? అది మా పంథా కాదు. వారి మతం, ధర్మం ఏమైనా మా దేశస్థులంతా బ్రిటిషు ప్రభుత్వ దుర్గాన్ని కూలగొట్టడానికి దృఢంగా ఏకం కావాలని నా ఒకే ఒక కోర్కె. మనదేశంలోని అన్ని మతాలవారికీ బ్రిటిషువాళ్ళు శత్రువులే. బ్రిటిషు నిరంకుశత్వాన్ని పుడ్చడానికి సమాధి తవ్వడం ప్రతి భారతీయుని నైతిక విధి. ప్రాసిక్యూషన్‌వారు నిరూపించినట్లు నేను హంతకుణ్ణి కాదు. భారత స్వాతంత్ర్య బలిపీఠంపై ప్రాణాలర్పించుతున్న తొలి భారతీయ ముస్లిమ్ నవుతున్నందుకు నేను గర్వపడుతున్నాను."

బడి చదువులేకున్నా, అసఫక్ ఉర్దూలో కవి. ఉరి తీసేముందు కవిత చెప్పాడు. దాని భావం ఇది: "నిరంకుశత్వాన్నీ, అన్యాయాన్నీ భరించలేక ఫైజాబాద్ జైలు నుంచి మృత్యుభూమికి పయనిస్తున్నాను." ఖుదీరాంబోస్ భగవద్గీతతో, ఉరికంబం ఎక్కినట్లు, అసఫక్-ఉల్లాఖాన్ కురాన్ చేత పట్టుకొని ఉరికంబం ఎక్కాడు.

## రాంప్రసాద్ బిస్మిల్

రాంప్రసాద్ బిస్మిల్ షాజహాన్‌పూర్‌లో జన్మించాడు. తండ్రి మురళీధర్‌తివారి. బాల్యంలో అల్లరి చిల్లరగా తిరిగినా, ఆర్య సమాజం వారి సంపర్కంతో జీవితంలో పెద్దమార్పు వచ్చింది. గుర్రపుస్వారి, ఈత, సైకిల్ తొక్కటం, వ్యాయామంలలో ఆరితేరాడు. హైస్కూలు విద్యార్థి అయినా స్వయంకృషితో హిందీ, ఉర్దూ, బెంగాలీ భాషల్లో కృషిచేశాడు. కవిత్వం రాసేవాడు. జాతీయోద్యమాలలో పాల్గొన్నాడు. 1916 అక్నో కాంగ్రెస్‌లో విప్లవవాదులతో పరిచయమైంది. విప్లవవాదుల సంఘం "మాతృవేదిక"లో సభ్యుడయాడు. మణిపూర్ కుట్రకేసులో నిందితుడే గాని పట్టుబడలేదు. నేపాల్, రాజపుత్ర స్థానాలలో ప్రవాస జీవితం గడిపాడు. షేర్‌గంజ్, బిచ్‌పూరి, మణిపూరిలలో విప్లవవాదులు సాగించిన దాడులలో పాల్గొన్నాడు. విప్లవగీతాలెన్నో రాశాడు. ఆవేశపూరిత ఉపన్యాసాలు చేసేవాడు. అతను ధైర్యశాలి. ఆపదలో చిక్కుకొన్నపుడు కూడా ఏమాత్రం తొట్రుపడని మనోనిబ్బరం గలవాడు. ఒకసారి రైల్వేస్టేషన్ ప్లాట్‌ఫారం పైన అతని పెట్టెను కూలీ పడవేశాడు. పెట్టిమూత విడిపోయి, రివాల్వర్లు తూటాలూ చిందరవందరగా పడిపోయాయి. సూటూ బూటూ హేట్‌తో వున్న బిస్మిల్ తొణక్కుండా కూలివానిని గద్దించాడు. ఇదంతా చూ న్న ఒక రైల్వే పోలీసు ఇనస్పెక్టర్ అతనెవడో ప అధికారి అనుకొని, అవన్నీ స ్ద పెట్టి, కూలివా క్షమించమని అడిగాడు. రెండవ తరగతి పె లోకి బిస్మిల్ ఏమాత్రం కంగారు పడకుండా వెళ్ళి కూర్చున్నాడు. కాకోరీ కుట్రకేసులో తానే స్వయంగా వాదించి, ప్రభుత్వ వకీలును చికాకు పెట్టాడు. గోరఖ్‌పూర్ జిల్లా జైలులో 1927 డిసెంబర్ 19న ఉరికంబం ఎక్కాడు. 18వ తేదీ రాత్రి యువజనులకొక సందేశం రాశాడు. ఉరికంబం వద్దకు వెళ్ళేముందు 'వందేమాతరం, భారతమాతకి జై' అని నినాదాలిచ్చాడు. "బ్రిటిషు సామ్రాజ్యవాదం పతనమవాలని నా కోర్కె" అని ఉరితాడు కంఠాన్ని బిగించే ముందు తన ఆఖరి కోర్కెను తెలియచేశాడు.

రాంప్రసాద్ బిస్మిల్ తల్లి కొడుకును ఉరితీశారన్న విషయంపై ఇలా అన్నట్లు చెబుతారు. "మాతృదేవి పాదాల వద్ద బలియైన నా కుమారుని గురించి నేను గర్వపడుతున్నాను. నా కన్నా, దేశానికే నా కుమారుడిలాంటి వారిపై ఎక్కువ అధికారం వుంది. మహత్తర ఆశయానికై నా కుమారుడు మరణించాడు. అందుకు నేను విచారపడను."

కాకోరీ కుట్రకేసు పెద్ద సంచలనాన్ని కల్గించింది. వారిని జైలునుంచి లక్నోలో కోర్టుకు తీసుకువెళ్ళేటప్పుడు, మళ్ళీ అక్కడనుంచి, తిరిగి తీసుకువచ్చేటప్పుడు రోజుకొక మార్గంలో తీసుకువెళ్ళేవారు. ప్రజలు రోడ్డు ప్రక్కన నిలబడి నివాళు లర్పించేవారు. పత్రికలలో వారిని గురించి కథలు, గేయాలు, నాటికలు, వ్యాసాలు ప్రచురింపబడేవి

## కార్మిక కర్షకోద్యమాల విజృంభణ

1924-25 లలో కార్మికుల సమ్మెలు ఉధృతమయ్యాయి. 1924 లో 8,70,000 పని దినాలు, 1925 లో 12,5000,000 పని దినాలు నష్టమయాయి. పని గంటల పెంపుదలకు నిరసనగా ఈ సమ్మెలు ప్రారంభమయాయి. 1924-25 లో బొంబాయి జౌళి కార్మికుల సార్వత్రిక సమ్మె; 1926-27 లో రైల్వే కార్మికుల సమ్మె జరిగాయి. బెంగాల్-నాగపూర్ రైల్వే కంపెనీ బ్రిటిష్ ప్రయివేటు వ్యక్తులది. దాని ప్రధాన కార్యాలయం లండన్‌లో వుండేది. దీనికి చెందిన ఖర్గపూర్ లోకోమొటివ్ రిపెయిర్ అండ్ మెయింటెనెన్స్ వర్క్‌షాపులో సమ్మె ప్రారంభమై సార్వత్రిక సమ్మెగా మారింది. సమ్మెను జవహర్‌లాల్, వి. ఎ. గిరి బలపరచారు. సంస్కరణవాదుల నాయకత్వం, బ్రిటిష్ ప్రభుత్వ దమనకాండవల్ల చాలా సమ్మెలు విఫలమయాయి. ఐనా కార్మికోద్యమం ఉధృతమవుతూనే వచ్చింది. 1926 నాటికి రమారమి 200 కార్మిక సంఘా లేర్పడ్డాయి. వీటిలో 30 వేలమంది సభ్యులుగా

చేరారు. వీటిలో అఖిల భారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌కు అనుబంధింపబడిన 57 సంఘాలలో 1,25,000 సభ్యులున్నారు. కార్మిక సంఘాలలో అతివాదులు, కమ్యూనిస్టులు పనిచేయడం ప్రారంభించడంతో, కార్మిక సంఘాలు రాజకీయ తీర్మానాలు కూడా చేయ ప్రారంభించాయి. కార్మికులను అణచడానికి పోలీసుల్ని వుపయోగించరాదని 1924 లోను, కార్మికులకు కూడా వోటింగ్ హక్కు ఇవ్వాలని 1925 లోను, అస్పృశ్యత, జాతి వివక్షలను ఖండించుతూ 1926 లోను కార్మిక సంఘాలు తీర్మానాలు చేశాయి.

ఇదేకాలంలో కార్మిక - కర్షకపార్టీ (వర్కర్స్ అండ్ పెజెంట్స్ పార్టీ) కూడా వృద్ధిచెందసాగింది. మొదట మద్రాసులో సింగారవేలుచెట్టియార్, 1923లో ఈ పార్టీని కమ్యూనిస్టులు స్థాపించడానికి చేసిన ప్రయత్నం విఫలమైంది. తర్వాత 1926-28 లలో బెంగాల్, బొంబాయి, పంజాబ్, సంయుక్త రాష్ట్రం (యు. పి.) లలో నెలకొల్పబడ్డాయి. 1928 లో ఇవన్నీ కలసి అఖిల భారత కార్మిక కర్షక పార్టీ (ఆల్ ఇండియా వర్కర్స్ అండ్ పెజెంట్సుపార్టీ)గా సమైక్యమయ్యాయి. 1928 డిసెంబర్‌లో మొదటి మహాసభ జరిగింది. 1927 మే 1న కార్మిక దినోత్సవంగా జరుపుకొంది బొంబాయి కార్మికవర్గం. కార్మికవర్గంలో పెరుగుతున్న కమ్యూనిస్టు ప్రాబల్యాన్ని తొలగించాలని బ్రిటిషు ప్రభుత్వం ఆలోచన. 1927-28 లలో బ్రిటిషు ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ప్రతినిధులు భారతదేశం వచ్చారు."భారతదేశ కార్మిక సంఘాలలో మంచి నిర్మాణం, కమ్యూనిస్టులను వెళ్ళగొట్టడం"- ఈ రెండు పనులకూ పై ప్రతినిధుల రాక దారితీస్తే బాగుండునని లండన్ టైమ్సు 1928 జూన్ 14 న రాసింది, కాని ఆ కోర్కె గొంతెమ్మ కోరికగానే మిగిలిపోయింది. కమ్యూనిస్టు సిద్ధాంతం వ్యాపించుతున్నందుకు వైస్రాయి లార్డ్ ఇర్విన్ 1929 జనవరిలో శాసనసభలో ప్రసంగించుతూ ఆందోళన వ్యక్తం చేశాడు. 1928-29 భారత ప్రభుత్వ సాంవత్సరిక నివేదికలో కూడా ఇదే ఆందోళన వ్యక్తమయింది, మాంచెస్టర్‌గార్డియన్ పత్రిక 1929 లో ఆగస్టులో కార్మికులు కమ్యూనిస్టుల చేతుల్లో పడిపోతున్నారని వాపోయింది. కార్మికోద్యమాన్ని అణచడానికి ప్రభుత్వం పూనుకొంది. 1928 సెప్టెంబరులో "భారతదేశంలో కమ్యూని కార్యకలాపాలు అణచివేసేందుకు" ప క్ పే బిల్లు (ప్రజా రక్షణ చట్టం) ప్రవేశపె ్ఒది. కా దాన్ని శాసనసభ తిరస్కరించింది. 19 లో ఇందుకు ప్రత్యేక ఆర్డినెన్సు ప్రకటించింది. బొంబాయి అల్లర్ల విచారణ కమిటీ అంటూ ఒకదాన్ని ప్రభుత్వం నెలకొల్పింది. "బొంబాయిలో కమ్యూనిస్టుల కార్యకలాపాలపై తీవ్రచర్య తీసుకోవాలని" అది రికమెండ్ చేసింది. 1929 మార్చిలో మీరట్ కమ్యూనిస్టు కుట్రకేసు పెట్టబడింది. (దీని వివరాలు మరోచోట ఇస్తున్నాం.)

కాంగ్రెసులోకూడా ఈ పరిణామాలను ప్రతిబింబించుతూ అతివాదులు తలెత్తారు. విప్లవాన్ని అణచడానికి షాంగేకు భారత సైన్యాలను పంపడాన్ని 1927 లో మద్రాసులో జరిగిన కాంగ్రెస్ తీవ్రంగా ఖండించింది, సామ్రాజ్యవాద ప్రతికూల పీడిత ప్రజల అంతర్జాతీయ సంస్థను ఏర్పర్చడంలో కాంగ్రెస్ కూడ పాల్గొంది. బ్రసెల్స్‌లో జరిగిన ఈ సభకు జవహర్‌లాల్ నెహ్రూ ప్రతినిధి, మోతీలాల్ నెహ్రూ, జవహర్‌లాల్ నెహ్రూలు సోవియట్ యూనియన్ సందర్శించారు. జవహర్‌లాల్ నెహ్రూ ఆ విషయంపై ఒక పుస్తకం రాశాడు. సోవియట్ ఆశయాల గురించి, విజయాల గురించి నెహ్రూ బాగా ప్రచారం చేశాడు. సామ్రాజ్యవాద ప్రతికూల పీడిత ప్రజల అంతర్జాతీయ సంస్థకు అనుబంధంకావడానికి మద్రాసు కాంగ్రెస్ ఏర్పాట్లుచేసింది. మద్రాసు కాంగ్రెస్‌లోనే పూర్ణస్వరాజ్యం, అంటే సంపూర్ణ స్వాతంత్ర్యం భారతదేశ అంతిమ లక్ష్యమనే తీర్మానాన్ని జవహర్‌లాల్ నెహ్రూ ప్రతిపాదించగా, సుభాష్‌చంద్రబోసూ, అతని అనుచరులూ బలపరిచారు. ఆ తీర్మానం ఆమోదింపబడింది. నెహ్రూ- సుభాష్‌చంద్రబోసులు కాంగ్రెస్ కార్యదర్శులుగా ఎన్నికయ్యారు. సైమన్ కమిషన్‌ను బహిష్కరించాలనీ మోతీలాల్ నెహ్రూ నాయకత్వాన ప్రత్యామ్నాయ రాజ్యాంగ శాసన, ముసాయిదా తయారుచేయాలనీ నిర్ణయించబడింది.

# సైమన్ గో బాక్

"సైమన్ గో బాక్!" (సైమన్ తిరిగి వెళ్ళిపో) ఈ నినాదం దేశమంతటా 1928 లో ప్రతిధ్వనించింది. ఎవరీ సైమన్? 1919 భారత ప్రభుత్వ చట్టం 84 వ సెక్షన్ ప్రకారం ప్రతి పదేళ్ళకూ రాజ్యాంగం ఎలా నడుస్తుందో సమీక్ష చేయాలి. అందుకు సర్ జాన్ సైమన్‌ను మరో ఆరుగురు ఆంగ్లేయుల్ని ఒక కమిషన్ (ఉప సంఘం)గా బ్రిటిష్ ప్రభుత్వం నియమించింది. ఈ కమిషన్ నియామకం గురించి ఆ నాటి వైస్రాయి ఇర్విన్ గాంధీకి తెలియజేసిన విధానం, ఎంత పొగరు బోతు తనంతో కూడివుందో చూడండి.

లార్డ్ ఇర్విన్ 1926 ఏప్రిల్‌లో 'రీడింగ్' స్థానే భారతదేశ వైస్రాయిగా వచ్చాడు. ఈయన తాత వైకౌంట్ హాలిఫాక్స్ కూడ భారత రాజ్యాంగ కార్య దర్శిగా పనిచేశాడు. ఇర్విన్ తండ్రి క్రైస్తవమత భక్తి పరాయణుడట. తాతగారి రాజకీయాలు, తండ్రి మతభక్తి ఇర్విన్‌కి వంటబట్టాయని కొందరు భావిం చారు. మతభక్తిగల వైస్రాయి, వివిధ మతాలతో కూడిన భారతదేశం రావడం - శుభసూచకమేనని కొందరు వెర్రివాళ్లు ఊహించారు. వైస్రాయి భారత దేశంలో అడుగుపెట్టిననాడే, ఆనాడు "గుడ్ ఫ్రయిడే" కావడంతో, అధికార లాంఛనాల అట్టహాసాలను రద్దు చేసి చర్చికి వెళ్ళి ప్రార్థన చేసిన ఇర్విన్ గురించి ఇలాంటి కలలు కనడంలో ఆశ్చర్యంలేదు.

కాని ఇర్విన్ పదవిలోకి వచ్చిన 19 నెలల వరకు గాంధీని ఆహ్వానించడంగాని, గాంధీతో రాజకీయ పరి స్థితిని చర్చించాలనే ఉద్దేశంకాని వెల్లడించలేదు. గాంధీ తన పర్యటనలో మంగుళూర్‌లో వుండగా 1927 అక్టోబర్ 26 న ఆయునకు వైస్రాయినుంచి ఒక కబు రందింది. అందులో నవంబర్ 5 న తనను కలుసుకో మని వుంది.

గాంధీ తన పర్యటన కార్యక్రమం రద్దు చేసుకొని 1250 మైళ్లు, రెండు రోజులు రైలులో ప్రయాణం చేసి ఢిల్లీ చేరాడు. నిర్ణీత సమయానికి ఇర్విన్ కార్యా లయంలో గాంధీ అడుగుపెట్టాడు. ఇర్విన్ మరికొంద రిని కూడా అదే సమయానికి పిలిచాడు. కేంద్ర శాసన సభా అధ్యక్షుడు విఠల్‌భాయ్ పటేల్, 1927 లో కాంగ్రెస్ అధ్యక్షుడైన శ్రీనివాస అయ్యంగార్, 1928 కాంగ్రెస్‌కు అధ్యక్షుడుగా ఎన్నికైన డాక్టర్ ఎం. ఏ. అన్సారి కూడా అక్కడ వున్నారు. అందరూ తమ స్థానాల్లో కూర్చున్నాక, సైమన్ కమిషన్ నియామకం గురించి తెలిపే పత్రాలను అందరికీ ఇచ్చాడు. గాంధీ చదివి, మరేమైనా చెబుతాడేమోనని తలెత్తి చూశాడు. ఇర్విన్ మాటాడలేదు.

"మనం కలుసుకోడం ఇందుకోసం మాత్రమేనా?" అని గాంధీ ప్రశ్న.

"అవును" అని వైస్రాయి జవాబు.

ఎంత పొగరుబోతుతనం! ఎంతటి నిర్లక్ష్యమైన జవాబు!

ఆ తర్వాత వైస్రాయి తాను కలుసుకొన్న వారితో కూడా, ఇదే విధంగా వ్యవహరించాడు. ఒక చర్చ లేదు. ఒక వివరణ లేదు. "సైమన్ కమిషన్ వస్తుంది. మీ సూచన లేమైనా వుంటే ఆకమిషన్ ముందు వాఙ్మూ లాలు ఇవ్వండి" అని మాత్రమే అతడు చెప్పాడు.

ఆ రోజుల్లో భారత రాజ్యాంగ కార్యదర్శిగా బర్కెన్‌హెడ్ వుండేవాడు. 1929 లో బ్రిటిష్ ప్రభు వుల సభలో ఆయన ప్రసంగ భాగం చూడండి ఎలా వుందో:

"ఒక తరంలో, లేక రెండు తరాల్లో, లేదా మరో వంద సంవత్సరాలలో భారత ప్రజలు సైన్యం, నావికా దళం, పౌర అధికారాలకుఆధిపత్యం వహించగలదరనీ. ఈ దేశ ప్రభుత్వానికి గాక భారతదేశ ప్రభుత్వానికే బాధ్యత వహించే గవర్నర్ జనరల్ ఉంటాడనీ, అలాంటి పరిస్థితికి భారతదేశం రాగలదనీ ఈ సభలో ఎవరైనా చెప్పగలరా?" అని బర్కెన్ హెడ్ ప్రశ్నిం చాడు.

ఎంత అహంకారం!

ఎంత శ్వేతజాత్యహంకారం!!

భారతదేశ స్వాతంత్ర్య భవిష్యత్తును నిర్ణయించేం దుకు ఉద్దేశింపబడిన సైమన్ కమిషన్‌లో ఒక్క భార తీయుడూ లేడు. ఇది బ్రిటిష్ పార్లమెంట్‌కు నివేదిక సమర్పింపవలసిన పార్లమెంట్ సభ్యుల సంఘం కనుక భారతీయుడెవడూ లేడని అనడానికి ఆస్కారం

లేదు. లార్డ్ సిన్హా అనే భారతీయుడు అపుడు పార్లమెంట్ సభ్యుడు. భారతీయులకి ఈ అవమానం భరింపరానిది. సైమన్ కమిషన్‌ను బహిష్కరించాలనే భావం సర్వత్రా వ్యాపించింది. వైస్రాయి సలహా మండలి మాజీ సభ్యుడు, సర్ తేజ్ బహద్దూర్ సప్రూ, సైమన్ కమిషన్‌ను బహిష్కరించేందుకు లిబరల్ పార్టీని ఒప్పించాడు. హిందూమహాసభ మొదట్లో ఎటూ తేల్చుకోలేక ఊగిసలాడినా, పండిత మదన మోహన్ మాలవీయ ఒత్తిడితో బహిష్కారానికి వోటు చేసింది. పునరుద్ధరింపబడిన ముస్లింలీగ్ కూడా సైమన్ కమిషన్ బహిష్కారానికే నిశ్చయించింది. జిన్నాను తమ వైపు తిప్పుకోడానికి ఇర్విన్ చాలా ప్రయత్నం చేశాడు. కాని అదే సమయంలో బిర్కెన్ హెడ్ తలపొగరు ఉపన్యాసం అభిమానమున్న ప్రతి భారతీయునీ గాయపరచింది. జిన్నా కూడా సైమన్ కమిషన్ బహిష్కారానికే నిశ్చయించుకొన్నాడు. బ్రిటిష్ ప్రభుత్వానికి ఎప్పుడూ జోహుకుం అంటూ వుండేవాళ్ళు కొందరు మినహా అన్ని పార్టీలు సైమన్ కమిషన్‌ను బహిష్కరించాయి.

భారతీయులు సహకరించినా, సహకరించకపోయినా సైమన్ కమిషన్ తన పని తాను నిర్వర్తించుతుందని వైస్రాయి ఇర్విన్ ఫిబ్రవరి 2 న ప్రకటించాడు. ఫిబ్రవరి 3 న సైమన్ కమిషన్ బొంబాయి చేరింది. ఆ రోజున దీనికి నిరసనగా భారత దేశమంతటా హరతాళ్ జరిగింది. ఫిబ్రవరి 3 న సైమన్ కమిషన్ బొంబాయిలో అడుగు పెట్టింది. "సైమన్ తిరిగిపో" అనే నినాదాలు రాసిన అట్టలు. నల్లజెండాలతో పెద్ద ఊరేగింపు జరిగింది. 50 వేల మంది వలంటీర్లు పాల్గొన్నారు. ఫిబ్రవరి 4 న ఢిల్లీకి ఆ తర్వాత కలకత్తా, మద్రాసు, లాహోరు మొదలైన చోట్లకు సైమన్ కమిషన్ వెళ్ళింది, ఎక్కడికి వెళ్ళినా వీరికి నల్లజెండాల స్వాగతమే లభించింది. మద్రాసులో ఆంధ్రులు జరుపుతున్న ఊరేగింపుపై పోలీసులు కాల్పులు జరిపారు. ఒకరు అక్కడికక్కడే మరణించారు. తర్వాత మరో ఇద్దరు చనిపోయారు. అనేకమంది గాయపడ్డారు. మద్రాసులోనే మరో ఊరేగింపునకు నాయకత్వం వహించిన టంగుటూరి ప్రకాశం పంతులు పోలీసులు వద్దంటున్నా, చనిపోయిన వ్యక్తిని చూడాలని పట్టుబట్టాడు. కదిలితే కాల్చుతామని పోలీసులు బెదిరించారు. ప్రకాశం చొక్కావిప్పి కాల్చుకోమని ఎదురు రొమ్ము చూపించాడు. దిగ్భ్రాంతి చెందిన పోలీసులు కాల్పులు సాగించే ప్రయత్నం మానివేశారు. మరణించిన వ్యక్తినీ, గాయపడిన వారినీ ప్రకాశం చూశాడు.

కలకత్తాలోను మరికొన్ని చోట్ల విద్యార్థులకు పోలీసులకు ఘర్షణలు జరిగాయి. సైమన్ కమిషన్ బహిష్కార ఉద్యమ వెల్లువ చూచి ప్రభుత్వానికి గంగవెర్రులెత్తాయి. నిర్బంధ విధానానికి పూనుకొంది. లక్నోలో ప్రజా సమూహాలపైన లాఠీఛార్జీ చేశారు. జవహర్‌లాల్ నెహ్రూను కూడ ఒకచోట పోలీసులు లాఠీ దెబ్బలకు గురి చేశారు. పోలీసు కాల్పులాలు, ఆశ్విక దళాలు లాఠీఛార్జీ చేయడానికి ఉపయోగింపబడ్డాయి. లక్నో, పోలీసుల సాయుధ శిబిరంగా మారింది. నాల్గు రోజులపాటు పోలీసులు స్వైర విహారం చేశారు. అనేకమంది ఇండ్లను చుట్టుముట్టారు. ప్రచారకుల్ని లాఠీఛార్జికి గురిచేశారు. "సైమన్ తిరిగిపో" అని అరచిన అనేకమందిని అరెస్టు చేశారు. ఐనా ప్రజలు వెనుకంజ వేయలేదు. రోజూరోజుకూ సైమన్ కమిషన్‌కు ప్రతికూలంగా ప్రదర్శనలు హెచ్చయ్యాయి. ఇదే సందర్భంలో కొందరు తాలూకాదార్లు సైమన్ కమిషన్‌కు లక్నోలోని కైజర్‌బాగ్‌లో విందు తలపెట్టారు. విందు సమయంలో వేలాదిమంది పోలీసులు చుట్టూ కాపలా కాశారు. కైజర్‌బాగ్ సమీపంలోని రోడ్లవద్దకు కూడా అనుమానింపబడిన ప్రచారకులను రానీయలేదు. ఐనా కూడా "సైమన్ తిరిగి పో" "భారత దేశం భారతీయులకే" అనే నినాదాలు రాసిన నల్లని గాలి పటాలు, రబ్బరు బెలూన్లు విందు జరిగే చోట సైమన్ కమిషన్ సభ్యులకు కనువిందు చేశాయి.

పాట్నాకు సైమన్ కమిషన్ వచ్చినపుడు పెద్ద ఎత్తున స్వాగత సన్నాహాలు చేస్తున్నట్లు ప్రదర్శించడానికి, ప్రభుత్వం ఏర్పాటు చేసింది. కాని లారీలలో వచ్చిన జనం బహిష్కార ఉత్సవంలోకే వెళ్ళారు. ఒక వందమంది లోపు ప్రభుత్వ ఉద్యోగులు, చప్రాసీలు మొదలైన వారు, సైమన్ కమిషన్‌కు స్వాగతం చెప్పారు.

అక్టోబరు 30 న లాహోర్‌లో పెద్ద ఊరేగింపు జరిగింది. ఊరేగింపుకి ఎదురు రోడ్డుపై లాలాలజపతి

రాయ్ నిల్చుని వున్నాడు. పోలీసులు పాశవికంగా లాఠీ ఛార్జీ చేశారు. ఒక పోలీసు అధికారి లజపతి రాయ్‌ని తీవ్రంగా బాదాడు. ఆయన ఒక్కడుగు కూడా వెనక్కి వేయలేదు. "నీ పేరేమిటి ?" అని ఆ అధికారిని అడిగాడు. అతడు జవాబివ్వకపోగా మరికొన్ని దెబ్బలు వేశాడు. "నీవు మగాడివైతే నీ పేరుచెప్పు" అని మళ్ళాగద్దించాడు లజపతిరాయ్. మళ్ళా దెబ్బలు. ఉద్రిక్తులైన ప్రజల్ని లజపతిరాయ్ వారించాడు. ఆనాటి సాయంత్రం జరిగిన సభలో "మమ్మ్మ కొట్టిన ప్రతి దెబ్బ, బ్రిటిష్ సామ్రాజ్య శవపేటికకు ఒక్కొక్క మేకు అవుతుంది" అన్నాడాయన. గుండె, ఛాతీపైన తగిలిన దెబ్బలతో క్రమంగా ఆరోగ్యం క్షీణించి 1928 నవంబర్ 17 న లజపతిరాయ్ కీర్తిశేషుడయ్యాడు.

సైమన్ కమిషన్ బహిష్కార ఉద్యమంలో ఆంధ్రులు వెనుకబడలేదు. సైమన్ కమిషన్ భారత దేశంలో అడుగిడినపుడు బందరు తాలూకా బోర్డుపై నల్లజెండా ఎగిరింది. అపుడు తాలూకా బోర్డు అధ్యక్షులు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు. పాఠశాలలకు సెలవు ఇచ్చారు. జిల్లాలోకల్లా ఇలా తాలూకాబోర్డుపై నల్లజెండా ఎగురవేసిన సాహసం ఘనత బ్రహ్మయ్య గారికి దక్కింది. 1928 లో సైమన్ కమిషన్ రెండో సారి మద్రాసు వెళ్ళినపుడు, సైమన్ కమిషన్ ప్రతికూల ఉద్యమంలో పాల్గొనేందుకు కొండా వెంకటప్పయ్య పంతులు, బులుసు సాంబమూర్తి, డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, కృష్ణాజిల్లా వారైన గొట్టిపాటి బ్రహ్మయ్య, కాట్రగడ్డ మధుసూధనరావు కాట్రగడ్డ వెంకటనారాయణరావు, ఇంకా మద్దూరి అన్నపూర్ణయ్య, ఆకొండూరి గోవిందాచార్యులు, దండు నారాయణరాజు, చిక్కాల వెంకటరత్నం, మొసలికంటి తిరుమలరావు, కళా వెంకట్రావు, క్రొవ్విడి లింగరాజు మొదలైన వారున్నారు.

సైమన్ కమిషన్ వచ్చే ఒకరోజు ముందు కొండా వెంకటప్పయ్యగారిని, మరి కొందరిని అరెస్టు చేశారు. మద్రాసు సముద్ర తీరంలో ప్రకాశంగారి అధ్యక్షతన జరిగిన ఒక బహిరంగసభలో, శ్రీనివాస అయ్యంగార్ మాట్లాడారు. ఆయన విద్యార్థులను, తలి దండ్రుల అనుమతి లేకపోతే నల్లజండాల ప్రదర్శనలో పాల్గొన వద్దని చెప్పాడు. కాని ప్రకాశం "మీ తలిదండ్రులు అంగీకరించినా, అంగీకరించకపోయినా ప్రదర్శనలో పాల్గొనండి. తర్వాత మీ తలిదండ్రులు మీకు డబ్బు ఇవ్వకపోతే, నేను ముష్టి ఎత్తయినా మీకు సహాయం చేస్తాను " అని ప్రబోధించాడు.

తిరుపతి, కర్నూలు, ఏలూరు, బెజవాడ, శ్రీకాకుళం, విజయనగరం, గుంటూరు మున్సిపాలిటీలు సైమన్ కమిషన్ బహిష్కరణకు అనుకూలంగా తీర్మానం చేశాయి. మితవాది న్యాపతి సుబ్బారావు పంతులు కూడా బహిష్కారఉద్యమంలో పాల్గొన్నాడు. భీమవరం బార్ అసోసియేషన్ బహిష్కార తీర్మానాన్ని చేసింది. ఫిబ్రవరి 3 న జరిగిన హర్తాళ్‌లో న్యాయవాదులు, ఎక్కువ సంఖ్యలో విద్యార్థులు పాల్గొన్నారు. తెనాలి, గుంటూరులలో "సైమన్ తిరిగిపో" అనే నినాదాలతో వలంటీర్లు సైమన్ కమిషన్‌కు ఎదురయ్యారు. గుంటూరు సమీపంలోని కొత్తరెడ్డిపాలెం వెళ్ళినపుడు బహిష్కార నినాదాలతో ద్వారాలు అమర్చారు. గుంటూరు మున్సిపాలిటీ చైర్మన్‌గా వున్న నడింపల్లి నరసింహారావుగారు, మున్సిపల్ కార్యాలయంపై నల్లజెండా ఎగురవేశారు.

కలకత్తావెళుతూ సైమన్ కమిషన్ సభ్యులు బెజవాడలో ఆగినపుడు, బెజవాడ మున్సిపల్ చైర్మన్ అయ్యదేవర కాళేశ్వరరావు బంట్రోతు ద్వారా సైమన్‌కు ఒక కవరు పంపాడు. అందులో సైమన్ బహిష్కార తీర్మానపాఠం "సైమన్ తిరిగిపో" అనే పత్రాలు ఉన్నాయి. సైమన్ ఆ కవరు విప్పి చూచి వాటిని కలెక్టర్‌కు అందజేశాడు. ఆ సంవత్సరం పొడవునా బహిష్కార ఉద్యమం కొనసాగింది. 1929 ఫిబ్రవరి 7న బులుసు సాంబమూర్తిని బెజవాడలో అరెస్టు చేసి సంవత్సరం శిక్ష విధించింది ప్రభుత్వం. మోతీలాల్ నెహ్రూ, ప్రకాశం ప్రభుత్వ చర్యను ఖండించారు. మద్రాసులో ఫిబ్రవరి 17న అరెస్టయిన వారిలో కొండా వెంకటప్పయ్య, భోగరాజు పట్టాభి సీతారామయ్య, కళా వెంకట్రావు, జి. వి. పున్నయ్యశాస్త్రి, కె. బి. ఆర్, స్వామి మొదలైనవారు వున్నారు. వీరందరినీ ఆరాత్రే ప్రభుత్వం విడుదల చేసింది.

సైమన్ కమిషను బహిష్కార ఉద్యమ కాలంలో అతివాద భావాల వెల్లువ అన్నిచోట్లా విజృంభించింది. అనేకచోట్ల యువజనసంఘా లేర్పడ్డాయి. వీటిలో ఎక్కువమంది విద్యార్థులు చేరారు. విద్యార్థి ఫెడ

రేషన్ కూడా ఏర్పడింది, వీరు జాతీయ భావాలనేకాక సోషలిస్టు భావాలను కూడా వ్యాపింప చేయ సాగారు.

మద్రాసులో 1927లో జరిగిన కాంగ్రెస్‌లో "పూర్ణ స్వరాజ్యం" లేక "సంపూర్ణ స్వాతంత్ర్యం" కాంగ్రెస్ అంతిమ లక్ష్యమని తీర్మానింపబడింది. జవహర్‌లాల్ నెహ్రూ ప్రతిపాదించిన ఈ తీర్మానాన్ని సుభాస్ చంద్రబోస్ బలపరచాడు. ఐతే ఇదివరలో భారత రాజ్యాంగ కార్యదర్శి బిర్కెన్ హెడ్ అన్ని పక్షాలు అంగీకరించిన ఒక రాజ్యాంగ ప్రణాళికను తయారు చేయవలసిందిగా స్వరాజ్య పా ని సవాలు చేశాడు, ఆ సవాలు స్వీకరించడానికి కాం। స్ సిద్ధపడింది. అఖిల భారత అఖిలపక్ష సమా శం ఏర్పాటు చేయాలని వర్కింగ్ కమిటీకి 1926 డిసెంబరులో కాంగ్రెస్ ఆదేశించింది. 1928 ఫిబ్రవరి, మార్చి నెలల్లో ఈ సమావేశం జరిగింది. కాని ఎలాంటి నిర్ణయానికి రాలేకపోయింది. 1928 మే 19న జరిగిన సమావేశం కూడా ఫలించలేదు. ఐతే మోతీలాల్ నెహ్రూ ఆధ్వర్యాన ఒక కమిటీని ఏర్పరచింది. ఈ కమిటీ ఇచ్చిన నివేదికే, నెహ్రూ కమిటీ రిపోర్టుగా ప్రసిద్ధి చెందింది. దీని సారాంశం ఇది :

బాధ్యతాయుత ప్రభుత్వానికి, అనగా (ప్రభుత్వ) కార్య నిర్వహక వర్గంపై, శాసన సభదే అధికారం. బ్రిటిష్ సామ్రాజ్యాంతర్గత డొమినియన్ పార్లమెంటులు లాగానే - కెనడా ఆస్ట్రేలియాలు లాగానే - అధినివేశ ప్రతిపత్తి భారత దేశం కలిగివుంటుంది. పార్లమెంటులో సెనేట్, ప్రతినిధుల సభ అని రెండుసభలు వుంటాయి. సెనేట్‌కు రాష్ట్ర కౌన్సిళ్ళు దామాషా ప్రాతినిధ్యంతో 200 మంది సభ్యుల్ని ఎన్ను కొంటాయి. వయోజన వోటింగ్ ప్రాతిపదికగా ప్రతినిధుల సభకు 500 మంది సభ్యుల్ని ఎన్నుకొంటారు. బెంగాలులోని ముస్లిములకు, వాయువ్య రాష్ట్రంలోని ముస్లిమేతరులకు తప్ప, మతగ్రూపులకు ప్రత్యేక ప్రాతినిధ్యం లేదు. రాష్ట్ర కౌన్సిళ్ళలో మైనారిటీలకు జనాభా ప్రాతిపదికపై స్థానాలు ప్రత్యేకించి రిజర్వు చేయబడతాయి, ఐతే ఈ రాష్ట్రాలలో ఈ ప్రత్యేక రిజర్వేషన్ పంజాబు, బెంగాలులకు వర్తించదు.

మొత్తం మీద చూస్తే ఈ నివేదిక అటు కాంగ్రెస్‌లోని అతివాదులనూ సంతృప్తి పరచలేదు. ముస్లిములలో కొందరు ప్రముఖుల్ని సంతృప్తి పరచలేదు. కాంగ్రెస్‌లోని యువకులు కోరుతున్న "పూర్ణ స్వరాజ్యా" నికి అర్థం సామ్రాజ్యానికి లోబడిన డొమినియన్ స్టేటస్ (అధినివేశ ప్రతిపత్తి) అని భాష్యం చెప్పారు నాయకులు. ప్రజాతంత్ర, లౌకిక సూత్రాలపై సంపూర్ణంగా వారు ఆధారపడలేదు. సూటిగా, రాజీలేని పద్ధతిలో మత సమస్యను పరిష్కరించడానికి వారు ప్రయత్నించలేదు.

1928 డిసెంబరులో కలకత్తాలో కాంగ్రెస్ మహాసభ జరిగింది. ఈ సభకు ముందు కలకత్తాలోనే అఖిలపక్ష సమావేశం నెహ్రూ నివేదికను చర్చించడానికి సమావేశమైంది. ఆ సందర్భంగా మహమ్మదలీ జిన్నా నాలుగు సవరణలు ప్రతిపాదించాడు. అవి - కేంద్ర శాసన సభలలో 33 1/3 శాతం స్థానాన్ని ముస్లిములకు కేటాయించాలి. జనాభా ప్రాతిపదికపైన బెంగాల్, పంజాబులలో ముస్లిములకు స్థానాలను కేటాయించాలి. కేంద్రానికి గాక రాష్ట్రాలకే పరిశిష్ట అధికారాలు (రెసిడ్యుయరీ పవర్సు) వుంచాలి. సింధు రాష్ట్రాన్ని బొంబాయి నుంచి విడదీయాలి. తాను ప్రత్యేక నియోజక వర్గాలను కోరకపోయినా ముస్లిం ప్రజలు ఎక్కువ మంది కోరుతున్నారని, ఆ తర్వాత 1931 లో ఒక ప్రసంగంలో జిన్నా అన్నాడు. వ్యక్తిగతంగా తాను సంయుక్త నియోజక వర్గాలకే అనుకూలుణ్ణి అని అన్నాడు. ఐతే ప్రత్యేక నియోజక వర్గాల ప్రాతిపదికపై ఒక పరిష్కారానికి వస్తే, మున్ముందు హిందూ ముస్లింలలో స్వాతంత్ర్యానంతరం, పరస్పరం అపనమ్మకం, అనుమానాలు, భయాలు నశించి తర్వాత బహుశా ఈ ప్రత్యేక నియోజకవర్గాల సమస్య సమసిపోవచ్చు నన్నాడు.

కలకత్తా అఖిలపక్ష సమావేశంలో జిన్నా కోర్కెలను ఆమోదించలేదు. పైగా ఇతర మతవాదులు కూడా తమతమ కోర్కెల్ని వెలిబుచ్చ సాగారు. పంజాబులో సిక్కులకు ప్రత్యేక ప్రాతినిధ్యం కావాలని సిక్కు నాయకులు కోరారు.

1928 డిసెంబరు 23 న అఖిల పక్ష సమావేశంలో "డొమినియన్ స్టేటస్" పై చర్చ వచ్చినపుడు. లక్ష్యం నుంచి తొలగిపోవడం పిరికిపందల పని గాని పోరాడేవారి పని కాదన్నాడు మహమ్మదలీ, దీనిపై మాటా మాటా పెరిగింది. మితవాదుల్ను

మహమ్మదలీని వ్యతిరేకించారు. కాంగ్రెస్ నాయకులు మితవాదుల్ని ఖండించకుండా మౌనం వహించారు. దీనితో మహమ్మదలీ, షౌకతలీలు కాంగ్రెస్ నుంచి విడిపోడానికి దారి తీసింది. 25 శాతం వున్న ముస్లిములకు 33 శాతం కేంద్ర అసెంబ్లీలో సీట్లు యివ్వ నిరాకరించారని వారి అభియోగం. హిందూ పక్షపాతం గల కొందరు కాంగ్రెస్ వాముల నుద్దేశించి మహమ్మదలీ "మీరు యూదులు, మీరు వర్తకులు" అంటూ నిందించాడు. నెహ్రూ నివేదిక గురించి ఆయన ఇలా అన్నాడు. ఈస్టిండియా కంపెనీ రోజుల్లో "సృష్టి భగవంతుడిది. దేశం రాజుది. పరిపాలన జాన్ కంపెనీ బహదూర్‌ది" అని అరచుకుంటూ దండోరా వేసేవారు. కాని నెహ్రూ నివేదికకు అం ం -"సృష్టి భగవంతుడిది. దేశం వైస్రాయిది. పా మెంటూ పరిపాలనా హిందూ మహాసభది". 192 లో సహాయ నిరాకరణ ఉద్యమతత్వం గురించి అద్భుతమైన ఉపన్యాసమిచ్చిన మహమ్మదలీయేనా ఈయన అని, అనేటంతగా ఆశాభంగం పొందాడు. ప్రస్తుత వాతావరణం మారని పక్షంలో ఒక సంవత్సరం వరకూ తాను హిందూ ముస్లిములు కలిసివున్న సంయుక్త సభలలో పాల్గొనని షౌకదలీ అన్నాడు. తాను ప్రత్యేకించి ముస్లిములని సంఘటిత పరుచుతాననీ - "హిందువులకు వ్యతిరేకంగా కాదు, దేశ సేవకు" వారిని సంఘటిత పరుస్తాననీ అన్నాడు.

ఒకప్పుడు హిందూ ముస్లిముల సఖ్యతకు నిర్విరామంగా పాటుపడిన ఈ సోదరులు, యావత్ భారత దేశ అపూర్వ ఆదర ప్రేమలు చూరగొన్న ఈ సోదరులు, తిరిగి కాంగ్రెస్ సంస్థలోకి రాలేదు. కలకత్తాలో జిన్నా కొంతవరకు ప్రదర్శించిన సామరస్య ధోరణిని అవకాశంగా తీసుకొని ఈ సమస్యకు ఒక తుది పరిష్కారం చేసి వుండవలసిందని చారిత్రక విమర్శకుల అభిప్రాయం.

ఇంకొకప్రక్క కలకత్తా కాంగ్రెస్ నాటికి కాంగ్రెస్‌లోనూ, వెలుపలా అతివాద భావాలు వ్యాప్తి చెంద నారంభించాయి. లజపతిరాయ్‌ని తీవ్ర లాఠీచార్జికి గురిచేసి ఆయన మరణానికి కారకుడైన సాండర్స్ (లాహోర్ అసిస్టెంటు పోలీసు సూపరెంటు)ను 1928 డిసెంబరు 17 వ రాజగురు, భగత్‌సింగ్‌లు కాల్చి చంపారు. లజపతిరాయ్‌పై లాఠీచార్జి జరిపిన రోజున, లాఠీచార్జి జరపడానికి ఆజ్ఞాపించిన స్టాట్‌ను కూడా చంపాలని విప్లవ వాదులు తీర్మానించుకొన్నారు. కాని, సాండర్సు ఒక్కడే చిక్కాడు.

ఇలాంటి ఉద్రిక్త వాతావరణంలో డిసెంబర్ 26న ఎ. ఐ. సి. సి. సమావేశం జరిగింది. ఈ సమావేశంలో చర్చనీయాంశాలలో ప్రధానమైనది "డొమినియన్ స్టేటస్" (అధినివేశ ప్రతిప్రత్తి).

అంతకు ముందు కొంతకాలం గాంధీ రాజకీయాలలో పాల్గొనలేదు. 1922 లో శిక్షింపబడి వున్నందున 1922 గయా కాంగ్రెస్‌లోను, 1923 ఢిల్లీ ప్రత్యేక కాంగ్రెస్‌లోను, 1923 కాకినాడ కాంగ్రెస్‌లోను ఆయన లేడు. 1924లో ఆయన విడుదలయ్యాడు. కాన్పూర్ కాంగ్రెస్ తర్వాత ఒక సంవత్సరంపాటు రాజకీయ మౌనవ్రతం చేశాడు. గౌహతి కాంగ్రెస్‌లో పాల్గొన్నాడు. కాని మద్రాసు కాంగ్రెస్‌లో ఎలాంటి జోక్యం చేసుకోలేదు. విషయ నిర్ధారణ సభకు కూడా హాజరు కాలేదు. కాని అంతే అంటనట్లు వుండే విధానానికి స్వస్తి చెప్పి గాంధీ కలకత్తా కాం। .స్‌కు హాజరయాడు.

"డొమీనియన్ టస్" (అధినివేశ ప్రతిపత్తి)ని గురించి గాంధీ తీరా నాన్ని ప్రవేశపెట్టాడు. శ్రీనివాస అయ్యంగార్, జవ.. ర్‌లాల్ నెహ్రూ, సుభాస్‌చంద్ర బోస్‌లు డొమినియన్ స్టేటస్ భావానికి వ్యతిరేకులు. తన (నెహ్రూ) నివేదికను ఆమోదించుతూ మెజారిటీ తీర్మానించని పక్షంలో తాను కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించబోనని మోతీలాల్ స్పష్టం చేశాడు.

కాంగ్రెస్‌కు కొద్దికాలం కిందటే బార్డోలీ రైతుల పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని నడిపి విజయం సాధించిన వల్లభభాయ్ పటేల్, కలకత్తా కాంగ్రెస్‌కు అధ్యక్షుడవుతాడని అందరూ భావించారు. కాని గాంధీ ఇలా అన్నాడు: "బెంగాల్ (అంటే బెంగాల్‌లో జరగబోయే కాంగ్రెస్)కు పెద్ద నెహ్రూ అవసరం. ఆయన గౌరవప్రదమైన రాజీకోరే మనిషి- దేశానికి అది కావాలి. ఆ ధోరణిలో దేశం వుంది. అందుచేత ఆయన్ని ఎన్నుకోండి" అలా గాంధీ సలహా మేరకు కాంగ్రెస్ అధ్యక్షునిగా ఎన్నికైన మోతీలాల్ నె। హ్రూ తన నివేదికలో పొందుపరచిన డొమినియన్ టస్ భావాన్ని కాంగ్రెస్ కార్యదర్శు లిద్దరూ-జవహ। లాల్ నెహ్రూ, సుభాష్‌చంద్రబోస్‌లు - వ్యతిరేకించారు. మద్రాసు తీర్మానం "పూర్ణస్వరాజ్యాంను అమలు పరిచా

లని కోరారు. గాంధీ మధ్యేమార్గంగా ఒక తీర్మానం ప్రవేశపెట్టాడు. బ్రిటిష ప్రభుత్వం గనుక 1930 డిసెంబరు 30 నాటికి నెహ్రూ నివేదికను అంగీకరించక పోయినట్లయితే కాంగ్రెస్ అహింసాత్మక సహాయ నిరాకరణ ఉద్యమాన్ని ప్రారంభించుతుందని ఈ తీర్మాన సారాంశం ఐతే జవహర్‌లాల్‌నెహ్రూ ఈ తీరానాన్ని వ్యతిరేకించాడు. బ్రిటన్‌తో సంబంధాలు పూర్తిగా తెగతెంపులు చేసుకోనిదే నిజమైన స్వాతంత్ర్యం లేదన్నాడు. గాంధీగారి తీర్మానానికి సవరణ ప్రతిపాదించాడు. "వర్కింగ్ కమిటీ రూపొం దించిన తీర్మానాన్ని, గాంధీజీ ప్రతిపాదించిన తీర్మా నాన్ని సవాలుచేయడం సాహసం అనిపించినా తప్పద"ని అన్నాడు. కాంగ్రెస్‌లో ఈ తీర్మానంపై చీలిక సంభవమయేలాగ కన్పించింది. చివరకు గాంధీ రాజీ తీర్మానాన్ని ప్రతిపాదించాడు. 1930 నాటికి పెట్టిన గడువును 1929 కి మార్చాడు. స్వాతంత్ర్యానికి సంబంధించిన క్లాజుకు సవరణ ఆమోదింపబడింది. "కాంగ్రెస్ పేరిట సంపూర్ణ స్వాతంత్ర్యానికి ప్రచారం చేసుకొనేందుకు ఈ తీర్మానం (మోతీలాల్‌నెహ్రూ రిపోర్టును గురించిన తీర్మానం) ఏ విధంగాను అడ్డు రాదని ఆ సవరణ.

గాంధీ రాజీ తీర్మానం సారాంశం ఇది : 1929 డిసెంబరు 31 లోగా అఖిలపక్ష కమిటీ రికమెండ్ చేసిన రాజ్యాంగ నిబంధనావళిని గనుక ప్రభుత్వం తిరస్క రించినా, ఆమోదించకపోయినా కాంగ్రెస్ అహిం సాత్మక సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారంభించు తుంది. పన్నులు చెల్లించవద్దని లేదా తర్వాత నిర్ణ యించబడే మరో విధానాన్ని గాని అవలంబించవల సిందిగా దేశ ప్రజలకు కాంగ్రెస్ సలహా ఇస్తుంది.

విషయ నిర్ణయ సభలో ఈ తీర్మానానికి 118 వోట్లు అనుకూలంగా 4 వోట్లు ప్రతికూలంగా వచ్చాయి. మొదట రాజీ తీర్మానానికి నెహ్రూ, బోస్‌లు వోటు చేసినా, బహిరంగ సమావేశం వచ్చేసరికి బోస్ ఒక సవరణ ప్రతిపాదించాడు. నెహ్రూ ఆ సవరణను బల పరచాడు. సుభాస్ సవరణకు అనుకూలంగా 973 వోట్లు, ప్రతికూలంగా 1350 వోట్లు వచ్చి సవరణ ఓడిపోయింది. గాంధీ ప్రతిపాదించిన తీర్మానం నెగ్గింది.

కలకత్తా కాంగ్రెస్ సమయంలో పారిశ్రామిక కార్మికులు. కాంగ్రెస్ సభ ఆవరణలో చేసిన ప్రదర్శక గమనించదగ్గది 50 వేలమంది సుశిక్షితులైన కార్మి కులు. కాంగ్రెస్ పెండాల్‌ను ఆక్రమించారు. "మహాత్మా" అనే పేరుతో గాంధీ జీవితం రాసిన జి. డి. టెండూల్కర్ ఈ సంఘటన గురించి ఇలా వర్ణించాడు :

"....పారిశ్రామిక కార్మికులు విప్లవ మనస్తత్వంతో వున్నారు (స్వాతంత్ర్యం గురించిన తీర్మా నంలో) ఒక సంవత్సరంపాటు ఆలస్యంపట్ల అసహనం వహించిన 50 వేలమంది సభాస్థలికి చేరుకొన్నారు. జాతీయపతాకకు నమస్కరించారు. తర్వాత కాంగ్రెస్ సభావేదికపై దాడిచేసి ఆక్రమించుకొన్నారు. తక్షణం స్వాతంత్ర్యం కావాలని, వారి నాయకులు ప్రవేశపెట్టిన తీర్మానాన్ని ఆమోదించారు" రెండుగంటలపాటు పెండాల్ వారి స్వాధీనంలో వుంది. బోసు, నెహ్రూలాంటి అతి వాదుల విజ్ఞప్తిని కూడా వారు మన్నించలేదు. చివరకు గాంధీ, మోతీలాల్‌నెహ్రూ లాంటివారు విజ్ఞప్తిచేయగా, తమ కోర్కెలను వింటామనీ, వాటిని గురించి ఆలో చిస్తామనీ-వారు హామీ ఇచ్చాక, ఆ కార్మికులు పెండాల్ వదలి వెళ్ళిపోయారు.

కలకత్తా కాంగ్రెస్, బ్రిటిష్ ప్రభుత్వానికిచ్చిన తుది హెచ్చరిక 1929 డిసెంబర్ 31వ తేదీతో ముగు స్తుంది. ఆనాటికి డొమినియన్ స్టేటస్ ఇవ్వకపోతే సత్యాగ్రహ ఉద్యమం ప్రారంభమవుతుంది. దేశమంతా పోరాటానికి సంసిద్ధమై ఎదురు చూస్తూ వుంది. ఈ పరి స్థితులలో తర్వాతి సంవత్సరం కాంగ్రెసు అధ్యక్షునిగా గాంధీని ఎన్నుకొంది కాంగ్రెస్. కాని గాంధీ దొలగి జవహర్‌లాల్ నెహ్రూను కాంగ్రెస్ అధ్యక్షునిగా సూచించాడు. గాంధీ ఇలా ఎందుకు చేస్తున్నాడని ఆశ్చర్యపోయినా అతివాదులు అసంతృప్తి చెందలేదు. కాని 1929లో అక్టోబరు వైస్రాయి చేసిన ప్రకటన పట్ల కాంగ్రెసు నాయకులు కొందరు వెల్లడించిన సుము ఖత ఆశ్చర్యాన్ని కలుగచేస్తుంది. వైస్రాయి ఇలా అన్నాడు. "డొమినియన్ స్టేటస్ లక్ష్యం, భారతదేశ రాజ్యాంగ అభివృద్ధి యొక్క సహజ సమస్యగా, నిశ్చి తంగా చెప్పని భవిష్యత్ కాలంలో చేరుకుంటుంది."

ఈ ప్రకటనకు సుముఖతను వ్యక్తంచేసే ధోరణిలో గాంధీ అనిబిసెంట్, మోతీలాల్ నెహ్రూ, జవహర్‌లాల్ నెహ్రూ, సర్ తేజ్ బహద్దూర్ సప్రూ మరికొందరు ఒక సహకార ప్రణాళికపై సంతకాలు చేశారు. దీన్నే ఢిల్లీ ప్రణాళికఅంటారు. భారతదేశ అవసరాలకు తగువిధంగా డొమినియన్ రాజ్యాంగ విధానాన్ని ఏర్పరచేందుకు ఒక పథకాన్ని రూపొందించాలి." అని ఆ ప్రణాళిక కోరింది. తర్వాత తర్వాత జవహర్‌లాల్ నెహ్రూ ఈ ప్రణాళికపై సంతకం చేయడం పొరపాటని అంగీకరించాడు. బ్రిటిష్ ప్రభుత్వ దమనకాండకు వ్యక్తిగత విప్లవ వాదులు, కమ్యూనిస్టులు, అతివాద కాంగ్రెసు వాదులు గురవుతున్న రోజుల్లో, ఈ రాజీధోరణి సూచించే ప్రణాళిక రావడం ఆశ్చర్యకరమే. రానున్న సత్యాగ్రహ ఉద్యమాన్ని దృష్టిలో పెట్టుకుని ప్రభుత్వం దమన కాండను మరింత తీవ్రంగా ఉపయోగించడం ప్రారంభించింది.

1928లో ఒకసారి కేంద్ర అసెంబ్లీ అధ్యక్షునిచే నిరాకరింపబడిన ప్రజారక్షణ బిల్లును తిరిగి 1929 జనవరిలో ప్రవేశపెట్టబడింది. ఇది ఏప్రిల్ నెలలో చర్చకు వచ్చింది. అప్పటికే, 1929 మార్చి 20వతేదీన కమ్యూనిస్టు నాయకులను, కార్మిక నాయకులను అరెస్టు చేసి మీరట్‌లో విచారణ ప్రారంభించింది. వారి నేరం "భారతదేశంపై చక్రవర్తికిగల సార్వభౌమాధికారాన్ని తొలగించడం"

ఈ బిల్లును చర్చించినట్లయితే, మీరట్ కేసు గురించి ప్రస్తావించవలసి వుంటుందనీ అది కోర్టు ధిక్కార మౌతుందనీ కేంద్ర అసెంబ్లీ అధ్యక్షుడు విఠల్‌భాయి పటేల్ ఏప్రిల్ 2న అన్నాడు. ఈ కేసు పూర్తి అయ్యే వరకూ ఈ బిల్లును ఉపసంహరించుకోండి, లేదా మీరట్ కేసును ఉపసంహరించుకోండి అని ప్రభుత్వానికి ఆయన సూచించాడు. కాని ప్రభుత్వం అంగీకరించలేదు. ఈ పరిస్థితులలో ఈ బిల్లును చర్చకు అనుమతించితే సభా నిబంధనావళిని దుర్వినియోగపరచినట్లవుతుందని విఠల్‌భాయి పటేల్ ప్రకటించాడు. ఆ తర్వాత స్టేట్‌కౌన్సిల్ కేంద్ర శాసన సభలను సంయుక్తంగా సమావేశపరచి, ఈ బిల్లులోని అధికారాలను ప్రభుత్వం పొందేవిధంగా వైస్రాయి ఆర్డినెన్సును ప్రకటించాడు. ఈ సందర్భంగా వైస్రాయి ఉపన్యాసం కేంద్ర శాసన సభాధ్యక్షుని నిర్ణయాన్ని విమర్శించే విధంగా వుందని పటేల్ నిరసన తెలియజేశాడు. శాసనసభ గౌరవాన్ని అధ్యక్షుని నిర్ణయాలను విమర్శించుట తనఉద్దేశం కాదని వైస్రాయి జవాబు పంపాడు.

కేంద్ర శాసనసభలో ఏప్రిల్ 8 న కార్మిక వివాద చట్టం ప్యాసయింది. ప్రజారక్షణ చట్టం గురించి తన రూలింగ్ ఇవ్వడానికి అధ్యక్షుడు లేచి నిలబడ్డాడు. ఇంతలో రెండు బాంబులు విసరబడ్డాయి. ఫైనాన్సు మెంబరు సర్ జా స్కూస్టర్‌కు సమీపంలో ఈ బాంబులు పడ్డాయి. పెద్ద ధ తో పొగతో ఉక్కిరి బిక్కిరి చేసిన ఈ బాంబులు ఆ ర్వాత నిందితులు చెప్పినట్టు "ధ్వని కలుగచేయడానికీ, కదలిక కదిలించడానికీ ఉద్దేశింపబడి నవే గాని గాయపర్చడానికి ఉద్దేశింపబడినవి కావు". గందరగోళంతో శాసనసభ ముగిసింది. భగత్‌సింగ్ బటుకేశ్వరదత్తులు అరెస్టు చేయబడ్డారు. ఆ తర్వాతనే ఏప్రిల్ 12న పైన ఉదహరించబడిన వైస్రాయి ఆర్డినెన్సు ప్రకటన జరిగింది.

ఈ ఏప్రిల్‌లోనే బొంబాయిలో లక్ష యాభై వేల మంది జౌళి కార్మికులు సమ్మె చేశారు. సమ్మె ఆరు నెలలు కొనసాగింది. జెంషెడ్‌పూర్‌లో కార్మికులు, ఈస్టిండియా రైల్వే కార్మికులు, బెంగాల్ జూట్‌మిల్లు కార్మికులు, కలకత్తా పారిశుద్ధ్య కార్యాలు నిర్వర్తించే మున్సిపల్ కార్మికులు సమ్మె చేశారు. ప్రభుత్వం అరెస్టులు, సోదాలు సాగించింది. నిర్బంధ కాండను వినియోగించింది.

1857 స్వాతంత్ర్య సంగ్రామ వార్షికోత్సవ సందర్భంగా మీరట్‌లో మే 9న ప్రభుత్వం పెద్ద బందోబస్తు చేసింది. ప్రభు నికి ఎంత దడ పట్టుకుందో ఆనాటి హంగామా చూ తెలుస్తుంది. మీరట్‌కు వచ్చే వాళ్ళనూ పోయే వాళ్ళ బాగా తనిఖీ చేసిగాని వదలిపెట్టలేదు.

పుస్తకాలపై, పత్రికలపై నిషేధాలు ఎక్కువయ్యాయి. "దాస్య శృంఖలాలలో భారత భారతదేశం" (ఇండియా ఇన్ బాండేజ్) అని డాక్టర్ సందర్‌లాండ్ రాసిన గ్రంథాన్ని ప్రచురించినందుకు "మాడరన్ రివ్యూ" సంపాదకుడు రామానందచటర్జీని రాజద్రోహనేరం కింద అరెస్టు చేసింది. సుభాష్‌చంద్ర బోస్ తదితర కాంగ్రెస్ నాయకులు స్వల్పకారణాలపై అరెస్టు చేయబడ్డారు.

లాహోర్ కుట్ర కేసులో నిందితుడైన విప్లవవాది జతీంద్రనాథదాసు, జైళ్ళలోని అమానుష పరిస్థితులకు నిరసనగా 63 రోజులు కఠోర నిరాహారదీక్ష అనంతరం 1929 సెప్టెంబరు 13 న నిర్యాణం చెందాడు. ఈ నిరాహారదీక్ష సాగుతున్నకాలంలో దేశం అట్టుడికినట్లు ఉడికిపోయింది. నిరాహారవ్రతం సాగిస్తున్న ఖైదీలను కోర్టుకు తీసుకురాకుండానే విచారణ సాగించేందుకు వీలుగా, ప్రభుత్వం "నిరాహారవ్రత బిల్లు"ను ఒకదాన్ని ప్రవేశపెట్టింది.

ఈ పరిస్థితులలో కాంగ్రెస్ అనుయాయులలో గందరగోళం, ఆందోళన వృద్ధికా జొచ్చింది. ఢిల్లీలో కాంగ్రెస్ నాయకులు నవంబరు ప్రారంభంలో చేసిన ప్రకటన గురించి సామ్రాజ్యవాదులు సంబరపడ్డారు. 1929 నవంబరు 4 న "లండన్ టైమ్స్" ఇలారాసింది: "నిన్నటి (కాంగ్రెస్ నాయకులు) ప్రకటన లాహోర్‌లో సమావేశం కాబోతున్న కాంగ్రెస్ కార్యక్రమం రద్దయినట్లే." దీని అర్థం సంపూర్ణ స్వాతంత్ర్య లక్ష్యాన్ని కాంగ్రెస్ వదలుకొందని ఆ పత్రిక భావం.

కాని కాంగ్రెస్ నాయకులు చూపించిన రాజీ ధోరణికి వైస్రాయి ప్రతిస్పందించలేదు. వైస్రాయి సప్రూకు రాసిన జాబులో మోతీలాల్‌నెహ్రూ గాంధీలను 1929 డిసెంబరు 23 న కలుసుకొంటానని తెలియజేశాడు. అదే రోజున జిన్నా, సప్రూ, పటేల్‌లు కూడా వైస్రాయికి తమ తమ అభిప్రాయాలను తెలియచేయడానికి ఢిల్లీ చేరారు. వైస్రాయి తన పర్యటన ముగించుకొని తిరుగు ప్రయాణంచేస్తున్న సమయంలో అదేసమయాన ఢిల్లీ లో పాతకోట సమీపంలో రైలు లైనులో బాంబు పేలింది. వైస్రాయికొంచెంలోతప్పించుకొన్నాడు. ఆనాడే గాంధీ-ఇర్విన్‌ల మధ్య చర్చలు ప్రారంభమయ్యాయి. మొదట 45 నిమిషాలు వరకు బాంబు గురించిన ప్రస్తావనతోనే ముగిసింది. చివరకు వైస్రాయి చర్చలను "ఎక్కడనుంచి ప్రారంభిద్దాం. రాజకీయ ఖైదీల విషయంతో ప్రారంభిద్దామా ?" అని అడిగాడు. గాంధీ మొట్టమొదట డొమినియన్ స్టేటస్ గురించి మాట్లాడాలని కోరాడు, సంపూర్ణ అధినివేశ ప్రతిపత్తిపై ఆధారపడి రౌండు టేబిల్‌సభ ప్రారంభించాలని గాంధీ స్పష్టం చేశాడు. వైస్రాయి దాన్ని గురించి ఎలాంటి వాగ్దానం చేయలేనని అన్నాడు. అధినివేశ ప్రతిపత్తి (డొమినియన్‌స్టేటస్)ని వాగ్దానం చేస్తూ రౌండ్ టేబిల్ మావేశానికి ఆహ్వానం పంపే స్థితిలో తాను లేనని స్రాయి స్పష్టం చేశాడు. ఆ విధంగా లాహోర్ కాంగ్రెస్ మహాసభకు ముందు జరిగిన రాయబారాలు విఫలమయ్యాయి.

## లాహోర్ కాంగ్రెస్

1929 డిసెంబరు నెల చివరి వారంలో లాహోర్‌లోని రావి నదీ తీరాన కాంగ్రెస్ మహాసభ జరిగింది. రాజకీయ వాతావరణం ఉద్రిక్తంగావుంది. ఈ మహాసభకు 30 వేలమంది ప్రేక్షకులు, ప్రతినిధులు వచ్చారు. వాయువ్య సరిహద్దు రాష్ట్రం నుంచి ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్ నాయకత్వాన ఎక్కువమంది ఈ సభకు హాజరయ్యారు. 1924 నుంచీ కాంగ్రెస్‌కు దూరమౌతున్న మహమ్మదలీ, షౌకదలీ సోదరులు కూడా హాజరయ్యారు. కాని కాంగ్రెస్ తలపెట్టనున్న ఉద్యమంలో పాల్గొనబోమని హెచ్చరించడానికే వారు వచ్చారు. ముస్లిం జాతీయవాది, డాక్టర్ అన్సారీలో కూడా అంత ఉత్సాహం కన్పించలేదు. కాని మౌలానా అజాద్ మనస్ఫూర్తిగా ఈ మహాసభలో పాల్గొన్నాడు. స్వాతంత్ర్య ఉద్యమంలో ముస్లిం ప్రజాసామాన్యం పాల్గొంటారనే దృఢవిశ్వాసం ఆయనకు వుంది.

మోతీలాల్ నెహ్రూ తన అధ్యక్షపదవీకాలం ముగిసినందున, జవహర్‌లాల్ నెహ్రూకు ఆ బాధ్యత అప్పగించాడు. లాహోర్ కాంగ్రెస్‌కు అధ్యక్షుడుగా జవహర్‌లాల్ ఎన్నుకోబడిన విషయం పాఠకులకు విదితమే.

జవహర్‌లాల్ నెహ్రూ తన అధ్యక్షోపన్యాసంలో సంపూర్ణ స్వాతంత్ర్యం కాంగ్రెస్ లక్ష్యంగా వుండాలని ఉద్ఘోషించాడు. బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్నీ, రాజుల్నీ, సంస్థానాధీశుల్నీ ఆయన ఖండించాడు. తాను సోషలిస్టుననీ, రిపబ్లికన్ను అనీ చెప్పుకున్నాడు. "మనకు స్వాతంత్ర్యం అంటే అర్థం — బ్రిటిష్ పెత్తనం నుంచి, బ్రిటిషు సామ్రాజ్యవాదం నుంచి సంపూర్ణ స్వాతంత్ర్యం. స్వాతంత్ర్యం పొందిన తర్వాత ప్రపంచ సహకారానికి, ఫెడరేషన్‌కి చేసే ప్రయత్నాన్ని హర్షిస్తుంది భారతదేశం. అవసరమైతే తాను సమాన భాగస్వామిగా ఉన్న పెద్ద సముదాయం యొక్క ప్రయోజనాలకోసం తన స్వాతంత్ర్యాన్ని కూడా కొంతవరకు త్యాగం చేయడానికి అంగీ

కరించుతుంది. సామ్రాజ్యతత్వం పూర్తిగా నిర్మూలింపబడితే కాని భారతదేశం ఏ సమ్మేళనం (కామన్ వెల్త్)లో గాని, సమాన భాగస్వామిగా ఉండజాలదు" ప్రపంచంలోని తీవ్ర పరిణామాల్ని జవహర్‌లాల్ నెహ్రూ వివరించాడు. ప్రపంచం నూతన పరివర్తన కోసం ప్రసవవేదన పడుతున్నదని అన్నాడు. ప్రాచ్య దేశాలతో పాటు భారతదేశం కూడా ప్రపంచ ఉద్యమంలో పాల్గొంటున్నదని అన్నాడు. అధినివేశ ప్రతిపత్తి నిజమైన అధికారం ఇవ్వదనీ, పూర్తిగా విదేశ సైన్యం తొలగిపోతేతప్ప, ఆర్థికాధికారం విదేశీయుల చేతుల నుంచి పోతేతప్ప నిజమైన అధికారం కాజాలదనీ, నెహ్రూ అన్నాడు. హింస — అహింస (Violence and non Violence)ల సమస్యను ప్రస్తావిస్తూ, ఈ విషయాన్ని తాను నైతిక దృష్టితో కాక, ఎత్తుగడల దృష్టితో చూస్తున్నానని నెహ్రూ అన్నాడు. హింసాయుత పద్ధతులు అవలంబించడానికి తగిన సాధన సంపత్తి శిక్షణ కాని మనకు లేదని నెహ్రూ భావించాడు. హింసారాహిత సిద్ధాంతాన్ని మత విశ్వాసంగా కాక రాజకీయ పద్ధతిగా ఉండాలని అన్నాడు. "జన సమూహానికి సంబంధించినంతవరకు, ముందుగా తయారుచేయబడిన విప్లవ సందర్భాలలో తప్ప తక్కిన అన్ని సందర్భాలలోనుముఖ్యంగా శాంతిదాయకంగావుండాలి." అని నెహ్రూ తన అభిప్రాయాలను విశదీకరించాడు. జయాపజయాల్ని గురించి ప్రస్తావిస్తూ "విజయం ధైర్యంతో కార్యాచరణకు పూనుకొన్నవారికే తరచు లభిస్తుంది. తర్వాత ఫలితాల గురించి భయపడే పిరికివారికి అది లభించదు" అన్నా

కలకత్తా కాంగ్రెస్‌లో సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని వాయిదావేసి, రాజీ తీర్మానం ప్రవేశపెట్టిన బాధ్యత గాంధీది. అందుకని ఆయనే ఇపుడు లాహోర్‌లో "పూర్ణస్వరాజ్య" (సంపూర్ణ స్వాతంత్ర్య) తీర్మానాన్ని ప్రతిపాదించాడు. దీనితో గతంలోని నెహ్రూ నివేదిక, దానిలో అంతర్భాగంగా వున్న డొమినియన్ స్టేటస్ లక్ష్యం కాలదోషం పట్టి రద్దయాయి. "పన్నుల నిరాకరణతో సహా శాసనోల్లంఘన ఉద్యమ కార్యక్రమాన్ని, తగిన సమయంవచ్చిందని భావించినప్పుడు, ప్రారంభించేందుకు" ఆలిండియా కాంగ్రెస్ కమిటీకి కాంగ్రెస్ అధికారమిచ్చింది. సుభాష్ చంద్రబోస్ ప్రత్యామ్నాయ తీర్మానం ప్రవేశపెట్టాడు. "దేశంలో పోటీ ప్రభుత్వాన్ని నెలకొల్పడం కాంగ్రెస్ తన లక్ష్యంగా పెట్టుకోవాలి. అందుకోసం కార్మికుల్ని, రైతుల్ని, యువకుల్ని సంఘటిత పరచే కర్తవ్యాన్ని చేపట్టాలి." కాని ఈ తీర్మానం ఓడిపోయింది.

"నూతనంగా నిర్ణయించబడిన లక్ష్యానికి అనుగుణంగాను, రానున్న ఉద్యమానికి ప్రాథమిక చర్యగాను శాసన సభలను, ప్రభుత్వం నియమించిన శాసన సభా కమిటీలను పూర్తిగా బహిష్కరించాలి. జాతీయోద్యమంలో పాల్గొనే కాంగ్రెస్ వాదులు తదితరులు భవిష్యత్‌లో ఎన్నికలలో పాల్గొనరాదు. ప్రస్తుత శాసన సభ్యులు తమ సభ్యత్వానికి రాజీనామా చేయాలి" అని కూడా స్పష్టం చేసింది.

ప్రధాన తీర్మానంలో వైస్రాయిని గురించిన ప్రస్తావన (స్వరాజ్య సమస్య పరిష్కారానికి వైస్రాయి చేసిన ప్రయత్నాలను శ్లాఘించే భాగం) పైన గాంధీ సూచించిన కార్యక్రమ వివరాలపైన చాలాసేపు తర్జన భర్జనలు జరిగాయి. వైస్రాయిపై ప్రయోగించిన రైలు బాంబు ప్రయోగంపై తెచ్చిన తీర్మానం గురించి కూడా తీవ్రంగా చర్చలు జరిగాయి. కొద్ది వోట్ల మెజారిటీతో మాత్రమే, నాయకత్వం ప్రవేశపెట్టిన ఆ తీర్మానం నెగ్గింది. ప్రధాన తీర్మానానికి 14 సవరణలు వచ్చాయి. కొన్నిటిని ఆమోదించి, మరికొన్నిటిని మహాసభ తిరస్కరించింది. రాత్రి పదిగంటలకు చర్చలు ముగిశాయి. 12 గంటలకు సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానం, ఇతర తీర్మానాలు ఆమోదింప బడ్డాయి. అప్పటికే కలకత్తా కాంగ్రెస్ ఇచ్చిన గడువు - 1931 డిసెంబర్ 31లోగా డొమినియన్ స్టేటస్ ఇవ్వాలనే గడువు - ముగిసింది.

1929 సంవత్సరం ముగిసి 1930 సంవత్సరం అడుగిడిన ఆ అర్థరాత్రివేళ, స్వాతంత్ర్య పతాకాన్ని (ఎరుపు, తెలుపు, పచ్చరంగులతో కూడిన పతాకం - తర్వాత కొన్నాళ్ళకు ఈ పతాకంలోని ఎరుపు రంగుకి బదులు కుంకుమపువ్వురంగు చేర్చారు) కాంగ్రెస్ అధ్యక్షుడు జవహర్‌లాల్ నెహ్రూ ఎగరవేశాడు. "ఇంక్విలాబ్ జిందాబాద్! జిందాబాద్!" (విప్లవం వర్ధిల్లాలి) అన్న నినాదాలు చెవులు గింగురుమనేటట్లు...

మార్మోగాయని "మహాత్మ" అనే గ్రంథ రచయిత టెండూల్కర్ రాశాడు.

లాహోర్ కాంగ్రెస్ అమితమైన చలికాలంలో జరిగింది. డాక్టర్ పట్టాభి సీతారామయ్య ఆనాటి వాతావరణాన్ని, రాజకీయ వాతావరణాన్ని ఇలా వర్ణించాడు. "కాంగ్రెస్ సభా భవనమునకు బైట సహింప రాని చలి. కాని వైస్రాయితో రాయబారము లపజయం పొందుటచే కలిగిన భావ తీవ్రతకతన, హృదయముల లోని ఉద్రేకాగ్ని కణముల వలన, సంగ్రామ భేరీ నినాదముల కుప్పొంగిన శరీరముల మూలమున మాకా చలి గాడ్పులు తగిలినట్లే లేవు."

భౌతికమైన ఈ చలియే గాదు. లాహోర్ కాంగ్రెస్‌తో, జన సామాన్యానికి కూడా బ్రిటిష్ వాళ్ళతో పోరాటమంటే ఉన్న చలి - భయం - కూడా వదలి పోయింది. లూయీఫిషర్ అన్నట్లు - "బ్రిటిష్ శాసనం అంటే మారు మాటాడకుండా తలవొగ్గే భారతీయ ప్రవృత్తి 1930 నాటికి గతకాలపు మాటగా మారిపోయింది. 1928, 29, 30లలో పైకి కనపడకుండా, ఇతర్లుకూడా తరచు గమనించ లేనంతగా, భారతీయులు స్వతంత్ర మానవులయ్యారు. శరీరం ఇంకా సంకెళ్ళలోనే వుంది. కాని భావం మాత్రం జైలు నుంచి తప్పించుకు పోయింది."

## బార్డోలీ రైతు సత్యాగ్రహం

లాహోర్ కాంగ్రెస్‌కు పూర్వం ప్రదర్శితమైన ప్రజా చైతన్య వెల్లువకు నిదర్శనం బార్డోలీ తుల సత్యాగ్రహం. బొంబాయి రాజధానిలోని సూరత్ ల్లాలో బార్డోలీ ఒక చిన్న తహశీలు, దాని జనాభా 87 వేలు. 1928 లో బార్డోలీలో రైతుల సత్యాగ్రహం ప్రారంభించినా దానికి పునాది 1922 నుండీ వుంది 1922 నాటి సంఘటనలను కూడా జ్ఞప్తికి తెచ్చుకోవటం అవసరం.

1922 జనవరి 29 న బార్డోలీ తాలూకా ప్రజలు సమావేశమయ్యారు. ఆ సమావేశానికి ఖద్దరు వస్త్రాలు ధరించిన 4000 మంది వచ్చారు. ఇందులో 500 మంది స్త్రీలు కూడా వున్నారు. గాంధీ విధించిన షరతులకు లోబడి, సత్యాగ్రహ ఉద్యమం సాగించుతామనీ, ఆ ఉద్యమం సాగించే మొట మొదటి ఘనత బార్డోలీకి దక్కుతుందనీ ఈ సమావేశం కాంగ్రెస్ వర్కింగ్ కమిటీకి తెలియజేసింది. వర్కింగ్‌కమిటీ జనవరి 31న సూరత్‌లో సమావేశమై, బార్డోలీ ప్రజలు సత్యాగ్రహ ఉద్యమాన్ని సాగించడానికి అధికారమిచ్చింది. ఐతే గాంధీ అనుమతిని ముందుగా పొందితేతప్ప, దేశంలో ఇతరచోట్ల ఉద్యమాన్ని ప్రారంభించరాదనీ, బార్డోలీ సత్యాగ్రహ ఉద్యమానికి ఇతర రాష్ట్రాల వారు సహాయం చేయాలనీ వర్కింగ్ కమిటీ తీర్మానించింది.

ఫిబ్రవరి 1 న గాంధీ వైస్రాయికి పంపిన తుది హెచ్చరికలో ఈ క్రింది విషయాలను తెలియచేశారు.

"బార్డోలీ ప్రజలు సమిష్టి శాసనోల్లంఘనం ప్రారంభించాలని నిర్ణయించబడింది. నేను ఈ నిర్ణయానికి బహుశా ప్రధానంగా బాధ్యుణ్ణి గనుక, ఇలా ఎందుకు చేయవలసివచ్చిందో వివరిస్తాను. ఖిలాఫత్, పంజాబ్, స్వరాజ్య సమస్యల గురించి భారతదేశ నిర్ణయాలకు ప్రభుత్వం ఘోరంగా ప్రతికూలభావాలను నిరంతరం ప్రకటించుతున్నది. అందుచేత ప్రభుత్వానికి వ తి రేకంగా జాతీయ తిరుగుబాటును ప్రదర్శించే నిమి ం, బార్డోలీ సమిష్టి శాసనోల్లంఘనానికి తగిన ప్రథమ దేశంగా నిర్ణయింపబడింది. కాని బొంబాయిలో న ంబరులో జరిగిన కొట్లాటల వల్ల అపుడు ఆ ఉద్యమం ఆపివేయబడింది."

బార్డోలీ ప్రజలు సమిష్టి శాసనోల్లంఘనం ప్రారంభించేలోపల, ప్రభుత్వం తన రాజకీయ విధానాన్ని మార్చుకోవలసిందనికూడా గాంధీ వైస్రాయికి పంపిన తుది హెచ్చరిక లేఖలో కోరాడు. కాని ప్రభుత్వం ఈ లేఖలోని కోర్కెలను తిరస్కరించింది.

1922 ఫిబ్రవరి 5 న చౌరీచౌరా (యు. పి)లో జరిగిన ఘటనలను పురస్కరించుకొని అపుడు తలపెట్టిన ఉద్యమం ప్రారంభించకముందే ఆపివేయబడింది. అంతకుముందుకూడా రెండు మూడుసార్లుపన్నుల నిరాకరణ ఉద్యమ ప్రయత్నం ఆపివేయబడింది.

1928 లో దేశ మంతటా రైతులలో తీవ్ర అసంతృప్తి పెరిగింది. ప్రభుత్వం భూమి శిస్తు విషయంలో అపుడపుడూ సాగించే రీసెటిల్‌మెంట్ వల్ల తీవ్ర అసంతృప్తి పెరిగింది, గుజరాత్‌లో కూడ ఈ అసంతృప్తితో రైతులు ఉద్యమానికి సంసిద్ధులయ్యారు. రీసెటిల్‌మెంట్ జరిగినప్పుడల్లా ప్రభుత్వం నూటికి 25 చొప్పున భూమి శిస్తును హెచ్చించడం ప్రభుత్వానికి అలవాటు. పంటలు అభివృద్ధి చెందాయి అంటే అది ప్రభుత్వ సహాయంవల్లగాక, రైతుల స్వయం కృషి

వల్లనే. అందుచేత ఈ పన్నులు వేసే విషయంలో ఒక నిష్పాక్షిక కమిటీని వేయాలని రైతులు కోరారు. రీసెటిల్‌మెంట్ మూలంగా అదనంగా రైతులు భూమి శి ఇచ్చుకోవలసివచ్చింది. 1919 భారత ప్రభుత్వ చ ం ఎలా పని చేసుందో చూసేందుకు ఏర్పడిన పా మెంట్ కమిటీ సలహాకు విరుద్ధంగా 1924 లో బొ బాయి రాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిల్ సూచనలకు విరుద్ధంగా, భూమి శిస్తు హెచ్చించింది. కొన్ని సందర్భాలలో నూటికి 22 పాళ్ళు, మరికొన్ని ప్రత్యేక సందర్భాలలో నూటికి 60 పాళ్ళు కూడా భూమి శిస్తు హెచ్చింపబడింది. దీనిపై రైతులు అర్జీలు రాయబారాలు మొదలైనవన్నీ నడిపారుకాని ప్రయోజనం లేకపోయింది.

చిట్టచివరకు పన్నుల నిరాకరణోద్యమానికి రైతులు సిద్ధమయ్యారు. ఇది స్వరాజ్యం కోసం సాగించే ఉద్యమంలోగాని శాసనోల్లంఘన కార్యక్రమంలో భాగంగా గాని జరగలేదు. కేవలం రైతుల కోర్కెలపై సాగింది. ప్రారంభదశలో కాంగ్రెస్ జోక్యం కల్పించుకోలేదు. కాని తర్వాత ఉద్యమానికి కాంగ్రెస్ నాయకులు సారథ్యం వహించారు.

ఒకరోజున కలా ణ్‌జీ, కున్వర్‌జీ అనే సోదరులిద్దరు సబర్మతి ఆ। మానికి వెళ్ళారు. వీరు బార్డోలీలో చాలాసంవత్సరాలు నిచేశారు. బార్డోలీ రైతులు పన్నులు చెల్లించ నిరాకరించడానికి సిద్ధంగాఉన్నారని చెప్పారు. పాతభూమి శిస్తు చెల్లించడానికి రైతులు సిద్ధమేగాని, కొత్తగా విధించిన 22 శాతం అదనపు శిసును చెల్లించలేమని రైతులు చెబుతున్నట్లు వారు తెలియజేశారు. అలా శిస్తు చెల్లించడం మంచిదికాదని గాంధీ సలహా ఇచ్చారు. "అదనంగా పెంచిన శిస్తును ఉపసంహరించితే పాత శిస్తును చెల్లించడానికి మేము సంసిద్ధమే" అని చెప్పవలసిందిగా గాంధీ సలహా ఇచ్చాడు. ఇందుకు సంబంధించిన మరికొన్ని విషయాలను చర్చించిన తర్వాత గాంధీ ఇలా అన్నాడు. ప్రజలు పోరాడటానికి సిద్ధంగా వుండవచ్చు. కాని వారికి సత్యాగ్రహం వల్ల కలిగే ఫలితాలు గురించి తెలుసా ? ఒక వేళ వల్లభ్‌భాయ్‌పటేల్‌ను మీ మధ్యనుండి తొలగించితే, మీరంతా ఐక్యంగావుంటారా ?" కళ్యాణ్‌జీ తాను చెప్పలేనన్నాడు. ఈ చర్చలిలా సాగుతుండగా వల్లభ్‌భాయ్‌పటేల్ వచ్చాడు. రైతుల వాదన సరైనదని చెప్పాడు. "ఐతే ఇక ఆలోచించవలసిన పనిలేదు. గుజరాత్‌కు విజయం కలుగుగాక !" అని గాంధీ అన్నాడు. బార్డోలీ రైతుల ఉద్యమానికి సహాయపడేందుకు వల్లభ్‌భాయ్‌పటేల్‌ను కాంగ్రెస్ పంపింది.

వల్లభ్‌భాయ్‌పటేల్ మధ్య తరగతి రైతు కుటుంబం నుండి వచ్చిన వ్యక్తి. అందుచే పటేల్‌ను తమవాడిగానే రైతులు భావించారు. ఆయన రైతుల పరిభాషలోనే మాట్లాడేవాడు. నిర్భీతితో నిర్విరామంగా వారి మధ్య పని చేసేవాడు. 1927 ఫిబ్రవరి 12 న బార్డోలీలో జరిగిన ఒక సభలో సర్దార్ పటేల్ ప్రసంగ భాగం చూస్తే ఈ విషయం మరింత స్పష్టమౌతుంది. ఆయన ఆ సభలో ఇలా అన్నాడు.

"పీడనను, అన్యాయాన్ని ప్రతిఘటించాలని మీరు భావించినట్లయితే పోరాడండి. కాని ఈ పోరాటాన్ని తేలికగా తీసుకోవద్దు. మీరు కనుకహీనంగా పడిపోయారంటే, మళ్ళా కొన్ని ఏళ్ళవరకు లేవలేరు. మీరు కనుక విజయం పొందితే, స్వరాజ్యానికి పునాదులు వేయడంలోచాలాకృషి చేసినవారవుతారు (ఇకమీదట) బాధలు పడకూడదని మీరు నిశ్చయించుకొన్నట్లయితే అత్యంత బలోపేతుడైన నిరంకుశుడు మీ ముందు తల వంచక తప్పదు. ఇప్పటి సమస్య కొన్ని లక్షలరూపాయలనేది కాదు... కాని ఆత్మగౌరవం, (ప్రజల) ప్రాతినిధ్యంతో నిమిత్తం లేకుండా పన్నులు వేయరాదనేది, ప్రభుత్వ ప్రాథమిక సూత్రాలలో ఒకటిగా ఉండాలి."

బార్డోలీ తాలూకా అంతటా వల్లభ్‌భాయ్ పటేల్ 16 శిబిరాలను ఏర్పరచాడు. 250 మంది వలంటీర్ల అధీనంలో ఈ శిబిరాలను ఉంచాడు. 1928 ఫిబ్రవరి 12న రైతు ప్రతినిధుల సమావేశం జరిగింది. రీసెటిల్‌మెంట్ దా రా విధించబడిన అదనపు భూమి శిస్తును చె ంచవ ని రైతులను ఆ సమావేశంకోరింది. పాత శి ల మే కే ప్రభుత్వం వసూళ్ళు చేస్తే తప్ప, లేదా ఏటికప్పుడు విచారణ జరిపి భూమిశిస్తు రివిజన్‌ను నిర్ణయించడానికి నిష్పాక్షికమైన విచారణ కమిటీని నియమించితే తప్ప, పన్నులను చెల్లించవద్దని ఆ సమావేశం కోరింది.

బార్డోలీ పన్నుల నిరాకరణ ఉద్యమం దేశమంతటా జాతీయ చైతన్యాన్ని పెంపొందించడానికి తోడ్పడింది. సభలు జరిగాయి. సత్యాగ్రహ కీర్తనలు పాడు

కొంటూ, స్త్రీ, పురుషులు ఊరేగింపులు జరిపారు. బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్‌లోని ఏడుగురు సభ్యులు రాజీనామా లిచ్చారు. 63 గురు పటేళ్ళు, 11 మంది తలాతీలు రాజీనామా ఇచ్చారు. కేంద్ర శాసనసభ అధ్యక్షుడైన విఠల్‌బాయ్‌పటేల్, ప్రభుత్వం గనుకవెను తగ్గకపోతే, తాను కేంద్ర శాసన సభాధ్యక్ష పదవికి రాజీనామా చేస్తానని, ఉద్యమంలో పాల్గొంటానని బెది రించాడు. గాంధీకి రాసిన మరొక లేఖలో ఉద్యమం నడిచినన్నాళ్ళు నెలకు రు. 1000 విరాళం పంపుతానని తెలియచేశాడు. మహారాష్ట్ర, సింధు, తదితర రాష్ట్రాల నుండి కూడా ప్రజలు తామీ ఉద్యమంలో పాల్గొనదల చామని, తమ సంసిద్ధతను వ్యక్తపరిచారు. దేశమంతటి నుండీ లక్షయాభైవేల రూపాయలను సత్యాగ్రహ నిధికి పంపించారు. అహ్మదాబాద్ లేబర్ యూనియన్ 500 రూపాయలను పంపింది ఈ యూనియన్ అణా అణా టిక్కెట్లు ముద్రించి కార్మికుల నుంచి డబ్బు వసూలు చేసింది.సూపగురుకుల విద్యార్థులు కొన్ని రోజులుపాలు, నెయ్యి మానివేసి 65 రూపాయలు విరాళం పంపారు. కాంగ్రి గురుకుల్ విద్యార్థులు కూడా తమ వంతు విరాళం పంపారు. గాంధీ మిత్రుడొకరు కాంగ్రి గురు కుల్ నుండి రు. 250 విరాళం పంపుతూ తాము బార్డోలీ దినోత్సవాన్ని సముచిత రీతిని జరిపామని రాశాడు. ఇదే గురుకుల్‌లోని బ్రహ్మచారులు రెండురోజులు, శారీరకకష్టం చేసి రు. 50 పంపారు. తుఫానువల్ల నష్ట పడిన ఆశ్రమ భాగాలను బాగుపరచారు. గురుకుల్ కార్యకర్తలు రు. 200 పంపారు. ఒక వంటవాడు ఇందులో ఒక రూపాయి విరాళం ఇవ్వడం విశేషం. చోరాసి ప్రాంత రైతులు రు. 24,488ల విరాళం పంపించారు.

బార్డోలీ పన్నుల నిరాకరణోద్యమాన్ని అణచివేయ డానికి ప్రభుత్వం అన్ని విధాల నిర్బంధకాండను ఉప యోగించింది. పశువులను జప్తు చేయ ప్రారంభించింది భయపడి పన్నులు చెల్లిస్తారని ఒక వర్తకుని, ఒక మహమ్మదీయుని ప్రభుత్వం నిర్బంధించింది. కాని వారు లొంగలేదు. వివిధ సంఘాలమధ్య పోటీ పెట్టినా లాభం లేకపోయింది. పఠానులను తీసుకొచ్చి వారి సాయంతో జప్తులు ప్రారంభించారు. చరస్థిరాస్తులను స్వాధీన పర్చుకుంది. గేదెల్ని, దున్నపోతుల్ని జప్తు చేసింది. భూముల్ని స్వాధీన పర్చుకుంది అంచనాకట్టి విధించిన శిస్తుకన్న ఎన్నో రెట్లు విలువైన భూముల్ని వేలం వేసింది.

"మీ భూముల్ని చేతనైతే ఇంగ్లండుకు తీసుకు పోవలసిందిగా సవాలు చేయండి" అని వల్లభ్‌భాయ్ పటేల్ రైతులకు ఉద్బోధించాడు. తమ భూముల నుండి తొలగకుండా మునుపటిలాగానే పంటలు పండిం చండని కోరాడు. జప్తు చేయబడ్డ భూముల్ని కొనడానికి గాని, ఆ భూములలో పంటలు పండించడానికి గానీ ఎవరూ ముందుకు రాలేదు. 250 మంది వాలంటీర్లను అరెస్టుచేసి, వింతయైన అభూత నేరారోపణలు చేసింది ప్రభుత్వం. దీర్ఘకాల శిక్షలను విధించింది; పబ్లిక్ రోడ్‌పై కూర్చుని ఉన్నారనీ, కలెక్టర్ యింటివంక చూస్తున్నారనీ నేరారోపణ.

ఉద్యమం ఉధృత స్థాయిలో ఉండగా 1928 జూన్ 12న బార్డోలీ దినోత్సవం దేశమంతా జరపాలని గాంధీ విజ్ఞప్తి చేశాడు. ఆ రోజున అన్ని పనులు కట్టిపెట్టి బార్డోలీ సత్యాగ్రహ నిధిని ఆ రోజంతా పోగు చేయా లని కోరాడు. సభలు జరిపి సత్యాగ్రహులను బల పరుస్తూ, ప్రభుత్వ దమన నీతిని ఖండిస్తూ తీర్మానాలు చేయవలసిందిగా కోరాడు. దేశమంతా బార్డోలీ రైతులకు బాసటగా సభలు జరిపింది.

జూలై 23న బొంబాయి రాష్ట్ర ప్రభుత్వం రైతు లకు తుది హెచ్చరిక జారీ చేసింది. అదే రోజున భారత విదేశాంగ కార్యదర్శి కూడా ఒక ప్రకటన చేశాడు;

విచారణ జరిగేలోపు కొత్తగా విధించిన అదనపు శిస్తును వెంటనే చెల్లించాలని ప్రభుత్వం కోరింది. వివాదగ్రస్త విషయాలపై వా సవాలు అంకెల గురించి రెవిన్యూ అధికారి విచారణ చేస్తాడని చెప్పింది.

సత్యాగ్రహ ఖైదీలను విడుదలచేయాలనీ, అమ్మిన, వేలం వేసిన భూముల్ని తిరిగి ఇచ్చివేయాలనీ, చరాస్థి తాలూకు స్వాధీనం చేసుకొన్న వాటికి,ఆనాడున్నధరల ప్రకారం డబ్బు ఇవ్వాలనీ, డిస్మిస్ చేసినవారినీ, శిక్షించినవారినీ తిరిగి ఉద్యోగంలో పె కోవాలనీ వల్లభ్‌భాయ్‌పటేల్ కోరాడు. ఇవన్నీ చే అధికార విచారణకు అంగీకరించుతాననీ అన్నాడు. ఐ ఆ విచా రణ బహిరంగంగా ఉండాలి నిష్పక్షపాతమైనదిగా వుండాలి. ప్రజలు హాజరయ్యే విధంగా, న్యాయ స్వభావంగా (జుడీషియల్)గా ఉండాలనీ అన్నాడు.

అలాంటి విచారణ సాగించే పక్షంలో ఉద్యమాన్ని ఆపివేస్తామని, పాత శిస్తు చెల్లిస్తామని గాంధీ, సర్దార్ పటేలు ఇద్దరు హామీ ఇచ్చారు.

గాంధీ ఉద్యమాన్ని పర్యవేక్షించడానికి ఆగ 2 న బార్డోలీ వచ్చాడు. ప్రభుత్వం అడిగిన అ రహితమైన హామీ అనేకమంది కౌన్సిలర్లు ఇ చ్చరు. వల్లభ్‌భాయ్ పటేల్ మాత్రం దృఢంగా నిలబడ్డాడు. కాని కౌన్సిలర్లు ఇచ్చిన హామీని పురస్కరించుకొని ప్రభుత్వం తన పరువు నిలబెట్టుకోదలచింది. వల్లభ్‌భాయ్ నిర్దేశించిన పద్ధతిలోనే ప్రభుత్వం విచారణ కమిటీని నియమించింది.

1922 లో గాంధీని శిక్షించిన బ్రూమ్‌ఫీల్డు, ప్రభుత్వోద్యోగి మాక్స్‌వెల్ విచారణ కమిటీ సభ్యులుగా నియమించబడ్డారు. వీరు ప్రభుత్వం కొత్తగా విధించిన భూమిశిస్తును విమర్శించారు. రెవిన్యూ అధికారుల వైఖరిని ఖండించారు. సత్యాగ్రహ ఆందోళనకారులు తమ విచారణకు అందించిన సహకారాన్ని అభినందించారు నూటికి 22 చొప్పున శిస్తు హెచ్చింపుగాక నూటికి 6రూ॥ల పావలా చొప్పున (5.7 శాతం) శిస్తు హెచ్చించాలనీ తీర్పు ఇచ్చారు. బార్డోలీ తాలూకే గాక సత్యాగ్రహంలో పాల్గొనని చోరాసాయ్ తాలూకాకి కూడా ఈ శిస్తు విధానమే వర్తింపచేశారు. కాని ఆ అదనపు శిస్తును కూడా రాజీ కుదిరిన తర్వాత వసూలు చేయలేదు. వేలం పాడిన పొలాలను తిరిగి అప్పగించారు. ఉద్యమంలో పాల్గొన్నందుకు, ఉద్యోగాలు పోగొట్టుకున్న వారికి తిరిగి ఉద్యోగం ఇవ బడింది. బార్డోలీ సత్యాగ్రహ ఉద్యమం భారత తొంగ విజయానికి చిహ్నంగా నిలిచింది. ఆ ఉద్య కాలంలోనే ప్రజలు వల్లభ్‌భాయ్‌పటేలును, సర్దార్‌పటేలుగా పిలుస్తూ వచ్చారు. "వల్లభ్‌భాయ్ తన దేవుణ్ణి - వల్లభుని-బార్డోలీలో చూచాడు" అంటూ గాంధీ పటేల్‌ను ప్రశంసించాడు.

# శాసనోల్లంఘన ఉద్యమం (1930-34)

1930 సంవత్సరం నూతనోత్సాహాన్ని రేకెత్తించింది. "పూర్ణస్వరాజ్యం" తీర్మానం ఆమోదింపబడితేగాని శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించడానికి ఒక తేదీ గాని, కార్యక్రమం గాని, లాహోర్ కాంగ్రెస్ నిర్ణయించలేదు. భవిష్యత్ కార్యక్రమాన్ని గురించి గాంధీ మనస్సులో ఏమున్నదో గాని ఆయన అనుచరులెవ్వరికీ స్పష్టత లేదు. జవహర్‌లాల్ నెహ్రూ తన "స్వీయచరిత్ర"లో ఇలా అన్నాడు:

"భవిష్యత్తును గురించి మేము అస్పష్టంగా వున్నాం. కాంగ్రెస్ మహాసభలో ఉత్సాహం ప్రదర్శింపబడినా, ముమ్ముందు ఉద్యమ కార్యక్రమానికి దేశం ఎలా ప్రతిస్పందించుతుందో ఎవరికీ తెలియదు. తిరోగమించకూడదని నిర్ణయించుకొన్నాం. ఇక వెనక్కి పోలేం. కాని మా ముందున్న దేశం దాదాపు రూపురేఖలు తెలియని కొత్త దేశం."

యుద్ధానికి సన్నద్ధమైన సేనాధిపతులను తమ కార్యక్రమం గురించి ఎవరూ ప్రశ్నించరనీ, వారికి ఇతర్లకు చెప్పకూడని పథకాలుంటే వుండవచ్చును కాని, కాంగ్రెస్ కార్యక్రమానికి రహస్యం ఏమీ లేదంటూ ర్ పట్టాభి కాంగ్రెస్ చరిత్రలో చెప్పిన ఈ క్రిందివా లు కూడా జవహర్‌లాల్ పైన చెప్పిన అభిప్రాయా న్ని బలపరుచుతున్నాయి.

"....కాని సత్యాగ్రహోద్యమం అటువంటిదికాదు. మా కార్యక్రమమునకు రహస్యము లేదు. దానికొక నిర్ణయింపబడిన తిన్నని పంథా కూడా లేదు. ఉదయమున దట్టమైన మంచులో తొందరగా పోయే మోటారు కారుకు క్రమ క్రమముగా ఏవిధముగా దారి కనబడునో, అదే విధముగా సత్యాగ్రహోద్యమమునకు కూడా దారి ప్రత్యక్షమగును. సత్యాగ్రహికి లలాటమునందు విద్యుద్దీప మున్నది. అదే తరువాతి అడుగుకు దారి చూపును."

సుభాస్ చంద్రబోస్ కూడా తన ప్రత్యామ్నాయ తీర్మానం కాంగ్రెస్ మహాసభలో ఓడిపోవడం ప్రస్తావించి, ఇలా అన్నాడు: "ఈ తీర్మానం ఓడిపోయింది. ఫలితంగా, సంపూర్ణ స్వాతంత్ర్యం తన లక్ష్యంగా కాంగ్రెస్ తీర్మానించినప్పటికీ, ఆ లక్ష్యం చేరటానికి ఎలాంటి పథకాన్నీ రూపొందించలేదు. రానున్న సంవత్సరానికి కార్యక్రమాన్ని కూడా తయారుచేయలేదు. ఇంతకంటె హాస్యాస్పదమైన పరిస్థితిని ఊహించలేము."

—ఇండియన్ స్ట్రగిల్. అనే గ్రంథంలో.

శాసనో ంఘన ఉద్యమానికి ఒక తేదీ నిర్ణయించలేదు. కా క్రమం తయారు చేయలేదు. ఇవన్నీ గాంధీకి వద వేయబడ్డాయి చౌరీచౌరాలో వలె ఉద్యమాన్ని హఠాత్తుగా విరమించబోమని గాంధీ, జవహర్‌లాల్‌కు వా ం చేశాడు. నెహ్రూ ఇలా రాశాడు:

"ఎక్క నా చెదురుమదురుగా హింసాయుత ఘటనలు జ నంత మాత్రాన ఉద్యమం ఆపివేయబడదనే భావాన్ని మాకు గాంధీ తెలియబరచాడు. ఈ హామీ మాలో చాలామందికి చాలావరకు సంతృప్తి కలిగించింది."

ఇదీ శాసనోల్లంఘన ఉద్యమానికి వున్న పూర్వరంగం. లాహోర్ కాంగ్రెస్ సమావేశానంతరం జనవరి 2 న కార్యవర్గం సమావేశమైంది శాసనసభా బహిష్కారానికి సంబంధించిన తీరా నాన్ని అమలు పరచడానికి కొన్ని చర్యల్ని కార్యవ ం సూచించింది. "శాసనసభలలో రాజీనామానీయనివారి , శాసనసభాఎన్నికలలో జోక్యంకలుగజేసికోకుండా ఎదురుతిరిగే శాసన సభ్యులను బలవంతపెట్టుటకు వోటర్లందరూ ప్రయత్నించవలసిందిగా" కార్యవర్గం కోరింది. దీని ఫలితంగా కేంద్ర శాసనసభనుండి 27 మంది రాజీనామా ఇచ్చారు. 1930 జనవరి 26 వ తేదీ, స్వాతంత్ర్య దినంగా ప్రకటింపబడింది. 1930 జనవరి 26 వ తేదీ ఆదివారం దేశమంతటా బహిరంగసభలలో చదివి ఆమోదించడానికి కార్యవర్గం ఒక ప్రమాణ పత్రాన్ని తయారు చేసింది. దాని సారాంశం ఇది:

"తమ కష్టార్జిత ఫలితాలను అనుభవించి, తమ జీవితావసరాలు పొందడానికి ప్రతిజాతికీ హక్కువుంది. భారత జాతికి కూడా శాశ్వత హక్కు వుంది. దాని మూలాననే భారతీయుల అభివృద్ధికి సంపూర్ణ అవకాశాలున్నాయి. ఏ ప్రభుత్వమైనా ప్రజల ఈ హక్కుల్ని తృణీకరించి, వారిని అణగద్రొక్కడానికి పూనుకొంటే, ఆ ప్రభుత్వాన్ని మార్చుటకుగాని, నిర్మూలించుటకుగాని ప్రజలకు హక్కు వుంది. భారతదేశంలో బ్రిటిష్

ప్రభుత్వం ప్రజల స్వాతంత్ర్యాన్ని తృణీకరించుటే గాక, సామాన్య ప్రజల ధనాన్ని దోచుకోవడంద్వారా అది ఆధారపడి వుంది ఆ ప్రభుత్వం భారతదేశాన్ని ఆర్థికంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా, ఆత్మీకంగా నాశనం చేసింది. అందుచేత భారతదేశం బ్రిటన్‌తో గల సంబంధాన్ని తెగతెంచుకొని, పూర్ణ స్వరాజ్యాన్ని లేక సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని పొందాలని మా విశ్వాసం."

ఈ ప్రమాణ పత్రంలో మరికొన్ని అంశాలు కూడా వివరించబడ్డాయి. అవి : ప్రజల ఆదాయానికి వారుకట్టే పన్నులకు ఎక్కడా పొంతనలేదు. భారత ప్రజల సగటు ఆదాయం రోజుకి ఏడు కానులు. ('కాని' అంటే పూర్వం రూపాయిలో 64 వ వంతు) నూటికి 20 వంతులు భూమిశిస్తు పెంచి రైతుల పన్నులభారం హెచ్చించారు. నూటికి 3 వంతున ఉప్పుపన్ను హెచ్చించి, పేదలపై భారం ఎక్కువ చేశారు. చేతి వృత్తులు నశించాయి. వాటిస్థానే కొత్తవాటిని పెట్టలేదు. రైతులకు సంవత్సర కాలంలో నాల్గునెలలు పనిపాటూ లేకుండా కూర్చోవలసి వస్తోంది. దిగుమతి పన్నులు, కరెన్సీ తికమకలు, దిగుమతి పన్నుల విధానంలో పక్షపాతం, కృత్రిమ మారకపురేటు — వీటన్నిటి మూలంగా లక్షలాది రూపాయలు పరదేశానికి పోతున్నాయి. బ్రిటిష్ హయాంలోలాగా మునుపెన్నడూ ఈ దేశం ఇంత అధోగతి పాలుకాలేదు. సంస్కరణలవల్ల నిజమైన అధికారం రాలేదు. మాలోని ఉత్తమోత్తములు విదేశీయుల అధికారానికి తలవొగ్గి వుండవలసి వస్తూంది. అభిప్రాయ ప్రకటనకు గాని, సభా సమావేశాలకుగాని స్వాతంత్ర్యం లేదు. భారతీయులు అనేకమంది విదేశాలలో అజ్ఞాతవాసం చేయాల్సి వచ్చింది. వారు ఈ దేశానికి రావడానికి వీలులేని పరిస్థితి ఏర్పడింది. భారతీయుల పరిపాలనా సామర్థ్యం నిర్మూలింప బడింది. సామాన్య ప్రజలు చిన్న చిన్న గ్రామ నౌకరీలతోను, గుమస్తాగిరీలతోను సరిపెట్టు కోవలసి వచ్చింది. విద్యా విధానం బానిస శృంఖలాలను మేము మరింత అంటి పెట్టుకొనేలాగ చేసింది. బలవంతంగా భారతీయులు నిరాయుధులుగా చేయబడ్డారు. పౌరుషం నశించింది. ప్రజల నిరోధక శక్తిని అణచివేయడానికి భయంకరాయుధాలతో విదేశీసైన్యాలు ఈ దేశంలో వున్నాయి. స్వరక్షణ చేసుకోలేని దుస్థితిలో భారతీయులు పడిపోయారు. విదేశ దండయాత్రలనుండేగాక, దొంగలు, బందిపోటు దారులుమొద న దుర్మార్గుల నుండి రక్షించుకొనే శక్తి కూడాలేని ప తి ఏర్పడింది.

స్వాతం' య ప్రమాణ పత్రంలోని ముఖ్యాంశం ఇలా వుంది.

"ఇలాంటి ఆపదలు కల్గించిన పరిపాలనకు మా దేశాన్ని ఇంకా గురిచేయడం దేవునికీ, మానవునికీ విరుద్ధంగా అపరాధం చేయడమే నని భావిస్తున్నాం."

స్వాతంత్ర్య సాధనకు మార్గం హింసాయుత మార్గం కాదని ఈ ప్రమాణ పత్రంలో తెలియచేశారు. పన్నుల నిరాకరణతో కూడిన శాసనోల్లంఘనానికి సంసిద్ధంగా వున్నట్లు స్పష్టం చేశారు.

"పూర్ణ స్వరాజ్య సంపాదనార్థం అప్పుడప్పుడూ పంపించబడే కాంగ్రెస్ ఉత్తర్వులను శిరసావహిస్తామని ప్రమాణం చేస్తున్నాము" అని ఆ ప్రమాణ పత్రంలో చివరిగా పేర్కొనడం జరిగింది.

ఐతే ఈ ప్రమాణ పత్రంలో ఆధునిక పారిశ్రామికీకరణ విషయం ప్రస్తావించలేదు బ్రిటిష్ వాళ్ళ చేతుల్లో నాశనానికి గురి అయిన వాటిల్లో ఇది కూడా ఒకటి. "మా ఐచ్ఛిక సహాయాన్ని ఉపసంహరించుకొని, రెచ్చగొట్టినా కూడా హింసను ప్రేరేపించకుండా పన్నులు కట్టడం మానివేస్తే, ఈ అమానుష పరిపాలన అంతమై తీరుతుందని మేము విశ్వసిస్తున్నాము"-అన్న ఈ వాక్యం రానున్న ఉద్యమ స్వభావానికి రేఖా చిత్రంగా ఊహించబడింది.

1930 ఫిబ్రవరి 14 నుంచి 16 వ తేదీ వరకు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సబర్మతి ఆశ్రమంలో సమావేశమైంది. "తను ఎన్నుకొన్న కాలంలో ఎన్నుకొన్న సమయంలో" శాసనోల్లంఘ నోద్యమాన్ని ప్రారంభించ డానికి గాంధీకి అధికారమిస్తూ వర్కింగ్ కమిటీ తీర్మానించింది.

గాంధీ వ్యూహం ఏమిటో ఎవరికీ తెలియదని మొదట్లోనే ప్రస్తావించాము జనవరి 9న "న్యూయార్క్ వరల్డ్" అనే అమెరికా పత్రికకు ఇచ్చిన ప్రకటనలో "స్వాతంత్ర్య తీర్మానం ఎవరినీ భయపెట్ట నవసరం లేదు" అని గాంధీ అన్నాడు. జనవరి 30 న 'యంగ్ ఇండియా' పత్రికలో పదకొండు అంశాలను ప్రకటించాడు. ఈ పదకొండు అంశాలకు సంబంధించిన కోర్కె-

లను తీర్చితే శాసనోల్లంఘ నోద్యమాన్ని విరమిస్తానని గాంధీ అన్నాడు. లాహోర్ కాంగ్రెస్ తీర్మానం ఏమైనట్లు? అని ఆశ్చర్య పడవలసి వచ్చింది ఈ ప్రకటనతో. ఏమిటా పదకొండు అంశాలు?

ఈ పదకొండు అంశాలను ప్రకటించడానికి పూర్వం వైస్రాయి,కామన్సు సభలో భారతరాజ్యాంగ కార్యదర్శి వెడ్జివుడ్ బెన్, సర్‌జాన్ సైమన్ ఉత్తరంలో, రామ్సే మాగ్డనాల్డు ప్రకటనలలో ఒక విషయం స్పష్టమైంది. -వీరంతా చెప్పిన దాని బట్టి రౌండ్ టేబిల్ సమావేశం ఏర్పర్చడంలో ఉ శం- స్వయం నిర్ణయాధి కారం గురించి కాదట. భా తదేశ భవిష్యత్తుపై సమిష్టి నిర్ణయం గురించి కూడా కాదట.

దీనికి జవాబుగా గాంధీ పదకొండు అంశాలతో కూడిన కోర్కెలను వెల్లడించాడు. ఆ కోర్కెలు ఇవి-

1. సంపూర్తిగా మద్యపాన నిషేధం.

2. రూపాయి మారకం రేటు 16 పెన్నీలకు తగ్గించటం.

3. భూమి శిస్తు విధించే అధికారం శాసన సభకు వుండాలి. భూమి శిస్తును 50 శాతం తగ్గించాలి.

4. ఉప్పు పన్ను తీసివేయాలి.

5. సైనిక వ్యయం మొదటిసారి కనీసం సగానికి తగ్గించాలి

6. ప్రభుత్వ ఉద్యోగుల అత్యధికజీతాలు, తగ్గింపబడ్డ భూమి శిస్తులకు అనుగుణంగా సగానికి గానీ, లేక అంతకు తక్కువగానీ తగ్గించాలి

7. విదేశీ బట్టలు దిగుమతిపై రక్షణ పన్ను తగ్గించాలి.

8. కోస్తా ప్రయాణీకుల నియామక చట్టాన్ని అంగీకరించాలి.

9. హత్య చేసినవారు, హత్యకు ప్రోత్సాహ పరచినవారు, సామాన్య కోర్టులచే విచారింపబడినవారు తప్ప, తక్కిన రాజకీయ ఖైదీలందరినీ విడుదల చేయాలి. రాజకీయ కేసుల్ని ఉపసంహరించుకోవాలి. 124 ఎ సెక్షన్ 1818 మూడో రెగ్యులేషన్‌ను రద్దు చేయాలి భారతీయ ప్రవాసులందర్నీ తిరిగి రానీయాలి.

10. సి. ఐ. డి. శాఖను రద్దుచేయాలి లేదా ప్రజాయత్తం చేయబడాలి.

11. ఆత్మ సంరక్షణకు తుపాకుల లైసెన్సు ఇవ్వాలి. ఇదికూడా ప్రజాధికారం క్రిందనే జరగాలి.

ఈ పదకొండు కోర్కెల ప్రకటన రాజీ చర్చలు ప్రారంభించడానికి, మరొక రాజీ చేసుకోడానికి ప్రభుత్వానికి అవకాశం ఇచ్చింది. ఇది గాంధీ ఎత్తుగడలలో ఒక భాగం ఒకప్రక్క ప్రజాసమీకరణ, మరోప్రక్క ఎదుటివాడికి సంప్రదింపులు సాగించే అవకాశం ఇవ్వడం గాంధీ ఎత్తుగడలలో భాగం

ఈ అంశాలలో కొన్నింటిని వివరంగా పరిశీలించాలి. "రూపాయి : రకపురేటు 16 పెన్నీలకు తగ్గించుట"—అనే అంశాన్ని తీసుకొందాం. యుద్ధానికి పూర్వం రూపాయి మారకం రేటు 16 పెన్నీలు వుండేది అది 18 పెన్నీలకు పెంచబడింది. విదేశీ బట్టల వ్యాపారం ఎప్పుడూ బ్రిటిష్ ద్రవ్యంలోనే అంటే పౌనులు, షిల్లింగులు, పెన్నీలలోనే జరిగేవి.

ఇది ప్రధానంగా లాంక్‌షైర్ బట్టల్ని భారత దేశంలో పోటీగా చౌకగా అమ్మడానికి చేసిన ప్రయత్నం విదేశీబట్టలు నూటికి 12½ వంతులు చౌక అయ్యాయి. దీని మూలాన భారతీయ మిల్లు యజమానికి 1925 లో 7 1/2 వంతు లాభం వస్తే, 1927లో విదేశీ మిల్లు యజమానికి 12 1/2 వంతు లాభం వచ్చింది.

మరో అంశం విదేశీబట్టల దిగుమతిపై సంరక్షణ పన్ను. దేశీయ పరిశ్రమలకు, విదేశీ సరుకుల పోటీ నుండి రక్షించుకోడానికి సాధారణంగా దిగుమతి సంరక్షణ పన్ను విధిస్తారు. ఐతే బ్రిటిష్ ప్రభుత ం జపాను పోటీని ఎదుర్కొనేందుకు వీలుగా, ఇం ం డుకు లాభదాయకంగా వుండేలా ఈ పన్ను వి ం చింది. ఇంగ్లండు మినహా తక్కిన విదేశాల నుండి వచ్చే బట్టలపైన నూటికి 20 వంతులు, ఇంగ్లండు నుండి దిగుమతి అయ్యే బట్టల పైన నూటికి 15 వంతులు పన్నును బ్రిటిష్‌వాళ్ళ చెప్పుచేతల్లో ఉండే భారత ప్రభుత్వం విధించింది.

ఆ విధంగా జపాను పోటీని తట్టుకోవాలని బ్రిటన్ చూసింది. జపాను ఓడ కిరాయి 5 వంతుల చొప్పున తగ్గించి, ఆ నష్టాన్ని పూడ్చుకొని తమ బట్టలను భారతదేశానికి దిగుమతి చేయడం మొదలుపెట్టారు. ఇంతేగాక ఈజిప్టు అమెరికా దేశాల నుండి దిగుమతి అయ్యే మేలిరకర ప త్తిపై పన్ను వేసింది. దీనివల్ల భారతదేశం తయారుచేసే సన్నబట్టల ధర పెరిగి లాంక్‌షైర్ బట్టలకు పోటీ కొంత తగ్గుతుంది.

ఈ విధంగా ఈ 11 అంశాలలోని ఈ రెండు అంశాలు భారతీయ మిల్లు యజమానుల కోర్కెల్ని ప్రతిబింబించుతూ వున్నాయి. వస్త్రపరిశ్రమ రక్షణ బిల్లు కేంద్ర శాసనసభలో చర్చకు వచ్చినపుడు, ఇంగ్లండుకు ప్రత్యేక సదుపాయాలు కలిగించే క్లాజును తీసివేయాలని పండిత మదనమోహన మాలవీయ సవరణ పెట్టాడు సవరణ వీగిపోయింది. ఆయన, మరి కొందరు రాజీనామా చేశారు.

"మాలవీయ సహాయ నిరాకరణవాది కాదు. ఆయన శాసనోల్లంఘనమునకు అంత ప్రతికూలంగా లేడు. కాని ఆయన సంపూర్ణ స్వాతంత్ర్యము నంగీకరించలేదు" అనీ "నిజంగా కాంగ్రెస్ ఉద్యమమునకు తలవని తలంపుగా అనుకోని చోటునుండి దైవాను కూలమున సహాయం వచ్చెను" అనీ డాక్టర్ పట్టాభి కాంగ్రెస్ చరిత్రలో రాశాడు.

ఈ 11 అంశాల గురించి సాధారణ ప్రజావీకానికి అంతగా బోధపడలేదు. వారు మరింత తీవ్ర కార్యాచరణకు ఉవ్విళ్ళూరుతున్నారు. కొత్త ఉద్యమ పథకాల కోసం ఎదురు చూస్తున్నారు.

1930 ఫిబ్రవరిలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ, శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించడానికి గాంధీకి అధికార మిచ్చిన విషయం ఇదివరకే తెలియ చేశాం. ఫిబ్రవరి 27న ఉద్యమ పథకం వెల్లడించ బడింది. తన ఆశ్రమవాసులు 78 మంది మొట్టమొదట ఉప్పు చట్టాలను ఉల్లంఘించుతారని అపుడు గాంధీ ప్రకటించాడు. మార్చి 2న వైస్రాయికి దేశ దుస్థితిని వివరిస్తూ గాంధీ ఒక లేఖ రాశాడు. ఆ దుస్థితి నివారణకు 11 అంశాల కార్యక్రమాన్ని వివరించాడు. తన సూచనల్ని అంగీకరించకపోతే శాసనోల్లంఘన ఉద్యమాన్ని సాగించుతానని తెలియచేశాడు. తన అభిప్రాయాల్ని, విశ్వాసాల్ని పునరుద్ఘాటించుతూనే, వైస్రాయికి రాసిన లేఖలో గాంధీ వాడిన కొన్ని వాక్యాల్ని ఇక్కడ ఉటంకించడం అవసరం.

"బ్రిటిష్ ప్రభుత్వం పాపభూయిష్టమైనదని నా నమ్మకం. ఐనా ఇంగ్లీషు వాళ్ళంతా దుర్మార్గులని నేననుకోను. వారిలో నాకు కొందరు స్నేహితు అన్నారు.

"బ్రిటిష్ ప్రభుత్వం క్రమానుగతమైన ధనాకర్షణ పద్ధతివల్లా, సివిల్ సైనిక పరిపాలనా వ్యయం వల్లా నోరులేని సాదాజనాన్ని నిరుపేదల్ని చేసింది.

"అది రాజకీయంగా మమ్మల్ని బానిసలుగా చేసింది. మా విజ్ఞానసర్వస్వాన్నిహరించి, మమ్మల్ని నిరాయుధుల్ని చేసి, మా ఆత్మల్ని నాశనం చేసింది. ఆత్మబలంలేని ఆయుధ బలం లేని మేము దాదాపు పిరికి వాళ్ళుగానూ, నిస్సహాయులుగానూ చేయబడ్డాం.

"మీరుగాని బ్రిటిష్ ప్రభుత్వంగాని, అధినివేశ ప్రతిపత్తి పూర్తి ప్రణాళికను బలపరచుటకు వాగ్దానం చేయనన్నారు. కాబట్టి రౌండ్ టేబిల్ సభ పరిష్కరించలేదు"

ఇంకా ఈ లేఖలో "అధినివేశ ప్రతిపత్తి సామాన్య అర్థంలో ప్రయోగింపబడిన యడల స్వాతంత్ర్య తీర్మానాన్ని చూచి భయపడనవసరం లేదనీ, రాజకీయ దురంధరులు అనేకులు అధినివేశ ప్రతిపత్తిని నిజమైన స్వాతంత్ర్యంగా ప్రకటించార"నీ గాంధీ అన్నాడు. దీనితో మరొకసారి అధినివేశ ప్రతిపత్తికి పరోక్షంగా గాంధీ సుముఖత తెలియచేశాడు కాని కనీసం ఆ అధినివేశ ప్రతిపత్తిని కూడా బ్రిటిష్‌వాళ్ళియ్య సిద్ధంగా లేరని, గాంధీయే ఈ లేఖలో అంగీకరించాడు.

"ఆర్థిక సభ్యుడు ఒక్క కలం పోటుతో కొన్నికోట్ల రూపాయలను ఇండియా నుండి విదేశాలకు పంపించ దలచుకొన్నాడు" అని రూపాయి మారకపురేటు దిగుమతి సంరక్షణ పన్నుల గురించిన ప్రభుత్వ విధానాన్ని విమర్శించాడు. దాన్ని శాంతియుతంగా ఎదుర్కొనేందుకు చర్యలు తీసుకొంటూ ఉంటే, శాంతి భద్రతలపేరుతో వైస్రాయి ఆ ప్రయత్నాన్ని భగ్నం చేసేందుకు ధనవంతులైన భూస్వాములను సహాయపడవలసిందిగా కోరాడనీ, ఇది భారతదేశాన్ని నాశనం చేస్తుందనీ గాంధీ అన్నాడు.

గాంధీ ఈ లేఖలో స్వాతంత్ర్య ఉద్దేశాన్ని, స్వాతంత్ర్య నిర్వచనాన్ని ఇలా వివరించాడు:

"భయంకరమైన భూమిశిస్తుభారం స్వతంత్ర భారతదేశంలో తగ్గించాలి. నేటి ప్రభుత్వ ఆదాయంలో ఎక్కువ భాగం ఈ భూమిశిస్తు ద్వారానే లభించింది. పర్మినెంట్ సెటిల్‌మెంట్ భాగ్యవంతులైన కొంత మంది జమీందార్లకే గాని రైతులకు ఉపయోగపడదు. రైతు పూర్వంలాగే నిస్సహాయుడు. మామూలు కౌలు

దారు. భూస్వామి దయతలచకపోతే భూమిని విడిచి పోవాలి. ఇదీ రైతు స్థితి భూమిశిస్తు తగ్గించడమే గాక రైతు ప్రయోజనం కోసం ప్రభుత్వం తన ఆదాయ పద్ధతిని పూర్తిగా మార్చుకోవాలి.

ఉప్పు పన్ను విషయంలో కూడా రైతు ఎక్కువ భారం వహిస్తున్నాడు. ధనవంతులకంటే నిరుపేదలు ఎక్కువ ఉప్పు తిని జీవించవలసి వుంది. అందుచే వారికి ఉప్పు పన్ను మహా భారం.

తాగుడు, మత్తు పదార్థాల మూలాన ప్రభుత్వానికి వచ్చే ఆదాయం నిరుపేదలనుండే వస్తున్నది. వారి ఆరోగ్యం, నీతి నశిస్తోంది. తాగుబోతుతనాన్ని ప్రభుత్వం ప్రోత్సహించుతూంది.

భారతదేశం పేరిట చేయబడిన జాతీయ రుణాలను గురించి స్వతంత్ర భారతదేశంలో నిష్పాక్షికంగా న్యాయమూర్తి సంఘంచే విచారించాలి. ఆ సంఘం అన్యాయం అని చెప్పిన రుణాలను భారతదేశం చెల్లించదు.

వైస్రాయి జీతం నెలకు 21 వేల రూపాయలు. ఇంకా ఇతర ఖర్చులున్నాయి. బ్రిటిష్ ప్రధాని జీతం 5,400 రూపాయలకు సమానం. భారతీయుడు రోజుకు రెండు అణాల లోపు సంపాదిస్తూ వుంటే, వైస్రాయి రోజుకు ఏడువందల రూపాయలు పుచ్చుకొంటున్నాడు. బ్రిటన్‌లో రోజుకు రెండు రూపాయలు సంపాదిస్తున్నాడు అంగ్లేయుడు. బ్రిటిష్ ప్రధాని రోజుకు 180 రూపాయలు జీతం పుచ్చుకొంటున్నాడు. అంటే భారతీయుని సగటు ఆదాయానికి 5 వేల రెట్లకు పైగా వైస్రాయి జీతం తీసుకొంటూవుంటే, బ్రిటిష్ పౌరుని సగటు ఆదాయానికి 90 రెట్లు మాత్రమే పుచ్చుకొంటున్నాడు.... అధిక జీతముల పద్ధతిని నిర్మూలించాలి.

(ప్రజలనుండి రాబట్టే) ప్రభుత్వ ఆదాయం తగ్గించాలంటే పరిపాలనా వ్యయం తగ్గించాలి. అంటే ప్రభుత్వ పద్ధతి మార్చాలి. స్వాతంత్ర్యం రానిదే ఈ మార్పు అసంభవం.... వారికి ఈ పన్నుల బాధనుండి తప్పించుకొనుటే స్వాతంత్ర్యం."

ఆ తర్వాత భారతీయ ప్రయోజనాలు బ్రిటిష్ ప్రయోజనాలకు విరుద్ధమని వివరించాడు.

"భారతీయులు జీవించాలంటే, ఉపవాసాంతో క్రమక్రమంగా మరణం చెందకుండా ఉండాలంటే ఏదో ఒక ఉపాయం చూడాలి. ఇంగ్లాండుకు భారతదేశానికి గల ప్రయోజనాలు పరస్పర ప్రతికూలమైనవి. తన ప్రయోజనాల రక్షణకు ఇంగ్లండు. న్యాయంగానీ, అన్యాయంగానీ, తన యావచ్ఛక్తినీ వినియోగించుతుంది. కాబట్టి భారతదేశం ఆ మృత్యుముఖంనుండి తప్పించుకోడానికి శక్తి సామర్థ్యాలు సంపాదించుకోవాలి"

దేశంలో విప్లవవాదుల కార్యకలాపాలు రోజురోజుకూ పెరుగుతుండటాన్ని గురించి చెబుతూ, అటు బ్రిటిష్ వాళ్ళ దౌర్జన్యాన్నీ, ఇటు విప్లవవాదుల దౌర్జన్యాన్నీ ఎదిరిస్తానని ఈ లేఖలో గాంధీ తెలియజేశాడు.

"బ్రిటిష్ ప్రభుత్వం వాళ్ళది సంఘటిత దౌర్జన్యం. దౌర్జన్యపక్షం వారి (విప్లవవాదుల) దౌర్జన్యం అసంఘటితం. ఈ రెంటినీ ఎదిరించడానికి నా అహింసా సిద్ధాంతాన్ని ప్రయోగించడం నా కర్తవ్యం. నేను మూకీభావం వహిస్తే పై రెండువిధాల దౌర్జన్యాలకు దేశాన్ని అప్పగించినట్లవుతుంది" అని గాంధీ అన్నాడు.

విప్లవవాదుల ఆదర్శం తన ఆదర్శంలాంటిదేనని గాంధీ అంగీకరించాడు. కాని ఆ పక్షంవారి వల్ల ప్రజానీకానికి తగిన ప్రతిఫలం లభించదని తాను విశ్వసించుతున్నట్లు గాంధీ ఈ లేఖలో తెలియచేశాడు.

ఈ లేఖలో పైన ఉదహరించిన చెడుకార్యాలు తొలగించితే, స్నేహపూర్వక రాయబారాలు ప్రారంభించడానికి వీలవుతుందని గాంధీ సూచించాడు. 11 వ తేదీలోగా ఈ ఉత్తరం వల్ల వైస్రాయి మనస్సు కరగకపోతే, తన ఆశ్రమవాసులతో కలిసి ఉప్పు చట్టాలను ఉల్లంఘించుతానని గాంధీ హెచ్చరించాడు. "పూర్ణ స్వరాజ్య ఉద్యమం కేవలం నిరుపేదలైన భారత ప్రజల కోసం ఉద్దేశింపబడింది. ఆ ప్రయత్నాన్ని ఆ పేదలకు సంబంధించిన ఉప్పు చట్టంతో ప్రారంభించా అని గాంధీ చెప్పాడు. ఇంతకాలం నుండి మీమీ క్రూరమైన ఈ ఉప్పు పన్నుకు లోబడి ఉండడం ఆశ్చర్యకరం. నన్ను మీరు అరెస్టు చేస్తే, నా తర్వాత ఈ ఉద్యమాన్ని సుశిక్షిత పద్ధతిని నడిపించడానికి వేలాది మంది సంసిద్ధులుగా వున్నారని నా ఆశ."

ఈ 11 అంశాల ప్రస్తావన గాంధీ తీసుకురావడాన్ని జవహర్‌లాల్ లాంటి వాళ్ళకే ఆశ్చర్యం కలిగించింది. ఆయన తన ఆత్మకథలో ఇలా రాశాడు ;

మనం ఒక ప్రక్క స్వాతంత్ర్యం అనే పరిభాషలో మాటాడుతుంటే, రాజకీయ, సాంఘిక సంస్కరణల గురించి ఒక జాబితా ఇవ్వడంలో అర్థం ఏమిటి? మేము

ఉపయోగించిన అర్థంలోనే గాంధీజీ ఈ పదాన్ని కూడా వాడాడా? లేక మేమే మరోరకమైన భాషను ఉపయోగించామా?" అని నెహ్రూ విసుగపోయాడు ఏమైనా బ్రిటిష్ ప్రభుత్వం రాజీకి సిద్ధంగా లేదు. గాంధీ ఉత్తరానికి వైస్రాయి జవాబుగా ఆయన చర్య "ప్రజా శాంతికి భంగకర" మని, "న్యాయశాస్త్ర విరుద్ధ"మనీ అంటూ గాంధీ ఉద్యమం తలపెట్టినందుకు వైస్రాయి విచారాన్ని వ్యక్తం చేశాడు.

గాంధీ ఆశాభంగం చెందాడు. రొట్టె అడిగితే రాయి లభించిందన్నాడు. "భారతదేశం పెద్ద కారాగారం. బ్రిటిష శాసనాన్ని ధిక్కరించుతాను. వైస్రాయి కోరే శాంతి, విసుగు పుట్టించేదిగా వుంది. దుఃఖకరమైనది. ఆ నిర్బంధ శాంతి మూలాన భారత జాతికి ఊపిరాడటం లేదు" అని శాసనోల్లంఘనాన్ని ప్రారంభించడానికి గాంధీ నిశ్చయించుకొన్నాడు.

## దండీయాత్ర - ఉప్పుసత్యాగ్రహం

గాంధీ ఈ ఉద్యమాన్ని తాను ఎంపిక చేసిన ఆశ్రమవాసులతో నడపాలని అనుకొన్నాడు.

1930 ఫిబ్రవరి 27న యంగ్ ఇండియా పత్రికలో గాంధీ రాసిన వ్యాసంలో ఇలా అన్నాడు;

"నాకు సంబంధించినంతవరకు ఈ ఉద్యమ తత్వాన్ని బాగా ఎరిగి ఉన్నట్టే, దానికి తగిన శిక్షణ పొందినట్టే, మా ఆశ్రమవాసుల ద్వారాగాని, తదితరుల ద్వారాగాని నడపాలని నా ఆశయం".

"ఈ పర్యాయం ప్రారంభమయ్యే శాసనోల్లంఘన ఉద్యమం చిట్టచివరకు ఒక్క శాసన నిరోధకుడు జీవించివున్నా అరెస్టు కాకుండా బైటవున్నా ఆగదు. ఆపబడదు కూడా" అని గాంధీ అన్నాడు. చౌరీ చౌరా ఘటనల తర్వాత జరిగినట్లు మళ్ళా జరగదని గాంధీ హామీ ఇచ్చినట్లుగా గాంధీ అనుయాయులు భావించారు.

"అక్కడక్కడా చెదురుమదురుగా దౌర్జన్యం చెలరేగితే, శాసనోల్లంఘన ఉద్యమం ఆపివేయబడదనే అభిప్రాయాన్ని ఆయన (గాంధీ) మాకు కలుగజేశాడు.... ఈ హామీ మాలో చాలామందికి ఎక్కువ సంతృప్తిని క ంచింది".

తనను అరె చేస్తే ఏమి చేయాలో కూడ ఈ వ్యాసంలో గాం సూచించాడు. "ఈ పర్యాయం నేను అరెస్టు చేయబడితే, పూర్వంవలె ప్రజలు సాత్విక దౌర్జన్య రాహిత్యాన్ని (Passive Non Violence) అవలంబించకూడదు. తీవ్రమైన, దౌర్జన్య రాహిత్య పద్ధతిని (Non-violence of activist type) అవలంబించాలి. కాబట్టి భారతదేశానికి పూర్ణ స్వరాజ్యాన్ని సంపాదించడంలో అహింసా పద్ధతిని విశ్వసించేవారందరూ తాము స్వేచ్ఛగా వున్నంతకాలం, ప్రాణమున్నంతకాలం, ఇకముందీ బానిసత్వానికి లొంగకూడదు" అని గాంధీ ప్రబోధించాడు.

సత్యాగ్రహ సమర సన్నాహాలు ఒక ప్రక్క జరుగుతూండగా, వల్లభ్ భాయ్ పటేల్ ముందుగా గ్రామాలకు పోయి, సత్యాగ్రహ సమరానికి ప్రజల్ని సంసిద్ధుల్ని చేయడం మొదలుపెట్టాడు. "మీ పశువుల్ని ప్రభుత్వం జప్తు చేయవచ్చు. శక్తివంతమైన ప్రభుత్వంతో పోరాడేటప్పుడు ప్రజలు భోగలాలసులుగా ఉండరాదు. ఈ సత్యాగ్రహ సమరకాలంలో వివాహ ఉత్సవాలను మానండి. ఇళ్ళకు తాళాలు వేసుకొని పొలాలకు పోయి సాయంకాలం మాత్రమే తిరిగిరండి. ఇది పరీక్షా సమయం. వెనక్కి తిరగరాదు. మీ తాలూకాను గాంధీ సమిష్టి శాసనోల్లంఘనోద్యమానికి ఎన్నుకొన్నాడు. ఆ గౌరవాన్ని నిలబెట్టండి. ప్రభుత్వం మీ పొలాల్ని స్వాధీనపరచుకొంటుందని భయపడవద్దు. పొలాల్ని సీమకు తీసుకుపోలేరుకదా. ఆలా స్వాధీన పరచుకొంటే గుజరాత్ అంతా మీ పక్షమే."

ఇలా ప్రజలను ఉద్యమానికి ఉత్తేజపరుస్తున్న పటేల్‌ను మార్చి మొదటి వారంలోనే అరెస్టు చేసింది ప్రభుత్వం. స్వాతంత్ర్య దినోత్సవానికి (జనవరి 26కి) పూర్వమే సుభాస్ చంద్రబోసుని అరెస్టు చేసింది.

## దండీ - యాత్ర

ఏప్రిల్ 6 జాతీయ స్వాతంత్ర్య ఉద్యమ చరిత్రలో స్వర్ణదినం. 1919లో ఆనాడే జలియన్‌వాలా బాగ్‌లో బ్రిటిష్ వాళ్ళ చేతుల్లో అమాయక ప్రజలు హత్య గావింపబడ్డారు. ఆనాటినుండి ఏప్రిల్ 6 మొదలు ఒక వారం జాతీయవారంగా పరిగణించి అమరవీరులను భారతీయులు సంస్మరించుతూ ఉన్నారు. గాంధీ సరిగా ఆ పవిత్ర దినాన్నే దండిలో బ్రిటిష్ శాసనాలను ఉల్లంఘించి ఉప్పు వండటానికి నిర్ణ

యించుకొన్నాడు. దండి అరేబియా సముద్రతీరం లోనిది. సూరత్ జిల్లాకు చెందిన గ్రామం.

ఉప్పు సత్యాగ్రహమా? "అది మరో స్టంట్ చేయనీయండి చూద్దాం" అన్నాడు ఒక ప్రభుత్వోద్యోగి. "ఉప్పు చేయడానికి దండిలోని చిత్తడినేలకు వెళ్ళి ఓ గుప్పెడు ఉప్పు చేయడం వల్ల ఈ మునలాడికి ఒరిగేదేమిటి?" అన్నాడు మరొకడు.

గాంధీ ఉప్పు శాసనాలనే ఉల్లంఘించాలని ఎందుకు అనుకొన్నాడు? ఉప్పు బీదలందరికీ సంబంధించిన సమస్య. ఈ సమస్య ప్రజలందరి దృష్టినీ ఆకర్షించాలనుకొన్నాడు గాంధీ. తిండిలోకి ఉప్పుకూడా కొనలేని ప్రజలు లక్షలాదిమంది ఉన్నారు. మన దేశంలో సముద్రతీరం చాలావుంది. సముద్రపు ఆటుపోటుల్లో తీరప్రాంతంలోని పల్లపు ప్రదేశాలలోను, గుంటలలోను సముద్రజలం చేరుతుంది. ఎండకు ఆ నీరు ఉప్పుగా మారుతుంది. కాని ఈ ఉప్పును ప్రభుత్వమే తీసుకొని ప్రజలకు అమ్ముతోంది. ప్రకృతి పరంగా ఇచ్చిన ఈ ఉప్పును ప్రజలు తీసుకోడానికి వీల్లేదు. భారత దేశంలో ఉప్పును తయారుచేయడానికి విస్తారంగా అవకాశాలున్నాయి. ఐనా బ్రిటిష్ వర్తకులు ఇంగ్లాండ్‌నుంచి ఉప్పును మనదేశానికి ఓడలలో తెచ్చేవారు. ఈ సందర్భంలో మన దేశానికి ఇంగ్లీషువాళ్ళు ఉప్పు ఎలా దిగుమతి అవుతుందో తెలుసుకోడంకూడా అవసరం.

1836లో సాల్టు కమీషన్ సమావేశమై భారత దేశంలో ఉప్పు పన్ను వేయాలని తీర్మానించింది. ఇలా పన్ను వేస్తే ఇంగ్లండు నుండి వచ్చే ఉప్పు భారతదేశంలో అమ్మడం సులభమౌతుంది. పెద్దపెద్ద సముద్రాలలో ప్రయాణం చేసేఓడలు బరువులేకుండా రావడం క్షేమంకాదు. అందుకని ఖాళీ పడవుల్లో ఏదో ఒకటి వేసుకుని రావాలి. మట్టి, పాతపత్రికలు, పగిలిపోయిన పింగాణీ పెంకులు, ఉప్పు మొదలైనవి పడికట్టుగా (Keel Ballast) ఉపయోగపడేవి. ఓడల సరుకుల్లో మనదేశంనుండి ఎగుమతయ్యేవి ఎక్కువ. మన దేశానికి దిగుమతయ్యేవి తక్కువ. నౌకా వ్యాపారం సాగించే పడవల్లో ఎక్కువ భాగం నూటికి 72 పాళ్ళు బ్రిటిష్ వాళ్ళవే. అంచేత తమ పడవలు ఖాళీగా రాకుండా షెషైర్‌లో తయారైన ఉప్పును ఈ పడవల్లో వేసేవారు. ఈ ఉప్పును భారతీయులకు అంటగట్టేవారు. ఇలా ఇంగ్లీషువాళ్ళ ఉప్పు భారతీయులకు ముప్పుగా తయారైంది.

బ్రిటిష్ ప్రభుత్వాధికారులు, మన దేశంలో తయారైన ఉప్పుమీద పన్ను వేసినాకూడా, అది ఇంగ్లండ్‌లో తయారైన ఉప్పుకన్నా చౌకయేనని ఏవో లెక్కలు చూపించారు. ఏది ఏమైనా భారతీయుల హక్కుకు సంబంధించిన సమస్య ఇది. అంతేగాదు, ఈ సమస్య గ్రామీణ ప్రజలకి సులభంగా అర్థమవుతుంది. అందుచేతనే, ఇతర రాజకీయ కారణాలు అలావుంచి, ఈ సమస్యను ఎన్నుకొన్నాడు గాంధీ.

దండీయాత్ర 1930 మార్చి 12 న ప్రారంభమైంది. గాంధీ నాయకత్వాన 78 మంది సత్యాగ్రహులు సబర్మతి ఆశ్రమం నుండి దండీకి బయలు దేరారు. సబర్మతి నుండి దండికి 200 మైళ్ళు. పాదయాత్ర చేసుకొంటూ, మధ్య మధ్య గ్రామాలలో విశ్రాంతి తీసుకుంటూ రోజుకి 8 మైళ్ళ చొప్పున 25 రోజుల్లో దండి చేరి ఏప్రిల్ 6 న సత్యాగ్రహం ప్రారంభించాలని నిర్ణయించుకొన్నారు.

దండీ యాత్ర లంకకు రామచంద్రుని యాత్ర వంటి "చారిత్రాత్మక యాత్ర" అంటూ రామాయణ గాథను జ్ఞప్తికి తెచ్చాడు. "మోసెస్ నాయకత్వాన ఇస్రాయిలు జరిపిన యాత్ర" అంటూ ప్రఫుల్ల చంద్ర రాయ్ బైబిల్ కథను గుర్తుకు తెచ్చాడు. "ఉప్పు పన్నుపై ఇది యుద్ధం" అని గాంధీ అన్నాడు.

గాంధీ చేతికర్రను ఊతంగా పట్టుకొని పాదయాత్ర ప్రారంభించాడు. వల్లభ్‌భాయ్ పటేల్, సుభాష్‌చంద్ర బోస్, సేన్ గుప్తాలను అరెస్టు చేసిన ప్రభుత్వం గాంధీ జోలికి పోలేదు. గాంధీ దండి యాత్రకు ప్రపంచం నలుమూలల నుండీ విలేకర్లు వచ్చారు. న్యూస్‌రీల్సు (వార్తాచిత్రాలను) తీశారు. పత్రికలు బహుళ ప్రచారం చేశాయి. సినిమాలు తీశారు. ఇదంతా ప్రజానీకాన్ని మేల్కొల్పడానికి, సమీకరించడానికి అవసరమని కాంగ్రెస్ నాయకత్వం భావించింది. ఇదీ ఒకందుకు మంచిదే. సహనం కోల్పోతున్న ప్రజల్ని పక్కదారులకు పట్టించవచ్చుననే అభిప్రాయంతో మొదట ప్రభుత్వం మెదలకుండా వూరుకొంది.

ఈ యాత్రలో ప్రతిచోటా ప్రజలు తండోపతండాలుగా వచ్చి పాదయాత్రను చూడటం మొదలు

పెట్టారు. "దండీయాత్ర తోవలో మరణించనైనా మరణించాలి లేదా ఆశ్రమానికి దూరంగా ఉండాలి" అని గాంధీ శపథం పట్టాడు.

ఐతే గాంధీ, ఉద్యమాన్ని తన విశ్వాసాల పరిధి లోనే ఉంచాడు. ఆ పరిధిని మించినప్పుడు హెచ్చరిస్తూ వచ్చాడు. సబిన్‌స్పెక్టర్లను సాంఘికంగా బహిష్కరించినందుకు, జంబుసారు అనే గ్రామంలో గాంధీ నిరసించాడు. "ప్రభుత్వోద్యోగుల్ని లంకణాలు చేయించడం మన మతం గాదు" అన్నాడు. అలాగే యాత్రాసమయంలో ప్రజలిచ్చే భోజనాది సౌకర్యాలు మితంగా ఉండాలని అన్నాడు.

"నా జీవిత పద్ధతి ప్రజల సగటు ఆదాయంతో సంబంధం కల్గి ఉన్నపుడే వైస్రాయి అత్యధిక జీతాన్ని తీసుకోడాన్ని నిరోధించగలను....అన్న వస్త్రాలు లేని వారి పక్షాన, నిరుద్యోగుల పక్షాన మనము పనిచేయు చున్నామని చెప్పుచున్నాం....దరిద్రవంతమైన దేశం యొక్క శక్తిని మించి జీవించుట దొంగతనం చేసిన ఆహారంపైన జీవించడం వంటిది. అట్టి ఆహారంతో జీవించడంవల్ల మన యుద్ధం నెగ్గదు."

వనసారీలో మాట్లాడుతూ, పార్శీవారిని సారాయి వర్తకం మానవలసిందిగా గాంధీ ప్రబోధించాడు. "ఉప్పుపన్ను, సారాయి వ్యాపారం నిర్మూలించితే అహింసకు జయము కల్గినట్లే....నాకు కావలసినది నేను తీసుకొని పోవలెను, లేదా నా శవం పశ్చిమ సముద్రంలో తేలాలి."

గాంధీ ఏప్రిల్ 5న దండిగ్రామంచేరాడు. ఈ లోగా మార్చి 21 న అఖిలభారత కాంగ్రెస్ సంఘం సమావేశమై, అదివరలో కార్యవర్గం చేసిన తీర్మానాన్ని పునరుద్ఘాటించింది. కార్యవర్గం వారి సూచనలకు అనుగుణంగా రాష్ట్ర కాంగ్రెస్ సంఘాలు ఉప్పు చట్టానికి సంబంధించిన శాసనాలను మాత్రమే ఉల్లంఘించాలని నిర్ణయించింది గాంధీ శాసనోల్లంఘనం చేయకూడదనీ, గాంధీ ముందుగానే అరెస్టయిన యెడల శాసనోల్లంఘనం ప్రారంభించడానికి రాష్ట్రాలకు అధికారమిస్తూ, అఖిలభారత కాంగ్రెస్ కమిటీ తీర్మానించింది.

ఏప్రిల్ 5 న దండి చేరిన గాంధీ, 6 వ తేదీన సముద్రతీరంలోని ఉప్పు పోగుచేయడంతో శాసనోల్లంఘన ఉద్యమం ప్రారంభమైంది. 5 వ తేదీన ఒక పత్రికా ప్రతినిధికి ఇచ్చిన ప్రకటనలో గాంధీ ఇలా అన్నాడు :

"ఈ నా యాత్రను సహించి, ఉపేక్షించి నట్లుగానే, రే.టినుండీ అసంఖ్యాక జన సమూహాలు ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించితే ప్రభుత్వం ఊరుకుంటుందేమో చూడాలి. అన్ని కాంగ్రెస్ సంఘాలు రేపటినుండి ఉప్పు చట్టాలకు సంబంధించినంత వరకు ప్రారంభించవచ్చు. రేపు గం॥ 6-30 లకు నాతో వచ్చిన వలంటీర్లతో సహా శాసనోల్లంఘనాన్ని ప్రారంభించుతాను" అని గాంధీ అన్నాడు. 6 వ తేదీన గాంధీ, ఆయనతో పాటు వున్న వలంటీర్లు సముద్ర తీరంలోని ఉప్పును పోగుచేశారు, జాతీయ వారమంతా ఏప్రిల్ 6 నుండి 13 వరకు ఉప్పు చట్టాల్ని ప్రజలు ఉల్లంఘించాలని గాంధీ ఆదేశించాడు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనలేనివారు ఖద్దరు ధారణ, విదేశ వస్త్ర బహిష్కారం గురించి, మద్యపాన నిషేధం గురించి ప్రచారం చేయాలని గాంధీ తెలియ చేశాడు. మహిళలకు ప్రత్యేకంగా విజ్ఞప్తి చేస్తూ గాంధీ ఇలా అన్నాడు. "భారత నారీమణులు పూర్ణ స్వరాజ్యం కోసం, పురుషుల కంటే ఎక్కువ తోడ్పడ గలరని నా విశ్వాసం.........నిజంగా స్త్రీలకు ఎక్కువ ధైర్యంవున్నది. వారి స్వార్థత్యాగ బుద్ధి వర్ణనాతీతం" దీనితోపాటు స్కూళ్ళను కాలేజీలను వదలి రావలసిందిగా విద్యార్థులకు గాంధీ విజ్ఞప్తి చేశాడు.

ప్రభుత్వోద్యోగాలకు రాజీనామా చేయాలని ఉద్యోగులకు విజ్ఞ చేశాడు. ఏప్రిల్ 9 న గాంధీచేసిన విజ్ఞప్తిలో ప్రతి గ్రామంలోను శాసనోల్లంఘనం చేసి ఉప్పు తయారుచేయాలన్నాడు, సారా దుకాణాలను, విదేశ వస్త్ర దుకాణాలను పికెట్ చేయాలనీ, విదేశ వస్త్రాలు తగలబెట్టాలనీ, అందరూ నూలు వడకాలనీ, అస్పృశ్యత పాటించాలనీ, హృదయపూర్వకమైన హిందూ - ముస్లిం ఐక్యతకు కృషిచేయాలనీ గాంధీ విజ్ఞప్తి చేశాడు.

ఏప్రిల్ 6 వ తేదీ నుండి ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించవచ్చునని గాంధీ ప్రకటించగానే, దేశమంతటా అత్యంత ఉత్సాహంతో ప్రజలు గాంధీ విజ్ఞప్తికి ప్రతి స్పందించారు.

దేశ మంతటా బహిరంగ సభలు జరిగాయి. ప్రభుత్వోద్యోగులు వందలాదిగా తమ పదవులకు రాజీనామా

చేశారు. శాసనసభ్యులు తమ శాసన సభ్యత్వానికి రాజీనామా చేశారు. ఉప్పు చట్టాన్ని అనేకచోట్ల ప్రజలు ఉల్లంఘించారు. సారా దుకాణాలను ప్రజలు పికెట్ చేశారు. రైతులు పన్నుల్ని కట్ట నిరాకరించారు. రుణాలను చెల్లించ నిరాకరించారు

గాంధీ, కాంగ్రెస్ నాయకులూ పెట్టిన పరిమితి లోనే ఉద్యమం ఉండిపోలేదు. సమ్మెలు జరిగాయి. ప్రజా ప్రదర్శనలు జరిగాయి. కరాచీ, షిరోడా, రత్నగిరి, పాట్నా, పెషావర్, కలకత్తా, మద్రాసు, షోలాపూర్ నగరాలలో జరిగిన సంఘటనలే ఇందుకు నిదర్శనం.

గాంధీ తాను అరెస్టు కాకపూర్వం చేసిన ఒక ప్రకటనలో ఉద్యమ ఘటనలను కొన్నిటిని పేర్కొన్నాడు. అక్కడక్కడా జరిగిన ప్రభుత్వ దౌర్జన్యాలను నిరసించాడు. ఆయన ఇలా అన్నాడు.

"గుజరాత్‌లో సమష్టి శాసనోల్లంఘనంఅమృతంగా జరిగింది. ప్రభుత్వం ముఖ్యుల్ని నిర్బంధించింది.... న్యాయ విచారణలేకుండా సాత్విక నిరోధకుల ఆస్తులకు గానీ, శరీరాలకుగానీ హాని కల్గించిన యెడల అది చాలా క్రూరమైన విషయం. సాత్విక నిరోధకుడు ఖైదు మొదలైన నిర్బంధాలకు సంసిద్ధపడాలి. నాయకుడు తొలగించబడితే ప్రజలు భయం కనబరచరాదు. ఇపుడు ప్రతివాడూ నాయకుడు, అనుచరుడు కావాలి."

ఒక వలంటీరును మణికట్టుపైన పోలీసులు కొట్టినందుకు నైతికంగానూ, న్యాయశాస్త్ర ప్రకారం కూడా తప్పని గాంధీ అన్నాడు, .... ప్రజలను భయపెట్టడానికే ప్రభుత్వం ఇలా చేస్తే అందుకు ప్రజలు సంసిద్ధులు కావాలి........ప్రభుత్వం సాత్విక నిరోధకులను అరెస్టు చేయవచ్చు. వారి శరీరం ప్రభుత్వం స్వాధీనంలో వుంది కనుక వారి చేతిలో ఉప్పు కూడా తీసుకోవచ్చు. కాని అతడు నేరం చేశాడని శిక్షించిన తర్వాతనే ఆ పని చేయాలి".

ప్రభుత్వం హద్దు మీరితే తప్ప స్త్రీలు ఉప్పు పోరాటంలో పాల్గొనరాదని నవసారిలో ఇచ్చిన ఉపన్యాసంలో గాంధీ అన్నాడు

"దుష్ట పరిపాలన"అనే శీర్షికతో రాసిన వ్యాసంలో ప్రభుత్వాన్ని గాంధీ విమర్శించాడు

ప్రభుత్వం ఉప్పు ఉచితంగా ఈయాలి, లేదా, అది తెచ్చుకొనే శాసన నిరోధకులను అరెస్టు చేయాలి. అంతేగాని ఉప్పు కొటారులపై దాడికి పోయేవారిని హింసించడంకంటే కాల్చిచేటే ఉత్తమం "

ఉద్యమం తీవ్రమైన కొలదీ ప్రభుత్వ నిరంకుశ స్వరూపం నగ్నంగా కనపడసాగింది ఏప్రిల్ 23 న బెంగాల్ ఆర్డినెన్సు పునరుద్ధరింపబడింది. 1910 నాటి ముద్రణా శాసనాన్ని కొన్ని సవరణలతో ఆర్డినెన్సు ద్వారా పునరుజ్జీవింప చేయబడింది, ఇది పూర్వంకంటె భయంకరంగా వున్నదని గాంధీ అన్నాడు. మనకు తెలిసినా, తెలియకపోయినా, సైనిక శాసనం యొక్క ప్రచ్ఛన్న రూపంలో మనం వున్నాం. ఈ కొత్త ఆర్డినెన్సుకు ప్రజలు భయపడరాదు మన శరీరాలనేగాక, ఆస్తులను కూడా వారి స్వాధీనం చేయడానికి జంకరాదు. పత్రికాధిపతులు, ముద్రణాలయాధిపతులు ధరావత్తులు కట్టరాదు"

నవజీవన్‌ముద్రణాలయాధిపతి ఆ విధంగానే గాంధీ ఆదేశాన్ననుసరించి ధరావతు కట్టడం మానేశాడు. ఈ సమయంలోనే గాంధీ తాటిచెట్లను నరికే కార్యక్రమాన్ని కూడా ప్రారంభించాడు.

ఐతే గాంధీ విధించిన పరిమితులలోనే ఉద్యమం వుండిపోలేదు. దీనికి కారణం ప్రజల ఆర్థిక దుస్థితియే. 1927-28 నుండి ప్రపంచ వ్యాపితంగా ఏర్పడిన ఆర్థిక మాంద్యం మనదేశంలో కూడా ఏర్పడింది. వ్యవసాయ ఉత్పత్తుల ధర పడిపోయింది. గోధుమ నూటికి 50 వంతున, జూట్ నూటికి 50 నుండి 60 వంతున ధరలు పడిపోయాయి. ఐనా ప్రభుత్వం పన్నులు పెంచింది. భూస్వాములు, కౌలుదా నుండి ఇదివరలో వలె ధాన్యంగాక, డబ్బివ్వాలని ఒ డి చేయసాగారు. ధాన్యంధర పడిపోయింది గ డబ్బు రూపేణా ఐతే ఎక్కువ విలువ వుంటుందని భూస్వాముల ఆలోచన. చిన్న రైతులు కౌలుదార్లు దివాళా తీయసాగారు. రైతుల రుణం 900 కోట్ల రూపాయలకు పెరిగింది. అలాగే ఉద్యోగుల కార్మికుల పరిస్థితి అధ్వాన్నమైంది.

ఆర్థిక మాంద్యంనుండి తట్టుకోడానికి బ్రిటీష్ సామ్రాజ్యవాదులు వలస దేశాలను, ప్రధానంగా భారత దేశాన్ని వుపయోగించుకోవాలని చూశారు. వలసదేశాలను పిప్పి పీల్చివేసి తాము ఆర్థిక సంక్షోభం నుంచి బయటపడాలని చూశారు. ఎగుమతి, దిగుమతి ధరలను తమకు అనుకూలంగా నిర్ణయించేటట్లు చేశారు.

అందుచే భారతదేశంనుండి, ఎగుమతులు తగ్గిపోయాయి. బ్రిటన్ నుండి భారతదేశం దిగుమతి చేసుకొనే వస్తువు లెక్కువయ్యాయి. అందుచే బ్రిటిష్ వాళ్ళ వాణిజ్యం పెరిగింది. భారతదేశంలో చిన్న ఉత్పత్తిదార్లు నాశనమవుతూ వచ్చారు. ఆర్థిక మాంద్యంతో ప్రజలు బంగారం, వెండీ అమ్ముకున్నారు. వెండి ధర కూడా పడిపోయింది. తమ ఏజెంట్లద్వారా కొని బ్రిటిష్ బ్యాంకులు 300 కోట్ల రూపాయల విలువచేసే వెండి బంగారాలను దోచుకొని పోయారు రూపాయికి 18 పెన్నీల చొప్పున మారకపు రేటు నిర్ణయించడంతో భారతదేశ రుణం మరో 11 శాతం పెరిగింది.

సామ్రాజ్యవాదులకూ, భారత పారిశ్రామిక వేత్తలకూ కూడా ఘర్షణ పెరిగింది. జాతీయ విమోచనోద్యమంతోపాటు వర్గ పోరాటాలు కూడా పెరిగాయి.

ఆ విధంగా ప్రతివ ్నికీ ఏదో విధంగా బ్రిటిష్ ప్రభుత్వంపై అసంతృ పెరిగింది. అందుచే గాంధీ ప్రారంభించిన ఉప్పు స గ్రహ ఉద్యమం విస్తృత ప్రజానీకాన్ని కార్యరంగంలోకి దింపింది. ఆ ఉద్యమం లోంచి మట్టిలోంచి మాణిక్యాలు లాగ సామాన్య ప్రజల నుంచి వీరులు వుద్భవించారు. ఆసేతుహిమాచలం ప్రజా ప్రదర్శనలు జరిగాయి. ముదుసలులు, యువకులు, స్త్రీలు పోలీసు లాఠీ దెబ్బలకు గురి అయ్యారు. ఏదైనా ఒక ఊరేగింపును పోలీసులు అడ్డగించితే, గంటలు కొలది రోడ్లపై అలాగే తిష్ట వేసుకు కూర్చునేవారు సత్యాగ్రహులు. స్త్రీలు విశేషంగా ఈ ఉద్యమంలో పాల్గొనడం ఒక ప్రత్యేకత. ఆ రోజుల్లో ఢిల్లీ పట్టణంలో స్త్రీలు ఎక్కువగా పాత భావాలతోనే వుండేవారు. ఐనా అలాంటి ఢిల్లీలో 1600 మంది స్త్రీలు రాజకీయ కార్యకలాపాల్లో పాల్గొన్నందుకు అరెస్టు చేయబడ్డారు. బొంబాయిలో మధ్య తరగతి మహిళలు అధిక సంఖ్యలో ఉద్యమంలో పాల్గొన్నారు. శాసనోల్లంఘనోద్యమం ఏమి చేసినా చేయకపోయినా, భారత మహిళలు సామూహికంగా సామాజిక విముక్తి చెందడానికి తోడ్పడిందని బ్రిటిష్ పరిశీలకులు సైతం రాశారు. సంఘ సంస్కరణోద్యమాలు దాదాపు ముప్పాతిక శతాబ్దంపాటు చేయలేని పనిని ఈ ఉద్యమం కొన్ని వారాలలో చేయగలిగింది.

లాఠీఛార్జీలు, పోలీసు కాల్పులు నిత్యకృత్యాలయ్యాయి. ఏప్రిల్ 16 న జవహర్‌లాల్‌నెహ్రూను ప్రభుత్వం అరెస్టు చేసింది. వెన్వెంటనే వేలాది మందిని అరెస్టు చేసింది. ఏప్రిల్ 23 న బెంగాల్ ఆర్డినెన్సు ప్రకటించబడింది. దీనివల్ల స్వాతంత్ర్య సమర యోధుల జీవితం దుర్భరమైంది. 1910 ప్రెస్ ఆక్టును విచ్చితంగా అమలు జరిపి పత్రికలపై అనేక ఆంక్షలు విధించింది. దానికి నిరసనగా జాతీయ వార్తా పత్రికలు, మాగజైన్లు ప్రచురణను మానివేశాయి. పౌరుల ఆస్తి ధ్వంసం చేయబడింది. అమాయకులైన స్త్రీ పురుషులనేకమందిని కొట్టారు ఖైదీలకు తిండీ తిప్పలు లేకుండా మాడ్చారు. పోలీసు కాల్పుల్లో వందలాది మంది చనిపోయారు.

కరాచీలో పోలీసు కాల్పులవల్ల ఏడుగురు మరణించారు. ఇందులో దత్తాత్రేయ అనే యువకుడు సత్యాగ్రహి కాదు. ప్రజలను శాంత పరచడానికి ప్రయత్నించుతూ వుండగా పోలీసు కాల్పులకు గురై మరణించాడు. ఈ విషయాన్ని గాంధీయే స్వయంగా రాశాడు. అసలీ కాల్పులకు కారణం ఏమిటి ? సింధు రాష్ట్ర నాయకుడైన జయరామ్‌దాస్ దౌలత్‌రామ్ బొంబాయి శాసనసభకు రాజీనామా ఇచ్చాడు. మేజిస్ట్రేట్ కోర్టులో విచారింపబడుతున్న కొంతమంది ఖైదీలను చూడటానికి ప్రజలు విపరీతంగా వచ్చారు. వారిని సర్దుబాటు చేయడానికి దౌలత్‌రామ్ ప్రయత్నించాడు. ఇంతలో పోలీసులు ఆయనపైన, ఇతర ప్రజలపైన కాల్పులు కాల్చారు. ఆయన తొడలోకి తుపాకి గుండొకటి దూసుకు పోయింది. తర్వాత కొన్నాళ్ళకు తేరుకున్నాడాగాయం నుండి. ఆ తర్వాత కొన్నాళ్ళు ఆయన కార్యనిర్వాహక సభ్యుడుగా కొనసాగాడు.

మృత్యువును ధిక్కరించి, గాంధీ సూచించిన నియమావళికి మాత్రమే పరిమితంగాక, ఎందరెందరో ఆత్మార్పణం చేసిన ఉజ్వల ఘట్టాలు పెషావర్, షోలాపూర్, చిటగాంగ్‌లలో జరిగాయి. మొదటి పెషావర్ ఘటన లేమిటో చూద్దాం.

## పెషావర్ తిరుగుబాటు

1930 ఏప్రిల్ 20 న పెషావర్‌లో శాసనోల్లంఘన ఉద్యమం ప్రారంభించవలసి వుంది. ఆ రోజు ఈద్ పండుగకూడా. ఈద్ పండుగలో పాల్గొనేందుకు అనేక మంది బీదరైతులు వచ్చారు. మైదాన భూముల్లో పనీ

పాటలు చేసుకొని సీజన్ అయిపోయాక ఇండ్లకు తిరిగి వెళ్ళే సరిహద్దు జాతుల వాళ్ళు కూడా ఈద్ పండుగలో పాల్గొనడానికి వచ్చారు. స్థానిక కాంగ్రెస్ నాయకుల్ని అరెస్టు చేసినపుడు ఆ పట్టణ ప్రజలు అసమ్మతి తెలిపి వారిని విడిపించడానికి ప్రయత్నించారు. ప్రభుత్వం సాయుధ శకటాలను పంపింది. ఒక శకటం తగులబడింది కాని అందులోని వాళ్ళుమాత్రం తప్పించుకొన్నారు. దానిపైన మూకుమ్మడిగా పోలీసులు కాల్పులు సాగించారు. వందలాది మరణించడమో, గాయపడటమో జరిగింది. సరిహద్దు జాతుల వాళ్ళు కూడా ప్రజల పక్షాన చేరారు. రెండువైపులా కాల్పులు జరిగాయి. ప్రజా తిరుగుబాటు ప్రారంభమైంది. బ్రిటిష్ సాయుధ శకటాలు రాకుండా ప్రజలు బారికేడ్లను (అడ్డుగోడల్ని) కట్టారు. అధికారులు, పట్టణం లోని పై తరగతుల వారు సైనిక కంటోన్మెంటులో తల దాచుకున్నారు. దాదాపు ఇదే సమయంలో, సమర శీలురైన సిక్కు సంస్కర్తలూ, జాతీయవాదులూ అయిన అకాలీలు భారతీయ సైన్యంలో తిరుగుబాటునుప్రోత్సహించుతూ వచ్చారు.

పెషావర్‌లో తిరుగబడిన ప్రజల్ని కాల్చవలసిదిగా ఆజ్ఞాపించినపుడు, రాయల్ గర్వాల్ రైఫుల్సుకు చెందిన రెండు దళాలు (ప్లెటూన్లు) ప్రజలపై, అందులోనూ ముస్లిం ప్రజలపై కాల్పులు సాగించడానికి నిరాకరించి హిందూ-ముస్లిం ఐక్యతను చాటిచూపించాయి. ఈ దళాలు పర్వత ప్రాంతంలో వుండే గట్టి సైనిక దళాలు. వీరి నాయకుడు ఠాకూర్ చంద్రసింగ్ గర్వాలి.సోదర ముస్లిం పఠాన్లపైకాల్పులుసాగించనని స్పష్టం చేశాడు. "విభజించి పరిపాలించే" నీతితో, తమ పబ్బం గడుపుకోవాలన్న బ్రిటిష్ వాళ్ళ ఆటలు సాగలేదు. పది రోజులపాటు పెషావర్, ప్రజల చేతుల్లో వుండిపోయింది.

గార్వాలీ సైనికులను కంటోన్మెంట్ నుండి బ్రిటిష్ సైనికులు చుట్టుముట్టి అరెస్టు చేశారు. వారి నాయకులు కొంత మందిని ఉరి తీశారు. ఐనాకూడా మే నెలలో అఫ్రిదీ మహ్మద్ అనే కొండజాతులవారు తిరగబడి, పెషావర్‌లోని తిరగబడ్డ ప్రజల్ని కలవడానికి బయలుదేరి వచ్చారు. పంజాబ్‌లో పెషావరు పోరాటానికి మద్దతుగా, ముఖ్యంగా అకాలీలు ఒక దళాన్ని పంపారు. జీలం నదివద్ద వీరిని బ్రిటిషు సైనికదళం ఆపివేసింది. చిట్టచివరకు బ్రిటిషు సైన్యాలు వాయువ్య సరిహద్దుల్లోని గిరిజన తిరుగుబాటు దారులను తరిమివేశారు.

ఈ సందర్భంగా వాయువ్య రెడ్‌షర్టుల ఉద్యమం గురించి కూడా కొంత చెప్పాలి.

వాయువ్య సరిహద్దు రాష్ట్రంలో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తరుచుగా పఠాన్‌జాతుల వారు తిరుగుబాట్లు చేస్తూ వుండేవారు. డేరా ఇస్మాయిల్ ఖాన్, పెషావర్ ప్రజలూ బిన్నూ, కోహట్ నదీ లోయలో నివసించే ప్రజలు స్థానిక నాయకుల క్రింద పనిచేస్తూ వుండేవారు. అక్కడ వ్యవసాయ పరిస్థితులు ఎక్కువగా స్థిరపడడానికి అనువుగా వుండేవి. అబ్దుల్ గఫార్‌ఖాన్, అలాంటి పఠాన్ నాయకులలో ఒకడు. ఆయన అప్పటికే ఎన్నోసార్లు ప్రభుత్వ దమనకాండకు గురి అయ్యాడు. ఆయన సోదరుడు డాక్టర్ ఖాన్ సాహెబ్ ఆధునిక విద్యనుకూడా అలవర్చుకొన్నాడు. ఈ సోదరులిద్దరూ కలిసి పఠానులను అనేక మందిని అహింసాత్మక గాంధీ ఉద్యమంలోకి తీసుకు వచ్చారు. అబ్దుల్‌గఫార్‌ఖాన్ వ్యక్తిత్వం, దృఢ సంకల్పం గాంధీతో పోల్చుకొని ప్రజలు ఆయన్ని "సరిహద్దుగాంధీ" అని పిల్చేవారు. ఈయన జాతీయ వలంటీర్ల సేనను ఒకదాన్ని ఏర్పరచాడు. ఖుదై ఖిద్మత్ గార్‌లని వీరిని పిలిచేవారు. అంటే దేవుని సేవకులని అర్థం. వారు ధరించే ఎర్ర చొక్కాలవల్ల వారిని "ఎర్రచొక్కాల" వలంటీర్లని పిలిచేవారు. వీరు పఠాన్లు. ప్రాంతీయంగా జాతీయ ఐక్యతకు కృషిచేయాలని కోరేవారు. వలస ప్రభుత్వానికి వ్యతిరేకంగా చేతివృత్తులవారి దీనపరిస్థితులకు వ్యతిరేకంగా పోరాడేవారు. బీదరైతుల, పట్టణ చేతిపనివారల అండదండలు వీరికి వుండేవి.

## ఖుదై ఖిద్మత్‌గార్ ఉద్యమం

వాయువ్య రాష్ట్రంలో ఖుదై ఖిద్మత్‌గార్ ఉద్యమం భారత స్వాతంత్ర్య ఉద్యమ చరిత్రలో సువర్ణ ఘట్టం. వేలాదిమంది ముస్లిములూ, హిందువులూ, సిక్కులూ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు. స్త్రీలు, పురుషులు, పిల్లలు సైతం బ్రిటిష్ ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమంలో నానా హింసలు అనుభవించారు. వీరి త్యాగం లేకుండా ఇటు స్వతంత్ర భారత్‌గాని, అటు పాకిస్తాన్‌గాని ఏర్పడివుండేది కాదు.

సరిహద్దు గాంధీ అని ఆప్యాయంగా పిలువబడే అబ్దుల్ గఫార్ ఖాన్ (బాద్‌షాఖాన్ అనికూడా ఈయన్ని పిలుస్తారు.) సామాజిక సంస్కరణలు, విద్య, జీవ కారుణ్య సంబంధమైన పనులు-ఇవి ఆయన కార్యక్రమం. ఇందుకుగాను ఒక వలంటీర్ దళాన్ని "ఖుఖిద్మత్‌గార్" లను (దేవుని సేవకులను) 19 నవంబర్‌లో ఏర్పరచాడు. అంతకుముందు ఒక సంవత్సరం క్రిందట "పక్తూన్" అనే పత్రికను ప్రారంభించాడు. మొదటిసంచికలలో కొన్నాళ్ళు ఖాదిమ్ రాసిన పద్యాన్ని మొదటిపేజీలో ప్రకటించేవాడు. ఆ పద్య భావం ఇది.

"మృత్యువు కోరల్లో చిక్కుకుని బాధపడుతున్నప్పటికీ, ఒక గంటసేపు స్వాతంత్ర్యం అనుభవించడమే, దాస్యంలో ఏండ్లకొలది బానిసత్వంలో మ్రగ్గడం కంటే మేలు."

తర్వాత ఆ పత్రిక ముఖపత్రంపైన నెలబాలుడు, నక్షత్రంతోబాటు ఆయన కుమారుడు ఘని రాసిన పద్యం ఉండేవి. ఆ పద్య భావం ఇది :

తళ తళా మెరిసే రాతిఫలకం చెక్కిన గోరీక్రింద బానిసగా నన్ను పూడ్చిపెడితే,

దానిని గౌరవించకు, దానిపై ఉమ్మివెయ్ !

నేను అమరవీరుని రక్తంలో స్నానమాడకుండా చనిపోతే

నాకోసం ప్రార్థనలు చేసి ఎవరూ తమ నాలికను కల్మషం చేసుకోవద్దు!

బ్రిటిష్ ఫిరంగులచే నేను ముక్కలు ముక్కలు గాకపోతే,

ఈ నా బీడు భూమిని ఈడెన్ గార్డెన్‌గా మారుస్తాను- లేదా-

పక్తూన్ల ఇండ్లను, సందు గొందుల్ని తుడిచిపెడతాను!

ఖుదై ఖిద్మత్‌గార్లు ప్రమాణపత్రంపై సంతకాలు చేసేవారు. నిస్వార్థసేవ, పఠానులలోని దురాచారాలను మాన్పించడం, అహింసకు కట్టుబడి వుండటం, మొదలైనవి ఈ ప్రమాణంలోని అంశాలు.

వీరు ఎర్రటి యూనిఫారాలు ధరించేవారు. సైనిక కవాతు చేసుకుంటూ నడిచేవారు. ఈ క్రింది పాట పాడుకుంటూ గ్రామ గ్రామాన తిరిగేవారు.

"మేము దేవుని సైనికులం
మరణంగానీ, ధనప్రలోభంగాని
మమ్మల్ని కదలించలేదు,
మరణానికి సిద్ధమై
మేమూ మా నాయకుడూ
పయనిస్తాం
మా ఆశయాన్ని, మా ప్రజల్ని
ప్రేమించి సేవచేస్తాం
స్వాతంత్ర్యం మా లక్ష్యం
దానికై మేం చెల్లించే మూల్యం
మా ప్రాణాలే!"

1930 మార్చి నాటికి రెడ్‌షర్టుల సంఖ్య 'చార్సడ్డా' అనే చోట 2 వేలకి పైగా వుండేది. పోలీసుల నిర్బంధ విధానం వల్ల 1930 సెప్టెంబరు నాటికి 80 వేలకు, 1931 గాంధీ-ఇర్విన్ ఒడంబడిక నాటికి 3 లక్షలకు పెరిగింది.

1929 డిసెంబర్‌లో జరిగిన లాహోర్ కాంగ్రెస్‌లో, తానూ తన సంస్థ కాంగ్రెస్‌లో పనిచేస్తామని గఫార్‌ఖాన్ వాగ్దానం చేశాడు.

"భారతదేశాన్ని, మొత్తం ఇస్లామిక్ ప్రపంచాన్నే నాశనం జేయడానికి బాధ్యులైన ఇంగ్లీషు నిరంకుశ పాలకుల బంధనాలనుండి దేశాన్ని విముక్తి చేయ దలచుకొన్న పార్టీకి నేను చెందుతాను" అని ఆయన ప్రతిచోటా ఉపన్యాసాలిస్తూ వచ్చాడు.

పెషావర్‌లోని కిస్సాఖానీ బజారులో డిప్యూటీ కమిషనర్ హెచ్. ఎ. యఫ్. మెట్కాఫ్ అవలంబించిన దారుణ మారణకాండలో ఏప్రిల్ 23 న రెండు మూడు వందలమంది అమాయక ప్రజలు చనిపోయారు.

సరిహద్దు రాష్ట్ర చట్టాన్ని పరిశీలించడానికి ఏప్రిల్ 22 న వచ్చిన కాంగ్రెస్ విచారణ సంఘాన్ని రానీయకుండా ప్రభుత్వం నిషేధించింది. ఏప్రిల్ 23 నుండి పెషావర్‌లో సారా దుకాణాలను పికెటింగ్ చేయ దలపెట్టిన పెషావర్ కాంగ్రెస్‌వారు 11 మందిపై అరెస్టు వారంట్లు జారీ చేసింది.

మొట్టమొదటి ఖుదై ఖిద్మత్‌గార్ల (రెడ్ షర్టుల) సమావేశం 'ఉత్మంజాయి' అనే చోట ఏప్రిల్ 18, 19 తేదీలలో జరిగింది.

200 మంది రెడ్ షర్టులు హాజరయ్యారు. ఏప్రిల్ 23 న శాసనోల్లంఘన చేయవలసిందిగా సరిహద్దు గాంధీ కోరాడు. వెంటనే ఆయన్ని అరెస్టు చేశారు. ఆయనతోపాటు ఆఫ్ఘన్ యువజనసంఘ కార్యదర్శి మియా అహ్మద్‌షా, అధ్యక్షుడు అబ్దుల్ అక్బర్‌ఖాన్, సాలార్ సరాఫరాజ్‌ఖాన్, షానవాజ్‌ఖాన్‌లు అరెస్టు అయ్యారు. ఈ వార్త తెలియగా చారసదా అనే ప్రాంతంలో వేలాది ప్రజలు గుమిగూడారు. అదే రోజున పెషావర్‌లో సరిహద్దు గాంధీ సహచరులు అరెస్టు అయారు.

చాలాచోట్ల కాల్పులు జరిగాయి. అనేకమంది చని పోయారు. చారసదా వద్ద ప్రజలు జైలును చుట్టు ముట్టారు. సరిహద్దు గాంధీ "నా పోరాటం" అనే ఆత్మకథలో కొన్ని ఘటనల గురించి ఇలా వివరిం చాడు :

"........ తర్వాతి రోజున ఉత్మాంజాయ్ అనే గ్రామంలో సభ జరగబోతున్నది, అక్కడ హింస ప్రజ్వరిల్లడానికి అవకాశం వుంది. నేను సభాకాలానికి ముందుగానే చేరుకొన్నాను. బహిరంగ ప్రదేశంలో వారివద్ద వున్న ఆయుధాలను తీసివేసుకున్నాను. అక్కడ మొట్టమొదటిసారిగా బహిరంగసభలో మాట్లా డాను. ఇంతలోకే సైన్యం (గైడ్స్ కేవలరీ) వచ్చింది. పరిస్థితిని ఎదుర్కొవలేనివారు సభను వదలి వెళ్ళి పోవలసినదిగా కోరాను. కాని ఎవరూ వెళ్ళిపోలేదు. ఇంతలో సైనిక కమాండర్ వచ్చి ప్రజలు చెదిరిపోవా లనీ లేకపోతే కాల్పులు సాగిస్తామనీ బెదిరించాడు. ప్రజలు బెదరలేదు. కమాండర్ తనకు సహాయపడ వలసిందిగా నన్ను కోరాడు. నేను మీటింగ్ ఐపోయిం దని ప్రకటించాను."

చారసదా ఘటనల గురించి ఇదే గ్రంథంలో ఇలా రాశాడు :

"మా ప్రబోధాల మూలాన ప్రజలు అహింసా యుతంగానే వున్నారు. సాయంత్రం పోలీసులు మమ్మల్ని ఒక పోలీసువాన్‌లో వుంచి సైనిక రక్ష ణతో మార్దాన్‌కు తీసుకుపోయారు. ప్రజలు వాన్‌ను ఆపడానికి రోడ్డుపైన పడుకొన్నారు. అవరోధం కల్పించ వద్దని చెప్పి ప్రజల్ని ఒప్పించాను. సాయంత్రానికి మార్దాన్ జైలుకు చేరాం. మరునాటిరోజున మేజి స్ట్రేట్ సరిహద్దు నేరాల చట్టం క్రింద మాకు మూడు ఏండ్లు కఠినశిక్ష విధించాడు."

## పెషావర్ విచారణ కమిటీ

పెషావరు విచారణ కమిటీ విఠల్‌భాయ్‌పటేల్ నాయకత్వాన ఏర్పడింది. అక్కడ జరిగిన సంఘటనల గురించి విచారించడానికి ఈ కమిటీ ఏర్పడింది. ఐతే ప్రభుత్వం ఈ కమిటీని సరిహద్దు రాష్ట్రంలోకి రానీయ లేదు. అందుచే రావల్పిండిలో ఒక వారంపాటు ఈ కమిటీ పనిచేసింది. 79 మంది సాక్ష్యం ఇచ్చారు. వారి వాఙ్మూలాలను ప్రకటనలను ఈ కమిటీ రికార్డుచేసింది. ప్రభుత్వం అపుడపుడు ప్రకటించిన ప్రకటనల్ని, పత్రికావార్తల్ని, సులేమాన్‌కమిటీ ప్రోగుచేసిన సాక్ష్యాల సంక్షిప్తపాఠాన్ని కలిపి, నివేదికను తయారు చేసింది. ప్రభుత్వం, ఇకముందు ఇలాంటి సంఘట నల్ని ఎదుర్కొనేందుకుగాను, ఒక విచారణ కమి టీని నియమించింది. అదే సులేమాన్ కమిటీ. ఇద్దరు జడ్జీలు ఆ కమిటీలో ఉన్నారు. వారు, షామహమ్మద్ సులేమాన్, హెచ్. ఆర్. పాన్ క్రిడ్జి.

ఈ నివేదిక 350 పేజీల దాకా వుంది. దీనిని ప్రభుత్వం నిషేధించింది. ఐనా అంతకుముందే అది విస్తృతంగా పంచిపెట్టబడింది. విఠల్‌భాయ్ పటేల్ కమిటీ నివేదిక సారాంశం యిది.—

"1930 ఏప్రిల్‌లో స్థానిక కాంగ్రెస్‌కమిటీ, సారా కాంట్రాక్టర్ల దుకాణాలముందు పికెట్ చేయ నిశ్చ యించింది. కాంట్రాక్టర్లు, ఉన్న సరుకు అమ్ముకునేం దుకు 15 రోజులు వ్యవధి అడిగారు. దానికి ఒప్పు కొని ఏప్రిల్ 23వ తేదీనుండి, పికెటింగు జరుగు తుందని, కాంగ్రెస్ కమిటీ తెలియచేసింది.

"ఏప్రిల్ 22వ తేదీన వాయవ్య సరిహద్దు నిబంధ నలు పనిచేసే తీరును, విచారించడానికి వెళుతున్న అఖిలభారత కాంగ్రెస్ కమిటీ ప్రతినిధివర్గం, పెషా వరు వెళ్ళుతుండగా వారిని ప్రభుత్వం ఆపివేసింది. ఈ వార్త విని ప్రజలు పెద్ద ఊరేగింపు జరిపి, షాహి మార్కెట్‌వద్ద, పెద్ద సభ జరిపారు. పెషావరు నగర వాసులు 23 ఉదయం నుండి, సారాదుకాణాల వద్ద పికె టింగ్ జరపాలని కూడా నిర్ణయించారు. 23 తెల్లవారు ఝామున తొమ్మిదిమంది ప్రముఖ కాంగ్రెస్ నాయ కులను ప్రభుత్వం అరెస్టుచేసింది. ఉదయం కాంగ్రెస్ కమిటీ ఆఫీసులో జరిగిన సమావేశంలో ఈ అరెస్టుల

వార్త తెలిసింది. మరో ఇద్దరిపై వారంట్లు ఉన్నట్లు కూడా తెలిసింది. సారాదుకాణాల ముందు పికెటింగుకు ఏర్పాట్లు కూడా జరిగాయి. పట్టణం అంతా హర్తాళ్ జరిగింది. పికెటింగు జరిపే వలంటీర్లను, పంపే టప్పుడు ప్రజలు తండోపతండాలుగా చేరి వీడ్కోలు చెప్పసాగారు. ఒక పోలీస్ ఇనస్పెక్టర్ వచ్చి ఇద్దరు నాయకులను అరెస్టుచేసి లారీలో తీసుకు వెళ్లుతూ వుండగా, లారీ టైరు బద్దలయ్యింది. మరో లారీ కోసం సబ్ ఇనస్పెక్టర్ ప్రయత్నించుతుండగా కాంగ్రెస్ నాయకులు, తమంతతామే పోలీసుస్టేషనులో హాజరౌతామని చెప్పారు, అందుకు ఇన్‌స్పెక్టర్ అంగీకరించాడు.

నాయకులతో ఊరేగింపు, కాబూల్ గేట్ ఠానాకు చేరింది. ఠానాగేట్లు మూసి ఉన్నాయి. అరగంట సేపు ప్రజలు, వేచి ఉన్నారు. గే తెరపించే. ప్రయత్నం విఫలమైంది. అక్కడికి, అసి ంటు పోలీసు సూపరింటెండెంటుగుర్రంఎక్కి చే గానే ప్రజలు, జాతీయ నినాదాలు చేశారు. అతగాడికి కోపం వచ్చి వెళ్ళి పోయాడు. తర్వాత సబినస్పెక్టర్ వచ్చి నాయకుల్ని పోలీస్ స్టేషనులో పెట్టి, ప్రజల్ని శాంతి యుతంగా వెళ్ళిపొమ్మని కోరాడు. ప్రజలు, "ఇంక్విలాబ్,జిందాబాద్" "మహాత్మాగాంధీకి జై" అంటూ నినాదాలిచ్చు కుంటూ, వెళ్ళిపోసాగారు.

"ఇంతలో హఠాత్తుగా మూడు సాయుధ శకటాలు అతి వేగంగా వెనుక నుండి వచ్చి ప్రజలమధ్య నుంచి దూసుకు పోయాయి. అనేకమంది ఆ కార్ల క్రింద పడి చనిపోయారు.మరి కొందరికి గాయాలు తగిలాయి. ప్రజల వద్ద ఎలాంటి ఆయుధాలుగానీ, కర్రలు గానీ, రాళ్లుగానీ లేవు. ప్రజలెంతో నిగ్రహం పాటించారు. కొందరు కారుముందు నిలబడి,ఆపవలసిందిగా కోరారు. కారు వెనక్కి రివర్సులో పోతుండగా, మోటారు సైకిల్ పైనుండి వస్తున్న ఒక ఇంగ్లీషు వాణ్ణి ఢీ కొంది. అతని పైగా కారు వెళ్లింది. ఇంతలో ఒక కారుకు యాదృచ్ఛికంగా, నిప్పంటుకొంది. డిప్యూటీ కమిషనర్ తన సాయుధ శకటం నుండి బయటకు వచ్చి, పోలీసు ఠానాకువెళ్లాడు.అక్కడఖ్షమెట్లపై స్పృహతప్పి పడిపోయాడు.తరువాత ఒకనిమిషం తేరుకొని,సాయుధ శకటంలోని పోలీసుల్ని కాల్పులు సాగించవలసిందిగా ఉత్తరువులిచ్చాడు. ఈ కాల్పుల్లో అనేకమంది చని పోయారు. కొందరికి గాయాలు తగిలాయి. ప్రజల్ని వెనక్కి తరిమారు. 11½ గంటల ప్రాంతంలో ఒక రిద్దరు అటు ప్రజల్ని ఇటు అధికార్లను వెళ్లిపోవలసిందనీ, సైన్యాల్ని,సాయుధ శకటాల్ని వెనక్కి తీసుకు వెళ్ళవలసిందిగా అధికారుల్ని అభ్యర్థించారు. చనిపోయిన వారినీ, గాయపడ్డ వారినీ. తీసుకు వెళ్లనిస్తే సాయుధ శకటాల్ని సైనికుల్ని తొలగించితే తాము, వెనక్కి పోతామని ప్రజలు చెప్పారు.

అందుకు అధికారులు ఒప్పుకోలేదు. ప్రజలు గుండ్ల దెబ్బలు తినడానికి, ప్రాణాలు కోల్పోవడానికి సిద్ధమయ్యారు.

"రెండో వరస కాల్పులు కిస్సాఖానీ బజారునేలో గాక పక్కనున్న సందుల్లో కూడా, మూడు గంటల పాటు జరిగాయి. ఎందరో చనిపోయారు. మరెందరో గాయపడ్డారు. ఒక అంచనా ప్రకారం, చనిపోయిన వారు 200 నుండి 300 దాకా ఉన్నారు. ఇంకా ఎక్కువ సంఖ్యలో గాయపడ్డారు. ఆర్గురు ఖిలాఫత్ వాలంటీర్లు కూడా చనిపోయారు.

"అనేక శవాలను ఒక లారీలో తీసుకుపోయి కనబడకుండా చేసినట్లు చెబుతున్నారు. ఖిలాఫత్ వలంటీర్లు, తదితరులు పక్క సందు గొందులలోంచి 60 శవాలను ఖిలాఫత్ ఆఫీసుకు తీసుకుపోయారు. గాయపడిన వారిని, డాక్టర్ ఖాన్ సాహెబ్ కట్లుగట్టి లేడీరింగు హాస్పటల్‌కు పంపాడు. ప్రభుత్వం వారికి ప్రాథమిక చికిత్స చేయకుండా, ఉండేటట్లు చూసింది. సాయంత్రం 6 గంటలకు కాంగ్రెస్ ఆఫీసుపై దాడిచేసి కాంగ్రెస్ జెండాను, బాడ్జీలను తీసుకువెళ్ళింది. రాత్రి రెండు శవాలను, అక్కడినుంచి తొలగించింది,

"తర్వాత రెండు మూడు రోజులలో పెషావర్‌ను బ్రిటిష్ సైనికులు, నరకంగా మార్చారు. హఠాత్తుగా సైన్యాన్నేగాక పట్టణాన్ని కాపలా కాచే పోలీసుల్ని కూడా 26వతేదీ రాత్రి తొలగించింది. పట్టణం సరిహ దోపిడీ ముఠాలకు, దోపిడీగాండ్రకు గురి అయే ప్రమాదం ఏర్పడింది. ఐతే ఖిలాఫత్ వాలంటీ . పెషావరు పట్టణ గేట్లవద్ద, కాపలా కాచి, ఎలాం అవాంఛనీయ సంఘటనలు జరగకుండా చూడగల్గారు.

"ఏప్రిల్ 28న పోలీసులు తిరిగివచ్చారు. వలంటీర్ల స్థానంలో వారు కాపలా కాయడం మొదలుపెట్టారు. మే 4 వ తేదీన సైనికులు తిరిగి పట్టణాన్ని ఆక్ర

మించారు. కాంగ్రెస్ యువజన సంఘాలపై దాడి చేశారు. వస్త్రాలను,డబ్బును స్వాధీనపరుచుకున్నారు. వలంటీర్లను చితకబాదారు. కాంగ్రెస్ ఆఫీసు సమీపంలోని దుకాణాన్నిదోచుకున్నారు. మార్షల్‌లాప్రకటించబడింది. పెషావరులో నివసించే ఏ ఒక్కరి జీవితానికి ఆ సికీరక్షణలేదు. మే 31న సులేమాన్ కమిటీ, పెషావరులో విచారణ చేస్తున్న సమయంలోనే, ప్రజలపై కాల్పులు సాగించారు. బ్రిటిష్ సైనికుడు పొరపాటున కాల్చాడంటూ చెప్పిన ఘటనలో ఇద్దరు పిల్లలు చనిపోయారు. ఆ శవాలను పాతిపెట్టేందుకు శ్మశానానికి తీసుకువెళ్ళుతున్న సమయంలో కాల్పులు జరిగాయి. దానిఫలితంగా కనీసం పదిమంది చనిపోయారు. ఇరవై ఇద్దరు గాయపడ్డారు. బయటి ప్రపంచంవారు ఎవరూ ఇక్కడకు రాకుండా, దానిని నిషిద్ధ ప్రదేశంగా మార్చింది ప్రభుత్వం. బయటి ప్రపంచానికి ఈ విషయాలు పొక్కకుండా ఉండేందుకుగాను, ప్రజానాయకుడెవ్వరినీ ఇక్కడకు రానీయలేదు. ఇక్కడ విషయాలను స్వయంగా విచారించి, పరిపాలకుల దుష్కృత్యాలను బట్టబయలు చేస్తారనే భయంతో పెషావర్‌ను బయటి ప్రపంచంతో సంబంధాలు లేకుండా విడగొట్టింది. ప్రభుత్వం పెషావరు జిల్లాలోనూ, ఇతర జిల్లాల్లోనూ, అనేక ఘోరకృత్యాలు జరిపింది. ఈ జిల్లాలోని కాంగ్రెస్ సంఘాలు నిషేధింపబడ్డాయి. ఇంత జరిగినా ప్రజలు మొక్కవోని ధైర్యంతో నిలబడ్డారు. అహింసాసిద్ధాంతాన్నే ఖచ్చితంగా పాటించారు."

పిల్లల్ని చంపడం పొరపాటా? లేక ఆ దురదృష్టవంతుల పాలిట గ్రహపాటా? ఇదేదీ కాదు. బ్రిటిష్ సైనికుల మిడిసిపాటు; అసలు జరిగిందేమిటి?

గంగాసింగ్ కాంభోజ అనే అతను, పెషావరు మిలటరీ డెరీలో పని చేస్తున్నాడు. పిల్లలతో సహా కాబూలీ గేటుగుండా పోతున్నాడు. బ్రిటిష్ సైనికుడు వారిపై నిర్హేతుకంగా తుపాకీ పేల్చాడు. 9 నెలల 16 నెలల బిడ్డలు చనిపోయారు. ఆయన భార్యకు తీవ్రంగా గాయాలు తగిలాయి. ఆమె రొమ్ము పూర్తిగా ఎగిరిపోయింది. డిప్యూటీ కమీషనర్ అనుజ్ఞతో, శ్మశానానికి ఉత్సవంగా, ఆ బిడ్డల్ని తీసుకొని వెళుతున్న వారిపై, సైనికులు రెండుగజాల దూరంనుండి కాల్పులు సాగించారు. శవ వాహకులు పడిపోతే మరికొందరు వారి స్థానంలోనికొచ్చారు. వారికి దెబ్బతగిలితే మరొక జట్టు వచ్చేది. ప్రభుత్వం 17 సార్లు తుపాకీపేల్చింది.

పెషావరు సంఘటనల సందర్భంగా గార్వాల్ రైఫుల్ దళం ప్రజలపై కాల్పులు జరపడానికి నిరాకరించిన విషయం ఇదివరకే తెలియచేశాము. వీరిని కోర్టు మార్షల్ చేసి, విచారించినప్పుడు, ఆ సైనికులిలా అన్నారు——

"నిరాయుధులైన మా సోదరులపై మేము తుపాకులు కాల్చబోము. భారతదేశ సైన్యం, బయటి నుండి వచ్చే భారతదేశ శత్రువులపై యుద్ధం చేయడానికి ఏర్పడింది. మీరు ఫిరంగులతో మమ్ములను పేల్చివేసుకోవచ్చు."

గార్వాలీ రైఫుల్స్ దళంలోని 17 మందిని కోర్టు మార్షల్ చేసి విచారించారు. ఒకరికి యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్ష విధించారు. మరొకరికి 15 ఏళ్ళు కఠిన శిక్ష విధించబడింది. మరో 15మందికి మూడేళ్ళ నుండి 10 ఏళ్ళవరకూ, కఠిన శిక్ష విధించబడింది. నిజానికి ఈ గార్వాలీ సైనికులు ప్రదర్శించింది అహింసయే. కాని గాంధీకి ఇది నచ్చలేదు. "కాల్పులు జరపకుండా ఒక సైనికుడు ఉత్తరువును ఉల్లంఘించడం అంటే అతడు తాను చేసిన ప్రమాణాన్ని ఉల్లంఘించినట్లే. దీనివల్ల అతను ప్రభుత్వ ధిక్కారనేరానికి పాల్పడినవాడవుతాడు" అని ఒక ఫ్రెంచి పత్రికకు 1932 ఫి ్రి 20న ఇచ్చిన ఇంటర్వ్యూలో గాంధీచెప్పాడు. వి వవాదులు చేసిన చిన్న, చిన్నఘటనల్ని కూడా వ ంచిన "కాంగ్రెస్ చరిత్ర" గ్రంథకర్త డాక్టర్ పట్టాభి తన గ్రంథంలో, గార్వాలీ సైనికుల వీరోచిత కృత్యాలను గురించి నామ మాత్రంగా ప్రస్తావించాడు. అయితే ఠాగూర్ చంద్రసింగ్ ఈ సంఘటనలగురించి "పీపుల్స్‌వార్" అనే వారపత్రికలో 1945 మే లో ఒక వ్యాసం రాశాడు. యు. పి. రాష్ట్ర ప్రభుత్వం కాంగ్రెస్ మంత్రివర్గం అయినా ఆ పత్రికను నిషేధించింది.

గాంధీ, ఇర్విన్ ఒడంబడిక జరిగినప్పుడు రాజకీయ ఖైదీల విడుదలకు సంబంధించిన అంశంలో ఈ గార్వాలీ సైనికుల విడుదల ప్రస్తావనలేదు. 1937లో రాష్ట్రాలలో కాంగ్రెస్ మంత్రివర్గాలు ఏర్పడిన తర్వాతనే వారి పలుకుబడితో గార్వాలీ సైనికుల విడుదల సాధ్యమైంది.

## ఖుదై ఖిద్మత్‌గార్ల వీరోచిత కృత్యాలు

ఖుదై ఖిద్మత్‌గార్లపై (రెడ్ షర్టులపై) భగవత్సేవకులపై జరిగిన పాశవిక దమనకాండను వర్ణించడం అసాధ్యం. ఫైజ్ మహమ్మద్ అనే రెడ్‌షర్టు వలంటీరును, దుస్తుల్ని "ఊడదీయవలసినదిగా, పోలీసు అధికారి ఆజ్ఞాపించాడు. అతడు నిరాకరించాడు. ఎనిమిది తొమ్మిదిమంది సైనికులు బలవంతంగా అతని దుస్తులు ఊడదీయడానికి ప్రయత్నించారు. ఫైజ్ మహమ్మద్ దృఢకాయుడైన పఠాన్ యువకుడు. వాళ్ళవల్ల సాధ్యం కాలేదు. చివరకు అతని నొసటిమీద గాయపరచి, స్పృహ తప్పిపోయేవరకు కొట్టారు. అక్కడున్న బ్రిటిష్ సైనికుడు ప్రతివాడూ, తలా ఒక తన్ను తన్నారు. అలాగే ప్రతి రెడ్ షర్టునూ చితకబాది, బట్టలూడదీశారు. ఒక మేడ బాల్కనీ నుండి అబ్దుల్ రజాక్‌నూ, మరి కొందరు రెడ్ షర్టులనూ కింద పక్కా కంకరరోడ్డు మీదికి విసరివేశారు. అబ్దుల్ రజాక్ పాదం విరిగిపోయింది. ఇతర్లకు బాగా దెబ్బలు తగిలాయి. కొందరిని బాయొనెట్లతో పొడిచారు. సైనికులు రెడ్ షర్టు వలంటీర్ల కెప్టెన్ మహమ్మద్ నక్విబ్‌ఖాన్‌ను నిర్దాక్షిణ్యంగా బాదారు. అతని చొక్కాను బలవంతముగా ఊడబెరికారు. అతని లాగును కూడా ఊడదీయడానికి ప్రయత్నించగా, అతను యింటికి పరుగెత్తాడు. ఇంట్లో వున్న తన రివాల్వరుతో ప్రతిఘటించాలని అతని ప్రయత్నం. ఇంతలో కమాండర్ జోక్యం చేసుకుని "నీ ఓర్పు ఇంత త్వరగా నశించిందా? హింసతో తిరుగు దెబ్బ తీయాలనుకుంటున్నావా? చచ్చేవరకూ అహింసను పాటిస్తానని ప్రతిజ్ఞ చేశావు కదా?" అని అన్నాడు. దీనితో టోపీ, చొక్కాలను తీసివేసి కాళ్ళకు జోడు లేకుండా నడిచి వచ్చి అరెస్టయ్యాడు.

అబ్దుల్‌గఫార్‌ఖాన్ రెండవ కొడుకుపేరు వలీఖాన్. 14ఏళ్ళుంటాయి. యానిసారంతో ఈగందరగోళంజరిగే సమయంలో అక్కడ నిలబడి వున్నాడు. డిప్యూటీ కమీషనర్ ఆ కుర్రవాణ్ణి "ఎవరు నీవు?" అని ప్రశ్నించాడు. ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ కొడుకునని, అతడు సగర్వంగా చెప్పుకున్నాడు. డిప్యూటీ కమిషనర్ అతణ్ని తిట్టడం మొదలెట్టాడు. ఒక బ్రిటిష్ సైనికుడు బాయొనెట్‌ను గురిపెట్టాడు. ఇంతలో ఒక ముస్లిమ్ సైనికుడు జోక్యం కలుగచేసుకునేందుకు చేయి అడ్డం పెట్టాడు. ఇంతలో మరో బ్రిటిష్ సైనికుడు ముందుకు వచ్చాడు. ఇంతలో హస్సన్‌ఖాన్ అనే ఆయన వలీఖాన్‌ను తన చేతుల్లోకి తీసుకొని దగ్గరున్న మసీదులోకి దూకాడు. ఆ విధంగా ఆ కుర్రవాణి రక్షించారు. సైనికులు ఖుదై ఖిద్మత్‌గార్ల ఆఫీసు నిప్పుపెట్టి గ్రామాన్ని సర్వనాశనం చేశారు. ఎర్రచొక్కాలు ధరించిన వారినందరినీ అరెస్టు చేసి, నిర్దాక్షిణ్యంగా చితకబాదారు. "ఎవరైనా రెడ్‌షర్టులు ఇంకా మిగిలి ఉన్నారా?" అని డిప్యూటీ కమిషనర్ హుంకరించాడు. భయంతో ఎవరూ మాటాడలేదు. కానీ అంతటితోనే పఠాన్ల సాహసగాథ ముగియలేదు. అబ్దుల్ గఫార్‌ఖాన్ తన ఆత్మకథలో చెప్పిన సాహసచర్యను యిక్కడ ఉటంకించుతున్నాం.

"ఇంకెవరైనా ఎర్రచొక్కాల వారున్నారా?" అని దురభిమానంతో గర్జిస్తూ, డిప్యూటీ కమిషనర్ వీరవిహారం చేస్తూ వచ్చాడు. ప్రజలు భయభ్రాంతులై ఒక్క మాటైనా మాట్లాడలేదు. ఇంతలో, మహమ్మద్ అబ్బాస్ ఖాన్ అనే అతడు, (ఉత్మంజాయి నివాసి) ఈ మాటల్ని విన్నాడు. వెంటనే యింటికి పరుగెత్తి వెళ్ళి ఒక తొట్టిలో ఎర్రరంగు నీళ్ళు కలిపి తన చొక్కా మాత్రమే తన నౌకరు చొక్కాలను, రంగుతో తడిపి శాడు. నీరు కారుతున్న చొక్కాలను తొడుగుకొని, డిప్యూటీ కమిషనర్ వద్దకు వెళ్ళి "ఉన్నాం ఎర్రచొక్కాలవారం మరి కొందరం ఉన్నాం" అని నినాదాలు చేశారు.

"మహమ్మద్ అబ్బాస్‌ఖాన్, ఖుదాయీ ఖిద్మత్‌గార్లలో అధికార పూర్వక సభ్యుడు కాదు. పైగా మేమంటే గిట్టేదికాదు. కాని ఆ సమయాన అతని దేశభక్తి పెల్లుబికి వచ్చి అట్టి సాహస కార్యం చేయించింది".

### వేలిముద్రల ప్రహసనం

బ్రిటిష్ వాళ్ళు తమ సైన్యాలతో, ఉతాంజాయ్ గ్రామాన్ని చుట్టుముట్టి గ్రామస్థులను బలవంతంగా ఊరి బయటకు తీసుకువచ్చారు. వాళ్ళందరినీ ఎండలో కూర్చోబెట్టి "మేము ఖుదై ఖిద్మత్‌గార్లమే" అని బొటనవేలి ముద్రలు వేయమన్నారు. ఐతే వారిలో చాలామంది ఖుదై ఖిద్మత్‌గార్లు కాదు. ఐనా అలా

ఒప్పుకోవలసిందిగా నిర్బంధించారు. వారు ఒప్పుకో లేదు. ఎవడైనా ఒకడు, అలా వేలిముద్ర వేయడానికి అంగీకరించాడా, అతన్ని అసహ్యభావంతో చూసే వారు. ఒకతను వేలి ముద్రవేసి యింటికి వెళ్ళాడు. భార్య, బిడ్డల్ని ఉతుకుతూంది. పెద్ద బండ పుచ్చుకుని బిడ్డల్ని మోదుతోంది. భర్తను చూసి, "ఇంత పెంద రాళే, ఎలా రాగల్గావు, విషయం ఏమిటి?" అంటూ కోరచూపులు చూసింది. భర్త తడబడ్డాడు. తానేమీ ఎరగనన్నాడు. "వెధవా! నీవు అబద్ధం ఆడుతున్నావు. నీవు ద్రోహం చేసి వేలి ముద్ర వేసి ఉంటావు. ఏదీ వేలు చూపించు" అంది. భర్త పరుగెత్తనారంభించాడు. భార్య బండ పుచ్చుకొని వెంటబడింది. ఇదీ ఆనాటి పఠాన్ భూమిలో రాజకీయ వాతావరణం.

వాయువ్య రాష్ట్రంలోని సంఘటనల గురించి పూర్తి వివరాలు రాకముందు, గాంధీ 1930 మే 1 న ఒక ప్రకటన చేస్తూ పెషావరు ప్రజలు, అవహనం చూపుతున్నారని, సాయుధ శకటాలను తగులబెట్టడం గానీ, అధికారుల ప్రాణాలను తీయడంగానీ, పనికి రాదనీ, ప్రజలు బాధలు సహించడంలోనే వారి మార్గం వున్నదనీ రాశాడు.

ఐతే విఠల్‌భాయ్ పటేల్ తన రిపోర్టులో, ప్రభుత్వ రిపోర్టు అంతా పచ్చి అబద్ధమని నిరూపించాడు.

ఇక ప్రభుత్వ నిర్బంధకాండ అత్యంత తీవ్రంగా కొనసాగింది. మే 25 న మ న్ జిల్లాలోని టక్కర్ గ్రామంలో ఖుదై ఖిద్మత్‌గార్ల కాల్పులు జరిగాయి. అనేకమంది చనిపోయారు. ఖిద్మత్‌గార్ల కార్యాలయం తగులబెట్టబడింది. అనేక యిండ్లను భస్మీ పటలం చేశారు; సైనికులు స్థానిక నాయకులను అరె చేసి నందుకు నిరసనగా జరుగుతున్న సభపై ట క్కర్‌లో పోలీసులు కాల్పులు సాగించారు. ఇక్కడ జరిగిన ఘర్షణలో ఒక ఇంగ్లీషు ఉద్యోగి చనిపోయాడని చెప్పబడింది. మూడు రోజుల తర్వాత పోలీసులు సైనికులు టక్కర్‌ను చుట్టుముట్టారు. తర్వాత జరిగిన ఘర్షణలో అనేకమంది గ్రామీణులు ప్రాణాలు కోల్పోయారు.

డేరా యిస్మాయిల్‌ఖాన్ జిల్లాలో అనేక ప్రాంతాలలో స్త్రీలు, పిల్లలతోసహా ఊరేగింపులు సాగించుతూ ఉండే వారు. మే 30 న అలాంటి ఊరేగింపు జరిగింది. ఇస్మాంగర్ అనే పోలీసు ఇనస్పెక్టర్ జనరల్ అలాంటి మీటింగును చెదిరిపొమ్మని ఆజ్ఞాపించాడు. స్త్రీలు అందుకు నిరాకరించారు. ఇస్మాంగర్ తన రివాల్వరును స్త్రీల పైకి గురిపెట్టాడు. భగవాన్‌సింగ్ అనే ఒక సిఖ్ఖు యువకుడు ముందుకు దూకి, ఇస్మాంగర్ చేతిని పట్టుకొని "స్త్రీలను కాల్చడానికి నీకు సిగ్గు వేయడంలేదా?" అని ప్రశ్నించాడు. ఇనస్పెక్టర్ జనరల్ చేయివణికి, రివాల్వరు పడిపోయింది. బంగాళా వైపు పరుగెత్తి పోయాడు. ఇనస్పెక్టర్ జనరల్ భగవాన్‌సింగ్‌పై హత్యానేరంమోపి జైలులో పెట్టారు. అనేక జైళ్ళకు త్రిప్పారు. చాలాకాలం తరువాత నేరం రుజువుకాక వదలివేశారు.

బన్నూజిల్లాలోని హాథీఖేల్ అనేచోట జరిగిన ఘటనలను గూర్చి ప్రభుత్వ నివేదికలో చెప్పిన విషయాలనే చూసినా, ప్రభుత్వ పైశాచిక కృత్యాల నగ్న స్వరూపం బయటపడుతుంది.

ఆగస్టు 24 న స్పినాతంగి అనేచోట సభను భగ్నం చేయడానికి సరిహద్దు పోలీసు దళం, పోలీసులు వెళ్లారు. ఆ సభలో కొందరివద్ద ఆయుధాలున్నాయట. ఒక బ్రిటిష్ ఆఫీసర్ ఆ సభవైపుకు బయలుదేరడంతో హోరాహోరీ పోరాటం సాగింది. కెప్టెన్ ఆష్క్రాఫ్ట్, మరో ఎనిమిది మంది సైనికులు చనిపోయారు. ఫజల్-ఇ-కాదిర్ అనే ముల్లా అనుయాయులు 40 మంది చనిపోయారు. అనేకులు గాయపడ్డారు. 70 మందిని అరెస్టు చేశారు. ముల్లా గాయాల మూలంగా ఆ తర్వాత చనిపోయాడు. "1930-31 భారతదేశం" అనే అధికార ప్రచురణలో ఈ క్రింది విషయాలను ప్రభుత్వం అంగీకరించింది.

"1930 ఆగస్టులో విధించబడిన మార్షల్‌లా మరుసటి సంవత్సరం జనవరి వరకూ అమలులో వుంది. సరిహద్దు పొడవునా అన్నిజిల్లాలలో అశాంతి చిహ్నాలు కనిపించాయి. మే నుండి సెప్టెంబరు వరకూ రాయల్ విమాన దళాల సహాయంతో చిట్టచివరకు ప్రశాంతత నెలకొల్పబడింది. ఉద్యమం ఉన్న ఊళ్ళను, పట్టణాలను, చీకటిపడ్డాక చుట్టుముట్టేవారు. సైనికులను విరివిగా ఉపయోగించారు.

సరిహద్దు తెగలవారు ప్రభుత్వాని కిచ్చిన అల్టిమేటంలో "బాద్‌షాఖాన్(అబ్దుల్ గఫార్‌ఖాన్)ను వదలి పెట్టండి. ఫులాంగ్‌బాబా (దిగంబర ఫకీరును అంటే గాంధీని)ను వదలిపెట్టండి. ఖుదై ఖిద్మత్‌గార్లను వదలి

వేయండి. ఫఖ్తూన్లపై నిర్బంధకాండను, దౌర్జన్య చర్యలను విరమించండి. అలా చేయకపోతే మీపై యుద్ధంచేస్తాం."

"ఇంక్విలాబ్" కూడా ఒక వ్యక్తి అనుకొని ఆయన్ని కూడా విడుదల చేయాలని కొందరు కోరారు. తరచు వారిచ్చే నినాదం "ఇంక్విలాబ్ జిందాబాద్" "మహాత్మా గాంధీకి జై" అని.

1930 సంవత్సరాంతానికి వాయువ్య రాష్ట్రంలో సాయుధ పోరాటం సాగింది. సరిహద్దు జాతులవారైన మోమందులు, అఫ్రిదీలు కూడా గెరిల్లా యుద్ధాలు సాగించారు.

జాతీయోద్యమ కాలంలో కేవలం సత్యాగ్రహ ఉద్యమాలేగాక, విప్లవ వాదుల వీరోచిత సాహస కృత్యాలు బ్రిటిష్ ప్రభుత్వంపై కార్మిక, కర్షకుల ఉద్యమాలు కొన్ని జరిగాయి. అట్టివారిలో చిటగాంగ్ ఆయుధ కర్మాగారంపై దాడి ఒకటి. చిటగాంగ్ విప్లవ వాదుల వీర కృత్యాలను వర్ణించేముందు షోలాపూరు ప్రజల తిరుగుబాటు గురించి కొంత చెప్పాలి.

షోలాపూరు బొంబాయి రాజధానిలోని పారిశ్రామిక నగరం జనభా 1,40,000 లు. ఇందులో 50 వేల మంది టెక్స్టైల్ కార్మికులు పట్టణాన్ని ఒక వారం రోజుల పాటు స్వాధీనం చేసుకున్నారు. పోలీసులస్థానే తామే పరిపాలన సాగించారు. మే 12 న మార్షల్‌లా విధించ బడింది. ఈ ఉద్యమం ఇలా ఇంత ఉధృత స్థాయికి ఎలా చేరింది?

ఇక్కడ మేలో శాసనోల్లంఘన ఉద్యమం ప్రారంభమైంది. స్థానిక కాంగ్రెస్ కమిటీ, ఒక యుద్ధ సమితిని నెలకొల్పింది. పట్టణంలో జాతీయ పతాకను ఎగురవేశారు. పట్టణాన్ని స్వాధీనపరచుకున్నారు. ప్రభుత్వానికి విధేయులుగా వున్న పౌర అధికారులు భయపడి రైలు స్టేషనులో తలదాచుకొన్నారు. ప్రభుత్వం షోలాపూర్‌కు సంబంధించిన వార్తల గురించి బయటకు పొక్కకుండా చేసింది. 2 వేలమంది బ్రిటిష్ సైనికులను తిరుగుబాటును అణచడానికి పంపింది. తిరగబడిన విప్లవకారులను అనేకమందిని ప్రభుత్వం ఉరితీసింది. మరికొందరిని జైళ్ళపాలు చేసింది. అసలు ఈ పోరాటం ఇంత తీవ్రస్థాయికి పోవడానికి కారణం పోలీసులు రెచ్చగొట్టడమే. మే 5 వ తేదీన పోలీసులు రెచ్చగొట్టిన తరువాత ప్రజలు బారికేడ్లను (అడ్డు గోడల్ని) నిర్మించి పోలీసుల్ని ఎదుర్కొన్నారు. ఇదే పెద్ద తిరుగుబాటుగా పరిణమించింది. బ్రిటిష్ వాళ్ళు తలదాచుకొంటువున్న వలస పాలకుల భవనాలను, తిరుగుబాటుదార్లు తగలబెట్టారు. రైల్వే స్టేషన్‌ని చుట్టు ముట్టారు. అనేకరోజులు వీధి యుద్ధాలు సాగాయి. పట్టణం విప్లవ సమితుల స్వాధీనమైంది. తిరుగుబాటు నాయకులను మే 16 న అరెస్టు చేసిన తర్వాతగాని ఉద్యమం చల్లారలేదు.

"తన స్వంత ప్రభుత్వాన్ని ఏర్పరచడానికి చూస్తున్న గుంపుపై కాంగ్రెస్ నాయకులకు అదుపు తప్పింది." అని మే 14 న టైమ్సు పత్రిక రాసింది. "పరిపాలనను తమ చేతుల్లోకి తీసుకొని, తమ స్వంత చట్టాలను, నిబంధనలను ఏర్పరచడానికి ప్రయత్నించారు" అని 'పూనా స్టార్' అనే పత్రిక రాసింది.

## గాంధీ అరెస్టు - ఉద్యమ వ్యాప్తి

ఉప్పు సత్యాగ్రహ ఉద్యమం ప్రారంభించకముందే ప్రభుత్వం నిర్బంధ విధానాన్ని ప్రారంభించింది. సుభాష్‌చంద్రబోసుకు సంవత్సరం కఠినశిక్ష విధించ బడింది. 1930 ఏప్రిల్ 16 న జవహర్‌లాల్ నెహ్రూను అరెస్టు చేసింది ప్రభుత్వం. పోలీసు కాల్పులు, లాఠీ చార్జిలు నిత్యకృత్యాలయ్యాయి. స్త్రీలను సైతం విడిచి పెట్టలేదు. ఢిల్లీలో 1600 మంది స్త్రీలు అరెస్టయారు. ఏప్రిల్ 23 న బెంగాల్ ఆర్డినెన్సు ప్రకటించబడింది. స్వాతంత్ర్య సమరవీరుల జీవితం, ఈ ఆర్డినెన్సు క్రింద దుర్భరమైంది. 1910 ప్రెస్ యాక్టు విధించి, పత్రికలపై అనేక ఆంక్షలు విధించింది. ఖైదీలు ఆకలి దప్పులతో అలమటించారు. సంఖ్యను మించి ఖైదీలను జైళ్ళల్లో కుక్కారు.

1930 మే 5 వ తేదీన గాంధీని ప్రభుత్వం అరెస్టు చేసింది. "గాంధీ హింసాత్మక ఘటనలను పదే పదే ఖండించుతూ వచ్చినా, నిగ్రహంలేని అతని అనుచరులకు వ్యతిరేకంగా ఆయన చూపిన అసమ్మతి రాను రాను బలహీనపడింది. వాళ్ళపై నిగ్రహించే శక్తి ఆయనకు లేదని తేలిపోయింది" అంటూ ప్రభుత్వం ఈ సందర్భంగా ఒక ప్రకటన చేసింది. గాంధీ అరెస్టుకు నిరసనగా, దేశం అంతటా హర్తాళ్‌లూ, సమ్మెలూ ప్రారంభమయ్యాయి.

బొంబాయిలో గాంధీ అరెస్టుకు నిరసనగా, బ్రహ్మాండమైన సభ జరిగింది. వివిధ వేదికల నుండి

అనేకులు ఉపన్యసించారు. దాదాపు 80 మిల్లులు మూసివేశారు. 50 వేలమంది కార్మికులు మిల్లులనుండి బయటకు వచ్చారు. రైల్వే కార్మికులు కూడా హరతాళ్‌లో పాల్గొన్నారు. బట్టల వర్తకులు ఆరు రోజులు హర్తాళ్ జరిపారు. పూనాలో కూడా హర్తాళ్ జయప్రదంగా జరిగింది. దర్శన ఉప్పుకొటారుపై తాను దాడిచేయదలచానని అంతకుముందు గాంధీ నోటీసిచ్చాడు. ఇర్వాయికి రాసిన రెండవ ఉత్తరంలో ఈవిషయం వ్యక్తంచేశాడు. ఈ ఉప్పు కొటారుపై దండయాత్రను ఇర్వాయి ఆపదలచుకొంటే ఆయనికి మూడు మార్గాలున్నాయని గాంధీ అన్నాడు. 1. ఉప్పు పన్ను తొలగించడం, 2. తనను తన అనుచరులను అరెస్టుచేయటం. 3. అరెస్టయినవారి స్థానంలో కొత్తవారు వస్తూనే వుంటారు. అలా సత్యాగ్రహులు రానినాడు మాత్రమే దండయాత్ర ఆగిపోతుంది. పోలీసుల గూండాతనంవల్ల పోలీసులు తలలు పగులకొట్టినా కొత్తవాళ్ళు వస్తారు. అలా రానిపక్షంలో దండయాత్ర ఆగిపోతుంది.

గాంధీ ఈ లేఖలో ప్రభుత్వం అవలంబిస్తున్న దమనకాండను, ఆయా ప్రదేశాలలో ప్రభుత్వం జరిపిన దౌర్జన్యాలను ఉటంకించాడు.

గాంధీ, తన అరెస్టుకు పూర్వమే దండిలో ఇచ్చిన సందేశం ఆనాటి ఉద్యమ కీలక స్వభావాన్ని తెలియచేస్తుంది.

"ప్రస్తుతం భారతదేశం యొక్క ఆత్మగౌరవం–ఒక్క ఆత్మగౌరవమే కాదు, సర్వస్వమూ ఒక గుప్పెడు ఉప్పులో ఇమిడివుంది. మణికట్లు విరగకొటనీయండి. కానీ దానిని మాత్రం మనం తెరవకూడదు."

ఈ సందేశాన్ని అక్షరాలా ఎందరో స్వాతంత్ర్య సమరవీరులు పాటించారు. అంగవికలు లయ్యారు.

గాంధీ అరెస్టయాక ఆయన స్థానంలో, అబ్బాస్ తయాబ్జీ నాయకత్వం వహించాడు. బొంబాయికి చెందిన జాతీయ కాంగ్రెస్ ముస్లిం నాయకుడీయన. ఈయన అరెస్టు కాగానే సరోజినీనాయుడు నాయకత్వం వహించింది. మే 16 వ తేదీన ఆమెనూ, మరికొందరు వాలంటీర్లనూ అరెస్టుచేసి తర్వాత వదలివేశారు. ఐనా వలంటీరు దళాలు ఒకటి వెంట ఒకటి ఉరికాయి. పోలీసులు లాఠీచార్జి చేసి తరిమివేశారు. 220 మందిని అరెస్టు చేశారు. 19 వ తేదీన 400 మందిని అరెస్టు చేశారు.

కాంగ్రెస్ కార్యనిర్వాహకవర్గం గాంధీ అరెస్టు తర్వాత సమావేశమై ఉప్పుకొటారులపై దండయాత్రలు సాగించాలని తీర్మానించింది. మే 21 వ తేదీన దర్శన కొటారుపై జరిపిన ప్రజల దాడులు, వారి స్వాతంత్ర్య దీక్షను, పోరాటపటిమనూ ప్రదర్శించాయి.

అమెరికా పత్రికా రచయిత వెబ్ మిల్లర్, అతి కష్టంమీద మే 21 న దర్శన చేరుకున్నాడు. ఆయన ఉప్పు సత్యాగ్రహుల దాడులను ఇలా వర్ణించాడు—

"శ్రీమతి సరోజినీనాయుడు ప్రార్థనల అనంతరం వలంటీర్లను ఉద్దేశించి ఇలా ఉపన్యసించింది.

"భారతదేశ ప్రతిష్ట మన చేతుల్లో వుంది. మిమ్మల్ని కొడతారు, ఐనా మీరు ప్రతిఘటించరాదు. దెబ్బల్ని తప్పించుకోడానికి అడ్డంపెట్టేందుకైనా చేతుల్ని పైకి లేపవద్దు" ఆమె ఉపన్యాసం ముగించేసరికి దీర్ఘ హర్షధ్వానాలు మిన్నుముట్టాయి.

"నెమ్మదిగా, మౌనంగా అరమైలు పొడవున దండయాత్ర సాగింది. ఉప్పుకొటారు చుట్టూ నీటి గుంటలున్నాయి. వాటిచుట్టూ 400 మంది, సూరత్ పోలీసులు కాపలా కాస్తున్నారు. అరడజనుమంది బ్రిటిష్ అధికారులు వారిపై అధికారం చెలాయిస్తున్నారు. పోలీసుల చేతుల్లో లాఠీలున్నాయి. ఐదడుగుల లావుపాటి కర్ర చివర ఉక్కు కడియం బిగించి వుంది. ముళ్ళకంచె ఆవరణలో 25 మంది రైఫిళ్ళతో సిద్ధంగా ఉన్నారు.

"ఐదుగురుకంటే ఎక్కువ ఒకచోట గుమికూడరాదనే నిషేధపు ఉత్తరువులను అనుసరించి, పోలీసు అధికారులు సత్యాగ్రహులను చెదరిపొమ్మన్నారు. కానీ వారు ఖాతరుచేయకుండా ముందుకు వెళ్ళారు. స్థానిక పోలీసులు ఉక్కు పన్నుగల లాఠీలతో ముందుకువస్తున్న సత్యాగ్రహుల పైకి ఉరికి, వారి తలలపై బాదారు. ఒక్కరు కూడా తలకు చెయ్యి అడ్డంపెట్టుకోలేదు. ఎట్టి రక్షణా లేని సత్యాగ్రహుల తలలను బద్దలుకొడుతున్న జుగుప్సాకరమైన ఆ లాఠీ దెబ్బల మోతలను నేను విన్నాను. ఆ దృశ్యాల్ని చూస్తూ తమ వంతుకోసం ఎదురుచూస్తున్న సత్యాగ్రహ దళాలు, పోలీసులు కొట్టే ప్రతి దెబ్బకు హాహా రావాలు చేశారు. వారికి సానుభూతిగా నిట్టూర్పులు విడిచారు.

"రెండు, మూడు నిమిషాలలో ఆ ప్రాంతమంతా పడిపోయిన వలంటీర్ల దేహాలతో నిండిపోయింది. వారి తెల్లచొక్కాలపై రక్తంతో, పెద్ద పెద్ద ఎర్రమాసికలు ఏర్పడ్డాయి. మొదటి దళంలో ప్రతిఒక్కరూ పడిపోయిన తర్వాత, వారిని స్ట్రెచర్లపైన మోసుకుపోయేవారు. పోలీసులు వీరినిమాత్రం ఏమనేవారు కాదు."

"ఇలాగే రెండవ దళం కూడా. పోలీసులు ముందుకురికి, పద్ధతిప్రకారం యాంత్రికంగా రెండవ దళాన్ని కూడా బాదారు. గాయాలు తగిలిన 18 మందిని మోసుకెళ్ళడం చూశాను. ఇంకా 42 మంది నెత్తురు కారుకుంటూ నేలమీద పడివున్నారు."

"తర్వాత ఈ సత్యాగ్రహం చూస్తున్న వారిని కూడా పోలీసులు చావబాదారు. వారిని వెళ్ళిపొమ్మంటే వారు నిరాకరించారు."

"ప్రతిఘటించని ఆ ప్రజల్ని రక్తపు ముద్దలా పిప్పి పిప్పి చేసి ఒక పద్ధతి ప్రకారం బాదుతుంటే, నేను చూడలేక ముఖం తిప్పుకోవలసి వచ్చింది. నాలో వర్ణించలేని నిస్సహాయత, ఆగ్రహం, ఏహ్యాభావం నిండిపోయింది."

"ఉద్రిక్తులైన ప్రజల్ని నాయకులు అనేకసా వారించారు. పోలీసులపై పడడానికి ప్రజలు సంసిమయ్యారు. బ్రిటిష్ పోలీసు సూపరెంటు తన రైపి సైనికులను ఒక కొండగుట్టమీదికి తీసుకువెళ్ళి కాల్చడానికి సంసిద్ధంగా ఉంచాడు. నాయకులు వలంటీర్లను నిగ్రహం పాటించేటట్లు చూశారు. ఉదయం 11 గంటలకే ఆ రోజు చాలా వేడిగా వుంది. 116 డిగ్రీల ఎండ. ప్రదర్శనలు ఆగిపోయాయి. 320 మంది తీవ్రంగా గాయపడ్డారు. ఇద్దరు చనిపోయారు. ఇద్దరు జాతీయ డాక్టర్లు మాత్రమే గాయపడిన వారిని చూడ్డానికి ఉన్నారు."

చనిపోయిన వారిపేర్లు : భాయిలాల్‌భాయ్, దాజాభాయ్, బాబూహాలీ.

మిల్లరు తాను చూసిన విషయాలను తన దేశంలోని పత్రికలకు పంపించడానికి ప్రయత్నించాడు. మొదట అధికారులు ఆపివేశారు. తర్వాత సెన్సారు చేశారు. చాలారోజుల తర్వాత ఒక పుస్తకంలో ఈ విషయాన్ని ప్రచురించాడు.

వెబ్ మిల్లర్ "న్యూఫ్రీమన్" పత్రికకు ఇలా రాశాడు : "నేను 18 సంవత్సరాలనుండి పత్రికా విలేకరిగా పనిచేస్తున్నాను. లెక్కలేనన్ని అంతరంగిక కల్లోలాలను, దొమ్మీలను, వీధిపోరాటాలను, తిరుగుబాట్లను చూశాను. కానీ దర్శనలో చూసిన భయంకర దృశ్యాలను నేనెక్కడా చూడలేదు."

మే 21 న పాల్గొన్న సత్యాగ్రహులు మొత్తం 2500 మంది ఉన్నారు. దక్షిణ ఆఫ్రికాలో గాంధీ సహచరుడుగావున్న 62 ఏండ్ల వృద్ధుడు, ఇమాం సాహెబ్ ఆనాటి దళాలకు నాయకత్వం వహించాడు. ఈయనతోపాటు సరోజినీనాయుడు, ప్యారీలాల్, మణిలాల్ గాంధీలు అరెస్టయారు.

ఉప్పుకొటార్లపై దాడులు ఇలాగే కొనసాగుతూ వచ్చాయి. జూన్ 3 న 200 మంది వలంటీర్లు రెండు దళాలుగా చీలి, ఉంటాడీవద్ద ఏర్పరచిన శిబిరంనుండి దర్శన కొటారుపైకి వెళ్ళారు. వీరిని పోలీసులు ఆపివేసి ప్రజలపై లాఠీఛార్జి చేశారు. వాడాలా ఉప్పుకొటార్లపై 22, 25 వ తేదీలలో దాడి జరిగింది. వేలాది ప్రజలు వారివెంట ఉన్నారు. పోలీసులు వీరిని చితకబాదారు. జూన్ 1 వ తేదీన వలంటీర్లు, ప్రజలు 15 వేల మంది వాడాలా,ఉప్పుకొటారు దండయాత్రలో పాల్గొన్నారు.జనసమూహాన్ని పోలీసులు ఆపివేసినపుడు పోలీసు వలయాన్ని ఛేదించుకొని ఉప్పుకొటార్ల వద్దకు పరిగెత్తారు. కాంగ్రెస్ వలంటీర్లకు 150 మందికి ఆనాడు గాయాలు తగిలాయి.

వాడాలా నిర్బంధ శిబిరంలో జూన్ 3 వ తేదీకి 4000 మంది ఉన్నారు. వారికీ పోలీసులతో ఘర్షణ జరిగింది. సైనికులు వచ్చి రెండుసార్లు లాఠీఛార్జి చేశారు. 90 మందికి గాయాలు తగిలాయి. అందులో 25 మందికి ప్రమాదకరమైన గాయాలు తగిలాయి. ఈ చర్యలను ప్రజలు ప్రతిఘటించారు.

1930 జూలై 31 న బొంబాయిలో తిలక్ జయంతి జరిగింది. అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గం అపుడు మూడు రోజులుగా అక్కడ సమావేశమౌతూవుంది. అప్పటికి దానిపై నిషేధం విధించలేదు. కాంగ్రెస్ డిక్టేటరుగావున్న హంసమెహతా ఆధ్వర్యాన జరిగే ఊరేగింపులో కార్యవర్గ సభ్యులు పాల్గొన్నారు. ఊరేగింపు జరుగుతుండగా పోలీసులు 144 వ సెక్షన్ విధించారు. దీనితో ప్రజలు రోడ్డుమీద కూర్చొని కద

ల్లేదు. రాత్రి కుంభవర్షం కురిసినా కదల్లేదు. మరునటి రోజున కొందరు ముఖ్యుల్ని 100 మంది మహిళల్ని అరెస్టు చేశారు మాలవ్యా, వల్లభాయ్‌పటేల్, జయరాం దాస్ దౌలత్‌రాం, కమలానెహ్రూ, మణిబెన్ పటేల్, హంసమెహతా మొదలైన వారు అరెస్టు చేయబడ్డారు. బొంబాయికి కొత్తగా వచ్చిన విల్సన్ ఇదివరలో వలె గాక, తలపై లాఠీప్రయోగం మొదలెట్టాడు. బొంబాయి సభలకు 5 వేలు మొదలు లక్ష మందిదాకా వచ్చారు. పూర్ణ స్వరాజ్య జయంతి రోజున లక్ష మంది వచ్చారు పోలీసులు కాల్పులు సాగించారు.

మొదట ఉద్యమం ప్రారంభించినపుడు కాంగ్రెస్ నాయకులు శాసనధిక్కారాన్ని ఈ క్రింది అంశాలకే పరిమితం చేశారు. (1) ఉప్పుచట్టాన్ని ఉల్లంఘించడం, (2) విదేశవస్త్ర బహిష్కరణ, (3) విదేశ వస్త్ర దుకాణాలు, ప్రభుత్వ సారాదుకాణాలవద్ద పికెటింగు సాగించుట.

ఐతే ఏప్రిల్‌లో సాగిన సత్యాగ్రహ ఉద మం ఈ పరిమితులలోనే వుండిపోలేదు. వాయువ్య రా ౧ం లోని ఉద్యమం పెషావరు షోలాపూర్‌లలోని సం ట నలు, సంయుక్తరాష్ట్రం (యు.పి.)లోని రైతు పుద్యమం, చిటగాంగ్ ఆయుధ కర్మాగారంపై దాడి, భగత్‌సింగ్ ఆయన సహచరుల విప్లవోద్యమం. కార్మిక కర్షకోద్యమాలను నిర్వహించుచున్న కమ్యూని లను మొగ్గలోనే తుంచాలని, మీరట్ కుట్రకేసు పై సాగించిన విచారణ - ఇవన్నీ సత్యాగ్రహ ఉద మానికి పూర్వమూ, ఆ పుద్యమం జరుగుతున్న కాలంలోనూ, జాతీయోద్యమ శక్తులకు ప్రేరణ, ప్రోత్సాహమూ, బలమూ యిచ్చాయి.

గాంధీ ఇర్విన్ ఒడంబడిక జరిగేనాటికి, 1930-31 సంవత్సరాలలో, ప్రభుత్వ లెక్కల ప్రకారమే 60వేల మంది అరెస్టయి, శిక్షింపబడ్డారు_డాక్టర్ పట్టాభిగారి కాంగ్రెస్ చరిత్ర"లో ఈ సంఖ్య పదినెలల్లో 90 వేల మంది స్త్రీలు,పురుషులు, బిడ్డలుశిక్షింప బడ్డారు.

"1930 ఏప్రిల్ నుండి జూలై 14 వరకు 29 చోట్ల పోలీసు కాల్పులుజరిగాయి 103 గురు చనిపోయారు. 420 మంది గాయపడ్డారు." అని, 1930 జూలై 14 న ప్రభుత్వ ప్రతినిధి ఒకరు శాసన సభలో అంగీకరించారు. పెషావర్, మిడ్నపూర్‌లలో ప్రభుత్వ చేసిన దౌర్జన్యాలపై కాంగ్రెస్ విచారణ కమిటీ తయారుచేసిన నివేదికను ప్రభుత్వం నిషేధించింది. జూలై నుండి అస్సాం, మధ్య రాష్ట్రాలు,మినహాయించి అన్నిరాష్ట్రాలలోనూ, స్థానిక రాష్ట్రప్రభుత్వాలు ఉద్యమం సృష్టించిన తీవ్ర పరిస్థితులను ఎదుర్కొనక తప్పలేదు. వర్షాకాలం రాగానే బొంబాయిలో ఉప్పు కొటార్లపై దాడి ఉద్యమం సన్నగిల్లింది. విదేశ వస్తు, వస్త్ర బహిష్కరణ, విదేశ వస్త్ర దుకాణాల వద్ద పికెటింగు, తీవ్రమైంది. ఇతర రాష్ట్రాలలో కూడా ఇదే పద్ధతిని, ఉద్యమం విజృంభించింది ప్రభుత్వ ఉద్యోగాల బహిష్కార ఉద్యమానికి కూడా కొన్ని చోట్ల ప్రయత్నాలు జరిగాయి. పన్నులు, భూమిశిస్తుచెల్లింప నిరాకరించడం కొన్నిచోట్ల ప్రారంభమైంది. యూనివర్శిటీలను, స్కూళ్లను బహిష్కరించేందుకు విద్యార్థులను ప్రోత్సహించడం జరిగింది.

ఉద్యమం పెరిగిన కొలదీ ప్రభుత్వం నిర్బంధ విధానంలో కొత్త పద్ధతులు ప్రారంభించింది. పికెటర్లను అరెస్టు చేసి దూరప్రాంతాల్లో వదలి పెట్టడం సాగించింది. వారిచేతిలో దబ్బుండేది కాదు ఇది మొదట మద్రాసులో ప్రారంభించి తర్వాత దేశమంతటా అమలు పరచింది ప్రభుత్వం.

ప్రభుత్వం ఆర్డినెన్సులపై ఆర్డినెన్సులు, ప్రకటించుతూ వచ్చింది. పికెటింగు చేయరాదనీ, పన్నుల నిరాకరణ ప్రచారం చేయరాదనీ, సాంఘిక బహిష్కరణ చేయరాదనీ, ప్రభుత్వం వీటిద్వారా శాసించింది జాతీయ పతాకం ఆవిష్కరించిన సందర్భాలలో అనేక చోట్ల పోరాటాలు జరిగాయి. శిక్షలతో పాటు, జరిమానాలు విధించడం ప్రారంభించారు. జూన్‌లో కాంగ్రెస్ సంస్థలు నిషేధించ బడ్డాయి ఇక ఆయా రాష్ట్రాలలోని నిర్బంధ విధానం ఎంత తీవ్రంగా ఉందో స్థూలంగా పరిశీలించుదాం.

కర్ణాటకలో పన్నుల నిరాకరణ ఉద్యమం ప్రారంభింపబడింది. 3 లక్షల ఈత, తాడిచెట్లు నరికి వేయబడ్డాయి. సిరిసి, సిద్దాపూర్, అకోలా తాలూకాలలో పటేళ్ళు (మున్సబులు) అధిక సంఖ్యలో రాజీనామా చేశారు.పన్నుల నిరాకరణ ఉద్యమంలో, కనరాజిల్లాలో 800 మందికి పైగా పాల్గొన్నారు. సిద్దాపూర్, అకోలా, తాలూకాల్లో 100 మంది స్త్రీలతో సహా 800 మంది శిక్షింపబడ్డారు. ప్రభుత్వం ఆస్తుల్ని, ఇళ్లనూ స్వాధీనం చేసుకోటం మూలంగా 15 లక్షల రూపా

యలు రైతులు నష్టపోయారు. రైతులను ఇళ్లనుండి వెళ్లగొట్టి పోలీసులు, వాటిని శిబిరాలుగా మార్చారు. ఈ రెండు తాలూకాలలో. 2600 మంది ప్రజలుగల 330 కుటుంబాల భూముల్ని, 166 యిండ్లను ప్రభుత్వం స్వాధీనం చేసుకొంది. చరాస్తి జప్తు చేయబడింది. వీరిలో ఎక్కువమంది బీదలు. తమ పొలాలను వేలంలో కొన్న వారి ఇండ్లముందు, స్త్రీ సత్యాగ్రహులు 37 మంది సిద్దాపూర్‌లో నిరశనవ్రతం సాగించారు. మావినగుండి అనే చోట 31 రోజులు యీ నిరాహార వ్రతంకొనసాగింది. 1932 జనవరి దాకా పన్నుల నిరాకరణకుసంబంధించిన ఆర్డినెన్సు కనరా జిల్లాలో అమలులోవుంది.

బొంబాయిలో ఉద్యమం ఎంత తీవ్రస్థాయికి పెరిగిందంటే అక్కడ బ్రిటిష్ వాణిజ్య వర్గాలు చాలా గాబరా పడిపోయాయి. విదేశ వస్తువస్త్ర బహిష్కరణ వాళ్లకి గాబరా పుట్టించింది. జూలై 5 న స్పెక్టేటర్ పత్రిక బొంబాయి లేఖను ప్రచురించింది. అందులో ఇలా వుంది: "సైన్యాలు సాయుధపోలీసులే గనక లేకపోయినట్లయితే ఇంకో రోజులో బొంబాయి ప్రభుత్వం కూలిపోయేది. అందరి సమ్మతితో పరిపాలనను కాంగ్రెసు హస్తగతం చేసుకొని వుండేది."

బొంబాయిలో కార్మిక వర్గం బలం ఎక్కువ. దానికి తగ్గ విధంగానే నిర్బంధ విధానం కూడావుండేది. ఐనప్పటికి మాటి మాటికీ పోలీసుల లాఠీఛార్జీలను లెక్కచేయకుండా ప్రదర్శనలు చేసేవారు. కాంగ్రెస్ జెండాలతో పాటు ఎర్ర జెండాలు కూడా ఎగురుతూ ఉండేవి. బొంబాయిలో బ్రిటిష్ వర్తకులు, యూపిరియన్లలో శివ వంతున్న బొంబాయి మిల్లుయజమానుల సంఘం వాణిజ్య సంఘం అధినివేశ ప్రతిపత్తి ప్రాతిపదికపై తక్షణం భారతదేశానికి స్వపరిపాలన ఇవ్వాలని కోరారు. నిరాశ, నిస్పృహ ఓటమితత్వంతో సతమతమౌతున్న బొంబాయిలోని, దేశ విదేశ వాణిజ్య వర్గాలు, ప్రభుత్వమూ, కాంగ్రెస్ రాజీ రాయబారాలు సాగించేందుకు సూచనలు చేశారు.

బెంగాలులో లాఠీఛార్జీలు నిత్యకృత్యాలైపోయాయి. కలకత్తాలో ఒక ఊరేగింపును పోలీసులు, చెదరగొట్టుతుండగా, విశ్వ విద్యాలయ విద్యార్థులు, మేడపైనుంచి పోలీసులను, "పిరికివాళ్ళు" అంటూ కేకలు వేశారు ఆ తర్వాత ఒక యింగ్లీషు ఉద్యోగి పోలీసులతో యూనివర్శిటీలో ప్రవేశించి క్లాసుల్లోని విద్యార్థులను రక్తంకారేటట్లు కొట్టాడు. విశ్వవిద్యాలయ అధికారులు నిరసన తెలియచేశారు.

హైకోర్టు జడ్జి కొడుకు ఈ గాయపడిన విద్యార్థులలో ఒకడు. బెంగాలులో కాంటాయి అనేచోట ప్రజా సమూహంలోంచి ఐదుగురుని చెరువులోకి తోసివేశారు. బెంగాలులోని మిద్నపూర్ జిల్లాలో నిర్బంధ విధానం విలయతాండవం చేసింది. వలంటీర్లకు అన్నం పెట్టినందుకు, మంచినీళ్ళిచ్చినందుకు, గృహస్థులను శిక్షించారు. కేర్పాయిలో ఒక మిల్లును జప్తు చేయగా ప్రజలు గుమిగూడారు. వారిపై తుపాకులు పేల్చగా, మొదటిసారి ఒకడు, రెండవసారి 11 మంది చనిపోయారు. చేచన, అనుచోట పరుగెత్తిపోతున్న, జనంపై కాల్పులు సాగించగా, ఆరుగురు మరణించారు. జూన్ 22న దేశబంధు చిత్తరంజన్‌దాసు, వర్ధంతికోత్సవాన్ని ప్రభుత్వం నిషేధించగా, ధిక్కరించిన ప్రజలను లాఠీలతో మోదారు. అశ్విక పోలీసుల గుర్రపు డెక్కల క్రింద నలిగిపోకుండా క్షతగాత్రులను స్త్రీలు ముందుకు వురికి, రక్షించారు. బారిసాల్ లాఠీచార్జీలో, 500 మంది గాయపడ్డారు మరో గ్రామంలో పోలీసులు, సత్యాగ్రహుల, వారి సానుభూతిపరుల ఇండ్లకు నిప్పంటించారు. గోపీనాథ్‌పురంలో ఒక మహమ్మదీయ బాలుని, పోలీసులు కొట్టగా గ్రామస్థులు ఆగ్రహావేశంతో, పోలీసుల్ని ఒక పాఠశాలలో నిర్బంధించి, దానికి నిప్పంటించారు. కాంగ్రెస్ వలంటీర్లు తాళం బద్దలుకొట్టి పోలీసుల్ని రక్షించారు. అంతకుముందు ఒక సంవత్సరం శిక్షను అనుభవించిన సుభాష్‌చంద్రబోస్ విడుదలై వచ్చాడు. 1930 డిసెంబర్ 31 న సంపూర్ణ స్వాతంత్ర్య ఉత్సవ సందర్భంగా తీవ్రంగా సుభాష్‌చంద్రబోస్‌ను పోలీసులు కొట్టారు. మిద్నపూర్ జిల్లాలో, గూర్ఖా సైనికులు, ప్యూనిటివ్ పోలీసులు నానా భీభత్సంచేశారు. స్త్రీల మాన మర్యాదలను మంటగలిపారు. అక్కడ రైతులు పన్నులు చెల్లించ నిరాకరించి తమకున్నది కాస్తా సర్వనాశన మౌతున్నా భరించి చూశారు.

అన్ని రాష్ట్రాలలోకి బెంగాల్‌లోనే ఎక్కువమంది శిక్షలకు గురిఅయ్యారు.

గుజరాత్‌లో పోలీసుల నిర్బంధకాండకు తట్టుకోలేక పక్కనున్న బరోడా రాష్ట్రానికి రైతులు వలస పోతూ వచ్చారు. బార్డోలీ జిల్లాలోని కాంగ్రెస్ ఆశ్రమాన్ని, కాంగ్రెసు సంస్థను నిషేధించిన తర్వాత

స్వాధీనం చేసుకుంది ప్రభుత్వం. బార్డోలీ నుంచి రైతులు తమ ఆస్తుల్ని విడిచిపెట్టి వలసపోయారు. ఆ పొలాలను కొనేవారెవరైనా ఉంటారేమోనని పోలీసులు వెదకసాగారు.

వలసపోయే గుజరాతు రైతులను ఒక తాత్కాలిక శిబిరంలో చూచిన హెచ్. యన్. బ్రెయిల్స్ఫర్డ్ ఇలా రాశాడు. "మీరెందుకు ఇళ్ళు విడిచి వెళుతున్నారు ?" అని రైతులలోని పెద్దముఠాను అడిగాను. "గాంధీజీ జైలులో వున్నారు గనుక" అని స్త్రీలు తక్షణమే జవాబు చెప్పారు "వ్యవసాయం గిట్టుబాటుగాలేదు. ఐనా పన్నులు అన్యాయంగా వున్నాయి" అని పురుషులు తమ ఆర్థిక పరిస్థితిని తెలియజేస్తూ అన్నారు ఒకరిద్దరు "స్వరాజ్యం సాధించడానికి" అని జవాబు చెప్పారు.

1931 జనవరి 12 న మాంచెస్టర్ గార్డియన్ పత్రికలో బ్రెయిల్స్ఫర్డ్, సూరత్ పోలీసులు దురాగతాలను వివరిస్తూ సుదీర్ఘ వ్యాసం రాశాడు. 1931 జనవరిలో వసూలు చేయవలసిన పన్నుల్ని అక్టోబర్‌లోనే వసూలు చేయాలని ప్రభుత్వం నిర్ణయించడం వల్ల రైతుల పరిస్థితి అధ్వాన్నమైనదని ఆయన అన్నాడు. ప్రభుత్వ ప్రతికూల గ్రామాల్లో ప్రజల్ని పోలీసులు విచక్షణా రహితంగా కొట్టారు. గ్రామాలలో జాతీయ పతాకాల్ని కాంగ్రెస్ ప్రకటన పత్రాల్ని చించివేశారు గాంధీ టోపి తీసే వరకు మనుషుల్ని కొట్టారు. ఏడుసార్లు పోలీసుకు సలాం చేసేవరకు ఒకతన్ని తీవ్రంగా బాదారు. "మీకు స్వరాజ్యం కావాలా ? ఐతే ఇదిగో తీసుకో" అంటూ లాఠీ దెబ్బలు చవిచూపించారు. దొంగజాతుల వారిని రైతుల పైకి ఉసికొల్పారు. బోర్సాద్‌లో 30 చదరపుటడుగుల బోనులో 18 మంది రాజకీయ ఖైదీలను వుంచిన విషయాన్ని కూడా బ్రెయిల్స్ఫ ఉదహరించాడు. బోర్సాద్‌లో పన్నుల నిరాకరణో ద్యమం సాగిన సందర్భంలో ఈ సంఘటన జరిగింది.

ఆష్వా అనే గ్రామంలో అక్టోబరులో జరిగిన ఘాతుక కృత్యాలను బ్రెయిల్స్ఫర్డ్ వివరించాడు. ఈ గ్రామంలో వలస పోకుండా కొందరు రైతులున్నారు. బరోడా వెళ్ళిన రైతులు కొందరు తిరిగి వచ్చారు. వీరు పొలాల్లో నిద్రిస్తుండగా పట్టుకొని కొట్టారు. రైతు సోదరు లిద్దర్ని తలలు డీడిక్కొట్టించారు. బార్డోలీలో రైతులను లాకప్ చేసిన సబిన స్పెక్టర్, రైతుల భార్యలతో వారి భర్తలను సంసారం చేయకుండా పనికిరానివారిగా చేస్తానని బెదిరించాడు. తోవనుపోయేవారి జేబులుకొట్టి, బంగారు నగలు కాజేసి పన్ను చెల్లించని రైతుల పేరిట, వారు పన్నులు చెల్లించినట్లు రశీదు లిప్పించాడు.

## సంయుక్త రాష్ట్రం (యు. పి.)లో

1930 మార్చిలో యు. పి. కాంగ్రెస్ జాతీయ కార్యక్రమంలో భూమి శిస్తు తగ్గింపు, అప్పులన్నిటినీ పాక్షిక పరిహారంతో రద్దు చేయాలని తీర్మానించింది. యు. పి కాంగ్రెస్‌కు జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షుడు. ఐతే భూమి శిస్తు తగ్గింపు అన్న విషయాన్ని మాత్రమే కాంగ్రెసు వర్కింగ్ కమిటి అంగీకరించింది.

పన్నుల నిరాకరణోద్యమం అల్లాబాద్ జిల్లాలో ప్రారంభమైంది. అప్పటికి భారతదేశం వచ్చివున్న యం.యన్. రాయ్, అతని అనుచరులూ కాంగ్రెస్‌లో చేరారు. గ్రామాల్లో సోషలిస్టు భావాలను ప్రచారం చేయసాగారు.

తూర్పు బెంగాల్‌లో కిషోర్‌గంజ్, జూట్ (గోగునార) పండించే ప్రాంతం. జూట్ ధరలు పడిపోవడంతో రైతులు మక్తాలు చెల్లించ నిరాకరించారు. వీరికి మద్దతుగా కలకత్తా కార్మికులు నిలబడ్డారు. సైన్యాలు కిషోర్‌గంజ్ వెళ్ళి ఉద్యమాన్ని నాశనం చేయడానికి పూనుకొన్నారు. బీరార్‌లోని బుల్దానా జిల్లాలో పత్తి పండించే రైతులను వర్తకులు, వడ్డీ వ్యాపారులు జలగల్లా పీల్చుకు తింటున్నారు. రైతులు, రైతు సంఘాన్ని ఏర్పరచుకొని, పన్నులు భూమి శిస్తు, వడ్డీలు చెల్లించకూడదని తీర్మానించింది. వ్యవసాయ కార్మికులుకూడా ఈ సంఘంలో చేరారు. రైతువలంటీర్లు పన్నులువసూలు చేసే అధికారులను ప్రతిఘటించారు. గ్రామగ్రామానికి డప్పులు లాంటి వాయిద్యాలను మోగించుకుంటూ యాత్ర సాగించారు. వడ్డీవ్యాపారుల, భూస్వాముల ఆస్తినీ, పంటల్నీ స్వాధీనం చేసుకొని వారి ఇళ్ళను తగులబెట్టారు. వివిధ కులాలవారు హిందూ ముస్లిములు ఐక్యంగా ఈ పనులు చేశారు. ఈ తిరుగుబాటును సైనికులు అణచివేశారు. దండీ యాత్రలలాంటి వాటికి ప్రపంచమంతటా పత్రిక లిచ్చిన

ప్రాముఖ్యత చాటున, బుల్డానా లాంటి చోట్ల జరిగిన ఘటనలు మరుగున పడిపోయాయి. ఇలాంటి రైతు సంఘాలే ఆ తర్వాత అఖిల భారత స్థాయిని "రైతు సంఘం" ఏర్పడటానికి దారి తీసింది.

ఆయా రాష్ట్రాలలో జరిగిన శాసనోల్లంఘన ఉద్యమం, తదితర బ్రిటిష్ సామ్రాజ్య ప్రతికూల ఉద్యమాలన్నిటినీ, వివరించడం ఇక్కడ సాధ్యం కాదు. డాక్టరు పట్టాభిగారి మాటల్లో "దక్షిణ భారతదేశం ఒక విధంగా అత్యధిక కష్టాలను భరించింది." అపుడు ఆంధ్రులు మద్రాసు రాష్ట్రంలో వుండేవారు ఆంధ్రులు జాతీయోద్యమంలో త్యాగాలకు, కష్టనష్టాలు భరించడానికి, సాహసకృత్యాలకు ఏమాత్రం వెనుదీయలేదు. లాహోర్ కాంగ్రెస్ సమావేశ సందర్భంగా కొండా వెంకటప్పయ్య గాంధీని కలిసినప్పుడు తాను నడిపే సత్యాగ్రహోద్యమంలో గుజరాత్, బీహార్, ఆంధ్రపై ఆధారపడుతున్నట్లు గాంధీ చెప్పారు. గాంధీ ఆశల్ని ఆంధ్రులు_వారు ఎక్కడవున్నా, మద్రాసులో వున్నా, నిజాం నిరంకుశ పాలన కింద వున్నా, ఆయా పరిస్థితులకు తగు విధంగా-శాసనోల్లంఘనోద్యమాన్ని పరిపుష్టం చేశారు.

ఆంధ్రరాష్ట్రంలో ఉప్పు సత్యాగ్రహ కార్యక్రమం నిర్ణయించడానికి ఏలూరులో రాష్ట్ర కాంగ్రెస్ సంఘం సమావేశమైంది. ఈ సందర్భంగా కొండా వెంకటప్పయ్యగారి స్వీయచరిత్రలో రాసిన ఈ వాక్యాలు గమనార్హం.

"ఈ సత్యాగ్రహోద్యమము సాగించుట కెవ రిని నియమించవలెనను ప్రశ్న బయలువెడలినది హాజ న వారిలోనెవ్వరును అందుకు అభిముఖులుగా కనబ నం దున నన్ను ఉద్యమము నడిపింపవలసినదని అందరును ఏకగ్రీవముగ కోరిరి. దేశమున సంచారము చేసి, సభలలో ఉపన్యాసములిచ్చి, పూలదండలు వేయించుకొనిన వారీనాడు ముండ్ల కిరీటము ధరించవలసి వచ్చినపుడు వెనుదీయుట సరిగాదని తలంచి వారి కోరిక సంగీకరించితిని"

రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు వహించవలసిన భారం కొండా వెంకటప్పయ్యపై పడింది. ఆయన్ని కాంగ్రెస్ 'నియంత' గా ఎన్నుకొన్నారు. ఏలూరులో జరిగిన పై సభకు సాంబమూర్తి, కాశేశ్వరరావు మున్నగువారు హాజరయ్యారు.

మొదట్లో ఇలాంటి తడబాట్లు, ఉద్యమ నిర్వహణ విధానంలో పరస్పర సమన్వయం లేకపోయినా, తరువాత శాసనోల్లంఘన ఉద్యమం గ్రామగ్రామానికీ పాకింది. మహాత్ముని దండీయాత్రలో పాల్గొన్న 78 మందిలో ఎర్నేని సుబ్రహ్మణ్యం ఒక్కడే ఆంధ్రుడు.

ప్రతి జిల్లాకు ఒక కాంగ్రెస్ నాయకుని ఏర్పరచి, ఆయా జిల్లాల్లో వలంటీరు శిబిరాల్ని ఏర్పరచారు. ఆయా జిల్లా కేంద్రాల్లో ఉప్పు చట్టాల్ని ధిక్కరించడమే గాక, బాలచెరువు, నౌపడా, కనపర్తి మొదలైన చోట్ల ఉప్పు కొటార్లపై దాడి జరిగింది. విదేశ వస్త్ర బహిష్కరణ, కల్లు దుకాణాల పికెటింగ్, తాటి చెట్ల నరికివేత ప్రారంభమయ్యాయి. జూన్ 10 నుండి ఉప్పు కొఠార్లపై దాడి ఆపివేయబడింది. మొ మొదట కొంత ఉదాసీన భావంతో ప్రవర్తించిన రా ౧ ప్రభుత్వం రాను రాను దమనకాండను ఎక్కువ ంది. లాఠీచార్జీలు, కాల్పులు, జాతీయ పతాకాలు తొలగించడం, కాంగ్రెస్ శిబిరాలను బలవంతంగా మూసివేయడం, గాంధీ టోపీ ధరించిన వారి బట్టలూడదీయడం, గాంధీ ఫోటోలు జెండాలు తగలబెట్టడం, రాట్నాలు విరగగొట్టడం- వంటివి చేశారు. కొన్ని చోట్ల అటవీ శాసనాల ధిక్కారానికి సత్యాగ్రహులు ప్రజల్ని ప్రోత్సహించారు. ("తెలుగునాట స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర" విభాగంలో - ఉద్యమ వివరాలు చూడండి) ఆంధ్రదేశానికి మలబారు నుంచి వచ్చిన మిలటరీ పోలీసులు ఏలూరు, బరంపురం, కాకినాడ, రాజమండ్రి, మొదలైన పట్టణాల్లో ఖద్దరు కట్టుకున్న వారినల్లా చావబాదటం మొదలుపెట్టారు. ఏలూరులో ఎదురు తిరిగితే కాల్పులుసాగించారు. ఇద్దరు మరణించారు. గుడివాడలో కూడ కాల్పులు జరిగాయి. 19 0 డిసెంబర్‌లో పెద్దాపురంలో అల్పాహార విందుకు సమావేశమైన 80 మందిని, స్త్రీలు పిల్లలతో సహా కొట్టారు ఈ ఉద్యమంలో ఇదివరకు ఊరూ పేరూ లేని కొత్తవారెందరో మట్టిలోంచి మాణిక్యాల వలె ఉద్భవించారు. ఎవరూ ఊహించని రీతిని అసమాన సాహసాలను ప్రదర్శించారు. గాంధీ అరెస్టు వార్త విని మే 6 న బందరు రాబర్టుసన్ పేటలోని కుందు మీద జెండా ప్రతిష్టాపన సమయంలో తోట నర్సయ్య లాంటి వాళ్ళు చూపిన సాహసం ఇందుకు ఒక చిన్న ఉదాహరణ. ఇలాంటి

ఘటనలు ఎన్నెన్నో. కొన్ని చరిత్ర కెక్కాయి. కొన్ని చరిత్ర మరుగున పడ్డాయి

ఇక శాసనోల్లంఘనోద్యమం ఆయా రాష్ట్రాలలో వివిధ రూపాలలో జరిగింది. బెంగాలులో అధిక సంఖ్యాకులు అరెస్టయ్యారు దక్షిణ భారత దేశం అత్యధిక కష్టాలకు గురయింది. బెంగాల్, బీహార్, ఒరిస్సాలలో బ్రిటిష్ వస్త్ర బహిష్కరణ ఉద్యమం అతి తీవ్రంగా సాగింది. గుజరాత్, సంయుక్త రాష్ట్రం (యుపి) మొదలైన చోట్ల పన్నుల నిరాకరణోద్యమం ప్రారంభమైంది. బీహారులో చౌకీదారు పన్ను చెల్లించ నిరాకరించారు. మధ్య రాష్ట్రంలో అటవీ సత్యాగ్రహం జరిగింది. వాయువ్య రాష్ట్రంలో ఖుదైఖిద్మత్‌గార్ల ఉద్యమం బ్రిటిషు వాళ్ళ గుండెల్లో తారెత్తించింది. పంజాబు కూడా తన ప్రక్క రాష్ట్రాలకు తీసిపోలేదు. మాంట్‌గోమరీలో లాలా లఖ్కీరాం నిరాహారవ్రతం చేసి మరణించాడు.

కర్ణాటకలో పన్నుల నిరాకరణోద్యమం సాగింది. కేరళలో నూటికి 70 వంతులు కల్లు పాటలు పడిపోయాయి. కల్లుపాటలను నిరోధించినందుకు తమిళ నాడులో కాల్పులు సాగించారు.

1930-32 సంవత్సరాల మధ్య బర్మాలోని థార్వాడీ జిల్లాలో తిరుగుబాటు జరిగింది. బ్రిటిషు వాళ్ళు దాన్ని అతి క్రూరంగా అణచివేశారు. 200 మందిని ఉరి తీశారు. 500 మందికి యావజ్జీవ శిక్ష విధించి అండమాన్లకు పంపారు.

1931 జనవరిలో గాంధీ కొద్ది రోజులకు విడుదల కానున్న సమయంలో జనవరి 31 న బోర్సాద్ స్త్రీలపై జరిగిన పోలీసుల పాశవిక ప్రవర్తనతో ఈ అధ్యాయాన్ని ముగిద్దాం.

బోర్సాద్ స్త్రీలు ఆ రోజున ఊరేగింపు చేయాలనుకున్నారు. ఊరేగింపులో దాహమైన వారికి మంచినీళ్ళు ఇవ్వాలనే ఉద్దేశంతో మంచినీటి కుండల్ని అక్కడక్కడా పెట్టారు. పోలీసులు ఆ కుండల్ని బద్దలు కొట్టారు. ఊరేగింపు చేస్తున్న స్త్రీలను బలప్రయోగంతో పోలీసులు చెదరగొట్టారు కింద పడిపోయిన స్త్రీల రొమ్ములపై బూట్లతో ఎక్కి తొక్కారు.

గాంధీ విడుదల, గాంధీ ఇర్విన్ ఒడంబడికలను ప్రస్తావించేముందు, దేశంలో విప్లవవాదులపైన, కార్మిక కర్షకోద్యమాలపైన జరిగిన దాడిని, బనాయించిన కుట్రకేసులను గురించి తెలుసుకొందాం.

## మీరట్ కుట్రకేసు

'విభజించి పాలించడం' ఒక్కటేకాదు బ్రిటిషు వాళ్ళ కుటిల నీతి. జాతీయోద్యమాన్ని చీల్చడానికి కులమత ద్వేషాగ్నులను రగల్చడం మాత్రమే కాదు, దాని పన్నుగడ. జాతీయ ఉద్యమ శక్తుల్ని వేర్వేరుగా దెబ్బకొట్టడం కూడా దాని రాజకీయ కుట్రనీతిలో ఒక భాగమే. అందుకే అది శ్రామిక కార్మికులను, రైతులను సంఘటిత పరచుతున్న కమ్యూనిస్టుల పైకి దాడికి పూనుకొంది. "కమ్యూనిస్టు సిద్ధాంతాలు అందోళనకరంగా వ్యాప్తిచెందడాన్ని" నిరోధించేందుకు తగు చర్యలు తీసుకొంటున్నామని వైస్రాయి లార్డ్ ఇర్విన్ 1929 జనవరిలో కేంద్ర శాసనసభలో ప్రకటించాడు. "కొన్ని పెద్ద పట్టణాలలో ముఖ్యంగా పారిశ్రామిక కార్మికవర్గాలలో కమ్యూనిస్టు ప్రచారమూ, పలుకుబడీ విస్తరించుతోంది" అని 1928-29 భారత ప్రభుత్వ నివేదిక తెలియచేసింది "మాంచెస్టర్ గార్డియన్" లాంటి పత్రిక కూడా ఇందుకు తన ఆవేదన వెళ్ళబుచ్చింది. "సమ్మె" అంటేనే మితవాద రాజకీయవాదులు, మితవాద పత్రికలు గగ్గోలు పెట్టడం ప్రారంభమైంది. 1928 సెప్టెంబరులో స్పీకర్ విఠల్ భాయ్ పటేల్ కాస్టింగ్ ఓటుతో తిరస్కరించబడిన "ప్రజా రక్షణబిల్లు" ను ప్రత్యేక ఆర్డినెన్సురూపంలో 1929 లో వైస్రాయి ప్రవేశపెట్టాడు.

1929 మార్చిలో బొంబాయిలో సార్వత్రిక సమ్మె జరిగింది. గిర్నికాంగార్ యూనియన్ రైల్వే కార్మిక సంఘం ఈ సమ్మె జరపాలని విజ్ఞప్తి చేసింది. 1918 సమ్మెలలో పాల్గొన్న కార్మికులను డిస్మిస్ చేసి, వారి స్థానే పఠాన్లను నియమించినందుకు నిరసనగా ఈ సమ్మె ఉద్దేశించ బడింది. యజమానుల చర్యమూలంగా కార్మిక సంఘాల ఐక్యతకు దెబ్బతగలడమే కాక, హిందూ ముస్లిం కలహాలు కూడా మిల్లులలో జరిగాయి.

ఈ పరిస్థితిని ఆసరాగా తీసుకుని 1929 మార్చి 20 న 31 మంది కార్మిక రైతు నాయకుల్ని ప్రభుత్వం అరెస్టు చేసింది. ఆ తర్వాత మరొకరిని అరెస్టు చేసింది. అరెస్టు చేసేముందు బొంబాయి, బెంగాల్, సంయుక్త రాష్ట్రం (యు పి.) పంజాబులలో

సోదాలు జరిగాయి. బ్రిటిషు ప్రభుత్వాన్ని కూలదోయ డానికి కుట్ర పన్నారంటూ కేసులో ఇరికించింది. వీరిపై విచారణ మీరట్‌లో జరిగింది. అందుకే దీనికి 'మీరట్ కుట్రకేసు' అని పేరు వచ్చింది కార్మిక వర్గం వీరి పట్ల సంఘీభావం ప్రదర్శించే అవకాశం వున్న పెద్ద పారిశ్రామిక నగరాల్ని కాక, మీరట్‌లాంటి చిన్న పట్టణాన్ని విచారణకు ప్రభుత్వం ఎంచుకోవడంలో గల అంతర ం ఇదే. దాదాపు 4 1/2 ఏళ్ళు అంటే 1933 వరకూ సుదీ విచారణ జరిగింది. అరెస్టయినవారిలో ము. రు అం యులు, వారు ఫిలిప్స్‌స్ప్రాట్, బి ఎఫ్. [illegible] ,లెస్టరు ..చిన్‌సన్, భారతీయులలో అరెస్టయిన వా దరూ కమ్యూనిస్టులు కాదు. ట్రేడ్‌యూనియన్, రైతుసంఘాలలో పనిచేస్తున్నవారు వున్నారు.

భారతీయులందరూ బానిసలే అనే నీచభావం ఆంగ్లేయులందరిలో లేదని, ఈ ఆంగ్లేయుల అరెస్టువల్ల తెలిసింది. భారత కార్మికవర్గం కోసం, భారత జాతీయ విముక్తికోసం పాటుపడేందుకు, అంతర్జాతీయ కార్మిక సుహృద్భావాన్ని నిరూపించిన వ్యక్తులుగా వీరు మన జాతి మన్ననలను పొందారు.

ముజఫర్ అహ్మద్, ధరణిగోస్వామి, గోపాల్ చక్రవర్తి, గోపాల్ బసక్, రాధారమణమిత్రా, శివనాథ బెనర్జీ, శంశల్‌హుద, కిశోర్‌లాల్‌ఘోష్, ఫిలిప్స్ స్ప్రాట్‌లను పశ్చిమ బెంగాల్‌లో అరెస్టు చేశారు. మహారాష్ట్రలో అరెస్టయినవారిలో బి ఎఫ్ బ్రాడ్లే, ఎస్. వి. ఘాటే, మిరాజ్‌కర్, ఎస్. ఏ.డాంగే, ఎ ఏ. ఎల్వే, జి. ఆర్. కాస్లె, డి. ధంగ్డీ, ఎం. జి. దేశాయ్, జి. అధికారి, ఎస్. హెచ్. ఝాబ్‌వాలా, ఎల్. హచిన్‌సన్ ఉన్నారు. సంయుక్త రాష్ట్రం (యు పి.) లో పి సి. జోషి, అయోధ్యప్రసాద్, గౌరీశంకర్, విశ్వనాథముఖర్జీ, ధర్మవీర్‌సింగ్, ఎల్. కదమ్, షౌకత్ ఉస్మానీ అరెస్టు చేయబడ్డారు పంజాబ్‌లో సోహన్‌సింగ్ జోషి, అబ్దుల్ మజీద్, కేదార్‌నాథ్ సెహగల్ అరెస్టు చేయబడ్డారు.

అరెస్టయిన వారిలో చాలామంది అప్పటికే కార్మిక నాయకులు. రైతు ఉద్యమ నిర్మాతలు, యువజన నేతలు, డాంగే జౌళికార్మికుల సంఘం, గిర్నికాంగార్ యూనియన్ ప్రధాన కార్యదర్శి, అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ సహాయకార్యదర్శి. 1920 శకంనుంచీ సోషలిస్టు, కమ్యూనిస్టు భావాలను వ్యాప్తి చేసినవాడు. మిరాజ్‌కర్ స్టీమ్‌నావిగేషన్ కంపెనీ యూనియన్ కార్యదర్శి, వర్కర్స్ అండ్ పెజెంట్స్ పార్టీ బొంబాయి శాఖకు కార్యదర్శి, జోగ్లేకర్, నింబకర్‌లు వర్కర్సు అండ్ పెజెంట్సు పార్టీ సభ్యులు మాత్రమే కాక, అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సభ్యులు కూడా. డాక్టరు జి. అధికారి అపుడే జర్మనీలో డాక్టరేట్ పట్టా పుచ్చుకొని వచ్చాడు, "స్పార్క్" అనే పత్రికకు వ్యాసాలు రాస్తూ వుండేవాడు. భారతదేశంలో అడుగిడిన కొద్ది కాలంలోనే ఆయన్ని అరెస్టు చేశారు. ముజఫర్ అహమ్మద్ బెంగాల్ పెజెంట్స్ అండ్ వర్కర్స్ పార్టీ కార్యదర్శి, ఆ పార్టీ పత్రిక 'గణవాణి' సంపాదకుడు. ధరణి గోస్వామి, గోపాల చక్రవర్తి ఇద్దరూ యువజన నాయకులు, రైతుఉద్యమ నిర్వాహకులు.

సోహన్‌సింగ్ జోషి మొట్టమొదటి అఖిలభారత వర్కర్స్ అండ్ పెజెంట్స్ పార్టీ మహాసభ అధ్యక్షుడు. పంజాబ్‌లో ఆ పార్టీ శాఖకు ప్రధాన కార్యదర్శి. అబ్దుల్‌మజీద్ ప్రెస్‌వర్కర్స్ తదితర కార్మిక సంఘాలలో పనిచేశాడు. కొన్నాళ్ళు మాస్కోలో వున్నాడు. పెషావర్ కుట్రకేసులో జైలుపాలయ్యాడు. ఇదే కుట్రకేసులో ప్రముఖుడైన షౌకత్ ఉస్మానీకూడా కొన్నాళ్ళు మాస్కోలో వున్నాడు "పెషావర్ నుండి మాస్కోకు" అన్న గ్రంథం రాశాడు.

తర్వాత భారత కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శిగా రూపొందిన పి. సి. జోషి ఆ రోజుల్లో అలహాబాద్ యూనివరి టీ విద్యార్థి. రాష్ట్ర వర్కర్స్ అండ్ పెజెంట్స్ పా కార్యదర్శి. ఝాబ్‌వాలా ప్రముఖ ట్రేడ్‌యూనియ నాయకుడు. బొంబాయిలో దాదాపు 50 కార్మిక సంఘాల వ్యవస్థాపకుడు. ధంగడీ ప్రముఖ కార్మిక నాయకుడు. అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ మాజీ అధ్యక్షుడు శివనాథ బెనర్జీకూడా ప్రముఖ ట్రేడ్‌యూనియన్ నాయకుడు. మిగతావారిలో యువ న్యాయవాదులూ, జర్నలిస్టులూ, నౌజవాన్ భారత సభ మొదలయిన వాటిల్లో పనిచేస్తున్నవారు.

ఈ కుట్రకేసు బనాయించడంలో ప్రభుత్వ ఉద్దేశమేమిటో భారత, బ్రిటిషు అధికారుల మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల్లో వెల్లడైంది. ఈ అరెస్టుల ద్వారా ట్రేడ్ యూనియన్ సంఘాలను, ఇతర సంఘాలను బలహీన పరచి చీల్చడం. తమ దృష్టిలో

ప్రమాదకారులని భావించిన నాయకుల్ని తొలగించడం. దేశంలోని కమ్యూనిస్టులతో విదేశాలలోని కమ్యూనిస్టుల సంబంధాలను వేరుచేయడం. తద్వారా ప్రభుత్వానికి "ఊపిరి పీల్చుకునేందుకు విలువైన సమయాన్ని" సంపాదించడం. ఇంతేకాదు, కమ్యూనిస్టులంటే భయభ్రాంతుల్ని చేసి, ధనికవర్గాలను తమ వైపుకు తిప్పుకొనేందుకు కూడా ప్రభుత్వం ఎత్తు వేసింది. బ్రిటన్‌లో పార్లమెంటు ఎన్నికలు రానున్నాయి ఈ కుట్రకేసును ఒక పావుగా ఉపయోగించుకొని కన్సర్వేటివ్ ప్రభుత్వం తిరిగి అధికారంలోకి రావాలని ప్రయత్నించడం.

ఐతే ఈ ఉద్దేశాలేవీ నెరవేరలేదు. బ్రిటన్‌లో కన్సర్వేటివ్ ప్రభుత్వం పోయి లేబరుపార్టీ అధికారంలోకి వచ్చింది. ఐతే మీరట్ కుట్రకేసు పట్ల, ఎట్టి మార్పూ లేదు.

మొట్ట మొదట ఈ కేసులో జవహర్‌లాల్ నెహ్రూను కూడా ఇరికించాలనుకున్నారనీ, ఐతే అలా చే వచ్చే ఆందోళనను దృష్టిలో పెట్టుకొని మాని వే రనీ వెల్లడైంది. ఇంతేగాక ప్రధాన జాతీయోద్యమ ప్రవాహంనుంచి కమ్యూనిస్టులను వేరుచేయాలని కూడా ప్రభుత్వ ఉద్దేశం.

మీరట్ కేసులోని ముద్దాయిలను చూడటానికి అనేకమంది జాతీయ నాయకులు వచ్చారు. గాంధీ, మోతీలాల్‌నెహ్రూ, జవహర్‌లాల్‌నెహ్రూ, అన్సారీ మొదలైనవారు వీరిలో వున్నారు డిఫెన్సుకు సహాయపడటానికి వచ్చిన బి. టి రణదివేను కూడా ప్రభుత్వం అరెస్టు చేసింది. మీరట్ జైలులోని వారిని చూడటానికి వచ్చిన గాంధీ ఇలా అన్నాడు.

"త్వరలో లాహోర్ కాంగ్రెస్ జరగబోతోంది. కాంగ్రెసు లక్ష్యం సంపూర్ణ స్వాతంత్ర్యంగా తీర్మానించబోతుంది. అందుచేత లాహోర్ కాంగ్రెసు తర్వాత నేను నిర్వహించే పోరాటంలో కమ్యూనిస్టులు కూడా చేరండి."

చౌరీ చౌరాలోలాగా పోలీసులు రెచ్చగొట్టినపుడు ప్రజలు హింసాయుత చర్యలకు దిగితే, ఉద్యమాన్ని మళ్లీ ఆపివేస్తారా అని మీరట్ కేసులోని కమ్యూనిస్టు నాయకులు అడిగారు. కాసేపు ఆలోచించి గాంధీ "లేదు" అని జవాబిచ్చాడు.

జాతీయవాదుల నుంచి కమ్యూనిస్టులను, కార్మిక నాయకులను వేరుచేయాలనే ప్రభుత్వ దుష్టసంకల్పం నెరవేరలేదు. మీరట్‌లో లీగల్ డిఫెన్సుకు నెహ్రూలిద్దరూ-తండ్రీ కొడుకులు-సహాయపడ్డారు ఆ రోజుల్లో మోతీలాల్ భారత న్యాయవాదుల్లో న్యాయవాదిగా ప్రథమశ్రేణిలో ఉన్నాడు. ఆయన స్వయంగా మీరట్ కో కి ముద్దాయిల తరపున హాజరయ్యాడు. మేజిస్ట్రేట్ కో లో ప్రాసిక్యూషన్ వాదన పూర్తి అయ్యాక, కే ను మరో రాష్ట్రానికి బదలీ చేయాలని మోతీలాల్ నెహ్రూ, సర్ తేజ్ బహదూర్‌సప్రూ హైకోర్టులో పిటీషన్ పెట్టారు కాని దానిని తోసివేసింది. కేంద్ర శాసన సభలో కూడా మోతీలాల్ మీరట్ అరెస్టులను ఖండించాడు. భారతదేశంలోకి కొత్త భావాలు ప్రవేశించకుండా బ్రిటిష్ పాలకులు ముళ్ళకంచెలు వేసే రోజులు పోయాయని అన్నాడు.

కేసు విచారణ ప్రారంభంనాడు స్థానికులేకాక, తమ స్వంత ఖర్చులతో అనేకమంది జాతీయవాదులైన న్యాయవాదులు, బారిస్టర్లు కోర్టుకు హాజరయ్యారు.

మీరట్ డిఫెన్సు ఎలా వుండాలనే విషయంలో గాంధీ అభిప్రాయాలతో అంతా ఏకీభవించకపోవచ్చు. కాని ఈ సందర్భంగా బ్రిటిష్ ప్రభుత్వాన్ని నిర్ద్వందంగా ఖండించాడు. గాంధీ ఇలా వ్యాఖ్యానించాడు.

"కారి క నాయకులు, కమ్యూనిస్టులని పిలవబడే వారి అరె లు, ప్రభుత్వం గాభరా స్థితిలో వున్నదని తెలియచే ంది. మనం గతంలో చవిచూచిన ప్రభుత్వ దౌర్జన్యకాలంలోని లక్షణాలనే ప్రభుత్వం వెల్లడించుతోంది. న్యాయచట్టాల్ని పూర్తిగా రద్దుచేసి, వణికిపోతున్న భారతదేశానికి, ముసుగులో దాచిన తన రక్త పంజాలను ముసుగుతీసి చూపించడం, అపుడపుడూ అవసరం అని ప్రభుత్వం భావిచుతున్నట్లు అర్థమౌతోంది. విచారణ అనే తతంగం (ఫార్సు) కొనసాగుతుందనేమాట నిజమే. నిందితులు గనుక తెలివిగలవారైతే వారు ఆ వలలో పడకూడదు. డిఫెన్సు పెట్టుకొని, ఆ ఫార్సుకని తోడ్పడకూడదు. వాళ్ళు ధైర్యంగా జైలుశిక్షకు సిద్ధపడాలి ఇపుడు న్యాయచట్టం పేరిట, న్యాయాన్ని మట్టుపెట్టి పాలించే ఈ పాలనను శాశ్వతంగా అంతరింపచేయాలంటే వేలాది ప్రజలు జైలుకు సిద్ధపడటమేకాదు, ఆ శిక్షను ఆహ్వానించి జైలుపాలు కావడమే నేటి కర్తవ్యం."

" ఈ కేసు ఉద్దేశం కమ్యూనిజంను చంపడంకాదు, (ప్రజలలో) భీతి కల్గించడమే.... ఐతే (ప్రభుత్వం ప్రదర్శించే)దౌర్జన్యం అంటే ప్లేగులాగానే ప్రజలలో భయం పోయింది."

విదేశీ కమ్యూనిస్టుల నుంచి, భారత కమ్యూనిస్టులను విడదీయాలన్న దుష్టపథకం కూడా నేరవేరలేదు. పైగా దేశ దేశాల్లోని ప్రజాతంత్ర వాదులంతా మీరట్ నిందుతులపట్ల సానుభూతి చూపారు. డిఫెన్సు కమిటీలు ఏర్పరచారు. సహాయనిధులు పోగుచేశారు

ఏడు నెలలు తరవాత కేసు సెషన్సు కోర్టుకు వెళ్ళింది. సెషన్సు కోర్టును కమ్యూనిస్టు ప్రచారానికి వేదికగా ఉ యోగించుకోవాలని ఈ కేసులోని కమ్యూని ముద్దాయిలు నిర్ణయించుకొన్నారు. ఎలాగో .. యశాస్త్రంలోని లొసుగుల ద్వారా బయటపడటం ల ్యంకాదు వీరిది. బ్రిటిషు పాలకుల నిజస్వరూపాన్ని బ బయలు చేయాలి, అందుకోసం వీరు డిఫెన్సు ఎ బిట్స్ 1406 పేజీలు ఉంచారు. రెండు నెలలపాటు డి న్సు సాక్ష ం జరిగింది. భారతదేశంలోని రాజకీయ సామాజిక ఎం తులపై, ఆనాటి తమకున్న పరిజ్ఞానంతో సమ ్పంచిన ఈ పత్రాలు, ఆ తర్వాత చరిత్రకు తోడ్పడ్డాయి

సెషన్సు కోర్టులో కిశోరీలాల్ ఘోష్, శివనాధ బెనర్జీ, డాక్టరు విశ్వనాధ్‌ముఖర్జీలను విడిచిపెట్టారు. ముజఫర్ అహ్మద్‌కు ద్వీపాంతర యావజ్జీవ శిక్ష విధింపబడింది. డాంగే, స్ప్రాట్, ఘాటే, జోగ్లేకర్, నింబ్కార్‌లకు పన్నెండుఏళ్ళ ద్వీపాంతరవాస శిక్ష విధింపబడింది. బ్రాడ్లీ, మిరాజ్‌కర్, షౌకత్ ఉస్మాన్, మీర్ అబ్దుల్ మజీద్‌లకు పదేసిఏళ్ళ శిక్ష విధింపబడింది. సోహన్‌సింగ్‌జోష్, ధరణిగోస్వామి, అయోధ్య ప్రసాద్‌లకు ఏడేసి ఏళ్ళ ద్వీపాంతరవాస శిక్ష పడింది. అధికారి, పి సి. జోషి, హచిన్‌సన్, యం జి. దేశాయ్, గోపేంద్ర చక్రవర్తిలకు ఐదేసి ఏళ్ళ ద్వీపాంతర శిక్ష విధింపబడింది. మరో ఐదుగురికి నాల్గేళ్ళ కఠినశిక్ష, మరో నల్గురికి మూడేసి ఏళ్ళ కఠిన శిక్ష విధింపబడింది.

ఈ కేసు హైకోర్టు అప్పీలుకు వెళ్ళే సమయానికి ప్రపంచ ప్రముఖులనేకులు బ్రిటిష్ ప్రభుత్వ చర్యలను ఖండించారు. వారిలో బ్రిటన్‌లోని ఆర్చిబిషప్, హెచ్. జి. వెల్సు, ఐన్‌స్టయిన్, రోమారోలా, ప్రొఫెసర్ హెరాల్డ్‌లాస్కీ మొదలైనవారు వున్నారు.

విడుదలైన తర్వాత హచిన్‌సన్ "మీరట్ కుట్ర" అనే గ్రంథం రాశాడు. అందులో భారతదేశంలోను, ఇంగ్లండులోను మీరట్‌లో విధింపబడిన శిక్షలకు అనమ్మతి తీవ్రంగా నానాటికీ పెరిగిందనీ, కామన్సు సభలో ప్రశ్నలతో ముంచెత్తారనీ తెలియచేశాడు. ఈ కేసుపై అంతర్జాతీయంగా ఆసక్తి పెరిగిందనీ, బ్రిటిష్ న్యాయ విధాన సంప్రదాయాలు బూటకమని రుజువు చేయబడిందనీ రాశాడు. దీనితో బ్రిటిష్ ప్రజానీకం ఆందోళన చెందింది, బ్రిటిష్ న్యాయంపై భ్రమలు తొలగిపోకుండా ఉండాలంటే, ఆ న్యాయాన్ని పునరుద్ధరించాలి, ఆ సంతోషదాయకమైన కర్తవ్యాన్ని అల్హాబాద్ హైకోర్టు నెరవేర్చింది.

హైకోర్టులో 9 మందిని విడిచిపెట్టారు. వారిలో హచిన్‌సన్ ఒకడు. అనుభవించిన శిక్షచాలని, వదలిపెట్టబడిన ఐదుగురిలో పి సి. జోషి, డాక్టరు గంగాధర అధికారి వున్నారు ముజఫర్ అహ్మద్, డాంగే, షౌకత్ ఉస్మానీలకు మూడేళ్ళకు తగ్గింపబడింది. ఘాట్, జోగ్లేకర్, నింబ్కార్, బ్రాడ్లే, మిరాజ్‌కర్, సోహన్‌సింగ్‌జోషీ, ధరణి గోస్వామి, మజీద్‌లకు శిక్షలు ఒక సంవత్సరం తగ్గింపబడ్డాయి. స్ప్రాట్‌శిక్ష రెండేళ్లు తగ్గింపబడింది.

1933 ఆగసు 3 తో ముగిసిన ఈ సుదీర్ఘ విచారణపై ప్రొఫెసర్ లాస్కీ ఇలా రాశాడు.

"బ్రిటిష్ ఇండియా చరిత్రలో మీరట్ కేసు హృధయవిదారక సంఘటన అనేక సంవత్సరాలు నిందితులు పౌర జీవనం నుంచి వేరుచేయబడ్డారు. వారి నేరమల్లా మామూలు ట్రేడ్‌యూనియన్ కారక్రమాన్ని సాగించడం. ఈ దేశంలో (బ్రిటన్‌లో రాజకీయాందోళన దైనందిన జీవనసరళి. ఆ పద్ధతిలో వీరూ పనిచేయడం వీరి నేరం. బ్రిటిష్ సోషలిసుల అభిప్రాయంలో ప్రాసిక్యూషన్ ప్రారంభంలోనే నేరారోపణ నీచమైన నిందలతో కూడి వుంది. దాన్ని కొనసాగించడం అవమానకరం. ఈ రకంగా ప్రవర్తించే ప్రభుత్వం తనపై తానే నేరం ఆపాదించుకొంటుంది. అది భయంతో ప్రవర్తించుతోంది. హింసాత్మకంగా పనిచేస్తోంది. ఏ ప్రభుత్వానికైనా తనను సమర్థించు

కోవాలంటే, దానికి ఉదారబుద్ధి అవసరం. కాని దీనికా శక్తిలేదు."

తమ సిద్ధాంతాన్నీ, బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా తాము చేసిన చర్యల్నీ, డిఫెన్సులో కమ్యూనిస్టులు సమర్థించుకొంటూ రాసిన సుదీర్ఘ పత్రాలను, చేసిన ప్రసంగాలను ప్రభుత్వం బయటకు రాకుండా తొక్కిపెట్టింది. 1929-31 సంవత్సరంలో శాసనోల్లంఘనోద్యమం వెల్లువ, ఇతర రాజకీయ సంఘటనల మాటు ఈ కేసు కొంతవరకు ప్రజల దృష్టినుంచి మరుగు పడింది.

## చిటగాంగ్ వీరులు

ఉప్పు సత్యాగ్రహ పరిధినిదాటి దేశంలో జరిగిన కొన్ని సమరశీల సంఘటనలను ఇదివరలో ప్రస్తావించాం. శాసనోల్లంఘనోద్యమ ప్రారంభకాలంలో చిటగాంగ్‌లో శత్రుసైనిక శిబిరంపై జరిగిన దండయాత్ర గురించి, ఆ చిటగాంగ్ వీరుల గురించి కొంత తెలుసుకొందాం.

డాక్టరు పట్టాభిగారి కాంగ్రెస్ చరిత్రలో ఒక అంశానికి వివరణాత్మకమైన అథోపీఠికగా ఈ చరిత్ర వివరింపబడింది. అందులో "ఉద్యమ ప్రారంభదశలో చిట్టగాంగ్ సైనిక శిబిరముపైన ఒక దండయాత్ర జరిగెను అందులో కొంతమంది భారతీయ యువకులు సైనిక దుస్తులతో పోయి చిట్టగాంగ్ సైనికులను కొందరిని కాల్చివేసిరి. ఇందుకు భయంకరములైన ప్రతిక్రియలు చేయబడెను. 1921లో ఐర్లాండు దేశమునందలి బ్లేక్ అండ్ టాన్సు (Black and Tans) కార్యక్రమముల నవి జ్ఞాపకము చేసెను"

చిటగాంగ్ విప్లవవాదులు అక్కడ సైనిక ఆయుధాగారంపై సాగించిన దాడి, భీకర పోరాటం మన జాతీయోద్యమ చరిత్రలో ఒక మహత్తర సాహసగాథ. ఆనాటి పోరాట సంఘటనలు నేటికీ, మనల్ని ఉత్తేజపరుచుతున్నాయి.

తూర్పు బెంగాలులోని ఒక రేవుపట్టణం చిటగాంగ్. ఇపుడు ఈ పట్టణం బంగ్లాదేశ్‌లో వుంది. చిటగాంగ్‌లో జరిగిన స్వాతంత్ర్య పోరాటసాహసగాథను మామూలు చరిత్రకారులు ఏదో "దాడి"గా "విప్లవవాదుల దౌర్జన్య చర్య"గా మాత్రమే వర్ణించి దాని ప్రాముఖ్యాన్ని తగ్గించ చూశారు. ఐతే చిటగాంగ్ పర్వత ప్రాంతం నుంచి తాత్కాలికంగానైనా బ్రిటిష్ పెత్తనాన్ని తొలగించడం మన స్వాతంత్ర్య ఉద్యమ చరిత్రలో మరపురాని ఉజ్జ్వల ఘట్టం. 'దాడి' అనీ "దౌర్జన్యవాదచర్య" అనీ దాని ప్రాముఖ్యాన్ని తగ్గించడానికి కొంత ప్రయత్నం జరిగిన మాట వాస్తవమే. కాని ఆనాటి భారత విదేశాంగ మంత్రి, బ్రిటిష్ కన్సర్వేటివ్ పార్టీలో కరుడు గట్టినవాడూ ఐన సర్ శామ్యూల్ హోర్ దాన్ని "చిటగాంగ్ తిరుగుబాటు" అని అనక తప్పలేదు.

చిటగాంగ్ తిరుగుబాటు లాంటిది, ఇది వరకెన్నడూ జరగలేదు. దీని ఫలితాలు తర్వాత స్వాతంత్ర్య ఉద్యమాన్ని ఎంతో ప్రభావితం చేశాయి.

అది 1930 ఏప్రిల్ 18వ తేదీ. ఆ రోజున సారి తూర్పు బెంగాల్‌లో సైనిక ఆయుధాగారాల దాడులు సాగించాలని పథకం. ఇంతవరకూ బ్రిటిష ప్రభుత్వం దృష్టిలో విప్లవవాదులంటే, కొంతమంది దౌర్జన్యవాదులనీ, ఏవో హత్యలు, దోపిడ్లు సాగించే ముఠాఅనీ, బాంబుల్నీ, మారణాయుధాల్నీ పరిమితంగా తయారు చేయగల వారనీ మాత్రమే ఒక భావం వుండేది. అంతేగాని ఒక ఆయుధాగారంపై సాహసంతో దాడి చేయగలరనిగానీ, వ్యూహాత్మకంగా ముఖ్యమైన ప్రభుత్వ భవనాలపై దాడి చేయగలరనిగానీ, టెలిగ్రాఫ్ ప్రసారాలను, రైల్వేరాకపోకల్నీ భగ్నంచేయ గలరనిగానీ, సెంట్రల్ టెలిఫోన్ భవనాన్ని తగుల బెడతారనికానీ వారు భావించలేదు. ఒక చిన్న స్కూలు ఉపాధ్యాయుని నాయకత్వాన గల యువ విప్లవకారులు కృత నిశ్చయంతో హఠాత్తుదాడి సాగించగలరని కానీ ఊహించలేదు.

ఈ తిరుగుబాటు పథకాన్ని అతి రహస్యంగానూ, అత్యంత జాగరూకతతోనూ సాగించారు. ప్రభుత్వ గూఢచారులు దాన్ని ఏమాత్రం పసిగట్ట లేకపోయారు. చిటగాంగును విదేశీ బానిసత్వం నుంచి విముక్తిచేసి తాత్కాలిక స్వతంత్ర విప్లవ ప్రభుత్వాన్ని నెలకొల్పాలని విప్లవవాదుల నాయకుడు సూర్యసేన్ నాయకత్వాన ఒక పథకం వేశారు. బెంగాల్‌రాష్ట్రాన్ని లేదా యావత్ భారతాన్ని విముక్తి చేయాలని ఆశయం. దానికై విద్యార్థులకు, యువకులకు ఒక ఉదాహరణను ఏర్పరచడం, బ్రిటిష్ వాళ్ళ మనోనిబ్బరాన్ని చెదరగొట్టడం వారి లక్ష్యం.

వీరి పథకాన్ని గురించి ముఖ్యమైన అగ్ర నాయకులకు తప్ప మామూలు కార్యకర్తలెవరికీ తెలియదు. ఐతే మరణానికి సన్నద్ధమై ఉండాలని నాయకులు చెప్పేమాటలు కార్యకర్తలకు కుతూహలాన్ని రెకెత్తించాయి. అదిగమనించి "మృత్యుకార్యక్రమం" అంటూ వాళ్ళకు చెబుతూ వుండేవారు. ఈ కార్యక్రమంలోని ప్రధాన అంశాలివి.

1. హఠాత్తుగా దాడిచేసి, చిటగాంగ్‌లోని రెండు ఆయుధాగారాలను వశపరచుకోవడం. దానితోపాటు శతృవులు, తమ వాళ్ళను సమీకరించుకొనకుండా చేయడం.

2. పట్టణంలోని వారంతా ఒకరికొకరు టెలిఫోను చేసుకొనే కేంద్రమైన, కేంద్ర టెలిఫోన్ ఆఫీసునూ, చిటగాంగ్‌కూ వెలుపల దానితో దేశమంతటినీ కలిపే కేంద్ర టెలిగ్రాఫ్ బిల్డింగునూ ఆక్రమించి పూర్తిగా నాశనం చేయడం.

3. రైల్వే లైన్ల ప్రక్కనే వున్న టెలిగ్రాఫ్ తీగెల్ని కత్తిరించి, రైల్వేమార్గాలను నాశనంచేసి, చిటగాంగ్‌కూ, ఇతర జిల్లాలకూ సంబంధం లేకుండా చేయడం. ఆ విధంగా సమాచారం పంపుకోడానికిగాని, సైనికులను పంపుకోడానికిగాని వీలు లేకుండా చేయడం.

4. సాధ్యమైనంత ఎక్కువ మంది ఇంగ్లీషు ఆఫీసర్లను అదుపులోకి తీసుకోవడంగాని, లేదా వారిని బందీలుగా ఉంచుకోవడం, వారు ప్రతిఘటించే పక్షంలో ఇంగ్లీషువారిని పూర్తిగా తుడిచిపెట్టడం.

ఈ పనులన్నీ నిర్వర్తించడానికి తర్ఫీదు పొందిన కార్యకర్తల్ని నియమించారు. నల్గురేసి ఉన్న రెండు జట్లు రైలుమార్గాలని విచ్ఛిన్నం చేయడానికి, తంతి తీగలు తెంచివేయడానికి నియమింప బడ్డాయి. చిటగాంగ్‌కు 80 మైళ్ళలో ఉన్న ధూమ్ రైల్వే షన్ వ , 60 మైళ్ళదూరంలో ఉన్న ఫెనీ రైల్వే షన్ వ ఈ పని అమలు జరపవలసి వుంది. చిటగా గ్‌కు దా _ మధ్యగా వున్నసెంట్రల్ టెలిగ్రాఫ్ టెలిఫోన్ ఆఫీసులను, మరో రెండు ఆయుధాగార కేంద్రాలను. యూరోపియన్ క్లబ్బును వశపర్చుకోడానికి ఆరుగురు చొప్పున ఉన్న నాల్గుజట్లు నియమింపబడ్డాయి;

మరో 30 మంది విప్లవ కార్యకర్తలను ప్రత్యేకంగా ఏరి, ఆరుముఠాలుగా విడగొట్టారు. సాయుధులై పూర్తిగా తయారై రాత్రి తొమ్మిదీ ముప్పావుకల్లా నిర్ణీత స్థలాలకు వెళ్ళాలని ఆదేశించారు. పోలీసు ఆయుధాగారం ఉన్న స్థలానికి 200 గజాల దూరంలో వున్న అడవి గార్డెన్‌లో ఒకరి కొకరు దూరంగా కనిపించకుండా దాక్కున్నారు. ముందుగా నిర్ణయించిన రహస్య నినాదాలు గనుక వినపడకపోతే లైటుతో చేసే సాంకేతాలు గనుక కనబడకపోతే, పదిన్నరకు శాంతియుతంగా ఎవరికి వాళ్ళు వెళ్ళిపోవాలని నిశ్చయింపబడింది. సిగ్నల్స్ కనపడినా, నినాదాలు వినపడినా ఆ ప్రదేశాలకు వెంటనే పరిగెత్తుకొని వచ్చి చేరాలి.

పోలీసు ఆయుధాగారం పట్టణానికి వాయువ్యంగా చిన్న కొండపైన వుంది. పక్కనే ప్రధాన రహదారి వుంది. ఈ కేంద్ర పోలీసు ప్రధాన కార్యాలయంలో 500 మంది పోలీసులు వుండేవారు. జిల్లాలో ఏ అవాంతరం వచ్చినా ఇక్కడి నుంచి వెళ్ళేవారు. వీళ్ళకి ఒక ఆయుధగారం కూడా వుంది.

ఏప్రిల్ 18 న సరిగ్గా 10 గంటలకు ఒక కారులో సైనిక ఉద్యోగులులాగ వేషం వేసుకుని కొండపై ఆయుధాగారం వద్దకు వెళ్ళే మెట్ల వద్దకు వెళ్ళారు. వాళ్ళెవళ్ళో పెద్ద ఆఫీసర్లనుకుని సెంట్రీ సలాం పెట్టాడు. అతణ్ణి కాల్చివేశారు. మిగతా ఐదుగురు సెంట్రీలు వరండాలో విశ్రాంతి తీసుకుంటున్నారు. వాళ్ళే కాల్పులు చూడగానే ఎక్కడి వాళ్ళక్కడ పారిపోయారు. తర్వాత తూటాలు లేని ఉత్త తుపాకులు పేల్చగా 500 మంది పోలీసులు కాళ్ళకు బుద్ధిచెప్పారు. విప్లవవాద సైనికులు మొత్తం ఆయుధాలను వశపరుచుకొన్నారు

నినాదాలు వినబడగానే, సంకేతాలు కనబడగానే అడవులో దాగివున్నవాళ్ళు వచ్చారు. కింది కారులో వున్న సామాగ్రితో ఆయుధాగారం తలుపులు బద్దలు కొట్టి, 500 రైఫిళ్ళు, డజన్లకొద్దీ రివాల్వర్లు వశపరుచుకొని విప్లవవాదులకు పంచిపెట్టారు.

అదే సమయాన ఆగ్జిలియరీ ఫోర్సు ఆయుధగారాన్ని వశపరుచు కొన్నారు. అక్కడిలాగే ఇక్కడ సెంట్రీ కూడా వారిని పెద్ద ఆఫీసర్లు అనుకొని శాల్యూట్ చేశాడు. అతన్ని విప్లవవాదులు చంపివేశారు. పరుగెత్తిపోతున్న మిగతా సెంట్రీలలో మరొకణ్ణి చంపివేశారు, ఇక్కడ జరిగిన దాడిలో సార్జెంట్ మేజర్ ఫారెల్ చనిపోయాడు. 303 సైనిక

రైఫిళ్ళు కొన్ని లూయీగన్లూ, అనేక రివాల్వర్లు వశమయాయి. ఐతే గుళ్ళు వగైరా ఎక్కడ ఉన్నాయో తెలియలేదు. అందుచేత ఒకటి రెండు రైఫిళ్ళు, రివాల్వర్లు మాత్రం తీసుకుని, తక్కిన వాటిని నాశనం చేశారు. అలాగే ప్రేలుడు పదార్థాలున్న గదిని పెట్రోలుతో తగలబెట్టారు. ముందు అనుకున్న ప్రకారం అందరూ పోలీసు ఆయుధాగారం వద్దకు చేరారు.

టెలిఫోను సెంటర్‌ను నాశనం చేయడానికి వచ్చిన జట్టు రివాల్వర్లు చూపి బెదిరించి ఉద్యోగుల్ని బయటకు పంపారు. టెలిఫోన్ బోర్డును నాశనం చేసి తగులబెట్టారు. తర్వాత వీరు పోలీస్ కర్మాగారం వైపు వెళ్ళారు.

రైల్వే లైన్ల విచ్ఛిన్నం చేసేవారు కూడా ఇచ్ఛితంగా పది గంటలకే పని చేయనారంభించారు. కొండల పక్కన, మనుష్య నివాసం లేని చోటు అవటం వల్ల వాళ్ళపని సులభంగానే అయింది. ఆ రాత్రే పదిన్నర గంటలకు రైల్వే లైన్లవిధ్వంసం అవడం మూలంగా ధూమ్ స్టేషన్ వద్ద ఒక గూడ్సుబండి పడిపోయింది.

ఐతే యూరోపియన్ క్లబ్‌పై దాడి విఫలమైంది. దాడి చేయడానికి వెళ్ళినపుడు ఎవ్వరూ అక్కడలేరు. ఒక కానిస్టేబుల్ ద్వారా దాడి వార్తలు విన్న జిల్లా మేజిస్ట్రేట్ ఆగ్నిలరీ ఫోర్సు ఆయుధ కర్మాగారం వద్దకు, ప్రతిఘటన ఏర్పాటు చేసేందుకై వెళ్ళాడు. తిరుగుబాటుదారులు ఇతన్ని గుర్తించి కాల్పులు జరిపారు. అతని డ్రైవర్ చనిపోయాడుగాని, మేజిస్ట్రేటు తప్పించుకొన్నాడు. యూరోపియన్ కుటుంబాలన్నింటినీ బంగాళాఖాతం లోని పడవల్లోకి చేర్చాడు. నౌకల్లోని వైర్లెస్‌ద్వారా కలకత్తా అధికారులకు సైనిక సహాయం పంపవలసిందిగా కోరాడు.

ఈలోగా పోలీసు ఆయుధాగారం వద్ద, ధూమ్ ఫెని జట్టులు తప్ప తక్కినవారంతా చేరారు. మాష్టర్, సూర్యసేన్ అక్కడికి చేరాడు. "ఇండియన్ రిపబ్లికన్ ఆర్మీకి" చెందిన "చిటగాంగ్ బ్రిగేడ్" గా ఇదివరలో విప్లవవాదుల సైనాలకు పేరు పెట్టారు. ఆ సైన్యం సూర్యసేన్‌కి సైనిక వందనం చేసింది. జాతీయ పతకాన్ని స్థాపించి, తన ఆధిపత్యాన తాత్కాలిక స్వాతంత్ర ప్రభుత్వాన్ని ఏర్పరచినట్లు ఆయన ప్రకటించాడు. రానున్న బ్రిటిష్ దాడినుంచి కాపాడటానికి ఈ స్వతంత్ర ప్రభుత్వానికి సాయం చేయవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేశాడు. విరివిగా ఈ విజ్ఞప్తిపత్రాల్ని పంచడానికి పథకం వేశారు.

చిటగాంగ్ రేవులో అత్యవసర పరిస్థితుల్లో ఉపయోగించడానికి వుంచిన మెషిన్‌గన్లలో కొందరు తప్పించుకున్న బ్రిటిష్ ప్రభుత్వ ఆఫీసర్లు, మునిసిపల్ వాటర్ టాంక్ ఎక్కి, పోలీసు ఆయుధాగారం వద్ద వున్న తిరుగుబాటు దార్లపై కాల్పులు సాగించారు. ఇటువైపు నుండి కూడా తీవ్రంగా ఎదురు కాల్పులు సాగాయి. మెషిన్‌గన్ మోత మళ్ళా వినబడలేదు.

పోలీసు ఆయుధాగారాన్ని విడిచిపెట్టి వెళ్ళాలని తిరుగుబాటు సైన్యాలు నిశ్చయించాయి. సాధ్యమైనన్ని రివాల్వర్లను, మందుగుండు సామగ్రినీ ప్రతి సైనికుడు తీసుకువెళ్ళాలనీ మిగతాది నాశనం చేయాలనీ నిశ్చయించారు. ఆయుధాలున్న భవనానికి నిప్పుపెట్టారు.

హిమాంగ్‌సేన్ (అండూ) ఈ సందర్భాన తీవ్రంగా గాయపడ్డాడు. అతన్ని నల్గురు ఆమె తల్లివద్దకు చేర్చారు. కాని ఈ నల్గురూ తిరుగుబాటు సైన్యాన్ని చేరుకోలేకపోయారు.

అపుడు సూర్యసేన్ నాయకత్వాన ఈ ప్రాంతాన్ని విడిచి, పట్టణ శివారులలోని కొండప్రాంతాలకు వెళ్ళారు. శత్రుసేనలకోసం నిరీక్షిస్తూ కూచున్నారు. ఏప్రిల్ 22 న వేలాది సైన్యం అక్కడికి చేరుకొంది. సూర్యసేన్ నాయకత్వాన ఉన్న తిరుగుబాటు సైనికులు ఉండే ప్రదేశాన్ని జలాలాబాద్ అంటారు. జలాలాబాద్ కొండల్ని ప్రభుత్వ సైనికులు చుట్టుముట్టారు. పైకివెళ్ళాలని ప్రయత్నించారు. కాని తిరుగుదాడిలో సూర్యసేన్ సైనికులు వారి ప్రయత్నాలను విఫలం చేశారు. మరో రెండుసార్లు తీవ్రనష్టాలతో శత్రువు పలాయనం చిత్తగించాడు. తర్వాత ప్రభుత్వ సైన్యాలు జలాలాబాద్‌కన్నా ఎత్తయిన పర్వతాలపైకివెళ్ళి మెషిన్‌గన్‌లతో సూర్యసేన్ అనుయాయులపై గుళ్ళ వర్షం కురిపించారు 12 మంది స్వాతంత్ర్యయోధులు మరణించారు. సాయంత్రానికి తమవారిలో 83 మంది శవాలను అక్కడ వదిలేసి ప్రభుత్వ సైన్యాలు హడావిడిగా వెనక్కి వెళ్ళిపోయాయి.

జలాలాబాద్ పోరాటంలో ఈ క్రిందివారు అమర వీరులయ్యారు : హరిగోపాల్‌బాల్ (టేగ్రా), నిర్మల్ లాలా, త్రిపురసేన్, బిందుభూషణ్ భట్టాచార్జీ, ప్రభాస్

బాల్. శశాంకదత్తా, మధుసూదన్ దత్తా, నరేష్‌రాయ్, ఫణీన్‌ఘోష్, మాటికనుంగో, జితేంద్రదాస గుప్త, అర్ధేందు దస్తీదార్.

తమవద్దనున్న పోలీసు తుపాకులతో, అధునాతన ఆయుధాలున్న సైనికుల్ని ముఖాముఖి ఎదిరించటం వల్ల లాభంలేదని, గెరిల్లా పద్ధతులు అవలంబించాలని సూర్యసేన్ నిశ్చయించాడు. బాగా నమ్మకమున్న గ్రామాలకు తన అనుచర సైన్యాలతో వెళ్ళాడు. తమ పట్ల ప్రగాఢ సానుభూతి గల కుటుంబాల ఇళ్ళలో రహస్య జీవితం సాగించారు. అలాంటి గ్రామాలు మహావుంటే, రెండు డజన్లకు మించివుండవు. దాదాపు మూడేళ్ళ తిరుగుబాటు సైన్యాలు ఆ గ్రామాల్లో వుండి పోయాయి. చిన్న చిన్న ముఠాలుగా విడిపోయి మారు వేషాలతో చిటగాంగ్ పట్టణంలోని వివిధ కేంద్రా లలో బ్రిటిష్ సైనికులపైన, వారి ఉద్యోగులపైన దాడిచేసేవారు. ఒకటి రెండుసార్లుతప్ప జయప్రదంగా తమపని ముగించుకొని తిరిగి గ్రామాలకు వెళ్ళేవారు. ప్రభుత్వానికి ఈ గ్రామాల్లో వీరున్నట్లు తెలిసింది. వేలాదిమంది సైనికులతోను, పోలీసులతోను ఈ గ్రామాలను చుట్టుముట్టి సోదాచేసినా ఏమీ ఆచూకీ లభించలేదు. విప్లవవాదుల ప్రాణరక్షణకు హిందూ, ముస్లిం స్త్రీలు ఎంతో సాహసంతో వీరి ప్రాణాల్ని కాపాడుతూ వచ్చారు.

ఏప్రిల్ 22 న జలాలాబాద్‌లో పగలు పోరాటం జరిగింది. ఇందులో పాల్గొన్నారని అనుమానింపబడిన నల్గురిని ఫెనీ రైల్వేస్టేషన్‌లో కలకత్తా వెళ్ళే రైలులో కూర్చుని వుండగా అరెస్టు చేశారు. తమను చుట్టు ముట్టిన సాయుధ దళాలపై హఠాత్తుగా దాడిచేసి వలయం ఛేదించుకొని వారు చీకటిలోకి పారిపోయారు. విడివిడిగా వెళ్ళి తిరిగి కలకత్తాలో కలిశారు.

వీరెక్కడవుందీ తెలిసికోడానికీ, చిటగాంగ్‌లో ప్రజల మనోభావాలు ఎలావుందీ తెలిసికోడానికీ సూర్య సేన్ 16 ఏళ్ళ బాలుడు అమరేంద్ర నందిని ఏప్రిల్ 20 న కొండపైనుంచి పట్టణానికి పంపాడు. అమరేంద్ర మంచి తెలివితేటలు గల యువకుడు. ఎవరి కంటా పడకుండా పట్టణం చేరుకోగల్గాడు. అతనువున్న సాదర్‌ఘాట్ ప్రాంతమంతా పోలీసులు చుట్టబెట్టారు. ఒక కల్వర్టులో దుబ్బుల చాటున దాగినా పోలీసుల కంటపడ్డాడు. శత్రువుల చేతిలో పడకూడ దని నిశ్చయించుకొన్న అమరేంద్ర రివాల్వర్‌తో కాల్చుకొన్నాడు.

స్థానిక కాలేజీలో మొదటి సంవత్సరం చదివే విద్యార్థులు ఆర్గురు తమకు ఏదైనా కార్యక్రమం చూపించవలసిందిగా సూర్యసేన్‌కు పదే పదే ఉత్త రాలు పంపుతూవుండేవారు. తగు కార్యక్రమం ఇచ్చే దాకా ఆగవలసిందని సూర్యసేన్ వారిని వారించాడు. ఐనా వీరు ఉండబట్టలేక తమలో తాము చర్చించుకొని సాదర్‌ఘాట్ డాక్ వర్కుషాప్ సమీపంలోని యూరో పియన్ల నివాసప్రాంతంపై దాడిచేయ నిశ్చయించారు. వారి తీవ్రవాంఛను అరికట్టడం సాధ్యంకాదని సూర సేన్ అంగీకరించాడు. 1930 మే 6 న వారు వ ణంలోకి వచ్చారు. వారిని త్వరలోనే పోలీసు చూశారు. ఒక గ్రామానికి తిరిగి వెళ్ళదలచినవారిని ఆ సాయంత్రం అంతా తరిమి తరిమి వెంటాడుతూనే వున్నారు. చివరకు ఒక బోటుపై వెళ్ళి కాలార్‌పోల్ అనేచోట ఇద్దరు దొరికిపోయారు. అక్కడి గ్రామ స్థులు వారికి సానుభూతిపరులు గాదు. మిగతా వారు రోడ్డు ప్రక్కనవుండే పొలాల్లో దాక్కున్నారు. రాత్రంతా వెతికినా వారు చిక్కలేదు. మరునాడు పోలీ సుల కంటపడ్డారు. సైన్యాలు చుట్టుముట్టాయి. ఆయు ధాలు పారవేసి లొంగిపొమ్మని సైన్యాలు కోరాయి. కాని అలాచేయక ఎదురెదురు కాల్పుల్లో నల్గురూ చని పోయారు. రజిత్‌సేన్, మనోరంజన్‌సేన్, స్వదేశీ రాయ్, దేవీప్రసాద్‌గుప్తా ఆ విధంగా బ్రిటిష్ సైన్యా లతో వీరోచితంగా పోరాడుతూ అసువు లర్పించారు.

న్యాయం, చట్టం, అంతర్జాతీయ శాసనాలు - అన్నీ ఉల్లంఘించడానికి బ్రిటిష్ ప్రభుత్వం వెనకాడదనడానికి ఫ్రెంచి వలస చంద్రనగర్‌పై చేసిన దాడి స్పష్టం చేస్తుంది.

కలకత్తాకు 20 మైళ్ళ దూరంలో వుంది చంద్ర నగర్. ఇక్కడ చిటగాంగ్ విప్లవకారులు ఒక ఇంట్లో దాక్కున్నారు. సెప్టెంబరు 2 న కలకత్తా పోలీసు కమీ షనర్ - ఇంగ్లీషువాడు - అంతర్జాతీయ న్యాయ సూత్రాలన్నిటినీ ఉల్లంఘించి స్థానిక అధికారులకు సైతం చెప్పకుండా, ఒక ఇంటిని చుట్టుముట్టాడు. అక్కడ జరిగిన సాయుధ ఘర్షణలో మఖన్‌ఘోషాల్ చనిపోయాడు. భార్యాభర్తలుగా నటిస్తున్న సుహాసినీ గంగూలీ, శశిధరఆచార్య, మరో ముగ్గురు తిరుగుబాటు

సైనికుల్ని కమిషనర్ తీవ్రంగా చావబాది అరెస్టు చేశాడు.

1930 నవంబరులో బెంగాల్ పోలీసు ఉన్నతాధికారి క్రెయిగ్ చిటగాంగ్ ప్రజలను క్రూరంగా హింసించడానికి అన్ని బందోబస్తులు చేసి, నవంబర్ 30 న, కలకత్తా వెళ్ళే రైలులో ఎక్కి కూర్చున్నాడు. చందాపూర్ స్టేషన్‌లో దిగి, అతడు స్టీమర్‌లో ప్రయాణం చేయాలి. అతన్ని యిద్దరు యువకులు వెంటాడుతూ వచ్చారు డిసెంబర్ 1వ తేదీ-మంచు బాగాపట్టివుంది. క్రెయిగ్ ప్రయాణం చేసిన పెట్టెలోంచి దిగిన ఒక వ్యక్తిని వీరు కాల్చి చంపారు. అతడు క్రెయిగ్ కాదు. తరణీముఖర్జీ అనే ఇనస్పెక్టర్, అంతా సవ్యంగా వుందో లేదో బయటికివెళ్ళి చూసి రావలసిందిగా క్రెయిగ్ అతణ్ణి పంపాడు. ఆ ఇద్దరు యువకుల్నీ అరెస్టు చేశారు. విచారణతంతు జరిపి, చిటగాంగ్ కాలేజీలో సైన్సు విద్యార్థి రామకృష్ణ విశ్వాస్‌కు మరణశిక్ష విధించారు. 1931 మేలో అతడు ఉరితీయబడ్డాడు.

ఆయుధాగారంపై దాడి మొదటి కేసు 1930 సెప్టెంబరులో ప్రారంభమైంది. 32 మంది ముద్దాయిలు చిట్టగాంగ్ జైల్లో మగ్గుతున్నారు. రహస్యంగా వున్న సూర్యసేన్, జైలులో వున్న వాళ్ళ నాయకులూ కలిసి, విచారణలో వున్న ఈ ఖైదీల విడుదలకు ఒక పథకం వేశారు. జైళ్ళ గోడలు పడగొటాలనీ, అదే సమయంలో చి గాంగ్ పట్టణంలో అనేక చోట్ల మందుపాతరల దా రా ప్రేలుళ్ళు జరిపి పరిపాలనను స్తంభింపచేయాల ఈ పథకం. ఇందుకోసం ఆయుధాలు, మందుగుండు సామగ్రీ రహస్యంగా పట్టణంలో తయారు చేయబడ్డాయి. ఆ రోజుల్లో ఉదయం మొదలు సాయంత్రందాకా కర్ఫ్యూ వుండేది. ఐనా జయప్రదంగా మందుపాతర్లు వివిధ ప్రదేశాలలో పాతిపెట్టబడ్డాయి. అనూహ మైన పరిస్థితులు సంభవించినందునా, కొంతవరకు ఎకారుల కొద్దిపాటి నిర్లక్ష్యం వల్లా ఈ పథకమం విఫలమైంది.

అసనుల్లాఖాన్ అనే క్రూరుడైన పోలీసు ఆఫీసరు వుండేవాడు. తనను గాయపరచేవాడెవడూ పుట్టలేదని ప్రగల్భాలు కొట్టేవాడు. అతని కామవాంఛకు అంతూ పొంతూ లేదు. అతనిపై సూర్యసేన్‌కు అనేకమంది ఫిర్యాదు చేశారు ఆగస్టు 31 న ఫుట్‌బాల్ గ్రౌండులో లక్షమంది ప్రేక్షకుల సమక్షంలో ఈ కిరాతకుడు హత్యచేయబడ్డాడు. ఒక పదమూడేళ్ళ బాలుడ్ని పట్టుకుని యావజ్జీవ శిక్ష విధించారు.

దాసానుదాసుడైన తమ పోలీసు ఆఫీసరు మరణానికి రెచ్చిపోయిన బ్రిటిష్ ఆఫీసర్లు, ముస్లిం ఆఫీసర్నిచంపారనే వంకతో హిందూ-ముస్లింల కలహాలను రేకెత్తించవలసిందిగా ముస్లిం యువకులను ప్రేరేపించారు కాని వారెవరూ అందుకు సిద్ధంకాలేదు. డి స్ట్రిక్టు మేజిస్ట్రేట్, పోలీసు ఆఫీసరు స్వయంగా ద రలోవున్న బెంగాల్ జాతీయ దినపత్రిక "పాంచజ న్య" కార్యాలయాన్ని, ప్రెస్‌నూ, యంత్రాలనూ సుత్తులతో బాది ధ్వంసం చేశారు దేశప్రియ జె.యం. సేనుగు ప్త దీనిపై హిందూ-ముస్లిము ప్రజలనుంచి సాక్ష్యం సేకరించి, ఫొటోలు తీసి, వాటిని ఇంగ్లండులో ప్రజలకు చూపాడు.

మొదటి ఆయుధాగారంపై దాడి కేసు మార్చి 1 న ముగిసింది. 32 మందిపై కేసు నడపగా, అందులో 12 మందికి శిక్షలు పడ్డాయి. కొందరికి యావజ్జీవ శిక్ష, మరికొందరికి దీర్ఘకాల శిక్షలు పడ్డాయి. విడుదలైన వారిని కూడా వదలకుండా డిటైన్ చేశారు. 1938 లో కాని వారు విడుదల చేయబడలేదు.

1932 జూన్‌లో సూర్యసేన్, చిట్టగాంగ్ అగ్ర నాయకుడైన నిర్మల్‌సేన్, ధల్‌ఘాట్ అనే గ్రామంలో ఉంటున్నారు. సూర్యసేన్ ఆదేశం మేరకు ఒక గరల్స్ స్కూల్ హెడ్‌మిస్ట్రెస్ అయిన విప్లవనారి ప్రీతిలత వద్దదార్ అక్కడికి వచ్చింది. 13 వ తేదీ సాయంత్రం హఠాత్తుగా సైన్యాలు ఆ యింటిని చుట్టుముట్టి ఇం ప్రవేశింప చూచాయి. సాయుధ సంఘర్షణలో నికోద్యోగి చనిపోయాడు. విప్లవవాదులు నిర్మల్‌సే , అపూర్వసేన్ వీరమరణం చెందారు. సూర్యసేన్, ప్రీతిలత పోలీసు వలయం ఛేదించుకొని పారిపోయారు.

చిటగాంగ్ ఆయుధాగారంపై దాడి సందర్భంగా యూరోపియన్ క్లబ్‌పై దాడికి ప్రయత్నించిన విషయం తెలిసిన బ్రిటిష్ సైనికులు తమ క్లబ్బును "పహార్‌తలి"కి మార్చారు. అక్కడనుంచి చుట్టుపట్ల గ్రామాలకు వెళ్ళి స్త్రీలను, పురుషుల్ని, పిల్లల్ని క్రూరంగా హింసించేవాళ్ళు. ఇళ్ళన్ను కూడా తగులబెట్టేవాళ్ళు. దీనికి ప్రతీకారంగా కుమారి ప్రీతిలత

నాయకత్వాన 8 మంది యువకులు పహార్‌తలి యూరోపియన్ క్లబ్బుపై దాడిచేశారు. 1932 సెప్టెంబరు 24 రాత్రి 9 గంటలకు జరిగిన మెరుపుదాడి మూడు నాల్గు నిమిషాలకన్న ఎక్కువలేదు. క్లబ్బును చుట్టుముట్టి, ప్రతి ద్వారం ముందు, కిటికీ ముందు సన్నద్ధమయ్యారు నాయకులు సిగ్నల్ ఇవ్వగానే భయంకరమైన దాడి సాగించారు. అంతకుముందే కాపలావాళ్ళు, సైనికులు తోకముడిచారు. లోపలవారు చాలామంది చనిపోయారు. ప్రీతిలత సంజ్ఞ చేసిన చోటుకు వచ్చి, ముట్టడిదార్లు ఆమె సూచనల మేరకు తిరుగుముఖం పట్టారు. వారు చాలాదూరం పోయాక ప్రీతిలత పొటాషియం సైనేడ్ తీసుకుని, శత్రువులకు చిక్కకుండా మరణించింది. ఆమె దుస్తులలో భారత మహిళలకు చేసిన ఒక విజ్ఞప్తి పత్రం, ఆ తర్వాత వచ్చిన పోలీసులకు, సైనికులకు దొరికింది. మాతృదేశ విముక్తికై మహిళలు బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాయుధ పోరాటం సాగించాలని ఆమె విజ్ఞప్తి చేసింది.

1932 ఫిబ్రవరి 16 న గొయిరాలా గ్రామంలో సూర్యసేన్ అరెస్టయాడు. డబ్బుకి ఆశపడిన నేత్రాసేన్ అనే తుచ్ఛుడు సూర్యసేన్ ఆచూకీని తెలియ చేశాడు. ఉదయం 9 గంటలకు సూర్యసేన్ వున్న ఇంటిని చుట్టుముట్టారు. కుమారి కల్పనాదత్ (ఈమె విడుదలైన తర్వాత, కమ్యూనిస్టుపార్టీలో చేరింది, కమ్యూనిస్టుపార్టీ నాయకుడు పి. సి. జోషీని వివాహమాడింది. కల్పనా జోషి చిటగాంగ్ వీరుల ఒక గ్రంథాన్ని కూడా రాసింది) తదితరులు రలో వున్న అడవిలోకి పారిపోయారు. దురదృ వ త్తు సూర్యసేన్ ఆ అడవిలో చీకటిలో ఒక గూ సైని కునికి గుద్దుకొన్నాడు. అతడు సూర్యసేన్‌ని ఎ కొని సహాయంకోసం అరచాడు, సూర్యసేన్ తన తుపాకిని ఉపయోగించే అవకాశం లేకుండా పోయింది. పోసీ సహాయం కోసం అరవడానికికూడా వీలులేకపోయింది. వారిద్దరిపైన బ్రిటిష్ సైనికులు ప్రయోగించిన లైట్ల వెలుతురు పడింది.

కొన్నిరోజుల తర్వాత సూర్యసేన్ వున్న ఇంటిని పోలీసులు సర్వనాశనం చేశారు. ఆ ఇంటి యజమానురాలు క్షీరోదప్రభ. విప్లవకారులంతా ఆమెను పిస్నీ అని పిలిచేవారు. 94 ఏళ్ళ వృద్ధాప్యంలో కలకత్తాలో నివసించుతూ ఉండేది.

1932 మే 18 న గొహిరా అనే గ్రామాన్ని పోలీసులు చుట్టుముట్టారు సూర్యసేన్ తర్వాత తారకేశ్వర దస్తిదార్ విప్లవోద్యమానికి నాయకత్వం వహించాడు. మనోరంజన్‌దాస్, కుమారి కల్పనాదత్‌లతో కలిసి, ఆ గ్రామంలో ఒక ఇంట్లో అతను వుంటున్నాడు. సైన్యాలు చుట్టుముట్టి కాల్పులు సాగించాయి. మనోరంజన్‌దాస్ చనిపోయాడు. ఇంటిలోపల నుంచి ఎదురు కాల్పులు సాగించారు. పోలీసు కాల్పుల్లో ఇంటి యజమాని పూర్ణ తాలూక్‌దార్ అనే వృద్ధుడు చనిపోయాడు. తమకోసం అమాయక వ్యక్తులు బలి కావడం ఇష్టంలేక తారకేశ్వర దస్తిదార్, కల్పనాదత్‌తో సైనికులకు లొంగిపోయారు. ఆయుధాగారంపై మూడో దాడి కేసు 1933 జూన్ 15 న ప్రారంభమైంది. సూర సేన్ కల్పనాదత్, తారకేశ్వరదస్తిదార్లపై ఆగ 14 న తీర్పు చెప్పబడింది. సూరసేన్, తారకేశ్వర్‌లకు మరణశిక్ష, కల్పనకు యావజ్జీవ శిక్ష విధించబడింది. 1934 జనవరి 12 న చిటగాంగ్ జైలులో అర్ధరాత్రి 12 గంటలకు సూర్యసేన్, తారకేశ్వర్‌లను ఉరితీశారు కాని ఉరితీసేముందు వారి ద్దరినీ జైలులో కొట్టి చంపివేశారనీ, వారి శవాలనే ఉరితీశారనీ కొన్ని వార్తలు తర్వాత అందాయి. వారి శవాలను బంధువుల కీయలేదు. చిటగాంగ్ జైలులో అంత్యక్రియలు చేయనూ లేదు. "దిరినోక్" అనే క్రూయిజర్ నౌకపై శవాలను తీసుకువెళ్ళి, భారత దేశ సరిహద్దుకు కొన్ని వందలమైళ్ళ దూరంగా బంగాళాఖాతంలో పారవేశారు.

చిటగాంగ్ విప్లవ వీరకిశోరగాథలు మరికొన్నింటిని ఇక్కడ ప్రస్తావించడం అసందర్భం కాదు. 1933 జూన్‌లో రోహిణీ బారువా అనే 15 ఏళ్ళ బాలుడు అరెస్టయ్యాడు. 15 నెలల తర్వాత ఫరీద్‌పూర్ జిల్లాలో దౌలత్‌పూర్‌లో అతణ్ణి ఇంటరన్ చేశారు, జాతీయవాదులకు పరమ శత్రువూ, ఇంగ్లీషు వాళ్ళ తొత్తూ అయిన ఒక పోలీసు ఉద్యోగి నిరంతరం రోహిణిబారువాను అవమానించి రెచ్చగొడుతూ వుండేవాడు. విసుగుపుట్టి ఓర్పు నశించిన రోహిణి 1930 డిసెంబర్ 15 న ఆ పోలీసు ఆఫీసర్ని హతమార్చి, ఉరికంబాలను నవ్వుతూ కౌగలించుకున్నాడు.

1934 జనవరి 7 న - సూర్యసేన్‌ను ఇంకా ఉరి తీయకముందు క్రి చౌదరి, నిత్యరంజన్‌సేన్, హిమాంసు చక్రవ , హరేన్‌భట్టాచార్య అనే నల్గురు యువకులు అపూర్వ హసం ప్రదర్శించారు. పల్టాన్ మైదాన్‌లో క్రికెట్ పోటీలు జరుగుతున్నాయి. యూరోపియన్ ఆటగాళ్ళు ఆడుతున్నారు. కొన్ని వందలమంది ఇంగ్లీషువాళ్ళు ఆట చూడటానికి వచ్చారు. పోలీసులు, సైనికులు గట్టి కాపలా కాస్తున్నారు. యూరోపియన్లను, యూరోపియన్ డ్రెస్‌లో వున్నవారినితప్ప, ఎవరినీ లోనికి రానీయడంలేదు. ఐనా కాపలాదార్లను ఎలాగో తప్పించుకొని, వీరు ప్రేక్షకుల గాలరీవద్దకు వెళ్ళి, రివాల్వర్లు, బాంబులతో దాడి చేశారు. సైనికులు హిమాంసు చక్రవర్తిని కాల్చివేశారు. తక్కినవారిని అరెస్టుచేసి కోర్టు విచారణ తతంగం నడిపి, 1934 జూన్ 5 న ఉరితీశారు. వీరు 16 లేక 17 ఏళ్ళ వయస్సువాళ్ళే.

సూర్యసేన్ ఇక మూడు రోజులకు చనిపోతాడనగా అతణ్ణి పట్టి యిచ్చిన నీచుడు నేత్రసేన్‌ను విప్లవవాదులు హతమార్చారు. ఆ ద్రోహిని హత్య చేసిన వారెవరో ఆచూకీ లేక, అనుమానింప బడిన వారెవరో కూడా తెలియక ఎవర్నీ పోలీసులు అరెస్టు చేయలేకపోయారు.

1930 చిటగాంగ్ తిరుగుబాటు భారతదేశాన్నిగాని, కనీసం బెంగాల్‌నిగాని విముక్తి చేయలేకపోయిన మాట నిజమే. కాని చిటగాంగ్ జిల్లా విముక్తి, దేశంలో తదితర చోట్లకూడా, ఇతర ప్రాంతాల విముక్తికి ప్రేరణ కలుగచేస్తుందని చిటగాంగ్ విప్లవవీరులు ఆశించారు. బ్రిటిష్ ప్రభుత్వానికి మనోనిబ్బరం సడలుతుందని నమ్మారు.

ఐతే ఈ ఆశలు నెరవేరలేదు. ఇలాంటి తిరుగుబాట్లు రాకుండా బ్రిటిష్ పాలకులు చాలా జాగ్రత్తలు వహించారు. ఐతే చిటగాంగ్ విప్లవవీరుల ఆత్మబలిదానం జాతీయోద్యమ తుదిపోరాటానికి దేశ ప్రజలనుత్సాహపరిచింది. చిటగాంగ్ తిరుగుబాటు తర్వాత బెంగాలు రాష్ట్రమంతటా విప్లవజ్వాలలు లేచాయి. ఉదాహరణకు ఒక్క మిడ్నపూర్ జిల్లానే తీసుకుందాం.

ఈ జిల్లా పరిపాలనకు ఏ ఇంగ్లీషువాణ్ణీ సహించబోమని విప్లవవాదులు శపథం చేశారు. వరుసగా ముగ్గురు బ్రిటిష్ ఉద్యోగుల్ని చంపి వేశారు. పాలకుల ప్రతీకారంతో అనేకమంది దేశభక్తులైన యువకుల్ని చంపివేశారు. కాని జిల్లా పరిపాలనాధికారిగా ఒక్క తెల్లవాణ్ణీ నియమించలేక పోయారు.

చిటగాంగ్ ఘటనల తర్వాతనే గార్వాలీ సైనికుల తిరుగుబాటు జరిగింది. షోలాపూర్ కార్మికుల వీరోచిత పోరాటం సాగింది.

చిటగాంగ్ విప్లవవాదుల ఈ వీరగాథను పై మాటల్లో చెప్పినదంతా, ఆ పోరాటంలో పాల్గొన్న గణేశ్ ఘోషే.

భారతదేశ ప్రబల శత్రువులు సైతం, ఈ పోరాటం విలువను గుర్తించక తప్పలేదు. ఆనాటి భారతదేశ విదేశాంగ మంత్రి శామ్యూల్ హోర్ బ్రిటిష్ పార్లమెంట్‌లో ఇలా అన్నాడు: "1930 నాటి చిటగాంగ్ తిరుగుబాటు, భారతదేశ జాతీయోద్యమానికి ఉత్సాహ వెల్లువను సమర్పించింది."

చిటగాంగ్ విప్లవ వీరులందరి జీవితాలు అనేక ఉజ్వల సాహసఘట్టాలతో ముడిపడి ఉన్నవే. అవన్నీ ఇక్కడ వర్ణించడంసాధ్యంకాదు. కాని వీరి నాయకుడు సూర్యకుమార్‌సేన్ గురించి కొంతైనా చెప్పాల్సి వుంది.

చిటగాంగ్ జిల్లా నవపరాలో సూర్యకుమార్‌సేన్ 1893 అక్టోబరు 18 న జన్మించాడు. తండ్రి రాజమని సేన్. సూర్యసేన్ ఆర్ట్సుగ్రాడ్యుయేట్, ఉమతర హైస్కూల్లో ఉపాధ్యాయుడుగా పనిచేశాడు. అందుకనే ఆయన్ని ఆప్యాయంగా "మాస్టర్‌దా" అని పిల్చేవారు. 1918 లో విప్లవపార్టీలో చేరాడు. అతని పెళ్ళిరోజున ఆయన రాజకీయ గురువు కూడా వచ్చాడు. ఆ రోజుల్లో విప్లవవాదులు స్త్రీలతో ఎట్టి సంబంధం పె కోకూడదని కఠోరనియమం వుండేది. అందుచే సూ- సేన్ కూడా భార్యతో సంసారం చేయలేదు. 28 లో ఆమె చనిపోయేవరకు, ఆమెతో ఎట్టి సంపర్కంలేకుండా జీవించాడు. 1921 సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నాడు ఇండియన్ రిపబ్లికన్ ఆర్మీ చిటగాంగ్ శాఖకు నాయకత్వం వహించాడు. డిసెంబరు 23న పహార్‌తలి రైల్వే ఆఫీసులో జరిగిన రాజకీయ దోపిడిలో పాల్గొన్నాడు. అస్సాం, సిల్చార్, కరీంగంజ్, గౌహతి, శివసాగర్ మొదలైన తేయాకు తోటకేంద్రాల్లో విప్లవ కేంద్రాలను నెలకొల్పాడు, దక్షిణేశ్వర బాంబు కేసులో కూడ

సూర్యసేన్ ఒక ముద్దాయి. ఐతే పోలీసులకు చిక్కలేదు. ఒక కేసులో విచారణ తర్వాత విడుదలయ్యాడు. 1924 లో అరెస్టు చేసి నాలుగేళ్ళు డిటెన్యూగా వుంచింది ప్రభుత్వం. 1932 జూన్ 13 న పాటియాలో. సావిత్రి చక్రవర్తి ఇంటివద్ద సైనికులు చుట్టుముట్టినా తప్పించుకున్నాడు. 1928 లో చిటగాంగ్ వచ్చి ఇండియన్ రిపబ్లికన్ ఆర్మీ (చిటగాంగ్ శాఖ)ను స్థాపించాడు. ఆ తర్వాత కథ మీరు పైన చదివే వున్నారు.

సూర్యసేన్ గురించి అనేక కథలు చెప్పుకొనేవారు ప్రజలు. మానవాతీత శక్తుల్ని ఆపాదించేవారు ఆయనకి. "ఆ కథలన్నీ నిజం కావు. కాని మన దేశీయులు మన పట్లగల ప్రేమను ఇవి తెలియచేస్తున్నాయి. అందుకనే వారు పోలీసులకు మనల్ని పట్టివ్వడంలేదు." అని అనే వాడు. కల్పనా దత్ 1939 మేలో జైలు నుంచి బయటికి వచ్చింది. ఒక చిల్లర సామగ్రి అమ్ముకొనే వాడు ఆమెతో సూర్యసేన్ గురించి అన్న మాటలు చిరస్మరణీయాలు: "సూర్యసేన్‌ను ఉరితీసే రోజున సూర్యుడు ఉదయించనే లేదు" ఏ కవీ అనలేని ఎంతటి సత్యవాక్కు అది.

## బెంగాల్‌లో విప్లవవాదుల ఉద్యమ వ్యాప్తి

1930 ఏప్రిల్‌లో చిటగాంగ్ తిరుగుబాటు తర్వాత బెంగాల్‌లో మరికొన్ని ఘటనలు ప్రజల దృష్టిని ఆకర్షించాయి. 1930 అగస్టు 24 న బినయ్ బోస్ అనే విద్యార్థి మిట్ ఫోర్డ్ మెడికల్ కాలేజిలోని "లోమన్" అనే యూరోపియన్‌ను చంపి పారిపోయాడు. 1930 డిసెంబర్ 8న అతడు బాదల్, దినేష్ అనే మరో ఇద్దరితో కలిసి కలకత్తా రైటర్స్ బిల్డింగ్ (ప్రభుత్వ కార్యాలయం) కు వెళ్ళాడు. వీరంతా యూరోపియన్ దుస్తుల్లో వున్నారు. జైళ్ళ ఇనస్పెక్టర్ కల్నల్ సింప్సన్ గది ముందు నిలబడి "దేవుని ప్రార్థించుకో కల్నల్! నీ అంతిమ గడియ వచ్చింది" అని అరిచారు. అతన్ని చంపాక హోమ్ సెక్రటరీ గదికి వెళ్ళారు. గందరగోళం చెలరేగింది. పోలీసులు సైన్యమూ దిగాయి. వరండాలో తుపాకి గుండ్లు అయిపోయే దాకా పోరాడారు. శత్రువులకు చిక్క కూడదని బాదల్ పొటాసియం సైనేడ్ నోటో వేసుకుని చనిపోయాడు. బినయ్ బోస్ దినేష్‌లు తమ రివాల్వర్ల చివరి తూటాలతో ఆత్మహత్యకు ప్రయత్నించారు. గాయపడి బినయ్ బోస్ రోజుల్లో మరణించాడు. దినేష్ కోలుకున్నాక కోర్టులో విచారించి మరణశిక్ష విధించి అతన్ని ఉరి తీసిం ప్రభుత్వం.

## లాహోర్ కుట్రకేసులు

సైమన్ కమిషన్ బహిష్కార ఉద్యమ సందర్భంగా లాహోర్‌లో ఐ. పి. సాండర్స్ అనే పోలీసు ఆఫీసర్, లాలాలజపతిరాయ్‌తలపైన, ఛాతీపైన తీవ్రంగా లాఠీచార్జీ చేశాడు. ఆ దెబ్బలతో ఆరోగ్యం క్షీణించి కొన్నాళ్ళకు లజపతిరాయ్ మరణించాడు ఇది భారతీయ యువకుల్లో ఆగ్రహాన్ని రేకెత్తించింది. పగ తీర్చుకోవాలనే పట్టుదలను రేకెత్తించింది. చిత్తరంజన్‌దాసు సతీమణి బసంతదేవి ఇలా ఉపన్యసించింది.

"వృద్ధుడూ, దేశ ప్రజలకు ప్రియతముడూ ఐన లజపతిరాయ్‌ను ఒక మూర్ఖ బ్రిటిష్ పోలీసు ఆఫీసర్ కొట్టి చంపాడంటే నా రక్తం ఉడుకెత్తిపోతోంది. ఇది యువకుల, 30 కోట్ల ప్రజల మగటిమిని ప్రశ్నించే సవాల్. భారతీయ మహిళల తరపున నేనో ప్రశ్న వేస్తున్నాను. భారతీయ యువకులు బతికున్నారా? చచ్చారా? భారతీయ యువతరంలో ముందుకు వచ్చి నా ప్రశ్నకు జవాబిచ్చేవారు లేరా?"

ఉన్నారు. ఆ ప్రశ్నకు జవాబిచ్చారు. వాళ్ళే భగత్ సింగూ, అతని సహచరులూ. లజపతిరాయ్‌పై లాఠీ చార్జికి ఆజ్ఞాపించిన స్కాట్‌ను చంపాలని నిర్ణయించబడింది. లాలా లజపతిరాయ్‌ను లాఠీలతో మోదిన సాండర్స్‌ను 1928 డిసెంబరు 17న సైకిల్‌పై వెళుతుండగా పోలీసు గేటు వద్ద చంపివేశారు. రాజగురు మొదట రివాల్వర్‌తో కాల్చాడు. తర్వాత భగత్‌సింగ్ పిస్టల్‌తో సాండర్స్‌తలను ముక్కలు ముక్కలు చేశాడు. ఈ ఘటన జరిగిన ఐదురోజుల్లో లాహోర్ పట్టణమంతా గోడలనిండా హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్‌పార్టీ నోటీసులు అంటించబడ్డాయి. "నిరంకుశ ఉద్యోగులారా! జాగ్రత్త!!" అంటూ ఆ నోటీసుకు శీర్షిక పెట్టారు. అందులో లాలా లజపతిరాయ్ హత్యకు ప్రతీకారమే సాండర్స్ హత్య అని స్పష్టం చేశారు. "భారతదేశాన్ని అవమానపర్చడం ద్వారా విదేశ ప్రభుత్వం, ఆత్మగౌరవం గల వీరపుత్రులకు ఒక

సవాలు విసిరింది. అలాంటి అవమానాలను సహించ డానికి భారతజాతిలో చేవ చావలేదనీ, అది ఇంకా నిర్జీవం కాలేదనీ, బ్రిటిష్ ప్రజలూ, భారతజాతీ ఈ జవాబువల్ల అర్థం చేసుకొంటారు. భారత ప్రజల రక్త నాళాల్లో కొత్త రక్తం పారుతోంది. తమ జీవితాల్ని త్యాగం చేసైనా జాతి గౌరవాన్ని కాపాడటానికి యువ భారతదేశం సిద్ధంగా వుంది.

"ప్రభుత్వ నిరంకుశాధికారీ, జాగ్రత్త!"

"ఇప్పటికే దోపిడీకి, వేధింపులకు గు , రెచ్చి పోయిన ప్రజల భావాలను మరింత కెలకవ . మీరు మమ్మల్ని నిరాయుధులుగా చేయడానికి ఎని చట్టాలు చేసినా, ఎన్ని ప్రయత్నాలు చేసినా పిస్తళ్ళు, రివాల్వర్ల ప్రవాహం మా దేశ యువకుల చేతుల్లోకి ప్రవహి స్తుంది. కొద్దిపాటి ఆయుధాలతో సాయుధ విప్లవం జయప్రదం కాదని తెలిసినప్పటికీ, మాటిమాటికీ పాల కులు మా జాతిని పెట్టే అవమానాలకు ప్రతీకారం చేయ డానికిఈ కొద్దిపాటి ఆయుధాలు చాలు. మా చర్యల్ని జాతీయనాయకు లనబడే వారు ఖండించి నిరసించవచ్చు. పరాయి ప్రభుత్వం మా సంఘాన్ని నలిపివేయడానికి తమ శక్తి కొద్దీ ప్రయత్నించవచ్చు....పీడన, నిర్బం ధాలు, చుట్టూ చు ముట్టినా విప్లవ నినాదం మారు మోగకుండా మ -పోనీయం. మా కంఠం చుట్టూ మృత్యువు ఉరి డు బిగించుకుంటున్నా "విప్ల వం వర్థిల్లు గాక" అంటూ అరుస్తాం, హర్షధ్వానాలు చేస్తాం.

"ఒక మానవుణ్ణి చంపవలసి వచ్చినందుకు, మేము నిజంగా విచారపడుతున్నాం. మేము చంపవలసివచ్చిన ఆ వ్యక్తి, క్రూరమైన అల్పబుద్ధి గల అన్యాయమైన విదేశ అధికార పరిపాలనలో ఒక అంతర్భాగం. అతన్ని కూల్చివేయటం కన్నా మాకు వేరే ప్రత్యా మ్నాయం లేదు. భారతదేశంలోని బ్రిటిష్ అధికారానికి ప్రతినిధి హోదాలో మాత్రమే ఈ వ్యక్తి చంప బడ్డాడు. బ్రిటిష్ అధికారం ప్రపంచంలోకల్లా అత్యంత క్రూరమైనది.

"మానవరక్తం చిందించాల్సి వచ్చినందుకు మేము మళ్ళీ ఒకసారి మా విచారాన్ని తెలియచేస్తున్నాం. ఒక మానవుణ్ని మరో మానవుడు దోపిడీ చేయజాన్నంత టినీ, తుదముట్టించే విప్లవ బలిపీఠంపై రక్తం ఒలికిం చడం తప్పనిసరి."

విప్లవం వర్థిల్లుగాక!

బలరాజ్

కమాండర్

18-12-1928 పంజాబ్ హెచ్. ఎస్. ఆర్మీ

1929 ఏప్రిల్ 8 న శాన్ని కుదిపివేసిన మరో ఘటన జరిగింది. న్యూఢి లో కేంద్ర అసెంబ్లీ సమా వేశం జరుగుతుండగా ..ంబులు పేలాయి. గాలిలోకి పిస్తోళ్ళు కాల్చిన శబ్దాలు వినవచ్చాయి. పెద్ద చప్పుడ యింది. హాలంతా పొగ కమ్మింది. పొగ చెదిరిపోయాక భగత్‌సింగ్, బటుకేశ్వర దత్తులు ఎర్రటి కర పత్రాలు పంచుతూ కన్పించారు.

"చెవిటివాళ్ళు చెముడు వదలించి బిగ్గరగా వినపడేం దుకే ఈ బాంబులు ప్రయోగించాం" అని కరపత్రంలో వుంది.

సర్దారు భగత్‌సింగ్ కోర్టులో సుదీర్ఘ వాఙ్మూలం ఇచ్చాడు. అందులో కొన్ని భాగాలు ఇవి. భగత్‌సింగ్ ఇలా అన్నాడు:

"మా ప్రధాన ఆశయం అసంఖ్యాక ప్రజల్ని హెచ్చరించటం. చెవిటివాళ్ళకు వినపడేలాగ చేయడం. ఈ బాంబులు ఎక్కువ నష్టం చేసేవి కాకుండా ప్రత్యే కించి తయారు చేయబడ్డాయి. పైకి ప్రశాంతంగా వున్న భారతీయుని తలలో తీవ్ర అసంతృప్తి నాటుకునిఉంది. తుఫానులా అది బద్దలయ్యే స్థితికి వచ్చింది....మేం అహింసా శక సమాప్తిని ఆరంభించాం. అహింస, ఆదర్శవాదుల కల. దాని వైఫల్యాన్ని యువతరం ఇపుడు నిస్సందేహంగా గుర్తించింది. నూతన తత్వ ఉదయాన్ని గురించి ఇదివరలోనే మేము తెలియచేశాం. ఆ నూతన తత్వం గురు గోవిందసింగ్, శివాజీ, ముస్తఫా కమల్‌పాషా, రజాఖాన్, వాషింగ్టన్, గారి బాల్డి, లఫాయెట్టీ, లెనిన్ మొదలైన వారి ఆదర్శాలు ప్రేరేపించాయి ప్రభుత్వమూ, భారత నాయకులూ తమ కళ్ళూ, చెవులూ, మూసుకొని ఉండటంవల్ల వారి దృష్టిని ఆకర్షించడానికి ఈ హెచ్చరికను ఇంత ధ్వనితో చేయాల్సి వచ్చింది.

"సభలో ఏ వ్యక్తి పట్లగాని, స్వల్పగాయాలు తగిలిన మరే వ్యక్తి పట్లగాని మాకు ఎట్టి ద్వేషమూ, ఎట్టి వైమనస్యమూ లేదు. పైగా మానవ జీవితం వర్ణించనలవి కానంతగా పవిత్రమైనదని మా భావన. ఒకరిని గాయపరచడం కన్నా మానవజీవితం కోసం బలి కాడానికి మేం సిద్ధంగా వున్నాం. సామ్రాజ్యవాదుల కిరాయి సైనికులకు మానవుల్ని నిర్దాక్షిణ్యంగా చంపడానికి తర్ఫీదు ఇస్తారు. అలాంటి కిరాయి సేనల మనస్తత్వం కాదు మా స్వభావం. మేము లొంగిపోయామంటే దానికి కారణం మా చర్యల పర్యవసాన ఫలితాలను అనుభవించాలనే దృష్టితోనే, కొద్దిమంది వ్యక్తులను నాశనం చేయటం ద్వారా సామ్రాజ్యవాద దోపిడిగాళ్ళ వాస్తవాన్ని ఎన్నటికీ నాశనం చేయలేరని, వారిని మేము హెచ్చరించదలిచాం. ఒకరిద్దరు వ్యక్తుల్ని హతమార్చడం ద్వారా ఒక జాతి యావత్తూ అణచి వేయబడదు. బాస్టయిల్ దుర్గం ఫ్రెంచి విప్లవాన్ని ఆపలేకపోయింది. విప్లవకారుల్ని సైబీరియాకు ప్రవాసం పంపటంవల్ల రష్యన్ విప్లవం రద్దుకాలేదు. రక్తసిక్తమైన ఆదివారాలు, స్వాతంత్ర్యానికై ఐరిష్ ప్రజలు సాగించిన పోరాటక్రమాన్ని ఆపలేకపోయాయి. భారతీయుల మనస్సులలో మండుతున్న స్వాతంత్ర్య జ్వాలను ఈ దురాగత చర్యలు ఎలా ఆర్పివేయగలవు?

"విప్లవానికి ప్రతికూలురైనవారు, విప్లవమంటే అర్థం ఆయుధాలు, కత్తులు, అలాంటి ఇతర సాధనాలు అని పొరపడుతున్నారు. కాని విప్లవం అనేది వీటికి మాత్రమే పరిమితమై లేదు. వీటిని సాధనాలుగా వారు ఉపయోగించుకొని వుంటే ఉపయోగించుకొని వుండవచ్చు. కాని వాటి వెనుక విప్లవం యొక్క గట్టి బలమూ, తత్వమూ వున్నాయనే విషయం మరచిపోకూడదు. మార్పు కావాలనీ, ఆ మార్పును సాధించాలనీ కోరడమూ, ప్రస్తుత ఆర్థిక నిర్మాణంలో విప్లవాన్ని, దేశ రాజకీయ ప్రభుత్వపు స్వరూప నిర్మాణాలు మారాలనీ ప్రజలు తమ ఆశయంగా ప్రకటించుకోడమూ, కోరడమూ లోనే ఆ బలం వుంది.

"మా విప్లవం యొక్క ఉద్దేశం ఎన్నడూ కొందరు వ్యక్తుల్ని రక్తపాతానికి గురిచేయడం అని కాదు. మానవుని మరో మానవుడు దోచుకొనే ఈ దోపిడీ రాజ్యాన్ని తుదముట్టించడం, మన దేశానికి పూర్తిగా స్వయంనిర్ణయాధికార హక్కును సాధించటం. అదీ మా విప్లవమనే అభిప్రాయానికి తుది లక్ష్యం. స్వాతంత్ర్యం మానవుని జన్మహక్కు. ఈ ఆశయం కోసం పాటుపడేటప్పుడు, ఈ ఆశయాన్ని సాధించే దీక్షలో ఎన్ని బాధలొచ్చినా, ఎంత త్యాగం చేయవలసి వచ్చినా, ఎన్ని బాధలు అనుభవించవలసి వచ్చినా, మేము వాటిని ఆహ్వానిస్తాం. విప్లవం చిరస్థాయి అగుగాక!"

కేంద్ర అసెంబ్లీ బాంబు ఘటనలో జయదేవ్ కపూర్ కూడా ముఖ్య పాత్ర వహించాడు. ప్రేక్షకుల గ్యాలరీకి కావలసిన ప్యాస్‌లను సంపాదించేవాడు. భగత్‌సింగ్, సుఖదేవ్, చం' శేఖర్ అజాద్‌లు కూడా అపుడపుడూ కేంద్ర అసెం ప్రేక్షకుల గ్యాలరీలో కూర్చుని వెళ్ళిపోతూ వుం వారు. బాంబువేసి పారిపోవడం సులభసాధ్యమేనని అజాద్ కూడా అన్నాడు. విజయకుమార్ సిన్హా మొదలైనవారు బాంబులు వేసినవారిని, ఒక కారులో తీసుకుపోవడానికి బయట ఏర్పాటు చేశారు కూడా. ఐతే పారిపోకూడదనీ, పట్టుబడి శిక్ష అనుభవించితేనే విప్లవవాదుల పార్టీకి బలం చేకూరుతుందనీ భగత్‌సింగ్ వాదించి వారిని ఆ ప్రయత్నం నుంచి విరమింప చేశాడట.

భద్రతా సిబ్బంది, పోలీసు సార్జెంటులు భగత్‌సింగ్, దత్తులను అరెస్టు చేయడానికి తటపటాయించుతున్న సమయంలో, వారే స్వయంగా అరెస్టు చేసుకోమని చెప్పారు.

భగత్‌సింగ్, దత్‌లు అసెంబ్లీ బాంబు కేసులో అరెస్టయ్యే నాటికి విప్లవవాదుల ఉద్యమంలో వచ్చిన మార్పులు గమనించాలి. 1928 కలకత్తా కాంగ్రెస్‌లో సంవత్సరంలోగా డొమినియన్ స్టేటస్ (అధినివేశ ప్రతిపత్తి) ఇవ్వకపోతే సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం పోరాడుతామని తీర్మానించింది. దేశంలో అపుడు యువజనోద్యమం, బొంబాయిలో సమ్మె వెల్లువ దేశాన్ని ఉగ్రరూతలూగించుతున్నాయి. వివిధ రాష్ట్రాల నుంచి వచ్చిన విప్లవ సంఘాల ప్రతినిధులు 1928 సెప్టెంబర్ 8, 9 తేదీలలో ఢిల్లీలో సమావేశమయ్యారు హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ అసోసియేషన్‌ని స్థాపించారు. ఈ పార్టీ ఆశయం భారత దేశంలో సోషలిస్టు ప్రభుత్వాన్ని స్థాపించటం. దానికి ఒక కేంద్ర కమిటీ వుంటుంది. దాని క్రింద రాష్ట్రీ

కుట్రకేసు విచారణ ప్రారంభమైంది. ఈ కేసులో ప్రధాన వ్యక్తిగా సుఖదేవ్‌ని పేర్కొన్నారు. ఈ కేసులో ఇంకా ఈ క్రిందివారిని చేర్చారు. కిశోరీలాల్, శివవర్మ గయాప్రసాద్, జయదేవ్ కపూర్, జతీన్ దాస్, భగత్‌సింగ్, కమల్‌నాథ్ తివారి, బి. కె. దత్తు. జితేంద్ర సన్యాల్, అయ్యారామ్ దేశరాజ్, ప్రేమ దత్, యస్. పాండే, మహావీర్‌సింగ్, అజయ్‌కుమార్ ఘోష్. వీరుకాక విజయ్ కుమార్ సిన్హా, చంద్రశేఖర్ ఆజాద్, భగవతీ చరణ్, యశ్‌పాల్, బి. కె. సుఖా, రఘునాథ్ (రాజగురు) మరికొందరు పరారీ అయినట్లు ప్రభుత్వం ప్రకటించింది. కొన్నాళ్ళకు చంద్రశేఖర ఆజాద్, యశ్‌పాల్‌లు తప్ప తక్కిన వారంతా అరెస్టయారు.

అరెస్టయిన వారిలో జయగోపాల్ ప్రభుత్వానికి లొంగిపోయాడు. ఆ తర్వాత హంసరాజ్ వోహ్రా లొంగిపోయాడు వీరు చెప్పిన సమాచారం ఆధారంగా బీహార్, యు. పి, పంజాబ్‌లలో అనేకమంది నాయకులు, ముఖ్య కార్యకర్తలు అరెస్టయ్యారు. నిర్బంధ విధానాన్ని, చిత్రహింసలనూ తట్టుకోలేక పైన చెప్పిన ఇద్దరేగాక మరికొందరు కూడా తమ రహస్యాలు చెప్పివేశారు. ఫలితంగా యిద్దరు సెంట్రల్ కమిటీసభ్యులూ మరో ఐదుమంది అప్రూవర్లుగా మారారు.

## జతీన్‌దాస్ ఆత్మాహుతి

జతీన్‌దాస్ 1929 జూన్ 14న అరెస్టయాడు. అప్పటికే భగత్ సింగ్, దత్తు జూన్ 15 నుంచి నిరశన వ్రతం సాగిస్తున్నారు. లాహోర్ కుట్రకేసులో విచారించబడుతున్న 19మంది ఈ నిరశనవ్రతంలో జూలై మధ్యభాగంలో చేరారు. జతీన్‌దాస్ కూడా అందులో ఒకడు. జతీన్‌దాస్ ఒక్కడికే ఇదివరలో నిరశన వ్రతం చేసిన అనుభవంవుంది. 1925లో దిఓెన్సూగా ఢాకాలో నిరశన వ్రతం చేశాడు. హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ అసోసియేషన్ సెంట్రల్ కమిటీ, అదివరలో ఒక తీర్మానం చేసింది. అప్పటికి లాహోర్ కుట్రకేసు ముద్దాయిలు అరెస్టు కాలేదు. తాము అరెస్టయితే అవకాశం దొరికినప్పుడు రాజకీయ ఖైదీలను గుర్తించి వారికి మానవత్వంతో కూడిన మంచి సౌకర్యాలు కల్పించాలని కోరుతూ నిరాహారదీక్ష చేయాలని తీర్మానించు కొన్నారు. ఆ ప్రకారమే భగత్‌సింగ్ దత్తులు నిరాహారవ్రతం మొదలుపెట్టారు. అమానుషంగా, బలవంతాన వారిచే పాలు త్రాగించడానికి జైలు అధికారులు ప్రయత్నించుతూ వున్నారు. జూలైలో కోర్టులో జయదేవ్ కపూర్, లాహోర్ కేసులోని ముద్దాయిలందరూ నిరశన వ్రతం చేస్తారని తెలియచేశాడు. ప్రభుత్వ న్యాయవాది ఒకరోజు గడువు ఇవ్వవలసిందిగా కోరాడు. కానీ, కోర్టు అనుమతించలేదు. ప్రభుత్వ వైఖరిని నిరసిస్తూ అసమ్మతి సభలు, ప్రదర్శనలు దేశమంతటా జరిగాయి. బ్రిటిష్ ప్రధాని రామ్సే మాగ్డనాల్డుకు విజ్ఞప్తులు వెళ్ళాయి. ఒకప్రక్క రాజకీయ పోరాటాలతో పాటు, మరో ప్రక్క న్యాయశాస్త్ర పరమైన పోరాటాలు జరిగాయి. ఒక ప్రక్క నిర్బంధ విధానం, మరో ప్రక్క దానికి వ్యతిరేకంగా ఆందోళన సాగుతూ వచ్చాయి. పత్రికలుకూడా నిరశన ।తం చేసేవారి హక్కు బలపర్చాయి. రాజకీయ దీలను జైళ్ళలో బాగా చూడాలని, జైళ్ళలో జాతి వక్షత ఉండరాదనీ పత్రికలు రాశాయి. నిరశనవ్రతం ప్రారంభించిన మొదటి పది రోజులూ ప్రభుత్వం ఏమీ మాటాడలేదు. కాని ఆరోజు నుంచి బలవంతంగా ద్రవాహారాన్ని ఖైదీలకు ఎక్కించడానికి ప్రయత్నం జరిగింది. బలిష్ఠులైన పఠాన్లను వెంటబె కొని ఖైదీలను బలవంతంగా చాపమీద పరుండబె ముక్కులో రబ్బరుగొట్టం ద్వారా పాలు పోసేవా . ఐతే ఖైదీలు దాన్ని ప్రతిఘటించేవారు. జతీన్‌దాస్ కాలేజీరోజుల్లో మంచి క్రీడాకారుడు. అయన సులభంగా పఠానులకు లొంగలేదు. అయినా పశుబలంతో క్రింద పడేశారాయన్ని. బలవంతంగా ఎక్కించే పాలు జీర్ణకోశానికి చేరకుండా వారు అనేక పద్ధతులు అవలంబించేవారు. కిశోరీ ఉడుకు నీళ్ళతో కారం మింగేవాడు. దానితో గొంతువాచి పోయేది. పాలు బలవంతంగా ఎక్కిస్తే విపరీతంగా దగ్గు వచ్చేది. దగ్గుతెరతో ఊపిరాడక చనిపోతాడని ట్యూబ్ తీసివేసేవారు. అజయ్ కుమార్ ఘోష్ బలవంతాన పాలు ఎక్కించాక ఈగల్ని మింగి పాలు కక్కివేసేవాడు. ఈ విషయాలు తెలుసుకొన్న జైలు అధికారులు నిఘా వేశారు.

ఎలా గైనా పాలు తాగించాలని కుండల్లో నీరు పారబోసి, వాటిలో పాలు వుంచారు జైలు అధికారులు. అజయ్‌కుమార్ ఘోష్ తన అనుభవాలను ఇలా వర్ణించాడు.

"మాకీ సంగతి తెలియదు. దాహం వేసినపుడు మంచినీళ్ళ కోసం కుండ దగ్గరకు వెళ్ళాను. మంచి నీళ్ళకు బదులుగా అందులో పాలువున్నాయి. పాలు తాగితే నిరశనవ్రతం భగ్నమవుతుంది. ఒకరోజు గడిచింది. విపరీతమైన దాహం. నాలుక పిడచగట్టుకు పోతూంది. మంచినీళ్ళు పోశారేమో అనే ఆశతో అలాగే పడుతూలేస్తూ కుండ దగ్గరికి పోయి మూకుడు తీసిచూస్తే పాలుకనపడేవి. ఇలా ఎన్నోసార్లు జరిగింది. పిచ్చి ఎత్తినట్లుండేది ఈ పద్ధతిని కనిపెట్టిన వాడు నా కళ్ళముందు కనపడితే అతన్ని చంపివేసి వుండేవాణ్ణి. నేను చేసే ప్రతిపనిని గార్డు చూస్తూనే ఉన్నాడు. ఇంకా కొంత సేపు వుంటే, నేను లొంగిపోతానేమో? గొంతు తడి ఆరిపోయింది, నాలుక ఉబ్బరించింది. గార్డును మంచినీళ్ళు తెమ్మన్నాను. పర్మిషన్ లేదన్నాడు. వెర్రి ఆవేశం ముంచుకొచ్చింది. కుండప కుని తలుపు కేసికొట్టాను. అది ముక్కలు ముక్కలైంది. పాలు చింది పోయాయి. నాకు పిచ్చెత్తి పోయిందనని అతడు భయపడ్డాడు. నిజమే. కొంత వరకు అది వాస్తవమే."

జైలు అధికారుల ఈ దుశ్చర్యలను ఎప్పటికప్పుడు దేశమంతా నిరసించుతూ వచ్చింది. జూన్ 30న "భగత్ సింగ్ సంఘీభావ దినం" గా దేశమంతటా సభలు జరిగాయి. ఆ రోజున లాహోర్ కుట్రకేసు ఖైదీలు ఆహారం ముట్టుకోలేదు. జూలై 5న నిరాహార వ్రతులకు సంఘీభావాన్ని తెలియజేస్తూ జవహర్‌లాల్ నెహ్రూ ఒక ప్రకటన చేశాడు. జూలై 13న జయదేవ్ కపూర్ కోర్టులో ఒక ప్రకటన చేస్తూ భగత్ సింగ్, దత్తుల నిరాహార దీక్ష ఐదో వారం ప్రవేశించిందనీ, లాహోర్ కుట్ర కేసులోని ఖైదీలైన తాము కూడా నిరశన వ్రతంలో చేరుతున్నామనీ తెలియ చేశాడు. కాంగ్రెస్, నవజవాన్ భారత్‌సభ, 14వ తేదీ నుండి అసమ్మతి సభలు ప్రారంభించాయి. విప్లవ వాదుల బహిరంగ వేదికగా, నవజవాన్ భారత్‌సభ, ఆరోజుల్లోపని చేస్తోంది. ఊరేగింపులు, సభలు కొనసాగుతున్నాయి. జూలై 19న ఊరేగింపుపై పోలీసులు లాఠీఛార్జీ చేశారు నవజవాన్ భారత్‌సభ కార్యకర్తలను నిర్ఘృహతప్పేలా కొట్టారు. 144వ సెక్షన్‌ప్రయోగించబడింది. బ్రిటిష్ లేబర్ ప్రభుత్వానికి విజ్ఞప్తులు, హెచ్చరికలు చేయబడ్డాయి. కోర్టులలో న్యాయశాస్త్ర సంబంధమైన వాద ప్రతివాదాలు చెలరేగుతున్నాయి. మితవాద పత్రికలు సైతం నిరాహార వ్రతులను సమర్థించాయి. అనారోగ్యంగా వున్నవారికి మంచి ఆహారం ఇస్తామని ప్రభుత్వం చెప్పిన మాటలకు, గణేశ్ శంకర్ విద్యార్థి సంపాద కత్వాన నడుస్తున్న "హిందీ ప్రతాప్" పత్రిక అపహాస్యం చేసింది. ప్రపంచమంతటా రాజకీయ ఖైదీలకు ప్రత్యేక సౌకర్యంవున్నదనీ, ఐరిష్ స్వాతంత్ర్య యోధులకు కూడా బ్రిటన్ మంచి సౌకర్యాలు సమకూర్చుతున్నదనీ, ఆ పత్రిక రాసింది. ఇతర పత్రికలు కూడా ఇలాగే రాశాయి.

జూలై 27న జైళ్ళ ఇనస్పెక్టర్ జనరల్ డాక్టర్ యన్. డి పూరి ప్రభుత్వానికి ఒక నివేదిక పంపాడు. అందులో జతీన్‌దాస్ కృత్రిమంగా (బలవంతంగా అనేపదాన్ని అతడు వాడలేదు) ఆహారాన్ని ఎక్కించడాన్ని నిరోధిస్తున్నాడనీ 26న స్పృహతప్పి పోయాడనీ, 102 డిగ్రీల జ్వరం వస్తున్నదనీ, ఊపిరి తిత్తులలో చెమ్మ చేరిందనీ. నోటిద్వారా ఆహారంగానీ, మందులుగానీ తీసుకోవడంలేదనీ, కృత్రిమంగా అంటే (బలవంతంగా) ఆహారం ఇవ్వటం అపాయకరమనీ. ఆయన్ని ప్రమాదకర మైన జబ్బు పడ్డ వ్యక్తిగా ప్రకటించాలనీ తెలియ చేశాడు.

జితేంద్రనాథ్ సన్యాల్ కోర్టులో జైలు అధికారులు ఎలా పాశవికంగా ముక్కులలోను. నోటిలోను గొట్టాల ద్వారా బలవంతంగా ఆహారం ఎక్కించి చిత్రహింసలు పెడుతున్నారో తెలియచేశాడు. జతీన్‌దాస్ మృత్యుశయ్యపై వున్నాడని హెచ్చరించాడు.

అజయ్ ఘోష్ కోర్టులో ప్రవేశించుతూ జతీన్‌దాస్‌కు న్యుమోనియా వచ్చిందనీ 103 డిగ్రీల జ్వరం వుందనీ పత్రికా విలేకరులకు తెలియ జేశాడు.

అల్లాబాద్‌లో జరిగిన ఎ ఐ.సి.సి. సమావేశంలో డాక్టర్ అన్సారీ, డాక్టర్ బి. సి. రాయ్‌లు బలవంతంగా ఖైదీలకు ఆహారం ఎక్కించే పద్ధతిని తీవ్రంగా ఖండించారు. దేశంలో ప్రతి డాక్టరూ ఈ పద్ధతి ఉపసంహరింపబడేలా చూడాలని వారు కోరారు

జతీన్‌దాస్ సోదరుడు కిరణ్ చంద్రదాస్ కూడా స్వాతంత్ర్య సమర యోధుడే ఆయన జైలులో తన అన్నను "ఫంటో" అనే సోడా నీళ్ళని తాగడానికి ఒప్పించాడు. అందులో ఆహారపదార్థాలేవీ లేవని తన అన్నను ఒప్పించాడు, డిప్యూటీ ఇనస్పెక్టర్ జనరల్

కూడా దీనికి ప్రోత్సహించారు. రాత్రింబవళ్ళు తన సోదరునికి సేవచేయడానికి అనుమతించారు. "వింటో" తాగడం వల్ల జతీన్‌కు కొంత స్వస్థత చేకూరింది. అప్పటి రోజుల్లో తెలియలేదుగాని, ఆతర్వాత ఇనస్పెక్టర్ జనరల్ కార్యాలయం రహస్య చారిత్రక పత్రాలవల్ల ఒక విషయం బైటపడింది. ఒక ఔన్సు గ్లూకోవ్‌ను, అరఔన్సు బ్రాందీని వింటోలో కలిపి ఇచ్చేవారు. ఆగస్టు 1న రహస్య రిపోర్టులో ఈ విషయం అంగీకరించ బడింది. జతీన్‌దాస్, శివవర్మలకు కృత్రిమ పద్ధతులద్వారా ఆహారం ఎక్కించడానికి పనికిరాదని ఆ రిపోర్టులో వుంది.

అయినప్పటికీ జతీన్ పరిస్థితి మెరుగు కాలేదు. ఆగస్టు 5 నాటికి పరిస్థితి విషమించింది. చాలా బలహీన పడ్డాడు. అవయవాలు స్పర్శజ్ఞానం కోల్పోసాగాయి. నీళ్ళు మాత్రమే తాగ గల్గుతున్నాడు.

భగత్‌సింగ్, జతీన్ ఆరోగ్యాన్ని గురించి చాలా ఆదుర్దా పడ్డాడు. మొదట నిరాహార వ్రతం అవలంబించిన తానే ఆత్మాహుతి ఐతే బాగుంటుందని భగత్ సింగు భావన. అందుకే జైలు అధికారులనుంచి సంప్రదింపులనే మిషతో జతీంద్రనాథ్‌ను చూడడానికి పరిమిషన్ తీసుకొని వచ్చాడు. పోషక పదార్థాలు లేని మందులు లాంటివి తీసుకోవాలని అతణ్ణి కోరాడు.

ప్రజల్ని మోసపుచ్చే ఉద్దేశంతో ప్రభుత్వం ఆగస్టు 16 న జైలు పరిస్థితులను విచారించేందుకు ఒక కమిటీని ఏర్పరచింది. అందులో అనధికారులే ఎక్కువమంది వున్నారు. చౌదరీ జఫరుల్లాఖాన్, మహ్మద్ హయ్యాత్ ఖాన్, ఖురేష్ అలీ, అఫల్‌హక్, మోహన్‌లాల్, హరబక్స్‌సింగ్, మొహిందర్‌సింగ్ దౌలత్‌రామ్ మాత్వాలు యిందులో వున్నారు. వీరంతా జతీన్‌ను కలుసుకొని, ఆయన కోర్కెలను సానుభూతితో విచారిస్తామని హామీ యిచ్చి నిరశన దీక్ష విరమించవలసిందిగా కోరారు. తన కోర్కెలను అంగీకరిస్తేతప్ప దీక్ష విరమించేదిలేదని జతీన్‌దాసు జవాబిచ్చాడు. డా॥ గోపీచంద్ భార్గవ, పురుషోత్తమదాస్ టాండన్ మొదలైన జాతీయ నాయకుల ప్రయత్నాలు కూడా విఫలమయ్యాయి. డా॥ గోపీచంద్ భార్గవ "మందులు, నీళ్ళు ఎందుకు తీసుకోవు" అనడిగాడు.

"నేను చనిపోవాలని వుంది" అని జతీన్‌దాసు జవాబు.

"ఎందుకు ?"

"నా దేశం కోసం, రాజకీయ ఖైదీల హోదాను పెంచడానికి."

ఆగస్టు 21 న భగత్‌సింగు దత్తులు, గోపీచంద్ భార్గవ, పురుషోత్తమదాస్ టాండన్లతోపాటు వచ్చారు గతంలో తన సలహా అంగీకరించినట్లుగానే ఈసారి కూడా అంగీకరించవలసిందిగా భగత్‌సింగు కోరాడు. "అప్పుడు నీ మాట విన్నాను. కాని మళ్ళీ ఎందుకొచ్చావు ? నీ మాట వినను. నీవు నా హృదయాన్ని బ్రద్దలు చేశావు. నీవు వచ్చి వుండవలసిందికాదు" అన్నాడు జతిన్. తమ కోర్కెపైనే వారు వచ్చారని భార్గవ, టాండన్లు నచ్చచెప్పారు. ఐసు (మంచుగడ్డ). మంచినీళ్లు మాత్రం తీసుకొంటానని అన్నాడు. భగత్ సింగు పాలు కూడా తీసుకోమని సలహా యిచ్చాడు. ఇలా ఎందుకు కోరాడని చాలామంది ఆశ్చర్యపోయారు. కాని నిరాహార వ్రతం మొదట ప్రారంభించిన తానే ఆ దీక్షతో మరణించాలిగాని, జతీన్ కాకూడదని ఆయన వాంఛ. జతీన్ ఒప్పుకోలేదు. డా॥ భార్గవ మందు యిస్తే తీసుకొంటానని అన్నాడు.

లు విచారణ కమిటీ లాహోరు కేసులోని ము యిలందరినీ జైల్లో చూసింది. వారి కోర్కెలను సా భూతితో పరిష్కరించుతామని చెప్పింది. భగత్ సింగు తదితరులు ఇది నమ్మి నిరశన వ్రతం మానేశారు. "కమిటీ మమ్మల్ని లులో కలిసింది. మా కోర్కెల్లో చాలా భాగం అంగీ ంపబడతాయని హామీ యిచ్చింది. దాని ఆధారంగా మేము నిరాహారవ్రతం విరమించడానికి నిర్ణయించుకొన్నాము" అని అజయ్ కుమార్ ఘోష్, భగత్‌సింగుని గూర్చిన వ్యాసంలో రాశాడు.

రాత పూర్వకమైన హామీ లేనిదే వాగ్దానాలు నమ్మరాదని జతీన్ దీక్ష విరమించలేదు. జతీన్‌ను బేషరతుగా విడుదల చేస్తామన్న విచారణ కమిటీ వాగ్దానం అమలు పర్చలేదు. భగత్‌సింగు మొదలైనవారు మోసగించబడ్డారు. జతీన్‌ను జామీన్‌పై విడుదల చేస్తామన్నారు. కాని ఆయన అందుకు అంగీకరించలేదు.

సెప్టెంబరు 9 న పత్రికలు జతీన్‌కు నిద్రపట్టలేదనీ, జ్వరం బాగా వున్నదనీ రాశాయి. శివవర్మ పరిస్థితి కూడా హఠాత్తుగా ఆందోళనకరంగా వుందనీ, నెత్తురు కక్కుకున్నాడనీ వార్తలు వచ్చాయి. విజయ

కోర్కెలు పరిష్కరింపబడటంతో భగత్‌సింగ్ మొదలైన వారు నిరాహారవ్రతం మానివేశారు.

జతీన్ నిరాహారవ్రత సందర్భంగా మరపురాని మరో సంఘటన ఇక్కడ జ్ఞప్తికి తెచ్చుకోవాలి.

గదర్ పార్టీ సంస్థాపకుడు బాబా సోహన్‌సింగ్ భాక్నాకు 1915–16 లాహోర్ (మొదటి) కుట్ర కేసులో శిక్ష విధింపబడింది. జతీన్ నిరాహార వ్రతం చేస్తున్న సమయంలో ఆయన కూడా లాహోర్ జైల్లోనే వున్నాడు. ఆయన అప్పటికే అండమాన్ దీవుల్లోను, భారతదేశ జైళ్ళలోను 14 ఏళ్ళ జైలుజీవితం గడిపాడు. వృద్ధుడు ఆరోగ్యం బాగాలేదు. ఐనా ఆయన కూడా నిరాహారవ్రతం ప్రారంభించాడు. ఆయన నిరాహార వ్రతం మానకపోతే, ఆయనకు రెమిషన్ రద్దు చేయబడుతుందనీ. అందువల్ల మరి కొంతకాలం జైలులో వుండాల్సివస్తుందనీ జైలు సూపరెన్టెంట్ తెలియజేశాడు. భగత్‌సింగ్ ఆయన చేత నిరశన దీక్ష విరమింపచేయాలని ప్రయత్నించి విఫలుడయ్యాడు. ఈ విషయం తన సహచరులకు చెప్పేటప్పుడు భగత్‌సింగ్ కళ్ళవెంట నీళ్ళుకారాయి. నిరాహారవ్రతంలో పాల్గొన్న ఫలితంగా బాబాకు రెమిషన్ తగ్గిపోయింది ఆ కారణంగా మరో సంవత్సరం ఆయన జైలులో వుండాల్సి వచ్చింది. వృద్ధుడైనా బాబా ఎంతటి పట్టుదలగల మనిషి.

## జతీన్‌దాసుకు నివాళులు

కేంద్ర అసెంబ్లీలో జతీన్ దాసుకు నివాళు లర్పించుతూ యం. ఆర్. జయకర్, జతీన్ శరీరంలోని ప్రతి అంగుళమూ, ఎలా జీవం కోల్పోయిందో వర్ణించాడు.

తన విద్యార్థులకు ఒక నాటకం గురించి తర్ఫీదు యిస్తుండగా, రవీంద్రనాథ్ టాగూర్‌కి జతీన్ నిర్యాణ వార్త చేరింది. అవాక్కయి పోయాడు. ఆ రోజు రాత్రే జతీన్‌పై ఒక పాట రాశాడు. ఆ పాట తర్వాత విప్లవవాదు లందరికీ ఉత్తేజం కలుగచేసింది.

సరోజినీ నాయుడు ఇలా అన్నారు. "ఒక సిద్ధాంతం (ప్రిన్స్‌పుల్) కోసం జతీన్‌దాసు తన జీవితాన్ని అర్పించాడు. ఒక సిద్ధాంతం– జీవిత వాస్తవాలలో అత్యంత సౌందర్యమైన వాటిలో ఒకటి. కాబట్టి జతీన్ త్యాగాన్ని ఎన్నడూ మరచిపోలేము."

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ దీర్ఘమైన ప్రకటన చేస్తూ ఇలా అన్నాడు "జతీన్ చేయగలిగినదంతా చేశాడు. దీర్ఘకాలం, భయంకరమైన బాధ అనుభవించాక, బ్రిటిష్ సామ్రాజ్యం యుద్ధం ప్రకటించలేని ప్రాంతంలోకి జతీన్ నిష్క్రమించాడు. ఆయన తన కర్తవ్యాన్ని బాగా నెరవేర్చాడు. మరి మనమో ?"

నిరాహారదీక్షలో వున్న జతీన్‌దాస్, భగత్‌సింగ్‌ల గురించి జవహర్‌లాల్ నెహ్రూ తన ఆత్మకథలో పేర్కొంటూ, "జతీన్‌దాస్ మరణం దేశమంతటా అలజడి కల్గించింది" అన్నాడు.

జతీన్‌దాస్ భౌతికకాయాన్ని తీసుకువెళుతున్న రైలు కాన్పూర్ చేరినపుడు జవహర్‌లాల్ నెహ్రూ, పురుషోత్తమదాస్ టాండన్, బాలకృష్ణ శర్మలు మొట్టమొదట జతీన్ భౌతికకాయం వుంచిన రైలు పెట్టెలోకి ప్రవేశించారు. నెహ్రూ కోర్కెపై శవపేటిక తెరిచారు. కన్నీళ్ళతో వీరంతా జతీన్‌కు పాదాభివందనం చేశారు.

దేశం యావత్తూ సిద్ధాంతాలతో నిమిత్తం లేకుండా జతీన్‌దాస్‌కు నివాళులు అర్పించింది కానీ గాంధీయోః నిరాహార సమయంలో ఖైదీల పరిస్థితి విషమించినపుడు కూడా ఆయన ఒక్కమాట మాటాడలేదు. జతీన్ భౌతికకాయాన్ని తీసుకువెళుతున్న రైలు ఆగ్రా చేరుకొన్నపుడు గాంధీ ఆగ్రాలోనే ఉన్నాడు. కాని ఆయన జతీన్ కాయాన్ని చూడటానికి రాలేదు. జతీన్ చనిపోయిన నెలరోజులకి గాంధీ ఒక ప్రకటన ఇలా చేశాడు :

"నేను నా అభిప్రాయాన్ని వెల్లడించటం వల్ల సాహసవంతుడైన జతీన్ చేసిన ఆమరణ నిరాహార దీక్షకు లాభంకన్నా నష్టమే వాటిల్లుతుందని భావించాను....నేను పూర్తిగా మౌనం వహించుతున్నాను. దేశాన్ని ఎదుర్కొనే ప్రముఖ సమస్యలు చాలా ఉన్నాయి. నాకు వాటిపట్ల బలీయమైన, నిర్ణీతమైన అభిప్రాయాలున్నా, నేను పూర్తిగా మౌనం వహించుతాను....విప్లవవాదుల తాత్విక చింతన గురించి నా అభిప్రాయాలు చాలాసార్లు చెప్పాను. వాటిని వివరించడంగాని, ఇంకా విస్తృతపరచి చెప్పడంగాని అనవసరం. ఐనా నా మౌనం జతీన్ చేసిన నేరం లేక నిర్దోషిత్వంతో ఎలాంటి సంబంధం లేదు నేరం నిర్ధారింపబడలేదు గనుక అండర్‌ట్రయల్ (కోర్టు

ఆనాటి జైలులో ఎలాంటి విషాద వాతావరణం అలముకొనివుందో. ఆయన సహచర ఖైదీలు రాసిన విషయాలనుబట్టి తెలుస్తూంది.

సాధారణంగా ఉరిశిక్షను ఉదయం 7 గంటలకు అమలుపరుస్తారు. కాని అలాకాకుండా జైలు అధికారులు చాలా హడావిడిపడ్డారు. ఆరోజు ఖైదీ లందరినీ మామూలుగా రాత్రి 7 గంటలకు లాకప్ చేయడానికి (గదుల్లో పెట్టి తాళం వేయడానికి) బదులుగా 4 గంటలకే లాకప్ చేశారు. చీఫ్‌హెడ్ వార్డర్‌ను ఖైదీలు అడిగారు. ఇంత తొందరగా ఎందుకు లాకప్ చేస్తున్నారని. అతను మాటాడలేదు. కాసేపటికి అతని చెక్కిళ్ళపై నీళ్ళు కారాయి. 'దయచేసి లోనికివెళ్ళండి. లాకప్ చేయాలి' అని రుద్ధ కంఠంతో జవాబు చెప్పాడు. "ఎందుకు? ఎందుకు?" అని మళ్ళీ ఖైదీలు అడిగారు. "నన్నెందుకు అడుగుతారు? అంతా అయిపోయింది. ఇంకో గంటలో వాళ్ళని ఉరితీయబోతున్నారు" అని జవాబు.

ఆవాళ రాత్రి 9 గంటలకు "ఇంక్విలాబ్ జిందాబాద్" అని బారక్‌లలో నినాదాలు ఒక గంట సేపు వినపడ్డాయి, ఆ తర్వాత నిశ్శబ్దం. ఖైదీలు ఆ రాత్రి భోజనం చేయలేదు. నిద్రపోలేదు. ఒకరితో మరొకరు మాట్లాడుకోలేకపోయారు. అంతా గంభీర నిశ్శబ్దం.

ఆ మర్నాడు ఉదయం 7 గంటలకు చీఫ్‌హెడ్ వార్డర్ వచ్చాడు. తాళాలు తీశాడు. కాసేపు నిశ్శబ్దంగా వున్నాడు. చిన్న బిడ్డలా ఏడ్చాడు. ఎలాగో తమాయించుకున్నాడు. తర్వాత ఇలా చెప్పాడు:

"నేను 30 ఏళ్ళు వివిధ జైళ్ళలో పనిచేశాను. నేను వందలాది ఉరితీసిన ఘటనల్ని చూశాను. ఉరితీసినప్పుడు చీఫ్ హెడ్‌వార్డర్‌గా నేను దగ్గరగా వున్నాను. కాని ఉరికంబం దగ్గరకు అంత ధైర్యంగా గంభీర చిత్తంతో వెళ్ళడం నేను ఇదివరకెన్నడూ చూడలేదు. జైలు గదులనుంచి బయటకురాగానే ఒకరి చేతులు ఒకరు పట్టుకుని నినాదాలిచ్చుకుంటూ ఉరికంబాల వైపు నడిచారు. మెడ చుట్టూ ఉరితాళ్లు చుట్టి వుండగా నినాదాలు చేశారు. కాని ఆ నినాదాలు పూర్తి కాకుండానే ఉచ్చులు బిగుసుకుని వారి దేహాలు వేళ్ళాడుతున్నాయి."

ఆ అమరవీరుల మృతదేహాలను బంధువులకుగాని, ప్రజలకు గాని అప్పగించడానికి ప్రభుత్వానికి దమ్ములు లేకపోయాయి. బ్రిటిష్ సైనికులకు వాటిని అప్పగించారు జైలు అధికారులు. వారు వాటిని ఫిరోజ్‌పూర్ దగ్గర సట్లెజ్‌నది ఒడ్డుకు తీసుకువెళ్ళి ముక్కలు ముక్కలుగా నరికి కిరోసిన్ పోసి మంటలు పెట్టారు. ఆ మంటల చుట్టూ "రండి రాక్షసులారా! ఇపుడు తుపాకులు పేల్చండి" అంటూ నృత్యం చేయడం మొదలు పెట్టారు. ఇంతలో ఆ వార్త తెలిసిన ప్రజలు హుటాహుటిని అక్కడికి చేరి, ఇంకా కాలికాలకుండా వున్న అవశేషాలను లాహోరు తీసుకువెళ్ళి అత్యంత గౌరవ పూర్వకంగా అంత్యక్రియలు జరిపారు. బ్రిటిష్ సైనికులు పైశాచిక తాండవ నృత్యం చేసినచోటనే - హుసేన్ వాలా - లో ఇపుడు వారి స్మారక చిహ్నాలు వున్నాయి. ఐతే కరాచీలో కాంగ్రెస్ సమావేశమైన పెద్దలకు పై వార్త వదంతిగా కన్పించింది. ఒక విచారణ సంఘాన్ని నియమించింది. మొదట ఈ వార్త తెలియజేసిన భగత్‌సింగ్ తండ్రి ఆ విచారణ కమిటీ వద్దకు రానందున అంతటితో ఆ సంఘం పని ముగిసిందట!

భగత్‌సింగ్ ఉరివార్తతో దేశమంతటా ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనలు జరిగాయి. ప్రభుత్వం తీవ్ర దమకాండ ప్రారంభించి, అనేక మందిని అరెస్టు చేసింది. ముందు జాగ్రత్తకోసం వైస్రాయి భారత రాజ్యాంగ కార్యదర్శిని మరికొన్ని సైన్యాల్ని పంపవలసిందిగా కోరాడు.

భారతదేశ స్వాతంత్ర్యంకోసం ఉరికంబా లెక్కిన వీరులలో భగత్‌సింగ్ మొదటివాడుకాదు, ఐతే భగత్‌సింగ్‌లా భారతీయుల హృదయాలను ఉత్తేజపరచిన విప్లవ కారుడు ముందెప్పుడూ లేడు.

## భగత్‌సింగ్ అపూర్వ గుణగణాలు

భగత్‌సింగ్ విప్లవవాదుల సంఘంలో పనిచేసినా, అతడు అరాచక వాదికాదు, వ్యక్తిగత హింసావాదమే పరమలక్ష్యంగా గల వాడూకాదు. బాంబువాదంలో అతనికి నమ్మకంలేదు. ఆయన స్వయంగా ఇలా చెప్పాడు: "బాంబులు, పిస్తోళ్ళవల్ల దేశానికి మేలు కలుగుతుందనే నమ్మకం నాకులేదు. కేవలం బాంబులు విసరడం వ్యర్థమైన పనే కాకుండా, తరుచు హాని కూడా చేస్తుంది. కొన్ని పరిస్థితులలో అలా బాంబులు విసరటం అనుమతించవలసి రావచ్చు."

'విప్లవం' అంటే ఆయన భావం ఏమిటో కూడా భగత్‌సింగ్ ఇలా స్పష్టంచేశాడు. "కళ్ళకుగట్టే అన్యాయం ఆధారంగా ఈనాటి వ్యవ వుంది. దీన్ని తప్పకుండా మార్చడమే విప్లవానికి అ ం."

భగత్‌సింగ్ తప్పనిసరై శత్రు సంహారంచేసినా ఎంతటి మానవతావాదో ఆయన చెప్పిన ఈ వాక్యం తెలియచేస్తుంది: "మానవుడి ప్రాణానికి మేం ఎక్కువ పవిత్రతను ఆపాదించుతాం. మానవుడి జీవితం అన్నిటి కన్నా కూడా చాలా పవిత్రమైనది. మరో ప్రాణికి హాని కల్గించకముందే, మేము త్వరలో మానవసేవలో మా ప్రాణాలు అర్పించబోతున్నాం."

భగత్‌సింగ్‌కు తప్పించుకొనే అవకాశంవున్నా తప్పించుకో దల్చుకోలేదు. కావాలనే మృత్యువుని ఆహ్వానించాడు. జహంగరీలాల్ అనే రో విప్లవ యోధుడు. భగత్‌సింగ్ ఉన్నచోటికి మీపంలోని బారక్‌లో వుండేవాడు. భగత్‌సింగ్‌ను రెం రోజుల్లో ఉరితీస్తారనగా, అంటే 1931 మార్చి 21 న జహంగరీలాల్ భగత్‌సింగ్‌కు ఒక చీటీ పంపాడు. "మిమ్మల్ని కాపాడమంటారా? ఆఖరిక్షణమైనా, ఇప్పటికైనా మిమ్మల్ని రక్షించడానికి ప్రయత్నించడం సాధ్యమే."

దీనికి భగత్‌సింగ్ ఇలా జవాబిచ్చాడు: "బ్రతికి వుండాలనే వాంఛ నాకు వుండటం సహజమే. ఆ విషయం నేను దాచిపెట్టదల్చుకోలేదు. కాని నేను జీవించివుండటానికి ఒక షరతువుంది. నేను జైలులో గాని, నిర్బంధా ల కిందగాని సజీవంగా ఉండదల్చుకో లేదు. భారత వి వానికి చిహ్నంగా నా పేరు మారింది. విప్లవపార్టీ శయాలు, త్యాగాలు నన్ను చాలా ఎత్తుకు పెంచాయి. నేనొకవేళ బతికివున్నా ఎత్తు పెరగడానికి వీలులేనంతగా పెరిగిపోయాను. ఇవాళ నా బలహీనతలు ఇతర్లకు తెలియవు. నేను ఉరినుంచి కాపాడబడితే, నా బలహీనతలన్నీ వెలుగులోకి వస్తాయి విప్లవ చిహ్నం పాలిపోతుంది. అది అంత రించి పోయినా పోవచ్చు. నవ్వుతూ, ధైర్యంగా నేను రికంబాలు ఎక్కానంటే, మా లక్ష్యం దగ్గరకు స్తుంది. భారతదేశంలోని తల్లులు తమ బిడ్డలు భగత్ ంగ్ కావాలని కోరుకుంటారు సామ్రాజ్యవాదపు పైశాచి బలానికి విప్లవాన్ని ఆపగలశక్తి అసాధ్య మయ్యే ంత పెద్దదిగా దేశ స్వాతంత్ర్యానికై బలై పోయిన అమరవీరుల సంఖ్య పెరుగుతుంది. ఒక ఆలోచనమాత్రం నా గుండెను పిండిచేస్తూ వుంది దేశంకోసం, మానవాళికోసం నేను చేయదలచుకొన్న దానిలో వెయ్యోవంతు కూడా నేను పూర్తిచేయలేక పోయాను. ఆజాద్ (చంద్రశేఖర్ ఆజాద్) కన్నుక బతికివున్నట్లయితే బహుశా నేనీ కర్తవ్యాలను పూర్తి చేసే అవకాశం నాకు కల్గివుండేది. బహుశా నా కోర్కెల్ని పూర్తిచేయగల్గి వుండేవాడిని. నా కన్నా అదృష్టవంతుడు ఇంకెవడున్నాడు? ఈ రోజుల్లో నా గురించి నేను గర్వపడుతున్నాను. అంతిమ పరీక్షకు ఓర్పు నశించి మరీ వేచివున్నాను. అది (తుది క్షణం) త్వరగా రావాలని నేను గాఢంగా కోర్కు తున్నాను."

అనారోగ్యంతో పడకబెట్టిన మోతీలాల్ నెహ్రూ సిమ్లానుంచి. లాహోర్ కుట్రకేసులో విధించిన శిక్షలపై అప్పీలు చేయవలసిందిగా కోరాడు. కొంత వ్యవధి దొరికితే, రాజకీయ ఖైదీలను అందరినీ విడిపించే ప్రయత్నం చేయవచ్చునని మోతీలాల్ ఉ శం. కాని తన మిత్రులతో భగత్‌సింగ్ "అలాచేయ ద్దు, వద్దు. ఉరిశిక్ష రద్దుకాకూడదు" అన్నాడు రాజ య్య ఖైదీ లందర్నీ విడుదల చేస్తారనే భ్రమ లేదుగాని, ప్రాసి క్యూషన్ సాక్ష్యాలు బలహీనంగా ఉన్నందువల్ల మరణశిక్ష రద్దుఅవుతుందేమో నన్న భయం భగత్‌సింగ్‌కు కలిగింది.

విజయకుమార్‌సిన్హా మాటల్లో చెప్పాలంటే "దేశం యావత్తూ ఆయన ప్రాణాన్ని కాపాడాలని కోర్తు తున్నది. కాని భగత్‌సింగ్ మాత్రం తాను చనిపోవా లనుకొంటున్నాడు. తాను మరణించినా తద్వారా విప్లవోద్యమం జీవించి ఉంటుందని ఆయన చనిపో డానికి ఆదుర్దాపడుతున్నాడు."

చనిపోయేముందు తన చిన్న సోదరుడు కర్తార్ సింగ్‌కు రాసిన ఉత్తరంలో భగత్‌సింగు ఇలా రాశాడు:

"ప్రభాతకాంతి విరజిమ్మే సమయంలో, భవి ష్యత్‌ను ఎవడు ఆపగలడు? యావత్ ప్రపంచమూ మాకు వ్యతిరేకంగా నిలిచినా, అందులో నష్టం ఏముంది?............ మిత్రులారా! జీవిత ఘడియలు ముగియబోతున్నాయి, ఉదయమయ్యేసరికి దీపకాంతి నశించిపోతుంది. అలాగే ప్రభాత కిరణాలు ప్రసరించక ముందే నేను అదృశ్యమై పోతున్నాను. పిడుగుపడే

టపుడు మెరిసే మెరుపులా, మన విశ్వాసం, మన అభిప్రాయాలు కాంతిని విరజిమ్ముతాయి. ఈ గుప్పెడు మట్టి "దేహం" నశించిపోతే వచ్చే నష్టం ఏముంది?"

లాహోర్ కుట్రకేసు ఖైదీలు చాలామంది ఇదివరకే సోషలిస్టు భావాలవైపుకు మొగ్గారు. అందులో భగత్‌సింగు మొదటివాడు. తనకు మరణం తథ్యమని తెలిసి కూడా సోషలిస్టు గ్రంథాన్ని పఠించుతూనే వుండేవాడు. 1930 జూలై 24 న లాహోర్ సెంట్రల్ జైలునుంచి జయదేవ గుప్తాకు రాసిన వుత్తరంలో భగత్‌సింగ్ ఈ క్రింది పుస్తకాలు పంపమని కోరాడు. దాన్నిబట్టే తెలుస్తుంది ఆయన అభిరుచి ఏమిటో? ఆ పుస్తకాలివి:

1. కారల్ లిబ్నెక్ రాసిన "మిలిటరిజం"
2. బెర్ట్రాండ్ రసెల్ రాసిన "హార్డ్‌మెన్స్ ఫైట్"
3. సోవియట్స్ ఎట్‌వర్కు.
4. కొలాప్స్ ఆఫ్ సెకండ్ ఇంటర్నేషనల్.
5. లెఫ్ట్‌వింగ్ కమ్యూనిజం.
6. ప్రిన్స్ క్రొపాట్కిన్ రాసిన మ్యూచ్యువల్ ఎయిడ్.
7. ఫీల్డ్స్, ఫాక్టరీస్, వర్క్‌షాప్స్.
8. మార్క్స్ రాసిన-సివిల్‌వార్ ఇన్‌ఫ్రాన్సు.
9. లాండ్ రివల్యూషన్ ఇన్ రష్యా.
10. బుకారిన్ రాసిన-హిస్టారికల్ మెటీరియలిజం.
11. అప్టన్ సింక్లైర్ రాసిన "స్పై"
12. స్టాల్లింగ్ రాసిన "పెజెంట్ ఇన్ ప్రాస్పర్టీ అండ్ డెట్"

భగత్‌సింగ్ ఆఖరి క్షణాన చదివిన గ్రంథం కూడా లెనిన్ గురించిన గ్రంథమే. ప్రాణనాథ్ అనే న్యాయవాది ద్వారా ఆ గ్రంథాన్ని తెప్పించుకొన్నాడు. మర్నాడు తనకు ఉరి తప్పదు. ఈలోగానే పూర్తి చేయాలనే తహతహ. ఏకదీక్షగా చదువుతున్నాడు. చివరికి ఆ ఉరి తీసే సమయం వచ్చింది. జైలుగది తాళాలు విడివడ్డాయి. ఉరిశిక్షకు సి ం కమ్మని కోరాడు అధికారి. ఐనా భగత్‌సింగ్ దృ పుస్తకం పైనే కేంద్రీకరించి ఉంది. మరికొన్ని ణాలు పు కంపై నిలార్పెడు. పూ ర్తయ్యేలా కనిపించలేదు. కాన్ని మూసివేశాడు. పద అంటూ ఆ అధికారిని అ రించాడు:

ఢిల్లీ సెషన్సు జడ్జి కోర్టులో భగత్‌సింగ్ విప్లవం అంటే తనకుగల అవగాహన ఏమిటో విశదీకరించాడు. ఆ కోర్టులోని ఆయన వాఙ్మూలం సోషలిస్టు భావాల వైపు పరివర్తనను తెలియచేస్తోంది. ఆయన యిలా అన్నాడు.

"విప్లవం అంటే తప్పనిసరిగా రక్తపిపాసతో కూడిన కలహం కానక్కరలేదు. అలాగే వ్యక్తిగత ప్రతీకారానికి తావు లేదు. బాంబు, పిస్తోళ్ళ సిద్ధాంతం కాదది. కనబడుతూవున్న అన్యాయాన్ని ఆధారం చేసుకొని ఉన్న ప్రస్తుత వ్యవస్థను మార్చడం మా ఉద్దేశంలో విప్లవం. ఉత్పత్తిదారులు లేక కార్మికులు సమాజంలో అత్యంత అవసరమైన వ్యక్తులైనప్పటికీ, వారి శ్రమ ఫలితాన్ని దక్కకుండా దోచుకోబడుతున్నారు. వారి ప్రాథమిక హక్కులు హరింపబడుతూ వున్నాయి. ధాన్యం పండించే తు, తన కుటుంబముతో సహా అందరితోనూ ప పడివుంటున్నాడు. ప్రపంచ మార్కెట్‌కు బట్టలు ‌ యి చేస్తున్న నేత పనివాడు తన స్వంత బిడ్డల దేహాలు కప్పడానికి తగిన బట్టలు లేవు. వడ్రంగులు, కంసాలులు చేతిపనివారు బ్రహ్మాండమైన భవనాలకు అలంకరణలు సమకూర్చుతారు. కాని వారు మురికివాడల్లో నివశించి నశించిపోతారు. కాగా పెట్టుబడిదారీ దోపిడిదార్లు సమాజంపై ఆధారపడి బతికే పరాన్నభుక్కులు తమ చిత్తం వచ్చినట్లు కోట్లాది డబ్బును దుర్వ్యయం చేస్తున్నారు. ఈ భయంకరమైన అసమానతలు, బలవంతంగా రుద్దిన వ్యత్యాసాలు సంక్షోభాన్ని కల్గిస్తున్నాయి. ఈ పరిస్థితులు ఇలాగే చిరకాలం వుండజాలవు. బద్దలవడానికి సి మౌతున్న అగ్నిపర్వతం పైన ప్రస్తుత సామాజిక వ వస్థ ఆటలాడుతూంది. దోపిడికి గురయ్యే లక్షలాది జలు, అమాయకులైన వారి పిల్లలు ప్రమాదకరమైన ఆ అగ్నిపర్వత శిఖరం అంచున నడుస్తున్నారు. సకాలంలో రక్షించకపోయినట్లయితే, ఈ నాగరికత అంతా కూలిపోతుంది. అందుచేత తీవ్రమైన మార్పు అవసరం. సోషలిస్టు ప్రాతిపదికపై సమాజాన్ని పునర్నిర్మించడం, ఈ విషయం గుర్తించిన వారి విధి. ఇది గనుక చేయకపోయినట్లయితే, మానవుని మరో మానవుడు, జాతిని మరో జాతి దోచుకోడం అనే దాన్ని, అనగా సామ్రాజ్యవాదాన్ని నశింపచేయక పోయినట్లయితే, నేడు మానవాళి ఎదుర్కొం

టున్న బాధల్ని. హత్యాకాండనీ అరికట్టడం అసాధ్యం, యుద్ధాల్ని అంతం చేస్తామనీ విశ్వశాంతి శకాన్ని ఆరంభిస్తామనీ చెప్పే మాటలన్నీ నగ్నమైన కపటనాటకం అవుతాయి. అలాంటి సంక్షోభాల వల్ల ప్రమాదానికి గురి కాబోని సామాజిక వ్యవస్థను చిట్ట చివరకు స్థాపించడమే విప్లవమని మేం అంటున్నాం. అలాంటి సామాజిక వ్యవస్థలో శ్రామికవర్గ సార్వ భౌమాధిపత్యాన్ని గుర్తించాలి. తత్ఫలితంగా ఒక ప్రపంచ సమాఖ్య ఏర్పడి, పెట్టుబడిదారీ విధానదాస్యం నుంచి, సామ్రాజ్య యుద్ధాల వల్ల కలిగే దౌర్భాగ్యం నుంచి మానవాళిని రక్షించాలి"

మాతృదేశబలిపీఠంపై ప్రాణాలర్పించిన లాహోర్ కుట్రకేసు ఖైదీల సంగ్రహ జీవితాన్ని ఇక్కడ సంస్మరించుకొందాం.

## భగత్ సింగ్

భగత్‌సింగ్, బాంగా అనే గ్రామంలో 1907 సెప్టెంబర్ 27 న జన్మించాడు. ఇపుడు ఆ గ్రామం పశ్చిమ పాకిస్తాన్‌లో వుంది. తండ్రి కిషన్‌సింగ్. తల్లి విద్యావతి. కిషన్‌సింగు మొక్కవోని దేశభక్తుడు నేపాల్‌లో కొన్నాళ్ళు ప్రవాసజీవితం గడిపాడు. భగత్‌సింగు కుటుంబీకులంతా స్వాతంత్ర్య సమరవీరులే. భగత్ సింగు జననం తర్వాత ఆ కుటుంబంలో కొన్ని సంతోష కరమైన ఘటనలు జరిగాయి. తండ్రి కిషన్‌సింగు ప్రవాసజీవితం నుంచి తిరిగివచ్చాడు. అలాగే భగత్ సింగు పినతండ్రి స్వరణ్‌సింగు డిటెన్షన్ నుంచి విడుదలయ్యాడు. పెదనాన్న అజిత్‌సింగు మాండలే జైలు నుంచి విడుదలై రాబోతున్నాడు. అందుచే భగత్ సింగును తమకు భాగ్యం (అదృష్టం) తెచ్చిన వ్యక్తిగా భావించి భగత్‌సింగు అని పేరు పెట్టారు

భగత్‌సింగు తాత అర్జన్‌సింగు హింధు వైద్యుడు, సంఘసంస్కర్త. తన పెద్ద మనవడు జగత్‌సింగునూ, భగత్‌సింగునూ భారతదేశ విముక్తి కోసం అర్పిస్తానని అంటూ వుండేవాడు. అయితే జగత్‌సింగు 11 వ ఏటనే చనిపోయాడు. జైళ్ళలో క్షయవ్యాధి సోకిన స్వరణ్ సింగు 1910 జూలై 20 న చనిపోయాడు. ఇతరదేశాల నుంచి బ్రిటిష్ ప్రభుత్వంపై దాడి చేయటం అవసరమని భావించి అజిత్‌సింగు భారతదేశాన్ని విడిచిపెట్టి వెళ్లాడు. తన తండ్రిని అనేకసార్లు పోలీసులు స్టేషన్‌కు లాక్కువెళ్ళడం చూసిన భగత్‌సింగు లేత హృదయంలో దేశభక్తి బీజాలు నాటుకొన్నాయి.

భగత్‌సింగు గృహానికి తరుచు రాజకీయ నాయకులు వస్తూ వుండేవారు. వంగ విభజన రద్దు చేయడానికి ఆ రాష్ట్ర ప్రజలు సాగించిన వీరోచిత పోరాట గాథల్ని భగత్‌సింగు వింటూ వుండేవాడు. పంజాబ్‌లో కాలనైజేషన్ ఆక్టును రద్దు చేయవలసిందిగా పోరాడిన వారిలో అజిత్‌సింగు వున్నాడు. గదర్ పార్టీ పోరాటాలను కూడా భగత్‌సింగు వినేవాడు. నవంబర్ 16న కర్తార్‌సింగు సారభా ఉరితీయబడడమూ, జలియన్ వాలా బాగు హత్యాకాండలు భగత్‌సింగుపై మంచి ప్రభావాన్ని కలుగజేశాయి. స్కూళ్ళను బహిష్కరించాలని విద్యార్థులకు గాంధీ విజ్ఞప్తి చేసిన రోజుల్లో, భగత్‌సింగు లాహోర్‌లో డి.ఎ.వి. మిడిల్ స్కూలులో చదువుతున్నాడు. గాంధీ ఆదేశాన్ని పాటించి, సుఖదేవ్, భగవతీ చరణ్, యశపాల్ మున్నగువారు తమ చదువులకు స్వస్తి చెప్పారు.

"చదువు పట్ల అంత శ్రద్ధలేని నీవు దేశానికి ఏం సేవ చేస్తావు. పెదనాన్న అజిత్‌సింగు పేరు చెప్పుకొనీ, కిషన్‌సింగు కొడుకునని చెప్పుకొనీ నీవు గర్వపడతావు" అని తండ్రి ఎగతాళి చేశాడు.

"మీపేర్లు చెప్పుకొని నేను గర్వపడను. కాని ఒకానొక రోజున చరిత్ర నాపేరును మీ ఇద్దరిపేర్లతో జతచేసినపుడు, మీ ఇద్దరూ గర్వపడతారు" అని భగత్‌సింగు జవాబిచ్చాడు. చివరికాజోస్యమే నిజమైంది. 1-9-1924 లో భగత్‌సింగు విప్లవవాదుల సంఘంలో చేరాడు. వైవాహిక జీవితం అక్కరలేదని పెళ్ళిచేసుకో నిరాకరించాడు.

అదివరలో శచీంద్రనాథ్ సన్యాల్ నాయకత్వాన హిందూస్తాన్ రిపబ్లికన్ అసోసియేషన్ ఏర్పడింది. దీన్ని హిందూస్తాన్ సోషలిస్టు రిపబ్లికన్ అసోసియేషన్‌గా పేరుమార్చారు. ఈ సంఘానికి చంద్రశేఖర్ ఆజాద్ నాయకుడు. "సోషలిస్టు" అనే పదం ఈ సంఘం పేరుతో భగత్‌సింగు సూచనపైననే చేర్చబడింది. తర్వాత హిందూస్తాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ కూడా ఒకటి నిర్మించబడింది. తదితర విప్లవ నాయకులతోపాటు భగత్‌సింగు కూడా దీని నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించాడు.

1928 డిసెంబర్ 17న సాండర్స్ హత్యజరిగింది. పోలీసులు లాహోర్ నగరమంతా భగత్‌సింగు ప్రభృతుల కోసం తీవ్రంగా గాలిస్తున్నారు. విప్లవకారుడు భగవతీ చరణ్ భార్య దుర్గాదేవి వీరిని తప్పించడానికి తోడ్పడింది. భగత్‌సింగు భార్యగా నటిస్తూ, చంటి బిడ్డతో (ఏకైక పుత్రుడు) ప్రయాణం చేసింది. భగత్‌సింగు సివిల్ అధికారి వేషంలో, ఆమె తోడ్పాటుతో తప్పించుకు పోయాడు. పరాయివాని భార్యగా నటించటం, మూడేళ్ళ పసిబిడ్డకు కూడా ఏదైనా ఘటన జరిగితే ప్రమాదం వుందని తెలిసికూడా, దుర్గావి లాంటి వీరమాత మినహా ఎవరూ అంత సాహసానికి ఒడిగట్టరు. రాజగురు నౌకరు వేషంలో వీరితో పాటు తప్పించుకొన్నాడు. వీరికి తెలియకుండానే చంద్రశేఖర్ ఆజాద్ కూడా, రామనామం ముద్రించిన దుప్పటి కప్పుకొని, పురోహితుని వేషంలో తప్పించుకు పోయాడు.

కేంద్ర అసెంబ్లీలో బాంబువిసిరి పట్టుబడిన తర్వాత భగత్‌సింగుకు మొదట యావజ్జీవ శిక్ష విధింపబడింది. సాండర్సు హత్యలో భగత్‌సింగ్ వున్న విషయం తెలిశాక విచారించి ఉరిశిక్ష విధింపబడింది. లాహోర్ సెంట్రల్‌జైలులో 1931 మార్చి 23న సుఖదేవ్, రాజ్‌గురులతో పాటు ఉరితీయ బడ్డాడు.

## రాజగురు

రాజగురు పూర్తిపేరు శివరాం రాజగురు. తండ్రి హరిరాజ్ గురు. పూనాలో వుండేవాడు. రాజగురు వారణాసిలో జన్మించాడు. సాండర్సు హత్యలో పాల్గొన్నాడు. భగత్‌సింగు సహచరుడు. 1929 సెప్టెంబర్ 30న ఒక మోటార్ గ్యారేజిలో అరెస్టయాడు. లాహోర్ కుట్రకేసులో మరణశిక్ష విధించబడి భగత్‌సింగుతో పాటు ఉరితీయ బడ్డాడు.

## సుఖదేవ్

లయాల్పూర్ (ఇపుడు పాకిస్తాన్‌లో వుంది) లో సుఖదేవ్ జన్మించాడు. తండ్రి రామ్‌లాల్. పంజాబ్ తదితర ఉత్తరాది రాష్ట్రాల్లో విప్లవ సంఘాన్ని ఏర్పరచాడు. సాండర్సు హత్యలో పాల్గొన్నాడు. లాహోర్ కుట్రకేసులో కీలక వ్యక్తిగా ప్రభుత్వం ఇతన్ని గురించి పేర్కొంది. 1929 ఏప్రిల్ 15న అరెస్టయాడు. లాహోర్ కుట్రకేసులో మరణశిక్ష విధించబడింది. భగత్‌సింగు, రాజగురులతోపాటు ఉరితీయ్యబడ్డా. ఉరితీయబడే కొద్దిరోజుల ముందు గాంధీకి ఒక లేఖ రాశాడు. కాని అది ఆయన ఉరితీయ్యబడిన అనంతరం గాంధీకి చేరింది.

"అనేకులలో ఒకడు" అనేపేరుతో ఆ ఉత్తరం రాశాడు లాహోర్ కాంగ్రెస్ సంపూర్ణ స్వాతంత్ర్యానికి కట్టుబడి వుండాలని ఆ లేఖలో హెచ్చరించాడు. ఏవైన ఒడంబడికలు జరిగినా, అవి యుద్ధ విరామంగా భావించి పోరాటాన్ని మరింత ఉన్నత దశకు తీసుకుపోడానికి ఆ కాలాన్ని ఉపయోగించాలని చెప్పాడు. జైళ్ళలో మగ్గుతున్న విప్లవ దీలను గురించి, 1914-15 నుంచి జైళ్ళలో మగ్గుతున్న గదర్ పార్టీ వీరులు మున్నగు వారి గురించి సుఖదేవ్ జ్ఞప్తికి తెచ్చాడు.

ఈ ఉత్తరాన్ని ప్రకటించుతూ గాంధీజీ "వ్యాసకర్త (సుఖదేవ్) అనేకులలో ఒకడు కాజాలడు. స్వాతంత్ర్యం కోసం ఉరికంబాన్ని కౌగలించుకొనేవాడు అనేకులలో ఒకడు కాజాలడు" అని రాశాడు. ఆయన లేవనెత్తిన కొన్ని ప్రశ్నలకు గాంధీ జవాబు చెప్పాడు.

## బటుకేశ్వర దత్త

బటుకేశ్వర దత్తను బి. కె. దత్తుగా అందరూ పిలవడం పరిపాటి. భగత్‌సింగ్‌కు నమ్మకస్తుడైన సహచరుడు. భగత్‌సింగుతోపాటు కేంద్ర అసెంబ్లీ హాలులో బాంబులు వేసి, కరపత్రాలు పంచాడు.

దత్తు 1908 లో కాన్పూరులో జన్మించాడు. తండ్రి గోష్ఠబిహారీదత్తా. 1925 లో మెట్రిక్యులేషన్ ప్యాసయ్యాడు. కలకత్తా వెళ్ళి దర్జీపని నేర్చుకుంటున్నాడు. ఈ దశలో తలిదండ్రులు చనిపోయారు.

భగత్‌సింగు, చంద్రశేఖర్ ఆజాద్, రాజగురు, సుఖదేవ్‌లతోపరిచయం ఏర్పడ్డాక, వారికి అత్యంత విశ్వసనీయ అనుచరుడయ్యా. ఆగ్రా, తదితర ప్రాంతాల్లో ఆర్గనైజరుగా పని చేశాడు. భగత్‌సింగు, దత్తులు అరెస్టయ్యాక, వేర్వేరుగా వివిధ జైళ్ళలో వున్నా. నిరశనవ్రతం చేసి, రాజకీయ ఖైదీల పరిస్థితిని కొంత మెరుగయ్యేలా చేశారు. లాహోర్ కుట్ర కేసులో దత్తును విడిచిపెట్టారుకాని, అసెంబ్లీ బాంబు కేసులో శిక్షింపబడ్డాడు. 1930 లో అండమాన్ జైలుకి

పంపేరది ప్రభుత్వం. అండమాన్స్‌కు రాగానే నిరశన వ్రతం ప్రారంభించాడతడు. ఇతర్లు కూడా ఆయనతో పాటు నిరశనవ్రతంలో చేరారు. జైలు అధికారులు దత్తును అమానుష చిత్రహింసలకు గురిచేశారు. ఈ సందర్భంలోనే మహావీర్‌సింగు చిత్రవధలకు గురై మరణించాడు. అతని శవాన్ని అధికారులు సముద్రంలో పారవేశారు. గాంధీ జోక్యం ఫలితంగా అండమాన్ దీలను భారతదేశానికి రప్పించారు. 1937 లో ద భారతదేశం చేరాడు. 1938 లో విడుదలయా . 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో దత్తును తిరి చేశారు. 1945 లో అతని సోదరుని ఇంట్లో దత్తు ఇంటరన్ చేశారు. 1947 లో విడుదలయాడు. 1962 లో ఒక యాక్సిడెంట్‌కు లోనై దత్తు జబ్బు పడ్డాడు. 1965 జూలై 19 న ఢిల్లీలోని ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్‌లో చనిపోయాడు. ఫిరోజ్‌పూర్‌లో భగత్‌సింగు సమాధివద్ద సట్లెజ్ నదీతీరాన గౌరవ లాంఛనాలతో సమాధి చేయబడ్డాడు.

## చంద్రశేఖర్ ఆజాద్

చంద్రశేఖర్ ఆజాద్ 1906 జూలై 23 న, ప్రస్తుత మధ్యప్రదేశ్‌లోని భవోరా గ్రామంలో ఒక బీద బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. తండ్రి పండిట్ సీతారామ్ తివారి, తల్లి శ్రీమతి జగదనీదేవి. బీదరికం కారణంగా హైస్కూలులో చదవలేకపోయాడు. కాని సంస్కృతం నేర్చుకొనేందుకు వారణాసికి అతని తలిదండ్రులు పంపారు. సంస్కృత శిక్షాశాలలోను, కాశీవిద్యాపీఠ్‌లోనూ విద్య నభ్యసించాడు. సంస్కృత విద్య అభ్యసిస్తున్న కాలంలోనే 14 వ ఏటనే నాన్ కోపరేషన్ ఉద ంలో చేరాడు. ఒక ఊరేగింపు నడుపుతుండగా అరె సి 1921 లో జైలుకి పంపారు. జైలులో 15 రడా దెబ్బలు కొట్టారు. మేజిస్ట్రేట్ ముందు తన పేరు 'ఆజాద్' (స్వతంత్రం) అనీ, తండ్రి పేరు "స్వాధీన్" అనీ; తన అడ్రసు "జైలు" అనీ చెప్పాడు. అతణ్ణి కొట్టిన కొరడాదెబ్బలే; అతణ్ణి ।టిష్ ప్రభుత్వానికి బద్ధ శత్రువుగా; పక్కలో బ ఎగా, సింహస్వప్నంగా తయారుచేశాయి. సుప్రసి విప్లవకారుడు మన్మథనాథ గుప్త ప్రోత్సాహంతో విప్లవవాదులలో చేరాడు. రామ్‌ప్రసాద్ బిస్మిల్ నాయకత్వాన కాకోరి రైలు దోపిడీలో పాల్గొన్నాడు. కాని పోలీసులకు చిక్కలేదు. పోలీసులు ఆజాద్‌ను పట్టుకుంటే 30 వేల రూపాయలు బహుమతి ఇస్తామని ప్రకటించారు. ఐనా ప్రభుత్వానికి చిక్కకుండా అనేక సంవత్సరాలు రహస్య జీవితం గడిపాడు. 1928 సెప్టెంబర్ 8 న ఏర్పడిన హిందూస్తాన్ రిపబ్లికన్ అసోసియేషన్ ఏర్పరచిన "హిందూస్తాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ"కి అధిపతి అయ్యాడు. లజపతిరాయ్ మరణానికి కారకులైన స్కాట్, సాండర్స్ అనే బ్రిటిషు పోలీసు ఉద్యోగులను హత్య చేయడానికి ఆజాద్, భగత్‌సింగు, రాజగురులు పథకం వేశారు. సాండర్స్ హత్యలో కృతకృత్యులయ్యారు.

"హిమాలయా టాయ్‌లెట్స్" అనే పేరుతో ఒక కంపెనీ పెట్టారు. ఈ కంపెనీ అసలు తయారు చేసేది తయుధ సామగ్రి. రోజుకి 400 బాంబులు తయారుచేయాలనే సంకల్పంతో దీనిని నెలకొల్పారు.

కేంద్ర అసెం లో బాంబులు విసిరే పథకాన్ని ఆజాద్ రూపొంది చాడు. ఈ కేసులో పట్టుబడకుండా రెండేళ్ళు తప్పిం కు తిరిగాడు. ఆజాద్ ఎన్నో విప్లవ ఘటనలలో తప్పించుకు తిరిగాడు. అతని మిత్రులు అతనికి "పాదరసం" అని పేరు పెట్టారు. పాదరసలాం తుర్రున రిపోయేవాడని భావం. కాకోరి, లాహోర్, మ్యాఢి కుట్రకేసుల్లోను, ఇతర కేసుల్లోనూ ఆజాద్ ఎ పుడూ పట్టుబడలేదు. విప్లవవాదుల ఉద్యమంలో అనేకమంది అరెస్టు కావడంతో నవతరం నుంచి యువకుల్ని రిక్రూట్ చేద్దామనే ఉద్దేశంతో ఆజాద్ దేశమంతటా పర్యటించాడు. ఆ సందర్భంగానే 1931 ఫిబ్రవరి 26 న అల్లాహాబాద్ వచ్చాడు. విప్లవవాదుల మీటింగులో పాల్గొన్నాడు. ఆ మర్నాడు మరో విప్లవకారుని కలవడానికి ఆల్ఫ్రెడ్ పార్కుకు వెళ్ళాడు. వీరభద్ర తివారి అనే ద్రోహి అతణ్ణి గుర్తించి పోలీసులకు సమాచారం అందించాడు.

అలాహాబాద్ పోలీసులు పార్కును అన్ని వేపులా చుట్టుముట్టి, అందులోనికి ఎవరూ చొరబడకుండా చూశారు. పోలీసులు కాల్పులు సాగించుతున్నపుడు గానీ, పరిస్థితి తీవ్రతను ఆజాద్ గ్రహించలేదు. ఒక కీలక స్థానంలో చోటు చేసుకొని, రెండు చేతుల్తో పిస్తోళ్ళతో కాల్చడం మొదలెట్టాడు. బిశ్వేశ్వరసింగు అనే పోలీసు ఇనస్పెక్టర్ దళం తుపాకి గుళ్ళ వర్షం

కురిపించింది. దేహ మంతా తూట్లుపడ్డాయి, అయినా ఆజాద్ కాలుస్తూనే వున్నాడు. ఇక లాభం లేదను కొన్న పరిస్థితుల్లో ఆఖరి గుండుతో తన శిరస్సుకు ఎక్కుపెట్టి కాల్చుకుని వీర మరణం చెందాడు. "శత్రు వుల తుపాకి గుళ్ళను ఎదుర్కొంటాను. స్వతం త్రుడిగానే జీవిస్తాను. స్వతంత్రుడిగానే మరణిస్తాను" అని ఆయన చేసిన శపథాన్ని అక్షరాలా నిలబెట్టు కొన్న మహావీరు డతడు. ఈ పోరాటంలో అనేకమంది పోలీసులు చనిపోయారు. బ్రిటిష్‌పోలీసు సూపరెన్టెంట్ నాట్ - బౌవర్ గాయపడ్డాడు. భారతీయ పోలీసు ఉద్యోగి బిశ్వేశ్వర్ సింగ్ కూడా గాయపడ్డాడు.

ఆజాద్ తన రహస్య జీవిత కాలంలో రాజాలతో, జాగీర్దార్లతో స్నేహం పెంచుకున్నాడు. తన విప్లవ పార్టీ కార్యకర్తలకు తుపాకులు కాల్చడంలో తర్ఫీదు యివ్వడానికి, వీరి ఆశ్రయాన్ని ఉపయోగించు కొన్నాడు. తర్వాత కొన్నాళ్ళకు కొందరు జాగీర్దార్ల హక్కులను అజాద్‌తో సంబంధాలు కలిగివున్నారనే మిషతో ప్రభుత్వం రద్దుచేసింది ఆనాడు విప్లవవాదు లలో వస్తున్న మార్పులను చంద్రశేఖర్‌ఆజాద్, జవ హర్‌లాల్ నెహ్రూను కలుసుకొన్న సంఘటన తెలియజేస్తుంది. తమ అభిప్రాయాలను మార్చుకున బ్రిటిష్ ప్రభుత్వాధికారులు, ఇంకా తమను వేటా వేధించుతున్నారని ఆజాద్ తెలియచేశాడు. ఈ వి యమై జవహర్‌లాల్‌నెహ్రూ, చంద్రశేఖర్ ఆజాద్‌ను గురించి, తన ఆత్మకథలో ఇలా అన్నాడు.

"భారతదేశ టెర్రరిస్టుసంఘ చిత్తవృత్తిని తెలిపే హంశం ఒకటి నాకు జ్ఞాపకం వుంది. ఇది నేను విడు దలైన వెంటనే జరిగింది. ఒక కొత్త వ్యక్తి నన్ను చూడటానికి వచ్చాడు. తన పేరు చంద్రశేఖర్‌ఆజాద్ అని అతడు చెప్పాడు ... నేను అతణ్ణిచూసి ఆశ్చర్య పడ్డాను. కాంగ్రెసుకు ప్రభుత్వానికి రాయబారాలు జరుగ నున్నవన్న వదంతులు విని, అతడు నన్ను చూడటా నికి వచ్చాడు. సమాధానం కుదిరితే తమ సంఘానికి ఏమైనా శాంతి చేకూరుతుందా ? అని అడిగేందుకు అతడు వచ్చాడు. వారు ఇంకా న్యాయ బాహ్యులుగానే భావించబడి, అలాంటి ఆదరణనే పొందుతారా ? తల దాచుకునేందుకు చోటులేకుండా తరుమకొట్టబడుదురా ? ఉరికంబాలు ఎప్పుడూ వారి కోసం ఎదురుచూడవలసిం దేనా ? లేక ప్రశాంత వృత్తులు అవలంబించడానికి సావకాశాలు వున్నవా ? కేవలం "టెర్రరిస్టు పద్ధతుల వల్ల లాభంలేదనీ వాటివల్ల ఎలాంటి మంచీ చేకూర లేదనీ తాము గ్రహించామని అతడు చెప్పాడు. అయినా భారతదేశం కేవలం శాంతి పద్ధతుల చేతనే స్వాతంత్ర్యం పొందగలదన్న నమ్మకం అతనికి లేదు. భవిష్యత్తులో ఎప్పుడో ఒకప్పుడు దౌర్జన్యం రావచ్చుననీ, కాని అది టెర్రరిజం కాదనీ అతడు చెప్పాడు, కనుక అతడు భారత స్వాతంత్ర్యానికి సంబంధించినంతవరకూ ప్రస్తుత టెర్రరిజం పనికి రాదన్నాడు, కాని ప్రశాంతంగా బ్రతకడానికి ఎలాంటి అవకాశం కలుగజేయకుండా "నన్నెప్పుడూ తరుమ కొడుతుంటే నేనేం చెయ్యాలి ?" అని అత డడిగాడు. ఈ మధ్య జరిగిన టెర్రరిస్టుచర్యలు చాలవరకు ఆత్మరక్షణ కోసం చేయబడ్డవేనని అతడు చెప్పాడు.

టెర్రరిజంలో నమ్మకం నశించుతున్నదని ఆజాద్ ద్వారా విని. నేను చాలా సంతోషించాను. ఈ విష యంలో తరవాత నాకు మరింత నమ్మకం కలిగింది.

నేను చంద్రశేఖర్ ఆజాద్‌కు నా రాజకీయతత్వం బోధించి, నా దృక్పధానికి మార్చుకో చూశాను. కాని నేను ఇప్పుడేం చెయ్యాలి ?" అని అతడు అడిగిన ప్రధాన ప్రశ్నకు నేను జవాబు చెప్పలేకపోయాను"

## బాబా పృధ్వీసింగ్ ఆజాద్

విప్లవ వీరగాథలతో పెనవేసికుని వుంది పృధ్వీ సింగు జీవితం. శౌర్యం మూర్తీభవించిన రాజపుత్ర యోధుడు పృధ్వీసింగు. "ఆయనకు భారతస్వాతంత్ర్యం తప్ప మరో లక్ష్యం లేదు" అని గాంధీ ప్రశంసల నందుకొన్న మహావ్యక్తి. పోలీసులు ఆయన్ని అరెస్టు చేసినప్పుడు "నా దృష్టిలో ఆయన (పృధ్వీసింగు) సిగ్గు పడవలసిన నేరం ఏమీ చేయలేదు" అంటూ గాంధీ, పృధ్వీసింగు సమరశీల జీవితాన్ని కొనియా డాడు.

పృధ్వీసింగు 92 ఏండ్ల క్రితం సెప్టెంబర్ 15 న జన్మించాడు. ఆయన బాల్యం చాలా కష్టాలతో కూడు కొని వుంది. దారిద్ర్యం పుట్టుకతోనే వెన్నాడింది. బాల్యంలో ఆయనకి మంచి ఆహారం కాని, మంచి బట్టలు కాని ఉండేవి కావు. పంజాబులోని అంబాలాలో ఆయనకు బాల్యంలో విద్య అంతగా పట్టుబ నట్టులేదు. పృధ్వీసింగు తండ్రి, భార్య ఇద్దరు పిల్ల పోషించే నిమిత్తం రంగూన్ చేరాడు.పృధ్వీసింగు అ క్కత కూడా

కొన్నాళ్ళు ఉండి చదివాడు కాని ఆయన దృష్టి విద్యాభ్యాసం కన్నా, దేశ స్వాతంత్ర్యంపై మళ్ళింది. 15వ ఏటనే సర్ వాల్టర్‌స్కాట్ రాసిన ఒక గేయం ఆయన్ని రాజకీయాల వైపు బాగా ఆకర్షింపబడేలా చేసింది.

1907 నాటి ఆర్యసమాజం, బెంగాల్‌లో విప్లవవాదుల బాంబు ప్రయోగాలు, లజపతిరాయికి ప్రవాస శిక్ష మొదలైనవి పృథ్వీసింగు లేత హృదయంలో స్వాతంత్ర్యకాంక్షను బలంగా నాటుకొనేటట్లు చేశాయి.

పృథ్వీసింగు బర్మా వదలి మొదట సింగపూర్ వెళ్ళాడు. అక్కడనుండి మనిలా వెళ్ళాడు. మనిలా నుండి అమెరికా చేరాడు. అక్కడ గదర్ పార్టీ సభ్యులతో పరిచయమైంది. గదర్‌పార్టీ వ్యవస్థాపక సభ్యుడయ్యాడు. 1914 ఫిబ్రవరిలో స్టాక్టన్‌లో జ్వాలాసింగు అధ్యక్షతన జరిగిన గదర్‌పార్టీ సభలో పృథ్వీసింగు పాల్గొన్నాడు. తర్వాత గదర్‌పార్టీ స్థాపించిన పత్రిక "గదర్"లో పని చేశాడు.

భారతదేశంలో సాయుధ తిరుగుబాటు లేవదీయడానికై అమెరికా నుండి భారతదేశానికి బయలుదేరిన గదర్ వీరులలో పృథ్వీసింగు కూడా ఉన్నాడు.

క్లిష్ట సమయాల్లో పృథ్వీసింగు ఎలాంటి సాహసాన్ని ప్రదర్శించాడో, 1914 ప్రారంభంలో జరిగిన ఒక ఘటన తెలియ చెప్తుంది.

పృథ్వీసింగు రహస్యజీవితం గడుపుతున్నాడు. హఠాత్తుగా అతని గదిలోకి అమరసింగు అనే పోలీసు ఆఫీసర్ ప్రవేశించాడు. మందీ మార్బలంతో తాను వచ్చేదాకా, పృథ్వీసింగును ఏదో మాటల్లో దింపి కాలక్షేపం చేయవలసిందిగా పోలీసు సూపరెంటెంటు అమర్ సింగును ఆదేశించాడు. ఐతే అతగాడు ఆ పనిలో విఫలమయ్యాడు. ఏదో సమాచారం అడుగుతున్నట్లు అడుగుతూనే హఠాత్తుగా రివాల్వర్ తీసి పృథ్వీసింగును చేతులెత్తమన్నాడు అమర్‌సింగు. పృథ్వీసింగు చేతిలో ఆయుధం ఏమీ లేదు. ఐనా కలబడి పిస్తోలున్న అతని ముంజేతిని గట్టిగా పట్టుకొని విదిలించేశాడు. పిస్తోలు కింద పడింది. దూరంగా పృథ్వీసింగు దాన్ని తన్నివేశాడు. అమర్ సింగు పొడుగాటి కత్తి తీసి పృథ్వీసింగు కంఠం పైన రెండు ప్రక్కలా గాయపరచాడు. దెబ్బ తిన్న సింహంలా పృథ్వీసింగు విజృంభించి అమర్ సింగును నేలపై పడేసి, అతని ఎదురు రొమ్ముపై కూర్చొని స్పృహ తప్పే దాకా అతడ్ని చావబాదాడు. గాయాల వల్ల రక్తం కారిపోయి పృథ్వీసింగు కూడా తన స్పృహ తప్పిపోయాడు. పోలీసులు వచ్చి అరెస్టు చేసి ఆస్పత్రిలో చేర్చారు. బ్రిటిష్ సర్జన్ ఒకడు పృథ్వీసింగును అవమానపరచేటట్లు మాటాడితే తిరిగి అదే ధోరణిలో అతగాడిని అవమానపరచాడు. తర్వాత ఒక కేసు బనాయించి పృథ్వీసింగుకు 10 ఏండ్ల శిక్ష విధించారు.

ఈ కేసులో శిక్ష అనుభవిస్తున్న కొద్ది నెలల్లోనే మొదటి లాహోరు కుట్ర కేసులో పృథ్వీసింగు శిక్షింపబడ్డాడు. మొదట మరణశిక్ష విధించినా, చివరకు యావజ్జీవ శిక్షగా మార్చబడింది. ఈ శిక్ష అనుభవించడానికి పృథ్వీసింగును అండమాను దీవులకు పంపింది. అక్కడ దుర్భర పరిస్థితులను ఎదిరించుతూ పృథ్వీసింగు 155 రోజులు ఉపవాసం చేశాడు. ఉపవాస విరమణ తర్వాత అండమాన్ దీవులలోని ఖైదీలు పృథ్వీసింగు కోలుకోడానికి కావలసిన ఆహారం ఎలాగో రా సమకూర్చిపెట్టారు. అస్థిపంజరంలా తయారైన పృథ్వీసింగు తిరిగి కొన్నాళ్ళకు మామూలు మనిషి అయ్యాడు. ప్రజల ఆందోళన ఫలితంగా ఆయన్ని అండమాన్ దీవుల నుండి మద్రాసుకు తీసుకువచ్చారు. అక్కడి నుండి నాగపూర్ జైలుకు పోలీసుల రక్షణతో తీసుకువెళుతున్నారు.

1921 జూన్ మాసం అని పృథ్వీసింగుకు జ్ఞాపకం. కలకత్తా మెయిల్‌లో పృథ్వీసింగును తీసుకువెళుతున్నారు. ముగ్గురు మద్రాసు సిపాయిలు కాపలా. కాళ్ళకు బేడీలు వేశారు. చేతులకు సంకెళ్ళు వేశారు. జైలులో పృథ్వీసింగుకు తప్పించుకుపోవాలన్న ఆలోచన కలిగింది. జీవితాంతం జైలులో పడివుండే కన్నా, తప్పించుకొనిపోయే ప్రయత్నంలో మరణించినా ఫర్వాలేదనుకున్నాడు. ఒంగోలు సమీపంలోని దసరాజుపల్లె వద్ద రైలుపెట్టెలోని కిటికీలోంచి కిందికి దూకాడు. అది రాత్రి, కొంచెం చినుకులు పడుతున్నాయి. కారు చీకటి. కాలికీ, చేతులకూ సంకెళ్ళు. ఒంటినిండా ముళ్ళు గుచ్చుకున్నాయి. దెబ్బలు తగిలి గాయాలై రక్తం కారుతూంది. ఆ చీకట్లో అలా పోతూపోతూ వుండగా ఒక గుడిసెలో దీపపు కాంతి మినుకు మినుకు మంటూ కన్పించింది. నెమ్మదిగా అక్కడికి చేరాడు. అది ముక్తినూతలపాడు. హరిజన దంపతుల ఇల్లు అది. తన కాళ్ళకూ చేతులకూ సంకెళ్ళు. పొడుగాటి గడ్డం.

విరబోసిన పొడుగాటి జుట్టు. దేహం నిండా రక్తం భయంకరంగా కనపడుతున్నాడు. ఆ స్థితిలో పృథ్వీసింగును చూడగానే వాళ్ళ కళ్ళల్లో భయం తొంగి చూసింది. "దేశభక్త్", "స్వరాజ్య" అని చెప్పాడు పృథ్వీసింగు. బహుశా వాళ్ళకు కాస్త అర్థమయ్యే వుంటుంది. కళ్ళల్లో భయం ఛాయలు తగ్గిపోయాయి. అతడు సంకెళ్ళను బద్దలు కొడతానని సూచించాడు. అలాగే బద్దలు కొట్టాడు. "నేను బట్టలు విడిచాను. కాని నా కివ్వడానికి అతని వద్ద బట్టలు లేవు. పెట్టడానికి తిండి లేదు. అందుకు అతని ముఖంలో విచారం కానవస్తూంది. నన్ను పట్టించి ఇచ్చి ప్రభుత్వం బహుమానం పొందాలనే భావం అతనికి లేదు. ఆ బీద వాని స్మృతి నా జీవిత పర్యంతం ఉంటుంది" అని పృథ్వీసింగు రాశాడు.

తెల్లవారింది. పృథ్వీసింగుకు ఆ గ్రామంలో తగిన సహాయం లభించలేదు. చివరకు ఏదైనా రైల్వే స్టేషన్‌కు వెళ్ళి అక్కడ ఇంగ్లీషో, హిందీయో తెలిసిన వాళ్ళ ద్వారా సహాయం పొంది తప్పించుకుపోదామను కున్నాడు. కాని పృథ్వీసింగు కోసం వెతుకుతున్న పోలీసుపార్టీ వలయంలోకే చిక్కుకున్నాడు. పోలీసులు ఆయన్ని రాజమండ్రి జైలుకు తీసుకుపోయారు

రెండవ లాహోర్ కుట్రకేసులో కూడా పృథ్వీసింగ్‌ను నిందితునిగా ప్రభుత్వం చేర్చింది. పృథ్వీసింగు రాజపుత్రుడు గనుక, ఆ విషయం తెలిస్తే, రాజపుత్ర సైనికులలో అసంతృప్తి రావచ్చునని, అతణ్ణి సిక్కుగా ప్రభుత్వం పేర్కొంది. ఈ కుట్ర కేసుకు అందరూగాక, ఏడుగురు మాత్రమే బాధ్యత వహించాలని ఈ కేసులోని నాయకులు భావించారు. అందులో పృథ్వీసింగు కూడా ఒకడు.

పృథ్వీసింగు రాజమండ్రి జైలులో ఉండగానే అల్లూరి సీతారామరాజు మన్యం తిరుగుబాటు కూడా జరిగింది. పృథ్వీసింగు ఈ తిరుగుబాటుకు సూచన లిచ్చి పరోక్షంగా సహాయ పడుతున్నాడనే అనుమానం ప్రభుత్వాధికారులకు కల్గింది అని ఒక కథనం. ఆయన్ని రాజమండ్రి నుండి నాగపూర్ జైలుకు మార్చాలని ప్రభుత్వం నిశ్చయించింది.

1922 నవంబర్ 29 రాత్రి కలకత్తా మెయిల్‌లో పృథ్వీసింగును తీసుకవెళుతున్నారు. ఇక తెల్లవారితే నాగపూర్ సెంట్రల్ జైలులో 1952 వరకు ఖైదీగా జీవితం గడపాలి. ఇది రుచించని పృథ్వీసింగు తప్పించుకోవాలని నిర్ణయించుకున్నాడు.

పృథ్వీసింగుకు ఒక ఇం షు సార్జెంటు 8 మంది సిపాయిలు కాపలా కా న్నారు. ఐతే ఈసారి చేతులకూ, కాళ్ళకూ సం ళ్ళు లేవు. కాపలాదార్లను అడిగి లెట్రిన్ దొడ్డిలోకి వెళ్ళాడు. లెట్రిన్‌లోని కిటికీ బద్దలుకొట్టి బయటకు దూకాడు. ఈ సంగతి బయట కాపలా కాస్తున్న వాళ్ళకు తెలియదు. ఎప్పుడు, ఎలా తప్పించుకొన్నాడో వాళ్ళకు తెలియదు. పృథ్వీసింగు పరుగు లంకించుకున్నాడు. ఉదయం ఐదు గంటలయ్యే సరికి అమరావతి చేరాడు. అక్కడ ఒక విద్యార్థుల హాస్టల్ పేరుచూసి తలుపు తట్టాడు. ఒక యువకుడు తలుపుతీసి బయటికి వచ్చాడు. తనను ఎవరైనా ఒక దేశభక్తుని ఇంటికి తీసుకువెళ్ళమని పృథ్వీసింగు అడిగాడు. "మీరెవరు ? ఎందుకు ? ఏం పని" అని ఆ యువకుడు అడగలేదు. ఆయన పృథీసింగును వెంటబెట్టుకొని తిరిగి తిరిగి చివరకు డాక్టరు బ్రహ్లాద్ పాండే వద్దకు తీసుకువెళ్ళాడు. ఆయన సహాయంతో పృథ్వీసింగు బొంబాయి చేరాడు. వినాయక్ దామోదర్ సావర్కార్‌కు బంధువైన డాక్టర్ నారాయణదామోదర్ సావర్కార్ వద్దకు పాండే రాసిచ్చిన ఉత్తరం తీసుకుని వెళ్ళాడు. తన కథంతా విన్న తర్వాత ఆయన ఒక యువకుణ్ణి తోడుగా ఇచ్చి ప్రిన్స్ స్ట్రీట్‌లో పోలీసుస్టేషన్‌కు సమీపంలోని ఒక ఇంటిలో పృథ్వీసిగుకు మకాం ఏర్పాటుచేశాడు. తర్వాత గణేశ్ రఘునాధ వైశంపాయన్‌కు అప్పగించాడు. వైశంపాయన్ భావనగర్‌లో టెలిగ్రాఫ్ డిపార్టుమెంటులో పని చేస్తున్నాడు. యువకుడుగా ఉన్నప్పుడు ఆయన సావర్కార్ సహచరుడు. ఆయన పృథ్వీసింగు డాక్టర్ పురుషోత్తమ వినాయక్ కాణేకు అప్పగించాడు. కుడి చేయిపైన ఇంగ్లీషు అక్షరాలలో ఉన్న పృథ్వీసింగు అనే పేరును శస్త్రచికిత్స చేసి తీసివేశాడు. తర్వాత కర్నల్ జొరావర్‌సింహ్ గోహిల్ రక్షణలో కొన్నా ఉన్నాడు. కర్నల్ పేరు ప్రతిష్ఠలున్న వ్య ప్రసిద్ధ పోలో ఆటగాడు. బ్రిటిష్ సైన్యాధికారుల సమ్మానం పొందినవాడు. స్కౌట్ కమిటీ సభ్యుడు.

1922-23 సంవత్సరాలలో సహాయ నిరాకరణ ఉద్యమకాలంలో హరభాయిత్రివేదీ, నానాభాయిభట్ అనేవారు దక్షిణామూర్తి పేర పాఠశాల పెట్టారు.

దానిలో పృధ్వీసింగును ఉపాధ్యాయునిగా చేర్చుకొన్నారు. తర్వాత హరఖ్‌చంద్ర మోతీచంద్రశాహ్, జీవన్‌లాల్ మోతీచంద్రశాహ్ అనే వర్తకులు సౌరాష్ట్రలో అనేకచోట్ల పృధ్వీసింగు వ్యాయామ శాలలను నెలకొల్పడానికి సహాయపడ్డారు.

1930 ఉప్పు సత్యాగ్రహం జరుగుతున్న రోజుల్లో ఆ ఉద్యమం కొంత ఆకర్షించింది. కాని అహింసలో విశ్వాసం లేనందున తానా ఉద్యమంలో స్వయంగా పాల్గొనలేకపోయాడు

ఇదే సంవత్సరం మరోప్రక్క విప్లవ కార్యకలాపాల్లో కూడా పృధ్వీసింగు పాల్గొన్నాడు. 1930 లో బొంబాయిలో లేమింగ్‌టన్ రోడ్ షూటింగు ఘటనలో పృధ్వీసింగు ఉన్నాడు. యూరోపియన్, ఆంగ్లో-ఇండియన్ పోలీసు ఆఫీసర్లపైన కాల్పులు జరిగాయి. ఆ సమయంలో పోలీసులు నలువైపులా పృధ్వీసింగును చుట్టుముట్టారు. సరోజ్‌కుమార్‌బక్షి, పి. డి. మిస్త్రీ అనేవారు పృధ్వీసింగును పోలీసు వలయంలోంచి తప్పించి రక్షించారు. తర్వాత దేశంలో అనేక ప్రాంతాలలో పృధ్వీసింగు తిరిగాడు. రాజస్థాన్‌లో కొన్నాళ్ళు ఉన్నాడు. 1931 లో కరాచీలో కాంగ్రెస్ మహాసభ జరుగుతున్నపుడు. 15 రోజులు ఎక్కువగా కాలినడకపైనే ప్రయాణంచేసి అక్కడికి చేరాడు. అక్కడ తన మిత్రులతో భవిష్యత్ కార్యక్రమం గురించి చర్చించాడు. సోషలిస్టు సమాజ వ్యవస్థ గురించి స్వయంగా పరిశీలించి రావలసిందిగా జైలులోనున్న భగత్‌సింగు, పృధ్వీసింగుకు కబురు పెట్టాడు. చంద్రశేఖర్ ఆజాద్ ఈ వార్తను స్వయంగా అందచేశాడు. కరాచీ కాంగ్రెస్‌కు వచ్చిన మిత్రులు కూడా, విదేశాలలో ఉండి భారత స్వాతంత్ర్య ఉద్యమానికి సహాయ పడవలసిందిగా పృధ్వీసింగును కోరారు.

పృధ్వీసింగును కొందరు మిత్రులు ఖాన్‌అబ్దుల్ గఫార్‌ఖాన్‌కు పరిచయం చేశారు. ఆయనతోపాటు గఫార్‌ఖాన్ స్వగ్రామమైన ఉత్‌మంజాయ్ చేరాడు. అక్కడినుండి ఆఫ్ఘనిస్తాన్‌కు వెళ్ళాడు.

తాను ఆఫ్ఘనిస్తాన్ ఎందుకు వచ్చిందీ వివరించటం పృధ్వీసింగుకు కష్టమైంది. కాబూల్‌లో కొన్నాళ్ళు జైలులో ఉంచి తర్వాత విడుదల చేసింది ఆఫ్ఘన్ ప్రభుత్వం. ఘజ్నీ, హిరాత్‌ల మీదుగా కాలినడకను సోవియట్ యూనియన్‌కు వెళ్ళాలని బయలుదేరాడు. హిరాత్‌లో అరెస్టు చేసి వదలిపెట్టారు. తర్వాత సోవియట్ యూనియన్ చేరాడు. పాస్‌పోర్టు లేకుండా అక్కడికి చేరిన పృధ్వీసింగును అనుమానించి జైలులో పెట్టారు. కొన్నాళ్ళు ఈయన పుట్టుపూర్వోత్తరాల గురించి దర్యాప్తు చేశారు. చివరకు పృధ్వీసింగు రాజకీయ జీవితం పట్ల సంతృప్తి చెంది, విడుదల చేశారు. అక్కడ తాష్కెంట్‌లోను, మాస్కోలోను రెండున్నర ఏండ్లపాటు ఉన్నాడు. పాల్ రిచర్డ్ మారోక్ అనే మెక్సికన్ పేరుతో అక్కడ ఉండిపోయాడు. లెనిన్ రాజకీయ పాఠశాలలో అధ్యయనం చేశాడు. లెనిన్ పాఠశాలలో బోల్షివిక్ పార్టీ సభ్యులనే చేర్చుకుంటారు. పృధ్వీసింగు బోల్షివిక్ పార్టీలో చేరినందువల్ల ఆ సమస్య కూడా ఉత్పన్నం కాలేదు. కొన్నాళ్ళు సోవియట్ యూనియన్‌లో ఉన్న తర్వాత పృధ్వీసింగు మాతృదేశానికి బయలుదేరాడు. ఆఫ్ఘనిస్తాన్‌కు చేరాలంటే ఆము నదిని దాటాలి. గాలి నింపిన చర్మపు సంచి ఆధారంగా నదిని దాటాడు. నదీప్రవాహంలో అక్కడక్కడా కొండలు తగులుతాయి. పదునైన ఆ కొండరాళ్ళనుండి రక్షించుకొంటూ ఎలాగో ఆఫ్ఘనిస్తాన్ చేరాడు. అక్కడ పోలీసులు అరెస్టు చేసి జామీనుపై విడుదల చేశారు. కాబూల్ వెళ్ళడానికి అనుమతించారు. కాబూల్‌నుండి ఎలాగో జలాల్‌బాద్ చేరాడు. అక్కడ పోలీసులు పృధ్వీసింగును అరెస్టు చేయడమేగాక ఆయనవద్ద డబ్బును కాజేశారు. కాబూల్ జైలులో పృధ్వీసింగు 13 నెల నానా కష్టాలు పడ్డాడు. ఆయన కాళ్ళకు 10 పౌ బరువుగల సంకెళ్ళు వేశారు. ఈయన అరెస్టు వా కాబూల్‌లోని సోవియట్ రాయబార కార్యాలయాని చేరింది. ప్రపంచమంతటా పత్రికలు కూడా ప్రచురించాయి.

భారతదేశంలో కూడ పృధ్వీసింగు విడుదలకు ఆందోళన ప్రారంభించారు. విదేశాలలోని పత్రికలు కూడా ఆయన విడుదలకై ఆందోళన ప్రారంభించాయి. చిట్టచివరకు పృధ్వీసింగును విడుదల చేశారు. కాని భౌతికంగా ఆయన్ని రూపుమాపడానికి కొందరు ప్రయత్నం చేశారు. కాని సకాలంలో ఈ వార్త తెలుసుకొన్న సోవియట్ రాయబార కార్యాలయం ఆయన్ని ప్రత్యేక విమానంలో సోవియట్ యూనియన్‌కు తీసుకు

వెళ్ళింది. ఇది 1933 జూలైలో జరిగింది. కొన్ని సంవత్సరాలు సోవియట్ యూనియన్‌లో ఉన్నాక ఆయన ఒడెస్సీ రేవుపట్నం నుండి ఇటలీ నౌకలో మాతృదేశానికి బయలుదేరాడు. మార్సెల్సులో మరొక నౌక ఎక్కి, ఆనాటి ఫ్రెంచి ఇండియా భాగమైన పుదుచ్చేరి చేరాడు. అక్కడనుండి మద్రాసు చేరాడు. ఆ తర్వాత ఆయన అనేక మారువేషాలలో జీవించాడు. కొన్నాళ్ళు సన్యాసిగా, కొన్నాళ్ళు ఇంటి కాపలాదారుగా, మరికొన్నాళ్ళు వ్యాపార ఏజెంటుగా కాలం గడిపాడు.

16 ఏండ్ల రహస్య జీవితం గడిపి ప్రభుత్వానికి చిక్కకుండా తప్పించుకొన్నాడు. 1938 మేలో ఆయన గాంధీని కలుసుకొన్నాడు. గాంధీ సలహా మేరకు ఆయన ప్రభుత్వానికి లొంగిపోడానికి ఇష్టపడ్డు. గాంధీ అధికారులకు కబురు చేయగా వారు పృధ్వీసింగును అరెస్టుచేశారు. ఆ సందర్భంగానే 193 మే 28 వ "హరిజన" పత్రికలో గాంధీ, పృధ్వీసింగును కొనియాడాడు. తర్వాత బొంబాయి, రావల్పిండి జైళ్ళల్లో గడిపాడు. విడుదలయ్యాక గాంధీ ఆశ్రమంలో కొన్నాళ్ళున్నాడు. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో ఆయన్ని అరెస్టు చేసింది ప్రభుత్వం. 1956 నుండి నెహూర్రు సలహా మేరకు రాజస్థాన్, పంజాబులలో యువకులకు వ్యాయామ శిక్షణ ఇచ్చాడు. 1966 వరకు ఈ కార్యక్రమం కొనసాగింది. ఇంత వైవిధ్య రాజకీయ జీవితం గల పృధ్వీసింగును "స్వాతంత్ర్య దేవాలయం చేరడానికి ఇలాంటి సహయాత్రికులనే నేను కోరుకుంటాను" అని గాంధీ ప్రశంసించాడంటే అందులో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

పృధ్వీసింగు 90 వ జన్మదినోత్సవం చండీఘర్‌లో జరిగింది. అఖిలభారత స్వాతంత్ర్య సమరయోధుల సంఘం తరపున శీలభద్రయాజి ఆయనకు 90 వేల రూపాయల చెక్కు సమర్పించాడు. ముఖ్యమంత్రి దర్బారాసింగు "వ్యక్తిగత ఉపయోగం కోసం" 51 వేల రూపాయలు సమర్పించాడు. ఈ రెండు మొత్తాలకు మరో ఐదువేల రూపాయలు కలిపి, ఆ మొత్తాన్నంతా ఢిల్లీలో స్వాతంత్ర్య సమరయోధుల స్మారకచిహ్నం నెలకొల్పడానికి బహూకరించాడు.

"క్రాంతి పథక్ కా పథిక్" (విప్లవ పథంలో నడిచే యాత్రికుడు) అనే పేరుతో ఆత్మ కథను రాశాడు పృధ్వీసింగు. స్వాతంత్ర్య సమరంలో ఎందరెందరు ఎన్ని కష్టాలు పడ్డారో, ఎన్ని గండాలు గడిచి బయటపడ్డారో, ఎంతటి అమోఘ త్యాగాలు చేశారో, అందుకు మంచి నిదర్శనం బాబా పృధ్వీసింగు ఆజాద్ జీవితం.

## విప్లవ వాదుల యుగాంతం

ఆజాద్, భగత్‌సింగు, రాజగురు, సుఖదేవ్‌ల మరణంతో, దాదాపు విప్లవవాద యుగం అంతమైందనే చెప్పాలి ఆ తర్వాత చెదురుమదురుగా కొన్ని ఘటనలు జరిగినా ఒక ఉద్యమంగా అది ముగిసినట్లే. ఇందుకు కారణం ఆ ఉద్యమ నాయకులలో వచ్చిన పరివర్తనం, ఉద్యమం అంతర్గత విద్రోహాలతోను, బయట శత్రువుల బలమైన దెబ్బలతోను ఉద్యమం క్షీణించసాగింది.

పథమ ` తంత్ర్య యు ం తర్వాత 1876 లో ఫో బ్లయిర్‌లో ప్రాయి లా మేయో గుండెలో పొ చిన షేర్ ఆ ఖాన్ మొద కొని ఎందరెందరో యోధులు నేలకొరిగారు. లండన్ ఢీంగ్రా, పూనాలో చాపేకర్ సోదరులు, గదర్ ఉద్యమం, హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ, అనుశీలన్ సమితి, యుగాంతర్, అల్లూరి సీతారామరాజు మన్యం తిరుగుబాటు-యిలా ఎందరెందరో కావించిన రక్తతర్పణంతో ఎన్నెన్నో విప్లవాధ్యాయాలు సృష్టించిన ఉద్యమాలతో ఈ విప్లవవాద యుగం దేశ స్వాతంత్ర్య చరిత్రలో మహోజ్వల ఘట్టాల సృష్టి జరిగింది. ఏది ఏమైనా విప్లవవాదుల వ్యక్తిగత హింసావాదం మధ్యతరగతి వారి సిద్ధాంతం. ఒక్కొక్క వ్యక్తి చూపే ధైర్య సాహసాలు, చేసే త్యాగం-ఇవే ఉన్నత పోరాట రూపాలని వారు పొరప రు. ప్రజలకు దూరంగా ఉండి జరిపే యిలాంటి వి వ చర్యలు జాతిని కదల్చలేవని తేలిపోయింది. పై ఆ పార్టీల అంతరంగిక క్రమశిక్షణ మనోనిబ్బరం కూడా, తమ నాయకుల వ్యక్తిత్వంమీద ఆధారపడినంతకాలమే నిలుస్తాయని తేలిపోయింది విప్లవవాదులు చేసిన సాహసిక ఘటనల తర్వాత, ప్రజల తిరుగుబాట్లు జరగలేదు. ప్రజలకు రాజకీయాలు బోధించడంగాని, వారిని సంఘటిత పరచడంగాని విప్లవవాదులు చేయలేదు. ప్రజల సహ

కారం లేనిదే ఒక వ్యక్తిగాని, ఒక ముఠాగాని వాళ్ళెంత గొప్పవాళ్ళయినా విప్లవాన్ని సాధించలేరు. విప్లవవాదులు "ప్రజానీకంగాదు విప్లవానికి పనిచేయాల్సింది, ప్రజలకోసమే విప్లవం సాగించాలి." అని భావించేవారు. అందుచే 1934-35 తర్వాత విప్లవవాదుల ముఠాల సమిష్టి కార్యకలాపాలు దాదాపు ఆగిపోయాయి. దీని అర్థం వీరంతా గాంధీవాదులుగానో, అటు సోషలిస్టు కమ్యూనిస్టులుగానో అందరూ మారిపోయారని అర్థంకాదు కొందరు సోషలిస్టు కమ్యూనిస్టులుగా మారినా, మరికొందరు అలా మారలేదు. వారికి వ్యక్తిగత హింసావాదంలో మాత్రం నమ్మకం సడలిపోయింది. ఏమైనా భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో విప్లవవాదుల పాత్ర మహత్తరమైనది. వారి వ్యక్తిగత త్యాగాల ద్వారా ఉన్నత ఆదర్శాలను చూపించారు దేశం కోసం మృత్యువును సైతం ఎదుర్కోడానికి, సర్వస్వం త్యజించడానికి సిద్ధం కావాలని వారు ప్రజలకు నేర్పారు. భారత దేశం తుదకు స్వాతంత్ర్యం సంపాదించడానికి అవసరమైన నూతన భావదీప్తిని తమ త్యాగాల ద్వారా వారు సృష్టించారు.

# గాంధీ - ఇర్విన్ ఒడంబడిక

ఉప్పు సత్యాగ్రహ ఉద్యమం ముమ్మరంగా సాగుతున్న కాలంలోనే, 1930 వేసవిలో సైమన్ కమిషన్ తన నివేదికను ప్రకటించింది ఆ నివేదికలోని సూచనలన్నీ అభ్యుదయ నిరోధకమైనవే. "అధినివేశ ప్రతిపత్తి" అనే మాటైనా అందులోలేదు. రాష్ట్రాల్లో ద్వంద్వ అధికారం తీసివేసి అన్ని శాఖల్ని బాధ్యతాయుత ప్రభుత్వానికి అప్పగించాలని ఈ నివేదిక సూచించింది. కేంద్రం విషయంలో ఎలాంటి మార్పును అది సూచించలేదు. పైగా కేంద్ర అసెంబ్లీలో సంస్థానాధీశుల పలుకుబడిని హెచ్చించడానికి ఆ నివేదిక ప్రయత్నించింది. సింధు ఒరిస్సా రాష్ట్రాల్ని ఏర్పరచే విషయం పరిశీలిచిచాలన్నది. రైతు ఉద్యమం బాగా విజృంభించుతున్న సమయంలో, భారత జాతీయోద్యమం నుండి బర్మాను దూరం చేయాలనే తలంపుతో, బర్మాను విడగొట్టాలని సూచించింది. అందుచేత మితవాదులకు సైతం ఈ నివేదిక నచ్చలేదు.

అనాడు బ్రిటన్‌లో అధికారంలో వున్న లేబర్‌పార్టీ ప్రభుత్వానికి రౌండ్‌టేబిల్ సమావేశాన్ని ఏర్పాటు చేయవలసిందిగా వైస్రాయి కోరాడు. బ్రిటిష్ ప్రభుత్వం అందుకు అంగీకరించింది. 1930 నవంబరు 12న లాంఛన ప్రాయంగా చక్రవర్తి, మొదటి రౌండ్ టేబుల్, కాన్ఫరెన్సును ప్రారంభించాడు. దీనికి సంస్థానాధీశులు, ముస్లింలీగు, హిందూ మహాసభ, లిబరల్ ఫెడరేషన్, అంబేద్కర్ పార్టీ హాజరయ్యారు.

హాజరైన ముఖ్యులలో సర్‌తేజబహద్దర్ సప్రూ, మహమ్మద్ అలీ, జనాబ్ జిన్నా, భోపాల్ నవాబు, అంబేద్కర్ మొదలైనవారు హాజరయ్యారు. కాంగ్రెస్ దీన్ని బహిష్కరించింది. 1931 జనవరి 19 వరకు ఈ మొదటి రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్సు సమావేశం జరిగింది. దీనికి బ్రిటిష్ ప్రధాని రామ్సే మాగ్డనాల్డ్ అధ్యక్షత వహించాడు. ఈ సమావేశంలో సంస్థానాధీశుల ప్రతినిధులుగా సర్‌మీర్జా ఇస్మాయిల్, సర్ అక్బర్ హైదరీ, బికనీర్ మహారాజులు హాజరయ్యారు.

ఈ సమావేశంలోకొన్ని ప్రధాన సూత్రాలు అంగీకరించబడ్డాయి. ప్రభుత్వం ఫెడరల్ ప్రభుత్వంగా వుంటుంది. బ్రిటిష్ రాష్ట్రాలు. సంస్థానాలు కలిసి దీని క్రింద వుంటాయి. కొన్ని రిజర్వేషన్లు రక్షణలు మినహాయించి ఫెడరల్ ప్రభుత్వం, ఫెడరల్ శాసనసభకు బాధ్యత వహించుతుంది. రాష్ట్ర ప్రభుత్వాలకు రాష్ట్ర వ్యవహారాలలో స్వయం ప్రతిపత్తి వుంటుంది.

ప్రధానమైన కాంగ్రెస్ పార్టీ పాల్గొనకుండా భవిష్యత్ భారత రాజ్యాంగ తుది స్వరూపాన్ని నిర్ణయించడం మంచిదికాదనే వుద్దేశంతో ప్రభుత్వం కాంగ్రెస్‌తో రాయబారాలకు దిగింది.

1930 ఆగస్టులో సర్‌తేజ్ బహదూర్ సప్రూ, యం.ఆర్. జయకర్ ఎర్రవాడ జైలులో గాంధీని కలుసుకొన్నారు. సంప్రతింపులలో పాల్గొనడానికి వీలుగా మోతీలాల్ నెహ్రూ, జవహర్‌లాల్ నెహ్రూలను ఈ జైలుకే బదిలీ చేయించారు కాని ఈ సంప్రతింపులు ఫలించలేదు. అలా మొదటి రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్సులో కాంగ్రెస్ పాల్గొనలేదు. కాని 1931 జనవరి 26 న గాంధీని, కాంగ్రెస్ వర్కింగు కమిటీ సభ్యులను ప్రభుత్వం విడుదల చేసింది. మొదటి రౌండ్‌టేబుల్ సమావేశం నుంచి తిరిగి వచ్చిన తేజ్ బహదూర్ సప్రూ, గాంధీని కలుసుకొని, ఇర్విన్‌తో రాయబారాలు సాగించవలసిందిగా గాంధీని అర్థించాడు. ఫిబ్రవరి 17 నుంచి మార్చి 5 వరకు రాయబారాలు సాగాయి. కాంగ్రెస్ చేసిన స్వాతంత్ర్య తీర్మానం గాని, జనవరి 26 ప్రమాణం గాని ఈ చర్చలలోకి రాలేదు. ఇది నెహ్రూ, బోస్‌లకు ఇతర వామపక్ష కాంగ్రెస్‌వాదులకు చాలా బాధ కల్గించింది. మొదటి రౌండ్‌టేబిల్ సమావేశ నిర్ణయాలను ప్రాతిపదికగా తీసుకొని చర్చించడానికి గాంధీ అంగీకరించాడు.

## ఒడంబడిక వివరాలు

ఈ ఒడంబడిక ప్రకారం కాంగ్రెస్ శాసనోల్లంఘన ఉద్యమాన్ని ఆపివేస్తుంది. హింసాయుత ఘటనల్లో పాల్గొన్నవారు మినహా మిగతా రాజకీయ ఖైదీలను విడుదలచేయడానికి వైస్రాయి అంగీకరించాడు. ఉప్పును స్వంత ఉపయోగానికి ఉప్పు మడుగుల్లోంచి ఏరుకోడానికి అనుమతించింది ప్రభుత్వం. అలాగే విదేశ వస్త్రాలను. సారా దుకాణాలను శాంతియుత పికెటింగుకు ప్రభుత్వం అంగీకరించింది.

ఈ ఒడంబడిక ఏవిధంగా చూసినా చాలా నిరాశా జనకంగావుంది. కాంగ్రెస్ ప్రధాన కోర్కెలలో ఒక్కదాన్నీ ప్రభుత్వం అంగీకరించలేదు. లాహోర్ కాంగ్రెస్ సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానం దీనిలో ప్రస్తావించలేదు. ఉప్పు పన్ను రద్దుచేయలేదు. రాజకీయ ఖైదీల విషయంలో "హింసాయుత ఘటనల్లో పాల్గొన్న వారినీ, హింసను ప్రోత్సహించిన వారినీ" సైనిక అధికారుల ఆజ్ఞలను ఉల్లంఘించిన సైనికులనూ విడిచిపెట్టకుండా మినహాయించింది ప్రభుత్వం. గాంధీ ఇదివరలో సూచించిన 11 సూత్రాల ప్రస్తావన కూడా గాలిలో ఎగిరిపోయాయి. హింసాయుత ఘటనలను అణచడం పేరుతో జారీచేసిన ప్రత్యేక ఆర్డినెన్సులను ఉపసంహరించుకోవాలని గాంధీ కోరాడు. వైస్రాయి తిరస్కరించాడు. సహాయ నిరాకరణ ఉద్యమానికి సంబంధించిన ఆర్డినెన్సులను మాత్రమే ఉపసంహరించడానికి వైస్రాయి అంగీకరించాడు. పన్నులు చెల్లించనివారి భూములను జప్తుచేసిన ఘటనలలో ఆ భూమి స్వంతదారులకు తిరిగి ఇవ్వాలన్న గాంధీ సూచనను కూడా వైస్రాయి తిరస్కరించాడు. కొన్ని ప్రాంతాలలో భూమి పన్ను కొంత తగ్గించడానికి మాత్రం వైస్రాయి అంగీకరించాడు. ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వం రాయబారాలకు ఒప్పుకోలేదు. రాష్ట్ర ప్రభుత్వాలే వీటి విషయం ఆలోచించాలని వైస్రాయి చెప్పాడు. ఈ సమాచారం గాంధీ చెప్పగా విన్న పటేల్, గుజరాత్‌లో రాజీనామా పెట్టిన ఇద్దరు డిప్యూటీ కలెక్టర్ల విషయం అడగవలసిందిగా గాంధీని కోరాడు. గాంధీ అడిగినా వైస్రాయి ఎలాంటి వాగ్దానమూ చేయలేదు. వారికి పెన్షన్‌గాని కొంత "బహుమానం" గాని ఇప్పిస్తానని వైస్రాయి అన్నాడు.

1931 మార్చి 5 న వర్కింగ్ కమిటీ సమావేశమయింది. గాంధీ - ఇర్విన్ సంభాషణలపై రాత్రి 2½ గంటలకు చర్చలు ప్రారంభమయ్యాయి. కొందరు కాంగ్రెస్‌కు ఇది విజయమని భావింపగా, మరికొందరికి ఈ ఒడంబడిక సంతృప్తి కల్గించలేదు. "జవహర్‌లాలునకు రాజ్యాంగతంత్ర విషయమున నిష్టము లేకుండెను. రాజకీయ బంధితుల విషయ మెవ్వరికిని నచ్చలేదు."అని పట్టాభి కాంగ్రెస్ చరిత్రలో రాశాడు. జవహర్‌లాల్ నెహ్రూ ఆత్మకథలో ఈ విషయమై ఇలారాశాడు :

"ఇక మన లక్ష్యానికి చెందిన ప్రధాన సమస్య, స్వాతంత్ర్య సమస్య మిగిలిపోయింది. ఒడంబడికలోని రెండవషరతులో ఇదికూడ భగ్నం కావించబడిందని నాకు కన్పించింది. దీనికొరకేనా మన ప్రజలొక సంవత్సరం పాటు అంత ధైర్య సైర్యాలతో పోరాడింది ? మన ధైర్య వచనాలు, క్రియలు ఇంతటితో సమాప్తం చెందవలసిందేనా? ఆ విధంగా ఆ రాత్రంతా దీర్ఘాలోచనా తత్పరుడనై వున్నాను ఏదో అమూల్య వస్తువు పోయినట్లు. అది తిరిగి లభించబోదన్నట్లు నా హృదయంలో శూన్యత ఏర్పడింది."

గాంధీ నెహ్రూని ఒప్పించడానికి చాలా ప్రయత్నం చేశాడు. "భారత ప్రయోజనాలకోసం దేశ సైన్యం, విదేశ వ్యవహారాలు ......... మున్నగు విషయాల గూర్చి........" అనే ఒడంబడిక రెండవ షరతులోని "భారత ప్రయోజనాలకోసం"అనేమాట మీద గాంధీ ఎక్కువ ఆధారపడ్డాడని నెహ్రూ తెలియచేశాడు. "ఆ అర్థం నాకు బలవంత బ్రాహ్మణార్థంగా తోచింది. నాకు నచ్చలేదు.........

"నేను మానసిక పోరాటముతోను, శరీర బాధతోను ఒడంబడికకు సమ్మతించాను. హృదయ పూర్వకంగా దాన్ని అమలు పరచడానికి అంగీకరించాను."

చిట్ట చివరకు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఈ ఒడంబడికకు ఆమోదం తెల్పింది. మార్చి 5 నే ఒడంబడికపై సంతకాలు జరిగాయి. "గాంధీ-ఇర్విన్ ఒడంబడిక"గా ఇది చరిత్రలోకి ఎక్కింది.

జాతీయ కాంగ్రెస్ నాయకునితో బ్రిటిష్ ప్రభుత్వం బహిరంగమైన ఒప్పందంపై సంతకం చేయడమే ఒక గొప్ప విజయంగా భారతీయులు భావించారు. దేనినైతే నిషిద్ధ సంస్థగా ప్రకటించి, నాశనం చేయడానికి బ్రిటిష్ ప్రభుత్వం ప్రయత్నించిందో, ఆ కాంగ్రెసుతోనే ఒడంబడిక చేసుకోవటం ఘన విజయంగా, ప్రజలలో ఉత్సాహాన్ని రేకెత్తించింది. లోతుపాతులు తెలిసిన రాజకీయ అనుభవజ్ఞులకు తప్ప, ఇందులోని లోపాలు సాధారణ ప్రజలకు తెలియలేదు. కాలం గడిచినకొద్దీ, బ్రిటిష్ పరిపాలకుల నిజనైజం

బయటపడినకొద్దీ ఈ ఒడంబడికలోని లోపాలు మరింత స్పష్టంగా కన్పించసాగాయి.

## కరాచీ కాంగ్రెస్

గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ఆమోదింపచేయడానికి కరాచీలో మార్చి 29 న కాంగ్రెస్ మహాసభను హడావిడిగా ఏర్పాటు చేశారు. ఈ మహాసభ గాంధీ-ఇర్విన్ ఒడంబడికను ఏకగ్రీవంగా ఆమోదించింది. ఈ తీర్మానాన్ని జవహర్‌లాల్ నెహ్రూయే ప్రతిపాదించాల్సి వచ్చింది. ఆయన పడిన మానసిక వ్యధ గురించి యిదివరకే తెలియచేశాము. ఈ ఒడంబడికను తీవ్రంగా విమర్శించిన సుభాస్‌చంద్రబోస్ కూడా, జాతీయైక్యతకు భంగం కల్గుతుందని చెప్పి, ఈ ఒడంబడికకు ఆమోదం తెలియచేశాడు. నెహ్రూ సైతం ఈ ఒడంబడిక "ప్రజామోదకరంగా" లేదని ఒప్పుకొ డు. గాంధీ కాక మరెవ్వరైనా యిలాంటి ఒడంబడిక ప్రతిపాదించి వుంటే, అతణ్ణి సముద్రంలోకి తోసి సి వుండేవారని ఒక ప్రతినిధి ఆగ్రహంతో అన్నాడు. కాంగ్రెసు వెలుపల యువజనులు ఎక్కువగా ఈ ఒడంబడికకు వ్యతిరేకత తెల్పారు. కార్మికవర్గం కూడా తమ తీవ్ర అసంతృప్త ప్రకటించింది. రెండవ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సుకు వెళుతున్న గాంధీ ఎదుట బొంబాయి కార్మికులు నిరసన ప్రదర్శనలు జరిపారు. పదేళ్ళ క్రితం అలాంటి ప్రదర్శనలు జరపడం ఊహించరాని విషయమని టైమ్సు పత్రిక రాసింది. కరాచీలో గాంధీ యిచ్చిన ఉపన్యాసాలు ఆయనగాక మరెవరైనా యిచ్చివుంటే తీవ్ర అసమ్మతికి గురయ్యేవాడని కె. యం. మున్షీ అన్నాడు. "పొరపాటున భారతదేశాన్ని అమ్మివేశాడు" అని గాంధీని విమర్శించుతున్న సమయంలోనే, చర్చిల్ లాంటి కరుడుగట్టిన సామ్రాజ్యవాదులకు. భారతదేశంలోని బ్రిటిష్ నిరంకుశ అధికారులకు ఈ ఒడంబడిక కంటకంగా తయారయింది. చర్చిల్ యిలా విషం కక్కాడు: "ఒక ప్రక్క ప్రభుత్వ ధిక్కార శాసనోల్లంఘన ఉద్యమాన్ని సంఘటితపరుస్తూ, సాగిస్తూనే, రాజద్రోహి, అనామక లాయరూ అయిన గాంధీ, ప్రాచ్య దేశాల్లో సుపరిచితమైన ఫకీర్ వేషంలో అర్ధదిగంబరుడై, చక్రవర్తి ప్రతినిధులతో సమాన హోదాలో మాట్లాడటానికి, వైస్రాయి భవనం మెట్లెక్కుతున్నాడు. ఈపరిస్థితి చాలా ఆందోళన కరంగానూ, ఏవగింపు కలిగించేదిగానూ వుంది."

## భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌ల ప్రస్తావన

భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌లను ఉరితీసిన ఆరు రోజులలోనే, కరాచీ కాంగ్రెస్ జరిగింది. దేశమంతటా విషాద వాతావరణం నెలకొని వుంది. కరాచీ కాంగ్రెస్‌లో కూడా ఈ వాతావరణం ప్రతిఫలించింది. ఈ యువకిశోరాల ప్రాణాలను గాంధీ కాపాడలేకపోయాడనే ఆగ్రహావేశాలు కూడా కాంగ్రెస్‌లో వ్యక్తమయ్యాయి. గాంధీ కరాచీ కాంగ్రెస్ మహాసభ రేపు జరుగుతుందనగా కరాచీకి 12 మైళ్ళ దూరంలో గాంధీ, వల్లభాయ్‌పటేల్‌లు రైలుదిగి వస్తుండగా కొందరు యువకులు నల్లజెండాలు చూపారు. "గాంధీ డౌన్ డౌన్" అని అరిచారు "గాంధీ ఒడంబడిక భగత్‌సింగ్‌ను ఉరికంబాలపాలు చేసింది" అని నినాదాలు చేశారు. నల్లటి పూలను గాంధీకి సమర్పించారు.

భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌ల ప్రాణరక్షణకు గాంధీ-ఇర్విన్ రాయబారాల సమయంలో గాంధీ ఏమి చేశాడు అనేది వివాదాంశంగా తయారైంది. పట్టాభిగారి కాంగ్రెస్ చరిత్ర ఈ క్రింది విషయాలు తెలియచేసింది.

"ఈ విషయంలో గాంధీ వైస్రాయిలు దీర్ఘమైన చర్చలు జరిపారు....వైస్రాయ్ చాలా జాగ్రత్తగా మాట్లాడాడు. పంజాబ్ గవర్నమెంటుకు సలహా యిస్తాననటం మినహా ఆయన ఎలాంటి వాగ్దానం చేయలేదు. ఇర్విన్ ప్రభువు ఈ విషయంలో సహాయం చేయలేకపోయాడు. కరాచీ కాంగ్రెస్ జరిగేవరకు ఎలాగో ఈ ఉరిశిక్షలను ఆపివుంచుతానని వైస్రాయి వాగ్దానం చేశాడు. "ఆ కుర్రవాళ్ళను ఉరితీయవలసివస్తే కాంగ్రెస్ తరవాత కంటే, ముందుగానే ఉరితీయవలసిందని గాంధీ చెప్పాడు దానివల్ల వ్యవహార పరిస్థితులు చక్కగా తేటతెల్లమౌతాయి. ప్రజల హృదయాలలో నిరర్థకమైన ఆశలు అంకురించవు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక దాని మంచిచెడ్డల్నిబట్టి, ఆ కుర్రవాండ్ర ఉరి మూలాన పోతేపోతుంది, లేదా నిలుస్తుంది" ఏమైనా ప్రభుత్వం ఉరిశిక్షల్ని అమలు పరచడం వాయిదా వేయలేదు.

కాంగ్రెస్ చరిత్రకారుడు ఈ సందర్భంలో ఇంకా ఇలా రాశాడు ; "ఆ రోజులలో భగత్సింగు పేరు నలు మూలలా గాంధీజీ పేరువలె విఖ్యాతమై పోయిందన డం అతిశయోక్తి కాదు. గాంధీ ఎంత ప్రయత్నించినా పీరి ఉరిశిక్షలను మార్పించలేకపోయాడు."

జవహర్‌లాల్ నెహ్రూ తన ఆత్మకథలో యిలా రాశాడు : భగత్‌సింగు మరణశిక్షను మార్చవలసినదని గాంధీజీ చేసిన వాదనను కూడా ప్రభుత్వ మంగీకరింప లేదు, దీనికి ఒడంబడికకు సంబంధం ఏమీలేదు. భారత దేశమంతా ఈ విషయమై గగ్గోలుగా నుండుటచే అతడు దీనిని ప్రత్యేకంగా కోరాడు, కాని ఆయన కోరిక వ్యర్థమైంది."

భగత్‌సింగు, ఆయన సహచరుల ఉరి ఆనాడు దేశాన్ని ఎలా కల్లోలపరచిందో పట్టాభిగారి కాంగ్రెసు చరిత్రలోని ఈ కింది వాక్యం తెలియచేస్తుంది: "ఆనాడు కరాచీలో భగత్సింగును గూర్చియు, గాంధీ-ఇర్విన్ ఒడంబడికను గూర్చియు బెట్టిన రెండు తీర్మానములలోనేది ప్రజాదృష్టి నెక్కువ ఆగ్నము చేసి కొనియెనో చెప్పజాలము."

భగత్సింగు శౌర్యాన్ని, త్యాగాన్ని ప్రశంసిస్తూ కరాచీలో కాంగ్రెసు చేసిన తీరా నంలో, కాంగ్రెసు వారు "ఏ విధమైన రాజకీయ దౌ న్యంతోగాని తమకు సంబంధంలేదని తెలుపుతూ, దానిని షేధించుతూ"అనే వాక్యం చేర్చబడింది. ఈ వాక్యం చాలా వాదవివాదా లకు దారితీసింది. కొందరు యువకులు ఈ వాక్యాన్ని తీసివేయాలని, మార్పులు సూచించారు. వాలంటీరు మహాసభలో ఈ వాక్యం లేకుండా తీర్మానం ఆమో దించబడింది. సమావేశం జరుగుతుండగా, ఆవరణ బయట గల్లంతు సాగింది. తర్వాత జరిగిన రాష్ట్ర సభలలో కూడా ఈ వాక్యం వాద వివాదాలకు దారి తీసింది.

భగత్‌సింగు అతని అనుచరుల ఉరికి నిరసనగా భారతదేశంలోజరిగిన, సభలు ప్రదర్శనలలో పోలీసుల కాల్పులవల్ల 141 మంది చనిపోయారు. 500 మందికి పైగా గాయపడ్డారు. అనేక వందలమంది అరెస్టయారు. ఈ వాతావరణమే కరాచీ కాంగ్రెస్‌లో కూడ ప్రతిబిం బించింది.

కరాచీ కాంగ్రెస్ మహాసభ, నిర్ణయాలు ఒక విధంగా మునుపటి మద్రాసు, కలకత్తా కాంగ్రెస్ మహాసభలనాటి స్థితికి వచ్చింది. పూర్ణ స్వరాజ్యం కోరుతూనే గాంధీ - ఇర్విన్ ఒడంబడికను ఆమో దించడంద్వారా, లక్ష్యాలను పునరాలోచించే స్థితికి దిగజారింది. ప్రజల చొరవ చంపివేసి, తర్వాత వేయాల్సిన అడుగును నాయకులకు వదలివేసింది.

కాగా అతివాదులను సంతృప్తి పరచడానికి ప్రధా నంగా జవహర్‌లాల్‌నెహ్రూ చొరవతో ప్రాథమిక హక్కుల తీర్మానాన్ని కరాచీ కాంగ్రెస్ ఆమోదించింది. ఈ తీర్మానం భవిష్యత్తులో పార్టీ రాజకీయ, ఆర్థిక, సామాజిక ప్రజాతంత్ర కార్యక్రమాన్ని, ఆర్థిక విధా నాన్ని తెలియచేసింది. ఈ కార్యక్రమం అభ్యుదయ కరమైనది. ప్రధానంగా ప్రజాతంత్ర స్వభావం గల ప్రణాళిక. పూర్వం ఈ విషయాన్ని ఇంత స్పష్టంగా కాంగ్రెస్ తన కార్యక్రమంలో పెట్టలేదు.

"సామాన్య జనుల్ని దోచుకొనే ఇప్పటి పద్ధతి పోవాలంటే, రాజకీయ స్వాతంత్ర్యంలో సామాన్య ప్రజల ఆర్థిక స్వాతంత్ర్యం కూడా వుండాలి. అందుచే కాంగ్రెస్ అంగీకరించే ఏ రాజ్యాంగంలోనైనా క్రింది అంశాలు ఉండాలి, లేదా స్వరాజ్య ప్రభుత్వం వీటిని చేర్చడానికి అధికారం ఉండాలి" అని ప్రాథమిక హక్కు తీర్మాన ఉద్దేశాలను కాంగ్రెస్ వివరించింది.

## ప్రధాన హక్కులు – విధులు

1. భారతదేశంలో ప్రతిపౌరుడూ స్వేచ్ఛగా తన అభిప్రాయాన్ని ప్రకటించుకోవచ్చు, ఇష్టంవచ్చిన సంఘంలో చేరవచ్చు. న్యాయానికి, నీతికి విరుద్ధంగాని పనులకోసం నిరాయుధంగా ఇష్టంవచ్చినట్లు సమావేశం కావచ్చు.

2. మతస్వేచ్ఛ, ప్రజానీతికి, శాంతికి భంగం లేకుండా ప్రవర్తించుట.

3. మైనారిటీ సంఘాల, ఆయా భాషా రాష్ట్ర వాసుల వి నం, భాష, లిపులను సంరక్షించుట.

4. వ , మత, లింగ భేదంలేక అంతా న్యాయ శాస్త్రిము దు సమానులే.

5. ఎలాంటి ఉద్యోగాన్నిగాని, అధికారాన్నిగాని, వా పారాన్నిగాని, వృత్తినిగాని సంపాదించడానికి అ త, వారి కుల మత లింగాల ఆధారంగా ఉండ దు.

6. ప్రభుత్వం లేక స్థానిక ప్రభుత్వం, లేదా వ్యక్తులు అందరిఉపయోగంకోసం ధనమిచ్చి నిర్మిం

చిన బావులు, చెరువులు, రోడ్లు, పాఠశాలలు, ప్రజా విహార స్థలాలు - వీటన్నిటిపైన ప్రజలందరికీ సమాన హక్కులు, బాధ్యతలు వుంటాయి.

7. ప్రతిపౌరునికీ శాసనాను సారంగా, ఆయుధం ధరించే హక్కు.

8. లా ప్రకారంగాక ఏ పౌరుని స్వాతం। త్ర్యాన్ని హరించకూడదు. అతని గృహంలో ।వేశించ కూడదు. అతని ఆస్తి లాక్కోకూడదు, వ పర్చుకో కూడదు.

9. ప్రభుత్వం అన్నిమతాలపట్ల తటస్థంగా వుంటుంది.

10. మైనారిటీ తీరిన వాళ్ళందరికీ వోటింగ్ హక్కు.

11. దేశమంతటా ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యావిధానం ప్రవేశపెట్టుట.

12. ప్రభుత్వం ఎవరికీ బిరుదులు ఇవ్వరాదు.

13. మరణశిక్ష వుండరాదు.

14. భారతదేశంలో ప్రతిపౌరుడు ఇష్టం వచ్చినట్లు ప్రయాణం చేయవచ్చు. ఇష్టంవచ్చినచోట్ల ఆస్తి సంపాదించవచ్చు, ఇష్టంవచ్చిన వ్యాపారం, వృత్తినీ అవలంబించవచ్చు, అన్నిప్రాంతాలలో నేరారోపణ విషయంలోను, రక్షణ విషయంలోను సమానమైన హక్కులు పొందాలి.

## కార్మికులు

1. కార్మికులకు సముచిత జీవన ప్రమాణం కల్గించే విధంగా ఆర్థిక జీవన నిర్మాణం, న్యాయ ధర్మాను కూలంగా వుండాలి.

2. పారిశ్రామిక కార్మికులకు ప్రత్యేక శాసనాల ద్వారా, తదితర పద్ధతులద్వారా వారికి తగిన జీవన భృతి కల్గించాలి. ఆరోగ్యకరమైన పని పరిస్థితులు కల్పించాలి, రోజుకు 8 గంటల పని జీతంతో సెలవులు ఇవ్వాలి. కార్మికులకు, యజమానులకు వచ్చే తగాదా తీర్చడానికి ఏర్పాట్లు చేయాలి. వార్ధక్యం, రోగం, నిరుద్యోగం సంభవించినపుడు తగిన రక్షణ కల్గించాలి.

3. బానిసత్వం, బానిసత్వానికి సమానమైన పరిస్థితులను కార్మికులకు లేకుండా తొలగించాలి.

4. స్త్రీ కార్మికులకు రక్షణ, బాలింతరాండ్రకు సెలవులు వుండాలి.

5. పాఠశాలలకు పోయే వయస్సు గల పిల్లలను ఫ్యాక్టరీలలోగాని, గనులలోగాని ప్రవేశ పెట్టకోరాదు

6. రైతులు, కార్మికులు తమ హక్కుల సంరక్షణకు సంఘాలను ఏర్పరచుకోవచ్చు.

## రైతులు, తదితరులు

1. భూమి కౌళ్ళపద్ధతి, భూమి శిస్తుపద్ధతి సంస్కరించాలి. చిన్న చిన్న రైతులిచ్చే భూమి శిస్తును, కౌలును తగ్గించాలి. ఒకటి రెండెకరాల రైతులకు న్యాయమని తోచినంతకాలం అసలు పన్నులు లేకుండా చేయాలి. చిన్న ఎస్టేట్ దార్ల నికరాదాయాలను అనుసరించి వారిపై పన్నులు వేయాలి.

2. కొంత పరిమితిదాటిన తర్వాత, ఆస్తులపై క్రమాభివృద్ధి అనుసారం మరణ సుంకాలు విధించాలి.

3. సైన్యం ఖర్చు సగానికిసగం తగ్గించాలి.

4. సివిల్ ఉద్యోగుల జీతాలు చాలావరకు తగ్గించాలి. ప్రత్యేక నిపుణులకు మినహా తక్కిన ప్రభుత్వ ఉద్యోగు లెవరికీ 500 రూపాయలకు మించి జీతం. వుండరాదు.

5. భారతదేశంలో తయారయే ఉప్పుమీద పన్ను వుండరాదు.

## ఆర్థిక విషయాలు

1. స్వదేశీ వస్త్రపరిశ్రమను రక్షించాలి. విదేశీ వస్త్రాలు, నూలు దేశంలోకి రాకుండా నిషేధించాలి, విదేశీ పోటీనుంచి, స్వదేశీ పరిశ్రమల్ని కూడా రక్షించాలి.

2. మత్తుపానీయాలు, మందులు, వైద్యానికి కావలసినవి తప్ప తక్కిన వాటిని నిషేధించాలి.

3. ద్రవ్యమారక పద్ధతి దేశ ప్రయోజనాలకు అనుగుణంగా వుండాలి.

4. ప్రధాన పరిశ్రమ లన్నిటినీ ప్రభుత్వం వశం చేసుకోవాలి. గనులు, రైల్వేలు, జలమార్గాలు, నౌకలు మొదలైన ప్రయాణ సౌకర్యాలన్నీ ప్రభుత్వానికి చెందాలి.

5. రైతుల రుణాల్ని తీర్చాలి. అనుచితమైన వడ్డీలను రూపుమాపాలి.

6. పౌరు లందరికీ సైనిక శిక్షణ ఇవ్వాలి. ప్రభుత్వ సైన్యాలుకాక వేరే రక్షణ సైనిక దళాలు వుండాలి.

కరాచీ కాంగ్రెస్‌లోని ప్రాథమిక హక్కుల ప్రణాళిక ఈ విషయంలో 1930 జనవరి నాటి పరిస్థితి-

శం తే ముందడుగు వేసిందనే చెప్పాలి. రాజకీయంగా కరాచీ కాంగ్రెస్, గాంధీ విధానానికి విజయంచేకూర్చినా కాంగ్రెస్ కార్యక్రమంలో అతివాద, సోషలిస్టు ధోరణి చోటు చేసుకోడం కూడా కనబడుతుంది.

గాంధీ-ఇర్విన్ ఒడంబడికవల్ల కొంతమందిలో నైనా ఏర్పడ్డ ఉత్సాహం త్వరలోనే అణగారి పోయింది. 1931 ఏప్రిల్ 18 న ఇర్విన్‌స్థానే వైస్రాయిగా లార్డ్ విల్లింగ్డన్ వచ్చాడు. కొత్త వైస్రాయి హయాంలో ఈ ఒడంబడికను ఉల్లంఘించడం ప్రారంభమయింది. సంయుక్త రాష్ట్రం (యు.పి.)లో సాయుధ పోలీసులు మేజిస్ట్రేట్లు ప్రజల్ని వేధించి, భయ పెట్టడం ప్రారంభించారు. కాంగ్రెస్ కార్యకర్తల ఇళ్ళపై దాడులుచేయడం, కాంగ్రెస్ జండాలను తగుల బెట్టడం, స్త్రీలను అవమాన పర్చడం మొదలు పెట్టారు. బహిరంగసభల్ని నిషేధించి, ఉల్లంఘించిన వారిని శిక్షించడం మొదలు పెట్టారు. గుజరాత్‌లో రైతుల నుంచి లాక్కున్న భూమిని తిరిగి వారికి ఇప్పించడానికి చాలా శ్రమపడాల్సి వచ్చింది. బెంగాల్‌లో విచారణ లేకుండానే కాంగ్రెస్ వాదులను అరెస్టు చేయడం మొదలు పెట్టారు. న్యాయవాదులు హామీ పత్రాలు ఇవ్వాల్సి వచ్చింది. బొంబాయిలో ఖైదీలను విడుదల చేయలేదు. శాంతియుతంగా పికెటింగు చేయడాన్ని కూడా సహించలేదు. స్కూళ్ళనుంచి విద్యార్థుల్ని వెళ్ళగొట్టారు. మద్రాసు, ఢిల్లీలలోకూడా, ఇదే మాదిరిగా ఒడంబడికను వుల్లంఘించారు.

గాంధీ ఈ విషయాలన్నీ ప్రభుత్వ దృష్టికి తెచ్చి విచారించవలసిందిగా కోరినా, ఆపని జరగలేదు. గాంధీ-ఇర్విన్ ఒడంబడికను ఉల్లంఘించిన సంఘటనలను విచారించడానికి ప్రభుత్వం, కాంగ్రెస్‌లతో కూడిన మధ్యవర్తి సంఘాలు ఏర్పరచాలన్న - గాంధీ సూచనను ప్రభుత్వం తిరస్కరించింది. అలా చేస్తే ప్రభుత్వంతో సమానస్థాయికి కాంగ్రెస్ వస్తుందని బ్రిటిష్ అధికారులు భయపడ్డారు. ఈ సమస్య పై చివరకు గాంధీ లండన్ రౌండ్‌టేబుల్ సమావేశానికి వెళ్ళనని ఆగస్టులో పట్టుబట్టాడు. ఐనా వెల్లింగ్డన్ లొంగలేదు. డాక్టర్ అన్సారిని కాంగ్రెస్ ప్రతినిధిగా లండన్ పంపాలనే నిర్ణయానికి కూడా వైస్రాయి అడ్డు తగిలాడు. ఇతర ముస్లిం ప్రతినిధులు అన్సారీ పేరుకు వ్యతిరేకించుతున్నారని ప్రభుత్వం చెప్పింది. అంతేకాక హిందూ, సిక్కు, ముస్లిం మతతత్వ వాదులకు ప్రాతినిధ్యం వారి సంఖ్యకు తగినట్లుగాక, ఎక్కువగా ఇచ్చింది. కొన్ని విషయాలపై వివరణ కోరేందుకు పటేల్, నెహ్రూ మొదలైన వారితో కలిసి గాంధీ సిమ్లాలో వైస్రాయిని కలిశాడు. సూరత్ జిల్లాలోని కొన్ని గ్రామాలలో బలవంతంగా భూమిశిస్తు వసూలు గురించి ప్రభుత్వం విచారించుతుందని వైస్రాయి హామీ ఇచ్చాడు. కాంగ్రెస్ ఇంతవరకు తన దృష్టికి తేని విషయాలలో విచారణ జరపబోమన్నాడు. ఒక సందర్భంలో వైస్రాయిని కలియడానికి గాంధీ వెళ్ళినపుడు, ఆయన వెంట జి. డి. బిర్లా కూడా వున్నాడు.

చిట్టచివరకు రెండవ రౌండ్‌టేబుల్ సమావేశంలో పాల్గొనేందుకు, గాంధీ లండన్ బయలుదేరి వెళ్ళాడు. ఈ సమావేశం 1931 సెప్టెంబర్ నుంచి డిసెంబర్ వరకు జరిగింది. కాంగ్రెస్ తరఫున గాంధీ ఒక్కడే ప్రతినిధి. ఆ సమావేశంలో కాంగ్రెస్ ప్రతినిధుల సంఖ్య ఎక్కువగా వుంటే, అందులోనూ జాతీయ ముస్లిములు కూడా పాల్గొంటే బాగుండేది. కాని గాంధీ తన బలాన్ని అధికంగా అంచనా వేసుకొన్నాడు. సరోజినీ నాయుడు, పండిట్ మాలవీయలు కూడా వెళ్ళారు. కాని, వారు కాంగ్రెస్ ప్రతినిధులుగా కాక వ్యక్తిగత హోదాలో వెళ్ళారు.

రెండవరౌండ్‌టేబుల్ సమావేశంలో చర్చలు నాల్గు నెలలపాటు జరిగాయి. భవిష్యత్ రాజ్యాంగ నిర్మాణం గురించేగాక మైనారిటీల ప్రాతినిధ్య సమస్య ప్రధానంగా ఈ చర్చల్లో తలెత్తింది, "రక్షణ సేనలు, విదేశ వ్యవహారాలు భారతీయులకి ఇస్తే సంపూర్ణ స్వాతంత్ర్యంకోసం తాను ఆశించనని గాంధీ అన్నాడు. ఇది లాహోర్ కాంగ్రెస్ తీర్మానానికి విరుద్ధమని కొందరు గాంధీ దృష్టికి తెచ్చారు. అధినివేశ ప్రతిపత్తి చివరకి సంపూర్ణ స్వాతంత్ర్యానికి దారి తీస్తుందని గాంధీ జవాబిచ్చాడు.

మైనారిటీల ప్రాతినిధ్య సమస్యపై పూర్తిగా ప్రతిష్టంభన ఏర్పడింది. జిన్నా, ఆగాఖాన్, జఫ్రుల్లాఖాన్, అంబేద్కర్‌లతో ఈ విషయమై విభేదాలు సమసిపోలేదు. 1931 అక్టోబరు 8న వివిధ ప్రతినిధి వర్గాలతో జరిపిన తన సంభాషణలు విఫలం చెందాయని గాంధీ అంగీకరించాడు. హిందూ, సిక్కు మతవాదులు కూడా బ్రిటిష్ ప్రభుత్వ కుతంత్రాలకు తోడ్పడ్డారు.

ఏకగ్రీవంగా బ్రిటిష్ ప్రభుత్వం ముందు ఒక ప్రతిపాదన చేయాలనే గాంధీ సూచనకు వీరంతా అడ్డు అయ్యారు. "విదేశీ పెత్తనం వల్లనే, మన విభేదాలు తలెత్తక పోయినా, ఆ విభేదాలు మరింత బిగుసుకు పోయాయి. అందుచే వీటి పరిష్కారం స్వరాజ్య రాజ్యాంగానికి పునాది కాక, కిరీటమే అవుతుంది. స్వాతంత్ర్య భానోదయంతో మత విభేదాలనే మంచు పెళ్ళలు కరిగి పోతాయనే దానిలో నా కెలాంటి సందేహంలేదు" అని గాంధీ ఎంత మొత్తుకున్నా పరిష్కారం కుదరలేదు.

గాంధీ ఉత్త చేతులతో 1931 డిసెంబర్ 28 న భారతదేశానికి తిరిగి వచ్చాడు. ఐనా గాంధీ తిరిగి పోరాటానికి సన్నద్ధుడై లేడు. పోర్టు సయ్యద్ నుంచే భారత కార్యాలయానికి ఒక కేబిల్ పంపించుతూ, తాను తన శక్తినంతా వినియోగించి శాంతి కోసమే కృషి చేస్తానని గాంధీ అన్నాడు. బొంబాయికి గాంధీ తిరిగి వచ్చిన రోజున 1931 డిసెంబరు 28 న పోరాటాన్ని తిరిగి ప్రారంభించరాదంటూ ఒక తీర్మానం తయారు చేశాడు. అసలు ఈ ధోరణి రౌండ్ టేబుల్ సమావేశంలోని ఆయన ఉపన్యాసాలలోనే స్పష్టమైంది. రౌండ్ టేబుల్ మహాసభలో గాంధీ ఎలా ప్రవర్తించాడో కాంగ్రెస్ చరిత్రకారుడు పట్టాభి వివరించాడు. గాంధీ "సామ్రాజ్యభావ లక్ష్యమునకును, మిత్రదేశము లొడబడియుండు నొక కామన్వెల్తు లక్ష్యమునకుగల భేదమును వివరించెను. ఇది యొక వ్యాపారస్థుడు తన వ్యాపారము నితరుని కప్పగించుట వంటిదనెను. ఇర్వురు భాగస్వాములు విడిపోవునప్పుడు జమా ఖర్చు లెక్కలను సరిచూచుకొందురను సామ్యముదెచ్చెను.... ఇంగ్లాండు, భారత దేశమును కత్తితోగాక ప్రేమ సూత్రముచే బంధించి యుంచిన యెడల బ్రిటిష్‌వారి బడ్జెట్‌ను మేమే సరిపుచ్చి యిత్తుమని వా నము చేసెను."

గొర్రె కసాయివా నమ్మిన గాంధీ బ్రిటిషు పరిపాలకులపై పెట్టుకొన శలు అ యాసలయ్యాయి.

గాంధీ-ఇర్విన్ ఒ ంబడిక ఫలితంగా ఏర్పడిన పోరాట విరామకాలంలో బ్రిటిషు ప్రభుత్వం జాతీయోద్యమాన్ని అణచివేయడానికి సకల సన్నాహాలు చేస్తూనే వుంది. బ్రిటిషు ప్రభుత్వ చిత్తవృత్తి ఎలా వుందో తెలియజేయడానికి ఒక్క చిన్న ఉదాహరణ చాలు.

రెండవ రౌండ్ టేబుల్ సమావేశకాలంలో చక్రవర్తి, ప్రతినిధులను బకింగుహామ్ పాలస్‌కి ఆహ్వానించాడు. గాంధీని కూడా అలాగే ఆహ్వానించాడు. వారిద్దరి మధ్య జరిగిన సంభాషణలో చక్రవర్తి, దక్షిణాఫ్రికాలో తాను గాంధీని కలుసుకున్నప్పుడూ, 1918 వరకూ గాంధీ మంచివాడేననీ కాని ఆ తర్వాత ఏదో కొంత పొరపాటు జరిగిందని అన్నాడు. గాంధీ దీనికి జవాబు చెప్పలేదు. "నా కుమారుడు వేల్సుయువరాజును ఎందుకు బహిష్కరించారు?" అని చక్రవర్తి ప్రశ్నించాడు. "బహిష్కరించింది మీ కుమారుణ్ణి కాదు మహాశయా, బ్రిటిషు సింహాసనపు అధికార ప్రతినిధిని" అని గాంధీ జవాబిచ్చాడు. భారతదేశంలో తిరుగుబాటును, తాను సహించబోనని చక్రవర్తి హెచ్చరించాడు. గాంధీ మర్యాదగా "ఈ అంశంపై మీతో వాదించుతానని ఘనత వహించిన తమరు ఆశించకండి" అన్నాడు. ఇది తర్వాత బ్రిటిషు ప్రభుత్వం చేపట్టిన దమన నీతికి సూచన కాబోలు !

## తిరిగి కఠోర నిర్బంధ కాండ

వైస్రాయి విల్లింగ్డన్ హయాంలో ప్రభుత్వం తీవ్ర నిర్బంధ విధానాన్ని ప్రవేశపెట్టింది. ప్రభుత్వంతో సంప్రతింపులు సాగుతునా యి. కాబట్టి ఈలోగా రైతులు శిస్తు చెల్లించవ , యు. పి. కాంగ్రెస్ వాదులు సలహా యిచ్చా . వీరందరినీ ప్రభుత్వం అరెస్టు చేసింది. జవహర్‌లాల్‌నెహ్రూ, పురుషోత్తమదాస్ టాండన్, టి. ఎ. కె. షెర్వానీ లనుకూడా అరెస్టయినవారిలో వున్నారు. గాంధీ భారత దేశానికి ఇక ఐదు రోజుల్లో వస్తాడనగా ఈ అరెస్టులు జరిగాయి. వాయువ్య రాష్ట్రంలో అబ్దుల్‌గఫార్ ఖాన్, అతడి సోదరుడు డాక్టర్ ఖాన్ సాహెబ్‌ను ప్రభుత్వం అరెస్టు చేసింది. అత్యవసర (ఎమర్జన్సీ) ఆర్డినెన్సుల్ని సంయుక్త రాష్ట్రం (యు. పి.) బెంగాల్, వాయువ్య రాష్ట్రాలలో జారీచేసింది. వాయువ్య రాష్ట్రంలో సైనిక పాలన విధించింది. 1931 ఆగస్టు 31 తేదీ మొదలు మూడురోజులు బెంగాల్‌లో చిటగాంగు పట్టణం, అనధికార యూరోపియనులు వారికి తోడుగావచ్చిన గూండాల పాలబడింది. వారు జాతీయ వాదుల ఇళ్ళను లూటీ చేస్తుంటే, పోలీసులు చూస్తూ వూరుకొన్నారు. ఒక ప్రెస్‌ను నాశనం

చేసి, దాని యజమానిని చావచితక కొట్టారు. మత కలహాన్ని ప్రారంభించవలసిందిగా ప్రజల్ని నిర్బంధించి విఫల మయ్యారు. బార్డోలీరైతుల విషయంలో పోలీసుల అత్యాచారాలను విచారించడానికి ఆర్. సి. గార్డెన్‌ను నియమించింది. భూలాభాయ్ దేశాయ్, వల్లభాయ్‌పటేల్ రైతుల తరపున నిలిచారు. ప్రభుత్వం వీరితో సహకరించలేదు. అందుచే ఆ విచారణ ఆగిపోయింది.

ఐర్లండులో విప్లవకారుల్ని అణచుటలో అనుభవం వున్న సర్‌జాన్ ఆండర్సన్ బెంగాల్ గవర్నరు అయ్యాడు. ఖర్గపూర్ సమీపంలోని హిజిలీ డిటెన్ శిబిరంలో డిటెన్యూలపై లాఠీచార్జి జరిపి కాల్పులు సాగించగా ఇద్దరు చనిపోయారు. ఇరవైమంది గాయపడ్డారు. ఆంధ్రరాష్ట్రంలో భూమిపన్ను రీసెటిల్‌మెంట్ ద్వారా 18 ¾ రూపాయలు హెచ్చించి వసూలు చేయడానికి సిద్ధంగావుంది. ప్రభుత్వం పన్నులు ఇవ్వమని అంటే నేను ప్రకటిస్తానని మద్రాసు గవర్నర్ బెదిరిస్తూ న్నాడు.

ఈ పరిస్థితులలో వైస్రాయితో ఇంటర్వ్యూకోరాడు గాంధీ. అందుకు వైస్రాయి పెట్టిన షరతు గాంధీ తన సహచరుల చర్యల్ని ఖండించడం, రెండవది బెంగాల్, యు. పి. వాయువ్య రాష్ట్రాల సంగతి చర్చించకుండా వుండటం. దీనికి గాంధీ అంగీకరించలేదు.

కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ 1932 జనవరిప్రారంభంలో సమావేశమై తిరిగి శాసనోల్లంఘనం ప్రారంభించాలని నిర్ణయించింది. ఈ తీర్మానాన్ని వివరించడానికై, వైస్రాయిని అనుమతి కోరాడు గాంధీ. దానికి కూడా వైస్రాయి తిరస్కరించాడు. దీనితో సంప్రతింపులు పూర్తిగా భగ్నమైనందున శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించాలని కాంగ్రెస్ నిర్ణయించింది.

జనవరి 3వ తేదీ అర్ధరాత్రి, తెల్లవారితే 4వ తేదీ అనగా గాంధీని. ప్రముఖ కాంగ్రెస్ నాయకులందర్నీ అరెస్టు చేసింది ప్రభుత్వం. కాంగ్రెస్‌నీ, దాని అనుబంధ సంస్థల్ని నిషేధించింది. కాంగ్రెస్ పత్రికలను నిషేధించింది. కాంగ్రెస్ నిధులను,ఆస్తులను, స్థలాలను స్వాధీన పరచుకొంది. 1930 లో వలె ఒక్కొక్కటిగా కాక, మూకుమ్మడిగా ఆర్డినెన్సులను గుమ్మరించింది. సర్ సామ్యూల్‌హోర్, కామన్సు సభలో ఈ ఆర్డినెన్సులు చాలా కఠిన మైనవీ,తీవ్రమైనవీ అని అంగీకరించాడు.ఈ సారి "బిరిగిచిన పోరాటం"కాదన్నాడు. "కృత్రిమ నిబంధనలతో మేము ఆటలాడటం లేదు" అని భారత ప్రభుత్వహోంశాఖా సభ్యుడన్నాడు.ప్రభుత్వానికి సంబంధించినంత వరకు, ఈ ఆర్డినెన్సులకు కాల పరిమితి లేదన్నాడు."రబ్బరుతొడుగుల(గ్లోవ్స్)తో యుద్ధం ఎవరూ చేయరు" అంటూ బొంబాయి ప్రభుత్వ ప్రతినిధి అన్నాడు. కొద్ది కాలంలోనే ఈ ఆర్డినెన్సుల సంఖ్య 13కి పెరిగింది దాదాపు "భారతీయ జీవనానికి సంబంధించిన ప్రతి కార్యకలాపానికి" ఈ ఆర్డినెన్సులు వర్తించాయి. అంటే వీటి సాకుతో ఏ కార్యకలాపాన్నయినా నిషేధించి శిక్షించ వచ్చునన్న మాట. "సిపాయి తిరుగుబాటు" నాటికన్నా కూడా ఈ ఆర్డినెన్సులు కఠినంగా వున్నాయని చర్చిల్ సైతం అంగీకరించాడు. ఒక విచిత్రమైన ఉదాహరణ కావాలంటే పిల్లలు గనుక ఏదైనా నేరం చేస్తే, వారి తలిదండ్రులుగాని, సంరక్షకులు గాని శిక్షార్హులు.

1932 జనవరి 10 నాటికి ప్రముఖ కాంగ్రెస్ నాయకులంతా అరెస్టయ్యారు. కాంగ్రెస్‌ను నిషేధించటం అటుంచి, దానితో ఎలాంటి సంబంధంలేని సంస్థలు కూడా నిషేధించబడ్డాయి. యువజన సంఘాలు, విద్యార్థిసంఘాలు, జాతీయ పాఠశాలలు, సంస్థలు, కాంగ్రెస్ ఆస్పత్రులు, స్వదేశీ సంస్థలు, లైబ్రరీలు- ఇవన్నీ నిషేధింపబడ్డాయి.

1932 లో ప్రభుత్వం భయానక పరిస్థితులు సృష్టించింది. న్యాయం, చట్టం అంటూ లేదు. మధ్య యుగాలనాటి మృగదశకు పోయారు పాలకులు. ఆ తర్వాత కాలంలో హిట్లరూ అతని అనుచరులూ అధికారంలోకి వచ్చి చేసిన దురంతాలతో బ్రిటిష్ ప్రభుత్వ అఘాయిత్యాలను పోల్చవచ్చు. "నేనూ ఒక రకంగా భారతదేశంలో ముసోలినీని అవుతున్నాను" అని సిగ్గులేకుండా వెల్లింగ్టన్ చెప్పుకున్నాడు.

1932 లో ఇండియాలీగ్ భారత దేశంలోని పరిస్థితుల్ని విచారించడానికిఒక కమిటీనిపంపింది. అందులో ఎల్లెన్ విల్కిన్‌సన్ (లేబర్‌పార్టీకి చెందిన పార్లమెంట్ సభ్యుడు), లియొనార్డ్ మేటర్స్, వి. కె. కృష్ణమీనన్ ఉన్నారు. "భారతదేశ పరిస్థితి" అంటూ ఈ కమిటీ 1933 లో లండన్ నుంచి ఒకనివేదికను ప్రచురించింది. ఈ నివేదికకు ఉపోద్ఘాతం రాసిన బెర్ట్రాండ్ రస్సెల్, భారతదేశంలోని బ్రిటిష్ దురంతాలు హిట్లరు దురం

తాలను మించిపోయినవన్నాడు. అందులో ఈ క్రింది విషయాలను వివరించింది.

। టిష ప్రజలు నమ్ముతున్నట్లుగా భారతదేశంలో వ్య స్వేచ్ఛగాని, రక్షణలుగాని లేవు. మార్షల్‌లా పరి లు నెలకొని వున్నాయి. మామూలు చట్టాల దా రా పనిచేయటం నిలిపివేయబడింది. న్యాయచట్టాల స్థా పరిపాలనాధికారుల విపక్షతో కూడిన పాలన కొనసాగుతూంది. పోలీసుల స్థానంలో శాంతి భద్రత లను కాపాడటానికి సైనికుల్ని ఉపయోగించుతున్నారు. సాయుధ పోలీసుల్ని ఉపయోగించడం పరిపాటి అయింది. పూ నిటివ్ జరిమానాలు, బలవంతంగా వస్తువుల్ని సప యి చేయాలని నిర్బంధించటం జరుగుతూ వుంది. యుధాలు మోసుకు వెళుతున్నట్లుకాని, సమాచారం తీసుకువెళుతున్నట్లుకాని తెలిసినపుడు, ఒక వ్య క్తిని అక్కడి కక్కడే ఆపి సోదా చేయవచ్చు. ప్రత్యేక ట్రిబ్యునల్స్ విధించారు. ఒక రాష్ట్రంలోనే తిరగడానికి వ్య క్తులకూ, ఒక్కొక్కప్పుడు ప్రజా సముదాయాలకు అనుమతి పత్రాలు కావాలి. రైత్వారీ గ్రామాల్లో సైనికుల్ని మకాంపెట్టించారు. సైనికులు పహరా తిరుగుతూ తమ కేకలకు జవాబివ్వని రైతుల్ని కాల్చి చంపిన ఘటనలు కూడా వున్నాయి.

ప్రభుత్వ దమనకాండ ఎంతదూరం పోతుందో చెప్పడానికి ఒక్క ఉదాహరణ చాలు. కాంగ్రెస్ వారికి గాని, దానికి సంబంధించిన కార్యకలాపాలకు గాని ఎవరైనా ముమ్ముందు డబ్బు ఇస్తారేమోనన్న సందేహం ప్రభుత్వానికి కలిగితే, అలాంటి వ్య క్తుల ఖాతాలను పరీక్షించడానికి ప్రభుత్వానికి హక్కుంది.

ప్రభుత్వ దౌష్ట్యాలకు అంతూ పొంతూ లేదు. సభలను క్రూరంగా లాఠీచార్జీచేసి చెదరగొట్టింది. లాకప్‌లోను, జైళ్ళలోను సత్యాగ్రహులను నానా బాధలు పెట్టింది. గ్రామాలలో సామూహిక జరిమానాలు విధించింది. సత్యాగ్రహుల బంధువుల్ని, ఇరుగు పొరుగు వారిని కూడా బాధించింది. కొన్ని సందర్భాలలో స్త్రీలను వివస్త్రలను చేయటం, మాన భంగం చేయటంకూడా జరిగింది. జెండా ప్రతిష్ఠాపనఒక నేరం. స్వదేశీవస్త్రధారణ అపరాధం. హర్తాళ్ళసమయములో దుకాణాలు మూసివేసినందుకు శిక్ష విధించబడింది పత్రికా వా ర్తలపై సెన్సారు విధించబడింది. ఉత్తరాలు సెన్సారు చేయటం, నిలిపివేయటం పరిపాటి అయింది. మూకుమ్మడి విచారణల ద్వారా, అసలు విచారణ లేకుండానే జైళ్ళపాలు చేయటం నిత్యకృత్యమైంది. ఐదుగురికన్నా ఎక్కువమంది, గుమికూడరాదంటూ **144** వ సెక్షన్ విధించబడింది. వలంటీర్లను, పికెటర్లను లాఠీలతో మోదేవారు. ప్రజలను స్వస్థలాల నుంచి వెళ్ళగొట్టటం, ఫలానిచోటనే వుండాలని నిర్బంధించటం లాంటి నిషేధాజ్ఞల్ని అధికారులు జారీ చేశారు. జల ఆ స్తిని ధ్వంసం చేశారు. సాంఘిక సేవా సం ల్ని కూడా మూసివేశారు. ప్రజల గృహసామగ్రి , ఇంట్లో పాత్రలను, నగల్ని, పశువుల్ని అన్నీ స్వాధీనపరచుకోవడం, కొన్నింటిని నాశనం చేయటం ప్రారంభించారు. ఈ విధంగా ప్రజల మనోనిబ్బరాన్ని నాశనం చేయాలని ప్రభుత్వ ఉద్దేశం. మామూలు నేరస్థులకన్నా అధ్వాన్నంగా రాజకీయ ఖైదీలను చూడాలని ప్రభుత్వం రహస్య సర్క్యులర్ పంపింది. జైలులో కొరడాలతో కొట్టడం సర్వ సాధారణ మైంది.

ఆరువారాల్లో ప్రభుత్వం ఉద్యమాన్ని అణచివేయగలనని భావించింది. కాని నాయకత్వం అరెస్టయిపోయినా, సైనిక నాయకుడు లేని సైన్యంలాగ పరిస్థితి ఏర్పడినా, భారతీయులు తమ ధైర్యసాహసాలు ప్రదర్శించారు. కొన్ని నెలలపాటు ఉద్యమాన్ని సాగించారు. జైళ్ళు నిండిపోయాయి. తాత్కాలికంగా ఏర్పాటు చేసిన జైళ్ళు కూడా చాలలేదు. ప్రభుత్వ చట్టాల్ని ఎన్ని విధాల ఉల్లంఘించడానికి వీలుందో అన్నివిధాలా ఉల్లంఘించడం మొదలుపెట్టారు ప్రజలు. సారాదుకాణాన్ని పికెట్ చేశారు. అబ్కారీ రెవెన్యూ తగ్గిపోయేలా చేశారు. కొన్నిచోట్ల భూమి శిస్తు చెల్లించలేదు. అడవి పుల్లరి కట్టలేదు. చౌకీదారీ పన్నులు చెల్లించలేదు. నిషేధాన్ని ఉల్లంఘించి జాతీయ పతాకాల్ని భవనాలు మార్కెట్లపైన, బహిరంగ ప్రదేశాలలో ప్రతిష్ఠించేవారు. ఆ పతాకాలను పోలీసులు తొలగించుతూవుంటే అడ్డుపడి సత్యాగ్రహం చేసేవారు. గాంధీ టోపీలను ధరించటం ప్రభుత్వం నిషేధించింది. ప్రజలు ధిక్కరించి టోపీలు పెట్టుకొని అరెస్టయేవారు. వందేమాతరం పాడరాదనే నిషేధాన్ని ఖాతరు చేయకుండా పాడి, జైళ్ళపాలయ్యారు కొందరు. బ్రిటిష్ వస్త్ర, వస్తు బహిష్కరణ కారణంగా, భారత దేశానికి బ్రిటిష్ దిగుమతులలో కొంతభాగం తగ్గి

పోయింది. ప్రభుత్వం ఎంత కట్టుదిట్టాలు చేసినా, సత్యాగ్రహులు కరపత్రాలు అచ్చువేసో, చెప్పుచేసో, సైక్లోస్టయిల్ చేసో పంచిపెడుతూనే వుండేవారు. గాంధి అరెస్టు చేసిన జనవరి 4 న అఖిలభారత ఖైదీల దినంగా పాటించారు. పెషావర్ కాల్పులు జరిగిన నాడు, పెషావర్ దినం జరిపారు. ఏప్రిల్‌లో జాతీయ వారోత్సవం జరిపారు.

## ఢిల్లీ కాంగ్రెసు మహాసభ

1932 ఏప్రిల్ 24 న కాంగ్రెస్ మహాసభ జరగాల్సిన రోజు. తాత్కాలిక అధ్యక్షుడు మదనమోహన్ మాలవీయ. ఆయన్ని పోలీసులు ఢిల్లీకి రాకముందే అరెస్టు చేశారు. ఐనాకూడా పోలీసుల కన్నుగప్పి, ఢిల్లీలోని చాందినీ చౌక్‌లోని క్లాక్‌టవర్ కింద మహాసభ జరిగింది. 500 మంది ప్రతినిధులు హాజరయ్యారు. పోలీసులు మహాసభ జరిగే చోటికి వచ్చేసరికే, సేఠ్ రణచోడ్‌దాస్ అమృతలాల్ ఆధ్వర్యాన. నాల్గు తీర్మానాలు చేసిన తర్వాత కాంగ్రెస్ మహాసభ ముగిసింది. కాంగ్రెస్ సంపూర్ణ స్వాతంత్ర్య ఆదర్శాన్ని పునరుద్ఘాటించింది. శాసనోల్లంఘన ఉద్యమాన్ని తిరిగి ప్రారంభించినందుకు ఆమోదాన్ని తెలియచేసింది. గాంధీ నాయకత్వంలోను, అహింసా సిద్ధాంతం పట్ల విశ్వాసాన్ని ప్రకటించింది. ఇక్కడికి వచ్చిన ప్రతినిధులను కొందర్ని తోవలో ప్రభుత్వం అరెస్టుచేసి మే 1 న విడుదల చేసింది. ఇలాగే రాష్ట్ర జిల్లాల సభలు కూడా దేశంలో అనేకచోట్ల జరిగేవి.

## కలకత్తా కాంగ్రెస్ మహాసభ

ప్రభుత్వ నిషేధాల్ని లెక్కచేయక, ఢిల్లీ కాంగ్రెస్ మహాసభ లాగానే కలకత్తా కాంగ్రెస్ మహాసభ కూడా జరిగింది. 1933 మార్చి 31 న ఈ మహాసభ జరిగింది. ఈ మహాసభకు అన్ని రాష్ట్రాల నుంచి 2,200 మంది ప్రతినిధులు ఎన్నుకోబడ్డారు. పండిత మదనమోహన మాలవీయ అధ్యక్షత వహించడానికి అంగీకరించారు. కాని ప్రభుత్వం తోవలోనే అసన్‌సోల్ రైల్వే స్టేషన్‌వద్ద అరెస్టు చేసింది. సభకు వస్తున్న మోతీలాల్ నెహ్రూ సతిని, డాక్టర్ సయ్యద్ మహ్మద్ మొదలైన వారిని అరెస్టు చేసింది. తాత్కాలిక అధ్యక్షుడైన ఆణేను కూడా అరెస్టుచేసి జైలులో పెట్టింది. ఆయా రాష్ట్రాల ప్రతినిధులను రాష్ట్రాల లోను, తోవలోను సుమారు వెయ్యిమందికి పైగా అరెస్టు చేసింది. ఐనా వెయ్యిమంది ప్రతినిధులు ఎలాగో కలకత్తా చేరుకున్నారు. నిర్ణీత స్థలంలో మహాసభ ప్రారంభించారు. పోలీసులు వారిపై లాఠీఛార్జి చేశారు. సేన్‌గుప్త సతిని, ఇతర కాంగ్రెస్ నాయకుల్ని అరెస్టు చేశారు. ఒకవైపు లాఠీలవర్షం కురుస్తున్నా లెక్కచేయకుండా ప్రతినిధులు 7 తీర్మానాలు చేశారు. సేన్‌గుప్త సతికి ఆరునెల్ల శిక్ష విధించబడింది. ఏప్రిల్ 3న మాలవీయను వదలిపెట్టారు. కలకత్తా కాంగ్రెస్‌పై పోలీసుల పాశవిక దాడిని గురించి విచారించి, ఆయన ఒక ప్రకటన చేశాడు. పోలీసుల దాడిపై విచారణ గావించాలని ప్రభుత్వాన్ని కోరాడు.

కలకత్తా కాంగ్రెస్ మహాసభ లాహోర్ మహాసభ చేసిన సంపూర్ణ స్వాతంత్ర్య ఆదర్శాన్ని పునరుద్ఘాటించింది. శాసనోల్లంఘనం న్యాయసమ్మతమైనదేనని నొక్కిచెప్పింది. శాసనోల్లంఘన ఉద్యమాన్ని బలపరచి విస్తరింపచేయాలని కోరింది. విదేశ వస్త్రాలు, బ్రిటిష్ వస్తువులను బహిష్కరించాలనీ, ఖద్దరు ధరించాలనీ తీర్మానించింది బ్రిటిష్ ప్రభుత్వం శ్వేతపత్రం ద్వారా తెలియచేసిన రాజ్యాంగ ప్రణాళిక భారతదేశ ప్రజలకు అంగీకారం కాదని, ఈ దేశంలో పర ప్రభుత్వాన్ని శాశ్వతంగాపాదుకొల్పడానికిఅదిఉద్దేశింపబడిందని స్పష్టంచేసింది. 1932 సెప్టెంబర్‌లో గాంధీ సాగించిన ఉపవాసం జయప్రదంగా ముగిసినందుకు గాంధీని అభినందించుతూ కాంగ్రెస్ తీర్మానించింది. 1931 కరాచీ కాంగ్రెస్ ప్రాథమిక హక్కుల తీర్మానాన్ని ప్రజలకు వివరించాలని చెప్పింది.

1930–31 లో కన్నా 1932–33 లో నిర్బంధ విధానం అతి తీవ్రంగా అమలు జరిపింది ప్రభుత్వం. 1932 మే 2 నాటికి అంటే 4 నెలల్లోనే, పండిత మాలవీయ నివేదిక ప్రకారం 80 వేలమంది అరెస్టయారు. 1933 ఏప్రిల్‌లో జరిగిన కలకత్తా కాంగ్రెస్ మహాసభ నాటికి ఒక లక్షా ఇరవై వేలమంది అరెస్టయారు.

## కమ్యూనల్ అవార్డు

1932 ప్రారంభంలో బ్రిటిష్ ప్రధాని రామ్సే మాక్డనాల్డ్, భారతదేశంలోని వివిధ మతస్థులకు రాజ్యాంగంలో ఎలాంటి ప్రాతినిధ్యం వుండాలనే విషయంపై ఒక మధ్యవర్తి పరిష్కారాన్ని ప్రకటించాడు నిజానికి ఈయన్ని మధ్యవర్తిగా వుండమని ఎవరూ

కోరలేదు. కాని తనంతకు తానే మధ్యవర్తిగా ఉంటానని రామ్సే మాగ్డనాల్డ్ ప్రకటించుకొన్నాడు. రానున్న నూతన రాజ్యాంగచట్టంలో ముస్లిములకు, క్రైస్తవులకు, యూరోపియన్లకు, ఆంగ్లో ఇండియన్లకు, సిక్కులకు మాత్రమేకాక హరిజనులకు కూడా ప్రత్యేక ప్రాతినిధ్యం ఉంటుందని ప్రకటించాడు. హరిజనులు, హిందువులలో ఒక భాగంగా కాక, వేరే ప్రత్యేక తరగతిగా విడదీసి వారికి కూడా ప్రత్యేక ప్రాతినిధ్యం వుంటుందని అన్నాడు. ఆ సమయంలో గాంధీ జైలులో ఉన్నాడు. హరిజనుల్ని హిందువుల నుంచి వేరు చేయాలనే కుతంత్రాన్ని ఎదిరించదలచాడు. గాంధీ ఎరవాడ జైలులో 1932 సెప్టెంబరులో ఆ మరణ నిరాహారదీక్ష పూనాడు. గాంధీకి హరిజన నాయకుల మధ్య అంగీకారం కుదిరితే, ఈ అవార్డును సవరించుతానని మాగ్డనాల్డ్ వాగ్దానం చేశాడు. మాలవీయ చొరవతో హరిజన నాయకులతో, తదితర హిందూ నాయకులమధ్య సమావేశం జరిగింది. డాక్టర్ అంబేద్కర్ రాజీకి అంగీకరించాడు. అదే పూనా ఒడంబడికగా ప్రసిద్ధి కెక్కింది. ఈ ఒడంబడిక మూలముగా, హరిజనులకు రిజర్వుచేసిన స్థానాలు తగుపాటిగా ఎక్కువ చేశారు. గాంధీ ఉపవాసవ్రతం విరమించాడు. కమ్యూనల్ అవార్డుకు సవరణగా అంగీకరింపబడింది. హిందువులనుంచి హరిజనులను వేరు చేయాలనే ప్రయత్నం ఈ విధంగా భగ్నమైంది.

1933 మే 8 నుంచి 21రోజులు ఉపవాసం సాగిస్తానని జైలునుంచి గాంధీ తెలియచేశాడు. హరిజనుల సంక్షేమంకోసం ఆత్మ పారిశుధ్యంకోసం తానీ ఉపవాసం చేస్తున్నట్లు గాంధీ ప్రకటించాడు. ప్రకటించిన నాడే నిరాహారవ్రతం ప్రారంభమైంది. గాంధీని ప్రభుత్వము విడుదల చేసింది. ఆయన సలహాతో కాంగ్రెస్ తాత్కాలిక అధ్యక్షుడు అణే ఆరువారాలపాటు, ఉద్యమాన్ని ఆపివేశాడు. దేశంలో శాంతి కావాలనుకుంటే ఈ అవకాశం ఉపయోగించుకుని సత్యాగ్రహులను విడుదల చేయాలని గాంధీ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశాడు. ప్రభుత్వం అందుకు తిరస్కరించింది. ఆరు వారాలయ్యాక గాంధీ, వైస్రాయితో ఇంటర్వ్యూ కోరాడు. ప్రభుత్వాన్ని ప్రతిఘటించుతున్న వారితో సంప్రతింపులు సాగించే సమస్యేలేదని వైస్రాయి జవాబిచ్చాడు. అణే, ఇంకా అందుబాటులో ఉన్న ఇతర నాయకులతో సంప్రతించాక గాంధీ సామూహిక శాసనోల్లంఘనానికి బదులుగా వ్యక్తి శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించాలని నిశ్చయించాడు. అలా శాసనోల్లంఘనం చేసేవారు స్వంత బాధ్యతమీదే చేయాలి. ఉద్యమం బహిరంగంగా వుండాలి. రహస్యంగా ఉండరాదు. కాంగ్రెస్ సంఘాలన్నీ, అఖిలభారత కాంగ్రెస్ కమిటీతో సహా రద్దవుతాయి. పన్నుల నిరాకరణ, భూమిశిస్తు నిరాకరణ ఉద్యమాల్ని విరమించాలి.

1933 ఆగస్టు 1న గాంధీ ఈ ఉద్యమాన్ని ప్రారంభించాలి. కాని ప్రభుత్వం ముందుగానే ఆశ్రమవాసులు 34 మందితో సహా గాంధీని అరెస్టు చేసింది. 4 రోజుల తర్వాత గాంధీని విడుదల చేసింది. పూనాలో నివసించాలని గాంధీని శాసించింది ప్రభుత్వం. గాంధీ ధిక్కరించగా, ఆయనకు ఒక సంవత్సరం శిక్ష విధించబడింది. దీనితో వందలాది సత్యాగ్రహులు సత్యాగ్రహం ప్రారంభించారు. 1933 ఆగస్టుతో ప్రారంభమైన ఈ సత్యాగ్రహం 1934 మార్చి దాకా సాగింది.

గాంధీ అరెస్టు అయిన కొద్దిరోజులకే ఆగస్టు 16న నిరశన వ్రతం ప్రారంభించాడు. జైలు లోపలనుంచే హరిజనసేవా కార్యక్రమాన్ని నిర్వర్తించడానికి తనకు వీలు కల్పించలేదని చెప్పి, గాంధీ ఈ నిరశనవ్రతం ప్రారంభించాడు. ఆగస్టు 23 న ఆయన పరిస్థితి విషమించడంతో ఆయన్ని ప్రభుత్వం విడుదల చేసింది. ఐనప్పటికీ తనకు విధించిన శిక్షాకాలం సంవత్సరం పూర్తయ్యేదాకా, రాజకీయాల్లో పాల్గొరాదని గాంధీ నిశ్చయించుకొన్నాడు.

1934 ఏప్రిల్ 7 న గాంధీ చేసిన ప్రకటనతో శాసనోల్లంఘన ఉద్యమం దాదాపు ముగిసిపోయింది. శాసనోల్లంఘన కర్తవ్యాన్ని తన ఒక్కని మీదికే తీసుకొన్నాడు గాంధీ. 1934 మే 18, 19 తేదీలలో సమావేశమైన అలిండియా కాంగ్రెస్ కమిటీ శాసనోల్లంఘన ఉద్యమాన్ని ఉపసంహరించుతూ తీర్మానం చేసింది.

1934 జూన్‌లో ప్రభుత్వం కాంగ్రెస్‌పై నిషేధం తొలగించింది. ఐతే యువజన సంఘాలపైన, రైతు సంఘాలపైన, రెడ్ షర్టులపైన నిషేధాలను తొలగించలేదు. 1934 జూలైలో కమ్యూనిస్టు పార్టీని నిషేధించింది.

కాంగ్రెస్ నుంచి గాంధీ నిష్క్రమించుతాడని కొన్నాళ్ళుగా వున్న వార్త, బొంబాయి కాంగ్రెస్ (1934) లో ధృవపడింది. ఆయన కాంగ్రెస్ సభ్యత్వానికి రాజీనామా చేశాడు.

ఆ విధంగా 1930 లో అత్యంత ఉత్సాహ వాతావరణంలో ప్రారంభమైన జాతీయ స్వాతంత్ర్య పోరాటం, 1934 లో నిరుత్సాహ వాతావరణంతో ముగిసింది. ఆశించిన స్వాతంత్ర్యం సిద్ధించని మాట నిజమే. కాని అంతమాత్రాన ఈ ఉద్యమంవల్ల కల్గిన సత్ఫలితాలను చూడకుండా కళ్ళు మూసుకోలేము. ఈ ఉద్యమంలో అనేక బాధలు పడటానికీ, ఎనలేని త్యాగాలు చేయడానికీ స్త్రీలూ, పురుషులూ సంసిద్ధమయ్యారు. శాసనోల్లంఘనోద్యమం బ్రిటిష్ ప్రభుత్వ నగ్న స్వరూపాన్ని ప్రపంచానికి చాటింది. దాని నైతిక ప్రతిష్ట నలుగురిలో నవ్వులపాలైంది. రవీంద్రనాథ ఠాకూర్ అన్నట్లు అది యూరప్‌కు పెద్ద నైతిక అపజయం. యూరప్ వంక ఉన్నత భావంతో చూసిన ఆసియా ఇపుడు యూరప్‌ను హీనభావంతో చూడవచ్చు.

ఈ కాలంలోని జాతీయోద్యమం చేసిన కృషికి అది గర్వపడవచ్చు. ఈ కాలంలో సామ్రాజ్యవాదం తన అధునాతన ఆయుధబలంతో, నిర్బంధ విధానంతో ప్రజల్ని లొంగదీసి, వారి మనోనిబ్బరాన్ని సడలించి, స్వాతంత్ర్య ఉద్యమాన్ని కాలరాయవచ్చని భావించింది. కాని ఆ ఆశయం నెరవేరలేదు. స్వాతంత్ర్య సమరాగ్నిలో కాకలుతీరిన జాతీయోద్యమశక్తులు రోజురోజుకూ బలపడుతూ వచ్చాయి. జాతీయైక్యతను మరింత పెంపొందించుకొన్నాయి. ప్రగాఢ ఆత్మవిశ్వాసాన్ని అలవర్చుకొన్నాయి. తమ కార్యదీక్షకు మరింత గర్వపడ్డాయి. మరింత కృత నిశ్చయంతో మరో సమరఘట్టంలో ప్రవేశించడానికి ఉద్యుక్తమవుతున్నాయి.

# అతివాద దిశలో జాతీయోద్యమం

1930-34 ఉద్యమం 1922 నాటి ఉద్యమంకన్నా, చాలా భిన్నమైంది. రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభ మయ్యేలోగా ఈ కొద్ది సంవత్సరాలలో జాతీయ కాంగ్రెస్‌లోను, జాతీయ విమోచనోద్యమంలోను అతివాదశక్తులు మునుపెన్నడూ లేనంతగా పెరుగ జొచ్చాయి. సోషలిస్టు భావాలు కలవారు, కమ్యూనిస్టులు, అతివాదులు, సమరశీల సామ్రాజ్యవాద వ్యతిరేకులు, ప్రధానంగా వీటిలో వున్నారు. అతివాద శక్తులు కాంగ్రెస్‌కు వెలుపల కూడ అఖిలభారత ప్రజా సంఘాల్ని నిర్మించాయి. స్వతంత్ర ప్రజాపోరాటాలను నడిపాయి. 1934 మేలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఏర్పడింది. తన సెక్టేరియన్ ధోరణి (పిడివాదం) మూలంగా 1930-34 లో కొంతవరకు జాతీయోద్యమ ప్రవాహానికి దూరమైన కమ్యూనిస్టు పార్టీ తన పొర పాట్లను సరిదిద్దుకొని ఐక్యసంఘటన కార్యక్రమాన్ని ప్రారంభించింది. ట్రేడ్‌యూనియన్ రంగంలో ఐక్యత సాధించి, అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌ను తిరిగి ఐక్యపరచింది. అఖిలభారత కిసాన్‌సభ, అఖిల భారత విద్యార్థి సభలను స్థాపించింది. 1936 లో అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘాన్ని నెలకొల్పింది. రైతుల, కార్మికుల, విద్యార్థుల పోరాటాలకు నాయకత్వం వహించింది.

ఇదే సమయంలో సంస్థానాధీశులకు వ్యతిరేకంగా, ప్రజాపోరాటాలు ఉధృతమయ్యాయి. జాతీయ పోరాటంలో సంస్థానాధీశ ప్రజల ఉద్యమం కూడా ఒక భాగమైంది. అఖిలభారత విద్యార్థి ఉద్యమం విద్యార్థుల్ని అతివాద భావాలవైపు మళ్ళించడమేకాక అనేకమంది సమరశీల కార్యకర్తలను అతివాద, సోషలిస్టు, కమ్యూనిస్టు ఉద్యమాలకు సమకూర్చింది.

కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఏర్పాటుకు వల్లభభాయ్ పటేల్‌లాంటి వారికి కోపంగానే వుంది. సోషలిజం గురించి కాంగ్రెస్ వర్కింగ్‌కమిటీ ఒక సందర్భాన వెలువరించిన అభిప్రాయాలు కూడా జవహర్‌లాల్ నెహ్రూకు బాధ కల్గించాయి. నెహ్రూ ఇలా రాశాడు : "ఆ విషయం (సోషలిజం) మీద వర్కింగ్‌కమిటీ చేసిన తీర్మానం, సోషలిజంలో గల అంశాల గురించిన అజ్ఞానం ఆశ్చర్యం గొల్పుతూ వుంది. ఆ తీర్మానాన్ని చదవటం, దాన్ని భారతదేశం వెలుపల చదువుతారనే భావం రాగానే బాధకల్గించుతూంది."

కాంగ్రెస్‌ను మరింత ప్రజాప్రాతినిధ్యంగల పటిష్ఠవంతమైన సంస్థగా చేసేందుకు, 1936 ఏప్రిల్‌లో లక్నో కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించిన జవహర్‌లాల్‌నెహ్రూ కార్మిక, కర్షక సంఘాల్ని, కాంగ్రెస్‌కు సమిష్టి అనుబంధ సంఘాలుగా చేర్చాలని సూచించాడు. ఇదే తిరిగి ఫైజాపూర్ కాంగ్రెస్‌లోకూడ సూచించాడు. కాని గాంధీ, పటేల్ మొదలైన మితవాదవర్గం దీన్ని వ్యతిరేకించడంతో ఆ విషయం అంతటితో వదలివేయబడింది.

బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించిన 1935 రాజ్యాంగ చట్టాన్ని, దేశంలో ఏ పార్టీ కూడా హర్షించలేదు. సి. వై. చింతామణివంటి మితవాదిసైతం "ఈ దేశ ప్రజలు ఎంతగానో ఆశించిన లక్ష్యాలను క్రూరంగా నిరాకరించుతుంది ఈ చట్టం" అన్నాడు.

ఎన్నికల అనంతరం కాంగ్రెస్ అధికారాన్ని స్వీకరించాలా వద్దా అనే విషయంపై ఫైజపూర్ కాంగ్రెస్‌లో విభిన్న అభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. ఎన్నికలు ముగిశాక దీనిపై నిర్ణయం చేయాలని మెజారిటీ అభిప్రాయపడింది. పదవుల్ని స్వీకరించరాదనీ, రాజ్యాంగ నిర్మాణసభ (కాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ) ఏర్పరచాలని, ప్రజాపోరాటం సాగించడానికి సన్నాహాలు చేయాలనీ తెచ్చిన సవరణలు వీగిపోయాయి.

## ఎన్నికలు

1937 లో జరిగే ఎన్నికల్లో పాల్గొనాలని కాంగ్రెస్ నిర్ణయించింది. ఎన్నికలు రాష్ట్రశాసన సభలకు మాత్రమే జరిగాయి. ఐనా ఈ ఎన్నికలు దేశంలోని రాజకీయ వాతావరణాన్ని ఉద్విగ్నపరిచాయి. ప్రజలలో అతివాద భావాల వ్యాప్తికి, సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యాన్ని పెంపొందించడానికి సహాయపడ్డాయి.

కాంగ్రెసుకు మద్రాసు (ఎగువ సభలో కూడా) బొంబాయి, యు.పి., బీహార్ (ఎగువ సభలో కూడ) సి.పి., ఒరిస్సాలలో పూర్తి మెజారిటీ వచ్చింది. బెంగాల్, అస్సాం, వాయువ్య రాష్ట్రాలలో బలమైన

పార్టీగా కాంగ్రెస్ వచ్చింది. బెంగాల్‌లో మొత్తం 250 సీట్లలో మెజారిటీ రాకపోయినా ఎక్కువ సీట్లు అంటే 60 సంపాదించుకొన్న పార్టీ కాంగ్రెసే. అలాగే అస్సాంలో 108 సీ లో కాంగ్రెస్‌కు 35 సీ వచ్చాయి. వాయువ్య ౧ంలోని 50 సీట్లలో 19 సీ కాంగ్రెస్‌కు వచ్చాయి. జాబ్‌లో 175 సీట్లకు 1 , సింధ్‌లో 60 సీట్లకు 7 మాత్రమే కాంగ్రెస్‌కు లభించాయి. ఈ విధంగా ఈ రెండు రాష్ట్రాలలో కాంగ్రెస్ దెబ్బతిన్నది.

ఈ ఎన్నికల్లో మితవాదులు తుడుచుపెట్టుకపోయారు. మద్రాసులో జస్టిస్‌పార్టీ తుడుచుపెట్టుకుపోయింది. యు పి.లో ప్రభుత్వ ఆదరణగల నేషనల్ అగ్రికల్చరిస్టు పార్టీ కూడా ఓడిపోయింది.

కాంగ్రెస్ మొ ంమీద జనరల్ సీట్లలోనే ఎక్కువగా గెల్చింది. ములకు కేటాయించిన 58 సీటకు పోటీచేసి 26 సిట్ల మాత్రమే చేజిక్కించుకోగల్గింది.

కాంగ్రెస్ గెల్చిన రాష్ట్రాలలో అధికారాన్ని స్వీకరించాలా లేదా అనే విషయంపై తర్జనభర్జనలు జరిగాయి. నెహ్రూ, సుభాష్‌చంద్రబోస్ తదితర అతివాదులు పదవీ స్వీకారానికి వ్యతిరేకులు. గాంధీగారి జోక ంతో ఆలిండియా కాంగ్రెస్ కమిటీ 1937 ఆగ 30 న ఒక తీర్మానం చేసింది. గవర్నర్ తన ప్ర ్యేక అధికారాలు ఉపయోగించడనీ, మంత్రుల లహాను త్రోసిపుచ్చడనీ నమ కం శాసనసభలలోని కాంగ్రెస్ పార్టీ నాయకులకు క నపుడే మంత్రి పదవులను అంగీకరించాలి—అని తీ ్మనం పేర్కొన్నది.

గవర్నర్లు ఇలాంటి హామీ ఇవ్వడానికి తిరస్కరించారు. ఈ లోగా తా తా ్క లిక మంత్రి వర్గాల్ని ప్రభుత్వం నియమించింది. 1937 జూన్ 21 న గవర్నర్ జనరల్ లార్డ్ విన్‌లిత్ గో ఇచ్చిన హామీ పురస్కరించుకొని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ 1937 జూలై 7 న మంత్రి పదవుల్ని స్వీకరించడానికి కాంగ్రెస్ అంగీకరించింది. 1937 జూలైలో ఆరు రాష్ట్రాలలో కాంగ్రెస్ మంత్రివర్గాలు ఏర్పడ్డాయి వాయువ్య రా ష్ట్రం లో ఎనిమిదిమంది కాంగ్రెసేతర సభ్యులు కాంగ్రెస్‌లో కలవడంతో అక్కడ కూడా కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడింది. తర్వాత అస్సామ్, సింధులలో కాంగ్రెస్ సంకీర్ణ మంత్రివర్గాలు ఏర్పడ్డాయి. ఆ విధంగా 11 రాష్ట్రాలలోనూ 9. రాష్ట్రాలలో కాంగ్రెస్ మంత్రి వర్గాలు ఏర్పడ్డాయి.

రాష్ట్ర ప్రభుత్వాలకు పరిమితాధికారాలే ఉండేవి. అదీగాక కాంగ్రెస్‌కున్న సామాజిక పునాది కార్మికుల నుంచి, రైతులు, పెట్టుబడిదార్లు, జమీందార్ల వరకూ ఉండటంచేత, కాంగ్రెస్ నాయకత్వం మితవాద ధోరణితో ఉండటంవల్ల పరిపాలనా స్వభావంలో సమూలమైన మార్పు తేలేక పోయాయి కాంగ్రెస్ మంత్రి వర్గాలు. ఐనా మద్యపాన నిషేధం, విద్య, వ్యవసాయ ్యరుణాలు, గ్రామీణపరిశ్రమలు, గ్రామీణాభివృద్ధి కౌలుదార్ల భూస్వాముల సంబంధాలు మొదలైన వాటిపై అనేక చట్టాలు చేశారు. రాజకీయ కారణాల వల్ల బ్రిటిష్ ప్రభుత్వం ` ధీనంచేసుకొన్న భూములను తిరిగి ఆ స్వంత దా కు ఇచ్చేలా బొంబాయి మంత్రివర్గం ఒకచట్టం చేసిం . మద్రాసులో పాతరుణాలను కొంత తగ్గిస్తూ చట్టం చేయబడింది. యు. పి., బొంబాయిలలో రుణాలు మొత్తాన్ని తగ్గిస్తూ, వడ్డీ రేటును తగ్గిస్తూ చట్టాలు చేయబడ్డాయి. కౌలుదార్లను బేదఖలు చేయకుండా, కౌలురేట్లను పెంచకుండా క్రమబద్ధంకాని అదనపు ఛార్జీలు లేకుండా చేశారు. కొన్నిచోట్ల శిస్తు రెమిషన్ ఇవ్వబడింది. బొంబాయిలో వెట్టిచాకిరీ నుంచి 40 వేలమందిని విము క్తి చేశారు. యు.పి., బీహారులలో రైతులు ఆశించినంతగా మేలు కలగలేదు. జమీందార్ల పట్ల ఈ మంత్రివర్గాలు మొగ్గు చూపుతున్నాయని విమర్శించారు.

కాంగ్రెస్ మంత్రివర్గాలు ఏర్పడిన తర్వాత రాజకీయ దీల విడుదల ప్రారంభమైంది. 1922 చౌరీ చౌరా దీలను, 1921 మాప్లా తిరుగుబాటు ఖైదీలను, విడుద చేశారు. అనేక సంఘాలపైన నిషేధాలు తొలగాయి. ఐతే కేంద్ర ప్రభుత్వం కమ్యూనిస్టుపార్టీపై విధించిన నిషేధం మాత్రం తొలగలేదు. పత్రికల నుంచి తీసుకొన్న ధరావతులను తిరిగి ఇచ్చేశారు. పత్రికాస్వేచ్ఛ, ప్రచురణస్వేచ్ఛ తగినంతగా పెరిగింది.

కార్మికవర్గం కూడా కాంగ్రెస్ మంత్రివర్గాల నుంచి చాలా ఆశించింది, కార్మికులలో పోరాట పటిమ పెరిగింది. 1937 లో సమ్మెలవల్ల 90 లక్షల పని దినాల నష్టం జరిగింది. 6 లక్షల 47 వేల మంది కార్మికులు సమ్మెల్లో పా ల్గొ నా ్న రు. బొంబాయి,

కాన్పూరులలో కార్మికుల వేతనాలు పెరిగాయి. కాన్పూరులో కమ్యూనిస్టుల ఆధ్వర్యానవున్న మజ్దూర్‌సభ సమ్మె చేసినపుడు కార్మికులపట్ల అక్కడి కాంగ్రెస్ సంఘీభావం ప్రకటించింది. ఐతే త్వరలోనే కాంగ్రెస్ మంత్రి వర్గాలలో మార్పు వచ్చింది. మద్రాసు, బొంబాయిలలో కార్మికులు సమ్మె చేసుకొనే హక్కుపై ఆటంకాలు కల్గించబడ్డాయి. దీనికి ఉదాహరణ బొంబాయి ఇండస్ట్రియల్ డిస్ప్యూట్‌బి . దీనికి నిరసనగా 1938 నవంబర్ 7న నిరసన సమె హర్తాళ్ జరిగాయి. పోలీసుల కాల్పులలో ఒకరు చ పోయారు. అనేకమంది గాయపడ్డారు. నెహ్రూగాని, సుభాష్ చంద్రబోస్‌గాని దాన్ని ఖండించలేదు. మద్రాసులో సోషలిస్టు అయిన యస్. యస్. బాటిల్వాలాకు ఆరునెలల శిక్షవిధింపబడింది. కాంగ్రెస్ గతంలో గర్హించిన 124ఎ, 144 సెక్షన్లను మద్రాసు మంత్రి వర్గం అమలు పరచింది.

కాంగ్రెస్ మంత్రివర్గాలు మొదట ఏర్పరచినపుడు ఒకప్రక్క 1935 రాజ్యాంగ చట్టాన్ని అమలు పరచుతూనే, దాన్ని ఎదుర్కోవాలని భావించాయి. కాని రానురాను ఎదుర్కోవాలనే భావన వెనక్కిపోయింది.

1938 లో బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధులకు, వ్యక్తిగత కాంగ్రెస్ నాయకులకూ మధ్య అనేక సంభాషణలు జరిగాయి. ఫెడరల్ రాజ్యాంగచట్టం విషయంలో ఏదో ఒక రాజీ కుదురుతుందని వదంతులు పుట్టాయి. అయితే ప్రభుత్వ ప్రకటన లేవీ ఆ వదంతులను నిజమని ధృవపరచలేదు. కాని కొందరు కాంగ్రెస్ నాయకులు చేస్తున్న ప్రకటనల తీరుకు కాంగ్రెస్‌లోని అతివాదులు భయపడ్డారు. చట్టబద్ధ రాజకీయాలకు కాంగ్రెస్ దిగజారి పోతున్నదనీ, ఎంత గొప్ప గొప్ప మాటలు చెబుతున్నా, సామ్రాజ్యవాదులకు లొంగి పోతారేమోనని వీరు భయపడసాగారు.

## సుభాష్ చంద్రబోస్ ఎన్నిక

ఇలాంటి పరిస్థితులలోనే 1939లో త్రిపురకాంగ్రెస్ అధ్యక్షపదవికి ఎన్నికలు జరిగాయి. అంతకు ముందు సంవత్సరంకూడా బోస్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా వున్నాడు. ఐతే అపుడు ఎన్నిక జరగలేదు. కాంగ్రెస్ అధ్యక్ష పదవికి పోటీ చేయటం కాంగ్రెస్ చరిత్రలో ఇదే మొదటి సారి. ఫెడరేషన్ ఏర్పాటుకు వ్యతిరేకంగా, బ్రిటిష్ వాళ్ళతో రాజీకి సుముఖంగా వున్న మితవాద నాయకుల ధోరణిని ఎదిరించేందుకు తాను పోటీ చేస్తున్నానని బోస్ ప్రకటించాడు. మొదట్లో కాంగ్రెస్ అధ్యక్ష పదవికి మౌలానా ఆజాద్ పోటీ చేస్తాడని భావించారు కాని ఆయన తన నామినేషన్ ఉపసంహరించుకొన్నాడు. ఇక మిగిలింది డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య. పట్టాభిగారి నామినేషన్ ఆయనకు తెలియకుండానే ఎవరో దాఖలు చేశారట. అందుకని ఆయన తన నామినేషన్‌ను ఉపసంహరించుకొన్నాడు. కాని మౌలానా అబుల్ కలాం అజాద్ ప్రోత్సాహంతో నామినేషన్ పునరుద్ధరించబడింది. సుభాస్ చంద్రబోస్, పట్టాభి మాత్రమే రంగంలో వుండిపోయారు. పట్టాభిగారిని గాంధీ, వర్కింగ్ కమిటీలో అధిక సంఖ్యాకులు బలపర్చారు. బోస్‌ను అతివాద జాతీయవాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు బలపరచారు. బోస్‌కు 1575 వోటురాగా పట్టాభికి 1376 వోట్లు వచ్చాయి. పట్టాభి వోడిపోయాడు. పట్టాభి తన వోటమిని హుందాతనం తోనే అంగీకరించాడు. ఈ విషయం కాంగ్రెసు చరిత్రలో ఆయన రాసిన మాటల్ని బట్టి అర్థమౌతుంది. "ఈ విజయం వలన కొందరికి అత్యంతమైన సంతోషం కలిగింది. మరికొందరికి చాలా ఆశ్చర్యం కలిగింది. సుభాస్‌బాబు యొక్క వ్య త్వమేగాక, ఆయన ఎన్నికల ప్రణాళికలోని ఉత్కృ సిద్ధాంతం కూడా ఆయన అభ్యర్థిత్వానికొక ఉచ్ఛస్థి ని చేకూర్చింది ఆయన ....ఈ పోటీగానీ, పోటీయొక్క ఫలితంగానీ వ్యక్తులకు సంబంధించినదిగా గాక సిద్ధాంతాలకూ, కార్యక్రమాలకూ సంబంధించినదిగా పరిణమించింది" అని కాంగ్రెసు చరిత్రలో రాశాడు.

కాంగ్రెసు అధ్యక్ష పదవికి మౌలానా అబుల్ కలాం ఆజాద్ గనుక అంగీకరించని పక్షంలో ఆ "ముళ్ళకిరీటాన్ని" పట్టాభినెత్తిన ఉంచవలసి వసుందన్న గాంధీకి ఈ అపజయం అంత సులభంగా తోచలేదు. "ఈ అపజయం పట్టాభిది కాదు, నాదే" అని ఆగ్రహాన్ని వెళ్ళగక్కాడు. గాంధీ అంతటి ఉన్నత వ క్తి తన హుందాతనానికి భిన్నంగా, బేలగా ఇలాంటి ప్రకటన చేయటం చాలా మందికి విస్మయం కలుగ సింది. "నేను ఆమోదించే సిద్ధాంతాలనూ, విధానాలను ప్రతినిధులు అంగీకరించటం లేదని స్పష్టమైంది" అని గాంధీ వ్యాఖ్యానించాడు. "కాంగ్రెస్

అతివాదంవైపు మొగ్గుతున్న దనడానికి" నిదర్శనంగా టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రిక వ్యాఖ్యానించింది. "అతివాదంవైపు కాంగ్రెస్ మొగ్గే ధోరణినే గాక, ప్రజలు తమ వ్యక్తిత్వాన్ని నిరూపించుకొనడాన్ని స్పష్టంగా సూచించుతున్న" దని బొంబాయి క్రానికల్ పత్రిక రాసింది.

తర్వాత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీలోని 15 మంది సభ్యులలో 12 మంది రాజీనామా నిచ్చారు. వీరితో కలిసికాక వేరేగా జవహర్‌లాల్‌నెహ్రూ రాజీనామా ఇచ్చాడు. బ్రిటిష్ ప్రభుత్వంతో రాజీకి కొందరు ప్రయత్నిస్తున్నారనే ఆరోపణను బోసు ఉపసంహరించుకోనందున తాను రాజీనామా ఇస్తున్నట్లు నెహ్రూ చెప్పాడు. త్రిపుర కాంగ్రెస్, భారత రాజ్యాంగ చట్టంలోని ఫెడరల్ భాగానికి రాజీలేని ప్రాతికూల్యం ప్రకటించింది.

గాంధీ అనుయాయులు "గాంధీగారి అభీష్టానుసారంగా కాంగ్రెస్ వర్కింగ్ కమిటీని బోస్ ఏర్పరచాలని" ఒక తీర్మానం ప్రతిపాదించగా నెగ్గింది; బోస్ గాంధీని సంప్రతించగా "మీ అభిప్రాయాలు నాకు తెలుసు. ప్రధాన సూత్రాల విషయంలో సభ్యులలో అభిప్రాయ భేదాలున్నాయని కూడా నాకు తెలుసు. అందుచేత నేను గనుక పేర్లను ఇస్తే, అది మీమీద రుద్దినట్లవుతుంది. అందుచేత వర్కింగ్ కమిటీని ఎన్నుకొనే అధికారం మీకే ఇస్తున్నాను" అన్నాడు

కాంగ్రెస్ నియమావళికీ, పైన ఆమోదించిన తీర్మానానికీ ఎక్కడా పొంతనలేదు, గాంధీ సాధారణ సభ్యుడు కూడా కాడు ఐనా ఆయన కాంగ్రెస్‌పై నియంతగా వ్యవహరించడానికి ఈ తీర్మానం దారి తీసింది. విషయ నిర్ధారణ సభలో ఈ తీర్మానానికి 218 వోట్లు అనుకూలంగా, 135 వోట్లు ప్రతికూలంగా వచ్చాయి. చిట్టచివరకు కలకత్తాలో జరిగిన ఎ. ఐ. సి. సిలో (1939 ఏప్రిల్, మే) బోస్ రాజీనామా నిచ్చాడు.

రాజేంద్రప్రసాద్ కాంగ్రెస్ అధ్యక్షుడయ్యాడు. ఈయన ఏర్పరచిన వర్కింగ్ కమిటీలో నెహ్రూ పేరుకూడా లేదు. రాష్ట్ర కాంగ్రెస్ కమిటీల అనుమతి లేనిదే ఎలాంటి సత్యాగ్రహ పోరాటాన్నీ సాగించరాదని కాంగ్రెస్ నిషేధించింది. రైతాంగం తమ హక్కులకోసం, ప్రజలు తమ పౌర హక్కులకోసం పోరాటాలు సాగించుతున్నకాలం అది. ఎ.ఐ.సి.సి. తీర్మానానికి నిరసనగా "అతివాద ఐక్య సంఘటన" ఆధ్వర్యాన 1939 జూలై 9 న బోస్ నాయకత్వాన, ప్రజా ప్రదర్శనలు జరిగాయి. దీనిపై క్రమశిక్షణా రాహిత్యం క్రింద బోస్‌ను మూడేళ్ళపాటు కాంగ్రెస్‌లో ఎలాంటి పదవులు చేపట్టరాదని బహిష్కరించింది దీనితో బెంగాల్ కాంగ్రెస్‌లో విభేదా లేర్పడి రెండు కాంగ్రెస్‌లుగా చీలిపోయాయి.

కాంగ్రెస్‌లోని అతివాదులను, సామ్రాజ్యవాద వ్యతిరేకులను సమీకరించే లక్ష్యంతో బోస్ "ఫార్వర్డ్ బ్లాక్" ఏర్పరచాడు. కాంగ్రెస్ నియమావళితోగాని, ఆశయంతోగాని, విధానంతోగానీ, కార్యక్రమంతోగానీ ఫార్వర్డ్‌బ్లాక్ విభేదించలేదు. ప్రస్తుతమున్న కాంగ్రెస్ నాయకత్వంపట్ల అసంతృప్తిని మాత్రమే అది చాటింది. ఫెడరల్ ప్రతిపత్తికి వ్యతిరేకంగా, స్వాతంత్ర్యం కోసం పోరాటం సాగించాలని, అందుకు సన్నాహాలు చేయాలని ఫార్వర్డ్‌బ్లాక్ నిశ్చయించింది. పౌరహక్కుల కోసం పోరాటం సాగించుతానని బోస్ చేసిన వాగ్దానాన్ని అమలు జరపాలని ప్రజలు ఎదురు చూస్తున్నారు. కాని ఫార్వర్డ్‌బ్లాక్ సమరశీల ప్రజా ఉద్యమ కార్యాక్రమాన్ని అప్పుడు ఏదీ ఇవ్వలేకపోయింది. కాంగ్రెస్ అధ్యక్ష పదవికి బోస్‌ను బలపరచిన కమ్యూనిస్టుపార్టీ కూడా. బోస్ ఈ నిర్ణయాన్ని బలపరచలేదు. కాంగ్రెస్‌లోనే వుండి, కాంగ్రెస్‌లోని నాయకత్వపు రాజీధోరణులకు వ్యతిరేకంగా పోరాడుతూ, కాంగ్రెస్‌ను అతివాద దిశకు మళ్ళించాలని వీరు సూచించారు.

1939 సెప్టెంబర్‌లో ద్వితీయ ప్రపంచ మహాయుద్ధం ప్రారంభమయ్యాక, సామ్రాజ్యవాదానికీ జాతీయోద్యమానికీ మధ్య సంఘర్షణ మరింత ఉధృతమై నూతన సమస్యలు తలెత్తాయి.

# రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో

1939 సెప్టెంబర్‌లో రెండో ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. భారత జాతీయోద్యమ నాయకులు మొదటినుంచీ, ఈ యుద్ధాన్ని ప్రారంభించడంలో ప్రముఖ భాగస్వామైన ఫాసిజాన్ని ఎదిరించుతూనే వచ్చారు. జాతి విద్వేషం, నియంతృత్వంగల ఫాసిస్టు సిద్ధాంతాన్ని ఖండించారు. స్పెయిన్‌, ఇథోపియా, జకోస్లొవేకియాలు ఫాసిస్టులచే కబళింపబడినపుడు కాంగ్రెస్ ఆ దేశాల ప్రజలకు సానుభూతి ప్రదర్శించింది. చైనాపై దాడి సాగించిన జపాన్‌ను ఖండించింది. వలసలను పంచుకోడానికి పాత వలస ప్రభుత్వాలూ, కొత్తగా తలెత్తిన ఫాసిస్టు దేశాలూ ప్రయత్నించినట్లయితే దానితో తమ కెలాంటి సంబంధం లేదని కాంగ్రెస్ స్పష్టం చేసింది.

ఐతే ఇదే సమయంలో సామ్రాజ్యవాదానికి కూడా కాంగ్రెస్ వ్యతిరేకియే. మిత్రరాజ్యాలు కనుక తమ పద్ధతులు మార్చుకొని "ప్రజాస్వామ్యంకోసం ప్రపంచాన్ని రక్షించాలని" నిజంగా భావించి యితే, ఫాసిస్టులతో నిజంగా అందుకోసం పోట్లాడిన యితే, భారతదేశం తనకు సాధ్యమైనంత సహాయాన్ని అందించుతుందని కాంగ్రెస్ నాయకులు చెప్పారు మిత్రదేశాలు, ముఖ్యంగా బ్రిటన్ ఇందుకు రుజువు కనపరచాలని కోరారు. భారతదేశంపై తన సామ్రాజ్య, వలస పెత్తనాన్ని వదలుకొని, భారతదేశానికి సహేతుకమైనంతవరకు స్వపరిపాలన ఇవ్వాలని అన్నారు. ఐతే ఈ అభిప్రాయాలను బ్రిటిష్ ప్రభుత్వం ఖాతరు చేయలేదు. 1939 సెప్టెంబరు 3 న యుద్ధం ప్రకటించ బడింది. భారతదేశ ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోకుండానే. భారత జాతీయ నాయకులతో సంప్రతించకుండానే, యుద్ధంలో భారతదేశం బ్రిటన్‌తోపాటు భాగస్వామి అని ప్రకటించింది 1935 రాజ్యాంగచట్టంలోని "ఫెడరల్ ప్రభుత్వం" అనే అంశం, ఇంకా అమలులోకి రాలేదు, అందుచేత సాంకేతికపరంగా చూచినట్లయితే వైస్రాయి ఈ చర్య సబబుగానే కన్పించవచ్చు. కాని భారత ప్రజల మనోభీష్టానికి మాత్రం ఇది పూర్తి విరుద్ధం. కేంద్రశాసన సభవుంది. రాష్ట్రింలో ప్రజా ప్రతినిధుల మంత్రివర్గాలున్నాయి. దేశంలో సుసంఘటితమైన రాజకీయ పార్టీలు కూడా వున్నాయి. కాని వీటితోగాని, రాజకీయ నాయకులతో కాని ఎలాంటి సంప్రతింపులు సాగించలేదు. ఇది భారతీయుల్ని విస్మయ పర్చడమేగాక, వారికిది అవమాన కరంగా తోచింది.

1939 వేసవిలో మ ల యా కు భారత సేనలను ముందు జాగ్రతకోసం పంపినపుడు, దీనికి నిరసనగా కేంద్ర అసెంబ్లీలోని కాంగ్రెస్‌పార్టీ సభకు హాజరు కాలేదు.

1939 సెప్టెంబరు 14 న యుద్ధంపట్ల తన వైఖరిని స్పష్టంచేస్తూ కాంగ్రెస్ ఒక ప్రకటన చేసింది.

"ప్రస్తుతమున్న పరిస్థితినే, అనగా సామ్రాజ్యవాద అధీనదేశాలు, వలసలు, దాని ప్రయోజనాలు, ప్రత్యేక సౌకర్యాలు అలాగే ఉండేందుకు వాటి పరిరక్షణకోసం యుద్ధం కొనసాగుతున్నట్లయితే, భారతదేశానికి దానితో ఎట్టి సంబంధంలేదు. అసలు సమన్య ప్రజాస్వామ్యమూ, ప్రజాస్వామ్యంపై ఆధారపడిన ప్రపంచ వ్యవస్థా నిర్మాణమూ కనుక ఐనట్లయితే, భారతదేశానికి అందులో గాఢాశక్తి వుంటుంది.... స్వతంత్ర ప్రజాతంత్ర భారతదేశం దురాక్రమణకు వ్యతిరేకంగా పరస్పర సంరక్షణకోసం ఇతర స్వతంత్ర దేశాలతో సహకరించుతుంది. పరస్పర ఆర్థిక సహకారానికి కృషి చేస్తుంది. కాని ఈ సహకారం పరస్పర అంగీకారంతోను, సమాన హోదాగల దేశాలమధ్య ఐ వుండాలి."

అందుచేత బ్రిటిష్ ప్రభుత్వం తన యుద్ధ లక్ష్యాలేమిటో స్పష్టపరచాలనీ. భారతదేశంలో ఆ లక్ష్యాలను ఎలా అనువ రింపచేస్తుందో చెప్పాలనీ,కాంగ్రెస్ కోరింది. బ్రిటన్ చి తశుద్ధికి నిజమైన పరీక్ష, అలాంటి లక్ష ల ప్రకటనను అమలు జరపడమనీ కాంగ్రెస్ స్ప ం చేసింది.

నికి సమాధానం వెంటనే రాలేదు. 1939 అక్టోబరు 17 న వైస్రాయి పంపిన సమాధానంలో బ్రిటిష్ ప్రధాని ప్రకటనకన్నా తాను చెప్పవలసింది ఏమీ లేదన్నాడు. వైస్రాయి కార్యనిర్వాహక సభ్యులలో మరికొందరు భారతీయుల్ని చేర్చుకొంటానన్నాడు. యు కాలంలో అధికార మార్పిడి అసాధ్యమన్నాడు. యు నంతరం 1935 రాజ్యాంగ చట్టంలో ఎలాంటి మా ్పులు కావాలో వివిధ వర్గాలతో సంప్రతించ

టానికి సంసిద్ధత తెలియ చేశాడు. దీని పర్యవసానంగా "భారతదేశం గొప్ప డొమినియన్ దేశాల మధ్య తగు స్థానం సంపాదించుకోగలదు" అన్నాడు.

తక్షణం ఎలాంటి అధికారం బదలాయించకపోగా, సుదూర భవిష్యత్తులో ఇచ్చేది కూడా సంపూర్ణ స్వాతంత్ర్యంకాదనీ, అదినివేశ ప్రతిపత్తి మాత్రమే ననీ స్పష్టమైంది.

వైస్రాయి ప్రకటనను గాంధీ ఇలా నిరసించాడు. "వైస్రాయి ప్రకటన స్పష్టంగా తెలియచేసేదేమంటే బ్రిటన్ అడ్డుపెట్ట గలిగినట్లయితే భారతదేశంలో ప్రజాస్వామ్యం వుండదు. మరో రౌండ్ టేబుల్ సమావేశాన్ని గురించి వాగ్దానం చేశాడు. కాని పూర్వం వాటిలాగానే అదీ భగ్నమై తీరుతుంది. కాంగ్రెస్ రొట్టె అడిగితే, రాయి వడేసింది ప్రభుత్వం."

కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ 1939 అక్టోబరు 22 న సమావేశమై, కాంగ్రెస్ మంత్రి వర్గాలను రాజీనామా చేయవలసిందిగా ఆదేశించింది. అక్టోబరు 27 నవంబర్ 15 తేదీలమధ్య కాంగ్రెస్ మంత్రివర్గాలన్నీ రాజీనామా చేశాయి.

ఇలా కాంగ్రెస్, వైస్రాయిలమధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు, రాయబారాలు సాగుతున్న సమయంలోనే. అక్టోబరు 2 న బొంబాయి కార్మికవర్గం యుద్ధ వ్యతిరేక రాజకీయ సమ్మె చేసింది. ఒకరోజు జరిగిన ఈ సమ్మెలో 90 వేలమంది కార్మికులు పాల్గొన్నారు. యుద్ధంలో నిమగ్నమైవున్న దేశాలలో ఎక్కడా జరగని యుద్ధ వ్యతిరేక సమ్మె మనదేశంలోనే జరిగింది. "సామ్రాజ్యవాదం నశించాలి." "భారత స్వాతంత్ర్యం చిరస్థాయి అగుగాక." "ఎర్రజెండాకు విజయం కలగాలి." అంటూ వీరు నినాదాలు చేశారు. 1939 సెప్టెంబర్‌లోనే యుద్ధ వ్యతిరేక ప్రదర్శనలను కమ్యూనిస్టులు, కాంగ్రెస్ సోషలిస్టులు ప్రారంభించారు. మద్రాసులో అలాంటి పెద్ద ప్రదర్శన జరిగింది. అక్టోబరు, నవంబరు మాసాలలో యుద్ధ వ్యతిరేక సమ్మెలు కాన్పూర్, పాట్నా, ఝరియాలలో జరిగాయి. 1939 చివరిభాగంలో 110 సమ్మెలు జరిగాయి. వీటిలో లక్ష 70 వేలమంది కార్మికులు పాల్గొన్నారు. ఇదే సమయంలో సామ్రాజ్యవాద వ్యతిరేక అతివాద శక్తులు సమీకరింపబడుతున్నాయి. కార్మిక, రైతు, విద్యార్థి సంఘాలు సామ్రాజ్యవాద వ్యతిరేక అఖిల భారత మహాసభను 1939 అక్టోబరులో నాగపూర్‌లో జరిపాయి. ఇందులో కమ్యూనిస్టు పార్టీ, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, ఫార్వర్డు బ్లాకు పాల్గొన్నాయి. బ్రిటిష్ ప్రభుత్వంతో రాజీలేని ధోరణిని ఇవి ప్రదర్శించాయి. కమ్యూనిస్టులూ, తదితర సోషలిస్టు అతివాద శక్తులూ ఈ సామ్రాజ్యవాద యుద్ధంలో పాల్గొనరాదని తీర్మానించాయి. ఈ సంఘాల ఆదేశాన్ని అనుసరించి పంజాబు, యు.పి., ఆంధ్ర, మలబార్‌లలో యుద్ధ వ్యతిరేక ప్రదర్శనలు, కార్యక్రమాలు జరిగాయి.

1940 మార్చిలో అబుల్‌కలాం ఆజాద్ అధ్యక్షతన రాంఘర్‌లో కాంగ్రెస్ సమావేశమై "బ్రిటన్ యుద్ధాన్ని ప్రధానంగా సామ్రాజ్యవాద లక్ష్యాలకోసమే చేస్తున్నది. అందుచే ప్రత్యక్షంగా కానీ, పరోక్షంగా కానీ, ఏ విధంగా కూడా ఈ పరిస్థితులలో యుద్ధంలో కాంగ్రెస్ భాగస్వామి కాజాలదు." అని తీర్మానించింది. సుభాస్ చంద్రబోస్‌పై కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ అనుమతి పొందని ఉపన్యాసాలిచ్చాడంటూ క్రమశిక్షణాచర్య తీసుకొన్నందుకు నిరసనగా బెంగాల్ రాష్ట్ర కాంగ్రెస్ రాంఘర్‌కు తమ ప్రతినిధుల్ని పంపలేదు. బోస్ అనుయాయులు "రాజీ వ్యతిరేక మహాసభ" అంటూ ఒక సభ జరిపి కాంగ్రెస్‌నూ, గాంధీని తీవ్రంగా విమర్శించారు. కాంగ్రెస్‌లోని అతివాదశక్తుల్ని కూడగట్టుతున్న కమ్యూనిస్టు పా కూడా, బోస్ నిర్వహించిన ఈ మహాసభ సామ్రాజవాద వ్యతిరేక ఉద్యమ ఐక్యతకు భంగం కల్గింతున్నదని, దానిలో పాల్గొనలేదు. రాంఘర్ కాంగ్రెసులో మరో విశేషం అబుల్‌కలాం ఆజాద్‌తో పోటీ చేసిన యం.యన్. రాయ్ ఓడిపోయాడు. ఆజాద్‌కు 1864 వోట్లు రాగా, రాయ్‌కి 183 వోట్లు మాత్రమే వచ్చాయి.

ఆగస్టులో జరిగిన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ విజ్ఞప్తి ననుసరించి గాంధీ కాంగ్రెసుకు నాయకత్వం వహించడానికి అంగీకరించాడు. రాంఘర్ కాంగ్రెస్ తీర్మానాన్ని అనుసరించి, శాసనోల్లంఘనం ప్రారంభించాల్సి వుంది. కాని గాంధీ, మూకుమ్మడి సత్యాగ్రహానికి వ్యతిరేకత చూపాడు. గాంధీ ఎన్నికచేసిన కొందరు సత్యాగ్రహులు మాత్రమే, సత్యాగ్రహం చేయాలి. బ్రిటన్ సాగిస్తున్న అన్యాయ యుద్ధంలో

భారతీయ లెవరూ పాల్గొనరాదని సత్యాగ్రహులు వీధులలో అరచేవారు. అలా నినాదాలివ్వటం రాజద్రోహమంటూ ప్రభుత్వం వారిని అరెస్టు చేసేది.

ఇలా మొట్టమొదట వ్యక్తిసత్యాగ్రహం చేసినవాడు వినోబాభావే. ఆ తర్వాత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులు నెహ్రూ, పటేల్, రాజేంద్రప్రసాద్, మొదలైనవారు అరెస్టయారు. 1941 సంవత్సరాంతానికి 25 వేలమంది జైళ్ళలో వున్నారు. 1941 మే 24 నాటికి ఒక్క యు పి.లోనే 12వేలమంది అరెస్టయారు. భారతదేశం మొత్తంమీద ఆనాటికి అరెస్టయిన 20 వేల మందిలో 398 మంది శాసనసభ్యులు 31మంది మాజీ మంత్రులు, 22 మంది కేంద్ర అసెంబ్లీ సభ్యులు వున్నారు. అరెస్టయిన వారిలో అనేకమందిని డిఫెన్సు ఆఫ్ ఇండియా రూల్సుక్రింద, ఇతర చట్టాలక్రింద, డిటెన్యూలుగాను, ఖైదీలుగాను నిర్బంధించారు. దియోలి, హిజ్లీ కాన్సెన్ట్రేషన్ క్యాంపులలో ఖైదీలను నిర్బంధించారు. ఐతే వ్యక్తి సత్యాగ్రహం దేశాన్ని అనుకొన్నంతగా ఉద్రూతలూగించలేదు. కాంగ్రెస్, ప్రభుత్వాలమధ్య ప్రతిష్టంభన అలాగేవుండిపోయింది. కాంగ్రెస్ మిత్రులుగా ఉండిన బిర్లా కుటుంబీకులు యుద్ధ కంట్రాక్టుల ద్వారా బలిసిపోయారు. పారిశ్రామిక వర్గాలలో కొంతమందిని ఇలా జోకొట్టగల్గింది ప్రభుత్వం. ఇదే సమయంలో జవహర్‌లాల్ నెహ్రూకు నాలుగేళ్ళ శిక్ష విధింపబడింది. మౌలానా అబుల్ కలాం ఆజాద్‌కు 18 నెలల శిక్ష విధింపబడింది. కాంగ్రెస్ నాయకుల అరెస్టుకు ప్రజలు తీవ్ర నిరసన తెల్పుతున్నా, దాన్ని ఒక ఉద్యమంగా మార్చాలని గాంధీ భావించలేదు. "మన చేతులు కట్టివేయబడి వున్నాయి. మన కళ్ళకు గంతలు కట్టి వున్నాయి. మన అవయవాలను కదల్చే స్థితిలో లేము. మన ముందున్న మార్గం ఏమిటో కన్పించడంలేదు." అనే అయోమయ స్థితిలో పడ్డారు కాంగ్రెస్ నాయకులు. ఈ సత్యాగ్రహం కేవలం చిహ్నప్రాయమేనని, అఖిల భారత కాంగ్రెస్ కమిటీలో 1940 సెప్టెంబరు 16 న గాంధీ చెప్పిన మాటలవల్ల స్పష్టమవుతుంది. "ఇపుడు స్వాతంత్ర్యం కోసం శాసనోల్లంఘనం సాగించటం అసంబద్ధం. తన స్వాతంత్ర్యమే మహా ప్రమాద స్థితిలో వున్న దేశంతో మన స్వాతంత్ర్యం కోసం ఏలా పోరాడగలం? ఒక దేశానికి మరో దేశం స్వాతంత్ర్యం యివ్వాలనుకొన్నా అది ఇంగ్లీషువాళ్ళకి ఇపుడు సాధ్యంకాదు. తామే ప్రమాదంలో వున్నపుడు వారు ఇతరలను రక్షించలేరు." ఈ దృష్టితో సాగించిన వ్యక్తిగత సత్యాగ్రహం బ్రిటిష్ ప్రభుత్వంపై ఎట్టి తీవ్ర ప్రభావం కల్గించలేదు. దీనికి ఉదాహరణగా బ్రిటిష్ ప్రధాని చర్చిల్ ప్రకటనల్నే తీసుకోవచ్చు. 1941 ఆగస్టులో బ్రిటిష్ ప్రధాని చర్చిల్, అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్ట్ అట్లాంటిక్ ప్రణాళికను ప్రకటించారు. ప్రతి దేశానికీ స్వాతంత్ర్యం స్వతస్సిద్ధమైన హక్కు అనీ, అన్ని పరాధీన దేశాలకూ స్వపరిపాలన ప్రసాదిస్తామనీ అన్నారు. భారతదేశానికి కూడా యీ ప్రకటన వర్తించుతుందని చాలామంది భావించారు. కాని సెప్టెంబరులో చర్చిల్ ఒక ప్రకటన చేస్తూ, హిట్లర్ చేతిలో స్వాతంత్ర్యం కోల్పోయిన దేశాలకే ఇది వర్తిస్తుంది కాని, భారతదేశానికి గానీ, బ్రిటిష్ వలసదేశాలకుగానీ ఇది వర్తించదని అన్నాడు. ఈ పరిస్థితులలో వ్యక్తిగత సత్యాగ్రహం 1941 డిసెంబరు నాటికి దాదాపు ముగిసిపోయింది.

## ముస్లిం రాజకీయాలు

1937 అక్టోబర్‌లో లక్నోలో ముస్లింలీగ్ మహాసభ జిన్నా అధ్యక్షతన జరిగింది. ప్రభుత్వంలో హిందువులకు, మహమ్మదీయులకు సమాన భాగం వుండాలని ఆ మహాసభ తీర్మానించింది. హిందువులకు 50 శాతం, ముస్లిములకు 50 శాతం చొప్పున ప్రజాప్రాతినిధ్య సంస్థల్లో సీట్లు ఉండాలని, ఈ తీర్మానం ఉద్దేశం. ముస్లిముల తరపున మాట్లాడే హక్కు ముస్లిమ్‌లీగ్‌కు ఉందనీ, అలా ప్రభుత్వం గుర్తించాలనీ కూడా ఈ మహాసభ కోరింది. ఇంతవరకూ జిన్నా రాజకీయాలకు దూరంగా వున్న పంజాబ్ ముస్లిం నాయకులు కూడా ఆయన్ని బలపర్చారు. జిన్నా విధానాలను ఇంతవరకూ వ్యతిరేకించుతూ వచ్చిన కొందరు ఉలేమాలు (మతగురువులు) కూడా ఆయన్ని బలపర్చారు. కాంగ్రెస్ జిన్నాతో సంప్రతింపులు సాగించాలని ప్రయత్నం చేసినపుడు, కాంగ్రెస్ హిందూ సంస్థ అని ప్రకటించాలనీ, తనతో రాజీ సంప్రతింపులకు వచ్చే కాంగ్రెస్ వారిలో ముస్లిములు ఎవ్వరూ ఉండరాదనీ జిన్నా పట్టుబట్టాడు. 1938 డిసెంబరులో కాంగ్రెస్ మంత్రివర్గాలకు వ్యతిరేకంగా ముస్లింల

హక్కుల కోసం ప్రత్యక్ష కార్యాచరణ సాగించాలని పాట్నాలో సమావేశమైన ముస్లింలీగ్ తీర్మానించింది. కాని ఈ తీర్మానాన్ని అమలు పర్చకముందే కాంగ్రెస్ మంత్రివర్గాలు రాజీనామా చేశాయి దీన్ని "విముక్తి దినం"గా ముస్లింలీగ్ పాటించింది.

ముస్లింలీగ్ కాంగ్రెస్ లాగా బ్రిటిష్ వ్యతిరేక స్వాతంత్ర్య ఉద్యమాలను నడిపి వుండలేదు ఐనా కాంగ్రెస్ వాదులకన్నా ముస్లింలే అతివాదులంటూ లీగ్ ప్రగల్భాలు పలకసాగింది. కాంగ్రెస్, గాంధీ రాజకీయాలతో విసుగెత్తి మౌలానా మహమ్మదలీ, హస్రత్ మొహనీలాంటివారు కాంగ్రెస్‌ను విడిచిపెట్టి వెళ్ళారని లీగ్ ప్రచారం సాగించింది. ముస్లిం యువకులు, ముస్లిం మధ్యతరగతి ప్రజలు జిన్నా రాజకీయాలవైపు కొట్టుకుపోయారు.

1940 మార్చిలో లాహోర్‌లో జరిగిన ముస్లింలీగ్ మహాసభలో పాకిస్తాన్ తీర్మానం ఆమోదించబడింది. 1930 లో కవి మహ్మద్ ఇక్బాల్ రేఖామాత్రంగా సూచించిన పాకిస్తాన్ ప్రణాళికను 1935 లో లీగ్ మొట్టమొదటి సారిగా ప్రకటించింది ఐతే దాన్ని అప్పుడెవరూ అంతగా పట్టించుకోలేదు. ఈ తీర్మానం ప్రకారం భారత దేశంలోని వాయువ్య భాగాలలోను, ఈశాన్య భాగాలలోను ముస్లిములు మెజారిటీగా వున్న రాష్ట్రాలన్నీ కలిపి పాకిస్తాన్‌గా వేరే రాజ్యంగా ఏర్పడాలి. లాహోర్ సమావేశంలో జిన్నా "భారతదేశ స్వాతంత్ర్యాన్ని నిర్ద్వంద్వంగా కోరుతున్నా" నని చెప్పినప్పటికీ రెండు జాతుల సిద్ధాంతాన్ని ప్రవేశ పెట్టాడు.

ము ం ప్రజలలో ఎక్కువ ప్రభావం కలిగించిన ఈ సి ంతాన్ని గురించి ఒక పరిష్కారానికి కాంగ్రెస్ లీగ్‌లు రేకపోయాయి. వాటి మధ్య విభేదాలు మరింత తీవ్రమయ్యాయి. బ్రిటిష్ వాళ్ళకు ఇది చాలా సంతోష కరంగా పరిణమించింది. ఇదే సమయంలో వి డి. సావర్కార్ భారతదేశం "హిందువుల దేశం"గా చిత్రిస్తూ వచ్చాడు. కాంగ్రెస్ నుంచి రాజీనామా చేసి కె. యం. మున్షీ అఖండ హిందూస్థాన్ అంటూ ఒక ఉద్యమాన్ని సాగించాడు. ఐతే అది ఎంతో కాలం నిల్వలేదు. కాంగ్రెస్ అంతదూరం పోలేదుగాని లీగ్‌తో మాత్రం ఒప్పందం చేసుకోకుండానే 1940-41 లలో ఢిల్లీ, వార్ధా, పూనా సమావేశాలలో కేంద్రంలో జాతీయ ప్రభుత్వం ఏర్పరచాలని కాంగ్రెస్ కోరుతూ వచ్చింది. ఐతే అది ఫలించలేదు. ఈలోగా బ్రిటిష్ ప్రభుత్వం మద్దతుతో జిన్నా పాకిస్తాన్ కోర్కెకు బలం చేకూరుతూ వచ్చింది.

ఈ ప్రతిష్టంభన ఇలా సాగుతున్న కాలంలోనే 1941 జూన్ 22 న, సోవియట్ యూనియన్‌పైన ఫాసిస్టు జర్మనీ దాడి చేసింది. అప్పటికే పోలెండ్, బెల్జియం, హాలెండ్, నార్వే, ఫ్రాన్సు, తూర్పు యూరప్‌లో కొన్ని భాగాల్ని జర్మనీ ఆక్రమించింది. బ్రిటన్‌పై విమానాల దాడులతో సాగించిన యుద్ధంలో విజయం సాధించక పోయినా, జర్మనీ బ్రిటన్‌కు తీవ్ర నష్టాన్ని కలుగచేసింది. 1941 డిశెంబర్‌లో పెరల్ హార్ ర్‌పై హఠాత్తుగా దాడి చేయడం ద్వారా జపాను యు ంలో ప్రవేశించింది. దీనితో మిత్ర రాజ్యాల పక్ష అమెరికా, సోవియట్ యూనియన్లు ఫాసిస్టు కూటమి వ్యతిరేక యుద్ధంలో ప్రవేశించాయి. బ్రిటన్, సోవియట్‌ల మధ్య ఒప్పందం కుదిరింది. బ్రిటన్, అమెరికా, సోవియట్ యూనియన్, చైనాలు మిత్ర రాజ్యాల కూటమిగా ఏర్పడ్డాయి. దీనితో యుద్ధ స్వభావం పూర్తిగా మారింది.

1941 డిసెంబరులో జవహర్‌లాల్ నెహ్రూ ఇలా అన్నాడు : "రష్యా, బ్రిటన్, అమెరికా, చైనాలు ప్రాతినిధ్యం వహించుతున్న ముఠా వెనుక ప్రపంచ అభ్యుదయ కాముకశక్తులు నిలబడ్డాయి "

ఈ నూతన పరిస్థితులలో బ్రిటన్ విజ్ఞత ప్రదర్శించి, భారతదేశానికి పరిపాలనాధికార మిచ్చి రాజీకి వచ్చివుండినట్లయితే, పరిస్థితి వేరుగా వుండేది. 1941 ఆగస్టులో ప్రకటించిన అట్లాం క్ ప్రణాళిక భారత దేశానికి వ ర్తించదంటూ సెప్టెంబరు 9 న బ్రిటిష్ ప్రధాని చర్చిల్ ప్రకటన భారత జాతీయ వాదులలో ఆగ్రహం రేకెత్తించింది.

1941 డిసెంబరులో ముఖ్యమైన కాంగ్రెస్ నాయకుల్ని విడుదల చేసింది ప్రభుత్వం. 1941 డిసెంబర్‌లో బార్డోలీలో కాంగ్రెస్ ఈ క్రింది తీర్మానాన్ని చేసింది. దాన్ని 1942 లో పునరుద్ఘాటించింది. "బ్రిటిష్ ప్రభుత్వంలో మార్పులేదు. ఐనా యుద్ధ పరిస్థితినీ దానివల్ల ఉత్పన్నమైన పరిణామాల్నీ, భారతదేశ ప్రాంగణంలోకి యుద్ధం విస్తరించడాన్నీ కాంగ్రెస్ తప్పకుండా పరిగణించాలి; కాంగ్రెస్ సానుభూతి దురా

క్రమణకు గురై, తమ స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న వారిపట్లనే వుంది. ఐనా, స్వతంత్ర స్వేచ్ఛా, భారతదేశం మాత్రమే జాతీయ ప్రాతిపదికపై దేశ రక్షణ కొనసాగించే స్థితిలో ఉంటుంది."

అహింసా సిద్ధాంతాన్ని దేశరక్షణ విషయంలో విడనాడటానికి సిద్ధమైనందుకు గాంధీ తన భేదాభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. కాంగ్రెసు నాయకత్వం నుంచి గాంధీ వైదొలగాడు.

1942 మార్చి నాటికి ప్రపంచయుద్ధం భారతదేశం గుమ్మంలో తొంగిచూస్తూ వుంది. ఆసియా రంగంలో ఫిలిప్పైన్సు, ఇండో-చైనా, ఇండొనీషియా, మలయా, బర్మాలు—జపాను ఆక్రమణ కిందికి వచ్చాయి. మార్చి 7 న రంగూన్ జపాన్ కైవసమైంది.

1942 ఫిబ్రవరిలో భారతదేశాన్ని సందర్శించిన చాంగ్ కై షేక్ ఇటు భారతదేశానికి, అటు బ్రిటన్‌కూ ఒకేసారి ఒక విజ్ఞప్తి చేశాడు. దురాక్రమణ దారుల పక్షానో, లేక దురాక్రమణ దారులను ప్రతిఘటించు పక్షానో తప్ప మధ్యే మార్గం లేదని భారత జాతీయ నాయకులను హెచ్చరించాడు. యుద్ధంలో పూర్తి బలంతో పాల్గొనడానికి వీలుకలిగే విధంగా భారతదేశానికి నిజమైన రాజకీయ అధికారాన్ని ఇవ్వాలని కోరాడు. ఆస్ట్రేలియా విదేశాంగ మంత్రి కూడా ఇలాంటి ప్రకటనే చేశాడు. అట్లాంటిక్ ప్రణాళిక భారతదేశానికి వర్తించదని 1941 సెప్టెంబర్‌లో బ్రిటిష్ ప్రధానిచేసిన ప్రకటనను యుక్తి యుక్తంగా సవరిస్తూ అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ 1942 ఫిబ్రవరి 24 న చేసిన ప్రకటనలో, అట్లాంటిక్ ప్రణాళిక యావత్ ప్రపంచానికీ వర్తించుతుందని అన్నాడు. వీరందరి ఒత్తిడి ఫలితంగానే 1942 మార్చి 11 న బ్రిటిష్ ప్రభుత్వం మంత్రివర్గ సభ్యుడైన సర్‌స్టాఫర్డ్ క్రిప్స్‌ను రాయబారం పంపడానికి నిర్ణయించింది. మార్చి 23 న భారతదేశం వచ్చిన క్రిప్సు మూడు వారాల పాటు భారత దేశంలో వుండి వివిధ నాయకులతో చర్చలు జరిపాడు.

## క్రిప్స్ రాయబార వైఫల్యం

సర్‌స్టాఫర్డ్ క్రిప్సు రెండు రకాల సూచనల్ని తీసుకువచ్చాడు. మొదటి సూచనలు భవిష్యత్తును గురించి వున్నాయి. అవి (అ) యుద్ధానంతరం భారత దేశానికి అధినివేశ ప్రతిపత్తి యివ్వబడుతుంది. కావాలంటే భారతదేశం బ్రిటిష్ కామన్వెల్త్‌తో తెగతెంపులు చేసుకోవచ్చు. (ఆ) రాజ్యాంగ నిర్ణయ సభను ఏర్పరచడం. 1935 భారత ప్రభుత్వ చట్టప్రకారం ప్రజలలో 11 శాతం మందికి వోటింగ్ హక్కు వుంది. వోటింగు హక్కుగల వీరు 1585 సభ్యులుగల "ఎలక్టోరల్ కాలేజి"ని ఎన్నుకొంటారు. ఈ కాలేజి పదోవంతు సభ్యులి రాజ్యాంగ నిర్ణయ సభగా ఎన్నుకొంటారు. సంస్థానాధీశులు ఎలక్టోరల్ కాలేజికి 500 మందిని తమ ప్రతినిధులుగా నామినేట్ చేస్తారు. (ఇ) రాష్ట్రంగాని, సంస్థానంగాని వేరుపడి వుండవచ్చు లేదా ప్రస్తుత స్థితిలోనే కొనసాగవచ్చు. వేరే అధినివేశ రాజ్యంగా సమాన హక్కులతో నూతన రాజ్యాంగాన్ని ఏర్పరచుకోవచ్చు. (ఈ) మైనారిటీ జాతులవారి, మతాలవారి రక్షణకు బ్రిటిష్ ప్రభుత్వం యిచ్చిన హామీలు ఉండే విధంగా బ్రిటనూ, "రాజ్యాంగ నిర్ణయ సభ" ఒడంబడిక చేసుకోవాలి.

రెండవది : యుద్ధకాలంలో భారతీయ ప్రతినిధుల సమాలోచన, సహకారాలతో బ్రిటన్ అధికారాన్ని కలిగి వుంటుంది.

క్రిప్సు విడివిడిగా ఆయా వర్గాలవారిని కలిశాడు. అందరికీ అన్ని హామీలూ యిచ్చాడు. కాంగ్రెస్ వారికి నూతనరాజ్యాంగ ప్రకారం భారతదేశం కామన్వెల్త్‌లో ఉండదలుచుకొంటే ఉండవచ్చు. లేదా విడిపోవచ్చునన్నాడు. ముస్లిం మెజారిటీ వున్న రాష్ట్రాలలో వారు స్వంత రాజ్యాంగ నిర్ణయ సభను ఎన్నుకొని, బ్రిటిష్ ప్రభుత్వంతో వేరే ఒడంబడిక చేసుకోవచ్చునని ముస్లింలీగ్‌తో చెప్పాడు. మైనారిటీ జాతులకు, మతాలవారికి న్యాయం కలిగేటట్లు చూస్తామని హామీ యిచ్చాడు. సంస్థానాధీశులకు గనుక నూతన రాజ్యాంగం ఇష్టం లేకపోతే, వారి "సంధి హక్కులు" భగ్నం కాకుండా చూస్తామని అన్నాడు.

క్రిప్స్ సూచనల్ని కాంగ్రెస్ త్రోసిపుచ్చింది. యుద్ధ కాలంలో భారతీయులకి ఎలాంటి అధికారాన్నీ యివ్వడానికి బ్రిటన్ సంసిద్ధంగా లేదని కాంగ్రెస్‌కు స్పష్టమైంది. వివిధ కారణాలతో యితర పార్టీలు కూడా క్రిప్స్ రాయబారాన్ని త్రోసిపుచ్చాయి. క్రిప్స్

"సోషలిస్టు" అనీ, నెహ్రూ "స్నేహితుడు" అనీ ఏవేవో ఆశలుపెట్టుకొన్న వారందరికీ ఆశాభంగం కలిగింది.

క్రిప్సు ప్రతిపాదనలను యథాతథంగా అంగీకరించి వుండవలసిందని రాజగోపాలాచారి అభిప్రాయపడ్డాడు. కాని గాంధీ వాటిని "దివాళా తీయబోయే బాంక్‌కు యిచ్చిన తర్వాతి తేదీ (పోస్టు డేటెడ్) చెక్" అన్నాడు. గాంధీ క్రిప్స్‌తో యింకా యిలా అన్నాడని తెలిసింది, "మీరిచ్చేది ఈ మాత్రమే ఐతే మీరెందుకు వచ్చినట్లు? భారతదేశానికి యివ్వదలచుకొన్నదంతా ఈ ప్రతిపాదన మాత్రమే అయితే, వెంటనే విమానం ఎక్కి మీరు ఇంటికి వెళ్ళడం మంచిది."

"ఆ విషయం ఆలోచిస్తా"నని మాత్రమే క్రిప్స జవాబు. బ్రిటిష్ ప్రభుత్వానికీ, జాతీయోద్యమ నాయకులకూ మధ్య ప్రతిష్టంభన తొలగించడంలో క్రిప్స రాయబారం ఆ విధంగా విఫలమైంది.

# క్విట్ ఇండియా

1942 అగస్టులో "క్విట్ ఇండియా" (భారతదేశం నుంచి బ్రిటిష్‌వాళ్ళు వైదొలగిపోవాలి) అనే ఉద్యమం ప్రారంభమైంది. ఈ ఉద్యమ కాలంలోనూ, ఆ తర్వాతా బ్రిటిష్ పరిపాలకులు ప్రచారం చేసినట్టు గాంధీ, తదితర కాంగ్రెస్ నాయకులూ ఫాసిస్టు కూటమికి అనుకూలురా? జపాను దండయాత్రను వారు ఆహ్వానించారా? లేదు.

1941 డిసెంబరు 8 న లక్నోలో పత్రికాగోష్ఠిలో జవహర్‌లాల్ అభ్యుదయ కాముక శక్తులన్నీ మిత్ర రాజ్యాల పక్షాన వున్నాయని అన్నాడు. 1941 డిసెంబర్ 31 కాంగ్రెసు వర్కింగు కమిటీ బార్డోలీలో సమావేశమై "దురాక్రమణకు గురైన, స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న ప్రజలకు తమ సానుభూతి వుంది" అని తీర్మానించింది. అస్సాం, బెంగాల్‌లలో కొన్ని ప్రాంతాల నుంచి ప్రజలను ఖాళీ చేయించేటపుడు బ్రిటిష్ ప్రభుత్వం వారికి ప్రత్యామ్నాయం చూపించలేదు. పైగా బెంగాల్‌లో కొందరి ప్రజల జీవనాధారమైన పడవలను శతృవు చేతికి చిక్కకుండా ఉండాలని చెప్పి తగులబెట్టింది. ఇలాంటి చర్యలు బ్రిటిష్ ప్రభుత్వంపై సామాన్య ప్రజలలో మరింత ద్వేషాన్ని రగిల్చాయి. తమ శత్రువు బ్రిటన్, బ్రిటన్‌కు శత్రువు జపాను తమ శత్రువుల శత్రువు మిత్రుడౌతాడని వీరికి దురభిప్రాయం ఏర్పడ్డది అందుకని కొందరు జపాను విజయాలను హర్షించ మొదలుపెట్టారు. ఈ ధోరణిని జూలై 16 న జవహర్‌లాల్ నిరసించుతూ హెచ్చరించాడు. "గత మూడు నెలలుగా మన దేశంలో జపాను అనుకూల భావాల్ని ఎదిరించుతూ వచ్చాము. నిజానికి యివి జపాను అనుకూల భావం అనడంకన్నా బ్రిటిష్ వ్యతిరేక భావం అనవచ్చు. అందుచేత జపాన్‌పై మొగ్గు చూపుతున్నారు కూడా. భారతదేశం నిస్సబ్దతలో పడరాదని మా భావం. జపాన్‌తో రాజీ అనేమాట అనూహ్యమైన విషయం."

బ్రిటిష్ వాళ్ళు వెళ్ళిపోతే జపాన్ మనజోలికి రాకపోవచ్చునన్న భావంగల గాంధీ కూడా ఆ అభిప్రాయం పొరపాటని గ్రహించాడు. ఆయన యిలా అన్నాడు. "జపాన్‌వాళ్ళను దూరంగా ఉంచాలని బ్రిటిష్‌వాళ్ళకన్నా నేను ఎక్కువ ఆసక్తిగా వున్నాను. భారతదేశ సముద్ర జలాల్లో ఓటమి బ్రిటన్‌కు కేవలం భారతదేశం మాత్రమే పోతుంది, కాని జపాన్ విజయం పొందితే భారతదేశం సర్వస్వాన్ని కోల్పోతుంది" బయటినుంచి సహాయం లభిస్తుందని కొందరిలో భ్రమలు కలిగినపుడు జవహర్‌లాల్ నెహ్రూ యిలా హెచ్చరించాడు: "బయటినుంచి వచ్చే ఏ శక్తి అయినా అది జపాన్ చేతిలో వుండే కీలుబొమ్మ శక్తి మాత్రమే" (1942 ఏప్రిల్ 12) "అక్షరాజ్యాలు (జర్మనీ, ఇటలీ, జపాను కూటమి) వొలకబోసే స్నేహపూర్వక ధోరణికి నేను ఏ మాత్రం ప్రాముఖ్యం యివ్వను. వాళ్ళు గనుక భారతదేశానికివస్తే వారు విమోచనపరులుగారారు. ఓడిపోయినవారి ఆస్తుల్ని పంచుకొనేవారుగా మాత్రమే వస్తారు" అని 1942 జూన్ 21 న గాంధీ హరిజన్ పత్రికలో స్పష్టం చేశాడు.

దేశం మనుగడకే మహా విపత్తు వచ్చింది అని కాంగ్రెస్ నాయకత్వం భావించిందికాని కమ్యూనిస్టుల లాగ ఈ నూతన పరిస్థితి మున్నెన్నడూ లేనంతగా ప్రజలకు విజయావకాశాలు కలగచేస్తుందని భావించలేదు. కమ్యూనిస్టులు ఓటమి తత్వంతో ఉండిపోలేదు. ప్రతిష్టంభన తొలగించాలంటే, జాతియైక్యతను చాటండి, దేశరక్షణకు ప్రజలను సమీకరించండి, అని వారు చెప్పారు. "ఈ యుద్ధం విజయం పొందేందుకు పోరాడటం అంటే మన దేశాన్ని రక్షించుకోడం, మన స్వాతంత్ర్యాన్ని సాధించుకోడం" అని వారు అన్నారు. మలయా మొదలైన చోట్ల బ్రిటిష్ ప్రభుత్వం పలాయనం చిత్తగించిన ధోరణి చూశాక "మన దేశ భవిష్యత్తును సామ్రాజ్యవాదుల చేతుల్లోంచి లాక్కోవాలి.........సామ్రాజ్యవాదుల నిరంకుశత్వానికి వ్యతిరేకంగా భారతీయ ఐక్యతను చాటాలి" అన్నారు.

1942 జూలైవరకు కమ్యూనిస్టుపార్టీపై నిషేధం వుంది. నిషేధంలో వుండగానే 1942 జనవరిలో ఆలిండియా స్టూడెంట్స్ ఫెడరేషన్ మహాసభ పాట్నా లో జరిగినపుడు, ఆ సభ ద్వారా కమ్యూనిస్టు పార్టీ న చెప్పిన అభిప్రాయాన్ని ప్రజల దృష్టికి తీసుకొచ్చింది. దీనినే "ప్రజాయుద్ధ" విధానంగా పేర్కొంది, దీని అర్థం యుద్ధానంతరం దానంతకదే స్వతంత్రం లభిస్తుందని, అది భావించలేదు. ఆయా దేశప్రజల స్వంత బలంపైన, వారి కృషిపైన, స్వాతంత్ర్యం ఏమేరకు లభించుతుందనేది ఆధారపడి వుంటుందని కమ్యూనిస్టుపార్టీ స్పష్టం చేసింది.

"యుద్ధాన్ని బలపరచడం అంటే, సామ్రాజ్యవాదానికి దాసోహం అంటూ సహకరించడం కాదనీ, సామ్రాజ్య వాద ప్రభుత్వానికి లొంగడం కాదనీ, ప్రజాతంత్ర హక్కులకోసం పోరాడుతూ, జాతీయ ప్రభుత్వ స్థాపనకై పోరాడటం" అనీ కూడా అది విశదీకరించింది. యుద్ధ స్వభావం మారినంత మాత్రాన ప్రభుత్వ స్వభావంగాని, ప్రభుత్వ యుద్ధ ప్రయత్న స్వభావంలో గాని మార్పు వచ్చినట్లు కాదని స్పష్టం చేసింది. "ప్రజల ప్రయోజనాలకు అనుకూలంగా వున్న చోట సహకరిస్తాం, ప్రతికూలంగా వున్నచోట ప్రతిఘటిస్తాం. ఆ విధంగా ప్రజా ప్రయోజనాల సంరక్షణకు వాటిని కార్యోన్ముఖుల్ని చేసి ముందుకు తీసుకుపోతాం" అని కమ్యూనిస్టుపార్టీ తెలియజేసింది.

అయితే ఈ దశలో కాంగ్రెస్ నాయకత్వం చొరవతీసుకోకుండా బ్రిటిష్‌వాళ్ళకే ఆ చొరవ వదలివేసింది. 1942 ఏప్రిల్ 18 న నెహ్రూ చేసిన ప్రకటనలో ఈ నిస్సహాయత కనబడుతుంది. "ఏం చేయాలో నాకు తోచడంలేదు, భారతదేశంపై శత్రువు దాడిచేస్తున్నాడనే భావంతో కృంగిపోయిన నాకు నేను నిస్సహాయుడినైనాను అనే భావం కలిగింది."

1942 మేలో అలహాబాద్‌లో జరిగిన ఆలిండియా కాంగ్రెస్‌కమిటీలో గోవిందవల్లభపంత్ అన్న మాటలు ఈ వైఖరిని మరింత స్పష్టం చేస్తాయి. "వాళ్ళు బ్రిటిష్‌వాళ్ళు, మమ్మల్ని గౌరవప్రదంగా బతకనూ బతకనివ్వడంలేదు, గౌరవప్రదంగా చావనూ చావనివ్వడంలేదు"

క్రిప్స్ రాయబార వైఫల్యంతో దేశంలో నిరాశ, క్రోధం పెల్లుబికాయి: మలయా, బర్మాలకు పట్టినగతి భారతీయులకు పట్టరాదని జాతీయ నాయకులు ఆదుర్దా పడుతున్నారు. సైనిక దురాక్రమణ వచ్చినపుడు ప్రజలు భయాందోళనకు గురిఅవుతున్నారు. ఇలాంటి స్థితినుంచి భారతీయుల్ని తప్పించాలంటే, తాము స్వతంత్ర పౌరులమనే భావన వారికి రావాలి. తమ దేశ రక్షణ తమ విద్యుక్త ధర్మమనీ, అదేదో బ్రిటిష్ వాళ్ళ వంతు అనే అభిప్రాయం పోవాలి, ఆ భావన భారతీయులకు స్వాతంత్ర్యం లభిస్తేనే కలుగుతుంది. అని గాంధీ మరికొందరు కాంగ్రెస్ నాయకులు భావించసాగారు. "బ్రిటిష్‌వాళ్ళు అధికారాన్ని అప్పగించి భారతదేశంనుంచి వైదొలగిపోవాలి" అనే ఉద్యమాన్ని ప్రారంభించాలని గాంధీ అభిప్రాయపడ్డాడు. అందుచే హరిజన పత్రికలో "క్విట్ ఇండియా" (భారతదేశంనుంచి బ్రిటిష్‌వాళ్ళు వైదొలగాలి) అనే విషయంపై గాంధీ అనేక వ్యాసాలు రాశాడు. వాటి సారాంశం ఇది :

"భారతదేశం భారత ప్రజలది, బ్రిటిష్‌వాళ్ళకు దానిపై పరిపాలించే హక్కులేదు. బ్రిటిష్‌వాళ్ళు పరిపాలిస్తున్నారు కాబట్టి జపాను భారతదేశంపై దండెత్త చూస్తోంది. బ్రిటిష్‌వాళ్ళు భారత ప్రజలకి అధికారం బదలాయిస్తే జపాను దాడి ప్రమాదం వుండదు. ఒకవేళ బ్రిటిషువాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత జపాను దాడి చేస్తే, తాము నూతనంగా సంపాదించుకున్న స్వాతంత్ర్యాన్ని రక్షించుకోడానికి భారత ప్రజలు సర్వత్యాగాలు చేయడానికి సంసిద్ధమౌతారు. జపానుతో భారత ప్రజలు సహకరించే సమస్య లేదు. దేశంనుంచి బ్రిటిషువాళ్ళు వెళ్ళకపోయినా వారిని తరిమివేయడానికి జపాను సహకారాన్ని భారత ప్రజలు కోరరు, బ్రిటిషువాళ్ళు వైదొలగిన తర్వాత నూతన జాతీయ ప్రభుత్వం బ్రిటన్, అమెరికా సైన్యాలను జపానుతో యుద్ధం కొనసాగించడానికి భారతదేశంలో ఉండనిస్తుంది. ఈ యుద్ధంలో బ్రిటన్, అమెరికా, చైనా, రష్యాలు ఓడిపోవటం భారతీయుల అభిమతం కాదు. నూతన జాతీయ ప్రభుత్వం అన్ని పార్టీల ప్రతినిధులతో కూడి వుంటుంది. అది దేశ రక్షణను, రోజువారి పరిపాలనను కొనసాగించగల స్థితిలో వుంటుంది. ఒకవేళ బ్రిటిషు ప్రభుత్వం వైదొలగిన తర్వాత అరాచకం ప్రబలినా అది బ్రిటిషు సామ్రాజ్యవాద పాలనకన్నా మంచిదే, కాని అలాంటి అరాచక ప్రమాదం లేదు."

గాంధీ ఈ వ్యాసాల ద్వారా "క్విట్ ఇండియా" ఉద్యమానికి జాభిప్రాయం సుముఖంగా వుండేలాగ చేయడానికి యత్నించాడు. 1942 జూలై 14 న కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశమై ఈ క్రింది తీర్మానం చేసింది :

బ్రిటన్ తక్షణం భారతదేశంనుంచి వైదొలగాలి. భారతదేశ ప్రయోజనాలకేకాక, ప్రపంచ శాంతి ప్రయోజనాలకు, ఫాసిజం, సామ్రాజ్యవాదం ఇతర నియంతృత్వ ధోరణులనీ జాతి వివక్షనీ కూల్చివేయడానికి ఇది అవసరం.

బ్రిటన్ లాంటి మూతవ పార్టీ దేశాన్ని ఏలుతున్నంతవరకూ హిందూ-ముస్లిం సమస్యకు పరిష్కారం వుండదు. మతసమస్యాపరిష్కారానికి ఇన్నాళ్ళూ అడ్డు వచ్చింది "విభజించి పాలించు" అనే బ్రిటిషువాళ్ళ విధానమే.

బ్రిటిషువాళ్ళు వైదొలగగానే అఖిలపక్ష ప్రతినిధులతో కూడిన జాతీయ ప్రభుత్వం ఏర్పడి, రాజ్యాంగ నియ సభను ఏర్పరచుతుంది. అది అన్ని వర్గాలకు అంగీకారయోగ్యమైన రాజ్యాంగాన్ని ఏర్పస్తుంది.

"జాతీయ ప్రభుత్వం, జపాన్‌పై యుద్ధంకొనసాగించడానికి, మిత్రరాజ్యాల సేనలను భారతదేశంలో వుంచేందుకు అంగీకరించుతుంది. అందుచే ఈ తీర్మానాన్ని అంగీకరించి బ్రిటిష్ ప్రభుత్వం, భారతదేశం నుంచి వైదొలగి, అధికారాన్ని భారతీయులకు అప్పగించాలి.

"బ్రిటన్ కనుక దేశం వదలి వెళ్ళడానికి నిరాకరించినట్లయితే, కాంగ్రెస్ శాసనోల్లంఘనం ప్రారంభించాల్సి వస్తుంది. తనకు లభ్యమయ్యే అహింసాత్మక బలాన్నంతాఉపయోగించి ప్రభుత్వంపై ఒత్తిడి తేవడానికి, స్వాతంత్ర్యం సాధించడానికి కృషి చేయాల్సివస్తుంది.

"ఈ తీర్మానం చాలా ప్రాముఖ్యమైనది. కనుక బొంబాయిలో ఆగస్టు 7న జరిగే ఆలిండియా కాంగ్రెస్ కమిటీ, దీన్ని ధృవీకరించాల్సి వుంది."

జవాబిచ్చేందుకు బ్రిటిషు ప్రభుత్వానికి 24 రోజులు వ్యవధి ఇచ్చింది కాంగ్రెస్. జూలై 15న విదేశీ పత్రికలవారితో మాట్లాడుతూ మహాత్మాగాంధీ "ఉద్యమం ప్రారంభించాల్సివస్తే, అది అహింసాయుతంగా వుంటుంది" అన్నాడు. అదివరలో ఈ సమస్య పరిష్కారానికి రూజ్‌వెల్టు సహాయం కోరాడు గాంధీ. చాంగ్-కై-షేక్ కూడా జూలై 25న రూజ్‌వెల్టు జోక్యం చేసుకొని, కాంగ్రెస్ ఉద్యమాన్ని ఆరంభించాల్సిన అవసరం లేకుండా చూడాలని, ఆయనకి ఒక ఉత్తరం రాశాడు. రూజ్‌వెల్టు ఆ ఉత్తరాన్ని బ్రిటిష్ ప్రధాని చర్చిల్‌కి పంపాడు. కాని చర్చిల్ రాజీకి సిద్ధంగా లేడు.

"బ్రిటిష్ సామ్రాజ్యాన్ని రద్దుచేసే సమావేశానికి అధ్యక్షత వహించడానికి నేను ప్రధాన మంత్రిని కాలేదు" అని చర్చిల్ భీష్మించాడు.

కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తీర్మానాన్ని వేర్వేరు దృక్కోణాలనుంచి ముస్లింలీగ్, హిందూ మహాసభలు వ్యతిరేకించాయి. లిబరల్ పార్టీ నాయకులు కాంగ్రెస్‌ను ఉద్యమం ప్రారంభించ వద్దని కోరారు.

కాంగ్రెస్, లీగ్, ఇతర రాజకీయ పక్షాలు అన్నీ ఐక్య సంఘటనగా ఏర్పడి ఫాసిజాన్ని ప్రతిఘటించడానికి ఐక్య వేదిక ఏర్పరచాలనీ, అలాంటి సంఘటన దారా జాతీయ ప్రభుత్వానికై ఒత్తిడి చేయాలనీ, ఒకక్క రాజకీయ హక్కుకోసం ఒత్తిడి చేస్తూనే రోప్రక్క యుద్ధ ప్రయత్నాలకు సహాయ పడుతూ జాతీయ ఉద్యమ నాయకత్వాన అనధికార ప్రజా సమీకరణచేసి ఫాసిజానికి జాతీయ ప్రతిఘటనను ఇనుమడింప చేయాలనీ, మొదటినుంచీ కమ్యూనిస్టుపార్టీ చెబుతూ వచ్చింది. ఈ స్థితిలో సహాయ నిరాకరణ విధానాన్ని గట్టిగా తిరస్కరించాలని కోరింది.

ఐతే జాతీయ ప్రభుత్వం ఏర్పరచాలనే కోర్కెను బ్రిటన్ తిరస్కరించడం వల్లనూ, తద్వారా జాతీయవాదులతో ఏర్పడ్డ తీవ్ర విద్వేషం వల్లనూ, కమ్యూనిస్టుపార్టీ సూచించిన ఈ విధానానికి జాతీయవాదులలో అధిక భాగం ఆమోదం తెల్పలేక పోయారు.

బొంబాయిలో ఆలిండియా కాంగ్రెస్ కమిటీ రెండు రోజులు సమావేశ మయింది. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ చేసిన తీర్మానాన్ని, ఆగస్టు 8 న ఆలిండియా కాంగ్రెస్ కమిటీ ఆమోదించింది. తీర్మానం ప్రధాన భాగంలో ఫాసిజానికి వ్యతిరేకతను, మిత్రరాజ్యాలపట్ల సానుభూతినీ, జపాను దురాక్రమణ దారులకు వ్యతిరేకంగా ఒక ప్రక్క సైనికుల సాయుధ ప్రతిఘటన, ప్రజల తరపున అహింసాయుత ప్రతిఘటనను సాగిస్తామని స్పష్టం చేసింది. కార్యాచరణకు సంబంధించిన భాగంలో ఆ తీర్మానం ఇలావుంది.

"ఈ దేశంలో బ్రిటిష్ పరిపాలన అంతం కావటం ప్రధాన, తక్షణ సమస్య. యుద్ధ భవిష్యత్తూ, స్వాతంత్ర్య ప్రజాస్వామ్యాల విజయమూ దీని పైనే ఆధారపడి వున్నాయి. స్వతంత్ర భారత దేశం తన గొప్ప వనరులను స్వాతంత్ర్య పోరాటంలో నాజిజం, ఫాసిజం, సామ్రాజ్యవాదుల దురాక్రమణకు వ్యతి

రేకించే పోరాటంలో ధారవోసి ఈవిజయాన్ని సాధించ గలదు." అందుకోసం అహింసాయుత పద్ధతులపై సాధ్యమైనంత విస్తృత స్థాయిలో ప్రజా పోరాటాన్ని సాగించాలనీ, గత 22 ఏళ్ళ శాంతియుత పోరాటం ద్వారా చేకూర్చుకున్న అహింసాయుత బలాన్నంతా ఉపయోగించాలని తీర్మానం స్పష్టం చేసింది.

## గాంధీ ఉపన్యాసం

1942 ఆగస్టు 8 న రాత్రి కాంగ్రెస్ ప్రతినిధులను ఉద్దేశించి గాంధీ ఇలా ఉపన్యసించాడు.

"అందుచేత నేను తక్షణం, పీ లెతే తెల్లవారకముందే ఈ రాత్రే, స్వాతంత్ర్యం కావాలని కోరుతున్నాను. మంత్రివర్గాలకోసం వైస్రాయితో మంతనాలాడబోవటం లేదని నేను మీకు హామీ ఇస్తున్నాను. సంపూర్ణ స్వాతంత్ర్యానికి మినహా మిగతాది ఏదీ నన్ను సంతృప్తి పరచదు. ఇదిగో ఒక మంత్రం చెబుతున్నాను. మీ హృదయాలపై దాన్ని ముద్రించండి. మీ ఉచ్ఛ్వాస నిశ్వాసల్లో దాన్ని ప్రతిబింబించనీయండి. అది; "విజయమో వీర మరణమో" (Do or Die) దీన్నే హిందీలో "కరో యా మరో" అన్నారు. మనం భారతదేశాన్ని స్వతంత్రమైనా చేస్తాం లేదా ఆ ప్రయత్నంలో మరణిస్తాం. అంతేకాని మన బానిసత్వం స్థిరీభూతమై వుండటానికి మనం బ్రతకబోవటం లేదు...."

గాంధీ ఉద్దేశంలో వెంటనే ఉద్యమం ప్రారంభించాలని లేదు. ఉద్యమం ప్రారంభించే ముందు వైస్రాయిని కలుసుకొని చర్చించాలని గాంధీ ఆశించాడు కనీసం కొన్ని వారాలైనా వ్యవధి వుంటుందని భావించాడు. అందుచేతనే కాంగ్రెస్‌చే ఉద్యమాన్ని నడపటానికి సర్వాధికారాలు పొందిన గాంధీ, పోరాటానికి ఆదేశ సూత్రాలు ఏవీ ఇవ్వలేదు. వైస్రాయితో సంభాషణలకు కనీసం రెండు మూడు వారాలైనా వ్యవధి ఉంటుందని గాంధీ ఆశించాడు. ఈలోగా కార్యకర్తలు ఏం చేయాలి. "రాట్నం వుండనేవుంది అంతకన్నా మరో ముఖ్య విషయం వుంది," అని గాంధీ అన్నాడు— "ఈ క్షణంనుంచి ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడూ స్వతంత్రులుగా భావించాలి. ఇక ఏ మాత్రం సామ్రాజ్యవాద పాదం క్రింద నలిగిపోతున్నట్లు భావించక స్వతంత్రులమని భావించాలి" అన్నాడు

ఆలిండియా కాంగ్రెస్ కమిటీ సమావేశంపూర్తి కాగానే గాంధీ వైస్రాయికి ఉత్తరం రాయడం ప్రారంభించాడు. కాని ఆ ఉత్తరం పూర్తి కాకముందే గాంధీని అరెస్టు చేసింది ప్రభుత్వం.

ఆగస్టు 9 తెల్లవారక మునుపే కాంగ్రెస్ ముఖ్య నాయకులంతా అరెస్టయారు. బొంబాయిలో 148 మంది అరెస్టయారు. గాంధీ, నెహ్రూ, ఆజాద్, పటేల్, కృపలానీ, రాజేంద్రప్రసాద్ మొదలైన వారినందర్నీ అరెస్టు చేసింది ప్రభుత్వం. గాంధీని పూనాలో ఆగాఖాన్ భవనంలో నిర్బంధించి వుంచింది. మిగతా వారిని అహ్మద్ నగరంలో నిర్బంధించింది. కాంగ్రెస్ సంస్థను నిషేధించింది – బహిరంగ సభలపై నిషేధం విధించింది. ప్రజలకు నాయకత్వం లేకుండా చేయటం ద్వారాఉద్యమాన్ని మొగ్గలోనే తుంచి వేయాలని చూచింది.

ఉద్యమం ఒకవేళ ప్రారంభిస్తే ఒక వారంలోనే విజయం సాధిస్తుందని వల్లభాయ్ పటేల్ అంచనా వేశాడు. శత్రువు తమకు వ్యవధి ఇస్తాడనీ, విజయం ఇంత తేలికగా లభిస్తుందని కాంగ్రెస్ నాయకులు వేసిన అంచనాలు పూర్తిగా తప్పయ్యాయి. నాయకత్వం లేకుండానే, ఎక్కడికక్కడ ఉద్యమం ప్రారంభమైంది. సాధికారంగా కాంగ్రెస్ ఉద్యమాన్ని ప్రారంభించలేదనే విషయాన్ని తర్వాతి ఘటనలు రుజువు చేశాయి జూలై 15 న గాంధీ వైస్రాయికి రాసిన లేఖలో ఒక సర్క్యులర్‌లోని భాగాలను ఇలా ఉల్లేఖించాడు.

"మహాత్మా గాంధీ నిర్ణయించే దాకా ఉద్యమాన్నికానీ మరేదైనా కార్యాచరణ కానీ ప్రారంభించరాదు. బహుశా అందుకు విరుద్ధంగా ఆయన నిర్ణయించవచ్చు. అందుచేత (అలా ప్రారంభించితే) అనవసరమైన పొరపాటుకు మీరు బాధ్యులవుతారు సంసిద్ధంగా వుండండి. తక్షణం సంఘటితం కండి. జాగరూకులై వుండండి. కాని ఆచరణకు మాత్రం దిగకండి."

1945 సెప్టెంబర్ 21 న కాంగ్రెస్ తరపున అధికారయుతంగా నెహ్రూ, పటేల్, పంత్‌లు సంతకం చేసిన ఒక ప్రకటనలో ఇలా స్పష్టం చేశారు.

"ఎ. ఐ. సి. సి. గాని, గాంధీజీ కానీ అధికారయుతంగా ఎట్టి ఉద్యమాన్ని ప్రారంభించలేదు."

## క్విట్ ఇండియా ఉద్యమం

"క్విట్ ఇండియా" ఉద్యమ తీర్మానాన్నీ, నాయకుల అరెస్టు వార్తనూ ఆగస్టు 9న ప్రజలు తెలుసుకొన్నారు. ఈ హఠాత్పరిణామానికి ప్రజలు విస్మయం చెందారు. వారి క్రోధావేశాలు ఒక్కుమ్మడిని పెల్లుబికాయి. పట్టణాల్లో హర్తాళ్ళు జరిగాయి. నిరసన ప్రదర్శనలు, ఊరేగింపులు జరిగాయి. నాయకుల్ని విడుదల చేయాలంటూ నినాదాలు అంతటా దిక్కుల్ని పిక్కటిల్లచేశాయి. ఒక్క ఢిల్లీలోనే ఆగస్టు 11, 12 తేదీల్లో పోలీసులు నిరాయుధ ప్రజలపై కాల్పులు సాగించారు. 47 సార్లు కాల్పులు జరిగాయి. 76మంది చనిపోయారు. 114 మంది గాయపడ్డారు. ఇలాగే ప్రతిచోటా ప్రజలకు ఎలా పోరాటం సాగించాలో చెప్పే నాథుడు లేడు. చాలా మంది నాయకులు జైళ్ళలో వున్నారు. మరి కొందరు రహస్య జీవితం గడుప నారంభించారు. వ్యక్తులు కొన్ని ముఠాలు ఈ పరిస్థితిని తమ కిష్టం వచ్చిన రీతిలో మలచుకో సాగారు. తమ కేది మంచిదను కొంటే అది చేయసాగారు. ప్రభుత్వ ఆర్డినెన్సు రాజ్యం ప్రజల్ని రెచ్చగొట్టింది. వ్యక్తిగత శాసనధిక్కారం, ఉద్యమ రూపం దాల్చింది. ఉద్యమం త్వరలోనే తిరుగుబాటుగా మారింది. బ్రిటిష్ అధికారానికి చిహ్నాలైన పోలీసు స్టేషన్సు, పోస్టాఫీసులు, రైల్వే స్టేషన్సు తగులబెట్టారు ప్రజలు. కొన్ని చోట్ల విద్రోహచర్యలు కొనసాగాయి. టెలిఫోను తీగెలు తెంచివేశారు. కొన్ని చోట్ల రైలు పట్టాలను తొలగించారు. రైలు బండ్లను పడగొట్టడానికి ప్రయత్నాలు జరిగాయి లాఠీ ఛార్జీలు, కాల్పులకు నిరసనగా పలుచోట్ల ప్రజలు హింసాయుత తి ఘటన సాగించారు. ప్రభుత్వ భవనాలు, రైల్వే షన్లు, రైలు పెట్టెలను తగల బెట్టడమే కాకుండా, నిక వాహనాలను కూడా తగలబెట్టారు. ఈవిషయంలో మద్రాసు, బెంగాల్ రాష్ట్రాలలో ఎక్కువ నష్టం వాటిల్లింది. కొన్నిచోట్ల పట్టణాల్లో, నగరాలో గ్రామాల్లో ప్రజలదే తాత్కాలిక రాజ్యమైంది. ఉత్తర ప్రదేశ్, బీహార్, ఒరిస్సా, పశ్చిమబెంగాలు, మహారాష్ట్ర, ఆంధ్ర, తమిళనాడులలో కొన్నిచోట్ల బ్రిటిష్ భుత్వమే అంతరించింది. కొన్నిచోట్ల పోటీప్రభుత్వాలు ఏర్పడ్డాయి.

"1857 తిరుగుబాటు తర్వాత మొట్టమొదటిసారిగా భారతదేశంలోని బ్రిటిష్ పరిపాలనా నిర్మాణాన్ని తమ బలంతో (ఆయుధాలు లేని బలంతో) ప్రజలు సవాలు చేశారు." అని నెహ్రూ ఈ ఉద్యమం గురించి వ్యాఖ్యానించాడు.

బ్రిటిష్ ప్రభుత్వం ఈ ఉద్యమాన్ని అణచడానికి తన యావత్ యంత్రాంగాన్నీ ఉపయోగించింది. 1942 సెప్టెంబరు 10 న చర్చిల్ ఇలా అన్నాడు: "ప్రభుత్వం తన బలమంతా ఉపయోగించి అల్లకల్లోలాన్ని అణచివేసింది. భారతదేశానికి అదనపు సేనలు వెళ్ళాయి. భారతదేశ విస్తీర్ణం జనాభాతో పోల్చితే చాలా తక్కువగా కనపడినా అక్కడ ఇప్పుడున్న తెల్లసైనికులు బ్రిటిష్ హయాంలో మున్నెన్నడూ లేరు."

ఫాసిజాన్ని ప్రతిఘటించడంలో ఇతర దేశాల్లో అసమర్థత చూపించిన బ్రిటిష్ ప్రభుత్వం భారత పౌరరక్షణ, ఆర్థిక సంక్షేమాన్ని సమకూర్చలేని బ్రిటిష్ ప్రభుత్వం భారత ప్రజలపై ఆకస్మికంగా అత్యంత క్రూరంగా విరుచుకుపడింది. ఫాసిజంతో పోరాడుతామని కాంగ్రెస్ చేసిన ప్రకటన మిత్రరాజ్యాల, మిత్రరాజ్య ప్రజల చెవిని పడరాదని, ఆ విధంగా కాంగ్రెస్‌పట్ల సానుభూతి పెరగరాదని అది భావించింది. స్వతంత్ర భారత ఫెడరల్ రాజ్యాంగంలో రాష్ట్రాలకు పరిశిష్ట అధికారాలు (Residuary Powers) ఉంటాయని మౌలానా ఆజాద్ చేసిన ప్రకటన ఎక్కడ కాంగ్రెస్–లీగ్‌ల మధ్య ఐక్యతకు దారితీస్తుందోనని ప్రభుత్వం గాభరాపడింది. అందుచేతనే బ్రిటిష్ పరిపాలనా చరిత్రలో మున్నెన్నడూ లేనంతగా నిర్బంధ విధానాన్ని అవలంబించింది.

పోలీసుల కాల్పులవల్ల, సైనికుల కాల్పులవల్ల వేలాది ప్రజలు చనిపోయారని అనధికారుల అంచనా. ప్రజల్ని విచక్షణా రహితంగా అవమాన పరచారు. నగ్నశరీరాలపై కొరడాలతో బాదారు. ఒక మతం వారిపైననే ప్రత్యేకించి సాముదాయక జరిమానాలు విధించారు. ఒక మతంవారి ఇళ్ళను లూటీ చేయాల్సిందిగా మరో మతంవారిని ప్రోత్సహించారు. బీహార్‌లోని పాట్నా, భగల్పూర్, మాంఘీర్ పట్టణాలపైన, బెంగాల్‌లోని నాడియాపైన, తాల్చార్ పట్టణంపైన

విమానాలనుంచి మెషిన్‌గన్లతో కాల్పులు సాగించారు. ఇంకా చీమూర్, మిద్నపూర్, నందూర్‌బార్, పూనా, అల్హాబాద్‌లలో విమానాలనుంచి బాంబులు వేయటం, మెషిన్‌గన్లతో కాల్పులు సాగించటం జరిగింది. కొన్ని చోట్ల ఈ ఉద్యమంలో చాటుగా చొరబడిన ఫాసిస్టుల ఏజెంట్లు అక్కడక్కడ కొన్ని విధ్వంసక చర్యలుచేసి వుండవచ్చు. కాని ఎక్కువభాగం అనుకోకుండా హఠాత్తుగా తమంతకుతామే ప్రజలు తిరగబడి విధ్వంసక చర్యలు కొనసాగించారు. అనేకచోట్ల రైతులు పన్నులు చెల్లించలేదు. బాలియాను స్థానిక నాయకులు స్వాధీనపరచుకొన్నారు. సైనిక దళాలు వచ్చి వారిని తరుమగొట్టాయి. సుతహత, సతారా, కర్నాటకలలో రైతులు రహస్య గెరిల్లా ప్రతిఘటన సాగించింది. సంస్థానాలకు కూడా క్విట్ఇండియా ఉద్యమం వ్యాపించింది. మొత్తం దేశందేశమే పోలీసు రాజ్యంగా మారిపోయింది.

కొన్ని రాష్ట్రాలలో ఈ ఉద్యమం ఎంతటి దారుణ నిర్బంధ చర్యలకు లోనయిందో తెలిసికోడం అవసరం.

మహారాష్ట్రలో పూనా, షోలాపూర్, నాసిక్, అహ్మద్‌నగర్, సతారాలలో ఉద్యమం తీవ్రంగా సాగింది. పూనా చాలా రోజులు దాదాపు సైనికుల చేతి లోనే వుండనవచ్చు. సతారా ప్రజలపై అమానుష కృత్యాలు సాగించారు పోలీసులు, సైనికులు. పోలీసు కాల్పులలో 13 గురు మరణించగా 2 వేల మంది అరెస్టయారు, వీరిలో ఆరుగురు జైళ్ళలో మర ణించారు. కధియవాడిలో నల్గురు వృద్ధులను కూర్చో బెట్టి వాళ్ళనెత్తిన రాతిబండలనుపెట్టి, వాటిపై కుర్ర వాళ్ళను కూర్చోబెట్టారు. జైళ్ళలో ఖైదీలను పశువు ల్లాగ బాదేవారు. తోలుబెల్టులను ఉప్పునీటిలో నానబెట్టి వాటితో బాదేవారు. ఆ దెబ్బలకి గాయాలైతే, వాటికి ఉప్పుతగిలి పుండుకు కారంరాచినట్లయేది.

బీహార్‌లో ఆగస్టు 11 న రాష్ట్రమంతటా హర్తాళ్ళు జరిగాయి. అనేకసార్లు లాఠీచార్జి చేసినా లెక్కచేయ కుండా విద్యార్థులు పాట్నా సచివాలయంపై జాతీయ జండాను ఎగురవేయ గల్గారు. రెండు గంటలసేపు విద్యార్థులు హోరాహోరీ పోలీసులతో పోరాడి జండాను ప్రతిష్ఠాపించారు. పోలీసులు 14 రౌండ్లు కాల్చగా ఏడుగురు విద్యార్థులు మరణించారు. అనేక మంది గాయపడ్డారు. బీహారులో పోలీసు, సైనిక దురంతాలు చెప్పనలవికాదు. అనేకచోట్ల మెషిన్ గన్లతో కాల్పులు సాగించారు. అనేక జిల్లాలు దాదాపు సైనిక పాలనకింద వున్నాయి. చాలాచోట్ల స్త్రీల నగల్ని దోచుకున్నారు సామాన్లతో పాటుగా ఇళ్ళను తగుల బెట్టారు. భగల్పూర్ జిల్లాలో ఇళ్ళను తగులబెట్టి ఆస్తుల్ని దోచుకొన్నారు. ఒకచోట సైనికులు ఒకర్ని పట్టుకొని అనేకచోట్ల కత్తితో పొడిచి చంపివేశారు. మరోచోట ఒక వ్యక్తిని నగ్నంగా పడుకోబెట్టి పేము బెత్తంతో దెబ్బలు కొట్టారు. అనధికారుల అంచనాల ప్రకారం ఈ జిల్లాలో 218 మంది కాల్పుల్లో మర ణించారు. 280 మంది వివిధ రకాల బాధలకు లోనయ్యారు. మహేంద్రచౌదరి అనే ఆయన్ని ఉరి తీసింది.

ఉత్తర ప్రదేశ్‌లోని బాలియా, అజాంఘర్, ఘాజీ పూర్, బస్తి, మిర్జాపూర్, ఫైజాబాద్, సుల్తాన్‌పూర్, వారణాసి, జౌన్‌పూర్, గోరఖ్‌పూర్ జిల్లాలలో ఉద్యమం అత్యంత తీవ్రస్థాయికి చేరింది. సైనికులు ఉత్తర ప్రదేశ్‌లోని తూర్పు జిల్లాలలో గ్రామాలకు గ్రామాలు లూటీ చేసి తగులబెట్టారు. జవహర్‌లాల్ నెహ్రూ ఈ విషయమై ఇలా రాశారు :

సైన్యాలు వచ్చాయి. విమానాలు వచ్చాయి, గ్రామాలను నేల మట్టం చేశాయి. (బ్రిటిష్ వాళ్ళకు వ్యతిరేకంగా) అలాంటి సాహసాన్ని ప్రదర్శించిన గ్రామాలు అసలు అక్కడవున్న గుర్తు కూడా లేకుండా చేసేందుకు ఆ గ్రామాల్నంతా దున్ని పారేశారు."

ఘాజీపూర్‌లో మగవాళ్ళందర్నీ రోడ్డుపైన కూర్చో బెట్టారు; ఆడవాళ్ళను బయటికి రమ్మని పిలిచి, వారి ఆభర ణాలన్నిటి దోచుకొన్నారు. ఇళ్ళల్లోని నగదూ, నగలూ దోచుకొన్నారు. తర్వాత మగవాళ్ళు వున్న చోటికి వచ్చి వాళ్ల బట్టలూడదీయించి కప్పల్లాగ నాల్గు కాళ్ళపై పాకేలా చేశారు. సుఖ్‌పురాలో ఒక మఠాన్ని దోచుకోడమేకాక, ఆ మఠానికి చెందిన ఏనుగునీ, ఎద్దునీ కూడా కాల్చి చంపారు. కాన్పూరులో విచ్చల విడిగా వర్తకుల్ని దోచుకున్నారు. అనేక జిల్లాల్లో సాముదాయక జరిమానాలు విధించి డబ్బు గుంజారు.

బెంగాల్‌లో మొత్తంగా గ్రామాన్ని సైనికులు నేల మట్టం చేశారు. ఇంటిలోని సామాన్లను లూటీ చేయ డానికి ఒక మతం వారిని ప్రోత్సహించారు.

ఆంధ్రలో కాంగ్రెస్ నాయకుల అరెస్టుకు నిరసనగా వరుసగా మూడురోజులు అన్ని పట్టణాల్లోను పెద్ద పెద్ద గ్రామాలలోను హర్తాళ్లు జరిగాయి. ఊరేగింపులు జరిగాయి. పోలీసులు లాఠీ చార్జీలు కాల్పులు సాగించారు. ఆంధ్ర సర్క్యులర్ లేక కర్నూల్ సర్క్యులర్ అనబడే ఒక సర్క్యులర్, ఆలిండియా కాంగ్రెస్ కమిటీ ఆగస్టు 8 వ క్విట్ ఇండియా తీర్మానం చేయకముందే జారీ చేయబడింది. దాని ప్రకారం ఆరు దశలలో ఉద్యమం కొనసాగించాలని సూచన లివ్వబడ్డాయి. ఐదవ దశలో, రైల్వే కంపార్టుమెంట్లలో అలారం గొలుసులు లాగాలనీ, రైలు బండ్లను ఆపాలనీ, టిక్కెట్లు లేకుండా ప్రయాణంచేయాలనీ సూచన వుంది. మొదటి నాల్గు దశలు అమలుపరచినా లేకపోయినా దీన్ని మాత్రం చాలాచోట్ల ముందుగానే అమలు పరచడానికి ప్రయత్నం జరిగింది.

ఆగస్టు 12 న తెనాలిలో రైల్వే స్టేషన్‌పై దాడి జరిపి బోగీలను, స్టేషన్‌లోని కొన్ని ఆఫీసుల్ని తగలబెట్టడంతో ఆంధ్రలో ఉద్యమం తీవ్రస్థాయికి చేరింది. ఈ ఉదాహరణనే తీసుకొని దేశంలో పలుచోట్ల ఇలాంటి సంఘటనలు జరిగాయి. గుంటూరులో కాల్పులు జరిగాయి. భీమవరంలో కోర్టులను ప్రజలు ముట్టడించారు రెవిన్యూ డివిజనల్ ఆఫీసును ముట్టడించి, ఆ ఆఫీసరు కాంగ్రెస్ జెండా పుచ్చుకొని నడిచేలాచేశారు. పోలీసుస్టేషన్ సమీపించిన ప్రజలపై కాల్పులు జరిగాయి. ఇలా ప్రారంభమైన ఈ ఉద్యమం హైదరాబాద్ సంస్థానంలో కూడా ఇదే సమయాన కొనసాగింది. [తెలుగు నాట జరిగిన ఉద్యమ చరిత్రను రాష్ట్రీ స్వాతంత్ర్య ఉద్యమ చరిత్ర భాగంలో వివరంగా ఇచ్చాం, చదవండి ]

అనంతపూర్, కడప, పశ్చిమ గోదావరి, గుంటూరు, కృష్ణా, కర్నూల్, నెల్లూరులలో సాముదాయిక జరిమానాలు విధింపబడ్డాయి అలా సాముదాయిక జరిమానా పొందిన జిల్లాల్లో గుంటూరు జిల్లా అగ్రస్థానం పొందింది.

దేశం మొత్తంమీద క్విట్ ఇండియా ఉద్యమంలో జరిగిన హింసాకాండ గురించి, అరెస్టులు, కాల్పులు గురించి ప్రభుత్వం ఇచ్చిన లెక్కలు సమగ్రంగాలేవు. ఐనప్పటికీ అది ప్రకటించిన లెక్కల ప్రకారమే 1942 సంవత్సరాంతానికి 60,229 మంది అరెస్టయారు. 18 వేల మంది, డిఫెన్సు ఆఫ్ ఇండియా రూల్సు క్రింద డిటైన్ చేయబడ్డారు, పోలీసులు, సైనికుల చేతిలో కాల్పులకు గురై మరణించిన వారి సంఖ్య 940; ఇదే సందర్భంలో గాయపడిన వారి సంఖ్య 1630.

కాని ఈ లెక్కలు వాస్తవాన్ని చిత్రించవు. పోలీసు, సైనికుల కాల్పుల్లో కనీసం 10 వేల మందైనా చనిపోయి వుంటారని అనేకమంది చరిత్రకారుల అంచనా.

సైన్యాన్ని 60 చోట్లకు రప్పించామనీ, 538 సార్లు కాల్పులు సాగించామనీ, 300 చోట్ల విమాన దాడులు జరిగాయనీ ప్రభుత్వం ప్రకటించింది. అలాగే 250 రైల్వే స్టేషన్లకు, 500 పోస్టాఫీసులకూ నష్టం జరిగిందనీ – ఇందులో 50 పోస్టాఫీసులు తగులబెట్ట బడ్డాయనీ ప్రభుత్వం ప్రకటించింది. బీహారు, యు. పి. లలో రైల్వే రహదారులు అనేక వారాల దాకా ప్రయాణానికి పనికిరాకుండా పోయాయి. 50 మంది పోలీసులు, మరికొందరు అధికారులు చనిపోయారు.

క్విట్ ఇండియా ఉద్యమాన్ని ప్రభుత్వం దాదాపు రెండునెలల్లోనే అణచివేయగల్గింది. చర్చిల్ ఈసందర్భంగా ఇలా ప్రగల్భాలు కూడా పలికాడు. 1857 సిపాయి తిరుగుబాటు తర్వాత అత్యంత తీవ్రమైన తిరుగుబాటుగా ఒకప్పుడు భావించబడిన ఈ ఉద్యమం దాదాపు ఎట్టి ప్రాణనష్టం లేకుండానే అణగారిపోయింది."

కాంగ్రెస్ నాయకత్వం లేని సమయంలో కాంగ్రెస్ నాయకుల అనుమతిగాని, సూచనలుగాని లేకుండానే "ఆగస్టు పోరాటం" రహస్యంగా కొనసాగించాలని కొందరు భావించారు. వారిలో సోషలిస్టులు ముఖ్యులు. జయప్రకాశ్‌నారాయణ్, రామమనోహరలోహియా, అరుణ అసఫాలీ వీరిలో ప్రసిద్ధులు. కొన్నిచోట్ల ఇంకా అక్కడక్కడ మిగిలిన విప్లవవాదులు కూడా రహస్య ఉద్యమాన్ని కొనసాగించారు. క్విట్ ఇండియా ఉద్యమకాలంలో సోషలిస్టులు, గాంధీ అహింసా సిద్ధాంతానికి కట్టుబడి వుండలేదు. బలప్రయోగానికి సిద్ధపడ్డారు. 1942 నవంబర్ 9 న హజారీబాగ్ జైలునుంచి జయప్రకాశ్ తప్పించుకు పోయాడు. బొంబాయి, మద్రాసు, కలకత్తా మొదలైనచోట్ల రహస్య కార్యకలాపాలు సాగించాడు.

నేపాల్‌ను కేంద్రంగా చేసుకుని గెరిల్లా దళాలు తయారుచేసి, విధ్వంసక కార్యక్రమాలకు పూను కున్నాడు. 1943 మే లో తిరిగి అరెస్టయిన జయ ప్రకాశ్‌ను, కొందరు జైలుపై దాడిచేసి విడుదల చేశారు. కాని 1943 డిసెంబర్ 18 న ఆయన తిరిగి అరెస్టయాడు.

క్విట్ ఇండియా ఉద్యమ ఉధృతి కాంగ్రెస్‌వారికి సంబంధించినంతవరకు రెండు నెలల్లోనే అణగి పోయినా, కొన్ని రాష్ట్రాలలో పోటీ ప్రభుత్వాలు ఏర్పాటు చేసిన ప్రాంతాల్లో దాదాపు రెండు మూడేళ్ళు చెదురుమదురుగా కొనసాగుతూనే వచ్చింది.

క్విట్ ఇండియా ఉద్యమం గతంలో జరిగిన కాంగ్రెస్ ఉద్యమాల లాంటిది కాదు. అహింసతో ముడిపెట్టకుండా ఉద్యమాన్ని సాగించిన ఫార్వర్డుబ్లాకు, సోషలిస్టు పార్టీ, విప్లవవాదులు తదితరులు దీనిలో ఉన్నారు.

"సేనానాయకుడు లేని సేనల పోరాటం 1942 నాటి గొప్ప తిరుగుబాటు. సేనాని తికమక పడ్డాడు. కాని సైనికులు తమ పటిమను ప్రదర్శించి దేశస్వాతంత్ర్య లక్ష్యంకోసం తమ ప్రాణాలొడ్డి అమరవీరులయ్యారు" అని డా॥ మజుందార్ ఈ ఉద్యమాన్ని వర్ణించాడు. నాయకత్వం లేకుండానే, సరైన నిర్మాణం లేకుండానే గాంధీగారి మాటల్లో "ప్రజలకు పిచ్చెత్తించేందుకు దారితీసిన ప్రభుత్వ హింసాకాండ"కు వీరోచితంగా జవాబు చెప్పారు.

గాంధీ అహింసాయుత వాతావరణంలో పుట్టి పెరిగిన జాతీయోద్యమ కార్యకర్తలు, స్వాతంత్ర్యం కోసం సాయుధపోరాటానికైనా సంసిద్ధమయ్యారని, "క్విట్ ఇండియా ఉద్యమం" లేక "ఆగష్టు విప్లవం" రుజువు చేసింది.

# సుభాష్‌చంద్రబోస్ నాయకత్వాన భారతజాతీయ సైన్యం

ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభం కాగానే సుభాష్ చంద్రబోస్ దేశమంతటా పర్యటించి బ్రిటిష్ ప్రభుత్వ వ్యతిరేక ప్రచారం సాగిస్తూ ఉపన్యాసాలిచ్చాడు. భారత రక్షణ చట్టం క్రింద సుభాష్ చంద్ర బోస్‌ను ప్రభుత్వం 1940 లో అరెస్టుచేసి కలకత్తా ప్రెసిడెన్సీ జైలులో నిర్బంధించింది.

1897 జనవరి 23 న జన్మించిన సుభాష్ చంద్ర బోస్, 1921 లో ఐ.సి.యస్. ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి స్వాతంత్ర్య ఉద్యమంలో చేరాడు. అప్పటి నుంచి 1940 నాటికి అనేకసార్లు జైలుశిక్షను, ప్రవాస శిక్షలను అనుభవించాడు. హింసాయుత ఘటనలతో సంబంధం వున్నదని ప్రభుత్వం బోస్‌ను మూడేళ్ళు మాండలేలో నిర్బంధించింది. ఆరోగ్య కారణాలవల్ల తర్వాత విడుదల చేసింది. మోతీలాల్ నెహ్రూ కమిటీ అధినివేశ ప్రతిపత్తి కోరుతున్న సమయంలో బోస్ సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరాడు. 1928 లో కాంగ్రెసులోని కొత్త యువతరానికి, అతివాదులకు నాయకుడయ్యాడు. దేశ బహిష్కరణకు గురై కొన్నాళ్ళు యూరప్‌లో నివసించాడు. ప్రభుత్వ ఉత్తర్వులను ధిక్కరించి భారతదేశం వచ్చాడు. ప్రభుత్వం తిరిగి ఆయన్ని నిర్బంధించి 1937 వరకు బోస్‌ను జైలులో పెట్టింది. హరిపుర కాంగ్రెస్‌కు అధ్యక్షుడయ్యాడు. త్రిపుర కాంగ్రెస్‌లో డా॥ పట్టాభిని ఓడించి అధ్యక్షుడయ్యాడు.

కాంగ్రెసు నాయకత్వం సహాయ నిరాకరణ ఫలితంగా 1939 లో అధ్యక్ష పదవికి రాజీనామా చేశాడు. ఫార్వర్డు బ్లాకు స్థాపించాడు. 1939 ఆగస్టులో మూడు ఏళ్ళ వరకు బోస్‌ను కాంగ్రెస్ నుంచి బహిష్కరించింది నాయకత్వం. ద్వితీయ యుద్ధం ప్రారంభమైన నాటినుంచీ బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రచారం చేస్తూ వచ్చాడు బోస్.

1940 నవంబరు 29 న జైలులో నిరసన వ్రతం ప్రారంభించగా బోస్‌ను 1940 డిసెంబరు 5 న విడుదల చేసింది ప్రభుత్వం. కాని కలకత్తాలోని ఎల్గిన్ రోడ్‌లోని ఆయన గృహంలోనే పోలీసుల నిఘాతో నిర్బంధించింది. 1941 లో పోలీసుల నిఘాను తప్పించుకొని విదేశాలకు పారిపోయాడు.

## పలాయన గాథ వెనుక

సుభాష్ చంద్రబోస్ పోలీసుల నిఘా నుంచి తప్పించుకుని విదేశాలకు వెళ్ళడంలో ప్రముఖ పాత్ర వహించింది కమ్యూనిస్టులనీ, ఆ ప్రయత్నంలో ఒక కమ్యూనిస్టు అనుపులర్పించాడనీ చెబితే ఆశ్చర్యపోయేవారు చాలామంది వుంటారు. సోవియట్ యూనియన్‌పై జర్మనీ దాడి చేశాక ప్రపంచ యుద్ధ స్వభావంలో వచ్చిన మార్పును గుర్తించక, జపాను ఫాసిస్టుల సహాయాన్ని తీసుకోదలచిన సుభాష్ బోస్‌ను గట్టిగా విమర్శించిన వారిలో కమ్యూనిస్టు పార్టీ వుంది. గాంధీ నెహ్రూలు కూడా సుభాష్‌చంద్ర బోస్ భావాలతో ఈ విషయంలో విభేదించారు కూడా అయితే, బ్రిటిష సామ్రాజ్యవాద వ్యతిరేకిగా బోసు. అనుసరించిన అతివాద రాజకీయాలను అనేకసార్లు కమ్యూనిస్టుపార్టీ బలపర్చుతూ వచ్చింది. 1936 తర్వాత సుభాస్ చంద్రబోసుతో సత్సంబంధాలను కలిగి వుంది. దీనికి ఉదాహరణగా బెంగాల్ కాంగ్రెసు అధ్యక్షుడుగా బోసు వున్నప్పుడు ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు బంకిం ముఖర్జీ ఉపాధ్యక్షుడుగా వున్నాడు. మరో కమ్యూనిస్టు నాయకుడు పంచు గోపాల్ బహదురీ సహాయకార్యదర్శిగా వున్నాడు. కాంగ్రెస్‌లో అతివాద సమైక్య సంఘటన (Left consolidation committee) ఏర్పడినపుడు కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు సోషలిస్టుపార్టీ, యం.ఎన్.రాయ్ అనుచరులు, సుభాష్ అనుచరులు అందులో వున్నారు. త్రిపుర కాంగ్రెస్ అధ్యక్ష పదవికి సుభాసును ఎన్నుకోవాలని ఆనాటి కమ్యూనిస్టుపార్టీ నాయకుడు పి.సి. జోషి బహిరంగంగా ప్రకటించాడు, కమ్యూనిస్టుపార్టీ పత్రిక "నేషనల్ ఫ్రంట్"లో "సుభాసుకే ఓటు వేయండి" (Vote for Subhas) అని పతాక శీర్షికలు ప్రకటించుతూ వచ్చింది. సుభాస్ గెల్చినపుడు "కార్యకర్తల విజయం" అంటూ ఆ పత్రిక సంపాదకీయం రాసింది.

ఐతే సిద్ధాంత విషయాల్లో విభేదాలు వచ్చినపుడు కమ్యూనిస్టుపార్టీ ఆ విషయం దాచలేదు. ఫార్వర్డుబ్లాక్ ఏర్పరచడాన్ని విమర్శించింది అలాగే జర్మనీ-జపాన్ ఫాసిస్టుల సహకార విషయంలో కూడ తమ ప్రాతి కూల్యాన్ని గట్టిగా వక్కాణించింది. అందుచేతనే బోసును తప్పించడంలో కమ్యూనిస్టులు సహాయపడ్డారనే వార్త కొందరికి విస్మయం కలిగించవచ్చు కాని అది నమ్మలేని నిజం.

1940 లో జైల్లో వుండగానే సుభాస్ చంద్రబోసు భారతదేశం నుంచి తప్పించుకొని వెళ్ళి, విదేశాల నుంచి సాయుధ పోరాటం సాగించాలని భావించాడు. సోవియట్ యూనియన్ వెళ్ళి, మధ్యఆసియాను కేంద్రంగా చేసుకొని పనిచేయాలని బోసు ఆలోచన, అందుకోసం పంజాబ్, వాయువ్య రాష్ట్రంలలోని ప్రముఖ నాయకులతో సంబంధాలు పెటుకొనా డు. ఆలిండియా ఫార్వర్డు బ్లాకు వర్కింగ్ కమిటీ సభ్యు వ మియాం అక్బర్‌షాను యిందుకు నియమిం_ . అక్బర్‌షా యువకుడుగా వున్న రోజుల్లో ఆఫ్ఘనిస్తాన్ ద్వారా సోవియట్ యూనియన్ వెళ్ళాడు, కమ్యూనిస్టు అయ్యాడు. తిరిగి భారత దేశం వస్తుండగా చిత్రాల్‌లో అరెస్టయ్యాడు. 1921-22 నాటి "పెషావర్ బోల్షివిక్ కుట్ర కేసు"లో నిందితుడు. పంజాబ్ ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు అచ్చర్‌సింగ్‌చీనాతో బోస్ సంబంధాలు పెట్టుకొన్నాడు. వాయువ్య రాష్ట్రం ఆఫ్ఘనిస్తాన్‌ల ద్వారా సోవియట్ యూనియన్‌కు బోసును తీసుకువెళ్ళడంలో ఏర్పా చేయడానికి ఆయన అంగీకరించాడు. 1940 జూ లో చీనా, మరో ప్రముఖ కమ్యూనిస్టు రామ్‌కిష , బోసు సోవియట్ యూనియన్‌కు వెళ్ళడానికి ఏ ర్పా ట్లు చేయడానికి బ య లు దేరారు. రామకిషన్, నవజవాన్ భారత్ సభ సంస్థాపకుడు కూడా. నవజవాన్ భారత్ సభ విప్లవ వాదులకు బహిరంగ వేదికగా ఉండేది. ఇంతేకాక రామకిషన్ పంజాబ్‌లో "కీర్తి" పార్టీ నాయకుడుకూడా, వీరిద్దరూ ఆఫ్ఘన్-సోవియట్ సరిహద్దులోవున్న ఆక్సస్‌నదిని దాటాల్సివుంది. చీనా, ఆ నది దాటి సో వి య ట్ యూనియన్ చేరగల్గాడు. కాని రామకిషన్ కాలు జారిలోతైన నదీప్రవాహంలో పడిపోయి మరణించాడు.

ఆ తర్వాత సుభాస్ చంద్రబోసును భారతదేశం నుంచి వెలుపలికి తీసుకు వెళ్ళడానికి ఏర్పాట్లు సిద్ధమైనట్లు బోసుకు తెలియచేశారు. కాని బోస్‌కు 1941కి గాని వీలు చిక్కలేదు. మియా అక్బర్‌షా, అచ్చర్ సింగ్ చీనాలు చే సి న ఏ ర్పా ట్లు ప్రకారం పఠాను కమ్యూనిస్టు విప్లవకారుడు భగత్‌రామ్ తల్వార్ సహాయంతో సుబాసుచంద్రబోసు కాబూల్‌చేరాడు. అక్కడ నుంచి1941 మార్చి 28న బెర్లిన్ చేరాడు. బోసు పరారు కావడానికి కమ్యూనిస్టులు సహాయ పడిన ఉదంతాన్ని హెచ్. వి. కామత్ కూడా 1951లో అంగీకరించాడు. "1941 లో భారతదేశం నుంచి బో సు తప్పించుకు పోడానికి భారత కమ్యూనిస్టులు విలువైన సహాయం చేశారని" అన్నాడాయన. 1941 లో ఆఫ్ఘనిస్తాన్‌లో వున్న ఇటలీ రాయబారి ఉద్యోగి కొరోన్ని (ఈయన 1950-51లో పశ్చిమ జర్మనీ రా య బా రి) ఇలా చెప్పాడు."బోసుకు భారతీయ కమ్యూనిస్టులు సహాయ పడుతున్నారు. ఆఫ్ఘనిస్తాన్‌లో రహ్మత్‌ఖాన్ అని తన పేరు చెప్పుకొనే ఒక వ్యక్తి (భగత్ రామ్ తల్వార్) సుభాస్ బోస్ వెంట వున్నాడు.

## జర్మనీలో

బ్రిటిషు ప్రభుత్వాన్ని దుయ్య బడుతూ రేడియోలో ప్రసంగించడానికి బెర్లిన్‌లోసుభాసుచంద్రబోసుకు సౌకర్యాలు కల్గించింది హిట్లర్ ప్రభుత్వం. బెర్లిన్ రేడియోనుంచి సుభాస్‌బోస్ భారత ప్రజలను ఉద్దేశించి ప్రసంగించేవాడు.

1941 జూన్‌లో జర్మనీ, సోవియట్‌యూనియన్‌పై దాడి చేసినప్పుడు, హిట్లర్ ప్రభుత్వానికి బోసు ఒక సూచన చేశాడు. భారత సైన్యం ఒ క టి ఏ ర్పా టు చేయాలి జర్మన్ సైన్యాన్ని అనుసరిస్తూ వెళ్ళి, అది మధ్య ఆసియాకి చేరుకుంటుంది. అ క్క డ ను ం చి వాయువ్య సరిహద్దులో బ్రిటిషు సైనికులపై యుద్ధం చేస్తుంది. అంతేకాక 1941 మే 29న హిట్లర్‌ను కలుసుకొన్నప్పుడు భారతదేశాన్ని స్వతంత్రదేశంగా అక్ష రాజ్యాలు (ఫాసిస్టు రాజ్యాల కూటమి) ప్రకటించాలని బోసు కోరాడు. కాని హిట్లర్ అలాంటి వాగ్దానం ఏమీ చేయలేదు.

జర్మనీ ఉత్తరాఫ్రికాలో, పట్టుకొన్న భారతీయ ఖైదీలతో 1942 జనవరిలో భా ర త సైనిక దళాన్ని

(లీజియన్) బోసు తయారు చేశాడు. రోమ్, పారిస్ లలో స్వతంత్ర భారత కేంద్రాలను ఏర్పరచాడు. బోసు ఏర్పరచిన భారత సైనిక దళంలోమూడు వేల మంది దాకా వున్నారు. ఐతే పైకి ఎంత కపటప్రేమ వొలికించుతున్నప్పటికీ, హిట్లర్‌కు ఈ ఖైదీల భారత దళం గురించి ఏ మాత్రం గౌరవం లేదు. హిట్లర్ ఇలా అన్నాడు.

"భారత సైనిక దళం ఉత్తజోక్. ఒకపేనుని కూడా చంపలేని భారతీయులున్నారు. వాళ్ళు ఇంగ్లీషు వాళ్ళను కూడా చంపలేరు. ఇంగ్లీషు వాళ్ళకు ఎదురుగా వాళ్ళని ఉంచటం బుద్ధిహీనమైన పని అనినేను భావిస్తున్నాను. భారతీయులను ప్రార్థన ఫ్యాక్టరీలకు మరలించితే. అక్కడ వాళ్ళు ప్రపంచంలో కల్లా అత్యంత సాహస వంతులైన సైనికులవుతారు."

ఈ భావాలు ఆనాడుబోసుకు తెలిసో లేదోచెప్పలేం. కాని 1964 లో షైరర్ రాసిన "ది రైజ్ అండ్ ఫాల్ ఆఫ్‌ది థర్డ్ రీష్" లో పైవాక్యాలు ఉటంకించాడు.

జర్మన్ ప్రజాతంత్రం రిపబ్లిక్‌లోని పోట్స్‌డాం ఆర్కైవ్స్ నుంచి, లభించిన ఒక పత్రంలో ఇంకా కొన్ని విశేషాలు దొరికాయి. అందులో ఇలా వుంది:

"మొదటి నుంచీ సుభాసు చంద్రబోసును, అతని అనుయాయులను జర్మన్ ఫాసిజం నమ్మటంలేదు. వారిపై నిఘా వుంచింది. వారి వుత్తరాలు అన్నిటినీ సెన్సార్ చేసేది. భారతదేశానికి పంపే రేడియో ఉపన్యాసాలు కూడా సెన్సార్ చేయకుండా వదలి పెట లేదు."

ఇదే పత్రంలో మరో విషయం కూడా బైట పడింది. సుభాసుచంద్రబోస్ "జర్మనీనుంచి జపానుకు వెళ్ళే సమయంలో భారత సైనికులకు బోస్ ఒక ఖచ్చితమైన ఆజ్ఞ విధించాడు. బ్రిటిష్‌వాళ్ళతోనే పోరాడండి, కాని సోవియట్ యూనియన్‌పై పోరాడకండి, అని చెప్పాడు. ఆ ఆదేశాన్ని అనుసరించి తూర్పురంగానికి వెళ్ళడానికి భారత సైనికులు నిరాకరించారు. దాని ఫలితంగా వెంటనే సైనిక కోర్టులో పది మంది భారతీయులకు మరణశిక్ష విధించారు" మరో 40 మంది కూడా విచారణలో వున్నట్లు ఇదే పత్రం తెలియచేసింది. వారికి ఏ శిక్ష విధించారో తెలియదు. బహుశా వారు కూడా మరణశిక్షకు గురై వుంటారు.

1942 ఫిబ్రవరి 15 న సింగపూర్, జపాన్ వశమైంది. జపాన్, బ్రిటన్‌పై వరుసగా విజయాలు సాధించుతున్నదని విన్న సుభాస్‌చంద్రబోస్, తాను జర్మనీలోకన్నా తూర్పురంగంలో వుంటే ఎక్కువ ఉపయోగపడగలనని భావించాడు. జర్మనీనుంచి జపానుకు వెళ్ళాడు. 1943 ఫిబ్రవరి 8 న ఒక జర్మన్ సబ్‌మెరిన్ (జలాంతర్గామి యుద్ధనౌక) లో ప్రయాణమై, బ్రిటిష్ నౌకలుండే మార్గాల్ని వదలి వేరే మార్గాలగుండా మెడగాస్కర్‌కు ఈశాన్యంగా 400 మైళ్ళలో ఒక ప్రాంతానికి చేరుకొన్నాడు. అక్కడ నుంచి ఒక రబ్బరు డింగీలో జపాను సబ్‌మెరీను వద్దకు చేరుకున్నాడు. అది బోస్‌ను సుమత్రాకు తీసుకు వెళ్ళింది. అక్కడనుంచి బోస్ 1943 జూన్ 13 న విమానంలో టోక్యో చేరాడు. భారత ప్రజల శత్రువులైన బ్రిటిషువారి పలుకుబడిని తుదముట్టించడానికీ, భారతదేశం స్వాతంత్ర్యాన్ని సంపాదించుకోడానికీ జపాను అన్నివిధాలా సహాయం చేస్తుందనీ, అందుకు కృతనిశ్చయంతో వున్నదనీ బోస్‌కు టోజో వాగ్దానం చేశాడు. కాని కొన్నాళ్ళకు హిట్లర్ లాగానే జపాను వైఖరి కూడా సానుకూలమైంది కాదని చరిత్ర రుజువు చేసింది.

## భారత జాతీయ సైన్యం (ఐ.యన్.ఎ)

తూర్పురంగంలో యుద్ధం ప్రారంభం కాగానే తూర్పుదేశాల్లో నివసిస్తున్న భారతీయులు ఉత్సాహపడ్డారు. జపాన్, హాంకాంగ్, ఇండోనీషియా, థాయ్‌లాండ్‌లలోని భారతీయులు అనేక సంఘాలు ఏర్పరచారు. బ్రిటన్‌నుంచి భారతదేశాన్ని విముక్తి చేయడానికి ఈ సంఘాలు పనిచేయాలని భావించాయి. రసబిహారి ఘోష్ ప్రముఖ భారతీయ విప్లవవాది. బ్రిటిషు వాళ్ళనుంచి తప్పించుకొని 1915 నుంచి జపాన్‌లో స్థిరపడ్డాడు. ఈయన కృషి ఫలితంగా 1942 మార్చి 28-30 తేదీల మధ్య ఒక సభ జరిగింది. భారత స్వతంత్ర సమితి (ఇండియన్ ఇండిపెండెన్సు లీగ్) ఏర్పడింది. 1942 జూన్‌లో భారతీయులు పూర్తిగా ప్రాతినిధ్యం వహించే సభను బాంకాక్‌లో 1942 జూన్‌లో జరపాలని నిర్ణయించారు ఆ సభ జూన్ 15 నుంచి 23 వరకు జరిగింది. బర్మా, జపాన్, చైనా, ఇండో-చైనా, ఫిలిప్పైన్సు, మలయాలనుంచి

100 మంది ప్రతినిధులు వచ్చారు. రసబిహారీ ఘోష్ అధ్యక్షత వహించాడు. ఆ సభలో భారత జాతీయ పతాకను ఆవిష్కరించారు. భారతదేశానికి సత్వరం స్వాతంత్ర్యం సాధించడం లక్ష్యంగా గల నిబంధనావళితో భారత జాతీయ సమితిని ఏర్పరచింది ఈ సభ. సుభాస్‌బోసును తూర్పు ఆసియాకు రావలసిందిగా ఈ సభ ఆహ్వానించింది. ఈ సభకు జపాన్ ఖైదీలుగావున్న భారతీయులు కూడా వచ్చారు. సింగపూర్ జపాన్ వశమైనపుడు 40 వేలమంది (మరో అంచనా 60 వేలమంది) భారతీయ సిపాయీలు ఆయుధాలతో సహా జపాన్‌కు చిక్కారు. బ్రిటిషు సైన్యంలో సైనిక ఉద్యోగిగా వున్న కెప్టెన్ మోహన్‌సింగ్‌కు వారిని అప్పగించి, బ్రిటిష్ వ్యతిరేక యుద్ధంలో చేరవలసిందిగా ప్రోత్సహించింది జపాన్. మోహన్‌సింగ్ "ఆజాద్ హింద్ ఫౌజ్" (స్వతంత్ర భారత సైన్యం) అనే వలంటీర్ సైనికదళాన్ని ఏర్పరచాడు. పైన ఉదహరించిన టోక్యో, బాంకాక్ సభలకు మోహన్‌సింగ్ కూడా హాజరయ్యాడు. భారత జాతీయ సైన్యానికి కమాండర్ ఇన్ ఛీఫ్‌గా ఇతన్ని ఎన్నుకొన్నారు. బాంకాక్‌లో ఏర్పరచిన కార్యాచరణ సంఘంలో మోహన్‌సింగ్ సభ్యుడుగా వున్నాడు. 1942 ఆగస్టు నాటికి భారత జాతీయ సైన్యంలో 16 వేలమంది వున్నారు. దాన్ని విస్తరింపచేయాలని ఇతడు చేసిన సూచనను జపాన్ అంగీకరించలేదు. మోహన్‌సింగ్‌కు జపాన్ ప్రభుత్వ వుద్దేశాలపట్ల అనుమానాలు కలిగాయి. చైనాలో జపాన్ ప్రవర్తన అతనికి సందేహాలు రేకెత్తించింది. సైన్యాల కదలిక, రవాణా వాస్తవంగా ఎక్కడ యుద్ధం జరిపేదీ మొదలైన విషయాల గురించి జపాను ఇదమిత్థంగా ఎలాంటి వాగ్దానాలు చేయలేదు. దీనితో భారత జాతీయ సేనను మోహన్‌సింగ్ రద్దుచేశాడు. దానితో అతన్ని యుద్ధఖైదీగా జపాన్ నిర్బంధించింది. ఈ పరిస్థితులలో రసబిహారీ ఘోష్, సుభాస్‌చంద్రబోస్‌ను ఆహ్వానించాడు. బోస్ జపాన్ చేరగానే జపాన్ ప్రధాని అన్నివిధాలా బ్రిటన్‌ను ఓడించడానికి సహాయపడతానని ప్రకటించాడు. 1943 జూలై 2 న సింగపూర్ వెళ్ళాడు బోసు. భారత జాతీయ సైన్యాన్ని 40 వేలకి పెంచాడు. జూలై 4 న తూర్పు ఆసియాలోని భారత స్వాతంత్ర్య ఉద్యమ బాధ్యతలను రసబిహారీ ఘోష్, సుభాస్‌బోస్‌కు అప్పగించారు. అప్పటికే అస్వస్థుడుగా వున్న రసబిహారీ ఘోష్ 1945 జనవరి 21న మరణించాడు. జీవితాంతం బ్రిటన్‌కు పక్కలో బల్లెంలా మెలిగిన ఆ మహాయోధుడు కీర్తిశేషుడయాడు.

ఇండియన్ ఇండిపెండెన్సు లీగ్ అధ్యక్ష పదవిని సుభాసచంద్రబోసు స్వీకరించాడు. 1943 జూలై 5 న "ఆజాద్ హింద్ ఫౌజ్" ఏర్పడిన విషయం ప్రపంచానికి చాటాడు "సంపూర్ణ సమీకరణ" "ఛలో ఢిల్లీ" నినాదాలిచ్చాడు 1943 ఆగస్టు 25 న స్వయంగా భారత జాతీయ సైన్యానికి (ఐ. యన్. ఏ) నాయకత్వం వహించాడు.

సుభాస్‌చంద్రబోస్ తాత్కాలిక భారత ప్రభుత్వాన్ని ఏర్పరచాడు. దానికి అధ్యక్షుడు ఆయనే. బోస్ తాత్కాలిక ప్రభుత్వం 1943 అక్టోబరు 23 న బ్రిటన్ అమెరికాలపై యుద్ధం ప్రకటించింది. బోస్ స్వయంగా రేడియోలో ఈ విషయం ప్రకటించాడు. ఈ తాత్కాలిక ప్రభుత్వాన్ని జపాను, జర్మనీ, ఇటలీ మరో ఆరు దేశాలు గుర్తించాయి.

సైనిక కవాతుకూ, అధికార భాషగానూ హిందుస్తానీ అని ప్రకటించాడు త్రివర్ణ పతాకను జాతీయ జండాగా ప్రకటించాడు. టాగూర్ జనగణమణ గీతాన్ని జాతీయ గీతం చేశాడు. తామిదివరకే ఆక్రమించిన అండమాన్‌దీవులను జపాన్ బోస్‌కు అప్పగించింది. అండమాన్‌దీవుల పేరును షహీద్ దీవులనీ, నికోబార్‌దీవుల పేరును స్వరాజ్య దీవులనీ మార్చివేశాడు.

భారత జాతీయ సైన్యంతో భారతదేశంపై దండెత్తాలని బోస్ కాంక్ష దానికి జపాన్ సుముఖంగాలేదు. భారత సైనికుల సైనిక పటిమను శంకించింది. జయప్రదంగా ఆ యుద్ధంలో గెలవగలరా? అని శంకించింది తామే దండయాత్ర సాగిస్తామనీ, విముక్తిచేసిన ప్రాంతాలను బోస్‌కు అప్పచెబుతామనీ జపాన్ వాదించింది, కాని భారతీయ సైనికులే బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూల్చాలని బోస్ పట్టుబట్టాడు. చిట్టచివరకు జపాన్ అందుకు అంగీకరించింది. 1944 ఫిబ్రవరిలో బోస్ తన భారత జాతీయ సైన్యం (ఐ. ఎన్. ఏ)తో రంగూన్ నుంచి భారత సరిహద్దుల వైపుకు వెళ్ళాడు. జపాన్ సైన్యాలు ఆయన సైన్యాల వెంట వచ్చాయి.

భారత జాతీయ సైన్యం రెండు చోట్ల బ్రిటిష్ సైన్యాలను ఓడించి 1944 మేలో భారతదేశంలోకి చొచ్చుకు వచ్చి, మౌడాక్ అనే ప్రదేశాన్ని వశపరచుకుంది. ఈ యుద్ధంలో బ్రిటిష్ వాళ్ళు చాలామంది చనిపోయారు. అనేక ఆయుధాలను, మందుగుండు సామాగ్రిని బ్రిటిష్‌వాళ్ళు వదిలిపెట్టి పోయారు 1944 సెప్టెంబరు వరకు మౌడాక్ వీరి స్వాధీనంలో వుంది. త్వరలోనే భారత జాతీయ సైనిక దళంలో ఒక భాగం జపాను సేనలతో కలసి నాగాలాండ్‌లో ప్రవేశించి, దాని రాజధాని అయిన కొహిమాలో జాతీయ పతాకను ఎగురవేసింది. మరొక భాగం మణిపూర్‌లో ప్రవేశించి ఇంఫాల్ నగరాన్ని వశపర్చుకున్నాయి.

1943 లో మిత్రరాజ్యాలు ఉత్తర, దక్షిణ పసిఫిక్ మహా సముద్ర ప్రాంతాలలో నౌకలతోను, విమానాలతోను ఎదురు దాడి సాగించింది దీనితో జపాను తన వైమానిక దళాలను బర్మా నుంచి దక్షిణ పసిఫిక్ ప్రాంతానికి తరలించింది. అందుచే బర్మారంగంలోని వారికి సప్లయిలను భూ మార్గంగుండా అడవులు, చెడిపోయిన రోడ్ల ద్వారా పంపవలసివచ్చింది. శత్రు వైమానిక దళాలు వీటిని పసిగట్టి అపుడపుడూ దెబ్బకొట్టేవారు. దీనికితోడు అనుకోకుండా వర్షాలు మామూలువలెగాక రెండు వారాలు ముందుగానే వచ్చిపడ్డాయి. జపాను ఫిలిప్పైన్సునూ, తదితర ప్రాంతాలను పునరాక్రమించుకోడంలో, భారతదేశ సరిహద్దుల నుంచి, జపాను తన సైన్యాలను తిరుగుముఖం పట్టించింది.

ఈ పరిస్థితిలో 1944 జూన్ నాటికి తామాక్రమించుకొన్న ప్రదేశాలను వదలి భారత జాతీయ సైన్యం వె తిరిగిపోవటం ప్రారంభించింది. తిరుగుముఖం పట్టిన భారత సైనికులు అనేక కష్టాలుపడాల్సి వచ్చింది. కొండల్లో, అడవుల్లో ప్రయాణం చేయాల్సి వచ్చింది వర్షాల వల్ల వాగులు పెద్ద నదుల్లా పొంగి, వాటిలో అనేకమంది సైనికులు మునిగి చనిపోయారు. అనేక అంటు వ్యాధులకు గురయ్యారు. గాయాల బాధలకు తోడు, గుంపులుగా ఆ పుండ్లపై దాడి చేసే ఈగలు, ఒక రకం పురుగులు బాధలకు తట్టుకోలేక, ఆత్మహత్యకు సిద్ధమై పరస్పరం కాల్చుకొని లేదా తామే కాల్చుకుని అనేకమంది చనిపోయారు. 1944 సంవత్సరాంతంలోను, 1945 ప్రారంభంలోను బర్మాపై బ్రిటిష్ సేనలు దాడి చేశాయి. మేలో పూర్తిగా బర్మాను స్వాధీన పరచుకొన్నాయి. భారత జాతీయ సైన్యంలో చనిపోగా మిగిలినవారు తిరిగి బందీ అయ్యారు. ఈసారి బ్రిటిష్‌ప్రభుత్వం బందీలయ్యారు.

1945 ఏప్రిల్ 28 న బోస్ రంగూన్‌లో ఉన్నాడు. జపాన్ రంగూన్‌ను వదలి వెళుతుందనే వార్త అపుడు ఆయనకు అందింది. బోసు అతని ముఖ్య సహచరులు అతికష్టం మీద 1945 మే 15 న బాంకాక్ చేరుకొన్నారు 1945 ఆగస్టు 13 న సింగపూర్‌కు బోసును పిలిపించి,జపాన్ ప్రభుత్వం తాను మిత్ర రాజ్యాలకు లొంగిపోతున్నట్లు తెలిపింది, ఆగస్టు 16 న ఆయన సైగాన్ వెళ్ళాడు. అక్కడనుంచి కర్నల్ హబిబుర్ రహమాన్‌తో కలిసి విమానంలో టోక్యోకు బయలుదేరాడు. 1945 ఆగస్టు 18 న ఫార్మోజాలోని తైహో విమానాశ్రయంలో జరిగిన విమాన ప్రమాదంలో గాయపడి ఆస్పత్రిలో మరణించాడు. ఆగస్టు 22 న టోక్యో రేడియో ఈ వార్తను ప్రపంచానికి ప్రసారం చేసింది.

బోస్ మరణవార్తను భారతీయులలో కొందరు విశ్వసించలేదు ఈ వార్తను రాజకీయ వివాదాంశంగా కూడా కొందరు మార్చారు. 1956లో ఈ విషయమై దర్యాప్తు చేసిన షానవాజ్ ఖాన్ కమిటీ, ఆ తర్వాత జి. డి. ఖోస్లా ఏకసభ్య కమిషన్ కూడా బోస్ మరణించాడని ధృవపరచాయి.

జర్మనీ జపాను ఫాసిస్టు ప్రభుత్వాలు ఎన్ని కపట వాగ్దానాలు చేసినా, బ్రిటిష్ వాళ్ళని ఓడించడానికి భారతీయుల్ని బలి పశువులుగా ఉపయోగించుకోడమే వారి లక్ష్యం. ఈ విషయం జర్మనీ, జపానులలో వున్నపుడు బోస్‌కు కొంత వరకైనా అవగతమై వుంటుందని తెలుస్తోంది.

1934లో భారతదేశ పోరాటం (ఇండియన్ స్ట్రగుల్) తొలిముద్రణ వెలువడినప్పుడు సుభాష్‌చంద్ర బోస్ ఫాసిజాన్ని పొగిడాడు. ఫాసిజం కమ్యూనిజంల మధ్య ఏదో ఒకదాన్ని ఎన్నుకోవలసి వస్తే కమ్యూనిస్టు లక్ష్యాన్నే నేను ఎన్నుకొంటానని నెహ్రూ అన్నాడు. ఈ అభిప్రాయాలు తప్పంటూ బోస్ ఈ రెండింటినీ సమన్వయించే సిద్ధాంతం (సింథసిస్) ఒకటి భారతదేశంలో భవిష్యత్‌లో వస్తే ఆశ్చర్యమా అని బోస్ అన్నారు. కాని ఈ అభిప్రాయాలు తప్పని

1938లో బ్రిటిష కమ్యూనిస్టు నాయకులతో చర్చించాక, బహిరంగంగా అంగీకరించాడు. ఐతే "మన శత్రువుకు శత్రువు మన మిత్రుడు" అనే భావంతో జపాన్, జర్మనీల సహాయం కోరాడు. ఐతే భారతీయుల్ని జర్మన్ ఫాసిస్టులు నమ్మలేదు. హిట్లర్ భారతీయుల పట్ల ప్రదర్శించిన, చులకన వైఖరి గురించి ఇంతకుముందే ప్రస్తావించాం.

బోస్ ప్రతి చర్యనూ జర్మన్ గూఢచారులు గమనించుతూ వచ్చారు. ఆయన ఉత్తరాలు సెన్సార్ చేశారు. రేడియో ఉపన్యాసాలు కూడా సెన్సార్‌చేశారు. 1942 లో క్రిప్స్‌కు బోస్ రాసిన బహిరంగ లేఖను కూడా ప్రచురించే ముందు రిబ్బన్ ట్రాఫ్ స్వయంగా చూసి గాని అనుమతించలేదు. జర్మన్ విదేశాంగ శాఖలో "భారతదేశ ప్రత్యేక శాఖ"ను ఒకదాన్ని ఏర్పరచాడు. అది భారతీయ దేశభక్తులపై నిఘా వేసి ఉంచేది. ఇంతే కాక ఈ ప్రత్యేకశాఖపై అనేక ప్రముఖనాజీ నాయకులు నిఘావేసి వుంచారు. పశ్చిమ జర్మనీ, ఛాన్సలర్‌గా వున్న కీసింగర్ కూడా బోస్‌పై నిఘా వుంచిన వ్యక్తుల్లో ఒకడు. ఇతనే స్వయంగా బోస్ రేడియో ప్రసంగాలను సెన్సార్ చేయాల్సిందిగా ఆజ్ఞాపించాడు. గోబెల్స్ మంత్రిత్వశాఖ "సుభాస్‌బోస్‌పై ఎలాచక్కని నిఘా ఏర్పాటుచేయాలి" అనే సమస్యపై సమావేశమైంది.

"బోస్ రేడియో ఉపన్యాసాలు చాలా జాగ్రత్తగా సెన్సార్ చేయాలి బోస్‌కు ఏ విధంగాను ఆ విషయం తెలియకూడదు.

"బోస్ రేడియో ఉపన్యాసాల్ని ఉదయం 10 గంటలకే రికార్డ్ చేయాలి. అందువల్ల ఆరోజే సెన్సార్ చేయడానికి వీలౌతుంది" — అనే ఈ సమావేశం నిర్ణయించింది.

తాము చెప్పినట్లు నడుచుకోవాలని 1942 చివరి భాగంలో జర్మన్ ఫాసిస్టులు బోస్‌ను ఒత్తిడి చేయసాగారు. వాళ్ళకు లొంగడమా? ధిక్కరించడమా అన్నది ప్రశ్నయింది. ధిక్కరిస్తే కాన్సెంట్రేషన్ క్యాంప్‌లో పడేసేవాళ్ళే, తన జీవితాన్ని ఫాసిస్టులకు బలిచేయడం బోస్‌కు ఇష్టంలేదు అందుచేతనే జపాన్ రంగానికి వెళ్ళడానికి సన్నద్ధమయ్యాడు. ఆగ్నేయ ఆసియాలో జపాన్ విజయాలను ఆధారం చేసుకొని అక్కడికి వెళతానని, జపానువెళ్ళి, జర్మన్ ఫాసిస్టు ముష్కరుల బారినుంచి తప్పించుకోగల్గాడు. ఈ పైన చెప్పిన విషయాలన్నీ, జర్మన్ సెంట్రల్ ఆర్కైవ్స్ నుంచి పరిశోధకులు వెలికితీసిన పత్రాల నుంచి, సేకరించిన సమాచారం.

ఇక జపాను ఫాసిస్టులనైజం కూడా త్వరలోనే ఆయనకు బహుశా తెలిసివుంటుంది. 1945 లో అండమాన్ దీవులలో సుభాస్ బోస్ ఎంతగా విరోధించినా, లెక్క చేయకుండా పౌరులను ఉచకోతకోశారు. అలాగే జపాన్ సేనలు భారతదేశ సరిహద్దులనుంచి తిరోగమించేటప్పుడు, భారతజాతీయ సైనికులను వాళ్ళ గతికి వాళ్ళను వదలి, ఆహారం, మందులు లేకుండా విమానాలు, ఆయుధాలు తిరిగి పంపకుండా వదలి వేశారు. బర్మా, మలయా, ఫిలిప్పైన్స్, ఇండొనీషియాలలో జపానుతో సహకరించిన జాతీయ ఉద్యమ నాయకులే, జపాన్‌ను వ్యతిరేకించి, ఆ తర్వాత ఉద్యమాలను నడిపారు.

బహుశా సుభాస్ బోసులో కూడా కొంత మార్పు వచ్చిందేమోనని 1945 మే 21 బాంకాక్‌లో ఇచ్చిన ఉపన్యాసాన్ని బట్టి తెలుస్తున్నది. అందులో ఆయన ఇలా అన్నాడు.

"మిత్రులారా! నేను మళ్ళా యూరప్‌లోని యుద్ధాన్ని గురించి ప్రస్తావిస్తాను. ఒకప్పుడు రష్యాలోని జర్మన్ సైన్యాలు చొచ్చుకొని స్టాలిన్‌గ్రాడ్ దాకా పోయాయి. ఆ ప్రవాహం వెనక్కి తిరుగుతుందనీ, ఒక రోజున సోవియట్ సైన్యం బెర్లిన్‌లో ఉంటుందని ఆ రోజుల్లో ఎంతమంది ఊహించి వుంటారు?

"ఇపుడు సోవియట్ యూనియన్ యుద్ధలక్ష్యాలు ఆంగ్లో - అమెరికన్లు—వారందరికీ ఉమ్మడి శత్రువు జర్మనీ అయినా — లక్ష్యాలకన్నా భిన్నమైన నేది స్పష్టం."

ఏదిఏమైనా, ఆనాటి ఫాసిస్టు దేశాల బందీలుగా వున్న భారతీయ సైనికులకు బోసు నాయకుడు. వారే ఆప్యాయంగా ఆయన్ని "నేతాజీ" అని పిలిచారు. తర్వాత "నేతాజీ" అన్న పదమే బహుళ ప్రచారంలోకి వచ్చింది. అలాగే ఆ యుద్ధకాలంలో బోస్

వాడిన "జై హింద్" అన్న పదం జాతీయ వాదుల హృదయాలకు హత్తుకుంది.

## ఐ. యన్. ఏ. నాయకుల విడుదలకై ఆందోళన

1945 శీతాకాలంలో ఢిల్లీలోని ఎర్రకోటలో భారత జాతీయ సైన్య (ఐ.యన్.ఏ.) నాయకులపై విచారణ ప్రారంభమైంది. మేజర్ జనరల్ షా నవాజ్ ఖాన్, కర్నల్ టి. కె. షెగాల్, కర్నల్ జె. యస్. ధిల్లాన్ లను ఈ కేసులో విచారించారు. వీరు ముగ్గురూ యాదృచ్ఛికంగా హిందూ, ముస్లిం, సిక్కు మతాలకు చెందినవారు. ఈ అంశం కూడా వీరి విడుదలకై జరిగిన ఆందోళనలో వివిధ మతస్థులు ఐక్యం కావడానికి కొంత దోహదం చేసింది.

ఐ. యన్. ఏ. నాయకుల్ని విడుదల చేయాలని దేశంలోని అన్ని రాజకీయ పక్షాలు కోరాయి. కాంగ్రెస్ వీరి డిఫెన్సు నిమిత్తం ఒక కమిటీని ఏర్పరచింది. భూలాభాయ్ దేశాయ్, తేజ్ బహదూర్ సప్రూ, కైలాస నాథ్ కట్జూ, అసఫాలీలాంటి ప్రముఖ న్యాయవాదులు ఈ కమిటీలో వున్నారు. నెహ్రూ కూడా ఈ కమిటీలో ఉండటమేకాక, లాయర్ గౌనుకూడా వేసుకొని కోర్టుకు హాజరయ్యాడు. డిఫెన్సు నిధికూడా ఏర్పరచారు. "ఐ.యన్.ఏ. ఖైదీలను విడుదల చేయాలి" అంటూ దేశమంతటా ప్రదర్శనలు, సమ్మెలు జరిగాయి. 1945 నవంబరులో కలకత్తాలో జరిగిన సమ్మె ప్రజల ధిక్కార ధోరణికి ప్రతీకగా నిలచింది. జపాను యుద్ధ కాలంలో మూడేళ్ళపాటు ఆగ్నేయ ఆసియాలోని ప్రజలకు ఏమాత్రం రక్షణ కల్పించలేని బ్రిటిష్ వారిపట్ల ఆ ప్రాంతంలోని ప్రజలకు ఏహ్యభావం కల్గింది. వారిప్పుడు భారత స్వాతంత్ర్యంకోసం పోరాడిన ఐ ఎన్.ఏ. సైనిక నాయకులపై విచారణ సాగిస్తుంటే ఆగ్రహం పెల్లుబికింది. నవంబరు 19 న కలకత్తా విద్యార్థులు శాంతియుతంగా ప్రదర్శన చేసుకుంటూ డల్హౌసీ స్క్వేర్‌కు బయలు దేరారు. సమీపంలోనే ప్రభుత్వభవనం, సచివాలయం వుండటంతో ప్రభుత్వం గాభరాపడింది. తోవలోనే సాయుధ పోలీసులు విద్యార్థులను నిలిపివేశారు. విద్యార్థులు వీధిలోనే బైఠాయించారు ఎట్టి కవ్వింపు లేకుండానే వారిపై కాల్పులు సాగించారు. దీనితో ప్రజలు ఉద్రిక్తు లయ్యారు. రెండు రోజులు ప్రజలు కలకత్తా వీధుల్లోనే వున్నారు. ఘర్షణలు జరిగాయి. నిరాయుధ ప్రజలకూ, సైనికులు పోలీసులకూ మధ్య పోరాటం సాగింది. చిట్టచివరకు పోలీసులు డల్హౌసీ స్క్వేర్‌కు ప్రదర్శకులు రాకుండా పెట్టిన నిషేధాన్ని తొలగించారు. ఐ.ఎన్.ఏ. నాయకులకు కోర్టు దీర్ఘకాల శిక్షలు విధించినా, దేశమంతటా జరిగిన ఆందోళనకు తలొగ్గి వారిని విడుదల చేసింది ప్రభుత్వం.

అయితే 1946 ఫిబ్రవరిలో అబ్దుల్ రషీద్ అనే ఐ.ఎన్.ఏ. ఖైదీకి శిక్ష విధించింది. గతంలో ఐ ఎన్.ఎ. నాయకుల శిక్షల్ని రద్దుచేసినట్లుగా ఈయన శిక్షను రద్దుచేయడానికి ప్రభుత్వం నిరాకరించింది. దీనితో విద్యార్థి సంఘాలు ఫిబ్రవరి 11 న సమ్మెచేయాలని విజ్ఞప్తి చేశాయి ఫిబ్రవరి 12 నుంచి 15 వరకు సమ్మె కొనసాగింది. కలకత్తా వీధులలో విద్యార్థులు మరోసారి పోలీసులతో ఘర్షణలకు తలపడ్డారు విద్యార్థుల సమ్మె బొంబాయికి, ఇతర పట్టణాలకు వ్యాపించింది. హిందువులు, ముస్లింలు నవంబరులోకన్నా ఎక్కువ ఐక్యంగా ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. ప్రభుత్వం హిందూ ముస్లిమ్ విభేదాలు కల్పించాలని ప్రయత్నించినా ఆ ఆట సాగలేదు. పోలీసులు కాల్పులు సాగించారు. ఐ.యన్.ఏ. విచారణల సందర్భంగా సాగిన ప్రజా ఉద్యమాలు, ప్రభుత్వ దమనకాండను ఏమాత్రం సహించబోమని స్పష్టంచేశాయి. సరిగా అదే సమయంలో రాయల్ ఇండియన్ నేవీలో సమ్మె ప్రారంభమైంది.

# ఆర్.ఐ.యన్. (భారత నావికా సైనిక) తిరుగుబాటు

"లేవండి, కూలీకొడకల్లారా, ఇండియన్ కుక్కల కొడకల్లారా" అంటూ నోటితో ఉచ్చరించరాని ఏవేవో బండబూతులు తిడుతున్నాడు కమాండర్ కింగ్. ఆశ్చర్యంతో తలతిప్పి చూశారు భారత నావికా సైనికులు. భారత నావికా సైనికులకు చెందిన "తల్వార్" నౌకలో కమాండింగ్ ఆఫీసర్ "కింగ్". అతడు కోపంతో పిచ్చెత్తిన వాడిలా తిట్టుకుంటూ వచ్చాడు, అలాగే వెళ్ళిపోయాడు.

ఈ ఘటన 1946 ఫిబ్రవరి 8 న బొంబాయి వద్ద "తల్వార్"లో జరిగింది. జాతి వివక్ష, అధికార మదోన్మత్తతతో కూడిన బ్రిటిష్ సైనికాధికారులూ, వాళ్ళ అడుగు జాడల్లో నడిచే కొందరు భారతీయ సైనికాధికారులూ వాడే ఇలాంటి పదజాలం భారత నావికా సైనికులకు కొత్తేమీ కాదు. కాని ఆనాడు తిట్టిన తిట్లు వారిని ఉద్రిక్తపరచాయి. ఇలాంటి అవమానాలు సహించబోమని వారు చేసిన సమ్మె చివరకు రాజకీయ స్వభావము వహించి, ఐదురోజులపాటు బ్రిటిష్ ప్రభుత్వాన్ని అదరగొట్టింది. భారత స్వాతంత్ర్య అవతరణను త్వరిత పరచిన మహోద్యమంగా మార్చివేసింది.

"హెచ్.యం.ఐ. యస్ తల్వార్" నౌకలో భారత నావికా సైనికులకు (ఆర్.ఐ.యన్) సిగ్నల్ ట్రైనింగు ఇస్తారు. ఇది బ్రిటిష్ సామ్రాజ్యంలోనే రెండవస్థానం ఆక్రమించిన పెద్ద శిక్షణా కేంద్రం. ఇందులో అధికారులు కాని, ఇతర్లు కాని 1500 మంది దాకా ఉంటారు. వీరిలో కమ్యూనికేషన్ శిక్షణ పొందేవారు 700 మంది దాకా వున్నారు. మరో 300 మంది తాత్కాలిక రిజర్వు నావికా సైనికులుగా పని చేశాక, ఇండ్లకు పంపివేయబడటానికి సిద్ధంగా వున్నారు. వీరికి రావాల్సిన జీతాలు ఇవ్వకుండా జాప్యం చేయడంతో, వీరిలో అసహనం పెల్లుబుకుతోంది ఇక్కడ బ్రిటిష్ సైనికాధికారులదే అధికారం.

సాధారణంగా సైన్యాలలో వలెనే, తల్వార్‌లో పని చేసే నావికా సైనికుల పరిస్థితి కూడా ఘోరంగా వుండేది. ప్రతివారూ ఇక్కడి పరిస్థితులకు విసిగి వేసారి పోయారు. ఆఫీసర్లు బండబూతులు తిట్టేవారు. నావికా సైనికుల తిండి అధ్వాన్నంగా వుండేది.

యుద్ధం ముగిసింది. ప్రతిచోటా రాజకీయ, ఆర్థిక అశాంతి ప్రబలివుంది. యుద్ధం ముగిసిన రెండునెలల్లోనే బ్రిటిష్ ప్రభుత్వ వ్యతిరేక పోరాటాలు పెల్లుబికాయి. 200 ఏళ్ళ నుంచి బ్రిటిష్ పాలకులపై పేరుకుపోయి వున్న ద్వేషం, రెండో ప్రపంచ యుద్ధకాలంలో అశేషంగా అనుభవించిన బాధలు ఈ పోరాటాలలో ప్రతిబింబించాయి. కొనఊపిరిలో వున్న సామ్రాజ్యవాదం దాస్యశృంఖలాలను ఛేదించుకొని బయట పడటానికి తహతహలాడే జనసామాన్యం అపూర్వ చైతన్యాన్ని ప్రదర్శించింది. భారతజాతీయ సైనిక (ఐ.ఎన్.ఏ) నాయకుల విడుదలకై కలకత్తా వీధులలో ప్రజలు జరిపిన వీరోచిత పోరాటాలు భారత నావికా సైనికులను ఉత్తేజపరచాయి.

తల్వార్ నౌకపైన "జైహింద్" క్విట్ ఇండియా అని రాసిన ఆర్.కె. సింగు అనే నావికా సైనికునిపై ఎట్టి క్రమశిక్షణ చర్యా తీసుకోలేదట. లెఫ్టినెంట్ కమాండర్ కోవ్, అంతే ఆయన్ని బదిలీ చేశారు. అతని స్థానంలోనే ఆ బండబూతులు తిట్టిన కమాండర్ కింగు వచ్చాడు. ఇతని హయాంలోనే ఇద్దరు నావికా సైనికుల్ని ఎలాంటి విచారణ చేయకుండా శిక్షించాడు. కింగు అంటే భారతీయ నావికాసైనికుల్లో ఎవరికీ సదభిప్రాయం లేదు.

ఇంతకూ ఆనాడు నావికా సైనికులు చేసిన తప్పేమిటి? అతను వచ్చినపుడు పెరేడ్‌లో పాల్గొనేందుకు నావికా సైనికులు దుస్తులు వేసుకోడంలో నిమగ్నులై వున్నారు. బహుశా అటెన్షన్‌లో నిలబడి అతనికి శాల్యూట్ చేసివుండక పోవచ్చు. వాళ్ళు పెరేడ్‌కు సిద్ధమవుతున్న వేళలో వచ్చాడు కింగు. అంత మాత్రానే ఇంత అహంకారమా? ఇక ఏ మాత్రం ఇలాంటి అవమానాల్ని సహించదలచుకోలేదు నావికా సైనికులు.

కమాండర్ కింగు వచ్చాక కూడా బ్రిటిష్ వ్యతిరేక భావాలు ఏదో రూపాన ప్రదర్శితమౌతూనే వున్నాయి. బి.సి. దత్తు అనే ముఖ్య టెలిగ్రాఫిస్టును రాజకీయ నినాదాలు రాశాడని అరెస్టు చేశారు. దీనితో నావికా సైనికుల ఆగ్రహం పెల్లుబికింది. కమాండర్ కింగు కారుపైన, ఎవరో "క్విట్‌యిండియా" అనే నినాదం

రాశారు. ఆ కారు టైర్లో గాలి తీసివేశారు. నిప్పు తొక్కిన కోతిలాగయ్యాడు కమాండర్ కింగు ఏదో కాస్త సందు దొరకగా నావికా సైనికులపైన, ఇంతకు ముందు, చెప్పినట్లు బండబూతులు లంకించుకున్నాడు.

సైనిక నియమావళి ప్రకారం ఇలాటి వాటికి నావికా సైనికులు అసమ్మతి తెలియచేయాలంటే సామూహికంగా ఏదీ చేయరాదు. ఎవరికి వారు వ్యక్తిగతంగానే ఫిర్యాదు చేయాలి. ఫిబ్రవరి 9 న 14 మంది వ్యక్తిగతంగా ఫిర్యాదు చేశారు. కమాండర్ కింగు వాడిన భాషకు నిరసన తెలిపారు.

ఈ ఫిర్యాదులన్నీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా వున్న లెఫ్టినెంట్ కమాండర్ నోల్స్ విన్నాడు. పదో తారీకున కమాండింగ్ ఆఫీసర్‌కు ఫిర్యాదుల గురించి తెలియజేశాడు. నావికా సైనికులలో వున్న అసంతృప్తిని పసిగట్టిన నోల్స్, కింగుకు ఒక రహస్య లేఖ రాశాడు. తెలివిగా ఈ వ్యవహారాన్ని పరిష్కరించుకోవలసిందని ఆ లేఖలో సలహా ఇచ్చాడు. ఐతే కింగు దాన్ని ఖాతరు చేయలేదు. వారం రోజులు గడిచాయి ఐనా ఏమీ జరగలేదు.

ఫిబ్రవరి 16 న ఫిర్యాదు చేసిన 14 మందినీ పిలిపించాడు కింగు·తప్పుడు ఫిర్యాదులు చేయవద్దన్నాడు. వాళ్ళు చెప్పదలచుకున్నదేమీ వినలేదు. ఆ ఫిర్యాదుల గురించి పునరాలోచించుకోడానికి 24 గంటల వ్యవధి నిచ్చాడు. ఆ తర్వాత తమ వైఖరి మార్చుకోకపోతే, రాతపూర్వకంగా ఫిర్యాదులు రాసివ్వాలని కోరాడు.

ఇది పూర్తిగా బెదరింపని అర్థమైంది. దీనికి తోడు ఫిబ్రవరి 17 న నావికా సైనికులకిచ్చిన ఆహారం తిన యోగ్యంగా లేదు. వాళ్ళు అసమ్మతి తెలిపారు. ఆ రోజున వున్న డ్యూటీ ఆఫీసర్ చిన్న అధికారి. అతనంటే నావికా సైనికులకి మంట. ఎంతోమంది సమర్థులయిన భారతీయులుండగా, వారిని త్రోసిపుచ్చి. ఇతగాణ్ణి బ్రిటిష్ అధికారులు ఆ పదవిలో వుంచారు. అతనితోనైనా తమ యిబ్బందులు చెప్పుకుందామని వెళ్ళారు.

"అడుక్కునేవాళ్ళకి ఫలానిది మాకు కావాలని అడిగేహక్కు లేదు," అంటూ కూశాడు.

ఇకలాభంలేదు. శృతిమించి రాగానపడింది. నావికా సైనికులకు ఏం చేయాలో పాలుపోలేదు. అవమానం తర్వాత అవమానం సహించే స్థితిలో వాళ్ళులేరు. ఆ రోజు వాళ్ళు తిండిముట్టుకోలేదు. నిరాహారదీక్ష పూనారు. ఈ సంగతి పైఅధికారులకి తెలియదు.

## చరిత్రాత్మకమైన ఫిబ్రవరి 18

ఫిబ్రవరి 18 న ఇచ్చిన ఆహారం కూడా బాగా లేదు. ఆహారం ఉడకలేదు. అందులో ఉప్పు లేదు. ప్రతివాడూ నిశ్శబ్దంగా అసమ్మతి సూచకంగా బయటకు వెళ్ళిపోయారు.

ఆనాడు ఉదయం పెరేడ్‌కు ఎవరో కొద్దిమంది చిన్న చిన్న ఆఫీసర్లు తప్ప మరెవ్వరూ వెళ్ళలేదు.

ఆర్. ఐ. ఎన్. లో రిమోట్ కంట్రోల్ ఆఫీసు చాలా కీలకమైంది. అక్కడ జరిగే క్లాసులకు మామూలుగా నావికా సైనికులు వచ్చారు. అక్కడ వీరికి సెంట్రల్ కమ్యూనికేషన్సు ఆఫీసులో సమ్మె చేస్తున్నట్లు తెలిసింది. వాళ్ళుకూడా క్లాసుల్లోంచి వాకౌట్ చేశారు. 9-30 గంటలకు జరిగే పెరేడ్‌లో ఎవరూ పాల్గొనలేదు. దీనితో "తల్వార్" నావికా సైనికుల సమ్మె పూర్తిస్థాయికి చేరింది.

కమాండింగ్ ఆఫీసరూ తదితర బ్రిటిష్ అధికారులూ ఈ హఠాత్ పరిణామానికి ఆశ్చర్యపోయారు. భారతీయ అధికారులు తటస్థంగా ఉన్నారు. రెండు గంటలపాటు అంతా సవ్యంగానే వుంది.

11 గంటలకు భారతీయ అధికార్లు లెఫ్టినెంటు కోహ్లి, లెఫ్టినెంట్ నందాలు వచ్చి నావికా సైనికుల కోర్కెలేమిటో తెలియ చేయవలసిందిగా కోరారు. వీరిద్దరూ భారతీయులైనా, సాధారణ సైనికులతో కలిసిమెలసి తిరిగేవారు కాదు. అందుచేత వీళ్ళంటే, క్రోధావేశులై వున్న నావికా సైనికులు వీరితో మాటాడటానికి నిరాకరించారు. ఏమీ బదులు చెప్పడానికి వారు నిరాకరించారు.

రాజీ ప్రయత్నాలను సూచాయిగా తెలియచేసినా. నిరాకరించడంతో బొంబాయి ఫ్లాగ్ ఆఫీసర్ రియర్-అడ్మిరల్ రాట్రే, తల్వార్ నౌకలోకి వచ్చాడు. అతనితోపాటు ఇనిగో-జోన్స్‌కూడా వున్నారు. ఇలాంటి సమ్మెనే 1944 లో అతి క్రూరంగా అణచివేశాడు ఇతగాడు. కమాండర్ కింగ్ స్థానే ఈ ఇనిగో-జోన్సును నియమించుతానని రాట్రే వాగ్దానం చేశాడు అందుకు నావికా సైనికులు నిరాకరించారు.

ఎవరినైనా భారతీయ అధికారిని అతని స్థానంలో వేయాలని కోరారు. నావికా సైనికుల కోర్కెలగురించి వినబోననీ, వారు క్రమశిక్షణను ఉల్లంఘించుతున్నారనీ బెదిరించి వెళ్ళిపోయాడు రాట్రే.

రిమోట్ కంట్రోల్ ఆఫీసు సమ్మెమూలంగా చాలా ఇబ్బందు లేర్పడ్డాయి. దీనితో కొంత దిగివచ్చి రాట్రే తిరిగి సంభాషణలు సాగించాడు. నావికా సైనికులు 12 మంది ప్రతినిధులను పంపితే వారి ఇబ్బందులకు సంబంధించిన కోర్కెల గురించి వింటానని రాట్రే అన్నాడు. ఐతే రిమోట్ కంట్రోల్ ఆఫీసు సిబ్బంది మాత్రం సమ్మె మానివేయాలని రాట్రే షరతు పెట్టాడు. దీనికి నావికా సైనికులు అంగీకరించ లేదు. తమ సైనికుల్ని పంపితే వాళ్ళని శిక్షిస్తారనీ, అందు చేత కాంగ్రెస్, లీగ్, కమ్యూనిస్టుపార్టీలలో ఎవరైనా ఒక జాతీయ నాయకుని ద్వారా సంప్రదింపులు సాగించుదామనీ జవాబిచ్చారు. రాట్రేకి యిది అసాధ్యమైన కోర్కెగా కనిపించింది. వారి ప్రతినిధులను శిక్షించబోమని హామీ ఇచ్చాడు. ఈ వివాద పరిష్కారానికి బయటివారిని తీసుకురావటము మంచిదికాదని అన్నాడు. ఆ సలహాకు వారు అంగీకరించారు.

ఈలోగా సమ్మె వార్తను ఆలిండియా రేడియో ప్రసారం చేసింది. నావికా సైనికులు ఎక్కడికక్కడ ఈ విషయమే గుసగుసలాడుతున్నారు. రహస్య సమావేశాలు జరిగాయి. ముఖ్య నావికా సైనికుల సభలు జరిగాయి. వాద ప్రతివాదాలు సాగుతున్నాయి. ఆ రాత్రంతా ఎవరికీ నిద్రలేదు.

బొంబాయి రేవులో నావికాదళానికి చెందిన నౌకలు అరవై దాకా ఉన్నాయి. వాటికి కూడా తల్వార్‌లోని సమ్మె వార్త అందింది. ఆ నౌకల్లోనివారు కూడా మర్నాడు ఉదయం నుంచీ సమ్మెచేయాలను కున్నారు. తమ కోర్కెలను తెలియచేసేందుకు ఇద్దరు ప్రతినిధులను ఎన్నుకొన్నారు. వారి కార్యక్రమం ఇది:

తాము సమ్మె చేస్తున్నామని కెప్టెన్‌కు తెలియ చేశాక, సమ్మె కొనసాగించుతారు. తెల్లవాళ్ళ యూనియన్ జాక్ (పతాక) దించివేసి మూడు ముఖ్య జాతీయ పక్షాలకు చెందిన పతాకాలను ఎగురవేస్తారు. ప్రతి నౌక వద్దకూ వెళ్ళి నావికా సైనికుల్ని సమ్మె చేయాల్సిందిగా కోరతారు. "ఇంక్విలాబ్ జిందాబాద్" "మా కోర్కెలు తీర్చండి", "ఐ. ఎన్. ఏ. ఖైదీలను విడుదల చేయండి", "జైహింద్" మొదలైన నినాదాలను ఇవ్వాలని నిశ్చయించు కొన్నారు.

నావికా సైనికులలో ముఖ్యులంతా ప్రతి నౌకవద్దకు వెళ్ళి పై నిర్ణయాలను తెలియ చేశారు. అందరూ సమ్మెలో చేరుతామని హామీ యిచ్చారు. మర్నాడు ఏమి చేయాలా అని ఆ రాత్రంతా చర్చిస్తూ వచ్చారు, ఎప్పుడు తెల్లవారుతుందా అని ఎదురు చూడసాగారు.

ఆర్.ఐ.యన్ కి చెందిన "బరోడా" అనే నౌక కొలంబోలో వుంది. ఒక నావికా సైనికుడు యాదృచ్ఛికంగా తన వైర్‌లెస్ టెలిగ్రాఫ్ సెట్టులో బి.బి.సి. వార్తలు విన్నాడు. బొంబాయిలో ఆర్.ఐ.యన్. నావికా సైనికులు సమ్మె చేస్తున్నట్లు బి.బి.సి. తెలియ చేసింది. అతడీ వార్తను అందరికీ వ్యాపింప చేశాడు. చివరికి తెల్లవారు ఝామకి ఆ నౌకలోని వారు కూడా సమ్మె చేయాలని నిశ్చయించారు.

ఆ విధంగా భారత నౌకాదళ సైనికుల సమ్మె ఉజ్వలగాథ ప్రారంభమైంది. జాతి వివక్ష, బ్రిటిష్ అధికారుల చేతిలో అవమానాలు, నావికా సైనికుల దైనందిన బాధలు – వీటన్నిటికీ సమాధి కట్టాలని నిశ్చయించు కొన్నారు.

ఇలా నావికా సైనికులు తమ పరిస్థితులను బాగు చేసుకోడానికి ప్రారంభించిన సమ్మె రాజకీయ పోరాటంగా మారింది.

## సంఘీభావంగా సమరానికి సమాయత్తం

ఫిబ్రవరి 19 న బొంబాయి, దాని శివార్లలో వున్న భారత నావికాదళానికి (ఆర్.ఐ.యన్.) చెందిన తీరంలోని 11 సంస్థల్లోను, హార్బరులోని 60 నౌకల్లోను సమ్మె ప్రారంభమైంది దాదాపు 20 వేలమంది నావికా సైనికులు సమ్మెలో పాల్గొన్నారు.

ఫోర్ట్ బారక్స్‌లో మామూలుగానే 5-30 గంటలకు బిగిల్ వూదారు. కాని 350 మందిలో ఒక్కడూ లేవ లేదు. తర్వాత కొంతసేపటికి నావికా సైనికులు లేచారు. గుంపులు గుంపులుగా చేరి ఆరోజు తాము చేయాల్సిన పనేమిటో నిర్ణయించుకునేందుకు చర్చలు సాగిస్తున్నారు. ఉదయం పేపర్లకోసం చూస్తున్నారు. వాతావరణాన్ని పసిగట్టిన ఒక అధికారి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్, లెఫ్టినెంట్ కమాండర్ ఖాన్‌కు ఫోర్టు బారక్సు

లోని క్రమశిక్షణారాహిత్యాన్ని గురించి తెలియ చేశాడు. మళ్ళీ 6-30 గంటలకు బిగిల్ మోగింది. మామూలుగా ఇది ఊడ్చి శుభ్రంచేసే సమయం. కాని ఆరోజు ఎవరూ చీపుళ్ళను ముట్టుకోలేదు. తాము నిరాహారవ్రతంగా సాగించాలా? ముమ్ముందు ఏం చేయాలి? ఇలా ఎన్నో చర్చలు జరుగుతున్నాయి. అధికార్లు తామింకా వున్నామని ప్రదర్శించుకోటానికి అటూ ఇటూ తిరిగేవారు. ఐనా మునుపటివలె నిశ్శబ్ద వాతావరణం లేదక్కడ. తకీమని లేచి అటెన్షన్‌లో నిలబడటంలేదు. శాల్యూట్‌లు చేయటం అంతకన్నా లేదు.

కాగా నావికా సైనికుల చర్చల్లో బ్రిటిష్ అధికారుల జాతి వివక్ష, నిరంకుశత్వం చోటు చేసుకొనేవి. అంతేకాక తాము పొందిన అవమానాల్ని కూడా వారు ఒకరికొకరు చెప్పుకొనేవారు.

"నల్లలం.... కొడుకులు" "కూలీ నా కొడుకులు" "కుక్కల కొడుకులు" "అడవి నాయాళ్ళు" అంటూ తిట్లు తిట్టిన ఆఫీసర్ల నిరంకుశ వైఖరిని గురించి చర్చించుకొనేవాళ్ళు. "ఈసారి ఏమైనా నిరంకుశత్వానికి లొంగరాదు, తెల్ల ఆఫీసర్లని తోలి పారేయాలి" అని నిశ్చయించుకొన్నారు.

లెఫ్టినెంట్ కమాండర్ ఖాన్ వచ్చి, నావికా సైనికుల్ని బుజ్జగించి సమ్మె విరమింప చేయడానికి చేసిన ప్రయత్నం ఫలించలేదు. చేసేదిలేక వెనక్కి వెళ్ళిపోయాడు.

బయటికి పట్టణంలోకి వెళ్ళి ఫలాహారం చేద్దామని ఎవరో సూచించగా నావికులు బయటికి వెళ్ళారు. బడి పంతుళ్ళ కఠిన నియమాలనుంచి బయటపడ్డ బడిపిల్లల్లా హోటళ్ళలో ఫలాహారాలు సేవించడం మొదలు పెట్టారు.

కాజిల్ బారక్స్‌లో కూడా ఇదే వరస. నావికా సైనికులు పత్రికలకోసం ఎగబడ్డారు. తమ సమ్మెను గూర్చిన పతాక శీర్షికలు చదివారు. "తల్వార్"లో పరిస్థితి ఏమిటో చూచిపోదామని బయలు దేరారు. ఒక నావికా సైనికుడు చెట్టెక్కి అక్కడనుంచి ఉపన్యాసం ప్రారంభించాడు. 300 మంది దాకా గుమిగూడారు. "తల్వార్"లో జరిగిన ఘటనలు గురించి అతడు ఉపన్యసించాడు. అప్పుడే ఒకతను వంటశాలకు పప్పు తీసుకు వెళుతున్నాడు— "మనం సర్వీస్‌లో చేరిందగ్గరనుంచీ చూస్తున్నాం. ఆ పప్పు, వాసన వేస్తోంది. ఉడికీ వుడకనిది. దాన్నిండా రాళ్ళు, బొట్టు" అని అతడు వివరిస్తున్నాడు. "మనం కూడా "తల్వార్"లో లాగ నిరాహారవ్రతం సాగిద్దాం" అన్నాడొకడు. నావికా సైనికులు హర్షధ్వానాలు చేశారు. వారంతా "తల్వార్" నౌకవద్దకు ఊరేగింపుగా వెళ్లారు. ఊరేగింపులో 3 వేల మంది దాకా చేరారు. "ఇంక్విలాబ్ జిందాబాద్" "హిందూ-ముస్లిమ్ ఏక్‌హో" అంటూ నినాదాలు చేశారు.

వీరంతా అక్కడనుంచి ప్రధాన వీధికి బయలు దేరారు. ఎవరో కాంగ్రెస్ లీగ్ పతాకాలు తెచ్చారు. "కాంగ్రెస్ .... లీగ్ ఏక్ హో" "ఇంక్విలాబ్ జిందాబాద్" అని నినాదాలు చేశారు. "మనం శ్రామిక ప్రజలం. మనం ఎర్రజెండాను కూడా పెడదాం." అని మరెవరో సూచించగానే ఎర్రజెండాను కూడా చేర్చారు. ఊరేగింపు ఫోర్టు బారక్సు చేరుకుంది. అక్కడ నుంచి బోరి బందరు వెళ్ళింది. ఆ తర్వాత హారన్‌బీ రోడ్ (దాదాభాయ్ నౌరోజి రోడ్) చేరింది. షాపుల్ని మూసివేయాల్సిందిగా నావికా సైనికులు కోరారు. భారతీయ వర్తకులు షాపులు మూసివేశారు. బ్రిటిష్ దుకాణాల యజమాన్లు అందుకు నిరాకరించారు. దీనితో ఉద్రిక్తులైన నావికా సైనికులు కిటికీలు బద్దలు కొట్టారు. ఆ షాపుల్లో సామగ్రినంతా లుకొట్టారు. అమెరికా ఇన్ఫర్మేషన్ లైబ్రరీ ముం.... అమెరికా పతాకను దింపి తగలబెట్టారు. బ్రిటి ప్రభుత్వ చిహ్నంతో వున్న ఒక తపాలా మెయిల్‌వాన్‌ను ఆపి అందులోనివి బయటికి ఈడ్చి తగలబెట్టారు ఈ సందర్భంగా కొందరు యూరోపియన్లకు దెబ్బలు తగిలాయి. చివరకు ఊరేగింపు "తల్వార్" వద్దకు చేరింది. నావికా సైనికుల్ని పెరేడ్‌గ్రౌండ్‌కు రావాలని మిగతా వారంతా బయటనే వుండాలని ఎవరో లౌడ్‌స్పీకర్‌లో చెప్పారు, నావికులుగాని పౌరులంతా బయటనే వుండిపోయారు.

ఆయా నౌకలలో బ్రిటిష్ చిహ్నాలనూ, పతాకాలనూ ఎలా తొలగించిందీ, ఊరేగింపు క్రమంగా ఎలా పెద్దదవుతూ వచ్చిందీ చెప్పుకు పోతున్నాడొకడు.

చివరకు "తల్వార్"లోని సమ్మె నాయకుడు అధికారులను తాము అడగబోతున్న కోర్కెల గురించి ఇలా వివరించాడు :

1. భారత జాతీయ సైనికుల (ఐ.ఎన్.ఏ.)తో సహా రాజకీయ ఖైదీలందరిన్నీ విడుదల చేయాలి.

2. దుర్భాషలాడిన కమాండర్ కింగ్‌ను శిక్షించాలి.

3. త్వరగా సైన్యంనుంచి విడుదలచేసి, శాంతి కాలంలోని ఉద్యోగాలను సమకూర్చి వీరికి పునరావాసం కల్గించాలి.

4. రాయల్ నేవీ సైనికులకు ఇచ్చే జీతాలు, అలవెన్సులు మాదిరిగానే, భారతీయ నావికా సైనికులకివ్వాలి.

5. నాఫీ (NAAFI) కాంటీన్లకు, నావికా సైనికులందరూ వెళ్ళే హక్కుండాలి.

6. మంచి ఆహారం.

7. విడుదలయే టప్పుడు సైనికుల బట్టల 'కిట్'ను (సంచి) తిరిగి ఇవ్వనక్కర్లేకుండా చూడాలి.

8. ఇండొనీషియా నుంచి భారత సైన్యాలను ఉపసంహరించాలి.

ఈ కోర్కెలపట్ల హర్షధ్వానాలు చెలరేగాయి. ఉపన్యాసకుడు నావికా సైనికుల్ని ఆయుధాలు ధరించవద్దని విజ్ఞప్తి చేశాడు. వీధులలో ప్రశాంతంగా వుండవలసిందిగా, నావికా సైనికులకు చెప్పడానికి కొందరు వాహనాలతో బయటకు వెళ్ళారు. కొందరు పాత్రికేయులువచ్చి, 'తల్వార్'లోని పరిస్థితులు చూచి వెళ్ళారు. వీరిని మొదట కాపలాదార్లు ఆపివేశారు. కాని నావికాసైనికులు లోపలకు తీసుకువెళ్ళి అక్కడి పరిస్థితులు వివరించారు.

సాయంత్రం రెండు గంటలకు క్రమబద్ధంగా ఊరేగింపు సాగింది. ఊరేగింపులో కాంగ్రెస్, లీగ్, ఎర్ర జెండాలను పట్టుకొని బయలుదేరారు. ఊరేగింపు బొంబాయిలోని కొన్ని వీధుల్లో తిరిగి వచ్చేసింది.

సమ్మెచేస్తున్న నావికా సైనికులు తమకు సలహా ఇచ్చేందుకు అరుణా అసఫాలీని మీటింగ్‌లో ఉపన్యసించవలసిందిగా కోరారు. ఆమె నాల్గు గంటలకు వస్తుందని ఎదురు చూశారు. కాని ఎందువల్లనో ఆమె రాలేదు. ఆమె రావటంలేదని నాల్గు గంటలకు వార్త వచ్చింది. ఈలోగా రియర్ అడ్మిరల్ రాట్రే సమ్మె చేస్తున్న వారివద్దకు వచ్చాడు. గతంలో కోరిన కోర్కెలతోపాటు, కొత్త కమాండింగ్ ఆఫీసరైన కెప్టెన్ ఇనిగో జోన్స్‌ను కూడా తొలగించాలని సమ్మె నాయకులు చెప్పారు. రాట్రే ఏం మాటాడలేదు. సమయం కోసం ఎదురు చూస్తున్నాడు.

బొంబాయి ఫ్లాగ్ ఆఫీసరు తమ కోర్కెలలో ఒక్క ఆహార విషయంలో మెరుగు పరచడం మినహా మిగతావి ఏవీ అంగీకరించబోమని చెప్పాడు. ఈ విషయం సమ్మెదార్లకు చెప్పారు. రాత్రివరకు కూడా సమ్మె విషయమై తర్జన భర్జనలు జరిగాయి. కాజిల్ బారక్స్‌లో కూడా ఇదే పరిస్థితి.

నావికా సైనికులు కొందరు బయట భోంచేశారు. మిగతా వారు వంట ప్రారంభించారు. స్టోర్ బద్దలు కొట్టారు. వంటచెరకు దొరక్కపోతే ఆఫీసు సామగ్రి ముక్కలుచేసి మంట బెట్టారు.

ఆ రాత్రి హమ్లా అనే నౌకలోని నావికా సైనికులు కూడా ఊరేగింపుగా కాజిల్ బారక్సుకు చేరారు. నినాదాలు, ఉపన్యాసాలు, సంఘీభావ ప్రదర్శనలు కొనసాగాయి.

"మనం జయించి తీరుతాం" అని హర్షధ్వానాల మధ్య నావికా సైనికులు నినాదా లిచ్చారు.

## బ్రిటిష్‌వాళ్ళ ఎదురుదాడి

ఫిబ్రవరి 20 న ఫోర్ట్ బారక్సులో నిరశనవ్రతం చేయాలా లేదా? చేస్తే బలహీన పడినవారు ఎలా బ్రిటిష్ వాళ్ళతో పోరాటం సాగిస్తారు? ఇలా తర్జన భర్జనలు జరిగి చివరకు తమ వంట తామే వండుకొని తినాలని నిశ్చయించుకొన్నారు. వంటవాళ్ళకు నచ్చచెప్పారు. ఉదయం ఫలాహారాలు ముగిశాయి. కాంగ్రెస్, లీగ్, కమ్యూనిస్టు జెండాలతో బారకాసులనుంచి ఊరేగింపుగా బయలుదేరారు. మూడు వరసల్లో క్రమ శిక్షణతో వీధులగుండా కవాతుచేసుకొంటూ 'తల్వార్' వైపు వెళ్ళారు.

కాజిల్ బారక్స్‌లో కూడ నావికా సైనికులు ఫలహారాలు ముగించుకొని, కొందరు ప్రతినిధులు 'తల్వార్' వద్దకు వెళ్ళారు. ఈలోగా గోండ్‌వానా నౌకనుంచి ప్రతినిధులు అక్కడికి వచ్చారు, భారతీయుడైనా లెఫ్టినెంట్ కమాండర్ రషీద్ తమను ఎలా బెదిరించిందీ చెప్పారు. ఐనా వారంతా సమ్మెచేశారు. వంటవాళ్ళూ సమ్మెచేశారు. "మేం పోరాడవలసివస్తే తిండిలేక బలహీనంగా వుండి ఎలా పోరాడగలం? కనుక మీరు వండిపెట్టండి. మీరు సహాయపడేది బ్రిటిష్ వాళ్ళకు కాదుకదా?" అని నచ్చచెప్పారు. వంట వాళ్ళంతా

సమావేశమై ఒక నిర్ణయానికి వచ్చారు. నావికా సైనికులు పోరాటం ప్రారంభిస్తే, అపుడు తమకు కూడా ఆయుధాలు ఇవ్వాలని వారు కోరారు. ఆ షరతుకు అంగీకరించాక వంది పెట్టారు.

'తల్వార్' నౌకవద్దకు వరుసగా ఊరేగింపుగాతో వివిధ నౌకలకు చెందిన వారు వచ్చారు క్రితంరోజు క్రమ శిక్షణా రాహిత్యాన్ని కొందరు విమర్శించారు. సమ్మె కమిటీ అధ్యక్షుడు తమ కోర్కెలు నెరవేర్చేదాకా సమ్మె కొనసాగుతుం దన్నాడు. కొత్తగా ఏర్పడ్డ నౌకా సమ్మె కేంద్ర కమిటీ సభ్యుడొకడు ఇలా ఉపన్యసించాడు:

"మన పోరాటం బ్రిటిష్ సామ్రాజ్యంమీద గత ఆరేళ్ళుగా బ్రిటిష్ అధికార్లు మనల్ని కుక్కల్లాగా చూశారు. మన కోర్కెల కోసమేగాక దేశ స్వాతంత్ర్యానికి కూడా పోరాడాలి. అందువల్ల ఐ.యన్.ఏ. ఖైదీల విడుదలకోసం కూడా పోరాడాలి" అని అతడన్నాడు. మరో నావికా సైనికుడు "అవసరమైతే, స్వాతంత్ర్యంకోసం, మన ప్రాణాలర్పిద్దాం కాని, బ్రిటిష్ వాళ్ళకు బానిసలుగా వుండరాదు" అని ఉద్బోధించాడు. "ఇంక్విలాబ్ జిందాబాద్" "లొంగి పోరాదు" అనే నినాదాలు మిన్నుముట్టాయి.

నావికా సమ్మె కేంద్ర కమిటీకి అధ్యక్షునిగా యం. యస్. ఖాన్‌ను ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు. మరో నలుగురిని రాయబార కమిటీగా ఎన్నుకొన్నారు. నావికా సైనికుల కోర్కెలను సిద్ధపర్చారు. ఐ.యన్.ఎ. ఖైదీలను విడుదల చేయాలనీ, ఇండొనీసియా నుంచి సేనలు వైదొలగాలనీ, మరో రెండు కోర్కెలను కూడా తమ కోర్కెల జాబితాలో చేర్చారు.

ఢిల్లీనుంచి ఆర్. ఇ. యన్. ఫ్లాగ్ ఆఫీసర్, వైస్ అడ్మిరల్ గాడ్‌ఫ్రే వచ్చాడని విని, ఈ విషయాలన్నీ ఆయనకు తెలియచేయాలని నిశ్చయించుకొన్నారు.

కార్మికులు, విద్యార్థులు కూడా వీరికి సానుభూతిగా సమ్మెచేయ నున్నారని సమ్మె కేంద్ర కమిటీ సభ్యులకు తెలియచేశారు. మధ్యాహ్నం 12 గంటల దాకా సమ్మె కేంద్రకమిటీ సమావేశమైంది. మీటింగ్ జరుగుతున సమయంలో చుట్టుపక్కల భవనాలపై ఎక్కిన జన సమూహం వీరిపట్ల సానుభూతిగా హర్షధ్వానాలు చేస్తూనే వుంది.

ఈలోగా అక్బర్ అనే నౌక నుంచి 3500 మంది నావికా సైనికులు వచ్చారు. 1944 లో వీరు సమ్మె చేశారు. ముస్లిం నావికా సైనికులు తమకు ప్రార్థన చేసుకోడానికి సమయం ఇవ్వ నిరాకరించినందుకు సమ్మె చేశారు. వీరికి సానుభూతిగా హిందూ నావికా సైనికులు కూడా సమ్మె చేశారు దీనికిగాను అప్పుడు 200 మందిని డిస్మిస్ చేశారు. 12 న్నర గంటలకు అధికారులు పెరేడ్ ఏర్పాటు చేశారు. ఒక అధికారి మాట్లాడుతూ క్రమశిక్షణా రాహిత్యాన్ని సహించబోమని బెదరించాడు. నావికా సైనికులకు కోపం వచ్చింది. ఐనా కోపంతో, హృదయ భారంతో పనుల్లోకి వెళ్ళారు.

మర్నాడు నావికా సైనికులంతా సమ్మె చేయాలని నిశ్చయించారు ఎవరూ మర్నాడు ఉదయం ఫలహారాలు ముట్టలేదు. అధికారులు కంగారుపడి వారిని ఫలాహారం చేయవలసిందిగా బతిమాలారు. కాని ఎవరూ లొంగలేదు. తొమ్మిదిగంటలకు పెరేడ్ గ్రౌండ్ వద్ద, నావికా సైనికులు గుమికూడారు. 'తల్వార్' నౌకవద్దకు వెళ్ళాలని వారి పట్టుదల. ఐదు మైళ్ళ దూరం వుంది. అందుకని దానా స్టేషన్ వరకైనా తమకు వాహనాల సౌకర్యం కల్పించాలని అడిగారు. కాని అధికారులు నిరాకరించారు. అక్కడున్న లారీలలో సరుకుల్ని ఖాళీచేసి, కొందరు నావికా సైనికులు వాటిని బయటకి తీసుకుపోయారు. ఇంకా కొంత మంది ఎటూ తేల్చుకోలేక అలాగే వుండిపోయారు. ఇంతలో ట్రాంబేవద్ద వున్న "చీతా" నౌకను సైనికులు ముట్టడించారన్న వార్త చేరింది.

ఈ వా వినడంతోనే నావికా సైనికులు మండిపడ్డారు. గా రూమ్‌కి వెళ్ళి ఖైదీలను విడిపించారు. దాన్ని తగు బెట్టారు.

కొంతమంది భారతీయ అధికారులు నావికా సైనికుల్ని ఇలా ప్రవర్తించ ద్దని, బయటకు వెళ్ళవద్దని చెప్పారు. వెళితే అరెస్టు చేస్తామని బెదిరించారు. దీన్ని లెక్కచేయకుండా, కాలినడకను బయలుదేరారు నావికా సైనికులు. కాంగ్రెస్, లీగ్, కమ్యూనిస్టు జెండాలతో ఊరేగింపు సాగింది.

"హిందూస్థాన్ ఆజాద్, స్వతంత్ర భారత్"
"ఐ. ఎన్. ఏ. నాయకుల్ని విడుదల చేయండి"
"మా కోర్కెలు తీర్చండి"

"హిందూ-ముస్లిమ్ ఏక్ హో"
"బ్రిటిష్ సామ్రాజ్యవాదం నశించాలి"
"ఇంక్విలాబ్ జిందాబాద్" (విప్లవం వర్ధిల్లాలి)
ఇలా నినాదాలు చేసుకుంటూ రైల్వేస్టేషన్ చేరారు. రైలు పెట్టెలలో 'తల్వార్' సమ్మె గురించి ప్రయాణీకులకు వివరించారు. ఒంటిగంటకు "తల్వార్" చేరారు.

సమ్మె కేంద్ర కమిటీకి, ఫ్లాగ్ ఆఫీసర్ కమాండర్‌కీ మధ్య రాయబారాలు జరుగుతున్నట్లు నావికా సైనికులు విన్నారు.

కాని ఇంతలోనే 3-30 గంటలకల్లా అందరూ తమ తమ నౌకల్లోకి వెళ్ళాలని లేకపోతే అరెస్టు చేస్తామని ఫ్లాగ్ ఆఫీసర్ చేసిన ఉత్తర్వు విని, ఆగ్రహావేశులయ్యారు. సమ్మె కేంద్ర కమిటీ ప్రతినిధి ఒకరు చెప్పిన సలహా ననుసరించి విచారంతో, మౌనంగా నావికా సైనికులు చెదిరిపోయారు.

ఈలోగా బ్రిటిష్ అధికారులు మిలటరీ గార్డులను అనేకచోట్ల నియమించారు. మూడుగంటలకు నావికా సైనికుల్లో ఎక్కువభాగం తమ తమ నౌకల్లోకి వెళ్ళారు. కొద్దిమంది బయట మిగిలిపోయారు. పోలీసులు వారిని పట్టుకొని లారీలలో 'తల్వార్' వద్దకు తీసుకువచ్చారు. బ్రిటిష్ దాడి అలా ప్రారంభమైంది. ఐతే పరిస్థితులు చేయిజారకుండా వుండేందుకు జాగ్రత్తపడుతున్నారు.

ఆ రాత్రంతా నావికా సైనికులేమిచేస్తారో చూద్దామని అధికారులూ, వారేమిచేస్తారో చూద్దామని నావికా సైనికులూ పరస్పరం ఎదురుచూస్తూవచ్చారు.

నావికా సమ్మె కేంద్ర కమిటీకి, మరాఠా సైనికులు కాజిల్ బారక్సును చుట్టుముట్టిన వార్త, ఇతర స్థలాలకు సైనికులు వచ్చిన వార్త తెలిసింది. నావికా సైనికులను దిగ్బంధం చేశారు. బయటి ప్రపంచంతో సంబంధం లేదు. సాయుధ దళాలను, పోలీసులను ఇలా పిలవడం రెచ్చగొట్టే చర్య అంటూ సమ్మె కమిటీ ఖండించింది. ఎంత రెచ్చగొట్టినా హింసా చర్యలకు పూనుకోవద్దని విజ్ఞప్తి చేసింది.

సాయుధ దళాలను చూడగానే కాజిల్ బారక్సులోని నావికా సైనికులు ఉద్రిక్తపడ్డారు. వారిని నాయకులు సముదాయించి శాంతపర్చారు. ఏదైనా సమష్టిగా చేయాలిగాని, ఎవరి కిష్టం వచ్చినట్టు వాళ్ళు చేస్తే, అది శత్రువుకు ఉపయోగపడుతుందని చెప్పారు. ఇది వారికి నచ్చింది. కాని అక్కడ వున్న ఆయుధాల్నీ, మందుగుండు సామగ్రినీ కాపాడుకొనేందుకు తమ స్వంత కాపలాదార్లను పెట్టారు.

ఫోర్ట్ బారక్సులో ఆయుధాలు లేవు. అందుకని నావికా సైనికులు ఊరేగింపు నుంచి రాగానే తమ సామాను సర్దుకొని కాజిల్ బారక్సుకి పోవడానికి కొందరు సిద్ధపడ్డారు. అలా పోకుండా ఇక్కడే ఉండాలని ఒకవేళ పోరాటమే తప్పనిసరైతే, పౌరదుస్తుల్లో బయటికివెళ్ళి, బయటివారి సహాయం అర్థించవచ్చనీ మరికొందరు అన్నారు. చివరకు అంతా అక్కడే వుండి పోడానికి నిశ్చయించారు.

హిందూ ముస్లిం తగాదా వుందని చెప్పి, మరాఠా సైనికుల్ని అక్కడికి తీసుకువచ్చారు. అసలు విషయం తెలిశాక వారు తమ సోదరులపై కాల్పులు సాగించబోమని చెప్పారు. దీనితో వీరు సంతృప్తి పడిపోయారు.

గోండ్‌వానా నౌకలో హింసాయుత ప్రతిఘటనా, అహింసాయుత ప్రతిఘటనా అని వాదోపవాదాలు జరిగాయి. చివరకు బ్రిటిష్‌వాళ్ళు దాడి జరిపితే మాత్రం సాయుధ ప్రతిఘటన సాగించాలని నిర్ణయించుకొన్నారు. అలా ఆయుధాలు చేపట్టేముందు శత్రువును బయటకి పోవలసిందిగా హెచ్చరిస్తారు. ఇది అహింసావాదులను దృష్టిలో పెట్టుకొని చేసిన చర్య.

ఉన్న ఆయుధాలు, మందుగుండు సామగ్రి లెక్కలు తయారుచేశారు. ఆఫీసర్లు నౌకల్ని వదలిపెట్టి వెళ్ళిపోయారు. అక్కడ ఆయుధాలుగానీ, మందుగుండు సామగ్రికాని ఎక్కువగా లేదు. తర్ఫీదుకోసం వుంచిన కొద్ది ఆయుధాలు, మందుగుండు సామగ్రి మాత్రమే వుంది.

యుద్ధానికి ఎవరెక్కడ నిలబడాలో అంతా సంసిద్ధం చేశారు. రాత్రిళ్ళు నౌకల రాకపోకలు తెలుసుకొనేందుకు కాపలా వుంచారు.

ఈ లోగా రాయబారాలు విఫలమయ్యాయి. సైనిక గార్డులను తొలగించడానికి అధికార్లు అంగీకరించలేదు. లొంగిపోతామని హామీ ఇస్తే, సైనిక గార్డులను తొలగించుతామని, సైనికాధికారులు గాడ్‌ఫ్రే, రాత్రేలు జవాబిచ్చారు. ఒక్క ఆహార విషయంలో తప్ప మిగతా కోర్కెల్ని ఆమోదించబోవటం లేదని వార

న్నారు. అధికారులు బుద్ధి పూర్వకంగా వ్యాపింపచేసే నీలి వార్తల్ని నమ్మవద్దంటూ, రాయబార వర్గ సభ్యులు తమ అనుచరులకు ఆదేశాలు పంపారు.

నావికా సైనికులు తమతమ నౌకల దగ్గరకు వెళ్ళి తుది పోరాటానికి సన్నద్ధమౌతున్నారు. 'తల్వార్'లోని సైనికులకు అప్పుడే సమ్మె భారత దేశమంతటికీ వ్యాపించిందనీ, మారుమూల రేవుల్లోని నౌకల్లో కూడా సమ్మె చేస్తున్నారన్న వార్త తెలిసింది.

ఈ వాతావరణంలో నావికా సైనికులు సమావేశమయ్యారు. ఆహార పరిస్థితి విషమించుతోంది. ఆయుధాలు ఎన్ని వున్నాయనే విషయం వాళ్ళు పట్టించుకోలేదు. జాతీయ నాయకులు వచ్చి ఏదో విధంగా పరిష్కరిస్తారనీ, ఆయుధాలు పట్టుకోవాల్సిన అవసరం లేదనీ వారు భావించారు.

రాత్రి పదిగంటలయ్యే సరికి కాజిల్ బారక్సులో సుమారు 5 లేక 6 వేలమంది దాకా నావికా సైనికులు గుమిగూడారు. వారంతా చర్చిస్తుండగా, ఒక ఆఫీసర్ వచ్చి, ఆహార విషయంలో నావికా సైనికులు కోరినట్లు జామ్, వెన్న, కోడిగుడ్లు, తాజాపళ్ళు ఇస్తామనీ ఇతర కోర్కెలకు పట్టుబట్టకుండా సమ్మె విరమించవలసిందిగా కోరాడు కాని ఎవరూ సమాధాన మివ్వలేదు.

ఇంతలో ఒక లారీ నిండా ఆహార పదార్థాలు వచ్చాయి. కాని వాటిని ఎవరూ ముట్టలేదు.

ఈ లోగా ఆర్. ఐ యన్. డాక్ యార్డ్సులోని వారు, మిలటరీ గార్డుల్ని ఉపసంహరించక పోతే, ఫిబ్రవరి 19 నుంచి నిరశన వ్రతం సాగిస్తామని పట్టుబట్టారు. ఆ రాత్రి డ్యూటీకి వెళ నిరాకరించారు. మర్నాడు సైనిక కవాతు. నావికా నికులు రాకపోతే బలప్రయోగం చేయాలని అధి నిశ్చయించుకొన్నారు. కాని అందరూ కవాతు వెళ్ళి, వాళ్ళని ఆశ్చర్య పరచారు అంతేకాదు బోట్లవద్దకు పరుగెత్తి, వాటిలో ఎక్కి ఉడాయించాలని చూశారు. కాని బోట్లు నడపాలంటే, మెకానికల్ ఇంజనీరు సహాయం కావాలి. అతణ్ణి కమాండింగ్ ఆఫీసరు పోనివ్వలేదు. బయటికి పోవాలన్న వాళ్ళ ప్రయత్నం ఫలించలేదు.

ఉద్రిక్తులైన నావికా సైనికులు యూనియన్ జాక్ కిందికి లాగి తగలబెట్టారు. బ్రిటిష్ వ్యతిరేక నినాదాలు చేశారు. దీనితో అధికార్లు కంగుతిన్నారు. ఎలాగో నావికా సైనికులు బోట్లను నడిపించ గల్గారు. సాయంత్రానికి కాజిల్ బారక్స్‌కు చేరారు.

అంతా ఆ రాత్రంతా తుది సమరానికి ఆయత్తమవుతున్నారు.

## ఫిబ్రవరి 21 నాటి ఘటనలు

ఫిబ్రవరి 21 న ఫోర్ట్ బారక్సులో నావికా సైనికులు సమావేశమై వుండగా ఒకాయన హఠాత్తుగా వచ్చి "కాజిల్ బారక్సులో మన సోదరుల్ని కాల్చి చంపుతున్నారు. వాళ్ళకి సహాయంగా మనం వెళ్ళాలి" అంటూ అరిచాడు. ఏం చెయ్యాలన్నది సమస్య. అక్కడికి చేరటం ఎలా, చేరేలోగానే బ్రిటిష్ అధికారులు కాల్చి చంపవచ్చు. సాయుధ ప్రతిఘటన సాగించుతూ పోవాలంటే ఎన్ని ఆయుధాలున్నాయో, ఏమో. ఇలా తర్జన భర్జనలు జరుగుతున్నాయి. పెద్దవాళ్ళు వాస్తవ పరిస్థితుల్ని వివరిస్తున్నారు. యువకులు బరితెగించి ముందుకు పోదాం అంటున్నారు. అవతలి కాల్పులు చెవుల్లో గింగురుమంటున్నాయి. కార్యాచరణకు కదిలారు నావికా సైనికులు.

ఆరోజే పత్రికలో ఒక వార్త వచ్చింది. బొంబాయి విద్యార్థి సంఘం 22 న సానుభూతి సమ్మె జరపవలసిందిగా బొంబాయి పౌరులకు విజ్ఞప్తి చేసింది. ఇది చూచిన కొందరు నావికా సైనికులు పౌరదుస్తుల్లో బయటకు వెళ్ళి ఇక్కడి పరిస్థితులను ప్రజలకు వివరించి, వారి సానుభూతిని పొందాలని సూచించారు. ఆ సూచనకు అంతా అంగీకరించారు. ఇద్దరు మాత్రం కాజిల్ బారక్సులో విషయాలు తెలుసుకొనేందుకు పౌరదుస్తుల్లో బయలు దేరారు.

సమ్మెదార్ల పట్ల సానుభూతిగల కాపలాదార్లు వాళ్ళు వెళ్ళటం చూసీ చూడనట్లు వూరుకొన్నారు. డాక్‌యార్డుకి కూడా ఈ వార్త చేరింది. కాజిల్‌బారక్స్ వైపు అంతా చూస్తున్నారు. ఒక యువ సిగ్నలర్ సమీపంలోని ఇళ్ళ పైకప్పులనుంచి 'తమను' బ్రిటిష్ సైనికులు అన్ని వైపులనుండి తుపాకులతో కాల్చుతున్నారనీ, తాము జవాబుగా ఎదురు కాల్పులు సాగిస్తున్నామనీ వార్తను సిగ్నల్స్ ద్వారా అందచేశాడు. ఈ వార్తను డెక్ సిగ్నలింగ్ స్టేషన్‌కు చేరవే ·గా అది అన్ని నౌకలకు, కార్యాలయాలకు ఈ వార్తను అందచేసింది. వెంటనే నావికా సైనిక

ఎక్కడివాళ్ళక్కడ తమ నౌకల్లోకి వెళ్ళిపోయారు. ఆయుధ గి ంగిని బద్దలు కొట్టి దొరికినంత మ కు తీసుకొన్నా . ఒక గంటలో పోరాటానికి సి మై, ఆయా స్థలాల్లో వుండిపోయారు. కాజిల్ బారక్స్ వైపు పోతున్న బ్రిటిష్ సైనికుల ముఖాల్లోని ఆందోళనా ఛాయల్ని చూస్తూ వున్నారు.

అదే సమయంలో కాజిల్ బారక్సు సమీపంలోని టౌన్ హాల్ వద్ద బ్రిటిష్ సైన్యాన్ని కేంద్రీకరించి వుంచారు.

ప్రధాన ద్వారానికి దగ్గరలో వున్న మరో కావలా సైనికుల్ని సమీపించి కొందరు "మనం మనం సోదరులం, భారతీయులం. మనలో మనం పోట్లాడుకోరాదు. మాకోసమే కాక మీకోసం కూడా మేం పోట్లాడుతున్నాం" అంటూ నచ్చచెప్పడానికి ప్రయత్నించారు. "మీ పైన కాల్చం, వృత్త తూటాలే వీటిలో వున్నాయి. పై అధికార్ల ఆజ్ఞల మేరకే ఇక్కడ వున్నాం" అని వారు జవాబు చెప్పారు.

తర్వాత ఏం జరిగిందో తెలియదు గాని, తుపాకి కాల్పులు ప్రారంభమయ్యాయి. నావికా సైనికులు హఠావిడిగా గార్డు రూముకు పరుగెత్తి ఆయుధాలు తీసుకొన్నారు. అందరూ యుద్ధభూమిలో లాగ "పొజిషన్"లో పడుకొన్నారు. మరాఠా కావలా సైనికులపై అధికారం చెలాయిస్తున్న తెల్ల సైనికాధికారులు కంగుతిన్నారు. తమ సిపాయిలను వెనక్కి పంపించారు.

కాస్త వ్యవధి దొరకడంతో నావికా సైనికులు తమ తమ ఆయుధాలను, వాటిని బాగా ఉపయోగించగల సైనికులకు పంచారు. సుశిక్షిత సైనికుల్లాగా తమ నాయకుల ఆజ్ఞలను అమలులో పెట్టారు.

జైలు తలుపులు బద్దలకొట్టి ఖైదీలను విడుదల చేశారు. అదిచూచి తెల్ల అధికారులు కాల్పులు సాగించారు. నావికా సైనికులు తిరుగు కాల్పులు సాగించి పోరాటానికి తమ సంసిద్ధతను తెలియపర్చారు.

మరో ఆయుధ గిడ్డంగిని బద్దలుకొట్టారు. మరికొన్ని ఆయుధాలు దొరికాయి. ఈ సారి మీడియం మెషిన్‌గన్లు కూడా దొరికాయి. ఆయుధాలను పంచిపెట్టారు. కాజిల్ బారక్సు చుట్టూ రక్షణ స్థానా లేర్పరచుకొని సంసిద్ధంగా వున్నారు.

అటువైపు బ్రిటిష్ సైన్యం కూడా చిన్న చిన్న ముఠాలను నాలుగైదు చోట్లకు పంపి దెబ్బతీయాలని చూసింది. మరాఠా కావలా సైనికులు తమకు తోడ్పడరని నమ్మకం ఏర్పడగానే వారిని పంపించివేసి, అచ్చంగా బ్రిటిష్ సైనికులను తీసుకువచ్చారు. నిజానికి మరాఠా సైనికులు తమ సోదర సైనికులపై కాల్పులు సాగించేందుకు నిరాకరించారు.

పోరాటం ప్రారంభమైంది. రిజర్వుబ్యాంక్ బాల్కనీ నుంచి వుత్తర్వులిస్తున్న ఒక నావికాధికారిని ఒక్క గుండుతో ఠామ్మనిపించారు. గేటువద్ద నున్న మరొకడు కూడా అలాగే గుండుదెబ్బకు మరణించాడు. ఇంటిపై భాగానికి వెళ్ళేందుకుగాను ఒకచెట్టెక్కుతున్న మరో సైనికుడు కూడా హతమయ్యాడు

గాడ్ ఫ్రే, దాడిని పూర్తిగా ముమ్మరం చేయాలనుకొన్నాడు. భారతీయ సైనికులందర్నీ తొలగించి వారి స్థానంలో బ్రిటిష్ వాళ్ళను పెట్టాడు. 17 లారీలు, సాయుధశకటాలు, మెషిన్‌గన్‌లూ, రైఫిళ్ళూ తదితర ఆయుధాలతో రంగంలోకి దిగాయి, ఇరుపక్షాలా కాల్పులు ప్రారంభమయాయి నావికా సైనికులకు తమ వ ఎక్కువ ఆయుధాలు లేవని తెలుసు. ఐనా, తమకు ఉ ర్వులిచ్చే అధికార్లు గాని, ప్రవీణులుగాని ఎవరూ లే ండానే వీరోచితంగా పోరాడటానికి, ఆత్మాహుతికి సంసిద్ధమయారు.

బ్రిటిష్ సైనికుల కేంద్రీకరణను ఒక మూలనుంచి, తొంగి చూస్తున్న కృష్ణన్ అనే సైనికుడు ఈ పోరాటంలో మొట్ట మొదట బలి అయ్యాడు. స్వాతంత్ర్య రక్షణకోసం, స్వరక్షణకోసం సాయుధ ప్రతిఘటన సాగించిన మొట్ట మొదటి ఈ అమరవీరుడు యాదృచ్ఛికంగా దాక్షిణాత్యుడవటం మనకు గర్వ కారణమే.

ఇరుపక్షాలా పోరాటం కొనసాగింది. నష్టాలు ఇరుపక్షాలకూ సంభవిస్తున్నాయి. నావికా సైనికులకు ఇరుగు పొరుగున పౌరులు సహాయం చేయ ప్రయత్నించారు. కార్మికవర్గ యువకులు సహాయ పడటానికి తమ ప్రాణాలకు ముప్పు అని తెలిసి కూడా సిద్ధమయారు. ఒక యువకుడు ఆ విధంగానే ప్రాణాలు కోల్పోయాడు.

బ్రిటిష్ సైనికులు టౌన్‌హాల్ నుంచి రెండవ దాడి ప్రారంభించారు. తేలిగ్గా మోసుకు వెళ్ళగలిగే మెషిన్ గన్‌లను ఉపయోగించారు. కానీ నావికా సైనికుల్లో "అనేక యుద్ధముల నారియు తేరిన" ధీరులున్నారు

వారు ఎదురు కాల్పులు సాగించగా ఆ మెషిన్‌గన్‌ను ఉపయోగిస్తున్న ఇద్దరు సైనికులు గాయపడి ఆస్పత్రి పాలయ్యారు. మెషిన్‌గన్ పీక నొక్కి వేసినట్లయింది. బయటనుంచి ఆయుధాలతోనే కాక లోపలికి తమ గూఢ చారుల్ని పంపి ప్రతిఘటనను అంతం చేయాలని అధి కారులు ప్రయత్నించారు. అలాంటి వారిద్దర్ని పట్టుకొని, అధికారులు సైనికులకు స్వల్ప నేరాలకి విధించే శిక్ష లాంటి శిక్షనే విధించారు. డిఫెన్సన్ బారక్స్ దాకా పరుగెత్తించారు. కాపలాదార్లతో వాళ్ళను ఆస్పత్రికి పంపారు.

పదిగంటల ప్రాంతంలో సమ్మె కమిటీ అధ్యక్షుడు ఖాన్ వచ్చాడు. కుమాంవ్ అనే నౌక నెక్కి మైక్‌లో బ్రిటిషు అధికార్లను నౌకలు వదలి వెళ్ళిపోవలసిందిగా విజ్ఞప్తి చేశాడు. భారతీయ అధికార్ల నుద్దేశించి మాట్లాడుతూ "జీవన్మరణ సంగ్రామం" లో చేరవల సిందిగా కోరాడు లేదా బ్రిటిషు వాళ్ళలాగానే, వారు కూడా వెళ్ళిపోవాల్సిందిగా కోరాడు. నౌకలన్నీ కదల డానికి సిద్ధంగా ఇంజన్లను సిద్ధం చేయాల్సిందిగా కోరాడు. పదిన్నరకల్లా నౌకలు సిద్ధమయాయి. గొట్టాల్లోంచి పొగవస్తోంది. నౌకలపైన ఫిరంగులను అమర్చి సిద్ధం చేశారు. సముద్రంలోంచి బ్రిటిషువాళ్ళు ఏవైనా నౌకలు పంపితే వాటిని ఎదుర్కొటానికి అన్ని వైపులా సమ్మెదార్లు తమ నౌకల్ని సంసిద్ధం చేసు కొన్నారు. ఇక ఆహారం, నీరు మాత్రమే సమస్య. వాటిని కూడా బయట ప్రజలు తండోప తండాలుగా వచ్చి, ఇచ్చి పోతున్నారు. వాటిని తీసుకోగల్గడమే సమస్య, అక్కడ కాపలా వుండే మరాఠా సైనికులు జోక్యం చేసుకోలేదు. అందుకని మొదట కొన్నాళ్ళు ఆహార సమస్య అంతగా ఇబ్బంది కల్గించలేదు.

సాయంత్రం ఒకటిన్నర గంటల ప్రాంతంలో బ్రిటిషువాళ్లు దాడి ప్రారంభించారు; కిందనుంచే కాక, ఇండ్ల పైకప్పులకెక్కి కూడా కాల్చటం ప్రారంభిం చారు. ఇంతలో నావికా సైనికులు, వారి అధీనంలోని నౌకలు గుండ్లవర్షం కురిపించి శత్రువుదాడిని నిలవ రించగల్గారు.

## కాల్పుల విరమణ

ఆర్. ఐ. యన్. కమాండింగ్‌ఫ్లాగ్ ఆఫీసర్ 2-30 గంటలకు నావికా సైనికులకు హెచ్చరికను ప్రసారం చేశాడు. బేషరతుగా వారిని లొంగి పొమ్మ న్నాడు. ప్రభుత్వం వద్ద అధిక సైన్యాలున్నాయని, నౌకలు నాశనమైనా సరే వారిని పూర్తిగా ఉపయోగిస్తా మని బెదిరించాడు.

మరి కొంత సేపటికి సమ్మె కమిటీనుంచి కూడా "కాల్పుల విరమణ" చేయాల్సిందిగా ఆదేశం వచ్చింది. సమ్మె కమిటీ అధ్యక్షుడు కూడా తాము చర్చలు జరుపుతున్నామని, అందాకా శాంతియుతంగా వుండాలని కోరుతూ సందేశం పంపాడు.

ఈ లోగా, ఆర్. ఐ. యన్ కమాండింగ్ ఫ్లాగ్ ఆఫీసర్ స్వయంగా వస్తున్నాడని వార్త వచ్చింది. నావికా సైనికులు తాము తమ ప్రతినిధుల్ని ముగ్గుర్ని పంపుతామనీ, వారి చేతుల్లో తెల్ల జెండా ఉంటాయనీ, అలాగే అధికారులు కూడా తెల్ల జెండాలతో రావాలనీ కోరారు.

5-30 గంటలకు ముగ్గురు నావికా సైనికులు కాజిల్ బారక్స్ నుంచి తెల్ల జెండాలు పుచ్చుకొని బయలు దేరారు. కాని ఫ్లాగ్ ఆఫీసర్ ఎక్కడా వస్తాలేదు. చివ రికి ఒక ముప్పావు గంటయిన తర్వాత సమ్మె కమిటీ సభ్యులు కొందరు, చేతుల్లో తెల్ల జెండాలు పుచ్చుకొని వున్న కొందరు అధికార్లను వెంట బెట్టుకు వచ్చారు.

జాతీయ నాయకుల మధ్య రాయబారాలు జరుగు తున్నాయని, నావికా సైనికులు శాంతంగా వుండాలనీ వారు కోరారు. ఇష్టం లేకపోయినా వారందుకు అంగీక రించారు. ఐతే కాల్పుల విరమణకు అంగీకరించారేకాని లొంగిపోడానికి ఇష్ట పడలేదు. అన్ని నౌకలపైన వారికి సంబంధించిన సంస్థలపైన కాల్పుల విరమణ జెండాలను ఎగురవేశారు.

## బొంబాయి ఫ్లాగ్ ఆఫీసర్‌కు పరాభవం

ఈలోగా బొంబాయి నౌకల ఫ్లాగ్ ఆఫీసర్, డెక్ సిగ్నల్ స్టేషన్‌ను పర్యవేక్షించడానికి బయలుదేరాడు. నావికా సైనికులు పెట్టిన కాపలాదార్ల కెప్టెన్, గేటు వ అతన్నీ, అతనితో పాటు వున్న ఇతర అధి — నూ నిలిపివేశాడు. తమ నెత్తిన వున్న టోపీలు తొ గించి నడవాలని చెప్పాడు. ఇది తనకు తమ వారిచ్చిన ఆదేశం అని చెప్పాడు. చేసేది లేక వారం దరు అంగీకరించారు. వారికి రక్షణగా ఆరుగురు సాయుధ నావికా సైనికుల్ని ఇచ్చి పంపాడు కెప్టెన్.

ఫ్లాగ్ ఆఫీసర్‌ను చూడగానే నావికా సైనికులు "వెనక్కి వెళ్ళిపో ఫ్లాగ్ ఆఫీసర్" "మా కోర్కెల్ని తీర్చండి" అంటూ నినాదాలిచ్చారు.

ఎంత చక్కటి అతిథ్యం అధికార్లకు! వారంతా వచ్చిన దారే పట్టారు!

ఈలోగా నావికా సైనికులకు అనేక వార్తలందుతూ వచ్చాయి. కరాచీలో హిందూస్థాన్ నౌకలో సాయుధ ప్రతి ఘటన జరిగింది. బ్రిటిష్ ప్రధాని అట్లీ, బ్రిటిష్ నౌకల్ని బొంబాయి పంపుతున్నట్లు పార్లమెంట్‌లో ప్రకటించాడు. ఈ బెదిరింపు వార్త కూడా రేడియోలో నావికా సైనికులు విన్నారు బొంబాయి, కరాచీ, పూనాలకు నౌకల్ని, సైనికుల్ని ఇతోధికంగా పంపుతున్నట్లు ప్రధాన కార్యాలయం చేసిన ప్రకటన కూడా విన్నారు.

ఈ బెదిరింపులు దృష్టిలో పెట్టుకొని కేంద్రసమ్మె కమిటీ వివిధ రాజకీయ పార్టీలకు, ప్రజలకూ ఒక విజ్ఞప్తి చేసింది. అందులో తాము నౌకా సైన్యంలో ఇన్నేళ్ళుగా పడ్డ బాధలు వివరించారు. చెప్పనలవికాని కష్టాలు, తక్కువ జీతం, పనికి మాలిన ఆహారం, అమానుష మైన జాతి వివక్ష, యుద్ధానంతరం వారివారి ఇళ్ళకు పంపి పునరావాసం ఏర్పాటు చేయడంలో జాప్యం మొదలైన వన్నీ పేర్కొన్నారు. ఈ పరిస్థితులు బాగుచేయడానికి 5 రోజులుగా సమ్మె చేస్తుంటే సైన్యం కాల్పులు సాగించిందనీ, గత్యంతరం లేక సాయుధ ప్రతి ఘటన చేశామనీ చెప్పింది. చివరిగా కాంగ్రెస్, లీగ్ కమ్యూనిస్టు పార్టీ నాయకులకు క్రింది విధంగా విజ్ఞప్తి చేసింది.

"బొంబాయిలో రక్త పాతం నిరోధించడానికి మీరు చేయగల్గిన దంతా చేయండి!"

"నౌకా అధికార్లు కాల్పులు సాగించకుండా, బాంబులు చేయకుండా చూడండి. మీతో రాయబేదింరి సాగించేలా వారిపై వొత్తిడి చేయండి!

"శాంతియుత హర్తాళులు, సమ్మెల ద్వారా మాకు అండగా ప్రజల్ని సమీకరించండి!

"సోదరీ సోదరులారా! మా విజ్ఞప్తిని మన్నించవలసిందిగా కోరుతున్నాం. మీ జవాబుకై వేచి వుంటాం!"

ఫిబ్రవరి 21నతొమ్మిదిగంటల ప్రాంతంలో బి.వో. ఆర్. సైనికులు (బ్రిటిష్ అదర్ రాంక్సు) పఠానులు తల్వార్ నౌక వద్ద కాజిల్ బారక్సు సమ్మెదార్లపై దాడి చేశారు. డాక్ యార్డ్‌తో సమ్మె దార్లకు సంబంధాలు తెగిపోయాయి. సాయంత్రం దాకా కాల్పులు సాగుతూనే వున్నాయి. 22 న సమ్మె కమిటీ నిర్ణయాను సారం సమ్మె దార్లు శాంతంగానే వున్నారు. డాక్ యార్డ్సులో కూడా అదే పరిస్థితి. కాల్పుల విరమణను వీరంతా పాటించారు ప్రజలు ఆహార పదార్థాలను నౌకల నుంచి వచ్చిన పడవలకు అందజేస్తూనే వున్నారు. ఈ సమాచారాన్నంతా అన్ని నౌకలకూ అందజేశారు. మర్నాడు ఏమౌతుందో అని అందరూ ఎదురు చూస్తున్నారు.

## కరాచీలో

ఫిబ్రవరి 19 కి బొంబాయి నావికా సైనికుల సమ్మె వార్త కరాచీకి చేరింది. అక్కడ రాయల్ ఇండియన్ నేవీకి చెందిన, హిందూస్థాన్, తిరువాంకూర్ అనే నౌకలు వున్నాయి. ఇవి కాక తీరంలో బహదూర్, హిమాలయా, చమక్ అనే నౌకలు మనోరా దీవిలో వున్నాయి. బహదూర్‌లో నావికా సైనికులకు శిక్షణ ఇస్తారు. చమక్‌లోని నావికా సైనికులు "తల్వార్" నావికా సైనికులకు సానుభూతిగా నౌక లోపల సమ్మె చేయాలని నిశ్చయించుకున్నారు హిందూస్థాన్ నావికా సైనికులు కొన్ని కోర్కెలను తయారుచేసి, సమ్మె చేయాలని నిశ్చయించారు. వారి కోర్కెల్లో ఫస్ట్ లెఫ్టినెంట్‌గా వున్న ఒక అధికారిని తొలగించటం కూడా వుంది.

తిరువాన్కూర్ నౌకలో కూడా శాంతియుతంగా సమ్మె జరపాలని నిశ్చయించారు. ఫిబ్రవరి 20 న హిందూస్థాన్ నౌకలోనివారు, తమ ఇబ్బందులను తొలగించాలని కోరుతూ ప్రదర్శనలు చేసి సమ్మెచేశారు. సమ్మె విరమిస్తేతప్ప వారి కోర్కెలను వేటినీ అంగీకరించేది లేదని కెప్టెన్ బెదిరించాడు. ఈలోగా తిరువాన్‌కూర్ నౌకలో సమ్మె చేస్తున్న వార్తకూడా తీరంలో వున్న నౌకలకు వ్యాపించింది.

బహదూర్ నౌకలో రొట్టెలకిచ్చే గోధుమపిండి బాగా లేదని సమ్మె చేశారు. ఇంతలో ఇతర నౌకలలో కూడా సమ్మె జరిగిన విషయం తెలిసి పెరేడ్ గ్రౌండ్‌లో నినాదాలిస్తూ ప్రదర్శన చేశారు.

చమక్, హిమాలయ నౌకలలో ఆ రోజు రాత్రి రహస్య సమావేశం జరిగింది. మర్నాడునుంచి సమ్మె

చేయాలని నిశ్చయించారు. అలాగే 21 న సమ్మెలో చేరారు.

కరాచీలోని నౌకా సైనికులు 21న పెరేడ్‌గ్రౌండ్‌కు వెళ్ళి రాయల్‌నేవీపతాకను (Wnite Ensign) చింపివేశారు. తర్వాతగార్డ్సురూముకువెళ్ళి. అధికారినిపక్కకు నెట్టిఅందులోసిఖ్ ఖైదీలను విడుదలచేశారు. రెగ్యులేటింగ్ ఆఫీసుకు వెళ్ళి నావికా సైనికుల శిక్షల గురించి వివరించే పత్రాలను, ఫైళ్ళను చింపివేశారు. చమక్ నౌక వైపు వెళ్ళుతూ త్రోవలో ఒక స్కూల్ వద్ద వున్న బ్రిటిష్ పతాకను లాగి పారేశారు. నౌకపైవున్న రాయల్ నేవీ పతాకను దింపివేశారు. ఒక అధికారి మరో జెండాను ఎగుర వేయడానికి ప్రయత్నించగా కమాండింగ్ ఆఫీసర్ అతణ్ణివారించాడు. తర్వాత వారు ఖైదీలను విడిపించి, హిమాలయలోని నావికా సైనికులతోపాటు తిరిగి చమక్ నౌక వద్దకి వచ్చారు. రెండు ముఠాలుగా విడివడి నావికా సైనికులు మనోరా దీవి నుంచి కరాచీకి బయలుదేరారు. 400 మంది హిమాలయ నౌకవద్దకు 200 మంది బహద్దూర్ నౌక వద్దకు వెళ్ళారు. బహద్దూర్‌లోని నావికా సైనికులకు మోటార్ బోట్లు దొరకలేదు. అందుకని మామూలుబోట్లలో వెళ్ళడానికి సంసిద్ధమవుతున్నారు. హిమాలయలోని నావికా సైనికులు ఒక పడవలో బయలుదేరి వెళ్ళారు.

## తమ సోదరులపై దాడిచేయ నిరాకరించిన బలూచీ సైనికులు, గూర్ఖాలు

ఈలోగా పరిస్థితులు విషమించాయి. బలూచీస్థాన్ రెజిమెంట్‌కుచెందిన 60 మందిని తీసుకువచ్చి 'హిందూస్తాన్' నౌకలో ప్రవేశించవలసిందిగా కోరారు. కాని సమ్మె వార్తవిన్న బలూచీ సైనికులు నావికా సైనికులను అణచివేసేందుకు నిరాకరించారు. ఈ వార్తవిన్న జనరల్, ఇండియన్ పారాచూట్ బ్రిగేడ్ 777 కు చెందిన గూర్ఖా సైనికులు 60 మందిని (రెండు ప్లాటూన్లను) రప్పించవలసిందిగా ఆజ్ఞాపించాడు. "వారు అతి నమ్మకమైన సైనికులు. మంచి యోధులు" అని ఆ జనరల్ వారికి కితాబ్ ఇచ్చాడు. కాని అతని అంచనా తప్పింది. గూర్ఖాలు కూడా తమ సోదర సైనికులపై దాడిచేయ నిరాకరించారు. ఇక లాభంలేదని రెండు ప్లాటూన్ల (60 మంది) బ్రిటిష్‌సైనికుల్ని రప్పించారు.

మనోరా దీవినుంచి వచ్చిన నావికాసైనికులు ఒడ్డుకు సమీపించగానే అక్కడ ఏదో కుంభకోణం జరగబోతోందని గ్రహించి హిందూస్థాన్ నౌక వైపుకు తిరిగి వెళ్ళిపోయారు. హిందూస్థాన్ నౌకపై 600 మంది దాకా నావికా సైనికులున్నారు. వారు డాక్టర్ని మినహా మిగతా అధికారులందర్నీ నౌకను విడచిపెట్టవలసింగా కోరారు. కెప్టెన్ వెళిపోతూ పోతూ రివాల్వర్‌తో కాల్చాడు.

ఇది బ్రిటిష్ సైనికులకు సంకేతం. బ్రిటిష్ సైనికులు నౌక ఎక్కడానికి ప్రయత్నించారు. "మీప్రాణాలు దక్కించుకోవాలంటే పైకి రాకండి" అని ఒక నోటీసు తగిలించారు కొంచెం వెనకాడిన బ్రిటిష్ సైనికులు తేలికపాటి మెషిన్‌గన్‌లను ఉపయోగించారు. హిందూస్థాన్ నౌకలోనివారు తిరిగి కాల్పులు సాగించి వాళ్ళను తరిమివేశారు.

కొంతసేపు అంతా ప్రశాంతంగా వుంది. కాని ఈలోగా బ్రిటిష్ సైనికులు ఒక భవనంపైన ఇసుక బస్తాల చాటున రక్షణ తీసుకొని కాల్పులు సాగించారు హిందూస్థాన్ నౌకలోని వారిద్దరు చనిపోయారు, అందులో ఒకడు 16 ఏండ్లవాడు మాత్రమే.

హిందూస్థాన్ నౌక ఫిరంగులతో జవాబిచ్చింది. నాలుసార్లు ఫిరంగిని పేల్చింది. తెల్లసైనికులు ఆరోజు ఇక పత్తాలేరు. ఇదంతా గమనిస్తున్న రేవు కార్మికులు హర్షధ్వానాలు చేస్తున్నారు.

బహదూర్‌నుంచి వచ్చిన నావికాసైనికుల్ని కరాచీలో బల్టన్ మార్కెట్‌వద్ద సైనికులు ఆపివేశారు. వారివద్ద ఆయుధాలు లేవు. అందుచే మనోరా దీవికి తిరిగి వెళ్ళిపోయారు. హిందూస్థాన్ నౌక వద్దకువెళ్ళిన ఇతర నావికా సైనికులు కూడా తిరిగివచ్చారు. బ్రిటిష్ సైనికులను ఉపసంహరించాలని తీర్మానించారు.

ఆ రాత్రంతా హిందూ న్ నౌకలోనివారు నిద్రపోలేదు. కాజిల్‌బారెక్స్‌వద్ద తీవ్రంగా పోరాటం సాగుతోందనీ వారిపై దాడి స్తే ప్రతిఘటించాల్సిందనీ నర్బద నౌకనుంచి ఆదేశాలు వచ్చాయి.

ఆరాత్రి బ్రిటిష్ సైనికాధికారులు దాడికి తుది రూపు దిద్దారు. వివిధ సైనిక దళాలనుంచి సైనికుల్ని రప్పించారు. కీలక ప్రాంతాల్లో ఫిరంగులు నెల

కొల్పారు. మోటార్లు కూడా తెచ్చారు. వార్ఫ్ అంతటినీ బ్రిటిషు సైనికులు చుట్టుముట్టారు. ఎంబార్కేషన్ హెడ్ క్వార్టర్సులో నావికా సైనికులందర్నీ తొలగించారు హిమాలయ నౌకకు చెందిన ఆయుధగారాన్ని ఖాళీ చేశారు తీసుకురావడానికి సాధ్యంకాని పెద్ద ఫిరంగుల్ని మినహాయించి తక్కినవాటి నన్నిటినీ తొలగించారు.

ఫిబ్రవరి 22 న బ్రిటిషు సైనికులు సకల సన్నాహాలు చేసుకొని హిందూస్తాన్ నౌకను అన్ని వైపుల నుంచీ ముట్టడించి వేరుచేశారు. బేషరతువుగా లొంగవలసిందిగాను, లేకపోతే పూర్తిగా దాడి ఫలితాలను అనుభవింభాలనీ అంతిమ హెచ్చరిక చేశారు.

హిందూస్తాన్ నౌకా సైనికులు దీనికి తిరస్కరించారు. తమపై దాడి జరక్కపోతే, తాము దాడ చేయబోమని. శాంతంగా ఉంటామనీ కబురు చేశారు.

ఉదయం 10½ గంటలకు బ్రిటిష్ సైనికులు హఠాత్తుగా కాల్పులు ప్రారంభించారు. భారీ మెషిన్‌గన్ లతోను, మోర్టార్‌లతోను, గుండ్లవర్షం కురిపిస్తున్నారు బ్రిటిష్‌సైనికులు, ఈలోగా సముద్రపు పోటు నీరు తగ్గుముఖం పట్టడంలో హిందూస్థాన్ నౌక నీటి మట్టం కిందికి తగ్గిపోసాగింది. కాల్పుల మధ్య హిందుస్తాన్ నావికా సైనికులు తమ ఫిరంగుల వద్దకు వెళ్ళలేకపోయారు కొందరు సాహసించి వెళ్ళినా వాటిని ఎత్తుకు తిప్పలేకపోయారు, ఐనా తిరుగు కాల్పులు సాగించారు. 25 నిమిషాలు అసమాన యుద్ధం సాగింది. అర్గురు చనిపోయారు. 30 మంది గాయపడ్డారు ఇంకా పోరాటం సాగించటం ఆత్మహత్యతో సమానమే. అందుచే లొంగిపోడానికి నిశ్చయించారు.

తెల్లజెండాను పుచ్చుకొని లొంగుబాటును తెల్పడానికి వెళ్ళిన ఒక కుర్రవాణ్ణి సైనిక నీతి నియమాలను కూడా కాలరాచి చంపివేశారు. "ఆ కుర్రవాణ్ణి అధికారి ఎందుకు చంపాడు ? సిగ్గుచేటైన విషయం" అనుకొంటూ, నావికా సైనికుల ధైర్యాన్ని మెచ్చుకుంటూ బ్రిటిష్ సైనికులు వెనుతిరిగారు. తర్వాత బ్రిటిష్ సైనికులు హిందూస్తాన్ నౌకను ఆక్రమించి నావికా సైనికుల్ని మాలిక్ శిబిరంలో వుంచారు.

ఆ రోజు సాయంత్రం బ్రిటిష్ పారాట్రూప్ సైనికులు మనోరాదీవిని ఆక్రమించి దిగ్బంధం చేశారు. 18 రోజులు నావికా సైనికుల్ని దాదాపు నిర్బంధంలో వుంచారు. ఆ విధంగా కరాచీలో నౌకా సమ్మె అంతమైంది.

## దేశ దేశాల్లో

బొంబాయి కరాచీలలోనే కాక, దాదాపు భారతదేశంలోని అన్ని ప్రభుత్వ నౌకా కేంద్రాలకు సమ్మె వ్యాపించింది.

*కలకత్తాలో* – బొంబాయిలో సమ్మె విరమణ తర్వాత కూడ కలకత్తాలో సమ్మె కొనసాగింది. వారం రోజులపాటు సమ్మె జరిగింది. ఫిబ్రవరి 19 న బొంబాయి సమ్మె వార్త తెలియగానే, ఒడ్డున ఉన్న "హుగ్లీ" అనే నౌకలో సమ్మె ప్రారంభమైంది. సమ్మె కమిటీ ఏర్పడింది. ఇది సముద్రంలో వున్న నౌకలకు వార్త పంపింది. ఆర్.ఐ. యన్ లోని మహిళా విభాగం కూడ సమ్మెలో చేరింది. 22 న 500 మంది నావికా సైనికులు సభ జరిపి ఆర్ ఐ ఎన్. కమాండింగ్ ఫ్లాగ్ ఆఫీసర్ చేసిన బెదిరింపును ఈ సభలో ఖండించారు.

"మా పోరాటం కేవలం మా తిండికోసమేకాదు. స్వాతంత్ర్యం కోసం కూడా" అని ఒక నావికా సైనికుడు పత్రికా విలేకరులతో అన్నాడు. 23 తేదీన బొంబాయి, కరాచీలలో సమ్మెదార్లు లొంగిపోయినట్లు వార్త వచ్చింది, ఐనా మర్నాడు సమావేశమైన నావికా సైనికులు సమ్మె కొనసాగించాలనే నిశ్చయించుకొన్నారు అవసరమైతే భారత నౌకలనేరి ధ్వంసం చేస్తానని ఫ్లాగ్ ఆఫీసర్ చేసిన బెదరింపును ఖండించుతూ చేసిన తీర్మానాన్ని గమనించాల్సి వుంటుంది.

"ఈ నౌకలు ఎవరివి ? అవి మా దేశానికి చెందిన సైనిక బలగానివి. దీనిపై తీర్పు ఇవ్వడానికి ప్రస్తుత ప్రభుత్వానికి హక్కు లేదు. జాతీయ ప్రభుత్వం ఏర్పడినపుడు ఈ నావికా దళం బాధ్యత ఆ ప్రభుత్వానికి వుంటుంది. మా దేశ రక్షణకోసం మేం ఉద్యోగాల్లో చేరి మా ప్రాణాల్ని ప్రభుత్వం చేతిలో పెట్టాం. ఇతర జాతులు ఏ ప్రాతిపదికపై జీవిస్తున్నారో అదే ప్రాతిపదికపై జీవించడం మా హక్కు, ఆ హక్కు సాధించేందుకు మా ప్రాణాల్ని త్యాగం

చేయడానికి కూడా మేం సిద్ధంగా వున్నాం. అట్లే ఈ వ్యవహారంలో తలదూర్చవలదని మావిజ్ఞప్తి. అందుకు మా జాతీయ నాయకులున్నారు. భారత రాజకీయ రంగం నుంచి ప్రభుత్వం వైదొలగాలి."

బొంబాయిలో నావికా సైనికుల సమ్మెకు సానుభూతిగా హర్తాళ్ జరిపి, ప్రభుత్వ సైనికుల కాల్పుల్లో తమ ప్రాణాలర్పించిన వారికి జోహారు లర్పించారు ఇదే తీర్మానంలో.

24 న బెహాలా శిబిరాన్ని చుట్టుముట్టారు ప్రభుత్వ సైనికులు. ఆ మర్నాడు నావికా సైనికుల్ని దాదాపు పూర్తిగా చుట్టుముట్టారు. ఒకరికొకరు సంబంధాలు తెగిపోయినందున, శత్రు బలం అధికం కావడంవలన నిరాయుధులవడం మూలాన చివరకు 26 తేదీన కలకత్తా నావికా సైనికులు లొంగిపోయారు.

*విశాఖపట్టణంలో* - సోనావతి, అహ్మదాబాద్, షిలాంగ్, ఫ్లోటిల్లా అనే నౌకలలో ఇక్కడ సమ్మె జరిగింది. మొదట బొంబాయిసమ్మె వార్త చేరగానే, సమ్మె పోరాటంలో చేరాలని ఇక్కడి నావికాసైనికులు నిశ్చయించారు. మొదట రాయల్‌నేవీ పతాకాన్ని తొలగించారు. కొన్ని మోటారు బోట్లను వశం చేసుకొని, ఒడ్డుకు చేరుకొన్నారు. కాంగ్రెస్, లీగ్ జండాలు పుచ్చుకుని విప్లవ నినాదాలు చేసుకుంటూ ప్రదర్శన చేశారు. చిట్టచివరకు ప్రభుత్వ సైనికులు వారిని అరెస్టుచేసి నిర్బంధంలో పెట్టగలిగారు.

*కొచిన్‌లో* - ఆర్. ఐ. యన్ నౌకలు చాలా వున్నాయి. మొదట వెందుర్తి అనే నౌకకు 22వ తేదీన బొంబాయి సమ్మె వార్త చేరింది. నావికా సైనికులు వెంటనే నిరాహార వ్రతం పూనారు. అదే రోజు బరోడా అనే నౌక వచ్చింది. ఇది మందు పాతరను తొలగించే నౌక. దానికీ వార్త తెలియగానే అది కూడా సమ్మెలో చేరింది. 22 వ తేదీన సభచేసి, బొంబాయిలోని ఆర్. ఐ. యన్. కమాండింగ్ ఫ్లాగ్ ఆఫీసర్ చర్యను ఖండించారు. బొంబాయిలో నావికా సైనికులు లొంగిపోయిన వార్త తెలియగానే, వీరు కూడా సమ్మె మానివేశారు.

*జామ్‌నగర్*: కూడా సమ్మె వార్త చేరింది. అక్కడ జల్సురా నౌకలోని సైనికులలో ఎక్కువ మంది రాజకీయ చైతన్యం గలవారు. వివిధ పార్టీల పట్ల అభిమానం కలవారు. అందుచే వారంతా ఏకాభిప్రాయానికి రావడానికి రెండు రోజులు చర్చలు జరిగాయి. చివరకు 21 వ తేదీన కమాండింగ్ ఆఫీసర్ వద్దకు వెళ్ళి తమ సానుభూతిని "తల్వార్" నౌకా సైనికులకు అందచేయవలసిందిగా కోరారు. కాని అతడు నిరాకరించాడు. ఆరోజు సాయంత్రం బొంబాయిలోని నావికా సైనికాధికారి గాడ్‌ఫ్రే బెదరింపునూ, వల్సురా నౌక పేరు చెప్పి, అది వినయ విధేయతలతో వుందని అతగాడు చెప్పడమూ, ఇక్కడ చిర్రెత్తించింది. మర్నాడు సమ్మెచేసి, రాయల్ నేవీపతాకను తొలగించి, కాంగ్రెస్, లీగ్ కమ్యూనిస్టు జెండాలను ఎగురవేశారు. దాంతో పోలీసుల్ని, కాపలా సైనికుల్ని పెట్టి, నావికా సైనికుల్ని ఎటూ పోకుండా చేశారు అధికారులు. 23 వ తేదీన నావికా సైనికులు నిరశన వ్రతం చేశారు. సర్దార్ పటేల్, ము ం లీగ్ నాయకులు సమ్మె విరమింపవలసిందిగా వి పి చేశారన్న వార్త విని, రెచ్చిపోయి కాంగ్రెస్, ,, జెండాలను తొలగించారు. ఎర్రజెండా అలాగే వుంచారు. తర్వాత మూడు గంటలకు బొంబాయి నావికాసైనికులు లొంగిపోయారన్న వార్తవిని, వీరు కూడా దీర్ఘంగా చర్చించి తర్వాత లొంగిపోయారు.

ముఖ్యమైన నాయకుల్ని ఏడుగురిని అధికార్లు అరెస్టు చేశారు. తమ నాయకులెవరో చెప్పవలసిందని నావికా సైనికుల్ని చిత్రహింసలు పెట్టారు. వారం దర్నీ ఎండలో కుర్చోబెట్టారు. "తామంతా నాయకులమే" అంటూ వాళ్ళు జవాబిచ్చారు. చివరికి ఒక ముగ్గురిని ఏరి కోర్టు మార్షల్‌కి పంపారు.

*ఢిల్లీలో*- నేషనల్ హెడ్ క్వార్టర్సుకు చెందిన సంస్థలో చిన్న నౌక "ఇండియా" వుంది. దానిలోని వారు బొంబాయి సమ్మెకు సంఘీభావాన్ని ప్రదర్శించారు.

*విదేశాలలో*- ఏడెన్‌లో 48 మంది నావికా సైనికులు నిరశనవ్రతం చేశారు. అండమాన్ దీవులలో మందు పాతరలు తొలగించే దళంలో ఏడు నౌకలున్నాయి. వాటన్నిటిలోను సమ్మె చేశారు. అవి రోహిల్ ఖండ్, దక్కన్, బెంగాల్, కర్ణాటక్, బీహార్, క్రిష్ణా, బలూచిస్తాన్ అనే నౌకలు. భారత దేశంలోగాని, విదేశాల్లోగాని మొత్తం 78 నౌకలు యీ సమ్మెలో పాల్గొన్నాయి. తీర ప్రాంతంలో 20

చోట్ల సమ్మె జరిగింది. మొత్తంమీద 20 వేలమంది నావికా సైనికులు, భారతీయ అధికారులు యీ సమ్మెలో పాల్గొన్నారు.

## వైమానికుల, సైనికుల తోడ్పాటు

ఆర్.ఐ.యన్. సమ్మెకు పూర్వమే రాయల్ ఇండియన్ ఎయిర్ ఫోర్స్ (భారత వైమానిక దళం) సమ్మె చేసింది. కాని ఆ సమ్మెను చాక చక్యంగా అధికారులు వ్యవహరించి, అణచి వేశారు. అది కూడా దేశవ్యాపితంగా జరిగినా నావికా సమ్మె వలె అది అంతగా ప్రజల దృష్టిలో పడలేదు.

ఐతే నావికా సైనికులకు అండగా వైమానికులు నిలిచారు. బొంబాయిలోని మెరైన్‌డ్రైవ్, అంధేరీ శిబిరాలలోని భారత వైమానికులు మొట్టమొదట తమ సంఘీభావాన్ని ప్రదర్శించారు. ఫిబ్రవరి 21న కాజిల్ బారక్సులో నావికా సైనికులు తమ ప్రాణాలొడ్డి పోరాడుతున్నపుడు వారికి అండగా నిలిచారు.

రక్తపు మరకలున్న ఒక తెల్లటి జెండాతో బొంబాయి వీధుల్లో వారు ఊరేగారు. విప్లవ నినాదాలిచ్చారు. నావికా సైనికుల పట్ల సంఘీభావం ప్రదర్శించారు. అదే రోజున బొంబాయి సమీపంలోని, కుర్లా వద్ద రాయల్ ఇండియన్ ఆర్మీ సర్వీస్‌కోర్ దళం సమ్మె చేసింది. అక్బర్ నౌక సమీపంలోని నావీ బారక్స వద్దకు వెళ్ళి తమకు సాధ్యమైన రీతిలో అన్ని విధాలా సహాయ పడతామని వాగ్దానం చేసింది.

నావికా సైనికుల పట్ల తోడి సైనికులు ప్రదర్శించిన సంఘీభావ ఘటనలలో కలకత్తాలో జరిగిన ఒక సంఘటన అత్యంత శౌర్య సాహసాలు ప్రదర్శించిన ఘటన.

బొంబాయిలో నావికా సమ్మె లొంగిపోయాక కలకత్తాలో ఇండియన్ పయనీర్ కంపెనీకి చెందిన ఒక దళం (1386 సమ్మె చేసింది. ఇది బెహాలావద్ద మజెర్‌హాట్ వ వుంది. అక్కడ పరిస్థితులు, ఆహారం బాగా వు దకపోవటమేకాక, యుద్ధం ముగిసి ఏడాది గడిచినా వారిని ఇంకా ఇళ్ళకు పంపలేదు. గోధుమపిండి అధ్వాన్నంగా వుండేది. బియ్యం నిండా రాళు , అనేక విధాల నిధులు వసూలు చేసినా, వాటివ తిఫలం నావికా సైనికులకు దక్కేదికాదు. ఈ పరి ల్లో నావికా సైనికుల సమ్మె జరిగింది. వారికి ఘీభావంగా ఇండియన్ పయనీర్ కంపెనీ 1386 వ దళం సమ్మె చేసింది. తర్వాత పయనీర్ కంపెనీ 1519 వ దళం కూడా సమ్మె చేసింది.

ఫిబ్రవరి 24 న ఉదయం పెరేడ్ మామూలుగానే జరిగింది. కాని సాయంత్రం పెరేడ్‌కు ఎవ్వరూ రాలేదు. మా కోర్కెలు పరిష్కరించండి అనిఅడిగారు. "వెధవల్లారా! ఇది సైనిక తిరుగుబాటు అవుతుంది" అంటూ కమాండింగ్ ఆఫీసర్ కెప్టెన్ గ్రిఫిత్స గర్జించాడు. చాలాసేపు నయాన భయాన చెప్పిచూశాడు. లాభంలేకపోయింది. "మీ నాయకుడెవరు?" అని ప్రశ్నించాడు కెప్టెన్.

"నేనే" అంటూ 22 ఏళ్ళ నాయక్ బుధాన్ సాహెబ్ ముందుకు వచ్చాడు. ఇతడు నాన్‌కమిషన్డ్ ఆఫీసర్లలో చాలా సమర్థుడు.

"మీ రైఫిళ్ళు, తుపాకి గుళ్ళు, కిట్ (సంచి) వగైరా అప్పచెప్పండి" అని ఆజ్ఞాపించాడు.

"మేం అప్పజెప్పం" అన్నారు సైనికులు. కోపంతో గ్రిఫిత్స, బుధాన్ ముఖంమీద కొట్టాడు. బుధాన్ వెంటనే తిరిగి అతని ముఖంమీద ఛళ్ళున కొట్టాడు.

తెల్ల అధికారిని ఒక నల్ల సిపాయి కొట్టడమా? ఖంగుతిన్నారు బ్రిటిష్ అధికార్లు. ఏరియా కమాండర్‌కు కబురు వెళ్ళింది. ఈ తిరుగుబాటు అణచడానికి పంజాబీ, గార్వాలీ సైనికుల్ని పిలిపించాడు. కాని తమ సోదరులతో పోరాడటానికి వారు నిరాకరించారు.

ఈలోగా పయనీర్స ఆయుధాలు తీసుకొని తమ శిబిరం చుట్టూ కాపలా వుంచారు. ఏరియా కమాండర్ టాంకులు, సాయుధ శకటాలు లారీలలో బ్రిటిష్ పదాతిదళ సైనికులతో వచ్చాడు. కాని బుధాన్ శిబిర సమీపానికి వస్తున్న ఏరియా కమాండర్ని "హాల్ట్" (ఆగు) అని హెచ్చరించాడు. తన తోటి సైనికులు, కమాండర్‌ను రానీయవలసిందిగా గొంతుచించుకొని అరుస్తున్నా లెక్కచేయలేదు.

తర్వాత జరగాల్సిందేదో జరిగింది. సైనికులు శత్రువుల అధిక బలానికి లొంగక తప్పలేదు. బుధాన్‌ని, మరికొందర్ని అరెస్టుచేసి, కోర్ట్‌మార్షల్‌కు పంపారు.

బుధాన్ మంచి సామర్థ్యం కలవాడవటంవల్ల అతన్ని తప్పించాలని, "పొరపాటు" జరిగిందని ఒప్పుకోమని కోర్టు కోరింది.

"ఏమిటి ? నేనా నా శత్రువునుంచి క్షమాభిక్షను కోరేది."

బుధాన్‌కు ఎక్కువ శిక్ష వేశారు. తర్వాత అత నేమయ్యాడో సమాచారం లేదు.

1519 వ దళం కూడా ఫిబ్రవరి 23 న సమ్మె చేసింది. 24 న తమ ప్రక్కన వున్న మరికొందరు కూడా సమ్మె చేశారు.

బ్రిటిష్ సైన్యాలు తమను చుట్టుముట్టుతాయని కాల్పులు సాగిస్తారని, వీరంతా ఎదురు చూస్తున్నారు. భారత సైనికులు ప్రతిఘటనకు సిద్ధమయ్యారు. కాని కాల్పులు జరగలేదు. ఒక టాంక్ గేటు వద్ద హవల్దార్ వారిని ఆపాడు "మేం కాల్పులు సాగించేందుకు రాలేదు. మాటాడటానికి వచ్చాం" అంటూ అధికారి చెప్పాడు. తమ ఆయుధాల్ని నేలవైపుకు వంచి లోనికి రావలసిందిగా భారత సైనికులు కోరారు. అందుకు వారు అంగీకరించారు. అధికార్లకు కొంత వ్యవధి ఇవ్వాల్సిందిగా బ్రిటిష్ కమాండర్ కోరాడు. ఆలోచించి వారి సమస్యల్ని పరిష్కరిస్తామని హామీ యిచ్చారు.

ఫిబ్రవరి 27 న ఆర్. ఐ. యన్. నావికా సైనికులు లొంగిపోయారు. పయనీర్ కంపెనీ దళాలవారిని రెండుగా విభజించి వేర్వేరు స్థలాలకు తీసుకు వెళ్లారు. కొత్త స్థలాలలో వారి కోర్కెలను పరిష్కరిస్తామన్నారు. ఆ విధంగా వారిని మోసంచేసి, ఒకరి కొకరిని దూరం చేశారు. తర్వాత 45 మందిని నిరాయుధుల్ని చేసి, అరెస్టు చేశారు. నెలా పద్దెనిమిది రోజులు ఎలాంటి విచారణ జరగలేదు. ఏప్రిల్ 16 న విచారణ తతంగం పూర్తిచేసి 17 న అలీపూర్ సెంట్రల్ జైలుకు పంపారు.

బెంగాల్‌లో ఆర్. ఐ. ఎ. యఫ్. (రాయల్ భారతీయ వైమానిక దళం) జెస్సూర్‌వద్ద హోబ్రాలో సమ్మె చేశారు. ఫిబ్రవరి 25 న తమ కోర్కెల పత్రాన్ని అధికారులకు సమర్పించారు. దానిలో ఆర్. ఐ. యన్. సైనికుల సమ్మెకు సంఘీభావం తెలిపారు. తర్వాత ఏం జరిగిందో వివరాలు తెలియ లేదు కాని కొందర్ని అరెస్టు చేసి, మరికొందర్ని తొలగించి సమ్మెను అణచివేసి వుంటారు.

కరాచీలో ఎంబార్కేమెంట్ యూనిట్‌లోని సైనికులు సుమారు 80 నుంచి 100 మంది దాకా సమ్మె చేశారు. వీరిలో గుమాస్తాలు. కాపలాదార్లు, డ్రైవర్లు, వగైరా వివిధ వృత్తుల వారున్నారు. ఫిబ్రవరి 21 సమ్మె, నిరశన వ్రతం చేశారు. తమతో సంప్రతించడానికి బ్రిటిష్ అధికారులు ఒక భారతీయ అధికారిని పంపారు. ఆయనకు వీరు ఒక కోర్కెల పత్రాన్ని సమర్పించారు. కాని చర్చలు ఫలించలేదు. రెండు గంటల వేళ వీరందరినీ కరాచీలోని విశ్రాంతి శిబిరంలో నిర్బంధించి, సాయుధ సైనికుల్ని కాపలా వుంచారు. ఈ వార్తను ఒక పఠాను సైనికుడు గోడ ఎగబాకి తప్పించుకుని బొంబాయి పత్రికలవారికి తెలియ చేశాడు.

మర్నాడు నౌకా సైనికులు లొంగిపోగానే వీరు కూడా లొంగిపోయారు.

వివిధ ప్రాంతాల్లోని సాధారణ సైనికులు ఆర్. ఐ. యన్. సైనికులు విజ్ఞప్తిని అనుసరించి పోరాటానికి సంసిద్ధ మయ్యారు. కాని ముందుగానే పసికట్టిన ప్రభుత్వం ఏ మాత్రం ఆందోళన తలెత్తినా నిర్దాక్షిణ్యంగా అణచివేసింది. వీటిని గురించి అస్పష్టమైన సమాచారం తప్ప పూర్తి వివరాలు లభ్యం కాలేదు.

ఆర్. ఐ. యన్. సమ్మె తర్వాత కొన్నాళ్ళకు జబల్‌పూర్‌లో భారతీయ సైనికుల సమ్మె చేశారు. కొ రోజులపాటు వారు సాగించిన పోరాటానికి ప ణం యావత్తూ అండగా నిలిచింది. ఒంటరిగా సా .౦చిన పోరాటంవల్ల చివరకు వారు ఓడిపోక తప్ప లేదు. కాని వారు ప్రదర్శించిన శౌర్యం ఆర్. ఐ. యన్ పోరాటానికి ఏ మాత్రం తగ్గలేదు.

## సైనికుల, సామాన్య ప్రజల రక్తం కలిసి పారిన బొంబాయి

భారతదేశంలో సామ్రాజ్యవాద వ్యతిరేక వెల్లువలో నావికుల తిరుగుబాటు ఒక ఉజ్వల ఘట్టం. మన దేశంలో బ్రిటిష్ రాజ్యం అంతానికి అది నాందీగీతం అనదగిన మహోజ్వల పోరాటమని, పైన చెప్పిన ఘటనలే రుజావు చేశాయి.

నావికా సైనికులు ఒక కేంద్ర సమ్మె కమిటీని

ఏర్పాటు చేశారు. తమకు తోడ్పడ వలసిందిగా అన్ని రాజకీయ పార్టీలకు, కార్మికులకూ ఆ కమిటీవారు విజ్ఞప్తి చేశారు' కాంగ్రెస్, లీగ్ పార్టీల నాయకులు, ముఖ్యంగా సర్దార్ పటేల్, జిన్నాలు వారి విజ్ఞప్తికి ప్రతికూలంగా జవాబిచ్చారు. కాని కమ్యూనిస్టు పార్టీ మాత్రం బొంబాయిలోని కార్మికులకూ, ప్రజలకూ, నావికులకు తోడ్పడాలి ందిగా పిలుపు నిచ్చింది. కార్మిక వర్గం ఆ పిలుపును అందుకుంది. నావికులకు తోడ్పాటుగా బ్రహ్మాండమైన సమ్మెకు పూనుకుంది. బొంబాయి వీధులలో కార్మికులూ, ప్రజలూ గొప్ప ప్రదర్శనలు జరిపారు. బ్రిటిష్ సైనిక పటాలాలు అడ్డూ ఆపూ లేని దమనకాండ సాగించాయి. కార్మికుల రక్తమూ, సాయుధ బలగాల సభ్యుల రక్తమూ కలసి, బొంబాయి వీధులలో పారింది. శత్రువుల తూటాలు తగిలి కమ్యూనిస్టులతోపాటు వందలాది మంది నేల కొరిగారు. ఆ రోజుల్లో తాత్కాలికంగా కొద్ది కాలంపాటే అయినా, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన కార్మికులు, బొంబాయిలో బ్రిటిష్ వ్యతిరేక దాడిలో ముందువరసన నిలబడ్డారు.

వీరోచితమైన మన స్వాతంత్ర్య సమర చరిత్రలో 1946 ఫిబ్రవరి 21-23వరకూ—ఈ మూడు రోజులూ కలకాలం స్మరించదగినవి.

తమ న్యాయమైన హక్కుల రక్షణకోసం పోరాటం సాగిస్తున్న భారత నావికుల వీరోచిత చర్యను బలపరుస్తూ, బొంబాయి కార్మికులు బ్రహ్మాండమైన ప్రదర్శనలు జరిపారు. సమ్మెలు, హర్తాళ్ల ద్వారా యావత్తు బొంబాయి నగర జీవితాన్ని స్తంభింప చేశారు.

బ్రిటిష్‌వాళ్ళు జోక్యంచేసుకొని ప్రదర్శనను రక్తపు ఏరుల్లో ముంచెత్తబోగా, ప్రజలూ, కార్మికులూ గొప్ప మెలకువచూపి, ప్రతిఘటనద్వారా బ్రిటిష్ దమనకాండపై నైతిక విజయం సాధించారు. మూడు పతాకాలు ఏకంకావటంతో ఉమ్మడి శత్రువుకు వ్యతిరేకంగా సమిష్టి పోరాటానికి అవి చిహ్నం కావటం అంతటా రుజువైంది.

మన సా తంత్ర్య పోరాట చరిత్రలో సాయుధ బలగాలవారి ర మూ,పౌరజీవితానికి చెందినవారి రక్తమూ మొట్టమొద సారిగా కలసి ప్రవహించింది.

గురువారం, ఫిబ్రవరి 21 న, బ్రిటిష్ సైనికులు కాజిల్ బారక్స్‌లో నిర్బంధింపబడిన భారత నావికులపై కాల్పులు జరపగా, వారు తిరుగు కాల్పులు జరిపారన్న వార్తలు మధ్యాహ్నానికే బొంబాయి నగర ప్రజలందరిలో వ్యాపించాయి.

భారత నావికుల కేంద్ర సమ్మెకమిటీ ప్రధాన రాజకీయ పార్టీలకూ, బొంబాయి ప్రజలకూ హర్తాళ్ సమ్మెలద్వారా తమను బలపర్చవలసిందిగా విజ్ఞప్తి చేసింది.

ఆ సాయంకాలం అపోలో బందరు జనంతో కిక్కిరిసి పోయివుంది. వారంతా సముద్రంలోని ఓడవైపు ఆదుర్దాగా చూస్తున్నారు. నావికులు తమ లాంచీల్లో వార్ఫుకువచ్చి పౌరులతో సంప్రతింపులు జరిపారు. లాంచివెంట లాంచివచ్చి ప్రజలు ప్రేమతో తమకిచ్చిన తిండిపొట్లాలు, మిఠాయి, పళ్ళతో తిరిగి వెళ్ళాయి.

డాక్‌యార్డు నుంచి తిరిగి వచ్చిన ప్రజలు 'కల్బాదేవి' ప్రాంతంలోని పోలీసులతో ఘర్షణ పడ్డారు. రాత్రి ప్రొద్దు పోయాక, మర్నాడు హర్తాళ్ జరగబోవటం లేదని ఒక ప్రకటన జారీచేసినట్లు తెలిసింది. నావికుల డిమాండ్లను బలపరుస్తూనూ, వారు భౌతికంగా రూపుమాపబడకుండా రక్షించేందుకుగాను శుక్రవారం నాడు సంపూర్ణ హర్తాళ్ జరపాల్సిందిగా కార్మికులకూ, ప్రజలకూ కమ్యూనిస్టు పార్టీ విజ్ఞప్తి చేసింది. సాయంత్రపువేళ పార్టీ ప్రచారంచేసే మిల్లు ప్రాంతాలలో తిరిగి హర్తాళ్ విషయమై ప్రచారం చేసింది.

వక్తలు నౌకాదళ యువకుల వీరోచిత చర్యను వర్ణించి చెప్పి, వారికి ఏర్పడిన ప్రమాదాన్ని వివరించారు. 47 వీధి సమావేశాలు జరిగాయి. భారత నౌకాదళ వీరోచిత చర్యపట్ల, ప్రజలు పెద్ద పెట్టున హర్షామోదాలు తెలిపారు.

కార్మికులు మన స్థితినిబట్టి, మర్నాడు సంపూర్ణ హర్తాళ్ జరుగనున్నదని స్పష్టంగా తెలిసింది. ఫెర్గసన్ రోడ్డులోని 8 మిల్లుల్లో నైట్‌షిఫ్టులో పనిచేసే కార్మికులు అప్పుడే సమ్మెకు దిగారు. కాని మిల్లు ప్రాంతం మాత్రం ఆరాత్రి ప్రశాంతంగానే వుంది.

*ఫిబ్రవరి 22, శుక్రవారం* : మర్నాడు ఉదయం మిల్లు గేట్లవద్ద పెద్ద పెద్ద గుంపులు పోగయ్యాయి. ఎవ్వరూ లోపలికివెళ్ళే ప్రసక్తే కనిపించలేదు. ఏ మిల్లు

లోనూ, ఏ ఒక్క చక్రమూ కదల దు. మూడు రైల్వే వర్క్‌షాప్‌లూ, ఇతర చిన్న పె ఫ్యాక్టరీలూ అన్నీ బంద్ అయ్యాయి. అదంతా ఐ చ్ఛికంగా జరిగింది. 3 లక్షల మందికి పైగా కార్మికులు సమ్మెలో పాల్గొన్నారు.

నినాదాలిస్తూ కార్మికులు వీధుల్లో ఊరేగింపులు జరిపారు. ఈ ఊరేగింపులలో వారు, ఎక్కడ మైదానముంటే అక్కడ బహిరంగ సమావేశాలు జరిపారు. కామ్గార్ మైదాన్‌లో అలా జరిగిన ఒక సమావేశంలో భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ సభ్యుడు శ్రీ ఎస్. ఎ. డాంగే ప్రసంగించారు.

జి. ఐ. పి. పరేల్ వర్క్‌షాపు నుంచి బయలు దేరిన కార్మికుల ఊరేగింపులో కమ్యూనిస్టు, కాంగ్రెస్, లీగ్ జెండాలు మూడూ వున్నాయి. ఈ ఊరేగింపులు శాంతియుతంగా, క్రమశిక్షణతో జరిగాయి. అలాంటి శాంతియుత ప్రదర్శనలమీద, పోలీసులు రెచ్చగొట్టే దాడులు జరపడంవల్లనే, కార్మికులు తిప్పికొట్టేందుకు పూనుకొన్నారు ఆ తర్వాత సైన్యం బుద్ధిపూర్వకంగా, విచక్షణారహితంగా కాల్పులకు పూనుకుంది.

పోర్ట్ ప్రాంతంలో, డాక్‌వర్కర్లు శాంతియుతంగా ఊరేగింపు జరుపుతూవుంటే, హఠాత్తుగా ఒక మిలటరీ లారీ ఆ ఊరేగింపు మీదుగా నడపబడింది. ఇద్దరు కార్మికులు నలిగిపోయారు. తమ కామ్రేడ్స్‌ను కాపాడుకోవాలని ముందుకు పరుగెత్తారు కార్మికులు. ఆ గలాభాలో ప్రక్కన నిలబడ్డ పోలీసులు కాల్పులు మొదలుపెట్టారు కాల్పుల్లో ఇద్దరు కార్మికులు గాయపడ్డారు. దాంతో కార్మికులు రెచ్చిపోయారు. ఆ దారిన పోతున్న రెండు మిలిటరీ లారీలపై దాడిచేసి, వాటిని తగులబెట్టారు అప్పుడు అక్కడికి బ్రిటిష్ మిలటరీ దిగింది. వాళ్ళు రైఫిళ్ళతోను, టామీ తుపాకులతోను రెండు గంటలసేపు కాల్పులు సాగించగా పలువురు గాయపడ్డారు. ప్రాణాలు కోల్పోయారు. ప్రొద్దుటి ప్రదర్శనల తర్వాత లాల్‌బాగ్‌లో, పేటల్లో, గల్లీల్లో ప్రవేశించి, పోలీసులు, కార్మికు చితకబాదడం మొదలుపెట్టారు. తేజూకాయా మాన్‌లో ప్రవేశించి, ఒక కార్మికుణ్ణి పటుకొని బలవతాన తీసుకుపోతుండగా, అతడ్ని విడిచిపెట్టమని డిమాండ్ చేస్తూ ఒక కార్మికుల గుంపు వాళ్ళ వెంటపడింది. పోలీసులు గుంపుపై కాల్పులు సాగించారు. ఆ కాల్పులకు భయపడకుండా పోలీసులపై కార్మికులు తిరుగుదాడి చేశారు. ఈ గలాభాలో 50 మంది దాకా గాయపడ్డారు ఆ ప్రాంతపు ఎర్రజెండా వలంటీర్లు, గాయపడినవారిని ఆస్పత్రికి తీసుకువెళ్ళారు. వారిని తీసుకువెళ్ళడానికి తమ లారీలనిచ్చి నలుగురు ముస్లిం లారీ డ్రైవర్లు తోడ్పడ్డారు కొద్ది క్షణాల్లో ఓ లారీ నిండుగా బ్రిటిష్ సైనికులు రంగంమీదికి దిగారు. తమ రైఫిళ్ళతోను, టామీ తుపాకులతోను ఇష్టం వచ్చినట్టు కాల్పులు జరిపారు. సుమారు 40 మంది గాయపడగా, ముగ్గురు చనిపోయారు. ఆ తర్వాత బ్రిటిష్ సైనికులు గల్లీల్లోనూ, పేటల్లోనూ చొరబడి కనిపించిన వాళ్ళని కాల్చటం మొదలుపెట్టారు.

సాయంత్రం మూడు గంటలయ్యేసరికి, బొంబాయి అంతటా బ్రిటిషు మిలిటరీ లారీలు పిచ్చెక్కినట్టు తిరిగాయి ఏమాత్రం హెచ్చరిక చేయకుండానే గుంపులపై కాల్పులు సాగించారు. మరతుపా లు పుచుకొని, నగరంలోని కీలకస్థానాలన్నింటిలోనూ తివేశారు పరేల్‌లో కమ్యూనిస్టుపార్టీ బొంబాయి కమి కార్యాలయానికి ఎదుట, అలాంటి శిబిరం ఒకటి ఏర్పాటు చేయబడింది.

సాయంత్రం 4 గంటలవేళ, ఒక మిలిటరీ లారీ దాదర్ రోడ్‌మీదుగా వేగంగా వచ్చి, పరేల్ ట్రాఫిక్ ఐలాండ్‌ను చుట్టి, ఎల్ఫిన్ బ్రిడ్జి మీదికి దూసుకుపోయింది. పరేల్ మహిళాసంఘ కార్యదర్శి కుసుమ్ రణదివే, కోశాధికారి కమల్‌దోండే, అహల్యా రంగ్నేకరూ—ఈ ముగ్గురూ కమ్యూనిస్టుపార్టీ సభ్యులే—రైల్వేస్టేషన్ వైపుకు పోతున్నారు. ఓ తుపాకిగుండు కమల్‌లోకి దూసుకుపోయింది. కుసుమ్ రణదివే కాలికి గుండుదెబ్బ తగిలింది.

బొంబాయి పార్టీ కమిటీ కార్యాలయానికి ఈ వార్త తెలియగానే, వాళ్ళు స్థలానికి పరుగెత్తారు. అప్పటికి మిలిటరీ లారీ కాల్పులు జరుపుకొంటూనే తిరిగి వచ్చింది గిర్నీకామ్‌గార్ యూనియన్‌కు(రెడ్‌ఫ్లాగ్)కు చెందిన పాట్కర్, కుసుమ్ రణదివేను ఆస్పత్రికి మోసుకెళ్ళాడు. ఆమె ఎలాగైనా ప్రాణాలు కాపాడా లన్న ఆదుర్దాతో దోండే స్వయంగానే తన భార్యను ఆస్పత్రికి తీసుకువెళ్ళాడు.

ఆ కాల్పుల్లో 40 మందికి పైగా గాయపడ్డారు. తమ ఇళ్ళలోనూ, షాపుల్లోనూ కూర్చున్న వాళ్ళకి కూడా తుపాకి గుళ్ళు తగిలాయి. ఆ కాల్పుల వల్ల, గుట్టలుగా పడిపోయిన గాయపడ్డ వారితో, వాళ్ళ శరీరాల నుంచి కారే రక్తంతో వీధి వీధంతా ఎరుపెక్కిన దృశ్యాన్ని చూసిన వారెవరూ జీవితంలో ఎన్నడూ మరచిపోలేరు.

## పాలకోసం వెళ్ళిన బాలలపై తుపాకి గుళ్ళు

ఓ చిన్న అబ్బాయి, అతని చెల్లెలూ పాలకోసం మిల్క్ రేషన్‌షాపుకు వెళుతున్నారు. వాళ్ళు పాలకి బదులు తుపాకి గుళ్ళకి గురయ్యారు. ఒక వ్యక్తి తన భార్యాబిడ్డలతో అప్పుడే దాదర్ స్టేషన్‌లో దిగాడు. అతను స్టేషన్ నుంచి బయటకు వచ్చి నడుస్తున్నాడు. అంతలో తుపాకి కాల్పులు ప్రారంభమయ్యాయి. వెంటనే అతనూ, అతని బిడ్డా అక్కడికక్కడే నేలకూలి ప్రాణాలు విడిచారు. అతని భార్యని ఆస్పత్రికి తీసుకు వెళ్ళాల్సి వచ్చింది. వాళ్ళ వెంట వస్తున్న కూలీ పెట్టె బేడాకింద పడేసి పారిపోయాడు.

డెలిస్లే రోడ్‌లో వందమంది పోలీసుల్ని ఎదిరించి నిలిచి, మూడున్నర గంటలసేపు కార్మికులు పోరాడారు. పోలీసుదళం రెండుసార్లు పారిపోయింది. నలుగురు పోలీసులు తమ యూనిఫారాలు విడిచి పరుగు లంకించుకున్నారు. చివరికి ఓ మిలటరీ లారీ కాల్పులు జరుపుతూ అక్కడికి వచ్చింది. ప్రజలు దాన్ని విడిచి పెట్టలేదు.

అలా కార్మికుల క్రమశిక్షణతో కూడిన రాజకీయ ప్రదర్శనలతో ప్రారంభమైన ఆ రోజు, సైన్యం విచ్చలవిడిగా జరిపిన కాల్పుల వల్ల మూకుమ్మడి హత్యాకాండతో ముగిసింది. ఆ మూడు రోజుల్లోను అధికారుల లెక్కల ప్రకారం 250 మంది చనిపోతే, కార్మికవర్గం ఉండే ప్రాంతంలోని కె ఇ.ఎమ్ ఆస్పత్రి మార్గంలోనే 97 మంది లెక్క తేలారు. అంటే దాని అర్థం, బొంబాయి, మృతుల్లో సుమారు సగంమంది కార్మికవర్గ ప్రాంతానికి చెందినవారే.

బొంబాయి స్టూడెంట్స్ యూనియన్ (అఖిల భారత విద్యార్థి సమాఖ్యకు అనుబంధిత సంఘం) గురువారం నాడు ఒక్కరోజు సాధారణ సమ్మెకూ, ఫిబ్రవరి, 22 శుక్రవారంనాడు విద్యార్థుల హర్తాళ్‌కూ పిలుపు ఇచ్చింది.

ఉత్తర దక్షిణప్రాంతాలు రెండింటిలోని కాలేజీలూ, స్కూళ్లూ ఈ పిలుపును అందుకొని శుక్రవారంనాడు హర్తాళకు పూనుకొన్నారు. సెంట్ జేవియర్ కాలేజి విద్యార్థులు అజాద్ మైదానానికి ఊరేగింపుగా సాగి పోయారు. ముస్లిమ్ విద్యార్థి సమాఖ్య విద్యార్థులు ఊరేగింపులో కలిశారు. జి ఎస్. ఎస్. మెడికల్ కాలేజీ, ఇతర కాలేజీల విద్యార్థులు, నావికులకు ఆహారం కొనేందుకు డబ్బు పోగుచేశారు. దక్షిణాన జరిగిన విద్యార్థుల ఊరేగింపుల విషయంలో పోలీసులు జోక్యం కల్పించుకోలేదు. అందుచేత అక్కడ ఘర్షణ లేమీ జరగలేదు.

ఉత్తర ప్రాంతంలో రుయా కాలేజి నుంచి 500 మంది విద్యార్థులతో ఊరేగింపు బయలుదేరింది. ఊరేగింపుపై పోలీసులు రెండు సార్లు లాఠీచార్జీ చేశారు. కాని విద్యార్థులు అక్కడికి ఫర్లాంగు దూరంలోని తిలక్ బ్రిడ్జి దగ్గర మళ్ళీ గుమిగూడారు. అక్కడికి సుమారు అరమైలు దూరంలోని హింద్‌మాతా సినిమా హాలు వద్ద పోలీసులు మళ్ళీలాఠీ చార్జీ చేశారు. దాంతో విద్యార్థులు తెగించి కర్రలతోను, వట్టి చేతులతోను ప్రతిఘటించారు. చివరకు ఎలాగైతేనేం పోలీసులు పరేల్ దగ్గర తీవ్రమైన మరో లాఠీచార్జీ చేసి ఊరేగింపును చెదరగొట్టారు ఒక విద్యార్థికి తలపైన తీవ్రమైన గాయం తగిలింది.

శనివారం ఫిబ్రవరి 23-శుక్రవారం రాత్రి బొంబాయి నగరంలో కర్ఫ్యూ విధింపబడింది. సాయుధ సైనిక శకటాలు నిర్మానుష్య నిశ్శబ్ద వీధుల్లో గస్తీ తిరిగాయి. ప్రజలు, కార్మికులూ తమ తమ బంధువులతో బాటు (వారు చనిపోయి వున్నా, బతికి వున్నా) ఆస్పత్రుల్లో ఆ రాత్రంతా క్షణమొక యుగంగా గడిపారు.

మొత్తం భారత నావికులందరూ (ఓడలో వున్నా, ఒడ్డున వున్నా) సర్దార్ పటేల్ సలహా మేరకు, తమ భవితవ్యాన్ని మొత్తం జాతి చేతికి అప్పగించాలనీ, సమ్మె విరమించుకోవాలనీ నిర్ణయించు కొన్నారు. అయితే ప్రజలూ, కార్మికులూ, మళ్ళీ పనుల్లోకి వెళ్ళే ధోరణిలో లేరు. వారి బంధుమిత్రులింకా మార్చ్యువరీ (మృత దేహాలుంచే స్థలం) ల్లో వున్నారు. బాయొనెట్లు

ఎక్కుపెట్టి సైన్యం ఇంకా వీధుల్లో మోహరించే వుంది.

కార్మికులు తమ ఫ్యాక్టరీలకు వెళ్ళలేదు. షాపులు మూతపడే వున్నాయి. పొద్దు వాలుతున్న కొద్దీ సైనికులు, పోలీసులకు ప్రజలకు మధ్య దొమ్మీలు జరిగాయి.

ఖేండీ బాజారులో కొందరు ప్రజలు ఇద్దరు పోలీసు ఆఫీసర్ల నుంచి రివాల్వర్లు లాక్కున్నారు. పాశవిక మిలటరీ కాల్పులకూ, ప్రజల అచంచల ప్రతిఘటనకూ మదన్ పురా, నార్త్ బ్రూక్ గార్డెన్స్, డంకన్‌రోడ్ ప్రాంతాలు రంగ స్థలాలు అయ్యాయి.

డంకన్ రోడ్డు దగ్గరి రెండు చెరువుల చౌరస్తాలూ బారికేడ్లు నిర్మింప బడ్డాయి. ఆ ప్రాంతం సంకుల పోరాటాలకు స్థావరమైంది. అన్ని చోట్లలాగే మిలటరీ లారీలు విచ్చలి విడిగా కాల్పులు జరుపుతూ అక్కడికి వచ్చాయి. కాని వాటికి అక్కడ ప్రతిఘటన ఎదురయింది. ప్రజలు మొదట్లోనే అక్కడ వెదురుబొంగులు, బట్టలతో, గట్టి తాళ్ళతో బందోబస్తుగా బారికేడ్లు నిర్మించారు. అవి మిలిటరీ లారీలను అడ్డుకో గలంత బలంగా వున్నాయి. ఆ బారికేడ్ల మీద కాంగ్రెస్, లీగు జెండాలు ఎగరవేయ బడ్డాయి. కామాటీపురం వైపు కాంగ్రెస్, లీగ్, ఎర్ర జెండాలు ఎగుర వేయ బడ్డాయి. అప్పుడు జనం, కొయ్యతో నిర్మించబడిన పోలీసు చౌకీని నిర్మూలించ పూనుకున్నారు.

మిలిటరీ లారీలు రావటం కనిపించంగానే జనం ఇళ్ళల్లోకీ, సందుల్లోకీ మాయమయ్యేవారు ఒళ్ళు మండిన మిలటరీ, బారికేడ్లను విరగగొట్టి, విచ్చలి విడిగా కాల్పులు జరిపేవారు. హఠాత్తుగా వాళ్ళపై రాళ్ళవాన కురిసేది. ఆ రాళ్ళు విసిరిన వారు కనబడేవారుకాదు. దాంతో మిలిటరీ కంగుతిని మర తుపాకులనుంచి గుళ్లు కురిపించి అక్కడనుంచి వెళిపోయేవారు. వాళ్లు అలా వెళ్ళగానే జనం మళ్ళీ రో మీద గుమిగూడేవారు. గాయాలు తగిలిన వాళ్ళ ఇళ్ళకు మోసుకుపోయి, గాయాలకు కట్లు కట్టేందుకు ఆడవాళ్ళకి అప్పగించేవారు. పోరాటం కొనసాగించ డానికి మళ్ళీ మగవాళ్ళు వీధుల్లోకి వెళ్ళేవారు.

ఆ రోజున బ్రిటిషు సైన్యం మళ్ళీ మళ్ళీ కాల్పులు జరిపింది. అయినా ప్రజలు కంగారు పడలేదు. రాత్రి కాగానే వీధిదీపాలు బద్దలుకొట్టి సైనికులు అటు పోయేందుకు అవకాశం లేకుండా చేశారు. మిలిటరీ కాల్పులు జరుపగా గుళ్ళల్లో ఎక్కువభాగం శూన్యంలో కలిసేవి. కాని మిలిటరీ లారీలకు మాత్రం రాళ్ల తప్పకుండా తగిలేవి.

శివాజీపార్కు దగ్గర సైన్యం పిచ్చెత్తినట్టు కాల్పులు జరిపింది. ఆరోగ్యశాఖ బిల్డింగులోని వ్యక్తులకూ, ఇతర ఇళ్ళకూ గుళ్ళదెబ్బలు తగిలాయి.

విద్యార్థులు, కార్మికులు, ఇతర్లూ రాళ్ళు పట్టుకొని మిలటరీ లారీలవస్తే కొట్టేందుకు శివాజీపార్కువద్ద వేచి వున్నారు. మళ్ళీ మళ్ళీ కాల్పులు జరిగినా గుంపు చెదరకపోగా, పెరిగింది.

ఫెర్గసన్‌రోడ్డు దగ్గర ఉదయం పదిన్నర నుంచి సైనికులు అనేకసార్లు కాల్పులు జరిపారు. కార్మికులకీ మిలిటరీకి మధ్య అనేక దొమ్మీలు జరిగాయి.

ఆదివారం, ఫిబ్రవరి 24 – అంతకు ముందు రోజున జరిగిన బీభత్సకాండకు నిరసనగా, ఆదివారంనాడు కార్మికులు పనుల్లోకి వెళ్ళలేదు. కేవలం పది పన్నెండు మిల్లులు పాక్షికంగా పనిచేశాయి స్పిన్నింగ్ మిల్లుల వద్ద పోలీసులూ, దాదరు దగ్గర సైనికులూ కాల్పులు జరిపారు.

మిట్టమధ్యాహ్నం నుంచి, పోలీసులు కార్మిక పేటల్లో ప్రవేశించి, మూకుమ్మడి అరెస్టులు ప్రారంభించారు. అప్పటికే వందలాది కార్మికులు అరెస్టు చేయబడ్డారు. ఒక్క డెల్‌హౌసి రోడ్డు ప్రాంతంలోనే మున్సిపల్‌పేటల్లో, కుమ్మరివాడల్లో హాక్‌మిల్స్ మున్నగువాడల్లో వందమందికి పైగా కార్మికులు అరెస్టు చేయబడ్డారు. వాళ్ళని నిద్రనుంచిలేపి, దుస్తులు కూడా మార్చుకోనివ్వకుండా, తీసుకుపోయి అరెస్టు చేశారు.

ఈ మూడు రోజుల్లోనూ మొత్తం 300 మంది చనిపోయారు. ఇందులో 100 మంది కార్మికుల ప్రాంతాల లోనివారు.

ఒక్క బొంబాయిలోనేకాక ఇతర నగరాల్లో కూడా, నావికా సైనికులకు అండగా ప్రజలు వీరోచితంగా పోరాడారు. విశాఖపట్నంలో 22 తేదీన కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యాన సభ జరిగింది. నావికా సైనికుల అరెస్టును ఖండించుతూ ఆ సభ తీర్మానించింది. కార్మికులు పెద్ద సంఖ్యలో బ్రిటిష్ వ్యతిరేక నినాదాలతో ఊరేగింపు జరిపారు. ప్రభుత్వం విచ్చలవిడిగా

అరెస్టులు సాగించింది. 144 సెక్షన్ వుపయోగించింది. సానుభూతి ప్రదర్శనలపై నిషేధం విధించింది. ఒక నెలదాకా కమ్యూనిస్టు నాయకుల కార్యకలాపాలపై, నిషేధం విధించింది.

కలకత్తాలో ఫిబ్రవరి 23 న, ట్రామ్‌వే కార్మికులు వీరోచితంగా సమ్మె నడిపారు. ట్రాములు, బస్సులు, టాక్సీలు, రైళ్ళు సమ్మెలో పాల్గొన్నాయి. లక్షమందికి పైగా కార్మికులు, విద్యార్థులు వీధుల్లో ప్రదర్శనలు చేశారు. ఉదయంనుంచీ పోలీసుల దాడి ప్రారంభమైంది. అయినా కార్మికులు, విద్యార్థులు నగరంలోని వివిధ ప్రాంతాల్లో ప్రదర్శనలు జరిపారు. కాంగ్రెస్, కమ్యూనిస్టు నాయకులు ఉపన్యసించారు.

కరాచీ బొంబాయిలలోని కాల్పుల వార్త చేరగానే ఫిబ్రవరి 25 న అహ్మదాబాద్‌లో సార్వత్రిక సమ్మె జరిగింది. అంతకుముందు రోజు సభలు, హరిజన కార్మికుల ప్రచారమూ, కామ్గార్ మైదాన్‌లో 6 వేల మందితో సభ జరిగాయి. కాంగ్రెస్, లీగ్‌లు వ్యతిరేకించినా, కమ్యూనిస్టుపార్టీ విజ్ఞప్తి మేరకు 10 వేలమంది సమ్మె చేశారు. 8 మిల్లులు పూర్తిగా మూతప యి. 3 వేల మందితో ఊరేగింపు, సాయంత్రం పె సభా జరిగాయి. అదేరోజున తిరుచునాపల్లిలో కా కుల ప్రదర్శన జరిగింది. గో న్‌రాక్‌లో 5 వేల ంది కార్మికులు, 500 మంది క్లరు లు, 200 మంది వీధులు వూడ్చేపనివారు సమ్మె చేశా . 5 వేల మందితో ఊరేగింపు జరిగింది. గోల్డెన్ రాక్‌లోని షాపులు, హోటళ్లూ అన్నీ మూసివేశారు. వార్తాప్రసారాలు, సమాచారాలు ఆగిపోయాయి. ఫ్యా రీలు మూతపడ్డాయి. అన్నిచోట్ల నుంచి కార్మిక జన! వాహం ఊరేగింపుగా వచ్చింది. రైల్వే కార్మికులు, డీ కార్మికులు, పారిశుధ్య కార్మికులు, బస్ కార్మికులు, షాపు గుమాస్తాలు, విద్యార్థులు అంతా సమ్మె చేశారు. కమ్యూనిస్టుపార్టీ ఆఫీసువద్ద లక్షమందితో సభ జరిగింది. ఆర్. ఐ. యన్ సైనికుల పట్ల సంఘీభావం తెలియచేస్తూ, బ్రిటిషు సైనికుల పోలీసుల కాల్పులు ఖండిస్తూ ఈ సభ తీర్మానించింది.

మద్రాసులో ఫిబ్రవరి 25 న పూ ్తి హ రాళ్ జరిగింది. కమ్యూనిస్టుపార్టీ, రాష్ట్రట్రేడ్ యూనియన్ కాంగ్రెస్. వివిధ కార్మిక సంఘాలు సార్వత్రిక సమ్మెకు విజ్ఞప్తి చేశాయి. అన్ని పక్షాల విద్యార్థులూ కార్మికులకు తోడుగా నిలిచారు. ఆలిండియా స్టూడెంట్ ఫెడరేషన్‌కు అనుబంధశాఖ అయిన మద్రాసు స్టూడెంట్స్ ఆర్గనైజేషన్ (యం. యస్. ఓ.) స్టూడెంట్సు కాంగ్రెస్, సమ్మెలో పాల్గొన్నాయి. రైల్వేకార్మికులు సమ్మెలో చేరటంతో, రైల్వేల రాకపోకలకు అంతరాయం కలిగింది. విద్యార్థుల, కార్మికుల, షాపు గుమాస్తాల ఊరేగింపు జరిగింది. పీపుల్స్ పార్క్‌లో కార్మికుల సభ 15 వేలమందితో జరిగింది. నగరంలో అనేకచోట్ల మీటింగ్‌లు జరిగాయి. సాయంత్రం తిలక్‌ఘాట్‌లో బ్రహ్మాండమైన సభ జరిగింది. మొదటినుంచీ పోలీసులు రెచ్చగొడుతూనే వున్నారు. ఎలియట్ రోడ్‌వద్ద పోలీసులు లాఠీచార్జీ చేస్తే, ప్రజలు రాళ్ళు విసిరి ప్రతిఘటించారు. రాయపురం వద్ద పోలీసుస్టేషన్‌పై దాడిచేసిన ప్రజలపై పోలీసులు కాల్పులు సాగించారు. ఐనా వారు ప్రతిఘటిస్తూనే వచ్చారు. పోలీసులు నగరంలో రెండుచోట్ల కాల్పులు సాగించారు. అంతకు ముందురోజు జరిగిన "అల్లర్ల"లో పాల్గొన్నారని 29 మందిని ప్రభుత్వం శిక్షించింది.

కాన్పూర్‌లో ఫిబ్రవరి 26 న విజయవంతంగా సమ్మె జరిగింది. అంతకు ముందురోజున కమ్యూనిస్టులు ఎడ్ల బళ్ళపైన, ఇక్కా బళ్ళపైన కాలినడకనా వెళ్ళి ప్రచారం చేశారు. పెరేడ్ గ్రౌండులో మీటింగ్ జరిపారు. 26 న వర్షం జోరుగా కురుస్తున్నా ఆరువేల మందితో సభ జరిగింది.

మధురైలో 27 న కమ్యూనిస్టు విజ్ఞప్తిపై పూర్తి హరాళ్ జరిగింది. రవాణా శాఖలలో, ఫ్యాక్టరీలలో, ప్రెస్‌లలో సమ్మె జరిగింది. పారిశుధ్య కార్మికులు, చేనేత పనివారు. జాళి మిల్లు కార్మికులు, విద్యార్థులు సమ్మె చేశారు. 90 శాతం దుకాణాలు మూసివేయబడ్డాయి. హోటళ్ళు, భోజనశాలలు బందయ్యాయి. సాయంత్రం 5 వేలమందితో ఊరేగింపు. 50 వేల మందిలో బహిరంగ సభ జరిగాయి.

అదేరోజు (26 అర్ధరాత్రినుంచీ) అస్సాంలోని లూండింగ్‌లో 6 వేలమంది సమ్మెచేశారు. 24 గంటల పాటు రైళ్ళు నడవలేదు. అస్సాంలోనే పాండువా అనే చోట 3 వేలమంది రైల్వే కార్మికులు 28 వ తేదీ సాయంత్రం 4 గంటలనుంచి 29 తేదీ సాయంత్రం 4 గంటల వరకు సమ్మె చేశారు.

బొంబాయిలో చరిత్రాత్మకమైన సమ్మెలో అసువు లర్పించిన దాదాపు 300 మంది అమరవీరులను సంస్మరిస్తూ మార్చి 8 న కాంగ్రెస్ మైదాన్‌లో సభ జరిగింది. ఆర్. ఐ. ఎన్. సైనికుల ప్రతినిధి ఒకరు, అరెస్టయిన తమ సహచరుల డిఫెన్సుకు సాయపడాల్సిందిగా, కాంగ్రెస్, లీగ్ కమ్యూనిస్టుపార్టీల ఐక్య డిఫెన్సు కమిటీలను ఏర్పరచాల్సిందిగా కోరాడు. ఈ చారిత్రాత్మక సమ్మెలో సైనికుల, సామాన్య ప్రజల రక్తం వీధుల్లో కలిసి పారింది. కొన్ని పార్టీల నాయకత్వం వ్యతిరేకించినా కాంగ్రెస్, లీగ్ కమ్యూనిస్టు సామాన్య సభ్యులు కలిసి సమైక్యంగా పోరాడారు. ఈ సమ్మె ఒక నూతన శకాన్ని ప్రారంభించింది. బ్రిటిష్ పాలన అంతానికి నాందీవాచకం పలికింది.

## సమ్మె విరమణ తర్వాత నిర్బంధవిధానం

ఫిబ్రవరి 22 న ఆర్. ఐ. ఎన్. సైనికులకు సంఘీభావం ప్రదర్శించేందుకు, సార్వత్రిక సమ్మె జరపాలని బొంబాయి నగర కమ్యూనిస్టుపార్టీ విజ్ఞప్తిచేసింది. కాని వల్లభాయ్ పటేల్ హర్తాళ్ చేయవద్దని ఒక ప్రకటన చేశాడు. నావికా సైనికుల ఇబ్బందులు తీర్చడానికి కాంగ్రెస్ ప్రయత్నిస్తున్నదనీ, కేంద్ర అసెంబ్లీలో కాంగ్రెస్ పెద్ద పార్టీఅనీ అందుచేతనే శాయశక్తులా నావికా సైనికులకు సాయపడేందుకు కృషి చేస్తుందనీ ఆ ప్రకటనలో చెప్పారు. ఐనా మూడురోజులు బొంబాయిలో బ్రిటిష్ సైనికుల దురాగతాలను ప్రతిఘటిస్తూ జయప్రదంగా హర్తాళ్ చేశారు. ఫిబ్రవరి 23 న నావికా సైనికుల్ని లొంగిపోవాల్సిందిగా పటేల్ సలహా ఇచ్చాడు.

"ఇపుడు తాత్కాలిక ఆపద్ధర్మ ప్రభుత్వం వుంది. అందుకని సమ్మెలకు, హర్తాళ్ళకు, ధిక్కారానికి తావులేదు. ఆపద్ధర్మ ప్రభువులుగా వ్యవహరిస్తున్న విదేశీ పాలకులతో ఘర్షణ పడటానికి తక్షణ కారణం ఏమీ కన్పించదు" అంటూ ఆజాద్ అన్నాడు. గాంధీ ఈ సమ్మెను నిరసించాడు. జిన్నా కూడా సమ్మె విరమించాల్సిందిగా కోరాడు. నావికా నికులు 18 న సమ్మె ప్రారంభించితే మర్నాదే టిష్ ప్రధాని అట్లీ, భారతదేశ స్వాతంత్ర్య సమ స్యను చర్చించేందుకు మంత్రివర్గ రాయబారం పంపడానికి నిశ్చయించినట్లు కామన్స్ సభలో చెప్పాడు. ఇది కాంగ్రెస్, లీగ్ నాయకులకి ఎరచూపినట్లయింది.

నెహ్రూ ఒక పక్క నావికా సైనికుల త్యాగం పొగుడుతూనే మరోపక్క వారి పోరాటాన్ని ఆక్షేపించాడు. "ఆర్. ఐ ఎన్. ఉదంతం భారతదేశ సైనికుల చరిత్రలో ఒక కొత్త అధ్యాయాన్ని ప్రారంభించింది. భారత ప్రజలకు, భారత సైన్యానికి మధ్య బ్రిటిష్ వాళ్ళు కట్టిన అడ్డుగోడ కూలిపోయింది" అంటూనే నెహ్రూ "18 వ శతాబ్దపు విప్లవ పద్ధతులు, బారికేడ్లు (కొట్లగడలు) కాలదోషం పట్టినవి" అని ఆక్షేపించాడు. "ఏడు గంటలపాటు జరిగిన తుపాకియుద్ధం దాదాపు విరపాయకరమైనదే" అని వ్యాఖ్యానించాడు. "మెషిన్ గన్‌లను, రైఫిళ్ళతో నీవు ఎదిరించ లేవు. చిన్న తుపాకులు పెద్ద తుపాకులను ఎదిరించలేవు" అన్నాడు నెహ్రూ.

చెదురుమదురు హింసా ఘటనలు అధికారాన్ని చేపట్టడానికి సహాయపడవిమాటనిజమేగాని,బానిసప్రజలు ఏ పరిస్థితుల్లోను సాయుధ ప్రతిఘటనకు దిగరాదని నెహ్రూ చెప్పడం ఒక విధంగా సమ్మెను నిరుత్సాహపర్చడమే. ప్రజలకు, సైనికుల మధ్య ఐక్యతఏర్పడి ఒకానొక రోజున బ్రిటిష్ పీడనను వదిలించుకోగల అవకాశాన్ని తోసి పుచ్చటమే అవుతుంది.

కాంగ్రెస్, లీగ్ నాయకత్వాలు నావికా సైనికుల పక్షాన జోక్యం చేసుకోబోవని స్పష్టమైన తర్వాత ప్రభుత్వం వారిపై నిర్బంధ విధానాన్ని తీవ్రతరం చేసింది.

ప్రజావెల్లువ ఉధృతంగా వున్న సమయంలో సర్వసైన్యాధ్యక్షుడు, కాంగ్రెస్‌అధ్యక్షుడు ఆజాద్‌కు, నావికా సైనికులను ఉద్యోగం నుండి తొలగించబోమని హామీ ఇచ్చాడు కాని ఈ హామీ ఉల్లంఘించడానికి ఎంతోకాలం పట్టలేదు.

ఆర్. ఐ. ఎన్. సమ్మె ద్వారా పోయిన ప్రతిష్ఠ నిలబెట్టుకోడానికి ఢిల్లీలో విజయోత్సవ సైనికప్రదర్శన బర్మా విజయచిత్ర ప్రదర్శనలాంటి చౌకబారు ఎత్తులు వేశారు. మరో పక్క మూడు సైనిక శాఖలలోను, ముఖ్యంగా నావికాసైన్యంలో నిర్దాక్షిణ్యంగా నిర్బంధ విధానం మొదలుపెట్టారు. సమరశీలురను, దేశభక్తి భావాలు గల నాయకులను ఏరిపార వేశారు. మార్చి, ఏప్రిల్ నెలల్లో 5 వేల 5 వందలమంది నావికాసైనికుల్ని ఇళ్ళకు పంపివేశారు.

లొంగిపోయిన రెండురోజుల్లోనే కేంద్ర సమ్మె కమిటీ అధ్యక్షుడు ఖాన్‌నూ, ఇతర సభ్యుల్ని అరె స్టు చేసి, ఎక్కడికో తీసుకుపోయి డిటెన్ చేశారు. సమ్మె కమిటీ అధ్యక్షుడు "మేం భారత దేశానికి లొం. పోయాముకాని బ్రిటిష్ వాళ్ళకి కాదు" అని వెళ్ళిపోయే ముందు సందేశమిచ్చాడు.

ఫిబ్రవరి 26 న గోండ్‌వానా నౌకలో ఒక వంట వాణ్ణి, ఇద్దరు నావికులను మరోనౌకకు తీసుకుపోతు న్నామని చెప్పి అన్ని సర్దుకోమన్నారు. తీరా ఒడ్డుకు వెళ్ళేసరికి సాయుధ సైనికులున్న లారీలో ఒక సైనిక శిబిరానికి ఖైదీలుగా తీసుకుపోయారు. కొన్నిగంటల్లో 396 మందిని అరెస్టుచేసి. మూలండ్ సైనిక శిబిరానికి తీసుకుపోయారు. కరాచీలో లొంగుబాటు జరగిన వెంటనే నావికా సైనికుల్ని అరెస్టుచేసి, మాలిక్ శిబి రంలో పెట్టారు. బ్రిటిష్ సైనికుల్ని కాపలాపెట్టారు. వాళ్ళ నాయకు లెవరని ప్రశ్నిస్తే తామే నాయకులమని ప్రతివారూ చెప్పసాగారు. దాంతో నావికా సైనిక ఖైదీల్ని మూడు శిబిరాలలోనికి మార్చారు. కమాం డింగ్ ఆఫీసర్, నాయకుల్ని ముందుకు రావాల్సిందిగా కోరాడు, కానీ ఎవరూ ముందుకు రాలేదు. ఆ తర్వాత కొందరి పేర్లుచెప్పి. వాళ్ళని ముందుకు రమ్మన్నాడు. కాని ఎవరూ రాలేదు. ఎవరైనా ముందుకు అడుగేస్తే. అతనితోపాటే, ఇతర్లు కూడా అడుగు వేసేవారు. ఇక గత్యంతరం లేక పైన చెప్పిన విధంగా మూడు శిబి రాలలోకి మార్చారు. హిందూ ముస్లిం శిబిరాలగాను, రాష్ట్రాల వారిగాను, ఇంకా అనేక విధాలుగాను వీరిని విభజించారు. కాని వారి దృఢ నిశ్చయాన్ని మాత్రం కదల్చలేకపోయారు.

ఖైదీలు నౌకా వంటశాలలోని ఆహారం తీసుకొనేం దుకు నిరాకరించారు. తమ సైనిక సహచరుల కిచ్చే ఆహారాన్ని తమకూ ఇవ్వాలనికోరారు. వంటవాళ్ళు అందుకు సిద్ధపడటంతో వారు అంగీకరించారు.

ఆఫీసర్ల భోజనశాల, నివాస గృహాలు ఖైదీలకు దగ్గరలోనే వుండేవి. రాత్రిళ్ళు ఖైదీలు అల్లరిచేస్తూ పెద్ద శబ్దం చేసేవారు. తెల్లవా న కమాండింగ్ ఆఫీ సరుకు చిర్రెత్తింది. అందరినీ ల్చివేస్తానని బెదరిం చాడు. వాళ్ళ ఖైదీ గదుల కెదురుగా, బాష్పవాయువు, పొగబాంబుల జనరేటర్లు సిద్ధంచేసి వుంచాడు. దాంతో ఖైదీలలోనేగాక, సిపాయిల్లోకూడా అసంతృప్తి ఫెరి గింది. ఇది గమనించి ఉన్నతాధికారులు సర్దుబాటుచేసి, విచారణ కోర్టును నియమించింది.

కరాచీలో ఆ విధంగా 500 మందిని మాలిక్ శిబి రంలో ఉంచారు. ఖైదీలు క్షమాదానం కోరాలని మొదటి నుంచీ ప్రయత్నంచేశారు. మొదట తిరస్కరించినా, తర్వాత కొందరు నావికా సైనికులు లొంగిపోయారు. వారి ఐక్యత అలా భగ్నమయింది. క్షమాభిక్షకోరిన వారిచే, మళ్ళా ఎప్పుడూ అధికార్లను ఇబ్బంది పెట్ట బోమని హామీపత్రాన్ని రాయించుకొన్నారు. ఆ విధంగా 350 మంది విడుదలయ్యారు తక్కినవారిని కఠినంగా శిక్షించారు.

బొంబాయిలో కూడా ఇలాగే జరిగింది కాని నావికా సైనికులు ఆ ప్రయత్నాన్ని ప్రతిఘటించారు.

మూలండ్ శిబిరంలో సమ్మె విరమణ తర్వాత ఒక వారమయ్యే సరికి 390 మందిదాకా ఖైదీలుచేరారు. అక్కడ పారిశుధ్య పరిస్థితులు అధ్వాన్నంగా ఉండ టంతో, చాలామంది జబ్బుపడ్డారు. ఆహారం కూడా చాలా చెడ్డగా వుండేది, వాసన వేసేది. నావికా సైని కులు ఏ పరిస్థితిలో సమ్మె చేశారో ఆ పరిస్థితుల్నే ఇపుడు కక్షతో అధికారులు ప్రవేశపెట్టారు.

విచారణ సంఘాలేర్పరచి, వాటిద్వారా తతంగం నడిపి, సమ్మె నాయకు లెవరో తెలుసుకోడానికి అధి కార్లు ప్రయత్నించేవారు· కాని వారి ఆటలు సాగేవి కావు.

నావికా సైనిక ఖైదీల పరిస్థితి, నానాటికీ క్షీణిం చింది. మార్చి 12 న మంచి ఆహారం కావాలని అధి కారులతో ఘర్షణ పడ్డారు. అధికార్ల దురుసుతనానికి నిరసనగా నిరాహారవ్రతం సాగించారు. ఐతే ప్రభు త్వం తన గూఢచారులను ఖైదీల మధ్య వుంచింది. వాళ్ళు ఖైదీల ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికి ప్రయ త్నించేవారు.

అధికార్లు ఒకరోజు సాయంత్రం సినిమా ప్రదర్శ నకు ఏర్పాటుచేశారు. ఖైదీలు దాన్ని బహిష్కరించ నిశ్చయించారు. ఐనా ఆ ప్రదర్శన కొనసాగుతూ వుంటే, అస్లామ్అనే యువకుడు తెరచించి పారేశాడు. అధికార్లు, మరాఠా సైనికుల్ని సంసిద్ధంగావుండాలని ఆజ్ఞాపించారు. కర్ఫ్యూ విధింపబడింది, సమ్మె చేసిన వారిని గదుల్లోకి పంపించివేశారు.

కమాండింగ్ ఆఫీసర్ కెప్టెన్ నాట్ వచ్చి "భోజనం చేసేవారిని చేయవద్దని ప్రోత్సహించేవారిని అరెస్టు చేశా"మని తక్కిన వారంతా భోం చేయవల సి-దని కోరాడు.

ఖైదీలందర్నీ ఒక్క-చోట ఉంచితే తప్ప భోం చేయబోమని వారు నిరాకరించారు మరో శిబిరంలోని సమ్మె నాయకులు ఒక విజ్ఞప్తిని తయారుచేసి, ఆర్. ఐ యన్. సైనికులకు, సైనికులకు, వైమానికులకు పంపడానికి సంసిద్ధులయ్యారు. తమ శిబిరం వద్దకు బ్రిటిష్ సైనికులను రప్పించారనీ, మరాఠా సైనికుల్ని రైఫిళ్ళు లోడ్‌చేసి వుంచవలసిందని కోరారనీ ఈ పత్రంలో రాశారు. కాని ఈ పత్రం ఎవరికీ చేరకముందే అధికార్లు మరోసారి దాడిచేశారు.

సమ్మె నాయకుడు ఖాన్‌ను వేరేచోటికి పంపాలని అధికార్లు నిశ్చయించారు. ఖాన్ తిరస్కరించాడు. బాయ్‌నెట్ చూపి, మూటకట్టినట్టు అతన్ని లారీలో పడవేశారు. ఈ దృశ్యం చూసి సహించలేని అస్లామ్ అనే యువకుడు కెప్టెన్‌నాట్ వద్దకువెళ్ళి అతని దుస్తులపై ఉన్నతాధికార చిహ్నాలను ఊడబెరికాడు. చెప్పు తీసుకొని అతని ముఖం మీద కొట్టాడు. కెప్టెన్ నాట్ మరాఠా సైనిక కాపలాదార్లను కాల్పులు సాగించాల్సిందిగా ఉత్తర్వు చేశాడు. కాని వారు తమ రైఫిళ్ళను కిందపడవేసి, తమ సోదరులను కాల్చ నిరాకరించారు. ఏదో గలాభా జరుగుతున్నదని ఇతర బారక్‌లలోవున్న నావికా సైనికులు బయటికివచ్చారు. ఖైదీల గేటు బద్దలుగొట్ట ప్రయత్నించారు. ఇంతలో బ్రిటిష్ సైనికులు వచ్చి టామీ గన్‌లతోను, తేలికపాటి మెషిన్ గన్‌లతోను కాల్చారు. నావికా సైనికులు చెదరిపోయారు.

నిరాహారవ్రతంలో దాదాపు 150 మంది జబ్బుపడ్డారు. వారిలో పరిస్థితి మరీ ప్రమాదంగాఉన్న వారిని మూలాండ్ శిబిర సమీపంలోని సముద్రతీరానికి తరలించారు. మంచి ఎండలో వుండటంవల్ల వడదెబ్బ తగిలినవారు దాదాపు 50 మందిదాకా వున్నారు. కొందరిని మరో శిబిరానికి తరలించారు. నిరాహారవ్రతులకు బలవంతంగా ఆహారం ఎక్కించ సాగారు. ఒక 20 మంది తప్ప, అంతా నిరాహారవ్రతం విరమించారు. ఈ పరిస్థితులలో కళ్యాణిలోని నాయకుల సలహాతో తక్కినవారు కూడా మార్చి 16న నిరాహారవ్రతం విరమించారు.

ఈలోగా కళ్యాణ్‌లో జరిగినదేమిటి ? అక్కడ నిరాహారవ్రతుల్ని కూడా ఒకచోట నుంచి, మరో చోటికి కవాతు చేయిస్తూ నడిపించారు. నడవలేక తిరస్కరించినవారిని బ్రిటిష్‌వాళ్ళు "జైహింద్ కుక్కల కొడుకులు" అని తిడుతూ కాళ్ళతో తన్నేవారు. ఇది సహించలేక ఒకడు కాపలా సైనికుడిపై దాడి చేశాడు. అపుడు ఖైదీ లందర్నీ గదికి ముగ్గురు చొప్పున బంధించారు. వారివ స్తువులన్నీ లాక్కు-న్నారు.

బ్రిటిష్ నికులకు కూడా, మొదట వీరంతా హిందూ ం కలహాల్లో పాల్గొన్నారని భావించారు. చివరకు అ లు విషయం తెలిసింది. కొంతవరకూ వారి వైఖరి మారింది.

చివరకు ఏప్రిల్ 5 న మొట్ట మొదటిసారిగా కొందరిని ఉద్యోగానికి అనర్హులని ఇళ్ళకు పంపారు. వారికి "ఇంక్విలాబ్ జిందాబాద్" "జైహింద్" అంటూ వీడ్కోలు ఇచ్చారు.

ఇండ్లకు పంపివేయబడుతున్న నావికా సైనికులకు వారి పౌర దుస్తులు వారికివ్వలేదు. జీతాల కోసం వెళితే అక్కడ వారి కాతాలో ఏమీలేదు. వివరంఅడిగితే చెప్ప నిరాకరించారు. పైగా వాళ్ళకి ఇచ్చిన సంచీ (కిట్) తిరిగి ఇవ్వాలని పట్టుబట్టారు. సైనిక తిరుగుబాటులో పాల్గొన్నారంటూ డిశ్చార్జి చేశారు.

చేతిలో దమ్మిడీ లేదు. దుస్తుల్లేవు. తిండిలేదు. సాయుధ సైనికుల కాపలాతో రైలెక్కించి "ఇక బొంబాయి ముఖం చూడవద్ద"ని సాగనంపారు.

ఆ విధంగా భారత నావికా సైనికులు, నౌకలపై వున్నా, జైళ్ళలో వున్నా తుదకంటా వీరోచితంగా పోరాడారు భారత నావికా సైనికుల తిరుగుబాటు దేశంలో పరిస్థితి విప్లవోన్ముఖంగా నడుస్తున్నదని నిరూపించింది. భారత స్వాతంత్ర్య అవతరణను త్వరితం చేసింది.

# రాయబారపర్వం

1943 అక్టోబరు 18 న సర్ ఆర్చిబాల్డ్ వేవెల్ భారతదేశానికి వైస్రాయిగా వచ్చాడు. 1944 జనవరి, ఏప్రిల్ మాసాల మధ్య వైస్రాయితో గాంధీ, భారత దేశ స్వాతంత్ర్యానికి సంబంధించిన ప్రతిష్టంభన తొలగించడానికి ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. కాని లాభంలేకపోయింది 1944 ఏప్రిల్ 14 న జబ్బుపడిన గాంధీని మే 6 న విడుదల చేశారు. మరికొంతమంది కాంగ్రెస్ వర్కింగ్‌కమిటీ సభ్యుల్ని విడుదల చేశారు. జైళ్ళలోవున్న కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులతో అందర్నీ కలిసికొనే అవకాశాన్ని ఇవ్వాల్సిందిగా వైస్రాయిని గాంధీ కోరాడు. కాని అతడు అందుకు నిరాకరించాడు. శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించే ఉద్దేశం తనకు లేదనీ, పౌరపరిపాలనపై పూ ర్తి పెత్తనం గల జాతీయ ప్రభుత్వంతో తాను సంతృప్తి చెందగలనని తెలియచేశాడు. ఐనా వైస్రాయి ధోరణి సుముఖంగా లేదు. ముఖ్యమైన గ్రూపులూ, మైనారిటీలు ఒక ఒడంబడికకి వస్తే జాతీయ తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పరచవచ్చు అని వైస్రాయి అన్నాడు. 1944 అక్టోబరు 5 న అమెరీ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులను ఎందుకు విడిచిపెట్టారో కారణం కన్పించడం లేదని అన్నాడు.

ఒకపక్క వైస్రాయితో గాంధీ ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూనే, జిన్నాతో కూడా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. కాంగ్రెస్, లీగ్‌లకు ఒక అంగీకారం కుదిరితే తప్ప, దేశ స్వాతంత్ర్యం సాధించటం కష్టమని గాంధీ భావించాడు.

## రాజాజీ పథకం

గాంధీ అనుమతితో చక్రవర్తుల రాజగోపాలాచారి (రాజాజీ) ఒక పథకాన్ని రూపొందించాడు. 1944 జూన్ 30 న దాన్ని జిన్నాకు అందించాడు. 1940 లో లీగ్ చేసిన లాహోర్ తీర్మానాన్ని దాదాపు ఇది అంగీకరించినట్లే అవుతుంది. మౌలానా ఆజాద్ దీనికి అభ్యంతరం కూడా తెలియచేశాడు. కాంగ్రెస్ ఇదివరలో అవలంబించిన వైఖరికి ఇది భిన్నమైనదని ఆయన అభిప్రాయ పడ్డాడు.

రాజాజీ పథకం ప్రకారం —— 1. దేశ స్వాతంత్ర్యాన్ని సాధించటంలో ముస్లింలీగ్ కాంగ్రెస్‌తో సహకరించాలి. స్వాతంత్ర్యం వచ్చాక పాకిస్తాన్ ఏర్పడుతుంది.

2. బెంగాల్, పంజాబులలో ముస్లిమేతరులు అధిక సంఖ్యాకులుగా వున్న ప్రాంతాలను, పాకిస్తాన్‌లో చేర్చరాదు. దీని అర్థం తూర్పు పంజాబ్‌లో హిందువులు, సిక్కులు అధిక సంఖ్యాకులుగా వున్న జిల్లాలను, పశ్చిమబెంగాల్‌లో హిందువులు అధిక సంఖ్యలో వున్న జిల్లాలను పాకిస్తాన్‌లో చేర్చకుండా వదిలి వేయాలి.

3. పాకిస్తాన్ ఏర్పడేముందు, ఏర్పరచదలచిన ఆ పాకిస్తాన్ ప్రాంతంలోని ప్రజాభిప్రాయాన్ని, జనాభిప్రాయసేకరణ (ప్లెబిసైట్) ద్వారా తెలుసుకోవాలి.

4. పాకిస్తాన్, హిందూస్థాన్ ఏర్పడిన తర్వాత కూడా ఈ రెండు దేశాల మధ్య, అఖండ భారతదేశం యొక్క రక్షణ, రవాణా, ఇంకా ఉభయులకూ అవసరమైన ముఖ్యవిషయాలమీద ఒడంబడిక జరగాలి.

ఈ పథకం ఆధారంగా, గాంధీ 1944 జూలై ఆగస్టు మాసాలలో జిన్నాతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు.

1944 సెప్టెంబరు 9 న గాంధీ జిన్నాను బొంబాయిలో కలిశాడు. నిర్మొగమాటంగా చర్చలు సాగాయి. రాజాజీ పథకాన్ని జిన్నా తోసిపుచ్చాడు. పాకిస్తాన్ ఏర్పరచే కోర్కెను మొట్టమొదట అంగీకరించాలన్నాడు. అప్పుడే కాంగ్రెస్‌తో లీగ్ సహకరించుతుందని స్పష్టంచేశాడు బ్రిటిష్‌వాళ్ళు వెళ్ళిపోయాక, దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక స్వతంత్ర భారత దేశం పాకిస్తాన్‌ను ఏర్పరచదేమో నన్న సందేహం వెలిబుచ్చాడు. అంతేకాక పంజాబ్, బెంగాల్ రాష్ట్రాలు పూర్తిగా పాకిస్తాన్‌లో భాగాలు కావాలని కోరాడు. జనాభిప్రాయ సేకరణ (ప్లెబిసైట్)కు కూడా ఆయన వ్యతిరేకత తెలియచేశాడు. హిందువులు, ముస్లిములు రెండు వేర్వేరు జాతులు అనే భావాన్ని గాంధీ అంగీకరించాల్సిందిగా జిన్నా కోరాడు. కాని గాంధీ ఈ రెండు జాతుల సిద్ధాంతం అంగీకరించలేదు.

"భారతదేశంలోని అత్యధిక ముస్లిములు మతాంతరీకరణద్వారా ముస్లిములయ్యారు. అలా మతం మార్చుకొన్న వారి వంశీకులు నేటి ముస్లిములలో అధిక సంఖ్యాకులు. బెంగాలీ ముస్లిం, బెంగాలీ హిందువు

లాగానే బెంగాలీభాష మాటాడతాడు. వారి ఆహార విధానంలోగానీ, వస్త్రధారణలోగాని భేదంలేదు. ఆనంద పారవశ్యంలో ఒకే రీతిని అనుభూతి పొందుతారు. దక్షిణాదిన బీదముస్లిముల విషయంలో కూడా ఇదే వర్తింపచేస్తుంది. వంశపారంపర్య హక్కుకు సంబంధించిన హిందూ లా ముస్లింలలో అనేక గ్రూపులకి వర్తించుతుంది .... భారతదేశంలోని హిందువులు, ముస్లిములు రెండు జాతులుకావు. ఒక జాతిగా దేవుడు సృష్టించిన వాళ్ళను మానవుడు ఎన్నడూ (రెండుగా) విభజించలేడు" అన్నాడు గాంధీ.

"పాకిస్తాన్, హిందూస్తాన్"లుగా భారతదేశాన్ని విభజించడంతప్ప, హిందూ ముస్లిం సమస్యకు మరో పరిష్కారమార్గంలేదని 1944 అక్టోబరు 8 న స్పష్టం చేశాడు జిన్నా.

మూడు వారాలపాటు జరిగిన గాంధీ జిన్నా చర్చలు విఫలమయ్యాయి. కాని ముస్లిమ్ ప్రజల దృష్టిలో జిన్నా అంతస్తు పెరిగింది. అతని పాకిస్తాన్ వాదనకు బలం చేకూరింది.

1945 జనవరిలో కేంద్ర అసెంబ్లీలో నాయకుడుగా వున్న భూలాభాయ్ దేశాయి, కేంద్ర అసెంబ్లీలో ముస్లింలీగుకు డిప్యూటీగా వున్న లియాకత్ ఆలీఖాన్‌కు మధ్య ఈ సమస్యపై సంప్రతింపులు జరిగాయి.

తాత్కాలిక జాతీయ ప్రభుత్వంలో కాంగ్రెస్‌కు 40 శాతం, ముస్లింలీగ్‌కు 40 శాతం, ఇతర గ్రూపులకు 20 శాతం స్థానాలు వుండేటట్లు, ఆ ప్రాతిపదికపై మంత్రివర్గాన్ని ఏర్పరచేటట్లు — వీరు ఒడంబడికకు వచ్చారు. ఈ సూచనను వైస్రాయి వేవెల్ ముందు వుంచారు. వైస్రాయి బ్రిటిష్ మంత్రివర్గంతో చర్చించాడు. ఆ తర్వాత వైస్రాయి వేవెల్ 1945 సెప్టెంబరు 19 న ఒక ప్రకటన చేశాడు. త్వరలో రాజ్యాంగ పరిషత్ (కాన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ) ఏర్పరచుతామనీ, ఆ సభలో సంస్థానాధీశులకు ఎంత ప్రాతినిధ్యం కావాలంటారో, ఆ విషయం గురించి వారితో చర్చించుతామనీ అన్నాడు. బ్రిటిష్ వాళ్ళు భారతదేశం నుంచి వైదొలగాక బ్రిటిన్ భారతదేశాల మధ్య వుండాల్సిన సంబంధాం గురించి ప్రస్తావించాడు. 1945 డిసెంబరులో ఎన్నికలు జరుగుతాయని తెలియపరచాడు. వేవెల్ పథకం గురించి చర్చించడానికి సిమ్లాలో వివిధ ప్రతినిధుల సమావేశం జరిగింది. ఈ సమావేశానికి ముందు కాంగ్రెస్ వర్కింగు కమిటీ సభ్యుల్ని విడుదల చేసింది ప్రభుత్వం.

వేవెల్ పథకంలో ముఖ్యమైన అంశం_వైస్రాయి సర్వసైన్యాధిపతి మినహా, వైస్రాయి కార్యనిర్వాహక వర్గంలోని మిగతా సభ్యులంతా భారతీయులే వుంటారు. 'సవర్ణ' హిందువులు, ముస్లిములూ సమాన ప్రాతినిధ్యం కలిగి వుంటారు.

ఈ ఎరకు రెండు పార్టీలు లోబడ్డాయి. హిందువుల సీట్లన్నీ తనకు వస్తాయనీ, అవేకాక ఒకటి రెండు ముస్లిం సీట్లు కూడా వస్తాయనీ కాంగ్రెస్ ఆశించింది. ముస్లిం సీట్లన్నీ తనకు వస్తాయని లీగ్ ఉవ్విళ్ళూరింది. వేవెల్ నాటకాన్ని కాంగ్రెస్,లీగ్‌లు రెండూ గ్రహించలేకపోయాయి. కాంగ్రెస్, లీగ్‌లు పరస్పరం నిందించుకున్నాయి. దీనితో కాస్త ఊపిరి పీల్చుకొన్న బ్రిటిష్ ప్రభుత్వం, తాము అధికారం ఇచ్చేందుకు సిద్ధంగా వున్నా, భారతీయుల అనైక్యత అందుకు అడ్డువస్తున్నదని ప్రపంచానికి చాటింది. 1945 జూన్‌లో కాంగ్రెస్, లీగ్ తదితర ప్రతినిధుల సమావేశం విఫలమైంది ప్రతిష్టంభన తొలగించలేకపోయింది.

1945 జూలై 14 న లార్డు వేవెల్ సిమ్లా సమావేశం విఫలమైందనీ, అందుకు బాధ్యత తనదేననీ ప్రకటించాడు. వైస్రాయి కార్యనిర్వాహక సభ్యులలో ముస్లిములకు కేటాయించిన సభ్యులందర్నీ ముస్లింలీగ్ మాత్రమే నామినేట్ చేయాలని జిన్నా పట్టుబట్టడం వల్ల, సిమ్లా సమావేశం విఫలమైందని మౌలానా ఆజాద్ జూలై 14 న ప్రకటించాడు. కాంగ్రెస్ జాతీయ సంస్థ కనుక, కనీసం ఒక ముస్లిం సభ్యుడినైనా నామినేట్ చేసేందుకు దానికి హక్కు వుండాలని పట్టుబట్టిందనీ, అందుకు లీగ్ అంగీకరించనందున సమావేశం విఫలమైందనీ అకాలీ సిక్ నాయకుడు మాస్టర్ తారాసింగ్ వెల్లడించాడు.

ది టైమ్సు, డైలీ టెలిగ్రాఫ్, న్యూస్ క్రానికల్, లాంటి లండన్ దినపత్రికలన్నీ సిమ్లా సమావేశ వైఫల్యానికి జిన్నా కారకుడని ప్రకటించాయి. డైలీ మెయిల్ ఇలా వ్యాఖ్యానించింది. "క్రిప్స్ ప్రతిపాదనలను గాంధీ భగ్నం చేశాడు. వేవెల్ ప్రతిపాదనలను జిన్నా భగ్నం చేశాడు."

భారతదేశంపై జపాన్ దండయాత్ర ప్రమాదం వున్న సమయంలో క్రిప్స్ వచ్చాడు. ఆ ప్రమాదం కాస్తా తొలగగానే క్రిప్స్ రాయబారం కూడా హఠాత్తుగా ముగిసిపోయింది. 1945 జూలైలో బ్రిటన్ ఎన్నికలలో కన్సర్వేటివ్ పార్టీకి, లేబర్‌పార్టీ విజయ ప్రమాదం దాపురించినపుడు వేవెల్ పథకం వచ్చింది. ఎన్నికలు ముగియడంతో వేవెల్ పథకం కూడా భగ్నమైంది. అమెరికా వత్తిడివల్ల క్రిప్స్ రాయబారమూ, సోవియట్ ఒత్తిడివల్ల సిమ్లా సమావేశమూ జరిగినట్లు కూడా కొందరు వ్యాఖ్యానించారు.

ఈ సమయంలో రెండు ప్రధాన సంఘటనలు జరిగాయి. ఒకటి బ్రిటన్‌లో లేబరు పార్టీ విజయం పొందింది. జపాను 1945 ఆగస్టు 14 న లొంగిపోయింది.

ఇలాంటి పరిస్థితుల్లో కూడా కాంగ్రెస్ నాయకత్వం ప్రజా పోరాట వెల్లువను ప్రోత్సహించలేదు. హిందూ ముస్లిమ్ ప్రజలు సంయుక్తంగా బ్రిటిష్ వ్యతిరేక పోరాటాలు సాగించుతున్నపుడు క్రమేపీ హిందూ ముస్లిమ్ విభేదాలు తగ్గిపోయి వుండేవి కాని బ్రిటిష్ కుటిల పన్నాగాలలో చిక్కుకున్న కాంగ్రెస్ లీగులు పరస్పరం నిందించుకోడంలోనే నరిపుచ్చుకొన్నాయి. నాయకత్వం జైళ్ళలో వున్న రోజుల్లోనే 1942 లో ప్రజలు అసమాన పోరాట పటిమను ప్రదర్శించారు. అలాంటప్పుడు కాంగ్రెస్ నాయకత్వం బయటవున్న సమయంలో ప్రజా సమరశీల స్వభావానికి తగినట్లుగా వ్యవహరించలేక పోయింది.

వైస్రాయి వేవెల్ సెప్టెంబరులో ఎన్నికల గురించి ప్రకటన చేసినట్లుగానే, బ్రిటిష్ ప్రధాని అట్లీ కూడా ఒక ప్రకటన చేశాడు. 1942 లో క్రిప్సు ప్రతిపాదనలు యీనాటికీ యథాతథంగానే ఉన్నాయని ఆ ప్రకటనలో ఆయన అన్నాడు.

1942- 45 మధ్య ఏమీ మార్పు జరగనట్లుగానే, బ్రిటిష్ ప్రభుత్వం ప్రవర్తించిన తీరు ఆలిండియా కాంగ్రెస్ కమిటీకి నచ్చలేదు. ఐనప్పటికీ కేంద్ర రాష్ట్ర అసెంబ్లీల ఎన్నికలలో పాల్గొనాలని నిర్ణయించింది.

## 1945- 46 లలో ఎన్నికలు

కేంద్ర శాసనసభకు 1945 లో జరిగిన ఎన్నికలలో ముస్లిమేతర నియోజకవర్గాలలో, అధిక స్థానాల్ని కాంగ్రెస్ గెల్చుకొంది. ముస్లిమ్ నియోజక వర్గాలలో దాదాపు నూటికి నూరుపాళ్ళు ముస్లింలీగ్ గెల్చింది. ఈ ఎన్నికలలో వోటింగ్ హక్కు చాలా పరిమితం. "మొదటి రౌండ్‌లో గెల్చాం." అంటూ జిన్నా కాంగ్రెస్‌పై కవ్వింపు ధోరణిలో ప్రకటన చేశాడు 1946 మార్చిలో రాష్ట్ర శాసనసభలకు ఎన్నికలు జరిగాయి. 13 శాతం లోపల జనాభాకే వోటింగ్ హక్కు వుంది. అన్ని రాష్ట్రాలలోను జనరల్ నియోజకవర్గాలలో (అంటే ముస్లిమేతర నియోజక వర్గాలలో) కాంగ్రెస్ అత్యధిక మెజారిటీ సంపాదించింది. ముస్లింలీగ్ ఒక్క వాయువ్య రాష్ట్రములో తప్ప అన్ని చోట్లా ఘనవిజయాలు సాధించింది. వాయువ్య రాష్ట్ర జనాభాలో ముస్లిములు అధికంగా వున్నా కాంగ్రెస్ పలుకుబడి అక్కడ ఎక్కువగా వుంది. హిందూ ప్రజలు మెజారిటీగా వున్న రాష్ట్రాలలోని, ముస్లిములు అధిక సఖ్యగల బెంగాలులోని- ముస్లిం నియోజక వర్గాలలో లీగ్ ఎక్కువసీట్లు సంపాదించింది. పంజాబ్, సింధులలో ముస్లిం ప్రజలు అధికంగా వున్నా అక్కడ సీట్లను ముస్లిం-లీగూ, దాన్ని వ్యతిరేకించే స్థానిక పార్టీలూ పంచుకొన్నాయి.

ఈ ఎన్నికలు ఏం రుజువు చేశాయి? వోటర్లలో అధిక సంఖ్యాకులు ఐక్యభారత దేశానికే మొగ్గు చూపారు ముస్లిమేతర ప్రజలున్న రాష్ట్రాలలోని ముస్లిములకు పాకిస్తాన్ నిర్మాణంపట్ల ఆకర్షణ పెరిగింది. దేశం మొత్తంమీద చూసుకొన్నపుడు ముస్లిం ప్రజల అభిమానాన్ని ముస్లింలీగ్ పొందగల్గింది.

వివిధ రాష్ట్రాలలో కాంగ్రెస్ 930 స్థానాలు సంపాదించుకోగా, లీగ్ 497 స్థానాలు సంపాదించుకొంది. ఐతే ఒక్క బెంగాలులో మాత్రమే లీగు రాష్ట్ర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయగల్గింది.

ఈ ఎన్నికలు భారతదేశ ఐక్యతను కాపాడాలని కాంగ్రెసూ, పాకిస్తాన్ నిర్మాణానికై లీగూ మరింత పట్టుబట్టడానికి తోడ్పడ్డాయి.

ఈ పరిస్థితులలో ఆర్. ఐ. యన్. సైనికుల సమ్మె జరిగింది. రాయబారాల పరంపరను వరసగా బ్రిటిష్ ప్రభుత్వం పంపడానికి దోహదం చేసిన ఆనాటి జాతీయ, అంతర్జాతీయ పరిస్థితుల్ని కూడా సింహావలోకనం చేయాలి.

రెండో ప్రపంచ యుద్ధం పూర్తయ్యేసరికి, గెలుపొందిన దేశాల్లో ఒకటైన బ్రిటన్ బలహీన పడింది. ప్రపంచ అగ్రరాజ్యాల్లో అది మూడో స్థానానికి నెట్టివేయబడింది. ఫాసిజం ఓడిపోవటంతో జర్మనీ, ఇటలీ, జపాన్‌ల సామ్రాజ్యాలు తుడిచిపెట్టుకుపోయాయి. అమెరికా, బ్రిటిష్ సామ్రాజ్యాలు సమసిపోలేదు. కాని ఎన్నో నష్టాలు కలిగినా సోవియట్ యూనియన్ బలమైన అగ్రరాజ్యంగా రూపొందింది. ప్రపంచంలో దాని పలుకుబడి ఎంతో పెరిగింది. విముక్త యూరప్‌లో అనేక రాజ్యాలు, ప్రజాతంత్ర రాజ్యాలుగా ఆవిర్భవించాయి. మరికొన్ని సోషలిస్టు రాజ్యాలుగా అవతరించాయి. చైనాపై జపాను ఆధిపత్యం బద్దలై అది సోషలిస్టు దేశమైంది. వలస దేశాలన్నిటిలోను, స్వాతంత్ర్య ఉద్యమం తీవ్రతరమైంది. పరోక్షంగానో, ప్రత్యక్షంగానో బ్రిటన్ పలుకుబడి క్రింద, ఆధిపత్యం క్రింద వున్న దేశాలు– ఈజిప్టు, పాలస్తీనా, బర్మా, మలయా, ఇండోనీషియాలు తమ స్వాతంత్ర్యానికై ఒత్తిడి ఎక్కువ చేయసాగాయి

ఈ పరిస్థితుల్లో బ్రిటిష్ ఆర్థిక బలమూ, సైనిక బలమూ చాలా సన్నగిలింది. బ్రిటిష్ సైనికులు చాలా అలసి వున్నారు. సామ్రాజ్య సంరక్షణ కోసం ఇంకా తాము కష్టాలు సహించే స్థితిలో లేరు. 1945 వేసవిలో కన్సర్వేటివ్ పార్టీ ఓడిపోయి, టన్‌లో లేబరుపార్టీ వచ్చింది. భారతదేశంలో పరి తి పూర్తిగా మారిపోయింది. అధికారంలో ఇంకా నసాగడం బ్రిటిషు వాళ్ళకు అసాధ్యమైంది. భారత జాతీయ సైనికుల (ఐ ఎన్.ఎ) విచారణ కాలంలో ప్రదర్శించిన నిర్బంధ విధానం కాని, అస్పష్ట వాగ్దానాలు కాని, భారతీయుల్ని సంతృప్తి పరచటం లేదు భారత నావికుల తిరుగుబాటు, భారత వైమానిక దళంలో సమ్మె, జబల్‌పూర్‌లో ఇండియన్‌సిగ్నల్‌కోర్ సమ్మె–ఇవన్నీ భారతీయులకు స్వాతంత్ర్యం ఇవ్వకపోతే పరిస్థితి అగ్ని పర్వతంలా బద్దలవుతుందని రుజువు చేశాయి. పోలీసులు, ప్రభుత్వ ఉద్యోగులు సైతం జాతీయ భావాలపట్ల మొగ్గు చూపెడుతున్నారు. ఇలాంటి పరిస్థితిలో వీరి సాయంతో జాతీయ ఉద్యమాన్ని అణచాలనుకోడం అవివేకం అవుతుంది. దీనికితోడు సమ్మెలు, హర్తాళులు, బ్రిటిషు ఇండియా అంతటా వ్యాపించడమేకాక, సంస్థానాలకు కూడా పాకాయి. సంస్థాన ప్రజోద్యమాలు విజృంభించ సాగాయి ఇదే సమయంలో కార్మికుల, రైతుల పోరాటాలు కూడా విస్తరించాయి 1945 నవంబరు నుంచి దాదాపు ప్రతి ముఖ్యమైన పరిశ్రమలోను సమ్మెలు జరిగాయి. కలకత్తాలో రవాణా, మున్సిపల్ కార్మికులు, నీటి సరఫరా కార్మికులు సమ్మె చేశారు యుద్ధం ముగిశాక పరిశ్రమలలో కొత్త సమస్యలు ఉద్భవించాయి పని నుంచి తొలగింపు, యుద్ధకాలంలో ఇచ్చిన అదనపు జీతాల్లో కొన్నిచోట్ల తగ్గింపు, మరికొన్ని చోట్లపూర్తిగ రద్దు చేయటం, కరువుభత్యం తగ్గించటం మొదలయిన చర్యల మూలంగా కారి కుల్లో అసంతృప్తి పెరిగి సమ్మెలు సాగించారు. ల్వే కార్మికుల సార్వత్రిక సమ్మె 1946 జూన్27 ంచిసాగించాలని,నిర్ణయింపబడినా జాతీయ నాయకులహామీతో విరమింపబడింది. భారతదేశం లోని రైళ్ళకు పెట్టిన పెట్టుబడికి ప్రతిఫలంగా బ్రిటిషు వాళ్ళకు ఏటా 2 కోట్ల పౌండ్లు ముట్టేవి. ఐనా కార్మికుల స్వల్పకోర్కెలను కూడా రైల్వే పరిపాలకులు తీర్చేవారు కాదు. రైల్వే కార్మికుల ఇబ్బందులు, కోర్కెలు న్యాయసమ్మతమైనవే అని నాయకులు అంగీకరించారు. రైల్వేబోర్డు పనినుంచి తొలగింపు, కనీస వేతనం–ఈ రెంటికీ సంబంధించిన సమస్యలను అడ్జుడికేషన్ తీర్పుకు దఖలు చేసింది. రైల్వే పరిపాలకులు, రైల్వే కార్మికులు ప్రదర్శించే ఉత్సాహం చూసి బెదిరిపోయారు. జాతీయ నాయకుల హామీని ధిక్కరించి కార్మికులపై పగ తీర్చుకోసాగారు. దానితో సౌత్ ఇండియా రైల్వేలోని 40 వేలమంది కార్మికులు ఆగస్టు 24 నుంచి, సెప్టెంబర్ 23 వరకూ సార్వత్రిక సమ్మె చేశారు. క్రూర నిర్బంధ కాండ కూడా ఈ సమ్మెను అణచలేక పోయింది. ప్రయిమరీ స్కూళ్ళ టీచర్లు కూడా సమ్మె చేశారు. వీరి జీతాలు ఇంటి నౌకర్ల జీతాలకన్నా తక్కువ. మామూలు కార్మికునితో కలిసి మెలిసి వుండటం, వారితో కలిసి హక్కులకై పోరాడటం వీరు నామోషీగా భావించేవారు. అలాంటి వారు సైతం సమ్మె చేశారు.

ఐతే ఈ సమ్మెలను బ్రిటిషు వ్యతిరేక మహోద్యమంగా తీర్చిదిద్దడానికి కాంగ్రెస్ నాయకులు సంసిద్ధంగా లేరు. 1946 మార్చిలో కాంగ్రెస్ అధ్యక్షుడుగా వున్న మౌలానా ఆజాద్ సమ్మెల్ని, హర్తాళ్ళను నిరుత్సాహ

పరచాడు. విదేశీ పాలకులు ఇప్పుడు ఆపద్ధర్మ ప్రభుత్వాధికారులుగా వున్నారు. కాబట్టి వాళ్ళతో పేచీ పడవలసిన అగత్యం లేదు. త్వరలోనే అధికారాన్ని వారు బదిలీ చేస్తారు. ఈ ధోరణిలో ఆజాద్ తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు. సమ్మెల్ని అణచడంలో బ్రిటిషు సైనికుల దురంతాల గురించి కూడా తీవ్రంగా ఖండించకుండా, న్యాయవిచారణ (జుడిషియల్ ఎంక్వయిరీ) చేయాలని కోరాడు బ్రిటిషు వాళ్ళు మూటాము కట్టుకొని పోతున్నారనీ, వారికి అలా మూటాము కట్టుకొనడంలో సాయపడాలనీ కాంగ్రెస్ నాయకు కొందరన్నారు.

భారతదేశంలోని ఈ సంఘటనల్ని విస్మరించటం బ్రిటిషు లేబర్ ప్రభుత్వానికి అసాధ్యం. 1946 జనవరిలో భారతదేశ నాయకులతో చర్చించడానికి, బ్రిటిషు పార్లమెంట్ ప్రతినిధి వర్గాన్ని పంపింది. ఫిబ్రవరి 19న బ్రిటిషు ప్రధాని అట్లీ ఒక ప్రకటన చేశాడు, భారతదేశ సమస్య చాలా ముఖ్యమైనది కనుక, కేబినెట్ మంత్రుల ప్రత్యేక రాయబారాన్ని పంపుతానని ప్రకటించాడు. 1946 మార్చి 15 న మరో ప్రకటన చేశాడు. "భారతదేశమే తన భవిష్యత్ రాజ్యాంగాన్ని ఎన్నుకోవాలి. ప్రపంచంలో తన స్థానమేమిటో అదే నిర్ణయించుకోవాలి. బ్రిటిషు కామన్‌వెల్తులో ఉండటానికి బహుశా భారత ప్రజలు ఎన్నుకోవచ్చు. అలా చేస్తే భారతదేశానికే ఎక్కువ సౌకర్యం. ఇతర ప్రపంచంతో సంబంధం లేకుండా వేరు పడిపోయిన సంపూర్ణ జాతీయత ఈ రోజుల్లో నిజంగా కాలం చెల్లిన కోరికే. బ్రిటిషు కామన్‌వెల్తూ, సామ్రాజ్యమూ కేవలం బయటి ఒత్తిడి అనే సంకెళ్ళతో కలిసి బంధింపబడి వుండలేవు. స్వేచ్ఛా ప్రజల స్వతంత్ర కలయిక ఐతేనే ఆ రెండూ కలసి ఉండటం సాధ్యం "ఇదే ప్రకటనలో మైనారిటీ మెజారిటీని వీటో చేయరాదని అట్లీ ప్రకటించాడు. జిన్నా ఈ వాక్యానికి అభ్యంతరం తెలుపుతూ "భారతదేశ విభజనను కోరుతున్నాం—పాకిస్తాన్ స్థాపనను కోరుతున్నాం" అన్నాడు.

## మంత్రివర్గ రాయబారం

ఫిబ్రవరి 14 న బ్రిటిషు ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది. భారతదేశ రాజ్యాంగ కార్యదర్శి పెదిక్ లారెన్సు, సర్‌స్టాఫర్డ్‌క్రిప్సు, లార్డ్ అలగ్జాండర్‌లతో కూడిన మంత్రివర్గ ప్రతినిధివర్గం, భారతదేశం వెళతుందనీ, కాంగ్రెస్, లీగ్ తదితర రాజకీయ పార్టీలతో సంప్రతింపులు సాగించుతుందనీ, ఆ ప్రకటనలో బ్రిటిషు ప్రభుత్వం తెలియచేసింది. మార్చి 24 న ఆ ప్రతినిధివర్గం ఢిల్లీ చేరి, మూడువారాలపాటు, వివిధ పార్టీల నాయకులతో చర్చలు జరిపింది

1946 లో బ్రిటిషు మంత్రుల ప్రతినిధివర్గం వచ్చినపుడు, దాన్ని గురించి అనేకమందికి సందేహాలు కల్గాయి. కాని గాంధీ "అధికార ప్రతినిధివర్గం ఒక గొప్ప దేశాన్ని మోసగించేందుకు వస్తుందా?" అని ఆ సందేహం నివృత్తి చేశాడు.

ఐతే ఈ మంత్రివర్గ ప్రతినిధులు చేసిన సూచనలలో, అధికారాన్ని తక్షణం బదిలీచేసే విషయం ప్రస్తావించలేదు. స్వాతంత్ర్యం ఏ తేదీన ఇవ్వబడుతుందో, లేదు మనదేశాన్ని ఆక్రమించివున్న బ్రిటిషు సైన్యాల ఉపసంహరణ ప్రసక్తి కూడా ఏమీలేదు. రాజ్యాంగ నిర్మాణ సభను ఏర్పరచే విషయంలో, ఏకపక్షంగా బ్రిటిషు ప్రభుత్వానిదే నిర్ణయం. రాజ్యాంగ నిర్మాణసభ ఎవరెవరితో కూడివుండాలి? దాన్ని ఏర్పరచడానికి ఏ పద్ధతి అవలంబించాలి? ఇవన్నీ బ్రిటిషు ప్రభుత్వమే నిర్ణయించాలి. రాజ్యాంగ నిర్మాణ సభలో సంస్థానాధీశుల ప్రతినిధులు నాల్గోవంతు ఉంటారు. మిగతావారిని రాష్ట్ర శాసన సభలు ఎన్నుకోవాలి. పరిమితమైన వోటింగుతోను, మత ప్రాతిపదికతోను ఈ రాష్ట్ర శాసన సభా సభ్యులను ప్రజలు ఎన్నుకొన్న విషయం మరచిపోరాదు. కేంద్రం విదేశాంగ వ్యవహారాలు, రక్షణ, రవాణా తన అధికారం కింద వుంచుకొంటుంది. సంస్థానాలు కాక మూడు గ్రూపులుగా భారతదేశం విభజింపబడుతుంది. "తాత్కాలిక ప్రభుత్వం"లో వైస్రాయి కార్యనిర్వాహకవర్గ సభ్యుల పాత జాబితా నే కొత్త జాబితా వస్తుంది. ఈ పథకం కింద సైన్యాన్ని భారతీయం చేసే సమస్య బ్రిటిషు సర్వసేనాని ప్రకటన ప్రకారం "పదేళ్ళ లేక ఇరవై ఏళ్ళు, లేదా మరి కొంతకాలం" పట్టవచ్చు. ఇంతేకాదు, 1946 డిసెంబర్‌లో పార్లమెంటులో బ్రిటిషు ప్రధాని, చర్చిల్ మొదలైన ప్రతిపక్షాల వారికి సమాధానమిస్తూ - "క్రిప్సు రాయబార కాలంనాటి ప్రకటనను మించి, తమ మంత్రివర్గ పథకం ఏమాత్రం ముందుకు పోలేదు"ని అన్నాడు.

"భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వడానికి అడ్డంకి ఏమీలేదు. భారతీయులలో ఐక్యత ఒక్కటే అడ్డం వస్తోంది." అని నమ్మించడానికి బ్రిటిషు ప్రభుత్వం ప్రయత్నం చేసింది. భారతదేశ స్వాతంత్ర్య సమస్య వచ్చేసరికి, అది కన్సర్వేటివ్‌లైనా, లేబర్‌పార్టీవారైనా, లిబరల్స్ ఐనా ఒకే పాట పాడేవారు. ఉదాహరణకు క్లిమెంట్ డేవీస్ (లిబరల్ నాయకుడు) ఇలా అన్నాడు. "ప్రస్తుత సమయంలో స్వతంత్ర ప్రజలుగా, తమ దేశ ప్రభుత్వాన్ని తమ చేతుల్లోకి తీసుకొనేలాగ, ప్రపంచ ప్రభుత్వ కార్యకలాపాల్లో (Counsels) గర్వించతగిన తమ పాత్రను నిర్వహించేలా వారికి (భారతీయులకు) మా శాయశక్తులా బోధించాం, దయగా వుండటానికి, సహాయపడటానికి కూడా మా శాయశక్తులా కృషి చేశాం."

ఇలాంటి బూటకపు మాటలు ఎవర్నీ మభ్య పెట్టలేవు భారతదేశ భవిష్యత్తును రూపుదిద్దే రాజ్యాంగ నిర్మాణ సభను ఏర్పరచే బాధ్యతను, ప్రజాతంత్ర పద్ధతిపై ఎన్నుకోబడిన కాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ (రాజ్యాంగ పరిషత్తుకి) ఇవ్వలేదు. బ్రిటిషు ప్రభుత్వమే ఏకపక్షంగా నిర్ణయించిన పద్ధతిలో అది నిర్ణయించిన ప్రతినిధులతో రాజ్యాంగ నిర్మాణ సభను ఏర్పాటు చేయడానికి పూనుకుంది.

అసలు భారతదేశంమీద ఇంత ప్రేమ, ఇంత దయ వొలకపోయడానికి అసలు కారణాన్ని, పి. జె. గ్రిఫిత్స్ 1960 జూన్ 24 న లండన్‌లో ఈస్టిండియా అసోసియేషన్‌లో ఇచ్చిన ఉపన్యాసం వెల్లడి చేస్తుంది. ఆయన భారత కేంద్ర శాసనసభలో యూరోపియన్ గ్రూపుకు నాయకుడు గ్రిఫిత్స్ ఇలా అన్నాడు.

"బ్రిటిషు మంత్రివర్గ ప్రతినిధులు వచ్చేముందు భారతదేశం, విప్లవ ప్రాంగణంలో ఉన్నదని అనేక మంది అభిప్రాయపడ్డారు. మంత్రివర్గ ప్రతినిధుల రాయబారం ఆ ప్రమాదాన్ని తొలగించలేకపోయినా, కనీసం వాయిదా వేసింది"

నిజంగా బ్రిటిషుసామ్రాజ్యవాదానికి వలస ప్రజలపై అంత వల్లమాలిన ప్రేమవుంటే. ఇది ఇండోనీషియాలో వీరోచిత స్వాతంత్ర్య ఉద్యమాన్ని అణచడానికి జపాను సైనికులను ఎందుకు ఉపయోగించుతుంది ? మలయాకు వింతరకమైన శాసన సంస్కరణలను ఎందుకుప్రవేశపెడుతుంది ? బర్మా, సింహళాలకు కనీసం సంపూర్ణ డొమినియన్ ప్రేటస్‌ను ఎందుకు ఇవ్వలేదు. "బ్రిటిష్ కిరీటంలో కలికితురాయి" ఐన భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రదానం చేసిపోడానికి బ్రిటన్‌కు అంత దయపుట్టుకొస్తుందా ?

అందుకని బ్రిటిష్ మంత్రివర్గ పథకం రూపొందించినది స్వాతంత్ర్యం కాదు. దాని వికృత స్వరూపమే. ఇంతకు పూర్వం సూచించిన రాజ్యాంగ చట్టాల కన్న ఇది భిన్నం కావచ్చు. కాని ఏ పరిస్థితులలోనూ అది స్వాతంత్ర్యం అని అనిపించు లేదు.

కాంగ్రెస్, లీగుల మధ్య విభేదాలను చాకచక్యంగా ఉపయోగించుకొంటూ సాగించిన బ్రిటిష్ మంత్రివర్గ రాయబార సంప్రతింపులు విఫలమయ్యాక 1946 మే 16 న బ్రిటిష్ ప్రభుత్వం "రాజీ పథకం" అంటూ ఒక పథకాన్ని ప్రకటించింది. దీని ప్రకారం—

1. బ్రిటిష్ ఇండియాలోని రాష్ట్రాలతో, సంస్థానాలు కలిసి, ఆలిండియా ఫెడరేషన్‌గా వుంటుంది.

2. ఆ ఫెడరేషన్‌కు సంబంధించిన కేంద్ర ప్రభుత్వానికి రక్షణ, విదేశాంగ విధానం, రవాణాలపైన మాత్రమే అధికారం వుంటుంది.

3 ఇతర అధికారాలన్నీ రాష్ట్రాలకు ఉంటాయి. దీని వల్ల ముస్లింలకు మెజారిటీ వున్న రాష్ట్రాలలో తమ భవిష్యత్తును తామే దిద్దుకోవచ్చు. హిందువుల పెత్తనం అనే భయం ఇక్కడ వుండదు.

4. హిందూ మెజారిటీ రాష్ట్రాలన్నిటినీ, ఎ. గ్రూపుగాను, వాయువ్య భారతదేశంలోని ముస్లిం మెజారిటీ రాష్ట్రాలైన సింధు, పంజాబ్, వాయువ్య రాష్ట్రం, బలూచిస్తాన్‌లు 'బి' గ్రూపుగాను, బెంగాల్ అస్సాం రాష్ట్రాలు 'సి' గ్రూపుగాను విభజింపబడతాయి. ఆయా గ్రూపుల్లోని రాష్ట్రాలు కోరుకున్నట్లయితే, ఆ గ్రూపులు సబ్ ఫెడరేషన్‌గా ఏర్పడవచ్చు. అలా ఏర్పడినపుడు వాటికి దఖలు పరచబడిన అధికారాలను నిర్వహించుతాయి.

5. పది లక్షల ప్రజలకు ఒకరు చొప్పున ఎన్నుకోబడిన సభ్యులు గల రాజ్యాంగ పరిషత్తు, భవిష్యత్ రాజ్యాంగ చట్టాన్ని రూపొందించుతుంది. జనరల్ నియోజక వర్గాలలోను, ముస్లిం, సిక్కు నియోజక వర్గాలలోని, రాష్ట్ర శాసన సభ్యులు, రాజ్యాంగ పరిషత్ సభ్యులను ఎన్నుకొంటారు. సంస్థానాలకు కూడా ఇదే దామాషాను ప్రాతినిధ్యం వుంటుంది. కాని ఆ

ప్రతినిధులను ఎలాఎన్నుకోవాలి అనే విషయం సంస్థానాధీశులతో సంప్రతింపులు జరిపివారిని చేర్చుకోవాలి

అలా ఏర్పడ్డ రాజ్యాంగ పరిషత్ అధ్యక్షుణ్ణీ, ఇతర కార్యవర్గ సభ్యుల్నీ ఎన్నుకొంటుంది. ప్రాథమిక హక్కులు, మైనారిటీల రక్షణ గురించి సలహా ఇచ్చేందుకు సలహా కమిటీలను నియమించుతుంది.

6. దీని తర్వాత ఆయాగ్రూపుల రాష్ట్రాల సమావేశమౌతాయి. రాష్ట్రప్రభుత్వాల గురించీ, రాష్ట్రాల గ్రూపు ప్రభుత్వం గురించీ, నిర్ణయాలు చేస్తాయి.

7. రాష్ట్ర రాజ్యాంగ నియమావళిని, రాష్ట్రాల గ్రూపురాజ్యాంగ నియమావళిని ఏర్పరచాక రాజ్యాంగ పరిషత్ పూర్తి సమావేశం జరిపి,ఆలిండియా ఫెడరేషన్ రాజ్యాంగ నియమావళిని రచిస్తుంది ఇందులో ఓ ముఖ్య విశేషం ఏమంటే, రాష్ట్ర రాజ్యాంగ నియమావళిని కాని, రాష్ట్రాల గ్రూపు రాజ్యాంగ నియమావళిని కాని, రచించటంలో రాజ్యాంగ పరిషత్తుకు ఎలాంటి పాత్రా లేదు.

8. బ్రిటన్ భారతదేశాల మధ్య భవిష్యత్ సంబంధాల గురించిన ఒడంబడికను, రాజ్యాంగ పరిషత్ నిర్ణయించుతుంది.

9. కొత్త రాజ్యాంగ నియమావళులను రచించడానికి కొంతకాలం పడుతుంది. కాబట్టి ఈలోగా తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడుతుంది. అధికారాలను, ఆ ప్రభుత్వం నిర్వహించుతుంది. కాంగ్రెస్, లీగులతోపాటు సిక్కుల భారత్ క్రైస్తవుల, పార్సీల ప్రతినిధులు ఈ తాత్కాలిక ప్రభుత్వంలో వుంటారు.

1946 మే 24 న కాంగ్రెస్ వర్కింగు కమిటీ, బ్రిటిషు మంత్రివర్గ ప్రతినిధులపై ప్రతిపాదనలు చర్చించి, విమర్శించింది. కాని "ఈ దశలో అంతిమ నిర్ణయం చేయలేము" అని చెప్పింది. 1946 జూన్ 6 న ముస్లిమ్‌లీగు, ఈ ప్రతిపాదనలను అంగీకరించింది. మరో 20 రోజుల తర్వాత కాంగ్రెస్ వర్కింగు కమిటీ, తాము తాత్కాలిక ప్రభుత్వంలో చేరబోమని తెలియచేసింది. కాని "రాజ్యాంగ నిర్ణయ సభ"లో చేరడానికి, సుముఖత తెలియపరచింది.

1946 జూలై 7 న జరిగిన ఆలిండియా కాంగ్రెస్ కమిటీలో కాంగ్రెస్ అధ్యక్షుడు మౌలానా ఆజాద్, బ్రిటిషు మంత్రివర్గ ప్రతినిధులు ప్రతిపాదించిన మే 16 పథకాన్ని అంగీకరించాల్సిందిగా విజ్ఞప్తి చేశాడు భారత రాజ్యాంగం రూపొందించడానికి ప్రాతిపదికగా ఈ పథకాన్ని ఆలిండియా కాంగ్రెస్ కమిటీ అంగీకరించింది.

గత ఏడేళ్ళుగా అధ్యక్షుడుగా వున్న ఆజాద్ స్థానే, జవహర్‌లాల్ నెహ్రూను కాంగ్రెస్ అధ్యక్షునిగా ఈ సమావేశంలోనే ఎన్నుకొన్నారు.

జవహర్‌లాల్ నెహ్రూ కాంగ్రెస్ అధ్యక్షుడైన తర్వాత జూలై 10 న పత్రికా విలేకరులతో మాట్లాడాడు. తాను వెల్లడించే అభిప్రాయాలు వ్యక్తిగతమైనవని అన్నాడు. వైస్రాయి, ముస్లింలీగులు భావించిన రీతిలో తాము "స్వాతంత్ర్యం" గురించి అర్థం చేసుకోటం లేదని నెహ్రూ అన్నాడు. విదేశీ పలుకుబడి నుంచి, పూర్తిగా విడివడినదే తాను ఊహించుతున్న స్వాతంత్ర్యానికి అర్థం అన్నాడు. అవసరమైతే బ్రిటన్‌తో తెగ తెంపులు చేసుకొనే అవకాశం ఉన్నది అన్నాడు. భారత రిపబ్లిక్‌ను స్థాపించదలిచామని చెప్పాడు.

మే 16 పథకాన్ని యధాతథంగా కాంగ్రెస్ అంగీకరిస్తున్నదా ? తాత్కాలిక ప్రభుత్వ మంత్రివర్గంలో ఏయే పార్టీలు ఎంతమంది ఉండాలనే విషయాన్ని కూడా కాంగ్రెస్ అంగీకరించిందా ? అని విలేకరులు ప్రశ్నించారు. ఏ ఒడంబడికలూ, కాంగ్రెస్‌ను బంధింపలేవనీ ఆయా పరిస్థితులలో ఉద్భవించే సమస్యలను స్వేచ్ఛగా కాంగ్రెస్ ఎదుర్కొని పరిష్కరించ ప్రయత్నించుతుందని నెహ్రూ అన్నాడు. బ్రిటిషు మంత్రివర్గ ప్రతినిధుల పథకాన్ని సవరించవచ్చునని దీని అర్థమా ? అని అడిగినప్పుడు నెహ్రూ ఇలా జవాబిచ్చాడు : రాజ్యాంగ పరిషత్‌లో చేరడానికే మేం అంగీకరించాం, బ్రిటిషు మంత్రివర్గ పథకాన్ని మంచిదనుకున్న రీతిలో మార్చడానికి లేదా సవరించడానికి, మాకు హక్కు వుంది "

రాజ్యాంగ పరిషత్‌లో కాంగ్రెస్‌కు మెజారిటీ వుంది కాబట్టి, నెహ్రూ ప్రకటన ప్రకారం, అది మే 16 పథకాన్ని మార్చివేస్తుందనీ, అందువల్ల ముస్లిమ్‌లు హిందువుల నియంతృత్వం కింద పడివుండాల్సి వస్తుందనీ, నెహ్రూ ప్రకటనపై జిన్నా వ్యాఖ్యానించాడు. ఆయన ఆదేశాన్ని అనుసరించి, మంత్రివర్గ ప్రతినిధుల ప్రతిపాదనలకు, ఇదివరలో తాము వెల్లడించిన అంగీకారాన్ని లీగు జూలై 29 న ఉపసంహరించుకొంది. బ్రిటిషు బిరుదుల్ని త్యజించాల్సిందిగా లీగు

సభ్యుల్ని కోరింది. లీగు ఆశయాల లక్ష్య సాధనకు "ప్రత్యక్ష కార్యాచరణ"కు పూనుకోవాలని నిశ్చయించింది. నిజానికి ఇది బ్రిటిషు వ్యతిరేక కార్యాచరణకు ఉద్దేశించింది కాదు. కాంగ్రెస్‌పై ఒత్తిడి తేవడానికే ఈ తీర్మానం చేసింది.

1946 ఆగస్టు 16 న "ప్రత్యక్ష కార్యాచరణ" దినం జరపాలని జిన్నా, ముస్లిం ప్రజలకు విజ్ఞప్తి చేశాడు పాకిస్తాన్ ఏర్పాటుకు ఆందోళన ప్రారంభించాడు.

ఆగస్టు నెల 6 న, నెహ్రూను తాత్కాలిక ప్రభుత్వం ఏర్పరచవల్సిందిగా వైస్రాయి కోరాడు. కాంగ్రెస్, లీగులు రెండూ అంగీకరిస్తేనే తప్ప తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పరచే సమస్యలేదని చెబుతూ వచ్చిన వైస్రాయి, తన వైఖరి మార్చుకొనక తప్పలేదు. ఆగస్టు 8 న కాంగ్రెస్ వర్కింగు కమిటీ సమావేశమై బేషరతుగా బ్రిటిషు మంత్రివర్గ ప్రతినిధుల పథకాన్ని అంగీకరించింది. నెహ్రూ వ్యక్తిగతంగా వెల్లడించిన అభిప్రాయాలతో నిమిత్తం లేదని స్పష్టం చేసింది.

నెహ్రూ ఆగస్టు 24 న తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పరచాడు. ఏర్పరచే ముందు జిన్నాను లీగు తరపున తమ మంత్రివర్గ సభ్యులను పేర్కొనవలసిందని కోరాడు. జిన్నా అందుకు తిరస్కరించాడు. వైస్రాయి అధ్యక్షతన, నెహ్రూ ఉపప్రధానిగా వున్న మంత్రివర్గంలో వల్లభాయ్ పటేల్, రాజేంద్రప్రసాద్, అసఫాలీ, రాజగోపాలాచారి, శరత్ చంద్రబోస్, జాన్ మత్తయ్, సర్దార్ బలదేవ్‌సింగు, సి. హెచ్. భాబా, జగ్జీవన్‌రామ్, డా॥ షాఫత్ అహ్మద్ ఖాన్, సయ్యద్ అలీజహీర్‌లు సభ్యులు. ముస్లింలీగ్ కనుక మనసు మార్చుకొని, మంత్రివ ంలో చేరదలచుకుంటే, అందుకు వీలుగా రెండు నాలు ఖాళీగా వుంచారు.

సెప్టెంబరు 2 న తా ్కాలిక ప్రభుత్వం ప్రమాణ స్వీకారం చేసింది. ఈ మంత్రివర్గంలో ఆ రు కాంగ్రెస్ వాదులు, ఐదుగురు ముస్లిములు, ము రు మైనారిటీ వర్గ ప్రతినిధులు ఉండాలని అంతకు పూ ్వం వైస్రాయి చేసిన ప్రకటనలో తెలియ చేశాడు.

లీగ్‌చే "ప్ంత్యక్ష కార్యాచరణ"కు నిర్ణయింపబడ్డ ఆగస్టు 16 న కలకత్తాలో హిందూ- ముస్లిమ్ కలహాలు చెలరేగాయి. ఆ కాలంలో బెంగాల్‌లో సుహ్రావర్ధి ముఖ్యమంత్రిగా వున్నాడు. ఆనాడు చెలరేగిన భీషణ హత్యాకాండను నిరాకరించలేకపోయింది రాష్ట్ర ప్రభుత్వం. ఆ రోజు ముఖ్యమంత్రి సెలవు దినంగా ప్రకటించాడనీ, స్వయంగా కంట్రోలు రూము నుంచి పోలీసులను అల్లరకు ప్రేరేపించాడనీ, సైన్యాన్ని పిలవలేదనీ, సుహ్రావర్ధీపై ఆరోపణలు వచ్చాయి. ఆగస్టు 16 నుంచి 19 దాకా యీ హత్యాకాండము పెన్నడూ లేనంత ఉధృతంతో కొనసాగింది. ఆగస్టు 16 కి పూర్వం కూడా సంయుక్త రాష్ట్రాల (ఉత్తరప్రదేశ్)లోను, అహ్మద్‌బాద్‌లోను, అక్కడక్కడా హిందూ ముస్లిం కలహాలు జరిగాయి. ఐతే కలకత్తాలో మత కలహాలకు దారితీసిన ఊరేగింపులు ప్రారంభమైనపుడు, అక్కడ పోలీసులు కాని, సైనికులు కాని లేరు. కలహాలు ఎలా ప్రారంభమైనా, బ్రిటిషు ప్రభుత్వ మద్దతు కల్గిన మతతత్వశక్తులు కూడా కార్యరంగంలోకి దిగాయి. నాల్గురోజులపాటు జరిగిన యీ హత్యాకాండలో వేలాదిమంది మరణించారు. అంతకు పదిరెట్లు గాయపడ్డారు. దుకాణాల్ని దోచుకోవడమో, నాశనం చేయడమో జరిగింది. ఇంత జరుగుతున్నా, బ్రిటిషు గవర్నర్ కిమ్మనలేదు. కాంగ్రెస్ లీగుల మధ్య ఐక్యతలేని సమయంలో, లీగ్ ఆగస్టు 16 ఆదేశం అంతర్యుద్ధానికి దారి తీస్తుందని కమ్యూనిస్టు పార్టీ చేసిన హెచ్చరిక రుజువైంది. అంతర్యుద్ధం బెదిరింపుతో బ్రిటిషు ప్రభుత్వాన్నీ కాంగ్రెస్‌నీ తమ కనుకూలంగా లొంగదీయాలని లీగ్ భావించింది. కాంగ్రెస్ కూడా యీ సమయంలో చాకచక్యంగా వ్యవహరించక బ్రిటిషు పన్నాగంలో పడింది. భారతదేశంలో హిందూ ముస్లిములు కొట్టుకు చస్తుంటే, బ్రిటిషు సామ్రాజ్యవాదులు వీరిద్దరిమధ్య తటస్థులమన్నట్లుగా ప్రపంచానికి చాటడానికి ప్రయత్నించారు.

కలకత్తా మత కలహాలు బీహార్, బొంబాయి. బెంగాల్‌లోని మరికొన్ని ప్రాంతాలకు వ్యాపించాయి. మత కల్లోలాలతో విషపూరితమైన విషాద సమయంలో గాంధీ ప్రశాంత పరిస్థితులు నెలకొల్పడానికి, కల్లోల ప్రాంతాలలో పర్యటించాడు. 77 ఏళ్ళ ప్రాయంలో గాంధీ నౌఖాలీజిల్లా (బెంగాలు)లో గ్రామగ్రామానికీ వెళ్ళాడు. బీహార్‌లో పర్యటించాడు. పంజాబ్‌కి కూడా వెళ్ళాలని నిశ్చయించాడు. ఢిల్లీ వెళ్లాడు.

గాంధీ అప్పటికి ఇంకా దేశవిభజన తప్పించటం సాధ్యమనే భావిస్తున్నాడు. బెంగాల్‌లో కనుక హిందూ ముస్లిములు సామరస్యం ప్రదర్శించితే సహజీవనం సాగిస్తే, దేశం యావత్తూ రక్షింపబడుతుందని భావించాడు.

బీహార్‌లో పరిస్థితులు విషమించినపుడు, ఆగ్రహావేశానికి లోనైన నెహ్రూ (అపుడు తాత్కాలిక ప్రభుత్వ ఉపప్రధాని) కలహాలు ఇంకా కొనసాగితే, విమానాల నుంచి, బాంబులు కురుపించుతామని బెదిరించాడు. గాంధీ దీనికి అంగీకరించలేదు. బీహార్ ప్రజల్ని ఆయన ఇలా హెచ్చరించాడు: "మీరు కనుక మళ్లా పిచ్చివాళ్ళయితే, (మతోన్మాదం ప్రదర్శిస్తే) మీరు మొదట నన్ను నాశనం చెయ్యాలి."

హిందూ-ముస్లిం ప్రజల మధ్య అంతర్యుద్ధ వాతావరణ పరిస్థితులలో గాంధీ, లీగ్‌తో ఒప్పందానికి రావలసిందిగా కాంగ్రెస్‌ను కోరాడు. ముస్లిం ప్రజలకు లీగు ఒక్కటే ప్రాతినిధ్యం వహించే సంస్థ అని అంగీకరించాల్సిందిగా కాంగ్రెస్ వర్కింగ్ కమిటీకి సలహా ఇచ్చాడు. ఇది కాంగ్రెస్ మూల సూత్రాలకే విరుద్ధం. కాంగ్రెస్ హిందువులకు మాత్రమే ప్రాతినిధ్యం వహించుతుందనే స్థితికి అది నెట్టివేయబడే ప్రమాదం దీనివల్ల క తుంది. ఐనా దేశంలోని మా ణ హోమాన్ని అరిక డానికి ఆయనకు పరో దారి కన్పించలేదు. కాం' ప్ వర్కింగ్ కమిటీ అలాగే తీర్మానించింది. ఈ తీర్మానం ఆధారంగా వైస్రాయి, నెహ్రూలు జిన్నాను, తాత్కాలిక ప్రభుత్వంలో చేరాల్సిందిగా కోరారు. ఐతే బ్రిటిషు మంత్రివర్గ పథకాన్ని తోసిపుచ్చుతూ లీగ్ చేసిన తీర్మానాన్ని ఉపసంహరించుకోవాలని నెహ్రూ కోరాడు.

జిన్నా అలా వాగ్దానం చేశాడని, వైస్రాయి చేసిన హామీని పురస్కరించుకొని నెహ్రూ తన మంత్రివర్గాన్ని పునర్నిర్మించాడు. ముస్లిం లీగ్ సభ్యులకు, ఇదివరకు రెండు సీట్లు ఖాళీగా ఉండనే వున్నాయి. ఇపుడు శరత్‌చంద్రబోస్, షఫాత్ అహ్మద్‌ఖాన్, సయ్యద్ అలీ జహీర్‌లు, రాజీనామా చేశారు. తాత్కాలిక ప్రభుత్వంలో లీగ్ చేరడానికి జిన్నా అంగీకరించాడు. వైస్రాయితోనూ, నెహ్రూతోను అనేక ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాక, ఈ నిర్ణయానికి వచ్చాడు. ఐతే ముస్లిములకి కేటాయించిన 5 స్థానాలను లీగే భర్తీ చేస్తుందని జిన్నా అన్నాడు.

1946 అక్టోబర్ 25 నుంచీ, కాంగ్రెస్ లీగ్‌ల ప్రతినిధులతో కూడిన మంత్రివ ం పనిచేయ ప్రారంభించింది. ఐతే జూలై 29 తీ నం ఉపసంహరించుకొనేందుకు జినా ఎట్టి ప్రయ్నమూ చేయలేదు. పైగా మంత్రివ ంలోని లీగ్ సభ్యులు నెహ్రూకు సహకారం ఇ్వ నిరాకరించారు. పరిపాలన స్తంభించింది ఉద్యోగులలో హిందూ-ముస్లిం అనుకూల వర్గాలుగా విభజన ఏర్పడింది. ఆర్థికమంత్రిగా వున్న లియాకత్ అలీఖాన్ లోనుంచి సహాయ నిరాకరణ ప్రారంభించాడు.

సరిగా ఈ సమయంలోనే మత కల్లోలాలు చెలరేగుతున్నాయి. జూలై 29 తీర్మానాన్ని లీగ్ ఉపసంహరించుకోకపోవటంతో రాజ్యాంగ పరిషత్ కార్యకలాపాలకు అవరోధం ఏర్పడింది. రాజ్యాంగ చట్ట నిర్మాణానికి అడ్డంకులు కల్గాయి. రాజ్యాంగ పరిషత్‌నే వాయిదా వేయాల్సిందిగా జిన్నా కోరాడు. నెహ్రూ అంగీకరించలేదు. రాజ్యాంగ పరిషత్ డిసెంబర్ 9 న జరుగుతుందని ప్రకటించాడు. దాన్ని బహిష్కరించాల్సిందిగా జిన్నా ఆదేశించాడు.

ఈ పరిసితుల్లో నెహ్రూ తాత్కాలికప్రభుత్వంలోని ముస్లింలీగ్ సభ్యులను పదవి నుంచి తప్పుకోవాలని సూచించాడు. దీనితో గందరగోళ స్తితిలోపడ్డ బ్రిటిషు ప్రభుత్వం నెహ్రూ, జిన్నా, బలదేవ్‌సింగ్, వేవెల్-వీరందరినీ లండన్‌కు ఆహ్వానించింది. డిసెంబర్ 6న బ్రిటిష్ మంత్రివర్గం, కాంగ్రెస్ లీగ్‌ల మధ్యనున్న వివాదాంశాలపై ఒక తీర్పు నిచ్చింది. రాష్ట్రాలను గ్రూపులుగా విభజించడాన్ని, ఆ గ్రూపులలో రాష్ట్రాల్ని చేర్చడాన్నీ బ్రిటిష్‌ప్రభుత్వం సమర్థించింది. మంత్రివర్గప్రతినిధుల పథకానికి చెప్పిన ఈభాష్యంపై సుప్రీంకోర్టు, తన నిర్ణయాన్ని చెప్పాలనీ దాన్ని అందరూ శిరసావహించాలనీ కాంగ్రెస్ కోరింది. సుప్రీంకోర్టుఅభిప్రాయం తెలుసుకోవచ్చుకాని, దాని నిర్ణయం లీగ్‌కు వ్యతిరేకంగా ఉంటే, దాన్ని తప్పనిసరిగా లీగ్ పాటించాల్సిన పనిలేదని బ్రిటిషు మంత్రివర్గం అన్నది. అంతేకాక రాజ్యాంగ పరిషత్ సభలో ముస్లింలు పాల్గొనక పోయిన పక్షంలో, వారు గైరుహాజరు అయిన కాలంలో, రాజ్యాంగ పరిషత్

రూపొందించిన రాజ్యాంగాన్ని అంగీకరించాల్సిందిగా ముస్లింలీగ్‌పై ఒత్తిడి చేయబోమని స్పష్టం చేసింది. దీంతో జిన్నా మరింత బిర్రబిగుసుకుపోయాడు.

రాజ్యాంగ పరిషత్ సభ 1946 డిసెంబర్ 9 న సమావేశమైంది. రాజేంద్రప్రసాద్‌ను అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు. ప్రాథమిక హక్కుల గురించి, మైనారిటీల రక్షణ గురించీ నివేదిక తయారుచేయడానికి ఒక సలహా సంఘాన్ని ఏర్పరచారు. ఆ తర్వాత వాయిదాపడిన రాజ్యాంగ పరిషత్ సభ 1947 జనవరి 20 న సమావేశమైంది. అపుడుకూడా లీగ్ సభ్యులు ఈ సమావేశానికి రాకుండా బహిష్కరించారు. రాజ్యాంగ చట్ట లక్ష్యాలు ఆశయాలు గురించి చర్చించి ఆమోదించింది రాజ్యాంగ పరిషత్ సభ. కాని తర్వాత కార్యక్రమం ఏమీ కొనసాగలేదు.

తాత్కాలిక ప్రభుత్వంలోని లీగ్ సభ్యులు మినహా తక్కినవారంతా, తాత్కాలిక ప్రభుత్వం నుంచి లీగ్ సభ్యుల్ని తొలగించాలని వైస్రాయిని కోరారు. దానికి వైస్రాయి అంగీకరించలేదు. దాంతో నెహ్రూ తదితర సభ్యులు తమ రాజీనామాలు పంపారు.

బ్రిటిషు ప్రభుత్వానికి ఇది చిక్కు సమస్య అయింది. తాత్కాలిక ప్రభుత్వం నుంచి లీగ్ సభ్యుల్ని తొలగించినా లేక కాంగ్రెస్ సభ్యుల రాజీనామా అంగీకరించినా అది తీవ్ర పరిణామాలకు దారితీసేలావుంది. అందుకని 1947 ఫిబ్రవరి 20 న బ్రిటిషు ప్రధాని అట్లీ, కామన్సు సభలో భారత స్వాతంత్ర్య సమస్యపై చరిత్రాత్మక ప్రకటన చేశాడు. బ్రిటన్ భారతదేశాన్ని విడిచిపెట్టిపోతుందని అన్నాడు.

ఈ ప్రకటన వెలువడేముందు దేశంలో పరిస్థితులు ఏమిటి ? కాంగ్రెస్, లీగ్‌ల మధ్య విభేదాలు, మత కలహాలను మాత్రమే, బ్రిటిష్ పాలకులు భారతదేశం గురించి చిత్రిస్తూ వచ్చారు. కాని యుద్ధానంతరం ముఖ్యంగా 1946 లో భారత ప్రజల సమరశీల స్వభావాన్ని, ఆనాటి ఉద్యమాలు ప్రతిబింబించుతున్నాయి.

1946 మేలో కాశ్మీర్ సంస్థాన ప్రజలు, సంస్థానాధీశునిపై అపూర్వ సాహసంతో పోరాడారు. దాల్ సరస్సు వద్ద జరిగిన పోరాటం తీవ్రస్థాయికి చేరింది. ఈ ఉద్యమం సందర్భంగానే షేక్ అబ్దుల్లాకు మూడేళ్ళ శిక్ష పడింది.

1946 జూలై 9న కలకత్తాలో కార్మికులు బ్రహ్మాండమైన సమ్మె జరిపారు. ప్రతి పారిశ్రామిక కేంద్రంలోను సమ్మెలు జరిగాయి. అఖిల భారత తంతి తపాలా సమ్మె జరిగింది. ఆగస్టు సెప్టెంబరులలో సౌత్ ఇండియన్ రైల్వే కార్మికులు సమ్మె చేశారు. 1946 అక్టోబర్, డిసెంబర్ మాసాల మధ్య హైద్రాబాద్, తిరువాంకూర్ లలో సంస్థాన ప్రజల సాయుధ తిరుగుబాట్లు (వీర తెలంగాణా పోరాటం, పున్నప్రవాయలార్ పోరాటం) తీవ్రస్థాయికి చేరాయి. బొంబాయిలోని అమేల్నర్, తిరుచునాపల్లిలోని గోల్డెన్ రాక్‌లో, కోలార్, కోయంబత్తూర్‌లలో జరిగిన సమ్మెలలో కార్మికుల రకం పారింది. నవంబరులో బెంగాలు రైతులు "తేభాగా" ఉద్యమం ప్రారంభించారు. రైతులు తాము కౌలుచేసి, పండించే పంటలో సగభాగంకాక, మూడు వంతులు కావాలని కోరారు. మద్రాసు రాష్ట్రంలో వ్యవసాయ కార్మికుల, మహారాష్ట్రంలోని వార్లీలు, ఉత్తర ప్రదేశ్‌లోని అనేక రాష్ట్రాలలోని వ్యవసాయ కార్మిక ఉద్యమాలు బలపడసాగాయి. ఈ ఉద్యమాలను నాయకులు నిరుత్సాహపర్చేవారు. పత్రికలు వీటిని గురించిన వార్తలు అంత ప్రాముఖ్యంగా ప్రచురించేవి కావు. ప్రజా ఉద్యమాల ఈ సంరంభమే వీరిని చాల వరకు మతకలహ జ్వాలలనుంచి దూరంగా ఉంచింది. అంతేకాక నౌఖలి, హసన్‌బాద్‌లలో ఆత్మార్పణద్వారా కొందరు ఈ మతవిద్వేషాగ్నులను ఆర్పడానికి యత్నించారు. ఇండోచైనా స్వాతంత్ర్యంపట్ల సంఘీభావం ప్రదర్శించిన విద్యార్థులపై కలకత్తాలో 1947 జనవరి 21 న బాష్పవాయువు ప్రయోగించి గుండ్లవర్షం కురిపించారు.

ఇదే సమయంలో భారతదేశ స్వాతంత్ర్య ఉద్యమానికి ఆసియాలోను, పాశ్చాత్య ప్రపంచంలోను మద్దతు లభించింది. ఐక్యరాజ్య సమితి సర్వసభ్య సమావేశంలో (1946 డిసెంబరు) సోవియట్ యూనియన్ విదేశాంగ మంత్రి మోలటోవ్ ఇలా అన్నాడు: "భారతదేశం ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వంగల్గిన దేశం. దీని ప్రణాళిక ప్రకారం బ్రిటన్‌తో సమానమైన ప్రతిపత్తి భారతదేశానికి ఉండాలి. తనను బలపరచవలసిందనీ, సహాయ పడవలసిందనీ భారతదేశం చేసిన విజ్ఞప్తి మనం వినలేదా? దీన్ని మనం పెడచెవిని పెట్ట

రాదు. భారతదేశ న్యాయమైన కోర్కెలను గుర్తించ డానికి ఇది తగిన సమయం."

భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని ఇవ్వాలని సోవియట్ కోరటం ఇది మొదటిసారికాదు. 1945 ఏప్రిల్‌లో శాన్‌ఫ్రాన్సిస్‌కోలో జరిగిన ఐక్యరాజ్య సమితి సమావేశంలో సోవియట్ ప్రతినిధి నాయకుడైన మోలటోవ్ ఇలా అన్నాడు : "భారతదేశం నుంచి వచ్చిన ప్రతినిధివర్గం ఇక్కడ వుంది కాని భారత దేశం స్వతంత్ర దేశంకాదు. స్వతంత్ర భారతదేశవాణి వినే రోజు వస్తుందని మనందరికీ తెలుసు".

ఒక పక్క ప్రజాఉద్యమాల విజృంభణ, మరో పక్క ప్రజాభిప్రాయం, భారతదేశానికి సత్వరం స్వాతంత్ర్యం ఇవ్వాలని ఒత్తిడిచేస్తున్న సమయంలో 1947 ఫిబ్రవరి 20 న అట్లీ ప్రకటన వెలువడింది. ఆ ప్రకటన సారాంశం ఇది :

1. 1948 జూన్ 30 వ తేదీలోగా బ్రిటన్ భారత దేశంనుంచి ఉపసంహరించుకొంటుంది.

2. ఆలోగా అన్ని పా ల ఆమోదించిన రాజ్యాంగాన్ని, రాజ్యాంగ పరిష కనుక తయారుచేసి, నూతన ప్రభుత్వాన్ని ఏర్ప చితే, అది తన అధికారాన్ని ఆ ప్రభుత్వానికి దఖలు పరుస్తుంది.

3. అలాంటి రాజ్యాంగాన్ని కనుక రచించని పక్షంలో రాష్ట్రాలలో అప్పుడు అధికారంలో వుంటున్న వివిధ ప్రభుత్వాలకు బ్రిటన్ అధికారాన్ని దఖలు చేస్తుంది.

4 ఏ కారణంవల్లనైనా ఇది కూడా సాధ్యంకాని పక్షంలో, భారతదేశ ప్రజలకు అత్యంత లాభదాయకమైన ఏ ఇతర సంస్థకైనా అది తన అధికారాన్ని దఖలు పరుస్తుంది.

ఈ అట్లీ ప్రకటనను చర్చిల్‌లాంటి కన్సర్వేటివ్ పార్టీ ముఖ్యులు హర్షించలేదు. కరుడుగట్టిన సామ్రాజ్యవాది, భారత స్వాతంత్ర్య ఉద్యమానికి పరమశత్రువూ అయిన విన్‌స్టన్ చర్చిల్ 1947 లో బ్రిటిష్ పార్లమెంట్‌లో ఇలా అన్నాడు :

"....స్వాతంత్ర్యం మానవుని జన్మహక్కు. కాని ఈ సమయంలో ప్రభుత్వా న్ని కాంగ్రెస్‌కు అప్పగించడమంటే, ఆకలిగొన్న లక్షలాది ప్రజల భవిష్యత్తును రాస్కెల్స్ రోగ్స్, చేతుల్లో పెట్టడ మవుతుంది. ఒక్క గ్లాసెడు నీళ్ళు, ఒక్క రొట్టెముక్క సైతం వన్నులనుంచి తప్పించుకోలేవు. గాలిమాత్రం స్వేచ్ఛగా వుంటుంది. ఆకలిగొన్న లక్షలాది ప్రజల రక్తం అట్లీ తలపై వుంటుంది. భారతదేశం అల్పమైన రాజకీయ తగాదాలలో కొ -కుపోతుంది. ..."

ఈ చర్చిల్ ప్రకటనను అ త్రోసి పుచ్చాడు.

ఈ ప్రకటన చేయాల్సి అవసరం ఎందుకు వచ్చింది. బల ప్రయోగం ద్వారా భారత దేశాన్ని తన అదుపులో బ్రిటన్ ఉంచుకోలేదు. భారత ప్రజల ఉద్యమం తమను పూ గా తుడిచిపెట్టి వేస్తుందన్న భయం కూడా దీనికి ఐ ంది.

సర్ స్టాఫర్డు క్రి ప్స్ కామన్సు సభలో ఇలా అన్నాడు. భారత ప్రజల కోర్కెకు వ్యతిరేకంగా 15 లేక 20 ఏళ్ళు బ్రిటన్ వుండనన్నా వుండాలి, లేదా నానాటికీ అతి క్లిష్టమౌతున్న పరిపాలనా బాధ్యతను వదులుకోనన్నా వదులు కోవాలి. బ్రిటన్ మొదటి మార్గాన్ని ఎన్నుకోలేదు. బ్రిటిషు ప్రజలుగాని, భారతీయులుకాని అది కోరరు అందుకని రెండో మార్గమే శరణ్యం."

అలాన్ కాంప్ బెల్-జాన్సన్ అనే ఆయన లార్డ్ ఇస్మే మాటలను ఇలా ఉల్లేఖించాడు "1947 మార్చిలో భారతదేశం నడిసముద్రంలో మందుగుండు సామగ్రి మోసుకెళ్ళే మండుతున్న ఓడలా వుంది. ఆ మంటల్ని మందుగుండు సామగ్రికి అంటుకోకముందే ఆర్పివేయాలి."

డైలీ మెయిల్ (లండన్) పత్రిక భారతదేశంలో బ్రిటిషువాళ్ళు ఇంకా ఉండాలంటే, కనీసం 5 లక్షల సైన్యమైనా దానికి కావాలి అని రాసింది.

సైనిక బలంతో భారతదేశాన్ని అణచి వుంచలేమని గ్రహించాకనే, ప్రజా ఉద్యమాల వెల్లువ చూసి భయపడిన తర్వాతనే, అట్లీ ప్రకటన వెలువడింది. ఐతే పరోక్షంగా తమ ప్రాబల్యాన్ని నిలబెట్టుకోవాలనే తపన బ్రిటన్‌కు వుంది. అందుకు భారతదేశాన్ని ఎంత బలహీన పరిస్తే, హిందూ మహ్మదీయ వైషమ్యాల్ని ఎంత పెంచితే, అంత మంచిదని అది భావించింది. అందుకే ఈ ప్రకటన.

అట్లీ ఈ ప్రకటనతోపాటు, వైస్రాయి వేవెల్ స్థానంలో లా మౌంట్ బాటన్ వైస్రాయిగా నియమింప బడిన తెలియ చేశాడు. వే ల యుద్ధరంగంలో నిపుణుడు వచ్చు, కాని రాజకీయ తంత్రంలో,

అందులోనూ కుటిల రాజకీయ తంత్రాలకు బహుశా అతడు పనికి రాలేదు. తమ ఉనికి దినదిన గండంగా మారుతున్న రోజుల్లో భారతదేశంలో మరో తరహా వ్యక్తి కావాలి. మెదడు, మెదడుతోపాటు మెలకువ, మెలకువతోపాటు జిత్తులమారితనం కల వ్యక్తి అవసరం. అవన్నీ మౌంట్ బాటన్‌లో వున్నాయి. పైపెచ్చు అతడు బ్రిటిషు చక్రవర్తుల కుటుంబ బంధువు కూడా.

మౌంట్ బాటెన్ మార్చి 22 న ఢిల్లీ వచ్చాడు. 24 న వైస్రాయి పదవిని స్వీకరించాడు వరుసగా వివిధ పార్టీల నాయకులతో, ప్రముఖులతో వేర్వేరుగా సంభాషణలు సాగించాడు. మొదట తాత్కాలిక ప్రభుత్వంలో ఉప ప్రధానిగానూ, విదేశాంగ మంత్రిగానూ వున్న జవహర్‌లాల్ నెహ్రూతో సంభాషణలు సాగించాడు. నెహ్రూను ఆహ్వానిస్తూ, "భారత దేశంలో బ్రిటిషు రాజ్యాన్ని సమాప్తం చేస్తున్న వైస్రాయిగా మీరు నన్ను భావించవద్దు నూతన భారత దేశానికి మార్గాన్ని చూపుతున్న వైస్రాయిగా నన్ను భావించండి" అన్నాడు. దానికి జవాబుగా నెహ్రూ వైస్రాయి వశీకరణశక్తి అపాయకరమైందని ప్రజలు అనుకుంటుంటే విన్నాను. ఇపుడుదాన్ని నేను అర్థంచేసుకుంటున్నాను." అంటూ జవాబిచ్చాడు నెహ్రూ.

మౌంట్ బాటెన్ కాంగ్రెస్ నాయకుల్ని కలుసుకున్నప్పుడల్లా, ముఖంలో విషాదం కనబరచేవాడు. మత కలహాల్లో చనిపోయినవారి పట్ల సానుభూతి వొలకబోసేవాడు. మౌంట్ బాటన్ భారతదేశం వచ్చిన రోజుల్లోనే పంజాబులో ఘోరమైన మత దురంతాలు జరిగాయి. పంజాబ్ గతంలో మతోన్మాదానికి గురైన ప్రాంతంకాదు. కాని అక్కడ గృహదహనాలు, దోపిడీలు, హత్యలు పెద్ద పెట్టున జరిగాయి. అలాగే సింధు, వాయువ్య రాష్ట్రాలలో కూడా మత కల్లోలాలు తీవ్రస్థాయికి చేరాయి. ఒక్క రావల్పిండిలోనే 4 వేల మంది చనిపోయారు. లాహోర్, ఝీలమ్, అమృత్‌సర్‌లలో మత కల్లోలాలు విజృంభించాయి. బ్రిటిష్ అధికారులు కావాలనే ఈ కల్లోలాలను ఆపడానికి ప్రయత్నించలేదు. రావల్పిండి సమీపంలోనే భారత పెద్ద సైనిక కేంద్రం కూడా వుంది. ఐనా అక్కడి ఘోర కృత్యాలను ప్రభుత్వం ఆపలేకపోయింది. నిజానికి బ్రిటిషు అధికారుల ఉదాసీనత, వారి ఏజెంట్ల ప్రోత్సాహంతోనే మత కలహాలు ప్రజ్వరిల్లాయి.

మౌంట్ బాటన్ ప్రదర్శించిన ఈ కపట సానుభూతి, వాస్తవాలను దాచిపెట్టలేదు. వైస్రాయి సలహాదార్లు అప్పటికే భారతదేశాన్ని చీల్చడానికి, పథకాన్ని రూపొందించుతున్నారు. లీగు పెడుతున్న అభ్యంతరాలతో అసంతృప్తి చెందివున్న కాంగ్రెస్ నాయకులలో దేశ విభజన మినహా గత్యంతరం లేదనే భావాన్ని మౌంట్ బాటన్ క్రమక్రమంగా, నెమ్మది నెమ్మదిగా చొప్పించ మొదలుపెట్టాడు.

మౌంట్ బాటన్ మొదట పటేల్‌ను ఒప్పించగల్గాడు. లీగు గొడవ వదలిపోతే, కాస్త భూభాగం పోయినా ఫర్వాలేదు అనే నిర్ణయానికి పటేల్ వచ్చాడు. తాత్కాలిక ప్రభుత్వంలో ముస్లింలీగు కల్పించిన అవరోధాలతో విసుగెత్తిన పటేల్ మొదట దేశ విభజనకు సుముఖత చూపించాడు. తాము ఇష్టపడినా, లేకపోయినా ఇప్పుడు భారతదేశంలో రెండు జాతులు వున్నాయని, వారిద్దరినీ కలపడం సాధ్యంకాదనీ అన్నాడు. తగువులాడుకొనే ఇద్దరు అన్నదమ్ములు ఒకే కుటుంబంలో వుండటం కన్నా విడిపోతేనే మంచిదనీ, విడిపోయిన వాళ్ళు స్నేహితులుగా మెలుగుతారనీ పటేల్ అన్నాడు.

పటేల్‌ను ఆకట్టుకొన్నాక మౌంట్ బాటన్ పని సులభమైంది. గాంధీ, నెహ్రూలను కూడా క్రమంగా అందుకు ఒప్పించగల్గాడు.

మౌంట్‌బాటెన్‌ను కలుసుకోడానికి గాంధీ మార్చి 31న ఢిల్లీకి వచ్చాడు. అంతకు ముందు పటేల్‌ఆయన్ని సమర్థించేవారి వైఖరి పట్ల, ఆందోళన చెందుతున్న మౌలానా ఆజాద్‌కు, గాంధీ-"కాంగ్రెస్ కనుక దేశ విభజన కోరితే, అది నా మృతదేహం పైననే సిద్ధిస్తుంది" అని హామీ ఇచ్చాడు. మూడు రోజులపాటు గాంధీ- వైస్రాయిల మధ్య సంభాషణలు కొనసాగాయి. వైస్రాయి భవనాన్ని గాంధీ వదలి వెళ్ళగానే, పటేల్ మళ్ళా వైస్రాయిని కలుసుకొంటూ వుండేవాడు.

మౌలానా అబుల్‌కలం ఆజాద్, తన స్మృతులను గ్రంథ రూపంలో రాశాడు. దాన్ని తన మరణానంతరం ప్రకటించాల్సిందిగా ఆయన కోరాడు. ఆయన తన గ్రంథంలో 'దేశ విభజన' అనే అభిప్రాయానికి అంగీకరించిన కాంగ్రెస్ నాయకులలో పటేల్

మొదటి వాడని చెప్పాడు. జవహర్‌లాల్ నెహ్రూను కూడా మౌంట్‌బాటెన్ తన వైపు తిప్పుకోగల్గటం ఆశ్చర్యం అని ఆజాద్ తన గ్రంథంలో రాశాడు. పటేల్ గట్టిగా పట్టుబట్టడం, మత కలహాల విజృంభణను పెద్ద రాకాసిలా చూపించి మౌంట్‌బాటెన్ భయ పెట్టటం వల్ల గాంధీకూడా తన వైఖరి మార్చుకొన్నాడని చెప్పాలి. నిస్పృహతో విభజన తప్పని సరి అని అంగీకరించాడు గాంధీ. కలకత్తాలోను, ఆ తర్వాత దేశంలో చెలరేగిన మత కలహాలు గాంధీని కృంగదీశాయి.

ఈ సందర్భంగానే ఆజాద్ తన స్మృతులలో వెల్లడించిన కొన్ని విషయాలు ఆసక్తికరంగా వుంటాయి. మౌంట్‌బాటెన్ ఎలాంటి శుష్క వాగ్దానాలు చేశాడో ఆజాద్ వెల్లడించాడు.

కాంగ్రెస్ కనుక దేశవిభజన అంగీకరించితే, దేశంలో ఎక్కడా మతకలహాలు వుండబోవని మౌంట్‌బాటెన్ హామీ ఇచ్చాడు. మత కలహాల్ని మొగ్గలోనే తుంచడానికి కఠినాతికఠిన చర్యలు తీసుకొంటానని చెప్పాడు. దీనిపై ఆజాద్ వ్యాఖ్య ఇలా వుంది - "మౌంట్ బాటెన్ చెప్పిన ఈ పెద్దపెద్ద కబుర్లు తర్వాత, ఏం జరిగిందో మొత్తం ప్రపంచానికి తెలుసు. దేశంలో అనేకచోట్ల రక్తం వరదలై పారింది .... అమాయకులైన హిందువుల, ముస్లిముల హత్యల్ని ఆపేందుకు ఫలప్రదమైన పని ఏమీ జరగలేదు"

ఒక్క గాంధేకాక, నెహ్రూకూడా మొదట దేశ విభజనకు తీవ్ర వ్యతిరేకి. దేశ విభజన అనే అభిప్రాయం మధ్యయుగాల భావన అనీ, దానికి ఈ ఆధునిక ప్రపంచంలో స్థానం లేదనీ అన్నాడు. ఒక పక్క రాష్ట్రాలకు, సంస్థానాలకు ఎక్కువ స్వపరిపాలనాధికారాలు ఇసూనే, బలమైన కేంద్రంతో ఐక్యభారత దేశాన్ని ఆయన కోరుతూ వచ్చాడు. రాజ్యాంగంలో మైనారిటీలకు రక్షణ కల్పించాలని అన్నాడు. ఐతే బ్రిటిషు విధానాల వల్ల భవిష్యత్‌లో ఏం జరుగుతుందో చెప్పలేమని ఆయన ఆనాడు అన్నాడు.

మే 10న మౌంట్ బాటెన్, నెహ్రూకు తన ప్రతిపాదన ముసాయిదాను తెలియ చేశాడు. బ్రిటిషు ప్రభుత్వ అనుమతికోసం, ఆ ముసాయిదాను ఆయన పంపబోతున్నాడు. నెహ్రూ తన బసకు రాత్రి 2గంటలకి చేరాడు. కృష్ణమీనన్ తప్ప మరెవ్వరూ ఆగదిలో లేరు. మౌంటె బాటెన్ పథకంతో, నెహ్రూ ఎంత నిర్ఘాంతపోయాడంటే, ఉద్రేకంతో కొంతసేపు ఆయన నోటినుంచి మాట రాలేదు.

ఇంతకూ మౌంట్ బాటెన్ నెహ్రూకు అందచేసిన పథకం ఏమిటి ?

బ్రిటిషువాళ్ళు, అధికారాన్ని భారతదేశంలోని ఆయా రాష్ట్రాలకు ఇస్తారు. ఆ రాష్ట్రాలు తర్వాత వేర్వేరు కూటాలుగా ఏర్పడవచ్చు బెంగాల్,పంజాబ్ రాష్ట్రాలను విభజించాలి. ముస్లిమేతర ప్రజలు అధికంగా వున్న ప్రాంతాలనుంచి, ముస్లిములు అధికంగా వుండే ప్రాంతాల్ని - ఈ రెండు రాష్ట్రాలలోనూ చీల్చాలి. ముస్లిముల ప్రాబల్యంగల సిల్హెట్ జిల్లాను ముస్లిం బెంగాల్ రాష్ట్రంలో చేర్చడానికి మౌంట్ బాటెన్ సూచించాడు. వాయువ్య రాష్ట్ర విషయంలో ప్రజల అభీష్టాన్ని తెలుసుకొనేందుకు ఎన్నికలు జరపాలి.

ఈ పథకాన్ని భారతదేశం అంగీకరించబోదని నెహ్రూ, మౌంట్ బాటెన్‌కు తెలియచేశాడు. ఈ పథకంవల్ల భారతదేశం విచ్ఛిన్నమౌతుందనీ, ఆంతరంగిక కలహాలు పెరిగి దొమ్మీలకు, హింసాకాండకు దారితీస్తాయనీ, కేంద్రం బలహీన పడుతుందనీ నెహ్రూ తెలిపాడు.

మౌంట్‌బాటెన్ ఇంతటితో నిరుత్సాహపడలేదు. వేవెల్ కాలంనుంచీ, వి పి. మీనన్ రాజ్యాంగ సలహాదారు, మొదట మౌంట్‌బాటెన్ ఈయన సలహాలు తీసుకోలేదు. కాని నెహ్రూ తన పథకాన్ని నిరాకరించిన తర్వాత ఈయన సలహా కోరాడు.

మీనన్ మరో పథకాన్ని రూపొందించాడు. నెహ్రూ, పటేల్‌లతో సంప్రతించాడు. సంపూర్ణ స్వాతంత్ర దేశాలుగాకాక, కామన్ వెల్తు లోనైన డొమినియ గా పాకిస్తాన్, హిందూస్తాన్‌లను ఏర్పరచాలి. బ్రిటన్‌తో సంబంధాలు భారతదేశానికి లాభదాయకమని వి పి. మీనన్ సలహా, ఈ సలహాకు నెహ్రూ తదితర కాంగ్రెస్ నాయకులు అంగీకరించారు. 1947 మే 18 న మౌంట్‌బాటెన్ లండన్‌వెళ్ళి యీ పథకానికి బ్రిటిష్ ప్రభుత్వ అనుమతి పొందాడు. అధికార బదలాయింపు పథకంగా 1947 జూన్ 3 వ తేదీన ప్రకటన వెలువడింది.

## జూన్ 3 పథకం

జూన్ 3 ప్రకటన ప్రకారం, బెంగాల్, పంజాబ్, అస్సాంలలో కొంత భాగం మత ప్రాతిపదికపై చీల్చబడతాయి. బ్రిటిషు ఇండియా రెండు ముక్కలవుతుంది. 1947 ఆగస్టు 15 వ తేదీనుంచి ఈ రెండు భాగాలు ఇండియన్ యూనియన్ (మామూలుగా దీన్ని హిందూస్తాన్ అని పిలుస్తుంటారు). పాకిస్తాన్‌లుగా విడిపోతాయి. ఇవి పూర్తి స్థాయి డొమినియన్లు (అధినివేశ రాజ్యాలు)గా వుంటాయి. బ్రిటిషు కామన్‌వెల్తులోని ఇతర డొమినియన్ల వలె స్వతంత్ర ప్రతిపత్తి కలిగి వుంటాయి. ఈ రెండు డొమినియన్ల రాజ్యాంగ పరిషత్తులు తమ తమ దేశాలు, బ్రిటిషు కామన్‌వెల్తులో ఉండాలా? లేదా? అనేది అవి నిర్ణయించుకొంటాయి. ఇక భారతదేశంలోని సంస్థానాలు తమకు ఇష్టంవచ్చిన డొమినియన్‌లో చేరవచ్చు. లేదా స్వతంత్రంగా వుండవచ్చు. అంతేకాక బ్రిటిషు ప్రభుత్వంతో వెనకటి సంబంధాలను కొనసాగించుకోవచ్చు దీని అర్థం దాని వలసలుగా ఉండవచ్చు.

ఈ పథకాన్ని జూలై 18 న బ్రిటిషు పార్లమెంట్ ఆమోదించింది. ఇది ఆనాటినుంచి "భారత స్వాతంత్ర్య చ ం"గా పిలువబడుతూ వుంది. గతంలో ప్రకటించి ˘ 1948 జూన్‌లో కాక 1947 ఆగస్టు 15 కే అధి - న్ని దఖలు చేయాలని కూడా మౌంట్‌బాటెన్ బ్రిటిషు ప్రభుత్వాన్ని ఒప్పించాడు.

ముస్లింలీగ్ యీ పథకాన్ని దాదాపు ఏకగ్రీవంగా అంగీకరించింది. పాకిస్తాన్ రెండు భాగాలను (అంటే ఇప్పటి బంగ్లాదేశ్, పాకిస్తాన్‌లను) కలిపే 800 మైళ్ళ పొడవు దారి కావాలని మొదటజిన్నా అన్నాడు. కాని దాన్ని బ్రిటిషు ప్రభుత్వం తిరస్కరించింది. జిన్నా కూడా తర్వాత అంతగా పట్టుబట్టలేదు.

అఖిలభారత కాంగ్రెస్ కమిటీ జూన్ 14 న సమావేశమైంది. గాంధీ కూడా యీ పథకాన్ని ఆమోదించాల్సిందిగా కోరటంతో ఎటూ తేల్చుకోలేక ఊగిసలాడేవారు కూడా యీ పథకానికి అంగీకరించారు.

జూన్ 15 న యీ పథకాన్ని ఆమోదించుతూ అఖిలభారత కాంగ్రెస్ కమిటీ తీర్మానించింది. 157 వోట్లు అనుకూలంగా 29 వోట్లు ప్రతికూలంగా వచ్చాయి. పథకాన్ని అంగీకరిస్తూ అఖిలభారత కాంగ్రెస్ కమిటీ తీర్మానించింది. అందులో యిలా వుంది.

"జూన్ 3 వ తేదీ ప్రతిపాదనల వల్ల భారతదేశంలోని కొన్ని భాగాలు వేరు పడిపోవచ్చు. ఇది ఎంత విచారకరమైన విషయమైనా, ఇప్పటి పరిస్థితులలో దీన్ని అఖిలభారత కాంగ్రెస్ కమిటీ అంగీకరించుతున్నది."

దేశ విభజనపట్ల గాంధీకి అతి సన్నిహితుడైన కృపలానీ భావాలు, ఇక్కడ ఉవహరించటం అవసరం.

"నేను గాంధీతో 30 ఏళ్ళు వున్నాను. ఆయనపట్ల నాకు గల విశ్వాసాన్ని నేనెన్నడూ సడలించలేను. నేను ఆయనతో విభేదించినా, ఎక్కువ హేతుబద్ధంగా కనబడినా, నా వైఖరికంటే ఆయన రాజకీయ ఇంగిత జ్ఞానం సరయినదని భావించుతూ వచ్చాను. ఇవాళ కూడా ఆయన ప్రదర్శించిన అత్యంత నిర్భీతి సరైనదని, నా వైఖరి లోపభూయిష్టమైనదని నేను భావిస్తున్నాను. ఐతే నేను ఆయన పక్షాన ఉండలేదు. ప్రజా ప్రాదితమైన ఆ సమస్యను పరిష్కరించడానికి, ఆయనకి మార్గం దొరకలేదని నేను భావిస్తున్నాను. అహింసాయుత సహాయ నిరాకరణ మార్గాన్ని ఆయన బోధించినపుడు, ఆయన ఒక నిశ్చిత పద్ధతిని బోధించాడు యాంత్రికంగానైనా మేము అపుడాయన్ని అనుసరించాము. ఈనాడు ఆయన చీకట్లో తడుముకొంటున్నాడు. ఆయన నౌఖాలీ వెళ్ళాడు. అక్కడ పరిస్థితి మెరుగుపడింది. ఆయన ప్రయత్నాలు పరిస్థితిని సరళం చేశాయి, ఇపుడు బీహారులో వున్నాడు. పరిస్థితి సులభమైంది. కాని ఇది పంజాబులోని మంటల్ని ఆర్పి పరిష్కరించలేకపోయింది. యావద్భారత దేశానికి సంబంధించిన హిందూ - ముస్లిం ఐక్యతా సమస్యను బీహారులో పరిష్కరించుతున్నానని ఆయన ఇపుడు అంటున్నాడు. కావచ్చు. కాని అదెలా పరిష్కరింపబడుతున్నవో చూడటం కష్టం. అహింసాయుత సహాయ నిరాకరణ విధానంలో- కావాలనుకొన్న లక్ష్యాన్ని చేరడానికి అవసరమైన ఖచ్చితమైన మెట్లు ఏవీ లేవు."

1947 జూన్ 20 న భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ న్యూఢిల్లీలో సమావేశమై ఇలా తీర్మానించింది.

"జూన్ 3 నాటి మౌంట్ బాటన్ పథకం భారతదేశానికి నిజమైన స్వాతంత్ర్యాన్ని ఇవ్వదు. సామ్రాజ్యవాదుల ద్విముఖ విధాన పర్యవసానమే ఈ పథకం. ఇది ఒకపక్క అధికారాన్ని దఖలు పరచాలనే, దేశ వాంఛకు అనుకూలంగా కొన్ని రాయితీలు కల్పిస్తూనే, నిజమైన స్వాతంత్ర్యాన్ని సాధించడానికి అడ్డపడే విచ్ఛిన్నకర శక్తులను, అభివృద్ధినిరోధక శక్తులను రంగంలో ప్రవేశపెడుతున్నది. హిందూ-ముస్లిం విభేదాలను ఉపయోగించుకొని విభజించి పాలించు అనే బ్రిటిషు విధానం మున్నెన్నడూ ఎరుగని అంతర్యుద్ధాన్ని కలుగచేసింది. చివరకు దేశాన్ని రెండు శత్రుదేశాలుగా విభజించింది. విభజించబడిన విభిన్న ప్రాంతాలలోని అభివృద్ధినిరోధక శక్తులతో కొత్తగా ఒడంబడికలు చేసుకొని వాటిని తమ అధీనంలో వుంచుకోవాలని పథకం వేస్తున్నాయి."

మౌంట్‌బాటెన్ పథకాన్ని అయిష్టంగానే కాంగ్రెస్ నాయకులు అంగీకరించారు. గాంధీ ఇలా అన్నాడు. "కొన్ని సమయాల్లో కొన్ని నిర్ణయాలు రుచించకున్నా అంగీకరించాల్సి వుంటుంది."

హరిజన్ పత్రికలో 1947 జూలై 20 న ప్రచురించబడిన ఆయన ఉపన్యాసాన్ని చదివితే, దేశ విభజన వల్ల ఆయన ఆందోళన స్పష్టమౌతుంది, గాంధీ ఇలా అన్నాడు.

"స్వాతంత్ర్యం రావడానికి, సాంకేతికంగా చూస్తే ఇంకా కొన్ని రోజులు పడుతుంది. పార్టీలు సంయుక్తంగా ఈ పరిస్థితి అంగీకరించాయి. ఇపుడు వెనక్కుపోయే సమస్యలేదు.

"కాంగ్రెసు, లీగూ రెండూ వైస్రాయి జోక్యం లేకుండా, పరస్పరం అంగీకారానికి రావటం సులభమైన, సంసిద్ధమైన మార్గం. లీగు ఇందుకు మొదటి అడుగు వేయాలి. నేను పాకిస్తాన్‌ను ఏర్పరచవద్దని సూచించను. ఎట్టి వివాదంకాని, చర్చకాని లేకుండానే పాకిస్తాన్‌ను నిర్ణీతమైన వాస్తవంగా మనం భావిద్దాం. ఐనప్పటికీ కాంగ్రెస్, లీగ్‌లు రెండూ కనీసం పది మంది ప్రతినిధులయినా కూర్చొనగలిగే ఒక మట్టి గుడిసెలో సమావేశమై ఒక ఒడంబడికకు వచ్చేవరకు అక్కడనుంచి విడిపోరాదని నిర్ణయించుకోవాలి. అలాంటి ఘటన జరిగితే, సమాన ప్రాతిపదికపై దేశాన్ని రెండు భాగాలుగా విభజించే బిల్లుకన్న లెక్కలేనంతగా అది మంచిదవుతుంది.

"నిస్సహాయులుగా వున్న తమ ముందు జరిగే ఈ ఘటనలకు హిందువులుగాని, ముస్లిములుగాని సంతోషించటం లేదు.

"నన్ను చూసే హిందువులు, ముస్లిములు నాతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవారూ. మోసగించితే తప్ప, ఇది ఒకబోరకం సాక్ష్యం. ఐతే నేను కోరేది అసాధ్యమైన పెద్ద లక్ష్యం కావచ్చు. బ్రిటిషువాళ్ళ జోక్యం, చేయాల్సిన మోసం (ట్రిక్కు) కాస్తా చేసింది. అలాంటప్పుడు లీగ్ తన ప్రత్యర్థుల వద్దకు వచ్చి సోదరులమధ్య, స్నేహితులమధ్య ఒడంబడిక లాంటి ఒడంబడికను ఎలా చేసుకోగలుగుతుంది?

"మానవుడు ఆత్మవంచన చేసుకోడంలో చాలా తెలివితేటలు కలిగివుంటాడు. అందులో ఇంగ్లీషువాడు అందరికన్నా మిన్న. భారతదేశాన్ని ఆర్థిక, రాజకీయ కారణాలతో దాస్యంలో ఉంచటం తప్పని గ్రహించిన అతడు భారతదేశాన్ని విడిచిపెట్టి వెళుతున్నాడు.

ఈ విషయంలో అతడు చిత్తశుద్ధి కలవాడే. కాని, ఈ చిత్తశుద్ధి ఆత్మవంచనతో బాగా పొసుగుతుంది కూడా. భారతదేశంలో బహుశా దాని దురదృష్టవశాత్తు అరాచకం సంభవిస్తే, అలాంటి స్థితిలో భారతదేశాన్ని విడిచిపెట్టి వెళ్ళలేనని అతడు ఆత్మవంచన చేసుకుంటున్నాడు. రెండు సంఘటిత సైన్యాల మధ్య రణక్షేత్రంగా ఉంచి, భారతదేశాన్ని అతడు విడిచి వెళ్ళిపోతున్నాడు. వెళ్ళిపోయేముందు ఒక జాతిపై మరో జాతిని ఉసికొల్పే విధానానికి ఆమోదముద్రను వుంచిపోతున్నాడు."

దేశ విభజన పట్ల బ్రిటిషు లేబర్‌పార్టీ వైఖరిని గురించి మౌలానా అబుల్ కలాం ఆజాద్ అభిప్రాయాలు ఈ సందర్భంలో జ్ఞప్తికి తెచ్చుకోవాలి.

"లేబర్‌పార్టీ ఎప్పుడూ కాంగ్రెస్‌ను సానుభూతితో చూసేది. లేబర్‌పార్టీ నాయకులు అనేకసార్లు బహిరంగంగా ముస్లింలీగును విమర్శించారు. ముస్లింలీగు అభివృద్ధి నిరోధక సంస్థ అని అన్నారు. ముస్లింలీగు కోరికలకు అది లొంగిపోయిందంటే, నా ఉద్దేశంలో అది లీగును సంతృప్తి పరచడంకన్నా, బ్రిటిషు ప్రయోజనాలను రక్షించుకోవాలనే ఆసక్తాయే కారణమని నా అభిప్రాయం. ఐక్య భారతదేశం స్వతంత్ర

మైతే. భారతదేశ ఆర్థిక, పారిశ్రామిక జీవితంలో బ్రిటన్ తన స్థానాన్ని నిలుపుకోడం కష్టమౌతుంది.... పాకిస్తాన్‌లో బ్రిటిషు స్థావరం వున్న ఫలితంగా, భారతదేశం బ్రిటిషు ప్రయోజనాల గురించి మామూలు కంటె ఎక్కువ దృష్టిని కేంద్రీకరించి ఉండాల్సి వుంటుంది"

1947 ఆగ · 4 న భారత జాతీయ ప్రభుత్వ మంత్రివర్గ సభ్యుల పేర్లను కాంగ్రెస్ ఆమోదంతో మౌంట్‌బాటెన్ పంపాడు. నెహ్రూ, ప్రధానమంత్రి పదవినీ, విదేశాంగ, కామన్వెల్త్ వ్యవహార మంత్రిత్వ శాఖలను, శాస్త్రీయ పరిశోధనలశాఖ మంత్రిత్వాన్నీ తీసుకొన్నాడు.

పటేల్ ఉప ప్రధానిగాను, ఆంతరంగిక శాఖ, సంస్థానాధీశులశాఖ, సమాచార, రేడియో శాఖల మంత్రిగా ఉన్నాడు, ఇంకా ఈ మంత్రివర్గంలో ఆజాద్, రాజేంద్రప్రసాద్, జగజీవన్‌రామ్ మొదలైనవారు ఉన్నారు.

పాకిస్తాన్‌కు రాజధాని కానున్న కరాచీకి జిన్నా 7 వ తేదీన వెళ్ళిపోయాడు. ఆగ 11 న పాకిస్తాన్ రాజ్యాంగ పరిషత్‌కు జిన్నా అధ్యక్షుడయ్యాడు. జిన్నా పాకిస్తాన్ గవర్నర్ జనరల్ కూడా అయ్యాడు.

## స్వతంత్ర భారత్ అవతరణ

1947 ఆగస్టు 14 న భారత రాజ్యాంగ పరిషత్ సమావేశమైంది. రాజ్యాంగ పరిషత్ అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ ఆ రోజు అర్ధరాత్రి సమయంలో "ఇండియన్ యూనియన్" ఏర్పడినట్లు ప్రకటించాడు. స్వాతంత్ర్య సమరంలో అసువులు అర్పించిన సమర యోధులను సంస్మరిస్తూ పరిషత్ సభ్యులు రెండు నిమిషాలు మౌనం పాటించారు. ఈ సందర్భాన గాంధీని ప్రస్తుతించుతూ రాజేంద్రప్రసాద్ ప్రసంగించాడు.

1947 ఆగస్టు 14 అర్ధరాత్రి దాటింది. ఆగ 15 వ తేదీ ప్రవేశించింది. భారతదేశ పారతంత్ర్యం పటాపంచలైంది, స్వతంత్ర భారతదేశం అవతరించింది.

జవహర్‌లాల్ నెహ్రూ, రాజ్యాంగ పరిషత్ సభ్యులను ఉద్దేశించి మాట్లాడాడు. నిజానికి ఆ ప్రసంగం భారతీయులందరినీ, ప్రపంచ ప్రజలందరినీ ఉద్దేశించి మాట్లాడినదే. నెహ్రూ ఇలా అన్నాడు.

"ఎన్నో సంవత్సరాల క్రితం మన భవిష్యత్తు గురించి వాగ్దానం చేశాము. ఇపుడు మన ప్రతిజ్ఞ నెరవేర్చుకొనే సమయం వచ్చింది.

ఆ ప్రతిజ్ఞను పూర్తిగా మొత్తంగా మనం నెరవేర్చలేకపోవచ్చు. కాని దాదాపు పూర్తిగా నెరవేరింది అనాలి. అర్ధరాత్రి పన్నెండు గంటలు కొట్టే సమయంలో, ప్రపంచమంతా నిద్రపోతున్న సమయంలో, భారతదేశం మేల్కొని స్వాతంత్ర్యం ప్రకటించుకొంటున్నది. పాతనుంచి కొత్తకు అడుగువేసే సమయం, ఒకానొక తరం అంతరించే సమయం, చిరకాలంగా మౌనం వహించిన ఒక జాతి ఆత్మ మేల్కొని మాటాడుతున్న సమయం, చరిత్రలో బహు అరుదుగా వచ్చే సమయం—ఈనాడు వచ్చింది. ఈ పవిత్ర సమయంలో భారతదేశ సేవకు, భారత ప్రజలసేవకు, ఇంకా మానవాళి ఉన్నతాశయానికి అంకితమవుతామని మనం ప్రతిజ్ఞ చేద్దాం"

భారత ప్రజలు బాధలద్వారా, త్యాగాలద్వారా స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొన్నా. ఈ పవిత్ర సమయంలో ప్రపంచశాంతికీ, మానవజాతి సంక్షేమాల అభివృద్ధికి భారతదేశమూ, భారతప్రజలూ తమ వంతు బాధ్యతను పూర్తిగా నెరవేర్చేందుకు, ప్రపంచంలో భారతదేశానికి న్యాయంగా ఉండాల్సిన స్థానాన్ని సంపాదించుకొనేందుకు కృషి చేస్తామని, భారతదేశ సేవకు అంకితమవుతామని రాజ్యాంగ పరిషత్ సభ్యులు ప్రమాణం చేశారు.

ఆగస్టు 15 సాయంత్రం, ఢిల్లీ అంతా నేత్రపర్వంగా అలంకరింపబడింది. లక్షలాది ప్రజలు ఎర్రకోటవద్ద చేరారు. వేదికపై స్వాతంత్ర్య ఉద్యమ నాయకులు కూర్చున్నారు. కాస్త దూరంలో భారత గవర్నర్ జనరల్ మౌంట్‌బాటెన్ తన సలహాదారులు, సిబ్బందితో కూర్చున్నాడు.

31 శతఘ్నులు పేలాయి. నెహ్రూ జాతీయపతాక ఎగరవేయడానికి జెండా స్తంభం వద్దకు వచ్చాడు. బ్రిటిషు పాలకుల యూనియన్‌జాక్(జెండా)ను దించి, జాతీయపతాకను ఎగరవేయాల్సిన ఘట్టం అది. ఐతే యూనియన్ జాక్ పత్తాలేదు. అంతకు ముందు రాత్రే దాన్ని బ్రిటిషు అధికారులు తొలగించారు. తమ కళ్ళ ముందే బ్రిటిషు జెండాను కిందికి దింపుతుంటే చూడాల్సిన అవమానకర పరిస్థితిని ఆ విధంగా దాటవేశారు.

నెహ్రూ త్రివర్ణ పతాకను, జాతీయ పతాకను జయ జయ ధ్వానాల మధ్య ఎగుర వేశాడు.

ఆనాడు దేశమంతటా ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. గాంధీని దేశ నాయకులంతా పొగిడారు. కాని గాంధీ హృదయం మాత్రం సంతోషంతో స్పందింపలేదు. స్వాతంత్ర్య దినోత్సవ సందేశాన్ని ఇవ్వవలసిందిగా గాంధీని అడగ్గా సుముఖత చూపెట్ట లేదు. తన హృదయం మోడువారిందన్నాడు. సందేశం ఇవ్వకపోతే బాగుండదని గుర చేయగా ఆయనిలా జవాబిచ్చాడు. "అసలు సందేశ మిచ్చేందుకు ఏమీ లేదు. అది తప్పయితే కానివ్వండి"

స్వాతంత్ర్య అవతరణదినాన గాంధీ కలకత్తాలో వున్నాడు. హిందూ ముస్లిం ఐక్యతకై ఆయన కృషి చేస్తున్న రోజులవి. ప్రార్థన ఉపవాసంతో ఆగస్టు 15 ను గడిపాడు.

హిందూ ముస్లిం మత కలహాలు, దేశ విభజన గాంధీ లాంటి వారికే కాక ఎంతో మందికి క్షోభ కల్గించినా, ఆగస్టు 15ను అంతతేలికగా చూడరాదు. భారత దేశ చరిత్రలో ఆనాడది ఒక మైలురాయి. బ్రిటిషు సామ్రాజ్య వాదుల ఊహాపోహలేవైనా, కుట్రలేవైనా, భారతీయప్రజలు ఈ మార్పును అత్యంతఉత్సాహంతో స్వీకరించారు. పంజాబ్, కలకత్తా వంటి మత కల్లోలాలు కొనసాగేచోట్ల తప్ప దేశమంతటా ఊరేగింపులు, ఉత్సవాలు జరిగాయి. భారత దేశచరిత్రలో నూతన శకం ఆరంభమైంది. తమ భవిష్యత్‌ను తామే స్వతంత్రంగా తీర్చి దిద్దుకోగల మనే ఆశ, ప్రజల్లో చిగురించింది. స్వాతంత్ర్య భానోదయంతో ప్రసరించిన కాంతిరేఖల్లా ప్రజల వదనాలు వికసించాయి. వారి ఆత్మ విశ్వాసం మరింత దృఢ పడింది. ఐతే ఈ ఉత్సాహం వెనుక, ఈ సంరంభం వెనుక, కొంత విచారం. లేక పోలేదు. హిందూ ముస్లిం ఐక్యత ద్వారా కాక, బ్రిటిషుపరిపాలకుల మధ్య వర్తిత్వం ద్వారా లభించిందే మన స్వాతంత్ర్యం అనేదే ఆ విచారం అందుచేతనే గాంధీకి అంత నిస్పృహ, అంత నైరాశ్యం.

ఏది ఏమైనా భారత స్వాతంత్ర్య సాధన, వందలాది సంవత్సరాలుగా భారత ప్రజలు చేసిన అశేష త్యాగాల ఫలితం. అనేక మంది మహనీయ సంస్కర్తల దివ్యప్రవచనాలతో, ఉద్బోధలతో ఉత్తేజితులై ఎందరో ప్రజాసేవకు అంకిత మయ్యారు.పరప్రభుత్వ బానిసత్వం నుంచి తప్పించడానికి బాటలు వేశారు. స్వదేశంలో, విదేశాలలో భారత దేశ విముక్తికై బహిరంగంగా, రహస్యంగా సంఘా లేర్పరచారు. భారత దేశ స్వాతంత్ర్యంసిద్ధికి సహాయపడే ప్రతి అవకాశాన్నీ వినియోగించుకొన్నారు.

వ్యక్తులుగా,సంఘాలుగా తిరగబడ్డారు. "కుట్రలు" చేశారు. సాయుధులై శత్రువులను మట్టు పెట్టారు. విజ్ఞప్తులు విన్నపాలు ఫలించనపుడు ఉద్యమాలకు ఉపక్రమించారు. విప్లవ వాదులు ఉరికంబాలపై ఉగ్రూత లూగి, శౌర్యరసాన్ని ఉప్పొంగ చేశారు.

వందేమాతరం, సహాయ నిరాకరణం, శాసనోల్లంఘనం,పన్నుల నిరాకరణ, ఉప్పు సత్యాగ్రహం,క్విట్ ఇండియా, ఉద్యమాలు శతాబ్దాలుగా నిద్ర పోతున్న జనాన్ని సైతం జాగృతం చేశాయి. వీటికి తోడుగా సంఘటిత కార్మిక కర్షక ఉద్యమాలు విజృంభించాయి. యువకులు,విద్యార్థులుమహిళలు,అపూర్వ చైతన్యాన్ని ప్రదర్శించారు. సైనికులు,నావికులు సైతంకిరాయి సైనికులుగా పనిచేయనిరాకరించారు. యుద్ధకాలంలో విదేశాలలో భారతజాతీయసైన్యం, యుద్ధానంతరం రాయల్ ఇండియన్ నౌకాసైన్యం తిరుగుబాటు-స్వాతంత్ర్యాన్ని త్వరితంగా సాధించడానికి దోహదం చేశాయి. దేశ విభజన, తద్వారా జరిగిన తదుపరి పరిణామాలు స్వాతంత్ర్యం సాధించిన సంతోషాన్ని విషాదంతో మేళవించిన మాట నిజమే. కాని ఆత్మ విశ్వాసంతో భవిష్యత్ పై ఆశతో స్వతంత్ర భారతదేశం 1947 ఆగస్టు 15 న, స్వతంత్రదేశాల సరసన సగర్వంగా తల ఎత్తి నిలబడింది. మానవజాతి ఐక్యతకు, సమానతకు ప్రపంచ శాంతికి మానవాళి సాగించే మహోద్యమంలో భాగస్వామియై పురోగమించు తుందనే ఆశా విశ్వాసాలు భారత ప్రజల హృదయాలలో చిగురించాయి.

# గాంధీ నిర్యాణం

స్వాతంత్ర్యం లభించింది. కాని దేశంలో మత సామరస్యం లభించలేదు. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల దుష్టపథకంతో మతకలహాలు చెలరేగాయి. రక్తం ఏరులై పారింది. అమాయక ప్రజలెందరో హిందువులూ ముస్లిములూ ఈ హత్యాకాండకు బలి అయ్యారు. గాంధీ మనసు వ్రక్కలయింది. వృద్ధాప్యంలో సైతం నిరాహార వ్రతం సాగించాడు. జనవరి 18 న హిందూ, ముస్లిమ్ మత ప్రతినిధులు గాంధీ ఎదుట మత సామరస్యానికి ప్రతిజ్ఞ చేశారు. గాంధీ నిరాహార వ్రతం విరమించాడు. తాత్కాలికంగా శాంతి నెలకొన్నది.

ఇది కొందరికి రుచించలేదు. జనవరి 20 న ఢిల్లీలో బిర్లాభవనం వద్ద గుమిగూడిన జనసమూహం ముందుకు గాంధీ వచ్చినపుడు, ఎవడో ఒక దుండగుడు గాంధీపై బాంబు విసిరాడు. గాంధీ ఆ విపత్తునుండి బయటపడ్డాడు. ఆ బాంబువల్ల ఎవరికి హాని జరగలేదు.

ఈ దుర్ఘటన జరిగి పట్టుమని పదిరోజులైందో లేదో 1948 జనవరి 30 న సాయంత్రం 5 గంటల ప్రాంతంలో ఒక మతోన్మాది తుపాకిగుండ్లకు గాంధీ బలి అయ్యాడు.

ఆ రోజున గాంధీ ప్రార్థనకు సంసిద్ధమౌతున్నాడు. "ఇవాళ మీరు ఆలస్యంగా వచ్చారుకదూ" అంటూ గుంపులోంచి దూసుకువచ్చిన ఒక వ్యక్తి గాంధీని అడిగాడు. "అవును" అని గాంధీ జవాబిచ్చాడు. మరోమాట మాటాడకముందే గాంధీకి పాదాభివందనం చేస్తున్నట్టు నటించిన ఆ వ్యక్తి నాలుగుసార్లు రివాల్వర్ కాల్పులు సాగించాడు. రెండు గుళ్ళు గుండెను చీల్చుకుపోయాయి. ఒకటి పొట్టలోకి చొరబడింది. "హేరామ్" అంటూ, మనుమరాండ్రు ఆభాగాంధీ, మనూగాంధీ చేతుల్లోకి ఒరిగిపోయాడు. తెల్లబట్టలు రక్తసిక్తమయ్యాయి. వైద్యులెంత శ్రమపడినా గాంధీని మృత్యువు వాతనుండి తప్పించలేక పోయారు.

దుఃఖపరవశ ఆతృతతో వేచివున్న వేలాది ప్రజలనుద్దేశించి ఆనాడు జవహర్‌లాల్, గాంధీ నిర్యాణ వార్తను ఇలా తెలియచేశాడు.

"మన జీవితాలమధ్య నుండి కాంతి కనుమరుగైపోయింది. అంతటా చీకటి ఆవరించింది మీకు ఏమని చెప్పాలో, ఎలా చెప్పాలో అర్థం కావడంలేదు. మన ప్రియతమ నాయకుడు, బాపూ, జాతిపిత ఇక లేడు. సలహాకోసం, ఉపశమనంకోసం ఆయన వద్దకు వెళ్ళాలంటే, ఆయన మరిలేడు. నాకొక్కనికేగాదు, దేశంలోని కోట్లాది ప్రజలకు ఇది తీవ్రమైన దెబ్బ.

"కాంతి కనుమరుగైందని నేనన్నాను. కాని, నేను పొరపడ్డాను; ఎంచేతనంటే ఈ దేశంలో వెలిగిన ఈ కాంతి మామూలు కాంతి కాదు. ఇన్నేంగా ఈ దేశాన్ని కాంతిమయం చేసిన ఆ వెలుగు సున్న అనేక సంవత్సరాలపాటు, వెలుగుతూనే ఉంటుంది. వెయ్యేండ్ల అనంతరం కూడా ఈ దేశంలోనూ, తదితర ప్రపంచంలోనూ అది కన్పించుతూనే ఉంటుంది."

ఈ వాక్యాలు కొందరికి ఉత్ప్రేక్షగా కన్పించవచ్చు. మతోన్మాదులకు కర్ణకఠోరంగా ఉండవచ్చు. కాని ఆనాటి అశేష భారత ప్రజల మనోభావాల్ని ఆ వాక్యాలు ప్రతిబింబించుతున్నాయి.

జాతి వైతాళికుల శకం ముగిశాక, భారత ప్రజా స్వాతంత్ర్య ఉద్యమానికి నాయకత్వం వహించిన దేశభక్తుడు గాంధీ. స్వాతంత్ర్య ఉద్యమాన్ని, ప్రజలంతా పాల్గొనే ప్రజా ఉద్యమంగా మార్చి, తీర్చి దిద్దడానికి కృషిచేసిన యోధుడు. స్త్రీ పురుషుల సమానతను చాటి, మహిళలను జాగృతంచేసి, వర్ణ వ్యవస్థను, అస్పృశ్యతను ఈసడించి, వాటి నివారణకై అహోరాత్రాలు పరితపించి కృషిచేసిన మహా సంస్కర్త. మత సామరస్యానికై పాటుబడి, ఆ కారణంగానే మతోన్మాది చేతిలో మరణించి, ఆత్మ బలి దానం చేసిన అమరుడు.

గాంధీలో భావవాదం వుంది.

కొంతవరకు మతదృష్టి వుంది.

ఆయన భావాలు కొన్ని భౌతిక దృష్టికి చాలా భిన్నమైనవి.

బ్రిటిష్ పరిపాలకుల్ని దేశంలోని ప్రజాపీడకుల్ని కూడా అహింసద్వారా ఓడించవచ్చునన్నది ఆయన గాఢ

విశ్వాసం. ఇది చారిత్రక పరీక్షకు నిలుస్తుందో లేదో అనేది చరిత్రకారులకి వివాదాంశమైనా, శాంతినీ, మానవతా దృక్పథాన్ని వ్యక్తీకరించే భావనే ఆ విశ్వాసం. సర్వ కాల సర్వావస్థలకూ ఈ అహింసా సూత్రమే వర్తించుతుందన్న నమ్మకంతో నెహ్రూ లాంటివారు విభేదించారు. అహింసా సూత్రాన్ని ఒక పడికట్టు సూత్రంగా, మంత్రంగా చేయడం మంచిది కాదని నెహ్రూ అన్నాడు. మూఢ నమ్మకంగా దాన్ని దిగజార్చకూడదన్నాడు. గోవా, డయ్యూ, డామన్, హైద్రాబాద్ లాంటి ప్రదేశాలను భారత దేశంలో విలీనం చేసుకోవాలనే సమస్య ఉత్పన్న మైనపుడు. ఈ సూత్రం నుండి విడివడక తప్పలేదు. అహింసా సూత్రం సర్వ రోగ నివారణలాంటి దివ్యౌషధంకాదు. ఆయా జల స్థాయినిబట్టి, ఆయా సమయాలలో పరాయి ప్రభుత్వాన్ని ధిక్కొనడంలో కొంతవరకు ఉపయోగపడిన అస్త్రం.

గాంధీ దేవుడుకాదు. దయ్యమూకాదు. ఐతే చిత్త శుద్ధితో స్వాతంత్ర్య సమరం సాగించిన మహా యోధుడు. అచంచల మానవతావాది. స్వతంత్ర భారత సంస్థాపకులలో ఒకడు.

"జాతిపిత"గా గౌరవించారు. నిష్కళంక దేశ భక్తికీ, ఉదాత్త మానవతావాదానికీ, దేశ స్వాతంత్ర్యం సాధించాలనే దృఢ నిశ్చయానికీ ప్రతీకగా నిల్చిన గాంధీ. దేశ ప్రజల దృష్టిలో "గాంధీజీ" "పూజ్యబాపూజీ" "మహాత్మ" "జాతి పిత"గా పరిగణించబడ్డాడు. శాంతికాముక ప్రగతిశీల ప్రపంచ ప్రజలందరి మన్ననల్ని చూరగొన్నాడు.

ఆయా సర్వ సాధారణ పరిస్థితులలో, ఆయా నిర్దిష్ట పరిస్థితులలో తన సమకాలీన సామాజిక అవసరాలు ఏమిటో గుర్తించి, వాటిని సాధించడానికి ఎవడు మహత్తరసేవ చేసాడో వాడే మహనీయుడు, మహాత్ముడూనూ. అందులోనే ఆయన గొప్పతనం ఉంది. అలాంటి నాయకుడే గాంధీ.

స్వాతంత్ర్యం లభించింది. సాధారణ ప్రజల చిరకాల వాంఛితాలన్నీ ఇంతమాత్రంతోనే ఈడేర లేదు. ఈ వ్యవస్థను మార్చి "సర్వేజనాస్సుఖినో భవంతు" అనే సూక్తిని అమలు పరచవలసిన కర్తవ్యం ఈ తరం వారిది. అందుకు స్వాతంత్ర్య సంగ్రామయోధుల ఆనాటి మహత్తర త్యాగాలు మనకు ఆదర్శం. ఆ స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోడం, కుల మతాది విభేదాలు లేని శాంతిమయ జీవితాన్ని సాధించడం మన ధర్మం, ఆ కర్తవ్య నిర్వహణకు స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలోని మహత్తర వీరోచిత కృత్యాలు మార్గదర్శక మహనీయ ఘటనలు.

# తిరువాంకూర్

తిరువాంకూర్ సంస్థానాన్ని భారతదేశంలో విలీన మొనర్చే సంస్థాన ప్రజా ఉద్యమంలో, పున్నప్రా-వాయలార్ గ్రామాలలో సామాన్య ప్రజలు సైనిక బలాలను ప్రతిఘటించి అసమాన శౌర్యాన్ని ప్రదర్శించారు. అపూర్వత్యాగాలు చేశారు. తమ ప్రాణాలను బలిపెట్టి, సంస్థాన విచ్ఛిత్తికి సోపానమయ్యారు.

పున్నప్రా-వాయలార్ గ్రామాలు తిరువాంకూర్ సంస్థానంలో కోస్తాతీరంలో ఉన్న రెండు చిన్న గ్రామాలు. రెండిటిమధ్య 25 మైళ్ళదూరం ఉంది. ఐనా అవి సంస్థాన ప్రజా ఉద్యమ చరిత్రలో ఒకే గ్రామంలాగా, వీరోచిత కృత్యాలద్వారా ప్రసిద్ధి కెక్కాయి. ఒకే లక్ష్యంకోసం, ఒకే పోరాటంలో ఆ రెండు గ్రామాల వీరుల రక్తం ప్రవహించి ఒకటిగా పారింది.

తిరువాంకూర్ సంస్థానం షెర్లాయ్ పెద్ద భూస్వాముల దోపిడీకి కేంద్రం. కమ్యూనిస్టుపార్టీ, అఖిల తిరువాన్కూరు ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్లు, అక్కడి కొబ్బరిపీచు కార్మికుల, బెస్తవారు వ్యవసాయ కార్మికుల పోరాటాలను నడిపాయి. వీటితోపాటు తిరువాంకూర్ మహారాజా రాచరికం, దివాన్ నిరంకుశపాలనా అంతరించాలనీ, వయోజన వోటింగ్ హక్కు ప్రవేశ పెట్టాలనీ ప్రజాస్వామ్య ప్రభుత్వం నెలకొల్పాలనీ, ఇంకా మరికొన్ని కోర్కెలతో 23 అంశాల కార్యక్రమాన్ని ఒకదానిని రూపొందించాయి.

తిరువాంకూర్ సంస్థాన దివాన్ సర్ సి. పి. రామస్వామి అయ్యర్ ప్రోత్సాహంతో, ఆయుధాల సహాయంతో కొబ్బరిపీచు కార్మికులపైన, వ్యవసాయ కార్మికులపైన యజమానులు, భూస్వాములు దాడి చేయడం ప్రారంభించారు. మొదట వారి వేతనాలను త ంచి రెచ్చగొట్టారు. ఈ దాడులు 1946 ఆగస్టు, సె ంబర్, అక్టోబర్ మాసాల్లో జరిగాయి. హత్యలు, మా భంగాలు జరిగాయి. ఈ భీభత్స కాండను ఎదిరించిన వారిని స్థానిక గూండాలతో కలిసి సైనికులు నానా హింసాకృత్యాలకు గురిచేశారు. ప్రజలను విచ్చలవిడిగా అరెస్టుచేసి హింసించడం మొదలు పెట్టారు.

షెర్తలాయ్, పున్నప్రాలలో అనేక సైనిక శిబిరాలు వెలిశాయి. సైనిక దళాల కవాతు ప్రదర్శనలేగాక, కష్టజీవులకు సాయుధ సైనికులకు మధ్య అనేక ఘర్షణలు జరిగాయి. షెర్తలాయ్, అంబలపుళ తాలూకాల్లో, తిరువాన్కూర్ రాచరిక ఉద్యోగులూ, వారికి మద్దతుగా నిలచిన భూస్వాములూ, గూండాల, సైనికుల రక్షణ సాయంతో ప్రదర్శనలు చేయడం ప్రారంభించారు. ఆ తర్వాత ప్రదర్శనల్ని, బహిరంగ సభలను నిషేధించే ఆర్డినెన్సు ప్రకటించింది సంస్థాన ప్రభుత్వం. నాయకులను అరెస్టు చేసింది.

సైనికుల, గూండాల హింసాకృత్యాలను కష్టజీవులు ప్రతిఘటించారు. కార్మికవర్గం బలంగాఉన్న అలెప్పీలాంటి పట్టణాలలో, యజమానులకు గూండాలు దొరకలేదు. మతకలహాలను రెచ్చగొట్టే చర్య కూడా ఫలించలేదు.

అవతలి పక్షంవాళ్ళు ఎంత రెచ్చగొట్టుతున్నా, ప్రజానాయకులు ఎంతో నిగ్రహం పాటించారు. ఐతే గ్రామీణ ప్రాంతాల్లో ప్రజలు తమ ఇండ్లలో నివసించే పరిస్థితి చేయిదాటిపోయింది. ఆత్మరక్షణకై వలంటీర్ల శిబిరాలు నిర్వహించబ యి సంస్థాన కాంగ్రెస్ నాయకత్వానికి, షె య్, అంబలపుళాలలో జరుగుతున్న దారుణ ద నకాండ గురించి చెప్పారు. శిబిరాలలో శిక్షణపొందే వలంటీర్ల వద్ద ఆయుధాలు లేవు. కర్రబల్లేలు మాత్రం ఉండేవి. అక్టోబర్ మాసం మధ్యలో కార్మిక నాయకులకూ ప్రభుత్వానికీ మధ్య జరిగిన సంప్రతింపులు విఫలమయ్యాయి.

దివాన్ సూచించిన అమెరికన్ తరహా రాజ్యాంగ చట్టానికి వారు ఆమోదించలేదు.

అక్టోబర్ 19 న మొదట కమ్యూనిస్టు పార్టీని, షెర్తలాయ్ పీచు ఫ్యా రీ కార్మిక సంఘాన్ని, మత్స్యకారుల సంఘాని నిషేధించింది సంస్థాన ప్రభుత్వం, తర్వాత మరి న్ని సంఘాలు నిషేధింప బడ్డాయి. వీరి కార్యాలయాలను సైన్యాలు ఆక్రమించు కొన్నాయి. నాయకుల్ని,కార్యక ర్తల్ని అరెస్టు చేశారు. పోలీసు లాకప్‌లో దారుణ హింసాకాండ జరుగుతున్న వార్తలు బయటకు పొక్కాయి.

సంస్థాన కాంగ్రెస్ నాయకులలోని సమరశీలురైన కేశవన్, శంకరపిళ్లేలను అరెస్టు చేశారు. పట్టం తానుపిళ్లే నాయకత్వాన జరుగుతున్న రాజీబేరాలు కూడా ఒక నెల వాయిదా పడ్డాయి. దీనితో సర్ సి. పి. రామస్వామి అయ్యర్ సంస్థాన ప్రజాఉద్యమాన్ని, కార్మికోద్యమాన్ని కాలరాయడానికి తుది పోరాటానికి సిద్ధమయ్యాడు. దీనితో ఆత్మరక్షణకు, కమ్యూనిస్టు పార్టీ, కార్మిక ప్రజలూ తదితర సంస్థాన వ్యతిరేక ప్రజానీకమూ పూనుకొన్నారు.

కె. సి. జార్జి నాయకత్వాన కె. వి. పాత్రోజ్, కె. కె. కుంజిన్, పి. జి. సదాశివన్, పి. జి. పద్మనాభన్‌లతో ఒక రాజకీయ కేంద్రం షెర్తలాయ్-పున్నప్రాగ్రామాల మధ్య ఏర్పడింది. అలెప్పీతోనూ, శిబిరాలతోనూ ఆ కేంద్రానికి రాజకీయ సంబంధాలు కలుగచేయబడ్డాయి. కీలకమైన వాయలార్ ప్రాంతపు శిబిరానికి కుమార్ ఫణిక్కర్ బాధ్యత వహించాడు.

మిలిటరీ గూండాల భీభత్సకాండకి నిరసనగా 1946 అక్టోబరు 21 నుంచి సార్వత్రిక సమ్మె జరపాలని రాజకీయ కేంద్రం నిర్ణయించింది. దీని ప్రకారం రహస్యజీవితం గడపకుండా బయటవున్న టి. వి. థామస్ సమ్మెకు పిలుపు నిచ్చాడు. కార్మికవర్గం ఆ పిలుపునందుకుని, గొప్ప చొరవ ప్రదర్శించారు. సార్వత్రిక సమ్మె జయప్రదంగా జరిగింది. ప్రతి చోటా ఆత్మరక్షణ దళాలు ఏర్పడ్డాయి.

శూలాలులాంటి సూదిమొన కర్రలకి జెండాలు తగిలించుకుని, "అమెరికన్ మోడల్ నశించాలి" "దివాన్‌పాలన అంతంకావాలి" "బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడాలి" అనే నినాదాలతో బ్రహ్మాండమైన ప్రదర్శనలు చేశారు. అమెరికన్ మోడల్

పరిపాలనను గతంలో సర్ సి. పి. రామస్వామి అయ్యర్ సూచించాడు. ఈ ప్రదర్శనల సమయంలో ఎవళ్ళూ సైనిక, పోలీసు దమనకాండను లక్ష్య పెట్టలేదు.

ఆ మధ్యాహ్నం మార్షల్‌లా ప్రకటింపబడింది. సర్ సి. పి. స్వయంగా సంస్థాన సాయుధ బలగాలకు అధిపత్యం వహించాడు. ఆ ఉద్యమం చట్టవిరుద్ధ మైనదనీ, సమ్మె విరమించి లొంగిపొమ్మనీ హెచ్చ రించే కరపత్రాలు విమానాలదా రా విరజిమ్మారు. ఆ హెచ్చరికకు జవాబుగా కొ రోజుల్లోనే ప్రజలు పెద్ద ఎత్తున ప్రదర్శనలు జరిపా . మహారాజా పుట్టిన రోజు అక్టోబరు 23 న సర్ సి. పి. తన రాజ్యాంగ ప్రతిపాదనల్ని ప్రకటించాలనుకున్నాడు. కాని కార్మిక వర్గ ప్రతిఘటనతో అది ఆగిపోయింది.

ఆ రోజున పున్నప్రా గ్రామంపైకి అన్నివైపుల నుండి సాయుధబలగాలు వచ్చిపడ్డాయి. ఒక స్థానిక భూస్వామి గృహం పోలీసు శిబిరంగా మారింది. ఆ శిబిరాన్ని ఎత్తివేయాలని ప్రదర్శకులు కోరారు. కాని పోలీసులు ప్రజాప్రదర్శనపై కాల్పులు ఆరం భించారు. ప్రజలంతా నేలపై పడుకుని ధైర్యంగా పోలీసుల్ని ప్రతిఘటించారు. పోరాటం కొన్ని గంటల పాటు జరిగింది. దాంతో ప్రజలూ, పోలీసులూ చాలా మంది చనిపోయారు. అక్కడి పోలీసు శిబిరాన్ని ధ్వంసంచేసి, డజను రైఫిళ్ళు, స్టెన్‌గనులూ చేజిక్కించుకొని ప్రజలు తమ ఇళ్ళకు వెళ్ళి పోయారు.

ఈ సంఘర్షణవల్ల కలిగిన అనుభవంలో ప్రజల్ని శిబిరాలలో కేంద్రీకరించటం మంచిదికాదనీ, వాటిని మూసివేయాలనీ రాజకీయ కేంద్రం నిర్ణయించింది. ఇక సాయుధులు గ్రామాల్లో ప్రవేశించి దమనకాండ జరిపినా, స్త్రీలను అవమానపరచినా ప్రజలు మూకమ్మడిగా ప్రతిఘటించాలని స్పష్టంచేస్తూ, శిబిరాలన్నింటికీ సూచనలుపంపే ఏర్పాట్లుచేయ బడ్డాయి. ఈలోగా అక్టోబరు 26 న సైన్యం విమా నాలమీద వాయలర్‌లో దిగాలనుకుంది. కాని ఆ ప్రయత్నం ఫలించలేదు. మర్నాడు 27 వ తేదీ మధ్యాహ్నం నావలపై అక్కడి ఉప్పుటేరుదాటి 27,400మంది సైనికులు వాయలర్‌మీదికి వచ్చిపడ్డారు. వాళ్ళు అన్నివేపులనుంచీ రైఫిళ్ళు, మరతుపాకులతో దాడి ప్రారంభించారు. ప్రజలు వీరోచితంగా ప్రతిఘ టించారు. తుపాకి కాల్పులకు నేలకొరిగినవారు, తమ సహచరులను పోరాటం కొనసాగించాల్సిందిగా ఉత్తేజపర్చారు. మధ్యాహ్నం 12 గంటలకు ప్రారంభ మైన పోరాటం సాయంత్రం 5 న్నర గంటలదాకా కొనసాగింది. స్త్రీలు, పిల్లలు తలదాచుకుంటున్న ఇళ్ళ నన్నింటినీ తగలబెట్టి, వారిలో చాలామందిని హతమార్చారు. సైనికులు దెబ్బలు తగిలిన వారిని కూడా వదలకుండా పాశవికంగా చంపివేశారు. మొత్తం ఆ ప్రాంతమంతా గాలించి, మనిషన్నవాడు మిగలకుండా చేశారు. ఇది వాయలర్ వీరోచిత పోరాటం.

ఆ తర్వాత షెరలాయ్, అంబలపుళ తాలూకాల్లో నెలలకొద్దీ కనీవినీ ఎరుగని దమనకాండ జరిగింది. వేలకొద్దీ ప్రజలు అరెస్టు చేయబడ్డారు, హింసించ బ రు, అంగవికలురుగా చేయబడ్డారు. ఆ తర్వాత - రోజులకి కమ్యూనిస్టు పార్టీ, కార్మికవర్గమూ ఆ మనకాండ మధ్యనుంచి క్రమంగా వెనక్కి తగ్గాయి. శిబిరాలు మూసివేయ బడ్డాయి, చనిపోగా మిగిలిన వారిని అతికష్టంమీద ఇతర రాష్ట్రాలకు తరలించారు.

సర్ సి. పి. విజయోన్మాదంతో కమ్యూనిస్టుల్ని, ట్రేడ్‌యూనియన్లనీ అణచివేశామనీ, తాము తిన్న దెబ్బకు రెండు దశా లదాకా మరల కోలుకోలేవనీ గొప్పలు చెప్పుకొనా డు.

అయితే, అభివృ నిరోధకుని విజయోత్సాహం మూనాళ్ళ ముచ్చటయింది.

పున్నప్రా – వాయలర్ పోరాటం జరిగి ఆరునెలలు కాకముందే కమ్యూనిస్టు పార్టీ, ట్రేడ్‌యూనియనులూ తిరిగి సంఘటితం కాగలిగాయి. తమ కార్యకలాపా లను ప్రారంభించగలిగాయి. 1947 తొలి రోజుల్లో ముమ్మరంగా పని చేసింది కమ్యూనిస్టు పార్టీ. సర్ సి. పి. "స్వతంత్ర తిరువాన్కూర్" పథకానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో కమ్యూనిస్టు పార్టీ ప్రముఖపాత్ర వహించింది. పున్నప్రా వాయలార్ పోరాటం, తిరువాన్కూర్ నిరంకుశ రాజరిక పతనాన్ని త్వరితంచేసింది. ఆ తర్వాత కొద్ది నెలలకి సర్ సి. పి. దివాన్ పదవి పూడింది. తిరువాన్కూర్‌లో ప్రజాప్రభుత్వం ఏర్పడింది.

# సంస్థానాల విలీనం

1947 ఆగస్టు 15 నాటికి భారతదేశంలో 565 సంస్థానాలు వున్నాయి. మన దేశానికి స్వాతంత్ర్యం ప్రకటించినప్పుడు బ్రిటన్ విధించిన షరతుల ప్రకారం ఈ సంస్థానాలు భారతదేశంలో విలీనమైనా కావచ్చు లేదా స్వతంత్రంగా ఉండాలంటే వుండనూ వచ్చు. భారతదేశ భూభాగంలో ఈ సంస్థానాల విస్తీర్ణం 48 శాతం వుంటుంది. దేశం మొత్తం జనాభాలో కాస్త తక్కువగా 25 శాతం వుంటుంది. బ్రిటన్ ఈ సంస్థానాలను పాచికలుగా వుపయోగించుకొని స్వాతంత్ర్యం ఇవ్వడానికి అడ్డు తగులుతూ ఉండేది. భారతదేశంపై రాచ పుండుల్లాగ వుండే ఈ సంస్థానాలు దేశానికి ప్రమాదం.

స్వాతంత్ర్యం పొందిన తర్వాత జాతీయ ప్రభుత్వం ఎదుర్కొన్న సమస్యలలో ముఖ్యమైనది సంస్థానాల భవిష్యత్తు సమస్య. చిన్నవీ పెద్దవీ సంస్థానాలెన్నో వున్నాయి. మహారాజులు, నిజాంలాంటి ప్రభువులు, నవాబులు, ఎందరెందరో ఉన్నారు. ఈ సంస్థానాలు భారతదేశంలో ఎప్పుడో ఒకప్పుడు విలీనం గాక తప్పదని గ్రహించిన బ్రిటిష్ ప్రభుత్వం, కొన్ని ముఖ్య సంస్థానాలనైనా విడిగా ఉండేటట్లు చూడాలని ప్రయత్నించింది. రాజకీయ సలహాదారుగా సర్ కోనార్డ్ కోర్‌ఫీల్డ్‌ను పంపింది. సంస్థానాధీశుల వ్యవహారాలను చూస్తున్న బ్రిటిష్ రాజకీయ శాఖ ఇతని ఆదేశాలను అనుసరించి పని చేయడం ప్రారంభించింది. సంస్థానాలగుండా వెళ్ళే రైల్వేల, జాతీయ రహదారులకు సంబంధించి అమలులో ఉన్న ఒడంబడికలను రద్దు చేయాలని రాజకీయ శాఖ ఆదేశించింది. రవాణా, రాకపోకల ఇబ్బంది కల్పించడం, వాటిని విచ్ఛిత్తి చేయడమే దీని లక్ష్యం. దీనికి నెహ్రూ తీవ్ర అసమ్మతి తెలియచేశారు. మరొక తీవ్ర సమస్య కీలకమైన సంస్థానాల పట్ల బ్రిటిష్ ప్రభుత్వ వైఖరి. కాశ్మీర్, హైద్రాబాద్, మైసూరు, తిరువాన్కూర్ సంస్థానాలలో బ్రిటిష్ సైన్యాలు, విమాన దళాలూ ఉన్నాయి. ఈ సంస్థానాలను ఇలాగే వుంచి, వలసవాద తత్వాన్ని కొత్త మూసలో పోసి, భారత దేశంలో తన పలుకుబడిని నిలబెట్టుకోవాలని బ్రిటిష్ ప్రభుత్వం అంచనా.

అందుచేతనే కొన్ని సంస్థానాలు భారతదేశంలో విలీనాన్ని వ్యతిరేకించాయి. 1948 సంవత్సర మధ్య భాగానికి ఇంకా 26 సంస్థానాలు విలీనానికి వ్యతిరేకించుతూనే వున్నాయి. వాటిలో కూచిబీహార్, త్రిపుర, మయూర్‌భంజ్, మణిపూర్, భోపాల్, హైద్రాబాద్ మొదలైనవి వున్నాయి. కొంతకాలం హైద్రాబాద్ స్వతంత్రంగా వుండాలని ప్లాను వేసింది. పోర్చుగల్, బ్రిటన్‌లతో ఒడంబడికలు చేసుకోవాలని చూసింది.

జమ్మూ – కాశ్మీర్‌లో పరిస్థితులు అల్లకల్లోలంగా వున్నాయి. అప్పటికే సంస్థాన ప్రజోద్యమ ఒత్తిడి ఫలితంగాను, పాకిస్తాన్ తెస్తున్న ఒత్తిడిని ప్రతిఘటించేందుకూ, కాశ్మీర్ మహారాజా 1947 అక్టోబరు 26న భారతదేశంలో తన సంస్థానాన్ని విలీనం చేశాడు.

1947 వేసవిలో మౌంట్‌బాటెన్ కాశ్మీర్ వచ్చాడు. కాశ్మీర్ భారతదేశంలో చేరాలా, పాకిస్తాన్‌లో చేరాలా అనే విషయంపై ప్లెబిసైట్ (ప్రజాభిమతాన్ని వోటు ద్వారా తెలుసుకోవడం) తీసుకోవల్సిందని, రాజాకు సలహాఇచ్చాడు. ప్లెబిసైట్ జరిగితే అధిక సంఖ్యాకులైన ముస్లింలు పాకిస్తాన్‌లో చేరడానికి వోటు చేస్తారని అతని అంచనా. ఐతే మౌంట్‌బాటెన్ అభీష్టం నెరవేరలేదు. 1947 సెప్టెంబరులో గాంధీ, కాశ్మీర్ వచ్చాడు. కాశ్మీర్ నేషనల్ కాన్ఫరెన్సు నాయకుడు షేక్ అబ్దుల్లాను జైలునుంచి విడిపింప చేశాడు. కాశ్మీర్ మహారాజాకు, షేక్ అబ్దుల్లాకు మధ్య ఒడంబడిక కుదిరింది.

ఐతే ఇంతటితో కాశ్మీర్ పరిస్థితులు చక్కబడలేదు. 1947 అక్టోబరు 22న కాశ్మీర్‌పై పాకిస్తాన్‌కు చెందిన పఠాన్ తెగవారు దండయాత్ర చేశారు. అక్టోబరు 26 నాటికి రాజధాని శ్రీనగర్ సమీపించారు. 1947 అక్టోబర్ 26న కాశ్మీర్ మహారాజా కాశ్మీర్‌ను భారతదేశంలో విలీనం చేస్తున్నట్లు ప్రకటించాడు. మహారాజా పాలన కుప్పకూలింది. మహారాజా

శ్రీనగర్ నుంచి పారిపోయాడు. శ్రీనగర్ సంరక్షణ బాధ్యత నేషనల్ కాన్ఫరెన్సు, కమ్యూనిస్టు నాయకులపై పడింది. అక్టోబర్ 27 న మౌంట్‌బాటెన్ వ్యతిరేకించుతున్నా, భారత ప్రభుత్వం విమానాల ద్వారా సైనికులను పంపింది. మర్నాడు భారత సైనిక దళాలు పఠాన్ సైన్యాలను ఢీకొన్నాయి.

పాకిస్తాన్ ఆక్రమిత ప్రాంతంలో "అజాద్ కాశ్మీర్ ప్రభుత్వం" అంటూ పాకిస్తాన్ ఏర్పరచింది. 1947 డిసెంబర్ 31 న, ఐక్యరాజ్య సమితి సమావేశం ముందు కాశ్మీర్ సమస్యను భారతదేశం వుంచింది. 1948 లో సాయుధ ఘర్షణ అంతమొంది, 1949 జనవరి 1 న యుద్ధ విరమణ ఒడంబడిక జరిగింది. ఐనా కాశ్మీర్ సమస్యను అప్పటికీ ఇప్పటికీ పాకిస్తాన్ లేవ నెత్తుతూనే వుంది.

జునాఘడ్ సంస్థానాధీశుడు ముస్లిమ్ మతస్థుడు. ఈ సంస్థానంలో సగానికి పైగా హిందువులే వున్నారు. ఐనా కూడా ఈ సంస్థానాధీశుడు జునాఘడ్‌ను పాకిస్తాన్‌లో కలపడానికి సిద్ధమయ్యాడు. భారతదేశం 1948 ఫిబ్రవరిలో సైన్యాన్ని జునాఘడ్ సంస్థానానికి పంపింది. ప్లెబిసైట్ నిర్వహించింది. అక్కడ అత్యధిక సంఖ్యాకులు భారతదేశంలో విలీనం కావాలని తీర్మానించారు. జునాఘడ్ సంస్థానాధీశుడు పాకిస్తాన్‌కు పారిపోయాడు.

ఇలాగే ఎన్నో సంస్థానాలు సంస్థాన ప్రజల వీరోచిత పోరాటాల, త్యాగాల ఫలితంగా క్రమక్రమంగా భారతదేశంలో విలీనమయ్యాయి. సంస్థానాలలో ఎన్నో ప్రజా ఉద్యమాలు విజృంభించాయి. ఈ సందర్భంగా వీర తెలంగాణా చరిత్రాత్మక పోరాటం గురించి తెలుసుకుందాం.

# వీర తెలంగాణా

అమానుషమైన, అనాగరికమైన నిజాం రాజు ఫ్యూడల్ సాంఘిక వ్యవస్థకు వ్యతిరేకంగా తెలంగాణా ప్రజలు సాయుధులై సాగించిన పోరాటమే తెలంగాణా చరిత్రాత్మక పోరాటం.

మొగలాయి చక్రవర్తుల పరిపాలన అంతమయ్యాక నైజామ్, హైద్రాబాద్ సంస్థానాన్ని ఏర్పాటు చేశాడు. బ్రిటిష్ వాళ్ళకు మహారాష్ట్రలోని బేరార్, ఆంధ్ర కోస్తాప్రాంతం, రాయలసీమ జిల్లాల్ని ధారపోసిన తర్వాత 83 వేల చదరపు మైళ్ళ విస్తీర్ణం గల సామంత రాజ్యంగా హైదరాబాద్ సంస్థానం ఏర్పడింది. భారతదేశంలోని సంస్థానాలన్నిటిలోకి ఇది పెద్దది. దీనిలో తెలుగు, మహారాష్ట్ర, కర్ణాటక భాషాప్రాంతాలు వున్నాయి. తెలుగువాళ్ళు జనాభాలో గాని, వైశాల్యంలోగాని సగభాగంగా వున్నారు. హైద్రాబాద్ సంస్థానంలో ఆయా భాషలవారి భాషా సంస్కృతులు అణచివేయ బడ్డాయి. ఉర్దూ భాషను బోధనా భాషగాను, పరిపాలనా భాషగాను ప్రజలపై నిజాం ప్రభుత్వం రుద్దింది. ప్రాథమిక పాఠశాలలు కాని, గ్రంథాలయాలుకాని ఏర్పరచుకోడమే ఉర్దూయేతర భాషలవారికి చాలా కష్టమయ్యేది.

బ్రిటిష్ పాలకులకు తొత్తుగా వ్యవహరించి, వారి "విశ్వాసపాత్ర మిత్రుడు"గా బిరుదు పొందాడు నిజాం ప్రభువు.

అసలీ నిజాంరాజు పుట్టు పుర్వోత్తరాలేమిటి? 18 వ శతాబ్దం ప్రారంభంలో, దక్కను ప్రాంతంలో మొగలాయి చక్రవర్తులపై అనేక తిరుగుబాట్లు జరిగాయి. ఔరంగజేబు చక్రవర్తి వీటిని అణచడానికి 1713 లో తన సేనాని అసఫ్‌ఝాను పంపాడు. కొంతకాలానికి ఈ సేనానే స్వతంత్రుడై అసఫ్‌ఝా రాజవంశానికి మూలపురుషుడయ్యాడు. నిజామ్-ఉల్-ముల్క్ అనే బిరుదుకూడా ఇతనికి ఇవ్వబడింది.

అసఫ్‌ఝా తన వెంట అనేకమంది ముస్లిములను, హిందువులను హైదరాబాదు తీసుకువచ్చాడు. కొందరిని జాగీర్దార్లుగా నియమించాడు. జాగీర్దార్లు భూమిశిస్తు వసూళ్ళు చేసేవారు. కొన్ని సందర్భాలలో అబ్కారీ, అడవులు, చేపలు పట్టుకొనే హక్కులు సైతం వీరికి వుండేవి. జాగీర్దార్ల భూమి దాదాపు నూటికి 31 పాళ్ళు వుండేది. జాగీర్ గ్రామాలసంఖ్య 6535.

నిజాం ప్రభుత్వం ఏర్పడక పూర్వం నుంచీ, ఇవికాక 14 సంస్థానాలు వుండేవి. వీటిలో ఐదు ముఖ్యమైనవి. తక్కిన సంస్థానాలను నిజాం జాగీర్లు గానే చూసేవాడు. ఈ ఐదు సంస్థానాలను "దివానీ ప్రభుత్వం" నుంచి మినహాయించాడు నిజాం. అంటే నిజాంకు వీటిపై ప్రత్యక్షపాలన వుండదు. వాటి సంస్థానాల్లో వాళ్ళ సొంత పరిపాలనే వుండేది ఈ ఐదు సంస్థానాలకు. ఈసంస్థానాలు గద్వాల, వనపర్తి, జటిప్రోలు, అమర్చింత, పాల్వంచ. ఇవికాక మరి కొన్ని ఈనాం గ్రామాలు వుండేవి.

నిజాం రాజుకు ప్రత్యేక జాగీర్ కూడా వుంది. దాన్ని సర్ఫే-ఖాస్ అని పిలిచేవారు. ఈ జాగీర్‌లోని గ్రామాల్లోని ఆదాయం నిజాం ప్రయివేట్ ఆదాయంగా మారిపోయింది.

జాగీర్ గ్రామాల్లో రైతులు భూమి యజమానులుగా కాక, కౌలుదార్లుగా పరిగణింపబడుతూ వచ్చారు.

నిజాం పరిపాలనలో వెట్టిచాకిరి అన్ని కులాల వారికీ తప్పలేదు. హరిజనులు, కుమ్మరులు, రజకులు, మంగళ్ళు, వడ్రంగులు యితర చేతిపనివారు-వైశ్య బ్రాహ్మణులతోసహా-వెట్టిచాకిరి చేయాల్సిందే. అధికారులకు, భూస్వాములకు చేసే వెట్టిచాకిరీలో, ఇతర గ్రామాలకు ఉత్తరాలను చేరవేయడం, సామాను మోయడం, లాంతర్లు తుడిచి వెలిగించటం, భూముల పక్కలు దులిపి శుభ్రం చేయటం, వాళ్ళ కాళ్ళు ఒత్తటం మొదలైనవి వుండేవి. భూస్వాము ప్రయాణం చేసేటప్పుడు వారి బండ్లతోపాటు వాటి ముందుగా నౌకర్లు పరుగెత్తాలి. ప్రయాణం చేయడానికి ఉపయోగించే పల్లకీలను మోయాలి. జాగీర్ గ్రామాల రైతుల నుంచి చేసే రకరకాల దోపిడి గురించి వేరే చెప్పనక్కరలేదు. జాగీర్దార్ల ఇండ్లలో ప్రజలు చేసే వెట్టిచాకిరికి అంతంలేదు. ఏ మాత్రం అసమ్మతి చూపినా, కొరడాలతో బాదేవారు. బండలను నెత్తిమీదపెట్టి, నిలబెట్టేవారు, గాయపరచి పుండ్లపై కారం చల్లేవారు. తలక్రిందులుగా వేలాడదీసేవారు. గ్రామాల్లోని అనేకమంది యువతుల శీలాన్ని జాగీర్దార్లు, వాళ్ళ గూండాలు దోచుకొనేవారు. ఈ విధంగా చెప్పాలంటే ఎన్నయినా చెప్పవచ్చు.

ఈ దుర్భర పరిస్థితులలో తెలంగాణా ప్రజలపై కాంగ్రెసు స్వాతంత్ర్య ఉద్యమ ప్రభావం పడింది. 1930 ప్రాంతాలలో గ్రంథాలయ ఉద్యమం ప్రారంభమైంది. ప్రభుత్వ నిరంకుశ చర్యలకు అడపా దడపా అసమ్మతిని తెలుపుతూ వుండేవారు.

1938 లో పౌరహక్కుల కోసం, బాధ్యతాయుత ప్రభుత్వం సాగించిన పోరాటం రాష్ట్ర స్థాయిని జరిగిన మొదటి రాజకీయ ఉద్యమం. 1938 లో వందేమాతరం గేయాన్ని పాడే హక్కు తమకున్నదని ఉస్మానియా యూనివర్శిటీ విద్యార్థులు సమ్మె చేశారు. స్టేట్ కాంగ్రెసు నిషేధింపబడింది. ఆ తర్వాత ఆంధ్ర మహాసభ, మహారాష్ట్ర పరిషత్, కన్నడ పరిషత్‌లు సాగించిన ఉద్యమంతో నూతనదశ ఏర్పడింది.

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో 1939-40 లో కమ్యూనిస్టుపార్టీ పలుకుబడి, ఉద్యమం హైద్రాబాద్ సంస్థానంలో ప్రవేశించింది. ఆంధ్ర మహాసభలో కూడ కమ్యూనిస్టుల ప్రభావంతో మరింత సమరశీల స్వభావం సంతరించుకుంది.

ఆంధ్ర మహాసభ 1949 లో భువనగిరిలో మహాసభ జరిపినపుడు మితవాదులు దీనిలోంచి తప్పుకొన్నారు. దీనితో ఆంధ్ర మహాసభ తెలంగాణా ప్రజల పోరాట ఉద్యమానికి నాయకత్వం వహించిన సంస్థగా మారింది.

1944–46 కాలంలో భూస్వాములు, దేశ్‌ముఖ్‌లు వారి రౌడీలు, పోలీసులు సాగించిన దాడులను త్రిప్పికొట్టడంతో తెలంగాణా సంస్థాన ప్రజోద్యమం విస్తరించింది.

భువనగిరి మహాసభ తర్వాత ఆంధ్ర మహాసభ "సంగం" పేరుతో గ్రామగ్రామాన వృద్ధి చెంది, వెట్టిచాకిరి, నజరానాలకు, నిర్బంధ వసూళ్ళకు, అక్రమ బేదఖళ్ళకు వ్యతిరేకంగా ఉద్యమం ప్రారంభమైంది. ముంద్రాయి, పాలకుర్తి, కడవెండి, బాలేముల, పాత సూర్యాపేట, ఆకునూరు, మాచిరెడ్డిపల్లి, దేవరుప్పుల, కామారెడ్డి మొదలైనచోట్ల భూస్వాములను, నిజాం ప్రభుత్వ సాయుధ దళాలను ప్రతిఘటించారు ప్రజలు. ఆ ప్రతిఘటనలలో అనేకమంది మరణించారు. 1946 లో నిజాం ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీని నిషేధించింది. 1947 లో గ్రామాలలో

నిజాం ప్రభుత్వం సైనిక శిబిరాల్ని నెలకొల్పింది. కాశిం రజ్వీ నాయకత్వాన రజాకార్ దళాలేర్పడి గ్రామాల్లో నానాబీభత్సం చేస్తున్నాయి.

1947 ఆగస్టు 15 న భారత స్వాతంత్ర్య ప్రకటన జరిగింది. అనేక సంస్థానాలు భారతదేశంలో విలీన మైనా నైజాం విలీనం కాలేదు. భారతదేశంలో నైజాం విలీనం కావాలనే ఉద్యమం ప్రారంభమైంది. ఐనా నిజాం రాజు ఇందుకంగీకరించలేదు. భారత ప్రభుత్వం నిజాంతో రాయబారాలు సాగించి 1947 నవంబరులో యథాతథ ఒడంబడిక చేసుకొంది. ఇది సంవత్సర కాలం అమలులో ఉంటుంది: దీనిప్రకారం హైద్రాబాద్ అంతరంగిక వ్యవహారాల్లో భారత ప్రభుత్వం జోక్యం చేసుకోదు. ఇది సంస్థాన ప్రజలకు వెన్నుపోటుగా తయారైంది. ఒక సంవత్సరం పాటు ఊపిరి పీల్చుకోడానికి నిజాం రాజుకు అవకాశం కల్గింది. ప్రజా ఉద్యమాలను మరింత క్రూరంగా అణచడానికి అతడు పూనుకొన్నాడు. ఇతర రాష్ట్రాల నుంచి ముస్లిములను ఆకర్షించి, హిందువులను వెళ్ళగొట్టి నైజాంను దక్షిణ పాకిస్తాన్‌గా చేయాలనే పన్నాగాన్ని, కమ్యూనిస్టులు ప్రజాతంత్ర శక్తివాదులు, ముస్లిములలోని అభ్యుదయవాదులు చాల వరకు వమ్ముచేశారు.

నిజాం పైశాచిక పాలనను త్వరగా అంతం చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. నిజాం సాయుధ దళాలు, రజాకార్ గూండాలు సాగించే దుష్కృత్యాలను శాశ్వతంగా అంతం చేయాల్సిన ఘడియలు ఆసన్నమయ్యాయి. కమ్యూనిస్టుపార్టీ, ఆంధ్ర మహాసభ, అఖిల హైద్రాబాద్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుల తరపున రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, ముకుం మొహిద్దీన్ గారలు నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధ ప్రతిఘటన సాగించాలని విజ్ఞప్తి చేశారు. అఖిల విద్యార్థి యూనియన్ కూడా దీన్ని బలపర్చింది.

వీరి విజ్ఞప్తిలో 16 అంశాల కార్యక్రమాన్ని ప్రకటించారు. ఆ అంశాలు ఇవి:

1. నిజాం ప్రభుత్వాన్ని కూలద్రోయటానికి సాయుధ ప్రతిఘటన సాగించాలి.

2. సాయుధ ప్రతిఘటనలను నిర్వహించేందుకు సాయుధ పోరాట శిక్షణా తరగతులు నిర్వహించాలి.

3. భూస్వాముల స్వాధీనంలో వున్న ఆయుధాల్ని, శత్రు శిబిరాలలోని ఆయుధాలను దాడులు జరిపి స్వాధీనం చేసుకోవాలి.

4. నైజాం ప్రభుత్వ కార్యకలాపాలను స్తంభింప చేయాలి. ప్రభుత్వ రికార్డులను స్వాధీన పర్చుకొని తగులపెట్టి వేయాలి.

5. నైజాం ప్రభుత్వానికి భూమిశిస్తు లెవీధాన్యం యివ్వడానికి నిరాకరించాలి.

6. తాటిచెట్ల నుంచి కల్లు గీయకుండా, కల్లు అమ్మకానికి వీలులేకుండా చూడాలి.

7. నైజాం ప్రభుత్వంతో కుమ్మక్కయిన భూస్వామ్య శక్తులను శత్రువులుగా పరిగణించాలి, వారి స్థిరచరాస్తుల్ని స్వాధీనపరచుకోవాలి.

8. నైజాం వ్యతిరేక పోరాటంలో ప్రజలతో కలిసివచ్చే భూస్వాములకు రెండు వందల ఎకరాల ఖుష్కీ, లేక 50 ఎకరాల తరీ స్వంత సేద్యానికిగాను వారికి వదలివేయాలి. మిగిలిన భూమిని నిరుపేదలకు వ్యవసాయ కార్మికులకు పంచాలి.

9. ప్రభుత్వ బంజరు భూముల్ని వ్యవసాయ యోగ్యమైన అటవీ భూముల్ని పంపకం చేయాలి.

10. భూస్వాములు, వడ్డీ వ్యాపారులు ఆక్రమించుకొన్న అనాక్రాంతమైన భూముల్ని తిరిగి ఆయా యజమానుల స్వాధీనం చేయాలి.

11. ప్రభుత్వ ఆఫీసుల్ని, కోర్టుల్ని, పాఠశాలల్నీ కాలేజీలనూ బహిష్కరించాలి.

12. భూస్వాములు, వడ్డీ వ్యాపారులు నాగుల పై యిచ్చిన ధాన్యాన్ని, నగదును చెల్లించ నిరాకరించాలి.

13. జాం సరిహద్దులలో వుండే కస్టమ్స్ ఔట్ పో లను ధ్వంసం చేయాలి.

14. వ్యవసాయ కార్మికుల జీతాలు పెంచాలి.

15. జాగీర్దారను స్వంత సేద్యంలో వున్న భూములను స్వాధీన పరచుకోవాలి. జాగీర్దార్లకు పన్నులు చెల్లించ నిరాకరించాలి.

16. ప్రభుత్వ ఆజ్ఞల్ని ధిక్కరించి గ్రామగ్రామాన జాతీయ జెండా, కమ్యూనిస్టు పార్టీ ఆవిష్కరించాలి.

ఆ విధంగా వీర తెలంగాణా సాయుధ పోరాటం ప్రారంభమైంది.

ఆంధ్రమహాసభ కొత్త ప్రాంతాలకు విస్తరించింది. అనేకగ్రామాల్లో మహాసభ గ్రామశాఖలు ఏర్పడ్డాయి. ఆధునిక ఆయుధాలు సేకరించి శాశ్వత గెరిల్లా దళాల నిర్మాణం జరిగింది. స్థానిక దళాలకు తోడుగా ఇవి శక్తివంతమైన సాయుధ ప్రతిఘటనకు పూనుకొన్నాయి. అనేక సందర్భాలలో రజాకార్ల ఆయుధాలు గుంజుకోవటం, వాళ్ళ పిక్కబలం చూపటం జరిగింది. గెరిల్లా దళాలకు ప్రజలు వేలాది సంఖ్యలో వచ్చి తోడ్పడేవారు. భూస్వాములు, వాళ్ళ ఏజెంట్లు ప్రజలధాటిని తట్టుకోలేక, వాళ్ళు విధించే శిక్ష తప్పించుకొనేందుకు, పట్టణాలకు పారిపోయేవారు.

రాష్ట్ర కాంగ్రెస్ కూడా కొన్ని సాయుధ దళాలను ఏర్పరచి, సాయుధ ప్రతిఘటనకు పూనుకొన్నది. కాని నిజాం తన సర్వశక్తులతో ప్రజలపై మూకుమ్మడి హత్యాకాండ ప్రారంభించినపుడు యీ దళాలు సరిహద్దుకు ఉపసంహరింప బడ్డాయి. సరిహద్దులనుంచి, కొన్ని సాయుధ చర్యలను యీ దళాలు నిర్వహించాయి.

సాయుధ ప్రతిఘటన విజయవంతమైన ప్రాంతాలలో వెట్టి చాకిరి రద్దు చేయబడింది. అక్రమంగా భూస్వాములు ఆక్రమించుకున్న భూముల్ని రైతులు తిరిగి స్వాధీన పరచుకొన్నారు. వ్యవసాయ కార్మికులు, పేదలు ప్రభుత్వ భూముల్ని పంచుకొన్నారు. కౌలుచేలు తగ్గించబడ్డాయి. ధాన్యం రుణాలు రద్దు చేయబడ్డాయి.

ఈ రోచిత పోరాట ఫలితంగా రెండు వేల గ్రామాలు విముక్తి చెందాయి. పది లక్షల ఎకరాలకు పైగా పేదలకు, వ్యవసాయ కార్మికులకు పంచి పెట్టబడ్డాయి.

1948 సెప్టెంబరు 13 న భారత సైన్యాలు నైజాం సంస్థానంపై "పోలీసు చర్య" జరిపాయి. నైజాం సేనలు, రజాకారు మూకలు ఒకటి రెండు రోజులోనే లొంగిపోయాయి. నిజాం లొంగిపోయాడు. తనతోతు రజాకారు రాకాసి మూకల నాయకుడు ఖాసిం రజ్వీని కూడా భారత ప్రభుత్వానికి అప్పగించాడు.

నిజాం ప్రభువు లొంగిపోయాక కూడా భారత ప్రభుత్వం కమ్యూనిస్టులపైన తీవ్రమైన దమనకాండను అవలంభించింది. కమ్యూనిస్టు బలమైన కేంద్రాలపైన, గెరిల్లా దళాలపైన సాయుధ సేనలు దాడిచేశాయి. అనేకమంది కమ్యూనిస్టులు, గెరిల్లా యోధులు చనిపోయారు. తెలంగాణా సాయుధ పోరాటం 1951 అక్టోబరు 21 న ఉపసంహరించబడింది.

తెలంగాణా సాయుధ ప్రతిఘటన భూసమస్యను, భూసంస్కరణల సమస్యను యావద్దేశ ప్రజల దృష్టికి తెచ్చింది. సర్వోదయ నాయకుడు వినోబాభావే సైతం తెలంగాణాలోని పోచంపల్లిలో భూదాన ఉద్యమాన్ని ప్రారంభించడానికి ప్రేరణ కల్గించింది. తెలుగు ప్రజల చరిత్రలో ఉజ్వల ఘట్టాన్ని రచించింది. తెలంగాణా సాయుధ ప్రతిఘటనోద్యమం. బ్రిటిష్ వాళ్ళతొత్తుల్లో కల్లా, ముఖ్యుడైన నిజాం నిరంకుశపాలన అంతమొందించటం ద్వారా, భారత స్వాతంత్ర్యం మరింత పరిపుష్టమైంది.

సంస్థానాల విలీనం గురించి, ముఖ్యంగా తిరువాంకూర్– హైద్రాబాద్ సంస్థానాల గురించి గాంధీ అభిప్రాయాలను గమనించాలి. రేపో మాపో బ్రిటిష్ ప్రభుత్వం, అధికారాన్ని భారతీయుల చేతిలో వుంచి నిష్క్రమిస్తున్న సమయంలో తిరువాకూర్ దివాన్ సర్ సి.పి. రామస్వామయ్యర్ తిరువాంకూర్ సంస్థాన ప్రజా కాంగ్రెస్‌ను నిషేధించాడు. బహిరంగ సభలు జరపకూడదని శాసించాడు. దీనిపై గాంధీ జూన్ 13, 14 వ తేదీలలో చేసిన ప్రసంగాల సారాంశం హరిజన్ పత్రికలో జూన్ 22 న ప్రకటించబడింది. సంస్థానాలను పూర్తిగా నిర్మూలం చేయాలనే అతివాద పక్షాలవలె ఆయన కోరకపోయినా, సంస్థానాలు భారతదేశంలో విలీనం కావాలనే విషయంలో ఆయన ఖచ్చితమైన ధోరణినే ప్రదర్శించాడు. "సంస్థానాల స్థితి ఏమిటి" అనే హరిజన పత్రికలో ప్రచురింపబడిన వ్యాసంలో గాంధీ ఇలా అన్నాడు :

సర్ సి.పి. రామస్వామయ్యర్.... సమర్థుడైన పరిపాలకుడు, బ్రిటిష్ వారు ఇండియాను వదలగానే తిరువాన్కూర్ సంస్థానం స్వతంత్ర రాజ్యంగా ప్రకటిస్తుందని కూడా ఆయన అన్నారు. దీన్ని బట్టి బ్రిటిష్‌రాజు ఇండియాకు చక్రవర్తిగా వున్నంత కాలం తిరువాన్కూర్ ఇండియాలో ఉండటానికి సర్ సి.పి. అంగీకరించినట్లూ, అధికారం భారతీయుల చేతుల్లోకి వచ్చిన తక్షణం తిరువాన్కూర్ ఇండియన్

యూనియన్‌తో చేరటానికి ఆయన అయిష్టంగా వున్నట్లూ తెలుస్తోంది. ఇది చాలా ఆశ్చర్యకరమైన పరిస్థితి. ఏ సంస్థానానికీ యిది గౌరవనీయమైన పని కాదు. ఈ స్థితికి బ్రిటిష్ ప్రభుత్వం వారి ప్రవర్తన దోహదం చేస్తూవుంటే, ఇది వారు చిరకాలం సిగ్గుపడాల్సిన విషయం. హైదరాబాద్ సంస్థానం వారు సైతం సరయిన పంథా అవలంబిస్తారని భావిస్తున్నాను. పత్రికలలోని వార్తలు నమ్మతగినవైతే నిజాం జారీచేసిన ఫర్మానూ పూర్తిగా తప్పు. ....సంస్థానాధిపతులు స్వతంత్రులు కావడమంటే సంస్థానప్రజలు స్వాతంత్ర్యం కోల్పోవడం. నాకు తెలిసినంతవరకూ ఇండియాలో అటువంటి స్థితిని ఎవ్వరూ సహించరు. సంస్థానాధిపతులు తమ భవితవ్యం స్పష్టంగా తెలుసుకోవాలి."

# తెలంగాణా పోరాటము

స్వాతంత్ర్య సముపార్జనకై వివిధ సంస్థాన ప్రజలు జరిపిన పోరాటంలో హైద్రాబాద్ సంస్థానం లోని తెలంగాణా పోరాటం అత్యున్నత స్థాయి దాల్చింది. అందులకు గల కారణాలు తెలుసుకొన వలెనన్న ఆనాటి బ్రిటీషు పాలకుల రాజనీతి, వారి అడుగులకు మడుగులొత్తి కాలం గడుపుతూ వచ్చిన నిజాం నవాబు వైఖరి, సంస్థాన పరిస్థితులు తెలుసు కొనుట అత్యావసరము. ఈ సంస్థాన ప్రత్యేకత గూర్చి తెలుసుకొనుటకు జనరల్ ఫ్రేజర్ తన కుమారునితో చెప్పిన వాక్యములు ఎంతేని తోడ్పడ గలవు.

1. Memories and Correspondence of General Frazer నుండి.

"The Pre.eminent importance of Hyderabad State in population in Reve. nue and in the historic relations of the dynasty to the Mogal house of Timur to the British Govt. and to the Muslim population of India Prevails as distinctly now as at any period in the anuls of our empire. One of the last things he said to me was to stay at Hyderabad and so far as lay within my power and the scope of my duties to watch over the welfare and Independence of the Nizams Sovereignity and there he said was the centre and Strength of the Empire."

అలాగే సర్ విలియమ్ జాష్టన్ చెప్పిన యీక్రింది వాక్యాలు కూడా హైద్రాబాదు సంస్థాన ప్రత్యేకతను. బ్రిటీషు రాజనీతిని ప్రతిబింబింప చేస్తాయి.

"Flung almost completely aeross the Indian Penunsula the great state of Hyderabad holds a strategic position of the first importance both from the political and Military point of view. In an emergency it would Practically isolate the Predominently Hindu South from the North. where Muslim influence of Rule are at the strongest. well gover. ned. Conscious of herself. her military strength develop her prestige untornished she may play in a federal India a part not unworthy of the British traditions of Islam in India."

అలాగే సంస్థానాధీశుల సార్వభౌమాధికారాన్ని గురించి బట్లర్ కమిటీ చేసిన యీ ప్రకటన నిజాం నవాబుకు ఎంత బలమిచ్చిందో మనము వూహించ వచ్చు.

"The Promise of the king Emperor to maintain unimpaired. the privilages, rights and dignities of the Princes Carr. ies with it a duty to protect the prin. ce against attempts to eliminate him and to substitute another form of Government. The paramount power would be bound to maintain the rights. Privilages and dignities of the prince. But it will also be bound to suggest such measures as would satisfy the demands without eliminating the prince"

ఈ విధమైన బ్రిటీషువారి అండగలిగిన నిజాం నవాబు తన రాజ్యపాలన నిరంకుశంగా, పాక్షికంగా మత ప్రాతిపదికపై నడిపాడు. పర్యవసానంగా సంస్థాన ప్రజలు అనేక కష్టాలను ఎదుర్కొవలసి వచ్చింది, వీటిని క్లుప్తంగా యిచ్చుట పొందుపరచడం తెలంగాణా పోరాటానికి దారితీసిన పరిస్థితులను అర్థం చేసుకోవడం అవుతుంది.

నాటి పరిస్థితులు :

## 1. ఉర్దూ - రాజభాష

హైద్రాబాదు సంస్థానంలో మైనారిటీ ముస్లిముల మాతృభాష అత్యధిక సంఖ్యాకులైన ముస్లిమేతరులపై రుద్ద యత్నం జరిగింది. అందుకుగాను ఉర్దూను రాజభాషగా గు రించారు. దీని ప్రభావం ఒక్కమాటలో చెప్పాలంటే బ్రిటిషు ప్రభుత్వం బలపడేందు కోసం బ్రిటిషువారు భారతదేశంలో ఏవిధంగా ఇంగ్లీషు వుపయోగించారో దాదాపు అదే విధంగా నిజాం ప్రభుత్వం బలపడేందుకు ఉర్దూను రాజభాషగా పాలకవర్గంవారు వుపయోగించారు. దీని పర్యవసానం భాషా దాస్యము, భావ దాస్యము మెండయింది. ప్రాథమిక పాఠశాలలు సైతం అనుమతిలేనిదే పెటుకోకూడదని ప్రభుత్వం circular జారీ చేసింది. అత్యధిక సంఖ్యాకులైన హిందువులకు తమ మాతృభాషలో చదువు చెప్పుకొనే అవకాశం తగ్గింది. ఈలాంటి నిర్బంధాలవల్ల అక్షరాస్యత (literacy) హిందూ ముస్లిములలో యే విధంగా వుండిందో తెలుసుకోవడానికి 1931 సం॥లో ప్రకటించిన యీ స్టేట్‌మెంటు పనికివస్తుంది.

| | హిందువులు | | | ముస్లిములు | |
|---|---|---|---|---|---|
| సంవత్సరం | మొత్తం | రు లు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు |
| 1881 | 3.7 | 98 | .0 4 | 4.94 | .02 |
| 1891 | 4.4 | 3.37 | .1 2 | 5.1 | .27 |
| 1901 | 3.4 | 2.5 | .1 5 | 5. | 1.02 |
| 1911 | 3.2 | 2.3 | .19 | 5. | 1.25 |
| 1921 | 3.3 | 2.6 | .32 | 8. | 3.06 |
| 1931 | 4.8 | 3.3 | .64 | 10.3 | 2.9 |

ఈ అపకతవకలు గమనించే కాబోలు దూర దృష్టి కలిగిన బ్రిటిష్ వైస్రాయి లార్డ్ ఇర్విన్ 192 లో ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని స్థాపించినప్పుడు యీ క్రింది విధంగా ఉపన్యసించాడు.

"It will be the task of a mature Statesmenship so as to shape the policy of the Osmania University so that it may have as strong an appeal to the Hindus as to the Mohammadan Subjects of your state.

ఎవరెన్ని చెప్పినా నిజాం ప్రభుత్వ వైఖరి మాత్రం చాలాకాలం వరకు భాషాదాస్యం నుంచి, భావదాస్యం నుంచి ముస్లిమేతరులు తప్పుకొనేదశ లేకుండా చేసింది.

## 2. ఉద్యోగ సమస్య

నిజాం నవాబు హై బాదులోని ముస్లిములకేకాక యావత్ ప్రపంచ ము ములకు ప్రతినిధిగా నిలిచిపోయాడు. అందులకు ప స్థితి అనుకూలిస్తే స్విట్జర్లాండువలె హైద్రాబాదు భారతదేశ నడిగడ్డపై స్వతంత్ర హైద్రాబాదుగా వుండవలెనని వూహించాడు. దీనిని సాధించుటకై హైద్రాబాదులోని ప్రతి ముస్లిము తానే ప్రభువునని, హైద్రాబాదు రక్షణే యావత్ ప్రపంచ ముస్లిముల రక్షణ అని భావించసాగారు దీనికనువగు వాతావరణం నిజాం ప్రభుత్వం కల్పించింది. ప్రతీ కీలక స్థానంలో ముస్లిము అధి రులే వున్నారు. చిన్న ఉద్యోగాలలో కూడా భాషాదా ము భావదాస్యం, పొంది, ఉర్దూలో చదువుకొని ఉస్మా యా యూనివర్సిటీలో ఉత్తీర్ణు న వారికే చాలా వరకు ఉద్యోగాలు లభించాయి. నికంగా యీ పదవులకు సరియైన ముస్లిములు లే చోట యు.పి. యిత్యాది ప్రదేశాల నుంచి ముస్లిములను రప్పించి ఉద్యోగాలిచ్చారు. ఇది హిందువులకు, జాతీయ ముస్లిములకు తదితరులకు సహించరానిదయింది. పైగా యీ ఉద్యోగాలలో వున్న అధికారుల యొక్క ప్రవర్తన అధిక సంఖ్యాక వర్గీయుల ఆత్మగౌరవానికి భంగకరంగా వుండేది. రాజ్యాధికారంలో ముస్లిములు ఎంత భాగస్వాములనుకునేవారో ముస్లిమేతరులు తమకు అంతలేదని అనుకునే దశ వచ్చింది.

## 3. మతాంతరీకరణ

ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థ 1930 లో స్థాపించబడింది. ఈ సంస్థ కార్యక్రమాలలో మతం, మార్పిడి, మత ప్రచారము ఉద్యమ స్థాయిలో నడపబడ్డాయి. వ్యక్తి విశ్వాసాలపై మతం మార్పిడి జరుగుతే ఎవరికీ బాధ వుండేది కాదు. కానీ ప్రభుత్వ సహకారంతో మతం మార్పిడి జరగడం హిందువులు, తదితరులు సహించలేదు. పైగా హిందువులవూరేగింపులు, మసీదు ముందర నుంచి పోయినప్పుడు బాజా బజంత్రీలు

ప్రయోగించకూడదని ప్రభుత్వం భావించింది. దానిని అమలు చేసింది. ప్రభుత్వంయొక్క ఆదాయంలోని కొంత భాగం యితర దేశాలలో ముస్లిం మత ప్రచారానికై వినియోగించబడింది. 18000 హరిజనులను ఒక్క బహదూర్ యార్‌జంగు ముస్లిములుగా మార్చగలిగాడు. అంతేగాక హైందవులలో కూడాఏమాత్రం వీలున్నా కులం పేరిట, వర్గం పేరిట చీలికలు తెచ్చేందుకు ప్రభుత్వం కొంత ప్రయత్నించింది. లేదా అట్టివి వచ్చినప్పుడు వాటికి చేయూత యిచ్చింది. దీనికి వుదాహరణగా హైద్రాబాద్ స్టేట్ షెడ్యూల్ కాస్ట్ ఫెడరేషన్(Hyderabad State Schedule Caste Federation) వారు 29 జూలై 1946 న షెడ్యూల్ కా వారిని హిందువులలో ఒక భాగంగా చూడడం న్యాయం కాదని, వారిని ఒక ప్రత్యేకమైన రాజకీయ వర్గంగా చూడాలని శాసన సభలలో మూడవ వంతు వారికి ప్రాతినిధ్యం వుండాలని, మిగతా రెండు వంతులలో హిందువులుముస్లిములు,సమానంగాపంచుకోవాలని తీర్మానించారు. దీనికి కొంత ప్రోత్సాహం ఆనాటి ప్రభుత్వం యిచ్చిందని వినికిడి. అట్టి అనుమానానికి అతీతంగావుండే పరిస్థితి ప్రభుత్వానికి లేకపోయింది.ఈ విధంగా అత్యధిక సంఖ్యాకులు మత స్వాతంత్ర్యంకోల్పోయారు.

## 4. వెట్టిచాకిరీ

వీటన్నిటినీ ప్రజలు కొంతవరకు ఓర్చుకున్నా సాధారణ ప్రజలలో ప్రభుత్వం యొక్క దమన నీతి, అధికారుల దుశ్చేష్టలు చాలా బాధ కలిగించాయి. ముఖ్యంగా వెట్టి చాకిరీ అధికార దర్పానికి చిహ్నమయింది. వెట్టి చాకిరీ చేయించుకోలేని ఆఫీసరను, జమీందారు, గిరుదారు, వతందార్లను అసమర్థులుగా చూచే దశ వుండింది. బండి ముందర ఎల్లోడు పరుగెత్తడం ఆచారమయింది. అతను ఎడ్లకన్న తీవ్రంగా పరుగెత్తలేకపోతే అతనిపై జాలి చూపే దానికన్నా అతనిపై నుండి బండి పోనిచ్చి ఆనందించే రోజులు సాధారణ ప్రజ చూడాల్సి వచ్చింది. దొరలకు, అధికారులకు ఊడిగం చేయడం పరిపాటయింది. గ్రామాలలో వంతుల వారీగా వతందారులకు సేవలు సహాయ, సహకారము అందించడం తప్పని వుసరి అయింది ఒక అధికారి వూళ్లోకి వస్తే షా కౌరు ముడి సామాగ్రి సప్లై చేయడం, చాకలి గుడ్డలు తకడం, మంగలివాడు దీపం పెట్టడం, హరిజనుడు లేక ఎల్లోడు బండి ముందర పరుగెత్తడం తతర చిల్లర పనులు చేయడం యీ విధంగా ఏ వృత్తి వారు ఆ వృత్తి సౌకర్యాలను వుచితంగా యివ్వడం ఆచారంగా అయిపోయింది. ఇలాసేవలు చేయడం వుచితం కాదని వారికి ప్రభుత్వంకొందరికి యిచ్చిన యీనాముల దృష్ట్యా జరుగుతున్నదని ప్రభుత్వ అధికారులు చెప్పినా ఆత్మవంచన లేకుండా యీ పనులు జరిగేవి మాత్రంకావు. ఇట్టి పనులు చేసే వారికే కాక చూచేవారికి కూడా చాలాఅసహ్యంగాను, బాధాకరంగాను, ఆత్మవంచనగాను కనుపించేవి. ఈ విధంగా అమానుషత్వం పెగిరింది. వ్యక్తి దాస్యం ప్రబలింది.

## 5. ఆంధ్రమహాసభ
## ఆంధ్రోద్యమము

నిజాం రాజ్యము యొక్క విస్తీర్ణము 82,698 చ. మైళ్ళు.వీనిలో సుమారు సగము 41,320 చ.మై. తెలంగాణాకు చెందింది. ఈ ప్రాంతంలో దాదాపు 1920 వరకు తెలంగాణా వాసుల హక్కుల రక్షణకై ఏ విధమైన సంస్థ వున్నదని కానీ లేక దానికై పెద్ద ప్రయతనం జరిగిందనికానీ చెప్పే వీలులేదు.1922 లో వివేకవర్ధని థియేటర్‌లో హిందూసంఘ సంస్కరణల సభ ఒకటి జరిగింది. ఈ సభలో మహారాష్ట్ర ప్రముఖులు మరాఠీ ఉపన్యసించగా ఆంధ్రులు ఉర్దూలోను, హిందీలోను ఉపన్యసించారు. శ్రీ ఆలంపల్లి వెంకట రామారావు అనే న్యాయవాది తెలుగులో మాట్లాడారు. మహారాష్ట్రులు అతన్ని వెక్కిరించారు. దానిపై ఆంధ్ర యువకులకు కోపం వచ్చింది. ఈ కోపమే ఆంధ్రజనకేంద్ర సంఘ స్థాపనకి కారణమయింది. దానికి నాయకత్వం కీ. శే. మాడపాటి హనుమంతరావుగారు వహించారు. జాతీయ ఉద్దేశాలతో స్థాపించబడిన యీ మహాసభ క్రమేణాఆంధ్ర మహాసభగా మారింది. ఈ మహాసభ ప్రజల యిబ్బందులను ప్రభుత్వ దృష్టికి తెచ్చే సంస్థగానే చాలా కాలంవుండిపోయింది.మొదటి దశలలో యీ మహాసభ తీర్మానాలు సైతం ప్రభుత్వాధికారులకు చూపి అంగీకరించబడుతూ వుండేవి. 1930 లో జరిగిన

జోగిపేట ప్రథమాంధ్ర మహాసభకు కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు అధ్యక్షత వహించారు. దేవరకొండలో జరిగిన ద్వితీయాంధ్ర మహాసభకు కీ. శే. బూర్గుల రామకృష్ణరావుగారు అధ్యక్షత వహించారు. తృతీయాంధ్ర మహాసభ జరిగినప్పుడు ఆ మహాసభలలో రాజకీయ స మ స్య లు చర్చించకూడదని, సాంఘిక సమస్యలు చర్చించకూడదని వారికి ప్రభుత్వం తెలిపింది. ఆనాటి మితవాద నాయకత్వం దానిని వ్యతిరేకించకుండా రైతులకు సంబంధించిన సమస్యలపై అనేక తీర్మానాలు చేశారు. పన్నులు తగ్గాలని, జాగీర్దలో బందోబస్తు జరగాలనీ సూచనలు చేయబడ్డాయి. ఈ ఘట్టాలను బట్టి 1938 వరకు రాజకీయంగా ఎంత వెనకబడివునా మో మనకు బోధపడుతుంది 1938 లో స్టేట్ కాం' స్ సం ను స్థాపించుటకు । యత్నాలు జరిగాయి. 1 39 – 4 లో కమ్యూని పా అమలులోకి వచ్చింది. కాం' స్ కమ్యూని ర్టీల అవతరణయే హైద్రాబాదు సంస్థానంలో ంధ్ర మహాసభను దరఖాస్తు దశనుంచి తప్పించి ప్రభుత్వ వ్యతిరేక తీర్మానములు చేయుటకు గల స్ఫూర్తిని, శక్తిని యిచ్చింది. ఆంధ్ర మహాసభ చాలా వరకు ప్రజలను గ్రంథాలయం ద్వారాను, తదితర సాధనముల ద్వారాను ప్రజలను తమ హక్కులను గూర్చి గుర్తింపచేయించి వారిని అఖిల భారత రాజకీయ ఉద్యమాల మార్గంలో పెట్టిందని చెప్పుట న్యాయమవుతుంది. ఈ ఉద్యమాల వల్ల ప్రజలు చైతన్య వంతులయ్యారు. ఆంధ్రమహాసభల పేరుతో జరిగే కమ్యూనిస్టు, కాంగ్రెస్ ఉద్యమాల పాలసీలను, కార్యక్రమాలను గుర్తించసాగారు. అలాగే ఆంధ్ర మహాసభ నాయకులను 1942 నాటికల్లా కాంగ్రెస్ కమ్యూనిస్టు అనే పేరుతో వారిని గుర్తించి అనుసరించగలిగారు. ఆంధ్రోద్యమం ప్రజలు ఆర్థిక సామాజిక రాజకీయ రంగాలలో వెనుకబడి వున్నారని తెలుప గలిగింది.

## 6. ప్రజల హక్కులు ప్రభుత్వ వైఖరి

1937 వరకు ప్రభుత్వం ఏవిధమైన పౌరహక్కులకై ఎవరు ప్రయత్నించినా ఇత్తెహాదుల్ ముసల్మీన్ కాకపోతేనరి ప్రభుత్వం వారిని వివిధ నిర్బంధాలకు గురిచేసేది. వందేమాతరం ఉద్యమం, 1938 లో జరిగిన స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహము ఆర్యసమాజీ సత్యాగ్రహము, హిందూ మహాసభ సత్యాగ్రహము యిత్యాది వుద్యమాలన్నీ మొట్టమొదటిసారిగా అంతర్జాతీయ, జాతీయ భూమికలో ప్రభుత్వం చూసేటట్లు చేసినాయి. యదార్థాన్ని గుర్తించినా నిజాం ప్రభుత్వం సమస్యలని పరిష్కరించకుండా వ్యక్తుల హక్కులను అణగదొక్కడమే పద్ధతిగా పెట్టుకుంది. దీనికి బద్దం యల్లారెడ్డిగారి కేసే తార్కాణము. శ్రీ బద్దం యల్లారెడ్డి కమ్యూనిస్టు. ఆంధ్ర మహాసభ నాయకుడు. కరీంనగర్ జిల్లాలోని గాలిపల్లి వాస్తవ్యుడు. నేను ఆనాడు కాంగ్రెస్ గోత్రీకుడను. సేవాగ్రాంలోని గాంధీ ఆశ్రమం వదిలి సిరిసిల్ల తాలూకాలోని ముస్తాబాదులో గాంధేయ పద్ధతులపై నిర్మాణ కార్యక్రమాన్ని నడుపుతూ వుండేవాణ్ణి. భూపతిరెడ్డి పరిసర గ్రామ వాస్తవ్యులు శ్రీ అన్నం వెంకటరెడ్డి, శ్రీ లక్ష్మీనరసింహారె , శ్రీ రాజారెడ్డి, శ్రీ లక్ష్మారెడ్డి ముస్తాబాద్ వతందా . అయినా మేమంతా వెట్టిచాకిరీ నిర్మూలనా ఉద్యమా కి కలిసి పనిచేసేవాళ్ళం. దీనికి ఆంధ్ర మహాసభ వేదిక అయింది. శ్రీ ఎల్లారెడ్డి వెట్టిచాకిరీ వ్యతిరేక ఉద్యమాన్ని తీవ్రంగా లేవదీసిన కారణంగా అతన్ని డిఫెన్స్ ఆఫ్ హైద్రాబాద్ రూల్సు క్రింద అరెస్టు చేశారు. అతను కమ్యూనిస్టు అని, ప్రజాయుద్ధ నినాదాన్ని అతను విశ్వసిస్తున్నాడని అధికారులకు తెలుసు. ఐనా వారికి రాజకీయ దృష్టి కన్న స్థానికంగా వెట్టిచాకిరీ చేయించుకోలేని అపఖ్యాతి తమకు వస్తుందని అది సహించలేక శ్రీ ఎల్లారెడ్డిని ప్రభుత్వ అధికారులు అరెస్టు చేశారు. ఆ రోజుల్లో నేను దక్కన్ క్రానికల్‌కి విలేఖరిగా వున్నాను. అప్పుడిచ్చిన పత్రికా వార్త పై విషయాన్ని రుజువు చేస్తుంది.

Sircella

Mr. Yella Reddy's Case

Mr. Alwar Swamy came here this morning he told me that the Vakils at Hyderabad find it diffcult to appear on behalf of Mr. yella Reddy at this place and that he would therefore try to get the case transferred to the Hydera bad High Court.

There was a gathering of about 250 or 300 people from the neighbouring Villages present in the Court hall. when the case commenced with Mr. Yella Reddy being brought into it. The accused filed an application with the Munsiff to grant him time for getting the case transferred to the High Court. The Munsiff passed orders that as regards the charge under Sec 25 of the defence of Hyderabad Rules he would grant time till the 5th March and as regards the charge under Sec. 82 of the Asafia Penal Code (Sedition) the accused was committed to the Sessions. The accused pleaded not guilty and said that the charges were unfounded that he had never said that help should not be rendered to the British Government in the Present war and that on the Contrary it was his firm conviction that all possible help should be given to the British to keep the enemy out of the Country.]

ఈ విధంగా ప్రభుత్వం సంకుచిత దృష్టితో వ్యవహరించడం పరిపాటయింది. ఉప్పు సత్యాగ్రహంలో ఏ కొద్దిగా ఉప్పు చేయనిచ్చినా అంత మాత్రం భూమిపై సముద్రజలంపై బ్రిటీషువారి సార్వభౌమాధికారం పోయినట్లు బ్రిటీషు ప్రభుత్వం ఏవిధంగా భావించిందో అలాగే ఒక వ్యక్తినుంచి కానీ, ఒక వూరినుంచి కానీ వెట్టి చేయించుకోలేక పోతే నిజాం ప్రభువుల సార్వభౌమాధికారం అంత మాత్రం దెబ్బతిన్నట్లుగా, కోల్పోయినట్లుగా భావించబడే రోజులవి. పౌరసత్వ హక్కులు మృగ్యమయినవి.

## 7. గ్రామాధికారులు వెట్టిచాకిరీ

గ్రామాధికారులు ప్రభుత్వ యంత్రాంగంలో కీలక స్థానం ఆక్రమించారు. గ్రామంలోకి ప్రభుత్వ అధికారులు రాగానే ఓతుల గొర్రెలను, కోడిపిల్లలను పట్టి తెప్పించి వాటిని కోసి కూర సప్లయి చేయవలసి వచ్చేది. అలాగే పెరుగు, పాలు, నెయ్యి, కాఫీలు, టీలు. ఆనాటి సంస్థాన పరిస్థితి వల్ల యీ సేవలు వారికి తప్పినవికావు. చివరకు జాగీరులోను, మక్తాలలోను కూడా యీ పరిస్థితి వారిని వెన్నాడింది. ఇదంతా కొంత అసంతృప్తికి కారణమయింది.

## 8. లెవీ వసూళ్ళు

యుద్ధ సమయంలో లెవీ వసూళ్ళు ప్రారంభమయ్యాయి. గ్రామాలలో ప్రతి చిన్న, పెద్ద రైతు నుండీ పండినా, పండకపోయినా ప్రభుత్వం లెవీ వసూళ్ళకు పూనుకుంది. ప్రతీ గ్రామంలోను ఎంత లెవీ కట్టాలో తాసిల్దారు అంగీకారంతో గ్రామాధికారులు నిర్ణయించి గ్రామ సావిడిపై పట్టిక వేసేవారు. ఆ ప్రకారం రైతులు స్వంత బళ్ళలో మిల్లులోకి ధాన్యం తెచ్చి యివ్వవలసి వచ్చేది. రైస్ మిల్లర్స్‌ని ప్రభుత్వం ఏజంట్లుగా పెట్టింది. ఈ లెవీ రకం వారీగా గ్రేడెడ్ పద్ధతిగా చెల్లించవలసి వచ్చేది. దొరలు, పెట్టుబడిదారులు, దళారులు వివిధ రకంగా వీరిని దోచుకో ప్రారంభించారు. దోపిడికి ఎదురు నిల్చిన వారందరినీ ప్రభుత్వం తన శత్రువులుగా పరిగణించింది. రైతాంగంలో, వ్యాపారస్తులలో కూడా తీరని అసంతృప్తి కలిగించింది.

## 9. మత తత్వము – ఇత్తెహాదుల్ ముసల్మీన్ నాయకత్వం

నిజాం నవాబు తన అనుకున్న స్వతంత్ర హైద్రాబాద్ సాధించేందుకు అటు బ్రిటీషువారి అండ పొందాడు. మరొక వైపు స్థానికంగా బహదూర్ యార్‌జంగు నాయకత్వంలో ముస్లిములకు ఏకైక ప్రతినిధిగావున్న ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థను తన ఆశయసిద్ధికై వుపయోగించు కున్నాడు. బహదూర్ యార్ జంగు హైద్రాబాద్ రాజ్య భవిష్యత్తును గురించి, హిందువులను గురించి చెప్పిన వుపన్యాసాలు అతని నాయకత్వ ధోరణిని, చూపిస్తాయి. అంతేగాక నవాబు అతనిపై ఆధారపడేందుకు కారణం కూడా తెలుపుతాయి.

"If as a result of this relentless war should India which was suffering from slavery since two centuries once again breath the air of Independence under the aegis of the British Emperor (Sovereign) then the powers, responsibilities Privi-lages and the territories and regions which were ceded by the Nizam to his British ally at various stages of history should be returned unconditionally geographically if on one side, Berar, Northern Circars etc. are included in the limits of Hyderabad on the other side Hyderabad should be as independent Muslim State have the right and enlitle-ment (eligibility) to establish diploma-tic relations not only with a free India but also with all other free coun-tries in the World. అంతేగాక "In the Indian atmosphere the Hindus can use democracy as a most useful instrument to rule the Country with the strength of the majority thus taking revenge on their muslim brothers." మతతత్వంఅణువణువున ఇముడ్చుకున్న బహదూర్‌యార్ జంగు ముస్లిం లందరు స్వాతంత్ర్య ప్రియులని, ప్రజాస్వామ్య అభిప్రాయాలు కలవారని పదేపదే చెప్పసాగారు. అతను ఎంత గట్టిగా నొక్కిచెప్పితే అంత వ్యతిరేకత జాతీయ ముస్లిములలోను, హిందువులలోను కనబడసాగింది. చివరకు గాంధీజీ అంతటివాడు మతతత్వము, ప్రజాస్వామ్యము (Communalism & Democracy) గురించి యిదే కాలంలో జవాబు చెప్పాడు.

"What can be the meaning of com-munalism? In a state where the people of a Particular Community or in a majority eg: What is the meaning of Communalism in Kashmir or North West Frontier Province where the over whelming portion of the province are the followers of one religion? The tricky horse (Trojan Horse) of minority can be made to run but to a certain extent. But this minority should atleast be reasonable numerically speaking. Even a single person constituting the minor-ity can expect justice, but he cannot have any place in the political field of any person belonging to a very small minority, rises to power, he will do so because of his own merit, but not because he represents his religion or group. Judged by the meaning of the word Communalism as is understood in India, the Hyderabad State Congress can never called a communal organisa-tion.

స్టేట్ కాంగ్రెస్ మత సంస్థ అని అన్నదానికి గాంధీజీ సమాధానం చూశాక బహదూర్‌యార్ జంగ్ మతతత్వ వాదము ప్రజాస్వామ్యానికి ఎంత దూరంగా వుండి అఖిలభారత ముస్లిం లీగ్ వైఖరికి ఎంత దగ్గరగా వుందో బోధపడుతుంది. సంస్థానంలోని విద్యావంతులు, విద్యావేత్తలు, మధ్య తరగతి వారు, సాధారణ ప్రజ బహదూర్ యార్ జంగును హర్షించలేక పోయారు. అతనిపై విద్వేషం పెరిగింది. క్రమేణా నిజాం నవాబు ముస్లిం ప్రజానీకం అండకోసం అతనిపై ఆధారపడవలసి వచ్చింది. ఒక మాటలో చెప్పాలంటే ముస్లిములు బహదూర్‌యార్ జంగుమాట విన్నారు కానీ నిజాం నవాబు మాట కాదు. ఈ దశ అతను 1944 లో చనిపోయేంత వరకు వుండింది. నిజాం నిస్సహాయత ప్రకటించాడు. మత పాక్షికదృష్టి స్పష్టమయింది.

## 10. రాజ్యాంగ సంస్కరణలు

1938 నాటికల్లా హైద్రాబాదులోని వివిధ రాజకీయ సంస్థలు అఖిలభారత నాయకత్వంవైపు మొగ్గినవి. వారి సలహా సంప్రదింపులతో వివిధ రాజకీయపక్షాలు పనిచేయసాగాయి. రాజకీయమైన ప్రతీ విషయాన్ని అఖిలభారత దృష్టితో చూచేదశ వచ్చింది. అందుకని

పరిసర రాష్ట్రాలలోను, సంస్థానాలలోను జరుగుతూ వచ్చిన రాజ్యాంగ సంస్కరణలను నిజాం నవాబు కాదనలేక పోయాడు. 1939 లో అయ్యంగారు కమిటీచేసిన సిఫారసులపై నిజాం ప్రభుత్వం రాజ్యాంగ సంస్కరణలను అమలుచేయ పూనుకుంది. శాసనసభలో 132 స్థానాలు వుండేటట్లు దానిలో 76 గురు ఎన్నుకొనబడేటట్లుగా సంస్కరణలు రూపొందించబడ్డాయి. జిన్నా యొక్క సూచనపై ఎన్నుకొనబడే వారు ఫంక్షనల్ రిప్రజెంటేటివ్ గా వుండేటట్లు చూడబడింది. అంటే ప్రాతినిధ్యం రైతులకు, యిండ్ల యజమానులకు, కిరాయిదారులకు, జాగీరుదారులకు, కూలీలకు, డాక్టర్లు, వకీళ్ళు, వ్యాపారస్తులు యిత్యాది వృత్తులవారికి యీయబడింది. మొత్తం మీద ప్రతి అభ్యర్థి 51 శాతం ఓట్లు సంపాదించుకుంటే గెలిచిన గా ప్రకటించడం జరుగుతుందన్నారు. ఈ 7 సీట్లుకాక మరి 56 మందిని ప్రభుత్వము నామినేట్ చేసింది. ఏ లెక్క చూసినా ము ం ఆధిక్యత వుండేటట్లు యీ సంస్కరణలు చేయబ వి. ఈ సంస్కరణలు రెండవ ప్రపంచ యుద్ధం జ గుతున్న సందర్భంలో వచ్చాయి. కమ్యూనిస్టులు ప్రజాయుద్ధ నినాదంతో పనిచేయ సాగారు అందువల్ల వారు జాతీయ ప్రభుత్వం కావాలని కోరారు. మితవాదులు కొందరు సంస్కరణలవైపు మొగ్గారు. భారత జాతీయ కాంగ్రెసు యుద్ధంతో సంబంధం వుంచుకోరాదని నిశ్చయించింది ఆ కారణంగా పదవ ఆంధ్ర మహాసభలో కమ్యూనిష్టు పా వారు హైద్రాబాదు ప్రభుత్వంలో సగం పాలు ఇ హాదుల్ ముసల్మీను వారికి, మిగతా స్థానాలు ంధ్ర, మహారాష్ట్ర, కర్నాటక మహాసభలకు వుండాలని ప్రతిపాదించారు. దీనిని జాతీయ వాదులు వ్యతిరేకించారు భారత జాతీయ కాంగ్రెస్ కోరినట్లుగా ప్రజాయుద్ధ నినాదానికి అనుకూలమైన యీ తాత్కాలిక ప్రభుత్వ తీర్మానాన్ని ఆంధ్రమహాసభ తిప్పికొట్టింది. అయినా కమ్యూనిష్టు పార్టీకి జనాదరణ తగ్గలేదు. దానికి ముఖ్యకారణం ప్రజా సమస్యలపై వారు చేసిన కృషి, త్యాగాలు అని చెప్పవచ్చు. ఏదైనా యీ తీర్మానంపై చర్చోపచర్చలు మరింత చైతన్యాన్ని ప్రజలలో కల్పించాయి. ఆ తరువాత 1946 లో మీర్జా ఇస్మాయిల్ ప్రధానమంత్రిగా వచ్చాడు. పైరాజ్యాంగ సంస్కరణలలో కొన్ని మార్పులు తెచ్చి ప్రభుత్వ యంత్రాంగంలో రాజకీయోద్యమ ప్రతినిధులకుస్థానం కల్పించయత్నించారు. కానీ అదికూడా అంత ఫలించలేదు. చివరకు ముస్లీములు, ముస్లీమేతరులు ఎవరూ కూడా యీ సంస్కరణల పట్ల తృప్తి పొందని దశ వచ్చింది. రాజకీయ చైతన్యం మాత్రం యీ ఒరపిడి వలన మరింత హెచ్చుగా సాగింది. క్లుప్తంగా చెప్పాలంటే 1927 నుంచి 1939 వరకు తెలంగాణా పోరాటం ప్రచారం, ప్రబోధం శాంతియుతమైన ఆందోళనతో వుండింది. సర్వతోముఖాభివృద్ధి తన ధ్యేయమని ఆంధ్ర మహాసభ నియమావళిలో రూపొందించి ఆ వేదికపై బహువ్యాప్తంగా ప్రజలలో చైతన్యము కలిగించింది. దీనికి గ్రంథాలయాలు, వర్తక సంఘాలు, మద్యపాన నిరోధక సంస్థ ఒకటేమిటి వ్యాసరచన వక్తృత్వ పోటీ సంఘాలు, భిన్న భిన్న సంస్థలు యీ పోరాటానికి చైతన్యాన్ని కలిగించాయి. రాజకీయ అసంతృప్తి కూడా అధికమయింది.

## 11. 1939 నుంచి 1942
### ఆందోళనా ఉద్యమాలు

ఈ నాలుగు సంవత్సరాలలో భారత దేశంలో, సంస్థానాలలోను ప్రభుత్వమును ఎదిరించే ఆందోళనలు ప్రారంభమయ్యాయి. మత స్వాతంత్ర్యానికై ఆర్య సమాజీయులు విశ్వజన హిందూ పరిషత్తు హైద్రాబాదులో సత్యాగ్రహం జరిపారు. సివిల్ లిబర్టీస్ యూనియన్ పౌరహక్కులకై సత్యాగ్రహం జరిపింది. హైద్రాబాద్ స్టేట్ కాంగ్రెస్ బాధ్యతాయుత ప్రభుత్వానికై సత్యాగ్రహం జరిపింది. 1942 నాటికి క్విట్ఇండియా నినాదం హైద్రాబాదును కూడా పెనవేసింది. హైద్రాబాదు సంస్థానంలో ప్రతి ఉద్యమము అఖిల భారత ఉద్యమంగా మారడం లేక హైద్రాబాద్సంస్థాన ప్రజలు అఖిల భారత ఉద్యమాలలో పాల్గొనడమో జరిగింది. ఈ విధంగా తెలంగాణా ప్రజలు చైతన్యవంతులై, శక్తివంతులై నిరంకుశ ప్రభుత్వాన్ని ఎదుర్కొన ప్రారంభించారు.

## 12. 1942 నుంచి 1944 కాంగ్రెస్ కమ్యూనిస్టు ఉద్యమాల పోకడ

1942 క్విట్ ఇండియా ఉద్యమం నాటికి తెలంగాణా ప్రజలు కాంగ్రెస్ కమ్యూనిస్టనే విభేదం ప్రజా సామాన్యందాకా పోకుండా ఆంధ్ర మహాసభ పేరుతో నడపసాగారు. కానీ ప్రజా యుద్ధ నినాదం రావడం జాతీయ ప్రభుత్వాన్ని నిర్మాణం చేయాలనే విషయంలోకమ్యూనిస్టు 10వ ఆంధ్ర మహాసభలో విజయం పొందలేక పోవడం భువనగిరిలో జరిగిన కమ్యూనిస్టు ఆంధ్ర మహాసభ కమ్యూనిస్టు జండాలతో రెప రెపలాడడం శ్రీ రావి నారాయణరెడ్డిగారు సైతం ప్రప్రథమంగా సాధారణ ప్రజచే కమ్యూనిస్టు నాయకుడుగా గుర్తింపబడడం హైద్రాబాదు ప్రజలలో కమ్యూనిస్టేతరులైన వారు జాతీయవాదులు అనే భావన ప్రబలిపోయింది. కమ్యూనిష్టుపార్టీవారు ప్రజా యుద్ధనినాదం తీసిన కారణంగా వారిని ప్రజలంతగా హర్షించలేదు. వారి ధోరణి సహజ జాతీయ ధోరణికి విరుద్ధంగా వుండిపోయింది. అయినా వారు ప్రజా సమస్యలపై 1944 లో తీసిన ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాలు వారికి సామాన్య ప్రజలతో సంబంధం పోకుండాచేసి ప్రజా చైతన్యవంతులు చేశాయి.

## 13. 1944 తెలంగాణా కమ్యూనిస్టు ప్రజా పోరాటం : ప్రథమ ఘట్టం

శ్రీ రావి నారాయణరెడ్డి, శ్రీ ఆరు లక్ష్మి నరసింహారెడ్డి, శ్రీ ఆరుట్ల రామచంద్రారె దంపతులు, శ్రీ బ ం ఎల్లారెడ్డి, గట్టెపల్లి మురళీ ర్ యిత్యాది కమ్యూ నిస్టు నాయకులు చేస్తూవున్న ప్రజా యుద్ధ ప్రచా ం వారిని కొంత ప్రజల నుంచి దూరం చేసింది. కాని వారు ప్రజాహిత సమస్యలను చేబూని ఫ్యూడల్ భూస్వాముల నిరంకుశ అధికారుల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా, పోరాటాలు లేవదీశారు. దీనికి యీ క్రింది సమస్యలు చాలా తోడ్పడ్డాయి. దొరలవెట్టి చాకిరీని వీరు ప్రతిఘటించారు. అధికారుల లంచగొండితనాన్ని ప్రజా వ్యతిరేక చర్యలను పేరు పేరునా తీసుకొని వూరేగింపులు తీయసాగారు.

ప్రజా వ్యతిరేక శక్తుల వ్యవసాయాన్ని సాగనీయకుండా ప్రతిఘటించారు. తమ ప్రజా పార్టీ బలంతో గ్రామ పెత్తందార్లు తీసుకున్న లంచాల లెక్కలు ప్రకటింప చేశారు. కొన్నిచోట్ల ఆ డబ్బు తిరిగి యిప్పించారు. నాగులు యీయనీయలేదు. దొరలు దెబ్బలు కొడితే దెబ్బకు రెండు దెబ్బలు, తిట్టుకు రెండు తిట్లు తిట్టి సంఘ గౌరవాన్ని, వ్యక్తి గౌరవాన్ని కాపాడుకోండని ప్రబోధించి దొరలకు, వారి ఏజంట్లకు, అధికారులకు ఎదురు తిరుగునట్లు చేశారు. దొరల అధికారానికి భయపడి "నీ బాంచనైతా దాసోడ్ని" అని పదే పదే కాళ్ళ మీదపడే అలవాటును మానిపించారు. కొన్నిచోట్ల దీర్ఘకాలం నుంచి చేసిన పనులకు పాళ్లు గట్టి యివ్వాలని నిలదీసి గ్రామ పెత్తందార్లను, దొరలను అడిగేటట్లు చేశారు. కౌలుదారులను భూముల నుండి తొలగించకుండా సంఘటిత పరిచారు. భూస్వాములు గూండా శక్తులను ఉపయోగిస్తే వాటిని ఎదుర్కొనే ప్రజాశక్తిని చేకూర్చి దౌర్జన్యంగానైనా సరే వారి కాళ్ళు విరగగొట్టి తమ హక్కులను రక్షించుకోండని ప్రబోధం చేశారు. అలా చేసేందుకు అనువగు ఉద్రిక్తత, సంఘటితశక్తి చేకూర్చారు. ప్రభుత్వ అండతో తమకు వ్యతిరేకంగా వున్న దొరలు ఇండ్లు నేలమట్టం చేయడం, పశుసంపదను, పంటను ధ్వంసం చేయడం, దోపిడీ చేయడం, చివరకు చంపించడం చేస్తే వారికి వ్యతిరేకంగా సాయుధ పోరాట బలాన్ని పెంచారు. అబ్కారీ పాటలు దొరలు పాడి అధికారులకు మామూళ్లు కల్లుగీత పారిశ్రామికుల చేత యిప్పించే ఆచారాన్ని రూపుమాపారు. దొరల పొలాలకు పెంటను రైతులు వంతులుగా పోసి వ్యవసాయం చేసే పద్ధతి తుదముట్టించారు. ఎక్కువ కూలి యిచ్చినా దొరల భూములు చేయనిదే ఎక్కడకూ పోకూడదనే ఆచారాన్ని తొలగించారు. దొరల గ్రామాల నుంచి మెయిన్ రోడ్డు నుంచి ఒక్క పైసా యివ్వకుండా వేసిన రోడ్లను హరిజనులు పరిరక్షణ చేసే పద్ధతి రూపు మాపేటట్లు చేశారు. వైశ్యులు యీ దొరల గోదాము లందుగల ధాన్యాన్ని కొలిచే ఆచారం ఆయా గ్రామాల యందు యింటికి నాగులపై పోసి లెక్కలు వ్రాసే పద్ధతి తుదముట్టించబడింది, బాలింతలు, రజస్వల అయిన వారిపై బలవంతంచేసే దృశ్యాలు, నీచకృత్యాలు

తొలగించారు. తమ ఆధిపత్యాన్ని రుజువు చేసేందుకు కాబోలు మంగళ్ళ చేత ప్రతీ రోజు దున్న పోతులకు పోతు దున్నలకు, క్షౌరం చేయించే రోజులు అంతమొందింప చేశారు. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రభుత్వాలతో పోరాడ డానికి కావలసిన ధైర్య స్థైర్యాలు. సాయుధ పోరాట నిర్భయత కమ్యూనిస్టు ప్రజలకి కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం 1944 లో నల్గొండ యిత్యాది జిల్లాలలో శిక్షణ యిచ్చి తోడ్పడింది. దీనికి ఫలితంగా అనేక మంది కార్యకర్తలు వీరస్వర్గమలంకరించారు. అమరజీవి దొడ్డి కొమరయ్య కథను తెలంగాణా రైతాంగంలో యిప్పటికీ పాడుకుంటూనే వుంటారు. అలాగే విసునూరి రామచంద్రారెడ్డి దౌర్జన్యాలను గురించికూడా పాటలు పాడుతుంటారు. ఈ ఉద్యమం నల్గొండ జిల్లాలోని భువనగిరి, జనగాం, సూర్యాపేట తాలూకాలలో ఎక్కువ పేరు గాంచింది. శ్రీ ఆరుట్ల రామచంద్రారెడ్డి దంపతులు, శ్రీ ఆరుట్ల లక్ష్మీ నరసింహారెడ్డి, శ్రీ రావి నారాయణరెడ్డి యీ వర్గ పోరాటానికి నాయకత్వం వహించారు. ఈ వర్గ చైతన్యం జనగాం, భువనగిరి తాలూకా గ్రామాలైన పడిపడిగ నిర్మాల, సీతారాంపురం, విసునూరు, కడివెండి, దేవరుప్పల, చినమాటూరు, పాలకుర్తి, ధర్మాపురం, దాచారం గ్రామాలలో ఎక్కువగా కనిపిస్తుంది. సూర్యాపేట తాలూకా బాలెముల, పాత సూర్యాపేట యిత్యాది గ్రామాలలో కూడా దీని తీవ్రత అగుపడుతుంది. ఈ వర్గ పోరాటమును, దాని ఫలితాలను గురించి తెలుసుకొనుటకై ఆంధ్ర ప్రాంతీయ కాంగ్రెస్ శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు, శ్రీ గొట్టిముక్కల రామచంద్రరాజు, మరికొందరితో కూడిన కమిటీ విచారణ జరిపింది. శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారి నాయకత్వాన మరొక కమిటీ వివరాలు సేకరించింది. పండిట్‌జీ అంతరంగిక కార్యదర్శి కృష్ణగారితో కూడిన మరొక కమిటీ కూడా యీ వివరాలను సేకరించింది. అన్ని కమిటీల సారాంశము, దొరల దౌర్జన్యాలు వున్నవని ప్రజల పోరాటము న్యాయమైనదని పేర్కొనబడింది. కానీ ప్రభుత్వం యొక్క సహాయం దొరలకు లభించి బాధితులకు లభించలేదనే. కమ్యూనిస్టులు వర్గ పోరాటాన్ని తీసిన దానికన్న, వర్గ సమన్వయం చేస్తే బాగుండేదని పలువురభిప్రాయబడ్డారు. వర్గ పోరాటాన్నే నమిన కమ్యూనిస్టులు వారితో ఏకీభవించిన పార్టీలు మాత్రం దీనిని అంగీకరించలేదు. ఏదైనా ప్రజలను సంఘటిత పరచి సాయుధ పోరాటశక్తిని కమ్యూనిస్టుపార్టీ చేయగలిగిందనే మాట సత్యం, ఈ పోరాటాన్ని తెలంగాణా ప్రజాపోరాటమని వారు పేర్కొన్నారు. కానీ దొరలతో జరిగిన యీ వ్యక్తిగత సంఘర్షణలన్నీ 1946 లో నిజాం ప్రభువు భారత యూనియన్‌లో చేరాలనే వుద్దేశంతో తీసిన తెలంగాణా ప్రజాపోరాటం ద్వితీయ ఘట్టానికి నాంది అని చెప్తే బాగుంటుంది.

## తెలంగాణా కాంగ్రెస్ పోరాటము-ప్రథమ ఘట్టము

తెలంగాణా ప్రజలకున్న యిబ్బందులు, కమ్యూనిస్టులు ఏ విధంగా వర్గ పోరాటాన్ని తెచ్చిందీ పైన పేర్కొన్నాను. ఈ సమస్యలనే సమన్వయ పద్ధతిపై పరిష్కరించాలని ఆంధ్ర మహాసభ జాతీయ వాదులు కోరుకున్నారు. కానీ ఆంధ్ర మహాసభ మితవాద నాయకత్వం అటు ప్రభుత్వానికి దగ్గరగా వుండింది. ఈ జమీందారీ ఫ్యూడల్ వర్గాలు, వర్గ పోరాటాలు పోలీసు బలంతో, వ్యక్తిగత బలంతో అణచాలని యత్నించినవి. కానీ రాజకీయ చైతన్యం ఎక్కువ అవుతున్నకొలదీ వారీ విషయంలో విఫలులైనారు. అలాగే ఫ్యూడల్ భూస్వాములకు సాయంచేసి తమ రాజ్యాన్ని నిలుపుకోగలమనే విశ్వాసం ప్రభుత్వానికి కొంత సడలింది. పైగా అప్రదిష్టకు ఎక్కువగా గురి అవుతున్నామని వారు గుర్తించసాగారు. మితవాదులు ఫ్యూడల్ భూస్వాముల యొక్క సహకారంతో జాతీయ ఉద్యమాన్ని కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా నిర్మించగలమన్న విశ్వాసాన్ని కోల్పోయారు. అందుకని ఆంధ్ర మహాసభలోని యువకవర్గ సహాయాన్ని వారు అర్థించక తప్పలేదు. జాతీయ వాదులైన యువకులు కొద్దిమందైనా ఆంధ్ర జాతీయ పక్షం పేరుతో బాగా పుంజుకొని కమ్యూనిస్టులని ఎదుర్కొనగలిగారు. 11 వ ఆంధ్ర మహాసభ భువనగిరిలో కమ్యూనిస్టు ప్రజాశక్తి ఉద్యమాన్ని చిత్రిస్తే మడికొండ మహాసభ నరసింగరావుగారి అధ్యక్షతలో కాంగ్రెస్‌ని ప్రతిబింబింప చేసింది. భువనగిరిలో కమ్యూనిస్టు జండాలు, మడికొండలో కాంగ్రెస్

జండాలు పోటీ బడ్డాయి. ఇది గ్రహించి దొరలు కమ్యూనిస్టులతో లీనం కాలేక మితవాదుల అండన చేరారు. మితవాదులు సైతం కమ్యూనిస్టులతో లీనం కాలేక ఆంధ్ర జాతీయ పక్షంలోని యువకశక్తులని కలుపుకొన యత్నించారు. ప్రభుత్వం సైతం కమ్యూనిస్టులని అణుస్తూ ఫ్యూడల్ భూస్వాముల్ని వదలివేసి మితవాద నాయకత్వంతో మంత్రిత్వాలకై బేరాలు పెట్టారు. నిజాం నవాబు తన మూలసూత్రమైన ఆజాద్ హైద్రాబాదును మరువకుండా సంస్కరణలను తలపెట్టాడు. కానీ అది అంతగా ఫలించలేదు. ఏదైనా ఒక్క విషయం మాత్రం స్పష్టం. 1938 నుంచి 1944 వరకు ఒక చెంప కమ్యూనిస్టులు, మరొకచెంప జాతీయ పక్ష సభ్యులు స్థానిక సమస్యలను తీసుకొని వారివారి విశ్వాసాల ననుసరించి వర్గ పోరాటాలలోనో లేక గాంధేయ సమన్వయ పద్ధతితోనో కృషి సలుప సాగారు. దానికి క్రింది లేఖ తార్కాణము.

22-5-1354F

పూజ్యులగు శ్రీ హయగ్రీవాచార్యులకు,

నమస్కారములు. బొమ్మెర విషయమును మనము మాట్లాడిన పిదప కూడా మాప్పురాలేక పోయినందుకు విచారిస్తున్నాము. శ్రీ కమ్మరి నారాయణ ఆంధ్ర మహాసభలో అభిమానంగా వున్నాడన్న మిషపై అతనికి చాకలి వాడిని రాకుండా చేయడం గ్రామ రైతులతో పని చేయించుకోకూడదని ఆజ్ఞాపించడం అతనికి రావలసిన బాకీలు యివ్వకూడదని యితర ప్రజలకు చెప్పడము లతనికి చాలాకాలమునుండి ఖబ్జాలోవున్న చిన్న యింటి పెరడు గూడా గుంజుకోవడము యివన్నియు యధావిధిగా సాగుతూనే వున్నవి. అతనిని 500 రూ॥లు బదులివ్వమని, లేక కాయితం వ్రాసివ్వమని బలవంతపెట్టి యుండిరి. కానీ యిప్పుడు మాత్రం ఆ విషయం ఎత్తుటలేదు. ఇంతియే........ రెండపది పాఠశాలను గురించి మనకు చెప్పిన విషయములను గురించి ఉత్త బూటకములనియు మీకు యిదివరకే తెల్పియుంటిని. పాఠశాల ఆయనచేత నడువబడుటలేదు. సరికదా ! కొంత సహాయమైనను చేయుటలేదు. బందోబస్తును గురించి రైతులు ఎదురు నిల్చి అడుగుటలేదు. తానేమీ ప్రయత్నం చేయుటలేదు. అయినను యీ విషయంలో మనమంతా కొంత కాలము వేచియుండవలెనుకదా ! లెవీగల్లా విషయములోనూ ఊరి రైతులకు లచట చాలా భూమికలదు. వారందరు ఎంత గల్లా పడినదో బలుకుమీద వేసి యిస్తే తమ గోదాంకు చేర్చి రశీదుతెచ్చి యిచ్చెదమన్న వినక తమ యిష్టప్రకారం ధాన్యము తనకే యిమ్మని బలవంతం చేయుచున్నారు. మరియు ఆవూరి ధాన్యం పన్నులు కూడా చేసి తమ వద్ద వుంచుకుంటున్నారట. ఈ విషయంలో కూడా మీరు కల్పించుకోవలసి వుంటుంది. పై విషయములన్నియు దృష్టిలో వుంచుకొని లెవీ విధానమున క్రమ విధానమును అనుసరించుట మక్తేదారుకు తగిన జాబు వ్రాయదనను కొందును. విషయము లివి. నేనేమో వినయాశ్రయం పెడుతున్నానుకదా ! భారమంతయు మీదే. మిక్కిలేమి వ్రాయుదును.

ఇట్లు
విధేయుడు
చౌడవరపు విశ్వనాధం.

చౌడవరపు విశ్వనాధంగారు ఆంధ్ర జాతీయ పక్ష కార్యవర్గ సభ్యుడు. జనగాం తాలూకాలోని గూడూరు వాస్తవ్యుడు. ప్రజాఉద్యమ నాయకుడు, కాంగ్రెస్ అభిలాషి. ఆయన వ్రాసిన యీ లేఖ కమ్యూనిస్టులకు, కాంగ్రెస్ వారికి దైనందిన గడ్డు సమస్యలు ఎదుర్కొనుటలో ఉద్దేశంలోను, తీవ్రతలోను తేడా లేదని పిస్తుంది. కానీ విధానాలనుబట్టి, శక్తినిబట్టి ఫలితాలు వచ్చినాయని వేరుగా చెప్పనక్కరలేదు. Feudals పై అభ్యుదయ జాతీయ యువక శక్తులు (జాతీయపక్షం) ఎంత ప్రభావం వేసిందో తెలుసుకొనుటకు యీ క్రింది ఉదాహరణం పనికి వస్తుంది. నేను, నా మిత్రులు మితవాదులతో పాటు ఒక దొరవారింట్లో భోజనం చేస్తూంటె ఆ దొరవారు కమ్యూనిస్టులను, కాంగ్రెస్ వారిని గూర్చి వివరిస్తూ జాతీయ ఆంధ్రమహాసభలోని జాతీయ పక్షంవారు లేక అభ్యుదయ శక్తులు పందికొక్కులని, కమ్యూనిస్టు ఆంధ్రమహాసభలోని కమ్యూనిస్టులు నక్కలని పర్ణించారు. నక్కలు అరవగానే కాల్చివేయవచ్చు—పందికొక్కులు గుమ్మంలోని ధాన్యం అయిపోయేంతవరకు మనకేం తెలియదన్నారు. దీన్నిబట్టి జాతీయ పక్షంవారెని చూస్తే వారెంతగా భయపడేవారో ద్యోతకమవుతుంది.

స్వామీ రామానందతీర్థ కమ్యూనిస్టుపార్టీ జాతీయ పక్షం యొక్క శక్తిని గుర్తించే అఖిల భారత సంస్థాన ప్రజామండలి కమ్యూనిస్టులను నియమావళి రీత్యా దూరం చేసేంతవరకు రెండు ఆంధ్ర మహాసభలలోని కమ్యూనిస్టులు జాతీయ అభ్యుదయ శక్తులు ఉమ్మడి కార్యక్రమంపై పని చేయాలని కోరుతూ వచ్చారు. అది కొంతవరకూ ఫలించింది. కానీ కమ్యూనిస్టులు అంతర్జాతీయ పాలసీ దృష్ట్యా జాతీయ ఉద్యమానికి దూరమయ్యారు జాతీయవాదులు జాతీయ తత్వాన్ని మరువలేదు. నాటిని భారత స్వాతంత్ర్య ఉద్యమం ఆకట్టుకుంది. 1941 లో 25000 మంది వ్యక్తి సత్యాగ్రహం చేయడం 1942 లో క్విట్ ఇండియా ఉద్యమం రావడం, 43 లో గాంధీజీ ప్రాయోపవేశం చేయడం, 46 లో కాంగ్రెస్ ఎన్నికలలో విజయం పొందడం, 15 జూలై 1947 న భారతదేశం స్వతంత్రం ప్రకటించడం జాతీయవాదుల నెంతేని ప్రోత్సహించాయి. ఈ విధంగా 1942 నుంచి 46 వరకు పరిసర రాష్ట్రాలు స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తూంటే నిజాం నవాబు యింకా ఆజాద్ హైద్రాబాద్ కలలే కంటూ వచ్చాడు. భారత యూనియన్‌లో చేరేందుకై మరొక పోరాటం అవసర మయింది. నిక ఉద్యమాలలో వర్గ పోరాట మైనా, వర్గ సమన యమైనా ప్రజలను 1946 కల్లా నిజాం నవాబుతో కొనేందుకై ప్రజలను అపసర మైతే సాయుధ పోరాటానికి తీయగలిగిన శక్తిని, మన సత్వాన్ని వారికీయగలిగారు. 1946 రావడంతో తెలంగాణా ప్రజాపోరాటానికి నాంది పలికిన కాంగ్రెస్ కమ్యూనిస్టు శక్తులు విజృంభించాయి.

## తెలంగాణా కమ్యూనిస్టు ప్రజా పోరాటము 1946– ద్వితీయ ఘట్టము

1944 లో బహదూర్ యార్‌జంగు చనిపోయాడు. ఆ తరువాత కాశిం రజ్వీ ఇత్తెహాదుల్ ముసల్మీన్‌కి అధ్యక్షుడయ్యాడు. అతని ఆధ్వర్యంలో వాలంటీర్లు రిక్రూట్ అయ్యారు. వీరిని రజాకార్లనే పేరుతో పిలిచేవారు. వీరికి సైనిక శిక్షణ యీయబడింది. మిలిటరీ దుస్తులు, ఆధునిక ఆయుధాలు, వాహనాలు ఇవ్వబడ్డాయి. పోలీసుదళాలకి వెంటవుండి స్వతంత్ర హైద్రాబాద్ నినాదానికి భిన్నంగా కార్యకర్తలని అణిచేందుకు వీరిని ప్రభుత్వం ఉపయోగించసాగింది. క్రమేణా వీరి బలము ప్రభుత్వ బలాన్ని ధాటించి చేసే దశకు వచ్చింది. అల్ప సంఖ్యాకులుగా ఉన్న ముస్లిం కుటుంబాలను కొన్ని కేంద్రాలకి తీసుకెళ్ళి దానిని రజాకార్ల కేంద్రంగా తయారు చేసేవారు. వారు వివిధ రకాలైన గ్రామాలపై దాడిచేసి ముస్లిమేతరులను చాలా బాధపెట్టేవారు, ఆ విధంగా రజాకార్ల కేంద్ర మైన గ్రామాలలో కొలనుపాక గ్రామ మొకటి. కామ్రేడ్ శ్రీ ఆరుట్ల రామచంద్రారెడ్డి ఇట్టి రజాకార్లను మాయవేషాలతో గట్టిగా సాయుధంగా ఎదిరించిన వారిలో ఒకరు శ్రీ రామచంద్రారెడ్డి వ్రాసిన తెలంగాణా పోరాట స్మృతులు అనే పుస్తకంలో నైజాం వ్యతిరేక పోరాటాన్ని సుభృత రూపంలో నిర్వహించుటకు పార్టీ పిలుపు ఇచ్చిందని వ్రాశారు. అలాగే కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెస్ ఇచ్చిన పోరాట కార్యక్రమాన్ని బలపరుస్తూ ఇంకా అదనపు పోరాట కార్యక్రమాన్ని దానికి జోడించి నైజాం వ్యతిరేక పోరాటం ఈ క్రింది అంశాలతో నడపబడ్డదని వారు చెప్పారు.

1) గ్రామాధికార్ల యిండ్లను చుట్టుముట్టి గ్రామ రికార్డులను స్వాధీన పరచుకొని ఆ రికార్డులను తగుల పెట్టుట.

2) భూస్వాముల ఇండ్లపై దాడులు గావించి వారి స్వాధీనములో గల ఆయుధాలను, తలువార్లను, డాలులు తదితర పరికరాలను స్వాధీనపరచుకొనుట.

3) భూస్వాముల స్వాధీనంలో గల భూములను 200 వందల ఎకరాలను స్వంత సేద్యానికి వదిలి అదనపు భూములు పంపకం చేయుట.

4) భూస్వాములు, దోపిడీదార్లు, నైజాం ప్రభుత్వ ఏజంట్లుగావున్న వారి చర స్థిరాస్తులను స్వాధీన పరచుకొని పంపకం చేయుట.

5) పెట్టుబడిదార్లు, వడ్డీ వ్యాపారులు ప్రజానీకానికి ఇచ్చిన అప్పులను, నాగుల పెచ్చుల గల్లాను ఎగ వేయించుట.

6) ప్రభుత్వ భూముల పంపకం. వ్యవసాయానికి యోగ్యమగు అటవీ భూముల పంపకం.

7) గ్రామ గ్రామాన రక్షక గెరిల్లా దళాల నిర్మాణం.

8) గ్రామాన జైత్రయాత్రల రూపంలో పెద్ద ప్రజా సమీకరణతో కమ్యూనిస్టుపార్టీ జెండా ప్రతిష్టాపన.

9) గెరిల్లా పోరాటాలను నిర్వహించుటకు వున్నత స్థాయి కామ్రేడ్స్ పార్టీ కేంద్ర గెరిల్లా శిక్షణ తరగతులను నిర్వహించుట.

ఈ విధంగా కార్యక్రమాన్ని తలపెట్టిన కమ్యూనిస్టుపార్టీ గెరిల్లా శిక్షణ ఇవ్వ ప్రారంభించింది. 1947 లో మొట్ట మొదటిసారిగా ఆంధ్ర ప్రాంతంలో వున్నతస్థాయి గల కామ్రేడ్స్‌కి శిక్షణ యిచ్చారు. శిక్షణ అనంతరం జరిగిన కార్యక్రమాలలో పలుచోట్ల పలుమంది గాయపడ్డారు. హతులయ్యారు. భువనగిరి తాలూకాలో ఆలేరు రిజర్వు పోలీసులు తుపాకీగుళ్ళకు గురి అయి 5 గురు స్వర్గీయులయినారు. ఇక్కుర్తి, కొల్లూరు మొదలగు గ్రామాలందు కమ్యూనిస్టుపార్టీ జండాలు ప్రతిష్ఠించుటకు జైత్ర యాత్రలు తీయబడ్డాయి. ఈ జైత్రయాత్రలను ఆలేరు పోలీసు అడ్డగించింది. అయినా ప్రజలు భయపడలేదు. పోలీసులు వీరిని చుట్టుముట్టి కాల్పులు సాగించారు. పూసంరోజు వీరయ్య, రొండా పుల్లయ్య, బత్తెం నారాయణ మరణించారు. మరి 60 మంది గుండు దెబ్బలకు గురి అయ్యారు. వీర స్వర్గమలంకరించిన ప్రతి వీరుడు దేశంలో ఉత్సాహ ఉద్రేకాలను పెంచి ఉద్యమాన్ని బలపరచినట్లయింది. అంతేగాక పలు విధమైన కార్యక్రమాలు శతృవులను బలహీన పరచేందుకు కార్యకర్తలు తీసుకున్నారు. శతృవు కేంద్రాలకు తినుబండారాలు, పాలు, పెరుగు, వెళ్ళకుండా చేశారు. లెవీధాన్యం ఇవ్వలేదు. రెవెన్యూ పన్నులు కట్టలేదు. భూస్వాములవద్ద, శతృవుల వద్ద ఉన్న ఆయుధాలను భూముల వంపక కార్యక్రమాని విరివిగా సాగించారు. ఉద్రిక్తమైన వుపన్యాసాలు ఇవ్వబడ్డాయి. ఒక్కొక్కప్పుడు దీనివల్ల యువకులు కమ్యూనిస్టు దళాలలో చేరసాగారు అట్లాచేరినవారిలో కీ॥ శే॥ బెల్లంకొండ మాధవులు, పవుడాల సత్తయ్య, చల్లా పుల్లారెడ్డి. వీరిలో పవుడాల సత్తయ్య, చల్లా పుల్లారెడ్డి, రేణికుంటలో చరిత్రాత్మకమగు పోరాటాన్ని సాగించిన రామిరెడ్డిని నైజాం సైన్యాలు కాల్చి చంపాయి. పోలీసు నాకాలను ప్రజలు చుట్టుముట్టారు. వాసాలమఱ్ఱి నాకా దీనికి గురి అయింది. ఆ నాకాను రక్షించుకునేందుకోసం పోలీసులు కాలి పేదతాయిపల్లె యువకుడొకడు మరణించాడు. దానిపై ప్రజలు ఉద్రిక్తులై ఆ నాకాకు నిప్పంటించారు. పోలీసులు 12 బోర్‌గన్సు, అమెరికన్ రైఫిల్సు వాడుతుండేవాటిని నాటుతుపాకులతో ఎదిరించి వీరిని గాయపరిచారు. ఒడిసెలతోను, దాల్సుజంబియాలతో, కర్రలతో రెండు, మూడువేలమంది రజాకార్లను జగిదేపురంపై దాడి సలిపారు. రజాకార్లతో మూడురోజులు ప్రత్యక్ష పోరాటం జరిగింది. పాశం రామిరెడ్డి, రజాకార్లచే చంపబడ్డాడు.

రజాకర్ నాయకులగోడు తరలించబడాయి. అతని గడివాములు తగులబెట్టబడ్డాయి. పోలీసు శవాలను తీసుకెడుతున్నపుడు రోడ్లలో కందకాలు తీసి ఆ వాహనాలపై బాంబులు వేశారు. ఒకటేమిటి? కుప్తంగా చెప్పాలంటే యుద్ధరంగంలో జరిగే చర్యలన్నీ చిన్నస్థాయిలో తెలంగాణా ప్రజా పోరాటంలో కమ్యూనిస్టులు చేయబూనుకున్నారు, చేశారు. అంతర్జాతీయంగా, జాతీయంగా ఈ కమ్యూనిస్టులు చేసిన పోరాటాన్ని తెలంగాణా ప్రజా పోరాటము అని ప్రచారం కావడంతోను, యీ పేరున గవర్నమెంటు కూడా తమ రికార్డులలో తెలంగాణాప్రజా పోరాటము "Telangana uppraisings" అని అనడంతో తెలంగాణా ప్రజాపోరాటం అనగానే కమ్యూనిస్టులు తీసిన పోరాటం అని గుర్తించడం పరిపాటయింది. ఈ ఉద్యమంలో 4 వేల గెరిల్లా సైన్యం మరి పదివేల స్థానికా ప్రతిఘటనా సైన్యం తయారైందని శ్రీ రావి నారాయణరెడ్డి తెలంగాణా రాజకీయోద్యమ ఉద్యమము అనే వ్యాసంలో పేర్కొనబడింది.

## తెలంగాణా ప్రజా పోరాటము— కాంగ్రెస్ 1946–47

1938 లో స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం జరిగింది. గాంధీజీ సరియైన ఒక్క సత్యాగ్రహి ఉన్నా తమ ధ్యేయం నెరవేరుతుందన్నాడు. స్వామీజీ అందుకు సిద్ధమయ్యాడు. 1941 లో అరెస్టయిన స్వామీజీ విడుదల చేయబడ్డాడు. క్విట్ ఇండియా ఉద్యమం 15 ఆగస్టున ప్రారంభమయింది. స్వామీజి 16–8–42 న నైజాం ఇండియన్ యూనియన్‌లో చేరాలని అతనికి లేఖ వ్రాశాడు. 1943 లో ఆంధ్ర మహారాష్ట్ర, ప్రాంతీయ కమిటీలు మూడు ఒకే కార్య ప్రణాళికతో నడవాలని నిశ్చయానికి వచ్చాయి.

23-6-1944 లో మూడు ప్రాంతీయ కార్యవర్గాలు కలిసి జాయింటు కో ఆర్డినేషన్ కమిటీ ఏర్పాటు చేసుకున్నారు 1944 లో గాంధీజీ విడుదల కావడం, బహాదూర్ యార్ జంగ్ చనిపోవడం, కాశిం రజ్వీ అధికారానికి రావడం జరిగింది. సుబేదక్కన్‌లో నిజాం తన రాజ్యాన్ని వున్నది వున్నట్లుగా వుంచాలని ఒక ప్రకటన చేశాడు.

Subhe - Deccan - Dated 26th July 1944 "Hyderabad-India's Premier State."

"Responsible Govt. as distinct from Representative Government cannot under any conditions be established in those Indian States which have either contracted friendly relations with the British Government under historical treaties are under the protection of the Paramount Power (particularly in the Deccan) for the coditions peculiar to them, their status, position or admitted dignity not only vary with others but have their own importance and significance. In these circumstances the problem does not call for any elucidation for "What is known need not be told."

Subhe-Deccan, dated 29th July 1944 "His Exalted Highness clarifies his previous Firman".

"As after the death of Bahadur Yar Jung, discussion had again (un-necessarily) started among the workers of the Majlis-Ittehad-ul Musalmeen, on the subject referred to, it was thought expedient to clarify it so that everything might appear in its proper light and there is no ambiguity left.

(2) Apart from the details of the Representative form of Government, which can be attained at the proper time not that of the responsible form are contained in the Reforms Scheme (published some years ago). In view of this, the present controversy between the press and the Majlis-Ittehad-ul Mussalman must cease, as it is a wholly fruitless business.

(3) The words "particularly in the Deccan appearing in the brackets of the previous article, mean Hyderabad Deccan.

(4) In short, signs and symptoms indicate that it is impossible that the Indian States will at any time sever the ties of their historical alliance with the paramount power, as history shows that the very existence of their order depends on the British Government, reason and Statesmanship therefore demand that a boon like this, implying as it does their own well-being, should not be given up. This is an admitted fact and cannot be denied.

సంస్కరణల ఉద్యమం దెబ్బతింది. నిజాం నవాబు మితవాదులని తనవైపు అనుకున్నంత పెద్ద పెట్టున తిప్పుకోలేక పోయాడు. మడికొండ జాతీయ మహాసభ జాతీయ వాదులకు నూతన ఉత్సాహాన్ని యిచ్చింది. 1945 లో అఖిలభారత సంస్థాన ప్రజామండలి తన పాలసీ కార్యక్రమాలతో ఏకీభవించని రాజకీయ పక్షాలు, వ్యక్తులు సభ్యులుగావుండే వీలులేదని తీర్మానించింది. 1946 లో సంస్థాన ప్రజామండలి స్థాయి సంఘం పండిట్‌జీ అధ్యక్షతన సమావేశమయింది. కాంగ్రెస్‌పై నిషేధాన్ని తొలగించాలని లేనిచో తీవ్ర చర్య తీసుకోవలసి వస్తుందని అభిప్రాయ పడింది. కమ్యూనిస్టులు దైనందిన సమస్యలు తీసుకొని పోరాటం నలుపుతుంటే కాంగ్రెస్‌వారు కూడా సమన్వయ పద్ధతిపై అదేచేస్తూ వచ్చారు. కానీ దీనికి తోడు జాతీయజండా వందనం ఉద్యమంగా లేవదీశారు. ఆంధ్ర జాతీయపక్ష వార్షికోత్సవం ఖమ్మం జిల్లాలోని దుర్గాలరావు పేటలో జరిగింది. అచట ప్రభుత్వాన్ని వుల్లంఘించి జండా వందనం చేశారు. ఆ తరువాయి వరంగల్ కోటలో కాంగ్రెస్ పతాక వందనం జరిగింది. కాశిం షరీఫ్ తన అనుయాయులతో వచ్చి మొగలయ్యను బల్లెంతో పొడిచాడు. అతను అచ్చటనే చనిపోయాడు. వీరమొగలయ్యకి జోహారు అర్పించబడ్డాయి. ఈ జాతీయ జండా వందనమే 46, 47 భారత్ యూనియన్‌లో విలీనం

కావాలనే ఉద్యమానికి పట్టుకొమ్మగా వుండి పోయింది.

28-10-46 న బిందూగారి అధ్యక్షతన స్టేట్ కాంగ్రెస్ కార్యాచరణ సంఘం ఏర్పాటయింది. సత్యాగ్రహాలు ప్రారంభమయ్యాయి. రజాకార్లను ఎదుర్కొనేందుకోసం బోర్డరు క్యాంపులు (సరిహద్దులలో శిబిరాలు) ఏర్పాటయ్యాయి. తెలంగాణాలో పోలంపల్లి, వేములనర్వ, వత్సవాయి, జొన్నలగడ్డ, పెద్దారం, జయంతి, తిరువూరు, గుడిపట్లగూడెం, జీలుగుమిల్లి, భద్రాచలం, దుమ్ముగూడెం, పరిటాల, మంగుళ్లు, రేపాల, మాచెర్ల, ఎత్తిపోతల, తాళ్ళపల్లి, నెమిలి, కర్నూలు, చాందా, చిలుకూరు, గణువు పాడు ముఖ్యమైన కేంద్రాలుగా పరిగణించబడ్డాయి. బొమ్మకంటి సత్యనారాయణరావుగారు వ్రాసిన హైద్రాబాద్ స్వాతంత్ర్య పోరాటం అనే వ్యాసంలో యీ క్రింది కార్యక్రమాన్ని నిశ్చయించుకున్నట్లు తెలిపారు.

1. పటేలు, పట్వారీలచేత తమ ఉద్యోగములకు రాజీనామాలు యిప్పించి ప్రభుత్వ దస్తరములను స్వాధీనంచేసుకొని, గ్రామాలలో నిజాం పరిపాలనను ప్రథమంగా అంతిమొందించుట.

2. ప్రభుత్వ యంత్రాంగము, రజాకార్ రాక్షసులను ఎదిరించి, లెవీ ధాన్యము యివ్వకుండా ప్రజలను సమీకరించడం, ఆహారం లేకుండా చేయడం.

3. సంస్థానమునకు, భారత యూనియన్‌కి మధ్యనవున్న సరిహద్దులను రూపుమాపుట. దీనికి ముఖ్యమైన (ప్రత్యేకంగా ప్రభుత్వము నిర్మించిన) కరోడ్‌గిరి నాకాలను ధ్వంసము చేయుట.

4. గవర్నమెంటు విశ్రాంతి భవనములు (Guest houses) రజాకార్లకు, నిజాం మిలిటరీకి కేంద్రాలుగా వర్ధిల్లి, అక్కడనుండి ప్రజలపై దాడులు జరిగేవి. అందుచేత వాటిని నిర్మూలించుట

5. గవర్నమెంటుకు ఆదాయమును సమకూర్చి ప్రజలకు తాగుడు పిశాచముద్వారా బానిసత్వాన్ని ప్రసాదించిన అబ్కారీ తాడిచెట్టు, ఈతచెట్టు సమూలంగా నాశనం చేయుట.

6. జలపై దాడులకు మిలిటరీ, రజాకార్లు మోటార్ల రాకుండా బ్రిడ్జీలు పడగొట్టి రహదారి మార్గము ను ధ్వంసము చేయుట.

7. గవర్నమెంటుయొక్క ఆర్ టి.సి. బస్సులను నడవకుండా చేయుట, మరియు రైళ్ళ రాకపోకలను పూర్తిగా స్తంభింపచేసి ప్రభుత్వము పూర్తిగా నాశనమైనదని ప్రత్యక్షంగా ఋజువు చేయుట.

8. గెరిల్లా దళాలను నిర్మించి మిలిటరీ పైన, రజాకార్లపైన మెరుపు దాడులనుచేస్తూ ప్రజలపై దాడి చేయకుండా నిరంతరం వారిని నిరోధించడం.

9. గ్రామములను రిపబ్లిక్‌లుగా ప్రకటించి అక్కడి పన్నులను గవర్నమెంటుకు యివ్వకుండా వసూలుచేసి గ్రామ పరిపాలనకొరకు గ్రామ పంచాయితీలను ఏర్పాటుచేసుకొని, గ్రామరక్షక దళాన్ని నిర్మించుకొని, ప్రజానురంజకంగా పరిపాలనను నడిపించుట

10. కాంగ్రెస్ కార్యకర్తలను ధనవంతులను దోపిడిచేసే విధానం, లూటీలు మొదలైన తప్పుడు కార్యక్రమాల్లో పాల్గొనవద్దని ప్రజలను ప్రత్యేకంగా హెచ్చరించనైనది. కమ్యూనిస్టు పార్టీ యొక్క యీ అనుచితమైన కార్యక్రమానికి చాలా దూరంగా వుండవలెనని హెచ్చరించనైనది. ఆహారము రజాకార్లనుండి, వారి ఏజంట్లనుండి దాడిచేసి తీసుకున్న తర్వాత దానిని ధ్వంసము చేయకూడదనియు, గ్రామ ప్రజలకు పంచియివ్వవలెననియు ప్రత్యేకంగా కార్యకర్తలను కోరనైనది. గమనించదగిన విషయమేమిటంటే కమ్యూనిస్టు పార్టీ మనకు కాకపోతే తగులబెట్టు అనే విధానం ప్రకారం ఆహారాన్ని ధ్వంసము చేయవలెనని కార్యక్రమము యిచ్చియున్నందున ఆ విధానము మంచిదికాదని కాంగ్రెసు కార్యకర్తలను దారితప్పవద్దని సర్క్యులర్ కోరనైనది.

ఈ కార్యక్రమాలకు వలయు సైనిక శిక్షణ యివ్వబడింది. సూయిసైడల్ స్క్వాడ్స్ (ఆత్మహతి దళాలు) తయారు చేయబడ్డాయి. పోరాటాలలో అనేకులు వీరస్వర్గమలంకరించారు. ఖమ్మం పట్నానికి చెందిన రజాకర్ నాయకుడు మహమ్మద్ ఇబ్రహీంను సాయుధుడైన నారాయణ పెబడి అతని వద్ద రైఫిల్ తీసుకొని అతన్ని కాల్చివేశాడు. కానీ నిద్రానమయంలో నారాయణని చుట్టుముట్టి రజాకార్లు చంపివేశారు. రామకోటేశ్వరరావు ప్రభృతులు గానుగపాడు నాకాపై దాడిచేశారు. రామకోటయ్య బాకు గాయాలకి గురిఅయి చనిపోయాడు. పటేల్ పట్వారీలు

ద ఫరీలను పారవేసి చాలా గ్రామాలలో పన్నులు వసూలు చేయలేదు. లెవీని యివ్వకుండా చేయడం జరిగింది. తాడిచెట్లు, ఈతచె , రిజర్వు ఫారెస్టులు కొట్టివేయబడ్డాయి. రైల్వేలై రాకపోకలు స్తంభింప చేయబడ్డాయి. పరిటాల స్వత త్రం ప్రకటించుకొంది. ఈ విధమైన కార్యక్రమాల కవసరమైన మందుగుండు సామాను కూడా తయారు చేయసాగారు. రేపాల కేంద్రం, నేలమఱ్ఱి కేంద్రంలో యీ మందులు చేయడంలో ఒక కార్యక ర్త చేయిపోయింది. ఉద్యమం పెరుగుతూన్న కొలదీ ఆయుధసేకరణ కూడా ఎక్కువ చేయడం జరిగింది. విరివిగా విరాళాలు వసూలు చేయబడ్డాయి. రేపాల, నేలమఱ్ఱి, సింగవరం, కొక్కిరేణి, సిరిపురం క్యాంపులు కోదాటి నారాయణ రావుగారి అధ్వర్యంలో ప్రముఖ పాత్రను వహించాయి. పర్కాల తాలూకాలో కీ॥ శే॥ యస్. మనోహర్, శ్రీ వీర గోపాలరావు, శ్రీ వాసు దేవరెడ్డి, శ్రీ సహదేవు, శ్రీ రంగాచారి ప్రభృతుల నాయ కత్వంలో మిలిటరీ పోలీసులను సాయుధంగా ఎదిరించి పోరాడారు. కర్నూలు కేంద్రంలో కూడా తంగేటి రామిరెడ్డి, మరి 11 మంది ప్రభుత్వ కాల్పులకు పర్యవసానంగా మరణించారు. అనేకమంది స్త్రీలు బలవంతంగా మానభంగం జరిగినందుకు ఆత్మహత్య చేసుకున్నారు.

కాంగ్రెస్ ప్రజాపోరాటాన్ని ప్రచారం చేసేం దుకై కర్నూలు వద్ద భాగ్యనగర్ ప్రసార కేంద్రం పాగా పుల్లారెడ్డిచే నెలకొల్ప బడింది. ఈ పోరాట దశ తీవ్రత చెందినకొలదీ భారత ప్రభుత్వం బాధ్యత హైద్రాబాద్ ప్రజలపట్ల ఎక్కువయింది. ఎంత యత్నించినా నిజాం కౌంరజ్వీ చేతుల్లోంచి బయట పడి భారత యూనియన్‌లో హైద్రాబాదును విలీనం చేసేందుకు ఒప్పుకోలేదు. చివరకు కాంగ్రెస్ కమ్యూ నిస్టుల తెలంగాణా ప్రజాపోరాటం యొక్క ఫలితంగా ప్రజలు మరింత చైతన్యవంతులై ఆత్మరక్షణకోసం ఆయుధాలు నిజాం పోలీసు, రజాకార్లకు వ తిరేకంగా వుండేదశ దాటి అవసరమైతే నేరుగా యు ప్రకటన చేసే దశకే వచ్చారు. ఆ దశలో భారత భుత్వం కె. యం. మున్షీని హైద్రాబాదులో ఏజంటు జనరల్‌గా వుంచింది. తరువాత పోలీసు చర్య జరిగి నిజాం 17-9-1949 న భారత ప్రభుత్వానికి లొంగిపోయాడు. ఆ తరువాయి 1952 లో ఎన్నికలు జరిగి ప్రజా ప్రభు త్వం కీ॥ శే॥ బూర్గుల రామక్రిష్ణరావుగారి ముఖ్య మంత్రిత్వంలో ఏర్పడడం జరిగింది. ఈ పోరాటంలో జరిగిన నష్టాలు యీ క్రింది విధంగా వున్నాయని శ్రీ బొమ్మకంటి సత్యనారాయణగారు తన హైద్రా బాద్ స్వాతంత్ర్య పోరాట వ్యాసంలో పొందు పరిచారు.

## ఆంధ్రలో నష్టాల వివరం

| నెం. జిల్లాపేరు | లూటీలవ దహనాలవ కలిగిన న ం | గృహ దహనాలు | హత్యలు | మాన భంగాలు | హత మార్చబడ్డ రజాకార్లు | చంపబడ్డ మిలిటరీ, పోలీసు ఉద్యోగస్తులు |
|---|---|---|---|---|---|---|
| 1. వరంగల్ | రూ. 1,18,07,420 | 4221 | 365 | 81 | 31 | 117 |
| 2. నల్గొండ | 1,49,05,900 | 4740 | 398 | 150 | 7 | 19 |
| 3. కరీంనగర్ | 5,93,700 | 132 | 115 | 18 | 1 | 15 |
| 4. అత్రాఫ్ బల్దా | 6,15,500 | 164 | 69 | 40 | — | — |
| 5. మహబూబ్‌నగర్ | 1,20,000 | — | 28 | 100 | 2- | 2 |
| 6. నిజామాబాద్ | 35,05,000 | 325 | 11 | 3 | — | — |
| 7. అదిలాబాద్ | 77,000 | 124 | 12 | 4 | — | 15 |
| 8. మెదక్ | 36,71,800 | 63 | 7 | — | 20 | — |
| మొత్తం | 3,52,96,230 | 9,759 | 1005 | 396 | 67 | 168 |

కుప్తంగా చెప్పాలంటే జాతీయ వాదుల తరపున జరిగిన తెలంగాణా పోరాటం 1946 కు ముందు వర్గ సమన్వయ పద్ధతిపైనను, సత్యాగ్రహ స్వరూపంతోను నడిచింది. స్థానిక సమస్యలపై పోరాటము కాంగ్రెస్‌జండా యీ పోరాటానికి చేయూత నిచ్చాయి. 1946, 47 లో జరిగిన పోరాటము సత్యాగ్రహముతోను బోర్డరు కాంపులు ఏర్పరచిడి ఫెన్సివ్ వైలెన్సు (ఆత్మరక్షణకోసం హింస), పౌర సాయుధ పోరాట రూపంలో జరిగింది, కమ్యూనిస్టులు పోరాటం వర్గ పోరాట స్వరూపాన్ని అంటిపెట్టుకొని వుంది. 1946, 47 నాటి పోరాటంలో సాయుధ పోరాట సూత్రాన్నే వారు పాటించారు. ఏరకమైన పోరాటం వచ్చినా, తీయబడినా వెనకబడ్డ నిజాం రాష్ట్ర ప్రజలని చైతన్యవంతులు చేసి వారిని మనుషులనిపించిందని చెప్పాలి.

కాకపోతే జాతీయవాదులు అంతర్జాతీయ, జాతీయ ఉద్యమాలు ఏ విధంగావున్నా తమ జాతీయ విధులను మర్చిపోలేదు. కమ్యూనిస్టు పార్టీ మాత్రం దీనికి భిన్నంగా వ్యవహరించింది. కామ్రేడ్ కంభంపాటి సత్యనారాయణ సీనియర్ ఆంధ్రదేశంలో అతివాద ఉద్యమాలు అనే శీర్షిక క్రింద కమ్యూనిస్టు ఉద్యమాన్ని గూర్చి యీ క్రింది విధంగా పొందు పరిచారు. ఇది గమనార్హము.

"యుద్ధానికి పూర్వం అతివాద పా లలో ప్రముఖ స్థాన మలంకరించిన కమ్యూనిస్టు పా తన అంత తీయ క ర్తవ్యాన్ని నిర్ణయించడంలో తీయ విధు విస రించి ప్రజల సామ్రాజ్య వ్యతిరేక చైతన్యాని భిన మైన నినాదాలను చేపట్టింది. ఉదాహరణకు ఫా స్టు వ్యతిరేక యుద్ధానికి "ప్రజాయుద్ధ" మని పిలిచింది. కాంగ్రెస్ ముస్లిం లీగుల మధ్య ఐక త్యను సాధించాలనే ఉద్దేశంతో సి ంతాన్ని వక్ర ్యం చేసింది. కార్మికులు యు కృషికి తోడ్ప టటు చేయడానికి సమ్మెలను ్యతిరేకించింది. అధికాహారోత్ప త్తికై రైతు, కూలీల ప్రయోజనాలను విస్మరించింది. యుద్ధాన్ని, యుద్ధ కృషినీ వ్యతిరేకించే దేశభ కుల్ని "పంచమాంగ దళం" అని నిందిం ంది. ఈ నినాదాలను "ప్రజాశ క్తి" వారపత్రిక "ప్రజా క్తి" దినపత్రిక ద్వారా ప్రచారం చేసింది. 194 లో విజయవాడలో జరిగిన కమ్యూనిస్టు పార్టీ మూడవ మహాసభ యీ పంథాను ధృవీకరించింది.

మొ త్తంమీద 1941 నుండి 1945 వరకు కమ్యూనిస్టు పార్టీ చేపట్టిన రాజకీయ విధానం జాతీయోద్యమం నుంచి దాన్ని దూరం చేసింది.

కానీ ప్రజల నిత్య జీవితంతో ఆంధ్ర కమ్యూనిస్టులు అతి సని హితంగా పెనవేసుకు పోవడంవల్ల ముఖ్యంగా యు ంవల్ల దాపురించిన కష్టాలు, బాధలు, యిబ్బందుల్లో జల కండగా వుండడంవల్ల యుద్ధం సమాప్తమైన వెంటనే వారు తమ బలాన్ని తిరిగి పుంజుకో గలిగారు.

యుద్ధం సమాప్త మయ్యాక చర్చలు ఆత్మ విమర్శనద్వారా కమ్యూనిస్టుపా తన లోపాలను గురించి తిరిగి జాతీయోద్యమ వె పలో సముచిత ్నం అలంకరించింది. కాంగ్రెస ముస్లింలీగ్ కమ్యూనిస్టు పార్టీ పతాకాలతో దేశ వ్యాప్తంగా ప్రారం మైన నావికుల తిరుగుబాటును బలపర్చింది. హిందూ-ముస్లింల హత్యాకాండను నిరసించడంతో పాటు శాంతి స్థాపనకు కృషిచేసింది. 1947 ఆగష్టు 15 నాటి స్వాతంత్ర్యోత్సవాల్లో కమ్యూనిస్టులు, యితర దేశభక్తులతో కలిసి ఉత్సాహంగా పాల్గొన్నారు. ఈ విధంగా ప్రజా చైతన్యం, ప్రజా సంఘటితశక్తి ఆందోళన హైద్రాబాదుని భారత దేశంలో విలీనమయ్యేటట్లు చేశాయి. నిజాం నవాబు స్వతంత్ర హైద్రాబాదు కలను పగటికలగా మార్చాయి. ఏదైనా తెలంగాణా పోరాటంపై ప్రజా ఉద్యమాలతో ఏ పార్టీ, ఏ వ్యక్తి చేసినా పోలీసు చర్యగానే ముగిసిందని చెప్ప వచ్చు. ఈ ఉద్యమంలో రక్తం ప్రవహించినా, ప్రవహించక పోయినా. త్యాగం చేసినా, చేయకపోయినా బ్రిటిషు వారిని పారద్రోలి నిజాం నవాబును భారత యూనియన్‌లో చేరుటకు తగు వాతావరణం కల్పించిన ప్రతి వ్యక్తి పార్టీ తెలంగాణా పోరాటంలో భారతమాత గౌరవాన్ని యినుమడింప చేయడంలో యథాశక్తి తోడ్పడ్డాడని భావిస్తే యీ తెలంగాణా పోరాటం ప గౌరవము, తృప్తి మనకి లభిస్తుంది. దాని మహ ను మనం అర్థం చేసుకోగలుగుతాము. మన తరు తరాలు వారికి ఆదర్శంగా వుండ గలుగుతాము.

"జై హింద్"

# తెలుగు నాట స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర

## ఆంధ్రదేశంలో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానికి పూర్వరంగం

ఆంధ్రుల చరిత్ర, సంస్కృతి ప్రాచీనమైనవి. ఇప్పటికి దాదాపు మూడువేల సంవత్సరాల క్రితం వెలువడినట్టు భావించబడే ఐతరేయ బ్రాహ్మణంలో ఆంధ్రుల ప్రస్తావన వున్నది. అటుతరువాత చంద్ర గుప్త మౌర్యకాలంలో గ్రీకు రాయబారి మెగస్తనీస్ తన రచనలలో ఆంధ్రులు శక్తివంతమైన స్వతంత్ర రాజ్యాలను, 30 కోటలు, లక్ష పదాతి సైన్యం, రెండు వేల అశ్వదళం, వెయ్యి గజ దళం కలిగి వున్నారని పేర్కొన్నాడు.

వింధ్య పర్వతాల దక్షిణాదిన నివసించే ఆంధ్రులు, మౌర్యసామ్రాజ్యం వెలుపల స్వతంత్ర జనపద (రిపబ్లిక్) రాజ్యాంగం కలిగివుండి, ప్రధానంగా బౌద్ధ మతావలంబకులై వున్నారని అశోక చక్రవర్తి శాసనాలనుబట్టి మనకు అవగత మవుతున్నది. ఆంధ్రుల రాజ్యాన్ని ఆక్రమించడానికి అశోక చక్రవర్తి అత్యంత భీకరమైన కళింగ యుద్ధం చేయవలసి రావడం, ఆ యుద్ధంలో ప్రవహించిన రక్తవాహినులను కాంచి అశోక చక్రవర్తి మనస్సు విరిగిపోవడం ఆయన యుద్ధాలను, హింసను విసర్జించి, చరిత్ర ప్రసిద్ధమైన "అశోక ధర్మాన్ని" ప్రతిపాదించి ఆచరించడం అందరికీ తెలిసిందే.

మౌర్య సామ్రాజ్య పతనానంతరం, ఆంధ్రులకు చెందిన శాతవాహన వంశ రాజులు క్రీస్తుకు పూర్వం 225 సంవత్సరం నుంచి క్రీస్తుశకం 415 సంవత్సరం వరకు, అంటే 640 సంవత్సరాలపాటు, మహారాష్ట్ర, ఉత్తర కొంకణం, బీరారు, గుజరాత్, మాల్వా, దక్షిణాదిన కంచి వరకు గల ప్రాంతాన్ని పరిపాలించారు. ఆ కాలంలోనే, జావా, సుమత్రా, ఇండో - చైనా, మలయా ద్వీపకల్పం మున్నగు దేశాలతో వాణిజ్య సంబంధాలు కలిగి వున్నారు. చైనా, జపాన్, బర్మా దేశాలతో కూడా వ్యాపార సంబంధాలు ఏర్పరచుకొని, పేరు పొందారు.

గత మూడు వేల సంవత్సరాల కాలంలో ఆంధ్రులు ఎప్పటికప్పుడు ప్రగతిశీలమైన భావాలను ఆహ్వానిస్తూ, అలవర్చుకొంటూ ముందుకు సాగిన చరిత్రను పరిశీలిస్తే, మనకు స్పష్టమవుతుంది. బౌ మతం క్షీణించిన పిమ్మట, ఆంధ్రులు నివసించిన లుగునాట వివిధ మత సంస్కరణోద్యమాలకు, శంకర అద్వైతం, బసవలింగ వీరశైవం, రామానుజ వైష్ణవం, వేమన అచలబోధ, వీరబ్రహ్మం, సిద్ధయ్య తత్వాలకు ఆదరణ లభించింది.

భారతదేశ చరిత్రలో ముఖ్యంగా దక్కన్ పీఠ భూమిలో క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దం నుంచే, అంటే శాతవాహన రాజుల కాలంనుంచి, క్రీస్తు శకం 16 వ శతాబ్దం వరకు ఆంధ్రులు ప్రముఖపాత్ర వహిస్తూ వచ్చారు.

కాకతీయ వంశానికి చెందిన తెలుగు రాజు ప్రతాప రుద్రుడు 1323 లో ఢిల్లీ సుల్తాను చేతిలో ఓడిపోవడంతో, కాంచీపురంవరకు విస్తరించిన కాకతీయ రాజ్యం విచ్ఛిన్నమైపోయింది. హెచ్చు ప్రాంతం బహమినీ సుల్తానుల అధీనమై పోయింది. 1518 లో కుతుబ్ షాహీలు గోలుకొండ రాజ్యాన్ని స్థాపించారు.

మరొక వైపున 1336 లో సంగమ వంశానికి చెందిన హరిహర బుక్కరాయ సోదరులు స్థాపించిన విజయనగర సామ్రాజ్యం 1565 వరకు వర్థిల్లింది. 1565 తళ్ళికోట యుద్ధంతో విజయనగర సామ్రాజ్యం కూడా విచ్ఛిన్నమై పోవడంతో కోస్తా (సర్కార్) జిల్లాలు కుతుబ్ షాహీల అధీనమై పోయాయి. ఔరంగజేబు సైన్యాలు కుతుబ్ షాహీలను తుడిచిపెట్టడంతో

తెలుగు ప్రాంతాలు మొగల్ రాజుల అధీనంలోకి పోయాయి.

నిజాం ఉల్ ముల్క్ అసఫ్‌జా 1724 లో హైదరాబాద్ సంస్థానాన్ని స్థాపించాడు. నైజాం నవాబు దక్కన్ పీఠభూమిలో ఫ్రెంచి సేనలను వుంచడానికి 1753 లో ఫ్రెంచి సేనాని బుస్సీకి అనుమతి ఇచ్చాడు. బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ సైన్యం ఫ్రెంచి సేనలను ఓడించి, 1776 లో కోస్తా ప్రాంతమైన ఏలూరు, ముస్తఫనగర్, రాజమండ్రి, శ్రీకాకుళం ప్రదేశాలను ఆక్రమించుకొంది శత్రు దాడుల నుంచి నైజాం నవాబుకు రక్షణ కల్పించే షరతుపై ఈస్టిండియా కంపెనీ 1788 లో గుంటూరు ప్రాంతాన్ని కూడ దఖలు పర్చుకొంది. అనంతరం 1800 సంవత్సరం అక్టోబరు 20 న నైజాం నవాబు ఈస్టిండియా కంపెనీకి రాయలసీమ ప్రాంతమైన కడప, కర్నూలు, అనంతపురం, బళ్ళారి జిల్లాలను దారాదత్తం చేశాడు.

ఈ విధంగా తెలుగు దేశం 1800 సంవత్సరం నుంచి రెండుగా చీల్చబడి, కోస్తా—రాయలసీమ ప్రాంతాలు బ్రిటిష్ పాలనక్రింద, తెలంగాణా ప్రాంతం నైజాం నవాబు పాలనక్రింద, దాదాపు 150 సంవత్సరాలపాటు క్రుంగిపోతూ, విభిన్న సామాజిక, రాజకీయ, సాంస్కృతిక చరిత్రలను సంతరించుకొన్నది.

తెలుగునాట కోస్తా, రాయలసీమ ప్రాంతాలలో ఈస్టిండియా కంపెనీ నిలదొక్కుకుని స్థిరపడడానికి దాదాపు డబ్భై, అరవై సంవత్సరాల కాలం పట్టింది. కోస్తా ప్రాంతంలో స్థానిక జమీందారులు, రాయలసీమలో పాళెగార్లు బ్రిటిష్ పాలనను తీవ్రంగా ప్రతిఘటించారు.

ఈ సందర్భంలో గంజాంజిల్లాలోని ఘుంసూర్, పర్లాకిమిడి జమీందారులు, విశాఖపట్నం జిల్లాలో విజయనగరం రాజా, గోలుకొండ గిరిజనులు, కోస్తాజిల్లాలలోని మరికొందరు జమీందారులు జరిపిన తిరుగుబాట్లు పేర్కొనదగినవి.

రాయలసీమ ప్రాంతంలో, 1800 సంవత్సరం నాటికి 80 మంది పాళెగార్లు వున్నారు. వారంతా 18 నెలలపాటు ఈస్టిండియా కంపెనీపై తిరుగుబాట్లు సాగించారు. కర్నూలుజిల్లాలో నరసింహారెడ్డి 1846 లో ఈస్టిండియా కంపెనీపై తిరుగుబాటుచేసి, కోయిలకుంట్ల ఖజానాను దోచుకుని, కంబంపై దాడికి వెడుతుండగా ముండ్లపాడువద్ద కెప్టెన్ వోల్ అడ్డగించాడు. ఆ పోరాటంలో నరసింహారెడ్డి ఓడిపోయి, ప్రక్కనే గల నైజాం రాజ్యంలో దాక్కొన్నాడు. ఆరువారాల అనంతరం నరసింహారెడ్డి తిరిగి కర్నూలు జిల్లాలో ప్రవేశించి, బ్రిటిష్ వాళ్ళకు పట్టుబడ్డాడు. కోయిలకుంట్లలో ఆయనను బ్రిటిష్ వాళ్ళు బహిరంగంగా ఉరి తీశారు. బ్రిటిష్ అధికారి థామస్ మన్రో పాళెగార్ల ఎస్టేట్లన్నింటినీ ఈస్టిండియా కంపెనీ తరపున స్వాధీనం చేసుకొని, పర్మనెంట్ లాండ్ రెవెన్యూ సెటిల్‌మెంటును ప్రవేశపెట్టాడు.

ఆంధ్రదేశంలో అంతకు ముందు ఏలుబడి సాగించిన ప్రభుత్వాలకు, బ్రిటిష్ ఈస్టిండియాకంపెనీ పాలనకు మౌలికమైన తేడావుంది. అంతకు పూర్వపు ప్రభుత్వాలు పన్నులు వసూలుచేసి అనుభవించడం మినహా, ప్రజల ఆర్థిక, రాజకీయ సామాజిక జీవితంలో పెద్దగా జోక్యం కల్పించుకోలేదు. కాని ఆంగ్లేయులు భూసంబంధాలను మార్చుతూ, అనేక శాసనాలను అమలు జరిపారు.

ఈస్టిండియా కంపెనీ కోస్తా జిల్లాలలో అనేక జమీందారీలను ఏర్పాటు చేయటంతోపాటు, కొంత ప్రాంతంలో రైత్వారీ పద్ధతిని, రాయల సీమ ప్రాంతమంతటా రైత్వారీ పద్ధతిని ప్రవేశపెట్టింది. జమీందారీ ప్రాంతాలలో భూమి శిస్తు వసూలుచేసే అధికారాన్ని జమీందార్లకు యిచ్చి, ప్రతిఫలంగా జమీందార్లనుంచి 'పేష్కష్'ను, రైత్వారీ ప్రాంతాలలో రైతులనుంచి నేరుగా భూమిశిస్తును వసూలు చేయసాగింది

## బ్రిటిష్ పాలనా యంత్రాంగం

ఆంధ్రప్రాంతాన్ని అణగదొక్కి, ఆర్థికంగా పీల్చిపిప్పి చేయడానికి అనువైన పరిపాలనా యంత్రాంగాన్ని బ్రిటిషు పాలకులు రూపొందించారు. కోస్తా ప్రాంతాన్ని ఐదు జిల్లాలుగా - గంజాం, విశాఖపట్నం గోదావరి, కృష్ణా, నెల్లూరు కలెక్టరేట్‌లుగా విభజించారు. రాయలసీమ ప్రాంతాన్ని ఆదిలో అనంతపురం కేంద్రంగా ఒకే కలెక్టరేట్‌గా ఏర్పాటు చేశారు. హర్పనహళ్ళి, ఆదోని, కడప, కంబం సబ్ కలెక్టర్లను నియమించారు. తరువాత కడప, కర్నూలు, అనంతపురం, చిత్తూరు జిల్లాలను 1858, 1882, 1911 లలో ఏర్పాటు చేశారు.

## తలెక్షన్ కోసమే కలక్టర్లు

ఈస్టిండియా కంపెనీ కొత్తది. తన అధీనంలోకి వచ్చిన ప్రాంతంనుంచి సాధ్యమైనంత ఎక్కువగా రెవెన్యూ వసూలు చేసేందుకే కలెక్టర్లను నియమించారు. వారంతా తెలుగు భాషరాని ఆంగ్లేయులే. వారిలో ఇద్దరు మాత్రమే – మన్రో, సి.పి. బ్రౌన్‌లు దుబాషీలతో పనిలేకుండా, తెలుగు భాషలో ధారాళంగా మాట్లాడ గలిగినవారు.

ఈస్టిండియా కంపెనీ జమీందారీ ప్రాంతాలలో 'పేష్కష్' రూపంలోను, రైత్వారీ ప్రాంతాలలో భూమిశిస్తు రూపంలోను జమీందార్లను, రైతులను నిర్దాక్షిణ్యంగా పిండుతూ వచ్చింది. అంతకు ముందు వస్తురూపంలో పన్ను చెల్లింపు పద్ధతినిరద్దుచేసి, నగదు రూపంలో పన్ను చెల్లింపు పద్ధతిని ప్రవేశపెట్టింది. 1834లో వ్యవసాయ ఉత్పత్తుల ధరలు విపరీతంగా పడిపోవడంతో, రైతులు నగదు రూపంలో పన్ను చెల్లించే నిమిత్తం వ వ్యాపారులవద్ద అప్పులు చేయవలసి వచ్చింది. ఈస్టిండియా కంపెనీతోపాటు, వడ్డీ వ్యాపారుల పంటా పండింది. దాంతో రైతులు తమ భూములను కోల్పోవలసి వచ్చింది.

## అటవీ సంపద దోపిడీ

ఈస్టిండియా కంపెనీ ఆంధ్రదేశంలోని అటవీ సంపదను దోచుకొనుటకు అనేక మార్గాలు అవలంబించింది: అడవులలో నివసించే గిరిజన కొండజాతి ప్రజలను చతుర్విధోపాయాలతో కొల్లగొట్టింది. చింతపండు, నేరేడు, మామిడి, వెలగ, పనస, ఉసిరి కాయలు, అల్లం, పసుపు, కంది, చిక్కుడు, కంద, చేమ దుంపలు, ఏనుగు దంతాలు, కొమ్ములు, చేకు, తదితర కలప, కరక్కాయ, తుమ్మజిగురు, లక్క, కుంకుళ్ళు, సీకాయ, మైనం, విస్తళ్ళు – ఆదిగాగల అనేక సరుకులను ఆంగ్లేయులు కారుచౌకగా పొంది విపరీతమైన లాభాలు పొందారు.

బ్రిటిష్ పాలనలో దోపిడీ విధానం ఫలితంగా, ఆంధ్రదేశంలోని అన్ని వర్గాల ప్రజలస్థితి క్షీణించి పోసాగింది. పేష్కష్ చెల్లించలేక, అనేకమంది జమీందార్లు క్రమంగా ఎస్టేట్లను కోల్పోతూ వచ్చారు మితిమీరిన భూమిశిస్తు, పన్నుల వల్ల రైతులు ఆర్థికంగా కునారిల్లి అనేక కష్టనష్టాలకు గురయ్యారు. రైత్వారీ ప్రాంతాలలో సరయిన సర్వేరికార్డులు లేవు. పన్నులు అధికంగా వున్నమాట నిజమేనని, ఆనాటి గవర్నరు మన్రో అంగీకరించాడు.

1847లో గోదావరి ఆనకట్ట, 1853లో కృష్ణా ఆనకట్టల నిర్మాణం మినహా, ఈస్టిండియా కంపెనీ ఆంధ్రదేశంలో నీటి పారుదల సౌకర్యాలకు ఎట్టికృషి జరుపలేదు. చెరువులకు మరమ్మతులు చేయక పోవడంతో చెరువుల కింద సాగుభూములన్నీ దెబ్బ తిన్నాయి. 1805 నుంచి 1807 వరకు కోస్తా, రాయలసీమ ప్రాంతాలలో పంటలు పూర్తిగా దెబ్బతిన్నాయి. 1811లో నెల్లూరు కరువు, 1823లో మరోకరువు, 1833లో గుంటూరు కరువు, 1839లో ఆంధ్రదేశమంతటా పంటలు పాడైపోవటం వంటి ఉపద్రవాలకు రైతాంగం లోనైంది అంటారు. కరువులో దాదాపు 5 లక్షల జనాభాలో 2 లక్షలకుపైగా ప్రజలు మలమల మాడి ప్రాణాలు కోల్పోయారంటే పరిస్థితులు ఎంత దారుణంగా వున్నవో వూహించవచ్చు.

## కుప్పకూలిన చేతి వృత్తులు

బ్రిటన్‌లో పారిశ్రామిక విప్లవం విజయవంతమయ్యాక, ఈస్టిండియా కంపెనీ ఆంధ్రదేశంలో విలసిల్లిన వివిధ చేతివృత్తులను, చేతిపరిశ్రమలను సర్వనాశనం చేసే విధానాలను చేపట్టింది.

అంతర్జాతీయ మార్కెట్లలో బరంపురం, పెద్దాపురం, ధర్మవరం సిల్కుకి, శ్రీకాకుళం పట్టు వస్త్రాలకు, ఏలూరు తివాసీలకు, రగ్గులకు, దుప్పట్లకు, బందరు కలంకారీ అద్దకాలకు, నెల్లూరు తువాళ్ళకు విపరీతమైన గిరాకీ వుండేది. 1810 – 1820 మధ్యకాలంలో సాలీనా విశాఖపట్నం నుంచి రు. 7 లక్షల వస్త్రాలు, బందరు నుండి రు. 30 లక్షల వస్త్రాలు, నెల్లూరునుంచి రు. 1,30,000లు వస్త్రాలు ఎగుమతికాగా, 1843 ప్రాంతానికి ఆ ఎగుమతులు పూర్తిగా పడిపోయాయి. 1843 – 44 లో బందరు నుంచి కేవలం రు. 2750ల వస్త్రాలు ఎగుమతిమాత్రమే జరిగింది. అలాగే 1842 – 43లో నెల్లూరు నుంచి రు. 360ల వస్త్రాల ఎగుమతి మాత్రమే జరిగింది.

తెలుగు దేశంలో చేనేత పరిశ్రమను దెబ్బతీసి, బ్రిటిషు జౌళి వస్త్రాలకు ప్రోద్బలం కలిగించేందుకు ఈస్టిండియా కంపెనీ, ఆంధ్రదేశంలోని చేనేత మగ్గాలపై 'మోతుర్ఫా' పన్ను విధించింది. దేశీయ మార్కెట్టులో మన చేనేత వస్త్రాలను దెబ్బతీయడానికి ఒకజిల్లాలోనే అనేకచోట్ల చెక్‌పోస్టు లు ఏర్పాటు చేసి, సుంకం వసూలు చేశారు. దానివ ఆంధ్రదేశంలోని చేనేత కార్మికులు ఉపాధి కోల్పో యి, పొట్టచేత పట్టుకుని, పెద్ద సంఖ్యలో సింహళం, బర్మా, మారిషస్ వంటి ప్రాంతాలకు కూలీలుగా వలస వెళ్ళారు.

దీనితోపాటు హ స్తకళలకు సంబంధించిన వృత్తులు దెబ్బతిన్నా యి. గంజాం, నెల్లూరు, మధ్య నౌకా రవాణా, దానితోబాటు నౌకా నిర్మాణ పరిశ్రమ బాగా దెబ్బతిన్నాయి. ఇనుము, కత్తులు, చాకులు ఉత్ప త్తి చేసే పరిశ్రమలు కూడా మూతబడ్డాయి.

ఈస్టిండియా కంపెనీపాలన దోపిడీ విధానాల మూలంగా, ఆంధ్రదేశంలోని ఆర్థిక జీవనం తారుమా రైపోతుంటే, రెండో వైపున బ్రిటిష్ వాళ్ళు తమ పాలనను సుస్థిరం చేసుకోడానికి క్రయి స్తవ మత ప్రచారకులను దింపి, మతాంతీకరణ కార్యక్రమాన్ని ప్రారంభించారు.

విద్యాబోధన విషయంలో ఆంధ్రదేశాన్ని ఈస్టిండియా కంపెనీ అలక్ష్యం చేసింది. 1813లో కంపెనీ వారు విద్య కోసం కేవలం లక్ష రూపాయలుమాత్రమే కేటాయించారు. మద్రాసు రాష్ట్ర గవర్నరు పదవిని స్వీకరించిన మన్రో విద్యాభివృద్ధికి మద్రాసు రాష్ట్రమంతటికి 40 కలెక్టరేట్ స్కూళ్ళను, 300 తహశీల్‌దార్ స్కూళ్ళను మంజూరు చేశాడు అయితే ఈ పథకం వైఫల్యం చెందినట్లు 1839 లో ప్రకటించబడింది.

విద్యా సంస్థలను ఈస్టిండియా కంపెనీ స్థాపించకుండా, విదేశీ క్రయి స్తవ మతాధికారులకు, ఆ సంస్థలను స్థాపించడానికి ప్రోద్బలమిచ్చింది. హిందువులను క్రయి స్తవులుగా మార్చడానికి, ఆ విద్యాసంలను సాధనంగా వినియోగించారు. అదేదశలో పలుచో సంభవించిన కరువు కాటకాలకు గు రైన గ్రామీ ప్రాంతాలలోని క్షామ పీడితులకు క్రయి స్తవ మతాధికారులు ఆర్థిక సహాయం చేసి, వారిని క్రయి స్తవులుగా మార్చివేశారు; ప్రజలలో బ్రిటిషు వ్యతిరేకభావాలు బలపడడానికి ఇదొక కారణమయింది.

ఈ విధంగా ఈస్టిండియా కంపెనీ పాలన ఫలితంగా, యావత్ భారతదేశంతోబాటు, ఆంధ్రదేశంలో దారిద్ర్యం పెరిగింది. పరిశ్రమలు దెబ్బతిన్నాయి. ప్రజల జీవన స్థితిగతులు అన్నివిధాల క్షీణించిపోయాయి. భారత ప్రధమ స్వాతంత్ర్య సంగ్రామానికి, సైనిక తిరుగుబాటుకు ఆంధ్రదేశంలో పూర్వరంగం ఇది.

# ఆంధ్రదేశంలో తొలి తిరుగుబాట్లు

ఉత్తర భారతంలో మనదేశ ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం - సైనిక తిరుగుబాటు ప్రారంభం కావడానికి పూర్వమే ఆంధ్రదేశంలో రైతులు, ముఖ్యంగా ఏజన్సీ ప్రాంతాలలోని గిరిజనులు బ్రిటిషువాళ్ళపై తిరుగుబాట్లు జరిపారు.

1883లో కాశీపురం, 1834లో అనకాపల్లి, జమీందారుల తిరుగుబాట్లు జరుపగా బ్రిటిషువాళ్ళు వాటిని అణచివేశారు; 1845లో విశాఖపట్నంజిల్లా గూడెం గోలుకొండ ఏజన్సీలలో బ్రిటిషు అధికారుల అక్రమాలకు వ్యతిరేకంగా, ముఠాదారులు, కంట్రాక్టర దోపిడీకి వ్యతిరేకంగా గిరిజనులు తిరుగుబాటు చేసి బ్యారికేడ్లు నిర్మించి, మూడు సంవత్సరాలపాటు వీరోచితంగా పోరాటం సాగించారు. బ్రిటిషు పాలనను స్థంభింప చేశారు. అధికసంఖ్యలో సైన్యాన్ని దింపి, బ్రిటిషువాళ్ళు ఆ తిరుగుబాటును అణచివేశారు.

నిర్దిష్టమైన రాజకీయ లక్ష్యం లేకుండా సాగిన ఈ తిరుబాట్లు సహజంగానే విఫలమైనవి.

---

## తమిళజాతి "బ్రహ్మరథం" పట్టిన తెలుగు యోధుడు కట్టబ్రహ్మన

తమిళజాతి హృదయంలో చిరస్థాయిగా వెలుగొందుతున్న "వీరపాండ్య" కట్టబ్రహ్మన తెలుగువాడని చరిత్రకారులు నిర్ణయించారు. 1865లో జన్మించి, 1899లో బ్రిటిషు ముష్కరులచేత ఉరితీయబడిన వీరపాండ్య కట్టబ్రహ్మన పేరు చెబితేచాలు, నేటికీ తమిళ ప్రజల మేను పులకరిస్తుందంటే అతిశయోక్తి కాదు.

నాడు తిరునల్వేలి జి ప్రాంతంలో పరిపాలిస్తున్న కట్టబ్రహ్మన 1892లో రైతులు, చేతిపని వారలతో మహోద మాన్ని నిర్మించి, దక్షిణప్రాంతాన్ని పాదాక్రాంతం చేసుకొనడానికి దండెత్తి వచ్చిన ' టిషు వలస సైనికమూకకు ఎదురొడ్డాడు. ఆరు సంవత్సరాలపాటు, 1898 వరకు. ఆంగ్ల సైనికమూకను ముప్ప తిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్ళను త్రాగించాడు.

ఎట్టాయపురం యువరాజు ఎట్టప్పన్ ఆంగ్లేయులు పెట్టిన ప్రలోభానికి లోనై విద్రోహిగా మారి, కట్టబ్రహ్మన వున్న రహస్య స్థావరాన్ని తెల్లవాళ్ళకు తెలియజెప్పాడు. ఫలితంగా కట్టబ్రహ్మన బ్రిటిషువాళ్ళ బంధీ అయ్యాడు. నిర్బంధంలో కట్టబ్రహ్మనను ఆంగ్లేయులు ఎన్నోవిధాల, ఎన్నెన్నో ఆశలుచూపి, లొంగదీసుకోవాలని విశ్వ ప్రయత్నం చేసి, విఫలు లయ్యారు. చివరకు గవర్నర్ ఉత్తర్వుమేరకు వీరపాండ్య కట్టబ్రహ్మనను ఉరితీశారు,

ఆయనను ఉరి తీసినచోటు తమిళ ప్రజలకు తీర్థస్థలి అయ్యింది. ఆ స్థలంలో కట్టబ్రహ్మన స్మృత్యర్థంస్థూపంనిర్మించాలని ప్రజలు ప్రయత్నించగా, బ్రిటిషు ప్రభువులు నిషేధించారు.

అయినా ఆ స్థలాన్ని సందర్శించడానికి వెళ్ళే వేలాది, లక్షలాది ప్రజలు ఒక్కొక్క రాయిని తీసుకెళ్ళి, భక్తిపూర్వకంగా అక్కడవేస్తూ వచ్చారు. ఆ రాళ్ళతో అక్కడొక కొండ వెలిసింది.

ఆంగ్లేయులకు కట్టబ్రహ్మన ఆచూకీ తెలిపిన ఎట్టప్పన్ తమిళజాతి చరిత్రలో 'విభీషణుడుగాను' విద్రోహిగాను, కట్టబ్రహ్మన వీరయోధుడుగాను చిరస్థాయిగా నిలిచిపోయారు.

---

## తెలుగుదేశంపై 1857 సమర ప్రభావం

1857 ప్రథమ స్వాతంత్ర్య సమర ప్రభావం ఆంధ్రప్రాంతంలో అక్కడక్కడా, తెలంగాణా ప్రాంతంలో అధికంగాను కానవచ్చింది.

పర్లాకిమిడి జమీందారీలోని సవర తెగకు చెందిన గిరిజనులు దండసేనుని నాయకత్వంలో జరిపిన తిరుగుబాటుకు కెప్టెన్ విల్సన్ నాయకత్వంలో బ్రిటిషు సైన్యం అణచివేసి, దండసేనుడిని ఉరి తీసింది.

అలాగే, గోదావరి జిల్లాలోని కొరటూరుకు చెందిన గ్రామాధికారి సుబ్బారెడ్డి, నానాసాహెబ్ నాయకత్వంలో భారత సైనికులు విజృంభించారన్న వార్త విని, తిరుగుబాటు జరిపాడు ఈ తిరుగుబాటును కూడా బ్రిటిషు సైనికులు అణచివేసి, సుబ్బారెడ్డిని ఉరితీశారు.

ఈ రెండు తిరుగుబాటులు మినహా ఆంధ్ర ప్రాంతంలో 1857 సమర ప్రభావం అంతగా లేదనే చెప్పాలి. అయితే ఆంధ్రప్రాంతంలో విశాఖ పట్టణం, కడప, మచిలీపట్నం వంటి చోట్ల ముస్లిములు బ్రిటిషు వ్యతిరేకతను ప్రదర్శిస్తూ సైనిక తిరుగుబాటుకు మద్దతు ప్రకటించిన దాఖలాలు ఉన్నాయి.

### తెలంగాణా ప్రాంతంలో

నిజాం నవాబు బ్రిటిషు అనుకూలతను ప్రదర్శిస్తూ ఉత్తరాదిలో ప్రారంభమైన సైనిక తిరుగుబాటు, దక్షిణానికి విస్తరించకుండా అరికట్టడానికి శతథా ప్రయత్నించాడు.

1857 స్వాతంత్ర్య సమరంలో భారత సైనికులు ఆదిలో సాధించిన విజయ పరంపర వార్తలు విని, హైదరాబాద్ సంస్థానంలోని ముస్లిములు ఉత్తేజితులయ్యారు. అది పవిత్రయుద్ధమని, దాన్ని విజయవంతం చేయాలని మసీదులలో ప్రార్థనా సమయంలో మౌల్వీ అల్లావుద్దీన్ ఉద్బోధించాడు.

### ఔరంగాబాద్ తిరుగుబాటు

ఔరంగాబాద్‌లోని ఈస్టిండియా సైనిక దళంలో బయలుదేరిన కలవరం 1857 జూన్ 23న ప్రమాదకరంగా పరిణమించకుండా, 90 మంది సిపాయిలను బ్రిటిషు అధికారి కెప్టెన్ అబాట్ నిరాయుధం చేసి అరెస్టు చేశాడు. మీర్ ఫైదా అలీ అనే దఫేదారు బ్రిటిషు కేప్టెన్‌ను కాల్చి చంపడానికి జరిపిన ప్రయత్నం విఫలమైంది. మీర్ ఫైదా అలీని ఉరి తీశారు. దాంతో సిపాయిలంతా తిరుగుబాటు చేశారు. ఆ తిరుగుబాటును బ్రిటిషు సైన్యం తేలికగానే అణచివేసింది.

### రెసిడెన్సీపై దాడి

ఔరంగాబాద్ పై సికుల తిరుగుబాటు వార్త విన్నాక, హైదరాబాద్ నగరంలో రోహిల్లా సైనికుల జమేదారు తుర్రాబజ్‌ఖాన్ నాయకత్వంలో 500 మంది ప్రజలు బ్రిటిష్ రెసిడెన్సీపై దాడి జరిపారు. అయితే ఆ దాడి విజయవంతం కాలేదు.

ఈ తిరుగుబాటుకు నాయకత్వం వహించిన తుర్రాబజ్‌ఖాన్‌ను, మౌల్వీ అల్లావుద్దీన్‌ను అరెస్టు చేయమని నైజాం నవాబు ఆదేశించా , ఇద్దరినీ అరెస్టు చేసి, జీవితాంత కారాగారవాసశిక్ష విధించారు- అయితే తుర్రాబజ్‌ఖాన్ జైలునుంచి తప్పించుకొని పారిపోయాడు. ఆయనను తిరిగి అరెస్టుచేసే ప్రయత్నంలో కాల్చి చంపివేశారు. అనంతరం ఆయన శవాన్ని హైదరాబాద్ నగరంలో ఉరితీశారు-కాగా, అండమాన్ దీవుల్లో యావజ్జీవ శిక్ష అనుభవిస్తూ, మౌల్వీ అల్లావుద్దీన్ 1884లో చనిపోయాడు.

### 1862 లో "కుట్ర"

1862 లో హైదరాబాద్‌లో బ్రిటిషు వ్యతిరేక "కుట్ర" జరిగిందని, ఈ కుట్రకు సూత్రధారుడు పీష్వా నానాసాహెబ్ బంధువు, రావుసాహెబ్ పీష్వా అని, ఈ కుట్రకు సంబంధించిన పథకాలు, మధ్యప్రదేశ్, గుజరాత్ ప్రాంతాలకు విస్తరించాయని ఆరోపించబడింది. "రావుసాహెబ్" రామారావు అనే వ్యక్తి 1862 మార్చిలో హైదరాబాద్‌కు వచ్చి, షావుకారు కిషన్‌లాల్‌కు చెందిన బాలాముకుందబాగ్ అనే దేవాలయంలో ఆశ్రయం పొందాడు. ఈ కుట్రకు సంబంధించిన పథకాన్ని హైదరాబాద్‌లో విజయవంతం చేయడానికి అవసరమైన నిధులను సమకూర్చడానికి పూరన్‌మల్ వ్యాపారసంస్థ సిద్ధమైంది, ఆర్మూర్ తాలూకాలోని మార్తామ్ జమీందారు రుక్మారెడ్డి, రాజయ్యరెడ్డి వంటి వారితోబాటు, నైజాం సైనికుల అధిపతి "కంటోన్మెంట్ రాజా" అమృతలాల్ సోదరుడైన తుల్జారామ్ కూడా ఈ కుట్రకు మద్దతుఇచ్చాడు.

ఈ కుట్ర సంగతి వెల్లడి కాగానే, కుట్రదార్లను అరెస్టు చేయడానికి నైజాం మంత్రి సాలార్‌జంగ్ కట్టుదిట్టమైన చర్యలు తీసుకొన్నాడు. మార్చి 4న రావు సాహేబు రామారావును అరెస్టు చేశారు. అయితే, ఆయన స్థానిక ప్రజల సహకారంతో అధికారుల కళ్ళుగప్పి నిర్బంధంనుంచి తప్పించుకొని పారిపోయాడు.

రావుసాహెబ్ రామారావుతోపాటు, ఆయన దివాన్ కృష్ణారావు, మరో తెలుగు స్త్రీ కూడా బాల ముకుంద బాగ్‌నుంచి తప్పించుకు పారిపోయారు.

నైజాం భటులు రామారావును అరెస్టు చేయడానికి కిషన్‌లాల్‌కి చెందిన ఒక ఇంటిని ము డించినపుడు స్థానిక ప్రజలు ప్రతిఘటించి, ఆ । యత్నాన్ని వమ్ముచేశారు. అలాగే నరసింగ గ్రా ంలో రామారావును అరెస్టు చేయడానికి జరిపిన ప్రయత్నం కూడా సఫలం కాలేదు.

ఈ కుట్రకేసులో హైదరాబాద్ ప్రభుత్వం 59 మందిని అరెస్టు చేసింది. వారిలో 40 మందికి వివిధ శిక్షలు విధించింది. రుక్మారెడ్డికి యావజ్జీవశిక్ష విధించి, ఎల్లవేళలా సంకెళ్ళలో బంధించివుంచారు. పిన్నవయసులో వున్న కిషన్‌లాల్ కుమారునికి రు. 75 వేలు జరిమానా వేసి వదిలివేశారు. పూరన్‌మల్ సంస్థకు 10 వేలు జరిమానా విధించారు. రావుసాహేబ్ రామారావుకు ఆశ్రయమిచ్చిన రామ్‌రతన్‌జీని అరెస్టు చేయగానే ఆయన ఆత్మహత్య చేసుకొన్నాడు. ఈ కుట్ర అణచివేయడంతో 1857 స్వాతంత్ర్య సమరం ప్రభావంతో పెల్లుబికిన బ్రిటిషు వ్యతిరేకోద్యమం అంతమైనదని చెప్పవచ్చు.

## చరిత్ర ప్రసిద్ధి చెందిన రంప పితూరీ

దేశం మొత్తంమీద 1857 సైనిక తిరుగుబాటు అణచివేత అనంతరం, ఆంధ్రలోని ఏజన్సీ ప్రాంతాలలో గిరిజనులు 1879-80 సంవత్సరంలో పెద్ద తిరుగుబాటు జరిపారు. అది రంప పితూరీగా చరిత్ర ప్రసిద్ధి చెందింది

ఈస్టిండియా కంపెనీ 1813లో గోదావరి, విశాఖపట్నం జిల్లాలలోని ఏజన్సీ ప్రాంతాల రెవెన్యూ సెటిల్‌మెంట్‌ను రూపొందించింది. దీని ప్రకారం ఒక ప్రాంతానికి "మున్సబుదారు"ను ప్రధానాధికారిగాను, మున్సబుదారుకు సహాయకులుగా అనేకమంది ముఠాదార్లను నియమించారు. ఆ ప్రాంతంలోని శాంతి భద్రతలను కాపాడే బాధ్యత "మున్సబుదారు"ది. ఆయన క్రింది అధికారులుగా, ముఠాదారులు వివిధ కొండలు, గుట్టలు ప్రాంతాలలో నియుక్తులయ్యారు.

## తిరుగుబాటు ప్రారంభం

గోదావరి నదిప్రక్కనే, గోదావరి జలాల్లోని రంప చోడవరం అనే ప్రాంతంలో రంప అరణ్యప్రాంతం వుంది. ఆ ప్రాంతంలోని గిరిజనులు సాయుధులై 1879మార్చిలో తిరుగుబాటు ప్రారంభించారు. నాలుగు నెలల్లో ఈ తిరుగుబాటు దావానలంలా పలు ప్రాంతాలకు-5వేల చదరపుమైళ్ళ విస్తీర్ణం, 20 లక్షల జనాభా కలిగిన ప్రాంతాలకు విస్తరించింది.

కల్లు, సారా త్రాగుడు గిరిజనులకు అలవాటు. అబ్కారీ నిబంధనలు విధించి, దానిద్వారా ఆదాయం పెంచుకోడానికి బ్రిటిషు ప్రభుత్వం "చిగురు పన్ను" విధించింది. ఈ చిగురు పన్ను వసూలుకు సారా పాటలు పెట్టారు, ఆ వేలంపాటలో నెగ్గిన సారా కాంట్రాక్టర్లు "చిగురు పన్ను" వసూలు చేసేవారు, ఈ చిగురు పన్నులో మూడింట రెండు వంతులు "మొదట పన్ను"కు అదనంగా మునసబుదారు విధించారు. ఈ రెండు పన్నుల విధింపుతో అసంతృప్తులైన గిరిజనులు రంప తిరుగుబాటును ప్రారంభించారు. దీనికితోడు సారా కాంట్రాక్టర్లు, మునసబుదారు లిచ్చే లంచాలు తినమరిగిన పోలీసులు గిరిజనులను దారుణంగా వేధించడంతో అగ్నిలో ఆజ్యం పోసినట్టయింది.

ఈ తిరుగుబాటును అణచడానికి బ్రిటిషు ప్రభుత్వం మొత్తం 8 పదాతి రెజిమెంట్లను వినియోగించవలసి వచ్చింది.

ఈ తిరుగుబాట్లకు దారబందాల చంద్రయ్య, సర్దార్ చంగం, పులికాంత సాంబయ్య, కారు తమ్మన్నదొర, బోదులూరు అంబుల్ రెడ్డి, వీరయ్యదొర నాయకత్వం వహించారు.

నైజాం సంస్థానంలోని భద్రాచలం ఏజన్సీ ప్రాంతమైన నూగూరుతాలూకా రేకపల్లెకు కూడా రంపపితూరీ విస్తరించింది.

గిరిజన గెరిల్లాలు పోలీసుస్టేషన్లపై దాడిచేసి, స్వాధీనం చేసుకొన్న ఆయుధాలతోనే ఈ తిరుగు

బాటును 1880 జూలై వరకు సాగించగలిగారు. ఈ తిరుగుబాటును అణచడానికి రెండు మ్ షిప్పులలో బ్రిటిషు సైనికులు రాగా, ఆ రెండు మ్ షిప్పులను గోదావరినదిలో గెరిలాలు ముంచివేశా .

మునసబ్‌దారు మాధవతి రామభూపతిదేవ్ పోలీసులకు లంచం పెట్టి, గిరిజనులను మాత్రమే కాక ముఠాదారులను సైతం దారుణంగా దోపిడీ చేయడంతో, ముఠాదారులు కూడా ఈ తిరుగుబాటులో చేరారు. రంప అడవి చుట్టూ బ్రిటిషు సైన్యాలను మోహరింపచేసి, గోదావరి, శబరి నదీ తీరాలపై సైనిక శిబిరాలను ఏర్పాటుచేసి, సాయుధబలంతో అణచడానికి కట్టుదిట్టమైన చర్యలు తీసుకొన్నారు. తిరుగుదాటు దారుల మధ్య అపోహలు సృష్టించి, కలతలు పెంచారు. రెండవవైపున సల్లివాన్ అనే బ్రిటిషు ఉన్నతాధికారి గోదావరిజిల్లాకు వచ్చి, తిరుగుబాటుకు దారితీసిన మూలకారణాలేమిటో దర్యాప్తు జరిపాడు. మున్సబుదారును తొలగించాడు. దాంతో ముఠాదారులు తిరుగుబాటును బలపర్చడం విరమించి, బ్రిటిషుపక్షాన చేరిపోయారు. తత్పర్యవసానంగా రంపపితూరీ బలహీనపడిపోయింది.

తిరుగుబాటు నాయకుడైన అంబుల్‌రెడ్డిని 1879 చివరభాగంలో బ్రిటిషువారు హత్య చేయించారు. 1880 ఫిబ్రవరిలో దారబందాల చంద్రయ్యను హత్య చేయించారు. 1880 జులైలో మరొక నాయకుడు తమ్మనదొర కూడా చనిపోవడంతో రంపపితూరి అంతమైపోయింది.

# ప్రాచీన నాగరికత విచ్ఛిత్తి- కొత్త శక్తుల పుట్టుక

1857 ప్రథమ స్వాతంత్ర్య పోరాటాన్ని అణచి వేసిన అనంతరం, బ్రిటిషు ప్రభుత్వం భారతదేశంలో ఈస్టిండియా కంపెనీ పాలనను రద్దుచేసి, తన ప్రత్యక్ష పాలనను 1858 లో ప్రవేశపెట్టింది.

భారతదేశంలో పాలనాధికారాన్ని స్వాధీనం చేసుకొంటూ, 1858 నవంబరు 1 వ తేదీన బ్రిటిషు రాణి విక్టోరియా జారీచేసిన అధికార ప్రకటనలో నాలుగు వాగ్దానాలు పొందుపర్చారు.

1. భారతీయులను కూడా బ్రిటిషు పౌరులతోపాటు సమానదృష్టితో చూస్తాం. 2. భారతీయులకు పూర్తి మత స్వేచ్ఛను కలిగిస్తాం. 3. ప్రభుత్వోద్యోగాలలో అర్హతలు, సామర్థ్యం, నిజాయితీ ప్రాతిపదికపై బ్రిటిషు పౌరులతోపాటు సమానదృష్టితో భారతీయులను కూడా నియమిస్తాం. 4. జాతీయ పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడతాం.

ఈ వాగ్దానాలలో ఏ ఒక్కదాన్ని బ్రిటిషు ప్రభుత్వం నిలబెట్టుకోలేదు. పైగా ఆ వాగ్దానాలకు భిన్నంగా వ్యవహరించింది. 1857 సైనిక తిరుగుబాటు అనంతరం భారతదేశానికి వచ్చిన బ్రిటిషు అధికారులంతా భారతీయులను ఆటవికులుగా అంటరానివారిగా పరిగణించసాగారు.

భారతదేశంలోని యూరోపియన్లు నేరాలకు పాల్పడినప్పుడు, వారిని విచారించే అధికారం భారతీయ న్యాయమూర్తులకు కలుగచేయాలని వైస్రాయి లార్డ్ రిప్పన్ చేసిన సూచన మేరకు 1883 లో టిషు పార్లమెంట్‌లో ప్రతిపాదించబడిన ఇల్బ బిల్లుకు వ్యతిరేకంగా ఇంగ్లండులో చెలరేగిన వ్యతి తను సాకుగా చూపి ఆ బిల్లును ఉపసంహరించారు. ఆంగ్లేయ పౌరులతో భారతీయులను సమానదృష్టితో చూస్తామన్న వాగ్దానానికి ఆ రకంగా తిలోదకాలిచ్చారు.

ప్రభుత్వోద్యోగాలలో యూరోపియన్లతోపాటు భారతీయులకు సమాన అవకాశాలు కల్పించగలమని చేసిన రెండవ వాగ్దానాన్ని కూడా అతిక్రమించారు. ఐ. సి. ఎస్. పరీక్షా కేంద్రాన్ని లండన్‌లో మాత్రమే ఏర్పాటు చేశారు. ఆ పరీక్షకు హాజరయ్యే అభ్యర్థుల వయోపరిమితిని 19 సంవత్సరాలుగా నిర్ణయించి, ఆ పరీక్షలకు హాజరుకాగోరే భారతీయులకు సాధ్యమైనన్ని అవరోధాలు కల్పించారు. ఐ. సి. ఎస్. పరీక్షలకు హాజరయ్యే అభ ర్థుల వయోపరిమితిని పెంచాలని దేశంలోని అనేక సం లతోపాటు కాకినాడలో ఏర్పడిన సాహిత్యసమితి కూ భారతీయ. వ్యవహారాల బ్రిటిషు మంత్రికి వినతిపత్రం సమర్పించింది. అయినా ప్రయోజనం లేకపోయింది. 1861 లో భారతీయ వ్యవహారాల బ్రిటిషుమంత్రి ఢిల్లీలోని తన వైస్రాయికి పంపిన అధికార పత్రంలో "సైనిక, వైద్య ఉద్యోగాలకు భారతదేశస్తులు పనికిరారని" పేర్కొన్నాడు.

పోతే, మత విషయాలలో బ్రిటిషు ప్రభుత్వం జోక్యం కల్పించుకోదని, భారతీయులకు పూర్తి మత స్వేచ్ఛ ఒసగగలమని చేసిన మూడవ వాగ్దానానికి విరుద్ధంగా, భారతదేశంలోని క్రైస్తవమత ప్రచారకులకు అన్నివిధాల ప్రోత్సాహమిచ్చారు. క్రైస్తవమత ప్రచారకులు ప్రారంభించిన విద్యాసంస్థలకు గ్రాంట్లు యిచ్చి, ఆ విద్యా సంస్థలలో బైబిల్ బోధనల ప్రచారానికి పూర్తి అవకాశమిచ్చారు.

1805 లో లండన్ క్రైస్తవమిషన్ విశాఖపట్నంలో తన కార్యకలాపాలను ప్రారంభించింది. ఆ మిషన్ తన కార్యకలాపాలను 1922 లో కడపకు విస్తరింపచేసింది. బందరులో రెవరెండ్ నోబెల్ ఆధ్వర్యంలో చర్చి మిషనరీ సొసైటీకార్యకలాపాలు ప్రారంభించారు. అనేకమంది బ్రాహ్మణులను, ఇతర అగ్రకులాల వారిని క్రైస్తవమతంలో చేర్పించటంలో నోబెల్ కృతకృత్యుడయ్యాడు. అదే సమయంలో గుంటూరు జిల్లాలో అమెరికన్ మిషన్ తన కార్యకలాపాలను తీవ్రతరం చేసింది. 1876 లో సంభవించిన ఘోరమైన కాటకాన్ని పురస్కరించుకొని, అమెరికన్ మిషన్ రోజుకి 100 మంది చొప్పున క్రైస్తవ మతంలోకి మార్చగల్గింది.

దేశీయ పరిశ్రమల అభివృద్ధిని ప్రోత్సహించగలమని చేసిన నాల్గవ వాగ్దానం కూడా పాటించబడలేదు.

## పిటీషన్ల శకం

ఆంగ్లేయుల పాలనతో అసంతృప్తి చెందిన భారతీయులు, ముఖ్యంగా విద్యావంతులు కలకత్తా, మద్రాసు వంటి ప్రధానమైన పట్టణాలలో దేశీయ సంస్థలను

స్థాపించారు. అలాంటి సంస్థలలో మద్రాసు నేటివ్ అసోసియేషన్ ఒకటి. అది 1852 ఫిబ్రవరి 26 న ఏర్పడింది. కలకత్తాలో ఏర్పడిన బ్రిటిష ఇండియన్ అసోసియేషన్‌కు అనుబంధంగా కొంతకాలం పనిచేశాక, మద్రాసు నేటివ్ అసోసియేషన్, కలకత్తా సంస్థతో విభేదాలు ఏర్పడటంతో. స్వతంత్ర సంస్థగా పనిచేయ సాగింది.

మద్రాసులోని ఆంధ్రప్రముఖులు మద్రాసు నేటివ్ అసోసియేషన్‌లో సభ్యులుగా చేరారు. ఆ సంస్థ 1859 లో బ్రిటిష । త్వానికి మొదటి వినతి పత్రాన్ని సమర్పించి . క్రైస్తవమత సంస్థలకు ప్రభుత్వం యిస్తున్న గ్రాంట్లు దుర్వినియోగ పర్చబడుతున్నవని, కనుక ప్రభుత్వమే స్కూళ్ళను ప్రారంభించి గ్రాంట్లు పద్ధతి రద్దు చేయాలని ఆ వినతి పత్రంలో కోరారు. ప్రభుత్వోద్యోగులు క్రైస్తవమత కార్యకలాపాలలో పాల్గొనకుండా నిషేధించాలని కూడా అందులో కోరారు.

అదే సంస్థ 1861 లో మరొక వినతి పత్రం సమర్పిస్తూ, అందులో ఈ క్రింది ప్రధానమైన కోర్కెలను పొందు పర్చింది.

1. రైత్వారీ పద్ధతి అమలు జరుపుతున్న ప్రాంతాలలో అధిక శిస్తులు, పన్నులతో రైతులు నానా అవ ల పాలవుతున్నారని, అధిక శిస్తులు, పన్నులు వ ంచ ని రైతుల ఇళ్ళ కప్పులను, నాగళ్ళను, ఎ ల , ధాన్యాన్ని, విత్తనాలను వేలం వేయడం, రై ల అరె చేయడం, పన్ను బకాయిలు పడిన రైతుల బావు , చెరువులలో నీళ్ళు తోడుకోడానికి వీలు లేకుండా ఆటంకాలు కల్పిస్తున్నారని ఆ వినతిపత్రంలో పేర్కొనబడింది.

2. జమీందారీ ప్రాంతాలలో రైతులను జమీందారులు విపరీతంగా దోపిడీ చేస్తున్నారని అందులో వివరింపబడింది.

3. రైత్వారీ,జమీందారీప తులను రద్దుచేసి గ్రామమొత్తానికి ఇంత శిస్తు అని ని యించి వసూలు చేయాలని అందులో సూచింపబడిం .

4. దేశీయ పరిశ్రమలపై విధించిన 'మోతుర్బా' ఇతర పన్నులు, పుల్లరివంటి వాటిని రద్దుచేయాలని అందులో కోరబడింది.

5. పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంట్‌లో మితిమీరిన అవినీతివల్ల నీటి పారుదల సౌకర్యాలు పూర్తిగా దెబ్బతిని, వ్యవసాయం క్షీణించుతున్నదనీ, 6. రో నిర్మాణం జరపక, పేద రైతులతో బలవంతంగా రో వేయిస్తున్నారని అందులో ఉదహరింపబడింది. 7. రె న్యూ శాఖనుంచి పోలీసు శాఖను వేరు చేయాలని 8. ఐ.సి.ఎస్.ను రద్దుచేసి, ఉన్నతాధికార పదవులకు భారతీయులను నియమించాలని అందులో కోరబడింది.

## అప్పుల పాలైన నైజాం

నైజాం సంస్థానంలో మంచి రాబడి వచ్చే బీరారు, ఉస్మానాబాద్, రాయచూర్ జిల్లాలను ఈస్టిండియా కంపెనీకి దారాదత్తం చేయడంతో, నైజాం నవాబు రాబడి తగ్గి రు. 2 కోట్ల 70 లక్షల మేరకు అప్పుల పాలయ్యాడు. అరబ్బులకు, రోహిల్లాలకు తన ఆభరణాలను, సొంత ఎస్టేట్లను నైజాం నవాబు తనఖా పెట్టవలసి వచ్చింది.

1853లో నైజాం దివానుగా నియుక్తుడైన సాలార్ జంగ్, నైజాం ఆర్థిక స్థితిని బాగుపరచడానికి అనేక చర్యలు అమలుజరిపారు; బ్రిటిష వాళ్ళకు నైజాంను రాజకీయంగా గులాంగా మార్చి, బ్రిటిష సైనిక రక్షణ పొందుతూ, నైజాం సైనిక వ్యయాన్ని సాలార్‌జంగ్ బాగా తగ్గించాడు. నైజాంను 18 జిల్లాలుగా విభజించాడు. ప్రభుత్వ సిబ్బందికి భూములిచ్చే పద్ధతి స్థానే, వేతన పద్ధతి ప్రవేశపెట్టాడు.

సాలార్‌జంగ్ విద్యారంగంలో కూడ అనేక సంస్కరణలు ప్రవేశపెట్టి' పరిపాలనకు అవసరమైన సిబ్బందిని తర్ఫీదు చేశాడు. 1855లో దారుల్-ఉల్‌మ్-హైస్కూలు స్థాపించి ఉర్దూతో పాటు ఇంగ్లీషును కూడా బోధించడానికి ఏర్పాటు చేశాడు. 1870, 1872లలో ఇంగ్లీషును బోధించే సిటీ హైస్కూలును, చాదర్‌ఘాట్ హైస్కూలును స్థాపించాడు. 1870లో ఇంజనీరింగ్ స్కూలును స్థాపించాడు. సాలార్‌జంగ్ మృతి అనంతరం 1887లో నిజాం కాలేజీని స్థాపించారు; అలీఘర్‌లో విద్యాసంస్థల స్థాపనకు సర్ సయ్యద్ అహ్మద్‌కు సాలార్‌జంగ్ ఆర్థిక సహాయం అందచేశాడు.

1868లో మద్రాసు-బొంబాయి రైలుమార్గం వేయబడింది. ఈ రైలుమార్గం హైదరాబాదు సంస్థానంలోని

గుల్బర్గా-వాడి పట్టణాలను కలుపుకుంటూ పోవడంతో, హైదరాబాదు నుంచి వాడి వరకు రైలుమార్గాన్ని 1878 లో పూర్తి చేశారు.

హైదరాబాదు సంస్థానం అభివృద్ధికి సాలార్‌జంగ్ ఎనలేని కృషి చేశాడు.

క్రీస్తుకు పూర్వం 3500 సంవత్సరాల క్రితం రూపొందించిన భారతీయ నాగరికత, సంస్కృతి, అనేక విదేశ దాడులకు తట్టుకుని నిలువగలిగింది. గ్రీకులదండ యాత్ర, తురుష్కుల పరిపాలన, మొగలాయిల పరిపాలన వల్లకూడా భారతీయ నాగరికత, సంస్కృతి చెక్కు-చెదరలేదు. భారతీయ నాగరికత, సంస్కృతికి స్వయం సమృద్ధమైన గ్రామం ప్రాతిపదిక, కావడమే దీనికి కారణం.

మనదేశంలో వర్ణవ్యవస్థ కులవృత్తుల ప్రాతిపదికపై ఏ గ్రామానికి ఆ గ్రామం స్వయంసమృద్ధిగా మనుగడ సాగిస్తూ వచ్చింది. గ్రామస్థాయిలోని వ్యవసాయం, పరిశ్రమలు బయట ప్రపంచంతో నిమిత్తం లేకుండా తమ కాళ్ళపై తాము నిలబడుతూ వచ్చాయి. వాటికి బయటినుంచి పోటీ అనే ప్రమాదం ఏర్పడలేదు. కనుకనే భారతీయ నాగరికత అన్ని వేల సంవత్సరాలు మనగలిగింది.

పారిశ్రామిక విప్లవంతో పుట్టిన పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థను బ్రిటిషు వాళ్ళు భారతదేశంలోకూడా ప్రవేశ పెట్టడంతో, స్వయంసమృద్ధమైన గ్రామీణ ఆర్థిక వ్యవస్థ బీటలు వారసాగింది.

స్వయంసమృద్ధమైన గ్రామాలతో పాటు, రాజకీయ ప్రాధాన్యం కలిగిన పట్టణాలు - రాజులు, రాజ బంధువులు నివశించే పట్టణాలు- వర్తక వాణిజ్యాల కేంద్రాలుగా అభివృద్ది చెందాయి. ఈ పట్టణాలలో సమాజంలోని శ్రీమంతులకు అవసరమైన విలాస వస్తువులు ఉత్పత్తిచేసే పరిశ్రమలు అభివృద్ధి చెందాయి. బందరు. నాగపట్నం, ఏలూరువంటి పట్టణ ప్రాంతాలలో జౌళి పరిశ్రమ అంతర్జాతీయఖ్యాతిని ఆర్జించింది. లోహ పరిశ్రమలు, రాతి వస్తువులు, హస్తకళలు. కాగితం పరిశ్రమలు, తోళ్ళ పరిశ్రమలు అభివృద్ధి చెందాయి. ఐరోపాలోని పారిశ్రామిక విప్లవం ప్రభావంతో మన పరిశ్రమలన్నీ కూకటివేళ్ళతో కుప్ప కూలిపోయాయి.

బ్రిటిషు పారిశ్రామిక వస్తువులు, వాడకం వస్తువులు క్రమేణా గ్రామీణ ప్రాంతాలలోకి చొచ్చుకు రావడంతో, గ్రామీణ ఆర్థిక వ్యవస్థ కూడా తారుమారు కాసాగింది.

బ్రిటిషు ప్రభుత్వం మనదేశమంతటా ఒకే రకమైన పరిపాలనా వ్యవస్థను, కేంద్రీకృత వ్య  ను ప్రవేశ పెట్టి, ఇంగ్లీషు బోధనా భాషగా వి-- వ్యవస్థను ఏర్పాటు చేయడంతో అంతవరకు మనదె ప్రజలలో లేని జాతీయభావం రూపొందింది. రెండో వైపున మన దేశంలో బ్రిటిషు ప్రభుత్వం ప్రవేశ పెట్టిన పెట్టుబడి దారీ వ్యవస్థతో, కాలక్రమంలో భారత జాతీయ ఆర్థిక వ్యవస్థ ప్రాదుర్భావం పొందింది. తత్పర్యవసానంగా కొత్త ఆర్థిక వర్గం-జాతీయ బూర్జువావర్గం పుట్టి వృద్ధి చెందసాగింది. ఈ వర్గం బ్రిటిషు మార్కెట్లతో పోటీ పడాలని ఉవ్విళ్ళూరసాగింది. భారత జాతీయ వాదం అభివృద్ధికి ఈ వర్గం పుట్టుక మరింత ప్రోత్సాహమిచ్చింది.

ఆంగ్ల విద్య నభ్యసించిన విద్యావంతులలో బయలు దేరిన జాతీయ భావమే జాతీయోద్యమానికి పునాది అయ్యింది.

# పునర్వికాస యుగం

1858 - 1885 మధ్య కాలంలో, దేశమంతటితో పాటు ఆంధ్రదేశంలో కూడా పునర్వికాసం బాగా పాదు కొన్నది.

క్రైస్తవమత ప్రచారం కోసం బళ్ళారి నుంచి ప్రారంభించిన 'సత్యమాత' మొదటి తెలుగు పత్రికగా వెలువడింది. దానికి పోటీగా క్రైస్తవ మత ప్రచారాన్ని ఎదుర్కొనడానికి 1864 లో మద్రాసు వేద సమాజం వారు 'తత్వబోధిని' అనే తెలుగు పత్రికను ప్రారంభించారు.

ఆంధ్రలో పునర్వికాసయుగ పురుషులైన కందుకూరి వీరేశలింగం పంతులు ఆధునిక తెలుగు స్రష్టగా, తెలుగు వర్ధిల్లడానికి మూల పురుషుడుగా, సాంఘిక సంస్కరణోద్యమ వైతాళికులుగా భాసించాడు.

వీరేశలింగం పంతులుగారు 1874 లో రాజమండ్రి నుంచి 'వివేకవర్ధని' వార పత్రికను ప్రారంభించి, దాని ద్వారా సాంఘిక, సాహిత్య, రంగాలలో సంస్కరణలను ప్రతిపాదించి, ప్రచారం చేశాడు. అనంతరం స్త్రీల కోసం ప్రత్యేకంగా 'సతిహిత బోధిని' 'హాస్య వర్ధని', సత్య సమవర్ధని పత్రికలను ప్రారంభించి బాల్య వివాహాలు, కులవ్యవస్థ, సానివృత్తి మున్నగు వాటికి వ్యతిరేకంగా ప్రచారం చేశాడు. వితంతు వివాహాలను ప్రోత్సహించాడు.

వీరేశలింగం పంతులు ప్రారంభించిన పత్రికలకు పోటీగా, మద్రాసు నుంచి మహా మహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు 'ఆంధ్రభాషా సంజీవి'ని పత్రిక ప్రారంభించారు.

భారత జాతీయ కాంగ్రెసు పుట్టిన సంవత్సరంలోనే 1885 లో ఎ. పి. పార్థసారధి నాయుడు సంపాదకత్వాన మొట్ట మొదటి తెలుగు రాజకీయ వార ప క 'ఆంధ్ర ప్రకాశిక' వెలువడింది. సంకల్పసిదు న జాతీయవాదిగా ఆయన ఆ పత్రికను 25 సంవత్స ల పాటు నడిపాడు.

ఇంచుమించు అదే సమయంలో మద్రాసులో 'మద్రాసునేటివ్ అసోసియేషన్'1858 లో ఏర్పడింది. క్రిసెంట్ ఆంగ్ల వార పత్రిక ప్రారంభించిన గాజు లక్ష్మి నరసుశెట్టి (1806 - 1890) చెన్నపట్టణ స్వదేశీ సంఘం స్థాపించాడు. 1884 లో మద్రాసు మహా జనసభ, కాకినాడ లిటరరీ అసోసియేషన్ ఏర్పడ్డాయి.

ప్రజలలో జాతీయ చైతన్యం కలిగించడానికి ఏర్పడిన మద్రాసు మహా జనసభ తొలి అధ్యక్ష కార్యదర్శులు పి. రంగయ్యా నాయుడు, పి. ఆనందాచార్యులు.

## రాష్ట్రంలో తొలి జిల్లా సంఘం

1885 లో భారత జాతీయ కాంగ్రెస్ ఏర్పడినప్పుడు మద్రాసు రాష్ట్రంలోని 29 జిల్లాలలోను మొట్ట మొదటి జిల్లా సంఘం ఏర్పడినది కృష్ణా జిల్లా లోనే.

1885 లో బొంబాయిలో జరిగిన మొట్ట మొదటి కాంగ్రెస్ మహాసభకు మద్రాసు ఆంధ్ర ప్రముఖులు పి. రంగయ్యా నాయుడు, ఆనందాచార్యులు, ఎన్. ఎన్. నరసింహులు నాయుడు, గుత్తి కేశవపిళ్ళె, అనంతపురం నుంచి ఎన్. వి. జి. పంతులు, బందరు నుంచి ఎన్. వెంకట సుబ్బరాయుడు ప్రతినిధులుగా హాజరై చర్చలలో ప్రముఖ పాత్ర వహించారు.

## తెలుగు పత్రికల ధోరణి

దేశంలో వందేమాతరం ఉద్యమం ప్రభంజనమై వీయడానికి పూర్వం, తెలుగు పత్రికలు ప్రధానంగా సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక అంశాలపై చర్చలు సాగించాయి.

1874 లో 'పురుషార్థ ప్రధాయిని' పత్రిక కలకత్తా, మద్రాసు, బొంబాయిలలోని క్రైస్తవ బిషప్పులు హిందువులను క్రైస్తవులుగా మార్చుతున్నందుకు విమర్శించింది.

అదే దశలో 'లోకరంజని' అనే మరొక తెలుగు పత్రిక ఇంగ్లండులో జరిగే ఐ.సి.ఎస్. పరీక్షలలో ఉత్తీర్ణులైతే తప్ప, హిందువులను ఉన్నతాధికార పదవులకు నియమించరాదని 'బ్రాక్ ఆరో' చేసిన వాదనను నిశితంగా విమర్శించింది. ప్రతి పట్టణంలోను, ప్రతి

గ్రామంలోను నిరుద్యోగులైన నిరుపేద యువకులు వీధులు పట్టుకు తిరగడం కన్పిస్తున్నది. నిస్సహాయులైన బాలురకు విద్య గరిపే ఏర్పాటుచేయాలి ...... వారి బాగోగులు చూడటం ప్రభుత్వ బాధ్యతలలో ఒకటి" అని ఆ పత్రిక రాసింది.

20 వ శతాబ్దం ప్రారంభంలో తెలుగు పత్రికలు రాజకీయాంశాలపై విమర్శలు ప్రారంభించాయి. ఉదాహరణకు 1901 లో 'గౌతమి' పత్రిక "మద్రాసులోని ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు చీఫ్ ఆఫీసులో తాత్కాలికమైన గుమాస్తా ఉద్యోగానికి ముస్లిం అభ్యర్థి కావలెను" అని ప్రభుత్వం జారీచేసిన అడ్వర్టయిజ్ మెంటును ఈ క్రింది విధంగా విమర్శించింది.

"జాతి, మత విభేదాలను అణచివేయడం ప్రభుత్వం విద్యుక్త ధర ం. అలాంటప్పుడు ఒక ప్రభుత్వ ఉన్నతాధికారి అ ప్రకటనచేస్తే, జాతి, మత దురభిమానాలు పెర డమేకాక, దేశంలో ధర్మపాలన వుందా? అన్న సందేహం । జలకు కలుగుతుంది"అని గౌతమి పత్రిక 1901 ఆగ ' 27 వ తేదీ సంచిక సంపాదకీయంలో విమర్శిం ంది.

బ్రిటిషు చక్రవర్తి 7వ ఎడ్వర్డు పట్టాభిషేకం సందర్భంలో భారతదేశ ఖజానా నుంచి పెద్ద మొత్తాన్ని బ్రిటిషు ప్రభుత్వం దుబారా చేయడాన్ని విమర్శిస్తూ, 1902 లో మరొక తెలుగు పత్రిక 'శశికళ' విమర్శించింది. ఇతరబ్రిటిషు వలసలతో పాటు భారతదేశాన్ని సమానార్హతతో చూడటంలేదని ఆక్షేపించింది.

దేశభక్త కొండా వెంకటప్పయ్య బందరు నుంచి ప్రారంభించిన 'కృష్ణా పత్రిక' 1902 లో దక్షిణాఫ్రికాలోని భారతీయుల దుస్థితిని ప్రస్తావించి "న్యాయశాస్త్రం దృష్టిలో అందరూ సమానులు కారా? ఇప్పుడు దక్షిణాఫ్రికాలో సర్వాధికారం బ్రిటిషు ప్రభుత్వానిదే కనుక అక్కడి భారతీయుల అవస్థలను బ్రిటిషు ప్రభుత్వం తొలగించగలదని యావద్భారత జాతి ఆకాంక్షతో ఎదురుచూస్తున్నది."

దీనినిబట్టి, 20వ శతాబ్దం ప్రారంభం నాటికే ఆంధ్రదేశంలో జాతీయవాదం బలంగా వేరూనుతున్నదని గ్రహించవచ్చు.

1857 సైనిక తిరుగుబాటు నిష్ఫలమైన అనంతరం భారతదేశమంతటికి సంబంధించిన రాజకీయ పార్టీ ఏర్పడడానికి దాదాపు 25 సంవత్సరాలు పట్టింది. 1883లో భారతీయ ఐ. సి. ఎస్. ఉద్యోగులు భారతదేశంలో నేరం చేసిన యూరోపియను విచారించి, శిక్షించడానికి అనుమతించే బి ను ప్రాయి రిప్పన్ సలహామేరకు బ్రిటిషు పా మెం లో ఒక బిల్లు ప్రవేశ పెట్టడం - దానికి వ తిరేకంగా భారత దేశంలోని యూరోపియన్ల రక్షణ మితి, అనే పేరుతో ఒక సంస్థను స్థాపించి రు.లక్ష నిధి వసూలు చేసి, ఆందోళన సాగించడంతో జాతీయ రాజకీయ పక్షం స్థాపన అవసరాన్ని భారత నాయకులు గుర్తించారు.

## 1894 లో తెలుగు రైతుల పోరాటం

1894 లో ఏలూరులో జరిపిన కృష్ణాజిల్లా రైతుల మహాసభలో నీటి తీరువా హెచ్చింపుకు వ తిరేకంగా తీర్మాని ం చి, నీటి తీరువాను త ంచేవరకు భూములను సాగుచేయకుండా బీ పెట్టాలని నిర్ణయించబడింది.

1885 చరమాంకంలో హ్యూమ్ చొరవతో భారతీయ జాతీయ కాంగ్రెస్ స్థాపించబడింది. ఐ.సి.ఎస్. ఆఫీసరుగా హ్యూమ్ ఇండియా వచ్చాడు. జిల్లా కలెక్టరుగా, కేంద్ర ప్రభుత్వ కార్యదర్శిగా దేశంలోని పరిస్థితులను ఆయన పూర్తిగా ఆకళింపు చేసుకున్నాడు. భారతీయుల కోర్కెలు సమంజసమని గుర్తించాడు. బ్రిటిషు ప్రభుత్వ వైస్రాయితో ఏకీభవించలేక తన పదవికి రాజీనామా చేసి, సిమ్లాలో స్థిరపడిపోయాడు.

అప్పటికే ఇటలీ విప్లవకారుడైన మాజినీ రచనల వల్ల ప్రభావితుడై సురేంద్రనాథ్ బెనర్జీ ఏర్పాటు చేసిన జాతీయ మహాసభకు పోటీగా హ్యూమ్ భారత జాతీయ కాంగ్రెసును స్థాపించాడు. సురేంద్రనాథ్ బెనర్జీలోని 'విప్లవ' ధోరణి ప్రమాద కరమని హ్యూమ్ తలచాడు. భారతదేశం కలకాలం బ్రిటిష్ దేశంలో అంతర్భాగంగా వుండాలని, భారతదేశంలో ఆంగ్లం అభ్యసించిన వారు మాత్రమే నిజమైన దేశనాయకు

లని, సంస్థానాధీశులు, జమీందారులు, ప్రజలకు నాయకత్వం వహించలేరని గ్రహించి విద్యావంతులైన భారతీయుల కోర్కెలను బ్రిటిషు ప్రభుత్వం గుర్తించాలని హ్యూమ్ భావించాడు.

గవర్నరు లార్డు రిప్పన్ లిబరల్ ధోరణితో నేరము చేసిన యూరోపియన్లను విచారించే అధికారం భారతీయులైన న్యాయమూర్తులకు కలుగజేయాలని, దేశీయ పత్రికలపై ఆంక్షలు విధించిన దేశభాషా పత్రికల చట్టాన్ని రద్దు చేయాలని, స్థానిక స్వపరిపాలన ప్రవేశ పెట్టడం వంటి చర్యలకు ఆంగ్లో - ఇండియన్ల నుంచి తీవ్రమైన వ్యతిరేకత రావడంతో, 1884లో రిప్పన్ తన పదవిని విరమించాడు. దానిపై భారత దేశంలో ఎన్నడూలేని విధంగా నిరసన ప్రదర్శనలు జరిగాయి. ఆ ప్రదర్శనలు చూసి బ్రిటిష్ అధికారులు ఆందోళన చెందారు. అప్పటి భారతదేశ ఆర్థికమంత్రి ఆక్లండ్ క్లోవిన్ "ఇది నిజమా ? దీని ఆంతర్యమేమిటి ? ఆరు బయట లోయలో పడివున్న ఎండు ఎముకలు సైతం సజీవమవుతున్నవా ?" అని ఆశ్చర్యం, ఆందోళన వ్యక్తం చేశాడు.

ఇట్టి స్థితిలో బ్రిటిషు పాలన పట్ల భారత ప్రజల లోని అసంతృప్తి అదుపు తప్పకుండా జాగ్రత్త పడుతూ అలెన్ అక్టోవియన్ హ్యూమ్ అప్పటి వైస్రాయి లార్డు డఫ్రిన్‌ని ఒప్పించి, 1885లో భారత జాతీయ కాంగ్రెస్‌ను స్థాపించాడు.

## మూడు దశలు

భారత జాతీయోద్యమంలో మనకు స్పష్టమైన మూడు దశలు కన్పిస్తాయి 1885 నుంచి 1904 వరకు "విన్నపాలదశ" గాను. 1904 నుంచి 1919 వరకు 'విభ్రమదశ'గాను 1920 నుంచి 1947 వరకు'పోరాట దశ'గాను పేర్కొనవచ్చు.

1891లో నాగపూర్ కాంగ్రెసు మహాసభకు అధ్యక్షత వహించిన ఆనందాచార్యులు తన ప్రసంగంలో బ్రిటిషు ప్రజలకు వాస్తవ విషయాలను తెలియజెప్ప డానికి లండన్‌లో కాంగ్రెస్ మహాసభను జరపాలని, బ్రిటిషు ప్రభుత్వఆధిపత్యంలో భారతదేశ పరిపాలనా వ్యవహారాలలో పాలుపంచుకోవాలని మాత్రమే తాము కోరుకుంటున్నామని పేర్కొన్నాడు.

అయితే, బ్రిటిషు ప్రభుత్వం పట్ల భారత జాతీయ కాంగ్రెస్ నాయకులకు గల భ్రమలు 1904 నాటికి పటాపంచలు కాసాగాయి. 1904లో బాల గంగాధర తిలక్ 'కేసరి' పత్రిక సంపాదకీయంలో 'ఆసియా వాసులు కలకాలం విదేశీయులకు బానిసలుగా పడివుండా లన్న తెల్లవాళ్ళ భావనను పటాపంచలు చేయవలసిన సమయం ఆసన్నమైనదని వ్రాశాడు.

భారత జాతీయ కాంగ్రెసు నాయకులలో బ్రిటిషు వారి పట్ల భ్రమలు తొలగిన వారు స్వరాజ్యం కోసం పోరాటం ప్రారంభించాలని, స్వదేశీ ఉద్యమం ప్రారంభించాలని కోరసాగారు. బాల్, పాల్, లాల్. (బాల గంగాధర్ తిలక్, బిపిన్ చంద్రపాల్, లాలా లజపతి రాయ్) వీరిని తీవ్రవాదులుగా భావించసాగారు.

భారత ప్రజల ఆశలు, ఆశయాలపట్ల నిర్లక్ష్య వైఖరిని అవలంబిస్తున్న బ్రిటిషు ప్రభుత్వం పట్ల, దేశప్రజలలో అసహనం అంతకంతకు అధిక మవుతున్న దశలో, వైస్రాయి లార్డ్ కర్జన్ బెంగాల్ విభజనకు ఒడిగట్టి అగ్నిలో ఆజ్యం పోశాడు. దానితో 'వందేమాతరం' ఉద్యమం దేశంలో భగ్గున మండింది.

1857 సైనిక తిరుగుబాటు అనంతరం భారత దేశంలో బ్రిటిషు పాలనకు వ్యతిరేకంగా చెలరేగిన ఉద్యమం 'వందేమాతరం'. ఈ ఉద్యమంలో ప్రధానంగా విద్యావంతులైన మధ్య తరగతి వారు పాల్గొన్నారు.

50 వేల మంది హాజరైన కలకత్తా సభలో విదేశీ వస్తు బహిష్కరణ శపథం స్వీకరించారు.

బొంబాయినుంచి తిలక్ వెలువరించిన కేసరి,మరాతా పత్రికలు, కలకత్తానుంచి అరవింద ఘోష్ వెలువరించిన 'యుగంతర్' పత్రిక, ఆంధ్రాలోని బందరునుంచి వెలువడిన 'కృష్ణాపత్రిక' జాతీయోద్యమం చేపట్టిన నూతన కార్యక్రమాలను ప్రచారం చేయడంలో ప్రముఖ పాత్ర వహించాయి.

# ఆంధ్రలో "వందేమాతరం" ఉద్యమం

భారతదేశంలో అప్పుడే వేరూని, విస్తరిస్తున్న జాతీయ సంఘీభావాన్ని దెబ్బతీయాలన్న దుర్బుద్ధితో బ్రిటిషు వలస పాలకుల ప్రతినిధి వైస్రాయి లార్డ్ కర్జన్ 1905 జూలై 7 న బెంగాలు రాష్ట్రాన్ని, తూర్పు పశ్చిమబెంగాల్ రాష్ట్రాలుగా విభజిస్తూ ప్రకటన జారీచేశాడు.

బ్రిటిషు సామ్రాజ్యవాదులు కన్నకలలు, వేసుకొన్న అంచనాలు పూర్తిగా తలక్రిందులు చేస్తూ, బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా జాతీయ సంఘీభావం దేశమంతటా ఉవ్వెత్తున ఎగసి, "వందేమాతరం" ఉద్యమరూపంలో ఆసేతు హిమాచల పర్యంతం ప్రభంజనమై వీచింది.

అంతవరకు భారతదేశంలో ఉన్నత వర్గాలకు వాణిజ్యవర్గాలకు మాత్రమే ప్రధానంగా పరిమితమై వున్న జాతీయోద్యమం, బాల్-పాల్-లాల్ (మహారాష్ట్రకు చెందిన బాలగంగాధరతిలక్, బెంగాల్ కు చెందిన బిపిన్‌చంద్రపాల్, పంజాబుకు చెందిన లాలా లజపతిరాయ్) నాయకత్రయ సారథ్యంలో మధ్య తరగతి వర్గాలలో దావానలంలా వ్యాపించింది.

1906-11 సంవత్సరాల మధ్యకాలంలో ఆంధ్రదేశంలోని రాజకీయాలు పూర్తిగా "వందేమాతరం" ఉద్యమంతో ప్రభావితమయ్యాయి. "వందేమాతరం-మందే రాజ్యం" అన్న నినాదం తెలుగునాట బహుళ వ్యాప్తి పొందింది.

1906 లో బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా బారిసాల్ (బెంగాల్) సభలో సింహగర్జన వంటి ప్రసంగం చేసిన సురేంద్రనాథ్ బెనర్జీని అరెస్టు చేసినందుకు నిరసనగా రాజమండ్రి, కాకినాడ, విజయనగరం, గుత్తి వంటి కేంద్రాలలో బహిరంగసభలు నిర్వహించి "వందేమాతరం" గేయాన్ని ఆ సభలలో పాడారు.

1906 డిసెంబరులో కలకత్తాలో దాదాబాయి నౌరోజీ అధ్యక్షతన జరిగిన కాంగ్రెస్ మహాసభకు ఆంధ్రదేశం నుంచి అనేకమంది ప్రతినిధులు హాజరయ్యారు. వారు మహాసభనుంచి స్వరాజ్యం, స్వదేశీ వస్తు విక్రయోద్యమం, విదేశీ వస్తు బహిష్కరణ, జాతీయ విద్య అనే నాలుగు అంశాలకు సంబంధించిన సందేశాలను ఆంధ్రదేశానికి తీసుకువచ్చారు.

"వందేమాతరం" ఉద్యమంతో ఉద్దీప్తులైన తెలుగు విద్యార్థులు అయ్యదేవర కాళేశ్వరరావు, రామశాస్త్రి నాయుడు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, కొమర్రాజు లక్ష్మణరావు, గొల్లపూడి సీతారామశాస్త్రి, చక్రయ్యశెట్టి వంటి వారు 1905 సెప్టెంబరులోనే మద్రాసు బీచ్‌లో "వందేమాతరం" ఉద్యమానికి మద్దతు ప్రకటిస్తూ విద్యార్థుల సభను ఏర్పాటు చేశారు. "స్వదేశ్ మిత్రన్" పత్రిక సంపాదకులు జి. సుబ్రహ్మణ్య అయ్యర్ ఆ సభకు అధ్యక్షత వహించారు. వందల సంఖ్యలో విద్యార్థులు హాజరైన ఆ సభలో నవ యువ తమిళ మహాకవి సుబ్రహ్మణ్యభారతి ఉత్తేజపూరితమైన తన గేయాలతో సభికులను ఉర్రూతలూగించి ఉద్రేకపూరితులను గావించాడు.

స్వదేశీ ఉద్యమ వ్యాప్తికి జాతీయ నిధిని ఏర్పాటు చేయాలన్న నిర్ణయం అదే సభలో గైకొన్నారు. ఎం. ఏ. చదువుతున్న గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఆర్యసమాజ ప్రచారకుడు ఆదిపూడి సోమనాధరావు ఉత్తేజపూరితమైన ప్రసంగాలు చేశారు.

## స్వదేశీ ఉద్యమం

ఆంధ్రదేశంలో "వందేమాతరం" ఉద్యమం స్వదేశీ ఉద్యమరూపం ధరించింది. న్యాయపతి సుబ్బారావు, సుప్రసిద్ధ జర్నలిస్టు సి. వై. చింతామణి, నెల్లూరు, గుంటూరు, కాకినాడ, విశాఖపట్నం, విజయనగరం వంటి పట్టణాలలో స్వదేశీ ఉద్యమ ప్రచారాన్ని చేశారు. గుంటూరులోని వైశ్యులు, స్వదేశీ వస్తువులను మాత్రమే కొని, అమ్మాలని నిర్ణయించారు. స్వదేశీ "గ్లాసు" వస్తూత్పత్తిలో శిక్షణ పొందడానికి కొందరు ఆంధ్ర విద్యార్థులను ప్రత్యేకంగా జపాన్ పంపించారు.

1905లో రష్యా, జపాన్ చేతిలో చావుదెబ్బ తినడంతో భారతదేశంలో జాతీయభావం ఉప్పొంగింది. ఆదిపూడి సోమనాధరావు, జపాన్ చరిత్రను తెలుగులో ప్రచురించి, మునగాల జమీందారుకు అంకితమివ్వడం, శ్రీరామ వీరబ్రహ్మం "జాపనీయం" అనే తెలుగు నాటకం రచించడం, మునగాల జమీందారు తన కుమారులకు జపాను సైనికాధికారులైన "టోగో", "నోగి" అనే పేరులు పెట్టుకోవడం ఇందుకు నిదర్శనం.

స్వదేశీ ఉద్యమ ప్రభావంతో మునగాల జమీందారు బెజవాడలో ఒక నేత ఫ్యాక్టరీని స్థాపించాడు. పెద్ద పట్టణాలలో స్వదేశీ వస్తు విక్రయశాలలు వెలిశాయి.

స్వదేశీ ఉద్యమానికి రాజమండ్రి కేంద్రమైంది. ఆ పట్టణంలోని యువకులు "బాలభారతి సమితి"ని ప్రారంభించి స్వదేశీ ఉద్యమ ఉద్దేశాలను ప్రచారం చేశారు. చిలుకూరి వీరభద్రరావు, గంటి లక్ష్మన్న టంగుటూరి శ్రీరాములు వంటివారు బాలభారతి సమితికి ప్రధానంగా తోడ్పాటు నందించారు. రాజమండ్రి కరణం గున్నేశ్వరరావు కూడా రహస్యంగా స్వదేశీ ఉద్యమానికి, బాలభారతి సమితికి అండదండలు సమకూర్చాడు.

1907 ఫిబ్రవరిలో మహాశివరాత్రి సందర్భంలో బాలభారతి సమితివారు గోదావరినది గట్టున కోటి లింగాల వద్ద పెద్ద ఊరేగింపు, బహిరంగసభ జరిపారు. ఆ బహిరంగసభలో చిలుకూరి వీరభద్రరావు టీచర్ ట్రైనింగ్ పొందుతున్న గాడిచర్ల హరిసర్వోత్తమరావు స్వదేశీ ఉద్యమ లక్ష్యాలను వివరిస్తూ ప్రసంగించారు.

## బిపిన్ చంద్రపాల్ పర్యటన పెల్లుబికిన జాతీయత

అగ్రశ్రేణి జాతియ నాయకులలో ఒకరైన బిపిన్ చంద్రపాల్ పర్యటనను ఆంధ్రదేశంలో ఏర్పాటు చేసినవారు "కృష్ణాపత్రిక" సంపాదకులు ముట్నూరి కృష్ణారావుగారు. 1907 ఏప్రిల్‌లో బిపిన్ చంద్రపాల్ తెలుగుదేశంలో పర్యటన ప్రారంభించారు.

బిపిన్ చంద్రపాల్ విజయనగరం, విశాఖపట్నం, కాకినాడ, రాజమండ్రి, విజయవాడ, బందరు పట్టణాలలో అనేక సభలలో ప్రసంగించి, తెలుగు ప్రజల హృదయాలలో రాజుకొంటున్న జాతీయోద్యమ భావాలను ప్రేరేపించి ప్రజ్వలింపచేశారు.

విశాఖపట్నం, కాకినాడలలో బిపిన్ చంద్రపాల్ రాక సందర్భంలో వి. పూర్ణయ్య, భూపతిరాజు, వెంకటపతిరాజులు సభలు ఏర్పాటు చేశారు. రాజమండ్రిలో 2వేలమంది ప్రజలు బిపిన్ చంద్రపాల్‌కు ఘన స్వాగతమిచ్చారు. "వందేమాతరం" అన్న నినాదం తెలుగు, ఉర్దూ, సంస్కృత భాషలలో ముద్రించిన జెండాలు ధరించిన వందలాది ప్రజలు తమ ప్రియతమ నాయకుడు బిపిన్ చంద్రపాల్‌ను రాజమండ్రి పురవీధులలో వూరేగించి, అడుగడుగునా హారతులు పడుతూ, పూలదండలు వేస్తూ, ఫలాలు సమర్పిస్తూ ఘనంగా సత్కరించారు. విద్యార్థినాయకుడైన గాడిచర్ల హరి సర్వోత్తమరావు జాతీయ నాయకునికి స్వాగత పత్రం సమర్పించి, విద్యార్థులు, ప్రజలు స్వరాజ్య సాధనకు దీక్షబూనగలరన్న ప్రతినను అందులో పొందుపర్చారు.

## ఉత్తేజపూరితమైన చిలకమర్తి పద్యం

రాజమండ్రిలో బిపిన్ చంద్రపాల్ ఆంగ్ల ప్రసంగాలను తెలుగులోకి అనువదించిన చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు ఉత్తేజితులై, ప్రజల్ని ఉద్రూతలూగించిన తెలుగు పద్యాన్ని రచించారు.

"భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై ఏడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుతున్నారు మూతులు బిగయగట్టి"

చిలకమర్తి రచించిన ఈ పద్యం యువతరాన్ని విశేషంగా ఆకర్షించింది. విద్యార్థులు 'తారకమంత్రంగా' దాన్ని కంఠస్థంచేసి పాడటమేకాక, గోడలపై ఆ పద్యాన్ని వ్రాసి, బహుళ ప్రచారం చేశారు.

బిపిన్‌చంద్రపాల్ రాజమండ్రిలో స్వదేశీ స్టోర్సుకు ప్రారంభోత్సవం జరపడమేకాక, పట్టణంలో జాతీయ పాఠశాలను ఏర్పాటుచేయవలసిన అవసరాన్ని వక్కాణించి, నిధి వసూలు చేశారు. కరణం గున్నేశ్వరరావు జాతీయ పాఠశాల స్థాపనకు రు. 1000/- విరాళం యిచ్చారు. తెలుగునాట జాతీయ పాఠశాలల అవతరణకు అక్కడే నాంది ప్రస్తావన జరిపారు.

## తారక మంత్రమైన 'వందేమాతరం'

'వందేమాతరం' నినాదం నిజంగా తెలుగునాట తారకమంత్రమైంది. ఇద్దరు కలుసుకున్నప్పుడు పరస్పరం అభినందించుకొనడానికి 'వందేమాతరం' పర్యాయపదంగా వుపయోగించడం ఆ రోజులలో సర్వసామాన్యమైపోయిందంటే, ఆ పదం ప్రభావం ఎంతో మనం అర్థంచేసుకోవచ్చు.

ఫ్రెడరిక్ ఏంగిల్స్ అన్నట్టు "An idea becomes a force" (భావమే శక్తిగా రూపొందుతుంది) వందేమాతరం నినాదం మహత్తర శక్తిగా రూపాంతరం చెందింది.

ఆ రోజుల్లో 'వందేమాతరం' నినాదం చెవిని పడితే చాలు, తెల్లదొరల వంటినిండా తేళ్ళు, జెర్రులూ పాకినట్టు కంపరంపొంది నిప్పుతొక్కిన కోతుల్లాగా ప్రవర్తించేవారనడానికి కాకినాడ ఉదంతమే నిదర్శనం.

## కాకినాడ ఉదంతం

1907 జూలైలో కాకినాడలో జిల్లా వైద్యాధికారి కెప్టెన్ కెంప్, బగ్గీ వెడుతుండగా, ముగ్గురు కుర్రవాళ్ళు 'వందేమాతరం' నినాదం చేశారు. ఆ నినాదం చెవిన సోకగానే, కంపరంపుట్టి కుపితుడైన ఆ తెల్లదొర గభాలున బగ్గీనుంచి క్రిందకు దిగివచ్చి, ఆ ముగ్గురి కుర్రవాళ్ళలో ఒకనిని—కృష్ణారావును—పట్టుకొని చావచితకకొట్టి, తన కసిని తీర్చుకొన్నాడు. ఫలితంగా ఆ కుర్రవాడు స్పృహను కోల్పోయి క్రింద పడిపోయాడు. అప్పటికీ కసితీరక ఆ తెల్లదొర, ఆ కుర్రవాడి జుట్టుపట్టుకొని, చచ్చిన గేదెదూడను ఈడ్చినట్టు బరబరా పోలీసు స్టేషనుకు ఈడ్చుకుపోయాడు. తాను వైద్యశాఖాధికారై వుండి, కూడా ఆపదలోవున్న ఆ కుర్రవాడికి వైద్యచికిత్స జరిపించలేదు.

## పెల్లుబికిన ప్రజల క్రోధాగ్ని

ఈ వార్త విన్నంతనే, తెల్లవాడు జరిపిన దురంతం గురించి తెలుసుకొన్నంతనే, కాకినాడ పౌరుల హృదయాలలో క్రోధాగ్నులు పెల్లుబికగా వారు కర్రలు చేబూని కొదమ సింహాలై కదనరంగంలోకి దుమికి కెప్టెన్ కెంప్‌వున్న యూరోపియన్ క్లబ్‌ను చుట్టుముట్టారు. అప్పుడు రాత్రి 8-30 గంటల వేళ, కెప్టెన్ కెంప్ తన మిత్రపరివారంతో కలిసి, విందారగిస్తున్నాడు. సుమారు 300 మంది ఆ క్లబ్‌పై రాళ్ళవ ం కురిపించారు. పిరికిపందలైన కెంప్, తదితర త దొరలు లైట్లు ఆర్పేసి, మొదటి అంతస్తులో దాకున్నారు. క్లబ్ భవనం కిటికీలు, ఇతర ఫర్నిచ ధ్వంసమయింది. దాదాపు రు. 2 వేల ఆస్తి నష్టం జరిగినట్టు అంచనా. ఈ వార్త విన్న కలెక్టర్ జె. ఎ. కమింగ్ వెనువెంటనే పోలీసు బలగంతో అక్కడకు వచ్చారు. ప్రదర్శకులు సోడాబుడ్డిని జిల్లాకలెక్టరుపైకి విసరడంతో, కమింగ్ నుదుటికివచ్చి తగిలి, రక్తం జాలువారింది. ఆ విధంగా మెరుపుదెబ్బ తీసిన ప్రజలు పోలీసులకు చిక్కకుండా తప్పించుకు పారిపోయారు.

కెప్టెన్ కెంప్ ఇక కాకినాడలో వుండటం క్షేమకరం కాదని గ్రహించిన కలెక్టర్, తెల్లవాడైన ఆ వైద్యాధికారిని అప్పటికప్పుడే, అర్ధరాత్రివేళ సైకిల్‌పై సామర్లకోటకు, అక్కడనుంచి రాజమండ్రికి, కడకు మద్రాసుకు తరలించాడు. ఆ దెబ్బతో కాకినాడలోని తెల్లదొరలందరూ భయకంపితులై పోయారు. జిల్లా పోలీసు అధికారి రాజమండ్రినుంచి 50 మంది రిజర్వు పోలీసులతో హుటాహుటిని కాకినాడ వచ్చి, తెల్లవాళ్ళకు రక్షణ కల్పించాడు.

ఆంధ్ర రాజకీయ రంగంలో జరిగిన మొట్టమొదటి క్రిమినల్ కేసుగా కాకినాడ ఘటన పరిణమించింది. నా యపతి సుబ్బారావు పంతులు నిందితుల తరపున కో లో వాదించారు. కాకినాడలోని స్వదేశీస్టోర్సు మే జరు, పట్టభద్రుడు అయిన అరిపిరాల లక్ష్మీనరసింహారావు, చిన పేరయ్య, పెద్ద పేరయ్యలకు ఆ కేసులో రెండేళ్ళ కఠిన కారాగారవాస శిక్ష విధించారు. బాపు వెంకట నారాయణ, రామన్న, లక్ష్మన్న, రత్తయ్యలు పది నెలల కఠిన కారాగారవాస శిక్ష పొందారు కాకినాడ పౌరులపై సామూహిక జరిమానా విధించి, క్లబ్‌చుట్టూ కొన్నాళ్ళపాటు పోలీసు కాపలా పెట్టారు. క్లబ్ భవనానికి జరిగిన నష్టానికిగాను రు. 398-13-8 పెనల జరిమానా విధించారు. అయితే, కృష్ణారావును కొట్టినందుకు కెప్టెన్ కెంప్‌కు రు. 300 లు జరిమానా విధించారు.

కాకినాడలో ఏర్పాటుచేసిన ప్రత్యేక పోలీసు క్యాంపును ఎత్తివేయాలని కోరుతూ కె. పేర్రాజు అధ్యక్షతన జరిగిన బహిరంగ సభలో తీర్మానించారు. అప్పీలులో అరిపిరాల లక్ష్మీనరసింహారావు, మరి ఇద్దరు నిర్దోషులుగా తీర్పు చెప్పడంతో, వారు ముగ్గురు విడుదలయ్యారు.

కాకినాడ ఘటన చూడడానికి చిన్నదే అయినా, దాని ప్రాధాన్యం, ప్రాముఖ్యం దృష్ట్యా, దానికి విశేష ప్రాచుర్యం లభించింది. ఆ చిన్ననేరానికి అంతటి తీవ్రమైన శిక్షలు విధించడంద్వారా తెల్లదొరలు తెలుగు ప్రజలను భయపెట్టవచ్చు ననుకొన్నారు.

మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో కాకినాడ దురంతం ప్రస్తావనకు రావడం, కెప్టెన్ కెంప్‌ను కడవకు బదిలీ చేయడం జరిగింది.

## బిపిన్‌చంద్రపాల్ పర్యటన ప్రభావం

ఆంధ్రదేశంలో బిపిన్‌చంద్రపాల్ పర్యటన తెలుగు ప్రజలలో నూతన చైతన్యం విలసిల్లడానికి దారి తీసింది.

"సారవంతమైన నేలలో పాల్ శక్తివంతమైన విషబీజాన్ని నాటాడు. ఈ బీజం మొలకెత్తి కొన్ని తావులలో ఏపుగా ఎదుగుతున్నదన్న విషయాన్ని గుర్తించాలి" అని రాజమండ్రిలోని ఒక క్రైస్తవ మతప్రచారకుడు పాల్ పర్యటన ప్రభావాన్ని గురించి హెచ్చరిస్తూ ప్రభుత్వానికి రాశాడు.

బిపిన్‌చంద్రపాల్ పర్యటన, ప్రసంగాలతో తెలుగు విద్యార్థిలోకం చైతన్య విలసితమైంది. ఇందుకు రాజమండ్రి గవర్నమెంట్ ఆర్ట్సు కాలేజి విద్యార్థులు ధిక్కారధోరణి ప్రత్యక్ష నిదర్శనం.

మార్క్ హంటర్ అనే ఆంగ్లేయుడు ఆ కాలేజీకి ప్రిన్సిపాల్‌గా పని చేస్తున్నాడు. తన కాలేజీ విద్యార్థులు 'వందేమాతరం' నినాదం చేస్తున్నారని, ఊరేగింపులలో పాల్గొంటున్నారని, బాల భారతి సమితిలో సభ్యులుగా చేరుతున్నారనీ, వీధులలో సైకిళ్ళపై తిరుగుతూ, తెల్లవాడు కన్పించగానే 'వందేమాతరం' అని అరుస్తూ, తె వాళ్ళను వేధిస్తున్నారని ఫిర్యాదులు రావడంతో, కాలే విద్యార్థులను కట్టుదిట్టమైన కట్టుబాట్లలో వుంచడాని ప్రిన్సిపాల్ హంటర్ వెంటనే 1907 మార్చి 19 న సమావేశాన్ని ఏర్పాటుచేసి, విద్యార్థులలో ఎవరూ 'వందేమాతరం' నినాదాలు చేయరాదని వూరేగింపులలో పాల్గొనరాదని, బాల భారతిలో సభ్యులుగా చేర రాదని శాసిస్తూ విధి, నిషేధాలను జారీ చేశాడు. ఆ మర్నాడు కాలేజి విద్యార్థి జె. రామచంద్రరావు, గున్నేశ్వరరావును వెంటనిడుకొని కాలేజి హాస్టల్‌కు వెళ్ళి, ।న్సిపాల్ ఆదేశాలను ధిక్కరించవలసిందని విద్యా లకు ఉద్బోధించాడు. ఈ సంగతి తెలిసి న్సిపాల్, మచంద్రరావుకు క రు పెట్టాడు. రామ ంద్రరావు 'వందేమాతరం' బ్యా ధరించి ప్రిన్సిపా ముందు ప్రత్యక్షమయ్యాడు. విద్యార్థి తనను ధిక్కరించడం చూసి, సహించలేకపోయిన ప్రిన్సిపాల్ రామచంద్రరావును కాలేజీ నుంచి సస్పెండ్ చేశాడు, క్షమాపణలు చెప్పకపోతే, కాలేజీ నుంచి బహిష్కరిస్తానని బెదిరించాడు. విధిలేని పరిస్థితులలో రామచంద్రరావు క్షమాపణలు చెప్పి, తిరిగి కాలేజీలో చేరాడు.

రబ్బరు బంతిని ఎంత బలంగా నేలకేసి కొడతామో అంత బలంగానూ అది పైకి లేస్తుంది. ప్రిన్సిపాల్ హంటర్‌కు పాపం ఆ విషయం తెలియదు. విద్యార్థుల తిక్క అణచివేశానన్న నమ్మకంతో ప్రిన్సిపాల్ హంటర్ ఏదో పనిమీద మద్రాసుకు వెళ్ళాడు. ఆయన మద్రాసు నుంచి తిరిగి వచ్చేసరికి, రాజమండ్రిలో పరిస్థితి పూర్తిగా మారిపోయింది.

బిపిన్ చంద్రపాల్ రాజమండ్రిలో చేసిన ప్రసంగాలతో ప్రభావితులైన విద్యార్థుల హృదయాలు 'వందేమాతరం' భావాలతో అట్టుడిగి పోసాగాయి. గవర్నమెంట్ ఆర్ట్సు కాలేజీతోపాటు, తన అధీనంలో గల టీచర్సు ట్రయినింగ్ కాలేజీ విద్యార్థి అయిన గాడిచర్ల హరి సర్వోత్తమరావు బిపిన్ చంద్రపాల్‌కు సమర్పించిన సన్మాన పత్రంలో స్వరాజ్య పోరాటంలో విద్యార్థులంతా పాల్గొంటారని శపథం చేసినట్టు తెలుసుకొన్న ప్రిన్సిపాల్ హంటర్ "అసలే కోతి, పైగా కల్లు తాగింది. దానికి తోడు నిప్పుపై కాలు వేసింది," అన్న చందంగా, 1907 ఏప్రిల్ 24 న జరుగుతున్న ఆరు నెలల పరీక్షలకు హాజరైన ఇంటర్, బి.ఎ. విద్యార్థులంతా 'వందే మాతరం' బ్యాడ్జీలు ధరించి వుండటంచూసి, నివ్వెరపోయాడు. వెంటనే ఆ బ్యాడ్జీలను తీసి పారవేయాలని ఆదేశించాడు. కొందరు బ్యాడ్జీలు తీసివేశారు. మరి కొందరు నిరాకరించారు. దాంతో అంతకు ముందు బ్యాడ్జీలు తీసివేసిన వారు కూడా, తిరిగి వాటిని ధరించి, క్లాసుల నుంచి నిష్క్రమించారు.

విద్యార్థులు తనను ధిక్కరించి క్రమశిక్షణా రాహిత్యానికి పాల్పడినట్లు భావించిన హంటర్ ఆ విద్యార్థులందరినీ మూకుమ్మడిగా సస్పెండ్ చేశాడు. ట్రయినింగ్ కాలేజీనుంచి గాడిచర్ల హరి సర్వోత్తమరావును డిస్మిస్ చేశాడు. బి. ఎ. విద్యార్థి జె. రామచంద్రరావును డిబార్ చేశాడు.

రాజమండ్రి విద్యార్థులను మూకుమ్మడిగా బహిష్కరిస్తూ, 1907 నవంబరు 16 న ప్రభుత్వం జారీచేసిన

ఉత్తర్వు పుణ్యమా అని, 222 మంది విద్యార్థులలో 138 మందిని శిక్షించారు. ఇది చరిత్రలోనే అపూర్వం. ఆంధ్రదేశంలో విద్యార్థులు రాజకీయపోరాటంలో పాల్గొనడానికి ఇది నాందీ ప్రస్తావన అయ్యింది.

రాజమండ్రి విద్యా ల తరపున విజయనగరానికి చెందిన బి. ఎన్. శర , న్యాయపతి సుబ్బారావు పంతులు వంటివారు భుత్వానికి చేసిన విజ్ఞప్తి వల్ల ఎలాంటి ప్రయోజనం కలుగలేదు. రాజమండ్రి విద్యార్థుల చర్యను సమర్థిస్తూ 'దేశాభిమాని' 'కృష్ణాపత్రిక' సంపాదకీయ వ్యాసాలు రాశాయి. ప్రభుత్వోద్యోగాలు లేకపోయినంత మాత్రాన భారతీయులు బ్రతకక లేక పోరు. జాతీయ పాఠశాలలు, కళాశాలలు ప్రారంభించి, భారతీయులు స్వయంగా తమ పిల్లలకు విద్యా బుద్ధులు గరపుకో గలరు అన్న ధోరణిలో 'దేశాభిమాని' పత్రిక సంపాదకీయం వెలువడగా- "విద్యార్థులారా, నిరుత్సాహ పడకండు. న్యాయం మీ పక్షనే వుంది.... స్వరాజ్య సాధనలో మీరు నాయకత్వ పాత్ర వహించగల అవకాశాలు దేవుడు మీకు కలుగజేస్తాడని తప్పక చెప్పవచ్చు." అని కృష్ణాపత్రిక సంపాదకీయం వెలువడింది.

రాజమండ్రి ట్రెయినింగ్ కాలేజీ నుంచి బహిష్కృతుడైన గాడిచర్ల హరి సర్వోత్తమరావు బెజవాడ (విజయవాడ)లో స్థిరపడి, బోడి నారాయణరావుతో కలిసి 'స్వరాజ్య' వారపత్రికను ప్రారంభించాడు.

## బందరులో బిపిన్ చంద్రపాల్

బిపిన్ చంద్రపాల్ రాజమండ్రిలో మూడు రోజుల పాటు అనేక కార్యక్రమాలలో పాల్గొని, బహిరంగ సభలలో ప్రసంగించి, ఏప్రిల్ 24 న విజయవాడ చేరి, అప్పట్లో బందరు నోబుల్ కాలేజీలో విద్య నభ్యసిస్తున్న మునగాల రాజా అతిథిగా వున్నాడు. అయ్యదేవర కాళేశ్వరరావు ఏర్పాటు చేసిన సభలలో స్వదేశీ ఉద్యమం గురించి ప్రసంగించాడు.

విజయవాడనుంచి పాల్ ఏప్రిల్ 26 న బందరు చేరి, బ్రహ్మ సమాజానికి చెందిన రామదాసు నాయుడు అతిథిగా వున్నాడు 26 వ తేదీన హిందూ హైస్కూలు హెడ్మాష్టర్ కృష్ణమాచారి అధ్యక్షతన జరిగిన సభలోను, 27 వ తేదీన న్యాయవాది, మున్సిపల్ మాజీ ఛైర్మన్ పురాణం వెంకటప్పయ్య, అధ్యక్షతన జరిగిన సభలోను బిపిన్ చంద్రపాల్ స్వదేశీ ఉద్యమం, బహిష్కరణోద్యమం, జాతీయ విద్యా ఉద్యమం, స్వరాజ్య పోరాటం, వందేమాతరం ఉద్యమం గురించి ప్రసంగించాడు. బందరులో కార్యక్రమాలను కృష్ణా జిల్లా సంఘం ఏర్పాటు చేసింది.

## స్వరాజ్య సమితి స్థాపన

పాల్ పర్యటన ఫలితంగా బందరులో స్వరాజ్య సమితి స్థాపన జరిగింది. ఆ సమితి ఆధ్వర్యంలో బందరులో జాతీయ పాఠశాలను ప్రారంభించాలని నిర్ణయించారు. కోపల్లె హనుమంతరావు జాతీయ కళాశాలను స్థాపించి, దానికి తానే ప్రిన్సిపాల్‌గా వ్యవహరిస్తూ, జాతీయ విద్యాభివృద్ధికి తన జీవితాన్ని అంకితం చేయగలనని ప్రకటించాడు.

ఈ విధంగా ఆంధ్రదేశంలో ఉత్తరోత్తరా జాతీయోద్యమానికి అనేకమంది కార్యకర్తలను తయారు చేసిన నేషనల్ కాలేజీ ప్రారంభానికి బిపిన్ చంద్రపాల్ రాక తోడ్పడింది.

బిపిన్ చంద్రపాల్ 1907 ఏప్రిల్‌లో పదిహేను రోజులపాటు ఆంధ్రదేశంలో పర్యటించి, వివిధ బహిరంగ సభలలో చేసిన ప్రసంగాల ఫలితంగా తెల్లదొరలను పారద్రోల గలమన్న విశ్వాసం ప్రజలలో బలపడటమేకాక, విద్యార్థులు రాజకీయ రంగ ప్రవేశానికి పాల్ పర్యటన దోహదమిచ్చింది. బందరునుంచి బిపిన్ చంద్రపాల్ మద్రాసు వెళ్ళాడు.

## స్వరాజ్య పత్రిక కేసు

1907 డిసెంబరులో జరిగిన సూరత్ కాంగ్రెస్ మహాసభలో మితవాదులు, అతివాద జాతీయ వాదులు ఘర్షణ పడడంతో కాంగ్రెస్ రెండుగా చీలింది. కృష్ణా జిల్లా కాంగ్రెస్ సంఘం అతివాద జాతీయ వాదుల పక్షాన నిలబడింది. 1908 వేసవిలో తెనాలిలో (అప్పుడు గుంటూరుజిల్లా కూడా కృష్ణాజిల్లాలో అంతర్భాగంగా వుండేది.) జరిగిన కృష్ణాజిల్లా సంఘ సమావేశంలో అతివాద జాతీయ వాదులను బలపర్చుతూ తీర్మానించారు.

కృష్ణాజిల్లా దివి తాలూకా వక్కలగడ్డ గ్రామానికి చెందిన బోడి నారాయణరావు బెజవాడ నుంచి స్వరాజ్య పత్రిక ప్రారంభించాడు.

తమిళనాడులోని తిరునల్వేలి జిల్లా మేజిస్ట్రేట్‌ను కాల్చి చంపిన కేసులో చిదంబరం పిళ్ళైకు యావజ్జీవ కారాగారవాస శిక్షను విధించారు. చిదంబరం పిళ్ళై అరెస్టుకు వ్యతిరేకంగా మద్రాసులో పెల్లుబికిన నిరసన సందర్భంలో తెల్లవాడు ఒకడు ఇద్దరు భారతీయుల్ని కాల్చి చంపాడు.

ఆ ఘటనపై స్వరాజ్య పత్రికలో గాడిచర్ల హరి సర్వోత్తమరావు రాసిన వ్యాసంలో "క్రూరాతి క్రూరమైన ఆంగ్లేయ పులి ఇద్దరు భారతీయుల ప్రాణాలు బలిగొన్నది" అని పేర్కొన్నాడు.

ఈ వ్యాసం చురించిన నేరానికి బోడి నారాయణ రావును, గాడిచ హరిసర్వోత్తమ రావును 1908 జూలై 18 న అ స్టు చేశారు.

కృష్ణాజిల్లా సెషన్సు కోర్టులో నిందితుల తరపున సూర్యనారాయణ మూర్తి, జె డి. శామ్యూల్, రామాచారి వాదించారు. ప్రభుత్వం తరపున కళ్ళి నారాయణ రావు వాదించాడు. హరిసర్వోత్తమరావు తరపున మునగాల రాజా సాక్ష్యమిచ్చాడు.

సెషన్సు జడ్జి కేర్షాస్ప బోడి నారాయణరావుకు 9నెలల కఠిన శిక్ష, హరిసర్వోత్తమరావుకు 6 నెలల కఠినశిక్ష విధించాడు. ఈ తీర్పుకు వ్యతిరేకంగా తెల్లదొరతనం వారు మద్రాసు హైకోర్టులో అప్పీలు దాఖలు చేశారు. సెషన్సు జడ్జి ఉదారబుద్ధితో తేలికశిక్ష విధించాడన్న కారణంపై, ప్రభుత్వం కెర్షాస్పను సెషన్సు జడ్జి పదవి నుంచి సబ్ కలెక్టర్ పదవికి డిమోట్ చేసి నర్సారావు పేటకు బదిలీ చేసింది. కాగా, హైకోర్టు బోడి నారాయణరావుకు విధించిన 9నెలల శిక్షను ఖాయపర్చి, హరిసర్వోత్తమరావుకు విధించిన ఆరునెలల శిక్షను మూడేళ్ళ శిక్షగా మార్చింది. వందేమాతరం ఉద్యమంలో ఆంధ్రదేశంలో జైలుశిక్షలు పొందిన తొలి రాజకీయ ఖైదీలు బోడి నారాయణరావు, హరిసర్వోత్తమరావులు అని చెప్పవచ్చు.

## కోటప్పకొండ గలాటా
## పైసై చెన్నపరెడ్డి

వందేమాతరం ఉద్యమ ప్రభావం పట్టణ ప్రాంతాల నుంచి క్రమంగా పల్లెప్రాంతాలకు విస్తరిస్తున్నదనడానికి నిదర్శనంగా 1909 ఫిబ్రవరి 18వ తేదీన కోటప్ప కొండ వద్ద చెలరేగిన గలాటాను ఉదహరించవచ్చు.

గుంటూరు ` కోటప్ప కొండ వద్ద ఏటేటా శివరాత్రి పండుగ పె ఎత్తున జరుగుతుండటం అనాదిగా వస్తున్నది. చుట్టు క్కల ప్రాంతాల నుంచి ప్రజలు వేలసంఖ్యలో ఎడ్లబండ్లు, ప్రభలు కట్టుకొని, కోటప్ప కొండ తిరునాలకు తరలిరావటం, ఎడ్లపందాలు ఏర్పాటు చేయడం, శాంతిభద్రతల పరిరక్షణకు పోలీసులు బందోబస్తు చేయడం మామూలే.

1909 ఫిబ్రవరి 18న శివరాత్రి సందర్భంగా, తాత్కాలిక పోలీస్‌స్టేషన్‌ను తాటాకు పాక వేసి, అందులో ఏర్పాటు చేశారు. వందేమాతరం ఉద్యమం దేశంలో జోరుగా సాగుతున్నందున, ఆ ఏడాది పోలీసులు మరింత కట్టుదిట్టమయిన ఏర్పాట్లు చేశారు.

చిన్నపరెడ్డి అనే రైతు తన గిత్తల జతతో ఆ తిరునాళ్ళకు వచ్చాడు. పోలీసుల హడావిడి జాస్తిగా వుండటంతో తిరునాలకు వెళ్ళిన ప్రజలలో విసుగుదల పెరుగుతున్నది. అనవసరంగా లాఠీలతో జనాన్ని బెదిరిస్తున్న పోలీసులను చిన్నపరెడ్డి వారించాడు దానితో చిన్నపరెడ్డిని పోలీసు స్టేషనుకు తీసుకుపోతూవుంటే ఆయన గిత్తలలో ఒకటి తన యజమానిని పట్టుకెళుతున్న పోలీసులపైకి ఉరికింది. ఆ గిత్తను పోలీసులు తుపాకితో కాల్చి చంపారు. దాంతో ప్రజలలో కోపావేశాలు ఉవ్వెత్తున పెల్లుబికాయి. పోలీసులలో ఒకడిని ప్రజలు పట్టుకొని, చావచితక తన్నసాగారు, పోలీసుస్టేషనుకు తీసుకుపోయిన చిన్నపరెడ్డిని విడుదల చేయాలని ప్రజలు ఘోషించారు. పోలీసులు అందుకు నిరాకరించడంతో, కర్రలు చేబూనిన జనం 'వందేమాతరం' అని నినదిస్తూ పోలీసుస్టేషన్‌ను చుట్టుముట్టారు. పోలీసు స్టేషన్‌వున్న తాటాకు పాకకు నిప్పు పెట్టారు. స్త్రీలుసైతం చేతికిదొరికినకర్రనో, పుల్లనో చేతబుచ్చుకొని ఆ దాడిలో పాల్గొనటం విశేషం. పోలీసు షన్ తగలబడిపోయింది. పోలీసులు పలాయనం చి గించారు. అక్కడకు దాపున ఒక సత్రంలో మకాం చేసి డి.వై. ఎస్.పి. సుబ్బారెడ్డి హడావిడిగా అక్కడకు వచ్చాడు. అప్పటికే పరిస్థితి చేయి దాటిపోయిందన్న సంగతి పాపం ఆయనకు తెలీక అక్కడకు వచ్చాడు. రెచ్చిపోయిన ప్రజలకు నచ్చచెప్పడానికి ఆయన ప్రయత్నించాడు. ఉద్రిక్తులైన ప్రజలు ఆయనపై రాళ్ళు రువ్వి, డి.వై.ఎస్.పి.ని

తీవ్రంగా గాయపర్చారు. విధి లేక ఆయన తూలుతూ, కాళ్ళీడ్చుకుంటూ సత్రానికి తిరిగి వెళ్ళిపోయాడు.

అక్కడకు సమీపంలోని గురువాయ పాలెంలో మకాం చేసివున్న సబ్ కలెక్టర్ కేర్నాస్ప్‌కు ఈ కబురు అందింది. గాడిచర్ల హరిసర్వోత్తమరావుకు తక్కువ శిక్ష విధించాడన్న కారణంపై ఇదే సబ్‌కలెక్టరును కృష్ణాజిల్లా సెషన్సు జడ్జి పదవి నుండి డిమోట్ చేశారు. వెంటనే ఆయన దఫేదారును వెంటనిడుకొని, కోటప్ప కొండకు బయలుదేరి వచ్చాడు. దిక్కూ మొక్కూ లేకుండా సత్రంలో పడివున్న డి ఎస్. పి.కి సబ్‌కలెక్టరు స్వయం శుశ్రూష చే ుడగా, జనం వందేమాతరం నినాదాలు చేస్తూ, ఆ త్రాన్ని చుట్టుముట్టారు. సబ్‌కలెక్టరు దఫేదారును చావచితక తన్నారు. సత్రానికి నిప్పు పెట్టారు. సబ్‌కలెక్టరు, డి. వై.ఎస్.పి. అతికష్టంమీద ఎలాగో బ్రతుకుజీవుడా అంటూ ప్రజల క్రోధాగ్ని జ్వాలల నుంచి తప్పించుకొని బయటపడ్డారు. అనంతరం జనం లంకాదహనం జరిపారు ఆ గలాటాలో ఒక పోలీసు, ఉప్పు శాఖకు చెందిన ఒక బంట్రోతు చనిపోయారు. ఇద్దరు రెడ్డి యువకులు ప్రాణాలుకోల్పోయారు. ఈ సందర్భంలో 45మందిని అరెస్టు చేసి, వారిపై ప్రభుత్వం కేసు పెట్టింది. వారిలో 21మందికి శిక్షలు పడ్డాయి. చిన్నపరెడ్డికి మరణ శిక్ష విధించారు. మరో నలుగురికి యావజ్జీవ కారాగారశిక్ష విధించారు.

కోటప్పకొండ ఉదంతంలో ప్రముఖ పాత్ర వహించిన చిన్నపరెడ్డి వీరోచిత ప్రవర్తన "పైపై చిన్నపరెడ్డి" అనే కీర్తనగా జనబాహుళ్యం పాడుకునేటంత ప్రాచుర్యం పొందింది. ఆ జానపద గేయం వింటే, ప్రజలకు సహజంగానే వీరావేశం పొంగుకొస్తుంది.

## భారతీయ ఉద్యోగులకు ఉద్వాసన

కోటప్పకొండ ఉదంతం, దేశప్రజలలో బ్రిటిష్ ప్రభుత్వంపట్ల ద్వేషభావాన్ని పెంచగా, మరోవైపున ఆంగ్లో-ఇండియన్ వర్గాలవత్తిడికి లొంగిన తెల్లదొరలు "పిరికితనం" ప్రదర్శించిన భారతీయ ఉద్యోగులకు ఉద్వాసన చెప్పారు. "మద్రాసు టైమ్స్" అనే ఆంగ్లో-ఇండియన్ పత్రిక కోటప్పకొండ ఉదంతంపై వ్యాఖ్యానిస్తూ, భారతీయ ఉద్యోగులు కేర్నాస్ప్, సుబ్బారెడ్డి పిరికిపందలు కనుక పారిపోయారని, ఆ స్థానంలో యూరోపియన్లెవ రైవుంటే అలా జరిగేది కాదనీ, విద్యావంతులైన దేశీయులు పరిపాలనకు తగరనిరుజువు అయిందని రాసింది. మద్రాసు ప్రభుత్వం కేర్నాస్ప్‌ను సుబ్బారెడ్డిని సస్పెండ్ చేసింది. బ్రహ్మానందం నాయుడు అనే తహసిల్‌దారునీ, బి వి. సుబ్బారాయుడు అనే సబ్ మేజిస్ట్రేట్‌ను డిస్మిస్ చేసింది. దీనిపై 'హిందూ' పత్రిక ఇలా వ్యాఖ్యానించింది.

"ఇద్దరు ఆఫీసర్లను సస్పెండ్ చేస్తూ ప్రభుత్వం తీసుకున్న చర్య, మా దృష్టిలో, తొందరపాటుతోను, అనాలోచితంగాను చేసిన పని అని చెప్పక తప్పదు. వర్గాలమధ్య ఉద్రిక్తత తారస్థాయిలోవున్న తరుణంలో ఆంగ్లో-ఇండియన్ వర్గాల చిలిపి సలహాలకు చెవి యొగ్గడానికి మారు, ప్రభుత్వం కడు జాగరూకతతో వ్యవహరించటం మంచిది."

## తెనాలి బాంబు కేసు

ఇదే సమయంలో "తెనాలి బాంబు కేసు" అనే మరో సంఘటన జరిగింది. తెనాలి సమీపంలోని కంచర్లపాలెం గ్రామంలో బాంబు ప్రేలి, చెన్నుగాడు అనే హరిజనుడు మృతిచెందాడు. చుక్కపల్లి రామయ్య, కొటంరాజు వెంకట్రాయుడు, లక్కరాజు బసవయ్య ఆ బాంబును తయారు చేసినట్టు ప్రభుత్వం కేసు పెట్టింది. 1909 ఏప్రిల్ 6 న ఆ ముగ్గురిని అరెస్టు చేశారు. చుక్కపల్లి రామయ్యకు 10 సంవత్సరాల దేశాంతర కారాగారవాస శిక్ష విధించారు స్వరాజ్య సంపాదన అనే తెలుగు కరపత్రం పంచారన్న నేరం ఆరోపించి, మిగతా ఇద్దరిపైన కేసు నడిపారు. లక్కరాజు బసవయ్యకు 5 సంవత్సరాల దేశాంతర కారాగారవాస శిక్ష విధించారు. తర్వాత దాన్ని రెండేళ్ళకు తగ్గించారు. అప్పట్లో బారిష్టర్‌గా ప్రాక్టీసు చేస్తున్న టంగుటూరి ప్రకాశంపంతులు, పి వి. శ్రీనివాసరావు, అక్కి-

లక్ష్మీనరసింహం సహాయంతో ముద్దాయిల తరపున వాదించారు.

## స్వదేశీ అభిమానం - జాతీయ విద్యా-సంస్థలు

ఆంధ్రదేశంలో వందేమాతరం ఉద్యమంతో ప్రజలలో స్వదేశీ అభిమానం బలంగా వేరూనడం, అనేక జాతీయ విద్యాసంస్థలు ప్రాదుర్భావం పొందటం జరిగింది. ఈ దశలోనే అనేకచోట్ల స్వదేశీ వస్తు విక్రయశాలలు, జాతీయ పాఠశాలలు వెలిశాయి.

రాజమండ్రి, బందరులలో ప్రారంభమైన జాతీయ విద్యాసంస్థలను ప్రత్యేకంగా పేర్కొనాలి. రాజమండ్రిలో కరణం గున్నేశ్వరరావు బాలభారతి సమితి స్థాపనను ప్రోత్సహించడమేకాక, అక్కడ జాతీయ విద్యా సంస్థస్థాపనకు, స్వదేశీ ఉద్యమాభివృద్ధికి మూలకారకుడని ఆనాటి సి. ఐ. డి. రిపోర్టులలో పేర్కొన్నారు. పేర్రాజు దానం చేసిన రు. 40 వేల విలువ చేసే స్థలంలో జాతీయ ఉన్నత పాఠశాలను నెలకొల్పారు. ఆ విద్యాసంస్థకు న్యాయపతి సుబ్బారావు ప్రారంభోత్సవం జరుపుతూ "దేశీయ విద్యాలయం"గా దాన్ని వర్ణించారు. బందరులో గాడిచర్ల హరిసర్వోత్తమరావు ప్రోద్బలంతో, చల్లపల్లి జమీందారు దివాను కుమారుడైన కోపల్లె హనుమంతరావు తన న్యాయవాది పట్టాను చించి, అవతల పారేసి, జాతీయ విద్యావ్యాప్తికి తన జీవితాన్ని అంకితం చేస్తున్నట్టు ప్రతినబూని, జాతీయ కళాశాలను ప్రారంభించాడు. హెచ్. హనుమంతరావు, రామదాసు, వల్లూరి సూర్యనారాయణ, ముట్నూరి కృష్ణారావు, కౌతా శ్రీరామశాస్త్రి, పట్టాభి సీతారామయ్య వంటివారు బందరు జాతీయ కళాశాల స్థాపనకు తోడ్పడ్డారు. స్వదేశీ పారిశ్రామిక ప్రావిడెంట్ ఫండ్‌ను ప్రారంభించారు. 1907 లో కృష్ణాపత్రిక సంపాదకత్వ బాధ్యతలను స్వీకరించిన ముట్నూరి కృష్ణారావు జాతీయ కళాశాల అభివృద్ధికి ఎనలేని కృషి చేశారు. కృష్ణాజిల్లా వాసులు స్వదేశీ ఉద్యమం, జాతీయ విద్యావ్యాప్తికి మాత్రమేకాక, సాంస్కృతిక రంగంలో జాతీయ నాటక సమాజాన్ని స్థాపించి, కళారంగం ద్వారా జాతీయోద్యమ సందేశాన్ని ప్రజలలో ప్రచారం చేశారు దాసు నారాయణరావు స్థాపించిన జాతీయ నాటక సమాజంవారు విజయనగర సామ్రాజ్య వైభవాన్ని, శివాజీ ధైర్యసాహసాలను చాటే నాటకాలను ప్రదర్శించడంద్వారా ప్రజల్ని ఉత్తేజపర్చారు.

ముట్నూరి కృష్ణారావు, పురాణం వెంకటప్పయ్య వంటివారు "షటిల్ లూమ్" ప్రవేశపెట్టి, చేనేత పరిశ్రమాభివృద్ధికి తోడ్పడ్డారు. అలాగే జాతీయ కళాశాలలో తివాసీ నేత పాఠ్యాంశాన్ని ప్రవేశపెట్టి, చేతి పరిశ్రమల అభివృద్ధికి పునాదులు వేశారు.

ఇలాంటి జాతీయ విద్యాసంస్థలను ఒంగోలు, కడప, తదితరచోట కూడా ప్రారంభించారు. అయితే జాతీయ విద్యాసంస్థల కంటే హెచ్చుచోట్ల స్వదేశీ ఉద్యమం తల ఎత్తింది. ఆంధ్రలోని అనేక జిల్లాలలో స్వదేశీ ఉద్యమాన్ని ప్రచారంచేస్తూ సభలు జరిగాయి. 1904 లోనే నెల్లూరులో ఎ. రామేశం, కె. ఎస్. సుబ్రహ్మణ్యశాస్త్రి తదితరులు కలిసి, స్వదేశీ ఉద్యమాన్ని ప్రచారంచేస్తూ బహిరంగ సభ జరిపారు.

రాజమండ్రిలో స్వదేశీ ఉద్యమానికి గంటి లక్ష్మన్న, న్యాయపతి సుబ్బారావు, భీమశంకరరావు, సుదర్శనరావు, డాక్టరు కృష్ణారావు వంటివారు నాయకత్వం వహించడంతో, ఆ ఉద్యమం విద్యార్థిలోకానికి మాత్రమేకాక, వ్యాపారవర్గాలకు సైతం వ్యాపించింది. నాళం పుల్లయ్య, ఆలపాటి భాస్కరరామయ్య వంటి వ్యాపారులు స్వదేశీ వస్తువులను మాత్రమే విక్రయించడానికి నిర్ణయించుకొన్నారు. క్రై. రామచంద్రరావు వంటి భూస్వాములు కూడా స్వదేశీ వుద్యమాన్ని బలపర్చారు. ఫలితంగా రాజమండ్రిలో జాతీయ పారిశ్రామిక సంస్థ వెలసింది.

గుంటూరుకు చెందిన భావనాచారి, పారిశ్రామిక శిక్షణకొరకు యువకులను జపాన్‌దేశానికి పంపాలని, వారు అక్కడ శిక్షణపొంది, స్వదేశానికి తిరిగి వచ్చాక జాతీయ పరిశ్రమలను స్థాపించవచ్చునని సూచించారు. ఉదారులైన జమీందారులు పారిశ్రామిక శిక్షణకు యువకులను జపాన్ పంపడానికి విరాళాలు ఒసగాలని విజ్ఞప్తి చేశారు ఈ విషయంలో పేతు సోదరులైన శ్రీనివాసరావు, మాధవరావు ప్రముఖపాత్ర వహించారు. కోపల్లె హనుమంతరావు ప్రోద్బలంతో చల్లపల్లి జమీందారు స్వదేశీ ఉద్యమానికి చేయూతనిచ్చారు.

కడపలో జంగంకోటి హరిఅప్ప, భద్రాచలం వెంకటేశ్వరరావు స్వదేశీ వస్త్రాలయాన్ని ప్రారంభించారు.

1908 లో నెల్లూరులో మహంకాళి శ్రీనివాస శాస్త్రిలు స్వదేశీ సొసైటీని స్థాపించగా, వెన్నెల కంటి నరసయ్య ఇంట్లో రాత్రి పాఠశాలను నిర్వహించారు.

గుంటూరులో స్వదేశీ ఉద్యమానికి కొండా వెంకటప్పయ్య, వింజమూరి భావనాచారి స్వదేశీ ఉద్యమానికి నాయకత్వం వహించారు.

## జపాన్‌కు వెళ్ళిన యువకులు

కాకినాడకు చెందిన మల్లాది వెంకటసుబ్బారావు, 1901 లో పెన్సిళ్ళ తయారులో శిక్షణ పొందడానికి జపాన్ వెళ్ళాడు. గుంటూరుకు చెందిన "సేవాయాన నిధి" నుంచి ఈ యువకుని విదేశీయానానికి ఖర్చు చేయబడింది.

బళ్ళారికి చెందిన ఎస్. రామారావు గ్లాసు, చేతి గడియారాల ఉత్పత్తిలో శిక్షణ పొందడానికి మద్రాసు జాతీయనిధి, పారిశ్రామిక సంస్థలు సమకూర్చిన నిధులతో జపాన్ వెళ్ళాడు.

రాజమండ్రికి చెందిన ప్రముఖ కలప వ్యాపారి ఎ. భాస్కరరామయ్య, మద్రాసు జాతీయనిధి వారు యిచ్చిన విరాళాలతో గోటేటి జానకిరామయ్య కార్డు బోర్డు, స్ట్రాబోర్డు ఉత్పత్తిలో శిక్షణ పొందడానికి ఒకాసా వెళ్ళాడు.

ఎలక్ట్రో ప్లేటింగ్, అనుబంధ పరిశ్రమలలో శిక్షణ పొందడానికి రాజమండ్రి నుంచి మామిడి రేవేంద్రం విదేశాలకు వెళ్ళాడు.

## స్వదేశీ ఉద్యమ వ్యాప్తికి గ్రంథ ప్రచురణ

ఇదే దశలో స్వదేశీ ఉద్యమవ్యాప్తికి దోహదమిచ్చే అనేక గ్రంథాలు ప్రచురితమయ్యాయి. వీటిలో అత్తిలి సూర్యనారాయణ రచించిన "హిందూ దారిద్ర్యం," మంగిపూడి వెంకటశర్మ రచించిన "భారత మాతృ శతకం" పేర్కొనదగినది.

స్వదేశీ ఉద్యమవ్యాప్తికి మద్రాసు మహాజనసభ 15-2-1906 న సమావేశమై నిర్దిష్ట కార్యక్రమాన్ని రూపొందించింది.

1. వివిధ జిల్లాలలోను, సబ్ డివిజన్లలోను చేనేత విద్యాలయాలను స్థాపించాలి 2 ఉన్ని, సిల్కు వస్త్రాల నేత నేర్పడంతోపాటు పాఠశాలలలో అల్లిక యంత్రాలను ప్రవేశపెట్టాలి. 3. నేతమగ్గాలను అభివృద్ధి పర్చడానికి చర్యలు తీసుకోవాలి. 4. కొద్దిపాటి పెట్టుబడితో చాకులు, కత్తెరలు, తాళాలు, స్టీల్ ట్రంక్ పెట్టెలు, గుండీలు, కొవ్వొత్తులు వంటి వాటిని తయారుచేసే లఘు పరిశ్రమలను స్థాపించాలి. 5. జాతీయ పాఠశాలలలో అధ్యాపకుల పని చేసే యువకులకు శిక్షణ గరపే నిమి ం జాతీయ విద్యార్థి ఉపకార వేతనాలను ఒసగాలి. . నిరుపేద లైన చేనేత కార్మికులకు హామీ క్రెడిట్ పరపతి సౌకర్యం కల్పించాలి, 7. స్వదేశీ వస్తువులను కమీషన్ ప్రాతిపదికపై విద్యార్థులు ఇంటింటికి తిరిగి అమ్మే పద్ధతని ప్రోత్సహించాలి.

ఈ కార్యక్రమం అమలుకు అవసరమైన నిధులను వసూలు చేయడానికి, జమీందారులను, బ్యాంకర్లను వ్యాపారులను ఇతర ప్రముఖులను కలుసుకోవాలని మద్రాసు మహాజన సభ నిర్ణయించింది. అలాగే పెళ్ళిళ్ళు తదితర వేడుకల సందర్భంలో జాతీయ నిధికి విరాళాలు వసూలు చేయాలని నిశ్చయించారు. వ్యాపారులు రూపాయికి ఒక పైస, జాతీయ నిధికి ధర్మం చేయాలని కోరారు.

రాజమండ్రికి చెందిన బాలభారతి సమితి సభ్యులు, రాజమండ్రి గవర్నమెంట్ ఆర్ట్సు కాలేజీనుంచి బహిష్కృతు లైన విద్యార్థులు రహస్యంగా చుట్టుప్రక్కల గ్రామాలలో స్వదేశీ ఉద్యమం గురించి ప్రచారం చేసినట్టు ధవళేశ్వరానికి చెందిన రెవరెండ్ ఆర్ఫ్స్ అనే మత ప్రచారకుడు జిల్లా కలెక్టర్‌కు పంపిన రహస్య నివేదికను బట్టి వెల్లడవుతున్నది.

విశాఖ పట్నంలో వల్లూరి మహారాణి ప్రోత్సాహంతో 1905లో భారతి సంఘం అనే మహిళాసంఘం ప్రారంభించబడింది. ఆ రోజులకు చెందిన సి. ఐ. . రిపోర్టులను పరిశీలిస్తే ఈ క్రిందివారు ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలలో చురుకుగా పాల్గొన్నట్లు పేర్కొనబడింది.

బందరుకు చెందిన ముట్నూరి కృష్ణారావు, ఓతిరాజా సురేంద్రనాథ్ ఆర్య, హరి సర్వోత్తమరావు, చిల్లరిగ మాధవరావు, పట్టాభి సీతారామయ్య, అల్లూరి

సూర్యనారాయణ, బొబుపల్లి నారాయణరావు, కొత్తా శ్రీరామశాస్త్రి, విజయవాడకు చెందిన బోడి నారాయణరావు, రంగనాథనాయుడు, గుంటూరుకు చెందిన ఉన్నవ లక్ష్మీనారాయణ, దేవగుప్త శేషాచలపతిరావు, కాటంరాజు రాజేశ్వరరావు, రాజమండ్రికి చెందిన కరణం గున్నేశ్వరరావు, మద్రాసుకు చెందిన వెంకట సుబ్బయ్య, ఏలూరుకు చెందిన మామిడి దేవేంద్రం ప్రముఖపాత్ర వహించారు.

## ఆంగ్లేయులకు అవహేళన

ఆంధ్రదేశంలోని ఆంగ్లేయులను అవహేళన చేయడానికి వారు కన్పించగానే 'వందేమాతరం' వంటి నినాదాలు చెయడమే కాక, కలెక్టరుగా పదవీ విరమణ చేసి స్వదేశమునకు తిరిగి వెళుతున్న బ్రెయిడ్‌వుడ్‌కు వీడ్కోలు సన్మాన సభకు ప్రతిగా రాజమండ్రిలో టంగుటూరి శ్రీరాములు, గంటి లక్ష్మన్న వంటివారు ఒకవంట వాడికి వీడ్కోలు సన్మానసభ ఏర్పాటు చేసి, ఆంగ్లేయుల పద్ధతిని అవహేళన పర్చారు.

## టెర్రరిస్టు ధోరణలు

వందేమాతరం ఉద్యమకాలంలో ఆంధ్ర దేశంలో టెర్రరిస్టు ధోరణులు కొద్దిగా పొడసూపకపోలేదు. తెనాలి బాంబుకేసు, బాపట్ల విద్రోహకేసు ఇందుకు నిదర్శనం. అలాగే అమెరికాలో ఏర్పడిన గదర్ పార్టీలో ఆంధ్రుడైన దర్శి చెంచయ్య చేరినప్పటికీ ఆయన తర్వాత ఆ ధోరణి నుంచి బయటపడ్డాడు.

## బ్రాహ్మణేతర ఉద్యమానికి బీజాలు

వందేమాతరం ఉద్యమంలో ప్రధానంగా, ప్రముఖంగా విద్యావంతులైన బ్రాహ్మణులు పాల్గొన్నారని, బ్రాహ్మణేతరులు ఆ ఉద్యమానికి దూరంగా వున్నారని అప్పటి సి.ఐ.డి. రిపోర్టులలో ప్రత్యేకంగా పేర్కొన్నారు.

విద్యావంతులైన బ్రాహ్మణులు పరిస్థితిని ముందుగా ఆకళింపు చేసుకొని జాతీయోద్యమంలోకి దుమకగా విద్యా విషయకంగా వెనకబడివున్న బ్రాహ్మణేతరులు కొంత ఆలస్యంగా స్వాతంత్ర్యోద్యమంలో ప్రవేశించారని చెప్పవచ్చు.

చీలించి, పాలించడంలో నేర్పరులైన బ్రిటిష్ వలసాధిపతులు ఆంధ్రదేశంలో బ్రాహ్మణేతర ఉద్యమానికి బీజాంకురాలు వేయడంద్వారా, బ్రాహ్మణ నాయకత్వంలో గల జాతీయోద్యమాన్ని దెబ్బతీయాలన్న దృష్టితో మింటో-మార్లే సంస్కరణలలో కమ్యూనల్ ప్రాతినిధ్యం ప్రవేశపెట్టారు. ఉత్తరోత్తరా జస్టిస్‌పార్టీ స్థాపనకు ఇదే ప్రాతిపదిక అయింది. ఉత్తరభారతంలో హిందూ-ముస్లిం మత విభేదాలను రెచ్చగొట్టినట్టే, దక్షిణ భారతంలో బ్రాహ్మణ-బ్రాహ్మణేతర విభేదాలను తెల్లదొరలు పని గట్టుకొని రెచ్చగొట్టారు.

## మింటో - మార్లే సంస్కరణలు

భారత జాతీయోద్యమాన్ని దెబ్బతీయడానికి మింటో-మార్లే సంస్కరణలను 1910లో ప్రవేశపెట్టారు. ఆ సంస్కరణలతోపాటు వాక్, పత్రికా స్వేచ్ఛను అరికట్టే చట్టాలను కూడా జారీచేశారు.

అయినా ప్రయోజనం లేకపోవడంతో వైస్రాయి మింటోను, సెక్రటరీ ఆఫ్ స్టేట్ మార్లే జంటను బ్రిటిషు ప్రభుత్వం ఆ పదవులనుంచి తప్పించి, కొత్తవారిని నియమించింది

వందేమాతరం ఉద్యమాన్ని బలప్రయోగంద్వారా అణచడం సాధ్యంకాదని గ్రహించిన బ్రిటిషు వలసాధిపతులు 1911 డిసెంబరు 12న జార్జి చక్రవర్తి ద్వారా బెంగాల్ విభజనను రద్దుచేస్తూ ప్రకటింపచేశారు. జాతీయోద్యమం బలంగావున్న కలకత్తానుంచి భారత రాజధానిని ఢిల్లీకి మార్చాలని అప్పుడే నిర్ణయించారు.

అనంతరం జాతీయోద్యమం, స్వదేశీ ఉద్యమాలు స్తబ్దతలో పడిపోయాయి. జాతీయోద్యమంలోని అతివాదులైన బాలగంగాధరతిలక్‌ను మాండలే జైలులో ఆరేళ్ళపాటు నిర్బంధించడం, అలాగే బిపిన్ చంద్రపాల్‌ను అరెస్టు చేయడం, నిరాశతో లాలా లజపతిరాయ్ అమెరికా వెళ్ళిపోవడం, అరవిందఘోష్ రాజకీయాలంటే విరక్తి కలిగి, పుదుచ్చేరిలో ఆశ్రమం స్థాపించడంతో జాతీయోద్యమంపై మితవాదుల ప్రభావం పెరిగిపోయింది.

ఆంధ్రదేశంలో మితవాదులైన కొండా వెంకటప్పయ్య, బి. ఎన్. శర్మ వంటివారి ప్రాబల్యం హెచ్చింది.

# వందేమాతరం ఉద్యమం నుంచి ఆంధ్రోద్యమం పుట్టుక

"వందేమాతరం", స్వదేశీ ఉద్యమాలతో ఆంధ్రులలో చైతన్యం వెల్లివిరిసింది. అయితే జాతీయోద్యమం మితవాద నాయకత్వం చేతుల్లోకి పోవడంతోను, మింటో-మార్లే సంస్కరణలు నిరాశాజనకంగా వుండటంతోను జాతీయోద్యమంలో 1910 నుంచి స్తబ్దత ఏర్పడింది. ఆ దశలో ఆంధ్రుల దృష్టి తెలుగుజాతి గత ప్రాభవం వైపు మళ్ళడంతో ప్రత్యేక రాష్ట్రం కావాలన్న కాంక్ష ఆంధ్రులలో బయలుదేరింది.

కొమర్రాజు లక్ష్మణరావు స్థాపించిన విజ్ఞాన చంద్రికా మండలి 1910 లో "ఆంధ్రుల చరిత్రము" ప్రకటించింది. అది బహుళ ప్రచారం పొందింది. దీనితో ఆంధ్రులలో ఆంధ్రాభిమానం మొలకెత్తి పెరగ సాగింది.

మద్రాసు రాష్ట్రంలోని విస్తీర్ణంలో 58 శాతం, జనాభాలో 40 శాతంగా గల ఆంధ్ర ప్రాంతం ఆర్థికంగానూ, విద్యావిషయకంగానూ, ఉద్యోగాల విషయంలోనూ వెనుకబడివుండటం ఏమిటన్న ప్రశ్న, ఆలోచన ఆంధ్రుల హృదయాలలో ఉదయించాయి. దానికి తమిళుల పెత్తనం, అవహేళనలు తోడయ్యాయి.

ఒక తమిళుడు తెలుగుగడ్డపై రైలులో ప్రయాణం చేస్తూ, తోటి ప్రయాణీకుడైన తెలుగువాడితోనే అన్న మాటలు ఇవి: "తెలుగువాళ్ళు వెనకబడ్డజాతి, వాళ్ళకు బుర్రలు లేవు. మా భాష్యం అయ్యంగార్, ముత్తుస్వామి అయ్యర్ వంటి వారు వీళ్ళకు లేరు."

హిందూ పత్రికలో 1911 ఏప్రిల్ ఉత్తరార్థంలో "తెలుగు ప్రజల ప్రస్తుత పరిస్థితి" గురించి ఒక విలేకరి వరసగా ఆరు వ్యాసాలు ప్రచురించాడు. ఆ వ్యాసాలలో తెలుగు ప్రజలు అన్ని విధాల ఎలా వెనుకబడి వున్నారో సోదాహరణంగా నిరూపించాడు.

మద్రాసు రాష్ట్రంలో 56మంది తెలుగేతరులు ఉన్నతాధికారులు కాగా, కేవలం 8 మంది తెలుగువారు మాత్రమే ఉన్నతాధికారులుగా వున్నారని జిల్లాజడ్జి పదవిని పొందగల్గిన ఆంధ్రుడు ఒక్కడూ లేడని, కాగా, ఆంధ్రేతరులు 19మంది జిల్లాజడ్జి పదవులలో వున్నారని, ఆంధ్రదేశంలోని బాపట్ల, బందరు, నర్సాపురం, రాజమండ్రి, విశాఖపట్నం, పర్లాకిమిడి వంటి చోట్ల విద్యాసంస్థలకు ఆంధ్రేతరులే అధికారులు కావలసిన దుర్గతి పట్టిందని ఆ వ్యాసాలలో వెల్లడించా .

అంతకు రెండు నెలల పూర్వం 1911 ఫిబ్రవరి 4 న గుంటూరునుంచి వెలువడే "దేశాభిమాని" ఆంగ్ల - ఆంధ్ర వారపత్రిక పెద్ద సంపాదకీయం వ్రాసింది. తెలుగు ప్రజల మధ్య సౌహార్దం పెంపొందించడానికి, తెలుగు ప్రజల ప్రత్యేకావసరాలను గురించి చర్చించడానికి ప్రత్యేక రాజకీయ మహాసభ జరపాలని సూచించింది.

1911 డిసెంబరు నాటికి ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రకోర్కె ఒక నినాదంగా రూపుదాల్చింది. 1911 డిసెంబరులో "దేశాభిమాని" పత్రికలో ప్రచురించిన లేఖలో ఎన్. నారాయణరావు ఇలా రాశాడు.

"తెలుగు ప్రతిభ అంతరించిపోతున్నది. అది పూర్తిగా అంతరించిపోకుండా చూడవలసిన బాధ్యత ప్రభుత్వానిదే. తెలుగు ప్రజలను ప్రత్యేక ప్రభుత్వం క్రిందికి తెచ్చినప్పుడు మాత్రమే అది సాధ్యం."

ఆ లేఖ ప్రచురితమైన వారంరోజులకు సి. శేషగిరిరావు అదే పత్రికలో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాల్సిన అవసరాన్ని వక్కాణిస్తూ వరుసగా వ్యాసాలను ప్రచురించాడు.

ఇలా ప్రారంభమైన ప్రత్యేకాంధ్ర రాష్ట్ర వాంఛను బొంబాయినుంచి వెలువడే ఆంధ్రపత్రిక, బందరునుంచి వెలువడే "కృష్ణాపత్రిక" సమర్థించి ప్రచారం చేయడంతో 1912 నాటికి ఆంధ్రోద్యమం రూపునందుకుంది. ప్రత్యేక రాష్ట్రం కావాలని కోరినంత మాత్రాన సరిపోదని, ఆ కోర్కె సాధనకు నిర్దిష్టమైన కార్యక్రమాన్ని రూపొందించి ముందుకు సాగాలని దేశాభిమాని సంపాదకీయ వ్యాసంలో ఉద్బోధించింది.

ఆంధ్రదేశమంతటా ఆందోళన జరపాలని బహిరంగ సభలు ఏర్పాటుచేయాలని, మహాసభలు జరిపి ప్రత్యేక రాష్ట్ర సాధన గురించి చర్చించాలని,ప్రభుత్వం వద్దకు ప్రతినిధివర్గాలను పంపాలని ఆ పత్రిక సూచించింది. తెలుగు పత్రికలు ప్రపంచ రాజకీయాల గురించి

కాక, ఆంధ్రదేశానికి సంబంధించిన విషయాల గురించి రాయాలని దేశాభిమాని కోరింది.

## నిడదవోలు మహాసభ

ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం స్థాపన ఆవశ్యకతను గురించి పత్రికలు సాగించిన ప్రచారం ప్రభావం 1912 నాటికి కనపడింది. 1912 మే మాసంలో నిడదవోలులో ఐ. రామదాను అధ్యక్షతన గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాల సంయుక్త మహాసభలో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర స్థాపన సమస్య తీర్మాన రూపంలో చర్చకు వచ్చింది. అయితే ఆంధ్రు లందరికీ సంబంధించిన సమస్యపై కేవలం ఒక ప్రాంతానికి పరిమితమైన ఈ మహాసభలో చర్చించడం ఉచితం కాదని సి. నరసింహారావు తెచ్చిన అభ్యంతరంతో ప్రత్యేకాంధ్ర రాష్ట్ర తీర్మానాన్ని అధ్యక్షులు చర్చకు అనుమతించలేదు. మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్రు లందరికీ ప్రాతినిధ్యం వహించే ప్రత్యేక మహాసభను జరపాలని సి. నరసింహారావు చేసిన సూచనకు కొండా వెంకటప్పయ్యతోసహా పలువురు ప్రతినిధులు ఆమోదం తెలిపారు.

ఆ నిడదవోలు మహాసభ నుంచి గుంటూరు చేరగానే, కొండా వెంకటప్పయ్య, అఖిల భారత ఆంధ్ర మహాసభను జరపడం గురించి, వి. భావనాచార్యులు, ఉన్నవ లక్ష్మీనారాయణ, సి. శేషగిరిరావు, జె. గురునాథం వంటి ప్రముఖులతో చర్చించారు. కొండా వెంకటప్పయ్య కార్యదర్శిగా ఏర్పడిన స్థాయీ సంఘం అఖిల భారత ఆంధ్ర మహాసభ నిర్వహణకు సన్నాహాలు ప్రారంభించింది. 1913 మే మాసంలో ఆ మహాసభను బాపట్లలో జరపాలని ఆ స్థాయీ సంఘం నిర్ణయించింది.

నిడదవోలు మహాసభ అనంతరం, ప్రత్యేక ఆంధ్ర రా ం ఏర్పాటు సమస్యపై పెద్దఎత్తున వాదోపవాదాలు ఆ , తెలుగు పత్రికలలో చెలరేగటంతో ప్రత్యేక రా ంపై ప్రజాభిప్రాయం క్రమేణా ఘనీభవించింది. ప్రత్యేక రాష్ట్ర సాధనకోసం ఆందోళన జరపడానికి సమయం ఆసన్నంకాలేదని, తెలుగు, తమిళ ప్రభుత్వోద్యోగుల మధ్య మనస్పర్ధలు మరింత తీవ్రం కాగల ప్రమాదం వుందని, ఆంధ్రుల మధ్య ఏకీభావం సాధించకుండా, అధికారంలోవున్న తమిళులతో తగవు కొని తెచ్చుకొనడం మంచిదికాదని కృష్ణాపత్రికలో ప్రచురితమైన ఒక వ్యాసంలో హెచ్చరింపబడింది.

ప్రత్యేకాంధ్ర రాష్ట్రం వెంటనే సిద్ధించినా, సిద్ధించకపోయినా దానికోసం ఆందోళన ఆరంభించవలసిందేనని 'దేశమాత' పత్రిక రాసింది.

మితవాద కాంగ్రెస్ వాదియైన న్యాయపతి సుబ్బారావు వంటి వారు ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటును వ్యతిరేకించాడు. ప్రత్యేకాంధ్ర రాష్ట్రం ఏర్పడితే అది చిన్న రాష్ట్రం అయిపోతుందని, కనుక అది గవర్నర్ క్రిందకాక కమిషనర్ క్రిందకు వస్తుందని వాదిస్తూ ఆయన వ్యతిరేకించాడు.

ఆ అభ్యంతరానికి డాక్టరు పట్టాభి సీతారామయ్య సమాధానం చెబుతూ, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఎంత చిన్నదైనా, కమిషనర్ పాలన కిందకు వచ్చినా ఫరవా లేదని, దేశంలో భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్మాణం జరగాలని 1913 ఫిబ్రవరి 26 వ తేదీ 'హిందూ' పత్రికలో లేఖ ప్రచురించాడు.

## తమిళుల అవహేళన

ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయంలో ఆంధ్రుల మధ్య ఏకీభావం లేక, ఇలాంటి తర్జనభర్జనలు సాగుతుంటే, రెండవవైపున తమిళులు ఆంధ్రుల అభిలాషను గురించి అవహేళన చేయసాగారు.

వెంటనే ఆంధ్రరాష్ట్రం ఏర్పడితే, దానికి అవసరమైన ఉన్నతాధికారులు, హైకోర్టు జడ్జీలు ఎక్కడ నుంచి వస్తారు? ఆ బాధ్యతలు నిర్వహించగల్గిన అర్హతలు, యోగ్యతలు వున్న ఆంధ్రులు ఏరి? ఎక్కడ? ప్రత్యే క రాష్ట్రాన్ని కోరేముందు, ఆంధ్రులు అభివృద్ధి, అ తలను, యోగ్యతలను పొందటం మంచిది. మ సు వంటి పెద్ద రాష్ట్రంలో వుంటూ, వారు ఆ పనిచేయాలని సూచిస్తూ 'విశ్వామిత్ర' పేరుతో 1912 ఆగస్టు 29 వ తేదీ 'హిందూ'లో ఒకలేఖ ప్రచురితమైంది.

ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు విషయంలో నెల్లూరు రాయలసీమ జిల్లాలు, ఉత్తరాంధ్ర జిల్లాలకు చెందిన ప్రముఖులు అ ంత ఉత్సుకతను ప్రదర్శించకపోవడం, రాయలసీమ జిల్లాలలో స్థిరపడి, రాజకీయాలలో ప్రముఖపాత్ర వహిస్తున్న కేశవపిళ్ళె (గుత్తి) ఏకాంబరఅయ్యర్ (నంద్యాల) వంటివారు తమిళుల పెత్తనం పరిరక్షణ కోసం ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటును వ్యతిరేకించడం. ఇలాంటి వాతావరణంలో 1913 మేలో బాపట్లలో జరుపతలపెట్టిన మొట్టమొదటి

ఆంధ్ర మహాసభలో వివాద రహితమైన అంశాలను - ఆంధ్రుల ప్రయోజనాల రక్షణకు ఆం దిన పత్రికను ప్రారంభించాలని, ఆంధ్రులకు ప్రతే క యూనివర్శిటీని ఏర్పాటుచేయాలనీ, సైన్యంలో ఉగువారు చేర డంపై విధించిన నిషేధాన్ని తొలగించాలని కోరే తీర్మానాలను మాత్రమే చర్చనీయాంశాలుగా సూచిస్తూ ఆంధ్ర మహాసభ స్థాయీ సంఘం సంయుక్త కార్యదర్శులు 1912 సెప్టెంబరులో ఒక సర్క్యులర్‌ను జారీ చేశారు అందులో ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు ప్రస్తావనలేదు.

## బాపట్ల మహాసభ

1913 మే 26 న బాపట్లలో తొలి ఆంధ్ర మహాసభ జరిగింది. 2 వేల మంది పరిశీలకులు, 800 మంది ప్రతినిధులు మద్రాసు రాష్ట్రంలోని వివిధ జిల్లాల నుంచి ఆ మహాసభకు హాజరయ్యారు. హైదరాబాద్, వరంగల్, నాగపూర్‌ల నుంచి కూడా ప్రతినిధులు వచ్చి ఆ మహాసభలో పాల్గొన్నారు.

ఆ మహాసభకు అధ్యక్షత వహించిన మితవాదవర్గ నాయకుడు బి. ఎన్. శర్మ తన అధ్యక్షోపన్యాసంలో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పాటుగురించి ప్రస్తావించి, అందుకోసం ఆందోళన ప్రారంభించడానికి తగిన సమయం ఆసన్నం కాలేదని, వెంటనే ఆందోళన ప్రారంభిస్తే మేలు జరగకపోగా, కీడు వాటిల్ల వచ్చునన్న అభిప్రాయం వ్య ం చేశాడు.

ప్రత్యేక ఆంధ్ర రా ్ర నిర్మాణాన్ని కోరుతూ వి. రామదాసు ప్రవేశపె తీర్మానంపై మొదట ప్రతినిధుల సభలోను, నంతరం మహాసభలోను తీవ్రమైన చర్చలు, వాదోపవాదాలు సాగాయి. ఎన్. సుబ్బారావు, ఎమ్. ఆదినారాయణ, ఎమ్. రామచంద్రరావు వంటి వారు తీర్మానాన్ని వ్యతిరేకించారు. చివరకు ఈ అంశంపై నిర్ణయాన్ని వచ్చే సంవత్సరం ఆంధ్ర మహాసభకు వాయిదావేస్తూ, ఆ తీర్మానాన్ని సవరించారు. గడచిన రెండేళ్ళుగా ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం కోసం పెద్దఎత్తున ప్రచారం చేస్తున్న కృష్ణా, గుంటూరు జిల్లాల ప్రతినిధులకు బాపట్ల మహాసభ నిర్ణయం ఆశాభంగం కల్గించింది.

బాపట్ల మహాసభలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయంలో రాయలసీమ, నెల్లూరు, ఉత్తరాంధ్ర జిల్లాల ప్రతినిధులు అంత ఉత్సాహం ప్రదర్శించడంలేదని గ్రహించిన కృష్ణా, గుంటూరు జిల్లాల నాయకులు కొండా వెంకటప్పయ్య, పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, వల్లూరి సూర్యనారాయణ బృందం నంద్యాల, గుత్తి, అనంతపురం, బళ్ళారి, చిత్తూరు, కడపలలో బహిరంగ సభ ు జరిపి, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం ఆవశ్యకతను వివరి ాచారు. అనంతరం కొండా వెంకటప్పయ్య బరంపురం, విశాఖపట్నం, కాకినాడ, రాజమండ్రిలలో బహిరంగ సభల్లో ప్రసంగించారు.

బాపట్ల ఆంధ్రమహాసభ అనంతరము జరిగిన వివిధ జిల్లాల మహాసభలలో ప్రత్యేక ఆంధ్రరా ్ర నిర్మాణ సమస్య చర్చకు వచ్చింది. ప్రతే క రాష్ట్రాన్ని కోరుతూ విశాఖపట్నం జిల్లా మహా భ అధ్యక్షులు ఎమ్. సూర్యనారాయణ ప్రసంగించారు.

## విజయవాడ మహాసభ

1914 ఏప్రిల్ 11న విజయవాడలో జరిగిన రెండవ ఆంధ్రమహాసభకు అధ్యక్షత వహించిన ఎన్. సుబ్బారావు చేసిన ప్రసంగం ప్రతినిధులకు తీరని ఆశాభంగం కల్గించింది. అయితే ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలని కోరుతూ ఎమ్. సూర్యనారాయణ ప్రతిపాదించగా వి. రామదాసు బలపర్చారు ఆ తీర్మానం అత్యధిక ఓట్ల మెజారిటీతో ఆమోదించబడింది.

అదే సంవత్సరం మే మాసంలో జరిగిన విశాఖపట్నం జిల్లా మహాసభకు అధ్యక్షత వహించిన వెంకటపతిరాజు ప్రత్యేక రాష్ట్రం కావాలని తీర్మానించిన పిమ్మట, దానికోసం ఆందోళన ప్రారంభించకపోవడం అవివేకమని హెచ్చరించారు.

ఏది ఏమైతేనేం 1914 సంవత్సరాంతానికి ఆంధ్రులలో అత్యధికులలో ప్రత్యేక రాష్ట్రం ఏర్పడాలన్న ఆకాంక్ష బలంగా వేరూనిందని చెప్పవచ్చు.

## మాతృభాషలో విద్యాబోధన

1915 మే మాసంలో విశాఖపట్నంలో రాజా పానుగంటి రామరాయణింగార్ అధ్యక్షతన జరిగిన మూడవ ఆంధ్ర మహాసభలో ప్రత్యేకాంధ్ర వాంఛను పునరుద్ఘాటించారు. దాంతోపాటు ఉన్నత పాఠశాలలలో విద్యాబోధనను తెలుగులో సాగించాలని తీర్మానించారు. తమిళ దిన పత్రిక "స్వదేశ మిత్రన్" తెలుగులో

విద్యాబోధనను ప్రవేశ పెట్టాలన్న కోర్కెను సమర్థించింది.

1916 లో కాకినాడలో మోచర్ల రామచంద్రరావు అధ్యక్షతన జరిగిన నాలుగవ ఆంధ్ర మహాసభలోను, 1917 జూన్ లో నెల్లూరులో కొండా వెంకటప్పయ్య అధ్యక్షతన జరిగిన అయిదవ ఆంధ్ర మహాసభలోను ఉత్తరాంధ్ర ప్రతినిధులు ప్రత్యేకరాష్ట్రం కోరే తీర్మానాన్ని సమర్థించగా, రాయలసీమ, నెల్లూరు ప్రతినిధులు తమ వ్యతిరేకతను వ్యక్తం చేస్తూ వచ్చారు.

నెల్లూరు మహాసభలో విభేదాలు తీవ్రస్థాయికి చేరి, ఆంధ్ర మహాసభ చీలిపోతుందా అన్న పరిస్థితి ఏర్పడింది.

## ఆంధ్ర కాంగ్రెసు సర్కిల్ ఏర్పాటు

ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర సాధనకు ముందు ఆంధ్ర కాంగ్రెస్ సర్కిల్ ఏర్పాటు అవసరమని ఆంధ్ర నాయకులు గుర్తించారు.

1885లో కాంగ్రెస్ సంస్థ స్థాపితమైన నాటినుంచి మద్రాసు రాష్ట్ర కాంగ్రెస్‌లో ఆంధ్రులు ప్రముఖ పాత్ర వహించారు. 1914లో మద్రాసులో జరిగిన కాంగ్రెస్ మహాసభకు 256 మంది ఆంధ్ర ప్రతినిధులు హాజరయ్యారు. అయినా కాంగ్రెస్ కార్యవర్గంలో ఆంధ్రులకు స్థానం లేని పరిస్థితి ఏర్పడింది.

కొండా వెంకటప్పయ్య, డాక్టరు పట్టాభి సీతారామయ్యలు ఇద్దరూ దేశంలో భాషా ప్రయుక్త ప్రాతిపదికపై రాష్ట్రాల పునర్నిర్మాణం జరగాలని వాదిస్తూ రచించిన కరపత్రాన్ని అచ్చువేసి, దేశవ్యాప్తంగాగల కాంగ్రెస్ వాదులకు పంపించారు. ఆంధ్ర కాంగ్రెస్ నాయకుల ఆందోళన ఫలితంగా 1918 జనవరి 22 వ తేదీన న్యాయపతి సుబ్బారావు అధ్యక్షులుగా, కొండా వెంకటప్పయ్య కార్యదర్శిగా ఆంధ్ర కాంగ్రెస్‌సర్కిల్ ఏర్పాటు అయింది. తమిళుల పెత్తనం నుంచి బయట పడడానికి ఆంధ్రులు సాగించిన ఆందోళనలో తొలి విజయం ఇది.

## తెలంగాణా ప్రాంతంలో చైతన్య దీప్తి

బ్రిటిష్ పాలన క్రింద మద్రాసు రాష్ట్రంలో నివసిస్తున్న రెండు కోట్లమంది తెలుగు ప్రజలు వందేమాతరం ఆంధ్రోద్యమాల ద్వారా చైతన్య ప్రదీప్తులవుతున్న సమయంలోనే ఇంచుమించుగా, నైజాం నవాబు పాలన క్రింద హైదరాబాద్ సంస్థానంలోని తెలంగాణా ప్రాంతంలో నివసిస్తున్న కోటి మంది తెలుగు ప్రజలలో చైతన్యానికి గ్రంథాలయోద్యమం నాంది అయింది.

## హైదరాబాద్ సంస్థానం రూపు రేఖలు

హైదరాబాద్ సంస్థానం విస్తీర్ణం 82 700 చదరపు మైళ్ళు. జనాభా కోటి 85 లక్షలు. ఈ సంస్థానం నాలుగు సూబాలుగా - వరంగల్లు, మెదక్, ఔరంగాబాద్, గుల్బర్గా సూబాలుగా విభజించబడింది. వరంగలు, మెదక్ సూబాలు తెలుగు ప్రాంతాలు. ఈరెంటు సూబాలను 8 జిల్లాలుగా విభజించారు. ఈ తెలంగాణా ప్రాంత జనాభా కోటి వరకు వుంది. వైశాల్యం 49,502 చదరపు మైళ్ళు.

ఔరంగాబాద్ సూబా ప్రాంతమైన మరట్వాడాలో 40 లక్షల మంది మరాఠీ ప్రజలు, గుల్బర్గా సూబా ప్రాంతంలో 20 లక్షలమంది కన్నడిగులు నివసిస్తున్నారు. కాగా ముస్లిములు, ఇతరులు మరొక 20 లక్షల మంది వున్నారు.

హైదరాబాద్ సంస్థానంలో అక్షరాస్యత చాలా తక్కువ. జనాభాలో 4.8 శాతం మాత్రమే అక్షరాస్యులు. విద్యాబోధన ఉర్దూలో జరుగుతుండేది. వ్యవసాయ భూమిలో 42 శాతం నైజాం నవాబు, జాగీర్దారు, దేశ్‌ముఖ్‌లు వంటివారికి చెంది వుండేది. మిగతా 58 శాతం భూమికూడా మక్తాదారులు, పట్టాదారులు పేరుతో చెలామణీఅయ్యే భూస్వాముల అధీనంలో వుండేది. గ్రామ ప్రాంతాలలో ప్రజలు దాస్యంలో మ్రగ్గుతూ వుండేవారు. వారిలో అత ధికులు కౌలుదారులు, వ్యవసాయ కూలీలు, నాముప తి ద్వారా అప్పులు ఇచ్చి, ఆర్థికంగా దోపిడి చేసేవ తి కొనసాగుతుండేది. కౌలుదారులకు, వ్యవసాయ కూలీలకు రక్షణ,భద్రత అనేవివుండేవికాదు.వారికి వెట్టి చాకిరీ తప్పేది కాదు. "నీ బాన్చను దొరా, నీకాళ్ళకు మొక్కుతా" అనే మాటలు ఆ రోజులలో ఈ తెలంగాణాలోని ఏ గ్రామానికి వెళ్ళినా అనుక్షణం విని పిస్తుండేవి. అంటే అక్కడి పరిస్థితి ఎలాంటిదో మనం ఊహించుకోవచ్చు.

## ప్రజాభిప్రాయం 'మొలకలు'

బ్రిటిష్ పాలిత భారతదేశంలో సంభవిస్తున్న ఘటనల ప్రభావం నైజాంపాలనలో గల హైదరాబాద్

సంస్థానం ప్రాంతంలో ప్రసరించ సాగింది. 'కొండంత చీకటికి గోరంత దీపం' చందంగా 1883 లో శ్రీమతి సరోజినీ నాయుడు—తండ్రిగారైన డాక్టరు అఘోర నాథ చటోపాధ్యాయ, ముల్లా అబ్దుల్ ఖయూం, దస్తూర్ హొసగి హోషాంగ్ అనే రివెన్యూ ఆఫీసరు — ఈ ముగ్గురు మేధావులు కలిసి 'చాందా రైల్వే పథకం' హైదరాబాద్ సంస్థానం ప్రయోజనాలకు అనుగుణ మైనది కాదంటూ ఆందోళనోద్యమం ప్రారంభించారు. నైజాం ప్రభుత్వ చర్యను ప్రశ్నించి, నిరసన తెలపడం సహించలేని నిజాం నిరంకుశ పాలకులు డాక్టర్ అఘోర నాధ్ చటోపాధ్యాయను, దస్తూర్ హొసగి హోషియార్‌ను ఉద్యోగాలనుంచి బర్తరపుచేసి, షోలాపూర్, పూనాలకు బలవంతంగా తరలింప చేశారు. ముల్లా అబ్దుల్ ఖయూం నైజాం సంస్థానాన్ని వదిలి వెళ్ళి పోయాడు. అయితే రెండేళ్ళ తర్వాత డాక్టరు అఘోర నాధ్ చటోపాధ్యాయ, దస్తూర్ హొసగి హోషియార్‌లు నైజాం సంస్థానానికి తిరిగి రావటానికి అనుమతించారు. డాక్టర్ అఘోరనాధ్ చటోపాధ్యాయ నైజాం కళాశాల ప్రిన్సిపాల్ బాధ్యతలు స్వీకరించారు. అబ్దుల్ ఖయూం కూడా హైదరాబాద్ సంస్థానానికి తిరిగి వచ్చాడు.

## వైతాళికులు

1885 లో భారత జాతీయ కాంగ్రెసు స్థాపనకు ఆహ్వానించిన వారిలో డాక్టర్ అఘోరనాధ్ చటో పాధ్యాయ, ముల్లా అబ్దుల్ ఖయూం, అడ్వొకేట్ రామచంద్ర పిళ్లె, ముత్యాలు రామన్న, రెసిడెన్సీ లోకల్‌ఫండ్ బోర్డు సభ్యులు కృష్ణఅయ్యంగార్, ఈడల్జీ సొరాబ్జీ, డాక్టరు నబీఖాన్, చెనాయ్, హాజీ సజన్‌లాల్, వేణుగోపాల్ పిళ్ళె, ఇస్మాయిల్ సాహెబ్, చిరుకొండ రామచంద్రయ్య, రామానుజ మొదలియార్, గంగా భీషమ్, బెంబానీ అడుగే వంటి వారు వున్నారు. నైజాం సంస్థానంలోని విద్యావంతు లను మేల్కొలిపి, వారిలో చైతన్యాన్ని రగిలింప చేయడంలో ముల్లా అబ్దుల్ ఖయూం, రామచంద్ర పిళ్ళె, డాక్టర్ అఘోరనాధ చటోపాధ్యాయ ముఖ్యులు. భారతజాతీయ కాంగ్రెసులో చేరిన మొట్టమొదటి ముస్లిం ముల్లా అబ్దుల్ ఖయూం. మద్రాసు, బెనారస్ లలో కాంగ్రెస్ మహాసభలకు ప్రతినిధిగా హాజరై, చురుకైన క్రియాశీల కార్యకర్తగా పనిచేశాడు. ముస్లిములంతా భారత జాతీయ కాంగ్రెసులో చేరాలని ఉద్బోధించాడు.

## చైతన్య దీపికలైన పత్రికలు

భారతదేశంలోని జాతీయోద్యమానికి అను కూలంగా నైజాం సంస్థానంలో ప్రజల అభిప్రాయాన్ని మలచడంలో 'హైదరాబాద్ రికార్డ్' అన్న పత్రిక ప్రధానంగా తోడ్పడింది హైదరాబాద్‌లోని బ్రిటిషు ప్రభుత్వ ప్రతినిధి రెసిడెంటును ఆ పత్రిక 'స్థానిక సీజర్'గా విమర్శించింది. దానితో 1892 లో ఆ పత్రికను నిషేధించారు. అంతేకాదు, పత్రికలపై తీవ్రమైన నిర్బంధాలను విధించారు.

## హిందూ సోషల్ క్లబ్

ఆ రోజుల్లో ప్రతిభావంతులైన విద్యార్థులను విదే శాలలో ఉన్నత విద్యాభ్యాసానికి స్కాలర్‌షిప్పులు యివ్వాలని నైజాం ప్రభుత్వం నిర్ణయించింది. అయితే, హిందువులైన వారిని స్కాలర్‌షిప్పుల పథకంనుంచి మినహాయించడానికి నిజాం ప్రభుత్వం ఒక ఎత్తు వేసింది. హిందువులు సముద్రయానంచేసి, మ్లేచ్ఛులు కారాదన్న ఛాందస భావాన్ని ఆసరాగా చేసుకొని, హిందువులైన విద్యార్థులు సముద్రయానం చేయ వచ్చునా, లేదా అను అంశాన్ని నిర్ణయించడానికి నిజాం ప్రభుత్వం సనాతన హిందువులతో ఒక కమిటీని నియమించింది. ఈ కమిటీ నియామకానికి వ్యతిరేకంగా ఆందోళన చేయడానికి రాజా మురళీ మనోహర్ అధ్యక్షులుగా, కృష్ణఅయ్యంగార్ ఉపాధ్యక్షులుగా, రామకృష్ణ పిళ్ళె తదితరులు సభ్యులుగా 'హిందూ సోషల్‌క్లబ్' ఏర్పడింది.

ఇంగ్లండులో ఉన్నతవిద్య నభ్యసించడానికి ఉర్దూ, పర్షియన్ భాషల పరిజ్ఞానం అవసరం లేకపోయినా

ఆ రెండు భాషలలో పరిజ్ఞానంలేని హిందూ విద్యార్థులను విదేశీ చదువుకు పంపరాదన్న ఆంక్ష విధించారు అన్యాయమని కూడా 'హిందూ సోషల్ క్లబ్' ఆందోళన చేసింది.

## బారిష్టర్ రుద్ర ఉదంతం

ఆనాటి నైజాం సంస్థానంలో పత్రికాస్వేచ్ఛ పౌర హక్కులపై నిర్బంధాల తీవ్రస్వభావాన్ని అర్థంచేసుకొనడానికి బారిష్టరు రుద్ర ఉదంతం చక్కని తార్కాణం.

బారిష్టరు రుద్ర న్యాయవాదవృత్తి సాగించడానికి 1889 లో హైద్రాబాద్ వచ్చాడు ఆదిలో ఆయనకు పాలకులు బ్రహ్మరథం పట్టారు. ఆయనకు నైజాం క్లబ్‌లో సభ్యత్వం యిచ్చారు. అయితే, నైజాం నవాబుచుట్టూ చేరిన ఫ్యూడల్ వందిమాగధులను గురించి ఆయన 'పయొనీర్' పత్రికలో వ్యాసాలు ప్రచురించడంతో, ఆయనను నైజాంక్లబ్‌నుంచి బహిష్కరించడమేగాక, అనేక విధాల వేధించసాగారు. దానితో ఆయన హైదరాబాద్ వదలి వెళ్ళిపోవలసి వచ్చింది.

## ముల్కీ – నాన్‌ముల్కీ గొడవ

1956 లో హైదరాబాద్ సంస్థానం విభజన జరిగి, భాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మాణంలో భాగంగా ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలను కలిపి, ఆంధ్ర ప్రదేశ్‌ను ఏర్పరచిన తర్వాత ప్రజ్వరిల్లిన ముల్కీ - నాన్‌ముల్కీ గొడవకు బీజాంకురాలు 1890 దశకంలోనే పడినవి.

రాజకీయ కార్యకలాపాలపై నైజాం సంస్థానంలో వున్న దారుణ నిర్బంధాల కారణంగా, అక్కడ జాతీయోద్యమం సాంస్కృతిక పునర్వికాసోద్యమ రూపంలో ప్రారంభమైనది.

1892 లో స్థాపితమైన ఆర్యసమాజం సాంస్కృతిక పునర్వికాసోద్యమానికి సారథ్యం వహించింది. ఆర్య సమాజం ఉద్యమాన్ని మొగ్గలోనే త్రుంచివేయడానికి నాన్‌ముల్కీల పేరుతో ఆర్యసమాజ నాయకులను నైజాం నవాబులు నిర్బంధకాండకు గురిచేశారు. ఆర్య సమాజం నాయకులైన నిత్యానంద బ్రహ్మచారి, విశ్వనాథ సరస్వతి వంటివారిని బంధికానా పాలు చేశారు. వారి తరపున న్యాయవాదిగా వకాల్తా పుచ్చుకొన్న రామచంద్ర పిళ్ళే, ఆ ఖైదీలతో మాట్లాడ డానికి జైలుకెళ్ళినప్పుడు, పోలీసులు ఆ న్యాయవాదిని కూడా రెండు గంటలపాటు నిర్బంధంలో వుంచారు.

నైజాం ప్రభుత్వం ఎన్ని నిర్బంధాలు విధించినా, హైదరాబాద్ సంస్థానంలో ఆర్యసమాజం ఉద్యమం వేరూని విస్తరించింది. డాక్టరు అఘోరనాధ్ చటోపాధ్యాయ ఈ ఉద్యమానికి కొండంత అండగా నిలిచారు. కేశవరావు కొరాట్కర్, దామోదర్ సత్వలేకర్ వంటివారు 1896 లో ఈ ఉద్యమంలో చేరారు.

## గణేశ్ ఉత్సవాలు

హైదరాబాద్‌లో నేటికి బ్రహ్మాండంగా జరుపబడుతున్న గణేశ్ ఉత్సవాలు 1895 లో ప్రారంభించబడినవి. బాలగంగాధర్ తిలక్ జాతీయోద్యమానికి ప్రోద్బల శక్తిగా ఈ గణేశ్ ఉత్సవాలను ప్రవేశపెట్టిన విషయం ఈ సందర్భంలో గమనార్హం. భారత దేశంలోని మిగతా ప్రాంతాలలోవలెనే, హైదరాబాద్ సంస్థానంలో కూడా జాతీయోద్యమ వ్యాప్తికి ఈ గణేశ్ ఉత్సవాలు ఎంతగానో తోడ్పడ్డాయి.

## శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయం

20 వ శతాబ్దం ఆదిలో ఆంధ్రప్రాంతంలో ఉవ్వెత్తున ఎగసిన సాంస్కృతిక పునర్వికాసోద్యమంతో ఉత్తేజితులైన కొమర్రాజు లక్ష్మణరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, అయ్యదేవర కాళేశ్వరరావు వంటివారు ఆంధ్ర - తెలంగాణా ప్రాంతంలోని తెలుగువారి మధ్య సాంస్కృతిక సంబంధాలను పెంపొందించాలన్న ధ్యేయంతో పునర్వికాసోద్యమాన్ని ప్రారంభించారు. నైజాం సంస్థానంలో ఈ ఉద్యమానికి మునగాల జమీందారు ఎన్. వెంకట

రంగారావు, మునసబుదారు రావిశెట్టి రంగారావు పూర్తి ప్రోత్సాహం, ప్రోద్బలాలను సమకూర్చారు.

మునగాల జమీందారు దివాన్‌గా పనిచేస్తున్న కొమర్రాజు లక్ష్మణరావు, మునసబుదారు రావిశెట్టి రంగారావుతో కలిసి, 1901 లో శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయం స్థాపించారు. తెలుగువారి మధ్య సంఘీభావ వ్యాప్తికి ఈ గ్రంథాలయోద్యమం నాంది అయింది. అనంతరం, విజ్ఞానశాస్త్ర, సాహిత్య గ్రంథాలను తెలుగులో వెలువరించే నిమిత్తం 1906 లో వారు హైదరాబాద్‌లో విజ్ఞాన చంద్రిక గ్రంథ మండలి స్థాపించారు.

మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్రప్రాంతంలో వందే మాతరం ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించిన గాడిచర్ల హరిసర్వోత్తమరావును బ్రిటిష్ ప్రభుత్వం అరెస్టు చేయడంతో, విజ్ఞాన చంద్రిక గ్రంథమండలి కార్యకలాపాలపైన నిజాం ప్రభుత్వం నిషేధం విధించింది దానితో ఆ మండలి కేంద్ర కార్యస్థానాన్ని 1908 లో హైదరాబాద్ నుంచి మద్రాసుకు తరలించవలసి వచ్చింది.

దీనికి తోడుగా, మరొక రెండు తెలుగు గ్రంథాలయాలు కూడా అదే దశలో నైజాం సంస్థానంలో వెలిశాయి. 1904 లో హనుమకొండలో శ్రీ రాజరాజ నరేంద్ర ఆంధ్రభాషానిలయం, 1905 లో సికింద్రాబాద్‌లో ఆంధ్ర సంవర్ధని గ్రంథాలయం స్థాపితమయ్యాయి. కొమర్రాజు లక్ష్మణరావు కృషిఫలితంగా, విజ్ఞాన చంద్రిక పరిషత్ ఆధ్వర్యంలో తెలుగుభాషలో పరీక్షలు నిర్వహించబడ్డాయి.

## ఆంధ్రుల అడుగు జాడలలో మహారాష్ట్రులు, కన్నడిగులు

హైదరాబాద్ సంస్థానంలోని మహారాష్ట్రులు, కన్నడిగులు ఆంధ్రుల అడుగుజాడలలో సాంస్కృతిక పునర్వికాసోద్యమం ప్రారంభించారు. హైదరాబాద్‌లో మహారాష్ట్ర ప్రముఖులైన పండిత కేశవరావు కోరాట్కర్, వామన రామచంద్రనాయక్, గణపతిరావు హర్ధికర్‌లు 1906 లో వివేకవర్ధన పాఠశాలను స్థాపించారు. గుల్బర్గాలోని కన్నడిగ ప్రముఖులైన విఠల్‌రావు, బేవుల్ గోంకర్, గరుడారావు, కేశవరావు కొరాట్కర్ వంటివారు నూతన విద్యాలయ ఉన్నత పాఠశాలను ప్రారంభించారు.

హైదరాబాద్ సంస్థానంలో ఈ విధంగా సాంస్కృతిక పునర్వికాస సాధనకు పై సంస్థలు ప్రాతిపదికలు వేశాయి.

## నైజాం సంస్థానంలో స్వదేశీ ఉద్యమం

ఆర్యసమాజం, గణేశ్ ఉద్యమాలద్వారా నైజాం సంస్థానంలో స్వదేశీ ఉద్యమం సాగించింది. నిజాం ప్రభుత్వం విధించిన ఆంక్షలను ఖాతరు చేయకుండా, స్వదేశీ ఉద్యమంలో భాగంగా, తాలింఖానాలు ఏర్పాటు చేసి, యువకులకు శారీరక శిక్షణ కేంద్రాలు నిర్వహించింది.

డాక్టరు అఘోరనాథ్ చటోపాధ్యాయ ఇంట్లోజరిగిన సమావేశాలలో స్వదేశీ ఉద్యమం, విదేశీ వస్త్ర బహిష్కరణల ప్రాధాన్యాన్ని వివరిస్తూ, కేశవరావు కొరాట్కర్, పండిట్ దామోదర సత్యలేకర్, వామన్ నాయక్, అప్పాజీ తులిజీపూర్కార్ వంటివారు చర్చించారు. వీరి కార్యకలాపాలు నిజాం ప్రభుత్వ దృష్టిలో పడి, వీరిని సంస్థానం నుంచి బహిష్కరించాలని ప్రభుత్వంఆలోచించసాగింది. ఇది తెలిసినంతనే, దామోదర్ సత్యలేకర్, తులిజాపూర్కర్ లిద్దరూ తమంత తాము సంస్థానం వదలి, హరిద్వార్, బొంబాయిలకు వెళ్ళి అక్కడ స్థిరపడిపోయారు. స్వదేశీ ఉద్యమ ప్రచారకులైన వీరిద్దరి నిష్క్రమణ, నిజాం సంస్థానంలో స్వదేశీ ఉద్యమానికి విఘాతం ఏర్పడింది.

## జాన్సన్ హత్య

వందేమాతరం ఉద్యమం ప్రచారంతో హైదరాబాద్ సంస్థానంలో కూడా టెర్రరిస్టు ధోరణులు చోటు చేసుకున్నాయి. నిజాం సంస్థానంలోని మరట్వాడా జిల్లాలు ఈ ధోరణులకు కేంద్రాలైనవి.

1908 లో బాలగంగాధరతి క్‌కు ఆరేళ్ళ కారాగార వాస శిక్ష విధించి, మాండలే జైలుకు పంపించిన బ్రిటిష్ అధికారి జాన్సన్ 1909 లో నాసిక్‌జిల్లా కలెక్టరుగా పనిచేస్తున్నప్పుడు, అనంతలక్ష్మణ్ అనే విద్యార్థి-టెర్రరిస్టు ఆ బ్రిటిష్ అధికారిని కాల్చి చంపాడు. జాన్సన్ ప్రాణం తీసిన టెర్రరిస్టు ముఠాలతో సంబంధాలు కలిగి వున్నారన్న కారణంగా ఔరంగాబాద్‌లోని ఇండస్ట్రియల్ స్కూలు హెడ్ డ్రాయింగ్‌మాష్టరు మాధవరావును, సర్వే సెటిల్‌మెంట్స్ అసిస్టెంట్ కమీషనర్ నరహరి త్రియంబక్ ఘోత్‌పోలే, వినాయక్ గోవిందతెక్కె, ధరణ్‌చోగ్లే, కాలేవంటి జాతీయోద్యమాభిమానులు ఉద్యోగాల నుంచి భర్తరఫు చేయబడ్డారు.

## భజన కూటములు

మహబూబ్‌నగర్ జిల్లాలో జాతీయ భావాల ప్రచారానికి చిన్న కృష్ణయ్య అనే న్యాయవాది, శేషగిరిరావు అనే కంట్రాక్టరు స్థాపించిన భజన కూటమి కేంద్రమైనదన్న అనుమానంతో, దానిని ప్రభుత్వం నిషేధించింది.

నిజాం సంస్థానంలోని ఇతర ప్రాంతాలలో భజన మండలులను స్థాపించరాదని ఆదేశించింది. వందేమాతరం నినాదం, తిలక్, బిపిన్ చంద్రపాల్ వంటి నాయకుల ఫోటోలు ముద్రించిన కార్టన్‌బాక్సులు, లాకెట్లు, బటన్లు వంటి వాటి అమ్మకాలను కూడా నిజాం ప్రభుత్వం ఆ రోజుల్లో నిషేధించింది.

స్వాతంత్ర్యోద్యమానికి బీజాంకురాలు వేసిన స్వదేశీ ఉద్యమం నిజాం సంస్థానంలో వ్యాప్తి చెందకుండా నిరోధించడానికి నిజాం నవాబులు అన్నిరకాలైన ఆంక్షలు, నిషేధాజ్ఞలు విధించారని దీనిని బట్టి మనం గ్రహించవచ్చు.

# హోమ్‌రూల్ ఉద్యమం

1905 లో ప్రారంభమైన వందేమాతరం ఉద్యమం 1911 లో బెంగాల్ విభజనను రద్దు చేయడంతో ముగిసింది. ఈ ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించిన ముఖ్య నాయకులు ముగ్గురిలో బాలగంగధరతిలక్‌కు ఆరేళ్ళ శిక్ష విధించి, మాండలే జైలుకు పంపించడం, ఆలీపూర్ బాంబుకేసులో నిందితుడైన అరవిందఘోష్ రాజకీయాలతో విరక్తి చెంది, పుదుచ్చేరిలో ఆశ్రమం స్థాపించడం, బిపిన్‌చంద్రపాల్‌ను జైలులో నిర్బంధించడం, లాలాలజపతిరాయ్ స్వచ్ఛందంగా క్రియాశీల రాజకీయరంగం నుంచి నిష్క్రమించడంతో, జాతీయోద్యమంలో మితవాదులది పైచేయి అయింది.

ఈ దశలోనే లాలాహరదయాళ్, శాన్‌ఫ్రాన్సిస్కో (అమెరికా)లో విప్లవకర సంస్థ గదర్ పార్టీని స్థాపించాడు. ఆంధ్రుడైన దర్శి చెంచయ్య గదర్‌పార్టీలో చేరినప్పటికి, ఎక్కువకాలం ఆ పార్టీలో కొనసాగలేదు. అయితే రష్యన్ విప్లవకారుల గురించిన సాహిత్యం ఆ దశలోనే ఆంధ్రదేశంలో ప్రచారం లోకి వచ్చింది. బాపట్లకు చెందిన ఎల్. బసవయ్య ఈ సాహిత్యాన్ని రహస్యంగా పంపిణీ చేసినందుకు "బాపట్ల విద్రోహపు కేసు" బనాయించారు.

ఆంధ్రదేశంలో 1910 వరకు ఉవ్వెత్తున వందేమాతరం, స్వదేశీ ఉద్యమాలు సాగినప్పటికీ అనంతరం కాంగ్రెసుపై మితవాదులది పైచేయి కావడంతో జాతీయోద్యమంలో కొంత స్తబ్దత ప్రవేశించింది. మితవాదులైన కొండా వెంకటప్పయ్య, దివాన్ బహదూర్, బి. కేశవపిళ్ళె వంటి మితవాదుల నాయకత్వంలో కాంగ్రెసు 1911 తరువాత ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర స్థాపనకై దృష్టిని కేంద్రీకరించి అందుకోసం ఆందోళన సాగించింది.

## హోమ్ రూల్ లీగ్

బాలగంగాధరతిలక్ 1914 జూన్ 16 న మాండలే జైలు నుంచి విడుదల నంతనే, మహారాష్ట్రకు తిరిగి వచ్చాడు. 1914 ఆగ లో మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభమయింది. 907 లో సూరత్ కాంగ్రెసు మహాసభలో అతివాద, మితవాదుల మధ్య వచ్చిన చీలికకు స్వస్తి చెప్పుతూ వారు 1916 లో లక్నో కాంగ్రెసు మహాసభలో తిరిగి ఏకమయ్యారు. బాలగంగాధర్‌తిలక్ బ్రిటిష్ పాలన నుంచి భారతదేశం విముక్తి కావడానికి తొలిమెట్టుగా 'హోమ్‌రూల్' స్వపరిపాలన సాధించాలన్న లక్ష్యంతో 1916 ఏప్రిల్ 16న 'హోమ్‌రూల్'ను స్థాపించారు. అలాగే ఐర్లెండుకు చెందిన శ్రీమతి అనిబీసెంట్ మద్రాసు వచ్చి, అక్కడ స్థిరపడి. థియోసాఫికల్ సొసైటీని నడుపుతున్నది. ఆమె కూడా 1916 సెప్టెంబరులో మరొక హోమ్‌రూల్ లీగ్‌ను స్థాపించింది.

ఈ రెండు "హోమ్‌రూల్‌లీగ్‌లు" సమన్వయ దృష్టితో, కృషి చేయడంతో వందేమాతరం ఉద్యమం వలెనే, హోమ్‌రూల్ ఉద్యమం కూడా దేశవ్యాప్తంగా సాగింది.

## ఆంధ్రలో హోమ్ రూల్ ఉద్యమం

హోమ్ రూల్ ఉద్యమానికి ఆంధ్రదేశం స్వాగతం పలికింది. గాడిచర్ల హరిసర్వోత్తమరావు కార్యదర్శిగా హోమ్ రూల్ లీగ్ ఏర్పాటయింది.హోమ్ రూల్ అవసరం గురించి ఆంధ్రదేశంలో ప్రచారం పెద్ద ఎత్తున సాగింది. స్వరాజ్యం ఎందుకు అవసరమో వివరిస్తూ అనేక కరపత్రాలు తెలుగులో ప్రచురించారు. సరోజినీ నాయుడు రచించిన "ఎవేక్ మదర్" (తల్లీ మేలుకో) ప్రబోధాత్మక గేయాన్ని తెలుగులోకి అనువదించారు. దానికి "నూతన హైందవ మాతృగీతం" అని పేరు పెట్టారు. 'స్వరాజ్య పరమోద్దేశం" 'స్వతంత్ర వర్ధన పత్రం' 'స్వరాజ్యం కోరుటకు కారణం' వంటి కరపత్రాలు ప్రచురించారు. వీటి ధర ఒక 'కానీ' మాత్రమే. వీటిని విరివిగా ప్రజలలో అమ్మి, హోమ్ రూల్ ఉద్యమ ఆశయాన్ని ప్రచారం చేశారు.

గాడిచర్ల హరిసర్వోత్తమరావు నడుపుతున్న నేషనలిస్టు ఆంగ్ల వారపత్రికలో తీవ్రస్వభావం గల వ్యాసాలు ప్రచురించినందుకు, ఆ పత్రిక ధరావతు సొమ్మును ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నది. హోమ్‌రూల్ ఉద్యమాన్ని ప్రచారం చేయటంలో చిలకమర్తి లక్ష్మీనరసింహం నడిపిన 'దేశమాత', ఏలూరు నుంచి వెలువడిన 'హితకారిణి', 1914 లో కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు ప్రారంభించిన 'ఆంధ్రపత్రిక' ముట్నూరి కృష్ణారావు 'కృష్ణా పత్రిక' లు ప్రముఖ పాత్ర వహించాయి.

## అనీబిసెంట్ పర్యటన

అనీబిసెంట్ 1916 లో లక్నో కాంగ్రెసు మహాసభలో పాల్గొని, మద్రాసు తిరిగి వెడుతూ ఆంధ్ర దేశంలో పర్యటించారు. కాకినాడ, రాజమండ్రి, ఏలూరు, చిత్తూరు బహిరంగ సభలలో ప్రసంగించారు ఆమె పర్యటన తెలుగు ప్రజలపై పెద్ద ప్రభావాన్ని కలుగ జేసింది. మోచర్ల రామచంద్రరావు ఈ పర్యటనను ఏర్పాటు చేశారు.

అనీబిసెంట్ మద్రాసు నుంచి ప్రారంభించిన 'న్యూ ఇండియా' 'కామన్ వీల్' పత్రికలు బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా తీవ్ర ప్రచారం చేశాయి. ఆరోజుల్లో రైళ్ళలో యూరోపియన్లకు ప్రత్యేకించిన బోగీలలో భారతీయులు ప్రయాణం చేయరాదన్న ఆంక్ష విధించారు. ఆ ఆంక్ష భారతీయులను అవమాన పర్చడం తప్ప మరొకటి కాదని అనీబిసెంట్ ప్రచారం చేశారు. దానితో అనేక మంది భారతీయ విద్యార్థులు యూరోపియన్లకు ప్రత్యేకించిన బోగీలలో ప్రయాణించడానికి ప్రయత్నించి, తెల్లవాళ్ళతో అనేక సందర్భాలలో తీవ్రమైన ఘర్షణలకు కారకులయ్యారు.

## యువతరానికి ఉత్తేజం

అనీబిసెంట్ యువతరానికి చైతన్యం కలిగించింది. వారిని ఉత్తేజ పర్చడానికి యంగ్‌మన్స్ క్రిష్టియన్ అసోసియేషన్‌కు పోటీగా, యంగ్‌మన్స్ మెమోరియల్ అసోసియేషన్ స్కౌట్ ఉద్యమాన్ని ఆమె ప్రారంభించారు. ఆమె 1916 మేలో మదనపల్లిలో నేషనల్ కాలేజీని స్థాపించారు. ఐరిష్ జర్నలిస్టు జె. హెచ్. కజిన్స్‌ను ఆ కాలేజి ప్రిన్సిపాల్‌గా నియమించారు.

హోమ్ రూల్ లీగ్ ఉద్యమ నాయకులైన హరిసర్వోత్తమరావు, చిదంబర పిళ్ళె వంటి వారి ప్రచారం వల్ల, కార్మిక, వ్యవసాయ వివాదాలు తలెత్తాయని, ఆ రోజుల్లోని సి. ఐ. డి. నివేదికలో పేర్కొనబడింది.

## ప్రభుత్వం నిర్బంధాలు

హోమ్ రూల్ ఉద్యమం బహుళ వ్యాప్తి చెంది ప్రజోద్యమంగా పెంపొందుతుండడంతో మద్రాసు ప్రభుత్వం ఆందోళన చెంది, ఆ ఉద్యమాన్ని అణచివేయడానికి నిర్బంధ విధానాన్ని తీవ్రతరం చేసింది. విద్యార్థులు రాజకీయ కార్యకలాపాలలో పాల్గొన రాదని నిషేధించింది. 1917 జూన్ 16 వతేదీన అనీబిసెంట్, ఆమె అనుచరులైన బి. పి. వాడియా (న్యూ ఇండియా అసిస్టెంట్ ఎడిటర్) జార్జి అరండేల్ లను ఉదకమండలంలో నిర్బంధించింది.

అనీబిసెంటు అరెస్టుకు నిరసనగా దేశ వ్యాప్తంగా బహిరంగసభలు జరిగాయి ప్రభుత్వం తన నిర్బంధ విధానాలను తీవ్రతరంచేసే కొలదీ, హోమ్‌రూల్ ఉద్యమం కృష్ణా, చిత్తూరు జిల్లాలలో మరింత మహోధృత రూపం దాల్చింది. బందరులోని జాతీయ కళాశాల, మదనపల్లిలోని నేషనల్ కాలేజీ అధ్యాపక సిబ్బంది హోమ్‌రూల్ ఉద్యమాన్ని మరింత తీవ్రం చేయడంలో ప్రముఖ పాత్ర వహించారు.

## బ్రాహ్మణ–బ్రాహ్మణేతర ఘర్షణలు

ఆంధ్రదేశంలో జాతీయోద్యమానికి నాయకత్వం వహిస్తున్న బ్రాహ్మణులకు వ్యతిరేకంగా, బ్రిటిషు ప్రభుత్వం బ్రాహ్మణేతరులను రెచ్చగొట్టుతూ, 'చీలించి పాలించే' తనకుటిల రాజనీతిని పాటించింది. ఆ విధంగా కాంగ్రెస్ ఉద్యమాన్ని బ్రాహ్మణుల ఉద్యమంగా చిత్రించ ప్రయత్నించింది. ఈ కుటిల రాజనీతి ఫలితంగా బ్రాహ్మణ వ్యతిరేక- బ్రిటిషు అనుకూల జెస్టిస్ పార్టీ ఆంధ్రదేశంలో బయలుదేరింది. బొబ్బిలి రాజా, తదితర జమీందారులు, భూస్వాములు జస్టిస్ పార్టీకి మూలకంద మయ్యారు.

గుంటూరు, కర్నూలు, కడపవంటి చోట్ల బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులకు మధ్య ఘర్షణలు, కొట్లాటలు చెలరేగాయి.

## ఐక్యతా ప్రయత్నాలు

బ్రిటిషువారు 'చీలించి-పాలించే' నీతిని వమ్ము చేయడానికి అయ్యదేవర కాళేశ్వరరావు చొరవ తీసుకొని, ప్రత్యేక ఆంధ్ర మహాసభను విజయవాడలో ఏర్పాటుచేశారు. ఈ మహాసభకు 1200 మంది ప్రతినిధులు హాజరయ్యారు. ఈ మహాసభలో బ్రాహ్మణేతర ప్రముఖులైన త్రిపురనేని రామస్వామి చౌదరి, పట్టాభి రామరెడ్డి, గు కేశవపిళ్ళె, రంగనాధ పిళ్ళె వంటివారు ప్రముఖపా వహించారు. బ్రాహ్మణేతరులకు మద్రాసు లెజిస్లేటి కౌన్సిల్‌లో హెచ్చు ప్రాతి

నిధ్యం ఒసగాలని కోరడంతోపాటు, హోమ్‌రూల్ ఉద్యమాన్ని బలపరుస్తూ ఈ మహాసభలో తీర్మానించారు.

ఈ మహాసభ నిర్వాహకులు ఒక్క విజయవాడ కాంగ్రెస్ డివిజన్‌లోని అయిదు తాలూకాలలో హోమ్ రూల్ ఉద్యమాన్ని బలపరుస్తూ, 10 వేలమంది ప్రజల సంతకాలు సేకరించగలిగారు.

## రాయబారానికి పేచీ

అప్పట్లో బ్రిటిషు మంత్రి వర్గంలో ఇండియా కార్యదర్శిగా పనిచేస్తున్న మాంటేగు, భారతదేశాన్ని సందర్శించినప్పుడు, ఆయన వద్దకు రాయబారవర్గాన్ని పంపాలని ఆంధ్ర మహాసభ నిర్ణయించింది. ఆ రాయబార వర్గానికి మాంటేగుతో ఇంటర్వ్యూ ఏర్పాటుచేయడానికి మద్రాసు ప్రభుత్వం మొదట నిరాకరించింది. చివరకు ఆంధ్ర కాంగ్రెసు సంఘం రాయబార వర్గంతోపాటు, ఆర్యవైశ్య రాయబారవర్గం, నాయుడు రాయబార వర్గాలకు కూడా మాంటేగుతో మద్రాసు ప్రభుత్వం ఇంటర్వ్యూలు ఏర్పాటు చేయడం ద్వారా కుల విభేదాలను రెచ్చగొట్టడానికి శతధా ప్రయత్నించింది.

న్యాయపతి సుబ్బారావు నాయకత్వంలో 27 మందితో కూడిన ఆంధ్రమహాసభ ప్రతినిధి వర్గం మాంటేగును కలుసుకొని ప్రత్యేకాంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలని కోరింది. ఆ కోర్కెను పరిశీలించగలనని మాంటేగు వాగ్దానం చేశాడు.

ఆ ప్రతినిధివర్గంలో న్యాయపతి సుబ్బారావుతోపాటు, మోచర్ల రామచంద్రరావు, కె ఆర్. వి కృష్ణారావు, బి.ఎన్.శర్మ, ఎ. సూర్యనారాయణరావు, కొండా వెంకటప్పయ్య, కాశీనాధుని నాగేశ్వరరావు, కోపెల్లి హనుమంతరావు, భోగరాజు పట్టాభి సీతారామయ్య, సి. ఎ. ఎస్. నరసింహరాజు, గాడిచర్ల హరి సర్వోత్తమరావు, ఎమ్. డి. ఆర్. ఆలీషా, గాదె రాఘవరావు, సి. హెచ్ లచ్చారావు, వేమూరి పట్టాభి రామారావు, సి. హెచ్.వీరయ్య, ఓరుగంటి వెంకటరంగయ్య పి. చెంచయ్య, హెచ్. శంకరరావు, వి. పిచ్చయ్య, ఎన్. వెంకట సుబ్బయ్య, ఎస్. వి. నరసింహారావు, బొాణకా పట్టాభి రామరెడ్డి, సి. భాస్కర రెడ్డి, బి. రామన్న, అప్పయ్యలు సభ్యులు.

అనంతరం 1918 ఫిబ్రవరి 6వ తేదీన ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో బి ఎన్. శర్మ, భాషా ప్రయుక్త రాష్ట్రాలను ఏర్పాటు చేయాలని కోరుతూ ప్రవేశ పెట్టిన తీర్మానాన్ని ఎం. ఎ. జిన్నా, వి. ఎస్. శ్రీనివాసశాస్త్రి, సురేంద్రనాద్ బెనర్జీ వంటివారు వ్యతిరేకించడంతో అది వీగిపోయింది.

బి. ఎన్. శర్మ తీర్మానాన్ని తిరస్కరించడంతో ఆంధ్రులు ఆందోళన చెందారు. ప్రత్యేకాంధ్ర సాధనకు ఆందోళన తీవ్రతరం చేయాలని కృష్ణా, విశాఖపట్నం జిల్లాల ఆంధ్ర మహాసభలు తీర్మానించాయి. విశాఖపట్నం ఆంధ్రమహాసభకు అధ్యక్షత వహించిన జయపూర్ మహారాజా విక్రమ దేవవర్మ 'జన్మతః నేను ఆంధ్రుణ్ణి కాకపోయినా ఆంధ్రదేశం, ఆంధ్రభాష నా పెంపుడుతల్లి. ఆంధ్రోద్యమానికి నాహృదయపూర్వకమైన మద్దతు వుంటుంది' అని ఎలుగెత్తి చాటాడు.

## అనిబిసెంట్ సేవలకు గుర్తింపు

1914 - 1917 వరకు అనిబిసెంట్ భారత స్వాతంత్ర్యోద్యమానికి చేసిన అవిరళ సేవలకు గుర్తింపుగా ఆమె కలకత్తా కాంగ్రెసు మహాసభకు అధ్యక్షులుగా ఎన్నికయ్యారు.

బాల గంగాధర్ తిలక్ కృషి ఫలితంగా ఆంధ్ర కాంగ్రెసు సంఘం ఏర్పాటుకు కలకత్తా కాంగ్రెసు మహాసభలో తీర్మానించారు.

## మాంటేగు - చెమ్సుఫర్డ్ సంస్కరణలు

1918లో బ్రిటిషు ప్రభుత్వం మాంటేంగూ - చెమ్సుఫర్డు సంస్కరణలను ప్రకటించింది. అయితే హోమ్‌రూల్ ఉద్యమ ఆశయాలకు ఈ సంస్కరణలు సరితూగలేదు. కడప, విజయవాడ, కృష్ణా, నెల్లూరు, గంజాం జిల్లాలలో జరిగిన ప్రత్యేక జిల్లా మహాసభలలో ఈ సంస్కరణల పట్ల అసంతృప్తి వ్యక్తం చేస్తూ తీర్మానించారు.

## హోమ్ రూల్ ఉద్యమం ప్రపంచ యుద్ధం ముగింపు

హోమ్‌రూల్ ఉద్యమం, ప్రపంచ యుద్ధం రెండూ దాదాపు ఒకే సమయంలో ముగిశాయి. 1918 నవంబరు

11న ప్రపంచయుద్ధం అంతమైంది. యుద్ధంలో విజేతలైన మిత్రదేశాలు ప్రపంచ దేశాలకు స్వయం నిర్ణయాధికారాన్ని వాగ్దానం చేశాయి. దీని ఫలితంగా భారత నాయకులలో సహజంగానే ఆశలు చిగురిం చాయి స్వరాజ్యం లభించగలదని వారు ఆశించారు.

1918 డిసెంబరు 8వ తేదీన విజయవాడలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘ సమావేశంలో, పారిస్‌లో జరగనున్న ప్రపంచ శాంతి మహాసభకు బాలగంగాధర తిలక్‌ను భారత ప్రతినిధిగా పంపించా లని కోరుతూ తీర్మానించారు. అవసరమైతే ఇంగ్లం డులో కాంగ్రెసు ప్రత్యేక మహాసభను జరపడం మంచిదని వారు సూచించారు.

అనంతరం ఢిల్లీలో మదన్ మోహన్ మాలవీయ అధ్యక్షతన సమావేశమైన అఖిల భారత కాంగ్రెసు సంఘం పారిస్ శాంతి మహాసభకు భారత ప్రతినిధి వర్గంగా బాలగంగాధర తిలక్, గాంధీజీ, హసన్ ఇమామ్‌లను ఎంపిక చేసింది అయితే యుద్ధం ముగిసినందున బ్రిటిషు ప్రభుత్వం భారత ప్రజల వాణిని పెడచెవిని పెట్టసాగింది.

అయితే, వందేమాతరం, హోమ్‌రూల్ ఉద్యమాల ఫలితంగా, భారత దేశంలో స్వాతంత్ర్య ఉద్యమానికి బలీయమైన పునాదులు పడినవి. ప్రజలలో రాజకీయ చైతన్యం పెరిగింది.

1920 ఆగస్టు 1న బాలగంగాధర తిలక్ మృతితో స్వాతంత్ర్యోద్యమ ధ్రువతార రాలిపోయింది. అయితే, ఆయన స్థానంలో మహాత్మాగాంధీ రంగప్రవేశం చేశాడు.

# గాంధీ శకారంభం - ఆంధ్రలో సహాయ నిరాకరణోద్యమం

భారతదేశ స్వాతంత్ర్య పోరాట చరిత్రలో 1919 సంవత్సరం ఒక మైలురాయి వంటిది. అదే సంవత్సరంలో భారత రాజకీయ రంగంలో మహాత్మా గాంధీ ప్రవేశించాడు ఆయన నాయకత్వంలో స్వాతంత్ర్య ఉద్యమం తుదికంటా సాగి 1947 లో దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది.

మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో బ్రిటిషు ప్రభుత్వం భారత దేశంలో నిరంకుశ శాసనాలను అమలు జరిపింది. యుద్ధానంతరం 1919లో ఆ నిరంకుశ శాసనాలకు కొత్తరూపం యిచ్చింది. దాని పేరే రౌలట్ చట్టం. దేశమంతటా వరదలా ఉవ్వెంగుతున్న జాతీయోద్యమాన్ని అణచటం కోసం ఆ చట్టాన్ని ఉద్దేశించారు.

వ్యక్తులను ప్రవాసం పంపించడం, విచారణలేకుండా జైలులో నిర్బంధించడం, పత్రికల గొంతు నొక్కివేయడం, రాజకీయ ఖైదీలను శిక్షించడానికి ప్రత్యేక న్యాయస్థానాలు ఏర్పరచడం వంటి అసాధారణ నిరంకుశాధికారాలను రౌలట్ చట్టంద్వారా బ్రిటిషుప్రభుత్వం ప్రవేశపెట్టింది.

'ఆంధ్ర పత్రిక' 'కృష్ణా పత్రికలు' ఈ చట్టాన్ని అతి తీవ్రంగా, నిశితంగా విమర్శించాయి. ముఖ్యంగా 'కృష్ణా పత్రిక' మానవుని ప్రాథమిక హక్కులను రౌలట్ చట్టం హరించి వేస్తున్నదని విమర్శించింది.

## గాంధీజీ హెచ్చరిక

రౌలట్ బిల్లులను చట్టంగా ఆమోదిస్తే, తాను సత్యాగ్రహ పోరాటం ప్రారంభించగలనని మహాత్మాగాంధీ 1919 ఫిబ్రవరి 24వ తేదీన హెచ్చరించాడు. 1919 మార్చి మొదటి వారంలో భారత ప్రభుత్వం హడావుడిగా రౌలట్ బిల్లులకు శాసనరూప మిచ్చింది. రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా దేశమంతటా మార్చి 30న నిరసన తెలియజేస్తూ హర్తాళ్ జరపాలని మొదట నిర్ణయించారు, కాని తరువాత దానిని ఏప్రిల్ 6వ తేదీకి మార్చారు హ శ్ తేదీని వాయిదా వేసిన సంగతి తెలియక ఢిల్లీలోను, ఇంకా అనేకచోట్ల మార్చి 30వ తేదీనే జా యవాదులు వూరేగింపులు, నిరసన ప్రదర్శనలు జరిపారు. ప్రదర్శకులపై సైనికులు కాల్పులు జరిపారు. ఆకాల్పులలో అయిదుగురు మృతి చెందారు. అనేకమంది గాయపడ్డారు. అదే రోజున ఢిల్లీలో ఆర్య సమాజ నాయకులు స్వామి శ్రద్ధానంద ఒక ఊరేగింపుకు నాయకత్వం వహిస్తూ, తుపాకులు ఎక్కుపెట్టిన బ్రిటిషు సైనికుల ముందుకు నిర్భయంగానడిచివెళ్ళి, గుండెలెదురొడ్డుతూ 'కాల్చుకోండిరా' అనటంతో తెల్ల సైనికులు విభ్రాంత పోయారు. ఏదిలేక బ్రిటిషు సైనికులు తుపాకులు దించి, ఆ వూరేగింపు ముందుకు సాగిపోవడానికి అనుమతించారు.

## పెల్లుబికిన నిరసన వెల్లువ

1919 ఏప్రిల్ 6వ తేదీన, మహాత్మాగాంధీ పిలుపు మేరకు, రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా యావద్భారత దేశంలో నిరసన వెల్లువ పెల్లుబికింది. ఆ రోజున ఆంధ్ర దేశంలోని విశాఖపట్నం, రాజమండ్రి, నర్సాపురం, ఏలూరు, విజయవాడ, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు వంటి పట్టణాలలో ప్రార్థనలు, నిరసన వ్రతాలు, హర్తాళ్లు జరిగాయి. విజయవాడ తాలూకా కోలవెన్ను గ్రామంలో రైతులు సభ జరిపి, రౌలట్ చట్టాన్ని ఖండించారు. ఆ రోజున ఆంధ్ర దేశంలో ఆందోళన శాంతియుతంగా సాగిపోయినా, దేశంలోని ఇతర ప్రాంతాలలో, ముఖ్యంగా పంజాబులోని గుజరన్‌వాలా, అమృతసర్ వంటి చోట్ల గలాటాలు చెలరేగాయి.

ఆ రోజున గాంధీజీ 24 గంటల నిరసనవ్రతం పాటించారు. సి. రాజగోపాలాచారి, రామస్వామి అయ్యంగారు, గాడిచర్ల హరి సర్వోత్తమరావు, ఆది నారాయణచెట్టి ఆదిగా గల నాయకుల సంతకాలతో ఏప్రిల్ 6వ తేదీన పాటించవలసిన కార్యక్రమాన్ని వివరిస్తూ కరపత్రాలను మద్రాసు రాష్ట్ర మంతటా పంచారు. ఏప్రిల్ 6వ తేదీన 'రేపే హ ' అంటూ డప్పులతో దండూరా వేయించారు మొత్తంమీద ఏప్రిల్ 6వ తేదీన దేశమంతటా హర్తాళ్ అపూర్వమైన రీతిలో విజయవంతమైంది.

## పంజాబ్‌లో దురంతాలు

పంజాబ్‌లో లెఫ్టినెంట్ గవర్నరుగా పనిచేస్తున్న ఓడ్వయ్యర్ మార్షల్ లా ప్రకటించి దారుణమైన దమన

కాండ అమలుజరిపి జాతీయోద్యమాన్ని కాలరాసి, బ్రిటిషు ప్రభుత్వం మెహర్బానీ పొందాలన్నదృష్టితో పంజాబ్ అంతటా నిషేధాజ్ఞలు జారీచేశారు.

1919 ఏప్రిల్ 10 వ తేదీన పంజాబ్ కాంగ్రెస్ నాయకులైన డాక్టరు సత్యపాల్, డాక్టరు కిచ్లూ లిద్దరినీ అరెస్టు చేసి, రహస్య తావులలో నిర్బంధించారు. వారి విడుదలను కోరుతూ ప్రజలు ప్రదర్శన జరిపారు. ఆ ప్రదర్శకులపై పోలీసులు కాల్పులు జరిపారు ఫలితంగా పలువురు చనిపోయారు

పంజాబ్‌లో పరిస్థితి విషమించిందని తెలియగానే, మహాత్మాగాంధీ పంజాబ్‌కు బయలుదేరారు దారి మధ్యలో గాంధీజీని అరెస్టుచేసి, అహమ్మదాబాద్‌కు పంపివేశారు. ఉద్యమం అదుపుతప్పి, హింసాత్మకంగా మారుతోందని భయపడిన మహాత్మాగాంధీ వెంటనే సత్యాగ్రహోద్యమాన్ని విరమిస్తున్నట్లు ప్రకటించారు

## జలియన్‌వాలాబాగ్ దురంతాలు

ప్రభుత్వ దమనకాండకు నిరసనగా 1919 ఏప్రిల్ 13 వ తేదీన అమృతసర్‌లోని జలియన్‌వాలాబాగ్‌లో పెద్ద బహిరంగసభ ఏర్పాటుచేశారు. ఆ సభకు 20 వేల మంది హాజరయారు. సభ ప్రశాంతంగా జరుగుతున్నది. జనరల్ డయర్ తన సైనిక బలగంతో అక్కడకు చేరారు. జలియన్‌వాలాబాగ్‌లో వెళ్ళడానికి ఒక ప్రవేశమార్గం వుంది. ఆ ప్రవేశమార్గాన్ని ఆక్రమించిన డయర్ సైనిక మూక సభకు హాజరైన జన సమూహంపై కాల్పులవర్షం ప్రారంభించారు. 1600 రౌండ్లుపేల్చారు. 400 మంది ప్రజలు అక్కడికక్కడే నేల కొరిగారు. 1200 మంది గాయపడ్డారు. డయర్ మూక వద్ద తుపాకి గుళ్ళన్నీ అయిపోయాయి. కనుక కాల్పులు ఆగిపోయాయి. లేకపోతే మరెన్ని వందల ప్రాణాలుఎగిరిపోయేవో? ఇది ప్లాను ప్రకారం జనరల్ డయర్ జరిపించిన మానవ హత్యాకాండ తప్ప మరొకటి కాదు.

జలియన్‌వాలాబాగ్ దురంతాల గురించిన వార్త వెలుగులోకి రాకుండా దాచిపెట్టడానికి బ్రిటిషు ప్రభుత్వం శతథా ప్రయత్నించింది. కాని, ఆ వార్త దావానలం వలె దేశమంతటికీ ప్రాకిపోయింది.

1919 ఏప్రిల్‌లో మహాత్మాగాంధీ దేశ పర్యటనలో భాగంగా ఆంధ్ర ప్రాంతం సందర్శించారు ఆయన మొదట సికింద్రాబాద్‌కు వచ్చారు. అక్కడ నుంచి బెజవాడ వచ్చి, రామమోహన లైబ్రరీ వద్ద జరిగిన బ్రహ్మాండమైన బహిరంగ సభలో ప్రసంగించారు.

గాంధీ ఉపన్యాసాన్ని అయ్యదేవర కాళేశ్వరరావు తెలుగులోకి అనువదించారు

1919 ఏప్రిల్ 23 వ మద్రాసు బీచ్‌లో జరిగిన బ్రహ్మాండమైన బహిరంగ సభకు టంగుటూరి ప్రకాశం పంతులు అధ్యక్షతవహించి, ఉత్తేజపూరితమైన ప్రసంగం చేశారు. నాటినుంచే ప్రముఖ రాజకీయ నాయకుడుగా టంగుటూరి ప్రకాశం రాణించసాగారు. ఆ సభ జరిగిన మరునటి రోజున, మద్రాసులో జరిగిన మరొక బహిరంగ సభలో మహాత్మాగాంధీ ప్రసంగించారు. ఆ సభలో సరోజినీనాయుడు రౌలట్‌చట్టాన్ని విమర్శించే తీర్మానాన్ని ప్రతిపాదించి, తీవ్రమైన ప్రసంగం చేశారు.

## ఆంధ్రదేశంలో నిరసన వెల్లువ

పంజాబ్ దురంతాల పట్ల దేశ మంతటా తీవ్రమైన నిరసనవ్యక్తమయింది. ఆంధ్రదేశంలో గంజాం, విశాఖపట్నం, గోదావరి, కృష్ణా, కాంగ్రెస్ సంఘాల ఆధ్వర్యంలో జరిగిన సభలలో జలియన్‌వాలాబాగ్ కాల్పులను, ప్రభుత్వ దమనకాండను తీవ్రంగా విమర్శిస్తూ తీర్మానించారు.

గాడిచర్ల హరిసర్వోత్తమరావు తన 'నేషనలిస్టు' పత్రికలో బ్రిటిషు "తుపాకి రాజ్యం"గురించి తీవ్రంగా విమర్శించడంతో ఆ పత్రికను నిషేధించారు. ఆంధ్ర పత్రిక, దేశమాత, దేశాభిమాని, ఆంధ్రవాణి, హితకారిణి, వంటి తెలుగు పత్రికలన్నీ ప్రభుత్వ పాశవిక ధోరణిని కడు నిశితంగా విమర్శించాయి.

విశ్వకవి రవీంద్రనాధ్‌ఠాకూర్ బ్రిటిష్ ప్రభుత్వం తనకు ప్రదానం చేసిన బిరుదును జలియన్‌వాలాబాగ్ దురంతాలకు నిరసనగా త్యజించారు.

## ప్రాథమిక హక్కుల ప్రస్తావన

పంజాబ్‌లో సైనిక శాసనం వల్ల జరిగిన దారుణాలు చూసిన తరవాత, దేశంలో ప్రాథమిక హక్కుల

అవసరాన్ని ఉద్ఘాటిస్తూ 1919 సెప్టెంబర్‌లో టంగుటూరి ప్రకాశం పంతులు అధ్యక్షతన జరిగిన నెల్లూరు జిల్లా కాంగ్రెస్ సంఘ సమావేశంలో ఒక 'డిక్లరేషన్' ఆమోదించారు.

గంజాంజిల్లా కాంగ్రెస్ సంఘం వైస్రాయి లార్డ్ చెమ్స్ఫర్డును ఉపసంహరించాలని డిమాండ్ చేసింది. గుంటూరు బార్ అసోసియేషన్ జనరల్ డయర్‌ను దండించాలని తీర్మానించింది. పంజాబ్ దురంతాలలో బాధితులైన వారి సహాయార్థం నిధిని వసూలు చేయాలని తీర్మానించారు. ఆ నిధి వసూలు బాధ్యతను కొండా వెంకటప్పయ్య స్వీకరించారు.

## ఉద్యమ స్వరూప స్వభావాలలో వచ్చిన మార్పు

ఆ విధంగా 1919 సంవత్సరంలో భారత స్వాతంత్ర్య ఉద్యమ స్వరూప స్వభావాలలో మౌలికమైన మార్పు వచ్చింది. అప్పటివరకు మధ్య తరగతి, ఉన్నత వర్గాలకు మాత్రమే పరిమితమైన ఉద్యమం సామాన్య ప్రజలైన కార్మికులు, కర్షకులు, మహిళలను కూడా ఆకర్షించసాగింది. మహాత్మాగాంధీ తనలోని విచిత్రమైన ఆకర్షణ తో కార్మికులు, కర్షకులు, పెట్టుబడిదారులు, విద్యార్థులు, మహిళలు, ఇతర వృత్తుల వారిని జాతీయోద్యమంలో భాగస్వాములుగాను, పాత్రధారులుగాను చేయగలిగాడు.

## ఖిలాఫత్ ఉద్యమం

మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన పిమ్మట ఆ యుద్ధంలో జర్మనీ పక్షాన చేరి, ఓడిపోయిన టర్కీ సామ్రాజ్యాన్ని ముక్కలు ముక్కలు చేసే పథకాన్ని బ్రిటిషు ప్రభుత్వం చేపట్టింది. యావత్ ప్రపంచంలోని ముస్లిములకు టర్కీ సుల్తాన్ 'మతాధిపతి' కావడంవల్ల, టర్కీ సామ్రాజ్య విచ్ఛిత్తిని భారతదేశంలోని ముస్లిములు 'తీరని అవమానంగా పరిగణించారు. ముస్లిం ప్రజలలో పెల్లుబికిన ఈ నిరసన వెల్లువను జాతీయోద్యమంలోకి మళ్ళించాలని భావించిన మహాత్మాగాంధీ 1919 డిసెంబరు 24 న ఢిల్లీలో జరిగిన ఇస్లామిక్ మహాసభకు అధ్యక్షత వహించాడు. ఆ మహాసభలోనే మహాత్మా గాంధీ అహింసా పద్ధతిలో సహాయ నిరాకరణోద్యమం ఎలా నిర్వహించాలో విశదీకరించాడు.

టర్కీ సామ్రాజ్య విచ్ఛిత్తికి వ్యతిరేకంగా ముస్తాఫా కమల్ పాషా ప్రారంభించిన ఖిలాఫత్ ఉద్యమాన్ని భారతదేశంలో అలీ సోదరులు-షౌకత్ అలీ, మహమ్మదాలీ కొనసాగించారు ఈ ఖిలాఫత్ ఉద్యమాన్ని మాంటేగూ-చెమ్స్ఫర్డు సంస్కరణలకు వ్యతిరేకంగా తాను తలపెట్టిన సహాయనిరాకరణోద్యమంతో మేళవించడానికి మహాత్మాగాంధీ ఎందుకు నియించాడో వివరిస్తూ కాంగ్రెస్ చరిత్రకారుడు భోగరాజు పట్టాభిసీతారామయ్య ఇలా రాశారు- "త్రివేణీ సంగమంలాగా, ఖిలాఫత్, పంజాబ్ దురంతాలు, మాంటేగు-చెమ్స్ఫర్డు సంస్కరణలపట్ల పెల్లుబుకుతున్న నిరసన వెల్లువలో మూడింటినీ ఏకోన్ముఖం చేయడంద్వారా జాతీయ అసంతృప్తి వరదను సృష్టించారు పంజాబ్ ప్రజలకు, ఖిలాఫత్‌కు జరిగిన అన్యాయాలకు వ్యతిరేకంగా తన అహింసాత్మక సహాయ నిరాకరణోద్యమం నడపాలని ఆయన నిశ్చయించారు."

మహాభారతయుద్ధంలో శ్రీకృష్ణునివలె మహాత్మా గాంధీ భారత స్వాతంత్ర్య సమరానికి శంఖం పూరించారని "దేశాభిమాని" పత్రిక రాసింది.

## భిన్నమైన రెండు ధోరణులు

ఆ దశలో భారత జాతీయోద్యమంలో భిన్నమైన రెండు ధోరణులు ప్రస్ఫుటమయ్యాయి. స్వయం నిర్ణయాధికార సూత్రానుసారం భారతదేశంలో బాధ్యతాయుత ప్రభుత్వస్థాపనకు బ్రిటిషు పార్లమెంటు తగిన చర్యలు తీసుకోవాలని 1919లో అమృతసర్‌లో మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతన జరిగిన కాంగ్రెస్ మహాసభలో బాలగంగాధరతిలక్, సి. ఆర్. దాసు వంటివారు మాంటేగు-చెమ్స్ఫర్డు సంస్కరణల పట్ల తీవ్ర అసంతృప్తిని వ్యక్తం చేశారు. కాగా, మహాత్మాగాంధీ, మదనమోహనమాలవీయ వంటివారు ఆ సంస్కరణలు సంతృప్తికరంగా లేకపోయినా, వాటి అమలుకు అవకాశం యిచ్చి చూడాలని రాజీ ప్రతి

పాదన చేశారు. ఆ రాజీ ప్రతిపాదనను అమృతసర్ మహాసభ ఆమోదించింది.

## ఆంధ్ర మహాసభ, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసుల డిమాండ్

మాంటేగూ-చెమ్స్‌ఫర్డు సంస్కరణలను క్రోడీకరిస్తూ, బ్రిటిషు పార్లమెంటు రూపొందించిన 1919 భారత ప్రభుత్వ చట్టంక్రింద నియోజకవర్గాల డిలిమిటేషన్ నిర్ణయాధికారాన్ని భారత ప్రభుత్వానికి దఖలు పర్చారు. ఈ కొత్త చట్టంక్రింద 1920 నవంబరులో ఎన్నికలు జరపాలని నిర్ణయించారు. ఈ ఎన్నికలలో తెలుగువారికి అన్యాయం జరగకుండా చూడటానికి, 1920 జనవరి, ఫిబ్రవరిలలో జరిగిన ఆంధ్రమహాసభా స్థాయీసంఘం, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘాలు మద్రాసు రాష్ట్ర శాసనసభలో తెలుగు జిల్లాలకు సగం స్థానాలు కేటాయించాలని, మద్రాసు యూనివర్సిటీకి కేటాయించిన రెండు స్థానాలలో ఒక స్థానం తెలుగు ప్రాంతం జిల్లాలకు ప్రత్యేకించాలని, కౌన్సిల్ ఆఫ్ స్టేట్‌లో మద్రాసు రాష్ట్రానికి కేటాయించిన నాలుగు స్థానాలలో రెండింటిని తెలుగు జిల్లాలకు ప్రత్యేకించాలని కోరుతూ తీర్మానించారు.

## గాంధీజీ — మహమ్మదాలీ పర్యటన

1919 అమృతసర్ కాంగ్రెసు మహాసభలో మాంటేగూ-చెమ్స్‌ఫర్డు సంస్కరణల అమలుకు అవకాశమిచ్చి చూదామన్న వైఖరిని అవలంబించిన మహాత్మాగాంధీ 1920 సంవత్సరారంభానికే తన ధోరణి మార్చుకొన్నారు. 1919 భారత ప్రభుత్వ చట్టంక్రింద 1920 నవంబరులో జరిగే ఎన్నికలను బహిష్కరించి, అహింసా పద్ధతులలో సహాయనిరాకరణోద్యమాన్ని ప్రారంభించాలన్న నిర్ణయానికి వచ్చాడు. ఈ ఉద్యమాన్ని గురించి ప్రచారం చేయడానికి మహాత్మాగాంధీ మహమ్మదాలీతో కలిసి, దేశమంతటా పర్యటించాడు.

1920 ఏప్రిల్ 6 నుంచి 13 వరకు జాతీయ వారోత్సవం జరపాలని నిర్ణయించారు. ఆ వారంరోజులలో పంజాబు దురంతాలను ఖండిస్తూ, జలియన్‌వాలాబాగ్ మృతవీరులను సంస్మరిస్తూ బహిరంగసభలు జరపాలని నిశ్చయించారు.

మద్రాసునుంచి సి. రాజగోపాలాచారి, షౌకత్ ఆలీతో కలిసి, కలకత్తా వెళుతూ మహాత్మాగాంధీ విజయవాడలో ఆగారు-అయ్యదేవర కాళేశ్వరరావు, ముట్నూరి కృష్ణారావు, చెరుకువాడ నరసింహం తదితరులు ఆయనకు స్వాగతమిచ్చారు.

అంతకుముందే 1920 ఏప్రిల్ 17వ తేదీన మహాత్మాగాంధీ మహమ్మదాలీతో కలిసి, దేశభక్త భారతీయులంతా బ్రిటిషు ప్రభుత్వం యిచ్చిన బిరుదులను త్యజించాలని, రానున్న ఎన్నికలను బహిష్కరించాలని, పన్నులు చెల్లించ నిరాకరించాలని, విద్యార్థులు ఇంగ్లీషు విద్యాసంస్థలను వదలి జాతీయ విద్యాసంస్థలలో చేరాలని, న్యాయవాదులు కోర్టులను బహిష్కరించాలని పిలుపు యిచ్చివున్నారు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో తనకు బ్రిటిషు ప్రభుత్వం ప్రదానం చేసిన "కైజర్ ఎ హింద్" బిరుదును మహాత్మాగాంధీ త్యజిస్తూ వైస్రాయికి లేఖ రాశాడు.

## కాళేశ్వరరావు ముందంజ

1920 ఆగస్టు 1వ తేదీన విజయవాడలో జరిగిన బహిరంగసభలో మహాత్మాగాంధీ తాను ప్రారంభిస్తున్న సహాయనిరాకరణోద్యమ లక్ష్యాలను వివరించగానే, అయ్యదేవర కాళేశ్వరరావు నవంబరు ఎన్నికలను బహిష్కరిస్తూ, తన అభ్యర్థిత్వాలను ఉపసంహరించుకుంటున్నట్లు ప్రకటించారు-మహమ్మద్ గులాం మొహిద్దీన్ సాహెబ్ ఫస్టుక్లాస్ ఆనరరీ మేజిస్ట్రేటు పదవిని త్యజించారు. ఈ విధంగా ఆంధ్రదేశంలో మహాత్మాగాంధీ పిలుపును మొట్టమొదటగా పాటించిన ఘనత వారిరువురికీ దక్కింది. 1920 సెప్టెంబరు 28వ తేదీన కొండా వెంకటప్పయ్య, గంటి సూర్యారాయుడు, వింజమూరి భావనాచారి, వేమవరపు రామదాసు పంతులు, చీమకుర్తి రామస్వామి, గంగూలు అప్పారావు, ఖాజా అహమ్మదుల్లా, అన్వర్ జమాఖాన్ తదితరులు ఎన్నికలను బహిష్కరిస్తూ తమ అభ్యర్థిత్వాలను ఉపసంహరించుకున్నారు. కోర్టులను బహిష్కరించాలని గుంటూరు బార్ అసోసియేషన్ తీర్మానించింది- ఖమ్మంజిల్లా కొత్తగూడెం తాలూకాకు చెందిన పానుగంటి పిచ్చయ్య తన పట్వారీ ఉద్యోగానికి

రాజీనామా చేశారు. అనంతరం ఆయన రామదండులో చేరి జైలుశిక్ష అనుభవించారు.

## ఎన్నికల బహిష్కరణ

1920 సెప్టెంబరు 4వతేదీన కలకత్తాలో ప్రారంభమైన కాంగ్రెసు ప్రత్యేక మహాసభ ఎన్నికలను బహిష్కరించి, సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించాలన్న మహాత్మాగాంధీ తీర్మానాన్ని ఆమోదించింది. ఈ మహాసభకు ఆంధ్రదేశం నుంచి హాజరైన వారిలో అయ్యదేవర కాళేశ్వరరావు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రి, బులుసు సాంబమూర్తి, దండు నారాయణరాజు, పేట బాపయ్య, కోటగిరి వెంకట కృష్ణారావు (గంపలగూడెం జమీందారు) మున్నగువారు మహాత్మాగాంధీ తీర్మానాన్ని బలపర్చారు. కొండా వెంకటప్పయ్య, డాక్టరు పట్టాభి సీతారామయ్య ఆ తీర్మానాన్ని వ్యతిరేకించారు.

కలకత్తా కాంగ్రెసు మహాసభ తీర్మానానుసారం కొండా వెంకటప్పయ్య తన శాసన సభ్యత్వానికి రాజీనామా చేశారు. ఉన్నవ లక్ష్మినారాయణ, పోలిశెట్టి హనుమంతయ్య గుప్త, మదనపల్లి నరసింహాచార్యులు న్యాయవాద వృత్తి నుంచి విరమించారు. బందరు నోబుల్ కాలేజీలో బి. ఎస్. సి. ఫైనల్ విద్యార్థి కళా వెంకటరావు తన చదువుకు స్వస్తి చెప్పారు.

ఎన్నికలను బహిష్కరించాలని కోరుతూ రా ్రంలో అనేకచోట్ల బహిరంగ సభలు జరిపారు. సె ంబరు 28న రాజమండ్రిలో జరిగిన సభలో గ్రాడు యేట్ల నియోజకవర్గం ఓటర్లు ఎన్నికలను బహిష్కరించాలని తీర్మానించారు.

ఎన్నికల బహిష్కరణకు గంపలగూడెం జమీందారు కోటగిరి వెంకటకృష్ణారావు అధ్యక్షతన ప్రత్యేక జాతీయ మహాసభ జరిపారు. తిక్కవరపు రామిరెడ్డి ఆహ్వాన సంఘాధ్యక్షులుగా నెల్లూరులో మరొక మహాసభను నిర్వహించారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యదర్శి కొండా వెంకటప్పయ్య రాష్ట్రమంతటా పర్యటించి ఎన్నికలను బహిష్కరించాలని ప్రచారం చేశారు. చిత్తూరుజిల్లా కాంగ్రెసు సంఘం ఎన్నికలను బహిష్కరిస్తూ, తీర్మానించడమే కాక, ప్రజా న్యాయస్థానం ఏర్పాటు చేసింది. అనేక గ్రామాలలో **పంచాయతీ** కోర్టులు ఏర్పాటు చేశారు. కాంగ్రెసు పెద్ద ఎత్తున నిర్వహించిన ఎన్నికల బహిష్కరణ ప్రచారంఫలితంగా, రాష్ట్రంలో పోలైన ఓట్లు శాతం బాగా తగ్గిపోయింది. గుంటూరులో 15 శాతం ఓటర్లు ఓటు చేశారు రాజమండ్రిలోని మొత్తం 120 మంది ముస్లిం ఓటర్లలో కేవలం ఒకే ఒక ఓటరు అదీ ప్రభుత్వోద్యోగి ఓటు చేశాడు అత్యధిక జిల్లాలలో అనేక పోలింగ్ స్టేషన్ల నుంచి ఖాళీపెట్టెలు తిరిగి వచ్చాయి.

## జస్టిస్ పార్టీ పంట పండింది

కాం .సు పా  ఎన్నికలను బహిష్కరించడంతో జస్టిస్‌పా  అభ్య  ల పంట పండింది. మొ  ం శాసన సభలోని 0 స్థా  లలో 63 స్థానాలు ఆ పా కి లభించాయి. 1920 డిసెంబర్ 17వ తేదీన సుబ్బ  యలు రెడ్డియార్ ముఖ్యమంత్రిగా మొట్టమొదటి జస్టిస్‌పార్టీ మంత్రివర్గం పదవీ స్వీకారం చేసింది. పి. రామరాయణింగార్ (పానగల్లు రాజా) ఏలూరుకు చెందిన కె. వి. రెడ్డినాయుడు ఇతర మంత్రులుగా ప్రమాణ స్వీకారం చేశారు

## నాగపూర్ మహాసభ

1920 డిసెంబరులో నాగపూర్‌లో విజయరాఘవాచారి అధ్యక్షతన జరిగిన, కాంగ్రెసు మహాసభకు 16,000 మందిప్రతినిధులు హాజరయ్యారు. వీరిలో అత్యధికులు న్యాయవాదులు, విద్యార్థులు. వీరంతా స్వదేశీ దుస్తులు ధరించారు మొట్టమొదటి సారిగా "గాంధీ టోపీ" ధరించే సంప్రదాయం నాగపూర్ మహాసభతోనే ప్రారంభమయింది.

నాగపూర్ మహాసభలో ప్రసంగిస్తూ మహాత్మాగాంధీ న్యాయబద్ధమైన శాంతియుత పద్ధతులలో స్వరాజ్యాన్ని సంవత్సరంలోగా సాధించాలన్న "పిలుపు"ను ఇచ్చారు, దేశంలో రాష్ట్ర కాంగ్రెస్ సంఘాలను భాషాప్రయుక్త ప్రాతిపదికపై పునర్నిర్మాణం చేయాలన్న నిర్ణయం జరిగింది కూడా నాగపూర్ మహాసభలోనే. నాగపూర్ మహాసభ నిర్ణయాలను అమలు జరపడానికి స్వరాజ్య లక్ష్యసాధనకు అఖిల భారత కాంగ్రెసు సంఘం ప్రతి నెలా వివిధ ప్రాంతాలలో సమావేశాలు జరపాలని కూడా నిర్ణయించారు.

# ఆంధ్రదేశాన్ని ఉర్రూతలూగించిన విజయవాడ ఎ. ఐ. సి. సి. సభ

నాగపూర్ కాంగ్రెస్ మహాసభ అనంతరం, 1921 మార్చి 31, ఏప్రిల్ 1 తేదీలలో విజయవాడలో జరిగిన అఖిలభారత కాంగ్రెసు సంఘ సమావేశం అనేకవిధాల చరిత్రాత్మకమైనదిగా పేర్కొనవచ్చు. దక్షిణదేశాన్ని ముఖ్యంగా ఆంధ్ర దేశాన్ని దేశభక్తి భావంతో విద్యున్మయం చేయడానికి ఈ సమావేశం దోహదమిచ్చిందంటే అతిశయోక్తి కాదు. మారుమూల ప్రాంతాల నుంచి వందలు, వేల సంఖ్యలో ప్రజలు కాలినడకన, ఎడ్లబండ్లపైన, ఇతరత్రా ఈ సమావేశాన్ని తిలకించడానికి నాయకులిచ్చే ఆదేశాలను ఆలకించడానికి తండోపతండాలుగా తరలి వచ్చారు.

సతీసమేతంగా కస్తూరిబాతో కలసి మహాత్మాగాంధీ, విఠల్‌భాయ్ పటేల్, జవహర్‌లాల్ నెహ్రూ, మోతీలాల్ నెహ్రూ, లాలా లజపతిరాయ్, చిత్తరంజన్‌దాస్, అబ్బాస్‌త్యాబ్జీ, హకీం అజ్మల్‌ఖాన్, అబ్దుల్ కలాం అజాద్, షౌకత్ అలీ, మహమ్మదాలీ, పురుషోత్తమదాసు టాండన్ వంటి జాతీయ నాయకులంతా ఆ సమావేశానికి హాజరయ్యారు.

రాజమండ్రి, రామచంద్రపురం, చీరాల మున్నగు ప్రాంతాల నుంచి "కేసరి సమాజం" "రామదండు" వంటి పేరులతో వందల సంఖ్యలో బయలుదేరిన యువజన దళాలు దారి పొడుగునా, జాతీయ గీతాలు పాడుకుంటూ, గ్రామగ్రామాన కాంగ్రెసు ప్రచారం చేసుకుంటూ విజయవాడ చేరారు. "దండాలు దండాలు భరతమాత" "మహాత్మాగాంధీ దర్శనమే పుణ్యం" "మము బ్రోవ మహిని వెలసితివా మహాత్మాగాంధీ" వంటి పాటలతో ఆంధ్రదేశం మారోమ్రగిపోయింది.

ఈ ఎ. ఐ. సి. సి. సమావేశానికి అవసరమైన ఏర్పాట్లు చేయడానికి అద్దేపల్లి రామశేషయ్య శ్రేష్ఠి అధ్యక్షతన ఆహ్వాన సంఘం ఏర్పడింది.

విజయవాడలో ప్రస్తుతం గాంధీనగరంగా పిలువబడుతున్న ప్రాంతం అప్పట్లో మైదానంగా వుండేది. ఆ మైదానంలో అక్కడక్కడ చిన్న పొదలుతప్ప మరేమీ వుండేవికావు. ఆ మైదానాన్ని బాగుచేసి, అక్కడ కాంగ్రెసు ఎ. ఐ. సి. సి. సభను జరిపారు. రాష్ట్రం నలుమూలలనుంచి, ఇరుగు పొరుగు రాష్ట్రాల నుంచి వచ్చిన 2 లక్షల మంది ప్రజలతో ఆప్రాంతం కిక్కిరిసి పోయింది. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నాయకత్వంలో రామదండు వలంటీర్లు ఆ జన సమూహాలను నడడంతో, తొక్కిసలాటలు లేకుండా నివారించడంలో ప్రశంసనీయంగా కృషి చేశారు. కల్లూరి సుబ్బారావు ఇక్కడే వాలంటీరుగా నమోదు అయి రాజకీయరంగ ప్రవేశం చేశారు.

## చారిత్రాత్మక నిర్ణయాలు

ఆంధ్రదేశాన్ని ఉర్రూతలూగించిన విజయవాడ ఎ. ఐ. సి. సి. సమావేశంలో అనేక చారిత్రాత్మక నిర్ణయాలు జరిగాయి. ఈనాటి మన జాతీయ పతాకానికి మూలమైన త్రివర్ణ జెండాను రూపొందించినవాడు తెలుగువాడు కావడం, పింగళి వెంకయ్య రూపకల్పన చేసిన జెండాను మహాత్మాగాంధీ కొద్ది మార్పులతో భారతజాతీయ కాంగ్రెసు జెండాగా అంగీకరించడం విజయవాడ ఎ. ఐ. సి. సి లోనే జరగడం తెలుగు జాతికి నిజంగా గర్వకారణం.

అంతేకాదు, 'తిలక్ నిధి' పేరిట కోటి రూపాయలు స్వరాజ్యనిధి వసూలు చేయాలని, కాంగ్రెసులో కోటిమంది సభ్యులను చేర్పించాలని, 20 లక్షలరాటాలను ప్రవేశపెట్టి, ఖద్దరు ఉద్యమాన్ని అభివృద్ధి చేయాలని, మద్యపాన వ్యతిరేక ప్రచారోద్యమాని ప్రారంభించాలని, పంచాయతీ కోర్టులు నెలకొల్పి, వివాదాలన్నింటిని పరిష్కరించాలని, జాతీయ విద్యా సంస్థలను ప్రోత్సహించాలని, హిందీ భాషాభ్యాసాన్ని పెంపొందించాలని, అంటరాని తనం నిర్మూలనకు కృషిచేయాలని, హిందూ-ముస్లిం సఖ్యతకు పాటుపడాలని-మున్నగు అతి ముఖ్యమైన నిర్ణయాలు విజయవాడ ఎ. ఐ. సి. సి. సమావేశంలోనే జరిగాయి.

ఆంధ్ర నాయకులు టంగుటూరు ప్రకాశం, కొండా వెంకటప్పయ్య, పట్టాభి సీతారామయ్య, బులుసు సాంబమూర్తి, దువ్వూరి సుబ్బమ్మ, గద్దె రంగయ్యనాయుడు, దక్షిణాది నాయకులు రామస్వామి నాయకర్, షఫీ అహ్మద్, డాక్టరు వరదరాజులు నాయుడు, కె. సంతానం, సి. రాజగోపాలాచారి వంటి వారు ఈ

సమావేశంలో జరిగిన చర్చలలో చురుకుగా పాల్గొన్నారు. నైజాం నవాబు అధీనంలోగల తెలంగాణా ప్రాంతంనుంచి మాడపాటి హనుమంతరావు తదితరులు పరిశీలకులుగా ఈ సమావేశంలో పాల్గొన్నారు.

## గాంధీజీ ఆంధ్ర పర్యటన

విజయవాడ ఎ. ఐ. సి. సి. సమావేశం అంతి బ్రహ్మాండమైన రీతిలో విజయవంతం కావడంతో జాతీయోద్యమానికి ఆంధ్రదేశం గట్టి పట్టుకొమ్మ కానున్నదని గ్రహించిన గాంధీజీ వెంటనే ఆంధ్ర దేశంలో పర్యటించడానికి ఉద్యమించారు. ఆయన కాకినాడ, రాజమండ్రి, ఏలూరు, బందరు, గుంటూరు, వేటపాలెం, నెల్లూరు, బాపట్ల, చీరాల మున్నగు పట్ట ణాలను సందర్శించారు

మహాత్మాగాంధీ వెళ్ళిన ప్రతిచోట ప్రజలు అత్యు త్సాహంతో "తిలక్ స్వరాజ్యనిధి"కి విరాళాలిచ్చారు, మాగంటి బాపినీడు సతీమణి అన్నపూర్ణమ్మ తన వంటిమీద నగలన్నింటిని వలచి, మహాత్మా గాంధీకి సమర్పించారు. విదేశీ వస్త్ర ధారణకు స్వస్తి, ఖద్దరు ధారణకు ఆమె గాంధీజీ ఎదుటనే ప్రతిన బూనారు. శ్రీమతి అన్నపూర్ణమ్మ ఆదర్శంతో ఉత్తేజితులైన అనేకమంది మహిళలు తమతమ బంగారు ఆభరణాలను స్వరాజ్యనిధికి కానుకగా గాంధీ జీకి సమర్పించారు. అనతి కాలంలోనే ఈ నిధివసూలు కార్యక్రమం కోటి రూపాయల లక్ష్యాన్ని అవలీలగా అధిగమించింది.

బుద్ధ భగవానుని చూసి, ప్రభావితురాలైన వేశ్య అంబాపాలి వలెనే, మహాత్మాగాంధీని చూడడంతో చైతన్య దీప్తురాలైన యామినీ పూర్ణతిలకం అనే దేవ దాసి తన వృత్తిని విడనాడి, సహాయ నిరాకరణో ద్యమంలోకి దుమికి, దేశ స్వాతంత్ర్య సాధనకు తన జీవితాన్ని అంకితం చేసింది కొండా వెంకటప్పయ్యతో కలిసి ఆంధ్రలో పర్యటించిన మహాత్మాగాంధీ తన సత్యాగ్రహ సమరానికి తెలుగునాట లభించిన అపూర్వ సహకారం చూసి మహదానంద భరితు లయ్యారంటే అతిశయోక్తి కాదు.

## ఖద్దరు ఉద్యమ వ్యాప్తి

విదేశీ వస్త్ర బహిష్కరణకు తోడుగా, మహాత్మా గాంధీ తలపెట్టిన ఖద్దరు ఉద్యమానికి ఆంధ్ర దేశం ప్రధాన కార్యరంగమైంది. విజయవాడ ఎ. ఐ. సి. సి. సమావేశంలో గైకొన్న నిర్ణయాల ప్రకారం, 'తిలక్ స్వరాజ్య నిధి' లక్ష్యంతో పాటు, 20 లక్షల రాట్నాల లక్ష్యంకూడా అవలీలగా అధిగమించబడింది. విజయ వాడకు చెందిన దాసు వామనరావు తన న్యాయవాద వృత్తికి స్వస్తిచెప్పి, ఖాదీ కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. ఆంధ్రదేశంనుంచి ఖద్దరు వస్త్రాలు దేశం లోని అనేక ప్రాంతాలకు ఎగుమతి అవుతూవచ్చాయి. శ్రీకాకుళం జిల్లాకు చెందిన 'పొందూరు ఖాదీ' అత్యు త్తమ శ్రేణికి చెందినదిగా యావద్భారత ప్రశంస పొందింది. అలాగే దివితాలూకాకు చెందిన 'పురిటిగడ్డ ఖద్దరు' మధ్యరకానికి చెందిన అత్యుత్తమ ఖాదీగా ఖ్యాతి పొందింది.

బందరులో పట్టాభి సీతారామయ్య, దుగ్గిరాలరాఘవ చంద్రయ్య, గుంటూరులో కొండా వెంకటప్పయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రి, ఒంగోలులో ఎ. రామశాస్త్రి, ఎర్నేని సుబ్రహ్మణ్యం ఖాదీ ఉద్యమ వ్యాప్తికి బహుళ కృషి చేశారు.

## సహాయ నిరాకరణోద్యమంలో అరెస్టులు- త్యాగధనులు

మహాత్మాగాంధీ పిలుపు ననుసరించి, ఆంధ్ర దేశంలో 1921 జూన్ నాటికి న్యాయవాద వృత్తిని త్యజించిన వారి సంఖ్య 103 కి, ఉపాధ్యాయ వృత్తిని విడనాడినవారి సంఖ్య 47 కి పెరిగింది. వారిలో పాణ్యం రామచంద్రయ్య, బి. ఇ. నారాయణమూర్తి, గురజాడ రాఘవశర్మ, కొడాలి ఆంజనేయులు, గడియారం సాంబయ్య,కల్లూరి సుబ్బారావు వంటి వారు వున్నారు. అలాగే కరణం, తదితర ప్రభుత్వోద్యోగాలకు రాజీ నామా చేసిన వారిసంఖ్య 244 కి పెరిగింది. వారిలో గాదిపాటి వెంకటేశ్వరరావు, కోడెబోయిన కోటయ్య నాయుడు, పింగళి వెంకటరావు వంటివారు వున్నారు.

1921-22 శాసనోల్లంఘన ఉద్యమంలో అనేక మంది నాయకులతోపాటు, ఆంధ్రదేశంలో దాదాపు 300 మంది జైళ్ళకు వెళ్ళారు. జైలుశిక్ష అనుభవించిన వారిలో చెరుకువాడ లక్ష్మీనరసింహం, మానికొండ సత్యనారాయణ, అయ్యదేవర కాళేశ్వరరావు, ఎ. పి. కవి. బులుసు సాంబమూర్తి, కళావెంకటరావు, మొసలి కంటి తిరుమలరావు. అడివి బాపిరాజు, ఆత్మకూరి

గోవిందాచార్యులు, గౌస్‌బేగ్, గంపలగూడెం జమీందారు కోటగిరి వెంకటకృష్ణారావు, కంభంపాటి సాంబయ్య, బెజవాడ చంద్రశేఖరరెడ్డి, జి.వి. పున్నయ్యశాస్త్రి, వరదరాజులు నాయుడు (అనంతపురం), జె. వి. నారాయణ (బరంపురం), కొరదల సర్వేశ్వరశాస్త్రి, భానుమూర్తి (అనంతపురం) మంతెన వెంకటరాజా, వెన్నేటి సత్యనారాయణ వంటివారు వున్నారు

'మా కొద్దు ఈ తెల్ల దొరతనం' అన్న గేయం రచించిన గరిమెళ్ళ సత్యనారాయణను కూడా అరెస్టు చేసి, జైలుశిక్ష విధించారు. రైతు కుటుంబాలకు చెందిన యలమంచిలి వెంకటప్పయ్య- పేట బాపయ్యవంటి యువకులు తమ విద్యకు స్వస్తి చెప్పి, సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని, అరెస్టు అయి, జైలు జీవితం అనుభవించారు.

ఈ విధంగా మహాత్మాగాంధీ భారత జాతీయోద్యమానికి సారథ్యం వహించిన రెండేళ్ళ కాలంలోనే, స్వాతంత్ర్యోద్యమాన్ని ప్రజోద్యమంగా మార్చి, భారతదేశ చరిత్రలోనే కాక, ఇంగ్లండ్ దేశచరిత్రలోను, ప్రపంచ చరిత్రలోనే గణనీయమైన పరిణామాలకు పునాదులను వేయగలిగారు.

## గాంధీజీ నాయకత్వ విశిష్టత

గాంధీజీ తన రాజకీయ సత్యాగ్రహోద్యమానికి నైతిక, ఆధ్యాత్మిక సూత్రాలను ప్రాతిపదికగా చేసుకొన్నారని ఒక చరిత్రకారుడు పేర్కొన్నాడు. బహుశా అదే ఆయన నాయకత్వంలోని విశిష్టతకావచ్చు.

1920 దశకంలోని సామాజిక పరిస్థితులలో రాజకీయ లక్ష్యాలను మతపరమైన, నైతిక సూత్రాలతో జోడించినప్పుడు మాత్రమే, ప్రజల మనస్సులకు హత్తుకొంటాయని గ్రహించిన గాంధీజీ ఆ పని చేశారు. పురాణాలలోని 'హిరణ్య కశ్యపు'ని క్రౌర్యాలను పోలిన క్రూరాలు చేస్తున్న బ్రిటిషు పాలకులను" ప్రహ్లాదుని" వలె ప్రతిఘటించాలని చెబితే, అది సామాన్య ప్రజల మనస్సులకు ఎంతగానో హత్తుకుపోయింది. అలాగే భారతదేశాన్ని భరతమాతతో పోల్చడంవల్ల, దేశంలోని వివిధ ప్రాంతాలకు చెందిన ప్రజలందరి హృదయాలలోను, తామంతా ఒకే తల్లి - భారతమాత- బిడ్డలం అన్న భావం వేరూని, జాతీయ సంఘీభావంగా రూపొందడానికి తోడ్పడింది.

"దండాలు, దండాలు భారతమాత
.... .... .... .... .... .... ....
చిప్ప చేతికొచ్చిందే భరతమాత
.... .... .... .... ... .... ....
అడుక్కు తినటం మనవంతా భరతమాత
వళ్ళు గుల్ల చేసినారు భరతమాత."

వంటిగేయాలు రచించిన గరిమెళ్ళ సత్యనారాయణ ప్రజల హృదయాలలో చైతన్యాగ్నులు రగిలించ గలిగాడు. అలాంటి గేయాలు రచించిన నేరానికి ఆయన ఒకసారి ఒక సంవత్సరం జైలుశిక్ష, మరొకసారి రెండు సంవత్సరాల జైలు శిక్ష అనుభవించవలసి వచ్చింది.

## ఆర్థిక దుస్థితి - అసంతృప్తి

కేవలం మహాత్మాగాంధీ నాయకత్వ విశిష్టత ఒక్కటే ఈ ఉద్యమం ఇంత ఉవ్వెత్తున పొంగిన దనడానికి వీలులేదు.

మొదటి ప్రపంచ యుద్ధకాలంలో భారతదేశ ఆర్థిక స్థితి మరింత దిగజారిపోయింది. ధరలు పెరిగాయి. నిరుద్యోగం తీవ్రమైంది. యుద్ధనిధి పేరిట ప్రజలను విపరీతంగా పీడించారు. పన్నుల భారంతో ప్రజలు సతమతమైపోతున్నారు. 1917 లో ఇన్‌ఫ్లుయంజా వ్యాధికి దాదాపు 60 లక్షల మంది ప్రాణాలు కోల్పోయారు. కొన్ని రాష్ట్రాలలో ప్లేగు వ్యాధి ప్రబలింది జీవితం అన్ని విధాల దుర్భరమై పోయింది. ప్రజల హృదయాలలో అసంతృప్తి అగ్ని పర్వతంలా రాజుకొంటున్నది. ఏమిచేయాలో దిక్కుతోచని స్థితిలోపడి కొట్టుమిట్టాడుతున్న ప్రజలకు గాంధీజీ ఒక మార్గం చూపించాడు. అందుకే ప్రజలలో గాంధీజీ ఉద్యమానికి అంత ఆదరణ లభించింది.

## ఉద్యమ రూపాలు

1921-22 లలో ఆంధ్రదేశంలో సహాయ నిరాకరణ ఉద్యమం దశ రూపాలలో సాగింది. 1. ఎన్నికల బహిష్కరణ, 2. బిరుదులు, గౌరవ పదవులు త్యజించడం, 3. విద్యా సంస్థల బహిష్కరణ, 4 న్యాయస్థానాల బహిష్కరణ, 5 మున్సిపాలిటీలకు సహాయ నిరాకరణను విస్తరింప చేయటం, 6. ఫారెస్టు నిబంధనలను ఉల్లంఘించటం. 7. స్వదేశీ ఉద్యమాన్ని ప్రోత్సాహ పరచటం. విదేశీ వస్త్ర బహిష్కరణ,

8. మద్యపాన వ్యతిరేక ప్రచారం చేయటం.
9. గ్రామోద్యోగ పదవులకు రాజీనామా లివ్వటం.
10. పన్నుల నిరాకరణ

## ఎన్నికల బహిష్కరణోద్యమం

ఎన్నికల బహిష్కరణోద్యమంలో ఎర్రమల్లి జగన్నశాస్త్రి, మతం బాలసుబ్రహ్మణ్యం గుప్తా, నిర్వహించిన పాత్ర ప్రశంసనీయమైనవి. బాలసుబ్రహ్మణ్యం గుప్తా, ఉత్తేజపూరితమైన తన ప్రసంగాలతో ప్రజలను ఉద్రూతలూగించారు. ఆయన ప్రసంగాలు ఎన్నికల బహిష్కరణోద్యమ సాఫల్యతకు ఎంతగానో తోడ్పడ్డాయి. అందుకే అలాంటి ఉద్రేక పూరిత ప్రసంగాలు చేసినందుకు, ఆయనను పోలీసులు అరెస్టుచేసి, ఆరు నెలల జైలుశిక్ష విధించారు.

బాల సుబ్రహ్మణ్యం గుప్తా అరెస్టుకు నిరసనగా హర్తాళ్ జరిగింది. ఫ్యాక్టరీలు, స్కూళ్ళు మూత పడ్డాయి.

అయ్యదేవర కాళేశ్వరరావు, కానూరి వెంకట చలపతయ్య, వి. రాజగోపాలరావు, కె. వి. ఆర్. స్వామి, కోటగిరి వెంకటకృష్ణారావు, సభాపతి, ఆర్. ఓబులరెడ్డి వంటివారు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ ఎన్నికల పోటీనుంచి తమ అభ్యర్థిత్వాలను ఉపసంహరించుకోగా, కొండా వెంకటప్పయ్య, బి. వెంకటపతిరాజు, సి. నరసింహరాజు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యత్వాలకు రాజీనామా చేశారు వి. రామదాసు పంతులు మద్రాసు యూనివర్శిటీ సిండికేట్ సభ్యత్వానికి రాజీనామా చేశాడు.

## త్యజించిన బిరుదులు గౌరవ పదవులు

మద్రాసుకు చెందిన మౌల్వీ జహీర్ హుస్సేన్ సాహెబ్, జమాల్ మొహిద్దీన్ సాహెబ్ లిద్దరూ తమ బిరుదులను త్యజించారు. గుంటూరుకు చెందిన మౌల్వీ మహ్మద్ రజాసాహెబ్, విజయవాడకు చెందిన గులాం మొహిద్దీన్ సాహెబ్, భీమవరానికి చెందిన సత్యదేవర రామచంద్రరావు పంతులు, గుంటూరుకు చెందిన ఏలూరు హనుమంతరావులు తమ ఆనరరీ మేజిస్ట్రేట్ పదవులకు రాజీనామా చేశారు.

## విద్యా సంస్థల బహిష్కరణ

ఆంధ్ర దేశంలో విద్యా సంస్థల బహిష్కరణ. జాతీయ విద్యా సంస్థల స్థాపన ఉద్యమాలు కూడా గణనీయంగా విజయవంతమయ్యాయని చెప్పవచ్చు. రాజమండ్రిలోని ఆర్ట్సు కాలేజి విద్యా ల 20 మంది, బందరులోని నోబెల్ కాలేజి విద్యా లు 60 మంది, పర్లాకిమిడి రాజాగారి కాలేజి విద్యా లు 30 మంది, విశాఖపట్నం ఎ.వి.ఎన్. కాలే , సి.బి.ఎమ్. హైస్కూలు విద్యా లు ఆరుగురు ఇంకా ఇతర విద్యా సం ల వి లు అనేకులు ఇంగ్లీషు చదువుకు స్వ చెప్పా . ఆనాడు అలా విద్యకు స్వస్తి చెప్పిన లో చిట్టావఝుల రామకృష్ణమ్మ, కళా వెంకటరావు, మానికొండ సత్యనారాయణ, బొమ్మ శేషురెడ్డి, రామచంద్రయ్య, కామినేని వెంకటప్పయ్య, వెన్నెలకంటి రాఘవయ్య, పాతూరి సుబ్బరామయ్య వంటివారు వున్నారు.

ఇంగ్లీషు విద్యా సంస్థలను జాతీయ విద్యాసంస్థలుగా మార్చాలని కోరుతూ విజయనగరంలో మహారాజా కాలేజీ, హైస్కూళ్ళ విద్యార్థులు 1000 మంది 1921 ఫిబ్రవరి 4 న సమ్మె చేశారు. తెనాలిలో హైస్కూలు విద్యార్థులు 1060 మంది 1921 ఫిబ్రవరిలో వారం రోజులపాటు అదే కోర్కెతో సమ్మె కొనసాగించారు.

ఈ ఉద్యమం ఫలితంగా 1921 సంవత్సరం మధ్య ప్రాంతం నాటికి రాష్ట్రంలో 44 జాతీయ విద్యా సంస్థలు అవతరించాయి.

ఉపాధ్యాయ వృత్తికి స్వస్తి చెప్పిన అనేకులలో కొడాలి ఆంజనేయులు, గురజాడ రాఘవశర్మ, గడియారం సాంబయ్య, సూరంపాటి కనకరాజు వున్నారు.

## న్యాయస్థానాల బహిష్కరణ

ఆదినుంచీ జాతీయోద్యమంలో ప్రముఖపాత్ర వహిస్తున్న న్యాయవాదులు కోర్టుల బహిష్కరణ ఉద్యమాన్ని తీవ్రతరం చేశారు. 1920 సెప్టెంబర్ 28 న సమావేశమైన గుంటూరు బార్ అసోసియేషన్, ప్లీడరీ వృత్తిని 1921 జనవరి 15 నుంచి మూడు

మాసాలపాటు బహిష్కరించాలని తీర్మానించింది. ఆ బార్ అసోసియేషన్ తిరిగి 1921 జనవరి 20 న సమావేశమై, ఫిబ్రవరి 1 వ తేదీనుంచి 11 నెలల పాటు కోర్టులను బహిష్కరించాలని తీర్మానించింది.

కోర్టుల బహిష్కరణోద్యమంలో భాగంగా న్యాయవాద వృత్తిని విడిచిపెట్టిన వారిలో అయ్యదేవర కాళేశ్వరరావు, గొల్లపూడి సీతారామశాస్త్రి, మాడభూషి నరసింహాచార్యులు, టి. ప్రకాశం, ఉన్నవ లక్ష్మినారాయణ, పోలిశెట్టి హనుమంతయ్య గుప్త, శిష్ట్లా పురుషోత్తం, సూర్యనరసింహం, ఓరుగంటి వెంకటసుబ్బయ్య, వెంకటేశ్వరరావు, దాసు మధుసూదనరావు, విస్సా రాజగోపాలరావు మున్నగువారు కలరు.

## విదేశీ గుడ్డలంటే భూమిలోన పెంట

ఆంధ్రదేశంలో విదేశీ వస్త్ర బహిష్కరణ ఉద్యమం పెద్ద ఎత్తున సాగింది. విద్యా సంస్థలను బహిష్కరించిన విద్యార్థులు, కాంగ్రెసు కార్యకర్తలు, గ్రామాలకు వెళ్ళి, విదేశీ వస్త్ర బహిష్కరణ, ఆవశ్యకతను ఇంటింటా ప్రచారం చేశారు. వారు జాతీయ గీతాలు, పాడుతూ, భజనలు చేస్తూ గ్రామ వీధులలో ప్రచారం కొనసాగించారు వారి ప్రభావంతో ప్రభావితులైన గ్రామస్తులు తమ విదేశీ వస్త్రాలను తగలబెట్టమని వారికి యిచ్చేవారు. వాలంటీర్లు ఆ విదేశీ వస్త్రాలన్నింటిని గ్రామం మధ్యలో ఒక గుట్టగా పోసి, సంక్రాంతి పండుగ ముందు భోగి మంటలవలె తగలబెట్టి "విదేశీ బట్టలంటే భూమిలోన పెంట" అని పాటపాడుతూ దగ్ధమైపోతున్న ఆ విదేశీ వస్త్రాల మంటలపై గెంతుతూ, కేరింతలు కొట్టేవారు.

నెల్లూరులో ఓరుగంటి వెంకట సుబ్బయ్య, గాదేపల్లి పద్మనాభయ్య, విస్సా రాజగోపాలరావు వంటి వారి నాయకత్వంలో యువకులైన కాంగ్రెసు కార్యకర్తలు వెన్నెలకంటి రాఘవయ్య, బొమ్మా వేమారెడ్డి, కొమండూరు పార్థసారధి అయ్యంగార్, రామసుబ్బయ్య వంటి వారు స్వదేశీ ప్రచారాన్ని పెద్ద ఎత్తున ప్రశంసనీయంగా సాగించారు. గోదావరి జిల్లాలో సీతానగరం ఆశ్రమం స్థాపకులైన బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం ఖద్దరు ప్రచారాన్ని పట్టుదలగా నిర్వహించారు.

ఇదే దశలో కొడాలి ఆంజనేయులు "విప్లవ పరివర్తనం" నాటకం రచించారు. ఆ నాటక ప్రదర్శనను ప్రభుత్వం నిషేధించింది. విదేశీ వస్త్ర బహిష్కరణ, ఖద్దరు ప్రచారోత్సవాల ఫలితంగా 1921 అక్టోబరు నాటికి ఒక్క విజయవాడలోని 70 మంది వర్తకులు విదేశీ వస్త్రాలను మాత్రమేకాక, దేశీయ మిల్లు వస్త్రాలను కూడా 1922 లో బహిష్కరించగలమని ప్రతిజ్ఞ చేశారు.

## మద్యపాన వ్యతిరేకోద్యమం

కాంగ్రెసు కార్యకర్తలు మద్యపానానికి వ్యతిరేకంగా పెద్ద ఎత్తున సాగించిన ప్రభావం గుంటూరు, నెల్లూరు, బళ్ళారి, అనంతపురం, కర్నూలు, గోదావరి జిల్లాలలో బాగా పనిచేసింది. ఈ ఉద్యమానికి హిందువులు, ముస్లిములు కూడా పూర్తి తోడ్పాటు నిచ్చారు.

అనంతపురం జిల్లా మద్యపాన వ్యతిరేకోద్యమానికి కల్లూరి సుబ్బారావు సారథ్యం వహించారు. అందుకు ఆయనకు 1921 లో పెనుగొండలో అరెస్టు చేసి, సంవత్సరం కఠిన కారాగారవాస శిక్ష విధించారు.

నెల్లూరు జిల్లాలో ఓరుగంటి వెంకట సుబ్బయ్య, తిక్కవరపు రామిరెడ్డి, బి. చంద్రశేఖరరెడ్డి మద్యపాన వ్యతిరేకోద్యమానికి పట్టుగొమ్మలయ్యారు వారు తిలక్ స్వరాజ్య నిధి వసూలు సాగిస్తూనే, పల్లెపాడులో ఒక ఆశ్రమం నెలకొల్పి, దానిని గాంధేయ పద్ధతులలో నిర్వహించారు. ఆ ఆశ్రమ నిర్వహణ బాధ్యతను చతుర్వేదుల కృష్ణయ్యకు అప్పగించారు.

కల్లు దుకాణాల టలలో పాల్గొనవద్దని రెడ్డి కులస్థులైన కాంట్రాక్టర్లకు నచ్చచెప్పడంలో తిక్కవరపు రామిరెడ్డి, బి. చంద్రశేఖరరెడ్డి పాత్ర ప్రత్యేకంగా పేర్కొన దగినది. వారి కృషికి వెన్నెలకంటి రాఘవయ్య, బొమ్మా శేషురెడ్డి, బళ్ళపల్లి రామసుబ్బయ్య, దొరై స్వామి అయ్యంగార్, కొమండూరు పార్థసారధి అయ్యంగార్, శ్రీమతి పొనకా కనకమ్మ, వెంకట సుబ్బయ్యశ్రేష్టి, రాళ్ళపల్లి రామసుబ్బయ్య

వంటి యువక కార్యకర్తల తోడ్పాటు పెద్ద యెత్తున లభించింది.

## "గాంధీ శాపం తగులుతుంది సుమా"

## కొత్త కొత్త ప్రచార పద్ధతులు

మద్యపాన వ్యతిరేక ప్రచారకులైన ఈ కార్యకర్తలు జిల్లాలోని అన్నిగ్రామాలను సందర్శించి, కల్లు తాగవద్దని, దేశానికి ద్రోహంచేయవద్దని, కల్లుతాగితే మహాత్మాగాంధీ శాపం తగులుతుందని హెచ్చరిస్తూ చేసిన ప్రచారం బాగా పనిచేసింది. ఈ కార్యకర్తలు రాత్రిపూట ఎడ్లబండ్లపై ప్రయాణం సాగించారు. పగటిపూట వూరూరా తిరుగుతూ, భజనలుచేస్తూ, పాటలు పాడుతూ, ఉపన్యాసాలిస్తూ కాలినడకను ప్రచారం చేశారు.

కందుకూరులో రోడ్డుపైన తహసిల్దారు యొక్క గుర్రం చెవులను కోసివేయడంద్వారా అక్కడి ప్రజలు తమ అక్కసును తీర్చుకొన్నారంటే, ఈ ప్రచారకుల ప్రభావం ప్రజలపై ఎంతగా పడిందో వూహించవచ్చు.

కాంగ్రెసు వాలంటీర్ల బెడదనుంచి తప్పించుకొనడానికి, ప్రభుత్వం రహస్యంగా కల్లుపాటలను నిర్వహించడానికి ప్రయత్నించింది. ఆ ప్రయత్నాలను కూడా కాంగ్రెసు వాలంటీర్లు వమ్ముచేశారు. రాజపాలెంలో రహస్యంగా కల్లుపాటలు ఏర్పాటుచేసినట్లు మోదిన్ సాహెబ్ అనే వ్యక్తిద్వారా తెలుసుకున్న వెన్నెలకంటి రాఘవయ్య, బొమ్మా శేషురెడ్డి, పార్థసారధి అయ్యంగార్, రామ సుబ్బయ్య హుటాహుటిని అక్కడకు వెళ్ళారు. కల్లుపాటలు జరిగే ఆవరణ గేటువద్ద నిలబడి మద్యపాన వ్యతిరేక ప్రసంగాలు ప్రారంభించారు. కల్లుపాటలలో పాల్గొనడానికి వచ్చిన కాంట్రాక్టర్లు వారి ఉపన్యాసాలు విని, వెనుతిరిగి పోసాగారు. సాయంత్రం 4 గంటల వరకు కల్లుపాటలు సాగలేదు. ఒక ఎక్సైజ్ సబిన‌స్పెక్టర్ దొంగచాటుగా కొందరు పాటదారులను, వేరొక మార్గంగుండా ఆవరణలోకి తీసుకెళ్ళి, పాటలు ప్రారంభించాడు. ఈ సంగతి తెలిసిన వెంటనే రామసుబ్బయ్య అక్కడకు పరుగెత్తుకుంటూ, గభాలున పాటదారుల కాళ్ళపైబడి, "అయ్యా! దేశమాతకు ద్రోహం చేయకండి. మాతృదేశం సర్వనాశనం కాకుండా కాపాడండి" అంటూ ప్రార్థించాడు. మనస్సు కరిగిన పాటదారులు వెనుతిరిగి పోయారు. కల్లుపాటలు జరగలేదు.

ఒకే రోజున అనేక గ్రామాలలో ఏక సమయంలో కల్లు పాటలు పెట్టడం ద్వారా కాంగ్రెస్ కార్యకర్తల బెడదనుంచి బయట పడాలనికూడా ప్రభుత్వం ప్రయత్నించింది. ఒకే రోజున ఒకే సమయానికి 24 కేంద్రాలలో ఏర్పాటు చేసిన కల్లు పాటలను పికెటింగ్ చేయడానికి అవసరమైనంత మంది వాలంటీర్లను సమీకరించడం ద్వారా బొమ్మా శేషురెడ్డి, ఆయన సహచరులు ఆ ప్రయత్నాన్ని కూడా వమ్ము చేశారు.

1921 ఫిబ్రవరి 7వ తేదీన అనంతపురంలో ఏర్పాటు చేసిన కల్లు పాటలలో పాల్గొనవద్దని వెంకటప్పయ్య, ఎ. నారాయణరావు పాటదారులకు విజ్ఞప్తి చేయడంతో 80 మంది పాటదారులు పాటలలో పాల్గొనకుండా వెనుతిరిగి పోయారు. ఫలితంగా ఆ పాటలను వాయిదా వేయవలసి వచ్చింది. విశాఖపట్నం జిల్లా శృంగవరపు కోటలోను అలాగే జరిగింది. అక్కడ సర్వేశ్వరశాస్త్రి, ఆయన సహచరులు కలసి, ఆ కల్లు పాటలు జరగకుండా నిరోధించారు. నర్సీపట్నంలో కల్లు పాటలకు ఒక్క పాటదారుడు కూడా హాజరు కాలేదు. పాలకొండ తాలూకాలోని 26 కల్లు అమ్మక కేంద్రాలకు గాను, ఒకే ఒక కేంద్రానికి కాంట్రాక్టరు పాట పాడాడు.

కర్నూలు జిల్లాలోని పెద్దపాక, బోలాపురం, బుధవారపు పేటలలో కల్లు పాకల వద్ద కాంగ్రెసు వాలంటీర్లు జరిపిన పికెటింగ్ ఫలితంగా కల్లు అమ్మకాలు బంద్ అయ్యాయి. రాయలసీమ జిల్లాలలో మద్యపాన వ్యతిరేక ప్రచారోద్యమం వల్ల ప్రభుత్వ ఆదాయం బాగా తగ్గిపోయింది. కడప జిల్లాలో రు. 4.15.406/- లనుంచి రు. 2,01.044 లకు. అనంతపురంలో రు. 2,69,574/- లనుంచి రు. 1.37.664/- లకు బళ్ళారి జిల్లాలో రు. 3 లక్షల నుంచి రు. 2 లక్షలకు, కర్నూలు జిల్లాలో

రు. 2,22,900/-ల నుంచి రు. 90,316/- లకు ప్రభుత్వ ఆదాయం పడిపోయింది.

గుంటూరు జిల్లాలో కూడా మద్యపాన వ్యతిరేక ప్రచార ప్రభావం విస్తృతంగా వ్యాపించింది. కల్లు అమ్మకం బాగా తగ్గిపోయింది.

సహాయ నిరాకరణోద్యమ కార్యకర్తల కార్య కలాపాలను అరికట్టడానికి ప్రభుత్వం విద్రోహ సమావేశాల చట్టాన్ని పునరుద్ధరించింది. కె. వి. ఆర్. స్వామి, జి. రామచంద్రరావు, బి. సుబ్రహ్మణ్యం, రాజమండ్రికి చెందిన డాక్టరు పి. గురుమూర్తి వంటి వారిని అరెస్టు చేసి శిక్షలు విధించారు. గౌస్ బేగ్, చావలి సూర్యనారాయణ, వెంకట నరసింహాచార్యులు, కొండా వెంకటప్పయ్య వంటివారు ప్రసంగాలు చేయరాదని ఆంక్షలు విధించారు.

## గాంధీ టోపీ ధారణపై ఆంక్షలు

గాంధీ టోపీ ధారణను కూడా నేరంగా బ్రిటిషు అధికారులు పరిగణించారు. గాంధీ టోపీలను ధరించి కోర్టులో ప్రవేశించినందుకు మలపూరి నరసింహం, గొల్లపూడి శ్రీరామమూర్తి, ప్రయాగ విశ్వనాధంలకు గోదావరి జిల్లా మేజిస్ట్రేట్ జైలు శిక్షలు విధించారు. గాంధీటోపీలు ధరించి విశాఖపట్నం వైద్య కళాశాలకు హాజరైన 142 మంది వైద్య విద్యార్థులకు 1921 సెప్టెంబరు 28న బహిష్కరణ ఉత్తర్వులు జారీ చేశారు. వారిలో 32 మంది క్షమాపణ చెప్పడానికి నిరాకరించి, చదువు చాలించి, వెళ్ళిపోయారు. మిగతా వారు క్షమాపణ చెప్పి, చదువు కొనసాగించారు.

# ఆంధ్రదేశంలో పెల్లుబికిన విప్లవాత్మక ఉద్యమాలు

దేశంలో సహాయనిరాకరణోద్యమం సాగిన కాలంలో 1921-22 సంవత్సరాలలో ఆంధ్రదేశంలో విప్లవాత్మక ఉద్యమాలు నాలుగు ప్రజ్వరిల్లాయి. 1. చీరాల-పేరాల పోరాటం, 2. పల్నాడు పుల్లరి వ్యతిరేక పోరాటం, 3. పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం, 4. మన్యం తిరుగుబాటు. ఇందులో మొదటి మూడు పోరాటాలు గుంటూరుజిల్లాలోను, నాల్గవది ఏజన్సీ ప్రాంతంలోను జరిగాయి.

స్వాతంత్ర్య పోరాటంలో ఆంధ్రదేశం, మిగతా రాష్ట్రాలకంటే ముందంజ వేసిందని ఈ నాలుగు పోరాటాలు నిరూపించాయి.

## చీరాల-పేరాల పోరాటం

సహాయనిరాకరణోద్యమ కార్యక్రమంలో భాగమైన మున్సిపాలిటీల బహిష్కరణ పేరుతో చీరాల-పేరాల పోరాటం జరిగింది. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ఈ పోరాటానికి సారధ్యం వహించారు.

పాత చీరాల, పేరాల, జాంద్రపేట, వీరరాఘవపేట అనే నాలుగు గ్రామాలు చీరాల యూనియన్ పాలనలో వుండేవి. అప్పుడు ఆ యూనియన్ సాలీనా ఆదాయం రు. 4000/లు అయితే, 1919లో చీరాల, పేరాల గ్రామాలను కలిపి, ప్రత్యేక మున్సిపాలిటీగా ఏర్పాటుచేయాలని మద్రాసు ప్రభుత్వం నిర్ణయించింది. జాంద్రపేట, వీరరాఘవపేట గ్రామాలను యూనియన్ పాలన క్రింద కొనసాగించాలని నిర్ణయించింది. మద్రాసు ప్రభుత్వం చేసిన ఈ నిర్ణయాన్ని ఆ గ్రామాల ప్రజలు వ్యతిరేకించారు. యథాపూర్వ తిని కొనసాగించాలని వారు ప్రభుత్వానికి వినతిపత్రాలు సమర్పించుకొన్నారు. ప్రజల కోర్కెను ప్రభుత్వం తిరస్కరించింది.

కొత్తగా ఏర్పాటయిన చీరాల-పేరాల మున్సిపాలిటీ ఆదాయాన్ని సాలీనా రు. 30 వేలకు పెంచుతూ, ప్రభుత్వం ప్రజలపై విపరీతమైన పన్నుల భారం విధించింది.

చీరాల-పేరాల గ్రామాల జనాభా పదిహేనువేలు మాత్రమే. వీరిలో చేనేత కార్మికులు అత్యధికులు. చేనేత కార్మికుల రోజువారీ ఆదాయం పావలా, అణా దణాలకు మించదు. అలాంటి ప్రజలపై ప్రభుత్వం విధించిన పన్నులు తలకుమించిన భారంగా పరిణమించాయి. తమ గ్రామాలను సందర్శించిన గవర్నర్‌కు కూడా చీరాల-పేరాల ప్రజలు తమ గోడు విన్నవించుకొన్నారు. అయినా ప్రయోజనం లేక పోయింది.

1920 జనవరి 12వ తేదీన చీరాల-పేరాల గ్రామాలలో కొత్త మున్సిపాలిటీ ఏర్పాటయింది. 11మంది కౌన్సిలర్లు వుండే ఆ మున్సిపాలిటీకి డివిజనల్ రెవెన్యూ ఆఫీసరు ఛైర్మన్‌గా నియమింపబడ్డాడు. మున్సిపల్ కౌన్సిలర్లు కొందరు పౌరులను విపరీతంగా పీడించారు. పట్టణంలో పారిశుధ్య కార్యక్రమాలను పూర్తిగా అలక్ష్యం చేశారు. ఇక లాభంలేదనుకొన్న ప్రజలు తిరుగుబాటుకు సిద్ధమయ్యారు. మున్సిపాలిటీని బహిష్కరించాలన్న నిర్ణయానికి వచ్చారు. పరిస్థితిని గమనించిన కౌన్సిలర్లు సామూహికంగా రాజీనామా చేశారు. వారెందుకు రాజీనామా చేయవలసివచ్చిందో విచారించడానికి జిల్లాకలెక్టర్ వచ్చాడు. మున్సిపాలిటీని రద్దుచేయాలని పౌరులు జిల్లాకలెక్టర్‌కు వినతిపత్రం సమర్పించారు.

ప్రజల విన్నపాలకు పదే పదే పెడచెవిని పెట్టటమే కాక, 1921 ఫిబ్రవరిలో చీరాలను సందర్శించిన మద్రాసు రాష్ట్ర మున్సిపల్ అడ్మినిస్ట్రేషన్ మంత్రి పానుగంటి రామరాయణింగార్ ప్రజలను బెదిరించాడు. చీరాలలో అవసరమైతే ప్యూనిటివ్ పోలీసును ఏర్పాటుచేస్తామని, చీరాలకు రైల్వే స్టేషన్, పోస్టాఫీసు, ఆసుపత్రివంటి సౌకర్యాలు లేకుండా చేస్తామని కూడా ఆ మంత్రి బెదిరించాడు. దానితో ప్రజలు మరింత ఉగ్రులైపోయారు.

ఆ దశలో దుగ్గిరాల గోపాలకృష్ణయ్య రంగప్రవేశం చేసి, చీరాల-పేరాల ప్రజల పోరాటానికి సారధ్యం వహించాడు. పన్నులు చెల్లించవద్దని ఆయన ప్రజలకు ఉద్బోధించాడు. పన్నుల వసూలుకు అధికారులు ఆస్తులు స్వాధీనం చేసుకొని వేలంపాటలు పెట్టారు. ఆ వేలంపాటలలో ఎవరూ పాల్గొనలేదు. చీరాల పేరాలలో స్వాధీనం చేసుకున్న చరాస్తిని బాపట్ల, గుంటూరు వంటి దూరప్రాంతాలకు తీసుకుపోయి అక్కడ వేలం వేశారు.

పన్నులు చెల్లించ నిరాకరించిన నేరానికి ఒక మహిళతో సహా దజనుమందిని అరెస్టు చేశారు. దేశమంతటిలో పన్నుల నిరాకరణోద్యమంలో అరెస్టు అయిన మొట్టమొదటి మహిళ బహూశా చీరాలలో అరెస్టు అయిన వృద్ధురాలే కావచ్చు!

చీరాల-పేరాల పౌరులపై ప్రభుత్వం దమనకాండ రోజురోజుకీ పెరిగిపోతున్నది. ఏమిచేయాలో పాలుపోక, దు రాల గోపాలకృష్ణయ్య మహాత్మాగాంధీ సలహా అ ంచాడు. ప్రభుత్వంతో ప్రజలు సంఘర్షణను నివా ంచి, అదే సమయంలో చీరాల మున్సిపాలిటీ దానంతటదే అంతరించిపోయే మార్గాన్ని గాంధీజీ సూచించారు. ప్రజలంతా తమ ఇళ్ళను వదిలిపెట్టి, మున్సిపాలిటీ పరిధి ఆవల పొలిమేరలలో పర్ణశాలలు వేసుకొని, జీవితం గడపడానికి సిద్ధంకావాలని ఉద్బోధించారు.

భారత ప్రజలు తాను చెప్పినట్టు నడుచుకొంటే సంవత్సరకాలంలో స్వరాజ్యం సాధించగలనని మహాత్మాగాంధీ నాగపూర్ కాంగ్రెసు మహాసభలో చేసిన ప్రకటనను దేశ ప్రజలు విశ్వసించారు. అందువల్లనే ఆయన యిచ్చిన పిలుపు నందుకొని, సహాయ నిరాకరణోద్యమంలోకి దుమికిన అశేష ప్రజానీకం అనుపమ త్యాగాలు చేయడానికి సిద్ధమయ్యారు.

చీరాల-పేరాల పౌరులు కూడా అదే విశ్వాసంతో దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ఆదేశం ప్రకారం, 1921 ఏప్రిల్ 25వ తేదీ అర్ధరాత్రి పెట్టే బేడా సర్దుకుని తమ నెత్తిన లేదా ఎడ్ల బండి పైన వేసుకొని, తమ ఇళ్ళను ఖాళీజేసి, మున్సిపాలిటీ పరిధి ఆవలి పొలిమేరలలో పాకలు వేసుకుని జీవించడానికి తరలి వెళ్ళారు. చీరాల-పేరాల జనాభా 15,326 మందిలో 13,572 మంది ఈ విధంగా ప్రవాసోద్యమంలో స్వచ్ఛందంగా పాల్గొనడం నిజంగా చరిత్రలోనే అపూర్వం. ఇదే విషయాన్ని ఆనాటి హిందూ విలేకరి ఢి. ఎన్. ఆర్. రావు కళ్ళకు కట్టినట్టు చిత్రిస్తూ పంపిన వార్త ఆ పత్రికలో ప్రచురితమైంది.

పదకుండు నెలల పాటు, చీరాల మున్సిపాలిటీ అనేది లేకుండాపోయింది. చీరాల - పేరాల వీధులు నిర్మానుష్యంగా, పాడుపడిన పేటల వలె, శ్మశాన వాటికల వలె గోచరించాయి.

చీరాల - పేరాల ప్రజలకు సారధ్యం వహించిన దుగ్గిరాల గోపాల కృష్ణయ్య ఆదర్శవాది. స్వరాజ్యం, స్వధర్మం ఆదర్శాల ఆధారంగా ఆదర్శవంతమైన రాజ్యం స్థాపించాలని ఆయన కలలు కన్నాడు. పర్ణశాలలతో ఏర్పడిన కొత్త చీరాల-పేరాల గ్రామంలో ఆయన పంచాయతీ పరిపాలనా వ్యవస్థను ఏర్పాటు చేశాడు. అన్ని కులాలకు ప్రాతినిధ్యం వుండే కమిటీలకు పరిపాలనా బాధ్యతలు అప్పగించాడు. ఒక్కమాటలో చెప్పాలంటే, ఆయన అక్కడ పోటీ ప్రభుత్వాన్ని నడిపి, చరిత్రను సృష్టించాడు.

సమాజం అవసరాలను, ప్రజల అవసరాలను తీర్చడానికి ఆయన ఎర్ర దుస్తుల 'రామదండు' వాలంటీరు దళాన్ని ఏర్పాటుచేశాడు. దాని కేంద్ర కార్యస్థానాన్ని రామానగర్‌లో నెలకొల్పారు. 200 మంది సభ్యులు గల పార్లమెంట్ ఏర్పడింది. 1921 ఏప్రిల్ 6 వ తేదీన చీరాల దర్శించిన మహాత్మా గాంధీ చీరాల - పేరాల ప్రజల పోరాట పటిమను ఎంతగానో ప్రశంసించారు.

బలిచక్రవర్తిని మూడు అడుగులతో పాతాళానికి తొక్కేసిన వామనుని వలె, మహాత్మా గాంధీ బ్రిటిషు ప్రభుత్వాన్ని పంజాబ్, ఖిలాఫత్, స్వరాజ్యం అనే మూడు ఆందోళనలతో అధః పాతాళానికి తొక్కివేయగలడని దుగ్గిరాల గోపాల కృష్ణయ్య ఈ చీరాల - పేరాల ప్రజలను ఉత్తేజపర్చాడు.

దుగ్గిరాల గోపాల కృష్ణయ్య ఎడింబరో యూనివర్శిటీ ఎమ్. ఏ. పట్టభద్రుడు. 1917 - 18 లో సంవత్సరం పాటు రాజమండ్రి గవర్నమెంట్ ట్రయినింగ్ కాలేజీలో లెక్చరరుగా పనిచేశాడు. 1918-19 లో బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలో చేరాడు. అక్కడ విద్యా విధానంతో పరిపడక ఆయన చీరాల సమీపంలో 1920 లో ఆంధ్ర విద్యా పీఠ గోష్ఠి అనే సంస్థను స్వయంగా స్థాపించి, దానిని నడిపాడు. ఆ విధంగా ఆయన చీరాల - పేరాల ప్రజలకు సన్నిహితుడయ్యాడు.

## నరక యాతనలు

పర్ణశాలలు వేసుకొని జీవిస్తున్న చీరాల, - పేరాల ప్రజలు నరకయాతనలు అనుభవించారు. వారి వ్యాపారాలు దెబ్బతిని, ఆర్థికంగా ఇబ్బందుల పాలయ్యారు.

ఆ ఏడాది వేసవి గాడ్పులు మహా తీక్షణంగా వీచాయి. ఉష్ణోగ్రత 120 డిగ్రీలకు పెరిగిపోయింది. వేసవిని వెంటాడుతూవచ్చిన వర్ష రుతువు కూడా వారికి మరిన్ని ఇడుములు, ఇక్కట్లు తెచ్చిపెట్టింది. కొద్ది రోజుల వ్యవధిలో కుండపోతగా 10½ అంగుళాల వర్షపాతం పడింది. స్వరాజ్యం కనుచూపు మేరలో వుందన్న ఆశాభావంతో వారు ఈ నరక యాతనల నన్నింటిని అనుభవించారు.

## పెరిగిన ప్రభుత్వ పీడన

చీరాల - పేరాల వాసులు ప్రభుత్వానికి చెందిన బంజరు భూములలో రు. 20 నుంచి రు. 40 ల ఖర్చుతో పాకలు ఏర్పాటు చేసుకొన్నారు. తమ ఇళ్ళ ఆవరణలో రు. 5 ల వ్యయంతో బావులు తవ్వ కొన్నారు. ప్రభుత్వం వారిపై తమ నిర్బంధ చర్యలను తీవ్రం చేయడానికి ఒకొక్క ఇంటికి రు. 1025/- ల పెనాల్టీ విధించింది. ఆ విధంగా వారిని పీడించింది.

ఇలాంటి దశలో దుగ్గిరాల గోపాలకృష్ణయ్య చీరాల - పేరాల వాసుల పునరావాసానికి నిధి సేకరించే నిమిత్తం 1921 సెప్టెంబరులో బరంపురంలో జరిగిన ఆంధ్ర మహాసభకు వెళ్ళాడు. అక్కడ ఆయన చేసిన ప్రసంగాలకుగాను ప్రభుత్వం దేశద్రోహనేరం క్రింద ఆయనను అరెస్టు చేసి, సంవత్సరం కఠిన కారాగారవాస శిక్ష విధించింది.

## "పదవే భద్రాద్రికి పాపిష్టి ఘటమా"!

కారాగారవాసశిక్ష పడిన దుగ్గిరాల గోపాలకృష్ణయ్య "పదవే భద్రాద్రికి పాపిష్టి ఘటమా!" అనే పాట పాడుతూ కటకటాలలోకి నడిచి వెళ్ళాడు. తమ నాయకుడు దుగ్గిరాల గోపాలకృష్ణయ్య జైలు పాలు కావడంతో, చీరాల - పేరాల ప్రజల నైతిక పాటవం దెబ్బతిని పోయింది. నిరాశా, నిస్పృహలు వారి హృదయాలను అలముకొన్నాయి. దానితో వారు పర్ణశాలలను విడిచిపెట్టి, తమ తమ పాత ఇళ్ళకు తిరిగి పోవలసి వచ్చింది. ఈ విధంగా చీరాల - పేరాల పోరాటం పరాజయంతో ముగిసినప్పటికి, దానికి చారిత్రక ప్రాధాన్యం లేకపోలేదు. రేపల్లె, విజయవాడ మున్సిపాలిటీలలో కూడా ఇంతటి స్థాయిలో కాకపోయినా, ఇదే స్వభావం గల్గిన ఉద్యమాలు నిర్వహించారు. అయితే ప్రభుత్వం వాటిని అంతగా పట్టించుకోలేదు.

దుగ్గిరాల గోపాలకృష్ణయ్యను ఆదర్శంగా తీసుకొని, డాక్టర్ మురళీ నాసిక్‌లో స్థాపించిన బోంస్లే సైనిక పాఠశాల ఆవరణకు "రామభూమి" అని పేరు పెట్టారు. ఆ సైనిక స్కూలులో శిక్షణ పొందినవారికి "రామ దండులు" అని పిలిచారు. ఆ స్కూలు టెలిగ్రాఫిక్ అడ్రసు "రామ దండు"గా పిలవబడింది.

పదహారేళ్ళ తరువాత 1938లో మద్రాసులో ఏర్పడిన కాంగ్రెసు మంత్రివర్గ హయాంలో మంత్రి బెజవాడ గోపాలరెడ్డి చీరాల మున్సిపాలిటీని రద్దు చేశారు.

## చరిత్ర ప్రసిద్ధమైన పుల్లరి సత్యాగ్రహం

సహాయ నిరాకరణోద్యమంలో భాగంగా, ఆంధ్ర దేశంలో అటవీ నిబంధనల ఉల్లంఘనోద్యమాలు కూడా సాగించబడ్డాయి. వీటిలో గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాలో కన్నెగంటి హనుమంతు నాయకత్వంలో జరిగిన పుల్లరి సత్యాగ్రహం చరిత్ర ప్రసిద్ధి చెందింది.

గుంటూరు జిల్లాలోని పల్నాడు తాలూకా ఆర్థికంగా వెనుకబడిన ప్రాంతం. 1920-21 సంవత్సరంలో వర్షాలు లేక రైతులు దెబ్బ తిన్నారు. పైగా పశుగ్రాసం కొరత ఏర్పడింది.

దేశంలోని అటవీ సంపదను కొల్లగొట్టడానికి అలవాటు పడిన బ్రిటిషు ప్రభుత్వం, అటవీ నిబంధనలు అంటూ పెట్టి, అటవీ సంపదను ప్రజలు అనుభవించటానికి వీలులేకుండా చేసింది.

అడవులలో పశువులను మేపుకొనడానికి వీల్లేదు. వంట పుల్లలు ఏరుకు తెచ్చుకోడానికి వీల్లేదు. వ్యవసాయ పనిముట్లకు అవసరమైన కలపకొయ్యలను కొట్టి తెచ్చుకొనడానికి వీలులేదు. అడవులలో లభించే సీటి వనరులను వినియోగించుకోడానికి వీలులేదు. ఈ రకమైన ఆంక్షలతో ప్రజలు విసుగెత్తి పోవడం సహజం.

ఒక ఆవును అడవిలో మేపుకొనాలంటే 12 అణాలు ఫీజు చెల్లించి, పర్మిట్ పొందాలి. అదికూడా ప్రత్యేకమైన ఒక అటవీ ప్రాంతానికి మాత్రమే చెల్లుతుంది. మరొక ప్రాంతంలో ఆవును మేపుకోవాలంటే,

పన్నెండు అణాలు రుసుం చెల్లించి, మరో పర్మిట్ పొందాలి. ఈ నిబంధనలను సడలించాలని, పశువు 1కి మూడు అణాలు చొప్పున వసూలు చేయాలని, ఒకే పర్మిట్టుపై జిల్లాలో ఏ ప్రాంతం అడవిలోనైనా మేపు కొనడానికి అనుమతించాలని, గొర్రెలు, మేకలకు ఒకటిన్నర అణా రుసుంమాత్రమే వసూలు చేయాలనీ మోపెడు కట్టెపుల్లల చార్జీని ఆరుపైసలకు తగ్గించాలని ఎడ్లను ఉచితంగా అడవులలో మేపుకోనివ్వాలని పల్నాడు రైతులు కోరారు.

బ్రిటిషు ప్రభుత్వోద్యోగులు, ముఖ్యంగా లంచ గొండులైన అటవీ ఉద్యోగులు ప్రజలను విపరీతంగా పీడించారు. లంచాలు యివ్వకపోతే, కేసులు పెట్టి వేధించేవారు. విసిగిపోయిన ప్రజలు అసంతృప్తితో అట్టుడిగి పోతున్నారు. కాంగ్రెస్ ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమం వారికి ఆశారేఖగా గోచరించింది. మాచర్లలోని ప్రజలు ప్రభుత్వోద్యోగులపై సాంఘిక బహిష్కరణ ప్రారంభించారు. ప్రభుత్వోద్యోగులకు సరుకులు అమ్మడానికి వర్తకులు నిరాకరించారు. చాకళ్ళు, మంగళ్ళు కూడా ఆ సాంఘిక బహిష్కరణలో పాల్గొన్నారు. ఆ ప్రాంతంలోని డెప్యూటీ తహశీల్‌దార్ పిల్లలకు పాలుకూడా కరువైన పరిస్థితి ఏర్పడింది. ఆ ప్రాంతాన్ని సందర్శించడానికి వచ్చిన జిల్లా కలెక్టరు, జిల్లా పోలీసు అధికారికి కూడా ఇదే అవస్థ పట్టింది. కలెక్టరు ప్రభుత్వ ఉత్తర్వులను దండోరా వేయించడానికి, డప్పుల వాళ్ళకోసం కబురు పంపితే, వూళ్ళో డప్పులన్నీ పగిలిపోయాయని సమాధానం వచ్చింది.

మాచర్ల, వెలుదుర్తి, బట్టిపాలెం, శ్రీగిరిపాడు, రెంటచింతల వంటి గ్రామాలలో ప్రజలు అటవీ ఉద్యోగులను బాహాటంగా ధిక్కరించే ధోరణిని ప్రదర్శించారు. వందలాది గొడ్ల మందలను అడవులలోకి తోలి, మేపడం ప్రారంభించారు. అటవీ ఉద్యోగులు ఆ మందలను బందుల దొడ్లలో బంధించితే, జన సమూహాలు దాడి చేసి, ఆ మందలను విడిపించు కొనడం సర్వ సాధారణమైపోయింది.

నాడుపాలెంలో 100 పశువులను బందిలదొడ్లో పెట్టడానికి అటవీ ఉద్యోగులు తోలుకుపోతుంటే, ఒక మహిళ నాయకత్వంలో జనం ఫారెస్టు రేంజర్‌పై దాడిచేసి, ఆ పశువులను విడిపించారు.

పల్నాడు తాలూకాలో తీవ్రతరమవుతున్న ఉద్యమ పరిస్థితిని పరిశీలించడానికి ఆంధ్ర కాంగ్రెసు సంఘం తరఫున ఉన్నవ లక్ష్మీనారాయణ, వేదాంతం నరసింహాచారి 1921 జూలై 21 న ఆ ప్రాంతాన్ని సందర్శించారు జిల్లా కలెక్టరు ఆ సమయాన ఆ ప్రాంతంలోనే మజిలీ చేస్తున్నాడు. ప్రజలు ఆ నాయకులిద్దరినీ డప్పులు మోగిస్తూ ఘనంగా ఊరేగించారు. తాను అడినప్పుడు డప్పులన్నీ పగిలిపోయాయని చెప్పి, ఇప్పుడు కాంగ్రెసు నాయకులను డప్పులతో ఊరేగించడాన్ని చూసి, ఉగ్రుడై పోయిన జిల్లా కలెక్టరు ఆ నాయకులిద్దరినీ అరెస్టు చేయించి సంవత్సరం కఠిన కారాగారవాస శిక్ష విధించాడు.

కాంగ్రెస్ నాయకుల అరెస్టుతో పల్నాడు తాలూకాలో పరిసితి మరింత తీవ్రరూపం దాల్చింది. కొత్తపల్లిలో ఇద్దరు ఫారెస్టుగార్డులు పూటకూళ్ళ ఇంట్లో అన్నం తింటూవుండగా, ప్రజలు వారిద్దరినీ భోజనం పూర్తికాకుండానే, తన్ని తరిమేశారు. మరో గ్రామంలో ఫారెస్టు రేంజర్‌ను వెంటనే, అద్దె ఇంట్లో నుంచి ఖాళీచేసి పొమ్మని గ్రామస్తులు ఆదేశించారు.

మొత్తం మీద పల్నాడు తాలూకాలో బ్రిటిషు ప్రభుత్వం విధించిన అటవీ నిబంధనలన్నివి అమలు కాని పరిస్థితి ఏర్పడింది. ఉన్నవ లక్ష్మీనారాయణ, వేదాంతం లక్ష్మీనరసింహాచార్యుల అరెస్టుకు నిరసనగా గుంటూరు పట్టణంలో వారం రోజుల పాటు హర్తాళ్ జరిగింది. ఈ హర్తాళ్ ఉన్నవ లక్ష్మీబాయమ్మ నిర్వహణలో యామిని పూర్ణతిలకం అనే దేవదాసి ప్రముఖ పాత్ర వహించారు.

సూర్యప్రకాశరావు అనే హైస్కూలు విద్యార్థి కాలేజి విద్యార్థులను సమ్మెకు పురికొల్పుతున్నాడనే పేరుతో సబిన్‌స్పెక్టర్ అతడిని అరెస్టు చేశాడు. ఆ విద్యార్థి అరెస్టుకు నిరసనగా విద్యార్థులు పోలీసు స్టేషన్ ముందు ప్రదర్శన జరిపారు. ఆ ప్రదర్శనపై పోలీసులు లాఠీచార్జీ జరిపారు. ఈ దారుణానికి ప్రజలు కోపోద్రిక్తులయ్యారు. పరిస్థితిని చక్కదిద్దడానికి వెళ్ళిన డిప్యూటీకలెక్టరుపై ప్రజలు బురద జల్లారు. అట్టి పరిసితిలో కొండా వెంకటప్పయ్య జోక్యం కల్గించుకొని, పరిస్థితిని చక్కదిద్దారు.

అయినా జూలై 30 న గుంటూరులో కొండా వెంకటప్పయ్య, మరి ముగ్గురుని పోలీసులు అరెస్టు చేశారు.

పరిస్థితి ఉద్రిక్తంగా తయారయింది. ఆగస్టు 2 న కొండా వెంకటప్పయ్య ప్రభృతులను విడుదలచేయక తప్పలేదు.

పల్నాడు తాలూకాలో పుల్లరికి వ్యతిరేకంగా ప్రారంభమైన సత్యాగ్రహం క్రమేణా పన్నుల నిరాకరణోద్యమం రూపుధరించసాగింది. 1921 ఆగస్టులో జరిగిన పల్నాడు రాజకీయ మహాసభలో కొండా వెంకటప్పయ్య మాట్లాడుతూ, పన్నుల నిరాకరణోద్యమం, కాంగ్రెసు ఆమోదించలేదు. కనుక, దానిని సాగించరాదని స్పష్టం చేశాడు. కాంగ్రెసు నాయకులు పల్నాడు ఉద్యమాన్ని అదుపులో వుంచడానికి ప్రయత్నించినా, అక్కడి ప్రజలు పట్టుదలతో ఉద్యమాన్ని మరింత ఉన్నతస్థాయికి తీసుకుపోతూనేవున్నారు.

ప్రజలకు ఫారెస్టు గార్డులకు మధ్య ఘర్షణలు అధికం కాజొచ్చాయి. అదనపు పోలీసు బలగాలు దిగాయి. 1921 సెప్టెంబరు 23 న మంచలపాడు సమీపంలోని అడవిలో మేస్తున్న గొర్ల మందలను సాయుధ పోలీసుల సహాయంతో ఫారెస్టు ఉద్యోగులు బందులదొడ్లకు తోలుకు పోతుంటే, కన్నెకంటి హనుమంతు నాయకత్వంలో రెండు మూడు వందలమంది ప్రజలు ప్రతిఘటించారు. సాయుధ పోలీసులు కాల్పులు జరిపారు. ఆ కాల్పులలో కన్నెగంటి హనుమంతుతో సహా మొత్తం నలుగురు నేలకొరిగారు. మరుసటి రోజున అదనపు పోలీసు బలగాలను రప్పించి 28 మంది పురుషులను, 9 మంది మహిళలను అరెస్టు చేశారు.

కన్నెగంటి హనుమంతు మృతితో పల్నాటి ఉద్యమానికి గట్టి దెబ్బ తగిలింది. పైగా కాంగ్రెసు నాయకులు కూడా ఆ ఉద్యమాన్ని నిరుత్సాహపరిచే విధంగా ప్రవర్తించారు. ఈ రెండు అంశాలకు తోడు ప్రభుత్వ నిర్బంధకాండ తీవ్రతరంకావడంతో పుల్లరి సత్యాగ్రహం క్రమంగా నీరసించిపోయింది.

విజయవాడ తాలూకా కొండూరులో సంగవరపు సుబ్బయ్యశాస్త్రి నాయకత్వంలో పుల్లరి సత్యాగ్రహం సాగింది. కడపజిల్లా రాయచోటి పుల్లరి సత్యాగ్రహం తీవ్రరూపం దాల్చడంతో జిల్లా కలెక్టరు ప్యూనిటివ్ పోలీసులతో ఆ ఉద్యమాన్ని అణచివేశాడు.

## విప్లవ ధోరణిలో సాగిన పెదనందిపాడుపన్నుల నిరాకరణ

సహాయ నిరాకరణోద్యమకాలంలో యావద్భారత దృష్టినే కాక, బ్రిటిషు పార్లమెంటు సభ్యుల దృష్టిని కూడా ఆకర్షించిన పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం నిజంగా విప్లవ ధోరణిలో సాగిందంటే అతిశయోక్తికాదు.

ఆ ఉద్యమం భారతదేశంలో బ్రిటిషు సామ్రాజ్యపు పునాదులనే కుదిపివేసిందని అప్పట్లో మద్రాసు గవర్నరుగా పని చేస్తున్న లార్డ్ వెల్లింగ్టన్ అంగీకరించాడు.

పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమానికి సారధ్యం వహించిన పర్వతనేని వీరయ్య చౌదరి పెద్దగా చదువుకున్న వ్యక్తి కాదు. అంతా ఆయనను "ఆంధ్ర శివాజీ" అని పిలిచేవారు. అంతటి వీరుడు ఆయన. నిప్పులాంటి నిజాయితీపరుడు. పుట్టుకతోనే ఆయనకు నాయకత్వ లక్షణాలు అలవడ్డాయి. ఆ ప్రాంతపు ప్రజలు ఆయన మాటను "వేదవాక్కు"గా పాటించారు.

గుంటూరు జిల్లాలోని పెదనందిపాడు ప్రాంతంలో ఆ వుద్యమం అంతగా విజయవంతం కావడానికి తోడ్పడిన అంశాలలో ఆనాటి గ్రామోద్యోగుల ఆందోళన ఒకటని చెప్పకతప్పదు.

మహాత్మాగాంధీ నాయకత్వంలో దేశ వ్యాప్తంగా సాగుతున్న జాతీయోద్యమంతో ప్రభావితులైన గ్రామోద్యోగులు సంఘటితమై తమ హక్కుల సాధనకు ఆందోళన చేస్తున్న రోజులవి.

ఆంధ్ర దేశ గ్రామోద్యోగుల సంఘం అధ్యక్షులు బిక్కిన వెంకటరత్నం గొల్లలమామిడాలలో జరిగిన సహకార సమావేశానికి హాజరు కాలేదన్న కారణంపై 1921 ఆగస్టులో ప్రభుత్వం ఆయనను ఉద్యోగం నుంచి సస్పెండు చేసింది. తరువాత సీతంపల్లికి చెందిన కాజ వెంకట్రామయ్య, చందు ఎన్నయ్య, చందు బయన్న, మురుతుకుమార వెంకట్రావులను కూడా సస్పెండు చేశారు. అనంతరం రాజమండ్రిలో

జరిగిన ఆంధ్రదేశ గ్రామోద్యోగుల సంఘ సమావేశంలో గ్రామోద్యోగులంతా అక్టోబరు 1 వ తేదీకి తమ పదవులకు రాజీనామా చేయాలని తీర్మానించారు.

ఈ తీర్మానాను సారం కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాలలో అనేకమంది గ్రామోద్యోగులు తమ పదవులకు రాజీనామా విచ్చారు. గుంటూరు జిల్లా పుసులూరులో జరిగిన గ్రామోద్యోగుల మహాసభలో 16 మంది కరణం, మునసబులు తమ పదవులకి సలాం పెట్టారు. పెదనందిపాడు ఫిర్కాలోని గ్రామోద్యోగులు మూకుమ్మడిగా తమ పదవుల నుంచి వైదొలగారు.

“ఖిలాఫత్, పంజాబ్ వంటి ఘోరనేరాలు చేసిన బ్రిటిషు ప్రభుత్వం, భారదేశాన్ని అవమానపర్చింది. కనుక ఇలాంటి సైతాను ప్రభుత్వం క్రింద నేను పని చేయజాలను “అని దెందులూరు కరణం తన రాజీనామా పత్రంలో పేర్కొన్నాడు.

జీతాలు పెంచాలని, పనిభారం తగ్గించాలని రద్దు చేసిన అసిస్టెంటు కరణాలు, వెట్టి వాళ్ళ వంటి ఉద్యోగాలకు తిరిగి సిబ్బందిని నియమించాలని గ్రామోద్యోగులు కోరారు. ఆ కోర్కెలను తీర్చడానికి ప్రభుత్వం నిరాకరించింది,

అలాంటి దశలో 1922 జనవరి 7వ తేదీన విజయవాడలో సమావేశమైన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాలలో పన్నుల నిరాకరణోద్యమం ప్రారంభించాలని తీర్మానించింది.

ఈ తీర్మానాన్ని అమలు జరిపే విషయం చర్చించడానికి పొన్నూరులో సమావేశమైన గుంటూరుజిల్లా కాంగ్రెస్‌సంఘం తెనాలి, గుంటూరు, ఒంగోలు, రేపల్లె తాలూకాలను మినహా, జిల్లాలోని మిగతా తాలూకాలన్నింటిలోను పన్నుల నిరాకరణోద్యమం ప్రారంభించాలని నిర్ణయించింది. కొండా వెంకటప్పయ్య, శరణు రామస్వామిచౌదరి, గొల్లపూడి సీతారామశాస్త్రి, ఉన్నవ లక్ష్మీబాయమ్మ, మహ్మద్ గౌస్‌బేగ్, మంతెన రామరాజు,మద్ది రాధాకృష్ణయ్య, కామరాజు భానుమూర్తి గ్రామీణ ప్రాంతాలలో విస్తృతంగా పర్యటించి, పన్నుల నిరాకరణోద్యమాన్ని జయప్రదం చేయాలని ఉద్బోధించారు.

రేపల్లె కరణం మాచిరాజు రామమూర్తి గ్రామోద్యోగులను సంఘటితంచేసి, వారిచేత రాజీనామాలిప్పించి, పన్నుల నిరాకరణోద్యమం జయప్రదం కావడానికి అవసరమైన పూర్వరంగాన్ని సమకూర్చడంలో ప్రముఖపాత్ర వహించారు.

## శాంతి సేన ఏర్పాటు

ఈ పన్నుల నిరాకరణోద్యమాన్ని జయప్రదం చేయడానికి 4 వేల మంది వాలంటీర్లతో ‘శాంతి సేన’ ఏర్పాటుచేశారు. ఈ శాంతి సైనికులు గ్రామాలలో అహింసను పాటిస్తూ, శాంతియుతమైన ఉద మాన్ని నిర్వహించాలని, పన్నులు చెల్లించరాదని పె ఎత్తున ప్రచారంచేసి, ప్రజలకు నచ్చచెప్పారు. ంటరాని తనాన్ని పూర్తిగా నిర్మూలించినచోట్ల మాత్రమే పన్నుల నిరాకరణోద్యమాన్ని ప్రారంభించాలని గాంధీ విధించిన షరతు దృష్ట్యా పెదనందిపాడు ఫిర్కాలో అంటరానితనం పూర్తిగా నిర్మూలించారు. శాంతి సైనికుల కృషి ఫలితంగా ప్రజలంతా ‘ఒకేబాట’గా వ్యవహరించారు.

గుంటూరుజిల్లా అడిషనల్ మేజిస్ట్రేటు రూథర్‌ఫర్డ్ అక్కడి పరిస్థితిని స్వయంగా పరిశీలించడానికి వచ్చినపుడు, ప్రజలలో ఏ ఒక్కరు ఆ అధికారి అడిగిన ప్రశ్నలకు సమాధాన మివ్వలేదు. అంతా మౌనముద్ర వహించారు. ఊరుపేరు చెప్పడానికిగాని, ఫలానా వూరికి ఎటువెళ్ళాలంటే దారి చూపడానికిగాని, పోలీసు కేంద్రాలు ఎక్కడ వున్నాయంటే, వివరాలు తెల్పడానికిగాని ఎవరూ ముందుకు రాలేదు. దీనినిబట్టి ప్రజలను శాంతిసేన ఎంత క్రమశిక్షణతో వుంచగల్గిందో అర్థమవుతుంది.

## సిసలైన ప్రజోద్యమం

లాఠీలు ధరించిన శాంతి సైనికులు వూరూరా పహరా తిరుగుతుండేవారు. అయితే వీరు ఎన్నడూ ఉద్యోగులతో తారసపడలేదు. తెరవెనుకవుండి సూత్రధారులవలె కథను నడిపించారు. ప్రజలు తెరముందు పాత్రధారులై ఆ పోరాటంలో పాల్గొన్నారు. అదే పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమ విశిష్టత.

## ప్రభుత్వాధికారుల అవస్థలు

పన్నులు చెల్లించ నిరాకరించిన వారి చర, స్థిరాస్తులను స్వాధీనం చేసుకొని, వేలంవేయడానికి ప్రభుత్వాధి

కారులు శతధా ప్రయత్నించారు. చర, స్థిరాస్తులను స్వాధీనం చేసుకొనడానికి అధికారులు గ్రామాలకు వస్తే, ఇళ్ళపై గల నంబర్లు చెరిపివేయబడి వుండేవి. ఏ ఇల్లు ఎవరిదో అధికారులకు తెలిసేదికాదు. ఏ ఇంట్లోకి వెళ్ళినా, ఆ ఇంట్లో ఎవరూ వుండేవారుకాదు. ఆ ఇంట్లో సామాన్లు మాయమైపోయి వుండేవి. పన్నులు బకాయి పడినవారి పేర్లను అధికార్లకు ఎవరూ చెప్పేవారుకాదు. గ్రామాలకు గ్రామాలు నిర్మానుష్యంగా వుండేవి ఇళ్ళ తలుపులకు గొళ్ళాలు పెట్టబడి వుండేవి. పురుషులంతా శాంతి సేనలో చేరిపోగా స్త్రీలు అధికారులు వస్తున్నట్టు తెలియగానే ఇళ్ళువదలి వెళ్ళిపోయేవారు.

ఇళ్ళల్లో స్వాధీనం చేసుకున్న ధాన్యాన్ని ప్రభుత్వాధికారులు కొలచి. బస్తాలకు ఎత్తుకోవలసి వచ్చేది. ఇలా రోజుకి ఆరు కేసులను కూడా అధికారులు పూర్తి చేయగల్గేవారుకాదు. స్వాధీనం చేసుకున్న ధాన్యపు బస్తాలను, రిజర్వు పోలీసులు నెత్తిన ఎత్తుకొని మోటుకు పోవలసి వచ్చేది.

పెదనందిపాడు ఫిర్కాలో పరిస్థితిని స్వయంగా పరిశీలించడానికి రెవెన్యూబోర్డు సభ్యుడు హారిస్‌ను మద్రాసు ప్రభుత్వం పంపించింది. ఆయన వచ్చి. గ్రామోద్యోగుల రాజీనామాలను ఉపసంహరింపచేయడానికి శత విధాల ప్రయత్నించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. పరిస్థితి ఎంత ప్రమాదకరమైనదో గ్రహించిన హారిస్ తన నివేదికలో "ప్రస్తుత ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి తలపెట్టిన విప్లవం" తప్ప మరొకటి కాదని స్పష్టంచేశాడు.

## సామ, దాన, భేద, దండోపాయాలు

సంపూర్ణంగా, విజయవంతంగా సాగుతున్న ఈ పన్నుల నిరాకరణోద్యమాన్ని ఎత్తివేయడానికి ప్రభుత్వం చతుర్విధోపాయాలను—సామ, దాన, భేద, దండోపాయాలను చేపట్టింది. గ్రామోద్యోగుల రాజీనామాలను ఉపసంహరింపచేయడానికి జిల్లాకలెక్టర్ గెలెటీ ఎంతగానో ప్రయత్నించాడు. వారి కోర్కెలు తీర్చుతామని వాగ్దానం చేశాడు. అందుకు వారు ఒప్పుకొనకపోతే బెదిరించాడు. అయినా ఫలితం కన్పించలేదు.

ప్రభుత్వం తన ఎత్తుగడను మార్చి, ఉద్యమంలో చీలికలు తేవడానికి ప్రయత్నించింది. ముస్లిములు ఉద్యమంలో పాల్గొనకుండా చూడడానికి, ముస్లిం సబినస్పెక్టరును ఆ ప్రాంతంలో నియమించింది. ఆ ఉద్యమంలో ప్రముఖపాత్ర వహిస్తున్న కమ్మకులస్థులను చీల్చడానికి,సహకారశాఖలో ఇనస్పెక్టర్‌గా పనిచేస్తున్న కమ్మకులానికి చెందిన వ్యక్తిని డెప్యూటీ కలెక్టరుగా ప్రమోట్‌చేసి, ఆ ప్రాంతానికి నియమించింది. ఈ రెండు ప్రయత్నాలు విఫలమైనవి.

గుంటూరు జిల్లాకలెక్టరు ఈ ఉద్యమాన్ని బాహాట మైన తిరుగుబాటు తప్ప మరొకటికాదని తన నివేదికలో పేర్కొన్నాడు. అవసరమైతే సైన్యాన్ని కూడా ప్రయోగించవలసి రావచ్చునని అందులో హెచ్చరించాడు.

శాంతిసేనను నిషేధించారు. శాంతి సైనికులను అరెస్టు చేద్దామంటే, వారు వేల సంఖ్యలో వున్నారు. వారిని అరెస్టుచేసి, దూరప్రాంతాలకు తీసుకెళ్ళి వదిలేద్దామన్న ప్రతిపాదనను కూడా ప్రభుత్వం ఆలోచించింది. కాని అదీ సాధ్యంకాలేదు. చివరకు ప్రతి గ్రామంలోను ప్యునిటివ్ పోలీసులను ఏర్పాటుచేశారు.

రైతుల పొలాలను, పశువులను స్వాధీనం చేసుకుని, వాటిని హరిజనులకు ఉచితంగా పంచిపెట్టడంద్వారా ఉద్యమాన్ని దెబ్బతీయాలని ప్రభుత్వం వేసిన ప్లాను నెరవేరలేదు. ప్రభుత్వం ఉచితంగా యిచ్చే పశువులను, పొలాలను స్వీకరించడానికి ఎవరూ ముందుకి రాలేదు.

ఈ పన్నుల నిరాకరణోద్యమం సాగుతుండగా పల్నాడు గ్రంథాలయ సంఘంవారు "స్వరాజ్య గీతా పుంజం" అన్న గ్రంథం ప్రచురించారు. దాన్ని ప్రభుత్వం నిషేధించింది. పల్నాటి వీర చరిత్రను ఒకసారి గుర్తుకు తెచ్చుకోవలసిందిగా ఆ గ్రంధంలో ఉద్బోధించారు.

ఈ ఉద్యమ కాలంలో కె. వి. ఆర్. స్వామి, కల్లూరి సత్యనారాయణ, బి. వెంకటరత్నం, గొల్లపూడి సీతారామశాస్త్రి, ఓరుగంటి వెంకట సుబ్బయ్య, కె. సాంబయ్య, ఆర్. రామ సుబ్బయ్య వంటి నాయకులను ప్రభుత్వం అరెస్టు చేసింది.

ఈ ఉద్యమాన్ని దెబ్బతీయడానికి ప్రభుత్వం నిర్బంధకాండను తీవ్రతరంచేసింది. చివరకు సైన్యాన్ని రంగంలోకి దింపి, గ్రామాలలో సైనిక కవాతు జరి

పించింది. శాంతిసేనను నిషేధించిన పిమ్మట 144 సెక్షన్ విధించింది.

శాంతియుతంగా, సంపూర్ణంగా సాగిపోతున్న పన్నుల నిరాకరణోద్యమాన్ని దెబ్బ తీయడానికి ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలను చూసి ప్రజలు బెదిరిపోలేదు. భయపడలేదు. వారిలో పోరాటదీక్ష సన్న గిల్లి పోలేదు. ఆ ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న పర్వతనేని వీరయ్య చౌదరి ప్రతిభ అలాంటిది. ఆయన నిర్మించిన శాంతి సేన పాటవం అలాంటిది.

అయితే, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు నాయకులలో కొందరు ప్రభుత్వ ధోరణిని చూసి భయపడసాగారు. పరిస్థితిని సమీక్షించడానికి 1922 జనవరి 10న సమావేశమైన గుంటూరు జిల్లా కాంగ్రెసు సంఘం కాశీనాధుని నాగేశ్వరరావు, దండు నారాయణరాజు, టంగుటూరి ప్రకాశంలతో కూడిన ప్రతినిధి వర్గాన్ని పెదనందిపాడు ఫిర్కాకు పంపించాలని తీర్మానించింది.

ఆ ప్రతినిధివర్గం అక్కడ పరిస్థితిని పరిశీలించిన పిమ్మట అక్కడ సాగుతున్న శాంతియుత ఉద్యమం అపూర్వంగా వున్నదని అంగీకరిస్తూనే, ప్రభుత్వం అమలుజరిపే పాశవిక చర్యలతో ప్రజలు రెచ్చిపోయి, హింసాత్మక చర్యలకు దిగవచ్చునన్న తమ భయాన్ని తమ నివేదికలో పేర్కొన్నారు. కనుక ఉద్యమాన్ని విరమించాలని వారు సూచించారు.

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు నాయకులు, ఆ ప్రతినిధివర్గం నివేదికను చర్చిస్తున్న సందర్భంలో మహాత్మా గాంధీ నుంచి కొండా వెంకటప్పయ్యకు ఒక ఆదేశం అందింది. తాను బార్డోలీలో ప్రారంభించే పన్నుల నిరాకరణోద్యమ ఫలితాలను బేరీజు వేసేవరకు పెదనందిపాడు ఉద్యమాన్ని సస్పెండ్ చేయాలని గాంధీజీ ఆదేశించారు.

జయప్రదంగా సాగిపోతున్న ఉద్యమాన్ని విరమించడంవల్ల కాంగ్రెసు ప్రతిష్ఠ దెబ్బతింటుందని తెలిసినప్పటికీ, కొండా వెంకటప్పయ్య గాంధీజీ మాటను కాదనలేక ఉద్యమాన్ని విరమించాలని నిర్ణయించారు.

దీన్ని అవకాశంగా తీసుకొన్నప్రభుత్వం పెదనందిపాడు ప్రజలపై దారుణదమనకాండను అమలు జరిపింది. కాంగ్రెసు నాయకులు ఉద్యమాన్నివిరమించడం ప్రభుత్వం తనను కాల్చిచంపుతామని బెదరించడంతో, ఉద్యమనాయకుడు పర్వతనేని వీరయ్య చౌదరి, దిక్కుతోచక, ప్రభుత్వానికి క్షమాపణ చెప్పుకున్నాడు. 1922 మార్చి నాటికి ఆంధ్రదేశంలో సహాయ నిరాకరణోద్యమం పరాజయంతో ముగిసింది.

## ముందంజ — వెనుకంజలమధ్య గాంధీజీ మధ్యే మార్గం

దేశంలోని అన్ని ప్రాంతాలు, దేశ జనాభాలోని అన్ని వర్గాల ప్రజలు స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నప్పుడే, బ్రిటిషు సామ్రాజ్యవాదులను లొంగదీయడం సాధ్యమని భావించిన మహాత్మాగాంధీ జాతీయోద్యమాన్ని సమన్వయ పర్చడానికి వీలుగా కొన్ని సందర్భాలలో జయప్రదంగా సాగిపోతున్న ఉద్యమాలను హఠాత్తుగా విరమింప చేయవలసి వచ్చింది.

తొలుత 1921 నవంబరు 23న బార్డోలీలో పన్నుల నిరాకరణోద్యమం ప్రారంభించగలనని గాంధీజీ ప్రకటించాడు. అయితే నవంబరు నెలలో భారతదేశ పర్యటనకు వస్తున్న ప్రిన్స్ ఆఫ్ వేల్సు దంపతులరాక సందర్భంలో నిరసన ప్రదర్శనలు జరుపవలసిందిగా కాంగ్రెసు పిలుపు యిచ్చింది.

ప్రిన్స్ ఆఫ్ వేల్సు దంపతులు నవంబరు 17 న బొంబాయిలో దిగారు. అదేరోజున దేశమంతటా శాంతియుతంగా హర్తాళ్లు, నిరసన ప్రదర్శనలు జరిగాయి.

## బొంబాయిలో అల్లర్లు

అయితే, బొంబాయిలో ప్రిన్స్ ఆఫ్ వేల్సు దంపతుల గౌరవార్థం ఏర్పాటుచేసిన సన్మాన కార్యక్రమాలలో పార్సీలు, యూరోపియన్లు, ఆంగ్లో ఇండియన్లు పాల్గొన్నారు. అలా పాల్గొన్న వారిపైన సహాయ నిరాకరణోద్యమ కార్యకర్తలు దాడి చేశారు. పారశీమహిళలపై అత్యాచారాలు జరిపారు. దాంతో రెచ్చిపోయిన పార్సీలు, ఆంగ్లోఇండియన్లు, యూరోపియన్లు నవంబరు 15 నుంచి 21 వరకు పిస్తోళ్ళతో జనాన్ని కాల్చి చంపడం మొదలు పెట్టారు. పోలీసులు జోక్యం కల్పించుకుని కాల్పులు జరిపారు. ఫలితంగా 53 గ్గురు చనిపోయారు. 400 మందికి పైగా గాయపడ్డారు. చనిపోయిన 53 గ్గురులో 45 మంది కాంగ్రెసు కార్యకర్తలే. ఈ అల్లర్లు చూసి గాంధీజీ దిగ్భ్రాంతి చెందాడు. బొంబాయి వచ్చి, ప్రజల మధ్య తిరుగుతూ

శాంతి యుతంగా వ్యవహరించాలని విజ్ఞప్తి చేశాడు. కాని ప్రజలు ఆయన మాట వినిపించుకోలేదు. తన అహింసా ప్రబోధనలు నిష్ఫలమైనవని, ప్రజలు సత్యాగ్రహానికి అర్హులు కానప్పుడు, సత్యాగ్రహానికి పిలుపు యిచ్చినందుకు ప్రాయశ్చిత్తంగా మహాత్మాగాంధీ మూడురోజుల పాటు నిరాహారదీక్ష పూనారు. నవంబరు 23వ తేదీన తాను ప్రారంభించవలసిన బార్డోలీ పన్నుల నిరాకరణోద్యమాన్ని వాయిదా వేశారు.

## నిరాశ చెందిన ప్రజలు

మహాత్మాగాంధీ పన్నుల నిరాకరణోద్యమాన్ని వాయిదా వేయడంతో దేశవ్యాప్తంగా ప్రజలు నిరాశ చెందారు. బొంబాయి ఘటనల పేరుతో, బొంబాయికి ఎన్నో వందలమైళ్ళ దూరంలో వున్న బార్డోలీలో పన్నుల నిరాకరణోద్యమాన్ని వాయిదా వేయవల్సిన అవసరమేమిటని పలువురు ప్రశ్నించారు. ఖిలాఫత్ ఉద్యమాన్ని మహాత్మాగాంధీ నీరుకార్చుతున్నాడనే భావం ముస్లిం ప్రజలలో ప్రబలిపోసాగింది.

ప్రిన్సు ఆఫ్ వేల్సు భారతదేశ సందర్శన సందర్భంలో 1921 నవంబరు 17వ తేదీన ఆంధ్రదేశంలో కాకినాడ, సామర్లకోట, పిఠాపురం, రాజమండ్రి, పెద్దాపురం, విజయవాడ, గుంటూరు, రామచంద్రపురం వంటి చోట్ల హర్తాళ్లు జయప్రదంగా నిర్వహించబడ్డాయి.

## చౌరా చౌరీ ఉదంతం

1922 ఫిబ్రవరి 4వ తేదీన ఉత్తరప్రదేశ్‌లోని చౌరా చౌరీలో సహాయనిరాకరణోద్యమ కార్యకర్తలు 22మంది పోలీసులను బంధించి, సజీవదహనం కావించారు.

అంతకుముందు 1921 డిసెంబరులో అహ్మదాబాద్‌లో జరిగిన కాంగ్రెసు మహాసభ సహాయ నిరాకరణోద్యమాన్ని నడిపే విషయంలో సర్వాధికారాన్ని మహాత్మాగాంధీకి దఖలుపరుస్తూ తీర్మానించారు. దానిని ఆధారం చేసుకుని, మహాత్మాగాంధీచౌరీ చౌరా ఉదంతం అనంతరం పన్నుల నిరాకరణోద్యమంతోపాటు మొత్తం సహాయ నిరాకరణోద్యమాన్ని విరమిస్తూ 1922 ఫిబ్రవరిలో ప్రకటించారు.

గాంధీజీ చేసిన పనిని సి. ఆర్. దాసు, మోతీలాల్ నెహూ్రు, లాలా లజపతిరాయ్, ఇంకా అనేకమంది నాయకులు తీవ్రంగా విరసించారు. ముస్లింలు కూడా గాంధీజీకి పూర్తిగా దూరమైపోయారు. ఢిల్లీలో జరిగిన అఖిలభారత కాంగ్రెసు సంఘ సమావేశంలో గాంధీజీపై అవిశ్వాస తీర్మానం ప్రతిపాదించబడింది. అయితే అది వీగిపోయింది.

## మహాత్మాగాంధీ వ్యూహాత్మకమైన వెనుకంజ

ఉపఖండం వంటి భారత మహాదేశంలో అన్ని ప్రాంతాల ప్రజలను, అన్ని వర్గాల ప్రజలను స్వాతంత్ర్య పోరాటంలో భాగస్వాములను చేయాలన్న తన వ్యూహానికి అనుగుణంగా మహాత్మాగాంధీ సాగుతున్న సహాయనిరాకరణోద్యమాన్ని విరమించాడు. సైనిక పరిభాషలో దీనిని వ్యూహాత్మకమైన వెనుకడుగు అంటారు.

జాతీయోద్యమ దీర్ఘకాలిక ప్రయోజనాలకు ఇది అవసరమని, తాత్కాలికంగా కొన్ని నష్టాలు సంభవించినా ఈ వెనుకడుగు వేయక తప్పదని మహాత్మాగాంధీ భావించాడు.

## ప్రభుత్వ కర్కశ ధోరణి

1919లో పంజాబులో జనరల్ ఓడయర్ జరిపించిన దురంతాల దుష్ఫలితాలను చవిచూసిన బ్రిటిష్ ప్రభుత్వం, భారతదేశంలోని రాష్ట్రప్రభుత్వాలు హద్దు మీరకుండా కొన్ని కట్టుదిట్టాలు చేసింది.

మలబారులోని మాప్లా తిరుగుబాటు, బొంబాయిలో ప్రిన్సు ఆఫ్ వేల్సు దంపతుల రాక సందర్భంలో జరిగిన అల్లకల్లోలం, చౌరా-చౌరీ ఉదంతం, ఆంధ్రదేశంలో చీరాల-పేరాల పోరాటం, పల్నాడు పుల్లరి సత్యాగ్రహం, పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం వంటి వాటిని చూసిన తరవాత, బ్రిటిష్ ప్రభుత్వం తన ధోరణిని మార్చుకొన్నది. భారతదేశంలోని రాష్ట్రప్రభుత్వాలకు స్వేచ్ఛ నొసగి, జాతీయోద్యమాన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేయవలసిన సమయం వచ్చిందని బ్రిటిషు ప్రభుత్వం భావించింది.

సరిగ్గా అదే దశలో గాంధీజీ సహాయనిరాకరణో ద్యమాన్ని పూర్తిగా విరమించి, వ్యూహాత్మకమైన వెనుకడుగు వేయడంతో, జాతీయ ఉద్యమంలోని కొన్ని వర్గాలు, ముఖ్యంగా ముస్లిములు నిరాశ, నిస్పృహలకు లోనయ్యారు. ప్రజలలో మహాత్మా గాంధీ పలుకుబడి కొంత తగ్గింది.

ఆ దశలో బ్రిటిషు ప్రభుత్వం 1922 మార్చి 13న దేశద్రోహ నేరంక్రింద మహాత్మాగాంధీని అరెస్టు చేసి, బాలగంగాధరతిలక్‌కు విధించినట్లే ఆరు సంవత్స రాల కారాగారవాస శిక్ష విధించి, యర్రవాడ జైలులో బంధించింది.

## ముగింపు

గాంధీజీ 1920లో మూడు లక్ష్యాలతో-ఖిలాఫత్, పంజాబ్ దురంతాలకు వ్యతిరేకంగాను, స్వరాజ్య సాధనకోసం ప్రారంభించిన సహాయనిరాకరణోద్యమం, ఆ మూడింటిలో ఏ ఒక్క లక్ష్యాన్ని సాధించకుండానే ముగిసింది. దీన్నిబట్టి ఈ ఉద్యమం పూర్తిగా విఫల మైనట్టు అంచనా వేయరాదు. ఈ ఉద్యమం సాధించిన సత్ఫలితాలు ఎన్నో వున్నాయి.

దేశప్రజలలోని అన్ని వర్గాలలోను-భూస్వాములు పెట్టుబడిదారులు మొదలుకొని రైతు కూలీలు, కార్మికుల వరకు అన్ని వర్గాల ప్రజలకు దేశభక్తి భావం-ఈ ఉద్యమంవల్ల బలంగా వేరూనింది. వారిలో జాతీయ భావం వెల్లివిరిసింది. స్వాతంత్ర్య పోరా టంలో వర్గ, కుల విభేదాలకు తావులేదని నిరూపిత మైంది.

# అల్లూరి సీతారామరాజు మన్యం విప్లవం

మహాత్మాగాంధీ నిర్ణయం ప్రకారం కాంగ్రెస్ కార్యవర్గం సహాయనిరాకరణోద్యమాన్ని 1922 ఫిబ్రవరి 12న విరమించింది. సరిగ్గా ఇంచుమించు అదే సమయంలో ఆంధ్రదేశంలోని మన్యం ప్రాంతంలో అల్లూరి సీతారామరాజు సారధ్యంలో బ్రిటిషు ప్రభుత్వం పైన సాయుధ పోరాటం ప్రారంభమైంది. "మన్యం విప్లవం"గా అది పిలువబడింది.

పండిత జవహర్‌లాల్ నెహ్రూ మాటల్లో చెప్పాలంటే "వ్రేళ్ళపై లెక్కింపదగిన స్వల్పసంఖ్యాకులగు అనుచరుల సహాయంతో బ్రిటిషు ప్రభుత్వమును టకటక లాడించిన ధైర్యసాహసోపేతుడగు వీరుడైన అల్లూరి సీతారామరాజు" తల్లిదండ్రులు పెట్టిన అసలు పేరు రామరాజు. 1897 జూలై 4వ తేదీన జన్మించాడు.

అల్లూరి సీతారామరాజు పూర్వీకుల నివాసస్థలం గుంటూరుజిల్లా చౌప్పాడి. అయితే ఆయన తాత, ముత్తాతలు అక్కడనుంచి పశ్చిమగోదావరిజిల్లా భీమవరం తాలూకాలోని మోగల్లు గ్రామానికి తరలివెళ్ళి, అక్కడ స్థిరపడిపోయారు. ఆ రోజులలో పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు–కృష్ణామండలంగా ఒకే పాలిత ప్రాంతంగా వుండేవి.

సీతారామరాజు తండ్రి అల్లూరి వెంకటరామరాజు 1875 లో జన్మించాడు. ఆయన స్వాతంత్ర్యప్రియుడు. బ్రిటిషు వ్యతిరేకి. ఇంగ్లీషు విద్య నభ్యసించి, సర్కారు ఉద్యోగం చేయడం ఇష్టంలేని వెంకట రామరాజు ఫోర్తుఫారం చదువుతూ, ఇంట్లో కొంత డబ్బు చేత బుచ్చుకొని, బొంబాయి పారిపోయాడు. అక్కడ చిత్ర లేఖనం, ఛాయా చిత్ర గ్రహణం (ఫొటోగ్రఫీ) వంటివి నేర్చుకొని, స్వస్థలానికి తిరిగి వచ్చాడు. ఫొటోగ్రాఫర్‌గా జీవితం ప్రారంభించాడు.

ఫొటోగ్రాఫర్‌గా విజయనగర ప్రాంతంలోని పలువురు ప్రముఖులకు, పెద్దలకు సన్నిహితుడైన వెంకట రామరాజు 1893 ప్రాంతంలో విజయనగరం సమీపంలోని పాండ్రంకి గ్రామానికి చెందిన నారాయణమ్మను పరిణయ మాడాడు. ఆ దంపతులకు ముగ్గురు సంతానం కలిగారు. మొదటి సంతానం ఆడపిల్ల. సీత. రెండో సంతానం సీతారామరాజు. మూడో సంతానం సత్యనారాయణరాజు.

సీతారామరాజు బాల్యం రాజమండ్రిలో గడిచింది. అక్కడే ఆయన తండ్రి ఫొటోగ్రాఫర్‌గా స్థిరపడ్డాడు. వందేమాతరం ఉద్యమం, బాలుడైన సీతారామరాజుపై బలంగా ముద్రవేసింది. బాల్యంలో రాజమండ్రిలో బిపిన్ చంద్రపాల్ ప్రసంగాలు విన్నాడు. దానికితోడు, తండ్రి వెంకటరామరాజు స్వతంత్ర భావాలను, ఈ బాలరాజులో ఉగ్గుపాలతో రంగరించి పోశాడు.

సీతారామరాజు స్ఫురద్రూపి. పట్టినపట్టు విడువని దీక్షాపరుడు. తెలివి తేటలకు కొదవలేదు. మూడవ తరగతిలో బాలరాజు ప్రదర్శించిన ప్రతిభ కారణంగా అధ్యాపకులు ఆ బాలుని ఏకంగా ఐదవ తరగతికి ప్రమోట్ చేశారు.

1908 ఆగస్టున పుష్కర సమయంలో రాజమండ్రిలో ప్రబలిన కలరా వ్యాధి సోకి, తండ్రి వెంకటరామరాజు మృతి చెందడంతో, సీతారామరాజు కుటుంబం దాదాపు నిరాధారమై పోయింది. ఆ రోజుల్లో ఫొటోగ్రాఫర్‌గా వెంకటరామరాజు నెలకు రు. 200/-లు సంపాదించేవాడు. అయినా, ఆయన ఏమీ మిగల్చలేదు. దాతృత్వ స్వభావం గల ఆ కుటుంబం ఇంటికి వచ్చిన వారందరికీ తగిన అతిథి మర్యాదలు చేసి, ఆదాయాన్నంతా ఖర్చు చేశారు.

అయితే సీతారామరాజు పెదతండ్రీ, పినతండ్రులు ముగ్గురూ ఆర్థికంగా మంచి స్థితిలోనే వున్నారు. ఎటొచ్చీ ఈ ఒక్క కుటుంబమే నిరాధారమై పోయింది. సీతారామరాజు పినతండ్రి ఒకరు మేజిస్ట్రేట్‌గా పని చేస్తున్నాడు.

ఇంటికి పెద్దకొడుకైన సీతారామరాజుకు బాగా చదివి, సంపాదించాలన్న దృష్టి వుండి వుంటే, అందుకు అవసరమైన సహాయం లభించకపోదు. నిజానికి సీతారామరాజును బాగా చదివించి, మంచి ఉద్యోగం యిప్పించాలని మేజిస్ట్రేట్‌గా పనిచేస్తున్న పినతండ్రి రామకృష్ణరాజు ఎంతగానో ప్రయత్నించక పోలేదు.

## అంతరంగంలో ఏదో తపన, వేదన

సీతారామరాజు బాగా చదవాలని ఎంతగా ప్రయత్నించినా, తన అంతరంగంలో కుతకుతలాడుతున్న ఏదో

తెలియని తపనవల్ల దృష్టిని చదువుపై లగ్నం చేయ లేకపోయాడు. స్కూలుకి వెళ్ళి క్లాసులో కూర్చునేవాడు. ఇంటికొచ్చి లాంతరు ముందు పుస్తకాలు పరుచుకొన్నా, సీతారామరాజు ఏవేవో ఆలోచనలలో మునిగి తేలు తుండేవాడు. మితభాషి, కార్యవాది అయిన సీతారామ రాజు తన మనస్సులోని వేదన ఏమిటో ఎవరికీ చెప్పే వాడు కాదు.

1913 లో నర్సాపురం టెలర్ హైస్కూలులో నాల్గవఫారం క్లాసులో వెనుకబల్లపై కూర్చుని, పైకి చూస్తూ ఏదో ఆలోచించే సీతారామరాజును ఆ హైస్కూలు ప్రధానోపాధ్యాయుడు జయరామయ్య పంతులు "ఇక నీకు చదువురాదు కాని, సన్యాసం పుచ్చుకొని, ఏ హిమాలయాలలోనో తపస్సు చేసుకో" అని మందలించాడు. "అదే ఆలోచిస్తున్నానండీ" అని సీతారామరాజు సమాధాన మిచ్చాడు.

అంతకు ముందు కాకినాడలో థర్డుఫారం చదువు తున్నప్పుడే సీతారామరాజుతో మద్దూరి అన్నపూర్ణ య్యకు సహచర్య మేర్పడింది. ఆ మిత్రులిద్దరూ చదువులను గురించి ముచ్చటించుకొన్న సందర్భంలో సీతారామరాజు "మనం చదువుతున్నది ఒక విద్యా? దేశవిద్యే నిజమైన విద్య నేను సన్యాసినవుతాను. లోకోద్ధరణకు ఉపకరించే విద్యే నిజమైన విద్య" అనడాన్ని బట్టి సీతారామరాజు అంతరంగం ఎలాంటిదో మనం కొంత వూహించవచ్చు.

విశాఖపట్నం ఎ.వి ఎన్. స్కూలులో ఫోర్తుఫారం చదువుతున్నప్పుడు, అన్యకులానికి చెందిన జమీందార్ కొడుకుతో రామరాజుకు పరిచయ మయిందని, ఆ పరిచయంవల్ల జమీందారు కుమార్తె, రామరాజు ప్రేమించుకొన్నారని, ఇది తెలిసిన తల్లి రామరాజును నర్సాపూర్‌కు పంపించిందనీ, ఆ తరవాత ఆ యువతి 'సీత' చనిపోయినదనీ, నాటినుంచే రామరాజు "సీతా రామరాజు"గా పేరు పెట్టుకొన్నాడని చెప్పబడు తున్నది.

నర్సాపురంలో విద నభ్యసిస్తున్న సమయంలోనే, సీతారామరాజు తన సు మేట్సుతో, చించివాడ గ్రామంవెళ్ళి, అక్కడ -గ్రపుస్వారీ నేర్చుకొన్నాడు. ఈ సంగతి తెలిసి, కోపమొచ్చిన పినతండ్రి రామ కృష్ణరాజు, సీతారామరాజు వీపుపైన ఒకదెబ్బ వేశాడు. ఆత్మాభిమానం మెండుగా గల సీతారామరాజు చదువుకు స్వస్తి చెప్పి, పినతండ్రి ఇల్లు వీడి వెళ్ళి పోయాడు. అంతే, తిరిగి తన జీవితంలో సీతారామరాజు తన పినతండ్రి ముఖం చూడనేలేదు.

## అడవులలో సంచారం

1913-18 మధ్యకాలంలో సీతారామరాజు తల్లి, అక్క, తమ్ముడు తునిలో గడిపారు. నర్సాపురం నుంచి పారిపోయి వచ్చిన సీతారామరాజు కొన్నిరోజులు తునిలో తల్లి దగ్గర గడిపి, అక్కడ నుంచి అడవులకు చేరి, ఆటవికులైన మన్యం ప్రజల మధ్య తిరగ సాగాడు. తాను తపస్సు చేసుకొనడానికి అనువైన ప్రదేశం కొరకు ధారా పర్వతములు, కృష్ణదేవుపేట అడవులను గాలించాడు.

అదే సమయంలో సీతారామారాజు తునిలోని పండి తుల వద్ద సంగీతం, జ్యోతిశ్శాస్త్రం అభ్యసించాడు. 1915 లో పెదభైరవి భూపతి అగ్రహారంలో సూరి సుబ్బయ్యశాస్త్రి పండితుని వద్ద సంస్కృత భాషా భ్యాసం చేశాడు. సూరి నరసింహమూర్తి, వింజమూరి సత్యనారాయణ, కోటమర్తి గోపాలం, బాడ నరసింహ మూర్తి, సూరి మంగయ్య అప్పటి సహాధ్యాయులు.

## యాత్రలు

1916 ఏప్రిల్ 26 న సీతారామరాజు కాలి నడకన దేశయాత్ర ప్రారంభించాడు. నర్సీపట్నం, చోడవరం, విజయనగరం మీదుగా ఇచ్ఛాపురం చేరాడు. అక్కడ ఒక నెలరోజులు వుండి, బ్రాహ్మణులవద్ద జ్యోతిషం, జాతక భాగములు హెచ్చుగా నేర్చుకొన్నట్టు చెప్ప బడుతున్నది. అక్కడినుండి కలకత్తా చేరిన సీతారామ రాజుకు రెండు రోజులపాటు తిండిలేదు. కలకత్తాలో కడుపు దహించుకుపోతుండగా తిరుగుతున్న ఈ బాల యోగికి కాకతాళీయంగా తన నిత్యార్చనకు అతిథికోసం వెదుకుతున్న సురేంద్రనాథ్ బెనర్జీ తారసపడ్డాడు. సురేంద్రనాథ్ బెనర్జీ ఇంటి అతిధిగా వున్న 15 రోజుల వ్యవధిలో సీతారామరాజుకు దేశనాయకులైన మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్‌దాసు, మాలవీయ, మున్నగు వారిని సందర్శించే అవకాశం కలిగింది. వారితో దేశ పరిస్థితిని గురించి ముచ్చటించాడు. 1916 లో జరిగిన లక్నో కాంగ్రెస్ మహాసభకు కూడా హాజరయ్యాడు.

బొంబాయి, బ్రోచి, బరోడా, ఆనంద్, డాకూర్, ఉజ్జయిని, అమృతసర్, కాశీ, హరిద్వారం, ఋషికేశం, నేపాల్, బ్రహ్మకపాలం, లక్ష్మణఝూలా, కేశప్రయాగ, రుద్రప్రయాగ, బదరీనాథ్ వంటి పుణ్యక్షేత్రాలు సందర్శించడంతో, పృథ్వీసింగ్ వంటి విప్లవకారులతో సీతారామరాజు ఈ సందర్భంలోనే సంబంధాలు పెట్టుకొన్నాడు. 1921 జూలైలో చిట్టగాంగ్‌లో జరిగిన విప్లవకారుల రహస్య సమావేశంలో పాల్గొన్నాడు. దీన్నిబట్టి సీతారామరాజు ఒకవైపున ఆధ్యాత్మిక చింతనను పెంచుకోవడంతోపాటు, విప్లవ ధోరణులను కూడా అలవర్చుకొన్నాడని మనం గ్రహించవచ్చు. 1916-17 లలో ఆయన జరిపినది తీర్థయాత్ర మాత్రమేకాదు, రాజకీయ యాత్ర కూడా అన్న విషయం తదుపరి ఆయన అనుసరించిన మార్గం రుజువు చేసింది.

బాగా పెరిగిన గడ్డం, అంగవస్త్రం, పైన తువాలు చేతిలో వంచితో సీతారామరాజు తన యాత్రలు ముగించుకొని 1917 జూలై 17 న విశాఖజిల్లాలోని కృష్ణదేవుపేట చేరాడు. ఆ బాలయోగికి చిటికెల భాస్కరుడు ఆతిధ్యమిచ్చాడు.

కృష్ణదేవుపేటలో తన జ్యోతిష్య విద్యలతో, ఆయుర్వేద వైద్యంతో సీతారామరాజు స్థానిక ప్రజల అభిమానాన్ని, విశ్వాసాన్ని పూర్తిగా చూరగొనగలిగాడు. స్థానిక ప్రజల కోర్కెపై ఆయన అక్కడే కుటీరం ఏర్పాటు చేసుకొని, తపస్సు సాగించాడు. ఒకవైపున తపస్సు చేసుకుంటూనే, స్థానిక ప్రజల సమస్యలు గ్రహిస్తున్నాడు. వారికి చైతన్యం కల్గిస్తున్నాడు. కోయప్రజల నుంచి విలువిద్య నేర్చుకున్నాడు. పోలీసులు ఈ బాలయోగికి తుపాకి కాల్చడం నేర్పారు. తాను ఉత్తరోత్తరా బ్రిటిష్ ప్రభుత్వంపై సాగించదలచిన గెరిల్లా పోరాటానికి మన్యంప్రాంతం అనుపానులను ఉనికిని యావత్తు ఆకళింపు చేసుకొన్నాడు. తన గెరిల్లా దళ సభ్యులుగా, దళ నాయకులుగా ఎవరెవరు పనికివస్తారో కూడా సీతారామరాజు ఎంపిక చేసుకొన్నాడు. 1918 జూన్‌లో గూడెం, ఏజెన్సీ, జయపూర్, బస్తర్, నాగపూర్, నాసిక్, పూనా, బొంబాయి, మద్రాసు, మైసూరు, పండరీపూర్‌ల యాత్ర జరిపి, అదే సంవత్సరం అక్టోబరులో తిరిగి సీతారామరాజు కృష్ణదేవుపేట చేరుకున్నాడు.

కృష్ణదేవుపేట సమీపంలోని కొంగసింగిలో మోదుగ చెట్టుక్రింద తపస్సు చేసుకొనడానికి చిన్న కుటీరం వేసిపెట్టమని సీతారామరాజు ఆ గ్రామస్తుల్ని కోరాడు. ఆ ప్రాంతాన్ని 'పడాలదిబ్బ' అని కూడా అంటారు.

పడాల దిబ్బపైన తపస్సు పూర్తి చేసుకొని, ధార కొండలపై సీతారామరాజు 1918 నవంబరు 12న నాలుగు మాసాలపాటు తపస్సు చేశాడు. వేసవిలో కూడా ఆ కొండలపై నీటిధారలు పారుతుండటంవల్ల వాటికి ధార కొండలని పేరు వచ్చింది. ఈ కొండల పొడవు ఆరు మైళ్ళు. నర్సీపట్నం నుంచి నిమ్మగడ్డ వరకు వ్యాపించి వున్నాయవి.

1919 ఏప్రిల్‌లో తాండవ నది గట్టుపైన "శ్రీరామ రాజేంద్ర విజయనగరం" పేరుతో చిన్న గృహం నిర్మించి దానిలో సీతారామరాజు నివసించసాగాడు. తన కుటుంబ సభ్యుల నందరిని అక్కడకు రప్పించి, ముఠాదారుడు యిచ్చిన 30 ఎకరాలను సేద్యం చేయించాడు. తన సోదరి భర్త దంతలూరి వెంకటపతిరాజు కూడా అక్కడే ఉంటూ, వ్యవసాయం చేయసాగాడు.

తాండవ నది గట్టుపైన సీతారామరాజు రాత్రి పాఠశాల ఏర్పాటుచేసి, 20 మందికి విద్య నేర్పసాగాడు. ఆ కాలంలోనే కోయలచేత మద్యపానం మాన్పించడానికి ప్రచారం చేశాడు. ప్రజలమధ్య వివాదాలను గ్రామపంచాయితీల ద్వారా తీర్చే ఏర్పాటు చేశాడు.

1919-22 సంవత్సరాల మధ్య కాలంలో అల్లూరి సీతారామరాజు బ్రిటిష్ ప్రభుత్వంపై గెరిల్లా పోరాటానికి ఆయత్తమవుతున్న దశలోనే బాస్టియన్ అనే క్రైస్తవ అధికారి విశాఖజిల్లా ఏజెన్సీలోని గూడెం ప్రాంతానికి తహశీలుదారుగా నియుక్తుడయ్యాడు.

ఏజన్సీ ప్రాంతంలో రాకపోక సౌకర్యాల కోసం ఆ రోజులలో నర్సీపట్నం నుండి కొండ సంతవరకు రోడ్డు నిర్మాణం జరుగుతున్నది. దానినే దౌనూరు-చింతపల్లి ఘాట్‌రోడ్ అంటారు. ఈ రోడ్డు నిర్మాణం కాంట్రాక్టును ప్రభుత్వాధికారయిన తహశీల్‌దారు బాస్టియన్‌కు అప్పగించారు. సంతానం పిళ్ళె అనే ఓవర్‌సీరు, పర్యవేక్షణలో ఈ రోడ్డు నిర్మాణం సాగింది.

బాస్టియన్, సంతానం పిళ్ళెలిద్దరూ పరమ అవినీతి పరులు, కిరాతకులు. వారిద్దరూ కలిసి కోయ ప్రజలను విపరీతంగా పీడించారు. ప్రభుత్వం నిర్ణయించిన ఆరు అణాల కూలీకి బదులు పావలా, బేడ కూలి యిస్తూ, రోడ్డు నిర్మాణంలో కూలీల శ్రమను దారుణంగా దోపిడీ చేశారు.

ముఠాదారులు, గ్రామ మునసబులు, రైతుల మధ్య తగవులు, తంపులు పెట్టి — యన్ విపరీతంగా లంచాలు గుంజాడు. బ్రిటిష్ ప్రభుత ం పాటించిన "చీలించు-పాలించు" విధానాన్ని బా యన్ కూడా తనస్వార్థం కోసం ఆచరించాడు.

బ్రిటిష్ ప్రభుత్వం 1916లో అటవీ చట్టాన్ని ఏజన్సీ ప్రాంతంలో అమలు జరిపింది. ఈ చ ం ప్రకారం, రిజర్వుడు ఫారెస్టు, అన్ రిజర్వుడు ఫారె అని అటవీ ప్రాంతాన్ని రెండు తరగతులుగా వి ం చింది. కోయలు అన్ రిజర్వుడు ఫారెస్టును దాటి రిజర్వుడు ఫారెస్టులో అడుగు పెట్టకుండా నిషేధించారు. దీనివల్ల కోయ ప్రజల కష్టాలు అధికమయ్యాయి.

ఈ విధంగా విశాఖపట్నం ఏజన్సీ ప్రాంతంలోని 32 గ్రామాలు ప్రజలలో పేరుకుపోతున్న అసంతృప్తి జ్వాలలను పోరాట రూపంలోకి మళ్ళించడానికి ప్లాను ప్రకారం అయిదేళ్ళపాటు కోయ ప్రజల మధ్య చరిస్తూ సీతారామరాజు వారి విశ్వాసాన్ని పూర్తిగా చూరగొని, వారికి ఒక ఆశాజ్యోతిగా కన్పించసాగాడు.

## తెలుగునాట తొలి గెరిల్లా పోరాటం

బ్రిటిషు ప్రభుత్వాన్ని సాయుధ పోరాటం ద్వారా పారద్రోలడానికి సీతారామరాజు 150 మంది గెరిల్లా యోధులను తయారు చేశాడు. వారిని మూడు దళాలుగా ఏర్పాటు చేశాడు. గాం గంటందొర, గాం మల్లుదొర, ఎండుపడాల్ అనే ముగ్గురుని ఆ మూడుదళాలకు నాయకులుగా నియమించాడు.

గాం గంటందొర, గాం మల్లుదొరలు ఇద్దరూ అన్నదమ్ములు. మాకరం ముఠాకు చెందిన వీరు మహాయోధులు. బట్టు వణుకుల మునసబ్‌గిరీ నుంచి గంటం దొరను బాస్టియన్ తొలగించాడు. అంతేకాక, గంటం దొర, మల్లుదొరలు సాగుచేస్తున్న భూములను ముఠాదారుని చేత ఇతర రైతులకు యిప్పించాడు. అలాగే పెదవలస ముఠాదారుడైన కంకిపాటి ఎండు వీరన్న పడాల్‌ను కూడా బాస్టియన్ చెప్పనలవి కాని కష్టనష్టాలకు గురిచేశాడు.

## గూడెం ముఠాదారుని కథ

గూడెం ముఠాదారు మొట్టాడం వీరయ్యదొర తన ముఠా ప్రజల ప్రేమానురాగాలను పొందినవాడు. ఆయన తండ్రి 1847లో ద్వారబంధాల చంద్రయ్య సారథ్యంలో జరిగిన పితూరీలో పాల్గొన్నాడు. బ్రిటిష్ సైన్యంతో పోరాడిన యోధుడు. యుక్తవయస్సు వచ్చిన తర్వాత వీరయ్యదొర ఆ ముఠాకు అధిపతి అయ్యాడు. 1916-17లో "లాగరాయి" పితూరీ లేక శాంతిభూపతి విప్లవం పేరుతో పిలువబడుతున్న పోరాటంతో సంబంధ వున్న అనుమానంపై బ్రిటిష్ అధికారులు వీరయ్య దొరను గూడెంనుంచి బహిష్కరించి విజయనగరానికి ప్రవాసం పంపారు. ఆ ప్రవాస జీవితం భరించ లేక వీరయ్యదొర పోలీసుల కన్నుగప్పి, గూడెం చేరి, రహస్య జీవితం గడిపాడు. కొంత కాలానికి వీరయ్య దొరను అరెస్టుచేసి, విచారణ లేకుండా రాజవొమ్మంగి పోలీసుస్టేషన్‌లో నిర్బంధంలో వుంచారు.

## శాసనమై చెల్లుతున్న సీతారామరాజు మాట

సీతారామరాజు కోయ ప్రజలను రిజర్వుడ్ ఫారెస్టు కఱ్ఱెలు కొట్టి తెచ్చుకోమని, బేదఖలైన రైతులను తమ భూములను తిరిగి దున్నుకోమని చెప్పడం, అలాగే ప్రజలు ఆయన మాటను పాటించడం జరుగుతున్నది. ఏజన్సీ ప్రాంతంలోని 32 గ్రామాలలోను పంచాయతీ కోర్టులతోనే ప్రజల వివాదాలు పరిష్కారమై పోతున్నాయి. ఒక్కమాటలో చెప్పాలంటే, సీతారామరాజు మాట మన్యంలో శాసనమై చెల్లుతున్న స్థితి ఏర్పడింది.

## మునసబు చేసిన ఫిర్యాదు

సీతారామరాజు సాయుధ తిరుగుబాటుకు రంగం సిద్ధం చేస్తున్నట్లు కృష్ణదేవుపేట మునసబ్ 1922 జనవరి 28న నర్సీపట్నం డెపూటీ కలెక్టర్‌కు రిపోర్టు పంపించాడు. ఆ మరుసటి రోజునే జిల్లా పోలీసు అధి

కారి స్పైన్ స్వయంగా కృష్ణదేవుపేటకు వచ్చి, పరిస్థితిని పరిశీలించాడు.

"పితూరీకి ప్రజలను ఆయత్తం చేస్తున్నట్టు నీపై మాకు ఫిర్యాదు అందింది. నీ సంజాయిషీ ఏమిటి?" అని స్పైన్ ప్రశ్నించగా, తాను గ్రామాలను దోపిడీ చేయమని చెప్పడం లేదనీ, మద్యపానం తగదని, పంచాయతీ స్థాపన ద్వారా న్యాయ విచారణ జరుపుకోమని ప్రజలకు చెప్పడం పితూరీ ఎలా అవుతుందని సీతారామరాజు ఎదురుప్రశ్న వేశాడు.

జిల్లా పోలీసు అధికారి స్పైన్ నర్సీపట్నం తిరిగి వెళ్ళి' సీతారామరాజును కృష్ణదేవుపేట నుంచి నర్సీపట్నం తీసుకు రావలసిందిగా ఉత్తర్వులు జారీ చేశాడు.

ఆ ఉత్తర్వుల ప్రకారం 1922 ఫిబ్రవరి మొదటి వారంలో డెప్యూటీ కలెక్టర్ ఫజులుల్లా సాహెబ్ తహసీల్దారు మన్, పోలీసు ఇనస్పెక్టర్ సీతారామరాజును ప కుపోవడానికి కృష్ణదేవుపేట వచ్చారు. తాను యో ంలో వున్నాననిచెప్పి, సీతారామరాజు వారిని కలియకుండా తప్పించుకున్నాడు. యోగం పూర్తి కాగానే, నర్సీపట్నం రావలసిందని సీతారామరాజుకి చెప్పి, ఫజులుల్లా, తదితరులు నర్సీపట్నం తిరిగి వెళ్ళిపోయారు మరునటి రోజున తన కుటుంబాన్ని తుని పంపించి తాను నర్సీపట్నం బయలుదేరి వెళ్ళాడు.

డెప్యూటీ కలెక్టర్ ఫజులుల్లా సీతారామరాజు పిన తండ్రి రామకృష్ణరాజు సహాధ్యాయి. వారు మిత్రులు, అందుచేత సీతారామరాజు పట్ల ఆయనకు ప్రేమాభిమానాలు ఏర్పడ్డాయి. సీతారామరాజు మనస్సు మార్చి, ఆయన కుటుంబానికి ఒక దారి చూపించాలన్న దృష్టితో ఫజులుల్లా ఒక సలహా చెప్పాడు. అడ్డతీగల సమీపంలో గల పైడిపుట్టలో తాను 30 ఎకరాల భూమిని ఇప్పించగలనని, అక్కడ స్థిరపడి వ్యవసాయం చేసి, కుటుంబాన్ని పోషించుకోవలసిందని డెప్యూటీ కలెక్టరు సలహా. అదీ ఒకందుకు మంచిదేనను తలంపుతో సీతారామరాజు అందుకు అంగీకరించాడు.

సీతారామరాజు కుటుంబం పైడి పుట్టలో స్థిరపడింది. 1922 మే వరకు సీతారామరాజు అక్కడే వున్నాడు. పోలీసుల నిఘా ఎక్కువగానే వుంది. అయినా మల్లుదొర ఒకసారి వచ్చి, సీతారామరాజుతో మాట్లాడిపోయాడు. పితూరీకి తన కొడుకు తయారవుతున్నట్టు గ్రహించిన తల్లి నారాయణమ్మ, తన చిన్న కొడుకుని తీసుకుని, మరిది రామకృష్ణరాజు వుంటున్న నర్సాపురం చేరింది. తాను నేపాలు యాత్రకు వెళ్ళడానికి అనుమతించాలని సీతారామరాజు కోరగా, డెప్యూటీ కలెక్టరు ఫజులుల్లా అనుమతించాడు, నేపాల్‌కు వెడతానని బయలుదేరిన సీతారామరాజు సరాసరి పెదవలస వచ్చి, ఎండ పడాలుతో మంతనాలు సాగించాడు.

1922 జూన్ నుంచి ఆగస్టు వరకు సీతారామరాజు గూడెం కొండలలో గెరిల్లా పోరాటానికి కావలసిన ఏర్పాట్లను పూర్తి చేశాడు.

## తొలిదెబ్బ

మన్యం ప్రాంతంలో కోయలు 1922 జనవరి నుంచి ప్రభుత్వధిక్కార చర్యలు ప్రారంభించినప్పటికీ, ఆగస్టు 22 వ తేదీన సీతారామరాజు నాయకత్వంలో 150 మంది గెరిల్లాలు మూడు దళాలుగా మూడు వైపుల నుంచి చింతపల్లి పోలీసు స్టేషన్‌ను ముట్టడించారు. ఈ మూడు దళాలు గూడెం నుండి బయలు దేరాయి. వీరు విల్లంబులు, బాణాలు, గండ్ర గొడ్డళ్ళు, కత్తులు ధరించి ముందుకు సాగారు. కొద్దిగా తుపాకులు కూడా వారి వద్ద లేక పోలేదు.

దారిలో పోలీసు సబినస్పెక్టర్ ఒక రక్షక భటునితో గెరిల్లా దళాలకు తారసపడ్డాడు. ఆ సబిన్‌స్పెక్టర్ కు సీతారామరాజు తన పోరాట లక్ష్యాన్ని వివరించాడు. తనది అతివాదమని, మహాత్మాగాంధీది మితవాదమని, సాయుధ పోరాటం ద్వారా స్వరాజ్య సంపాదన తన ధ్యేయమని విశదం చేశాడు.

పోరాటం జరప నవసరం లేకుండానే చింతపల్లి పోలీసు స్టేషన్ గెరిల్లాల వశమైంది. 11 తుపాకులు, 1370 తూటాలు, 5 ఖడ్గాలు, 10 తుపాకి మందు సంచులు, రెండు ఇనుప గొలుసులు, 14 సనీన్లు, 9 కడ్డీలు చింతపల్లి పోలీసు స్టేషన్‌లో గెరిలాలకు లభ్యమైనవి. పోలీసు డైరీలో వాటి వివరా లన్నింటిని రాసి, వాటిని తాను స్వాధీనం చేసుకుంటున్నట్టు ఉటంకించి, సీతారామరాజు సంతకం చేశాడు. విజయోత్సాహంతో గెరిలాలు అక్కడ నుంచి తిరిగి వెడుతుండగా, ఎదురు పడిన ఇద్దరు పోలీసుల నుంచి ఒక

తుపాకిని ఐదు తుపాకి గుండ్లను గెరిలాలు స్వాధీనం చేసుకొన్నారు.

## మలి దెబ్బ

మరుసటి రోజున అంటే ఆగస్టు 23 న కృష్ణదేవుపేట పోలీసు స్టేషన్‌పైదాడికి వస్తున్నట్టు సీతారామరాజా సబిన్స్పెక్టరుకు కబురు పంపాడు. ఆ స్టేషన్ కూడా పోరాటం అవసరం లేకుండానే గెరిలాల స్వాధీనమైంది. ఆ స్టేషన్‌లో 6 తుపాకులు, 250 తూటాలు, కొంత తుపాకి మందు, 14 సున్నీలు, 5 ఖడ్గాలు గెరిలాల వశమయ్యాయి. సీతారామరాజును చూడటానికి వేలాది మంది ప్రజలు కృష్ణదేవుపేట వచ్చారు.

## రాజవొమ్మంగి స్టేషన్ వశం వీరయ్యదొరకు విముక్తి

ఆగస్టు 24 వ తేదీన గెరిలాలు రాజ వొమ్మంగి స్టేషన్ పై దాడి చేశారు. గెరిల్లాలను చూడగానే పోలీసులు పారిపోయారు. ఆ స్టేషన్‌లో బందీగా వున్న గూడెం ముఠాదారు మట్టాడపు వీరయ్య దొరను సీతారామరాజు విడుదల చేశాడు. 8 తుపాకులు, 850 తుపాకి గుళ్ళు, 5 ఖడ్గాలు దొరికాయి. పోలీసు స్టేషన్ నుంచి విడుదల చేయబడిన వీరయ్య దొర సీతారామరాజు గెరిల్లా దళాలలో చేరాడు.

సీతారామరాజు గెరిల్లా పోరాటం ప్రారంభించిన నాలుగు దిశలకు, ఆగస్టు 26 న డి. ఎస్. పి. ట్రెమన్ హార్ నాయకత్వంలో నాలుగు రిజర్వు పోలీసు దళాలు గెరిల్లాలను నిర్మూలించ డానికి నర్సీపట్నం చేరాయి.

గెరిల్లాల కోసం ప్రభుత్వ బలగాలు గ్రామాలను గాలిస్తున్నాయి. ప్రభుత్వ సైనికులకు ప్రజల సహకారం లభించడం లేదు. ప్రభుత్వ బలగాలను చూసి ప్రజలు భయపడడం లేదు. కాగా, గెరిల్లా దళాలకు గ్రామాలలో వీర మర్యాదలు లభిస్తున్నాయి.

## సీతారామరాజును 'బందిపోటు'గా చిత్రించిన ప్రకాశం పంతులు

మన్యం ప్రాంతంలో సీతారామరాజు ప్రారంభించిన విప్లవంతో ఉత్తేజితులైన పెద్దాపురం కాంగ్రెస్ వాదు అప్పటి ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షులైన టంగుటూరి ప్రకాశం గారికి తంతి మూలంగా తెలియ పర్చారు. ఆగస్టు 30 వ తేదీన ప్రకాశం, బ్రహ్మజోస్యుల సీతారామయ్య (తణుకు) పేరిట తంతి మూలంగా ఈ దిగువ సమాధానం పంపారు.

"పెద్దాపురం కాంగ్రెసు వారేమి కల్పించుకొనరాదు, దోపిడీ గాండ్రు పోలీసు స్టేషన్‌లను దోచుకొని, తుపాకులు, తూటాలు తీసుకొని పోతూవుంటే, కాంగ్రెస్ వారు చేయవలసిన దేమో నాకు బోధపడుట లేదు. వారి వద్దకు పోయి, మీరిటుల చేయగూడదని నెమ్మదిగా బోధించుటకు కూడా అవకాశంలేదు. కాంగ్రెసు వారెవరును బందిపోటుల కడకు పోకూడదు. కాంగ్రెస్ నాయకులు రావలెనను తంతి వార్తలు పత్రికలకు పంపుటే అసంగతం"

సీతారామరాజు జరుపుతున్న విప్లవం పట్ల కాంగ్రెస్ నాయకుల ధోరణి ఏమిటో దీన్నిబట్టి స్పష్టమైంది.

ఒంజేరి అనుచోట మన్యం విప్లవకారులు విశ్రాంతి తీసుకొంటున్న సమయంలో, జయపూర్ మహారాజా సరఫరా చేసిన గజబలంతో ట్రెమన్‌హార్ సారధ్యములో బాస్టియన్‌తో సహా మొత్తం 30 ప్రభుత్వ సైనికులు దాడి చేశారు. అప్పుడు విప్లవకారులకు, ప్రభుత్వ సైనికులమధ్య జరిగిన పోరాటంలో సీతారామరాజు పక్షానికే జయం లభించింది. ఒక ప్రభుత్వ సైనికుడు చనిపోయాడు. ట్రెమన్‌హార్ తీవ్రంగా గాయపడ్డాడు. మల్లుదొర బాస్టియన్‌పై గురిపెట్టి కాల్చాడు. కొద్దిలో గురి తప్పింది. బాస్టియన్ బ్రతికి బయటపడ్డాడు... ఆయుధాలు, మందుగుండు సామగ్రి గెరిల్లాల వశమయ్యాయి. గెరిల్లాల చేతిలో పరాజయం పాలైన ప్రభుత్వ సేనలు నర్సీపట్నానికి తిరోగమించవలసి వచ్చింది.

## కొండపల్లి పోరాటం

అనంతరం ఆంగ్ల సైనాధికారి జాన్ నాయకత్వములో బ్రిటిష్ సైన్యం సెప్టెంబరు 19 న కొండపల్లి వద్ద గెరిల్లా దళాలతో పోరాటానికి తలపడింది. ఈ పోరాటంలో కూడా ప్రభుత్వ సైనికులు పరాజయం పొందవలసి వచ్చింది. కడుపుమంటతో ప్రభుత్వ సైనికులు కొండపల్లి, నడిమిపాలెం గ్రామాలను తగులబెట్టి మరీ తిరోగమించారు.

---

### ఇద్దరు తెల్ల సైనికాధికారుల హతం

1922 సెప్టెంబరు 21 వ తేదీన కృష్ణదేవు పేటలో మహాకాళి పూజలో సీతారామరాజు నిమగ్నుడై వున్నట్టు తెలుసుకొన్న ప్రభుత్వ అధికారులు సాయుధులై వుండే గెరిలాలపై హఠాత్తుగా దాడిచేసి, హతమార్చాలన్న దుర్బుద్ధితో, కోరాపుట్టి రిజర్వు పోలీసు దళాన్ని పంపించారు.

టాల్బార్ట్, సాండర్స్ అనే ఇద్దరు ఆంగ్ల సేనానులను ఆ దళానికి అధికారులుగా నియమించారు. వీరి రాక ఆచూకీని పసికట్టిన గెరిలాలు పెదవలస వద్దనే ఎదురొడ్డడంతో సాండర్సు ముఠా తిరోగమించక తప్పలేదు.

మొదటి ప్రపంచ యుద్ధంలో జర్మన్ సైనికులతో పోరాడిన ఇద్దరు ఆంగ్లసేనానులు స్కాట్ కవర్డ్, హైటర్‌ల నాయకత్వాన 50 మంది ప్రభుత్వ సైనికులు గెరిలాలకోసం చింతపల్లి, అడ్డతీగల, కోటనందూరు, మలకనగిరి, దౌనూరుఘాట్ మున్నగు ప్రాంతాలలో గాలించి, సెప్టెంబర్ 24 న శరభన్నపాలెంనకు నాలుగుమైళ్ళ దూరంలోని దమనపల్లి ఘాట్ వద్ద ధారకొండలు, గాలి కొండల మధ్యలోయలో మొగిలి దొడ్డి ఘాట్‌వద్దకు రాగానే పెద్ద కొండరాయి చాటున మాటువేసి వున్న 10 మంది గెరిలాలు గంటం దొర, మల్లుదొర, ఎండుపడాల్ మొదలైనవారు శత్రువులపై కాల్పులు ప్రారంభించారు. ఎండుపడాల్ గురి చూసి పేల్చిన రెండు తుపాకి గుళ్ళకు స్కాట్ కవర్డు, హైటర్ వరుసగా నేలకొరిగి, వారి శవాలు లోయలో పడిపోయినవి. మరో సైనికుడు కూడా మృతిచెందాడు. మిగతా ప్రభుత్వ సైనికులు పలాయనం చిత్తగించారు గెరిలాలకు "303" తుపాకులు ఆరు, కవర్డ్, హైటర్ల పిస్తోళ్ళు రెండు లభించాయి.

ఈ వార్త తెలిసినంతనే, ఐ.జి.పి, ఆర్మిటేజి, మరొక పోలీసు అధికారి కేన్ లిద్దరూ కొందరు సైనికులతో కవర్డ్, హైటర్ శవాలను తీసుకుపోవడానికి అక్కడికి వచ్చారు. వారిని గెరిలాలు ఎదుర్కొన్నారు. ఆర్మిటేజ్ గాయపడడంతో వారు కూడా తిరోగమించక తప్పలేదు. ఈ పోరాటంలో మరొక సైనికుడు చనిపోయాడు.

అటు తరువాత, స్టూవర్ట్, సీతారామరాజు అనుమతి పొంది, ఆంగ్ల సేనానుల శవాలను తీసుకుపోయాడు. మిగతా సైనికుల శవాలను మాత్రమే అక్కడ వదిలివేశారు.

నర్సీపట్నంలో ఆ ఆంగ్లసేనానుల శవాలను పాతిపెట్టి, ఆ సమాధులపై చలువరాళ్ళ మీద వారిద్దరి త్యాగాలు కీర్తిస్తూ సంస్మరణ వాక్యాలు చెక్కించారు.

### నాఫ్ వ్యూహం - ఎమ్.ఎస్.పి. రాక

అనుభవజ్ఞులైన ఇద్దరు ఆంగ్లసేనానులను మన్యంలో గెరిలాలు అవలీలగా వధించడంతో గంగవెర్రులెత్తిన బ్రిటిష్ ప్రభుత్వం గెరిల్లా యుద్ధ నిపుణుడైన హోంశాఖ సభ్యుడు నాఫ్‌ను మన్యం ప్రాంతానికి పంపించింది. మలబారు స్పెషల్ పోలీసు దళాలను ఏజెన్సీ ప్రాంతానికి తరలించారు. నాఫ్ ఆదేశం ప్రకారం, ఏజెన్సీ ప్రాంతంలోని పోలీసు స్టేషన్లలో ఆయుధాలను సురక్షిత ప్రాంతాలకు తరలించారు. ఆయుధాలు గెరిలాల వశం కాకుండా నివారించడానికి ఈ పని చేశారు. అక్టోబరు 15 న 90 మంది గెరిలాలు అడ్డతీగల పోలీసు స్టేషన్‌పై దాడి చేశారు. ఆ పోలీసు స్టేషన్‌లో ఆయుధాలు ఏవీ గెరిలాలకు లభ్యం కాలేదు. అక్కడనుంచి గెరిలా దళాలు చోడవరం చేరాయి.

గెరిలాలకు పట్టుబడిన ప్రభుత్వ బంటు రుద్రయ్య ద్వారా సీతారామరాజు వార్తగా, గోదావరి జిల్లా కలెక్టర్ బ్రేకన్‌కు కబురు పెట్టాడు.

"నేను అడ్డతీగలలో వుంటాను. కలెక్టరునువచ్చి నాతో మాట్లాడమని చెప్పు. లేదా నాతో పోరాటానికైనా రమ్మను. నేను దేనికైనా సిద్ధమే" అని విప్లవకారుడు పెట్టిన కబురుకు జిల్లా కలెక్టర్ నుంచి సమాధానమే లేదు.

500 మంది సైనికులు వుంటే తప్ప, సీతారామరాజును ఎదిరించడం కష్టమని తహశీల్‌దారు జిల్లా కలెక్టరును హెచ్చరించాడు.

సీతారామరాజు జిల్లాకలెక్టరు రాకకు ఎదురుచూస్తూ, అడ్డతీగలనుంచి పెదిపు చేరాడు. అక్కడికీ కలెక్టర్ రాకపోవడంతో 60 మంది గెరిలాలతో సీతారామరాజు రంప చోడవరం చేరాడు. అక్కడ పోలీసు స్టేషన్‌పై అగ్గిరాజు దాడి చేశాడు. కొద్దిసేపు పోరాటం

జరిగింది. చాలామంది ఉద్యోగులు పారిపోయారు. రంప చోడవరంలో కూడా ఆయుధాలు లభించలేదు.

అ జరు 23 వ తేదీన ఆంగ్లసేనాని సాండర్స్ సారథ ంలో మలబారు పోలీసు దళం రాయవరం ప్రాం ంలో గెరిలాలతో పోరాటానికి తలపడింది. గెరిలాలతో పోరాడలేక సాండర్స్ బలగం తిరోగ మించింది.

ఇంతవరకు ప్రభుత్వ సైనికులకు, గెరిలాలకు ఆరుచోట్ల పోరాటాలు జరిగాయి. ఆ ఆరుచోట్ల గెరి లాలదే పైచేయి. ప్రభుత్వ సేనలకు అన్నిచోట్ల పరాజయమే ఎదురయింది.

## విప్లవకారులకు తొలి పరాజయాలు

1922 డిసెంబరు 6 వ తేదీన సీతారామరాజు విప్లవ సైనికులు తొలి పరాజయం పొందారు. జాన్ నాయక త్వంలో 57 మంది పెదగడ్డపాలెం వద్ద విప్లవకారు లపై కాల్పులు జరిపారు. నలుగురు విప్లవకారులు మర ణించారు. ఒక విప్లవకారుడు ఖైదీగా చిక్కాడు. అదే రోజు సాయంత్రం హాఫెల్, స్వీన్ అనే ఆం సేనానులు 53 గ్గురు సైనికులతో లింగాపురం వ 20 మంది గెరిల్లాలతో వున్న సీతారామరాజుపై దా ప్రారంభించారు. తీవ్రమైన పోరాటం జరిగింది. సీతా రామరాజు గాయపడ్డాడు 8 మంది విప్లవ సైనికులు మృతి చెందారు. నలుగురు ఖైదీలుగా పట్టుబడ్డారు. ఈ పోరాటంలో విప్లవకారులకు అపారమైన ప్రాణనష్టమే కాక, ఆయుధాలు శత్రువుల పాలయ్యాయి. సీతారామ రాజు మిగతా వారితో కలసి, తప్పించుకొన గల్గాడు. ఒక్కరోజులో 12 మంది విప్లవకారులు నిహతు లయ్యారు.

ఈ సంఘటన తరువాత నాలుగు మాసాలపాటు గెరిల్లాలు ఎక్కడా దాడులుచేయలేదు. దానితో పితూరీ అణగారిపోయినట్టు భావించిన ప్రభుత్వం మలబారు స్పెషల్ పోలీసును మన్యం ప్రాంతం నుంచి ఉప సంహరించారు.

1923 ఏప్రిల్ 18 న సీతారామరాజు అన్నవరం పోలీసుస్టేషన్‌పై దాడి చేశాడు. కాని అక్కడ ఆయు ధాలు ఏమీ విప్లవకారులకు దొరకలేదు. అయితే అన్నవరం ప్రజలు మాత్రం సీతారామరాజుకు అఖండ స్వాగతం ఒసగారు. డిప్యూటీ తహశీల్‌దార్, పోలీసు సబిన‌స్పెక్టరు సైతం, సీతారామరాజుకు స్వాగత మిచ్చినవారిలో చేరడం విశేషం.

## అగ్గిరాజు చేరిక

వేగిరాజు సత్యనారాయణరాజు పశ్చిమగోదావరి జిల్లా భీమవరం తాలూకా కుముదవల్లి గ్రామంలో జని ంచాడు. సహాయ నిరాకరణోద్యమంతో ఉత్తే జితు కాంగ్రెస్‌లో చేరాడు. దేశంలో బ్రిటిష్‌వాళ్ళ పాల కు కొందరు స్వదేశీయులే మూలస్తంభాలుగా తయారవుతున్నారనీ, ఇందుకు పోలీసు అత్యాచారాలు నిదర్శనమన్న భావం సత్యనారాయణరాజు హృద యంలో పేరుకుపోయింది. "నల్లవాడు ఉద్యోగికానిదే తెల్లవాడి రాజ్యం ఎందుకు నిలుస్తుంది? మనలను దోచు కొనేవారు తెల్లవారైతే, వాడికి సహాయపడుతున్నది మన నల్లవాడి దేశద్రోహమే. ముందు నల్లవాడి సహాయం లేకుంటే, స్వరాజ్యం దానికదే వస్తుంది." అన్నది సత్యనారాయణరాజు విశ్వాసం.

ఇలాంటి విశ్వాసంగల సత్యనారాయణరాజు రైలులో కలకత్తా వెడుతూ, అల్లూరి సీతారామరాజును గురించి ప్రయాణీకులు ముచ్చటించుకుంటున్న విషయాలు విని, మన్యం విప్లవంలో చేరాలన్న ని యానికి వచ్చాడు. కలకత్తా వెళ్ళవలసినవాడు అ వరం స్టేషన్‌లోనే దిగిపోయాడు. ఆ క్రితం రా నే సీతారామరాజు అన్నవరం రావడం, అఖండ స్వాగతం అందుకోవ డం జరిగింది. సీతారామరాజును వెదుక్కుంటూ, సత్యనారాయణరాజు ఎట్టకేలకు విప్లవకారులను చేర గలిగాడు.

1923 మే నెలలో ఆ విధంగా విప్లవకారులతో చేరిన సత్యనారాయణరాజు, సీతారామరాజు ఆంతరంగికు లలో ఒకడయ్యాడు. అగ్గిరాజుగా పేరు పొందాడు.

## పట్టుబడిన మల్లుదొర

మన్యం విప్లవంలో కీలక పాత్రధారులలో ఒక డైన గాం మల్లుదొరకు మొదటినుంచి మద్యపానం, వేశ్యాలోలత్వం అనే రెండు బలహీనతలు వున్నాయి. ఈ బలహీనతలు విప్లవానికి తీరని ప్రమాదం తెచ్చి పెట్టగలవని సీతారామరాజు మొదటినుంచి హెచ్చ రిస్తూనే వున్నాడు. ఈ బలహీనతలనుంచి బయట పడగలనని చెబుతూనే, మల్లుదొర చాటుమాటుగా ఈ

చర్యలు సాగిస్తున్నాడు. కనుక సీతారామరాజు, మల్లు దొరను కనిపెట్టుతుండమని ఎప్పటికప్పుడు ఎవరో ఒక విప్లవకారుడిని నియమిస్తూ వుండేవాడు. ఒక రోజున తన ఇంటికి వెళ్ళి రావడానికి మల్లుదొర సీతారామరాజు అనుమతిని కోరాడు. అలాగే వెళ్ళిరమ్మని అనుమతి యిచ్చిన సీతారామరాజు అతనికి తెలియకుండా అతనివెంట ఒక విప్లవకారుడిని పంపాడు.

ఇంటికి వెళుతున్న మల్లుదొర దారిలో ఒకతాటిచె ఎక్కి కల్లు తనివితీరా తాగాడు. తూలుతూ నడుస్నా డు. ఆ స్థితిలో మల్లుదొరను చూసిన సి ఐ డి. నె మ్మదిగా అతని ప్రక్కనచేరి కూపీలు లాగడం మొదలుపెట్టాడు. ఎక్కడినుంచో ఒక తుపాకీ గుండు వచ్చి ఆ సి ఐ డి. ప్రాణాలు తీసింది. మల్లుదొర సీతారామరాజు ముందు హాజరుపర్చబడ్డాడు. మల్లుదొర చేసిన తప్పిదానికి విప్లవకారులనుంచి బహిష్కరిస్తూ సీతారామరాజు ఆదేశించాడు.

అనంతరం మల్లుదొర నడింపల్లి వెళ్ళి, తన ఉంపుడుకత్తె ఇంటవుండగా, పోలీసులకు పట్టుబడ్డాడు. అతనివల్ల విప్లవానికి ఎలాంటి ద్రోహం జరగలేదుగాని, అతని బలహీనతలవల్ల మన్యం విప్లవం కొంత నష్టపోయిందని చెప్పక తప్పదు. అనంతరం మల్లుదొరకు ద్వీపాంతర శిక్ష విధించి, అండమాన్ దీవులకు పంపారు. స్వాతంత్ర్యానంతరం మల్లుదొర పార్లమెంట్‌కు ఎన్నికయ్యాడు. ఆనాటి మన్యం విప్లవ నాయకులలో స్వాతంత్ర్యాన్ని చూసినది మల్లుదొర ఒక్కడే.

ఆయుధాల కొరతను తీర్చడానికి పోలీసుస్టేషన్లపై దాడి చేసినా ప్రయోజనం లేకపోవడంతో సీతారామరాజు 1923 అక్టోబరు 26 న గూడెంలోని సైనిక శిబిరంపైననే దాడి చేశాడు. అయితే ఈ ప్రయత్నంలో ఆయనకు విజయం లభించలేదు. ఒక విప్లవకారుడు చనిపోయాడు. మిగతావారు తప్పుకున్నారు.

పోలీస్ స్టేషన్‌లపైన, సైనిక శిబిరాలపైన దాడులు చేస్తున్నప్పటికి ఆయుధాలు లభ్యం కాకపోవడం, జయపూర్ మహారాజు సహాయంతో విప్లవాన్ని అణచడానికి ప్రభుత్వం నిర్బంధ కాండను తీవ్రతరం చేయడం, వి వకారులు కొందరు సంఘర్షణలలో చనిపోవడంతో వి వాన్ని జయపూర్, పర్లాకిమిడి అరణ్య ప్రాంతాల విస్తరింప చేయాలన్న ఉద్దేశంతో సీతారామరాజు మన్యం ప్రాంతంలో విప్లవ రథసారథ్య బాధ్యతలను గంటందొర, అగ్గిరాజులకు అప్పగించి తాను పర్లాకిమిడి అరణ్యాలకు వెళ్ళాడు.

## భిన్న ధోరణులు

మన్యం ప్రాంతంలో విప్లవ రథసారథ్య బాధ్యతను తాత్కాలికంగా స్వీకరించిన గంటందొర, అగ్గిరాజుల మధ్య సదవగాహన కరువైంది.

"తెల్లవారిని మాత్రమే దండించండి. తెల్లవారికి తోడ్పడుతున్న సోదర దేశస్థులను మాత్రం మందలించి, భయపెట్టి వదలివేయండి" అన్న నీతిని ఆదినుంచీ సీతారామరాజు ఆచరిస్తుండడం ఎంతో అర్థవంతమైనది అది గంటందొరకు పూర్తిగా జీర్ణమైనది. కనుకనే గంటందొర ఆంగ్లేయులకు తోడ్పడుతున్న ముఠాదారులు, మున్సబులు, ఇతర అధికారులు పట్టుబడినప్పటికి, వారిని మందలించి, భయపెట్టి విడిచిపెట్టేవాడు. కాని, ఆంగ్లేయులతో పాటు, ఆంగ్లేయులకు "పట్టుగొమ్మలు"గా వున్న స్వదేశీయుల్ని కూడా అగ్గిరాజు ద్వేషిస్తున్నాడు. కనుక అగ్గిరాజు ప్రభుత్వానికి తోడ్పడుతున్న స్వదేశీయులను హతమార్చే ఆత్మహత్యా సదృశమైన విధానాన్ని అమలు జరుపసాగాడు. దీనితో విప్లవ శక్తులలోనే చీలికలు ప్రారంభమైనవి.

## తీవ్రమైన దమనకాండ

సీతారామరాజుకు ప్రజలలో గల అండదండలను, ఆదరాభిమానాలను దెబ్బ తీయడానికి ప్రభుత్వం ప్రజలపై తన దమనకాండను తీవ్రతరం చేసింది. గ్రామాలపై సామూహిక జరిమానాలు విధించసాగింది. పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమాన్ని అణచిన రూథర్‌ఫర్డ్‌ను మన్యం ప్రాంతానికి అధికారిగా నియమించింది. మన్యం విప్లవాన్ని అణచడానికి అస్సాం రైఫిల్స్ దళాలను-ఘూర్కా దళాలను - రెండింటిని ప్రత్యేకంగా 1924 జనవరి 27న నర్సీపట్నానికి రప్పించింది. వి వానికి సహాయం చేస్తున్న 55 మందిని రూథర్‌ఫ అరెస్టుచేసి, ప్రవాసం పంపాడు మరొక 183 మం పైన అరెస్టు వారంట్లు జారీ చేశాడు. దీనితో ప్రజలలో భయోత్పాత వాతావరణం ఏర్పడింది.

పర్లాకిమిడి ప్రాంతం నుంచి, సీతారామరాజు గూడెం ప్రాంతానికి తిరిగి వచ్చేసరికి, పరిస్థితి చాలా విషమించింది. అగ్గిరాజు చేస్తున్న "దుశ్చర్యలు" గురించి ప్రజలు సీతారామరాజుకు ఫిర్యాదు చేశారు. అటు ప్రభుత్వ నిర్బంధకాండ, ఇటు అగ్గిరాజు చర్యలమధ్య ప్రజలు పడి నలిగిపోయారు.

సీతారామరాజు పరిస్థితిని చక్కదిద్దడానికి తొలి ప్రయత్నం చేశాడు. కాని అప్పటికే పరిస్థితులు చేయి దాటిపోయాయి.

1924 మే 6న మ రు నది వద్ద జరిగిన పోరాటములో అగ్గిరాజు అరె అయ్యాడు. ఆ మరునటి రోజున సీతారామరాజు జమేదారు కంచుమీనన్ అరెస్టు చేశాడు. మేజర్ గుడ్ మన్ సమక్షంలో సీతారామరాజును చెట్టుకు కట్టివేసి, కాల్చి చంపారు. మే 26న పోరాటంలో పండుపడాల్ మృతి చెందాడు. 1924 జూన్ 7వ తేదీన జరిగిన పోరాటంలో గంటందొర మృతి చెందాడు.

ఈ విధంగా 1922 ఆగస్టులో ప్రారంభమైన మన్యం విప్లవం 1924 జూన్‌లో ముగిసింది.

## అపజయం పొందిన రెండు విభిన్న ఉద్యమాలు

రవి అస్తమించని బ్రిటిషు సామ్రాజ్య పునాదులను 1922-1924 మధ్యకాలంలో ఆంధ్రప్రదేశ్‌లోని రెండు ప్రాంతాల ప్రజలు కుదిపివేశారని చెప్పవచ్చు.

గుంటూరు జిల్లా పెదనందిపాడు ప్రాంతంలో పర్వతనేని వీరయ్య చౌదరి నాయకత్వాన సాగిన పన్నుల సహాయ నిరాకరణోద్యమం, మన్యం ప్రాంతంలోని సీతారామరాజు సారథ్యంలో సాగిన సాయుధ విప్లవం రెండూ అపజయం పొందాయి.

ఈ రెండు ఉద్యమాలకు కాంగ్రెసు నాయకత్వం చేయూత నివ్వకపోగా, ఆ రెండు ఉద్యమాలను దెబ్బ తీసే వైఖరినే అవలంబించింది ఈ రెండు ఉద్యమాలకు చరిత్రలో రావలసినంత ప్రాచుర్యం కూడా లభించలేదు ఇది ఆంధ్రజాతి దురదృష్టం.

అయితే గాంధీజీ సూచించిన శాంతియుత సత్యాగ్రహ పోరాటంలోను (పెదనందిపాడు) లెనిన్ సూచించిన సాయుధ విప్లవ పోరాటంలోను (మన్యం విప్లవం) ఆంధ్రులు ఉన్నతస్థాయి నందుకున్నారన్న అంశం ఈ రెండు ఉద్యమాల ద్వారా నిరూపితమైంది.

# తెలంగాణా ప్రాంతంలో ఆంధ్రోద్యమం పుట్టుక

1911 నుంచి 1924 వరకు ఆంధ్రదేశంలో హోమ్ లీగ్ ఉద్యమం, సహాయ నిరాకరణోద్యమం, మన్యం విప్లవం వంటి మహోద్యమాలు చెలరేగగా, అదే కాలములో నైజాం పాలనలో గల తెలంగాణా ప్రాంతంలో ఆంధ్రోద్యమం ప్రారంభమైంది. ఈ ఉద్యమం పుట్టుకకు దారితీసిన పూర్వరంగం ఇది.

నైజాం నవాబు నిరంకుశ పాలనలో నలిగిపోతున్న హైదరాబాద్ సంస్థానంలోని తెలంగాణా, కర్నాటక, మరట్వాడా ప్రాంతాలకు చెందిన విద్యావంతులు 1915 ప్రాంతంలో వివిధ రూపాలలో పునర్వికాస కార్యక్రమాలు చేపట్టారు.

అదే దశలో ఉర్దూ మాతృభాషగా గల ముస్లిములు మాతృభాషలో విద్యాబోధన జరగాలన్న సూత్రం ప్రాతిపదికపై 1915లో ఉస్మానియా యూనివర్శిటీని స్థాపించారు ఇది తెలంగాణా, కర్నాటక, మరాట్వాడా ప్రాంతీయులలో తమతమ మాతృభాషలపట్ల అభిమానం పెంచుకొనడానికి దోహదమిచ్చింది

సాంఘిక సంస్కరణల ద్వారా హరిజనోద్ధరణకు 1915 ప్రాంతంలో రిటైర్డు హైకోర్టు జ రాయ్ బాల ముకుంద్, కలప వ్యాపారి లాలీ మే , హరిజన నాయకుడు భాగ్యరెడ్డివర్మ వంటివారు క సి "మానవ కరుణ సంఘం" స్థాపించారు. అదే సమయంలో నైజాం సంస్థానంలో ప్రాథమిక విద్య, మహిళా విద్య, గ్రంథాలయ ఉద్యమవ్యాప్తికి "సోషల్ సర్వీసు లీగ్" అనేదానిని కేశవరావు కొరాట్కర్, వామన్ నాయక్ స్థాపించారు.

కేశవరావు కొరాట్కర్ ఉపాధ్యక్షుడుగా, రాఘవేంద్ర రామ్‌శర్మ కార్యదర్శిగా హైదరాబాద్ సంస్థానం సంస్కరణల సంఘం ఏర్పడింది.

బ్రిటిష్ ఇండియాలో విస్తరిస్తున్న కాంగ్రెస్ ఉద్యమం ప్రభావం హైదరాబాద్ సంస్థానంపై ప్రసరించిన ఫలితంగా, 1918 లో వామన్ నాయక్ తన అధ్యక్షతన మొదటి కాంగ్రెస్ కమిటీని స్థాపించాడు. రాయచూర్‌కు చెందిన పండిట్ తారానాథ్, కర్నాటక ప్రాంతంలో రాజకీయ చైతన్య దీప్తికి ఎంతగానో కృషి చేశాడు. ఆయన రాయచూర్‌లో జాతీయ ఉన్నత పాఠశాలను స్థాపించాడు. ఆ హైస్కూలు విద్యార్థి రాజబహదూర్ పేరుతో, పండిట్ తారానాథ్ "హిందూ" పత్రికలో నైజాం నవాబును "ఇండియన్ డయర్"గా చిత్రిస్తూ ఒక వ్యాసం ప్రచురించాడు. 1921 లో తారానాథ్‌ను హైదరాబాద్ సంస్థానం నుంచి బహిష్కరించారు.

మహాత్మాగాంధీ, షౌకత్ అలీ లిద్దరూ కలసి సాగించిన ఖిలాఫత్, సహాయనిరాకరణోద్యమాల ప్రభావం హైదరాబాద్ సంస్థానంపై అధికంగా ప్రసరించింది. హిందూ-ముస్లిం ఐక్యత వెల్లివిరిసింది.

నైజాం నవాబు ఎన్ని కట్టుదిట్టాలు చేసినా, గాంధీజీ ప్రభావాన్ని అరికట్టలేకపోయాడు. స్వదేశీ ఉద్యమం వ్యాప్తిచెందింది. ఖద్దరు ధారణ, ఇళ్ళలో రాట్నాలపై నూలు వడకడం అధికమైంది. ఆర్.వి. పిళ్ళై వితంతు సోదరి చర్కాపై నూలువడికే ఫ్యాక్టరీ స్థాపించింది. మహబూబ్‌నగర్‌కు చెందిన నర్సోజీ చిన్న స్పిన్నింగ్ ఫ్యాక్టరీ స్థాపించాడు. భీమారావు, భుజంగరావు లిద్దరూ ఖద్దరు వస్త్రాల అమ్మకం సాగించారు. బద్రుల్ హసన్, జాఫర్ హసన్, బారిష్టర్ కృష్ణన్, పద్మజానాయుడు వంటివారు ఖద్దరు ఉద్యమాన్ని వ్యాపింప జేశారు. బద్రుల్ హసన్ బొంబాయి నుంచి రాట్నాలు తెప్పించి, హైదరాబాద్‌లో ప్రవేశపెట్టాడు. తిలక్ స్వరాజ్య నిధికి బద్రుల్ హసన్ రు. 23 వేలు వసూలు చేశాడు. వరంగల్‌కు చెందిన ఎక్సైయిజ్ కాంట్రా రు నెర్ల నరసింహ రాట్నాలు ఉత్పత్తిచేసే క గారాన్ని వరంగల్‌లో స్థాపించి, అక్కడ తయారైన రాట్నాలను విజయవాడకు ఎగుమతి చేశాడు. మాడపాటి హనుమంతరావు వంటివారు అదే కాలంలో హిందీ భాషాభ్యాస ఉద్యమాన్ని నిర్వహించారు.

పూనా, బొంబాయి, అలీఘర్ వంటి చోట్ల విద్యనభ్యసిస్తున్న డాక్టరు జయసూర్య, మీర్ మహ్మద్ హుస్సేన్ (కరీంనగర్), అక్బర్ అలీఖాన్, మఖ్బల్ అలీ, సయ్యద్ మహ్మద్ అన్సారీ వంటివారు తమ చదువుకు స్వస్తి చెప్పారు. మీర్ మహ్మద్ హుస్సేన్ నెల్లూరు జైలులో ఆరు మాసాలపాటు కారాగారవాస శిక్ష అనుభవించాడు.

ఖిలాఫత్ ఉద్యమానికి మద్దతుగా 1920 మే 5 న హైదరాబాద్‌లో హర్తాళ్ జరిపారు. హిందూ-ముస్లిం ఐక్యతకు అదొక ప్రత్యక్ష నిదర్శనం. మే 17 వ తేదీన 15 వేలమంది హాజరైన బహిరంగసభలో హిందూముస్లిం ప్రముఖులు ప్రసంగించారు.

## ఆంధ్ర జనసంఘం ఏర్పాటు

ఆ రోజులలో హైదరాబాద్ సంస్థానంలో సాగుతున్న జాతీయోద్యమంలో తెలంగాణావారికి, తెలుగు భాషకు తగిన గుర్తింపు లేదు. మహారాష్ట్రీల ప్రాబల్యం హెచ్చుగా వుంది.

1921 నవంబర్ 11, 12 తేదీలలో హైదరాబాదులో మహర్షి కార్వే అధ్యక్షతన నైజాం సంస్థాన సాంఘిక సంస్కరణల మహాసభ జరిగింది. ఆ మహాసభలో ప్రసంగాలు ఇంగ్లీషు, ఉర్దూ, మరాఠీ భాషలలో సాగిపోతున్నాయి. ఆ మహాసభలో తెలుగు ప్రతినిధి అయిన ఆలంపల్లి వెంకటరామారావు తెలుగులో ప్రసంగించడానికి ప్రయత్నించినపుడు, మహారాష్ట్రీలు గేలిచేశారు. తెలుగువారిని, తెలుగు భాషను అవమానపర్చారు. తెలంగాణాలో ఆంధ్రోద్యమ పుట్టుకకు అదే నాంది అయింది.

ఆ మహాసభకు హాజరైన తెలుగు ప్రతినిధులంతా ఆ రోజు రాత్రి ప్రత్యేకంగా సమావేశమై "ఆంధ్ర జనసంఘాన్ని" స్థాపిస్తూ నిర్ణయించారు. మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణారావు, ఎమ్. నరసింగరావు, ఆదిరాజు వీరభద్రరావు మున్నగువారు "ఆంధ్ర జనసంఘం" స్థాపకులలో ప్రముఖులు.

కేవలం 12 మంది సభ్యులతో ప్రారంభమైన "ఆంధ్ర జనసంఘం" సభ్యత్వం అనతికాలంలోనే 100 కి పైగా పెరిగింది. 1922 ఫిబ్రవరి 14వ తేదీన కొండా వెంకటరంగారెడ్డి అధ్యక్షతన "ఆంధ్ర జనసంఘం" మొదటి సమావేశం జరిగింది. మాడపాటి హనుమంతరావు కార్యదర్శిగా ఎన్నికయ్యారు. నాటి నుంచి "ఆంధ్ర పితామహ"గా పేరొందిన మాడపాటి హనుమంతరావు తెలంగాణా ప్రజల సామాజిక, సాంస్కృతిక అభ్యున్నతి సాధనకు ధృవతారగా వెలుగొందాడు.

కొమర్రాజు లక్ష్మణరావు నెలకొల్పిన ఆదర్శాన్ని పాటిస్తూ, ముందుకు సాగాలని ఆంధ్ర జనసంఘం నిర్ణయించింది. మొదట ఆసంస్థ తెలంగాణా ప్రాంతంలోని తెలుగు ప్రజల సామాజిక, సాంస్కృతిక అభ్యున్నతికి కృషి చేయడం ద్వారా చైతన్యవ్యాప్తికి దోహదం చేసింది. తెలంగాణాలో తెలుగువారి రాజకీయోద్యమానికి అదే పునాది అయింది.

తెలుగు గ్రంథాలయాలు, పఠనాకేంద్రాలు, ప్రయివేటు పాఠశాలలు స్థాపించడం, తెలుగు పండితులను సత్కరించడం, తెలుగుజాతి చరిత్రను వెలుగులోకి తెచ్చే గ్రంథాలు ప్రచురించడం వంటి కార్యక్రమాలను ఆంధ్ర జనసంఘం చేపట్టింది.

"నైజాం ఆంధ్రరాష్ట్ర ప్రశంస" అన్న చారిత్రక గ్రంథాన్ని, "నిజాం సంస్థాన ఆంధ్రులు-వారి అభివృద్ధికి మార్గాలు" వంటి వాటిని ఆ సంస్థ ప్రచురించింది.

తెలంగాణా ప్రాంతంలోని వివిధ ఆంధ్ర సంఘాల కృషి సమన్వయపరచడానికి "ఆంధ్ర జనకేంద్ర సంఘం" ఏర్పడింది. ఆ కేంద్ర సంఘం వారు "వెట్టి చాకిరి-వర్తక సంఘం" అన్న కరపత్రాన్ని ప్రచురించింది, వర్తకుల్ని సంఘటిత పర్చింది.

ఆ సంస్థ కార్యక్రమాల్ని ప్రచారం చేయడానికి నీలగిరి పత్రిక (నల్లగొండ) తెలుగు పత్రిక (వరంగల్లు) గోల్కొండ పత్రిక (హైదరాబాద్) ప్రారంభించబడ్డాయి.

ఆ సంఘం మొదటి మూడు మహాసభలు 1923 హైదరాబాద్, 1924 నల్లగొండ, 1925 మధిరలో జరిగాయి.

1925 నాటికి ఆంధ్రజన సంఘం, దాని అనుబంధ ఉద్యమంగా గ్రంథాలయోద్యమం అమితమైన రీతిలో పెంపొందాయి. దాన్ని చూసి భయపడిన నైజాం నవాబు, అనుమతి పొందకుండా ప్రారంభించారన్న పేరుతో అనేక గ్రంథాలయాలను మూసివేస్తూ ఉత్తర్వులు జారీ చేశాడు.

1928 లో సూర్యాపేటలో ఆంధ్రజన సంఘం మహాసభతోపాటు జరగవలసిన గ్రంథాలయ ద్వితీయ మహాసభను నైజాం ప్రభుత్వం నిషేధించింది. ఆహ్వాన సంఘంవారు కోర్టుకు వెళ్ళి మహాసభ నిర్వహణకు అనుమతిని పొందవలసి వచ్చింది.

1926 లో ఆంధ్రజన సంఘం మహిళా విద్యా వ్యాప్తికి ఆంధ్రబాలికోన్నత పాఠశాలను ప్రారంభించారు. ఈ స్కూలులో బోధనా భాషగా తెలుగును ప్రవేశపెట్టారు. ఉస్మానియా యూనివర్శిటీ మొదట దీన్ని గుర్తించడానికి నిరాకరించింది. అయితే మహర్షి కార్వే ఇన్‌స్టిట్యూట్ వారు ఈ పాఠశాల విద్యార్థులకు మెట్రిక్ పరీక్షలు నిర్వహించారు.

ఈ విధంగా తెలుగు భాషకు జరిగిన అవమానం తెలంగాణాలో ఆంధ్రోద్యమ పుట్టుకకు కారణమై, అది వర్ధిల్లడానికి దారి తీసింది.

# ఆంధ్రదేశంలో స్తబ్ధత

సహాయ నిరాకరణోద్యమాన్ని ఉపసంహరించిన పిమ్మట, కాంగ్రెసు సంఘం శాసనోల్లంఘనోద్యమం ప్రారంభించడానికి దేశంలో పరిస్థితులు అనుకూలంగా వున్నవా లేదా అని పరిశీలించడానికి ఒక విచారణ సంఘాన్ని నియమించింది ఆ సంఘం 1922 ఆగస్టున గుంటూరు వచ్చింది.

మద్రాసునుంచి ఆంధ్రదేశానికి వచ్చిన ఆ సంఘానికి నెల్లూరు, చీరాల, బాపట్ల, తెనాలి మున్నగు చోట్ల అఖండ స్వాగతం లభించింది.

గుంటూరులో ఆ సంఘ సభ్యులకు ఘనస్వాగత మివ్వడానికి పెద్ద ఎత్తున ఏర్పాట్లు జరిగినా, ప్రభుత్వం 144 సెక్షన్ విధించింది, అందుకు ప్రతిబంధకాలు కల్పించింది. ఈ సందర్భంలో ఉన్నవ లక్ష్మీనారాయణ, దండు నారాయణరాజు, నరసింహాచారి వంటి నాయకులను మినహా 250 మందిని అరెస్టు చేశారు. వీరితో కాకుమాను లక్ష్మయ్య, కొత్రగడ్డ రాఘురామయ్య, పెదర్ల వెంకటసుబ్బయ్య మున్నగు వారున్నారు. ప్రభుత్వం ఎంతటి నిర్బంధ కాండకు ఒడిగట్టినా స్వాగత కార్యక్రమాలు జయప్రదమైనవి. మునిసిపల్ కౌన్సిలర్ ఎన్. వి. ఎల్. నరసింహారావు పౌర సన్మాన ప్రసంగం చదివి, ప్రభుత్వ నిషేధాన్ని ధిక్కరించాడు. విజయవాడ మునిసిపల్ కౌన్సిల్ ఆ సంఘానికి పౌర సన్మానం జరిపింది. కాంగ్రెస్ పత్రిక సంపాదకులు మద్దూరి అన్నపూర్ణయ్య, కె. రామచంద్రరావులను అరెస్టు చేయడం ద్వారా ప్రభుత్వం తన అక్కసును తీర్చుకుంది.

## నాగపూర్‌లో జెండా సత్యాగ్రహం

1923 లో నాగపూర్‌లో జమన్‌లాల్ బజాజ్ నాయకత్వాన జరిగిన జెండా సత్యాగ్రహంలో పాల్గొనడానికి ఆంధ్రదేశంనుంచి మొత్తం 40 మంది సత్యాగ్రహులు 5 దళాలుగా వెళ్ళి, అందులో పాల్గొన్నారు.

కృష్ణా, గోదావరి, గుంటూరు, నెల్లూరు, శ్రీకాకుళం జిల్లాలనుంచి హాజరయిన సత్యాగ్రహ దళాలు నాగపూర్ వెళ్ళాయి.

నాళం చిన్నభీమరాజు, ఏడిద సత్యనారాయణ, బంకా అచ్చయ్య పాత్రుడు, బులుసు యజ్ఞన్న, బల్లేపల్లి కామేశ్వరరావు, పోతిన గణపతిరావు, మతం బాలసుబ్రహ్మణ్యగుప్తా మున్నగువారు నాగపూర్ సత్యాగ్రహంలో పాల్గొన్న ప్రముఖులు.

## స్వరాజ్యపార్టీ అవతరణ

మహాత్మాగాంధీ హఠాత్తుగా సహాయనిరాకరణోద్యమాన్ని ఉపసంహరించడం, చీరాల పేరాల పోరాటం, పల్నాడు పుల్లరి సత్యాగ్రహం, పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం, మన్యం విప్లవంమున్నగు ఉద్యమాలు వరుసగా విఫలం కావటంతో, ఆంధ్రదేశంలో నిరాశ, నిస్పృహలు అలుముకొని, కొంత కాలం పాటు రాజకీయ స్తబ్ధత ఏర్పడింది.

మహాత్మాగాంధీ ధోరణిలో విరక్తి చెందిన హకీం అంజల్‌ఖాన్, పండిట్ మోతీలాల్ నెహూౄ, విఠల్‌భాయ్ పటేల్, సి. ఆర్. దాసు వంటి నాయకులు శాసనసభలలో ప్రవేశించి, లోపలనుంచి బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించాలన్న ఉద్దేశంతో 1923 లో స్వరాజ్య పార్టీని స్థాపించారు. రాజగోపాలాచారి, పట్టాభి సీతారామయ్య, అన్సారీ, కస్తూరిరంగ అయ్యంగార్ వంటివారు దాన్ని వ్యతిరేకించారు. ఆ విధంగా కాంగ్రెస్ ప్రోఛేంజర్సు - నోఛేంజర్సు అనే రెండు వర్గాలుగా చీలిపోయింది.

నో ఛేంజర్స్ వర్గానికి పెట్టని కోటగా వున్న ఆంధ్ర దేశంలో సి. ఆర్. దాసు పర్యటన జరపడంతో పరిస్థితి తలక్రిందులైంది. అయ్యదేవర కాళేశ్వరరావు, బి. వెంకటరత్నం, వి. రామదాసుపంతులు, కె. వి. ఆర్. స్వామి వంటి వారితో ఆంధ్రస్వరాజ్య పార్టీ ఏర్పడింది. 1923 లో జరిగిన ఎన్నికలలో బి. వెంకటరత్నం, పి. ఆంజనేయులు, పి. వి. వెంకటపతిరాజులు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు, వి. రామదాసుపంతులు సెంట్రల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు స్వరాజ్యపార్టీ ప్రముఖులుగా ఎన్నికయ్యారు.

1924 లో ప్రో ఛేంజర్స్, నో ఛేంజర్స్‌కు మధ్య రాజీ కుదిరింది. లెజి టివ్ కౌన్సిళ్ళలో ప్రో ఛేంజర్స్ - స్వరాజ్యపా వారు - తమ కార్యక్రమాలు కొనసాగించాలని, - గ్రెస్ నో ఛేంజర్స్ ఖద్దరు ప్రచారంవంటి నిర్మాణ కార్యక్రమాలను ఉధృతం చేయాలని నిర్ణయించారు.

## చరఖా సంఘం

1921 లో ఆంధ్రదేశంలోను, మద్రాసులోను మహాత్మాగాంధీ జరిపిన పర్యటనలో ఖాదీనిధికి వసూలయిన రు. 2,53,322 ల మొత్తంలోను రు. 1 86,600 లు ఆంధ్రదేశంలోనే వసూలయింది. అలాగే 1922 జూన్ – జూలైలలో ఖద్దరు విచారణ సంఘం నివేదికలో "ఖద్దరు ఉత్పత్తి విషయంలో, పంజాబ్‌ను మినహాయిస్తే, ఆంధ్రదేశం మొత్తం దేశంలోని రాష్ట్రాలన్నింటికి తలమానికంగా వుంది." అని పేర్కొన్నారు. అయితే, అఖిలభారత చరఖాసంఘం అను బంధశాఖ ఆంధ్రలో 1925 లో గానీ ఏర్పడలేదు. రు 1,07,139 ల మూలధనంతో ఆ శాఖను ఏర్పాటు చేశారు.

## ఆంధ్రదేశంలో మొదటిసారిగా సంపూర్ణ స్వరాజ్య నినాదం

అల్లూరి సీతారామరాజు సారధ్యంలో మన్యం విప్లవం అణచివేయబడిన వెంటనే బులుసు సాంబమూర్తి, మద్దూరి అన్నపూర్ణయ్య, డాక్టరు సుబ్రహ్మణ్యం వంటి ప్రముఖులు కాంగ్రెస్ అధివేశ ప్రతిపకి పరిమితమైన స్వరాజ్యంతో తృప్తిచెందక, సంపూ స్వరాజ్య సాధనకు ఉద్యమించాలని, తదనుగుణంగా కాంగ్రెస్ నిబంధనావళిని సవరించాలని కోరుతూ 1924 సెప్టెంబరులో జరిగిన గంజాం జిల్లా మహాసభలో ప్రవేశపెట్టిన తీర్మానం ఆమోదించబడింది. ఈ తీర్మానాన్ని అయ్యదేవర కాళేశ్వరరావు, హరిసర్వోత్తమరావు వంటి నాయకులు హర్షిస్తూ ప్రకటనలు జారీ చేశారు.

1925 లో జరిగిన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘ సమావేశంలో బులుసు సాంబమూర్తి సంపూర్ణస్వరాజ్య తీర్మానాన్ని ప్రతిపాదించడంతో టంగుటూరి ప్రకాశం, కొండా వెంకటప్పయ్య, డాక్టరు పట్టాభి సీతారామయ్య, దండు నారాయణరాజు, కాశీనాధుని నాగేశ్వరరావు వంటివారు వ్యతిరేకించారు.

అయితే, బులుసు సాంబమూర్తి, డాక్టరు బి సుబ్రహ్మణ్యం, మొసలికంటి తిరుమలరావు, క్రొవ్విడి లింగరాజు, తెన్నేటి విశ్వనాథం సభ్యులుగా సంపూర్ణ స్వరాజ్యం కోసం ఆందోళన చేయడానికి ఒక కమిటీ ఏర్పడింది.

## రాష్ట్రంలో ప్రకాశం పర్యటన కాంగ్రెస్‌కు అఖండ విజయం

1926 లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు టంగుటూరి ప్రకాశం, ఆంధ్ర ప్రాంతంలో విస్తృతంగా పర్యటించి కాంగ్రెస్ ఎన్నికల ప్రచారం సాగించారు,

ఆ ఎన్నికలలో ఆంధ్రదేశంలోనే కాక, మద్రాసు రాష్ట్ర మంతటా కాంగ్రెస్‌కు అఖండ విజయం చేకూరింది.

లెజిస్లేటివ్ కౌన్సిల్ లో మెజారిటీ లభించినప్పటికీ, కాంగ్రెస్ మంత్రివర్గాన్ని ఏర్పాటుచేయడానికి నిరాకరించింది.

డాక్టర్ పి. సుబ్బరాయన్ నాయకత్వంలో ఇండిపెండెంట్ మంత్రివర్గం ఏర్పడింది.

# సోషలిస్టు శక్తుల పుట్టుక - వర్గ సంఘాల అవతరణ

1917 లో రష్యాలో లెనిన్ నాయకత్వాన సోషలిస్టు విప్లవం విజయవంతం కావడంతో ప్రపంచ వ్యాప్తంగా చరిత్రలో పెద్ద మలుపు వచ్చింది. సోవియట్ విప్లవం యొక్క ప్రభావం భారతదేశ రాజకీయ రంగంలో పైతం ప్రస్ఫుటం కాజొచ్చింది.

1920 లో ఎన్. ఎమ్. జోషి, లాలాలజపతిరాయ్, జోసెఫ్ బాప్టిస్టా వంటి నాయకుల కృషి ఫలితంగా కార్మికవర్గ సంస్థ - అఖిల భారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ ఏర్పడింది. ఈ కార్మికోద్యమానికి బాల గంగాధరతిలక్ ఆశీస్సులు వున్నాయి. అయితే, కార్మికమహాసభ జరగడానికి పూర్వమే ఆయన కన్ను మూశాడు. అనంతరం వి. వి. గిరి, సి. ఆర్. దాసు వంటి జాతీయ నాయకులు ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ కార్యకలాపాలలో ప్రముఖ పాత్ర వహించారు.

సహాయ నిరాకరణోద్యమాన్ని గాంధీజీ ఉపసంహరించడంతో, నిరాశచెందిన యువకులు అతివాదం వైపు మొగ్గి, సోషలిస్టు, కమ్యూనిస్టు భావాలు అలవర్చుకో సాగారు. ఎస్. ఏ. డాంగే 1923 లో 'సోషలిస్టు'వార పత్రిక ప్రారంభించి, సోషలిస్టు భావాలను ప్రచారం చేయడం మొదలు పెట్టాడు.

## రైతు ఉద్యమం పుట్టుక

దేశంలో రైతు ఉద్యమానికి నాందీ ప్రస్తావన చేసిన ఘనత తెలుగు వారిదే. 1923 లో ఆచార్య ఎన్. జి. రంగా నిడుబ్రోలులో గుంటూరు జిల్లా వ్యవసాయ కార్మికుల మహాసభను జరిపారు. దేశంలో మొట్టమొదటి వ్యవసాయ కార్మిక మహాసభ ఇదే. అనంతరం ఆచార్య రంగా, మాగంటి బాపినీడు సహకారంతో 1929లో ఆంధ్రరాష్ట్ర రైతు సంఘాన్ని స్థాపించారు.

## కార్మిక సమ్మెలు

అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ నాయకత్వంలో 1928 లో దక్షిణ భారత రైల్వే సమ్మె, బెంగాల్ నాగపూర్ రైల్వే సమ్మె, బొంబాయి జౌళి కార్మికుల సమ్మె జరిగాయి. కార్మిక సంఘాల కార్యకలాపాలను దెబ్బతీయడానికి భారత ప్రభుత్వం 1929 లో ప్రజా భద్రతా చట్టాన్ని అమలులోకి తీసుకొచ్చింది.

## టెర్రరిస్టు గ్రూపులు

1924-29 మధ్యకాలంలో దేశంలో టెర్రరిస్టు గ్రూపులు ఏర్పడి, సాయుధ చర్యల ద్వారా బ్రిటిష్ పాలకులను పారద్రోలాలని సంకల్పించాయి.

సోషలిస్టు, కమ్యూనిస్టు భావాలతో ప్రేరేపితులైన తీవ్రవాద రాజకీయ కార్యకర్తలను, వర్గ సంఘాల నిర్మాణాన్ని మొగ్గలోనే తుంచివేయాలన్న దుష్టతలంపుతో, ప్రభుత్వం కాన్పూరు, మీరట్, లాహోర్ కుట్ర కేసులను బనాయించింది. ఇదే దశలో జైళ్ళలో రాజకీయ ఖైదీలను నరకయాతనలు పెడుతున్న ప్రభుత్వ పాశవిక ధోరణికి నిరసనగా జైలులో ఖైదీగా వుంటూ నిరాహారదీక్ష ప్రారంభించిన లాహోరు కుట్ర కేసు ముద్దాయి జతీన్‌దాసు 64 రోజుల పాటు నిరసనవ్రతం సాగించి, ఆత్మార్పణ కావించాడు.

## విద్యార్థుల సమ్మెలు

రాజకీయంగా విద్యార్థులు చైతన్యవంతులు కావడంతో, దేశంలో విద్యార్థి ఉద్యమానికి ఇదేకాలంలో పునాదులు పడినవి. బొంబాయి, బెంగాల్ రాష్ట్రాలలో విద్యార్థుల సమ్మెలు జరిగాయి.

## అఖిలండియా ఇండిపెండెన్సు లీగ్

సుభాసు చంద్రబోస్, బులుసు సాంబమూర్తి వంటి వారితో కలిసి, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ 1928 లో ఆలిండియా ఇండిపెండెన్సు లీగ్‌ను స్థాపించారు. ఈ సంఘం తన కార్యక్రమంలో సంపూర్ణ స్వాతంత్ర్య సాధనతోపాటు, స్వదేశీ సంస్థానాల రద్దు, జమీందారీల రద్దు, మున్నగు అంశాలను కూడా చేర్చింది. కొత్తగా అవతరిస్తున్న విద్యార్థి, యువజన సంఘాలతో కలిసి, ఈ ఇండిపెండెన్సు లీగ్ సైమన్ కమిషన్ బహిష్కరణోద్యమ నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించింది.

## స్వదేశ సంస్థానాధీశుల సంఘం

జాతీయోద్యమంలో అతివాద వర్గాలవారు స్వదేశ సంస్థానాల రద్దును కోరడంతో, తమ ఉనికిని పరి

రక్షించుకొనడానికి దేశంలోని స్వదేశ సంస్థానాధీశు లంతా కలిసి, "ఇండియన్ చాంబర్ ఆఫ్ ప్రిన్సెస్" అనే సంస్థను స్థాపించుకొన్నారు.

### మత సంస్థల అపశ్రుతులు

ఒక వైపున హిందూ మహాసభ, రెండోవైపున ముస్లింలీగ్ దేశంలో మత సామరస్యాన్ని పూర్తిగా కలుషితం చేసే కార్యక్రమాలు చేపట్టాయి. ఖిలాఫత్ ఉద్యమం విషయంలో మహాత్మాగాంధీ సరిగా ప్రవర్తించలేదన్న నిరసనభావం ముస్లిం ప్రజలలో వేరూనింది. ఫలితంగా ముస్లిములు జాతీయోద్యమానికి దూరం కాజొచ్చారు. కొన్నిచోట్ల మతకలహాలు చెలరేగాయి.

### బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ఎత్తు

దేశంలో రాజకీయ పరిస్థితి ఇలా గందరగోళంగా వున్న తరుణంలో, బ్రిటన్‌లోని కన్సర్వేటివ్ ప్రభుత్వం 1927 నవంబరులో భారతదేశానికి స్వరాజ్యం ప్రదానం చేయవచ్చునా లేదా అన్న అంశం పరిశీలించే నిమిత్తం, నిర్ణీతగడువుకంటే సంవత్సరం ముందుగా. సైమన్ కమిషన్‌ను పంపించాలని నిర్ణయించింది.

1919 భారత ప్రభుత్వం చట్టం ప్రకారం, పదేళ్ళ తరవాత, అంటే 1929 లో ఇలాంటి కమిషన్‌ను నియమించవలసి వుంది. సైమన్ కమిషన్ సభ్యులందరూ బ్రిటిష్ వాళ్ళే. వాళ్ళలో భారతీయుడు ఒక్కడూ లేడు. అదీకాక, స్వరాజ్యం యివ్వవచ్చునా. లేదా అన్న అంశం అప్రస్తుతమైనదిగా దేశంలో రాజకీయంగా చైతన్యవంతులైన అన్ని వర్గాలవారు గట్టిగా అభిప్రాయపడ్డారు. అందుకే, ముస్లింలీగ్‌తో సహా దేశంలోని రాజకీయ సంస్థలన్నీ సైమన్ కమిషన్‌ను బహిష్కరించాలని నిర్ణయించాయి.

### సైమన్ బహిష్కరణలో పెల్లుబికిన బ్రిటిషు వ్యతిరేకత

సైమన్ కమిషన్ రాకకు ముందు, 1927 లో మద్రాసులో జరిగిన అఖిలభారత కాంగ్రెసు సభ సైమన్ కమిషన్‌ను బహిష్కరించాలని, సంపూర్ణ స్వాతంత్ర్య సాధన కాంగ్రెసు లక్ష్యమని, కాంగ్రెసు సంస్థను సామ్రాజ్య వ్యతిరేక అంతర్జాతీయ లీగ్‌కు అనుబంధించాలని తీర్మానించింది.

భారతదేశంలో 1928 ఫిబ్రవరి 3 న సైమన్ కమిషన్ భారతదేశంలో అడుగుపెట్టింది. అదే రోజున ఆ కమిషన్ రాకకు నిరసనగా దేశవ్యాప్తంగా హర్తాళ్ళు, ప్రదర్శనలు, బహిరంగసభలు జరిగాయి. ఢిల్లీ, లక్నో, కలకత్తా, మద్రాసు, పాట్నావంటి నగరాలలో అసమ్మతి ప్రదర్శనలు పెద్ద ఎత్తున జరిగాయి.

మద్రాసు నగరంలో ఫిబ్రవరి 3 న కాశీనాధుని నాగేశ్వరరావు అధ్యక్షతన జరిగిన సభలో, భారత దేశాన్ని శాశ్వతంగా బ్రిటిష్ దాస్యంలో వుంచడానికి సైమన్ కమిషన్ వచ్చినదని, కనుక దాన్ని అంతా బహిష్కరించాలని ప్రజలకు విజ్ఞప్తి చేశారు. కాశీనాధుని నాగేశ్వరరావు తెలుగులోనే ప్రసంగించారు. గాడిచర్ల హరిసర్వోత్తమరావు, సామి వెంకటాచలం చెట్టికూడా ప్రసంగించారు.

ఆంధ్ర తమిళ కాంగ్రెస్ సంఘాల సంయుక్త ఆధ్వర్యంలో ఎన్. సత్యమూర్తి అధ్యక్షతన సైమన్ కమిషన్ బహిష్కరణ సంఘం ఏర్పడింది. ఫిబ్రవరి 3 న విద్యార్థులు, ఉపాధ్యాయులు సమ్మె చేయాలని, న్యాయవాదులు కోర్టులకు హాజరు కారాదని, ట్రామ్ కారులు, బస్సులు, టాక్సీలు, ఎడ్లబళ్ళు, రిక్షాలు, హోటళ్ళు, షాపులు సర్వం బంద్ కావాలని బహిష్కరణ సంఘం విజ్ఞప్తి చేసింది.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు టంగుటూరి ప్రకాశం నాయకత్వంలో మద్రాసులో హర్తాళ్ కార్యక్రమం పూర్తిగా జయప్రదమయింది. ఆ కార్యక్రమాన్ని జయప్రదం చేయడంలో శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతి నాయకత్వంలో మహిళలు కృషి చేశారు. కృష్ణాజిల్లాకు చెందిన గొట్టిపాటి బ్రహ్మయ్య, కాట్రగడ్డ మధుసూదనరావు, కాట్రగడ్డ వెంకట నారాయణ రావు మున్నగువారు మద్రాసులో జరిగిన సైమన్ కమిషన్ బహిష్కరణోద్యమంలో పాల్గొన్నారు.

### నల్లజెండాల ఊరేగింపులు

"సైమన్ గో బ్యాక్", "బ్రిటిష్ సామ్రాజ్య వాదం నశించాలి" అన్న నినాదాలు 1928 ఫిబ్రవరి 28 న మద్రాసు నగరంలో మారోమ్రగాయి. ఆంధ్ర, తమిళ రాష్ట్రాల కాంగ్రెసు సంఘాల సంయుక్త ఆధ్వర్యంలో శ్రీనివాస అయ్యంగార్, వరదరాజులు

నాయుడు, సత్యమూర్తి, షఫీ మహ్మద్, కాశీనాథుని నాగేశ్వరరావు, పున్నయ్యశాస్త్రి, అయ్యదేవర కాళేశ్వరరావు, యామిని పూర్ణతిలకం వంటివారి నాయకత్వంలో నల్లజెండాల వూరేగింపు నేపియర్ పార్కునుంచి బయలుదేరింది. 'స్వరాజ్య' పత్రిక కార్యాలయంనుంచి టంగుటూరి ప్రకాశం, కొండా వెంకటప్పయ్య, పట్టాభి సీతారామయ్య, బి. వెంకటరత్నం, మద్దూరి అన్నపూర్ణయ్య, గద్దె రంగయ్యనాయుడు, ఏ. గోవిందాచార్యుల నాయకత్వాన వచ్చిన మరో వూరేగింపు, నేపియర్ పార్కునుంచి బయలుదేరిన వూరేగింపుతో కలిసిపోయింది.

మద్రాసు హర్తాళ్ సందర్భంలో రిజర్వుపోలీసులు కాల్పులు జరిపారు. ఆ కాల్పులలో ఒక వ్యక్తి మృతిచెందాడు. కాంగ్రెస్ వాదులు ఎవరూ మృతిచెందిన ఆ వ్యక్తి శవం వద్దకు వెళ్ళడానికి వీలులేకుండా అటకాయించారు. టంగుటూరి ప్రకాశం పోలీసులను ధిక్కరిస్తూ "చనిపోయిన మా కామ్రేడ్ శవాన్ని మేము చూడాలి. మేము ముందుకేవెళ్ళుతాం. కావాలంటే పేల్చుకో....కాల్చుకో" అంటూ ఆయన, తన చొక్కా బొత్తాలు విప్పి, తన గుండెను పోలీసు తుపాకి గుళ్ళకు ఎదురొడ్డుతూ ముందుకు సాగాడు. నిర్ఘాంతపోయిన పోలీసులు తప్పుకున్నారు. ప్రకాశం ముందుకు సాగిపోయాడు. నాటి నుంచే ప్రకాశం 'ఆంధ్రకేసరి'గా పేరుపొందాడు.

## ఆంధ్రలో సైమన్ కమిషన్ బహిష్కరణోద్యమం

విజయవాడలో సమావేశమైన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘం సైమన్ కమిషన్‌ను బహిష్కరించాలని తీర్మానించిన పిమ్మట, బులుసు సాంబమూర్తి గుంటూరు, తెనాలి, పట్టణాలకు వెళ్ళి సైమన్ కమిషన్‌ను బహిష్కరించాలని ప్రచారం చేయడంతోపాటు, ఇండిపెండెన్సు లీగ్‌లో సభ్యులను చేర్పించారు. అనంతరం ఆయన ఫిబ్రవరి 7న కాకినాడకు బయలుదేరి, రైలు ఎక్కుతుండగా అరెస్టుచేసి, బందరు సబ్‌జైలుకు పంపించారు, ఆయనకు సంవత్సరం కఠిన కారాగార వాసశిక్ష విధించారు. రాజమండ్రి సెంట్రల్ జైలునుంచి అర్ధరాత్రి సమయంలో రహస్యంగా ఆయనను బళ్ళారి సెంట్రల్ జైలుకు తరలించారు. జైలునుంచి రైల్వేస్టేషన్‌కు రెండుమైళ్ళ, తన సామానును తానే మోస్తూ ఆయన కాలినడకను చేరవలసి వచ్చింది. ఆయన అరెస్టుపై ఆంధ్రదేశంలో తీవ్ర నిరసన వ్యక్తమయింది.

కొండా వెంకటప్పయ్య, పట్టాభిసీతారామయ్య, ప్రకాశం, దండునారాయణరాజు, వెన్నేటి సత్యనారాయణ, మున్నగువారు పట్టుదలగా ప్రచారంచేసి, ఆంధ్రలో సైమన్ కమిషన్ బహిష్కరణోద్యమాన్ని జయప్రదం చేశారు. ఆ రోజున పాఠశాలలను బహిష్కరించి, నల్ల జెండాల ప్రదర్శనలలో పాల్గొనవలసిందిగా వారు విద్యార్థులకు విజ్ఞప్తి చేశారు.

ఈ సందర్భంలో ప్రభుత్వం కొండా వెంకటప్పయ్య, పట్టాభి సీతారామయ్య, కె. వి. ఆర్. స్వామి, జి. వి. పున్నయ్యశాస్త్రి, కళా వెంకట్రావు ప్రభృతులను అరెస్టుచేసి. తరవాత విడుదల చేసింది.

తిరుపతి, కర్నూలు, ఏలూరు, విజయవాడ, శ్రీకాకుళం, విజయనగరం, గుంటూరు వంటి మున్సిపాలిటీలు సైమన్ కమిషన్‌ను బహిష్కరించాలని తీర్మానించాయి. పున్నయ్యశాస్త్రి కృషి ఫలితంగా తెనాలిలో బహిష్కరణోద్యమం పూర్తిగా విజయవంతమైంది. సైమన్ కమిషన్ ఒంగోలు, గుంటూరు సందర్శించినప్పుడు హర్తాళ్ జరగడమేకాక, నల్లజెండాల ప్రదర్శనలు నిర్వహించబడ్డాయి.

సైమన్ కమిషన్ గుంటూరు వెడుతూ, విజయవాడ రైల్వే స్టేషన్‌లో ఆగినప్పుడు, మున్సిపల్ ఛైర్మన్ అయ్యదేవర కాళేశ్వరరావు తన దఫేదారు ద్వారా మున్సిపాలిటీ ఆమోదించిన బహిష్కరణ తీర్మానంతోపాటు, "సైమన్ కమిషన్ గో బేక్" అని రాసిన కాగితం కూడా జతపర్చి, సీల్డు కవరులో సైమన్ కమిషన్‌కు అందజేశారు. ఈ విధంగా 1928 సంవత్సరమంతా సైమన్ కమిషన్ వ్యతిరేక ఉద్యమంతో గడిచిపోయింది.

## ఆంధ్ర దేశంపట్ల సైమన్ కమిషన్ తడువుమంట

ఆంధ్ర దేశంలో సైమన్ కమిషన్‌కు ఎదురైన నిరసన ప్రదర్శనల కారణంగా, ఆ కమిషన్ తన నివేదికలో ఆంధ్రరాష్ట్ర స్థాపన విషయం ప్రస్తావించకుండా, ఒరిస్సా, సింధురాష్ట్రాల ఏర్పాటుకు సిఫారసు

చేసింది. పైగా, ఆంధ్ర ప్రాంతాల్ని కొన్నింటిని ఒరిస్సాలో చేర్చింది కూడా. ఆ విధంగా ఆంధ్రదేశంపై సైమన్ కమిషన్ తన కడుపుమంటను తీర్చుకొన్నది.

1928 డిసెంబరులో కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ మహాసభ ముందు, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘం సమావేశమై కేవలం అధినివేశ ప్రతిపత్తి కోరే నెహ్రూ కమిటీ నివేదికను పరిశీలించి, సంపూర్ణ స్వాతంత్ర్య సాధన కాంగ్రెసు లక్ష్యం కావాలని తీర్మానించింది. 1928 డిసెంబరు 19 న బులుసు సాంబమూర్తి అధ్యక్షులుగా, డా॥ బ్రహ్మజోశ్యుల సుబ్రహ్మణ్యం కార్యదర్శిగా, తెన్నేటి విశ్వనాథం కోశాధికారిగా ఆంధ్ర రాష్ట్ర ఇండిపెండెన్సు లీగ్ ఏర్పడింది.

కలకత్తా కాంగ్రెస్ మహాసభలో నెహ్రూ కమిటీ నివేదికను తగు విధంగా సవరించి ఆమోదించారు. విదేశీ వస్త్రాలను బహిష్కరించాలని, కాంగ్రెసు వాదులంతా విధిగా ఖద్దరు ధరించాలని ఆ మహాసభ లోనే తీర్మానించారు.

ఆ తీర్మానానుసారం, మహాత్మాగాంధీ కలకత్తా లోని శ్రద్ధానంద పార్కులో విదేశీ వస్త్రాల దహన కాండకు ప్రారంభోత్సవం జరిపారు. అందుకు ఆయ నపై ప్రభుత్వం కేసు పెట్టింది. గాంధీపై కేసుపెట్టి నందుకు నిరసనగా ఆంధ్ర దేశంలో అనేకచోట్ల సభలు జరిపారు. 1929 మార్చి 10 న విదేశీ వస్త్ర దహనకాండ పెద్ద యెత్తున ఆంధ్ర దేశంలో జరుప బడింది.

## ఆంధ్ర దేశంలో మహాత్మాగాంధీ విస్తృత పర్యటన

స్వాతంత్ర్య పోరాటంలో అగ్రభాగాన నిలబడి పోరాడుతున్న ఆంధ్రదేశంపట్ల మహాత్మాగాంధీ 1920 నుంచి ప్రత్యేక శ్రద్ధాశ లను చూపుతూ వచ్చారు. తాను సాగించే సత్యాగ్రహ పోరాటా నికి దేశంలోని మూడే మూ రాష్ట్రాల పై గుజరాత్, ఆంధ్రదేశం, బీహారులపై-ఆధారపడు తున్నట్టు మహాత్మాగాంధీ కొండా వెంకటప్పయ్యకు తెలియజేశారు.

1929 లో మహాత్మాగాంధీ ఆరు వారాలపాటు ఆంధ్రదేశంలో విస్తృతంగా పర్యటించి, బ్రిటిష్ వ్యతిరేక పోరాటంలో తెలుగు ప్రజలను ఉత్తేజ పర్చారు. ఖద్దరు ఉద్యమ ప్రాధాన్యాన్ని వివరించారు.

"భారత దేశంలో తిరిగి మరొకమారు రామరాజ్యం అవతరించాలి సీత లేందే రామరాజ్యం సాధ్యమా? మీలో ప్రతి ఒక్కరిలోను సీత గుణగణాలు ఉద్దీపం కావాలి" అని మహాత్మాగాంధీ స్త్రీలను ఉద్బోధించి, ఉత్తేజపర్చారు. 1930-1933 ఉప్పు సత్యాగ్రహం, శాసనోల్లంఘన ఉద్యమాలలో తెలుగు స్త్రీలు అంత పెద్ద సంఖ్యలో పాల్గొనడానికి మహాత్మాగాంధీ పర్య టనే ప్రధాన కారణమని చెప్పక తప్పదు.

## యువజన సంఘాల పుట్టుక

అదే సమయంలో ఆంధ్ర దేశంలో అతివాద కాంగ్రెసువాదులు అనేక చోట్ల యువజన సంఘాలను ఏర్పాటుచేసి యువజనోద్యమాన్ని నిర్మిస్తున్నారు. ఆ యువజనోద్యమానికి మద్దూరి అన్నపూర్ణయ్య వంటి వారు ప్రోద్బల పరుస్తున్నారు. తన సంపాదకత్వాన వెలువడుతున్న వారపత్రిక 'కాంగ్రెసు'లో అల్లూరి సీతారామరాజు వంటి జాతీయ యోధులను ఆదర్శంగా కీర్తిస్తూ, యువజనులను ఉత్తేజపర్చారు.

## గుంటూరులో యువజన విద్యార్థి సంఘాల స్థాపన

1928 మే నెలలో పట్టణ యువజన సంఘం ఏర్ప డింది. జొన్నలగడ్డ రామలింగయ్య, యడవల్లి కృష్ణా రావు, జంధ్యాల సీతారామశాస్త్రి వంటి ఏడెనిమిదిమంది విద్యార్థులతో ఆ సంఘం ఏర్పడినా త్వరలోనే అది వృద్ధి చెందింది. సైమన్ కమిషన్ బహిష్కరణోద్య మంలో ఆ సంఘం కార్యకర్తలు ప్రముఖ పాత్ర వహించారు. 1930 ఉప్పు సత్యాగ్రహానికి ముందు హిందుస్తాన్ సేవక్ నాయకులు డా॥ హార్డికర్ గుంటూరు పట్టణ యువజన సంఘ సమావేశంలో ప్రసంగించారు. ఈ సంఘ సభ్యులు 50 మంది ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని శిక్షలు అనుభవించా రంటే, ఈ యువజన సంఘాల ప్రాధాన్యం ఏమిటో అర్థం చేసుకోవచ్చు.

1929 లో అమంచర్ల గోపాలరావు, జొన్నలగడ్డ రామలింగయ్య, గాలిబ్ సాహెబ్, రహిమాన్,

చల్లపల్లి నారాయణరావు, ఎన్.వి.ఎల్. నరసింహం, కూనపులి సుబ్రహ్మణ్యం, మాడభూషి వెంకటాచారి, యడవల్లి కృష్ణారావు వంటివారు విద్యార్థి ఫెడరేషన్‌ను కూడా స్థాపించారు.

వృద్ధిచెందింది. విస్తరిస్తున్న విద్యార్థి, యువజనోద్యమాలను దెబ్బతీయడానికి ప్రభుత్వం 1929 జూలై 17 వ తేదీన మద్దూరి అన్నపూర్ణయ్యను దేశద్రోహ నేరంక్రింద అరెస్టు చేసింది. రెండేళ్ళ కఠిన కారాగార వాసశిక్ష విధించారు. అప్పుడు 'కాంగ్రెసు' వారపత్రిక సంపాదకత్వ బాధ్యతలను క్రొవ్విడి లింగరాజు స్వీకరించారు.

## ప్రపంచ ఆర్థిక సంక్షోభం

మహాత్మాగాంధీ సారధ్యంలో జాతీయోద్యమం దేశమంతటికి, అన్నివర్గాలకు విస్తరించి, రాజకీయ చైతన్యం దావానలంలా అలుముకొంటున్న దశలోనే ప్రపంచ ఆర్థిక సంక్షోభం ముందుకు రావడంతో, దేశ ప్రజల ఆర్థిక జీవనం పూర్తిగా తలక్రిందులై పోయింది.

ఇలాంటి సమయంలో, 1929 అక్టోబరు 31 వ తేదీన వైస్రాయి లార్డ్ ఇర్విన్ భారతదేశానికి అధినివేశ ప్రతిపత్తిని ప్రదానం చేయడానికి సిద్ధమంటూ ఒక ప్రకటన జారీచేశాడు. అధినివేశ ప్రతిపత్తి ప్రదానం విషయం చర్చించడానికి భారత నాయకులతో రౌండ్ టేబుల్ చర్చలు జరపగలనని ఆయన వివరించాడు.

## ఇర్విన్ ప్రతిపాదనలు

లార్డు ఇర్విన్ ప్రకటనతో కాంగ్రెస్ నాయకుల ఆశలు చిగురించి, విరబూశాయి. వైస్రాయి ప్రతిపాదనలకు హర్షామోదాలు తెలుపుతూ మహాత్మాగాంధీ, మోతీలాల్ నెహ్రూ, తేజ్ బహదూర్ సప్రూ, శ్రీమతి అనీబిసెంట్, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూలు ప్రకటన జారీ చేశారు.

కాంగ్రెస్ తరపున గాంధీజీ,మోతీలాల్ నెహ్రూలు, ఇతర పార్టీల తరపున జిన్నా, సప్రూలు 1929 డిసెంబరు 21 న లార్డ్ ఇర్విన్‌ను కలుసుకొన్నారు. రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్సు ప్రారంభం కావడానికి ముందే, భారతదేశానికి సంపూర్ణ అధినివేశ ప్రతిపత్తిని ప్రదానంచేస్తూ ప్రకటన జారీచేయాలని గాంధీజీ షరతుపెట్టాడు. అందుకు లార్డ్ ఇర్విన్ తన అశక్తతను వ్యక్తంచేయడంతో ఆ చర్చలు భగ్నమయ్యాయి.

## లాహోర్ కాంగ్రెస్‌తో కీలకమయిన మలుపు

దేశంలో ఇలా రాజకీయ ఉద్రిక్త పరిస్థితి నెలకొన్న తరుణంలోనే లాహోరు కాంగ్రెసు మహాసభ జరిగింది. ఆ మహాసభకు యువజన శక్తికి ప్రతినిధిగా పరిగణింపబడుతున్న జవహర్‌లాల్‌నెహ్రూ అధ్యక్షత వహించాడు. "పూర్ణ స్వరాజ్యం" సాధించడం కాంగ్రెస్ లక్ష్యంగా ప్రకటించాడు. జనవరి 26 వ తేదీన స్వాతంత్ర్య దినోత్సవంగా జరపాలని నిర్ణయించారు. శాసనసభలలోని కాంగ్రెసు వాదులంతా తమ సభ్యత్వాలకు రాజీనామా చేయాలని ఆదేశించారు.

లాహోర్ కాంగ్రెస్ మహాసభ నిర్ణయాల ప్రకారం 1930 జనవరి 26 న దేశంలో మొట్టమొదటగా స్వాతంత్ర్య దినోత్సవం జరుపబడింది.

లాహోర్ కాంగ్రెసు మహాసభ అనంతరం, కాకినాడలో సమావేశమైన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం జనవరి 26 వ తేదీన రాష్ట్రమంతటా స్వాతంత్ర్యదినోత్సవం పాటించి, స్వాతంత్ర్య సందేశాన్ని వాడవాడలకు తీసుకుపోవాలని నిర్ణయించారు.

మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లోని కాంగ్రెస్ సభ్యులు మోతే నారాయణరావు, అయ్యదేవర కాళేశ్వరరావు, కడప కోటిరెడ్డి, టి ప్రకాశం, వి రామదాసు పంతులు తమ సభ్యత్వాలకు రాజీనామా యిచ్చారు.

## ఉప్పు సత్యాగ్రహ పోరాట పూర్వరంగం

మహాత్మాగాంధీ సత్యాగ్రహ పోరాటం ప్రారంభించడానికి ముందు ఆంధ్రదేశంలో ఆరువారాలపాటు జరిపిన పర్యటన విశేషాలు పరిశీలిస్తే, ఆయన పర్యటనకు ఎలాంటి ప్రాధాన్యం వున్నదో అర్థమవుతుంది.

ఆడవారికి ఆభరణాలపట్ల మక్కువ ఎక్కువ. అయినా మహాత్మాగాంధీ ఆంధ్రలో జరిపిన ఖద్దరు ప్రచారయాత్ర సందర్భంలో మహిళలు తమ వంటిమీద నగలను వొలిచి ఖద్దరు నిధికి సమర్పించిన తీరు చూస్తే, మహాత్మాగాంధీ ప్రబోధం స్త్రీలపై ఎంతటి ప్రభావాన్ని కలుగజేసిందో అర్థమవుతుంది.

మహాత్మాగాంధీ 1921 లో రెండు సార్లు, 1929, 1933, 1934, 1946 లలో మొత్తం ఆరుసార్లు ఆంధ్రలో పర్యటించారు. ఈ పర్యటన అన్నింటిలోకీ 1929 పర్యటన రాజకీయంగా ప్రాముఖ్యమైనది.

## అనంతవరంలో గాంధీజీ

గుంటూరుజిల్లా అనంతవరం గ్రామానికి గాంధీజీ వస్తున్నట్టు తెలియగానే, చదలవాడ గ్రామానికి చెందిన ఒక మహిళ తన భర్తకు చెప్పకుండా, తన పదేళ్ళ కొడుకుని వెంటనిడుకొని, తమ ఎడ్లబండిమీద అనంతవరం బయలుదేరింది.

అనంతవరంలో జనం కోలాహలంగా వున్నారు. విదేశీ వస్త్రాలన్నింటిని ఒక గుట్టగా పోశారు. టాపు లేని కారులో మహాత్మాగాంధీ అక్కడకు చేరగానే ఆ విదేశీ వస్త్రాల గుట్టకు నిప్పుపెట్టారు. కారు మండుతున్న విదేశీ వస్త్రాల గుట్టవరకూ వచ్చి ఆగిపోయింది.

కారులోనుంచి దిగిన మహాత్మాగాంధీ కొంచెంసేపు హిందీలో ప్రసంగించారు. అనంతరం కాంగ్రెసు కార్యకర్తలు పైపంచను జోలిగా పట్టుకొని, ప్రజలవద్దకు వచ్చారు. కొందరు డబ్బులు వేస్తున్నారు. చదలవాడ నుంచి వచ్చిన మహిళదగ్గర డబ్బులులేవు. ఒక క్షణం ఆలోచించింది. చేతికున్న బంగారు మురుగును తీసి, ఆ జోలిలో వేసింది. అంతవరకు బాగానేవుంది. కాని, ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు తనుచేసిన పనికి తన భర్త ఎక్కడ దండిస్తాడోనని కంట తడిపెట్టసాగింది. కాని, జస్టిస్ పార్టీకి చెందినవాడైనా, ఆమె భర్త ఆమె చేసిన పనికి ఆమెను మందలించ లేదంటే, మహాత్మాగాంధీ ప్రభావం ఆనాడు ఆంధ్ర ప్రజలపై ఎంతగా వున్నదో అర్థమవుతుంది.

గాంధీజీ వెళ్ళిన ప్రతిగ్రామంలోను ఇలాంటి దృశ్యాలే ప్రత్యక్ష మయ్యాయి ఆంధ్రదేశంలో ఉప్పుసత్యాగ్రహం ప్రారంభం కావడానికి పూర్వరంగం ఇది.

"ఉప్పు నిప్పొయె - ఏకు మేకాయె!"

# ఉవ్వెత్తున ఎగసిన ఉప్పు సత్యాగ్రహం

1930 జనవరి 30 వ తేదీన మహాత్మాగాంధీ "యంగ్ ఇండియా" పత్రికలో దేశమంతటా మద్య పాన నిషేధం, భూమి శిస్తును 50 శాతం తగ్గించ డంతో సహా మొత్తం 11 అంశాలను బ్రిటిష్ పాలకు లకు ప్రతిపాదించాడు. ఈ 11 అంశాలను అమలు జరపడానికి బ్రిటిష్ ప్రభుత్వం సమ్మతిస్తే, తాను శాసనోల్లంఘన ఉద్యమం ప్రారంభించ బోనని తెలిపాడు.

గాంధీజీ ప్రతిపాదనలను ప్రభుత్వం అంగీకరించ లేదు. 1930 ఫిబ్రవరిలో సబర్మతిలో జరిగిన కాంగ్రెస్ కార్యవర్గ సమావేశంలో, శాసనోల్లంఘన ఉద్యమాన్ని నడపడానికి సర్వాధికారాలను మహాత్మా గాంధీకి దఖలు పరుస్తూ తీర్మానించింది.

1930 ఏప్రిల్ 6వ తేదీన ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించడానికి గాంధీజీ ముహూర్తం నిర్ణయిం చారు. 1919లో జలియన్‌వాలాబాగ్ అనంతరం, భారతజాతి ఏప్రిల్ 6 నుంచి 13 వరకు ప్రతి సంవ త్సరం జాతీయ వారోత్సవాలను జరుపుకొంటున్నది. ఈ జాతీయ వారోత్సవంలోనే శాసనోల్లంఘనోద్య మాన్ని ప్రారంభించాలని గాంధీజీ నిర్ణయించారు.

## దండి సత్యాగ్రహం

1930 మార్చి 6 వ తేదీన మహాత్మాగాంధీ సబ ర్మతి ఆశ్రమం నుంచి 79 మంది ఆశ్రమ వాసులతో దండి యాత్ర ప్రారంభించాడు. ఆంధ్రదేశానికి చెందిన కృష్ణాజిల్లా వాసి యెర్నేని సుబ్రహ్మణ్యం, (సాధు సుబ్రహ్మణ్యం) ఆ 79 మందిలో ఒకరు. సూరత్ జిల్లాలోని దండి గ్రామంలో ఉప్పు చట్టాన్ని ఉల్లం ఘించడం ద్వారా ఉప్పు సత్యాగ్రహానికి ప్రారంభోత్స వం జరపాలని గాంధీజీ నిర్ణయించారు.

సబర్మతి నుంచి దండి వరకు గల గ్రామాలన్నింటి లోను తన సత్యాగ్రహ పోరాట లక్ష్యాలను ప్రచారం చేస్తూ, మహాత్మాగాంధీ మార్చి 12న దండి చేరాడు. ఆ రోజున ఉదయాన్నే సముద్రంలో స్నానం చేసిన గాంధీజీ, సముద్రతీరంలో పిడికెడు ఉప్పును పరిగ్ర హించడం ద్వారా ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించాడు.

## ఆంధ్రదేశం ముందంజ

దేశవ్యాప్తంగా గాంధీజీ శాసనోల్లంఘన ఉద్య మాన్ని ప్రారంభించక ముందే, ఆంధ్రదేశంలో తూర్పు, పశ్చిమ గోదావరి, కృష్ణా జిల్లాలలో పర్య టిస్తున్న గవర్నరుకు నల్ల జెండాల ప్రదర్శనలద్వారా నిరసన తెలిపి, పోరాటం ప్రారంభించారు.

1930 మార్చి 15న బందరులో గవర్నరు రాక సందర్భంలో న జెండాల ప్రదర్శనలో పాల్గొన్న 10 మందిని అరె చేశారు. కొండాలి ఆంజనేయులుకు 16 నెలల కఠిన రాగారవాస శిక్ష విధించారు.

ఆంధ్ర దేశంలో సత్యాగ్రహ ఉద్యమాన్ని నడప డానికి రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గం కొండా వెంక టప్పయ్యను డిక్టేటరుగా నియమించింది. అలాగే ప్రతి జి కు ఒక డిక్టేటరు చొప్పున నిర్ణయించారు. రాష్ట్ర డి టరుకు ఉద్యమ నిర్వహణలో సలహాలియిస్తుండ డా కి "యుద్ధ సలహా మండలి"ని కూడా ఏర్పాటు చేశారు.

## సత్యాగ్రహ సైనిక శిబిరాలు

ప్రభుత్వ బలగాలన్నింటిని ఒకేచోట కేంద్రీక రించి, ఉద్యమాన్ని అణచివేయడానికి వీలులేకుండా సత్యాగ్రహ సమరాన్ని ఏకకాలంలో రాష్ట్రమంతటా అనేకచోట్ల సాగించడానికి వ్యూహం రూపొందించారు. ఈ వ్యూహం ప్రకారం, ప్రతి జిల్లాలోను ఒక్కొక్క సత్యాగ్రహ సైనిక శిబిరాన్ని ఏర్పాటుచేసి, ఆ శిబిరా లలో సత్యాగ్రహులకు శిక్షణ ఇచ్చారు.

విశాఖపట్నం జిల్లాకు విజయనగరంలోను, తూర్పు గోదావరి జిల్లాకు సీతానగరం ఆశ్రమంలోను, పశ్చిమ గోదావరి జిల్లాకు ఏలూరు జాతీయ కళాశాలలోను, పశ్చిమ కృష్ణాజిల్లాకు విజయవాడలోని ఆంధ్రరత్న భవనంలోను, తూర్పు కృష్ణాకు బందరులోను, గుంటూరుజిల్లాకు గుంటూరులోను నెల్లూరుజిల్లాకు పల్లెపాడు ఆశ్రమంలోను, రాయలసీమ జిల్లాలకు బళ్ళారిలోను, మద్రాసుకు టి. ప్రకాశం "వేదవనం" ఇంటిలోను ఈ శిబిరాలు ఏర్పాటు అయ్యాయి.

ఈ వ్యూహాన్ని సూచించినది పట్టాభి సీతారామయ్య. కృష్ణాజిల్లా మేజస్ట్రేట్ ప్రభుత్వానికి పంపిన నివేదికలో ఈ క్రింది భాగం గమనార్హమైనది.

"చాలా కాలంగా పట్టాభి సీతారామయ్య ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొంటూ వస్తున్నాడు. అయినా, ఆయన ప్రతిసారీ జైలుకు పంపకుండా వదలి పెట్టబడ్డాడు. ఇంతకుముందు ఉద్యమాలలో వలెనే, ఈ ఉద్యమం ప్రారంభ దశలో, మొత్తం కథను నడిపించడానికి ప్లాను సహా కూర్చినది ఆయనే".

## సత్యాగ్రహ పోరాట కార్యక్రమం

సముద్ర తీరంలో ఉప్పు తయారు చేయడం, పట్టణాలలో విదేశీ వస్త్ర విక్రయశాలలముందు పికెటింగ్ చేయడం. గ్రామాలలో కల్లుగీతలకు ఉపయోగించే తాటి గెలలను నరకడం, కల్లు అంగళ్ళముందు పికెటింగ్ చేయడం, ఉప్పు కొటారులను ముట్టడించడం వంటి అంశాలతో సత్యాగ్రహ పోరాట కార్యక్రమం నిర్ణయమైంది.

## అడుగు వూడిన జస్టిస్ పార్టీ

కులాల మధ్య వైమనస్యాలు పెంచి, జాతీయోద్యమాన్ని దెబ్బ తీయాలన్న దృష్టితో, బ్రిటిషు పాలకుల ప్రోద్బలంతో తలఎత్తిన జస్టిస్ పార్టీ అడుగు వూడిందీ, కుప్ప కూలిందీ ఉప్పు సత్యాగ్రహ కాలంలోనే.

నెల్లూరు జిల్లాలో రెడ్డి, గుంటూరు కృష్ణా జిల్లాలలో కమ్మ, తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలలో క్షత్రియ కులాలకు చెందినవారు వందలు, వేల సంఖ్యలో ఈ సత్యాగ్రహోద్యమంలోకి దుమకడంతో కాంగ్రెసు బ్రాహ్మణుల పార్టీ అనే మచ్చ పూర్తిగా చెరిగిపోయింది.

## వీరగంధము తెచ్చినారము వీరులెవరో తెల్పుడీ

ఉప్పు సత్యాగ్రహ సందర్భంలోనే "వీరగంధం తెచ్చినారము వీరులెవరో దెల్పుడీ" అనే ప్రబోధాత్మక గేయం రూపొందింది. దీని రచయిత జస్టిస్ పార్టీ ప్రముఖులు, బ్రాహ్మణేతర ఉద్యమ నాయకులు, సుప్రసిద్ధ సంఘ సంస్కర్త, బారిస్టర్ అయిన త్రిపురనేని రామస్వామిచౌదరి కావడం విశేషం.

శరణు రామస్వామిచౌదరి నాయకత్వంలో తెనాలి వస్తున్న సత్యాగ్రహ దళానికి స్వయంగా స్వాగతం చెప్పి, వీర తిలకం దిద్ది, సత్యాగ్రహ సమరానికి సాగనంపడానికి ఆయన ప్రత్యేకంగా ఈ గేయాన్ని రచించారు.

"వీరగంధము దెచ్చినారము  
వీరు దెవ్వరో తెల్పుడీ  
పూసిపోదుము, మెడను వైతుము  
పూలదండలు భక్తితో ।  
శాంతి పర్వము జదువ వచ్చును  
శాంతి సమరంబైన పిమ్మట  
తెలుగు నాటిని వీరమాతను  
జేసి మాత్రము తిరిగి రమ్మిక  
పలు తుపాకులు పలు ఫిరంగులు  
దారి కడ్డము రాక తప్పవు  
నడుము గట్టిన తెలుగు బాలుడు  
వెనుక తిరుగం డెన్నడున్  
బాస యిచ్చిన తెలుగు బాలుడు  
పారిపోవం డెన్నడున్ ।"

తెలుగు హృదయ స్ఫూర్తి ఈ గేయంలోని ప్రతిపదంలోను ప్రతిధ్వనించిందంటే అతిశయోక్తి కాబోదు.

## గణపవరం ఉదంతం

పశ్చిమగోదావరి జిల్లాలోని గణపవరంలో జరిగిన ఉదంతాన్ని గురించిన సి. ఐ. డి. ల రిపోర్టు గమనార్హంగా వుంది. ఏలూరు నుంచి వస్తున్న సత్యాగ్రహ దళానికి ఆ గ్రామ ప్రజలు బ్యాండ్ మేళాలతో ఎదురేగి మరీ స్వాగత మిచ్చారు.

1930 మార్చి 31 న ఏలూరు నుంచి బయలుదేరిన ఈ సత్యాగ్రహ దళంలోని సభ్యుల పట్టికను పరిశీలిస్తే, ఆసక్తికరమైన, గమనార్హమైన అంశాలు వెల్లడవుతాయి. "ఈ దళానికి ఒక బ్రాహ్మణేతరుడు నాయకుడు 19 మంది బ్రాహ్మణులు, 5 గురు క్షత్రియులు, ఒక విశ్వ బ్రాహ్మణుడు, 6 గురు కాపులు, 5 గురు కమ్మవారు. ఇద్దరు తూర్పుకాపులు ఈ దళంలో సభ్యులుగా వున్నారు. వీరంతా సహపంక్తి

భోజనం చేస్తూ, జాతీయ గేయాల బృందగానం చేశారు.

మహాత్మాగాంధీ సారథ్యంలో వెల్లువికిన జాతీయోద్యమ వెల్లువలో కుల విభేదాలు, కుల వైమనస్యాలు అంతరించి, జాతీయవాదం, దేశభక్తి వికసించి, పరిమళించాయనడానికి ఈ ఉదంతం ఒక నిదర్శనం.

ఆంధ్రదేశంలో మొట్టమొదట కృష్ణాజిల్లాలోనే ఉప్పు సత్యాగ్రహం ప్రారంభమైంది.

## కృష్ణాజిల్లాలో ఉద్యమ ప్రారంభం

1930 ఏప్రిల్ 6 వ తేదీన బందరులో అయ్యదేవర కాళేశ్వరరావు, ముట్నూరి కృష్ణారావు, పట్టాభి సీతారామయ్య. సముద్ర తీరానికి వెళ్ళి, ముగ్గురూ మూడు గుప్పిళ్ళ ఉప్పు తెచ్చారు. అదే సాయంత్రం బందరులో జరిగిన బహిరంగ సభలో ఆ ఉప్పు పంచిపెట్టారు.

## పిడికెడు ఉప్పు విలువ "నవరసు బంగారం"

ఏప్రిల్ 9 వ తేదీన డాక్టరు పట్టాభి సీతారామయ్య తిరిగి సముద్ర తీరానికి వెళ్ళి, ఉప్పు తెచ్చారు. ఆ ఉప్పును బందరులో తిలక్ చౌక్ వద్ద జరిగిన బహిరంగ సభలో వేలంపాటపెట్టారు. ఆ ఉప్పు పొట్లాన్ని పురాణం సూరిశాస్త్రి నవరసు బంగారం పెట్టి కొన్నాడు. అదే రోజున వేలూరి యజ్ఞనారాయణ నాయకత్వంలో అయిదుగురు వాలంటీర్లు ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించారు.

ఉప్పు సత్యాగ్రహం ప్రారంభమైన మొదటి దినాలలో చూసీ చూడనట్టు పోయిన ప్రభుత్వం, రోజులు గడుస్తున్న కొలదీ ఉద్యమం విస్తృతిని, తీవ్రతను సంతరింప చేసుకొనడంతో, నిర్బంధ విధానానికి ప్రభుత్వం దిగింది.

ఏప్రిల్ 10 న టంగుటూరి ప్రకాశం, కొండా వెంకటప్పయ్య చిన్నాపురం వెళ్ళి ఉప్పు తీసుకొస్తుండగా, పోలీసులు వారిని అడ్డగించి వారి వద్దనున్న ఉప్పును లాగేసుకొన్నారు. ప్రభుత్వ నిర్బంధ కాండకు ఇది నాంది అయింది.

## స్వరాజ్య లక్ష్మీవ్రతం

ఈ సత్యాగ్రహ పోరాటంలో అనేక కొత్తరీతులు, పద్ధతులు । వేశపెట్టబడ్డాయి. గుంటూరులో శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ, శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతి ఇంటింటికి తిరిగి ఉగాది పండుగనాడు మార్చి 31 న స్వరాజ్యలక్ష్మి పూజలు జరిపి,స్త్రీలు ఉప్పుసత్యాగ్రహ సమరంలోకి దుమకాలని ఉద్బోధించారు

## ప్రజల ఆదరాభిమానాలు

ఉప్పు సత్యాగ్రహానికి ప్రజలలోని అన్ని వర్గాల ప్రజల అండదండలు, ఆదరాభిమానాలు మెండుగా లభించాయి. ఆది ఆంధ్రులు, క్రైస్తవులతో సహా అందరూ ఈ ఉద్యమంపట్ల సానుభూతి ప్రదర్శించారు. సత్యాగ్రహ శిబిరాల ఖర్చులను ఆయా ప్రాంతాలలో వర్తకులు, ప్రజలు స్వచ్ఛందంగా భరించారు. సత్యాగ్రహ శిబిరాలకి, సత్యాగ్రహ దళాలు వచ్చినప్పుడు, వారికి స్థానిక ప్రజలు బ్యాండ్‌మేళాలతో స్వాగతం చెప్పారు.

కృష్ణాజిల్లాలో బందరు సముద్రతీరం సత్యాగ్రహ సమర స్థలిగా మారింది. తూర్పు గోదావరిజిల్లాలో కాకినాడకు రెండుమైళ్ళ దూరంలోని చొల్లంగి, గుంటూరులో కొండా వెంకటప్పయ్య గృహం, నెల్లూరులో మైపాడు బీచ్ ఉప్పు సత్యాగ్రహ తావులయ్యాయి.

నెల్లూరు జిల్లాలో సత్యాగ్రహ రథసారథులుగా బొమ్మా శేషురెడ్డి, ఓరుగంటి వెంకట సుబ్బయ్య, బెజవాడ గోపాలరెడ్డి, వి. లక్ష్మయ్య, ఎల్. సుబ్బరామరెడ్డి నియమితులయ్యారు. వారిలో ఎవరైనా అరెస్టు అయితే, ఇతరులను కో అప్ట్ చేసుకొనే అధికారం ఆ సైన్యాధిపత్య మండలికి యిచ్చారు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్న ఈ రథసారథులందరిని అరెస్టుచేసి, శిక్షలు విధించారు. నెల్లూరు జిల్లాలో మొదటి సత్యాగ్రహ దళానికి ఓరుగంటి వెంకట సుబ్బయ్య నాయకత్వం వహించారు. నెల్లూరు జిల్లాలో ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయిన మొట్టమొదటి మహిళ పాతూరి బాలసరస్వతమ్మ, అనంతరం ఓరుగంటి మహాలక్ష్మమ్మ, ఆమె కుమార్తె, కొడుకు అరెస్టు అయ్యారు. ఆ విధంగా ఓరుగంటి వారి కుటుంబం మొత్తం ఉప్పు సత్యాగ్రహంలో అరెస్ట

యింది. పొనకా కనకమ్మ ఉద్యమంలో పాల్గొని, జైలు శిక్షలు అనుభవించారు.

## సీతానగరం ఆశ్రమం పాత్ర

తూర్పుగోదావరి జిల్లాలో సీతానగరం ఆశ్రమం ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో కీలకపాత్ర వహించింది. ఆ జిల్లాలో సత్యాగ్రహ దళానికి వెన్నేటి సత్యనారాయణ సారథ్యం వహించారు. పశ్చిమగోదావరి జిల్లాలో గణపవరంలో జరిపిన సత్యాగ్రహ సమరానికి దండు నారాయణరాజు, చాగల్లు ఆశ్రమానికి చెందిన తల్లాప్రగడ నరసింహశర్మ నాయకత్వం వహించారు.

## వేలాది ప్రజల సమక్షంలో ఉప్పు చట్టం ఉల్లంఘన

కాకినాడ సమీపంలోని చొల్లంగిలో నాలుగువేల మంది ప్రజల సమక్షంలో ఉప్పు సత్యాగ్రహులు ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించారు. కుండలలో ఉప్పునీటిని కాచి, ఉప్పు తయారు చేశారు. పశ్చిమగోదావరి జిల్లా గణపవరంలో 500 మంది స్త్రీలతో సహా మొత్తం 6 వేలమంది ప్రజలు చూస్తుండగా, 50 కుండలలో ఉప్పునీటిని కాచి, ఉప్పు తయారుచేశారు. ఈ ఉప్పు నీటిని కాచే కార్యక్రమంలో 100 మంది మహిళలు పాల్గొన్నారు.

## బందరులో సామూహిక సత్యాగ్రహాలు

బందరులో 22 మంది పురుషులు, ముగ్గురు మహిళలు అధికారరీత్యా ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా, సముద్ర స్నానానికి వచ్చిన 1000 మంది ప్రజలు కూడా ఉప్పు నీటిని కాయడం ద్వారా సామూహిక సత్యాగ్రహులుగా మారారు.

## మద్రాసులో

మద్రాసులో ఉప్పు సత్యాగ్రహాన్ని ప్రధానంగా తెలుగు నాయకులే నడిపారు. వారిలో కాశీనాథుని నాగేశ్వరరావు, గద్దె రంగయ్యనాయుడు, వి. ఎల్. శాస్త్రి, శ్రీమతి దు ర్గాబాయ్ ముఖ్యులు.

శ్రీమతి దు ర్గాబాయ్ నాయకత్వంలో మహిళలు ఏప్రిల్ 13 న అ కమంది సత్యాగ్రహంలో పాల్గొన్నారు. వారు తమ ఆభరణాలను కానుకలుగా సమర్పించారు. ప్రకాశం సతీమణి వారిలో ఒకరు.

## కృష్ణాజిల్లాలో వీరోచిత సమరం

కృష్ణాజిల్లాలో సత్యాగ్రహ సమరం వీరోచితంగా సాగింది. పశ్చిమ కృష్ణానుంచి అయ్యదేవర కాళేశ్వరరావు, గంపలగూడెం జమీందారు కోటగిరి వెంకట కృష్ణారావు, డాక్టర్ వెలిదండ్ల హనుమంతరావుల నాయకత్వంలో మూడు సత్యాగ్రహ దళాలు వేరు వేరు మార్గాలలో బందరు చేరాయి.

అయ్యదేవర కాళేశ్వరరావు నాయకత్వంలో 36 మంది సత్యాగ్రహులు రైలులో విజయవాడనుంచి బందరు చేరారు. గంపలగూడెం జమీందారు నాయకత్వంలో 60 మంది సత్యాగ్రహులు విజయవాడనుంచి బయలుదేరి, దారిపొడవునా గ్రామాలలో ప్రచారం చేసుకుంటూ పాదయాత్ర చేస్తూ బందరు చేరారు. ఈ సత్యాగ్రహ దళంలో తూర్పు కృష్ణకు చెందిన 150 మంది సత్యాగ్రహులు దారిలో కలిశారు. మొత్తం ఈ 210 మంది ఏప్రిల్ 13, 14 తేదీలలో కోన వద్ద ఉప్పు సేకరించి తిరుగు ప్రయాణమయ్యారు. డాక్టరు వెలిదండ్ల హనుమంతరావు నాయకత్వంలో 36 మంది సత్యాగ్రహులు మరొక దళంగా ఏర్పడి పాదయాత్ర చేస్తూ బందరు చేరారు.

150 మంది సత్యాగ్రహులు ఏప్రిల్ 11వ తేదీన కుండలలో సముద్రపు నీరు తెచ్చి, బందరులో ఆ నీటి కుండలను వూరేగించిన అనంతరం, ఉప్పు తయారు చేసి, దాన్ని ప్రజలకు అమ్మారు. గంపలగూడెం జమీందారు నాయకత్వంలో సేకరించిన ఉప్పును ఏప్రిల్ 26 న విజయవాడ బహిరంగసభలో పంచిపెట్టారు.

పాదయాత్ర చేస్తూ వెళ్ళిన ఈ సత్యాగ్రహ దళాలకు వూరూరా ప్రజలు ఘనస్వాగత మిచ్చారు. విజయవాడ తాలూకా నెప్పల్లి గ్రామంలో ఈ సత్యాగ్రహ దళానికి భోజనం పెట్టిన పిన్నమనేని పున్నయ్య తుపాకి లైసెన్సును ప్రభుత్వం రద్దుచేసి తన కక్షను ప్రదర్శించుకొన్నది.

పశ్చిమ కృష్ణాకు చెందిన గ్రామీణ ప్రాంతాలలోని రైతు యువకులను సత్యాగ్రహోద్యమంలో సమీకరించడంలో గంపలగూడెం జమీందారు వెంకటకృష్ణారావు, పేట బాపయ్య, కాట్రగడ్డ మధుసూదనరావు, కాట్రగడ్డ వెంకటనారాయణరావు(బదరు)ప్రముఖపాత్ర వహించారు. విజయవాడ పట్టణంలోని యువకులను డాక్టరు వెలిదండ్ల హనుమంతరావు, విద్యావంతుల్ని

అయ్యదేవర కాళేశ్వరరావు ఈ ఉద్యమంలోకి సమీక రించారు. ఆ రోజులలో మొగల్రాజపురం గ్రామీణ యువకుల సమీకరణకు కేంద్రమయింది.

## గుంటూరు జిల్లాలో

గుంటూరు జిల్లాలో కొండా వెంకటప్పయ్య, శరణు రామస్వామి చౌదరి, ఎన్. వి. ఎల్ నరసింహారావు నాయకత్వంలో ఏప్రిల్ 9 న 100 మంది సత్యా గ్రహులు వాడ్రేవు వద్ద సముద్ర జలాలను కుండల కె త్తి, గుంటూరు తీసుకొచ్చి, కొండా వెంకటప్పయ్య ఇంటివద్ద ఉప్పు తయారు చేశారు. ఈ ఉప్పు తయారు చేయటంలో 16 మంది మహిళలు పాల్గొన్నారు. వాడ్రేవు వద్ద ఎ. కామేశ్వరరావు, కాశీ విశ్వనాథం ఉప్పును సేకరించి, ఏప్రిల్ 16 న తెనాలి బహిరంగ సభలో అమ్మారు.

1930 ఏప్రిల్ 26 న 41 మంది వాలంటీర్లు కనపర్తి ఉప్పు కొటారులపై దాడిచేసి ఉప్పును పట్టుకు పోయారు. ఆ ప్రాంతపు ప్రజలు కూడా అదే పని చేశారు. ఏప్రిల్ 27 న సుమారు 100 మంది వాలం టీర్లు దేవరంపాడు శిబిరం నుంచి బయలుదేరి, ఉప్పును సేకరించారు.

## గోదావరి మండలంలో

తూర్పుగోదావరి జిల్లాలో వెన్నేటి సత్యనారాయణ, బులుసు సాంబమూర్తి నాయకత్వాన సత్యాగ్రహులు కాకినాడనుంచి బయలుదేరి చొల్లంగి వెళ్ళి, అక్కడ ఉప్పు చట్టాలను అతిక్రమించి, మూడు మణుగుల ఉప్పును తయారుచేశారు. అనంతరం దానిని ప్రజలకు పంచిపెట్టారు.

పశ్చిమగోదావరిజిల్లాలో సర్దార్ దండు నారాయణ రాజు నాయకత్వంలో ఉప్పు సత్యాగ్రహోద్యమం సాగింది. మట్టపాలెంవద్ద ఎ. గోవిందాచారి ఉప్పు చట్టాన్ని ధిక్కరించాడు. వారు ఏప్రిల్ 15 నుంచి మే 13 వరకు ఉప్పు సత్యాగ్రహ శిబిరాలు నిర్వ హించారు

విశాఖపట్నం జిల్లాలో ఉప్పు సత్యాగ్రహ ఉద్య మానికి తెన్నేటి విశ్వనాథం నాయకత్వం వహించారు. ఏప్రిల్ 18, 30 తేదీలలో భీమిలివద్ద నలుగురు వాలంటీర్లు ఉప్పు తయారు చేశారు.

## నెల్లూరు జిల్లాలో

నెల్లూరు జిల్లాలో ఉప్పుసత్యాగ్రహోద్యమంలో బెజవాడ గోపాలరెడ్డి, ఎల్. ఫకీర్, వి. బలరామిరెడ్డి, టి. రామలింగం, డి. సుబ్బరామిరెడ్డి, సిహెచ్. వెంకట రాఘవయ్య, ఓరుగంటి వెంకట సుబ్బయ్య ఖాసా సుబ్బారావు వంటివారు ప్రముఖ పాత్ర వహిం చారు వారు మే 11 న మైపాడు బీచ్‌లో ఉప్పు తయారుచేసి, తిప్పరాజు సత్రంలో వేలం పాటలో రు. 120 లకు అమ్మారు. అంతకుముందు ఏప్రిల్ 20 వ తేదీన ఓరుగంటి వెంకట సుబ్బయ్య, ఖాసా సుబ్బారావుల నాయకత్వంలో 16మంది సత్యాగ్రహులు మైపాడు బీచ్‌లో తయారుచేసి, నెల్లూరుకు తీసుకు వెళ్ళారు.

## మద్రాసులో తెలుగువారి సారథ్యంలో సత్యాగ్రహం

మద్రాసు నగరంలో ఉప్పు సత్యాగ్రహోద్య మాన్ని జయప్రదం చేసే బాధ్యతను టంగుటూరి ప్రకాశం, కాశీనాధుని నాగేశ్వరరావు స్వీకరించారు. సత్యాగ్రహోద్యమ ప్రచార నిర్వహణలో శ్రీమతి దుర్గాబాయమ్మ ప్రముఖ పాత్ర వహించింది. శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి నగర మంతటా తిరుగుతూ, సత్యా గ్రహోద్యమంలో చేరవలసిందిగా ప్రజలను ఉద్బో ధించారు

ఏప్రిల్ 13 న మద్రాసులో మొట్టమొదటి సత్యా గ్రహ దళం టంగుటూరి ప్రకాశం, కాశీనాధుని నాగే శ్వరరావు నాయకత్వాన స్వరాజ్య పత్రిక కార్యాలయం నుంచి వూరేగింపుగా బయలుదేరి, సముద్రతీరం చేరి, అక్కడ ఉప్పు తయారు చేసింది. అనంతరం టంగు టూరి ప్రకాశం, శ్రీమతి దుర్గాబాయ్, నాయకత్వాన 20 మంది మహిళలు హైకోర్టు బీచ్‌వద్ద ఉప్పు తయారు చేశారు.

## నాగేశ్వరరావు పంతులు అరెస్టు పెల్లుబికిన నిరసన

కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు, తదితర నాయకులను పోలీసులు అరెస్టు చేయడంతో మద్రాసు నగరం అట్టుడికిపోయింది. నిరసన ప్రజ్వరిల్లింది. ఏప్రిల్ 22 న పూర్తి హర్తాళ్ జరిగింది. వ్యాపారు

లంతా ఆ హర్తాళ్‌ను పూర్తిగా బలపర్చారు. అదే రోజున ఉదయం 11 గంటలకు 1500 మంది మిల్లు కార్మికులు జాతీయ నాయకుల అరెస్టులకు నిరసనగా వూరేగింపు జరిపారు. కార్మిక ప్రదర్శకులకు, పోలీసులకు ఘర్షణ బయలుదేరింది. సరిగ్గా అదే సమయానికి టంగుటూరి ప్రకాశం ప్రసంగంవిని, వస్తున్న జన సమూహాలు కార్మిక ప్రదర్శకులతో కలిశారు. వారంతా కలిసి, పోలీసు జులుంను ప్రతిఘటించసాగారు. ప్రదర్శకులను చెదరగొట్టడానికి లాఠీచార్జికి ఉపక్రమించారు. హైకోర్టు బీచ్‌లో సాయంత్రం 4 గంటల నుంచి రాత్రి 10 గంటల మధ్యకాలంలో బహిరంగ సభలు జరపరాదని నిషేధా లు జారీ చేశారు. ఏప్రిల్ 26 న అదే బీచ్‌లో నిషేధా లను ధిక్కరిస్తూ, 200 మందితో బహిరంగ సభ జర గా, పోలీసులు సభను చెదరగొట్టడానికి కాల్పులు జరపవలసి వచ్చింది. ట్రిప్లికేన్ బీచ్‌లో మరొక బహిరంగ సభ జరిగింది. అక్కడ ప్రజలు పోలీసులపై తిరగబడ్డారు. ఆ ఘర్షణ ముదిరి, చివరకు తుపాకి కాల్పులకు దారితీసింది. ఆ కాల్పులలో ముగ్గురు ప్రాణాలు కోల్పోయారు. అనేకమంది గాయపడ్డారు.

పోలీసులు ఎంతగా బందోబస్తు చేసినా, శ్రీమతి దుర్గాబాయమ్మ నాయకత్వంలో 9 మంది మహిళా సత్యాగ్రహులు మే 5 న మైలాపూర్‌లోని శాంతోమ్ బీచ్‌లో ఉప్పు తయారుచేస్తుండగా, పోలీసులు దాడి చేసి, ఉప్పు నీటిని మరగబెడుతున్న కుండలను బద్దలుకొట్టారు. పొయ్యిలను చిందరవందర చేశారు. అప్పుడా మహిళా సత్యాగ్రహులు సీసాలలో ఉప్పు నీటిని నింపి, తీసుకువెళ్ళారు. అనంతరం జూన్ 16న వేదవనంలోని శిబిరాన్ని పోలీసులు స్వాధీనం చేసుకొని, మూసివేశారు.

## రాయలసీమలో

రాయలసీమ జిల్లాలైన అనంతపురం, కడప, బళ్ళారి జిల్లాలు సముద్రతీరానికి దూరంగా వున్నందున, అక్కడ ఉప్పు సత్యాగ్రహం అంత ఉధృతరూపం దాల్చలేదు. అయితే, త్రివిధ బహిష్కరణలలోని మద్యపాన వ్యతిరేక ప్రచారం, విదేశ వస్తు బహిష్కరణ కార్యక్రమాలు మాత్రం రాయలసీమ ప్రాంతంలో విజయవంతంగా నిర్వహించబడినవి. అక్కడ ఈ ఉద్యమాన్ని విజయవంతం చేయడంలో కల్లూరి సుబ్బారావు ప్రముఖ పాత్ర వహించారు.

## పోలీసుల దమనకాండ

ఉప్పు సత్యాగ్రహం ప్రారంభమైన తొలి దినాలలో పోలీసులు అంత క్రూరంగా ప్రవర్తించలేదు. అయితే ఉద్యమం విస్తరించి, ఉధృతం అవుతున్నకొద్దీ, పోలీసుల క్రూరత్వం కూడా పెరగసాగింది.

ఉప్పు సత్యాగ్రహులు పోలీసుల కన్నుగప్పి తమ కార్యకలాపాలను సాగించడానికి కొత్తపద్ధతులు చేపట్టారు. ఉదాహరణకు పశ్చిమగోదావరి జిల్లా యుద్ధమండలి ఆదేశానుసారం మే 11 న ఏలూరులోని నేషనల్ స్కూలు నుంచి బయలుదేరిన వాలంటీర్లు రెండవ రిజర్వాయర్ టాంకు వద్దకు వెళ్ళి ఉప్పు తయారు చేశారు. దెందులూరు, నడింపల్లి, కొవ్వలి, చింతలపూడి వంటి గ్రామాలలో ఉప్పు చట్టాలను ఉల్లంఘించారు. మైనారిటీ వెళ్ళని దశలో పుచ్చలపల్లి సుందరయ్య వంటి బాలురు ఈ ఉద్యమంలో పాల్గొని బోర్‌స్టల్ స్కూలులో జైలు శిక్ష అనుభవించారు.

తూర్పుగోదావరి జిల్లాలో కొత్తపల్లి శిబిరం నుంచి క్రొవ్విడి లింగరాజు నాయకత్వంలో వాలంటీరు దళం సముద్రతీరానికి వెళ్ళి ఉప్పు తయారు చేసింది. తూర్పుగోదావరి జిల్లాలోని ప్రధాన సత్యాగ్రహ కేంద్రమైన చొల్లంగి శిబిరాన్ని పోలీసులు ధ్వంసం చేయడంవల్ల బెండమూడిలంక నుంచి ఉప్పునీరు తెచ్చి ఉప్పాడ, అమలాపురం, కొత్తపల్లి వంటి చోట్ల ఉప్పు తయారు చేసే కార్యక్రమం చేపట్టవలసి వచ్చింది.

గుంటూరు జిల్లాలో మే 3 న శరణు రామస్వామి చౌదరి, కె. టి. వెంకటేశ్వరరావు, వేదాంతం నరసింహారావు, కె. గోపాలకృష్ణయ్య చిన్నకారులో దేవరంపాడు నుంచి కనపర్తి ఉప్పు కొటారులకు వెళ్ళి, ఉప్పు తీసుకొ ండగా, మధ్యదారిలో వారిని పోలీసులు అడ్డగించి అరె చేశారు. 30, 40 మంది వాలంటీర్లు, 400 మంది జ ం నిజాంపట్నం ఉప్పుకొటారులపై దాడిచేసి ఉప్పును తెచ్చారు.

1930 జూన్ నెలాఖరు నాటికి వర్షాకాలం ప్రారంభం కావడంతో ఉప్పు చట్టాలను ఉల్లంఘించే కార్యక్రమానికి స్వస్తిచెప్పి, కల్లుపాకల వద్ద పికెటింగ్,

విదేశీ వస్త్ర బహిష్కరణ కార్యక్రమాలను సత్యాగ్రహాలు చేపట్టారు.

## విదేశీ వస్తు బహిష్కరణ మద్యపాన వ్యతిరేకోద్యమాలు

ఉప్పు సత్యాగ్రహోద్యమంలో భాగంగా, ఆంధ్ర దేశంలో విదేశీ వస్త్ర దహనకాండ, మద్యపాన వ్యతిరేకోద్యమం పెద్ద ఎత్తున, విస్తృతంగా జరిగాయి.

మద్యపాన వ్యతిరేక పోరాటం కొత్త పద్ధతులలో సాగింది. కల్లు పాకలముందు పికెటింగు జరపటంతో పాటు తాటి, ఈతచెట్ల కల్లు గీత గెలలు నరికివేసేపద్ధతి పూర్తిగా విజయవంతమైంది.

మద్రాసు ప్రభుత్వం ప్రధాన కార్యదర్శికి గుంటూరు జిల్లా కలెక్టరు పంపిన నివేదికలో దీనిని గురించి ఇలా పేర్కొన్నారు.

"గుంటూరు జిల్లాలో తాటి, ఈతచెట్ల కల్లు గీత గెలలను నరికించే పద్ధతిని ప్రవేశపెట్టినది గొల్లపూడి సీతారామశాస్త్రి. ఈ కొత్త పద్ధతి దావానలంవలె ఇతర ప్రాంతాలకు త్వరితంగా వ్యాపించింది. గెలలు నరికివేత కార్యక్రమం సాంఘిక సంస్కరణకు దోహదకరమైంది. రైతులు విశేషంగా ఈ కార్యక్రమంలో చురుకుగా పాల్గొన్నారు."

గెలలు నరికివేత ఉద్యమం కృష్ణా, నెల్లూరు జిల్లాలకు త్వరితంగా విస్తరించింది. విజయవంతంగా సాగించబడింది.

విదేశీ వస్త్ర దుకాణాల ముందు పికెటింగ్ కార్యక్రమాన్ని కూడా పెద్ద ఎత్తున సాగించారు. ఈ పికెటింగ్ కార్యక్రమంలో పురుషులతోపాటు స్త్రీలు కూడా గణనీయంగా పాల్గొన్నారు. అలా పాల్గొన్న మహిళా మణులలో దిగుమర్తి బుచ్చి కృష్ణమ్మ, గాడిచర్ల శేషాబాయి, ఎస్. సుబ్బమ్మ, పాలకోడేటి శ్యామలాంబ మున్నగువారు వున్నారు.

శాసనోల్లంఘన ఉద్యమం ప్రారంభ సమయంలో కృష్ణాజిల్లాలోని పలువురు వ్యాపారులు "ఆరుమాసాల పాటు విదేశీ వస్తువులను అమ్మబోము" అని వాగ్దానం చేశారు.

ఈ దశలోనే అనేకమంది గ్రామోద్యోగులు తమ పదవులకు రాజీనామా లిచ్చారు. ఏలూరు కరణం పోసంగిరావు ఆదర్శాన్ని పాటించి, చల్లపల్లి, కొణికి, వీరభద్రపురం, యలమంచిపాడు, శోత్రియం కరణాలు కూడా తమ పదవులకు రాజీనామా లిచ్చినవారిలో వున్నారు.

ఉప్పు సత్యాగ్రహ సమరం విస్తరించి, తీవ్ర రూపం దాల్చుతున్నకొద్దీ బ్రిటిషు ప్రభుత్వం క్రూరమైన నిర్బంధకాండ ప్రయోగించసాగింది. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్న రైతుల పొలాలకు నీరు సరఫరా కాకుండా బంద్ చేశారు.

## పెద్దాపురం 'వనభోజనం' పోలీసుల పశుత్వం

1930 డిసెంబరు 30న పెద్దాపురంలో ప్రముఖ న్యాయవాది చొక్కా నరసింహమూర్తి తోటలో వత్సవాయి జగపతి వర్మ ధనుర్మాసం సందర్భంలో వనభోజనం ఏర్పాటు చేశారు. పెద్దాపురం, రాజమండ్రి కాకినాడలకు చెందిన పురప్రముఖులు, లాయర్లు, వ్యాపారులు మొత్తం 60 మందిని ఆ వనభోజన విందుకు ఆహ్వానించారు. మాజీ శాసన మండలి సభ్యుడు కె వి. ఆర్. స్వామి, నాళం కృష్ణారావు, బార్ ఎట్ లా కె. శేషగిరిరావు, పెద్దాడ కామేశ్వరమ్మ, కోదాటి రంగాచార్యులు, వి. గోపాలకృష్ణయ్య, లక్కరాజు సుబ్బారావు, నాళం భీమరాజు, వై. వెంకటేశ్వర్లు, పైడా వెంకటనారాయణ మున్నగువారు మధ్యాహ్నం తేనీరు సేవిస్తుండగా డి. వై. ఎస్. పి. రాజా పిళ్ళె నాయకత్వంలో 30 మంది సాయుధులైన పోలీసు మూకతో దాడి జరిపి చుట్టుముట్టారు. ఆ పోలీసు మూకలో సబిన్స్పెక్టర్ దస్పుల సుబ్బారావు



### ఉప్పు పట్టిన పిడికిలి ఉక్కు పిడికిలి

తూర్పు గోదావరి జిల్లా రాజమండ్రినుంచి వెలువడిన "కాంగ్రెసు" పత్రిక సంపాదకుడు రామచంద్రునివెంకటప్ప "ఉప్పు పట్టిన పిడికిలి"ని తెరిపించడానికి పోలీసులు లాఠీదెబ్బలు ఎన్ని కొట్టారో లెక్కలేదు. తన ఉప్పు పిడికిలిపై పడే ప్రతి లాఠీదెబ్బకు నవ్వుతూ "ఉప్పు పిడికిలి ఉక్కు పిడికిలి"గా మారిందని నిరూపించాడు.



కూడా వున్నాడు. తేనీరు సేవిస్తున్న ప్రముఖులంద రినీ 'చెదిరి' పొమ్మని ఆదేశించాడు. వారు అక్కడ నుంచి వెళ్ళిపోడానికి అవకాశ మివ్వకుండా దప్పుల సుబ్బారావు "మారో" అంటూ పోలీసు మూకను ఉసిగొల్పాడు. నిర్దాక్షిణ్యంగా లాఠీలతో ఆ పెద్దలంద రినీ చావమోదారు. పరుగు తీస్తున్నవారి వెంటబడి తరిమి మరీ కొట్టారు పోలీసులు. తునికి చెందిన కోదాటి రంగాచార్యులు చెయ్యి విరిగిపోయింది. నాళం కృష్ణారావు కాలుకు పెద్ద గాయం తగిలింది. కె. వి. ఆర్. స్వామినాయుడు, డాక్టరు గోపాలకృష్ణయ్య, జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు పి. కామేశ్వరమ్మ వంటి వారిని లాఠీలతో చితకబాదారు.

## రాజమండ్రి జైలులో విప్లవకారుల నిరాహారదీక్ష

లాహోరు కుట్రకేసులో నిందితులైన శివవర్మ, విజయకుమార్ సిన్హా, జగదల్ కపూర్‌లకు 1930లో రాజమండ్రి జైలుకు మార్చారు. ఉప్పు సత్యాగ్ర హంలో అరెస్టయిన అనేకమంది తెలుగు యువకులకు ఈ విప్లవకారులతో సన్నిహిత సంబంధాలు ఏర్పడి నవి. అలాంటి వారిలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత పుచ్చలపల్లి సుందరయ్య ఒకరు ఈ విప్లవకారులు రాజమండ్రి జైలులో "బి" తరగతి కోసం నిరాహార

---

## జెండా వీరుడు తోట నర్సయ్య

మే 6వతేదీన బందరులోని కోనేరు సెంటర్‌లో తత్వానందస్వామి జాతీయజెండాను ఎగురవేయ బోగాపోలీసులుఆయనను అడ్డగించి,స్పృహతప్పే వరకు లాఠీలతో చావమోదారు. యువకుడైన తోట నర్సయ్య స్పృహతప్పి పడిపోయిన తత్వానందస్వామి చేతిలోని జెండాను తీసుకొని ఎగురవేసి చరిత్రను సృష్టించాడు. పదిహేను మంది పోలీసులు ఒకేసారి తోట నర్సయ్యపై విరుచుకుపడి విపరీతంగా లాఠీచార్జీ చేశారు అయినాసరే, ఆ జెండా వీరుడు తోట నర్సయ్య "గాంధీజీకి జై" అంటూ చివరివరకు నినదిస్తూనే స్పృహతప్పి నేల కొరిగాడు

---

దీక్ష సాగించారు. గాంధీ - ఇర్విన్ ఒప్పందం అనం తరం రాజమండ్రి జైలునుంచి విడుదలైన కాకాని వెంకటరత్నం ఈ నిరాహార దీక్షను గురించిన వార్తను పత్రికలలో ప్రకటించారు.

---

## "రఘుపతి రాఘవ రాజారామ్" నాగళ్ళ వెంకటకృష్ణయ్య

గుంటూరుజిల్లాకు చెందిన అనంతవరం గ్రామంలో రైతుకుటుంబంలో పుట్టిన ఆజాను బాహువైన శ్రీ నాగళ్ళ వెంకటకృష్ణయ్య గుంటూరు సత్యాగ్రహ శిబిరంలో కూర్చుని "రఘుపతి రాఘవ రాజారామ్, పతితపావన సీతా రామ్, ఈశ్వర్, అల్లా తేరేనామ్"అని ప్రార్థన చేస్తుండగా, పోలీసులు ఆయనపై అమానుషంగా లాఠీచార్జి జరిపారు. ఇద్దరు పోలీసులు ప్రార్థ నలో వున్న ఆ స్వాతంత్ర్య సమరయోధుని కిరు వైపులా నిలబడి తమ లాఠీలతో ఎడాపెడా 60 దెబ్బలు కొట్టి అలిసిపోయారుగాని, నాగళ్ళ వెంకటకృష్ణయ్య దీక్ష చెక్కు చెదరలేదు. ఆయన సాహసం మొక్కవోలేదు.

---

ఉప్పు సత్యాగ్రహోద్యమానికి సంబంధించిన ఇలాంటి గాథలు ఎన్నో వున్నాయి మద్రాసులోని "వేదారణ్యం" శిబిరంవద్ద కాపలా పెట్టబడిన రిజర్వు పోలీసులను ఆంగ్లేయులపై తిరగబడమని ఉద్బోధించే కరపత్రాలను శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి రిజర్వు పోలీ సులలో పంచి, సంచలనం సృష్టించారు.

## మహాత్మాగాంధీ అరెస్టుకు నిరసన

మే 5న మహాత్మాగాంధీని అరెస్టు చేసినందుకు నిరసనగా దేశంలో జరిగిన అసమ్మతి ప్రదర్శనలలో భాగంగా ఆంధ్రదేశంలోని గుత్తి, తాడిపత్రి, గుంత కల్లులలో హర్తాళ్‌లు జరిగాయి. తాడిపత్రి తాలూకా బోర్డు ఉపాధ్యక్షుడు తన పదవికి రాజీనామా చేశాడు.

1921-22 సహాయనిరాకరణోద్యమం మహాత్మా గాంధీ అరెస్టుతో తగ్గుముఖం పట్టి నీరసించి పోగా, 1930-31 ఉప్పు సత్యాగ్రహోద్యమం మహాత్మాగాంధీ

ఆరెస్టు అనంతరం తగ్గకపోగా మరింత మహోద్ధృత రూపం దాల్చింది.

ఉదాహరణకు బందరులో మే 6 న తత్వానంద స్వామి, తోట నరసయ్య వంటి సత్యాగ్రహులపై పోలీసులు జరిపిన దారుణమైన లాఠీచార్జీలకు నిరసనగా అప్పటి బందరు మున్సిపల్ ఛైర్మన్ శీలం జగన్నాథ రావునాయుడు ఖద్దరు వస్త్రధారణ చేసి, మున్సిపల్ ఆఫీసుపైన, ఇతర బహిరంగ స్థలాలలోను జాతీయ జెండాను ఎగురవేయించాలని మున్సిపల్ కౌన్సిల్‌లో తీర్మానాన్ని ప్రవేశపెట్టి, ఆమోదింపజేశారు.

## వెలిదండ్ల హనుమంతరావుపై జైలర్ల దౌష్ట్యం

కృష్ణాజిల్లాలో ఉప్పు సత్యాగ్రహ దళానికి నాయకత్వం వహించి, అరెస్టయి, రాజమండ్రి జైలులో శిక్ష అనుభవిస్తున్న డాక్టరు వెలిదండ్ల హనుమంతరావు పైన జైలర్లు జరిపిన అమానుష కృత్యం బ్రిటిషు వలస వాదుల కర్కశత్వానికి ప్రత్యక్ష తార్కాణం. ఖైదీలకు "పురుగుల కూడు" పెడుతున్నందుకు నిరసనగా నిరాహార వ్రతం సాగించిన నేరానికి డాక్టరు వెలిదండ్ల హనుమంతరావును రాజమండ్రినుంచి వెల్లూరు జైలుకు బదిలీ చేశారు అర్ధరాత్రివేళ ఆయనను రాజమండ్రి జైలునుంచి బయటకు తీసుకువచ్చి, నిష్కారణంగా, మహాదారుణంగా లాఠీలతో చావమోదారు. ఆయన రక్తం కక్కి, స్పృహ కోల్పోయారు. ఆ లాఠీదెబ్బల వల్ల ఆయన ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. దీని నుంచి ఆయన తిరిగి కోలుకోలేదు. 1934 లో డాక్టరు వెలిదండ్ల అసువులు బాసారు. మాతృదేశ విముక్తి కోసం ఈ విధంగా ప్రాణాలు కోల్పోయినవారు అసంఖ్యాకంగా వున్నారంటే అతిశయోక్తికాదు.

పశ్చిమగోదావరిజిల్లాలో ఒక సభలో ప్రసంగిస్తున్న డాక్టరు గురుమూర్తిపైన, రామచంద్రపురంలో నిద్రపోతున్న సత్యాగ్రహి డాక్టరు కొర్సిల రాజారావు పైన, గుంటూరులో కల్లుపాకముందు పికెట్ చేస్తున్న కె. రామశాస్త్రి పైన పోలీసులు మహాదారుణంగా లాఠీచార్జీ జరిపి, వారు స్పృహ కోల్పేయేవరకు కొట్టారు.

1930 జూన్ 21 న ప్రభుత్వం, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘం, బెజవాడ జిల్లా యుద్ధమండలి, తూర్పు కృష్ణా, పశ్చిమ కృష్ణా, పశ్చిమ గోదావరి, గుంటూరు, నెల్లూరు జిల్లాల కాంగ్రెస్ సంఘాలు మున్నగువాటిని చట్టవిరుద్ధమైన సంస్థలుగా ప్రకటించి నిషేధించింది.

## గుడివాడలో తుపాకి కాల్పులు

బహిరంగ సభలు జరగకుండా నిషేధాజ్ఞలు జారీ చేసిన పోలీసులు జూన్ నెలలో గుడివాడ, ఏలూరు, ఒంగోలు వంటి చోట్ల బహిరంగ సభలను చెదరగొట్టడానికి తుపాకి కాల్పులు జరిపారు.

## అంగ్లేయుల గులాములుగా 'కుక్కబుద్ధి' ప్రదర్శించిన పోలీసు అధికారులు

ఉప్పు సత్యాగ్రహ కాలంలో ప్రజలపై దారుణమైన దమనకాండ జరిపి తెల్లవాళ్ళ మెరమెచ్చులు పొందాలని "కుక్క బుద్ధి"ని ప్రదర్శించిన పోలీసు అధికారులు కొందరు వున్నారు. ముస్తాఫ్అలీ, దప్పుల సుబ్బారావు, దావుద్‌ఖాన్, నీలి వెంకటేశ్వర్లు వంటి వారు ఆ కోవకు చెందినవారు.

## ప్రభుభక్తి పరాయణులు

కాగా, సంఘంలోని కొందరు పెద్దలు బ్రిటిష్ ప్రభుభక్తి పరాయణులు "లాయలిస్టు లీగ్" అనే సంస్థను ఏర్పాటుచేశారు. వారు "యదార్థవాది" అనే పత్రికను నడిపి, బ్రిటిష్ ప్రభుత్వ అనుకూల ప్రచారం చేశారు.

## ఉద్యమ విస్తృతి, ఉధృతిపై జిల్లా కలెక్టర్ల అంచనాలు

ఆంధ్రదేశంలో ఉప్పు సత్యాగ్రహోద్యమం స్వరూప, స్వభావాలను గురించి, దాని విస్తృతి, ఉధృతి గురించీ కొందరు జిల్లా కలెక్టర్లు ప్రభుత్వానికి పంపిన నివేదికలు ఈ సందర్భంలో గమనార్హమైనవి. గుంటూరు జిల్లా కలెక్టర్ కె. కె. విజెల్లీ తన నివేదికలో ఇలా పేర్కొన్నాడు.

"ఈ శాసనోల్లంఘనోద్యమం నిస్సందేహంగా జాతీయ భావోద్దీపన నుంచి పుట్టుకొచ్చిందని చెప్పవచ్చు. ఉద్దీపమైన ఈ జాతియ భావం విస్తృతిని, ఉధృతిని అంచనాకట్టడం కష్టం. అన్ని జాతీయోద్య

మాలలో వలెనే ఈ ఉద్యమానికి కూడా మేధావివర్గమే ప్రధానమైన చోదకశక్తిగా వుంది ఈ వర్గం నుంచి నాయకులు మాత్రమేకాక, అసంఖ్యాకమైన కార్యకర్తలు కూడా తయారయ్యారు దీనికితోడు, విద్యావంతులైన వారు బహిరంగంగా ఈ ఉద్యమాన్ని బలపరచక పోయినా, దీనిపట్ల పూర్తి సానుభూతి వైఖరిని ప్రదర్శించారు. ప్రభుత్వ దమననీతిని విద్యావంతులైన వారు ఎప్పటికప్పుడు ఖండిస్తున్నారు పోలీసు నిందిస్తున్నారు.

డెల్టా ప్రాంతంలో సారవంతమైన భూములను, కృష్ణా, గోదావరి నదీ జలాల సహాయంతో సాగు చేస్తున్న రైతాంగం ఈ ఉద్యమం వైపు ఆకర్షితులు అయ్యారు.............సహాయ నిరాకరణోద్యమంలో వలెనే - చరిత్ర పునరావృతమైంది. బ్రాహ్మణులు, క్షత్రియులు, కమ్మవారు ప్రభుత్వం పట్ల చెక్కు చెదరని శత్రుత్వ వైఖరిని ప్రదర్శించారు"

1921 - 22 సహాయ నిరాకరణోద్యమానికి 1930 - 31 ఉప్పు సత్యాగ్రహానికి గల తేడాను గుంటూరు జిల్లా కలెక్టరు తన నివేదికలో వివరిస్తూ 1921 - 22 సహాయ నిరాకరణోద్యమం పాలపొంగు లాగా పెల్లుబికి చల్లారిపోయిందని, 1930 - 31 ఉప్పు సత్యాగ్రహోద్యమం అలాంటిదికాదని పేర్కొన్నాడు. స్వాతంత్ర్య సిద్ధి తథ్యమన్న ఆశతో, గ్రామోద్యోగులు 1921 - 2 ఉద్యమంలోకి ఉరికారని. గాంధీజీ అరెస్టుతో ఆ ఉద్యమం జావ కారిపోయిందని, ఆ నివేదికలో పేర్కొన్నాడు.

1921 లో గాంధీజీ ఒక్కడే ఉద్యమానికి నాయకుడని, 1930 - 31 నాటికి అనేకమంది యువకులు ఉద్యమ నాయకులుగా తయారయ్యారని, అవసరమైతే, గాంధీజీని ప్రక్కకునెట్టి ఆ యువకులే ఉద్యమాన్ని నడుపగల శక్తిని సంపాదించుకొన్నారని ఆ నివేదికలో ఉదహరించాడు.

కమ్మవారు, క్షత్రియులు ప్రబలంగావున్న ప్రాంతాలలో ఉప్పు సత్యాగ్రహోద్యమం ఉధృతరూపం దాల్చినదని ఆ నివేదికలో పేర్కొన్నాడు.

విశాఖపట్నం జిల్లా కలెక్టర్ జి. టి. హెచ్. బ్రాకెన్ కూడా ఇదే రకమైన నివేదికను ప్రభుత్వానికి పంపించాడు.

1921 - 22 సహాయ నిరాకరణోద్యమం పాలపొంగు వలె, ఎంత త్వరగా పొంగిందో అంత త్వరగానూ, చల్లారి పోయిందని, 1930 - 31 ఉప్పు సత్యాగ్రహోద్యమం అలాకాక, దీర్ఘకాలిక పోరాటం అన్న గుర్తింపుతో సకల ఏర్పాట్లతో ప్రారంభమైనదని, కనుకనే 1921—22 పోరాటం గాంధీజీ అరెస్టుతో చప్పబడిపోగా, 1930—31 ఉద్యమం గాంధీజీ అరెస్టు అనంతరం కూడా చల్లారలేదని ఆ నివేదికలో విశ్లేషించాడు.

1930 ఏప్రిల్ 6 న ప్రారంభమైన ఉప్పు సత్యాగ్రహం 1931 జనవరి నెలాఖరులో గాంధీజీ ఇతర జాతీయ నాయకుల విడుదలతో విరమించబడింది. గాంధీ - ఇర్విన్ ఒప్పందం జరిగింది 1931 కరాచీ కాంగ్రెస్ మహాసభ ఇంగ్లండులో జరిగే రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సుకు మహాత్మాగాంధీని పంపించాలని తీర్మానించింది.

గాంధీ - ఇర్విన్ ఒప్పందం జరిగినా, ప్రభుత్వ దమనకాండ కొనసాగుతున్నా, కల్లు పాకల ముందు, విదేశ వస్త్ర విక్రయశాలల ముందు పికెటింగ్ మాత్రం తగ్గలేదు. మహాత్మా గాంధీ చిత్రపటాలను వూరేగించడానికి పోలీసులు ఆటంకాలు కల్పించారు. ఈ సందర్భంలో రాజమండ్రి సమీపంలోని వాడపల్లి వద్ద రథోత్సవ సంఘటన ప్రత్యేకంగా గమనార్హమైనది.

## వాడపల్లి రథోత్సవ సంఘటన

తూర్పుగోదావరిజిల్లా కొత్తపేట తాలూకాలోని వాడపల్లిలో ఏటేటా శ్రీ వెంకటేశ్వర రథోత్సవం జరుగుతుంది. ఆ దేవాలయం ధర్మకర్త ప్రభుత్వం వద్దనుంచి ముందుగా అనుమతిపొంది, 1931 మార్చి 30 న మహాత్మాగాంధీ, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, సరోజినీదేవి చిత్రపటాలను రథంలో అమర్చి, రథోత్సవం ప్రారంభించబోతుండగా, పోలీసు అధికారులు అటకాయించారు. ఆ సంఘటన గురించి సుప్రసిద్ధ స్వాతంత్ర్య సమరయోధుడు క్రొవ్విడి లింగరాజు 1981 ఏప్రిల్ 9 వ తేదీ ఆంధ్ర పత్రికలో ప్రచురించిన సంస్మరణ వ్యాసంలో ఇలా వివరించారు :

## వాడపల్లి రథోత్సవ బలిదానం

తూర్పుగోదావరిజిల్లా, కొత్తపేట తాలూకాలో గోదావరిగట్టున వెంకటేశ్వర వాడపల్లి అనే గ్రామం

వెంకటేశ్వరస్వామి క్షేత్రంగా చరిత్ర ప్రసిద్ధి గాంచినది. అక్కడ చైత్రశుద్ధ ఏకాదశినాడు స్వామివారి కళ్యాణం గొప్పగా జరుగుతుంది. 1931 మార్చి 30 న ఆ మహోత్సవం జరుగుతుంటే, ఆ కాలంలో మహా కఠినాత్ముడుగా పేరుపొందిన డిప్యూటీ సూపరింటెండెంట్ ముస్తాఫాలీఖాన్ తుపాకీ ప్రయోగం ఫలితంగా నల్గురు అక్కడి కక్కడే మరణించారు. మరి ముగ్గురు వారి ఇండ్లకుపోయి మరణించారు. సరిగా 50 సంవత్సరముల క్రిందట ఈ సంఘటన భారత దేశాన్నంతనూ కదలించింది. స్వాతంత్ర్య సమర మహాయోధులను, ఆనాటి ఉజ్వల చారిత్రక ఘట్టాలనూ మరచిపోతున్న ఈ తరంవారికి ఆ గాధను జ్ఞప్తికి తేవడం న్యాయం.

1931 సం॥ మార్చి 3 న గాంధీ - ఇర్విన్ ఒడంబడిక జరిగింది. ఆనాటి పోరాటంలో పాల్గొన్న ప్రజలు విజయోత్సాహంలో నిమగ్నులైనారు. కాని ఒడంబడిక అయిన 20 రోజులకే లాహోరు కుట్రకేసు శిక్షితులు భగత్‌సింగ్ ప్రభృతులు ఉరితీయబడ్డారు. గాంధీజీ ఇర్విన్ ప్రభువు నెంత ప్రార్థించినా ఉరిశిక్ష ఆగలేదు. ఆ కారణంగా ప్రజలలో కొంత నిరుత్సాహం ప్రబలింది. అది జరిగిన వారం రోజులలో వాడపల్లిలో పోలీసు రాక్షసత్వం చిందులు త్రొక్కింది.

ఏకాదశినాటి రథోత్సవంలో పాల్గొనడానికి వేలాది ప్రజలు సమకూడారు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో అలాటి ఉత్సవాల్లో గాంధీ, నెహ్రూవంటి ప్రముఖుల పటాలతోనూ, జాతీయ పతాకాలతోనూ, అలంకరించడం జరుగుతుండేది, ఆ సంప్రదాయం ప్రకారమే స్థానాచార్యులవారి సమ్మతితోనే రథాన్ని గాంధీ, నెహ్రూ, సరోజినీదేవి బొమ్మలను రథంమీద అలంకరించారు. పోలీసు సర్కిల్ ఇనస్పెక్టర్ అభ్యంతరం చెప్పాడు. దాని కభ్యంతరం చెప్పేవాళ్ళుంటారు కనుక తీయించేయమన్నాడు. స్థానాచార్యులవారు అలాంటి అభ్యంతరంవస్తే ఆలోచిద్దామని రథాన్ని లాగడానికి అనుమతించమని శాంతంగా చెప్పారు. అయితే మా సూపరింటెండెంట్‌ను రానీయం డన్నాడు సర్కిల్ ఇనస్పెక్టర్. ఇంతలో ముస్తఫాలీ వస్తూనే "డిస్పర్స్. మారో" అనే రాక్షస మంత్రాన్ని పఠించాడు. పోలీసులు లాటీలతో విజృంభించి జనాన్ని చావబాదారు. ఆ దుర్ఘటన చూస్తూ పూరుకోలేక ప్రజలు కూడా విజృంభించారు. ముస్తఫాలీఖాన్ అనుకుని ఖాకీదుస్తుల్లో ఉన్న ఒక శానిటరీ ఇనస్పెక్టరును అటకాయించారు. దుర్మార్గానికి దిగడానికి ఏదో అవకాశంకోసం వేచివున్న ముస్తఫాలీ తుపాకులు పేల్చమని ఉత్తర్వు చేశాడు. ఆ కాల్పులకు నల్గురు అక్కడి కక్కడే కూలిపోయారు. కొన్ని వందల మందికి గుండుదెబ్బలు తగిలినాయి. కొంతమంది జనం పారిపోయారు. కొందరు అలాగే వెనక్కు తగ్గేరు రథం అలానే నిలిచిపోయింది. ఉద్వేగపరులుగా మారుతున్న ప్రజల ఆవేశాన్ని గుర్తించి ముస్తఫాలీఖాన్ ఒక పూరింటిలోదూరి మర్నాడు రిజర్వు వచ్చేదాకా అలాగే దాగుకొని వున్నాడు. ఈ ఉదంతం 31 వ తేదీ ఉదయానికి జిల్లా అంతా పాకింది.

ఈ సంఘటన జరిగిన మరునటి రోజునుంచీ, ప్రజలు పోలీసులమీద తిరుగబడి చంపబోయారన్న కారణంగా కాల్పులు జరిపినట్లు కథ సృష్టించడానికి ముస్తఫాలీ గ్రామాల్లోని పెద్దలను భయపెట్టడం ప్రారంభించాడు. ఆ ప్రాంతం జాతీయోద్యమంలో ప్రశస్తమైన పాత్రను ధరించిన ర్యాలి నరసింహరాజు, పెనుమత్స సత్యనారాయణరాజు, నంబూరి జగ్గరాజు, నామన బాపన్న వంటి ప్రముఖులు నాయకత్వం వహించారు.

ఈ సంఘటన రాజమహేంద్రవరంలోని ప్రముఖ లాయర్లలో ఒక ఉద్రిక్తతను, సంచలనాన్ని కలిగించింది. అప్పట్లో బార్‌అసోసియేషన్ కార్యదర్శిగా వుండిన మిత్రుడు శ్రీ మద్దూరి శివరామ కృష్ణయ్య, బార్ అసోసియేషన్ ప్రెసిడెంట్ చిత్రపు వెంకటచలం గారిని, న్యాపతి సుబ్బారావుపంతులుగారిని, ఆ ప్రాంతపు నివాసి అయిన వకీలు వీరఘంటు లక్ష్మీనరసింహం గారిని మరికొందరు పెద్దలను ముందుకు రావించారు. వారందరూ ఒక ఉపసంఘంగా ఏర్పడి ఆ ప్రాంతమంతా సంచారంచేసి సమగ్రమైన విచారణచేసి వాస్తవాన్ని బయటపెట్టారు. వారొక నివేదిక తయారుచేసి పత్రికలకూ, ప్రభుత్వానికీ అందజేశారు. ఆ నివేదిక ప్రభుత్వాన్ని కూడా ఇరకాటంలో పెట్టింది.

ముస్తఫాలీఖాన్ ప్రోద్బలంతో ప్రభుత్వం దాదాపు 30 మందిని ముద్దాయిలుచేసి హత్యాప్రయత్నం, దొమ్మీ మొదలైన సెక్షన్లమీద కేసు బనాయించింది. వాస్తవానికి ఆ ముద్దాయిలలో 5, 6 గురు తప్ప మిగిలినవారు ఆ స్థానంలో లేరు. ఇదొక ఆధారంగా రాజకీయా

లలో చైతన్యులుగాఉండే నాయకుల నందరిని బాధించాలనీ, భయపెట్టాలనీ పెద్ద కేసుగా బనాయించారు. అప్పట్లో ట్రయినింగ్‌లోవున్న ఐ. సి ఎస్. ఉద్యోగి గోపాలస్వామి కమిటల్ విచారణ రాజమండ్రిలో జరిపి సెషన్సుకు పంపారు. కొందరిని విడుదలచేసి 26 గురిని అని జ్ఞాపకం, సెషన్సుకు పంపి బెయిలివ్వకుండా, రాజమండ్రి సెంట్రల్ జెయిలులో ఉంచారు. మొత్తం ఏడు మాసాలుపైగా విచారణ జరిగింది. ఆఖరుకు సెషన్సుజడ్జి శంకరయ్యరు. ముద్దాయిలు నిర్దోషులని తీర్పు చెప్పారు. ముగ్గురు పెద్దలకుమాత్రం ఏదో చిన్న వంకను మూడేసి మాసాల శిక్ష విధించారు."

"కాంగ్రెసు" వారపత్రికలో క్రొవ్విడి లింగరాజు 31-2-1931, 10-5-1931 తేదీలలో "వీరబలి" 'ప్రథమ స్వాతంత్ర్య సమర వర్ధంతి' వ్యాసాలు ప్రచురించిన నేరానికి "124 సెక్షన్ 'ఎ' క్రింద శిక్షలు విధించారు. యువకులు అల్లూరి సీతారామరాజు, భగత్సింగ్, తదితర వీరుల ఆదర్శాలను పాటించాలని ఆ వ్యాసాలలో ఆయన ఉద్బోధించారు.

దేశంలోని ఇతర ప్రాంతాలలో కూడా పరిస్థితి ఇదే విధంగా కుతకుత లాడిపోతున్నది. ఆశాభావంతో లండన్ రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్సుకు వెళ్ళిన మహాత్మాగాంధీ నిరాశపొంది, స్వదేశానికి తిరిగి వచ్చాడు. ఇంగ్లండులో లేబర్‌పార్టీ ప్రభుత్వం పోయి, కన్సర్వేటివ్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. వైస్రాయిగా ఇర్విన్ నిష్క్రమించడం, ఆ స్థానంలో వెలింగ్డన్ రావటం జరిగింది. వైస్రాయి వెలింగ్డన్‌మహాత్మాగాంధీకి ఇంటర్వ్యూ ఇవ్వడానికి కూడా నిరాకరించాడు. దానిపై 1931 డిసెంబరు 30,31 తేదీలలోను 1932 జనవరి 1 వ తేదీన బొంబాయి కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం, సంపూర్ణస్వాతంత్ర్య సాధనకు పోరాటం ప్రారంభించడం మినహా మార్గాంతరం లేదని తీర్మానించింది.

కల్లుపాకల ముందు పికెటింగ్, విదేశీవస్త్ర బహిష్కరణ, వూరేగింపులు, ప్రదర్శనలు, ఉప్పుచట్టాల ఉల్లంఘన వంటి అంశాలకు 1932 శాసనోల్లంఘనోద్యమాన్ని పరిమితం చేయాలని నిర్ణయించారు.

జాతీయ కాంగ్రెస్ విసరిన ఈ సవాలుకు సమాధానంగా బ్రిటిష్ ప్రభుత్వం 1932 జనవరి 13 వ తేదీన మహాత్మాగాంధీని అరెస్టు చేసింది. ఆ అరెస్టు 1932 ఉద్యమానికి శంఖారావమైంది.

దేశంలోని మిగతా రాష్ట్రాలలో వలెనే ఆంధ్రదేశంలోకూడ శాసనోల్లంఘన ఉద్యమ నిర్వహణకు డిక్టేటర్లను - నియంతలను - నియమించారు.

## దారుణ దమనకాండ

ఉవ్వెత్తున ప్రారంభమైన శాసనోల్లంఘనోద్యమాన్ని దారుణంగా అణచివేయాలన్న దృష్టితో బ్రిటిష్ ప్రభుత్వం ముందుగానే ప్లాను ప్రకారం నాలుగు ఆర్డినెన్సులు జారీచేసింది.

ఈ ఆర్డినెన్సుల క్రింద ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘాన్ని, ఆంధ్రదేశంలోని జిల్లా కాంగ్రెస్ సంఘాలను, మద్రాసు జిల్లా కాంగ్రెస్ సంఘాన్ని, నర్సాపురం, కొవ్వూరు, తణుకు, భీమవరం, కైకలూరు, గుడివాడ, బొబ్బిలి, చీపురపల్లి, అనకాపల్లి తాలూకా కాంగ్రెస్ సంఘాలను, బందరు, బెజవాడ, నూజివీడు, గుడివాడ, విశాఖపట్నం, విజయనగరం పట్టణ కాంగ్రెస్ సంఘాలను, యలమంచిలి ఫిర్కా కాంగ్రెసు సంఘాన్ని, మద్రాసు నగర కాంగ్రెస్ సంఘాన్ని, గంజాంజిల్లా హిందూస్తాన్ సేవాదళాన్ని చట్టవిరుద్ధ సంస్థలుగా ప్రకటించి నిషేధించారు.

## ఆశ్రమాలపై నిషేధం

జాతీయోద్యమ వ్యాప్తికి కేంద్రాలుగా వున్న వివిధ ఆశ్రమాలపై కూడ నిషేధం విధించారు.

డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం రాజమండ్రి సమీపంలో స్థాపించిన సీతానగరం ఆశ్రమాన్ని పోలీసులు ఆక్రమించుకున్నారు. 'కాంగ్రెస్' వారపత్రిక కార్యస్థానం కూడా అదే. ఆ పత్రిక ప్రెస్‌ను కూడా స్వాధీనం చేసుకొన్నారు ఆ వూరులోని పశువుల శాలలను, పశువులను, ఎడ్లను, ఎడ్లబళ్ళను వేలంపాటలో అమ్మివేశారు.

కృష్ణాజిల్లాలోని కొమరవోలు గాంధీ ఆశ్రమాన్ని భట్లపెనుమర్రు, నెల్లూరు, ఇనుగపల్లి కాంగ్రెస్ శిబిరాలను పోలీసులు ఆక్రమించారు.

అంగలూరులోని యెర్నేని సుబ్రహ్మణ్యం, యెర్నేని సూర్యనారాయణ, విశాఖపట్నంలోని నడింపల్లి నరసింహమూర్తి, కోటిగరిడిలోని కొండిపర్తి

శ్రీరామమూర్తి వంటివారిపై దాడులు జరిపి, పోలీసులు సోదాలు చేశారు.

## ఆంధ్రరత్న భవనం ఆక్రమణ పునరాక్రమణకు సత్యాగ్రహం

బెజవాడలో ఆంధ్రకాంగ్రెస్ సంఘ కార్యాలయమైన, 'ఆంధ్రరత్న భవనాన్నీ' కాకినాడ కాంగ్రెస్ ఆఫీసుభవనాన్నీ పోలీసులు స్వాధీనం చేసుకొని తాళాలు వేశారు.

విజయవాడలో హుదీబుల్లా నాయకత్వంలో కాంగ్రెస్ కార్యకర్తలు ఆంధ్రరత్న భవనాన్ని పోలీసుల స్వాధీనంనుంచి విముక్తం చేయడానికి 1932 జూలై 31 న సత్యాగ్రహం జరిపి, 17 మంది కార్యకర్తలు అరెస్టు అయ్యారు.

## ప్రముఖులపై 144 వ సెక్షన్ విధింపు

సి. ఆర్. పి. సి. 144 సెక్షన్ క్రింద డాక్టరు సుబ్రహ్మణ్యం, కళా వెంకట్రావు, డాక్టరు జె. మల్లపురాజు, మొసలికంటి తిరుమలరావు, పెద్దాడ కామేశ్వరమ్మ, దేవులపల్లి సత్యనారాయణ, వెన్నేటి సత్యనారాయణ, తదితర ప్రముఖులు శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొనరాదని, దాన్ని గురించి ప్రచారం చేయరాదని నిషేధించారు. ఇలాంటి నిషేధాజ్ఞలనే విశాఖ పట్నంలో తెన్నేటి విశ్వనాథం, కె. సర్వేశ్వర శాస్త్రివంటి వారిపైన, నెల్లూరులో పొణకా కనకమ్మ, కొమండూరు పార్థసారథి అయ్యంగార్, ఓరుగంటి వెంకటసుబ్బయ్య, ఓరుగంటి మహాలక్ష్మమ్మ వంటివారిపైన, గుంటూరులో కొండా వెంకటప్పయ్య, జి. పున్నయ్యశాస్త్రి, ఉన్నవ లక్ష్మీనారాయణ, ఉన్నవ లక్ష్మీబాయమ్మ, ఎన్. వి. ఎల్. నరసింహారావు, మద్ది వెంకటరంగయ్య వంటి వారిపైన జారీ చేశారు.

## సానుభూతి పరులపై కఠినచర్యలు

1932 శాసనోల్లంఘ నోద్యమంపట్ల సానుభూతితో సహాయ సహకారాలను అందిస్తున్న సామాన్య ప్రజలను బెదిరించి, భయపెట్టడానికి బ్రిటిష్ ప్రభుత్వం తీవ్ర కఠినచర్యలకు దిగింది. లోగడ ఉప్పు సత్యాగ్రహ కాలంలో ఓరుగంటి మహాలక్ష్మమ్మ, పొణకా కనకమ్మలకు భోజనంపెట్టి, ఆశ్రయమిచ్చారనే నేరంపై కొత్త పొల్లూరు గ్రామ మునసబ్, డిప్యూటీ కరణాలను, ఉద్యోగాలనుంచి తొలగించారు. మహిళా వాలంటీర్లకు భోజనం పెట్టిన నేరానికి కృష్ణాజిల్లాలో సూరపనేని గోపాలకృష్ణయ్యకు రు. 1000 లు జరిమానా విధించారు. స్వాతంత్ర్య పోరాటం పట్ల సానుభూతి ప్రదర్శించిన తాయవరం మునసబ్‌ను, మునసబ్ గిరీనుంచి తొలగించడమే గాక, వారి వంశ పారంపర్య హక్కును కూడా రద్దుచేశారు.

కాకినాడ, గుంటూరు, తెనాలి, ఒంగోలు, రాజమండ్రి వంటి పట్టణాలలో ఊరేగింపులు, ప్రదర్శనలు, బహిరంగసభలు జరగకుండా నిషేధించారు

## ప్రముఖ నాయకుల అరెస్టులు

1932-33 ఉద్యమం ప్రారంభమైన మొదటి రెండు వారాలలో జరిగిన అరెస్టుల వివరాలను పరిశీలిస్తే, ఈ ఉద్యమం విస్తృతి, ఉధృతి ఎంతో మనకు కొంత అవగత మవుతుంది.

1932 జనవరి 6న సత్ప్రవర్తనకు హామీనివ్వ నిరాకరించిన నేరానికి దుగ్గిరాల కమలాంబ, దాసరి కృష్ణవేణమ్మ, దాసరి లక్ష్మీబాయమ్మ (ఏలూరు) మల్లాది యజ్ఞనారాయణ (బాపట్ల) శిక్షలు పొందారు.

జాతీయ నాయకుల అరెస్టులకు నిరసనగా ఏలూరు వీధులలో జాతీయ జెండాలు చేబూని, జాతీయ గీతాలు పాడుతూ ప్రదర్శన జరిపిన బి. విజయన్న, డి. అంజయ్య, తదితరులను అరెస్టు చేశారు. అదే రోజున గుడివాడలో కె.ఎల్. నరసింహారావు, ఎమ్. గుర్రాజు, గుళ్ళపల్లి రామబ్రహ్మం వంటి వారికి ఆరునెలల కఠిన కారాగారవాస శిక్ష విధించారు

జనవరి 7న కొవ్వూరులో రెబ్బాప్రగడ మందేశ్వర శర్మ, కోటమర్తి కనకమ్మలను పూచీకత్తు ఇవ్వనిరాకరించిన నేరానికి శిక్ష విధించారు. ప్రభుత్వ ఉత్తర్వులను ఉల్లంఘించారన్న నేరంపై బందరులో జాతీయ కళాశాల ప్రిన్సిపాల్ దిగుమర్తి రామస్వామి, భోగరాజు పట్టాభి సీతారామయ్య, వి డి. నాగేశ్వరరావు, ముట్నూరి కృష్ణారావు, మున్నగువారిని అరెస్టుచేశారు. అభ్యంతరకర ప్రసంగాలు చేసిన నేరానికి చెరుకువాడ లక్ష్మీనరసింహం (బందరు), పట్టణంలోను, పాఠశాలలోను అభ్యంతరకర పత్రాలు పంచిన నేరానికి చుండి జగన్నాధం (నెల్లూరు) వంటి వారిని అరెస్టు చేశారు.

జనవరి 9న ఏలూరులో మూల్పూరి చుక్కమ్మను, బెజవాడలో అయ్యదేవర కాళేశ్వరరావు, కాకుమాను లక్ష్మయ్య, కాట్రగడ్డ మధుసూదనరావు, నూతల వీర రాఘవయ్య, తదితరులను, ఏలూరులో కాకర్లమూడి భాస్కరరావు, పెనుగొండ శ్రీరాములు, ఎమ్ గంగాధరం, వై. రామయ్య, కె. శ్రీరాములు తదితరులను, పాలకొల్లులో చోపెల్ల సత్యనారాయణ మూర్తిని అరెస్టు చేశారు.

ఏలూరు జాతీయ పాఠశాల హిందీ ఉపాధ్యాయుడు వల్లమూడి లక్ష్మీ నరసింహం విదేశ వస్త్ర దుకాణం ముందు పికెటింగ్ చేస్తుండగా ఆయనపై లాఠీచార్జి చేశారు. సత్తిరాజు శ్యామలాంబ, సత్తిరాజు మంగమ్మ, ముదిమూరి స్వరాజ్యలక్ష్మి పికెటింగ్ చేస్తూ అరెస్టు అయ్యారు.

జనవరి 11న అనంతపురంలో కల్లూరి సుబ్బారావును రాజమండ్రి తాలూకాలో అచ్చిరెడ్డి ముత్యాలరావును, ఏలూరులో ఎల్. లక్ష్మీనరసమ్మ, కొమ్మూరు వీర వెంకమ్మ, సిహెచ్. బుచ్చమ్మలను అరెస్టు చేశారు.

జనవరి 12 న బెజవాడలో చట్టవిరుద్ధంగా సమావేశమయ్యారన్న నేరంపై పేట బాపయ్య, జాగర్లమూడి వెంకట రామయ్య, తదితరులను అరెస్టు చేశారు, కాంగ్రెస్ వాలంటీర్లకు ఆతిథ్యమిచ్చిన నేరానికి ఏలూరులో డాక్టరు మూల్పూరి రంగయ్యను అరెస్టు చేశారు. కాంగ్రెసులో చేరమని ప్రజలను పురిగొల్పారన్న కారణంపై గుంటూరులో గొల్లపూడి సీతారామశాస్త్రికి శిక్ష విధించారు. చిత్తూరు జిల్లా కాళహస్తిలోని యేర్పేడు ఆశ్రమానికి చెందిన టి. కనకయ్యకు కఠిన శిక్ష విధించారు. విజయనగరంలో ప్రభుత్వంపట్ల ధిక్కారధోరణి ప్రదర్శించారన్న కారణంపై ఎ.వి.ఆర్. దీక్షితులు, జె. ఎల్. నరసింహం, సాంబమూర్తి, పరమహంస, ఎ. సింహాచలం, వి. రంగనాథం, వి. సత్యనారాయణ, మాధవశాస్త్రి జైలుపాలు చేయబడ్డారు.

జనవరి 13న ఏలూరులో వీరమాచినేని వెంకట నారాయణ, టి. ప్రకాశరావు, కొమ్మారెడ్డి సూర్యనారాయణ, మాగంటి సీతారామదాసు, పేరిరాజు, గరికిపాటి జోగయ్య, ఎమ్.పి. చంద్రశేఖరరావులు, పాలకొల్లులో బి. రామచంద్రరావు, గుంటూరు జిల్లాలో మంతెన వెంకటరాజు, యనమండ్ర వెంకటప్పయ్య, తణుకులో కొవ్వలి గోపాలరావు, ముదిగంటి జగ్గన్న శాస్త్రి, మానాప్రగడ కృష్ణారావు, బెజవాడలో రాచర్ల నిత్యానందశర్మ వంటివారిని వివిధ నేరాల క్రింద అరెస్టు చేశారు.

శమాత స్వేచ్ఛ కోరుతూ, పోతునూరు మునసబ్ పదవికి రాజీనామా చేసిన సర్దార్ కొమ్మారెడ్డి ఆంజనేయులు, కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తి, మాజేటి రామచంద్రరావులను ఏలూరులోను, కర్నూలు జిల్లా ఆత్మకూరులో దుద్యాల శేషారెడ్డిని జనవరి 14న అరెస్టు చేసి శిక్షలు విధించారు

జనవరి 15 న కృష్ణాజిల్లాలో గొట్టిపాటి బ్రహ్మయ్య, కొల్లిపర సూరయ్య, కొడాలి ఆంజనేయులు లకు రెండేళ్ళ కఠిన శిక్షతో పాటు జరిమానా కూడా విధించారు విజయనగరంలో మూలా వెంకటాంబ, పేకుమళ్ళ మహాలక్ష్మమ్మలకు జైలుశిక్ష విధించారు.

జనవరి 16న మద్రాసులో విదేశీ వస్త్ర బహిష్కరణ ప్రచారం చేసిన నేరానికి కాశీనాధుని నాగేశ్వరరావుకు 6 నెలల శిక్ష, రు 250ల జరిమానా విధించారు. రచయిత టి. శివశంకరశాస్త్రి ఎస్ రామస్వామి చౌదరి, టి. కుటుంబరావులకు జైలు శిక్షలు విధించారు.

జనవరి 17న తణుకులో కొవ్వలి కనకమ్మ, కృష్ణా జిల్లాలో అబ్బూరి మల్లిఖార్జునరావు, కాజ బసవయ్య వివిధ శిక్షలకు గురయ్యారు.

కాకినాడలో గాంధీ అరెస్టుకు నిరసనగా, జిల్లా కోర్టు కార్యాలయాన్ని మూసివేసిన నేరానికి జనవరి 18న పళ్ళంరాజును నెలరోజులపాటు జైలులో నిర్బంధించి, రు. 200ల జరిమానా విధించారు.

## విచ్చలవిడిగా పోలీసుల దాడులు : సోదాలు

ఒక వైపున సత్యాగ్రహులను పెద్ద ఎత్తున అరెస్టు చేసి, శిక్షలు విధించడంతో పాటు, ఉద్యమానికి వివిధ రకాలుగా చేయూత నిస్తున్న సామాన్య ప్రజలను భయభ్రాంతులను కావించడానికి పోలీసులు విచ్చలవిడిగా దాడులు జరిపి, సోదాలు చేసే కార్యక్రమం చేపట్టారు.

జనవరి 5న తణుకులో ముదిగొండ జగ్గన్నశాస్త్రి ఇంటిపైన, జనవరి 9 న గుంటూరుజిల్లా కాంగ్రెస్ కార్యాలయ భవనంపైన, మద్ది వెంకట రంగయ్య, తల్లావఝుల శివశంకరశాస్త్రి, జొన్నలగడ్డ రామలిం

గయ్య ఇళ్ళపైన, తెనాలిలో చింతమనేని భావయ్య చౌదరి, కల్లూరి చంద్రమౌళి ఇళ్ళపైన పోలీసులు దాడులు జరిపి, సోదా చేశారు. జనవరి 10న విశాఖ పట్నంలో తెన్నేటి విశ్వనాథం, ఇ సూర్యనారాయణ గుప్తాల రికార్డులను పోలీసులు స్వాధీనం చేసు కొన్నారు. జనవరి 12న రాజమండ్రిలో సహకార కేంద్ర బ్యాంకు, తాలూకా సహకార యూనియన్, ఇన్నీసుపేట సహకార అర్బన్ బ్యాంకు, గోదావరి జిల్లా సహకార ఫెడరేషన్ కార్యాలయాలను, పి. గురు మూర్తి, కె.ఎల్. నరసింహారావు, పి. సూర్యప్రకాశ రావు, అరివ ఆదినారాయణ ఇళ్ళను సోదా చేశారు.

## మహిళల వీరోచిత పాత్ర

1932 శాసనోల్లంఘనోద్యమంలో తెలుగు మహి ళలు వీరోచిత పాత్ర వహించారు. ఉదాహరణకు గుడివాడలో వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ నాయ కత్వంలో దిగుమర్తి జానకమ్మ, చుక్కమ్మ, వాసి రె హనుమాయమ్మ, కన్నగర్తి నాగరత్నమ్మ, దు రాల కనకాంబ, దాసరి కృష్ణవేణమ్మ, ఆరెక పూ మాణిక్యాంబ, సుగుణ, మహాలక్ష్మమ్మ చెరు కూరి సౌభాగ్యమ్మ, కోటమర్తి కనకమ్మ, త్రిపుర నేని కౌశల్యమ్మ, వేదాంతం కమలాదేవి, కంభంపాటి మాణిక్యాంబ లిదితరులు 144 వ సెక్షన్ ధిక్కరించి, పికెటింగ్ చేశారు. వీరందరికి సంవత్సరం జైలుశిక్ష విధించారు. మాణిక్యాంబ ఆరుమాసాల పసిబిడ్డను చంకనెత్తుకొని జైలుకు వెళ్ళింది.

## జైళ్ళలో దారుణ పరిస్థితి

ఆనాటి జైళ్ళలో పరిస్థితులు మహాదారుణంగా వుండేవి. స్వాతంత్ర్య సమరయోధులకు పురుగుల కూడు పడవేసేవారు. అదేమిటని అడిగినవారిపై నిరా క్షిణ్యంగా లాఠీచార్జీ జరిపేవారు. వివాహితులైన దేశ భక్తురాండ్రు జైళ్ళలో గాజులు ధరించడానికి వీలు లేకుండా చేశారు. నొసట కుంకుమ దిద్దుకొనడానికి కూడా వారు నోచుకోలేదు. తలకు కొబ్బరినూనె రాసుకొనడానికి అవకాశం లేకుండా చేయడంతో అనేక మంది ఖైదీలు విపరీతమైన తలనొప్పితో బాధపడాల్సి వచ్చింది.

1932 ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించిన మరో మహిళామణి భారతిదేవి రంగా. రేపల్లె, తెనాలి తాలూకాలలోను, కావూరు, పెద్దపల్లి, మంతెన వారి పాలెంలలోను తీవ్రమైన బ్రిటిష్ వ్యతిరేక ప్రచారంచేసి, అరెస్టు అయింది. ఆమెకు సంవత్సరం జైలుశిక్ష, రు. 500 ల జరిమానా విధించారు

## పోలీసుల అమానుష పద్ధతులు

మహిళా కార్యకర్తల విషయంలో పోలీసులు హేయమైన, అమానుషమైన పద్ధతులు అవలంబించి, వారిలోని స్వాతంత్ర్యేచ్ఛను అణచ జూచారు. ఉదా హరణకు గుడివాడలో పికెటింగు సాగిస్తున్న మహిళా సత్యాగ్రహులపైన హోస్ పైపులతో రంగునీళ్ళ, బురదనీళ్ళ వదిలి, వారిని ఉక్కిరి బిక్కిరి చేశారు. వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ ఊపిరాడక, స్పృహ తప్పి పడిపోయింది కూడా.

ఆడ సత్యాగ్రహులను అరెస్టు చేయరాదన్న ప్రభుత్వ నిర్ణయానికి అనుగుణంగా మహిళా సత్యా గ్రహులను తీవ్రంగా లాఠీచార్జీచేసి, నిర్బంధంలోకి తీసుకొని, పోలీసు వ్యాన్‌లోకి ఎక్కించి, సుదూర నిర్మానుష్య ప్రాంతాలకు తీసుకెళ్ళి, అర్ధరాత్రి వేళ వారందరిని అక్కడ వదలివేసే పద్ధతిని పోలీసులు పెద్ద ఎత్తున అనుసరించారు. వారంతా దాదాపు ఇరవై మైళ్ళు కాలినడకను స్వస్థలాలకు చేరవలసి వచ్చేది. గుమ్మిడిదల దుర్గాబాయిని మధుర జైలులో "ఏకాంత వాసం" శిక్ష విధించారు పోలీసులు ఎన్నిహింసలు పెట్టినా, మహిళా సత్యాగ్రహులలో పోరాట దీక్ష ఇసుమంత కూడా తగ్గక పోవడం గమనార్హం.

## విదేశీ మహిళల ప్రశంసలు

1932 ఉద్యమ కాలంలో తెలుగు మహిళలు ప్రద ర్శించిన సాహసం, దీక్షలను ఇంగ్లీషు, ఐరిష్ మహిళా మణులైన శ్రీమతి గ్రేటా కజిన్స్, కుమారి స్లేడ్‌లు ఎంతగానో మెచ్చుకున్నారు. శ్రీమతి గ్రేటాకజిన్స్ మద్రాసు మహాజన సభలో ప్రసంగిస్తూ, మన మహి ళలు సాగిస్తున్న పోరాటం పట్ల తమ సానుభూతిని బాహాటంగా వ్యక్తం చేసింది.

### ఇంటికొక ముద్ద
### గుడిలో విందు

1932 ఉద్యమాన్ని అణచడానికి పోలీసులు కొత్త కొత్త పద్ధతులు ఆచరిస్తుంటే, వాటికి విరుగుడుగా సత్యాగ్రహులు కూడా కొత్త పద్ధతులను చేపట్టారు.

గ్రామాలలో ఉద్యమ ప్రచారం సాగిస్తున్న సత్యాగ్రహులకు ఆశ్రయమిచ్చి, అన్నం పెట్టిన వారిని ప్రభుత్వం అరెస్టు చేసి, కఠినశిక్షలు విధించసాగింది. గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాలో యలమంచిలి వెంకటప్పయ్య, కొత్తపల్లి వెంకటకృష్ణశర్మ, వి. వెంకయ్యలు నాలుగు మాసాలపాటు గ్రామాలలో ఉద్యమ ప్రచారం సాగిస్తూ ఇంటింటికి వెళ్ళి, ఒక్కొక్క ముద్ద చొప్పున సేకరించి, తమ ఆకలితీర్చుకొన్నారు. దీనివల్ల ప్రభుత్వం "దేశభక్తులకు అన్నం పెట్టిన నేరానికి" గ్రామస్థులను అరెస్టుచేసి, శిక్షించలేని పరిస్థితి ఏర్పడింది. ఇంటికొక ముద్దచొప్పున సేకరించిన అన్నాన్ని వారు ఆయా గ్రామాల్లోని దేవాలయాలలో కూర్చుని తినేవారు. ఆ సత్యాగ్రహులను వెన్నంటి తిరుగుతున్న ఇద్దరు పోలీసులు కూడా వారితోపాటే ఆ "ముద్దల కూడు" భుజించేవారు.

1931 సెప్టెంబరు 10 న యలమంచిలి వెంకటప్పయ్య సత్యాగ్రహ బృందం మైనేని వారి పాలెంలో గీతకు ఉపయోగిస్తున్న ఈత చెట్లవద్ద పికెటింగ్ చేస్తుండగా, 14 మంది పోలీసులు రేపల్లెనుంచివచ్చి 7 పైగా లాఠీ దెబ్బలు కొట్టడంతో ఆ ముగ్గురు సత్యాగ్రహులు స్పృహతప్పి పడిపోయారు. ప్రజలు వారికి రెండు రోజులపాటు శుశ్రూషచేసిన తరువాత గాని వారు కోలుకోలేదు.

1932 ఫిబ్రవరి వరకు ఈ బృందం గ్రామాలలో ప్రచారం సాగించగా చివరకు ఫిబ్రవరి మాసాంతంలో అరెస్టుచేసి 29-3-32 న ఈ ముగ్గురికి ఆరుమాసాల జైలుశిక్షలు విధించారు.

### జాతీయ వారోత్సవాలు

ఉధృతంగా సాగుతున్న ఉద్యమంలో భాగంగా 1931 ఏప్రిల్ రెండవవారంలో జాతీయ వారోత్సవాలు రాష్ట్రమంతటా పెద్దఎత్తున నిర్వహించబడినవి. బెజవాడ పట్టణమంతా జాతీయ పతాకాలను ఎగురవేశారు. తెనాలిలో పికెటింగ్ చేస్తూ కన్నెగంటి సూర్యనారాయణ, రాలపల్లి మురహరిరావు,వాసిరెడ్డి మృత్యుంజయరావు, రామచంద్రరావులను పోలీసులు పేము బెత్తాలతో బాది, అదుపులోకి తీసుకొన్నారు కృష్ణా జిల్లా అంగలూరు గ్రామంలో ఎగురవేసిన జాతీయ పతాకాలను గుడివాడ నుండి వచ్చిన పోలీసులు పెరికివేశారు. గుంటూరుజిల్లా కోర్దులో మాడభూషి వెంకటాచారి, పి సుబ్రహ్మణ్యం కరపత్రాలను పంచి, సంచలనం సృష్టించారు మరొక ఇరువది వాలంటీర్లు త్రివర్ణ పతాకాలు చేబూని, త్రివర్ణ బాడ్జిలు ధరించి, నిర్భయంగా వీధులలో తిరిగారు. వీరందరినీ పోలీసులు అరెస్టు చేశారు. కృష్ణాజిల్లా ముదునూరులో జాతీయ వారోత్సవం జరిపిన అన్నె అంజయ్య, మామిడి సూర్యప్రకాశం, బోనాల రామలింగయ్యలను పోలీసులు అరెస్టు చేశారు నెప్పల్లి గ్రామంలో జాతీయవారోత్సవం జరిపి, చెరుకూరు విజయమ్మ, చలసాని రామచంద్రరావు జైలుశిక్షలు పొందారు.

### ఢిల్లీ రాజకీయ సభ
### ఆంధ్ర ప్రతినిధుల అరెస్టు

శాసనోల్లంఘనోద్యమాన్ని తీవ్రతరం చేయడానికి ప్రభుత్వనిషేధాజ్ఞలను పమ్మచేస్తూ, రహస్యంగా రాజకీయ మహాసభలు జరపాలని జాతీయ నాయకత్వం నిర్ణయించింది. ఆ మేరకు జాతీయ, రాష్ట్ర, జిల్లా, తాలూకా స్థాయిలలో మహాసభలు జరిగాయి.

ఢిల్లీలో చాందినీ చౌక్ వద్ద రహస్యంగా 500మంది ప్రతినిధులతో జరిగిన జాతీయస్థాయీ రాజకీయ మహాసభకు ఆంధ్రదేశం నుంచి కొండా వెంకటప్పయ్య, ప్రతాప సుబ్బరామయ్య, ఉప్పల కృష్ణయ్య, వీరమాచనేని రామకోటయ్య, పొన్నలూరి రాధాకృష్ణమూర్తి, కాట్రగడ్డ శ్రీనివాసరావు, చెన్నుపాటి మురహరిరావు, మొవ్వా ఆదినారాయణ, ఉన్నవ లక్ష్మీబాయమ్మ, అయాచితుల లక్ష్మీనరసింహశర్మ, జా సూర్యనారాయణ, భాగవతుల సుబ్బరామయ్య, సుంకర వెంకట సుబ్బారావు హాజరై అరెస్టు అయ్యారు.

### మహిళల అధ్యక్షతన జరిగిన రహస్య రాజకీయ మహాసభలు

ఢిల్లీలో జరిగిన రహస్య రాజకీయ మహాసభ అనంతరం, ఆంధ్రదేశంలో జరిగిన రాష్ట్ర, జిల్లాల,

తాలూకాల రహస్య రాజకీయ మహాసభలన్నింటికీ మహిళలే అధ్యక్షత వహించడం విశేషం.

జూన్ 5వ గుంటూరులో జరగవలసిన రాష్ట్ర రాజకీయ మహాసభను విఫలం కావించడానికి పోలీసులు ముందుగానే, జూన్ 2, 3, 4 తేదీలలోనే కొండా వెంకటప్పయ్యతో సహా అనేక మంది ప్రముఖులను అరెస్టుచేశారు. అయినప్పటికీ, గుంటూరు అగ్రహారంలో వేదాంతం కమలాదేవి అధ్యక్షతన రాజకీయ మహాసభ జరిగింది. రాష్ట్రమంతటినుంచి 60 మంది ప్రతినిధులు ఆ మహాసభకు హాజరయ్యారు. రామినేని అప్పయ్య అధ్యక్షతన ఏర్పడిన ఆహ్వానసంఘం ఈ రహస్య సభకు అన్ని ఏర్పాట్లు చేసింది. జూన్ 5వ తేదీ తెల్లవారు జామున ప్రారంభమైన ఈ సభ తెల తెలవారుతుండగా, 5-30 గం॥ లకు ముగిసింది. అనంతరం జరిగిన వూరేగింపులో మహాసభ ప్రతినిధులు, వందలాది ప్రజలు పాల్గొన్నారు. ఈ సందర్భంలో 220 మందిని పోలీసులు అదుపులోకి తీసుకొన్నారు. తరువాత వారిలో హెచ్చుమందిని వదిలివేశారు. మహాసభ అధ్యక్షురాలికి, ఆహ్వాన సంఘాధ్యక్షుడికి జైలు శిక్ష విధించారు

జూన్ 26న పసల కృష్ణమూర్తి అధ్యక్షతన జరిగిన పశ్చిమగోదావరిజిల్లా రహస్య రాజకీయ మహాసభలో కాశీపట్నం కొండయ్య పాల్గొన్నారు. జూలై 1న రేపల్లె తాలూకా మహాసభ జరిగింది. జూలై 7న తెనాలిలో జరగాల్సిన గుంటూరు జిల్లా రాజకీయ మహాసభకు ముందుగానే, 44 మంది నుంచి పూచీకత్తును డిమాండ్‌చేస్తూ, శాంతి భద్రతలకై రు. 500 బాండ్ చెల్లించాలని ఉత్తర్వులు జారీ చేశారు.ఇలాంటి ఉత్తర్వులు జారీ అయిన వారిలో కొండా వెంకటప్పయ్య. మద్ది వెంకటరంగయ్య, మంతెన వెంకటరాజు, చలసాని బసవయ్య మున్నగువారు వున్నారు. ఈ సందర్భంగానే గుంటూరులో 25 మందిని, తెనాలిలో 52 మందిని అరెస్టు చేశారు.

జూలై 7న తెనాలిలో జరిగే గుంటూరు జిల్లా రాజకీయ మహాసభకు ప్రతినిధులను రహస్యంగా సమీకరించే నిమిత్తం ఎంతగా వ్యయ ప్రయాసలకు లోనుకావలసి వచ్చిందీ ఈ క్రింది ఉదంతాన్ని బట్టి మనం గ్రహించవచ్చు.

అప్పట్లో తెనాలిలో హైస్కూలు విద్యార్థి అయిన మహబూబ్ ఆదం తన గురువుగారు మంత్రవాది వెంకటరత్నం ఆదేశానుసారం ఒకరాత్రి రామమూర్తి వెంటబయలుదేరాడు. రాత్రి 10 గంటల వేళ మహబూబ్ ఆదంను వెంటనిడుకొని, కాలినడకను రైలే స్టేషనుకు బయలు దేరాడు వారిద్దరు గాడిబావి దరకు చేరేసరికి, ఇద్దరు పోలీసులు సైకిళ్ళపై తమ వెంటాడుతున్నట్టు రామమూర్తి గ్రహించాడు.

వెంటనే రామమూర్తి ప్రక్కనేగల మార్కెట్టు దుకాణాల వరండాలో నేలపై పడుకుని, ఆదంను తన పొట్టమీద పడుకోబెట్టుకొన్నాడు. అక్కడకు వచ్చిన పోలీసులు వాళ్ళిద్దరికోసం గాలిస్తూ ముందుకు సాగిపోయారు. పోలీసుల కన్నుగప్పి, తప్పించుకొన్న పిమ్మట వాళ్ళిద్దరు రైల్వేస్టేషన్‌చేరి,రైలెక్కి నిడుబ్రోలులో దిగారు. అక్కడ ఒక మహిళా ప్రతినిధిని వెంటబెట్టుకొని రామమూర్తి, ఆదం తెనాలికి తిరుగు ప్రయాణమయ్యారు. రామమూర్తి టర్కీటోపీ, షెర్వానీ, పైజమా తొడిగాడు. ఆమహిళ 'బూబమ్మ' వేషంలో ముసుగు ధరించింది. ఆదం పైజమా తొడిగి, ఆ సాహెబ్ 'బూబమ్మ' కొడుకు వేషం వేశాడు. తాత్కాలికమైన 'అమ్మ'ను 'నాన్న'ను అయితానగరప్పాడు సమీపంలో ఒక ఇంట్లోవదిలి ఆదం తెలతెలవారు తుండగా తనదారిన తాను పోయాడు. అనుకున్న ప్రకారం జూలై 7న తెనాలిలో గుంటూరు జిల్లా రాజకీయ మహాసభ తల్లాప్రగడ విశ్వసుందరమ్మ అధ్యక్షతన జరిగింది. అనంతరం తెనాలిలో మహాసభ ప్రతినిధులు వూరేగింపు జరిపారు. పోలీసులు జరిపిన లాఠీచార్జీలో రామమూర్తి తల పగిలింది, రామమూర్తి తమిళుడు. హోమియో వైద్యం చేసేవాడు. జూలై 16న రుద్రరాజు బంగారమ్మ అధ్యక్షతన నర్సాపురం తాలూకా మహాసభ, జూలై 23న తల్లాప్రగడ ప్రకాశ రాయుడు అధ్యక్షతన భీమవరం తాలూకా మహాసభ, లావు అంకమ్మ అధ్యక్షతన ఆగస్టు 8న బాపట్ల తాలూకా మహాసభ, ఆగస్టు 16న కంబంపాటి మాణిక్యాంబ అధ్యక్షతన తెనాలి తాలూకా మహాసభ. ఆగస్టు 26న ఉేకుమళ్ళ బుచ్చిరామాయమ్మ అధ్యక్షతన కైలాస పట్నంలో విశాఖపట్నం జిల్లా మహాసభ, సెప్టెంబరు 26న

బవనం తిరుమలమ్మ అధ్యక్షతన నెల్లూరు జిల్లామహా సభలు జరిగాయి.

## అఖిల భారత ఖైదీల దినోత్సవం

జూలై 4వ తేదీన రాష్ట్రమంతటా అఖిలభారత ఖైదీల దినోత్సవం పాటించబడింది. కృష్ణాజిల్లాలో ఈ దినోత్సవం పెద్దఎత్తున జరిపారు. బెజవాడ చుట్టు ప్రక్కల గ్రామాలలో బులెటెన్‌లు విస్తృతంగా పంచారు. వాలంటీర్లు పోలీసు ఉన్నతాధికారులకు కూడా ఈ బులెటెన్‌లను స్వయంగా యిచ్చే సాహసం ప్రదర్శించారు. జాతీయ గేయాలు పాడుతూ, ఊరేగింపులు జరిపారు. ఆ ఊరేగింపులపై పోలీసులు పలు చోట్ల తీవ్రంగా లాఠీ చార్జీలు జరిపి అనేక మందిని అరెస్టు చేశారు.

## సాముదాయక జరిమానాలు

శాసనోల్లంఘన ఉద్యమంలో ప్రజా బాహుళ్యం విస్తృతంగా పాల్గొంటున్న గ్రామాలపై కక్ష కట్టిన ప్రభుత్వం, ఉద్యమాన్ని దెబ్బ తీయడానికి ప్యునిటివ్ పోలీసు దళాలను ఆ గ్రామంలో ఏర్పాటుచేసి, సామూహిక జరిమానాలు విధించారు. కృష్ణాజిల్లా వెంట్రప్రగడ గ్రామంలో తిష్ట వేసిన ప్యూనిటివ్ పోలీసుదళం జరిపిన దారుణమైన లాఠీఛార్జీలో మద్దుకూరి చంద్రశేఖరరావు రక్తం కక్కారు. ఆ గ్రామంపై రు. 4 వేల సామూహిక జరిమానా విధించి, వసూలు చేశారు. దోకిపర్రుకు చెందిన పామిరెడ్డి వెంకటసుబ్బారావు ఆస్తిని జప్తు చేశారు. బందరులో నండూరి బాపనయ్య బ్యాంకి డిపాజిట్లను స్వాధీనం చేసుకొన్నారు.

## పత్రికలు, ప్రెస్సులపై ఆంక్షలు

1930–32 స్వాతంత్ర్య సమర కాలంలో పత్రికల పైన, ముద్రణాలయాలపైన రకరకాల నిర్బంధాలు విధించారు. 'బనోడా సత్యాగ్రహ విజయం' ముదిగంటి జగన్నశాస్త్రి రచించిన "భారత స్వరాజ్య యుద్ధం" పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంఘం ప్రచురించిన "దరిద్ర నారాయణీయం" దావులూరు పుండరీకాక్షుడు రచించిన "నవయుగ గాంధీ విజయం" కె. వెంకటరామశర్మ రచించిన "పూర్ణస్వతంత్రం" వంటి గ్రంథాల ప్రతులను పోలీసులు స్వాధీనం చేసుకొని వాటిని నిషేధించారు.

ఆ ఉద్యమ కాలంలో "ఆంధ్రపత్రిక"తో సహా మొత్తం 17 తెలుగు పత్రికలకు వార్నింగ్ యిచ్చి, వాటి ప్రచురణ కర్తల నుంచి సెక్యూరిటీ మొత్తాలను ప్రభుత్వం డిమాండ్ చేసింది. జాతీయోద్యమానికి చెందిన కరపత్రాలను ప్రచురిస్తున్నందుకు, ఒక కృష్ణా జిల్లాలోనే మొత్తం 14 ప్రెస్సులను "బ్లాక్ లిస్టు" చేశారు. ఏలూరులో "సత్యాగ్రహి" పత్రికను ముద్రిస్తున్న ప్రెస్‌ను స్వాధీనం చేసుకొని, దాని యజమాని గోవిందాచారికి జైలుశిక్ష విధించారు. ప్రభుత్వం కోరిన సెక్యూరిటీ చెల్లించలేక, గుడివాడ నుంచి వెలువడుతున్న "దరిద్రనారాయణ" పత్రిక ప్రచురణను నిలిపి వేయవలసి వచ్చింది.

## రహస్య పత్రికలు

ఈ విధంగా ప్రభుత్వం పత్రికా స్వేచ్ఛను దారుణంగా భంగ పర్చుతున్నందున, ఉద్యమకారులు కొన్నిచోట్ల రహస్యంగా ప్రెస్సులు నడుపుతూ, పత్రికలు, కరపత్రాలు ప్రచురించారు. పశ్చిమగోదావరి జిల్లానుంచి, 'వీర భారతి' కృష్ణాజిల్లా ముదునూరు సెంటర్ నుంచి 'రేపే' వంటి రహస్య పత్రికలు వెలువడ్డాయి. ఈ రెండు పత్రికల ప్రచురణల ఆచూకీ తీయడం ప్రభుత్వం వల్ల కాలేదు.

## పోలీసు అత్యాచారాలు

1932 ఉద్యమ కాలంలో, పోలీసుజులుం, అత్యాచారాలు మితిమీరిన ఉదంతాలు కొన్ని దేశ దేశాల ప్రజల నిరసనకు గురి కావడం గమనార్హం. తూర్పు గోదావరి జిల్లాలో డి. వై. ఎస్. పి. ముస్తఫా ఆలీ ఖాన్, 'దవ్వల సుబ్బారాయుడు'గా పేరొందిన సబిన్ స్పెక్టర్ బి. సుబ్బారావు, కృష్ణాజిల్లాలో డి.వై.ఎస్.పి. దావూద్‌ఖాన్, సబిన్‌స్పెక్టర్ నీలి వెంకటేశ్వర్లు, లిల్లీపుట్‌గా పేరొందిన సాంటు వంటి పోలీసు అధికారులు మహా దారుణం రాక్షసులవలె సత్యాగ్రహులను హింసించారు.

కాకినాడలో బులుసు సాంబమూర్తిని దవ్వల సుబ్బారాయుడు అమానుషంగా లాఠీఛార్జీ చేసి, స్పృహ తప్పి పడిపోయేవరకు చావమోదాడు. అలాగే డి. వై. ఎస్. పి. ముస్తఫాఆలీఖాన్ రాజమండ్రిలో నాళం భీమ

రాజు ఇంటిలో వున్న డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంను బయటకు పిలిచి, నిష్కారణంగా తన చేతిలోని లాఠీతో చావమోదుతూ "ఏరా, ఎక్కడ నీ గాంధీ ? ఇప్పుడు వచ్చి నిన్ను రక్షిస్తాడా ?" అని దుర్భాషలాడుతూ, క్రింద పడవేసి బూటుకాళతో ప్రక్క ఎముకలు విరిగేటట్టు తన్నాడు. ఆ దౌర్జన్యం ఫలితంగా డాక్టరు సుబ్రహ్మణ్యం ఊపిరితిత్తులు కూడా దెబ్బ తిన్నాయి.

ఇదే డి. వై. ఎస్. పి. తరువాత తూర్పు గోదావరి జిల్లా గ్రామాలలో విదేశ వస్త్ర విక్రయానికి వ్యతిరేకంగా పికెటింగ్ చేస్తున్న కాశీభట్ల జగన్నాథం వంటివారిపై ఖాదీ దుస్తులు వలిపించి, విదేశ వస్త్రాలు ధరించమని నిర్బంధిస్తూ, చిత్రహింసలు పాల్పేశారు. ఆయనఖాదీ దుస్తులను తగలబెట్టాడు. ముస్తాఫాఆలీఖాన్ కొట్టే ప్రతి లాఠీదెబ్బకు ఆ సత్యాగ్రహి "గాంధీ.... గాంధీ" అని ఉచ్చరిస్తూ, మొక్కవోని మనోస్థైర్యాన్ని ప్రదర్శించాడు. బేయ్‌నెట్‌తో ఆ సత్యాగ్రహి నోరు బలవంతాన తెరిపించిన, ఆ దుర్మార్గుడు ఆయన నోట్లో సారా పోశాడు. ఈ అత్యాచారానికి పాల్పడినందుకు, మద్రాసు హైకోర్టు ముస్తఫా ఆలీఖాన్‌ను గర్హిస్తూ, జరిమానా విధించింది.

## వామనాకారుడు : లిల్లీపుట్ !

వామనాకారుడైన సత్యాగ్రహి పోడూరు పేర్రాజు మీసాలు పట్టుకొని గుంజిన లిల్లీపుట్ సార్జంట్ "యు ఆర్ లిల్లీపుట్, ఐయామ్ లిల్లీపుట్" అంటూ కోతిలాగ చిందులు తొక్కుతూ ఆ స్వాతంత్ర్య సమర యోధుడిని తీవ్రంగా లాఠీతో చావబాది జైలు శిక్ష వేయించి, నెల్లూరు జైలుకు పంపించాడు.

## ఇండియా లీగ్ ప్రతినిధివర్గం రాక

మహాత్మాగాంధీ నాయకత్వంలో సాగుతున్న భారత స్వాతంత్ర్య పోరాటం ప్రపంచ ప్రజల దృష్టిని ఆకర్షించే స్థాయికి చేరింది. లండన్‌లోని ఇండియాలీగ్ భారతదేశంలో స్థితి గతులను పరిశీలించి, నివేదిక సమర్పించవలసిందని కోరుతూ బెట్రండ్ రసెల్ అధ్యక్షతన ఒక ప్రతినిధి వర్గాన్ని భారత దేశానికి పంపింది. ఆ ప్రతినిధివర్గంలో హెరాల్డ్ లాస్కీ, ఎలెన్ విల్కిన్‌సన్, మోనికా వాట్‌లే, ఎల్. డబ్ల్యు. మాటర్సు, కృష్ణమీనన్ మున్నగువారు సభ్యులుగా వున్నారు. ఆగస్టులో భారతదేశానికి వచ్చిన ఆ ప్రతినిధివర్గం సెప్టెంబరు 4 న ఆంధ్రదేశానికి వచ్చారు. మాగంటి బాపినీడు ఆ ప్రతినిధివర్గం వెంట వుంటూ సహాయం చేశారు. బెజవాడ, గుంటూరు, ఏలూరు, రాజమండ్రి, విశాఖపట్నం వంటి ప్రాంతాలను సందర్శించిన ఆ ప్రతినిధి వర్గం అనేక బహిరంగ సభలలో ప్రసంగాలు చేసి, రైతులను హరిజనులను స్వయంగా కలసి, అనేక విషయాలు అడిగి తెలుసుకున్నారు. ఆ ప్రతినిధివర్గం ఆంధ్రదేశంలో పర్యటిస్తున్నన్ని రోజులూ పోలీసులు "బుద్ధిమంతుల" వలె "పెద్దమనుషుల" వలె ప్రవర్తించడం గమనార్హం. బెజవాడలో పోలీసుల అధీనంలో గల "ఆంధ్రరత్న భవనాన్ని" తిరిగి ఆక్రమించడంకోసం సెప్టెంబరు 5 న సత్యాగ్రహులు పునః ప్రయత్నం చేయడం, వారిపై లాఠీఛార్జి జరపకుండా, అరెస్టు చేయడం ఇందుకు ప్రత్యక్ష నిదర్శనం. గుంటూరు ఆంధ్ర క్రిష్టియన్ కాలేజి ఆవరణలో జరిగిన బహిరంగ సభలో ఇండియా లీగ్ ప్రతినిధివర్గం సభ్యులు మోనికా వాట్‌లే ప్రసంగిస్తూ, "భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వం చేస్తున్న పనిని బట్టి, బ్రిటిష్ జాతిని మొత్తంగా నిందించవద్ద"ని భారత ప్రజలకు విజ్ఞప్తి చేసింది. ఆ ప్రతినిధివర్గం రిపోర్టు, రసెల్ పీఠికతో "భారత దేశంలో పరిస్థితి" పేరుతో గ్రంథంగా వెలువడింది.

## కమ్యూనల్ అవార్డు

భారత జాతి ఏకోన్ముఖంగా బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా పోరాట రంగంలోకి దుముకుతున్నదని గ్రహించిన, ఆంగ్లేయులు "విభజించి, పాలించే" తమ నీతికి అనుగుణంగా, హరిజనులకు ప్రత్యేక నియోజక వర్గాలను ఏర్పాటుచేసే కమ్యూనల్ అవార్డును 1932 ఆగస్టు 17 న ప్రకటించారు.

ఆంధ్రదేశంలో ఆ కమ్యూనల్ అవార్డుకు వ్యతిరేకంగా హరిజన ప్రముఖులు పలువురు బీరపోగు సుబ్బయ్య, మంగళగిరి రాఘవదాసు, పరవస్తు దాసు, గంగాధర శివ, దేవేంద్రుడు, కుసుమ ధర్మయ్య వంటివారు నెల్లూరు, గుంటూరు, ఏలూరు, రాజమండ్రి, కాకినాడ, బందరు, గుడివాడ, మున్నగు చోట్ల హరి

జన సదస్సులు జరిపి, ఉమ్మడి నియోజకవర్గాలను ఏర్పాటుచేయాలని కోరుతూ తీర్మానించారు.

ఆంగ్లేయుల కుట్రలోని ప్రమాదాన్ని గ్రహించిన మహాత్మా గాంధీ సెప్టెంబరు 20 న ఆ కమ్యూనల్ అవార్డుకు నిరసనగా నిరాహారదీక్ష ప్రారంభించాడు.

గాంధీజీ నిరశనదీక్ష ప్రారంభించిన రోజున ఆంధ్ర దేశ మంతటా కాంగ్రెసు వాదులు నిరాహార దీక్షా దినంగా పాటించి, హర్తాళ్లు జరిపారు. అంట రానితనం పాటించబోమని ప్రతిన చేశారు. అందుకు నాందిగా అనేకచోట్ల హరిజనులను గ్రామ బావులలో నీళ్ళు తోడుకో నిచ్చారు.

హరిజన నాయకుడు డాక్టరు అంబేద్కర్‌తో సంప్ర తింపులు జరిపిన జాతీయ నాయకులు సెప్టెంబరు 24 న ఒక ఒప్పందానికి వచ్చారు. ఆ ఒప్పందం ప్రకారం హరిజనులకు 71 స్థానాలకు బదులు 148 స్థానాలను ఉమ్మడి నియోజకవర్గాలలో కేటాయించాలని అంగీ కారం కుదిరింది. బ్రిటిష్ ప్రభుత్వం కూడ అందుకు అంగీకరించవలసి వచ్చింది. సెప్టెంబరు 26 న మహాత్మాగాంధీ నిరాహారదీక్ష విరమించాడు

## బరంపురం కాల్పులు

బరంపురంలో మితిమీరిన పోలీసు జులుంకు వ్యతి రేకంగా ప్రజలు తిరగబడ్డారు 1932 జనవరి 15 న పికెట్ చేస్తున్న వాలంటీ వట్ల పోలీసులు ప్రవర్తి స్తున్న తీరు చూసి, హించలేని ప్రజలు రాళ్ళు రువ్వారు. పోలీసులు ప్రజలపై తీవ్రమైన లాఠీఛార్జీ చేశారు. చెల్లాచెదురైన ప్రజలు తిరిగి సమీకృతులై, పోలీసులపై తిరిగి రాళ్ళ వర్షం కురిపించారు. అప్పుడు పోలీసులు తుపాకులు పేల్చగా అనేకమంది గాయ పడ్డారు.

## గాంధీ విడుదల : ఉద్యమం విరమణ

1933 మే 8 న ప్రభుత్వం మహాత్మాగాంధీని విడుదల చేసింది, 1933 జూలై 14 న శాసనోల్లంఘ నోద్యమాన్ని తాత్కాలికంగా నిలుపుచేస్తూ జాతీయ నాయకత్వం ని యించింది.

## వి వకారుల చర్చలు

## కాకినాడ కుట్రకేసు

మహాత్మాగాంధీ సాగిస్తున్న అహింసాయుత పోరాట పద్ధతుల పట్ల అపనమ్మకం కల్గిన యువకులు కొందరు విప్లవ సంస్థలను ఏర్పాటుచేయడానికి ఉద్య మించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, తీవ్ర మైన లాఠీదెబ్బలు తిన్న ప్రతివాద భయంకరాచారి (వెంకటాచారి) గాంధీ - ఇర్విన్ ఒప్పందం కుదిరిన వెంటనే కాకినాడలో విప్లవ కార్యక్రమం మొదలు పెటాడు. బాంబులు ప్రయోగించి హింసా పద్ధతులు చేప డంద్వారా మాత్రమే ఆంగ్లేయులను పారద్రోలడం సాధ మన్న నమ్మకంతో ప్రతివాద భయంకరాచారి అనే మంది విద్యార్థులను తన విప్లవసంస్థలో సభ్యులుగా చేర్చారు. కె. కామేశ్వరశాస్త్రి, సిహెచ్. నరసింహా చారి, ఓరుగంటి వెంకట సుబ్బయ్య కుమారుడు ఓరుగంటి రామచంద్రయ్య (ఆంధ్ర యూనివర్శిటీ హిస్టరీ ప్రొఫెసర్‌గా రిటైర్ అయ్యారు) సిహెచ్. అప్పారావు, సిహెచ్. రామమూర్తి, వి. సుందరం, నండూరి నరసింహాచారి ప్రభృతులు నరరూప రాక్షసు లుగా ప్రవర్తిస్తున్న పోలీసు అధికారులు ముస్తాఫా అలీఖాన్, దప్పుల సుబ్బారావు లను నఫా చేయ డానికి ప్లాను వేశారు. ఆ ప్లాను ప్రకారం బొంబాయి, కలక పుదుచ్చేరిల నుంచి ఆయుధాలు, ప్రేలుడు పదా సిహెచ్.ఎన్. చారి అండ్ సన్స్, కాకి డ చిరునామాకు ర వా ణా చేయించారు. బాంబులు విసరి ముస్తాఫాఅలీని, దప్పుల సుబ్బా రావును నఫా చేయాలని భయంకరాచారి ప్రభృతులు 1933 ఏప్రిల్ 6 వ తేదీ రాత్రి, తిరిగి ఏప్రిల్ 14 వ తేదీ రాత్రి ప్రయత్నించి, విఫలులయ్యారు. మరునటి రోజున పట్టపగలే ము స్తఫా అలీని హతమార్చాలన్న దృష్టితో ఏప్రిల్ 15 వ తేదీ తెల్లవారు ఝామున ఒక తువాలులో చేతి బాంబులు మూటకట్టి, కాకినాడ రేవులో ఒక పడవలో దాచి, ప్రక్కనే గల హోటల్‌కు విప్లవ కారులు వెళ్ళగా, ఆ సమయంలో ఒక కూలీ కుతూ హలం కొద్దీ పడవలోని ఆ మూట విప్పాడు. ఒక బాంబు ప్రేలింది. ఆ కూలీ స్పృహ తప్పిపడిపోయాడు. వెంటనే పోలీసులు రంగంలోకి దిగి, భయంకరాచారి ట్రంకు పెట్టెను స్వాధీనం చేసుకోగా, బాంబుల తయా రీకి ఉపయోగించే ప్రేలుడు పదార్థాలు బయటపడ్డాయి. భయంకరాచారి నైజాం సంస్థానంలోకి పారిపోయాడు.

తరువాత దప్పుల సుబ్బారావు కాజీపేట రైల్వే స్టేషన్‌లో భయంకరాచారిని అరెస్టు చేశాడు, ఆ దళంలో మిగతా విప్లవకారులు కూడా పట్టుబడ్డారు. కాకినాడ

కుట్ర కేసులో ప్రతివాద భయంకరాచారికి జైలుశిక్ష విధించి, అండమాన్ జైలుకు పంపారు. మిగతావారికి వివిధ రకాల శిక్షలు విధించారు. ఓరుగంటి వెంకట సుబ్బయ్య, ఆయన సతీమణి అప్పుడు జైలులో శిక్షలు అనుభవిస్తున్న దృష్ట్యా వారి కుమారుడు, కాకినాడ కుట్ర కేసులో ముద్దాయి అయిన ఓరుగంటి రామ చంద్రయ్య మైనరు కావడంవల్ల ఆ యువకునికి జైలు శిక్ష విధించి, బోర్‌స్టల్‌స్కూల్‌కు పంపారు.

## హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ

1933 మార్చి 10 న మద్రాసులో "హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ" అనే మరో విప్లవ సంస్థ ఏర్పడింది. తిరుచునాపల్లి జైలులో శిక్షలు అనుభవిస్తున్న సత్యాగ్రహులు కొందరు కలిసి, ఈ విప్లవ సంస్థ స్థాపనకు తీర్మానించారు. ఆయుధాలు సేకరించి, బాంబులు, తుపాకులు తదితర ఆధునిక అస్త్రాలు ప్రయోగించడం ద్వారా, అవసరమైతే దోపిడీలు, హత్యలు కూడా జరుపుతూ, విప్లవ పద్ధతులలో దేశానికి స్వాతంత్ర్యం సాధించడం విప్లవ సంస్థ లక్ష్యంగా నిర్ణయించారు. ఈ సంస్థలో ఆంధ్రులైన కానూరు రామానందచౌదరి, ఎమ్. సభాపతి, బి. జోసెఫ్, కె. అరుణాచలం, కె. గోపాలశాస్త్రి, జి. బాలకృష్ణారెడ్డి, బి. బలరామరెడ్డి, ఆర్. ఆదిశేషయ్య, బి. బాపిరాజు, డి. దశరథరామరెడ్డి మున్నగు వారు సభ్యులుగా చేరారు.

ఈ సంస్థ రాష్ట్ర ఆర్గనైజర్లుగా ఆంధ్రదేశానికి కానూరి రామానందచౌదరి, తమిళనాడుకు రంగరాజు, కర్నాటకకు కృ కుమార్ నియుక్తులయ్యారు. ఈ వి వకారులు మ సులోని మైలాపూర్ ఇంపీరియల్ బా ంకి దోపిడీకి చే న ప్రయత్నం విఫలమైంది. అలాగే వా గుండాలమ్మ మునసబ్ యింటిని దోపిడీ చేయటానికి చేసిన ప్రయత్నం కూడా నెరవేరలేదు. పోలీసులు ఈ విప్లవకారులందరినీ అరెస్టు చేసి కఠినశిక్షలు విధించారు.

## జైలులో 72 రోజులు నిరశనం పాటించిన తెలుగు యోధుడు

మద్రాసు కుట్రకేసులో నాలుగేళ్ళ కఠిన కారాగార శిక్ష పొందిన కానూరి రామానంద చౌదరి జైలులో 72 రోజులపాటు నిరాహార దీక్ష సాగించి, జైలు అధికారులను లొంగదీసి, విజయం సాధించాడు.

1930-33 మధ్యకాలంలో జరిగిన ఉప్పు, శాసనోల్లంఘన ఉద్యమాలలో గుంటూరు జిల్లాకు చెందిన 191మంది స్వాతంత్ర్య సమరయోధులు, కృష్ణాజిల్లాకు చెందిన 112 మంది సమరయోధులు జైలుశిక్షలు అనుభవించారు. పశ్చిమ గోదావరిలో 92 మంది, తూర్పు గోదావరిలో 35 మంది, నెల్లూరులో 36 మంది, విశాఖపట్నంలో 19మంది, గంజాంలో 14మంది, అనంతపురంలో 14మంది జైలుకు వెళ్లారు. ఈ ఉద్యమాలలో బ్రాహ్మణులు, కమ్మవారు, క్షత్రియులు, వైశ్యులు, రెడ్లు ప్రముఖ పాత్ర వహించినట్లు మద్రాసు ప్రభుత్వానికి వివిధ జిల్లాల నుంచి అందిన రిపోర్టులను బట్టి తేలింది.

# తెలంగాణాలో ఆంధ్రమహాసభ అవతరణ
# రాజకీయ పోరాటం ప్రారంభం

ఆంధ్రదేశంలో ఉప్పు, శాసనోల్లంఘనోద్యమాలు వెల్లువరూపం దాల్చిన కాలంలో, తెలంగాణాలో ఆంధ్ర జనసంఘం "ఆంధ్ర మహాసభ"గా రూపాంతరంచెంది, ప్రజోద్యమ స్వరూప స్వభావాలను సంతరింపచేసు కొన్నది.

మెదక్ జిల్లా జోగిపేటలో 1930లో సురవరం ప్రతాపరెడ్డి అధ్యక్షతన జరిగిన ఆంధ్ర జనసంఘం మహాసభలో సంస్థ పేరును 'ఆంధ్రమహాసభ'గా మార్చుతూ తీర్మానించారు. ఇదే మహాసభలో ఆంధ్ర మహిళా సమాజం సభను కూడా జరిపారు. ఈ విధంగా ఆంధ్ర మహాసభకు మహిళా విభాగం ఏర్పడింది. 1930 నుంచి 1942 వరకు ఆంధ్ర మహాసభ కాన్ఫరెన్సులతోపాటే, ఏటేటా ఆంధ్ర మహిళా సమాజం కాన్ఫరెన్సులు కూడా జరుగుతూ వచ్చాయి. ధర్మవరంలో జరిగిన తొమ్మిదవ మహిళా మహాసభలో మహిళా సమాజం స్వతంత్ర సంస్థగా రూపొందింది



## 'ఆంధ్ర' అన్నపదమే నైజాం నవాబుకు సింహస్వప్నం

హైదరాబాద్ సంస్థానంవిచ్ఛిత్తికి 'ఆంధ్రమహాసభ" కారణం కావచ్చునని ఆందోళన చెందిన నైజాం ప్రభుత్వం "ఆంధ్ర మహాసభ" పేరును 'తెలుగు మహాసభ'గానో లేక 'తెలంగాణా మహాసభ'గానో మార్చమని చేసిన సూచనలను తెలంగాణా నాయకులు తిరస్కరించారు.



కొత్తపేరుకు తగినట్టుగానే, "ఆంధ్ర మహాసభ" ఆశయాలు, లక్ష్యాలు విస్తృతిని, మరింత విశిష్టతను సంతరింపచేసుకొన్నాయి. అంతవరకు సాంఘిక సాంస్కృతిక విషయాలకే పరిమితమై వున్న స్థితి తొలగి, జాగీర్ భూములలో రైతుల హక్కుల రక్షణ, స్త్రీ విద్య, వేశ్యావృత్తి నిర్మూలన, హరిజనోద్ధరణ, పర్దాపద్ధతి రద్దు, స్థానిక సంస్థలకు ఎన్నికలు జరపమని ప్రాథమిక విద్యను ప్రవేశపెట్టమని కోరడం, బాలికా పాఠశాలల్లో తెలుగులో విద్యాబోధన జరగాలని కోరడం, ఆయుర్వేద వైద్య విద్యాబోధన, తెలంగాణా సరిహద్దుల నిర్ధారణ, సహకార సంస్థల స్థాపన వంటి అంశాలతో కూడిన కార్యక్రమాన్ని ఆంధ్ర మహాసభ చేపట్టింది.

ఆంధ్రుల ఆదర్శాన్ని పాటించి ఆంధ్ర మహాసభ అడుగుజాడలలో నైజాం సంస్థానంలో కన్నడ, మహారాష్ట్ర భాషా ప్రాంతాలలో కన్నడ పరిషత్, మహారాష్ట్ర పరిషత్‌లు 1937లో ఏర్పడ్డాయి.

జాం సంస్థానంలో రాజకీయ శక్తుల పుట్టుకను, పె గుదలను మొగ్గలోనే తుంచివేయాలన్న తుచ్ఛపు బుద్ధి , నైజాం ప్రభుత్వం 1929లోనే ప్రత్యేకంగా "గ 50,53" ఉత్తర్వును జారీచేసింది. ఆ ఉత్తర్వు ప్ర ం, నైజాం సంస్థానంలో ఎక్కడ, ఎవరు ఏ సభ జరిపినా పదిరోజులు ముందుగా ప్రభుత్వ అనుమతిని పొందాలని, చర్చనీయాంశాలేమిటో కూడా ముందుగానే ప్రభుత్వానికి తెలియజేయాలని ఆదేశించారు.

ఒకసారి ఆంధ్రమహాసభ నాయకులు బూర్గుల రామకృష్ణారావు అప్పటి ప్రభుత్వ ఉపకార్యదర్శికి "ఆంధ్ర మహాసభ రాజకీయేతర సంస్థ" అనీ, ప్రధానంగా "అది గ్రంథాలయ ఉద్యమం మాత్రమే "ననీ వివరిస్తుండగా, ప్రక్కనే వున్న పోలీసు కమీషనర్ ఆర్మ్ స్ట్రాంగ్ కలుగజేసుకుని "అయ్యా ! బెంగాలులో నేను గడించిన అనుభవాన్ని బట్టి గ్రంథాలయోద్యమం అంటే ఏమిటో నాకు తెలుసు. అది విప్లవోద్యమం తప్ప మరొకటి కాదు" అని హెచ్చరించాడు.

## "నైజాం కళ్ళలో దుమ్ము"

1927లో ఏర్పడిన ఇత్తెహాదు-ఉల్-ముస్లిమీన్ పార్టీ "ఆంధ్ర మహాసభ ప్రమాదకరమైన ఉద్యమానికి పునాదులు వేస్తూ, పైకి మాత్రం అమాయకతను ప్రదర్శిస్తూ, నైజాం నవాబు కళ్ళలో దుమ్ము కొట్టు"తున్నదని విమర్శించింది.

ఏది ఏమైనా, తెలంగాణా ప్రజలలో రాజకీయ చైతన్యం కల్గించడానికి, ఆంధ్ర మహాసభ కారణమైన దనడంలో సందేహం లేదు. అనతికాలంలోనే అది తెలంగాణా ప్రజల ఆశలకు, ఆశయాలకు ప్రతీకగా మారింది.

ఆంధ్ర మహాసభ రెండవ కాన్ఫరెన్సు 1931లో దేవరకొండలో బూర్గుల రామకృష్ణారావు అధ్యక్షతన జరిగింది. ఈ మహాసభలో అత్యధిక ప్రతినిధులు తెలుగులో ప్రసంగించారు. హైదరాబాద్ సంస్థానంలో తెలుగుభాషా వ్యాప్తికి ఆంధ్ర జనసంఘం చేసిన కృషి ఫలించిన దనడానికి ఇదొక నిదర్శనం.

దేవరకొండ మహాసభ అనంతరం హైదరాబాద్ ప్రభుత్వం ఆంధ్రమహాసభ పట్ల శత్రుత్వ వైఖరి అవలంబించసాగింది. మూడవ మహాసభను జరుపుకొనడానికి మూడేళ్ళ తరవాత గాని, నైజాం ప్రభుత్వం ఆంధ్ర మహాసభకు అనుమతి ఒసగలేదు. 1934లో ఖమ్మంలో పులిజాల వెంకట రంగారావు అధ్యక్షతన మూడవ మహాసభ జరిగింది. 1935లో సిరిసిల్లాలో మాడపాటి హనుమంతరావు అధ్యక్షతన నాల్గవ మహాసభ, 1936లో షాద్‌నగర్‌లో కె.వి. రంగారెడ్డి అధ్యక్షతన అయిదవ మహాసభ జరిగాయి.

## కాకినాడలో తొలి హైదరాబాద్ రాజకీయ మహాసభ

నైజాం సంస్థానంలో రాజకీయ సభలు జరుపుకునే అవకాశం లేనందున, హైదరాబాద్ రాజకీయ మహాసభలన్నీ నైజాం సంస్థానం వెలుపలనే జరుపుకొనవలసి వచ్చింది మాడపాటి హనుమంతరావు, వామన్ నాయక్, రాఘవేంద్రరావు శర్మ వంటివారి కృషి ఫలితంగా 1923 లో కాకినాడలో మాధవరావు ఆణే అధ్యక్షతన తొలి హైదరాబాద్ రాజకీయ మహాసభ జరిగింది. తరువాత రాజకీయ మహాసభలు 1926. 1928, 1939 లలో వరుసగా బొంబాయి, పూనా, అకోలాలలో జరిగాయి.

## చైతన్య వెల్లువకు సంస్కరణ అడ్డకట్ట

హైదరాబాద్ సంస్థానంలో, ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలో 1930 నుంచి రాజకీయ చైతన్యం వెల్లివిరియ సాగింది. ఈ విషయాన్ని నైజాం ప్రభుత్వం గమనంలోకి తీసుకొనక తప్పిందికాదు. ఈ రాజకీయ చైతన్య వెల్లువకు అడ్డకట్టలువేసి, అదుపులో పెట్టడానికి నైజాం నవాబు 1937 లో దివాన్ బహదూర్ అరవముదు అయ్యంగార్ అధ్యక్షతన రాజ్యాంగ సంస్కరణల సూచనకు ఒక కమిటీని ఏర్పాటు చేసింది. అదే సంవత్సరం నిజామాబాద్‌లో జరిగిన ఆంధ్ర మహాసభ కాన్ఫరెన్సులో మొట్టమొదటిసారిగా రాజకీయ తీర్మానాన్ని ఆమోదించారు. హైదరాబాద్ ప్రజా సదస్సు తరపున ప్రభుత్వానికి వినతి పత్రం సమర్పించే అధికారాన్ని ఆ మహాసభ కె.వి. రంగారెడ్డికి దఖలు పరుస్తూ తీర్మానించింది.

## అతివాదం వైపు మొగ్గిన ఆంధ్రమహాసభ

1941 వరకు ఆంధ్ర మహాసభ మితవాద నాయకులైన కె. వి. రంగారెడ్డి, మందుముల నరసింగరావు, మాడపాటి రామచంద్రరావు వంటివారి ప్రాబల్యంలో వుంది. అయితే 1941 లో నల్లగొండ జిల్లా చిలుకూరులో జరిగిన ఆంధ్ర మహాసభ కాన్ఫరెన్సులో అతివాద నాయకులైన రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి వంటి వారిది పైచేయి కావడంతో, తెలంగాణా రాజకీయ పరిస్థితిలో మౌలికమైన మార్పులకు ప్రాతిపదికలు పడినవి

## ఆర్య సమాజం కార్యకలాపాలు

ప్రధానంగా మతపరమైన, సామాజికమైన స్వభావంతో ఏర్పడిన ఆర్యసమాజం ప్రభావం తెలంగాణాపై అంతగా విస్తరించలేదు. దాని కార్యకలాపాలు హైదరాబాద్ నగరానికి, మహారాష్ట్ర, కన్నడ ప్రాంతాలకు మాత్రమే పరిమితమైనవని చెప్పవచ్చు. ఆర్యసమాజ నాయకులైన మహాత్మా నారాయణస్వామి, కేశవరావు కొరాట్కర్, పండిట్ వినాయకరావు విద్యాలంకార్, పండిట్ నరేంద్రజీ వంటి వారంతా ఆంధ్రేతరులే.

1929 లో హైదరాబాద్ సంస్థానంలోని కర్నాటక ప్రాంతంలో సిద్దికే దీన్‌దార్ అనే వ్యక్తి తాను చెన్న బసవేశ్వర అవతారమని, ఇస్లాం లింగాయత్ మతానికి ఆధునిక స్వరూపమని, కనుక అంతా ముస్లిం మతం స్వీకరించాలని ప్రచారం మొదలు పెట్టాడు. "దీన్‌దార్ ఉద్యమం"గా అది పిలువబడింది.ఆ ఉద్యమా

నికి వ్యతిరేకంగా ఆర్య సమాజం పెద్ద ఎత్తున ప్రచారం ప్రారంభించి, నైజాం ప్రభుత్వ కోపాగ్నికి గురయింది. ఈ సందర్భంలో గుల్బర్గా, ధూళిపేట వంటి ప్రాంతాలలో కలహాలు చెలరేగాయి. 1939 లో ఆర్యసమాజం సత్యాగ్రహ ఉద్యమం నడిపింది. వేలాదిమంది ఆ సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు. 1939 లో హైదరాబాద్ ప్రభుత్వం కొన్ని సంస్కరణలు ప్రకటించటంతో ఆర్యసమాజం తన సత్యాగ్రహోద్యమాన్ని విరమించింది.

## హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ స్థాపన

ఆంధ్ర మహాసభ నాయకులైన బూర్గుల రామకృష్ణా రావు, రావి నారాయణరెడ్డి వంటివారి సహాయ సంపత్తులతో స్వామి రామానందతీర్థ 1938 జనవరి 29 న హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌ను ఏర్పాటు చేశారు. పై ముగ్గురితోపాటు, కాశీనాథరావు వైద్య, రామకృష్ణ ధూట్ వంటి వారితో రాష్ట్ర కమిటీ ఏర్పాటయ్యింది. 1938 సెప్టెంబరు 9 న హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ మహాసభను జరపాలని నిర్ణయించారు. ఆ మహాసభను అప్పటి హైదరాబాద్ ప్రధాని సర్ అక్బర్ హైదరీ నిషేధించాడు. ప్రభుత్వ నిర్బంధ విధానానికి వ్యతిరేకంగా సత్యాగ్రహోద్యమం నడపాలని స్టేట్ కాంగ్రెస్ నిర్ణయించింది.

## 1938 సత్యాగ్రహోద్యమం రాజకీయ పోరాటానికి నాంది

హైదరాబాద్ సంస్థానంలో రాజకీయ పోరాటానికి 1938 సత్యాగ్రహోద్యమం నాందీగీతమైంది. పౌర హక్కుల కోసం సాగిన ఈ సత్యాగ్రహోద్యమంలో స్టేట్ కాంగ్రెస్‌తో పాటు ఆర్య సమాజం, ప్రజా మండలులు, హిందూ మహాసభ, హిందూ పౌర హక్కుల సంఘం వంటి సంస్థలు పాల్గొన్నాయి. ఆ విధంగా 1938 సంవత్సరం నైజాం సంస్థానం చరిత్రలో చెరిగిపోని ప్రాధాన్యాన్ని, ప్రాముఖ్యాన్ని సంతరింప చేసుకొన్నదంటే అతిశయోక్తి కాదు.

## 30 ఏళ్ళు ఆలస్యంగా 'వందేమాతరం'

భారతదేశాన్ని ఉర్రూత లూగించిన "వందేమాతరం" ఉద్యమం, దాదాపు 30 యేళ్ళ ఆలస్యంగా హైదరాబాద్ సంస్థానంలో 1938 లో ఉవ్వెత్తున సాగింది.

1938 దసరా ఉత్సవాల సందర్భంలో ఉస్మానియా యూనివర్శిటీ "బి" హాస్టలులోని హిందూ విద్యార్థులు తమ ప్రార్థనా సమావేశ సమయంలో "వందేమాతరం" గేయం పాడటం ప్రారంభించారు. ఇది హాస్టల్ అధికారులకు ఆగ్రహం కలిగించింది. వారు హాస్టల్‌లోని ప్రార్థనా మందిరాన్ని మూసివేశారు అయినా విద్యార్థులు తమ పట్టుదలను వదలక, ప్రార్థనా మందిరం వరండాలోనే "వందేమాతరం" గేయం పాడుకొన సాగారు. ఈ గొడవ చివరకు హిందూ విద్యార్థులను కాలేజీ నుంచి బహిష్కరించే స్థితికి దారితీసింది. 1938 నవంబరు 29 న ప్రో చాన్సలర్ 'బి' హాస్టల్‌లోని హిందూ విద్యార్థులందరిని కాలేజి నుంచి సస్పెండ్ చేసి, సాయంత్రంలోగా హాస్టల్ గదులు ఖాళీ చేయాలని ఆదేశించాడు. దానిపై ఉస్మానియా యూనివర్శిటీ విద్యార్థులంతా సమ్మె ప్రారంభించారు.

## విస్తరించిన విద్యార్థి సమ్మె

ఉస్మానియా యూనివర్శిటీలో ప్రారంభమైన 'వందేమాతరం' సమ్మె నైజాం సంస్థానంలోని ఇతర పట్టణాలకు దావానలంలా వ్యాపించింది.

1938 నవంబరు 29 న ప్రారంభమైన ఈ సమ్మె డిసెంబరు 10 వ తేదీ వరకూ కొనసాగిన ఫలితంగా ఉస్మానియా యూనివర్శిటీ ప్రోచాన్సలర్ ఒక అల్టిమేటమ్ జారీ చేశాడు. సమ్మె చేస్తున్న విద్యార్థులు వెంటనే సమ్మె విరమించి, క్షమాపణ చెప్పకపోతే, వారందరినీ విద్యాసంస్థలనుంచి బహిష్కరిస్తామని హెచ్చరించారు. ఆ హెచ్చరికను విద్యార్థులు పాటించ లేదు. ఫలితంగా డిసెంబరు 12 న 350 మంది ఉస్మానియా యూనివర్శిటీ విద్యార్థులను, 70 మంది సిటీ కాలేజీ విద్యార్థులను, 370 మంది గుల్బర్గా కాలేజీ, హైస్కూలు విద్యార్థులను, 120 మంది మహబూబ్‌నగర్ హైస్కూలు విద్యార్థులను ఆయా విద్యాసంస్థల నుంచి బహిష్కరిస్తూ ఉత్తర్వులు జారీచేశారు. తాము బహిష్కరించిన విద్యార్థులను భారతదేశంలోని ఇతర యూనివర్శిటీలవారు చేర్చుకోరాదని కూడా ఉస్మానియా యూనివర్శిటీవారు ప్రత్యేకంగా ఇంటర్ యూనివర్శిటీ బోర్డుకు విజ్ఞప్తి చేశారు. అయినా, నాగపూర్ యూని

వర్శిటీవారు ఈ విజ్ఞప్తిని పాటించక. నూకల రామ చంద్రారెడ్డి, అమృతరెడ్డివంటి విద్యార్థులను చేర్చు కొన్నారు.

ఈ వందేమాతరం ఉద్యమంలో పి. వి. నరసింహా రావు, హయగ్రీవాచారి, దేవులపల్లి వెంకటేశ్వరరావు, ఆరుట్ల రామచంద్రారెడ్డి, బి. ధర్మభిక్షం వంటివారు ప్రముఖపాత్ర వహించారు.

## ప్రతి లాఠీదెబ్బకు "వందేమాతరమ్" సమాధానం

అదే సమయంలో ఆర్యసమాజం సాగిస్తున్న ఆందోళనలో అరెస్టు అయిన, రామచంద్రరావు అనే సత్యాగ్రహి జైలులో ప్రార్థనా సమయంలో 'వందేమాతరం' గేయం పాడటం మొదలుపెట్టాడు. అందుకు జైలు అధికారులు అభ్యంతరం చెప్పారు. అయినా రామచంద్రరావు "వందేమాతరం" పాడటం ఆపలేదు. దానిపై జైలు అధికారులు ఆయనను జైలు ఆవరణలోకి తీసుకెళ్ళి, లాఠీఛార్జీ మొదలుపెట్టారు. తన వంటిపై పడే ప్రతి లాఠీదెబ్బకు "వందేమాతరం" అంటూ రామచంద్రరావు జవాబు చెబుతూనే వున్నాడు. లాఠీదెబ్బలు ఆయన వంటిపై పడుతూనే వున్నాయి ఆయన వంటి నుండి రక్తం చిమ్ముతూనే వున్నది. స్పృహ తప్పి, నేలకూలేవరకూ ఆయన "వందేమాతరం" అని స్మరిస్తూనే వున్నాడు. అందుకే ఆయన తదాదిగా వందేమాతరం రామచంద్ర రావుగా పిలువబడుతున్నాడు.

## జాతీయ నాయకుల ప్రశంసలు

నైజాం సంస్థానం విద్యార్థులు సాగించిన వందేమాతరం ఉద్యమాన్ని బలపరుస్తూ మహాత్మాగాంధీ, సుభాసుచంద్రబోసు, పండిట్ జవహర్‌లాల్‌నెహ్రూ, సావర్కార్ వంటి జాతీయ నాయకులు సందేశాలు పంపారు.

## స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం

హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ మహాసభ జరపడానికి అనుమతి కోరుతూ 1938 ఆగస్టు 27 న స్వామి రామానంద తీర్థ సత్యాగ్రహం జరిపి అరెస్టు అయ్యాడు. అనంతరం స్టేట్ కాంగ్రెస్ నాయకులు సత్యాగ్రహోద్యమ నిర్వహణకు ఒక కార్యాచరణ సంఘాన్ని నియమించారు. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌ను, కార్యాచరణ సంఘాన్ని కూడా హైదరాబాద్ ప్రభుత్వం అక్టోబర్ 24 న నిషేధించింది.

1938 అక్టోబరు 24 న స్టేట్ కాంగ్రెస్ అగ్ర నాయకులు గోవిందరావు నానల్, రావి నారాయణరెడ్డి, రామకృష్ణ ధూత్, జనార్దనరావు దేశాయ్‌లతోపాటు సత్యాగ్రహోద్యమాన్ని ప్రారంభించి, అరెస్టు అయ్యారు. హైదరాబాద్‌లోని సుల్తాన్‌బజార్ క్లాక్‌టవర్ ప్రాంతం, కాచిగూడా రైల్వే స్టేషన్, అబిద్‌షాపు పోలీస్‌స్టేషన్, ఫతేర్ ఘట్టి ప్రాంతాలలో వారానికి రెండు మూడు సార్లు చొప్పున సత్యాగ్రహ కార్యక్రమాలను నిర్వహించారు. ఈ సత్యాగ్రహోద్యమంలో అరెస్టయిన వారిలో రాజారెడ్డి, అప్పారావు షెల్కార్, కెప్టెన్ జోషి, రాఘవేంద్రరావు, శ్రీనివాసరావు, బద్దం ఎల్లారెడ్డి, ఎన్. కె రావు, దిగంబరరావు బిందూ, పి. వెంకటరావు, హైదరాబాద్‌కు చెందిన ఎమ్. హెచ్. కులకర్ణి, ఖమ్మంమెట్టుకు చెందిన అల్లూరి నరసింహం, శ్రీరాములు, అత్రఫ్‌పాల్దాకు చెందిన కె. ముకుందరెడ్డి, భువనగిరికి చెందిన జి. రామరెడ్డి, రత్నారెడ్డి, కొండారెడ్డి, ఆర్. వి. రంగారెడ్డి. షేక్ నబీసాహెబ్, షేక్ మొయినుద్దీన్, మహబూబ్‌నగర్‌కు చెందిన వెంకటరెడ్డి, అనంక గోవింద కులకర్ణి, ఎమ్. వెంకయ్య, మోతీలాల్, దుర్గయ్య, మల్లారావు, నరసయ్య, శంకరరావు ఖనపుర్కార్, గోపాలశాస్త్రి దేవ్, ఎమ్. రామచంద్రరావు, యల్లాప్రగడ సీతాకుమారి, ప్రేమరాజ్ యాదవ్, మల్లయ్య యాదవ్, ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి, పీరారెడ్డి, కాళోజీ నారాయణరావు మున్నగు

వారున్నారు. మొత్తం 400 మంది సత్యాగ్రహులు 18 దళాలుగా సత్యాగ్రహం చేశారు. ఆఖరి సత్యాగ్రహ దళానికి డిసెంబర్ 24 న 18 వ డిక్టేటర్ కాశీనాథరావు వైద్య నాయకత్వం వహించారు. మహాత్మాగాంధీ సలహా ప్రకారం అంతటితో ఆ సత్యాగ్రహ ఉద్యమాన్ని విరమించారు.

స్టేట్ కాంగ్రెస్ నడుపుతున్న సత్యాగ్రహోద్యమం మతతత్వంతో కూడినదిగా చిత్రించే ప్రమాదం వున్న దృష్ట్యా గాంధీజీ ఆ ఉద్యమాన్ని విరమించాలని సూచించారు. మహాత్మాగాంధీ అభిలాష ప్రకారం ప్రధాని సర్ అక్బర్ హైదరీ సత్యాగ్రహులను విడుదల చేసినా, స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధాన్ని మాత్రం తొలగించలేదు.

భారత ప్రజలతో, హైదరాబాద్ సంస్థానంలోని ప్రజలు, ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలోని తెలుగు ప్రజలు కొంత ముందు వెనకలుగా రాజకీయంగా చైతన్యవంతులవుతూ, పోరాటానికి సన్నద్ధమవుతున్నట్టు హైదరాబాద్ సంస్థానంలో 1938 లో స్టేట్ కాంగ్రెస్, ఆర్యసమాజం, విద్యార్థుల జరిపిన ఉద్యమాలు, సమ్మె పోరాటాల నిరూపిస్తున్నవి.

# ఉద్యమ విరమణతో ఆశాభంగం
## అతివాద శక్తుల పెరుగుదల

1933 జూలై 14 న మహాత్మాగాంధీ శాసనోల్లంఘన ఉద్యమాన్ని విరమిస్తూ చేసిన ప్రకటన దేశ వ్యాప్తంగా ప్రజలలో తీవ్రమైన ఆశాభంగం కలిగించడానికి దారితీసింది. ఈ ఆశాభంగమే ఆంధ్రప్రదేశ్‌లో అనేక రాజకీయ పరిణామాలకు కారణమైంది

### గాంధీజీ నిష్క్రమణ

దేశంలో సోషలిస్టు భావాలు బలపడటం, సోషలిస్టుల పలుకుబడి హెచ్చుతుండటం గమనించిన మహాత్మాగాంధీ 1934 లో కాంగ్రెస్ సంస్థనుంచి నిష్క్రమించాడు. సోషలిస్టులు ప్రకటించిన కార్యక్రమంతో నేను ఏకీభవింపజాలను. కాని, వారి అభిప్రాయాలను ప్రచారం చేసుకొనేందుకు గల స్వాతంత్ర్యమును అపుటకు నేను సిద్ధపడను. కాంగ్రెసులో వారు అధిక సంఖ్యాకులైన, నేను కాంగ్రెసులో ఉండజాలను" అని గాంధీ వివరించాడు. (1934 సెప్టెంబరు 22 వ తేదీ. కృష్ణా పత్రిక)

### ఆంధ్ర కాంగ్రెసులో గొడవ

అంతకు కొద్దిరోజుల ముందు, 1934 సెప్టెంబరు 14 న బెజవాడలోని దుర్గావిలాస్ (ప్రస్తుతం ఆంధ్ర పత్రిక ఆఫీసు) భవనంలో ఆంధ్ర కాంగ్రెస్ కమిటి సమావేశం జరిగింది. ఆ సమావేశంలో కొండా వెంకటప్పయ్యపంతులు గాంధీ నాయకత్వం పట్ల విశ్వాసం ప్రకటించే తీర్మానాన్ని ప్రతిపాదించగా, జొన్నలగడ్డ రామలింగయ్య ఆ తీర్మానాన్ని తీవ్రంగా వ్యతిరేకించాడు. తీర్మానానికి అనుకూలంగా కేవలం ఆరుగురు మాత్రమే ఓటుచేశారు.ఫలితంగా ఆ తీర్మానం వీగిపోయింది. మహాత్మాగాంధీ నాయకత్వంపట్ల ఆంధ్ర కాంగ్రెస్‌లో వున్న విరసనభావం తీవ్రత ఆ విధంగా వ్యక్తమైంది.

ఆనాటి ఆంధ్ర కాంగ్రెసు సంఘ సమావేశం ధోరణి గురించి కృష్ణాపత్రిక సంపాదకీయ వ్యాసంలో ఇలా వ్యాఖ్యానించారు.

"....వృద్ధుల రోజులు అస్తమించినవి, యువకుల రోజు ఉదయించుచున్నవి. భావికాలం వారిది. కాంగ్రెస్ యువకుల హస్తములలో బడునని భీతి చెందవలసిన పనిలేదు. కాంగ్రెసును స్వతంత్రముగ నడుపగల యువసాహసకు లున్నారని సంతసించవలసిన సమయమిది. మహాత్మునికి వీడుకోలిచ్చి యువకులు కాంగ్రెసును స్వాధీనం చేసుకొనెదరు గాక ; భక్తితో వానికి సలాం పెట్టి, దేశమును నడుపు బాధ్యత స్వీకరించెదరుగాక."

(కృష్ణాపత్రిక 22-9-1934)

### గాంధీ ఆంధ్ర పర్యటన

1933 డిసెంబరులో మహాత్మాగాంధీ ఆంధ్రదేశంలో 15 రోజులపాటు పర్యటించి, అంటరానితనం నిర్మూలనావశ్యకతను గురించి ప్రచారం చేశాడు. ఆయన రైళ్ళమీద 1024 మైళ్ళు, కారులో 665 మైళ్ళు, లాంచీలలో 15 మైళ్ళు, కాలినడకన రెండు మైళ్ళు ప్రయాణంచేసి, 76 గ్రామాలను, పట్టణాలను సందర్శించి మొత్తం 6 లక్షల మంది హాజరైన 69 సభలలో ప్రసంగించారు. మొత్తం 15 లక్షల మందికిపైగా ఆయన దర్శనం చేసుకొన్నారు. రు. 59,177 లు నగదు రూపంలో, రు. 9253 లు నగల రూపంలో విరాళాలు వసూరైనవి.

### రంగా రైతు ఉద్యమం

1934 లో ఆచార్యరంగా రైతుజనోద్ధరణకు రైతు రక్షణ సంఘాన్ని ఏర్పాటుచేశారు. రైతు యువకులను చైతన్యవంతం చేయడానికి ఆయన రైతువిద్యాలయాన్ని నిడుబ్రోలులో నిర్వహించారు. ఈ విద్యాలయంలో తర్ఫీదు పొందిన వారిలో గౌతులచ్చన్న, కందుల ఓబులరెడ్డి, పి. తిమ్మారెడ్డి, చేగిరెడ్డి బాలిరెడ్డి, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య మున్నగు వారు వున్నారు.

గాడిచర్ల హరిసర్వోత్తమరావు, వి. రామదాసు పంతులు, కొల్లి సత్యనారాయణ చౌదరి, గుమ్మిడిదల

వెంకట సుబ్బారావు వంటి పెద్దలు, 1935 ఆగస్టు 24న బెజవాడలో సమావేశమై, పూర్ణస్వరాజ్యం కోసం ఆందోళన కొనసాగించే నిమిత్తం ఆంధ్ర స్వరాజ్య పార్టీని స్థాపించారు. పూనా ఒప్పందం ప్రాతిపదికపై కుల, మత విభేదాల నిర్మూలనకు కృషిచేయాలని, రైతుల రుణభారాన్ని క్రమేణా రూపుమాపుతూ వ్యవసాయదారుల స్థితిగతులను మెరుగుపర్చాలని ఆ కొత్త పార్టీ తన లక్ష్యాలుగా ప్రకటించింది.

## కూలీ రక్షణ సమితి

మహాత్మాగాంధీ నాయకత్వం దేశానికి పనికిరాదని భావించిన యువకులైన కాంగ్రెస్ కార్యకర్తలు కమ్యూనిస్టులుగా మారారు. అప్పట్లో కమ్యూనిస్టుపార్టీపై నిషేధంవుంది. కనుక ఆంధ్ర దేశంలో కమ్యూనిస్టు "కూలీ రక్షణ సమితి" పేరుతో కార్మికులను, వ్యవసాయ కూలీలను సంఘటితపర్చేందుకు ఉద్యమించారు.

తొలుత 1935 మార్చిలో గుంటూరులో "కూలీ రక్షణ సమితి" ఏర్పడింది. తరువాత బెజవాడ, నెల్లూరు, తెనాలి, ఏలూరు, భీమవరం వంటి ప్రాంతాలకు ఆ సంఘం శాఖలను విస్తరింప చేశారు. ఆంధ్ర దేశంలో వర్గ సంఘాల నిర్మాణానికి "కూలీ రక్షణ సమితి" పునాదులను వేసిందని చెప్పవచ్చు. కార్మికులలోను, వ్యవసాయ కూలీలలోను, వర్గ చైతన్యం కల్గించే ప్రచారాన్ని ఈ సమితి ముమ్మరంగా సాగించింది.

## సోషలిస్టు పార్టీ పుట్టుక

అంతకుముందే, గాంధీజీ ధోరణితో విసుగు చెందిన అతివాదులు ఆచార్య గోగినేని రంగా నాయకత్వంలో ఆంధ్ర సోషలిస్టు పార్టీని స్థాపించారు. యువతరానికి అతివాద ధోరణికి ప్రాతినిధ్యం వహించే పుచ్చలపల్లి సుందరయ్య, మద్దూరి అన్నపూర్ణయ్య, చంద్ర రాజేశ్వరరావు, క్రొవ్విడి లింగరాజు, కంభంపాటి సత్యనారాయణ (సీనియర్), అల్లూరి సత్యనారాయణరాజు వంటి ప్రముఖులు 1934 జూన్ 23 న బెజవాడలోనే సమావేశమై, ఎన్. జి. రంగా అధ్యక్షులుగా, మద్దూరి అన్నపూర్ణయ్య ప్రధాన కార్యదర్శిగా ఆంధ్ర సోషలిస్టు పార్టీని స్థాపించారు.

## వర్గ సంఘాల నిర్మాణం

స్వరాజ్య సాధనకు, సోషలిస్టు సూత్రాలపై సమాజాన్ని పునర్వ్యవస్థీకరించడానికి అనువైన ప్రజోద్యమాన్ని నిర్మించే నిమిత్తం వర్గ ప్రాతిపదికపై కార్మిక, కర్షక సంఘాలను స్థాపించాలని సోషలిస్టుపార్టీ నిర్ణయించింది. కాంగ్రెసులో సభ్యులైనవారు మాత్రమే, సోషలిస్టు పార్టీలో సభ్యత్వం పొందడానికి అర్హులని, అదే సమయంలో సోషలిస్టు పార్టీలో చేరేవారు మార్క్సిస్టు సిద్ధాంతాల ప విశ్వాసం కలిగినవారై వుండాలని ఈ కొత్త పా నిబంధనావళిలో నిర్దేశం వారు. ఈ పార్టీ కాంగ్రె సోషలిస్టు పార్టీగా పిలువబడింది.

## రాజకీయ పాఠశాలలు

కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ప్రముఖులు ఆంధ్రదేశంలోని యువకులకు, రాజకీయ అర్థశాస్త్ర విషయాలను బోధించడానికి రాజకీయ పాఠశాలలను నిర్వహించే పద్ధతిని రాజకీయరంగంలో ప్రవేశపెట్టారు.

1937 వేసవిలో గుంటూరుజిల్లా కొత్తపట్నంలో తొలి రాజకీయ పాఠశాల నిర్వహించబడింది. ఆచార్య రంగాతో అనేకమంది ప్రముఖులు ఈ స్కూలులో అధ్యాపకులుగా పనిచేశారు. ఈ స్కూలులో విద్యార్థులుగా చేరిన వారంతా ఇంచుమించు ఉత్తరోత్తరా వివిధ రాజకీయ పార్టీల నాయకులుగా రూపొందారు.

## కొత్తపట్నం స్కూలు

అప్పటి మద్రాసు రాష్ట్రంలో అధికారంలో వున్న "నరమంత్రపు" మంత్రివర్గం ఆదేశం ప్రకారం కొత్తపట్నం పాఠశాలకు హాజరైన విద్యార్థులపై తీ మైన లాఠీచార్జీ జరిపి, కేసులు పెట్టడం, ఆ లాఠీ చా లో చంద్ర రాజేశ్వరరావు, అల్లూరి సత్యనారాయ రాజు వంటివారు తీవ్రమైన లాఠీదెబ్బలకు లోను కావటం జరిగింది. 60 మందిని అరెస్టుచేసి కేసులుపెట్టారు. ఈ దురంతాన్ని టంగుటూరి ప్రకాశంపంతులుతోసహా పలువురు కాంగ్రెస్ నాయకులు తీవ్రంగా గర్హిస్తూ ప్రకటనలు జారీ చేశారు.

1938 లో ఆచార్య రంగా చిత్తూరుజిల్లా మదనపల్లెలోను, సోషలిస్టు పార్టీ తరపున గుంటూరుజిల్లా మంతెనవారిపాలెంలోను రెండు రాజకీయ పాఠశాలలు నిర్వహించారు.

## అతివాద పత్రికలు

ఇదే దశలో "జన్మభూమి" "ప్రభ" "నవశక్తి" వంటి అతివాద పత్రికలు వెలువడినవి.

మద్రాసునుంచి ఎన్. జి. ఆచార్య రంగా సంపాదకత్వంలో వెలువడిన 'కానీ' పత్రిక 'జన్మభూమి' రాజకీయంగా పెద్ద సంచలనం కల్గించగా, 'ప్రభ' 'నవశక్తి' వంటి పత్రికలు సోషలిస్టు ఉద్యమ వ్యాప్తికి పెద్ద దోహదం చేకూర్చాయి.

ఇదే దశలో శ్రీశ్రీ విప్లవ ధోరణిలో రచించిన 'మరో ప్రపంచం' వంటి గేయాలు వెలువడినవి. దేశ సంపదలో ప్రజలంతా "సమ భాగస్వాములే" నన్న చైతన్యంతో ముందుకు సాగాలని, నూతన సమాజం నిర్మాణానికి పోరాడాలని ఆ గేయాలు ఉద్బోధించాయి.

## రైతు యువజనోద్యమాలు

కమ్యూనిస్టులు, కాంగ్రెసులోని అతివాదులతో కలసి యువజన సంఘాలను, రైతు సంఘాలను నిర్మించే కృషిని 1935 36 లలో ప్రారంభించారు.

1935 సంవత్సరారంభంలో విశాఖపట్నంలో ఆంధ్ర రాష్ట్ర యువజన ప్రథమ మహాసభ జరిగింది. మల్లింపూడి పళ్ళంరాజు ఆ మహాసభకు అధ్యక్షతవహించాడు. రాష్ట్ర యువజన సంఘం సంయుక్త కార్యదర్శులుగా పుచ్చలపల్లి సుందరయ్య, దాలాంత్రపు సత్యనారాయణ ఎన్నికయ్యారు.

1936 జనవరిలో కాకినాడలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర యువజన ద్వితీయ మహాసభకు జొన్నలగడ్డ రామలింగయ్య అధ్యక్షులుగా, అల్లూరి సత్యనారాయణరాజు కార్యదర్శిగా ఎన్నికయ్యారు. మద్దూరి అన్నపూర్ణయ్య యువజనోద్యమ నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించారు.

కమూనిసులు, సోషలిసులు కలసి కృషిచేసున్న ఆంధ్ర రా ్ర రైతు సంఘానికి అధ్యక్షులుగా కొమ్మారెడ్డి సూ ్యనారాయణమూర్తి, చలసాని వాసుదేవరావు, కార్యదర్శిగా ఎన్నికయ్యారు. వీరిద్దరి నాయకత్వంలో ఇచ్ఛాపురం నుంచి మద్రాసు వరకు రైతు మహాయాత్ర నిర్వహించబడింది.

## కొత్త రాజ్యాంగ చట్టం

బ్రిటిషు ప్రభుత్వం "1935 భారత చట్టం" అమలుపరచడం, భారతదేశ చరిత్రలో రాజ్యాంగపరంగా వచ్చిన ప్రముఖ పరిణామంగా పేర్కొనాలి. 1935 భారత చట్టం ప్రకారం జరిగిన 1937 ఎన్నికలలో కాంగ్రెస్ పా న్నది. అంతకుముందు 1935లో జరిగిన స్థానిక సం ల ఎన్నికలలో కాంగ్రెసు పోటీ చేసి విజయాలు సా ంచింది.

1937 మార్చి 9 న జరిగిన ఆంధ్ర కాంగ్రెసు కార్యవర్గం ఎన్నికలలో పాల్గొనాలని తీర్మానించింది. అంతకుముందే 1936 లోనే పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఉత్తరాంధ్ర జిల్లాలలో విస్తృతంగా ఎన్నికల ప్రచారం జరిపారు. 1937 లో సరోజినీనాయుడు తూర్పుగోదావరి జిల్లాలో ఎన్నికల ప్రచారం చేసింది.

1937 ఎన్నికల పోరాటాన్ని జి పరంగా నిర్వహించిన ఆంధ్ర కాంగ్రెసు కార్యవ ంలో టంగుటూరి ప్రకాశం, అయ్యదేవర కాళేశ్వర- , పట్టాభి సీతారామయ్య, శరణు రామస్వామిచౌదరి, బులుసు సాంబమూర్తి, మాగంటి బాపినీడు బెజవాడ గోపాలరెడ్డి, తెన్నేటి విశ్వనాథం, రామకోటయ్య, పళ్ళంరాజు, ఆర్. శ్రీనివాసులు, కె. వెంకట్రామాచారి, స్వామి నారాయణ మున్నగువారు సభ్యులుగా వున్నారు.

1930 – 1933 మధ్యకాలంలో ఆంధ్రదేశంలో పొంగువారిన స్వాతంత్ర్య పోరాట వెల్లువలో మునిగితేలిన తెలుగు ప్రజలలో రాజకీయ చైతన్యం వెల్లివిరిసింది. దీని ఫలితంగానే, 1937లో మద్రాసు రాష్ట్ర శాసన సభకు జరిగిన ఎన్నికలలో కాంగ్రెసుకు అఖండ విజయం లభించింది. అంతవరకు అధికారం చలాయిస్తూ వచ్చిన జస్టిస్‌పార్టీ నామరూపాలు లేకుండా తుడిచిపెట్టుకు పోయింది. చల్లపల్లి జమిందారు వంటి ఒకరిద్దరు మినహా జస్టిస్‌పార్టీ అభ్యర్థులంతా ఘోర పరాజయం పొందారు

పిఠాపురం జమీందారు స్థాపించిన పీపుల్స్ పార్టీ పుబ్బలో పుట్టి మఘలో అంతరించిపోయింది.

ఈ ఎన్నికల పోరాటంలో కాంగ్రెసులోని మితవాదులు, అతివాదులు ఐక్యంగా కృషిచేశారు. అతివాద వర్గంలో కొత్తగడ్డ వెంకట నారాయణరావు, నరసింహం వంటి ఇద్దరు ముగ్గురు, మద్రాసు శాసనసభకు కాంగ్రెసు అభ్యర్థులుగా ఎన్నికయ్యారు.

## ఐక్యత - సంఘర్షణ

బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, కాంగ్రెసులోని మితవాద, అతివాద వర్గాల మధ్య "ఐక్యత - సంఘర్షణ" 1933 ఉద్యమం, తరువాత నిర్దిష్టరూపం దాల్చింది. ఆంధ్రదేశంలో ఇది మరింత ప్రస్ఫుటంగా వ్యక్తమైంది.

## మద్రాసులో కాంగ్రెస్ ప్రభుత్వం

1937 మార్చి 27న మద్రాసు గవర్నరు రాష్ట్ర మంత్రి వర్గాన్ని ఏర్పాటు చేయవలసిందని కోరుతూ కాంగ్రెసు శాసన సభా పార్టీ నాయకుడు సి. రాజగోపాలాచారికి ఆహ్వానం పంపాడు. రాష్ట్ర గవర్నరు తన ప్రత్యేక అధికారాలను వినియోగిస్తూ, మంత్రుల వ్యవహారాలలో జోక్యం కల్పించుకోబోనని గవర్నర్ హామీ యివ్వ నిరాకరించినందున సి. రాజగోపాలాచారి, మంత్రివర్గం ఏర్పాటుచేయ జాలనని తెలుపడంతో జస్టిస్ పార్టీ నాయకుడు కె. వి. రెడ్డి నాయుడు ఏప్రిల్ 1 న నడమంత్రపు మంత్రి వర్గం ఏర్పాటు చేశాడు. ఆ మంత్రి వర్గం జూలై 13 వరకు అధికారంలో వుంది.

వైస్రాయి లిన్‌లిత్‌గో జూన్ 22న ప్రభుత్వానికి ప్రజలకు మధ్య సహకారం పెంపొందించే విధాన ప్రకటన చేయడంతో, కాంగ్రెసు కార్యవర్గం సమావేశమై మద్రాసులో కాంగ్రెసుమంత్రి వర్గం ఏర్పాటుకు అనుమతించింది. జూలై 14న రాజగోపాలాచారి మంత్రివర్గం పదవీ స్వీకారం చేసింది. ఈ మంత్రి వర్గంలో ఆంధ్రదేశం నుంచి ప్రకాశం, ఎ. వి. గిరి, బెజవాడ గోపాలరెడ్డి, మంత్రులుగాను, అయ్యదేవర కాళేశ్వరరావు, తెన్నేటి విశ్వనాథం, బి. ఎస్. మూర్తి, మాగంటి బాపినీడు, ఎస్. ఎస్. వరదాచారి పార్లమెంటరీ కార్యదర్శులుగాను నియమితులయ్యారు. బులుసు సాంబమూర్తి స్పీకరుగా ఎన్నికయ్యాడు.

రెవెన్యూ మంత్రి ప్రకాశం పంతులు శాసనోల్లంఘనోద్యమంలో ఉద్యోగాలుకోల్పోయిన గ్రామోద్యోగులందరికి తిరిగి ఉద్యోగాలిచ్చాడు. రాజకీయ ఖైదీలనందరినీ విడుదల చేశారు. ఋణభారం నుంచి రైతులను విముక్తం చేయడానికి "మద్రాసు వ్యవసాయ సహాయ బిల్లు"ను అమలు జరిపారు. మద్యపాన నిషేధం నాలుగు జిల్లాలలో అమలుచేశారు. జమీందారీ ప్రాంతాలలో పరిస్థితుల పరిశీలనకు రెవెన్యూమంత్రి ప్రకాశం అధ్యక్షతన ఒక దర్యాప్తు సంఘాన్ని నియమించారు. ప్రెస్‌లు, పత్రికలపై విధించిన సెక్యూరిటీ మొత్తాలను యిచ్చివేశారు.

## పట్టాభి పరాజయం సుభాస్ బోస్ విజయం

1939లో త్రిపుర కాంగ్రెసు అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నిక, కాంగ్రెస్‌లోని మితవాద, అతివాద వర్గాల మధ్య హోరాహోరీ పోరాటంగా పరిణమించింది. మహాత్మా గాంధీ, మితవాద నాయకుడు పట్టాభి సీతారామయ్యను ఎంత గట్టిగా బలపర్చినా ప్రయోజనం లేకపోయింది. అతివాదుల అండదండలతో సుభాసు చంద్రబోస్ అఖండ విజయం సాధించారు. "పట్టాభి ఓటమి నా ఓటమి" అని మహాత్మాగాంధీ అంగీకరించాడు. కాంగ్రెస్ కార్యవర్గం ఏర్పాటు విషయంలో మితవాద నాయకులు, చెప్ప వలనికాని చిక్కులు కల్పించి సుభాసుచంద్ర బోస్ కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా యిచ్చే పరిస్థితి సృష్టించారు కాంగ్రెస్ నుంచి వైదొలగిన సుభాసుచంద్ర బోసు 1939 ఏప్రిల్‌లో ఫార్వర్డుబ్లాకు పార్టీని స్థాపించాడు. సుభాసు చంద్రబోసు స్థానంలో రాజేంద్రప్రసాద్ అధ్యక్షుడయ్యాడు.

ఆంధ్రదేశంలో ఫార్వర్డుబ్లాక్ ఏర్పడింది. ఆంధ్ర ఫార్వర్డుబ్లాక్ శాఖకు మద్దూరి అన్నపూర్ణయ్య, పేట బాపయ్య మున్నగువారు నాయకత్వం వహించారు.

రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం కావడంతో వైస్రాయి లిన్‌లిత్‌గో 1939 సెప్టెంబరు 3వ తేదీన భారతదేశం కూడా బ్రిటన్‌తో పాటు జర్మనీకి వ్యతిరేకంగా యుద్ధంలోకి దిగుతున్నట్టు ప్రకటించాడు. ఇది కాంగ్రెసు నాయకత్వానికి ఎంత మాత్రం నచ్చలేదు. సంపూర్ణ స్వాతంత్ర్యం లేనిదే భారతదేశం జర్మనీ వ్యతిరేక యుద్ధంలో భాగస్వామి కాలేదని కాంగ్రెసు నాయకత్వం స్పష్టంచేసింది. అధినివేశ ప్రతిపత్తి మినహా సంపూర్ణ స్వాతంత్ర్యం ఒసగడానికి బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించలేదు. ఫలితంగా కాంగ్రెసు మంత్రి వర్గాలు రాజీనామా చేయాలని 1939 అక్టోబరులో కాంగ్రెసు కార్యవర్గం నిర్ణయించింది.

ఆ నిర్ణయం ప్రకారం మద్రాసు రాష్ట్రంలో రాజగోపాలా చారి మంత్రివర్గం రాజీనామా చేసింది.

## "క్విట్ ఇండియా" ఉద్యమానికి నాందిగా వ్యష్టి సత్యాగ్రహం

ప్రపంచ యుద్ధంలో భారతదేశం పాల్గొనే విషయంలో బ్రిటిషు ప్రభుత్వానికి, కాంగ్రెసు నాయకత్వానికి విభేదాలు ఉత్పన్నమై, కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా చేసిన దశలోనే ఇంగ్లండులో చేంబర్లిను మంత్రివర్గం స్థానంలో చర్చిల్ మంత్రివర్గం అధికారంలోకి వచ్చింది. కరడు గట్టిన కన్సర్వేటివ్ సర్ విన్‌స్టన్ చర్చిల్ భారత స్వాతంత్ర్యానికి ఆగర్భ శత్రువు.

"రవి అస్తమించని బ్రిటిషు సామ్రాజ్యానికి అంత్య క్రియలు జరపడానికి కాదు నేను ప్రధాన మంత్రిని అయ్యింది." అని ప్రగల్భించిన ప్రబుద్ధుడు ఆయన. అలాంటి చర్చిల్ సారధ్యంలో భారత దేశంలో బ్రిటిషుపాలన మరింత నిరంకుశ ధోరణిలో సాగింది.

1940 ఏప్రిల్‌లోనే సుభాసుచంద్రబోసు నాయకత్వంలో ఫార్వర్డుబ్లాక్ శాసనోల్లంఘ నోద్యమాన్ని ప్రారంభించడంతో సుభాసు చంద్రబోసు, తదితర ఫార్వర్డు బ్లాకు నాయకు లందరినీ అరెస్టుచేశారు.

అలాంటి పరిస్థితులలో మహాత్మాగాంధీ ఆదేశాను సారం కాంగ్రెసు నాయకులు వ్యష్టి సత్యాగ్రహానికి సిద్ధమయ్యారు.

1940 అక్టోబరు 17న వార్ధా సమీపంలోని పలనార్ గ్రామంలో ఆచార్య వినోబాభావే అరెస్టుతో వ్యష్టి సత్యాగ్రహం ప్రారంభమైంది. తరువాత పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, ఇతరకాంగ్రెస్ నాయకులు వరుసగా సత్యాగ్రహంచేసి, అరెస్టు అయ్యారు.

భారత ప్రజలు యు కి సహాయపడరాదని అహింసా పద్ధతిలో యు ప్రయత్నాలను ప్రతిఘటించాలని వ్యష్టి సత్యా' .హుంబ ప్రచారంచేశారు.

వ్యష్టి సత్యాగ్రహంలో రెండవ ఘట్టమైన "ప్రాతినిధ్య సత్యాగ్రహం" 1940 నవంబరు 17 న ప్రారంభమైంది. రెండవ ఘట్టంలో కాంగ్రెస్ కార్య వర్గ సభ్యులు, అఖిల భారత కాంగ్రెస్ సంఘ సభ్యులు, కేంద్ర, రాష్ట్ర శాసన సభలలోని కాంగ్రెస్ సభ్యులు సత్యాగ్రహం చేసి, అరెస్టు అయ్యారు.

ఆంధ్రదేశంలో మొత్తం 882 మంది వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, జైళ్ళ కెళ్ళారు. రు. 76, 553 లు మేరకు జరిమానాలు విధించారు. వ్యష్టి సత్యాగ్రహ కాలంలో అరెస్టు అయిన ప్రముఖులలో వావిలాల గోపాల కృష్ణయ్య, శ్రీరామమూర్తి, నాగప్ప, శ్రీమతి రుక్మిణీ లక్ష్మిపతి, పిల్లల మర్రి వెంకటేశ్వర్లు, గారపాటి సత్యనారాయణ, భూపతి రాజులక్ష్మి నరసింహరాజు, సి. వి. కృష్ణారావు, పి. రామారావు, పప్పూరి రామాచారి, తరిమెల నాగిరెడ్డి, మాడభూషి వెంకటాచారి, అన్నె వెంకటేశ్వరరావు, గొట్టుముక్కల వెంకట రామరాజు, దండు నారాయణరాజు, గౌతుఅచ్చన్న, కల్లూరి సుబ్బారావు, బోయ వెంకటప్ప, టంగుటూరి ప్రకాశం,అయ్యదేవర కాళేశ్వరరావు,శ్రీమతిఅమ్మన్న రాజా, కంభంపాటి సత్యనారాయణ, బులుసు సాంబమూర్తి, మాడభూషి అనంతశయనం అయ్యంగార్, డి. రామసుబ్బారెడ్డి, క్రొవ్విడి లింగరాజు, ఆత్మకూరి గోవిందాచారి, వేముల కూర్మయ్య, కె. షణ్ముగం, మాగంటి బాపినీడు, మొసలికంటి తిరుమలరావు,కోదండ రామిరెడ్డి, వి. వి. గిరి, అప్పయ్య నాయుడు, బి. గోపాలరెడ్డి, పళ్ళంరాజు, నారాయణరాజు, కల్లూరి చంద్రమౌళి, పట్టాభి సీతారామయ్య. కె. బ్రహ్మానంద రెడ్డి, బెజవాడ లక్ష్మికాంతమ్మ, కళా వెంకట్రావు, ఎన్. జి. రంగా, మద్దూరి అన్నపూర్ణయ్య, (ఫార్వర్డ్ బ్లాక్), దర్శి చెంచయ్య, శ్రీమతి భారతీదేవి రంగా, కోటిరెడ్డి, యజ్ఞ నారాయణ, షేక్ గాలిబ్, జనాబ్ షేక్ ఆలీ, బి. రామశాస్త్రి, సత్యమూర్తి, కె. వి. ఆర్. స్వామినాయుడు,మల్లిమడుగుల జగన్నాధరావు,బి.ఎస్. మూర్తి, మున్నగువారు ఉన్నారు.

బ్రిటిష్ సామ్రాజ్య వాదాన్ని జర్మన్లు, జపనీయుల సహాకారంతో తుదముట్టించాలన్న పట్టుదలతో, సుబాసు చంద్రబోస్ 1941 జనవరిలో భారతదేశం నుంచి అదృశ్యమయ్యాడు. బ్రిటిష్ వ్యతిరేకతతో భారతదేశం అట్టుడికి పోతున్నది.

అలాంటి స్థితిలో జపాన్ 1941 డిసెంబరు 7 న పెరల్ హార్బరుపై దాడి చేసింది. భారతదేశంపై జపాన్ దండయాత్ర తప్పదేమోనన్న భయం బ్రిటిష్

ప్రభుత్వాన్ని పట్టిపీడింప సాగింది. భారత ప్రజలను బుజ్జగించడానికి బ్రిటిష్ ప్రభుత్వం ఆగస్టు మాసంలో అదినివేశ ప్రతిపత్తి వాగ్దానాన్ని పునరుద్ఘాటిస్తూ, దానితోపాటు కొత్త రాజ్యాంగాన్ని రూపొందించుకునే హక్కులను కూడా భారతదేశానికి ఒసగుతూ రాజీ ప్రతిపాదన చేసింది. 1940–41 వ్యష్టి సత్యాగ్రహంలో అరెస్టయిన వారందరినీ జైళ్ళ నుంచి విడుదల చేసింది.

## క్రిప్స్ రాయబారం

భారత జాతీయ నాయకులతో బ్రిటిష్ ప్రభుత్వం తరపున రాయబారం జరపడానికి సర్ స్టాఫర్డ్ క్రిప్స్ 1942 మార్చిలో భారతదేశం వచ్చాడు.

ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత భారతదేశానికి, బ్రిటిష్ కామన్వెల్త్ నుంచి విడిపోయే హక్కు, స్వంత రాజ్యాంగాన్ని రూపొందించుకునే హక్కుతో అదినివేశ ప్రతిపత్తిని ఒసగ గలమని, యుద్ధం ముగిసే వరకూ మాత్రం రక్షణశాఖ బ్రిటిష్ ప్రభుత్వం అదుపు ఆజ్ఞలలో వుంటుందని క్రిప్స్ ప్రతిపాదించాడు. క్రిప్స్ ప్రతిపాదనలు భారత జాతీయ కాంగ్రెసుకు సమ్మతం కాలేదు. ముస్లింలీగ్‌కు కూడా ఆ ప్రతిపాదనలు ఆమోదకరంగా లేవు.

క్రిప్స్ ప్రతిపాదనలను "కుప్పకూలిపోతున్న బ్యాంకి కాతాపై యిచ్చిన పోస్టు డేటెడ్ చెక్" అని మహాత్మా గాంధీ వ్యాఖ్యానించాడు.

భారతదేశంలో జాతీయ ప్రభుత్వ స్థాపనకు వీలుగా ముస్లిం లీగ్ కోరిన విధంగా పాకిస్తాన్ ఏర్పాటుకు జాతీయ కాంగ్రెస్ అంగీకరించాలని సి. రాజగోపాలాచారి చేసిన సూచనను కాంగ్రెస్ నాయకత్వం తిరస్కరించింది.

## కాకినాడ, విశాఖపట్నంలపై జపాను బాంబులు

1942 ఏప్రిల్ 6 న జపాన్ యుద్ధ విమానాలు విశాఖపట్నం, కాకినాడ తీర ప్రాంతాలపై బాంబులు వేశాయి.

మే 1 న ఎ.ఐ.సి.సి. అలహాబాద్‌లో సమావేశమై భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని డిమాండ్ చేస్తూ తీర్మానించింది.

1942 జూలై 14 న మహాత్మాగాంధీ బ్రిటిష్ ప్రభుత్వానికి అల్టిమేటమ్ యిస్తున్నట్టు ఈ క్రింది విధంగా ప్రకటించాడు.

"సంప్రదింపులకు ఇక అవకాశం లేదు....భారత స్వాతంత్ర్యాన్ని గుర్తిస్తారా ? లేదా ?.... మరొక అవకాశం యిచ్చే సమస్యే లేదు. ఇది బాహాటమైన తిరుగుబాటే."

ఈ విధంగా దేశంలో తుది స్వాతంత్ర్య సమరానికి, క్విట్ ఇండియా ఉద్యమానికి రంగం సిద్ధమైంది.

# స్వాతంత్ర్య తుది సమరం-క్విట్ ఇండియా ఉద్యమం

భారతదేశ స్వాతంత్ర్య తుది సమరానికి నాందిగా ఆంధ్రదేశంలో వ్యష్టి సత్యాగ్రహం సాగుతున్న కాలంలో ప్రక్కనే గల హైదరాబాద్ సంస్థానంలో స్టేట్ కాంగ్రెస్‌పై విధించిన నిషేధం తొలగింప చేయడానికి మహాత్మాగాంధీ, ఇతర జాతీయ నాయకులు విఫల ప్రయత్నం చేశారు.

హైదరాబాద్ సంస్థానంలోని పరిస్థితిని స్వయంగా పరిశీలించాలని కోరిన పట్టాభి సీతారామయ్య, నారిమన్ వల్లభాయ్‌పటేల్ వంటి జాతీయ నాయకులను నైజాం సంస్థానంలో అడుగుపెట్టడానికి వీలులేకుండా ఆటంకాలు కల్పించబడ్డాయి.

స్టేట్ కాంగ్రెస్ ప్రతినిధిగా కాశీనాధరావు వైద్య 1939-40 సంవత్సరమంతా నైజాం ప్రభుత్వంతో ఎడతెగని సంప్రదింపులు జరిపినా ప్రయోజనం లేకపోయింది. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ నాయకులు చివరకు తమ సంస్థ పేరును, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ సూచన మేరకు "హైదరాబాద్ నేషనల్ కాన్ఫరెన్స్"గా మార్చడానికి సిద్ధమైనప్పటికీ, నైజాం ప్రభుత్వం అందుకు సమ్మతించలేదు. "నేషనల్" అన్న పదం కాంగ్రెస్ వారు వాడటానికి వీలులేదని, ఆ అర్హత వారికి లేదని, వారు కేవలం హిందూమతవాదులు మాత్రమేనని నైజాం ప్రభుత్వం భావించింది.

స్టేట్ కాంగ్రెస్‌పై నైజాం ప్రభుత్వం నిషేధం తొలగిస్తే, స్టేట్ కాంగ్రెస్ మనుగడకు అవకాశంలేని పరిస్థితిని తాము సృష్టించవలసి వస్తుందని హెచ్చరిస్తూ 1940 డిసెంబరు 1 న అంజుమాన్ ఇత్తిహాద్-ఉల్-ముస్లిమీన్ సంస్థ తీర్మానించింది.

స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధం తొలగించాలని కోరుతూ స్వామి రామానంద తీర్థ నాయకత్వంలో 1940 లో జరిపిన సత్యాగ్రహంవల్ల కూడా లాభం లేకపోయింది.

## నాలుగు కమ్యూనిస్టు గ్రూపులు

హైదరాబాద్ సంస్థానంలో 1940 సంవత్సరారంభానికి నాలుగు కమ్యూనిస్టు గ్రూపులు తయారయ్యాయి.

1. ఉస్మానియా విద్యార్థులు 1938 లో సాగించిన 'వందేమాతరం' ఉద్యమం ద్వారా ప్రభావితులై సోషలిస్టు భావాలవైపు ఆకర్షితులైన దేవులపల్లి వెంకటేశ్వరరావు, సర్వదేవభట్ల రామనాధం మున్నగువారు ఒక గ్రూపుగా వ్యవహరిస్తున్నారు.

2. సోవియట్ విప్లవం, ఫాసిస్టు ప్రమాదం మున్నగు వాటితో ప్రభావితులైన మేధావులు ముఖ్దూం మొహియుద్దీన్, రాజబహదూర్‌గౌడ్, సయ్యద్ ఇబ్రహీం, అలంఖుంద్‌మీర్ మున్నగువారు హైదరాబాదులో "కామ్రేడ్స్ అసోసియేషన్" అనే పేరుతో ఒక చర్చావేదికను నిర్వహిస్తున్నారు. వీరికి బూర్గుల రామకృష్ణారావు ప్రోద్బలం లభించింది.

3. ఆంధ్రమహాసభలో ప్రముఖ పాత్ర వహిస్తూ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ రచనలతో ఉత్తేజితులై సోషలి భావాలకు అంకితమైన రావినారాయణరెడ్డి, బ ం ఎల్లారెడ్డి, ఆరుట్ల సోదరులు ఒక గ్రూపుగా ఏర్ప రు.

4. మహారా 9 పరిషత్‌లో పనిచేస్తున్న ఔరంగాబాద్‌కు చెందిన చంద్రగుప్త చౌదరి, హబీబుద్దీన్, వి.డి. దేశపాండే మున్నగువారు కూడా సోషలిస్టు భావాలతో ఉత్తేజితులై వున్నారు.

ఆంధ్ర దేశంలో కమ్యూనిస్టు నాయకులైన చంద్ర రాజేశ్వరరావు, సుందరయ్య వంటివారి కృషి ఫలితంగా ఈ నాలుగు గ్రూపులు కలిసి 1940 సంవత్సరారంభంలో "నిజాం సంస్థాన కమ్యూనిస్టు కమిటీ"గా ఏర్పడింది. చరిత్ర సిద్ధమైన తెలంగాణా సాయుధ పోరాట రథసారథ్యం వహించింది వీరే.

## ఆంధ్ర మహాసభలో చీలిక

ఆంధ్ర దేశంలో కాంగ్రెసులోని అతివాద, మితవాదుల మధ్య విభేదాలు తీవ్రమైనట్టుగానే. తెలంగాణాలోని ఆంధ్ర మహాసభలో కూడా చీలికలు వచ్చాయి.

రావి నారాయణరెడ్డి నాయకత్వంలో అతివాద వర్గం ఆంధ్ర మహాసభలో పైచేయి సంపాదించే పరిణామం 1941 నుంచి 1944 మధ్య కాలంలో త్వరితంగా సంభవించింది.

## హైదరాబాద్‌లో "క్విట్ ఇండియా" ఉద్యమం

క్విట్ ఇండియా పోరాటానికి శంఖారావ వేదిక అయిన బొంబాయి ఎ.ఐ.సి.సి. సమావేశ సమయంలోనే

స్వామి రామనందతీర్థ మహాత్మా గాంధీని కలుసుకొని, నైజాం సంస్థానంలో "క్విట్ ఇండియా" ఉద్యమం ప్రారంభించడానికి అనుమతి పొందాడు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనాలని హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ మాత్రమే కాక, దేశమంతటా గల అనేక స్వదేశీ సంస్థానాలలోని ప్రజామండలులు కూడా నిర్ణయించాయి.

బొంబాయి నుంచి షోలాపూర్ మీదుగా హైదరాబాద్ బయలుదేరిన స్వామీ రామానందతీర్థ ముందుగానే డాక్టరు మేల్కొటేకు ఒక ఉత్తరం పంపాడు. తనను బహుశా అరెస్టు చేయవచ్చునని, తాను అరెస్టయితే, డా॥ మేల్కొటే కాంగ్రెసు నాయకుడుగా వ్యవహరించాలని స్వామీ రామానందతీర్థ ఆ లేఖలో ఆదేశించాడు.

అనుకున్నట్టుగానే, నాంపల్లి రైల్వే స్టేషనులో దిగి దిగగానే స్వామి రామానందతీర్థను అరెస్టు చేశారు. వెంటనే డా॥ మేల్కొటే స్టేట్ కాంగ్రెసు తరపున ఒక వినతి పత్రాన్ని నైజాం నవాబుకు సమర్పించాడు. పౌర హక్కులు కలుగజేయవలెనని స్టేట్ కాంగ్రెసుపై నిషేధం తొలగించాలని, రాజకీయ ఖైదీలందరిని విడుదల చేయాలని అందులో డిమాండ్ చేశాడు.

'క్విట్ ఇండియా' ఉద్యమాన్ని పురస్కరించుకొని కొందరు అభివృద్ధి నిరోధకులు "ఆజాద్ హైదరాబాద్" (స్వతంత్ర హైదరాబాద్) నినాదం ఇచ్చారు

క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా హైదరాబాద్ సంస్థానంలో అరెస్టు అయిన ప్రముఖులలో పండిట్ నరేంద్రజీ, హరిశ్చంద్ర హెడా, విమలబాయ్ మేల్కొటే, జి. ఎస్. మేల్కొటే, జితేంద్ర రాష్ట్రవాది, పద్మజానాయుడు, రామస్వామి దంపతులు, బూర్గుల రామకృష్ణరావు, జి. రామాచారి, గంగాధర కృష్ణ, గణపతిరావు, సింగరేణి కార్మిక నాయకుడు కృష్ణ దూబే, ఎల్. నారాయణ, రాజేశ్వరరావు, షో యాజులు, డి. నర్సయ్య, కొమరగిరి నారాయణరావు, ఎమ్. ఎస్. రాజలింగం, శ్రీధరరావు కులకర్ణి, కోదాటి నారాయణరావు, వందేమాతరం రామచంద్రరావు, ప్రేమరాజ యాదవ్, మల్లయ్య యాదవ్, కాశోజీ నారాయణరావు మున్నగువారున్నారు.

హైదరాబాద్ నగరంలో మాత్రమేగాక ఉస్మానాబాద్, పర్బని, నాందేడ్, ఉమ్రి మున్నగుచోట్ల స్టేట్ కాంగ్రెసు తరపున మాత్రమేకాక మహారాష్ట్ర పరిషత్, కర్నాటక మహాసభవంటి సంస్థల తరపున కూడా అనేక మంది వాలంటీర్లు సత్యాగ్రహం జరిపి, అరెస్టు అయ్యారు. మహారాష్ట్ర పరిషత్ కార్యదర్శి గోవిన్ దాసు ష్రాఫ్‌ను డిటెన్ చేశారు. రెసిడెన్సీ భవనంపై జాతీయ పతాకను ఎగురవేసి, పద్మజానాయుడు అరెస్టు అయ్యారు.

హైదరాబాద్‌లో క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభం కావడానికి ముందు, కాశీనాథ్‌రావు వైద్యా, సిరాజుల్ హసన్ తిర్మిడి, వినాయకరావు విద్యాలంకార్, రావి నారాయణరెడ్డి, ఫతుల్లాఖాన్, జనార్దనరావు దేశాయ్, మాడపాటి హనుమంతరావు, కక్రి మున్నగు ప్రముఖులు ఎన్నికైన మంత్రులతో ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయాలని నైజాం నవాబుకు విజ్ఞప్తి చేశారు.

పౌరహక్కుల పునరుద్ధరణ ప్రజాప్రభుత్వ స్థాపన కోసం ఆందోళన రోజురోజుకీ బలీయమవుతున్న దృష్ట్యా, నైజాం ప్రభుత్వం బి. బి. సి ఉద్యోగి ప్రొఫెసర్ రష్‌బ్రూక్ విలియమ్స్‌ను తన ప్రచారానికి వినియోగించింది. నైజాం సంస్థానంలో రాజకీయ స్వేచ్ఛకు పౌరహక్కులకు కొదవలేదని ఆ బి.బి.సి. ఉద్యోగి ఊదరగొట్టి ప్రచారం సాగించాడు.

క్విట్ ఇండియా ఉద్యమకాలంలో ఇద్దరు హైదరాబాదీయులు అబిద్‌హసన్ సఫ్రానీ, సురేష్ చంద్రలు అజాద్‌హింద్ ఫౌజ్ (ఐ.ఎన్.ఎ.)లో చేరారు.

## ఆంధ్ర సర్క్యులర్

బొంబాయిలో 1942 ఆగస్టులో ఎ.ఐ.సి సి. సమావేశం ప్రారంభంకావడానికి పూర్వమే, జూలై 29 న కళా వెంకటరావు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ తరపున "ఆంధ్రా సర్క్యులర్" (కర్నూలు సర్క్యులర్)ను తయారుచేసి, కాంగ్రెసు కార్యవర్గం ఆమోదం కోసం డాక్టరు పట్టాభి సీతారామయ్యద్వారా బొంబాయి పంపారు. బొంబాయిలో కాంగ్రెసు కార్యవర్గం ఎ. ఐ సి. సి. సమావేశం కూడా "ఆంధ్రా సర్క్యులర్"కు ఆమోదముద్ర వేసినట్లు ప్రచారమైంది. కర్నూలుజిల్లా కాంగ్రెసు కమిటీ కార్యాలయంలో "ఆంధ్రా సర్క్యు

లర్" ప్రతి ఒకటి పోలీసులకు పట్టుబడినందున అది "కర్నూలు సర్క్యులర్"గా కూడా పేర్కొనబడింది.

## నాయకుల ఆకస్మిక అరెస్టు

"క్విట్ ఇండియా" ఉద్యమానికి మహాత్మాగాంధీ పిలుపు ఇవ్వక పూర్వమే బ్రిటిషు ప్రభుత్వం 1942 ఆగస్టు 8 న మహాత్మాగాంధీతోపాటు కాంగ్రెసు కార్యవ సభ్యులందరిని ఆకస్మికంగా అరెస్టు చేసింది. దేశవ్యా ంగా కాంగ్రెసు నాయకులను ఎక్కడికక్కడ అరెస్టు , డిటైన్ చేసింది.

ఆంధ్రదేశంలో క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో డిటైన్ చేయబడిన ప్రముఖులలో పట్టాభి సీతారామయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు, టంగుటూరి ప్రకాశం, నీలం సంజీవరెడ్డి, మాగంటి బాపినీడు, దండు నారాయణరాజు, తెన్నేటి విశ్వనాధం, శంకరరెడ్డి, బెజవాడ గోపాలరెడ్డి, కాకాని వెంకటరత్నం, బి. వి. సుబ్బారెడ్డి, కాసు బ్రహ్మానందరెడ్డి, మద్దూరి అన్నపూర్ణయ్య, గొట్టిపాటి బ్రహ్మయ , మంతెన వెంకటరాజు, కొడాలి ఆంజనేయులు, డా రు పాతూరి తిరుమలరావు, పప్పూరి రామాచారి, ంతశయనం అయ్యంగార్, మొసలికంటి తిరుమలరావు, వి. వి. గిరి మున్నగువారు వున్నారు. ఆచార్య ఎన్. జి. రంగా కొంతకాలం రహస్య జీవితం గడిపి అరెస్టు అయ్యారు. కర్నూలుజిల్లా కాంగ్రెసు నాయకుడు నివ ర్తి వెంకట సుబ్బయ్య క్విట్ ఇండియా ఉద్యమం సాగినంతకాలం రహస్యజీవితం గడిపి, 1944 లో గాంధీజీ ఆదేశం మేరకు భుత్వానికి లొంగిపోయారు.

డిటె న్‌లో వున్న దండు నారాయణరాజు వెల్లూరు లులో తుదిశ్వాస విడిచారు.

## పెల్లుబికిన వెల్లువ

కాంగ్రెస్ నాయకులను హఠాత్తుగా అరెస్టుచేయటం ద్వారా, క్విట్ ఇండియా ఉద్యమానికి సరైన నాయకత్వం లేకుండా చేయాలని బ్రిటిష్ ప్రభుత్వం ప్లాను వేసింది. అయితే, మహాత్మాగాంధీ, ఇతర కాంగ్రెసు నాయకుల అరెస్టువా ర్త వినడంతోనే ఆగస్టు 9 న దేశమంతటా ప్రజలలో బ్రిటిషు ప్రభుత్వంపట్ల క్రోధావేశాలు వెల్లువలా ఉప్పొంగి మహోధృత రూపంలో ఉద్యమం ప్రజ్వరిల్లింది. ఈ ఆగస్టు విప్లవాన్ని కొందరు చరిత్రకారులు "మధ్యతరగతి వర్గాల విప్లవం"గా పేర్కొన్నారు.

## ఉద్యమ కార్యక్రమం

క్విట్ ఇండియా ఉద్యమంలో చేపట్టవలసిన కార్యక్రమాన్ని "ఆంధ్ర సర్క్యులర్"లో వివరించారు. ఉద్యమాన్ని శాంతియుతంగా నడపాలని, నిషేధాజ్ఞలను ఉల్లంఘించాలని, న్యాయవాదులు తమ వృత్తిని విడిచి పెట్టాలని, విద్యార్థులు విద్యాలయాలను బహిష్కరించాలని, కల్లుగీత గెలలను నరికివేయాలని, ప్రభుత్వ వార్తా సౌకర్యాలను విచ్ఛిన్నం చేయాలని, వంతెనలను కూల్చాలని, టెలిగ్రాఫ్, టెలిఫోన్ తీగలను తెగగొట్టాలని, రైలుపట్టాలను పీకివేయాలని, మున్సిపల్ పన్నులు మినహా మరేపన్నులు చెల్లించకూడదని, మిలటరీ రిక్రూట్‌మెంట్ ఆఫీసులముందు పికెటింగ్ చేయాలని, ప్రభుత్వ భవనాలన్నింటిపైన జాతీయ పతాకాలు ఎగురవేయాలని "ఆంధ్రా సర్క్యులర్"లో ఆదేశించారు. వ్యాపారులు తమ నిధులను బ్యాంకులనుంచి ఉపసంహరించాలని, బ్యాంకులలో డిపాజిట్లు కట్టకుండా బ్రిటిష్ ప్రభుత్వ ఆర్థిక స్థితిని దెబ్బతీయాలని కూడా అందులో సూచించారు.

## విజయమో - వీరస్వర్గమో !

క్విట్ ఇండియా ఉద్యమకాలంలో "విజయమో ! వీరస్వర్గమో (డు ఆర్ డై) అన్నది కీలక నినాదమైంది. తాడోపేడో తేలేవరకు పోరాటం సాగించాలి, ఈ ఉద్యమంలో అన్నివర్గాల ప్రజలను, కాంగ్రెసేతరులను కూడా సమీకరించాలని, ఇందుకోసం ఖద్దరు ధారణ నియమాన్ని ప్రక్కన పెట్టాలనికూడా అందులో వివరించారు.

## బ్రిటిషు ప్రభుత్వ అంచనా తలక్రిందులు

జాతీయ నాయకులను అరెస్టు చేస్తే, ఉద్యమం చప్పబడి చల్లారిపోతుందని బ్రిటిష్ ప్రభుత్వం వేసుకొన్న అంచనాలు పూర్తిగా తలక్రిందులైనవి. ఉద్యమాన్ని క్రమబద్ధంగా నడిపే నాయకులు రంగంలో లేకపోవడంతో, సామాన్య ప్రజలు ఎక్కడికక్కడే రంగంలోకి దుమికి, యావద్భారత దేశాన్ని రణరంగంగా మార్చివేశారు.

జాతీయ నాయకుల అరెస్టులకు నిరసనగా ఆగస్టు 9 నుంచి 11 వరకు ఆంధ్రదేశంలోని అన్ని పట్టణాల లోను ఉవ్వెత్తుగా హర్తాళ్‌లు, ప్రదర్శనలు బహిరంగ సభలు జరిగాయి. విద్యార్థులు సమ్మెచేసి, ఉద్యమంలోకి దుమికారు. ఇదంతాచూసి, ప్రభుత్వాధికారులు నిర్ఘాంత పోయారు. ఆగస్టు 11 న తెనాలిలో జరిగిన బహిరంగ సభలో మరుసటి రోజు హర్తాళ్‌కు పిలుపు యిచ్చారు. అదే ఆంధ్ర దేశంలో "క్విట్ ఇండియా" ఉద్యమ విస్తృతికి ఉధృతికి దారితీసింది.

## తెనాలి రైల్వే స్టేషన్‌పై దాడి

1942 ఆగస్టు 12 న తెనాలిలో విద్యార్థి నాయకులు కొత్తమాసు మోహనరావు, కోగంటి వెంకట్రామయ్య, దాచేపల్లి సుబ్బారావు, కొల్లి ప్రసాద్ వంటివారి నాయకత్వాన విద్యార్థులంతా సమ్మె చేశారు, కల్లూరి చంద్రమౌళి నాయకత్వంలో కాంగ్రెసు కార్యకర్తలు, సమ్మె చేసిన విద్యార్థులు కలిసి పట్టణ మంతా తిరుగుతూ పూర్తి హర్తాళ్ జరిపించారు.

రైల్వే స్టేషన్‌లోని క్యాంటీనును తెరచినట్టు వార్త అందగానే, విద్యార్థులు, కాంగ్రెసు కార్యకర్తలు రైల్వే స్టేషన్‌కు బయలుదేరారు. వారితో పాటు వందలాది ప్రజలు రైల్వే స్టేషనుకు వెళ్ళారు. స్టేషన్ లోని కాంటీన్‌ను మూసివేయమని డిమాండు చేశారు. రైల్వే అధికారుల అనుమతిలేనిదే, కాంటీన్‌ను తాను మూసివేసేదిలేదని మేనేజర్ నిరాకరించడంతో ఘర్షణ మొదలైంది.

గుంటూరుకు బయలుదేరడానికి సిద్ధంగావున్న రైలును ఆపుచేయవలసిందిగా ప్రజలు రైల్వే స్టేషన్ మాస్టర్‌ను వత్తిడిచేశారు. అందుకు స్టేషన్ మాస్టర్ నిరాకరించడంతో ప్రజలు కోపోద్రిక్తులయ్యారు. బయలుదేరిన గుంటూరు రైలును నార్త్ క్యాబిన్ సమీపంలో ప్రజలు అటకాయించి ఆపు చేశారు. ఇంజన్ డ్రయివర్ పారిపోయాడు. ఆ రైలు పెట్టెలన్నీ మంటలలో దగ్ధమైపోయాయి. ప్రజా సమూహాలు రైల్వే సిగ్నల్స్‌ను ధ్వంసం చేశాయి. రైల్వేస్టేషన్‌పై కిరసనాయిల్ పోసి, నిప్పుపెట్టాయి. రైల్వే ఉద్యోగులంతా పారిపోయారు. మద్రాసు, నుంచి వచ్చిన రైలు బండిని దక్షిణ క్యాబిన్ వద్దనే ప్రదర్శకులు ఆపు చేశారు. అప్పటికి గుంటూరు నుంచి రిజర్వు పోలీసు బలగం తెనాలికి చేరింది. జిల్లాకలెక్టర్, జిల్లా పోలీసు అధికారి కూడా రంగంలోనే వున్నారు. పోలీసు కాల్పులకు ఉత్తర్వులు చేశారు. ఆ కాల్పులలో ముగ్గురు ప్రదర్శకులు అక్కడికక్కడే మరణించారు. ఆ ముగ్గురితో పాటు, ప్రదర్శకులను శాంత పర్చడానికి ప్రయత్నిస్తున్న ప్రయాగ వీరరాఘవయ్య కూడా మృతి చెందాడు.

ఆ కాల్పులలో గాయపడిన జాస్తి అప్పయ్య, అమ్మినేని సుబ్బారెడ్డి, గాలి రామకోటయ్యలు తరవాత ఆస్పత్రిలో మృతి చెందారు. మరో 11 మంది గాయపడ్డారు. రైల్వేలకు జరిగిన నష్టం రు. 2,50,000 లుగా అంచనా వేశారు.

## చీరాల ఘటనలు

అదే రోజున చీరాలలో 500 మంది విద్యార్థులు ఊరేగింపుగా బయలుదేరి, సబ్ మేజిస్ట్రేట్ కోర్టుకు వెళ్ళి, దాన్ని బలవంతాన మూసివేయించారు. తరవాత వారు సబ్‌రిజిస్ట్రార్ ఆఫీసుపైన, సేల్సుటాక్సు ఆఫీసుపైన దాడి చేశారు. అక్కడనుంచి ఊరేగింపుగా రైల్వే స్టేషన్‌కు వెళుతుండగా, ఆ వూరేగింపులోకి వచ్చి చేరిన అదనపు జనసమూహాలతో ప్రదర్శకుల సంఖ్య 1500 కి పెరిగింది. దాదాపు లక్ష రూపాయల రైల్వే ఆస్తిపాస్తులను ధ్వంసం చేశారు. ట్రాలీ మీద ప్రయాణం చేస్తున్న సైనిక రిక్రూటింగ్ ఆఫీసరును, మరో రైల్వే అధికారిని ఆపుచేసి వారిచేత "గాంధీజీకి జై" అనిపించి వదలివేశారు. పోలీసు బలగం దిగేటప్పటికి ప్రదర్శకులు చెదిరిపోయారు.

## గుంటూరు కాల్పులు

ఆగస్టు 13 న గుంటూరులోని గాంధీ పార్కు నుంచి 2 వేల మంది ప్రదర్శకులు బయలుదేరగా వారిని వెంబడించిన పోలీసులు హఠాత్తుగా కాల్పులు జరిపి, ప్రదర్శకులను చెదరగొట్టారు. తుపాకి గుళ్ళు గుండెలలో దూసుకుపోవడంతో ఇద్దరు అక్కడికక్కడే మరణించారు. అనేకమంది గాయపడ్డారు. ఈ తుపాకి కాల్పులకు ప్రజలలో తీవ్రమైన నిరసన వ్యక్తమయింది. స్థానిక బార్ అసోసియేషన్, అధికారుల దుర్మార్గాన్ని ఖండించింది. విద్యా సంస్థలు వారం రోజుల పాటు మూతపడ్డాయి.

విద్యార్థులు, కూలీలు, కార్మికులు షుమారు 1500 మంది విశాఖ జిల్లాలోని పాలకొండ రైల్వే స్టేషన్‌పై

దాడిచేసి, గూడ్సు షెడ్‌ను పూ గా దగ్ధ పటలం కావించారు. అలాగే ఆకివీడు, అ లి, నిడుబ్రోలు, దెందులూరు, ఉండి తదితర రైల్వే షన్లు కూడా తీవ్ర నష్టానికి గురిచేయబడ్డాయి.

క్విట్ ఇండియా ఉద్యమంలో రైల్వే పట్టాలు పెరికి వేయబడిన సంఘటనలు అనేకం జరిగాయి. కృష్ణాజిల్లా ఉప్పులూరు స్టేషన్ సమీపంలో రైల్వే పట్టాలు పెరికివేసినందున, పోలీసు బలగం ప్రయాణం చేస్తున్న ప్రత్యేక రైలు ఆగస్టు 14 న ప్రమాదానికి గురైంది. చిత్తూరు జిల్లాలో పానపక్కం - చంద్రగిరి మధ్య ఆగస్టు 21 వ తేదీ రాత్రి ఒక గూడ్సు రైలు తలక్రిందులైంది.

ఆంధ్ర దేశంలో ఆగస్టు ఉద్యమకాలంలోమొ తం 1500 చోట్ల టెలిఫోన్, టెలిగ్రాఫ్ తీగెలను ఉద్యమ కారులు తెగ్గొట్టారు.

## పోలీసు స్టేషన్‌లపై దాడులు

క్విట్ ఇండియా ఉద్యమంలో ప్రజలు పోలీసు స్టేషనులపై దాడి చేసిన ఘటనలు కూడా అనేకం జరిగాయి. ఆగస్టు 17 న పాలకొల్లులో పోలీసు సబిన స్పెక్టరు, పోలీసు కానిస్టేబుల్ ఇళ్ళపై ఉద్యమ కారులు దాడిచేసి, ఆ ఇళ్ళను ధ్వంసం చేశారు. సబ్ జై లులోను, సబ్ ట్రజరీలోను కాపలాకాస్తున్న పోలీసులను వారు కొట్టారు. పోలీసుల వద్ద తుపాకి గుళ్ళను గుంజుకున్నారు. పరిస్థితి అదుపుతప్పుతున్నట్టు భయ పడిన రిజర్వు పోలీసులు కాల్పులు జరుపగా ఒక వ్యక్తి మృతి చెందాడు.

ఆకివీడు పోలీసు షనుపై 100 మంది దాడిచేసి. ఇద్దరు పోలీసు కాని బుల్‌స్‌ను తన్నారు. వారి వద్ద తుపాకులను, లాఠీల లాగేసుకొన్నారు. పోలీసు స్టేషనులోని రికార్డులను తగులబెట్టారు.

యాభై మంది ఉద్యమకారులు హఠాత్తుగా అల్లూరు పోలీసుస్టేషనుపై మెరుపుదాడి జరిపి, అక్కడ వున్న ముగ్గురు పోలీసుల కాళ్ళూ చేతులూ కట్టి పడవేసి రికార్డులను, ఫర్నిచ ను తగులబెట్టారు. ఆగస్టు 12న చీరాల పోలీసు షనుపై ప్రజలు దాడి చేశారు. కాని, అదనపు పోలీ బలగం రాకతో ప్రదర్శకులు నిష్క్రమించవలసి వచ్చింది.

## పోస్టాఫీసులు దగ్ధం

ఆంధ్రదేశంలో అనేకచోట్ల పోస్టాఫీసులను ఉద్యమ కారులు దగ్ధం చేశారు. ఆకివీడు, కళింగపట్నం పోస్టాఫీసులు పూర్తిగా దగ్ధమైపోయాయి. ఆగస్టు 12న బాపట్లలో సబ్ రిజిస్ట్రార్ ఆఫీసుపై ప్రజాసమూహం దాడి చేసింది.

## భీమవరంలో కాల్పులు

1942 ఆగస్టు 17న భీమవరం ప్రజలు బ్రిటిషు పాలనకు వ్యతిరేకంగా చరిత్రాత్మకమైన పోరాటం సాగించారు. గోకరాజు శ్రీరామరాజు. గొట్టుముక్కల రామచంద్రరాజు, అయ్యగిరి సుబ్బారాయుడు, కపిల జోగి జగన్నాధరావులు 2 వేలమందితో పెద్ద బహిరంగ సభ జరిపారు. స్థానిక విద్యాసంస్థలను మూసివేయించాలని ఆ సభలో తీర్మానించారు. వెంటనే ఆ తీర్మానం అమలు జరిపించడానికి జనం విద్యాసంస్థలకు వెళ్ళారు. స్థానిక యు.ఎల్.సి ఎమ్. స్కూలు అధికారులు స్కూలును మూసివేయడానికి నిరాకరించడంతో ఉద్రిక్తత పెరిగింది. విద్యార్థులు, స్కూలులోని బల్లలు, కుర్చీలు బద్దలుగొట్టారు. విధిలేక అధికారులు స్కూలును మూసివేశారు. అక్కడనుంచి ప్రజలు, విద్యార్థులు ఊరేగింపుగా బయలుదేరి, రెవెన్యూ డివిజనల్ ఆఫీసుకు వెళుతూంటే, దారిమధ్యలో స్థానిక ప్రముఖులు వేగేసిన నారాయణరాజు, పెద్దసుబ్బరాజులు, భూపతిరాజు సుబ్బరాజు వచ్చి, ఊరేగింపుకు నాయకత్వం వహించారు. ఈ ప్రదర్శకులను చూడగానే, ఆర్.డి.ఒ. ఆఫీసు తలుపులు మూసివేశారు. ప్రదర్శకులు తలుపులు బద్దలుగొట్టి, లోన ప్రవేశించారు. ఆర్.డి.ఓ. చేత బలవంతాన రాజీనామా పత్రంపై సంతకం చేయించి, ఆయనను బయటకు లాక్కొచ్చారు. ఆర్.డి.ఓ. చేతికి కాంగ్రెస్ జెండా యిచ్చి, ఊరేగింపుతో కొంతదూరం నడిపించారు. అప్పుడు ప్రదర్శకులలో కొందరికి కొత్త ఆలోచన బయలుదేరింది. వారు వెనుతిరిగి వెళ్ళి, ఆర్.డి.వో. ఆఫీసును, డిప్యూటి ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ ఆఫీసును తగలబెట్టారు. అక్కడనుంచి ప్రదర్శకులు కలెక్టరు ఆఫీసుకు వెళ్లారు. కలెక్టరు చేతకూడా రాజీనామా పత్రంపై సంతకం చేయించి, కాంగ్రెస్ జెండా ఆయన చేతికిచ్చారు. అప్పుడు గోకరాజు వెంకటపతిరాజు జిల్లా కలెక్టర్ ఆఫీ

సుపై జాతీయజెండాను ఎగురవేశారు. ఆఫీసులోని రికార్డులను తగులబెట్టారు. ప్రదర్శకులు అక్కడనుంచి పోలీసుస్టేషనుకు బయలుదేరారు. వారు స్టేషన్ సమీపంలోకి రాగానే పోలీసులు జనంపై కాల్పులు ప్రారంభించారు. అయినా ప్రదర్శకులు లక్ష్యపెట్టకుండా ఆయుధాగారం వైపు ముందుకు సాగుతుండగా, పోలీసులు విచ్చలవిడిగా కాల్పులు సాగించి, ముగ్గురి ప్రాణాలు తీశారు. మరొక అయిదుగురు తీవ్రంగా గాయపడ్డారు. ఈలోగా ప్రదర్శకులలో కొందరు పోలీసుల ఇళ్ళకు వెళ్ళి, వాటికి నిప్పు పెట్టారు. తుపాకి కాల్పులకు ఉత్తర్వులు జారీ చేసిన సబిన్స్పెక్టరు కుటుంబం తప్పించుకుని, పారిపోయింది. లేకపోతే ఆ కుటుంబం ప్రజల క్రోధాగ్ని జ్వాలలకు ఆహుతి అయివుండేది.

### పెంటపాడు పోస్టాఫీసు దగ్ధం

పశ్చిమ గోదావరి జిల్లా తాడేపల్లి గూడెం సమీపంలోని పెంటపాడులో ఆగస్టు 17న మహదేవ్ దేశాయ్ మరణవార్త విన్నంతనే సంతాపసభ జరిపిన ఉద్యమకారులు స్థానిక పోస్టాఫీసును తగలబెట్టారు. వారిపై పోలీసులు తీవ్రమైన లాఠీచార్జి జరిపి, అనేకమందిని అరెస్టు చేశారు.

### సామూహిక జరిమానాలు

క్విట్ ఇండియా ఉద్యమ విజృంభణను అణచడానికి బ్రిటిష్ పాలకులు దారుణమైన దమననీతిని ప్రయోగించారు. ప్రభుత్వ నిర్బంధ విధానంలో ప్రత్యేకంగా పేర్కొనదగినవి "1942 పెనాల్టీస్ ఆర్డినెన్స్" రైల్వేలు, టెలిగ్రాఫ్, టెలిఫోన్ తీగలు మున్నగువాటిపై దాడి జరిపి ధ్వంసం చేసేవారికి మరణశిక్ష విధించే అధికారం, కొరడాదెబ్బల శిక్ష విధించే అధికారం జిల్లా కలెక్టర్లకు ఈ ఆర్డినెన్సు దఖలు పరిచింది. పోతే రెండవది సామూహిక జరిమానా విధింపు ఆర్డినెన్సు. ఏ ప్రాంతంలోనైనా బ్రిటిషు వ్యతిరేక లేక యుద్ధ వ్యతిరేక చర్యలు జరిగితే, ఆ ప్రాంతంలో నివసించే ప్రజలందరిపైన "విచక్షణా రహితంగా" జరిమానాలను విధించే అధికారం ఈ ఆర్డినెన్సువల్ల కలెక్టర్లకు లభించింది. ఈ రెండు ఆర్డినెన్సులతో భారత ప్రజలను భయపెట్టి, లొంగదీసు కోవచ్చునని బ్రిటిషు పాలకులు ఆశపడ్డారు కాని వాళ్ళ ఆశలు నెరవేరలేదు.

గుంటూరు జిల్లాలో అధికారులు సామూహిక జరిమానాల పేరుతో రు.3,21,681 లు వసూలు చేశారు. పశ్చిమ గోదావరి జిల్లాలో రు. 2,48,285 ల మేరకు సామూహిక జరిమానాలు విధించారు. ఆగస్టు ఉద్యమం ఆ రెండు జిల్లాలలోను చాలా విస్తృతంగా, ఉధృతంగా సాగిందనడానికిదొక నిదర్శనం. కృష్ణా, అనంతపురం, కడప, కర్నూలు, నెల్లూరు జిల్లాలలో కూడ సామూహిక జరిమానాలు వసూలు చేశారు. ఎంత నిర్బంధ కాండ అమలు జరిపినా, భారత ప్రజల స్వాతంత్ర్య పోరాట దీక్ష సడలనూ లేదు, ఆ పోరాట పటిమ తగ్గనూలేదు.

క్విట్ఇండియా ఉద్యమంలో ఒక వైపున హింసాత్మక చర్యలు జరుగుతూ వుంటే, రెండవ వైపున శాంతియుత పోరాట పద్ధతులు కూడా కాంగ్రెసు కార్యకర్తలు పాటిస్తూ వచ్చారు. బహిరంగ సభలు జరిపి, శాంతియుతంగా సత్యాగ్రహ పోరాటం సాగించాలని ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

### విద్యార్థుల వీరోచిత పాత్ర

క్విట్ ఇండియా ఉద్యమంలో తెలుగు విద్యార్థులు వీరోచితమైన పాత్ర నిర్వహించారు. నిజానికి ఆంధ్ర దేశంలో ఆగస్టు విప్లవంలో కీలకమైన తెనాలి, భీమవరం సంఘటనలకు ఆద్యులు విద్యార్థులు కావడం గమనార్హం. ఈ ఉద్యమంలో విద్యార్థుల సమ్మెలు విరివిగా జరిగాయి. కాకినాడ, గుంటూరు, ఏలూరు, విశాఖపట్నం, అనంతపురం, మదనపల్లి, నెల్లూరు కాలేజీల విద్యార్థులు, చిత్తూరు, పెనుగొండ, హిందూపురం, మున్నగు హైస్కూలు విద్యార్థులు సమ్మెలలో మూకుమ్మడిగా పాల్గొన్నారు. ఆగ 14 న అనంతపురంలో విద్యార్థులు జరిపిన ప్రదర్శనపై పోలీసులు లాఠీచార్జి జరిపారు ఆగస్టు 27 న విజయనగరంలో 13 గురు విద్యార్థులను అరెస్టు చేశారు, వారందరికీ శిక్షలు విధించారు.

### సారా దుకాణాల ముందు పికెటింగ్

క్విట్ ఇండియా ఉద్యమంలో క సారా దుకాణాలముందు పికెటింగ్ చేసే కార్యక్రమం కూడా కొన్ని చోట్ల ఉద్యమకారులు చేపట్టా . ఆగస్టు 17 న లంకలకోడేరు, పాలకొల్లులలో కల్లు, సారా దుకాణాలను మూసివేయడానికి నిరాకరించినందున, ఉద్యమకారులు వాటిని తగలబెట్టారు. బాపట్ల, అల్లూరువంటి చోట్ల పికెటింగ్ శాంతియుతంగా జరిగింది. సత్యా

గ్రహాలను అరెస్టు చేసి, కఠిన శిక్షలతో పాటు రు. 50 ల జరిమానా కూడా విధించారు.

కొంతమంది కాంగ్రెసు కార్యకర్తలు, ప్రభుత్వోద్యోగులకు తమ పదవులకు రాజీనామా చేయాలని కోరుతూ ఉత్తరాలు రాసిన నేరానికి జైలు శిక్షలు పొందారు. విశాఖపట్నం జిల్లా కలెక్టరు పి. ఏ. కు, విశాఖ పోస్టుమాష్టర్‌కు, విజయనగరం డి. వై. ఎస్. పి. కి అలాంటి ఉత్తరాలు రాసినందుకు సి. వీరభద్రరావుకు ఆరు నెలల కఠిన శిక్షతో పాటు రు. 500 జరిమానా విధించారు, అనకాపల్లికి చెందిన డాక్టరు కోరుకొండ సుబ్బరాజు, కళింగ పట్నానికి చెందిన కె. సుబ్బారావులు మద్రాసులోని యూరోపియన్ అధికారి మేజర్ ఎఫ్. ఎమ్ కోలింగ్‌ను భారతదేశం వదలి పోవలసిందిగాను, కళింగపట్నం జిల్లా మేజిస్ట్రేట్‌ను స్వాతంత్ర్య పోరాటంలో చేరవలసిందిగాను కోరుతూ ఉత్తరాలు రాసినందుకు అలాంటి శిక్షలే విధించారు.

సి. ఆర్. పి. సి. లోని 144వ సెక్షన్‌ను ఆంధ్ర దేశంలో విచ్చలవిడిగా ప్రయోగించారు. బొంబాయి ఎ. ఐ. సి. సి. లో ఆమోదించిన తీర్మానాన్ని బల పర్చిన స్థానిక సంస్థ లన్నింటినీ సస్పెండ్ చేశారు. తూర్పు గోదావరి, చిత్తూరు, నెల్లూరు జిల్లా బోర్డులు, పాలకొల్లు, బెజవాడ మున్సిపల్ కౌన్సిళ్ళు అలాంటి కారణంగా ఆరు నెలలపాటు సస్పెండ్ అయ్యాయి.

## జగ్గయ్యపేట బాంబు కేసు

క్విట్ ఇండియా ఉద్యమాన్ని దారుణంగా అణచడానికి ప్రభుత్వం తీ మైన దమన కాండకు దిగింది. చీటికి మాటికి లాఠీచా లు జరపడం మాత్రమే కాక, శాంతియుత ప్రదర్శ లపై పోలీసులు నిష్కారణంగా తుపాకి కాల్పులు జరపడం కూడా అధికం కావడంతో ప్రజలలో ఉగ్రరిస్టు ధోరణులు తలఎత్తసాగాయి. ఇందుకు ఉదాహరణగా కృష్ణాజిల్లా జ య్యపేట బాంబు కేసును పేర్కొనవచ్చు. 1942 సె ంబరు 20 వ తేదీ రాత్రి కృ జిల్లా కలెక్టర్ జగ్గయ్య టలో రెడ్‌క్రాస్ సహాయా ఏర్పాటు చేసిన చింతామణి నాటక ప్రదర్శన తిల స్తుండగా, ఆయనపై ఉద్యమకారులు రెండు చేతి బాంబులు విసిరారు. జిల్లా కలెక్టర్ గాయపడ లేదుగాని, ప్రేక్షకులలో ఆరుగురు గాయపడ్డారు. ఆ సందర్భంలో 9 మందిని అరెస్టు చెసి, కఠిన శిక్షలు విధించారు.

## క్విట్ ఇండియా ఉద్యమం స్వరూప, స్వభావాలు

ప్రభుత్వ రికార్డులను పరిశీలిస్తే, క్విట్ ఇండియా ఉద్యమ స్వరూప, స్వభావాల చిత్రం మనకు గోచర మవుతుంది. ప్రజా సమూహాలను చెదర గొట్టడానికి పోలీసులు ఆంధ్ర దేశంలో 21 చోట్ల కాల్పులు జరిపి 39 మంది ప్రాణాలు బలి గొన్నారు. 177 మంది తీవ్రమైన గాయాలకు గురయ్యారు. పోతే, ప్రజలపై సైనికులు జరిపిన కాల్పుల సంఖ్య 68, ఆ కాల్పులలో 14 మంది మృతి చెందారు. దాదాపు 600 మందికి పైగా గాయపడ్డారు. మద్రాసు రాష్ట్రంలో 13 గ్గురు సైనికులు బ్రిటిషు ప్రభుత్వానికి ఎదురు తిరిగి, స్వాతంత్ర్య పోరాటంలో చేరారు. పోలీసులతో అలా తిరుగుబాటుచేసిన వాడుఒకడే ఒకడు. పోతే, ఈఉద్యమ కాలంలో ధ్వంసమైన పోలీసు స్టేషన్ల సంఖ్య అయిదు కాగా, 50 ప్రభుత్వ భవనాలు ధ్వంసమయ్యాయి, 57 మున్సిపల్ భవనాలు, 11 ప్రముఖ వ్యక్తుల భవనాలు కూడా ధ్వంసమైన వాటిలో వున్నాయి. బాంబు ప్రేలుళ్ళు 17 జరగగా, పట్టుబడిన బాంబుల సంఖ్య 35 బాంబు ప్రేలుళ్ళలో 5 గురు చనిపోయారు. మరొక 6 గురు బాంబులు తయారు చేస్తుండగా, సంభవించిన ప్రేలుళ్ళకు ప్రాణాలు కోల్పోయారు. రోడ్లను విధ్వంసం చేసిన ఘటనలు732, విద్యుత్ సరఫరాకు కల్గించిన విఘాతాల సంఖ్య 41. ఇతర రకాలైన విధ్వంసక చర్యలు 383 వరకు జరిగాయి. సామూహిక జరిమానాలను 71 ప్రాంతాలలో విధించి, రు. 10,36,371 లు వసూలు చేశారు. 1942 ఆగస్టు నుంచి 1943 వరకు ప్రత్యేక క్రిమినల్ కోర్డులలో శిక్షలు పొందిన వారి సంఖ్య 897 కాగా, మామూలు కోర్టులలో శిక్షలు పొందిన వారి సంఖ్య 3134 వరకు వుంది. ఇద్దరికి మరణ శిక్ష , 285 మందికి కొరడా దెబ్బల శిక్షలు విధించారు.

## సామూహిక జరిమానా కింద ఆచార్య రంగా ధాన్యం స్వాధీనం

గుంటూరు జిల్లా నిడుబ్రోలులో ప్రభుత్వాధికారులు సామూహిక జరిమానా వసూలు నిమిత్తం ఆచార్య

ఎన్.జి. రంగా, ఆయన సోదరుని ధాన్యాన్ని స్వాధీనం చేసుకొన్నారు. కృష్ణా జిల్లాలో ఈడుప్పుగల్లు, బొడ్డపాడు, గుడ్లవల్లేరు, పసుమర్రు మున్నగు గ్రామాలపై సామూహిక జరిమానాలు విధించారు. బ్రిటిషు ప్రభుత్వం "విభజించి పాలించాలి"న్న తన నీతి ప్రకారం, సామూహిక జరిమానాలనుంచి ముస్లిములు, క్రిష్టియన్లు, షెడ్యూల్ తరగతులు ప్రభుత్వోద్యోగులను మినహాయించింది.

## బెజవాడలో మారణాయుధాల స్వాధీనం

జాతీయ యువజన సంఘం స్వాతంత్ర్య సాధనకు సాయుధ పోరాటానికి సన్నాహాలు చేయక పోలేదు. ఆయుదాలు మందుగుండు సేకరించడానికి జరిపిన ప్రయత్నం విఫలమైంది. పోతిన వెంకన్న పేర వచ్చిన ఉత్తరం పోలీసుల చేతిలో పడింది. 1943 ఫిబ్రవరి 3 న పోలీసులు బందరు కాలువ గట్లును గాలించి. 15 తుపాకీ గుళ్ళను. ఒక దేశవాళీ పిస్తోలు, వివిధ రకాల బాంబులను స్వాధీనం చేసుకున్నారు. రాంపల్లి సూర్యనారాయణ ఇంటిపై దాడిచేసి, ఒక బ్రెడిల్ ప్రెస్‌ను, అగ్గిపెట్టె బాంబును స్వాధీనం చేసుకొన్నారు. వడిత్రెన మరిడయ్య ఇంటిని సోదా చేయగా, దేశవాళీ పిస్తోలు దొరికింది. ఈ సందర్భంలో చేబ్రోలుకు చెందిన యువజన నాయకుడు పి. నాగేశ్వరరావుకు 8 సంవత్సరాల కఠిన శిక్ష విధించారు. ఏది ఏమైనా. ఎవరో కొందరు ఆవేశపరులైన యువకులు తప్ప మొత్తం మీద క్విట్ ఇండియా ఉద్యమం అహింసా పద్ధతిలోనే సాగినట్లు బ్రిటిషు ప్రభుత్వానికి నమ్మకం ఏర్పడింది.

## తగ్గుముఖం పట్టిన ఉద్యమం

1930–32 కాలంనాటి జాతీయ సమైక్యతా భావం 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో కాన రాకపోవడం వల్లను, ఈ ఉద్యమాన్ని వామపక్ష శక్తులలో కొన్ని బలపర్చక పోవడం వల్లను, భారత రక్షణ నిబంధనల క్రింద కాంగ్రెసు, జాతీయ విద్యార్థి సంఘం, జాతీయ యువజన సంఘం వంటి వాటిని నిషేధించడం వల్లను ఆగస్టు విప్లవ పోరాటం క్రమేణా తగ్గుముఖం పట్టింది.

## గాంధీ నిరాహార దీక్ష

"దేశంలో సంభవించిన హింసా చర్యలన్నింటికి బాధ్యత గాంధీజీదే" నంటూ బ్రిటిషు ప్రభుత్వం సాగిస్తున్న నిందా పూర్వక ప్రచారానికి నిరసనగా మహాత్మా గాంధీ 1943 ఫిబ్రవరి 10 నుంచి మార్చి 30 వరకు నిరాహారదీక్ష సాగించారు. 74 సంవత్సరాల వయస్సులో గాంధీజీ నిరాహారదీక్ష ప్రారంభించడంతో. ఆయన ఆరోగ్యం గురించి భారతజాతి తీవ్రమైన ఆందోళనకు లోనైంది. దేశమంతటా ఉద్రిక్తతా వాతావరణం అలముకొంది. దేశంలోని అనేక ప్రాంతాలలో జరిగినట్లే, ఆంధ్రదేశంలోని అనేక పట్టణాలలో విద్యార్థులు సామూహికమైన నిరాహార దీక్షలు సాగించి తమ సానుభూతిని వ్యక్తంచేశారు విద్యార్థులు పూరేగింపులు జరిపి, గాంధీజీని వెంటనే విడుదల చేయాలని డిమాండ్ చేశారు. మదనపల్లిలో విద్యార్థుల ఊరేగింపుపై పోలీసులు జరిపిన లాఠీఛార్జీలో 25 మంది గాయపడ్డారు. అనేక బార్ అసోసియేషన్‌లు, విద్యార్థి సంఘాలు, వ్యాపార సంఘాలు,వ్యవసాయ కార్మికులు, ఒక్క మాటలో చెప్పాలంటే మొత్తం దేశం ముక్తకంఠంతో గాంధీజీ విడుదలను డిమాండ్ చేసింది.

గుంటూరులో వేయిమంది సంతకాలతో కూడిన మహజరును ప్రభుత్వానికి పంపారు. విశాఖపట్నం, ఎ.వి.ఎన్. కాలేజి విద్యార్థులు ఆంధ్రా మెడికల్ కాలేజీకి చెందిన మహిళా హాల్ విద్యార్థినులు సామూహిక నిరాహారవ్రతం పూరు ప్రొఫెసర్ మామిడిపూడి వెంకటరంగయ్య అధ్యక్షతన సమావేశమైన ఆంధ్ర యూనివర్శిటీ అధ్యాపకవర్గం, విద్యార్థుల సంయుక్త సమావేశంలో మహాత్మాగాంధీ ఆరోగ్యం క్షీణిస్తున్న దృష్ట్యా వెంటనే బేషరతుగా గాంధీజీని విడుదల చేయాలని కోరుతూ తీర్మానించారు.

కాకినాడలో ప్లీడరు గుమాస్తాలు, పి.ఆర్. కాలేజీ విద్యార్థులు అలాంటి ఆందోళననే సాగించారు. గాంధీజీని విడుదల చేయడానికి నిరాకరించిన బ్రిటిషు ప్రభుత్వం మొండి వైఖరికి నిరసనగా, వైస్రాయి కార్యనిర్వాహక వర్గం సభ్యత్వానికి ముగ్గురు భారతీయులు రాజీనామా చేశారు. అయినా ఆనాటి బ్రిటిష్ ప్రధాని చర్చిల్ మహాత్మాగాంధీని విడిచి పెట్టవలసిన అవసరం లేదని మొండి ధోరణినే ప్రదర్శించాడు.

1943 ఆగస్టు 9 న క్విట్ ఇండియా ఉద్యమం ప్రథమ వార్షికోత్సవం జరిపారు. అక్టోబరు 2 న గాంధీజీ జన్మదినోత్సవం దేశంలో పెద్ద ఎత్తున జరిపారు. అయినప్పటికీ 1942 తో పోల్చుకుంటే

1943 సంవత్సరంలో దేశపరిస్థితి కొంత ప్రశాంతంగా మారినదని చెప్పవచ్చు.

1943 అక్టోబరులో వైస్రాయి లా లిన్‌లిత్గో నిష్క్రమించి, ఆయన స్థానంలో లా వేవెల్ వచ్చాడు. లిన్‌లిత్గో హయాంలో జరిగిన దుణాలకు గాంధీజీ తన విచారాన్ని వ్యక్తం చేశారు.

1944 సంవత్సరం వచ్చేసరికి, ప్రజలలో బ్రిటిషు వ్యతిరేకత తగ్గకపోయినా, క్విట్ ఇండియా పోరాటం మాత్రం చాలావరకు చల్లబడిపోయిందని చెప వచ్చు. 1944 జనవరి 26 న దేశమంతటా పె ఎత్తున, అత్యంత ఉత్సాహపూరితంగా జరిపిన స్వాతంత్ర్య దినోత్సవం, భారత ప్రజల హృదయాలలో జేగీయమానంగా వెలుగుతున్న స్వాతంత్ర్య కాంక్షకు ప్రత్యక్ష నిదర్శనం.

క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టయిన మహదేవ్ దేశాయ్, కస్తూరిబాయ్‌గాంధీ జైళ్ళలోనే తనువులు చాలించారు. 1944 ఫిబ్రవరి 22 న కస్తూరిబాయ్ గాంధీ కన్ను మూసినదన్న వార్త విని, భారత ప్రజలు శోకతప్తులయ్యారు. ఆంధ్రదేశమంతటా సంతాప సభలు జరిపారు. ఈ సంతాప సభలు జరగడం కూడా, సహించలేని ప్రభుత్వాధికారులు భీమవరం వంటి చోట్ల సంతాప సభలను నిషేధించారు గుంటూరు వంటి చోట్ల వాలంటీర్లను అరెస్టు చేశారు.

## గాంధీజీ విడుదల

భారతదేశంలోని రాజకీయ ప్రతిష్టంభనకు గాంధీజీ విడుదల ఒక్కటే పరిష్కార మార్గం చూపగలదని దేశంలోని, ప్రపంచంలోని ప్రజాభిప్రాయం బలపడడంతో, బ్రిటిషు ప్రభుత్వం విధిలేక 1944 మే 6 న మహాత్మాగాంధీని "అనారోగ్య కారణాలపై విడుదల" చేస్తున్నట్లు ప్రకటించింది.

భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని బ్రిటిష్ ప్రభుత్వం వాగ్దానంచేస్తే, శాసనోల్లంఘనోద్యమాన్ని కాంగ్రెస్ విరమించేటట్లు, తాను చూడగలనని స్పష్టం చేస్తున్న మహాత్మాగాంధీ 1944 జులై 27 న వైస్రాయి వేవెల్‌కు లేఖ రాశాడు. ఆ ప్రతిపాదనకు లార్డు వేవెల్ నుంచి ప్రత్యుత్తరం లేదు.

అయినప్పటికీ ప్రభుత్వం తన దమననీతిని విడనాడలేదు. బహిరంగ సభలపై నిషేధాజ్ఞలు అమలు జరుపుతూనే వున్నది. ఆంధ్రదేశంలో క్విట్ ఇండియా ఉద్యమ ద్వితీయ వార్షికోత్సవం జరపడానికి అనుమతించవలసిందని పలువురు గాంధీజీని కోరగా, వార్షికోత్సవం జరపడంలో తప్పులేదుగాని, ప్రభుత్వం విధించిన నిషేధాజ్ఞలను ఉల్లంఘించడం వల్ల పరిస్థితి కలుషితం కాగల ప్రమాదం వుందని హెచ్చరించాడు. ఆగస్టు 9 న నిరసన వ్రతాలతోను, ప్రార్థనలతోను సరిపుచ్చు కోవలసిందిగా మహాత్మాగాంధీ సలహా చెప్పారు. అజ్ఞాతవాసంలో వున్న కాంగ్రెస్ కార్యకర్తలంతా పోలీసులకు లొంగిపోవాలని హితోపదేశం చేశాడు. కర్నూలుజిల్లా కాంగ్రెసు నాయకుడు నివర్తి వెంకట సుబ్బయ్య వంటివారు మహాత్మాగాంధీ సలహా ప్రకారం, పోలీసులకు లొంగిపోయారు.

దేశంలోని మత సమస్యను పరిష్కరించే మార్గం శోధిస్తూ మహాత్మాగాంధీ ముస్లిం లీగ్ నాయకుడు జిన్నాతో సంభాషణలు సాగించాడు. ఈ చర్చలు ఫలప్రదం కాలేదు.

కాంగ్రెస్ సంస్థపై నిషేధం వున్నందున,కాంగ్రెసు వాదులు పశ్చిమగోదావరి, కృష్ణా, నెల్లూరు వంటి జిల్లాలలో కాంగ్రెసు అసెం లను ఏర్పాటుచేసి, వాటి ద్వారా తమ రాజకీయ కార్యకలాపాలను సాగించసాగారు. కల్లూరి సుబ్బారావు, శ్రీమతి రుక్మిణి లక్ష్మిపతి వంటి నాయకులు రాష్ట్రమంతటా పర్యటించారు.

దేశంలోని రాజకీయ ప్రతిష్టంభనను తొలగించి, జాతీయ నాయకులతో ఒక అవగాహనకు రావడానికి వీలుగా బ్రిటిషు ప్రభుత్వం 1945 జూన్‌లో కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులందరిని జైళ్ళనుంచి విడుదల చేసింది.

1945 జూలైలో వైస్రాయి వేవెల్ సిమ్లాలో జాతీయ నాయకుల సమావేశం ఏర్పాటుచేసి, దానికి కాంగ్రెస్ ముస్లింలీగ్ నాయకులను ఆహ్వానించాడు. ఆ సమావేశంలో లార్డ్ వేవెల్ ఒక ప్రతిపాదన చేశాడు.

వైస్రాయి కార్యనిర్వాహక వర్గాన్ని తాను పునర్నిర్మాణం చేసి విదేశ వ్యవహారాల నిర్వహణ బాధ్యత తను భారతీయ సభ్యునికి అప్పగిస్తానని హామీ ఇచ్చాడు. వైస్రాయి కార్యనిర్వాహక వర్గంలో నియుక్తు లయ్యే ముస్లిములందరిని ముస్లింలీగ్ మాత్రమే నామినేట్ చేయాలని జిన్నా మొండి కెత్తడంతో సిమ్లా సమావేశం విఫలమైంది.

సిమ్లా సమావేశం విఫలమైన కొద్దిరోజులకే యుద్ధంలో జపాను ఘోర పరాజయం పొందటం, ఇంగ్లండులో ఎన్నికలు జరగడం, ఆ ఎన్నికలలో కన్సర్వేటివ్ పార్టీ ఓడిపోవటం, లేబరుపార్టీ ప్రభుత్వం ఏర్పడటం వంటి పరిణామాలు చకచకా సంభవించాయి.

1946 సెప్టెంబరు 16 న లార్డ్ వేవెల్ భారతదేశంలో కేంద్ర అసెంబ్లీకి, రాష్ట్ర అసెంబ్లీలకు త్వరలో ఎన్నికలు జరపగలనని ప్రకటించాడు. ఆ ఎన్నికలలో పోటీచేయాలని కాంగ్రెస్, ముస్లింలీగ్ నిర్ణయించుకొన్నాయి.

## ఆజాద్ హింద్ ఫౌజ్

దేశంలో జనరల్ ఎన్నికల ప్రచారం ముమ్మరంగా సాగుతుండగా 'ఆజాద్ హింద్ ఫౌజ్' (ఐ. ఎన్. ఎ.) ఖైదీలను ఢిల్లీ ఎర్రకోటలో ఏర్పాటు చేసిన ప్రత్యేక సైనిక న్యాయస్థానం విచారణ ప్రారంభించింది. ఈ విచారణపట్ల దేశమంతటా అసమ్మతి జ్వాలలు చెలరేగాయి.

మాతృదేశాన్ని బ్రిటిషు దాస్యశృంఖలాలనుంచి విముక్తం చేయడానికి జర్మనీ, జపాను దేశాల సహాయం స్వీకరించవచ్చునన్న ఉద్దేశంతో, భారతదేశం వీడిపోయిన సుభాసుచంద్రబోసు "ఆజాద్ హింద్ ఫౌజ్"(భారత జాతీయ సైన్యాన్ని) ఏర్పాటు చేశాడు. బర్మా, మలయా, సింగపూరులలో ఈ సైన్య నిర్మాణం జరిగింది. జపాను సైన్యంతోపాటు ఈ సైన్యంకూడా బ్రిటిషు సైనిక బలాలపై యుద్ధం సాగించింది. యుద్ధంలో జపాను ఓడిపోయినప్పుడు "ఆజాద్ హింద్ ఫౌజ్" సైనికులు 20 వేలమందికి పైగా బ్రిటిష్ సైనికులకు ఖైదీలుగా చిక్కారు.

ఆజాద్ హింద్ ఫౌజ్ సైనికులు దేశభక్తులని, వారిని యుద్ధ నేరస్థులుగా విచారించి శిక్షించటం అన్యాయమని, వారిని విడుదల చేయాలని ఆంధ్రదేశమంతటా ఊరేగింపులు, ప్రదర్శనలు, హర్తాళులు జరిగాయి. ఐ. ఎన్. ఎ. ఖైదీల 'రక్షణనిధి'ని వసూలు చేశారు. పెల్లుబికిన ప్రజాభిప్రాయానికి తలొగ్గిన బ్రిటిషు ప్రభుత్వం ఆజాద్ హింద్ ఫౌజ్ సైనికులకు విధించిన శిక్షలను తగ్గించింది.

1945 లో సుభాసుచంద్రబోసు విమాన ప్రమాదంలో చిక్కుకుని చనిపోయినట్టు ప్రకటన వెలువడింది. ఆజాద్ హింద్ ఫౌజ్ ఖైదీల తరపున ఎర్రకోటలోని సైనిక న్యాయస్థానంలో వాదించిన న్యాయవాదులలో భూలాభాయ్ దేశాయ్, సర్ తేజ్ బహదూర్ సప్రూ, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ వంటి వారున్నారు.

## జనరల్ ఎన్నికలు
## కాంగ్రెస్ విజయం

1945 డిసెంబరులో కేంద్ర అసెంబ్లీకి జనరల్ ఎన్నికలు జరిగాయి. ముస్లిం స్థానాలలో తప్ప, మిగతా అన్ని స్థానాలలోను కాంగ్రెసు అభ్యర్థులు అఖండ విజయం సాధించారు. ఆంధ్రదేశం నుంచి కేంద్ర అసెంబ్లీకి ఎన్నికైన 9 మంది కాంగ్రెసు సభ్యులలో ప్రొఫెసర్ ఎన్. జి. రంగా, అనంతశయనం అయ్యంగార్, వల్లపట్ల గంగరాజులు పోటీ లేకుండానే నెగ్గారు.

## నావికాసైన్యం తిరుగుబాటు

1945 డిసెంబరులో జరిగిన కేంద్ర అసెంబ్లీ ఎన్నికలకు, 1946 డిసెంబరులో జరిగిన రాష్ట్రాల అసెంబ్లీల ఎన్నికలకు మధ్య దేశంలో అతి ముఖ్యమైన సంఘటన ఒకటి సంభవించింది. అదే నావికా సైన్యం తిరుగుబాటు. భారతదేశం నుంచి బ్రిటిషు జెండాను ఎత్తివేయక తప్పదని బ్రిటిషు ప్రభుత్వం గ్రహించడానికి ఈ తిరుగుబాటు ఎక్కువగా తోడ్పడినదని చెప్పవచ్చు.

1946 ఫిబ్రవరి 18 న బొంబాయిలో శిక్షణ పొందుతున్న భారత నావికా సైనికులు తమను బ్రిటిషు అధికారులు అవమాన పర్చినందుకు తమకు అవమానకరమైన నిబంధనలు వర్తింపచేసినందుకు నిరసనగా నిరాహారదీక్ష ప్రారంభించడంతో నావికా తిరుగుబాటుకు ప్రారంభోత్సవం జరిగింది. ఈ పోరాటం అతి త్వరితంగా అన్ని ప్రాంతాలకు వ్యాపించడంతో మొత్తం భారత నావికాసైన్యమంతా అందులో పాల్గొన్నది.

భారత నావికా సైనికులు యుద్ధ నౌకలను స్వాధీనం చేసుకొన్నాయి. బ్రిటిషు సైనిక కేంద్రాలపై ఆ యుద్ధ నౌకల పైనుంచి ఫిరంగులు పేల్చడానికి సిద్ధమయ్యారు. అలాంటి దశలో వల్లభాయ్ పటేల్ జోక్యం వల్ల భారత నావికా సైనికుల తిరుగుబాటు విరమింపబడింది.

ఈ నావికాసైన్యం తిరుగుబాటు సందర్భంగా బొంబాయిలో అల్లర్లు, గృహదహనాలు, లూటీలు,

చాలా పెద్ద ఎత్తున జరిగాయి. పోస్టాఫీసులు, బ్యాంకులు, దుకాణాలు దగ్ధమైపోయాయి. పోలీసులకు అలవికాని పరిస్థితి ఏర్పడింది. సైన్యం రంగంలోకి దిగింది. తుపాకి కాల్పులు విచ్చలవిడిగా జరిపారు. ఆ కాల్పులలో మొత్తం 200 మంది ప్రాణాలు కోల్పోయారు.

విశాఖపట్నం, మద్రాసు, అహ్మదాబాద్ తదితర తావులలోని నావికాసైన ం కూడా ఈ తిరుగుబాటులో చేరింది. సోనావతి యు నౌకపై యూనియన్ జాక్ జెండాను తొలగించి, _ స్థానంలో జాతీయ జెండాను ఎగురవేశారు. నావికాసైనికులు విశాఖపట్నం, మద్రాసు, తదితర చోట్లకూడా జాతీయగీతాలు పాడుతూ ఊరేగింపులు జరిపారు.

## బ్రిటిషు మంత్రిమండలి ప్రతినిధివర్గం రాక

భారతదేశంలో ఇక తమ వలస పాలన సాగే పరిస్థితి లేదని గ్రహించిన, బ్రిటిషు లేబరు ప్రభుత్వం భారత జాతీయ నాయకులతో చర్చలు జరిపి, స్వాతంత్ర్యాన్ని ప్రదానం చేయడం వినా మరొక మార్గాంతరం లేదన్న నిర్ణయానికి వచ్చింది. అందుకు అనుగుణంగా లార్డ్ పెథిక్ లారెన్సు నాయకత్వాన ముగ్గురు సభ్యులతో కూడిన మంత్రిమండలి ప్రతినిధి వర్గాన్ని భారతదేశానికి పంపడానికి నిశ్చయించింది.

లార్డ్ పెథిక్ లారెన్సు, సర్ స్టాఫర్డ్ క్రిప్స్, లార్డ్ అడ్మరాలిటీ ఎ. వి. అలెగ్జాండర్ లతో కూడిన మంత్రి మండలి ప్రతినిధివర్గం 1946 మార్చి 24 న భారత దేశానికి చేరుకొన్నది. ఈ ప్రతినిధివ ం రెండు నెలల పాటు భారతదేశంలో కాంగ్రెస్, ము ంలీగ్, హిందూ మహాసభ, అకాలీదళ్ మున్నగు పా ల నాయకులతో చర్చలు జరిపి, అనేక విషయాలపై ఏకాభిప్రాయం సాధించగలిగారు. పాకిస్తాన్ ఏర్పాటుపై అంగీకారం కుదరలేదు.

## తాత్కాలిక ప్రభుత్వం

కేంద్రంలో తాత్కాలిక ! భుత్వాన్ని ఏర్పాటు చేయవలసిందిగా వైస్రాయి లా వేవెల్ 1946 ఆగస్టు 6 న కాంగ్రెస్ పార్టీని ఆహా ంచాడు. ఆ ఆహ్వానాన్ని కాంగ్రెస్ ఆమోదించిం . అందుకు నిరసనగా ఆగస్టు 6 న "ప్రత్యక్షచర్య దినోత్సవం" జరపాలని ముస్లింలీగ్ పిలుపు నిచ్చింది. అందుకు వీలుగా బెంగాల్ లోని ముస్లింలీగ్ ప్రభుత్వం ఆగస్టు 16 న ప్రభుత్వ సెలవుదినంగా ప్రకటించింది. ఆ ప్రత్యక్ష చర్య దినోత్సవ సందర్భంలో బెంగాలులోను, కలకత్తాలోను, సిల్హెట్ లోను మతకలహాలు చెలరేగి, రక్తపాతానికి దారితీసింది. కలకత్తా, సిల్హెట్ లలో జరిగిన వాటికి ప్రతీకారంగా నౌఖాలీ, తిప్పారాలలో మానవ మారణహోమం జరిగింది. ఇలాంటి హింసాత్మక వాతావరణంలో మతోన్మాదం పెచ్చరిల్లిన స్థితిలో సెప్టెంబరు 2 న ప్రధాని పండిట్ జవహర్ లాల్ నెహ్రూ నాయకత్వాన కేంద్రంలో తాత్కాలిక ప్రభుత్వం పదవీస్వీకారం చేసింది. అటు తరువాత కొన్ని రోజులకు ముస్లింలీగ్ కు చెందిన అయిదుగురు మంత్రులు తాత్కాలిక ప్రభుత్వంలో చేరారు.

1946 డిసెంబరు 9 న రాజ్యాంగ సభ తొలి సమావేశం జరిగింది. ఈ రాజ్యాంగ సభ నిర్ణయాలు చెల్లనేరవని ముస్లింలీగ్ ప్రకటించింది. ఆ దశలో బీహారులోను, గోము క్తేశ్వర్, లాహోర్, రావల్పిండి వంటి చోట్ల మతకలహాలు పెచ్చరిల్లాయి. పంజాబులో చెలరేగిన మతకలహాలను అణచడానికి ఆ రాష్ట్ర ప్రభుత్వం ఎలాంటి చర్యలు గైకొనలేదు. దాంతో అక్కడ శాంతిభద్రతలకు ముప్పు వాటిల్లింది.

## అట్లీ ప్రకటన

దేశంలో ఇలాంటి అల్లకల్లోల, అరాచక పరిస్థితులు ఏర్పడిన తరుణంలో, బ్రిటిషు ప్రధాని లార్డ్ అట్లీ 1948 జూన్ నెలాఖరులోగా బ్రిటిష్ ప్రభుత్వం భారత దేశంలో పాలనాధికారాన్ని జాతీయ నాయకులకు అప్పగించాలని నిర్ణయించినట్లు ప్రకటించాడు.

"తాంబూలాలు ఇచ్చేశారు, ఇక తన్నుకుచావండి" అన్న ధోరణిలో బ్రిటిషు ప్రభుత్వం వ్యవహరించింది.

## రాష్ట్ర అసెంబ్లీల ఎన్నికలు

1947 మార్చిలో వివిధ రాష్ట్ర ల అసెంబ్లీలకు జరిగిన జనరల్ ఎన్నికలలో కాం! స్ పార్టీ అఖండ విజయం సాధించింది. ఆంధ్రదే ంలో ఏవో కొన్ని స్థానాలు మినహా దాదాపు అన్ని స్థానాలలోను కాంగ్రెస్ అభ్యర్థులే నెగ్గారు. మద్రాసు రాష్ట్రంలో టంగుటూ

ప్రకాశం నాయకత్వంలో కాంగ్రెసు మంత్రివర్గం ఏర్పడింది.

## దేశ విభజన

దేశాన్ని రెండుగా చీల్చి, భారతదేశం, పాకిస్తాన్లుగా విభజించి, స్వాతంత్ర్యం ప్రదానం చేయనున్నట్టు బ్రిటిషు ప్రధాని లార్డ్ అట్లీ 1947 ఫిబ్రవరి 20 న ప్రకటించాడు.

దేశ విభజన, స్వాతంత్ర్య ప్రదాన కార్యక్రమాలను నిర్వహించడానికి 1947 జూన్ 3 న లార్డ్ మౌంట్ బాటెన్ను వైస్రాయిగా మన దేశానికి పంపారు.

వైస్రాయి మౌంట్ బాటెన్ రూపొందించిన పథకం ప్రకారం భారతదేశాన్ని విభజించి, పాకిస్తాన్ను ఏర్పాటుచేసి, భారత్ పాకిస్తాన్ దేశాలు రెండింటికి 1947 ఆగస్టు 15 వ తేదీన స్వాతంత్ర్యం ప్రదానం చేయడానికి నిర్ణయించారు.

1947 జూలై 15 న బ్రిటిష్ పార్లమెంట్ భారత స్వాతంత్ర్య ప్రదాన బిల్లును ఆమోదించింది.

1947 జూన్ 15 న అఖిలభారత కాంగ్రెసు సంఘం మౌంట్ బాటెన్ ప్లానుకు తన ఆమోదం తెలిపింది.

1947 ఆగస్టు 15 న భారతదేశం స్వాతంత్ర్యాన్ని పొందింది. దాదాపు రెండువందల సంవత్సరాల పరాయి పాలనలో మ్రగ్గిన భారతదేశం తిరిగి స్వాతంత్ర్య వాయువులను పీల్చసాగింది.

బ్రిటిషు వలస పాలనకు వ్యతిరేకంగా 1857 లో సైనిక తిరుగుబాటు రూపంలో ప్రారంభమైన భారత స్వాతంత్ర్య మహా పోరాటం 90 సంవత్సరాలపాటు సాగి, 1947 ఆగస్టు 15వ తేదీతో విజయవంతంగా ముగిసింది.

ఈ స్వాతంత్ర్య మహా పోరాటంలో అగ్రభాగాన నిలబడి, అశేష త్యాగాలు చేసి, అనుపమానమైన పాత్ర నిర్వహించిన తెలుగుజాతి ప్రజలు 1947 ఆగస్టు 15 న స్వాతంత్ర్య ఉత్సవాలను ఎంతో సంబరంగా జరుపుకొన్నారు.

# నైజాం ముష్కర పాలననుంచి తెలంగాణా విముక్తి

1944 లో నల్లగొండజిల్లా భువనగిరిలో రావి నారాయణరెడ్డి అధ్యక్షతన జరిగిన 11వ ఆంధ్ర మహాసభ కాన్ఫరెన్సులో అతివాదుల ప్రాబల్యం స్థిరీభూతమైంది. ఆంధ్ర ప్రాంతానికి చెందిన కమ్యూనిస్టు నాయకులు చండ్ర రాజేశ్వరరావు భువనగిరి మహాసభకు హాజరయారు. జాతీయవాద వర్గ నాయకులైన కె. వి. రంగారె , మాడపాటి రామచంద్రరావు అందుకు అభ్యం రం తెలిపారు. వారు మహాసభనుంచి నిష్క్రమించి, జాతీయ ఆంధ్ర మహాసభ అనే పోటీ సంఘాన్ని ఏర్పాటుచేశారు. ఆ విధంగా నైజాం పాలనకు వ్యతిరేకంగా, ఐక్య పోరాటం సాగిస్తున్న ఆంధ్ర మహాసభ రెండుగా చీలిపోయింది.

## స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధం తొలగింపు

భారత జాతీయ నాయకులతో బ్రిటిష్ ప్రభుత్వం ఏదో ఒక విధమైన ఒప్పందానికి రావడం ఖాయమని నైజాం నవాబుకు, బ్రిటిషు మంత్రిమండలి ప్రతినిధి వ ం రాకతో. భయం కలిగింది. ఆ భయంవల్ల నైజాం ꠰ భుత్వం స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధం తొలగించడానికి ంస్థాన కాంగ్రెసు నాయకులను 1945 నవంబరు 24న చర్చలకు ఆహ్వానించింది.

మందుముల నర్సింగరావు, జి. రామచందర్, కాశీనాధరావు వైద్యలతో కూడిన సంస్థాన కాంగ్రెసు ప్రతినిధివర్గం అప్పటి ప్రధానమంత్రి చత్తారీ నవాబ్ జహీద్ హుస్సేన్, ఆర్థిక మంత్రి అలీయవార్‌జంగ్, రాజకీయ కార్యదర్శి నవాబ్ మొహిన్ నవాజ్ జంగ్, రెవెన్యూ, పోలీసు శాఖ మంత్రి సవిద్గే, హోమ్ కార్యదర్శి రజ్వీలతో సుదీర్ఘమైన చర్చలు జరిపారు. కాంగ్రెసు అను పదాన్ని విసర్జించాలని నైజాం ప్రభుత్వం పట్టుబట్టింది. అయితే, ఆ షరతుకు కాంగ్రెసు ప్రతినిధులు అంగీకరించలేదు. అయితే నైజాం నవాబు పట్ల విధేయత ప్రకటించడం, నాన్ ముల్కీలను కాంగ్రెసు కార్యవర్గానికి ఎన్నిక కాకుండా నివారించడం అన్న రెండు షరతులపు కాంగ్రెసు ప్రతినిధులు సమ్మతించారు. దాంతో 1946 ఏప్రిల్‌లో నైజాం ప్రభుత్వం స్టేట్ కాంగ్రెస్‌పై విధించిన నిషేధాన్ని తొలగించింది.

## తెలంగాణా పోరాటం

నైజాం ప్రభుత్వం కాంగ్రెసుపై నిషేధాన్ని తొలగించడానికి దోహదమిచ్చిన మరో కారణం కూడా లేకపోలేదు. రావి నారాయణ రెడ్డి నాయకత్వంలో ఆంధ్రమహాసభ నైజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా రాజకీయ పోరాటం సాగించడంతో పాటు, జాగీర్దారు, దేశ్‌ముఖ్‌లు వంటి ఫ్యూడల్ శక్తులకు వ్యతిరేకంగా ఆర్థిక పోరాటాన్ని కూడా జోడించి, జోరుగా సాగించింది. అదే చరిత్రలో తెలంగాణా పోరాటంగా పేరు పొందింది.

## జయప్రకాశ్‌రాక - బహిష్కరణ

తెలంగాణా గ్రామీణ ప్రాంతాలలో ఆంధ్ర మహాసభ నైజాం ప్రభుత్వంపై రాజకీయ పోరాటంతో పాటు, సామాన్య ప్రజలను పీడిస్తున్న ఫ్యూడల్ శక్తులకు వ్యతిరేకంగా ఆర్థిక పోరాటాన్ని జోడించి, ఉధృత స్థాయికి తీసుకు పోతున్న దశలో కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి జయప్రకాశ్ నారాయణ 1947 మే 7న హైదరాబాద్‌వచ్చి, కర్బలా మైదానంలో బ్రహ్మాండమైన బహిరంగ సభలో నైజాం నవాబ్‌కు వ్యతిరేకంగా తీవ్రమైన పదజాలంతో చేసిన ఉత్తేజ పూరితమైన ప్రసంగం భాగ్యనగర్ ప్రజలను ఎంతగానో ప్రభావితం చేసింది. హైదరాబాద్, సికింద్రాబాద్ జంట నగరాల ప్రజలపై ఆ ప్రసంగం కల్గించిన ప్రభావాన్ని చూసి, భయపడిన జాం ప్రభుత్వం జయప్రకాశ్ నారాయణ్‌ను జాం సంస్థానం నుంచి బహిష్కరిస్తూ ఉత్తర్వులు రీ చేసింది.

## నిరసన వెల్లువ

నైజాం ప్రభుత్వం గైకొన్న ఆ నిరంకుశ చర్యకు నిరసనగా మే 8న జంటనగరాలలో కార్మిక నాయకులు బి. ఎస్. మహదేవ్ సింగ్, నరేంద్ర ప్రసాద్ సాక్సేనా నాయకత్వంలో కాంగ్రెసు వాలంటీర్లు గుంపులు గుంపులుగా జాతీయ జెండాలు చేబూని,

నల్ల బ్యాడ్జిలు ధరించి. "జయప్రకాశ్ నారాయణ్ జిందాబాద్, స్టేట్ కాంగ్రెస్ జిందాబాద్" అని నినాదాలు చేస్తూ, ప్రదర్శనలు జరిపారు. ఈ సందర్భంలో కింగ్స్‌వే, మార్కెట్ స్ట్రీట్, సుభ్రిక్‌స్ట్రీట్, సుల్తాన్ బజార్, బేగంబజార్, గౌలిగుడా వంటి చోట్ల పోలీసులకు, ప్రదర్శకులకు మధ్య ఘర్షణలు చెలరేగాయి. అనుకొన్న ప్రకారం, మే 8న రఘునాధ్‌బాగ్‌లో బ్రహ్మాండమైన బహిరంగసభ జరిగింది. ఆ సభలో స్వామి రామానందతీర్థ, నరేంద్ర ప్రసాద్ సాక్సేనా ప్రసంగించారు. అదే రోజున బూర్గుల రామకృష్ణారావు, ఆర్. వి. బేదట్, రామమూర్తి, వి బి. రాజు, ఈశ్వరయ్య ప్రభుత్వ నిషేధాజ్ఞలను ధిక్కరిస్తూ, బహిరంగ సభలలో ప్రసంగించారు. రోజూ సత్యాగ్రహం జరిపారు వారి ప్రసంగాలలో జయ ప్రకాశ్ బహిష్కరణను ఖండించారు. ఈ సందర్భంలో కొన్ని చోట్ల అల్లర్లు చెలరేగడమే కాక, నల్లకుంట వంటి ప్రాంతాలలో మతకలహాలు కూడా చెలరేగాయి. ఇద్దరు హిందువులు, ఒక ముస్లిం మరణించారు. జంట నగరాలలోని అనేక ప్రాంతాలలోని నిషేధాజ్ఞలను జారీ చేసిన జాం ప్రభుత్వం మొత్తం 317 మందిని అరె చేసింది.

## నైజాం వాబు స్వాతంత్ర్య ప్రకటన

1947 ఆగస్టు 15న భారత, పాకిస్తాన్ దేశాలు స్వతంత్ర దేశాలుగా అవతరించడంతో, నైజాం నవాబు తన సంస్థానం కూడా స్వతంత్ర దేశంగా వుంటుందని, భారతదేశంతోగాని, పాకిస్తాన్‌తోగాని చేరే సమస్యలేదని ప్రకటించాడు. భారతదేశంలో హైదరాబాద్ సంస్థానం విలీనాన్ని కోరుతున్న నైజాం సంస్థాన ప్రజలకు నైజాం నవాబ్ స్వాతంత్ర్యం ప్రకటించుకోవడంతో పుండుమీద కారం చల్లిన చందమైంది.

## ట్ కాంగ్రెసులో రెండు వర్గాలు

ట్ కాం! .సుపై నిషేధం తొలగిన తరువాత, హై రాబాద్ ట్ కాంగ్రెసు అధ్యక్షులుగా స్వామీ రామానంద తీ ఎన్నికయ్యారు. ఆ సందర్భంలో స్టేట్ కాంగ్రె లో రెండు వర్గాలు ఏర్పడ్డాయి.

స్వామిరామానంద తీర్థవర్గంలో జమలాపురం కేశవరావు, కోదాటి నారాయణరావు, కొమరగిరి నారాయణరావు, కె. వి. నర్సింగరావు, (తెలంగాణా) జి. ఎమ్. ష్రాఫ్, ఎస్. కె వైశంపాయన్, బాబా సాహెబ్ పరాంజపే, ఎ. కె. వాఘ్మారె, (మరాట్వాడా) జనార్ధనరావు చందర్కి, ఎ. కె. ప్రాణేశాచార్య, కృష్ణమాచారి జోషి (కర్నాటక) వంటివారు చేరగా, బూర్గుల రామకృష్ణారావు వర్గంలో కె. వి. రంగారెడ్డి, ఎమ్. చెన్నారెడ్డి, జె. వి. నర్సింగరావు, కాశీనాధరావు వైద్య, జనార్ధనరావు దేశాయ్ మున్నగువారు చేరారు నిషేధం తొలగించబడిన తరువాత జరిగిన స్టేట్ కాంగ్రెస్ మహాసభలో ఇరువర్గాల మధ్య ఐక్యతను, సఖ్యతను సాధించడానికి ఆచార్యరంగా (ఆంధ్ర) శంకరరావు దేవ్ (మహారాష్ట్ర) నిజలింగప్ప (కర్నాటక) కమలాదేవి చటోపాధ్యాయ (సోషలిస్టు) వంటి పెద్దలు కృషి చేశారు.

ఆ మహాసభలో నైజాం సంస్థానంలో స్వాతంత్ర్య తుది పోరాటం ప్రారంభించాలని కోరే తీర్మానాన్ని దిగంబరరావు బిందూ ప్రతిపాదింపగా, బూర్గుల రామకృష్ణారావు బలపర్చారు.

## రెండు రకాల వాదనలు

స్వాతంత్ర్య పోరాటాన్ని ఎలా నిర్వహించాలన్న అంశంపై ఈ మహాసభలో రెండు రకాలైన అభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. ఒకటి : అహింసాయుత సత్యాగ్రహ పోరాటం సాగిస్తూ, కల్లుగీతగెలలను నరకడం, పన్నుల నిరాకరణ, అటవీ నిబంధనలు, అబ్కారీ నిబంధనల ఉల్లంఘన, నైజాంనవాబు బలగాలు, రజాకార్ల మూకల రాకపోకలకు విఘ్నం కలిగిస్తూ, రహదారి మార్గాలను ఛేదించడంవంటి కార్యక్రమాల్ని చేపట్టాలని కొందరు వాదించారు. రెండు : కాగా, నైజాం ప్రభుత్వాన్ని, రజాకార్లను ప్రతిఘటించడానికి అజ్ఞాతవాసం గడుపుతూ, పోరాటం సాగించాలని మరికొందరు వాదించారు.

మితవాద నాయకులు బహిరంగంగా అహింసాయుత సత్యాగ్రహ పోరాట పద్ధతులు అనుసరించగా, యువతరానికి చెందిన గోవిందదాస్ ష్రాఫ్, వంశంపాయన్, డి. వెంకటరామారావు, కె. వి. నర్సింగరావు వంటివారు అజ్ఞాతవాసంలోకి వెళ్ళి, రహస్యంగా ఉద్యమాన్ని సాగించారు.

నైజాం సంస్థానంలో స్వాతంత్ర్య తొలిపోరాటాన్ని నడపడానికి దిగంబరరావు బిందూ అధ్యక్షులుగా, మాడపాటి రామచంద్రరావు కార్యదర్శిగా, గోవింద దాస్ ష్రాఫ్, జమలాపురం కేశవరావు, ప్రాణేశాచార్య సభ్యులుగా కార్యాచరణ సంఘం ఏర్పాటు చేశారు ఈ కార్యాచరణ సంఘం కేంద్ర కార్యాలయం బొంబాయిలో ఎస్. కె. పాటిల్ సహాయంతో నిర్వహించబడింది. కాగా, ఈ సంఘ ప్రాంతీయ కార్యాలయాలు తెలంగాణా ప్రాంతానికి విజయవాడలోను, కర్నాటక ప్రాంతానికి గడగ్‌లోను ఏర్పాటు చేశారు. విజయవాడలోని తెలంగాణా ప్రాంతీయ కార్యాలయాన్ని వి. బి. రాజు నిర్వహించారు. బొమ్మకంటి సత్యనారాయణ, హయగ్రీవాచారి ఆయనకు సహాయకులుగా పనిచేశారు.

## సరిహద్దు శిబిరాలు

ఈ స్వాతంత్ర్య పోరాట నిర్వహణకు స్టేట్ కాంగ్రెస్ ఆధ్వర్యంలో అనేక సరిహద్దు శిబిరాలు ఏర్పాటు చేశారు. వీటిలో విజయవాడ, షోలాపూర్, మన్మాడ్, చాందా, పరిటాలవంటిచోట్ల శిబిరాలు ముఖ్యమైనవి. వీటికితోడు నేలమర్రి, కొక్కిరేణి, సింగవరం, సిరిపురం, రేపల్లెవంటిచోట్ల కూడా శిబిరాలు ఏర్పాటయినవి.

విజయవాడ శిబిరాన్ని హయగ్రీవాచారి, పరిటాల శిబిరాన్ని కోదాటి నారాయణరావు, షోలాపూర్ మన్మాడ్, చాందా వంటి శిబిరాలను కె. వి. నర్సింగరావు, కె. వి. నరసింహారావులు నిర్వహించారు.

కోదాటి నారాయణరావు, నల్లగొండజిల్లాలో స్వాతంత్ర్య పోరాటాన్ని పర్యవేక్షించగా, కె. వి. నర్సింగరావు, కె. వి. నరసింహారావులు చాందా కేంద్రస్థానంనుంచి ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లాలలోని రహస్య ఉద్యమాన్ని నడిపారు.

## అరుణా అసఫ్ అలీ రహస్య పర్యటన

నైజాం సంస్థానంలో ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలో పరిస్థితిని స్వయంగా పరిశీలించడానికి సోషలిస్టు పార్టీ తరపున అరుణా అసఫ్‌అలీ రహస్య పర్యటన జరిపారు. ఆమె సిఫారసుపై నైజాం సంస్థానంలో స్వాతంత్ర్య పోరాటానికి సాయంచేసే నిమిత్తం సోషలిస్టుపార్టీ ఒక కార్యాచరణ సంఘాన్ని ఏర్పాటు చేసింది.

## "ఇండియన్ యూనియన్‌లో హైదరాబాద్‌ను చేర్చాలి'' అన్న నినాదంతో ఉద్యమం

స్వామి రామానంద తీర్థ నాయకత్వంలో "హైదరాబాద్ సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌లో చేర్చాలి" అన్న నినాదంతో 1947 ఆగస్టు 7 న ప్రారంభించారు. ఈ సందర్భంలో హైదరాబాద్ నగరంలో ప్రదర్శనలు జరిగాయి. పోలీసులు ప్రదర్శకులపై లాఠీచార్జీ జరిపారు.

ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ స్వయంగా స్వామి రామానందతీర్థకు అందజేసిన జాతీయ పతాకాన్ని 1947 ఆగస్టు 15 వ తేదీ ఉదయం 10 గంటలకు సుల్తాన్ బజారులో మోతీలాల్ మంత్రి ఎగురవేశారు. ఈ సందర్భంలో స్వామి రామానంద తీర్థ, డాక్టర్ జి. ఎస్. మేల్కొటే, కృష్ణమాచారిజోషి, జమలాపురం కేశవరావులను పోలీసులు అరెస్టు చేశారు.

రెండు మూడు మాసాలలోనే ఈ ఉద్యమం మహోద్యమ రూపం దాల్చి మొత్తం 21 వేలమంది కాంగ్రెస్ సత్యాగ్రహుల అరెస్టులకు దారితీసింది. ఈ ఉద్యమంలో అరెస్టయిన ప్రముఖులలో హరిశ్చంద్ర హెడా, విమలాబాయ్‌మేల్కొటే, జ్ఞానకుమారి హెడా, కమలమ్మ, అహల్యాబాయ్, సుమిత్రాబాయ్, లక్ష్మి, డాక్టరు ఎమ్. చెన్నారెడ్డి, కె. వి. రంగారెడ్డి, మహదేవ్‌సింగ్, రామకృష్ణధూత్, కృష్ణదూబే, కాళోజి నారాయణరావు, అరుట్ల చంద్రశేఖరరెడ్డి, వీరారెడ్డి, మందెనకు చెందిన రఘునాధరావుకాలే, కరీంనగర్‌కు చెందిన రమాపతిరావు, ప్రసిద్ధకవి దాశరధి కృష్ణమాచారి, హీరాలాల్ మోరియా, కె.సి. నరసింహారావు, జలగం వెంగళరావు, అచ్చుతరెడ్డి, బి. వెంకటస్వామి, అమృతలాల్, మాధవరె , ఎస్. బాబూరావు, మురళీధరరావు,ఎమ్. ఎస్. లింగం, బ్రిజ్ రాణీగాడ్, భోజరెడ్డి, శ్రీనివాసలహతి. ఎస్. బి. గిరి, జితేంద్ర జైన్, ఎకికర్, సిరిసిల్లాకు చెందిన హనుమంతరావు, మెట్టపల్లికి చెందిన లక్ష్మినారాయణ, పరకాలకుచెందిన

కేశవరెడ్డి, హుజారాబాద్‌కు చెందిన సీతారామనాయుడు, సికింద్రాబాద్‌కు చెందిన కె. ఎల్. నారాయణ, ఎల్. నారాయణ, ఖమ్మంకు చెందిన శ్రీమతి రాజేశ్వరి, హైదరాబాద్‌కు చెందిన కాటం లక్ష్మీనారాయణ, గుల్బర్గాకు చెందిన కక్కెర హనుమంతరావు, మరట్వాడాకు చెందిన ముకుందరావు పెడగోంకర్ మున్నగువారు వున్నారు. కొండా లక్ష్మణ్‌బాపూజీ 1942 క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో వలెనే, ఈ ఉద్యమ కాలంలోకూడా రహస్య జీవితం గడుపుతూ, కీలకమైన పాత్ర నిర్వర్తించాడు. నైజాం నవాబుపై విసరిన చేతిబాంబు కేసులో ఆయనకు పాత్ర వుంది. ఔరంగాబాద్ జైలునుంచి విద్యార్థి నాయకుడు గౌతమ్‌రావు పరారై తిరిగి ఈ ఉద్యమంలో చేరి, రహస్యంగా పని చేశాడు విద్యార్థి నాయకులు నండూరి ఏతల్‌రావు, ఎమ్. ఆర్. శ్యామారావు, బాబూరావు వర్మ వంటివారు ఈ ఉద్యమంలో పాల్గొని అరెస్టుకాగా, జకీర్ అలీ మీర్జాను గృహ నిర్బంధంలో వుంచారు.

"హైదరాబాదు సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌లో చేర్చాలి" అనే నినాదంతో సాగిన ఈ సత్యాగ్రహ పోరాటంలో భాగంగా నైజాం సంస్థానంఅంతటా బహిరంగ సభలు జరిపి, కాంగ్రెసు జెండాలు ఎగురవేశారు. కల్లుగీత గెలలను నరికివేశారు. ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లాలలో ఈ కార్యక్రమంలో చురుకుగా పాల్గొన్న బద్దం ఎల్లారెడ్డి, సి. హనుమయ్య వంటివారు విజయవాడలోని కమ్యూనిస్టు నాయకులు పుచ్చలపల్లి సుందరయ్య, దేవులపల్లి వెంకటేశ్వరరావువంటి వారితో నిత్య సంబంధాలు కొనసాగిస్తూ ఉద్యమాన్ని నడిపారు.

## రజాకార్ల రాక్షసకృత్యాలు

ఇదే సమయంలో రజాకార్ల రాక్షసకృత్యాలు మితిమీరిపోయాయి. నైజాం సంస్థానంలో రాజకీయ చైతన్యం మొగ్గ తొడుగుతున్న దశలో, 1927లో నైజాం నవాబు ప్రోత్సాహంతో ,ఇత్తెహాద్-ఉల్-ముస్లిమీన్ సంస్థ స్థాపించబడింది. నైజాం ప్రభుత్వాధికారి నవాబ్ సదర్ యార్‌జంగ్ అధ్యక్షతన "తౌహెద్ మంజిల్"లో జరిగిన ముస్లిముల సమావేశంలో ఈ సంస్థను స్థాపించాలని తీర్మానించారు. ఈ సంస్థ 1927లో స్థాపించబడినా, 1938 వరకు దీనికి అంత ప్రాముఖ్యం చేకూరలేదు. ఉస్మానియా యూనివర్శిటీ ప్రొఫెసర్ మౌల్వీ అబ్దుల్ ఖాదర్ సిద్దికీ అధ్యక్షతన ఈ సంస్థ 1938 లో మతపరమైన రాజకీయ శక్తిగా రూపాంతరం చెందింది. అప్పటినుంచి హైదరాబాద్ సంస్థానంలో ప్రజాతంత్ర హక్కుల కోసం జరిగిన అన్ని ఉద్యమాలను ఇత్తెహాదుల్-ముస్లిమీన్ సంస్థ ప్రతిఘటించసాగింది.

1939-40లో నవాబ్ బహదూర్ యార్‌జంగ్ అధ్యక్షులై వచ్చటినుంచి, ఇత్తెహాదుల్-ముస్లిమీన్ సంస్థ ప్రాధాన్యం మరింత పెరిగింది. "అనల్-మాలిక్" (మేమే పాలకులం) అన్న నినాదాన్ని ఈ సంస్థ చేపట్టింది.

ఇత్తెహాదుల్ ముస్లిమీన్ సంస్థ వాలంటీర్ దళాలను తయారు చేయాలని 1940లో సయ్యద్ మహ్మద్ హసన్ ప్రతిపాదించాడు. ఆ ప్రతిపాదన ప్రాతిపదికపై సైనిక శిక్షణ జరపిన వాలంటీరు దళాలను తయారు చేయడం మొదలుపెటారు. 30మంది వాలంటీర్లు ఉండే స్థానిక దళానికి 'సలార్' నాయకుడుగా వ్యవహరిస్తాడు తాలూకా నాయకునికి "సలార్ ఎ సాఫిర్ అని, జిల్లా నాయకునికి సలార్ ఎ కబీర్ అని, హైదరాబాదులో వుండే కేంద్ర సంఘ నాయకునికి అఫ్సర్ ఎ అలా" అని పేర్లు పెట్టారు. ఈ వాలంటీర్లకు కాకీ దుస్తులు యూనిఫారమ్‌గా నిర్ణయించారు. వాలంటీర్లందరికీ పొడుగాటి కత్తిని, చురకత్తిని సమకూర్చారు. ఈ రకమైన అర్ధసైనిక స్వరూప స్వభావాలతో కూడిన వాలంటీర్ల సంస్థకు 1940 అక్టోబరు 27న ప్రారంభోత్సవం జరిపారు.

కాగా, 1946లో కాశిం రజ్వీ "మజ్లిస్ ఎ ఇత్తెహాదుల్ ముస్లిమీన్" సంస్థ అధ్యక్షుడు కావడంతో ఈ సంస్థ స్వరూప స్వభావాలలో మరికొంత మార్పు వచ్చింది. 1947 జూలైలో రజాకార్లు అని పిలువబడే వాలంటీర్ల సంస్థ ఏర్పడింది. రజాకార్లు సాయుధులై వీధులలో కవాతు చేయడం మొదలుపెట్టారు. 1947 నవంబర్3వ తేదీకి రజాకార్ల సంఖ్య 50 వేలకు పెరిగింది. రజాకార్ల సంఖ్యను 5 లక్షలకు పెంచాలని కాశిం రజ్వీ కలలు కన్నాడు.

సాయుధులైన ఈ రజాకార్లు, నైజాం పోలీసులు, సైనికులు కలిసి, హైదరాబాదు సంస్థానంలో చెప్పనలవి కాని రాక్షసకృత్యాలకు ఉద్యమించారు. ప్రజలందరు

తమ ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని జీవించవలసిన పరిస్థితి ఏర్పడింది.

## రజాకార్ల దురంతాలకు ప్రజల సాయుధ ప్రతిఘటన

నైజాం ప్రభుత్వ అండదండలతో రజాకార్ల మూక సాగిస్తున్న దురంతాలను సాయుధులై ప్రతిఘటించడం తప్ప మరో మార్గం లేదన్న నియానికి వచ్చిన ఆంధ్రమహాసభ రావి నారాయణరెడ్డి నాయకత్వంలో సాయుధులైన గెరిల్లా దళాల నిర్మాణాన్ని ఈ దశలోనే చేపట్టవలసి వచ్చింది.

రజాకార్ల సంస్థ దళితవర్గాల ప్రజలను ఆకర్షించడానికి ప్రయత్నించింది. తమది కేవలం ముస్లిం మత సంస్థ కాదని, న్యాయంకోసం, దీన జనోద్ధరణ కోసం పాటుబడుతున్నామని రజాకార్లు ప్రచారం చేశారు. ఆ ప్రచారానికి మోసపోయిన దళితవర్గాల వారు బీదర్‌లో గలాటాలు సృష్టించారు.

గ్రామాలలో ప్రజల వద్దనుంచి బలవంతంగా రజాకారులు విరాళాలు వసూలు చేసిన మాట, రజాకార్లు తమకు రక్షణ కల్పిస్తున్నట్టు తెలిపే వినతి పత్రాలపైన హిందువులచేత బలవంతాన సంతకాలు చేయించిన మాటనిజమేనని ఆలీయవార్ జంగ్ రచించిన "హైదరాబాద్ ఇన్ రిట్రాస్పెక్ట్" అన్నగ్రంథంలో వివరించాడు.

కమ్యూనిస్టులైన రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, ముఖ్దుం మొహిద్దీన్, రాజబహదూర్ గౌడ్, ఆళ్వారుస్వామి, హేమాద్రి, డి.హెచ్. దేశాయ్, దేవులపల్లి వెంకటేశ్వరరావు, అరుట్ల సోదరులు వంటి వారి నాయకత్వంలో ఆంధ్రమహాసభ 1944 లో ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాన్ని ప్రారంభించినప్పటికీ, 1946లో అది ఉధృతరూపం దాల్చింది. దీనివల్ల తెలంగాణా, మరట్వాడా ప్రాంతాలలో కమ్యూనిస్టుల ప్రాబల్యం సహజంగానే పెరిగింది.

నైజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రారంభమైన స్వాతంత్ర్య పోరాటంలోను, అలాగే రజాకార్ల దురంతాలు ప్రారంభమైన మొదటి దశలోను కమ్యూనిస్టులు కాంగ్రెసువాదులు భుజంభుజం కలిపి, ఐక్యంగా పోరాడారు. ఈ ఐక్యత ప్రజలలో విశ్వాసాన్ని మరింత బలీయమొనర్చింది.

## మున్షీ విశ్లేషణ

నైజాం సంస్థానంలో కల్లోల పరిస్థితులు వున్న సమయంలో హైదరాబాద్‌లో భారత ప్రభుత్వ ప్రతినిధిగా పనిచేసిన కె.ఎమ్. మున్షీ రచించిన "ఒక శకం సమాప్తం" అన్న గ్రంథంలో పొందుపర్చిన విశ్లేషణ గమనార్హమైనది.

"స్టేట్ కాంగ్రెసు సాగించిన సత్యాగ్రహం నిజానికి గాంధీ వాదాను గుణమైనదికాదు. రజాకారు మూకలు అమానుషంగా ప్రవర్తిస్తున్నప్పుడు, హైదరాబాద్‌లో గాంధీ తరహా సత్యాగ్రహానికి ఎంతమాత్రం తావు వుండజాలదు. రజాకార్ల దురంతాల బారి నుంచి గ్రామాలలో ప్రజలను కాపాడడానికి ఒక శక్తి అవసరమైంది. ప్రాణాలు కోల్పోయి, అమరత్వ ఆనందం పొందుదామన్న భావం ప్రజలకు వుండదు. అలాంటి దశలో, (కాంగ్రెసు-కమ్యూనిస్టు ఐక్య సంఘటనలో భాగస్వాములుగా కమ్యూనిస్టులు నైజాం పోలీసులూ, రజాకార్లకు వ్యతిరేకం. వాలంటీర్లు సాగిస్తున్న హింసాత్మక పోరాటానికి నాయకత్వం వహించి, ప్రజల మన్నవలను పొందారు. రజాకార్ల దురంతాలు పెరిగే కొలదీ, గ్రామాలలో ప్రజలు కమ్యూనిస్టులను ఆహ్వానించి, వారి వద్దనుంచి ఆయుధాలను పొందారు. అలా ఏర్పడిన గ్రామ రక్షణ దళాలు ప్రతి ఘటనా కేంద్రాలుగా అభివృద్ధిచెందాయి. నైజాం ప్రభుత్వ బలగంతోను, రజాకార్లతోను హోరా హోరీ పోరాటాలు సాగించారు."

1948 నాటికి హైదరాబాద్ సంస్థానంలో కాంగ్రెస్-కమ్యూనిస్టు ఐక్య సంఘటన విచ్ఛిన్నం కాజొచ్చింది.

## యథాతథ ఒప్పందం

వైస్రాయి లార్డ్ మౌంట్‌బాటెన్ మధ్యవర్తిత్వం ఫలితంగా, భారత ప్రభుత్వానికి, నైజాం ప్రభుత్వానికి 1947 నవంబరు 27న యథాతథ ఒప్పందం కుదిరింది. ఈ ఒప్పందంపై నైజాం నవాబు సంతకం పడకుండా రజాకార్ల నాయకుడు కాశింరజ్వీ దాదాపు నెల రోజుల పాటు అడ్డుకొట్ట గలిగాడు. యథాతథ ఒప్పందం ప్రకారం, నైజాం సంస్థానానికి సంబంధించినంత వరకు

రక్షణ, విదేశ వ్యవహారాలు భారత ప్రభుత్వ పరం అయినవి.

అయినప్పటికీ, నైజాం నవాబు తన సంస్థానాన్ని స్వతంత్ర దేశంగా ప్రకటించడానికి అవసరమైన ఏర్పాట్లను లోపాయికారీగా సాగించకపోలేదు. పోర్చుగల్ నుంచి గోవా ప్రాంతాన్ని ఖరీదుచేయాలని ప్రయత్నించాడు. ఆ విధంగా రేవు పట్టణం పొందచూశాడు. ఇత్తెహాదుల్ ముస్లిమీన్ నాయకుడు ఎల్. ఎడ్రూస్‌ను రు. 5 కోట్ల డబ్బుతో, విదేశాలకు పంపి, ఆయుధాలు, విమానాలు కొనుగోలు చేయించాలని విఫల ప్రయత్నం చేశాడు. మరోవైపున కాశిం రజ్వీ నాయకత్వంలో రజాకార్ల దారుణాలు భరించరానంతగా మితిమీరి పోయాయి.

హైదరాబాద్ సంస్థానంలో పరిస్థితులు ఇలా స్పష్ట రూపం దాల్చుతున్న తరుణంలో కె. ఎమ్. మున్షీని హైదరాబాద్‌లో భారత ప్రభుత్వ ఏజెంట్ జనరల్‌గా నియమించారు. 1948 జనవరి 3న హైదరాబాద్ చేరిన మున్షీ వుండడానికి నైజాం ప్రభుత్వం వసతి గృహాన్ని నిరాకరించింది. అందువల్ల బోలారామ్‌లోని భారత ప్రభుత్వ భవనంలో ఆయన దిగాడు. దానికి "దక్షిణ సదన్" అని పేరు పెట్టారు.

యథాతథ ఒప్పందంపై సంతకాలు జరిగిన పిమ్మట, స్వామి రామానందతీర్థతో సహా ముగ్గురు కాంగ్రెస్ నాయకులను నైజాం ప్రభుత్వం జైళ్ళ నుంచి విడుదల చేసింది.

హైదరాబాద్ సంస్థానాన్ని భారతదేశంలో విలీనం చేసే సమస్యను వాయిదావేస్తూ, యథాతథ ఒప్పందంపై సంతకం చేసిన నైజాం నవాబు ఆ సమస్యపై ప్రజాభిప్రాయ సేకరణకు సమ్మతించాలని, నైజాంలో ప్రజా ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయాలని జైలు నుంచి విడుదలైన రామానందతీర్థ డిమాండ్ చేశాడు. ఈ ప్రకటన చేసినందుకు, తిరిగి రామానందతీర్థను నైజాం పోలీసులు అరెస్టు చేశారు.

హైదరాబాద్ సంస్థానంలో పరిస్థితిని స్వయంగా పరిశీలించిన అనంతరం కె. ఎమ్. మున్షీ భారత ప్రభుత్వానికి నివేదిక పంపాడు. ఆ నివేదికలో పరిస్థితులు త్వరితగతిని విషమిస్తున్నవని, రజాకార్ సంస్థను తక్షణం రద్దు చేయించాలని ఆ నివేదికలో సూచించాడు. ఈ విషయమై, సంస్థానాల శాఖ కార్యదర్శి వి. పి. మీనన్ అప్పటి నైజాం ప్రధాని లాయక్ ఆలీకి లేఖ రాయగా, రజాకార్ల సంస్థను ప్రస్తుత పరిస్థితులలో రద్దుచేసే ప్రసక్తిలేదు పొమ్మని లాయక్ ఆలీ సమాధాన మిచ్చాడు.

## రజాకార్ దురాగతాలతో భగ్నమైన శాంతి, భద్రతలు

1948 జనవరి 10 న భువనగిరిలో జరిగిన రజాకార్ల ర్యాలీ నుంచి అయిదు లారీలలో తిరిగివస్తున్న రజాకారు మూక బీబీనగర్‌కు చేరగానే అక్కడ పిల్లలు వారిని చూసి 'జై జై' అని కేకలు పెట్టారు. వారు దాన్ని సాకుగా తీసుకొని, రజాకార్లు బీబీనగర్ ఇళ్ళపై బడి, దోపిడీ చేయసాగారు రజాకార్లు బీబీనగర్‌లో జరిపిన దోపిడీలో 28 మంది ప్రజలు గాయపడ్డారు. రు 40 వేల ఆస్తిని దోచుకుపోయారు.

బీబీనగర్ వాసులు నైజాం నవాబుకు తూలనాడే నినాదాలు చేసినందుకు ప్రతీకారంగా రజాకార్లు ఈ పని చేశారని కాశిం రజ్వీ ఈ దురంతాన్ని బాహాటంగా సమర్థించాడు.

## మరికొన్ని గ్రామాల దోపిడీ

1948 జనవరి మొదటి వారంలో రజాకారు మూకలు మోటకొండూరు, మద్రా సింకదర్‌నగర్, చందనపల్లి, సోమవరం వంటి గ్రామాలపై దాడిచేసి, దోపిడీలు సాగించడం మాత్రమేకాక చందనపల్లిలో గృహదహనాలకు కూడా పాల్పడ్డారు. దోపిడీలద్వారా సంపాదించిన ధనాన్ని రజాకార్ల సంస్థ నిర్వహణకు, నైజాం సైన్యానికి కూడా ఖర్చు చేశారు.

నల్లగొండ జిల్లాలోని వర్ధమానకోట, పల్లెపహాడ్, సూర్యాపేట, ఖమ్మం జిల్లాలోని చెన్నారం, తదితర గ్రామాలలో ఇలాగే రజాకార్లు దారుణాలు సాగించారు. గ్రామాలలో ప్రజలు రజాకార్లు వస్తున్నారని తెలియగానే, ఇళ్ళల్లోంచి పారిపోవలసిన పరిస్థితి ఏర్పడింది. మధ్యతరగతి కుటుంబాలు వందల సంఖ్యలో కాందిశీకులవలె ప్రవాసం వెళ్ళవలసి వచ్చింది.

## గెరిల్లా దళాలు

రజాకారు దురంతాలను ప్రతిఘటించడానికి ఆంధ్ర మహాసభ సాయుధ గెరిల్లా దళాలను తయారుచేసింది.

ఈ గెరిల్లా దళాలకు ప్రజలు హృదయపూర్వకమైన తోడ్పాటును అందచేశారు. గ్రామాలపై దాడివస్తున్న నైజాం నిక బలగాన్ని రజాకార్ల మూకను గ్రామాల పొలిమే లోనే ఈ గెరిల్లా దళాలు అటకాయించి ప్రతిఘ ంచసాగాయి.

1948 జనవరిలో కరీంనగర్ జిల్లాలోని మంథా పురం కొండలలో నైజాం సైన్యంతోను, రజాకార్ల తోను హోరాహోరీ పోరాటం సాగించిన గెరిల్లా దళా లలో 8 మంది మృతి చెందారు. అలా వీరమరణం పొందిన వారిలో భూపతిరెడ్డి, వి. ప్రభాకరరావు వున్నారు.

## మీనబోలు పోరాటం

ఖమ్మం జిల్లా మధిర తాలూకా మీనబోలు గ్రామంలో 1948 జనవరి 15 న నైజాం ముష్కర మూకకి, ఆంధ్ర మహాసభ గెరిల్లా దళాలకి మధ్య జరిగిన సంకుల సమరంలో ఆరుగురు గెరిల్లా యోధులు అసువులు బాశారు.

## నల్లగొండ జిల్లాలో సాయుధ ప్రతిఘటన

నల్లగొండ జిల్లా భువనగిరి తాలూకా రేణికుంట గ్రామంపై దాడికి వచ్చిన నైజాం పోలీసులను, రజా కార్లను స్థానిక గ్రామస్తులు 80 మంది రేణికుంట రామిరెడ్డి నాయకత్వంలో 12 గంటలపాటు వీరోచిత మైన పోరాటం సాగించారు. ఆ పోరాటంలో నైజాం పోలీసులకు, రజాకార్లకు తీవ్రమయిన నష్టం వాటిల్లింది అయితే 26 మంది గ్రామస్తులు కూడా ప్రాణాలు కోల్పోయారు.

## చెక్‌పోస్టులు మూత

ఆంధ్ర మహాసభకు చెందిన గెరిల్లా దళాల దాడు లను తట్టుకోలేక, నల్లగొండ జిల్లాలో నైజాం ప్రభుత్వం, 28 చెక్‌పోస్టులను మూసివేసుకోవలసి వచ్చింది. దీనివల్ల నైజాం ప్రభుత్వం ఆదాయం గణ నీయంగా తగ్గిపోయింది. ఇలా తగ్గిపోయిన ఆదాయాన్ని భర్తీ చేసుకొనడానికి నైజాం ప్రభుత్వం అక్రమ మార్గాలు అవలంబించ సాగింది.

కోచారం చెక్‌పోస్టు వద్ద సుంకం చెల్లించలేదని చెప్పి, తమ్మరిలోని 75 బళ్ళను, ఎడ్లజతలను స్వాధీనం చేసుకొని, వాటి యజమానులను అరెస్టు చేసి, జైలులో పెట్టడమేకాక, వారికి రు. 250/-లు చొప్పున జరిమానా విధించారు. అయితే జరిమానా క్రింద స్వాధీనం చేసుకొన్న ఎడ్లను, బండ్లను స్థానిక రజాకార్లు పంచుకొన్నారు.

## గుండ్రంపల్లి దారుణం

1948 జూలై 19 న రజాకార్లు గుండ్రంపల్లి గ్రామంపై దాడిచేసి, 21 మందిని అరెస్టుచేసి, వారంద రిని నిలబెట్టి, తుపాకులతో కాల్చి చంపారు. వారి శవా లను ఒక మసీదు సమీపంలో గుట్టపోసి, నిప్పంటించి దహనం చేశారు.

సూర్యాపేట తాలూకా పాతర్లపహాడ్ గ్రామంపై అగస్టు 28న దాడిచేసిన నైజాం పోలీసులు, రజాకార్లు 17 మంది గ్రామస్తులను కాల్చి చంపారు.

వరంగల్లు జిల్లా కూతిగల్లు గ్రామం వద్ద నిజాం సాయుధ మూకకు, ఆంధ్ర మహాసభ గెరిల్లాలకు మధ్య జరిగిన పోరాటంలో 23 గ్గురు గెరిల్లాలు మృతి చెందారు.

జెహరంపల్లి గ్రామంపై 1500 మంది జాం సైనికులు, పోలీసులు, రజాకారు కలిసి ము డించి స్త్రీలు, పిల్లలతోసహా మొత్తం 76 మంది గ్ర మస్తు లను చ పివేశారు.

జనగామ తాలూకా కాటకొండ గ్రామంపై దాడి చేసిన రజాకారులు డిమాండ్ చేసిన విధంగా విరాళాలు యివ్వ నిరాకరించిన నేరానికి 13 గ్గురు గ్రామస్తులను కాల్చి చంపారు. ఇళ్ళను తగలబెట్టారు. అంకయ్యను, ఆయన భార్య వీరమ్మను కట్ట కట్టి, ఆ మంటలలోకి విసరివేశారు. రజాకార్లు విధించిన లెవీని చెల్లించ నిరాకరించినందుకు అంకనూరు, కోనపాక, చౌటపల్లి ఆదిగా గల అనేక గ్రామాలకు చెందిన అసంఖ్యాక ప్రజలను ఆ నరరూప రాక్షసులు నిలువునా కాల్చి చంపారు. వరంగల్లు, సూర్యాపేటలలో శాంతి యుతంగా ఊరేగింపు జరుపుతున్న ప్రజలపై రజాకార్లు

కాల్పులు జరుపగా, కాంగ్రెసు జెండాను చేతధరించిన కోడిలూరి లచ్చయ్య నేలకూలి కన్ను మూశాడు.

## మహబూబ్‌నగర్ జిల్లాలో

మహబూబ్‌నగర్ గద్వాల్ తాలూకా తహశీల్‌దారు మహబూబ్‌నగర్‌పై రజాకార్ల దాడికి సారథ్యం వహించి, లెవీ చెల్లించ నిరాకరించిన నేరానికి నలుగురు గ్రామస్తులను చంపివేశారు. భీష్మదేవ్ తీవ్రంగా గాయపడ్డాడు. నిజాం రైల్వే యూనియన్ కార్మికుడు నరసయ్యా చేయి విరిగి, అవిటివాడయ్యాడు

మరాట్వాడా, కర్నాటక ప్రాంతాలలో కూడా స్వాతంత్ర్య సమర యోధులు, తెలంగాణాలో జరిపినంత పెద్దఎత్తున కాకపోయినా, నైజాం ముష్కర మూకపై సాయుధ పోరాటం సాగించకపోలేదు.

## పరిటాల రిపబ్లిక్

నైజాం ప్రభుత్వం, దాని ప్రోత్సాహ ప్రోద్బలాలతో రజాకార్ ముష్కరులు సాక్షాత్తు రాక్షసుల వలె సాగించిన అమానుష కృత్యాలను భరించలేక, నైజాం ప్రజలు ఎక్కడికక్కడ ఉవ్వెత్తున తిరగబడ సాగారు. అదొక మహోద్యమ రూపం దాల్చింది.

విజయవాడ సమీపంలోగల నైజాం గ్రామం పరిటాల ప్రజలు తిరగబడి స్వతంత్ర రిపబ్లిక్‌ను స్థాపించుకొన్నారు. అలాగే బీరార్ సమీపంలో కోహ్లి, హడ్‌గాన్, వకోడిలలో రిపబ్లిక్‌లు వెలిశాయి.

## పగటి దొరలు – చీకటి దొరలు

తెలంగాణా ప్రాంతంలో రజాకార్లు పగటి దొరలుగా చలామణి అయినా, ఆంధ్ర మహాసభ వాలంటీర్లను చీకటి దొరలుగా ప్రజలు ఆ రోజులలో పిలుచుకునేవారు.

రజాకార్ ముష్కరమూక నాయకుడు కాశిం రజ్వీ పచ్చి మతతత్వం రెచ్చగొట్టుతూ, నైజాం నవాబుపై విపరీతమైన వత్తిడి తెచ్చి, "ఛలో ఢిల్లీ" నినాదం యివ్వడంతో, అంతవరకు అంతర్జాతీయ పరిణామాలను దృష్టిలో వుంచుకొని, పూగిసలాటను ప్రదర్శిస్తూ వచ్చిన భారత ప్రధాని నెహ్రూ హైదరాబాద్ సమస్యను పరిష్కరించడానికి అవసరమైతే "శస్త్ర చికిత్స"కైనా సిద్ధంకాక తప్పదన్న నిర్ణయానికి వచ్చారు.

రజాకార్లు బొంబాయి, మద్రాసు రైళ్ళపై దాడిచేసి, ప్రయాణీకులను చంపిన ఉదంతాలు కొన్ని జరగడంతో పాటు, భారత ప్రభుత్వ పోలీసులతోను, చివరకు సైనికులతోను సంఘర్షించే సాహసానికి నైజాం సాయుధ బలాలు, రజాకార్లు తయారయ్యారు. దీనితో అనేక సరిహద్దు సంఘర్షణలు జరిగాయి.

భారతదేశంలోని మద్రాసు, మైసూరు, మహారాష్ట్రిలలో నైజాంకుగల లంకలలో ప్రవేశించే పేరుతో రజాకార్లు ఇండియన్ యూనియన్ గ్రామాలైన బూర్గంపాడు, బుడివాడ, జగ్గయ్యపేట, మునగాల, సీతంపేట, హొన్నాల్, కొనగాన్, తండులవాడి వంటి చోట్ల అనేక అత్యాచారాలకు ఒడిగట్టారు. భద్రాచలం దేవాలయానికి వెళ్ళుతున్న మహిళా భక్తురాంద్రను ఘోరంగా మానభంగం చేశారు.

1948 జులై 24 న భారత సైనికదళం నానజ్ నుంచి బర్బి గ్రామానికి వెళుతుంటే, రజాకార్లు, అరబ్బులు, పఠానులతో కూడిన సాయుధ మూక దారి కాచి దాడిచేసి, అయిదుగురు భారత సైనికులను తీవ్రంగా గాయపర్చారు. భారత సైనికులు ఎదురు కాల్పులు జరపడంతో, నైజాం సైనికులు, పోలీసులలో 7 గురు మృతి చెందారు. భారత సైన్యం నానజ్‌ను ఆక్రమించుకొన్నది. భారత ప్రభుత్వం, నైజాం ప్రభుత్వం మధ్య సంబంధాలు ఎంతగా క్షీణించినదీ ఈ సంఘటన సూచిస్తున్నది. అందుకే అలీ యావర్ జంగ్ తన గ్రంథంలో "రానున్న తుపానుకు మరొక సూచన" అని పేర్కొన్నాడు.

ముంచుకొస్తున్న ప్రమాదాన్ని పసికట్టిన ముస్లిం ప్రముఖులు కొందరు ముందుచూపుతో, సమయం మించేపోకముందే, భారత ప్రభుత్వంతో ఒప్పందానికి రావడం మంచిదని నైజాం నవాబుకు సలహా యిచ్చారు. బషీర్ అలీ మీర్జా, నవాబ్ మాజ్వార్ జంగ్, అహ్మద్ మీర్జా, అఫ్జల్ మునీమ్, ఎస్.ఎన్.ఏ. జాఫ్రీలు 1948 ఆగస్టు 13 న నైజాం నవాబుకు పంపిన వినతిపత్రంలో రజాకార్ సంస్థను, రజాకార్ల పుట్టగా వున్న లాయక్ అలీ మంత్రివర్గాన్ని వెంటనే

రద్దు చేయాలని విజ్ఞప్తి చేశారు. వారి విజ్ఞప్తి 'చెవిటి వాని ముందు శంఖూదిన' చందమైంది.

### షోయబుల్లాఖాన్ దారుణ హత్య

కాశిం రజ్వీ సారథ్యంలో రజాకార్లు సాగిస్తున్న అమానుష కృత్యాలను ధైర్యంగా ఖండిస్తూ వ్యాసాలు ప్రచురించిన "ఇమ్రోజ్" పత్రిక సంపాదకుడు షోయబుల్లా ఖాన్‌ను 1948 ఆగస్టు 21న రజాకార్లు కాల్చి చంపారు. నేలపై పడిపోయిన షోయబుల్లాఖాన్ చేతులను కత్తులతో నరికివేశారు. అంతకు రెండు రోజుల ముందు ఖాసిం రజ్వీ చేసిన "పవిత్రయుద్ధం" ప్రసంగం ప్రత్యక్ష పర్యవసానమే ఈ దారుణహత్య.

1948 జూన్ 21 న వైస్రాయి పదవీ విరమణ చేసిన లార్డు మౌంట్ బాటెన్ ఇంగ్లండుకు బయలు దేరి వెళ్ళిపోయాడు. ఇంతకాలం తనకు ఢిల్లీలో కొండంత అండగా వున్న వ్యక్తి-మౌంట్ బాటెన్ వెళ్ళిపోవడంతో, నిజాం నవాబు గుండె నిబ్బరం కొంత సడలిపోయింది. బ్రిటిష్ ప్రధాని అట్లీ కూడా భారత ప్రభుత్వంతో ఒప్పందానికి రావలసిందిగా నిజాం నవాబుకు సలహా చెప్పాడు.

### లాయక్ అలీ రహస్య యాత్ర

పరిస్థితులు ఇలా విషమించిన దశలో నిజాం ప్రభుత్వ ప్రధాని లాయక్ అలీ రహస్యంగా కరాచీ వెళ్ళి, పాకిస్తాన్ ప్రభుత్వ సైనిక సహాయాన్ని అర్థించాడు. అప్పుడు పాకిస్తాన్ నిర్మాత జిన్నా చావు బ్రతుకుల మధ్య, మరణశయ్యపై వున్నాడు. సైనిక సహాయాన్ని వాగ్దానం చేయలేకపోయిన పాకిస్తాన్ విదేశాంగమంత్రి జఫ్రుల్లాఖాన్ హైదరాబాదు సమస్యపై ఐక్యరాజ్యసమితికి ఫిర్యాదు చేయవలసిందిగా లాయక్ అలీకి 'ఉచిత' సలహా చెప్పాడు. జిన్నా 1948 సెప్టెంబరు 12 న మృతి చెందడంతో నైజాం నవాబు ఇంచుమించు 'అనాథ' అయిపోయాడు.

హైదరాబాదు సంస్థానంలో నైజాం ప్రభుత్వం రజాకార్లు సృష్టించిన అరాజక పరిస్థితివల్ల ఉత్పన్నమైన దుష్ఫలితాలు పొరుగున గల ఇండియన్ యూనియన్ ప్రాంతాలకు విస్తరించే ప్రమాదాన్ని నివారించడానికి, భారత ప్రభుత్వం సెప్టెంబరు 9న సైనిక చర్యకు నిర్ణయించింది. ఆ నిర్ణయాన్ని సంస్థానాల శాఖ కార్యదర్శి వి. పి. మీనన్ నైజాం నవాబుకు సెప్టెంబరు 10 న తెలిపాడు.

### పోలీసు చర్య

1948 సెప్టెంబరు 13వ తేదీ తెల్లవారు ఝామున నైజాం సంస్థానంపై భారత ప్రభుత్వ పోలీసుచర్య ప్రారంభమైంది. మేజర్ జనరల్ జె ఎన్. చౌదరి సారధ్యంలో భారత సైన్యం ఆంధ్ర, కర్నాటక, మహారాష్ట్ర వైపుల నుంచి ముప్పేటదాడి ప్రారంభించింది.

"ఆపరేషన్ పోలో" పేరుతో సాగిన ఈ పోలీసు చర్య పట్టుమని పదిరోజులు కూడా పట్టలేదు. మొదటి రెండు రోజులలో కొద్దిగా ప్రతిఘటించిన నైజాం సైన్యం, రజాకార్లు, పోలీసులు పిరికిపందల వలె పారిపోయారు. తాము భారత సైనికుల పురోగమనాన్ని నిరోధించడానికి ముఖ్యమైన వంతెనలను కూడా కూల్చివేయలేక పోయామని లాయక్ అలీ "ట్రాజడి ఆఫ్ హైదరాబాద్" అన్న గ్రంథంలో వాపోయాడు. సెప్టెంబరు 17 నాటికి నైజాం నవాబు లొంగుబాటు ప్రకటించాడు అదే రోజున ప్రధాని లాయక్ అలీ రాజీనామా చేశాడు. అదే రోజున రజాకార్ల సంస్థను నైజాం నవాబు రద్దుచేస్తూ ఉత్తర్వులు జారీ చేశాడు.

బ్రిటిషు వలస పాలనకు వ్యతిరేకంగా మిగతా భారత ప్రజలందరితో పాటు, 1857 లో సైనిక తిరుగుబాటు రూపంతో ప్రారంభమైన స్వాతంత్ర్య సమరంలో తెలుగు ప్రజలు అన్ని ఘట్టాలలోను ప్రముఖ పాత్ర వహిస్తూ, అనుపమ త్యాగాలు చేసి, బ్రిటిష్ వలస పాలకులనేకాక, వాళ్ళ తాబేదారు నైజాం నవాబును తెలుగు గడ్డనుంచి తరిమివేసి, దాదాపు శతాబ్దం తరువాత 1948 లో స్వతంత్ర వాయువు పీల్చుకో గలిగారు 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడటంతో తెలుగు ప్రజలంతా ఒకే ప్రభుత్వ పాలన క్రిందకు వచ్చారు.

"జై తెలుగునాడు"

"జైహింద్"

# వివిధ జిల్లాలలో ప్రముఖ స్వాతంత్ర్య యోధులు కార్యకర్తలు

## శ్రీకాకుళం జిల్లా

### వరాహగిరి వెంకటగిరి (వి. వి. గిరి)

గంజాం జిల్లా బరంపురంలో 1894 ఆగస్టు 10 న వి. వి. గిరి జన్మించారు. తండ్రి వెంకట జోగయ్య పంతులు. బరంపురంలోని కళ్ళికోట కాలేజిలో పట్టభద్రులయ్యాక ఇంగ్లాండ్ వెళ్ళారు. ఇంగ్లాండు, ఐర్లాండులలో 1913–16 సంవత్సరాల మధ్య ఉన్నత విద్యాభ్యాసం కావించారు. డబ్లిన్ నేషనల్ యూనివర్సిటీలో బార్-ఎట్-లా ప్యాసయ్యారు. విద్యార్థిగానే ఐరిష్ రాజకీయ స్వాతంత్ర్య ఉద్యమం "సిన్‌ఫీన్" ఉద్యమంలో పాల్గొన్నారు. 1916 జూలై 1 న బ్రిటన్ నుంచి బహిష్కరించింది ప్రభుత్వం. భారత దేశం వచ్చాక 1916 లో కాంగ్రెస్, హోంరూల్ లీగ్ సంస్థలలో చేరారు. 1921 లో ప్రాక్టీసు మానివేసి సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్నారు. కొద్దికాలం జైలులో వున్నారు. 1922 నుంచి కార్మికోద్యమంలో పనిచేశారు. 1926, 1942 లలో ఆలిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు అధ్యక్షుడుగా పనిచేశారు. ఆలిండియా రైల్వే మెన్సు ఫెడరేషన్ సంస్థాపకులలో ఒకరు. దాని ప్రధాన కార్యదర్శిగా ఏడేళ్ళు, అధ్యక్షుడుగా ఏడేళ్ళు పనిచేశారు. 1927 లో జెనీవాలో జరిగిన ఇంటర్నేషనల్‌లేబర్ కాన్ఫరెన్సుకు భారతీయ కార్మిక ప్రతినిధి. 1931 లో లండన్‌లో జరిగిన రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్సుకు కార్మిక ప్రతినిధి. 1932 లో శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నా, రైల్వే కార్మికుల ఆగ్రహానికి గురవుతామనే భయంతో ప్రభుత్వం ఆయన్ని అరెస్టు చేయలేదు. వ్యక్తి సత్యాగ్రహ ఉద్యమంలో 30-11-1940న 15 నెలల విడిఖైదు విధించబడింది. వెల్లూరు, తిరుచినాపల్లి, మద్రాసు జైళ్ళలో శిక్షను అనుభవించారు. 1942 ఆగస్టు 24 నుంచి 1946 వరకు వెల్లూరు, నాగపూర్ మొదలైన జైళ్ళలో డెటిన్యూగా నిర్బంధింపబడ్డారు. 1934-37 లో కేంద్ర అసెంబ్లీ సభ్యులు. సి. రాజగోపాలాచారిగారు ముఖ్యమంత్రిగా వున్న మద్రాసురాష్ట్రి మంత్రి వర్గంలో కార్మిక, పారిశ్రామిక శాఖ మంత్రిగా వున్నారు 1946 లో ఉమ్మడి మద్రాసు శాసన సభకు ఎన్నికయ్యారు. ప్రకాశం మంత్రి వర్గంలో కార్మిక శాఖా మంత్రిగా ఒక సంవత్సరం పనిచేశారు. 1947–51 లో సింహళంలో భారత హైకమిషనర్‌గా పని చేశారు. 1952 సార్వత్రిక ఎన్నికలలో పిఠాపురం నియోజక వర్గం నుంచి లోక్ సభకు ఎన్నికయా రు. 1952 లో జవహర్‌లాల్ నెహ్రూ మంత్రివ ంలో కేంద్ర కార్మిక శాఖా మంత్రిగా వున్నా . 1954 లో బ్యాంక్ అవార్డ్ సమస్యపై రాజీనామా చేశారు. ఉత్తర ప్రదేశ్, కేరళ, మైసూరులలో గవర్నరుగా పని చేశారు. 1967–69 వరకు ఉప రాష్ట్రిపతి. 1969 ఆగస్టు 24 న అధికార పక్ష అభ్యర్థిని ఓడించి, భారత రాష్ట్రిపతిగా ఎన్నికయ్యారు. 1974 ఆగస్టు 23 వరకు ఆ పదవిలో వున్నారు. 1975 లో రిపబ్లిక్ దినోత్సవాన "భారత రత్న" బిరుదు పొందారు. 1980 జూన్ 24 న కీర్తిశేషులయ్యారు.

### న్యాపతి నారాయణమూర్తి

1897 లో బరంపురంలో జన్మించారు. 1936 నుంచి మద్రాసు వాస్తవ్యులు. తండ్రి రామానుజ స్వామి. పత్రికా సంపాదకుడు. 1921 లో సహాయ నిరాకరణోద్యమ కాలంలో బి. ఎ. చదువుతూ విద్యకు స్వస్తి చెప్పారు. ఆంధ్రవాణి, కళింగ, భారతి పత్రికలను నిర్వహించి జాతీయ భావాలను ప్రచారం చేశారు. 1922 లో కల్లు దుకాణాల ముందు, పికెటింగ్ చేసినందుకు ఒక నెల శిక్షపొందారు. 1930 ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో ఒక సంవత్సరం కఠినశిక్ష విధించబడింది. 8-3-1932 న ఆరు నెల్ల కఠినశిక్ష రు. 100 జరిమానా విధించబడింది. జరి

మానా వసూలు చేశారు. బరంపురం, కడలూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1945 కేంద్ర అసెంబ్లీ సభ్యులు. ఎ. ఐ. సి. సి. సభ్యులు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌కు, కార్యదర్శిగా పనిచేశారు. 1951 లో కీర్తిశేషులయ్యారు.

## వరాహగిరి వెంకట జోగయ్య పంతులు

యలమంచిలి తాలూకా పెంటకోటలో 1869 ఏప్రిల్ 10 న జన్మించారు. బరంపురం వాస్తవ్యులు. బి. ఎ. బి. యల్ అయాక 1894 లో గంజాంలో న్యాయవాద వృత్తి చేపట్టారు. 1894 నుంచి కాంగ్రెస్ కార్యకలాపాల్లో పాల్గొన్నారు. సహాయ నిరాకరణోద్యమంలో 1921 లో గవర్నమెంట్ ప్లీడర్, పబ్లిక్ ప్రాసిక్యూటర్ పదవులకు రాజీనామా చేశారు. 1927 కేంద్ర అసెంబ్లీకి ఎన్నుకోబడ్డారు. 1930 లో కాంగ్రెస్ ఆజ్ఞానుసారం రాజీనామా చేశారు. 1931 లో కల్లు దుకాణాలను పికెట్ చేసినందుకు అరెస్టు చేయబడి నిర్బంధించబడ్డారు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పరచాలని బ్రిటిష్ ప్రభుత్వానికి తెలియచెప్పేందుకు 1931-32 లో లండన్ వెళ్ళారు. గంజాం జిల్లా కాంగ్రెస్ కమిటీకి అనేక సంవత్సరాలు అధ్యక్షుడు. 1931-35 లో ఆంధ్రమహాసభ అధ్యక్షుడు. కొన్నాళ్ళు ఉత్తర విశాఖజిల్లా కాంగ్రెస్ కమిటీకి అధ్యక్షుడు. 1937-39 లో మద్రాసు శాసన మండలి సభ్యుడు. 1939 జనవరి 27 న కీర్తి శేషులయ్యారు.

## గరిమెళ్ళ సత్యనారాయణ

శ్రీకాకుళం తాలూకా గోనెపాడు అగ్రహారంలో 1893 లో జన్మించారు. తండ్రి వెంకట నరసింహం. బి.ఎ. చదివారు. జాతీయకవి, పాత్రికేయుడు. గంజాం జిల్లా కలెక్టరాఫీసులో కొన్నాళ్ళు ఉద్యోగం చేశారు. విజయనగరంలో హైస్కూలు ఉపాధ్యాయుడుగా పని చేశారు. బి. ఎ. యల్. టి పరీక్షకని రాజమండ్రి వెళ్ళారు. కాని, మానివేసి సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. 1922 ఫిబ్రవరి 8 నుంచి రెండున్నర సంవత్సరాలు కఠినశిక్ష, మద్రాసు, కడలూరు జైళ్ళలో అనుభవించారు. దేశభక్తియుత గేయాల ద్వారా ప్రజల్ని జాతీయ ఉద్యమంలోకి ఆకర్షించారు. "మా కొద్దీ తెల్ల దొరతనం" అనే గేయం ఆయన రచించిన ప్రసిద్ధగేయం. దాన్ని బ్రిటిష్ ప్రభుత్వం బహిష్కరించింది. కురళ్, నందియార్, అనే తమిళ రచనలను తెలుగులోకి అనువదించారు 1952 డిసెంబరు 18 న కీర్తిశేషులయ్యారు.

## పుల్లెల శ్యామ సుందరరావు

ఇచ్ఛాపురంలో 1903 డిసెంబర్ 27 లో జన్మించారు. తండ్రి వెంకట్రామయ్య పంతులు. 1921 సహాయ నిరాకరణ ఉద్యమం కాలంలో యూనివర్శిటీ విద్యకు తిలోదకాలిచ్చారు. కల్లు దుకాణాలముందు పికెటింగ్‌కుగాను శిక్షింపబడి 8-2-1922 నుంచి 14-9-1922 వరకు బరంపురం, కడలూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1930 లో నౌపాడ ఉప్పు కోటార్లపై దాడిచేసి సంవత్సరం శిక్ష పొందారు. శాసనోల్లంఘన ఉద్యమంలో 16-1-32 నుంచి ఆరు నెలల కఠినశిక్ష. రు. 100 జరిమానాను పొందారు. బరంపురం, కడలూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1934-35 లో బర్మాలోని ఆంధ్రమహాసభ కార్యదర్శిగా వున్నారు. బర్మా నుంచి 'ప్రజావాణి' పత్రిక నడిపారు. 1935-36 లో తుపాను బాధితుల సహాయ కార్యక్రమాన్ని పట్టుదలతో నిర్వహించారు. రాష్ట్ర కాంగ్రెస్ సభ్యుడు. జిల్లా కాంగ్రెస్ అధ్యక్ష, కార్యదర్శి పదవులను నిర్వహించారు. 1937 లో శాసనసభ సభ్యుడు. 1940 లో కిసాన్‌సభ అధ్యక్షుడు. ఇచ్ఛాపురంలో గృహ నిర్బంధంలో వుండగా 1940 జూన్ 16 న కీర్తి శేషులయ్యారు.

# విశాఖపట్నం జిల్లా

## తెన్నేటి విశ్వనాథం

విశాఖపట్నం జిల్లా లక్కవరంలో 1895 లో జన్మించారు. తండ్రి గౌరీపతిశాస్త్రి విశాఖపట్నం వాస్తవ్యులు. కాకినాడ, విశాఖపట్నాలలో విద్యాభ్యాసం చేశారు. 1918 లో మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజి నుంచి బి.ఎ. (ఆనర్సు)డిగ్రీ పుచ్చుకున్నారు. 1920 లో మద్రాసు యూనివర్శిటీలో లా డిగ్రీ పుచ్చుకొన్నారు. 1978 లో ఆంధ్రా యూనివర్శిటీ గౌరవ డాక్టరేట్ పట్టా నిచ్చింది. న్యాయవాద వృత్తి వదలి 1922 లో సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్నారు. 1922-23 లో గుజరాత్ విద్యాపీఠ్‌లో అధ్యాపకులుగా పనిచేశారు. జిల్లా కాంగ్రెస్ కార్యదర్శిగా

వున్నారు. 1925 లో స్వరాజ్య పార్టీకి జిల్లా కార్యదర్శి. 1926 లో ఎ.ఐ.సి.సి. సభ్యులు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో ఆరు నెలల శిక్ష 24-4-1930 నుంచి బరంపురం, మద్రాసు, వెల్లూరు జైళ్ళలోఅనుభవించారు. 1940 వ్యక్తి సత్యాగ్రహంలో సంవత్సరం 6 నెలలు కఠినశిక్ష, రు. 250 జరిమానా విధించబడింది. క్విట్ ఇండియా ఉద్యమంలో 16-8-1942 నుంచిసుమారు రెండేళ్ళ మూడు నెలలపాటు వెల్లూరు, అమరావతి (మహారాష్ట్ర) జైళ్ళలో డిటెన్యూగా వున్నారు. చాలాకాలం జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులుగా వున్నారు. ఉమ్మడి మద్రాసు శాసనసభకు 1937లో ఎన్నుకోబడ్డారు. రెవెన్యూ మంత్రికి పార్లమెంటరీ కార్యదర్శిగా పనిచేశారు. మొత్తంకాంగ్రెసు మంత్రివర్గం 1939 లో రాజీనామా చేసినపుడు, తన పదవికి రాజీనామా ఇచ్చారు. 1946 లో శాసనసభకు ఎన్నికయ్యారు. ప్రకాశం మంత్రివర్గంలో ప్రధాన పార్లమెంటరీ కార్యదర్శిగా పనిచేశారు. 1947 లో మున్సిపల్ కౌన్సిల్ ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు. 1951 కాంగ్రెస్ పార్టీకి శాసనసభా సభ్యత్వానికి రాజీనామా చేశారు. 1951 ఏప్రిల్‌లో ఉప ఎన్నికలో స్వతంత్ర అభ్యర్థిగా ఎన్నికయ్యారు. 1952 లో కిసాన్ మజ్దూర్ ప్రజా పార్టీ టికెట్‌పై శాసనసభకు ఎన్నికయ్యారు. 1953 లో శాసనసభకు రాజీనామా చేశారు. కర్నూల్‌లో ఏర్పడిన ప్రథమాంధ్ర మంత్రివర్గంలో ప్రకాశం మంత్రి వర్గంలో ఆర్థికమంత్రిగా పనిచేశారు. 1956 ఫిబ్రవరి నుంచి 1959 మార్చి వరకు కంపెనీ లా సలహా కమిషన్ అధ్యక్షులుగా పనిచేశారు. 1962 లో తిరిగి శాసనసభకు ఎన్నికయ్యారు. ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో నేషనల్ డెమోక్రాట్స్‌కు నాయకుడయ్యారు. 1966 లో శాసనసభకు రాజీనామా ఇచ్చి, విశాఖ ఉక్కు ఫ్యాక్టరీ నిర్మాణానికై జరిగిన అఖిలపక్ష ఉద్యమానికి నాయకత్వం వహించారు. 1967 లో శాసనసభకు, పార్లమెంట్‌కు ఎన్నికయ్యారు. పార్లమెంట్ స్థానాన్ని ఉంచుకొని శాసనసభకు రాజీనామా చేశారు. 1977 సెప్టెంబరు నుంచి 1978 మే వరకు ఆంధ్రప్రదేశ్ జనతాపార్టీ అధ్యక్షుడు. 1979 నవంబరు 10 న కీర్తిశేషులయ్యారు.

## తందాళ సర్వేశ్వరశాస్త్రి

భీమునిపట్నంలో 1902 డిసెంబర్ 17 న జన్మించారు. తండ్రి నీలకంఠం. మద్రాసు యూనివర్శిటీలో 'లా' పట్టా పుచ్చుకొన్నారు. విశాఖపట్నంలో న్యాయవాదిగా పనిచేశారు. సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొని 1922 ఫిబ్రవరి 7 న 10 నెలల శిక్ష, రు. 300 జరిమానా పొందారు. బరంపురం, కడలూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. లా కాలేజి విద్యార్థిగా వున్నపుడే సైమన్ కమిషన్ బహిష్కరణోద్యమాన్ని నడిపారు. కాలేజీ నుంచి బహిష్కరింపబడ్డారు 1930 ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో సంవత్సరం కఠినశిక్ష పొందారు. బరంపురం, కడలూరు, వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ– ఇర్విన్ ఒడంబడికను అనుసరించి విడుదలయ్యారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 10 నెలల శిక్షకు గురయ్యారు జిల్లాలో యువజనోద్యమాన్ని నిర్మించారు. చురుకైన సాంఘిక సేవకులు. ఆంధ్ర యూనివర్శిటీ సెనేట్, సిండికేట్‌ల సభ్యులుగా వున్నారు.

## తగ్గి వీరయ్య దొర

1898 లో జన్మించారు. చింతపల్లి తాలూకా బండచాయలు నివాసి. తండ్రి వీరయ్య దొర. 1922-24 వరకు అల్లూరి సీతారామరాజుతో మన్యం విప్లవంలో పాల్గొన్నందుకు జీవిత ఖైదు విధించబడింది. వీరు రాజమండ్రి, మద్రాసు, బళ్ళారి, అండమాన్ జైళ్ళలో 14 ఏళ్ళు గడిపారు. తామ్రపత్ర గ్రహీత.

## బోనంగి పండు పడాల్

సుమారు 1890 లో చింతపల్లి తాలూకా గొండిపాకలలో జన్మించారు. తండ్రి అందయ్య. వీరు అల్లూరి సీతారామరాజుగారి మన్యం విప్లవంలో పాల్గొన్నారు. వీరి ఆచూకీ తెలిపిన వారికి బహుమానం యిస్తానని బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించింది. వీరిని 1924 లో అరెస్టుచేసి, జీవితఖైదు శిక్ష విధించింది. రాజమండ్రి, కన్ననూరు, తిరుచునాపల్లి పాలంకోట, మద్రాసు జైళ్ళలోనూ ఆ తరవాత అండమాన్

జైల్లో నిర్బంధించారు. వీరు అండమాన్ దీవులలోని గాంజ్ గ్రామంలో స్థిరపడిపోయారు.

## మల్లి మడుగుల జగన్నాథరావు

1905 లో గంజామ్ జిల్లా బరంపురంలో జన్మిం చారు. విశాఖపట్నం వాస్తవ్యులు. అడ్వకేట్. ఉప్పు సత్యాగ్రహంలో 1930 లో ఒక సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, కన్ననూరు, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహంలో 6 నెలల కఠినశిక్షను రాజమండ్రి, ఆలీపురం జైళ్ళలో అను భవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో తన ప్లీడరు పట్టాను వదలి వేశారు. జిల్లా కాంగ్రెస్ కార్యదర్శి గాను, ఎ.ఐ.సి.సి. సభ్యుడుగానూ వున్నారు. తూర్పు గోదావరి సీతానగరం కస్తూరిబా మెమోరి యల్ ట్రస్టుకు సలహాదారుగా వున్నారు.

## గామ్ మల్లు దొర

1900 లో జన్మించారు. చింతపల్లి తాలూకా బట్ట పనుకుల వాస్తవ్యులు. తండ్రి జోగుదొర. అల్లూరి సీతారామరాజుతో సన్నిహిత సంబంధం వుండేది. 1922-23 లో పోలీసు షన్‌లను ముట్టడించిన సందర్భంలో నడింపాలెంవ పట్టుకొని జీవిత ఖైదు విధించారు. 13½ సంవత్సరాలపాటు విశాఖపట్నం, రాజమండ్రి. కోయంబత్తూరు జైళ్ళలో వున్నారు. 1952 లో గిరిజన నియోజకవర్గం నుంచి లోక్‌సభ సభ్యుడుగా ఎన్నుకోబడ్డారు.

## శిష్ట్లా రామదాసు (పప్పురాముడు)

1906 లో యలమంచిలి తాలూకా దిమిలిలో జన్మిం చారు. తండ్రి వెంకన్న. పురోహితుడు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 6 మాసాల కఠిన శిక్షను బరం పురం, ఆలీపూర్ జైళ్ళలో అనుభవించారు. 1932లో శాసనోల్లంఘన సందర్భంలో 1 సంవత్సరం కఠిన శిక్షను బరంపురం, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు. 1941 లో యుద్ధ వ్యతిరేక నినాదాలు చేసినందుకు 9 సంవత్సరాల కఠిన శిక్షను ఆలీపురం జైలులో అనుభవించారు. తామ్రపత్ర గ్రహీత.

## కొలగాని సంగతులు (పసుపులేటి కన్నడు)

తండ్రి బాలడు. వ్యాపారి. పెద్దపలసగ్రామ వాస్తవ్యుడు. సీతారామరాజుతో కలిసి పనిచేశారు. 1922 లో చింతపల్లి పోలీసుస్టేషనుమీద దాడిచేసిన సందర్భంలో 3 ఏళ్ళ కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవిస్తూ 1924 లో కీర్తిశేషులయ్యారు.

## నిష్టల సుబ్రహ్మణ్య సోమయాజులు

1894 లో బరంపురంలో జన్మించారు. చోడవరం వాస్తవ్యులు. తండ్రి వెంకట చలపతిశాస్త్రి. అడ్వ కేట్. 1921 లో సహాయ నిరాకరణ ఉద్యమంలో గంజాం జిల్లాలో న్యాయవాద వృత్తి మానుకున్న వారిలో మొదటివారు. 1921-22 లో సహాయ నిరా కరణోద్యమంలో 6 మాసాల కఠిన శిక్షను, ఒక నెల విడి శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. ఉప్పు సత్యాగ్రహంలో 1930 లో ఒక సంవత్సరం కఠిన శిక్షను అనుభవించారు. 1932 లో శాసనోల్లం ఘన ఉద్యమంలో పాల్గొన్నారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 లో ఒక సంవత్సరం కఠిన శిక్షను అనుభవించారు.

## దిగుమర్తి వెంకట రామస్వామి

1892 లో జన్మించారు. విశాఖపట్నం వాస వ్యులు. తండ్రి రామదాసు. అడ్వకేట్. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో 6 మాసాల కఠిన శిక్షను బరంపురం, మద్రాసు, వెల్లూరు జైళ్ళలో అనుభవిం చారు 1932 లో శాసనోల్లంఘన ఉద్యమంలో 2 ఏళ్ళ కఠిన శిక్షను రాజమం , కడలూరు, మధురై జైళ్ళలో అనుభవించారు. 19 0 లో వ్యక్తి సత్యా గ్రహంలో 6 మాసాల సాధారణ శిక్షను వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 6 మాసాల కఠిన శిక్షను ఆలీపురం జైలులో అనుభవించారు. 1937 లో ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభ సభ్యుడు. కొంతకాలం బందరు జాతీయ కళాశాల ప్రిన్సిపాల్‌గా వున్నారు.

## మాల వెంకమాంబ

1886 లో కురుపామ్‌లో జన్మించారు. నివాసం విజయనగరం. తండ్రి అతి అప్పయ్యపంతులు. భర్త సత్యనారాయణ. 1932 లో సహాయ నిరాకర ణోద్యమంలో 4 మాసాల కఠిన శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. అదే సంవత్సరం కైలాస

పట్నం రాజకీయ సభకు హాజరైనందున మరల 6 మాసాల కఠిన శిక్షను విధించగా రాయవెల్లూరు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు. స్త్రీల అభ్యున్నతికి, ఖాదీ ప్రచారానికీ ఎక్కువగా పాటుపడ్డారు.

# తూర్పుగోదావరి జిల్లా

## బులుసు సాంబమూర్తి

రాజమండ్రి తాలూకా దుళ్ళ వాస్తవ్యులు. 1886 మార్చి 4 న జన్మించారు. తండ్రి సుబ్బావధాన్లు. బి. ఎ.బి.యల్. పాసయ్యారు. విజయనగరం మహారాజా కాలేజీలో 1909 లో లెక్చరర్‌గా పనిచేశారు. కాకినాడలో లాయర్‌గా కొన్నాళ్ళు పనిచేశారు. 1919 లో హోమ్‌రూల్ ఉద్యమంలో చేరారు సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొని న్యాయవాద వృత్తి మానివేశారు. 1921 డిసెంబర్ 22 న ఒక సంవత్సరం కఠిన శిక్ష విధింపబడింది. రాజమండ్రి, బళ్ళారి సెంట్రల్ జైళ్ళలో శిక్ష అనుభవించారు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో 19-4-30 నుంచి సంవత్సరం శిక్ష రాజమండ్రి, మద్రాసు, కన్ననూర్, వెల్లూరు సెంట్రల్ జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో స్పృహ కోల్పోయే వరకు పోలీసులు లాఠీఛార్జీ చేశారు. 1932 జనవరి 7నుంచి రెండేళ్ళ కఠిన శిక్ష వెల్లూరు సెంట్రల్‌జైలులో అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహోద్యమంలో భారత రక్షణ నిబంధనల కింద 4-12-1940 నుంచి 1-11-1941వరకు వెల్లూరు సెంట్రల్‌జైలులో నిర్బంధింపబడ్డారు. 1925 లో రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులుగా సంవత్సరంపాటు వున్నారు. మద్రాసులో ఆంధ్రమహాసభకు అధ్యక్షులుగా వున్నారు. 1935-37 ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ ప్రధానకార్యదర్శిగా వున్నారు. 1937 మద్రాసు శాసనసభకు స్పీకరు అయ్యారు. 'మహర్షి' అని ప్రజానీకంచే పిలువబడ్డారు. 1958 లో కీర్తిశేషులయ్యారు.

## కళా వెంకటరావు

అమలాపురం తాలూకా ముకామలలో 1900 జూలై 7 న జన్మించారు. తం। బ్రహ్మయ్య. బి.ఎ. చదువుతున్న రోజుల్లోనే 1 21 లో శాసనోల్లంఘన ఉద్యమంలో చేరారు. కోనసీమ కోపరేటివ్ సెంట్రల్ బ్యాంకుకు 20 ఏళ్ళ పాటు కార్యదర్శిగా పనిచేశారు. కొన్నాళ్ళు దానికి అధ్యక్షులుగా వున్నారు. ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ సంయుక్త కార్యదర్శి. సహాయ నిరాకరణోద్యమంలో 1922 జనవరి 18 నుంచి రాజమండ్రి, కడలూరు జైళ్ళలో ఒక సంవత్సరం కఠిన శిక్ష అనుభవించారు. మద్రాసులో సైమన్ కమిషన్ రాక సందర్భంగా 1929 లో అరెస్టు చేయబడి ఒకరోజు తర్వాత విడుదలయ్యారు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో 19-4-30 నుంచి ఒక సంవత్సరం శిక్ష రాజమండ్రి, వెల్లూరు, కడలూరు జైళ్ళలో అనుభవించారు. తిరిగి 1932 ఫిబ్రవరి 1 నుంచి 5 నెలల కఠిన శిక్ష, రు. 200 జరిమానా విధింపబడింది. 1933 లో సబ్‌జైలులో 15 రోజులు వున్నారు. 1937, 1946 లలో ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభకు ఎన్నికయ్యారు. వ్యష్టి సత్యాగ్రహ సందర్భంగా 1941 మార్చి 20 న అమలాపురంలో అరెస్టయి మర్నాడు 6 నెల్ల కఠిన శిక్ష పొందారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. 1-9-1941 న విడుదలయ్యారు. భారత రక్షణ నిబంధనల కింద 2-9-41 నుంచి 10-1-1942 వరకు వెల్లూరు సెంట్రల్ జైలులో డిటెయిన్ చేయబడ్డారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా వెల్లూరు, నాగపూర్ జైళ్ళలో సుమారు రెండున్నర ఏళ్ళు డిటెయిన్ చేయబడ్డారు. 1940-46 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ ప్రధాన కార్యదర్శి, ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ప్రభుత్వంలో 1947 లో రెవెన్యూ మంత్రి. 1949 నుంచి 1951 సెప్టెంబరు వరకు భారత జాతీయ కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి, 1951 లో మద్రాసు శాసనమండలి సభ్యుడు. 1953లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు ఉపాధ్యక్షుడు. 1955 లో ఆంధ్ర శాసనసభ సభ్యులు ఆరోగ్య ప్రణాళిక శాఖ మంత్రి. 1956 నవంబరు నుంచి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో ఆర్థికమంత్రి. 1959 మార్చి 28 న కీర్తిశేషులయ్యారు.

## నడింపల్లి సుబ్బరాజు

1888 ఫిబ్రవరి 21 న జన్మించారు. అమలాపురం తాలూకా కోడూరుపాడు వాస్తవ్యులు. తండ్రి నారాయణరాజు, భూస్వామి, 1907 లో వందే

మాతరం ఉద్యమంలో చేరారు. అల్లవరం గ్రామ మున్సబు పదవికి రాజీనామా చేశారు. రు. 1000 జరిమానా వసూలు చేయబడింది. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమ కాలంలో శాంతిసేన సభ్యులకు భోజనం పెట్టినందుకు శిక్షింపబడి, 5-6-30 నుంచి 17-11-30 వరకు రాజమండ్రి సెంట్రల్ జైలులో నిర్బంధింప బడ్డారు. 1932 లో అమలాపురం తాలూకాబోర్డు అధ్యక్షులు. 1936-39 లో జిల్లాబోర్డు అధ్యక్షులు. 1937 లో మద్రాసు శాసనమండలి సభ్యుడు. వ్యక్తి సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొనేందుకు నిశ్చయించు కొన్న సమయానికి ఒక రోజు ముందు 1940 డిసెంబరు 7 న కీర్తిశేషులయ్యారు.

## బిక్కిన వీరాస్వామి

1888 ప్రాంతంలో జన్మించారు. రాజోలు తాలూకా తాటిపాక వాస్తవ్యులు. తండ్రి సుబ్బయ్య. 1915 లో కోయంబత్తూరులో వ్యవసాయంలో డిప్లొమా పొందారు. వ్యక్తి సత్యాగ్రహ ఉద్యమంలో 16-12-1940 వ సంవత్సరం కఠిన శిక్ష, రు 1000 జరిమానా విధింపబడింది. వెల్లూరు, తిరుచినాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1940-52 శాసన మండలి సభ్యులు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ప్రకాశం మంత్రివర్గంలో అటవీశాఖ మంత్రిగా వున్నారు. తూర్పుగోదావరి జిల్లాబోర్డు ఉపాధ్యక్షులు గాను, కోనసీమ సెంట్రల్ బ్యాంకు ఉపాధ్యక్షుడుగాను పనిచేశారు. 1970 నవంబరు 27 న కీర్తిశేషు లయ్యారు.

## బిక్కిన వెంకటరత్నం

రామచంద్రపురం తాలూకా చోడవరం వాస్తవ్యులు. తండ్రి వెంకట్రాయుడు. వ్యవసాయం. గ్రామోద్యోగ పదవికి రాజీనామాచేసి 1920-21 సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్నారు. సత్యాగ్రహులకు భోజనం పెట్టినందుకు ఆరు నెల్లు కఠిన శిక్ష, రు. 1000 జరిమానా విధించబడింది. 7-6-1930 నుంచి రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. జరిమానా వసూలు చేయబడింది. వ్యక్తిసత్యాగ్రహోద్యమంలో భారతరక్షణ నిబంధ నావళి క్రింద 14-2-1941 న 4 నెలల కఠిన శిక్ష, రు. 500 జరిమానా విధింపబడింది. జరిమానా వసూలు చేయబడింది. రాజమండ్రి, బళ్ళారి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. రామచంద్రపురం తాలూకాబోర్డు అధ్యక్షులుగా వున్నారు. రామచంద్ర పురం కోపరేటివ్ సెంట్రల్ బ్యాంకుకు 25 ఏళ్ళు అధ్యక్షులుగా వున్నారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో 1923-29 సంవత్సరాలలో శాసనమండలి సభ్యుడుగా వున్నారు. 1946-52 లో శాసన సభ్యుడు 1947 లో ప్రకాశం మంత్రివర్గంలో సభ్యుడు. స్టేట్ కోపరేటివ్ బ్యాంకు అధ్యక్షులు.

## అరుమిల్లి వెంకటరత్నం

రాజోలు తాలూకా నాగుల్లంకలో 1905 డిసెం బరు 4 న జన్మించారు తండ్రి రామన్న. వ్యవసాయం. శాసనోల్లంఘన ఉద్యమంలో తీవ్రంగా కృషిచేశారు. 1932 ఫిబ్రవరి 23 న 18 నెలల కఠిన శిక్ష, రు. 1000 జరిమానా విధింపబడింది. ప్రభుత్వం జరిమానా వసూలు చేసింది. రాజమండ్రి, వెల్లూరు, మధురై, కడలూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 21-4-1933 న విడుదలయ్యారు. 1941 లో తూర్పు గోదావరి జిల్లాబోర్డుకు అధ్యక్షులు.

## బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం

గుంటూరుజిల్లా ఫిరంగిపురం గ్రామంలో 1891 అక్టోబరు 12 న జన్మించారు. రాజమండ్రి వాస్తవ్యులు. తండ్రి రామశాస్త్రి. కలకత్తా నేషనల్ మెడికల్ కాలేజీలో వైద్యవిద్య నభ్యసించారు. 1916-17 లో హోమ్‌రూల్ ఉద్యమంలో ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. 1922 జనవరి 7 నుంచి రాజమండ్రి, కడలూరు జైళ్ళలో శిక్షను అనుభ వించారు. 1921 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సంయుక్త కార్యదర్శి. 1924 లో సీతానగరంలో గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమాన్ని స్థాపించారు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో 19-4-1930 నుంచి ఒక సంవత్సరం శిక్ష వెల్లూరు, కడలూరు జైళ్ళలో అనుభవించారు. 1932 లో సత్యాగ్రహ ఆశ్రమంపై దాడిచేసి, ప్రభుత్వం దాన్ని స్వాధీన పరచుకొంది. 1932 జనవరిలో రాజమండ్రిలో తీవ్రంగా లాఠీచార్జీకి గురయ్యారు. పక్కటెముక విరిగింది. తిరిగి 1932 మే 14 న ఆరు నెల్ల కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, కడలూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు.

జైళ్ళలో తీవ్రనిర్బంధ విధానానికి గురై క్షయవ్యాధి సోకి, 1936 డిసెంబరు 23 న కీర్తిశేషులయ్యారు.

## మల్లిపూడి పళ్ళంరాజు

రామచంద్రపురం తాలూకా బాలాంత్రంలో 1899 ఏప్రిల్ 25 న జన్మించారు. తండ్రి వీరాస్వామి. కోయంబత్తూరు వ్యవసాయ కళాశాలలో చదివారు. 1928 లో గ్రామ మునసబుపదవికి రాజీనామాచేసి, రాజకీయాలలో ప్రవేశించారు. 1929 లో జిల్లాబోర్డు అధ్యక్షులు. 1931 లో కాకినాడలో యావదాంధ్ర దేశానికి చెందిన హిందూస్థాన్ సేవాదళ శిబిరాన్ని నడిపారు. 1931 జిల్లాబోర్డు భవనంపై జాతీయ పతాకను ఎగురవేసినందుకు శిక్షింపబడ్డారు. శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నందుకు ఒక నెల కఠిన శిక్ష రు 200 జరిమానా విధింపబడింది. 18-1-1932 నుంచి 16-2-1932 వరకు రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్ష అనుభవించారు. తిరిగి ఒక నెల విడిఖైదు విధించి పిఠాపురం సబ్‌జైలులో వుంచారు. వ్యక్తిసత్యాగ్రహ ఉద్యమంలో ఒక సంవత్సరం కఠిన శిక్ష రు. 1000 జరిమానాను 1940 నవంబరు 29 న విధించారు. వెల్లూరు, తిరుచినాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో వెల్లూరు, అమరావతి జైళ్ళలో 12-8-1942 నుంచి 13-12-1944 వరకు డిటెన్యూగా వున్నారు. జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ, ఆలిండియా కాంగ్రెస్ కమిటీలకు చాలా సంవత్సరాలు సభ్యుడు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీకి అధ్యక్షుడు. సంజీవరెడ్డి, సంజీవయ్య రాష్ట్ర మంత్రివర్గాలలో అటవీ, పశు సంపద, మత్స్యశాఖ మంత్రిగా పనిచేశారు. 1962 లో కీర్తిశేషులయ్యారు.

## పంగవేటి దీక్షితులు

రాజమండ్రి తాలూకా సీతానగరం వాస్తవ్యులు. తండ్రి లక్ష్మినరసింహశాస్త్రి. శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నందుకు నిర్భయుడైన ఈ స్వాతంత్ర్యయోధునికి 1932 ఫిబ్రవరి 1 న నాల్గేళ్ళ కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచినాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## డా॥ చెలికాని వెంకట రామారావు

కాకినాడ తాలూకా తిమ్మాపురంలో 1901 జూలై 15 న జన్మించారు. రామచంద్రపురం వాస్తవ్యులు. తండ్రి నారాయణస్వామి ఎల్. యం. అండ్ యస్. లో ఉత్తీర్ణులై వైద్యవృత్తిని అవలంబించారు. సహాయ నిరాకరణోద్యమంలో 1922 మార్చి 23 న సంవత్సరం కఠినశిక్ష పొందారు. రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్ష అనుభవించారు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో 1930 ఆగస్టు 20 న 6 నెలల కఠినశిక్ష, . 200 జరిమానా విధింపబడింది. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 11-3-1931 న విడుదలయ్యారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 18 నెలల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, కోరాపుట్ జైళ్ళలో శిక్ష అనుభవించారు. బళ్ళారి వెల్లెస్లీ శానిటోరియం జైలులో నిర్బంధింపబడ్డారు. 1935-36 లో జిల్లా హరిజన సేవకసంఘ కార్యదర్శి. 1952-57 లోక్‌సభ సభ్యులు.

## మండపాక రంగయ్యనాయుడు

చంద్రపాలెంలో 1886 లో జన్మించారు. కాకినాడ వాస్తవ్యులు. తండ్రి సీతారామస్వామి. సహాయ నిరాకరణ ఉద్యమంలో 17-12-1922 నుంచి ఒక సంవత్సరం కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్ష అనుభవించారు. ఉప్పుసత్యాగ్రహ ఉద్యమంలో 25-4-1930 న ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించగా రాజమండ్రి, మద్రాసు, కన్ననూర్, వెల్లూరు జైళ్ళలో నిర్బంధింపబడ్డారు. శాసనోల్లంఘన ఉద్యమంలో 1932-3-17 న 18 నెలల కఠినశిక్ష, రు. 500 జరిమానా విధించబడగా రాజమండ్రి, కడలూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. తూర్పుగోదావరిజిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు, రాష్ట్ర కాంగ్రెసు కమిటీ సభ్యులు. కాకినాడ మున్సిపల్ వైస్ ఛైర్మన్. వ్యక్తి సత్యాగ్రహ ఉద్యమంలో 6-3-1941 న 9 నెలల కఠినశిక్ష, రు. 300 జరిమానా విధించబడింది. అలీపురం క్యాంపు జైలులో ఉండగా 1941 జూన్ 2 న కీర్తిశేషులయ్యారు.

కాకినాడలో ఎ. ఐ. సి. సి. వర్కింగ్ కమిటీ సమావేశం జరిగినపుడు ప్రముఖపాత్ర వహించిన

వారిలో ముఖ్యుడు.

## కందుల వీరరాఘవస్వామి (కె. వి. ఆర్. స్వామి)

రాజమండ్రిలో 1885 లో జన్మించారు. తండ్రి మాణిక్యం. బారిష్టర్. సహాయ నిరాకరణ ఉద్యమ కాలంలో బాగా ఆదాయం తెచ్చిపెడుతున్న న్యాయ వాద వృత్తిని వదలివేశారు. 1922 ఫిబ్రవరి 4 నుంచి ఆరువారాల కఠినశిక్ష మద్రాసు సెంట్రల్ జైలులో అనుభవించారు. సైమన్ కమిషన్ బహిష్కరణ ఉద్యమంలో పాల్గొని 1929 లో శిక్షింపబడ్డారు. 1930 లో పె పురంలో పోలీసుల లాఠీచార్జీకి గుర య్యారు. వ్య సత్యాగ్రహంలో 11-12-1940 న ఒక సంవత్స ం విడి ఖైదు రు. 500 జరిమానా కూడా విధించబడింది. వెల్లూరు, తిరుచినాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1926-29 లో శాసనమండలి సభ్యుడు. 1937-40 లో శాసనసభా సభ్యుడు. రాజ మండ్రి మున్సిపల్ ఛైర్మన్‌గా మూడుటరములు పని చేశారు. 1945 అక్టోబరులో కీర్తిశేషులయ్యారు

## మద్దూరి అన్నపూర్ణయ్య

జననం 1898. తండ్రి జయరామయ్య. స్వగ్రామం పిఠాపురం తాలూకాలోని గోరస. సహాయ నిరాకర ణోద్యమ సందర్భంగా 1921 లో రాజమండ్రి ప్రభుత్వ కళాశాలలో బి. ఏ. చదువుతూ మానివేశారు. రాజమండ్రి జాతీయ పాఠశాలలో ఉపాధ్యాయుని గానూ, సీతానగరం ఆశ్రమంలోను కొంతకాలం పని చేశారు. 'కాంగ్రెస్' అనే తెలుగు వారపత్రిక సంపాద కుడు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. రాజ ద్రోహ నేరంకింద అరెస్టుచేసి. 1-2-1923 న సంవ త్సరం జైలుశిక్ష, రు. 500 జరిమానాగానీ లేక మరో 6 నెలలు శిక్షగాని విధించింది ప్రభుత్వం. రాజమండ్రి వెల్లూరు సెంట్రల్ జైళ్ళలో శిక్ష అనుభవించారు. మళ్ళీ 12-8-1929 న 2 ఏళ్ళ జైలుశిక్ష రు. 500 జరిమానాగానీ లేక మరో 6 నెలల శిక్షగానీ విధించగా వెల్లూరు, మద్రాసు, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభ వించారు. శాసనోల్లంఘన సందర్భంలో 4 ఏళ్ళ శిక్ష విధించగా 1-2-1932 నుంచి 1934 వరకూ కడలూరు, వెల్లూరు, రాజమండ్రి, బళ్ళారి, తిరుచునా పల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు.

వీరు కొంతకాలం కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలోనూ ఇండిపెండెన్సు లీగ్ సభ్యులుగానూ వున్నారు. ఆంధ్రలోని యువజనోద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు. యుద్ధ వ్యతిరేక కార్యకలాపాల్లో పాల్గొ న్నందుకు 6-4-1940 నుంచి జూన్ 1945 వరకూ డెటిన్యూగా, వెల్లూరు, రాజమండ్రి, దామో, అమరా వతి జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1940 లో అఖిల భారత ఫార్వర్డుబ్లాక్ కార్యవర్గ సభ్యులు. ఖైదీగానూ, డిటెన్యూగాను ఈయన మొత్తం 12 ఏళ్లు జైలుశిక్ష అనుభవించారు. నిస్వార్థ ప్రజాసేవకులుగా పేరు పొందారు. 1953 లో కీర్తిశేషులయ్యారు.

## దుర్గాబాయ్ దేశ్‌ముఖ్

ఈమె 1910 లో రాజమండ్రిలో జన్మించారు. బి.వి.యన్. రామారావుగారి పుత్రిక. సి.డి. దేశ్‌ముఖ్ గారి భార్య. ఈమె యమ్.ఏ బియల్. చదివారు. ఆంధ్ర యూనివర్శిటీ నుంచి డి.లిట్ గౌరవ డిగ్రీ పొందారు. చైతన్యవంతమైన మహిళా ఉద్యమ నాయకురాలు.

ఈమె తన 12 వ ఏటనే గాంధీజీవల్ల ఉత్తేజం పొంది, స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. గ్రామ గ్రామానికి వెళ్ళి, గాంధీ ఆశయాల్ని ప్రచారం చేశారు. మహిళలకు హిందీ. నూలు వడకటం, నేత నేయటం నేర్పేందుకు ఒక స్కూలు ప్రారంభించారు. 1930 లో మద్రాసులో ఉప్పుసత్యాగ్రహోద్యమం నడుపుతుండగా 1 సంవత్సరం శిక్ష విధించగా రాయ వెల్లూరు జైలులో నిర్బంధింపబడ్డారు. 1931 లో గాంధీ-ఇర్విన్ ఒడంబడిక మూలంగా విడుదలయ్యారు. 1932లో 6 మాసాల కఠిన శిక్ష 20 రోజుల జరిమానా విధించగా వేలూరు, మదురై జైళ్ళలో శిక్ష అనుభవిం చారు. విద్యా వ్యాప్తికి. మహిళాశిశుసంక్షేమానికి గట్టి కృషి చేశారు. ఆంధ్ర మహిళా సభ స్థాపకురాలు. పార్లమెంట్ సభ్యురాలు, ప్లానింగ్ కమిషన్ సభ్యు రాలు. కేంద్ర సంక్షేమ బోర్డు ఛైర్మన్ విద్యా, మహిళా సంక్షేమాలపై చాల గ్రంథాలు రాశారు. అక్ష రాస్యత పెంపొందించేందుకు ఈమె చేసిన కృషికి గాను 1971 లో నెహ్రూ అవార్డు లభించింది.

1975 లో "పద్మ విభూషణ" బిరుదును బహూకరించారు.

## డా॥ పాలకోడేటి గురుమూర్తి

పశ్చిమగోదావరి జిల్లా భీమవరం తాలూకా గరగపర్రులో 1884 సంవత్సరంలో జన్మించారు. 1914నుంచి రాజమండ్రి నివాసి తండ్రి రాయప్ప, ఎల్.యం.పి. చదివారు. ప్రముఖ డాక్టరు. పన్నుల నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్నందుకు 1922 ఫిబ్రవరిలో 3 నెలల కఠిన శిక్ష విధింపబడి, మద్రాసు జైలులో నిర్బంధింపబడ్డారు. 1930 ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో తూర్పుగోదావరి జిల్లా కాంగ్రెస్ కమిటీ డిక్టేటరుగా పాల్గొనగా, తీవ్రమైన లాఠీ ఛార్జికి గురయ్యారు. 3 మాసాల కఠిన శిక్ష అనుభవించారు. హరిజనోద్ధరణకు పాటుబడ్డారు. సహకార ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు. రాజమండ్రి మున్సిపల్ ఛైర్మన్‌గా రెండేళ్ళు వున్నారు. 1948 లో కీర్తిశేషు లయ్యారు.

## గాడిచర్ల హరిసర్వోత్తమరావు

1883 లో కర్నూలులో జన్మించారు. తండ్రి వెంకట్రావు. రాజమండ్రి నివాసి. ఆంధ్రలో వందేమాతరం ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు. 1907 లో మద్రాసులో జరిగిన వందేమాతరం మీటింగుకు హాజరైన విద్యార్థి నాయకులలో వీరొకరు. బిపిన్ చంద్రపాల్ రాజమండ్రి వచ్చినప్పుడు స్వాగత పత్రం చదివినందుకు, ఈయన్ని ప్రభుత్వం ట్రెయినింగ్ కాలేజీ నుంచి డిస్‌మిస్‌చేసి, ప్రభుత్వ ఉద్యోగంఎక్కడా యివ్వరాదని ఆదేశించింది. "స్వరాజ్య" పత్రికకు సంపాదకులుగా వుంటూ నిర్భయంగా, ధైర్యంగా ప్రభుత్వ నిర్బంధ విధానాని తీవ్రంగా విమర్శించేవారు. మద్రాసులో ఒక ఆంగ్లేయుడు ఇద్దరు భారతీయుల్ని కాల్చివేసినందుకుగా ఖండిస్తూ "క్రూరమైన ఇంగ్లీషు పులి ఇద్దరు భారతీయుల్ని తన పొట్టన పెట్టుకుంది" అని తన పత్రికలో రాశారు. ఇందుకుగాను రాజద్రోహ నేరం మోపి 1908లో ఆయన్ని అరెస్టుచేసి, 3 ఏళ్ళ కఠిన శిక్షవిధించింది. ఈయనతోపాటు స్వరాజ్య పత్రిక ప్రచురణకర్త శ్రీ బోడి నారాయణరావుకి కూడా శిక్ష విధించింది. వీరిద్దరూ మన ఆంధ్రలో వందేమాతరం ఉద్యమంలో జైలుకు వెళ్ళిన మొట్టమొదటి రాజకీయ బాధితులు. వీరు 1960 లో కీర్తిశేషు లయ్యారు.

## వేదాంతం కమలాదేవి

1897 లో కడప జిల్లా రాజంపేట తాలూకా నందలూరులో జన్మించారు. నివాసం కాకినాడ. ప్రతాపగిరి గోపాలకృష్ణయ్యగారి పుత్రిక. డాక్టర్ వేదాంతం వెంకటకృష్ణయ్యగారి పత్ని. ఈమె కలకత్తాలో ఆంగ్ల, వం. భాషల్ని నేర్చుకున్నారు. సాంఘిక రాజకీయ రంగాలలో ప్రముఖ పాత్ర వహించారు. 1920 లో గాంధీ పిలుపుతో సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్నారు. 1923 లో కాకినాడలో కాంగ్రెసు మహాసభలు జరిగినపుడు ఈమె మహిళా వలంటీరు దళానికి నాయకురాలుగా వున్నారు. 1926లో అనంతపురంలో జరిగిన మహిళా సభకు అధ్యక్షత వహించారు. ఆంధ్ర దేశమంతటా పర్యటించి ఖద్దరు ప్రచారం చేయడమే కాక తిలక్ స్వరాజ్యనిధికి డబ్బు పోగుచేశారు. 1929, 1930, 1934 లలో అఖిల భారత కాంగ్రెసు, స్టాండింగ్ కమిటీ సభ్యురాలుగా వున్నారు. పక్షవాతంతో బాధపడుతూనే, విశాఖ జిల్లా అంతటా పర్యటించి ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొనవలసిందిగా మహిళలకు ప్రబోధించారు. ఇందుకుగాను 1930 మేలో ఈమెకు 6 నెలల కఠిన శిక్ష విధించగా వెల్లూరు జైలులో అనుభవించారు 1931 లో ఇచ్ఛాపురంలో జరిగిన మహిళా సభకు అధ్యక్షత వహించారు.

ఢిల్లీలో శ్రీమతి సరోజినీ నాయుడు ఆధ్వర్యాన జరిగిన జాతీయ సభలో గంభీరోపన్యాసం యిచ్చినందుకు 1932 లో 6 నెలల శిక్ష విధించగా వెల్లూరు జైలులో అనుభవించారు. ఈమెకు "దేశసేవిక" బిరుదు యివ్వబడింది. పక్షవాతంవల్ల 1940 లో ఈమె కీర్తిశేషులయ్యారు.

## పుసులూరి కోదండరామయ్య

ఈయన అమలాపురం తాలూకా పోలవరం గ్రామవాస్తవ్యులు. తండ్రి సీతాపతి. రైతు. స్వరాజ్య ఆశ్రమ స్థాపకులు. గిరిజన సంక్షేమానికి ఎక్కువగా కృషి చేశారు. 1922 నుంచి 1923 వరకూ సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్నందుకు రాజమండ్రి జైలులో నిర్బంధింపబడ్డారు. ఉప్పు సత్యాగ్రహంలో

పాల్గొన్నందుకు 1930 నుంచి రెండేళ్ల కఠిన శిక్ష రు. 1000 జరిమానా విధించారు. రాజమండ్రి, బళ్లారి జైళ్ళలో నిర్బంధింపబడ్డారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడికతో విడుదల చేయబడ్డారు.

1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 18 మాసాలు కఠిన శిక్ష విధింపబడింది. 1941 వ్యక్తి సత్యాగ్ర ఉద్యమంలో 3 నెలల 3 వారాలు కఠిన శిక్ష రాజ మండ్రి జైలులో అనుభవించారు. ఆ సంవత్సరమే దేశ రక్షణ చట్టం కింద అరెస్టుచేసి వెల్లూరు జైల్లో డిటెన్యూగా నిర్బంధించారు. 1942 లో విడుద లయ్యారు. మరల 1943 లో దేశరక్షణ చట్టం కింద అరెస్టు చేసి, ఒక సంవత్సరం 6 మాసాలు శిక్ష విధించి బళ్ళారి వెల్లస్లీ శానిటోరియం జైలుకి పంపారు. 1944 లో డిటెన్యూగా అరెస్టు చేయబడి 1945 వరకు తంజావూరు, బళ్ళారి, వెల్లూరు జైళ్ళలో నిర్బంధింపబడ్డారు.

## క్రొవ్విడి లింగరాజు

1904 లో జన్మించారు. తండ్రి సూర్యనారాయణ. రాజమండ్రి నివాసి. పత్రికా రచయిత. గ్రంథక ర. 1921 లో సహాయ నిరాకరణ ఉద్యమంలో చేరారు. 1923 నుంచి 29 వరకు "కాంగ్రెసు" పత్రికకు సహాయ సంపాదకులుగాను, 1929 నుంచి 31 వరకు సంపా దకులుగాను పనిచేశారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా 1930 లో 6 నెలలు శిక్ష విధించి, రాజ మండ్రి, వెల్లూరు, మద్రాసు, అలీపురం జైళ్ళలో నిర్బంధించారు. 1931 లో "కాంగ్రెస్" పత్రికలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా రాసినందుకు రాజద్రోహ నేరంక్రింద రెండున్నర సంవత్సరాల శిక్ష విధిం చారు. 1940 వ్యక్తి సత్యాగ్రహంలో ఒక సంవ త్సరం శిక్ష, రు. 500 జరిమానా విధించగా, వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళల్లో వున్నారు. 1942 లో డిటె న్యూగా, దామో, వెల్లూరు, అమరావతి జైళ్ళలో నిర్బంధింపబడ్డారు. 1945 లో విడుదలయ్యారు.

మాక్సిం గోర్కీ నవల "అమ్మను" తెనిగించారు. ఈ గ్రంథాన్ని ప్రభుత్వం నిషేధించింది. సీతానగరం సత్యాగ్రహ ఆశ్రమం సంస్థాపక సభ్యులలో ఈయన ఒకరు. 1938 నుంచి 41 వరకూ రాజమండ్రి మున్సి పల్ చైర్మన్‌గా వున్నారు.

1946-54 వరకూ మద్రాసు రాష్ట్ర శాసనసభ్యుడు. 1946-47 లో ప్రకాశం మంత్రివర్గంలో పార్ల మెంటరీ కార్యదర్శి. తెలుగులో సోవియట్ లాండ్ నెహ్రూ అవార్డు పొందినవారిలో ప్రథముడు. "ఆంధ్రప్రదేశ్‌లో స్వాతంత్ర్య పోరాట చరిత్ర" రచనకు ఏర్పడిన రాష్ట్ర కమిటీ సభ్యులు. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ స్వాతంత్ర్య సమరయోధుల పెన్షన్ స్కీము-రాష్ట్ర సలహా సంఘ సభ్యుడుగా 1974 నుంచి 1976 వరకూ వున్నారు.

## ఎ. బి. నాగేశ్వరరావు

ఈయన 1901 లో బందరులో జన్మించారు. తండ్రి రామకృష్ణయ్య. రాజమండ్రి నివాసి. ఎల్.యమ్.పి.డాక్టరు వైద్యవిద్య నభ్యసిస్తూ 1921లో సహాయ నిరాకరణ ఉద్యమంలో చేరినందుకు 4 మాసాల జైలుశిక్ష అనుభవించారు. 1930 ఉప్పు సత్యాగ్రహ సందర్భంలో తీవ్రమైన లాఠీఛార్జికి గుర య్యారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమ సంద ర్భంలో 18 నెలల పాటు రాజమండ్రి, ఆలీపురం జైళ్ళలో నిర్బంధించబడ్డారు.

ఆలీపురం కాంప్ జైల్లో మరల తీవ్రమైన లాఠీ ఛార్జికి గురయ్యారు. 1947-55 లో రాజమండ్రి మున్సిపల్ చైర్మన్‌గా వున్నారు. బెజవాడ గోపాల రెడ్డిగారి మంత్రివర్గంలో 1955 నుంచి 1956 వరకు సభ్యులు.

## బారు రాజారావు

1888 లో పశ్చిమగోదావరిజిల్లా నరసాపురంలో జన్మించారు. 1907 లో రాజమండ్రిలో ఇంటర్మీడి యట్ చదువుతూ వందేమాతరం ఉద్యమంలో పాల్గొ న్నందుకు కాలేజీనుంచి డిబార్ చేయబడ్డారు. కల కత్తా యూనివర్శిటీలో బి.ఏ. (ఆనర్సు) చదివారు. 1917 నుంచి 1934 వరకూ భారత జాతీయ కాంగ్రెస్ సహాయ కార్యదర్శిగానూ, కార్యదర్శిగాను పని చేశారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నం దుకు ఎరవాడ, కన్ననూర్ జైళ్ళలో నిర్బంధింప బడ్డారు. 1930-31 లో బార్డోలీ సత్యాగ్రహంలో వల్ల భాయ్‌పటేల్‌తో కలిసి పనిచేసినందుకు యులియా జైల్లో నిర్బంధించబడ్డారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో డిటెన్యూగా సబర్మతి, అహ్మదాబాద్,

కన్ననూర్ జైళ్ళలో వుంచబడ్డారు. విడుదలైన వెంటనే అరెస్టుచేసి 6 మాసాల శిక్ష విధించారు. మొత్తం 18 మాసాలు ఈయన జైలులో వున్నారు. 6 సంవత్సరాల పైగా అఖిల భారత కాంగ్రెస్ సంఘ సభ్యుడుగా వున్నారు 1937 లో మద్రాసు రాష్ట్ర శాసనసభ్యుడుగా ఎన్నుకోబడ్డారు. 1938 లో రాజమండ్రిలో కీర్తిశేషులయ్యారు.

## వెన్నేటి సత్యనారాయణ

కాతేరులో 1885 లో జన్మించారు. తండ్రి నరసింహం. 1907 లో బి ఎ. ఆఖరి సంవత్సరం చదువుతూ వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్నందుకు రెండు సంవత్సరాల వరకూ చదవనివ్వలేదు ప్రభుత్వం. హోమ్‌రూల్ ఉద్యమంపై ఎంతో ఆసక్తి చూపారు. న్యాయశాస్త్రం చదివారు. లాభదాయకమైన న్యాయవాద వృత్తి మానివేసి 1921 లో సహాయ నిరాకరణ ఉద్యమంలో చేరారు 1922 నుంచి ఒక సంవత్సరం శిక్ష రాజమండ్రి, కడలూర్ జైళ్ళలో అనుభవించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 19-4-1930 నుంచి దాదాపు 10 మాసాలు రాజమండ్రి, కడలూరు, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1932 లో గోదావరి రైలుస్టేషన్ వద్ద తీవ్రమైన లాఠీఛార్జికి గురయ్యారు. హరిజనోద్ధరణకు, ఖాదీ స్వదేశీ వస్తు ప్రచారానికి పాటుపడ్డారు. జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడుగాను, రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగాను పనిచేశారు.

## దువ్వూరు సుబ్బమ్మ

1880 లో రామచంద్రపురం తాలూకా ద్రాక్షారామంలో జన్మించారు. తండ్రి మల్లాది సుబ్బావధాని. భర్త దువ్వూరు వెంకయ్య. స్వాతంత్ర్య ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. దేశంలో సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొని, శిక్ష పొందిన మహిళల్లో యీమె ండవది. 1922 ఏప్రిల్ 4 న సంవత్సరం కఠిన శిక్ష విధించగా రాజమండ్రి జైలులో నిర్బంధింపబడ్డారు. ఉప్పు సత్యాగ్రహంలో 31-5-1930 నుంచి 6 నెలలు శిక్ష వెల్లూరు జైలులో అనుభవించారు. ఈమె గొప్ప వక్త. 1942 లో పెద్దాపురంలో క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా తీవ్రమైన లాఠీచార్జికి గురయ్యారు. 16 సంవత్సరాలపాటు ఎ.ఐ.సి.సి. సభ్యురాలు. రాజమండ్రిలోని సనాతన విద్యాలయ మేనేజరుగా కొంతకాలం పనిచేశారు. కాకినాడ కాంగ్రెస్ మహాసభలో 1923 లో యీమెకి "దేశ బాంధవి" బిరుదు యివ్వబడింది. ఈమె జబ్బుగా వుండగా, నెహ్రూ మరణవార్త తెలిసి, మందు తీసుకోడం మానేశారు. 1964 మే 31 న రాజమండ్రిలో కీర్తిశేషులయ్యారు.

## బయ్యా సూర్యనారాయణమూర్తి

## బి.యస్. మూర్తి

1906 లో రాజోలు తాలూకా నగరంలో జన్మించారు. తండ్రి నాగయ్య. యం.ఏ.బి యిడి. 1936–37 లో ఆంధ్రరాష్ట్ర వెనుకబడిన జాతుల సంఘ కార్యదర్శిగా పనిచేశారు. 1937 లో మద్రాసు శాసన సభ్యుడు. 1937-39 లోను, 1946-47 లోను రాష్ట్ర పరిశ్రమల కార్మిక శాఖామంత్రి. దేశరక్షణ చట్టం కింద అరెస్టు చేయబడి, 1940 డిసెంబరు 15 న చి 9 నెలల శిక్షను వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో ఒక సంవత్సరం శిక్ష రు. 100 జరిమానా విధింపబడింది. జరిమానా చెల్లించారు. ఆలీపూర్ క్యాంప్ జైలులో శిక్ష అనుభవించారు.

1940 నుంచి 1949 వరకు ఆంధ్ర రాష్ట్ర హరిజన సేవక సంఘ అధ్యక్షుడు. 1952 నుంచి 1972 వరకు లోకసభ సభ్యుడు. కేంద్ర డెప్యూటీ మంత్రిగాను, స్టేట్ మంత్రిగాను కూడా పనిచేశారు.

## పాలకోడేటి సూర్యప్రకాశరావు

1893 లో భీమవరం తాలూకా గరగపర్రులో జన్మించారు. తండ్రి పెద రాజప్ప. 1910 నుంచీ రాజమండ్రిలో నివాసం. బి ఏ. చదివారు. జర్నలిస్టు. ఆంధ్ర జర్నలిస్టు సంఘానికి ప్రధాన కార్యదర్శిగా వున్నారు. రాజమండ్రి పురపాలక సంఘ సభ్యుడు. హిందూపత్రిక విలేకరిగా 1922 నుంచి 1956 వరకూ పనిచేశారు. 1923 లో నాగపూర్ జండా సత్యాగ్రహ సందర్భంలో 7 మాసాల జైలుశిక్ష అనుభవించారు. 1930 ఉప్పుసత్యాగ్రహంలో రెండున్నర సంవత్సరాల కఠినశిక్ష విధింపబడి రాజమండ్రి, కన్ననూరు, వెల్లూరు జైళ్ళలో నిర్బంధింపబడ్డారు. గాంధీ-

ఇర్విన్ ఒడంబడికతో 1931 ఫిబ్రవరిలో విడుదలయ్యారు. 1932 రో గుంటూరులో నిషేధింప బడిన ఆంధ్రరాష్ట్ర సభను ఆవిష్కరించినందుకు 7½ మాసాల శిక్ష విధింపబడి, రాజమండ్రి, కడలూరు జైళ్ళలో నిర్బంధింపబడ్డారు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో 3 మాసాల కఠిన శిక్షను, రాజమండ్రి సెంట్రల్ జైలులో అనుభవించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో తీవ్రమైన లాఠీచార్జికి గురయ్యారు. ఒక సంవత్సరం కఠినశిక్ష విధించి రాజమండ్రి ఆలిపురం జైళ్ళలో నిర్బంధించారు. అనారోగ్య కారణాలవల్ల 1943 మేలో విడుద లయ్యారు. "ప్రేమ జ్యోతి" వారపత్రికకు గౌరవ సంపాదకులు. 1976 జూన్ 6 న కీర్తి శేష లయ్యారు.

## మొసలికంటి తిరుమలరావు

1901 లో పిఠాపురంలో జన్మించారు. తండ్రి జాయన్న పంతులు. 1921 లో కాలేజీ చదువు మాని వేసి, సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. 1930 ఉప్పుసత్యాగ్రహ ఉద్యమంలో ఒకసం॥ కఠినశిక్ష రాజమండ్రి, మద్రాసు, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు 1931 శాసనోల్లంఘన సందర్భంలో 6 నెలల శిక్షను రాజమండ్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు. 1940 వ్యక్తి సత్యాగ్రహంలో 18 మాసాల శిక్షను రు. 200 జరిమానా విధించారు. శిక్షను వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు 1942 లో 2½ సంవత్సరాలు డిటెన్యూగా వెల్లూరు, దామో, జైళ్ళలో వున్నారు. 1926 నుంచి ఎ.ఐ.సి.సి సభ్యుడుగా వున్నారు. రెండుసార్లు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులుగా వున్నారు. 1937 నుంచి 1940 వరకు కేం అసెంబ్లీ సభ్యులు. 1945 నుంచి 1947 వర స్టేట్ కౌన్సిల్ సభ్యుడు. 1948–50 లో రాజ్యాంగ పరిషత్ సభ్యుడు. 1950 – 52 లో తాత్కాలిక పార్లమెంటు సభ్యుడు. 1957, 1962, 1957 లలో లోక్‌సభకు ఎన్నికయ్యారు. వ్యవసాయ ఆహారశాఖ డిప్యూటీ మంత్రిగా పనిచేశారు. వింధ్య ప్రదేశ్ లెఫ్‌నెంట్ గవర్నరుగా వున్నారు. 1970లో కీర్తిశేషులయ్యారు.

## కాండ్రు వీరన్న

రాజమండ్రి తాలూకా చినకొండేపూడి వాస్తవ్యులు. సహాయ నిరాకరణ ఉద్యమంలో గ్రామ మునిసిఫ్‌లను రాజీనామా చేయమని ప్రచారం చేసినందుకు 6 మాసాల కఠినశిక్ష 1922 లో విధించబడింది. రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్ష అనుభవించారు; 1962 లోను, 1967 లోను శాసనసభ్యుడుగా ఎన్నుకోబడ్డారు. రాజమండ్రి కోపరేటివ్ సెంట్రల్ బ్యాంకు అధ్యక్షుడు.

## ధరణిప్రగడ శేషగిరిరావు

1901 లో రాజమండ్రిలో జన్మించారు. తండ్రి సూరయ్య. సీతానగరం ఆశ్రమ స్థాపకులలో ఒకరు. 1921 లో కాలేజీ చదువు మానివేశారు. 1927-28 లో మద్రాసులో సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 6 మాసాల కఠినశిక్షను మద్రాసు, మదురై జైళ్ళలో అనుభవించారు. 1950 జనవరి 6 న కీర్తి శేష లయ్యారు.

# పశ్చిమ గోదావరి జిల్లా

## తల్లాప్రగడ ప్రకాశరాయుడు

తాడేపల్లి గూడెం తాలూకా ఉంగుటూరులో 1893 ఏప్రిల్ 15 న జన్మించారు. తండ్రి లక్ష్మయ్య. కలకత్తా యూనివర్శిటీలో 1920 ఎం. ఏ. లో డిగ్రీ తీసుకొన్నారు. 'ధర్మజ్యోతి' మాసపత్రిక గౌరవ సంపాదకులు. 1921–23 లో రాజమండ్రి జాతీయ పాఠశాలలో ఉపాధ్యాయులు. 1928-30 లో చాగల్లు ఆశ్రమ సభ్యులు. హరిజన, సాంఘిక సంస్కరణ ఉద్యమాల్లో పాల్గొన్నారు. గాంధీ నిర్మాణ కార్యక్రమానికి అంకితమయ్యారు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో ఒక సంవత్సరం కఠిన శిక్ష విధింపబడింది. రాజమండ్రి, వెల్లూరు, అలీపురం, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ–ఇర్విన్ ఒడంబడికను అనుసరించి 25–3–1931–న విడుదలయ్యారు. శాసనోల్లంఘన ఉద్యమంలో తీవ్రంగా లాఠీచార్జికి గురయ్యారు. 1932 లో రెండేళ్ళు కఠిన శిక్ష విధింపబడింది. రాజమండ్రి, కోయంబత్తూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1942 క్విట్ ఇండియా

ఉద్యమంలో ఒక నెల సబ్‌జైలులో వుంచి వదలివేశారు. 1949-50 లో గోపన్నపాలెం గ్రామసేవిక విద్యాలయం ప్రిన్సిపాల్‌గా, ఖాదీగ్రామోద్యోగ కమిషన్ తరపున మూడేళ్ళకు పైగా చంపుడుబియ్యం పరిశ్రమ రాష్ట్ర పర్యవేక్షకునిగా పనిచేశారు. 1955-65 ల మధ్య ఖాదీ, గ్రామదాన్, శాంతిసేన ఉద్యమాల్లో పని చేశారు.

## దండు నారాయణరాజు

1889 అక్టోబరు 15 న జన్మించారు. భీమవరం తాలూకా నేలపోగులు వాస్తవ్యులు. తండ్రి భగవాన్‌రాజు, బి. ఏ. బి. యల్. న్యాయవాద వృత్తిని 1920 సహాయ నిరాకరణోద్యమంలో వదలివేశారు. స్వాతంత్ర్య ఉద్యమంలో "సర్దార్" బిరుదు పొందారు. తిలక్ స్వరాజ్యనిధికి డబ్బు సమకూర్చారు. 1921-24 లో జిల్లా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి. 1925, 1926, 1931, 1934, 1935 లలో జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు, 1921 నుంచి మరణించేవరకు ఎ. ఐ. సి. సి. సభ్యులు, తణుకు, భీమవరంలలో జాతీయ పాఠశాలలను నిర్వహించారు. ఏలూరులోని గాంధీ జాతీయ పాఠశాలకు ఉపాధ్యక్షుడు, జిల్లా ఖాదీబోర్డుకు 1923 లో కార్యదర్శి, 1924-25 లలో దానికి అధ్యక్షులు. భీమవరం రుణ నివారణ పరిష్కారబోర్డు సభ్యులు. జిల్లా కోపరేటివ్ సెంట్రల్ బ్యాంకు (ఏలూరు) కార్యదర్శి 1923-27 లలో జిల్లా రైతుసంఘ కార్యదర్శి 1928-29 జిల్లా రైతు సంఘ అధ్యక్షులు. 1926-29 లోను, 1937 లోను ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభ సభ్యులు, నాల్గేళ్ళు జిల్లా బోర్డుకు అధ్యక్షులుగా పని చేశారు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమాన్ని నడిపారు. 23-4-1930 న ఒక సంవత్సరం కఠినశిక్ష విధింపబడింది. వెల్లూరు, తిరుచినాపల్లి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ఫలితంగా విడుదలయ్యారు. 15 రూ॥ జరిమానా వసూలు చేయబడింది. 8-1-1932 నుంచి ఏడునెలల కఠినశిక్ష రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. తిరిగి 24-1-1933 న ఆరు నెలల కఠినశిక్ష రు. 200 జరిమానా విధించబడింది. 1-8-1933 వరకు వెల్లూరు సెంట్రల్‌జైలులో నిర్బంధింపబడి వున్నారు. 14-2-40 న ఆరునెలల కఠినశిక్ష రు. 200 జరిమానాను, వ్యక్తి సత్యాగ్రహ ఉద్యమకాలంలో పొందారు. వెల్లూరు, తిరుచినాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు. నర్సాపురంలో 6-8-1941 న సత్యాగ్రహం చేశారు. సంవత్సరం కఠినశిక్ష రు. 500 జరిమానా 15-8,1941 న విధించారు అలీపురం క్యాంపు జైలులో ఉంచారు. 13-12-41 న విడుదలయ్యారు, క్విట్ ఇండియా ఉద్యమకాలంలో భారత రక్షణ చట్టం క్రింద డిటెన్ చేయబడి వెల్లూరు, తంజావూర్ జైళ్ళలో 12-8-42 నుంచి 10-9-44 వరకు ఉన్నారు. 10-9-1944 న గుండెజబ్బుతో తంజావూర్ జైలులో చనిపోయారు.

## కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తి

ఏలూరు తాలూకా పోతునూరులో 1901 లో జన్మించారు. తండ్రి రామయ్య, వ్యవసాయ దారులు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నాడు. 7-6-1930 న సంవత్సరం కఠినశిక్ష విధింపబడింది. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక అనుసరించి 14-3-1931 న విడుదలయ్యారు. తిరిగి 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నారు. ఆరునెలల కఠినశిక్ష అనుభవించారు. జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు. 1936లో రాష్ట్ర రైతు సంఘానికి ప్రధాన కార్యదర్శి. కొంత కాలం రాష్ట్ర రైతుసంఘ అధ్యక్షులు. రైతుల ఇబ్బందులను ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చేందుకు జరిగిన కాలినడక యాత్రలో ఇచ్ఛాపురం నుంచి మద్రాసు వరకు రైతు రక్షణ యాత్రకు నాయకత్వం వహించారు. 1940 లో చనిపోయారు. జిల్లా కాంగ్రెసు కమిటీ భవనం, ఆయన పేరుతో నిర్మించబడింది.

## మాగంటి బాపినీడు

ఏలూరు తాలూకా చాటపర్రులో 1895 లో జన్మించారు. తండ్రి రామినీడు. కలకత్తాలో చదివారు. బి. ఎస్. సి. (అగ్రికల్చర్) కార్నెల్‌లోను, యం. ఎస్. సి (అగ్రికల్చర్) కాలిఫోర్నియాలోను చదివారు. కలకత్తా యూనివర్శిటీ భారత రక్షణ సైన్యంలో దక్షిణ భారత దేశంనుంచి వచ్చిన మొట్టమొదటి సైనికుడు. అమెరికా నుంచి తిరిగివచ్చి, కాంగ్రెస్ పార్టీలో వివిధ ఉద్యమాలలో పాల్గొన్నారు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో 14-5-1930 న

ఒక సంవత్సరం కఠినశిక్ష పొందారు. రాజమండ్రి, తిరుచినాపల్లి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. గాంధీ–ఇర్విన్ ఒడంబడిక ననుసరించి 14–3–1931 న విడుదలయ్యారు. తిరిగి 17–11–31 నుంచి 6 నెలల శిక్ష రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహంలో 2–12–1940 న సంవత్సరం కఠినశిక్ష రు. 100 జరిమానా విధించబడింది. వెల్లూరు, తిరుచినాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు. 10–8–1942 నుంచి వెల్లూరు, అమరావతి జైళ్ళలో సుమారు మూడేళ్ళు డిటెన్ చేయబడ్డారు. ఆంధ్ర యూనివర్శిటీ సెనేట్, సిండికేట్, అకడమిక్ కౌన్సిల్ సభ్యులు. ఆంధ్ర, మద్రాసు, యూనివర్సిటీలలో బోర్డ్ ఆఫ్ స్టడీస్‌కు ఛైర్మన్. జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ, ఎ. ఐ. సి. సి. సభ్యులు. హరిజన సేవక్ సంఘ్‌లో కొన్నాళ్ళు కార్యదర్శిగాను మరి కొన్నాళ్ళు అధ్యక్షులుగాను పని చేశారు. హరిజనోద్ధరణ, గ్రామీణ పునర్నిర్మాణం, సహకారోద్యమాలలో పనిచేశారు. 1951 లో ఆంధ్ర లోని మొట్ట మొదటి సార్వత్రిక ఎన్నికల్లో ప్రచార ఉద్యోగిగా పనిచేశారు. దక్షిణప్రాంత భారత్ సేవక్ సమాజ్‌కు నిర్మాణ కార్యదర్శి. "తెలుగుభాషా సమితి" సంస్థాపక సభ్యులు. 1942 లో "ఆంధ్ర సర్వస్వం" సంకలన కర్త. ఏ పంగా ఆంధ్రదేశం గురించిన సమగ్ర సమాచారాన్ని అందచేసింది ఈ గ్రంథం. అనేక గ్రంథాలను రాశారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభకు రెండు టరములలో శాసన సభ్యుడు. 1937 లో సమాచార మంత్రిత్వ శాఖకు పార్లమెంటరీ కార్యదర్శి. 1947 లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఛత్ర చీఫ్ విప్. అనేక దేశాలు పర్యటించారు. 969 జూలై 23 న కీర్తి శేషులయ్యారు.

## మాగంటి అన్నపూర్ణాదేవి

ఏలూరు తాలూకా చాటపర్రు వాస్తవ్యురాలు. తండ్రి కలగర రామస్వామిగారు. భర్త బాపినీడు. కలకత్తాలో చదువుకున్నారు. ఉన్నత విద్యకై అమెరికాకు వెళ్ళబోతున్న సమయంలో గాంధీజీ స్వాతంత్ర్య సమర శంఖారావం విని, విదేశాలలో చదువు కోవాలనే అభిప్రాయాన్ని వదులుకొని జాతీయ ఉద్యమంలో పాల్గొన్నారు. విలువైన తన విదేశీ వస్త్రాలను తగలబెట్టారు. కల్లు దుకాణాల వద్ద పికెటింగ్ చేశారు. 1921 లో గాంధీజీ ఆంధ్ర దేశంలో పర్యటించినపుడు, తన బంగారు నగలన్నిటినీ గాంధీజీకి సమర్పించారు. "నాకు జ్ఞాపకం వున్నంత వరకు తన ఆభరణాలన్నిటినీ నాకు ఇచ్చిన ప్రప్రథమ మహిళ ఈమెయే" అని గాంధీజీ ప్రశంసించాడు. ఆమె చిన్నతనంలోనే చనిపోయినపుడు గాంధీజీ ఇలా అన్నాడు. "భారతదేశంలో కల్లా నా అదృష్టవశాత్తు నాకు వున్న చాలామంది పుత్రికలలో ఒక పుత్రిక పోయింది. వారిలో ఈమె అత్యుత్తమురాలు"

## కొమ్మారెడ్డి సూర్యనారాయణ

1907 లో ఏలూరుతాలూకా పోతునూరులో జన్మించారు. తండ్రి బ్రహ్మయ్య, రైతు. ఉప్పుసత్యాగ్రహ ఉద్యమంలో 9 నెలల శిక్షను రాజమండ్రి కన్ననూరు, కడలూరు జైళ్ళలో అనుభవించారు. శాసనోల్లంఘన ఉద్యమంలో ఒక సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు. 1942 నవంబరు నుంచి 1944 ఏప్రిల్ వరకు క్విట్ ఇండియా ఉద్యమంలో వెల్లూరు, తంజావూరు, జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. జిల్లా కాంగ్రెసు సంఘ సంయుక్త కార్యదర్శిగాను, 1946 – 47 లో అధ్యక్షునిగానూ పని చేశారు. 1948 – 52 జిల్లా బో సభ్యుడు, ఎ. పి. సి. సి. సభ్యుడు. భీమవరం పంచదార ఫ్యాక్టరీ స్థాపక అధ్యక్షులు, 1952 – 58 వరకు రాజ్య సభ సభ్యులు, 1967, 1971, 1977 సంవత్సరాలలో లోక్‌సభకు ఎన్నుకోబడ్డారు. 1970లో పార్లమెంట్ సౌహార్ద సంఘ సభ్యుడుగా ఆఫ్ఘనిస్థాన్, ఇరాన్, టర్కీ, కువాయత్‌లలో పర్యటించారు. 1978 లో కొంతకాలం ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సంఘ ఉపాధ్యక్షుడుగా వున్నారు. ఇంకా అనేక సంస్థలకు కార్యదర్శిగానూ, అధ్యక్షుడుగాను, డైరక్టరుగానూ వున్నారు.

## కలిదిండి బంగారు రాజు

1902 లో నరసాపురం తాలూకా వెంపాలో జన్మించారు. నరసాపురం వాస్తవ్యులు, తండ్రి సూరపరాజు, రైతు, 1930 ఉప్పు సత్యాగ్రహంచేసి 9 నెలల శిక్ష రాజమండ్రి, కోయంబతూరు, ఆలిపురం, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్య

మంలో 4 నెలల కఠినశిక్షను రాజమండ్రి సెంట్రల్ జైలుల్లో అనుభవించారు. అదే ఉద్యమంలో మరల పాల్గొన్నందున 6 నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలో అనుభవించారు. గుంటూరు జిల్లా కొత్తపట్నం రాజకీయ పాఠశాలకు హాజరై తీవ్రమైన లాఠీచార్జికి గురయ్యారు. రాజమండ్రి సెంట్రల్ జైలులో 1937 జూన్ నుండి ఆగస్టు వరకూ నిర్బంధింపబడ్డారు. 1940 నుండి 1942 వరకు యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసినందుకు వెల్లూరు జైలులో డిటెన్యూగా వున్నారు.

## అడివి బాపిరాజు

1895 లో భీమవరంలో జన్మించారు. తండ్రి కృష్ణయ్య. లాయరు. ప్రసిద్ధ కవి, నవలా రచయిత, చిత్రకారుడు, జాతీయవాది. 1922 లో సహాయ నిరాకరణ ఉద్యమంలో సంవత్సరం కఠినశిక్షను రాజమండ్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు. 1934 నుండి 1937 వరకు బందరు జాతీయ కళాశాలకు ప్రిన్సిపాల్‌గా పని చేశారు. 1944 నుండి 1946 వరకు హైదరాబాద్‌లోని "మీజాన్" తెలుగు దిన పత్రిక సంపాదకులుగా పని చేశారు. ఈయన జమీందారీ పద్ధతి నిర్మూలన లక్ష్యంతో "నారాయణరావు" అనే గొప్ప నవల రాశారు. హిమబిందు, తుఫాన్, గోనగన్నారెడ్డి మున్నగునవి – వీరి ఇతర నవలలు, శైలబాల; శశికళ, మృత్యుంజయుడు - వీరి ఇతర ముఖ్య రచనలు. నవ్య సాహిత్య పరిషత్ వీరికి "కులపతి" బిరుదు ఇచ్చింది. 1952 లో కీర్తి శేషులయ్యారు

## శీర్ల బ్రహ్మయ్య

1913 లో ఏలూరులో జన్మించారు. తండ్రి శేషయ్య. వీరు బి.ఏ. చదివారు. హిందీలో సాహిత్య అలంకార పరీక్ష ప్యాసయ్యారు. వాణిజ్యవేత్త. 1930–32 లో శాసనోల్లంఘన ఉద్యమంలో కాంగ్రెస్ వాలంటీరు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో 6 నెలల కఠిన శిక్షను వెల్లూరు, ఆలీపురం జైళ్ళలో అనుభవించారు. 1942 ఉద్యమంలో 3 నెలల శిక్షను ఆలీపురం జైలులో అనుభవించారు. 1943 నుండి 1945 వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా వున్నారు. పట్టణ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు, జిల్లాకాంగ్రెస్ కమిటీ ఉపాధ్యక్షుడు, రాష్ట్రకాంగ్రెస్ సంఘ సభ్యుడుగా వున్నారు. 5 ఏళ్ళపాటు ఏలూరు మున్సిపల్ చైర్మన్. ఏలూరులో హిందీ బాలమిత్రమండలి నడిపారు. యువజనాభ్యుదయ మండలి, కళాసమితి స్థాపకులు. హిందీ ప్రేమీమండలి అధ్యక్షుడు, మద్రాస్, హైదరాబాద్, దక్షిణ భారత హిందీ ప్రచారసభకు కొన్నేళ్ళపాటు కార్యనిర్వాహకసంఘ సభ్యులు. ఏలూరు సి. ఆర్. రెడ్డి కళాశాలకు 13 ఏళ్ళపాటు కార్యనిర్వాహక సం సభ్యులు. రెండు దఫాలు ఆంధ్ర యూనివర్శిటీ సెనెట్ సభ్యుడు.

## మంగళంపల్లి చంద్రశేఖర్

1910 లో ఏలూరు తాలూకా గుండుగొలనులో జన్మించారు. తండ్రి వెంకట సుబ్బయ్య. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 9 నెలల పాటు కఠిన శిక్షను రాజమండ్రి, కన్ననూరు, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో ఒక సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, బళ్ళారి, మధురై, కడలూరు జైళ్ళలో అనుభవించారు. 1937 లో హరిజన సేవక సంఘంలోచేరి, మేనేజరుగా పనిచేశారు. 1942 లో ఏలూరు డివిజన్ మోటారువర్కర్స్ యూనియన్ నిర్మాత. హరిజన బాలికల హాస్టల్ ప్రారంభించి, 12 ఏళ్ళు నడిపారు. శాసనోల్లంఘన ఉద్యమకాలంలో 'వీరకేసరి' అనే సైక్లోస్టైల్ దినపత్రిక నడిపారు. అనేక ప్రముఖ పత్రికలకు కరస్పాండెంటుగా వున్నారు. ఆంధ్ర ప్రదేశ్ స్వాతంత్ర్య సమరయోధుల పెన్షన్‌స్కీము సలహా సంఘ సభ్యులు. జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘాధ్యక్షులుగా వున్నారు.

## మూల్పూరి చుక్కమ్మ

1900 లో జన్మించారు. ఏలూరు తాలూకా పెదపాడు వాస్తవ్యులు. తండ్రి కట్నేని రంగయ్య. భర్త రంగయ్య. శాసనోల్లంఘన ఉద్యమంలో ఒకసారి 2 నెలలు, మరోసారి 6 నెలలు శిక్షలు వెల్లూరు జైలులో అనుభవించారు. 1933 లో 6 నెలలు 1941 వ్యక్తి సత్యాగ్రహంలో 3 నెలలు శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. ఏలూరు పట్టణ కాంగ్రెస్ సంఘ సభ్యురాలు, రాష్ట్ర కాంగ్రెస్,

జిల్లా కాంగ్రెస్ సంఘాల సభ్యురాలుగా వున్నారు. రాష్ట్ర ఖాదీబోర్డు, జి పరిషత్ సభ్యురాలు. జిల్లా మహిళామండలి అధ్యక్షులు. సంఘ సంస్కర్త. హరిజనోద్ధరణకు పాటుపడ్డారు. 1967 లో కీర్తి శేషులు.

## వడ్లపట్ల గంగరాజు

1904 లో ఏలూరు తాలూకా కొవ్వలిలో జననం. తండ్రి రెడ్డయ్య, రైతు. సహాయ నిరాకరణ ఉద్యమంలో చదువు మానివేశారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో ఒక సంవత్సరం శిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. కల్లు దుకాణాలు, విదేశ వస్త్ర దుకాణాలవద్ద పికెటింగ్ చేశారు. 7 మాసాల జైలు శిక్షను రాజమండ్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో 4 నెలల శిక్షను ఆలీపురం జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 నుండి 1944 వరకు వెల్లూరు తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా వున్నారు. 1937 లో మద్రాస్ రాష్ట్ర శాసనమండలి సభ్యులు. 1956 లో కీర్తి శేషులు.

## కొవ్వలి గోపాలరావు

1896 లో తణుకులో జననం. తండ్రి గున్నయ్య 1919 వరకు కోపరేటివ్ సూపర్‌వైజరుగా పని చేశారు. సహాయనిరాకరణోద్యమంలో ఒకసంవత్సరం శిక్షను రాజమండ్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు. ఉప్పు సత్యాగ్రహంలో పది నెలలు శిక్షను రాజమండ్రి అలీపురం,బళ్లారి జైళ్ళలో అనుభవించారు. శాసనోల్లంఘన ఉద్యమంలో 7 మాసాల శిక్షను రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహంలో 6 మాసాల శిక్షను, క్విట్ ఇండియా ఉద్యమంలో 2 మాసాల శిక్షను ఆలీపురం జైలులో అనుభవించారు. 1943 లో 9 మాసాల శిక్షను ఆలీపూర్ జైలులో అనుభవించి విడుదలయ్యాక 1944 వరకూ తంజావూరు జైలులో డిటెన్యూగానిర్బంధింపబడ్డారు. కొన్నేళ్ళపాటు తణుకు పట్టణ, తాలూకా కాంగ్రెస్ సంఘాలకు అధ్యక్షులు. రాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యనిర్వాహక సభ్యుడు. ఖద్దరు హరిజన సేవ మున్నగు కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఇంగ్లీషులో "కృష్ణుని జీవితం, తెలుగులో "కర్మయోగం" పుస్తకాలు రాశారు. 1958 లో కీర్తిశేషులు.

## అత్మకూరి గోవిందచార్యులు

1895 లో తాడేపల్లిగూడెం తాలూకా గోపవరంలో జన్మించారు. తండ్రి వెంకటకృష్ణమాచారి. జర్నలిస్టు. ప్రముఖ రచయిత. మాతృభూమి సేవకై తన సంపదా, ఆరోగ్యమూ అర్పించిన త్యాగమూర్తి. ఉన్నత విద్యకై అమెరికా వెళ్లాలనుకుని, గాంధీజీ శంఖారావంతో జాతీయ పోరాటంలో పాల్గొన్నారు. ఒక హరిజన బాలుని తన యింటిలో పెట్టుకున్నందుకు, వీరి భార్య ఒప్పుకోనందున, ఆమెకు విడాకులిచ్చారు. 1921 లో ఏలూరులో గాంధీ నేషనల్ కాలేజీ స్థాపించారు. పన్నుల నిరాకరణ ఉద్యమంలో సంవత్సరం కఠిన శిక్ష రాజమండ్రి జైలులో అనుభవించారు. ఏలూరులో ఖాదీ ఉత్పత్తి కేంద్రం ప్రారంభించారు. సైమన్ కమిషన్ బహిష్కరణ ఉద్యమాన్ని నడిపారు. "సత్యాగ్రహి" అనే తెలుగు వారపత్రిక నడిపారు. పత్రికను నిషేధించి ప్రెస్‌ను స్వాధీనపర్చుకుంది ప్రభుత్వం. ఉప్పు సత్యాగ్రహంలో 6 నెలల కఠిన శిక్షను తిరుచునాపల్లి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 2 నెలల కఠిన శిక్ష రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహంలో 9 నెలల శిక్షను వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. అనేక ఏళ్ళపాటు ఎ.పి.సి.సి., ఎ.ఐ.సి.సి. సభ్యులు. 1942 నుండి 1952 వరకు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులు. ఆంధ్ర యూనివర్శిటీ సెనేట్ సభ్యుడు. అనేక రాజకీయ, అర్థశాస్త్ర గ్రంథాలు, గాంధీ జీవితం, గోవింద రామాయణం రచించారు. కళాప్రపూర్ణ బిరుదును, ఆంధ్ర యూనివర్శిటీ యిచ్చింది. 1973లో కీర్తిశేషులు.

## ముదిగంటి జగ్గన్న శాస్త్రి

1895 లో తూర్పుగోదావరి జిల్లా ఏనుగుల మహల్‌లో జన్మించారు. తండ్రి వెంకయ్య. 1920 నుండి తణుకులో నివాసం. జర్నలిస్టు, రచయిత. 1921 లో బి.ఏ. పరీక్షకు వెళ్ళలేదు. తణుకులో ఖాదీ ఉత్పత్తి కేంద్రం, ఒక జాతీయ పాఠశాల నడిపారు.

తర్వాత గుజరాత్ విద్యా పీఠంనుంచి డిగ్రీ పొందారు. "వల్లెటూరు" అనే తెలుగు వారపత్రికను 1923 లో సామాన్యులకు గాంధీ సందేశం అందించడానికి నడిపారు.

1930 ఉప్పు సత్యాగ్రహంలో 9 నెలలు కఠిన శిక్ష, రాజమండ్రి, కన్ననూరు, కడలూరు జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 7 నెలల కఠిన శిక్షను రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు. 1933 లో రాజద్రోహ సంబంధమైన సాహిత్యం ప్రచురించారని, వీరి పుస్తకాలు స్వాధీన పర్చుకున్నారు. "గాంధీ నీతి మంజరి" రచించినందుకు ఒక నెల శిక్ష విధించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో ఒక సంవత్సరం శిక్ష అలీపూర్ జైలులో అనుభవించారు. 1943 నుండి 1945 వరకూ వెల్లూరు, తంజావూర్ జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధించబడ్డారు.

చాలా కాలం తణుకు తాలూకా కాంగ్రెస్ సంఘాధ్యక్షులు. 1936–37 లో పశ్చిమగోదావరి జిల్లా కాంగ్రెస్ సంఘ కార్యదర్శి దాదాపు 20 గ్రంథాలు రచించారు. స్వాతంత్ర్య సమరయోధుల చరిత్ర రచన స్టేట్ కమిటీ సభ్యులుగా వున్నారు. 1981 లో కీర్తిశేషులు.

### కాశీపట్నం కొండయ్య

1900 లో తణుకు తాలూకా ఈదూరులో జన్మించారు. తండ్రి రథాంగ పాణి. కాశీ హిందూ యూనివర్శిటీ నుంచి యం.యస్ సి. డిగ్రీ పొందారు. చాలా కాలం కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో కెమిస్ట్రీ లెక్చరర్‌గా పనిచేశారు. 1930–32 లో "వీర భారతి" అనే రహస్య పత్రికను శాసనోల్లంఘన ఉద్యమ ప్రచారానికై నడిపారు. భీమవరం కలెక్టర్ ఆఫీసుపై కాంగ్రెస్ జెండా కట్టిన సందర్భంలో 1932 లో ఒక సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, బళ్ళారి, మధురై, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. "విజ్ఞానం" అనే మాసపత్రిక నడిపారు. విశ్వరూపం, ఆఫ్రికా పంపకం, మహమ్మదీయ రాజ్యాలలో జాతీయ వికాసం–గ్రంథాలు రచించారు. ఖగోళ శాస్త్రానికి సంబంధించిన "విశ్వ రూపం" తెలుగు వాడుకభాషలో రచించిన తొలి వైజ్ఞానిక గ్రంథం అనవచ్చును. విడదవోలులో "కె కల్స్ లిమిటెడ్" అనే రసాయనిక ద్రవాల తయారీ సంస్థను స్థాపించారు. ప్రసిద్ధ శాస్త్రవేత్తగా పేరు పొందారు. 1966 లో కీర్తిశేషులయ్యారు.

### వడ్డపట్ల మాణిక్యాలరావు

1905 లో జన్మించారు. కొవ్వలి గ్రామ నివాసం. తండ్రి రామయ్య రైతు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 10 నెలల కఠిన శిక్ష రాజమండ్రి, కన్ననూరు, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1933 లో శాసనోల్లంఘన ఉద్యమంలో ఒక వారం రోజులు సబ్ జైలులో వుంచి తీవ్రమైన లాఠీఛార్జీ చేశారు. వ్యక్తి సత్యాగ్రహంలో 6 నెలల కఠిన శిక్షను వెల్లూరు, అలీపురం క్యాంపు జైళ్ళలో అనుభవించారు. మరల అదే వుద్యమంలో 3 నెలలు కఠిన శిక్షను అలీపురం క్యాంపు జైలులో అనుభవించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో సంవత్సరం కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు. ఆ శిక్ష పూర్తయ్యాక 1943 వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. 1934–38 లో జిల్లా కాంగ్రెసు సంఘ కార్యవర్గ సభ్యులు. 1936–38 వరకూ తాలూకా కమిటీ కార్యదర్శి. 1940–42 వరకు అధ్యక్షులు

### కలిదిండి పెద్ద సుబ్బరాజు

### (కె. పి. యస్. రాజు)

1916లో భీమవరం తాలూకా ఈలురుపాడులోజన్మించారు. తణుకు తాలూకా పోలమూరు వాస్తవ్యులు. తండ్రి వెంకట రామరాజు. ఉప్పు సత్యాగ్రహంలో 1930 లో 9 నెలల కఠిన శిక్ష రాజమండ్రి, కోయంబత్తూరు జైళ్ళలో అనుభవించారు. శాసనోల్లంఘన ఉద్యమంలో 1932 లో ఒక సంవత్సరం 6 నెలల కఠిన శిక్షను తిరుచునాపల్లి జైలులో అనుభవించారు. ఒక బాంబు కేసు సందర్భంలో 1934 లో మద్రాసు జైలులో నిర్బంధించారు. 1937 లో 144 సెక్షన్ ధిక్కరించినందుకు 6 నెలల శిక్ష విధించబడింది. కాని 4 రోజుల తర్వాత కాంగ్రెస్ ప్రభుత్వం విడుదల చేసింది. వ్యక్తి సత్యాగ్రహంలో 6 నెలల కఠిన శిక్షను అలీపూర్ క్యాంపు జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో సంవత్సరంన్నర, తంజావూరు, తిరుచునాపల్లి, వెల్లూరు జైళ్ళలో

డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. 1932-47 వరకూ జిల్లా కాంగ్రెసు సంఘ సభ్యుడు. 1937-50 వరకూ రాష్ట్ర కాంగ్రెసు సంఘ సభ్యుడు. 1937-44 వరకూ ఎ.ఐ.సి.సి సభ్యుడుగా వున్నారు. పశ్చిమ గోదావరి జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘాధ్యక్షులు.

## గొట్టి ముక్కల రామచంద్రరాజు

1914 లో భీమవరం తాలూకా చినమిరం గ్రామంలో జన్మించారు. తండ్రి వెంకట నరసింహ రాజు. రైతు. 1930 ఉప్పుసత్యాగ్రహంలో వాలంటీరుగా పనిచేశారు. భీమవరం, నరసాపురంలలో రెండుసార్లు అరెస్టుచేసి, సబ్ జైలులో వుంచి, మైనర్ అయినందున విడిచి పెట్టారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో కొద్దికాలం నిర్బంధించబడ్డారు. వ్యక్తి సత్యాగ్రహంలో 4 నెలలు కఠిన శిక్ష ఆలీపురం జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంలో ఊరేగింపు జరుపుతుండగా, జనం భీమవరం రైలు స్టేషను, ప్రభుత్వ ఆఫీసు తగల బెట్టారు. పోలీసులు కాల్పులు జరపగా వీరి తమ్ముడు బలరామరాజు చనిపోయాడు. వీరికి 4 ఏళ్ళ కఠినశిక్ష విధించారు. ఆలీపూర్, మద్రాసు జైళ్ళలో శిక్ష అనుభవించారు. భీమవరం తాలూకా కాంగ్రెస్ సంఘ కార్యదర్శిగాను, సంయుక్త కార్యదర్శిగాను పనిచేశారు. 1938-40 వరకు పి. సి. సి. సభ్యుడు. 1946-52 లో పి. సి. సి. వర్కింగ్ కమిటీ సభ్యుడుగాను, కొంతకాలం ప్రధాన కార్యదర్శిగాను, ఆంధ్రప్రదేశ్ శాసన సభ్యుడుగా 1978 లో ఎన్నుకోబడ్డారు.

## ములుప్పూరి రంగయ్య

1897 లో ఏలూరు తాలూకా పెదపాడులో జన్మించారు. తండ్రి వెంకటాద్రి. ఎల్. యమ్. ఎస్. డాక్టరు. వైద్యవృత్తి మానివేసి, ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా 9 నెలల శిక్షను వెల్లూరు, రాజమండ్రి జైళ్ళలో అనుభవించారు. శాసనోల్లంఘన ఉద్యమంలో 1932 లో 7 నెలల కఠిన శిక్షను కడలూరు, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహంలో 9 నెలల కఠిన శిక్షను వెల్లూరు, తిరుచనాపల్లి జైళ్ళలో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942-44 వరకు వెల్లూరు, తంజావూరు, మద్రాసు జైళ్ళలో డిటెన్యూగా వున్నారు. సంఘ సంస్కరణ, హరిజనోద్ధరణకు కృషి చేశారు. 2 ఏళ్ళు ఏలూరు పట్టణ కాంగ్రెస్ సంఘ అధ్యక్షుడు. 1930-62 వరకు రాష్ట్ర కాంగ్రెస్ సంఘ సభ్యుడు. 1935-62 వరకు ఎ. ఐ. సి. సి సభ్యుడు. 1935, 1951 లో జిల్లా కాం. .స్ సంఘాధ్యక్షుడు. 1938-42 వరకూ జిల్లా బో అధ్యక్షుడు. 1955-62 వరకు శాసన సభ్యుడు, ంధ్ర యూనివర్శిటీ సెనేట్ సభ్యుడు. గాంధీ స్మారకట్రస్టు బోర్డు జీవిత సభ్యులుగా వున్నారు. 1963 లో కీర్తిశేషులు.

## ఆచంట రుక్మిణీ లక్ష్మీపతి

1891 లో జన్మించారు. పశ్చిమ గోదావరి జి వా సవ్వురాలు. తండ్రి ఉగ్గెళ్ళ శ్రీనివాసరావు, భ లక్ష్మీపతి. ఈమె బి. ఏ. ప్యాసయ్యారు. ఖా ప్రచారం చేశారు. స్వదేశీ స్టోర్సును మద్రాసులో నెలకొల్పారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 10 నెలల శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. శాసనోల్లంఘన ఉద్యమంలో 6 మాసాల కఠిన శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహంలో ఒక సంవత్సరం శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. మద్రాసు యూనివర్శిటీ సెనేట్ సభ్యురాలు. మద్రాసు కాంగ్రెస్ సంఘాధ్యక్షురాలు. 1935 లో మద్రాసు రాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యురాలు, 1937 లో మద్రాసు శాసనసభకు డిప్యూటీ స్పీకర్. ప్రకాశం మంత్రి వర్గంలో ఆరోగ్య శాఖ మంత్రిగా వున్నారు. 1951 లో కీర్తిశేషులు.

## గారపాటి సత్యనారాయణ

1911 లో ఏలూరు తాలూకా పెదపాడులో జన్మించారు. తండ్రి లక్ష్మయ్య. ఏలూరు వాసులు. ఉప్పు సత్యాగ్రహంలో 4 నెలల కఠిన శిక్ష నెల్లూరు, వేలూరు జైళ్ళలో అనుభవించారు. శాసనోల్లంఘన ఉద్యమంలో 10 నెలల కఠిన శిక్షను రాజమండ్రి, తిరుచనాపల్లి, మధురై, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1940 లో యుద్ధ వ్యతిరేక ప్రచారం చేయగా 3 మాసాలపాటు స్వగ్రామంలో నిర్బంధింపబడ్డారు. 1940 జూలై నుండి 1942 జనవరి వరకూ వెల్లూరు, కడలూరు జైళ్ళలో డిటెన్యూగా వున్నారు. 1942 సెప్టెంబరులో అరెస్టుచేసి, వెల్లూరు, పాలయ్యం

కోట, తంజావూరు జైళ్ళలో 1943 డిసెంబరు వరకు డిటెన్యూగా నిర్బంధింప బడ్డారు. 1935—36 లో యూత్ లీగ్, 1935 లో పట్టణ ప్రెస్ వర్కర్సు యూనియన్, 1937 లో చర్మకారుల యూనియన్, 1935 లో జూట్ వర్కర్సు యూనియన్ నిర్మాణం చేశారు. జిల్లా కాంగ్రెస్ సంఘ కార్యదర్శిగాను, జిల్లా కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కార్యదర్శిగాను, కమ్యూనిస్టు పార్టీ జిల్లా కార్యవర్గ సభ్యుడుగాను వున్నారు. 1952 లో మద్రాసు రాష్ట్ర శాసనసభ సభ్యునిగా ఎన్నికయ్యారు. 1963—68 లో మార్కిస్టు పార్టీ జిల్లా కార్యవర్గ సభ్యులు.

## అల్లూరి సత్యనారాయణరాజు

1913 లో నర్సాపురం తాలూకా వాలమర్రు గ్రామంలో జన్మించారు. జిన్నూరు వాస్తవ్యులు. తండ్రి సోమరాజు. హిందీ సాహిత్యరత్న. 8 వ తరగతి వరకూ చదివారు. రైతు, స్వాతంత్ర్య ఉద్యమంలో 9 ఏళ్ళకు పైగా జైలుశిక్ష అనుభవించారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 1 నెల నిర్బంధంలో వున్నారు. విడుదలైన వెంటనే తీవ్రమైన లాఠీచార్జికి గురయ్యారు. 144 సెక్షన్ ధిక్కరించినందుకు సీతానగరం ఆశ్రమంలో 1930 లో 6 నెలల శిక్షను బోర్‌స్టల్ స్కూలులో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో "వీరభారతి" అనే రహస్య వారపత్రిక పంచే బాధ్యత వహించగా చావు దెబ్బలకు గురయ్యారు. ఒంటిమీద 75 దెబ్బలు తగిలాయి. కోలుకునేందుకు ఆస్పత్రిలో 3 నెలలు పట్టింది. ఈయనను క్రూరంగా, అమానుషంగా హింసించినందుకు బ్రిటిష్ పార్లమెంటులో ప్రశ్నించటం జరిగింది. ఈయన ఆరోగ్యం పొందాక 19 మాసాల కఠినశిక్ష రాజమండ్రి జైలులో అనుభవించారు. జైలులో విప్లవవాదులతో సంబంధం ఏర్పడగా అతివాది అయ్యారు. 1936 లో కొత్తపట్నంలో వేసవి రాజకీయ పాఠశాలలో పాల్గొన్నారు. పాఠశాలను నిషేధించినపుడు నిషేధాన్ని ధిక్కరించగా లాఠీచార్జి చేసి 6 మాసాల కఠినశిక్ష విధించారు. కాశీపట్నం రైతు సత్యాగ్రహంలో రాజమండ్రి జైలులో 1937 జూన్ నుండి 1937 ఆగస్టు వరకూ డిటెన్యూగా నిర్బంధింపబడారు. 1939లో అరెస్టు చేసి స్వగ్రామంలో నిర్బంధించారు. 1940 నుండి 46 వరకూ వెల్లూరు, దామో, అమరావతి, రాజమండ్రి జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. 1933 లో రాష్ట్ర కాంగ్రెస్ సంఘానికి ఎ.ఐ.సి.సి కి సభ్యుడుగా ఎన్నుకోబడి 1963 వరకు వున్నారు. ఆంధ్ర రాష్ట్ర యువజనలీగ్‌కు అధ్యక్షుడు. 1936—38 లో జిల్లా కాంగ్రెస్ సంఘాధ్యక్షుడు. 1946—52 లో ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభ సభ్యుడు. 1951 లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘ ప్రధాన కార్యదర్శి. 1953 లో లోక్‌సభకు ఎన్నికయ్యారు. 1955-1957 లో రాష్ట్ర కాంగ్రెస్ సంఘ అధ్యక్షుడు. సంజీవయ్య మంత్రివ ~లో పి.డబ్ల్యు.డి మంత్రిగా 1960 నుండి 62 ంత వున్నారు. 1963 లో కీర్తిశేషులు.

## మాగంటి సీతారామదాసు

ఏలూరు తాలూకా చాటపర్రు వాస్తవ్యులు. తండ్రి వెంకటాద్రి. రైతు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 9 నెలల కఠినశిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. శాసనోల్లంఘన ఉద్యమంలో 1 సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, బళ్ళారి, మధురై, కడలూరు జైళ్ళలో అనుభవించారు. జిల్లా కాంగ్రెస్ సంఘ సభ్యుడు. జిల్లా బోర్డు అధ్య డు. 1946 లో ఉమ్మడి మద్రాసు రాష్ట్ర లెజి టివ్ కౌన్సిల్ సభ్యుడు, ఏలూరు లాండ్ మార్టగేజ్ బ్యాంకు అధ్యక్షుడు. ఆంధ్రప్రదేశ్ లాండ్ మార్టగేజ్ బ్యాంకు వైస్ ప్రెసిడెంట్, పెదవేగి ఆంధ్ర ఫిజికల్ ఎడ్యుకేషన్ కాలేజి అధ్యక్షుడుగా వున్నారు.

## దాట్ల సీతారామరాజు

1907 లో నరసాపురం తాలూకా మట్లపాలెంలో జన్మించారు. తండ్రి తమ్మిరాజు, రైతు. 1920 లో సహాయనిరాకరణోద్యమంలో ఇంగ్లీషు చదువు మాని వేసి, తమ గ్రామంలోని జాతీయ పాఠశాలలో చదివారు. ఉప్పు సత్యాగ్రహంలో 1930 లో ఒక సంవత్సరం ఒక నెల శిక్షను అనుభవించారు. తీవ్రమైన లాఠీ దెబ్బలకు గురయ్యారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 6 నెలల శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 6 నెలల శిక్షను ఆలీపురం జైలులో అనుభవించారు. 1942_43 వరకూ ఆలీపురం, వెల్లూరు, తంజావూరు

జైళ్ళలో డిటెన్యూగా వున్నారు. విడుదలయ్యాక ఒక సంవత్సరం గృహనిర్బంధంలో వుంచబడ్డారు. 1935-42 వరకు సోషలిస్టు పార్టీలో పనిచేశారు. రైతు సంఘాలు స్థాపించారు. కొన్నాళ్ళు తాలూకా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి. కొన్నేళ్ళు జిల్లా కాంగ్రెస్ సంఘ సభ్యుడు. తాలూకా స్వాతంత్ర్య సమరయోధుల సంఘ కన్వీనర్. జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘ కార్యవర్గ సభ్యులు.

## గుత్తా శ్రీరంగనాయకులు

1912 లో ఏలూరు తాలూకా కొవ్వలిలో జన్మించారు. తండ్రి సోమబ్రహ్మం. చిన్న వయస్సులోనే జాతీయ ఉద్యమంలో చేరారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 3 ఏళ్ళ శిక్షను రాజమండ్రిలోను, తంజావూరు బోర్‌సల్ స్కూలులోనూ అనుభవించారు. 1932 లో విదేశీ వస్త్ర దుకాణాల వద్ద పికెటింగ్‌చేసి, తీవ్రమైన లాఠీచార్జికి గురయ్యారు. 1932 లో ఢిల్లీ కాంగ్రెస్ సమావేశంలో ప్రతినిధిగా పాల్గొని 6 మాసాల కఠినశిక్షను ఢిల్లీ కాంపు జైలులో అనుభవించారు. బర్మాలోని హిందూ న్ జాతీయ ఉద్యమంతో సంబంధం పెట్టుకున ందుకు, బర్మాలో కొంతకాలం డిటెన్యూగా వున్నారు.

## భూపతిరాజు సుబ్బరాజు (సుబ్బతాతరాజు)

భీమవరం తాలూకా వేండ్ర గ్రామవాసులు. తండ్రి చినబంగారరాజు. రైతు. 1921 లో విద్యార్థిగా వున్నపుడే సహాయనిరాకరణోద్యమంలో ఆసక్తి చూపారు. 1932 లో శాసనోల్లంఘన ఉద్యమంలో 6 నెలల కఠినశిక్షను రాజమండ్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహంలో 4 నెలల కఠిన శిక్షను ఆలీపురం జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో భీమవరంలో వేలాదిమందితో ఊరేగింపు జరిపారు. 4 ఏళ్ళ కఠిన శిక్షను ఆలీపురం క్యాంపు జైలులో అనుభవించారు. 1952 లో భీమవరం నియోజకవర్గం నుంచి శాసనసభకు ఎన్నుకోబడ్డారు.

## కోసూరి సుబ్బరాజు

1914 లో తణుకు తాలూకా ఖండవల్లిలో జన్మించారు. తండ్రి సీతారామరాజు. నర్సాపురం తాలూకా జిన్నూరు వాస్తవ్యులు. జర్నలిస్టు. 1930 లో ఒక నెల కఠిన శిక్షను తిరుచినాపల్లి జైలులో అనుభవించారు. 1932 లో గుంటూరు జైలులో 45 రోజుల పాటు నిర్బంధ లో వున్నారు. అక్కడ తీవ్రమైన లాఠీచార్జికి గురయ్యారు మద్రాసులో రాజకీయ సభకు హాజ ెపుడు తీవ్రమైన లాఠీచార్జికి గురయ్యారు. అరె చేసి, మద్రాసుకు 25 మైళ్ళ దూరంలో వదలివేశా . 1932 సెప్టెంబరులో రైలుబండి గొలుసు లాగి, 6 మాసాల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. 1937 లో కొత్తపట్నం రాజకీయ పాఠశాలలో చేరినందుకు, 2 మాసాల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. యుద్ధ వ్యతిరేక ప్రచారంలో పాల్గొన్నందుకు 1940 నవంబరు నుండి 1941 డిసెంబరు వరకు వెల్లూరు జైలులో డిటెన్యూగా వుంచబడ్డారు. హిందీ, ఖద్దరు ప్రచారం చేశారు. 1939 - 1948 వరకూ తాలూకా కాంగ్రెస్ సంఘ ప్రధాన కార్యదర్శి, దక్షిణ భారత హిందీ ప్రచార సభ (ఆంధ్ర బ్రాంచి) వర్కింగ్ కమిటీ సభ్యులుగా వున్నారు.

## గొట్టుముక్కల వెంకన్న

1896 లో నర్సాపురం తాలూకా మల్లవరం పెదలంకలో జన్మించారు. తండ్రి నాగయ్య. రైతు. 1924లో ఉపాధ్యాయ వృత్తిని మానివేశారు. ఉప్పు సత్యాగ్రహంలో ఒక నెల నరసాపురం సబ్ జైలులో వుంచి వదిలిపెట్టారు. 1932 లో విదేశ వస్తు బహిష్కరణకు పాటు బడ్డారు. 1940 వ్యక్తి సత్యాగ్రహంలో 6 నెలల శిక్షను వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభకు 1936, 1946 లలో సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. 1972 లో ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీకి ఎన్నుకోబడ్డారు.

## తనికెళ్ళ వెంకటాచలపతి

1913 లో భీమవరంలో జన్మించారు. తండ్రి సూర్యనారాయణ, రైతు. 1930 నుంచి అన్ని జాతీయ ఉద్యమాల్లోనూ పాల్గొని చాలాసార్లు లాఠీ దెబ్బలకు గురయ్యారు. ఉప్పు సత్యాగ్రహంలో 6 నెలల శిక్షను రాజమండ్రి, తిరుచునాప , ఆలీపురం జైళ్ళలో అనుభవించారు. 1932 లో సనోల్లంఘన ఉద్యమంలో 2 మాసాల కఠినశిక్షను రాజమండ్రి, ఆలీపురం

జైళ్ళలో అనుభవించారు. అదే ఉద్యమంలో మరల 6 నెలల కఠిన శిక్షను రాజమండ్రి, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు. మరల 6 మాసాల కఠిన శిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. 1940 లో వేంద్ర గ్రామంలో కొంతకాలం నిర్బంధంలో వుంచబడ్డారు. యుద్ధ వ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొన్నందుకు 1940 సెప్టెంబరు నుంచి 1942 మే వరకు వెల్లూరు జైలులో డిటెన్యూగా వుంచబడ్డారు. మరల 1942 సెప్టెంబరు నుండి 1943 డిసెంబరు వరకు పాలంకోట, వెల్లూరు, తంజావూరు, జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. 1933 లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. కమ్యూనిస్టుపార్టీ నిషేధింపబడ్డాక కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో చేరారు

## గద్దే విష్ణుమూర్తి

1916లో చింతలపూడి తాలూకా ధర్మాజీగూడెంలో జన్మించారు. తండ్రి వీరరాఘవయ్య, రైతు, హిందీ ప్రచారకుడు. తన 14వ ఏట చింతలపూడికి 1929 లో గాంధీ రాగా, తాను కెప్టెన్‌గా వుండి, చిన్న పిల్లలచే ఆయనకు గౌరవ వందనం చేయించారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా మైనరు అయినందున శిక్షించకుండా వదలివేశారు. 1940 లో వ్యక్తి సత్యాగ్రహంలో 6 వారాల శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో ఒక సంవత్సరం కఠిన శిక్షను ఆలీపురం జైలులో అనుభవించారు. శిక్షపూర్తి కాగానే 1942 నుండి 1943 వరకూ డిటెన్యూగా వెల్లూరు, తంజావూరు జైళ్ళలో నిర్బంధింపబడారు. 1945 – 65 వరకు తాలూకా, జిల్లా కాంగ్రెస్ సంఘ సభ్యులు. ఆంధ్ర ప్రదేశ్ శాసన సభకు 1967 – 72 వరకు సభ్యులు.

## నడింపల్లి తిరుపతిరాజు

1910 లో జన్మించారు. తణుకు తాలూకా రేలంగి వాస్తవ్యులు, తండ్రి పద్మరాజు, రైతు, జర్నలిస్టు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 7 మాసాల కఠిన శిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో ఒక సంవత్సరం కఠిన శిక్షను అనుభవించారు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో 5 మాసాల కఠిన శిక్షను రాజమండ్రి, ఆలీపురం జైళ్ళలో అనుభవించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో ఒక సంవత్సరం శిక్షను ఆలీపురం క్యాంపు జైలులో అనుభవించారు. మరల 1943 జూలై నుండి 1943 డిసెంబరు వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధించబడ్డారు. 1944లో ఒక సంవత్సర కఠినశిక్ష ఆలీపురం జైలులో అనుభవించారు, ఈయన గొప్పదాత.

## పురం జనార్ధనగుప్త

1913 లో ఏలూరులో జన్మించారు. తండ్రి నరసింహస్వామి, వర్తకుడు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 10 నెలల కఠిన శిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి ఆలీపురం, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘనంలో 6 మాసాల కఠినశిక్షను రాజమండ్రి, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు. అదే వుద్యమంలో మరల 6 మాసాలు కఠిన శిక్షను రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు. 1934 లో 6 మాసాల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో 6 మాసాల శిక్షను ఆలీపురం జైలులో అనుభవించారు. చాలాసార్లు లాఠీ దెబ్బలకు గురయ్యారు. 1943 ఫిబ్రవరి నుండి నవంబరు వరకూ వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా నున్నారు. 1958 లో కీర్తి శేషులు.

## వీరమాచనేని వెంకటనారాయణ

1915 లో దెందులూరులో జన్మించారు. తండ్రి పట్టాభి రామయ్య. పోతునూరు వాస్తవ్యులు. చిన్నతనంలోనే స్వాతంత్ర్య పోరాటంలో చేరారు. మొత్తం 4 సంవత్సరాల 6 మాసాలు జైలుశిక్ష అనుభవించారు. ఉప్పు సత్యాగ్రహంలో 9 నెలలు శిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి, కన్ననూరు, కడలూరు జైళ్ళలో అనుభవించారు. శాసనోల్లంఘన ఉద్యమంలో సంవత్సరం కఠినశిక్షను రాజమండ్రి, బళ్ళారి, మధురై, కడలూరు జైళ్ళలో అనుభవించారు. 1940 వ్యక్తి సత్యాగ్రహంలోనూ క్విట్ ఇండియా ఉద్యమంలోనూ శిక్షింపబడ్డారు. కొంతకాలం జిల్లా కాంగ్రెస్ సంఘాధ్యక్షులు. 1974–76 వరకు ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ సంఘాధ్యక్షులు, ఆంధ్ర దేశ్ స్వాతంత్ర్య సమరయోధుల పెన్షన్ స్కీము లహా సంఘ అధ్యక్షులు, 1974 లో ఆంధ్రప్రదేశ్ లెజి టివ్

కౌన్సిల్ సభ్యుడు. 1978 లో చెన్నారెడ్డి మంత్రి వర్గంలో దేవాదాయ ధర్మాదాయ మంత్రి. తామ్రపత్ర గ్రహీత.

## భూపతిరాజు లక్ష్మీనరసరాజు

నర్సాపురం తాలూకా జిన్నూరు వాస్తవ్యులు. తండ్రి లక్ష్మీపతిరాజు. రైతు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 6 మాసాల కఠినశిక్షను రాజమండ్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు. 1938 లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. 1940 నవంబరు నుండి 1942 జూన్ వరకు వెల్లూరు జైలులో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. 9143 ఫిబ్రవరి నుండి డిసెంబరు వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా వున్నారు. 1952 లో ఆంధ్ర శాసనసభ సభ్యుడుగా ఎన్నికయ్యారు.

## మైలవరపు రామారావు

భీమవరం తాలూకా వేంద్ర అగ్రహారం వాస్తవ్యులు. తండ్రి గంగయ్య. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 6 మాసాల కఠినశిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో ఏడున్నర మాసాలు కఠిన శిక్షను రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు. విడుదలైన వెంటనే మరల ఒక సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు 1937 లో నెలా 15 రోజులు రాజమండ్రి జైలులో నిర్బంధింపబడ్డారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1943 నుండి 2 ఏళ్ళు కఠినశిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## పెద్దాడ రామచంద్రరావు

వీరవాసరంలో జన్మించారు. తండ్రి పేర్రాజు. ఉప్పుసత్యాగ్రహంలో 6 మాసాలు కఠినశిక్షను అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో ఒక సంవత్సరం కఠినశిక్షను రాజమండ్రి, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు. 1940 నవంబరు నుండి 1942 జనవరి వరకూ వెల్లూరు జైలులో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. మరల 1942 సెప్టెంబరు నుండి 1943 డిసెంబరు వరకు కఠినశిక్షను వెల్లూరు, తంజావూరు జైళ్ళలో అనుభవించారు. 1944 ఆగస్టు నుండి ఒక సంవత్సరం అలీపురం, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘ కార్యదర్శి.

## పోడూరి పేర్రాజు

1885 లో పోడూరులో జన్మించారు. తండ్రి లక్ష్మీనారాయణ. వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్నారు. 1920 లో రాజమండ్రి ట్రైనింగు కాలేజీ నుండి డిబార్ చేయబడ్డారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో 9 నెలల శిక్షను రాజమండ్రి, వెల్లూరు, మద్రాసు, అలీపురం, బళ్లారి జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో ఒక సంవత్సరం శిక్షను రాజమండ్రి, బళ్ళారిజైళ్ళలో అనుభవించారు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో 6 మాసాల కఠిన శిక్షను వెల్లూరు, అలీపురం జైళ్ళలో అనుభవించారు. 1942 ఉద్యమంలో 6 మాసాల కఠినశిక్షను అలీపురం జైలులో అనుభవించారు. 1966 లో కీర్తిశేషులు.

## భూపతిరాజు బాపిరాజు

1907 లో నర్సాపురం తాలూకా భగ్గేశ్వరంలో జన్మించారు. భీమవరం తాలూకా రాయలం నివాసి. తండ్రి పేర్రాజు. బి ఏ. చదువుతూ ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో మానివేశారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో ఒక సంవత్సరం కఠినశిక్షను, రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. 1933 లో మద్రాసు కుట్రకేసులో 3 ఏళ్ళ కఠినశిక్షను కోయంబత్తూరు, సేలం జైళ్ళలో అనుభవించారు. తాలూకా, జిల్లా కాంగ్రెస్ సంఘ అధ్యక్షులుగానూ, కార్యదర్శిగానూ పనిచేశారు ఆంధ్ర యూనివర్సిటీ సెనేట్ సభ్యులు.

# గుంటూరు జిల్లా

## మొవ్వ ఆదినారాయణ

తెనాలి తాలూకా జంపని నివాసి. రైతు. తండ్రి క య్య. 1921 లో అరెస్టు చేయబడ్డారు. 1930లో ఉప సత్యాగ్రహ సందర్భంలో 18 మాసాల కఠిన శిక్ష రాజమండ్రి, తిరుచునాపల్లి వెల్లూరు, అలీపూర్ జైళ్ళలో అనుభవించారు. 1932 లో శాసనోల్లంఘన ఉద్యమంలో 6 మాసాల విడి శిక్షను రాజమండ్రి సెంట్రల్ జైలులో అనుభవించారు. 1933 లో కలకత్తాలో ప్రత్యేక కాంగ్రెస్‌సభ సందర్భంగా 6 వారాల శిక్ష అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహ సందర్భంలో

6 వారాల కఠిన శిక్ష, పందరూపాయల జరిమానా విధించారు. జరిమానా వసూలు చేయబడింది. శిక్ష రాజమండ్రి జైలులో అనుభవించారు.

## వింజమూరి అనంతాచార్యులు

1900 లో తెనాలిలో జన్మించారు. తండ్రి భావనాచార్యులు. బి. ఏ. బి. యల్. అడ్వకేట్. 1921 లో మద్రాసులో చదువుతూ, సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొని శిక్ష అనుభవించారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 6 మాసాల కఠినశిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1932 లో శాసనోల్లంఘన సందర్భంలో 6 మాసాల శిక్షను, రాజమండ్రి, వెల్లూరు జైళ్ళ అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టు వారంట్‌కు అందకుండా ఉత్తర భారతదేశం వెళిపోయారు. 1943 లో వార్ధాలో గాంధీ క్యాంపులో రి హిందీ నేర్చుకున్నారు. హిందీ, ఖద్దరు ప్రచారం చేశారు. 1960 లో చనిపోయారు.

## తుమ్మల బసవయ్య

రేపల్లె తాలూకా కావూరు వాస్తవ్యులు. తండ్రి బాపయ్య. రైతు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో ఒక సంవత్సరం కఠినశిక్ష అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 6 మాసాల కఠిన శిక్ష రాజమండ్రి సెంట్రల్ జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 15 నెలల కఠిన శిక్ష రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. వినయాశ్రమానికి తన స్థిరచరాస్తులన్నింటినీ అర్పించారు. 1972 లో కీర్తిశేషులయారు.

## గోగినేని భారతీదేవి

1908 లో బాపట్ల తాలూకా మాచవరంలో జన్మించారు. తండ్రి వెలగా సుబ్బయ్య. భర్త ఎన్. జి. రంగా. నివాసం నిడుబ్రోలు. శారదానికేతన్‌లో చదివారు. 1925–26 లో లండన్‌లోని ఆక్స్‌ఫర్డ్ రస్కిన్ ఆర్ట్సు స్కూల్లో చదివారు. 1931 లో 6 మాసాలు తెనాలిలో విదేశీ వస్త్ర దుకాణాలవద్ద పికెటింగ్ చేయటానికి క్యాంపు నడిపారు. 1932 లో పశ్చిమగోదావరి, కృష్ణా జిల్లాలలో మహిళా సత్యాగ్రహాలను సంఘటిత పర్చారు. శాసనోల్లంఘనంలో 1932 లో ఒక సంవత్సరం శిక్షను రాయవెల్లూరు జైల్లో అనుభవించారు. వెంకటగిరి జమీందారీ రైతు ఉద్యమంలో దెబ్బలకి గురయ్యారు. 1934 నుంచి 54 వరకు జమీందారీ వ్యతిరేక, సంస్థాన వ్యతిరేక పోరాటాల్లో పాల్గొన్నారు. అదే కాలంలో రైతాంగ సంస్థకు చెందిన మహిళా శిబిరాలను నిర్వహించారు.

హరిజనోద్యమంలో కృషిచేశారు. కులరహిత సహపంక్తి భోజనాలు నిర్వహించారు, కులాంతర వివాహాలు జరిపించారు.

చేబ్రోలులో 1941 లో మహిళా రాజకీయ పాఠశాలకు తోడ్పడ్డారు. 1940–42 లో రాష్ట్ర, అఖిల భారత కిసాన్ కాంగ్రెస్ సంఘాలకు అధ్యక్షురాలు.

1952–53 లో రాయలసీమ కరువులో అక్కడికి బట్టలు, ఆహార పదార్థాలు, పశుగ్రాసం పంపారు. 1958 లో ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యురాలు. మందసా రైతులపై కేసులో సహాయనిధి పోగుచేశారు. గోదావరి జిల్లాలోనూ, ఏజన్సీ ప్రాంతంలోను వరద సహాయక చర్యలలో పాల్గొన్నారు. 1972 సెప్టెంబరు 27 న కీర్తిశేషులయారు.

## కాసు బ్రహ్మానందరెడ్డి

1909 లో నర్సరావుపేట తాలూకా చిరుమామిళ్ళ గ్రామంలో జన్మించారు. తండ్రి వెంకటకృష్ణారెడ్డి. ప్లీడరు. 1936 లో గుంటూరు జిల్లా బోర్డు అధ్యక్షుడు. 1941 లో వ్యక్తి సత్యాగ్రహంలో 4 నెలల కఠినశిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 సెప్టెంబరు నుండి 1944 డిసెంబరు వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా వున్నారు. మొదటిసారిగా 1946 లో మద్రాసు శాసనసభకు ఎన్నికయ్యారు. 1946 నుంచి, 1952 వరకూ, 1955 నుంచి 72 వరకూ శాసన సభ్యులుగా వున్నారు. 1955–56 లో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ ప్రధాన కార్యదర్శి. 1956 లో సంజీవరెడ్డి మంత్రివర్గంలో స్థానిక పరిపాలనాశాఖ మంత్రి. 1958 లో ఆర్థికశాఖ మంత్రి. 1964 లో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అయ్యారు. తెలంగాణా ఉద్యమ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ఐక్యతను కాపాడుటకు కృషి చేశారు. 1971 లో ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేశారు. అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడుగా ఎన్నుకోబడ్డారు. కేంద్ర ప్రభుత్వ ఆర్థిక కమీషన్‌కు 1972–

73 లో ఛైర్మన్‌గా వున్నారు. 1974 లో కేంద్ర రవాణాశాఖ మంత్రిగా వుండి, 10 నెలల తర్వాత హోమ్‌శాఖ మంత్రిగా నియమింపబడ్డారు.

## కల్లూరి చంద్రమౌళి

1898 లో తెనాలి తాలూకా మోపర్రు గ్రామంలో జన్మించారు. తండ్రి సుదర్శనం. స్కాట్‌లాండ్‌లో బి. యస్. సి. చదివారు. సంస్కృత పండితుడు. వాల్మీకి రామాయణాన్ని ప్రత్యేక అధ్యయనం చేశారు. 1926 లో కాంగ్రెస్‌లో చేరారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో ఒక సంవత్సరం కఠిన శిక్షను బళ్ళారి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో ఒక సంవత్సరం శిక్ష రాజమండ్రి, వెల్లూరు, మధురై, కడలూరు జైళ్ళలో అనుభవించారు.

1940 వ్యక్తి సత్యాగ్రహంలో 6 మాసాల కఠిన శిక్షను వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు.

క్విట్ ఇండియా ఉద్యమంలో వెల్లూరు, మద్రాసు జైళ్ళలో 1942 నుంచి 1943 వరకూ డిటెన్యూగా వున్నారు.

ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసన సభకు 1937 లోను, 1946 లోను ఎన్నికయ్యారు. గుంటూరు జిల్లా బోర్డు అధ్యక్షుడుగా కొంతకాలం పనిచేశారు. ఎ. ఐ. సి. సి. సభ్యుడుగా వున్నారు. 1947 52 లో స్థానిక పరిపాలనా శాఖమంత్రి. 1954-55 లో ఆంధ్రకాంగ్రెస్ సంఘ ప్రధాన కార్యదర్శి. గోపాలరెడ్డి మంత్రి వర్గంలో రివెన్యూ దేవాదాయశాఖ మంత్రిగా 1956 వరకూ వున్నారు. 1960 లో సంజీవయ్య మంత్రి వర్గలో దేవాదాయ సమాచార శాఖ మంత్రిగా వున్నారు. 1962-63 లో తిరుపతి దేవస్థాన ట్రస్టు బోర్డుకు ఛైర్మన్‌గా వున్నారు.

## తుమ్మల దుర్గాంబ

1916 లో జన్మించారు. రేపల్లె తాలూకా కావూరు వాస్తవ్యులు. తండ్రి పర్వతనేని కృష్ణయ్య. భర్త తుమ్మల బసవయ్య. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో 6 నెలల శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు ఈ ఉద్యమంలోనే రెండు సా అరె స్టయ్యారు. శాసనోల్లంఘన ఉద్యమంలో 2- -1932 నుంచిఏడున్నరమాసాలకఠినశిక్ష వెల్లూరుజైల్లో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 31-8-1942 నుంచి 15 నెలల శిక్షను వెల్లూరు జైల్లో అనుభవించారు. కస్తూరిబా స్మారకనిధి రాష్ట్ర, జిల్లా కమిటీల సభ్యురాలు. ఈమె తన యావదాస్తిని కావూరు వినయాశ్రమానికి సమర్పించారు.

## దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

1889 జూన్ 2 న కృష్ణాజిల్లా నందిగామతాలూకా పెనుగంచిప్రోలు గ్రామంలో జన్మించారు. రేపల్లె తాలూకా కూచినపూడి గ్రామ వాస్తవ్యులు, తండ్రి కోదండరామస్వామి. 'ఆంధ్రరత్న'గా పిలువబడే వాడు. గుంటూరులో కాలేజీవిద్య తరవాత 1911 లో ఇంగ్లాండ్ వెళ్ళి ఎడెంబరో యూనివర్శిటీ నుంచి యమ్. ఏ. డిగ్రీ పొందారు. ఇంగ్లండునుంచి వచ్చాక కొన్నాళ్ళు బందరు జాతీయ కళాశాలలో పనిచేశారు. సారస్వత సంఘ—గోష్ఠి స్థాపనకై ఈయనకు ప్రభుత్వం 60 ఎకరాల భూమిఇచ్చింది. కాని 1921లో సహాయ నిరాకరణ ఉద్యమంలో గాంధీ ఉపన్యాసాలు అనువదించినందుకు, ఆ భూమి రద్దు చేసింది. రామదండు పేరుతో వాలంటీర్ల దళాన్ని ఏర్పరచారు. ఖద్దరు, మద్యపాన నిషేధం, అస్పృశ్యత నివారణకు ప్రచారం చేశారు. 1921-22 లో చీరాల, పేరాల ఉద్యమాన్ని విజయవంతంగా నిర్వహించారు. సహాయ నిరాకరణ ఉద్యమంలో 1921 లో ఒక సంవత్సరం కఠినశిక్ష తిరుచునాపల్లి జైలులో అనుభవించారు. కొన్నాళ్ళు అఖిలభారత కాంగ్రెస్ సంఘ ప్రధాన కార్యదర్శిగా వున్నారు. చీరాల పేరాలలో పోటీ పాలన ఏర్పాటు చేశారు. 1928 లో కీర్తిశేషులయ్యారు.

## వావిలాల గోపాలకృష్ణయ్య

1906 లో సత్తెనపల్లిలో జన్మించారు. తండ్రి నరసింహం. 1921 లో పిన్నవయస్సులోనే స్వాతంత్ర్య ఉద్యమంలో చేరారు. కాని మైనరు అయినందున వదలివేశారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 9 నెలల శిక్షను కోరాపుట్టి, రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 6 మాసాల శిక్షను రాజమండ్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు. 1933 లో కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్ సమావేశానికి హాజరైనందున ఒక నెల రోజులు కలకత్తా ప్రెసిడెన్సీ జైలులో నిర్బంధింప

బడ్డారు. శాసనోల్లంఘన సందర్భంలో 6 మాసాల కఠినశిక్ష రాజమండ్రి సెంట్రల్ జైలులో అనుభవించారు. యుద్ధ వ్యతిరేక ప్రచార సందర్భంలో 1940 లో ఒక సంవత్సరం కఠినశిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1941 లో 10 నెలలు రక్షణ చట్టంకింద వెల్లూరు సెంట్రల్‌జైల్లో నిర్బంధింప బడ్డారు. 1942 లో రక్షణ చట్టంకింద 2 నెలలు అలీపురం క్యాంపు జైల్లో నిర్బంధింపబడ్డారు. 1947–48 లో హైదరాబాద్ సంస్థానాన్ని భారత దేశంలో విలీనం చేయాలనే ఉద్యమంలో పాల్గొన్నారు. హైదరాబాద్ సం నం నుంచి 6 నెలలవరకు బహిష్కరింప బ వ. మొత్తం 7 సంవత్సరాలు జైలుశిక్ష అనుభ చారు. కొన్నాళ్ళు ఆంధ్రపత్రికకు ఉపసంపాదకులు. 1952 నుంచి 1972 వరకూ ఆంధ్ర, ఆంధ్రప్రదేశ్ శాసన సభలలో ప్రతిపక్ష సభ్యుడు. శాంతి, గ్రంథాలయ తదితర ప్రజాహిత ఉద్యమాల్లో పని చేస్తున్నారు. నిస్వార్థ ప్రజాసేవకుడు.

## అవ్వాప్రగడ కామేశ్వరరావు

1902 లో నర్సరావుపేట తాలూకా కనుపర్తిలో జన్మించారు. నాదెండ్ల గ్రామ వాస్తవ్యులు. తండ్రి రోశయ్య. 1917 నుంచి 1921 వరకు మొదటి ప్రపంచ యుద్ధంలో మిలటరీలోచేరిమెసపుటోమియాలో పని చేశారు. మిలటరీ నుంచి వచ్చాక 1922 లో పన్నుల నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్నందుకు ఒక సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి కడలూరు జైళ్ళలో అనుభవించారు. 1924-25 లో భారత విప్లవకారులతో సంబంధం కలిగివున్నారు బొంబాయి, బరోడా, గుంటూరు మున్నగు ప్రాంతాల్లో వ్యాయామ శిక్షణ తరగతులు నడిపారు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని ఒక సంవత్సరం శిక్షను, రాజమండ్రి, కడలూరు, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1931 లో గుంటూరులో 144 సెక్షన్ ధిక్కరించినందుకు తీవ్రమైన లాఠీ ఛార్జికి గురయ్యారు. 1931 లో తూర్పు ఆఫ్రికా వెళ్ళి, అక్కడ నుంచి గదర్ పార్టీ సహాయంతో 1933 లో రష్యా వెళ్ళారు. 1939 లో తన గ్రామం నుంచి ఎక్కడకీ వెళ్ళకూడదని ఆంక్ష విధించగా, తప్పించుకుపోయి, 1942 వరకూ అజ్ఞాతంగా వుండి పనిచేశారు. 1943-45 వరకూ వేలూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా వున్నారు. 1946లో మద్రాసు శాసనసభకు గుంటూరు నుంచి ఎన్నుకోబడ్డారు. 'అంకుశం' వారపత్రికను మద్రాసు నుంచి నడిపారు. 1966 లో భారత విప్లవకారుల మహాసభకు అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డారు.

## ఉన్నవ లక్ష్మీనారాయణ

1873లో స తెనపల్లి తాలూకా వేములూరుపాడులో జన్మించారు. తండ్రి శ్రీరాములు. ఐర్లండ్‌లో బార్-ఎట్-లా చదివారు గొప్ప సంఘ సంస్కర్త. స్త్రీ పునర్వివాహ ఉద్యమంలో కృషి చేశారు. వందే మాతరం, హోమ్‌రూల్ ఉద్యమాల్లో పాల్గొన్నారు. 1921 లో న్యాయవాద వృత్తిని వదలి, పల్నాడులో పుల్లరి నిరాకరణ ఉద్యమం నడపగా గురజాలలో అరెస్టు చేయబడ్డారు. కలెక్టర్‌కు పూచీకత్తు యివ్వ నిరాకరించినందున, ఒక సంవత్సరం శిక్ష అనుభవించారు.1922లో 144 సెక్షన్ ధిక్కరించినందుకు మరల అరెస్టు చేయబడ్డారు. 1922 లో స్త్రీల కోసం 'శారదా నికేతన్' గుంటూరులో నెలకొల్పారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో ఒక సంవత్సరం శిక్షను విధించారు, 10 నెలల తర్వాత గాంధీ-ఇర్విన్ ఒడంబడిక మూలాన విడుదల చేయబడ్డారు. 1941 లో వ్యక్తి సత్యాగ్రహంలో 2 నెలల శిక్షను బళ్ళారి సెంట్రల్ జైల్లో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 6 నెలలపాటు వెల్లూరు జైలులో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. ఈయన సుప్రసిద్ధ రచయిత. మాలపల్లి, నాయకురాలు మొదలైన గ్రంథాలు రచించారు.

## ఉన్నవ లక్ష్మీబాయమ్మ

స తెనపల్లి తాలూకా అమీనాబాద్‌లో జన్మించారు. తండ్రి నడింపల్లి సీతారామయ్య, భర్త లక్ష్మీనారాయణ, "శారదా నికేతన్" స్థాపనలో భర్తకు తోడ్పడ్డారు. వితంతు వివాహాలను ప్రోత్సహించారు. 1921 సహాయ నిరాకరణ ఉద్యమంలో ఈమె ఆంధ్రదేశమంతటా తిరిగి ప్రచారం చేయడంతో, చాలామంది స్త్రీలు స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్నారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 6 మాసాల శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. 1941 లో వ్యక్తి సత్యాగ్రహంలో 3 నెలల శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు.

## వాసిరెడ్డి హనుమాయమ్మ

1910 లో జన్మించారు. చేబ్రోలు వాస్తవ్యులు. తండ్రి దేశభక్తుని వీరయ్య. భర్త కోటయ్య. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో ఒక సంవత్సరం శిక్ష విధించారు. గాంధీ–ఇర్విన్ ఒడంబడికవల్ల 8 నెలల తర్వాత వెల్లూరు జైలునుంచి విడుదలయ్యారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 21 నెలల విడి శిక్షను వెల్లూరు, కోయంబత్తూరు జైళ్ళలో అనుభవించారు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో 3 మాసాల శిక్షను వెల్లూరు, కడలూరు జైళ్ళలో అనుభవించారు.

## మేడూరి నాగేశ్వరరావు

1910 లో గుంటూరు తాలూకా ఏటుకూరులో జన్మించారు. రైతు. తండ్రి వెంకట్రాయుడు. 1930 లో మెట్రిక్యులేషన్ చదువుతూ మానివేసి, ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. వ్యక్తి సత్యాగ్రహంలో 4 మాసాల శిక్షను వెల్లూరు, ఆలీపురం జైళ్ళలో అనుభవించారు. గుంటూరు జిల్లా కాంగ్రెస్ సంఘ కార్యదర్శిగా 10 ఏళ్ళపాటు పనిచేశారు. 35 ఏళ్ళపాటు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘ సభ్యుడు. మూడుసార్లు ఆంధ్ర రాష్ట్ర శాసనసభకు 1946, 1953 1956 లలో ఎన్నికయ్యారు. పదేండ్లకు పైగా గుంటూరు జిల్లాపరిషత్ ఛైర్మన్. 1971 లో లోక్ సభకు ఎన్నుకోబడ్డారు.

## వల్లూరి రాజయ్య

1906 లో జన్మించారు. తెనాలి తాలూకా కూచిపూడి వాస్తవ్యులు. తండ్రి రామచంద్రయ్య. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 6 నెలల శిక్షను రాజమండ్రి, తిరుచునాప , ఆలీపురం జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 6 నెలల శిక్ష రాజమండ్రి జై లో అనుభవించారు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో 4 నెలల శిక్ష రాజమండ్రి సెంట్రల్ జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 నుంచి 1944 వరకు వెల్లూరు, తంజావూర్ జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు.

## సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి

1914 లో కృష్ణాజిల్లా నందిగామ తాలూకా వీరులపాడులో జన్మించారు. తెనాలి తాలూకా చేబ్రోలు వాస్తవ్యులు, తండ్రి వాసిరెడ్డి సీతారామయ్య. భర్త నాగయ్య. ఎస్.ఎస్.ఎల్.సి. హిందీ విశారద.

1932 లో శాసనోల్లంఘన ఉద్యమంలో ఒక సంవత్సరం శిక్షను వెల్లూరు, మద్రాసు జైళ్ళలో అనుభవించారు. రు. 50 జరిమానా విధించి వసూలు చేశారు. వ్యక్తి సత్యాగ్రహంలో 2 నెలల శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. రు. 100జరిమానా వసూలు చేశారు. క్విట్ ఇండియా ఉద్యమంతో కూడా సంబంధం వుంది. హిందీ, గ్రంథాలయ, హరిజన ఉద్యమాలలో పనిచేశారు. "తెలుగుదేశం" వారపత్రిక నడిపారు.

## నాగళ్ళ కృష్ణయ్య

తెనాలి తాలూకా అనంతవరం వాస్తవ్యులు. తండ్రి కోటయ్య. రైతు. సహాయ నిరాకరణ ఉద్యమంలో 1922 లో ఒక సంవత్సరం శిక్ష రాజమండ్రి సెంట్రల్ జైలులో అనుభవించారు. 1930 ఉప్పుసత్యాగ్రహంలో ఒక సంవత్సరం శిక్ష బళ్ళారి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో వంద లాఠీదెబ్బలకు గురయ్యారు. ఒక సంవత్సరం విడిఖైదు రాజమండ్రి సెంట్రల్ జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1943 ఫిబ్రవరిలో వెల్లూరు జైలులో డిటెన్యూగా నిర్బంధించి, జూలైలో అనారోగ్య కారణాల వల్ల, విడుదల చేశారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో వీరి భార్య నాగళ్ళ కృష్ణమ్మ 6 మాసాల శిక్ష అనుభవించారు. తెనాలిలో సత్యాగ్రహ శిబిరం నిర్వహించారు. గాంధీ కృష్ణయ్యగా ప్రసిద్ధి చెందారు.

## శరణు రామస్వామిచౌదరి

1900 లో తెనాలి తాలూకా అమృతలూరులో జన్మించారు, తండ్రి వెంకటరత్నం, రైతు. మదనపల్లి దివ్యజ్ఞాన సమాజం కాలేజీలో చదివారు. 1921 పన్నుల నిరాకరణోద్యమంలో రు. 1001 ల జరిమానా విధింపబడింది. ఉప్పు సత్యాగ్రహంలో ఒక సంవత్సరం శిక్షను రాజమండ్రి, కన్ననూరు, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. శాసనోల్లంఘన

సందర్భంలో ఒక సంవత్సరం శిక్షను రాజమండ్రి, బళ్ళారి, మధురై, కడలూరు జైళ్ళలో అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహంలో 4 నెలల శిక్ష అనుభవించారు. రు.200 జుర్మానా కట్టారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 సెప్టెంబరు నుంచి 1944 డిసెంబర్ వరకూ డిటెనూగా వెల్లూరు, తంజావూరు జైళ్ళలో శిక్ష అనుభవించా . 1937-1949 వరకూ గుంటూరు జిల్లా బోర్డు సభ్యుడు. గుంటూరు జి కాంగ్రెస్ సంఘ కార్యదర్శి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యదర్శిగా 6 ఏండ్లు పనిచేశా . 10 ఏళ్ళపాటు ఎ.ఐ.సి.సి. సభ్యుడు. కొన్నాళ్ళు ఆంధ్రప్రదేశ్ శాసనసభ్యుడు. గ్రంథాలయోద్యమాభివృద్ధికి కృషి చేశారు. గుంటూరు జిల్లా హరిజన సేవక సంఘ్, కార్యదర్శి. 1974-76 వరకూ ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య సమరయోధుల పెన్షన్ స్కీము సలహా సంఘ సభ్యులు.

## రామ్‌సింగ్ ఠాకూర్

తెనాలి వాస్తవ్యుడు, తండ్రి బాలాజీసింగ్. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 6 మాసాల శిక్ష రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1931 శాసనోల్లంఘన ఉద్యమంలో 6 మాసాల శిక్షను రాజమండ్రి సెంట్రల్ జైలులో అనుభవించారు. 1941 నాగపూర్ జండా సత్యాగ్రహంలో పాల్గొని శిక్షింపబడ్డారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో 6 మాసాల శిక్షను ఆలీపూర్ క్యాంపు జైలులో అనుభవించారు. 1944 లో మద్రాసులో స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంలో 6 మాసాల కఠినశిక్ష ఆలీపురం క్యాంపు జైలులో అనుభవించారు.

## గోగినేని రంగనాయకులు (ఆచార్య ఎన్. జి. రంగా)

1900 లో బాపట్ల తాలూకా నిడుబ్రోలులో జన్మించారు. తండ్రి నాగయ్య. 1926 లో బి.లిట్ (ఆక్స్‌ఫర్డ్) పట్టా పొందారు. భారత రైతు ఉద్యమ పితగా పేరు పొందారు. భారతదేశంలో ప్రముఖ నాయకులు. 1917 లో కాంగ్రెస్‌లో వలంటీర్‌గా రాజకీయ జీవితం ప్రారంభించారు. 1927 లో మద్రాసు పచ్చయప్ప కాలేజీలో రాజకీయ అర్థికశాస్త్ర ఆచార్యునిగా పని చేశారు. 1930 లో ఉద్యోగానికి రాజీనామాచేసి జాతీయోద్యమంలో చేరాడు. 1931 లో పన్నుల నిరాకరణోద్యమాన్ని గోదావరి, కృష్ణా జిల్లాలలో నడిపారు. నెల్లూరు జిల్లాలో వెంకటగిరిలో జమీందారీ రైతు ఉద్యమాన్ని నిర్మించారు. 1931-51 వరకు ఎ.ఐ.సి.సి సభ్యులు. 1931 లో ఒక సంవత్సరం శిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1933 లో కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్ సమావేశ సందర్భంలో ఒక నెలరోజులు డిటెన్యూగా వున్నారు. 1934-46 వరకు కేంద్ర అసెంబ్లీ సభ్యులు. 1936 లో ఫైజపూర్‌లో అఖిల భారత కిసాన్ సభ అధ్యక్షులు, కిసాన్ సభకు 1938 లో ప్రధాన కార్యదర్శి. 1940 లో శ్రీకాకుళం జిల్లా మందసా ఎస్టేటులో రైతు ఉద్యమాన్ని నడిపినందుకు ఒక సంవత్సరం కఠినశిక్ష రు. 500 జరిమానా విధించారు. మద్రాసు, వెల్లూరు, తిరుచునాపల్లి, తంజావూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1941 ఫిబ్రవరి నుంచి 1942 మార్చి వరకు వెల్లూరు జైలులో డిటెన్యూగా వున్నారు. మరల 1942 నవంబరు నుండి 1944 అక్టోబరు వరకు (క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో కొన్నాళ్ళు రహస్య జీవితం గడిపారు.) వెల్లూరు, దామో, అమరావతి, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా వున్నారు. 1946-51 వరకు రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు, 1947-51 వరకు ఎ.ఐ.సి.సి వర్కింగ్ కమిటీ సభ్యులుగానూ, తాత్కాలిక పార్లమెంటు సభ్యులుగానూ వున్నారు. ఆలిండియా చేనేత కార్మిక కాంగ్రెస్ స్థాపకులు, 1947 నుంచి నేటివరకు అధ్యక్షులు. 1951-53 వరకు కృషీకార్ లోక్ పార్టీ స్థాపక అధ్యక్షులు. 1952 లో అఖిలభారత గ్రామోద్యోగ సమ్మేళన అధ్యక్షుడు. 1952-60 వరకు నేషనల్ కోపరేటివ్ కాంగ్రెస్‌కు వైస్ ప్రెసిడెంట్. 1952-57 వరకు రాజ్యసభ సభ్యులు. కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీకి 1958-59 వరకు ప్రధాన కార్యదర్శి. 1959-69 వరకు ఆల్ ఇండియా స్వతంత్ర పార్టీకి అధ్యక్షుడు. 1971 లో తిరిగి కాంగ్రెస్‌పార్టీలో చేరారు. అనేక అంతర్జాతీయ సభలలో ఇండియా ప్రతినిధిగా వ్యవహరించారు. 1969 లో గాంధీజయంతి ఉత్సవాల సందర్భంలో "మహాత్మాగాంధీ" యునెస్కో సెమినార్‌లో పాల్గొన్నారు. బహు గ్రంథకర్త.

## రావూరి రంగారావు

1895 లో తెనాలి తాలూకా పెదరావూరు గ్రామంలో జన్మించారు. తండ్రి నారాయణ, రైతు. 1917 లో ప్రభుత్వ ఉద్యోగానికి రాజీనామాచేసి. 1921 లో జాతీయోద్యమంలో చేరారు. తిలక్ స్వరాజ్య నిధి వసూలుకు ఎక్కువ కృషి చేశారు. 1921-22 లో పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమంలో ఒక సంవత్సరం కఠినశిక్ష అనుభవించారు. సైమన్ కమిషన్ బహిష్కరణలో పాల్గొన్నారు. శాసనోల్లంఘన ఉద్యమంలో 1930 లో ఒక సంవత్సరం కఠినశిక్ష రాజమండ్రి, ఆలీపూర్ జైళ్ళలో అనుభవించారు. రెండున్నర సంవత్సరాలపాటు రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ ఆడిటింగ్ ఇనస్పెక్టరుగా పని చేశారు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో 6 మాసాల కఠినశిక్ష రాజమండ్రి, ఆలీపూర్ జైళ్ళలో అనుభవించారు. 1942 లో క్విట్ ఇండియా ఉద్యమంలో చేతి బాంబులు తన అధీనంలో వుంచుకున్నందుకు రహస్య బులెటనులు తెనిగించినందుకు డిటెన్యూగానిర్బంధింపబడ్డారు, తెనాలి పట్టణ తాలూకా కాంగ్రెస్ కమిటీలకు అధ్యక్షులుగానూ, గుంటూరుజిల్లా కాంగ్రెస్ సంఘ సంయుక్త కార్యదర్శిగానూ పనిచేశారు.

## కొమండూరు సంపత్కుమారాచార్య

1897 లో గుంటూరులో జన్మించారు. తండ్రి వెంకటాచార్యులు. చిన్నవయసులోనే విప్లవోద్యమంలో చేరారు. పొన్నూరులో జాతీయ పాఠశాల నడిపారు ఉప్పు సత్యాగ్రహంలో 9 నెలల శిక్షను 1930 లో కోరాపుట్, రాజమండ్రి జైళ్ళలో అనుభవించారు. విడుదలైన మర్నాడే తీవ్రమైన లాఠీ చార్జీకి గురయ్యారు. 1931 లో హిందూస్థాన్ నౌకా దళంలో శిక్షణ పొందారు. 1932, 42 ఉద్యమాలలో ఆంధ్ర కాంగ్రెస్ డిక్టేటర్గా నియమింపబడ్డారు. 1932 లో ప్రభుత్వ నిషేధాన్ని ధిక్కరించి సభ జరిపినందుకు 9 నెలలు నిర్బంధింపబడ్డారు. 1940 వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. రక్షణ చట్టం కింద అరెస్టు చేయబడి, 1943 నుంచి 2 సంవత్సరాలు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. కొన్నేళ్ళపాటు ఉచిత వైద్యశాల నడిపారు.

## వెనిగళ్ళ సత్యనారాయణరావు

1918 లో విజయవాడ తాలూకా పునాదిపాడులో జన్మించారు. తెనాలి తాలూకా దుగ్గిరాల వాస్తవ్యులు. తండ్రి వీరయ్య, రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1943 నుండి 2 సంవత్సరాల కఠినశిక్షను ఆలీపూర్ క్యాంపు జైలులో అనుభవించారు.

1946 లో గుంటూరుజిల్లా బోర్డు సభ్యులు. 1948 లో ఆంధ్రా యూనివర్శిటీ సెనేట్ సభ్యుడు. 1954-60 వరకు గుంటూరుజిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు. 1954 నుండి ఎ. ఐ. సి. సి సభ్యులు. 1958-59 లో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ పార్లమెంటరీ బోర్డు సభ్యుడు. 1958-70 వరకు ఆంధ్రప్రదేశ్ శాసనమండలి సభ్యుడు. 1967-69 వరకు బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో ఆబ్కారీ మంత్రి, గుంటూరుజిల్లా కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లి. (తెనాలి) అధ్యక్షుడు. దుగ్గిరాల ప్రాథమిక కోఆపరేటివ్ లాండ్ మార్టిగేజ్ బ్యాంకు అధ్యక్షుడు. 1970 లో రాజ్యసభకు ఎన్నికోబడ్డారు. 1976 లో తిరిగి ఎన్నికోబడ్డారు.

## చింతమనేని బావయ్య చౌదరి

1897 లో తెనాలి తాలూకా సంగంజాగర్లమూడిలో జన్మించారు. తండ్రి రత్తయ్య, రైతు. విద్యార్థి దశలోనే 1914-19 వరకు హోమ్రూల్ ఉద్యమంలో పనిచేశారు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనగా 1921 లో గుంటూరు సబ్ జైలులో కొన్నాళ్ళు నిర్బంధింపబడ్డారు. పన్నుల నిరాకరణ, ఉప్పు సత్యాగ్రహం ఉద్యమాల్లో పాల్గొన్నారు. ఒక సంవత్సరం కఠినశిక్ష విధించగా 1930 జూన్ నుంచి మార్చి 1931 వరకూ రాజమండ్రి, కన్ననూర్, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో ఒక నెల నిర్బంధింపబడ్డారు. 1937-38 లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సంయుక్త కార్యదర్శి. వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నారు, 1942 ఉద్యమంలో రక్షణ చట్టం కింద అరెస్టు చేయబడి సెప్టెంబరు 42 నుంచి మార్చి 44 వరకు డిటెన్యూగా వెల్లూరు, తంజావూర్ జైళ్ళలో వున్నారు. గుంటూరు జిల్లా కాంగ్రెసు సంఘ అధ్యక్షుడు. ఖాదీ, హిందీ, గ్రంథాలయ,

హరిజన ఉద్యమాల్లో పనిచేశారు. ఆంధ్రప్రదేశ్ శాసన మండలి సభ్యులు.

## గొల్లపూడి సీతారామశాస్త్రి

1885 లో జన్మించారు. రేపల్లె వాస్తవ్యులు. తండ్రి వెంకట సుబ్బయ్య. అడ్వకేట్. ఆం' లో ప్రముఖ కాంగ్రెస్ నాయకులలో ఒకరు. 190 లో విద్యార్థిగా వున్నప్పుడే వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్నారు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘానికి, ఎ. ఐ. సి. సి. కి కొన్నేళ్ళపాటు సభ్యులు. 1921, 1922 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘ కార్యదర్శి. తన ప్లీడరు వృత్తిని మానివేసి 1921 లో సహాయనిరాకరణ ఉద్యమంలో చేరారు. 1922 లో ఒక సంవత్సరం శిక్షను రాజమండ్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు. 1924-1928 వరకు ఖాదీ ప్రచారం చేశారు. ఆంధ్ర హరిజన సేవా సంఘానికి బాధ్యత వహించారు. 1923 లో వినయాశ్రమం స్థాపించారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో ఒక సంవత్సరం శిక్షను వెల్లూరు, మద్రాసు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో ఒక సంవత్సరం శిక్షను రాజమండ్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 అక్టోబరు నుండి 1944 డిసెంబరు వరకు వెల్లూరు, తంజావూరు ళ్ళలో డిటెన్యూగా వున్నారు. ప్రత్యేక ఆంధ్ర రా ్రం కోసం ఉపవాసం చేశారు. సర్వోదయ ఉద్యమ లో చేరి, పని చేస్తూ, విరాగిగా జీవితం గడిపారు. 1960 లో కీర్తిశేషులయ్యారు.

## వెలువోలు సీతారామయ్య

1907 లో తెనాలి తాలూకా అమృతలూరులో జన్మించారు. తండ్రి రంగయ్య. రైతు. ఇంగ్లీషు, హిందీ, సంస్కృతం, తెలుగు అభ్యసించారు. కవి. రచయిత. అశ్వనీ కుమార్ దత్ "ప్రేమ" అనే గ్రంథాన్ని హిందీ నుంచి తెనిగించారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 9 నెలల శిక్ష రాజమండ్రి, కోయంబత్తూరు, ఆలీపురం జైళ్ళలో అనుభవించారు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో 2 నెలల శిక్షను తిరుచునాపల్లి జైల్లో అనుభవించారు. 1942 నుండి 1944 వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో క్విట్ ఇండియా ఉద్యమంలో డిటెన్యూగా వున్నారు. తెనాలి తాలూకా బోర్డుకు సభ్యునిగా ఎన్నుకోబడ్డారు. 1933లో అమృతలూరు పంచాయతీ బోర్డు అధ్యక్షుడు. 1937 లో గుంటూరు జిల్లా కాంగ్రెస్ సంఘ ప్రధాన కార్యదర్శి. 1950 లో గుంటూరు జిల్లా కోపరేటివ్ సెంట్రల్ బ్యాంకు డైరెక్టరు. 1960 నుండి తెనాలి లాండ్ మారుగేజ్ బ్యాంకు స్థాపక అధ్యక్షుడు. తెనాలి వి. ఎస్. ఆర్ కాలేజీ మానేజింగ్ కమిటీ అధ్యక్షుడు. 1974-1976 వరకూ ఆంధ్ర ప్రదేశ్ స్వాతంత్ర్య సమర యోధుల పెన్షన్ స్కీము, సలహా సంఘ సభ్యుడు. హైదరాబాదులోని ఆంధ్రప్రదేశ్ కోపరేటివ్ సెంట్రల్ లాండ్ మారిగేజ్ బ్యాంకుకి డైరెక్టరు.

## పుతుంబాక శ్రీరాములు

1914 లో తెనాలి తాలూకా పెదపాలెంలో జన్మించారు. తండ్రి నరసయ్య. రైతు. 1930లో గ్రామ మునసబు ఉద్యోగానికి రాజీనామాచేసి, ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. అరెస్టుచేసి విచారణ తర్వాత వదలి పెట్టారు. 1941 వ్యక్తిసత్యాగ్రహంలో 4 నెలల కఠిన శిక్ష విధించారు, క్విట్ఇండియా ఉద్యమంలో 1942 డిసెంబర్ నుండి 1944 డిసెంబరు వరకూ వెల్లూరు, తంజావూర్ జైళ్ళలో డిటెన్యూగా వున్నారు. ఆంధ్ర రాష్ట్ర శాసన సభ్యుడుగా 1955-56 లో వున్నారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డాక 1956-1962 వరకు శాసన సభ్యుడు. గుంటూరు జిల్లాకోపరేటివ్ సెంట్రల్ బ్యాంకు ఛైర్మన్, గుంటూరు జిల్లా కోపరేటివ్ మార్కెటింగ్ సొసైటీ డైరెక్టరు. ఎ.ఐ.సి. సి. సభ్యుడు, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘ సంయుక్త కార్యదర్శి. తెనాలి వి. ఎస్. ఆర్. కాలేజీ అధ్యక్షుడు. ఆంధ్ర యూనివర్శిటీ సెనేట్ సభ్యుడుగా 5 ఏళ్ళపాటు వున్నారు. గుంటూరు జిల్లా హరిజన సేవా సంఘం అధ్యక్షుడుగా 10 ఏళ్ళపాటు వున్నారు. 9 ఏళ్ళపాటు ఈమని గ్రామ పంచాయితీ సమితి ప్రెసిడెంటు. పెదపాలెం హైస్కూలు స్థాపకుడు. 1976 నుంచి కొన్నాళ్ళపాటు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అడ్ హాక్ కమిటీకి వైస్ ప్రెసిడెంట్.

## తప్పగంతుల శ్రీరామమూర్తి

బాపట్ల వాస్తవ్యులు. తండ్రి వెంకట సుబ్బయ్య. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 18 నెలల శిక్ష విధించారు. గాంధీ ఇర్విన్ ఒడంబడిక మూలాన 7 నెలల తర్వాత వదలివేశారు. 1932 శాసనోల్లంఘనంలో 6 నెలల శిక్ష రాజమండ్రి జైలులో అనుభవించారు. 1940 వ్యక్తి సత్యాగ్రహంలో 12 నెలల శిక్ష కోయంబత్తూర్, వెల్లూరు, అలిపురం జైళ్ళలో అనుభవించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో 18 నెలల శిక్షను అలీపురం జైల్లో అనుభవించారు.

## పాతూరి సుబ్బయ్య

1895 లో రేపల్లె తాలూకా పెనుమూడి గ్రామంలో జన్మించారు. తండ్రి వెంకట్రామయ్య. రాష్ట్ర కాంగ్రెస్ సంఘ సభ్యుడు. గుంటూరు జిల్లా కాంగ్రెస్ సంఘ అధ్యక్షుడు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో ఒక సంవత్సరం శిక్ష విధించగా, రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్ష అనుభవిస్తుండగా, గాంధీ-ఇర్విన్ ఒడంబడిక మూలాన 7 నెలల తర్వాత వదలివేశారు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో 6 నెలల శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. గాంధీజీ హత్య వార్త విని 1948 లో చచిపోయారు.

## అలవర్తి సుబ్బయ్య

తెనాలి తాలూకా యలవర్రు గ్రామ వాస్తవ్యులు. తండ్రి శ్రీరాములు, రైతు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో ఒక సంవత్సరం శిక్ష రాజమండ్రి, బరంపురం జైళ్ళలో అనుభవించారు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో 4 మాసాల శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 1944 వరకు వెల్లూరు, తంజావూర్ జైళ్ళలో డిటెన్యూగా వున్నారు.

## మద్ది సుదర్శనం

1906 లో జన్మించారు. గుంటూరు వాస్తవ్యులు. తండ్రి వెంకట రంగయ్య. పారిశ్రామిక వేత్త. 1921 లో గాంధీ టోపీ పెట్టుకున్నందుకు అరెస్టుచేసి, 3 రోజుల తర్వాత వదిలిపెట్టారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో శిక్ష విధించారు. వ్యక్తి సత్యాగ్రహంలో 2 నెలల శిక్ష బళ్ళారి జైలులో అనుభవించారు. 7 ఏళ్ళపాటు ఉమ్మడి మద్రాసు శాసన సభ్యుడు. 1967 లోనూ, 1971 లోనూ లోక్‌సభకు ఎన్నుకోబడ్డారు. శ్రీకృష్ణాశ్రమం మేనేజింగ్ ట్రస్టీగా హరిజనుల అభ్యున్నతికి కృషిచేస్తున్నారు.

## నడింపల్లి వెంకటలక్ష్మి నరసింహారావు

1890 లో గుంటూరులో జన్మించారు. తండ్రి రామయ్య పంతులు. లండన్‌లో బారిష్టర్ పట్టా పొందారు. 1921 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం తొలి కోశాధికారి, 1922 లో కార్యదర్శి. 1922 పెదనందిపాడు ఫిర్కాలో పన్నుల నిరాకరణ ఉద్యమంలో పాల్గొనగా రు. 1000 జరిమానా వసూలు చేశారు. పెదనందిపాడు పన్నుల నిరాకరణ ఉద్యమం పనితీరు గురించి పరిశీలించుటకు పంపిన కాంగ్రెస్ కమిటీ వారికి తాను మున్సిపల్ కౌన్సిలర్‌గా వుండి, గుంటూరులో స్వాగత పత్రం సమర్పించగా ప్రభుత్వం నిషేధించింది. 1922-30 వరకు గుంటూరు మున్సిపల్ ఛైర్మన్. 1922 లో మున్సిపల్ ఆఫీసుపై కాంగ్రెస్ పతాకాన్ని ఎగురవేశారు. 1928 లో సైమన్ కమిషన్ బహిష్కరణలో ప్రముఖపాత్ర వహించారు. ఉప్పు సత్యాగ్రహ శిబిరానికి కావలసిన ఏర్పాట్లకు మున్సిపల్ సిబ్బందిని వినియోగించారు. 1930 లో ఒక సంవత్సరం శిక్షను బళ్ళారి, తిరుచునాపల్లి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో గృహ నిర్బంధంలో వుంచారు. 1950 లో మద్రాసు శాసనసభలో ప్రజా సోషలిస్టు పార్టీ ప్రతినిధిగా వున్నారు. 1953 లో రాష్ట్ర శాసనసభకు తాత్కాలిక స్పీకర్‌గా వున్నారు. ఆంధ్రప్రదేశ్ బార్ కౌన్సిల్ సభ్యుడుగానూ డిసిప్లినరీ కమిటీ ఛైర్మన్‌గాను వున్నారు. కొన్నాళ్ళు ఆంధ్ర యూనివర్శిటీ సెనేట్ సభ్యుడు.

## జాస్తి వెంకట నరసయ్య

1910 లో తెనాలి తాలూకా పెదపూడిలో జన్మించారు. తండ్రి సుబ్బయ్య. ఉభయ భాషాప్రవీణ పాసయ్యారు. తెలుగు పండితుడుగా ఉన్నత పాఠశాలలో పని చేశారు. రచయిత. కవి. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 2 సంవత్సరాల శిక్ష విధించారు. ఒక సంవత్సరం తరవాత వదలివేశారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో 2 సంవత్సరాల శిక్షను అలీపురం క్యాంపుజైలులో అనుభవించారు. ఆంధ్రప్రదేశ్

సర్వోదయ సాహిత్యమండలి సభ్యుడు. గ్రంథాలయ సర్వస్వం పత్రిక సంపాదకవర్గ సభ్యుడు.

### కొండా వెంకటప్పయ్య

1866 లో గుంటూరులో జన్మించారు. తండ్రి కోటయ్య పంతులు. అడ్వకేట్‌గా బందరు, గుంటూరులలో ప్రాక్టీసు చేశారు. కృష్ణా పత్రికను బందరులో ప్రారంభించారు. 1915 లో దేశసేవకోసం తన ప్లీడరు వృత్తిని మానివేశారు. మాంటేగ్ – ఛెమ్స్ఫర్డు లు వచ్చినపుడు, భాషాప్రయుక్త రాష్ట్రాలు, ముఖ్యంగా ఆంధ్రరాష్ట్రం ఏర్పరచవలసిందిగా వారిని కోరారు. 1919 లో మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడు. 1921 లో సహాయ నిరాకరణ ఉద్యమంలో కౌన్సిల్ సభ్యత్వానికి రాజీనామా చేసి ఉద్యమంలో పాల్గొన్నందుకు ఒక సంవత్సరం శిక్ష రాజమంద్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘ కార్యదర్శిగాను, తరువాత అధ్యక్షుడుగానూ వున్నారు. కొన్నేళ్ళు ఎ. ఐ. సి. సి. సభ్యుడుగాను, కార్యవర్గ సభ్యుడుగాను వున్నారు. 1923 లో ఎ ఐ సి సి కి తాత్కాలిక అధ్యక్షుడుగా వున్నారు. 1923 లో కాకినాడ కాంగ్రెస్ మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షుడు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో ఒక సంవత్సరం శిక్ష వెల్లూరు, మద్రాసు, కన్ననూర్ జైళ్ళలో అనుభవించారు. 1932 సహాయ నిరాకరణ ఉద్యమంలో 6 నెలల శిక్ష వెల్లూరు, రాజమంద్రి జైళ్ళలో అనుభవించారు. 1937 మద్రాసు శాసన సభ్యుడు. వ్యక్తి సత్యాగ్రహంలో నిర్బంధింప బడ్డారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 నుండి 45 వరకూ మద్రాసు, వెల్లూరు జైళ్ళలో డిటెన్యూగా వున్నారు దేశభక్త అని బిరుదు యివ్వబడింది. గాంధీ, నెహ్రూలు ఈయననుఎంతో గౌరవించేవారు. గుంటూరులో శారదానికేతన్ వ్యవస్థాపకులలో ఒకరు. 1948 లో కీర్తిశేషులయ్యారు.

### గుత్తా సుందరమ్మ

1904 లో జన్మించారు. రేపల్లె తాలూకా పెదపులివర్రు గ్రామ వాస్తవ్యురాలు. తండ్రి కొత్తపల్లి అచ్చయ్య. భర్త చలమయ్య. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో ఒక సంవత్సరం కఠిన శిక్షను వెల్లూరు, కన్ననూరు, మద్రాసు జైళ్ళలో అనుభవించారు. 1937 లో కీర్తిశేషులయ్యారు.

### కన్నెగంటి సూర్యనారాయణమూర్తి

1.96 లో జన్మించారు. తెనాలి తాలూకా నందివెలుగు వాస్తవ్యులు. తండ్రి రెడ్డెమ్మ, రైతు. 1921 సహాయ నిరాకరణోద్యమంలో 6 నెలల కఠినశిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. 1930 ఉప్పుసత్యాగ్రహంలో తీవ్రమైన లాఠీచార్జికి గురికావటమేకాక 8 నెలల కఠిన శిక్షను రాజమంద్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 7 మాసాల 15 రోజుల శిక్షను, రాజమండ్రి, వెల్లూరు, మధురై జైళ్ళలో అనుభవించారు. కొన్నాళ్ళు గుంటూరు జిల్లా కాంగ్రెస్ సంఘ అధ్యక్షుడు. 1921–24 వరకు ఎ ఐ సి సి సభ్యుడు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో 6 మాసాల శిక్షను అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో ఒక సంవత్సరం 9 మాసాలు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధింప బడ్డారు. గుంటూరు జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం అధ్యక్షులు. తామ్రపత్ర గ్రహీత.

### చావలి సూర్యనారాయణ

1905 లో గుంటూరులో జన్మించారు. తండ్రి వెంకటచలపతిరావు, రైతు. ఇంటర్మీడియట్ వరకు చదివారు. ఉప్పు సత్యాగ్రహఉద్యమకాలంలో చదువు మానివేశారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 6 మాసాల శిక్షను రాజమంద్రి సెంట్రల్ జైలులో అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని, ఒక సంవత్సరం శిక్షను వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 నుంచి 1944 వరకు వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 నుండి 1944 వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధింప బడ్డారు. చాలాకాలం ఎ ఐ సి సి సభ్యులుగానూ, గుంటూరు జిల్లా కాంగ్రెస్ సంఘ అధ్యక్షులుగానూ వున్నారు

### భట్టిప్రోలు సూర్యప్రకాశరావు

1897 లో జన్మించారు. బాపట్ల వాస్తవ్యులు. తండ్రి షణ్ముఖరావు, రైతు. 1921 సహాయ నిరాకరణోద్యమంలో 2 సంవత్సరాల ఒక మాసం శిక్షను రాజమంద్రి, మద్రాసు, కడలూరు, కోయంబత్తూరు

జైళ్ళలో అనుభవించారు. చీరాల–పేరాల ఉద్యమంలో పాల్గొన్నారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 10 నెలల కఠిన శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు

## కల్లూరు తులశమ్మ

తెనాలి తాలూకా మోపర్రు గ్రామ వాస్తవ్యురాలు. భర్త రంగయ్య. 1940 వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. కాని అరెస్టు చేయలేదు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో 16 నెలల కఠిన శిక్షను వెల్లూరుజైలులో అనుభవించారు. ఈమె ఖాదీప్రచారం చేస్తూ దానిమీద వచ్చే కమీషన్‌తో జీవిస్తున్నారు. స్వాతంత్ర్య సమరయోధుల పెన్షన్ ఈమె తీసుకోవడంలేదు. చాలా నిరాడంబరజీవి. గాంధీ, వినోబాభావే ఆశయాల్ని అమలు జరుపుతూ జీవిస్తున్న ఆదర్శ మహిళ. ఈమె వార్ధా ఆశ్రమంలో కొన్ని మాసాలు వున్నారు హిందీని అభ్యసించారు

## దామరాజు పుండరీకాక్షుడు

1896 లో నర్సరావుపేట తాలూకా పాటిబండ గ్రామంలో జన్మించారు. తండ్రి గోపాలకృష్ణయ్య, అడ్వకేట్. కవి. దేశభక్తి. పూరితమైన నాటకాలు రచించడంతో, వాటిని ప్రభుత్వం నిషేధించింది. 50 వేల రూపాయల విలువచేసే వీరి గ్రంథాలను తగుల బెట్టించింది.

1921 సహాయ నిరాకరణ ఉద్యమంలో గుంటూరు, మంగళగిరిలలో తీవ్రమైన లాఠీఛార్జీకి గురయ్యారు. 20 రోజులపాటు గుంటూరు సబ్–జైలులో నిర్బంధింపబడ్డారు. తర్వాత మరల అరెస్టుచేసి 3 మాసాలు కాకినాడ జైలులో నిర్బంధించారు.

కొన్ని వీరి రచనలు – స్వరాజ్య సోపానం, గాంధీ విజయం, కలియుగ ప్రహ్లాద (గాంధీ), పాంచాల పరాభవం, గాంధీ మహోదయం, క్విట్ ఇండియా. "రామరాజ్" పత్రిక సంపాదకులు.

## మంతెన వెంకటరాజు

1904 లో బాపట్ల తాలూకా మంతెనవారి పాలెంలో జన్మించారు. తండ్రి బాపిరాజు. రైతు. ఫిఫ్తుఫారం చదువుతూ బడి మానివేసి 1921 సహాయనిరాకరణ ఉద్యమంలో చేరారు. గాంధీ టోపీ పెట్టుకొన్నందుకు 1922 లో అరెస్టు చేయబడ్డారు. 1928 లో సైమన్ కమిషన్ బహిష్కరణలో పాల్గొనారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో తీవ్రమైన లాఠీచార్జికి గురయ్యారు. 9 నెలల కఠిన శిక్ష రాజమండ్రి, ఏలూరు, అలీపురం జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో ఒక సంవత్సరం శిక్షను రాజమండ్రి, బళ్ళారి జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో సెప్టెంబరు 1942 నుండి డిసెంబర్ 1944 వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. వీరి జైలు జీవితంలో బెంగాలీ, ఉర్దూ, హిందీ, తమిళం వంటి భాషలు నేర్చుకున్నారు.

కొన్నేళ్ళపాటు ఎ. ఐ. సి. సి. సభ్యుడు, 1936–37 లో జిల్లా కాంగ్రెస్ సంఘ కార్యదర్శి, 1939–46 వరకు జిల్లా కాంగ్రెస్ సంఘాధ్యక్షుడు, 1960–62 ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సంఘ కార్యదర్శి. 1946–52, 1955–1956, 1957–62 లలో శాసన సభ్యుడు. హరిజన దేవాలయ ప్రవేశం, ఘోషాపద్ధతి తొలగింపు, స్త్రీ పునర్వివాహం విషయమై ఎక్కువగా కృషి చేశారు. 1968 లో కీర్తిశేషులయ్యారు.

## మద్ది వెంకట రంగయ్య

గుంటూరు వాస్తవ్యులు. తండ్రి సుదర్శనం, వాణిజ్యవేత్త. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 10 మాసాలు శిక్షను రాజమండ్రి, వెల్లూరు, జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 6 నెలల శిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. గవర్నరు రాక సందర్భంలో గుంటూరులో వ్యతిరేక ప్రదర్శనలు చేసినందుకు 1942 లో 4 రోజులు సబ్‌జైలులో నిర్బంధింపబడారు. క్విట్ ఇండియా ఉద్యమములో 1942 నుండి 1944 వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. శ్రీకృష్ణ ఆశ్రమం పేరున హరిజన పాఠశాల నడిపారు.

## పులుపుల వెంకట శివయ్య

1906 లో జన్మించారు. వినుకొండ వాస్తవ్యులు. తం॥ భగవానులు. బెనారస్ హిందూ యూనివర్శిటీ పో గ్రాడ్యుయేట్. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 8 నెలల కఠిన శిక్షను తిరుచునాపల్లి, రాజమండ్రి, ఆలీపురం జైళ్ళలో అనుభవించారు. 1940 వ్యక్తి

సత్యాగ్రహంలో 18 మాసాలు కఠినశిక్ష వెల్లూరు, ఆలీపురం జైళ్ళలో అనుభవించారు. 1941 లో ఆలీపురం క్యాంపు జైలునుంచి తప్పించుకుని పారిపోయారు. 1942 లో పట్టుబడగా, 6 నెలల శిక్ష విధించి బ రి జైలులో నిర్బంధించారు. ఆంధ్రలో కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థాపకులలో ఒకరు 1952 లోనూ, 1 62 లోనూ కమ్యూనిస్టుపార్టీ టికెట్ పై రాష్ట్ర శాసన సభకు ఎన్నుకోబడారు. 197 6 లో చికిత్సకోసం మాస్కో వెళ్ళి అక్కడే గుండెపోటుతో మరణించారు. కవి. రచయిత.

## చుండూరు వెంకయ్య

తెనాలి తాలూకా ఆలపాడు వాస్తవ్యులు. తండ్రి సుబ్బయ్య. రైతు. ఖాదీ ప్రచారకులు. ఉప్పు సత్యాగ్రహంలో 6 నెలల శిక్ష అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో సుమారు ఒక సంవత్సరం శిక్షను రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు 1941 వ్యక్తి సత్యాగ్రహంలో 4 మాసాల శిక్షను, రాజమండ్రి జైలులో అనుభవించారు.

## పర్వతనేని వీరయ్య చౌదరి

1886 లో బాపట్ల తాలూకా పెదనందిపాడులో జన్మించారు. కర్నాటక గాత్ర సంగీతంలో నిష్ణాత. 1921 లో పెదనందిపాడులో తాను ఏర్పరచిన శాంతి సేన ద్వారా పన్నుల నిరాకరణోద్యమం నడిపారు. 1922 లో అరెస్టు చేయబడి శిక్ష అనుభవించారు. వీరి ఉద్యమ ప్రభావంవల్ల, చుట్టుపక్కల గ్రామాల్లోని గ్రామోద్యోగులు తమ ఉద్యోగాలకు రాజీనామా చేశారు. గ్రామాల్లోని రైతులు పన్నులు చెల్లించలేదు. దాదాపు వంద గ్రామాల్లోని పరిపాలన స్థంభించి పోయింది. ఈ ఉద్యమం మొత్తం దేశాన్ని ఆకర్షించింది. వైస్రాయి వెల్లింగ్టన్ ఈ ఉద్యమం భారత దేశంలోని బ్రిటిష్ ప్రభుత్వ పునాదులని కుదిపివేసిందని భయపడ్డారు. ఆంధ్ర యూనివర్శిటీ, మ్యూజిక్ బోర్డు సభ్యుడు. మద్రాసు సంగీత అకాడమీ నిపుణుల సంఘ సభ్యుడు. ఆంధ్ర సంగీత నాటక అకాడమీ సభ్యుడు.

## మల్లాది యజ్ఞనారాయణశర్మ

బాపట్ల వాస్తవ్యులు. తండ్రి వెంకట కృష్ణశాస్త్రి. అడ్వకేట్. 1930 ఉప్పు సత్యాగ్రహంలో ఒక సంవత్సరం శిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి, కడలూరు, మద్రాసు, బళ్ళారి వెల్లస్లీ శానిటోరియమ్ జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 6 నెలల శిక్షను రాజమండ్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు. 1941 వ్య సత్యాగ్రహంలో 3 మాసాల శిక్షను రాజమం , తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 నవంబరు నుంచి 1944 డిసెంబరు వరకూ వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా వున్నారు.

## చుక్కపల్లి వీరయ్య

తెనాలి తాలూకా కంచర్లపాలెం వాస్తవ్యులు, తండ్రి కృష్ణయ్య. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని 1930 మే నుంచి 1931 మార్చి వరకు రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్షను అనుభవించారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 6 మాసాల కఠిన శిక్షను రాజమండ్రి, జైలులో అనుభవించారు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో 4 మాసాల శిక్ష రాజమండ్రి జైలులో అనుభవించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో 6 నెలల శిక్ష అనుభవించారు.

## చందు నాగభూషణం

తెనాలి తాలూకా ఆలపాడు గ్రామ వాస్తవ్యులు, తండ్రి కృష్ణయ్య. రైతు. శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొని 1932 డిసెంబరు నుంచి 1933 ఆగ వరకు రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహంలో మొత్తం ఒక సంవత్సరం శిక్షను రాజమండ్రి. ఆలీపురం జైళ్ళలో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో ఒక సంవత్సరం శిక్షను ఆలీపురం జైలులో అనుభవించారు.

# ప్రకాశం జిల్లా

## గౌస్ బేగ్

1885 లో జన్మించారు. చీరాల వాస్తవ్యులు. తండ్రి ఆజీమొహిద్దీన్‌బేగ్. రైతు 1922 లో సహాయ నిరాకరణోద్యమంలో 1 సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో ఒక సంవ

త్సరం కఠిన శిక్షను రాజమండ్రి, మద్రాసు, కన్న నూరు, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1932 లో శాసనోల్లంఘన సందర్భంలో 2 సంవత్సరాల కఠిన శిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభ వించారు.

## రామచంద్రుని వెంకటప్ప

1902 లో ఒంగోలు తాలూకా టంగుటూరులో జన్మించారు. తండ్రి రామకృష్ణయ్య, కరణం. పాత్రికేయుడు. 1922 లో వేల్సు యువ రాజు బహిష్కరణ ఉద్యమంలో పాల్గొన్నందుకు 5 నెలల కఠిన శిక్ష రాజమండ్రి జైలులో అనుభ వించారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో 6 మాసాల కఠిన శిక్షను రాజమండ్రి, వెల్లూరు, మద్రాసు, ఆలీపురం, మదురై జైళ్ళలో అనుభవిం చారు. 1932 లో శాసనోల్లంఘన సందర్భంలో 5 సంవత్సరాల కఠిన శిక్షను రాజమండ్రి, బళ్ళారి వెల్‌స్లీ శానిటోరియం, బళ్ళారి జైళల్లో అనుభవిం చారు. 1941 లో వ్యక్తిసత్యాగ్రహ సందర్భంలో 6 మాసాల కఠినశిక్షను మద్రాసు, ఆలీపురం జైళ్ళలో అనుభవించారు. విడుదలైన వెంటనే సత్యాగ్రహం చేయుట వ 9 మాసాల కఠినశిక్షను తిరుచునాపల్లి, ఆలీపురం ళ్ళలో అనుభవించారు. 1942 లో క్విట్ ఇండియా ద్యమంలో 2 సంవత్సరాలు కఠిన శిక్షను ఆలీపురం, వెల్‌స్లీ శానిటోరియం జైళ్ళలో అనుభవిం చారు. సీతానగరం ఆశ్రమంలో 'కాంగ్రెసు' తెలుగు వారపత్రికకు సంపాదకులుగా వున్నారు. తామ్రపత్ర గ్రహీత.

## గేదల చంద్రయ్య నాయుడు

1890 లో పాతపట్నం తాలూకా ఇరపాడు గ్రామంలో జన్మించారు. తండ్రి వెంకునాయుడు. రైతు. 1930 లో ఉప్పు సత గ్రహ సందర్భంలో 1 సంవత్సరం కఠినశిక్ష బ ంపురం, కన్ననూరు, కడలూరు జైళ్ళలో అను వించారు. 1932 లో శాసనోల్లంఘన ఉద్యమ సందర్భంలో 2 సంవత్స రాల కఠినశిక్షను బరంపురం, బళ్ళారి జైళ్ళలో అను భవించారు. 1941 లో వ్యక్తి సత్యాగ్రహ సంద ర్భంలో 3 మాసాల కఠిన శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. కొన్నాళ్ళు జిల్లా బోర్డు సభ్యుడు గానూ పి. సి. సి. కార్యవర్గ సభ్యుడుగానూ వుండిరి.

# నెల్లూరు జిల్లా

## బెజవాడ గోపాలరెడ్డి

1907లో, బుచ్చిరెడ్డిపాలెంలో జన్మించారు. తండ్రి పట్టాభిరామరెడ్డి. 1927 లో టాగూర్ విశ్వ భారతి యూనివర్శిటీనుండి డిగ్రీ పొందారు. ఉప్పు సత్యాగ్రహంలో 3 మాసాల శిక్షను వెల్లూరు, కడ లూరు జైళ్ళలో అనుభవించారు. విడుదలైన వెంటనే మరల 6 మాసముల కఠిన శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. 1931 లో ఎ. ఐ. సి. సి. సభ్యుడు గానూ, ఆంధ్ర కాంగ్రెసు సంఘ సహాయ కార్య దర్శిగానూ వున్నారు. శాసనోల్లంఘన సందర్భంలో 18 మాసాల కఠి శిక్షను వెల్లూరు సెంట్రల్ జైలులో అనుభవించారు. 1937 లో ఉమ్మడి మద్రాస్ శాసన సభ సభ్యుడుగా ఎన్నికై స్థానిక పరిపాలన మంత్రిగా వున్నారు. 1940 వ్యక్తి సత్యాగ్రహంలో 1 సంవ త్సరంకఠిన శిక్షను వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942లో 6 మాసాల కఠిన శిక్షను వెల్లూరు, ఆలీపురం జైళ్ళలో అనుభవించారు. విడుదలైన వెంటనే 1943 వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధించబడ్డారు. 1947 నుండి తెలుగు భాషా సమితి ప్రెసిడెంట్, 1957 నుండి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రెసిడెంట్.

1946 లో మద్రాస్ శాసనసభకు ఎన్నికై ఆర్థిక శాఖ మంత్రిగా 1952 వరకు పనిచేశారు. 1953 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘ అధ్యక్షులు. 1955 మార్చి నుంచి నవంబరు 1956 వరకు ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి. ఆంధ్రప్రదేశ్ హోమ్‌మంత్రిగానూ, ఆర్థిక మంత్రిగానూ 1957 ఏప్రిల్ వరకు పనిచేశారు. 1958, 1960 లలో రాజ్యసభకు ఎన్నికయ్యారు. 1962 లో లోక్‌సభ సభ్యులు. 1963 వరకు కేంద్ర మంత్రి. 1967 నుండి 1972 వరకు ఉత్తర ప్రదేశ్ గవర్నర్.

## చుండి జగన్నాథం

1914 లో నెల్లూరులో జన్మించారు. తండ్రి నరసింహయ్య. ఖాదీ కమిషన్‌లో పనిచేసి రిటైరయ్యారు. 1932 లో శాసనోల్లంఘన సందర్భంలో 1 సంవత్సరం కఠిన శిక్షను బళ్ళారి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. బళ్ళారి జైలులో విప్లవ వాదులతో సంబంధం యేర్పడింది. 1934 లో ప్రభుత్వ వ్యతిరేక కార్యక్రమాల్లో పాల్గొన్నందున 9 నెలలపాటు మద్రాసు జైలులో వుంచిరి. తరువాత 1 సంవత్సరం కఠిన శిక్షను బళ్ళారి, కోయంబత్తూరు జైళ్ళలో అనుభవించారు. వినోబాభావే భూదాన ఉద్యమంలో పని చేశారు.

## గాదిరాజు కాళయశెట్టి

1910 లో కోవూరులో జన్మించారు. తండ్రి శేషయ్య శెటి. రైతు. 1930 లో ఉప్పు సత్యాగ్రహ సందర్భంలో 1 సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. 1933 లో కాకినాడ బాంబుకేసు సందర్భంలో 25 రోజులు పోలీసు కస్టడీలో వుంచబడ్డారు. మద్రాసు కుట్ర కేసులో 1933 నుండి 1934 వరకు మద్రాస్ సబ్ జైలులో వుంచబడ్డారు. 1934 ఏప్రియల్‌లో 3 సంవత్సరాల కఠిన శిక్షను మద్రాసు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు. కన్ననూరు జైలులో రాజకీయ ఖైదీల సౌకర్యాల కొరకు 21 రోజులపాటు ఉపవాసం చేశారు. అందుకుగాను 3 మాసాల కఠిన శిక్షను విధించగా అనుభవించారు. 1939 నుండి 1943 వరకుఈయనను ఇద్దరు పోలీసులు వెంటాడుతూ వుండేవారు. క్విట్ ఇండియా సందర్భంలో రణగర్జన అనే వారపత్రికను నడిపారు. 1976 నుండి నెల్లూరు జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘాధ్యక్షులు. అనేక గిరిజన సంఘాలు స్థాపించారు.

## వేమూరు లక్ష్మయ్య

1894 లో జన్మించారు. కోవూరు తాలూకా అలూరు వాస్తవ్యులు. తండ్రి పిచ్చయ్య. రైతు. 1914 లో బ్రిటిష్ ప్రభుత్వంపై తిరగబడమని కరపత్రాలు పంచినందుకు అరెస్టు చేసి బాదారు. మదనపల్లి జాతీయ కళాశాలలో చదివారు 1918 లో హోమ్‌రూల్ ఉద్యమంలో పనిచేశారు. వివేకానంద పేరుతో జాతీయ పాఠశాలను కావలిలో ప్రారంభించారు. 1922 లో పన్నుల నిరాకరణోద్యమంలో 1 సంవత్సరం కఠిన శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 5 మాసముల కఠిన శిక్షను రాజమండ్రి, వెల్లూరు, ఆలీపురం జైళ్ళలో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో అలూరు పోలీసు స్టేషన్ తగులబెట్టిన సందర్భంలో 1942 అక్టోబరు నుండి 1944 డిశంబరు వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధింప బడ్డారు.

## ఓరుగంటి మహాలక్ష్మమ్మ

1885 లో కృష్ణాజిల్లా విజయవాడలో జన్మించారు. తండ్రి తూములూరు శివకామయ్య. భర్త వెంకట సుబ్బయ్య. నివాసం కావలి. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో 6 మాసముల కఠిన శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. 1932లో విదేశ వస్తు బహిష్కరణ ప్రచార సందర్భంలో 1 సంవత్సరం కఠిన శిక్ష విధించి, 3 మాసాల తర్వాత వెల్లూరు జైలు నుంచి విడుదల చేశారు. 1945 లో కీర్తిశేషులు.

## మహమ్మద్ గౌస్ సాహెబ్

వ్యాపారి. తండ్రి నన్నెమియా. 1922 లో సహాయ నిరాకరణోద్యమంలో 6 మాసముల కఠిన శిక్షను వెల్లూరు, కడలూరు జైళ్ళలో అనుభవించారు.

## వెన్నెలకంటి రాఘవయ్య

1897 లో జన్మించారు. నెల్లూరు నివాసి. తండ్రి పాపయ్య. అడ్వొకేట్. 1912 లో వందేమాతరం ఉద్యమంలో చేరారు. 1921 లో సహాయ నిరాకరణోద్యమంలో 1 సంవత్సరం కఠిన శిక్షను అనుభవించారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో మూడు మాసాల శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. 1940 లో వ్యక్తి సత్యాగ్రహంలో 6 మాసాల కఠినశిక్షను వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళల్లో అనుభవించారు. 1942 లో క్విట్ ఇండియా సందర్భంలో 2 న్నర సంవత్సరాలు వెల్లూరు, అమరావతి జైళ్ళల్లో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. 1921 లో నెల్లూరు జిల్లా కాంగ్రెసు సంఘ మొదటి

ప్రధాన కార్యదర్శి. తర్వాత అధ్యక్షుడు. ఎ.ఐ.సి.సి సభ్యుడు. 1946 లో ప్రకాశం మంత్రివర్గంలో పార్లమెంటరీ కార్యదర్శిగా పనిచేశారు గిరిజనాభ్యుదయానికి గట్టి కృషి చేశారు. 1973 లో పద్మభూషణ్ బిరుదు పొందారు.

## ఖాసా సుబ్బారావు

1896 లో నెల్లూరు జిల్లాలో జన్మించారు. తండ్రి సుందరరామారావు. లాయర్. ఉపాధ్యాయుడు. ప్రముఖ పాత్రికేయుడు. రచయిత. ఫ్రీ ప్రెస్ జర్నల్, ఇండియన్ ఎక్స్ప్రెస్, స్వరాజ్య, ఆంధ్ర ప్రభ-పత్రికలలో ఎడిటర్‌గా పనిచేశారు. ఉప్పు సత్యాగ్రహంలో 6 మాసాల కఠినశిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. 1932 లో మద్రాసులో శాసనోల్లంఘన సందర్భంలో తీవ్రమైన లాఠీచార్జీవల్ల శరీరమంతా రక్తసిక్తమైపోయింది. ఈ దురంతాన్ని గురించి బ్రిటిష్ పార్లమెంటులో తీవ్రంగా ఖండించబడింది.

1932 లో 6 మాసాల కఠినశిక్షను మద్రాసు, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో 1942 సెప్టెంబరు నుండి 1944 ఏప్రిల్ వరకు మద్రాసు, వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. 1961 లో కీర్తిశేషులు.

## ఓరుగంటి వెంకటసుబ్బయ్య

1882 లో జన్మించారు. కావలి వాస్తవ్యులు. తండ్రి లక్ష్మీనారాయణప్ప. ప్లీడరు. 1921 లో సహాయనిరాకరణోద్యమంలో న్యాయవాద వృత్తిని మానివేశారు 1922 లో సహాయనిరాకరణోద్యమంలో 1 సంవత్సరం కఠినశిక్షను అనుభవించారు. ఉప్పు సత్యాగ్రహంలో 1930 లో 4 మాసముల కఠినశిక్షను నెల్లూరు, బళ్ళారి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు 1937-39 లో మద్రాసు రాష్ట్ర శాసన సభ సభ్యుడు. 1941 లో వ్యక్తి సత్యాగ్రహంలో 8 మాసాల కఠినశిక్షను వెల్లూరు, ఆలీపురం జైళ్ళలో అనుభవించారు. 1942 ఆగస్టు నుండి 1942 డిశంబరు వరకు వెల్లూరు జైలులో డిటెన్యూగా నిర్బంధించబడ్డారు. 1976 లో కీర్తిశేషులు.

## రావి ఆదిశేషయ్య

కోవూరు తాలూకా అల్లూరు వాస్తవ్యులు. తండ్రి రామయ్య. రైతు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో 2 సంవత్సరముల కఠినశిక్షను రాజమండ్రి, తంజావూరు బోర్‌స్టల్ స్కూళ్ళలో అనుభవించారు. 1932 లో శాసనోల్లంఘన ఉద్యమంలో 7 న్నర మాసాల కఠినశిక్షను అనుభవించారు. కొత్తపట్టణం రాజకీయ పాఠశాలలో చేరినందున 2 మాసాల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా సందర్భంలో 1940 జూన్ నుండి 1942 జూన్ వరకు వెల్లూరు జైలులో డిటెన్యూగా వుంచబడ్డారు. తామ్రపత్ర గ్రహీత.

## తూములూరు అనంతపద్మనాభయ్య

కోవూరు తాలూకా గండవరం గ్రామ వాస్తవ్యులు. తండ్రి రాఘవయ్య. 1922లో సహాయ నిరాకరణోద్యమంలో పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగానికి రాజీనామా చేశారు. నెల్లూరు ఖాదీ డిపో మేనేజరుగా పనిచేశారు. ఉప్పు సత్యాగ్రహంలో 1931 లో 6 మాసాల కఠినశిక్షను నెల్లూరు, వెల్లూరు, తిరుచినాపల్లి జైళ్ళల్లో అనుభవించారు. 1932, 1942 జాతీయ ఉద్యమాల్లో పాల్గొన్నారు. గొప్ప రసిక. తన యావదాస్తిని స్వాతంత్ర్య పోరాటంలో పోగొట్టుకొన్నారు. నెల్లూరు జిల్లా కాంగ్రెసు సంఘ కార్యవర్గ సభ్యుడుగానూ, నెల్లూరు పట్టణ కాంగ్రెసు సంఘ అధ్యక్షుడుగానూ పనిచేశారు.

## గణపం బాలకృష్ణారెడ్డి

1914 లో ఉదయగిరి తాలూకా వింజమూరులో జన్మించారు. తండ్రి చెన్నారెడ్డి 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో మైనర్ అయినందున అరెస్టుచేసి విడిచిపెట్టారు. 1932 లో హిందూస్తాన్ సోషలిస్టు రిపబ్లిక్ ఆర్మీలో సభ్యుడుగా చేరారు. 1933 లో మద్రాసు కుట్రకేసులో 2 సంవత్సరాల కఠినశిక్షను అనుభవించారు.

1942 లో క్విట్ ఇండియా ఉద్యమంలో వెల్లూరు జైలులో ఒక సంవత్సరం డిటెన్యూగా వుంచబడిరి. 1950 లో కీర్తిశేషులు.

## గంగా చినకొండయ్య

1917 లో ఆత్మకూరు తాలూకా వాసిలి గ్రామంలో జన్మించారు. తండ్రి సుబ్బయ్య. పాత్రికేయుడు. 1940 లో యుద్ధ వ్యతిరేక నినాదాలు చేయుటవల్ల 1 సంవత్సరం కఠిన శిక్షను వెల్లూరు. కోయంబత్తూరు ఆలీపురం జైళ్ళల్లో అనుభవించారు. 1941 జూన్ నుండి ఒక సంవత్సరం వెల్లూరు జైలులో డిటెన్యూగా వుండిరి. క్విట్ ఇండియా ఉద్యమంలో 9 మాసాలు కఠిన శిక్షను అనుభవిస్తుండగా విడుదల చేయబడ్డారు. 1943 లో అదే ఉద్యమంలో 4 మాసాల కఠిన శిక్షను ఆలీపూర్ జైలులో అనుభవించారు. పాత్రికేయుడు. 1952 లో మద్రాసు రాష్ట్ర శాసనసభ సభ్యుడుగానూ 1962 లో ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభ్యుడుగా ఎన్నుకోబడ్డారు.

## ముతరాజు గోపాలరావు

నెల్లూరు వాస్తవ్యులు. తండ్రి రంగారావు. 1920 లో చదువు మానివేశారు సహాయ నిరాకరణోద్యమ సందర్భంలో మా కొద్దు యీ తెల్ల దొరతనము అనే పాట పాడినందుకు 1922 లో 1 సంవత్సరం కఠిన శిక్షను వెల్లూరు. కడలూరు జైళ్ళల్లో అనుభవించారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో 11 మాసాల కఠిన శిక్షను నెల్లూరు. ఆలీపురం. రాజమండ్రి జైళ్ళల్లో అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహ సందర్భంలో 4 మాసాల కఠిన శిక్షను ఆలీపురం క్యాంపు జైలులో అనుభవించారు. కి ట్ ఇండియా ఉద్యమ సందర్భంలో 1942 ఆగ నుండి 1944 డిశంబరు వరకు వెల్లూరు, తంజావూ జైళ్ళల్లో డిటెన్యూగా వుంచబడ్డారు. నెల్లూరు పట్టణ కాంగ్రెసు సంఘ అధ్యక్షుడు.

## చీళ్ళ గురునాథం

1905 లో వెంకటగిరిలో జన్మించారు. తండ్రి పుల్లయ్య. 1932 లో శాసనోల్లంఘన ఉద్యమంలో 1 సంవత్సరం కఠిన శిక్షను వెల్లూరు, కన్ననూరు జైళ్ళల్లో అనుభవించారు. 1941 లో వ్యక్తి సత్యాగ్రహ సందర్భంలో 3న్నర మాసాలు కఠిన శిక్షను నెల్లూరు. బళ్ళారి. ఆలీపురం జైళ్ళల్లోఅనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 నవంబరు నుండి 1944 డిశంబరు వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళల్లో డిటెన్యూగా వుంచబడ్డారు.

## ఓరుగంటి రామచంద్రయ్య

1912 లో కావలిలో జన్మించారు. తండ్రి వెంకట సుబ్బయ్య. 1930 లో ఉప్పుసత్యాగ్రహ సందర్భంలో 6 మాసాల శిక్షను వెల్లూరు బళ్ళారి జైళ్ళల్లో అనుభవించారు. కాకినాడ బాంబుకేసు సందర్భంలో భయంకరా చారితోపాటు అరెస్టు చేయబడ్డారు. 2½ సంవత్సరాల కఠిన శిక్షను అనుభవించారు. యమ్.ఏ.పి. హెచ్.డి (లండన్) ఆంధ్ర యూనివర్శిటీలో చరిత్ర శాఖకు అధిపతిగా పనిచేశారు. అనేక చారిత్రక గ్రంధాలు రచించారు. మీరాబాయి కీర్తనలు తెనిగించారు.

## బొమ్మా శేషురెడ్డి

1901 లో జన్మించారు. కోవూరు తాలూకా గండరం వాస్తవ్యులు. తండ్రి అయ్యప రెడ్డి. 1920 లో నాగపూర్ కాంగ్రెసుకు ప్రతినిధిగా వెళ్ళారు. 1930 లో ఉప్పుసత్యాగ్రహంలో 3మాసాల కఠిన శిక్షను వెల్లూరు, బళ్ళారి జైళ్ళల్లో అనుభవించారు. 1941 లో వ్యక్తి సత్యాగ్రహంలో 3 మాసాల కఠిన శిక్షను ఆలీపురం జైలులో అనుభవించారు. 1942 లో క్విట్ ఇండియా ఉద్యమంలో 2½ సంవత్సరాలపాటు వెల్లూరు తంజావూరు జైళ్ళల్లో డిటెనూ గా వుంచబడిరి. స్వాతంత్ర్య సమరయోధుల పెన్స్కీము రాష్ట్ర సలహా సభ సభ్యుడు. తామ్ర గ్రహీత.

## పొట్టి శ్రీరాములు

1901 లో మద్రాసులో జన్మించారు. కావలి తాలూకా జువ్వలదిన్నె గ్రామవాసులు. తండ్రి గురవయ్య. 1927 లో శానిటరీ ఇంజనీర్ ఆఫీసులో ఉద్యోగం మానివేసి సబర్మతీ ఆశ్రమంలో చేరారు. గుజరాత్‌లో గ్రామసేవాశ్రమ సంఘంలో 1 న్నర సంవత్సరం పనిచేశారు. కృష్ణాజిల్లా కొమరువోలు గాంధీ ఆశ్రమంలో 4 సంవత్సరాలు పనిచేశారు శాసనోల్లంఘన, వ్యక్తి సత్యాగ్రహం, ఉప్పుసత్యాగ్రహ ఉద్యమాలలోపాల్గొని శిక్షింపబడ్డారు. 1943లో క్విట్ ఇండియా ఉద్యమంలో 6 మాసాల కఠిన శిక్షను ఆలిపూర్ జైలులో అనుభవించారు. సర్వోదయ, హరిజన ఉద్యమాలలో పనిచేశారు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కొరకు 19-10-1952 నుండి 15-12-1952 వరకు

58 రోజులు నిరాహార వ్రతంచేసి ప్రాణాలు కోల్పోయారు. వీరి నిరాహారదీక్ష ఫలితంగా, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది.

# కడప జిల్లా

## యర్రపురెడ్డి ఆదినారాయణరెడ్డి

1916 లో రాయవరంలో జన్మించారు. తండ్రి నాగిరెడ్డి. బి.ఏ. రైతు. వ్యక్తి సత్యాగ్రహంలో 1941 లో 3 మాసాల శిక్షను వెల్లూరు సెంట్రల్ జైలులో అనుభవించారు. జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యుడు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 డిశంబరు నుండి 2 సంవత్సరాలు వెల్లూరు, తంజావూరు జైళ్ళల్లో డిటెన్యూగా వుంచబడిరి 1969 నుండి ఏ.ఐ.సి.సి. సభ్యుడు. 1940–49 వరకు జిల్లా కాంగ్రెసు సంఘ అధ్యక్షుడు. ఆజాద్ హింద్ అనే తెలుగు వారపత్రికకు సంపాదకుడు. 1952 నుండి 1954 వరకు, 1954 నుండి 1962 వరకు యం.ఎల్.ఎ.గానూ, 1964 నుండి 1970 వరకు రాజ సభ సభ్యుడుగాను వున్నారు. 1974 లో ఆంధ్ర లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడుగా ఎన్నికయ్యా .

## కె. బాలనారాయణరెడ్డి

ప్రొద్దుటూరు వ్యాస్తవ్యులు. తండ్రి చెంచురెడ్డి. అడ్వకేట్. 1921. 1930 స్వాతంత్ర్య పోరాట ఉద్యమాలలో పాల్గొన్నారు. 6 మాసాల కఠిన శిక్ష అనుభవించారు. 1941 లో వ్యక్తి సత్యాగ్రహంలో 5 నెలల కఠిన శిక్షను వెల్లూరు, బళ్ళారి, ఆలీపురం జైళ్ళల్లో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 డిసెంబరు నుండి 1944 డిసెంబరు వరకూ వెల్లూరు, తంజావూరు జైళ్ళల్లో డిటెన్యూగా వుంచబడిరి. ఆంధ్ర యూనివర్శిటీ సెనేట్ సభ్యుడు. కడప జిల్లా కాంగ్రెసు సంఘ సభ్యుడుగా వున్నారు.

## వై. ఈశ్వరరెడ్డి

1915 లో జమ్మలమడుగు తాలూకా పెద్ద పసుపుల గ్రామంలో జన్మించారు. తండ్రి చినవెంకట సుబ్బారెడ్డి. బి.ఏ. 1941 లో వ్యక్తి సత్యాగ్రహంలో 3 మాసాల శిక్షను వెల్లూరు, ఆలీపురం జైళ్ళల్లో అనుభవించారు. పాలూరులో మొదటి రైతు సభను యేర్పాటు చేశారు. 1941 లో జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యుడు. 1945 లో కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు. 1952–57 లో లోక్‌సభ సభ్యుడుగానూ 1958–62 లో ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడుగానూ ఎన్నుకోబడిరి. కడప నియోజకవర్గంనుండి 1962, 67, 71 లలో లోక్‌సభ సభ్యుడుగా ఎన్నుకోబడ్డారు.

## వై. బి. కొండారెడ్డి

1900 లో పులివెందల తాలూకా పెజూతూర్‌లో జన్మించారు. తండ్రి పెద బూసిరె . వ్యక్తి సత్యాగ్రహంలో శిక్ష అనుభవించారు. కి ఇండియా ఉద్యమంలో తీవ్రమైన లాఠీఛా కి గురయ్యారు. 1942 డిసెంబరునుండి 1 సంవత్స ం కఠిన శిక్షను ఆలీపూర్ క్యాంపు జైలులో అనుభవించారు. విడుదలైన వెంటనే 1945 వరకు కన్ననూర్, తంజావూరు, వెల్లూరు జైళ్ళల్లో డిటెన్యూగా వుంచబడిరి. 6 వేల రూపాయల విలువ చేసే వీరి ఆస్తి వేలంవేయబడింది. జిల్లా కాంగ్రెసు సంఘ కార్యదర్శిగానూ, ఏ.ఐ.సి.సి. సభ్యుడుగానూ వున్నారు.

## కోటిరెడ్డిగారి కోటిరెడ్డి

1886 లో చిత్తూరుజిల్లా మాదేనపల్లి తాలూకా కోటిరెడ్డిగారి పల్లిలో జన్మించారు. కడప నివాసి. తండ్రి సిద్దారెడ్డి. బారిష్టరు, రైతు. 1919–20 లో గాంధీ రాయలసీమ పర్యటనలో ఆయన వెంట వున్నారు. వ్యక్తి సత్యాగ్రహంలో 1940 లో 8 నెలల శిక్షను వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళల్లో అనుభవించారు. క్విట్ఇండియా ఉద్యమలో 1942 ఆగస్టు నుండి 1943 డిసెంబరు వరకు వెల్లూరు, అమరావతి జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధించబడ్డారు. ఆంధ్ర మహాసభకు అధ్యక్షుడు. ఉమ్మడి మద్రాస్ రాష్ట్ర 1946–47 లో ఎండోమెంట్సు, ఎక్సైజ్ మంత్రిగానూ, 1953–54 లో ఆంధ్రరాష్ట్ర రివిన్యూ మంత్రిగానూ, 1962 వరకు శాసనసభ్యుడుగానూ, 1964–70 వరకు ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడుగానూ వున్నారు.

## కల్లూరు ఓబులరెడ్డి

1919 లో జమ్మలమడుగు తాలూకా పెనికలపాడు గ్రామంలో జన్మించారు. తండ్రి పెద్ద మునయ్య.

రైతు. 1941 లో వ్యక్తి సత్యాగ్రహంలో 10 రోజులపాటు నిర్బంధంలో వుంచబడిరి. క్విట్ ఇండియా ఉద్యమంలో 1943 నుండి 2 సంవత్సరాల కఠిన శిక్షను ఆలీపూర్ క్యాంపు జైలులో అనుభవించారు. అనంతపూర్ రాష్ట్రీ కాంగ్రెసు బ్రాంచి ఆఫీసు సంయుక్త కార్యదర్శిగా పనిచేశారు.

## పోతురాజు పార్థసారథి

1916 లో రాజంపేట తాలూకా కోడూరులో జన్మించారు. తండ్రి గంగిచెట్టి. శాసనోల్లంఘన ఉద్యమంలో చదుపు మానివేశారు. అడవి సత్యాగ్రహ ఉద్యమంలో తీవ్రమైన లాఠీదెబ్బలు తిన్నారు. వ్యక్తి సత్యాగ్రహంలో 8 మాసాల కఠిన శిక్షను వెల్లూరు, ఆలీపురం జైళ్ళల్లో అనుభవించారు. 1943 లో క్విట్ ఇండియా ఉద్యమంలో మద్రాసు కాలేజీలను బహిష్కరింపమని విద్యార్థులను రెచ్చగొట్టగా 6 నెలల కఠిన శిక్షను ఆలీపురం క్యాంపు జైలులో అనుభవించారు. రవీంద్రుని గీతాంజలిని తెలుగులోనికి, కాళిదాసు కుమారసంభవాన్ని ఇంగ్లీషులోనికి అనువదించారు.

1935–38 లో ఎ.ఐ.సి.సి. సభ్యుడుగానూ, జిల్లా కాంగ్రెసు సంఘ ప్రధాన కార్యదర్శిగానూ పని చేశారు. 1955–62 లో ఆంధ్రప్రదేశ్ యమ్.ఎల్.ఎ. గానూ, 1967 లో లోక్‌సభ సభ్యుడుగా ఎన్నికో బడారు. 1970–71 లో కేంద్ర డిప్యూటీ మంత్రి, 1971 లో తిరిగి లోక్‌సభకు ఎన్నికయ్యారు.

## భాస్కర రామశాస్త్రి

1909 లో చిత్తూరుజిల్లా పుంగనూరులో జన్మించారు. జమ్మలమడుగు నివాసి. తండ్రి వెంకట్రామయ్య. జర్నలిస్టు — 1934 లో హరిజన బాలుర హాస్టల్ నడిపారు. యుద్ధనిధి వసూళ్ళకు వ్యతిరేక ప్రచారం చేసినందుకు 1940 లో 18 మాసాల కఠిన శిక్షను వెల్లూరు, తిరుచనాపల్లి, ఆలీపురం జైళ్ళల్లో అనుభవించారు. క్విట్ఇండియా ఉద్యమంలో 1 సంవత్సరం కఠిన శిక్షను ఆలీపూర్ క్యాంపు జైలులో అనుభవించారు. ఉప్పలపాడు గ్రామంలో రాజకీయ పాఠశాలను నడిపారు. 1943 నుండి 1944 వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా వుంచబడిరి. 1946 లో జమ్మల మడుగులో జిల్లా చేనేతవారి సంఘాన్ని ఏర్పాటు చేశారు. తామ్రపత్ర గ్రహీత.

# కర్నూల్ జిల్లా

## సిర్‌దార్ అమరావతమ్మ

కోట కర్నూల్ నివాసి. తండ్రి ఎనుముల అంకన్న. భర్త నాగప్ప వ్యక్తి సత్యాగ్రహంలో 2 నెలలపాటు కర్నూల్ సబ్ జైలులో వుంచబడిరి. 1941 నుంచి 10 మాసాల కఠినశిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 లో 1 సంవత్సరం శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. కీర్తిశేషులు.

## కానాల అంకిరెడ్డి

1916 లో కోయలకుంట్లలో జన్మించారు. తండ్రి రామస్వామిరెడ్డి. రైతు. గుంటూరుజిల్లా మంతెన వారి పాలెంలోని రాజకీయ పాఠశాలలో 1937 లో శిక్షణ పొందారు. వ్యక్తి సత్యాగ్రహంలో 5 నెలల కఠినశిక్షను బళ్లారి ఆలీపురం జైళ్ళల్లో అనుభవించారు. క్విట్ఇండియా ఉద్యమంలో పాల్గొనిరి. 1946–51లో జిల్లా కాంగ్రెసు సంఘ సెక్రటరీగా పని చేశారు. 1955–58 లో వెంకటేశ్వర యూనివర్శిటీ సెనేట్ సభ్యుడు.జిల్లా పరిషత్ ఉపాధ్యక్షుడు జిల్లా కో-ఆపరేటివ్ మార్కెటింగ్ సొసైటీకి డైరెక్టరు. ఇంకా అనేక సంఘాలకు సభ్యుడుగాను దేవాలయాల మేనేజింగ్ ట్రస్టీగాను ఉన్నారు. 1978 లో ఆంధ్రప్రదేశ్ శాసనసభా సభ్యుడుగా ఎన్నుకోబడిరి.

## కాశిరెడ్డి దయానందరెడ్డి (హుస్సేన్ రెడ్డి)

నంద్యాల తాలూకా తొగిర్చేడు గ్రామ వాస్తవ్యులు. తండ్రి బాలిరెడ్డి. రైతు. వ్యక్తి సత్యా · హంలో 5 నెలల కఠినశిక్షను బళ్లారి. ఆలీపూర్ ళ్ళల్లో అనుభవించారు. దేశ రక్షణ చట్టం క్రింద ల 1941 లో 9 మాసాల కఠినశిక్షను బళ్ళారి ఆలీపూర్ జైళ్ళలో అనుభవించారు క్విట్ ఇండియా ఉద్యమంలో 5 సంవత్సరాల శిక్ష విధించి 12

దెబ్బలు కొట్టి అలీపూర్ క్యాంపు జైలులో వుంచబడిరి. కాని ఒక నెల తరువాత నిర్దోషి అని విడిచి పెట్టబడ్డారు. నంద్యాల తాలూకా కాంగ్రెసు సంఘ కార్యదర్శిగా వున్నారు.

## దాశరథి గోవిందదాస్

1899 లో ఆలూరు తాలూకా చింతగుంట గ్రామంలో జన్మించారు. తండ్రి నరసింహయ్య. టీచర్ పోస్టుకు రాజీనామా ఇచ్చి 1930లో కాంగ్రెసులో చేరారు. వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని 1940 లో 6 మాసాల కఠినశిక్షను బళ్ళారి, వెల్లూరు జైళ్ళల్లో అనుభవించారు. 1933 లో హరిజన హాస్టల్ నెడిపారు. 1937 లో 1946 లో మద్రాస్ శాసనసభ సభ్యునిగా ఎన్నుకోబడిరి. 1967 లో ఆంధ్రప్రదేశ్ శాసన సభకు ఎన్నుకోబడిరి. 1972 లో కీర్తిశేషులు.

## గద్దె హంబ్బోజీరావు

1912 లో కర్నూల్‌లో జన్మించారు. కుట్టుపని వృత్తి. 1941 లో యుద్ధ వ్యతిరేక నినాదాలు చేసినందులకు 2 నెలల కఠిన శిక్షను అలీపూర్ల క్యాంపు జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో 2 సంవత్సరాల కఠిన శిక్షను అలీపురం క్యాంపు జైలులో అనుభవించారు.

## దేశాయి కుప్పూరావు

నంద్యాల నివాసి. తండ్రి గుండూరావు. రైతు. వ్యక్తి సత్యాగ్రహంలో 6 నెలల కఠిన శిక్షను బళ్ళారి, అలీపురం జైళ్ళల్లో అనుభవించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 డిశంబరు నుండి 1944 డిశంబరు వరకు తంజావూరు, వెల్లూరు జైళ్ళల్లో డిటెన్యూగా వుంచబడిరి.

## పులకుర్తి లక్ష్మిరెడ్డి

1905లో కర్నూల్ తాలూకా ఉలచల గ్రామంలో జన్మించారు. కర్నూల్ నివాసులు. అడ్వకేట్. వ్యక్తి సత్యాగ్రహంలో 6 నెలల కఠినశిక్షను అలీపూర్ క్యాంపు జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా సందర్భంలో 1942 అక్టోబరు నుండి 1944 డిశంబరు వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళల్లో డిటెన్యూగా వుంచబడిరి. జిల్లాబోర్డు మెంబరుగను ఉపాధ్యక్షునుగాను ఎన్నుకోబడిరి తాలూకాబోర్డు ప్రసిడెంటు. 1946లో ఎ.ఐ.సి.సి.సభ్యుడుగా ఎన్నుకోబడిరి. 1938 నుండి 1942 వరకు జిల్లా హరిజన సేవక సంఘ కార్యదర్శి 1940 లో ఆంధ్ర యూనివర్శిటీ సెనెట్ సభ్యుడు. 1958-60 వెంకటేశ్వర యూనివర్శిటీ సెనెట్ సభ్యుడు. కర్నూల్ బార్ ఎసోసియేషన్ అధ్యక్షుడు.

## రెడ్డెం కొండా రెడ్డి రామలింగారెడ్డి

1922 లో ఆళ్ళగడ్డ తాలూకా చాగలమర్రి గ్రామంలో జన్మించారు. సేవాగ్రామం, శాంతి నికేతన్‌లలో చదివారు. వ్యక్తి సత్యాగ్రహంలో 4 మాసాల కఠిన శిక్షను బళ్లారి, అలీపురం జైళ్ళల్లో అనుభవించారు. క్విట్ ఇండియా సందర్భంలో 1సంవత్సరం కఠినశిక్షను అలీపురం క్యాంపు జైలులో అనుభవించారు. తూర్పు బెంగాల్‌లో 1946 లో నవ ఖాలీ శాంతి యాత్రలో గాంధీతోపాటు పాల్గొన్నారు. 1940 లో తాలూకా కాంగ్రెసు సంఘాధ్యక్షుడు. 1941 నుండి 1946 వరకు జిల్లా కాంగ్రెసు సంఘ కార్యదర్శి. ఆంధ్ర యూనివర్శిటీ సెనెట్ సభ్యుడు. జిల్లాబోర్డు సభ్యుడు. జిల్లా గ్రంథాలయ చైర్‌మెన్. సర్వోదయ భూదాన ఉద్యమాలతో సన్నిహిత సంబంధం వుండేది. ఖాదీ, గ్రామ పరిశ్రమ సంఘ డైరెక్టరు.

## యమ్. శంషేర్ బేగ్.

1916 లో కర్నూల్‌లో జన్మించారు. పాణ్యం నివాసి. తండ్రి క్వాదర్‌బేగ్. రైతు. వ్యక్తి సత్యాగ్రహంలో 9 నెలల కఠినశిక్షను వెల్లూరు, అలీపురం జైళ్ళల్లో అనుభవించారు.

క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 లో 1 సంవత్సరం కఠినశిక్షను అలీపురం క్యాంపుజైలులో అనుభవించారు. జిల్లాబోర్డు సభ్యుడు. ఆంధ్ర యూనివర్శిటీ, మద్రాస్ యూనివర్శిటీ సెనెట్ సభ్యులుగా 1948-49 లో వుండిరి. 1966, 1972 లో రెండు దఫాలు ఆంధ్రప్రదేశ్ కౌన్సిల్ సభ్యుడుగా ఎన్నుకోబడ్డారు.

## నయుకాంతి సంకరరెడ్డి

1898 లో కర్నూల్ తాలూకా ముడుమల గ్రామములో జన్మించారు. తండ్రి కృష్ణారెడ్డి. బి.ఎ. చదువుతూ సహాయ నిరాకరణోద్యమంలో చదువు మానేశారు. 1940 లో యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసినందుకు 9 నెలల కఠిన శిక్షను వెలూరు, తిరుచునాపల్లి జైళ్ళల్లో అనుభవించారు. 1942 అగస్టు నుండి 1944 డిశంబరు వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా వున్నారు. 1952–53 లో రాజగోపాలాచారి మంత్రివర్గంలో స్థానిక పరిపాలన శాఖ మంత్రి. 1935-38 లో జిల్లా బోర్డు అధ్యక్షుడు. 1937–52 వరకు ఉమ్మడి మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడు.

## చొల్లవరం వెంకట సుబ్బారెడ్డి

1903 లో కోయలకుంటలో జన్మించారు. తండ్రి రామస్వామిరెడ్డి. అడ్వకేట్. వ్య సత్యాగ్రహంలో 6 నెలల కఠినశిక్షను ఆలీపురం కా ంపుజైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ద్యమంలో 1942 అక్టోబరు నుండి 1945 వరకు తంజావూరు, వెల్లూరు జైళ్ళల్లో డిటెన్యూగా వు చబడిరి. 1955 నుండి 1974 వరకు ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభ్యుడు. 1962, 1967 లో ఆంధ్రప్రదేశ్ శాసనసభా స్పీకరుగా ఎన్నుకోబడిరి. 1965 లో సోవియట్ రష్యా వెళ్ళిరి. 1970 లో లండన్‌లో కామన్‌వెల్తు పార్లమెంటరీ ఎసోసియేషన్ సెమినార్‌కు హాజరైరి. జపాన్ మొదలైన అనేక విదేశాలలో పర్యటించారు. పి.వి. నరసింహారావు మంత్రివర్గంలో డిప్యూటీ చీఫ్ మినిష్టర్‌గా 1971 లో నియమింపబడిరి. వెంగళరావు మంత్రివర్గంలో డిప్యూటీ చీఫ్ మినిష్టర్‌గా 1973 లో నియమింపబడిరి. 1974 లో కీర్తిశేషులు.

## నివర్తి వెంకట సుబ్బయ్య

1910 లో పత్తికొండలో జన్మించారు. నంద్యాల నివాసి. తండ్రి అచ్చయ్య. బి ఏ. గవర్నమెంటు ఉద్యోగానికి రాజీనామా యిచ్చారు. స్వరాజ్య పత్రికకు సబ్ ఎడిటర్‌గా పనిచేశారు. వ్యక్తి సత్యాగ్రహ సందర్భంలో 1940 లో 8 మాసాల కఠిన శిక్షను వెల్లూరు, ఆలీపురం జైళ్ళలో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో రహస్యంగా పని చేయుటవల్ల యీయనను పట్టించి యిచ్చినవారికి వెయ్యి రూపాయల బహుమతి యివ్వబడునని ప్రభుత్వం ప్రకటించింది. 1944 లో సేవాగ్రామంలో గాంధీగారివద్ద 2 మాసాలపాటు ఉండిరి. గాంధీజీ సలహా ప్రకారం పోలీసులకు లొంగిపోయారు. 6 మాసాలపాటు కర్నూల్ సబ్ జైలులో వుంచి విడుదల చేశారు. 1946–52 ఉమ్మడి మద్రాస్ రాష్ట్ర శాసనసభ సభ్యుడు. 1958–64 వరకు ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడు. 1937–1971 వరకు పి.సి.సి. సభ్యుడుగానూ 1937–48 వరకు కార్యవర్గ సభ్యుడుగానూ, కర్నూలు జిల్లా కాంగ్రెస్ సంఘ ప్రధాన కార్యదర్శిగానూ, 60–64 కో అధ్యక్షుడుగానూ వున్నారు. "మన సీమ" అనే వార పత్రికను 1953–55 వరకు నడిపారు. ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య సమరయోధుల సలహా సంఘసభ్యుడుగా 1974–76 వరకు ఉండిరి. 1974 లో ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిల్ చైర్‌మెన్‌గా వుండిరి. 1978 లో కీర్తిశేషులు.

# అనంతపూర్ జిల్లా

## పెద్దగొంది కొండప్ప

1905 లో జననం. అనంతపూర్ తాలూకా సింగనమల, గ్రామ నివాసి. తండ్రి సుబ్బారాయుడు. వ్యాపారస్థుడు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో 18 నెలల కఠినశిక్షను బళ్ళారి జైలులో అనుభవించారు. 1941 లో వ్యక్తి సత్యాగ్రహంలో 4 మాసముల కఠినశిక్షను బళ్ళారి జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 నుండి 1944 వరకు డిటెన్యూగా వేలూరు తంజావూరు జైళ్ళలో వుంచబడిరి. రెండుసార్లు మునిసిపల్ కౌన్సిల్ సభ్యుడుగాను, ఒకసారి ఉపాధ్యక్షుడుగాను ఎన్నికయ్యారు. జిల్లా కాంగ్రెస్ సంఘ కార్యదర్శిగాను, రాష్ట్ర కాంగ్రెసు సంఘ సభ్యుడుగా వుండిరి.

## తరిమెల నాగిరెడ్డి

1917 లో తరిమల గ్రామంలో జన్మించారు. తండ్రి సుబ్బారెడ్డి. యమ్. ఏ. యల్. యల్. బి

బెనారస్ యూనివర్శిటీలో చదివారు. 1939 లో విద్యార్థిగా వున్నప్పుడే నిషేధ సాహిత్యాన్ని పంచినందుకు 1 సంవత్సరం కఠినశిక్ష అనుభవించారు. 1940 లో వ్యక్తి సత్యాగ్రహంలో 1 సంవత్సరం కఠినశిక్షను బళ్ళారి, వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళల్లో అనుభవించారు. 1941 నుండి 1942 వరకు వెల్లూరు జైలులో డిటెన్యూగా వుంచబడిరి. ఆంధ్రప్రదేశ్ మార్క్సిస్టుపార్టీ కార్యదర్శిగాను, ఆంధ్ర రాష్ట్ర శాసనసభలో 1953–54 లోనూ 1962–67లో ఆంధ్ర ప్రదేశ్ శాసనసభ ప్రతిపక్ష నాయకుడు. 1968 లో విప్లవ కమ్యూనిస్టు పార్టీలో చేరి శాసనసభ సభ్యత్వానికి రాజీనామా చేశారు.

## హరె సముద్రం నరసింగరావు

1908 లో మడకశిర తాలూకా హరెసముద్రంలో జన్మించారు. తండ్రి లక్ష్మీపతిరావు, సీతానగరం గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమంలో 1929 లో చేరారు. ఉప్పు చేయుట, కల్లు అంగళ్ళ వద్ద 144 సెక్షన్ ధిక్కరించి పికెటింగు చేయు సందర్భంలో ఒక నెల కఠినశిక్షను అనుభవించారు. దర్శన ఉప్పుకొటారిమీద దాడిచేసినప్పుడు తీవ్రమైన లాఠీఛార్జికి గురయ్యారు. 1932 లో సహాయనిరాకరణోద్యమంలో 6 నెలల కఠినశిక్షను బళ్ళారిజైలులో అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహంలో 1941 ఏప్రియల్ నుండి జులై వరకు అలీపురం జైలులో 4 మాసాల కఠినశిక్షను అనుభవించారు. క్విట్ఇండియా ఉద్యమంలో 1942 లో విరాళాలను పోగుచేయుచుండగా ఒక నెల శిక్షను విజయవాడలో అనుభవించారు. 1935–42 వరకు రాష్ట్ర కాంగ్రెసు సభ్యులు. 1941 నుండి 1945 వర్కకు జిల్లా కాంగ్రెసు కార్యదర్శి.

## ప్రభాకర్ జీ (జోసెఫ్)

అనంతపూర్ నివాసి. తల్లి సుబ్బమ్మ. మచిలీపట్నంలో జాతీయ కళాశాలలో 1936 నుండి 1939 వరకు చదివారు, గాంధీగారి రచనలవల్ల ప్రభావితుడై అహింసావాదిగా మారారు. వార్ధాలో సేవాగ్రామ ఆశ్రంమలో 12 సంవత్సరాలు ఉండిరి. క్విట్ఇండియా సందర్భంలో 1943 లో ఒక నెల రోజులు రాయవేళ్లూరు జైలులో వుంచబడిరి. ఆంధ్రప్రదేశ్ సర్వోదయమండలి అధ్యక్షుడు, సేవాగ్రామ ఆశ్రమ కార్యదర్శి. అఖిల భారత ప్రకృతి చికిత్సా సంఘ ఉపాధ్యక్షుడు. ఆంధ్రప్రదేశ్ భూదాన యజ్ఞబోర్డుకు ఛైర్మెన్. ఇంకా అనేక సంస్థలకు సభ్యుడూ, కార్యదర్శి.

## నీలం రాజశేఖరరెడ్డి

1918 లో జననం. అనంతపురం తాలూకా ఇల్లూరు వాస్తవ్యులు. తండ్రి చిన్నప్పరెడ్డి, మదనపల్లిలోనూ కాశీ హిందూ విశ విద్యాలయంలోనూ చదివారు. 1938 లో కమ్యూని పార్టీలో చేరారు. ఒక సంవత్సరం ఆగ్రా సె ల్ జైలులో డిటెన్యూగా వుంచబడ్డారు. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉపన్యసించుటవల్ల 1942 లో 1 సంవత్సరం కఠిన శిక్ష విధించి,అలీపురం జైలులో శిక్ష అనుభవిస్తుండగా ఒక నెల తర్వాత వదలివేశారు. 1943 లోనూ 1947 లోనూ అరెస్టు చేశారు. 1947 ఆగస్టు 15 న విడుదల చేశారు. భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యవర్గ సభ్యులు.

## పప్పూర్ రామాచార్లు

1896 లో జన్మించారు. అనంతపూర్ నివాసి. తండ్రి నరసింహాచార్యులు. కొంతకాలం పినాకిని పత్రిక నడిపారు. 1926 లో "సాధన" వారపత్రిక సంపాదకుడు. 1932 లో శాసనోల్లంఘన ఉద్యమంలో 1 సంవత్సరం కఠినశిక్షను బళ్ళారి సెంట్రల్ జైలులో అనుభవించారు.

క్విట్ఇండియా ఉద్యమంలో 1942 సెప్టెంబరు నుండి డిటెన్యూగా తంజావూరు జైలులో నిర్బంధింపబడి 1943 డిసెంబరులో విడుదల చేయబడ్డారు. అనంతపురం మున్సిపల్ ఛైర్మెన్గా 1947 నుండి 51 వరకు వుండిరి. రాష్ట్ర శాసనసభ సభ్యుడుగా 1955 నుండి 1961 వరకు ఉండిరి. 1972 లో కీర్తిశేషులు.

## నీలం సంజీవరెడ్డి

1913 లో అనంతపురం తాలూకా ఇల్లూరులో జని ంచారు. తండ్రి చిన్నప్పరెడ్డి. కాలేజీ చదువు మా వేసి, 1931 లో స్వాతంత్ర్యోద్యమంలో చేరారు. 194 లో వ్యక్తి సత్యాగ్రహంలో 6 మాసముల

కఠిన శిక్షను వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళల్లో అనుభవించారు. 1941 జూన్‌నుండి 1942 మార్చి వరకు వెల్లూరు జైలులో డిటెన్యూగావుండిరి. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 ఆగస్టు నుండి 1945 ఆఖరువరకు వెల్లూరు, అమరావతి జైళ్ళలో డిటెన్యూగా వుంచబడిరి. 1946 లో మద్రాసు శాసన సభ్యుడుగాను, ఆ తర్వాత మద్రాసు కాంగ్రెసు లెజిస్లేటివ్ పార్టీ కార్యదర్శిగా పనిచేశారు.

మద్రాస్ రాష్ట్ర కుమార రాజామంత్రి వర్గంలో, 1949-51 వరకు మద్యనిషేధం, అడవుల గృహ నిర్మాణ శాఖల మంత్రిగా వున్నారు. 1951-53 వరకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘ అధ్యక్షుడు, కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యుడు. 1952, 53 లో రాజ్యసభ సభ్యుడు. 1953 లో ప్రకాశం మంత్రి వర్గంలో ఆంధ్రరాష్ట్ర ఉప ముఖ్యమంత్రి. గోపాలరెడ్డి మంత్రివర్గంలోఅదే పదవిలో వున్నారు. 1956 నుండి 1959 వరకు ఆంధ్రప్రదేశ్ ప్రధమ ముఖ్య మంత్రి. 1959 నుండి1962వరకు అఖిలభారత కాంగ్రెసు సంఘ అధ్యక్షుడు. మరల 1962ఏప్రియల్ నుండి 1964ఫిబ్రవరివరకు ఆంధ్రప్రదేశ్‌ముఖ్యమంత్రి 1964 లో కేంద్రంలో లాల్‌బహదూర్ శాస్త్రి మంత్రి వర్గంలో ఉక్కుగనుల శాఖా మంత్రి. 1966 లో ఇందిరాగాంధి మంత్రి వర్గంలో పౌర విమానశాఖ మంత్రి. 1967 నుండి 1969 జూలై వరకు లోక్‌సభ స్పీకరు. భారత రాష్ట్రపతిగా 5 సంవత్సరాలు వున్నారు.

## కల్లూరు సుబ్బారావు

1897 లో హిందూపురం తాలూకా, కల్లూరులో జన్మించారు. తండ్రి సూరప్ప. తెలుగు విద్వాన్, ఉపాధ్యాయుడుగా కొంతకాలం పనిచేశారు. అనిబిసెంటు హోమ్‌రూల్ ఉద్యమంలో పనిచేశారు. 1921 లో రాయలసీమలో సత్యాగ్రహంలో పాల్గొన్న మొదటి సత్యాగ్రహి. మద్యపాన నిషేధ ప్రచార సందర్భంలో 1 నెల కఠిన శిక్షను అనుభవించారు. సహాయ నిరాకరణోద్యమ సందర్భంలో 1 సంవత్సరం కఠినశిక్షను తిరుచునాపల్లి, కడలూరు జైళ్ళలో అనుభవించారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహ కాలంలో 1 సంవత్సరం కఠిన శిక్షను బళ్ళారి, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. శాసనోల్లంఘన ఉద్యమంలో 1932 జనవరి నుండి 1933 వరకు 1 సంవత్సరం విడి శిక్షను బళ్ళారి, కోయంబత్తూరు జైళ్ళల్లో అనుభవించారు. 1940 లో వ్యక్తి సత్యాగ్రహ సందర్భంలో 1 సంవత్సరం కఠిన శిక్షను అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో 1942 ఆగస్టు నుండి 1944 వరకు వెల్లూరు, నాగపూర్, అమరావతి జైళ్ళలో డిటెన్యూగా వుంచబడిరి. కొన్ని సంవత్సరాలపాటు ఎ. ఐ. సి. సి. సభ్యుడు. రెండు పర్యాయాలు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యదర్శి. 1937 నుండి చాలాకాలం మద్రాసు శాసన సభ్యుడు. జిల్లా కాంగ్రెసు సంఘ అధ్యక్షుడుగా చాలాకాలం వుండిరి. గొప్ప వక్త. చురుకైన కార్యకర్త. రాయలసీమ ప్రముఖ వృద్ధ నాయకులుగా ప్రసిద్ధి చెందారు. 1973 లో కీర్తిశేషులు.

## ఇదుకల్లు సదాసివన్

అనంతపురం నివాసి. తండ్రి చెన్నప్ప. ఉప్పు సత్యాగ్రహ సందర్భంలో 6 మాసముల కఠినశిక్షను బళ్ళారి జైలులో అనుభవించారు. 1932 లో శాసనోల్లంఘన ఉద్యమంలో 1 సంవత్సరం కఠినశిక్షను బళ్ళారి జైలులో అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహంలో 1 సంవత్సరం కఠిన శిక్షను ఆలీపురం, బళ్ళారి జైళ్ళల్లో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 లో శిక్ష విధించి ఆలీపురం జైలుకు పంపబడిరి.

# చిత్తూరు జిల్లా

## మాడభూషి అనంతశయనం అయ్యంగార్

1891 లో చంద్రగిరి తాలూకా తిరుచానూరులో జన్మించారు. నివాసం తిరుపతి. తండ్రి వెంకట వరదాచారి, అడ్వకేట్. లెక్కల ఉపాధ్యాయుడుగా పనిచేశారు. 1921 లో తిరుపతిలో హరిజన హాస్టల్ ప్రారంభించారు, చాలాకాలం తిరుపతి హరిజనసేవక సంఘ అధ్యక్షులు. ఖాదీ, హరిజన, సహకార ఉద్యమాల వ్యాప్తికి కృషి చేశారు. 1940 లో వ్యక్తి సత్యాగ్రహంలో 9 మాసముల కఠినశిక్షను వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళల్లో అనుభవించారు. క్విట్

ఇండియా ఉద్యమంలో 1942 ఆగస్టు నుండి 1944 డిశంబరు వరకు వెల్లూరు, అమరావతి జైళ్ళల్లో డిటెన్యూగా వుంచబడిరి. కొంతకాలం జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు, ఎ. ఐ. సి. సి. సభ్యుడు. 1934 నుండి 1947 వరకు కేంద్ర శాసనసభ సభ్యుడు. 1962 వరకు లోక్‌సభ సభ్యుడు. 1956 లో లోక్‌సభ స్పీకరుగా ఎన్నుకోబడిరి. 1962 ఏప్రిల్ నుండి 1967 డిశంబరు వరకు బీహారు గవర్నర్.

## మార్గరెట్ ఇ. కజిన్సు

ఐర్లండులో 1878 లో జన్మించారు. 1915 లో భారతదేశం వచ్చారు. మదనపల్లి జాతీయ కళాశాలలో ప్రిన్సుపాలుగా పనిచేశారు. ఈమె థియోసాఫిస్టు. హోమ్‌రూల్ ఉద్యమంలో అనిబిసెంట్‌తో పాటు పని చేశారు. ఖాదీ, రాట్నము వగైరాల ఉపయోగాన్ని ప్రచారం చేశారు. శాసనోల్లంఘన ఉద్యమంలో 1932 నుండి 1 సంవత్సరం శిక్షను మద్రాసు. వెల్లూరు జైళ్ళల్లో అనుభవించారు.

## పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి

1914 లో వాయలపాడు తాలూకా చీనేపల్లి గ్రామంలో జన్మించారు. తండ్రి అన్నారెడ్డి. మదనపల్లి దివ్యజ్ఞాన సమాజ కాలేజీలో బి. ఏ చదివారు. యన్ జి. రంగా రాజకీయ పాఠశాలలో పాల్గొన్నారు. 1941 లో రాయలసీమ రైతు రక్షణ యాత్ర 500 మైళ్ళు కాలినడకన నడిపారు. 1938 లో వాహినీ పత్రిక సంపాదకులు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 డిశంబరు నుండి 1945 జనవరి వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళల్లో డిటెన్యూగా వుంచబడిరి. 1946 నుండి ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు ఉపాధ్యక్షుడుగా రెండు దఫాలు ఎన్నుకోబడిరి. 1952 లో మద్రాసు శాసనసభ్యుడుగా ఎన్నుకోబడిరి. ప్రకాశం మంత్రివర్గంలో సభ్యుడు. 1956 లో సంజీవరెడ్డి మంత్రివర్గంలో మంత్రి. 1964లో ఆంధ్రప్రదేశ్ శాసనసభకు ఎన్నుకోబడిరి. అదే సంవత్సరం, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘాధ్యక్షుడుగా ఎన్నుకోబడిరి. 1967 నుండి 1971 వరకు బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో మంత్రి.

# తెలంగాణా

## స్వామి రామానందతీర్థ

1903 లో గుల్బర్గా జిల్లా చినమల్లిలో జన్మించారు. వీరి అసలు పేరు వెంకటేష్ భావన్‌రావు ఖేడ్గికర్. తండ్రి భావన్‌రావు ఖేడ్గికర్. నివాసం హైదరాబాద్. యం.ఏ. చదివారు. మాతృదేశ సేవకై బ్రహ్మచారిగా వుండిపోయారు. 1932 లో సన్యాసం స్వీకరించారు. 1938 లో రాజకీయరంగంలో ప్రవేశించారు. అదే సంవత్సరం నైజాం ప్రభుత్వం హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌ను నిషేధించినపుడు సత్యాగ్రహం చేసి, హైదరాబాద్ జైలులో శిక్ష అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహ ఉద్యమంలో 11-9-1940 నుండి 15-12-41 వరకు నిజామాబాద్ జైలులో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. 1942-50 వరకు హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షులు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 ఆగస్టు నుండి 1943 డిసెంబరు వరకు హైదరాబాద్ సెంట్రల్ జైలులో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. భారత విలీనోద్యమంలో 1948 జనవరి నుండి, సెప్టెంబరు వరకూ హైదరాబాద్, సంగారెడ్డి, గుల్బర్గా జైళ్ళల్లో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. హైదరాబాద్ ఖాదీ సమితి, హైదరాబాద్ హిందీ ప్రచార్ సంఘ్, హైదరాబాద్ ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ మున్నగు సంస్థలకు అధ్యక్షులు. 1952-62 వరకు లోక్‌సభ సభ్యులు. 1962 లో రాజకీయాలనుంచి విరమించుకుని, సర్వోదయ సిద్ధాంతాల ప్రచారానికీ, నిర్మాణ కార్యక్రమానికి పూనుకున్నారు తూర్పుగోదావరి జిల్లా పిఠాపురం వద్ద "శాంతి ఆశ్రమం" స్థాపించారు 1972 లో కీర్తిశేషులయ్యారు.

## బూర్గుల రామకృష్ణారావు

1899 లో మహబూబ్‌నగర్ జిల్లా కల్వకుర్తి తాలూకా పడ్కాల్‌లో జన్మించారు. నివాసం హైదరాబాద్. తండ్రి నరసింగరావు. పూనా, బొంబాయి, హైదరాబాద్‌లలో చదువుకున్నారు. బి. ఏ. ఎల్. ఎల్. బి. అడ్వకేట్. తెలుగు, సంస్కృతం, పర్షియా భాషల్లో పండితుడు. 1921 లో హైదరాబాదులో ఆంధ్ర జనసంఘం స్థాపించారు. 1931లో అక్టో

లాలో జరిగిన నాల్గవ హైదరాబాద్ రాజకీయ సభలో పాల్గొన్నారు. హిందూ-ముస్లిం ఐక్యతకు కృషి చేశారు. హైదరాబాద్ స్వదేశీ లీగ్ కార్యదర్శి. 1938 లో హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ ప్రొవిషనల్ కమిటీ సభ్యులు. 1942 అక్టోబరు 8 న గాంధీ జయంతి ఉత్సవాల సందర్భంలో అరెస్టు చేయ బడ్డారు. నైజాం ప్రభుత్వం బహిరంగ సభ లను నిషేధించగా, 1947 లో ఒక సభలో ప్రసం గించి, సత్యాగ్రహం చేశారు. భారత విలీనోద్య మంలో పాల్గొన్నందుకు హైదరాబాద్ సెంట్రల్ జైలులో 16-9-1947 నుంచి 30-11-1947 వరకూ డిటెన్యూగా నిర్బంధించబడ్డారు. 1950-52 లో హైదరాబాద్ స్టేట్ వెల్లోడి కాబినెట్‌లో విద్య. రెవెన్యూ మంత్రిగా వున్నారు. 1952-56 లో ప్రజ లచే ఎన్నుకోబడిన తొలి మంత్రివర్గం ముఖ్య మంత్రి. ఆంధ్రప్రదేశ్ ఏర్పడడానికి గట్టి కృషి చేశారు. 1957-60 లో కేరళ గవర్నరు. 1960-62 లో ఉత్తరప్రదేశ్ గవర్నరు. 1962-66 వరకు రాజ్యసభ సభ్యులు. భారత సేవక సమాజం (ఆంధ్ర ప్రదేశ్) ఛైర్మన్. దక్షిణ భారత హిందీ ప్రచార సభ వైస్ ప్రెసిడెంట్. వీరి రచనలు: కృష్ణశతకం, సారస్వత వ్యాసముక్తావళి మొదలైనవి. 1967 లో కీర్తిశేషులయ్యారు.

### వట్టికోట అళ్వారస్వామి

1915 లో నల్లగొండ జిల్లా చెర్వు మాధవరంలో జన్మించారు. సికింద్రాబాద్ వాస్తవ్యులు - తండ్రి రామచంద్రారెడ్డి. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో ఒక సంవత్సరం జైలుశిక్ష అనుభవించారు. పట్టాభి సీతారామయ్య, కాశీనాథుని నాగేశ్వరరావుగార్లతో కలిసి పని చేశారు. 1945 నుండి కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు. రచయిత. జైలు లోపల, గంగు, ప్రజల మనిషి మున్నగు గ్రంథాలు రాశారు. 'తెలుగు తల్లి' అనే మాసపత్రిక కొన్నాళ్ళు నడిపారు. 1961 లో కీర్తిశేషులు.

### బద్దం ఎల్లారెడ్డి

1906 లో కరీమ్‌నగర్ జిల్లా గాలిపల్లి గ్రామంలో జన్మించారు. హైదరాబాద్ వాస్తవ్యులు. తండ్రి హను మంతరెడ్డి. 1930 లో చదువు మానివేసి, కాకినాడ లోనూ, ఏలూరులోనూ ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఇందుకుగాను 7 మాసాల కఠినశిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి, ఆలీపురం జైళ్ళలో అను భవించారు. ఖద్దరు ఉత్పత్తి, హరిజనోద్ధరణకై కృషి చేశారు. హైదరాబాద్ స్టేట్‌కాంగ్రెసునునైజాం ప్రభుత్వం నిషేధించినందుకు సత్యాగ్రహం చేసి 1938 నవంబరు నుండి 1939 ఏప్రిల్ వరకు కఠిన శిక్షను హైదరాబాద్ గుల్‌బర్గా జైలులో అనుభవిం చారు. యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసినందుకు 6 నెలల కఠిన శిక్షను హైదరాబాద్, వరంగల్ జైళ్ళలో అను భవించారు. కరీంనగర్ జిల్లాలో సాగిన రైతాంగ ఉద్యమంలో వీరు ప్రముఖ పాత్ర వహించారు.

1943 - 46 వరకు ఆంధ్ర మహాసభకు కార్య దర్శిగాను, ఆ తర్వాత అధ్యక్షుడుగాను పని చేశారు. ప్రముఖ కమ్యూనిస్టు, 1846 లో హైదరాబాద్ స్టేట్‌లో కమ్యూనిస్టుపార్టీని నిషేధించాక. స్వగ్రామంలో నిర్బంధింబడ్డా. 1952 - 57 లోనూ, 1964 - 70 లోనూ లోక్‌సభ సభ్యుడు. 1958 - 61 వరకూ రాజ్యసభ సభ్యుడు, 1972 - 78వరకు ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభ్యుడు, తామ్రపత్ర గ్రహీత, 1978 లో కీర్తిశేషులు.

### డా. జి. యస్. మేల్‌కొటే

గోపాల్ సుబ్బకృష్ణ మేల్‌కోటే, 1901 లో గంజాం జిల్లా బరంపురంలో జన్మించారు. తండ్రి సుబ్బుకృష్ణమేల్‌కోటే. హైదరాబాద్ వాస్తవ్యులు. ప్రముఖ వైద్యుడు. 1916 లో స్వదేశీ ఉద్యమంలో చేరారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని తీవ్ర మైన లాటీ చార్జికి గురయ్యారు. 1931 లో కరాచీ కాంగ్రెస్‌కు హైదరాబాద్ నుండి ప్రతినిధిగా వెళ్ళారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 ఆగస్టు నుండి హైదరాబాద్ జైలులో డిటెన్యూగా నిర్బంధింప బడ్డారు. 1947 ఆగస్టు 15న జాతీయ పతాకను ఎగుర వేయబోగా హైదరాబాద్ జైలులో నవంబరు నెలా ఖరు వరకు డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు. 1952 - 56 వరకు హైదరాబాదు ప్రభుత్వ ఆర్థిక మంత్రిగాను, ప్రజా పనుల శాఖ మంత్రి గాను పని చేశారు. 1957 నుండి లోక్‌సభ సభ్యులుగా వున్నారు.

## కాళోజీ నారాయణరావు

1914 లో వరంగల్ జిల్లా మడికొండలో జన్మించారు. తండ్రి రంగారావు. వరంగల్ నివాసి. ప్లీడరు. తెలుగు, ఉరుదు, హిందీ మరాఠీ భాషలలో ప్రముఖ కవి, రచయితా, నైజాం ప్రభుత్వ కాలంలో తన రచనల ద్వారా, ప్రజలలో దేశభక్తిని రేకెత్తించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో రెండున్నరసంవత్సరాల శిక్షను 1943 జనవరి నుంచి వరంగల్, హైదరాబాద్ జైళ్ళలో అనుభవించారు. ఇండియా విలీనోద్యమంలో 1948 లో 7 మాసాల శిక్షను వరంగల్, గుల్బర్గా జైళ్ళలో అనుభవించారు. హైదరాబాద్‌లో ఆంధ్ర సారస్వత పరిషత్ స్థాపకులు. తామ్రపత్ర గ్రహీత.

## దాశరథి కృష్ణమాచార్య

1927 లో వరంగల్ జిల్లా మహబూబా బాద్ తాలూకా చిన్నగూడూరులో జన్మించారు. తండ్రి వెంకటాచారి. ప్రముఖ తెలుగుకవి. సంస్కృతం, ఉరుదు, హిందీ, పార్శీ, తమిళం, ఇంగ్లీషు భాషలలో పాండిత్యం గడించారు. B A. చదివారు. నైజాం నిరంకుశపాలనను అంతమొందించేందుకు తన గేయాల ద్వారా ప్రజలలో చైతన్యం, ఉత్తేజం కలిగించారు. స్వాతంత్ర్య పోరాటకాలంలో అగ్నిధార, రుద్రవీణ అనే రెండు గేయ సంపుటాలను ప్రచురించినందుకు నైజాం పోలీసులు అరెస్టు చేశారు. కాని వాళ్ళ నిర్బంధం నుంచి తప్పించుకున్నారు. 1947 నవంబరు నుండి 1948 జూన్ వరకూ వరంగల్, నిజామాబాద్, హైదరాబాద్ జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధించబడ్డారు. మీర్జా గాలిబ్ గేయాలను తెనిగించారు తెలంగాణా రచయితల సంఘం అధ్యక్షుడు. తామ్రపత్ర గ్రహీత. కేంద్ర సాహిత్య అకాడమీ. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతులు పొందారు. ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవిగా 1977 లో నియమింపబడ్డారు.

## రావి నారాయణరెడ్డి

1908 లో నల్లగొండజిల్లా భువనగిరి తాలూకా బొల్లెపల్లిలో జన్మించారు. హైదరాబాద్ నివాసం. తండ్రి గోపాల్‌రెడ్డి. రైతు. కమ్యూనిస్టు. ఇంటర్‌మీడియట్ చదువుతూ మానివేసి శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నారు. 1932-38 వరకు హైదరాబాద్ స్టేట్ హరిజన్ సేవక్ సంఘ్ అధ్యక్షులు. 1938 లో హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ వ్యవస్థాపక సభ్యులు. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ నిర్మాణాన్ని నైజాం ప్రభుత్వం నిషేధించినందుకు, 1938 లో సత్యాగ్రహం చేశారు రెండు నెలల జైలుశిక్ష అనుభవించారు. హైదరాబాద్ స్టేట్‌లో 1939 లో కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థాపకులలో ఒకరు. 1941 లో చిలుకూరులోను, 1944 లో భోనగిరిలోనూ, 1945 లో ఖమ్మంలోనూ జరిగిన ఆంధ్ర మహాసభ (తెలంగాణా) సమావేశాలకు అధ్యక్షత వహించారు. అజ్ఞాతవాసంలో వుండి నైజాం భూసామ్య విధానానికి వ్యతిరేకంగా రైతు ఉద్యమాన్ని నిర్మించారు. 1946-48 లో నైజాం నిరంకుశపాలనకూ, రజాకార్ల దురంతాలకు వ్యతిరేకంగా జరిగిన గెరిల్లా పోరాటంలో ప్రముఖ పాత్ర వహించారు. భూమిలేని పేదలకు తన 500 యకరాల స్వంత భూమిని పంచిపెట్టారు. 1952-57 వరకు లోక్‌సభ సభ్యులు. 1957-62 వరకు ఆంధ్ర ప్రదేశ్ శాసన సభ సభ్యులు. మరల 1962-67 వరకు లోక్‌సభ సభ్యులు.

## కోదాటి నారాయణరావు

1914 లో నల్లగొండ జిల్లా హుజూర్‌నగర్ తాలూకా రేపాల గ్రామంలో జన్మించారు. తండ్రి రంగారావు. నివాసం హైదరాబాద్. బి. ఏ. ఎల్. ఎల్. బి చదివారు. హరిజన్ సేవక్ సంఘ్ ద్వారా హైదరాబాదు స్టేటు ప్రజలలో రాజకీయ చైతన్యం కలిగించారు. 1941 లో చిలుకూరులో జరిగిన ఆంధ్ర మహాసభ 8 వ సమావేశంలో విశాలాంధ్ర తీర్మానాన్ని ప్రవేశపెట్టిన మొదటి వ్యక్తి. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 1947-48 లో ఇండియా విలీనోద్యమంలో పన్నుల నిరాకరణకు ప్రచారం చేశారు. రజాకార్ల దాడులను ఎదుర్కొనేందుకు గ్రామీణ దళాలను ఏర్పరచారు. కొన్నాళ్ళు ఎ.ఐ.సి.సి సభ్యులు. గ్రంథాలయ, హరిజన, ఖాదీ ఉద్యమాలలో ఎక్కువగా కృషి చేశారు. హైదరాబాదు రాజ్యాంగ సంస్కరణలు, శాసనసభ మొదలగు గ్రంథాలు రచించారు.

## జమలాపురం కేశవరావు

1908 లో మధిర తాలూకా యెర్రుపాలెంలో జన్మించారు. తండ్రి వెంకట రామారావు. ఇంటర్మీడియట్ ప్యాసయ్యారు. రైతు. ప్రముఖ కాంగ్రెస్ వాది. సర్దార్‌గా పిలువబడేవాడు. హైదరాబాద్ జిల్లా కలెక్టర్ ఆఫీసు ఉద్యోగానికి రాజీనామా చేసి, నైజాం వ్యతిరేక స్టేట్ కాంగ్రెస్ ఉద్యమంలో చేరారు. నైజాం ప్రభుత్వం హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ సంఘ నిర్మాణాన్ని నిషేధించగా 1938 లో సత్యాగ్రహం చేసి, 1938 డిసెంబరు నుండి 1939 ఏప్రిల్ వరకు వరంగల్ సెంట్రల్ జైలులో శిక్ష అనుభవించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించారు. ఆంధ్ర మహాసభ ప్రముఖ నాయకులలో ఒకరు. ఇండియన్ యూనియన్‌లో హైదరాబాద్ స్టేట్ విలీన ఉద్యమంలో 1947 ఆగస్టులో అరెస్టు చేయబడ్డారు. రెండుసంవత్సరాలకు పైగా వరంగల్, నిజామాబాద్ జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1947 లో యెర్రుపాలెంలోని ఆయన గృహాన్ని రజాకార్లు దోచుకున్నారు. రాజ్యాంగ పరిషత్తు సభ్యుడుగా నియమింపబడ్డారు. గ్రంథాలయ ఉద్యమ వ్యాప్తికి. అస్పృశ్యతా నివారణకు నిర్విరామ కృషి చేశారు. దేశసేవకై తన యావజ్జీవితం ధారబోసిన దేశభక్తుడు. 1953 లో కీర్తిశేషులు.

## అబీద్ హసన్ శఫ్రానీ

1911 లో హైదరాబాదులో జన్మించారు. తండ్రి అమీర్ హసన్. బెర్లిన్ యూనివర్శిటీలో ఇంజనీరింగు చదువుతూమానేసి గాంధీజీసబర్మతీ ఆశ్రమంలో 1931 లో చేరారు. నాసిక్ జైలు రిఫైనరీని పేల్చి పారేయాలని కుట్ర పన్నారని 1 సంవత్సరం కఠిన శిక్ష విధించగా బొంబాయి జైలులో అనుభవించారు. 1941 లో జర్మనీలో వున్నప్పుడు సుభాస్‌చంద్రబోస్ ఆజాద్ హిందుఫౌజులో చేరారు. బోసుకు ఆంతరంగికుడుగా 1942 మే వరకు ఉంటిరి. జపాన్‌లో తిరుగుతున్నప్పుడు బ్రిటిష్ ప్రభుత్వం అరెస్టుచేసి సింగపూర్‌లో 1945 వరకు డిటెన్యూగా వుంచింది. స్వాతంత్ర్యానంతరం విదేశీ వ్యవహారాల శాఖలో చేరారు. కైరోలోనూ పెకింగ్‌లోనూ మొదటి కార్యదర్శిగా నియమింపబడిరి. డమాస్కస్,బాగదాద్ డెన్‌మార్కులలో భారత ప్రభుత్వ రాయబారిగా నియమింపబడిరి.

## అంబాజీరావు శ్రీనివాసరావు దేశపాండే

1925 లో హైదరాబాదులో జన్మించారు. తండ్రి శ్రీనివాసరావు దేశపాండే. బ్యాంక్ హెడ్ క్యాషియరుగా పనిచేశారు. క్విట్ ఇండియా సందర్భంలో వార్ధా సేవా గ్రామ ఆశ్రమంలో చేరారు. కాంగ్రెసు కరపత్రాలను పంచిపెట్టగా. 1942 లో 6 మాసముల కఠిన శిక్షను వార్ధా, చాందాపూర్ జైళ్లల్లో అనుభవించారు. తామ్రపత్రగ్రహీత.

## మునగాల బాల్‌రెడ్డి

1918 లో సికిందరాబాదులో జన్మించారు. హైదరాబాదు నివాసి. తండ్రి వెంకయ్య. విద్యార్థిగా వున్నప్పుడు ఉప్పు సత్యాగ్రహ సందర్భంలో నినాదాలు చేసినందుకుగాను దెబ్బలుకొట్టి విడిచిపెట్టారు. 1932 లో శాసనోల్లంఘన సందర్భంలో కూడా దెబ్బలు కొట్టి విడిచిపెట్టారు.

## విజయకుమార్‌సిన్హా

1909 లో కాన్పూరులో జన్మించారు. హైదరాబాదు నివాసులు. తండ్రి మార్కండదాస్‌సిన్హా. పట్టభద్రుడు. జర్నలిస్టు. ఉత్తరప్రదేశంలో విప్లవ ఉద్యమాలలో ప్రముఖ పాత్ర వహించిన వారలలో ఒకరు. భగత్‌సింగు, చంద్రశేఖర్ ఆజాదుల సన్నిహితుడు. 1928 లో విప్లవకారులను సమీకరించాలని దేశంలో రహస్యంగా తిరుగుతున్నప్పుడు బ్రతికివున్న స్థితిలో గాని, చనిపోయిన స్థితిలోగాని యీయనను పట్టించి యిచ్చినవారికి బహుమానం యిస్తామని ప్రభుత్వం ప్రకటించింది. లాహోర్ కుట్రకేసులో అరస్టుచేసి ద్వీపాంతరవాస శిక్షను 1930లో విధించి 1930 నుండి 1938 వరకు లాహోర్. రాజమండ్రి, విశాఖపట్నం, అండమాన్ జైళ్ళలో నిర్బధించారు. అండమాను జైలులో అమానుష చర్యలకు వ్యతిరేకంగా చాలా సార్లు నిరాహారదీక్ష వహించారు. 1933 లో 5 మాసాలపాటు ఉపవాసం చేశారు. అండమానుల నుండి రాజకీయ ఖైదీలను భారతదేశం పంపమని 52 రోజులపాటు ఉపవాసం చేశారు. 1939 లో కాంగ్రెసులో చేరారు. 1941 లో వ్యక్తి సత్యాగ్రహ సందర్భంలో 1 సంవత్సరం కఠిన శిక్షను అనుభవిం

చారు. 1942 లో క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో 1942 నుండి 1945 వరకు డిటెన్యూగా వున్నారు. అండమానులోని ఖైదీల పరిస్థితులను గురించి వీరు వ్రాసిన పుస్తకాన్ని ప్రభుత్వం నిషేధించింది. 1971 లో సోవియట్ భూమి తరపున నెహ్రూ బహుమానం వీరి "సోవియట్ యూనియన్‌లో నూతన మానవుడు" అనే పుస్తకానికి యివ్వబడింది.

## దివాకర్‌రావు టోర్నేకర్

1920 లో బీదర్ జిల్లా ఔరాద్ తాలూకా బోర్నాలో జన్మించారు. తండ్రి గూండేరావ్ బోర్నేకర్. టీచరు. క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంలో నిషేధకర పత్రాలను పంచినందుకుగాను 6 మాసముల కఠిన శిక్షను హైద్రాబాదు సెంట్రల్ జైలులో అనుభవించారు.

## ఉప్పలంచి గౌరీశంకర్

1926 లో సికిందరాబాదులో జన్మించారు. రేడియో ఇంజనీయరు. తండ్రి లక్ష్మినారాయణ. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో 1942 అక్టోబరు నుండి 1943 జూన్ వరకు 8 మాసాల కఠిన శిక్షను సికిందరాబాదు జైలులో అనుభవించారు.

## సంగం లక్ష్మీబాయి

1911 లో హైదరాబాదు తూర్పు తాలూకా ఘటకేశర్‌లో జన్మించారు. హైదరాబాదు నివాసురాలు. తండ్రి రామయ్య. గుంటూరులో శారదా నికేతన్‌లో విద్య నభ్యసించారు. పూనా యూనివర్శిటీ గ్రాడ్యుయేట్. 1928 లో సైమన్ కమీషన్ బహిష్కరణలో పాల్గొన్నారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో 1 సంవత్సరం కఠిన శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. 1932 లో శాసనోల్లంఘన ఉద్యమంలో 1 సంవత్సరం కఠిన శిక్షను అనుభవించారు. 1932లో గాంధీగారితోపాటు ఉపవాసం చేశారు. 1951 లో భూదానోద్యమ సందర్భంలో వినోబాభావేతో కలసి తెలంగాణాలో పర్యటించారు. 1951 నుండి 1971 వరకు లోక్‌సభ సభ్యురాలు. తామ్రపత్రగ్రహీత.

## మక్‌బూల్ అహమద్ జమాయీ

1902లో పంజాబులో జన్మించారు. నివాసం హైదరాబాదు. తండ్రి షేక్ ఫజులుద్దీన్. ఆలీఘర్ యూనివర్శిటీలో చదివారు. కవి, గ్రంథకర్త. 1920 లో జాతీయ ఉద్యమంలో చేరారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహ సందర్భంలో 1 సంవత్సరం కఠిన శిక్షను మధ్యప్రదేశ్‌లోని సియోని జైలులో అనుభవించారు. 1932 లో శాసనోల్లంఘన సందర్భంలో మధ్యప్రాంతంలో సైయాల్ కోటలో ఉపన్యసించినందుకు 15 మాసముల కఠిన శిక్షను సైయాల్‌కోట జైలులో అనుభవించారు. 1938 లో హైదరాబాదు గవరమెంటు యీయనను హైదరాబాదు నుండి వెళ్ళగొట్టినపుడు మలబారు వెళ్ళి మహమ్మదీయ జాతీయ సభ జరిపిరి; మలబార్ నుండి మధ్యప్రదేశ్‌లో సియోనికి వెళ్ళిరి. జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడుగా వుండిరి. 1956-60 లో ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభ్యుడుగా ఎన్నుకోబడ్డారు. కొన్ని ఉర్దూ దైనిక పత్రికలకు సంపాదకులుగా వుండిరి.

## పర్వట్‌కర్ నరసింహారావు కృష్ణారావు

1909 లో హైదరాబాద్‌లో జన్మించారు. తండ్రి కృష్ణారావు పర్వాట్‌కర్. 1930 లో బీజాపూరులో ఉప్పుసత్యాగ్రహ సందర్భంలో 2 మాసముల శిక్షను బీజాపూర్ జైలులో అనుభవించారు. 1932 లో శాసనోల్లంఘన ఉద్యమ సందర్భంలో 1932 ఫిబ్రవరి నుండి 1932 జులై వరకు 5 నెలల కఠినశిక్షను బీజాపూర్, ఎర్రవాడ జైళ్ళల్లో అనుభవించారు క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో కొంతకాలం శిక్ష అనుభవించారు.

## బెల్లంపల్లి నరసింగరోశయ్యగుప్త

1914 లో నెల్లూరుజిల్లా కావలితాలూకా శాయిపేటలో జన్మించారు. తండ్రి పెద రోశయ్యగుప్త. 15 సంవత్సరాల వయస్సులో చదువు మానివేసి సబర్మతీ ఆశ్రమంలో చేరారు. ఉప్పు సత్యాగ్రహములో గుజరాత్‌లోని ఖైరాజిల్లా మట్టార్ తాలూకాలో పాల్గొన్నారు. 1932 లో శాసనోల్లంఘన ఉద్యమ సందర్భంలో 1 సంవత్సరం కఠినశిక్షను విస్పూర్‌జిల్లా జైలులో అనుభవించారు. పొట్టి శ్రీరాములుగారితో కలిసి సాంఘికసేవా కార్యక్రమాలలో పనిచేశారు.

### సండూరి కృష్ణమాచార్యులు

పశ్చిమగోదావరిజిల్లా తాడేపల్లి గూడెం తాలూకా గోపపరం అగ్రహారం నివాసులు. తండ్రి-శోభనాద్రి ఆచార్యులు. హైదరాబాద్ నివాసి. యమ్. ఏ. బి. యల్. 1930 లో తూర్పుగోదావరిజిల్లా రామచంద్ర పురంలో ఉప్పుసత్యాగ్రహ సందర్భంలో తీవ్రమైన లాఠీదెబ్బలకు గురయ్యారు. అరెస్టుచేసి హైదరా బాద్ పంపబడిరి. అనేకసా మద్రాసులో లాఠీ దెబ్బలకు గురయ్యారు. అరె ‛చేసి జైలుకు పంప బడిరి. 1933 లో పశ్చిమగో_ రిజిల్లా ఏలూరులో శాసనోల్లంఘన సందర్భంలో 6 మాసముల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. 1943లో క్విట్ఇండియా ఉద్యమ సందర్భంలో ఈయనగారి యిల్లు సోదా చేయబడింది.

### ధ్రువసింగ్

1922 లో హైదరాబాద్‌లో జన్మించారు. తండ్రి రఘునాధసింగ్. ఆంధ్ర మహాసభ, ఆర్య సమాజ్, సర్వోదయ సంస్థలలో పనిచేశారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో 1942 లో 1 నెల రోజులు సికిందరాబాద్ జైలులో వుంచబడిరి. 1942 నవంబరు నుంచి 1943 ఫిబ్రవరి వరకు డిటెన్యూగా క్విట్ ఇండియా సందర్భంలో సికిందరాబాద్ జైలులో వుంచ బడిరి. హైదరాబాద్ సంస్థానాన్ని ఇండియన్ యూని యన్‌లో కలపాలనే ఉద్యమంలో పనిచేశారు.

### యన్. దుర్గయ్య

1918 లో సిరిసిల్ల తాలూకా గాలేపల్లిలో జన్మిం చారు. వ్యాపారి. తండ్రి రాజయ్య. స్టేట్ కాంగ్రెసు మీద ఉన్న నిషేధాజ్ఞలను ఉల్లంఘిసూ 1938 లో సత్యాగ్రహం చేశారు. ఆ సందర్భంలో 1938 డిశం బరు నుండి 1939 ఏప్రియల్ వరకు హైదరాబాద్, నిజామాబాద్ జైళ్ళల్లో డిటెన్యూగా వుంచబడిరి.

### కె.వి. మురళీధరరావు

సుల్తానాబాద్ తాలూకా గట్టిపల్లి నివాసులు. రైతు. తండ్రి లక్ష్మీరంజన్. 1938 లో సత్యాగ్రహ సంద ర్భంలో 1938 నవంబరు నుండి 1939 ఫిబ్రవరి వరకు హైదరాబాద్ గుల్‌బర్గా జైళ్ళల్లో డిటెన్యూగా వుంచబడిరి.

### డి. నరసయ్య

కరీమ్‌నగర్ నివాసులు. తండ్రి రాజన్న. బీడీ వ్యాపారి. 1938 నవంబరులో సత్యాగ్రహము చేశారు. 1938 నవంబరు నుండి 1939 ఏప్రియల్ వరకు హైదరాబాద్, గుల్‌బర్గా, ఔరంగా బాద్ జైళ్ళల్లో డిటెన్యూగా వుంచబడిరి.

### కొండప లక్ష్మీ నరసింహారావు

1925 లో ఇ ందు తాలూకా బేతంపూడిలో జన్మిం చారు. రైతు. 1 2 లో క్విట్ ఇండియా సంద ర్భంలో 11 మాసముల కఠినశిక్షను అనుభవించారు. 1957-67 వరకు ఆంధ్రప్రదేశ్ శాసనసభా సభ్యుడుగా వుండిరి.

### కొమరగిరి నారాయణరావు

1915 లో ఖమ్మంలో జన్మించారు. తండ్రి జగన్నాథరావు. 1930లో ఆంధ్ర మహాసభలో పాల్గొ న్నారు. 1942లో క్విట్ ఇండియా ఉద్యమ సందర్భ ములో 1942 లో 10 మాసముల కఠినశిక్షను వరంగల్ జైలులో అనుభవించారు.

### పానుగంటి పిచ్చయ్య

1901 లో పాత పాలవంచలో జన్మించారు. 1921 లో సహాయ నిరాకరణ ఉద్యమ సందర్భంలో తన కరణీకానికి రాజీనామా చేశారు. దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారి రామదండులో చేరిన సందర్భంలో ఒక సంవత్సరం శిక్షను అనుభవించారు. కొన్ని సంవత్సరాలపాటు గాంధీ ఆశ్రమంలో వుండిరి.

### చతుర్వేది రామకిషోర్

1921 లో ఖమ్మంలో జన్మించారు. తండ్రి రామనారాయణ చతుర్వేది. 1942 లో లక్నోలో చదువుచున్నపుడు క్విట్ ఇండియా ఉద్యమ సంద ర్భంలో డిటెన్యూగా వుంచబడిరి.

### యన్. జాగ్రి రామకురీ

1917 లో ఖమ్మంలో జన్మించారు. తండ్రి పురుషోత్తం. 1934 నుండి వరంగల్‌లో ఒకమిల్లులో పనిచేసుండేవారు. విద్యార్థిగా వున్నప్పుడే కృష్ణా జిల్లా మచిలీపట్నంలో శాసనోల్లంఘన సందర్భంలో విదేశీ వస్త్రముల వస్తువుల దుకాణాలవద్ద పికెటింగు

చేశారు. అమృతసర్ కాంగ్రెసుకు 1956 లో ప్రతినిధిగా వెళ్ళిరి.

### గురు ప్రసాద్

కొత్తగూడెం తాలూకా రుద్రంపూర్ గ్రామ వాసవ్యులు కొత్తగూడెంలో సింగరేణి కాలరీసులో పనిచేశారు. 1943 లో క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో 10 మాసాల కఠిన శిక్షను హైదరాబాద్, వరంగల్ సెంట్రల్ జైళ్ళల్లో అనుభవించారు.

### హీరాలాల్ మోరియా

1924 లో ఖమ్మంలో జన్మించారు. తండ్రి జగన్నాథ ప్రసాద్. చిన్న చిన్న కథలను వ్రాసేవారు జనరలిస్టు 1942 లో క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో మూడు సార్లు అరెస్టు చేయబడిరి. 1956 లో అమృతసర్ కాంగ్రెసు ప్రతినిధిగా వెళ్ళిరి.

### చతుర్వేది లజ్జావతి

1923 లో ఉత్తరప్రదేశ్ ఫిరోజాబాద్‌లో జన్మించారు. ఖమ్మం నివాసురాలు. భర్త రామకృష్ణ చతుర్వేది. బి.ఏ. 1942 లో క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో లక్నోలో అరెస్టు చేయబడిరి. హరిజన ఉద్యమంలో పనిచేశారు.

### చెన్నా నరసింహం

1920 లో ఖమ్మంలో జన్మించారు. కొత్తగూడెం నివాసులు. తండ్రి హనుమంతు. గుమాస్తా ఉద్యోగం. 1940-41 లో వ్యక్తి సత్యాగ్రహ సందర్భంలో 7 మాసాల కఠినశిక్షను ఖమ్మం, బీదర్ జైళ్ళల్లో అనుభవించారు.

### సోమ నరసింహం

ఖమ్మం నివాసులు. తండ్రి మాచయ్య. వ్యక్తి సత్యాగ్రహ, సందర్భంలో 15 మాసాల కఠినశిక్షను వరంగల్, నిజామాబాద్ జైళ్ళల్లో అనుభవించారు

### బాకులపల్లి రంగనాథం

1899 లో కొల్లాపూర్‌లో జన్మించారు. హైదరాబాద్ నివాసులు. కృష్ణాజిల్లా నూజివీడులో 1921 లో సహాయ నిరాకరణోద్యమ సందర్భంలో 4 మాసముల కఠినశిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో కూడ పాల్గొన్నారు.

### రాయసం వెంకట్రావు

1903 లో నాగర్‌కర్నూల్‌లో జన్మించారు. మహబూబ్‌నగర్ నివాసులు. తండ్రి కృష్ణారావు. 1934లో కాశీ విద్యా పీఠశాస్త్రి పరీక్ష ప్యాసయ్యారు. 1930 లో ఉత్తరప్రదేశ్ ప్రతాప్‌గఢ్ జిల్లా జైలులో ఉప్పు సత్యాగ్రహ సందర్భంలో 8 మాసాల కఠిన శిక్షను అనుభవించారు శాసనోల్లంఘనఉద్యమ సందర్భంలో 2 సంవత్సరాల కఠినశిక్షను ప్రతాప్‌గఢ్, బెరేలీ జైళ్ళల్లో అనుభవించారు. సంస్థానాల ఉద్యమంలో చేరినపుడు 3 సంవత్సరములపాటు ప్రతాప్‌గఢ్, ఆగ్రా, ఫతేపూర్ జైళ్ళల్లో డిటెన్యూగా వుంచబడిరి. 1939-42 లో బరేలీ జైలులో ఉంచబడిరి. క్విట్ ఇండియా సందర్భంలో 1942 లో 2న్నర సంవత్సరాలపాటు లక్నో, ఉన్నావ్, ఫైజాబాద్ జైళ్ళల్లో డిటెన్యూగా వుంచబడిరి. వేరు వేరు భాషలలో శబ్దకోశములను వ్రాశారు.

### అక్కిరాజు వాసుదేవరావు

1926 లో మెడ్ల చెరువులో జన్మించారు. తండ్రి వెంకట తిరుమలరావు. వెంకటరావుపురం నివాసులు. రైతు. ప్రాథమిక విద్యను కృష్ణాజిల్లా జగ్గయ్యపేటలో పొందారు. 1942 లో క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో 2 మాసములపాటు ఒంగోలు సబ్ జైలులో వుంచబడిరి. 1962-72 లో ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభ్యుడుగా వుండిరి. 1969 నుంచి 1972 వరకు సమాచారశాఖ పౌర శాఖ మంత్రిగా ఉండిరి.

### ఎం. ఎస్. రాజలింగం,

ముదిగొండ సిద్ధవీర రాజలింగం 1919 ఫిబ్రవరి 9 న వరంగల్‌లో జన్మించారు. తండ్రి వీరలింగ శాస్త్రి. రాజలింగంగారు, బి.ఎస్‌సి, యల్.యల్.బి., అడ్వొకేట్. ఆయన హైదరాబాదులోని నిజాం కళాశాలలో విద్యార్థిగా వుంటూనే, 1939 లో రాజకీయ, సాంఘిక కార్యకలాపాలలో పాల్గొనేవారు. 1940 లో వర్ధాలోని గ్రామోద్యోగ విద్యాలయంలో సంఘసేవ, కుటీర పరిశ్రమల విభాగంలో శిక్షణ పొందారు. 1941 చివరవరకు సేవాగ్రామ్ ఆశ్రమం

లోని డైరీ ఫారంలో అసిస్టెంటు మేనేజరుగా పని చేశారు. 1942 లో కరీంనగర్ జిల్లా ముస్తాబాదులో గ్రామోద్ధరణ కేంద్రం నెలకొల్పారు. 1942 అక్టోబరు 2 న, నిజాం ప్రభుత్వం విధించిన నిషేధాన్ని ఉల్లంఘించి, గాంధీ జయంతి ఉత్సవం జరిపారు. ఫలితంగా వరంగల్ సెంట్రల్ జైలులో 1 1/2 సంవత్సరాలు కారాగారశిక్ష అనుభవించారు. 1943లో వరంగల్‌లో చేతితో తయారుచేసే కాగితం ఉత్పత్తికి, లిక్విడ్ గ్లూకోజు, తదితర ఉత్పత్తుల కోసం సుభాను కుటీర పరిశ్రమ నెలకొల్పారు. వరంగల్‌లోని ఆంధ్ర విద్యార్థినీ ఉన్నత పాఠశాల ప్రథమ కార్యదర్శి. ఆంధ్రమహాసభ, స్టేట్ కాంగ్రెస్ కార్యకలాపాలలో పాల్గొనేవారు. నిజాం ప్రభుత్వం విధించిన వరంగల్ జిల్లా ఎక్స్‌టర్నమెంటు ఉత్తరువును ధిక్కరించడంతో, 1946 జనవరి 8 నుండి 1947 ఫిబ్రవరి 6 వరకు డిటెన్షన్‌లో వున్నారు.

"ఇండియన్ యూనియన్‌లో సంస్థానాల విలీనం" ఉద్యమం సందర్భంగా ప్రభుత్వ వ్యతిరేక ఉపన్యాసాలు యిచ్చినందుకు 1947-6-15 నుండి 1948-3-22 వరకు అండర్‌ట్రైల్ ప్రిజనర్‌గా బాధలకు గురయ్యారు. తర్వాత 6 మాసాల కఠినశిక్ష విధించడంతో, వరంగల్ సెంట్రల్ జైలులో 1948-3-23 నుండి శిక్ష అనుభవించారు. పోలీసు చర్య అనంతరం, 1948-9-22 న జైలు నుండి విడుదల చేశారు. 1952 నుండి 1956-10-31 వరకు హైదరాబాదు శాసనసభ సభ్యులు. 1954 నుండి 1956 అక్టోబరు 31 వరకు కొనసాగిన తొలి ప్రజా ప్రభుత్వంలో పి.డబ్ల్యు.డి. కార్మిక శాఖ డిప్యూటీ మంత్రిగా పని చేశారు. 1958 లో కార్మిక సమస్యల అధ్యయనానికి అమెరికా సంయుక్త రాష్ట్రాలు, యూరపు దేశాలలో పర్యటించిన అంతర్జాతీయ కార్మిక ప్రతినిధి వర్గంలో రాజలింగం సభ్యులు. 1964-73 లో హైదరాబాదులోని సిటీ సివిల్ కోర్టులలో ప్రభుత్వ ప్రధాన న్యాయవాది, ప్రధాన పబ్లిక్ ప్రాసిక్యూటర్. 1974-10-24 నుండి 1978-4-17 వరకు ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో రెవిన్యూశాఖ తరపున ప్రభుత్వ న్యాయవాది. 1972 నవంబరు 1 న భారత ప్రభుత్వం రాజలింగంగారికి తామ్రపత్రం బహూకరించింది.

## డాక్టర్ రాజబహదూర్ గౌడ్

డాక్టర్ రాజబహదూర్ గౌడ్ హైదరాబాదులో 1918 జూలై 1 న జన్మించారు. హైదరాబాదు నివాసి. తండ్రి మహబూబ్‌రాజ్ గౌడ్. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం.బి.బి.ఎస్. లో ఉత్తీర్ణులయారు. భారత కమ్యూనిస్టు పార్టీ నాయకులు, ట్రేడ్ యూనియన్ నాయకులు. ఎం.బి.బి.ఎస్. విద్యార్థిగా వుంటూనే, 1938 లో హైదరాబాద్ సంస్థానంలో జరిగిన వందేమాతరం ఉద్యమం సందర్భంగా హైదరాబాదు వైద్యకళాశాలలో సానుభూతి సమ్మె నిర్వహించారు. ఆంధ్ర మహాసభ కార్యకర్త. 1940 నుండి భారత కమ్యూనిస్టు పా సభ్యులు. ఆయన నిర్వహించిన జమీందారీ జాగి రీ వ్యతిరేక పోరాటాలకుగాను నిజాం ప్రభుత్వం 2-11-1946న ఆయనను అరెస్టుచేసి, హైదరాబాదు సెంట్రల్ జైలులో డిటైన్ చేసింది. 7-5-47న ఆయన జైలు నుండి తప్పించుకున్నారు. 1946-56 సంవత్సరాల మధ్య అఖిల హైదరాబాదు ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌ను స్థాపించి, దానికి ప్రధాన కార్యదర్శిగా వున్నారు.

1953-56 లో తెలంగాణా కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శివర్గ సభ్యులు. 1952-62 సంవత్సరాలలో రాజ్యసభ సభ్యులు, 1956-59 లో ఆంధ్రప్రదేశ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ఉపాధ్యక్షులు. 1969 నుండి ప్రధాన కార్యదర్శి. 1957-59 లో అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ కార్యదర్శి. 1970 నుండి ఉపాధ్యక్షులు. రాజ్యాంగ సంస్కరణలు (1946), హైదరాబాదులో త్రివర్ణపతాకం ఎగరాలి. కాంగ్రెస్ రాజ్యంలో కార్మికవర్గం, తెలంగాణా సమస్య (1969)। ముఖ్దుం స్మృతులు (1970) అనే పుస్తకాలు ఇంగ్లీషులో వ్రాశారు.

## ఆరుట్ల రామచంద్రారెడ్డి

ఆరుట్ల రామచంద్రారెడ్డి భువనగిరి తాలూకా కొలనుపాకలో 1909 లో జన్మించారు. వీరి తండ్రి రాజారెడ్డి. రామచంద్రారెడ్డి ఇంటర్మీడియట్ పరీక్షలో ఉత్తీర్ణులయారు. ఆర్య సమాజ్, ఆంధ్ర మహాసభ కార్యకర్తగా పని చేశారు. 1952 నుండి కమ్యూనిస్టు పార్టీ సభ్యులు. 1938 లో

జరిగిన వందేమాతరం ఉద్యమం సందర్భంగా, అనేక కేసులలో రామచంద్రారెడ్డికి సంబంధం వున్నందువల్ల, ఆయనను అరెస్టుచేసి, పోలీసు కస్టడీలో తీవ్రంగా కొట్టారు. నైజాం సంస్థానంలో జమీందారీ, జాగీర్దారీ వ్యవస్థ రద్దుకోసం తీవ్రంగా కృషి చేశారు. పర్యవసానంగా, నిజాం ప్రభుత్వం 1945 లో కొలనుపాకలో ఆయనను ఇంటర్న్ చేసింది. తర్వాత హైదరాబాదు సెంట్రల్ జైలులో అండర్ ట్రైల్ ప్రిజనర్‌గా ఒక సంవత్సరం డిటైన్ చేశారు. తర్వాత విడిచిపెట్టారు. 1947–48 సంవత్సరంలో "ఇండియన్ యూనియన్‌లో స్వదేశీ సంస్థానాల విలీనం" కోసం జరిగిన ఉద్యమం సందర్భంగా, రజాకార్లు రామచంద్రారెడ్డి ఇల్లు లూటీ చేశారు.

## ఆరుట్ల కమలాదేవి

శ్రీమతి ఆరుట్ల కమలాదేవి భువనగిరి తాలూకా మంతపురిలో 1921 లో జన్మించారు. వీరు తర్వాత హైదరాబాదులో నివాసం ఏర్పరచుకొన్నారు. శ్రీమతి కమలాదేవి ఆరుట్ల రామచంద్రారెడ్డిగారి భార్య. ఈమె మెట్రిక్యులేట్, కమ్యూనిస్టు. ఈమె విద్యార్థిగా వుంటూనే ఆర్య సమాజ్ కార్యకలాపాల్లో పాల్గొనేవారు 1942-44 లో హైదరాబాదు మహిళా సంఘం ప్రధాన కార్యదర్శి. నల్లగొండజిల్లా ఆంధ్ర మహాసభ సభ్యురాలు. తెలంగాణాలో 1946–48 సంవత్సరాల్లో కమ్యూనిస్టుపార్టీ నిర్వహించిన ఫ్యూడల్ వ్యతిరేక పోరాటంలో రహస్య కార్యకర్త. రజాకార్లు జరిపిన అత్యాచారాలకు వ్యతిరేకంగా సాయుధ గెరిల్లాల పోరాటానికి శ్రీమతి కమలాదేవి మహిళలను సంఘటిత పరచారు. ఇదేకాలంలో రజాకార్లు ఆమె ఇంటిని లూటీ చేశారు. 1952 నుండి 1956 అక్టోబరు 31 వరకు హైదరాబాదు శాసనసభసభ్యురాలు. 1957–67 సంవత్సరాల్లో ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభ్యురాలు.

## మల్లు స్వరాజ్యం

శ్రీమతి మల్లు స్వరాజ్యం సూర్యాపేటతాలూకా కరివిరాల 1931 లో జన్మించారు. తండ్రి భీమిరెడ్డి రామిరెడ్డి. భర్త వెంకట నరసింహారెడ్డి. ప్రాథమిక విద్య పూర్తి చేశారు. భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) కార్యకర్త. 1945 – 48 సంవత్సరాల మధ్య నైజాం ప్రభుత్వానికి, రజాకార్లకు వ్యతిరేకంగా జరిగిన సాయుధ పోరాటంలో క్రియాశీల పాత్ర నిర్వహించారు. ఆమెను అరెస్టుచేస్తే బహుమతి ఇస్తామని నిజాం ప్రభుత్వం ప్రకటించింది. 1947 – 48 ఉద్యమంలో రజాకార్లు ఆమె ఇంటిని పూర్తిగా దహనం చేశారు. రాష్ట్ర మహిళా సంఘ సహాయ కార్యదర్శిగా పని చేశారు. 1945 -47 లో కిసాన్‌సభ జిల్లా కార్యవర్గం (ఆంధ్ర మహాసభ) సభ్యురాలు. వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాలలో కోయ గిరిజన ప్రజలలో పనిచేశారు. 1978 ఎన్నికలలో ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభ్యురాలుగా ఎన్నికయారు.

## భీమిరెడ్డి నరసింహారెడ్డి

భీమిరెడ్డి నరసింహారెడ్డి సూర్యాపేట తాలూకా కరివిరాల గ్రామంలో జన్మించారు. 1942 నుండి కమ్యూని పార్టీ సభ్యులు, తర్వాత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సి )లోకి వెళ్ళారు. నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకం నల్లగొండ జిల్లాలో అనేక ఉద్యమాలు నిర్వహించారు 1967–71 లో ఆంధ్రప్రదేశ్‌లో శాసనసభ సభ్యులు. 1971–77 లో లోక్‌సభ సభ్యులు

## టంగుటూరి ప్రకాశం

టంగుటూరి ప్రకాశంగారు ఒంగోలు తాలూకా, కనుపర్తిలో 1972 ఆగస్టు 23 వ తేదీన శ్రీ గోపాల కృష్ణయ్యగారికి జన్మించారు. ప్రకాశంగారు సాహసోపేతమైన స్వాతంత్ర్య సమరయోధుడు. దేశం కోసం ఆయన తన సర్వస్వం త్యాగంచేశారు ఆయన చిన్నతనంలో వల్లూరు, నాయుడుపేట,ఒంగోలులలో ప్రాథమిక,మాధ్యమిక విద్య పూర్తి చేశారు ఉన్నత పాఠశాల, కళాశాల విద్యలను రాజమండ్రిలోపూర్తి చేశారు. తర్వాత, ఆయన మద్రాసు న్యాయశాస్త్ర కళాశాలలో రెండవ తరగతి న్యాయవాది విద్య నభ్యసించి, పట్టా పొందారు కొంతకాలం ఒంగోలులో న్యాయవాదిగా పనిచేసి, అనంతరం రాజమండ్రిలో న్యాయవాదిగా 1903 వ సంవత్సరం వరకు పని చేశారు, ఆయన 29 వ సంవత్సరంలో రాజమండ్రి మున్సిపాలిటీకి చైర్‌మన్‌గా ఎన్నికయారు.

తర్వాత ఆయన లండన్ వెళ్ళి, అక్కడ ఉన్నత న్యాయశాస్త్రమును అభ్యసించి, బారిష్టరు అగుటకు,

1904 లో లండన్ నుండే రాజమండ్రి మున్సిపాలిటీ ఛైర్మన్ పదవికి రాజీనామా చేశారు. ఆయన ఉత్తమ శ్రేణిలో బారిస్టరు పరీక్షలో ఉత్తీర్ణులై, లండన్ నుండి తిరిగివచ్చి, 1907 లో మద్రాసులో న్యాయవాదిగా ప్రాక్టీసు ప్రారంభించారు.

1910 లో మహాత్మాగాంధీ ప్రభావానికిలోనై, సత్యాగ్రహ ప్రమాణ పత్రంపై సంతకం చేశారు. తర్వాత ఐదు అంశాల శాసనోల్లంఘన కార్యక్రమం ప్రారంభంకాగానే, ఆర్థికంగా ఎంతో లాభదాయకంగా వున్న న్యాయవాద వృత్తిని 1921 లో విడిచిపెట్టారు. అదే సంవత్సరంలో ప్రకాశంగారు ఎ ఐ సి.సి. కార్యవర్గ సభ్యునిగా ఎన్నికయారు; కొంతకాలంపాటు ఎ.ఐ.సి.సి. కార్యదర్శిగా పని చేశారు. 1921 లో ఎ.పి.సి.సి అధ్యక్షునిగా ఎన్నికై ,13 సంవత్సరములు ఆ పదవిలో కొనసాగారు. అనేకమంది ప్రముఖ న్యాయవాదులకు నచ్చచెప్పి, వారిని శాసనోల్లంఘనోద్యమంలోకి తీసుకువచ్చారు. ఆంధ్రదేశంలో వెల్లువగా వచ్చిన జాతీయోద్యమానికి ఆయన నాయకత్వం వహించారు. ఆంధ్రదేశంలో జాతీయోద్యమం మూడు దశాబ్దాలపాటు ఆయన పలుకుబడిక్రింద వుంది.

1928 లో సైమన్ కమిషన్ ధిక్కరణోద్యమంలో, మద్రాసు నగరంలో సంపూర్ణ హర్తాళ్ నిర్వహించబడింది; అంతేకాక, సైమన్ కమిషన్‌కు వ్యతిరేకంగా నిరసన తెలుపుతూ జరిపిన నల్లజెండాల ప్రదర్శనకు నాయకత్వం వహించారు. నగరంలో కొన్ని చోట్ల నల్లజెండాల ప్రదర్శకులపై రిజర్వు పోలీసులు కాల్పులు జరిపారు. ఆంధ్ర కాంగ్రెసు కమిటీ నాయకుడుగాను, అధ్యక్షుడుగాను, రిజర్వు పోలీసులు జరిపిన కాల్పులలో గాయపడిన సోదర ప్రదర్శకులను చూస్తానని గట్టిగా పట్టుపట్టారు; కాని వారిని చూచేందుకు ఆయనను వెళ్ళనివ్వకుండా రిజర్వు పోలీసులు అడ్డగించారు. వెంటనే ఆయన తన చొక్కా ఊడదీసి, తనను కాల్చుకోమని చెప్పి, వారి అభ్యంతరాన్ని లెక్కచేయకుండా కాల్పులలో గాయపడిన సోదరులను పరామర్శించేందుకై ఆయన అత్యంత సాహసంతో ముందుకు వెళ్ళారు; ఈ ఘటనను పురస్కరించుకునే ఆయనకు "ఆంధ్రకేసరి" అని బిరుదు లభించింది.

ఉప్పు సత్యాగ్రహం సందర్భంగా, ప్రకాశంగారికి 1930 ఏప్రిల్ 23 వ ఒక సంవత్సరం సామాన్య లు శిక్ష విధించారు. ఆయన మద్రాసు, తిరుచిరాప . వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవిం రు. 1932 శాసనోల్లంఘనోద్యమ కాలంలో, 1932 జనవరి 1 వ తేదీన 7 మాసాలు కఠిన శిక్ష, రు. 15/- లు జరిమానా విధించారు. జరిమానా చెల్లించారు. ఆయనను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో నిర్బంధించారు.

"స్వరాజ్య" దినపత్రికను ప్రారంభించారు. ఏమాత్రం జంకులేకుండా, ఆ పత్రికలో శాసనోల్లంఘనోద్యమానికి సంబంధించిన వివిధ వార్తలను ప్రచురించడంతో అనతికాలంలోనే ఆ పత్రిక ఎంతో ప్రతిష్ఠను సముపార్జించుకోవడమేగాక, దాని సర్క్యులేషన్ కూడా విపరీతంగా పెరిగింది. ప్రకాశం పంతులుగారు "స్వరాజ్య" పత్రికా నిర్వహణలో లక్షలు విలువచేసే తన ఆస్తిపాస్తులన్నిటినీ పోగొట్టుకున్నారు.

భారతదేశంలోని ప్రముఖ పాత్రికేయులకు స్వరాజ్య పత్రిక ప్రముఖ శిక్షణా కేంద్రంగా వినియోగపడింది.

ప్రకాశంగారు 1937 లో అప్పటి మద్రాసు రాష్ట్రంలో రెవెన్యూ మంత్రిగా పనిచేశారు. అప్పుడే ఆయన జమీందారీ వ్యవస్థ రద్దుకు పునాది వేశారు. తర్వాత జరిగిన వ్య గత సత్యాగ్రహోద్యమంలో ప్రకాశంగారికి 19 నవంబరు 26 వ తేదీన ఒక సంవత్సరం సామాన్య శిక్ష విధించారు. అప్పుడు ఆయన వెల్లూరు, తిరుచురాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు. అనంతరం క్విట్ఇండియా ఉద్యమం సందర్భంగా 1942 ఆగస్టు 14 తేదీ నుండి సుమారు మూడు సంవత్సరాలు వెల్లూరు, నాగపూరు, అమ్రోలీ జైళ్ళలో డిటైన్ చేశారు.

1946 ఏప్రిల్ 30 వ తేదీన కాంపోజిట్ మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ నాయకుడుగా ఎన్నికై, ముఖ్యమంత్రిగా నియమింపబడ్డారు. 1950 చివరలో ఆయన ప్రజా పార్టీని స్థాపించారు. తర్వాత ఆంధ్ర రాష్ట్రం ఏర్పడగానే ఆయన తిరిగి కాంగ్రెసులో చేరారు. ఆంధ్ర ప్రభుత్వ తొలి ముఖ్యమంత్రిగా నియమింపబడ్డారు. 1955 లో ఆంధ్ర రాష్ట్ర శాసన

సభకు జరిగిన మధ్యంతర ఎన్నికలలో ఒంగోలు శాసనసభా నియోజకవర్గం నుండి శాసనసభ్యుడుగా ఎన్నికయారు. అనంతరం 1957 మే 20 వ తేదీన తన 85 వ ఏట హైదరాబాదులో ప్రకాశంగారు కన్నుమూశారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఒంగోలు జిల్లాకు ప్రకాశం జిల్లాగా పేరుపెట్టి ఆయన పట్ల గల గౌరవాన్ని ప్రదర్శించింది.

## కందుల ఓబులరెడ్డి

గిద్దలూరు తాలూకా లింగాపురంలో 1911 జూన్ 7 న జన్మించారు. తండ్రి నాగిరెడ్డి. బి.ఎ వరకు చదివారు. వ్యవసాయదారు. 1930-32 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 1934 లో నిడుబ్రోలులో జరిగిన రాజకీయ శిక్షణ శిబిరంలో విద్యార్థిగా పాల్గొన్నారు రాయలసీమలో జరిగిన భూమి శిస్తు రీసెటిల్‌మెంటు సందర్భంగా 1934 లో రాయలసీమలో పర్యటించారు. 1936 లో రాష్ట్ర కిసాన్ కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నికయారు. 1936-37 సంవత్సరాల్లో కర్నూలు, చిత్తూరు జిల్లాలలో కొన్ని రాజకీయ పాఠశాలలు నిర్వహించారు. 1940-41 వ్యష్టి సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు. బ్రిటిష్ ప్రభుత్వ చట్టాలను ఉల్లంఘించవలసిందిగా ప్రజలను ఉద్బోధించారు రైతుల రహస్య సమావేశాలు జరిపి, ప్రభుత్వానికి భూమి శిస్తు చెల్లించవద్దని ఉద్బోధించారు. 1942 మార్చి 20 న ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించి, బళ్ళారి జైల్లో నిర్బంధించారు. జైలుశిక్ష పూర్తి కాగానే 1943 ఫిబ్రవరి 10 వ తేదీ నుండి 1945 జూలై 8 వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్ చేశారు. 1939-41 మధ్య కర్నూలు డి.సి.సి అధ్యక్షులుగా పనిచేశారు. 19,9 లో జిల్లా బోర్డు సభ్యులుగా పనిచేశారు. 1946 మే నుండి 51 వరకు పి.సి.సి ప్రధాన కార్యదర్శి. 1951 లో కిసాన్ మజ్దూర్ ప్రజా పార్టీని నెలకొల్పారు. 1951 లో కృషిక్‌లోక్ పార్టీ (కె. యల్. పి.) లో చేరారు. 1955 లో ఆంధ్ర శాసనసభ సభ్యుడుగా ఎన్నికయారు. 1956 మార్చి-నవంబరు లలో వ్యవసాయం, అడవులు, పౌరసరఫరాలు, పశుసంవర్ధక శాఖ, మత్స్య శాఖల మంత్రిగా పనిచేశారు. 1962 లో తిరిగి ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభ్యుడుగా ఎన్నికయారు. 1963 లో ఎస్టిమేట్సు కమిటీ ఛైర్మన్‌గా నియమింపబడ్డారు. 1967-71 మధ్య ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ మేనేజిమెంటు బోర్డు ఛైర్మన్‌గా పనిచేశారు. 1972 లోను, 1978 లోను తిరిగి శాసనసభకు ఎన్నికయారు. 1978 మార్చి 10 నుండి 1980 అక్టోబరు 10 న చెన్నారెడ్డి మంత్రివర్గం రాజీనామా చేసేవరకూ ఆ మంత్రివర్గంలో మధ్యతరహా నీటివనరుల శాఖ మంత్రిగా పనిచేశారు. తిరిగి అంజయ్య మంత్రివర్గంలో 1980 అక్టోబరు 16 న అదే శాఖలో మంత్రిగా నియమింపబడ్డారు.

## పొణకా కనకమ్మ

శ్రీమతి పొణకా కనకమ్మ 1896 లో జన్మించారు. నెల్లూరు వాస్తవ్యురాలు. తండ్రి మరుపూరు కొండారెడ్డి. భర్త సుబ్బరామిరెడ్డి. కవయిత్రి. వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్నారు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 27-6-1930 నుండి నెల్లూరు, వెల్లూరు జైళ్ళలో ఆరు మాసాలు శిక్ష అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 26-5-1932 న 18 మాసాలు శిక్ష విధించారు. వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు. 30-6-1933 న విడుదలయారు. గ్రంథాలయోద్యమంలో క్రియాశీలంగా పాల్గొన్నారు. 1923 కాకినాడ కాంగ్రెస్‌లో, మహిళల సమావేశానికి అధ్యక్షురాలు. నెల్లూరు కాంగ్రెస్ కమిటీకి ప్రథమ మహిళా అధ్యక్షురాలు ఎ.ఐ.సి.సి సభ్యురాలు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ ఉపాధ్యక్షురాలు. మహిళలలో విద్యావ్యాప్తికి, సాంఘిక సంస్కరణలకోసం కృషిచేశారు. నెల్లూరులో కస్తూర్బా మహిళా ఉన్నత పాఠశాల నెలకొల్పారు.

## గరిమెళ్ల సత్యవీరభద్రరావు

గరిమెళ్ల సత్యవీరభద్రరావుగారు కాకినాడ తాలూకా గంగ్రేడు వాస్తవ్యులు. తండ్రి సూరయ్య. బ్రహ్మసామాజికుడు. ఉప్పుసత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు. 9-5-1930 నుండి మద్రాసు, వెల్లూరు జైళ్ళలో 6 మాసాలు కఠిన శిక్ష అనుభవించారు. అనంతరం శాసనోల్లంఘనోద్యమంలో

పాల్గొన్నారు 20-1-1932 న ఒక సంవత్సరం కఠిన శిక్ష, రు. 100 లు జరిమానా, చెల్లించక పోతే, 12 వారాలు కఠిన శిక్ష విధించారు. బరంపురం, ఒ రి, కోయంబత్తూరు జైళ్ళలో నిర్వం ధించారు. వ్యష్టిసత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 6 మాసాలు కఠిన శిక్ష విధించారు. 8-1-1941 నుండి వెల్లూరు, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభ వించారు. తిరిగి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొ న్నందుకు 26-8-1942 నుండి అలీపురం జైల్లో 18 మాసాలు కఠిన శిక్ష అనుభవించారు.

## తల్లాప్రగడ నరసింహ శర్మ

తాడేపల్లిగూడెం తాలూకా ఎ గుటూరులో నర సింహశర్మ 1898 సంవత్సరం 21 జన్మించారు. తండ్రి త్ర్యంబకం అనే సుందర రామయ్య. జాతీయ విద్యా బోధన లక్ష్యంతో బాగలులో ఆనంద నికేతన్ ఆశ్ర మాన్ని స్థాపించారు. 1921 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. అనంతరం ఉప్పు సత్యాగ్రహోద్య మంలో పాల్గొన్నారు. 2-6-1930 న ఒక సంవ త్సరం కఠిన శిక్ష విధించారు రాజమండ్రి, కన్ననూరు, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒడంబడికను పురస్కరించుకుం, 14-3-1931 న విడుదలయారు. తిరిగి శాసనోల్లంఘ నోద్యమంలో పాల్గొన్నందుకు 6 మాసాలు కఠిన శిక్ష, రు. 200/-లు జరిమానా విధించారు. జరి మానా వసూలు చేశారు. వెల్లూరు జైల్లో శిక్ష అనుభ వించారు. 1923 లో ఒక ఆశ్రమం స్థాపించి, హరిజనోద్ధరణకు కృషి చేశారు.

## కొమ్మారెడ్డి ఆంజనేయులు

కొమ్మారెడ్డి ఆంజనేయులు ఏలూరు తాలూకా పోతునూరు వాస్తవ్యులు. తండ్రి గోపాల కృష్ణయ్య. వ్యవసాయదారు గ్రామ మునసబు. 1920 లో గ్రామమునసబు పదవికి రాజీనామా యిచ్చి, కాంగ్రెస్ పార్టీలో చేరారు. 1929-30 లో పశ్చిమ గోదావరి కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు. ఉప్పు సత్యాగ్ర హోద్యమ సందర్భంగా, డిక్టేటరుగా, ఏలూరులో సత్యాగ్రహ శిబిరాన్ని విజయవంతంగా నిర్వహిం చారు. ఏలూరు సబ్ డివిజనల్ మేజిస్ట్రేటు 25-6-1930 న కొమ్మారెడ్డి ఆంజనేయులు రికి రు. 600/-జరిమానా విధించి, చెల్లించకపోతే, ఒక సంవత్సరం సామాన్య శిక్ష విధించాడు. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభ విస్తుండగా, గాంధీ - ఇర్విన్ ఒడంబడికను పురస్క రించుకొని 14-3-1931 న విడుదల అయారు. తిరిగి శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నందుకుగాను, 13-1-1932 న ఆరు మాసాలు సామాన్య శిక్ష విధించి, రాజమండ్రి, కడలూరు జైళ్ళలో నిర్బం ధించారు.

మూడవ భాగం

# కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర

—శ్రీ తుమ్మల వెంకటరామయ్య
—శ్రీ పరుచూరి కోటేశ్వరరావు

# కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర

## స్వాతంత్ర్య పోరాటాలకు పుట్టినిల్లు కృష్ణా మండలం

ఆంధ్రప్రదేశ్‌లోని కృష్ణా మండలం ప్రాచీన నాగరికతకు, సంస్కృతికి నిలయమై, అనేక విధాల చరిత్ర ప్రసిద్ధి చెందింది. భారత స్వాతంత్ర్య సంగ్రామం ప్రారంభమైన నాటికి, ఇప్పటి కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలు - కృష్ణా మండలంగా పిలువబడుతుండేవి. పూర్వకాలంలో దీనికి 'కర్మనాడు' అనే పేరు కూడా వుంది.

ప్రాచీనకాలంలో ఆంధ్ర సామ్రాజ్యాలకు ఆయువు పట్టు అయిన కృష్ణా మండలం ఆధునిక కాలంలో స్వాతంత్ర్య పోరాటాలకు పుట్టినిల్లు కావటం విశేషం. గమనార్హం. దేశ ఆర్థిక, రాజకీయ సాహిత్య కళా రంగాలలో అనాదిగా ప్రముఖస్థానం అలంకరిస్తూ, ప్రధానపాత్ర వహిస్తూ వచ్చిన కృష్ణామండలం, 1850 దశకంలో ప్రపంచ మహా మేధావి, కమ్యూనిస్ట్ సిద్ధాంత తత్వవేత్త అయిన కారల్ మార్క్స్ దృష్టిని ఆకర్షించటం, ఆయన భారతదేశం గురించి రాసిన లేఖలలో అది చోటు చేసుకొనడం ఇందుకు ఒక నిదర్శనం.

### బౌద్ధమతానికి సుక్షేత్రం

క్రీస్తుకు పూర్వం 400 సంవత్సరాల ప్రాంతంలో ఆంధ్ర సామ్రాజ్యం అవతరించక మునుపే కృష్ణా మండలం బౌద్ధ మతానికి సుక్షేత్రం అయింది. ఈ మండలంలో నేటికీ చారిత్రక అవశేషాలుగా మిగిలిన అనేక బౌద్ధ క్షేత్రాలే అందుకు సాక్షీభూతాలు.

చరిత్ర ప్రసిద్ధి చెందిన బౌద్ధక్షేత్రం, నాగార్జున విశ్వవిద్యాలయ కేంద్రం అయిన విజయపురి మొదలు ఇప్పటి కృష్ణాజిల్లా మొవ్వ తాలూకాలోని ఘంటసాల వరకు విస్తరించివున్న ఈ కృష్ణామండలంలో కృష్ణా నదికి ఇరువైపుల అనేక బౌద్ధ క్షేత్రాలు వెలిశాయి. వీటిలో అమరావతి, ఘంటసాల క్షేత్రాలు ప్రధానమైనవి.

### సిద్ధ నాగార్జునుని జన్మస్థలం జగ్గయ్యపేట

ఆచార్య నాగార్జునుని ముఖ్య శిష్యుడు, మూలికా వైద్య నిపుణుడుగా గణుతికెక్కిన సిద్ధ నాగార్జునుని జన్మస్థలం కృష్ణాజిల్లాలోని జగ్గయ్యపేట. అక్కడ ఆయన నిర్మించిన బౌద్ధ స్థూపం నేటికీ పర్యాటకుల దృష్టిని ఆకర్షిస్తున్నది. కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలోని రామిరెడ్డిపల్లి, విజయవాడ సమీపంలోని మొగల్రాజపురం కొండగుహలు, గుడివాడ, చిగురు కోట, గుడిమెట్ల, అల్లూరు, పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు తాలూకాలోని గుంటుపల్లి మున్నగు గ్రామాలలో నేటికీ మనకు కన్పిస్తున్న బౌద్ధ చిహ్నాలను బట్టి, కృష్ణా మండలంలో బౌద్ధమత వ్యాప్తి, విస్తృతి ఎంతో మనకు అర్థమవుతుంది.

### ధీశక్తికి, ధైర్యసాహసాలకు లోటులేని పోతుగడ్డ

ధీశక్తికి, ధైర్యసాహసాలకు, పరాక్రమానికి లోటులేని పోతుగడ్డ కావటం, కృష్ణా మండలం ఆంధ్ర సామ్రాజ్యానికి పుట్టిల్లుగా కాగలిగింది. కృష్ణాజిల్లా మొవ్వ తాలూకాలోని కృష్ణానదీ తీరాన గల శ్రీకాకుళం క్రీస్తుకు పూర్వం 400 సంవత్సరాల ప్రాంతంలో ఆంధ్ర విష్ణువు స్థాపించిన, ఆంధ్ర సామ్రాజ్యానికి రాజధాని అయింది. తొలి ఆంధ్ర రాజ్యాధిపతులు ఇక్కడనుంచి సేనా వాహినులతో బయలుదేరి, బీహార్, హైదరాబాద్, మధ్యప్రదేశ్ ప్రాంతాలను జయించారు.

### బెజవాడ ప్రశస్తి

ఇంద్రకీలాద్రి పర్వతంగా పిలువబడే బెజవాడ కొండపైన, అర్జునుడు తపస్సుచేసి పాశుపతాస్త్రం సంపాదించాడన్న స్థల పురాణ గాథను అటుంచినా విష్ణుకుండినుల కాలంలో నిర్మితమైన కనకదుర్గ ఆలయం, మల్లికార్జునాలయం ఈ ప్రాంతపు ప్రాచీన ప్రాభవానికి ప్రత్యక్ష తార్కాణం.

### వివిధ రాజ్యాల రాజధానులకు కృష్ణా మండలమే నిలయం

శాతవాహన రాజుల అనంతరం, ఆంధ్ర సామ్రాజ్యానికి అధిపతులైన అనేకమంది రాజులు, తమ రాజ్యాల రాజధానులను కృష్ణామండలంలోనే ఏర్పాటు చేసుకొన్నారు. ఇక్ష్వాకుల రాజధాని విజయపురి, బృహత్ఫలాయనుల రాజధాని కృష్ణాజిల్లా దివి తాలూకా కోడూరు, శాలంకాయనుల రాజధాని ఏలూరు సమీపంలోని వేంగిపురం, కొల్లేటికోట, పెదవేగి, చినవేగి, విష్ణుకుండినుల రాజధాని వినుకొండ, తూర్పు చాళుక్యుల రాజధాని వేంగివంటి చారిత్రక ప్రదేశాలన్నీ ఈ మండలంలోనివే.

### క్రీస్తుకు పూర్వమే ఘంటసాలకు ఖ్యాతి

ఈ మండలంలోని కంటకశైలం (ఘంటసాల) క్రీస్తుకు పూర్వమే, ప్రధానమైన రేవు పట్టణంగా రాణించింది. ఇటలీ తదితర యూరోపియన్ దేశాలకు, జావా, సుమిత్రా, బోర్నియో, సయాం, కాంబోడియా వంటి తూర్పు ఆసియా దేశాలకు ఈ రేవు నుంచి పెద్ద ఎత్తున వ్యాపారం సాగింది. క్రీ. శ. రెండవ శతాబ్దానికి చెందిన సుప్రసిద్ధ ఈజిప్షియన్ ఖగోళ శాస్త్రజ్ఞుడు టొలమీ రచనలోను, అలాగే సుప్రసిద్ధ ఫ్రెంచి చరిత్రకారుడు డూబ్రియల్ రచించిన 'దక్కన్ పూర్వ చరిత్ర' గ్రంథంలోను ఈ చారిత్రిక వాస్తవం ఉదహరించబడింది.

కంటకశైలం రేవు నుంచి, దాని ప్రక్కనే గల గూడూరు రేవునుంచి సరుకులు మాత్రమే కాక ఆంధ్రులనాగరికతకూడా జావా, సుమత్రా, బోర్నియో, సయాం, కాంబోడియా వంటి తూర్పు ఆసియా దేశాలకు తరలివెళ్ళినట్లు, ఆ దేశాలలో నేటికీ ఆంధ్ర దేశపు పట్టణాల పేరులు, ఆంధ్ర నాగరికత చిహ్నాలు స్పష్టంగా కన్పిస్తున్నాయని డూబ్రియల్ వివరించాడు.

ఘంటసాల గ్రామంలోని పాటిదిబ్బలు తవ్వుతుంటే, బయల్పడుతున్న బంగారు నాణెములు (ఒక వైపున రోమ్ చక్రవర్తి బొమ్మ, రెండవ వైపున సముద్రదేవుని బొమ్మ గలవి) అలనాడు ఇటలీ దేశంతో జరిపిన వాణిజ్యానికి ప్రత్యక్ష నిదర్శనం. క్రీ. శ. 13 వ శతాబ్దం వరకు కంటకశైలం (ఘంటసాల) రేవు పట్టణంగా విరాజిల్లింది.

### కృష్ణామండలం ఆడపడుచు కడుపున పుట్టిన వీరనారి రుద్రమాంబ

కాకతీయ చక్రవర్తి గజపతి కృష్ణాజిల్లా దివి తాలూకా తలగడ దీవివద్ద జరిగిన యుద్ధంలో కృష్ణా మండలవాసుడు ప్రదర్శించిన పరాక్రమం చూసి, పరవశుడై, ఈ మండలానికి చెందిన ఇద్దరు ఆడపడుచులను — జాయప సేనాని సోదరీమణులను అంగులుగా పరిగ్రహించాడు. వారిలో ఒకరి కడుపున పుట్టిన రాణి రుద్రమాంబ కాకతీయ సామ్రాజ్యాధినేతగా రాణించి, మహిళా లోకానికే చిరస్థాయిగా వెలుగొందే వన్నె తెచ్చిపెట్టింది.

### సంస్కృతీ సంపద నిలయం

కృష్ణామండలం ఆంధ్ర సామ్రాజ్యానికి నాగరికతకు ఆయువుపట్టు కావడమేకాదు, తెలుగు సంస్కృతీ సంపదకు కూడా నిలయమై భాసించింది. అన్నమయ్యతో పరితూగగలిగిన పదకవి క్షేత్రయ్య జన్మస్థానం కృష్ణాజిల్లా మొవ్వ. అలాగే భరత నాట్యాచార్యుడు సిద్ధేంద్ర మహాయోగి కర్మభూమి కృష్ణాజిల్లా కూచిపూడి.

ఇలాంటి సుసంపన్నమైన ప్రాచీన సంస్కృతీ సంపద, నాగరికత, చరిత్ర కలిగిన ఈ కృష్ణామండలం ఆధునిక కాలంలో బ్రిటిష్ వలసపాలకులకు వ్యతిరేకంగా సాగిన భారత స్వాతంత్ర్య సంగ్రామంలో కూడ అగ్రశ్రేణిని నిలబడి, అత్యంత ప్రముఖమైన పాత్ర నిర్వహించింది.

## తొలి రైతు పోరాటాలు

భారత జాతీయ కాంగ్రెసు నాయకత్వంలో భారత స్వాతంత్ర్య సంగ్రామం ప్రారంభం కావడానికి పూర్వమే, కృష్ణామండలంలో 19 వ శతాబ్దం చివరి భాగంలో కృష్ణాజిల్లా ఉయ్యూరు సమీప గ్రామమైన గండిగుంటకు చెందిన దండమూడి రామబ్రహ్మం నాయకత్వంలో, బ్రిటిష్ పాలకులకు, తాబేదారులైన జమిందారులకు వ్యతిరేకంగా చారిత్రాత్మకమైన రైతు పోరాటం సాగించబడింది. "నాగలి మేడిని భూమిలో తిరగవేసి, పాతే ఉద్యమం"గా అది పిలువబడింది. అలా పాతిన నాగలి మేడులు ఆకులు తొడిగినట్లు కథలు ప్రచారంలోకి వచ్చాయి. మహాత్మాగాంధీ కంటే మునుపే, కృష్ణామండలం రైతులు సాగించిన సత్యాగ్రహ పోరాటం అది. వ్యవసాయ భూములు బీడులుగా మారడంతో, బ్రిటిష్ ప్రభుత్వం రైతులకు తలవంచవలసి వచ్చింది. ఆటు తరువాత 20 వ శతాబ్దం ప్రారంభంలో కృష్ణాజిల్లా ముస్తాబాదు గ్రామానికి చెందిన కడియాల చంద్రయ్య రైతుల తరఫున జమిందారులకు వ్యతిరేకంగా న్యాయస్థానాలలో నడిపిన "లీగల్ పోరాటం" ప్రత్యేకంగా పేర్కొనదగింది.

## తెలుగునాట స్వాతంత్ర్యోద్యమ ఆద్యులు, నిర్మాతలు, రథసారథులు

తెలుగునాట స్వాతంత్ర్యోద్యమ ఆద్యులు, నిర్మాతలు, రథ సారథులలో ఎక్కువభాగం కృష్ణామండలంలో జన్మించినవారే. ఈ సందర్భంలో కొండా వెంకటప్పయ్య, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, భోగరాజు పట్టాభి సీతారామయ్య, కాశీనాధుని నాగేశ్వరరావు, ముట్నూరి కృష్ణారావు, సర్దార్ దండు నారాయణరాజు వంటి వారి పేరులను ఉదహరించవచ్చు.

తెలుగు సాహితీ పునర్వికాసానికి పునాదులువేసిన గ్రంథప్రచురణను ప్రారంభించిన కొమర్రాజు లక్ష్మణరావు, తెలుగు నాటకరంగం పునరుజ్జీవన కృషిలో ప్రముఖపాత్ర వహించిన మైలవరం నాటక సమాజం స్థాపకులు మైలవరం రాజా, మైలవరం బాలభారతి సమాజం పోషకులు సూరానేని వెంకట పాపయ్యారావు బహద్దురు జమిందారు, ప్రసిద్ధ నటుడు డి. వి. సుబ్బారావు కృష్ణాజిల్లాలోనే పుట్టిపెరిగారు.

అంతేకాదు, ఆంధ్రదేశంలో సహకారోద్యమానికి అంకురార్పణ చేసిన వి. రామదాసు పంతులు, గ్రంథాలయోద్యమాన్ని ప్రారంభించిన అయ్యంకి వెంకట రమణయ్య, రైతు నాయకుడుగా అఖిల భారత ఖ్యాతి నార్జించిన ఆచార్య ఎన్. జి. రంగా, హిందీ ప్రచారోద్యమంలో ఉన్నత శిఖరా లందుకొన్న మోటూరి సత్యనారాయణ, జాతీయ ఉద్యమ నాయకులను సృష్టించిన ఆంధ్ర జాతీయ కళాశాల స్థాపకులు కోపల్లె హనుమంతరావు మున్నగువారు పుట్టి పెరిగింది ఈ మండలంలోనే. తెలుగు దినపత్రిక "ఆంధ్రపత్రిక"ను స్థాపించినది ఈ మండలవాసే. ఈ మండలంనుంచి వెలువడిన కృష్ణాపత్రిక యావదాంధ్ర జాతిని ఉత్తేజపర్చి, ఉద్దీపం కావించి, స్వాతంత్ర్య సంగ్రామానికి సమాయత్తం చేసింది

జాతీయ జెండాకు రూపకల్పనచేసి, భారత జాతికి సమర్పించిన పింగళి వెంకయ్య కృష్ణాజిల్లా యార్లగడ్డలో జన్మించాడు. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్య అధినేతలను గడగడ లాడించిన అల్లూరి సీతారామరాజు పుట్టింది ఈ పోతుగడ్డపైనే. ఆంధ్ర రాష్ట్ర చరిత్రలోనేకాక, మొత్తం భారతదేశ చరిత్రలోనే సువర్ణాక్షరాలతో లిఖించదగిన దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నడిపిన చీరాల - పేరాల ఉద్యమం, పర్వతనేని వీరయ్య చౌదరి నడిపిన పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం, కన్నెగంటి హనుమంతు నడిపిన పల్నాడు పుల్లరి సత్యాగ్రహంవంటి వాటికి కర్మభూమి కృష్ణామండలమే, కళారంగంలో "మాలపిల్ల", "రైతుబిడ్డ" వంటి సంచలనాత్మక చిత్రాలు నిర్మించిన గూడవల్లి రామబ్రహ్మం, సంగీత విద్వాంసులు సుసర్ల దక్షిణామూర్తి, పాలపర్తి రామకృష్ణయ్య, మధుర గాయకుడు స్వాతంత్ర్య సమరయోధుడు ఘంటసాల వెంకటేశ్వరరావు, మంగళంపల్లి బాలమురళీకృష్ణ, బ్రిటిష్ గవర్నరు పదవిలో వుంటూ గాంధీ టోపి ధరించి చరిత్ర సృష్టించిన కూర్మగంటి రాఘవేంద్రరావు, తెలుగు పత్రికా ప్రపంచంలో నూతనాధ్యాయం ప్రారంభించిన నార్ల వెంకటేశ్వరరావు, కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలలో ప్రముఖుడైన చండ్ర రాజేశ్వరరావు

పుట్టి పెరిగింది ఈ జిల్లాలోనే. సుప్రసిద్ధ కమ్యూనిస్టు నాయకులు పుచ్చలపల్లి సుందరయ్య రాజకీయ జీవితానికి కృష్ణామండలమే ప్రధాన కార్యరంగం అయింది. ఆంధ్రదేశంలో పారిశ్రామిక యుగానికి పరిపుష్టి సమకూర్చిన వేలగపూడి రామకృష్ణ, ముళ్ళపూడి హరిశ్చంద్రప్రసాద్, అంతర్జాతీయ ఖ్యాతి గాంచిన శాస్త్రవేత్తలు వై. నాయుడమ్మ, నూతక్కి భానూప్రసాద్ ఈ మండలంవారే. అంతేకాదు, ఇటీవల ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుదేశం పార్టీని ప్రారంభించి, రాజకీయ పెనుతుపాను సృష్టించి ప్రపంచ దృష్టిని ఆకర్షించిన నందమూరి తారకరామారావు కృష్ణాజిల్లా నందమూరు గ్రామంలో పుట్టారు.

ఇలాంటి సుదీర్ఘ చరిత్ర కలిగిన కృష్ణామండలంలో భాగమైన కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సంగ్రామం ఏవిధంగా మొదలై వృద్ధిచెందిందో విస్తరించిందో వివరంగా పరిశీలిద్దాం.

# కృష్ణా మండలంలో స్వాతంత్ర్య శంఖారావం

1885 లో భారత జాతీయ కాంగ్రెస్ పుట్టుకతో ప్రారంభమైన జాతీయ మహోద్యమంలోను, స్వాతంత్ర్య సంగ్రామంలోను కృష్ణామండలం అగ్రశ్రేణిని నిలచి, ప్రముఖపాత్ర వహించింది. ఇప్పటి కృష్ణా, గుంటూరు జిల్లాలు, పశ్చిమగోదావరి, ప్రకాశం జిల్లాలలోని కొన్ని ప్రాంతాలు ఇరవయ్యో శతాబ్ది ప్రారంభం నాటికి కృష్ణామండలంలోనే వుండేవి. ఈ మండలానికి మచిలీపట్నం – బందరు – ముఖ్య పట్టణంగా వుండేది.

సర్ ఆర్థర్ కాటన్ 1854 లో బెజవాడవద్ద కృష్ణానదిపై నిర్మించిన ఆనకట్ట, కృష్ణామండలంలోని ఆర్థిక సామాజిక, రాజకీయ పరిస్థితిపై గొప్ప ప్రభావాన్ని ప్రసరింపచేసినదని చెప్పవచ్చు. ఈ ఆనకట్ట నిర్మాణం కారణంగా ఈ మండలంలో వ్యవసాయాభివృద్ధి సాధ్యంకావటం మాత్రమేగాక, విద్యాభివృద్ధికి అవకాశాలు ఏర్పడ్డాయి. దీనికితోడు, బ్రిటిష్ పాలకులు తమ పాలన సుసిరం చేసుకొనడానికి క్రైస్తవ మతవ్యాప్తికి సాధనంగా ఆంగ్లభాషలో విద్యను బోధించే విద్యాసంస్థలను స్థాపించటం, ఆ సంస్థలలో విద్యావంతులైన యువకులు రాజకీయంగా చైతన్యవంతులు కావటం జరిగింది. అలా చైతన్యవంతులైన యువకులే ఆంధ్రదేశంలో స్వాతంత్ర్య సంగ్రామానికి శంఖం పూరించారు.

## తొలి తెలుగు వారపత్రిక

భారత జాతీయ కాంగ్రెసు పుట్టిన సంవత్సరంలోనే ఆవుల చినపార్థసారథి నాయుడు సంపాదకత్వంలో మద్రాసునుంచి "ఆంధ్ర ప్రకాశిక" అనే తొలి తెలుగు రాజకీయ వారపత్రిక ప్రారంభమైంది. పార్థసారథినాయుడు గట్టి జాతీయవాది. ఆయన ఆ పత్రికను 25 సంవత్సరాలపాటు సమర్థవంతంగా నిర్వహించి, జాతీయోద్యమ వ్యాప్తికి ఎంతగానో తోడ్పడ్డాడు.

భారత జాతీయ కాంగ్రెస్ పుట్టుకకు ఒక సంవత్సరం ముందే, 1884 లో పి. రంగయ్య నాయుడు, పి. ఆనందాచార్యులు అధ్యక్ష, కార్యదర్శులుగా మద్రాసు మహా జనసభ ఏర్పడింది. 1885 లో బొంబాయిలో జరిగిన తొలి జాతీయ కాంగ్రెసు మహాసభకు పి. రంగయ్య నాయుడు, ఆనందాచార్యులు తదితర మద్రాసు ఆంధ్రులతో పాటు, బందరు న్యాయవాది ఎస్. వెంకట సుబ్బారాయుడు కూడా హాజరయ్యాడు. అలాగే 1891 లో నాగపూర్‌లో జరిగిన భారత జాతీయ మహాసభకు శనగపల్లి రామస్వామిగుప్తా హాజరయ్యాడు.

## ఆదర్శప్రాయమైన కృష్ణా మండలం

ఇలాంటి పూర్వ రంగంలో ,1891 సంవత్సరంలో "కృష్ణా మండల జిల్లా సంఘం" ఏర్పడింది. మద్రాసు

రాష్ట్రంలోని మొత్తం 21 జిల్లాలలో, బహుశా దేశం మొత్తంలోనే, మొట్ట మొదటగా ఏర్పడిన జిల్లా సంఘం అదే. "కృష్ణాజిల్లా సంఘం" తొలి మహాసభ 1892 లో గుంటూరు పట్టణంలో వావిలాల వెంకట శివావధానులు అధ్యక్షతన జరిగింది.

కృష్ణాజిల్లా సంఘ నిర్మాణంలోను, దాన్ని విస్తరింప చేయటంలోను ప్రముఖపాత్ర వహించిన వారంతా ఇంగ్లీషు చదువుకొన్న విద్యాధికులే. వారిలో వేమూరి సుబ్బారావు, కట్టమూడి చిదంబరరావు, కెడింబి హనుమంతరావు, దాసు నారాయణరావు, కొండా వెంకటప్పయ్య, పురాణం వెంకటప్పయ్య, కొడాలి శివరామకృష్ణారావు, వేమవరపు రామదాసు పంతులు, మున్నగు వారి పేర్లు పేర్కొనదగినవి.

## జాతీయోద్యమ వైతాళిక "కృష్ణా పత్రిక"

భారత జాతీయోద్యమ లక్ష్యాలను, స్వాతంత్ర్య పోరాట ప్రాధాన్యాన్ని ప్రజలలో విరివిగా ప్రచారం చేయటంకోసం కృష్ణాజిల్లా అసోసియేషన్ తరపున "కృష్ణా పత్రిక"ను 1902 లో ప్రారంభించారు దీని మొదటి సంపాదకులు కొండా వెంకటప్పయ్య. తరువాత వేమవరపు రామదాసు, ముట్నూరి కృష్ణారావు, భోగరాజు పట్టాభి సీతారామయ్య, సంపాదకులుగా పని చేసినప్పటికీ, "కృష్ణా పత్రిక"అంటే ముట్నూరి కృష్ణారావు పత్రికగా మాత్రమే చరిత్రలో చిరస్థాయిగా భాసిల్లుతుందనవచ్చు.

"కృష్ణా పత్రిక" చదివి, ఆంధ్రదేశంలో స్వాతంత్ర్య సమరయోధులుగా తయారైన వారి సంఖ్య అనేక వేలలో వుందంటే అతిశయోక్తి కాదు. జాతీయ కాంగ్రెసు నాయకత్వంలో స్వాతంత్ర్య పోరాటం ప్రారంభమైన నాటి నుంచి దేశానికి 1947 ఆగస్టు 15 న స్వాతంత్ర్యం సిద్ధించినంతవరకు, కృష్ణా పత్రిక స్వాతంత్ర్య సంగ్రామ చోదకశక్తిగా పనిచేసింది.

## బందరు, బెజవాడ కేంద్రాలుగా వెల్లివిరిసిన ఉద్యమాలు

ఇరవయ్యో శతాబ్దం ఆరంభంలో కృష్ణా మండలం జాతీయోద్యమానికి పుట్టినిల్లుగా మాత్రమేకాక, ఆంధ్రదేశంలో "పునర్వికాస శకానికి" దారితీసిన పత్రిక ప్రచురణ, గ్రంథాలయోద్యమం, సాంఘిక, సంస్కరణోద్యమం, సహకారోద్యమం, జాతీయ నాటక సమాజాలు, జాతీయ కళాశాలలు, ఖద్దరు ఉద్యమం, అంటరానితన నిర్మూలన ఉద్యమం మున్నగునవి అన్నింటికీ ఈ మండలమే ముఖ్యంగా బెజవాడ బందరు పట్టణాలు నిలయమయ్యాయని చెప్పవచ్చు.

## "స్వరాజ్య" తదితర పత్రికలు

గాడిచర్ల హరిసర్వోత్తమరావు సంపాదకులుగా బోడి నారాయణరావు ప్రచురణకర్తగా, పింగళి లక్ష్మీనారాయణ కోశాధికారిగా 'స్వరాజ్య' వార పత్రిక 1908 జూలై 18 న బెజవాడ నుంచి వెలువడింది. కృష్ణాజిల్లా యలకుర్రు గ్రామానికి చెందిన కాశీనాధుని నాగేశ్వరరావు బొంబాయి నుంచి తెలుగు వార పత్రికగా "ఆంధ్ర పత్రిక"ను 1908 లోనే ప్రారంభించాడు. అనంతరం 1914 లో మద్రాసు నుంచి తొలి తెలుగు దిన పత్రికగా "ఆంధ్ర పత్రిక"ను వెలువరించాడు. బందరు నుంచి "నవయుగ" గుంటూరు నుంచి "దేశాభిమాని" పత్రికలు వెలువడ్డాయి.

## విజ్ఞాన వికాస సాధనాలు

ప్రజల నుంచి చైతన్యం ప్రదీప్తమైతే నే స్వాతంత్ర్య ఉద్యమం వృద్ధిచెందుతుంది. ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడానికి పత్రికలు ప్రారంభించడం, కృష్ణాజిల్లా అసోసియేషన్ తరపున ప్రతి సంవత్సరం రాజకీయ మహాసభలు నిర్వహించడంతో పాటు, గ్రంథాలయోద్యమాన్ని, నాటక సమాజాల్ని, గ్రంథ ప్రచురణ సంస్థలను కూడా ప్రారంభించారు.

మహారాష్ట్రుల చరిత్ర, సిక్కుల చరిత్ర, స్వాతంత్ర్యం ఆవశ్యకతను వివరిస్తూ సూపర్లు మిల్లు రచించిన గ్రంథాలు వంటి వాటిని ప్రచురించి ప్రజల హృదయాలలో స్వాతంత్ర్యాగ్నిని రగిలించే నిమిత్తం బందరులో "ఆంధ్ర భాషాభి వర్ధినీ సమాజం" అనే ప్రచురణ సంస్థ ప్రారంభించబడింది. అదేకాలంలో కృష్ణా జిల్లాకు చెందిన కొమర్రాజు లక్ష్మణరావు, హైదరాబాద్‌లో విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలిని స్థాపించారు.

గ్రంథాలయోద్యమ వ్యాప్తికై ముట్నూరి కృష్ణా

రావు బందరులో "ఆంధ్ర భారతి" అనే పత్రికను ప్రచురించారు. తరవాత గ్రంథాలయ ఉద్యమ బాధ్యతలను స్వీకరించిన అయ్యంకి వెంకట రమణయ్యా పల్లెపల్లెకు గ్రంథాలయోద్యమం వ్యాపింపచేయటంలో కృతకృత్యుడయాడు. అంగలూరు, కౌతవరం, వంటి గ్రామాలలోని గ్రంథాలయాలు ప్రత్యేకంగా పేర్కొనదగినవి.

## నేషనల్ థియేటర్

స్వాతంత్ర్యోద్యమ వ్యాప్తికి మూలకందమైన జాతీయ భావాలను, దేశాభిమానాన్ని, స్వాతంత్ర్యేచ్ఛను, త్యాగశీలాన్ని ప్రజల హృదయాల్లో ప్రోదిచేసే నిమిత్తం బందరులో, దాసు నారాయణరావు నేషనల్ థియేటర్- జాతీయ నాటక సమాజం స్థాపించాడు. శివాజీ, పీష్వా నారాయణరావు వధ, విజయనగర పతనం వంటి నాటకాలను తెలుగు, హిందీ భాషలలో ప్రదర్శించారు ఈ నాటక ప్రదర్శనల కోసం బందరులో ప్రత్యేకంగా బుట్టయ్యపేట హాలు నిర్మించారు. నేషనల్ థియేటర్‌కు చెందిన సుప్రసిద్ధనటుడు ఈమని లక్ష్మణస్వామి హిందీ నాటకాలలో శివాజీ, షమేర్‌సింగ్, యూసఫ్‌ఖాన్ వంటి పాత్రలను అమోఘంగా, అద్వితీయంగా పోషించటం మాత్రమేకాక, యువతరానికి హిందీ భాషను బోధించి, తన జీవితాన్ని సార్థకం చేసుకొన్నాడు.

## స్వదేశీ సంతలు-మర మగ్గాలు

కృష్ణాజిల్లా అసోసియేషన్ తరపున ముట్నూరి కృష్ణారావు, పురాణం వెంకటప్పయ్య, చేతి మగ్గాలు స్థానే మర మగ్గాలను ప్రవేశపెట్టి, ఎక్కువ ఉత్పత్తిని సాధించవలసిందిగా పెడన, పల్లెకోట, చింతగుంటపాలెం, కప్పల దొడ్డి వంటి గ్రామాలలో చేనేత పనివారికి నచ్చ చెప్పారు. "మర మగ్గములు మాట చేతకావు. పోగుతెగిపోవును" అంటూ వారు వెనుకాడినప్పుడు, చింతగుంటపాలెం దేవాంగి పెద్ద బూసు సుబ్బారాయుడు సాహసించి, మర మగ్గంపై నేత సాగించాడు. ఎక్కువ ఉత్పత్తి చేసి చూపెట్టాడు. దాంతో అందరూ మరమగ్గాల మీద నేత నేయడానికి ముందుకొచ్చారు.

దేశీయ పరిశ్రమలను ప్రోత్సహించే నిమిత్తం బందరులోని అయ్యంకివారి హాలులో తరచు "స్వదేశీ సంతలు" జరుపుతుండేవారు.

## సంస్కృతీ వికాసం-సంఘ సంస్కరణలు

ఇదే కాలంలో బందరు తెలుగు సాహిత్య సంగీత సంస్కృతీ వికాసానికి కేంద్రంగా భాసించింది. బందరు హిందూ హైస్కూలులో అధ్యాపకుడైన తిరుపతి వెంకటశాస్త్రి "తిరుపతి వెంకటేశ్వరకవుల" పేరుతో తెలుగు సాహిత్యానికి నూతనోత్తేజం కల్గించారు. గరికపర్తి కోటయ్య దేవర, సుసర్ల దక్షిణామూర్తి, హరి నాగభూషణం వంటి సంగీత శాస్త్రజ్ఞులు మృదంగ వాద్య నిపుణుడు అశ్వధాటి రామమూర్తి బందరు వాస్తవ్యులే.

బందరు నోబుల్ కాలేజీ ప్రిన్సిపాల్‌గా పని చేస్తున్న రఘుపతి వెంకటరత్నం నాయుడు బ్రహ్మ సమాజం స్థాపించి, క్రైస్తవ మతాంతీకరణకు అడ్డుకట్ట వేశాడు. అందుకు ఆయనను క్రైస్తవ మతాధిపతులు ఉద్యోగం నుంచి తొలగించారు. కాంగ్రెసులో ప్రముఖ పాత్ర వహించిన భోగరాజు పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి శిష్యులే.

## అస్పృశ్యతా నిర్మూలనోద్యమం

హరిజన ఉద్యమానికి బీజాంకురమైన అస్పృశ్యతా నిర్మూలనోద్యమానికి గూడూరు రామచంద్రరావు ఆద్యులు కాగా, వేమూరి రాంజీరావు పల్లె పల్లెకు పోయి, అంటరాని వారైన హరిజనులలో ప్రచారం సాగించారు.

ఇలాంటి పూర్వరంగంలో కృష్ణా మండలంలో స్వాతంత్ర్యోద్యమానికి "వందేమాతరం" ఉద్యమ సందర్భంగా నాందీ ప్రస్తావన జరిగింది.

# వందేమాతరం ఉద్యమంతో కృష్ణాజిల్లాలో ఉత్తేజం

1905 లో వైస్రాయి లార్డ్ కర్జన్ బెంగాల్ రాష్ట్రాన్ని తూర్పు, పశ్చిమ బెంగాలు రాష్ట్రాలుగా విభజిస్తూ ఉత్తర్వు చేయడంతో బెంగాలులో మాత్రమే కాక, యావద్భారత దేశంలో కూడా బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా జాతీయోద్యమం పెల్లుబికింది. 1905 లో కాశీలో జరిగిన కాంగ్రెస్ మహాసభలో బెంగాల్ విభజనను వ్యతిరేకిస్తూ తీర్మానించారు

ఆ సమయంలో మద్రాసులో విద్యనభ్యసిస్తున్న అయ్యదేవర కాళేశ్వరరావు, గొల్లపూడి సీతారామ శాస్త్రి, గాడిచర్ల హరిసర్వోత్తమరావు వంటి యువకులు జాతీయ భావాల ప్రభావానికిలోనై, సముద్ర తీరంలో 1905 సెప్టెంబర్‌లో విద్యార్థి మహాసభ ఏర్పాటు చేయడంలో ప్రముఖ పాత్ర వహించారు. ఆ సభకు అధ్యక్షత వహించిన జి. సుబ్రహ్మణ్య అయ్యర్, ఆ విద్యార్థులలో దేశభక్తిని నూరిపోశాడు. బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా బెంగాల్ యువకులు జరుపుతున్న పోరాటాన్ని బలపరుస్తూ ఆ సభలో తీర్మానించారు.

## స్వాతంత్ర్య పోరాటానికి నాందిగా స్వదేశీ ఉద్యమం

బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగిన స్వాతంత్ర్య పోరాటానికి స్వదేశీ ఉద్యమం నాంది అయిందని చెప్పవచ్చు. మద్రాసులోని తెలుగు విద్యార్థులు అయ్యదేవర కాళేశ్వరరావు ప్రభృతులు స్వదేశీ వర్తక సంఘాన్ని స్థాపించడానికి, స్వదేశీ పరిశ్రమల అభివృద్ధికి "దీపావళి భిక్ష" పేరుతో ఇంటింటికి తిరిగి విరాళాలు వసూలు చేశారు

మద్రాసులోని తెలుగు విద్యార్థుల ఆదర్శాన్ని పాటించి, విజయవాడలో పింగళి లక్ష్మీనారాయణ అదే నెలలో "కృష్ణా స్వదేశీ ట్రేడింగ్ కంపెనీ" ని స్థాపించి, స్వదేశీ వస్తు విక్రయశాలను ప్రారంభించారు. కాగా బందరులో "స్వదేశీ సంతలు" రూపంలోను, మర మగ్గాలు ప్రవేశపెట్టడం ద్వారాను స్వదేశీ ఉద్యమం సాగించింది.

## కలకత్తా కాంగ్రెస్ రగిల్చిన కనువిప్పు

1906 లో కలకత్తాలో జరిగిన కాంగ్రెసు మహాసభ జాతీయోద్యమంలో గుణాత్మకమైన మార్పును కొనివచ్చింది. స్వరాజ్య సాధన భారతజాతి లక్ష్యంగా ఆ మహాసభ నిర్దేశించింది. స్వరాజ్య సాధనకు స్వదేశీ వ్రతం స్వీకరించి, విదేశీ వస్తు బహిష్కరణ కావించి, జాతీయ విద్యను అభ్యసించాలని ఆ మహాసభ నిర్దిష్టమైన కార్యక్రమాన్ని భారత ప్రజల ముందుంచింది. ఆ మహాసభకు బెజవాడ నుంచి, పింగళి లక్ష్మీనారాయణ, మునగాల రాజా, కొమర్రాజు లక్ష్మణరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు ప్రభృతులు హాజరయ్యారు. బెజవాడ ప్రతినిధి వర్గసభ్యులంతా, కలకత్తా కాంగ్రెసు మహాసభలో మితవాద నాయకులైన సురేంద్రనాథ్ బెనర్జీ, ఫిరోజ్‌షా మెహతా, గోపాలకృష్ణ గోఖలే, మదన్‌మోహన మాలవ్యా, న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు వంటి వారి వాదనలను వ్యతిరేకించి, అతివాద జాతీయ నాయకులైన బిపిన్ చంద్రపాల్, లాలాలజపతిరాయ్, బాల గంగాధరతిలక్, అరవిందఘోష్ వంటి వారి వాదనలను గట్టిగా బలపర్చారు. చివరకు ఆ మహాసభలో అతివాద రాజకీయ నాయకుల వాదనలే నెగ్గాయి.

అదే సమయంలో న్యాయవాద పట్టాతో బెజవాడ చేరిన అయ్యదేవర కాళేశ్వరరావు న్యాయవాదవృత్తిని కొనసాగిస్తూ, పింగళి లక్ష్మీనారాయణ, పెద్దిభొట్ల వీరయ్య, సూరి వెంకట నరసింహశాస్త్రి, అయ్యంకి శ్రీరంగశాయిలతో కలిసి, పశ్చిమ కృష్ణాజిల్లాలో బహిరంగ సభలు జరిపి, జాతీయ కీర్తనలు పాడుతూ, కరపత్రాలు పంచుతూ కాంగ్రెసు ప్రచారాన్ని ముమ్మరంగా సాగించారు.

స్వదేశీ పరిశ్రమలను ప్రోత్సహించే నిమిత్తం పింగళి లక్ష్మీనారాయణ బెజవాడలో "సిరంపూర్ ఫ్లయ్‌షటిల్"అనే కొత్తరకం నేతమగ్గాలను తయారు చేసే ఫ్యాక్టరీని స్థాపించారు. ఆంధ్రదేశంలో మరమగ్గాల వ్యాప్తికి ఈ ఫ్యాక్టరీ ఎంతగానో తోడ్పడింది.

## ముట్నూరి కృష్ణారావు ఆహ్వానంపై బిపిన్ చంద్రపాల్ ఆంధ్ర పర్యటన

ఆంధ్రదేశంలో జాతీయోద్యమ నిర్మాతలలో ఒకరైన ముట్నూరి కృష్ణారావు ఆరు నెలలపాటు బెంగాల్‌లో, జాతీయోద్యమంలో లాల్-పాల్-లాల్ త్రయంగా పేరొందిన ముగ్గురిలో ఒకరైన బిపిన్ చంద్రపాల్‌తో పర్యటించిన అనంతరం, బిపిన్ చంద్రపాల్‌ను ఆంధ్రదేశ పర్యటనకు ఆహ్వానించారు.

బిపిన్ చంద్రపాల్ కృష్ణాజిల్లాలోని బెజవాడ బందరు పట్టణాలలో అనేక సభలలో ప్రసంగించి తన వాగ్ధాటితో వేలాది సభికులను ఉద్రూతలూగించి, ఉత్తేజితులను కావించగలిగారు.

బెజవాడలో మునగాల రాజా ఆతిథ్యం స్వీకరించిన బిపిన్ చంద్రపాల్ "స్వదేశీ - ఆధ్యాత్మిక స్వాతంత్ర్యం" అన్న అంశంపై ఉత్తేజపూరితమైన ప్రసంగం చేశారు. అనంతరం ఆయన బందరు చేరినప్పుడు కోపల్లె హనుమంతరావు, ఎమ్. నరసింహం, సూర్యనారాయణరావు తదితరుల నాయకత్వంలో అఖండ స్వాగతం లభించింది. బందరులో బ్రహ్మసమాజానికి చెందిన రామదాసు నాయుడు గృహంలో బిపిన్ చంద్రపాల్ మూడు రోజులపాటు గడిపాడు. ఆ మూడు రోజులలోను మూడు అంశాలపై స్వదేశీ, స్వరాజ్యం, వందేమాతరం గురించి మూడు-సభలలో ఉద్రేకపూరితమైన ప్రసంగాలు చేశాడు.

## ప్రజలలో సంచలనం బ్రిటిష్ పాలకులలో కలవరం

బెజవాడ, బందరు పట్టణాలలో బిపిన్ చంద్రపాల్ చేసిన ప్రసంగాలు కృష్ణాజిల్లా ప్రజలలో పెద్ద ఎత్తున సంచలనం కల్గించటంతో విదేశీ పాలకులలో కలవరం పుట్టింది. అప్పటి జిల్లా కలెక్టర్ మారిస్ సౌమ్యుడు, పనికిరాడు అనే భావంతో అతణ్ణి అనంతపురం జిల్లాకు బదిలీ చేసి, కృష్ణాజిల్లా కలెక్టర్‌గా కర్కోటకుడైన స్కాట్‌ను నియమించారు. స్కాట్ ప్రత్యేకంగా 300 మంది మహమ్మదీయ పోలీసు బలగాన్ని కృష్ణా జిల్లాకు రప్పించాడు. బందరు పౌరులపై పోలీసుల దౌర్జన్యం కాండ మితిమీరిపోయింది. జాతీయవాదులని అనుమానించిన వారందరిపైన తప్పుడు న్యూసెన్సు కేసులు బనాయించడం మొదలుపెట్టారు. పోలీసు నిర్బంధ విధానానికి నిరసనగా బందరులో 'పౌరుల స్వరాజ్య సమితి'ని స్థాపించి, ఆందోళన సాగించారు.

బందరు, బెజవాడలలో కొందరి ఇళ్ళపై పోలీసులు దాడులు జరిపి, సోదాలు చేశారు. "మీరు దేశభక్తుల్ని అరెస్టు చేస్తే, మీ ప్రాణంతీసే బాంబు సిద్ధంగా వుంది. మీ ౹ జాన్ని 15 రోజులలోగా బ రి గొ ం టాం తెలు ?" అని హెచ్చరించే ఆకాశరామన్న ఉత్తరం చూసి, భయపడిన కలెక్టర్ స్కాట్ తన పోలీసు జులుంను మరింత హెచ్చుగా సాగించాడు.

## కృష్ణాజిల్లా పరిస్థితిపై అల్లాబాద్ 'పయొనీర్' వ్యాఖ్య

కృష్ణాజిల్లాలో బిపిన్ చంద్రపాల్ ప్రచారం కల్గించిన ప్రభావం గురించి, అల్లాబాద్ నుంచి వెలువడుతున్న "పయొనీర్" పత్రిక "కృష్ణాజిల్లాలో రాజద్రోహ ప్రచారం"అనే శీర్షికతో ఈ క్రింది హెచ్చరికతో కూడిన వ్యాఖ్యచేసింది.

"పాల్ సందేశం స్వదేశీ వక్తలచే ప్రతి గ్రామానికి కొనిపోబడుతున్నది. ప్రజల హృదయ సీమలలో రాజద్రోహ బీజములు నాటబడుతున్నవి."

పయొనీర్ పత్రిక వ్యాఖ్య పూర్ణసత్యంతో కూడుకొన్నది కాకపోయినా, పాక్షిక సత్యంతో కూడినట్టిదేనని చెప్పవచ్చు.

బందరులో బిపిన్ చంద్రపాల్ చేసిన ప్రసంగం విని, ఉత్తేజితుడైన, బొబ్బా పద్మనాభయ్య, తన స్వగ్రామమైన కొతవరం వెళ్ళి "వందేమాతరం - మందేరాజ్యం" అనే పోస్టర్లను పూరంతా గోడల నిండా అతికించాడు. ఆ గ్రామం మధ్యలోగల పాక (అమ్మవారిపురం పాక)ను ఆ పోస్టర్లతో అలంకరించడంతో గ్రామస్తులదృష్టి దానిపైనే లగ్నమైంది. తన వూళ్ళోని యువకులందర్నీ చేరదీసి. వారికి స్వాతంత్ర్య భావాలను నూరిపోశాడు. కొతవరం గ్రామంలో ఏదో "విప్లవశక్తి" బయలుదేరినట్టు భయపడిన బ్రిటిష్ ప్రభుత్వాధికారులు రిజర్వుపోలీసులను ఆ గ్రామానికి ఉరికించారు. అయితే అప్పటికే యువకులు పోలీసుల కనుగప్పి, తప్పుకొన్నారు.

అదే దశలో బెంగాల్ నుంచి బెజవాడవచ్చిన ఒకా

నొక పెర్రరిస్టు సర్కార్,అయ్యదేవర కాళేశ్వరరావు ప్రభృతులను కలుసుకొని. బ్రిటిష్ పాలకులను పార ద్రోలి, మాతృదేశ విముక్తిని సాధించడానికి సాయుధ పోరాటం, అవసరమని నచ్చచెప్పడానికి ప్రయత్నిం చాడు. గాడిచర్ల హరి సర్వోత్తమరావు అయ్యదేవర కాళేశ్వరరావు, వీరమల్లయ్య. సూరి వెంకటశాస్త్రి, ఉన్నవ లక్ష్మీనారాయణ వంటి యువకులు రహస్య సంస్థలను స్థాపించి, విప్లవం లేవదీయాలని ప్రయ త్నించక పోలేదు. కాగా, అయ్యంకి వెంకటరమ ణయ్య, నోరి వెంకటేశ్వర్లువంటి యువకులు"ఫుల్స్ క్లబ్"అనే దాన్ని స్థాపించి, విప్లవానికి సంబంధించిన గ్రంథాల్ని చదవటం. చదివించటం, చర్చించటం, కరపత్రాలు అచ్చువేసి, పంచిపెట్టటంవంటి పనులు చేశారు. అయితే, తీవ్ర ధోరణితో కూడిన కార్య కలాపాలకు, ప్రయత్నాలు జరుగుతున్నట్టు పసికట్టిన పోలీసు అధికారులు బెజవాడలో అయ్యదేవర కాళే శ్వరరావు. పెద్దిబొట్ల వీరయ్య. నరసింహశాస్త్రి ఇళ్ళపై దాడులుచేసి, సోదాలు జరిపారు. దాంతో ఈ తీవ్రవాద ధోరణులు అంతరించి పోయాయి.

## అతివాదంవైపు మొగ్గు

1907లో సూరత్‌లో జరిగిన కాంగ్రెస్ మహా సభకు హాజరైన కృష్ణాజిల్లా ప్రతినిధులైన పెద్దిభొ వీరయ్య. గాడిచర్ల హరిసర్వోత్తమరావు. కోప హనుమంతరావు, గంటి లక్ష్మన్న వంటి వారం బాలగంగాధరతిలక్. అరవింద ఘోష్‌వంటి అతివాద వర్గ నాయకుల పక్షం వహించారు.

## సాంఘిక, రాజకీయ మహాసభలు

అదే సంవత్సరం. నందిగామలో కృష్ణాజిల్లా సాంఘిక, రాజకీయ మహాసభలను నిర్వహించారు. ఈ మహాసభల ఆహ్వానసంఘం అధ్యక్షులు మునగాల రాజా కాగా, కార్యదర్శి అయ్యదేవర కాళేశ్వరరావు. రాజకీయ మహాసభకు వల్లూరి సూర్యనారాయణరావు. సాంఘిక మహాసభకు కొండా వెంకటప్పయ్య అధ్య క్షత వహించారు.

## ప్రభుత్వ నిర్బంధ విధానానికి నాంది

ఈ మహాసభలు ప్రారంభం కావడానికి ఒకటి రెండురోజులు ముందు, లాలా లజపతిరాయ్. అజిత్ సింగ్‌లను బ్రిటిష్ ప్రభుత్వం అరెస్టుచేసి ప్రవాసం పంపించింది. ఈ వార్త మహాసభలకు హాజరైన ప్రతి నిధులలో తీవ్ర ఆందోళన కల్గించింది. ఏ సరిసున్న జాతీయోద్యమాన్ని అణచివేయడానికి. బ్రిటిష్ ప్రభుత్వం తలపెట్టిన నిర్బంధ విధానానికి అదేనాంది అని ప్రతినిధులు గ్రహించారు.

ఆహ్వాన సంఘాధ్యక్షులైన మునగాల రాజా తన ప్రసంగంలో స్వరాజ్యం, స్వదేశీ ఉద్యమం, విదేశీ వస్తుబహిష్కరణ. జాతీయ విద్య అనునవి నాలుగు చతుర్వేదములుగా వర్ణించారు.

## అస్పృశ్యతా నిర్మూలన

జిల్లా సాంఘిక మహాసభలో అస్పృశ్యతనునిర్మూ లించవలసిన అవసరాన్ని చాటుతూ ఒక తీర్మానం ఆమోదించారు. హరిజనులతోకలసి సహపంక్తి భోజనం చేశారు. వితంతు వివాహం చేసుకొన్నవారితో కలిసి, విందు ఆరగించారు.

## వెలివేత

హరిజనులు, వితంతు వివాహం చేసుకొన్నవారితో కలసి, సహపంక్తి భోజనం చేసిన నేరానికి బెజవాడ లోని ఛాందస బ్రాహ్మణులు, సంస్కరణ వాదులైన పెద్దిభొట్ల వీరయ్య. అయ్యదేవర కాళేశ్వరరావు.దాసు మధుసూదనరావు. చింతకింది సూర్యనారాయణమూర్తి పింగళి లక్ష్మినారాయణ. పాటిబండ్ల సుబ్రహ్మణ్యం వంటి తొమ్మిదిమందిని వెలివేశారు. ఈ వెలివేతను ఎవరూ పట్టించుకోలేదు.

## బందరులో సాంఘిక సంస్కరణ ఉద్యమం

సాంఘిక సంస్కరణోద్యమంలో బందరు పట్టణం వెనుకబడలేదు. 1906లోనే స్త్రీ పునర్వివాహం న్యాయ సమ్మతమని ఉద్ఘాటిస్తూ. కొండా వెంకటప్పయ్య. చెన్నాప్రగడ భానుమూర్తి. ముట్నూరి కృష్ణారావు వంటివారు చోడవరపు జగన్నాధరావు వివాహం జరి పించారు. బందరులో అదే తొలిసంస్కరణ వివాహం. పలువురు పురప్రముఖులు శుభలేఖలపై తమ సంత కాలుచేసి, తమ సంస్కారదీక్షను చాటారు. ఆ విహా హానికి హాజరైన వారిని తాంబూలాలు పుచ్చుకొన్న వారిని వెలివేయుటకు నిర్ణయం చెయ్యన్న, పురాణం

సుబ్రహ్మణ్యావధానులు వంటి. ఛాందసులు చేసిన ప్రయత్నాలు ఫలించలేదు.

## సంస్కరణల మహాసభ

1908 ఏప్రిల్ 20న బందరులో పట్టాభి సీతారామయ్య అధ్యక్షుడుగా, ముట్నూరి కృష్ణారావు కార్యదర్శిగా "ఆంధ్ర సంస్కరణవాదుల మహాసభ" జరిగింది. పంచముల అభివృద్ధికి పాఠశాలలను ఏర్పాటు చేయాలని, విదేశీయాత్రలపై సాంఘిక ఆంక్షలను రద్దుచేయాలని, కన్యాశుల్కం పద్ధతి రద్దుకావాలని, స్త్రీలకువిద్య బోధించాలని ఆ మహాసభలో తీర్మానించారు

కందుకూరి వీరేశలింగంగారిని బందరు ఆహ్వానించి, త్రిపురనేని రామస్వామిచౌదరి స్వాగత పద్యాలు సమర్పించారు. దీనికి వ్యతిరేకంగా నాదెళ్ళ పురుషోత్తముడు అసభ్యకరమైన గ్రంథాన్ని ప్రచురించాడు. అంతేకాదు. సంస్కరణవాదులైన చెరుకువాడ వెంకటనరసింహం, అవుటపల్లి నారాయణరావు, కౌతా శ్రీరామశాస్త్రి, కోట వెంకటాచలం మున్నగు వారిపై సనాతనులు కేసులు కూడా పెట్టారు.

## ప్రభుత్వ నిర్బంధ విధానం

1908 లో దేశవ్యాప్తంగా బ్రిటిష్ ప్రభుత్వం జాతీయోద్యమాన్ని అణచడానికి ప్రారంభించిన నిర్బంధ విధానంలో భాగంగా, బెజవాడ నుంచి వెలువడుతున్న 'స్వరాజ్య' పత్రిక ఎడిటరు గాడిచర్ల హరి సర్వోత్తమరావు, పబ్లిషర్ పింగళి లక్ష్మినారాయణ, ప్రింటర్ బోడి నారాయణరావులపైన "రాజద్రోహం" నేరం క్రింద కేసు పెట్టారు. పింగళి లక్ష్మినారాయణ పోలీసులకు దొరకకుండా, పుదుచ్చేరికి పరారయ్యాడు. అక్కడ తమిళ మహాకవి సుబ్రహ్మణ్య భారతి, అరవింద ఘోష్‌లతో గడిపి, నిర్బంధ విధానం విరమించబడిన పిమ్మట, 1912 లో ఆయన పుదుచ్చేరి నుంచి బెజవాడకు తిరిగి వచ్చాడు. తరువాత ఆయన సన్యాసాశ్రమం స్వీకరించి, స్వామి నారాయణానంద పేరుతో వ్యవహరిస్తూ, జాతీయోద్యమంలో కొనసాగుతూ, చివరకు కర్నూలు జిల్లాలో స్థిరపడిపోయాడు.

ఆ కేసులో అరెస్టయిన గాడిచర్ల హరిసర్వోత్తమరావు, బోడి నారాయణరావులకు అప్పటి కృష్ణాజిల్లా జడ్జి కర్‌షాప్స్ ఆరునెలలు కఠిన శిక్ష విధించాడు. నిందితులకు తేలిక శిక్షలు విధించినందుకు జడ్జి కర్‌షాప్స్‌ను డిమోట్ చేసిన బ్రిటిష్ ప్రభుత్వం హైకోర్టులో అప్పీలుచేసి, గాడిచర్ల హరిసర్వోత్తమరావుకు విధించిన శిక్షను ఆరునెలల నుంచి మూడు సంవత్సరాలకు పెంచేలా చేయగల్గింది. స్వాతంత్ర్య సమరయోధులపట్ల బ్రిటిష్ ప్రభుత్వం కసి, కార్పణ్యం ఎంత తీవ్రమైనవో దీన్నిబట్టి మనం గ్రహించవచ్చు.

మొత్తంమీద బ్రిటిష్ ప్రభుత్వం తన నిర్బంధ విధానంతో, కృష్ణాజిల్లాలో భయోత్పాతం సృష్టించి, స్వాతంత్ర్య సమరాగ్నులు తాత్కాలికంగా చల్లారిపోయేలా చేయగల్గింది.

దేశవ్యాపంగా వందేమాతరం ఉద్యమం అనేక సత్ఫలితాలకు దారితీసింది. కృష్ణాజిల్లాలో కూడా ఆ ఉద్యమం రాజకీయ చైతన్యానికి దారితీసింది. ఆ ఉద్యమ ప్రభావంతో రాష్ట్రంలో వెలసిన జాతీయ కళాశాల, పాఠశాలలు అసంఖ్యాకులను స్వాతంత్ర్య సమరయోధులుగా తిర్చిదిద్దడానికి దోహదమిచ్చాయి.

## బందరు జాతీయ కళాశాల

1906 లో కలకత్తా కాంగ్రెసు మహాసభ ఆమోదించిన నాలుగు అంశాల కార్యక్రమంలో ఒకటైన జాతీయ విద్యావ్యాప్తికి ఆంధ్రదేశంలో ఏర్పడిన జాతీయ విద్యాసంస్థలలో బందరులో స్థాపించబడిన ఆంధ్ర జాతీయ కళాశాల అత్యంత ప్రధానమైనది. 1908 సంవత్సరంలో న్యాయవాదియైన కోపల్లె హనుమంతరావు తన న్యాయవాద పట్టాను చించి, కాలువలో పారవైచి, ఆంధ్ర జాతీయ కళాశాలను స్థాపించి, దాని అభివృద్ధికి తన జీవితాన్ని అంకితం చేశాడు. భోగరాజు పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు ప్రభృతులు కోపల్లె హనుమంతరావు కృషికి చేదోడువాదోడుగా నిలిచారు.

బిపిన్‌చంద్రపాల్ చే 1907 లో శంకుస్థాపన జరిగి, 1911 లో ప్రారంభింపబడిన ఆంధ్ర జాతీయ కళాశాలలో విద్య నభ్యసించిన అసంఖ్యాక యువకులు భారత స్వాతంత్ర్య పోరాటంలో సమర సైనికులుగా తయారయ్యారు ఈ కళాశాలలో విద్యనభ్యసించి

పేరు పొందినవారిలో అడివి బాపిరాజు, విశ్వనాథ సత్యనారాయణ, గుర్రం మల్లయ్య, కొత్తా రామ మోహనశాస్త్రి మున్నగువారున్నారు.

## త్రిపురనేని "రాణాప్రతాప్"

బందరు సభలలో బిపిన్ చంద్రపాల్ చేసిన ఉద్రేకపూరితమైన, ఉత్తేజకరమైన ఉపన్యాసాలు విని, ప్రభావితులైన హైస్కూలు విద్యార్థి త్రిపురనేని రామస్వామిచౌదరి (కవిరాజు) రాణాప్రతాప్ నాటక రచన చేశాడు. జాతీయ భావాల ప్రదీప్తికి ఆ నాటకం దోహదపడుతున్నందుకు ఆందోళన చెందిన బ్రిటిష్ ప్రభుత్వం ఆగ్రహం ప్రకటించింది.

## బెజవాడ డివిజనల్ కాంగ్రెస్

1908 లో స్థాపించబడిన బెజవాడ డివిజనల్ కాంగ్రెసు, కృష్ణాజిల్లాలో స్వాతంత్ర్యోద్యమానికి గట్టి పునాదులు వేసిందని చెప్పక తప్పదు.

రావుబహదూర్ తాడంకి వెంకటప్పయ్యపంతులు, అధ్యక్షులుగాను, అయ్యదేవర కాళేశ్వరరావు కార్యదర్శిగాను ఏర్పడిన బెజవాడ డివిజనల్ కాంగ్రెసు 1920 వరకు సమర్థవంతంగా పనిచేసింది. గ్రామాలలో రైతులను కాంగ్రెసు సభ్యులుగా చేర్పించే కార్యక్రమం పెద్ద ఎత్తున చేపట్టారు. 1916 లో బ్రిటిష్ ప్రభుత్వం నీటి తీరువాను రూపాయికి పావలా చొప్పున పెంచినందుకు నిరసనగా బెజవాడ డివిజనల్ కాంగ్రెసు ఆధ్వర్యంలో జరిగిన ఆందోళనకు ప్రభుత్వం తలొగ్గి నీటితీరువా హెచ్చింపు ప్రతిపాదనను విరమించుకొన్నది.

## గ్రంథాలయోద్యమం

ఆంధ్రదేశంలో జాతీయోద్యమ వ్యాప్తికి ఆలంబనమైన గ్రంథాలయోద్యమాన్ని పెంపొందించడంలో పెద్దిబొట్ల వీరయ్య, నరసింహశాస్త్రి, అయ్యదేవర కాళేశ్వరరావు, బొడ్డపాటి వెంకటప్పయ్య, అయ్యంకి వెంకటరమణయ్య, గోపరాజు బ్రహ్మానందం ప్రముఖపాత్ర వహించారు. వీరంతా కలిసి బెజవాడలో రామమోహన గ్రంథాలయాన్ని స్థాపించి, వృద్ధి చేశారు.

## పంచముల ప్రవేశం

బెజవాడలోని పంచముల పాఠశాలకు చెందిన విద్యార్థులు రామమోహన గ్రంథాలయంలో ప్రవేశించినందుకు, పెద్దిబొట్ల వీరయ్య తన తీవ్ర అభ్యంతరం తెలిపారు. దానితో కొన్నిరోజులపాటు వివాదం చెలరేగింది. చివరకు హరిజనులు కూడా రామమోహన గ్రంథాలయంలో ప్రవేశించవచ్చునని తీర్మానించడంతో పరాజితులైన పెద్దిబొట్ల వీరయ్య రాజకీయాల నుంచి పూర్తిగా నిష్క్రమించారు.

బెంగాల్ విభజన రద్దుకు బ్రిటిష్ ప్రభుత్వం సమ్మతించడంతో, ఆ ఉద్యమం ముగిసింది. అయితే జాతీయ ఉద్యమాన్ని అణచడానికి బ్రిటిష్ ప్రభుత్వం చేపట్టిన "సామ, దాన, భేద, దండోపాయాలు" కారణంగా, జాతీయోద్యమం తాత్కాలికంగా వెనుకడుగు పట్టినట్టు పైకి కన్పించినా, నివురుగప్పిన నిప్పువలె, లోలోన మండుతూనే వున్నది.

అట్టి దశలో మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. ఆ యుద్ధంలో విజయం సాధించడానికి బ్రిటిష్ వలస అధికారులకు భారత ప్రజల సహకారం, సహాయం అవసరమైంది.

కొత్తగా ఏర్పడిన ఈ పరిస్థితిని, పురస్కరించుకొని, దక్షిణాదిన అనిబిసెంట్, మహారాష్ట్ర ప్రాంతంలో బాలగంగాధర తిలక్ 'హోమ్‌రూల్' ఉద్యమానికి పిలుపు నిచ్చారు.

## హోమ్‌రూల్ ఉద్యమం

హోమ్‌రూల్ ఉద్యమంతో, కృష్ణాజిల్లాలో స్వాతంత్ర్య సమరానికి విస్తృతమైన ప్రాతిపదికలు పడినవి.

1916 లో అనిబిసెంట్ బెజవాడ రావడం, ఆ సందర్భంలో గొప్ప బహిరంగ సభ జరగడం, జాతీయోద్యమానికి మంచి ఊపు నిచ్చింది. అప్పటి వరకు జాతీయోద్యమానికి దూరంగా వున్న బెజవాడ దివ్యజ్ఞాన సమాజికులు సైతం స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనడానికి ముందుకు వచ్చారు.

## "కాంగ్రెసు – లీగ్ స్కీము"

1916 డిసెంబరులో కాంగ్రెసు–ముస్లింలీగ్ నాయ

కులు కాన్పూరులో సమావేశమై భారతదేశానికి కావలసిన రాజ్యాంగ ప్రణాళికను సూచిస్తూ "కాంగ్రెసు-లీగ్ స్కీము"ను రూపొందించారు. ఈ స్కీమును బలపర్చే పత్రంపై సంతకాల సేకరణకు జరిపిన ఉద్యమం స్వాతంత్ర్య పోరాట వ్యాప్తికి దోహద మిచ్చింది.

"కాంగ్రెసు-లీగ్ స్కీము"పై సంతకాల సేకరణ ఉద్యమం కృష్ణాజిల్లాలో పెద్ద ఎత్తున సాగింది. కొత్తపేట గ్రామంలో నిర్వహించబడుతున్న జాతీయ పాఠశాల ఉపాధ్యాయులు, గ్రామాలలో పర్యటిస్తూ, స్కీముకు ప్రజల మద్దతును పెద్ద ఎత్తున సమీకరించారు.

హోమ్‌రూల్ ఉద్యమంలో విద్యార్థులు అధికంగా పాల్గొనడంతో, విద్యార్థులు ఎవరూ రాజకీయాలలో తలదూర్చరాదని బ్రిటిష్ ప్రభుత్వం ఆంక్ష విధించింది. ఈ ఆంక్షలను ధిక్కరించవలసిందని కోపల్లె హనుమంతరావు, ముట్నూరి కృష్ణారావు, పట్టాభి సీతారామయ్య విద్యార్థులకు ఉద్బోధించారు.

బెజవాడ డివిజనల్ కాంగ్రెస్‌వారు కరపత్రాలు ప్రచురించడం ద్వారాను, గ్రామాలలో బహిరంగ సభలు జరపడం ద్వారాను హోమ్‌రూల్ ఉద్యమాన్ని గ్రామీణ ప్రాంతాలకు విస్తరింప చేశారు. హోమ్‌రూల్ ఉద్యమ నాయకులైన అనిబిసెంట్, వాడియా, అరండేల్‌వంటి వారిని విచారణ లేకుండా నిర్బంధంలో వుంచినందుకు నిరసనగా శాసనోల్లంఘనం చేయడానికి, బెజవాడ డివిజనల్ కాంగ్రెస్ పెద్దలు పలువురు సిద్ధమయ్యారు. దేవ భయంకర్ ఉపన్యసించిన సభలో పలువురు అట్టి శపథం చేశారు. హోమ్‌రూల్ ఉద్యమంలోకి దుమికిన గంపలగూడెం జమీందారు కోటగిరి వెంకట కృష్ణారావు పశ్చిమ కృష్ణాలో కాంగ్రెసు ఉద్యమానికి పట్టుగొమ్మ అయ్యారు.

## ఆంధ్రోద్యమం పుట్టుక

వందేమాతరం ఉద్యమం ముగిసి, హోమ్‌రూల్ ఉద్యమం ప్రారంభం కావడానికి మధ్యకాలంలో, ఆంధ్రదేశంలో జాతీయవాదులు ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణానికి ఆంధ్రోద్యమాన్ని ప్రారంభించారు. 1913 లో బాపట్లలో మొదటి మహాసభ జరిగింది. 1914 లో ద్వితీయ ఆంధ్ర మహాసభ బెజవాడలో జరిగింది.

హోమ్‌రూల్ ఉద్యమం తాకిడికి తట్టుకొనలేక, దేశ పరిపాలనలో భారతీయులకు ఇతోధిక పాత్ర కల్పించే పేరుతో బ్రిటిష్ ప్రభుత్వం 1917 లో మాంటేగ్యూ-చెమ్స్‌ఫర్డ్ సంస్కరణలను ప్రకటించింది. అప్పట్లో మాంటేగ్యూ బ్రిటిష్ ప్రభుత్వంలో ఇండియా కార్యదర్శిగా వ్యవహరిస్తున్నాడు.

## బ్రిటిష్ ప్రభుత్వ కుటిల నీతి

ఒకవైపున మాంటేగ్యూ-చెమ్స్‌ఫర్డ్ సంస్కరణలను వాగ్దానం చేస్తూనే, బ్రిటిష్ ప్రభుత్వం రెండవ వైపున "విభజించి పాలించు" అన్న తన కుటిల నీతిని అనుసరించి దేశంలో మత విభేదాలను, కుల విద్వేషాలను రెచ్చగొట్టడానికి ప్రయత్నించింది. ఈ కుటిలనీతి పర్యవసానంగా 1917 లో గుంటూరు, కర్నూలు, కడప వంటి పట్టణాలలో బ్రాహ్మణులకు, బ్రహ్మణేతరులకు మధ్య సంఘర్షణలు జరిగాయి.

## బ్రిటిషు 'విషానికి' విరుగుడు

బ్రిటిష్ ప్రభుత్వం ప్రయోగించిన ఈ విషానికి విరుగుడుగా, ఆంధ్రదేశంలోని జాతీయవాదులు బెజవాడలో ప్రత్యేకాంధ్ర మహాసభను జరిపి, బ్రహ్మణేతరులకు హెచ్చు ప్రాతినిధ్యం కలుగ చేయాలని కోరుతూ తీర్మానించారు. ఈ ప్రత్యేక ఆంధ్ర మహాసభ ఆహ్వాన సంఘానికి అయ్యదేవర కాళేశ్వరరావు గారు అధ్యక్షులుగా వ్యవహరించారు, చింతపాటి నరసింహరాజు ఆ మహాసభకు అధ్యక్షత వహించారు.

భారతదేశంలో పర్యటించడానికి వస్తున్న మాంటేగ్యూకు వినతిపత్రం సమర్పించడానికి న్యాపతి సుబ్బారావు, కొండా వెంకటప్పయ్య, పట్టాభి సీతారామయ్యలతో కూడిన ప్రతినిధి వర్గాన్ని మహాసభలో ఎన్నుకొన్నారు.

కాంగ్రెస్-లీగు స్కీమును బలపరుస్తూ పశ్చిమ కృష్ణాజిల్లాలోని అయిదు తాలూకాలలో 10 వేల మంది ప్రజలు సంతకాలు చేశారు.

## జస్టిస్ పార్టీ పుట్టుక

మద్రాసు ప్రభుత్వ సభ్యుడైన కార్డ్యూ అనే ఆంగ్లేయుని ప్రోద్బలంతో మొదట "బ్రాహ్మణేతర

లీగు" పేరుతో తదుపరి "జస్టిస్ పార్టీ" పేరుతోను ఒక ఉద్యమం ప్రారంభమైంది.

మద్రాసులో సమావేశమైన బ్రాహ్మణేతరులు చేసిన తీర్మానాలను ఆధారం చేసుకొని, ఇంగ్లండు లోని దినపత్రికలు "హిందూ దేశం స్వరాజ్యం కాంక్షించుటలేదు." అన్న శీర్షికతో ఆ వార్తను ప్రచురించాయి. అప్పటిలో డబ్లిన్‌లో బార్ ఎట్ లా చదువుతున్న కృష్ణాజిల్లా అంగలూరు వాస్తవ్యుడు త్రిపురనేని రామస్వామి చౌదరి, ఆ వార్త చదివి, దిగ్భ్రాంతిచెందాడు. వెంటనే ఆయన "స్వాతంత్ర్యం కావాలి" అనే శీర్షికతో ఒక లేఖరాసి, కృష్ణాపత్రికకు పంపాడు.

"చెన్నపట్టణంలో పోగైన బ్రాహ్మణేతరులకు యావద్భారతదేశంలో వున్న బ్రాహ్మణేతరుల పక్షాన ఈ గతి తీర్మానించడానికి ఎవ్వరధికార మిచ్చారు? స్వలాభపరులెవరో ఈ నీచ కార్యానికి దిగి వుందురు. కావున ఈ తీర్మానాన్ని బ్రాహ్మణేతరు లందరూ అంగీకరించుటలేదని. బ్రిటిషు వారి అధి కారం క్రింద స్వరాజ్యాన్ని (హోమ్‌రూల్) పొందుట మాకు పరమ సమ్మతమని తెలియజేస్తున్నాను. మీ యందరీ తీర్మానాన్ని అంగీకరించక పోవుటయే కాక, బ్రిటిష్ ప్రభుత్వం క్రింద స్వరాజ్య మందుట పరమ సమ్మతమని పత్రికా ముఖాన, సభల మూలాన ప్రభు త్వానికి తెలియజేయండి. బ్రిటిష్ వారి దయాదాక్షి ణ్యాలపై ఆధారపడి స్వాతంత్ర్యం కోరుతున్నామా? వారిని తరిమి వేయడం మన కర్తవ్యం" అని త్రిపుర నేని రామస్వామి చౌదరి తన లేఖలో ఉద్బోధించారు.

ఈ లేఖనుబట్టి, బ్రాహ్మణేతరులలో స్వా పరులు, సంకుచిత దృష్టిగల కొద్దిమంది మాత్రమే జ స్పారీ వాదనలను సమర్థి న్నారని బ్రాహ్మణే రులలో అత ధికులు దేశ సా తంత్ర్యాన్ని కాంక్షిస్తున్నారని స్ప ం కావటమే కా , డ న్‌లో విద్య పూ రిచేసు కొ , ఆయన 1917 సె ంబరు 11 న స్వదేశానికి తిరిగి రాగానే, బెజవాడలో యన అధ్యక్షతన జరిగిన జాతీయ బ్రాహ్మణేతర మహాసభ జయప్రదమైన తీరు ప్రత్యక్ష నిదర్శనం.

## పోటీ బ్రాహ్మణేతర మహాసభలు

బెజవాడలో ప్రత్యేక ఆంధ్ర మహాసభ జరిగిన రెండు వారాల అనంతరం, బ్రిటిష్ ప్రభుత్వం ప్రోద్బ లంతో "షన్మండల (సాగర) జిల్లాల బ్రాహ్మణేతర మహాసభ"ను జరపడానికి నిర్ణయించి, చల్లపల్లి జమీందారు అధ్యక్షతన ఒక ఆహ్వాన సంఘాన్ని ఏర్పాటు చేశారు.

దీనికి ప్రతిగా "ఆంధ్ర రైతాంగంలో కాంగ్రెసుకు అనుకూలమైన వారి నందరినీ చేరదీసి, బలపర్చి, కాంగ్రెస్‌ను పటిష్టంచేయవలెనని, వారిచేత కాంగ్రెస్-లీగు సంస్కరణలు కావలెనని తీర్మానం చేయించ వలెనను దృఢ సంకల్పంతో అయ్యదేవర కాళేశ్వర రావు వందేమాతరం ఉద్యమ కాలంలోను, హోమ్ రూల్ ఉద్యమంలోను, తనతో కలిసి పని చేసిన రైతు ప్రముఖుడైన కానూరు వెంకటచలపతయ్య, కానూరు దామోదరయ్య, బొబ్బా పద్మనాభయ్య (కొత్తవరం) సుంకర బసవయ్య (ఆత్కూరు) మాగంటి పేరయ్య (పశ్చిమ గోదావరిజిల్లా.చాటపర్రు) మల్లెల శివరామకృష్ణయ్య (గుంటూరుజిల్లా రావిపూడి) కోలవెన్ను, కంకిపాడు, నెప్పల్లె, నందిగామ మొద లైన గ్రామాలకు చెందిన రైతు ప్రముఖులు మొత్తం 30 మందిని ఆహ్వానించి, తన ఇంట్లోనే వారి సమా వేశం ఏర్పాటు చేశారు. బెజవాడలో జస్టిస్ పార్టీవారు జరుపుతున్న షన్మండల (సాగర) జిల్లాల బ్రాహ్మణే తర మహాసభ జరిగే రోజుననే, అంతకంటే గొప్పగా కాంగ్రెసు పక్షావలంబులగు బ్రాహ్మణేతరుల సభను జరపాలని ఆ సమావేశంలో నిర్ణయించారు.

పొణకా పట్టాభిరామిరెడ్డి అధ్యక్షతన ఆహ్వాన సంఘం ఏర్పాటు చేశారు. అప్పుడే డబ్లిన్‌లో బారిస్టర్ ప్యాసై స్వదేశానికి తిరిగివచ్చిన త్రిపురనేని రామ స్వామి చౌదరిని కాంగ్రెస్ పక్ష బ్రాహ్మణేతర మహా సభ అధ్యక్షులుగా ఎన్నుకొన్నారు.

ఈ మహాసభ జరపడానికి కేవలం వారం రోజుల వ్యవధి మాత్రమే వుంది. అయినా గ్రామీణ ప్రాంతాల లోని రైతులు, బెజవాడలోని వైశ్యులు, కష్టజీవులు అంతా కలిసి, ఈ మహాసభను జయప్రదం చేయడానికి పట్టుదలతో ముందుకు వచ్చారు. "కాంగ్రెస్ పక్షావ లంబులగు బ్రాహ్మణేతరులకు స్వాగతం" "కాంగ్రెస్-లీగ్ సంస్కరణలు కావలె" "కాంగ్రెస్ వర్థిల్లాలె" వంటి నినాదాలుగల అర్చీలు, బోర్డులు పతాకాలు, తోరణాలతో విజయవాడ పట్టణమ వా

అలంకరించారు.

మైలవరం హాల్ (నాటకశాల)లో జరిగిన సభానికి మహాసభాధ్యక్షుడైన త్రిపురనేని రామస్వామి చౌదరిని గుర్రపు బగ్గీపై ఊరేగింపుగా తీసుకెళ్ళారు. నాలుగు వేల మంది బ్రాహ్మణేతర ప్రతినిధులతో మైలవరం హాలు కిక్కిరిసి పోయింది. బ్రిటిష్ ప్రభుత్వం, జమీందారుల వత్తాసుతో జరిగిన షణ్మండల బ్రాహ్మణేతర మహాసభకు 500 మంది మాత్రమే హాజరయ్యారు. రైతు ప్రముఖులు నిర్వహించిన బ్రాహ్మణేతర మహాసభ ముందు జమీందార్లు నిర్వహించిన బ్రాహ్మణేతర మహాసభ సూర్యునిముందు దివిటీవలె వెలవెల పోయిందంటే అతిశయోక్తి కాదు.

రైతు నాయకులు యిచ్చిన ఉత్తేజకరమైన ప్రసంగాలు విన్న ప్రతినిధులు కాంగ్రెస్-లీగ్ సంస్కరణలే కావలెనని, బ్రాహ్మణేతరులకు ప్రత్యేక ప్రాతినిధ్యం కావలెనని, ఆంధ్ర రాష్ట్రం కావలెనని కోరుతూ మూడు తీర్మానాలను కర్తవ్యంగా ఆమోదించారు. కాగా జస్టిస్ పార్టీవారు నిర్వహించిన బ్రాహ్మణేతర మహాసభలో కాంగ్రెస్ బ్రాహ్మణుల పార్టీ అని తిట్టిపోస్తూ, కాంగ్రెస్-లీగ్ సంస్కరణలు అవసరం లేదని, బ్రాహ్మణేతరులకు పెద్ద ఉద్యోగాలు మంజూరు చేస్తే చాలునని చెబుతూ తీర్మానించారు.

## వలస వ్యవస్థ - వర్ణ వ్యవస్థ

ఆర్థికంగా దోపిడీ చేయడానికి ఆంగ్లేయులు భారత దేశంలో ఏర్పాటు చేసిన వలస వ్యవస్థ నిర్మూలనకు మాతృదేశంలోని వర్ణ వ్యవస్థ అడ్డంకిగానే కాక, దేశ ప్రగతికి ప్రతిబంధకంగా తయారైనదని దృఢంగా విశ్వసించిన కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి ఒక వైపున వలస వ్యవస్థ నిర్మూలనకు, కాంగ్రెస్ ఉద్యమాన్ని సమర్థిస్తూనే రెండవ వైపున వర్ణ వ్యవస్థకు వ్యతిరేకంగా బ్రాహ్మణేతర ఉద్యమాన్ని నడిపాడు. ఆయన వ్యక్తిత్వంలో పరస్పర విరుద్ధంగా కానవచ్చే ద్వంద్వ స్వభావానికి మూలం ఇదే.

1927 బెజవాడ మున్సిపల్ ఎన్నికలలో కాంగ్రెస్ అభ్యర్థి ఐన అయ్యదేవర కాళేశ్వరరావుగారిని ఓడించడానికి కృషి చేసిన జస్టిస్‌పార్టీ ప్రముఖులు అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య, మిర్జాపురం రాజాలతోపాటు, త్రిపురనేని రామస్వామి చౌదరిగారు కూడా వున్నారు. అప్పటికి ఆయన జస్టిస్ పార్టీలో చేరారు. బెజవాడలో కాంగ్రెస్ అనుకూల బ్రాహ్మణేతర మహాసభల్లో, బ్రాహ్మణేతరులకు ప్రత్యేక ప్రాతినిధ్యం కావాలని వాదించినా, 1918 గుంటూరు ప్రత్యేక ఆంధ్ర కాంగ్రెస్, బ్రాహ్మణేతరులకు ప్రత్యేక ప్రాతినిధ్యం అవసరంలేదని తీర్మానించింది బహుశా జస్టిస్ పార్టీ వైపు చౌదరిగారు మొగ్గడానికి ఇదొక కారణం కావచ్చు.

తెనాలి మున్సిపల్ ఛైర్మన్‌గా వున్న కాలంలో "వీరగంధం తెచ్చినారము, వీరులెవ్వరో తెల్పుడీ" వంటి ఉత్తేజకరమైన జాతీయగీతం రచించి, ఉప్పు సత్యాగ్రహ దళానికి నిండుమనస్సుతో స్వాగతమిచ్చి, దేశభక్తులను స్వాతంత్ర్య సమరానికి సాగనంపిన త్రిపురనేని రామస్వామి చౌదరి తరువాత తంజావూరులో జరిగిన జస్టిస్ పార్టీ మహాసభకు అధ్యక్షత వహించటం ఈ కారణంగానే జరిగింది. జస్టిస్ పార్టీలో జమీందారీ వర్గానికి, రైతు పక్షానికి మధ్య జరిగిన సంఘర్షణలో త్రిపురనేని రామస్వామి చౌదరి రైతు పక్షం వహించారని ఆచార్య ఎన్. జి. రంగా అభిప్రాయం వ్యక్తం చేశారు.

## పంచముల తొలి మహాసభ

వర్ణ వ్యవస్థ నుంచి ఉద్భవించిన కులాల మధ్య విభేదాలు సృష్టించి, స్వాతంత్ర్య సమరాన్ని దెబ్బతీయాలని చూస్తున్న బ్రిటిష్ ప్రభుత్వ దుష్టబుద్ధిని గ్రహించిన అయ్యదేవర కాళేశ్వరరావు వంటి దేశభక్తులు బెజవాడలో కాంగ్రెస్ పక్ష బ్రాహ్మణేతర మహాసభను జరిపిన వారం రోజులకే, 1917 సెప్టెంబరు ఆఖరు వారంలో హిందూ సమాజంలో అస్పృశ్యులుగా వున్న పంచములను స్వాతంత్ర్య సమరంలో సమీకరించడానికి ఆంధ్రదేశ ఆది ఆంధ్రుల తొలి మహాసభకు ఏర్పాట్లు చేశారు. మహాత్మాగాంధీ హరిజనోద్యమం ప్రారంభించడానికి చాలా సంవత్సరాల ముందే కృష్ణాజిల్లాలో హరిజనోద్ధరణ కృషి ప్రారంభమైన దనడానికి ఇది నిదర్శనం.

## హరిజనోద్ధరణ వైతాళికులు

అప్పటికే గుడివాడ కాపురస్థులైన గూడూరి రామ

చంద్రరావు, బందరు కాపురస్థులైన వేమూరి రాంజీరావు, ఆర్యసమాజికులైన వెల్లంకి కృష్ణమూర్తి— ఈ ముగ్గురూ అస్పృశ్యతా నిర్మూలన కొరకు మాత్రమే కాక, ఆర్థికంగా, విద్యావిషయకంగా హరిజనులను అభివృద్ధి చేయడానికి బహుముఖ కృషిని పట్టుదలగా సాగిస్తున్నారు. బందరు జాతీయ కళాశాలలో హరిజన విద్యార్థులను చేర్చుకొన్నారు.

హరిజన నాయకులైన రాయుడు గంగయ్య, చుండ్రు వెంకయ్య, అత్తిలి సూర నారాయణ, నరాల శెట్టి దేవేంద్రుడు, చింత శేషయ్య, కుసుమ వెంకట్రామయ్య, మంగళగిరి రాఘ దాసు, నూతక్కి వెంకటేశ్వర్లు వంటి వారితోను, గూడూరి రామచంద్ర రావు, వేమూరి రాంజీరావు, వెల్లంకి కృష్ణమూర్తి వంటి హరిజనోద్ధరణ ఉద్యమ నాయకులతోను సంప్రతించి, వారి సహకారంతో అయ్యదేవర కాళేశ్వర రావు ఆంధ్రదేశ పంచముల మహాసభను జయప్రదంగా నిర్వహించారు. ఆ మహాసభలోనే పంచములు ఆది ఆంధ్రులుగా ప్రకటించుకొన్నారు. హైద్రాబాదుకు చెందిన సుప్రసిద్ధ ఆది ఆంధ్ర నాయకుడు భాగ్యరెడ్డివర్మ ఆ మహాసభకు అధ్యక్షత వహించారు. ఆది ఆంధ్రులకు శాసనమండలిలో ప్రత్యేక ప్రాతినిధ్యం కల్పించాలని, ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరగాలని కోరుతూ తీర్మానించారు. ఈ మహాసభ నిర్ణయాలను మాంటేగ్యూకు నివేదించే నిమిత్తం భాగ్యరెడ్డివర్మ, చుండ్రు వెంకయ్య, రాయుడు గంగయ్య మున్నగు ఆది ఆంధ్ర ప్రముఖులతో ఒక ప్రతినిధివర్గాన్ని ఎన్నుకొన్నారు.

## పెదమద్దాలి, బలిపర్రులలో పోటీ మహాసభలు

మాంటేగ్యూ సంస్కరణలను సమర్థిస్తూ, బ్రాహ్మణేతరులకు హెచ్చు ప్రాతినిధ్యం కోరుతూ కృష్ణాజిల్లాలోని ప్రముఖ జమీందారులు గుడివాడ తాలూకా పెదమద్దాలిలో ఒక మహాసభను ఆర్భాటంతో జరుపగా, దానికి పోటీగా ప్రక్కనే గల బలిపర్రు గ్రామంలో కాంగ్రెసువారు మరొక మహాసభను పెద్ద ఎత్తున జరిపి, కాంగ్రెస్-లీగు స్కీమును వర్చుతూ తీర్మానించారు. పెదమద్దాలిలో జరిపిన జస్ పార్టీ మహాసభకు అప్పటి రాష్ట్ర మంత్రి కూరా వెంకట రెడ్డి నాయుడు హాజరుకాగా, బలిపర్రులో జరిగిన కాంగ్రెస్ మహాసభకు గంపలగూడెం కుమార రాజా కోటగిరి వెంకటకృష్ణారావు అధ్యక్షత వహించారు. జయంతిపురం జమీందారు వాశిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద్, అయ్యదేవర కాళేశ్వరరావు, పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, రైతు యువకులు యలమంచిలి వెంకటప్పయ్య మున్నగువారు బలిపర్రు సభలో ప్రసంగించారు

## ఆంధ్ర కాంగ్రెసు సంఘం ఏర్పాటు

1917 లో కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ మహాసభ తీర్మానానుసారం, 1918 జనవరి 20 వ తేదీన విజయవాడ టౌనుహాలులో జరిగిన ఆంధ్ర కాంగ్రెసువాదుల మహాసభలో ఆంధ్ర కాంగ్రెసు సంఘం ఎన్నికైంది. న్యాపతి సుబ్బారావు అధ్యక్షులుగా, కొండా వెంకటప్పయ్య కార్యదర్శిగా ఎన్నికయ్యారు. నాటినుంచి 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడేవరకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘానికి బెజవాడ కేంద్ర కార్యస్థానంగా వుంటూ వచ్చింది.

## బెజవాడ కేంద్ర కార్యస్థానంగా ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘం

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసుకు కేంద్ర కార్యస్థానమైన బెజవాడలో ఈనాడు ఆంధ్రరత్న భవనం అని పిలువబడే భవనాన్ని కొన్నారు. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య 1928 లో అస్తమించినపుడు, ఆ భవనానికి 'ఆంధ్రరత్న భవనం' అని నామకరణం చేశారు. సుమారు 20 వేల రూపాయలకు ఆ భవనాన్ని కొన్నారు.

## జిల్లా సంఘాల ఏర్పాటు

1920 వరకు ఆంధ్ర దేశంలో కాంగ్రెసువారు మండల సంఘాలు, డివిజన్ అసోసియేషన్ల పేరుతో కార్యక్రమాలు నిర్వర్తిస్తూ వచ్చారు. కాగా 1920 లో జిల్లా కాంగ్రెసు సంఘాలు ఏర్పాటయ్యాయి.

కృష్ణా డిస్ట్రిక్టు అసోసియేషన్‌ను తూర్పు కృష్ణా కాంగ్రెసు సంఘంగాను, బెజవాడ డివిజనల్ కాంగ్రెస్‌ను పశ్చిమ కృష్ణా కాంగ్రెసు సంఘంగాను, రాష్ట్ర కాంగ్రెసు 1919 లో గుర్తించింది.

1919 సంవత్సరంలో తిరువూరు తాలూకా గంపలగూడెంలో కోటగిరి వెంకటకృష్ణారావు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా కృష్ణామండల రాజకీయ మహాసభలు జయప్రదంగా జరగడంతో, రౌలట్ చట్టాలకు వ్యతిరేకంగా మహాత్మాగాంధీ ప్రారంభించిన సత్యాగ్రహోద్యమానికి కృష్ణాజిల్లాలో మంచి పూపు లభించింది.

## రౌలట్ చట్టాలు

మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో భారతీయులకు మాంటేగ్యూ– చెమ్స్‌ఫర్డ్ సంస్కరణల పేరుతో బ్రిటిష్ ప్రభుత్వం చేసిన వాగ్దానం 1918 లో ప్రపంచ యుద్ధం ముగియడంతోనే ఆ వాగ్దానాలకు విరుద్ధంగా జాతీయోద్యమాన్ని దారుణంగా అణచివేయటం కోసం రౌలట్ చట్టాలను అమలు జరిపింది. విచారణ లేకుండా భారతీయులను డిటైన్ చేసే అధికారాన్ని బ్రిటిష్ ప్రభుత్వం ఆ చట్టాల రూపంలో దఖలు పర్చుకున్నది.

బ్రిటిష్ పార్లమెంట్ కనుక రౌలట్ చట్టాలకు ఆమోదముద్ర వేస్తే, తాను సత్యాగ్రహోద్యమం ప్రారంభించగలనని మహాత్మాగాంధీ 1919 ఫిబ్రవరి 24 న హెచ్చరించాడు. అయినా బ్రిటిష్ పార్లమెంట్ మార్చి మొదటివారంలో రౌలట్ చట్టాలకు ఆమోద ముద్ర వేసింది.

## తొలిసారిగా బెజవాడకు మహాత్మాగాంధీ రాక

రౌలట్ చట్టాలకు వ్యతిరేకంగా తాము తలపెట్టిన సత్యాగ్రహ ఉద్యమానికి ప్రజలను సమీకరించే నిమిత్తం మహాత్మాగాంధీ జరిపిన దేశపర్యటనలో భాగంగా 1919 ఏప్రిల్‌లో బెజవాడ వచ్చారు. రామమోహన లైబ్రరీవద్ద జరిగిన బ్రహ్మాండమైన బహిరంగసభలో ప్రసంగించారు. గాంధీజీ ప్రసంగాన్ని అయ్యదేవర కాళేశ్వరరావు తెలుగులోకి అనువదించారు.

## బెజవాడలో సత్యాగ్రహ దీక్ష

1919 ఏప్రిల్ 6 న అయ్యదేవర కాళేశ్వరరావు అధ్యక్షతలో బెజవాడలోని అన్ని మతాలవారు, కులాలవారు పెద్ద ఊరేగింపుగా కృష్ణానదికి వెళ్ళి స్నానంచేసి, రౌలట్ చట్టాలకు వ్యతిరేకంగా సత్యాగ్రహోద్యమం నడపాలని దీక్ష పూనారు. రౌలట్ చట్టాలు రద్దుకావాలని కోరుతూ సామూహిక ప్రార్థనలు చేశారు. ఆవేళ సాయంత్రం జరిగిన పెద్ద బహిరంగ సభకు న్యాయవాదులు, డాక్టర్లు, వ్యాపారస్తులు పెద్ద సంఖ్యలో హాజరయ్యారు.

## గ్రామాలలో నిరసన సభలు

రౌలట్ చట్టాలను నిరసిస్తూ, వాటిని రద్దు చేయాలని కోరుతూ వేలూరి యజ్ఞనారాయణశాస్త్రి నాయకత్వంలో గన్నవరం తాలూకా చిరివాడలోను, కోటగిరి వెంకట కృష్ణారావు సారథ్యంలో తిరువూరు తాలూకా గంపలగూడెంలోను, వేమూరి వెంకయ్య, వేమూరి రత్తయ్యల ఆధ్వర్యంలో దివి తాలూకా ఘంటసాలలోను, పిన్నమనేని నరసయ్య నాయకత్వములో కోలవెన్నులోను, గుడివాడలో పెద్దపెద్ద బహిరంగసభలు, సామూహిక ప్రార్థనలు నిర్వహించబడినవి. అలాగే పిన్నమనేని వెంకటచలం అధ్యక్షతన ఇందుపల్లిలోను, తుమ్మల కోటయ్య నాయకత్వంలో ముదునూరు, కాటూరు, బోళ్ళపాడు గ్రామాలలోను సత్యాగ్రహ దీక్ష పూని బహిరంగ సభలు జరిపారు.

## జలియన్‌వాలాబాగ్ దురంతాలు సత్యాగ్రహోద్యమం నిలుపుదల

ఈ విధంగా కృష్ణాజిల్లాలో రౌలట్ చట్టాలకు వ్యతిరేకంగా సత్యాగ్రహోద్యమానికి పెద్ద ఎత్తున సన్నాహాలు జరుగుతుండగానే పంజాబ్‌లో ఏప్రిల్ 13 న జలియన్‌వాలాబాగ్ దురంతాలు సంభవించడంతో మహాత్మాగాంధీ సత్యాగ్రహోద్యమాన్ని తాత్కాలికంగా నిలుపుచేస్తూ ప్రకటించాడు. ఉద్యమాన్ని విరమించడంతో, కృష్ణాజిల్లా ప్రజలకు కొంత ఆశాభంగం కలుగకపోలేదు.

## ఎన్నికల బహిష్కరణ

1920 లో మాంటెగ్యూ-చెమ్స్‌ఫర్డ్ సంస్కరణల ప్రకారం దేశంలో ఎన్నికలు జరపడానికి బ్రిటిష్ ప్రభుత్వం ఆయత్తమవుతూ వుండగా, మహాత్మా

గాంధీ టర్కీ విభజన కారణంగా ముస్లిం ప్రజలలో పెల్లుబికిన నిరసన జ్వాలలనుంచి పుట్టిన ఖిలాఫత్ ఉద్యమాన్ని తను తలపెట్టబోతున్న సత్యాగ్రహ ఉద్యమంలోకి మళ్ళించడానికి ప్రాతిపదికలు సమకూర్చారు.

1920 మే నెలలో అలాహాబాద్‌లో ముస్లిం నాయకులైన షౌకత్ అలీ, మహమ్మదలీ, డాక్టర్ అన్సారీ వంటి వారితో కలిసి, మహాత్మాగాంధీ, కాంగ్రెసు చరిత్రకారుడు డాక్టరు పట్టాభి సీతారామయ్య మాటల్లో చెప్పాలంటే "ఖిలాఫత్, పంజాబ్ దురంతాలు, ఎందుకూ కొరగాని మాంటెగ్యూ-చెమ్సుఫర్డ్ సంస్కరణలకు త్రివిధ బహిష్కారం (ఈ మూడింటినీ) త్రివేణీ సంగమం"గా మార్చి సత్యాగ్రహోద్యమానికి పథకం రూపొందించారు.

ఈ పథకం ప్రకారం, దేశభక్తులైన భారతీయులంతా బ్రిటిష్ ప్రభుత్వం యిచ్చిన గౌరవ బిరుదులను త్యజించాలని, ప్రభుత్వ విద్యా సంస్థలను విద్యార్థులంతా బహిష్కరించాలని, జాతీయ విద్యా సంస్థలలో చేరాలని, న్యాయవాదులు తమ న్యాయవాద వృత్తిని త్యజించాలని, బ్రిటిష్ ప్రభుత్వానికి పన్నులు చెల్లించరాదని, ఎన్నికలను బహిష్కరించాలని నిర్ణయించారు.

అయితే, అంతకుముందు మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతన అమృతసర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభ నిర్ణయానుసారం కృష్ణాజిల్లాలోని కాంగ్రెస్ నాయకులైన అయ్యదేవర కాళేశ్వరరావు, కోటగిరి వెంకట కృష్ణారావు, కానూరి వెంకట చలపతయ్య, మద్రాసు శాసనసభకు జరిగే ఎన్నికలలో తమ నామినేషన్లను దాఖలుచేసి వున్నారు.

## గాంధీజీ పిలుపు

కలకత్తాలో జరిగే కాంగ్రెస్ ప్రత్యేక మహాసభకు షౌకత్‌అలీతో కలసి మహాత్మా గాంధీ కలకత్తా వెళుతూ 1920 ఆగస్టు 1 న ఒకరోజు బెజవాడలో ఆగారు. ఆ సందర్భంలో జరిగిన బహిరంగసభలో అహింసాత్మకమైన సహాయ నిరాకరణోద్యమం కాంగ్రెస్ కార్యక్రమంగా ప్రకటించారు. ఆ సభలోనే జనాబ్ గులాం మొహిద్దీన్ తన గౌరవ మేజస్ట్రేట్ పదవిని త్యజించాడు. అయ్యదేవర కాళేశ్వరరావు శాసనసభ ఎన్నికలకు తాను దాఖలు చేసుకొన్న నామినేషన్‌ను ఉపసంహరించుకొంటూ ప్రకటన చేశారు. న్యాయవాద వృత్తిని విసర్జించారు. అనంతరం గంపలగూడెం కుమారరాజా, కానూరి వెంకట చలపతయ్యలు కూడా తమ నామినేషన్లను ఉపసంహరించుకొన్నారు.

## ఎన్నికల వ్యతిరేక ప్రచారం

కలకత్తాలో 1920 లో జరిగిన ప్రత్యేక కాంగ్రెస్ మహాసభ తీర్మానానుసారం కృష్ణాజిల్లాలో ఎన్నికల వ్యతిరేక ప్రచారం చాలా పెద్ద ఎత్తున సాగింది. ఎన్నికల వ్యతిరేక ప్రచారంచేసిన నేరానికి మతం వాలసుబ్రహ్మణ్య గుప్తకు 6 నెలల జైలు శిక్ష విధించారు. అందుకు నిరసనగా బెజవాడలో సంపూర్ణ హర్తాళ్ జరిగింది.

మతం వాలసుబ్రహ్మణ్య గుప్త మంచి వక్త. ఆయన సామాన్య ప్రజలకి అర్థమయ్యే భాషలో ప్రసంగించేవాడు. వేలాది మంది ఆయన ఉపన్యాసాలు వినడానికి వచ్చేవారు. కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలలో ఉపన్యసించేవాడు. ఆరు నెలలపాటు జామీన్ ఇవ్వవలసిందిగా జిల్లా మేజిస్ట్రేట్ నోటీసు ఇచ్చాడు. అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఆయన తరపున వాదించి, ప్రథమ జామీన్ మీద విడుదల చేయించారు. జామీన్ కేసు వాయిదాలు పడుతున్నంత కాలం గుప్తగారు ఉపన్యాసాలు ఇస్తూనేవున్నారు. చివరి వాయిదా 1920 డిసెంబరులో పడింది. తుది విచారణలో, ఆరు నెలల కాలం మంచి ప్రవర్తన కలిగివుంటానని జామీన్‌ఇవ్వాలని, లేనిచో ఆరునెలలు జైలులో ఉండాలని జిల్లా మేజిస్ట్రేట్ తీర్పు చెప్పాడు. గుప్తగారు జామీన్ ఇవ్వడానికి నిరాకరించారు. ఆ రోజుల్లో జిల్లామేజిస్ట్రేట్, జిల్లా పోలీసు సూపరెంటెంటు కూడా యూరోపియన్లే. గుప్తగారికి 6 నెలల శిక్ష విధించబడింది. జనం వేలాదిగా గుమిగూడారు. కోర్టు నుంచి సబ్ జైలుకు గుప్తగారిని తీసుకువెళ్ళటం ఎలాగా అనేది సమస్య అయింది. చివరికి కాంగ్రెస్ వారి సహకారం తప్పనిసరి అయ్యింది. కాళేశ్వరరావుగారి బగ్గీ మీద, గుప్తగారు కాళేశ్వరరావుగారు, యూరోపియన్ సార్జంట్ కూర్చుని సబ్‌జైలుకు తీసుకుపోయారు. అయినా సార్జంటు పైన ఎవరో రాళ్ళు వేయడం తప్పలేదు. నాయకుల అభ్యర్థనపై ప్రజలు

శాంతించారు. ఆవేళ హర్తాళ్ జరిగింది. ప్రజలు బలవంతాన కోర్టులు, కచేరీలు మూయించారు. ఎవరికీ తెలియకుండాగుప్తగారిని గన్నవరంలో రైలు ఎక్కించి రాజమండ్రి తీసుకుపోయారు. ఆ రాత్రి బెజవాడ స్టేషన్‌లో గుప్తగారికి వీడ్కోలు ఇవ్వడానికి వచ్చిన అశేషజనసమూహానికి ఆశాభంగం కలిగింది.

## ఘంటసాల ఆదర్శం

గొట్టిపాటి బ్రహ్మయ్య ప్రభృతులు ఎన్నికలకు వ్యతిరేకంగా, దివి తాలూకాలో సాగించిన ప్రచారం ప్రభావంవల్ల, ఘంటసాల పోలింగ్ కేంద్రంలో ఒక్క ఓటు కూడా పోల్ కాలేదు. ఆపోలింగ్ కేంద్రం పరిధిలో గల 14 గ్రామాల కరణాలు, మునసబులు సైతం ఎన్నికలను బహిష్కరించారు. ఇది ఒక విధంగా చరిత్రలోనే అపూర్వం.

బెజవాడలో అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశం 1921 మార్చి 31, ఏప్రిల్ 1 వ తేదీలలో జరిగింది. నాగపూర్ కాంగ్రెస్ తర్వాత జరిగిన ఎ.ఐ.సి. సి. మొదటి సమావేశం ఇదే. ఈ సమావేశంలో చేసిన తీర్మానాలే బెజవాడ కార్యక్రమాలైనవి. ఈ సమావేశంలో తీర్మానాలు చాలా ముఖ్యమైనవి. మ్యూజియం హాలులో రెండు రోజుల పాటు ఎ. ఐ. సి. సి. సమావేశం జరిగింది. కోటి మంది కాంగ్రెస్ సభ్యుల్ని చేర్పించాలనీ, 20 లక్షల రాట్నాలు పెట్టించాలనీ, తిలక్ నిధికి కోటి రూపాయలు వసూలు చేయాలనీ – ఈ సమావేశం నిర్ణయించింది.

త్రివర్ణ పతాకను కాంగ్రెస్ జండాగా ఈ సమావేశంలోనే నిర్ణయించారు. పింగళి వెంకయ్యగారు రూపొందించిన పతాకకు గాంధీగారి సూచనతో రాట్నం చేర్చారు. హిందువులకు గుర్తుగా ఎర్ర రంగును, మహమ్మదీయులకు గుర్తుగా ఆకుపచ్చను, ఇతరులందరికీ గుర్తుగా తెలుపును ఈ జండాలో చేర్చారు. కాని కొన్నాళ్ళ తర్వాత మత ప్రమేయం లేకుండా ఎర్ర రంగుకు బదులు కుంకుమపూవు రంగును చేర్చారు.

బెజవాడ ఎ. ఐ. సి. సి మహాసభకు అఖిల భారత నాయకులంతా రావటంతో అత్యంత ఉత్సాహ వాతావరణంలో సభలు జరిగాయి. విద్యుచ్ఛక్తి కాని, మైకులు కాని, బస్సులు కాని లేని రోజుల్లో ఈ సమావేశానికి వచ్చిన నాయకుల్ని చూడటానికి, వారి ప్రసంగాల్ని వినడానికి జనంతండోపతండాలుగా వచ్చారు.

ఈ సమావేశంలో ప్రభుత్వ నిర్బంధ చర్యలు నిర్హేతుకమైనవనీ, చాలా సందర్భాలలో న్యాయ విరుద్ధమైనవనీ ఒక తీర్మానంలో వక్కాణించారు.

ప్రభుత్వం ఎంత రెచ్చగొట్టినా ప్రజలు అహింసాత్మకంగా అత్యాశ్చర్యకరంగా ప్రవర్తించారని ప్రశంసించారు. ఇప్పటి సహాయ నిరాకరణ ఉద్యమంలో, శాసనోల్లంఘనానికి తావులేదని స్పష్టం చేశారు. అందుకు తగు క్రమశిక్షణ, స్థైర్యం, పరిపక్వత లేదని చెప్పారు నిషేధపు ఉత్తర్వులను ఉల్లంఘించరాదని స్పష్టం చేశారు. ప్రభుత్వ న్యాయస్థానాలను బహిష్కరించి, గ్రామ పంచాయతీల ద్వారా వివాదాలను పరిష్కరించాలని కోరారు. తాగుడు మొదలైన దురభ్యాసాలను వదలాలని కోరారు.

ఈ సభల సందర్భంగానే మైలవరం నాటకశాలలో మహిళా మహాసభ జరిగింది. విశ్వబ్రాహ్మణ సంఘం తరపున గాంధీ గారికి సన్మాన పత్రం సమర్పించారు శిల్పకళా కౌశలం పునరుద్ధరింప చేయడానికి కాంగ్రెసు తమకు తోడ్పడాలని ఆ పత్రంలో వారు కోరారు. గాంధీ అధ్యక్షతన అఖిలభారత విశ్వకర్మ మహాసభ జరిగింది. భారతదేశ చేతిపనుల్ని ప్రోత్సహించాలని తీర్మానించబడింది.

బెజవాడ మహాసభలు గ్రామీణ ప్రాంతాల్ని పూర్తిగా ఉత్తేజ పరచాయి. ఈ మహాసభలకు ముందే, ఆయా గ్రామాల్లో సభలు జరిపి, ప్రజల్ని సన్నద్ధం చేశారు.

అందరూ చేత్తో వడికిన ఖద్దరు నూలుబట్టలు ధరించాలి, అస్పృశ్యతను రూపుమాపాలి, వివిధ మతాల మధ్య ఐక్యత సాధించాలి, జాతీయ పాఠశాలలు నెలకొల్పాలి, జాతీయ భాషగా హిందీని నేర్చుకోవాలి—అని బెజవాడ సమావేశం తీర్మానించింది.

తిలక్ కోటి రూపాయల నిధికి ఆంధ్ర రాష్ట్రం వంతు 7 1/2 లక్షల ద్రవ్యాన్ని సమకూర్చాలి. 7 1/2 లక్షల మందిని సభ్యులుగా చేర్చాలి. 1 1/2 నుంచి 2 లక్షల దాకా రాట్నాలను ఏర్పాటు చేయాలి. దీనిని ఎంతవరకు నెరవేర్చారు ?

రాష్ట్రంలో 1921 జూలై 1 వ తేదీ నాటికి తిలక్

స్వరాజ్యనిధికి 3 లక్షల రూపాయలు వసూలైనట్లు కొండా వెంకటప్పయ్యగారు తెలియజేశారు. ఇందులో ఒక్క కృష్ణామండలంలోనే దాదాపు 23 వేల రూపాయలు వసూలయ్యాయి. ఈ నిధికి మహిళలు ఉత్సాహంగా తమ ఆభరణాలను సమర్పించారు. మాగంటి బాపినీడుగారి సతి అన్నపూర్ణాదేవిగారు విదేశ వస్త్రాలను దహనంచేసి, ఖద్దరు ధరించడమే కాక, తన బంగారు నగలన్నిటినీ బెజవాడ మహిళా సభలో సమర్పించారు. అంతేకాక ఇతర్లనుంచి కూడా వసూలు చేసిందామె. గాంధీ అనేకసార్లు ఆమెను ప్రశంసించారు.

బెజవాడ సభల అనంతరం గాంధీ బందరు, ఉయ్యూరు, పామర్రు. కౌతవరం, గుడివాడ మున్నగు గ్రామాలలో పర్యటించారు. వెళ్ళిన చోటల్లా అపూర్వ ఉత్సాహం, చైతన్యం వెల్లివిరిసింది.

గుడివాడ కేంద్రంగా చేసుకొని జిల్లాలో హరిజనోద్ధరణ చేస్తున్న గూడూరు రామచంద్రరావు (రామచంద్రుడుగా తన పేరు మార్చుకొన్నారు) కృషిని గాంధీ ప్రశంసించి, అఖిల భారత కాంగ్రెస్ సంఘంచే విరాళ మిప్పించారు.

1921 అక్టోబరులో బరంపురం ఆంధ్ర మహాసభలో కోటగిరి వెంకట కృష్ణారావు (గంపలగూడెం కుమార రాజా)గారు ఇచ్చిన అధ్యక్షోపన్యాసం దేశద్రోహకరంగా వున్నదని అరెస్టుచేసి జామీన్ ఇవ్వవలసిందిగా ప్రభుత్వం కోరింది. ఆయన నిరాకరించాడు. సంవత్సరం శిక్ష విధించబడింది.

బరంపురంలో నిషేధాజ్ఞలు విధించగా, ధిక్కరించిన దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిని అరెస్టుచేసి బందరు పంపారు. అక్కడ సంవత్సరం శిక్ష విధింపబడింది.

గంపలగూడెం కుమార రాజా కోటగిరి వెంకట కృష్ణారావుగారిపై 108 సెక్షన్ రాజద్రోహ నేరంకింద కేసు పెట్టారు. జామీన్ ఇవ్వ నిరాకరించినందున సంవత్సరం జైలుశిక్ష విధించబడింది.

బరంపురం సభలనుండి ఇంటికి వెళుతున్న సమయంలో గంపలగూడెం రాణీగారినుండి ఒక గుమాస్తా వచ్చి కాశేశ్వరరావుగారిని కలిశాడు. పొరపాటున కూడా జామీన్ ఇవ్వవద్దనీ, పౌరుషంగా జైలుకు వెళ్ళవలసిందిగా కుమార రాజాకు రాణీగారు, ఆమె భర్తా కబురు పంపారు. ఆ కబురును కాశేశ్వరరావుగారు తిరిగి బరంపురం వెళ్ళి సెంట్రల్ జైలులో ఉన్న కుమార రాజాగారికి అందచేశారు. వారి సందేశం విని కుమార రాజా సంతోషించారు. సంవత్సరం జైలు శిక్షను అనుభవించారు.

కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్ తర్వాత జిల్లాలో పలుచోట్ల సహాయ నిరాకరణ ఉద్యమం గురించి వివరింపబడింది. ఆ రోజుల్లోనే కళా వెంకటరావు బందరులోని నోబుల్ కాలేజినుంచి చదువు మానివేశాడు. అప్పుడాయన బి.యస్‌సి. ఫైనల్ ఇయర్ చదువుతున్నాడు. చితావఝుల రామకృష్ణయ్యగారు కూడా ఇదే కాలేజినుంచి చదువు మానివేశాడు. మానికొండ సత్యనారాయణశాస్త్రి బి.ఎల్. చదువుతూ మానివేశారు. కొడాలి ఆంజనేయులు, గురజాడ రాఘవశర్మ, గడియారం సాంబయ్య మొదలైనవారు ఉద్యోగాలు మానివేశారు. సాంబయ్యగారు పామర్రులో జాతీయ పాఠశాల నెలకొల్పి చాలాకాలం అందులో పనిచేశారు. కామినేని వెంకటప్పయ్యగారు హిందూహైస్కూలులో చదువు మానివేసి, జాతీయ కళాశాలలో ప్రవేశించారు. దాసు మధుసూదనరావు, దోర్బల శేషాద్రిశాస్త్రి, చోడవరపు విశ్వేశ్వరశాస్త్రిగార్లు ఒక సంవత్సరంవరకు తమ న్యాయవాద వృత్తిని మానివేశారు. దాసు మధుసూదనరావు ఖద్దరు కేంద్రం స్థాపించి, ఖద్దరును ఇతర రాష్ట్రాలకు ఎగుమతి చేసేవాడు. తూర్పు కృష్ణాజిల్లాలో పట్టాభి, దుగ్గిరాల రాఘవచంద్రయ్యగార్లు ఖాదీ కేంద్రాన్ని నెలకొల్పి ప్రచారం చేశారు.

సహాయ నిరాకరణ ఉద్యమాన్ని పురస్కరించుకొని, ఇద్దరు గ్రామోద్యోగులు తమ ఉద్యోగాలు పోగొట్టుకున్నారు. మరో 18 మంది రాజీనామా చేశారు. వీరిలో శ్రీమతే (నూకల వీరరాఘవయ్య) కూడా వున్నాడు. బందరు క్రిష్టియన్ మిషనరీ స్కూలులో 60 మంది విద్యార్థులు చదువు మానివేశారు.

ఈ కాలంలోనే చెరుకువాడ వెంకటనరసింహం గారికి సంవత్సరం, మానికొండ సత్యనారాయణశాస్త్రి గారికి తొమ్మిది మాసాలు, అశ్వధాటి రామదాసుగారికి

విద్యార్థులలో అలజడి కల్గించుతున్నాడనే నేరంమోపి వారం రోజులు శిక్షవిధించారు. వీరంకి లాకువద్ద కాల్వ కట్టలపై గడ్డి వేలంపాటలను పాడకుండా పికెటింగ్ చేసినందుకుగాను. యలమంచిలి వెంకటప్పయ్యగారికి 6 నెలల కఠిన శిక్ష విధింపబడింది. ఎతి రాజమ్మగారికి జరిమానా విధింపబడగా ఎవరో ఆ సొమ్మును చెల్లించారు. కొడాలి అంజనేయులుగారి "అవతార పరివర్తనం" నాటక ప్రదర్శన నిషేధింపబడింది.ఎన్నికల బహిష్కరణ ఉద్యమ సందర్భంలో పేట బాపయ్యగారిని మరో ఆరుగురిని అరెస్టుచేసి జైలుకుపంపారు. ఉయ్యూరులో వల్లభనేని వెంకట్రావు. గాయత్రి అనంతరామయ్య. గొడవర్రులో జొన్నవిత్తుల కుటుంబసుబ్బారావు మొదలగువారిని 17మందినిఅరెస్టు చేశారు. నూజివీడులో దశిక సూర్యప్రకాశరావు మొదలగువారిని 12 మందిని శిక్షించారు. విజయవాడ తాలూకాలో అటవీ సత్యాగ్రహం చేసినందుకు, కొండపల్లిలో కల్లుదుకాణాలవద్ద పికెటింగ్ చేసినందుకు కొందర్ని అరెస్టుచేశారు. పన్నుల నిరాకరణగురించి ప్రచారం చేస్తున్నారనిచెప్పి' వేదాంతం శంభుశాస్త్రిగారిని తీవ్రంగా లాఠీచార్జిచేసి పెనుగంచి ప్రోలులో అరెస్టుచేసి, సంవత్సరం శిక్షవిధించారు.

1922లో మున్సిపల్ ఎన్నికలు జరిపించాల్సిందిగా ఆందోళన చేసినందుకు అయ్యదేవర కాళేశ్వరరావు. అద్దేపల్లి వెంకటగురున్నాధరామశేషయ్యగార్లకు 1922 ఫిబ్రవరిలో ఒక సంవత్సరం శిక్షవిధించారు. రాష్ట్రంలోని అన్ని మున్సిపాలిటీలలోను 1920 నవంబరులోగా ఎన్నికలు జరిగాయి. కాని బెజవాడ మున్సిపల్ కౌన్సిలర్ల ఎన్నిక. చైర్మన్ ఎన్నికకాకుండా అప్పటి జస్టిస్‌పార్టీ ముఖ్యమంత్రి పానుగల్లు రాజా జాప్యం చేస్తూ వచ్చాడు. ఎన్నికలు జరిపించాలని ఎన్ని విజ్ఞప్తులు చేసినా లాభంలేక పోయింది. అందుచేత ఎన్నికలు పెట్టేదాకా పన్ను లివ కూడదనే ఉద్యమాన్ని సాగించారు కౌన్సిల చేత రాజీనామా యిప్పించారు. 24 మంది కౌన్సిల ర్లలో 18 మంది రాజీనామాచేశారు. కోరం లేకుండాపోయింది. పోటీగా ప్రజా కౌన్సిల్ ఏర్పరచి దానికే పన్నులు ఇవ్వాలని నిర్ణయించారు. దీనిపై 1922 ఫిబ్రవరి 28న అయ్యదేవర కాళేశ్వరరావు, అద్దేపల్లి వెంకటగురునాధరామశేషయ్యగార్లను అరెస్టుచేసి, జామీను ఇవ్వాల్సిందిగా కోరారు. జామీను ఇవ్వ నిరాకరించగా సంవత్సరం శిక్షను అనుభవించారు. ఈలోగా వీరు అరెస్టయిన 3 నెలల్లోనే ప్రభుత్వం మధ్యవర్తులద్వారా రాజీకి వచ్చి. పన్నులు కడితే ఎన్నికలు జరిపించుతామని అనగా పన్నులు కట్టారు, తర్వాత ఎన్నికలు జరపగా కాంగ్రెస్ పార్టీకే మెజారిటీ వచ్చింది.

## నాగపూర్ జండా సత్యాగ్రహం

1923 మే1న నాగపూర్‌లో కాంగ్రెస్ వలంటీర్లు సివిల్ లైన్లవైపు జాతీయ జండాలను తీసుకు వెళుతుండగా పోలీసులు అడ్డగించి వారిని చెదరగొట్టారు. జాతీయ పతాకాలను ఆవైపు తీసుకుపోరాదని నిషేధించారు. కాంగ్రెస్ వలంటీర్లు ఈ నిషేధాజ్ఞలను ధిక్కరిస్తూ ప్రతిరోజూ సత్యాగ్రహం చేయసాగారు. ఇది దేశమంతటినీ ఆకర్షించిన "జండా సత్యాగ్రహం"గా మారింది. వారానికొక 8 మందిని ఈ సత్యాగ్రహంలో పాల్గొనేలా పంపాలని అఖిలభారత కాంగ్రెస్ కమిటీ ఆదేశించింది.

విజయవాడ నుంచి సర్వశ్రీ మఠం బాలసుబ్రహ్మణ్యం గుప్తా. పోతిన గణపతిరావుపాత్రుడు. బంకా అచ్చయ్య పాత్రుడు, తమ్మన నరసింహం, పీసపాటి మన్మధరావు, జొన్నలగడ్డ సీతారామయ్య.తాడికొండ పార్వతీశం, కోట నాగభూషణంగుప్త మున్నగు వారు ఈ సత్యాగ్రహంలో పాల్గొని ఆరేసి నెలలు శిక్షను పొందారు.

తర్వాత కొన్నాళ్ళకు ప్రభుత్వం లొంగివచ్చింది. ఏ రోడ్డున జండాలు తీసుకొని వెళ్ళేదీ ముందుగా చెబితే అభ్యంతరం ఉండదని తెలియచేసింది. జండా సత్యాగ్రహ ఉద్యమం ఆపివేయబడింది. ఖైదీలు విడుదలయ్యారు. ఐనా మఠంబాల సుబ్రహ్మణ్యగుప్త గారికి 1923లో 108 సెక్షన్ కింద సంవత్సరం శిక్ష విధించబడింది.

సహాయ నిరాకరణ ఉద్యమం విరమింపబడ్డాక దేశ పరిస్థితులను విచారించడానికి పండిత మోతీలాల్ నెహ్రూ నాయకత్వాన ఒక కమిటీ మద్రాసు నుంచి గుంటూరు వెళ్ళినపుడు, త్రోవలో ప్రతిచోటా అమితోత్సాహంతో ప్రజలు స్వాగతమిచ్చారు. బెజవాడ మున్సిపాలిటీ కూడా స్వాగతపత్రం సమర్పించింది. ప్రభుత్వానికిది కంటగింపుగా వుంది. గుంటూరులో

144 సెక్షన్ విధించింది. కొందరు నాయకుల్ని అరెస్టు చేసింది. నిషేధాజ్ఞలను ధిక్కరించగా వంద లాది సత్యాగ్రహులు అరెస్టయారు. అరెస్టయిన వారిలో కృష్ణాజిల్లాకు చెందిన కాకుమాను లక్ష్మయ్య, కాట్రగడ్డ రఘురామయ్య, పెదర్ల వెంకటసుబ్బయ్య, నల్లూరి పాపయ్యగార్లున్నారు మూడు రోజులు నిర్బంధంలో వుంచి, ఆ తర్వాత లక్ష్మయ్యగారికి రు.25 లు, మిగతావారికి రు. 15లు చొప్పున జరిమానా విధించారు.

## గవర్నరుకు నల్ల జెండాలు

మద్రాసు గవర్నరు 1930 ఫిబ్రవరి 8 వ కోస్తా జిల్లాలలో పర్యటన సందర్భంగా బందరు వచ్చాడు. ఈ రాకను బహిష్కరించాలని తూర్పుకృష్ణా జిల్లా కాంగ్రెస్ అంతకుముందే తీర్మానించింది. "గవర్నర్ గోబాక్" అనే నినాదంతో, నల్లజండాలతో బందరులో ఊరేగింపు జరిగింది. పోలీసులు ఈ ప్రదర్శనాన్ని నిషేధించినా, దాన్ని ఉల్లంఘించినందుకు 32 మందిని అరెస్టు చేసి, అందులో 11 మందిపై కేసు పెట్టారు. ఆరు వారాలపాటు సబ్ జైలులో ఉంచారు. విచారణకై కోర్టుకు వాయిదా రోజున వెళ్ళినప్పుడల్లా చేతులకు బేడీలువేసి తీసుకువెళ్ళారు. తర్వాత మార్చి 15 న సంవత్సరం ఆరువారాల కఠిన శిక్ష విధించారు.

ఇలా శిక్షించబడినవారిలో సర్వశ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య, కొడాలి ఆంజనేయులు, బొబ్బా వెంకట శేషయ్య, వల్లూరు రామారావు, మునుగంటి వెంకట రావు, తల్లాప్రగడ రామారావు, అన్నే వెంకట రత్నం, గూడూరు వెంకటచలం, వడ్లమూడి సత్య నారాయణ, బొబ్బా ఆదినారాయణమూర్తి, బొబ్బా రంగయ్య, జి. ఆదినారాయణ ఉన్నారు.

వీరి అరెస్టు వార్త విని, ప్రకాశంగారు బందరు వచ్చి, అభినందించటమే కాక, బహిరంగసభలో కూడా ప్రశంసించారు. కృష్ణాపత్రిక సంపాద కీయంలో వీరిని కొనియాడింది. రానున్న ఉప్పు సత్యాగ్రహ ఉద్యమానికి నాందిగా, ఉత్సాహాన్ని రేకెత్తించింది.

## కృష్ణాజిల్లాలో ఖద్దరు నిధికి గాంధీ యాత్ర

శాసనోల్లంఘన విరమణ తర్వాత నిర్మాణ కార్యక్రమంలో భాగంగా, కాంగ్రెస్ ఖద్దరు ప్రచారంపై కేంద్రీకరించింది. గాంధీ జైలుకు వెళ్ళిన దినంగా ప్రతి నెలా 18 వ తేదీన కాంగ్రెస్ వాదులు ఖద్దరు ప్రచారం చేసేవారు. ఏప్రిల్ 6 నుంచి 13 వరకు జాతీయ వారోత్సవ సందర్భంగా కూడా ఖద్దరు ప్రచారం చేసేవారు. 1922 జూన్, జూలై మాసాల్లో "ఖద్దరు విచారణ సంఘం" ఆంధ్రలో పర్యటించి, ఆంధ్రలోని ఖద్దరు అభివృద్ధిని ప్రశంసించింది. రాజ మండ్రిలో జరిగిన ఆంధ్ర కాంగ్రెస్ కార్యవర్గ సమావేశంలో రాజకీయాల నుంచి ఖద్దరు వ్యవహారాలను వేరుచేసి "ఖద్దరు బోర్డు"ను ఏర్పరచారు. దానికి కాశీనాధుని నాగేశ్వరరావుగార్ని అధ్యక్షునిగా నియమించారు. ప్రాంతీయ డైరెక్టర్లను కూడా నియమించారు. జిల్లా, తాలూకా స్థాయిలో కూడా ఖద్దరు సంఘాలు ఏర్పడ్డాయి. ఇవి ఏర్పడకముందే కొన్ని చోట్ల ఖద్దరు సంఘాలు ఏర్పడి పనిచేస్తున్నాయి. పట్టాభిగారి అజ్మాయిషీన ఒక ఖద్దరు కేంద్ర బ్యాంక్ ఏర్పాటు చేయడానికి 1923 ఫిబ్రవరి 1 న రాష్ట్ర కాంగ్రెస్ నిర్ణయించింది. 192 లో అఖిల భారత ఖాదీబోర్డు సభ్యులు ఆంధ్రలో పర్యటించారు. ఖద్దరును ప్రోత్సహించాల్సిందిగా విజ్ఞప్తి చేశారు. వీరిలో జమన్‌లాల్ బజాజ్ కూడా ఉన్నారు. ఈ సంవత్సరమంతా ఖద్దరు కార్యక్రమాన్ని పట్టారు. అహ్మదాబాద్ కాంగ్రెస్ తీర్మానాన్ని అనుసరించి ప్రతి కాంగ్రెస్ సభ్యుడు నెలకు స్వయంగా 2 వేల గజాల దారాన్ని పంపాలి. ఈ సందర్భంగా కృష్ణాజిల్లాలో ఖద్దరు ఉద్యమం గురించి తెలుసుకొందాం.

1921 నుంచి 1923 వరకూ డాక్టరు ధనాడ రామచంద్రరావుగారి ఆధ్వర్యాన బెజవాడలో ఖద్దరు సంస్థ వుండేది. తర్వాత పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ ఖద్దరు సంస్థ, అద్దేపల్లి వెంకట గుర్నాధ రామశేషయ్యగారి యాజమాన్యాన నడిచింది. తిలక్ పేట (గవర్నరు పేట) లో ఒక ఖద్దరు సంస్థ కాట్రగడ్డ రఘురామయ్య, పేట బాపయ్య, నల్లూరు పాపయ్యగార్ల ఆధ్వర్యాన నడిచేది. బెజవాడలో అఖిల భారత

కాంగ్రెస్ కమిటీ సమావేశ సభలు పూర్తయాక దాసు మధుసూదనరావుగారు ఒక ఖద్దరు కేంద్రాన్ని స్థాపించారు. ఇక్కడి ఖద్దరును ఇతర రాష్ట్రాలకు ఎగుమతి చేశారు. 1921 లో దీన్ని అద్దేపల్లి వెంకట గురునాథ రామశేషయ్యశ్రేష్ఠి. అయ్యదేవర కాళేశ్వరరావు గారు తీసుకొని నడిపారు. దీనికిగాను అఖిల భారత చరఖా సంఘానికి నోటురాసి రు. 2500 అప్పుతెచ్చి వేశారు.

1924 లో దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి పేరిట ఖద్దరు ఉత్పత్తి కేంద్రం, వస్త్రాలయం ఘంటసాలలో నెలకొల్పబడి పనిచేస్తూవుంది. 1929 లో అఖిల భారత చర్ఖా సంస్థలో దాన్ని విలీనం చేశారు. బందరులో డాక్టరు పట్టాభి సీతారామయ్య, దుగ్గిరాల రాఘవచంద్రయ్య గార్లు తూర్పు కృష్ణా జిల్లాలో ఖద్దరు ఉత్పత్తి కేంద్రాలను నెలకొల్పారు. గుంటూరు మండల ఖద్దరు సంఘం వారు ఒక విక్రయశాలను బెజవాడలో నెలకొల్పి ఖద్దరు అమ్మారు.

ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారు 21 వేల రూపాయలను, గుణదలలోని ఖద్దరు సంస్థానానికి ఇచ్చారు. అక్కడ ఖద్దరే కాక స్వయం సహాయ సిద్ధాంతంపై వ్యవసాయం, నోట్ల చలామణి ద్వారా కాక, వస్తు మార్పిడి అనే ఆదర్శాలతో పనిచేశారు. కుటుంబ సభ్యులంతా ఈ కార్యక్రమానికే అంకితమయ్యారు.

అంగలూరులో "జాతీయ పత్రిశ్రమాలయం" పేరుతో ఖద్దరు ఉత్పత్తి కేంద్రాన్ని దుగ్గిరాల రాఘవ చంద్రయ్య, అరికెపూడి రామశాస్త్రులు, ఎర్నేని సుబ్రహ్మణ్యం స్థాపించి దీర్ఘకాలం నడిపారు.

1923 లో ఖద్దరు ఉత్పత్తి హెచ్చుకావించేందుకు జమ్నాలాల్ బజాజ్‌గారిచే గాంధీ పెట్టుబడి పెట్టించాడు. ప్రతి జిల్లాలోను ఐదుగురు నోట్లురాసి ఏడు వేలు పెట్టుబడిగా ఇప్పించారు. కృష్ణా జిల్లాలో ఇలా నోటు రాసినవారు సర్వశ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, చెరుకువాడ వెంకటనరసింహం, గొట్టిపాటి బ్రహ్మయ్య, గడియారం సాంబయ్య. బ్రహ్మయ్యగారు అధ్యక్షులుగా, పట్టాభిగారు కార్యదర్శిగా ఖద్దరు బోర్డు ఏర్పడింది. 1929 లో అఖిలభారత ఖద్దరు సంస్థ (ఆంధ్ర) శాఖ ఏర్పడే వరకూ ఇది పనిచేసింది.

ఖద్దరు నిధికిగాను గాంధీ కృష్ణాజిల్లాలో 1929 ఏప్రిల్ 7 నుంచి 16 వరకూ పర్యటించారు. హైదరాబాద్ నుంచి ఆయన పర్యటన ప్రారంభమైంది. బోనకలు స్టేషన్ నుంచి గాంధీని జయంతిపురం తీసుకు వెళ్ళడంతో కృష్ణాజిల్లా పర్యటన ప్రారంభమయింది. ఈ పర్యటనలో గాంధీ 30 కేంద్రాలలో ఉపన్యసించాడు. పశ్చిమ కృష్ణా, రొఖ్ఖం కాని అభరణాలు కాని మొత్తం రు. 24,561 లు, తూర్పు కృష్ణా రు. 29,360 లు నిధిని సమర్పించాయి.

జయంతిపురం, జగ్గయ్యపేట, కొణకంచి, నందిగామ, ఇబ్రహీంపట్నం, గుంటుపల్లి, బెజవాడ, నూజివీడు, గొల్లపల్లి, ఆరుగొలను, వీరవల్లి, పొట్టిపాడు, ఆత్కూరు, విజయవాడ పరిసర గ్రామాలైన గుణదల, మొగల్రాజపురం, పటమట, పోరంకి, ఈడుపుగల్లు, పునాదిపాడు, నెప్పల్లి, ఆకునూరు, ఉయ్యూరు మొదలైన గ్రామాలను గాంధీ సందర్శించారు.

తర్వాత తూర్పు కృష్ణాలో, కపిలేశ్వరపురం, తాడంకి, కుమ్మదాలి, కనుమూరు, పామర్రు, వీరంకిలాకు, ఎలకుర్రు, గుడివాడ, సెరీకల్వపూడి, నూజెళ్ళ, అంగలూరు, కౌతవరం, వడ్లమన్నాడు, పెడన, బందరు, చినముత్తేవి, పెదపూడి, కూచిపూడి, నరసన్నపాలెం, మొవ్వ, కొడాలి, తాడేప , ఘంటసాల పాలెం, ఘంటసాల, దేవరకోట, చ పల్లి, పురిటిగడ్డ, కప్తానుపాలెం, పెదప్రోలు, మోదేవి, నాగాయతిప్ప, అవనిగడ్డ, నాగాయలంక, కోడూరు, కొత్తపేట, గూడూరు, గొల్వేపల్లి, కైకలూరు, భైరవపట్నం, వడాలి, మెంట్రప్రగడ, పెదపారుపూడి గ్రామాలలో గాంధీ పర్యటించారు. తిరిగి కల్వపాముల మానికొండ గ్రామాలలోను, విజయవాడ స్టేషన్‌లోను నిధులు సమర్పించారు.

ఈ దిగువ గ్రామాల ప్రజలు కూడా ఖద్దరు నిధికి, లాలాజీ నిధికి విరాళాలు సమర్పించారు.

బొర్లపూడి, గూడపాడు, పెదముత్తేవి, అయ్యంకి, శ్రీకాకుళం, కొత్తపల్లి, కాజ, కోసూరు, కోసూరివారిపాలెం, చిట్టిగూడూరు, తరకటూరు, జమిగొల్వేపల్లి, కొమరవోలు, పెయ్యేరు, దాకవరం, శోభనాద్రి అగ్రహారం, వానపాముల, అప్పికట్ల, అన్నవరం, గురజ, దాకరం, చేవం, ముదినేపల్లి, లింగాల,

మక్కపేట, కానుమోలు, గొడవర్రు, గండిగుంట త్రోవ, కొమ్మమూరు, చినివాడ, పునాదిపాడు, కాటూరు, నందమూరు, మానికొండ, కల్వపాముల, ముదునూరు, పసర్లపూడి, పసుమర్రు, జక్కంచర్ల, ఎలమర్రు, కొరిమర్ల, గుడ్లవల్లేరు, బొమ్మలూరు, ఎలమర్రు మాలపల్లి వాసులు.

గాంధీ పర్యటన మూలంగా ప్రజలలో ఉత్సాహం, సంస్కరణ భావాలు వ్యాప్తి చెందాయి. ఖద్దరు, మద్యపాననిషేధం, అంటరానితనం, మహిళల ఉద్యమం మొదలైన అంశాలపై గాంధీ కేంద్రీకరించాడు. చాలా చోట్ల ప్రత్యేకంగా మహిళల సభలలో ప్రసంగించాడు. ముమ్మందు రానున్న సత్యాగ్రహోద్యమాలలో విరివిగా మహిళలు పాల్గొనడానికి కూడా ఇదొక కారణం. 1930 ఉప్పు సత్యాగ్రహ ఉద్యమానికి గాంధీ పర్యటన పూర్వరంగాన్ని సంసిద్ధం చేసింది వేలాది కార్యకర్తలు స్వాతంత్ర్య సమరాగ్నికి సన్నద్ధ మయ్యారు.

## సైమన్ కమిషన్ బహిష్కారం

1928 లో భారత రాజకీయ పరిస్థితులను పరిశీలించడానికి బ్రిటిష్ ప్రభుత్వం నియమించిన సైమన్ కమిషన్‌ను బహిష్కరించాల్సిందిగా గాంధీ కోరాడు. అన్నిచోట్లా సైమన్‌కు నల్లజండాలు "సైమన్ వెనక్కిపో" అనే నినాదాలు ఎదురయ్యాయి.

సైమన్ కమిషన్ 1928 లో గుంటూరు, ఒంగోలు నగరాలకు వెళ్ళడానికి నిశ్చయించుకొంది. ఐతే, ఇక్కడికి వచ్చేముందు కలకత్తా వెళ్ళింది. కలకత్తా నుంచి ప్రత్యేక రైలులో ఈ కమిషన్ సభ్యులు వచ్చారు. ఆ రైలు బెజవాడలో ఆగినపుడు అప్పటి మున్సిపల్ ఛైర్మన్ అయ్యదేవర కాళేశ్వరరావుగారు తమ డఫేదార్‌ద్వారా ఒక కవరు అందించారు. అందులో సైమన్ కమిషన్‌ను బహిష్కరించాలని మున్సిపాలిటీ చేసిన ఏకగ్రీవ తీర్మానమూ, 'సైమన్ గోబాక్' అని రాసివున్న కాగితమూ వున్నాయి. సైమన్ కమిషన్ ముప్పావు గంటసేపు బెజవాడ ప్లాట్‌ఫారంమీద ఆగింది. పోలీసు బందోబస్తు పెద్ద ఎత్తున చేశారు. ఐనా కూడా కాంగ్రెస్ వలంటీర్లు హఠాత్తుగా ప్లాట్‌ఫారమ్‌పై ప్రత్యక్షమై, నల్ల జండా చూపారు. ముస్తాబాద్‌లోనే నల్లజండాలు చూపాలని చేసిన ప్రయత్నం అక్కడ రైలు ఆగకపోవటంతో విఫలమైంది. వాలంటీర్లు అకస్మాత్తుగా సైమన్ ఉన్న ప్లాట్‌ఫారం మీదకు వచ్చి, నల్లజండాలు చూపారు.

సైమన్ కమిషన్ రాక సందర్భంగా బందరు తాలూకా బోర్డుకు అధ్యక్షుడుగా వున్న గొట్టిపాటి బ్రహ్మయ్యగారు తాలూకాబోర్డు ఆఫీసుపై నల్లజండా ఎగురవేసి, పాఠశాలలకు ఆ రోజు సెలవు ఇచ్చారు.

## ఉప్పు సత్యాగ్రహం

లాహోర్ కాంగ్రెస్‌లో "పూర్ణ స్వరాజ్య" తీర్మానం ఆమోదించబడింది. శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించాలనీ, అవసరమైతే పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని కూడా ప్రారంభించాలని తీర్మానించింది. 1930 జనవరి 26 న భారత స్వాతంత్ర్య దినంగా పరిగణించి, సభలలో స్వాతంత్ర్య ప్రణాళిక చదవాలని కాంగ్రెసు తీర్మానించింది. ఆ తీర్మానాన్ని అనుసరించి జిల్లాలో అనేక సభలు జరిగాయి. స్వాతంత్ర్య ప్రణాళికను ఆ సభలలో చదివారు.

శాసనోల్లంఘన ఉద్యమానికి తాను గుజరాత్, బీహార్, ఆంధ్రదేశాలపై ఆధారపడుతున్నానని గాంధీ చెప్పాడు. కాంగ్రెస్ సమావేశ అనంతరం రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు గాంధీని కలుసుకొని సత్యాగ్రహ కార్యక్రమం గురించి చర్చించారు. రాష్ట్ర కాంగ్రెస్ సమావేశం కాకినాడలో జరిగింది. జనవరి 26 న "పూర్ణ స్వరాజ్య" దినం పాటించాలనీ, మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులందరూ రాజీనామా చేయాలనీ తీర్మానించారు.

కృష్ణాజిల్లాలో అయ్యదేవర కాళేశ్వరరావుగారు శాసన సభ్యత్వానికి రాజీనామా చేశారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ, యావదాంధ్రకు సత్యాగ్రహోద్యమాన్ని నడపడానికి కొండా వెంకటప్పయ్యగారిని "డిక్టేటర్"గా ప్రకటించింది. ప్రతి జిల్లాకు ఒక శిబిరం ఏర్పరచబడింది. పశ్చిమ కృష్ణాకు బెజవాడలోను, తూర్పు కృష్ణాకు బందరులోను శిబిరాలు ఏర్పడ్డాయి. తూర్పు, పశ్చిమ కృష్ణా జిల్లాలు రెండూ కూడా బందరులో సత్యాగ్రహ ఉద్యమం ప్రారంభించాలని నిర్ణయింపబడింది.

సత్యాగ్రహ ఉద్యమాన్ని సాగించకముందు, పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడైన కానూరి

చిన వెంకట దాసయ్య, పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, చెరుకువాడ వెంకట నరసింహం 100 గ్రామాలలో సంచారంచేసి ప్రచారం చేశారు. అత్యంత ఉత్సాహంతో వలంటీరు ప్రమాణ పత్రాలను యువకులు స్వీకరించారు. ధాన్య, ధన రూపంలో ప్రజలు విరాళాలను ఇచ్చారు. మొదట సత్యాగ్రహ శిబిరానికి బందరులోని గొడుగుపేట నాటకశాలను సిద్ధపరచుకొన్నారు. కాని పోలీసులు దాని యజమానిని బెదిరించటం మూలంగా వేరేచోట శిబిరాన్ని ఏర్పాటుచేసుకోవాల్సి వచ్చింది. అఖిల భారత చర్కా-సంఘం ఆంధ్రశాఖ ఆవరణలో శిబిరాన్ని నెలకొల్పారు. పక్క-నేవున్న భవనాన్ని వలంటీర్ల భోజనాలు వగైరాలకు పురాణం సూరిశాస్త్రిగారిచ్చారు. ఆయన వలంటీరుగా కూడా పనిచేశారు. ఏప్రిల్ 2 న ఈ శిబిరానికి కాశీనాధుని నాగేశ్వరరావు గారు ప్రారంభోత్సవం చేశారు. వారంరోజులు శిబిరంలో వలంటీర్లకు వివిధ విషయాలను నాయకులు బోధించారు. వాలంటీర్లను 12 దళాలుగా విభజించారు. ఆరు దళాలను శిబిరంలో వుంచి, మిగతా ఆరు దళాలు కాలినడకను గ్రామాల్లో ప్రచారం చేయడానికి వెళ్ళారు. ఈ దళాలకు గోనుగుంట్ల వెంకట సుబ్రహ్మణ్య గుప్త, కామినేని వెంకటప్పయ్య, వల్లభనేని రామబ్రహ్మం, కొల్లిపర సూరయ్య, కాశీనాధుని వీరమల్లయ్య, సూరపనేని గోపాలకృష్ణయ్య అధిపతులుగా పని చేశారు.

బందరుకు ఎనిమిది మైళ్ళ దూరంలోని చిన్నాపురానికి సమీప ప్రాంతంలో ఉప్పు శాసనాలను ఉల్లంఘించాలని నాయకులు భావించారు. అందుచేత శిబిరాన్ని చిన్నాపురానికి మార్చారు. సత్యాగ్రహులను బందరు నుంచి చిన్నాపురం తీసుకువెళ్ళడానికి వల్లభనేని రామబ్రహ్మంగారు తమ బస్సు నిచ్చారు. ప్రభుత్వం వెంటనే ఆ బస్సు లైసెన్సును రద్దుచేసింది. రామబ్రహ్మంగారికి రు. 500 జరిమానా వేసి, తక్షణం వసూలు చేసింది. బస్సు డ్రయివర్ అన్నె వెంకట శివుడుగారికి 4 మాసాల శిక్ష విధించారు.

బెజవాడలో ఏప్రిల్ 2 న ఆంధ్రరత్న భవనంలో సత్యాగ్రహ శిబిరం ఏర్పడింది. ఏప్రిల్ 4 న పశ్చిమ గోదావరి జిల్లా రాజకీయ మహాసభకు అధ్యక్షత వహించిన అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఏప్రిల్ 5 న బందరు చేరి, సముద్రతీరంలో ఉప్పు ఏరి, రాబర్ట్‌సన్‌పేటలో మార్కెట్‌వద్ద బహిరంగసభలో ఉపన్యసించి, ఆ ఉప్పును పంచిపెట్టారు. ఈ సభకు ముట్నూరి కృష్ణారావుగారు అధ్యక్షత వహించారు. ప్రజలను సత్యాగ్రహం చేయాలని వారు విజ్ఞప్తి చేశారు. కాని వీరెవరినీ ఆ రోజున పోలీసులు అరెస్టు చేయలేదు. కాళేశ్వరరావుగారు బెజవాడ వెళ్ళి పోయారు.

1930 ఏప్రిల్ 6 న ఉదయం 8 గంటలకు బెజవాడలోని ఆంధ్రరత్న భవనం నుంచి మొదటి సత్యాగ్రహుల దళం బయలుదేరింది. ఈ శిబిరంలో దాదాపు 300 మంది సత్యాగ్రహు లున్నారు. తర్వాత క్రమంగా ఈ సంఖ్య పెరిగింది. వర్తకులు వీరికి భోజన సౌకర్యాలు చేశారు. తర్వాత ఎర్నేని లక్ష్మీనారాయణగారు 3½ వేల రూపాయలిచ్చారు. జైలుకు వెళ్ళేటంతవరకు కాట్రగడ్డ మధుసూదనరావుగారు శిబిరాధిపతిగా వున్నారు. దీనికి కోటగిరి వెంకట కృష్ణారావుగారు (గంపలగూడెం కుమారరాజా) నాయకత్వం వహించారు. ఇందులో 53 మంది వున్నారు. (మరో కథనం 120 మంది దాకా వున్నారని) ఈ దళంలో సర్వశ్రీ పేట బాపయ్య, అన్నె అంజయ్య, వేలూరి యజ్ఞనారాయణశాస్త్రి, స్వామి నారాయణానంద, పింగళి లక్ష్మీనారాయణ, కాకుమాను లక్ష్మయ్యచౌదరి, కాట్రగడ్డ మధుసూదనరావు, పిడికిటి రామకోటయ్య, పిడికిటి మాధవరావు, నూకల వీరరాఘవయ్య (శ్రీమతే), వల్లభనేని వెంకటరావు, మానికొండ సత్యనారాయణశాస్త్రి, దశిక సూర్యప్రకాశరావు, కాకాని వెంకటరత్నం మొదలైనవారున్నారు. ఈ దళం బయలుదేరినపుడు వేలాదిమంది అక్కడ గుమిగూడారు. సత్యాగ్రహ దళం బయలుదేరినపుడు వాయిద్యాలు మారుమోగాయి. స్త్రీలు మంగళహారతు లిచ్చారు. కొండా వెంకటప్పయ్య, టంగుటూరి ప్రకాశం, అయ్యదేవర కాళేశ్వరరావుగార్లు శుభాకాంక్షలు తెలియచేశారు. సత్యాగ్రహులకు వీధులలో పూలహారాలు వేశారు.

ఈ దళం మొగల్రాజపురం, పటమట, పటమటలంక, పోరంకి, ఈడుపుగల్లు, పునాదిపాడు, నెప్పల్లి, ఆకునూరు, ఉయ్యూరులలో మధ్య మధ్య మకాం చేస్తూ 11 వ తేదీ సాయంత్రానికి బందరు చేరింది.

తోవలో మరో పదిహేడు మంది సత్యాగ్రహులుగా చేరారు. అక్కడ తూర్పు, పశ్చిమ కృష్ణాజిల్లాల యావత్ వలంటీరు దళానికి కోటగిరి వెంకట కృష్ణారావుగారు నాయకత్వం వహించారు. చిన్నాపురంలో మూడురోజులు మకాం చేసి ఉప్పు పోగుచేసి 14 న బందరు చేరారు. ఈలోగా వేలూరి యజ్ఞనారాయణ శాస్త్రిగారు మరో ఐదుగురు సత్యాగ్రహులు 9 వ తేదీన బందరు చేరారు. సముద్రతీరంలోని ఉప్పు తెచ్చి బహిరంగసభలో విక్రయించారు.

ఏప్రిల్ 13 న డాక్టరు వెలిదండ్ల హనుమంతరావు గారి నాయకత్వాన తూర్పు కృష్ణా జిల్లా నుంచి రెండో సత్యాగ్రహ దళం బయలుదేరింది. కాంప్ కమాండరుగా కాట్రగడ్డ నారాయణరావుగారు వున్నారు. ఇంకా ఘంటసాల సీతారామశర్మ, బోతిన గణపతి మొదలైనవారు 34 మంది వున్నారు. వీరు పోరంకి, పెనమలూరు, వేల్పూరు, ఉప్పులూరు, మంతెన, తెనేరు, మానికొండ, కాటూరు, కలువపాముల, జబపూడి, మంటాడ, మొదలైన గ్రామాలలో ప్రచారం చేసుకుంటూ 14 వ తేదీకి బందరు చేరారు. మరో వందమంది దళం కాలినడకను బందరు వెళ్లారు. ఏప్రిల్ 11 న అయ్యదేవర కాళేశ్వరరావుగారు కొంతమంది శాంతి సైనికులతో నందిగామ తాలూకాలో పర్యటించారు. చాలామంది కొత్తవారిని తమ దళంలో చేర్చుకొన్నారు. 12 వ తేదీన బెజవాడకు చేరి, జాతీయ పతాకాలతో అలంకరించబడిన ప్రత్యేక రైల్వేకంపార్టుమెంటులో 80మంది బందరుబయలుదేరి వెళ్ళారు. తోవలో మరో 20మంది కలిశారు. రైల్వేస్టేషనులో పౌర సమూహాలు జయజయ ధ్వానాలు చేశాయి. ఆ రాత్రి బందరులో 100 మందితో కూడిన కాళేశ్వర రావుగారి దళం హనుమంతరావుగారి దళంతో కలిసింది. నందిగామ తాలూకాలో కాళేశ్వరరావుగారు పర్యటించినపుడు ఉత్సవాలతో సత్యాగ్రహులను ప్రజలు సత్కరించారు. కొత్తవారు సత్యాగ్రహులుగా చేరారు. నందిగామ విద్యార్థి రావులపాటి మధుసూదన రావు అందులో ఒకడు. ఆయన ఈమధ్య కాలంలో పశ్చిమ గోదావరి కలెక్టర్‌గా పనిచేశాడు. రేబాల బుచ్చిరామశేషయ్యశ్రేష్ఠి, అనుమల రామగోవింద శర్మ, వేదాంతం శంభుశాస్త్రి, సుంకర సుబ్బారావు, డాక్టరు బసవరాజు, సాధు రామకృష్ణయ్య, దుర్భా కృష్ణమూర్తి, మునగాల నుంచి వచ్చిన ఒక ముస్లిం యువకుడూ ఈ దళంలో వున్నారు.

అంతకు ముందు ఏప్రిల్ 10 న టంగుటూరి ప్రకాశం పంతులు, కొండా వెంకటప్పయ్య, కాశీనాథుని నాగేశ్వరరావు గార్లు సత్యాగ్రహ స్థలాన్ని చూసి వచ్చేటప్పుడు ఉప్పు తీసుకు వచ్చారు. దారిలో పోలీసులు అడ్డగించి వారి గుప్పెళ్ళను బలవంతంగా విప్పి ఉప్పును తీసుకొన్నారు. ఆ సాయంకాలం బహిరంగ సభలో, యుద్ధకాలంలో తాను పొందిన అవమానాలను గురించి ఎరుకసాడు వాస్తవ్యుడు సుబ్బారాయుడు ఏకరువు పెట్టాడు. ఆ సభలో చిన్నాపురం నుంచి తెచ్చిన ఉప్పును, సముద్రం నుంచి తెచ్చిన ఉప్పునీటినీ కుండలతో అమ్మారు.

కోటగిరి వెంకటకృష్ణారావుగారి (గంపలగూడెం కుమారరాజా) దళం ఏప్రిల్ 13 న బందరు చేరి, చిన్నాపురంనుంచి ఉప్పుతెచ్చిబహిరంగసభలలో పంచిపెట్టింది. జాతీయ జండాలతో ఊరేగింపు జరిపింది. కాని పోలీసులు అరెస్టు చేయలేదు. ఈ దళం మూడుగా చీలి, జిల్లాలోని వివిధ గ్రామాలలో ప్రచారం చేసుకొంటూ 17 వ తేదీనాటికి బెజవాడ ఆంధ్రరత్న భవనం చేరారు. చివరకు ప్రభుత్వం ఏప్రిల్ 30 న కోటగిరి వెంకటకృష్ణారావుగారినీ, కాకుమాను లక్ష్మయ్య చౌదరిగారినీ అరెస్టుచేసి చెరో సంవత్సరం శిక్ష విధించింది. గాంధీగారివెంట దండీ యాత్రలో పాల్గొన్న ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు ఏప్రిల్ 15 న బందరు రాగా వారికి బ్రహ్మాండమైన స్వాగతం ఇచ్చారు ఆ రోజు బహిరంగ సభలో ఉపన్యసించి దండీనుంచి తెచ్చిన ఉప్పును అమ్మారు. మరికొంత మంది వలంటీర్లతో కలిసి గ్రామాల్లో ప్రచారం చేయడానికి వెళ్ళారు.

తూర్పు కృష్ణాజిల్లా సత్యాగ్రహ దళాధిపతులలో ఒకరైన వల్లభనేని రామబ్రహ్మంగారు కొమరువోలు వద్ద తాటి గెలలు నరికించినందుకు ఆరు మాసాల శిక్షకు గురయ్యారు.

విజయవాడలో ఏప్రిల్ 13 న స్వామి నారాయణానంద సరస్వతిని (పింగళి లక్ష్మీనారాయణగారు సన్యాసాశ్రమం స్వీకరించి పై పేరు పెట్టుకొన్నారు) ప్రభుత్వం అరెస్టు చేసింది. సంవత్సరం ఖైదు విధించింది.

1930 ఏప్రిల్ 19, 20 తేదీలలో పట్టాభిగారిని, చెరుకువాడ వెంకటనరసింహంగారిని అరెస్టుచేసి చెరో సంవత్సరం శిక్ష వేశారు. ఆనాడు బందరులో హర్తాళ్ జరిగింది. ప్లీడరు గుమాస్తాలు కోర్టులకు వెళ్ళలేదు. ఇండ్లపై జాతీయ జండాలను ఎగురవేశారు. 21 వ తేదీన వెలిదండ్ల హనుమంతరావు, కాశేశ్వరరావు గార్లు బందరు సముద్రతీరంలో ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించి, సత్యాగ్రహం చేశారు. కాశేశ్వరరావుగార్ని ప్రభుత్వం అరెస్టుచేసి ఒక సంవత్సరం శిక్ష విధించింది. ఈ విధంగా ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో సత్యాగ్రహులను జైళ్ళపాలు చేయడం ప్రారంభమైంది.

గాంధీ అరెస్టువార్త బందరులో పెద్ద సంచలనం కల్గించింది. మే 6 న సత్యాగ్రహులు ఊరేగింపు చేశారు. అప్పటికే రాబర్ట్సన్ పేటకుండు మీద వున్న జాతీయ జండాను విరిచిపారేశారన్న వార్త తెలిసింది. ఊరేగింపుగా వెళ్ళి అక్కడ తిరిగి జండాను ప్రతిష్ఠింప చేయడానికి వలంటీర్లు ప్రయత్నించారు. తత్వానంద స్వామి (కొండిపర్తి వీరభద్రాచార్యులు) గారు జండా కడుతుండగా, దాన్ని ఒక పోలీసు లాక్కొని విరిచి పారేశాడు. స్వామిగారు పెనుగులాడుతుంటే, వారిని పోలీసులు మూటగా కట్టి క్రిందికి నెట్టిపారవేశారు. ఇంతలో అనేకమంది వలంటీర్లు జండా ప్రతిష్ఠాపనకై పోలీసులతో పెనుగులాడారు. పోలీసుల లాఠీ దెబ్బలకు చాలామంది గురయ్యారు. జండా ప్రతిష్ఠాపనకై పోలీసులతో జరిగిన పెనుగులాటలో తోట నర్సయ్యగారు అసమాన ధైర్యాన్ని ప్రదర్శించారు. 15 మంది పోలీసులు స్పృహ తప్పేవరకు ఆయన్ని చావచితక కొట్టారు. ఐనా స్పృహ కోల్పోయేవరకు జండాను వదలకుండా వీరోచితంగా ప్రతిఘటించాడు. ఆనాటి నుంచే జండా వీరుడుగా నర్సయ్య ప్రసిద్ధి చెందాడు. బందరులో ప్రజలు హర్తాళ్ చేశారు. బందరు ఛైర్మన్ ఖద్దరు బట్టలు ధరించి, మున్సిపల్ ఆఫీసుపై కాంగ్రెస్ జండా పెట్టారు. కుంపుమీద జండా కట్టడానికి అనుమతించుతూ కౌన్సిల్ తీర్మానించింది. ఆ విధంగా సత్యాగ్రహులకు పాక్షిక విజయం లభించింది.

బందరు శిబిరంలోని వారిని ఇట్లు జట్లుగా అరెస్టు చే . శిబిరంమీద పోలీసులు దండెత్తారు. శిబిరానికి ఇల్లు ఇచ్చిన పురాణం సూరిశాస్త్రిగారికి 6 నెలల కఠిన శిక్ష విధించారు. శిబిర నిర్వాహకులైన కోడే గోపాల కృష్ణయ్య, గొట్టిపాటి సూర్యనారాయణగార్లను శిక్షించారు. కృష్ణా పత్రిక 6 నెలలపాటు ఆగిపోయింది. గాంధీ అరెస్టుకు నిరసనగా వేమూరి రాంజీరావు, పర్వతనేని భూషయ్యగార్లు తమ శాసన సభ్యత్వానికి రాజీనామా ఇచ్చారు.

బెజవాడలో జూన్ 21 న ప్రభుత్వం ఆంధ్రరత్న భవనాన్ని స్వాధీనం చేసుకుని, అక్కడ శిబిరంలో వున్న సత్యాగ్రహుల్ని వెళ్ళగొట్టింది. ఆంధ్రరత్న భవనాన్ని తిరిగి తమ స్వాధీనం చేసుకునేందుకు జట్లు జ గా వెళ్ళి తీవ్రమైన లాఠీ చార్జీలకు గురయ్యారు. సె ంబరు నుంచి డిసెంబరు వరకు ఆంధ్రరత్న భ ం ముట్టడి సత్యాగ్రహం కొనసాగింది.

కోటగిరి వెంకటకృష్ణారావుగారి తర్వాత వెలిదండ్ల హనుమంతరావుగారు అరెస్టయ్యాడు. ఇంకా శివలెంక మల్లిఖార్జునరావు, వేలూరి యజ్ఞనారాయణశాస్త్రి, నల్లూరి పాపయ్య, మరుపిళ్ళచిట్టి(చినఅప్పలస్వామి), కొత్రగడ్డ మధుసూదనరావు, పేట బాపయ్యగార్లు అరెస్టయారు. మధుసూదనరావుగారిని పోలీసులు కొట్టారు. పుట్టుగుడి భువనకడియం నాగభూషణం గారికి జూన్ 17 న రెండేళ్ళ కఠినశిక్ష విధించబడింది.

గాంధీ అరెస్టు తర్వాత దేశమంతటా నిర్బంధ విధానం తీవ్రమయింది. 144 సెక్షన్ విధించారు. కాంగ్రెస్ సంఘాలను అక్రమ సంఘాలుగా ప్రకటించారు. పికెటింగ్ చేసిన వారిని, ప్రభుత్వ ఉద్యోగాలు వదలుకొమ్మని ప్రబోధించినవారిని, నిషిద్ధ వాఙ్మయాన్ని చదివిన వారినీ, పంచిపెట్టిన వారి , ప్రభుత్వ అనుమతి లేకుండా సైక్లోస్టయిల్ పత్రిక "సత్యాగ్రహ సమాచార్" ప్రచురించినందుకు, తాటిచెట్లను, గెలలను నరికినందుకూ సత్యాగ్రహులను అరెస్టుచేసి, శిక్షించింది ప్రభుత్వం. బెజవాడలో దిగవల్లి శివరావు, చెరుకుపల్లి వెంకటప్పయ్యగా ఆధ్వర్యాన ప్రచురింపబడిన పత్రాలను కొన్నిటిని ప్రభుత్వం నిషేధించింది. మొత్తం జిల్లాలో పది .. దిమ్మెలు కేంద్రాలలో సత్యాగ్రహ చార్లు తీవ్రంగా జరిగింది. కాంగ్రెస్ జండాలు తి గ్రామాన సాక్షాత్కరించాయి. ఈ ఉద్యమం బెజవాడ, బందరుల్లో

విదేశ వస్త్రాల అర్డరును రద్దుపరచుకొంటామని హామీ ఇచ్చారు వర్తకులు.

లింగాల, ముక్కొల్లు, కపిళేశ్వరపురం, ఆర మూరు, మల్లవోలు, జమీగొల్వేపల్లి, భట్లపెనుమర్రు, చౌటపల్లి, నందివాడ, కురుమద్దాలి, ఘంటసాల, పెంట్రప్రగడ, కాజ, కవుతవరం, గుడవల్లేరు, అంగలూరు, కొమరవోలు, మొవ్వ, మొదలైన గ్రామాలలో ఉద్యమం ఉత్సాహంగా సాగింది. ఉప్పు చేయడం —అమ్మడం, తాటి గెలలు నరకడం, కల్లు సారా దుకాణాల పికెటింగ్, జండా ప్రతిష్టాపన, ఊరేగింపులు మొదలైన కార్యక్రమాలను ఈ గ్రామాలు సాగించాయి. నూజివీడులో పతాకావిష్కరణ చూస్తున్న ప్రజలపై లాఠీ చార్జీ జరిగింది.

మే 19 న గుడివాడలో నిషేధాజ్ఞలు ఉల్లంఘించి బహిరంగ సభలో పాల్గొంటున్న ప్రజలపై పోలీసులు కాల్పులు జరిపారు. దొండపాడు గ్రామానికి చెందిన దాసరి వెంకటచలపతిరావుకు తొడలో గుండు దూసుకుపోయింది. కానూరి వెంకటదాసయ్యగారి నెత్తిపై కుర్చీ పెట్టి "నీవా కాంగ్రెసుకు ప్రెసిడెంట్‌వి. ఐతే దీన్ని మొయ్యి" అని అవమానపరిచారు పోలీసులు. ప్రభుత్వ నిర్బంధ విధానం ఎంత నికృష్టంగా తయారయిందంటే, బందరు కుండు వద్ద జరిగిన జెండా పోరాటంలో చెరువు సుబ్బారావుగారిని పోలీసులు బట్టలూడదీసి అవమాన పరచారు. తిరువూరులో ఖద్దరు కట్టుకొని కోర్టుకు వెళుతున్న ఒక ప్లీడరు టోపీ లాగదీశాడొక పోలీసు. అతనిపై క్రిమినల్ కేసు పెట్టి శిక్ష పడేలా చేశాడు ఆ న్యాయవాది. బెజవాడలో స్వదేశ వస్త్రాల వ్యాపారం చేస్తున్నందుకు, కాంగ్రెస్‌తో చేతులు కలిపారనీ, వారిని శిక్షిస్తాననీ కలెక్టర్ బెదిరించాడు. దివితాలూకా శ్రీకాకుళంలో రథోత్సవం సందర్భంగా పోలీసులు జాతీయ నాయకుల పటాలను, పతాకాలను తొలగించి ప్రజలపై లాఠీ చార్జీ చేశారు.

ఖద్దరు కట్టుకొన్నవారిని, గాంధీ టోపీ పెట్టుకొన్నవారిని లాఠీలతో బాదటం, దేశ నాయకుల పటాల్ని, గాంధీ పటాల్ని జండాలను ఊడబెరికించడం, చింపటం, ఖద్దరు దుకాణాలను బ్రద్దలు కొట్టడం, గ్రంథాలయాలలోని పుస్తకాలను విరజిమ్మటం, కొన్ని పుస్తకాలను తగుల బెట్టటం లాంటి బీభత్స కాండను సాగించారు పోలీసులు.

సత్యాగ్రహాన్ని బలపరిచే వారినుంచీ, సత్యాగ్రహంలో పాల్గొన్న రైతుల నుంచీ ఎక్కువ పన్ను వసూలు చేశారు. గుళ్ళపల్లి రామబ్రహ్మంగారి నుంచి శిస్తుకు ఆరు రెట్లు వసూలు చేశారు.

1931 జనవరి 26 నాటికి ప్రభుత్వం రాజీ ధోరణితో కాంగ్రెస్ నాయకులతో రాయబారాలు సాగిస్తూ వుంది. అప్పుడే జైలు నుంచి విడుదలైన వ భనేని రాంబ్రహ్మం, గుళ్ళపల్లి రాంబ్రహ్మంగా జనవరి 26న స్వాతంత్ర్య దినోత్సవాన్ని బందరులో జరిపి, ఊరేగింపు చేస్తుండగా లాఠీలతో దాడి మూడు నెలల శిక్ష విధించారు. జనవరి 27న గాంధీ విడుదల వార్త విని జండాలతో బందరులో ఊరేగింపుగా వస్తున్న మానికొండ సత్యనారాయణ శాస్త్రి, వారణాసి వెంకటాచలం గార్లను లాఠీచార్జీ చేశారు. ప్రజలపై లాఠీచార్జీ చేసి చెదరగొట్టారు. ఆరు నెలల కఠిన శిక్షను పై ఇదరకూ విధించి, చేతులకు బేడీలు వేసి గొలుసులతో వీధుల వెంట నడిపించుకుపోయి రైలు ఎక్కించి రాజమండ్రి పంపారు.

1931 మార్చి 5న గాంధీ – ఇర్విన్ ఒడంబడిక కుదరడంతో క్రమక్రమంగా సత్యాగ్రహులందరూ విడుదల కావడం మొదలుపెట్టారు.

## రీ సెటిల్‌మెంట్ ఆందోళనలో అరెస్టులు

1929 లో భూమి శిస్తు, నీటి తీర్వా పైన రూపాయికి మూడణాలు హెచ్చించడానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఆచార్యరంగా కార్యదర్శిగా వున్న ఆరోగ్యస్వామి మొదలియార్ కమిటీ "పన్ను హెచ్చించరాదు" అని సిఫార్సు చేసింది. కాని 1931 లో మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం మొదటి సంవత్సరం అణా, రెండో సంవత్సరం రెండణాలు, మూడో సంవత్సరం మూడణాలు పన్నులు పెంచుతామని ప్రకటించింది. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ ఈ చర్యను ఖండించింది. ఒక కార్యాచరణ కమిటీని ఏర్పరచింది. అప్పుడు పశ్చిమ కృష్ణాజిల్లాలో కాట్రగడ్డ మధుసూదనరావు గారు రైతు సంఘ కార్యదర్శిగా పని చేశారు.

బార్డోలీ సత్యాగ్రహ ఫలితం తేలేవరకు పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని సాగించరాదనీ, ఒకవేళ సాగిం

చాల్సి వస్తే, రైతు సంఘాలద్వారా మాత్రమే చేయాలనీ గాంధీ సూచించాడు. రైతు సంఘాలద్వారా రీసెటిల్‌మెంట్‌కు వ్యతిరేకంగా 1931 లో ఉద్యమం సాగింది. కృష్ణా జిల్లాలో మాగంటి బాపినీడు, ఆచార్య రంగా, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగార్లను ప్రభుత్వం శిక్షించింది.

"తెలుగు డెల్టా జిల్లాల్లో అతివాద రాజకీయ అభిప్రాయాలు గల ప్రసిద్ధ కాంగ్రెసువాదులు అనేక సందర్భాలలో ఈ రైతు ఆందోళనను ప్రోత్సహించి, పాల్గొంటున్నారు. ఇది పన్నుల నిరాకరణ రూపం ధరిస్తే చాలా ప్రమాదకర పరిస్థితికి దారితీయగలదు". అని ప్రభుత్వం ప్రకటిచింది. ముద్రణాలయాలను, అభ్యంతరకర సాహిత్యాన్ని కనిపెట్టుకొని వుండాలని హెచ్చరించింది. మద్రాసు రాష్ట్రపరిపాలనా నివేదికలో కూడా ఇవే భావాలు కన్పించాయి. "ఈ ఆందోళన కాంగ్రెస్ పేరిట జరగకపోయినా, కొందరు అతివాద కాంగ్రెస్ సభ్యులు పన్నుల నిరాకరణను సూచించే రీతిలో వ్యవహరిస్తున్నారు. ప్రభుత్వానికి అనేక అర్జీలు పంపారు. రైతు సంఘాలు ఏర్పడ్డాయి. కార్మికుల ఆర్థిక దుస్థితి కూడా దీన్ని మరింత విషమింప చేసింది. కొన్నిచోట్ల ధాన్యం దోపిడీలు కూడా జరిగాయి."

జామీన్ ఇవ్వనిరాకరించి,జైలుకు వెళ్ళిన రైతు నాయకులను అభినందిస్తూ, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ తీర్మానించింది.

సత్యాగ్రహ ఉద్యమాలు ఒక పక్క జరుగుతున్న సందర్భంలో రైతుఉద్యమం జరగటం, స్వాతంత్ర్య సమరానికి పుష్టిని కూర్చింది.

## 1932 సత్యాగ్రహం

రౌండ్ టేబుల్ సమావేశంలో పాల్గొని బ్రిటన్ నుంచి గాంధీ 1931 డిసెంబరు 28 న భారతదేశానికి వచ్చాడు. రౌండ్ టేబుల్ సమావేశం వల్ల ఆశించిన ఫలితం దక్కలేదు. ఈలోగా భారతదేశ వైస్రాయిగా ఇర్విన్ స్థానే వెల్లింగ్‌డన్ వచ్చాడు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక షరతులను వెల్లింగ్‌డన్ ప్రభుత్వం ఉల్లంఘించుతూ వచ్చింది. నెహూ్ర, గఫార్‌ఖాన్ లాంటి నాయకులను అరెస్టు చేయడమే కాక, అనేక ఆర్డినెన్సులను జారీ చేశాడు వైస్రాయి. గాంధీకి ఇంటర్వ్యూ సైతం నిరాకరించి, ఆరు వారాల్లోనే ఉద్యమాన్ని అణచివేస్తానని బెదరించాడు.

1932 జనవరి 4 నుంచి శాసనోల్లంఘనం ప్రారంభించాలని, కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ నిశ్చయించింది. జనవరి 3 వ తేదీ అర్ధరాత్రి వేళ కాంగ్రెసులోని ముఖ్య నాయకులను, గాంధీని అరెస్టుచేసి జైలులో పెట్టారు. ఐనా ప్రజలు పట్టుదలతో ఉద్యమాన్ని కొనసాగించారు.

జనవరి 4 న బందరు రామలింగేశ్వరస్వామి ఆలయంలో రాజద్రోహకరమైన ఉపన్యాసమిచ్చాడనే నేరంపై ప్రయాగ సత్యనారాయణ (గంజాం జిల్లా వాస్తవ్యుడు) గారికి సంవత్సరం శిక్ష విధించబడింది. 1932 జనవరి 5 న బందరులో 144 సెక్షన్ జారీ చేయబడింది. దాన్ని ధిక్కరించడానికి నిశ్చయించుకొని డాక్టర్ పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, డాక్టర్ వేమూరు దుర్గానాగేశ్వరరావు గార్లు బహిరంగసభను ఏర్పాటు చేశారు. సభాస్థలం కిక్కిరిసిపోయింది. స్థలం చాలక చుట్టుపక్కల ఇళ్ళపైన, మేడలపైన జనం ఎక్కారు. ఉపన్యాసం ప్రారంభించారో లేదో వెంటనే పోలీసులు ప్రజలపై లాఠీచార్జీ చేసి, నాయకుల్ని జైలుకు తీసుకుపోయారు. స్థానికంగా విచారణ జరిపితే ఉద్రిక్తత పెరుగుతుందని భయపడిన ప్రభుత్వం వీరి విచారణను గుడివాడ కోర్టులో సాగించింది. అక్కడ వీరందరికీ తలా ఒక రెండేళ్ళ కఠిన శిక్ష, రు. 1100 జరిమానా విధించారు. "సి" సు ఇచ్చారు. ఐతే కొంతకాలానికి పట్టాభి, నాగేశ్వరరావు గార్లకు "ఏ" క్లాసుగానూ, కృష్ణారావుగారి "బి" సుగానూ ఇచ్చారు. జనవరి 6 న "సత్యవ్రత" హామీ ఇవ్వ నిరాకరించిన దుగ్గిరాల కమలాంబగారికి శిక్ష విధించబడింది.

గుడివాడలో కేతవరపు లక్ష్మీనరసింహారావు, డా ర్ ముదునూరి గుర్రాజు, గుళ్ళపల్లి రాంబ్రహ్మంగా ను 5 వ తేదీన అరెస్టు చేసి ఆరుమాసాల కఠిన శి విధించారు.

గుడివాడలో గోనుగుంట్ల సుబ్రహ్మణ్యగుప్త, మరో ముగ్గురు ఇళ్ళు సోదా చేశారు. హర్తాళ్ జరిగింది. పోలీసులు తన కొట్టు తీసి వుంచమని నిర్బం

ధించగా, అందుకు ఒప్పుకోనందున కొడాలి బస వయ్యగారిని అరెస్టు చేసి 6 నెలల శిక్ష విధించారు.

జనవరి 8 న కురెళ్ళ మాధవరావుగారిని కొట్టి నెట్టిపారవేశారు

అలాగే పశ్చిమ కృష్ణాలో కూడా 5 వ తేదీనుంచే నిర్బంధ విధానం ప్రారంభమయ్యింది. బెజవాడలో ఆ రోజున 144 సెక్షన్ జారీ చేయబడింది. దాన్ని ఉల్లంఘించిన కేశిరెడ్డి సూర్యనారాయణ, గెల్లి రాజ గోపాలం గార్లను పోలీసులు కొట్టారు. 7, 8 తేదీలలో అయ్యదేవర కాళేశ్వరరావు, కాకుమాను లక్ష్మయ్యచౌదరి, కొత్రగడ్డ మధుసూదనరావు, నూకల వీరరాఘవయ్య గార్లను అరెస్టు చేసి తలా ఒక సంవత్సరం శిక్ష విధించింది ప్రభుత్వం.

బందరులో ప్రభుత్వ ఉత్తర్వులను ధిక్కరించగా బందరులోని ఆంధ్ర జాతీయ కళాశాల ప్రిన్సిపాల్ దిగుమర్తి రామస్వామిగారిని జనవరి 6 న అరె చేశారు. దిగుమర్తి రామస్వామిగారు, వారి త , భార్య జానకీబాయమ్మ, వారణాసి వెంకటాచలం. ర్లు బందరు తిలక్ చౌక్‌లో మీటింగ్ పెట్టగా పోలీసులు తీవ్రంగా లాఠీచార్జీ చేశారు. వెంకటాచలంగారికి బాగా దెబ్బలు తగిలాయి. రామస్వామిగారు మినహా తక్కినవారిని వదిలివేశారు.

జనవరి 12 న చట్టవిరుద్ధంగా సమావేశమయ్యా రనే పేరుతో పేట బాపయ్య, చాగర్లమూడి వెంకట రామయ్యగార్లను అరెస్టు చేశారు జనవరి 13 న బెజ వాడలో రాచర్ల నిత్యానందశర్మగారిని అరెస్టుచేశారు. జనవరి 12 న అరెస్టుచేసి, 15 న గొట్టిపాటి బ్రహ్మయ్య, కొడాలి ఆంజనేయులు గార్లకు రెండేళ్ళ శిక్ష, మరికొంత జరిమానా విధించారు జనవరి 14 న కొల్లిపర సూరయ్యగారిని అరెస్టుచేసి రెండేళ్ళ శిక్ష విధించారు.

విదేశ వస్తువులను బహిష్కరించాలని కరపత్రాలు పంచినందుకుగాను కాశీనాధుని నాగేశ్వరరావుగారిని మద్రాసులో జనవరి 16 న అరెస్టు చేసి 6 నెలల శిక్ష, రు. 250 లు జరిమానా విధించారు. ఆ మర్నాడు కాజ బసవయ్య, అట్లూరి మల్లిఖార్జునరావు గార్లకు శిక్షలు విధించబడ్డాయి.

కాంగ్రెస్ నాయకులను అరెస్టు చేయడంతోపాటు, పోలీసులు సోదాలు, దాడులు ప్రారంభించారు. జనవరి 14 న బందరులో జిల్లా కాంగ్రెస్ కార్యాలయంపై దాడి చేశారు. జాతీయ జెండాను పీకివేశారు, తలుపు లకు సీళ్ళు వేసి పోలీసు కాపలా పెట్టారు.

కొమరవోలులో ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు స్థాపించిన సత్యాగ్రహ శిబిరంపై రెండుసా పోలీసులు దాడి చేశారు. సుబ్రహ్మణ్యంగారి _ ్యను, మరికొందరు స్త్రీలను అరెస్టు చేసి బస్సులో తీసుకుపోయి నిర్మానుష్య ప్రదేశంలో వదలివేశారు. వారు నడచి తిరిగి ఆశ్రమానికి రాగా, మళ్ళా అరెస్టుచేసి దూరప్రాంతానికి తీసుకువెళ్ళి వదలివేశారు. జనవరి 26 న ఘంటసాలలో రిజర్వు పోలీసులు, 30 మందిని కొట్టి జాతీయ జెండాను పీకివేశారు.

అంగలూరులో జాతీయ దినోత్సవం జరిపినందుకు ఆరెకపూడి నాగభూషణం, కొసరాజు సత్యనారాయణ గార్లను లాఠీలతో మోదారు. నాగభూషణంగారికి తీవ్రంగా దెబ్బలు తగిలాయి.

జనవరి 23 న కొత్తవరంలో చలసాని నాగభూషణం, వీరపనేని గోపాలకృష్ణయ్య, దుక్కిపాటి నాగేశ్వరరావు, కాజ వెంకటరత్నంగార్లను అరెస్టు చేసి రాత్రి వదలివేశారు. 24, 25 తేదీలలో భట్లపెను మర్రులో తీవ్రమైన లాఠీచార్జీ జరిగింది. దేవినేని భీమయ్యగారికి బాగా దెబ్బలు తగిలాయి. అరెస్టు చేయడానికి వచ్చి, తమతో రమ్మనమని కామినేని వెంకటప్పయ్యగారిని పోలీసులు కోరగా, వారంటు చూపిస్తేనేగాని తాను రానని అన్నాడు. పోలీసులు ఆయనపైబడి స్పృహతప్పేదాకా కొట్టారు. ఇంకా కామినేని సత్యనారాయణ, కామినేని వెంకటరత్నం, చలసాని ప్రకాశరావు, చలసాని కుటుంబయ్య మొదలగు వారికి తీవ్రంగా దెబ్బలు తగిలాయి. దుకాణాల నుంచి భగత్‌సింగ్ చిత్రపటాలను తొలగించారు.

బందరులో బస్‌లో ప్రయాణించుతున్న సౌభాగ్యమ్మగారిని ఖద్దరు ధరించిన నేరానికి, పోలీసు దింపించివేశాడు.

వెంట్రప్రగడ గ్రామంలో బ్రిటిష్ చక్రవర్తి గ బొమ్మను ఊరేగించినందుకు, అక్కడ వలంటీ కార్యకలాపాలకు గ్రామస్థులు సహకరించుతున్నార రు. 1350 సామూహిక జరిమానాను ఆ గ్రామంనుంచి రాబట్టారు. పోలీసులు ఆ గ్రామంలో రెండు నెలలు మకాంపెట్టారు. వారి ఖర్చులకింద పై మొత్తాన్ని

సామూహిక జరిమానాగా వసూలు చేశారు. భీమవరపు రామచంద్రరావుగారిని బెజవాడలో లాకప్‌లో కొట్టగా రక్తం కక్కాడు.

జాతీయ వారోత్సవాల సందర్భంగా బెజవాడనిండా జాతీయ జండాలను ఎగరవేశారు. అంగలూరులో జండాలతో ఊరేగింపు జరుగుతుండగా గుడివాడనుంచి వచ్చిన పోలీసులు జండాలు లాగివేశారు. ఆ గ్రామంలో పోలీసుల్ని కాపలా పెట్టారు.

ముదునూరులో ఇదే సందర్భాన అన్నె అంజయ్య, మామిడి సూర్యప్రకాశం, బోనాల రామలింగయ్య గార్లు అరెస్టయ్యారు.

నెప్పల్లిలో చెరుకూరు విజయమ్మ, చలసాని రామచంద్రరావుగార్లు జైలుకు వెళ్ళారు.

నిషేధింపబడిన కాంగ్రెస్ వార్షిక సమావేశం ఢిల్లీలో ఏప్రిల్‌లో చాందినీ చౌక్‌వద్ద జరిగింది. 500 మంది ప్రతినిధులు హాజరయ్యారు. బెజవాడ నుంచి కొత్రగడ్డ శ్రీనివాసరావు, పొన్నలూరి రాధా కృష్ణమూర్తి, చెన్నుపాటి మురహరిరావుగార్లు హాజరై అరెస్టయ్యారు. జూలై 4 న ఆంధ్ర అంతటా అఖిల భారత ఖైదీల దినోత్సవం జరిగింది. కృష్ణాజిల్లాలో ఎక్కువగా ఈ దినోత్సవాలు జరిగాయి. బెజవాడ, దాని పరిసర గ్రామాలలోను బులెటిన్లు పంచిపెట్టారు. పోలీసు డెప్యూటీ సూపరింటెండెంట్‌కి కూడా ఇచ్చారు. జాతీయ గీతాలతో ఊరేగింపులు, జాతీయ జండాల ప్రదర్శనలు జరపగా పోలీసులు లాఠీచార్జి చేసి అనేకమందిని గాయపరచారు.

1933 మార్చి 31 న కలకత్తాలో శ్రీమతి సేన్‌గుప్తా అధ్యక్షతన జరిగిన కాంగ్రెస్ మహాసభకు అనేక మంది ఆంధ్ర ప్రతినిధులు వెళ్ళారు. కృష్ణాజిల్లా నుంచి వెళ్ళిన వారిలో పాలడుగు సుబ్బారావు, చలసాని గంగయ్య, సీతంరాజు సుబ్బారావు, వెల్లంకి సీతారామయ , గుళ్ళపల్లి సుబ్బారావు, కోనేరు నారాయణ రావుగా వున్నారు. అక్కడ అరెస్టు చేయబడిన పాలడు సుబ్బారావు, చలసాని గంగయ్య, సీతంరాజు సుబ్బారావుగార్లను అలీపూర్ సెంట్రల్ జైలులో 11 రోజులు వుంచి తర్వాత వదలివేశారు. ఇదే సందర్భాన వల్లభనేని సుబ్రహ్మణ్యంగారిని కలకత్తా సబ్‌జైలులో మూడు రోజులు వుంచి వదలివేశారు.

జైలులో నిరశనవ్రతం పూని విడుదలైన గాంధీ 6 వారాలపాటు సత్యాగ్రహ ఉద్యమాన్ని నిలిపివేసినట్లు 1933 మే 9 న ప్రకటించాడు. ఆ విజ్ఞప్తిని అనుసరించి ఆంధ్రలో సత్యాగ్రహం ఆ రోజుల్లో జరగలేదు. 1933 జూలై 31 న వ్యక్తిగత శాసనోల్లంఘనాన్ని గాంధీ ప్రారంభించాడు. డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య, దుగ్గిరాల బలరామ కృష్ణయ్య, అయ్యదేవర కాళేశ్వరరావుగార్లు సత్యాగ్రహంచేసి శిక్ష పొందారు. 1934 మే 20 న సత్యాగ్రహ ఉద్యమం పూర్తిగా విరమించబడింది.

1930 లో వలెగాక 1932 లో ప్రభుత్వం ముందుగానే దారుణ నిర్బంధ విధానాన్ని అమలు పరచాలనే కృతనిశ్చయంతో వుంది. ఆర్డినెన్సుల పరంపరతో పరిపాలన సాగించింది.

1930 సత్యాగ్రహ ఉద్యమ కాలంలో పోలీసు అధికారి దావూద్‌ఖాన్ లాగానే, 1932 లో డిప్యూటీ కలెక్టర్ "రంగప్ప బంగారా" అతి క్రూరంగా సత్యాగ్రహ ఉద్యమాన్ని అణచడానికి పూనుకొన్నాడు.

గాంధీ అరెస్టుతోనే కృష్ణాజిల్లాలో కూడా స్థానిక నాయకుల అరెస్టులు ప్రారంభమయ్యాయి. 144 వ సెక్షన్ జారీచేసింది ప్రభుత్వం. కాంగ్రెస్ ఉద్యమంలో చేరకూడదని ప్రజల్ని భయపెట్టడానికి రిజర్వు పోలీసుల్ని వీధుల్లో తిప్పింది. జాతీయ జండాలను పోలీసులు లాగివేశారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌ను, పశ్చిమ కృష్ణాజిల్లా జాతీయోప సంఘాన్ని, బెజవాడ నగర కాంగ్రెస్ సంఘాన్ని అక్రమ సంఘాలుగా ప్రభుత్వం ప్రకటించింది. బెజవాడలోని ఆంధ్రరత్న భవనాన్ని, ఈడ్పుగల్లులోని సేవాశ్రమాన్ని వశపరచుకొన్నారు. బహిరంగ సభలు, సమావేశాలు నిషేధించబడ్డాయి. ఉద్యమ వార్తల్ని ప్రకటించరాదని పత్రికా విలేకరులను బెదిరించారు, ముద్రణాలయాలపై ఆంక్షలు పెట్టారు. బెజవాడ చుట్టుపట్ల చాలా ఇళ్ళనూ, ముద్రణాలయాలనూ సోదా చేశారు. ఇలాగే తూర్పు కృష్ణాలో కూడా జరిగింది. కొమరవోలు ఆశ్రమం, భట్ల పెనుమర్రు లైబ్రరీలను ప్రభుత్వం వశపర్చుకుంది. జిల్లా కాంగ్రెస్ కమిటీడబ్బు అనే అనుమానంతో ఎండూరి బాపనయ్యగారి తాలూకు రు. 1200 బ్యాంకు డిపాజిట్‌ను ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది.

ఫిబ్రవరి 17 న బందరులో భారతలక్ష్మి బ్యాంకు, కృష్ణా కోఆపరేటివ్ బ్యాంకు, ఆంధ్రాబ్యాంకు, ఆంధ్రా ఇన్సూరెన్సు కంపెనీలలో భోగరాజు వెంకటరత్నం, భోగరాజు రాజేశ్వరమ్మ, ఎండూరి బాపనయ్య, యర్రమల్లి మంగయ్య, ఆవటపల్లి హనుమంతరావు గార్ల ఖాతాలోని డబ్బు వాడరాదని ప్రభుత ం నిషేధించింది. పట్టాభి, బాపనయ్య, మంగయ్యగా ఇళ్ళు సోదా చేసింది. అలాగే హిందూ పత్రికా వి కరి ఇల్లు ఫిబ్రవరి 26 న సోదా చేశారు. ముద్రణాలయాలవారిని జిల్లా కలెక్టర్ బెదిరించాడు. అంతకుముందు జనవరిలోనే ప్రెస్ ఆర్డినెన్స్ కింద కృష్ణా పత్రికకు నోటీసు ఇవ్వబడింది. మేకా ఆదినారాయణగారిని, జనవరి 11 న బందరు కాంగ్రెస్ ఆఫీసులో ఉద్యోగి అయిన నిమ్మగడ్డ వెంకటకృష్ణారావుగారిని, "పోలీసులు ప్రభుత్వ కొలువు వదలుకోవాలి" అనే కరపత్రాన్ని బజారులోను, పోలీసు లైనులోను పంచిపెడుతున్నందుకు అరెస్టు చేసి లాకప్‌లో బాదారు. వారివద్ద వున్న రశీదులు, డబ్బు తీసుకొని తిరిగి ఇవ్వలేదు. రాత్రికి విడిచి పెట్టారు. జిల్లా కాంగ్రెస్ కమిటీపై దాడిచేసి, తలుపులకు సీళ్ళువేసి, పోలీసుల్ని కాపలా పెట్టారు. జనవరి 14 న కాజ గ్రామంలో లాఠీచార్జి జరిగింది. జనవరి 17 న కొడాలి ఆంజనేయులుగారి ఇల్లు సోదా చేసి, తాళంవేసి, సీలు వేశారు. జనవరి 18 న దోకిపర్రు వాస్తవ్యులు సామిరెడ్డి వెంకటసుబ్బారావు రెడ్డి గారికి రెండేళ్ళ శిక్షతోపాటు వెయ్యి రూపాయల జరిమానా విధించారు. జరిమానా వసూలు కోసం పోలీసులు చాలా నీచంగా వ్యవహరించారు. బహిష్టయి కూర్చుని వున్న వారి తల్లిగారి కాళ్ళ కడియాలను బలవంతంగా ఊడగొట్టి లాక్కున్నారు. ఇంటికి వచ్చిన చుట్టాల నగల్ని కూడా లాక్కుపోయారు. ఇంటిలో తలుపులన్నీ లాక్కుపోయారు. మూడు నెలల వరకూ ఆ ఇంటివారు చెట్టుకింద కాపురం చేయాల్సి వచ్చింది.

జనవరి 24 న ఆంధ్ర జాతీయ కళాశాలను, కళాశాల ప్రిన్సిపాల్ దిగుమర్తి రామస్వామిగారి ఇంటిని సో చేశారు. బందరులో దుకాణాల నుంచి భగత్‌సిం మొదలైన విప్లవకారుల పటాలను అమ్మకుండా స్వా నం చేసుకొన్నారు. ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు స్థాపించిన "దరిద్రనారాయణ" పత్రిక నుంచి రు. 250 ధరావతు కట్టవలసిందని కోరగా, చెల్లించనందున ఆ పత్రిక ఆగిపోయింది. కరపత్రాలు పంచిపెడుతున్నందుకు జనవరి 28 న, పెంట్రప్రగడలో మదుకూరి చంద్రశేఖరరావు, కొసరాజు శేషయ్యగార్లు అరెస్టు చేయబడ్డారు. ఎలకుర్రులో కోడే గోపాలకృష్ణయ్యగారిని పట్టుకొని పోలీసులు స్పృహ తప్పేవరకు కొట్టారు. పెంట్రప్రగడలో జనవరి 29 న "ఘారీవాలా" దినోత్సవం జరిపినందుకు వాగర్లమూడి బ్రహ్మానందరావు, వీరపనేని శ్రీరంగంగార్లను పోలీసులు అరెస్టుచేసి మర్నాడు లాఠీలతో చితకబాది రాత్రికి వదలివేశారు. ఫిబ్రవరి 9 న పెంట్రప్రగడ, ఘంటసాల గ్రామాల్లో వలంటీర్లను లాఠీలతో మోదారు. ఫిబ్రవరి 22 న మరోసారి ఘంటసాలలో లాఠీఛార్జీ జరిగింది.

బెజవాడలో పోలీసుల నిర్బంధ విధానం, లాఠీఛార్జీలు నిత్యకృత్యాలయ్యాయి. స్వాతంత్ర్య దినోత్సవం, గాంధీ అరెస్టు జరిగిన రోజు, జాతీయ వారోత్సవం, జలియన్ వాలాబాగ్ దినం, నెలలో ఆఖరు ఆదివారం నాడు జరిగే పతాక వందనోత్సవాల సందర్భంగా లాఠీఛార్జీలకు వలంటీర్లు గురయ్యారు. పశ్చిమ కృష్ణాజిల్లాలోని అన్నిగ్రామాలకు వలంటీర్లు, మహిళా వలంటీర్లు వెళ్ళి ప్రచారం చేశారు పుస్తకాలు పంచిపెట్టేవారు. కాంగ్రెస్ బులిటెన్లను, పుస్తకాలను 300 గ్రామాలలో పంచిపెట్టారు. కొన్ని పుస్తకాలను ప్రభుత్వం నిషేధించింది.

"విదేశ వస్త్రాలను బహిష్కరించండి" అనే నినాదాల్ని గోడల మీద రాశారు. 1932 మార్చి నుంచి "రెడీ" అనే సైక్లోస్టయిల్ పత్రిక నిర్వహించి కాంగ్రెస్ సత్యాగ్రహ వార్తలను ప్రచురించి ప్రచారం చేశారు. ఈ సందర్భంగా ఈ పత్రిక చదివే వారిని, పంచేవారిని బెదరించి కొట్టి అరెస్టు చేసింది ప్రభుత్వం.

1932 ఫిబ్రవరి 26 న లోథియన్ కమిటీ బెజవాడ రైల్వే స్టేషన్‌కు వచ్చినపుడు పోలీసు బందోబస్తును తప్పించుకొని, కాట్రగడ్డ శ్రీనివాసరావు, చలసాని రాజగోపాలరావు (అన్నవరం) మరొకరు లోథియన్ కమిటీకి నల్లజెండాలు చూపించారు. ఏప్రిల్ 4న ఢిల్లీ కాంగ్రెస్‌లో తూర్పు కృష్ణా నుంచి ఆరుగురు ప్రతినిధులు వెళ్ళారు. అలాగే గుంటూరు పోలీసుల కన్ను

గప్పి జూన్ 5 న జరిగిన రాష్ట్ర సభకు 5 గురు వెళ్ళారు. అంతకుముందు మే 10 న కృష్ణాజిల్లా రాజకీయ సభ జరిగింది. అందులో ఢిల్లీ కాంగ్రెస్ తీర్మానాలను పునరుద్ఘాటించారు.

రైళ్ళలో గొలుసులాగి, బండిని ఆపి కరపత్రాలను పంచే కార్యక్రమం కూడా జయప్రదంగా జరిగింది. జూలై 4 న జరిగిన అఖిల భారత ఖైదీల దినోత్సవ సందర్భంగా తీవ్రమైన లాఠీచార్జీ జరిగింది.

జూలై 31 మొదలుకొని నవంబరు 14 వరకు ఆంధ్రరత్న భవనాన్ని పోలీసుల నుంచి స్వాధీనం చేసుకోడానికి కాంగ్రెస్ వలంటీర్లు నాలుగుసార్లు దాడి చేసి తీవ్రమైన లాఠీ దెబ్బలకు గురయ్యారు.

1932 మార్చి 1 వ తేదీ నుంచి, అక్టోబరు నెల వరకు ప్రతిరోజూ, కొద్దిరోజులు మినహాయించి, నిత్యమూ విదేశ వస్త్రాలయాల ముందు పికెటింగ్ జరిగేది. విజయవాడలో "శివాలయం జట్టు" అని పిలవబడే యువకుల బృందం అతి పట్టుదలగా పికెటింగ్ జరిపేది. పల్లెల నుంచి వచ్చిన యువకులు పికెటింగ్‌లో పాల్గొనేవారు. పదే పదే పికెటింగ్ చేసి లాఠీచార్జీకి గురయ్యేవారు. బెజవాడలో ఒకే రోజున 250 సార్లు లాఠీచార్జీ చేసినట్లు ఒక అంచనా. ఈ లాఠీచార్జీల గురించి, మద్రాసు శాసనసభలో కోళందరెడ్డి మొదలైన వారు ప్రశ్నల పరంపర వేసి, పోలీసుల దుష్కృత్యాలపై విచారణ సాగించాలని కోరారు. కాని ప్రభుత్వం పెడచెవిని పెట్టింది. 1932 సత్యాగ్రహ కాలంలో కాకుమాను లక్ష్మయ్య, వేదాంతం శంభుశాస్త్రి, కాకాని వెంకటరత్నం, తుమ్మల కోటయ్య మొదలగువారు 13 మంది పశ్చిమ కృష్ణాజిల్లా "డిక్టేటర్లు"గా పనిచేశారు.

పికెటింగ్ నిర్వాహకులుగా అన్నె అంజయ్య, వేదాంతం శంభుశాస్త్రి, కృత్తివెంటి కుటుంబరావు, కేశిరెడ్డి సూర్యనారాయణ, కాకాని వెంకటరత్నం, పిడికిటి రామకోటయ్య మున్నగువారున్నారు.

లాఠీదెబ్బలు తిన్నవారికి ఆశ్రయమివ్వటం కూడా నేరం కావడంతో సత్యాగ్రహులు, ముఖ్యంగా గ్రామాలనుంచి వచ్చినవారు, నానా బాధలకు గురయ్యారు. కొందరు రామమోహన లైబ్రరీ వరండాలో పడివుండేవారు. లైబ్రరీకి కూడా ప్రభుత్వం నష్టం కలుగజేస్తుందనే ఉద్దేశంతో, ఆ లైబ్రరీ కార్యదర్శి వలంటీర్ల రాకకు అభ్యంతరం తెలియచేశాడు. ఈ పరిస్థితులలో డాక్టర్ శివలెంక మల్లిఖార్జునరావు, గాదిరాజు వెంకటేశ్వరరావు, శంకర వెంకట్రామయ్య గార్లు "పీపుల్సు హాస్పిటల్" (ప్రజా వైద్యశాల) స్థాపించి, అందులో తీవ్రంగా లాఠీచార్జీకి గురయిన వారికి చికిత్స చేయటం ప్రారంభించారు. ఈ దశాలకు గవర్నర్‌పేటలోని తమ భవనాన్ని కా గరమురామయ్యగారు ఇచ్చారు. ఈ కక్షతో గా రా వెంకటేశ్వరరావుగారిపై కేసుపెట్టి 6 మాసాల శిక్ష విధించారు. ఆంధ్రరత్న భవనంపై దాడిలో లాఠీచార్జీకి గురై జైలుశిక్ష పొంది, జైలులో క్షయవ్యాధి సోకి, చివరకు ఆంధ్రరత్న భవనంలోనే సుంకర వెంకట సుబ్బారావు అనే స్వాతంత్ర్య సమరయోధుడు అసువులు వీడాడు.

కృష్ణాజిల్లాలో 1932 సత్యాగ్రహ ఉద్యమంలో మహిళలు చూపిన పట్టుదల, చేసిన త్యాగం మరువరానివి. వారు స్వాతంత్ర్య సంగ్రామంలో ఉజ్వల ఘట్టం సృష్టించారు.

1932 సత్యాగ్రహ ఉద్యమంలో మహిళలు అపూర్వ చైతన్యాన్ని ప్రదర్శించారు. అష్టకష్టాలకు లోనయ్యారు. అవమానాలు భరించారు. ఐనా బ్రిటిష్ ప్రభుత్వాన్ని, వారి గులాముల్ని నానా ఇబ్బందులకు గురిచేసి, గడగడ లాడించారు.

ఉద్యమాన్ని అణచడానికి కొత్త కొత్త పద్ధతుల్ని 1932 లో ప్రభుత్వం అవలంబించింది. సత్యాగ్రహులకు ఆశ్రయమిచ్చినా, ఫలహారం పెట్టినా, భోజనం పెట్టినా శిక్షించటం ప్రారంభించింది. 1932 లో జండా ప్రతిష్ఠాపన సందర్భంగా వలంటీర్లపై లాఠీచార్జీ చేయగా, వారిని తన యింటిలో వుంచి సేవ చేసినందుకు, ఫలహారాలు పెట్టినందుకు కొత్రగడ్డ మధుసూదనరావుగారి తల్లి, రామసీతమ్మగారికి ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించి రు. 400 జరిమానా విధించారు. సత్యాగ్రహులకు ఇకముందు భోజనంగాని, ఫలహారంగాని పెట్టను అని ఒక మాట అంటే విడిచి పెడతామని పోలీసులు అన్నారు. కాని ఆమె అందుకు నిరాకరించి వీరనారి అనిపించుకుంది. జరిమానా వసూలు చేయడానికి ఇంటి సామాన్లన్నీ వేలం వేసినా, జరిమానాకు సరిపడు డబ్బు రాలేదని, ఆమె వద్ద, ఆమె కోడలి వద్ద నున్న బంగారు గాజులను

లాక్కుపోయారు. వారి ఇంటిలోని ధాన్యాన్ని. ఇతర సామగ్రిని మొగల్రాజపురం నుంచి బెజవాడ తెప్పించి అమ్మించారు. వారి గృహాన్ని రెండేళ్ళు తమ స్వాధీనంలో ఉంచుకొన్నారు. జైలులో పక్షవాతం వచ్చి కాలు చెయ్యి పడిపోగా, శవాల గదిలో పడవేసి మూడురోజు లుంచారు. నాలుగో రోజున స్మారకం రాగా తిరిగి మామూలు చోట వుంచారు. తీవ్రవ్యాధికి గురైకూడా క్షమాపణ చెప్పక, పూర్తి శిక్ష అనుభవించి ఆమె విడుదలైంది. వేలూరు మధిర జైళ్ళలో శిక్ష అనుభవించింది. ఆమె ఆఖరులో మధిర జిల్లా ఆస్పత్రిలో చికిత్స పొంది విడుదల అయింది.

గరికపర్రు, కుమ్మమూరు, ముదునూరు, పెడిముక్కల, గురజాడ, కపిలేశ్వరపురం, పురిటిగ, యాకమూరు, తేలప్రోలు, ఉయ్యూరు, నెప్ప గ్రామాలనుంచి, 26 మంది మహిళలు విజయ నుంచి మరో ఇద్దరు – మరుపిళ్ళ భ్రమరాంబ (చిట్టిగారి భార్య) పాదర్తి సుందరమ్మ–అత్యంత సాహసంతో సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నారు. వీరిలో 17 మంది జైలుకు పంపబడ్డారు. ఒకరికి రు. 200 జరిమానా విధించబడింది. గరికపర్రులో పికెటింగ్ చేసిన రామినేని రాజమ్మ, మైనేని శ్రీరామమ్మ, గాది సుబ్బమ్మ, చెరుకూరి వియ్యమ్మ మున్నగువారు జైలుశిక్ష లనుభవించారు. మిగిలిన వారిని నానా యాతనలకు గురిచేసి వదలిపెట్టారు పోలీసులు.

మహిళా వలంటీర్లకు భోజనం పెట్టినందుకు సూరపనేని గోపాలకృష్ణయ్యగారికి వెయ్యిరూపాయలు జరిమానా విధించబడింది. తూర్పు కృష్ణాలో 1930–33 సంవత్సరాల మధ్య వివిధ శిక్షలకు ఈ కింది మహిళా సత్యాగ్రహులు గురయ్యారు.

చెరుకూరు వియ్యమ్మ, గుత్తికొండ రామమ్మ, గుత్తికొండ లక్ష్మమ్మ, గెల్లికొండ రాపమ్మ, గాదె సుబ్బమ్మ, కోగంటి లక్ష్మమ్మ, కాట్రగడ్డ రామసీతమ్మ, కొల్లిపర లక్ష్మీకాంతమ్మ, కోనేరు అనసూయ, మైనేని శ్రీరామమ్మ, మిక్కిలినేని పప లక్ష్మమ్మ, నాదెళ్ళ మహాలక్ష్మమ్మ, పాలడుగు పప లక్ష్మమ్మ, పాదర్తి సుందరమ్మ, రామినేని రాజమ్మ, సూరపనేని అన్నపూర్ణమ్మ, తుమ్మల సత్యవతమ్మ, ముక్కల పున్నమ్మ, పెరంబూరు సుభద్రమ్మగారు.

వీరు కాక 1935 ఫిబ్రవరి 4 న ఈపుగల్లు, వెంట్రప్రగడ గ్రామాల్లో ఇచ్చిన ఉపన్యాసాలకు శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయకు ఒక సంవత్సరం శిక్ష విధించబడింది. వీరు కాక మరో 11 మందిని ఏలూరులో అరెస్టు చేసి వారంరోజులు రిమాండులో వుంచారు. మరో ముగ్గురిని ఇతర విధాల నిర్బంధాలకు గురిచేశారు.

1932 లో మహిళా వలంటీర్ల కోసం ముదునూరు గ్రామం వెలుపల అన్నే పెదబసవయ్యగారి "వాల్మీకాశ్రమం" లో శిబిరం ఏర్పాటు చేశారు అన్నె అంజయ్యగారు ఇక్కడ నుంచి తుమ్మల సత్యవతమ్మ, ఎక్కల పున్నమ్మ, కోగంటి లక్ష్మమ్మ గార్లు గ్రామాల వెంట తిరుగుతూ మరికొందరు సత్యాగ్రహులను సమకూర్చుకుంటూ ప్రచారం చేశారు. పోలీసులు వీరిని వెంటాడి, అరెస్టు చేసి జైళ్ళకు పంపారు. పాలడుగు వరలక్ష్మమ్మ, కొల్లిపర లక్ష్మీకాంతమ్మ, సూరపనేని అన్నపూర్ణమ్మ, యార్లగడ్డ రత్నమ్మ, మైనేని రాజేశ్వరమ్మ, నాదెళ్ళ నాంచారమ్మ, వీరమాచినేని చిట్టెమ్మ, అన్నె దుర్గాంబగార్లు జాతీయ పతాకాలతో, జాతీయ గీతాలు పాడుకుంటూ బెజవాడ చేరారు. బెజవాడలో ఊరేగింపు చేస్తుండగా వీరిని పోలీసులు నిర్బంధించి రాత్రి పొద్దుపోయాక, కృష్ణానది ఒడ్డున వదలిపెట్టి పోయారు. వీరిని కొందరు యువకులు ముదునూరు శిబిరానికి క్షేమంగా చేర్చారు. తరాత మరో సత్యాగ్రహ సందర్భంలో వీరిని అరె చేసి జైళ్ళకు పంపారు.

హిళా సత్యాగ్రహులపై రంగు నీళ్ళు చల్లటం, వారిని అరెస్టుచేసి పొద్దుగూకిన తర్వాత పది నుంచి ఇరవై మైళ్ళ దూరాన ఒంటరిగా వదలిపెటడం కృష్ణా జిల్లాలో నిత్య కృత్యాలైనాయి. బందరులో తంగిరాల సీతారావమ్మ, దావులూరు తులశెమ్మ గార్లను స్వతంత్ర దినోత్సవ సందర్భాన అరె చేసి, ఆ తర్వాత వదలి పెట్టారు. మర్నాడు వీరి రూ కర పత్రాలు పంచుతుండగా పోలీసులు వారి రంగు నీళ్ళను కొట్టారు. త్రిపురనేని కౌసల్యాదేవి, అరెకపూడి ఉషామణి (అంగలూరు) పాలడుగు వరలక్ష్మి (గురజాడ) గార్లు బందరులో విదేశీ వస్త్రదుకాణాల

ముందు పికెటింగు చేయగా అరెస్టుచేసి, పోలీసు స్టేష నుకు తీసుకుపోయి ఆ తర్వాత వదలి వేశారు. ఆ మర్నాడు మహిళలు పికెటింగ్ చేయగా తిరిగి రంగు నీళ్ళు కొట్టి వదలివేశారు.

గుడివాడలో మహిళా సత్యాగ్రహులపై పోలీసులు అవలంబించిన పద్ధతులు అతి నికృష్టంగా వున్నాయి. గుడివాడలో 144 వ సెక్షన్ ధిక్కరించి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగారు మరి కొందరు స్త్రీలు పికె టింగ్ సాగించారు. డిప్యూటీ కలెక్టర్ రంగప్ప బంగార అదరింపులను బెదరింపులను వీరు లెక్కచేయ లేదు. అందుచే పోలీసులు వీరిని అరెస్టు చేసి దూర ప్రాంతాల్లో విడిచిపెట్టడం ప్రారంభించారు. ఒకసారి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ, చెరుకూరి సౌభా గ్యమ్మ గార్లను బలారువద్ద పోలీసులు విడిచిపెట్టి రాగా, భట్లపెనుమర్రు వలంటీర్లు వీరిని తిరిగి గొల్వే పల్లికి చేర్చారు.

సత్యాగ్రహులకు భోజనాలు పెడితే శిక్షించుతా మని బెదిరించినా లెక్కచేయక, పాడుపడ్డ దేవాల యాల్లో, మఠాలలో, ఆశ్రమాలలో చేరి, వీరు వంట చేసుకొని విశ్రాంతి తీసుకొనేవారు.

కొమరవోలు గాంధీ ఆశ్రమాన్ని స్వాధీనపర్చు కొంటామని సీతామహాలక్ష్మమ్మగారు ప్రభుత్వానికి నోటీసు ఇచ్చారు. మరి కొందరు వలంటీర్లతో ఆశ్ర మానికి ప్రభుత్వం వేసిన సీళ్ళు పగలగొట్టి స్వాధీన పరచుకొన్నారు. తర్వాత పోలీసులు వీరందరినీ అరెస్టుచేసి, లారీలలో తీసుకుపోయి చాలా దూరాన సముద్రతీరంలో ఇసుక పర్రలలో వదలివేశారు. ఐనా మెల్లమెల్లగా తిరిగి వీరుగుడివాడ చేరి పికెటింగ్‌లో పాల్గొనేవారు.

ఈ పద్ధతులు లాభంలేదని పోలీసులు చిమ్మన గొట్టాలను ఉపయోగించి కారం, రంగు, మసి, బురద నీళ్ళను మహిళా వలంటీర్లపై చిమ్మి, వెకిలి నవ్వులు నవ్వుతూ బీభత్స దృశ్యాలను సృష్టించారు. ఒక దశలో సీతామహాలక్ష్మమ్మగారు స్పృహ కోల్పోయింది. ఆమె చనిపోయిందని భావించి వాళ్ళు వెళ్ళిపోయారు. ఈ వార్త విని గుంపులు గుంపులుగా ప్రజలు గుడివాడ చేరారు. సీతామహాలక్ష్మమ్మగారికి స్పృహ వచ్చిన వార్త విని సంతోషించారు.

సీతామహాలక్ష్మమ్మ, గోనుగుంట్ల లక్ష్మీనరసమ్మ గార్లు గుడివాడ నుంచి అంగలూరు వెళ్ళినపుడు అక్కడ ఆరెకపూడి నాగభూషణంగారి సోదరి తిపిరి నేని కౌసల్య, భార్య ఉషామణిగారు వారితోపాటు జండాలతో ప్రచారంసాగించారు. కౌసల్యగారు జాతీయ గీతాలు పాడేవారు. గుడివాడలో రంగునీళ్ళు చిమ్మడం వల్ల స్పృహ కోల్పోయిన ఆరెకపూడి కౌసల్య, ఉషామణి గార్లను ఆస్పత్రిలో చేర్చారు. విడుదలైన మర్నాడు తిరిగి వీరు పికెటింగ్ చేయగా 8, 10 మైళ్ల దూరాన వదలివేశారు. వీరితోపాటు, 11 ఏళ్ళ సుగుణ మణి, నాగభూషణంగారి తల్లి మాణిక మ్మగారు, ఎర్నేని సుబ్రహ్మణ్యంగారి మేనకోడ (చిన్న వయసువారు) అంగలూరు శిబిరంనుంచి చారానికి వెళ్ళేవారు. సుగుణమణికి శిబిరవాసులందరితోపాటు శిక్ష పడింది. ఆమెకు రెండేళ్ళు శిక్ష విధించినా సంవత్సరం తర్వాత విడుదల చేశారు.

గుడివాడలో పికెటింగ్‌లో పాల్గొన్న నందివాడ వాస్తవ్యులు పూనూరు సుందరమ్మ, మలిరెడ్డి అన్న పూర్ణమ్మ, గాదిరెడ్డి పుట్లమ్మగార్లకు 6 నెలల శిక్ష విధింపబడింది.

1932 మే 2 న వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ, గోనుగుంట్ల లక్ష్మీనరసమ్మ, ఆరెకపూడి మాణి క్యమ్మ, ఆరెకపూడి ఉషామణి, ఆరెకపూడి మహా లక్ష్మమ్మ, కన్నెగంటి నాగరత్నమ్మ, చెరుకూరు సౌభాగ్యమ్మ, ఘంటా మల్లికాంబ, తిపిర్నేని కౌసల్యమ్మగార్లకు తలా ఒక సంవత్సరం శిక్ష విధించారు. ఘంటా మల్లికాంబగారు 6 మాసాల పసి బిడ్డతో కారాగారవాసం చేసింది. 11 ఏళ్ళ సుగుణ మణికి కక్షతో రెండేళ్ళ శిక్ష విధించారు. 1932 ఆగస్టు 2 న వల్లభనేని అన్నపూర్ణమ్మ, గుత్తికొండ సీతమ్మ మరి కొందరు మహిళలు ప్రభుత్వ స్వాధీ నంలో ఉన్న భట్ల పెనుమర్రు కాంగ్రెస్ ఆఫీసుపై దాడి చేసి, తిరిగి స్వాధీనం చేసుకొన్నారు. వీరిని అరెస్టుచేసి, 5 వ తేదీన తిరిగి పోలీసులు ఆ భవనాన్ని సీలు చేశారు.

1932–34 ఉద్యమంలో మహిళలు అధిక సంఖ్యలో పాల్గొని ధైర్య సాహసాలు ప్రదర్శించారు. ఉద్యమం నిరాఘాటంగా సాగడానికి వీరే కారకులయ్యారు. మహిళా సత్యాగ్రహులను అవమానపరచడానికి, కొట్టడానికి

దినకూలీ ఇచ్చి కొందరు ఆడవాళ్ళను పోలీసులు నియమించారు. వీరు చేసే దుష్కృత్యాలకు భయపడక, మహిళలు పట్టుదలతో పికెటింగ్ మొదలైన శాసన ధిక్కార ఉద్యమాలు సాగించారు. నిషేధించబడిన తాలూకా, జిల్లా మహాసభలకు మహిళలే అధ్యక్షత వహించారు.

1932 సత్యాగ్రహోద్యమం ఉధృతంగా జరిగిన జిల్లాలలో కృష్ణాజిల్లా ఒకటి. ఇక్కడ కాంగ్రెస్ కమిటీలు రైతు సంఘాల ఆధ్వర్యాన పన్నుల నిరాకరణకు కూడా పథకాలు వేశారు.

ఉద్యమం గురించి ఆయా జిల్లాల కలెక్టర్లు తయారు చేసిన నివేదికలు ఆసక్తిదాయకంగా వున్నాయి. కృష్ణాజిల్లా గురించి పంపిన నివేదికలో "కృష్ణాజిల్లాలో కమ్మవారు అధిక సంఖ్యలో ఉద్యమంలోకి దిగారు. వారంతా సంపన్న వ్యవసాయ కుటుంబానికి చెందిన వారే. తర్వాత పేర్కొనదగినవారు బ్రాహ్మణులు. ఇందులో వకీళ్ళు, వారి గుమాస్తాలు, ప్రభుత్వ పరీక్షలలో తప్పినవారు, సహకార శాఖలో ఉద్యోగులు, స్థానిక సంస్థలకు చెందిన ఉపాధ్యాయులు, అసంతృప్తితో వున్న ఉద్యోగులు" ఉద్యమంలో పాల్గొన్నారని తెలియచేయబడింది. మొత్తం రాష్ట్ర పరిస్థితిని తెలియచేస్తూ "జమీందారు లందరూ ఉద్యమాన్ని వ్యతిరేకించారు. జస్టిస్ పార్టీకి చెందిన బ్రాహ్మణేతరులు ఈలాగే ప్రవర్తించారు" అని కూడా ఆ నివేదికల్లో వుంది.

సత్యాగ్రహోద్యమ కాలంలో పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ తరపున కొన్ని కరపత్రాలు, గేయ సంపుటాలు ప్రచురించబడ్డాయి. దిగవల్లి శివరావు, చెరుకుపల్లి వెంకటప్పయ్యగార్ల ఆధ్వర్యాన ప్రచురణశాఖ ఏర్పడి ఈ కరపత్రాలను ప్రచురించేవారు. సత్యాగ్రహ చరిత్ర 400 ప్రతులను ఉచితంగా పంచిపెట్టారు. నిర్భాగ్య భారతము, ఆంధ్ర పౌరుషము (పాటలు), ఉప్పు సత్యాగ్రహము, బార్డోలీ సత్యాగ్రహ విజయము, నిర్మాణ కార్యక్రమము (గీతాలు), పాంచజన్యము (గీతాలు), దరిద్ర నారాయణము, విదేశ వస్త్ర బహిష్కారము, సత్యాగ్రహ బోధిని, బ్రిటిష్ వస్తు బహిష్కారము మొదలైనవి వీరు ప్రచురించారు. వీటిలో కొన్నింటిని ప్రభుత్వం నిషేధించింది. ఒక్క పశ్చిమ కృష్ణాలో దిగవల్లి శివరావుగారిపై ప్రభుత్వం పెట్టిన కేసు ఉపసంహరించుకొంది. 300 గ్రామాలలో కాంగ్రెసు బులెటిన్లు, అచ్చు పుస్తకాలను విరివిగా పంచిపెట్టారు. ముదునూరు నుంచి రెడీ, జయభేరి పత్రికలు రహస్య పత్రికలు వెలువడేవి. ముదునూరులో 'రెడీ' పత్రిక నిర్వహణలో అన్నె అంజయ్యగారు కట్టుదిట్టమైన ఏర్పాట్లుచేశారు. వారి అరెస్టు అనంతరం ఈ పత్రిక మద్దుకూరి చంద్రశేఖరరావుగారి సంపాదకత్వాన నడిచింది. ఈ పత్రిక నిర్వహణలో ఎందరో యువకులు తోడ్పడ్డారు. తెల్లవారేసరికి పత్రిక జిల్లా నలుమూలలకు చేరేది. ముదునూరు, నందివాడ, రావులపాడు, వెంట్రప్రగడ సత్యాగ్రహులు ఈ పత్రికను గ్రామాలకు రహస్యంగా చేరవేసేవారు. దూరగ్రామాల వారు కూడా వచ్చి ఈ పత్రికల్ని తీసుకుపోయేవారు. ఈ పత్రికఆచూకీకై పోలీసులు ముదునూరు, వెంట్రప్రగడ మొదలైన గ్రామాల్లో కనపడ్డ ప్రతి యువకుని దారుణంగా కొట్టి భయోత్పాతం సృష్టించారు. మద్దుకూరి చంద్రశేఖరరావుగారిని ఒక ఇంగ్లీషు పోలీసు సార్జంట్ దారుణంగా కొట్టాడు. ఈఅమానుషత్వం సార్జంటు భార్యకు కూడా రుచించలేదు. దెబ్బలు తిన్న చంద్రశేఖరరావుగారిని ఆమె పరామర్శించక తప్పింది కాదు. ఈ సందర్భాన "యువకులలో ఈ వెంట్రప్రగడ వాస్తవ్యులు మద్దుకూరి చంద్రశేఖరరావుగారు, కొనరాజు శేషయ్యగారు మొదలైనవారు చూపిన తెగువ, ధైర్య సాహసాలు అత్యద్భుతములు" అని మానికొండ సత్యనారాయణశాస్త్రిగారు తూర్పు కృష్ణాజిల్లా జాతీయోద్యమ చరిత్రలో కొనియాడారు.

1933 డిసెంబరు 15 న బెజవాడలో పోస్టాఫీసు వద్ద కాంగ్రెస్ బులెటెన్లను గోడలకు అంటించుతూవుండగా, ముక్కేవి మాధవాచారిగారిని అరెస్టు చేశారు. కురుమద్దాలిలోని వారి ఇల్లు సోదా చేయగా 'జయభేరి' 'ఆజ్' 'తయ్యార్' అనే పత్రికలూ, కొన్ని బులెటెన్లూ, జాతీయ పతాకాలు, విదేశ వస్తువుల్ని బహిష్కరించండి' అనే రబ్బరు స్టాంపులూ దొరికాయి. మాధవాచార్యిగారికి 14 నెలల శిక్ష విధించబడింది.

పత్రికల స్వేచ్ఛను అ[illegible]డం, ముద్రణా [illegible] హెచ్చరించటం, [illegible]భుత్వ ప్రకటనలు, అచ్చు పనులు పత్రికలకు, ము[illegible]లయాలకు ఇవ్వక

పోవటం మొదలైన పనులు చేసేది ప్రభుత్వం. ఇలా కృష్ణాజిల్లాలో 14 ముద్రణాలయాలు ప్రభుత్వ ఆగ్రహానికి గురిఅయ్యాయి. ఆంధ్రపత్రిక, కృష్ణా పత్రిక ఇంకా అనేక పత్రికలకు హెచ్చరికలు అందాయి. ధరావతు ఇవ్వనందున గుడివాడ నుంచి "దరిద్ర నారాయణ" పత్రిక ఆగిపోయింది. కృష్ణా పత్రిక కూడా కొన్నాళ్ళు ఆగిపోయింది. ఫిబ్రవరి 23న కలెక్టర్ అచ్చాఫీసుల వారిని బెదరించారు. ఫిబ్రవరి 26 హిందూ పత్రికా విలేకరి ఇల్లు సోదా చేశారు. మార్చి 2 న కృష్ణాపత్రిక ఆఫీసును సోదా చేశారు. ప్రభుత్వం ఇలాంటినిషేధాలు పెట్టినా, స్వాతంత్ర్య ఉద్యమం వార్తలు, రహస్య పత్రికల ద్వారానో, బులెటన్ల ద్వారానో గోడలపై రాతల ద్వారానో ప్రజలకు చేరుతూనేవుండేవి.

మొత్తం మీద 1932 ఉద్యమం తీవ్ర నిర్బంధాల మధ్య మరింత పటిమను ప్రదర్శించింది.

వ్యక్తిగత విప్లవ వాదులతో సత్యాగ్రహులకు సంబంధాలు జైళ్ళలో ఏర్పడ్డాయి. అల్లూరి సీతారామరాజు, భగత్‌సింగ్ మొదలైన విప్లవ వీరుల ప్రభావం కృష్ణాజిల్లాలో కూడా పడింది. అలాంటి వారిలో కానూరి రామానందచౌదరిగారొకరు. కొతవరం నివాసి. 1933 లో మద్రాసు కుట్ర కేసులో ఈయన ఒక ముద్దాయి. ఈ కుట్రకేసులో తమిళులతో పాటు తెలుగు వారు కూడా కొందరున్నారు. మైలాపూర్ ఇంపీరియల్ బ్యాంకును దోచుకోవాలనీ, మైఖేల్ అనే అతణ్ణి చంపి వేయాలనీ కుట్ర పన్నినట్లు వీరిపై నేరారోపణ. రామానంద చౌదరి, విచారణ అనంతరం నాలుగేళ్ళ జైలు శిక్ష అనుభవించారు.

## గాంధీ నిరాహార దీక్షకు సానుభూతి సభలు

1933 మే 8 నుంచి మూడు వారాల పాటు గాంధీ నిరాహార దీక్ష పూనాడు. ప్రభుత్వం ఆయన్ని విడుదల చేసింది. కాంగ్రెస్ అధ్యక్షుడు ఆణే, గాంధీ విజ్ఞప్తిని అనుసరించి మే 9 నుంచి ఆరు వారాల పాటు శాసనోల్లంఘన ఉద్యమాన్ని నిలిపివేశాడు.

కృష్ణాజిల్లాలో కూడా, దేశంలో ఇతర ప్రాంతాలల్లో వలెనే 'హరిజన సేవా కార్యక్రమాలకు ఈ కాలాన్ని వినియోగించారు.

మే 12 నుంచి 24 వ తేదీ వరకూ అన్నె అంజయ్య గారి నాయకత్వాన సేవాదళం నగర సంకీర్తనలతో, ఈ క్రింది గ్రామాలలో హరిజన సేవా ప్రచారం చేశారు: బొళ్ళపాడు, కాటూరు, కలువపాముల, నందమూరు, మానికొండ, మారేడుమాక, తెన్నేరు, తరిగొప్పల, మేడపాడు, మంతెన, కేసరిపల్లి, గన్నవరం, దావాజిగూడెం, పెదావటపల్లి, ఆత్కూరు, పొట్టిపాడు, తేలప్రోలు, అంపాపురం, పెదవీరపల్లి, కానుమోలు, కాకులపాడు, ఆరుగొలను, తిప్పనగుంట, చిరివాడ, గారపాడు, పొనుకుమాడు, ఉంగుటూరు, ఇరకుపాడు, వెల్దిపాడు, ఇందుపల్లి, కడంపాడు, కుందేరు, నెప్పలి, పెదఓగిరాల, ఆకునూరు, చినఓగిరాల, గండిగుంట, ఉయ్యూరు, కొమ్మమూరు.

మే 18 న తేలప్రోలులో అయ్యదేవర కాళేశ్వరరావుగారి అధ్యక్షతను జరిగిన సభలో డాక్టర్ ఘంటసాల సీతారామశర్మ, మతంపాల సుబ్రహ్మణ్య గుప్త, సుంద్రు వెంకట్రామయ్య (హరిజనుడు)గారు ఉపన్యసించారు. జంతువులకన్నా హీనంగా హరిజనుల్ని చూడరాదనీ, మానవులుగా చూసి, అంటరానితనాన్ని రూపుమాపాలనీ వెంకట్రామయ్యగారన్నారు, అస్పృశ్యతను పాటించరాదని తక్కిన ఉపన్యాసకులు ప్రబోధించారు.

మే 23 న బందరు తిలక్ చౌక్‌లో జరిగిన సభలో పెనుమర్తి లక్ష్మీపతిశాస్త్రి, తంగిరాల వీరరాఘవరావు, పత్తిపాటి లక్ష్మయ్యగార్లు, హరిజనులకు దేవాలయాల్లో, చెరువులు, బావులు, పాఠశాలల్లో, అన్ని ప్రజా సంస్థల్లో నిరభ్యంతరంగా ప్రవేశం కల్గించాలని కోరారు.

మే 26 న జగ్గయ్యపేటలో ఆచార్య రంగా, కొట్రగడ్డ మధుసూదనరావు గార్లు అస్పృశ్యతా నివారణ సభ జరుపబోగా పోలీసులు దాన్ని ఆపడానికి యత్నించారు. సభ ఉద్దేశాలను వివరించాక సభకు అనుమతించారు. జయంతిపురం రాజా, ఆచార్యరంగా, కొట్రగడ్డ మధుసూదనరావుగార్లు ఉపన్యసించార్లు.

బండిపాలెం, కొణకంచి గ్రామాలలో ఆచార్య రంగా, జయంతిపురం రాజా వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద్, రేపాల బుచ్చిరామయ్య శ్రేష్ఠిగార్లు ఉపన్యసించారు. అంతకుముందే ఏప్రిల్ 30 న బండిపాలెంలో శ్రేష్ఠిగారు పేద హరిజనులకు వస్త్రదానం

చేశారు. అనుముల రామగోవిందశర్మగారు మరికొంత మంది యువకులు కొణకంచిలోని కొన్ని బావులను, శ్రీరామ మందిరంలోని గ్రంథాలయాన్ని, ఉపయోగించుకొనడానికి హరిజనులకు అవకాశమిచ్చారు. అందుచే వీరిని వెలివేయడానికి కొందరు ప్రయత్నించారు. దీనిని గురించి గాంధీకి లేఖ రాయగా, ఆయన ఇచ్చిన జవాబు ప్రేమ, సుహృద్భావాలతో కూడివుంది. ఈ జవాబును సభలో చదవగా అది చాలా ప్రభావాన్ని కలుగచేసింది.

నందిగామా తాలూకా వీరులపాడులో వాసిరెడ్డి వీర వరప్రసాదరావు, జయంతిపురం రాజా, ఆచార్యరంగా, కొత్రగడ్డ మధుసూదనరావు గార్లు హరిజనులకు దేవాలయప్రవేశం కల్గించాలని ఉద్బోధించారు.

గాంధీ నిరాహారవ్రత విరమణ తర్వాత మే 30 న బెజవాడలోని కార్మికపురంలో హరిజన బాలబాలికలకు తలంట్లు పోసి భోజనాలు పెట్టారు. పాదుర్తి సుందరమ్మ, కొల్లా కనకవల్లి తాయారమ్మగార్లు, మరి కొందరూ నైజాము గూడ్సుషెడ్ వద్ద వున్న హరిజన పాకల వద్దకుపోయి, తలంటు కొనేందుకు నూనె వగైరా ఇచ్చారు. ఫలహారాలు పంచి పెట్టారు. అయ్యదేవర కాళేశ్వరరావుగారి అధ్యక్షతన బహిరంగ సభ జరిగింది. కాకుమాను లక్ష్మయ చౌదరి, ఆచార్య రంగా, నూకల వీరరాఘవయ్య ( మతే)గార్లు అస్పృశ్యతా నివారణకు అందరూ కంకణం కట్టుకోవాలని ఉపన్యసించారు.

ఘంటసాలలో ఇదివరకే సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆలయంలో హరిజనులకు ప్రవేశం కల్పించబడింది. మే నెలలో విశ్వేశ్వరస్వామి ఆలయాల్లో కూడా హరిజనులకు ప్రవేశం కల్పించ బడింది. కొన్ని బావులలో హరిజనులు నీళ్ళు తోడుకోవడానికి అవకాశం కల్పించారు.

ఈ విధంగా ఈ కాలంలో జరిగిన సభలు, తర్వాత గాంధీ పర్యటనను మరింత జయప్రదం చేయడానికి దోహదం చేశాయి.

## హరిజన నిధికై 1933 లో గాంధీ పర్యటన

1933 డిశంబరు 16 న బెజవాడ రాకతో కృష్ణా జిల్లాలో గాంధీ హరిజన నిధికై పర్యటన మరోసారి ప్రారంభమైంది. గాంధీకి నాయకులే కాక ప్రజలుఅత్యంత ఉత్సాహంతో స్వాగతమిచ్చారు. దుర్గా విలాస్ (కాశీనాథుని నాగేశ్వరరావుగారి నివాస భవనం)లో ఆంధ్ర మహిళా సంఘం, కృష్ణాజిల్లా హరిజన సేవకసంఘం, ఆంధ్రరాష్ట్ర అస్పృశ్యతా నివారణ సంఘం హిందీ ప్రచారక సంఘం వారు గాంధీకి పూల మాలలు వేసి, హిందీలో సన్మానపత్రాలను సమర్పించారు. అలసటగా వున్నా, వర్షపు తుంపర్లు పడుతున్నా, నిర్ణీత కార్యక్రమం ప్రకారం గాంధీ పర్యటన ప్రారంభించారు.

మొదట ఈడుపుగల్లు వెళ్ళారు. ఖాదీ దండలు, పూలమాలలు సన్మాన పత్రాలు—వీటితోపాటు రు 150లు ఇచ్చారు. గాంధీ ఉపన్యాసనంతరం నగదూ, నగలూ సమర్పించ వలసిందిగా కోరగా, ఒక నాలుగేళ్ళ బాలిక లోలకులను ఒకహరిజన బాలిక బంగారం పొదిగిన ఇత్తడి బులాకిని ఇచ్చారు.

ఆనాటి మధ్యాహ్నం సుమారు వెయ్యి మంది మహిళలు దుర్గావిలాస్‌లో సమావేశమయ్యారు. గాంధీకి రు. 120 లు సమర్పించారు. తర్వాత దుర్గా కళామందిరంలో స్థానిక హరిజన కార్యకర్తలు, ఆంధ్రరాష్ట్ర అస్పృశ్యతా నివారణ సంఘ కార్యవర్గ సభ్యులు, హరిజన రచయితలు, కవులు, గ్రంథకర్తలూ సమావేశమైనారు. హరిజన కవులు గాంధీని స్తుతించుతూ రాసిన గేయాలను చదివారు. ఆ తర్వాత ఇష్టాగోష్ఠి సభలో గాంధీ కొన్ని ప్రశ్నలకు జవాబిచ్చారు.

సాయంత్రం 4½ గంటలకు బహిరంగ సభ జరిగింది. కలకత్తా నుంచి తెప్పించిన లౌడ్‌స్పీకర్లు, మార్గ మధ్యాన్నే చెడిపోయాయి. అప్పటివరకు బెజవాడలో రు. 3982–8–0 వసూలైనట్లు గాంధీ చెప్పారు. తనకిచ్చిన రెండు సన్మాన పత్రాలను వేలం వేయగా రు. 10–4–0 వచ్చింది.

మొగల్రాజపురంలో కొత్రగడ్డ రామసీతమ్మగారు గాంధీకి రు. 116 విరాళంగా ఇచ్చారు. అప్పటికి ఆమె కొద్దికాలం క్రిందటే జైలునుంచి విడుదలై వచ్చారు. ప్రభుత్వం ఆమె యింట్లో వస్తువుల్ని వేలంవేసి, జరిమానా మినహాయించుకుని మిగిలిన రు. 80 లు యిచ్చివేశారు. ఆ రు. 80 లకు తోడుగా

రు. 36 లు చేర్చి, మొత్తం రు. 116 లను మరికొన్ని ఆభరణాలను హరిజన నిధికి ఆమె సమర్పించారు.

17వ తేదీన గాంధీ, ఆయన బృందం పునాదిపాడు, కోమటిగుంట, కలువపాముల గ్రామాలకు వెళ్ళారు. గాంధీకి నిద్రాభంగం కలగకుండా యీ గ్రామాలవారు నిధి సమర్పించారు. పునాదిపాడు వారు రు. 116 లిచ్చారు. ముదునూరులో గాంధీ రెండు దేవాలయాల్లో హరిజన ప్రవేశ ఉత్సవాలు జరిపించారు. ఆ గ్రామవాసులు రు. 408 నిధి సమర్పించారు. కె. రాజమ్మగారు రు. 23-14-6, మరికొందరు తమ ఆభరణాలు సమర్పించారు. హరిజనులు గాంధీకి హారతి పట్టి, కొబ్బరికాయలు యిచ్చారు.

గుడివాడలో ఆహ్వాన సంఘం, హరిజన సేవక సంఘం, విద్యార్థి బృందం స్వాగత పత్రాలు సమర్పించారు గుడివాడ, నందివాడ, దొండపాడు, జొన్నపాడు, దండిగానపూడి, వివివాడ గ్రామస్థులు సుమారు రు. 1000 లు సమర్పించారు. బంగారు గాజులు, ఉంగరాలు, బంగారు తీగ గల పగడపు తావళాలు యిచ్చారు. చిరుత ప్రాయంలో వున్న పూనూరి వెంకొరెడ్డిగారి కుమార్తె బంగారు గాజులను సమర్పించింది. గాంధీ క్లుప్తంగా ఉపన్యసించారు. తర్వాత సిద్ధాంతం అనే గ్రామానికి వెళుతూ, తోవలో బొమ్మలూరులో ఆగి, అక్కడ దేవాలయాన్ని హరిజనుల ప్రవేశానికి తెరిచారు. సిద్ధాంతం గ్రామంలో శ్రీ సంతాన వేణుగోపాలస్వామి, శ్రీ దుర్గా నాగేశ్వరస్వామి దేవాలయాల్లో హరిజన ప్రవేశం కల్గించారు ఈ గుళ్ళకు ధర్మకర్త అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు. రంగాపురం ఎస్టేటు జమిందారు. ఈయన యింట్లోనే బెజవాడలోకూడా గాంధీకి వసతి ఏర్పాటు చేశారు.

సాయంకాలం రెండుంబావుకు గాంధీని మహిళలు ప్రత్యేకంగా సందర్శించారు. బంగారు, వెండి నగలు సమర్పించారు. చౌటపల్లి గ్రామస్థులు రు. 116, జొన్నపాడు వాస్తవ్యులు రు. 30, గొల్వేపల్లివారు రు. 48-6-0, పెదమద్దాలి నివాసులు రు. 15 లు హరిజన నిధికి సమర్పించారు. మహిళలు దాదాపు రు. 500 విలువగల వస్తువులు సమర్పించారు. నగలు సమర్పించిన వారిలో చలసాని చంద్రమ్మ, బొప్పన్ని సౌభాగ్యమ్మ, యలమంచిలి శశిరేఖమ్మ, చావరాల సౌభాగ్యమ్మ, వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ అట్లూరి వీరమ్మ, కొల్లి నాగరత్నమ్మ, ఘంటామల్లి కాంబ, మిక్కిలినేని సీతారామమ్మ, సూరపనేని వెంకటసీతమ్మ, కొడాలి అంజమ్మ, కొమ్మారెడ్డి శేషమ్మ, చెరుకూరి సత్యవతమ్మ, పొట్లూరి విమలావతి, ఆచంట శ్రీరామమ్మ, అడ్సుమిల్లి పిచ్చమ్మ, పర్వతనేని శ్రీరామమ్మ, త్రిపిరినేని అన్నపూర్ణమ్మ, మంగపాటి లక్ష్మి నరసమ్మగార్లు వున్నారు. వీరు గాక, కొండవల్లి కోటిరెడ్డి, రామిరెడ్డి వెంకయ్యగార్లు చెరొక ఉంగరం సమర్పించారు.

తర్వాత గాంధీ అంగలూరు వెళ్ళగా అక్కడ పర్వతనేని భూషయ్యగారు రు. 116 లు యిచ్చారు. పౌరులు తరపున రు. 60 లు యిచ్చారు. కమలమ్మ, లీలావతి, అమృతంగార్లు బంగారు నగలు సమర్పించారు. సభలో అస్పృశ్యత పాటించకుండా అందరూ కలిసికూచున్నారు.

కొంతసేపు కౌతవరం, పెడనలలో ఆగి గాంధీ బందరు చేరారు. ఆంధ్ర జాతీయ కళాశాలలో సాయంత్రం 6 గంటలకు బహిరంగ సభ జరిగింది.

కృష్ణాజిల్లా బోర్డు, మున్సిపాలిటీ, హిందీ ప్రేమీ మండలి, తూర్పు కృష్ణా హిందూ సేవా సంఘం, మహిళా సంఘం, విద్యార్థి సంఘం, కృష్ణాజిల్లా ఆదిమాంధ్రుల సంఘాలు సన్మాన పత్రాలు సమర్పించాయి. అఖిల భారత చర్ఖా సంఘం ఆంధ్రశాఖ, హరిజనులు తయారు చేసిన ఖద్దరు వస్త్రాలు, సన్నఖద్దరు, మేలురకం తివాచీని, చిత్రాసనాన్ని గాంధీకి కానుకలుగా సమర్పించారు.

బందరులో గాంధీ హరిజన నిధికి ఆంధ్ర ఇన్సూరెన్సు సిబ్బంది రు. 200, స్త్రీలు రు. 116-8-0 లు, కృష్ణా అర్బన్ బ్యాంకు రు. 25, హిందూ కాలేజి సిబ్బంది- విద్యార్థులూ రు. 28-13-0, నోబుల్ కాలేజి సిబ్బంది రు. 29, నోబుల్ కాలేజి విద్యార్థులు రు. 65-4-0 గొ పల్లి రాజా రు. 116 లు సమర్పించారు. టికెట్ల దా రా రు. 420, చిల్లర వసూళ్ళు రు. 21-15-0 సమర్పించ బడ్డాయి. తర్వాత గాంధీ బృందం చల్లపల్లి వెళ్ళారు.

చల్లపల్లిలో గాంధీగారి కార్యక్రమం ఆలస్యంగా ప్రారంభమైనా, ప్రజలు అమితోత్సాహంతో స్వాగత

మిచ్చి పీఠాలు సమర్పించారు. సెగలిచ్చారు. (వివరాలకు దివి తాలూకా చరిత్ర చూడండి).

బందరు నుంచి బెజవాడ వెళ్ళేముందు స్థానిక నటకులు ప్రదర్శించిన "నందనారు" నాటకాన్ని గాంధీ చూశారు. ఆ నాటకం తాలూకు వసూళ్ళు రు. 400 హరిజన నిధికి యిచ్చారు. ఒక వెండి పళ్ళెం, వెండి చట్రంలో గాంధీ ఫొటోను కూడా యిచ్చారు. తోవలో పామర్రు, కంకిపాడు గ్రామాల్లో గాంధీగారి హరిజన నిధికి రు. 250 సమర్పించారు. కృష్ణాజిల్లాలో సుమారు 10 వేల రూపాయల వరకూ హరిజన నిధి వసూలైంది.

గాంధీ హరిజన నిధి సేకరణకై ఈ జిల్లాలో పర్యటించినపుడు, ఆయన హరిజన సమస్యపైనే కాక, ఆంధ్రులకు చేసిన కొన్ని హితబోధలు గమనింపదగినవిగా వున్నాయి.

"అస్పృశ్యత మహా పాతకం. మనమందరం ఒక్కటైనపుడు మనలో ఎక్కువ తక్కువలంటూ ఉండకూడదు. మీ సొంత సోదరుడైన హిందువును అస్పృశ్యుడుగా మీరు పరిగణించకూడదు" ఇదే ధోరణిలో అన్నిచోట్లా గాంధీ ఉపన్యసించారు.

బెజవాడలో గాంధీని స్తుతిస్తూ కవులు గేయాలు చదివినపుడు ఆయన కవిత్వం కళల పాత్రను ఇలా స్పష్టంచేశారు.

"ఆంధ్రదేశంలోని ప్రజలు పద్యాలు అల్లడంలో వాటిని మధురంగా చదవటంలో ప్రసిద్ధులని నాకు బాగా తెలిసిన సంగతే. అందుచేత మీరు ఈ రోజున చేసిన ప్రదర్శన కొంతవరకు అనవసరమని నా అభిప్రాయం. కవిత్వంకానీ, కళకానీ సత్యం నిరూపించేవిగా ఉండాలి. అంతేకాని వాటిని పొగడకు ఉపయోగించకూడదు. కవిత్వాన్ని అందుకు ఉపయోగించడం వల్ల కళ క్షీణించటమేకాక, సత్యభంగం కూడా కలుగుతుంది."

ఆంధ్రదేశంలో హరిజనయాత్ర ముగించుకొన్న తర్వాత హిందూపురంనుంచి, ఆంధ్రదేశానికి వీడ్కోలు సందేశం ఇచ్చాడు గాంధీ. అందులో ఆంధ్రుల లోటుపాట్లను కూడా పేర్కొంటూ ఇలా లన్నాడు :

"మీరు నాపై చూపిన ప్రేమకు కృతజ్ఞత తెలిపే ముందు, మీ లోటుపాటులను చెప్పకపోవటం సరికాదు. స్వయంసేవకులు, కార్యకర్తలు కష్టపడి పని చేసినమాట వాస్తవం కాని, ఇన్నాళ్ళ అనుభవం తరవాత కూడా తమ కర్తవ్యం గురించిన సంపూర్ణ జ్ఞానం వారికి కలగలేదని చెప్పవలసి వచ్చినందుకు విచారపడుతున్నాను. సమావేశాలు ఏర్పాటుచేసినపుడు, వారు చిన్న చిన్న విషయాలలో కూడా శ్రద్ధ తీసుకోవలసి ఉంటుంది........ ఆంధ్రదేశంలోని స్వయంసేవకులు దూరాలోచనతో పని చేసినట్లయితే, వారు అద్భుతమైన కార్యాలను నిర్వర్తించగలరు. ఆంధ్రదేశంలో అత్యధికమైన భావోద్రేకం, శ్రద్ధాభక్తులు ఉన్నాయి. ఆ శ్రద్ధాభక్తులతోపాటు విమర్శనా జ్ఞానం అలవర్చుకోవాలని, వారిని నేను కోరుతున్నాను."

గాంధీ. ఆంధ్రుల లోటుపాట్లను ఇలా కుండబద్దలుకొట్టినట్లు చెప్పినప్పటికీ, ఆంధ్రులపట్ల ఆయన అభిమానం లోగడ "ఆత్మ కథ"లో రాసిన ఈ వాక్యాలలో స్పష్టమౌతుంది :

"తమిళంగానీ, తెలుగుగానీ తెలియకపోవటం నాకు ఇప్పటికీ చాలా లోపంగానే కనపడుతూ వుంది........ నాకు ఎవరైనా ఒక తమిళ మిత్రుడు కానీ, తెలుగు మిత్రుడుకానీ కనపడినపుడు దక్షిణాఫ్రికాలోని తెలుగు, తమిళ స్నేహితుల విశ్వాసం, పట్టుదల స్వార్థరహిత త్యాగం—ఇవన్నీ నా స్మృతిపథంలోకి వస్తాయి."

రౌలట్ చట్టం నిరసన సందర్భంగా మద్రాసులో ప్రసంగిస్తూ గాంధీ ఇలా అన్నాడు :

"....నాకు దక్షిణదేశం సొంతఇల్లువలె ఉంటుంది. అందుకు కారణం దక్షిణాఫ్రికా ఉద్యమం. తెలుగుల పైననూ, తమిళుల పైననూ నా కొక ప్రత్యేక హక్కు ఉన్నట్లు భావిస్తాను. దక్షిణాఫ్రికాలోని ఆ సజ్జను లెన్నడూ నా ఈ నమ్మకానికి భంగం కల్గించలేదు."

## 1934-39 సంవత్సరాల మధ్య అతివాద ఉద్యమాలు

రెండవ సత్యాగ్రహ ఉద్యమం తర్వాత కాంగ్రెస్ అనుయాయులలో ముఖ్యంగా యువకులలో నిరాశా నిస్పృహలు వ్యాపించాయి. స్వరాజ్య సాధనకు గాంధీమార్గం కాక ఇతర మార్గాల గురించి ఆలోచనలు రేకెత్తాయి. అప్పటికే జైళ్ళలో వ్యక్తిగత విప్లవవాదులతో కాంగ్రెస్ వారి పరిచయాలేర్పడి

నాయి. వ్యక్తిగత విప్లవవాదులలో కూడ 1933 నాటికి కొంత పరివర్తన వచ్చింది. వ్యక్తి హత్యల ద్వారాకాక, కార్మిక కర్షక సంఘాలేర్పరచి సోషలిజం ధ్యేయంగా తాము పనిచేయాలనే ధోరణికి కొందరు వచ్చారు. 1920 దశకంలో చిన్న చిన్న గ్రూపులుగా ఏర్పడి, కార్మిక కర్షక జనంలో పనిచేస్తూ, ప్రపంచంలోని కమ్యూనిస్టు తదితర విప్లవ నాయకులతో సంబంధాలు పెట్టుకొని, కాన్పూర్, మీరట్ కుట్ర కేసులలో శిక్షలకు కమ్యూనిస్టులు గురయ్యారు.

కమ్యూనిస్టు పార్టీ 1934 జూలైలో నిషేధింపబడింది. ఐనా 1934 సెప్టెంబరులో పుచ్చలపల్లి సుందరయ్యగారి కృషి ఫలితంగా, రాష్ట్ర కమ్యూనిస్టు ఆర్గనైజింగ్ కమిటీ ఏర్పడింది. కృష్ణాజిల్లాలో బహిరంగంగా పనిచేస్తున్న అతివాద వేదికల్ని ఉపయోగించుకుంటూ కమ్యూనిస్టులు పనిచేయసాగారు.

1934 మేలో అఖిల భారత కాంగ్రెస్ సోషలిస్టు ప్రథమ మహాసభ జరిగింది. వివిధ రాష్ట్రాలలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ శాఖలను స్థాపించాలనీ, వాటి ఆధారంగా అఖిలభారత కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ స్థాపించబడుతుందనీ తీర్మానించింది. దానికి అనుగుణంగానే జొన్నలగడ్డ రామలింగయ్య, బసవరాజు రంగశాయిగారు 1934 జూన్ 23 న ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు సమావేశం జరిపారు. ఆచార్య రంగా అధ్యక్షత వహించారు. దీనికి హాజరైన వారిలో ఈ జిల్లాలోని కాంగ్రెస్ వాదులు ఇంటూరి వెంకటేశ్వరరావు, కొడాలి ఆంజనేయులు గార్లు ఉన్నారు. డిసెంబరులోగా సోషలిస్టు పార్టీ శాఖలను ఏర్పర్చడానికి ఒక ఆర్గనైజింగ్ కమిటీని ఏర్పరచింది. దానిలో ఈ జిల్లాకు చెందిన అన్నె అంజయ్య (ముదునూరు), వల్లభనేని రామబ్రహ్మం (జమీగొల్వేపల్లి), నసరుద్దీన్‌ఖాన్ (బెజవాడ), ఇంటూరి వెంకటేశ్వరరావు (బెజవాడ) గార్లు ఉన్నారు. ఈ సమావేశం తర్వాత బెజవాడ, గుడివాడలలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ శాఖలు ఏర్పడ్డాయి.

1934 జూలై 10 న కృష్ణాజిల్లా కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఏర్పడింది. అధ్యక్షులు గద్దె లింగయ్య, కార్యదర్శులు వ భనేని రామబ్రహ్మం, వెల్లంకి పూ చంద్రయ్యగా , కార్యవర్గ సభ్యులలో మద్దుకూ చంద్రశేఖరరా , చలసాని జగన్నాధరావు, కొనరాజు శేషయ్య, పోచిరాజు కృష్ణారావు, అన్నె అంజయ్య, పిడికిటి రామకోటయ్య, వల్లభనేని వెంకట్రావుగార్లు వున్నారు.

ఐతే కాంగ్రెసుకూ, కాంగ్రెసు సోషలిస్టు పార్టీకి దూరంగా కొన్నాళు కమ్యూనిస్టులు వున్నారు. ఆ కాలంలో కమ్యూని ు, కమ్యూనిస్టు అభిమానులతో కలిసి, "కూలీ రక్ష సమితి" (Labour Protection League) ను ఏర్పరచారు. 1935 మార్చిలో గుంటూరులో మొ మొదట యీ సంఘం స్థాపించబడింది. కృష్ణాజి లో 1935 అక్టోబర్ 10 న బెజవాడలోను, అం కుముందు 1935 జూలై 1 న బందరులోను "కూలీ రక్షణ సమితులు" స్థాపించబడ్డాయి. బెజవాడ సమితికి పిల్లలమర్రి వెంకటేశ్వర్లు గారు కార్యదర్శిగా, మద్దుకూరి చంద్రశేఖరరావు, కొనరాజు శేషయ్య, చలసాని వాసుదేవరావు, కె. శ్రీనివాసరావు, అల్లూరి సత్యనారాయణగార్లు కార్యవర్గ సభ్యులుగా, చాపల వెంకటేశ్వరరావు, వాండ్రాసు సన్నయ్య, కృత్తివెంటి కుటుంబరావు, సోములు వగైరా సభ్యులుగా పనిచేశారు. బెజవాడ శాఖ, ప్రెస్ కార్మికులలోను, రైల్వే కార్మికులలోను పనిచేయటం ప్రారంభించింది, కార్మికుల హక్కులు కాపాడటం, కార్మికులకు సంబంధించిన సాహిత్యాన్ని ప్రచారం చేయటం, సామ్రాజ్య వ్యతిరేక దినోత్సవాలు జరపటం—ఈ కూలీ రక్షణ సమితుల కార్యక్రమంగా ఉండేది.

యువజనోద్యమాలను నిర్మించి, వారిని అతివాద రాజకీయాలలోకి ఆకర్షించటం ప్రారంభించారు కమ్యూనిస్టులు.

ఈ సందర్భంగానే 1936 జనవరిలో కాకినాడ అన్నదాన సమాజంలో ఆంధ్రరాష్ట్ర యువజన మహాసభ జరిగింది. ఈ సభను అవకాశంగా తీసుకుని అక్కడఅంతకుముందు రాత్రి ఆంధ్రరాష్ట్రకమ్యూనిస్టు ప్రథమ మహాసభ రహస్యంగా జరిగింది. ఎస్. వి ఘాటే, సుందరయ్యగార్లు హాజరయ్యారు. ఈ సభకు హాజరైన కొద్దిమందిలో తుమ్మల వెంకట్రామయ్యగారు (గుంటూరు జిల్లా నుంచి) వున్నారు.

1936 మార్చి 26 న బెజవాడలో జరిగిన కృష్ణా యువజన మహాసభకు పి. శివయ్యగారు అధ్యక్షత వహించారు. 1937 లో బందరు మినర్వా హాలులో

యువజన మహాసభ జరిగింది. కానూరి రామానంద చౌదరిగారు ఆహ్వాన సంఘాధ్యక్షుడు. కాట్రగడ్డ నారాయణరావుగారు అధ్యక్షత వహించారు. ఆ రోజుల్లో సోషలిస్టు నాయకుడుగా వున్న బాట్లీవాలా మహాసభను ప్రారంభించారు. ఆయన ఉపన్యాసం ప్రభుత్వానికి హడలెత్తించి, అరెస్టు చేసింది. కాని తర్వాత ప్రజాందోళన ఫలితంగా విడుదల చేసింది.

ఇతర జిల్లాలలో వలెనే ఈ జిల్లాలో కూడ కమ్యూనిస్టు కార్యకలాపాలపైన ప్రభుత్వం కన్నెర్ర చేసింది. పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (బెజవాడ)గారు యిచ్చిన ఉపన్యాసం రాజద్రోహ పూరితంగా వుందని అరెస్టుచేసి 1936 ఆగస్టు 4 న సంవత్సరం కఠినశిక్ష విధించింది ప్రభుత్వం. అప్పీలులో కూడా జిల్లా జడ్జి ఈ శిక్షను ఖాయపరచాడు.

1936 లో తిరిగి కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోను, కాంగ్రెసులోను కమ్యూనిస్టులు చేరారు. కృష్ణాజిల్లాలో కాంగ్రెసు సోషలిస్టు పార్టీకి కార్యదర్శిగా వెల్లంకి విశ్వేశ్వరరావు, సహాయ కార్యదర్శులుగా కంచ వెంకట్రామయ్య, కృత్తివెంటి కుటుంబరావుగా కార్యవర్గ సభ్యులుగా కొసరాజు శేషయ్య, గ లింగయ్య, చలసాని వాసుదేవరావు, ఇంటూరి వెంకటేశ్వరరావు మొదలైనవారున్నారు. 1936 సెప్టెంబరు 26, 27 తేదీలలో రాజమండ్రిలో జరిగిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ద్వితీయ మహాసభకు వెల్లంకి విశ్వేశ్వరరావు, చలసాని వాసుదేవరావు, కొసరాజు శేషయ్య, వంకసూరి శాస్త్రిగార్లు హాజరయ్యారు. ఈ మహాసభ నూతన కార్యవర్గంలోకి కృష్ణాజిల్లా నుంచి చలసాని వాసుదేవరావు, ఇంటూరి వెంకటేశ్వరరావుగార్లను ఎన్నుకొన్నారు.

ఈ మహాసభ సందర్భంగానే రాజమండ్రిలో యిచ్చిన ఉపన్యాసానికిగాను పుచ్చలపల్లి సుందరయ్య గారికి రెండేళ్ళు జైలుశిక్ష విధించబడింది.

ఈ రోజులలోనే రాజకీయ పాఠశాలలు రాజకీయ పరిజ్ఞానం పెంపొందడానికి తోడ్పడ్డాయి. నిడుబ్రోలులో రంగాగారు స్థాపించిన రైతు పాఠశాలలోను, ఆ తర్వాత కొత్తపట్నం, మంతెనవారిపాలెంలో సోషలిస్టులు కమ్యూనిస్టులు జాతీయవాదుల సహకారంతో నిర్వహించిన పాఠశాలల్లోను ఈ జిల్లా యువకులు పాల్గొన్నారు. కొత్తపట్నం రాజకీయ పాఠశాలను మద్రాసు ప్రభుత్వం నిషేధించినపుడు, ఆ నిషేధాన్ని ధిక్కరించి లాఠీదెబ్బలుతిని జైలుకు వెళ్ళిన యువతీ యువకులలో ఈ జిల్లావారు కూడా ప్రముఖ పాత్ర వహించారు. చండ్ర రాజేశ్వరరావుగారు అందులో ఒకరు. 1939 మేలో తిరువూరు తాలూకా తునికిపాడులో జరిగిన రైతు విద్యాలయంలో నైజాం రాష్ట్రంతోసహా అనేక ' ాల నుంచి వచ్చిన యువకులకు రైతు, సోషలి , కమ్యూనిస్టు నాయకులు రాజకీయాలను ప్రబో చారు.

## రైతు ఉద్యమాలు

బ్రిటిష్ ప్రభుత్వం మీద, వారి తాబేదార్ల మీద, జమీందార్లమీద రైతులు అనేక సందర్భాలలో తిరుగుబాట్లు చేశారు. అవి కొన్ని శాంతియుతంగాను, మరి కొన్ని సాయుధంగాను జరిగాయి. అందులో కృష్ణా జిల్లా కూడా ప్రముఖ పాత్ర వహించింది.

1871 లో జమీందారు శిస్తులు పెంచినందుకు నిరసనగా మేడూరు, ఉయ్యూరు ఎస్టేట్ల రైతులు 80 గ్రామాల్లోని తమ భూముల్ని బీడుపెట్టారు. 1880లో వల్లూరు ఎస్టేట్ రైతులు, జమీందారు భూమిశిస్తు పెంచినందుకు నిరసనగా పోరాటం సాగించారు.

1894 లో నీటి తీరువా హెచ్చించినందుకు నిరసనగా కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లా రైతులు తమ భూముల్ని దున్నకుండా వదలివేసి పోరాడారు. 1894 లో ఏలూరులో కృష్ణాజిల్లా రైతుల మహాసభ జరిగింది. (అపుడు ఏలూరు కృష్ణాజిల్లాలోనిదే) నీటి పారుదల రేటు హెచ్చింపును రద్దుచేయాలని, అలా చేయకపోతే భూముల్ని సాగుచేయకుండా వదలివేయాలని ఈ మహాసభ తీర్మానించింది. ప్రభుత్వం ఈ హెచ్చింపును ఉపసంహరించుకొనక తప్పిందికాదు.

1922-24 సంవత్సరాల మధ్య అల్లూరి సీతారామరాజు లేవదీసిన పితూరీ ప్రధానంగా, ఎక్సైజ్ అటవీ ఉద్యోగుల దౌర్జన్యాలు, పోడు వ్యవసాయంపై విధించిన ఆంక్షలు, కట్టెపుల్లలు, పశుగ్రాసం, కట్టెపు లకు చెట్లు కొ డం లాంటి హక్కులపై ప్రభుత ం వన్నుల్లు ంచటం మొదలగు వాటికి నిర గా బయలుదేరిన .

ఇరవయ్యో శతాబ్దం మొదటి దశకంలోనే, కృష్ణా జిల్లా రైతు సంఘాల నిర్మాణం ప్రారంభమైంది.

1906 అక్టోబర్‌లో, మాజెళ్ళలో గుడివాడ తాలూకా రైతు మహాసభ జరిగింది. 1915 లో కృష్ణా జిల్లా రైతు సంఘం ఏర్పడింది. 1919 లో కృష్ణా జిల్లా రైతుల సాంవత్సరిక మహాసభ జరిగింది. 1919 మార్చి 31 న గాంధీ బెజవాడ వచ్చినపుడు ఆయన ఉపన్యసించిన సభలో రైతులు ఒక సన్మానపత్రం సమర్పించారు. అందులో రైతులు పడే ఇబ్బందులను పేర్కొనా రు. 1920 మే నెలలో గన్నవరం తాలూకా తు సభ జరిగింది. కర్నూలులో జరగ నున్న హాసభలో శాశ్వత రైత్వారీ సమస్య చర్చించబడుతుందని తె యచేశారు.

నూజివీడు జమీందా కు వ్యతిరేకంగా కడియాల చంద్రయ్య పెద్ద పోరా ం నిర్వహించాడు. ముక్త్యాల జమీందారుకు వ్యతిరేకంగా గుణ్ణం కృష్ణారె పోరా డాడు. 19 వ శతాబ్దం చివరలో చల్లప జమీం దారుకు వ్యతిరేకంగా గొర్రెపాటి బాలకృష్ణ కై పోరా డాడు.

1935 లో రాష్ట్ర రైతు సంఘం పునరుద్ధరించ బడిన తర్వాత రైతు ఉద్యమం ఈ జిల్లాలో వేళ్ళూనుకుంది. ఏడవ రాష్ట్ర తు మహాసభ వీర పల్లిలోను, 8 వ రాష్ట్ర రైతు హాసభ 1939 లో బెజవాడలోను జరిగాయి. రైతు సంఘానికి అధ్యక్షు లుగా కొమ్మారెడ్డి సత్యనారాయణమూ ర్తి, ప్రధాన కార్యదర్శిగా చలసాని వాసుదేవరావు ఎన్నుకోబడ్డారు.

1937 చరిత్రాత్మక రైతు రక్షణయాత్ర ఇచ్ఛా పురంనుంచి మద్రాసు దాకా అధ్యక్ష, కార్యదర్శులైన కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి చలసాని వాసు దేవరావు గార్ల నాయకత్వాన నిర్వహించ బడింది. అపుడు కాంగ్రెసు ప్రభుత్వం అధికారంలో వుంది. రైతుల కష్టాలను, జమీందారీ రై ల కడగండ్లను మద్రాసులో ప్రభుత్వానికి వీరు మెమొరాండం ద్వారా సమర్పించారు.

## సాహిత్యంపై నిషేధాలు

గ లింగయ గారు "ప్లవ" అనే ప పత్రిక ము ఎలమ ంచి. వ్రాత్ర నుంచి వేలు ర్చారు. ప భుత ర్లు 8 0 రావత్తు కోరడంతో ఆరో ంచికతోనే అది పోయింది. ముద్రణక ర నుంచి కూడా ప్రభుత్వం రు. 1000 ధరావతు కోరింది.

గద్దె లింగయ్యగారు రాసిన "విప్లవ వీరులు" గ్రంథాన్ని ప్రభుత్వం నిషేధించింది. వీరే ప్రచు రించిన, క్రొవ్విడి లింగరాజుగారు అనువదించిన మాక్సిం గోర్కీ నవల "అమ్మ"ను కూడా నిషేధిం చింది. అదివరకే "లెనిన్ జీవితం" నిషేధించబడింది. ఐనా "విప్లవ వీరులు" రహస్యంగా చదివించేవారు. "కమ్యూనిస్టు" అనే రహస్య పత్రిక తెలుగు, ఇం షు భాషల్లో రహస్యంగా పంచబడుతూ వచ్చింది. 36 డిసెంబరు నుంచి వెలువడిన "నవశక్తి" (సోష స్టు వారపత్రిక) రెండో ప్రపంచయుద్ధం రావడంతో నిలిచి పోయింది. మొదట దీనికి మద్దూరి అన్నపూర్ణయ్యగారు సంపాదకులుగా డిక్లరేషన్ తీసుకున్నారు. రాజమండ్రి నుంచి కొన్నాళ్లు వెలువడింది. తర్వాత కొన్నాళ్ళకు బెజవాడ నుంచి మద్దుకూరి చంద్రశేఖరరావుగారు సంపాదకులుగా పుచ్చలపల్లి సుందరయ్య, కంభం పాటి సత్యనారాయణ (సీనియర్), తుమ్మల వెంకట రామయ్య గార్లు సంపాదకవర్గ సభ్యులుగా ఈ పత్రిక వెలువడింది. సామ్రాజ్యవాద వ్యతిరేక వ్యాసాలు రాసి నందుకుగాను 1940 లో సంపాదకవర్గంపై కేసు పెట్టింది. అప్పటికే మే 24 న కంభంపాటి సత్య నారాయణ (సీనియర్) గారికి 6 నెలలు శిక్ష విధించ బడింది. తుమ్మల వెంకటరామయ్యగారు మినహా మిగతా సంపాదకవర్గ సభ్యులు అండర్ గ్రౌండ్‌కు వెళ్ళటం వల్ల వారిని ప్రభుత్వం అరె చేయలేక పోయింది. వెంకటరామయ్యగారిని కొన్నా ళ్ళు బెజ వాడ సబ్ జైలులో పెట్టి, తక్కిన ంపాదకవర్గ సభ్యుల కోసం అన్వేషించటం మొదలుపెట్టారు పోలీ సులు. వారు దొరకనందున "నవశక్తి"పై కేసు ఉప సంహరించుకొని వెంకట్రామయ్యగారిని విడుదలచేసి, పోలీసు నిఘా (సర్వైలెన్సు) పెట్టింది. ఆ నిఘాను తప్పించుకుని ఆయన అండర్ గ్రౌండ్‌కు వెళ్ళి, కమ్యూనిస్టుపార్టీ రహస ంగా నిర్వహించుతున్న "స్వతంత్ర భారత్" ప కలో పనిచేయనారంభిం చారు. తర్వాత కొన్నాళ్ళ బందరులో "స్వతంత్ర భారత్" పత్రికలతో కొండేపూడి లక్ష్మీనారాయణ, ఎల్.వి. జోగారావుగార్లు అరెస్టయ్యారు. పత్రిక ఎక్కడ ముద్రించుతున్నారో చెప్పమని వారిని పోలీసులు చాలాకాలం చిత్రహింసలు పెట్టారు. కాని రహస్యం రాబట్టలేకపోయారు. కిరాతక కృత్యాలకు ప్రసిద్ధి

చెందిన డప్పుల సుబ్బారావు అనే పోలీసు అధికా ఆధ్వర్యాన ఈ చిత్రహింసలు జరిగాయి. త్వ్రా విచారించి వీరిద్దరికీ శిక్షలు విధించింది కోర్టు. పో నులు ఈ పత్రికా కార్యాలయాన్ని పట్టుకోవడాని ఒకే రోజున కృష్ణాజిల్లాలో 200 చోట్ల సోదాలు చేశారు. కాని వారికి ఏమాత్రం ఆచూకీ దొరకలేదు.

యుద్ధకాలంలో వ్యష్టి సత్యాగ్రహం ప్రారంభ మయ్యేముందు ఈ జిల్లాలో జరిగిన కొన్ని రాజకీయ సంఘటనలు గమనించదగ్గవి.

1934 సెప్టెంబరు 14 న బెజవాడ దుర్గావిలాస్‌లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సమావేశమైనపుడు, గాంధీగారి నాయకత్వం పట్ల విశ్వాసం ప్రకటిసూ కొండా వెంకటప్పయ్యగారు తెచ్చిన తీర్మానాన్ని జొన్నలగడ్డ రామలింగయ్యగారు వ్యతిరేకించారు. తీర్మానాని ఆరు ఓటు మాత్రమే వచ్చి, అది వీగి పోయింది.అలాగే 1935 జనవరి 11 న బెజవాడ దుర్గా విలాస్‌లో కాశీనాధుని నాగేశ్వరరావుగారి అధ్యక్షతన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సమావేశమైంది. జాతీయ కాంగ్రెస్ "న్యాయసమ్మతమైన, శాంతి యుత పద్ధతుల ద్వారా "సంపూర్ణ స్వరాజ్యాన్ని సాధించటం, తన ధ్యేయమంటూ తెలియజేసే క్లాజు లకు బదులుగా "సత్యం అహింస" ల ద్వారా అనే మాటలిన్ని చేర్చాలని అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఒక తీర్మానాన్ని ప్రతిపాదించగా అల్లూరి సత్యనారా యణగారు దాన్ని వ్యతిరేకించారు తీర్మానానికి అను కూలంగా 28 మంది, వ్యతిరేకంగా 30 మంది వోటు చేశారు. తటస్థులు 22 మంది. అంచేత కాళేశ్వరరావు గారి తీర్మానం వీగిపోయింది ఈ రెండూ ఆనాటి కాంగ్రెస్ నాయకత్వం పట్ల, అనుచరులలో వున్న విముఖతను తెలియచేస్తున్నాయి. 1935 నవంబరులో కాంగ్రెస్ అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ కృష్ణాజిల్లాలో పర్యటించాడు. బెజవాడ, కంచికచర్ల, పునాదిపాడు, వుయ్యూరు,భట్లపెనుమర్రు, మచిలీపట్నం,గుడివాడ, పామర్రు, గుడ్లవల్లేరు, హనుమాన్ జంక్షన్, గన్నవరం, గుణదల, నందివాడ మొదలైన చోట్ల పర్యటించారు. కొమరవోలు, పునాదిపాడులలో కార్య కర్తల సభలలో ప్రసంగించాడు.

శాసనసభా ప్రవేశానికి, మంత్రి పదవుల స్వీకా రానికి ఆనాడు విముఖులుగా వున్న కూలీ రక్షణ స తి సభ్యులు రాజేంద్ర ప్రసాద్‌కు కొన్ని చోట్ల న జెండాలు చూపా . బె వాడలో 1935 నవంబరు 1 న వీరు రాజేం ప్ర కు కృష్ణానది రైలు బ్రిడ్జి వద్ద నల్లజెండా చూపారు. ఆ రోజు రాత్రి జరిగిన బహిరంగ సభలో, ఆచార్యరంగా ప్రసంగిం చుతూ, ఈ సంఘటనను బలపరచకపోయినా, యువకు లలో ఈ అసంతృ పెరగడానికి గల రాజకీయ కారణాలేమిటో వి చారు.

ఐతే 1937 లో ష్ట్ర శాసన సభకు ఎన్నికలు వచ్చేసరికి జస్టిస్ పార్టీని, బ్రిటిష్ ప్రభుత్వ అను కూల వర్గాలనూ ఓడించడానికి కమ్యూనిస్టులు, సోష లిస్టులు కాంగ్రెస్ వాదులూ అంతా ఏకమయ్యారు.

ఈ ఎన్నికలలో జ స్ పార్టీ హేమా హేమీలు అంతా ఓడిపోయారు. . పి. పాత్రో, రామచంద్రా రెడ్డి, పిఠాపురం రాజా, బ్బిలిరాజా, జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి, వెంకటగిరిరాజాలు ఓడి పోయారు. పశ్చిమ కృష్ణాలోని ఎన్నికల్లో జయంతి పురం రాజా వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద్, కాట్రగడ్డ వెంకట నారాయణరావుగార్లు విజయం పొందారు. మీర్జాపురం జమీందారు, కొళందరెడ్డి ఓడి పోయారు. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన సుసంఘ టితమైన వలం ఆయా కేంద్రాల్లో పర్యటించి, కార్యాలయాల ర్వహించి వీరి విజయానికి ఎంతో తోడ్పడ్డారు. జవాడ–బందరు పట్టణ నియోజక వర్గం నుంచి అయ్యదేవర కాళేశ్వరరావుగారు గెలు పొందారు. తూర్పు కృష్ణాలో ఒక్క చల్లపల్లి రాజా మాత్రం, గొట్టిపాటి బ్రహ్మయ్యగారిపై ఈ ఎన్ని కల్లో గెలుపొందాడు. వేముల కూర్మయ్య రిజర్వు సీటుకు కాంగ్రెస్ అభ్యర్థిగా గెలుపొందారు. ఈ ఎన్నికల కాలంలో మునగాల, చల్లపల్లి తదితర జమీందారీ ప్రాంతాల్లో కార్యకర్తలు, జమీందారీ వ్యతిరేక ప్రచారం కావించారు.

అతివాద కాంగ్రెస్ సభ్యుల కాంగ్రెస్ నుంచి తొలగించడానికి 1937 – 3 సంవత్సరాలలో ప్రయత్నం జరిగింది. ఈ యత్నాల గురించి "నా జీవితకథ, నవ్యాంధ్రము" అనే గ్రంథంలో అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఇట్లా రాశారు.

"...ముఖ్యంగా మా పశ్చిమ కృష్ణాజిల్లా సోష లిస్టు – కాంగ్రెస్ స్పర్ధలకు ఆహూతి అయినది, ఒక

వర్గమువారు 29 వేలమంది ప్రాథమికసభ్యులను చేర్చగా, మరొక వర్గము వారు 35 వేల మందికి చేర్చిరి. 35 వేల మందిని చేర్చిన అన్నె అంజయ్య, పేట బాపయ్య, రేపాల బుచ్చిరామ శేషయ్య, పిడికిటి రామకోటయ్య, కాకాని వెంకటరత్నం గార్లు తమ పేర్లన్నిటిని సొమ్ముతో సహా కాంగ్రెస్ మహాసభ అధ్యక్షులైన సుభాస్ చంద్రబోసుగారికి సమర్పించి, సొమ్మును వారి పేరిట జమకట్టిరి. రెండవ వర్గము వారు తమ డబ్బును సభ్యుల జాబితాలను ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులైన డా॥ పట్టాభి సీతా రామయ్య, ప్రధాన కార్యదర్శి గొ॥ పాటి బ్రహ్మయ్య గార్ల ఆఫీసులో దాఖలు చేసిరి. ౹ పుర కాంగ్రెస్‌లో సుభాస్ చంద్రబోస్ గారధ్యక్ష దవిని గోల్పోయిరి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీకి పంపుటకు నిరాక రించిన 35 వేల మంది సభ్యుల పేర్ల విషయమై అఖిల భారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఎదుటకు విచారణకు వచ్చినప్పుడు, అచట సభ్యులుగా నున్న డాక్టరు పట్టాభి సీతారామయ్యగారి సలహాపైన వారు ఆ ముప్పది ఐదు వేల సభ్యుల ప్రాథమిక సభ్యత్వ మును కొట్టివేసిరి.....అటుల కొట్టివేయుట సరియైన పనికాదని నేను తలచినను నేనేమియు చేయజాలక పోతిని. అయిదారుగురు నాయకులే వీరికి చెల్లించక సుభాసుచంద్రబోస్ గారిపేర జమకట్టి నందున వారి మీదనే క్రమశిక్షణ చర్య తీసుకొనవలెనేగాని పావలా చందా చెల్లించిన ముప్పది ఐదువేల మంది యొక్క సభ్యత్వమును రద్దుపరచుట న్యాయవిరుద్ధమైన నిరంకుశ చర్య అని నా అభిప్రాయము."

ఈ విభేదాలు మరింత తీవ్రమయ్యాయి. 1939 ఏప్రిల్‌లో సుభాస్ చంద్రబోస్ నాయకత్వాన ఫార్వర్డు బ్లాక్ ఏర్పడినప్పుడు, పేట బాపయ్యగారు కృష్ణాజిల్లాలో దానికి నేతృత్వం వహించారు. జిల్లా ఫార్వర్డ్ బ్లాకుకు ఆయన అధ్యక్షులు. కాకాని వెంకట రత్నం, అన్నె అంజయ్య, పిడికిటి రామకోటయ్య, కొత్రగ మాధవరావు, ఈమని రాజరత్నశర్మ, మురుకు వెంకటప్పయ్యగార్లు, మరికొందరు దీనికి మానులుగా వున్నారు.

సుభాస్ చంద్రబోస్ ప్రభుత్వం కనుగప్పి తప్పించుకు పోయాక 1942 మే 18 న పేట బాపయ్య గారిని అరెస్టు చేశారు. తెల్లవారేటప్పటికి, సాహ్య వంతులైన బాపయ్యగారి అనుచరులు విజయవాడ గోడలపైన "స్వాతంత్ర్య యోధుడు సుభాస్‌చంద్రబోస్ వర్ధిల్లుగాక" అనేఅక్షరాలు రాసిన వాల్ పోస్టర్లు అంటిం చారు. వారు ఒకే రాత్రిలో విజయవాడ నగరమంతా ఈ వాల్ పోస్టర్లు అంటించారు. ఇది బాపయ్యగారి పనే నని ఆ రోజునే వారిని అరెస్టుచేసి, కన్ననూరు జైలులో డిటెన్యూగా నిర్బంధించారు. మరల వారిని 1946 లో రాజకీయ ఖైదీలతో పాటు విడుదల చెయ్యకుండా, ఆ తర్వాత ఎన్నికల సమయంలో విడిచిపెట్టారు.

## వ్యష్టి సత్యాగ్రహం

యుద్ధ కాలంలో భారతదేశం పట్ల బ్రిటన్ అనుస రిస్తున్న విధానానికి నిరసనగా 1940 అక్టోబరు 17 న గాంధీజీ వ్యక్తిగత శాసనోల్లంఘనాన్ని ప్రారంభిం చారు. అంతకుముందే జిల్లాలో అక్కడక్కడా నిర్బంధ విధానం ప్రారంభమైంది. 1940 జనవరి 26 న స్వాతంత్ర్యదినోత్సవం సందర్భంగా బెజవాడలో హర్తాళ్ జరిగింది. ఆ రోజున అక్క డక్కడా అరెస్టులు జరిగాయి. పాఠశాలలు మూసి వేశారు. 1940 నవంబరు నుంచి ప్రారంభమైన ఈ వ్యక్తిగత సత్యాగ్రహంలో ఈ జిల్లాలో పట్టాభి, కాశీశ్వరరావుగార్లు వున్నారు.

వల్లభనేని రామబ్రహ్మం, సీతామహాలక్ష్మమ్మ జమీగొల్వేపల్లిలో సత్యాగ్రహం చేయనున్నట్లు కలెక్టరుకు తెలియచేశారు. 19-3-41 న వారిద్దరినీ అరెస్టు చేశారు. సీతామహాలక్ష్మమ్మగారికి రు. 300 జరిమానా, కోర్టులేచేవరకు శిక్ష విధించారు జరిమానా చెల్లించకపోతే మూడు నెలల శిక్ష అనుభవించా లన్నారు. ఆమె జరిమానా చెల్లించక రాయవెల్లూరు జైలులో శిక్ష అనుభవించింది. రామబ్రహ్మంగారికి ఐదు మాసాల శిక్ష, రు. 400 జరిమానా విధించారు. జరిమానా ఇవ్వకపోతే మరో నాల్గు మాసాల శిక్ష. రామబ్రహ్మంగారు జరిమానా చెల్లించ నిరాకరించి, అలీపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవించారు.

1940-41 వ్యక్తిగత సత్యాగ్రహంలో ఈ క్రింది వారు పాల్గొన్నారు :

1. కాశీనాధుని పూర్ణమల్లికార్జునుడు
2. వేముల కూర్మయ్య

3. మాగంటి అంకినీడు
4. దుగ్గిరాల బలరామకృష్ణయ్య
5. ఈడుపుగంటి లింగయ్య
6. కూరళ్ళ భుజంగ భూషణరావు
7. తమ్మా నాగిరెడ్డి
8. గోనుగుంట్ల లక్ష్మీశ్వరమ్మ
9. ఓక్కా చలపతిరావు
10. ఎర్నేని అమృతమ్మ
11. ఎర్నేని లీలావతమ్మ
12. ఎర్నేని కస్తూరీదేవి
13. ఎర్నేని రాధామనోహరం
14. మానికొండ సత్యనారాయణశాస్త్రి
15. గుళ్ళపల్లి రామబ్రహ్మం
16. కొల్లిపర సూరయ్య
17. ఐనంపూడి శ్రీనివాసులు
18. మద్దాలి జగన్నాథం (పునాదిపాడు)
19. కొండపనేని నాగభూషణం (పెనమలూరు)
20. మద్దాలి వెంకట సుబ్బమ్మ (పునాదిపాడు)
21. మద్దాలి వెంకటేశ్వరరావు ,,
22. యలమంచిలి కోటయ్య (కోలవెన్ను)
23. ఉప్పలపాటి సూర్యనారాయణ ,,
24. తుమ్మల సత్యనారాయణ ,,
25. మద్దాలి తాతాచారి (చోడవరం)
26. కోవెలమూడి రాఘవయ్య ,,
27. కంచర్ల వెంకటేశ్వరరావు ,,
28. యలమంచిలి వెంకట్రామయ్య ,,
29. కొనకళ్ళ సూర్యనారాయణ (వేల్పూరు)
30. ముప్పాళ్ళ ధర్మారావు (మద్దూరు)
31. కుందేరు వెంకట్రావు (కుందేరు)
32. కంభంపాటి వెంకటరత్నం (ఈడుపుగల్లు)
33. కోయ వెంకట నర్సయ్య-కొణకంచి
34. రావూరి వెంకటేశ్వర్లు-ముప్పాళ్ళ
35. కోడిగంటి సత్యనారాయణ-కొణకంచి
36. శెట్టిపల్లి సంగిరెడ్డి-అల్లూరు
37. బండి తిరుపతయ్య-బండిపాలెం
38. మరుపిళ్ళ చిట్టి విజయవాడ
39. మరుపిళ్ళ భ్రమరాంబ ,,
40. పోతిన గణపతిరావు పాత్రుడు ,,
41. పైడిపాటి అప్పలస్వామి ,,
42 తమ్మిన నరసింహం విజయవాడ
43. కంచుపిళ్ళ పద్మనాభం ,,
44. శిరం కృష్ణ ,,
45. బసవరాజు రాజ్యలక్ష్మమ్మ ,,
46. జొన్నవిత్తుల కుటుంబ సుబ్బారావు ,,
47. రాయన రాములు ,,
48. పిళ్ళ నారాయణరావు ,,
49. పిళ్ళ సింహాచలం ,,
50. ఒంద్రాసి అప్పలస్వామి ,,
51. పోతిన వెంకన్న ,,
52. బంకా కొండలు ,,
53. పైడిపాటి పోతన్న ,,
54. పోతిన కనకయ్య ,,
55. రాంపిళ్ళ లక్ష్మణరావు ,,
56. గుజ్జారి నారాయణరావు ,,
57. భువనకడియం నాగభూషణం ,,
58. వేము వెంకటనర్సా మల్లిఖార్జునరావు ,,
59. తాటికొండ పార్వతీశం ,,
60. కొప్పరావూరి సత్యనారాయణ ,,
61. పోతిన రాములు ,,
62. బాడిత అప్పలస్వామి ,,
63. పైపిళ అప్పలస్వామి ,,
64. కేశరె సూర్యనారాయణ ,,
65. పోతూ శ్రీరామయ్య ,,
66. రాయన రాములు పాత్రుడు ,,
67. రాంపిళ్ళ చిన్న ,,
68. కోరుకొండ అప్పారావు ,,
69. పైబిళ్ళ సన్నయ్య పాత్రుడు ,,
70. పిల్లి గురవయ్య ,,
71. పిళ్ళా కనకయ్య ,,
72. పిళ్ళా నారాయణశాస్త్రి ,,
73. బూరాడ రమణయ్య ,,
74 దువ్వా వీరాస్వామి ,,
75. దక్కా ఎల్లయ్య ,,
76. మేదర చింతయ్య ,,
77 రాంపిళ్ళ తాతయ్య ,,
78. దొలిసెట్టి సత్యనారాయణ ,,
79. పిళ్ళా రాములు ,,
80. పేరిపు వెంకట్రామయ్య ,,

81. పొన్నూరి వీరరాఘవరావుగుప్త విజయవాడ
82. దుక్కా కనకయ్య "
83. జీడి రాములు "
84. తమ్మిన ముత్యాలు "
85. రాయపూరపు నాగేశ్వరరావు "
86. మారం కనకయ్య "
87. చిట్టూరి అన్నపూర్ణమ్మ "
88. గాదిరాజు వెంకటేశ్వరరావు "
89. పాదుర్తి సుందరమ్మ "
90. పొట్రు రామయ "
91. సన్నిధానం కృ మూర్తి "
92. సీతంరాజు సు రావు "
93. నదిగం కనకసీతారామయ్య "
94. పంక సూరిశాస్త్రి "
95. యండూరి వీరరాఘవయ్యగుప్త "
96. మల్లెల శ్రీరామమూర్తి "
97. పొనుకుమాటి వెంకట నాగభూషణం "
98. రావర్ల వెంకట నరసింహారావు "
99. అనుముల రామగోవిందశర్మ – కొణకంచి
100. అనుమల వెంకట్రామ శర్మ "
101. షేకు సర్దార్ సాహెబు "
102. లింగగిరి రాములు "
103. కోయ రంగనాయకులు – కొణకంచి
104 సూరపనేని వెంకటేశ్వరరావు – కొరిమర్ల
105. యలమంచిలి లక్ష్మయ్య – గొడవర్రు
106. మూల్పూరి సుబ్బారావు "
107. యలమంచిలి సుబ్బారావు "
108. అరుమళ్ళ సుబ్బారెడ్డి – తేలప్రోలు
109. ఆలపాటి సత్యనారాయణ – హనుమాన్‌జంకన్
110. అడుసుమిల్లి వీరభద్రయ్య "
111. ఆలపాటి లక్ష్మయ్య "
112. దేవినేని మాధవరావు – నెప్పల్లి
113. నూకల రామస్వామి – కానుమోలు
114. దిగువ నారాయణరావు – నూజివీడు
115. సిరికొండ వల్లభయ్య "
116. కోసూరి నరసింహమూర్తి "
117. పల్లగాని గోపాలస్వామి "
118. పోత్రాప్రగడ లక్ష్మీ నరసింహారావు – ఎన్నమదల
119. ఈడుప్గంటి వెంకటేశ్వరరావు – ముక్కొల్లుపాడు
120. అమాము రంగయ్య – సగ్గూరు
121. వాసిరెడ్డి దుర్గా సదా శివేశ్వరప్రసాద్ – (జయంతిపురం రాజా) జగ్గయ్యపేట.
122. రావూరు వెంకటేశ్వర్లు – ముప్పాళ్ళ
123. మొక్కపాటి గోపయ్య – కేతవీరునిపాడు.
124. డా॥ బుద్ధిరాజు సుబ్బారావు – కంచికచర్ల
125. వేమూరు నారాయణమూర్తి – అవనిగడ్డ
126. ఏలేశ్వరపు కృష్ణమూర్తి – పెదప్రోలు
127 నందిపాటి వెంకటరెడ్డి – పామర్రు
128. నందిపాటి చలమారెడ్డి – "
129. తమ్మా నాగిరెడ్డి – "
130. కామినేని సుబ్బారావు "
131. బొమ్మారెడ్డి కోటిరెడ్డి "
132. మారుతి రామయ్య – కొండిపర్రు

## మరికొన్ని వివరాలు

వ్యక్తి సత్యాగ్రహం చేయకపోయినా, యుద్ధ వ్యతిరేక ప్రచారం చేస్తున్నారనే అనుమానంతో కమ్యూనిస్టు, యువజన, విద్యార్థి నాయకులను ప్రభుత్వం ఈ కాలంలో అరెస్టు చేస్తూ వచ్చింది. వివిధ ప్రదేశాలలో అరెస్టయిన కాంగ్రెసువాదుల తదితరుల అరెస్టు వివరాలను పత్రికా వార్తల ఆధారంగా ఈ కింద పొందుపరుస్తున్నాము.

1940 సెప్టెంబరు 20 న గుడివాడలో జోస్యభట్ల సత్యనారాయణ, అడ్డుసుమిల్లి వెంకట గోపాలరావు, పొట్లూరి సూర్యప్రకాశరావు, సూరపనేని రామశేషగిరి రావు, శెట్టిపల్లి వెంకట్రామయ్య, చెన్నుపాటి వెంకటేశ్వరరావు, అడ్డుసుమిల్లి గోపాల కృష్ణమూర్తి, తమ్మారెడ్డి సత్యనారాయణగార్లు అరెస్టయారు.

అక్టోబరు 1న బందరులో డాక్టర్ కుప్పా వెంకట రామశాస్త్రిగారు అరెస్టయారు. అక్టోబరు 5 న వంగపాటి రంగారెడ్డి, కానూరు బలరామయ్యగార్లను గుడివాడ సబ్‌జైలుకు తీసుకువెళ్ళారు. అక్టోబరు 9 న కాట్రగడ్డ రాజగోపాలరావు, కొండపల్లి సీతారామరెడ్డి గార్లు అరెస్టయ్యారు. వెంట్రప్రగడలో కొసరాజు వెంకట్రామయ్య, కొసరాజు బ్రహ్మయ్య, మద్దుకూరి నాగేశ్వరరావు, జాగర్లమూడి చౌదరి, కొసరాజు

అన్నపూర్ణాదేవిగార్లను డిఫెన్సు ఆఫ్ ఇండియా చట్టం కింద అరెస్టు చేశారు. అన్నపూర్ణాదేవి, భర్త శేషయ్య గారిని దాచిందని విచిత్రమైన నేరారోపణ చేశారు. అక్టోబరు 26 న కాట్రగడ్డ రాజగోపాలరావు, వంగపాటి రంగారెడ్డి, కానూరు బలరామయ్య, ముక్తేవి కేశవాచార్యులు, సి. హెచ్. బాపయ్య, రామకుమార్ వర్మ, కొండపల్లి సీతారామరెడ్డిగార్లను బేషరతుగా వదలివేశారు.

నవంబరు 11 న జోస్యభట్ల సత్యనారాయణ, సూరపనేని రామశేషగిరిరావు, తమ్మారెడ్డి సత్యనారాయణగార్లు విడుదలయ్యారు.

డిసెంబరు 5 న జయంతిపురం రాజాకు 3 నెలల శిక్ష రు. 750 జరిమానా విధించబడింది. 16 వ తేదీన గద్దె రంగయ్యనాయుడుగారిని డి. ఐ. ఆర్. కింద అరెస్టు చేశారు. డిసెంబర్ 21న వేముల కూర్మయ్య గారికి 6 నెలల శిక్ష విధించబడింది.

గుడివాడకు చెందిన కె. భుజంగ భూషణరావు గారికి 1941 జనవరిలో 4 నెలల కఠినశిక్ష, రు. 25 జరిమానా, జరిమానా చెల్లించకపోతే మరో 2 నెలల శిక్ష విధించబడింది. పామర్రులో టి. నాగిరెడ్డిగారికి 4 నెలల కఠినశిక్ష రు. 250 జరిమానా, లేక రెండు నెలల కఠిన శిక్ష విధించబడింది. బందరులో కాశీనాధుని పూర్ణమల్లిఖార్జునుడుగారికి 6 నెలల శిక్షవిధించబడింది. బెజవాడలో పి. గణపతి పాత్రుడుగారికి ఆరు వారాల కఠిన శిక్ష రు. 700 జరిమానా లేక 3 నెలల శిక్ష విధించబడింది. కొణకంచిలో కె. రంగనాయకులు గారికి 1 నెల శిక్ష రు. 50 జరిమానా విధించారు. జరిమానా చెల్లించకపోతే మరొక నెల శిక్ష. బెజవాడకు చెందిన సన్నిధానం కృష్ణమూర్తికి నెలరోజుల శిక్ష, రు. 25 జరిమానా, అది చెల్లించకపోతే మరో నెల శిక్ష విధింపబడింది.

కేసిరెడ్డి సూర్యనారాయణగారికి ఒక వారం రోజులు శిక్ష రు. 40 జరిమానా, చెల్లించకపోతే ఒక నెల శిక్ష విధించారు. బి. అప్పలసామికి ఒక జా. శిక్ష రు. 10 జరిమానా, చెల్లించకపోతే వారం రోజుల శిక్ష విధించారు. జనవరి మూడో వారంలో గుడివాడలో బి. వి. చలపతిరావుగారికి 5 నెలల శిక్ష, ఎస్. వెంకటేశ్వరరావుగారికి మూడు నెలల శిక్ష రు. 250 జరిమానా, జరిమానా చెల్లించకపోతే మరో రెండు నెలల శిక్ష విధించబడింది. అవనిగడ్డలో వేమూరి నాగయ్యగారికి 3 నెలల శిక్ష రు. 200 జరిమానా, జరిమానా చెల్లించకపోతే 2 నెలల శిక్ష విధించబడింది.

రామచంద్రపురం (అవనిగడ్డ సమీప గ్రామం) వాస్తవ్యులు మోదుమూడి రామారావుగారికి 3 నెలల శిక్ష, రు. 50 జరిమానా లేక 15 రోజుల శిక్ష విధించబడింది. మోదుమూడి కృష్ణమూర్తికి (వల్లపల్లి) 3 నెలల శిక్ష రు 50 జరిమానా లేక 15 రోజుల శిక్ష విధించబడింది.

బెజవాడలో పరుచూరి భ్రమరాంబకు కోర్టు లేచే వరకు శిక్ష రు. 500 జరిమానా లేక నెల సీడి ఖైదు విధించబడింది. బసవరాజు శ్రీరంగశాయికి 6 నెలల శిక్ష రు. 200 జరిమానా లేక 2 నెలల శిక్ష విధించబడింది.

అనుమల వెంకట్రామ శాస్త్రికి (పెనుగంచిప్రోలు) 3 నెలల శిక్ష రు. 250 జరిమానా లేక 2 నెలల శిక్ష విధించబడింది. కొణకంచి నివాసి షేక్ సర్దార్ సాహెబ్‌కు కోర్టు లేచేవరకు శిక్ష విధించబడింది. బెజవాడలో కంచుపిళ్ళ పద్మనాభంకు కోర్టు లేచేవరకు శిక్ష రు. 100 జరిమానా, పోతిన కనకయ్యకు కోర్టు లేచే వరకూ శిక్ష విధించబడింది. నూజివీడులో సిరికొండ వల్లభరావుగారు 12 నెలల శిక్ష రు. 50 జరిమానా లేక ఒక నెల శిక్ష విధించబడింది. పి. రాములుగారికి రెండువారాల శిక్ష రు. 100 జరిమానా లేక మరో రెండువారాల శిక్ష విధించబడింది. పోలగాని గోపాల స్వామిగారికి 15 రోజుల శిక్ష, రు. 5 జరిమానా లేక 5 రోజులు శిక్ష విధించబడింది.

1943 ఫిబ్రవరి 13 న దాట్ల సూర్యనారాయణ రాజుగారిని (కమ్యూనిస్టు) అరెస్టుచేసి, రాయవెల్లూరు పంపారు. ఈయన రాయవెల్లూరు జైలునుంచి తప్పించుకు పోయిన 5గురు డిటెన్యూలలో ఒకరు.

## క్విట్ ఇండియా ఉద్యమం

ఫాసిస్టు దేశాల కూటమిలో చేరి, జపాను యుద్ధరంగంలో ప్రవేశించడంతో 1941 చివరిభాగంలోను, 1942 తొలి మాసాలలోను భారతదేశానికి జపాను ప్రమాదం తీవ్రమయ్యింది. మార్చిలో బర్మారాజధాని రంగూన్ జపాన్ వశమవటం, ఏప్రిల్‌లో కాకినాడ, విశాఖ పట్టణాలపై బాంబులు వేయటం ఈ ప్రమా

దాన్ని తీవ్రతరం చేసింది. బ్రిటిష్‌వాళ్ళు భారత దేశాన్ని విడిచిపెట్టి, భారతదేశానికి స్వాతంత్ర్యం ఇచ్చినపుడు జపానును ప్రతిఘటించటం సుసాధ్య మౌతుందని గాంధీ అనేకసార్లు హెచ్చరించాడు. కాని బ్రిటిష్ ప్రభుత్వం పెడచెవిని పెట్టింది.

అఖిలభారత కాంగ్రెస్ కమిటీ బొంబాయిలో సమా వేశమై క్విట్ ఇండియా తీర్మానాన్ని 1942 ఆగస్టు 8 న ఆమోదించింది. అర్ధరాత్రి దాటిన తర్వాత ఆగస్టు 9 న బొంబాయిలో కాంగ్రెస్ నాయకులను అరెస్టు చేశారు ప్రజల ఆగ్రహావేశాలకు రైల్వే, తంతితపాలా, తదితర ప్రభుత్వ ఆస్తులు ధ్వంస మయాయి. రైలు పట్టాలు పీకివేయడం, ఫిష్ ప్లేట్లు తొలగించటం తంతితీగలు తెగగొట్టటం మొదలైన సంఘటనలలో పోలీసులు అనేకచోట్ల కాల్పులు జరిపారు.

"ఆంధ్ర సర్క్యులర్" అని పిలువబడే కళా వెంకటరావుగారి సర్క్యులర్‌ను అనుసరించీ, సోష లిస్టుపార్టీ సాగించిన రహస్య ఉద్యమ ఫలితంగానూ, బాంబు ప్రేలుళ్ళు మొదలైనవి జరిగాయి. రహస్యంగా సైక్లోస్టయిల్డ్ పత్రికలు ముదునూరు, దివితాలూకాల నుంచి వెలువడ్డాయి. 1943 ఆగస్టు 9 న, నాయకులను అరెస్టుచేసి సంవత్సరమైన సందర్భంగా బెజవాడ మొదలైన చోట్ల హర్తాళ్ళు జరిగాయి.

క్విట్ ఇండియా తీర్మానాన్ని బలపర్చుతూ తీర్మా నించిన జిల్లా బోర్డుల, మునిసిపాలిటీలను రద్దుచేసి నట్లుగానే, విజయవాడ మున్సిపాలిటీని కూడా ప్రభుత్వం రద్దుచేసింది. ప్రభుత్వం అనేకచోట్ల గ్రామాలపై సాముదాయక జరిమానా విధించింది.

కృష్ణాజిల్లా ఈడుపుగల్లు వాసులకు రు. 500 జరి మానా విధించింది. బెజవాడ తాలూకా దొడ్డపాడు వాసులకు రు. 3000 సాముదాయక జరిమానా విధించింది. అలాగే గుడ్లవల్లేరు గ్రామానికి రు. 500 జరి మానా విధించబడింది. పెనుమత్ర గ్రామానికి రు. 700 జరిమానా విధించబడింది. ఈ సాముదాయక జరిమా నాలు విధించడంలో కూడా "విభజించు పాలించే" నీతినే ప్రభుత్వం అవలంబించింది. ముస్లిములను, క్రైస్తవులను, షెడ్యూలు కులాలవారిని, ప్రభుత్వ సేవకులను, ప్రభుత్వ బిరుదులు పొందినవారిని, సైనిక కుటుంబాలను, రైల్వే స్థానిక సంస్థల ఉద్యోగులను జరిమానాలు వేయకుండా మినహాయించింది ప్రభుత్వం.

బెజవాడలో జాతీయ యువజన సంఘంశాఖ ఆయుధాలను, మందుగుండు సామగ్రిని పోగుచేయడానికి ప్రయత్నించడమే కాక బాంబులు చేయడానికి కూడా ప్రయత్నించింది. పోతిన వెంకన్నకు రాసిన ఒక ఉత్తరం పోలీసుల చేతిలో పడింది. 1943 ఫిబ్రవరి 3 న బందరు కాల్వగట్టున, ఈ ఉత్తరం ఆధారంగా సోదా చేశారు. 15 తుపాకిగుళ్ళు, ఒక దేశవాళీ పిస్తోలు, అనేక రకాల బాంబులు దొరికాయి. రాంపల్లి సూర్యనారాయణ ఇంటిని సోదా చేయగా ఒక హాండ్ క్రెడిల్ ప్రెస్, నిప్పుపెట్టే బాంబు దొరికింది. పడిపెసి మరిదయ్య ఇంటిని సోదా చేయగా అతడు దేశవాళీ పిస్తోలు అప్పగించాడు.

ఇలాగే క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో జరిగిన కొన్ని సంఘటనలను పరిశీలించుదాం. పోతిన వెంకన్నగార్ని బాంబుకేసులో 1943 డిసెంబరు 2 న అరెస్టుచేసి విజయవాడ ఒన్ టౌను పోలీసుస్టేషనులో డిసెంబరు 16 వరకూ లాకప్‌లో వుంచి 17 న విజయవాడ సబ్ జైలుకు పంపారు. 1944 మార్చిలో బెయిల్ ఇచ్చాడు. జూన్ నాటికి విచారణ పూర్తి అయినది. 1945 జనవరిలో కేసు కొట్టివేశారు.

## జగ్గయ్యపేట బాంబు కేసు

యుద్ధనిధికి డబ్బు ఇవ్వవద్దని రేబాల బుచ్చిరామ శేషయ్య శ్రేష్ఠి మొదలైన కాంగ్రెస్ నాయకులు ప్రచారంచేశారు. ఐనా జగ్గయ్యపేటలో 20-9-1942న జిల్లా కలెక్టర్ సమక్షాన "చింతామణి" నాటకం ప్రదర్శించడానికి ఏర్పాట్లు జరిగాయి. ఈ నాటక ప్రదర్శనను ఏ విధంగానైనా భగ్నం చేయాలని స్థానిక కాంగ్రెస్ నాయకులు ప్రయత్నించారు. అప్పటివరకు అహింసావాది, గాంధేయవాది అయిన డాక్టర్ కలవకొలను శోభనాద్రి ఈ ప్రదర్శనను భగ్నం చేయడానికి ఒక పథకం వేశాడు. చేతిబాంబులు తయారు చేయడానికి అవసరమైన పదార్థాలను తెప్పించాడు. బోగం వెంకయ్య అనే ఆయనచేత మూడు చేతి బాంబులు తయారు చేయించాడు. నాటకం రసవత్తరంగా జరుగుతున్న సమయంలో కలెక్టర్ మహంతిపై ఒక బాంబు విసరబడింది. కాని అది పేలలేదు. కలె

క్టర్ తప్పించుకొన్నాడు. మరోసారి బాంబు పేలింది. అది కలెక్టర్ కుర్చీకి తగిలింది. మహంకాళి వెంక టేశ్వర్లు అనే ఆయన తొడపై ఆ బాంబు పేలింది. ఆయిగురికి గాయాలు తగిలాయి. కలెక్టర్ తప్పించు కొన్నాడు. ఈ కేసులో తూమాటి యోగానందా చార్యులుగారికి 7 సంవత్సరాలు, మళ్ళ నాగయ్యా గారికి 7 సంవత్సరాలు, దివ్వెల విశ్వనాధంగారికి నాల్గున్నరసంవత్సరాలు, డా॥ కలవకొలనుశోభనాద్రి గారికి 3 సంవత్సరాలు, పెపురపు నాగభూషణం, నకిరికంటి కృష్ణమూర్తి, మరవాది రామమూర్తి గారు తలా ఒక సంవత్సరం శిక్ష విధింపబడింది. డా॥ శోభనాద్రిగారు సబ్ జైలునుంచి పారిపోయి, కొన్నాళ్ళు రహస్య జీవితం గడిపారు. చివరకు పట్టు పడగా మరొక ఆరునెలల శిక్ష విధించబడింది. ఈ కేసులో అసలు నిందితులను కొందర్ని వదలివేశారనీ కొందరు అమాయకుల్ని కేసులో చేర్చారనీ కొందరు ఆక్షేపించారు బాంబుల్ని దాచి సమయానికి అందించిన ధూళిపాళ వెంకటేశ్వర్లును ఈ కేసులో పట్టుకోలేదట.

## రంగనాధ్ కులకర్ణి

కాంగ్రెసు సోషలిస్టుపార్టీ తరపున అచ్యుత పట్వ ర్ధన్ మద్రాసు కేంద్రంగా చేసుకొని దక్షిణ భారత దేశంలో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా రహస్య ఉద్యమాన్ని నిర్వహించుతూ వచ్చారు. ఆయన రంగనాధ కులకర్ణి అనే ఆయన్ని ముదునూరు పంపాడు. ముదునూరు అప్పటికే అన్నె అంజయ్యా గారి నాయకత్వాన రహస్య ఉద్యమానికి కేంద్రంగా వుంది. కులకర్ణి వచ్చేసరికే అంజయ్యగారు అరె స్టయ్యారు. భూపతి కోటేశ్వరరావు, రామకుమార వర్మ, మైనేని రామకోటయ్య, కలపాల సూర్య ప్రకాశరావు గారలతో కలిసి కులకర్ణి జిల్లాలో రహ స్యంగా కొన్నాళ్ళు తిరిగాడు. ఒక రాత్రి బందరు వెళుతుండగా అరెస్టయాడు. జైలులో ఆయన్ని నానా హింసలు పెట్టారు. 6 మాసాలు విచారణ లేకుండా చీకటి కొట్టులో వుంచారు. విజయవాడ మేజిస్ట్రేట్ కోర్టులో కేసు నడుస్తుండగా ఆయన్ని సహచరులు తప్పించారు. నాగపూర్ పంపారు. కొంతకాలానికి ఆయన్ని పునారో అరెస్టుచేసి, విజయవాడలో విచా రణ చేశారు. కాని ఆయన మీద కేసు నిలవలేదు. కేసు కొట్టివేశారు. కులకర్ణి వద్ద దొరికిన ఆచూకీతో ముదునూరులో నాగులపల్లి సీతారామయ్యను అరెస్టు చేసి రహస్య పర్యాయ్యలర్ల స్వాధీనం చేసుకొన్నారు. కులకర్ణి రహస్యంగా వుండగా భూపతి కోటేశ్వర రావు, రామకుమారవర్మ, మైనేని రామకోటయ్య, తాతినేని సుబ్బయ్య (దొర), కొల్లి వెంకటదాసు, చావలి వెంకటనారాయణ, మొవ్వ సత్యనారాయణ, కలపాల సూర్యప్రకాశరావు మొదలైనవారు సహాయ పడ్డారు.

క్విట్ఇండియా ఉద్యమ సందర్భంగా 1942–44 లో ఈ కిందివారిని డిటెన్యూలుగా ప్రభుత్వం నిర్బంధించింది. శ్రీయుతులు డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, గొట్టిపాటి బ్రహ్మయ్య, కొడాలి ఆంజనేయులు, కామినేని వెంక టప్పయ్య, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, వల్లభనేని రామబ్రహ్మం, అన్నె అంజయ్య, పేట బాపయ్య, కాకాని వెంకటరత్నం, మరుపిళ్ళ చిట్టి, భూపతి కోటేశ్వరరావు, సిరిపురపు కోటేశ్వరరావు, మెల్లి షోలింగర్, సన్నిధానం కృష్ణమూర్తి, పింగళి పానకాలు.

## ముదునూరు

అన్నె అంజయ్య, కామినేని వెంకటప్పయ్యగార్లు డిటెన్యూలుగా నిర్బంధింపబడక పూర్వం జిల్లాలో రహస్య ఉద్యమాన్ని నిర్వహించుతూ వుండేవారు. ముదునూరును ఈ రహస్య ఉద్యమానికి కేంద్రంగా పెట్టుకొన్నారు. పోలీసుల కంటబడకుండా తిరుగుతూ వీరు యువకులకు ప్రోత్సాహం ఇస్తూ వుండేవారు.

1939 ఆఖరులో గోపరాజు రామచంద్రరావు (గోరా) గారు తమ కుటుంబంతో సహా ముదునూరు వచ్చి నాస్తిక కేంద్రం నెలకొల్పారు. అన్నె అంజయ్యగారి ఆహ్వానంపైన, వారి పోషణ కింద ఈ కేంద్రం నిర్వహించబడుతూ వుండేది. ఈ కేంద్రాన్ని తమ రహస్య కార్యక్రమాలకు అంజయ్య గారు ఉపయోగించుకొంటూ వచ్చారు. కాకుమాను లక్ష్మయ్యచౌదరి, అన్నె అంజయ్య, అన్నె సుబ్ర హ్మణ్యం మొదలగువారు కలిసి, జిల్లా కాంగ్రెస్ కార్యవర్గం సమావేశమై క్విట్ ఇండియా ఉద్యమాన్ని ఈ జిల్లాలో నడిపేందుకు పథకాలను రూపొందిం

చారు. నాసిక కేంద్రం నుంచి "కాంగ్రెస్" అనే రహస్య పత్రికను రోటరీ మిషన్‌పై తయారుచేసి, జిల్లాలోని ఇతర ప్రాంతాలకు పంచిపె వారు. పోలీసుల నిఘా నుంచి తప్పించడానికి ఈ ప్రెస్‌ను ప్రతి రోజూ తలా ఒక ప్రదేశానికి మార్చి స్తూ వుండే వారు. ఈ పత్రికకు బెజవాడ నుంచి డా॥ తెన్నేటి చలపతిరావుగారి ద్వారా, కేంద్ర రహస్య ఉద్యమం తాలూకు సమాచార పత్రాలు అందచేయబడుతూ వుండేవి.

రోజు కొకచోట తిప్పుతూ వుండటంతో దానికి "తిరుగుడు ప్రెస్" అని పేరు వచ్చింది. 1942 డిసెంబరులో అన్నె అంజయ్యగారిని ఇంటివద్దనే అరెస్టు చేసి, డిటెన్యూగా పంపారు. ఆ తర్వాత ఈ గ్రామంలో ప్యూనిటివ్ పోలీసు దళం క్యాంపు పెట్టింది. రాత్రింబగళ్ళు అనేకచోట్ల సోదాలు చేస్తూ ప్రజలను వీరు నానా రకాలుగా హింసించేవారు. ఇళ్ళలో బియ్యాన్ని కోళ్ళను ఎత్తుకుపోయేవారు. అనుమానం గల వ్యక్తుల్ని చావబాదేవారు. పొలాల్లో నౌకర్లని బాధపెట్టేవారు. ఐనా 1932 ఉద్యమంలో వలెనే ఇపుడు కూడా ఈ గ్రామంలో ప్రెస్‌ను పోలీసులు పట్టుకోలేకపోయారు.

గుడివాడ సమీపంలోని పెదపారుపూడిలో మండవ వెంకటరత్నంగారి ఇంటిని రహస్య కేంద్రంగా ఉంచుకునేవారు. ఇక్కడ సమావేశాలు జరిగేవి. కొడాలి వెంకటచలం, యలమంచిలి భాస్కరరావు, పామిరెడ్డి సత్యనారాయణరెడ్డి మొదలైనవారు నాయకుల్ని రహస్య ప్రదేశాలకి చేర్చే కార్యక్రమాన్ని నిర్వర్తించేవారు.

అలాగే చినపారుపూడి దీవిలాగా ఉండేది. కొడాలి వెంకటరామయ్యగారి ఇంటిని రహస్య సమావేశాలకి ఉపయోగించుకొనేవారు. కార్యకర్తలకు తగు వసతులు సమకూర్చేవారు. పోలీసులకి ఈ గ్రామాల్లో ఏ మాత్రం అచూకీ దొరికేది కాదు.

కనుమూరులో కూడా ఒకసారి రహస్య సమావేశం జరిగింది. కామినేని గోపాలకృష్ణయ్య, పోలవరపు నాగేశ్వరరావు గార్లకు నిధి వసూలు చేసే కార్యక్రమం అప్పగించబడింది.

అన్నె అంజయ్యగారు అరెస్టు కాక పూర్వం బెజవాడకు చెందిన ఈమని. రాజరత్నశర్మ, ముదునూరు కేంద్రంతో సంబంధం పెట్టుకొని పనిచేస్తూ వుండేవారు. పశ్చిమ కృష్ణాలో కుర్రా వెంకటరత్నంతో కలిసి అనేక గ్రామాలు తిరిగారు. బందరు–బెజవాడ, రోడ్డుపక్క గ్రామాలలో రహస్య సమావేశాలు జరిపి యువకులను ఉత్సాహపరిచేవారు రహస్యంగా వున్న అంజయ్యగారిని. రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు రంగా, చంద్రమౌళి, లచ్చన్న, ఇంకా ఈ జిల్లా, ఇతర జిల్లాలలోని ప్రముఖులు వచ్చి కలుసుకునే వారు. చినపారుపూడి, గోపువానిపాలెం, కనుమూరు, కుందేరు, పెదపారుపూడి మొదలైనచోట్ల సమావేశాలు జరిగేవి.

కానరనేనివారి పాలెంలో కార్యకర్తలతో ఒక ముఖ్య రహస్య సమావేశం జరిగింది. అన్నె అంజయ్యగారు హాజరయ్యారు. ఎలాగో ఈ సమాచారం తెలుసుకుని రిజర్వు పోలీసులు వచ్చిపడ్డారు. జనాన్ని బెదిరించారు కాని, వారు ఆచూకీ ఏమీ చెప్ప లేదు. కొందరిని కంకిపాడు పోలీసుస్టేషన్‌లో నిర్బంధించి, తర్వాత వదలివేశారు.

## శేరీ కల్వపూడి

1942 ఆగస్టు 25 న కొపురవోలు గాంధీ ఆశ్రమంలో రహస్య సమావేశం జరిగింది. సుమారు 200 మంది కార్యకర్తలు హాజరయ్యారు. గోనుగుంట్ల సుబ్రహ్మణ్య గుప్త అధ్యక్షత వహించారు. ఈ సమావేశం తర్వాత బెజవాడ–బందరు రైల్వే లైనులో వున్న కలవపూడి సమీపంలో రైలు పట్టాలు పీకివేయబడినాయి. ఈ గ్రామం వారే కాక చుట్టు పక్కన గల గ్రామాల వారు, అంగలూరు గ్రామస్తులు పాల్గొన్నారు. ఈ కార్యక్రమానికి చలసాని నాగభూషణం ఆధ్వర్యం వహించారు. తర్వాత ఈ గ్రామాల్లో పోలీసు జులుం హెచ్చింది.

అల్లూరి సీతారామారావుగారు కోలవెన్ను వాస్తవ్యులు. క్విట్‌ఇండియా ఉద్యమంలో పూనాలో లా కాలేజీలో చదివేవారు. ఆ చదువు మానివేసి రాజకీయాల్లో ప్రవేశించారు, గాంధీజీ ఉపవాసం చేస్తున్నపుడు పూనాలో జరిగిన బ్రహ్మాండమైన నిరసన ప్రదర్శనలో పాల్గొన్నారు. పోలీసుల కాల్పుల్లో తుపాకిగుండు పక్కగా దూసుకుపోవడంతో ప్రాణాపాయం తప్పింది. అన్నె అంజయ్యగారి రహస్య

స్థావరంలో చేరి పనిచేశారు. కులకర్ణిని ఆంధ్రకు తీసుకురావటంలో కృషిచేశారు. కులక అరెస్టు తర్వాత కొన్నాళ్ళకు ప్రభుత్వం అరెస్టు చేసింది. 1942 లో వందమందితో కాంగ్రెస్ వాదళాన్ని నిర్మించారు.

### ఉరుటూరు

ఉరుటూరులో జరిగిన రహస్య సమావేశ నిర్ణయం ప్రకారం టెలిఫోన్, టెలిగ్రాం తీగలు తెంచివేయటం జరిగింది. గుడివాడ, పెదముత్తేవి గ్రామాలను కేంద్రంగా చేసుకొని యువకులు ఈ కార్యక్రమాన్ని నిర్వర్తించారు.

### ఉప్పలూరు

పునాదిపాడు కేంద్రంగా మరికొందరు, కంకిపాడు చుట్టుపక్కల, కాసరినేనివారిపాలెం, చోడవరం, వల్లూరివారిపాలెం, వణుకూరు, కొయ్యగూరపాడు గ్రామాలలో రహస్య సమావేశాలు జరిపారు. ఉప్పలూరు, పునాదిపాడు గ్రామ ప్రజలతో కలిసివెళ్ళి ఉప్పలూరు స్టేషన్‌ను ఆగస్టు 16 న తగులబెట్టారు. పునాదిపాడు హైస్కూలు పాకలు తగులబెట్టారు. చుట్టుపక్కల తంతితీగలు తెంచివేశారు 1943 మేలో బెజవాడ జాయంట్ మేజిస్ట్రేట్ ఉప్పలూరు షన్ తగలపెట్టారని నేరం మోపిన కేసులో, ము యిలే తగులబెట్టినట్లు రుజువు కాలేదని కేసు కొట్టి శారు, ఉప్పలూరు గ్రామంపై సామూహిక జరిమానా విధించబడింది. అంతకుముందు మద్దాలి జగన్నాథంగారిని అరెస్టుచేసి తీసుకువెళుతుండగా, కంకిపాడువద్ద, జనసమూహం అడ్డగించి నినాదాలు చేయగా, పోలీసులు లాఠీచార్జీ చేశారు.

### మద్రివాడ

మద్రివాడ వాస్తవ్యులు నిర్ణీత కార్యక్రమం ప్రకారం తంతి తీగలు తెంపుట మొదలైన విధ్వంసక కార్యక్రమాల్ని నడిపారు.

### నిడమానూరు

నిడమానూరు సమీపంలో చెన్నుపాటి రామకోటయ్యగారి నాయకత్వాన కొందరు యువకులు 1942 సెప్టెంబరులో రైలుపట్టాలు పీకారు. తంతి తీగెలు తెంచివేశారు. ప్రభుత్వం వీరిని అరెస్టుచేసి నానా హింసలుపెట్టి చుట్టుప్రక్కల నాల్గు గ్రామాల మీద అపరాధపు పన్ను విధించింది

### కొండప

కొండపల్లి–గంగినేని మధ్య బ్రిడ్జీలను డైనమేట్లతో పేల్చివేయడానికి వెల్లంకి పూర్ణచంద్రయ్యగారి నాయకత్వాన ఒక దళం పనిచేసింది. నాల్గురోజులు అడవుల్లో దాగి సమయంకోసం వేచివున్నారు. ఒక రోజున ఒక బ్రిడ్జికి పెట్టిన డైనమేట్, అతిశక్తివంతమైనది కాకపోవటంచేత, కొద్ది నష్టమే జరిగింది. పూర్ణచంద్రయ్య, వెల్లంకి సుబ్బారావుగార్లను ప్రభుత్వం అరెస్టు చేసింది.

### నిడుమోలు

1942 సెప్టెంబరులో బందరు–బెజవాడ ట్రంకు రోడ్డుకు నిడుమోలువద్ద గండి కొట్టారు. దీనికి తూర్పు కృష్ణాజిల్లా సహాయ కార్యదర్శి సూరపనేని వెంకటేశ్వరరావుగారు నాయకత్వం వహించారు. వీరికి సహాయంగా నిమ్మకూరు, యలకుర్రు, నెమ్మలూరు, నిడుమోలు, మంత్రిపాలెం, కొరిమెర్ల గ్రామ కార్యకర్తలు సహాయపడ్డారు. కొరిమర్ల గ్రామంపై రు. 1600 సాముదాయక జరిమానా విధింపబడింది. వెంకటేశ్వరరావుగారి గ్రామ వాస్తవ్యులే. (ప్రకాశం మంత్రివర్గం ఏర్పడ్డాక, ఈ మొత్తాన్ని వాపసు చేశారు.)

### దోసపాడు-ఇందుపల్లి

గన్నవరం తాలూకా కొయ్యగూరపాడులో రహస్యంగా సమావేశం జరిపిన యువకులు కొంతమంది, దోసపాడు–ఇందుపల్లి స్టేషన్ల మధ్య రైలు పట్టాలు పీకారు. తంతి తీగెలు తెంచారు. మూడు రోజులు రైళ్ళు ఆగిపోయాయి. రైలుపట్టాలు బాగు చేసిన వెంటనే మళ్ళా పీకివేశారు. ఆచూకీ సంపాదించి, వీరందరినీ అరెస్టుచేసి నానాహింసలు పెట్టారు. ఎక్కువమందికి జైలుశిక్షలు పడ్డాయి. గ్రామంమీద సాముదాయక జరిమానా విధించబడింది.

### గుంటుపల్లి

పెదర్ల వేణుగోపాలరావుగారి నాయకత్వాన ఒక రహస్య దళం ఏర్పడి, గుంటుపల్లి చుట్టుప్రక్క-

గ్రామాలలో కరపత్రాలు పంచారు. తంతి తీగెలు తెంచారు. పోస్టుబాక్సులు పాడుచేశారు. రైలుపట్టాలను పీకివేశారు. వీరిని అరెస్టుచేసి జైలుశిక్షలు విధించారు.

## పోలుకొండ

పోలుకొండ కేంద్రంగా అట్లూరి వెంకట సుబ్బయ్య, పిన్నమనేని సత్యనారాయణ, యలమంచిలి భాస్కరరావుగార్ల నాయకత్వాన, పుల్లచెరువు రైల్వే స్టేషన్ వద్ద పట్టాలు పీకివేశారు. ఈ పనిలో మొఖాసా కలపూడి, గండేపూడి, తమిరిశ గ్రామస్థులు కూడా పాల్గొన్నారు. బాగుచేయిస్తున్నా తిరిగి తిరిగి విధ్వంసక చర్యలు చేస్తూనే ఉండేవారు. సాముదాయక జరిమానా విధించబడింది.

## చల్లపల్లి ప్రాంతంలో

పునుకొల్లు సీతారామాంజనేయులుగారి నాయకత్వాన చినముత్తేవిలో సమావేశం జరిగింది. ఆ సమావేశ నిర్ణయం ప్రకారం చల్లపల్లి అవనిగడ్డ ప్రాంతాలలో, తంతి తీగెలు తెంపడం, పోస్టు ఆఫీసుల్ని తగలబెట్టడం మొదలైన కార్యక్రమాలు నిర్వహించారు.

## కొణకంచి

1942 ఆగస్టు ఉద్యమంలో కొణకంచిలో 25 మంది యువకులు, ఒక మహిళా పాల్గొన్నారు. ఆగస్టు 21 న ఇద్దరు గ్రామనౌకర్లు (మొహతాదులు) రాజీనామా ఇచ్చారు. స్థానిక ఆస్పత్రిలోని నర్సింగ్ ఆర్డర్లీగా ఉన్న మలసాని నాగయ్య రాజీనామా చేశారు. రిజర్వ్‌పోలీసులు కాంగ్రెసు భవనాన్ని సోదాచేసి జాతీయజెండాలు తీసుకొన్నారు. వారంరోజులు ఆ భవనాన్ని ఆక్రమించారు.

అనుమల రామగోవిందశర్మగారిని పదిరోజులు రేపల్లె బుచ్చిరామశ్రేష్ఠిగార్లను పదేసరోజుల చొప్పున మూడుసార్లు డిటెన్ చేశారు.

బండి తిరుపతయ్యగారు మద్రాసు వెళ్ళి సత్యాగ్రహం చేశారు. ఈ ఊరు కేంద్రంగా చేసుకొని, నందిగామ, పెనుగంచిప్రోలు ప్రాంతాలలో టెలిఫోను, తంతి తీగలను తెంచటం, పోస్టాఫీసులు తగలబెట్టటం, చర్చిల్ బొమ్మలు చేసి మీటింగులలో తగలబెట్టటం మొదలైన కార్యక్రమాలు సాగించారు. ఆగస్టు ఉద్యమ యువకులు కోయ రంగనాయకులు గారు నాయకత్వం వహించారు. ఆంధ్రకేసరి భవనం (కాంగ్రెస్ భవనం)ను పోలీసులు ఆక్రమించుకొన్నపుడు సాతులూరి రాఘవయ్యగారు నిరోధించారు. యుద్ధనిధి వసూలుకాకుండా కొణకంచి చిన వెంకటేశ్వరరావుగారు ప్రచారం చేశారు. సంవత్సరం మొదలు మూడేళ్ళ వరకు శిక్షలు పొందిన వారిలో బండి తిరుపతయ్య, కోయ రంగనాయకులు, సంగిరెడ్డి, నరమట్టు నారాయణ, తుటారపు భద్రయ్య బండి ముత్తయ్య, లావు వీరయ్య గార్లు వున్నారు. వీరి శిక్షలు అప్పీలులో కొంత తగ్గింపబడాయి. మరో 13 మందిని 105 రోజులు మొదలు 30 రోజులదాకా సబ్‌జైలులో ఉంచారు. నల్గురు డిఫెన్సు పెట్టుకోగా విడుదలయ్యారు. మరో తొమ్మిదిమంది ఉద్యమంలో పాల్గొన్నా, వారిని అరెస్టు చెయ్యలేదు.

## నందివాడ

దోసపాడు రైలే స్టేషన్ దిగువ భాగాన రైలు పట్టాలు తొలగించి స్లీపర్లకు నిప్పు పెట్టారు. ఈ కార్యక్రమానికి ఈ ప్పగంటి లింగయ్య, పూనూరు వెంకారెడ్డి, యార్లగడ్డ వెంకట నారాయణ, ఆచంట రామచంద్రరావు, వల్లభనేని సుబ్రహ్మణ్యం, ఆచంట రామబ్రహ్మంగార్లు నాయకత్వం వహించారు. కొండ అప్పలరాజు, బెల్లపు వెంకయ్య, కొండపల్లి పరకు రామరెడ్డి, చుక్కా నక్షత్రం, నందివాడ రామారావు గార్లు కూడా వీరితో పాల్గొన్నారు. నందివాడ గ్రామస్థులు, 50 మంది హరిజనులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

మరోసారి బుడమేరు వరదలు ఉధృతంగా వచ్చినా, చేలు మునిగిపోయి వున్నా, నందివాడ గ్రామస్తులు 100 మంది చేలకు అడ్డంపడి దోసపాడు స్టేషన్ ఎగువ భాగాన రైలు పట్టాలు తొలగించి, స్లీపర్లకు నిప్పంటించారు. పైన ఉదహరించిన మొదటి ఆర్గురు ఈ కార్యక్రమానికి నాయకత్వం వహించారు. 1942 సెప్టెంబరులో 10 లారీలలో పోలీసులు వచ్చి వీరి ఇళ్ళను ఒకేసారి చుట్టుముట్టి అర్ధరాత్రిన అరెస్టు చేశారు. ఇళ్ళలోని వారందరినీ దేవాలయం వద్దకు తీసుకొచ్చి తీవ్రంగా లాఠీఛార్జీ చేశారు. పూనూరు

వెంకారె , ఆచంట రామబ్రహ్మం, ఈడ్పుగంటి లింగయ గార్లను స్పృహ తప్పేలాగ కొట్టారు.

ఇం పాల్గొన్నవారిలో ఆచంట సీతయ్యగారి కుమారుడు పిచ్చయ్యగారికి బదులు బ్రహ్మయ్యగారి కుమారుడు పిచ్చయ్యను అరెస్టు చేశారు. ఇంకా కొండ అప్పలరాజు, చొక్కా నక్షత్రం, చావగడ్డ వెంకటేశు, చావగడ్డ సోమయ్య, గురుముచ్చు రామస్వామి, పెయ్యల నాగయ్యగార్లను అరెస్టు చేశారు. వీరందరినీ మూడు మాసాలు సబ్‌జైలులో ఉంచిన తర్వాత 24-12-1942 న శిక్షించి, 30 వ తేదీన అలీపురం (బళ్ళారి) క్యాంపు జైలుకు పంపారు. శిక్షల వివరాలు :

ఈడ్పుగంటి లింగయ్య-3 ఏళ్ళు రు. 400 జరిమానా, పూనూరు వెంకారెడ్డి-3 ఏళ్ళు యార్లగడ్డ వెంకటనారాయణ-2 ఏళ్ళు రు. 400 జరిమానా, ఆచంట రామచంద్రరావు-2 ఏళ్ళు 10 కొరడాదెబ్బలు, వల్లభనేని సుబ్రహ్మణ్యం 2 ఏళ్లు 10 కొరడా దెబ్బలు, కొండ అప్పలరాజు 2 ఏళ్ళు 10 కొరడా దెబ్బలు, చొక్కా నక్షత్రం (హరిజనుడు) 2 ఏళ్ళు 10 కొరడా దెబ్బలు, చాట్రగడ్డ వెంకటేశు (హరిజనుడు) ఒక సంవత్సరం, చాట్రగడ్డసామియేలు (హరిజనుడు) ఒక సంవత్సరం, పెయ్యల నాగయ్య (హరిజనుడు) ఒక సంవత్సరం (జైలుకు వెళ్ళి 2 మాసాల్లో జైలులోనే చనిపోయాడు.) కొండపల్లి పరశురామారెడ్డిని నెలరోజులు రిమాండ్‌లో వుంచి వదలి పెట్టారు. నందివాడ రామారావు గారిని అరెస్టు చేసి 15 రోజులు రిమాండ్‌లో వుంచారు.

గుడివాడలో రైలు పట్టాలు పీకివేసిన వారిలో నందివాడ వాస్తవ్యులు, ఈడ్పుగంటి కోటేశ్వరరావుగారు వున్నారు.

నందివాడేగాక గుడివాడ, అంగలూరు, చౌటపల్లి, పోలుకొండ, గండెపూడి, మొకాసా కల్వపూడి వగైరా గ్రామస్థులు సమీపంలోని రైలు పట్టాలు పీకివేశారు. టెలిగ్రాఫ్ తీగల్ని తెంచివేశారు. స్లీపర్లను తగలబెట్టారు. ఈ కార్యక్రమంలో ప్రజలు వందలాది సంఖ్యలో పాల్గొన్నారు.

## గుడివాడ

కురళ్ళ భుజంగరావు ఆధ్వర్యాన 20 మంది యువకులు గుడివాడ పరిసర గ్రామాల్లో సంవత్సరంపాటు ఉద్యమాన్ని కొనసాగించారు. మోటూరు-గుడివాడ మధ్య రైలు పట్టాలను, మోటూరు దొండపాడు మాలవారి సహాయంతో పీకించాడు. ఆయా గ్రామలు పోలీసుల హింసాకాండకు గురియై జైలు శిక్షలనుభవించారు.

## చౌటపల్లి

1942 సెప్టెంబరు, అక్టోబరు నెలల్లో అట్లూరి సత్యనారాయణ, ఘంటసాల వెంకటేశ్వరరావు (ప్రఖ్యాత సినీ గాయకుడు) గార్ల నాయకత్వాన 50 మంది రైలు పట్టాలు పీకుట, తంతి తీగలు తెంచుట వగైరా కార్యక్రమాల్లో పాల్గొన్నారు. పోలీసు నిర్బంధ విధానానికి, సాముదాయక జరిమానాకు ఈ గ్రామం గురయ్యింది.

## కౌతవరం

1905 నాటి నుంచీ అన్ని జాతీయోద్యమాలలోను ప్రముఖ పాత్ర వహించిన కౌతవరంలో క్విట్ ఇండియా ఉద్యమం కూడా బాగా వేళ్ళూనింది. బొడ్పా ఆదినారాయణమూర్తి నాయకత్వాన చుట్టుపక్కల 20 మైళ్ళ దూరంలో తంతి తీగలు తెంచటం, రైలు పట్టాలు పీకటం లాంటివి కొనసాగించారు. పామిరెడ్డి సత్యనారాయణరెడ్డి, యలమంచిలి భాస్కరరావు, కొడాలి వెంకటచలం లాంటి సాహసవంతులైన యువక బృందం, మదునూరు రహస్య కేంద్రంతో సంబంధం పెట్టుకొని పనిచేసేవారు. ఆదినారాయణమూర్తిగారు ఈ యువకుల సహాయంతో విధ్వంసక కార్యక్రమాన్ని సాగించేవారు.

బంటుమిల్లి సౌత్‌సైడ్ కెనల్ మీద వున్న టెలిఫోన్ తీగలు తెంపారని మొత్తం 15 మందిని అరెస్టు చేసి గుడివాడ తీసుకువెళ్ళారు. వారు — బొడ్పా ఆదినారాయణమూర్తి, వీరపనేని గోపాలకృష్ణయ్య, చౌదరి, బొడ్పా మధుసూదనరావు, వడ్లమూడి శ్రీకృష్ణమూర్తి, వడ్లమూడి నరసింహారావు, బొడ్పా శేషగిరిరావు, బొడ్పా వీరభద్రరావు, వడ్లమూడి కోటయ్య, బొడ్పా దశరథరామయ్య, కొల్లి గంగాధరరావు, బొబా వెంకటేశ్వరరావు (తండ్రి భూషయ్య), నిమ్మగ షణ్ముఖాచారి, రొంపిచెర్ల మాధవాచార్యులు, బొబా అంకమ్మ (హరిజన్), వడ్లమూడి జానకిరామయ్య.

వీరిలో కొందరిని వెంటనే విడుదల చేశారు. మరి కొందరిని సబ్‌జైలులో కొన్నాళ్ళు వుంచాక వదిలి వేశారు.

బొబ్బా ఆదినారాయణమూర్తి, బొబ్బా మధుసూదనరావు, వడ్లమూడి శ్రీకృష్ణమూర్తిగార్లకు ఒకొక్కరికి రెండేళ్ళ కఠిన శిక్ష, 12 కొరడా దెబ్బలను విధించారు. వారితోపాటు పామిరెడ్డి సత్యనారాయణరెడ్డి, కనుమూరి రామిరెడ్డి (దోకిపర్రు), కె. రఘురామయ్య (గొల్వేపల్లి), ఎర్నేని సూరనారాయణ (కొమరవోలు గాంధీ ఆశ్రమం) గార్కూడా రెండేళ్ళ శిక్ష 12 కొరడా దెబ్బల శిక్ష విధించబడింది.

ఒక రోజు రాత్రి స్వాతంత్ర్య సమరయోధులకు భోజనం పెట్టారన్న కారణంతో కానూరి చినవెంకటదాసయ్యగారిని అరెస్టుచేసి రెండేళ్ళ కఠిన శిక్ష విధించారు. వీరు సబ్‌జైలులో నిరాహారదీక్ష పూనినపుడు, వారి ధర్మపత్ని రాఘవమ్మగారు మేజిస్ట్రేట్‌ను ఎదుర్కొని "ప్రభుత్వం మాది, ఉద్యోగంనుంచి తొలగిపొండి" అని నినాద మిచ్చింది. అందుకు ఆమెకు సంవత్సరం శిక్ష విధించబడింది. శిక్షలను ఇద్దరూ అనుభవించారు.

## ఆకునూరు

కాకాని వెంకటరత్నంగారు ఈ గ్రామస్థులే. ఈయన్ని 1942 సెప్టెంబరు 10 న ప్రభుత్వం డిటెన్ చేసింది. బండి గోపాలాక్షరావు, చలపతిరావు, కంతేటి చలపతిరావు, మాలెంపాటి వెంకట నరసయ్య, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి (ఈయన తర్వాత కమ్యూనిస్టుగా మారాడు. ప్రజానాట్యమండలిలో కృషి చేశారు. సుప్రసిద్ధ సినీనటుడు. నాటక కళకు సంబంధించి అనేక రచనలు చేశారు) ముదునూరు కేంద్రంతో సంబంధం పెట్టుకొని రహస్య సాహిత్యాన్ని పంచుతూ వుండేవారు.

## నూజివీడు

క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో దశిక సూర్యప్రకాశరావుగారికి సంవత్సరం శిక్ష విధించబడింది. కోసూరి నరసింహమూర్తిగారికి రెండేళ్ళ శిక్ష విధించబడింది.

షేక్ నూరుల్లా సాహెబ్, యరజర్ల వెంకయ్య, నంబూరు బుల్లెయ్య, ఆరేపల్లి చెన్నయ్యగార్లు తంతి తీగెలు తెంచారు. కొన్నాళ్ళు పోలీసులకు చిక్కకుండా తప్పించుకొన్నారు. వారిని 1942 సెప్టెంబరు 21 న అరెస్టుచేసి 23 న మూడేసి నెలలు శిక్ష రు. 100 జరిమానా విధించారు. వీరుకాక గాజర్ల పిచ్చయ్య మార్కాపురంలో ఒక నెల, ఆలపాటి సత్యనారాయణ గన్నవరం సబ్‌జైలులో మూడు మాసాల నిర్బంధం, సముద్రాల సత్యనారాయణ, మల్లాది శివరామచంద్రమూర్తి సూరవరంలో ఒక సంవత్సరం శిక్ష పొందారు.

## గొడవర్రు

ఇక్కడ తంతి తపాల తీగల్ని తెంచి, తపాలా పెట్టెల్ని తగులబెట్టారు. తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ సహాయ కార్యదర్శి సూరపనేని వెంకటేశ్వరరావు నాయకత్వాన యువకులు బందరు - బెజవాడ రోడ్‌పై విదుమోలువద్ద గండికొట్టారు. కొలిమర్ల గ్రామంపై సామూహిక జరిమానా విధించబడింది.

## మైలవరం

గార్లపాటి సుబ్రహ్మణ్యంగారు స్వయంగా డప్పు వేసి గ్రామంలో బహిరంగసభకు జనాన్ని పోగు చేశారు. బెజవాడ నుంచి వచ్చిన మతం బాల సుబ్రహ్మణ్యంగుప్త ఉపన్యసించారు. గార్లపాటి సుబ్రహ్మణ్యంగారికి శిక్ష పడింది. శిక్షనుంచి విడుదలయ్యాక జయంతిపురం సమీపంలో సైక్లోస్టయిల్ మెషిన్‌పెట్టి రహస్య కరపత్రాలను ముద్రించి పంచిపెట్టారు.

## విస్సన్నపేట

రహదారీ బంగళాను క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో తగలబెట్టారు. నాయుడు సుబ్బయ్య, జగన్నాధాచారి, కాశీ సోమశేఖరాచారి, సాలార్ సాహెబ్ గార్లను అరెస్టుచేసి జైలు శిక్ష విధించారు.

## తిరువూరు

క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా జిల్లాబోర్డు హైస్కూలు పాకల్ని ఆగస్టు 30 న తగులబెట్టారు. గింజుపల్లి సత్యనారాయణ అనే విద్యార్థిని అరెస్టు

చేశారు. అప్పటికి ఇతని వయస్సు 14 ఏళ్ళు. చాలా రోజులు పోలీసులు సత్యనారాయణగారిని తమ కస్టడీలో వుంచుకున్నారు. సబ్ కలెక్టర్ కొండపల్లి, విజయవాడ, నందిగామ మొదలైనచోట్ల విచారణకు వాయిదాలు వేశారు. తిరువూరు తాలూకా ఆఫీసువద్ద ఉద్యోగుల, గ్రామస్థుల సమక్షంలో రెండు చేతులు కట్టివేసి, 12 కొరడా దెబ్బలు కొట్టవలసిందిగా సబ్ కలెక్టర్ నందిగామలో శిక్ష చెప్పాడు. (సరోజినీ రేగాని సంకలనంలో 32 దెబ్బలు అని వుంది) ఆ విధంగానే తిరువూరులో శిక్ష అమలుజరుపబడింది. తర్వాత ఈయన కమ్యూనిస్టు ఉద్యమంలో చేరాడు. "సత్యం–గంగు" అనే పేరుతో రచనలు చేశాడు. కులాంతర వితంతు వివాహం చేసుకొన్న సంఘ సంస్కరణవాది అయ్యాడు.

క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంగా మురుకుంట్ల వెంకటప్పయ్యగారిని 1942 ఆగస్టు 12 న అరెస్టు చేశారు. సెప్టెంబరు 9న 9 నెలల శిక్ష విధించబడింది. క్విట్ ఇండియా ఉద్యమ ప్రాముఖ్యతను గురించి వివరించే సభకు వెంకటప్పయ్యగారు అధ్యక్షత వహించడమే వీరి నేరం. వీరి అరెస్టు తర్వాత తిరువూరు, నూజివీడు మార్గంలోని తంతి తీగల్ని కాంగ్రెస్ కార్యకర్తలు తెంచివేశారు. కఠారు వెంకయ్య మున్నగువారు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

నందిగామ తాలూకాలో ఫణితి తిరుపతయ్య, కట్టమూరు సత్యనారాయణ, దోరేపల్లి లక్ష్మీపతిగార్లు తంతి తీగెలు తెంచే కార్యక్రమంలో పాల్గొన్నారు.

దేశమంతటి లాగానే కృష్ణాజిల్లాలో కూడా క్విట్ ఇండియా ఉద్యమ ఉధృతిని రెండు నెలల్లోనే ప్రభుత్వం అణచివేయ గల్గింది. కాని సోషలిస్టుల రహస్య కార్యకలాపాలతో ప్రచారానికి సంబంధించినంత వరకు 1943 వరకు కొనసాగింది. 1943 సంవత్సరాంతానికి అనేకమంది నాయకులు విడుదలయ్యారు. నిషేధింపబడ్డ కాంగ్రెస్ స్థానే 1945 లో జిల్లా కాంగ్రెస్ అసెంబ్లీ ఏర్పడింది. ఈ పద్ధతినే రాష్ట్రీ సంఘం కూడా అనుసరించి రాష్ట్రీ కాంగ్రెస్ అసెంబ్లీని ఏర్పరచారు. ఈ లోగా 1944 జనవరి 26 న స్వాతంత్ర్య దినోత్సవం జరిగినపుడు జాతీయ విద్యార్థి సంస్థను, జాతీయ యువజన సమాఖ్యను ప్రభుత్వం నిషేధించింది. గాంధీ విడుదల అనంతరం కూడా కృష్ణాజిల్లాలో కాంగ్రెస్ సభలపై నిషేధం జారీ చేశారు. కాశీశ్వరరావుగారు ప్రభుత్వ చర్యలను నిరసించారు.

సోవియట్ యూనియన్‌పై హిట్లరు దురాక్రమణ సాగించిన తర్వాత యుద్ధం పట్ల ప్రదర్శించిన వైఖరి మూలాన, క్విట్ ఇండియా ఉద్యమం పట్ల అవలంబించిన వైఖరివల్లనూ కమ్యూనిస్టులకీ, కాంగ్రెస్ వారికీ మధ్య అగాధం పెరిగింది. ఆ విధంగా సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ శక్తులమధ్య దురభిమానాలు, వైషమ్యాలు, ఘర్షణలు ప్రబలాయి.

ఐనప్పటికీ, కాంగ్రెస్ నాయకుల్ని విడుదల చేయాలనీ, హిందూ ముస్లిం ఐక్యత ఏర్పరచాలనీ, జాతీయ ప్రభుత్వం ఒక్కటే ఫాసిస్టు శక్తులకీ, జపాను సైనిక శక్తులకీ వ్యతిరేకంగా పోరాడగలదనీ కమ్యూనిస్టులు స్పష్టంచేశారు. రైతు, కార్మిక, యువజన, మహిళ, విద్యార్థి సంఘాలను నెలకొల్పి పటిష్టం చేయసాగారు. 30 లక్షలమందిని బెంగాల్ కరువు పొట్టన పెట్టుకున్న సమయంలో వారికి అండగా నిలిచి, సంక్షేమ కార్యక్రమాలు ప్రారంభించారు. వారి దీన గాథల్ని సాంస్కృతిక ప్రదర్శనలద్వారా ప్రజలకు హత్తుకొనేటట్లు చేయగల్గారు. అందుకనే ప్రజలలోనూ, ప్రజా సంఘాలలోనూ వాడు వేళ్ళూనుకో గలిగారు. సామాన్య ప్రజల దైనందిన కష్టాల నివృత్తికి కొంతవరకు నిరంకుశాధికార్లులను లొంగదీయ గల్గారు.

క్విట్ ఇండియా ఉద్యమం తర్వాత స్వాతంత్ర్యం సాధించబడేవరకు జిల్లాకార్య కలాపాల్లో

1946 ఎన్నికలు మినహా కాంగ్రెస్ వాదులు సాగించిన ఉద్యమాలంటూ ఏమీ లేవు. ఐతే జిల్లాలోని కొన్ని రైతు ఉద్యమాలలోను, స్వాతంత్ర్యానికి పూర్వమూ, ఆ తర్వాతనూ నిజాం వ్యతిరేక తెలంగాణా స్వాతంత్ర్యానికి దోహదం చేయడంలోను కాంగ్రెస్ వాదులు పాటుపడ్డారు.



1905 నుంచి 1947 లో స్వాతంత్ర్యం సిద్ధించే వరకూ నిర్వహించిన జాతీయోద్యమాలన్నిటిలో కృష్ణా జిల్లా ప్రముఖపాత్ర వహించి, సగర్వంగా నిలబడింది. ఈఉద్యమాలలో ఎందరెందరో ప్రాణాలర్పించారు, త్యాగాలు చేశారు. కష్టనష్టాల కోర్చారు. వీటి అన్నిటి ఫలితమే స్వాతంత్ర్యసిద్ధి.

# స్వాతంత్ర్య సంగ్రామంలో తాలూకాల విశిష్టపాత్ర

## నందిగామం తాలూకా

అమరావతి ప్రభువు వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడికి, 1802 లో బ్రిటిష్ ప్రభుత్వం నందిగామ పరగణాకు జమీందారీ సనద్ ఇచ్చింది. ఆయన గుంటూరు జిల్లాలోని అమరావతిలో వుంటూ, ఆంధ్ర దేశంలో 108 శివాలయాలు ప్రతిష్ఠించాడు. ఆయనే నందిగామ గ్రామంలో కూడా రామలింగేశ్వరస్వామి దేవాలయం కట్టించాడు. ఆ దేవాలయంలో పెద్ద నందీశ్వరుడు ప్రతిష్ఠించబడ్డాడు. పూర్వం నందిగామకు నందిగ్రామం అని పేరు వుండేది. ఆ పేరు నందీశ్వరుడి వల్లే వచ్చిందంటారు. కాలక్రమేణా నందిగ్రామం, నందిగామగా మారి, వాడుకలోకి వచ్చింది.

ఆచార్య నాగార్జునుడి ముఖ్య శిష్యుడు ఆర్యదేవుడు నందిగామ తాలూకాలోని జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లె గ్రామాలకు వచ్చినట్టు శాసనాలు వున్నాయి. ఈ రెండు గ్రామాల్లో పేరు పొందిన బౌద్ధ శిథిలాలూ వున్నాయి.

ఆంధ్రుల సంస్కృతీ వికాసాలకు బహుముఖాల కృషి చేసిన కొమర్రాజు లక్ష్మణరావుగారు ఈ తాలూకాలోని పెనుగంచిప్రోలులోను, ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావుగారు పొక్కునూరులోను జన్మించారు. ఆంధ్ర రత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారు కూడా పెనుగంచిప్రోలు గ్రామంలోనే జన్మించారు.

ప్రముఖ రాజకీయ నాయకులలో ఒకరైన అయ్యదేవర కాళేశ్వరరావుగారు నందిగామలో జన్మించారు. ఆయన నందిగామ తాలూకా జాతీయోద్యమానికి మూలపురుషుడు. ఆయన ప్రోత్సాహంతో ఈ తాలూకాలోని అనేక గ్రామాలలో జాతీయోద్యమం వ్యాపించింది. ఆ గ్రామాల్లో ముఖ్యంగా కొణకంచి, బండిపాలెం గ్రామాలు ప్రముఖపాత్ర వహించాయి. ఇక్కడి గ్రంథాలయం వల్ల ప్రజలు రాజకీయంగా చైతన్యవంతులయ్యారు.

1930 లో కొణకంచి, బండిపాలెం గ్రామాల నడుమ నాగిరెడ్డి తోపులో, గ్రంథాలయ వార్షిక మహాసభ, యువజన మహాసభ జరిగింది. కాశీనాధుని నాగేశ్వరరావుగారు సభకుఅధ్యక్షత వహించగా, కాళేశ్వరరావుగారు సభను అలంకరించారు. చుట్టుపక్కల గ్రామాల ప్రజలు వేలాది మంది సభకు వచ్చారు. పేరుకు గ్రంథాలయ వార్షిక సభ అయినా రాజకీయ ప్రబోధమే ఎక్కువగా జరిగింది. చాలామంది యువకులు స్వాతంత్ర్య సమరంలో పాల్గొనేందుకు ఉత్తేజితులయ్యారు. వారిలో ముఖ్యులు అనుముల రామగోవింద శర్మ, బుచ్చిరామశేషయ్య శ్రేష్ఠి, మందడపు బాలవీరరాఘవయ్యగా .

వారు బందరు వె ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. వారు చ్చిన ఉప్పును చిన్నపొట్లాలు కట్టి, కాంగ్రెస్ కార్యకర్తలు గ్రామాల్లో తిరిగి అమ్మారు. రావులపాటి మధుసూదనరావు (రాష్ట్ర ప్రభుత్వసెక్రటరీగా, రిటైరయ్యారు) కేసర నరసింహారావు (అడ్వకేట్) బండారు వీరమల్లు ప్రసాద్, నారసాని సత్యనారాయణ, మందడపు తిరుపతయ్య, కొత్తపల్లి శేషయ్యగార్లు ఉప్పు పొట్లాలు అమ్మిన వారిలో ఉన్నారు. వీరు గ్రామాల్లో ఉపన్యాసాలు ఇచ్చి, ఉప్పు పొట్లాలు వేలం వేసి, కాంగ్రెస్‌కు నిధిని వసూలు చేశారు. తర్వాత వారిపై వారంట్లు జారీ చేయబడ్డాయి.

నందిగామ తాలూకా కొణకంచిలో 1934 ఆగస్టు 25 న గ్రామ కాంగ్రెసు సంఘం మొట్టమొదట స్థాపించబడింది. అప్పటినుంచీ ఈ ప్రాంతానికి కొణకంచి, బండిపాలెం గ్రామాలు కాంగ్రెస్‌కు కంచుకోటగా పేరు పొందాయి.

1934 నుంచీ స్థానిక గ్రంథాలయం తరపున నెలకొల్పిన వయోజన పాఠశాల వయోజనవిద్యా వ్యాప్తికి యువజనులలో రాజకీయ చైతన్యం కలిగించేందుకు తోడ్పడింది.

అలా రాజకీయ చైతన్యం పొందిన కొణకంచి, బండిపాలెం కార్యకర్తలు అనేకమంది స్వాతంత్ర్య సమరంలో పాల్గొని జైళ్ళకు వెళ్ళారు.

ఆ రోజులలోనే గాంధీజీ ఆదేశానుసారం హరిజన సేవకు ఈ రెండు గ్రామాలు అంకితమయ్యాయి. హరిజన దేవాలయ ప్రవేశం, సహపంక్తి భోజనాలు, హరిజన వాడల శుభ్రత లాంటి కార్యక్రమాలు జరిగేవి.

హరిజనుల ఆర్థిక పరిస్థితి మెరుగుపర్చేందుకు "ఫీల్డు లేబర్ సొసైటీ" స్థాపించబడింది. బండి తిరుపతయ్యగారు మద్రాసువెళ్ళి అప్పటి రెవిన్యూ మంత్రి కళా వెంకటరావుగార్కి మెమొరాండం సమర్పించి, 150 యకరాల ఉప్పుల బీడును కుమ్రీ పద్ధతిపై సేద్యం చేసుకొనుటకు ఉత్తర్వులు వేయించారు.

మొత్తం భారతదేశంలో గ్రామ కాంగ్రెస్‌కు స్వంత భవనం నిర్మించిన ఘనత కొణకంచి గ్రామానికే దక్కింది. ఇందుకు నెహ్రూ చాలా మెచ్చుకున్నారు. ఆ భవనానికి "ఆంధ్రకేసరి కాంగ్రెస్ భవనం" అని పేరు పెట్టారు.

గ్రామ మునసబు కాకుమాను పిచ్చయ్యగారు ప్రభుత్వ ఉద్యోగి అయినా, జాతీయ ఉద్యమంలో పాల్గొనుటకు యువకులను ఎంతో ప్రోత్సహించారు. 1929 లో గాంధీ ఖద్దరు నిధికై ఆంధ్రలో పర్యటిస్తున్నప్పుడు, పిచ్చయ్యగారి తోడ్పాటుతో గ్రామ కాంగ్రెస్ కార్యకర్తలు కొణకంచి అడ్డరోడ్డు వద్ద గాంధీజీకి రు..101 సమర్పించారు.

పిచ్చయ్యగారు ఖద్దరు ధరిస్తారనీ, కాంగ్రెస్ వారిపై ఫిర్యాదులు చేయలేదనీ, కాంగ్రెస్ వాలంటీర్లకు భోజనం పెట్టారని, వారిపై ప్రభుత్వం 18 కేసులు పెట్టి, ఒక సంవత్సరం సస్పెన్షన్‌లో వుంచింది.

భారత స్వాతంత్ర్యానంతరం, కొణకంచి గ్రామం మధ్య గాంధీ మైదానంలో 46 1/2 అడుగుల ఎత్తు స్థూపం విజయ సూచకంగా నిర్మించబడింది. జాతీయోద్యమంలో పాల్గొన్న స్వాతంత్ర్యసమరయోధుల పేర్లు ఈ విజయ స్థూపం శిలాఫలకాలపై చెక్కించబడ్డాయి

1950 రిపబ్లిక్ దినోత్సవ చిహ్నంగా సాతులూరి రాఘవయ్యగారు, మరికొందరి కృషివల్ల మరో 18 అడుగుల జాతీయ స్థూపం, సుభాస్‌బోస్ విగ్రహం వద్ద నిర్మించబడింది. మొదటి రిపబ్లిక్ దినోత్సవం నాడు బోస్ విగ్రహాన్ని శ్రీ బండి తిరుపతయ్య గారు ఆవిష్కరించాడు.

## జగ్గయ్యపేట బాంబుకేసు

యుద్ధ నిధి వసూలుకోసం జగ్గయ్యపేటలో 20-9-1942 న "చింతామణి" నాటక ప్రదర్శన ఏర్పాటు చేశారు. ఆ ప్రదర్శనను భగ్నం చేయడానికి స్థానిక కాంగ్రెస్ నాయకుడు డాక్టర్ కలవకొలను శోభనాద్రిగారు ఒక ప్లాన్ వేశారు. చేతి బాంబులు తయారుచేయడానికి అవసరమైన మందుగుండును తెప్పించారు. మానిగ వెంకయ్య చేత మూడు చేతి బాంబులు తయారు చేయించి ధూళిపాళ వెంకటేశ్వ గారి ఇంట్లో దాచారు. రెండు పదిరూపాయల టిక్కెట్టు సంపాదించి, కాటుబోయిన వన్నూరు, బాల్నె రాము చేతి బాంబులతో నాటక శాలలోకి రాత్రి 10 1/2 గంటలవేళ ప్రవేశించారు. నాటక ప్రదర్శన రసవత్తరంగా సాగుతున్న సమయంలో రాములు, మొదటి వరసలో కూర్చున్న కలెక్టరు మహంతి వైపు చేతి బాంబు విసిరాడు. అది వెళ్ళి సబిన్స్‌పెక్టర్ దేవర కాళ్ళముందు పడిందిగాని పేల లేదు. ఆ తర్వాత వన్నూరు చేతిలోని బాంబు తీసుకుని, రాములు కలెక్టర్ మీదికి విసిరాడు. అది వెళ్ళి కలెక్టర్ కుర్చీకి తగిలి, ఆయన వెనుక కూర్చున్న గౌరవరం నివాసి మహంకాళి వెంకటేశ్వ గారి తొడపై పేలింది. ఆయన గాయపడగా కలె ర్ తప్పించుకున్నాడు. వెంకటేశ్వర్లుగార్ని కా లా చికిత్సకై తీసుకు వెళ్ళారు. ఈ విధంగా నాటక ప్రదర్శనను భగ్నం చేశారు.

ఈ బాంబు సంఘటనలో బాల్నె సత్యనారాయణ, వీరగంటి అప్పారావు, చిప్పా నారాయణ, బారెడు మోతీరాం కూడా పాల్గొన్నారు. కాని అప్పటి జాతీయ ఉద్యమంలో చురుకుగా పనిచేస్తున్న ఇతర్ల మీద కేసు బనాయించారు. వారిలో డాక్టరు శోభనాద్రి, తూమాటి యోగానందాచార్యులు, మళ్ళ నాగయ్య, డా॥ మొరిశెట్టి బసవరాజుగార్లు మొదలగు 11 మంది మీద కేసులు పెట్టారు.

## కొణకంచి

1930 నుంచి ఈ తాలూకా జాతీయోద్యమంలో కొణకంచి గ్రామం ప్రముఖ పాత్ర వహించింది. అనుమల గోవిందశర్మ, రేపాల బుచ్చిరామయ్య శ్రేష్ఠి, బండి తిరుపతయ్యగార్లు ముఖ్యపాత్ర వహించారు. కాంగ్రెస్ ఆదేశానుసారం బండి తిరుపతయ్యగారు మద్రాసు వెళ్ళి వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆ తరువాత తిరుపతయ్యగారు క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని ఒక సంవత్సరం జైలుశిక్ష అనుభవించారు. అదే సందర్భంలో 1943 మార్చి 16 న పోలీసులు వీరి ఇల్లు సోదా చేసి అరెస్టు చేశారు.

## మునగాల రైతు ఉద్యమ చరిత్ర

పూర్వం "మునగాల సంస్థానం" కాకతీయ రాజుల సామంతులకు చెందినది. ఈ సామంతుల వారసులు ఔరంగజేబు నుంచి "సన్నద్" పొందారు. వీరి సంతతివాడే కేసర నరసింహారావు 1802 లో బ్రిటిష్ వారి "శాశ్వత ఫైసలా" నిర్ణయం ప్రకారం ఈస్టిండియా కంపెనీ నుంచి "సన్నద్"ను పొందాడు. అప్పటి నుంచీ మునగాల "ఎస్టేటు"గా పరిగణింపబడింది. కృష్ణాజిల్లాలోని ఈ చిన్న సంస్థానంలో 42 గ్రామాలు వున్నాయి. 1932 లెక్కల ప్రకారం నాటి జనాభా 20 వేలు. ఈ సంస్థానం జమీందారు బ్రిటిష్ ప్రభుత్వానికి ఏడాదికి రు. 4008 లు పేష్కస్ మాత్రమే చెల్లిస్తూ, ప్రజల నుంచి ఏటేటా ఒక లక్ష, ముప్పయివేల రూపాయల శిస్తును వసూలు చేసేవాడు.

ఈ సంస్థానం చివరి జమీందారు రాజానాయని వెంకట రంగారావు 1900 లో అధికారానికి వచ్చాడు. ఈయన దగ్గర తెలుగు భాషాభివృద్ధికి విశేష కృషి చేసిన కొమర్రాజు వెంకటలక్ష్మణరావుగారు దివాన్‌గా వుండేవారు. వీరి పాలనలో సంస్థాన ప్రజలు సుఖ జీవితం గడిపారు. శ్రీ లక్ష్మణరావుగారు 1923 లో చనిపోవడంతో జమీందారు రంగారావు ప్రజల్ని దోపిడీ చేయడం మొదలు పెట్టాడు. శిస్తులు బాగా పెంచాడు. పంట భూముల్ని, మంచిబీడు భూముల్ని ఏదో ఒక సాకుతో కాజెయ్యటం ఆరంభించాడు. చెరువుల్ని బాగు చేయించలేదు. ప్రజలపై దౌర్జన్య విధానం అమలు జరిపాడు. ఇక జమీందారు నౌకర్లు యమకింకరులలాగా ప్రజల్ని పీడించుకు తినేవాళ్ళు.

## జమీన్ రైతు సంఘం స్థాపన

జమీందారు దౌర్జన్యాలు, దోపిడీ నుంచి రక్షించుకునేందుకు, వెలిదండ రంగారావు, కోదాటి వెంకట నరసింహారావు, కొల్లు అచ్చయ్య, కొండపల్లి రామచంద్రరావు, గెల్లి కోనయ్య, ఇమ్మడి పాపయ్య, కొల్లు కోటయ్య వంటి పెద్దలు జమీన్ రైతు సంఘం స్థాపించారు. మొదటి మహాసభను 1930 లో మునగాలలో జరిపారు. ఈ సభకు మద్రాసు శాసనసభ సభ్యుడు శ్రీ బి. విశ్వనాథన్‌గారిని, కేంద్ర శాసన సభ్యుడు శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారిని ఆహ్వానించారు.

సభకు వచ్చిన విశ్వనాథన్‌గారు జమీన్ రైతులు ఐకమత్యంగా వుండి, జమీందారును ఎదిరించమని ప్రబోధించారు. ప్రకాశంగారు ఆ సభకు రాలేదు. తర్వాత పది రోజులకు మునగాల వచ్చి రైతులకు సందేశం ఇచ్చారు.

ఈ సభలో జమీన్ రైతు సంఘానికి అధ్యక్షులుగా యిమ్మడి పాపయ్యగారిని, ప్రధాన కార్యదర్శిగా గెల్లి కోనయ్యగారిని ఎన్నుకున్నారు.

ఈ సంఘాన్ని విచ్ఛిన్నం చేయడానికి జమీందారు తన సిబ్బందితో రైతుసంఘ నాయకుల్ని కొట్టించాడు. వీరి వ్యవసాయం ఆపు చేయించాడు. వేల రూపాయల జరిమానాలు వసూలు చేశాడు. కొందరి రైతుల ఇళ్ళు పీకించాడు. కొందరిని సంస్థానం నుంచి వెళ్ళగొట్టించాడు. ఈ సంఘ సభ్యులపై సాంఘిక బహిష్కారం అమలు జరిపాడు. కొందరి ఇళ్ళకు కంప కొట్టించి, వాళ్ళ రాకపోకలు ఆపుచేశాడు. వాళ్ళనుంచి వేలాది రూపాయలు జరిమానా వసూలు చేశాకే కంప తీయించాడు. అన్ని కులాల వారిచేతా వెట్టి చాకిరీ చేయించాడు. జమీందారు దౌర్జన్యంతో ఈ రైతు సంఘం విచ్ఛిన్నమై పోయింది.

ఆంధ్ర రాష్ట్ర జమీన్ రైతు సంఘ నాయకుడు, జమీన్ రైతు పత్రికా సంపాదకుడు శ్రీ నెల్లూరి వెంకట్రామా నాయుడుగారు 1933 సెప్టెంబరు 22, 23 తేదీలలో మునగాల పరగణాలో పర్యటించి, అక్కడి దారుణ పరిస్థితుల్ని, రాష్ట్ర జమీన్ రైతు

సంఘానికి తెలిపారు. తన సంచార నివేదికను 'జమీన్ రైతు" పత్రికలో కూడా ప్రచురించారు. అక్కడి భయంకర పరిస్థితుల్ని రైతులు వివరిస్తుంటే తన కళ్ళ వెంట నీళ్ళు కారాయని ఆయన ఇలా రాశారు.

జమీందారు నిరంకుశ పాలనలో రైతులు, ప్రజలు పడరాని పాట్లు పడ్డారు. సకాలంలో శిస్తులు చెల్లించని రైతుల మెడలకి పలుపు తాళ్ళు వేసి, మోటబావి స్తంభానికి కట్టేవారు. లేదా శిస్తు కట్టేదాకా మాడే ఎండలో నిలబెట్టేవారు. వాళ్ళ వీపులపై బండలు ఎత్తేవారు. గ్రామాల్లోని కూలీలు వచ్చి గ కోసు కొచ్చి, దివాణంలో మోపులు వేసి పోవాలి. తులు, ఇతర వృత్తుల వారు కూడా వంతుల వారీ వచ్చి, వెట్టి చాకిరీ చేసి పోవాలి. ఎవరైనా కూలి అడిగారా, వాళ్ళ జుట్టు చింతచెట్టు కొమ్మలకి ముడేసి వేలాడ దీసేవారు.

1937 ఫిబ్రవరిలో మద్రాసు శాసనసభకు ఎన్నికలు జరిగాయి. అప్పుడు రాష్ట్ర కాంగ్రెసుకు, మునగాల జమీందారుకు మధ్య ఒక ఒడంబడిక కుదిరింది. దీని ప్రకారం—కాంగ్రెస్ నాయకులుగానీ, కార్యకర్తలుగానీ మునగాల ఎస్టేటులో ప్రవేశించి ప్రచారం చేయకూడదు. జమీందారు తన ఎస్టేటులోని ఓట్లన్నీ కాంగ్రెస్‌కు వేయించాలి. ఈ ఒడంబడికవల్ల కాంగ్రెస్ వాదులు మునగాలలో ప్రవేశించి, కాంగ్రెస్ రాజకీయాలు గురించి గానీ, ఎన్నికల ప్రణాళిక గురించి గానీ ప్రచారం చేయలేకపోయారు.

ఎన్నికల తర్వాత జిల్లా కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ తరపున చంద్ర రాజేశ్వరరావు, వెల్లంకి విశ్వేశ్వరరావుగారు మునగాల ఎస్టేటుకువచ్చి, అక్కడి పరిస్థితుల్ని విచారించారు. ప్రజల్ని రహస్యంగా కలుసుకుని జమీందారు దోపిడీ దౌర్జన్యాలు గురించి తెలుసుకున్నారు. బహిరంగ సభలు జరిపారు. కాని ప్రజలు భయంతో సభలకు రాలేదు. ఇళ్ళలో వుండే నాయకుల ఉపన్యాసాలు విన్నారు.

శ్రీ రాజేశ్వరరావు, శ్రీ విశ్వేశ్వరరావుగార్లు బెజవాడ వెళ్ళి, తమ పర్యటన వివరాల్ని. శాసనసభ సభ్యుడు శ్రీ కాట్రగడ్డ వెంకట నారాయణరావుగారికి తెలిపారు.

అపుడు శ్రీ నారాయణరావుగారు మునగాల వెళ్ళారు. రేపాల, తాడువాయి, నడిగూడెం మున్నగు గ్రామాలు పర్యటించి, జమీందారుకి వెట్టిచాకిరీ చేస్తున్నవారిని చేయవద్దన్నారు. అలా వెట్టిచేయించుకునేందుకు జమీందారుకి హక్కులేదని ప్రజలకి ఉద్బోధించారు. దాంతో ప్రజలు వెట్టిచేయటం మానుకున్నారు. శ్రీ నారాయణరావుగారు ఎస్టేటు దారుణ పరిస్థితులను జిల్లా కాంగ్రెస్ కమిటీకి తెలిపి, ప్రత్యేక విచారణ కమిటీని నియమించి, అక్కడి ప్రజల పరిస్థితిని పూర్తిగా విచారించి, నివేదిక తయారుచేయించాల్సిందిగా కోరారు.

శ్రీ నారాయణరావుగారి విజ్ఞప్తితో పశ్చిమ కృష్ణా జిల్లా కాంగ్రెస్ సంఘం ఈ క్రిందివారితో కమిటీని నియమించింది.

1. కాకాని వెంకటరత్నం (కన్వీనరు) 2. పేట బాపయ్య 3. అన్నె అంజయ్య 4. వెనిగళ్ళ వెంకటరత్నం, 5. నండూరి ప్రసాదరావు 6. అనుమల రామగోవిందశర్మ.

ఈ కమిటీ 1938 జూలై 23 నుండి 25 వరకూ మునగాల ఎస్టేట్‌లో పర్యటించి, సమాచారం సేకరించింది. దీని ఆధారంగా శ్రీ నండూరి ప్రసాదరావుగారు నివేదిక తయారుచేశారు. ఈ నివేదికలో ముఖ్యాంశాలు ఇవి :

1932 తరవాత జమీందారు దౌర్జన్యాలు మితిమీరిపోయాయి. ఎస్టేటులో జమీందారే సర్వాధికారి. సివిల్, క్రిమినల్ పవర్సు ఆయన చేతిలో వుండేవి. పోలీసు సబిన్స్పెక్టరుకన్నా, జమీందారు కొత్వాలు ఎక్కువ అధికారం చెలాయించేవాడు. ఎస్టేటు దివాణంలోకి రమ్మని ఎవరికైనా కబురు వచ్చిందంటే, అతడికి జరిమానా పడటమో లేదా అతడి వీపు పగలటమో జరిగేది. రైతుల జిరాయితీ భూముల్లోని చెట్లు కొట్టినా, కొమ్మ నరికినా జమీందారుకు జరిమానా చెల్లించాల్సిందే. ఏనెరాళ్ళు బండలమీద సైతం రైతుల హక్కులేదు. అన్ని కులాలవారూ, అన్ని వృత్తులవారు జమీందారుకు వెట్టిచాకిరీ చేయాల్సిందే. ఎదిరించిన వాళ్ళని కొట్టటం, హింసించడం, జరిమానాలు వసూలు చేయడం, దొంగ ప్రోనోట్లు రాయించుకోవడం వంటివి సాగించాడు. అనేకమంది ఆస్తులను జమీందారు దౌర్జన్యంగా లాక్కున్నాడు.

భూమి శిస్తులు మెరక య॥ 1 కి రు. 1-25 పైసల నుంచి రు. 3-60 కి పెంచాడు. పల్లం శిస్తు య॥ 1 కి

మొదటి పంటకు రు 10-00 లు, రెండో పంటకి రు. 5-00 లు చెల్లించాలి. స్వంత బావుల కింద రైతులు సేద్యం చేసుకున్నా య॥ 1 కి రు. 10-00 శిస్తు చెల్లించాల్సిందే.

శాసనసభ్యుడు శ్రీ కాట్రగడ్డ వెంకటనారాయణ రావుగారు, కరివిరాల, చెన్నకేశ్వరస్వామి గుడికి వెళ్ళగా, అక్కడి అర్చకుడు గుంటూరు లక్ష్మణా చార్యులుగారు ఆయనకు తీర్థప్రసాదాలు యిచ్చాడు. ఇది తెలిసి జమీందారు, అర్చకుని జీతం ఆ నెలనుంచీ ఆపుచేశాడు. ఈ నివేదిక పూర్తి పాఠం అచ్చులో 40 పేజీలుదాకా వుంది.

మునగాల ప్రజలను చైతన్యవంతుల్నిచేసి సంఘ టిత పర్చడానికి జిల్లా కాంగ్రెస్ తరపున రైతు సంఘం తరపున నండూరి ప్రసాదరావు, మోటూరు పరంధామయ్య, వేములప హనుమంతరావుగార్లు వెళ్ళారు. వీరు గ్రామాలనీ తిరిగి జమీందారు దౌర్జ న్యాలకు వ్యతిరేకంగా ప్ర ప్రచారం చేశారు. అంతేకాక కాంగ్రెస్ సభ్యులుగా 3 వేల మందినీ, రైతు సంఘ సభ్యులుగా 4 వేల మందినీ చేర్పించారు. రైతు సంఘాన్ని నిర్మాణం చేశారు.

1938 జూలైలో అఖిలభారత కిసాన్‌సభ నాయ కులు యన్. జి. రంగా, ఇందులాల్‌యాజ్ఞిక్‌గార్లు మునగాల, నడిగూడెం గ్రామాల్లో గొప్ప బహిరంగ సభల్లో ఉపన్యసించారు. ప్రజలు చైతన్యవంతు లయా రు.

జా ఉద్యమం దినదినాభివృద్ధి చెందడం చూచిన శాస సభ్యులు శ్రీ కాట్రగడ్డ వెంకటనారాయణరావు గారు, చలసాని వాసుదేవరావు, కామినేని వెంక టప్పయ్య, జోశ్యభట్ల సత్యనారాయణగార్లు పరగ ణాల్లో పర్యటించి, ప్రజల్ని ఉత్తేజపర్చటంలో ఎంతో కృషి చేశారు.

## మునగాల రైతుల సత్యాగ్రహం

రైతులు తమ హక్కులు తెలుసుకున్నారు. తమ బానిస జీవితం నుంచి బైటపడాలని దీక్ష వహించారు. 1930 నాటి జమీన్ రైతు సంఘాన్ని పునరుద్ధరించు కున్నారు. గ్రామ రైతు సంఘాలు నిర్మించుకున్నారు. సంఘ నిధికి విరాళాలు సేకరించారు. ఎస్టేటు జమీన్ రైతు సంఘం ఆఫీసు మునగాలలో ప్రారంభించ బడింది.

గ్రామాల్లో వలంటీరు దళాలు ఏర్పడ్డాయి. వీరు రైతు కూలి పాటలు వీధుల్లో తిరుగుతూ పాడేవారు. రాత్రిపూట గస్తీ తిరిగేవారు. శత్రువుల కదలికకు సంబంధించిన వార్తలు సేకరించేవారు.

అన్ని కులాలవారు, వృత్తులవారు జమీన్ రైతు సంఘంలో చేరారు. వెట్టిచాకిరి చేయడం, జరిమానాలు చెల్లించడం మానివేశారు.

## దేవుడి ఉత్సవానికి బదులు కాంగ్రెస్ నాయకుల ఊరేగింపు

ఏటేటా దీపావళికి రేపాలలో జమీందారు ఇష్ట దైవం లక్ష్మీనరసింహస్వామి ఉత్సవం జరిగేది. ఆచారం ప్రకారం ఆ ఏడాది కూడా మంగళ్ళు ఉత్స వానికి కాగడాలు పట్టబోగా, వాళ్ళని జమీందారు ఉద్యోగులు రైతుసంఘంలో చేరారనే కోపంతో వెళ్ళిపొమ్మన్నారు. అది చూచి, దేవుడి వాహనం మోసే చాకళ్ళు మోయటం మానేశారు. దాంతో రెండు రోజులు జరిగే ఉత్సవం ఆగిపోయింది.

దేవుడి ఉత్సవానికి బదులు ప్రజలు గాంధీ, నెహ్రూ, బోస్, రంగా ఫొటోలను బళ్ళమీద ఊరే గించారు. సభ కూడా జరిపారు. నండూరి ప్రసాదరావు గారు నాయకత్వం వహించారు.

అప్పటినుంచీ ఎస్టేటువారికీ, ప్రజలకూ ఘర్షణ ప్రారంభమైంది. జమీందారు ప్రజలపై ఇచ్చే ప్రతి ఫిర్యాదుకూ పోలీసులు కేసులు పెట్టేవారు. రైతుల ఫిర్యాదులపై ఏచర్యా తీసుకునేవారు కాదు.

జమీందారీ విధానం రద్దుకావాలని, లంచగొండి తనం, పోలీసు జులుం నశించాలని ప్రజలు నినాదాలు చేసేవారు.

పనివారు ఎస్టేటువారికి, వారి ఉద్యోగులకి పని చేయకుండా బహిష్కరించారు. శిస్తులు కట్టటం మాని వేశారు పోలీసుల సాయంతో జమీందారు జప్తులు ప్రారంభించాడు. స్త్రీల ఆభరణాల్ని కూడా జప్తు చేయటం ఆరంభించాడు. రైతులు ధైర్యంగా ఎదుర్కొన్నారు. జమీందారుతో తెగతెంపులు చేసు కోవాలనుకున్నారు. ఈలోగా కలుకోవలో కూలీల పోరాటం జరిగింది. తెలుసుకుందాం.

## కలుకోవ కూలీల పోరాటం

కలుకోవలో జమీందారుకి 22 యకరాల మాగాణీ భూమి వుంది. రైతులచేత వెట్టికి సేద్యం చేయించు కునేవాడు. రైతులు వెట్టి మానివేయడంతో ఆ సంవత్సరం కూలీలచేత పొలం పనులు చేయించుకోవలసి వచ్చింది. యకరానికి 40 మానికలు కూలి ఇస్తానని చెప్పాడు. 72 మంది హరిజన కూలీలు 14 రోజులు పనిచేశారు. కూలి అడగగా జమీందారు ఉద్యోగులు యకరానికి 30 మానికలు చొప్పున ముక్కిపోయిన ధాన్యం ఇస్తామన్నారు. వాటిని కూలీలు తీసుకోలేదు. మాకు సంఘమే ఇప్పిస్తుందని చెప్పి వెళ్ళిపోయారు.

ఇది తెలిసి, రైతు నాయకులు నండూరి ప్రసాదరావు, నల్లపాటి వెంకట్రామ నరసయ్యగార్లు కూలీలతో కలసి కోటకు వెళ్ళారు. రాజాగారు కూలీలను పోస్టుద్వారా దరఖాస్తు పంపమన్నాడు. అప్పుడు ప్రసాదరావుగారి సలహా మీదట, నల్లపాటి వెంకట్రామ నరసయ్యగారి నాయకత్వాన కూలీలు సత్యాగ్రహం మొదలుపెట్టారు. మొదటి రోజున 500 మంది, రెండో రోజున వెయ్యి మంది, మూడో రోజున 3 వేల మంది ప్రజలు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఇది చూచి జమీందారు రెచ్చిపోయాడు. ప్రసాదరావు, పరంధామయ్య, హనుమంతరావుగార్లను ఖూనీ చేస్తామని తన రౌడీలతో కేకలు వేయించాడు. కాని రైతులు, కూలీలు వెనుకంజ వేయలేదు. మరింత పట్టుదలతో సత్యాగ్రహం కొనసాగిస్తున్నారు. ఇది చూచి జమీందారు సహించలేకపోయాడు. తన కోటను రైతుసంఘ నాయకులు, కూలీలు రైతులచేత దోపిడీ చేయించబోతున్నారని అధికారులకి టెలిగ్రాములు పంపాడు. 1938 డిసెంబరు 24 న కృష్ణాజిల్లా కలెక్టర్, బెజవాడ సబ్‌కలెక్టర్, జిల్లా పోలీసు సూపరింటెండెంట్, మూడు లారీల నిండా పోలీసుల్ని వెంటపెట్టుకు వచ్చారు. కాంగ్రెస్ నాయకులు బి. యస్. మూర్తి, అయ్యదేవర కాళేశ్వర రావుగార్లు కూడా మునగాల వచ్చారు. అధికార్లు దబాయించినా భయపడకుండా తాము కూలికోసమే పోరాడుతున్నామని వారికి రైతులు, కూలీలు చెప్పారు.

తర్వాత బెజవాడ సబ్‌కలెక్టర్ కూలీలతో మాట్లాడి, నిజం తెలుసుకున్నాడు. కలుకోవ వెళ్ళి యకరానికి 40 మానికల చొప్పున మంచి ధాన్యం కూలీలకి ఇప్పించాడు. కూలీల సత్యాగ్రహం విజయవంతమయింది. ప్రజలకు యెక్కడలేని ధైర్యం వచ్చింది. జమీందారు ప్రజాశక్తికి లొంగిపోయి రాజీ సంభాషణలు ఆరంభించాడు. రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి గొట్టిపాటి బ్రహ్మయ్యగారు మధ్యవర్తిగా రాజీచేసుకునేందుకు రైతుసంఘంవారూ, జమీందారూ అంగీకరించారు.

కాంగ్రెస్ నాయకులు బి. యస్. మూర్తి, అయ్యదేవర కాళేశ్వరరావు (చీఫ్ పార్లమెంటరీ కార్యదర్శి) గార్లు కృష్ణాజిల్లా కలెక్టర్, జిల్లా పోలీసు సూపరింటెండెంట్ మొదలగు వారు, రైతునాయకులు 1939 జనవరి 9, 10 వ తేదీలలో సమావేశమై రాజీ షరతులు రూపొందించారు. 10 వ తేదీన ఒడంబడికపై సంతకాలు జరిగాయి. జమీందారు తరపున కుమారరాజా రామకృష్ణారెడ్డి, రైతుసంఘం తరపున వెలిదెండ రంగారావు, కోదాటి వెంకట నరసింహారావు, నండూరి ప్రసాదరావు, న పాటి వెంకటరామ నర్సయ్య, వుప్పల రామయ , కందుల రాములు సంతకాలు చేశారు. ఈ ఒడబడికే "బ్రహ్మయ్య అవార్డు"గా ప్రసిద్ధి కెక్కింది.

## మునగాల రైతు పోరాటం

పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంఘం, మునగాల జమీందారు రైతులపై సాగించే దురాగతాలను ఎదుర్కొని, అప్పటి జిల్లాకాంగ్రెస్ అధ్యక్షులు పేట బాపయ్యగారు, కార్యదర్శి కాకాని వెంకటరత్నంగారల నాయకత్వాన రైతుల తరపున పని చేశారు. కాకాని వెంకటరత్నంగారి నాయకత్వంలో సర్వశ్రీ గొంది కోటేశ్వరరావు, పిన్నమనేని సీతారామయ్య, వేజెండ్ల వెంకట సుబ్బయ్య, ఇమ్మడి పాపయ్య, న పాటి వెంకటరామనర్సయ్య, వంగవేటి అచ్చయ , బండి తిరుపతయ్య మొదలగు కార్యకర్తలతో అక్కడకు వెళ్ళి గ్రామాలలో జమీందారీ దౌర్జన్యాలను గురించి రిపోర్టు తయారు చేయించారు. ఈ సందర్భంలో యన్. జి. రంగా, ఇందులాల్ యాజ్ఞిక్‌గారలు వచ్చి పరిస్థితులను స్వయంగాచూసి వీరికి తగిన సలహాలనిచ్చి వెళ్ళారు. ఆ రిపోర్టును

కొణకంచి గ్రంథాలయములో జరిగిన జిల్లా కాంగ్రెస్ జనరల్‌బాడీ సమావేశంలో అంగీకరించారు. రిపోర్టు రాష్ట్ర కాంగ్రెస్ సంఘానికి, ప్రభుత్వానికి పంప బడింది. రిపోర్టు నిమిత్తం మునగాలపరగణాకువెళ్ళిన కార్యకర్తలను, జమీందారీ గూండాలు నానాహింసలు పెట్టారు. అయినా ధైర్యంతో గ్రామాలన్నీ తిరిగారు. అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వ రెవెన్యూ మంత్రి ప్రకాశంపంతులుగారు స్వయంగా మునగాల వచ్చి, పరిస్థితులను అవగాహన చేసుకుని వెళ్ళారు. తర్వాత గొట్టిపాటి బ్రహ్మయ్య (రాష్ట్ర కాంగ్రెస్ కార్య దర్శి) పేట బాపయ్య, ఎర్నేని సుబ్రహ్మణ్యం గార్లతో రాష్ట్రప్రభుత్వం ఒక కమిటీ వేసింది. వారు ఒక అవార్డు ఇచ్చారు. అదే బ్రహ్మయ్య అవార్డుగా పేరుతోకి వచ్చింది.

## "బ్రహ్మయ్య అవార్డు" అంశాలు

1. పట్టాలు- ముందు పట్టాలలో సర్వే నెంబర్ల వారీ భూములకు హద్దులువేసి ఇవ్వాలి.

2. ఈనాములు- చాకలి, మంగలి, కుమ్మరి, వడ్రంగి, పౌరోహిత్యం వగైరా వృత్తులవారి అను భవంలో వున్న చాకిరీ ఈనాములను గూర్చి జమీం దారుగారు వ్యాజ్యాలు వేసి జయం పొందివున్నారు. సదరు భూములకు పై వృత్తుల వారికి పట్టాలను ఇవ్వాలి.

అతరావు జమీందారీ రైతు భూమి శిస్తురేటు (అతరావు రేటులు హెచ్చుతగ్గులుంటే, ఆ రేటులు సగటురేటు....పల్లానికి పల్లపురేటు- మెరకకు మెరక రేటు) లో సదరు యీనాములకు పట్టాలను యిచ్చు టకు నిర్ణయం. వీరు యెవరికి నిర్బంధంగా చాకిరీ చేయవలసిన బాధ్యతలేదు.

2. టి.డి' ఈనాములు—ఈనాం కంటేగల హెచ్చు పరిమాణం గల భూమికి అతరావు జమీందారీ శిస్తు రేటుతో పట్టా యివ్వాలి, ఆ ఈనాందారుకే. ఈ విష యంలో ఈనాందారు చేస్తున్న అప్పీళ్ళు వదులుకుం టాడు. అన్ని రకాల ఈనాముకున్నూ ఇదే వర్తి స్తుంది. అయితే సర్వధుంబాలా ఈనాములు ఎట్టి సర్వీ సులతోనిమిత్తం లేకుండా, సర్వహక్కులతో, సర్వ కాలాలుఅనుభవించుటకు ఆధారాలు కలవారు అట్లుగా సంపూర్ణ హక్కులతో అనుభవించాలి.అట్లుగా ఆధా రాలు చూపని భూములకు పై మాదిరినే శిస్తులు కట్టుకోవాలి. ఈ పట్టాలు పూర్తికాగానే యిందుకు సంబంధించిన వ్యాజ్యాలు వుపసంహరించుకోవాలి.

3. హక్కుదారు లకు తెలియకుండా రెవెన్యూ వేలం వేయబడిన భూములు ఇతర్లకు విక్రయింప బడినవి, రాజాగారికని, వారి బంధువులపేరిటను వారి వుద్యోగుల పేరను కొట్టివేయబడిన భూముల గురించి :

1930 సంవత్సరం నుంచి సేల్ అయిన భూము లకు అట్టి భూములకుగాను యివ్వాల్సిన సేల్ మొత్తాన్ని దరిమిలా Improvement కు అయిన కిమ్మత్తును, రైతులు ఇస్తే వారికి వారి భూములకు పట్టాలు యివ్వాలి. సదరు భూములకు మరొక రైతుకు న్యాయంగా పట్టా యివ్వబడి ఆయన హక్కు భుక్తంలో వుంటే, అందుకు ఎట్టి చర్యా తీసుకో నక్కరలేదు.

4. దౌర్జన్యంగా రాజాగారు భుక్తపర్చుకొన్న భూముల గురించి; ఈ భూములు తమవని రైతులు ఆధారం చూపాలి. సదరు భూములను జమీందారు గారు యే ఆధారాలు పురస్కరించుకొని స్వాధీనపర్చు కొనెనో జమీందారు చూపాలి'

5. ప్రతిఫలరహితమైన ప్రామిశరీ నోట్లు: ప్రతి ఫలంలేని ప్రామిశరీ నోట్లు రాజాగారి పేరను వున్న ట్లయితే వారి బంధువులు, అనుచరులు, పేరను వున్నట్లయితే, అన్నీ ఇచ్చివేయాలి. శిస్తు బాకీలు తేల్చి ఆ మొత్తముల వారి అనుకూలుర పేర్లకు రాయించుకొన్న నోట్లు చెల్లుతాయి.

6. సాముదాయక భూముల ఆక్రమణ : అట్టి ఆక్రమణలను జమీందారుగారు వదలివేయాలి.

7. రైతు స్వంత నూతి కింద సాగుకు పల్లం రేటు వసూలు చేయుట వగైరా :

1. 1908 తర్వాత చెట్లన్నీ రైతులవే. అంతకు ముందు చెట్లు, తర్వాత చెట్లు ఏవో తేల్చుటకు డిప్యూటీ తహశీల్‌దారుకి వదలటమైనది. వారి నిర్ణ యం తుది నిర్ణయం.

2. ఇందులో కలుగితలకు యిచ్చిన చెట్ల రుసుం, వారి నిర్ణయాల ప్రకారం చెందుతుంది. వాటికి నంబర్లు వేయటం గురించి రైతులుగానీ, జమీందారు గానీ అభ్యంతరం పెట్టరాదు.

3. మెరక భూములలో స్వంత నూతికింద సాగుకు పల్లపురేటు వసూలు చేయనేరదు.

4. పట్టాగాని. భూమిగాని లేకుండా శిస్తు వసూలు చేయరాదు.

8. వర్తకులకు సరకులకై డబ్బు యివ్వలేదని; ఈ విషయమై దర్యాప్తు చేయించి. ఇవ్వవలసిన యావత్తు పైకం లిమిటేషన్‌తో నిమిత్తం లేకుండా యెస్టేటువారు ఇవ్వాలి.

9. రైతుల క్రయదస్తావేజులున్న, పాత పట్టాలున్న తీసుకుని యివ్వలేదు. వాటిని ఇవ్వాలి.

10. గ్రామ ఉద్యోగాలు- వారసులు కానివారిని నామినేట్ చేయుట గురించి—క్రమమైన కోర్టులో నిర్ణయించుకోవాలి.

11. క్రిమినల్ కేసుల గురించి: మేము జోక్యం తీసుకోలేము.

12 రైతుల తాలూకు పశువులు చెరువు పడకలలో మేయుటకు గల హక్కులను గురించి-వీటి గురించి కలెక్టరుగారికి పిటిషన్ పెట్టుకొని నిర్ణయించుకోవాలి.

13. సాంఘిక బహిష్కారం—ప్రతిఫలం యిచ్చి నౌకరీ చేయించుకునే సందర్భంలో ఎస్టేటువారు గానీ, రైతులు గానీ అట్టి కూలీ, నౌకరీ చేయవద్దని ఎవరికీ బోధించరాదు. సాంఘిక బహిష్కారం కూడదు.

14. శిస్తులు చెల్లించే విషయం ; ప్రతి గ్రామ భూముల ప్లానులు, శిస్తులు వసూలుచేసే జమీందారీ వుద్యోగివద్ద. శిస్తులు వసూలుస మయంలో వుండాలి. రైతులు వారి భూముల పరిమాణాలను గురించి సందేహాలు తీర్చవలసిందిగా కోరినప్పుడు, సదరు భూముల పరిమాణం సరిగా వుందని, ఆ ఉద్యోగి సదరు ప్లాను దాఖలు భూమిని సదరు రైతుకు చూపి పరిమాణం గురించి ఆయనను తృప్తి పర్చాలి. ఈ విషయంలో కుమార రాజాగారు ప్రత్యేక శ్రద్ధ వహించాలి. రైతులు అందరూ శిస్తు ఇవ్వాలి.

15 పల్లపు భూమి మెరకగా మార్చుటను-ల్యాండు ఆక్టు ప్రకారము 6 సంవత్సరాలు పల్లపు సాగు కాని భూమిని దరఖాస్తుపై మెరకగా ఎస్టేట్ వారు మార్చాలి.

## ప్రజల ఆందోళన

శిస్తు రెమిషన్ విషయంలో పేచీపెటి, జమీందాడు రాజీ షరతులు అమలుజరపలేదు. ఎస్టేటు గ్రామాల్లోని ప్రజలు బ్రహ్మయ్య అవార్డు అమలు జరగాలని ఆందోళన మొదలుపెట్టారు. అప్పుడు బ్రహ్మయ్యగారు తమ రాజీ షరతుల అమలుకు కృషి చేయవలసిందిగా ఎర్నేని సుబ్రహ్మణ్యంగారిని కోరారు. వీరికి తోడ్పడేందుకు జిల్లా రైతు సంఘ నాయకులు కామినేని వెంకటప్పయ్యగారిని నియమించారు. ఈ నిర్ణయాన్ని రైతులు జమీందారు అంగీకరించారు.

1939 ఫిబ్రవరి 26 న శాసనసభ్యులు కాట్రగడ్డ వెంకటనారాయణరావు, కామినేని వెంకటప్పయ్య, ఎర్నేని సుబ్రహ్మణ్యంగార్లు నడిగూడెం వచ్చారు. వివిధ గ్రామాల ముఖ్యులతో సంప్రదించారు. బహిరంగసభ జరిపారు. రెండువేలమంది సభకు వచ్చారు. అవార్డును అమలు జరిపించుకొనుటకు శాంతియుతంగా ఆందోళన సాగించాల్సిందిగా ప్రజల్ని నాయకులు కోరారు.

1939 ఏప్రెల్ 23 న ఆచార్యరంగా, పల్లెల శ్యామసుందరరావు (మద్రాసు శాసనసభ సభ్యుడు)- కాంగ్రెస్ నాయకులు పేట బాపయ్య, జిల్లా రైతు సంఘ కార్యదర్శి పామిరెడ్డి సుబ్బారావురెడ్డి, సుంకర సూర్యనారాయణగార్లు మునగాల వచ్చారు. మునగాల రైతు పోరాటానికి తమ తోడ్పాటు వుంటుందని హామీ యిచ్చారు.

మునగాల పరగణా గ్రామాలలో కాంగ్రెస్ మీటింగులు పెట్టనివ్వకుండా, సభ్యులుగా చేరకుండా మునగాల జమీందారు క్రూర నిర్బంధ విధానం ప్రవేశపెట్టాడు. ఇది మద్రాసులో కాంగ్రెస్ ప్రభుత్వం ఉండగానే జరిగింది. ఈ ఎస్టేటులో రైతులకుభూమిపై ఎట్టి హక్కులూ లేవు. సివిల్ క్రిమినల్ అధికారాలన్నీ జమీందారువే. పొలంనుండి కనీసం రాళ్ళు ప్రక్కనపెట్టి దున్నుకోవడానికి కూడా హక్కులు లేవు. జమీందారు నౌకర్లను చూచి రైతులు హడలిపోతూ వుండేవారు.

అందువల్ల పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ కమిటీ, మునగాల ఎస్టేటులో జమీందారుకు వ్యతిరేకంగా రైతాంగం తదితర ప్రజానీకం యొక్క హక్కుల

కొరకు సత్యాగ్రహం ప్రారంభించాలని నిర్ణయించింది. ఆ నిర్ణయం ప్రకారం 1939 ఏప్రిల్‌లో ఆ సత్యాగ్రహ నిర్వహణకు, నండూరి ప్రసాదరావు, జోశ్యభట్ల సత్యనారాయణ, మోటూరి పరంధామయ్యగార్లు పంపబడ్డారు. వీరు మునగాల గ్రామంలో శిబిరం పెట్టి మొత్తం ఎస్టేటులోని 40 గ్రామాలు తరుచుగా పర్యటిస్తూ, సభలు పెడుతూ, రైతాంగాన్ని, తదితరులను పోరాటానికి ఒకటిన్నర మాసాల కాలంలో తయారుచేశారు.

చివరకు జమీందారు వుండే నడిగూడెం గ్రామంలో జమీందారు అక్రమంగా ఆక్రమించుకున్న ఒక రైతు భూమిలో, అరకలు కట్టి దున్నడానికి ఏర్పాటు జరిగింది.

ఆ రోజున జమీందారు ఫిర్యాదుపై సబ్‌కలక్టరు తహశీల్‌దారు, పోలీస్‌తో సహా వచ్చి, ఆ పొలంలో వున్న సుమారు 60 మందిని, నండూరి ప్రసాదరావు, జోశ్యభట్ల సత్యనారాయణ, మోటూరి పరంధామయ్యలతో బాటుగా అరెస్టు చేశారు. ఈ కేసు విచారణ సుమారు 3 మాసాలు గడిచిన పిమ్మట, ఈ నాయకులతోబాటు స్థానిక నాయకులు, వెంకట్రామ నర్సయ్య ఇమ్మడి పాపయ్య, వుప్పల రామయ్యగార్లకు సంవత్సరం జైలుశిక్షలు. మిగిలిన వారందరికి 6 మాసాలు జైలు శిక్ష విధించి రాజమండ్రి జైలుకు పంపారు. శిక్షలు అనుభవించిన అనంతరం విడుదల చేశారు. ఈ పోరాటంలో రైతులు, కూలీలు, వ్యాపారంచేసే కోమట్లు, పౌరోహిత్యాలు చేసే బ్రాహ్మణులు యావన్మంది పాల్గొన్నారు.

సత్యాగ్రహులకు శిక్షణ: నండూరి ప్రసాదరావు, మోటూరి పరంధామయ్య, జోశ్యభట్ల సత్యనారాయణగార్లు నెలరోజులపాటు నాలుగు క్యాంపులలో 11 వందల మందికి శిక్షణ ఇచ్చారు. రాజకీయాలు సత్యాగ్రహ ధర్మాలు బోధించారు, కవాతు నేర్పారు.

## రామాపురంలో రైతాంగ విద్యాలయం

రామాపురం ప్రజలు తమ గ్రామంలో ప్రాథమిక పాఠశాల భవనం కట్టుకున్నారు. దీన్ని జమీందారు ఆక్రమించుకున్నాడు. మరల 1939లో యీ భవనాన్ని ప్రజలు ఆక్రమించుకుని ఎర్ర జెండా, కాంగ్రెస్ జెండా కట్టారు. ఈ భవనంలో రైతాంగ విద్యాలయం ప్రారంభించబడింది. జమీందారు పెట్టిన పిటీషన్‌మీద సబ్‌కలెక్టరు ఎక్సుప్రార్టీగా 144 సెక్షన్ యిచ్చాడు. ఈ చర్యతో జమీందారు రాజీ షరతుల్ని ఉల్లంఘించాడు. అయినా రైతాంగ విద్యాలయం కొనసాగించబడింది. ఈ విద్యాలయం నిర్వాహకులు నండూరి ప్రసాదరావుగారి మీదా, మరో 29 మంది మీదా కేసు పెట్టబడింది. దాంతో రైతులు తప్పనిసరిగా సత్యాగ్రహానికి పూనుకోవలసి వచ్చింది. బ్రహ్మయ్య అవార్డు అమలు జరుగుటకల్ల అని రైతులు భావించారు. నండూరి ప్రసాదరావుగారి అధ్యక్షతన సత్యాగ్రహ కమిటీ ఏర్పడి, జూన్ 2 నుంచి నడిగూడెంలో సత్యాగ్రహం ప్రారంభించాలను కున్నారు. 1930లో ప్రథమ జమీన్ రైతు సంఘాధ్యక్షుడు యిమ్మడి పాపయ్యగారి భూమిని జమీందారు దౌర్జన్యంగా ఆక్రమించుకొన్నాడు. ఆ భూమి మీదే సత్యాగ్రహం ప్రారంభించాలని నిర్ణయించుకున్నారు.

1939 జూన్ 2 న వుప్పల రామయ్య (పరగణా జమీన్ రైతు సంఘ ఉపాధ్యక్షులు) గారి నాయకత్వాన ప్రథమ సత్యాగ్రహదళంలో 8మంది అరకలు కట్టుకొని భూమిలో ప్రవేశించారు. వెంటనే పోలీసులు వారిని అరెస్టుచేసి తీసుకుపోయారు.

ఆ తర్వాత రైతు నాయకులు నండూరి ప్రసాదరావు, మోటూరి పరంధామయ్య, వేములపల్లి హనుమంతరావు జోశ్యభట్ల సత్యనారాయణ, నల్లపాటి వెంకటరామ నర్సయ్యగార్లను అరెస్టుచేసి పోలీసులు తీసుకువెళుతున్నపుడు, రామాపురం, బరాఖత్‌గూడెం, నారాయణగూడెం గ్రామాల స్త్రీలు మూడు వందలమంది అడ్డగించారు. స్త్రీలకు నాయకులు నచ్చచెప్పాక వెళ్ళనిచ్చారు.

జూన్ 4 న సత్యాగ్రహులపై తీవ్రమైన లాఠీచార్జి జరిగింది. 25 గురికి బలమైన దెబ్బలు తగిలాయి. 43 మందిని అరెస్టు చేశారు. దీనితో ప్రజలు పోరాటం మానివేశారని ప్రభుత్వ, జమీందారు ఏజంట్లు పుకార్లు పుట్టించారు. కాని 5వ నదీన కుక్కడపు రంగయ్య, శ్రీ కృష్ణసాగర్, జానయ, చిలుకూరి కనకయ్య, చిలుకూరి నారాయణగా, అరకలు తీసుకుని రామాపురం దళంతో చేలో ప్ర

శించి సత్యాగ్రహం చేశారు. దీనితో జమీందారుకు, అతడి అనుచరులకు గుండె దడ పట్టుకుంది.

సత్యాగ్రహ పోరాటం 17 రోజులు సాగింది. 300 మందిని అరెస్టుచేశారు. 80 మందికి 6 మాసాల కఠినశిక్ష విధించి, రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపారు. నండూరి ప్రసాదరావు, మోటూరి పరంధామయ్య, వేములప హనుమంతరావు, జోశ్యభట్ల సత్యనారాయణగా కు సంవత్సరం శిక్ష విధించబడింది. తక్కినవారి కొద్దికాలం సబ్‌జైళ్ళలో వుంచి విడుదల చేశారు. సత్యాగ్రహ సమయంలో అరకలు కట్టుకొచ్చిన పశువుల్ని కూడా వదలేదు. వాటిని అరెస్టుచేసి బందెల దొడ్డిలో పెట్టారు. నీరు, మేతా పెట్టకుండా వాటిని మాడ్చారు.

## జప్తులు, అరెస్టులు, లాఠీఛార్జీలు

జమీందారు ఉద్యోగులు పోలీసులను వెంట పెట్టుకొని గ్రామాలపై విరుచుకు పడ్డారు. జప్తులు మొదలుపెట్టారు. మునగాలలో రైతు నాయకుడు వుప్పల రామయ్యా గారింటికి జప్తు చేయడానికి వెళ్ళారు. ఆయన సోదరి రుక్కమ్మగారు ఎదిరించగా వెనక్కి వెళ్ళిపోయారు. తాడువాయిలో రైతు నాయకుడు గోపిని రామిరెడ్డిగారింటికి జప్తుకు వెళ్ళగా, ఆయన ముసలితల్లి ప్రజల సహకారంతో ఎదిరించింది. అక్కడనుంచి కూడా వెనక్కి మళ్ళారు. జప్తులకోసం రామాపురం వెళ్ళారు. అక్కడ ప్రజలు సహకరించలేదు. తాగేందుకు మంచినీళ్ళు కూడా వాళ్ళకి పుట్టనివ్వలేదు. దాంతో జప్తులు మానుకున్నారు.

నాయకుల్ని అరెస్టుచేసినా, గట్టి గోపాలకృష్ణయ్య, సామినేని రామయ్య, కోదాటి వెంకటనరసింహారావు, వెలిదండ రంగారావు, జూలూరు వేంకట రామనరసయ్యగార్లు రహస్యంగా వుండి పోరాటం కొనసాగించారు.

1939 జూన్ 11 న ఆంధ్రదేశమంతటా, మునగాల దినోత్సవం జరపబడింది. ఆనాడు జరిగిన బహిరంగ సభలలో మునగాల ప్రజల కోర్కెలు బలపరుస్తూ, ప్రభుత్వ దమనకాండను నిరసిస్తూ తీర్మానాలు చేసి ప్రభుత్వానికి పంపారు. ఈ పోరాటాన్ని బలపరుస్తూ నవశక్తి, వాహిని, జమీన్‌రైతు పత్రికలు సంపాదకీయాలు రాశాయి.

అప్పటి రెవెన్యూమంత్రి ప్రకాశం పంతులుగారు రైతునాయకులు ఎన్. జి. రంగాగారు మునగాల వెళ్ళి అక్కడ పరిస్థితులు విచారించారు. రెవెన్యూమంత్రి హామీ ఇవ్వగా, మునగాల రైతు పోరాటం విరమించబడింది.

## పోరాట ఫలితాలు

1930 లో జమీందారు దౌర్జన్యంగా లాక్కున్న యిమ్మడి పాపయ్యగారి భూమిని, తిరిగి ఆయనకు ఇచ్చివేయుట, 3 నెలల తర్వాత సత్యాగ్రహులను విడుదల చేయుట. సంపూర్ణ కితో వెట్టిచాకిరీ, దౌర్జన్యాలు, దోపిడీలు నిర్మూలించబడ్డాయి.

కానీ కాంగ్రెసు ప్రభుత్వం ప్రజలపై కన్నా జమీందారుపైనే ఎక్కువ పక్షపాతం చూపి వ్యవహరించిందనే వాస్తవం ప్రజలు తెలుసుకున్నారు.

రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. బ్రిటిష్ ప్రభుత్వానికి, కాంగ్రెస్‌కు వచ్చిన అభిప్రాయ భేదాల వల్ల కాంగ్రెసు ప్రభుత్వం రాజీనామా చేసింది. రాజీనామా చేసేముందు మునగాల సత్యాగ్రహ ఖైదీల విడుదలకు ఉత్తర్వు చేసింది. కాని పోరాట నాయకులు నండూరి ప్రసాదరావు, మోటూరి పరంధామయ్య, వేములపల్లి హనుమంతరావు, జోశ్యభట్ల సత్యనారాయణగార్లను మాత్రం విడుదల చేయలేదు. పోరాటం విరమించాక కాంగ్రెసు ప్రభుత్వం మూడు మాసాలు అధికారంలో వున్నా, బ్రహ్మయ్యా అవార్డు అమలుకు జమీందారుపై ఎట్టి ఒత్తిడి తీసుకురాలేదు. కాంగ్రెసు ప్రభుత్వం గద్దె దిగడంతో జమీందారు, అవార్డు అమలుకు తిలోదకాలిచ్చాడు.

ఈ ఒడంబడిక అమలుకు తగు చర్యలు తీసుకోవలసిందిగా నాటి కృష్ణాజిల్లా కలెక్టరుకు రైతుసంఘం 1940 నవంబరు 12 న ఒక మెమొరాండం సమర్పించింది.

దీనిపై జిల్లా కలెక్టరు, ఒడంబడిక షరతులపై తాను యిచ్చే తీర్పుకు ఉభయులు కట్టుబడి వుంటామంటే, తాను ఈ వ్యవహారంలో కలుగచేసుకుంటానని రైతుసంఘానికి తెలిపాడు. దీనికి రైతుసంఘం ఒప్పుకుని, జిల్లా రైతుసంఘ అధ్యక్షుని తన ప్రతినిధిగా సూచించింది. జమీందారు తన ఏజెంటును ప్రతినిధిగా పంపుటకు అంగీకరించాడు. జగ్గయ్యపేట

డిప్యూటీ తహశీల్దారును పరిష్కర్తగా ప్రభుత్వం నియమించింది. వీరు ముగ్గురూ ఆకుపాముల కేసుల్ని టెస్టు కేసులుగా పరిష్కరించడానికి పూనుకోగా, ఉభయుల వాదనలు విన్న తహశీల్దార్ తన తీర్పు ఇస్తానన్నాడు. ఇందుకు రైతుసంఘం అంగీకరించినా, జమీందారు ప్రతినిధి ఒప్పుకోకుండా, కలెక్టర్ నిర్ణయాన్ని తోసిపుచ్చాడు.

ఆ తరువాత కొత్త జిల్లా కలెక్టర్ వచ్చాడు. ఆయనకు పరగణా జమీన్ రైతుసంఘం ఒక మెమొరాండం సమర్పించింది. తాను నియమించే కమిటీ నిర్ణయాలను జమీందారు, రైతులు అంగీకరించాలన్నాడు కలెక్టరు. కాని ఆ సూచనను జమీందారు తిరస్కరించడంతో తన ప్రయత్నం మానుకున్నాడు కలెక్టర్.

## కోర్టులో దావా

ఒడంబడిక అమలుకు జమీందారుపై డిక్రీ ఇప్పించాలని కోరుతూ మునగాల జమీన్ రైతుసంఘం బెజవాడ డిస్ట్రిక్టు మున్సిఫ్‌కోర్టులో 1942 అక్టోబరులో సివిల్‌దావా దాఖలు చేసింది. ఈ దావా మద్రాసు హైకోర్టు వరకు వెళ్ళింది. జమీందారుకు ఆర్థికి స్తోమత వుంది. మాటి మాటికి అడ్డు పిటీషన్లు పెట్టాడు. చివరకి దావాను కొట్టి వేయించాడు.

మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెసు మంత్రివర్గం రాజీనామా తర్వాత, బ్రిటిష్ సలహాదార్ల ప్రభుత్వం ఏర్పడింది. రైతుసంఘం ఒడంబడికను అమలు జరిపించాల్సిందిగా వారిని కోరింది. కాని ప్రభుత్వం జోక్యం కలిగించుకోలేదు.

1946 లో మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెసు ప్రభుత్వం తిరిగి ఏర్పడింది. ప్రజలకు ప్రభుత్వానికి మధ్య దళారీలైన జమీందార్లను రద్దు చేస్తాం ? అని కాంగ్రెసు ప్రకటించి ఎన్నికలలో గెలిచింది. 1939లో రెవెన్యూమంత్రిగా ఉన్న ప్రకాశం పంతులుగారు ప్రధానమంత్రి (ఆరోజుల్లో ముఖ్యమంత్రిని ప్రధాన మంత్రి అనేవారు) అయ్యాడు.

1939 లో రాష్ట్రరెవెన్యూ మంత్రిగా వుండి ఒడంబడిక అమలుకు చర్య తీసుకుంటానని మాట ఇచ్చిన ప్రకాశంగారు, ఇప్పుడు ప్రధానమంత్రిగా తనమాట నిలబెట్టుకోగలడని ఆశిస్తూ రాష్ట్ర రైతు నాయకులు నండూరి ప్రసాదరావు, మునగాల జమీన్ రైతు సంఘ నాయకులు వుప్పల రామయ్యగార్ల నాయకత్వాన 15 మంది ప్రముఖ రైతులు మద్రాసు రాయబారం వెళ్ళారు. 5-11-46 న ప్రకాశంగారికి, రెవిన్యూ మంత్రికి కూడా మెమోరాండం సమర్పించారు. విచారించి తెలుపుతామని వారు రాయబారవర్గానికి చెప్పారు. ఎన్ని రోజులకూ సమాధానం రానందున 1946 డిసెంబర్ 11 న రైతు సంఘం రెవెన్యూ మంత్రికి ఏమి ఆలోచించినదీ తెలపమని జాబురాసింది. దానికీ జవాబు రాలేదు.

ఇంతలో ప్రజారక్షణ ఆర్డినెన్సు వచ్చింది. దాంతో జమీందారు విజృంభించాడు. కౌలుదార్ల రక్షణ చట్టానికి వ్యతిరేకంగా కౌలు భూములు, సాముదాయక భూములు, బ్రహ్మయ్య అవార్డు ప్రకారం రావాల్సిన భూములు – మూడు లక్షల విలువగలవి అమ్మాడు.

ఒక బూటకం పాడి పరిశ్రమ కంపెనీలో తన బంధువుల్ని, ఉద్యోగుల్ని, తనకు అనుచరులైన ధనికుల్ని సభ్యులుగా చేర్చి, దాన్ని రిజిష్టరుచేయించాడు. నడిగూడెం నుంచి కరివిరాల దాకా వున్న గ్రామాల్లో, తాను లోగడ దౌర్జన్యంగా లాక్కొన్న భూముల 5 లక్షల రూపాయలకు ఈ బూటకం కంపెనీకి అమ్మినట్లు దొంగ రికార్డు సృష్టించాడు. చెరువు లోతట్టు తుమ్మలను అమ్మి లక్షలాది రూపాయలు సంపాదించాలని, వాటిని అమ్మటం మొదలు పెట్టాడు.

ఒడంబడిక అమలుకు చాలాకాలం వేచి చూశాక, ఇక లాభం లేదని 1947 మే 7 న జమీన్ రైతు సంఘం, పరగణా కమ్యూనిస్టు కమిటీల నాయకత్వాన జమీందారు ఆక్రమించిన భూముల కోసం, కౌలు భూముల రక్షణ కోసం పోరాటం ప్రారంభమైంది.

పోరాట ప్రారంభ సంకేతంగా నడిగూడెంలోని జమీందారు కోట మీద 7 వ తేదీ తెల్లవారు జామున ఎర్ర జండా ఎగురవేశారు. ఆ ఉదయం రామాపురం, శిరిపురం, కరివిరాల, కలుకోవ, తాడువాయి, నారాయణ గూడెం, ఆకుపాముల, మునగాల మొదలైన గ్రామాల్లో రైతులు, కూలీలు ఎర్రజండాలు పట్టుకుని ఊరేగింపులతో వెళ్ళి జమీందారు ఆక్రమించిన భూముల పైన, కౌలు భూములపైనా ఎర్ర జెండాలు పాతి భూములు ఆక్రమించుకున్నారు. పరగణా భూములపై ఎక్కడ చూచినా ఎర్ర జెండాలే.

## నైజాం పోలీసుల దౌర్జన్యాలు

జమీందారు తన చుట్టాలైన పోలీసు ఉన్నత ఉద్యోగుల సాయంతో నైజాం పోలీసుల్ని రప్పించాడు. తన పరగణా గ్రామాలపై దాడులు జరిపించాడు. శిరిపురంలో ముగ్గుర్ని అరెస్టు చేసి, సూర్యాపేట తీసుకు వెళ్ళి వదిలివేశారు.

నారాయణగూడెంలో రైతు నాయకుడి ఇంట్లో పెళ్ళి జరుగుతుంటే రైతు నాయకుల్ని చూపమని పెళ్ళి పెద్దల్ని పురోహితుణ్ణి, కంసాలిని కొట్టారు. కొంత డబ్బు అపహరించారు.

కొక్కిరేణి, మాధవరం, నరసింహులగూడెం, మునగాల గ్రామాలపై నైజాం పోలీసులు దాడి చేసి ప్రజల్ని తీవ్రంగా కొట్టి బాధించారు. ఈ దాడులు నైజాం కమ్యూనిస్టు నాయకుల కోసమని సాకు చెప్పారు. కాని ఈ దాడుల్లో ఒక్క నైజాం కమ్యూనిస్టు నాయకుడూ దొరకలేదు.

పోరాటం ప్రారంభంలోనే జమీందారు, తన భూముల్ని కమ్యూనిస్టులు దౌర్జన్యంగా ఆక్రమించుకుంటున్నారని కృష్ణాజిల్లా కలెక్టర్‌కు, జిల్లా పోలీసు అధికారులకు రిపోర్టులు ఇచ్చాడు.

వెంటనే రిజర్వు పోలీసు దళాలు వచ్చి నడిగూడెం కోటలో మకాం వేశాయి. వీరికి జమీందారు "సన్నసువారం"(జమీందారు వంటశాల)లో విందులు చేసి, గ్రామాలపై దాడులు చేయించేవాడు.

రిజర్వు పోలీసులు, జమీందారు నౌకర్లు కలసి కలుకోవ, శిరిపురం, ఆకుపాముల, రామాపురం, కరివిరాల, నారాయణగూడెం, మొదలైన గ్రామాలపై చాలాసార్లు దాడులు జరిపారు. కనపడ్డ వారినల్లా కొట్టి బండబూతులు తిట్టారు. ఆకుపాముల గ్రామంలో ఒక స్త్రీని చెరిచారు. నేలమర్రి, కోడిపుంజులగూడెం గ్రామాల్లో స్త్రీలపై అత్యాచారాలు జరుపబోగా, ప్రజల జోక్యంతో ఆగిపోయారు.

## జిల్లా కలెక్టర్ రాక

పోలీసుల అత్యాచారాలు, దౌర్జన్యాలు; జమీందారు అన్యాక్రాంతాలు గురించి పరగణా, జిల్లా రైతు సంఘాలు ప్రభుత్వానికి, జిల్లా కలెక్టరుకు తెలియచేశాయి. 1947 జూన్ 13 న జిల్లా కలెక్టర్ మునగాల వచ్చాడు. పరగణాలోని గ్రామ ప్రజలు వెయ్యి మంది జిల్లా రైతు నాయకుల నాయకత్వాన కలెక్టర్ వద్దకు వెళ్ళారు. అక్కడి పరిస్థితి వివరించారు. దానిపై కలెక్టర్, కౌలు భూముల నుంచి వెళ్ళగొలగవద్దనీ, పోలీసు దాడులను విచారిస్తాననీ, బ్రహ్మయ్య అవార్డు అమలు విషయమై మద్రాసు ప్రభుత్వానికి రాస్తాననీ, సాముదాయక భూముల్లోని తుమ్మలు కొట్టకుండా తగు చర్యలు తీసుకుంటాననీ చెప్పాడు.

కలెక్టర్ మాటలకు కౌలుదార్లు ఉత్సాహపూరితులై, తమ కౌలుభూములలో పనులు ప్రారంభించారు.

## జమీందారు కుట్ర

ఇదంతా చూసి జమీందారు సహించలేకపోయాడు. ఆకుపాముల గ్రామంలో తన పశువుల కొట్టాన్ని కాళీ చేయించి, తగలబెట్టించాడు. కమ్యూనిస్టులు తన చావిళ్ళు తగలబెట్టి వ్యవసాయ పనిముట్లెత్తుకు పోతున్నారని అధికార్లకు తప్పుడు రిపోర్టులు ఇచ్చాడు. దాంతో అదనపు పోలీసు బలగాలు మునగాల పరగణాకు వచ్చిపడ్డాయి. మునగాల, శిరిపురం, కరివిరాల గ్రామాల్లో మకాం వేసి, దాడులు ప్రారంభించారు.

70 మంది పోలీసులు, 30 మంది జమీందారు నౌకర్లు నారాయణగూడెం మీద దాడి చేశారు. 20 మంది స్త్రీలను తీవ్రంగా కొట్టారు. చాలామంది పురుషుల్ని కొట్టారు తలలు పగిలాయి.

కరివిరాల గ్రామంలో వందలాది పోలీసులు, జమీందారీ నౌకర్లు ఉదయంనుంచి మధ్యాహ్నం ఒంటిగంటదాకా హింసాకాండ సాగించారు. 130 మంది స్త్రీ పురుషుల్ని తీవ్రంగా కొట్టారు. కడుపుతో వున్న స్త్రీలనుకూడా వదలలేదు.

రైతు నాయకుడు రణబోతు సత్యనారాయణ రెడ్డిని తీవ్రంగా కొట్టారు. ఆయనపై ఉమ్మివేసి అరెస్టు చేశారు. రైతుసంఘ కార్యకర్త గార్లపాటి గోపయ్యను లాఠీలతో చావగొట్టగా కొద్ది రోజులకే చనిపోయాడు.

కలుకోవ గ్రామంపై పోలీసులు అనేకసార్లు దాడి చేసి, ప్రజల్ని చావగొట్టినా వారు లొంగలేదు. జూలై రెండో వారంలో ఓనాడు తెల్లవారుజామున 70 మంది పోలీసులు, 30 మంది జమీందారు నౌకర్లు దాడిచేసి, గ్రామ నాయకుల్ని అరెస్టు చేశారు. అయినా ప్రజలు

అధైర్య పడలేదు. 600 మంది స్త్రీ పురుషులు నడిగూడెం వెళ్ళారు. తమ నాయకుల్ని విడుదల చేయాలని కోరుతూ ప్రదర్శన చేశారు.

కలుకోవ గ్రామంలో హరిజనులకు ప్రభుత్వ ఈనాంభూమి వుంది. మొత్తం 40 యకరాల భూమిని జమీందారు ఆక్రమించాడు. ఈ భూమిని హరిజనులు ఆక్రమించుకుని, విత్తనం వేసి, భోజనాలు చేసేందుకు ఇళ్ళకు వచ్చారు. ఇంతలో పోలీసులు ఆ గ్రామ రైతు నాయకుడు మందపల్లి రామయ్యగారింటిపై దాడిచేసి, ఆయన భార్య శాంతమ్మగారిని హింసించబోగా ఆమె ఎలాగో తప్పించుకున్నారు. ఈ వార్త తెలియగానే ప్రజలు రామయ్యగారింటివేపు వస్తున్నారు. అక్కడ పోలీసులు వున్నట్టు గమనించి దూరంలో ఆగిపోయి "మీకూ మాకూ ఏమీ తగాదాలేదు. మా హక్కులకోసం జమీందారుతో పోరాడుతున్నాం" అని శాంతంగా విజ్ఞప్తి చేస్తుండగా, హెచ్చరిక చేయకుండా పోలీసులు కాల్పులు మొదలుపెట్టారు. ఈ కాల్పులకి హరిజన యువకుడు సీమ గురవయ్య వీరమరణం పొందాడు. వెంపటి నరసయ్యగారి కాళ్ళకి తీవ్రమైన గాయాలు తగిలాయి. ఒక స్త్రీకి, మరో నలుగురికి గట్టి దెబ్బలు తగిలాయి.

ఈ కాల్పులవార్త బెజవాడ చేరగానే, ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ తరపున నాటి మద్రాసు శాసన సభ్యుడు పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు, రాష్ట్ర మహిళా సంఘ అధ్యక్షురాలు డాక్టరు అచ్చమాంబగారు, జిల్లా రైతుసంఘ కార్యదర్శి జాలాది రామకోటయ్యగారు మునగాల వచ్చారు. వీరు కలుకోవ వెళ్ళి కాల్పుల వివరాలు తెలుసుకున్నారు. చనిపోయిన గురవయ్య కుటుంబాన్ని పరామర్శించారు. గాయాలు తగిలిన ఇతర్లను ఓదార్చారు. పరగణా పరిస్థితుల్ని పూర్తిగా తెలుసుకుని బెజవాడ వెళ్లారు. కలుకోవ కాల్పులపై విచారణ కమిటీని వేయాలనీ, బ్రహ్మయ్య అవార్డు అమలుకు చర్యలు తీసుకోవాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తూ పత్రికా ప్రకటన చేశారు. ఈ డిమాండ్‌ను బలపరుస్తూ రాష్ట్ర, జిల్లా, పరగణా రైతు సంఘాలు ప్రభుత్వానికి విజ్ఞప్తులు పంపాయి.

## కళా వెంకటరావుగారు మునగాల రాక

జూలై చివరివారంలో మద్రాసు ప్రభుత్వం రెవిన్యూ శాఖామంత్రి కళా వెంకటరావుగారు, గొట్టిపాటి బ్రహ్మయ్యగారితో కలిసి మునగాల వచ్చారు. వీరితోపాటు ఆంధ్ర రాష్ట్ర రైతుసంఘ సహాయ కార్యదర్శి వై. వి. కృష్ణారావుగారు, జిల్లా రైతు సంఘం తరపున జాలాది రామకోటయ్యగారు వచ్చారు. పోలీసు కాల్పులపై విచారణ, బ్రహ్మయ్య అవార్డు అమలు జరిపించాలని కోరుతూ పరగణా, జిల్లా రైతు సంఘాలు విజ్ఞప్తి చేశాయి. కళా వెంకటరావుగారు ప్రజలపై కాల్పులు జరిపినందుకు విచారిస్తున్నాననీ, త్వరలో విచారణ కమిటీని నియమిస్తాననీ వాగ్దానం చేశారు.

## పోరాట కాలంలో అరెస్టులు — డిటెన్షన్లు

మేనెల నుంచి జూలై వరకూ జరిగిన పోరాట కాలంలో పరగణాలోని వివిధ గ్రామాల ముఖ్య కార్యకర్తలు 19 మందిని డిటెన్యూలుగా ప్రభుత్వం జైలుకు పంపింది. కార్యకర్తలు, ప్రజలమీద 30 కేసులు పెట్టింది. 200 మందిని అరెస్టు చేసింది. 100 మందిమీద అరెస్టు వారంట్లు జారీ చేసింది. 1947 ఆగస్టు 15 న డిటెన్యూలు విడుదల చేయబడ్డారు. ఆ తర్వాత శిక్షలుపడ్డవారు విడుదలయ్యారు. మిగతా కేసులు ఎత్తివేయబడ్డాయి. తన వాగ్దానం ప్రకారం 1947 అక్టోబరులో ఈ దిగువ కమిటీని కళా వెంకటరావుగారు నియమించారు.

గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ఛైర్మనుగాను, నూకల వీరరాఘవయ్య, పేట బాపయ్య, వై. వి. కృష్ణారావు, కుందేసు సత్యనారాయణగార్లు సభ్యులుగాను ఈ కమిటీలో వున్నారు.

ఈ కమిటీ మునగాలలోను, బెజవాడలోను అనేక సమావేశాలు జరిపి, రైతులను, జమీందారును విచారించి, తన నివేదికను 1948 జనవరి 10 న మద్రాసు ప్రభుత్వానికి సమర్పించింది. ఈ నివేదికలోని సిఫార్సులు :

1. ఒడంబడిక అమలుకు, వెంటనే అమల్లోకి వచ్చు ఉత్తర్వు చేయాలి.

2. అవార్డు ప్రకారం రావాల్సిన భూములకు నష్ట పరిహారం, ఉత్పత్తివల్ల లాభాలు రైతులకు చెందుటకు చర్చలు తీసుకోవాలి.

3. పై చర్యలు తీసుకొనుటకు స్పెషల్ ఆఫీసర్‌ను వెంటనే ప్రభుత్వం నియమించాలి.

అయితే ఈ నివేదికను ప్రభుత్వం ప్రకటించనూ లేదు, అమలు జరగనూలేదు, కాలగర్భంలో కలిసి పోయింది.

## ఉద్యమ ఫలితాలు

1. విచారణ కమిటీ నియామకం. ఈ కమిటీలో ఆంధ్ర రాష్ట్ర రైతు నాయకులు వై. వి. కృష్ణారావు గారిని కూడా నియమించుట.

2. కౌలు భూముల నుంచి వైదొలగకుండా రైతులు ఐక్యంగా నిలబడుట.

3. 1947 ఆగస్టు 15 నాటికి డిటెన్యూలు, శిక్షించబడినవారు విడుదల.గుట

4. వందలాది మందిపై పెట్టిన కేసులు నిలుపుదల

5. జమీందారు, 8 గ్రామాల్లోని హరిజనుల నుంచీ ఒక రైతు నుంచీ దౌర్జన్యంగా ఆక్రమించుకున్న భూములకు బదులుగా య. 145-00 మెరక, య. 17.40 మాగాణి భూమి వారికి ఇచ్చుట.

6. అధిక సంఖ్యలో జమీందారు ఉద్యోగులు రాజీనామా చేయుట.

7. రైతు సంఘం పేరు ప్రతిష్టలు ఉన్నత స్థాయికి పెరిగాయి. రైతు సంఘం సభ్యత్వం 12 వేలకు మించిపోయింది. పరగణా ప్రజలకు సంబంధించిన ప్రతి విషయం పైనా, రైతు సంఘ నిర్ణయమే తుది నిర్ణయంగా అమలు జరిగింది.

*(రైతులోకం మాసపత్రిక 1980 ఏప్రిల్ జూన్, ఆగస్టు సంచికలలోని కే. శే. తటవర్తి వెంకటేశ్వరరావుగారి వ్యాసం ఆధారం.)*

# తిరువూరు తాలూకా

తిరువూరు తాలూకా స్వాతంత్ర్య ఉద్యమాన్ని ప్రస్తావించవలసినప్పుడు, మొదట గంపలగూడెం గుర్తుకు వస్తుంది. 1920 నుంచి ఈ గ్రామవాసులు జాతీయోద్యమంలో పాల్గొన్నారు. కోటగిరి వెంకట కృష్ణారావు (గంపల గూడెం కుమారరాజా), పేట బాపయ గార్లవంటి జిల్లా కాంగ్రెస్ నాయకులు ఈ గ్రామ లే. కోటగిరి వెంకట కృష్ణారావుగారు, బెజవా నుంచి, ఉప్పు సత్యాగ్రహ దళాలలో ప్రథమ సత్యాగ్రహదళానికి నాయకత్వం వహించి నడిపినవారు. జిల్లా రాజకీయాలలో వీరిరువురూ ప్రముఖ పాత్ర వహించారు. జిల్లా స్వాతంత్ర్య సమర చరిత్రలో ఈ తాలూకా నిర్వహించిన పాత్ర గురించి కొంత వరకూ ఇదివరలోనే ప్రస్తావించడం జరిగింది. మరి కొన్ని వివరాలు ఇవి.

గంపలగూడెం కుమారరాజా కోటగిరి వెంకట కృష్ణారావుగారు హోమ్‌రూల్ ఆందోళన కాలంలో కాంగ్రెస్‌లో చేరి, అప్పటి నుంచి కాంగ్రెస్‌కు పట్టు కొమ్మ అయ్యారు. గంపలగూడెంలో 1919 లో జరిగిన కృష్ణా మండల రాజకీయ మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులై గంభీరోపన్యాసం కావించారు. వారి సహాయం వల్లనే, ఆ సభ జయప్రదంగా జరిగింది. దానికి కాశీనాధుని నాగేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు.

## తిరువూరు తాలూకా గ్రామాల్లో

1930 లో తిరువూరు తాలూకా ఆర్లపాడు గ్రామ వాస్తవ్యులు ఊటుకూరు సత్యనారాయణరావు (ఆంధ్ర నాటక కళానిధి) గారినీ, మధిర తాలూకా మాము నూరు కాపురస్థులు మామునూరు నాగభూషణరావు గారినీ ఉపన్యాసాలు ఇచ్చారని అరెస్టుచేసి, కొద్ది రోజులు పోలీసు కస్టడిలో వుంచి విడిచి పెట్టారు.

గోసవీడు కాపురస్తులు నేరెళ్ళ రోశయ్యగారు 1930 జూన్ 30 న, వారి గ్రామానికి వచ్చిన కాంగ్రెస్ కార్యకర్తలకు భోజనం పెట్టినందుకు, పోలీసులు ఆయన్ని తిరువూరు తీసుకువెళ్ళి మూడు రోజులు వుంచి వదిలి పెట్టారు. కాంగ్రెస్ కార్యకర్తలకు మంచినీళ్ళు యిచ్చారని జక్కేపల్లి నరసింహం (రోలుపడే గ్రామం) గార్ని పోలీసులు తిరువూరు

తీసుకుపోయి, మూడు రోజుల తర్వాత విడిచి పెట్టారు.

గంపలగూడెంలోను, ఇతర గ్రామాలలోను లైసెన్సులు వున్న తుపాకులు అన్నింటిని పోలీసులు స్వాధీనం చేసుకున్నారు.

1921 ఉద్యమంలో పాల్గొని జైలుకు వెళ్ళిన వారిలో కోటగిరి వెంకట కృష్ణారావు, పేట బాపయ్య, సువారపు వెంకయ్య, రాఘవరపు వెంకయ్య, సంతపురి నారాయణరావు, వూటుకూరు వెంకయ్య, చీమలపాటి సుందర రాములుగార్లు వున్నారు.

తిరువూరు తాలూకా తాతకుంట్ల శివారు గ్రామస్తులు 5 గురిని గౌరంపాలెం కాపురస్తులు ముస్లిములు 4 గురిని ఖిలాఫత్ ఉద్యమంలో అరెస్టుచేసి విజయవాడలో 4 రోజులు నిర్బంధంలో వుంచి విడిచి పెట్టారు.

1930 లో కోటగిరి వెంకట కృష్ణారావు, పేట బాపయ్య, కతారు వీరాస్వామి, కతారు గోవిందరావు, కతారు రంగనాయకులు, రాఘవరపు వెంకయ్య, ఊటుకూరు లక్ష్మి నరసింహారావుగార్లు రాజమండ్రి జైలులో శిక్షను అనుభవించారు. మురుకుట్ల వెంకటప్పయ్య, చారుగుండ్ల సీతారామగుప్త, ఊటుకూరు రామకృష్ణారావు, కోటగిరి పార్థసారధి, కాసులనాటి వెంకటేశ్వ , పొన్నలూరి రాధాకృష్ణమూర్తి, కోటగిరి సూర ప్రకాశరావుగార్లు తంజావూరు జైలులో శిక్ష అనుభవించారు.

గంపలగూడెం కాపురస్తులు మురుకుట్ల వెంకటప్పయ్యగారు 1933 లో హరిజన సహపంక్తి భోజనం చేశారని సాంఘికంగా బహిష్కరింపబడ్డారు. బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులకు అన్నం పెడితే పాపం తగులుతుందని అన్నం పెట్టేవారు కాదు. ఇలాంటిపరిస్థితిలో కూడా వెనుకంజ వేయలేదు.

జమీందారీ ఎంక్వయిరీ కమిటీకి అవసరమైన భోగట్టా సేకరిస్తుండగా గంపలగూడెం జమీందారు ఈయన్ని రౌడీలతో కొట్టించాడు. 1942 లో పేట బాపయ్య, మురుకుట్ల వెంకటప్పయ్యగార్లు జైలుకు వెళ్ళారు.

## కల్లు దుకాణాల పాట

1931—32 లో బెజవాడ సబ్ కలెక్టర్ తిరువూరు తాలూకాలోని అన్ని గ్రామాలలో కల్లు దుకాణాలు వేలం వేయుటకు, తేదీ నిర్ణయించి, పాటలు పెట్టాడు. శ్రీ కోటగిరి వెంకట కృష్ణారావు, శ్రీ పేట బాపయ్య, శ్రీ కాట్రగడ్డ మధుసూదనరావు, శ్రీ కతారి వీరాస్వామి, మురుకుట్ల వెంకటప్పయ్య మొదలైన కాంగ్రెస్ కార్యకర్తలు, తాలూకాలోని జమీందార్లతోను, రైతులతోను, కలసి ముందుగా మాట్లాడి, వారి స్వాధీనంలో వున్న తాటి చెట్లను కల్లుగీతకు ఇవ్వకుండా చేయించారు. గీత కార్మికుల నాయకులు ముచ్చెనపల్లి కాపురస్తులు శ్రీ గోదా మిచ్చిదాసుగారు తమ కులం వారైన గీత కార్మికులు ఆ పాటలో పాల్గొనకుండా ఆపు చేయించాడు. పాటల దగ్గర పికెటింగు జరిపారు. మొదటి దఫా, రెండవదఫా, ఎవరూ పాటలకు రాలేదు. మూడవ దఫా సబ్ కలెక్టర్ జిల్లా యేతర ప్రాంతాల నుంచి గీత కార్మికుల్ని రప్పించి, గ్రామాల కల్లు దుకాణాలు వారికి యిచ్చాడు. కాని ఆ గీత కార్మికులు కల్లు గీసుకొనుటకు ఎవరూ తాటి చెట్లు ఈత చెట్లు యివ్వలేదు. వారు అధికారులకు మొర పెట్టుకున్నారు. అధికారులు గ్రామస్తులను బెదిరించారు. అయినా ఎవరూ చెట్లను కల్లుగీతకు యివ్వలేదు. ఆ గీత కార్మికులు నష్టపడి తిరిగి వారివారి గ్రామాలకు వెళ్ళిపోయారు. తాలూకాలో ఆ సంవత్సరం కల్లు పాకలన్నీ మూతపడ్డాయి.

గంపలగూడెంలో పోలీసులు తీసివేసిన కాంగ్రెస్ జండాను, మరల కట్టారు. పోలీసుల కారుకు కిరసనాయిల్ పోయలేదు. వాళ్ళకి భోజనాలు పెట్టలేదు. ఇందుకు కోపించిన పోలీసులు కేతపల్లి పద్మనాభరావు కొల్లా సుందరరావు, నాగుబంది రంగయ్య, బొడ్డు వెంకటనారాయణ, నేరెళ్ళ నాగభూషణం, కొల్లా రామలింగం, కొల్లా జగ్గయ్య, కొల్లా పిచ్చయ్య, నేరెళ్ళ పుల్లయ్య, నేరెళ్ళ సుబ్బారావు, కొల్లా కోటయ్య, రాఘవరపు రంగయ్య, కొత్తా రాములు, బొడ్డు కాంతయ్య, కేతేప చిన్న శ్రీరాములు, బొడ్డు వెంకటేశ్వర్లు, చారుగుం వెంకట నరసింహం, చారుగుం రాఘవులు, దేరశెట్టి సోమయ్య, కొత్తగుం పుల్లయ్య, దూదేకుల సొందు సాహెబ్, ము ంబి వరదాచార్యులుగార్లను, మరో నలుగురిని అరెస్టుచేసి తిరువూరు తీసుకువెళ్ళారు. వారం రోజులు పోలీసు కస్టడీలో వారిని వుంచుకోగా, వకీలు శీలం

జగన్నాధరావుగారు కలెక్టరుకు అర్జీ యిచ్చి, వారందరినీ విడుదల చేయించారు.

తిరువూరు తాలూకా ఆఫీసు ఎదుట రోడ్డున వెళ తుండగా ప్రముఖ న్యాయవాది పిసపాటి లక్ష్మీకాంతం (బెజవాడ)గారు, కోటమర్తి సీతారామయ్య (తిరువూరు)గారు ఖద్దరు బట్టలు ధరించినందున, పోలీసులు ఆ ఇద్దరి బట్టలీ నడిరోడ్డుమీద ఊడదీశారు. ఈ విషయమై లండన్ లోని హౌస్ ఆఫ్ కామన్సు సభలో ప్రశ్నించటం జరిగింది.

తిరువూరు వాస్తవ్యులు మారేపల్లి సుబ్బారావుగారు 1938 నుండి కాంగ్రెస్ కార్యకర్త 1942 ఆగస్టు 9 న తిరువూరులో క్విట్ ఇండియా ఉద్యమ ప్రాముఖ్యత తెలుపుటకు మురుకుట్ల వెంకటప్పయ్యగారు జరిపిన సభకు సుబ్బారావుగారు అధ్యక్షత వహించారు. 12-8-1942 న వెంకటప్పయ్యగార్ని అరెస్టు చేశాక సుబ్బారావుగారు కఠారు వెంకయ్యగారు, కొందరు మిత్రులతో కలిసి తిరువూరు-నూజివీడు మార్గంపై తంతి తీగెలు తెంచివేశారు. అందుకుగాను వీరిపై అరెస్టు వారంట్ రాగా, పోలీసులకు చిక్కకుండా చాలారోజులు రహస్య జీవితం గడిపారు, వీరు చాలా కాలం తిరువూరు తాలూకా కాంగ్రెస్ సంఘంలోను, పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంఘంలోను సభ్యులు. స్వాతంత్ర్యం వచ్చాక నిజాం కాంగ్రెస్ జరిపిన స్వాతంత్ర్య పోరాటంలో నిజాం కాంగ్రెస్ కార్యాలయం వారికి,అక్కడ నుంచి వచ్చిన ప్రజలకు వైద్యం చేస్తూ వారి ఉద్యమానికి బలం చేకూర్చారు.

## నిజాం ఉద్యమ పోరాటం

1948 ఆగస్టు 15 తర్వాత నిజాం కాంగ్రెసువారు తిరువూరులో ఆఫీసుపెట్టి, అప్పుడప్పుడు నిజాం సరిహద్దులలోకివెళ్ళి రజాకార పై దాడులు జరిపేవారు. నిజాం ప్రభుత్వ ఆస్తులకు నష్టం కలిగించేవారు. ఒక రాత్రి తిరువూరు సరిహద్దు గ్రామం ముత్తగూడెం లోని ప్రభుత్వ కష్టమ్స్ ఆఫీసును బద్దలుకొట్టారు. మర్నాడు, దానిలోని ఆస్తిని దోచుకురమ్మని ప్రజలకి చెప్పారు. వారి మాట ప్రకారం తిరువూరు ప్రజలు ప్రభుత్వ ఆస్తిని దోచుకువస్తుండగా, నిజాం పోలీసులు, రజాకార్లు పొంచివుండి వారిపై కాల్పులు జరిపారు. ఆ కాల్పులలో తిరువూరు కాపురస్తులు గొండేల వెంకటరామమూర్తిగారు చనిపోయారు. జవ్వాజి రాములుగారికి తుపాకి గుళ్ళు తగిలి పడిపోగా ఆయన్ని తీసుకువెళ్ళి ఖమ్మం, వరంగల్లు, నిజాంబాద్ జైళ్ళలో చాలాకాలం నిర్బంధంలో వుంచారు. తెలంగాణాలో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడ్డాక వీరిని విడిచి పెట్టారు.

జంగా పుల్లారెడ్డి, లక్ష్మీకాంతారావు, బైగానివజ్రం దోర్నాల లచ్చిరెడ్డి, దొడ్డా రత్నారెడ్డి, నన్నక అనంతరామయ్య, ఆకుల శ్రీరాములుగా గ్రామాల్లో వుండి, తెలంగాణా కాంగ్రెసు సంఘం రికి కావలసిన సహకారం అందచేస్తూ వుండేవారు. తిరువూరు క్యాంపులో కోదాటి రాములు, వలదాసు అప్పయ్యగార్లు ఎప్పుడూ వారితో వుండి పనిచేసేవారు.

పెమ్మరాజు పార్థసారధిరావు, దూప గుం రాఘవులు, మారేపల్లి సుబ్బారావు, కఠారు వెంకయ్య, కంచి శ్రీమన్నారాయణగార్లు తిరువూరు తాలూ కాంగ్రెసు సంఘం తరపునా, నూర సాహెబ్, సుంకర సత్యగోపాలం, పేట కృ య్య గార్లు తిరువూరు గ్రామ కాంగ్రెస్ తరపు తిరువూరు పరిసర గ్రామాల్లో పనిచేశారు.

తిరువూరు క్యాంపు వారికి కొల్లి బుచ్చయ్య, పింగలి నరసింహారావు, అప్పలరాజు, కొడుమంచి సీతారామయ్య, మండలోజు వెంకటేశ్వర్లు, నన్నక రామక్రిష్ణయ్య, గద్దె ప్రభాకరరావుగార్లు సహకరించారు.

పెద్దవరం కా ంపు వారికి పెనుమత్స సత్యనారాయణరాజు (పె వరం), నాయని సీతారామయ్య, ఊటుకూరు వెం ట్రామారావు ఊటుకూరు లక్ష్మీనరసింహారావుగార్లు తోడ్పడ్డారు.

## తెలంగాణా ఉద్యమానికి తిరువూరు తాలూకా తోడ్పాటు 1945 నుంచి 1952 వరకు

తెలంగాణాలో రజాకార్ల ఉద్యమం ప్రారంభమైన కొద్దిరోజులకు, అప్పటి వరంగల్లు జిల్లా మధిర తాలూకాలోని గానుగపాడు వాస్తవ్యులు వనం కృష్ణమూర్తిగారి నాయకత్వాన, తిరువూరు తాలూకా పోలిశెట్టిపాడు గ్రామానికి చెందిన కోటేరు రామచంద్రారెడ్డి, అత్తనూరు బాచిరెడ్డి, చల్లా నరసింహం, గోదా

సుబ్బయ్య. నూతక్కి వెంకటచలం, వేము రాఘులు, వేపకూర పిచ్చయ్యగార్లు. మధిర తాలూకా రాయపట్నంకు చెందిన దూపగుండ్ల నారాయణరావుగారు గానుగపాడు వెళ్ళి, అక్కడి పోలీసు నాకాపై జాతీయ పతాకం కట్టారు

ఆ తర్వాత తెలంగాణా కాంగ్రెస్‌సంఘ నాయకులు బేతు కేశవరెడ్డిగారి అధ్యక్షతన, గానుగపాడు, దాని శివారు గ్రామాల ప్రజలు కలసి "గానుగపాడు రిపబ్లిక్ కమిటీకి చీవిరాల సీతారామయ్యగారిని అధ్యక్షునిగా ఎన్నుకున్నారు. ఈ కమిటీలో ఈ కిందివారు సభ్యులు_

గానుగపాడుకు చెందిన కర్నాటి వెంకటరెడ్డి, పొట్టేటి సుబ్బారెడ్డి, శెట్టిపల్లి వెంకటప్పారెడ్డి, శీలం వెంకటరెడ్డిగార్లు, చిక్కుళ్ళగూడెంకు చెందిన టంటం బాలయ్య, పల్నాటి వీరయ్యగార్లు. కొత్తూరుకు చెందిన గుర్రాల హనిమిరెడ్డి, తోకచిచ్చు పుల్లంరాజు గార్లు.

పల్లెర్లమూడికి చెందిన కవులూరు సత్యనారాయణ, చీరె పెదబసివిరె , పొటేటి పొట్టిరెడ్డి, చారుగుం అప్పయ్యగా .

టపల్లికి చెంది యరమం నాగిరెడ్డి, గుర్రాల చినకోటారెడ్డి, కామిరెడ్డి వెంకటరెడ్డి, గొల్లమందల అప్పయ్యగా .

ఊకులప కి చెందిన కామిరెడ్డి రామిరెడ్డి, శీలం అచ్చిరెడ్డి, క్ ఇమామ్, మంగినపూడి బిచ్చం గార్లు.

తెలంగాణా కమిటీ తరపున టి హయగ్రీవాచారి, బొమ్మకంటి సత్యనారాయణరావుగార్లు వున్నారు.

పైవారిలో ఒకరిని ముఖ్యమంత్రిగాను, మరొకరిని గవర్నరుగాను, ఇంకా కొందర్ని మంత్రులుగాను, కమిటీ కార్యదర్శిగా కె. వి. కృష్ణమూర్తి (గానుగపాడు) గారినీ రిపబ్లిక్ ఆర్గనైజరుగా, అండర్ గ్రౌండ్ వర్కరుగా మురుకుం చంద్రమౌళీశ్వర శర్మగారిని నియమించారు.

తిరువూరు వాస్తవ్యులు గుండిమెడ లక్ష్మీనారాయణ (బుల్లోడు), పనుపులేటి వీరయ్యగార్లను పల్లెర్లమూడి గ్రామం తీసుకువచ్చి, పోరాటానికి కావాల్సిన ఆయుధ సామగ్రి తయారుచేయించారు. ప్రమాదకరమైన ఆయుధాలు తయారు చేయించుటకు సర్దార్



నరసింహసింగ్ గారిని సికింద్రాబాదు నుంచి పిలిపించారు. వీరు పల్లెర్లమూడిలో బ్రహ్మంగారి ఇంట్లో తయారుచేస్తుండగా మందుసామగ్రి పేలి బ్రహ్మంగారి కాలు తెగి ఆరు అడుగుల దూరంలో పడింది. సర్దారు నరసింహసింగ్ ఒళ్లు తూట్లు పడింది. వీరిద్దరూ చనిపోయారు.

పై కమిటీ సభ్యులలో పల్నాటి వీరయ్య, చేరెడ్డి పెద్ద బసివిరెడ్డి, చారుగుండ్ల అప్పయ్య, గుర్రాల చినకోటారెడ్డి, కామిరెడ్డి వెంకటరెడ్డి, శీలం అచ్చిరెడ్డి, షేక్ ఇమామ్ గార్లు తర్వాత చనిపోయారు.

తిరువూరు తాలూకాలో చనుబండ, తిరువూరు, పెద్దవరం, తునికిపాడు గ్రామాలలో తెలంగాణా కాంగ్రెస్ ఆఫీసులను అధికారికంగా పెట్టారు.

చనుబండ వాస్తవ్యులు, మాచర్ల గోపాలం, మునగంటి వెంకటాచారి, మునగంటి నరసింహాచారి గార్లూ, సహీద్ వజీరుద్దీన్ ఖాదర్, గార్లపాటి పాపారావు, కలకొండి మె దక్షిణామూర్తి (కొర్లమంద) గారు, విస్సన్నపేట కాపురసులు గోపాల రామారావు, కేతేపల్లి రాధాకృష్ణమూర్తి, పెండెం సోమయ్య, పూట్ల కేశవులు, షేక్ గాలిబ్, లాల్ గార్లూ_తిరువూరు తాలూకా కాంగ్రెస్ సంఘం తరపున, చనుబండ ఆఫీసు తెలంగాణా కాంగ్రెస్ కార్యకర్తలకు తోడ్పడేవారు.

మధిర తాలూకాలోని కంచపర్తి సబ్ ఆఫీసు వారితో కలసి, వేములపల్లి రాఘవయ్య (కామిరెడ్డి పల్లె), వనమా నాగభూషణం (నూతిపాడు) గార్లు పనిచేస్తుండేవారు.

తునికిపాడు క్యాంపువారికి కర్నాటి అప్పయ్య, చిరుమాళ్ళ శేషయ్య, నల్లిగట్ల ఆదినారాయణ కొమ్మినేని వీరయ్య, కర్నాటి భద్రయ్య, దేవభక్తుని సీతారామయ్య, వనమ జగన్నాధం, వంకమామి శేషాచలం, నాళ్ళ అంజయ్యగార్లు సహకరించి పనిచేశారు.

చారుగుండ్ల జగన్నాధం, కతారు నరసింహారావు, ఊటుకూరు సత్యనారాయణమూర్తి, మేచినేని విశ్వనాధరావు, గుర్రం నారాయణరావు, సానికొమ్ము

రామకోటారెడ్డి, కన్నెగంటి పద్మనాభశాస్త్రి గార్లూ, ఇంకా కొందరూ గ్రామాల్లోకి వచ్చిన తెలంగాణా ప్రజలకు సహాయం చేశారు.

1938-39 లో తిరువూరు తాలూకా కాంగ్రెస్ సంఘానికి మురుకుంట్ల వెంకటప్పయ్యగారు అధ్యక్షులుగానూ, సుంకర వీరభద్రరావుగారు కార్యదర్శిగాను పనిచేశారు.

1945-1952 వరకు తాలూకా కాంగ్రెస్ సంఘానికి మురుకుంట్ల వెంకటప్పయ్యగారు అధ్యక్షులుగాను, పెమ్మరాజు పార్థసారథిరావుగారు ప్రధాన కార్యదర్శిగాను, జంగా పుల్లారెడ్డి, గద్దె ప్రభాకరరావుగార్లు సహాయ కార్యదర్శులుగాను, దూపగుంట్ల రాఘవులుగారు ట్రెజరరుగానూ వున్నారు.

## తిరువూరు తాలూకాలో రైతు ఉద్యమం

కృష్ణాజిల్లాలో తిరువూరు తాలూకా ఉత్తర భాగాన వుంది. అన్నివిధాలా వెనుకబడిన ప్రాంతం. దీనికి మూడువైపుల తెలంగాణా నిజాం గ్రామాలు అంటి వున్నాయి. 90 గ్రామాలు, 300 శివార్లుగా విస్తరించి వున్నాయి. నూటికి నూరు జమీందారీ, మొఖాసాదారీ ఏలుబడిలోని గ్రామాలే.

ధన-ధాన్యాలకు నిలయమైన కృష్ణాజిల్లాలో కూడా దరిద్రానికి - నికి స్థావర మనదగినది తిరువూరు తాలూకా, - ట్టవల్లాలు గల భూమి. అడవులు, కొండలు, వాగులతో నిండివుంది. రహదారులేవు, విద్యా - వైద్యసౌకర్యాలు మృగ్యం. తంతి-తపాలా సౌకర్యములు అరుదు. (అయిదు పోస్టాఫీసులు మాత్రమే వుండేవి.) అంటురోగాలకు పుట్టినిల్లు. మలేరియాకు స్థావరం. ఈ పరిస్థితులన్నింటికి జమీందారీ, మొఖాసాదారీ పాలనే మూలమని వక్కాణించవచ్చు. పోలీసుజులుం. అధికారుల నిరాదరణ. ఆర్థిక యిబ్బందులతో సతమత మవుతున్న అమాయిక ప్రజానీకం. ఇది 1936-37 సంవత్సరాల తాలూకా పరిస్థితి.

1936-37 ఎన్నికల సంరంభం : జాతీయోద్యమ ఛాయలు తాలూకాలో పరిమితంగా వున్న దినాలు. ఈ ఎన్నికలలో మొట్ట మొదటిసారిగా రహస్యపు ఓటింగు విధానం అమలుకు వచ్చింది. ఆనాడు శిస్తు కట్టేవారు మాత్రమే ఓటు చేయుటకు అర్హులు. ఈ విధానం ఒక విప్లవకరమైన మార్పుగా ఎంచవచ్చు.

ఇంతకుముందు ప్రత్యక్ష ఓటింగు సందర్భంలో ఇరుపక్షాలవారు పోలింగులవద్ద ఈటెలు-తుపాకులతో, ఎదురు బదురుగా నిలబడి ఓటర్లకు ప్రాణసంకట పరిస్థితులు కలిపించేవారు. పోలింగుకేంద్రాలు 7, 8 మైళ్ల దూరంతో వరకు వుండేవి ఎస్టేటు వుద్యోగులు ఓటర్లను మందలు-మందలుగా పోలింగు కేంద్రాలకు తో కువచ్చేవారు.

పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు అభ్యర్థులుగా (ద్విసభ్య నాలు.) శ్రీ కొట్రగడ్డ వెంకటనారాయణరావు, ι జయంతిపురంరాజాలు వున్నారు. జస్టిస్ పార్టీ తరఫున కొళందరెడ్డి అడ్వకేటు, గూడవల్లి లక్ష్మరాయుడుగారలు అభ్య ులు.

"దారి దొంకలు లేనివూ న్న
మనపల్లెటూళ్ళు దమ్మిడ కి పనికిరావన్నా."

అని గరిమెళ్ళ సత్యనారాయణగారి పై ప్రచార గేయాన్ని ఆలాపించినప్పుడు ఈ గేయంలోని చిత్రీకరణ ఎంత యదార్థమో అవగతమవుతుంది.

తిరువూరు నుండి నూజివీడు వెళ్ళు రోడ్డు మాత్రమే తిరువూరు తాలూకాలో ప్రధాన రహదారి. గ్రామాలు, వాటిచుట్టూ ఆవరించివున్న అడవులగుండా ఎక్కడకు వెళ్లాలన్నా కాలినడకే. వాహనాలు ఒడిదుడుకులు గల బాటలగుండానే ప్రయాణించవలసి వచ్చేది.

ఆనాడు మొఖాసాదార్లు, జమీందార్లు బ్రిటిష్ ప్రభుత్వానికి అండగాను, కాంగ్రెసుకు వ్యతిరేకంగాను ఉన్నారు, అనగా ప్రభుభక్తి పరాయణులుగా వుండి ప్రభుత్వోద్యోగుల, పోలీసుల అండతో తమ నిరంకుశ దోపిడీ విధానాన్ని ప్రజానీకంపై యధేచ్ఛగా సాగించుకొనుటలో హద్దూ-అదుపులేని పెత్తనం చలాయించేవారు.

ఇలాంటి ప్రాంతంలో తాలూకా వ్యాపిత కార్యక్రమం కొనసాగించడం చాలా కష్టమైన పనిగా

ఉండేది. అపుగపుగునా జమీందార్ల, మొఖాసాదార్ల రౌడీలు వారి తాబేదారులు, దళ సభ్యులకు భోజనాదులు లభించకుండా చేయడం, కాంగ్రెసుకు ఓట్లేస్తే గ్రామాలకు గ్రామాలనే ధ్వంసం చేస్తామని బెదిరించేవారు. ఈ ప్రమాదకర పరిస్థితులలో దారీ-తెన్నూ గానక చీకటిలో దేవులాడుతున్న ప్రజానీకంలోనూ తన వెలుగును-ఈ ప్రచార దళాలు సృష్టించాయి. ఉన్నాతినక పోయినా తదేకదీక్షతో దళాలు దాదాపు తాలూకాలో వున్న గ్రామాలు రెండుదఫాలు కలియదిరగడం జరిగింది. ఆనాడు యువక ప్రచారదళం జమీందారీ దురంతాలను ధైర్యంగా ప్రతిఘటించుతూ, చేసిన ప్రబోధం ప్రజలలో తమకు పెద్ద అండ దొరికిందనే విశ్వాసాన్ని కలిగించింది.

అభ్యర్థుల రంగుపెట్టెలను ప్రదర్శించి, రహస్య ఓటింగు విధానం ప్రచారం చేయడమే ఒక విప్లవంగా భావింపబడింది. కాంగ్రెసు అభ్యర్థులు విజయం పొందారు. మద్రాసురాష్ట్రంలో కాంగ్రెసు గద్దెనెక్కింది. ప్రజలలో ఒక నూతన చైతన్యం కనిపించింది. పలువురు యువకులు కాంగ్రెసు వైపుకు ఆకర్షింపబడినారు.

ఎన్నికలలో ఓటమి తిన్న ఫ్యూడల్‌వర్గాలు తమ అదుపులో నుండి ప్రజలు జారిపోయే ప్రమాదాన్ని గుర్తించారు. క్రూరత్వానికి, నిరంకుశత్వానికి పేరు పడిన వీరు బరితెగించి తాలూకాలోని గ్రామప్రజల్ని పలుహింసలకు గురిచేస్తూ వచ్చారు.

ఈ పరిణామ దశలో శ్రీ సుంకర వీరభద్రరావు, శ్రీ మురుకుంట్ల వెంకటప్పయ్యగార్లు తాలూకా కాంగ్రెసు అధ్యక్ష, కార్యదర్శులుగా ప్రచారకులుగా వున్నారు. కార్యకర్తలుగా పనిచేసినవారు ప్రజాదరణ పొందారు. గ్రామ-గ్రామం తిరుగుతూ ఆయా గ్రామాలలో జరుగుతున్న జమీందారీ దురంతాలకు వ్యతిరేకంగా ప్రజలను ఆయత్తపరుస్తూ పత్రికా ముఖాన (జమీన్ రైతు, వాహిని, నవశక్తి ఆదిగాగల పత్రికలలో) బైట ప్రపంచానికి తెలిసేటట్లు చేశారు. దాన్ని నేరంగా పరిగణించి గంపలగూడెం గ్రామంలో మురుకుంట్ల వెంకటప్పయ్యగార్ని జమీందారీ రౌడీలు కొట్టారు. ఆగ్రహం చెందిన ప్రజానీకం చుట్టుప్రక్కల గ్రామాలనుండి మరునాడు వచ్చి పెద్ద ప్రదర్శన జరిపి జమీందారీ దౌర్జన్య చర్యలను ప్రతిఘటించగలమనే హెచ్చరిక చేశారు. అలానే కొండపర్వ మొఖాసాదారు ప్రజలపై అనేక అక్రమ చర్యలకు పూనుకుంటే పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు అధ్యక్షులు పేట బాపయ్యగారు వాటిని అడ్డుకున్నారు. కొండపర్వ రైతులపై మోపబడిన కేసులన్నీ అక్రమమని ప్రకటించినందులకు, కోర్టు ధిక్కారణ నేరం పై ఒక నెలరోజులు వారికి శిక్ష విధించారు. (1938) కాంగ్రెసు ప్రభుత్వం వున్నంతకాలం జిల్లా కాంగ్రెసు ఈ తాలూకాలో జరుగుతున్న పలు పోరాటాలకు అంగగానే వుంది. ప్రజలు కూడా కాంగ్రెసుకు అండగానే వున్నారు.

చిట్టేల గ్రామం గంపలగూడెం ఎస్టేటులోనిది. కాంగ్రెసు ప్రభుత్వం నియమించిన జమీందారీ ఎంక్వయిరీ కమిటీ ముందు కొల్లి బుచ్చయ్యగారు అమూల్యమైన భోగట్టాలతో సాక్ష్యం యిచ్చారు. అందుకు జమీందారు బుచ్చయ్యగారిని గూండాలతో కొట్టించారు. గ్రామ స్త్రీలను భీతావహులను చేశారు. ఈ దాడిని రాజకీయ పార్టీలు ఖండించాయి. ఈ గ్రామానికి కాంగ్రెసు మంత్రులు వచ్చి పరామర్శించారు.

కాట్రగడ్డ వెంకటనారాయణరావుగారుఎం.ఎల్.ఎ. తాలూకాలో పర్యటించి వివిధ గ్రామాలలో జరిగే అక్రమ చర్యలను ప్రభుత్వ దృష్టికి తెస్తూ ప్రజలకు అండగానిలిచారు. అల్లూరు సీతారామరాజు చరిత్ర (మన్యం తిరుగుబాటు) రచయిత పొన్నలూరు రాధాకృష్ణమూర్తిగారు 1938 లో కాంగ్రెసు ప్రచారకులుగా తిరువూరు తాలూకాలో పనిచేశారు. "తిరువూరు తాలూకాలో జమీందారీ దురంతాలు" అనే 22 పేజీల కరపత్రం ప్రచురించి తాలూకా ప్రజల బాధలను ప్రభుత్వ దృష్టికి తెచ్చారు.

1937 లో సుంకర వీరభద్రరావుగారు తునికిపాడులో సిరపడి ప్రజా సమస్యల పరిష్కారానికి కృషి చేయడం ప్రారంభించారు. తునికిపాడు తాలూకా పశ్చిమ సరిహద్దులో వున్న జమీందారీ గ్రామం. ఈ గ్రామానికి అందుబాటుగా నందిగామ తాలూకాకు చెందిన కొణిజర్ల, నెమలి, ఉమ్మడిదేవరపల్లి గ్రామాలుండేవి. (ప్రస్తుతం తిరువూరు తాలూకాలో చేర్చబడ్డాయి.) ఇవి బ్రిటిష్ పాలనలోని రైతువారీ గ్రామాలు ఈ గ్రామాలకు వెళ్ళినప్పుడు జమీం

దారీ గ్రామాలకూ పై గ్రామాలకూ తేడా స్పష్టంగా కనిపించేది.

మద్రాసు కాంగ్రెసు ప్రభుత్వం తెచ్చిన ప్రజా హిత చట్టాలను గ్రామాలలో ప్రచారం చేయడం జరిగింది. ముఖ్యంగా ఋణ విమోచన చట్టం-ఈ తాలూకాలో సక్రమంగా అమలు జరిగితే ప్రతి ఒక్కరు ఋణ విముక్తులయ్యేవారు. చట్టమైతే చేయబడిందే కాని కట్టుదిట్టంగా అమలు జరిగేలా చేయడంలో ప్రభుత్వం విఫలమైంది.

ఆ రోజులలో 'పరపతి సంఘాలు' పరిమిత గ్రామాలలోనే వుండేవి. పంటలు పండక వ్యవసాయం గిట్టుబాటు కాక నూటికి 90 మంది వడ్డీ వ్యాపారస్తులపైన ఆధారపడక తప్పేదికాదు. ఈ పరిస్థితులను గమనించిన వడ్డీవ్యాపారస్తుల గొంతెమ్మ కోర్కెలు (చొప్ప, గడ్డి, పాడిగేదెల నప్పై) తీర్చక తప్పేది కాదు. సాలుసరి కాంపౌండు వడ్డీలు ఒక మామూలు సమస్యగానే వుండేవి.

సాగుపద్ధతి దోపిడీ విధానంలో అగ్రస్థానంలో వుండేది. సరినాగు (ధాన్యం, జొన్నలు) అనగా వ్యవసాయ తరుణంలో బస్తా తీసుకుంటే రెండు బస్తాలు పంటలలో యివ్వాలి. ఈ రెండు బస్తాలకు ముందుగానే రేటు నిర్ణయించి ఆ మొత్తానికి ప్రాంసరీ నోటు రాయించుకుంటారు. ఇలా ధాన్యం ధర పెరిగే వరకు వసూళ్ళకు వత్తిడి చేయకుండా వుండి పెరుగుదలప్పుడు బాకీ వసూళ్ళకు వత్తిడి చేసేవారు. అందువల్ల డబ్బు రూపంగా అప్పు లివ్వడం అరుదుగా వుండేది. ధాన్యరూపంలో యిచ్చిన అప్పుగా, ఖాతాలో అప్పుదారుతో సంతకం చేయించుకోవడంతో రెండు రకాలుగా యిరికించేవారు. ఈ బాకీలు తీర్చడం ఎవరికీ సాధ్యమయ్యేదికాదు.

దుందిరాలపాడులో ఒక రైతు 8 బస్తాలుజొన్నలు సాగుకు తీసుకున్నందుకుగాను 20 ఎకరాల మెట్ట భూమి, ఒక గిత్తదూడను యివ్వగా ఇంకా పదకొండు వందల రూపాయల బాకీ యివ్వతేలాడు. ఋణ విమోచన చట్టాన్ని బట్టి బాకీ చెల్లించవలసిన అవసరం లేదని తెలియజెప్పినా తిరిగి 9 వందల రూపాయలకు ఒక వితంతువుపేర నోటు రాయించుకున్నారు. ఇలా చుట్టు-ప్రక్కల గ్రామాల సంపద గంపలగూడెం లాంటి గ్రామాలలో పేరుకుపోయింది. అప్పు పుచ్చుకున్నవాళ్ళు దరిద్రులైనారు. తాలూకాలో హృదయాలను ద్రవింపచేసే ఇలాంటి సంఘటనలు ఎన్నో వున్నాయి.

జమీందార్ల అమానుష చర్యలు, ఈ ఆర్థిక దోపిడీ తాలూకా ప్రజానీకాన్ని నిర్వీర్యులను చేసింది.

1938 లోనే తిరువూరులో పశ్చిమ కృష్ణా కాంగ్రెసు రాజకీయ మహాసభ జరిగింది. ఈ మహాసభకు సింధు రాష్ట్ర మంత్రి సి వ్య. శ్రీ తెన్నేటి విశ్వనాథం, శ్రీ మద్దూరి అన్నపూ య్య, శ్రీ చంద్ర రాజేశ్వరరావు, శ్రీ మునుపల్లి రా రావు, శ్రీ కాట్రగడ్డ వెంకట నారాయణరావు, శ్రీ నందూరి ప్రసాదరావు, శ్రీ వెల్లంకి విశ్వేశ్వరరావు, (జిల్లా కాంగ్రెసు సహాయ కార్యదర్శి), శ్రీ పేట బాపయ్య, శ్రీ గద్దె రంగయ్యనాయుడు (తిరువూరు తాలూకా జమీన్ రైతుసంఘ అధ్యక్షులు) ప్రభృతులు హాజరైనారు. ఈ సభానిర్వహణలో స్థానిక కార్యకర్త శ్రీ కొల్లి బుచ్చయ్య తోడ్పడినారు.

ఈ మహాసభకు పెద్ద ఎత్తున ప్రజానీకం తాలూకా నలుమూలలనుండి హాజరైనారు. ఊటుకూరు, తునికిపాడు, కొణిజర్ల, నెమలి గ్రామాలనుండి కాకిఖద్దరు యూనిఫారాల్లో షుమారు 50 మంది (20 నుండి 50 ఏళ్ళ వయస్సు గలవారు) వలంటీర్లుగా గ్రామాలలో ప్రచారం చేసుకుంటూ మహాసభకు హాజరైనారు. శ్రీయుతులు చంద్ర రాజేశ్వరరావు, శ్రీ మునుపల్లి రామారావుగారలు కవాతుతో ప్రదర్శన చేయించారు. ఈ ప్రదర్శన ప్రజలను ముగ్ధులను చేసింది. బహుశా యిలాంటి ప్రదర్శన తిరువూరు తాలూకాలో ఇదే ప్రథమం కావచ్చు. పై గ్రామాలనుండి వసూలుచేసిన 8 వందల రూపాయలు నిర్వాహకులకు అందచేయబడింది. ఆనాడు ఇంత సొమ్ము 4, 5 గ్రామాలలో సేకరించడం ఎంతో అబ్బురం. ఈ మహాసభ ప్రజలలో నూతన సంచలనానికి, ప్రజాపోరాటాలకు పూపు నిచ్చింది.

ఈ రోజులలోనే తాలూకాలో కరువు పరిస్థితులు ఏర్పడినాయి. పనులు దొరకక పేదప్రజానీకం పస్తులకు గురైనారు. కరువు పనులకుగాను తిరువూరు, మధిర రోడ్డు (రోలుపడినుండి – రాజవరం వరకు) అలానే ప్రధానమైన రోడ్లు నిర్మించినచో కూలీలకు

పని లభించటంతోపాటు రహదారీ సౌకర్యం కలుగుతుందని ప్రభుత్వదృష్టికి తేవడం జరిగింది. ప్రభుత్వం మందకొడితనం వహించింది. గంపలగూడెంలో పట్టపగలు జొన్నలపాతరలను అన్నార్తులు లూటీచేయగా ప్రభుత్వం కండ్లుతెరిచి ఈ రోడ్డు నిర్మాణానికి పూనుకొంది. అలా క్రమక్రమంగా ప్రజావుద్యమ ప్రభావంతో లక్ష్మీపురం, విస్సన్నపేట రోడ్డు నిర్మాణానికి కూడా చర్యలు తీసుకుంది.

1938 తెలంగాణాలో నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా విముక్తి వుద్యమం స్టేటు కాంగ్రెసు నాయకత్వాన ప్రారంభమైంది. తెలంగాణా గ్రామాలలో అంతకు ముందునుండి తనకున్న పరిచయాలు పురస్కరించుకొని సుంకర వీరభద్రరావుగారు ఆయా గ్రామాలలో ఈ వుద్యమానికి ప్రోత్సాహం యిస్తూ కృషి చేయడం జరిగింది. సరిహద్దులలోని తిరువూరు, నందిగామ తాలూకా గ్రామాలలో జరిపిన బహిరంగ సభలలో వేలకొలది తెలంగాణా ప్రజలు పాల్గొన్నారు.

ఆనాటి నైజాం ప్రభుత్వంలో జరుగుతున్న దమనకాండ, అమాయక ప్రజలు పడే బాధలు, దోపిడీ నివారణకు, బ్రిటిష్ వ్యతిరేక పోరాటంతోపాటు నిజాం విముక్తి పోరాటం జరగటం ఎంతో ప్రాముఖ్యత. దీని వుధృతికి 1939 మే నెలలో "నిజాం ఆంధ్ర రైతాంగ విద్యాలయం" పేరుతో తునికిపాడు గ్రామంలో రాజకీయ శిక్షణాశిబిరం నడుపబడింది. ఈ శిబిరానికి ఆంధ్ర – తెలంగాణా ప్రాంతాలనుండి షుమారు రెండు వందల మంది హాజరైనారు. హెచ్చు సంఖ్యలో తెలంగాణా యువకులు వచ్చారు రోజూ చుట్టుప్రక్కల గ్రామాలనుండి పలువురు హాజరవుతుండేవారు. ఈ శిబిరం 20 రోజులు నిర్వహించబడింది. దీనికి ఆచార్యులుగా శ్రీ ఎన్. జి. రంగా, ఉపాధ్యాయులుగా శ్రీ మ కూరి చంద్రశేఖరరావు, శ్రీ మద్దూరి అన్నపూర్ణయ, శ్రీ రావి నారాయణరెడ్డి, శ్రీ బ ం ఎల్లారెడ్డి, ౹ రాటకొండ లక్ష్మినరసింహారె , శ్రీ డి. ఎతారామయ్య, శ్రీ కంభంపాటి సత్యనా యణ (సినియర్), శ్రీ పిల్లలమర్రి వెకటేశ్వర్లు, శ్రీ మునిపల్లె రామారావు ప్రభృతులు పనిచేశారు. శ్రీ పేట బాపయ్య, శ్రీ గద్దె రంగయ్యనాయుడు శిబిరాన్ని దర్శించి సందేశాలిచ్చారు. గోల్కొండ పత్రికా సంపాదకులు శ్రీ సురవరం ప్రతాపరెడ్డి శిబిరం జయప్రదం కావాలని సందేశం పంపించారు. తెలంగాణా గ్రామాలపైనా, తిరువూరు తాలూకా గ్రామాలపైనా ఈ విద్యాలయ ప్రభావం ఎంతగానో పడింది. తెలంగాణా పోరాటంలో వీరమరణం పొందిన మచ్చా వీరయ్యలాంటి యువకులు – ఈ విద్యాలయంలో శిక్షణ పొందినవారే. మరెందరో యువకులు రజాకార్ల వ్యతిరేక, నిజాం వ్యతిరేక పోరాట సాయుధ దళాలలో చేరారు. అలానే జమీందారీ వ్యతిరేక, మునగాల పోరాటంలో పాల్గొన్నవారున్నారు.

1939-40 సంవత్సరంలో ఖమ్మం పట్టణంలో రైతు సదస్సు జరిపి "నిజాం ఆంధ్ర రైతుసంఘం" ఏర్పాటు చేయబడింది. శ్రీ రావి నారాయణరె అధ్యక్షులుగాను, పైడిపల్లి హనుమయ్య (రాయనపేట) కార్యదర్శిగాను, బద్దం ఎల్లారెడ్డి, పలువు సభ్యులతో కార్యవర్గం ఏర్పడింది. సంఘపరంగా సమస్యలపట్ల తీసుకున్న వైఖరికి నిజాం ప్రభుత్వం కండ్లుకుట్టాయి రైతుసంఘం నిషేధింపబడే ప్రమాదం గుర్తించి, దాన్ని రద్దుచేసి ఆంధ్రమహాసభలో ప్రవేశించి రైతాంగ కార్యకలాపాలు నిర్వహించాలనే నిర్ణయం చేయబడింది. అలానే మల్కాపురం ఆంధ్ర మహాసభలో పాల్గొని నిర్వహించిన పాత్రను పసిగట్టిన ప్రభుత్వం కొన్ని చర్యలు తీసుకుంది.

తాలూకాలో జరిగే ప్రజాపోరాటాలకు భూమి సమస్య ప్రధానమైంది. సర్వే సెటిల్‌మెంటు ఎస్టేటు గ్రామాలలో (గంపలగూడెం తప్ప) లేని కారణంగా భూముల స్వభావం నిర్ధారింపబడలేదు. భూములపై సర్వాధికారాలతో జమీందార్లు, మొఖాసాదార్లు తమ చిత్తంవచ్చినట్లు వ్యవహరించేవారు. సజరానాలు పొంది భూములకు పట్టాలివ్వడం, యివ్వకపోవడం కద్దు. అందువల్ల అష్టకష్టాలుపడి పంటలు పండించుకున్న తరుణంలో ఏదో నెపంతో వాటిని తమ స్వంత కమతంలో కలుపుకొని మరొక పాడో–బీడో (అదైనా చెప్పినట్లు వింటేనే) చూపేవారు.

కృష్ణా జిల్లా రైతు సంఘం – కమ్యూనిస్టుపార్టీల ఆధ్వర్యాన తాలూకేతరప్రాంతాల నుండి 1942-43 సంవత్సరాలలో వెల్లంకి రాజారావు, గరికిపాటి క్రిష్ణ

రావు, వీరపనేని రంగారావు కోడూరు పూర్ణచంద్రరావు కేమిశె కోటయ్యగారలుఈతాలూకాలో పనిచేయడానికి పంపబడ్డరు. అలానే తాలూకా వాసులైన పేట రామారావు, నంతోజు బోధాయన, రామిశెట్టి వేణుగోపాలరావు,సువారపు కృష్ణమూర్తి,కాశీ సోమశేఖరాచార్యులు సయ్యాట్ సాలార్ కార్యకర్తలుగా నియమింపబడి తిరువూరులో తాలూకా పార్టీ, రైతు సంఘ ఆఫీసులు నెలకొల్పటంతోపాటు ప్రాంతీయ ఆఫీసులు కూడా నిర్వహించారు. వూరూరా ప్రజా సంఘాలు నెలకొల్పి, కార్యకలాపాలు సమన్వయంచేసుకొని దీక్షతో, నిర్మాణయుతంగా పనిచేయ పూనుకున్నారు. తాలూకా వ్యాపిత వుద్యమాలు కొనసాగాయి. రైతు సంఘం ప్రజాసంఘం ప్రత్యేకతను సంతరించుకుంది. కోటయ్యగారు చనిపోయేవరకు 31-12-1976 ప్రజా సేవలోనే వుండి ప్రజాభిమానం చూరగొన్నారు.

ప్రజావుద్యమాల పరిరక్షణకు, కార్యకర్తల రాజకీయ చైతన్యంతో పాటు, యువతరంలో మనో నిబ్బరం, ఆత్మ విశ్వాసం పెంపొందించేందుకు తాలూకా వ్యాపిత వలంటీరు శిక్షణా కేంద్రాలు (కొట్టు-తట్టు-కవాతు) నిర్వహింపబడ్డాయి.

మొఖాసాదార్లు జమీందారు వద్ద కొన్ని గ్రామాలు గుత్తకు తీసుకొని వసూలు చేసిన శిస్తులో కొంత భాగాన్ని జమీందారుకు చెల్లించేవారు. క్రమేపీ రైతులను అనేక బాధలు పెట్టి, పెద్ద - పెద్ద ఆస్తులు సంపాదించేవారు. వుదాహరణకు కొండపర్వ, చిత్తపూరు. చాట్రాయి, పుల్లేల.

కొండపర్వ మొఖాసాదారుకు వెయ్యి ఎకరాల మాగాణి పొగ తోటలు స్వంత కమతం వుండేది. 5 వేల ఎకరాల అడవి భూమి వుండేది. వీటిని ఆయన ఇష్టం వచ్చినట్లు అమ్ముకునేవాడు. అదే గ్రామంలోని రైతాంగం మొత్తానికి 2 వందల ఎకరాల చల్కర మాగాణి, 5 వందల ఎకరాలమెట్ట మాత్రమే వుండేది. వీటికి పట్టాలుండేవికావు. అంబారం (ధాన్య రూపంలో శిస్తు) ఎకరానికి రెండు బస్తాల నుండి నాలుగు బస్తాల వరకు వసూలు చేసేవారు. అంబారం రద్దు పరిచి నగదు రూపంలో శిస్తు విధించాలని, భూములకు పట్టా లివ్వాలని, వెట్టి చాకిరి రద్దు చేయాలని పెద్ద ఎత్తున కూలీ-రైతులు తిరుగుబాటు చేశారు.

పాలాటి సుబ్బారావు అనే రైతుకు 20 ఎకరాల పల్లం, 10 ఎకరాల మెట్ట శిస్తు నజరానాలతో కలిపి 1939 లో 1650 రూపాయలకు మొఖాసాదారు యిచ్చాడు. ఎగ్రిమెంటు ప్రకారం పట్టా కూడా ఇవ్వబడింది. రైతు పూర్తిగ సొమ్ము చెల్లించి రశీదు కూడా పొందాడు. ఇంతజరిగినా మొఖాసాదారు మర్నాటితో మరల ఆ భూమిని పొందేందుకు, ఒక ఇల్లు తగలబెట్టాడని, సుబ్బారావుపై 1940 లో కేసు బనాయించాడు. కాని కోర్టులోనే కేసు కొట్టివేశారు.

మొఖాసాదారు పోలీసుల సహాయంతో 145 వ సెక్షన్ క్రింద సబ్ కలెక్టరుకు పిటీషను పెట్టగా మొఖాదారుకు అనుకూలంగా తీర్పుయిచ్చాడు. రైతు తన హక్కు రక్షించుకొనేందుకు విజయవాడ మునసబు కోర్టులో దావా వేశాడు. సుబ్బారావు పాలేర్లు కూలీలపై అంతులేని దౌర్జన్యాలు చేశాడు. మొఖాసాదారు. ఇట్టి అక్రమాలను ఎదుర్కొనటానికి సంఘ శక్తిపై విశ్వాసముంచి నూటికి 80 మంది రైతు సంఘంలో చేరారు . ఇలాంటి కేసులను గ్రామస్థుల మీద బనాయించి కోర్టుల చుట్టూ తిప్పటం పరిపాటి.

చిత్తపూరు మొఖాసా గ్రామమే. ఆదిలో 7 వంతుల పొలం రైతులకు, ఒకవంతు మొఖాసాదారుకు వుండేది. ఈ రోజు మొఖాసాదారుకు అదే గ్రామంలో 2 వందల ఎకరాల పల్లం, 3 వేల ఎకరాల మెట్ట భూములు, 10 వేల రూపాయల ఆదాయం వచ్చే జరీబుతోటలు 6 వేల రూపాయల ఆదాయం వచ్చే మామిడితోటలు, 8 వేల రూపాయల ఆదాయం వచ్చే ఇతర ఆస్తులు వున్నాయి. రైతులకు 150 ఎకరాల పల్లం, 4 వందల ఎకరాల మెట్ట భూమి, 8 వేల ఆదాయం వచ్చే జరీబు, ఇతర భూములు మాత్రమే వున్నాయి. అంటే మొఖాసాదారుకు 5 వంతులు, రైతులకు 3 వంతులు. రైతుల పొలం మునుపటిలో సగమైనా, శిస్తు మాత్రం 1945 మార్చి నాటికి 2500 రూపాయలకు పెరిగింది.

చిత్తపూరు మొఖాసాదార్లలో ఒకరు చేసిన కొన్ని అఘాయిత్యాలు :

తుల మూడుపుట్లు అయ్యే వరి కుప్పను కొంచి గడ్డితో సహా దొంగిలించాడు. ఇద్దరి రైతుల రెండు కరాల వరి పైరును పంట మీద కంకి కోయించుకు పోయాడు.

ఇద్దరి స్థలం అక్రమించి ఇల్లు వేయించాడు.

మహాదేవి వెంకటాచార్యులుగారిని ఎండలో నిల బెట్టించి 35 రూపాయలు వసూలు చేశాడు.

దామెర వెంకట నరశింహ నారాయణం గారి 85 మామిడి చెట్లు, ఇస్సావఝుల వెంకట రామయ్య గారి పది మామిడి, పది జీడిమామిడి చెట్లు. ఒక ఉసిరి ఒక నేరేడు చెట్లను, బసవరాజు పురుషోత్తమరావు గారి జాయింటు తోటలో 26 మామిడి, 26 జీడి మామిడి చెట్లను నరికించాడు దోనపాటి సత్యనారాయణగారి ఇంటి తాళం పగులగొట్టి ఆ ఇంటిలో కాపురం పెట్టాడు.

తన దుర్మార్గాలకు లొంగిరాలేదని, రైతులకు చాకలి మంగళ్ళను బహిష్కరింప చేశాడు. గ్రామ జాతర్లకని, కొలుపులకని సొమ్ము వసూలుచేసి కాజేశాడు. అలాగే ఎన్నో దౌర్జన్యాలు, అమానుష చర్యలు జరిపించాడు.

ఇట్టి దౌర్జన్య చర్యలు, కేసులతో రైతులు విసిగి వేసారి పోయారు. ఏమైనాసరే, ఈ దౌర్జన్యాలను ఎదుర్కోవాలని దీక్ష పూనారు. రైతుసంఘ, కమ్యూనిస్టు కార్యకర్తల కృషితో ఐక్యమయ్యారు. అన్ని కులాల ప్రతినిధులతో ఐక్య కమిటీని ఎన్నుకున్నారు. ఇదంతా చూసిన మొఖాసాదారు పలాయన మంత్రం పఠించాడు. గ్రామస్థులు తన ఇంటిమీదకు వచ్చి పడినట్లు, భారతో పోలీసులకు రిపోర్టు యిప్పించాడు. తనపై దౌర్జన్యం చేయించుతున్నారని పోలీసు అధికారులకు తెలియపరిచాడు. విచారణలో అతని దుర్మార్గాలు రుజువైనాయి. ఈవిధంగా అక్రమ చర్యలకు పాల్పడుతూ గ్రామస్థులపై అనేక సివిల్, క్రిమినల్ తప్పుడు కేసులు బనాయించాడు. నెలలో ఎక్కువ భాగం వందలాది రైతు, వ్యవసాయ కార్మికులు కోర్టులచుట్టూ తిరగవలసివచ్చింది. అధికారులు కేసుల విచారణ సందర్భంలో మొఖాసాదారు కొమ్ము కాసి దూరప్రాంతాలకు వాయిదాలు వేసేవారు. కొండపర్వ, ఎరుకోపాడు, చిత్తపూరు గ్రామస్థులపై మోపబడిన బైండవరు కేసులు విజయవాడ, కంచికచర్ల, జగ్గయ్యపేట వేశారు. ప్రయాణ సౌకర్యం లేక కాలినడకనే ఈ కేసులకు హాజరయ్యారు. ఆర్థికంగా, వ్యవసాయకంగా అపారమైన కష్ట నష్టాలకు కూలీ రైతులు గురయ్యారు చిన్న చిన్న ఘర్షణలను సహితం ఆధారం చేసుకొని మొఖాసాదారులు యమయాతనలకు గురిచేస్తుంటే, కార్యకర్తలు ఈ అరాచకాన్ని ఎదుర్కొన్నారు.

ఇలాంటి దురంతాలు తర తమ భేదాలతో తాలూకాలోని ఎస్టేట్ గ్రామాలలో కొనసాగుతూ వుండేవి. చాట్రాయి మొఖాసాదారులు గ్రామస్థులను తమ అదుపులో పెట్టుకొనేందుకు, హామీనోట్లు రాయించుకొని, తమను వ్యతిరేకించిన వారిపై కేసులు వేయడం, దాడులు చేయడం, భూముల్నాక్రమించటం లాంటి సంఘటనలు జరిగాయి. రాజకీయ పార్టీల బహిరంగసభలలో అల్లరి చేయడంవలన, చుట్టుప్రక్కల గ్రామాలనుండి పగబట్టిన కూలీ రైతులు వేలసంఖ్యలో హాజరై సభలను నిర్విఘ్నంగా జరిపించేవారు

నరసాపురం ఎస్టేటు గ్రామాలలో, రైతు సంఘ కార్యకర్తలకు మంచినీళ్లు కూడా దొరకనిచ్చేవారు కాదు. సభలకు హాజరవుటకు భయపడేవారు. హాజరైనవారిని మరునాడు పిలిపించి జరిమానాలు విధించేవారు. చనుబండ శ్రీరామనవమి ఉత్సవానికి వలంటీర్లుగా వెళ్ళిన కార్యకర్తలకు నీడ నివ్వనీయలేదు. విడిచిన బట్టలు వీధిలో డేరాలా వేసుకొని వసుండైనా పనినెగ్గించేవారు. నరసింహారావు పాలెంలో మొఖాసాదారు పెట్టే హింసలు, సహించలేక కొంతమంది క్రైస్తవమతం స్వీకరించారు.

పుట్రేలగ్రామం తాలూకా నడిబొడ్డున వుంది. మొఖాసాదార్ల దురంతాలను గురించి కథలు కథలుగా చెప్పుకొనేవారు ఆ గ్రామం ప్రచారదళం వెళ్ళినప్పుడు ఎన్నో వాస్తవాలు తెలిసాయి. హరికథ చందా యివ్వలేదనో, వెట్టి చేయలేదనో, ఏవో ఆరోపణలు. నడి బజారులో గౌరవం గల రైతులను సహితం వంగబెట్టి వీపుపై హరిజనుణ్ణి ఎక్కించటం, వ్యవసాయ కూలీని వంగబెట్టి ఇసుకమూటలు, బండకొయ్యలు ఎత్తడం, వీపుపై వున్న దుంగ క్రిందపడితే దానికి మరో శిక్ష. ఇలాంటి అవమానకరమైన చర్యలు కూలీ రైతులపై అమలు జరుగుతుండేవి. ప్రజలు కష్టపడి సాగుకి యోగ్యంగా చేసుకున్న భూములనుండి ఏదో మిషతో వారిని తొలిగించేవారు.

మల్లవరం, పుల్లేటి మొఖాసాగ్రామం. సమిష్టి బీడులో అనాదినుండి గ్రామస్తులు పశువుల్ని మేపు కునేవారు. దాన్ని వేరొక గ్రామస్తునికి మొఖాసాదారు అమ్మి రౌడీలను రప్పించారు. బెదిరించి కేసులు పెట్టి స్వాధీనం చేసుకోవాలని ప్రయత్నించారు. రైతు సంఘ కార్యకర్తలు గ్రామస్తులను కూడగట్టి ప్రతి ఘటించారు.

గంపలగూడెం ఎస్టేటు తాలూకాలో పెద్దది. ఈ జమీ ఏలుబడిలో మల్లె, చిట్టేల, ఎరుకోపాడు గ్రామాలలో జరిగిన దండగాలు ఎన్నో వున్నాయి. ఎరుకోపాడు హరిజనవాడలో సుమారు వందగడప వుంటుంది. సర్వీసు ఈనాం భూములలోనే వూరు కట్టుకొని సాగుచేసుకుంటున్నారు. హరిజనవాడ పీకించి భూములను స్వాధీనం చేసుకొనేందుకు పశువులను చంపారని, వ్యవసాయ పనిముట్లు ఎత్తుకు పోయారని, ఎస్టేటు నౌకర్లపై దౌర్జన్యానికి పూను కున్నారని అభాండాలువేసి జామీను కేసులకు, క్రిమినల్, సివిల్ కేసులకు గురిచేసారు. హరిజనవాడపైకి రౌడీలను పంపగా బుద్ధి గరిపారు. గంపలగూడెంలో జరిగిన బహిరంగసభలపై దాడులు చేయించారు. కాని—ఆటలు సాగలేదు. కష్టకొద్దీ ఎరుకోపాడు హరిజన ప్రజల హృదయాలలో స్థానం ఏర్పరచు కున్న వీరపునేని రంగారావు గంపలగూడెం వెళ్ళగా దాడి చేయించారు. రావణాసుర కాష్టంలా సంవత్సరాలుగా కొనసాగుతూ వచ్చిన దుండగాలను ధైర్యముగా సంఘ సేవకులు ఎదుర్కొని విజయాలు సాధించారు. ఒకప్పుడు తన స్వార్థ ప్రయోజనాలు నెగ్గించు కొనేందుకు తమను వుపయోగించుకున్న జమీందారు నైజాన్ని ఎరుకోపాడు హరిజనులు అనుభవంలో గుర్తించారు.

అలాగే మల్లెల అడవిని బొగ్గు కాల్చుటకు జమీందారు అమ్మగా గ్రామస్తులు ప్రతిఘటించారు. పై అధికారులు వచ్చి అడవి నరుకుటకు వీలులేదని ఆర్డరిచ్చారు. అందుకు రామాలయంవద్ద నవమి పందిరికి పాతిన గుంజలు తమ అడవిలోనివేనని కేసు.

ఊటుకూరు, తుంగపోరాటం ఆ ప్రాంతంలో ఒక సంచలనాత్మకమైన అంశం. అనాదిగా చెరువులోని తుంగ గ్రామస్తులు ఇండ్లు కప్పుకొనేందుకు వుచితంగా వుపయోగించుకొనేవారు. ఈ గ్రామం మీర్జాపురం రాజాకుమారైకు చెందాక ప్రజల హక్కులను హరించ బూనుకున్నారు. పోలీసులను పిలిపించి ఇండ్లు కప్పుకొనుటకు తెచ్చుకున్న తుంగనంతటిని బలవంతంగా తీసుకువెళ్ళారు. దీన్ని ప్రతిఘటించిన గ్రామస్తులు 70 మందిని అరెస్టు చేయించారు.

తాలూకా రైతు సంఘ కార్యకలాపాలు, తాలూకా అన్ని గ్రామాలలోకి చొచ్చుకుపోయాయి. 1938 లో తిరువూరు పట్టణంలో పెద్ద ఎత్తున తాలూకా రైతు సదస్సు జరుపబడింది. దీనికి శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారు మరికొందరు ప్రముఖ రైతు నాయకులు హాజరైనారు. ఇదే సంవత్సరంలో ఇచ్ఛాపురం నుండి (ఒరిస్సా సరిహద్దు) మద్రాసుకు శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారి నాయకత్వాన బయలుదేరిన రైతు రక్షణ పాదయాత్రా దళం తాలూకాలో పర్యటించింది. ఆంధ్ర రైతాంగ కోర్కెల పత్రాన్ని ప్రభుత్వానికి సమర్పించేందుకు ఈ పాదయాత్ర సంచారం ప్రజలను ఎంతో వుత్తేజపరిచింది. ఈ రైతాంగ పోరాటాలు రైతుల సంఘటితపరిచాయి. ఈ సంవత్సరంలో 4 వేల రైతు సంఘ సభ్యత్వం చేర్పించబడింది. క్రమంగా మహాసభలు జరిపించి ప్రజా సమస్యల పరిష్కారానికి ఎప్పటికప్పుడు సంఘ నిర్మాణం కొనసాగిస్తూ కార్యక్రమాలు నిర్దేశింపబడుతూ వచ్చాయి. 1944 మే నెల 11, 12 తేదీలలో శ్రీ సయ్యద్ సాలార్ అధ్యక్షతన కంభంపాడులో తృతీయ రైతు మహాసభ జరిగింది. అత్యధిక సంఖ్యలో ప్రతినిధులు పాల్గొన్నారు. 1945 మార్చి 21 న విస్సన్నపేటలో తాలూకారైతు మహాసభ జయప్రదంగా జరిగింది. 70 గ్రామాలలో 5600 రైతు సంఘ సభ్యత్వం కలిగి వుంది. మహాసభకు దాదాపు అన్ని గ్రామాలనుండి వందకుపైగా ప్రతినిధులు హాజరైనారు. దీనికి జిల్లా రైతు సంఘ ఉపాధ్యక్షులు రామినేని పిచ్చయ్యగారు అధ్యక్షత వహించారు చంద్ర రాజేశ్వరరావుగారు మహాసభను ప్రారంభించారు. సాయంత్రం జరిగిన ఊరేగింపుకు వెంట్రప్రగడ మిలిటరీ బ్యాండు అగ్రభాగాన నడిచింది. వేలమంది వూరేగింపులో పాల్గొన్నారు.

1944 విజయవాడలో జరిగిన అఖిలభారత రైతు మహాసభకు ఈ తాలూకా నుండి విరాళాలు గణనీయంగా వసూలుచేసి పంపబడ్డాయి. వందలాది

రైతాంగం కాలినడకన, బండ్లమీద మహాసభకు హాజరైనారు.

జమీందారీలలో జరిగే అనేక సంఘటనలతోపాటు గ్రామాలలో పెత్తందారులు, కరణాలు అతి నీచమైన చర్యలకు, మోసాలకు వెనుతీసేవారుకాదు. కంబంపాటి కరణం తమ అనుచరులతో చుట్టుప్రక్కల గ్రామాలపై దాడులు చేయించటం (అప్రగడ, గొల్లమండల ఆది.) గ్రామస్థులను భయభ్రాంతులను చేసి అదుపులో పెట్టుకొనేవాడు. కంభంపాడు వర్తకులు సంవత్సరానికి యింత అని మామూళ్ళు చెల్లించుకునేవారు, తూము వీరారెడ్డిగారి విలువైన ఎడ్లబండిని కంభంపాడు నడివీధిలో పట్టపగలు కిరోసిన్‌పోసి తగలపెట్టించాడు. జమలయ్య అనే రైతు బండి ఆకులు నరికించాడు. ఒక సముద్దారుతో కలిసి గ్రామస్థులపై అక్రమ కేసులు పెట్టాడు. రైతులు స్వంత పెరళ్ళలో చింతకాయ కొట్టుకుంటే, తమ ఎస్టేటు చింతలనుండి ఆరుపుట్ల గింజలేని పండయ్యే కాయ ముగ్గురు వ్యక్తులు కొట్టినట్లు ఆరోపించి ఏడుగురు రైతులను అరెస్టు చేయించాడు. "దున్నపోతు ఈనిందంటే దూడను కట్టివేయమన్నట్లు" అంతకాయముగ్గురు వ్యక్తులు ఎలా కొట్టగలరో వివక్షత లేకుండా పోలీసుల ప్రవర్తన వుండేది. కొత్రగడ్డ సత్యనారాయణ గుండారాయుడు, గోపిరెడ్డిగారలను హత్య చేయించాలని వేసిన ఎత్తుగడలను ప్రజలు త్రిప్పికొట్టారు. ఈ దౌర్జన్యాలను ప్రతిఘటించటమంటే పేద ప్రజానీకం కూటికి-గుడ్డకు రోజీ అష్టకష్టాలను ఎదుర్కొనవలసి వచ్చేది. ఈ పోరాటాలలో విజయాలు ప్రజల సంఘటిత శక్తిని నిరూపించాయి.

తాలూకాలో జొన్న, వరి ప్రధానమైన పంటలు. నెలకు పుష్కలంగా మూడు వర్షాలుంటేనే పంటలు పండుతాయి. అసలే నిస్సారమైన గరపు భూములు. పశువుల, గొర్రెల ఎరువులు తప్ప రసాయనిక ఎరువులనేవి ఆనాడు లేనేలేవు. పల్లపు సాగుఅంతా చెరువుల క్రిందే చెరువులు లోప భూయిష్టంగా వుండేవి. వాగులు, ఏరులకు వరదలు వచ్చినా చెరువులు నిండేవికావు. రైతుల పంటల నష్టం జమిందార్లకు పట్టని విషయం. వీటికితోడు చెరువులలో, కంతానం, దొరపొగాకు వేయుటకుగాను నీరు తీసివేయుటచే పాతనీరుండదు. కొత్తనీరు వచ్చేవరకు నారు పోసుకొనే అవకాశం లేదు. లోతట్టు దున్నుట వలన చెరువులు మేటవేసేవి. వర్షంమీద ఆధారపడి వ్యవసాయం సాగేది. పంటలటుంచి గ్రామస్థులు నీటి ఎద్దడికి గురయ్యేవారు.

రెడ్డిగూడెం, రంగాపురం. (అడుసుమిల్లి వారి ఎస్టేటు) చెరువుల క్రింద ఎస్టేటు కమతం భూములలో నాటు పొగాకు వేసి చెరువులనీరు ఉపయోగించేవారు. రైతుల మాగాణి పంటకు నీరు లభ్యంగాక పంటలు నష్టపడేవి. జమిందారీ స్వంత కమతాలు సాగయ్యే వరకు మిగతా రైతాంగ భూములకు నీరు లభ్యమయ్యేదికాదు, అలానే నీటి కొరత కలిగినప్పుడు వున్ననీరు జమిందారే వుపయోగించుకొనేవారు. రైతుల ఇబ్బందులను గమనించి చెరువుల మరమ్మతులు చేయకపోయినా దారుణమైన శిస్తులు నిర్బంధంగా వసూలు చేయబడేవి. ఎకరానికి 25 రూపాయలవరకు శిస్తు రేట్లుండేవి. ఎస్టేటు నౌకర్లకు కరణం, తానేదారులకు మామూళ్ళు తప్పేవికావు. వ్యవసాయ ఖర్చులు, శిస్తులు కట్టటకు పండింది చాలక పుస్తెలు అమ్ముకోవలసి వచ్చేది. చేసేదిలేక భూములు విడుదల పెట్టేవారు.

అంబారం పాత కాలపు దోపిడీ విధానాలలో యిదొకటి. పండినా ఎండినా ఎకరానికి మూడుబస్తాల నుండి అయిదు బస్తాల ధాన్యం అంబారం రైతు ఎస్టేటు వారికి చెల్లించుకోవలసి వుండేది. ఉ॥ రాల్లపడి. ఊటుకూరు జమీలో 20 బస్తాలు పండితే 9 బస్తాలు జమిందారుకు యివ్వాలి. అలానే కందులు. పెసలు, మిర్చి, పొగాకు పంటలు కూడా. దాదాపు సగానికి సగం ఎస్టేటు వారికి కట్టబెట్టవలసి వచ్చేది. ఇంటికొక బండి ఎరువు, అరకలు వెట్టికి దున్నాలి. గొర్రెల మందలు ఎస్టేటువారి పొలాలలో వుచితంగా పెంట గట్టాలి, ప్రతి ఎస్టేటులోను యిది సర్వసామాన్యం. పశువులను, ఇతర జీవాలను అడవులలో మేపినందుకు పుల్లరి వసూలు చేసేవారు వ్యవసాయ అవసరాలకు కంప. కట్టె వుచితంగా లభించేదిగాదు. జమీందార్ల నౌకర్లు ప్రజలను కొట్టుకు తినేవారు. పశువులు, గొర్రెలు ఆది పుల్లరిదొడ్లో (జమీందారు స్వంతబంది) పెట్టి బంది తన యిష్టం వచ్చినంత

వసూలు చేసేవాడు. "అంగట్లో అన్నీ వున్నా అల్లుని నోట్లోశని" అన్నట్లు పొయ్యిలో కట్టెకు, వ్యవసాయ పనిముట్లకు ఇబ్బందులు తప్పేవికావు. అడవులు పోశ్ళు అమ్మి గడించేవారు.

ఎస్టేటు ల్యాండ్ ఆక్టుకు పూర్వం వున్న చెట్లపై జమిందారు హక్కు కలిగి ఉండేవారు. దాని ఆసరాతో ఆ తర్వాత రైతుల పొలాలలో పెరిగిన చెట్లపైన కూడా రైతుల హక్కును తృణీకరించారు. అవసరం కొద్దీ గత్యంతరంలేక రాత్రిపూట తాటాకును కొట్టుకుంటున్న వ్యక్తిని పట్టుకొని అతని మీసాలు పీకించారు. పైగా కేసు. ఇది తిరుపూరు ఎస్టేటులో జరిగిన దారుణ వుదంతం. వ్యవసాయానికి ఆటంకంగా వున్న చెట్లవల్ల ఎంతో పంట భూమి నష్టపొయ్యేది. ఈ రకంగా తమకు హక్కుగల చెట్లు నరుక్కొని వ్యవసాయ పనిముట్లు చేయించుకొనే అవకాశం లేక జమీందారుకు డబ్బు చెల్లించవలసి వచ్చేది. ప్రభుత్వ చట్టాలున్నా అమలు జరిగేవికావు.

రైతుసంఘం—కమ్యూనిస్టు కార్యకర్తలు ప్రజలకు జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను ప్రతిఘటించటంతోనే సరిపెట్టుకోలేదు. ప్రజల ఆర్థిక ప్రయోజనాలకు, ముఖ్యంగా రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో బ్లాక్ మార్కెట్టుదార్లను పట్టించడంలోను, బండిపట్టాలు, పలుగులు, పారలు లాంటి వ్యవసాయ పనిముట్లు కంట్రోలు రేటుకు అందించుటకు, కోటా బట్టలు, కిరోసిన్, బియ్యం, వంటి నిత్యావసర వస్తువులు వెలికిలాగి, పంపిణీ చేయడం, భూస్వాముల, జమీందార్ల, ధాన్యం నిల్వదారుల గోదాములను పట్టించి బియ్యం కొరతను అరికట్టారు. అధికాహారోత్పత్తికి నీటి వనర్లను అన్వేషించి ప్రభుత్వ దృష్టికి తెచ్చి, వాటి మరమ్మతులు, నిర్మాణములు జరిగేలా కృషిచేశారు. ఉదాహరణకు తిరుపూరు మల్లమ్మ చెరువులు ఏడు. వీటిపరవ ఏటిరాకట్టు తెలంగాణాలో వుంది. రాకట్టు ఏడు చెరువులకు సంబంధించినదే. దాని భోగట్టా సేకరించి నిజాం ప్రభుత్వ దృష్టికి తెచ్చి ఏడు చెరువులకు కాల్వనీరు వచ్చేలా ఆదరు పొందడం జరిగింది. మేటవేసిన చెరువులను రమ్మతులు చేయకుండా జమీందార్లు, మొఖాసాదార్లు మొండికేస్తే రైతులు శ్రమదానంతో మేటలుతీసి పంటలు పండించుట లాంటి దేశభక్తియుత చర్యలను ప్రోత్సహించారు. రాత్రి పాఠశాలలు నెలకొల్పి అక్షరజ్ఞానం పయోజనములకు కలిగించారు. నిరంతర రాజకీయ ప్రచారం సాగించి ప్రజలను చైతన్యపరిచారు.

దేశంలో ఏర్పడ్డ కరువు—కాటకాలను అరికట్టేందుకు అధిక ఆహారోత్పత్తికి బంజ ఆక్రమణకు పూనుకున్నారు. పెద్దవరం, వేమిరెపల్లి, చిత్తపూరు ఆదిగాగల గ్రామాలలో వంద ది ఎకరాలు భూమి ఆక్రమించి దున్నించారు. ఐతే, ఈ కార్యక్రమాన్ని విప్లవాత్మకంగా కొనసాగించటం జరగలేదు. జమిందార్ల, మొఖాసాదార్లకు దేశంలో ఏర్పడిన ఆహారకొరత అడ్డుకొనేందుకు బంజర్లు, అడవి పోళు ఇచ్ఛికంగా సాగుకు యివ్వాలని జాతీయతా ప్రబోధం చేశారు. ఆనాటి అవకాశాల దృష్ట్యా సాగుకు లాయకైన భూముల ఆక్రమణ జరిపివుంటే పేదలకు భూమి దక్కేది. జమీందార్లు, మొఖాసాదార్లు అన్యాక్రాంతం చేసి గడించేందుకు అవకాశం వుండకపోను. యుద్ధానంతరం పరిస్థితి వేరు విధంగా వుండేది.

అవినీతిపరులైన వుద్యోగులను ప్రజలలో ఎండవేసి వారిని ప్రభుత్వం శిక్షించేలా చేశారు. విస్సన్నపేట పోలీసు స్టేషనుకు చెందిన ఇద్దరు కానిస్టేబుల్సు అమాయక ప్రజలపై అత్యాచారాలు జరపగా ప్రభుత్వ దృష్టికి తెచ్చి విచారణ జరిపించారు. నిజము రుజువైనందున ఆ ఇద్దరు పోలీసులు వుద్యోగాల నుండి తొలగింపబడినాయి. వేరొకరికి ఇంక్రిమెంటు రద్దు అయింది. తిరుపూరు సబ్ రిజిష్ట్రారు, ఒక జమాను లంచం తీసుకున్నారనే నేరంపై వుద్యోగాలు కోల్పోయారు. ఈ విషయంలో శ్రీ మురుకుంట్ల వెంకటప్పయ్య మంచి కృషి చేశారు.

యుద్ధ సమయంలో "వార్ బాండ్సు" పేరుతో జరిగే దోపిడీకి కార్యకర్తలు అడ్డుగా వున్నారు."వార్ బాండ్సు" నిమిత్తం పైరువారీ రేటువిధించి అక్రమ వసూళ్లకు పూనుకోగా-వ్యతిరేకించినందులకు రామిశెట్టి వేణుగోపాలరావును తహశీల్దారు అరెస్టు చేయించాడు. తన అక్రమచర్య తనకే ముప్పు తెచ్చినందున తహశీల్దారు దిగిరాక తప్పిందిగాదు.

జమీందారీ ప్రాంతంలో విద్యకు, రహదార్లకు ప్రాధాన్యతలేదు. ప్రజలు చైతన్యం పొందటం వారికి

యిష్టముండదు. అందువల్ల వారు విద్యా రహదా అభివృద్ధికిగాను ఎట్టి కృషి చేయలేదు. రహదా లేని కారణంగా వ్యాపారస్థుల దోపిడీ పెద్ద ఎత్తు సాగేది. చదువుకున్నవారు తక్కువ. దానికి తగినట్లు తాలూకా మొత్తంలో అయిదే పోస్టాఫీసులు వుండేవి. దిన పత్రికలు రావడం ఐదు కాపీలు చేర్పించడంకూడా అబ్బురమే. ఇతర వైజ్ఞానిక సౌకర్యాలు లేనేలేవు. రైతులు తాము కష్టపడి పండించిన పంటలకు వర్తకుల దయా ధర్మం మీద వచ్చినంత వరకే తృప్తి పడేవారు. ఈ ఆర్థిక దోపిడీ బహుముఖాలుగా వుండేది.

ప్రభుత్వ పాఠశాలలు అరుదుగా వుండేవి. ఎక్కువ గ్రామాలలో ఎయిడెడ్ పాఠశాలలు మిషనరీల ఆధ్వర్యాన వుండేవి. ప్రాథమిక పాఠశాలలు సక్రమంగా నడపబడేవి కావు. పేదరికంలో వున్న జనం తమ బిడ్డలను స్కూళ్ళకు పంపటం అరుదుగా వుండేది. స్కూళ్ళకు వచ్చే పిల్లలకైనా సరైన విద్యా బోధన వుండేదికాదు. టీచర్లను జమిందార్లు, మొఖాసాదార్లు తమ అదుపులో పెట్టుకొని వ్యవహరించేవారు. చదువు చెప్పినా-చెప్పకపోయినా అజా పజా వుండేదికాదు. జీతాలు ముడుతూనే వుండేవి. స్కూలు ఇళ్లు నివాసయోగ్యంగా వుండేవికావు. ఎండకు - వానకు రక్షణలేదు. తాలూకా అంతటకు తిరువూరులో హైస్కూలు, విస్సన్నపేటలో మిడిల్ స్కూలు మాత్రమే వుండేవి.

ప్రభుత్వ ఆసుపత్రి తాలూకా మొత్తానికి తిరువూరులో ఒకటి వుండేది. దీనిలో కూడా రోగులకు అవసరమైన సౌకర్యాలు వుండేవి కావు. రూరల్ ఆసుపత్రులు ఒకటి, రెండు మాత్రమే. గ్రామాలలో వైద్య సౌకర్యం లేదు. కాన్పు కేసులు సహితం నాటు మంత్రసానులపైనే ఆధారపడవలసి వుండేది. ప్రయివేటు ఆయుర్వేద వైద్యులు కొద్ది గ్రామాలలో వృత్తిగా కొనసాగిస్తుండేవారు. మలేరియా, అంటు వ్యాధులకు గ్రామ ప్రజలు బలిగావడం జరిగేది. రోగులను తీసుకు వెళ్ళలేనివారు దేవునిపై భారం వేసి ముడుపులు కట్టుకునేవారు. ప్రభుత్వ పశు వైద్యశాలలు మచ్చుకైనాలేవు.

వ్యవసాయ కార్మికుల పరిస్థితి వర్ణనాతీతంగా వుండేది. సంవత్సరానికి ఆరు మాసాలు పనిపాటలు నికరంగా వుండేవిగావు. పరిశ్రమలంటూ లేవు. వేసవి రోజులలో పనులు దొరకక, తిండిలేక అలమటించేవారు. ఆనాడు కూలి-రోజుకు నాలుగణాలు. స్త్రీలకు రెండణాలు. నెల జీతాలు ముప్పై-నలభై మానికల ధాన్యం యిచ్చేవారు. "కలిగి ఖర్మం-లేక దరిద్రం" అన్నట్లు పడావు భూములు, అడవి భూములు ఎన్ని వున్నా ఇండ్లస్థలాలు వుండేవికావు. ఇండ్లకు అవసరమైనకలప, కప్పుకు తాటాకు సంపాదించుకోవడం కష్టముగావుండేది. వంటినిండా బట్టా-కంటినిండా నిద్రలేకపోయినా వెట్టిచాకిరి, బండబూతులు తప్పేవికావు. నీటి కరువు ఆనవాయితీగా వెంటాడేది. ఈ దరిద్రనారాయణులు దరిద్రం దైవం నిర్దేశించిందేనని పస్తులుండేవారు. ఈ దుర్భర దారిద్ర్య పరిస్థితులలో వున్న వ్యవసాయ కార్మికులను జాగృతపరిచేందుకు అవసరమైన చర్యలను కార్యకర్తలు చేపట్టారు. వారి అవసరాలు తీర్చేందుకు పోరాటాలు, యాత్రలు, ప్రభుత్వ ఆఫీసులకు నడిపారు. క్రమేపి సంఘ నిర్మాణ అవసరాలను గుర్తించడానికి పూనుకున్నారు.

ప్రజలు యమయాతనలు పడుతున్నా ఫ్యూడల్ వర్గాలకు పట్టదు. వినోదాలకు, విలాసాలకు, కోడి పందాలకు దోపిడీ చేసిన ధనాన్ని విచ్చలవిడిగా ఖర్చుచేసేవారు. కోడిపందెం అంటే గొంతు కోసుకుంటారు. ఎస్టేటుకు ఎస్టేట్లు-ఈ కోడిపందాలలో ఒడ్డి దివాళా తీసినవారున్నారు. దూర దూర ప్రాంతాలనుండి కూడా వచ్చి పాల్గొన్న వేలాది జనం ఆ సందర్భంలో నిర్వహింపబడే జూదశాలలకు, త్రాగుడుకు, పేకాటకు కోడిపందాలకు ఒడ్డి కొంపా-గోడు పోగొట్టుకున్నవారెందరో వున్నారు.

కోడిపందెముకు సారాయిబుడ్లకు-మేడలు కట్టుటకు
పాడుచేయునొక కొంత ధనంబును-పాపి
జమీందారు.

పై సమస్యలన్నింటికి ప్రతిబింబం కష్టజీవి బుర్రకథ. సుంకర సత్యనారాయణ స్వానుభవంతో చేసిన రచన, కథ కల్పితమైనా వాస్తవ గాథలకు, బాధలకు దర్పణం. ఈ కష్టజీవి బుర్రకథ తిరువూరు తాలూకాలో బహుళ ప్రచారం పొందింది. "ఈ కథ-మా కథ" అని ఆయా గ్రామాలవారు అనుకునేవారు. ప్రజా సమస్యలకు సజీవమైన ప్రబోధ సాధనంగా ఎంతగానో ప్రజోద్యమాల జాగృతికి తోడ్పడింది.

యువజన, విద్యార్థి సంఘాలు యువకుల సత్ప్రవర్తనకు దేశభక్తియుత చర్యలు చేపట్టేలా చేయడం మూఢనమ్మకాలు సాంఘిక దురాచారాలను ప్రతిఘటించేలాగున కోడిపందాలు మొదలగు దురలవాట్లకు దూరంగా వుండి ఆటల వైజ్ఞానిక కార్యకలాపాలవైపు ఆకర్షించటం జరిగింది. ఆదర్శ వితంతు వివాహాలు, సంస్కరణ వివాహాలు ప్రోత్సహించబడ్డాయి. ప్రజా సేవకులైన యువకులు ఆచరణలో ఆదర్శప్రాయంగా వుండేవారనుటలో అతిశయోక్తిలేదు.

వైజ్ఞానిక రంగం తాలూకాలో పుట్టి పెరిగింది. ప్రజా నాట్యమండలి ఆధిపత్యాన బుర్రకథ, నాటిక, నాటక సమాజాలు ఏర్పడినాయి. వైజ్ఞానికరంగ విస్తృత ప్రచారం నిర్వహించిన ఊటుకూరు బుర్రకథ దళం తిరువూరు దళాలు సాగించిన కృషిని అభినందించవలసి వుంది. జిల్లా ప్రజానాట్యమండలికి తిరువూరు నుండి శ్రీ వల్లం నరసింహారావు, ఆయన సోదరి రుక్మిణిని పంపించిన చరిత్ర, తాలూకాకు వుంది. రుక్మిణి ఆధ్వర్యంలో తాలూకా మహిళా బుర్రకథ దళం ఏర్పడి ' జాదరణ పొందింది.

వెల్లంకి విశ్వేశ్వరరా , అనుమర్లపూడి వెంకట సీతారామరావుగార్లు జిల్లా రైతు సంఘ నాయకులుగా తాలూకాకు తరచువస్తూ జమీందారీ మొఖాసాదారీ సమస్యలలో తమ అనుభవాన్ని తోటి కార్యకర్తలకు సలహాలిస్తూ ప్రోత్సాహపర్చేవారు. పలుమార్లు పుచ్చలపల్లి సుందరయ్య చిత్తపూరు కొండపర్వ వగైరా గ్రామాలు పర్యటించి కార్యకర్తలనువుత్సాహపరుస్తూ ఉద్యమాలను ప్రోత్సహించారు.

ఆ రోజులలో తాలూకాలో జరిగిన విస్తృత రాజకీయ ప్రచారం ప్రజారంగాల కార్యకలాపాల వల్ల గ్రామస్థాయిలోను, ప్రాంతీయంగాను పలువురు ప్రభావితులై కార్యరంగంలోకి వచ్చిన యువకులున్నారు. దుగ్గ చెన్నారెడ్డి, అనంతోజు బ్రహ్మయ అనంతోజు జగన్నాథాచార్యులు, రామిశెట్టి కృయ్యలు కార్యకర్తలుగా ముందుకు వచ్చారు. అలా అమరత్వం పొందిన ఏరువ వెంకట్రామరెడ్డి, పొన్నగంటి నాగేశ్వరరావు, తుమ్మలపల్లి గోపయ్య, నడకుదుటి నాగయ్య, తోలేటి అప్పారావు, కొండా ఆశీర్వాదం, కోట గోపయ్య, సంగసాని పిచ్చయ్య, కొంగర అబ్రహాం, తాళ్ళూరి నారాయణ కొంగర అచ్చయ్య చిరస్మరణీయులు.

ఫ్యూడల్ శక్తులపై కాంగ్రెసు పోరాటం నడిపింది. వీటిలో రైతు-కూలీ యువకులు తదితరులు అనగా జాతీయ విముక్తి పోరాటాన్ని అభిలషించే వారందరూ పాల్గొన్నారు. 1936-37 ఎన్నికలలో కాంగ్రెసు కార్యకర్తలపై పేదకళాపీ పోయించిన మొఖాసాదార్లే 1946-47 ఎన్నికలలో కాంగ్రెసు కమ్యూనిస్టు విభేదాలను ఆసరాగా తీసుకొని కమ్యూనిస్టు కార్యకర్తలపై పేడకొట్టించారు. ఉదాహరణకు పుట్రేల. స్వతంత్ర్య పోరాటంలో ముందున్న రైతు-కూలీ వర్గాలను కాంగ్రెసు ఈ ఒక భాగం విస్మరించింది. కాంగ్రెసులో అతివాద భావాలు గల యువకులు పోరాటాలలో అగ్రగామిగా పాల్గొన్నారు.

## నూజివీడు తాలూకా

కృష్ణాజిల్లాలోని నూజివీడు తాలూకా శౌర్య పరాక్రమాలకు పూర్వకాలం నుంచీ ప్రసిద్ధి పొందింది. 13 వ శతాబ్దంలో తుగ్లక్ వంశీయులైన ఢిల్లీ సుల్తానులు. కాకతీయ రాజు రెండో ప్రతాపరుద్రు ఓడించి నెపుసు-ముసునూరు నాయకులు కొంత సైన్యంతో బయలుదేరి, ఢిల్లీ సుల్తానులతో పోరాటం సాగించారు. ఈ ముసునూరు నాయకులు నూజివీడు తాలూకాలోని ముసునూరు గ్రామవాసులే.

18 వ శతాబ్దాంతంలో నూజివీడు సంస్థానం ఏలిక మేకా నారయ్యప్పారావుగారు, ఈస్టు ఇండియా కంపెనీవారికి కట్టాల్సిన కప్పం కట్టకుండా బ్రిటిష్ వాళ్ళను ఎదిరించి పోరాడి, ఎనమండుగురు బ్రిటిష్ సేనాధిపతులను గడగడలాడించాడు. ఈయన తర్వాతనే దక్షిణాదిన వీరపాండ్య కట్టబ్రహ్మన, స్వాతంత్ర్య సాధనకు ఆంగ్లేయులతో పోరాడి అసువులు బాశారు కాని వీరనారయ్యప్పారావుతో బ్రిటిషువారు రాజీపడి, వారి సంస్థానాన్ని వారికి అప్పగించారు.

1921 సంవత్సరంలో గాంధీ మహాత్ముని నాయకత్వాన భారత స్వాతంత్ర్య సమరం ఆరంభమైంది. సహాయ నిరాకరణోద్యమం సమయంలో మతం బాల సుబ్రహ్మణ్య గుప్తగారి ఉత్తేజకరమైన ఉపన్యాసాలు నూజివీడు తాలూకా ప్రజల్ని మేల్కొల్పాయి.

దీనితో కళాశాలలో చదువుకుంటున్న దశిక సూర్యప్రకాశరావు, భాగవతుల లక్ష్మీనారాయణగార్లు చదువు మానివేసి ఉద్యమంలో పాల్గొనుటకు నూజివీడు వచ్చారు. ఉద్యమ సభలలోను, ఊరేగింపుల్లోను ఉద్యమకారులు తీవ్రమైన లాఠీ దెబ్బలకు గురయ్యారు. ఈ ఉద్యమంలో ప్రభుత్వం 18 మందికి ఒక సంవత్సరం నుంచి 4 మాసాల వరకూ శిక్షలు విధించింది.

1923 లో నూజివీడు తాలూకా ఆగిరిపల్లి గ్రామంలో రథసప్తమినాడు వేలాదిమంది తీర్థయాత్రికుల సమక్షంలో రథం మీద మహాత్మాగాంధీ పటం కట్టినందుకు పారేపల్లి లక్ష్మీనారాయణ, తాడిగడప పుల్లయ్య, ఆకుల బసవయ్య, కేతేపల్లి సుబ్బారావు గార్లకు ఆరేసి నెలలు శిక్ష విధింపబడింది.

ఈ ఉద్యమ సందర్భంలోనే (1921-1923) నూజివీడు హైస్కూలు ఉపాధ్యాయులు కానూరు వెంకటనారాయణ, లక్కావఝల సుందరరామయ్యగార్లు తమ ఉద్యోగాలకి రాజీనామా చేసి, జాతీయ పాఠశాల స్థాపించి నడిపారు.

## 1930 ఉప్పు సత్యాగ్రహం

1929 లో గాంధీ ఖాదీ ప్రచారానికీ, జాతీయ భావాల్ని ప్రజల హృదయాల్లో నాటేందుకు ఆంధ్రలో పర్యటించారు. అపుడు నూజివీడుకి కూడా గాంధీ విచ్చేశారు. ఉయ్యూరు రాజా శ్రీ వేంకటాద్రి అప్పారావుగారు, వారి "నందనవనం" లో గాంధీకి బస ఏర్పాటు చేశారు. ఆనాటినుంచీ, రాజాగారు, వారి కుమారులూ ఖద్దరు ధారణకు దీక్ష పూనారు. జాతీయోద్యమాలకు సాయం చేసి, ప్రోత్సహించారు

1930 ఏప్రిల్‌లో గాంధీ సత్యాగ్రహోద్యమం ప్రారంభించారు. ఆ సందర్భంలో నూజివీడులో సభలు, వూరేగింపులు జరపగా పోలీసులు లాఠీఛార్జి చేశారు. 15 మందికి 6 మాసాల నుంచి 2 ఏళ్ళదాకా శిక్ష విధించబడింది.

నూజివీడుకి చెందిన కూనపులి సుబ్రహ్మణ్యం, మురారి విజయసారథి గార్లు కాలేజీ చదువు మానివేసి చాగల్లు (పశ్చిమగోదావరి జిల్లా) ఆశ్రమ నిర్వాహకులు తల్లాప్రగడ నరసింహశర్మగారి నాయకత్వాన ఉద్యమంలో పాల్గొన్నారు ఆకివీడు వద్ద సిద్ధాపురంలో కల్లు దుకాణాల దగ్గర పికెటింగు చేస్తూ అరెస్టయ్యారు. భీమవరం మేజిస్ట్రేటు కోర్టులో వీరిద్దరికీ మూసాల చొప్పున శిక్ష పడింది.

1932 ఉద్యమంలో ఖద్దరు ప్రచారం, తాటిచెట్లు నరకటం లాంటి ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాల్లో పాల్గొన్నందుకు మొత్తం 9 మందికి 6 మాసాల నుంచి ఒక సంవత్సరం వరకూ జైలుశిక్ష విధింపబడింది.

1930-32 ఉద్యమాల్లో పాల్గొన్న వారంతా ఖద్దరు ప్రచారం, హరిజన సేవ చేస్తూ, మహారాష్ట్ర నాయకుడు శ్రీ హార్డికర్ స్థాపించిన "హిందూస్తాన్ సేవాదళం" వారి కార్యక్రమాల్ని అమలు జరుపుతూ దేశ సేవ చేశారు.

1941 లో వ్యక్తి సత్యాగ్రహానికి గాంధీ పిలుపు నివ్వగా నూజివీడు తాలూకాలో దగుప నారాయణరావు, బోడాప్రగడ లక్ష్మీనరసింహారావు మొదలైన వారు 9 మంది పాల్గొన్నారు. వీరికి 4 మాసాల నుంచి 2 ఏళ్ళ వరకూ శిక్షలు విధించబడ్డాయి.

నూజివీడు తాలూకాలో 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నందుకు నూజివీడు, సూరవరం మొదలైన ఊళ్ళలో కోసూరి నరసింహమూర్తి, దశిక సూర్యప్రకాశరావు మొదలగు 10 మందికి 3 మాసాల నుంచి 2 ఏళ్ళ దాకా శిక్షలు పడ్డాయి.

## మొఖాసా రైతు ఉద్యమం

1935 ఇండియా చట్టం ప్రకారం ఎన్నికలు జరిగి, ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో (ఆంధ్రప్రదేశ్ కూడా అందులో చేరి వుండేది) 1937 లో రాజగోపాలాచారి ముఖ్యమంత్రిగా కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడింది. దీనివల్ల నూజివీడు. తిరువూరు తాలూకాల్లో మొఖాసాదార్ల చేత పీడింపబడుతున్న రైతులు, వ్యవసాయ కూలీలు మేలుకొని చైతన్యవంతులయ్యారు. మొఖాసాదార్లపై తిరుగుబాటు చేశారు.

ముఖ్యంగా తిరువూరు తాలూకా విస్సన్నపేట ఫిర్కాలోని కొండపర్వ, నర్సాపురం, చాట్రాయి, గంటిపాడు, చిత్తపూరు, పోలవరం, జనా నవరం, వంటి గ్రామాల్లోని రైతులు, వ్యవసాయ కూలీలు, జమీందార్లు, మొఖాసాదార్ల నిరంకుశత్వంలో పలు బాధలు అనుభవిస్తూ వుండేవారు

ఈ బాధలు భరించలేక మొట్ట మొదటిసారిగా 1937 లో కొండపర్వ గ్రామ రైతులు మొఖాసాదార్లపై తిరుగుబాటుచేసి, నూజివీడులోని కాంగ్రెస్ కార్యకర్తల సహాయాన్ని అర్థించారు. అప్పుడు నూజివీడు నుంచి దశిక సూర్యప్రకాశరావు, దిగువ నారాయణరావు, మేకల రాములు, కూనపులి సుబ్రహ్మణ్యం, కోసూరి నరసింహమూర్తి, యర్రోజు మాధవాచార్యులు, చలసాని రాజగోపాలరావుగార్లు, మరి కొందరు కొండపర్వ వెళ్ళి అనేక సార్లు సభలూ ఊరేగింపులూ జరిపి మొఖాసాదార్ల నిరంకుశ చర్యల్ని ఖండించి, అక్కడి రైతులకు అండగా నిలిచారు. శ్రీ పేట బాపయ్యగారు ఈ ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించి, రైతుల కోర్కెలలో చాలా వరకూ నెగ్గించుకు వచ్చారు. అప్పుడే వీరికి 'సర్దార్' బిరుదును రైతులు ఇచ్చారు.

1938, 1939 సంవత్సరాలలో కాకాని వెంకటరత్నం, పేట బాపయ్యగార్ల ఆదేశానుసారం కూనపులి సుబ్రహ్మణ్యం, కోసూరి నారాయణమూర్తి, చలసాని రాజగోపాలరావుగార్లూ, విడిగా దిగువ నారాయణరావుగారూ విస్సన్నపేట ఫిర్కా మొఖాసా గ్రామాలైన-కొండపర్వ, చిత్తపూరు, నర్సాపురం, తుమ గూడెం, చట్రాయి, పోలవరం, గంటిపాడు, జనా నవరంలలో పాదయాత్రచేసి, రైతులను కలుకున్నారు. కష్టాలు కడగండ్లతో కూడిన రాత విన్నపాలను వారి నుంచి సేకరించారు. అప్పటి ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షులు డా॥ పట్టాభిగారికి వాటిని సమర్పించారు. స్వయంగా, మొఖాసా రైతుల బాధల్ని వారికి విన్నవించారు. మంత్రులతో మాట్లాడి రైతుల బాధల నివారణకు కృషి చేస్తానని పట్టాభిగారు వాగ్దానం చేశారు.

1938 లో జమీందారీ, మొఖాసా రైతుల స్థితిగతులను తెలుసుకునేందుకు, అప్పటి రెవెన్యూ మంత్రి టంగుటూరి ప్రకాశంగారి నాయకత్వాన కమిటీ వచ్చింది. అప్పుడు జమీందార్ల బెదిరింపులకు లొంగక, నూజివీడు తాలూకా కాంగ్రెస్ అధ్యక్షుడు పర్వతనేని వెంకట సుబ్బయ్యగారు, నూజివీడు తాలూకా రైతు సంఘాధ్యక్షుడు కలగర సత్యనారాయణ, దాసరి వెంకట సుబ్బయ్య, మాదల వెంకటప్పయ్య, వేంపాటి సుబ్బయ్యగార్లు జమీందార్ల, మొఖాసాదార్ల అమానుష చర్యల్ని నిర్భయంగా ఆ కమిటీకి నివేదించారు.

1943 లో చట్రాయి, నర్సాపురం జమీ గ్రామాల్లోని 10 వేల మంది వ్యవసాయ కూలీలు, పేద రైతులూ, జమీందార్ల పై బాధలు భరించలేక తమ బాధల నుంచి విముక్తి కల్గజేస్తామన్న క్రైస్తవ మత ప్రచారకుల మాటలునమ్మి-వారు క్రైస్తవమతం స్వీకరించబోగా, యర్రోజు మాధవాచార్యులు, కూనపులి సుబ్రహ్మణ్యంగార్లు 50 మంది విద్యార్థులతో కలిసి బూరుగుగూడెం వెళ్ళారు. అక్కడి పేదరైతులను, వ్యవసాయ కూలీలను ఒప్పించి మతం మార్పిడిని నివారించారు.

ఉయ్యూరు సంస్థానానికి చెందిన మేకా రంగయ్యప్పారావుగారు 1929 నుంచీ ఖద్దరు ధరిస్తూ, కాంగ్రెస్‌లో పని చేస్తున్నారు. కాంగ్రెస్ పక్షాన నూజివీడు నియోజక వర్గంనుంచి ఎన్నుకోబడి, 25 ఏళ్ళపాటు శాసన సభ్యులుగా వున్నారు. 1962-67 వరకూ రాష్ట్ర మంత్రిగా వున్నారు.

తాడంకి ఏసురత్నంగారు (హరిజనుడు) 1940 లో బ్రిటిష్ సైన్యంలో చేరి, మధ్యప్రాచ్యంలో బ్రిటిష్ వారి తరపున పోరాడుతుండగా జర్మనీ సైన్యానికి చిక్కి, జైలులోవుంచబడ్డారు. నేతాజీ సుభాష్‌చంద్ర బోస్ జర్మనీ రావటంతో వీరు ఆజాద్ హింద్ ఫౌజులో చేరి బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా పోరాడారు. కాని జపాను రెండో ప్రపంచయుద్ధంలో ఓడిపోవటంతో - తిరిగి బ్రిటిష్ సైన్యానికి పట్టుబడి భారత దేశానికి తీసుకు రాబడ్డారు. జబల్‌పూర్‌లో నిర్బంధించారు. ఆజాద్ సైనికులతో పాటు 1946 లో విచారణానంతరం విడుదల చేయబడ్డారు. (వివరాలు జీవిత చరిత్రలో ఇవ్వబడ్డాయి.)

ఈ విధంగా నూజివీడు తాలూకా స్వాతంత్ర్య సమరంలో పాల్గొని విజయవంతంగా తన పాత్రను నిర్వహించింది.

## 1921 నుంచి 1942 వరకూ శిక్షలు పొందిన సమరయోధులు

1921 ఉద్యమంలో చలమాలి నారాయణ, గరికిపర్తి నాగభూషణందేవర, బట్టి గోవిందరాజులు, చలమాల పెద్ద కోటయ్య, పరిమిశెట్టి వెంకట నీలాచలం, బాగుల పల్లి రంగనాధం, మోహిద్దీన్ బేగ్, పి సర్వయ్య, కంతేటి రామజోగయ్య, మారేప వెంకయ్య, వె వెంకట నరసింహం, మరింగం నరసింహాచారులు, తుర్లపాటి బైరాజుగార్లు జైలు శిక్షలు అనుభవించారు.

1922 ఉద్యమంలో జైలు శిక్షలు అనుభవించిన వారు—దశిక సూర్యప్రకాశరావు, తటవర్తి రంగయ్య, బట్టి వెంకోజీ, కొత్వాల్ అబ్బాసలీ సాహెబ్, వల్లూరు రామారావు, తాడిగడప పుల్లయ్య, పారేపల్లి లక్ష్మీనారాయణ, ఆకుబనవయ్య, కేతేపల్లి సుబ్బారావుగార్లు.

1930 ఉద్యమంలో జైలు శిక్షలు అనుభవించిన వారు—దశిక సూర్యప్రకాశరావు, తటవర్తి రంగయ్య, బట్టి గోవిందరాజులు, పరిమశెట్టి వెంకట నీలాచలం, మల్లెల రామయ్య, కోనూరి నరసింహామూర్తి, సముద్రాల సత్యనారాయణ, కూరెళ్ళ సత్యనారాయణ, శిరికొండ వల్లభయ్య, మేకల రాములు, వలివేటి రామకోటయ్య, కూనపులి సుబ్రహ్మణ్యం, మురారి విజయసారధిగార్లు 1932 ఉద్యమంలో పాల్గొని జైలు శిక్షలు పొందినవారు- దశిక సూర్యప్రకాశరావు, భట్టర్ కృష్ణమాచార్యులు, ఆలపాటి లక్ష్మయ్య, ఆలపాటి సత్యనారాయణ, రాళ్ళపల్లి సత్యనారాయణ, చలమల శెట్టి రాఘవయ్య, బొమ్మగంటి రామకృష్ణయ్య, ముళ్ళపూడి నాగేశ్వరరావు, మల్లాది శివరామకృష్ణ శాస్త్రి, కోగంటి వెంకటేశ్వరరావు, సిరికొండ వల్లభయ్య, దిగువ నారాయణరావు, పలగాని గోపాల స్వామి, పోలాప్రగడ లక్ష్మీ నరసింహారావు, ఆమాకు రంగయ్య, కోసూరి నరసింహమూర్తి.

1942 ఉద్యమంలో జైలు శిక్షలు పొందినవారు- కోసూరి నరసింహమూర్తి, దశిక సూర్యప్రకాశరావు, షేక్ నూరుల్లా సాహెబ్, నంబూరి బుల్లెయ్య, ఆరేపల్లి చెన్నయ్య, యరజర్ల వెంకయ్య, సముద్రాల సత్యనారాయణ, అరిపాటి సత్యనారాయణ, ఆలపాటి లక్ష్మయ్య, చలమలశెట్టి రాఘవయ్యగార్లు.

# గన్నవరం తాలూకా

కాటూరుగ్రామం జాతీయ ఉద్యమానికి, వామపక్ష ఉద్యమాలకు నిలయం

1921 లో నార్ల తాతయ్య, కాటూరిశంకరరావుగారు మరి కొందరు దేశభక్తులు కలిసి రాట్నం బండిమీద పెట్టి పెద్ద ఊరేగింపు జరిపి, గ్రామంలో రాట్నాల ప్రదర్శన జరిపారు. వడుకు నూలుకేంద్రం ఏర్పర చారు. 10, 15 కుటుంబాలవారు ప్రతిరోజూ రాట్నాల మీద ఖద్దరునూలు తీయడం, ఖద్దరు ధరించటం జాతీయ కర్తవ్యంగా భావించారు

1929 లో గాంధీ ముసునూరు వచ్చినపుడు. కడియాల పిచ్చయ్య మొదలగు యువకులు ముదునూరు వెళ్ళి చేతి ఉంగరాలు ఆయనకు ఇచ్చారు. మహిళలు తమ మెడలో నగలు తీసి ఇచ్చారు. గ్రామస్థులు రు. 316 నిధి సమర్పించారు. కాటూరుతో సహా ఆ పరిసర గ్రామాలవారు నగల రూపంలో వెయ్యిరూపాయల విలువ చేసేవి ఇచ్చారు.

1930 లో విదేశ వస్త్ర దహన కార్యక్రమంలో కాటూరు వెంకటేశ్వరరావు, కడియాల శేషయ్య, మన్నె వీరయ్య, బుర్రిగాని వెంకటసుబ్బయ్య, రావులపల్లి సత్యనారాయణ, నాదెళ్ళ కుటుంబయ్యగార్లు ఇంకా మరికొందరూ పాల్గొన్నారు. వీరంతా ఒక దళంగా ఏర్పడి, విదేశీ వస్తు బహిష్కరణ ప్రభుత్వ వ్యతిరేక ప్రచారం చుట్టుపట్ల గ్రామాల్లో సాగించారు ఈ కార్యక్రమంలో పాల్గొన్నందుకు మన్నె వీరయ్య, నాదెళ్ళ రామబ్రహ్మం, వెంకట సుబ్బయ్యగార్లను అరెస్టుచేసి ఒక్కొక్క సంవత్సరం శిక్షలు వేసి, జైళ్ళలో నానాహింసల పాలు చేశారు.

మద్యపాన నిషేధ ఉద్యమంలో — కడియాల పిచ్చయ్యగారి నాయకత్వంలో 50 మంది యువకులు, పాల్గొన్నారు. వీరు గీతకు వచ్చిన తాటిగెలలు నరికి వేయటం, కల్లుముంతలు పగలకొట్టడం, కల్లు దుకాణాలముందు పికెటింగ్ జరపటం వంటివి చేశారు.

ప్రభుత్వం, కడియాల పిచ్చయ్య, నార్ల సీతా రామయ్య, మారిన రాఘవయ్య, యార్లగ లక్ష్మయ్య, వెలగా బసవపూర్ణయ్యగార్లను అరె చేయుచేగాక, రు. 150 జరిమానా కూడా విధించా .

1921 లోనే సహాయ నిరాకరణ ఉద్యమంలో బి. ఏ. చదువుకు స్వస్తిచెప్పి జాతీయోద్యమంలో చేరి 1931 జనవరి 28 న ఆరునెలలు శిక్ష విధించబడి జైలుశిక్షను అనుభవించిన ప్రముఖ కవి కాటూరి వెంకటేశ్వరరావుగారు ఈ గ్రామస్తుడే. నెల పది హేడు రోజులు శిక్ష అనుభవించాక గాంధీ ఇర్విన్ ఒడంబడికను అనుసరించి 15–3–31 న వీరు విడుద లయ్యారు.

ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో వెలిదండ్ల హను మంతరావుగారు కాటూరునుంచి 10 మంది దళంగా బయలుదేరి, బందరువెళ్ళి ఉప్పు తయారు చేశారు. ఉప్పుపొట్లాల వేలంవల్ల వచ్చిన డబ్బును గాంధీకి పంపారు. సమిష్టి సత్యాగ్రహ ఉద్యమంలో కడియాల పిచ్చయ్య, వెల్లంకి నరసింహారావు, మన్నె కన కయ్య, బుర్రియ్య, వేములపల్లి వెంకటసుబ్బయ్య, తోటకూర వెంకటేశ్వరరావు, నాదెళ్ళ కుటుంబయ్య, నార్ల శీతారామయ్యగార్లు పాల్గొన్నారు.

బెజవాడలోని కాంగ్రెసుభవనం స్వాధీనపర్చుకునే సందర్భంలో వాలంటీర్లపై కేసుబ పెట్టారు. ఈ కేసు జరుగుతుండగా, కడియాల గోపాలరావుగారి నాయకత్వాన ఐదుగురుతో కూడిన స్వచ్ఛంద దళం మాజివీడు, తిరువూరులలో సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రచారం తీవ్రంగా సాగించింది. వీరిపై పోలీసులు లాఠీఛార్జీ చేసి జైలులో పెట్టారు.

అదే సమయంలో అన్నె అంజయ్య, మద్దూరి చంద్రశేఖరరావుగార్లు నాయకత్వాన ముదునూరు గ్రామంలో "రెడ్డి" పేపరు రహస్యంగా నడిపేవారు. కడియాల పిచ్చయ్యగారి నాయకత్వాన యువకులు 10 గ్రామాలలో ఈ పత్రికను పంచేవారు.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో 'స్వతంత్ర భారత్' రహస్య పత్రిక వెలువడింది. ఈ పత్రిక చదివితే మూడు సంవత్సరాలు కఠిన శిక్షలు విధించ టం, గుండుసూదులు చేతివేళ్ళలో గుచ్చటంలాంటి కిరాతక చర్యలు బ్రిటిష్ ప్రభుత్వం చేసింది. వీటిని లెక్క చేయకుండా, ఈ గ్రామ యువకులు వెలగా ప్రసాద్, కడియాల నారాయణరావు మరికొంతమంది యువకులు ఈ రహస్య పత్రికను అన్ని తాలూకాల్లో విరివిగా ప్రచారం చేశారు.

సామ్రాజ్యవాదుల యుద్ధనిధి వసూళ్ళకు వ్యతి రేకంగా ఈ గ్రామ యువకులు పోరాడి అరెస్టయ్యారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పోలుకొండ కేసుకో కడియాల కోటేశ్వరరావుగార్ని అరెస్టు చేసింది.

కాటూరు గ్రామప్రజలు నూటికి 80 మంది జాతీయ ఉద్యమానికి అండగా నిలిచారు. తమ కర్తవ్యం నిర్వర్తించారు.

## ముదునూరు

వందేమాతరం ఉద్యమం ముదునూరు గ్రామంలో ఉత్సాహం రేకెత్తించింది. మొవ్వ భూషయ్య, తుమ్మల కోటయ్య, అన్నె నాగయ్యగార్లు ఈ ఉద్య మంలో దూకారు. ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడు పెదిభొట్ల వెంకటేశ్వర్లుగారు వీరిని ప్రోత్సహిం చాడు. వీరు ప్రతి దినం వందేమాతరం గీతాలాపన చేస్తూ, గ్రామం అంతా తిరిగేవారు. ఆనాటి వార్తా విశేషాలను ప్రజలకు తెలియజేసేవారు. ఉపాధ్యాయు నిపై వారంట్ జారీ అయింది. కాని ఆయన తప్పించు కున్నాడు.

1914 లో ఈ గ్రామంలో ఏర్పడ్డ గ్రంథాలయం ద్వారా విజ్ఞానవంతులైన అనేకమంది యువకులు ఆ తర్వాత జాతీయోద్యమంలో పాల్గొన్నారు.

1921 సహాయ నిరాకరణ ఉద్యమంలో పాలడుగు సుబ్బారావు, అన్నె సుబ్రహ్మణ్యంగారలు పాల్గొని. జిల్లా అంతటా సంచారంచేసి ప్రముఖపాత్ర వహిం చారు. వారికి వారెంటు జారీ అయ్యాయి.

1921 లో జస్టిస్‌పార్టీ నాయకులు మీర్జాపురం రాజా తన ఎస్టేట్ గ్రామం ముదునూరు వచ్చి ఎన్నికల సభ పెట్టినపుడు, అన్నె అంజయ్యగారి నాయకత్వాన కొందరు యువకులు ఆయన్ని అనేక ప్రశ్నలు వేసి, ఆ సభను భగ్నం చేశారు. గ్రామపెద్దలు జమీందా రును ఏనుగుపై ఊరేగించారు. "మా కొద్దు ఈ జమీందార్ల పొత్తు" అనే పాట జమీందారుకు విన పడేలా పాలడుగు సుబ్బారావుగారి నాయకత్వాన యువకులు పాడారు. ఆ విధంగా బ్రిటిష్ ప్రభుత్వానికి అండగాఉన్న జమీందార్లపట్ల నిరసన తెలియజేశారు.

1929లో గాంధీ ఈ గ్రామానికి రాగా, బహిరంగ సభ జరిగింది. ప్రజలు విరివిగా విరాళాలు యిచ్చారు. అన్నే అంజయ్యగారి సతీమణి నారాయణమ్మగారు చేతి బంగారు గాజులు, మెడలో బంగారు నగలు గాంధీకి సమర్పించారు. మహిళలు అనేకమంది విరాళాలు ఇచ్చారు.

ఈ గ్రామం శివాలయం సెంటరులో విదేశవస్త్రాలు గుట్టపోసి తగలబెట్టారు.

ఈ గ్రామంలో స్వాతంత్ర్య ఉద్యమానికి అండగా నిలచిన ముఖ్యులలో సర్వశ్రీ గుత్తా వీరయ్య, అన్నే సుబ్రహ్మణ్యం, అన్నే మల్లిఖార్జునరావు, అన్నే అంజయ్య, అన్నే పూర్ణచంద్రరావు, తుమ్మల చల్లయ్య, తుమ్మల కోటయ్య (శోభనాద్రిగారి కుమారుడు) కుర్రా వెంకటరత్నం, మొవ్వ సత్యం, ముగునూరు సూర్యం, తుమ్మల పెదసత్యనారాయణ మొదలైనవారు వున్నారు.

ప్రజలలో ప్రబలివున్న మూఢాచారాల్ని తొలగించుటకు గోపరాజు రామచంద్రరావుగారు ఇక్కడ ఎక్కువ కృషి చేశారు.

1930 ఉప్పు సత్యాగ్రహ ఉద్యమ కాలంలో అన్నె అంజయ్యగారి నాయకత్వాన అనేకమంది యువకులు సత్యాగ్రహులుగా చేరారు. తాటి గెలలు నరకడం, కల్లు దుకాణాలవద్ద పికెటింగ్ చేయటం, అస్పృశ్యతా నివారణ, ఖాదీ ప్రచారం మొదలైన అన్ని కార్య క్రమాలు నిర్వర్తించి, నాటి గాంధీ ఆదర్శాలను అమలు పర్చారు.

1930 మే నెలలో తుమ్మల కోటయ్య, తుమ్మల పెద సత్యనారాయణగార్లను అరెస్టు చేసేందుకు బెజవాడ నుంచి సర్కిల్ ఇనస్పెక్టరు రామలింగయ్య పోలీసులతో ముదునూరు వచ్చారు. ఆ సమయానికి సత్యాగ్రహులు ఊళ్ళో లేనందున, వాళ్ళ గ్రామ కరణం ఇంటివద్ద కూర్చుని వుండగా కొందరు గ్రామస్థులు వాళ్ళని హేళనచేశారు. వారిపై లాఠీఛార్జి చేయడానికి సబ్ ఇనస్పెక్టర్ పర్మిషన్ అడిగాడు. సర్కిల్ ఇనస్పెక్టరు అంగీకరించ లేదు. ఇంతలో చీకటి పడుతుండగా వాళ్ళు బయలుదేరారు. దారిలో కూడా వాళ్ళపై కొందరు గడ్డలు విసిరారు. వాళ్ళు బెజవాడ వెళ్ళిపోయి, పైవారితో కాల్పులకు ఆర్డరు తీసుకుని రెండు లారీల రిజర్వు పోలీసులతో ముదునూరు బయలుదేరారు. ఇది తెలుసుకొన్న అన్నే అంజయ, వెలిదండ్ల హనుమంతరావుగార్లు సర్కిల్ ఇనస్పె రును కలుసుకొని "మీరు ఊళ్ళోకి వెళితే ఉద్రిక్త పెరిగిపోతుంది. సత్యాగ్రహులు హాజరవుతారు" అని నచ్చచెప్పి వాళ్ళని ఆపివేశారు. వెంటనే వారూ, మాకల వీరరాఘవయ్యగారు ముదునూరు వెళ్ళి, సత్యాగ్రహులను తీసుకువచ్చి హాజరు పర్చారు. ఈ సందర్భంలో గ్రామ ప్రజలు తుమ్మల కోటయ్య, తుమ్మల పెద సత్యనారాయణగార్లను మేళతాళాలతో కారులో ఊరేగించి ఘనంగా వీడ్కోలిచ్చారు.

1931లో పశ్చిమ కృష్ణాజిల్లా రాజకీయ మహాసభ ఈ గ్రామంలోనే జరిగింది. అన్నే సుబ్రహ్మణ్యం గారు ఆహ్వాన సంఘాధ్యక్షులు. గంపలగూడెం కుమారరాజా కోటగిరి వెంకట కృష్ణారావుగారు సభాధ్యక్షులు. సభా ప్రారంభకులు అయ్యదేవర కాళేశ్వరరావుగారు. అన్నే అంజయ్యగారి పర్యవేక్షణలో సభ బాగా జరిగింది.

అన్నే అంజయ్యగారి సారధ్యంలో 1932లో రహస్యంగా "రెడీ" అనే సైక్లోస్టయిల్ పత్రిక ఈ గ్రామంనుండే వెలువడింది. దీని పోలీసులకు చిక్కకుండా కాపాడేవారు. ఈ సైక్లోస్టయిల్ మిషన్‌ను ఈ గ్రామం చుట్టు ప్రక్కల పొలాల్లో దాచేశారు. రహస్య కరపత్రాలను, పత్రికను నిర్వహించుతున్న మదుకూరి చంద్రశేఖరరావుగారు బుడమేటి ఏటిగట్ల మధ్య ఒక కేంద్రంలో అరెస్టయ్యారు. పోలీసుల చిత్రహింసలకు గురయ్యారు. ఈ సందర్భంగా వెంట్రప్రగడ గ్రామానికి ప్యునిటివ్ పోలీసుదళంపంపబడింది. మానికొండ సత్యనారాయణ శాస్త్రిగారు రాసిన తూర్పు కృష్ణాజిల్లా జాతీయోద్యమ చరిత్రలో "మదుకూరి చంద్రశేఖరరావుగారు, కొసరాజు శేషయ్య మున్నగువారు చూపినతెగువ, ధైర్య సాహసము, అత్యద్భుతములు" అని ఈసందర్భాన్నిప్రశంసించారు.

ఇక్కడ నుంచి అనేక గ్రామాలకు 'రెడీ' పత్రికను, రహస్య సర్క్యులర్లను సైకిళ్ళపై యువకులు మారుమూల గ్రామాలకు సైతం ఆనాటి కానాడు చేరవేసేవారు.

1932లో మహిళా వలంటీర్ల శిబిరాన్ని ఈ గ్రామంలో ఏర్పాటు చేశారు. ఈ శిబిరం నుండి

అనేకమంది మహిళలు బయలుదేరి వెళ్ళి ప్రచారం చేస్తుండేవారు. గ్రామాల్లో ప్రచారం చేసుకుంటూ బెజవాడ వెళ్ళి ఊరేగుతుండగా ఈ గ్రామ మహిళలను నిర్బంధించి, రాత్రి పొద్దుపోయాక కృష్ణానది ఒడ్డున వదలివేశారు. వారిని సురక్షితంగా కొందరు సత్యాగ్రహ యువకులు ముదునూరు శిబిరానికి చేర్చారు.

విజయవాడలో జాతీయవారోత్సవాల సందర్భంలో 1932లో జరిగిన లాఠీ ఛార్జీలలో ముదునూరు శిబిరం నుండి వెళ్ళిన వాలంటీర్లు కూడా వున్నారు. కొందరు స్పృహకోల్పోయారు. "పీపుల్సు హాస్పిటల్" లో చికిత్సపొందారు. అందులోతుమ్మలవెంకటసుబ్బయ్య (తండ్రి శేషయ్య) గారికి 20 రోజులవరకు స్పృహ రాలేదు. మంచినీళ్ళు మింగుడు పడలేదు. మూడు మాసాల వైద్య చికిత్స తర్వాత బతికి బయట పడ్డారు.

హరిజన సమస్యపై గాంధీ నిరాహారదీక్ష వహించినపుడు అన్నె అంజయ్యగారి నాయకత్వాన ఒక దళం గన్నవరం తాలూకాలో అనేక గ్రామాలలో అస్పృశ్యతా నివారణ ప్రచారం గావించారు. హరిజన దేవాలయ ప్రవేశం గ్రామబావులలో హరిజనులునీళ్ళు తోడుకోడానికి ప్రోత్సహించడం, సహపంక్తి భోజనాలు ఈ కార్యక్రమంలో వున్నాయి. జిల్లా నాయకులు కూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. అన్నె అంజయ్యగారు హరిజన సేవక సంఘానికి అధ్యక్షులుగా వున్నపుడు దూసరపాలెం హరిజనవాడలో గ్రంథాలయం పెట్టించారు కాశీనాథుని నాగేశ్వరరావు గారు వంద గ్రంథాలను దీనికి బహూకరించారు. వడ్డీ లేకుండా కారీకమాసం వంటి గడ్డురోజుల్లో హరిజనులకు అంజయ్యగారు అప్పు యిచ్చి తర్వాత పంట కోత, నూర్పిడి కాలాల్లో వసూలు చేసేవారు.

1933 డిశంబరులో కృష్ణాజిల్లాలో గాంధీ హరిజన యాత్ర చేసినపుడు ముదునూరుకు గాంధీని అన్నె అంజయ్యగారి నాయకత్వాన గ్రామస్తులు ఆహ్వానించారు. అక్కడ రెండు దేవాలయాలలోకి హరిజన ప్రవేశ ఉత్సవాలను ప్రారంభించారు. గాంధీకి వ్యవధి లేనందున బయటనుండే అర్చకులవద్ద ప్రసాదం స్వీకరించి వెళ్ళాడు. హరిజన నిధికి విరాళాలు, ఆభరణాలు సమర్పించబడినవి. గ్రామ హరిజన నాయకులు చప్పిటి తమ్మయ్య, గొల్లంకి నారాయణ, మత్తె చినబుచ్చయ్య, దూసర నర్సయ్య, తూమాటి పుద్దండు, చప్పిటి వెంకటయ్య, జక్కుల సోమయ్య మొదలగువారు రామలింగేశ్వర దేవాలయంలో ప్రవేశించారు. సనాతనులు కొందరు వ్యతిరేకించినా వారిని సమాధానపర్చగల్గారు.

1938 లో బెంగాలీ యువకుడు నందలాల్‌బోస్ అనే అతడు యిక్కడ నెలరోజులు రహస్య జీవితం గడిపారు. ఆయన "బోల్షివిక్‌పార్టీ నిర్మాణం"కోసం వచ్చినట్లు చెప్పారు.

గోపరాజు రామచంద్రరావుగారు అధ్యాపక పదవికి స్వస్తి చెప్పి ముదునూరులో నాసిక కేంద్రం ఏర్పరచారు. అన్నె అంజయ్యగారు వీరి కుటుంబ పోషణ బాధ్యత వహించారు, వయోజన పాఠశాల దీని ఆధ్వర్యాన నిర్వహించబడింది. రెండేళ్ళు ఈ కేంద్రం నడిచింది. చర్చాగోష్ఠులు, హరిజనవాడలో సమిష్టి భోజనాలు అన్ని వర్ణాలవారితో అల్పాహార విందులు నిర్వహించబడ్డాయి.

క్విట్ ఇండియా ఉద్యమంలో కూడా ముదునూరు ప్రముఖ పాత్ర వహించింది. జిల్లా కాంగ్రెసు కార్యవర్గం యిక్కడ సమావేశమై ఉద్యమ నిర్వహణ ఏర్పాట్లు చర్చించింది. నాసిక కేంద్రం ఉద్యమానికి కేంద్రంగా వుండేది. జిల్లాలో ఉద్యమ నిర్వహణ బాధ్యత అన్నె అంజయ్యగారు వహించారు. వారిపై అరెస్టు వారంటు పుట్టగా అజ్ఞాతవాసంలోకి వెళ్ళారు. బహిరంగంగా ప్రభుత్వ వ్యతిరేకప్రచారం ద్వారా జైళ్ళకు వెళ్ళటం, రహస్యంగా పత్రికలు, బులెటెన్ ప్రచురించటం, తంతి తీగెలు తెంచటం, రైలు పట్టాలు పీకటం వంటి కార్యక్రమాలు ఈ గ్రామం నుండి నిర్వహింపబడ్డాయి. 1942 డిసెంబరులో అంజయ్యగారిని పోలీసులు అరెస్టుచేసి డిటెన్ చేశారు, కొన్ని దళాలు బహిరంగంగా ప్రభుత్వ వ్యతిరేక ప్రచారంచేసి అరెస్టు అయ్యాయి. సోషలిస్టు నాయకుడు శ్రీరంగనాథ కులకర్ణి రహస్యంగా యిక్కడికివచ్చి, స్థానిక పరిసర గ్రామాల యువకులతో కలసిపనిచేస్తుండగా పట్టుబడ్డారు. వీరిపై బెజవాడ కోర్టులో విచారణ సాగింది. బెజవాడ నుండి తప్పించుకొని తిరిగి అరెస్టుఅయి పోలీసుల హింసలకు గురయ్యారు. ఈ సందర్భంగా అరెస్టయిన కల

పాల సూర్యప్రకాశరావుగారిపై కేసుపెట్టి కొన్నాళ్ళు సబ్‌జైలులో వుంచి వదలివేశారు. నాగులపల్లి సీతా రామయ్యగారివద్ద కులకర్ణి ఉత్తరాలు దొరకడంతో పోలీసులు హింసించి, కేసుపెట్టారు.

క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా "కాంగ్రెస్" అనే పత్రిక రహస్యంగా నిర్వహించ బడింది. దీన్ని కూడా పోలీసులు పట్టుకోలేక పోయారు.

ముదునూరు గ్రామంలోనేకాక, జిల్లా రాజకీయా లలో కూడ అన్నె అంజయ్యగారు సుప్రసిద్ధ నాయ కుడు, ప్రముఖ ఉద్యమ నిర్మాత. జాతీయోద్యమం లోని అన్ని ఘట్టాలలోను వీరి నిర్మాణ దక్షత కన్పించింది.

చింతా దీక్షితులుగారివద్ద గుంటూరులో తెలుగు భాషలో మంచి పరిజ్ఞానం సంపాదించిన అన్నె అంజయ్యగారు 1921 లో సహాయ నిరాకరణోద్యమా నికి 16 ఏండ్ల ప్రాయంలోనే పరోక్ష సహాయం చేశారు. 1930 సత్యాగ్రహ ఉద్యమాన్ని చివరి దశలో జిల్లాలో చక్కగా నిర్వర్తించారు. జిల్లాలో అప్పటికే ప్రసిద్ధులైన అనేకమంది కాంగ్రెస్ నాయ కులు వీరి సహచరులు. 1932 శాసనోల్లంఘన ఉద్య మాన్ని నిర్వహించారు. ఫార్వర్డ్‌బ్లాకు, విప్లవవాదులు, సోషలిస్టులతో సన్నిహిత సంబంధాలుండేవి. హరిజన దేవాలయ ప్రవేశం అస్పృశ్యతా నివారణ వయోజన విద్య, ఖాదీవస్త్ర ప్రచారం, హేతువాద ఉద్యమం మున్నగు అన్ని ఉద్యమాలకు చేయూత నిచ్చి స్వయంగా కృషిచేసిన వారు, వీరి కుమార్తె రాజ్యం భగత్‌సింగ్ సహచరుడు, విజయకుమార్ సిన్హాను వివాహ మాడారు. వారితోగల రాజకీయ బంధుత్వం మరింత ప్రగాఢమైంది. (వీరి రాజకీయ జీవిత వివ రాలను జీవిత చరిత్రలలో చూడండి)

1975 జూన్ 21 న అంజయ్యగారు గుండె పోటుతో మరణించారు. అన్నె అంజయ్యగారి కృషినీ, ముదునూరు గ్రామ సత్యాగ్రహుల త్యాగాన్నీ గుర్తుతెచ్చుకుంటున్నపుడు, అంజయ్య గారి తల్లి రమణమ్మగారి సేవలను ఎన్నడూ మరువ లేమని పెద్దలు చెబుతారు. ఆమె కష్ట సహిష్ణుత, ఓర్పు. కార్యకర్తలకు ఎంతో ప్రోత్సాహం ఇచ్చేవి.

# బెజవాడ తాలూకా

బెజవాడ పట్టణం 9, 10 శతాబ్దాలలో చాళుక్య చక్ర వర్తులకింద ఆంధ్ర దేశానికి రాజధానిగా వుండేది. ఇంద్రకీలాద్రి పర్వతం మీద విజయుడు (అర్జునుడు) తపస్సు చేసి పాశుపతాస్త్రం పొందినట్లు పురాణగాథ వుంది, దానివల్ల బెజవాడకు విజయవాడ అనే పేరు కూడా వచ్చింది, పావన కృష్ణానదీ తీరాన వుండటం వల్లా, ఇక్కడికి కొండపై కనకదుర్గ గుడి వల్లా ఇది పుణ్యక్షేత్రంగా పేరు పొందింది. చైనా యాత్రికుడు ఫాహియాన్ కనకదుర్గను దర్శించాడు. మొగల్‌రాజ పురం గుహలు జైనులు నిర్మించారు. యుద్ధమల్లుని బెజవాడ శాసనం చరిత్ర ప్రసిద్ధం. శ్రీకృష్ణదేవ రాయల వారు బెజవాడ వచ్చి కనకదుర్గను సేవిం చారు. 1857 లో కాటన్ దొర కృష్ణానదిపై ఆనకట్ట నిర్మించడంతో కృష్ణాజిల్లా సస్యశ్యామలమైంది. బెజవాడ పట్టణం కూడా విస్తరించసాగింది.

## కాంగ్రెస్ వుద్యమం

1906 లో కలకత్తా కాంగ్రెస్ చేసిన తీర్మానాలు పశ్చిమ కృష్ణాజిల్లాలో కాంగ్రెస్ ఉద్యమం ప్రారంభ మవడానికి దోహదం చేశాయి. స్వరాజ్యం కోసం పోరాడాలనీ, అందుకు బ్రిటిష్ వస్తు బహిష్కారం, స్వదేశీ వ్రతం, జాతీయ విద్య సాధనాలనీ ఆ కాంగ్రె స్‌లో తీర్మానించబడింది. 1905 సెప్టెంబరులో మద్రా సులో విద్యార్థులుగావున్నపుడే అయ్యదేవర కాళేశ్వర రావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగార్లు రాజకీయాల పట్ల అభిరుచి పెంచుకున్నారు. ఆ నెలలోనే సము ద్రపు ఒడ్డున విద్యార్థుల సభ జరిగింది. అక్కడ విద్యార్థులు స్వదేశీ వ్రతం తీసుకున్నారు. చక్రయ్య చెట్టి, సుబ్రహ్మణ్య భారతి మొదలైన సహచరులతో పాటు హరిసర్వోత్తమరావు, కాశేశ్వరరావుగార్లు ఆ సభలో పాల్గొన్నారు, స్వదేశీ పరిశ్రమలు నేర కొనే విద్యార్థుల సహాయం కోసం దీపావళి

"దీపావళి భిక్ష"ను వసూలు చేశారు. పది రూపాయల వంతు (షేర్) చొప్పున డబ్బు పోగుచేసి, "స్వదేశీ వర్తక సంఘం"స్థాపించాలని తీర్మానించారు. అదే నెలలో బెజవాడలో "కృష్ణా స్వదేశీ ట్రేడింగ్ కంపెనీ" ఏర్పడింది. అది 1909 వరకు పనిచేసింది. ఈ కంపెనీ స్థాపకుడైన పింగళి లక్ష్మీనారాయణ గారు కలకత్తా కాంగ్రెస్‌లో ప్రతినిధిగా పాల్గొన్నారు.

1906 లో కాశీశ్వరరావుగారు బెజవాడకు వకీలుగా వచ్చి స్థిరపడ్డారు. పింగళి లక్ష్మీనారాయణ, పెద్దిభొట్ల వీరయ్య, సూరి వెంకట నరసింహశాస్త్రి, అబ్బూరి శ్రీరంగశాయి, కాశీశ్వరరావుగార్లు కాంగ్రెస్ ఉద్యమాన్ని సాగించారు, నేతకు పౌలభ్యం కల్గించిన "ఫ్లయింగ్‌షటిల్"తో పాటు పడుగు పోసే యంత్రాన్ని కూడా కనిపెట్టి, దాన్ని వ్యాపింపచేశారు.

1907 లో బిపిన్ చంద్రపాల్ బెజవాడ వచ్చారు. మునగాల రాజా అతిధిగా వున్నారు. అయ్యదేవర కాశీశ్వరరావు, శ్రీరామ వీరబ్రహ్మం. పెద్దిభొట్ల వీరయ్య అపుడు కాంగ్రెస్ రంగంలో పని చేస్తున్నారు. బిపిన్ చంద్రపాల్ ప్రసంగాలు మంచి సంచలనాన్ని కల్గించాయి.

1907 లో కృష్ణా జిల్లా రాజకీయ సాంఘిక మహాసభలు నందిగామలో జరిగాయి. సాంఘిక మహాసభలో అంటరానితనాన్ని తొలగించాలని తీర్మానించారు. కొండా వెంకటప్పయ్యగారు ఈ సభాధ్యక్షులు. అవటపల్లి నారాయణరావు, పింగళి లక్ష్మీ నారాయణ, బోడి నారాయణరావు, కాశీశ్వరరావుగా పంచములనుచేతులతో పట్టుకుని సభలో కూర్చుం బెట్టారు. ఇది కలకలం కల్గించింది. సనాతనులు లేచి దూరంగా పోయి కూర్చున్నారు. ఆ రాత్రి భోజనాల సమయంలో వితంతు వివాహాలు చేసుకొన్న వారితో కలసి వీరంతా భోంచేశారు. ఆ రోజుల్లో ఇదో పెద్ద సాహస కృత్యం. విదేశయాత్ర, రజస్వలానంతర వివాహాలు, చే సి న వారితోకూడా కలసి భోంచేశారు. బెజవాడలోని పూర్వాచారపరాయణులు వీరిపై ఆగ్రహించారు. కాశీశ్వరరావు మొదలైన తొమ్మిది మందిని, రెండేండ్లు వెలివేశారు. ఎవరూ దీన్ని లక్ష్య పెట్టలేదు, వెలి వెలవెల బోయింది.

వందేమాతరం ఉద్యమ కాలంలో రాజమండ్రి ట్రెయినింగ్ కాలేజీ నుంచి వెళ్ళగొట్టబడిన గాడిచర్ల హరిసర్వోత్తమరావు, పింగళి లక్ష్మీనారాయణ, బోడి నారాయణరావు, పెద్దిభొట్ల వీరయ్య, సూరి వెంకట నరసింహశాస్త్రి, కాశీశ్వరరావుగార్లు బెజవాడలో కాంగ్రెస్ ఉద్యమాన్ని వ్యాపింపచేస్తూ ఉండేవారు. సంఘ సంస్కరణల కోసం కృషి చేసేవారు.

హరిసర్వోత్తమరావుగారు సంపాదకులుగా, బోడి నారాయణరావుగారు ముద్రాపకులుగా, పింగళి లక్ష్మీ య.ఃమానిగా "స్వరాజ్య" పత్రికను స్థాపించారు. మిగిలినవారు వ్యాసాలు రాసి ఆ పత్రికకు పంపేవారు. 1907 లో సూరత్ కాంగ్రెస్‌కు పెద్దిభొట్ల వీరయ్య, గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు వెళ్ళారు. సూరత్‌లో కాంగ్రెస్ అతివాద, మితవాద పక్షాలుగా చీలింది. తిలక్ "జాతీయ పక్షం"ను అతివాద పక్షంగా భావించేవారు. బెజవాడ ప్రతినిధులు తిలక్ పక్షానే ఉన్నారు. ఈ జిల్లా నుండి వెళ్ళిన కోవల్లె హనుమంతరావు, పేరి నారాయణమూర్తి, గంటి లక్ష్మన్న గార్లు కూడా తిలక్ పక్షానే వున్నారు.

సూరత్ కాంగ్రెస్ తర్వాత దేశంలో ప్రభుత్వ నిర్బంధ విధానం తీవ్రమైంది. "స్వరాజ్య" పత్రిక సంపాదకులు హరి సర్వోత్తమరావుగారిని, ముద్రాపకుడు బోడి నారాయణరావుగారిపై రాజద్రోహం నేరంమోపి అరెస్టు చేశారు. కాశీశ్వరరావు, సూరి వెంకట నరసింహశాస్త్రి, పెద్దిభొట్ల వీరయ్యగార్ల ఇళ్ళను సోదా చేశారు. అదే సమయాన బందరులో కూడా డాక్టర్ పట్టాభిగారిల్లు సోదా చేశారు. పింగళి లక్ష్మీ నారాయణగారు పుదుచ్చేరిపోయి సుబ్రహ్మణ్య భారతి, అరవింద ఘోష్‌లతో కలిసి ఉన్నారు. స్వరాజ్యపత్రికా నిర్వహణలో పాల్గొంటున్న కాశీనాధుని వీర మల్లయ్య అప్రూవర్‌గా మారాడు. హరి సర్వోత్తమ రావుగారికి మూడేళ్ళ కఠినశిక్ష, బోడి నారాయణరావుగారికి తొమ్మిది నెలల విడి ఖైదు విధించారు. వంగవిభజన రద్దయి, ఐదవ జార్జి చక్రవర్తి పట్టాభిషేకం సందర్భంగా ఖైదీల విడుదల, కేసుల ఉపసంహరణ జరిగినపుడు, వీరు బెజవాడ వచ్చారు. వీరంతా విడుదలయ్యాక, బెజవాడలో పంచములకు పగటిపూట ఒక పాఠశాల, రాత్రిపూట కార్మిక పాఠశాలను నడిపారు. పోలీసుల నిఘా వీరందరి పైన ఉండేది.

1908 లో బెంగాల్‌నుండి సర్కార్ అనే విప్లవ వాది వచ్చి కాశేశ్వరరావు గారింట్లో ఉన్నాడు. హరి సర్వోత్తమరావు మొదలైన వారిని బాంబులు చేయడం నేర్చుకోవలసిందిగా కోరాడు. ఇలాగే బందరువెళ్ళి, అక్కడి కాంగ్రెస్ వారిని కూడా కోరాడు. కాని ఫలితం లేక బెంగాల్ తిరిగి వెళ్ళిపోయాడు. కొందరు బాంబులు తయారు చేస్తున్నారన్న వదంతి మాత్రం పాకిపోయింది.

1908 వేసవిలో కృష్ణాజిల్లా కాంగ్రెస్ మహాసభ తెనాలిలో (అపుడు గుంటూరు జిల్లా కూడా కృష్ణా జిల్లాలో భాగంగా ఉండేది) జరిగింది. కాంగ్రెస్‌లోని అతివాదులను బలపరచే తీర్మానాలను అక్కడ ఆమోదించారు.

ఆ విధంగా బెజవాడ కాంగ్రెస్ కార్యకర్తలు ప్రారంభంనుండీ అతివాద రాజకీయాలతోనే రంగ ప్రవేశం చేశారు.

1908 డిసెంబర్‌లో జరిగిన మద్రాసు కాంగ్రెస్ మహాసభకు బెజవాడకాంగ్రెస్ కార్యకర్తలు వెళ్ళారు. కొన్నాళ్ళకు బెజవాడలో డివిజనల్ కాంగ్రెస్ ఏర్పడి 1920 వరకు పనిచేసింది. సంచార కార్యదర్శిని ఏర్పరచారు. గ్రామీణులైన రైతులు చాలా మంది సభ్యులుగా చేరారు. పల్లెటూళ్ళలో రాజకీయ సభలు జరుగుతుండేవి. హోంరూల్ ఉద్యమ కాలంలో బెజవాడ డివిజనల్ కాంగ్రెస్ చురుకుగా పనిచేసి కరపత్రాలు ప్రచురించింది. 1916 లో నీటి తీరువాను రూపాయికి పావలా చొప్పున పెంచినపుడు, అది కూడదని వేలాదిమంది రైతులచే, మహజర్లు పెట్టించి సంతకాలు, వేలిముద్రలు స్వీకరించారు. డివిజనల్ కాంగ్రెస్ యీ విషయంలో బాగా పనిచేసింది. హోంరూల్ ఉద్యమకాలంలో అనిబిసెంట్ బెజవాడ వచ్చి ఇచ్చిన గంభీర ఉపన్యాసాలఫలితంగా కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఉన్న దివ్య జ్ఞాన సామాజికులు కాంగ్రెస్‌లో చేరారు. సంఘ సంస్కరణలకు అనుకూలంగా మారారు. డివిజనల్ కాంగ్రెస్‌కి రావు బహద్దరు తాడంకి వెంకట నర్సయ్య పంతులు అధ్యక్షులుగా పనిచేశారు. (అప్పటికి రావు బహద్దూర్ పదవుల్ని యింకా నాయకులు వదులుకోలేదు.) కాశేశ్వరరావుగారు కార్యదర్శిగా కొన్నాళ్లు, అధ్యక్షుడుగా పనిచేశారు.

పంచముల పాఠశాలలోని వార్షికోత్సవ సందర్భంగా విద్యార్థులను రామమోహన గ్రంథాలయానికి తీసుకొనిరాగా కొందరుఅభ్యంతరంచెప్పారు. దానిపై కొంత ఆందోళన జరిగింది. గ్రంథాలయంలోకి పంచముల్ని రానీయాలని గ్రంథాలయ నిర్వాహకులు తీర్మానించారు. గ్రంథాలయ ఉద్యమం జాతీయోద్యమానికి సహకారిగా పనిచేసింది. నరసింహశాస్త్రి అయ్యంకి వెంకట రమణయ్య గ్రంథాలయోద్యమంలో నిమగ్నులయ్యారు. వందేమాతరం ఉద్యమ ఫలితంగా ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర వాంఛకూడా పెరిగింది. 1913 లో బాపట్లలో మొదటి ఆంధ్రమహాసభ జరిగింది. రెండవ మహాసభ బెజవాడలో జరిగింది. ఈ సభలో నిర్వివాదమైన అనేక తీర్మానాలు చేశారు. అధ్యక్షత వహించిన న్యాపతి సుబ్బారావుగారు త్యేక ఆంధ్ర రాష్ట్ర తీర్మానంపట్ల ప్రతికూల ఖరి అవలంబించారు. ఈ విషయాన్ని మూడవ హాసభకు వాయిదా వేశారు. ఐనా ఆనాటినుండి ప్రత్యేక రాష్ట్ర వాదనకు బలం చేకూరింది.

హోంరూల్ ఉద్యమంలో అనిబిసెంట్ మొదలైన వారిని అరెస్టు చేసినపుడు వారి విడుదలకై, శాసనోల్లంఘన ప్రమాణ ఉద్యమం బయలుదేరింది. దేవభయంకర్ అనే ఆయన బెజవాడవచ్చి అట్టి ప్రమాణాపత్రాలను కాంగ్రెస్‌వారి నుండి తీసుకొని పోయారు.

1917 నవంబర్‌లో బెజవాడలో ప్రత్యేక ఆంధ్ర మహాసభ జరిగింది. మాంటేగ్ వద్దకు ఆంధ్ర ప్రతినిధుల రాయబారం పంపడానికని యీ సభ ఏర్పాటైంది. ఈ సభకు ఆహ్వాన సంఘాధ్యక్షులైన అయ్యదేవర కాశేశ్వరరావుగారు బ్రాహ్మణేతరులకు సమిష్టి నియోజక వర్గాలలో ప్రత్యేక ప్రాతినిధ్యం యివ్వాలని కోరారు. అధ్యక్షులు చింతలపాటి నరసింహరాజుగారు బ్రాహ్మణేతరులకు ప్రత్యేక ప్రాతినిధ్యం కూడదన్నారు.

ఈ సభలో కాంగ్రెస్ లీగ్ స్కీము ఆమోదించబడింది. 1916 లో లక్నోలో కాంగ్రెస్ ముస్లిం లీగులు కలిసి రూపొందించిన కాంగ్రెస్— లీగ్ విధానాన్ని ఆమోదించుతూ పశ్చిమ కృష్ణాజిల్లాలో వేలాది మంది ప్రజలు సంతకాలుచేశారు. లక్నోలో కాంగ్రెస్— లీగ్‌లు స్వయంపాలన కావాలని ఒక ప్రణాళికను

తయారు చేశాయి. మాంటేగ్ భారతదేశం వచ్చి నపుడు యీ ప్రణాళికపై పది లక్షల సంతకాలుచేసి, ఆయనకు సమర్పించాలని తీర్మానించాయి. బెజవాడ ప్రాంతంలో పదివేలసంతకాలు సేకరించారు. బ్రాహ్మ ణేతరులకు ప్రత్యేక ప్రాతినిధ్యం యివ్వాలని కూడా యీ సభలో అంగీకరించబడింది.

ఆంధ్ర రాయబార వర్గ సభ్యులైన న్యాయపతి సుబ్బారావు, కొండా వెంకటప్పయ్య, డాక్టర్ పట్టాభి సీతారామయ్య, మోచర్ల రామచం' రావు మొదలైన వారు సమావేశమై మాంటేగ్ యివ్వదలచిన రాయబార పత్రాన్ని తయారు చేశారు.

ఇది జరిగిన కొన్నాళ్ళకు, ఆరు కోస్తా జిల్లాలకు చెందినవారితో జస్టిస్ పా మహాసభ జరిగింది. దీనికి పోటీగా బెజవాడలో ధ్రరాష్ట్ర బ్రాహ్మణేతర మహాసభను కాంగ్రెస్ వారు నిర్వహించారు. నెల్లూరు జిల్లాకు చెందిన పొణకా పట్టాభి రామిరెడ్డి ఆహ్వాన సంఘాధ్యక్షులు, త్రిపురనేని రామస్వామి చౌదరి అధ్యక్షత వహించారు. రాయలసీమ నుండి కేశవపిళ్లే, రంగనాథ మొదలియార్ మొదలైన వారు పాల్గొన్నారు. మాంటేగ్‌ను కలుసుకోదలచిన వారిలో కొందరి ప్రముఖుల పేర్లను ప్రభుత్వం తొలగించగా ఆందోళన జరిగింది. చివరకు ప్రభుత్వం దిగివచ్చి, ఆంధ్ర రాయబార వర్గానికి అనుమతించింది ఆ తర్వాత మాంటేగ్, వైస్రాయిలు ప్రత్యేకాంధ్ర రాష్ట్రం పట్ల అనుకూలంగా ఉన్నట్లు ప్రకటనలు మాత్రం చేశారు.

1919 లో గాంధీ బెజవాడ వచ్చినపుడు రౌలట్ సత్యాగ్రహాన్ని గురించి ఉపన్యసించారు. యుద్ధం ముగిసాక రౌలట్ చట్టం ద్వారా బ్రిటిష్ ప్రభుత్వం క్రూరమైన దమనకాండ ప్రారంభించింది. దీనికి నిర సనగా రౌలట్ సత్యాగ్రహాన్ని తలపెట్టి, గాంధీ దేశ మంతటా పర్యటించారు. ఆ సందర్భంగానే బెజవాడ వచ్చారు. కాశేశ్వరరావుగారు సత్యాగ్రహిగా చేరారు. కాని ఈ సత్యాగ్రహ ఉద మం ప్రారం భించక ముందే పంజాబు వధలు ము న్నగు కొన్ని సంఘటనలను పురస్కరించుకొని గాం ఉ్యదమాన్ని విరమింపచేశాడు. అందుచే ఆంధ్రలో ఈ సత్యా గ్రహ ఉద్యమం అమలులోకి రాలేదు.

కలకత్తాలో జరిగే ప్రత్యేక కాంగ్రెస్ మహాసభకు మద్రాసు నుండి వెళుతూ తోవలో గాంధీ, షౌకతాలీలు బెజవాడలో ఆగారు. ఆనాటి ఉపన్యాసాలలో శాసన సభా బహిష్కారం, బిరుదుల గౌరవోద్యోగాల విస ర్జన, మొదలైన సహాయ నిరాకరణ ఉద్యమాన్ని గురించి వారు వివరించారు. అప్పటికే కృష్ణాజిల్లా కాంగ్రెస్ తరపున కోటగిరి వెంకట కృష్ణారావు, అయ్యదేవర కాశేశ్వరరావు గారలు శాసనసభలకు పోటీ చేయడానికి నిశ్చయమైంది. కాని గాంధీగారి ఉపన్యాసం తర్వాత కొద్ది రోజుల్లోనే వీరు శాసనసభ లకు పోటీ చేయరాదని నిర్ణయించుకున్నారు.

కలకత్తా కాంగ్రెస్ తర్వాత వోటివ్వవద్దనీ, శాసన సభ ఎన్నికల్ని బహిష్కరించవలసిందనీ ప్రచారం జరిగింది. అలా ప్రచారం చేసిన మఠం బాలసుబ్ర హ్మణ్య గుప్త పై జామీన్ కేసు పెట్టగా, ఆయన జామీను ఇవ్వ నిరాకరించి ఆరు నెలల విడి ఖైదును అనుభవించాడు. ఈయనకు శిక్ష విధించినపుడు నిర సనగా బెజవాడలో మరునాడు పెద్ద హర్తాళ్ జరిగింది.

1921-22 సహాయ నిరాకరణోద్యమంలో బెజ వాడ వెనకపడలేదు. 1921 లో దాసు మధుసూదన రావు, దోర్బల శేషాద్రిశాస్త్రి, చోడవరపు విశ్వేశ్వర రావు గారలు ఒక సంవత్సరం తమ న్యాయవాద వృత్తిని త్యజించారు. 1921 మార్చిలో కాశేశ్వర రావుగారు శాశ్వతంగా న్యాయవాదవృత్తిని మాని వేశారు.

1921 జనవరిలో జాతీయ ఉన్నత పాఠశాలను నెలకొల్పి నాల్గున్నర ఏళ్ళు నడిపారు. తర్వాత డబ్బు లేక ఆగిపోయింది. బ్రిటిష్ ప్రభుత్వ కాలేజీలలో ఉన్నత విద్యను మానిన విద్యార్థులు, బెజవాడ పరిసర గ్రామాల్లో ఏర్పడిన జాతీయ పాఠశాలల్లో ఉపా ధ్యాయులుగా పనిచేశారు. మరికొందరు విద్యార్థులు జాతీయ పాఠశాలల్లో చదువు కొనసాగించారు. జాతీయ పాఠశాలకు తమ్మన నారాయణమూర్తి, అద్దే పల్లి వెంకటప్పయ్య, చుండూరి నాగభూషణం భూరి విరాళాలిచ్చారు.

దాసు మధుసూదనరావుగారి సంవత్సరంలోనే ఖద్దరు దుకాణం పెట్టారు.

వేముల కూర్మయ్య బెజవాడ జాతీయ ఉన్నత పాఠశాలలో మెట్రిక్యులేషన్ పాసయి కాశీ హిందూ

విశ్వవిద్యాలయంలో మొదటి హరిజన విద్యార్థిగా గాంధీగారి సిఫార్సుపై చేరాడు. ఆ తర్వాత ఆయన రాష్ట్ర మంత్రి అయ్యాడు.

1921 మార్చి 31, ఏప్రిల్ 1 తేదీలలో అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశం బెజవాడలో అత్యంత వైభవంగా జరిగింది. ఇక్కడ ఆమోదించిన తీర్మానానికే "బెజవాడ కార్యక్రమం" అని పేరు వచ్చింది. ఇక్కడే కాంగ్రెస్ పతాక రూపురేఖలు స్థిరపరచారు. ఈ సభకు అఖిల భారత నాయకులు రావడంవల్ల లక్షలాది జనం వచ్చారు. కావలి శంకర రావు నాయకత్వాన వలంటీర్లు పనిచేశారు. తొక్కిస లాటలో ముగ్గురు మరణించారు. దుగ్గిరాల గోపాల కృష్ణయ గారి నాయకత్వాన ఎర్రబట్టలు ధరించిన వలంటీ ఆ తర్వాత సభలను జయప్రదం చేయ డంలో కృషిచేసారు.

ఆ మహాసభలోనే మాగంటి అన్నపూర్ణాదేవి తన నగలన్నిటినీ గాంధీకి ఇచ్చివేసింది. విదేశీ వస్త్రాలు తగలబెట్టి, ఖద్దరు ధరించింది.

ఈ మహాసభ బెజవాడలోనే గాక, కృష్ణాజిల్లా లోను, రాష్ట్రంలోను ఆ తర్వాత జాతీయోద్యమానికి గట్టి పునాదివేసింది.

1921 సెప్టెంబరులో కృష్ణా పుష్కరాల సంద ర్భంగా కాంగ్రెస్ శాంతి సైనికులు యాత్రికులకు సేవ చేశారు. గాంధీ మైదానంలో రోజూ సభలు జరి గేవి. వివిధ ప్రాంతాల నుండి వచ్చిన నాయకులు ఆ సభలలో ఉపన్యసించి జాతీయ భావాల్ని ప్రచారం చేసేవారు.

బెజవాడలో పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్‌కు కార్యస్థానమై వేలాదిమంది సభ్యుల్ని చేర్పించింది. సభలు, ఉత్సవాలు, హరాళ్లు జరిపింది.

1921 ఆఖరు భాగంలో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘం బెజవాడలో సమావేశమైంది. క ష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాలలో పన్నులు చె ంచ నిరాకరించాలని తీర్మానించింది. కాని తర్వాత .ంధీ గారి సలహాపై, పన్నులు చెల్లించవలసిందిగా కాంగ్రెస్ ప్రజల్ని కోరింది.

1922 చివర భాగాన శాసనోల్లంఘనం జరుపుటకు దేశం సిద్ధంగా వుందా లేదా అని తెలుసుకునేందుకు మోతీలాల్ నెహ్రూ నాయకత్వాన ఓ కమిటీ బెజవాడ వచ్చింది. మునిసిపల్ సంఘం వినతిపత్రం సమ ర్పించింది. ఆ కమిటీవారు బహిరంగసభలో ఉపన్యా సించాక గుంటూరు వెళ్లారు. అక్కడ ఎవరూ శాంతి సైనికులుగా జండా పుచ్చుకుని రాకూడదని 144 సెక్షన్ ప్రభుత్వం ప్రయోగించింది. వందలకొద్దీ కాంగ్రెస్‌వారు ఆంధ్ర జిల్లాలు అన్నిటినుంచీ వచ్చి, ఆ నిషేధాజ్ఞల్ని ఉల్లంఘించారు. వందల మందిని జైళ లో పెట్టారు. ఇంకా పె ందుకు స్థలం చాలక అరె బు మానివేశారు అరె అయిన వారిని నాలు గై రోజులు వుంచి విడుద చేశారు కొందరికి జరిమానాలు వేశారు.

కాట్రగడ్డ రఘురామయ్య, కాకుమాను లక్ష్మయ్య, పెదర్ల వెంకట సుబ్బయ్య, నల్లూరు పాపయ్య మొద లైన ఆరుగురు పశ్చిమ కృష్ణానుంచి అరెస్టయ్యారు. వారికి జరిమానాలు విధించబడ్డాయి.

1923 నాగపూర్‌లో జరిగిన జాతీయ పతాక సత్యాగ్రహానికి మరం బాలసుబ్రహ్మణ్యగు ప్త, పోతిన గణపతిరావు, మన్మధరావు, బంక అచ్చయ్య పాత్రుడు మొదలగువారు 9 మంది బెజవాడనుండి వెళ్ళి, అక్కడ సత్యాగ్రహం చేసి తలొక 6మాసాల శిక్ష అనుభవించి వచ్చారు. మరల ఆ సంవత్సరం లోనేమరంబాల సుబ్రహ్మణ్యగుప్తగారికి 108 సెక్షన్ కింద ఒక సంవత్సరం శిక్ష విధింపబడింది.

దక్షిణ హిందీప్రచార సంఘంవారు పశ్చిమకృష్ణా లోను. బెజవాడలోను, జిల్లాలోని గ్రామాల్లోను యువతీ యువకులకు హిందీ నేర్పించారు.

తరుచుగా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘ కార్య స్థానం విజయవాడలోనే వుంటూ వచ్చింది. ఈ సంఘంవారు, తమ కార్యస్థానానికిగాను ఒక భవనం కొని ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి స్మారక చిహ్నంగా "ఆంధ్రరత్న భవనం" అని పేరుపెట్టారు.

1924 లో ఆంధ్రరాష్ట్ర స్వరాజ్య పార్టీ కార్య స్థానం కూడా విజయవాడలోనే వుండేది. దానికి అయ్యదేవర కాళేశ్వరరావుగారు అధ్యక్షులు. డాక్టరు ధన్వాడ రామచంద్రరావుగారు ప్రధాన కార్యదర్శి.

1920 ఎన్నికలలో పశ్చిమ కృష్ణాజిల్లా కూడా శాసనసభలను బహిష్కరించింది. అనేకచోట్ల కాళీ బేలట్ పెట్టెలు పంపబడ్డాయి.

1923 సంవత్సరంలో ఢిల్లీలో జరిగిన ప్రత్యేక దేశీయ మహాజనసభలో కాంగ్రెస్‌వారికి, ఇష్టమైతే శాసనసభలకు వెళ్ళవచ్చునని అనుమతించారు. కాని పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ వాళ్ళెవరూ శాసన సభలకు నిలబడలేదు.

1925 డిసెంబరులో కాన్పూరులో జరిగిన కాంగ్రెస్ మహాసభ, కాంగ్రెస్ అభ్యర్థుల్ని నిలబెట్టి శాసనసభలకి పంపాలని తీర్మానించింది. దానిప్రకారం 1926 ఎన్నికలలో కృష్ణాజిల్లా తరపున మద్రాసు శాసనసభకు ఆంధ్రరాష్ట్ర కమిటీ ఇద్దరు అభ్యర్థుల్ని నిలబెట్టింది, పోటీ తీవ్రంగా జరిగింది. జస్టిస్ పార్టీ పక్షాన మీర్జాపురం జమిందారు, కాంగ్రెస్ పార్టీ పక్షాన అయ్యదేవర కాళేశ్వరరావుగారు శాసనసభ్యులుగా ఎన్నుకోబడ్డారు.

1928 ఫిబ్రవరి నెలలో సైమన్ కమిషన్‌వారు గుంటూరువెళుతూ బెజవాడ రైలుస్టేషనులో కొంత సేపు ఆగారు. అపుడు బెజవాడ కాంగ్రెస్ యువకులు, వారికి నల్లజండాలు చూపారు. బెజవాడ మున్సిపాలిటీ వారు సైమన్ కమిషన్‌ను బహిష్కరిస్తున్నామనీ, వెనక్కి పొమ్మనీ తీర్మానించారు. ఆ తీర్మానాన్ని తమ దఫేదారుద్వారా కాళేశ్వరరావుగారు సైమన్‌కి అందచేశారు.

1929 డిసెంబరులో లాహోర్ కాంగ్రెస్ మహాసభ సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని అంగీకరించి, శాసనసభ్యులందరినీ రాజీనామాలు ఇవ్వాల్సిందిగా కోరింది. అపుడు కృష్ణాజిల్లా కాంగ్రెస్ తరపున అయ్యదేవర కాళేశ్వరరావుగారు తన శాసన సభ్యత్వానికి రాజీనామా ఇచ్చారు.

వీరు శాసనసభ్యులుగా వున్నకాలంలో నూకల వీరరాఘవయ్యగారు మొదలగు సహాయ నిరాకరణ వాదులకు చెందిన సుమారు 200 యకరాల మాగాణి భూమినీ ప్రభుత్వం మాగాణి ఆయకట్టునుంచి తొలగించింది. ఈ విషయమై శాసనసభలో పట్టుపట్టగా, మరల ఆ భూమి పల్లపు ఆయకట్టులో చేర్చబడింది. పాఠశాలలో హిందీని ప్రవేశపెట్టుటకు ప్రభుత్వ అనుమతికై వీరు కృషిచేశారు.

1929 లో గాంధీజీ ఆంధ్ర పర్యటనకు వచ్చి, మొదట పశ్చిమ కృష్ణాజిల్లాకు విచ్చేశారు. అప్పుడు ఈ జిల్లాప్రజలు మహోత్సాహం ప్రదర్శించారు.

## బెజవాడలో ఆంధ్రరాష్ట్ర మహాసభలు

1929 నవంబరులో ఆంధ్రరాష్ట్ర మహాసభలు నాగేశ్వరరావు పంతులుగారి దు కళామందిరంలో అతివైభవంగా జరిగాయి. ఈ సభ జయంతిపురం జమీందారు ఆహ్వానసంఘ అధ్యక్షులు, నడింపల్లి లక్ష్మీనరసింహారావుగారు అధ్యక్షులు.

రాష్ట్ర యువజన మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షుడు వల్లభనేని వెంకట్రావు చౌదరిగారు, అధ్యక్షులు కె. ఎఫ్. నారిమన్‌గారు.

రాష్ట్ర మహిళాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షురాలు తుర్లపాటి రాజరాజేశ్వరమ్మగారు, అధ్యక్షురాలు డాక్టరు ముత్తు లక్ష్మిరెడ్డి గారు.

ఆంధ్ర స్థానిక స్వపరిపాలన సభకు ఆహ్వాన సంఘాధ్యక్షులు కల్దిండి గంగరాజుగారు, అధ్యక్షులు పి. సి. వెంకటపతి రాజుగారు,

ఆంధ్రమహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులు కట్టమంచి కోళందరెడ్డిగారు, అధ్యక్షులు కడప కోటిరెడ్డిగారు.

ఈ సభలు రానున్న స్వాతంత్ర్య సమరానికి ఎంతో ప్రోత్సాహం కలిగించాయి.

## ఉప్పు సత్యాగ్రహం

1930 మార్చి నెలలో గాంధీ 80 మంది అనుచరులతో ఉప్పుసత్యాగ్రహం చేయడానికి దండి గ్రామానికి నడిచి వెళుతుండగా దారిలో బోర్సాదువద్ద కొండా వెంకటప్పయ్య, కాళేశ్వరరావు, సాంబమూర్తి, దండు నారాయణరాజుగార్లు మహాత్ముని దర్శించి వచ్చారు.

మార్చి 31 న గుంటూరులో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సమావేశమై శాసనోల్లంఘనం జరుపుటకు తీర్మానించింది.

పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంఘం కాకుమాను లక్ష్మయ్య చౌదరిగారి ఆధిపత్యంలో శాసనోల్లంఘనం జరుపుటకూ, తూర్పు కృష్ణాజిల్లా సత్యాగ్రహులతో కలసి ఉప్పుసత్యాగ్రహం చేయుటకూ తీర్మానించబడింది.

రాజా కోటగిరి వెంకట కృష్ణారావుగారిని ప్రథమ సర్వసేనాధి పతిగ ఎన్నుకున్నారు, వారు ప్రజలను సత్యాగ్రహం చేయుటకు రావల్సిందిగా విజ్ఞప్తి

చేశారు. ఏప్రిల్ 2 న విజయవాడ ఆంధ్రరత్న భవనంలో సత్యాగ్రహ శిబిరానికి అయ్యదేవర కాళేశ్వర రావుగారు ప్రారంభోత్సవం చేశారు. ఏప్రిల్ 5 న పశ్చిమగోదావరి జిల్లా మహాసభకు అధ్యక్షత వహించి, మర్నాడు కాళేశ్వరరావుగారు బందరు చేరారు. పట్టాభి, ముట్నూరి కృష్ణారావు, కాళేశ్వర రావుగార్లు నిషేధించిన ఉప్పు తీసుకువచ్చి,బందరులో బహిరంగ సభ జరిపారు. ఉప్పు స్వరాజ్యం పొందుటకు దివ్య ఔషధం అని కాళేశ్వరరావుగారు ఆ సభలో ఉపన్యసించారు. ఆ సభలో వారందరికి ఉప్పు పంచటం జరిగింది.

ఏప్రిల్ నెలలో దాదాపు 300 మంది సత్యాగ్రహులు, ఆంధ్రరత్న భవనంలోని శిబిరంలో చేరారు. ఆ తర్వాత వారి సంఖ్య బాగా పెరిగింది. వారందరికి భోజన సదుపాయాలు బెజవాడ వర్తకులు చేశారు.ఈ సత్యాగ్రహానికిగాను రు.3500 యేర్నేని లక్ష్మీనారాయణగారు ఇచ్చారు.

రాజా కోటగిరి వెంకటకృష్ణారావుగారు జైలుకు వెళ్ళాక, డాక్టరు వెలిదండ్ల హనుమంతరావుగారు, వారు కూడా అరెస్టు అయ్యాక డాక్టరు శివలెంక మల్లిఖార్జునరావుగారూ సర్వసేనాధిపతులుగా వున్నారు.

కాకుమాను లక్ష్మయ్య చౌదరి, వేలూరి యజ్ఞనారాయణశాస్త్రి, నల్లూరి పాపయ్యగార్లు ఒకరి తర్వాత ఒకరు జైలుకు వెళ్ళేంత వరకూ నియంతలుగా పని చేశారు. కాట్రగడ్డ మధుసూదనరావుగారు జైలుకు వెళ్ళేంత వరకూ శిబిరాధిపతిగా వున్నారు. కాళేశ్వరరావుగారు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘ ప్రధాన కార్యదర్శిగా వున్నారు. మధుసూధనరావుగారు 1925 నుండి కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంఘ కార్యదర్శిగా ఉండేవారు.

## ఉప్పు సత్యాగ్రహ సంరంభం

ఏప్రిల్ 9 వతేదీ ఉదయాన సర్వసేనాధిపతి రాజా కోటగిరి వెంకట కృష్ణారావుగారి నాయకత్వాన 53 మంది శాంతి సైనికులు జాతీయ పతాకాలు పట్టుకుని వాయిద్యాలు మోగుతుండగా, మహిళలు మంగళ హారతులు ఇవ్వగా, జనసమూహం చూస్తుండగా ఆంధ్ర రత్న భవనం నుంచి బయలుదేరారు. టంగుటూరి ప్రకాశం, కొండా వెంకటప్పయ్య, అయ్యదేవర కాళేశ్వరరావుగార్లు వారిని ఆశీర్వదించారు.

శాంతి సైనికులు తిలక్‌పేట (గవర్నర్‌పేట) ప్రధాన వీధుల గుండా వెళుతూ, అక్కడక్కడ గృహిణులు యిచ్చే మంగళ హారతులూ, ప్రజలు వేసే పూలమాలలూ అందుకుంటూ కాలినడకన బందరు బయలుదేరారు. తోవలో మొగల్రాజపురం, పటమట, పటమటలంక, పోరంకి, ఈడుపుగల్లు, పునాదిపాడు, నెప్పల్లి, ఆకునూరు, ఉయ్యూరు, గ్రామాల్లో మకాములు చేశారు. దారిలో వీరు మరో 17 మంది కొత్త సత్యాగ్రహులను తమ దళంలో చేర్చుకున్నారు. విరాళాలు పోగుచేశారు. ఈడుప్పుగల్లులో మంకర రామచంద్రయ్య తమ కుమారుడు సత్యనారాయణ గారిని ఈ దళంలో వలంటీరుగా చేర్చి ఉప్పు సత్యాగ్రహానికి పంపారు.

1930 ఏప్రిల్ 11 వ తేదీ సాయంత్రం బందరు చేరారు. అక్కడ గంపలగూడెం కుమారరాజాగారు తూర్పు, పశ్చిమ కృష్ణాజిల్లాల సత్యాగ్రహులు కలిసిన మొత్తం దళానికి నాయకత్వం వహించారు. చిన్నాపురంలో మూడురోజులు ఉప్పును ఎక్కువగా సేకరించి ఏప్రిల్ 14 న తిరిగి బందరు వచ్చారు.

ఈ లోపున ఏప్రిల్ 9 న వేలూరి యజ్ఞనారాయణ శాస్త్రిగారూ, మరో 5 గురు సత్యాగ్రహులు బందరు చేరి, సముద్రతీరం నుంచి ఉప్పు తెచ్చి బహిరంగ సభలో అమ్మారు.

ఏప్రిల్ 13 న డాక్టరు వెలిదండ్ల హనుమంతరావుగారి నాయకత్వాన 34 గురు సత్యాగ్రహులు బెజవాడ ఆంధ్రరత్న భవనం నుంచి బయలుదేరి పోరంకి, పెనమలూరు, వేల్పూరు, ఉప్పులూరు, మంతెన, తెన్నేరు, మానికొండ, కాటూరు, కలువపాముల, జబర్ పూడి, మాటాడ గ్రామాలమీదుగా బందరు చేరారు.

ఏప్రిల్ 14న గంపలగూడెం కుమారరాజా, డాక్టరు వెలిదండ్ల హనుమంతరావు, డాక్టరు ఘంటసాల సీతారామశర్మగార్లు, కృష్ణాజిల్లా మేజిస్ట్రేట్‌కు తాము జరుపుతున్న సత్యాగ్రహం గురించి నోటీసు ఇచ్చారు.

ఏప్రిల్ 16 న కుమారరాజాగారు తమ దళంతో బెజవాడ వచ్చి, తాము బందరునుంచి తెచ్చిన ఉప్పును బహిరంగ సభలలో పంచిపెట్టారు. కొంత అమ్మారు, చాలామంది ఉప్పును కొన్నారు.

ఏప్రిల్ 18 న కుమారరాజాగారు తన దళాన్ని 6 చిన్న చిన్న దళాలుగా విభజించి గ్రామాలలో ఉప్పు అమ్మటకూ. సత్యాగ్రహం గురించి బోధించుటకూ పశ్చిమ కష్ణాజిల్లాకు పంపారు. వీరు 64 గ్రామాలు వెళ్ళి సత్యాగ్రహ ఉద్యమం గురించి ఉద్బోధించారు.

ఏప్రిల్ 11 న అయ్యదేవర కాళేశ్వరరావుగారు 6 గురు శాంతి సైనికులతో బయలుదేరి నందిగామ తాలూకా గ్రామాలలో బహిరంగ సభలు జరిపారు. చాలామంది కొత్తవారిని తమ దళంలో చేర్చుకున్నారు.

విజయవాడ వచ్చి ఏప్రిల్ 12 వ తేదీ సాయం కాలం జాతీయ పతాకాలతో అలంకరించిన ఒక ప్రత్యేక రైలుపెట్టెలో 80 మంది సత్యాగ్రహులు ఎక్కారు. రైలు బందరు బయలుదేరిపోతుంటే, బెజవాడ ప్లాట్‌ఫారంమీద ప్రజలు జయ జయ ధ్వానాలు చేశారు. ఆ రాత్రి వారు బందరు చేరి, హనుమంతరావుగారి దళాన్ని కలిశారు.

ఆ మర్నాడు ఉదయం స్వామి నారాయణానంద సరస్వతి(పింగళి లక్ష్మీనారాయణగారుసన్యాసాశ్రమం స్వీకరించాక పెట్టుకున్న పేరు)గారిని బెజవాడలో అరెస్టుచేసి బందరు సబ్‌జైలుకు తీసుకు వచ్చారు

ఏప్రిల్ 21 తేదీ ఉదయం హనుమంతరావు, కాశేశ్వరరావుగార్లు తమ దళాలతో సముద్రతీరానికి వెళ్ళి ఉప్పు సత్యాగ్రహం చేశారు. బందరు శిబిరానికి తిరిగి రాగానే. కాశేశ్వరరావుగారిని అరెస్టుచేసి, ఒక సంవత్సరం శిక్ష విధించి రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపారు. ఆ మర్నాడు నారాయణానంద స్వామిగారికి ఒక సంవత్సరం శిక్ష విధించి, రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపారు.

డాక్టరు వెలిదండ్ల హనుమంతరావుగారు బెజవాడ వచ్చి సత్యాగ్రహ ఉద్యమాన్ని నడుపుతున్నారు. ఏప్రిల్ 30 న గంపలగూడెం కుమారరాజా, కాకుమాను లక్ష్మయ్య చౌదరిగార్లని అరెస్టుచేసి చెరొక సంవత్సరం శిక్ష విధించి రాజమండ్రి పంపారు. వెంటనే వెలిదండ్ల హనుమంతరావుగారి నాయకత్వాన విజయవాడలో కల్లు, సారాకొట్ల పికెటింగ్ ప్రారంభించారు.

పోలీసులను తమ ఉద్యోగాలు వదులుకొమ్మని ఉపన్యసించినందుకూ, అలాంటి విషయాలే సైక్లో స్టయిల్‌చేసి పంచిపెట్టినందుకూ కొందరు సత్యాగ్రహులను ప్రభుత్వం శిక్షించింది.

1930 జూన్ 21 న ఆంధ్రరత్న భవనాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. శిబిరంలోని సత్యాగ్రహులను కొట్టి, వెడలగొట్టింది.

సభలు చేయకూడదని 144 సెక్షన్ ప్రయోగించారు. కాంగ్రెస్ సంఘాలు అక్రమ సంఘాలని ప్రకటించారు. 144 సెక్షన్ ఉల్లంఘించినందుకు, క్రిమినల్‌లా అమెండ్‌మెంట్ చట్టంక్రింద కొందరు సత్యాగ్రహులను అరెస్టుచేసి శిక్షించారు.

నిసిద్ధవాఙ్మయం చదివినందుకూ, పంచిపెట్టినందుకూ, "సత్యాగ్రహ సమాచార్" అనే అనుమతి లేని వారపత్రికను సైక్లోస్టయిల్‌చేసి ప్రచురించినందుకూ, తాటిచెట్ల గెలలు నరికినందుకూ చాలా మంది సత్యాగ్రహులు శిక్షించబడ్డారు. క్రమంగా శిక్షల పరిమితి రెండున్నర సంవత్సరాలదాకా పెరిగింది.

ఇక్కడ చిట్టిగారి నాయకత్వాన విజయవాడలో సత్యాగ్రహం చేసినందుకు చిట్టిగారిని వారితోపాటు కొంతమందిని శిక్షించారు. చాల ఆందోళన జరిగింది.

సత్యాగ్రహం చేసినవారినందరినీ అరెస్టుచేయక ముఖ్యులను మాత్రమే అరెస్టు చేయటం మొదలు పెట్టారు. విదేశవస్తు దుకాణాలు, కల్లు, సారా దుకాణాలవద్ద పికెటింగు చేసినందుకు కార్మిక నాయకుడు మరుపిళ్ళ చిట్టి అనే చిన్న అప్పలస్వామిగారిని, వారి బృందాన్ని అరెస్టుచేసి శిక్షించారు.

పికెటింగ్ చేసిన సత్యాగ్రహులను కొన్నిసార్లు లాఠీఛార్జీ చేశారు కాట్రగడ్డ మధుసూదనరావుగారిని పోలీసులు కొట్టారు. ఒక పుట్టుగుడ్డి భువనకడియం నాగభూషణంగారికి 17–6–1930 వ తేదీన 2 ఏళ్ళ కఠినశిక్ష విధించారు.

ప్రెస్సు ఆర్డినెన్సుక్రింద బెజవాడలోని రెండు ప్రెస్‌లనుండి వెయ్యి రూపాయల చొప్పున ధరావతులను పుచ్చుకొన్నారు.

దిగవల్లి శివరావు, చెరుకుపల్లి వెంకటప్పయ్య గార్ల యాజమాన్యంలో నెలకొల్పబడిన ఒక ప్రచురణ

శాఖ ప్రజలలో మంచి ప్రబోధం కావించింది. "సత్యాగ్రహచరిత్ర" ప్రతులు 400, ప్రకాశకులు ఉచితంగా పంచిపెట్టారు. 1. నిర్భాగ్య భారతము. 2. ఆంధ్రపౌరుషము (జాతీయ గేయాలు). 3. ఉప్పు సత్యాగ్రహము. 4. నిర్మాణ కార్యక్రమము. 5. బార్డోలీ సత్యాగ్రహ విజయము. 6. నిర్మాణ కార్యక్రమము (గీతములు). 7. పాంచజన్యము (గీతములు). 8. దరిద్రనారాయణము. 9. విదేశీ వస్త్ర బహిష్కారము. 10. సత్యాగ్రహ బోధిని. 11. బ్రిటిష్ వస్తు బహిష్కారం. 12. త్రాగుడు మానుడు.

ఈ 12 కరపత్రాలు పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ పక్షాన ప్రచురించి పంచిపెట్టారు. వీటిలో కొన్నింటిని ప్రభుత్వం నిషేధించింది. వీటివల్ల రైతులు, వర్తకులు, కార్మికులలో బాగా ప్రబోధం కలిగింది. జైళ్ళకు వెళ్ళినవారిలో రైతు యువకులే ఎక్కువ మంది వున్నారు. కార్మికులలో చాలామంది త్రాగుడు మానివేశారు. విదేశవస్త్ర దుకాణదార్లు, ఇకముందు విదేశవస్త్రాలు తెప్పించబోమని ఖరార్నామాలు రాసి ఇచ్చారు. వర్తకులు తమంతట తాము నాయకులు అరెస్టుకాగానే హర్తాళ్ జరిపారు.

బెజవాడ మున్సిపల్ ఆఫీసుమీద జాతీయ పతాకం ఎగురవేయబడింది. దాన్ని పోలీసులు తీసివేశారు.

చివరికి గాంధీ — ఇర్విన్ ఒడంబడిక జరగటంతో అప్పటికి జైళ్ళలోవున్న సత్యాగ్రహు లందరినీ విడుదల చేశారు. వారిలో మహిళలు పాదర్తి సుందరమ్మ, పెరుంబుదూరి సుభద్రమ్మగార్లు వున్నారు.

1931 మార్చి 5 న గాంధీ — ఇర్విన్ ఒడంబడిక జరిగాక, మార్చి 13 న పశ్చిమ కృష్ణాజిల్లా సత్యాగ్రహులు అందరినీ విడుదల చేశారు.

బెజవాడ ఆంధ్రరత్న భవనాన్ని పోలీసులు 9—3—31 న కాంగ్రెస్ వారికి అప్పగించారు. 17 వ తేదీన టంగుటూరి ప్రకాశంగారు ఆంధ్రరత్న భవనంపై మళ్ళీ జాతీయ పతాకం ఎగురవేశారు.

విజయవాడ విదేశవస్త్ర దుకాణాలవద్ద, వెలిదండ్ల హనుమంతరావుగారు మరి కొందరు మహిళలను, యువకులను వెంటబెట్టుకొని ఏప్రిల్, మే నెలల్లో ప్రతిరోజూ పికెటింగ్ జరిపారు. విదేశవస్త్రాల అమ్మకం చాలావరకు పడిపోయింది.

వెలిదండ్ల హనుమంతరావుగారికి జైలు జీవితం వల్ల క్షయ, ఉబ్బసం పట్టుకున్నాయి. అయినా వాటిని లెక్కచెయ్యక పికెటింగు నడిపేవారు. వేసవిలో జబ్బు ఎక్కువై చికిత్సకోసం మైసూరు వెళ్ళి, అక్కడే వారు చనిపోయారు. దేశ స్వాతంత్ర్యంకోసం ప్రాణాలు అర్పించిన ఈ ధీరుని పేరిట, బెజవాడలో ఒక పార్కు, ఒక గ్రంథాలయం నెలకొల్పబడ్డాయి.

రీసెటిల్‌మెంట్‌కు వ్యతిరేకంగా రైతుఉద్యమం ప్రారంభమైంది. పశ్చిమ కృష్ణాజిల్లాలో కాట్రగడ్డ మధుసూదనరావుగారు రైతుసంఘ కార్యదర్శిగా పని చేశారు. సభ్యులుగా 6 వేల మంది చేరారు. న్యాపతి సుబ్బారావు పంతులుగారు వంటి పెద్దలు ఈ విషయమై బెజవాడలో మద్రాసు గవర్నరును దర్శించినా ఫలితం లేకపోయింది. ఈ రీసెటిల్‌మెంట్ ఆందోళన, అప్పుడు ఇంగ్లాండులోవున్న గాంధీ దృష్టికి తెచ్చారు. వారు ఇండియా సెక్రటరీకి తెలిపినా ప్రయోజనం కలగలేదు.

రైతుల ఆందోళనలో తీవ్ర ప్రచారం చేసిన ఆచార్య రంగాగారిని బెజవాడలో 1931 నవంబరులో అరెస్టు చేసి, ఒక సంవత్సరం ఖైదు విధించారు.

రాష్ట్ర కాంగ్రెస్ సంఘ కార్యదర్శి కాశేశ్వరరావు గారిని అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షులు వల్లభాయి పటేలుగారు బొంబాయికి పిలిపించి, ఈ విషయమై సంప్రదించారు. ఆ సమయంలోనే జవహర్‌లాల్ నెహ్రూ నెల్లూరు జిల్లాలో తీవ్రంగా జరుగుతున్న జమిందారు రైతుల ఆందోళన గురించి ఆంధ్ర కార్యదర్శితో మాట్లాడారు. పన్నుల నిరాకరణే శరణ్యమని ఇద్దరూ సలహా ఇచ్చారు.

డిసెంబరులో యాడుపుగల్లులో ఒక శిబిరం భారతీ రంగాగారిచే తెరువబడింది. మూల్పూరు చుక్కమ్మ గారు అధ్యక్షత వహించగా, బెజవాడ గోపాలరెడ్డి గారు జాతీయ పతాకం ఎగురవేశారు.

గాంధీ, రౌండ్ టేబిల్ సభ అనంతరం బొంబాయికి తిరిగి వచ్చారు. వారితో రీ సెటిల్‌మెంట్ గురించి సంప్రదించుటకు కాశేశ్వరరావు, దండు నారాయణరాజు గార్లను రాష్ట్ర సంఘం పంపింది.

స్వామి నారాయణానందగారు జైలునుంచి విడుద లయ్యాక, విజయవాడ నుంచి సికింద్రాబాద్ వెళ్ళారు. అక్కడ కాంగ్రెస్ సభ్యులను విరివిగా చేర్చారు. కల్లు, సారా దుకాణాల పికెటింగు చేశారు. అప్పుడు అక్కడి బ్రిటిష్ రెసిడెంట్ 40 మంది వలంటీర్లను అరెస్టు చేయించడమే కాక, స్వాములవారిని 24 గంటలలో సికింద్రాబాద్ విడిచిపొమ్మని ఉత్తరు జారీ చేశాడు. నైజాంలోకి రాకూడదని మరో ఉ ర్వును నైజాం ప్రభుత్వం జారీ చేసింది. అప్పు స్వాములవారు కర్నూలు వెళ్ళి, ఆ జిల్లా కాంగ్రెస్ ఉద్యమానికి నాయకత్వం వహించి, దీక్షగా పని చేస్తుండగా గాంధీ-ఇర్విన్ ఒడంబడిక రోజులలోనే బ్రిటిష్ ప్రభుత్వం వీరిని జైలుకు పంపింది.

1932 జనవరి మొదటి వారంలో గుంటూరులో కొండా వెంకటప్పయ్యగారింట ఆంధ్ర కాంగ్రెసు కార్యవర్గ సమావేశము జరిగింది. ఆ రాత్రి వెంకటప్పయ్యగారిల్లు చుట్టుముట్టి కొండా వెంక టప్పయ్యగారిని, ప్రకాశంపంతులుగారిని అరెస్టు చేసి తీసుకువెళ్ళారు. మరునాడు విజయవాడలో కాశీశ్వర రావు, కాట్రగడ్డ మధుసూదనరావుగారిళ్లు సోదా చేశారు. వారికేమీ దొరకలేదు.

అఖిల భారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ 1932 జనవరి 1 న మరల సత్యాగ్రహం ప్రారంభించాలని నిశ్చయించింది. 5 వ తేదీన బెజవాడలో 144 సెక్షన్ ప్రయోగించబడింది. 6 వ తేదీన కేశిరెడ్డి సూర్య నారాయణ, గెల్లి రాజగోపాలం గారు నిషేధాజ్ఞలను ఉల్లంఘించి బహిరంగసభ జరిపారు. వీరిద్దరినీ పోలీ సులు కొట్టి వెళ్ళగొట్టారు. 7 వ తేదీన కాశీశ్వర రావు, కాకుమాను లక్ష్మయ్య, కాట్రగడ్డ మధు సూదనరావుగార్లూ, 8 వ తేదీన నూకల వీరరాఘ వయ్యగారూ అరెస్టు చేయబడ్డారు 9 వ తేదీ ఉద యం ఈ నలుగురికీ తలా ఒక సంవత్సరం శిక్షవేసి రాజమండ్రి జైలుకు పంపారు.

ఆ తర్వాత సత్యాగ్రహ సమరం అనేక రూపా లుగా పశ్చిమ కృష్ణాజిల్లాలో జరిగింది. జనవరి నెలా రంభంలోనే జిల్లా అన్ని చోట్లా 144 సెక్షన్ కింద నిషేధపుటుత్తర్వులు జారీచేసి, ముఖ్యులలో చాలా మందిని బంధించారు కాంగ్రెస్ ఉద్యమంలో చేర రాదని ప్రతి పట్టణంలోనూ, ప్రతి పల్లెలోనూ రిజర్వు పోలీసులను వీధులలో తిప్పారు. జాతీయ జండాలు లాగివేశారు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘం అక్రమ సంఘంగా ప్రకటించారు. ఆంధ్ర రత్న భవనాన్ని వశపరుచుకున్నారు. ఈడుపుగల్లు సేవాశ్రమాన్ని కూడా వశపర్చుకున్నారు. పశ్చిమ కృష్ణాజిల్లా జాతీయోపసంఘాన్ని అక్రమ సంఘంగా ప్రకటించారు. బహిరంగసభలు, సమావేశాలు నిషే ధించారు ఉద్యమ సంబంధమైన విషయాలను ప్రచు రించరాదని పత్రికావిలేకరులను ఆదేశించారు. ప్రింటిగ్ ప్రెస్‌లకు ఆజ్ఞా పత్రాలు పంపారు.

బెజవాడలోను, చుట్టుపట్ల గ్రామాలలోను చాలా ఇళ్ళను, ప్రెస్‌లను సోదా చేశారు. ఉద్యమంలో చేరిన కొందరికి దీర్ఘమైన కఠినశిక్షలు విధించి, వేయి రూపాయల అధిక జరిమానాలు విధించి ప్రజల్లో భయోత్పాతం కలిగించారు. ఇంటూరి వెంకటేశ్వర రావుగారికి రెండున్నర సంవత్సరాల శిక్ష, పైగా రు. 300 ల జరిమానా కింద రెండున్నర నెలల శిక్ష విధించారు కాని ప్రభుత్వం అవలంబించిన ముఖ్య సాధనం కఠినమైన లాఠీ ప్రయోగం

1932 ఉద్యమంలో కూడా కొందరు ఉప్పు సత్యా గ్రహం చేశారు. మార్చి 24 న ఆరుగురు దేశ సేవి కలు ఎలుకపాడులో ఉప్పు సత్యాగ్రహం చేసేందుకు బయలుదేరి, కొన్ని గ్రామాలు కాలినడకను పోయి ప్రచారం చేశారు. వారిని పోలీసులు నిర్బంధించారు. చివరికి మార్చి 28 న కొందరు ఎలుకపాడులో ఉప్పు చేసి పంచిపెట్టగా కొంత డబ్బు సమకూడింది.

## ఉత్సవాలు

కాంగ్రెస్ ఆదేశానుసారంగా జరిగిన ఉత్సవాలలో పాల్గొన్న శాంతి సైనికులు తీవ్రమైన లాఠీ ప్రయోగా లకు గురైనా వెనుకాడలేదు. స్వాతంత్ర్యదినోత్సవం మహాత్ముని అరెస్టు దినాలు, జలియన్‌వాలాబాగ్ స్మారకదినోత్సవం, ఆఖరి ఆదివారాల్లో పతాక వంద నోత్సవాలు పలుచోట్ల జరిపారు జలియన్‌వాలాబాగ్ దినమున 20 మంది వలంటీర్లు తీవ్ర గాయాలకు గుర య్యారు. తక్కిన ఉత్సవాలలో అర్ధదు దెబ్బలు తిన్నారు.

సత్యాగ్రహ సమరం ఆరంభించినది మొదలు శాంతి సైనికులు, దేశసేవికలు తాలూకాలో ప్రచారం

చేశారు. కాంగ్రెస్ బులిటిన్‌లు, అచ్చు పుస్తకాలు పంచిపెట్టారు. ఈ సందర్భంలో ప్రభుత్వం కొన్ని పుస్తకాలు నిషేధించింది. గోడలమీద సిరాతో "విదేశ వస్త్రాలను బహిష్కరించుడు" అనే వాక్యాలు రాయబడ్డాయి. మార్చిలో "రెడీ" అనే క్లోస్తయిల్ పత్రిక ప్రారంభించి ప్రతిరోజూ కాంగ్రె వార్తలను ప్రచురించారు. దీనివల్ల చాలా ప్రచారం జరిగింది.

రాష్ట్రీయ కార్యక్రమం ప్రకారం ఆగస్టు 18 న ముగ్గురు శాంతి సైనికులు, సెప్టెంబరు 1 న ఏడుగురు శాంతి సైనికులు బెజవాడ—ఏలూరు మధ్య గొలుసు లాగి కలకత్తా మెయిలు ఆపి, బండిలోని ప్రయాణీకులకు కరపత్రాలు పంచిపెట్టారు.

జూలై 31 న 60 మంది శాంతి సైనికులు హాబిబుల్లాగారి నాయకత్వాన ఆంధ్రరత్న భవనం వశపరచుకొనబోగా 17 మంది తీవ్రమైన లాఠీఛార్జికి గురై జైలుకు పంపబడ్డారు. ఆగస్టు 25 న ఆర్గురు శాంతి సైనికులు భవనాన్ని స్వాధీనపరుచుకొనబోగా కొట్టి అరెస్టు చేశారు.

సెప్టెంబరు 5 న మూడోసారి 9 మంది భవనంపై దాడిచేశారు. వారిని కొట్టకుండా అరెస్టు చేసి, కొంతసేపు వుంచి వదలిపెట్టారు. ఎందుకంటే, ఆ రోజున బ్రిటన్‌కు చెందిన ఇండియా లీగ్ డెలిగేషన్‌వారు దేశమంతటా పర్యటిస్తూ, బెజవాడలో మకాం చేసి వున్నారు.

నవంబరు 14 న నాలుగోసారి 8 మంది శాంతి సైనికులు భవనంపై దాడి జరపగా లాఠీఛార్జీ చేసి చెదరగొట్టారు.

1932 సత్యాగ్రహం ఎదుర్కొనేందుకు ప్రభుత్వం తన పద్ధతులు మార్చింది. పోలీసులు అరెస్టులు మాని తీవ్రమైన లాఠీ చేయటం, స్త్రీ సత్యాగ్రహులపై మురికినీరు కొట్టడం, వారిని తీసుకుపోయి దూర ప్రదేశాల్లో విడిచిపెట్టడం, దీర్ఘశిక్షలు అధిక జుల్మానాలు వేయడం. సత్యాగ్రహులకు శరణ్యమిచ్చినా, భోజనం పెట్టినా, ఫలహారాలు పెట్టినా శిక్షించడం – ఇవన్నీ ప్రజలను భయపెట్టుటకు ప్రభుత్వం అవలంబించిన పద్ధతులు.

కాట్రగడ్డ మధుసూదనరావుగారి తల్లి రామసీతమ్మగారు సత్యాగ్రహులకు ఫలహారాలు పెట్టినందుకు, ఆమెకు ఒక సంవత్సరం కఠినశిక్ష రు. 400 జరిమానా విధించబడింది.

ఈ 1932 సత్యాగ్రహంలో 26 గురు స్త్రీలు ఎక్కువ ధైర్యసాహసాలతో పని చేశారు. ఈ వీరాంగనలు పొందిన కష్టాలు చేసిన త్యాగాలు, పురుషులు త్యాగం చేయడానికి పురికొల్పాయి.

మార్చి 1 వ తేదీ నుంచి విజయవాడలో విదేశ వస్త్రదుకాణాల పికెటింగు ప్రారంభమై అక్టోబరు 2 వరకూ జరిగింది. తుమ్మల సీత వతమ్మ, ఎక్కల పునమ్మ, కోగంటి లక్ష్మమ్మగార్లు పోలీసులు పెట్టిన నిర్బంధాలను శాంతంగా సహి పికెటింగ్ కొనసాగించారు.

మార్చి 13 న పాలడుగు వరలక్ష్మమ్మ, కోగంటి లక్ష్మమ్మగార్లు పికెటింగ్ ప్రారంభించగా, వారిని పోలీసులు దూర ప్రదేశాలకు తీసుకుపోయి వదలిపెట్టారు.

జెలియన్‌వాలాబాగ్ దినమున ఏప్రిల్ 13 న కొపర లక్ష్మీ కాంతమ్మ, సూరపనేని అన్నపూర్ణమ, దుర్గ రత్నమ్మ, మైనేని రాజేశ్వరమ్మ, నాదెండ్ల నాంచారమ్మ, వీరమాచనేని చిట్టెమ్మ, అన్నే దుర్గాంబగార్లు జాతీయ పతాకాలతో, జాతీయ గీతాలు పాడుతూ బెజవాడ వీధులలో ఊరేగుతుండగా పోలీసులు నిర్బంధించి రాత్రిదాకా కృష్ణానది ఒడ్డున వుంచి విడిచిపెట్టారు.

విజయవాడలో శివాలయపు బృందం అనే యువకుల జట్టు అతి పట్టుదలగా పికెటింగ్ సాగించారు. గ్రామాలనుంచి అధిక సంఖ్యలో విజయవాడ వచ్చి ఈ పికెటింగ్‌లో పాల్గొని అనేక కష్టాలకు లోనయ్యారు. ఈ యువకులలో చాలామంది తీవ్రమైన లాఠీ దెబ్బలు తిని కూడా మరల మరల పికెటింగు చేసి దెబ్బలు తిన్నారు. విజయవాడలో లాఠీ ఛార్జీలు 250 సార్లు జరిగాయని అంచనా.

విజయవాడలోను, చుట్టుపట్ల పల్లెలలోను 1932లో పికెటింగ్ చేసిన వారిని అశాస్త్రీయంగా, అతితీవ్రంగా లాఠీలతో కొట్టారని, మద్రాసు శాసనసభలో మితవాద సభ్యులు ప్రశ్నలు వేశారు. వాటిపై బహిరంగ విచారణ జరిపించవలసినదిగా ప్రభుత్వాన్ని కోరారు. కాని ప్రభుత్వం విచారణ జరిపించకపోగా, పోలీసులు తమ ధర్మం నెరవేర్చారని జవాబు చెప్పి వూరుకుంది.

ఇండియా లీగ్ డెలిగేషన్ వారు భారతదేశం వచ్చి సెప్టెంబరు 8 న విజయవాడ వచ్చారు. సత్యాగ్రహ ఉద్యమ పరిస్థితులను విచారించి వెళ్ళారు. లాఠీఛార్జీలలో అక్రమాలు జరుగుతున్నాయనీ. అతితీవ్రంగా వున్నాయనీ వారికి కొందరు బెజవాడపౌరులు విన్నవం సమర్పించారు.

కాకుమాను లక్ష్మయ్యగారు, జైలుకు వెళ్ళాక వేదాంతం శంభుశాస్త్రిలుగారు జిల్లా నియంతలుగా పనిచేశారు. శంభుశాస్త్రిలుగారిని అరెస్టుచేయక, అతితీవ్రంగా ఆయనపై లాఠీ ఛార్జీ చేశారు. ఆ తర్వాత కాకాని వెంకటరత్నం, తుమ్మల కోటయ్యగార్లు ఒకరు జైలుకు పోతే మరొకరు నియంతలుగా వున్నారు. ఇలా ఒకరి తరువాత ఒకరు పదముగ్గురు నియంతలుగా పని చేశారు. అన్నే అంజయ్య, వేదాంతం శంభుశాస్త్రిలు, కృత్తివెంటి కుటుంబరావు, కేశిరెడ్డి సూర్యనారాయణగార్లు పికెటింగ్ నడిపారు.

లాఠీ దెబ్బలు తగిలిన ఇతర గ్రామాల వారిని, బెజవాడలోనివారు, తమ ఇండ్లకు ప్రభుత్వ ఆంక్ష వల్ల రానీయలేదు. ఇక వారికి వేరే శరణ్యం లేక రామమోహన లైబ్రరీ వరండాలో కొంతకాలం చికిత్స కోసం పడివున్నారు. ఆ తర్వాత ఆ లైబ్రరీ కార్యదర్శి, గాయపడిన వలింటీర్లను లోపలకు రానిస్తే ముప్పు వాటిల్లుతుందని, వారిని రాకుండా అటకాయింప చేశారు. అపుడు డాక్టరు శివలెంక మల్లికార్జునరావు, గాదిరాజు వెంకటేశ్వరరావు, శంకర వెంకట్రామయ్యగార్లు పీపుల్సు హాస్పిటల్ (ప్రజల ఆసుపత్రి) ఒకదాన్ని స్థాపించి, లాఠీ దెబ్బలు ఎక్కువగా తగిలిన వారికి చికిత్స చేస్తూ వచ్చారు. ఈ హాస్పిటల్‌కు గవర్నరుపేటలోని తన భవనాన్ని కాట్రగడ్డ రఘురామయ్యగారు ఇచ్చి ధన సహాయం చేశారు. ఆ సమయంలోనే గాదిరాజు వెంకటేశ్వరరావుగారి మీద ప్రభుత్వం కేసుపెట్టి 6 మాసాలు శిక్ష విధించింది.

సుంకర వెంకట సుబ్బారావుగారు ఆంధ్ర రత్న భవనంపై దాడిలో పాల్గొని, తీవ్రమైన లాఠీదెబ్బలకు గురయ్యారు. ఆ సందర్భంలో విధించిన సంవత్సరం ఆరు మాసాలు శిక్ష అనుభవిస్తుండగా, ఆయనకు జైలులో క్షయవ్యాధి సంక్రమించింది. విడుదలయ్యాక ఆయన పేదరికంలో, క్షయ వ్యాధితో తీసుకుంటూ ఆంధ్రరత్న భవనంలోనే తన దేశం కోసం అమరుడయ్యాడు.

## హరిజనోద్యమం

1932 సెప్టెంబరు 18 న గాంధీమహాత్ముని ఉపవాస సందర్భంలో హర్తాళ్ జరిగింది. ఆనాడు మొదలు హరిజనోద్యమం, మహాత్ముని ఉపవాసం గురించి ప్రచారం జరిగింది. మహాత్ముని జన్మ దినోత్సవం సందర్భంలో లాఠీ ఛార్జీ చేయగా 6 గురికి గాయాలు తగిలాయి.

ఆది ఆంధ్ర మహాసభను జిల్లా కాంగ్రెస్ నిర్వహించింది. 10 వేల మంది సభకు వచ్చారు. ముంజీ నారిమన్ సభలో ఉపన్యసించారు.

ఈ సభ 1929 వ సం॥లో ఆంధ్ర మహాసభలతో పాటు జరిగింది. చాలా బాగా జరిగింది. కృష్ణా పత్రిక ఎడిటోరియల్ వ్రాసింది.

1933 ఆగస్టులో కృష్ణా పుష్కర సందర్భాన కాట్రగ మధుసూదనరావు, డాక్టరు ఘంటసాల సీతారామశర , కాకుమాను లక్ష్మయ్య, నూకల వీరరాఘవయ్య, ధుకూరి చంద్రశేఖరరావు పీసపాటి సుబ్బారావు, బాలచంద్ర ఆప్టే మొదలగువారు ఖాదీ, చేతి పరిశ్రమలు ప్రదర్శన ఏర్పాటుచేసి మహా వైభవంగాజరిపారు. పెద్దఎత్తున ఖద్దరుఅమ్మకం జరిగింది. ఈ ప్రదర్శనకు వలంటీరుగా సుంకర వీరభద్రరావు, చలసాని గంగయ్య, చలసాని రాజగోపాలరావు, కంభంపాటి వెంకటరత్నం, వెల్లంకి నరసింహారావు మొదలైనవారు పని చేశారు.

బెజవాడలో ఆంధ్ర రాష్ట్ర హిందీ మహాసభ తరపున హిందీ మహా విద్యాలయం స్థాపించబడి హిందీ ప్రచారం బాగా జరిగింది. విజయవాడలో కృష్ణాజిల్లా హిందీ ప్రచార మండలి స్థాపించబడింది. తర్వాతదీనికి అనుబంధంగా ఆంధ్రరాష్ట్ర హిందీ మహా విద్యాలయం కూడా బెజవాడలోనే నెలకొల్పబడింది.

పశ్చిమ కృష్ణాజిల్లా హరిజన సేవా సంఘం వారు, కూడా బెజవాడలో హరిజన బాలురకు వసతి గృహం నడుపుతున్నారు.

హరిజన పాఠశాల నడుపుటేగాక, హరిజన విద్యార్థులకు వసతి గృహం కూడా ఏర్పాటుచేశారు.

1933 డిసెంబరులో మహాత్ముడు పశ్చిమ కృష్ణాజిల్లాకు విచ్చేసి, ముఖ్యమైన గ్రామాలు పర్యటించడంతో ప్రజలలో అమితోత్సాహం వెల్లి విరిసింది.

1934 జూన్‌లో ప్రభుత్వం కాంగ్రెస్ సంఘాలని అక్రమ సంఘాలని ప్రకటించిన నిషేధపు ఉత్తర్వును ఉపసంహరించుకుంది. జూన్ 15 న విజయవాడలోని ఆంధ్రరత్న భవనాన్ని, రాష్ట్ర కాంగ్రెస్ సంఘ ప్రధాన కార్యదర్శికి వప్పగించారు.

కృష్ణా గోదావరి జిల్లాల అభ్య గా కేంద్ర అసెంబ్లీకి, రాష్ట్ర కాంగ్రెస్ సంఘ క్షులు నాగేశ్వరరావు పంతులుగారిని నిలబెట్టారు. రిని సనాతనధర్మ పక్షం వారు, హరిజన సమస్యపై ఎదిరించారు. నవంబరులో జరిగిన ఎన్నికలలో నాగేశ్వరరావు పంతులుగారికి 32 వేల వో , సనాతన పక్షం అ వేమూరి సుబ్రహ్మణ శాస్త్రిగారికి 12 వందలవా రాగా,ఆయన ధరావ కోల్పోయారు.పంతులుగా వచ్చినన్నివోట్లు భారతదేశంలో మరేఅభ్యర్థికిరాలేదు. డిసెంబరు 2న ఆంధ్రదేశంనుంచిఎన్నుకోబడిన కేంద్ర అసెంబ్లీ కాంగ్రెస్ సభ్యుల గౌరవార్థం విజయవాడలో గొప్ప ఉత్సవం, మహాసభ ఉత్సాహవంతంగా జరిగాయి.

## సత్యాగ్రహ ఉద్యమాల సమయంలో బెజవాడలో జరిగిన కొన్ని విశిష్ట సంఘటనలు

బెజవాడలో ఆంధ్రరత్న భవనాన్ని 21-6-30 న ప్రభుత్వం స్వాధీన పరచుకొంది. అక్కడ సత్యాగ్రహ శిబిరం నిర్వహించుతున్నారనే కారణంతో ప్రభుత్వం ఈ పని చేసింది. అంతకు ముందు కొన్ని రోజుల క్రితం శిబిరాన్ని స్వాధీన పరచు కోడానికి పోలీసులు వచ్చినపుడు, ద్వారం వద్ద పుట్టు గుడ్డి భువన కడియం నాగభూషణం ఉన్నాడు. ఆయన చేతిలో జండా కర్ర ఉండేది. శిబిరంలోని వాళ్ళ కంఠ ధ్వనిని బట్టి ఆయనలోనికి, వారిని అనుమతించేవాడు. పోలీసులు వచ్చినపుడు వాళ్ళకు ఆయన అడ్డు తగిలాడు. ఆయనకి 17-6-30 న రెండేళ్ళ శిక్ష విధించబడింది.

కాంగ్రెస్ శిబిరం పోలీసుల చేతుల్లో ఉన్నా అప్పుడప్పుడు కాంగ్రెస్ వలంటీర్లు తిరిగి స్వాధీనం చేసుకొనేవారు. పోలీసులు అదనపు బలగంతో వచ్చి తిరిగి స్వాధీన పరచుకొనేవారు. అలా చేతులు మారుతుండేది.

## డిక్టేటర్ల కాలంలో

సత్యాగ్రహ ఉద్యమ నిర్వహణకు ఒక్కొక్క డిక్టేటర్‌ను నియమించేవారు ఆయన్ని అరెస్టు చేస్తే మహో డిక్టేటర్ ముందుకు వచ్చేవాడు. అలాంటి రోజుల్లో ఒక రోజున సూర్యనారాయణ, సుంకర సుబ్బారావులు కాంగ్రెస్ జండాలతో నినాదాలు చేశారు.

## జండాలు

కాంగ్రెస్ ఆఫీసు పోలీసుల స్వాధీనంలో వుంది. ఐనా ఆఫీసు వెనక వైపునుంచి రహస్యంగా పైకి ప్రాకి జండా ఎగురవేశారు. అలాగే సబ్ కో లో కూడా కట్టారు ఉదయం పదిగంటలదాకా కాం .స్ జండాలు ఎగురుతున్నట్లు పోలీసులు గమనించ దు. తర్వాత వాటిని పోలీసులు తొలగించారు. ఈ కార్యక్రమంలో సుంకర వీరభద్రరావు వగైరాలు పాల్గొన్నారు.

కనకదుర్గ కొండమీద నుంచి కన్యకాంమ్మవారి సత్రం వరకు తీగెలపై రింగులతో జెండాలను కట్టి వదిలేవారు. అవి కొంత దూరం వచ్చి తీగెల మధ్యలో ఆగిపోయి వుండేవి. పోలీసులకు ఇది కంటకంగా ఉండేది. తుపాకులతో జండాలను కాల్చేవారు. దానివల్ల ఆ జండాలకు తూట్లు పడడం మినహా అవి అలాగే ఉండిపోయేవి. చివరికి రింగులకు గుడ్డలు కట్టి వాటిని కిరసనాయిల్‌తో తడిపి తగలు బెట్టేవారు. అవి కాలుకుంటూ జండాల వద్దకు వచ్చి అవి కూడా తగలబడేవి. వలంటీర్లు దీనికి పై ఎత్తు వేశారు. కర్రముక్కలతో తిక్కాడి లాగాకట్టి వాటికి జండాలు కట్టి తీగెలపై వదిలేవారు. పోలీసులు తగలబడే కిరసనాయలు గుడ్డలు పంపినా అవి కర్రలకు తగిలి రాలిపోయేవి. జండాలు చెక్కు చెదరకుండా నిల్చేవి. కొన్ని కృష్ణానది మధ్య వరకు తీగెల మీదనే వెళ్ళేవి. అక్కడ ఆగిపోయేవి.

## కరపత్రాలు

ఇలా రోజు ఏదో ఘటనజరిగేది. 1932 లో, కరపత్రాలు అంటించుతూ ఉండగా పోలీసుల కంట పడితే అరెస్టు అందుచేత 1932 ఉద మంలో సుంకర వీరభద్రరావు మరి కొందరు వలంటీ కొత్త ఎత్తులు వేశారు. ఒకాయన ముందు మై పిండి గల్పిన చెంబుతో ముందుకు వెళ్ళేవాడు బహిర్భూమికి వెళ్ళి వస్తున్నాడని చూసిన వాళ్ళు అనుకొనేవారు. పోతూ పోతూ ఎవడూ చూడకుండా ఆయన మైదా పిండిని స్తంభాలపైన, గోడలపైన, తలుపుల పైన రాసిపోయేవాడు. ఆయన వెనకాల కాస్త దూరంగా వచ్చే రెండో ఆయన కరపత్రాలను వాటికి అంటించేవారు

## అమరవీరుడు సుంకర వెంకట సుబ్బారావు

ఈడుపుగల్లు వాస్తవ్యులు సుంకర కోటయ్యగారి కుమారుడు వెంకట సుబ్బారావు, బందరు నోబుల్ కాలేజీలో విద్యార్థిగా వుండేవారు.మంచి క్రీడాకారుడు. విద్యార్థి దశలోనే సత్యాగ్రహ ఉద్యమంలోకి ఉరికాడు. బందరు కోనేరు కుంపపై జండా కట్టిన సందర్భంగా తోట నర్సయ్య మొదలగు వారిపై లాఠీ ఛార్జీలో తీవ్రంగా గాయపడ్డాడు. కాట్రగడ్డ సోదరులు అరెస్టు అయి ఉన్న కాలంలో మొగల్రాజపురంలో నూతివద్ద చెట్టుపై జండా కట్టినపుడు బొన్నలూరి రాధాకృష్ణమూర్తి, చెన్నుపాటి మురహరిరావుగార్లతో పాటు లాఠీ ఛార్జికి గురి అయ్యాడు. చాగర్లమూడి వెంకటరామయ్యగారు కాట్రగడ్డ శ్రీనివాసరావు వగైరాలతో పాటు అనేక పర్యాయాలు చెట్టుకు జండాలు కట్టి అరెస్టు అయ్యారు. శిక్షింపబడ్డారు. శ్రీనివాసరావు మరీ కుర్రవాడుబలహీనుడుఅయినందున వదలివేశారు.ఆంధ్రరత్న భవనాన్ని పోలీసులనుండి వశపరచుకొనే యత్నంలో తనపై జరిపిన లాఠీఛార్జిలో తీవ్రంగా గాయపడ్డాడు. జైలులో క్షయవ్యాధికి గురి అయ్యాడు. కొన్నాళ్ళు మొగల్రాజపురంలో, విశ్రాంతి తీసుకొంటూ వైద్య సహాయం పొందాడు. చివరకు ఆంధ్రరత్న భవనంలోనే అమరుడయ్యాడు.

## వీరమాత కాట్రగడ్డ రామసీతమ్మ

కాట్రగ రామసీతమ్మగారు గుంటూరు జిల్లా మందడం । . మంలో 1883 సంవత్సరంలో జన్మించారు. 189 లో విజయవాడ, మొగల్రాజపురం వాస్తవ్యులు కాట్రగడ్డ చినపిచ్చయ్యగారి దత్త పుత్రుడు కాట్రగడ్డ నరసయ్యగారితో ఈమెగారి వివాహం జరిగింది. వీరికి సంతానములేదు. 1916లో భర్త వియోగం ప్రాప్తించింది. కాట్రగడ్డ గంగయ్యగారి పుత్రుడు మధుసూదనరావుగారిని ఆమె దత్తత చేసుకున్నారు.

రామసీతమ్మగారు 1932లో జెండా ప్రతిష్ఠాపన సందర్భంలో లాఠీ చార్జీలకు గాయపడిన కాంగ్రెస్ వలంటీర్లను తన ఇంటిలోవుంచి సేవ చేసినందుకు, ఈమెకు ఒక సంవత్సరం కఠినశిక్ష, రు. 400 జరిమానా ప్రభుత్వం విధించింది. జరిమానా చెల్లించనందున ఆమె ఇంట్లోని మంచాలు, కుర్చీలు, బెంచీలు, ఇత్తడి సామాను చివరికి అట్లపేనంతోసహా మొత్తం సామాను స్వాధీనం చేసుకుని వేలంవేశారు. అయినా జరిమానాకు సరిపోయే డబ్బు రాలేదని, ఈమెవీ ఈమె కోడలు తులశమ్మగారివీ చేతి గాజులు (15 కాసులు) లాక్కున్నారు. రామసీతమ్మగారిని రాయవెల్లూరు జైలుకు పంపారు.

పోలీసులు ఇల్లు స్వాధీనం చేసుకొన్నాక కుటుంబ సభ్యులు తమ నిమ్మతోటలో పాకవేసుకొని వుండేవారు.

రామసీతమ్మగారికి జైలులోపక్షవాతంవచ్చి కాలూ, చెయ్యీ పడిపోయి రోగపీడితురాలుకాగా, బ్రతుకుతుందనే ఆశలేక మూడు రోజులపాటు శవాలగదిలో పడవేశారు నాలుగోనాడు కొంచెం కోలుకుని బ్రతికి, పూర్తి జైలుశిక్ష అనుభవించి విడుదలయ్యారు. ఈమె ప్రాణాపాయమైన జబ్బులో వుండికూడా క్షమాపణ చెప్పి బయటకు వచ్చుటకు నిరాకరించారు.

గాంధీ హరిజన నిధికై పర్యటనకురాగా, ఈమె సంతోషంతో ఆయనకు బంగారుగాజులు, ఒకఉంగరం రు. 1300/- నగదు సమర్పించారు. 1933లో హరిజనోద్యమ సందర్భాన, హరిజనులు, సవర్ణుల సహపంక్తి భోజనాలను ఈమె కుమారుడు మధుసూదనరావుగారు ఏర్పాటు చేయగా వీరి ముఖ్యమైన బంధు

వులు బహిష్కరించారు. దీన్ని లక్ష్యపెట్టక కుమారుడికి అండగా నిలచి, వివాహము జయప్రదంగా జరిపించారు. ఈ విందులో పట్టణ ప్రముఖ నాయకులు పాల్గొని, ఈమెనూ, ఈమె కుమారునీ ప్రశంసించారు. చాలాకాలం ఈమె కుటుంబాన్ని బంధువులు బహిష్కరించారు. కాని ఈమె చలించకుండా, బ్రతికున్నంత కాలం అస్పృశ్యతా నివారణవ్రతం నిష్ఠతో పాటించారు.

ఒక ఇంటర్వ్యూలో రామసీతమ్మగారు చెప్పిన ఈదిగువ మాటలు గమనార్హమైనవి.

"1932 జనవరిలో గాంధీగారు రౌండ్ టేబుల్ నుంచి తిరిగి వచ్చాక, మాఅబ్బాయిని అరెస్టుచేసి శిక్ష విధించారు. ఆ తర్వాత కొద్ది రోజులకు సత్యాగ్రహులు మొగల్‌రాజపురంలోని బావివద్ద చెట్టుకి జండాలు కట్టినందుకు, వారిని పోలీసులు కొట్టి పడేశారు. వారి బాధ చూడలేక, వారిని నా యింట్లో పెట్టుకొని, వైద్యం చేయించి, భోజనసౌకర్యాలు ఏర్పాటు చేశాను.

"అందుకు పోలీసులు వచ్చి నన్ను అరెస్టు చేసి తీసుకు వెళ్ళారు. జరిమానా, జైలుశిక్ష వేశారు. జరిమానా కట్టనందుకు, మా యింట్లో సామాను జప్తుచేసి, మా కోడలు వంటిమీద నగలు కూడా తీసుకుని, వేలం వేశారు. వేలంలో ఎవరూ పాల్గొనలేదు. అప్పటి ప్రభుత్వ తాబేదార్లు వాటన్నిటినీ చవుకగా పాడుకున్నారు. నన్ను క్షమాపణ కోరమని ఒత్తిడిచేశారు. ఏమైనాసరే కోరనని చెప్పాను రాయవెల్లూరు జైలుకు పంపారు. జైలులో నాకు పక్షవాతం వచ్చింది. జైలులోనాకు భారతీరంగా మొదలగువారు సేవచేశారు. తగ్గిన తర్వాత మధురై జైలుకు నన్ను పంపారు. అదేజైలుకు నాకుమారుడు మధుసూదనరావును కూడా మార్చారు. అక్కడ మళ్ళీ జబ్బు చేసింది. జిల్లా ఆసుపత్రిలో వుంచారు. అప్పటి డాక్టర్ రమణరావుగారు మమ్మల్ని బాగా చూశారు. మాతోఅదే జైలులో డాక్టరు లక్ష్మి, పిడికిటి రామకోటయ్యగారువున్నారు. సంవత్సరం జైలులో వున్నాక నన్ను విడుదల చేశారు.

"1933లో హరిజనోద్యమసందర్భంలో సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేయగా, అన్నికులాలవారు 3వేల మందికిపైగా వచ్చారు"

## ఈడుపుగల్లు

ఈడుపుగల్లులో స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొనేందుకు తన బిడ్డలను ప్రోత్సహించిన వారిలో సుంకర రామచంద్రయ్యగారు ప్రముఖులు. స్వాతంత్ర్య సమరంలో వెన్ను చూపవద్దనీ, అలా పిరికితనం ప్రదర్శిస్తే వారికి తన ఇంట్లో స్థానంలేదనీ కుమారులను హెచ్చరించేవాడట రామచంద్రయ్యగారు వీరి పుత్రులైన సుంకరసత్యనారాయణ (కవి), సుంకర వీరభద్రరావు, సుంకర సుబ్బారావు,కోటయ్యగారి కుమారుడు సుంకర వెంకట సుబ్బారావు సత్యాగ్రహ ఉద్యమాల కాలంలో ఈ గ్రామంలో తాటిచెట్లు గెలలు నరికారు. 1932లో సేవాశ్రమం నిర్మించగా పోలీసులు పీకివేశారు. దేవాలయ మండపంపై జెండా ప్రతిష్ఠించిన సందర్భంగా లాఠీ ఛార్జి జరిగింది.

గాంధీజీ హరిజన నిధికి పర్యటించుతూ ఈగ్రామం వచ్చినపుడు సుంకరరామచంద్రయ్యగారు ఎడ్లు, బండి అమ్మి ఆ నిధికి ఇచ్చారు. కూతురు చిన్నపిఐనా చెవిపోగు సమర్పించింది. ఈడుపుగల్లు, చుట్టుప్రక్కల గ్రామాలలో భగత్‌సింగ్ ఉరితప్పించాల విజ్ఞప్తి సంతకాల కార్యక్రమాన్ని ఈ గ్రామ యువకులు నిర్వహించారు.

విదేశ వస్త్ర బహిష్కరణ ఉద్యమ కాలంలో విదేశ వస్త్రాలను పోగుచేసి కావడిలాగా గడకర్ర భుజానవేసుకొని వాటిపై ఉంచి బట్టలు మోసినవారిలో బాలుడుగా వీరమాచినేని మధుసూదనరావు (ఇప్పటి సినీ డైరెక్టర్) పోగుచేశాడు. మొత్తం పోగయ్యాక వాటిని తగులబెట్టారు.

దేశోద్ధారక నాగేశ్వరరావుగారు యువజన గ్రంథాలయాన్ని ప్రారంభించారు. రాత్రి పాఠశాలను కంభంపాటి వెంకటరత్నంగారు నిర్వహించారు. ఈ గ్రామంలో హరిజనులతో సహపంక్తి భోజనం పెద్ద ఎత్తున నిర్వహించబడింది.

ఈడుపుగల్లు దుకాణంవద్ద పికెటింగుచేస్తున్న సుంకర సత్యనారాయణ, సుంకర వీరభద్రరావు, పర్వతనేని వెంకయ్య, పర్వతనేని వీరరాఘవయ్య, చలసాని చంద్రరావుగార్లను పోలీసులు చితకబాది దుక్కిగడ్డలలో పడేసి ఈడ్చారు. అరెస్టుచేసి రాత్రివేళ రోడ్లపై ఊరూ; పల్లెలేనిచోట విడిచిపెట్టారు.

సేవాశ్రమం పీకివేసి కలప మొదలైన వాటిని వేలంపెట్టగా ఏ ఒక్కరూ పాడలేదు.

## గోవా విమోచనోద్యమంలో బెజవాడ విద్యార్థుల బలిదానం

గోవా విమోచనోద్యమంలో పాల్గొనడానికి, కృష్ణా జిల్లానుండి వివిధ పార్టీల యువకులు 1955 ఆగస్టు 15 న గోవా వెళ్ళారు. దేశమంతటినుండి ఆనాడు అనేక వందలమంది ఆ ఉద్యమంలో పాల్గొన్నారు. విజయవాడ కమ్యూనిస్టు యువకులకు చలసాని వెంకటరత్నంగారు నాయకత్వం వహించారు. విజయవాడ కాలేజీ విద్యార్థులు, మరికొందరు విద్యార్థులు కూడా పాల్గొన్నారు. వీరు కాంగ్రెస్, తదితర పార్టీల అనుబంధ సంఘాలకు చెందినవారు. గోవా సరిహద్దుల్లో కొంతమందిని నిరోధించి కొందరిని వెనక్కి వెళ్ళేటట్లు చేశారు పోర్చుగీసు అధికారులు. మరికొంతమందిని తమ గూఢచారులద్వారా మాయ మాటలుచెప్పి వంచించి గోవా ప్రవేశిస్తున్న వారిని కేసిల్‌రాక్ సరిహద్దులో తుపాకులకు బలిచేశారు. కేసిల్‌రాక్‌నుండి మార్మగోవాపోయే రైలుమార్గంలో ఒక సొరంగంవుంది. సత్యాగ్రహులు సొరంగం గుండా కాలినడక వుందని ఒక గూఢచారి నమ్మించి తీసుకు వెళ్లాడు. అక్కడ పొంచివున్న పోర్చుగీసు సైనికులు కాల్పులు సాగించారు. అలా తుపాకులకు బలియైన వారిలో చాపరాల జగన్మోహనరావు, సూరి సీతారాం అనే విద్యార్థులున్నారు. అబ్దుల్ అజీజ్‌ఖాన్ అనే విద్యార్థి తీవ్రంగా తుపాకిగుండకు గురి అయ్యాడు. చాపరాల జగన్మోహనరావును పోర్చుగీసు వారే తగలపెట్టారు. జగన్మోహనరావు విజయవాడ యస్.ఆర్.ఆర్ &సి.వి.ఆర్.కాలేజీ విద్యార్థి,వయస్సు 19 ఏళ్ళు. తల్లి సంపూర్ణమ్మ, తండ్రి సుబ్బారావు. జగన్మోహనరావు తన అక్కగారికి తుదిలేఖలో ఇలా అన్నాడు : "నా జీవితంలో రెండు ఘనకార్యాలు చేశాను. ఒకటి ఆంధ్రరాష్ట్ర సాధనకు ఆందోళన, రెండు గోవా విమోచన సత్యాగ్రహంలో పాల్గొంటున్నాను."

సూరి సీతారాం వయస్సు 17 సంవత్సరాలు. జన్మస్థలం వుయ్యూరు. తల్లి స్వరాజ్యలక్ష్మి, తండ్రి శోభనాచలపతిరావు. యస్.ఆర్.ఆర్.&సి. వి. ఆర్. కాలేజీ విద్యార్థి. ఈయన మరణవార్తను బెల్గాంలోని అఖిలపక్ష గోవా విమోచన సమితి తెలియచేసింది. తన తండ్రికి రాసిన లేఖలో సీతారాం ఇలా అన్నాడు : "ఇది నా జీవితంలో ఆఖరిరోజు. దేశంకోసం, గోవాలోని నా సోదరులను పోర్చుగీసు బంధనాల నుండి తప్పించడంకోసం నా ప్రాణాలను అర్పించ వలసి యుంటుందేమో."

ఆ ఉత్తరంలో ఆ యువకుడు అనుమానించినట్లు గానే చివరకు ప్రాణాలను అర్పించాడు.

అజీజ్‌ఖాన్ నూజివీడు విద్యార్థి. ఏడు తుపాకి గుళ్ళు తగిలాయి. లోండాలోని ఆంధ్రులు ఈయనకు సహాయపడి చికిత్సచేశారు. ఈయన మరి ఏడుగురు విజయవాడ విద్యార్థులు ఆగస్టు 19 న విజయవాడ చేరారు

గోవాలో వీరమరణం పొందిన విద్యార్థులకు సాను భూతిగా విజయవాడలో హర్తాళ్, ఊరేగింపు జరిగాయి. ఆంధ్రలో అనేకచోట్ల హర్తాళ్లు జరిగాయి. (చూడండి జీవిత చరిత్రలు)

*   *   *

1925 మైలవరం జెండా కేసులో 13 మందితో పాటు మదన్‌సింగ్, అనుమర్లపూడి సీతారామారావు (కోడూరు) గార్లను కూడా అరెస్టుచేశారు.

మైలవరంతాలూకా కోడూరు గ్రామానికి చెందిన అనుమర్లపూడి సీతారామారావుగారు బందరు జాతీయ పాఠశాలకువెళ్ళి తిరిగివచ్చి కోడూరులో జాతీయ పాఠశాలను స్థాపించి రెండేళ్ళు నడిపారు.

సీతారామారావు జాతీయ ఉద్యమంలో పాల్గొంటూ జిల్లాబోర్డు మెంబరుగా కాంగ్రెస్ టికెట్టుపై జమీం దార్లకు వ్యతిరేకంగా నిలబడ్డారు. రైతుసంఘాల నిర్మాణంలో పాల్గొన్నారు. కృష్ణాజిల్లా రైతుసంఘ అధ్యక్షుడుగా ఎన్నుకోబడి, దాని నిర్మాణానికి కృషి చేశారు. కమ్యూనిస్టు కార్యకర్తగా బెజ వాడలో పనిచేశారు. 1950 లో కడలూరు జైలు కాల్పులలో చనిపోయారు.

# గుడివాడ తాలూకా

1886 రెండవ కాంగ్రెస్‌కు ప్రతినిధులను ఎన్నుకోడానికి వివిధ పట్టణాలలో సమావేశాలు జరిగాయి. అలాంటివాటిలో గుడివాడ ఒకటి. ఆనాటినుండి స్వాతంత్ర్యం సంపాదించేవరకు, స్వాతంత్ర్య సంగ్రామంలో వివిధ దశలలో గుడివాడ తాలూకా ప్రముఖపాత్ర వహించింది. మొదటి ప్రపంచ యుద్ధానంతరం బ్రిటిష్ ప్రభుత్వం రౌలట్ బిల్లు ప్రవేశపెట్టి పౌరహక్కులను కాలరాయడం మొదలుపెట్టింది. ఇది చట్టరూపం ధరిస్తే సత్యాగ్రహ ఉద్యమం సాగిస్తానని గాంధీ అన్నాడు. 1919 లో గాంధీ బెజవాడ వచ్చినపుడు ఒక్కరోజు మాత్రమే ఉన్నాడు. రామమోహన గ్రంథాలయ ఆవరణలో జరిగిన సభలో రాబోయే సత్యాగ్రహ కార్యక్రమ విధానాన్ని వివరించాడు.

రౌలట్ బిల్లును గర్హిస్తూ కృష్ణాజిల్లాలో అనేక చోట్ల సత్యాగ్రహ వ్రతాలు జరిగాయి. గుడివాడలో కూడ దేవాలయాల్లోను, మసీదులలోను సామూహిక ప్రార్థనలు జరిగాయి. ఏప్రిల్ 6 న ఉదయం తొమ్మిది గంటలనుండి భజనలతో నగరసంకీర్తన జరిగింది. 12 గంటలవరకు దేవాలయాల్లో పూజలు జరిగాయి. మధ్యాహ్నం 1, 3, 5 గంటలకు మసీదులలో నమాజులు జరిగాయి. వర్తకులు దుకాణాలు కట్టివేశారు. కొందరు ఉపవాసాలు చేశారు. రాత్రి 8 1/2 నుండి 1 గంటవరకు మార్కండేయోపాఖ్యానం హరికథ చెప్పారు. రౌలట్ సంకెళ్ళతో బంధించబడిన భారతమాత చిత్రాన్ని, గాంధీ చిత్రపటాన్ని ఆ రోజంతా ప్రదర్శించారు.

కాని జలియన్‌వాలాబాగ్ హత్యాకాండ తర్వాత గాంధీ తాను తలపెట్టిన సత్యాగ్రహ కార్యక్రమాన్ని విరమించాడు.

లక్నో కాంగ్రెస్‌లో కాంగ్రెసు-లీగ్‌లు ఐక్యమై భారతదేశానికి ఎలాంటి రాజ్యాంగం కావాలో తెలియజేస్తూ తయారుచేసిన ప్రణాళికపై సంతకాల కార్యక్రమాన్ని ఆనాటి కాంగ్రెసు నాయకులు ప్రారంభించారు. గుడివాడ తాలూకా కౌతవరంలోని జాతీయ పాఠశాల ఉపాధ్యాయులు ఈ సంతకాల కార్యక్రమంలో ఎక్కువ కృషి చేశారు.

1921 సహాయ నిరాకరణోద్యమ కాలంలో సర్వశ్రీ మానికొండ వెంకటరామయ్య (ఉరుటూరు), నందివాడ లక్ష్మీనారాయణ (నందివాడ) నందివాడ ఆదినారాయణమూర్తి (నూతలపాడు) తుమ్మలపల్లి వెంకటకృష్ణయ్య (గుడివాడ) సుబ్బయ (గ్రామ వెట్టి- ఉరుటూరు) కోడెబోయిన కోటయ (గ్రామ నాయకుడు - ఉరుటూరు) తమ గ్రామోద్యోగాలకు రాజీనామా చేశారు. మొత్తం యీ తాలూకాకు చెందిన 12 మంది కరణాలు రాజీనామా చేశారు.

1922 లో జమీగొల్వేపల్లిలో డాక్టరు పట్టాభిగారి అధ్యక్షతన సభ జరిగింది. ఆ గ్రామంలో జాతీయోద్యమానికి అంకురార్పణ అలా జరిగింది. అడూరి సోమ సూర్యప్రకాశరావుగారు కరణీకానికి రాజీనామా యిచ్చారు. ఆయన 15, 20 మగ్గాలు పెట్టి, గ్రామస్తుల సహకారంతో వడుకునూలు ప్రచారం అయిదారేళ్ళు సాగించాడు. అంతకాలమూ యీ మగ్గాలు అక్కడపని చేశాయి. 1929 గాంధీ హరిజనయాత్ర, 1930-32 ఉద్యమాల్లో గుడివాడ, అంగలూరు, కౌతవరం, నందివాడ, జమీగొల్వేపల్లి, మొదలైన అనేక గ్రామాలు, తాలూకా కేంద్రమూ నిర్వహించిన పాత్ర ప్రముఖమైనది. ఆ తర్వాత కూడా రైతు, యువ, సోషలిస్టు, క్విట్ ఇండియా మొదలైన అనేక ఉద్యమాలు గుడివాడ తాలూకా, జిల్లా స్వాతంత్ర్య ఉద్యమాలలో ప్రముఖపాత్ర వహించాయి. ఈ సందర్భంగా కొన్ని ప్రముఖ కేంద్రాల గురించి ఇక్కడ ప్రస్తావించాలి.

## కౌతవరం

కౌతవరం గ్రామంలో జాతీయవాద భావాలను నాటిన ప్రప్రథములలో కట్టమంచి కోళందరె గారు ఒకరు. ఈయన కొన్నాళ్ళు పోలీసు ఇనస్పెక్టరుగా పనిచేశాడు. తర్వాత యీ పదవికి రాజీనామా యిచ్చాడు. "ఆంధ్ర లక్ష్మి ఇండస్ట్రియల్ కంపెనీ" పేరుతో 1907 లో రైస్‌మిల్లు ఏర్పరచాడు. "ఆంధ్ర లక్ష్మి జాతీయ విద్యాలయం" నెలకొల్పి, దానికి యీ రైస్‌మిల్లులో కొనుగోలు- విక్రయాలపై 'ధర్మనిధి' వసూలుచేసి, ఆ డబ్బుతో దాన్ని పోషించే

వాడు. ఈయన ఎంతటి ఆత్మ గౌరవంగల పోలీసు ఉద్యోగో- గొటిపాటి బ్రహ్మయ్యగారు 'నా జీవన నౌక' గ్రంథంలో తెలియచేశారు.

కంకిపాడులో ట్రావెలర్సు బంగళాలో ఒక గదిలో తన సామాను ఉంచుకొని డ్యూటీపై, మరో గ్రామం వెళ్ళగా, ఆంగ్లేయుడైన సబ్-కలెక్టర్ యీయన సామన్లు తీసివేసి, తన సామాన్లు వాటి స్థానే పుంచాడు. కొళందరెడ్డిగారు వచ్చినపుడు వాటిని తీసి వేయించి తన సామగ్రిని అక్కడ ఉంచాడు. సబ్ కలెక్టర్ తర్వాత వచ్చి చూసి, కొళందరెడ్డిని తృణీకరించి మాట్లాడాడు. తిరిగి అదే రీతిని మాట్లాడమే కాక, చేతి బలం చూపడానికి కూడా సిద్ధమయ్యాడు. ఈ వివాదంపై జిల్లా కలెక్టర్, జిల్లా పోలీసు సూపర్నెంట్ విచారించి సబ్ కలెక్టర్‌చేత క్షమాపణ పత్రం రాయించి యిప్పించారు. దాన్ని రెడ్డిగారు పటం కట్టించి భద్రంగా వుంచారు. ఈ ఘటనపై కృష్ణాపత్రిక కొళందరెడ్డిగార్ని అభినందించింది.

జాతీయ విద్యాలయాన్ని 1910 నుండి 1919 వరకు చెరుకువాడ నరసింహంగారు నిర్వహించారు. ఈ గ్రామంలో అనేకమంది జాతీయ స్వాతంత్ర్య యోధులను తయారుచేయడంలో యీ పాఠశాల ద్వారా యీయన చేసిన కృషి ప్రశంసనీయం. వందేమాతరం ఉద్యమంగా వృద్ధి చెందాక, దాని ప్రభావం యీ గ్రామంపై పడింది. పైన ఉదహరించిన రెండు సంస్థలూ యీ ఉద్యమ ప్రభావంగా జన్మించినవే. అలాగే 1908 లో గ్రామ సహకార పరపతి సంఘం కూడా ఏర్పడింది.

సంఘ సంస్కార ప్రియులు, బ్రహ్మ సమాజకులూ అయిన రఘుపతివెంకటరత్నం నాయుడు, కందుకూరి వీరేశలింగం పంతులు గార్ల శిష్యకోటికి చెందిన వారు చెరుకువాడ, సంఘ సంస్కార ప్రియుడు, బ్రహ్మ సమాజవాది, యుపకా గ్రేసుడు. అయిన బొబ్బా పద్మనాభయ్యగారు, మరి కొందరు గ్రామ పెద్దల సహకారంతో 1910 వ సంవత్సరంలో యీ విద్యాలయాన్ని స్థాపించారు. వీరి బోధనా పద్ధతికి యీ గ్రామస్థులే కాక, కృష్ణాజిల్లాలోని అనేకమంది ఆకర్షింపబడ్డారు. ఇందుకు నిదర్శనం, నాటి మునగాల రాజాగారు, తన బిడ్డలనే కాక, తన బంధువుల బిడ్డలను కూడా ప్రోత్సహించి 10 మంది విద్యార్థుల వరకూ యిందులో ప్రవేశపెట్టారు. ఇది గురుకుల పద్ధతిలో ఏర్పడ్డ మాధ్యమిక రెసిడెన్షియల్ పాఠశాల.

విద్యార్థులకు పాఠాలతోపాటు, జాతీయాభిమానం నూరిపోసేవారు అంతేకాక జాతీయ కార్యక్రమాలలో ఉపాధ్యాయులు, విద్యార్థులు పాల్గొనేవారు. 1913–14 సం॥లలో బాపట్ల, బెజవాడలలో జరిగిన ఆంధ్ర మహాసభలకు యీ స్కూలు విద్యార్థులు వాలంటీర్లుగా వెళ్ళి సేవచేశారు. 1913 లో చెరుకువాడవారు టాగూర్ శాంతినికేతనానికి, దారిలో సాక్షిగోపాల్ వద్ద గోపబంధుదాస్ గారి సత్యబాల విద్యాలయానికి వెళ్ళి చూచి, అక్కడి విద్యా విధానాన్ని, ఆ పద్ధతుల్ని గ్రహించారు.

1916 డిసెంబరు లక్నో కాంగ్రెస్‌లో జాతీయ కాంగ్రెస్ – ముస్లిం లీగ్‌తో సమాధానపడి ఒక ప్రణాళికను తయారుచేసి, మాంటేగుకు సమర్పించింది. ఆ ప్రణాళికపై సంతకాలు చేసిన ప్రముఖుల్ని ప్రభుత్వం అరెస్టు చేసింది. అయినా ఈ విద్యాలయం ఉపాధ్యాయులు, విద్యార్థులు కొత్తవరంలోనేకాక, ఆ చుట్టుప్రక్కల గ్రామాలలో కూడా తిరిగి, ఆ ప్రణాళికమీద సంతకాలు చేయించారు. కాని వీరెవ్వరినీ అరెస్టు చేయలేదు.

1917 లో ముగ్గురు విద్యార్థులను వెంటబెట్టుకుని చెరుకువాడవారు సబర్మతీ ఆశ్రమానికి వెళ్ళి గాంధీగారిని సందర్శించారు. ఆయనతో జాతీయవిద్యావిషయాలపై చర్చించారు. చేతివృత్తిప్రాధాన్యతగల విద్యను ప్రవేశపెట్టుటలో "ఆంధ్ర లక్ష్మి ఇండస్ట్రియల్ కంపెనీ" డైరెక్టర్లతో భేదాభిప్రాయం వచ్చి 1919లో చెరుకువాడ వారు ఆ గ్రామం వదలవలసి వచ్చింది.

మాతృభాషలో దేశపాలన, విద్యాబోధన జరగాలనీ, హిందీ నిర్బంధ ద్వితీయ భాషగాను, ఇంగ్లీషు ఐచ్ఛిక భాషగాను వుండాలనీ విద్య గ్రామజీవనాన్ని ఉద్ధరించేదిగా ఉండాలనీ, ఇందుకు రాట్నం వంటి కుటీర పరిశ్రమలే శరణ్యం అని తెలుసుకోవటంతో చెరుకువాడవారు వాటిని ఈ విద్యాలయంలో ప్రవేశపెట్టాలని సంకల్పించారు. ఇందుకు కంపెనీ డైరెక్టరు అంగీకరించనందున ఆయన కొత్తవరం వదలి వెళ్ళిపోయారు.

కాని నాటి చెరుకువాడ వారి విద్యార్థులే నేటి స్వాతంత్ర్య సమరయోధులు. విద్యాధనులు, వారి

శిష్యులలోని ఈ గ్రామ ముఖ్య స్వాతంత్ర్య సమర యోధులు 1. బొబ్బా వెంకటశేషయ్య (దేశాభిమాని) 2 బొబ్బా వీరభద్రుడు, 3. బొబ్బా ఆదినారాయణ మూర్తి, 4. తాళ్ళూరి దుర్గాప్రసాదరావు, 5. నార్ల వెంకటేశ్వరరావు 6. కొల్లి సత్యనారాయణ, 7. కొనూరి రామానంద చౌదరి, 8. వెంకటరత్నం గార్లు.

చెరుకువాడవారు గ్రామ యువకులకు, పిన్నలకు పెద్దలకు రాజకీయాలను తెలియ చెప్పేవారు. తీరిక సమయాలలో గ్రామ నడివీధిలో సమావేశమయ్యే గ్రామస్తులకు భారత భాగవతాది పురాణాలను నాటి రాజకీయాలకు సమన్వయపరుస్తూ రసభరితంగా చెప్పి, వారిని ఒప్పించేవారు. అంటరానితనాన్ని రూపుమాపేందుకు, హరిజనులతోపాటు గ్రామస్తులను తన సరసన కూర్చుండబెట్టుకొని విందారగించేవారు.

ఇంతకుపూర్వం బ్రాహ్మణులు విద్యాధికులై ప్రభుత్వ యంత్రాంగంలోను, పట్టణ రాజకీయాల లోను ప్రముఖపాత్ర వహించేవారు. ఈ శతాబ్ది తొలి రోజుల్లో బ్రాహ్మణేతరులు కూడా ఆంగ్ల విద్య నభ్య సించారు. బ్రాహ్మణులతో పోటీపడుటకు, వారితో సమానత్వం సాధించేందుకు బ్రాహ్మణేతరులను సమీకరించి కుల మహాసభలు జరిపారు. ఈ బ్రాహ్మ ణేతర ఉద్యమం మొదటి ఆశయం సాంఘిక సమా నత్వం, బ్రాహ్మణాధిక్యత తగ్గించుట, బ్రాహ్మణేత రులు కూడా జందెం వేసుకుని వేదాధ్యయనం చేయటం, తామే పౌరోహిత్యం వహించటం, వంటివి. అంగలూరులో జన్మించిన త్రిపురనేని రామస్వామి చౌదరిగారు ఈ ఉద్యమంలో ప్రముఖపాత్ర వహిం చారు.

దీనికి ముందు 1910 లో బొబ్బా పద్మనాభయ్య, కానూరి దామోదరయ్య, కానూరి పెదవెంకట దాసయ్య, ఎర్నేని కోనయ్యగార్ల ఆధ్వర్యాన కొత్త వరంలో కమ్మ మహాజన సభ జరిగింది.

## కుల మహాజన సభలు

ప్రథమ ఆంధ్రరాష్ట్ర కమ్మ మహాజన సభ 1910 లో ఆంధ్రలక్ష్మి ఇండస్ట్రియల్ కంపెనీ వద్ద పాటిసలంలో జరిగింది. కమ్మమహాజనుల ప్రత్యేకాభి వృద్ధికి ఇది ఏర్పడింది. దీనికి పూర్వం రెడ్డి మహాజన సభ ఏర్పడి, వారి ఔన్నత్యానికి పాటు పడుతుండేది. కట్టమంచి కొళందరెడ్డిగారు కమ్మ మహాజనసభ స్థాపన ఆవశ్యకతను గురించి ఈ ప్రాంతపు కమ్మ వారికి తెలిపారు. చల్లపల్లి కుమారరాజా యార్లగడ్డ అంకినీడు ప్రసాద్‌ను మహాసభకు అధ్యక్షత వహించ డానికి ఆహ్వానించగా, వారు కారణాంతరాలవల్ల రాలేకపోయారు అప్పుడు నాగాయతిప్ప వాస్తవ్యులు కఠంనేని వెంకటరంగయ్యగారు ఈ సభకు అధ్య క్షత్యం వహించారు. ఈ సభ ప్రథమ కార్యనిర్వాహక వర్గానికి కార్యదర్శిగా బొబ్బా పద్మనాభయ్యగారు ఎన్నుకోబడ్డారు.

నాటి ఈ గ్రామ యువకులు బ్రాహ్మణేతర ఉద్య మాన్ని అభిమానించినా, జస్టిస్‌పార్టీలోకి ఆకర్షింప బడలేదు. అంచేత ఈ గ్రామం ఆ తర్వాత జాతీ యోద్యమాలలో సముచిత పాత్ర నిర్వహించింది. 1910-20 మధ్యకాలంలో జాతీయోద్యమం గురించి ప్రబోధించేందుకు, బందరు నాయకులు కోః హను మంతరావు, పట్టాభి సీతారామయ్య, చెనా ప్రగడ భానుమూర్తి, కౌతా సీతారామశాస్త్రి, చిల్లరిగె. నివాస రావు, వల్లూరి సూర్యనారాయణగార్లు తవరం తరుచుగా వచ్చేవారు. అభ్యుదయ భావాలు కలవారు, అందరి మన్ననలు పొందినవారు, ఒక టీముగా పని చేసేవారూ ఎప్పుడూ పదిమంది యువకులు ఈ గ్రామంలో దొరికేవారు అందుకని బందరు కాంగ్రెస్ నాయకులు ఈ గ్రామమన్నా, ఈ గ్రామ యువకు లన్నా ఎక్కువ అభిమానించేవారు.

డాక్టరు పట్టాభి, వల్లూరి సూర్యనారాయణరావు గా కృషివల్ల 1918 లో ఈ గ్రామంలోని శైవ, వై ష్ణవాలయాలు సక్రమ పాలన కిందకు వచ్చాయి. వ మూడి వారిలో 14 వారస కుటుంబాల పక్షాన కో ర్టులో వ్యవహరించి, ఆంధ్ర జాతీయ కళా శా ల ను 15 వ కుటుంబంగా చేర్చి, గెలిచాక తాను ఫీజు పుచ్చుకోకుండా, వారసుల చేత 20 యక రాల భూమిని ఆంధ్ర జాతీయ కళాశాలకు ఇప్పిం చారు వల్లూరి సూర్యనారాయణరావుగారు, అంతేకాక 80 సెంట్లు స్థలమూ, అందులోని ఒక పక్కా డాబా కూడా ఈ కళాశాలకు దానం చేశారు. వల్లూరివారు, భోగరాజువారు ఈ గ్రామ పెద్దల నుంచి చందాలు వసూలుచేసి, ఈ కళాశాలకు ఇచ్చేవారు, జాతీయ

ప్రయోజనంకోసం చందాలు అడిగేందుకు బందరు ప్రముఖులు వచ్చినప్పుడల్లా, ఈ గ్రామస్థులు వారికి తమ శక్తికొద్దీ చందాలు ఇచ్చి పంపేవారు.

ఈ గ్రామంలోని జాతీయ విద్యాలయం అధ్యాపకులు, విద్యార్థులు, చుట్టుప్రక్కల గ్రామాలకు వెళ్ళి, కాంగ్రెస్-లీగ్ ప్రణాళికపై ఎక్కువ సంతకాలు పెట్టించారు. సంతకాలు చేసిన వారిని, ఆ రోజుల్లో ప్రభుత్వం అరెస్టు చేసేది. ఆ విధంగానే బందరులో కోపల్లె హనుమంతరావు, పట్టాభి, ముట్నూరి కృష్ణారావుగార్లను సంతకాలు చేసినందుకే అరెస్టు చేశారు.

1921 లో బెజవాడలో ఎ. ఐ. సి. సి. సమావేశం నిర్ణయం ప్రకారం కృష్ణా జిల్లాలో "తిలక్ నిధి" 23 వేల రూపాయలు వసూలు చేశారు. కౌతవరంలో రు. 500 వసూలు చేశారు.

బెజవాడ మహాసభకు విచ్చేసిన గాంధీకి ఈ గ్రామస్థులు ప్రత్యేకంగా ఖద్దరు బట్టలు తయారుచేసి సమర్పించారు. వారిలో ముఖ్యులు : కానూరి చిన వెంకట దాసయ్య, దేశాభిమాని బొబ్బా వెంకట శేషయ్యగార్లు.

ఈ సభకు పూర్వమే ఖద్దరు ఉత్పత్తికి ముందంజ వేసిన గ్రామం కౌతవరం ఒక్కటే. ఆనాటినుండి 1930 వరకూ సహకార పద్ధతిపై ఖద్దరు ఉత్పత్తి సంఘం ఏర్పడి పనిచేసింది. ఇందులో 40 మగ్గాలు, 40 రాట్నాలు పని చేసేవి. అల్లాడ వారి తోటలో 40 కుటుంబాల వారు ప్రత్యేకంగా ఖద్దరు ఉత్పత్తి చేసేవారు అంతేకాక 1922 లో తాళ్ళూరి శ్రీరాములుగారు, 6 వేల రూపాయల మూలధనంతో, తన భూమిలో పాకలు వేయించి ఖద్దరు ఉత్పత్తి చేయించారు. 1921 ఎ. ఐ. సి. సి. సమావేశం నిర్ణయాలకు ఉత్తేజితులై వీరూ, వీరి భార్య సుబ్బమ్మగారు తమ విలువైన విదేశీ వస్త్రాలను గ్రామ నడివీధిలో గుట్టవేసి తగులబెట్టారు, ఆ తర్వాత "తిలక్‌నిధి"తో నిమిత్తం లేకుండా స్వంత బాధ్యతమీద ఖద్దరు ఉత్పత్తికి తోడ్పడ్డారు.

1923 కాకినాడ కాంగ్రెస్ మహాసభకు దేశాభిమాని బొబ్బా వెంకట శేషయ్య, డా॥ ఎ.బి. నాగేశ్వరరావు (మాజీ మంత్రి), బొబ్బా ఆదినారాయణమూర్తి, తాళ్ళూరి దుర్గాప్రసాదరావు, తాళ్ళూరి నారాయణ మూర్తిగార్లు వలంటీర్లుగా వెళ్ళి సేవ చేశారు. ఎ. బి. నాగేశ్వరరావుగారు కౌతవరంలోనే వుంటూ బందరు వెళ్ళి విద్యాభ్యాసం చేసేవారు.

సహాయ నిరాకరణ ఉద్యమంలో గుడివాడ తాలూకాకు చెందిన 12 మంది కరణాలు, తమ పదవులకు రాజీనామా ఇచ్చారు.

ప్రచారానికై ఈ గ్రామం వచ్చిన ఒక కరణంగారికి భోజనం పెట్టారన్న రాజద్రోహ నేరారోపణతో కౌతవరం గ్రామ కరణం తాళ్ళూరి దశరథరామయ్యగారిని సస్పెండ్ చేశారు.

1922 లో చెరుకువాడ నరసింహంగారిని అరెస్టు చేసి, పోలీసులు రాజమండ్రి సెంట్రల్ జైలుకు తీసుకువెళుతుండగా, ఆయనవద్ద చదువుకున్న చితజల్లు చలపతిరావుగారు, గుడివాడ తాలూకా ఆఫీసు ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి, రాజీనామా పత్రాన్ని గురుదక్షిణగా, గుడివాడ రైల్వేప్లాట్‌ఫారమ్ మీద ఆయనకు సమర్పించారు.

1928-33 మధ్యకాలంలో గుడ్లవల్లేరులో గ్రామ పునర్నిర్మాణ కేంద్రం ఏర్పడింది. ఈ సంస్థకు సూపర్‌వైజరు గురజాడ రాఘవశర్మగారు. వీరు కవుతరంలో కాపురం వుంటూ ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొనేందుకు బందరు వెళ్ళి అక్కడ అరెస్టు అయ్యారు.

1929 లో ఖద్దరుయాత్ర సందర్భాన గాంధీ ఈ గ్రామం విచ్చేశారు. అప్పుడు కానూరి చిన వెంకట దాసయ్యగారు గాంధీకి రు. 1116 లు సొంతసొమ్ము విరాళంగా ఇచ్చారు. వడ్లమూడివారి వారసులు రు 300 లు విరాళం ఇచ్చారు.

మద్రాసు గవర్నరు బందరు రాకను బహిష్కరించి, నల్లజండాలు చూపాల్సిందిగా పిలుపు ఇచ్చిన వారిలో ఒకరు దేశాభిమాని బొబ్బా వెంకట శేషయ్య (కృష్ణాజిల్లా కాంగ్రెస్ కార్యదర్శి)గారు. ఈ సందర్భాన 20 మందిని ప్రభుత్వం అరెస్టు చేసింది. 12 మందిని రోడ్డుమీదనే అటకాయించి తిప్పివేసింది. అలా అటకాయించబడిన వారిలో నార్ల వెంకటేశ్వరరావు, కొల్లి మాధవరావుగార్లు వున్నారు అరెస్టు చేయబడిన 20 మందిలో బొబ్బా వెంకట శేషయ్య, వడ్లమూడి సత్యనారాయణ, బొబ్బా ఆదినారాయణ మూర్తి, బొబ్బా రంగారావుగార్లు వున్నారు. బొబ్బా వెంకట శేషయ్యగారికి 4 వారాల కఠినశిక్షగానీ, ఒక

సంవత్సరం విడిఖైదుగాని విధించింది. మిగతా ముగ్గురికీ 4 వారాల కఠినశిక్ష విధించారు. బొబ్బా రంగారావు, వడ్లమూడి సత్యనారాయణగార్ల తరఫున జిల్లాకోర్టులో అపీలు చేయగా పోలీసు కేసులు కొట్టివేయబడ్డాయి. కేసులు కొట్టేసేలోగా వారిద్దరూ 45 రోజులు జైలుజీవితం అనుభవించారు. దేశాభిమాని, ఆదినారాయణమూర్తిగార్లు తరఫున అప్పీలు పడవేయనందున ఆదినారాయణమూర్తిగారు రాజమండ్రి, తిరుచునాపల్లి సెంట్రల్ జైళ్ళలోనూ, దేశాభిమానిగారు రాజమండ్రి, రాయవెల్లూరు సెంట్రల్ జైళ్ళలోను శిక్ష అనుభవించారు.

బందరు నల్లజెండాల కేసులతో ఆరంభమైన శిక్షలు, కృష్ణాజిల్లాలోని సత్యాగ్రహోద్యమానికి అంకురార్పణ అయ్యింది.

## ఉప్పుసత్యాగ్రహం (1930)

బందరు, చిన్నాపురం, కొత్తవరం, అంగలూరు, ఘంటసాల మొదలైన 15 కేంద్రాలలో వాలంటీర్ల కోసం శిబిరాలు ఏర్పాటుచేశారు. నాటి తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంఘం అధ్యక్షులు కానూరి చిన వెంకట దాసయ్యగారు వంద గ్రామాలు సంచారం చేశారు. వీరి సమరోత్సాహం అనేక సమరఘట్టాలలో పనిచేసింది.

బొబ్బా వీరభద్రుడుగారి చావిడిలో వాలంటీర్ల శిబిరం ఏర్పాటయింది. సమర కార్యక్రమాల్లో విశేషంగా కృషిచేసినవారు కానూరు చిన వెంకట దాసయ్య, కానూరి బలరామయ్య, కానూరి రామానంద చౌదరి, కానూరి వెంకటరత్నం, వడ్డి అర్జునరావు, కొమ్మారెడ్డి వెంకట సుబ్బయ్య, కొల్లి మాధవరావు, వడ్లమూడి వెంకట్రామయ్య, వడ్లమూడి సత్యనారాయణ, తాళ్ళూరి దుర్గాప్రసాదరావు, బొబ్బా వీరభద్రుడు, బొబ్బా వెంకట శేషయ (దేశాభిమాని) బొబ్బా శేషయ్య (తండ్రి వెంకట కృష్ణయ్య), బొబ్బా ఆదినారాయణమూర్తి, బొబ్బా రంగారావుగార్లు. వీరికి అనేకమంది యువకులూ, ప్రజలూ తోడ్పడ్డారు.

ప్రతిరోజూ నడివీధిలోని రామాలయంవద్ద ప్రజల్ని సమీకరించి, వారికి ఉప్పుసత్యాగ్రహ ప్రాముఖ్యతను తెలియచెప్పేవారు. ఉప్పువండి,ఉప్పు పొట్లాలు అమ్మేవారు. పోలీసులు కట్టిన జండాలను చింపిపారవేస్తుంటే, వాలంటీర్లు మరల కట్టేవారు. పోలీసుస్టేషన్ దగ్గర మర్రిచెట్టుమీద కట్టిన జెండా, బందరు–గుడివాడ రోడ్డున పోయే పోలీసుదళాల్ని కవ్విస్తున్నట్లు వుండేది. ఓనాడు సమరోత్సాహంతో మర్రిచెట్టుమీది జండాను కాపాడేందుకు తాళ్ళూరి దుర్గాప్రసాదరావు, బొబ్బా ఆదినారాయణమూర్తి, కొమ్మారెడ్డి వెంకట సుబ్బయ్యగార్లు జండా వదలకుండా పోలీసులతో పెనుగులాడారు. కాని పోలీసులు వారిని లాఠీలతో తీవ్రంగా కొట్టి, జెండాను పీకివేశారు. 1930 జూన్‌లో గుడివాడ కాల్పుల సమయంలో దావూద్‌ఖాన్‌చే అవమానింపబడిన జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు కానూరి చిన వెంకట దాసయ్య ఈ గ్రామస్థుడే

రీ సెటిల్‌మెంట్ ఆందోళన కాలంలో ఈ గ్రామంలోని వీరపనేని గోపాలకృష్ణయ్యగారి మీద 144 సెక్షన్ విధించారు. కానూరి చినవెంకటదాసయ్యగారి మీద పన్నుల నిరాకరణోద్యమం లేవనెత్తారనే నేరం మోపి, 7–1–1932 న శిక్షించారు.

దేశాభిమాని బొబ్బా వెంకటశేషయ్యగారు 2–10–1931 న కీర్తిశేషులయ్యారు. వీరిది పేద కుటుంబం. అంచేత వారి కుటుంబానికి సహాయం చేసేందుకు బందరు ఇండియన్ డ్రమటిక్ కంపెనీ వారు "పాండవ విజయం" నాటకాన్ని గుడివాడలో ప్రదర్శించాలనుకున్నారు. నటులు వేషాలు వేసుకొని స్టేజీ మీదికి రాగానే, గుడివాడ మేజిస్ట్రేటు ఆ నాటకాన్ని 3 నెలల వరకూ ఆడరాదని నిషేధించాడు.

1932 జనవరి 24 న వీరపనేని గోపాలకృష్ణయ్య చౌదరి, దుక్కిపాటి నాగేశ్వరరావు, చలసాని నాగభూషణం, కాజ వెంకటరత్నం గార్లు బులిటిన్లు ఈ గ్రామంలో పంచిపెడుతుండగా పోలీసులు అరెస్టు చేసి, గుడివాడ తీసుకుపోయి, లాకప్‌లో వుంచి, రాత్రి 12 గంటలకి దారుణంగా కొట్టారు. వీరపనేని గోపాలకృష్ణయ్య చౌదరిగారి చెవి కొంత తెగిపోయింది.

1932 ఏప్రిల్ 28 న పికెటింగ్ కోసం బందరు వెళ్ళగా అట్లూరి జయరాంగారిని పోలీసులు లాఠీలతో కొట్టి అరెస్టు చేశారు.

1932 జూలై 31 న బెజవాడలోని ఆంధ్రరత్న భవనం మీదకు దాడిచేసిన నలుగురిలో అట్లూరి

జయరాంగారు కూడా వున్నారు. వీరికి ఒక సంవత్సరం శిక్ష, వందరూపాయలు జరిమానా విధించారు.

1932 లో తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంఘం ఒక రహస్య పత్రిక నడిపింది. ఇందులో ప్రముఖ పాత్ర వహించిన వారు వీరపనేని గోపాలకృష్ణయ్య చౌదరి కానూరి బలరామయ్య, కానూరి వెంకటరత్నం గార్లు.

1932 లో నిషేధింపబడిన ఢిల్లీ ఎ.ఐ.సి.సి. మహాసభకు ఈ గ్రామం నుంచి ప్రతినిధులుగా కానూరి బలరామయ్య, కానూరి వెంకటరత్నం, వల్లమూడి సత్యనారాయణగార్లు రహస్యంగా వెళ్లారు అక్కడికి వెళ్ళగానే పోలీసులు వీరిని అరెస్టు చేసి, 24 గంటలు కష్టడీలో వుంచుకుని వదలివేశారు.

1933 జనవరిలో ఆంధ్ర రాష్ట్ర డిక్టేటర్ల సమావేశం గుంటూరులో రహస్యంగా జరిగింది. ఈ సభకు కానూరి బలరామయ , కానూరి వెంకటరత్నం గార్లు వెళ్ళగా వారిని అరె చేసి చెరి 6 నెలల శిక్ష, 2 వేల రూపాయల జరిమా విధించారు. జరిమానా చెల్లించనందున మరో సంవత్సరం శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవిస్తుండగా వీరికి విప్లవవాదులతోను, బెంగాల్ డిటెన్యూల తోను సంబంధం ఏర్పడింది. వీరి బోధనలవల్ల రామానంచచౌదరిగారు జైలునుంచి విడుదలయ్యాక జిల్లా, రాష్ట్ర టెర్రరి ఉద్యమాలలో పాల్గొన్నారు. దేశంలోని టెర్రరి గ్రూపులను అన్నింటినీ ఒకటిగా చేర్చి, పనిచేయిందానికి సుభాష్‌బోస్ సలహా కోసం రామానంద చౌదరిగారు బెంగాల్ వెళ్ళారు ఈ రహస్య కార్యకలాపాలు గ్రహించిన ప్రభుత్వం 1933 లో ఒక నాడు రిజర్వు పోలీసు దళాన్ని ఈ గ్రామంలోకి దింపింది. వీధులవెంట పోయేవారిని లాఠీలతో చితకబాదారు జస్టిస్ పార్టీ వాడైన, గ్లాస్కో పంచె కట్టిన చావరాల రామచంద్రరావుగారిని కూడా కొట్టారు. గ్రామాలకు వార్తలు మోస్తున్న తాళ్ళూరి పంగవతి రావుగార్ని, పరికొండర్ని కొట్టారు. కానూరి బలరామయ్యగారిని నెత్తురు పచ్చేలా కొట్టారు. ఈ వూరి పెదనూతి దగ్గిర స్నానం చేస్తున్న నార్ల గౌరీశంకరరావు గార్ని పోలీసులు మంచినీళ్ళు తాగుటకు తొక్కిన యివ్వమని అడిగారు. ఆయన ఇవ్వకపోగా దాన్ని నూతిలో పడేశాడు. ఆయన్ని కొట్టారు.

రామానందచౌదరి కోసం, ఆయన తండ్రి కానూరి దామోదరయ్యగారి ఇ సోదా చేశారు. ఆయన దొరక్కపోగా, నిషి వాఙ్మయమైనా దొరకలేదు. ఇలాగే ఇంకా చాలా ఇ సోదా చేశారు.

1933 మార్చి 19 నిషేధ కరపత్రాలు దొరుకుతాయేమోనని బందరులోని నార్ల వెంకటేశ్వరరావుగారి ఇంటిని సోదా చేశారు. ఏమీ దొరకలేదు.

నార్లవారు "జన్మభూమి" పత్రికకు పంపనున్న వ్యాసాన్ని చూసి పోలీసులు మండిపడ్డారు ఆయన్ని ఊరి బయటకు తీసుకుపోయి, తెలివి తప్పేలా కొట్టి ఒక పొదలోకి ఈడ్చారు.

రామానంద చౌదరిగారిని "మద్రాసు కుట్ర కేసు" లో 1933 లో 4 ఏళ్ళ కఠిన శిక్ష విధించారు. తిరుచునాపల్లి జైలులో శిక్ష అనుభవిస్తుండగా, అక్కడి జైలు వార్డెన్ అసభ్యంగా ప్రవర్తించడంతో. అందుకు అసమ్మతిగా 65 రోజులు కఠోర నిరాహారదీక్ష పూనారు. ఆ దీక్ష మానివేయాల్సిందిగా గాంధీ కోరినా, ఆయన వినలేదు. జైలు అధికారులు కొన్ని సౌకర్యాలు సమకూర్చగా దీక్ష విరమించారు.

గాంధీ హరిజన నిధి కోసం ఈ జిల్లాలోని గ్రామాలు తిరుగుతూ 1933 డిసెంబరు 17 న కొత్తవరం కూడా వచ్చారు. అప్పుడు ఈ గ్రామస్థులు రు. 1116 పోగుచేసి యిచ్చారు. అంతేకాక కొంత మంది స్త్రీలు బంగారు నగలు యిచ్చారు. ముఖ్యంగా నార్ల వెంకటేశ్వరరావుగారి తల్లి మాచమ్మగారు, తన చేతి బంగారు గాజులు గాంధీకి సమర్పించారు.

1932 లో తూర్పు కృష్ణాజిల్లా హరిజన సేవా సంఘం ఏర్పడింది. దీని కార్యాలయం వీరపనేని గోపాలకృష్ణయ్యగారి ఇంటివద్దనే వుండేది. దీనికి కార్యదర్శిగా వుండి ఈయన హరిజన హాస్టల్సు, పగలు, రాత్రి పాఠశాలలు నెలకొల్పి హరిజనోద్ధరణకు ఎక్కువ కృషి చేశారు, 1942 వరకూ ఈ సంఘం కృషి చేసింది. రాష్ట్ర సంఘం నుంచి గాని, ప్రజలనుంచి గాని, ప్రభుత్వం నుంచి గాని సుమారు 50 వేల రూపాయలు వసూలు చేసి హరిజనోద్ధరణకు కృషి చేశారు.

1935 డిసెంబరులో బందరులో అతి వైభవంగా కాంగ్రెసు సంస్థ స్వర్ణోత్సవాలు జరిగాయి. ఉత్సవాలకు వెళుతూ బాబూరాజేంద్రప్రసాద్‌గారు దారిలో

కొతవరం విచ్చేశారు. వారిని ఘనంగా సన్మానించారు.

1937 లో అసెంబ్లీ జనరల్ ఎన్నికల ప్రచారానికి నెహ్రూ గుడివాడ వరకు వచ్చారు. ఎస్. ఎ. డాంగే తన కుమార్తెతో కపుతరం వచ్చి కరాచీ కాంగ్రెస్ తీర్మాన ప్రాముఖ్యం గురించి సోషలిజం గురించి ఉపన్యసించారు.

వ్యక్తి సత్యాగ్రహంలో 1940 లో పాల్గొనగా, బొబ్బా ఆదినారాయణమూర్తిగారికి 6 నెలల కఠిన శిక్ష, రు. 100 జరిమానా, వీరపనేని గోపాలకృష్ణయ్య చౌదరిగారికి 3 నెలల శిక్ష రు 200 జరిమానా విధించి 'బి' క్లాసు యిచ్చారు.

1939 లో వాలంటీర్ల శిక్షణా శిబిరం – గన్నవరంలో జరగబోయే ఆంధ్ర రాష్ట్ర రైతు మహాసభ నిర్వహణ కొరకు కొతవరంలో "కృష్ణాజిల్లా రైతు సంఘం" తరపున వాలంటీర్ల శిక్షణా శిబిరం నిర్వహించారు. దీని నిర్వహణ బాధ్యత కానూరి బలరామయ్య, పామిరెడ్డి వెంకట సుబ్బారె (దోకిపర్రు) గార్లు వహించారు. నెల్లాళ్ళు వలంటీర్లకు కవాతు, రాజకీయ పాఠాలు నేర్పారు. ఈ శిబిరంలో రైతు యువకులు 40 మంది శిక్షణ పొందారు. వీరిలో వల్లమూడి బ్రహ్మానందరావు, తాళ్ళూరి మంగపతిరావు, బొబ్బా ఆదినారాయణమూర్తి మొదలైనవారు 10 మంది వున్నారు. చంద్ర రాజేశ్వరరావు, మునిపల్లె రామారావు బి ఎ. బి. ఎల్ గార్లు ఉపాధ్యాయులుగా పని చేశారు ఆచార్యరంగాగారు ఈ శిబిర పర్యవేక్షణ చేశారు.

ప్రథమ ఆంధ్ర రాష్ట్ర యువజన మహాసభ 1937 లో బందరు మినర్వా హాలులో జరిగింది. ఆహ్వాన సంఘ అధ్యక్షులు కానూరి రామానందం చౌదరిగారు, మహాసభ అధ్యక్షులు కాట్రగడ్డ వెంకట నారాయణరావుగారు, సభా ప్రారంభకులు ప్రముఖ సోషలిస్టు నాయకుడు బాట్లివాలా, ఈ సభ నిర్వహణలో గట్టి కృషిచేసిన వారు, కానూరి బలరామయ్య. కానూరి రామానందం చౌదరి. వల్లమూడి సత్యనారాయణ గార్లు.

1941 లో పమిడిముక్కల గ్రామంలో జరిగిన జిల్లా రైతు మహాసభకు కానూరి బలరామయ్యగారు అధ్యక్షులు. తూర్పు కృష్ణాజిల్లా రైతు కాంగ్రెస్‌కు కానూరి చినవెంకట దాసయ్యగారు అధ్యక్షులు.

క్విట్ ఇండియా ఉద్యమంలో – బంటుమిల్లి సౌత్ సైడ్‌చానల్ మీది టెలిఫోన్ తీగెలు తెంచారని 1. బొబ్బా ఆదినారాయణమూర్తి, 2. వీరపనేని గోపాలకృష్ణయ్య చౌదరి, 3. బొబ్బా మధుసూదన రావు, 4. వల్లమూడి శ్రీకృష్ణమూర్తి. 5. వల్లమూడి నరసింహారావు, 6. బొబ్బా శేషగిరిరావు, 7. బొబ్బా వీరభద్రరావు, 8. వల్లమూడి కోటయ్య, 9. బొబ్బా దశరథ రామయ్య, 10 కొల్లి గంగాధరరావు, 11. బొబ్బా వెంకటేశ్వరరావు, (తండ్రి భూషయ్య) 12. నిమ్మగడ్డ షన్ముఖాచారి, 13. రొంపిచర్ల మాధవాచార్యులు, 14. బొబ్బా అంకప్ప (హరిజనుడు) 15. వల్లమూడి జానకి రామయ్యగార్లు మొత్తం 15 మందిని అరెస్టు చేసి గుడివాడ తీసుకు వెళ్ళారు. వీరిలో బొబ్బా ఆదినారాయణమూర్తి, బొబ్బా మధుసూదనరావు, వల్లమూడి శ్రీకృష్ణమూర్తికి ఒక్కొక్కరికి 2 ఏళ్ళ కఠినశిక్ష, 12 కొరడా దెబ్బలు విధించగా అనుభవించారు. మిగతావారిని వదలివేశారు.

ఓనాడు రాత్రి సమరయోధులకు భోజనం పెట్టారన్న కారణంతో కానూరి చినవెంకట దాసయ్యగారిని అరెస్టు చేసి 2 ఏళ్ళ కఠిన శిక్ష విధించారు. వీరు సబ్‌జైలులో నిరాహారదీక్ష పూనగా. వీరి పత్ని రాఘవమ్మగారు మేజిస్ట్రేటు ఎదుట నిలబడి, "ప్రభుత్వం మాది, ఉద్యోగం నుంచి వైదొలగండి" అని హెచ్చరించగా ఆమెకు ఒక సంవత్సరం కఠినశిక్ష విధించారు. వీరు ఇద్దరూ పూర్తిగా శిక్షలు అనుభవించారు.

1948 లో నైజాంలో రజాకార్ల దురంతాలు పెచ్చు పెరిగి వున్నపుడు, వాటిని లెక్క చేయకుండా, అక్కడ జనపవిత్రులను చౌకగా కొని తులకు సప్లయిచేయాలని కానూరి చిన వెంకట దాసయ్యగారు ప్రముఖ వర్తకుడు ఆలపాటి కుటుంబరావుగారి ద్వారా ఖమ్మం పట్టణం వెళ్ళారు. వీరితోపాటు బొబ్బా ఆదినారాయణ మూర్తిగారు కూడా వున్నారు. వీరిద్దరూ ఖమ్మం చేరగానే రజాకర్లు పట్టుకుని, వీరి మెడలలో వేపమండలు కట్టి చంపడానికి తీసుకువెళుతున్నారు. ఈ విషయం ఆలపాటి కుటుంబరావుగారికి తెలిసి, ఆయనకు తెలి

సిన ఖమ్మం మున్సిపల్ కౌన్సిలర్ సాయంతో వాళ్ళిద్దరినీ విడిపించారు.

రైతులకు – వారి భూమి విస్తీర్ణం, కట్టాల్సిన శిస్తు, బాకీ మొదలైనవి తెలిపే డిమాండ్ నోటీసులు ఇచ్చాకే శిస్తు వసూళ్ళు చేయాలని ప్రభుత్వానికి వీరు అనేకసార్లు విజ్ఞప్తులు చేశారు. ప్రజలతో ఆందోళన చేయించారు. తాను శిస్తులు కట్టకుండా జప్తులు, వేలములు వేయించుకున్నాకే శిస్తులు కట్టేవారు.

కానూరి చినవెంకట దాసయ్యగారు ఇలా ప్రజా సమస్యల్ని పరిష్కరించడంలో ఎలాంటి ఇబ్బందులైనా అనుభవించి ప్రజల సేవ చేశారు.

## వెంట్రప్రగడ

గుడివాడ తాలూకా వెంట్రప్రగడ గ్రామంలో 1932 సత్యాగ్రహ ఉద్యమం పెద్ద ఎత్తున జరిగింది.

మహాత్మా గాంధీ పిలుపు నందుకుని ఈ గ్రామ యువకులు 26 మంది సత్యాగ్రహ వాలంటీరు దళంలో చేరారు. వీరు 4 గ్రూపులుగా చీలి పరిసర గ్రామాలలో జెండాలు, 'స్వాతంత్ర్యం మన జన్మ హక్కు' అనే బ్యానర్లు పట్టుకుని ప్రచారం చేశారు. అనేకచో జండాలు స్థాపించారు. బ్రిటిష్ సామ్రాజ్యపు ది బొమ్మ తయారుచేసి వెంట్రప్రగడలో తగలబెట్టా . విదేశీ వస్త్రాలు గుట్టగాపోసి నిప్పు అంటించారు. "స్వాతంత్ర్యం మా జన్మ హక్కు. పరాయి పాలకులను తరిమి వేయాలి" అనే నినాదాలు తారుతో వంతెనల మీదా, గోడల మీదా రాశారు.

ఈ గ్రామంలో 400 మందిని కాంగ్రెసు సభ్యులుగా చేర్పించారు.

జనవరి రెండో వారంలో రెండు బస్సుల నిండా పోలీసులు వచ్చి జెండాలు పీకి వేశారు. తారుతో రాసిన నినాదాల్ని కిరసనాయిలు రుద్ది చెరిపివేశారు. అయినా అవి పూర్తిగా పోలేదు. 15 మంది వాలంటీర్లను పట్టుకుని, గ్రామం మధ్యలో చేర్చి, చితక బాదారు. వాలంటీర్లు కాని వారు, అరెస్టు కావాలనే ఉద్దేశంతో వచ్చి వాలంటీర్లతో పాటు నిలబడ్డారు. వారిని అరెస్టు చేయకుండా లాఠీలతో కొట్టారు.

ఈ పోలీసు చర్యకు ప్రతి చర్యగా ఆనాటి రాత్రి దెబ్బలు తిన్న వాలంటీర్లతోపాటు మరికొందరు యువకులు చేరారు. పది సైకిళ్ళ మీద రెండు ముఠాలుగా బయలుదేరి వెళ్ళారు. ఒక దళం వెంట్రప్రగడ నుంచి గుడివాడ వరకూ, అటు జొన్నపాడు వరకూ అన్ని వంతెనల మీదా, పాఠశాలల గోడల మీదా "స్వాతంత్ర్యం మన జన్మహక్కు. బ్రిటిష్ వాళ్ళని తరిమికొట్టాలి" అనే నినాదాలు రాశారు. రెండో దళం వారు గుడివాడదాకా దారి పొడవునా రావి, తాటిచెట్ల పైన జండాలు కట్టారు.

తారుతో రాసిన నినాదాల్ని చెరిపివేయడానికి, చెట్లపై జండాలు తొలగించడానికి, పోలీసులకి రెండు రోజుల పని పట్టింది.

ఆ తర్వాత వాలంటీర్ల కోసం 4, 5 రోజులు వరసగా గాలించారు కాని ఒక్కరూ దొరకలేదు.

మద్దుకూరి చం॥ శేఖరరావు, కొసరాజు శేషయ్య, గద్దె లింగయ్యగా కాంగ్రెసు ఆధ్వర్యాన నడుపుతున్న 'రెడీ' బులెటెన్ ప్రతులు రాత్రికి రాత్రే అనేక గ్రామాల్లో ప్రత్యక్షమయ్యేవి. దాంతో వెంట్రప్రగడ, ముదునూరు, రావులపాడు, పాములపాడు, వానపాముల గ్రామాల్లోని సుమారు 50 మందిని నిర్బంధంలోకి తీసుకున్నారు. అయినా బులిటెన్ ప్రచారం ఆగలేదు. అంతేకాక టెలిఫోన్, టెలిగ్రాఫ్ తీగలు తెగగొట్టారు

అప్పుడు పోలీసు ఆఫీసర్లు గ్రామాలలోని పెద్దల్ని పిలిపించి, "మీరే వాలంటీ ను పట్టుకుని మాకు అప్పగించాలి, లేకపోతే మీ ' . మూలపై ప్యూనిటివ్ పన్ను వేస్తాం" అని బెదిరించా . అయినా పెద్దలు ఎవరూ కలుగచేసుకోలేదు.

పోలీసులు రాత్రంతా వెంట్రప్రగడ, ముదునూరు మధ్య పొలాలు, తోటలు, డొంకలూ కాపలాకాయడం సాగించారు. ఓనాడు అన్నే అంజయ్యగారి తోటలో చొరబడి, అక్కడి నౌకర్లని బెదిరించారు. ఓ పాకలో పాత బులిటెన్లు దొరకగా, త్రొక్కిపడి వెళ్ళిపోయారు. అయినా తెల్లారేసరికి కొత్త బులిటెన్లు రానేవచ్చాయి.

వెంట్రప్రగడ ట్రావెలర్సు బంగళాలో ఆంగ్లో ఇండియన్ సార్జెంటు కింద రిజర్వు పోలీసు దళాన్ని స్థిరంగా వుంచారు.

గ్రామస్థులందరినుంచీ నిర్బంధంగా పన్నువసూలు మొదలు పెట్టారు. పన్ను యివ్వనివారి యిళ్ళ తలుపులు పీకి వేలం వేయగా, వాటిని పాడేవారేలేరు. చివరకు వాటిని, కనీస ధరలకు వెట్టివాళ్ళకు అంటగట్టారు.

పాపం ! వాళ్ళు అవి తీసుకుపోయి ఇళ్ళ యజమానుల కిచ్చివేశారు.

రెడీ పత్రిక ఎక్కడి నుంచి వెలువడుతున్నదో చెప్పమని పోలీసులు ముదునూరు, వెంట్రప్రగడ మొదలైన గ్రామాలలో కనపడ్డ ప్రతి యువకుణ్ణి లాఠీలతో కొట్టారు. మదునూరి చంద్రశేఖరరావుగారిని ఒక ఇంగ్లీషు పోలీసు సార్జంటు దారుణంగా కొట్టారు. ఈ అమానుషత్వం చూసి సహించలేని అతడి భార్య సైతం చంద్రంగారిని పరామర్శించింది.

## జమిగొల్వేపల్లి

1922 లో డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య గారి అధ్యక్షతన జమిగొల్వేపల్లిలో ఒక సభ జరిగింది. ఆ రోజుల్లో కాంగ్రెసు సందేశాన్ని వివిధ గ్రామాల్లో పట్టాభి, చెరుకువాడ నరసింహం మొదలైన వారు సభలలో వినిపించుతూ వచ్చారు. ముట్నూరు కృష్ణారావుగారి కృష్ణా పత్రికలోని రాతలు, గుడివాడ పరిసర ప్రాంతాలలో పెల్లుబుకుతున్న చైతన్యం ఈ గ్రామస్తులపై పడింది. తరువాత గ్రామ కరణీకానికి రాజీనామా యిచ్చిన అదూరి సోమసూర్యప్రకాశరావు 15, 20 ఖాదీనేత మగ్గాలుపెట్టి వడుకు నూలు ఉత్పత్తిని ప్రోత్సాహపరచారు. దీనికి సహాయ సహకారాలు అందచేసిన వ భనేని రామబ్రహ్మంగారు పిన్నవయస్సులోనే ఇంగ్లీషు విద్యను బహిష్కరించారు. ఖాదీ నేతమగ్గాల పాటు 400 రాట్నాలు కూడా నెలకొల్పబడ్డాయి ఈ గ్రామంలో. కృష్ణాజిల్లాలో పన్నుల నిరాకరణోద్యమం ప్రారంభించాలని నిర్ణయించినపుడు ఈ గ్రామస్థులెవ్వరూ పన్నులు చెల్లించలేదు. ఆ ఉద్యమాన్ని ఆపివేసి, పన్నుల్ని చెల్లించవలసిందిగా, కాంగ్రెస్ ఆదేశించిన పిమ్మటే యీ గ్రామస్తులు పన్నులు చెల్లించారు. తర్వాత కాలంలో జిల్లా జాతీయోద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన రామబ్రహ్మంగారు హిందీ విద్యా భ్యా సా ని కీ, గ్రామంలో నాట్య ప్రదర్శనలకూ ప్రోత్సాహం యిచ్చారు. వేణుగోపాలస్వామి ఆలయం వ్యవహారాలను క్రమబద్ధం చేయడంలో కృషి చేశారు. 1929లో గాంధీ కృష్ణాజిల్లాలో ఖద్దరు ప్రచార యాత్ర ప్రారంభించినపుడు ఈయన సహకారం, గాంధీ పర్యటన దిగ్విజయం కావడానికి ఎంతో తోడ్పడింది. గుడివాడ నుంచి ఉయ్యూరు, కైకలూరు, బందరు, ఏలూరు, చింతలపూడి, తిరువూరు మొదలైనచోట్లకు బస్సులు నడిపిన అనుభవం, చిన్నకార్లకు ట్రక్కులకు ఏజంటుగా ఉన్న రోజుల్లో కార్లు నడిపిన అనుభవం గాంధీ పర్యటనలో ఎంతో ఉపయోగపడింది.

గాంధీ తూర్పు కృష్ణాజిల్లాపర్యటనలో రామబ్రహ్మం గారు కొత్తగా కొన్న కారును ఉపయోగించారు. కారు నడిపేది కూడా ఆయనే. ఆ రోజుల్లో రహదారులు అంత సౌకర్యంగా ఉండేవికావు. అందులో నిర్ణీత సమయానికి గ్రామాలకు గాంధీని చేర్చడం కష్టమైన పని. అయినా ఈ పనిని నిర్వర్తించి గాంధీ ప్రశంసలను పొందారు రామబ్రహ్మంగారు. ఒకోసారి 60 మైళ్ళ వేగంతో కారు నడిపి గమ్యస్థానం చేరేవాడు. కైకలూరులో రైల్వే స్టేషన్‌వద్ద జరిగిన సభలో అల్లరిచేసి, కారుచుట్టుముట్టిన గుంపు నుంచి నేర్పుగా తప్పించారు రామబ్రహ్మంగారు. కైకలూరు వాస్తవ్యులు కొందరు కాంగ్రెసు వ్యతిరేక నినాదాలు చేస్తూ గాంధీగారి కారును ముందుకు సాగనివ్వలేదు. ఆ సమయంలో కూడా రామబ్రహ్మంగారు శాంతంతో ఆ అల్లరి మూకనుంచి కారును, నేర్పుతో తప్పించి ఊరు వెలుపలికి చేర్చారు. ఈ సంఘటనలతోపాటు జమిగొల్వేపల్లి గ్రామం పేరు కూడా ప్రచారంలోకి వచ్చింది.

గాంధీ గొల్వేపల్లికి వచ్చినపుడు తోరణాలతో జాతీయ పతాకాలతో అలంకరించారు. వందలాది స్వచ్ఛంద సేవకులు జయజయధ్వానాలతో స్వాగతం చెప్పారు. కారు సీటు పై భాగంలో కూర్చుని గాంధీ ఉపన్యసించాడు. గ్రామస్థుల తరఫున రామబ్రహ్మంగారు రు. 1209-10-3 పై. ఖద్దరు నిధికి సమర్పించారు.

## ఉప్పు సత్యాగ్రహం

ఉప్పు సత్యాగ్రహ కాలంలో బందరు దగ్గర చిన్నాపురంలో శిబిరం ఏర్పాటు చేశారు జిల్లాలో వివిధ ప్రాంతాల నుండి బందరు చేరిన సత్యాగ్రహులను తన స్వంత బస్సులలో చిన్నాపురం చేర్పించారు రామబ్రహ్మంగారు. సర్వీస్ బస్సుల్ని యితర రూట్లలో నడిపారని నేరంమోపి, రు. 300 వసూలు చేసింది ప్రభుత్వం. బస్సుల లైసెన్సులనన్నిటినీ

రద్దు చేసింది. బస్సు డ్రయివర్ అన్నె వెంకట శివుడుగారికి 4 నెలలు శిక్ష విధించి. రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపింది.

రామబ్రహ్మంగారి దళం, అనేక గ్రామాల్లో ప్రచారంచేసి జమీగొల్వేపల్లి చేరింది. అది కేంద్రంగా పనిచేయడం ప్రారంభించింది. అడ్డాడ గ్రామంలో కల్లుపాకలముందు పికెటింగ్ జరిపారు. సంతృప్తి కరమైన ఫలితం కల్గలేదు. కొమరవోలులో కల్లుగీసే తాడిచెట్ల గెలలు నరికారు. 1930 జనవరి 30 న వీరందరినీ అరెస్టుచేసి 6 నెలల కఠినశిక్ష విధించి, సి క్లాసు ఇచ్చారు. అరెస్టయిన వారిలో అరెకపూడి కోటయ్య, రాళ్ళబండి దుర్గా నాగేశ్వరరావు, కొమ్మ సత్యనారాయణ, నన్నపనేని పున్నయ్య, మోటూరి వెంకట చలపతిరావు, వల్లభనేని వెంకట కృష్ణయ్య గార్లు వున్నారు. రాత్రిపూట వీరందరినీ గుడివాడ నుండి రాజమండ్రికి ప్రజలకంట బడకుండా తీసుకు పోయింది ప్రభుత్వం.

వల్లభనేని రామబ్రహ్మంగారిని, రాజమండ్రినుండి బరంపురం జైలుకు మార్చింది. అక్కడ విడుదలైన రోజున బరంపురంలో తిరగరాదని ప్రభుత్వం అడ్డు పెట్టింది. సత్యాగ్రహంచేసి, బరంపురంలో స్వేచ్ఛగా తిరిగే హక్కు సంపాదించుకొన్నారు.

ఇలాగే గాంధీ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సునుండి బొంబాయి వచ్చినపుడు, వారికి అక్కడ స్వాగతం చెప్పేందుకు కృష్ణాజిల్లా తరఫున బొంబాయి వెళ్ళే టపుడు — ఇల్లువిడిచి పోరాదంటూ రామబ్రహ్మం గారికి 144 సెక్షన్ విధించితే, ధిక్కరించారు.

బళ్ళారినుంచి విడుదలైన మోటూరి వెంకట చలపతిరావు, రామబ్రహ్మంగార్లకు గ్రామస్థులు ఘనస్వాగతం చెప్పారు 1930 లో కొంతమంది బాలురతో కలిసి విదేశీ వస్త్రాలను పోగుచేసి, దహనంచేసిన వారిలో కాట్రగడ్డ రాజగోపాలరావు గారు ఒకరు.

1931 జనవరి 26 న స్వాతంత్ర్య దినోత్సవాన్ని పురస్కరించుకొని, వల్లభనేని రామబ్రహ్మంగారు, కురుమద్దాలి వాస్తవ్యులు గుళ్ళపల్లి రామబ్రహ్మంగారు బందరులో 144 సెక్షన్ ధిక్కరించగా పోలీసులు ఘోరంగా లాఠీఛార్జి చేశారు. వల్లభనేని రామ బ్రహ్మంగారికి 3 మాసాలు కఠినశిక్ష విధింప బడింది.

గాంధీ — ఇర్విన్ ఒడంబడికను అనుసరించి దేశంలోని ఇతర సత్యాగ్రహులలాగానే రామ బ్రహ్మంగారు విడుదలయ్యారు.

## గుడివాడ శిబిరంలో

గుడివాడలో సత్యాగ్రహ శిబిరం ఏర్పాటుచేయ బడింది. రామబ్రహ్మంగారు, ఆయన భార్య సీతా మహాలక్ష్మమ్మ, కేతవరపు లక్ష్మీనరసింహారావు (ప్లీడరు), డాక్టరు ముదునూరు గుర్రాజు, గోను గుంట సుబ్రహ్మణ్యగుప్త, మూడె రామారావు మొదలైనవారు, మరికొందరు వాలంటీర్లు 50 మంది దాకా ఉన్నారు. వీరిలో మహిళా వలంటీర్లు కూడా వున్నారు. సత్యాగ్రహులు కల్లుపాకలవద్ద, విదేశ వస్త్ర దుకాణాలవద్ద, పికెటింగ్ కొనసాగించారు. విదేశవస్త్ర దుకాణదార్లు తమ దుకాణాలు మూసివేయ డానికి అంగీకరించారు. జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు కానూరి వెంకట దాసయ్య ఈ శిబిరాన్ని పర్యవేక్షిం చుతూ ఉండేవారు. ఈ శిబిరంనుంచి జమీగొల్వేపల్లి వాస్తవ్యులు సీతామహాలక్ష్మమ్మగారేకాక, పొట్లూరి పున్నమ్మ, యశోదమ్మ, చెరుకూరి సౌభాగ్యమ్మ, గుమ్మడి వెంకమ్మగార్లు ఇంకా కొందరు పికెటింగులో పాల్గొన్నారు.

తూర్పు కృష్ణాజిల్లా సత్యాగ్రహుల మహాసభ జమీగొల్వేపల్లిలో 1931 లో జరిగింది. దుగ్గిరాల కమలమ్మ జాతీయపతాకను ఆవిష్కరించారు. ఊరేగింపు జరుగుతుండగా భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌ల ఉరి వార్త చేరింది. ఊరేగింపులోని వారంతా నల్లబాడ్జీలు ధరించి, ఊరేగింపు పూర్తిచేసి సభ ముగించారు. భగత్‌సింగ్ ఆయన సహచరుల మృతికి సంతాపం వెలిబుచ్చారు.

1932 శాసనోల్లంఘన ఉద్యమంలో బందరులో వల్లభనేని రామబ్రహ్మంగారికి రెండేళ్ళ కఠినశిక్ష, వెయ్యి రూపాయల జరిమానా విధింపబడింది. సీతా మహాలక్ష్మమ్మగారికి సంవత్సరం కఠినశిక్ష విధించ బడింది. జైలుశిక్ష విధించేముందు, ఆమెనూ, ఆమెతోపాటు పికెటింగ్ చేస్తున్న మహిళలను,

ఖరద, కారం, రంగునీళ్ళుచల్లి హింసించిన ఘటన లను వేరొకచోట ప్రస్తావించాం.

వ్యష్టి సత్యాగ్రహోద్యమంలో కూడా వల్లభనేని దంపతులిద్దరూ శిక్షింపబడ్డారు. క్విట్ ఇండియా ఉద్యమంలో డిటెన్యూగా తీసుకుపోబడిన రామ బ్రహ్మంగారు 1945 వరకూ వివిధ జైళ్ళలో ఉన్నారు.

1932 లో ఈ దంపతులేకాక పొట్లూరి పున్నమ్మ, యశోదమ్మ, చెరుకూరి సౌభాగ్యమ్మ శిక్షింప బడ్డారు.

## అంగలూరు

ఆరెకపూడి నాగభూషణంగారు 1920 లో కల్లు పాకలవద్ద మద్యనిషేధ ప్రచారం చేస్తుండగా పోలీసు క డీలోకి తీసుకుని మర్నాడు వదలి పెట్టారు. ఆ తర్వాత ఖ ద్దరుధారణ, అంటరానితనం నిర్మూలన మొదలైన - గ్రెస్ కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

1930 ఏప్రిల్ 2 న బందరు సత్యాగ్రహ శిబిరంలో చేరి, శిబిరాధిపతి ఆదేశానుసారం గుడివాడ, బందరు, కైకలూరు తాలూకాలలో ఉద్యమప్రచారం చేశారు. అంగలూరులోను, ఆ చుట్టు గ్రామాలలోను తాటి గెలలు నరుకగా, ఆరెకపూడి కోటయ్య, ఆరెకపూడి నాగభూషణం, హరి వాసులు, దుగ్గిరాల అమర ప్రసాదరావుగార్లను నిర్బంధించుటకు పోలీసులు పే , ఇళ్ళు అడుగగా ఎవరూ చెప్పలేదు. అందు వ వీరందరూ పోలీసుల ఎదుట తిరుగుతున్నప్పటికీ ప కోలేక పోయారు. చివరకు జిల్లాసంఘం నుంచి వ చ్చిన ఆదేశంతో, వేలకొద్దీ జనం వీరిని అంగలూరు నుంచి గుడివాడకు వూరేగింపుగా తీసుకువెళ్ళి పోలీసు స్టేషనుకు అప్పగించారు. వీరు నేరం అంగీకరించినా సాక్ష్యం దొరకనందువల్ల, నాలుగు రోజుల తర్వాత ఒక గుర్రపుబండివానిని బెదిరించి 9 నెలలు జైలు శిక్ష, 50 రూ. జరిమానా విధించారు. ఆ తర్వాత సత్యాగ్రహులుగా పేర్లుయిచ్చినవారి నందర్నీ నిర్బం ధించి జైలుకు పంపారు.

తరువాత 1931 ఆఖరులో నాగభూషణంగార్ని విడుదల చేయగా, వీరికన్నా ముందు విడుదలైన వారిని చైతన్యవంతుల్నిచేసి, తిరిగి సత్యాగ్రహం చేశారు వీరితోపాటు మరో నలుగురిని నిర్బంధించి 6 నెలలు జైలుశిక్ష విధించారు. గాంధీ – ఇర్విన్ ఒడంబడికతో అందర్నీ విడుదల చేశారు.

1931 చివరలో వీరు, సాధు (ఎర్నేని) సుబ్ర హ్మణ్యంగారి దగ్గరకు సలహాకోసం వెళ్ళారు. ఆయన ఆశ్రమవాసులందరూ నిర్బంధింపబడేవరకూ వీరిని అజ్ఞాతవాసంలో ఉండమని కోరారు ఆశ్రమ వాసులందర్నీ నిర్బంధించాక, నాగభూషణంగారు అంగలూరు వెళ్ళారు. అక్కడ వీరి సోదరి తిపిరనేని కౌసల్యగారు, వీరి భార్య ఉషామణిగారు కూడా సత్యాగ్రహం చేస్తామని చెప్పారు. వీరు జెండాలు పట్టుకుని నినాదాలు చేస్తూ, ఆ చుట్టుపక్కల గ్రామాలు తిరుగుతుండగా, పోలీసులు కూడా వీరితోపాటు తిరిగారు. కాని ఏమీ అనలేదు. ఈ సమాచారం తెలిసి శ్రీ వల్లభనేని రామబ్రహ్మంగారు, గోనుగుంట సుబ్రహ్మణ్యంగారు అంగలూరు వచ్చారు. వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ, గోనుగుంట్ల లక్ష్మినరసమ్మ గార్లను పంపారు. వీరు నలుగురూ కలిసి ప్రచారం చేస్తున్నా సర్కిల్ ఇన్స్పెక్టరుతో సహా వందల సంఖ్యలో ఉన్న పోలీసులు ఆ గ్రామంలోవుండి, వారిని ఏమీఅనలేదు. అప్పుడు నాగభూషణంగారు వారిని గుడివాడ వెళ్ళి విదేశీ వస్త్ర బహిష్కరణకు పికెటింగ్ చెయ్యమని చెప్పారు.

పికెటింగు చేస్తుండగా, బస్సులలో పోలీసులు వచ్చి పిచికారీలతో మురికినీరు వారి ముఖాలమీద కొట్టి గుడవాడకు 8, 10 మైళ్ళదూరంలో రోడ్లమీద ఒక్కొ క్కర్ని ఒంటరిగా వదలివస్తూ, హింసించారు. ఈ విధంగా నాలుగురోజులు చేశారు. ఈ నాలుగు రోజులు నాగభూషణంగారు వారి వెంటవుండి, వారిని అంగలూరు చేర్చేవారు. ఐదవరోజున కౌసల్య, ఉషామణిగార్లు స్పృహతప్పి బజారులోనే పడి పోయారు. ఈ నలుగుర్నీ పోలీసులే ఆస్పత్రిలో చేర్పించారు.

ఆస్పత్రి డాక్టరుగారు "రెండు మూడురోజులు మీరింకా ఇలాచేస్తే ప్రాణాలు పోగొట్టుకోవలసి వస్తుంది కాబట్టి 10 రోజులు యిక్కడే వుండండి. బలం వచ్చేలా చేసి పంపుతాను" అని చెప్పారు. కాని కౌసల్యగారి పట్టుదలవల్ల చేరిన 6 వ నాడే మళ్ళీ పికెటింగుకు వెళ్లారు. కాని ఈ పర్యాయం పోలీసులు నీళ్ళు కొట్టడం మానివేసి బస్సులలో

ఎక్కించుకొని 8, 10 మైళ్ళ దూరంలో వీరిని వదలి పెట్టి వచ్చేవారు.

వీరిలో కౌసల్యగారికి సంగీతం కూడా వచ్చును కనుక జాతీయగీతాలు ఆమె పాడేవారు. ఒక రోజున ఆమెకు జ్వరం రాగా, 11 ఏళ్ళ సుగుణమణిగారు పాటలు పాడుటకు వెళ్ళారు. ఆనాటినుంచీ ఆమె 5 వ సత్యాగ్రహి అయ్యారు. ఆ తర్వాత నాగభూషణంగారి తల్లి అరెకపూడి మాణిక్యంగారు 6 వ సత్యాగ్రహి అయినది. ఇది చూసి ఆమె వయసు గల మహాలక్ష్మమ్మగారు 7 వ సత్యాగ్రహి అయినది. ఆ తర్వాత సాధు సుబ్రహ్మణ్యంగారి మేనకోడళ్ళు, సుగుణమణి వయస్సువారు, వారితో చేరారు. ఆ తర్వాత కోనేరు వీరరాఘవయ్య దంపతులు, ఘంటా వీరరాఘవయ్య దంపతులు వచ్చి చేరారు దానితో అది ఒక సత్యాగ్రహ శిబిరంగా మారింది

ప్రతిరోజూ నగర సంకీర్తనలు చేస్తూ నలుగురు చొప్పున గుడివాడ వెళ్ళేవారు. ఒకరోజున పోలీసులు శిబిరంలో హింసాకాండ సాగించి వీరరాఘవయ్య, రఘురామయ్య, మాగంటి వెంకటకృష్ణయ్యగార్లను తీవ్రంగా లాఠీఛార్జీ చేసి, వారిని బైటకు వెళ్ళగొట్టి, ఇంటికి తాళం వేశారు. అప్పుడు వారు చెరువుకట్టపై వంట చేసుకుని తిన్నారు.

1931 లో ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్ మాసాలలో 2 నెలల 15 రోజుల తర్వాత శిబిరవాసుల నందర్నీ నిర్బంధించి, మొత్తం 30 మందికి ఒక సంవత్సరం శిక్ష విధించారు. సుగుణమణిగారికి మాత్రం 2 సంవత్సరాల శిక్ష విధించారు కాని ఒక సంవత్సరం శిక్ష అనుభవించాక, ఆమెను ఇంటికి తీసుకువచ్చి అప్పగించారు.

ఉద్యమం రోజులలో నాగభూషణంగారు పోలీసు బస్సులకు తరుచుగా ఎదురు వెళ్ళుతుండడంతో, పోలీసులు కొట్టి క్రింద పడవేసి తన్నేవారు.

1931 మార్చిలో 15 రోజులు, ఏప్రిల్‌లో 8 రోజులు సబ్‌జైలులో వుంచి వదిలివేశారు.

కొన్నాళ్ళు వీరు ఎర్నేని సూర్యనారాయణగారి ఇంట్లో భోజనం చేయటంవల్ల వారి ఇల్లు పీకివేశారు.

1932 జనవరి 26 న స్వాతంత్ర్యదినోత్సవం జరిపి జెండా ఎగురవేసినప్పుడు తీవ్రమైన లాఠీఛార్జీ జరిగింది. నాగభూషణంగారి రెండు చూపుడువేళ్ళ ఎముకలు విరిగినవి, పిక్కలు, జబ్బలు, కీళ్ళకు లాఠీ దెబ్బలు తగులుటవల్ల ఆయన నాలుగు రోజులు మంచం దిగలేకపోయారు.

## గుడివాడ తాలూకాలో

1931 నుండి 1942 వరకు జరిగిన స్వాతంత్ర్య ఉద్యమాల్లో గుడివాడతాలూకాలో కవుతరం, నందివాడ, వెంట్రప్రగడ, పాములపాడు, రావులపాడు, జమీగొల్వేపల్లి, అంగలూరు, జనార్దనపురం, చౌటువల్లి మొదలగు గ్రామాల సత్యాగ్రహులు ఎక్కువగా పాల్గొన్నారు.

1931 లో నందివాడ సత్యాగ్రహులు బందరు వెళ్ళి ఉప్పునీరుతెచ్చి, నందివాడలో ఉప్పు తయారు చేయగా, పోలీసులు లాఠీఛార్జీ చేసి, వారిని చెదరగొట్టారు. ఇంకా ఉప్పు సత్యాగ్రహంలో గుడివాడ, అంగలూరు, దోకిప్రరు, జమీగొల్వేపల్లి మొదలైన గ్రామాలవారు పాల్గొనగా, వారిని అరెస్టుచేసి జైలుకు పంపారు.

1932 సహాయ నిరాకరణ ఉద్యమంలో నందివాడ, వెంట్రప్రగడ, రావులపాడు, అంగలూరు సత్యాగ్రహులు గుడివాడలో శిబిరం ఏర్పాటు చేసుకుని విదేశీ వస్త్ర దుకాణాల వద్ద పికెటింగు చేసేవారు.

శ్రీమతి వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగారి నాయకత్వాన మహిళా సత్యాగ్రహులు గుడివాడలో పికెటింగ్ చేస్తుంటే పోలీసులు రంగు నీళ్ల వారిపై కొట్టించి దూరప్రదేశాలలో వదలి వచ్చేవారు. ఆ విధంగా నెల్లాళ్ళు జరిగింది.

సత్యాగ్రహులపై ఓనాడు పోలీసులు లాఠీఛార్జీ, కాల్పులు జరుపగా దొండపాడు విద్యార్థి చలపతిరావు తొడలో గుండు దూరి గాయపడ్డాడు.

నందివాడ కల్లుపాకలవద్ద పికెటింగు చేస్తుండగా ఈడ్పుగంటి లింగయ్య, ఆచంట రామచంద్రరావు, ఆచంట రామబ్రహ్మంగార్లపై గ్రామ నడివీధిలో పోలీసులు లాఠీఛార్జీచేసి, గాయపర్చారు. తర్వాత కొన్ని రోజులకి వారిని అరెస్టు చేసి శిక్షలు విధించారు.

1933 లో యాగద్ది వెంకటనారాయణగారిని (నందివాడ) ఆంధ్రరా 9 కాంగ్రెస్ డిక్టేటరుగా నిర్ణయించి, వీరి అధ్యక్షత గుంటూరులో సభ జరపగా

డిక్టేటరునూ, సభకు వచ్చిన ప్రతినిధులనూ అరెస్టు చేసి, జైలుకు పంపింది ప్రభుత్వం.

1942 క్విట్ఇండియా ఉద్యమంలో గుడివాడ, నందివాడ, అంగలూరు, చౌటపల్లి, పోలుకొండ, గండేపూడి, మొకాసాకల్వపూడి మొదలైన గ్రామాల ప్రజలు వందల సంఖ్యలో ఆయా గ్రామాల సమీప రైలు పట్టాలు ఊడబెరికారు. టెలిగ్రాం తీగలు తెగగొట్టారు. సత్యాగ్రహులను అరెస్టుచేసి శిక్షలు విధించారు.

## నందివాడ

స్వాతంత్ర్య ఉద్యమాలను నందివాడ వాస్తవ్యులు ఈడ్పుగంటి లింగయ్య, పూనూరు వెంకారె , యార్లగడ్డ వెంకటనారాయణ, ఆచంట రామచంద్రరావు, వల్లభనేని సుబ్రహ్మణ్యం, ఆచంట రామబ్రహ్మంగార్లు ముందుండి నడిపించారు.

ఈడ్పుగంటి లింగయ్యగారు కాకినాడ కాంగ్రెసు మహాసభకు ప్రేక్షకులుగా వెళ్ళారు అప్పటి నుండి కాంగ్రెసు సభ్యత్వము స్వీకరించుతూనే వచ్చారు.

1927 లో మద్రాసు కాంగ్రెసు మహాసభకు పై ఆర్గురున్నూ పూనూరు చిన వెంకారెడ్డి, పుణుకొల్లు వెంకటదాసుగార్లు ఆంధ్రదళముగా పాల్గొని వలంటీర్ల బాధ్యతలు నెరవేర్చారు.

1931 ఉప్పు సత్యాగ్రహ ఉద్యమములో పై 6 గురుగాక నందివాడ గ్రామస్తులు, నందివాడ లక్ష్మినారాయణగారు (కరణం) వగైరాలు సముద్రపు నీరు తెచ్చి నందివాడలో వంటచేసి ఉప్పు చట్టమును ధిక్కరించారు. గ్రామములవెంట తిరిగి మీటింగులు (రహస్య) ద్వారా ప్రజలకు బ్రిటీషువారి చర్యలు తెలియజేశారు. నందివాడ లక్ష్మినారాయణగారు ఆ సమయములో కర్ణీకమునకు రాజీనామా చేశారు.

1931 వ సంవత్సరములో గుడివాడ టౌన్‌లో శిబిరము యేర్పాటు చేసుకొని పై ఆరుగురూ గుడివాడ స్వాతంత్ర్య సమరయోధులు 1. గోనుగుంట సుబ్రహ్మణ్యంగుప్త, 2. కేతవరపు లక్ష్మినరసింహారావు (అడ్వకేటు) మూడెడ్ల రామారావు, ముదునూరు గురురాజు (డాక్టరు) కూరళ్ళ మాధవరావుగార్లతో కలసి విదేశీ వస్త్రదుకాణముల వద్ద పికెటింగు చేశారు ఆ శిబిరము షుమారు నెల రోజులు నడుపబడినది. పోలీసువారు లాఠీ చార్జీలు చేసి పికెటింగు వలంటీర్లను బెదరగొట్టుతూ అరెస్టులు చేసి అప్పటికి అప్పుడే వదలివేసేవారు.

1931 వ సంవత్సరము నందివాడ ఫిర్కా గ్రామములో గుడివాడ తాలూకా కొన్ని గ్రామములలో పై ఆరుగురు జాతీయ జండాలతో గ్రామములవెంట కాలినడకన తిరుగుతూ కరపత్రములు పంచుతూ భారతదేశ స్వాతంత్ర్య ఆశయములను ప్రజలకు తెలియజేస్తూ ప్రచారము చేసేవారు. ఆ రోజులలో వలంటీర్లకు భోజనము కాదుగదా మంచినీళ్ళుకూడా యిచ్చుటకు గ్రామాలలో భయపడేవారు అట్టి రోజులలో అన్నపానాదులు లేకుండా ఓర్పు వహించి కార్యక్రమాలను నిర్వర్తించేవారు

1932 లో పై ఆరుగురు నాయకత్వములో నందివాడ, జనార్థనపురం గ్రామాదులలో కల్లు సారాయి దుకాణములవద్ద, మత్తుపానీయముల నిషేధ ఉద్యమములలో పాల్గొని షాపులవద్ద త్రాగకుండా పికెటింగు చేయుచుండెడివారు. వీరితోపాటు జనార్థనపురం కాపురస్తులు వంగపాటి రంగారెడ్డిగారు కూడా పాల్గొనేవారు. పోలీసులు వచ్చి వలంటీర్లను లాఠీ చార్జీతో బెదరగొట్టినా పట్టువదలకుండా పికెటింగు సాగించుచుండెడివారు.

1932 లో తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెసు సంఘ డిక్టేటరుగారైన కానూరు చిన వెంకటదాసయ్యగారు (కవుతరం) నిర్ణయించిన ప్రకారము ఒక రోజున 1. ఈడ్పుగంటి లింగయ్య, 2. ఆచంట రామచంద్రరావు, 3 ఆచంట రామబ్రహ్మంగార్లు నందివాడలో కల్లు, సారా దుకాణాలవ పికెటింగు చేయుచుండగా అప్పటి కృష్ణాజిల్లా కలెక్టరు, జిల్లా పోలీసు సూపరింటెండెంట్ (విదేశీయులు ) బ్రిటీషు సార్జంట్లు, రిజర్వు పోలీసులతో నందివాడ వచ్చి పికెటింగు విరమించి వెళ్ళవలసిందిగా కోరారు. అట్లు చేయుటకు నిరాకరించగా తుపాకులు పైకి పేల్పించి భయపెట్టుటకు ప్రయత్నించినప్పటికి వలంటీర్లు ప వదలనందున లాఠీఛార్జికి ఆర్డరు యివ్వగా పోలీదళము వలంటీర్లపై తీవ్రమైన లాఠీఛార్జీచేసి ముగ్గురు వలంటీర్లు క్రిందపడిపోగా నడిబజారులో వదలివేసి వెళ్ళారు.

1932 లో ఈడ్పుగంటి లింగయ్య, ఆచంట రామబ్రహ్మంగార్లు గుంటూరులో పికెటింగుకు వెళ్ళగా అచ్చట లాఠీచార్జీ చేసి వదలినారు. వల్లభనేని సుబ్రహ్మణ్యం, యార్లగడ్డ వెంకటనారాయణ గారు నూజివీడు పికెటింగుకు వెళ్ళగా అక్కడ లాఠీఛార్జీ చేసి వదిలారు.

1932 లో ముదునూరులో అన్నే అంజయ్య, గోపరాజు రామచంద్రరావు గార్ల ఆధిపత్యమున సైకిలో స్టయిల్ మిషన్ మీద తీయబడిన కరపత్రములు రాత్రి వేళలలో తెచ్చి మొదటఉదహరించిన పై ఆరుగుడు బెల్లపు వెంకయ్యగార్లు (రావులపాడు) గ్రామముల వెంట పంచిపెట్టు చుండెడివారు. ఈ కరపత్రములు అందించుటలో బెల్లపు వెంకయ్యగారు చాలా శ్రమపడ్డారు గ్రామాదులకు వెళ్ళినప్పుడు విద్యార్థులు సహాయపడుచుండెడివారు.

1932 లో అన్నే అంజయ్యగార్ని అరెస్టు చేసి జైలుకు పంపిన తర్వాత ముదునూరులో నడుపబడిన సైక్లోస్టయిల్ మిషన్‌ను నందివాడ తీసుకొని వచ్చి, కొండపల్లి పరబ్రహ్మంగారి ఇంట్లో పెట్టి పైఆరుగురు ఆధిపత్యమునజయభేరి,రడీఅనేపత్రికలు నడపగా బెల్లపు వెంకయ్యగారు కొండపల్లి పరుశురామారావుగార్లు గ్రామాదులలో పంచి పెడుతూ ప్రచారము చేస్తుండేవారు.

1932 లో గ్రామాదుల వెంట ప్రచారము చేయుచుండగా పూనూరు వెంకారెడ్డిగార్ని అరె చేసి లాఠీచార్జి చేసి వదలివేశారు. దరిమిలా ం రోజులలో యీడ్పుగంటి లింగయ్య, పూనూ వెంకారె , ఆచంట రామబ్రహ్మం, వల్లభనేని సుబ్రహ ణ్యం, బెల్లపు వెంకయ్యగార్లను అరెస్టు చేసి ప్రతి ఒక్కరికి 6 నెలల కఠిన శిక్ష, రు 400/–లు జరిమానా వేసి,సి క్లాసు క్రింద రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపారు. వీరందరు శిక్ష కాలము పూర్తిచేశారు.

వల్లభనేని సుబ్రహ్మణ్యంగారిని కలకత్తా కాంగ్రెసు మహాసభకు ప్రతినిధిగా పంపగా వారిని అరెస్టు జేసి తదుపరి విడుదల జేశారు.

పూనూరు సుందరమ్మ (నందివాడ) మల్లిరెడ్డి అన్నపూర్ణమ్మ, గాదిరెడ్డి పుట్లమ్మ (జనార్ధనపురం) గార్లు గుడివాడ పికెటింగుకు వెళ్ళగా 6 మాసములు శిక్ష వేసి రాయవెల్లూరు జైలుకు పంపారు.

1933 వ సంవత్సరములో యార్లగడ్డ వెంకటనారాయణగార్ని, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘ డిక్టేటరుగా నిర్ణయించిన మీదట గుంటూరులో మీటింగు ఏర్పాటుచేయగా యార్లగడ్డ వెంకటనారాయణ, ఆచంట రామచంద్రరావు, వంగపాటి రంగారెడ్డి గా కు 1 సంవత్సరము కఠిన శిక్ష వేసి రాజమండ్రి లుకు పంపగా 6 మాసములు పైగా శిక్ష అనుభవి చిన తర్వాత విడుదలయ్యారు. షేకుమహబూబుగార్ని గుడివాడలో అరెస్టు చేసి 6 మాసములు జైలుకు పంపారు.

1934 నుండి 1940 వరకు పై ఆరుగురు బెల్లపు వెంకయ్యగార్లు కాంగ్రెసు సంఘము ద్వారా నందివాడ ఫిర్కాలో ప్రచారోద్యమం సాగిస్తూనే వున్నారు.

1936 వ సంవత్సరములో యీడ్పుగంటి లింగయ్య, ఆచంట రామబ్రహ్మం, అడ్పుమిల్లి శంకరరావుగార్లు నిడుబ్రోలులో యన్. జి. రంగా గారిచే నడపబడిన రైతాంగ విద్యాయలములో నెల రోజులు ఉన్నారు.

1941 లో వ్యష్టి సత్యాగ్రహములో యీడ్పుగంటి లింగయ్యగార్ని 26-11-41 నను, 28-11-41 న పూనూరు వెంకారెడ్డిగారినీ అరెస్టు చేసి 4 మాసములు కఠిన శిక్ష వేసి రు. 25 లు జరిమానా విధించగా రాజమండ్రి జైలుకు వెళ్ళి శిక్ష అనుభవించి వచ్చారు.

1942 క్విట్ ఇండియా ఉద్యమములో ఆరుగురు నాయకత్వాన కొండ అప్పలరాజు, (పెద విరివాడ) బెల్లపు వెంకయ్య, కొండపల్లి పరుశురామరెడ్డి, చుక్కా నక్షత్రం, నందివాడ రామారావుగార్లూ, యింకా నందివాడ గ్రామస్తులు హరిజనులతో సహా 50 మందితో దోనపాడు రైల్వే స్టేషను దిగువ భాగమున రైలు పట్టాలు తొలగించి స్లీపర్లకు నిప్పు పెట్టినారు.

1942 ఆగస్టు చివరి వారములో ఉధృతమైన బుడమేరు వరదలలో ఊడ్చిన పొలములు మునిగిపోయినా లెక్కచేయక పై ఆరుగురు నాయకత్వమున నందివాడ గ్రామస్తులు సుమారు 100 మంది వరదలోనే చేలకు అడ్డంపడి దోనపాడు రైల్వే స్టేష

నకు ఎగువ భాగములో పట్టాలు తొలగించి నిప్పు పెట్టారు.

1942 సెప్టెంబరు నెల నాగులచవితి రోజున పైఅరు గురు ఇళ్ళను ఒకేసారిగా చుట్టుముట్టి పోలీసువారు అర్ధ రాత్రివేళ 1. యీడ్పుగంటి లింగయ్య, 2. పూనూరు వెంకారెడ్డి, 3. యార్లగడ్డ వెంకటనారాయణ, 4. ఆచంట రామచంద్రరావు, 5. వల్లభనేని సుబ్రహ్మణ్యం, 6. ఆచంట రామబ్రహ్మం, 7. కొండ అప్పలరాజు, 8. ఆచంట పిచ్చయ్య తండ్రి బ్రహయ్య, ఇందులో పాల్గొన్నవారు ఆచంట పిచ్చయ్య (తండ్రి సీతయ్య) అనేవారు కాగా డిసెంబరులో బ్రహ్మయ్య కుమార్డు పిచ్చయ్యను అరెస్టు చేశారు. 9. చుక్కా నక్షత్రం, 10. చావగడ్డ వెంకటేసు, 11. చావగడ్డ సోమయ్య, 12. గురుముచ్చు రామస్వామి, 13. పెయ్యల నాగయ్యగార్లను అరుస్టు చేసి సుమారు 3 మాసములు సబ్ జైలులో ఉంచి 24-12-1942 వ తేదీన యీ దిగువ వివరముల ప్రకారము శిక్షలు వేసి (అలీపురం) బళ్ళారి క్యాంపు జైలుకు 30-12-1942 న పంపారు. 9 నుండి 13 వరకు ఉన్నవారు హరిజనులు.

| పేర్లు | శిక్షలు | ఇతరములు |
|---|---|---|
| 1. ఈడ్పుగంటి లింగయ్య | 3 సం॥ | రు. 400/- జరిమానా |
| 2. పూనూరు వెంకారెడ్డి | 3 సం॥ | — |
| 3. యార్లగడ్డ వెంకటనారాయణ | 2 సం॥ | రు. 400/-జరిమానా |
| 4. ఆచంట రామచంద్రరావు | 2 సం॥ | 10 కొరడా దెబ్బలు |
| 5. ఆచంట రామబ్రహ్మం | 2 సం॥ | 10 కొరడా దెబ్బలు |
| 6. వల్లభనేని సుబ్రహ్మణ్యం | 2 సం॥ | 10 కొరడా దెబ్బలు |
| 7. కొండ అప్పలరాజు | 2 సం॥ | 10 కొరడా దెబ్బలు |
| 8. చుక్కా నక్షత్రం | 2 సం॥ | 10 కొరడా దెబ్బలు హరిజన్ |
| 9. చాట్రగడ్డ వెంకటేశు | 1 సం॥ | హరిజన్ |
| 10. గోరుముచ్చు రామస్వామి | 1 సం॥ | హరిజన్ |
| 11. చాట్రగడ్డ సామియేలు | 1 సం॥ | హరిజన్ |
| 12. పెయ్యల నాగయ్య | 1 సం॥ | (హరిజన్) వెళ్ళిన 2 మాసములకు జైలులో చనిపోయినాడు |
| 13. ఆచంట పిచ్చయ్య | 1 సం॥ | |

కొండపల్లి పరుసరామరెడ్డిగార్ని అరెస్టు చేసి నెల రోజులు రిమాండులో ఉంచి వదిలారు.

నందివాడ రామారావుగార్ని అరెస్టుచేసి 15 రోజులు రిమాండులో ఉంచి వదిలినారు.

1942 వ సంవత్సరములో నందివాడ వాస్తవ్యులు యీడ్పుగంటి కోటేశ్వరరావుగారు గుడివాడలో; రైల్వే పట్టాలు తొలగించిన కార్యక్రమములో పాల్గొన్నారు. దోసపాడులో రైలు నిల్పివేశారు.

*గుడివాడ తాలూకా నందివాడ మొదటి కేసుకు సహకరించినవారి పేర్లు*

శ్రీ నందివాడ లక్ష్మీనారాయణ
" అడ్డుమిల్లి సత్యనారాయణ
" ఈడ్పుగంటి వెంకటకృష్ణయ్య
" ఈడ్పుగంటి వీరరాఘవయ్య
" పోతినేని నాగేశ్వరరావు
" రావి పిచ్చయ్య
" దాల వెంకటరత్నం

" మలిరె సత్యనారాయణ
" మలిరె సీతారామరెడ్డి
" కొండ ల్లి వీరబ్రహ్మారెడ్డి
" పోతుల లక్ష్మయ్య
" దాసరి సత్యనారాయణ
" దాసరి బ్రహ్మయ్య
పునూరు కృష్ణారెడ్డి
" యీ సాంబిరెడ్డి
" అడుసుమిల్లి సుబ్బారావు
" పోతుల ఆదినారాయణ
" ఆచంట వెంకటేశ్వరరావు
" యీ చినపిచ్చయ్య
" మలిరెడ్డి జ్వాలారెడ్డి
" వల్లభనేని రంగయ
" కొండపల్లి పున్నారె
" యీ పరబ్రహ్మారె
" కుప్పెం లక్ష్మయ
" తూము లక్ష్మీపతి
" రామకూరి కోటయ్య
" గుళ్ళపల్లి లక్ష్మణదాసు
" అడుసుమిల్లి రామదాసు
" జన్నావుల వెంకటరత్నం
" నిమ్మగడ్డ రంగయ్య
" పునూరు చినవెంకారెడ్డి
" పొట్లూరి నాగేశ్వరరావు
" చొక్కా కొటాయి
" కొండపల్లి నాగభూషణం
" యీడుపుగంటి లక్ష్మణరావు
" వల్లభనేని సత్యనారాయణరావు
" యార్లగడ్డ సుబ్బారావు
" మలిరె కృష్ణమూర్తి
" గాదిరె సత్యనారాయణరెడ్డి
" నాగుల ల్లి బసవయ్య
" భీమర వీరాస్వామి
" దేశిరెడ్డి జ్వాలారెడ్డి
" చెరుకూరి శ్రీరాములు
" దండూరి కోటప్ప
" పెదమల్లు లక్ష్మీనారాయణ
" చింతా రాఘవయ్య
" మేడేపల్లి పోతయ్య
" నందివాడ వెంకటాచలశర్మ
" యలమంచిలి వెంకయ్య
" తుమ్మల వీరరాఘవయ్య

15-8-72 వ తేదీన యీడుపుగంటి లింగయ్య గారు ఆంధ్రప్రదేశ్ గవర్నర్ గారిచే తామ్రపత్రము స్వీకరించారు.

భారత స్వాతంత్ర్య ఉద్యమంలో గుడివాడ తాలూకాలో ఎక్కువగా పాల్గొన్న సుమారు 5, 6 గ్రామములలో నందివాడ గ్రామము ఒకటి.

ఉద్యమం రోజులలో నందివాడ గ్రామము సందర్శించిన మహానాయకులు :

1) రాజ రాజేంద్రప్రసాదు, 2. డా॥ పట్టాభి సీతారామయ , 3) నీలం సంజీవరెడ్డి, 4) ఆచార్య యన్. జి. రంగా, 5) ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులుగార్లు

# బందరు తాలూకా చరిత్ర

బందరు చరిత్ర ప్రసిద్ధమైన పట్టణం. బందరు, మచిలీ బందరు, మచిలీపట్టణం-అని వేర్వేరు పేర్లున్నా ఇంగ్లీషువాళ్ళు 'మసులా' అని పిలిచినా పేరులోన ఏమి పెన్నిధి యున్నది" అనిపించవచ్చు. ఈనాటి తాలూకా కేంద్రమైన బందరు చరిత్ర ప్రసిద్ధమైనదే కాక దీనికి స్థల పురాణ గాథలు కూడా వున్నాయి.

అసలు బందరు సముద్రం అడుగున వుండేదనీ, ఇప్పుడు బందరు-బెజవాడ రోడ్డులో వున్న గూడూరు దివితాలూకాలోని ఘంటసాలలే రేవు పట్టణాలనీ చరిత్ర పరిశోధకులు చెబుతున్నారు. పెరిప్లస్, టాలెమీ రచనల్నిబట్టి కూడా యిది ధృవపడుతోంది. ఘంటసాలను "కొంటకొస్సిల" అనీ, కృష్ణానదీ

ముఖ ద్వారాన్ని "మసేలియా" అనీ, కృష్ణానదిని "మైసొలిస్" అని పిల్చేవారట సన్నని నాజూకైన రవసెల్లా వస్త్రాలను మస్లిన్‌లు అని ఇంగ్లీషులో అంటారు. ఈ 'మస్లిన్' అనే పదం కూడా దీనినుంచే వచ్చిందనీ, ఈ పదాన్ని ఇంగ్లీషు పదకోశంలోకి అలా చేరిపోయిందనీ భావిస్తున్నారు.

శాతవాహనుల కాలం నుంచీ, బందరు ప్రాంతం నౌకాయానానికి కేంద్రం అనేమాట వాస్తవం.

క్రీస్తు పూర్వం 200, క్రీస్తు తర్వాత 200 సంవత్సరాల మధ్య పాలించిన శాతవాహనుల కాలంలోనే, నౌకాయానానికి ప్రోత్సాహం లభించింది. గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి (క్రీ శ. 174-203) విదేశాలతో వ్యాపారానికి,చాలా ప్రోత్సాహమిచ్చాడు. 2 వ శతాబ్దం నాటికే బందరు ప్రాంతమైన గూడూరు రేవు నుంచి నూలుబట్టలు, అద్దకం బట్టలు, రవ సెల్లాలు, వజ్రాలు, రోము నగరానికి, బర్మా, చైనా, సయాం దేశాలకు ఎగుమతి అయ్యేవి. శాత వాహనుల కాలంలోనే బందరు నుంచి హైద్రాబాద్‌కు అక్కడ నుంచి మహారాష్ట్రల రాజధాని అయిన పైఠాన్ నగరం, నాసిక్‌ల మీదుగా బ్రోచ్ రేవు పట్టణానికి వ్యాపార మార్గం వుండేది.

శాతవాహనులు, బృహత్ పలాయనులు, ఆంధ్ర వులు, ఇక్ష్వాకులు, తూర్పు చాళుక్యులు, చోళులు, రె రాజుల పాలనకింద బందరు వుండేదని చరిత్ర కారుల అంచనా. రెడ్డిరాజుల కాలంలో 14 వ శతాబ్దాన బందరు రేవును అభివృద్ధి పరచడం జరిగింది. అరబ్బీ వర్తకులు ఇక్కడ నివాస స్థలాలు ఏర్పాటు చేసుకోటం జరిగింది. గజపతిరాజులు, కృష్ణదేవ రాయలు, తిరిగి గజపతిరాజులు - ఆ తర్వాత గోల్కొండ నవాబుల అధీనంలోకి ఈ రేవు పట్టణం వచ్చింది.

భారతదేశం పరాయిదేశాల కింద బానిసత్వం అనుభవించడానికి దారి తీసినవి విదేశ కంపెనీలు, అలాంటి కంపెనీలు కొన్ని తొలిసారిగా బందరులో నెలకొల్పబడటం ఒక విశేషం. బుడతకీచులు (పోర్చ్ గీస్) పరాసులు (ఫ్రెంచివారు) ఒళందులు (డచ్చి వారు) అందరూ బందరులో కాలుమోపినవారే. పరాసుపేట, ఒళందపాలెం లాంటివి అందుకే ఈ పట్ట ణంలో చోటు చేసుకొన్నాయి.

ఇంగ్లీషు వర్తకులు, తూర్పు ఆసియా దీవుల్లో వర్తకం చేసుకోడానికి బ్రిటిష్‌రాణి అనుమతి పొందిన తర్వాత మొట్ట మొదటిసారిగా 1608 లో సూరత్‌లో ఇంగ్లీషువాళ్ళు కాలుపెట్టారు. ఇంగ్లీషు కంపెనీ హిప్పన్ అనే వాని ఆధిపత్యాన "గ్లోబ్" అనే నౌకను పంపింది. 1611 జనవరిలో "గ్లోబ్" బందరు చేరింది గోల్కొండ నవాబుతో సంప్రతింపులు జరిపి, ఆయన అనుమతితో ఇంగ్లీషువాళ్ళు బందరులో ఒక ఫ్యాక్టరీని స్థాపించారు. ఇది వారి రెండో స్థావరం. సయాం, బర్మాలలో వాణిజ్య సంబంధాల్ని ఇంగ్లీషు వాళ్లు నెలకొల్పుకోడానికి కూడా దారితీసింది. ఔరంగ జేబు గోల్కొండను జయించినపుడు, ఈ ఫ్యాక్టరీని కూడా స్వాధీనం చేసుకొన్నాడు. కాని, సంధి చేసు కొని, దాన్ని ఇంగ్లీషువాళ్ళకే వదలివేశాడు. తర్వాత తర్వాత తూర్పుఇండియా కంపెనీ సలహా సంఘ ప్రధాన కార్యాలయం కూడా బందరునుంచే పని చేసింది. బ్రిటిష్‌వాళ్ళపై సిపాయీలు తిరుగుబాటు చేసిన ఘనత కూడా బందరుకే దక్కుతుంది. తల పాగాలు తీసివేసి, టోపీలు పెట్టుకోవలసిందిగా భారత సిపాయీలను కోరగా అందుకు నిరాకరించి, 1706 లో వారు తిరుగుబాటు చేశారు. తిరుగుబాటు నాల్గు రోజుల పాటు సాగింది. వారిని తుపాకులతో కాల్చి, ఆ తిరుగుబాటును అణచివేశారు. ఆరుగురు మరణించారు.

విజయనగరం రాజాకు ఇంగ్లీషువాళ్ళు చేసిన ద్రోహ చరిత్రలో కూడా బందరు ప్రస్తావన రాక తప్పదు. ఫ్రెంచివారితో యుద్ధం చేస్తున్న రోజుల్లో విజయనగరం రాజా ఆనంద గజపతిరాజు, క్లైవ్ సహాయం కోరాడు. క్లైవ్ అప్పటికే బెంగాల్‌లో ప్లాసీ యుద్ధంలో విజయం పొందిఉన్నాడు. తన తరపున కర్నల్ ఫోర్డేను పంపాడు, 1758 నవంబరు 21 న రాజాకు, ఈస్టిండియా కంపెనీకి జరిగిన ఒడంబడిక ప్రకారం యుద్ధంలో కొల్లగొట్టిన ధనం ఇద్దరూ పంచు కోవాలి. గెల్చిన దేశాల్ని రాజా ఆధిపత్యం కిందకు తేవాలి. ఐతే సముద్ర రేవులు, నదీముఖాన వున్న పట్టణాలు కంపెనీకి చెందాలి. బ్రిటిష్‌వాళ్ళ సహాయంతో రాజా ఫ్రెంచివాళ్ళను ఓడించాడు. 1759 ఏప్రిల్ 8 న కర్నల్ ఫోర్డ్ బందరును వశపరచు కొన్నాడు.

ఆనందగజపతి తర్వాత విజయరామరాజు కాలంలో ప్రభుత్వానికి పేష్కష్ కట్టలేకపోయేసరికి జమీందారీని ప్రభుత్వం వశపరచుకొంది. రాజాను విజయనగరం వదలి బందరులో నెలకు రు 1200 పెన్షన్ మీద బతకమని ఇంగ్లీషువాళ్ళు కోరారు రాజు తిరగబడ్డాడు. విజయనగరం, భీమునిపట్టణం మధ్యలో వున్న పద్మనాభపురం వద్దకు వెళ్ళేసరికి కంపెనీ సేనలు వచ్చి, ఆయన్ని ఓడించి హతమార్చాయి. ఈ విధంగా బందరు పట్టణం అనేక విధాల ఆధునిక చరిత్రతో ముడివేసుకొని ఉంది.

బందరు కలంకారీలను, రవసెల్లాలను తూర్పు ఇండియా కంపెనీవాళ్ళు బందరు నుంచి ఎగుమతి చేసేవారు. ఒక దశలో బ్రిటిష్‌వాళ్ళు వీటిని తమ దేశానికి ఎగుమతి చేయవద్దని భారతదేశంలో నిషేధాలు కూడా పెట్టారు ఐతే ఈ పరిస్థితి ఆ తర్వాత కొనసాగలేదు. ఇంగ్లండులో యంత్ర సహాయంతో జౌళి పరిశ్రమ ప్రారంభమయ్యాక వాటి ఎగుమతులు తగ్గిపోయాయి.

19 వ శతాబ్దం రెండవ దశకంలో బందరు నుంచి ఎగుమతులు సగటున ఏడాదికి రు. 30 లక్షలు ఉండేవి. 1843-44 వాటికి రు 2750 లకు పడిపోయాయి. ప్రభుత్వం, మగ్గాలపై విధించిన పన్నులవల్ల కూడా ఉత్పత్తి దెబ్బతిని, నిక మార్కెట్‌లో కూడా వస్త్రాల వ్యాపారం .పోయింది. దీని ఫలితంగా అనేకమంది చేనేత ప వారు, శ్రీలంక, బర్మా, మారిషస్ దీవులకు వలస వెళ్ళిపోయారు. ఒకప్పుడు ఇక్కడ చేనేత పనివారు డచ్చివాళ్ళ కింద 5 వేల మంది పనిచేసేవారు ఇంగ్లీషువాళ్ళ కింద 700 మంది పనిచేసేవారు. స్వతహాగా పనిచేసుకొనేవాళ్లు అనేకమంది వుండేవారు. యంత్రయుగంలో బ్రిటిష్‌వాళ్ళ పోటీకి తట్టుకోలేక క్రమంగా మన చేనేత పరిశ్రమ దిగజారిపోయింది.

## తొలి కాంగ్రెస్ మహాసభకు హాజరైన బందరు ప్రముఖుడు

కాంగ్రెస్ ప్రథమ మహాసభకు హాజరైన వారిలో కీ॥ శే॥ శింగరాజు వెంకట సుబ్బారాయుడుగారు బందరు వాస్తవ్యులే. ఆయన 1844 లో జన్మించారు 1887 లో కీర్తిశేషు లయ్యారు. బి. యల్. ప్యాసై, హైకోర్టు వకీలుగా పనిచేసిన సుబ్బారాయుడుగారు బందరు మునిసిపల్ ఛైర్మన్‌గా కూడా పనిచేశారు, చెన్నపురిలోని మహాజనసభ లాంటి శాఖాసంఘాన్ని బందరులో స్థాపించి దానికి అధ్యక్షు లయ్యారు. ప్రభుత్వం ఆయనకు రావ్‌సాహెబ్ బిరుదు నిచ్చింది. రు. 20,000 దానధర్మాలు చేశారు. బందరు టౌన్ హాలుకు 5 వేల రూపాయలు విరాళం ఇచ్చారు. బందరులో ఒక సత్రాన్ని, పెడనలో, పెదగొల్లపాలెంలలో సత్రాల్ని నిర్మించారు. ఈయన మరణించినపుడు కాంగ్రెసు అధ్యక్షులు బద్రుద్దీన్ తయాబ్జీ సంతాపం ప్రకటించారు.

[ఇలాంటి ప్రముఖ ఆంధ్రుని జీవిత విశేషాలను కాంగ్రెస్ చరిత్రలో విస్మరించినందుకు దిగవల్లి వెంకట శివరావుగారు "సమాలోచన" (రాజమండ్రి పత్రిక 1-8-83) లో విమర్శించారు. పైన వివరించిన విశేషాలు వారి వ్యాసంనుండి గ్రహించినవే.]

1857 స్వాతంత్ర్య సంగ్రామం తర్వాత భారతదేశంలో కంపెనీ పాలన పోయింది. బ్రిటిష్ ప్రభుత్వ ప్రత్యక్ష పాలన అమలులోకి వచ్చింది. ఆ రోజుల్లో విక్టోరియారాణి చేసిన వాగ్దానాలలో మత విషయాల్లో జోక్యం చేసుకోబోమన ది ఒకటి. ఐతే ఆనాటికే కంపెనీల పాలనలో క్రైస్తవ మత ప్రచారమూ, హిందువుల్ని క్రైస్త మతంలోకి మార్పు చేయడమూ, విరివిగా సాగుతూ వుండేవి. 1841 లో బందరులో చర్చి మిషనరీ సొసైటీ, నోబుల్‌దొర ఆధ్వర్యాన బ్రాహ్మణులతో సహా అనేకమందిని క్రైస్తవులుగా మార్చింది. ఇదే సంవత్సరం రాబర్ట్ నోబుల్ బందరులో ఒక క్రైస్తవ పాఠశాల నెలకొల్పాడు. అది తర్వాత కాలేజీగా మారింది.

టి బి. మెకాలే 1836 అక్టోబరు 12 న తన తండ్రికి కలకత్తా నుంచి ఇలా రాశాడు "ఇంగ్లీషు విద్య పొందిన ఏ హైందవుడూ, తన మతాన్ని చిత్తశుద్ధితో అంటిపెట్టుకొని ఉండబోడు....మన విద్యాపథకాలు కనుక అమలు జరిగితే, ఇక 30 ఏళ్ళలో బెంగాల్‌లోని కులీన వర్ణాలలో విగ్రహారాధకులు ఉండబోరు."

ఇదే భావం ఆనాటి క్రైస్తవ మత ప్రచారకుల్లో వుండి వుండవచ్చు నోబుల్ కాలేజీలోచదివినధన్వాడ అనంతరం మొదలైన 12 మంది బ్రాహ్మణ యువ

కులు క్రైస్తవ మతాన్ని అవలంబించారు. కాని వారు నెలకొల్పిన ఈ విద్యాసంస్థల నుంచే విద్యార్థులలో స్వాతంత్ర్యేచ్ఛ కూడా పెరుగజొచ్చింది. ఉదాహరణకు ఈ నోబుల్ కాలేజీలో చదివిన వారెందరో బ్రహ్మ సమాజ ప్రభావంతో సంస్కర్తలయ్యారు ఆ తర్వాత జాతీయోద్యమంలోకి ఉరికారు.

రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు బందరులోనే జన్మించారు. బందరు నోబుల్ కళాశాలలో 1894 నుంచి 1899 వరకూ అధ్యాపకులుగా వున్నారు. ఈయన మంచి అధ్యాపకుడే కాక, మత సాంఘిక, నైతిక జీవనానికి ఒరవడి పెట్టిన సంస్కర్త. బ్రహ్మ సమాజ నాయకుడు. కుల భేదాలను, అంటరానితనాన్ని పోగొట్టడానికి కృషి చేశాడు. విగ్రహారాధన మానిన ఏకేశ్వరోపాసి. మహిళల అభ్యున్నతికి పాటుపడిన మహావ్యక్తి. హరిజన విద్యార్థి, విద్యార్థినులను తన ఇంట్లో పెట్టుకొని వారికి ఉన్నత విద్య గరిపాడు. సుగుణ మహాలక్ష్మమ్మ, విమల అ హరిజన యువతులను బ్రాహ్మణ విద్యాధికులకిచ్చి పెళ్ళి చేయించాడు. సుగుణ బి. ఏ. ఎల్. టి. ఆమె కంభంపాటి రామశాస్త్రి (బి. ఎ. బి. ఇడి)ని పెళ్ళి చేసుకుంది. విమల ఎల్. యం. పి సత్తిరాజు శేషగిరిరావు (బి. ఎ. బి ఎల్)ను పెళ్ళిచేసుకుంది. రఘుపతి వెంకటరత్నంగారి శిష్యులు అనేకులు ఆ తర్వాత బందరులో ప్రసిద్ధులయ్యారు. కోపల్లె హనుమంతరావు, ముట్నూరి కృష్ణారావు, భోగరాజు పట్టాభి సీతారామయ్య, మొదలగువారు ఈయనవద్ద చదువుకొన్నవారే. ఐతే నాయుడుగారి ఉనికి క్రైస్తవమత ప్రచారకులకు కంటకంగా తోచింది. రెవరెండ్ జి.ఎ. ఎడ్డి మూలంగా నాయుడుగారికి నోబుల్ కాలేజీనుంచి ఉద్వాసన జరిగింది.

పట్టాభిగారు 1896-97 లలో ఈ కళాశాలలో ఎఫ్. ఏ. చదివి, తర్వాత మద్రాసులో బి ఏ చదివి, ఆ తర్వాత అక్కడే యం. బి. సి. యం. ప్యాసయి 1906 నాటికి బందరులో డాక్టరుగా వైద్య వృత్తిని ప్రారంభించారు. 1898 లో కాంగ్రెస్ వలంటీరుగా పనిచేసిన పట్టాభి 1906 లో రాజకీయాలలో ప్రవేశించారు. అఖిలభారత నాయకుల స్థాయిలోకి ఎదిగినవాడు. గాంధీగారికి భాష్యకారుడు, నో చేంజర్. సుభాస్‌బోస్ లాంటి అతివాదులతోను, అఖిలభారత రంగంలోను, జిల్లాలో సోషలిస్టు భావాలవైపు మొగ్గిన అతివాదులతోను పేచీ పెట్టుకొన్నవాడు. ఖద్దరు, ఇన్సూరెన్సు, బ్యాంకింగ్ పరిశ్రమలను నెలకొల్పడమేకాక, వాటి నిర్వహణలో నిర్మాణదక్షత చూపిన వ్యక్తి. స్వాతంత్ర్యానికి పూర్వమే కాంగ్రెస్ చరిత్ర గ్రంథకర్త. స్వాతంత్ర్యానంతరం కాంగ్రెస్ అధ్యక్షుడుగా, గవర్నరుగా పనిచేసిన రాజకీయవే . "జన్మభూమి", "ఇండియన్ రిపబ్లిక్" లాంటి ప కల సంపాదకుడు అనేక భాషల్లో ప్రావీణ్యం సంపాదించినవాడు. బ్రహ్మసమాజ ప్రభావంతో జంధ్యాన్ని తీసివేసి, హరిజనుణ్ణి తన ఇ. ట్లో నౌకరుగా ఉంచుకున్న పట్టాభిగారు, వృద్ధాప్యంలో సనాతన ధర్మాన్ని సమర్థిస్తూ "హిందూ హోమ్ రీ డిస్కవర్డ్" అనే గ్రంథాన్ని రాశారు.

ముటూ రి కృష్ణారావుగారు కృష్ణా పత్రిక సంపాదకులు. ఆం విదా ఘకులు. 1902 లో బందరులో స్థాపించిన షా డి క్రిస్టు అసోసియేషన్ తరపున కృష్ణాపత్రిక పిం బడింది. దీనికి మొదట్లో కొండా వెంకటప్పయ గారుసంపాదకులు. కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదా రి జిల్లాలు మూడుకలిపి కృష్ణా జిల్లాగా వుండేది. దానికి కేంద్ర స్థానంగా బందరు ఉండేది. అందుచేతనే కొండా వెంకటప్పయ్యగారు ఇక్కడ న్యాయవాదిగా పనిచేశారు. 1904 లో గుంటూరు జిల్లాను కృ నుంచి విడగొట్టిన తర్వాత కృష్ణారావుగారికి, కృ పత్రిక బాధ్యతను అప్పగించారు ఆ పత్రిక ఎం రెందరినో జాతీయోద్యమంలో చేరేందుకు ప్రోత్సహించింది.

ముట్నూరు కృష్ణారావుగారు సంస్కృతం, ఇంగ్లీషు, తెలుగులో మంచి ప్రావీణ్యం కలవారే. వేదాంత శాస్త్రంలోకూడా ప్రవేశం వుంది. ఐతే గణిత శాస్త్రంలో ఎఫ్. ఏ.లో ఆరేళ్ళు ఆయన తప్పాడట. బిపిన్ చంద్రపాల్‌తో పాటు పర్యటించి, జాతీయ భావాలను ఈ జిల్లాలో, అందునా బందరులో ప్రచారం చేసిన ఆద్యులలో ఈయన ఒకడు.

1905 లో బెంగాల్ విభజన ప్రకటించినపుడు వందేమాతరం ఉద్యమం ప్రారంభమైంది. ఆ విభజన 1911 లో రద్దుకాగా ఆ ఉద్యమం కూడా విరమించబడింది. ఈ ఉద్యమంతో ప్రభావితులైన వారిలో

కృష్ణారావుగారు ఒకరు. బిపిన్ చంద్రపాల్‌తో కలసి, బెంగాల్, ఆంధ్రలో పర్యటించారు. పంజాబ్ కథల గురించి, గ్రామ గ్రామాన ప్రచారం చేసి, శౌర్యం ఉప్పొంగేటట్లు చేశారు. 1920 - 21 లో సత్యాగ్రహ సేవక శిబిరం నిర్వహించారు.

నోబుల్ కళాశాల మరో విద్యార్థి దేశిరాజు పెద బాపయ్య. మొదట సనాతనుడైనా, మద్రాసులో వీరేశలింగంగారి బ్రహ్మ సమాజ బోధనల ప్రభావంగా సంస్కర్త అయ్యాడు. కుల వ్యవస్థపై తిరుగబడి యజ్ఞోపవీతాన్ని తీసివేశాడు. ఇందుకు ఆగ్రహం చెందిన మామగారు, తన కూతురుని, అల్లుని వద్దకు కాపురానికి పంప లేదు. ఐనా ఆయన లొంగలేదు. 26 వ ఏటనే క్షయ వ్యాధికి గురై పెద బాపయ్య మరణించాడు.

ఆంధ్ర జాతీయ కళాశాల సంస్థాపకులలో ఒకరైన కోపెల్ల హనుమంతరావుగారు కూడా నోబుల్ కళాశాల విద్యార్థే. ఆయన తర్వాత మద్రాసులో బి. ఏ. యం. ఏ. పరీక్షలు చదివాడు. తర్వాత కొన్నాళ్ళు ఉద్యోగం చేసి దాన్ని విడిచిపెట్టి, ఎం. ఏ. బి. ఎల్ ప్యాసయ్యాడు. 1904 లో బందరులోలాయర్ వృత్తి ప్రారంభించాడు. ఆయన సూరత్ కాంగ్రెస్‌కు వెళ్ళి రాగానే జాతీయ కళాశాల స్థాపన చెయ్యాలనే ఆలోచన కల్గింది. సూరత్‌లో మితవాదుల అతివాదుల మధ్య చీలిక కలిగినపుడు ఈయన అతివాదుల వైపే వున్నాడు. 1908 లో ప్లీడరు వృత్తిని మానివేశాడు. భోగరాజు పట్టాభి సీతారామయ్య, కోపల్లె హనుమంతరావు, పెడింబి హనుమంతరావు, ముట్నూరి కృష్ణారావు, వల్లూరి సూర్యనారాయణ, మున్నగువారు ఒక కమిటీగా ఏర్పడి, కళాశాలకు నిధులు వసూలు చేశారు. 1909 మార్చి 25న భవన నిర్మాణం ప్రారంభించారు. కొండా వెంకటప్పయ్యగారి అధ్యక్షతన ఈ కళాశాల 1910 మార్చి 27 న ప్రారంభోత్సవం జరిగింది. ఈ కళాశాలకు మునగాల రాజా 8 వేల రూపాయలు, కాశీశ్వరరావుగారు వెయ్యిన్నూట పదహారు రూపాయలు ఇచ్చారు.

## ఆంధ్ర జాతీయ కళాశాల

ఆంధ్ర జాతీయ కళాశాల సంస్థాపకులైన కోపెల్ల హనుమంతరావుగారు తమ ప్లీడరీ పట్టాను చించిపారవేశారు. ఆ విధంగా కోర్టుల బహిష్కార ఉద్యమ సూత్రాన్ని ఆచరించాడు. కళాశాలలో తాటి చెను కల్లు గీతకు ఇవ్వలేదు. స్వయంగా ఖద్దరు బట్టలు కట్టాడు. కళాశాలలో తివాసే నేతను ప్రవేశపెట్టా. అంటరానితనానికి కళాశాలలో తావులేకుండా చేశాడు. పారిశ్రామిక వృత్తి నేర్పడానికి యంత్రాల్ని తెప్పించాడు. విద్యార్థులను సభలకు వలంటీరుగా పంపేవాడు. బెం. నుంచి వచ్చిన ప్రమోదకుమార్ చటర్జీ చిత్రలేఖనం నేర్పేవాడు. ఈ కళాశాలలో చరిత్ర, విజ్ఞాన శాస్త్రం, ఇంజనీరింగ్ మొదలైనవి నేర్పేవారు. ఈ కళాశాల ద్వారా అనేకమంది చిత్రకారులు, స్వాతంత్ర్యయోధులు, విద్యావేత్తలు తయారయ్యారు. ఐతే దురదృష్టవశాత్తు 1922 లో కోపెల్లె హనుమంతరావుగారు కీర్తిశేషులయ్యారు. 1918 - 19 లలో దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారు ఈ కళాశాల వైస్ ప్రిన్సిపాల్‌గా పని చేశారు.

వల్లూరి సూర్యనారాయణగారు స్వయం కృషితో ఉపాధ్యాయ వృత్తి నుంచి ప్రముఖ న్యాయవాదిగా మారారు. దేవాదాయ ధర్మాదాయాలలో దుర్వినియోగాన్ని అరికట్టేందుకు కంకణంకట్టుకొన్న వ్యక్తి. ఘంటసాల ధర్మగోటక వ్యాజాన్ని నడిపించిన వాడు. చాలా నిరాడంబర జీవితం గడిపేవాడు. బందరులో మనిషి లాగే రిక్షాను ప్రవేశపెట్టినది ఈయనే. సూరత్ కాంగ్రెస్‌లో తిలక్‌కు చెందిన అతివాదుల శిబిరంలోనే ఈయన వున్నాడు. జాతీయోద్యమానికి అనేక విధాల ప్రత్యక్ష పరోక్ష దానాలు చేసేవాడు. డిప్యూటీ మేజిస్ట్రేట్ లంచగొండితనం గురించి, ఎవరూ అఫిడవిట్ ఇవ్వడానికి తయారుకాని రోజుల్లో ఇచ్చి కష్టాలు కొనితెచ్చుకొన్నాడు.

ఈయన ఎంతో డబ్బు సంపాదించినా (1920 నాటికే లక్ష రూపాయలు సంపాదించాడట) తన కుమార్ళకు ఏమీ ఇవ్వలేదు. "నా తండ్రి నాకు ఆస్తి ఇవ్వలేదు. మీకు విద్యా బుద్ధులు చెప్పించి, సంసారులను చేసి, ఉద్యోగాలు కల్పించాను. అందుచే మీరు నా ఆస్తిని ఆశించవద్దు" అని నచ్చచెప్పాడు. 1931 లో 12 వేల రూపాయల్ని. 1936 లోని విల్లు ప్రకారం రు. 5,700 కొప్వూరు "ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠా"నికి దానం చేశాడు. ఇంతేకాక 15 వేల రూపాయల విలువగల స్వంత భవనాన్ని కూడా మరణానంతరం

విద్యా పీఠానికి చెందేలా విల్లు రాశాడు. ఆయన పెద్ద కొడుకు చనిపోగా కోడల్ని పునర్వివాహానికి ప్రోత్సహించాడు. కాని ఆమె అంగీకరించనందున బి. ఏ. యల్. టి చదివించి ఉపాధ్యాయినిగా చేశాడు. 1866 లో జన్మించిన ఈయన 1937 ఏప్రిల్ 28 న కీర్తి శేషులయ్యారు.

సాహిత్య సాంస్కృతిక రంగాల్లో కూడా బందరు నిలయంగా ఉండేది. తిరుపతి వెంకటేశ్వర కవులలో వెంకటశాస్త్రిగారు బందరు హిందూహైస్కూలులో పని చేశారు. వీరి శిష్యులు అనేకమంది తర్వాత సుప్రసిద్ధ కవులయ్యారు. వారిలో కొందరు జాతీయోద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు. స్వాతంత్ర్య భావాల్ని పురికొల్పే గ్రంథాల ప్రచురణకై బందరులో "ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజం" నెలకొల్పబడింది. "ఆంధ్ర భారతి" పత్రిక కూడా కొన్నాళ్ళు ఇక్కడ నుంచే వెలువడింది.

గరికపర్తి కోటయ్యదేవర, సునర్ల దక్షిణామూర్తిశాస్త్రి సంగీతంలో ఆంధ్రదేశమంతటా ప్రఖ్యాతి వహించిన వ్యక్తులు. వాగ్గేయకారక హరి నాగభూషణం, మృదంగ విద్వాంసులు అశ్వధాటి రామమూర్తిగారు ఇక్కడవారే. దేశాభిమానాన్ని రేకెత్తించే "నేషనల్ థియేటర్" కూడా బందరులో స్థాపించబడింది. ఈ థియేటర్ ఆధ్వర్యాన తెలుగు, హిందీ భాషలలో నాటకాలు ఆడేవారు.

## సంఘ సంస్కరణ

సుప్రసిద్ధ సంఘసంస్కర్త కందుకూరి వీరేశలింగంగారి తొలి రచనలు బందరునుంచి వెలువడే "పురుషార్థ ప్రదాయని"లో ప్రచురింపబడేవి. ఈ పత్రిక 1872 లో స్థాపించబడి, ఉమా రంగనాయకులు గారిచే నిర్వహించబడేది.

బిపిన్‌చంద్రపాల్ రాజకీయ నాయకుడుగాకాక, బ్రహ్మసమాజం పక్షాన 1903 లో బందరులో ఉపన్యాసా లిచ్చాడు. సంఘ సంస్కరణవాదులు ఆయనకు అల్పాహారవిందుచేసి, అందులో పాల్గొన్నారు. చక్రపొంగలి, గారెలు, ఆవడలు, కాఫీ సేవించారు. పాల్ "శూద్రుడ"ని, వారితో అల్పాహారవిందు భుజించటం నేరమనీ "మిమ్మల్ని ఎందుకు వెలివేయకూడదు ?" అంటూ బందరు బ్రాహ్మణ సభాపతి పురాణం సుబ్రహ్మణ్యావధాన్లు ముఖం పంపాడు. సంఘసంస్కరణవాదుల తరపున మూరి సుబ్బారావుగారు వాదించారు. నోబుల్ కళాశాల పండితులు నరసింహశాస్త్రిగారు యాజ్ఞవల్క్య స్మృతిలోని శ్లోకాలు చదివి, తైలంతో వండినవైతే "శూద్రులు" తయారుచేసినవి కూడా బ్రాహ్మణులు తినవచ్చునని సమర్థించారు. ఈ ఘటనతో నరసింహశాస్త్రిగారికి "తైలపక్వశాస్త్రి"గారని పేరువచ్చింది, అని అయ్యదేవర కాళేశ్వరరావుగారు తన విద్యార్థి జీవితం గురించిన ప్రస్తావనలో తెలియచేశారు. సనాతనుల ప్రాబల్యం ఎంతగా వుండేదో ఈ ఘటన తెలియచేస్తోంది.

1908 ఏప్రిల్ 20 న బందరులో ఆంధ్ర సంస్కరణవాదుల మహాసభ జరిగింది. పట్టాభి అధ్యక్షులు. ముట్నూరి కృష్ణారావుగారు కార్యదర్శి. ఈ సభలో చేసిన తీర్మానాల సారాంశం : "విదేశయాత్రలు చేసిన వారిని ప్రాయశ్చిత్తం లేకుండా సంఘంలో కలుపుకోవాలి. (ఆ రోజుల్లో విదేశాలలో పర్యటించిన వారిని నాలుకపై రాగితీగతో కాల్చి శుద్ధిచేసేవారట) భోజనం చేసేటప్పుడు ఇతర్లు చూడకూడదు అనేవి పాటించరాదు. పంచముల (హరిజనుల) అభివృద్ధికి పాఠశాలలు నెలకొల్పాలి, పండుగలను జాతీయ ఔన్నత్యానికి దారితీసే విధంగా పునరుద్ధరించాలి. తాలింఖానాలు ఏర్పరచాలి. వివాహాలలో సంతపశువుల్లాగా బాలబాలికల్ని విక్రయించే దురాచారాన్ని అంతం చేయాలి. స్త్రీలకు ఉన్నత విద్యతోపాటు వృత్తివిద్య కూడా బోధించాలి."

ఓసారి సంఘ సంస్కర్త వీరేశలింగంగారిని బందరుకి ఆహ్వానించారు. త్రిపురనేని రామస్వామి చౌదరిగారు ఈ సందర్భంలో స్వాగత పద్యాలు చదివారు. నాదెళ్ళ పురుషోత్తముడు అనే ఆయన దాన్ని అపహాస్యంచేస్తూ ఒక పనికిమాలిన గ్రంథాన్ని రాయగా దానిపై విమర్శ, ప్రతివిమర్శలు జరిగాయి. అవటపల్లి నారాయణరావు, కౌతా శ్రీరామశాస్త్రి, కోట వెంకటచలం మున్నగు సంస్కరణాభిలాషులపై కేసుపెట్టబడింది.

కళావంతుల సంస్కరణలో కూడ బందరు ప్రముఖసేవ చేసింది. పెళ్ళిళ్ళకు భోగంమేళాలు పెట్టే దురాచారాన్ని మానాలనీ, కళావంతులు

వివాహం చేసుకోవాలనీ పెద్దలు ప్రబోధించారు. ఈ ఉద్యమంలో కూడా రఘుపతి వెంకటరత్నంనాయుడు గారి శిష్యులైన గుడిసేవ సుబ్బయ్య, అశ్వథాటి రామమూర్తిగార్లు కృషిచేశారు. బందరులో అస్పృశ్యతా నివారణకు కృషిచేసిన ప్రముఖులలో గూడూరు రామచంద్రరావుగార్నీ, వేమూరి రాంజీ రావుగార్ని పేర్కొనాలి.

బ్రాహ్మణులతో సమాన వేదోక్తాధికారం వున్నదనే కులసంఘాల సభలు కూడా ఈ రోజుల్లోనే ప్రారంభమయ్యాయి. ఆత్మూరి లక్ష్మీనరసింహం గారనే వైశ్యుడు జిల్లా మున్సబు చేసినవ్యక్తి. వేదోక్తంగా యజ్ఞంచేసి "సోమయాజులు" అయ్యాడు.

రజస్వలానంతర వివాహాలు, వితంతు వివాహాలు గురించి సభలు జరగడమేకాక, బందరులో చోడవరపు జగన్నాధరావుగారి వివాహం జరిగింది. బందరులో స్త్రీ పునర్వివాహం జరగటం ఇదే ప్రథమం. వీరేశలింగంగారి బోధనలచే ప్రభావితుడై, జగన్నాధరావు ఈ విషయంలో ముందంజ వేశాడు. ఆయన అప్పుడు బి.ఏ. విద్యార్థి. వేమూరి సుబ్బారావు, కొండా వెంకటప్పయ్య, వల్లూరి సూర్యనారాయణ, కాశీశ్వరరావు మున్నగు వారు దీనికి ప్రోత్సహించారు. 1904 ప్రారంభంలో జరిగిన ఈ వివాహం చాలా వైభవంగా జరిగినా, చాలామంది సంఘసంస్కర్తలు సైతం చందన తాంబూలాలు తీసుకొని ఊరుకొన్నారట. భోజనం చేయడానికి మాత్రం వెరిచారట. హేమాహేమీలు అండలో ఈ వివాహం జరగటం మూలాన సనాతనులేమీ అడ్డుపెట్ట లేక పోయారు.

అలాగే మహిళా సమాజం కూడ బందరులో ఏర్పడింది. ఇదే ఆంధ్ర దేశంలో ప్రథమ సమాజం అని కాశీశ్వరరావుగారి అంచనా. బండారు అచ్చమాంబ గారు ఉపన్యసించారు బుట్టయ్యపేట ఆడపిల్లల పాఠశాలలో ఈ సభ జరిగింది. క్రైస్తవ మతం పుచ్చుకొన్న ఓరుగంటి శివరామకృష్ణయ్యగారి పుత్రిక రత్నం (ఎం.ఏ.) గారీ సభకు అధ్యక్షత వహించారు. బృందావన స్త్రీ సమాజం అని దీని పేరు.

## వందేమాతరం ఉద్యమ కాలంలో

వందేమాతరం ఉద్యమం 1905-1911 సంవత్సరాల మధ్య కాలంలో దేశాన్ని బ్రిటిష్ ప్రభుత్వంపై ప్రత్యక్ష కార్యాచరణకు పురికొల్పింది. బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా ఉద్భవించిన ఈ ఉద్యమం, కలకత్తా కాంగ్రెసు తీర్మానంతో మరింత బలపడింది. ఈ కాంగ్రెసు మహాసభ "స్వదేశీ" ఉద్యమ కాంక్షను మరింత గాఢంగా పెంపొందించింది. ఈ ఉద్యమ కాలంలోనే లాల్, బాల్, పాల్ త్రయం (లాలా లజపతిరాయ్, బాలగంగాధరతిలక్, బిపిన్ చంద్రపాల్) లోని బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశంలో రెండోసారి 1907 ఏప్రిల్‌లో పర్యటించాడు. పాల్ పర్యటనకు ముట్నూరి కృష్ణారావుగారు ఏర్పాటు చేయటమే కాక, స్వయంగా ఆయన వెంట వున్నారు విశాఖపట్నం, విజయనగరం, కాకినాడ, రాజమండ్రి, బెజవాడలలో పర్యటించాక పాల్ బందరు వచ్చాడు.

గవర్నమెంటు ప్లీడర్‌తోసహా స్థానిక ప్రముఖులతో ఒక ఆహ్వాన సంఘం ఏర్పడింది. బందరులో 1906 లోనే స్వదేశీ ఉద్యమాన్ని ప్రోత్సహించేందుకు చందాలు వసూలు చేయటం తాలింఖానాలు ఏర్పరచటం-ప్రభుత్వానికి భయాన్ని కలిగించింది. 1906 లో ఒక పోలీసు రిపోర్టులో ఈ సందర్భంగా వాటిల్లో పాల్గొన్న 12 మంది పేర్లను ఉదహరించింది. వందేమాతరం, స్వదేశీ ఉద్యమం రోజుల్లో బందరులో ఈ క్రింది ప్రముఖుల కార్యకలాపాలపై సి.ఐ.డి.లు తమ నివేదికలు పంపారు. ముట్నూరి కృష్ణారావు, ఎతిరాజు సురేంద్రనాధ ఆర్య, గాడిచర్ల హరి సర్వోత్తమరావు, కోపల్లె హనుమంతరావు, చిరిగె సీతామాధవరావు, అవుటపల్లి నారాయణరావు చిరిగె శ్రీనివాసరావు, డాక్టర్ పట్టాభి సీతారామయ్య, అల్లూరి సూర్యనారాయణరావు, కౌతా శ్రీరామశాస్త్రి

పాల్ రెండు రోజులు వరసగా యిచ్చిన ఉపన్యాసాలలో స్వదేశీ, విదేశ వస్తు బహిష్కరణ, జాతీయ విద్య, స్వరాజ్యం అనే అంశాలపై ప్రసంగించాడు. మతం గురించి మాట్లాడుతూ "విదేశ ప్రభుత్వాన్ని తొలగించితేకాని, నిజమైన మతం మనజాలదు" అని అన్నాడు. వందేమాతరం ఉద్యమం పుట్టు పూర్వోత్తరాలను పాల్ విపులీకరించాడు. బందరులో వైశ్య

సభవారు స్వదేశీ వస్తువుల అమ్మకానికి అనుకూలంగా తీర్మానించారు.

"తక్షణ ప్రమాదంలేదు. కాని పాల్ మంచి పదునైన క్షేత్రంలో మంచి శక్తివంతమైన చెడ్డ విత్తనం నాటాడు కొందరు భావించిన దానికంటే వేగంగా కొన్నిచోట్ల ఆ విత్తనం మొలకెత్తి పెరుగుతోంది." అని రాజమండ్రి ప్రాంతం నుంచి, ఒక మత ప్రచారకుడు ప్రభుత్వానికి 1907 జూలై 13 న పాల్ పర్యటన ప్రభావం గురించి జాబు రాసాడు.

పాల్ పర్యటన అనంతరం పత్రికలు ధైర్యంగా స్వదేశీ ఉద్యమం గురించి రాయటం మొదలు పెట్టాయి.

పాల్ రాక ఫలితంగానే బందరులో ఆంధ్ర జాతీయ కళాశాలను కోపల్లె హనుమంతరావు ప్రభృతులు స్థాపించటం జరిగింది. ఆంధ్ర జాతీయ కళాశాల ఈ కాలంలో జాతీయోద్యమానికి ఎలా దోహదం చేసింది, ఇదివరకే వివరించాం.

వందేమాతరం ఉద్యమ కాలంలోనే రాజమండ్రి ప్రభుత్వ ట్రైనింగ్ కళాశాల నుంచి డిస్మిస్ చేయబడిన గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు బెజవాడలో "స్వరాజ్య" పత్రికను స్థాపించాడు అందులో ప్రభుత్వాన్ని దుయ్యబట్టాడు.

హరి సర్వోత్తమరావు, ఈ పత్రికా నిర్వాహకులలో మరికొందరిపైన కేసుపెట్టి బందరులోనే విచారించి, తలా ఒక ఆరు నెలల శిక్ష విధించారు.

ముట్నూరి కృష్ణారావుగారిపై అరెస్టు వారంట్ రావడంతో ఆయన కృష్ణా పత్రిక సంపాదకత్వాన్ని కొన్నాళ్ళు వదులుకోవాల్సి వచ్చింది. చిల్లరిగ శ్రీనివాసరావుగారిపై అరెస్టు వారంటు రాగా "నవయుగ" ప కను ఆపివేశారు. హైకోర్టు అప్పీల్‌లో గాడిచె గారి శిక్షను ఇంకా ఎక్కువచేసి, మూడేళ్ళ శిక్ష వి ంచారు.

## హోం రూల్ ఉద్యమ ప్రభావం

1916 లో బాలగంగాధర తిలక్ హోం రూల్ లీగ్‌ను స్థాపించాడు. 1914 లో కాంగ్రెసులో ప్రవేశించిన అనిబిసెంట్ కూడా ఆలిండియా హోం రూల్ లీగ్ ఏర్పరచి, హోమ్ రూల్ ఉద్యమం ప్రారంభించింది. "స్వపరిపాలన" ధ్యేయంగా ఈ ఉద్యమం ప్రారంభించబడింది. అనిబిసెంట్ హోమ్ రూల్ లీగ్‌లో చేరిన ప్రముఖులలో బందరు నుంచి డాక్టర్ పట్టాభిగారు కూడా వున్నారు. ఆంధ్రలో హోమ్ రూల్ ఉద్యమం బలపడటం చూసి, ప్రభుత్వం-విద్యార్థులు హోం రూల్ ఉద్యమ సభలకి వెళ్ళరాదని నిషేధించింది. ఈ చర్యను రాష్ట్ర మంతటా ఖండించారు.

ఈ విషయంలో బందరు జాతీయ కళాశాల ఉపాధ్యాయులు ఎంతో ఉత్సాహంగా ఆందోళన సాగించారు. అనిబిసెంట్‌ను అరెస్టు చేసినపుడు ఆమె విడుదలపై సత్యాగ్రహం చేయాలని కాంగ్రెస్ వాదులు కొందరు అభిప్రాయపడ్డారు. అలాంటి సత్యాగ్రహాన్ని సమర్థిస్తూ బందరులో ఒక సభ జరిగింది. సత్యాగ్రహానికి అనుకూలంగా 30 మంది సంతకాలు చేసి పంపించారు. ఐతే అనిబిసెంట్ విడుదలతో యీ సత్యాగ్రహ సమస్య ముగిసిపోయింది.

మొదటి యుద్ధకాలంలో హోంరూల్ ఉద్యమ తీవ్రతను చల్లార్చడానికి, భారతకార్యదర్శి మాంటేగ్ కల్లిబొల్లి కబుర్లు చెప్పాడు. పరిపాలనలోకి భారతీయులు ఎక్కువమంది రావాలనీ, సైన్యంలో జాతి వివక్షత తొలగింపబడుతుందనీ అన్నాడు. బ్రిటిష్ ప్రభుత్వ ఆధిపత్యాన బాధ్యతాయుత పరిపాలన ఏర్పరచాలన్నాడు. ఈ మాటల్లో చాలామంది విశ్వాసం వుంచారు.

1917 కలకత్తాలో ఆంధ్ర రాష్ట్రానికి ప్రత్యేక కాంగ్రెస్ సంఘం ఏర్పడింది. అదివరలో మద్రాసు రాష్ట్రంలో భాగంగానే వుండేది. దీనితోపాటు కృష్ణా జి కాంగ్రెస్ ఏర్పడింది. మాంటేగ్ సూచించిన సంస్కరణలకు ఇంగ్లండులో ద్రోహం తలపెడతారనీ, అలా జరగకుండా చూసేందుకు పట్టాభి సీతారామయ్యగార్ని, ఇంగ్లండు పంపించాలని 1918 జనవరి 26 న బందరులో కృష్ణాజిల్లా ప్రతినిధులు సూచించారు. ఇది ఆనాడు బ్రిటిష్ ప్రభుత్వ ప్రకటనల పట్ల కొందరు నాయకులకు గల విశ్వాసాన్ని తెలియచేస్తుంది.

యుద్ధకాలంలో బ్రిటిష్ ప్రభుత్వం చేసిన వాగ్దానాలను యుద్ధం ముగియగానే భంగపరచింది. అది ప్రక

టించిన రాజ్యాంగ సంస్కరణలు భారతీయులకు నచ్చలేదు.

ప్రభుత్వం ప్రవేశపెట్టిన రౌలట్ బిల్లుకు వ్యతిరేకంగా జరిపిన సభలు, హర్తాళ్ళ సందర్భంగా జలియన్ వాలాబాగ్‌లోను, పంజాబ్‌లో తదితర ప్రాంతాల్లోను జరిపిన దురంతాలకు నిరసనగా, ఖిలాఫత్ ఉద్యమానికి మద్దతుగా సహాయ నిరాకరణ ఉద్యమాన్ని గాంధీ తలపెట్టాడు.

కలకత్తాలో 1920 సెప్టెంబరు 4 న ప్రత్యేక కాంగ్రెస్ జరిగింది. అందులో సహాయ నిరాకరణ ఉద్యమాన్ని గాంధీ ప్రతిపాదించినపుడు ఆంధ్ర ప్రతినిధులలో టంగుటూరి ప్రకాశం, కొండా వెంకటప్పయ్యగార్లు ప్రతికూలించారు. పట్టాభిగారు విషయ నిర్ణయసభలో తటస్థంగా ఉన్నారు. మహాసభకు పట్టాభిగారు హాజరు కాలేదు.

1919 లో పంజాబు దురంతాలను నిరసించడానికి ముట్నూరి కృష్ణారావుగారు గ్రామాలలో పర్యటించి బ్రిటిషు పైశాచిక కృత్యాలను తీవ్రంగా విమర్శించారు.

1920-21 లో తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్‌కు ముట్నూరి కృష్ణారావుగారు అధ్యక్షులుగాను, పట్టాభిగారు ప్రధాన కార్యదర్శిగాను ఉండేవారు. బెజవాడలో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ కమిటీ మహాసభల నిర్ణయానుసారం, రాట్నాలు పెంచటం, ఖద్దరు ప్రచారం, అంటరానితనం నిర్మూలన, తిలక్ నిధి వసూళ్ళు మొదలైన కార్యక్రమాల యీ సంఘం నెరవేర్చుతూ వుండేది.

సహాయ నిరాకరణోద్యమ కార్యక్రమంలో త్రివిధ బహిష్కారానికి గాంధీ సూచించాడు. కోర్టులను బహిష్కరించి మధ్యవర్తుల ద్వారా, తగాదాలు పరిష్కరించుకోడం, ప్రభుత్వ బిరుదులు, గౌరవోద్యోగాలు వదులుకోవటం, ప్రభుత్వ పాఠశాలలను, కళాశాలలను బహిష్కరించటం.

ఈ కార్యక్రమం గురించి, గాంధీ 1921 లో ఆంధ్రలో పర్యటన సందర్భంగా బందరు వచ్చినపుడు నొక్కి చెప్పాడు. 1921 ఏప్రిల్ 4, 5 తేదీలలో ఆయన ఆంధ్ర జాతీయ కళాశాలలో మకాం చేశాడు. పురపాలక సంఘం, వైశ్యులు, ఖిలాఫత్ సభ్యులు, వర్తకులు వేర్వేరు స్వాగతపత్రాలు సమర్పించారు. విదేశీయులను ఐశ్వర్యవంతం చేసే క , సారా మొదలైన మత్తు పదార్థాలను అమ్మడం దా రా వైశ్యులు ధనం సంపాదించరాదని బోధించా . జాతీయ కళాశాలలోని క్రమపద్ధతి, నిర్మాణం, కౌశలం, త్యాగసౌశీల్యాలను గాంధీ ప్రస్తుతించాడు. ఈ కళాశాలను స్థానికులే పోషించాలిగాని బయట నుంచి సహాయం ఆశించరాదని అన్నారు. జలియన్ వాలాబాగ్‌లో డయ్యర్ దురంతాలను గాంధీ వివరించాడు. హిందూ ముస్లిముల మధ అవిశ్వాసం తొలిగించాలనీ, రాట్నాన్ని పునరు రించాలనీ కోరాడు. భారతదేశ దుస్థితి వర్ణిస్తూ "ఒ లక్ష మంది ఆంగ్లేయులు యావద్భారత దేశాన్నీ దాస్యంలో ఉంచినపుడు దాన్ని తొలగించడానికి ఒక్కడు కూడా లేని అతినీచమైన దురవస్థను ప్రపంచ చరిత్రలో ఎవ్వరూ కనీవినీ వుండరు" అని అన్నాడు. స్వార్థపరత్వాన్ని మానాలని భారత భూమికోసం జీవించాలనీ బోధించాడు.

బందరులో తిలక్ స్వరాజ్యనిధికి ఆ రోజున 6 వేల రూపాయలు వసూలయ్యాయి.

ఏప్రిల్ 5 వ తేదీ సాయంకాలం బందరులోని డర్లు గాంధీని కలుసుకొని సంభాషణలు జరిపారు. డరు వృత్తిని విసర్జించాల్సిందిగా, కనీసం ఒక సంవత్సరం విసర్జించాల్సిందిగా గాంధీ కోరాడు. ప్లీడర్ల అనుమానాలను నివృత్తి చేయడానికి గాంధీ ప్రయత్నించాడు.

## సహాయ నిరాకరణ ఉద్యమం

త్రివిధ బహిష్కార ఉద్యమంలోను, సహాయ నిరాకరణ ఉద్యమంలోను పాల్గొన్న కొందరి ప్రముఖుల గురించి తెలుసుకుందాం.

పుచ్చా వెంకటకృష్ణయ్యగారు 1921 నుంచి కాంగ్రెస్ ప్రచారకులుగా వున్నారు. 1919 నుంచి గూడూరు రామలింగేశ్వర్ గురుకుల్‌గారు కాంగ్రెస్ వాది.బొప్పనమాణిక్యాంబగారు 1920 నుంచి కాంగ్రెస్ కార్యకర్త. తిలక్ నిధికి డబ్బు ఇచ్చిందామె. రామదాస్ నాయుడు 1907 లో బిపిన్‌చంద్రపాల్‌కు ఆతిథమిచ్చారు. జాతీయ కళాశాల స్థాపనలో ప్రముఖపాత్ర వహించారు. స్వదేశీ ప్రావిడెంట్ ఫండ్ స్థాపించా . వేమూరి రాంజీరావు హరిజన హైస్కూలు, హరిజన హాస్టల్ ఏర్పాటు చేసి, హరిజనుల్ని విద్యావంతులుగా

చేయడానికి కృషిచేశారు గురజాడ రాఘవశర్మ గారు 1921 లో ఉపాధ్యాయ పదవికి రాజీనామాచేసి, ఆంధ్ర జాతీయకళాశాలలో పనిచేశారు. చిట్టావఝుల రామ కృష్ణయ్యగారు నోబుల్ కాలేజీలో చదువు మానేశారు.

1921–22 ఉద్యమంలో అశ్వధాటి రామదాసు గారికి విద్యార్థులలో అలజడి లేవ నెత్తుతున్నాడని ఆరోపించి వారం రోజుల శిక్ష విధించారు. కంభంపాటి సాంబయ్యగారు కూడా ఈ ఉద్యమంలో శిక్షను అనుభవించారు. పినపాల నాగభూషణం గారికి ఒక వారం శిక్ష, రు. 15 జరిమానా విధించబడింది. ఆయాన కుట్టు మిషన్ వేలం వేసి, జరిమానాను ప్రభుత్వం వసూలు చేసింది. భోగరాజు పట్టాభి సీతారామమూర్తి గారికి 1922 లో నాల్గు నెలల శిక్ష విధించబడింది. వంకా సూరిశాస్త్రిగారు 1921–22 ఉద్యమంలో పాల్గొన్నారు. 1923 లో గుంటూరులో సబ్ జైలులో కొన్నాళ్ళు ఈయన్ని ఉంచారు. వేమవరపు రామదాసు పంతులు కొన్నాళ్ళు కృష్ణా పత్రిక సంపాదకులుగా పనిచేశారు. 1922 ఆంధ్ర స్వరాజ్యపార్టీ రాష్ట్ర కమిటీ అధ్యక్షుడు. సహకార ఉద్యమ నిర్మాత, సంఘ సంస్కర్త. జొన్నలగడ్డ సూర్యనారాయణ బందరు తాలూకా పుల్లిపాడు గ్రామ కరణం పదవికి రాజీనామా చేశారు. మానికొండ సత్యనారాయణ 1921 లో లా కాలేజీ వదలివేశారు. 1939 లో ప్రయి వేటుగా చదివి లా పూర్తి చేసినా ప్రాక్టీసు పెట్టలేదు. 1922–23 లో 9 నెలలు జైలు శిక్ష అనుభవించారు. అడవి బాపిరాజుగారు 1922 లో సంవత్సరం శిక్షను అనుభవించారు. కొడాలి ఆంజనేయులుగారు రాసిన అవతార పరివర్తనం (విప్లవ పరివర్తనం) అనే నాటి కను ప్రభుత్వం నిషేధించింది. చెరుకువాడ నరసింహం 1921 లో సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొని ఒక సంవత్సరం శిక్ష అనుభవించారు. జాతీయ కళాశాలలో ఉపాధ్యాయునిగా పనిచేశారు. కాంగ్రెస్ రాజకీయాలలో యావత్ కాలం పని చేసేం దుకుగాను ఈయన ఆ తర్వాత ఆ పదవికి రాజీనామా చేశారు. ఆ కాలంలో వల్లూరి సూర్యనారాయణగారు వీరి కుటుంబ ఖర్చులు భరించి, వేతనంపై రాజకీయ కార్యకర్తల్ని నియమించే పద్ధతికి దారిచూపారు.

## 1929, 1933 లలో బందరుకు గాంధీ రాక

ఖద్దరు నిధికై గాంధీ ఆంధ్రదేశ పర్యటన సందర్భంగా 1929 ఏప్రిల్ 13 న బందరు చేరాడు 5 వేల మంది స్త్రీలు పాల్గొన్న మహిళా సభలో ఆయన ప్రసంగించాడు. ఈ సభను మహిళా సంఘం ఏర్పాటు చేసింది. ఈ సభకు వచ్చిన కొంతమంది మహిళలు విదేశీ వస్త్రాలలో ఉండటం ఆయనకు విచారం కలుగ చేసింది. అందరూ ఖద్దరు ధరించాలని విజ్ఞప్తి చేశాడు. బాల్య వివాహాలు నిరుత్సాహపరచాలనీ, పిల్లలకి ఉత్తమ విద్య నేర్పించాలనీ కోరాడు. విలువైన వస్తువుల్నీ, నగల్నీ ఖద్దరు నిధికి సమర్పించాల్సిందిగా కోరాడు. ఆయన ఉపన్యాసం తర్వాత స్వచ్ఛంద సేవకులు నగలు డబ్బు సుమారు రు.500 విలువైనవి వసూలు చేశారు.

వేమూరి రాంజీరావుగారు నడిపే హరిజన బాలుర పాఠశాలను సందర్శించాడు. హరిజన బాలికల నిమిత్తం "అరుంధతీ ఆశ్రమా"నికి ప్రారంభోత్సవం చేశాడు. రాంజీరావు కృషిని గాంధీ కొనియాడాడు. వైశ్య గ్రంథాలయంలో వైశ్య సమాజం వారు రు. 116 లు సమర్పించారు.

ఆ రోజు సాయంత్రం 6 1/2 గంటలకు ఆంధ్ర జాతీయ కళాశాలలో గాంధీ ఉపన్యసించాడు. బందరులో వసూలైన రు. 5194 లు, కళాశాల సిబ్బంది రు. 45 లు ఒక అణా, పి. సత్యనారాయణగారు రు. 116, గుడ్లవల్లేరు నుంచి యం. కృష్ణారావు గారు ద్వారా వసూలైన రు. 116, ఈ మొత్తం డబ్బును పట్టాభిగారు గాంధీకి సమర్పించారు. సభకు 5 వేల మంది వచ్చారు. బందరు మున్సిపాలిటీ తరపున శీలం జగన్నాధరావు నాయుడు, బందరు తాలూకా బోర్డు తరపున కొల్లిపర వెంకట రమణయ్య నాయుడుగార్లు అభినందన పత్రాలు సమర్పించారు. ఆం జాతీయ కళాశాల వ్యవస్థాపకులు కీర్తిశేషులు కోప హనుమంతరావు గారిని సంస్మరిస్తూ, ఆయన ప్రతి ను, త్యాగాన్ని, దేశ భక్తిని తెలుసుకోడానికి తనకెంతో కాలం పట్టలేదని గాంధీ అనా ు. కళాశాలలోని అంతఃకలహాలకు విచారం వ్య ంచేశాడు. "ఈ దేశంలోని విద్యా సంస్థలలో ది ఎడారి

లోని జలాశయంవలె ఉన్న"దనీ, దాని నిర్దుష్ట స్వరూపాన్ని నిలబెట్టాలని గాంధీ కోరాడు.

మున్సిపాలిటీ వారిచ్చిన అభినందన పత్రంలో విదేశీ వస్త్ర దహనం గురించిన ఆక్షేపణలకు గాంధీ సమాధానమిస్తూ, దక్షిణాఫ్రికాలో జోహన్స్ బర్గ్‌లో ప్లేగు వ్యాధి వ్యాపించినపుడు 15 వేల పౌనుల విలువైన బట్టన్ని తగలబెట్టారని తెలియచేశాడు. "విదేశీ వస్త్రాలు మన దేశాన్ని దరిద్రవంతంగా చేయడమే కాక, దేశీయుల మానాభిమానాలను మైల పరుస్తున్నాయి ... మన పౌరుషానికి, ఆత్మ విశ్వాసానికి విదేశీ బట్ట కళంకం కలిగిస్తుందని నా నమ్మకం" అన్నాడు.

తాలూకా బోర్డు వారి అభినందన పత్రంలో చేసిన మరో ఆక్షేపణకు కూడా గాంధీ సమాధాన మిచ్చాడు. "ఖద్దరు కొనుక్కోకుండా స్వయంగా పత్తి పండించి, రాట్నంమీద వడికి స్వయంగా నేసుకుని ధరించాలి." అని బోర్డువారి సలహా. "స్వయంగా పొలం దున్ని పండించుకొని, స్వయంగా దంపుకొని, స్వయంగా వండుకొని భోజనం చేయమనడం ఎంత సమంజసమో ఇదీ అంతే" అని గాంధీ జవాబిచ్చాడు. "మీరు తయారుచేసుకొన్న ఖద్దరు కట్టండి, లేదా విదేశీ బట్టనే కట్టండి" అనే సిద్ధాంతం తనకు అర్థం కావడంలేదన్నాడు.

స్వయం పోషకత్వానికి జస్టిస్ పార్టీ ప్రముఖులు ఈ అభినందనల పత్రాలద్వారా చేసిన విమర్శలకు గాంధీ పై విధంగా సమాధానమిచ్చాడు తర్వాత మద్యపాన నిషేధం గురించి, అస్పృశ్యతా నివారణ గురించి గాంధీ మాట్లాడాడు.

1933 లో హరిజన యాత్ర జరిపినపుడు బందరులో గాంధీరాకకు ముందు, అస్పృశ్యతా నివారణకూ, హరిజన దేవాలయ ప్రవేశానికీ వ్యతిరేకంగా ఒక వారంరోజులపాటు సనాతనులు ప్రచారం చేశారు. గాంధీని కలుసుకుని చర్చించాలని కూడా భావించారు. చివరకు ఆ ప్రయత్నం మాని, సనాతన ధర్మ విరుద్ధమైన అస్పృశ్యతా నివారణ ప్రచారంలో జోక్యం కల్గించుకోరాదని రాశారు ఐతే తమ అసమ్మతిని ఒక లేఖ ద్వారా డిసెంబరు 17 న తెలియచేశారు. డిసెంబర్ 19 న ఆంధ్ర రాష్ట్ర దేవాలయ అర్చకుల సంఘం ఒక సూచన చేసింది. సనాతనులతో గౌరవనీయమైన ఒడంబడిక చేసుకోవాలని ఆ సూచన. హరిజనులకు శైవ, వైష్ణవ మతాలు యిప్పించి దేవాలయ ప్రవేశార్హత కలుగచేయాలని కాశీ కృష్ణమాచార్యులుగారు ఒక మధ్యవర్తి పరిష్కార పథకం సూచించారు అర్చక సంఘ కార్యదర్శి, సనాతనుల, సంస్కరణవాదుల ఉమ్మడి సమావేశం ఏర్పాటుచేస్తామని గాంధీకి జవాబు రాశాడు. అస్పృశ్యతా నివారణకై గాంధీ సాగించిన హరిజన యాత్ర సనాతనులలో ఎలాంటి అలజడి కలిగించిందో పై సంఘటన తెలియజేస్తోంది.

1930-31 లో ఉద్యమంలో పాల్గొని బందరులో శిక్షించబడినవారు. (వీరిలో ఇతర ప్రాంతాలవారు, పుట్టుకతో ఇతర ప్రాంతాలకు చెందినా, ఇక్కడ రాజకీయ జీవితంలో స్థిరపడినవారూ ఉన్నారు )

డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య, చెరుకువాడ వెంకట నరసింహం, ముట్నూరి కృష్ణారావు, మానికొండ సత్యనారాయణశాస్త్రి, తత్వానందస్వామి, (కొండిపర్తి వీరభద్రాచార్యులు), టి. పి. ఆళ్వార్, తూములూరి వెంకటప్పయ్య, వారణాసి వెంకటాచలం, తుంగిరాల వీరరాఘవరావు, ధూళిపాటి వెంకట సుబ్బారావు, నుసర్ల నాగేశ్వరశాస్త్రి, భాస్కర్ల గోపాల కృష్ణమూర్తి, మంగళపల్లి రాజేశ్వరరావు, పురాణం సూరిశాస్త్రి, పెనుమర్తి లక్ష్మీపతిశాస్త్రి, పోచిరాజు కృష్ణారావు, తోట నరసయ్య, అశ్వధాటి రామదాసు, మేడూరి వెంకట చలపతిరావు,పినపాల నాగభూషణం, (తిరుచునాపల్లి జైల్లో చనిపోయారు) కంభంపాటి సాంబయ్య, కొడాలి ఆంజనేయులు, వల్లూరి రామారావు, తల్లాప్రగడ రామారావు.

## 1932 34 ఉద్యమంలో పాల్గొన్నవారు

డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, వేమూరి దుర్గానాగేశ్వరరావు (గుడివాడ మేజిస్ట్రేట్ విచారించాడు. జరిమానాలు వసూలుచేయబడ్డాయి) ప్రయాగ సత్యనారాయణ, (గంజాం జిల్లా వాస్తవ్యులు), డిగుమర్తి రామస్వామి, చెరుకువాడ వెంకట నరసింహం, (ఏలూరులో విచారించి, శిక్షించారు) మేకా ఆదినారాయణ (నూజివీడు వాస్తవ్యులు 2 నెలలు శిక్ష విధించారు) నిమ్మగడ్డ వెంకట కృష్ణా

రావు, గోవిందలూరు సూర్యప్రకాశరావు, (వీరిద్దర్నీ కొట్టి వదలివేశారు.) కానూరి చినవెంకట దాసయ్య, దివితాలూకాకు చెందిన గొట్టిపాటి బ్రహ్మయ్య, కొడాలి ఆంజనేయులు, కొల్లిపర సూరయ్య, పెనుమర్తి లక్ష్మీపతిశాస్త్రి,, మానికొండ సత్యనారాయణ శాస్త్రి, వల్లభనేని రామబ్రహ్మం, అట్లూరి సుబ్బారావు (పోలీసు లాకప్‌లో వుంచారు) ఉసిరిక సుబ్బారావు (పోలీస్ లాకప్) దేవినేని భీమయ్య (సబ్‌జైలులో వుంచారు.) అట్లూరి జయం, తంగిరాల సీతారామమ్మ సూతక్కి గోపాలకృష్ణయ్య, పోచిరాజు కృష్ణారావు.

## 1939 నుండి 1945 వరకు ఉద్యమాలలో శిక్షింపబడినవారు

## డిటెన్యూలు

ఉసిరిక వెంకట సుబ్బారావుగుప్త, కాగితం వెంకటేశ్వరరావు, కాశీనాధుని పూర్ణమల్లికార్జునుడు, డా॥ కుప్పా వెంకట్రామశాస్త్రి, కేతవరపు శివ సుబ్బయ్య, గోవాడ నిరీక్షణరావు, తంగిరాల వీర రాఘవరావు, పుచ్చా వెంకట కృష్ణయ్య, బూశంకోట మల్లయ్య, భోగరాజు పట్టాభి సీతారామయ్య, మామిడాల అంకయ్య, ముట్నూరి కృష్ణారావు, మేకల ఆదినారాయణ, వి.వి.యస్. సోమయాజులు, అశ్వథాటి రామదాసు, ఆచంట సముద్రయ్య, ఆచార్య రామదేవ్, ఉన్నవ కృష్ణయ్య, కంభంపాటి రాధాకృష్ణమూర్తి, కాజ లక్ష్మీనారాయణశాస్త్రి, కోడూరు సీతారామాంజనేయులు, గాజుల వెంకటేశ్వరరావు, గుంజ వీరాస్వామి, గూడూరు రామలింగేశ్వర గురుకుల్, తటవర్తి పెరి ఆళ్వార్ గుప్తా, రామరాజు పట్టాభి రామారావు, నూకల కృష్ణమూర్తి, పోచిరాజు కృష్ణారావు, పోలిశెట్టి విశ్వేశ్వరరావు, మద్రి వెంకటేశ్వరరెడ్డి, కొమరవోలు రామచంద్రరావు, కృత్తివెంటి వెంకటేశ్వరరావు, చలమశెట్టి నాగయ్య, తోట పెరుమాళ్ళు, నందం లక్ష్మీ పెరుమాళ్లు, పాలూరి పుష్పేశ్వరరావు, పులి సుబ్బారాయుడు, యం. రామారావు, మొక్కపాటి కామయ్య, వారణాసి దుర్గాప్రసాదశాస్త్రి (1947-48 హైద్రాబాద్‌లో) శ్రీకాకుళపు రాఘవయ్య.

ఉద్యమ విరామ సమయంలో గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ప్రకారం విడుదల కావాల్సిన వారిలో సర్వశ్రీ శెట్టిపల్లి వెంకటరత్నం, బెడతనపల్లి సత్యనారాయణ, బెడతనప సీతయ్య, ఐనంపూడి సుబ్బారావు, చెరువు మల్లికార్జునుడు, అట్లూరి వెంకట రంగయ్య, సున్నం నరసింహ గార్లను ప్రభుత్వం విడుదల చేయలేదు. వీరి విడుదలకై నాయకులు చేసిన కృషి కూడా ఫలించలేదు. తమకు విధించిన శిక్షాకాలం పూర్తిగా అనుభవించిన తర్వాతనే వీరు విడుదలయ్యారు.

ఈ కాలంలోనే కాంగ్రెసు సంఘాలు పునరుద్ధరించబడ్డాయి. కాంగ్రెస్ సభ్యత్వాన్ని చేర్పించారు. బందరులో ఇతర పట్టణాలలోవలెనే వలంటీర్ల శిబిరం ఏర్పాటు చేశారు.

కల్లు, సారా దుకాణాలవద్ద, విదేశీ వస్త్రాలు, వస్తువులు అమ్మేచోట పికెటింగ్ ప్రారంభించారు.

ఇదే కాలంలో రీసెటిల్‌మెంట్ పన్నుల నివారణకు రైతు సంఘాలు కృషిచేయసాగాయి. గొట్టిపాటి బ్రహ్మయ్య, కానూరు చినవెంకటదాసయ్య, కొల్లిపర సూరయ్య మున్నగువారు గ్రామాల్లో సంచరించి, రీసెటిల్‌మెంట్ గురించి ప్రసంగించారు. వీరిలో కొందరిపై నిషేధాజ్ఞలు విధించింది ప్రభుత్వం.

సర్వశ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య, కొల్లిపర సూరయ్య, వల్లభనేని రామబ్రహ్మం, ఆత్మూరి నాగేశ్వరరావు, కేతవరపు లక్ష్మీనరసింహారావు, ముమునూరు గుర్రాజు, వీరపనేని గోపాలకృష్ణయ్య, కానూరి చినవెంకటదాసయ్య, చలసాని నాగభూషణం, కాజ బసవయ్య, బోలగాని రామలింగం మొదలైన 30 మందిపై 144 వ సెక్షన్ జారీ చేయబడింది. గుడివాడ తాలూకాలో ప్రవేశించరాదని నిషేధం విధింపబడింది. కొల్లిపర సూరయ్యగారిని కపిలేశ్వరపురం నుంచి కదలరాదని, రైతులతో మాట్లాడరాదని కూడా నిషేధించారు. నిషేధాజ్ఞలను ఉల్లంఘించరాదని కాంగ్రెస్ అధ్యక్షుడు పటేల్ సూచించడంతో వారు ఉల్లంఘించలేదు. దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారిని శిక్షించారు. శ్రీమతులు వల్లభనేని సీతామహలక్ష్మమ్మ, దుగ్గిరాల కమలమ్మ మున్నగు మహిళలు కూడా ఈ ఉద్యమంలో పాల్గొన్నారు.

# దివి తాలూకా

తన జాతినీ, సంస్కృతినీ, ప్రాచీన వైభవాన్నీ గుర్తు తెచ్చుకొని గర్వపడటం జాతీయోద్యమం పెట్టిన భిక్ష. ఆనాటి పాత కథలతోనే పరవశం చెంది చేతులు ముడుచుకు కూర్చోరాదనీ, తన కాలంనాటి బానిసత్వాన్ని పటాపంచలు చేయాలని బోధించింది జాతీయోద్యమమే ఆ దృష్టితోనే దివి (అవనిగడ్డ) తాలూకా స్వాతంత్ర్య ఉద్యమ చరిత్రను కూడా చూద్దాం. (స్వాతంత్ర్యానంతరం జరిగిన తాలూకాల పునర్విభజనతో నిమిత్తం లేకుండా, అంతకుపూర్వ మున్న తాలూకాను దృష్టిలో వుంచుకొని, ఈ తాలూకా సంగ్రామ చరిత్రను వివరిస్తున్నాం.)

మొట్టమొదటి ఆంధ్ర రాజ్యాన్ని స్థాపించింది శాతవాహనులు. వాళ్ళ మొట్టమొదటి రాజధాని కృష్ణా జిల్లాలోని శ్రీకాకుళం. కృష్ణానది ఒడ్డున ఈ గ్రామం వుంది. ఒకప్పుడు రాజధాని అయినా యిప్పుడది చిన్న గ్రామం. మౌర్య సామ్రాజ్యాన్ని ధిక్కరించి స్వతంత్రి రాజ్యం ఏర్పరచుకొన్న శాతవాహనులు శ్రీకాకుళం రాజధానిగా తమ రాజ్యాన్ని పాలించారు.

కృష్ణాజిల్లాలో ఖండాంతర వాణిజ్య కేంద్రాలుగా ఘంటసాల, గూడూరులు ఉండేవి. ఇవి ఒకప్పుడు రేవు కేంద్రాలు. ఘంటసాల దివి తాలూకాలోని గ్రామం.

శాతవాహనరాజు ఆంధ్ర విష్ణువు. నిశంభుడనే నాగరాజుని ఓడించి, ఆంధ్ర రాజ్యాన్ని స్థాపించాడని బ్రహ్మాండ పురాణ కథ. ఆంధ్ర విష్ణువు పేరిట నిర్మించబడిన శ్రీకాకుళం దేవాలయంలోని శిల్పాలు, చరిత్ర ప్రసిద్ధమైనవి. శాతవాహనుల కాలంలో ఘంటసాల, అవనిగడ్డ రేవుల ద్వారా విదేశ వ్యాపారం సాగేది. నూలుబట్టలు, అద్దకపుబట్టలు, రవ సెల్లాలు (సన్నని బట్టలు) వస్త్రాలు, అటు పశ్చిమాన రోమ్‌కు. ఇటు తూర్పున బర్మా, చైనా, సయాం దేశాలకు ఎగుమతి అవుతుండేవి. ఘంటసాలలో రెండో శతాబ్దం నాటి రోమ్ చక్రవర్తుల నాణాలు లభించాయి. 13 వ శతాబ్దంవరకు ఘంటసాల రేవు పట్టణంగా వుండేది. తూర్పు చాళుక్యుల కాలంలో కూడా రేవు పట్టణంగా ప్రసిద్ధిచెందింది. శాతవాహనులకు ముందే బౌద్ధమత వ్యాప్తి ఫలితంగా ఘంటసాలలో బౌద్ధ-స్తూపాలు, బౌద్ధ శిల్పాలు ఉన్నాయి. "కంటక శైల"గా పేర్కొనబడే ఈ గ్రామంలో నాగార్జుని కాలంలో పెద్ద బౌద్ధారామం ఉండేది. 1 వ శతాబ్దం నాటి బౌద్ధ స్తూపం అవశేషాలు మాత్రం ఇపుడు వున్నాయి మూడో శతాబ్దం నాటి భైరవసర్వతీ విగ్రహ శిల్పం, మొహంజిదారో శిల్పచాతుర్యాన్ని పోలినదని పెద్ద లంటారు.

బృహత్పలాయన రాజ్యాన్ని స్థాపించిన జయ వర్మ రాజధానిగా దివి తాలూకా 'కోడూరు' వుండేది. "కూడూరుహారము" అని ఆ రోజుల్లో పేరు. బృహత్పలాయనులు స్వతంత్ర రాజులు. శాతవాహనులు, ఇక్ష్వాకుల అనంతరం పల్లవులు అధికారంలోకి వచ్చిన సమయంలో కృష్ణకు ఉత్తరాన చిన్న చిన్న స్వతంత్ర రాజ్యాలు తలెత్తాయి. వారిలో వాడే జయ వర్మ. భారత నాట్యాచార్యుడుగా ప్రసిద్ధిచెందిన సిద్ధేంద్రయోగి నివసించిన కూచిపూడి, పద రచయిత క్షేత్రయ్య ఆరాధ్యదైవం వేణుగోపాలుని గ్రామం మొవ్వ ఈ తాలూకాలోనివే.

ఇంతటి ప్రాచీన చరిత్రగల ఈ తాలూకా స్వాతంత్ర్య సమరంలో వహించిన పాత్రను పరిశీలించుదాం.

## జమీందారీ వ్యతిరేక పోరాటం

జాతీయ చైతన్యం కల్గించడానికి గ్రంథాలయ ఉద్యమాలు, సంఘ సంస్కరణ సభలు, మొదలైనవి ప్రారంభదశలో ఎలా ఉపకరించాయో, అలాగే చదువు, ఉద్యోగాలలో వెనుకబడ్డ రైతు వ్యవసాయ కార్మికులలో జమిందారీ వ్యతిరేకపోరాటాలు జాతీయోద్యమానికి పరోక్షంగాను, ప్రత్యక్షంగాను సహాయ పడ్డాయి. ఇందుకు ఉదాహరణ ఈ తాలూకాలోని చల్లపల్లి రాజాకు వ్యతిరేకంగా ఘంటసాలలోని "ధర్మగోటకం"కై రైతులుసాగించిన పోరాటమే. ఒకప్పుడు బౌద్ధుల ఉద్యానవనంగావున్న స్థలమే ధర్మగోటకం, సుమారు 270 ఎకరాలు వుండేది. ఇది విశాలమైన పచ్చిక బయలుగా ఉండేది. ఘంటసాల, పరిసర గ్రామాల రైతుల పశువులు తిరగడానికి, పశుగ్రాసానికి అది ఉపయోగపడేది. దీన్ని సొంత

సేవ్యంగా ఉపయోగించుకోడానికి ఈ శతాబ్దం ప్రారంభంలోనే ఆనాటి చల్లపల్లి జమీందారు ప్రయత్నించాడు. ఈ ప్రయత్నాలను ఎన్నో కష్ట నష్టాలకులోనై రైతు పెద్దలు, గ్రామ పెద్దలు ఎదిరించి, చిట్టచివరకు విజయం సాధించగల్గారు. ఒకప్పుడు భయపడి, మరొకప్పుడు నిరుత్సాహపడి, ఇంకొకప్పుడు ప్రలోభాలకులోనై కొందరు పెద్దలు జమీందారీ పక్షాన చేరినా యువకులు ధైర్యంగా నిలబడి, ముల్లును ముల్లుతోనే తీసినట్లు మోసానికి మోసం విరుగుడుగా ఆ అస్త్రాన్ని కూడా ఉపయోగించి ప్రజలకు ధర్మగోటకం చెందేలా కృషి చేశారు. వీరు గొట్టిపాటి వీర రాఘవయ్య, దోనేపూడి వెంకట్రాయుడు, గొర్రెపాటి రామస్వామి, వేమూరి వెంకన్న, పిడుపాటి పెదసుబ్బయ్య, మొదలైనవారు సుప్రసిద్ధ కాంగ్రెసు నాయకులు. గొట్టిపాటి బ్రహ్మయ్య తండ్రిగారే వీర రాఘవయ్యగారు. ఈ జమీందారీ వ్యతిరేక ఉద్యమంలో వీరు కులాలవారీగా ఆయా కులాల పెద్దలను సమీకరించి, వారి అండదండలతో ధర్మగోటకాన్ని నిలబెట్టుకోగల్గారు. జమీందారు సివిల్ క్రిమినల్ కేసులు ఎన్ని పెట్టినా చివరకు ప్రజల పక్షానే న్యాయం కల్గింది. సుప్రసిద్ధ సంస్కర్త, న్యాయవాది వల్లూరి సూర్యనారాయణరావుగారి సహకారం విజయానికి కారణమైంది.

## సంస్కరణ భావాలు

బందరులో జరిగిన మొట్ట మొదటి వితంతు వివాహానికి (ఈ వివాహం 1903 లో జరిగిందని కాశేశ్వర రావుగారు, 1906 లో జరిగిందని మానికొండ సత్యనారాయణగారు రాశారు) గొట్టిపాటి వీర రాఘవయ్యగారు, దోనేపూడి వెంకట్రాయుడుగారు కట్నాలు చదివించటం సాహసమనే అనాలి.

## వందేమాతరం వుద్యమ ప్రభావం

1905 నాటి వందేమాతరం ఉద్యమ ప్రభావం, ఘంటసాల గ్రామంలో కూడా పడింది. బిపిన్ చంద్ర పాల్ ఆరునెలల శిక్ష అనుభవించి విడుదలయ్యాడనే వార్త విని, ఘంటసాలలో సుజనరంజనీ నాటకం కంపెనీవారు బిపిన్‌చంద్రపాల్ ఫొటోను ఊరేగించారు. ఊరేగింపులో వందేమాతరం నినాదాలిచ్చారు. మూడో తరగతి చదువుతున్న గొట్టిపాటి బ్రహ్మయ్యగారు పాల్గొన్నారు ఆ తర్వాత కొన్నాళ్ళకు స్థానిక పాఠశాలకు స్కూళ్ళ సూపర్‌వైజర్ తనిఖీకి వచ్చేటప్పటికి విద్యార్థులు బోర్డుమీద, గోడలమీద "వందేమాతరం, మందే రాజ్యం" అని రాశారు సూపర్‌వైజర్ పంతులుగారిపై మండిపడ్డారు. పంతులుగారు బ్రహ్మయ్యగారితో సహా పిల్లలపై విరుచుకుపడి, ఘాళ్ళకర్రతో దెబ్బలు కొట్టారు. ఈ గ్రామంలో 1914 నాటికే వయోజన పాఠశాల, రామమోహన గ్రంథాలయం ఘంటసాలలో నెలకొల్పబడింది.

భారతదేశానికి బాధ్యతాయుత ప్రభుత్వం ఇవ్వటమే తమ ఆశయమని మొదటి మెట్టుగా కొన్ని సంస్కరణలు ప్రకటించుతామని 1917 ఆగస్టు 20 న భారతదేశ మంత్రి మాంటేగ్ లండన్ పార్లమెంటులో ప్రకటించాడు. ఎలాంటి సంస్కరణలు ఇవ్వాలో విచారించడానికి 1917 సంవత్సరాంతంలో మాంటేగ్ భారతదేశంలో సంచారం చేయడానికి నిశ్చయించాడు. దీన్ని అంగీకరించాలా వద్దా అనేది వివాదాంశమైంది. ఐనా వీటిని కాంగ్రెస్ అంగీకరించింది. కాంగ్రెస్, ముస్లింలీగులు అప్పటికే ఒక ఒడంబడికకు వచ్చి ఒక ప్రణాళిక తయారుచేశాయి. దీనిపై సంతకాలు సేకరించే ఉద్యమం ఆంధ్రలో కొనసాగింది. అలాంటి సంతకాలు సేకరించడంతోనే, గొట్టిపాటి బ్రహ్మయ్యగారి రాజకీయ జీవితం ప్రారంభమైందని వారు "నా జీవిత నౌక"లో తెలియచేశారు.

## మండల సభలు

1920 జూన్‌లో దివితాలూకా పెదకళ్ళేపల్లిలో కృష్ణా మండల సభ జరిగింది. గుంటూరు జిల్లాలోని ఒంగోలు తాలూకా మినహా మిగతా గుంటూరు జిల్లా అంతా అపుడు కృష్ణాజిల్లాలో వుండేది. పశ్చిమ గోదావరి జిల్లాకూడా 1927 వరకు ఈ మండలంలోనే వుండేది. కృష్ణా మండలంలోనే ఉన్న గుంటూరులో 1892 లో కృష్ణామండల ప్రథమ మహాసభ జరిగింది. భారత దేశంలోనే ఇది ప్రథమ మండల మహాసభ అని కొండాలి శివరామకృష్ణారావుగారు రాశారు. యావదాంధ్రలో ప్రథమం అని బ్రహ్మయ్యగారు రాశారు. ఈ మహాసభలద్వారా కాంగ్రెస్ తీర్మానాలు ప్రచారం చేయబడుతూ వుండేవి. ఏమైనా ఆ రోజుల్లో మండల

సంఘాలు, మండల సభలు, సాంఘిక, ఆర్థిక రాజకీయ నైతిక విషయాలలో తమతమ అభిప్రాయాలను వెల్లడించేవి, ప్రభుత్వానికి తెలియచేసేవి. పులిగడ్డ ప్రాజె కు ఇదివరలో మండల సభలు చేసిన ఆందోళన, ప పులు కూడా దోహదం చేశాయి.

పె కళ్ళేపల్లిలో జరిగిన సభ 29 వది, చివరిది కూడాను. ఈ సభకు ఎక్కువగా రైతులే వచ్చారు. సుప్రసిద్ధ రైతు నాయకుడు కానూరు వెంకటాచలపతయ్య ప్రేరణతో ఈ సభలో జమీందారీ రద్దు తీర్మానం ప్రతిపాదించబడినా, తగు ప్రోత్సాహం లేక మరు సంవత్సరానికి అది వాయిదా పడింది. మాంటేగ్ చెలమ్సుఫర్డ్ రాజకీయ సంస్కరణలు అసంతృప్తికరమైన వన్న కాంగ్రెస్ తీర్మానాన్ని ఈ సభ బలపరచింది. ఆ రోజుల్లో అతివాదిగా భావింపబడుతున్న పట్టాభి ఈ సభలో పాల్గొన్నారు. బ్రిటిష్ చక్రవర్తి రాజకీయ సంస్కరణల గురించి చేసిన ప్రకటన అసంతృప్తికరంగా వున్నదని ఈ సభ తీర్మానించింది.

ఘంటసాలలో కూడా జరిగిన సభలో అయ్యదేవర కాళేశ్వరరావుగారు, చెరుకువాడ నరసింహంగారు పాల్గొని ఉపన్యసించారు.

మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో దివి తహసీల్దారు హుమాయూన్ సాహెబ్ ఘంటసాల గ్రామంలో యుద్ధనిధి చందాలకు వచ్చాడు. రైతుల మీద తివల్ల చందాలు యివ్వలేరని కాంగ్రెస్ సంస్థపట్ల భ కలిగి, జాతీయ భావాలుగల గొర్రెపాటి బ్రహ్మన్నగారి కుమారుడు వెంకయ్యగారు ఖచ్చితంగా చెప్పాడు. తహసీల్దారు "నేను ఇల్లిల్లు తిరిగి వసూలు చేస్తాను" అని అనగా "గ్రామంలోని ముఖ్యుల్ని కాదని వసూలు చేయగలరా ?" అని ఎదురుప్రశ్న వేయగా, దగ్గరలో వున్న పోలీసు అధికారులతో సంప్రతించి తహసీల్దార్ చ గా జారుకొన్నాడు.

యు కాలంలోని వాగ్దానాలకు ఎగనామం పెట్టి, విప్లవోద్యమాలను అణచే పేరుతో రౌలట్ శాసనాన్ని ప్రభుత్వం ప్రకటించింది. దీన్ని ప్రతిఘటించడానికి గాంధీ ఆదేశానుసారం దేశమంతటా సభలు జరిగాయి. ఘంటసాలలో వేమూరి లక్ష్మయ్య నాయకత్వాన సత్యాగ్రహ దీక్ష వహించి ఉపవాసాలు చేశారు. వేమూరి వెంకయ్యగారి అధ్యక్షతను బహిరంగసభ జరిగింది. వేమూరి రత్తయ్యగారు రౌలట్ చట్టాన్ని గురించి వివరించారు. రౌలట్ చట్టం రద్దు కావాలని తీర్మానించబడింది.

## సహాయ నిరాకరణ ఉద్యమం

గాంధీ సహాయ నిరాకరణ ఉద్యమాన్ని ప్రారంభించినపుడు జిల్లా అంతటా ఆ ఉద్యమం గురించి అనేక సభలు జరిగాయి. దివి తాలూకా సభ ఘంటసాలలో జరిగింది. గొర్రెపాటి రత్తయ్య ఆహ్వాన సంఘాధ్యక్షుడు. కిలారు కోదండరామయ్య అధ్యక్షతన జరిగిన సభలో చెరుకువాడ నరసింహం, కానూరు వెంకటాచలపతయ్య, కాజ శివరామకృష్ణయ్యగార్లు ఉపన్యసించారు. ఈ సభలను నిర్వహించటంలో గొట్టిపాటి బ్రహ్మయ్య, గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగార్లు విశేష కృషిచేశారు. ఆక్టింగ్ మున్సబుగా వుంటూనే వేమూరి లక్ష్మయ్యగారు, పై ఇద్దరినీ ఉత్సాహ పరచారు. ఈ సభలు జయప్రదం చేయడానికిగాను నిధి వసూళ్ళలో కూడా వారికి సాయపడ్డారు. ఈ సభలో ప్రార్థనగీతం పాడినందుకు సంజాయిషీ అడుగగా తాలూకా ఆఫీసు గుమాస్తా గిరికి రాజీనామా చేశారు విశ్వనాథ వెంకటేశ్వర్లుగారు.

అవనిగడ్డ సభకు ప్రచారం చేశారని దివి తాలూకా మేజిస్ట్రేట్ కోర్టులో రెండవ గుమాస్తాగా వుండిన కొడాలి ఆంజనేయులుగారిని ప్రభుత్వం సంజాయిషీ కోరింది. ఆ ఉద్యోగానికి ఆయన రాజీనామా చేసి కాంగ్రెస్ ఉద్యమంలో పని చేశారు. వీరు కొడాలి గ్రామ కరణంగారి కుమారుడు. ఈయన ఆ తర్వాత కాంగ్రెస్ నిర్వహించిన ఉద్యమాల్లో పాల్గొని శిక్షలను అనుభవించారు. పట్టాభిగారి కాంగ్రెస్ చరిత్రను తెలుగులోకి అనువదించారు. కవి, నాటకకర్త, సహాయ నిరాకరణ ఉద్యమ కాలంలో రచించిన "అవతార పరివర్తన" అనే రాజకీయ నాటకం (తిలక్ నిర్యాణం గురించినది) అచ్చుకాక మునుపే కొన్ని పట్టణాల్లో ప్రదర్శింపబడింది. బందరులో ప్రదర్శించడానికి సనా హాలు చేస్తుండగా "డ్రమటిక్ పర్ఫార్మెన్స్ ఆ " క్రింద నిషేధించారు.

అవనిగడ్డలో జరిగి సభకు బందరు తాలూకా బోర్డు ఉపాధ్యక్షులుగా వున్న గద్దె నాగయ్య ఆహ్వాన సంఘాధ్యక్షులుగా ఉన్నారు. గొల్లపూడి పురుషోత్తమరావు (గుమాస్తా), గొల్లపూడి చలపతిరావు

(పి. డబ్ల్యు. డి. సూపర్ వైజర్) తమ పదవులకు రాజీనామా చేసి కాంగ్రెస్ ఉద్యమంలో చేరారు.

పరుచూరి బైరాగి, రేపల్లె వెంకటకృష్ణయ్య, వేములపల్లి వెంకటగోపాలరావు, గొల్లపూడి కాశం గార్లు ఈ సభలను నిర్వర్తించారు కొనేరు టుంబరావు తాలూకా అంతటా తిరిగి ప్రచారం చేశారు. విప్లవవాదుల త్యాగాల గురించి చెబుతూ ఉత్తేజపర్చారు.

అవనిగడ్డ నుంచి దివి తాలూకా కోడూరుకు ముట్నూరి కృష్ణారావు, చెరుకువాడ నరసింహం, బోడి నారాయణరావు, గొట్టిపాటి బ్రహ్మయ్యగార్లు వెళ్ళి సభ జరిపారు. సభకు బ్రహ్మయ్యగారు, ముట్నూరివారి ఆదేశానుసారం అధ్యక్షత వహించారు. యద్దనపూడి గోపాలకృష్ణయ్య ఆహ్వాన సంఘాధ్యక్షుడు. ముట్నూరి కృష్ణారావు, చెరుకువాడ నరసింహంగార్లు ఉపన్యసించారు. వీరికి ఆతిథ్యం ఇచ్చారనే కారణంతో కోడూరు కరణం చామరి చలపతిరావును ఉద్యోగంనుంచి తీసివేశారు. కాంగ్రెస్ మంత్రివర్గ హయాంలో 1938 లో తిరిగి ఈయనకు ఉద్యోగం ఇవ్వబడింది.

## పన్నుల నిరాకరణకు ప్రయత్నాలు

1921 సంవత్సరం చివరి భాగంలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం విజయవాడలో సమావేశమై కాంగ్రెస్ ఆదేశించేవరకూ పన్నులు చెల్లించటం మానివేయాలని తీర్మానించింది. తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ కూడా పామర్రులో సమావేశమై అదే విధంగా ఆదేశించింది. ఘంటసాల గ్రామం ఈ తీర్మానానికి అనుగుణంగా పన్నులు చెల్లించ నిరాకరించింది. కాని తర్వాత గాంధీ ఆదేశంమేరకు పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని నిలిపివేశారు. గాంధీ యిలాంటి ఆదేశం ఇస్తారని కాంగ్రెస్ నాయకులు భావించటం లేదని బ్రహ్మయ్యగారు తన జీవిత కథలో రాశారు.

## ఎన్నికల బహిష్కరణ

ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభకు 1920 లో ఎన్నికలు జరిగాయి. కాంగ్రెస్ ఈ ఎన్నికల్ని బహిష్కరించాలని తీర్మానించింది. ఆ తీర్మానాన్ని అనుసరించి దివి తాలూకా అంతటా, వోట్లు ఇవ్వవద్దనే ప్రచారం జరిగింది. ఘంటసాల పోలింగ్ కేంద్రంలో 13 గ్రామాలు వున్నాయి. పదిరూపాయలు శిస్తు కట్టేవారంతా వోటర్లు. గ్రామ మున్సబు, కరణాలతో సహా ఎవ్వరూ వోటు చేయకుండా ఖాళీ పెట్టెలతో ఉద్యోగులను సాగనంపారు. ఇందుకు బ్రహ్మయ్యగారు, తదితర కార్యకర్తల నాయకుల ప్రశంసలను పొందారు. మద్రాసు రాష్ట్రంలో 26 జిల్లాలలో ఇలా ఖాళీ పెట్టెలను పంపిన ఘనత ఘంటసాల పోలింగ్ కేంద్రానికి దక్కింది.

1921 మార్చి 31 న, ఏప్రియల్ 1న బెజవాడలో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ కమిటీ తీర్మానం ప్రకారం కోటిరూపాయలు తిలక్ స్వరాజ్య నిధికి పోగు చేయాలని సంకల్పించారు. తిలక్ స్వరాజ్యనిధికి, గాంధీ పూజానిధికి ఘంటసాల గ్రామం సమర్పించిన నిధికి పటాభిగారి "జన్మభూమి" పత్రిక ప్రశంసించింది. 1921జూలైలో బొంబాయిలో అలిండియా కాంగ్రెస్ కమిటీ సభ జరిగింది. ఆ సభ, విదేశ వస్త్ర బహిష్కరణ, ఖద్దరు ఉత్పత్తిపై కేంద్రీకరణ గురించి తీర్మానాలు చేసింది. 1921 ఆగస్టు 1 నుంచి కాంగ్రెస్ వాదులంతా ఖద్దరు ధరించాలనే తీర్మానం చేయబడింది. ఈ తీర్మానాన్ని పురస్కరించుకొని అనేక గ్రామాల్లో ఖద్దరు ఉత్పత్తి ప్రారంభించారు.

1924 లో గాంధీ పూజానిధి పేరుతో కాంగ్రెస్ నిధి వసూలుచేయాలని ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ తీర్మానించింది.

1924 లో ఖద్దరు ఉత్పత్తి సంస్థ ఘంటసాల గ్రామంలో పించబడింది. 1929 వరకు ఈ గ్రామస్తులే ఈ సం ను నిర్వహించారు. మద్యపాన నిషేధ కార్యక్రమా న్ని కూడా ఈ గ్రామం నిర్వహించింది. 1923 లో హరిజనులచే బావులలో నీరు తోడించి, అంటరానితనాన్ని రూపుమాపడానికి ప్రారంభించిన ఉద్యమానికి కూడా ఈ గ్రామం తోడ్పడింది. ఈ ఉద్యమానికి ఈ గ్రామంలోని కొందరు పెద్దలు పట్టుదలతో సహకరించారు.

ప్రశస్తమైన మధ్యరకం ఖద్దరు ఉత్పత్తి సంస్థ పురిటి గడ్డలో ఈ రోజుల్లోనే ఏర్పడింది. రుపచూరి లింగయ్యగారి నిర్వహణలో ఇది కొనసాగింది.

సహాయ నిరాకరణోద్యమంలో ఒక భాగం కోర్టుల బహిష్కరణ. దీన్ని ఘంటసాలలో అమలుపరచి,

సివిల్ క్రిమినల్ కేసులను గ్రామంలోనే పరిష్కరించుకొనుచుండగా సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌కు కన్నెర్ర అయింది. గ్రామానికి వచ్చి విచారణ ప్రారంభించాడు. గ్రామ కాంగ్రెస్‌వారు, తాతము త్తాతల కాలం నుంచి గ్రామ తగాదాలను గ్రామస్థులే పరిష్కరించు కొంటున్నామని జవాబివ్వగా చేసేదిలేక అతడు వెనుతిరిగిపోయాడు.

ఈ ఉద్యమ కాలంలోనే భట్ల పెనుమర్రు వాస వ్యులు కామినేని వెంకటప్పయ్యగారు బందరులో హిందూ హైస్కూలులో చదువు మానివేసి జాతీయ కళాశాలలో ప్రవేశించారు.

## 1926 ఎన్నికలు

సహాయ నిరాకరణ ఉద్యమ సంరంభం చల్లారాక కాంగ్రెసులో ఏర్పడిన వివాదాలలో శాసనసభా ప్రవేశం మంచిదా? కాదా? అనేది ఒకటి. శాసనసభలను బహిష్కరించాలనే వైఖరిలో మార్పు వద్దనే వారిని "నో ఛేంజర్సు" గాను, మార్పు కావాలనే వారిని "ప్రో ఛేంజర్సు" గాను పిలిచేవారు. ఈ సందర్భంగానే చిత్తరంజన్‌దాస్, మోతీలాల్ నెహ్రూ స్వరాజ్య పార్టీ ఏర్పరచారు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులైన టంగుటూరి ప్రకాశంగారు స్వరాజ్య పార్టీలో ఉన్నారు. కాని ప్రధాన కార్యదర్శి బులుసు సాంబమూ ర్తి గారు "ప్రో ఛేంజర్". 1926 లో జరిగిన శాసనసభ ఎన్నికలలో పట్టాభిగారు, గాంధీగారు "నో ఛేంజర్" కాబట్టి తూర్పు కృష్ణా జిల్లా కాంగ్రెస్ కమిటీ కూడా "తటస్థం" గా వుండాలని సూచించారు. మద్రాసు రాష్ట్రంలో సమిష్టి నియోజక వర్గాలలో బ్రాహ్మణేతరులకు ప్రత్యేక ప్రాతినిధ్యం కావాలని కోరుతున్న రోజులవి. అందుచే ప్రతి జిల్లాలో ఇద్దరు అభ్యర్థులు అనీ, అందులో ఒకరు తప్పనిసరిగా బ్రాహ్మణేతరులై వుండాలనీ ప్రభుత్వం నిర్ణయించింది. ఈ నిర్ణయాన్ని బట్టి ఈ ఎన్నికల్లో కాంగ్రెస్ తరపున అయ్యదేవర కాళేశ్వరరావు, కొ పర సూరయ్య గారలు పోటీ చేశారు. జస్టిస్ పా అభ్యర్థిగా మీర్జాపురం రాజా, స్వతంత్రుడుగా కట్ట ంచి కొళంద డ్డి పోటీ చేశారు. మీర్జాపుర రాజా జస్టిస్ ` లో ప్రముఖుడే కాక జిల్లాబో అధ్యక్షులు. ఆ రో ల్లో జిల్లా రాజకీయాల్లో పలు బడి గల వ్యక్తి. ఆయనకు ప్రతిగా "అడుసుమిల్లి" వ ం ఉండేది. అలాగే చల్లపల్లి రాజా వర్గం వుండేది. మీ పురం రాజాను ఓడించాలంటే, కొల్లిపర సూ య్యగారు బలమైన పోటీదారు కాదంటూ ఆఖరు క్షణంలో అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారు కూడా నామినేషన్ వేశాడ, మొదట్లో వీరి సహకారం సూరయ్యగారికి ఉంటుందని గోపాలకృష్ణయ్యగారు హామీ ఇచ్చారు. మాగంటి బాపినీడుగారిని కాదని సూరయ్యగారిని నిలబెట్టించుటలో గోపాలకృష్ణయ్య గారి పాత్రఉంది. ఇలా ఆనాటి రాజకీయ చదరంగంలో బుద్ధిపూర్వకంగానో, కాకుండానో కాంగ్రెస్‌వాదులు, కాంగ్రెస్ నాయకులు పావులయ్యేవారు. ఈ కారణంగానే పట్టాభిగారు అంత సుముఖంగా లేకపోయినా, గొట్టిపాటి బ్రహ్మయ్య మొదలగువారు కాంగ్రెస్ అభ్యర్థుల కోసం జిల్లా అంతటా తిరిగి ప్రచారం చేశారు. పట్టాభిగారు, కృష్ణా పత్రిక కూడా మొదట్లో తన అభ్యర్థిత్వం పట్ల సుముఖంగా లేకపోవడమే గాక, కృష్ణా పత్రిక కొళందరెడ్డిగారికి అనుకూలంగా ప్రచారం చేసిందని అయ్యదేవర కాళేశ్వరరావుగారు "నా జీవిత కథ-నవ్యాంధ్రము" అనే గ్రంథంలో రాశారు. కాని చివరి రోజుల్లో కాంగ్రెస్ అభ్యర్థుల పక్షానే యీపత్రిక ప్రచారం చేసింది. కాశీనాధుని నాగేశ్వరరావుగారి సంపాదకత్వాన వెలువడే 'భారతి' ఈ సందర్భాన మత ప్రాంతీయ దురభిమానాలను విమర్శించింది. ఈ ఎన్నికలలో కాళేశ్వరరావుగారు, మీర్జాపురం రాజా గెలిచారు. మీర్జాపురం రాజా ఎన్నిక చెల్లదని బ్రహ్మయ్యగారు, దేశాభిమాని బొబ్బ వెంకట శేషయ్య, రామాచార్యులుగార్లు వేసిన పిటిషన్ నెగ్గలేదు. ఇది కొంత నిరుత్సాహం కల్గించినా, కృష్ణా జిల్లాలో జస్టిస్‌పార్టీ కంచుకోట బద్దలవడం ప్రారంభమైంది.

## సైమన్ కమిషన్ బహిష్కారం

భారతీయులు స్వపరిపాలనకు అర్హులా కాదా అని నిర్ణయించడానికి నివేదిక సమర్పించాల్సిందిగా బ్రిటిష్ ప్రభుత్వం సైమన్ కమిషన్‌ను నియమించింది. స్వరాజ్యం తమ జన్మహక్కని ము క్తకంఠంతో చాటుతున్న కాంగ్రెస్ దీన్ని బహిష్కరించాలని నిర్ణయించింది. పైగా బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పరచిన యీ కమిషన్‌లో అందరూ తెల్లవారే, 1927 సంవత్సరాంతంలో యీ కమిషన్ ఏర్పడింది.

ఆ రోజుల్లో బందరు తాలూకా బోర్డుకు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు అధ్యక్షులు. సైమన్ కమిషన్ భారతదేశానికి మొదటి పర్యాయం వచ్చిన సందర్భాన్ని పురస్కరించుకొని తాలూకా ఆఫీసుపై నల్లజెండా ఎగురవేశారు. పాఠశాలలకు సెలవు యిచ్చారు. జిల్లా బోర్డు కూడా కాంగ్రెస్ వారిదే అయినా, ఈ విధంగా ఆ బోర్డు చేయలేదు.

1928 లో సైమన్ కమిషన్ రెండోసారి వచ్చి మద్రాసును సందర్శించినపుడు రాష్ట్ర కాంగ్రెస్ ఆదేశాన్ని అనుసరించి, మద్రాసులో సైమన్ కమిషన్‌కు నల్లజెండాలు చూపించడాని కొందరు మద్రాసు వెళ్ళారు. గొట్టిపాటి బ్రహ్మయ్యగారు అలా వెళ్ళినవారిలో వున్నారు. నల్లజెండాల ప్రదర్శన ఏర్పాటు చేయటంలో మద్రాసులోని తమిళ కాంగ్రెస్ నాయకులు, కొందరు తెలుగు నాయకులూ ఒక పొరపాటు చేశారు. సైమన్ కమిషన్ వెళ్ళే మార్గాన కాకుండా, మరో మార్గాన ఆ ప్రదర్శనకు ఏర్పాటు చేశారు. ఆ సమయంలో మద్రాసులో ప్రకాశంగారు లేరు. యువకాంగ్రెస్ కార్యకర్తలు చేసిన ఆందోళన ఫలితంగా, ప్రకాశంగారు వచ్చాక సైమన్ కమిషన్ వెళ్ళే మార్గంలోనే నల్లజెండాల ప్రదర్శన ఏర్పాటు చేశారు. ఒక కారుకు నల్లజెండా కట్టి, సైమన్ కమిషనును బహిష్కరించాలనీ, నల్లజెండాలు చూపాలనీ ప్రబోధించుతూ ప్రకాశం, పళ్ళంరాజు, బ్రహ్మయ్యగార్లు బహిరంగసభకు ముందురోజున తిరిగారు. కొండా వెంకటప్పయ్య మొదలగు వారిని ఒకరోజు ముందుగానే అరెస్టు చేశారు. సైమన్ కమిషన్ బహిష్కార ఉద్యమ సందర్భంగానే పోలీసుల కాల్పులలో ఒకడు చనిపోవటమూ, అతని మృతదేహాన్ని చూడటానికి వెళ్ళగా ఒక పోలీసు తుపాకితో బెదరించగా ప్రకాశంగారు ఎదురురొమ్ము చూపి, కాల్చుకోమని చెప్పడమూ ప్రసిద్ధి చెందిన ఘటనే.

బారిష్టర్ లింగయ్యగారి యింట బసచేసిన బ్రహ్మయ్యగారు యీ సందర్భంగా తాను మరణిస్తే, తమ యింటికి పంపవలసిందిగా ఒక వీలునామారాసి వీరభద్రయ్యగారికి యిచ్చాడు. ఆ రోజుల్లో సత్యాగ్రహోద్యమం అంటే ప్రాణాల్ని సైతం బలి పెట్టాల్సి వస్తుందనే చైతన్యానికి ఈ ఘటన మహో నిదర్శనం.

## ఖద్దరు నిధికి గాంధీ పర్యటన

1924 లో గాంధీ విడుదలయ్యాక నిర్మాణ కార్యక్రమం చేపట్టాడు. అందులో ఒకటి ఖద్దరు సంఘానికి నిధి పోగుచేయడం. 1929 మార్చి, ఏప్రిల్ మాసాలలో ఆంధ్రలో గాంధీ 52 గ్రామాలు పర్యటించాడు.

1929 ఏప్రిల్ 14 న గాంధీ బందరు నుంచి బయలుదేరి నిడుమోలు, చినముత్తేవి, పెదపూడి, వార్లపూడి, కూచిపూడి, నరసన్నపాలెం, మొవ్వ, కొడాలి, తాడేపల్లి, కొత్తపల్లి, ఘంటసాలపాలెం గ్రామాలు సందర్శించి ఘంటసాల చేరాడు. ధర్మగోటకంలో పెద్ద పందిరి వేశారు. వాసాలుపాతి, దార్లు ఏర్పాటు చేశారు. ఒక దారిగుండా గాంధీ కాడును నడిపి, ఆయన్ని అందరూ చూసే అవకాశం కల్పించారు. గొర్రెపాటి వెంకట సుబ్బయ్య (కిసాన్ గారి నాయకత్వాన కాకి ఖద్దరు దుస్తులతో వలంటీ పనిచేశారు. ముందు వరసలో స్త్రీలు రాట్నా వడికారు ఇదివరకే ఈ గ్రామంలో వందలాది రాట్నాలు వున్నాయి. ఆరు వందల రూపాయలకు పైగా నిధి సమర్పించారు. కొందరు స్త్రీలు బంగారు ఆభరణాలు యిచ్చారు. తర్వాత దేవరకోట, చల్లపల్లి గ్రామాలను గాంధీ సందర్శించాడు. కొడాలిలో గ్రామ మున్సబు కుమారుడు గ్రామస్థుల తరపున నిధి సమర్పించారు.

గాంధీ సందర్శించిన గ్రామాల్లో పురిటిగడ్డ ఒకటి. అక్కడ రోజూ 60 రాట్నాలు పనిచేస్తూ వుండేవి. రాయలసీమ నుంచి హరిజనులను రప్పించి వారితో వడికిన ఖద్దరు నూలుతో బట్టలు నేయించేవారు. కప్తానుపాలెం, పెదప్రోలు, మోపిదేవి, నాగాయితిప్ప గ్రామాలకు వెళ్ళి, అక్కడ కృష్ణానదిదాటి, అవనిగడ్డ, నాగాయలంకలను సందర్శించి, అవనిగడ్డ బసకు వచ్చి విశ్రాంతి తీసుకొంటున్న సమయంలో అదివరకే పర్యటన కార్యక్రమంలో చేర్చబడిన కోడూరులో వేలకొలది జనం నిరీక్షిస్తున్నారని చెప్పగా, ఆ గ్రామం కూడా సందర్శించి తిరిగి అవనిగడ్డ వచ్చేసరికి చాలా పొద్దు పోయింది. అక్కడా ప్రజలు నిరీక్షిస్తున్నారు. వనిగలో గాంధీ ఉపన్యసించలేదు. ఆయన్ని శ్రమపెట్టడం యిష్టంలేని పట్టాభి, కొండా వెంకటప్పయ్యగార్లు ప్రజలకు క్షమాపణ చెప్పుకొన్నారు.

గాంధీగారి కార్యక్రమాన్ని ఏర్పాటు చేసిన ఖద్దరు సంస్థ ఏజెంటును, పట్టాభిగారిని ఉద్దేశించి "మీచేతుల్లో నా ప్రాణంపోతే, మీరెంత విమర్శకు గురి అవుతారో గుర్తించండి" అని కోడూరు నుంచి వచ్చేటప్పుడు వారిని హెచ్చరించారట గాంధీ.

కోసూరివారిపాలెంలో రేపల్లె వెంకట కృష్ణయ్యగారు పెద్ద భూస్వామి. కాంగ్రెస్ అనుయాయి. తాలూకాబోర్డు అధ్యక్షపదవి ఎన్నికలలో కులతత్వ ప్రలోభాన్ని ఎదిరించినవ్యక్తి. కృష్ణానదీతీరాన్నిదాటి గుంటూరు జిల్లాలో అడుగుపెట్టిన గాంధీకి, చివరి నిమిషంలోవచ్చి ఈయన రు. 116 గాంధీకి సమర్పించాడు. ఖద్దరు నిధికి ఈ క్రింది గ్రామాలనుంచి కూడా డబ్బు వసూలైంది. గూడపాడు, పెదముత్తేవి, అయ్యంకి, శ్రీకాకుళం, కాజ, కప్తానుపాలెం, పెదప్రోలు, మోపిదేవి.

ఈ పర్యటనలో జయప్రకాశ్ నారాయణ సతి ప్రభావతీదేవి, దక్షిణాఫ్రికాలోని గాంధీ సహచరుడైన ఒక మహమ్మదీయ సోదరుడు, స్థానిక రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు వున్నారు.

దివితాలూకాకు నిర్దేశించిన మొత్తంకంటె ఎక్కువగానే నిధి వసూలైంది స్త్రీలు, బాలికలుసైతం తమ నగలు ఇచ్చారు.

సహాయ నిరాకరణ ఉద్యమం తర్వాత ఖద్దరుపై అభిమానం తగ్గిపోయిన విషయాన్ని కృష్ణాపత్రిక, కృష్ణాజిల్లాలో గాంధీ పర్యటన కార్యక్రమంపై రాసిన సంపాదకీయంలో ఇలా వివరించింది :

"ఒక మాసం కిందటివరకు ఖద్దరు డిపోలలో సరుకు నిల్వఉండి పోయింది. ఖద్దరు మగ్గాలవారు సరుకు విడుదలకాక నిరుత్సాహం చెందిఉండినారు. వడికిన నూలు కూడా మిగిలి పోతూండటంవల్ల కొన్ని గ్రామాలలో రాట్నాలు తిరిగి వెలిసెలకెక్కాయి."

ఇలాంటి మాంద్యంనుంచి గాంధీ పర్యటనవల్ల, ఖద్దరుకి ఈ దుస్థితి తగ్గినట్లు ఈ పత్రిక రాసింది.

గాంధీ అన్నిచోట్లా "విదేశీ వస్త్రాలు విసర్జించండి. ఖద్దరును ధరించండి. తాగుడు మాన్పించండి. ఎవరినీ అంటరానివారుగా తలపకండి" అని చెప్పారని కృష్ణాపత్రిక రాసింది. ఘంటసాలలో అస్పృశ్యతా నివారణ గురించి నొక్కి చెబుతూ ఇలా అన్నాడు :

"ఈశ్వరుని నామం దానానుదానుము అయినప్పుడు, బ్రాహ్మణుడు జాత్యహంకారానికి వశంకాక వినమ్రుడై, సంఘసేవాతత్పరుడై ఉండవలెనని గాంధీజీ బ్రాహ్మణులను హెచ్చరించినారు" (కొడాలి ఆంజనేయులుగారి "ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ" అనే గ్రంథంలో) నిజానికి ఈ హెచ్చరిక ఇలాంటి భావాలు గల ఇతర వర్ణాలవారికి కూడా హెచ్చరికయే.

## గవర్నర్‌కు నల్లజెండాలు

లాహోర్ కాంగ్రెస్ తీర్మానాన్ని అనుసరించి 1930 జనవరి 26 న సంపూర్ణ స్వాతంత్ర్య దినోత్సవం దేశమంతటా జరిగింది. లాహోర్ తీర్మానాన్ని ఆ రోజు జరిగిన సభలలో పునరుద్ఘాటించారు. భారతీయులు బ్రిటిష్ ప్రభుత్వ రాజభక్తి పరాయణులని నిరూపించడానికి గవర్నర్ జనరల్, గవర్నర్లు జోహారుకుందార్ల సభలు ఏర్పాటుచేసుకున్నారు. అందులో భాగంగానే మద్రాసు గవర్నర్ ఆంధ్రదేశంలో పర్యటన ప్రారంభించాడు. పశ్చిమగోదావరి కాంగ్రెస్ నాయకులు గవర్నర్‌కు నల్లజండాలను చూపాలని ఒక ప్రకటన చేశారు వీరివలెనే తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంఘం ఫిబ్రవరి 1 న ఘంటసాలలో సమావేశమై నల్లజండాలు ప్రదర్శించాలని తీర్మానించింది. జిల్లా సహకారసభ ఘంటసాలలో జరుగుతున్న సందర్భాన్ని పురస్కరించుకుని జిల్లా కాంగ్రెస్ సంఘం కూడ సమావేశమైంది.

ఉప్పుసత్యాగ్రహం ప్రారంభించబోతుండగా ముందుగానే నల్లజండాల ప్రదర్శన దేనికని, తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడైన బ్రహ్మయ్యగారిని పట్టాభి, ముట్నూరి కృష్ణారావుగారిలు నిరుత్సాహపరిచారు. మున్సిపల్ ఛైర్మన్ బారిష్టర్ జగన్నాథరావు నాయుడుగారు కూడా మానవలసిందని కబురు చేశారు.

ఫిబ్రవరి 8 న "గవర్నర్ వెనక్కి వెళ్ళిపో" అంటూ కేకలతో బందరులో నల్లజెండాల ఊరేగింపు జరిగింది. పోలీసులు ఆ ప్రదర్శనను నిషేధించారు. పోలీసు ఉత్తరువును ధిక్కరించినందుకు 32 మందిని అరెస్టు చేశారు. ఐతే 12 మందిని మాత్రమే జైలుకు తీసుకుపోయారు. వారు వల్లూరు రామారావు, కొడాలి ఆంజనేయులు, మునుగంటి వెంకటరావు, తల్లాప్రగడ రామారావు, గొట్టిపాటి బ్రహ్మయ్య, బొబ్బా

వెంకట శేషయ్య, అన్నే వెంకటరత్నం, గూడూరు వెంకటచలం, వడ్లమూడి సత్యనారాయణ, బొబ్బా ఆదినారాయణమూర్తి, బొబ్బా రంగారావు, జి. ఆదినారాయణ, వీరుగాక టౌన్‌హాల్‌వద్ద పిన్నమనేని వీరయ్యగారిని అరెస్టు చేశారు. ఈయన కురుమద్దాలి వాస్తవ్యుడు. "గవర్నర్ గోబ్యాక్" అని నినాదం చేస్తూ గవర్నర్ కారులోకి నల్లజండాను చుట్టచుట్టి విసిరివేశారు. అది గవర్నర్ అంగరక్షకుని ఒడిలో పడింది. అతను బందోబస్తు సరిగాలేదని పోలీసులను చివాట్లుపెట్టాడు. మరో 20 మందిని రోడ్డుమీదనే ఆపివేశారు పోలీసులు. ముట్నూరి కృష్ణారావు, మానికొండ సత్యనారాయణ, నార్ల వెంకటేశ్వరరావు గారలతోపాటు 50 మందిని పోలీసులు రెండు, మూడు గంటలు అదుపులో ఉంచుకొని తర్వాత వదలివేశారు. అరెస్టయినవారిలో కొందరు డిఫెన్సు పెట్టుకొన్నారు.

పిన్నమనేని వీరయ్యగారిని వెంటనే విచారణ జరిపి నెల రోజులు కఠినశిక్ష విధించి బందరు సబ్ జైలులో వుంచారు. ఆరువారాలపాటు సబ్‌జైలులో వున్నతర్వాత గొట్టిపాటి బ్రహ్మయ్య, వల్లూరి రామారావు, కొడాలి ఆంజనేయులు, మునుగంటి వెంకట్రావు, తల్లాప్రగడ రామారావు, బొబ్బా వెంకట శేషయ్యగార్లకు శిక్షలు విధించబడ్డాయి. సంవత్సరం నాలుగువారాలు మొదలుకొని, సంవత్సరం ఆరువారాలు, 16 నెలల వరకు వీరికి శిక్షలు పడ్డాయి. ఈ శిక్షలు ఆ తర్వాత జరిగిన సత్యాగ్రహ ఉద్యమానికి ప్రేరణ, ఉత్సాహాన్ని కల్గించి నాంది అయ్యాయి.

కృష్ణా పత్రిక సంపాదకీయంలో వీరందరినీ అభినందించింది. మద్రాసు నుంచి ప్రకాశంగారు సబ్ జైలుకు వచ్చి వీరిని అభినందించారు. ఆ సాయంత్రం బహిరంగసభలో సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని గురించి ప్రకాశంగారు ఉత్తేజకరంగా ఉపన్యసించారు. వడ్లమూడి సత్యనారాయణ, వడ్లమూడి రంగారావుగార్లు హైకోర్టులో అపీలు చేయగా ఆరువారాల శిక్ష ఖాయపడింది. సంవత్సరం శిక్ష రద్దయింది. ఈ తీర్పు ఫలితంగా ఈ కేసులోని ఇతరులకు కూడా సంవత్సరం శిక్ష రద్దు చేయబడింది.

## 1930-32 ఉద్యమాలు

1930 మార్చి 2 న గాంధీ వైస్రాయికి ఒక ఉత్తరంరాశాడు. అందులో ఉప్పుచట్టాన్ని ఉల్లంఘించి శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించుతానని తెలియచేశాడు. సబర్మతీ ఆశ్రమవాసుల్ని తోడు తీసుకొని, చరిత్రాత్మకమైన దండీయాత్రను మార్చి 12 న ప్రారంభించాడు. సముద్రంలో స్నానంచేసి అనుయాయులతోపాటు గాంధీ సముద్రతీరాన వున్న ఉప్పును ఏరి, శాసనోల్లంఘనం ప్రారంభించాడు. కాని అప్పుడాయన్ని ప్రభుత్వం అరెస్టు చేయలేదు. దండి చేరిన తర్వాత ఏప్రిల్ 6 న మరోసారి శాసనోల్లంఘనం చేశాడు. ఈసారి కూడా గాంధీని అరెస్టు చేయలేదు. ఏప్రిల్ 9 న దేశమంతా ఉప్పు చట్టాన్ని ధిక్కరించి సత్యాగ్రహం చేయాలని గాంధీ ప్రకటించాడు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సత్యాగ్రహ ఉద్యమాన్ని నడపడానికి కొండా వెంకటప్పయ్యగారి యావదాంధ్ర దేశానికి డిక్టేటర్‌గా నియమించింది. రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు బోర్సాద్ వద్ద గాంధీని కలుసుకొని ఆంధ్రలో సత్యాగ్రహ ఉద్యమ కార్యక్రమం గురించి చర్చించారు.

ఉప్పుసత్యాగ్రహ ఉద్యమ కాలం నాటికి జిల్లాలో 5 వేలమందికాంగ్రెస్ సభ్యులున్నారని, జిల్లా కాంగ్రెస్ కమిటీలో 110 మంది సభ్యులు ఉన్నారనీ అంచనా. కానూరి చినవెంకట దాసయ్యగారి అధ్యక్షతను గల జిల్లా కాంగ్రెస్ పట్టాభి, ముట్నూరి కృష్ణారావు, చెరుకువాడ మున్నగు వారిలో కలిసి వంద గ్రామాలలో ప్రచారంచేసి, సత్యాగ్రహ శిబిరానికి ధన, ద్రవ్యనిధిని వసూలు చేశారు. వలంటీర్లను చేర్పించి ప్రమాణ పత్రాలపై సంతకాలు చేయించారు. ఏప్రిల్ 2 న బందరులో కాశీనాధుని నాగేశ్వరరావుగారు ప్రారంభించిన శిబిరంలో సత్యాగ్రహం, స్వరాజ్యం గురించీ, నేత పరిశ్రమ గురించీ, జైళ్ళలో ప్రవర్తించాల్సిన తీరుగురించీ ఒక వారంరోజులు బోధింపబడింది వలంటీర్లను 12 దళాలుగా విభజించారు. ఒక దళానికి దివితాలూకా భట్లపెనుమర్రు వాస్తవ్యులు కామినేని వెంకటప్పయ్యగారు నాయకుడుగా ఉన్నారు. పట్టాభిగారింట్లో ఏర్పాటు చేసిన మహిళా శిబిరానికి, దివితాలూకా కప్తానువారి పాలేనికి చెందిన కొత్రపాటి

అంకమ్మగారు నాయకత్వం వహించారు. ఖద్దరు నిధికై 1929 లో గాంధీ దివితాలూకాలో పర్యటించినపుడు, కప్తాన్‌వారి పాలెంలో ఈమె తన వంటిమీద నగలన్నీ గాంధీకి ఇచ్చివేశాడు. మహిళా వలంటీర్లు రోజూ బందరు నగరంలో ఖద్దరు ప్రచారం పికెటింగ్ చేసేవారు.

## 1932 లో దారుణ నిర్బంధకాండ

ఉప్పు సత్యాగ్రహం, గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ఫలితంగా విరమింపబడింది. ఈ ఒడంబడికను ప్రభుత్వం అడుగడుగునా ఉల్లంఘించుతూ వచ్చింది. ఐనా బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పరచిన రెండవ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సుకు అయిష్టంగానే గాంధీ వెళ్ళాడు. భారత స్వాతంత్ర్య సమస్యపై ఎలాంటి పరిష్కారం కుదరనందున, 1931 డిసెంబరు 28 న గాంధీ భారత దేశానికి తిరిగి వచ్చాడు.

ఇర్విన్‌స్థానే వైస్రాయిగా వచ్చిన లార్డ్ విల్లింగ్డన్ అప్పటికే కాంగ్రెస్ అగ్రనాయకులను అరెస్టు చేశాడు. జాతీయ ఉద్యమాన్ని క్రూరంగా అణచటం మొదలు పెట్టాడు.

ఈ కాలంలో దివితాలూకాలో కొన్నిచోట్ల తీవ్ర నిర్బంధ విధానాన్ని ప్రభుత్వం అవలంబించింది. ఈ విషయాలను ప్రస్తావించేముందు 1931 లో రీసెటిల్‌మెంట్ ఆందోళన గురించి కూడా కొంత ప్రస్తావించాలి.

## రీసెటిల్‌మెంట్ ఆందోళన

కృష్ణాజిల్లాలో ఎకరానికి 5 రూపాయలు వున్న నీటి తీరువాను రు. 6¼ లకు ప్రభుత్వం పెంచింది. దీనికి వ్యతిరేకంగా కృష్ణాజిల్లాలో "ఆంధ్రరాష్ట్ర రైతు రక్షణ సంఘం" ఏర్పడి పనిచేయ ప్రారంభించారు. 1928 లో ఆంధ్రరాష్ట్ర రైతుసంఘాన్ని ప్రారంభించిన ఆచార్య రంగాగారు దీనికి అధ్యక్షులు. కాట్రగడ్డ మధుసూదనరావుగారు ఉపాధ్యక్షులూ, కోశాధికారీ, గొట్టిపాటి బ్రహ్మయ్య, నూకల వీరరాఘవయ్య, (శ్రీమతే)గార్లు కార్యదర్శులు, దుగ్గిరాల బలరామకృష్ణయ్య సహాయ కార్యదర్శి, ఈ సందర్భంగా ఫిర్కా, తాలూకా, జిల్లా సభలు జరిగాయి. ప్రథమంలో కాంగ్రెస్ ఈ సభలలో అధికారికంగా పాల్గొనలేదు. కాని ఏలూరులో రాష్ట్ర రైతుసభ జరిపిన సందర్భంగా ప్రకాశంగారి అధ్యక్షతన జరిగిన కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం, ఈ ఆందోళనను బలపరచి ప్రభుత్వ చర్యల్ని ఖండించింది ఈ సమావేశానికి పూర్వమే ఆచార్య రంగా మొదలైన నాయకులు అరెస్టయ్యారు. పన్నుల నిరాకరణ గురించి ప్రబోధించరాదని, గొట్టిపాటి బ్రహ్మయ్యగారికి 144 వ సెక్షన్ జారీచేసింది. ప్రభుత్వం. గుడివాడ, కైకలూరు తాలూకాలలో అడుగు పెట్టరాదని నిషేధాజ్ఞ జారీ చేశారు. శాసనోల్లంఘనోద్యమం ప్రారంభం కాబోతుంది కాబట్టి అరెస్టు కావద్దని పెద్దలనుంచి ఆదేశం రావటంవల్ల ఈ నిషేధాజ్ఞను ఆయన ఉల్లంఘించలేదు. రీసెటిల్‌మెంట్ ఆందోళన సందర్భంగా కృష్ణాజిల్లాలో తమపై అరెస్టు వారంట్లు పుటినపుడు పోలీసులకు చిక్కకుండా దివి తాలూకాలో కొన్ని గ్రామాలలో సభలు జరిపి, తర్వాత కృష్ణదాటి గుంటూరుజిల్లాలో కొల్లూరు మొదలైన గ్రామాలలో సభలలో ఉపన్యసించి చివరకు అరెస్టయినవారిలో ఆచార్య రంగా, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగార్లు ఉన్నారు.

గాంధీ లండన్‌లో ఉండగానే ఈ సమస్య గురించి ఆయనకు సమాచారం అందచేయబడింది. ఇంగ్లండులోని భారతదేశ కార్యదర్శికి ఈ విషయాన్ని ఆయన తెలియచేసినా ఫలితం లేకపోయింది. గాంధీ బొంబాయి వచ్చినపుడు రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు అక్కడ ఆయన్ని కలుసుకొని ఈ విషయాన్ని చర్చించారు. ఈ సమస్యపై శాసనోల్లంఘనం చేయవద్దని అప్పటి కాంగ్రెస్ అధ్యక్షుడు పటేల్ ఆంక్ష విధించడం వల్ల కాంగ్రెస్‌వాదులు ఎక్కువమంది ఈ ఉద్యమంలో శిక్షకు గురికాలేదు. ఐనా 12-1-1932 పన్నుల నిరాకరణ ప్రచారం చేస్తున్నారని గొట్టిపాటి బ్రహ్మయ్యగారిని, రాజద్రోహం పురికొల్పాడని కొడాలి ఆంజనేయులు గారిని అరెస్టుచేసి, ఇద్దరికీ 15 వ తేదీన రెండేళ్ళు శిక్ష రు. 500 జరిమానా విధించారు. అంతటితో ఆగక, ఆ తర్వాత ఆంజనేయులు ఇల్లు సోదాచేశారు. ఆయన భార్య చీరెలు పట్టుకుపోయారు. ఇంటికి తాళం వేశారు. కోర్టులో ఆ చీరెలను మేజిస్ట్రేట్‌కు చూపించారు, కొన్నాళ్ళ తర్వాత ఆ చీరల్ని తిరిగి ఇచ్చివేశారు.

## 1932 లో తీవ్ర నిర్బంధ విధానం

వెల్లింగ్‌డన్ హయాంలో పోలీసుల నిర్బంధ విధానం తారాస్థాయి నందుకుంది. 1930-31 లో వలె అరెస్టులు జరిమానాలతో సంతృప్తి పడలేదు ప్రభుత్వం. లాఠీ ఛార్జీలు, కాల్పులు, ఇతర విధాలా అవమానించి, హింసపెట్టి ఉద్యమాన్ని అణచివేయాలని ప్రభుత్వం తలచింది.

గుడివాడ డిప్యూటీ కలెక్టర్ రంగప్ప బంగారా, సర్కిల్ ఇనస్పెక్టర్ దావూద్ ఖానుల పరిధిలోకే ఈ తాలూకా కూడా రావటంలో, వీరి రాక్షస కృత్యాలు శృతిమించి రాగాన పడ్డాయి.

దేశ నాయకుల పటాలు, చింపటం గాంధీ టోపీలను చింపటం, జెండాలను తొలగించి చించివేయటం, జెండా స్తంభా లను విరగ్గొట్టి పేళ్ళు వేయడం లాంటి దురంతాలెన్నో జిల్లాలో జరిగాయి.

తీవ్ర నిర్బంధ విధానానికి గురైన మొక్కవోని సాహసాన్ని ప్రదర్శించిన గ్రామాలలో భట్ల పెనుమర్రును పేర్కొనాలి. ఈ గ్రామంలో 144 సెక్షన్ ప్రయోగించారు. గాంధీగారి విగ్రహాన్ని ఊడబెరికి బందరు తీసుకువెళ్ళారు. దావూద్‌ఖాన్ పదే పదే ఈ ఊరిపై విరుచుకు పడేవాడు. గ్రంథాలయంలోని పటాలు, పుస్తకాలు విరజిమ్మించాడు. ఖద్దరు షాపులోని బట్టల్ని చిందర వందరగా పారవేయించాడు. రాట్నపు కదుళ్ళను విరగ గొట్టించాడు. ఖద్దరు కట్టినవారు కనబడినా, ఖద్దరు టోపీ కనబడినా లాఠీ రుచి చూపించేవాడు.

1932 జనవరి 20 న భట్ల పెనుమర్రు గ్రంథాలయాన్ని, ఖద్దరు స్టోర్సును సోదా చేశారు. గాంధీగారి విగ్రహాన్ని ఊడబెరికి బందరు తీసుకుపోయారు భట్ల పెనుమర్రు చుట్టు ప్రక్కల 5 మైళ్ళ వరకు 144 సెక్షన్ అమలు పర్చారు. తిరిగి 25 న భట్లపెనుమర్రులో తీవ్రమైన లాఠీ ఛార్జీ జరిగింది. దేవినేని భీమయ్య గారికి తీవ్రంగా దెబ్బలు తగిలాయి. కామినేని వెంకటప్పయ్యగారిని తమ వెంట రమ్మని పోలీసులు అడిగారు. వారంటు చూపవలసిందిగా ఆయన పోలీసులను ప్రశ్నించాడు. వారంట్ లేనిదే తాను రానన్నాడు. దానితో శివమెత్తిన పోలీసులు ఆయన్ని స్పృహ తప్పేటట్లు కొట్టారు. కామినేని సత్యనారాయణ, కామినేని వెంకటరత్నం, చలసాని ప్రకాశరావు, చలసాని కుటుంబయ్య మొదలైన వారికి దెబ్బలు బాగా తగిలాయి. ఫిబ్రవరి 3 న గ్రంథాలయాన్ని ఆర్డినెన్సు క్రింద నోటిఫై చేసి మూసివేశారు కామినేని వెంకటప్పయ్యగారికి రెండేళ్ళ కఠిన శిక్ష వెయ్యి రూపాయల జరిమానా విధింపబడింది.

ఫిబ్రవరి 12 న భట్ల పెనుమర్రులో కామినేని వెంకటప్పయ్యగారి ఆస్తి జప్తు చేయడానికి వెళ్ళినపుడు, పగిలిపోయిన తలుపులు తప్ప ఆ ఇంట్లో ఏమీ దొరకలేదు. మార్చి 3 న భట్ల పెనుమర్రులో వాలంటీర్ శిబిరం ఏర్పరచి కాంగ్రెస్ జెండాలతో అలంకరించారు. వలంటీర్లు అక్కడ నుంచి వెళ్ళి ఇతర గ్రామాల్లో కల్లు పాకలవద్ద పికెటింగ్ చేసేవారు. అవనిగడ్డ సబ్ మేజిస్ట్రేట్ స్వాధీన పర్చుకొని సీల్ చేసిన లైబ్రరీ భవనంపైన కాంగ్రెస్ జెండా ఎగురవేయబడింది. ఫిబ్రవరి 15 న చలసాని జగన్నాథరావు, అట్లూరి రాములు, పోలవరపు సత్యనారాయణగార్లు బందరులో విదేశీ వస్త్ర బహిష్కారాన్ని గురించి ప్రబోధించుతూ ఉండగా పోలీసులు బెత్తాలతో కొట్టి స్టేషన్‌కు తీసుకుపోయి తర్వాత వదలివేశారు. చలసాని నారాయణమూర్తి మున్నగువారు ఫిబ్రవరి 19 న బందరులో పికెట్ చేసినపుడు పోలీసులు అరెస్టుచేసి, కొట్టి చీకటిపడ్డ తర్వాత వదలివేశారు.

జాతీయ వారోత్సవ సందర్భంగా ఏప్రిల్ 9 వ తేదీనే భట్ల పెనుమర్రు నుంచి చలసాని నారాయణమూర్తి, చలసాని జగన్నాథరావు, చలసాని ప్రకాశరావు, సూరపనేని వీరయ్య, కొల్లి సీతారామయ్య, వీరపనేని బసవ కుటుంబయ్య బయలు దేరారు. కాంగ్రెస్ జండాలు పుచ్చుకొని పాటలు పాడుకుంటూ నినాదా లిచ్చుకొంటూ జాతీయవాద ప్రణాళిక గురించి వివరించుతూ అనేక గ్రామల్లో సంచారం చేశారు పెడసనగల్లు, అయ్యంకి, నరసాయపాలెం, గూడపాడు, మొవ్వ, వేములమడ, మొవ్వపాలెం, పెదముత్తేవి, పామర్రు, కురుమద్దాలి, ఉరుటూరు, మల్లపల్లి, అగినిపర్రు, మేడూరు, పమిడిముక్కల, కలూరు, చిగురుకోట, గోపవరం మండవల్లి మొదలైన గ్రామాలు తిరిగారు. ప్రతి గ్రామంలో ఊరేగింపు, జాతీయ జండా ఆవిష్కరణ

జరిగాయి. ఏప్రిల్ 16, 17 తేదీలలో దేవినేని భీమయ్య, కొల్లి సీతారామస్వామి, వీరపనేని బసవ కుటుంబయ్య, సూరపనేని వీరయ్య, చలసాని జగన్నాధరావు, చలసాని ప్రకాశరావు, చలసాని నారాయణమూర్తిగార్లను భట్లపెనుమర్రులో అరెస్టు చేసి బందరు తీసుకువెళ్ళి, విడిచిపెట్టారు. అట్లూరి శ్రీరాములుగారు మే 7, 8, 9 తేదీలలో పికెటింగ్ చేయడం, ఆయన్ని పోలీసులు అరెస్టుచేసి రాత్రికి విడిచిపెట్టడం నిత్యకృత్యమైనది. వీరింటిని మే 16న సోదా చేశారు.

మే 14 వ తేదీ నుంచి శ్రీకాకుళంలో క అంగడులవద్ద పెకెట్ చేస్తున్న భట్లపెనుమ పరిసర గ్రామాల వలంటీర్లను క్రూరంగా లాఠీ ఛా చేశారు 16వ తేదీన అట్లూరి శ్రీరాములు, చలసాని ంగయ్య చలసాని నాగేశ్వరరావు, చలసాని బసవయ్య, వెల్లంకి వీరరాఘవయ్య, దేవినేని భీమయ్య, దేవినేని తాతయ్య, కోనేరు గోపాలకృష్ణయ్య, కోనేరు గోపాలరావు (బార్లపూడి) పికెటింగ్ చేస్తుండగా, చల్లపల్లి పోలీసులు వలంటీర్లటోపీలను జెండాలను లాక్కుపోయారు భట్లపెనుమర్రు గ్రామంలో కూడా లాఠీఛార్జి చేశారు. వారు ఘంటసాల వెళ్ళి పికెటింగ్ చేయగా అక్కడ కూడా లాఠీ ఛార్జిచేసి అరెస్టు చేసి అవనిగడ్డలో వారం రోజులుంచి వదలివేశారు.

జూన్ 4 న చలసాని నారాయణమూర్తి, చలసాని జగన్నాధరావు, చలసాని ప్రకాశరావు, చెరుకూరి సౌభాగ్యమ్మ, దేవినేని భీమయ్య, తూర్పు కృష్ణాజిల్లా డిక్టేటర్ సూరపనేని వీరయ్యాగార్లకు 18 నెలల కఠిన శిక్ష విధించబడింది.

గుంటూరులో జరిగిన ఆంధ్ర రాజకీయ మహాసభకు భట్లపెనుమర్రు నుంచి చలసాని బసవయ్య, వెల్లంకి వీరరాఘవయ గార్లు హాజరయ్యారు. బసవయ్యాగారిని అరె చేసి జామీన్ అడిగారు. ఆయన అందుకు నిరాక ంచారు. చివరకు బసవయ్యాగారిని వదలివేశారు. బెజవాడలోని ఆంధ్రరత్న భవనంపై చేసిన దాడిలో పాల్గొన్నందుకు అట్లూరి శ్రీరాములు, కామినేని పున్నయ్యగార్లకు సంవత్సరం శిక్ష, వందరూపాయల జరిమానా విధించారు.

అగస్టు 11 న భట్లపెనుమర్రులో కొందరు ఊరేగింపుగా బయలుదేరి వెళ్ళి, సీలువేయబడిన కాంగ్రెస్ ఆఫీసుపై దాడిచేసి, తాళాలు బద్దలుకొట్టి,, నినాదాలిస్తూ జాతీయగీతాలు పాడుకొంటూఅక్కడే వుండిపోయారు. ఈ సంఘటనలో పాల్గొన్నవారు చలసాని గంగయ్య, చలసాని సీతారామయ్య, చలసాని కోటయ్య, చలసాని నాగేశ్వరరావు, కోనేరు నారాయణరావు, బొబ్బా వెంకట సుబ్బయ్య, మూలుపూడి వెంకటాద్రి, సూరపనేని లక్ష్మి పెదమాణిక్యగారు వున్నారు. వీరిపై పామర్రు పోలీసు సబిన్స్పెక్టర్, లాఠీఛార్జి చేసి వదిలివేశాడు 1932 ఆగస్టు 2న వల్లభనేని అన్నపూర్ణమ్మ, గుత్తికొండ సీతమ్మగారూ మరికొందరు మహిళలు ప్రభుత్వ స్వాధీనంలో వున్న భట్ల పెనుమర్రు కాంగ్రెస్ ఆఫీసుపై దాడిచేసి తిరిగి స్వాధీనం చేసుకొన్నారు. చుట్టు పక్కల గ్రామాలలో రెండు రోజులు ప్రచారం చేశారు. 5 వ తేదీన వీరిని అరెస్టు చేసి, కాంగ్రెస్ ఆఫీసుకు పోలీసులు సీలు వేశారు.

ఇలా ప్రతినిత్యం సత్యాగ్రహ సమరంలో పోలీసులతో దాగుడుమూత లాడుతూ, లాఠీ దెబ్బలు తింటూ, పలుగ్రామాలలో తిరుగుతూ మొక్కవోని సాహసం ప్రదర్శించారు భట్లపెనుమర్రు యువకులు. ఇంతటి చైతన్యంతో ఈ గ్రామ యువకులు ప్రవర్తించడానికి గల పూర్వపు చరిత్రను చూద్దాం.

హోంరూల్ ఉద్యమ ప్రభావంతో, అనిబిసెంట్ పటాన్ని 1921లో కొందరు యువకులు ఊరేగించారు. వీరు : చలసాని బసవయ్య (తండ్రి వెంకటరత్నం దేవినేని శేషయ్య, గొట్టిపాటి వెంకయ్య (తం| రామయ్య)—వీరంతా పిన్న వయస్కులే. ఆ ఊరేగింపుకు నాయకత్వం వహించారు. ఊరేగింపు తర్వాత ఉపన్యాసాలు మొదలుపెట్టారు ఐతే ఇది గ్రామమున్సబు (చలసాని వెంకట్రామయ్య) ఆగ్రహానికి కారణమైంది. ఆయన చలసాని పుల్లయ్య వాళ్ళనుతిట్టి, అనిబిసెంట్ పటాన్ని తగులబెట్టారు. పైన చెప్పిన యువకులు చిన్నవాళ్ళవడంతో భయపడి వెనక్కివెళ్ళిపోయారు. కానిఆనాటితో ఈగ్రామంలో జాతీయోద్యమానికి అంకురార్పణ ఏర్పడింది. పై ముగ్గురూ గ్రంథాలయాన్ని స్థాపించారు. దానికి ఆంధ్రపత్రికను తెప్పించారు. అందులోని వార్తలు చదివి, రాజకీయాలను గ్రామస్థులకు తెలియచేసేవారు.

1929 లో ముట్నూరి కృష్ణారావు, చెరుకువాడ నరసింహం, ఆత్మకూరు గోవిందాచారిగార్లు ఈ

గ్రామం విచ్చేసి జాతీయ ఉద్యమం గురించి, అస్పృశ్యతా నివారణ గురించి ఉపన్యాసాలిచ్చారు. వీటిచే ప్రభావితులైన కామినేని వెంకటప్పయ్య, దేవినేని భీమయ్య, గొట్టిపాటి సూర్యనారాయణ, చలసాని వెంకటేశ్వరరావుగార్లు కాంగ్రెస్ సభ్యత్వం (పావలా సభ్యత్వం) పుచ్చుకొన్నారు. కాంగ్రెస్ సభ్యత్వం, రాట్నాలు నడపడం మొదలైన కార్యక్రమాన్ని చేపట్టారు.

తర్వాత 1930లో శివరాత్రి ఉత్సవం సందర్భంగా కృష్ణానదీ తీరాన ఐలూరులో ఖద్దరు ఎగ్జిబిషన్ పెట్టారు. కామినేని వెంకటప్పయ్య, చలసాని నారాయణమూర్తి, దేవినేని భీమయ్యగార్లు ఇక్కడ ఖద్దరు అమ్మారు. కపిళేశ్వరపురం, మేడూరు గ్రామస్థులు కూడా పాల్గొన్నారు అందులో కొల్లిపర సూరయ్యగారు కూడా వున్నారు 1931లో కామినేని వెంకటప్పయ్య, గొట్టిపాటిసూర్యనారాయణ, దేవినేని భీమయ్య, చలసాని నారాయణమూర్తి, హనుమంతరావు, వెంకటేశ్వరరావు (మైనర్), వెంకటేశ్వరరావు, పోలవరపు సత్యనారాయణ, కామినేని వెంకట్రామయ్యగార్లు ఖద్దరు అమ్మి పావలా సభ్యత్వం చేర్పించారు.

1932 లో కూడా ఈ ఉద్యమం సాగింది. చలసాని వాసుదేవరావు, జగన్నాధరావుగార్లు ఖద్దరు దుకాణం పెట్టి అమ్మేవారు.

ఒక సందర్భంలో బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారిని జెండా ప్రతిష్ఠాపన చేయవలసిందిగా కోరగా "గాంధీగారు త్వరలో ఉప్పు సత్యాగ్రహం చేయబోతున్నారు. ప్రాణ త్యాగానికి సిద్ధపడుతున్నారు మీరు కూడా అట్టి త్యాగానికి సిద్ధపడితే జండాను ఆవిష్కరిస్తాను" అని అన్నారు. అపుడు పైన ఉదహరించిన ముగ్గురూ సత్యాగ్రహం చేస్తామని ప్రమాణం చేశారు. ఆ తర్వాత 1930 లో ఖద్దరు అమ్మకమే కాక సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నారు. వీరేకాక గొట్టిపాటి సూర్యనారాయణ, గొట్టిపాటి పద్మనాభయ్య, గొట్టిపాటి పెదనాగభూషణం ఉప్పుసత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొని శిక్షలు పొందారు.

ఈ ఉద్యమంలోని మహిళల కృషి ప్రశంసనీయమైంది. (మతులు గొట్టిపాటి చిలకమ్మ, కామినేని సపపూర్ణమ్మ, వెల్లంకి లక్ష్మీపులకమ్మ మొదలైనవారు గ్రామాల్లో గాంధీగారి ఉద్యమాన్ని గూర్చి ప్రచారం చేసేవారు. వీరు స్వయంగా చందాలు పోగుచేసి, గుంటూరులోని శతశిల్పి నూతలపాటి నరసింహారావుగారు చేసిన గాంధీ విగ్రహాన్ని తీసుకువచ్చారు. దాన్ని ఊరేగించిన అనంతరం, మూల్పూరి చుక్కమ్మగారితో గ్రంథాలయంవద్ద, గాంధీ విగ్రహాన్ని ప్రతిష్ట చేయించారు. శిబిరంలో ఉండి విశేష సేవ చేశారు. ఈ విగ్రహాన్ని గుడివాడ సర్కిల్ ఇనస్పెక్టర్ పడగొట్టుచుండగా, అడ్డు వెళ్ళిన కామినేని వెంకటప్పయ్యగారిని స్పృహతప్పిపోయేలాగ పోలీసులు చావబాదారు. ఆయన చనిపోయాడనే మొదట అందరూ భావించారు. ఆ విగ్రహాన్ని బందరు తరలించుకుపోయారు పోలీసులు.

భట్లపెనుమర్రులో పలుసార్లు లాఠీఛార్జీలకు వలంటీర్లు, ప్రజలు గురయ్యారు. అలాంటి సందర్భాలలో గాయపడినవారికి మహిళలు చేసిన సేవలు ప్రశంసనీయం. గాయపడినవారికి చలసాని వీరభద్రయ్యగారి ఇంటివద్ద చలసాని కాంతమ్మ, నాగరత్నమ్మ, బసవమ్మ, చినకాంతమ్మ, చిలకమ్మ వగైరాలు దెబ్బలు తగిలినవారికి నిమ్మకాయలతో కాపు కాసేవారు.

భ పెనుమర్రులో గాంధీ విగ్రహం వద్ద జరిగిన లాఠీఛా పరంపరలో చలసాని ప్రకాశరావుగారిని తీవ్రం, లాఠీఛార్జీ చేశారు.

తర్వాత దేవినేని భీమయ్యగారిసావిడిని కాంగ్రెస్ శిబిరంగా మార్చారు. కామినేని వెంకటప్పయ గారి నాయకత్వం కింద గ్రామాల్లో సత్యాగ్రహ ఉద మం గురించి ప్రచారం చేశారు. భట్లపెనుమర్రు, పెసనగల్లు, పెదపూడి, బార్లపూడి, నరసంపాలెం, గోడపాడు, మొవ్వ, మొవ్వపాలెం. వేములమద, కొండాపురం మొదలైన గ్రామాల్లో ప్రచారం చేశారు.

భట్లపెనుమర్రులోని సారా దుకాణాలవద్ద పికెటింగు చేస్తుండగా చలసాని నారాయణమూర్తిపై తీవ్రమైన లాఠీఛార్జీ చేశారు.

గుడివాడలో వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ, చెరుకూరి సౌభాగ్యమ్మగార్లను గుడివాడలో అరెస్టు చేసి లాఠీఛార్జీచేసి బయటకు వదలివేయగా ఆ విషయం తెలిసి భట్లపెనుమర్రు శిబిరానికి తీసుకువచ్చి తర్వాత వారిని గొల్వేపల్లి గ్రామానికి పంపారు. కొన్నాళ్ళకు శిబిరాన్ని పోలీసులు స్వాధీనం చేసుకొన్నారు.

1932 లో చలసాని బసవయ్యగారు మొవ్వలో చల్లపల్లి జమీందారుగారి సముద్దారుగా వుండేవారు. గొ పాటి బ్రహ్మయ్య, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగా ఈ గ్రామానికి వచ్చినపుడు భోజనం పెట్టారని తె న జమీందారు ఆ ఉద్యోగంనుంచి ఆయన్ని తొలగించాడు.

భట్లపెనుమర్రులో పత్రికా పఠనం మొదలుకొని, గ్రంథాలయ స్థాపన వరకు ఎక్కువ ప్రోత్సాహమిచ్చినవారిలో బసవయ్యగారు ముఖ్యుడు. ఆయన అన్ని ఉద్యమాల్లో ప్రత్యక్ష కార్యాచరణకు దిగకపోయినా, వెనుక వుండి ఎక్కువ సహాయపడుతూ కుటుంబ సభ్యులందర్నీ ప్రోత్సహించుతూ అనేక త్యాగాలను చేసినవాడు బసవయ్యగారు.

విదేశ వస్త్ర బహిష్కారం, తాటిగెలలు నరకడం లాంటి కార్యక్రమం భట్లపెనుమర్రులో బాగా జరిగింది.

చలసాని ప్రకాశరావు, జగన్నాధరావుగార్లు మేడూరు వెళ్ళి రాత్రిపూట తాటిచెట్లు ఎక్కి కల్లును గుమ్మరించారు. అలా చేస్తున్నపుడు ఆ చెట్ల యజమానులైన గౌడవారు చంపుతామని వెంటపడగా, తప్పించుకుని వారు తమ గ్రామం చేరుకున్నారు. జగన్నాధరావుగారు విద్యార్థి దశలోనే 1930 సత్యాగ్రహ ఉద్యమ ప్రభావానికి లోనయ్యారు. హైస్కూలు విద్యార్థులకే బ్రిటిష్ వ్యతిరేక సమ్మెలు చేయించేవారు, కరపత్రాలు పంచేవారు. ఎర్నేని సుబ్రహ్మణ్యంగారితో కలిసి కాంగ్రెస్ సేవ చేసేవాడు.

ముదునూరు గ్రామంలో 'రెడీ' అనే పత్రిక రహస్యంగా నడుపుతూ వుండేవారు. అన్నే అంజయ్యగారి పొలాన వున్న చావిడి దానికి ఉపయోగపడేది. మద్దుకూరి చంద్రశేఖరరావు, కొసరాజు శేషయ్యగార్లు మరికొందరు ఆ పనిలో నిమగ్నులయారు. ఈ పత్రికను వివిధ గ్రామాలలో రాత్రిపూట పంచిపెట్టేవారు. దేవినేని భీమయ్య, చలసాని నారాయణమూర్తి, భట్లపెనుమర్రు నుంచి సైకిళ్ళపై ముదునూరు వెళ్ళి ఆ పత్రిక తీసుకువచ్చి భట్లపెనుమర్రు, దాని చుట్టు ప్రక్కల గ్రామాలలో పంచిపెట్టేవారు. ఇలా గుడివాడ తాలూకాలో పంచుతున్న సందర్భంగా భట్లపెనుమర్రు వాస్తవ్యులు చలసాని గంగయ్యగారిని మరికొందరిని అరెస్టు చేసి గుడివాడ సబ్ జైలులో ఐదు రోజులుంచి వదలివేశారు.

1932 ఉద్యమంలో కామినేని వెంకటప్పయ్య, దేవినేని భీమయ్య, చలసాని నారాయణమూర్తి, చలసాని జగన్నాధరావు, ప్రకాశరావు, సూరపనేని వీరయ్య, చలసాని సీతారామయ్య, చలసాని నాగేశ్వరరావుగార్లు జైలుశిక్షలు అనుభవించారు.

అవనిగడ్డలో కల్లు దుకాణాలవద్ద పికెటింగ్ చేస్తున్న వేములపల్లి వెంకయ్య, నాగయ్యగార్లను కొట్టి వదలివేశారు. అరెస్టయి శిక్షలు పొందిన సత్యాగ్రహులలో పెదసనగల్లు, చినకళ్ళేపల్లి, భట్లపెనుమర్రు, మొవ్వ, మొవ్వపాలెం, గూడపాడు, నరసంపాలెం, ఘంటసాల, కోసూరు, కపిలేశ్వరపురం మొదలైన గ్రామాలవారున్నారు. నరసంపాలెంలో తీవ్రంగా లాఠీఛార్జీ కూడా జరిగింది. అక్కడ లాఠీఛార్జీకి గురైనవారిలో కొల్లి సీతారామయ్య, వల్లభనేని లక్ష్మయ్య, చలసాని నారాయణమూర్తిగార్లు వున్నారు.

కల్లు సారా దుకాణాల పికెటింగ్ సందర్భంగా ఈ తాలూకాలో ఘంటసాల, శ్రీకాకుళం గ్రామాల్లో తీవ్రమైన లాఠీఛార్జీలు జరిగాయి. కాంగ్రెస్ జండాలను లాగివేసి అవమానపరుస్తున్నపుడు నిరోధించిన సత్యాగ్రహులు తీవ్రమైన లాఠీ దెబ్బలకు గురయ్యారు.

ఘంటసాలలో జండాని లాగివేయడానికి పోలీసులు ప్రయత్నించినపుడు వారిని సాత్వికంగా నిరోధించినందుకు సాయం పరందదాసుగారిని పోలీసులు ఆపాదమస్తకం చితకబాదారు. వీరితోపాటు పిపుపాటి కృష్ణమూ , వేమూరి వెంకయ్యగార్లకు కూడా దెబ్బలు ాయి.

ఇదే గ్రామంలో కల్లు సారా దుకాణాలను పికెటింగ్ చేస్తున్న గొర్రెపాటి ఒసనరసింహంగారిని కొట్టి, సర్కిల్ ఇనస్పెక్టర్ దీక్షితులు, ఆయన నోట్లో క పోశాడు. ఈ దృశ్యం చూసిన వెట్టి సుబ్బయ ఆనాటినుంచి కల్లు, సారాలను ముట్టలేదు. కనుమూ రామిరెడ్డిగారికి కూడా బాగా గాయాలు తగిలాయి. పికెటింగ్ చేస్తున్న ఎనిమిదిమందిపై లాఠీఛార్జీ జరిగింది. కాంగ్రెస్ జండాలను తీయడానికి ప్రజలు నిరాకరించారు. లాఠీఛార్జీకి గురై స్పృహ కోల్పోయినవారిని ఇళ్ళకు మోసుకుపోవలసి వచ్చింది.

ఘంటసాలలో జండాలు పాతడం, పోలీసులు వాటిని తీసుకుపోవటం రోజూ పరిపాటి అయిపోయింది. కానిస్టేబుల్స్‌కు జండాలను పీకి తీసుకువెళ్ళే కార్యక్రమం ప్రధానమైపోయింది. ఏప్రిల్ 21 నుంచి 24 వరకు ఇలా జరిగింది. తిరిగి 29 వ తేదీన సబిన్‌స్పెక్టర్ వచ్చి మొత్తం జండాలను స్వాధీనపరచుకొన్నాడు.

ఇలాగే మే 15 న శ్రీకాకుళం వద్ద కల్లుపాకల ముందు పికెటింగ్ జరిపినపుడు, టోపీలు, జెండాలు లాక్కొని తీవ్రంగా లాఠీఛార్జీ చేశారు. వలంటీర్లు స్పృహతప్పిపోయారు. అట్లూరి శ్రీరాములు, చలసాని గంగయ్య, నాగేశ్వరరావు, బసవయ్య, వెల్లంకి వీరరాఘవయ్య, రావినేని భీమయ్య, కోనేరు గోపాలకృష్ణయ్య, దెబ్బలు తిన్నవారిలో వున్నారు. లాఠీఛార్జీ చేసిన అనంతరం వీరిని ఒక బండిలో బార్లపూడికి చేర్చారు. మర్నాడు కూడా పోలీసులు లాఠీఛార్జీ చేసి పికెటింగ్ చేస్తున్నవారిని చెదరగొట్టారు.

కల్లు దుకాణాలముందు పికెటింగ్ చేస్తున్నందుకు మార్చి 29 న గొర్రెపాటి సరస్వతమ్మ, లక్ష్మీకాంతమ్మ, కుటుంబమ్మగార్లను అరెస్టుచేసి ఏప్రిల్ 2 న మూడేసి నెలలు శిక్ష విధించారు.

నాగాయతిప్పలో దావులూరి దులకమ్మగారి అధ్యక్షతన జరిగిన సభపై తీవ్రంగా లాఠీఛార్జీ జరిగింది. కంఠంనేని అచ్యుతరామయ్య, యార్లగడ్డ రాజదాసయ్య, వేములపల్లి వెంకటరామయ్య, వేములపల్లి నాగయ్య, గరికిపాటి మల్లయ్య గార్లకు బాగా దెబ్బలు తగిలాయి.

1932 ఫిబ్రవరి 1 న గొట్టిపాటి బ్రహ్మయ్యగారికి రోగడ విధించిన జరిమానాను వసూలు చేశారు. కొడాలి ఆంజనేయులుగారికి విధించిన జరిమానాకుగాను వారి అన్నగారైన సీతారామదాసుగారి గేదెల్ని, ఇతర సామగ్రిని జప్తుచేశారు. అంతేకాక ఆంజనేయులుగారు కాపురముంటున్న ఇంటికి సీలువేశారు, ఏప్రిల్ 3 న గాని, పై నుదహరించిన ఇంటిపైన, కొండిపర్తి శ్రీరాములుగారి ఇల్లు పైన నిషేధాలను ప్రభుత్వం తొలగించలేదు.

గొట్టిపాటి నరసింహం, అట్లూరి శ్రీరాములు, కనుమూరి రామిరెడ్డిగార్లు ఏప్రిల్ 13 నుంచి ఘంటసాలలో కల్లు దుకాణాలముందు పికెటింగ్ చేశారు. జండాలు, పాటలు, నినాదాలతో గ్రామాల్లో జాతీయ పతాకను ఎగురవేశారు. సబిన్‌స్పెక్టర్ జండాను తొలగించాడు. కాంగ్రెస్ స్వచ్ఛంద సేవకులు కల్లు దుకాణానికి నలుమూలలా జాతీయ జండాలు పాతి పికెట్ చేసేవారు. రోజూ ఒక పోలీసువచ్చి, వాటిని లాక్కుపోయేవాడు. గుడ్డ జండాలైపోతే కాగితం జండాలు పెట్టడం ప్రారంభించారు 29 వ తేదీన జెండాలను సబిన్‌స్పెక్టర్ కొంతమంది కానిస్టేబులుతో వచ్చి బలవంతంగా ఊడదీసి, తీసుకుపోయాడు.

గొర్రెపాటి సరస్వతమ్మ, లక్ష్మీకాంతమ్మ, కుటుంబమ్మగార్లు ఘంటసాలలో కల్లు దుకాణాల ముందు పికెట్ చేసినందుకు అరెస్టుచేసి మూడేసి

నెలలు ఖైదు విధించారు. అలాగే విదేశవస్త్ర బహిష్కార నోటీసు యిచ్చినందుకు ఘంటసాలలో ఆగస్టు 30 న పోచిరాజు కృష్ణారావు, అయినంపూడి శ్రీనివాసులు, బిగురుపాటి కుటుంబయ్య గార్లను అరెస్టు చేశారు.

ఈ తాలూకాలో 1932 ఉద్యమంలో ప్రధానంగా పాల్గొని ఉద్యమాన్ని పటిష్టం చేసిన గ్రామాల్లో భట్ల పెనుమర్రు, ఘంటసాల, కపిలేశ్వరపురం, శ్రీకాకుళంలను పేర్కొనాలి.

## 1933 లో హరిజన యాత్ర

గాంధీ, ఆయన బృందమూ డిసెంబరు 17 న బందరునుంచి, దివి తాలూకాలో హరిజన యాత్రకు బయలుదేరారు. ఆ రాత్రి చల్లపల్లి చేరారు. తోవలో వర్షం కురవటంవల్ల అనుకున్న కాలం కంటే కొంత ఆలస్యమయింది. అక్కడ హరిజన నిధికి నూలు, ఖద్దరు వస్త్రాలేకాక, బంగారపు ఉంగరాలు, గొలుసులు, నగలు సమర్పించారు. పండ్లు సమర్పించారు. చంటి బిడ్డలచే పాదాభివందనం చేయించారు.

చల్లపల్లిలో నిధి సమర్పించిన గ్రామాల్లో చల్లపల్లి, ఘంటసాల, పురిటిగడ్డ, నాగాయితిప్ప, తాడేపల్లి, నర్సంపాలెం, పెదప్రోలు. కాజ, దాలిపర్రు మొదలైన గ్రామాలు కూడా వున్నాయి. రొక్కం రు. 3855-7-9, నగలరూపంలో రు. 1172-8-0 మొత్తం రు. 5027-15-9 వసూలైనట్టు, ఆంధ్ర గ్రంథమాల ప్రచురించిన "మహాత్ముని ఆంధ్రదేశ సంచారము" అనే గ్రంథంలో తెలుపబడింది. కొర్రపాటి అంకమ్మగారి పమూపపు వెంకట శివరామ కృష్ణ ప్రసాద్‌గారు హరిజనుల నివాసానికి అర ఎకరం స్థలం యిచ్చారు. అతని సోదరి భ్రమరాంబ గారు తన గాజుల జత ఇచ్చింది. గొట్టిపాటి సరస్వతమ్మ, దేవాభక్తుని బసవనాగమ్మ, కొర్రపాటి లక్ష్మమ్మ, నాదెళ్ళ భాస్కర హృదయాలయగార్లు కూడా బంగారు గాజుల జతలు ఇచ్చారు. చంద్రదు అన్నపూర్ణమ్మ, కిలారి వెంకట త్రిపురాంబ గా బంగారు ఉంగరాలను ఇచ్చారు. గుత్తికొండ అచ్చయ్య, చంద్ర శ్రీనివాసరావు, కొర్రపాటి రాజారాం మోహనరావుగార్లు బంగారు ఉంగరాలను, కావూరు కోదండ రామయ్యగారు వెండి గొలుసుతో వున్న గడియారాన్ని ఇచ్చారు.

గాంధీ, తన ఉపన్యాసంలో ఘంటసాలలో జరిగిన దేవాలయ హరిజన ప్రవేశాన్ని ప్రశంసించారు.

ఘంటసాలలో గొట్టిపాటి బ్రహ్మయ్యగారు జైలులో వున్న కాలంలో, చెరుకువాడ నరసింహం, గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగార్ల ప్రోత్సాహంతో హరిజనులచే మంచినీటి బావిలో నీరు తోడించారు. బ్రహ్మయ్యగారి మేనమామ, తమ పాలేరు గొడుమచ్చు నర్సయ్యచే నీరు తోడించి ముందుగా త్రాగారు. తర్వాత అక్కడ చేరిన అందరూ అలాగే ఆ హరిజనుడు తోడిన నీరు తాగారు. చెరుకువాడ నరసింహంగారు ఈ గ్రామంలోనే తాతగారి యింటిలో జన్మించారు. వారి అక్కగారి అత్తవారిల్లు కూడా ఆ వూళ్ళోనే. అందుచేత, కాంగ్రెస్ ఉద్యమంలో వస్తూ పోతూ వుండటంవల్ల ఆయన యీ గ్రామానికి చిరపరిచితుడు. తన ఉపన్యాస చాతుర్యంతో ప్రజల్ని ఆకట్టుకొని, వారిని జాతీయోద్యమంలోకి ఆకర్షించాడు.

ఘంటసాలలో సుబ్రహ్మణ్యస్వామి ఉత్సవమప్పుడు, హరిజనులు దేవాలయం వెలుపల టెంకాయలు కొట్టి వెళ్ళేవారు సత్యాగ్రహ ఉద్యమంలో జైలునుంచి బయటకు వచ్చిన కాంగ్రెస్‌వారు, తదితరులూ హరిజనులతో కలిసి ఆలయం వెలుపలనే టెంకాయలు కొట్టారు.

బ్రహ్మయ్యగారు విడుదలైన సందర్భంగా జరిగిన సన్మానసభలో పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు, సుబ్రహ్మణ్యస్వామి దేవాలయంలో హరిజన ప్రవేశం జరగకపోతే, ఆ మరణ నిరాహారవ్రతం సాగించుతానని శపథం చేశారు దీనిపై తర్జన భర్జ

నలు జరిగాయి. ప్రముఖ కాంగ్రెసు నాయకులు ఉపన్యాసాలు 15 రోజులపాటు జరిగాయి. కాశీనాధుని వీరమల్లయ్య గారు 1907 నాటి జాతీయవాది. గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి సన్నిహితుడు. పండితుడు. హరిజన దేవాలయ ప్రవేశం న్యాయ సమ్మతమని చెప్పారు. దేవాలయ ప్రవేశానికి అనుకూలంగా సంతకాల సేకరణ ప్రారంభించితే 85 శాతంమంది సంతకాలు చేశారు. సంతకాలు చేసిన వారిలో బ్రాహ్మణులు, వైశ్యులు, విశ్వబ్రాహ్మణులు కూడా కొద్దిమంది వున్నారు.

హరిజన దేవాలయ ప్రవేశం ఇష్టంలేనివారు కొందరు పోలీసులకు ఏవేవో రిపోర్టు చేసి 144 సెక్షన్ తేపడానికి ప్రయత్నించి విఫలమయ్యారు. 1933 నవంబరు 19 న అపుడు విద్యార్థిగా వున్న గోవాడ నిరీక్షణరావు మొదలైన వారితో సుబ్రహ్మణ్య స్వామి దేవాలయంలో హరిజన ప్రవేశం జరిగింది. తర్వాత ఉత్సవం కూడా బాగానే జరిగింది. అర్చకుడు మానివేస్తే తన కుమారుడ్ని కొంతకాలం అర్చకుడుగా నియమించాడు వీరమల్లయ్యగారు. దేవాలయంలో హరిజన ప్రవేశానికి అనుకూలంగా వున్నందుకు పురోహితుడు తద్దినాలకి రానని భీష్మించాడు. దీనితో స్వసంఘ పురోహిత్యం, బ్రాహ్మణేతరులకు వేద పాఠశాల జైలుకు వెళ్ళిన కాంగ్రెస్ వాదులు సైతం యజ్ఞోపవీతం ధరించడం సంభవించింది. మల్లంపాటి నాగభూషణవర్మ తాత్కాలిక అర్చకుడుగా పనిచేశాడు. ఈ సంస్కరణల ఫలితంగా వివాహ క్రతువులలో కూడా మార్పు వచ్చింది. ప్రమాణ స్వీకారంతో పెళ్లిళ్ళు జరిగాయి.

కొంతకాలానికి పూజాపలలో కూడా మార్పువచ్చి తిరిగి అర్చకత్వం కొనసాగించారు. దివి తాలూకాలో ప్రప్రథమంగా హరిజన దేవాలయ ప్రవేశం ఘంటసాలలో జరిగింది. దీనినే గాంధీ ప్రశంసించారు.

## భట్లపెనుమర్రు

1933 లో భట్లపెనుమర్రులో హరిజనుల దేవాలయ ప్రవేశానికి గ్రామపెద్దలు కొందరు వ్యతిరేకించారు. అందుచేత కామినేని వెంకటప్పయ్యగారి నాయకత్వాన కాంగ్రెస్ వలంటీర్లు, గ్రామస్తులైన చలసాని వెంకటప్పయ్య, చలసాని వీరభద్రయ్య, చలసాని వెంకటేశ్వరరావు, చలసాని వెంకటేశ్వరరావు (మైనర్), చలసాని పేరయ్యగారి కుమారుడు వెంకట్రామయ్య మొదలగువారి సహాయంతో గాంధీ విగ్రహంవద్ద పందిరివేసి, గంటకట్టి, పూజలు చేశారు. అందులో హరిజనులకు ప్రవేశం కల్పించారు. కురుమద్దాలి గ్రామస్థుడైన ముక్తేవి మాధవాచార్యగారు పూజారిగా పనిచేశారు చలసాని జగన్నాధరావుగారి సహకారంతో నైవేద్యాలు, పులిహోర మొదలైనవి మాధవాచార్యగారు సమకూర్చేవాడు. హరిజనులకు, గ్రామస్థులకు ఆ ఫలహారాలను పంచిపెట్టేవారు. నైవేద్యానికి కావలసిన వెచ్చాలను గ్రామంలోని వైశ్యులు, తదితర్లు ఇచ్చేవారు. హరిజనులను బహిష్కరించిన పెద్దలకు జవాబుగా, దేవాలయాన్ని బహిష్కరింపచేశారు. గాంధీ విగ్రహమున్న పందిరియే దేవాలయంగా మారింది.

## క్విట్ ఇండియా ఉద్యమం

క్విట్ ఇండియా ఉద్యమంలో కూడా ఈ తాలూకాలోని కొన్ని గ్రామాలు ముఖ్యపాత్ర వహించాయి. పులిగడ్డనుంచి శ్రీకాకుళం ఇంకా కృష్ణానది ఏటి ఒడ్డున గ్రామాల్లో టెలిఫోన్ తీగెలు తెంచివేయబడ్డాయి గ్రామాలలో ప్యూనిటివ్ పన్ను (సామూహిక జరిమానా) విధించగా పలుచోట్ల దాన్ని చెల్లించడానికి ప్రజలు తిరస్కరించారు

పొట్టిలంక జామతోటలో రహస్యంగా సైక్లోస్టైయిల్ యంత్రంపెట్టి కరపత్రాలు తయారుచేసి, వాటిని పంచిపెట్టేవారు అరుణ అసఫలీ, జయప్రకాశ్ నారాయణగార్ల నుంచి వచ్చే రహస్య సర్క్యులర్లను అనువదించి, వాటిని కరపత్రాలుగా ముద్రించి పంచిపెట్టేవారు (కిసాన్) గొర్రెపాటి వెంకట సుబ్బయ్య, కొసరాజు బసవయ్య, మండవ వెంకట కృష్ణారావు గార్లు వగైరాలకు ఇవి అందేవి. వీటిని తెలుగు

చేయటం, వాల్‌పోస్టర్లు అతికించడంలాంటి పనులకు ఆనాటి విద్యార్థిగావున్న పరుచూరి కోటేశ్వరరావు సహాయపడ్డాడు. క్విట్‌ఇండియా ఉద్యమంలో పోతార్లంక, పొట్టిలంక, జువ్వలపాలెం, పురిటిగడ్డ, మోపిదేవి, చినముత్తేవి, పెదముత్తేవి, పెదకళ్ళేపల్లి, కాజ, తలగడదీవి, కాజమాత్రిపాలెం, అవనిగడ్డ, పెద్దయాదర, కోడూరు మొదలైన గ్రామాల వారు క్విట్‌ఇండియా ఉద్యమంలో పాల్గొని శిక్షలు అనుభవించారు.

కాంగ్రెస్ ఉద్యమాలలో లబ్ధప్రతిష్ఠులైన గొట్టిపాటి బ్రహ్మయ్య, కొడాలి ఆంజనేయులు, కామినేని వెంకటప్పయ్యగార్లు దివితాలూకాకు చెందినవారే. ఈ తాలూకాలోనే జన్మించి, ఇతర జిల్లాలలోను, ఈ తాలూకాలలోను, వివిధ రంగాలలోను ప్రఖ్యాతి చెందిన చెరుకువాడ నరసింహం, క్రొవ్విడి లింగరాజు. వందేమాతరం రోజుల్లోనే "స్వరాజ్య" పత్రిక సంపాదకులైన బోడి నారాయణరావు, జాతీయ పతాక రూపొందించిన పింగళి వెంకయ్య, ఆంధ్రజాతీయ కళాశాల సంస్థాపకులలో ఒకరూ, ప్రిన్సిపాల్ ఐన కోపల్లె హనుమంతరావు, 1937 కొత్తపట్టణంలోను, 1943 లో చల్లపల్లి జమీందారీ వ్యతిరేక పోరాటంలోను శిక్షలనుభవించి, నేడు భారత కమ్యూనిస్టు పార్టీ అగ్రనాయకులైన చండ్ర రాజేశ్వరరావు, జాతీయోద్యమం ద్వారా రాజకీయాలలో ప్రవేశించి తర్వాత కమ్యూనిస్టు ఉద్యమంలో అసువులర్పించిన అమరవీరులైన చలసాని జగన్నాధరావు, చల్లపల్లి నారాయణరావు, గోగినేని తాతయ్య మున్నగువారు ఈ తాలూకాకు చెందినవారవటం విశేషం. ఆ విధంగా జిల్లా స్వాతంత్ర్య ఉద్యమంలో దివితాలూకా విశిష్ట సేవలొనరించింది.

నాల్గవ భాగం

# కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల జీవిత చరిత్రలు

# బందరు తాలూకా

## బందరు

### ఉసిరిక వెంకట సుబ్బారావు గుప్త



తండ్రి వెంకటరత్నం. దివి తాలూకా పెదపాలెంలో 1907లో జననం. ప్రస్తుత నివాసం బందరు. 9-2-1932న విదేశ వస్త్రాలయాల ముందు పికెటింగు చేసి నందుకు లాఠీఛార్జీచేసి, కొన్నాళ్ళు లాకప్‌లో వుంచి వదిలివేశారు. వ్యష్టి సత్యాగ్రహంలో 20-2-1941న మూడు మాసాలు కఠిన శిక్ష విధింపబడగా రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్ష అనుభవించారు.

### కాగిత వెంకటేశ్వరరావు



తండ్రి రామస్వామి. జననం 16-10-1923 లో, 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, రహస్య జీవితం గడిపారు. 1944 ఏప్రిల్‌లో అరెస్టు అయ్యారు. బందరు, గుడివాడ సబ్ జైళ్ళలో రిమాండ్‌లో వున్నారు. మున్సిపల్ కౌన్సిలర్‌గా పని చేశారు.

### కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడు



తండ్రి అల్లమయ్య అయ్యవారు. గుడివాడ తాలూకాయలకుర్రులో 25-12-1901 న జననం. ప్రస్తుత నివాసం బందరు. ఎం.ఎ. బి.యల్. మాజీ పార్లమెంటు సభ్యుడు. వ్యష్టిసత్యాగ్రహంలో 17-1-41 నుండి ఆరు నెలల కఠిన శిక్షను తిరుచినాపల్లి జైలులో అనుభవించారు. రు. 500 జరిమానా లేక అదనంగా 5 వారాల కఠిన శిక్ష విధించబడింది. ప్లీడరు వృత్తిని ఐచ్ఛికంగా 12 సంవత్సరాలు మానివేశారు. శాసనమండలి, రాజ్యసభ సభ్యులుగా పని చేశారు. పట్టణ, జిల్లా కాంగ్రెస్‌లకు, జిల్లా రైతు కాంగ్రెస్‌కు అధ్యక్షులుగా, రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులుగా పనిచేశారు. అనేక రాజకీయ వ్యాసాలను, గ్రంథాలను రచించారు.

### డాక్టర్ కుప్పా వెంకట్రామశాస్త్రి



తండ్రి రామస్వామిశాస్త్రి. జన్మస్థలం బందరు. వైద్యవృత్తి. విద్యార్థి ఉద్యమాలలో పాల్గొన్నారు. అభ్యుదయ రచయిత. ఔత్సాహిక నటుడు. తత్వశాస్త్ర అధ్యయనంలో ప్రత్యేక కృషి చేశారు. రెండవ ప్రపంచ

యుద్ధ కాలంలో యుద్ధ వ్యతిరేక ప్రచారం సాగించి నందుకు 5-10-1940 నుంచి 27-5-1942 వరకు డి.ఐ.ఆర్. క్రింద వెల్లూరు జైలులో డిటెన్యూగా నిర్బంధించారు. కమ్యూనిస్టు ఉద్యమంలో పాల్గొన్నారు.

## కోట వెంకట సుబ్బారావు



తండ్రి లక్ష్మీ నరసింహం. బందరు వాస్తవ్యులు. ఉపాధ్యాయులు. ఉప్పు సత్యాగ్రహంలో 28-6-1930న ఆరు నెలల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచినాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించారు. విడుదలయ్యాక తిరిగి శాసనోల్లంఘన వుద్యమంలో పాల్గొని విదేశ వస్త్ర దుకాణాల ముందు పికెటింగ్ చేసినందుకు మద్రాసులో 31-12-30 న అరెస్టు చేసి 20-1-31 న 6 నెలల కఠిన శిక్ష విధించారు. గాంధీ - ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 9-3-31 న విడుదలయ్యారు. కీర్తిశేషులు.

## కేతవరపు శివసుబ్బయ్య



తండ్రి సుబ్రహ్మణ్యం. 30-4-1913 న బందరులో జననం. రైతు. కైకలూరు తాలూకా కలిదిండి వాస్తవ్యులు. బందరు ఉప్పు సత్యాగ్రహ దళంలో చేరగా చిన్నవాడని నాయకులు పంపి వేశారు. 1932 లో పికెటింగ్ చేసినపుడు అరెస్టు చేసి వదలిపెట్టారు. క్విట్ ఇండియా ఉద్యమంలో ప్రభుత్వ ఉద్యోగులను రాజీనామా చేయవలసిందిగా ఉత్తరాలు రాసినందుకు 10 మాసాల శిక్ష, రు. 100 జరిమానా విధించారు. 16-10-42 నుండి అలీపురం క్యాంపు జైలులో శిక్ష ననుభవించారు. ఖాదీ ప్రచారకులు.

## గురుజాడ రాఘవశర్మ



తండ్రి త్రయాంబకరావు. 1898 ప్రాంతంలో గుడ్లవల్లేరులో జననం. కవిశేఖర బిరుదాంకితులు. అనేక గ్రంథాలు రచించారు. జాతీయ గీతాలు వ్రాశారు. బందరు నివాసి.

ఉప్పు సత్యాగ్రహంలో 9 నెలల శిక్ష విధించబడి 17-5-30 నుండి 12-1-31 వరకు రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్షను అనుభవించారు. కోర్టులో తన వాఙ్మూలాన్ని గేయరూపంలో చదివారు.

1921నుండి జాతీయవాది. అప్పుడుతనఉపాధ్యాయ పదవికి రాజీనామా చేశారు. ఆంధ్ర జాతీయ కళాశాలలో ఖద్దరు, కలంకారీ శాఖలలో విద్యార్థులకు తర్ఫీదు నిచ్చారు. ఈ రెండు శాఖల అఖిల భారత ప్రదర్శనలలో బంగారు పతకాలు పొందారు. జాతీయ గీతాలను ప్రచారం చేశారు.

## గోవాడ నిరీక్షణరావు
## (ఉరఫ్ సాములు)



బందరు తాలూకా బైరాగిపాలెంలో 19.7.1915న జన్మించారు. ప్రస్తుతం బందరు నివాసి. జర్నలిస్టు.ఉప్పుసత్యాగ్రహ శిబిరంలో వలంటీరు. కోనేరు జండా ప్రతిష్ఠాపన సమయంలో పోలీసులు చేసినదౌర్జన్యాల్ని ప్రచారం చేస్తుండగా, లాకప్‌లో వుంచి, కొట్టి,

పదిరోజుల తరవాత విడిచిపెట్టారు. రెండో ప్రపంచ యుద్ధకాలంలో పశ్చిమ గోదావరి జిల్లా కొమరాడలో అరెస్టు చేసి, పాలకొల్లులో విడిచి పెట్టారు. 1942లో నర్సాపురంలో 3 కేసులు పెట్టి, రెండు కేసుల్లో మొత్తం 18 నెలల కఠినశిక్ష విధించారు. అలీపురం, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. తెలంగాణాలోని "వెట్టి"కి వ్యతిరేక ప్రచారం చేసినందుకు నిజాం స్టేటు నుండి బహిష్కరింప బడ్డారు. 1946లో రజాకార్ల రాక్షసకృత్యాల్ని విచారించేందుకు తెలంగాణా వెళ్ళినప్పుడు ఎర్రపహాడ్‌కోటలో జిన్నారెడ్డి ప్రతాపరెడ్డి బంధించిన ముగ్గురిలో వీరొకరు. ప్రజాందోళన వల్ల వదిలివేశారు. 1956 నుండి "భాగ్యనగర్" పత్రిక సంపాదకులుగా వుంటున్నారు. హరిజనోద్యమ ప్రముఖులు. కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమర యోధుల సంఘం ఉపాధ్యక్షులు.

## చలమలశెట్టి గోపాలకృష్ణయ్య



తండ్రి వెంకటస్వామి. 1919 డిసెంబర్ 15వ తేదీన చిన్నాపురంలో జననం. ప్రస్తుతనివాసం బందరు. వర్తకులు. ఉప్పు సత్యాగ్రహ కాలంలో బాల వలంటీరు. సత్యాగ్రహ శిబిరం ఏర్పాటు చేసినందుకు వీరి తండ్రి కూడ బాధలకు గురి అయ్యారు. 1942లో వీరు లాఠీచార్జీకి గురి అయ్యారు.

## తంగిరాల వీర రాఘవరావు



తండ్రి వెంకటాచల సోమయాజులు. జననం 29-4-1907న బందరులో. 1929లో పట్టభద్రు లయ్యారు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, 27-6-1930 నుంచి ఆరు నెలలు కఠినశిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంఘ కార్యదర్శిగానూ కొంతకాలం ఆంధ్ర ఖాదీభాండార్ మేనేజరుగానూ పని చేశారు. 1937లో ప్రభుత్వోద్యోగంలో చేరారు. సామర్లకోట పంచాయితీబోర్డు స్పెషల్ ఆఫీసరుగానూ పాలకొల్లు మున్సిపల్ కమిషనర్‌గానూ పనిచేశారు. యుద్ధ నిధి వసూలుచేయ నిరాకరించి, 1940లో ఉద్యోగం నుండి బర్తరఫు అయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 17-8-1942 నుండి రెండు సంవత్సరాలు కఠినశిక్షను బళ్ళారి, అలీపురం జైళ్ళలో అనుభవించారు 1944లో రాయలసీమ క్షామ బాధితుల సహాయ కార్యక్రమాల నిర్వహణకు ఆర్గనైజర్‌గా పనిచేశారు. 1946లో మద్రాసు ప్రభుత్వం ఖాదీ అసిస్టెంట్ టెక్స్‌టైల్ కమిషనర్‌గా నియమించింది. కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘ ప్రధాన కార్యదర్శిగానూ, చైర్మన్‌గానూ కొంతకాలమున్నారు.

## తంగిరాల సీతారామమ్మ



వీర రాఘవరావు గారి పత్ని. బందరు వాస్తవ్యులు. 1932 జనవరి 26వ తేదీన స్వాతంత్ర్య దినోత్సవం జరుపగా అరెస్టు చేసి, వదిలివేశారు. 27-1-1932 న బందరులో కరపత్రాలుపంచు

తుండగా పోలీసులు రంగునీళ్ళు చల్లారు.శాసనోల్లంఘ నోద్యమంలో పాల్గొన్నారు. సంవత్సరం కఠినశిక్ష, రు.500లు జరిమానా విధింపబడింది వెల్లూరు జైలులో 2-5-1932 నుండి 7 నెలల శిక్ష అనుభవించాక, వదలివేశారు.

## తోట నరసయ్యనాయుడు



తండ్రి లక్ష్మయ్య. జన్మస్థలందివితాలూకా పాగోలు. నివాసం బందరు. మోటారు డ్రయివరు. మంచి వస్తాదు. ఉప్పు సత్యాగ్రహ కాలంలో 6-5-1930న బందరు కోనేరు సెంటర్‌లో జాతీయ జెండాను ఎగురవేసి, దానిని పోలీసుల బారి నుంచి కాపాడడానికి ప్రదర్శించిన ధైర్యసాహసాలు ప్రశంసనీయం. 15 మంది పోలీసులు లాఠీలతో చావ మోదుతున్నా చలించకుండా జెండా స్థంభాన్ని 45 నిమిషాలపాటు అలానే కౌగలించుకొని వున్నారు. చివరకు స్పృహతప్పి క్రింద పడిపోయారు. అప్పటి నుంచి 'జెండా వీరుడు'గా ప్రసిద్ధికెక్కారు. ప్రజల కోరికపై ఆనాటి మున్సిపల్ ఛైర్మన్ శీలం జగన్నాధ రావు నాయుడు జెండా వీరునిచేత మున్సిపల్ ఆఫీసు పైన జెండా ఎగురవేయించారు. ఆ రాత్రికి రాత్రే ఆయన్ను అరెస్టుచేసి, ఆ రాత్రి వేళనే విచారణ జరిపించి సంవత్సరం ఆరు నెలల కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, కోరాపుట్ జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒప్పందంతో 1931 మార్చిలో విడుదలయ్యారు. పన్నుల నిరాకరణగురించి ప్రచారం చేయరాదని 7-1-1932 న ఆయనపై నిషేధాజ్ఞలు జారీ చేశారు. మద్యపాన నిషేధం కోసం, హరిజనోద్ధరణ కోసం కృషి చేశారు. తరవాత సోషలిస్టు పార్టీలో చేరారు. మోటారు కార్మిక సంఘాన్ని స్థాపించారు యుద్ధ కాలంలో పెరిగిన ధరలకు వ్యతిరేకంగా ఉద్యమం నడిపి, బియ్యాన్ని చౌకగా పేదలకు అమ్మించారు. 12-9-1964న కీర్తిశేషులయ్యారు.

## ధూళిపాటి వెంకట సుబ్బారావు



తండ్రి లోకయ్య పంతులు. బందరు వాస్తవ్యులు. విద్యార్థి దశలోనే ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 12-6-30 నుండి ఆరు నెలల శిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు.

## పంచాంగం రామానుజమ్మ



భర్త కృష్ణమాచార్యులు. గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా ముక్కిపల్లి అగ్రహారంలో 1-7-1900న జన్మించారు. ప్రస్తుతం బందరు నివాసి. 1932 శాసనోల్లంఘనోద్యమంలో 1-2-1932 న ఆరు నెలల శిక్ష రు. 25 జరిమానా విధించబడింది. జరిమానా చెల్లించనందున చరాస్తినంతను ప్రభుత్వం జప్తుచేసింది. ఇంతేగాక మరో ఆరు వారాల శిక్ష విధింపబడింది. వెల్లూరు, కన్ననూర్ జైళ్ళలో శిక్షను అనుభవించారు.

## ప్రభల జానకిరామయ్య



తండ్రి వెంకటరత్నం. దివితాలూకా అయ్యంకిలో 1912 ప్రాంతంలో జననం. ప్రస్తుత నివాసం బందరు.

సైమన్ కమిషన్ బహిష్కరణ ఉద్యమ సందర్భంగా తీవ్రంగా

లాఠీదెబ్బలకు గురిఅయ్యారు. ఆబ్కారీ దుకాణాల ముందు, విదేశ వస్త్ర దుకాణాలముందు పికెటింగ్ చేశారు. క్విట్ ఇండియా ఉద్యమంలో తీవ్రంగా లాఠీచార్జికి గురిఅయ్యారు.

## పురాణం సూరిశాస్త్రి



తండ్రి వెంకటప్పయ్య పంతులు. బందరు వాస్తవ్యులు ఎం.ఏ. తన ఇంటిని ఉప్పుసత్యాగ్రహ శిబిరంగా వాడుకొనేందుకు ఇచ్చినందుకుగాను 19-5-1930 న ఆరు నెలల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్షను అనుభవించారు. నాటక కళపై అనేక గ్రంథాలు రచించారు. కీర్తిశేషులు.

## పుచ్చా వెంకట కృష్ణయ్య



తండ్రి చిన లక్ష్మీనారాయణ. గుంటూరు జిల్లా తెనాలి తాలూకా దంతలూరులో 9—10—1896 లో జననం. ప్రస్తుత నివాసం బందరు. 1920 లో పట్టభద్రులయ్యారు. 1921 నుండి కాంగ్రెస్ ప్రచారకులు. ఉప్పుసత్యాగ్రహంలో 24-9-1930 నుండి రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో ఆరు నెలల శిక్ష అనుభవించారు. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో అభ్యంతరకర రిపోర్టులు ప్రచురించారనే నేరంపై శిక్షింపబడ్డారు.

## పెనుమర్తి లక్ష్మీపతిశాస్త్రి



తండ్రి వెంకటరత్నం. జన్మస్థలం బందరు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, 24-6-1930 నుంచి ఆరునెలల కఠిన శిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 15-7-1932 న రెండేళ్ళ కఠిన శిక్ష. రు. 1000/- జరిమానా విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించి, 10-8-1932 న బెయిల్‌పై విడుదలయ్యారు. మున్సిపల్ కౌన్సిలర్, జర్నలిస్టు, 'ఆంధ్రకేసరి' పత్రిక సంపాదకులు, స్థానిక ప్రజాసమితి కార్యదర్శి.

## పోతుకూచి వెంకట్రామయ్య



తండ్రి సుబ్బయ్య. 15—7—1912 న బందరు తాలూకా కొప్పర్లలో జన్మించారు ప్రస్తుత నివాసం బందరు. సత్యాగ్రహ ఉద్యమంలో 25-6-30 న ఆరు నెలల శిక్ష విధింపబడి రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. తిరిగి 26-12-1930 న గుంటూరులో విదేశ వస్త్ర దుకాణాలవద్ద పికెటింగ్ చేసినందుకు అరెస్టుచేసి వదలిపెట్టారు.

## బూశం కోట మల్లయ్య



తండ్రి సుబ్బారాయుడు. 7-1-1908న బందరులో జననం. చేనేత పనివారు. ప్రస్తుత నివాసం హైద్రాబాద్.

వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని లాఠీ చార్జీకి గురి అయ్యారు. 4 మాసాల శిక్ష, 25 రూపాయల జరిమానా విధించబడి 25-1-41 నుండి వెల్లూరు జైలులో శిక్షను అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాల పీకివేత, టెలిగ్రాఫ్ తీగల తెంచివేత కార్యక్రమంలో లాఠీచార్జీకి గురై అనిటివారయ్యారు.

## భోగరాజు పట్టాభి సీతారామయ్య



తండ్రి వెంకట సుబ్రహ్మణ్యం. జననం24-11-1880న పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు తాలూకా గుండుగొలను. బి.ఏ. చదివి, ఎమ్. బి. సి. ఎమ్. పూర్తి చేసి, 1906 నుంచి 1916 వరకు బందరులో వైద్యవృత్తి సాగించారు. అఖిలభారత జాతీయ నాయకులలో ఒకరు. గాంధీ సూత్రాల భాష్యకారుడు. కాంగ్రెసు చరిత్ర రచయిత. 1920 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం ఏర్పాటుకు ప్రధాన బాధ్యులు. హోమ్‌రూల్ ఉద్యమ కాలంలో వైద్యవృత్తికి స్వస్తిపలికారు. 1919 లో ఆంగ్ల వారపత్రిక 'జన్మభూమి' ప్రారంభించారు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, 21-4-1930 నుంచి సంవత్సరం శిక్షను రాజమండ్రి, వెల్లూరు, తిరుచునాపల్లి, మద్రాసు జైళ్ళలో అనుభవించారు. 26-1-1931 న విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలో 7-1-1932 న రెండేళ్ళ కఠిన శిక్ష, రు. 1100 జరిమానా విధించారు. జరిమానా చెల్లించారు. రాజమండ్రి వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. బందరులో 30-10-1933 న పికెటింగ్‌లో పాల్గొన్నారు. ఆరు నెలల కఠిన శిక్ష, రు. 500 జరిమానా విధించారు. వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు. వ్యష్టిసత్యాగ్రహకాలంలో 21-3-1941నుంచి 1-11-1941 వరకు వెల్లూరు జైలులో డిటెన్యూగా వున్నారు. తిరిగి క్విట్ ఇండియా ఉద్యమకాలంలో 9-8-1942 నుంచి 14-6-1945 వరకు అహ్మద్ నగర్ ఫోర్టు, వెల్లూరు జైళ్ళలో డిటెన్యుగా వున్నారు. మొత్తం ఏడున్నర సంవత్సరాలు జైలుజీవితం గడిపారు. 1916 నుండి 52 వరకు ఏ. ఐ. సి. సి. సభ్యులు. 1937 40 మధ్యకాలంలో రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు. 1929-50 మధ్యకాలంలో అనేకసార్లు జాతీయ కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు. ఆంధ్ర జాతీయ కళాశాల, జిల్లా సహకార సెంట్రల్‌బ్యాంకు, ఆంధ్ర ఇన్సూరెన్సుకంపెనీ, ఆంధ్రబ్యాంకు వంటిఅనేకసంస్థల స్థాపకులు. 1952 నుంచి 1957 వరకు మధ్యప్రదేశ్ గవర్నరు. 1959 డిసెంబరు 17 న హైదరాబాద్‌లో కీర్తిశేషులయ్యారు..

## మహ్మద్ ఇస్మాయిల్ బేగ్



తండ్రి మహ్మద్ సులేమాన్‌బేగ్. బందరులో 1909 జూన్ 7 వ తేదీనజన్మించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని లాఠీ ఛార్జీకి గురికాగా, ఎడమ చేయి విరిగిపోయింది. 1932 లో విదేశ వస్త్రాలయాల ముందు, కల్లు దుకాణాల ముందు పికెటింగ్ చేసి, రెండుసార్లు అరెస్టు అయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని రహస్య జీవితం గడుపుతుండగా, వీరి భార్యను ప్రసవ సమయంలో చూసేవారు లేక, ఆమె చనిపోయారు. 1944 లో అరెస్టు చేసి 15 రోజులు సబ్ జైలు రిమాండ్‌లో వుంచారు.

## మామిడాల అంకయ్య



తండ్రి నాగయ్య. 1-7-1915 న కైకలూరులో జననం. ప్రస్తుత నివాసం బందరు. 1937 లో తపాలా బంట్రోతుగా చేరి, పోస్ట్‌మన్ అయి, 1941 లో యుద్ధతంతి తపాలా శాఖలో చేరారు. సింగపూర్ బేస్ పోస్టాఫీస్‌లో 1941 అక్టోబర్‌లో చేరారు. జపాను చేతిలో బ్రిటిష్ సేనలు ఓడిన తర్వాత 1942 ఫిబ్రవరి నుండి జపాన్ యుద్ధ ఖైదీగా ఉన్నారు. తర్వాత అజాద్ హింద్ ఫౌజ్‌లో జనరల్ మోహన్‌సింగ్ నాయకత్వాన పనిచేసి లాన్స్ నాయక్ నుండి నాయక్‌గా ప్రమోట్ అయ్యారు. అజాద్ హింద్ ఫౌజ్ తర్ఫీదు కార్యకర్తగా నియమింపబడ్డారు. 1941 లో హవల్దారుగా, గెరిల్లా రెజిమెంటు గుమాస్తాగా పని చేశారు. బర్మా వెళుతుండగా జపాను ఓడిపోవడంతో అమెరికా యుద్ధ ఖైదీ అయ్యారు. 15-9-45 నుండి 1946 జనవరి 6 వరకు అమెరికావారి నిర్బంధంలో ఉన్నారు. కంటి చూపు, చెవి వినికిడి తగ్గినందున భారత దేశానికి పంపివేశారు. 13-1-46 నుండి సెప్టెంబర్ 46 వరకు బెంగుళూర్‌లో డెటిన్యూగా వున్నారు. భార్య పిల్లలకు కూడా ఇంటర్వ్యూ ఇవ్వలేదు. కొన్నాళ్ళు నాగపూర్ క్యాంప్ "టి" లో సైనిక తపాలా శాఖ రికార్డు కార్యాలయంలో వుంచారు. 1946 అక్టోబర్ 25 న మిలటరీ నుండి డిశ్చార్జ్ చేశారు. 1947 ఏప్రిల్‌లో తిరిగి పోస్ట్‌మన్‌గా ఉద్యోగంలో చేరారు.

## ముట్నూరి కృష్ణారావు



తండ్రి నాగభూషణరావు. జననం 1879 లో. బందరులో ఇంటర్ వరకు చదివారు. వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్నారు. బెంగాల్ వెళ్ళి' సుప్రసిద్ధ బెంగాల్ నాయకులు బిపిన్‌చంద్రపాల్‌తో కలిసి పనిచేశారు. తరువాత కొంత కాలానికి, బందరు నుండి వెలువడిన సుప్రసిద్ధ జాతీయ వార పత్రిక 'కృష్ణా పత్రిక' సంపాదక పదవిని చేపట్టారు. స్వాతంత్ర్య సమర కాలంలో తన పదునైన సంపాదకీయాల ద్వారా పాఠకులలో ఉత్తేజాన్ని, ఉద్వేగాన్ని కల్గించి, అసంఖ్యాకమైన స్వాతంత్ర్య సమర యోధులను తీర్చిదిద్దారు. ఉప్పు సత్యాగ్రహంలో ప్రముఖ పాత్ర వహించారు. 24-6-1930 న రెండేళ్ళ కఠినశిక్ష విధించగా, రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 3-2-1931 న విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. 7-1-1932 న రెండు సంవత్సరాల కఠిన శిక్ష, రు 1100/- లు జరిమానా విధించారు. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. వ్యష్టి సత్యాగ్రహంలో ఆరు నెలల జైలుశిక్ష అనుభవించారు. మితభాషి. 'మౌన ముద్రాలంకార' అని ప్రసిద్ధి చెందారు. ఆంధ్ర దేశంలో అందరి గౌరవాభిమానాలు చూరగొన్నారు. తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ అధ్యక్షులుగా పని చేశారు. 23-6-1945 న కీర్తిశేషులయ్యారు.

## మేకల ఆదినారాయణ



తండ్రి పురుషోత్తం. 1910 లో బందరులో జననం. ప్రస్తుత నివాసం దివి తాలూకా అవనిగడ్డ. వరకులు. మోతీలాల్ నెహ్రూ మరణ సందర్భంగా హర్తాళ్ జరిపించడానికి జండాలు తీసుకొని వెళుతుండగా వీరిని పోలీసులు లాఠీలతో బాదారు. 9-2-31 నుండి రాజమండ్రి జైలులో 2 నెలలు కఠిన శిక్షను అనుభవించారు. ప్రభుత్వ ఉద్యోగులను రాజీనామా చేయవలసిందిగా కరపత్రాలు పంచినందుకు 11-1-32 న లాఠీచార్జికి గురి అయ్యారు. వ్యష్టి సత్యాగ్రహం ఉద్యమంలో పాల్గొన్నారు. యుద్ధ వ్యతిరేక నినాదాలిచ్చినందుకు 11-2-41 న 3 నెలల కఠిన శిక్ష, రు 20 జరిమానా విధించబడింది. జరిమానా వసూలు చేశారు. రాజమండ్రి జైలులో శిక్షను అనుభవించారు.

## వడ్డె రంగారావు



తండ్రి నాగయ్య. జననం 20-6-1913. దివి తాలూకా వేములమడుగు. ప్రస్తుతనివాసం బందరు. 1930 లో కాంగ్రెస్‌లోచేరి, గ్రామాలలో కాంగ్రెస్ ప్రచారం చేశారు. ఖద్దరు ప్రచారంచేస్తూ, గ్రామగ్రామాన ఖద్దరు అమ్మారు. జిల్లా రైతుఉద్యమ నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించారు. రహస్య పత్రిక "స్వతంత్ర భారత్" ప్రచురణకు తోడ్పడ్డారు. యువజనోద్యమంలో పాల్గొన్నారు. 1937లో జిల్లా కాంగ్రెస్ కమిటీ సభ్యులుగా ఎన్నికయ్యారు. ఇటీవల బందరు నియోజకవర్గం నుంచి శాసన సభకు జనతాపార్టీ అభ్యర్థిగా ఎన్నికయ్యారు.

## వారణాసి వెంకట చలం



తండ్రిసుబ్రహ్మణ్యం. బందరు వాస్తవ్యులు. బి.ఏ. చదువుతూ మానివేసి, ఖాదీ, మద్య నిషేధ ప్రచారాలను చేశారు. ఉప్పు సత్యాగ్రహంలో 12-6-30న 6నెలల కఠినశిక్ష విధింపబడి రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్షను అనుభవించారు. గాంధీజీ విడుదల అయ్యారన్న వార్తను ప్రజలకు చెప్పాడని 28-1-31 న మరో ఆరు నెలలు కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒడంబడిక ననుసరించి 13-3-31 న విడుదలయ్యారు. శాసనోల్లంఘనోద్యమంలో 8-3-32న అరెస్టుచేసి 17వ తేదీన రెండు ఏళ్ళ కఠినశిక్ష విధించారు. రు. 1000 జరిమానా, చెల్లించని పక్షంలో మరో మూడునెలల కఠినశిక్ష కూడా విధించారు. మదుర, కడలూరు, వెల్లూరు జైళ్ళలో శిక్షను అనుభవించారు. శాసనోల్లంఘనోద్యమ కాలంలో తూర్పు కృష్ణాజిల్లా డిక్టేటర్.

## వావిలాల వెంకట సుబ్రహ్మణ్య సోమయాజులు



తండ్రి అప్పయ్య శాస్త్రి. 11-7-1917 న ఉయ్యూరులో జననం. ప్రస్తుత నివాసం బందరు. స్టెనోగ్రాఫర్. విద్యార్థులలో, ప్రభుత్వోద్యోగులలో బ్రిటిష్ ప్రభుత్వ వ్యతిరేక ప్రచారం చేశారు. యుద్ధ వ్యతిరేక ప్రచారానికి గాను 29-9-41 నుండి 29-6-42వరకు వెల్లూరు జైలులో డిటెన్యూగా ఉన్నారు. 1938 లో చిత్తూరు జిల్లా కలక్టరాఫీసులో టైపిస్టుగా చేరిన వీరిని డిటెన్షన్‌తో పాటు ఉద్యోగం నుండి డిస్మిస్ చేశారు. స్వాతంత్ర్య అనంతరం తిరిగి ఉద్యోగం ఇచ్చారు. 1972 లో రిటైరయ్యారు. నాన్ గజిటెడ్ ఉద్యోగుల సంఘ సంస్థాపకులలో ఒకరు. దానికి అధ్యక్షులుగా కొన్నాళ్ళు, కార్యదర్శిగా కొన్నాళ్ళు, పనిచేశారు. ప్రెస్ కార్మికులను సంఘటిత పరచడానికి కృషి చేశారు. కమ్యూనిస్టు పార్టీ ట్రేడ్ యూనియన్ వుద్యమాలలో పనిచేశారు.

## వేమూరి దుర్గా వాగేశ్వరరావు



తండ్రి వెంకట సుబ్బారావు. జన్మ స్థలం బందరు. వైద్యవృత్తి. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 7-1-1932 న రెండేళ్ళ కఠిన శిక్ష, రు. 1100/- జరిమానా విధించారు. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. కీర్తిశేషులు.

## అశ్వధాటి రామదాసు

తండ్రి సుబ్రహ్మణ్యం. జన్మస్థలం బందరు. 1921 సహాయ నిరాకరణోద్యమకాలంలో విద్యార్థులలో అలజడులు రేపారన్న ఆరోపణపై వారం రోజులు శిక్ష విధించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని 4-7-1930 నుంచి ఆరునెలల కఠినశిక్షను రాజమండ్రి, అలీపురం, జైళ్ళలో అనుభవించారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని 30-1-1941 నుంచి మూడునెలల కఠినశిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## ఆచంట సముద్రయ్య

తండ్రి వెంకట జోగయ్య, బందరు తాలూకా. వర్తకులు. 18-2-41 న వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. మూడు నెలల కఠిన శిక్ష విధించబడి రాజమండ్రి సెంట్రల్ జైల్లో శిక్ష ననుభవించారు.

## ఆచార్య రామ్‌దేవ్

తండ్రి పండిట్ రవిశుక్లా. నివాసం బందరు. స్థానికులకు చరఖా వడకడం నేర్పారు. 21-2-1941 న వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, రెండు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## ఇవటూరి బాలత్రిపుర సుందరరావు

కృష్ణాజిల్లా బందరు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీఛార్జీకి గురయ్యారు. 23-3-1932 న అరెస్టు అయ్యారు.

## ఉన్నవ కృష్ణయ్య

తండ్రి సుబ్బయ్య.జన్మస్థలం బందరు.అడ్వొకేట్. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 10-2-1941 న బందరు సబ్ డివిజినల్ మేజిస్ట్రేట్ నాలుగు నెలల కఠిన శిక్ష, రు. 500/- జరిమానా విధించారు. వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు.

## ఎ. జీవరత్న మొదలియార్

తండ్రి చొక్కలింగం మొదలియార్. జన్మస్థలం బందరు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని 14-6-1930 నుంచి ఆరు మాసాల కఠిన శిక్షను రాజమండ్రి అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## ఒబిలినేని వెంకయ్య

తండ్రి వెంకటరాయుడు, జన్మస్థలం బందరు. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు 11-5-1932 న ఆరునెలల కఠిన శిక్ష, రు.100/- జరిమానా విధించారు. మద్రాసు, రాజమండ్రి జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## కంభంపాటి రాధాకృష్ణమూర్తి

తండ్రి సీతారామశాస్త్రి. స్వస్థలం బందరు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 21-11-1942 నుంచి ఆరు మాసాలు కఠినశిక్షను అలీపురం క్యాంప్ జైలులో అనుభవించారు.

## కంభంపాటి సాంబయ్య

తండ్రి వెంకటరత్నం. బందరు వాస్తవ్యులు. రైతు. 1921-22 లో సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. జైలుశిక్ష ననుభవించారు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని 28-6-30 నుండి రాజమండ్రి, వెల్లూరు. జైళ్ళలో ఆరునెలలు కఠినశిక్షను అనుభవించారు.

## కాట్రగడ్డ స్వామి



తండ్రి చలం బాపనయ్య. 1901 లో బందరు తాలూకా తరకటూరులో జననం. ఉప్పు సత్యాగ్రహంలో, వ్యష్టి సత్యాగ్రహంలో, క్విట్ ఇండియా ఉద్యమంలో లాఠీ దెబ్బలకు గురి అయ్యారు.

## కాజ లక్ష్మీనారాయణశాస్త్రి

జననం 21-1-1920. బందరు నివాసి. ఆంధ్ర జాతీయ కళాశాలలో విద్యాభ్యాసం. నిడుబ్రోలు రైతు విద్యాలయంలో శిక్షణపొందారు. చరఖా సంఘంలో పనిచేస్తూ, 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనడానికి రాజీనామా చేశారు. 1943 ఆగస్టు 9 న 144వ సెక్షన్ ధిక్కరించి, అరెస్టు అయ్యారు.

## కాశీనాధుని వీరమల్లయ్య అయ్యవార్లు

తండ్రి లింగయ్య అయ్యవారు. జన్మస్థలం బందరు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 13.5-1930 నుంచి 20-12-1930 వరకు రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో కఠిన శిక్ష అనుభవించారు. 1932 శాసనోల్లంఘనంలో కూడా పాల్గొన్నారు.

## కూచిభొట్ల చిదానందశాస్త్రి

జన్మస్థలం బందరు. 1932 శాసనోల్లంఘనంలో గుడివాడ-దోసపాడు స్టేషన్ల మధ్య నడుస్తున్న రైలు గొలుసు లాగి, రైలు నాపినందుకు 23-8-1932 న అరెస్టుచేసి, ఆరు నెలల కఠినశిక్ష, రు. 50. జరిమానా విధించారు.

## కూచిభొట్ల చంద్రమౌళేశ్వరరావు

తండ్రి వెంకట కృష్ణయ్య. జన్మస్థలం బందరు. శాసనోల్లంఘనములో అరెస్టయి, 11-8-1930 నుంచి ఆరునెలల కఠినశిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు.

## కొండిపర్తి పున్నయ్య

తండ్రి లక్ష్మిపతి. జన్మస్థలం బందరు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 10-6-1930 నుంచి 10 నెలల కఠినశిక్షను రాజమండ్రి, బళ్ళారి, మదురై జైళ్ళలో అనుభవించారు. ఖాదీ ఉద్యమంలో పని చేశారు.

## కోకా అహోబలరావు నాయుడు

బందరు నివాసి. 1930 ఉప్పు సత్యాగ్రహ కాలంలో డాక్టరు పట్టాభి సీతారామయ్య జైలుకెళ్ళినప్పుడు తూర్పు కృష్ణా కాంగ్రెసు నాయకత్వ బాధ్యతలు స్వీకరించారు. ఖాదీ ధరించి,వూరూరా తిరిగి మద్యపాన వ్యతిరేక ప్రచారం చేశారు.

## కోనేరు అనసూయ

తండ్రి త్రిపురనేని దూర్వాసులు. భర్త రాఘవయ్య. విశారద, విద్వాన్ పరీక్షలలో ఉత్తీర్ణులయ్యారు. శాసనోల్లంఘనంలో అరెస్టు అయ్యారు. 18-1-1932 న సంవత్సరం కఠిన శిక్ష, రు. 100/- జరిమానా విధించారు. వెల్లూరు, కన్ననూరులలో శిక్ష అనుభవించారు. ప్రస్తుతం నివాసం బందరు.

## కోడూరు సీతారామాంజనేయులు



తండ్రి రాంభొట్లు. 15-3-1914 లో నంగిగడ్డలో జననం. నివాసం పోలవరం. కోన, చిన్నాపురం గ్రామాలలో ఉప్పు సత్యాగ్రహ సందర్భంగా లాఠీఛార్జికి గురిఅయ్యారు విదేశ వస్త్రదహనం, కల్లు దుకాణాల పికెటింగ్‌లో పాల్గొని లాఠీఛార్జికి గురి అయ్యారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1942లో మల్లవోలులో టెలిగ్రాఫ్ తీగలు త్రెంచి 8 మాసాలు రహస్య జీవితం గడిపారు. 43 జూలైలో వీరిని అరెస్టు చేసి లాఠీచార్జీ చేశారు. 6 మాసాలు నిర్బంధంలో ఉన్నారు.

## కేశవరాజు కామాక్షమ్మ

తండ్రి వెంకటప్పయ్య. జన్మస్థలం బందరు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 9-11-1930 న ఆరు నెలల కఠిన శిక్ష విధించారు. వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు. గాంధీ – ఇర్విన్ ఒప్పందంతో

7-3-1931 న విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని, 18-1-1932 నుంచి ఆరునెలలు విడిఖైదును వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు.

## గాజుల వెంకటేశ్వరరావు



తండ్రి రంగయ్య. జననం బందరు తాలూకా కమలాపురం శివారు ఉప్పల కల్వగుంట. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో తంతి తీగలు త్రెంచారు. కొంత కాలం అజ్ఞాతవాసం గడిపారు. అరెస్టు అయి, కొన్నాళ్ళు గుడివాడ సబ్ జైలు నిర్బంధంలో వున్నారు.

## గుంజ వీరాస్వామి

తండ్రి వీరాస్వామి. జన్మస్థలం బందరు. చేనేత కార్మికుడు, యుద్ధ వ్యతిరేక చర్యలకుగాను 3-3-1941 నుంచి మూడు నెలల కఠినశిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## గూడూరు రామలింగేశ్వర గురుకుల్

తండ్రి మల్లయ్య. 1900 సెప్టెంబర్‌లో వడ్లమన్నాడులో జననం స్వగ్రామం పెడన.



1919 నుండి కాంగ్రెస్‌వాది. కాకినాడ, మద్రాసు కాంగ్రెస్‌లకు వెళ్ళారు. 1942 లో సబ్ జైలులో వారంరోజులుంచి వదలి పెట్టారు. ఆరునెలలు రహస్యంగా వుండి పనిచేశారు.

## గోవిందలూరు సూర్యప్రకాశరావు

తండ్రి శివానందం. బందరు వాస్తవ్యులు. విద్యార్థిగా ఉన్నప్పుడే ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 10-6-30 న 10 నెలల కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచినాపల్లి జైళ్ళలో శిక్షను అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నారు. 17-1-32 న లాఠీఛార్జికి గురయ్యారు. 18-3-32 న బందరులో అరెస్టుచేసి విజయవాడ తీసుకువెళ్ళి అక్కడ వదలి వేశారు.

## చిట్టావఝ్ఝుల రామకృష్ణయ్య

బందరు నివాసి. 1921-22 సహాయ నిరాకరణోద్యమ కాలంలో నోబుల్ కాలేజీలో విద్యనభ్యసిస్తూ, చదువుకు స్వస్తి చెప్పారు.

## చిల్లర మోహనరావు



నివాసం మల్లవోలు. ఉప్పు సత్యాగ్రహం, 1942 ఆగస్టు ఉద్యమాల్లో పాల్గొని లాఠీ దెబ్బలు తిన్నారు. టెలిఫోన్‌తీగెల తెంచివేతకు గాను సాముదాయక జరిమానాకు గురైన తమ గ్రామంలో 8 మాసాలు రహస్యంగా పనిచేశారు.

## తల్లాప్రగడ రామారావు

తండ్రి భద్రిరాజు, జన్మస్థలం బందరు. ఇన్సూరెన్సు వ్యాపారం. శాసనోల్లంఘనంలో పాల్గొని, 15-3-1930 నుంచి సంవత్సరం ఆరువారాల కఠిన శిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు.

## తటవర్తి పెరి ఆళ్వార్ గుప్తా

(టి. పి. ఆళ్వార్ గుప్తా)

తండ్రి జగన్నాధం. జన్మస్థలం బందరు. ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ ఉద్యోగి. ఉప్పు సత్యా

గ్రహంలో 13-5-1930న పాల్గొని, తీవ్రమైన లాఠీ ఛార్జీకి గురయ్యారు. బందరు సబ్ మేజిస్ట్రేట్ 9 నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, వెల్లూరు, మదురై, అలీపురం, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 4-4-1932 న ఆరు నెలలు కఠిన శిక్ష' రు. 200/- జరిమానా విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 20-8-1942న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. బళ్ళారి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. 8-7-1943 న విడుదలయ్యారు. కీర్తిశేషులైరి.

## తత్వానందస్వామి

(కొండిపర్తి వీరభద్రాచారి)

బందరు వాస్తవ్యులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 13-5-30 న 9 నెలల కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో నిర్భంధింపబడ్డారు. 8 1-31 న విడుదలయ్యారు.

## తుర్లపాటి గోపాలరావు

తండ్రి వాసుదేవమూర్తి. జన్మస్థలం బందరు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని 26-6-1930 నుంచి ఆరు నెలల కఠినశిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు.

## తూములూరి వెంకటప్పయ్య

తండ్రి శివయ్య. బందరు వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19-6-30 న సంవత్సరం కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచినాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష ననుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 14-3 31 న విడుదలయ్యారు.

## దామరాజు పట్టాభిరామారావు

తండ్రి సౌభాగ్యరాయుడు జన్మస్థలం బందరు. తన ప్రభుత్వోద్యోగానికి రాజీనామా చేశారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 12-6-1930 న ఆరు నెలల కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. తిరిగి వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 4-2-1941 న మూడునెలల కఠినశిక్ష, రు 200/- జరిమానా విధించారు. వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు.

## దిరిసవల్లి వెంకటచలపతిరావు

తండ్రి నర్సయ్య బందరు తాలూకా వడ్లమన్నాడు వాస్తవ్యులు. ఉప్పుసత్యాగ్రహఉద్యమంలో సంబంధం ఉన్నందుకు 14-6-30 న ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్షను అనుభవించారు 11-3-31 న గాంధీ - ఇర్విన్ ఒడంబడిక ననుసరించి విడుదలయ్యారు.

## విడుమోలు పార్ధసారథి



తండ్రి తారకరామయ్య 24-7-1909 న వడ్లమన్నాడులో జననం. కరణం. 1929లో అల్లూరి సీతారామరాజు సజీవులని భావించి ఆయనకోసం రంప చోడవరంలో మూడు మాసాలు కొందరు మిత్రులతో కలిసి తిరిగారు. బందరులో కాంగ్రెస్ జెండా ప్రతిష్ఠాపన సమయంలో దెబ్బలు తిన్నారు. కల్లు సారా దుకాణాలను పికెటింగ్ చేశారు 1942 లో కాంగ్రెస్ బులెటెన్స్‌ను రహస్యంగా పంచిపెట్టారు.

## నిభానుపూడి సత్యనారాయణమూర్తి

కృష్ణాజిలా వాస్తవ్యులు. 8 2-30 న బందరుకు మద్రాసు గవర్నర్ వచ్చినపుడు నల్లజెండాలు చూపినందుకు అరెస్టు చేసి, వదలివేశారు.

## నూకల కృష్ణమూర్తి



తండ్రి వెంకట సుబ్బయ్య. జన్మ స్థలం బందరు తాలూకా చిలకలపూడి. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనగా, 1944 ఏప్రిల్ ఆఖరువారంలో అరెస్టు చేసి, డి.ఐ.ఆర్ క్రింద రెండు వారాల శిక్ష రు. 100/- జరిమానా విధించారు. 29-4-1944 నుంచి 20-5-1944 వరకు బందరు సబ్ జైలులో శిక్ష అనుభవించారు.

## పంచపర్వాల కాంతయ్య

తండ్రి సుబ్బారాయుడు, బందరు తాలూకా అయిదు గుళ్ళపల్లిలో జననం. 1932. 1942 ఉద్యమాలలో లాఠీ దెబ్బలు తిన్నారు.

## పినపాల నాగభూషణం

తండ్రి సుదర్శనం. జన్మస్థలం బందరు. 1921 సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. ఒక వారం జైలుశిక్ష, రు. 15 జరిమానా విధించారు. ఆయన కుట్టు మిషన్ వేలంవేసి జరిమానా వసూలు చేసు కొన్నారు. తిరిగి ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 25-6-1931 నుంచి ఆరు నెలల కఠినశిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. ఖాదీ ప్రచారం పట్ల అమిత శ్రద్ధ వహించాడు.

## పెయ్యేటి గోపాలకృష్ణమూర్తి

(ఉరఫ్ ఆనందరావు)



తండ్రి లక్ష్మీనారాయణ. 15-8-'11న బందరులో జననం. నివాసంగురజ. ఎం. ఏ బి. టి. బ్రిటిష్ ప్రభుత్వాన్ని గుర్తించ వద్దనీ, ధిక్కరించవల సిందని కరపత్రాలు పంచినందుకు గుంత కల్లులో 1932-33లో అరెస్టయ్యారు. బళ్ళారిలో ఆరు నెలల శిక్ష అనుభవించారు. విద్యాట అంత రాయం కలిగింది. వారణాసిలో బి. ఏ. చదువు విర మించి సత్యాగ్రహ ఉద్యమంలో చేరారు.

## పొట్లూరి వెంకటకృష్ణయ్య

తండ్రి పిచ్చయ్య. బందరు వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 14-6-30న సంవత్సరం కఠినశిక్ష విధింపబడింది. రాజమండ్రి, తిరుచినాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించి నారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడికననుసరించి 14-3-31న విడుదలయ్యారు.

## పోచిరాజు పట్టాభి సీతారామమూర్తి

తండ్రి అప్పారావు బందరు నివాసి. సహాయ నిరాకరణంలో పాల్గొని, 10-2-1922 నుంచి నాలుగు మాసాల కఠినశిక్షను రాజమండ్రి జైలులో అనుభవిం చారు.

## పోచిరాజు కృష్ణారావు

తండ్రి అప్పారావు. జన్మస్థలం బందరు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 12-6-1930 న సంవత్సరం కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 1-3-1931 న విడుదలయ్యారు. 21-2-1932 న బందరులో విదేశీ వస్త్రాలయాల ముందు పికెటింగ్ చేసి, లాఠీఛార్జీకి గురయ్యారు. 21-3-1932 న అరెస్టుచేసి, ఎనిమిది నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభ వించారు. విదేశీ వస్త్రాల బహిష్కరణను ప్రచారం చేస్తానని జిల్లాకలెక్టర్‌కు నోటీసుయిచ్చి 30-8-1933న అరెస్టు అయ్యారు. బందరులో విదేశీ వస్త్రాలయాల ముందు పికెటింగ్ చేసి, 10-10-1933న అరెస్టు అయ్యారు. పదిహేను రోజులు లాకప్‌లో వున్నారు. తిరిగి ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 21.4 1941 నుంచి మద్రాసు, అలీపురం జైళ్ళలో 6 నెలలు కఠినశిక్ష అనుభవించారు.

## పోరంకి శాస్త్రి

బందరు వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొనగా 21-2-31 న అరెస్టు చేసి లాఠీ చార్జీ చేశారు పోలీసు స్టేషన్‌లో ఉంచి మరునాడు వదలి వేశారు.

## పోలిశెట్టి విశ్వేశ్వరరావు

బందరు తాలూకా నివాసి. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని 3-4-1941 న అరెస్టు అయ్యారు. బందరు సబ్ డివిజనల్ మేజిస్ట్రేట్ కోర్టు లేచేవరకు శిక్ష, రు. 500/ జరిమానా విధించారు.

## భాస్కర్ల గోపాలకృష్ణమూర్తి

తండ్రి సుబ్బయ్య. జననం 9-12-1897. పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపురం. నివాసం బందరు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. సంవత్సరం విడి ఖైదు విధించారు. 30-5-1930 నుండి రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931 న విడుదలయ్యారు తిరిగి 1932 శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు 2-5-1932న ఆరు నెలల కఠినశిక్ష. రు. 200/- జరిమానా విధించారు. రాజమండ్రి, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. అంటరానితనం నిర్మూలనకు కృషి చేశారు. 1926లో నర్సాపురం తాలూకా కాంగ్రెసు కమిటీ కార్యదర్శి

## బొప్పన మాణిక్యాంబ

బందరు నివాసి. 1920 నుంచి కాంగ్రెస్ కార్యకర్త. నిర్మాణ కార్యక్రమంలో ప్రముఖపాత్ర వహించారు. తిలక్ స్వరాజ్య నిధికి విరాళాలు వసూలు చేశారు. గాంధీజీ రూపొందించిన అయిదు బహిష్కరణలను సమర్థవంతంగా అమలు జరిపారు.

## బేతంభొట్ల రామమూర్తి

తండ్రి లక్ష్మీనారాయణ. జన్మస్థలం బందరు. విద్యార్థి దశలోనే ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. పది నెలల కఠినశిక్ష విధించారు రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘనంలో 18-3-1930 న బందరులో దుకాణాలముందు పికెటింగ్ చేసి, అరెస్టు అయ్యారు.

## మర్రి వెంకటేశ్వరరెడ్డి



తండ్రి లక్ష్మిరెడ్డి. జననం 1923 బందరు తాలూకా గోకవరం శివారు రెడ్డి పాలెం. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. లాఠీ ఛార్జికి గురయ్యారు. కొన్ని రోజులు బందరు కోట సబ్ జెయిలులో నిర్బంధించబడ్డారు. విడుదల అనంతరం రహస్య కార్యకలాపాలు కొనసాగించడంతో పోలీసులు వారంటు జారీ చేశారు. దానితో 1944 లో విజయవాడ వార్ ఫ్రంట్ సెక్యూరిటీ ఇన్‌స్పెక్టరుగా చేరారు. గన్నవరంలో పనిచేస్తుండగా 1945లో పోలీసు రిపోర్టు ఆధారంగా ఆ ఉద్యోగంలోంచి జిల్లా కలెక్టరు బర్తరఫ్ చేశారు.

## మల్లావజ్ఝల సుబ్బారావు

తండ్రి లక్ష్మినరసయ్య. బందరు వాస్తవ్యులు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నందుకు ఆరు నెలలు కఠినశిక్ష విధించబడింది

## మునిపల్లె రామారావు

తండ్రి లింగయ్య. జన్మస్థలం గుంటూరుజిల్లా బాపట్ల తాలూకా మునిపల్లె. కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో చదివారు. రాజకీయంలో ప్రవేశించారు. బందరులో విద్యార్థి, ప్రెస్ కార్మిక సంఘాలను నిర్మించారు. కమ్యూనిస్టు ఉద్యమాన్ని నిర్మించారు. కొత్తపట్నం రాజకీయ పాఠశాల సందర్భంలో 144 వ సెక్షన్ ధిక్కరించి, 17-6-1937 నుంచి 1-8-1937 వరకు రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

అనంతరం తెలంగాణాలో నిజాం పరిపాలనకు వ్యతిరేకంగా కృషిచేశారు. కీర్తిశేషులు

## ముళ్ళపూడి నాగేశ్వరరావు

తండ్రి సుబ్బారాయుడు. 1902 లో బందరులో జననం. కరణం. సహాయనిరాకరణోద్యమంలో 19.1.32 నుండి ఒక సంవత్సరం రాజమండ్రి జైలులో కఠినశిక్ష అనుభవించారు. స్వాతంత్ర్య ఉద్యమాలలో పాల్గొన్నందున కరణీకం పోయింది. సహకార ఉద్యమాభివృద్ధికి కృషి చేశారు. 1957 లో కీర్తిశేషులైరి.

## మేడూరి వెంకట చలపతిరావు

బందరు వాస్తవ్యులు. 1930 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది.

## మోటమర్రి సత్యనారాయణమూర్తి

తండ్రి రాంబొట్లు. బందరు వాస్తవ్యులు. వర్తకులు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నందుకు 21-6-30 నుండి ఆరు నెలల కఠినశిక్షను రాజమండ్రి, అలీపురం క్యాంప్ జైళ్ళలో అనుభవించారు.

## మోగంటి కొండయ్య

తండ్రి కనకయ్య. జననం 7-6-1915 బందరు తాలూకా చిన్నాపురం. క్విట్ ఇండియా ఉద్యమంలో అక్టోబరు 3 న బందరు కోర్టు ముందు పికెటింగ్ చేసి, లాఠీ ఛార్జికి గురయ్యారు ఒక రోజు సబ్ జైలులో వుంచి, విడుదల చేశారు.

## మైనేపల్లి వెంకటేశ్వరరావు

తండ్రి నారాయణరావు జన్మస్థలం బందరు. రైతు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 25-6-1930 నుంచి ఆరునెలల కఠినశిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## రెండుచింతల సూర్యనారాయణ



తండ్రి సుబ్బయ్య. 5-7-1907లో బందరు తాలూకా చిన్నాపురంలో జననం. చిన్నాపురం నివాసి పురోహితుడు. ఉప్పు సత్యాగ్రహంలోను, క్విట్ ఇండియా ఉద్యమంలోను లాఠీ దెబ్బలకు గురయ్యారు.

## రామదాస్ నాయుడు

బందరు నివాసి. బ్రహ్మసమాజవాది. 1907 లో బిపిన్ చంద్రపాల్‌కు బందరులో ఆతిథ్యమిచ్చారు. జాతీయ కళాశాల స్థాపనలో ప్రముఖ పాత్ర వహించారు స్వదేశీ పారిశ్రామిక ప్రావిడెంట్ ఫండు స్థాపకులు.

## లక్కరాజు శ్యామసుందరరావు

తండ్రి బాల నాగేశ్వరరావు. బందరు వాస్తవ్యులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 10-6-30 నుండి ఆరు నెలలు కఠిన శిక్షను, రాజమండ్రి, తిరుచినాపల్లి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## వల్లూరి రామారావు

తండ్రి లక్ష్మీనరసింహంపంతులు. జన్మస్థలం బందరు. జర్నలిస్టు. 1930లో అప్పటి మద్రాసుగవర్నరు బందరు రాక సందర్భంలో నల్లజెండాల ప్రదర్శనలో పాల్గొని, 15-3 1930 నుంచి సంవత్సరం నాలుగు నెలల కఠినశిక్షను, రాజమండ్రి, మద్రాసు, సేలం జైళ్ళలో అనుభవించారు.

## వంకా సూరిశాస్త్రి

తండ్రి నరసింహం. బందరులో 1897 నవంబర్ 26 న జననం. బందరు నేషనల్ కాలేజీలో చదువు

కొన్నారు. బొంబాయి ప్రయివేటు కంపెనీలోని ఉద్యోగానికి రాజీనామానిచ్చి 1921 సహాయ నిరాకరణోద్యమంలో పూర్తిగా పాల్గొన్నారు. తను ధరించే విదేశీ వస్త్రాములన్నిటినీ తగులబెట్టినారు. బొంబాయిలో వలంటీరుగా పనిచేశారు. శాసనోల్లంఘ నోద్యమ విచారణ కమిటీ వచ్చినపుడు 1923లో గుంటూరు సబ్ జైలులో నిర్బంధించబడ్డారు సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనేందుకుగాను, అనేక వలంటీరు దళాలను సమకూర్చారు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో 10-5-30న ఒక సంవత్సరం శిక్ష విధించబడింది. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష ననుభవించారు. గాంధీ-ఇర్విన్ సంధి ననుసరించి 14-3-31 న విడుదలయ్యారు

శాసనోల్లంఘనోద్యమంలో 8-1-1932 న 8 నెలల శిక్ష విధించబడింది. రాజమండ్రి, కడలూరు జైళ్ళలో శిక్షను అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమకాలంలో అండర్ గ్రౌండ్‌లో వున్నారు."విప్లవ జ్యోతి" అనే రహస్య వారపత్రిక ద్వారా తీవ్ర అభిప్రాయాలను ప్రచారం చేశారు. గుంటూరు విప్లవ విద్యార్థుల కమిటీని ఏర్పరచారు.

## వెచ్చా లక్ష్మీనరసింహం

తండ్రి లక్ష్మీ కోటయ్య. జన్మస్థలం బందరు. వ్యాపారి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 10-6-1930 నుంచి రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో పది మాసాల కఠినశిక్ష అనుభవించారు.

## వేమూరి రాంజీరావు

జననం 1891. బందరు. మెట్రిక్యులేట్. దళిత జనోద్ధరణకు కృషిచేశారు. బందరులో హరిజనుల కోసం హైస్కూలు స్థాపించి, హాస్టల్ ఏర్పాటు చేశారు. మద్రాసు ప్రభుత్వం యిచ్చిన 'రావు సాహెబ్' బిరుదును, మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ నామినేటెడ్ సభ్యత్వాన్ని 1930లో మహాత్మాగాంధీ అరెస్టుకు నిరసనగా త్యజించారు. 'దీనబంధు' వారపత్రిక స్థాపక - సంపాదకులు. 17-12 1963లో కీర్తిశేషులైరి.

## వేమవరపు రామదాసు పంతులు

జననం 1873 అక్టోబరు. బందరు. బి.ఏ బి.ఎల్. న్యాయవాది. జాతీయవాది. 1907-1908 'కృష్ణా పత్రిక' సంపాదకులు. బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా ప్రచారం చేశారు. 1922 లో ఏర్పడిన ఆంధ్ర స్వరాజ్యపార్టీ రాష్ట్రకమిటీ అధ్యక్షులు. సహకార ఉద్యమానికి మూలపురుషులు, 1934 లో లండన్‌లో జరిగిన 14వ అంతర్జాతీయ సహకార కాంగ్రెస్‌కు ప్రతినిధిగా హాజరయ్యారు. సంఘ సంస్కర్త. అంటరానితనం నిర్మూలనకొరకు, మహిళల విద్యకొరకు కృషిచేశారు. 1912 లో నిడదవోలులో జరిగిన కృష్ణా, గుంటూరు జిల్లాల కాంగ్రెస్ మహాసభకు, 1915 లో మదనపల్లెలో జరిగిన డివిజనల్ కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షత వహించారు. 1925, 1929 లలో మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ఎన్నికయ్యారు. కాంగ్రెస్ ఆదేశానుసారం 1930లో లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యత్వానికి రాజీనామా చేశారు. అనేక సంవత్సరాలు ఎ.ఐ.సి.సి. సభ్యులు 1944లో కీర్తిశేషులయ్యారు.

## వై. అనంతరావు

తండ్రి నారాయణ. జన్మస్థలం బందరు. విద్యార్థి దశలో శాసనోల్లంఘనంలో పాల్గొని, 7-5-1932 నుంచి ఆరు మాసాల కఠిన శిక్షను బళ్ళారి జైలులో అనుభవించారు

## శివపురపు సుబ్బారావు



తండ్రి విశ్వనాథం. బందరు తాలూకా పెడనలో జననం. ప్రస్తుత నివాసం సికింద్రాబాద్. విదేశ వస్త్ర బహిష్కరణ, క్విట్ ఇండియా ఉద్యమాల్లో లాఠీ ఛార్జీకి గురిఅయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 18 రోజులు బందరు సబ్ జైలులో నిర్బంధింపబడ్డారు.

## సాయం వరదదాసు

తండ్రి సుబ్బయ్య. బందరు వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమ కాలంలో బందరులో రాబర్ట్‌సన్ చౌకలో పోలీసుల వలయం ఉండగానే కాంగ్రెస్ జెండా ప్రతిష్ఠాపించినప్పుడు తీవ్రంగా లాఠీ ఛార్జికి గురిఅయ్యారు. 28-6-30 నుండి ఆరునెలల కఠిన శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్లల్లో అనుభవించారు. స్వాతంత్ర్య సంగ్రామ కాలంలో పాడుకొనేందుకుగాను జాతీయ గీతాలను వ్రాశారు. ఈ గీతాలను ఉద్యమ కాలంలో వలంటీర్లు పాడేవారు.

## సుసర్ల వాగేశ్వరశాస్త్రి

తండ్రి దక్షిణామూర్తి శాస్త్రి. జన్మస్థలం బందరు. ఈనాందారు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, 25-6-1930 నుంచి ఆరునెలలు కఠినశిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు.

## సిద్దాబత్తుని గోపాలం



తల్లి లక్ష్మిదేవి. గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా పెదపులివర్రులో 1900 ప్రాంతంలో జననం. ప్రస్తుత నివాసం బందరు. 1932 లో కల్లు, సారాయి దుకాణాల పికెటింగ్ సందర్భంలో ఆరు నెలల కఠిన శిక్షననుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 12 నెలల కఠిన శిక్ష రు 100 జరిమానా విధించబడింది. జరిమానా చెల్లించనందున మరో నెల శిక్ష అనుభవించారు.

# బందరు తాలూకా వివిధ గ్రామాలు

## కందికొండ వెంకటసుబ్రహ్మణ్యం

తండ్రి వెంకట నర్సయ్య. బందరు తాలూకా ముక్కొల్లు వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు ఆరునెలల కఠినశిక్ష విధించబడింది. 14-8-30 నుండి రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్షను అనుభవించారు.

## కొండపల్లి పాండురంగారావు



తండ్రి లక్ష్మి పెరుమాళ్ళు. జననం 16-7-1925. బందరు తాలూకా చిలకలపూడి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని లాఠీ దెబ్బలకు గురయ్యారు.

## కొమరవోలు రామచంద్రరావు



తండ్రి కనకయ్య. బందరు తాలూకా. కొంగంచెర్ల గ్రామంలో 25-10-1906 న జన్మించారు. గుర్విందగుంట వాస్తవ్యులు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా 1930 జూలైలో ఏలూరులో 6 నెలలు కఠినశిక్ష విధించబడి రాజమండ్రి సెంట్రల్ జైలులో జూలై 9 నుంచి శిక్ష అనుభవించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా వీరి మున్సబు పదవిని రద్దుచేసి, వారసులకు కూడా యివ్వలేదు.

## గవర ఆనందరావు

బందరు తాలూకా, బాదంపూడి నివాసి. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో లాఠీచార్జికి గురయ్యారు.

## కృత్తివెంటి వెంకటేశ్వరరావు



తండ్రి వెంకట కృష్ణయ్య. బందరు తాలూకా పెదగొల్ల పాలెం. చిన్నతనంలోనే ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 12-6-1930న రెండేళ్ళు కఠిన శిక్ష విధించారు. తంజావూరు బోర్‌స్టల్ స్కూలులోను, రాజమండ్రి జైలులోను శిక్ష అనుభవించారు. తంజావూరు జైలులో నిరాహారదీక్ష వహించారు. అప్పుడు తంజావూరు బోర్‌స్టల్ స్కూలుకు మైనర్లను పంపుట న్యాయవిరుద్ధమని నెల్లూరు న్యాయవాదులు కోర్టులో పిటీషను దాఖలు చేశారు. తంజావూరు జైలులో నిర్బంధించుట చట్టవిరుద్ధమని హైకోర్టుతీర్పునిచ్చింది. అప్పటికే తంజావూరు నుండి తిరుచునాపల్లికి మార్చబడిన వీరిని రాజమండ్రి జైలుకు పంపారు. 25-2-1931 న విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని, సంవత్సరం కఠినశిక్షను రాజమండ్రి, బళ్లారి జైళ్ళలో అనుభవించారు. అనంతరం కమ్యూనిస్టుపార్టీలో చేరారు. 3-10-1940 న అరెస్టు అయ్యారు. 4-10-1940 నుంచి 25-6-1942 వరకు డి. ఐ. ఆర్. క్రింద వెల్లూరు జైలులో డిటెన్యూగా వున్నారు.

## చెరువు సుబ్బారావు



తండ్రి శేషావధానులు 1905 మే 30 న నడుపూరు అగ్రహారంలో జననం. నివాసం విజయవాడ. ఉపాధ్యాయులు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. బందరు రాబర్ట్‌సన్ స్క్వేర్‌లోని స్తంభంపై జరగు ప్రతిష్ఠాపన సమయంలో నిచ్చెనపై వుండి పోలీసులను రాకుండా నిరోధించగా లాఠీచార్జీకి గురయ్యారు. పోలీసులు బట్టలూడ దీశారు ఆరు నెలల కఠిన శిక్షను విధించారు. రాజమండ్రిలో 1-8-30 నుండి 18 రోజులున్నారు. జైలు సూపరెండెంట్ వచ్చినప్పుడు లేచి నమస్కరించనందుకు అలీపురం క్యాంప్ జైలుకు బదిలీ చేశారు. మిగతా శిక్షను అక్కడ అనుభవించారు.

## చలమశెట్టి నాగయ్య

తండ్రి శాస్తుర్లు. 26-6-1906లో బందరు తాలూకా పోలవరంలో జననం. 1930, 1942 సంవత్సరాలలో లాఠీచార్జీకి గురిఅయ్యారు. 21 రోజులు పోలీసు కస్టడీలో ఉన్నారు.

## చెరువు వెంకటాచలం

(ఉరఫ్ కృష్ణమూర్తి)



తండ్రి శేషావధానులు. బందరు తాలూకా నడుపూర్ అగ్రహారంలో 30-6-1911నజననం ప్రస్తుత నివాసం గుంటూరు జిల్లా తెనాలితాలూకా బుర్రిపాలెం. ఉప్పు సత్యాగ్రహంలో సంవత్సరం కఠిన శిక్షను అనుభవించారు. బందరు కోనేటిసెంటరులో జెండా ప్రతిష్ఠాపన సందర్భంలో లాఠీ దెబ్బలకు గురి అయ్యారు.

## జొన్నలగడ్డ సూర్యనారాయణ

బందరు తాలూకా పుల్లపాడు వాస్తవ్యులు. 1920-21 సహాయ నిరాకరణ ఉద్యమంలో గ్రామకరణం పదవికి రాజీనామా చేశారు.

## టి. వి. రాఘవాచారి

తండ్రి రంగాచారి. జన్మస్థలం బందరు తాలూకా చిట్టిగూడూరు. శాసనోల్లంఘనంలో పాల్గొని, 11-5-1932 నుంచి ఏడున్నర నెలల కఠినశిక్ష మద్రాసు, బళ్లారి జైళ్ళలో అనుభవించారు.

## తోట పెరుమాళ్ళు



తండ్రి ఆదినారాయణ. బందరు తాలూకా తవిసెపూడిలో జననం. చిన్నాపురంలో వ్యష్టి సత్యాగ్రహంలో శిక్షవిధించబడి వెల్లూరు జైలులో 24-1-41 నుండి 5 నెలల శిక్షను అనుభవించారు.

## దూడగడప వెంకట నరసింహారావు

తండ్రి నరసింహారావు. బందరు తాలూకా గూడూరులో 1909 జూన్ 22న జన్మించారు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 19-6-30న ఒక సంవత్సరం కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి వెల్లూరు జైళ్ళలో శిక్ష ననుభవించారు. 12-3-31న గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ననుసరించి విడుదలయ్యారు

## దేవరకొండ శాస్తుర్లు



తండ్రి వెంకటసుబ్రహ్మణ్యం. 1-2-1905న బందరు తాలూకా ముక్కొల్లులో జననం. ప్రస్తుత నివాసం విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో కఠిన శిక్ష విధించబడింది. 28-8-30 నుండి 15-10-30 వరకు శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. విదేశ వస్త్రబహిష్కరణ, కల్లుదుకాణాల పికెటింగ్‌లలో పాల్గొన్నారు.

## పి. వి. సుబ్బారావు

బందరు తాలూకా చిన్నాపురంవాస్తవ్యులు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. లోకల్ ఫండ్ డిపార్ట్‌మెంట్ ఉద్యోగం నుంచి డిస్మిస్ చేయబడ్డారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక తర్వాత తిరిగి ఉద్యోగంలోకి చేర్చుకున్నారు.

## నందం లక్ష్మీ పెరుమాళ్ళు



తండ్రి వెంకట కృష్ణయ్య. 1919 లో బందరుతాలూకా పెడనలో జన్మించారు. 1940-41 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని లాఠీ ఛార్జికి గురయ్యారు. 1942 లో పోలీసులకు దొరకకుండా 18 నెలలు రహస్యంగా వుంటూ, క్విట్ ఇండియా ఉద్యమం కొనసాగించారు. అనంతరం వీరిని అరెస్టు చేసి తీవ్రమైన లాఠీ చార్జికి గురిచేశారు. ఆ లాఠీ చార్జీలో వీరి ముంజెయ్యి విరిగి పోయింది. 1945లో కృష్ణాజిల్లా యువజన కాంగ్రెసుకు కార్యదర్శి. 1946 నుండి 1952 వరకూ తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులుగా వున్నారు. తామ్ర పత్ర గ్రహీత.

## పాలూరి పుష్పేశ్వరరావు

తండ్రి రామశాస్త్రి. జన్మస్థలం బందరు తాలూకా ముంజులూరు. భారత లక్ష్మీబ్యాంకి మేనేజరు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 22-2-1941 నుంచి మూడునెలల కఠినశిక్ష రాజమండ్రి జైలులో అనుభవించారు.

## పులి సుబ్బారాయుడు

తండ్రి మల్లయ్య. నివాసం బందరు తాలూకా పోలవరం. ఉప్పుసత్యాగ్రహ ఉద్యమంలో లాఠీచార్జీకి గురయ్యారు. అబ్కారీ, విదేశీవస్త్ర దుకాణాల పికెటింగ్ సందర్భంలో లాఠీచార్జికి గురయ్యారు. పోలీసుకష్టడీలో బాధలకు గురయ్యారు. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. రహస్యంగా ఆరునెలలు యుద్ధ వ్యతిరేక ప్రచారం చేశారు 1942లో అరెస్టుచేసి. లాఠీ చార్జీ చేసి ఆరు నెలలు నిర్బంధంలో వుంచారు.

## ఎమ్. కనకదుర్గయ్య

స్వగ్రామం బందరు తాలూకా కైకలూరు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని లాఠీఛార్జీకి గురయ్యారు.

## ఎమ్. విశ్వేశ్వరశాస్త్రి

జన్మస్థలం బందరు తాలూకా మల్లేశ్వరం. 1907లో వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్న కారణంగా రాజమండ్రి ఆర్ట్సు కాలేజీ నుంచి బహిష్కృతు లయ్యారు.

## ఎమ్. రామారావు

తండ్రి వెంకటసూర్యప్రకాశరావు. స్వస్థలం రామచంద్రపురం.క వి. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 20-1-1941 న మూడునెలల కఠినశిక్ష, రు. 200/- జరిమానా విధించారు. వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు.

## మర్రి వేద్రాది

బందరు తాలూకా వర్రెగూడెం వాస్తవ్యులు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు.

## మొక్కపాటి రామయ్య



జన్మస్థలం బందరు తాలూకా చోడవరం. 1940-41 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. నూజివీడు సబ్ డివిజనల్ మేజిస్ట్రేట్ డి. ఐ. ఆర్ క్రింద 25 రోజులు జైలుశిక్ష, రూపాయి జరిమానా విధించారు.

## వారణాసి దుర్గాప్రసాదశాస్త్రి

తండ్రి కృష్ణమూర్తి. జన్మస్థలం బందరుతాలూకా చేవేంద్ర. నిజాం ప్రభుత్వం నిషేధించిన 'ప్రజాశక్తి' పత్రిక ప్రతిని కల్గివున్నందుకు, 1947-48 మధ్య కాలంలో వెనుకటి హైదరాబాద్ సంస్థానంలో అరెస్టు అయ్యారు. డి. హెచ్. ఆర్. క్రింద ఒక వారం జైలు శిక్ష విధించారు.

## వూచా వాంచారయ్య



తండ్రి వెంకటచలపతి. రైతు. బందరు తాలూకా ముక్కొల్లు నివాసి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 31-7-'30 నుండి రాజమండ్రి, అలీపురం క్యాంప్ జైళ్ళల్లో ఆరు నెలల కఠిన శిక్షను అనుభవించారు.

## శ్రీకాకుళపు రాఘవయ్య



తండ్రి సాహెబ్. 1916 ప్రాంతంలో బల్లిపర్రులో జననం. స్వస్థలం పెడన. సత్యాగ్రహంలో వ్యష్టి 1940 జనవరి 31 న నాల్గు మాసాల కఠిన శిక్ష విధించబడింది. జరిమానా చెల్లించనందున మరొక నెల శిక్ష. వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 15-8-42 న అరెస్టయి. అక్టోబర్ 7 న మూడుమాసాల కఠిన శిక్షకు గురి అయ్యారు. అలీపూర్ కాంప్ జైలులో శిక్షను అనుభవించారు. భారత సేవక్ సమాజ్‌లో పనిచేశారు.

## సమ్మెట రాధాకృష్ణయ్య

తండ్రి పట్టాభిరామయ్య. జన్మస్థలం బందరు తాలూకా ముక్కొల్లు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19-6-1930వ సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్లలో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931న విడుదలయ్యారు.

### పమ్మెంట అక్కయ్య నాయుడు



తండ్రి పట్టాభిరామయ్య 21-8-1899లో బందరు తాలూకా ముక్కొల్లులో జననం. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో ఆరు నెలల కఠినశిక్ష విధించ బడింది. 2-7-1930 నుండి రాజమండ్రి, అలీపురం క్యాంప్ జైళ్ళలో శిక్షను అనుభవించారు. 1921 నుండి కాంగ్రెస్‌వాది. జిల్లా కాంగ్రెస్ కార్య దర్శిగా పనిచేశారు.

### పమ్మెంట సత్యనారాయణ

తండ్రి పట్టాభిరామయ్య. జన్మస్థలం బందరు తాలూకా ముక్కొల్లు. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 4-2-1931 న 6 నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, అలీపురం జైళ్లలో శిక్షను అనుభవించారు.

### పమ్మెంట వెంకటరామయ్య

తండ్రి రామస్వామి. బందరుతాలూకా ముక్కొల్లు వాస్తవ్యులు. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 31-7-30 నుండి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి సెంట్రల్ జైల్లో అనుభవించారు.

### పమ్మెంట వెంకటరత్నం



తండ్రి రామస్వామి. బందరు తాలూకా ముక్కొల్లులో జన్మించారు. రైతు. ఉప్పు సత్యాగ్రహం లో ఆరునెలల శిక్ష విధింపబడి 14-8-30 నుండి రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్షను అనుభవించారు. రైలు పట్టాలు పీకివేత సందర్భంగా క్విట్ ఇండియా ఉద్యమంలో బందరులో అరెస్టుచేసి వదిలివేశారు.

## దివితాలూకా వివిధ గ్రామాలు

### అచ్యుతం వెంకట హనుమంతరావు

తండ్రి బాపయ్య. దివితాలూకా చినకళ్ళేపల్లి వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 17-6-30 న ఒక సంవత్సరం కఠినశిక్ష విధించ బడింది. రాజమండ్రి, తిరుచినాపల్లి, అలీపురం జైళ్ళలో నిర్బంధింపబడ్డారు. 14-3-31 న గాంధీ ఇర్విన్ ఒడంబడిక ననుసరించి విడుదలయ్యారు.

### అట్లూరి శ్రీరాములు

తండ్రి రామకృష్ణయ్య. జన్మస్థలం దివితాలూకా సూరపనేనివారి పాలెం. 1921 నుండి జాతీయవాది. జాతీయోద్యమంలో మొత్తం అయిదుసార్లు లాఠీ ఛార్జీలకు గురయ్యారు. 1932 మే నెలలో 7, 8, 9 తేదీలలో వరసగా బందరులో పికెటింగ్‌లో పాల్గొని, లాఠీదెబ్బలు తిన్నారు. 14 వ తేదీన దివితాలూకా శ్రీకాకుళంలో కల్లు పాకలముందు పికెటింగ్ చేస్తుండగా పోలీసులు స్పృహ తప్పేవరకు లాఠీలతో కొట్టారు. 10-8-1932 న విజయవాడ ఆంధ్రరత్న భవనాన్ని పోలీసు ఆక్రమణనుంచి విడిపించడానికి ప్రయత్నించి అరెస్టు అయ్యారు. సంవత్సరం కఠిన శిక్ష, 25 రూ. జరిమానా విధించారు. ఖాదీ ఉద్యమంలో పాల్గొన్నారు. 13-6-33 న రాజమండ్రి జైలు నుండి విడుదలయ్యారు.

### అన్నిశెట్టి గోపయ్య

తండ్రి వీరయ్య. జన్మస్థలం దివి తాలూకా మొవ్వ. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, రాజమండ్రి, తిరుచినాపల్లి జైళ్లలో తొమ్మిదిన్నర మాసాలు కఠిన శిక్ష అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 24-2-1931 న ఆరు నెలలు

కఠిన శిక్ష, రు. 50లు జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవిస్తూ, గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో విడుదలయ్యారు.

## అకురాతి వీరరాఘవులు

జన్మస్థలం దివితాలూకా కోసూరు. చేనేత కార్మికుడు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 27-5-1930 నుంచి 9 నెలలు కఠిన శిక్షను రాజమండ్రి, కోయంబత్తూరు, అలీపురం జైళ్లలో అనుభవించారు.

## ఐనంపూడి సోమసుందరరావు

తండ్రి మల్లయ్య. దివి తాలూకా పెదప్రోలు వాస్తవ్యులు. ఉపాధ్యాయులు. శాసనోల్లంఘన ఉద్యమంలో 10-8-32 న ఒక సంవత్సరం శిక్ష, రు. 100 జరిమానా చెల్లించనిచో మరో 6 నెలల శిక్ష విధింపబడింది. రాజమండ్రి, కోరాపుట్టి, బళ్లారి జైళ్ళలో శిక్ష ననుభవించి 4-9-33 న విడుదల చేయబడ్డారు.

## కంఠనేని అచ్యుతరామయ్య

జన్మస్థలం దివితాలూకా నాగాయితిప్ప. 20-1-1932న దివితాలూకా నాగాయతిప్పలో జరిగిన కాంగ్రెస్ కార్యకర్తల సమావేశంలో పాల్గొని, తీవ్రమైన లాఠీ చార్జీకి గురయ్యారు.

## కంచర్లపల్లి హనుమంతరావు

తండ్రి పెదచెంచయ్య. దివితాలూకా పెదయాదరలో 1900 సంవత్సరంలో జన్మించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని ఉప్పు అమ్ముతుండగా లాఠీ చార్జీకి, బోయెనెట్ చార్జీకి గురై స్పృహ కోల్పోయారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని లాఠీచార్జీకి గురయ్యారు. అరెస్టుచేసి కొంతకాలం బందరుకోట గోడౌన్స్‌లో నిర్బంధించారు. అనంతరం 9 నెలలు అజ్ఞాతవాసంలో వుంటూ క్విట్ ఇండియా ఉద్యమాన్ని సాగించారు.

## కామినేని పున్నయ్య

దివితాలూకా నివాసి. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని లాఠీచార్జీకి గురిఅయ్యారు. సంవత్సరం కఠిన శిక్ష, రు. 100 జరిమానా విధించారు.

## కూనపరెడ్డి పెద ఆదిశేషయ్య



తండ్రి పెద చెంచయ్య. జన్మస్థలం దివితాలూకా అవనిగడ్డ శివారు కొత్తపేట. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1932 శాసనోల్లంఘనంలో లాఠీ ఛార్జీకి గురయ్యారు. ఒకరోజు సబ్‌జైలు నిర్బంధంలో వున్నారు. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని లాఠీ ఛార్జీకి గురయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, అజ్ఞాత వాసంలో గడిపారు. ఫలితంగా పోలీసులు ఆయన ఆస్తిపాస్తులను ధ్వంసం చేశారు.

## కొల్లి సీతారామయ్య



తండ్రి వెంకటరత్నం. దివితాలూకా నరసంపాలెం వాస్తవ్యులు. రైతు. శాసనోల్లంఘనోద్యమంలో 19.3.32 న బందరు పికెటింగ్‌లో పాల్గొన్నారు అరెస్టు చేసి లాఠీ ఛార్జీ చేశారు. గ్రామాలలో కాంగ్రెస్ సందేశం వినిపించుతూ ప్రచారం చేశారు. 18-5-32 న మూడు నెలల కఠిన శిక్ష, రు 100 జరిమానా విధింపబడింది. రాజమండ్రి సెంట్రల్ జైల్లో శిక్ష ననుభవించారు.

## కొల్లి వెంకట కృష్ణయ్య

తండ్రి వెంకటరత్నం. దివితాలూకా నరసంపాలెం. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 16-5-30న 9 నెలల కఠిన శిక్ష, రు. 20జరిమానా చెల్లించని పక్షంలో మరో 15 రోజుల శిక్ష విధింపబడింది. రాజమండ్రి వెల్లూరు జైళ్ళలో శిక్షను అనుభవించారు

## కొల్లి సుబ్బయ్య

తండ్రి శ్రీరాములు. దివితాలూకా కిష్కింధపాలెం వాస్తవ్యులు. రైతు. శాసనోల్లంఘనోద్యమ కాలంలో 4-3-1931న ఆరు నెలలు కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి సెంట్రల్ జైల్లో శిక్షను అనుభవించారు. గాంధి - ఇర్విన్ ఒడంబడిక ననుసరించి 11-3-31న విడుదల య్యారు.

## కొల్లిపర శీతమ్మ



తండ్రి దామినేని అక్కయ్య. జననం 19-10-1902. దివి తాలూకా యార్లగడ్డ. భర్త వెంకయ్య. నాదెళ్ళ రంగమ్మతో కలిసి, 1932 శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. అవనిగడ్డ కోర్టులో 31-8-1932 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో శిక్షను అనుభవించారు.

## కొల్లూరు వాగేశ్వరరావు



తండ్రి వెంకటచలం. జననం 20-7-1910 దివి తాలూకా నాగాయలంక. వ్యాపారి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని. 11-6-30 నుంచి 15-11-30 వరకు రాజమండ్రి, బళ్లారి జైళ్ళలో కారాగారవాస శిక్ష అనుభవించారు. తిరిగి 1932శాసనోల్లంఘనములో పాల్గొని సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. తమపరి విజయవాడలో స్థిరపడ్డారు. 4-10-1968 న కీర్తిశేషులైరి.

## కొడాలి ఆంజనేయులు



తండ్రి వెంకటాచలం జననం 1-7-1898. దివి తాలూకా కొడాలి. జర్నలిస్టు, రచయిత. 1920 సహాయ నిరాకరణంలో తన ప్రభుత్వోద్యోగానికి రాజీనామాచేశారు. తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెసు సంఘం కార్యదర్శి. 8.2.1930 బందరులో అప్పటి మద్రాసు గవర్నరు రాకకు నిరసనగా నల్ల జెండాల ప్రదర్శనలో పాల్గొన్నారు. 15-3-1930 న 16 నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, బళ్ళారి జైళ్లలో శిక్ష అనుభవించారు 11-1-1932 న తీవ్రమైన లాఠీఛార్జీకి గురయ్యారు. 15-1-1932 న రెండేళ్ల కఠిన శిక్ష, రు. 500/- జరిమానా విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. ప్రభుత్వ ఉత్తర్వు మేరకు 30-11-1933 న విడుదలయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో 2౯-8-1942 నుంచి 9-12-1944 వరకు వెల్లూరు, తంజావూరు జైళ్లలో డిటెన్యూగావున్నారు. విశ్వనాథ సత్యనారాయణతో కలిసి వీరు రచించిన "అవతార పరివర్తనం" నాటకాన్ని ప్రభుత్వం నిషేధించింది. అనేక గ్రంథాలు రచించారు. స్వాతంత్ర్య సమర చరిత్ర సంపుటీకరణ సంఘం ఆంధ్రప్రదేశ్ కమిటీ సభ్యులు, కాంగ్రెస్ చరిత్ర అనువాదకులు. కవి.

## కొత్తపల్లి వెంకటరత్నం



తండ్రి రామయ్య జన్మస్థలంగుంటూరు జిల్లా. తెనాలి తా॥ అమృతలూరు. 1921 సహాయ నిరాకరణలోను 1930 ఉప్పు సత్యాగ్రహంలోను పని చేశారు.

30.5.1930 నుంచి ఏడాది కఠిన శిక్షను రాజమండ్రి, కోయంబత్తూరు, అలీపురం జైళ్లలో అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒప్పందంతో 13.3.1931 న విడుదల అయ్యారు. కొంతకాలం రేపల్లెలో వుండి, చివరకు నాగాయలంకలో స్థిరపడిపోయారు. హిందీ పండితుడు. సంగీత విద్వాంసుడు కూడాను.

## క్రొరపాటి అంకమ్మ

భర్త శివరామకృష్ణయ్య. స్వగ్రామం దివి తాలూకా కప్తానివారిపాలెం గాంధీజీ దివితాలూకాలో పర్యటించినప్పుడు, ఆమె తన ఒంటి మీద నగలన్నింటినీ సమర్పించారు. శాసనోల్లంఘనంలో మహిళా వాలంటీర్లకు నాయకత్వం వహించారు. ఖాదీ ప్రచారం, కల్లు పాకల ముందు పికెటింగ్ చేశారు.

## కొమ్మారెడ్డి గోపాల కృష్ణయ్య

జన్మస్థలం దివితాలూకా తూర్పులంకపల్లి. 1940–41 వ్యష్టి సత్యాగ్రహ కాలంలో విద్రోహకరమైన ప్రసంగాలు చేసినందుకు డి. ఐ. ఆర్. క్రింద శిక్ష విధించారు.

## కోపల్లె హనుమంతరావు

తండ్రి కృష్ణారావు. జననం 1880. దివి తాలూకా అవిరిపూడి. ఎమ్. ఎ. బి. ఎల్; 1907 లో బిపిన్ చంద్రపాల్ స్వదేశీ ఉద్యమ ప్రచారం చేస్తూ ఆంధ్ర దేశానికి వచ్చినప్పుడు, బందరులో స్వాగతం ఏర్పాటు చేసిన వారిలో ఒకరు. ఆంధ్ర జాతీయ కళాశాల స్థాపక – ప్రిన్సిపాల్ ఈ కళాశాలలో చదివిన విద్యార్థులనేకులు ఉత్తరోత్తరా ప్రముఖ రాజకీయ నాయకులుగా రాణించారు. తన న్యాయవాద పట్టాచించి కాలువలో పారవేశారు చల్లపల్లి జమీందారు దివానీగిరి యిస్తానంటే, తిరస్కరించారు. ఆంధ్ర జాతీయ కళాశాలకు బ్రిటీష్ ప్రభుత్వం మంజూరు చేసిన 10,000/– సాంవత్సరిక గ్రాంటును తిరస్కరించారు. అంటరానితనం నిర్మూలన, మద్యపాన నిషేధం ఖాదీ ప్రచారం కొరకు తీవ్ర కృషి సలిపారు. జాతీయ కళాశాల విద్యార్థులకు రాజకీయ తరగతులు నిర్వహించారు. 1922 లో కీర్తిశేషులైరి.

## కోనేరు సుబ్బారావు

తండ్రి రత్తయ్య. దివి తాలూకా మంత్రిపాలెం వాస్తవ్యులు. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో 13–2–43 న ఆరునెలల కఠిన శిక్షను అనుభవించారు. అలీపురం క్యాంప్ జైలులో శిక్షను అనుభవించారు.

## కోనేరు వెంకట బసవయ్య

తండ్రి పిచ్చయ్య. దివి తాలూకా వెలివోలు వాస్తవ్యులు. రైతు. 19–6–30 నుండి రాజమండ్రి, అలీపురం జైళ్ళలో 6 నెలల కఠినశిక్ష విధించబడింది.

## కేశవరాజు బసవయ్య

తండ్రి నరసయ్య. జన్మస్థలం దివి తాలూకా తాడేపల్లి. రైతు శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు 10–8–1 32 న సంవత్సరం ఆరు మాసాలు కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 13–6–1933 న విడుదలయ్యారు.

## గడ్డిపాటి కోటయ్య



తండ్రి రామయ్య. జననం 1907. గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా గూడవల్లి. నివాసం దివి తాలూకా స్వతంత్రపురం. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, బళ్ళారి జైలులో ఆరునెలల కఠిన శిక్ష అనుభవించారు. మూడుసార్లు లాఠీచార్జీకి గురయ్యారు. విదేశీ వస్త్రదహనం అనంతరం, ఆ బూడిదను రు. 116 లకు పాడారు.

## గడియారం సాంబయ్య

దివి తాలూకా నివాసి. రెవిన్యూశాఖలో ఉద్యోగానికి రాజీనామా చేశారు. ఖద్దరు వ్యాప్తికి కృషిచేశారు.

## గరికిపాటి మల్లయ్య

దివి తాలూకా నివాసి. దివితాలూకాలోని నాగాయతిప్ప గ్రామంలో జరిగిన కాంగ్రెస్ సమావేశానికి హాజరైనప్పుడు 20–1–1332న తీవ్రమైన లాఠీచార్జీకి గురయ్యారు.

## గుత్త వీరభద్రయ్య

తండ్రి రత్తయ్య. జన్మస్థలం దివితాలూకా గూడపాడు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 9 నెలలు కఠిన శిక్ష, రు. 20/- జరిమానా విధించారు. 16-5-1930 నుంచి రాజమండ్రి, వెల్లూరు, అలీపురం జైళ్లలో శిక్ష అనుభవించారు.

## గుత్తి కృష్ణారావు

తండ్రి భూషయ్య. జన్మస్థలం దివితాలూకా గూడపాడు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 17-6-1930 నుండి సంవత్సరం జైలుశిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్లలో శిక్ష అనుభవించారు.

## గుత్తికొండ రాఘవయ్య



తండ్రి కోదండ రామయ్య. జననం 5-12-1907. దివి తాలూకా చినకళ్లేపల్లి. రైతు. విదేశీ వస్త్రబహిష్కరణకై పికెటింగ్ జరిపినందుకు 17-1-33 న అరెస్టు చేశారు. 31-8-1933 వరకు రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 1936 లో 8 మాసాల పాటు వార్ధాశ్రమంలో గడిపారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. ప్రస్తుత నివాసం పశ్చిమ గోదావరి జిల్లా పోతునూరు.

## గుత్తికొండ సీతమ్మ

అచ్చయ్యగారి పత్ని. దివి తాలూకా చినకళ్లేపల్లి వాస్తవ్యులు. భట్లపెనుమర్రులో వల్లభనేని అన్నపూర్ణమ్మ మరో ఇద్దరితో కలిసి 2-8-32న ప్రభుత్వ అధీనంలో ఉన్న కాంగ్రెసు ఆఫీసుపై దాడి చేసి స్వాధీనం చేసుకొన్నారు. తర్వాత చుట్టుప్రక్కల గ్రామాల్లో రెండు రోజులు కాంగ్రెస్ ప్రచారం చేశారు. 31-8-32 న సంవత్సరం శిక్ష విధింపబడి వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో శిక్ష ననుభవించారు.

## గుత్తికొండ సత్యనారాయణ

తండ్రి నర్సయ్య. దివి తాలూకా చినకళ్లేపల్లి వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 21-6-30 నుండి రాజమండ్రి, అలీపురం జైళ్ళలో 6 నెలల కఠిన శిక్షను అనుభవించారు.

## గొన్నూరు సర్రెడ్డి



తండ్రి రామిరెడ్డి. దివితాలూకా, కాజ వాస్తవ్యులు. రైతు క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని 13-2-43 న ఆరు నెలల కఠినశిక్షకు, రు. 200 జరిమానాకు గురయ్యారు. అలీపురం క్యాంప్ జైలులో శిక్ష ననుభవించి 9-9-43 న విడుదలయ్యారు.

## గొల్లపూడి చలపతిరావు

తండ్రి రామారాయుడు. జన్మస్థలం దివి తాలూకా అవనిగడ్డ. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పి. డబ్ల్యు. డి. సూపర్‌వైజర్ ఉద్యోగానికి రాజీనామా చేసి, ఉద్యమానికి సహాయపడ్డారు.

## గొల్లపూడి పురుషోత్తమరావు

తండ్రి రామానాయుడు. జన్మస్థలం దివి తాలూకా అవనిగడ్డ. ఉప్పు సత్యాగ్రహంలో తాలూకా ఆఫీసు గుమాస్తా ఉద్యోగానికి రాజీనామా చేసి, ఉద్యమానికి సహాయం చేశారు.

## గోగినేని తాతయ్య



తండ్రి లక్ష్మీనారాయణ. గుంటూరు జిల్లా తెనాలి తాలూకా క్రాపలో 1922 లో జన్మించారు. దివి తాలూకా కోడూరు శివారు స్వతంత్రపురం వాస్తవ్యులు. మైనేని వారి పాలెంలో వేద

పతనం స్వసంఘ పౌరోహిత్య ఉద్యమంలో పౌరోహిత్యకాండ నేర్చుకొన్నారు. 1941 లో వార్ధావిధాన పరిశ్రమల పాఠశాలలో తర్ఫీదు పొందారు. 1943 జనవరి 26 న స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా ప్రభాతభేరీ నడిపినందుకు ఆరు నెలల శిక్ష విధించబడింది. 25-2-43 నుండి అలీపురం క్యాంప్ జైల్లో శిక్షననుభవించారు. యువజనోద్యమంలో కృషిచేశారు. కమ్యూనిస్టుపార్టీలో ఉండి రహస్యంగా పనిచేస్తుండగా 1950 మే 12 న చల్లపల్లి నారాయణ రావు గారితోపాటు దివి తాలూకా తలగడ దీవి కొత్త పాలెంలో కాల్చివేయబడ్డారు.

## చండ్ర రాజేశ్వరరావు



తండ్రి సుబ్బయ్య. జననం 6-6-1915. దివి తాలూకా మంగళాపురం. భారత కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి. విద్యార్థి దశనుంచి స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు. 1933-34లో బెనారస్ యూనివర్సిటీలో చదువుతూ, లక్నో కాంగ్రెస్‌లో వాలెంటీర్‌గా పని చేస్తూ, సి. ఐ. డి. ని పట్టుకొని కొట్టారు. దానిపై అరెస్టు వారంటు జారీకాగా, చదువు చాలించి, ఆంధ్ర దేశానికి తిరిగి వచ్చారు. 1935లో రాష్ట్రంలో యువజనోద్యమం నిర్మాణ బాధ్యతలు స్వీకరించారు. 1937లో కొత్తపట్నం రాజకీయ పాఠశాలలో వాలంటీర్లకు శిక్షణ గరిపారు. ప్రభుత్వ నిషేధాజ్ఞలను ధిక్కరించి అరెస్టయ్యారు. ఒంగోలు, తెనాలి సబ్ జైళ్ళలో కొన్నిరోజులు నిర్బంధంలో వున్నారు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసినందుకు వెల్లూరు జైలులో నిర్బంధించాలని ఆదేశిస్తూ. 1940లో అరెస్టు వారెంటు జారీకాగా రెండేళ్ళు అజ్ఞాతవాసం గడిపారు. 1943లో చల్లపల్లి జమీందారు వ్యతిరేక పోరాటంలో అరెస్టు అయి జైలుశిక్ష అనుభవించారు. నైజాం నవాబుకు వ్యతిరేకంగా తెలంగాణాలో సాగిన సాయుధ పోరాటంలో ప్రముఖపాత్ర వహించిన నాయకుల్లో ఒకరు. 1952లో మద్రాసు శాసనమండలికి ఎన్నికై, కొద్దిరోజులకే రాజీనామా చేశారు. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నుంచి "ఆర్డర్ ఆఫ్ లెనిన్" బిరుదును పొందారు.

## చల్లపల్లి (లక్ష్మి)నారాయణరావు



తండ్రి గోపాల కృష్ణయ్య. జననం 1913 దివితాలూకా చల్లపల్లి. ఎఫ్. ఎ. చదువుతూ, ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు 16-6-1930న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. తిరుచునాపల్లి, ఆలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో, శిక్ష పూర్తి కాకుండానే విడుదలయ్యారు. అనంతరం అతివాద రాజకీయాలవైపు మొగ్గి, కమ్యూనిస్టుపార్టీలో చేరి వ్యవసాయ కూలీల ఉద్యమాన్ని నిర్మించారు. 1950 మే 12 న పోలీసులచేత కాల్చి చంపబడ్డారు.

## చల్లపల్లి వెంకట రామదాసు



తండ్రిగోపాలకృష్ణయ్య జన్మస్థలం దివితాలూకా చల్లపల్లి. కరణం. 1930 ఉప్పు సత్యాగ్రహంలో తన కరణీకానికి రాజీనామాచేసి, పాల్గొన్నారు. 8-7-1930 న సంవత్సరం కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931న విడుదలయ్యారు. 1969 లో కీర్తిశేషులైరి.

## చామర్తి చలపతిరావు

జన్మస్థలం దివి తాలూకా కోడూరు. కరణం. 1920-21 సహాయ నిరాకరణోద్యమ కాలంలో

కాంగ్రెసు వాలంటీర్లకు భోజనం పెట్టారన్న ఆరోపణపై గ్రామోద్యోగం నుంచి ప్రభుత్వం బర్తరఫ్ చేసింది.

## చిట్టూరి శేషగిరిరావు

తండ్రి శివరామయ్య. దివి తాలూకా చిట్టూరు నివాసి, ఉపాధ్యాయుడు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో 12-6-30 నుండి 10 నెలల కఠిన శిక్షను అనుభవించారు.

## చిరువోలు రాధాకృష్ణయ్య

తండ్రి వెంకటకృష్ణయ్య. జననం 20-1-1912 దివి తాలూకా చిరువోలు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. మూడు మాసాల కఠిన శిక్షను, రు. 25/- జరిమానాను విధించారు. వెల్లూరు జైలులో శిక్షను అనుభవించారు.

## చిలకపాటి సుబ్బారావు



తండ్రి తిరుపతి రాయుడు. జన్మస్థలం దివితాలూకా కోడూరు. ఉపాధ్యాయుడు. దేశాభిమానం గల కుటుంబంలో పుట్టి, విద్యార్థి దశలోనే ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 22-5-1930 నుంచి ఏడాది కఠిన కారాగార వాస శిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. 1941లో వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. కోర్టు ముగిసేవరకు శిక్ష, రు. 250/- జరిమానా విధించారు. అవనిగడ్డ బోర్డు హైస్కూలు హెడ్మాస్టరుగా పనిచేస్తూ విద్యార్థి కాంగ్రెస్ వ్యాప్తికి తోడ్పడ్డారు. ప్రస్తుత నివాసం గుంటూరు జిల్లా తెనాలి తాలూకా అమృతలూరు.

## చిలకపాటి తిరుపతిరాయుడు

దివితాలూకా కోడూరు వాస్తవ్యులు. దివితాలూకా నాగాయితిప్ప. స్వగ్రామంలో కాంగ్రెస్ మీటింగ్‌కు హాజరయి తిరిగి వస్తుండగా 20-1-32 న అరెస్టు చేసి అవనిగడ్డ సబ్‌జైలులో కొంతసేపు నిర్బంధించారు. కీర్తిశేషులైరి.

## బోడి నారాయణరావు

జన్మస్థలం దివి తాలూకా వక్కలగడ్డ. సంఘ సంస్కర్త. వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్నారు. 'స్వరాజ్య' పత్రికలో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా రచన చేసినందుకు, 18-7-1908 న అరెస్టు చేశారు. రాజద్రోహ నేరంక్రింద 9-11-1908న తొమ్మిది నెలలు కఠిన శిక్ష విధించారు. ఆంధ్రదేశంలో జాతీయోద్యమంలో మొట్టమొదటగా జైలు శిక్ష అనుభవించి, గాడిచర్ల హరిసర్వోత్తమరావుతో పాటు అరెస్టు అయ్యారు. "వందేమాతరం" ఉద్యమం నాటి "స్వరాజ్య" పత్రిక సంపాదకులు. స్వదేశీ ఉద్యమాన్ని పెద్ద ఎత్తున ప్రోత్సహించారు.

## తంగిరాల పార్థసారథి శర్మ

జన్మస్థలం దివితాలూకా పోతవరలంక. క్విట్ ఇండియా ఉద్యమంలో కృష్ణానది మధ్యలంకలలో బ్రిటీషు వ్యతిరేక ప్రచారకేంద్ర నిర్వహణలో పాల్గొన్నారు. పొట్టిలంక జామ తోటలో సైక్లోస్టయిల్ మెషీన్ మీద రహస్య పత్రాలను ముద్రించి, పంచి పెట్టారు.

## తటవర్తి వెంకటేశ్వరరావు



తండ్రి బ్రహ్మానందం. 1917 ప్రాంతంలో జన్మించారు. అవనిగడ్డ వాస్తవ్యులు. వ్యష్టి సత్యాగ్రహ ఉద్యమంలో సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. క్విట్ ఇండియా ఉద్యమంలో 29-5-43 న 15 నెలల కఠిన శిక్ష విధింపబడింది. అలీపురం క్యాంప్ జైలులో శిక్షను అనుభవించుతుండగా హైకోర్టు తిర్పును అనుసరించి 13-3-44 న విడుదలయ్యారు. 1964 లో కీర్తిశేషులైరి.

## తలగడదీవి సత్యనారాయణ శర్మ



తండ్రి విశ్వనాథం. జననం 26-4-1916. దివితాలూకా తలగడ దీవి. క్విట్ ఇండియా ఉద్యమంలో 144 సెక్షన్ ధిక్కరించి లాఠీ దెబ్బలు తిన్నారు. 21-11-42 నుంచి ఆరుమాసాల కఠినశిక్షను అలీపూర్ క్యాంపు జైలులో అనుభవించారు. 1938 లో అఖిల భారత చరఖా సంఘంలో చేరారు. తదాదిగా ఖాదీ ప్రచారం సాగిస్తున్నారు. ప్రస్తుతం చిత్తూరు జిల్లా పాకాలలో ఖాదీ పరిశ్రమాభివృద్ధికి కృషిచేస్తున్నారు.

## తాతినేని వీరరాఘవయ్య



తండ్రి పిచ్చయ్య. జననం 29-6-1905. గన్నవరం తాలూకా ఆకునూరు. స్వగ్రామం దివితాలూకా మొవ్వ. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 16-5-1930న తొమ్మిది మాసాల కఠిన శిక్షను రు. 20 ల జరిమానా విధించారు. రాజమండ్రి, మద్రాసు, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీజీ కృష్ణాజిల్లా పర్యటనలో మొవ్వ వచ్చినపుడు రు. 116 విరాళం ఇచ్చారు.

## తుమ్మల వెంకట రామయ్య

దివి తాలూకా కొడాలి. 8-2-30 న బందరులో గవర్నర్ రాక సందర్భంగా నల్ల జెండాలు చూపినందుకు అరెస్టు చేయబడ్డారు.

## తోట వెంకటకృష్ణయ్య



జన్మస్థలం దివి తాలూకా పెద కళ్ళేపల్లి. 1930 ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, లాఠీదెబ్బలుతిన్నారు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 1941 వ్యష్ఠి సత్యాగ్రహంలోను 1942 క్విట్ ఇండియా ఉద్యమంలోను పాల్గొన్నారు.

## దాసరి వెంకట సుబ్బారావు



తండ్రి రామయ్య. జననం 1921 దివి తాలూకా వక్కలగడ్డ. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 అక్టోబరు 3 వ తేదీన బందరు కోర్టు ముందు పికెటింగ్ చేసి, లాఠీ ఛార్జీకి గురయ్యారు. ఒక రోజు సబ్ జైలులో నిర్బధించి, విడుదల చేశారు. ఖద్దరు ప్రచారం చేశారు.

## దావులూరి సూర్యనారాయణ



తండ్రి సుబ్బయ్య. జననం 1-1-1912 దివి తాలూకా పెదముత్తేవి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 17-6-1930 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## దివి సాంబమూర్తి



తండ్రి వీరయ్య. జననం 1890. దివి తాలూకా అవనిగడ్డ. 1921 సహాయ నిరాకరణ ఉద్యమంలో తాటిగెలలు నరికి నెల రోజుల జైలు శిక్షను అవనిగడ్డ, బందరుసబ్ జైళ్ళలో అనుభవించారు.

## దోనవల్లి మధుసూధనరావు



తండ్రి బాల గురువు. జననం 1911. దివితాలూకా మోపిదేవి. 1932 శాసనోల్లంఘనంలో అవనిగడ్డలో కల్లు పాకల ముందు పికెటింగ్ చేసి, అరెస్టు అయ్యారు. ఒకరోజు నిర్బంధంలో వుంచి, విడుదల చేశారు. బందరులో విదేశీవస్త్ర బహిష్కరణ ఉద్యమంలో లాఠీదెబ్బలు తిన్నారు. 1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, రహస్య జీవితం గడిపారు రైతు ఉద్యమంలో పనిచేశారు దివి తాలూకా కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు.

## నాదెళ్ళ రంగమ్మ

తండ్రి పరుచూరి రంగయ్య. పుట్టినిల్లు గుంటూరు జిల్లా రేపల్లెతాలూకా బేతపూడి మెట్టినిల్లు దివితాలూకా పురిటిగడ్డ. భర్త బ్రహ్మయ్య. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 28-1-1932 న సంవత్సరం జైలుశిక్ష విధించారు. తిరిగి 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని 23-9-1942 నుంచి ఆరుమాసాల జైలుశిక్ష అనుభవించారు. 26-4-1973 న కీర్తిశేషులైరి.

## విడుమోలు సుబ్బారావు

దివి తాలూకా నిడుమోలు వాస్తవ్యులు. 5-3-41 న వ్యష్టి సత్యాగ్రహం చేశారు. 8-3-41 న 15 రోజుల కఠిన శిక్ష విధించబడింది.

## పరుచూరి లింగయ్య

జన్మస్థలం దివితాలూకా పురిటి గడ్డ. రైతు. ఖాదీ ప్రచారానికి విశేషంగా కృషిచేసి, దేశంలో "పురిటి గడ్డ "ఖద్దరుకు విశేష ప్రచారాన్ని సంపాదించారు. రాయలసీమ నుంచి హరిజన నేతగాండ్ర కుటుంబాలను తీసుకొచ్చి, స్వగ్రామంలో మగ్గాలు ఏర్పాటుచేసి, ఖాదీ ఉత్పత్తి చేశారు. ఉప్పు సత్యాగ్రహంలో చిన్నాపురంలో ఉప్పు తయారీకి వెళ్ళినప్పుడు, గ్రామసులు "స్వరాజ్యం తేవడానికి వెళ్ళాడు" అని చెప్పుకొన్నారు. కనుక "స్వరాజ్యపు లింగయ్య"గా ప్రసిద్ధి చెందారు. గాంధీజీ రెండుసార్లు పురిటిగడ్డను సందర్శించడానికి కారకులు. కీర్తిశేషులైరి.

## పుసుకొల్లు వెంకటసీతారామాంజనేయులు



జననం22-9-1916 దివితాలూకా చినముత్తేవి. 1936 జిల్లా బోర్డు ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థి తరపున ప్రచారం చేయడంతో ప్రారంభమైన రాజకీయ జీవితం 1942 వరకు రైతు ఉద్యమంలో గడిచిపోయింది. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలోకి దుమికి, రహస్య జీవితం గడుపుతూ, ప్రముఖపాత్ర వహించారు. క్విట్ ఇండియా ఉద్యమ నాయకులు కులకర్ణిని విజయవాడ సబ్‌జైలు నుంచి తప్పించడంలో పాలుపంచుకొన్నారు. జిల్లా జాతీయ యువజన సంఘం అర్గనైజరుగా పనిచేశారు. 1948 లో జిల్లా బోర్డుకు ఎన్నికయ్యారు. రెండు సార్లు దివితాలూకా కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నికయ్యారు.

## పేకేటి రంగారెడ్డి



తండ్రి వెంకట రెడ్డి. జన్మస్థలం దివితాలూకా కాజ. రైతు. 1932 శాసనోల్లంఘనంలో గుంటూరులో లాఠీ ఛార్జీకి గురయ్యారు, రు. 200 జరిమానా విధించారు, గుంటూరు సబ్ జైలులో రెండు మాసాలు నిర్బంధించారు. తిరిగి 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 22-11-1942 న అరెస్టు చేశారు. మూడు మాసాలు సబ్ జైలులో నిర్బంధించి 13-2-1943 న ఆరు మాసాల కఠిన శిక్షను విధించారు. అలీపురం క్యాంప్ జైలులో శిక్షను అనుభవించారు.

## పేకేటి వీరారెడ్డి



తండ్రి మాధవ రాయుడు. జన్మస్థలం దివి తాలూకా కాజ. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 14-6-'30న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్షను అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒప్పందంతో 11-3-1931 న విడుదలయ్యారు. 1932 శాసనోల్లంఘనంలో కృష్ణాజిల్లా 3 వ డిక్టేటర్‌గా నియుక్తులయ్యారు. 14-1-1932న లాఠీ చార్జీకి గురయ్యారు. 6-4-1932న అరెస్టుచేసి 11-4-1932న ఆరు మాసాల కఠిన శిక్ష, రు. 1000/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్షను అనుభవించారు.

## పోతరాజు వెంకటకృష్ణ సుబ్బరాయశర్మ

తండ్రి చినపేరరాజు. జననం 22-7-1927. క్విట్ ఇండియా ఉద్యమంలో అవనిగడ్డ జైలులో 15 రోజులు నిర్బంధంలో వున్నారు. ప్రస్తుతం గుడివాడ తాలూకా పసుమర్రు గ్రామంలో వి. డి. ఓ. గా పనిచేస్తున్నారు.

## పోతరాజు సుబ్బయ్య



తండ్రి వెంకటప్పయ్య. దివి తాలూకా దాలిపర్రు. రైతు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 8-9-32 లో రాజమండ్రి జైల్లో ఏడు నెలల కఠినశిక్షను అనుభవించారు.

## పోతరాజు సుబ్బారావు

తండ్రి వెంకటప్పయ్య. దివితాలూకా దాలిపర్రు వాస్తవ్యులు. రైతు. ఉప్పుసత్యాగ్రహంలలో పాల్గొన్నారు. 17-6-30 న ఒక సంవత్సరం శిక్ష విధింపబడింది. రాజమండ్రి, తిరుచినాపల్లి జైళ్ళలో శిక్షను అనుభవించారు. శాసనోల్లంఘనోద్యమ కాలంలో రైలు బండిలో గొలుసులాగి బండిని ఆపినందుకుగాను 10-9-32 న తిరిగి అరెస్టు చేయబడ్డారు.

## బలభద్ర పెదకోటయ్య

జన్మస్థలం దివితాలూకా వక్కలగడ్డ. 1930 ఉప్పు సత్యాగ్రహం, 1932 శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. జాతీయగీతాలు రచించి ప్రజలను ఉత్తేజితులను కావించారు.

## బోగి సుబ్బారావు



తండ్రి రామస్వామి. జన్మస్థలం దివి తాలూకా కాజ. క్విట్ ఇండియా ఉద్యమంలో టెలిఫోన్, టెలిగ్రాఫ్ తీగలు తెంచి, అరెస్టులయ్యారు. జైలుశిక్ష అనుభవించారు.

## మండవ వెంకట కృష్ణారావు



తండ్రి కోటయ్య. జన్మస్థలం దివి తాలూకా పురిటిగడ్డ. హిందీ భాషలో నిష్ణాతులు. ఖాదీ ఉద్యమంలో పని చేశారు. హిందీ ప్రచారకులు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో, కృష్ణానది లంకలలో రహస్య విప్లవ ప్రచార కేంద్రాన్ని "వెంకటేశ్వరరావు" అను పేరుతో నిర్వహించారు. 18-11-1942 నుంచి ఆరు మాసాల కఠినశిక్షను అలీపురం క్యాంప్ జైలులో అనుభవించారు. ఖాదీ, గ్రామీణ పరిశ్రమల కమీషన్ ఆంధ్రశాఖ జనరల్ మేనేజరుగా రిటైర్ అయ్యారు. గాంధీ స్మారక నిధి తరపున పెనమలూరు కేంద్రంలో 5 ఏళ్ళు గాంధీ తత్వ ప్రచారకులు గాను, హిందీ కేంద్ర నిర్వాహకులుగాను పని చేశారు.

## మల్లంపాటి పట్టాభిరామయ్య



తండ్రి సోమయ్య. జన్మస్థలం గుంటూరు జిల్లా తెనాలి తాలూకా ఎలవర్రు. నివాసం దివి తాలూకా చినకళ్ళేపల్లి. రైతు. 1930 ఉప్పు సత్యాగ్రహం లో పాల్గొన్నారు 10-6-30న సంవత్సరం కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, బళ్లారి సెంట్రల్ జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒప్పందంతో 11-3-1931న విడుదలయ్యారు.

## మల్లంపాటి రత్నమాణిక్యమ్మ

భర్త నాగభూషణవర్మ. జననం 1926 దివితాలూకా వక్కలగడ్డ. తన 15వ ఏట తన భర్తతోపాటు 1941 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. మైనరు కావడంవల్ల అరెస్టు చేయలేదు.

## మల్లంపాటి నాగభూషణవర్మ



తండ్రి సుబ్బయ్య. జననం 1916 దివి తాలూకా వక్కలగడ్డ. రైతు. 1931-32 శాసనోల్లంఘనంలో గొట్టిపాటి బ్రహ్మయ్య గొర్రెపాటి వెంకటసుబ్బయ్య వంటి కాంగ్రెసు పెద్దలతో కలిసి, కల్లు పాకల ముందు పికెటింగ్ చేశారు. మైనరు కావడంవల్ల అరెస్టు చేయలేదు. 1933 లో ఘంటసాల దేవాలయంలోకి హరిజనులు ప్రవేశించినప్పుడు, ఆ దేవాలయ అర్చకులు సమ్మె చేయగా, తాత్కాలిక అర్చకుడుగా పని చేశారు. 1933 లో గాంధీజీ దివి తాలూకాలో పర్యటించినప్పుడు, సభలలో దేశభక్తి గేయాలు పాడారు. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో వక్కలగడ్డలో అరెస్టు అయ్యారు. 15 రోజుల జైలు శిక్ష, రు. 50 ల జరిమానా విధించారు.

## మల్లిపెద్ది నరహరి

దివి తాలూకా నివాసి. దివి తాలూకా నాగాయితిప్ప గ్రామంలో జరిగిన కాంగ్రెసు సమావేశంలో పాల్గొని తిరిగి వెడుతుండగా 20-1-1932 న అరెస్టుచేసి, సబ్ జైలులో నిర్బంధించారు.

## మల్లిపెద్ది అంజయ్య

దివి తాలూకా నివాసి. 20-1-1932న దివితాలూకా నాగాయతిప్ప గ్రామంలో జరిగిన కాంగ్రెసు సమావేశానికి హాజరై, తిరిగి వెడుతుండగా అరెస్టుచేసి, అవనిగడ్డ జైలులో నిర్బంధించారు. కొన్ని రోజుల తర్వాత విడుదల చేశారు.

## మేకా వెంకయ్య

తండ్రి బాపయ్య. జన్మస్థలం దివితాలూకా కోసూరు. రైతు, ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 27-5-1930 నుంచి 9 నెలలు కఠిన శిక్షను రాజమండ్రి, వెల్లూరు, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## ముట్నూరి లక్ష్మీకాంతయ్య



తండ్రి వెంకట కృష్ణయ్య. దివి తాలూకా కోడూరులో 1894లో జన్మించారు. 8-2-30న మద్రాసు గవర్నరు వచ్చిన సందర్భాన బందరులో "గోబాక్ గవర్నర్" అని కేకలు వేస్తూ నల్లజండాల ప్రదర్శన చేసినపుడు అరెస్టయిన 32 మందిలో వీరు ఒకరు. 11 మందిని మాత్రమే శిక్షించి, తక్కినవారిని విడిచి పెట్టారు. వీరిని కూడా విడిచిపెట్టారు. 1941 లో వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. గాంధీజీ 1929లో దివితాలూకా కోడూరు సందర్శించినపుడు రు. 500 ఖద్దరు నిధికి సమర్పించారు.

## మూల్పూరి లక్ష్మీనారాయణ

తండ్రి నారాయణ. జననం 1911 దివితాలూకా పెదసనగల్లు. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీ దెబ్బలు తిన్నారు. 10-9-1932న నడుస్తున్న రైలు గొలుసు లాగి, అరెస్టు అయ్యారు.

## మూల్పూరి వెంకటాద్రి



స్వస్థలం దివి తాలూకా. పెదసనగల్లు. ఉప్పు సత్యాగ్రహోద్యమంతో ఉత్తేజితులై భట్లపెనమర్రు గ్రామంలో సారాడిపో వద్ద పికెటింగ్ చేశారు. పోలీసుల లాఠీఛార్జీకి గురయ్యారు. వారంరోజులు సబ్ జైలులో నిర్బంధించారు. అనంతరం శ్రీకాకుళంలో మద్యపానానికి వ్యతిరేకంగా జరిపిన పికెటింగ్‌లో పాల్గొని, తిరిగి లాఠీదెబ్బలు తిన్నారు. అవనిగడ్డలో సారాపాటలకు వ్యతిరేకంగా పికెటింగ్ జరిపి ఒక రోజు సబ్‌జైలు నిర్బంధానికి గురయ్యారు. ప్రస్తుత నివాసం మెదక్‌జిల్లా సంగారెడ్డి.

## మేకా వీరరాఘవయ్య



జననం కృష్ణా జిల్లా పాగోలు. తండ్రి బుచ్చయ్య. గుంటూరు జిల్లా తెనాలి తాలూకా క్రాపలో జనవరి 26న స్వాతంత్ర్య పతాకం ఎగురవేసి, బ్రిటీష్ ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమంలో పాల్గొన్నందుకుగాను అరెస్టయారు. 25-2-43 నుండి అలీపురం క్యాంప్ జైల్లో ఆరునెలల శిక్ష అనుభవించారు. దివి తాలూకా దింటిమెరకలో స్థిరపడ్డారు. కీర్తిశేషులు.

## మొవ్వా రాజగోపాలరావు



తండ్రి రామయ్య. 1890 లో దివి తాలూకా మొవ్వలో జన్మించారు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1929 లో గాంధీజీ మొవ్వ గ్రామం సందర్శించినప్పుడు వారిని కలుసుకున్నారు. 16-5-1930న, 9నెలల కఠినశిక్ష, రు. 20/- జరిమానా. విధించారు. రాజమండ్రి, వెల్లూరు, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు.

గాంధీజీ సిద్ధాంతాలను మొవ్వ పరిసర గ్రామాల్లో ప్రచారం చేశారు. కాంగ్రెస్ పార్టీకి విరాళాలు సేకరించారు. గ్రామోద్ధరణకు గ్రామాల్లో నిరక్షరాస్యత నిర్మూలనకు కృషి చేశారు. చాలామంది పేద విద్యార్థులకు చదువు చెప్పారు. 1943 లో కీర్తిశేషులయ్యారు.

## మొవ్వ వీరభద్రరావు



తండ్రి గోపాల రాయుడు. జననం 22-5-1901. దివి తాలూకా మొవ్వ. రైతు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, ఆరుమాసాల కఠిన శిక్షను 9-7-30 నుంచి రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. ఆరుమాసాల కఠిన శిక్షను, రు. 75 ల జరిమానాను విధించారు. జరిమానా చెల్లించ నిరాకరించి, మొత్తం 7 మాసాల 15 రోజుల శిక్షను రాజమండ్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు

## యలవర్తి మునీశ్వరుడు



తండ్రిరామయ్య. జననం 12-8-1921 దివి తాలూకా అవనిగడ్డ. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 21-2-1941 న రెండువెలల కఠిన శిక్ష. రు 50/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని. ఉద్యోగంనుంచి తొలగించబడిరి.

## యార్లగడ్డ రాజబాబయ్య

జన్మస్థలం దివితాలూకా రావివారిపాలెం. రైతు. శాసనోల్లంఘన ఉద్యమ కాలంలో 20-1-1932 న నాగాయితిప్ప గ్రామంలో జరిగిన కాంగ్రెసు సమావేశానికి హాజరై, తీవ్రమైన లాఠీఛార్జీకి గురయ్యారు.

## యార్లగడ్డ రత్తమ్మ

స్వస్థలం దివితాలూకా పురిటిగడ్డ. 1932లో జాతీయ జెండాలు చేబూని జాతీయ గీతాలు పాడుతూ, బయలుదేరిన దళంలో సభ్యులు. ఈ దళాన్ని విజయవాడవద్ద కృష్ణానదీ తీరాన పోలీసులు అటకాయించి అర్ధరాత్రివరకు నిర్బంధించి. వదలివేశారు.

## యేలేశ్వరపు కృష్ణమూర్తి



తండ్రి పురుషోత్తం. జననం 20-8-1915 దివి తాలూకా పెదప్రోలు. పట్టభద్రులు. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని 29-1-1941 నుంచి మూడు మాసాలు కఠిన శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. రు. 15 జరిమానా వసూలు చేయబడింది. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 1960లో రాష్ట్ర ప్రభుత్వ పరిశ్రమలశాఖలో చేరి, ఉద్యోగం చేస్తూ కీర్తిశేషులైరి

## రామిరెడ్డి సుబ్బారెడ్డి

తండ్రి రామయ్య. జననం 1902 దివి తాలూకా కాజ. రైతు. స్వగ్రామంలో కాంగ్రెసు సంఘాన్ని స్థాపించి, 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19-6-1930 నుంచి సంవత్సరం కఠినశిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931న విడుదలయ్యారు. జైలులో ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిన్నప్పటికి, క్షమాపణ చెప్పి, విడుదల కావడానికి నిరాకరించారు. 1932శాసనోల్లంఘనంలో గుంటూరులో తీవ్రమైన లాఠీఛార్జీకి గురయ్యారు. తల పగిలిపోయింది. గుంటూరు సబ్‌జైలులో 15 రోజులు రిమాండ్‌లో వుంచి, విడుదల చేశారు. 1940లో కీర్తిశేషులైరి.

## రావి వెంకట్రామయ్య



జననం 1903. దివి తాలూకా రావి వారిపాలెం. 1921 విజయవాడ ఎ. ఐ. సి. సి. సభకు హాజరయ్యారు, ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 20-1-1932 న నాగాయతిప్ప కాంగ్రెస్ సభలో పాల్గొని తీవ్రమైన లాఠీఛార్జీకి గురయ్యారు. 2-8-1932 న కల్లు పాకలముందు పికెటింగ్ చేసి, మరొకసారి లాఠీఛార్జికి గురయ్యారు. వ్యష్టి సత్యాగ్రహంలోను 1942 క్విట్ ఇండియా ఉద్యమంలోను పాల్గొన్నారు.

## రెండుచింతల వెంకటరామయ్య



తండ్రి లక్ష్మీనారాయణ. జననం 22-7-1910 దివి తాలూకా కోసూరు పురోహితుడు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 14-3-1930న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి. అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. 15-3-1931 న విడుదలయ్యారు 1972 లో కేంద్ర ప్రభుత్వం జారి చేసిన తామ్రపత్ర గ్రహీత.

## లింగమనేని వెంకట రామయ్య

తండ్రి బసవయ్య. దివి తాలూకా పెదముత్తేవి వాస్తవ్యులు. 1941లో నాగపూర్ వద్ద సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 12-5-41 న అరెస్టుచేసి మద్రాసు పంపారు. జైలు శిక్షను అనుభవించారు.

## రెడ్రౌతు లక్ష్మీపెరుమాళ్ళు



తండ్రి పెద్ద సీతారామస్వామి. జననం 1910. దివి తాలూకా వెల్లమల్లి రుద్రవరం. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 9-2-1931న రెండునెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవిస్తూ, గాంధీ - ఇర్విన్ ఒప్పందంతో 11-3-1931 న విడుదలయ్యారు. 1958 లో కీర్తి శేషులయ్యారు.

## వట్టపు సీతారామరెడ్డి



తండ్రి సుబ్బారెడ్డి. జన్మస్థలం దివితాలూకా కాజ. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. గాంధీజయంతి సందర్భంలో కాజలో ఊరేగింపు జరిపి అరెస్టు అయ్యారు. 22-11-42 నుంచి 22-12-1942 వరకు బందరు సబ్ జైలు నిర్బంధంలో వున్నారు.

## వీరపనేని బసవ కుటుంబయ్య

తండ్రి రత్తయ్య. జన్మస్థలం దివి తాలూకా నరసంపాలెం. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 16-5-1930 న తొమ్మిది నెలల 15 రోజులు కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి. వెల్లూరులలో శిక్ష అనుభవించారు. బందరులో విదేశీ వస్త్రాలయాల ముందు పికెటింగ్ చేసి, 19-3-1932 న లాఠీఛార్జీకి గురయ్యారు. దివి తాలూకా గ్రామంలో కాంగ్రెస్ ప్రచారం పెద్ద ఎత్తున సాగించారు. 18-5-1932 న మూడు నెలల కఠినశిక్ష, రు 100/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## వల్లభనేని కాశీవిశ్వనాథం



జన్మస్థలం దివి తాలూకా పెదముక్తేవి. విద్యార్థిదశ నుంచి అంటరానితనానికి వ్యతిరేకంగా పనిచేశారు. అల్హాబాద్, కాశీ హిందీ విద్యాపీఠ్ లలో హిందీ నభ్యసించారు. 'విప్లవ యుగం' విషయ సేకరణ చేసి, ఆ గ్రంథం ప్రచురణకు కారకులయ్యారు. కాంగ్రెసు సోషలిస్టు సభ్యులుగా 'జ్యోతి' పత్రిక ప్రచురించారు. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో రహస్య జీవితం గడుపుతూ, విజయవాడలో అరెస్టు అయిన విప్లవ నాయకులు ఎస్. ఆర్. కులకర్ణిని పోలీసుల కళ్ళుగప్పి, సబ్ జైల్ నుండి విడిపించటంలో ప్రముఖపాత్ర వహించారు. ఏలూరులో "ప్రజా ప్రచురణలు" ప్రారంభించి, అక్కడనే స్థిరపడి పోయారు.

## వేములపల్లి గణయ్య



జననం 1902. దివితాలూకా నాగాయితిప్ప. 1921 విజయవాడ ఎ. ఐ. సి. సి. సభకు హాజరయ్యారు. 1922లో వోటు బహిష్కరణ ప్రచారం చేశారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, లాఠీఛార్జీకి గురయ్యారు. కల్లుపాకల ముందు పికెటింగ్ చేసి, లాఠీదెబ్బలు తిన్నారు. తాటి గెలలు నరుకుతూ మరొకమారు లాఠీ దెబ్బలు తిన్నారు. 20-1-1932న నాగాయితిప్ప కాంగ్రెస్ సభలో పాల్గొని, నాల్గవ పర్యాయము లాఠీచార్జీకి గురయ్యారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని లాఠీఛార్జీకి గురయ్యారు క్విట్ ఇండియా ఉద్యమంలో రహస్య జీవితం గడిపి కార్యక్రమం నిర్వహించారు. ప్రస్తుత నివాసం దివితాలూకా పెదకళ్లేపల్లి.

## వేములపల్లి నాగయ్య



తండ్రి పిచ్చయ్య. జన్మస్థలం దివి తాలూకా. అవనిగడ్డ శివారు కొత్తపేట. రైతు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో లాఠీ చార్జికి గురయ్యారు. 9-12-1930 నుంచి 14-3-1931 వరకు బళ్ళారి జైలులో శిక్ష అనుభవించారు. 1941లో వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. మూడు నెలలు కఠిన శిక్ష రూ. 200 ల జరిమానా విధించారు. 20-1-1941 నుండి వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు.

## వేములపల్లి వెంకయ్య

తండ్రి రత్తయ్య. దివి తాలూకా నివాసి. 20-1-1932 న దివితాలూకా నాగాయతిప్పలో జరిగిన కాంగ్రెస్ కార్యకర్తల సమావేశంలో పాల్గొని అరెస్టు అయ్యారు. 17-2-1941 లో వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. బందరు సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్ 3 నెలలు కఠిన శిక్ష. రూ. 1000/- జరిమానా విధించారు రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## వేములపల్లి వెంకటగోపాలరావు

దివి తాలూకా నాగాయతిప్ప వాస్తవ్యులు. 2-8-32న అవనిగడ్డలో కల్లుషాపుల పికెటింగ్‌లో పాల్గొన్నారు. 2-8-32న అరెస్టయ్యారు.

## వేములపల్లి వెంకట రామయ్య

20-1-32న దివి తాలూకా నాగాయతిప్పలో కాంగ్రెస్ మీటింగ్‌కు హాజరయినప్పుడు తీవ్రంగా లాఠీచార్జీకి గురయ్యారు.

## వేములపల్లి వెంకటరత్నం



కృష్ణాజిల్లా వాస్తవ్యులు. 20-1-32 న దివి తాలూకా నాగాయితిప్ప గ్రామంలో కాంగ్రెస్ మీటింగ్ జరిగినప్పుడు, దానికి హాజరైనందుకు గాను తీవ్రంగా లాఠిచార్జీ చేయబడ్డారు.

1942 క్విట్ ఇండియా వుద్యమంలో పాల్గొని టెలిగ్రాఫ్ తీగలు తెగగొట్టగా, బ్రిటీష్ ప్రభుత్వం అరెస్టువారంట్ జారీ చేయగా, తప్పించుకుని 1944 వరకూ అండర్ గ్రౌండులో వుండి పనిచేశారు.

1930 నుండి ఇప్పటివరకూ ఖద్దరు ధరిస్తున్నారు ప్రస్తుత నివాసం చల్లపల్లి శివారు రామానగరం.

## వేములపల్లి కృష్ణారావు



తండ్రి పిచ్చయ్య. జననం 1922. దివి తాలూకాజువ్వలపాలెం రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో రహస్య జీవితం గడుపుతూ, కృష్ణలంక గ్రామంలో రహస్య కరపత్రాలు పంపిణీ చేశారు.

## వేమూరి నారాయణమూర్తి



తండ్రి ఆంజనేయావధానులు. జననం 28-8-1914. దివి తాలూకా అవనిగడ్డ. ఎస్. ఎస్. ఎల్. సి చదువుతూ, 1930 లో చదువుకు స్వస్తి చెప్పి, జాతీయోద్యమంలో చేరారు. 1932 లో అవని గడ్డలో కల్లుపాకలముందు పికెటింగ్‌చేసి, అరెస్టు అయ్యారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 27-1-1941 న నాలుగు మాసాల కఠినశిక్ష, రు 200/- జరిమానా విధించారు. వెల్లూరు సెంట్రల్ జైలులో శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు.

## సిద్ధాబత్తుల సూర్యనారాయణ



తండ్రి నాగరత్నం. 12-3-1900న దివి తాలూకా పెదకళ్ళేపల్లిలో జననం. నల్ల జెండాల ఉద్యమం, ఉప్పు సత్యాగ్రహాలలో జైలు శిక్షలు, గృహ నిర్బంధం అనుభవించారు. 1942 లో రహస్య జీవితం గడిపారు. 1956 లో కీర్తిశేషులైరి.

## సిద్ధాబత్తుల చంద్రమౌళి



తండ్రి నాగరత్నం. జన్మస్థలం దివి తాలూకా పెదకళ్ళేపల్లి ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. అయిదు రోజుల తరువాత వదలివేశారు. వ్యష్టి సత్యాగ్రహంలోను, క్విట్ ఇండియా ఉద్యమంలోను పాల్గొన్నారు. ఖాదీ ఉద్యమంలో పనిచేశారు.

## సజ్జా వీరరాఘవమ్మ

భర్త వెంకటరామయ్య. స్వగ్రామం దివి తాలూకా కోడూరు. శాసనోల్లంఘనంలో పాల్గొని, 31-8-1932

నుంచి సంవత్సరం కఠినశిక్షను వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు.

## సుసర్ల కృష్ణమూర్తి

జన్మస్థలం దివి తాలూకా పెదకళ్ళేపల్లి. సంగీత విద్వాంసులు. మహాత్మాగాంధీ ఉద్బోధతో ప్రభావితులై, తన ఫిడేల్‌ను అవల పారవేసి, మగ్గం చేపట్టి ఖద్దరు వస్త్రోత్పత్తి నిస్వయంగా సాగించారు. అంటరానితనానికి వ్యతిరేకంగాను, హరిజనోద్ధరణకు, ఖద్దరు వ్యాప్తికి విశేషంగా కృషిచేశారు.

## సూదిపల్లి వెంకయ్య

తండ్రి వెంకటేశ్వర్లు. జన్మస్థలం దివి తాలూకా అవనిగడ్డ. వ్యాపారి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు 26-7-1930 న రెండు సంవత్సరాలు కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931న విడుదలయ్యారు.

## సూరపనేని వెంకటరత్నం

తండ్రి వీరయ్య. దివి తాలూకా పెదసనగల్లు వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నందుకు 14-7-30 న ఆరు నెలల కఠిన శిక్ష, రు. 20 జరిమానా, చెల్లించని పక్షంలో మరో రెండు వారాల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి సెంట్రల్ జైల్లో శిక్షను అనుభవించారు.

## సూరపనేని వీరయ్య



తండ్రి బాపయ్య. జన్మస్థలం దివి తాలూకా పెదసనగల్లు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 12-7-1930 నుంచి ఆరునెలల మూడు వారాల కఠినశిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని, తీవ్రమైన లాఠీచార్జీకి గురిఅయ్యారు. 4-6-1932 నుంచి పద్దెనిమిది నెలల కఠినశిక్షను రాజమండ్రి, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు

## సూరపనేని రంగారావు

జన్మస్థలం దివి తాలూకా పెదసనగల్లు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీచార్జికి గురయ్యారు.

## సూరపనేని గోపాలకృష్ణయ్య

తండ్రి వీరయ్య. జన్మస్థలం దివి తాలూకా పెదసనగల్లు. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని. 8-9-1932 నుంచి 7 నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## సూర్యదేవర కృష్ణదేవరాయలు



తండ్రి పెద పిచ్చయ్య. జననం 1912, దివి తాలూకా వేములపల్లి. ఉప్పు సత్యాగ్రహంలో బందరు సత్యాగ్రహ శిబిరంలో చేరారు. గ్రామాలలో జాతీయ జెండాలను ఎగురవేసి, జాతీయ నినాదాలు గోడలపై రాస్తూ, స్వాతంత్ర్య సందేశాలు ప్రజలకు అందించారు. శాసనోల్లంఘన కాలంలో గుంటూరుజిల్లా చేబ్రోలులో లాఠీఛార్జీకి గురయ్యారు. గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా జిల్లేపల్లిలో విదేశ వస్త్రదహన కార్యక్రమం నిర్వహించారు. అస్పృశ్యతా నివారణకు కృషిచేశారు.

# భట్లపెనుమర్రు

## కామినేని వెంకటప్పయ్య



తండ్రి సూరయ్య. జననం 10-8-1906 దివి తాలూకా భట్లపెనుమర్రు. రైతు. 1920లో ఆంగ్లవిద్యకు స్వస్తి చెప్పి, ఆంధ్ర జాతీయ కళాశాలలో చేరారు. స్వగ్రామంలో ఖద్దరు కేంద్రాన్ని ఏర్పాటుచేసి, ఖద్దరు ప్రచారాన్ని పెద్ద ఎత్తున సాగించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని ఆరు నెలల మూడు వారాలు కఠిన శిక్షను 12-7-1930 నుంచి రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. శాసనోల్లంఘన కాలంలో 'వీరభారతి' రహస్య పత్రిక నడుపుతూ, అరెస్టు అయ్యారు. రహస్యాలు వెల్లండించమని పోలీసులు స్పృహతప్పే వరకు లాఠీఛార్జీ చేశారు. 1-3-1932 న అరెస్టు చేసి, 3-3-1932 న రెండేళ్ళు కఠిన శిక్ష, రు. 1000/- జరిమానా విధించారు. కృష్ణాజిల్లాలో రైతు ఉద్యమ నిర్మాతలలో ప్రముఖులు. తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంఘం కార్యకర్తగా పనిచేశారు. మద్య నిషేధం, హరిజనోద్ధరణ, లైబ్రరీ ఉద్యమాలలో పనిచేశారు క్విట్ఇండియా ఉద్యమ కాలంలో రహస్యంగావుంటూ పనిచేశారు. ప్రస్తుతం తెలంగాణాలో వుంటున్నారు.

## కామినేని సత్యనారాయణ

దివి తాలూకా భట్లపెనుమర్రు వాస్తవ్యులు. శాసనోల్లంఘన ఉద్యమంలో 25-1-32న తీవ్రంగా లాఠీఛార్జీకి గురి అయ్యారు.

## కామినేని వెంకటరత్నం

భట్లపెనుమర్రు వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 25-1-32న లాఠీఛార్జీకి గురై శిక్షింపబడ్డారు.

## కోనేరు గోపాలకృష్ణయ్య

తండ్రి పిచ్చయ్య. జన్మస్థలం దివితాలూకా భట్లపెనుమర్రు. విద్యార్థి దశలోనే ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు 5-8-1930 నుంచి ఆరు నెలల కఠిన శిక్షణను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. 14-5-1932 వ దివితాలూకా శ్రీకాకుళంలో కల్లుపాకల ముందు పికెటింగ్ జరిపి, తీవ్రమైన లాఠీ చార్జీకి గురై, స్పృహ తప్పి పడిపోయారు. 2-7-1932 న గుంటూరులో జరిగిన రాజకీయ మహాసభకు హాజరై, మరొకసారి అరెస్టు అయ్యారు.

## గొట్టిపాటి సూర్యనారాయణ

తండ్రి అప్పయ్య. దివి తాలూకా భట్లపెనుమర్రు వాస్తవ్యులు. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19-6-30న ఒక సంవత్సరం కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి. వెల్లూరు జైళ్ళలో శిక్షను అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ఫలితంగా 12-3-31న విడుదలయ్యారు.

## గొట్టిపాటి పద్మనాభయ్య

తండ్రి నాగయ్య. జన్మస్థలం దివితాలూకా భట్లపెనుమర్రు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 14-7-1930 న ఆరునెలలు కఠినశిక్ష, రు. 20 జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## గొట్టిపాటి నాగభూషణం



తండ్రి రామయ్య 1906 లో భట్లపెనుమర్రులో జన్మించారు రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా 14-7-1980 న ఆరుమాసముల కఠిన శిక్ష రు. 20 లు జరిమానావిధింపబడింది. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## చలసాని సూర్యప్రకాశరావు



తండ్రి కంచయ్య. జననం 1914 దివి తాలూకా భట్లపెనుమర్రు. 1929లో ఐలూరు గ్రామంలో కాంగ్రెస్ జెండా ఆవిష్కరణ కార్యక్రమంలో పాల్గొన్నారు. 1930లో గొట్టిపాటి బ్రహ్మయ్య నాయకత్వంలో అవనిగడ్డలో పికెటింగ్‌లో పాల్గొన్నప్పుడు, లాఠీచార్జీ చేసి, రెండురోజులు పోలీస్‌లాకప్‌లో వుంచి వదిలివేశారు. 1932శాసనోల్లంఘనంలో తన స్వగ్రామంలో కల్లు దుకాణంముందు పికెటింగ్‌చేసి మొత్తం 5సార్లు లాఠీచార్జీకి గురయ్యారు. ఒకసారి పోలీసులు చెరువులోకి ఈడ్చి పారేశారు. 4-6-1932న 18 నెలలు కఠినశిక్ష విధించారు రాజమంద్రి జైలులో శిక్ష అనుభవిస్తూ, అన్నిరకాల జైలుశిక్షలు-సెగ్రిగేషన్, చేతులకు బేడీలు, కాళ్ళకు చేతులకు బేడీలు. నెలరోజులపాటు సోలిటరీ కన్‌ఫైన్‌మెంట్‌వంటి శిక్షలను అనుభవించారు. లాహోర్ కుట్ర కేసు వీరులకు రాజమండ్రి జైలులో సదుపాయాలు సమకూర్చటంలో ప్రముఖ పాత్ర వహించారు. జైలులోనే అతివాద రాజకీయాలవైపు మొగ్గి, విడుదల అనంతరం, జిల్లాలో యువజన, రైతు, వ్యవసాయ కూలీ ఉద్యమాలకు సహాయపడ్డారు. ఇబ్రహీంపట్నం థర్మల్‌స్టేషన్, వాగన్ వర్కుషాపుల స్థాపనకు కృషి చేసినప్రముఖులలో ఒకరు. ప్రస్తుతనివాసం విజయవాడ. జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం కోశాధికారి.

## చలసాని బసవయ్య

జన్మస్థలం దివి తాలూకా భట్లపెనుమర్రు. 1932 శాసనోల్లంఘనంలో శ్రీకాకుళంలో కల్లు పాకల ముందు పికెటింగ్ చేసి, లాఠీ ఛార్జీకి గురయ్యారు 14-6-1932 న స్పృహ తప్పి పడిపోయే వరకు లాఠీ దెబ్బలు తిన్నారు. గుంటూరు రాజకీయ మహాసభకు హాజరై 2-7-1932 న అరెస్టు అయ్యారు.

## చలసాని గంగాధరరావు అనే గంగయ్య



తండ్రి నారయ్య. జన్మస్థలం దివి తాలూకా భట్లపెనుమర్రు. 1930 ఉప్పు సత్యాగ్రహ కాలంలో కల్లు దుకాణాల ముందు పికెటింగ్ చేసి వారంరోజులు సబ్‌జైలులో నిర్బంధితులుగావున్నారు. 1932 శాసనోల్లంఘనంలో శ్రీకాకుళం, ఘంటసాల మున్నగు గ్రామాలలోని కల్లు దుకాణాలముందు, బెజవాడ, బందరు పట్టణాలలోని విదేశీ వస్త్రాలయాలముందు ఆంధ్ర రత్న భవన్‌పునరాక్రమణకు జరిపిన పికెటింగులలో పాల్గొని తీవ్ర లాఠీఛార్జీలకు గురయ్యారు. 11-5-1932 నుంచి ఆరుమాసాల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. రు. 60/- జరిమానా విధించారు. 16-10-1942 నుంచి ఆరునెలలు కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## చలసాని వాసుదేవరావు



తండ్రిసుబ్బయ్య జననం 1913 దివి తాలూకా భట్లపెనుమర్రు. రైతు. ఆంధ్ర జాతీయ కళాశాలలో చదువుతూ జాతీయోద్యమంలో పాల్గొనడానికి చదువు మానివేశారు. స్వగ్రామంలో హరిజన దేవాలయ ప్రవేశ ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించారు. ఖాదీ ప్రచారంలో పాల్గొన్నారు. రైతు ఉద్యమ నిర్మాణంలో ప్రధాన పాత్ర వహించారు 1937 లో ఇచ్ఛాపురం నుంచి మద్రాసు వరకు 1400 మైళ్ళ పొడవు రైతు పాదయాత్రకు నాయకత్వంవహించారు. రెండవ ప్రపంచయుద్ధకాలంలో అజ్ఞాతవాసంగడిపారు.

రాష్ట్రంలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలలో ఒకరు

## చలసాని సీతారామయ్య



తండ్రి శోభనాద్రి. జన్మస్థలం దివి తాలూకా భట్లపెనమర్రు. రైతు. ప్రస్తుత నివాసం గుడివాడ. 1932 శాసనోల్లంఘనంలో విదేశీ వస్త్రాలయం ముందు పికెటింగ్ చేసి, లాఠీ దెబ్బలు తిన్నారు. కాంగ్రెసు కరపత్రాలు పంచుతుండగా, అరెస్టుచేసి, సబ్ జైలులో రెండు నెలలు నిర్బంధించారు. 31-10-1932 న ఆరు మాసాల కఠిన శిక్షను, రు. 550/- ల జరిమానాను విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## చలసాని జగన్నాధరావు



తండ్రి వెంకటరత్నం. జన్మస్థలం దివితాలూకా భట్లపెనుమర్రు. బ్రహ్మచారి. దేశం కోసం ప్రాణాలు అర్పించిన యోధులు. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 4-6-1932న 18 నెలల కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, బళ్లారి. జైళ్ళలో శిక్ష అనుభవించారు. తరువాత కమ్యూనిస్టు పార్టీలో చేరారు. 1949లో పోలీసు కాల్పుల్లో మరణించారు.

## చలసాని బసవయ్య



తండ్రి వెంకటరత్నం. జన్మస్థలం దివితాలూకా భట్లపెనుమర్రు. 1918 లో పెదకళ్లేపల్లిలో జరిగిన కాంగ్రెస్ సమావేశానికి హాజరై. హోమ్‌రూల్ ఉద్యమంలో పాల్గొన్నారు. 1921 లో విజయవాడ ఏ. ఐ. సి. సి. సమావేశానికి వాలంటీరుగా పనిచేశారు. స్వగ్రామంలో గాంధీ విగ్రహ ప్రతిష్ఠాపనకు కృషి చేశారు ఖద్దరు ప్రచార ఉద్యమంలో పాల్గొన్నారు. 1930 ఉప్పు సత్యాగ్రహం సందర్భంలో బందరు సత్యాగ్రహ శిబిర నిర్వహణ బాధ్యతలు వహించారు. బందరు కోనేరు సెంటరులో జెండావీరునితో పాటు లాఠీచార్జీకి గురయ్యారు. ప్రస్తుత నివాసం దివితాలూకా నాదెళ్ళ వారిపాలెం.

## చలసాని వాగేశ్వరరావు

తండ్రి వీరభద్రయ్య. జన్మస్థలం దివితాలూకా భట్లపెనుమర్రు, రైతు. 1932 శాసనోల్లంఘనంలో దివితాలూకా శ్రీకాకుళంలో కల్లు పాకలముందు పికెటింగ్‌చేసి. తీవ్రమైన లాఠీ ఛార్జీకి గురై. స్పృహ కోల్పోయారు. 30 10-1932 న ఆరు నెలల కఠినశిక్ష, రు 500/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## చలసాని నారాయణమూర్తి

తండ్రి వెంకటరత్నం. జన్మస్థలం దివి తాలూకా భట్లపెనుమర్రు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 12-7-1930 నుంచి ఆరుమాసాల మూడువారాలు కఠినశిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. స్వగ్రామంలో కల్లు పాకలముందు పికెటింగ్ చేసి 22-1-1932న తీవ్రమైన లాఠీచార్జీకి గురయ్యారు తిరిగిబందరులో 19-8-1932న విదేశీ వస్త్రాలయాలముందు పికెటింగుచేసి మరొకసారి లాఠీచార్జీకి గురయ్యారు. గ్రామాలలో శాసనోల్లంఘన ఉద్యమ ఆవశ్యకతను గురించి ప్రచారం చేశారు. 4-6-32న 18 నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 31-8-1933న విడుదలయ్యారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## చలసాని శ్రీరాములు

దివితాలూకా భట్లపెనమర్రు వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో రెండుసార్లు లాఠీచార్జీ చేయబడ్డారు.

## చలసాని కుటుంబయ్య

జన్మస్థలం దివితాలూకా భట్లపెనుమర్రు. శాసనోల్లంఘనంలో పాల్గొని, 25-1-1952న తీవ్రమైన లాఠీ చార్జీకి గురయ్యారు.

## చలసాని కోటయ్య

జన్మస్థలం దివితాలూకా భట్లపెనుమర్రు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీచార్జీకి గురయ్యారు.

## చేకూరి వీరయ్య

జన్మస్థలం దివి తాలూకా భట్లపెనుమర్రు 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని లాఠీచార్జీకి గురయ్యారు.

## దేవినేని వెంకటామయ్య

దివి తాలూకా భట్లపెనుమర్రు వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు లాఠీ చార్జీకి గురిఅయ్యారు.

## దేవినేని కోటయ్య

జన్మస్థలం దివితాలూకా భట్లపెనుమర్రు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీదెబ్బలు తిన్నారు.

## దేవినేని భీమయ్య



తండ్రి రామలింగయ్య. జన్మస్థలం దివితాలూకా భట్ల పెనమర్రు రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని 12-7-1930 నుంచి ఆరుమాసాల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘనంలో 25-1-1932న తీవ్రమైన లాఠీ చార్జీకి గురయ్యారు. 16-4-1932 న అరెస్టుచేసి బందరు సబ్ జైలులో నిర్బంధించారు. 14-5-1932న శ్రీకాకుళంలో కల్లుపాకల ముందు పికెటింగ్ చేస్తూండగా తిరిగి తీవ్రమైన లాఠీచార్జీకి గురయ్యారు. 4-6-1932 నుంచి 18మాసాల కఠిన శిక్షను రాజమండ్రి సెంట్రల్ జైలులో అనుభవించి,31-8-1933న విడుదలయ్యారు.

## దేవినేని నరసింహం

జన్మస్థలం దివితాలూకా భట్లపెనుమర్రు, 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీ ఛార్జీకి గురయ్యారు.

## పింగళి వెంకయ్య



తండ్రి హనుమంతరాయుడు జననం 2-8-1876. దివితాలూకా భట్లపెనుమర్రు. స్వగ్రామం. దివితాలూకా యార్లగడ్డ. కరణం. బందరులో ఉన్నత విద్యాభ్యాసం. కొలంబోలో కేంబ్రిడ్జి సీనియర్ పరీక్షకు హాజరై, ఉత్తీర్ణులయ్యారు. భారత జాతీయ పతాకం(కాంగ్రెస్)సృష్టికర్త.19వయేట దక్షిణాఫ్రికా బోయర్ యుద్ధంలో పాల్గొన్నారు.కొంతకాలం రైల్వే గార్డుగా పనిచేశారు. జపనీస్ భాష అభ్యసించారు. ఉత్తరభారత దేశంలో అయిదేళ్ళు గడిపి బ్రిటిషు ప్రభుత్వాన్ని కూలద్రోయటానికి అనేక మంది విప్లవ కారులతో సంబంధాలు పెట్టుకొన్నారు. వ్యవసాయ శాస్త్రంలో ఆసక్తి-అభినివేశం వుంది. బ్రిటిషు రాయల్ అగ్రికల్చరల్ సొసైటీ సభ్యులుగా నియుక్తులయ్యారు. బందరు జాతీయ కళాశాల విద్యార్థులకు వ్యవసాయ శాస్త్రం, గుర్రపుస్వారీ, ప్రాథమిక సైనికశిక్షణలో శిక్షణ గరిపారు. సన్‌యత్ సేన్ జీవిత చరిత్రరాసి దేశ ప్రజలలో విప్లవోత్తేజం కలిగించడానికి ప్రయత్నించారు. జాతీయజెండా ఆవశ్యకతపై గ్రంథం రచించి జాతీయ కాంగ్రెస్ చేత ఆ ఆవశ్యకతను గుర్తింపచేశారు. 4-7-1963 న విజయవాడలో కీర్తిశేషులైరి.

## పోలవరపు సత్యనారాయణమూర్తి

దివితాలూకా భట్లపెనుమర్రు వాస్తవ్యులు బందరులో విదేశీవస్త్ర దుకాణాలముందు, కల్లు దుకాణాలముందు పికెటింగ్ చేశారు 22-1-32 న, 15-3-32 న అరెస్టు చేసి లాఠీచార్జీ చేశారు.

## యలమంచిలి భాస్కరరావు

తండ్రి హనుమయ్య. జననం 5-2-1933 దివి తాలూకా భట్ల పెనమర్రు. రైతు. హిందీ విద్వాన్. ఆంగ్ల విద్యను బహిష్కరించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. రహస్య జీవితం గడిపారు. పట్టి యిచ్చిన వారికి రు 600/- పారితోషికాన్ని పోలీసులు ప్రకటించారు. 5-7-1943 న అరెస్టు చేసి, డి.ఐ ఆర్. క్రింద మూడు సంవత్సరాల తొమ్మిది నెలల పదిహేను రోజులు కఠిన శిక్ష విధించారు. అలీపురం, వెల్లెస్లీ శానిటోరియం జైళ్ళలో శిక్ష అనుభవించారు. 30-3-1946 న ప్రభుత్వ ఉత్తర్వు మేరకు విడుదలయ్యారు. ఆంధ్ర యూత్ కాంగ్రెసు స్థాపకులలో ఒకరు.

## వెల్లంకి వీరరాఘవయ్య



తండ్రి వెంకటరత్నం. రైతు. దివి తాలూకా భట్లపెనుమర్రు వాస్తవ్యులు. కల్లు దుకాణాల ముందు పికెటింగ్ చేస్తుండగా దివి తాలూకా శ్రీకాకుళంలో 14-5-1932న తీవ్రమైన లాఠీచార్జికి గురయ్యారు. 22-6-1932 న 6 నెలల కఠిన శిక్ష విధింపబడగా రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్ష అనుభవించారు.

# ఘంటసాల

## ఆకురాతి వీరరాఘవయ్య

తండ్రి రెడ్డెమ్మ. జననం 1908న దివితాలూకా ఘంటసాల. 1932 శాసనోల్లంఘనంలో కోసూరు గ్రామంలో తాటిగెలలు నరికి అరెస్టయ్యారు. ప్రస్తుత నివాసం గుంటూరు జిల్లా మంగళగిరి.

## గొట్టిపాటి బ్రహ్మయ్య



తండ్రి వీరరాఘవయ్య. జననం 3-12-1898 దివి తాలూకా ఘంటసాల. బందరు నోబుల్ హైస్కూలులో విద్యాభ్యాసం. రైతు పెద్దగా పేరొందారు. 1917లో లైబ్రరీ, వయోజన విద్య ఉద్యమాలు నిర్వహించారు. 1920లో "ఓటు చేయకండి" అని ప్రచారం చేశారు. జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులుగా, బందరు తాలూకా బోర్డు అధ్యక్షులుగా, తూర్పుకృష్ణా ఖాదీబోర్డు అధ్యక్షులుగా పనిచేశారు. ఘంటసాలలో చరఖా సంఘం స్థాపించారు. జమీందారీ రైతు ఉద్యమ ప్రారంభకులలో ఒకరు. సైమన్ కమిషన్ బహిష్కరణలో పాల్గొన్నారు. 1930లో అప్పటి మద్రాసు రాష్ట్రగవర్నరుబందరు రాకసందర్భంలోనల్లజెండాల ప్రదర్శన నిర్వహించారు. అందుకు 15-3-1930న సంవత్సరం ఆరువారాల కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, బరంపురం, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు 15-1-1932న రెండేళ్ళ కఠినశిక్ష, రు. 1000/- జరిమానా విధించారు. రాజమండ్రి, బళ్లారి, మధురై, కడలూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1933లో ఘంటసాల దేవాలయంలోకి హరిజనులను ప్రవేశపెట్టారు. 1937లో నంద్యాలలో జరిగిన ఆంధ్ర రాజకీయ మహాసభకు అధ్యక్షత

వహించారు. 1937-40 మధ్యకాలంలో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో 25-8-1942 నుంచి 9-12-1944 వరకు వెల్లూరు తంజావూర్ జైళ్ళలో డిటెన్యూగా వున్నారు. 1962 నుండి 1964 వరకు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు. 1964 జులై నుంచి 1968 జూన్ వరకు ఆంధ్రప్రదేశ్ శాసనమండలి అధ్యక్షులు.

## గొర్రెపాటి వెంకట సుబ్బయ్య (కిసాన్)

తండ్రి అప్పయ్య. దివి తాలూకా ఘంటసాలలో 1903లో జన్మించారు "కిసాన్ సుబ్బయ్య" గా ప్రసిద్ధులు. 1929లో ఖద్దరు ఉద్యమ సంచారంలో గాంధీజీ ఘంటసాల వచ్చినపుడు కాంగ్రెస్ వాలంటీర్లకు వీరు సేనాధిపతిగా వ్యవహరించారు. వీరి నాయకత్వాన ప్రజలు క్రమశిక్షణగా ఉండడం చూసి గాంధీజీ ప్రశంసించారు. (భార్య సరస్వతమ్మగారు కూడా కల్లు దుకాణాల పికెటింగ్ ఉద్యమంలో పాల్గొని జైలుకు వెళ్లారు. ఆమె గాంధీజీకి మెడలోని బంగారు గొలుసు ఇచ్చారు.) కృష్ణాజిల్లా జమీందారీల రద్దుకై రిపోర్టు వ్రాయడానికి వచ్చిన ప్రకాశం కమిటీ ముందు సాక్ష్యాలను సమీకరించుటలో ఎక్కువ కృషి చేశారు. ఉప్పు సత్యాగ్రహంలో 27-5-30 నుండి 6 నెలల కఠిన శిక్షను రాజమండ్రి, వెల్లూరు, అలీపురం జైళ్ళలో అనుభవించారు. 1932 ఆంధ్ర రాజకీయ సభలకు హాజరయ్యారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమకాలంలో ఆరు నెలల కఠిన శిక్ష, రు. 500/-లు జరిమానా విధించబడింది. క్విట్ ఇండియా ఉద్యమంలో 3 నెలల కఠిన శిక్ష విధించబడింది. దివి తాలూకా రైతు సంఘాధ్యక్షులుగా పనిచేశారు. 1970 డిసెంబర్ 10 న కీర్తిశేషులయ్యారు.

## గొర్రెపాటి సరస్వతమ్మ

కిసాన్ వెంకట సుబ్బయ్యగారి పత్ని. 1908లో జననం. ఘంటసాలలో 29-3-33 న కల్లుదుకాణాలు పికెటింగ్ చేయగా 2-4-33 న మూడు మాసాల శిక్ష విధించారు. గాంధీజీ పర్యటన సందర్భంలో మెడలోని బంగారు గొలుసును, గాజులను గాంధీజీకి సమర్పించారు.

## పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్య



తండ్రి వెంకన్న. జననం 1-6-1898 ఘంటసాల వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 27-5-30 నుండి రాజమండ్రి సెంట్రల్ జైలులో మూడు నెలల కఠిన శిక్షను అనుభవించారు. 1917 లో చదువుకు స్వస్తి చెప్పారు. 1918 లో కాంగ్రెస్-ముస్లిమ్ లీగ్ ప్రణాళిక పైన వివిధ గ్రామాలలో సంతకాలు సేకరించారు 1919 జిల్లా కాంగ్రెసు సభ్యులు - జిల్లా కాంగ్రెస్ కమిటీ ఆదేశానుసారం "ఫలానా తేదీ వరకు భూమి శిస్తు ఇవ్వవద్దు" అనే నిర్ణయాన్ని ఆచరించారు.

హిందీ బెంగాలీలు చదివారు. బహుళ గ్రంథకర్త. జీవితచరిత్రల రచయితగా ప్రసిద్ధి చెందారు. సాహిత్య అకాడమీఅవార్డులు పొందారు. వృద్ధాప్యంలో నేడు కూడా రచనా వ్యాసంగం విడనాడలేదు.

## గొర్రెపాటి కుటుంబమ్మ

తండ్రి వీరమాచనేని బుచ్చయ్య. భర్త పండిత వెంకటసుబ్బయ్య స్వగ్రామం దివితాలూకా ఘంటసాల. హిందీ, సంస్కృత భాషలలో పరిచయం కలదు. 29-3-1933 న ఘంటసాలలో కల్లు దుకాణాలముందు పికెటింగ్ చేయగా, 3 నెలలు కఠిన శిక్ష అనుభవించారు. కీర్తిశేషులైరి.

## గొర్రెపాటి చినన‌రసింహం



తండ్రి కోటయ్య. 5-4-1902 లో దివి తాలూకా ఘంట సాలలో జన్మించారు. రైతు. 1930 శాసనోల్లంఘనంలో కల్లు పాకలముందు పికెటింగ్ తాటి గెలలు నరికే కార్యక్రమానికి ఆధ్వర్యం వహించగా అరెస్టుచేసి, 4-2-1931 న ఆరునెలలు కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. తిరిగి తన గ్రామంలో 9-2-1932 న 22-2-1932 న పికెటింగ్ చేసి, తీవ్రమైన లాఠీచార్జీలకు గురయ్యారు. ఆరునెలల కఠిన శిక్ష రు. 500/- జరిమానా విధించారు. జరిమానా వీరు చెల్లించలేదు. వీరి భూములు వేలం వేయగా ఎవరూ కొనలేదు. అభ్యుదయ కార్యక్రమాలన్నిటిలోనూ వీరు పాల్గొన్నారు. 1923- 29 వరకూ నడిపిన "దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు ఖద్దరుసంస్థ" కార్యనిర్వహణ వీరి చేతిమీదుగా జరిగింది. శ్రీపట్టాభిగారు "ఋషివంటి వాడు" అని వీరిని ప్రశంసించారు. 24-5-72 న వీరు. కీర్తిశేషులయ్యారు.

## గొర్రెపాటి లక్ష్మీకాంతమ్మ



తండ్రి వేమూరి వీరన్న. భర్త చినన‌రసింహం. జననం 1907 దివితాలూకా ఘంటసాల. 29-3-33న తన గ్రామంలో కల్లుపాకల ముందు పికెటింగ్‌చేసి, అరెస్టు అయ్యారు. 2-4-1933 న మూడు నెలలు శిక్షవిధించారు.

## చెరుకువాడ వెంకట నరసింహం



తండ్రి సీతారామయ్య. జననం 1-3-1887దివితాలూకా ఘంటసాల. 1906 లో మద్రాసు యూనివర్సిటీ మెట్రిక్యులేట్. ఫస్టు క్లాసులో 'లా' చదివిపరీక్ష ఫీజు కట్టుకోలేక మానివేశారు. 'దేశాభిమాని' 'కృష్ణా పత్రిక' సబ్ ఎడిటర్‌గా పనిచేశారు. 1910 నుంచి 1919 వరకు గుడివాడ తాలూకా కౌతవరంలో 'ఆంధ్ర లక్ష్మీ జాతీయ విద్యాలయం' స్థాపక నిర్వాహకుడుగా అనేక మంది ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులను తీర్చిదిద్దారు. అనంతరం ఆంధ్ర జాతీయ కళాశాలలో అధ్యాపకులుగా చేరారు. అనేక ఇన్సూరెన్స్ కంపెనీలలో పనిచేశారు. 1921 సహాయ నిరాకరణలో పాల్గొని ఒక ఏడాది కఠిక శిక్షను,ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని 22-4-1930 నుంచి సంవత్సరం కఠిక శిక్షను రాజమండ్రి, వెల్లూరు, కడలూరు జైళ్ళలోను, తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని, 7-1-1932 నుంచి సంవత్సరం కఠినశిక్షను రాజమండ్రి, కడలూరు జైళ్ళలోను అనుభవించారు. మంచివక్త "ఉపన్యాస డిండిమ"గా పేరుపొందారు. స్వాతంత్ర్య పోరాట కాలంలో వివిధ జిల్లాలలో పర్యటించి ప్రజలను తన ప్రసంగాలతో ఉత్తేజపర్చారు నిర్మాణకార్యక్రమంలో పాల్గొన్నారు. అనేక గ్రంథాలు రచించారు. 23-6-1964 లో కీర్తిశేషులైరి.

## దోనేపూడి సీతారామయ్య

తండ్రి వెంకటరాయుడు. దివితాలూకా ఘంటసాల వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు 27-5-30 నుండి తొమ్మిది నెలల కఠినశిక్షను వెల్లూరు, అలీపురం. జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో కూడా పాల్గొన్నారు.

## దోనేపూడి బాలమ్మ

తండ్రి వేమూరి లక్ష్మయ్య. భర్త సీతారామయ్య స్వగ్రామం దివి తాలూకా ఘంటసాల. 1931 శాసనో

ల్లంఘనంలో అరెస్టు అయ్యారు. జైలు శిక్ష అనుభవించారు.

## బోయపాటి కృష్ణారావు

తండ్రి దేవన్న. జన్మస్థలం దివితాలూకా ఘంటసాల. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 27-5 1930 నుంచి 9 నెలల కఠిన శిక్షను తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## వేమూరి వెంకటరామయ్య



తండ్రి రత్తయ్య. జననం 1908 దివి తాలూకా ఘంటసాల. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 27-5-1930 నుంచి తొమ్మిది మాసాల కఠిన శిక్షను రాజమండ్రి. వెల్లూరు అలీపురం జైళ్ళలో అనుభవించారు.

# కైకలూరు తాలూకా వివిధ గ్రామాలు

## అట్లూరి వెంకటసుబ్బయ్య



తండ్రి నరసయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకాపోలుకొండ. రైతు. శాసనోల్లంఘనంలో తీవ్రమైన లాఠీ చార్జీకి గురయ్యారు. 29-6-1932 నుంచి ఏడాది కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. 10-4-1933 న విడుదలయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పుట్లచెరువువద్ద రైలు పట్టాల పీకివేత కేసులో ముద్దాయి. రు. 200/- జరిమానా విధించారు.

## అడ్డల ఆనందరావు

కైకలూరు తాలూకా మొఖాసా కలవపూడి నివాసి. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాలు పీకివేత, తంతి తీగెలు త్రెంచి వేత చర్యలకుగాను డి.ఐ.ఆర్. క్రింద అరెస్టు చేశారు. మైనరు అయినందున వదిలివేశారు.

## అట్లూరి గోపాలరావు



తండ్రి నరసయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా పోలుకొండ. రైతు. క్విట్ఇండియా ఉద్యమంలో పుట్లచెరువు వద్ద రైలు పట్టాలు పీకివేత కేసులో ముద్దాయి. 18.10 1943 నుంచి ఆరు మాసాలు కఠిన శిక్షను ఆలీపురం జైలులో అనుభవించారు.

## అడుసుమిల్లి వెంకట సుబ్బారావు



తండ్రి జన్నయ్య. కైకలూరు తాలూకా పైవాకలో జన్మించారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. రెండు కేసులలో మొత్తం 9½ మాసాలు కఠినశిక్ష విధింపబడగా 16-5-1930 నుండి మద్రాసు, రాజమండ్రి జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1932లో 4 మాసాల శిక్ష అనుభవించారు. లాఠీచార్జికి గురయ్యారు.

## ఆచంట పిచ్చయ్య

తండ్రి ఉద్దండ రామయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా కలవపూడి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు రు. 100/- జరిమానా విధించారు. 29-12-1942 నుంచి 16-8-1943 వరకు అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## అరెకపూడి శ్రీరంగయ్య

తండ్రి వెంకట సుబ్బయ్య. కైకలూరు తాలూకా కల్వపూడి వాస్తవ్యులు. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాలు పెరికివేత, టెలిగ్రాఫ్ తీగెల తెంచివేత సందర్భంగా రు. 50 జరిమానా విధింపబడింది. అలీపురం క్యాంప్ జైలులో 29-12-42 నుండి ఆరు నెలల కఠిన శిక్షను అనుభవించారు

## అరెకపూడి రామదాసు

తండ్రి గంగయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా పైవాక. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, 7-5-1930 నుంచి ఆరుమాసాల పదిహేను రోజుల కఠిన శిక్షను రాజమండ్రి, వెల్లూరు, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## ఉన్మని నరసింహరాజు



తండ్రి సీతారామరాజు. కైకలూరు తాలూకా ఆలపాడులో 1910 న జన్మించారు. రైతు. తన 25 వ ఏటనే రాజకీయ రంగంలో ప్రవేశించి అనేకసార్లు లాఠీ దెబ్బలకు గురయ్యారు. 1929లో సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని అవనిగడ్డ తాళ్ళతోపులో లాఠీ దెబ్బలకు గురయ్యారు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని 26-6-1930 నుంచి 7 నెలల కఠిన శిక్ష రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. తిరిగి కైకలూరులో కల్లు పాకల ముందు పికెటింగ్ చేసి 21-3-1932 న, 24-3-1932 న లాఠీ దెబ్బలకు గురయ్యారు 1959లో కీర్తిశేషులయ్యారు.

## ఉప్పలపాటి కోటేశ్వరరావు



తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా కలవపూడి. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాల పెరికివేత, తంతి తీగల త్రెంచివేత చర్యలలో పాల్గొని, అరెస్టు అయ్యారు. నాలుగు మాసాలు సబ్ జైలు నిర్బంధంలో వున్నారు. అనంతరం ఒక వత్సరం కఠినశిక్ష విధించారు. మైనరు అయినందున రు. 1000/- బాండుపై విడుదల చేశారు.

## ఉప్పలూరి వీర రాఘవయ్య



తండ్రి వెంకట సుబ్బయ్య. జననం 1911 కైకలూరు తాలూకా పోలుకొండ శాసనోల్లంఘనంలో పాల్గొన్నందుకు సంవత్సరం కఠిన శిక్ష రు. 100లు జరిమానా విధించారు. 29-6-1932 నుంచి 10-4-1933 వరకూ రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పుట్లచెరువు రైలు మార్గ విధ్వంసన కేసులో ముద్దాయి. 1943 ఫిబ్రవరిలో అరెస్టు చేయబడ్డారు. 9 నెలలు సబ్ జైలులో వున్నారు 27-10-1943న 2 సంవత్సరాలు కఠిన శిక్ష విధించగా అలీపురం క్యాంపు జైలులో 18మాసాలు శిక్ష అనుభవించాక విడుదల చేయబడ్డారు.

## కంతేటి కాశీవిశ్వనాథం



తండ్రి పిచ్చయ్య. జననం 1906 కైకలూరు. వ్యాపారి. చిన్నతనం నుంచి జాతీయాభిమానంతో విదేశీ వస్త్ర దహనం, రాట్నం, తకిలీలు వడుకుట వంటి కార్యక్రమాలలో పాల్గొన్నారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు జైలుశిక్ష 200-/ జరిమానా విధించారు. 6-4-1943 నుంచి 2-10-1943 వరకు అలీపురం జైలులో శిక్ష అనుభవించారు

## కొల్లిపర వీరరాఘవయ్య

తండ్రి సుందరరామయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా మొకాసా కలవపూడి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాలు పెరికివేత, తంతి తీగెలు త్రెంచివేత చర్యలకుగాను అరెస్టు అయ్యారు 29-12-1942 న ఆరు నెలల జైలు శిక్ష, రు. 50/ జరిమానా విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## కొనకళ్ళ జనార్ధనరావు

కైకలూరు తాలూకా నివాసి. శాసనోల్లంఘనంలో పాల్గొని, 18-1-1932న అరెస్టు అయ్యారు.

## కోనేరు సత్యనారాయణ



తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా పోలుకొండ. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పుట్లచెరువు వద్ద రైలు పట్టాలపీకివేత కేసులో ముద్దాయి. దాదాపు 15 నెలలు రహస్య జీవితం గడిపారు. అనంతరం అరెస్టు అయి, కేసు విచారణ కాలంలో నాలుగు మాసాలు కైకలూరు, బందరు సబ్ జైళ్ళలో నిర్బంధంలో వున్నారు.

## కోనేరు వెంకటరత్నం

తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా పోలుకొండ. 1932 శాసనోల్లంఘనంలో కల్లుపాకల ముందు పికెటింగ్ చేశారు ఆరు మాసాల కఠిన శిక్ష విధించారు 11-5-1932 నుంచి రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 1969 లో కీర్తిశేషులైరి.

## కోనేరు నాగభూషణం

తండ్రి కోదండరామయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా పోలుకొండ. రైతు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పుట్లచెరువు వద్ద రైలుపట్టాలు పీకివేత కేసులో ముద్దాయి. కైకలూరు. బందరు సబ్ జైళ్ళలో నిర్బంధం 9 నెలల విచారణ అనంతరం రు. 200ల జరిమానా విధించారు. 1970లో కీర్తిశేషులైరి.

## గుత్తా కృష్ణారావు



తండ్రి నాయుడమ్మ. జన్మస్థలం కైకలూరు తాలూకా పోలుకొండ. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పుట్ల చెరువు వద్ద రైలు పట్టాలు పీకివేత కేసులో ముద్దాయి. 15 నెలలు రహస్యజీవితం గడిపి అరెస్టు అయ్యారు. కేసు విచారణ కాలంలో గుడివాడ సబ్ జైలులో నాలుగు నెలలు నిర్బంధంలో వున్నారు ప్రస్తుత నివాసం పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు తాలూకా చాటపర్రు.

## ఘంటా పేరయ్య

తండ్రి కోటయ్య. జన్మస్థలం దివితాలూకా చల్లపల్లి. 1932 శాసనోల్లంఘనంలో కైకలూరులో పికెటింగ్ చేసినందుకు రెండేళ్ళ కఠిన శిక్ష విధించారు. మైనరు కావడంవల్ల తంజావూరులోని బోర్‌స్టల్ స్కూలునందు శిక్ష అనుభవించారు. 12-1-1968 న కైకలూరులో కీర్తిశేషులైరి.

## చలసాని రంగయ్య

జన్మస్థలం కైకలూరు తాలూకా ఉనికిలి. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని లాఠీ ఛార్జీకి గురయ్యారు.

## చావలి నీలకంఠం

తండ్రి రామశాస్త్రి. జన్మస్థలం కైకలూరు తాలూకా గోపాలపురం. వ్యష్ఠి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 3-3-1941న రెండునెలల కఠినశిక్ష, రు10/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## చిర్రావూరి అచ్యుతరామయ్య



తండ్రి లక్ష్మీనారాయణ. జన్మస్థలం కైకలూరు. ఉపాధ్యాయుడు. యుద్ధ వ్యతిరేక నినాదాలు చేసినందుకు డి.ఐ.ఆర్. క్రింద అరెస్టు చేశారు. 11-1-1941న నాలుగు మాసాల కఠినశిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. తిరిగి క్విట్ ఇండియా ఉద్యమంలో బ్రిటిష్ ప్రభుత్వంపై తిరుగుబాటు జరపమని ఉద్బోధించే కరపత్రాలు పంచినందుకు 2-10-1942న అరెస్టు చేసి 16-10-1942న ఆరుమాసాల కఠినశిక్షను విధించారు. అలీపురం క్యాంప్ జైలులో శిక్షను అనుభవించారు.

## తమ్మారెడ్డి గోపాలరావు



తండ్రి లక్ష్మీనారాయణ. జన్మస్థలం కైకలూరు తాలూకా పోలుకొండ. రైతు. పుట్లచెరువువద్ద రైలు పట్టాలు పీకివేత కేసులో ముద్దాయి. 15మాసాలు రహస్య జీవితం గడిపి, 25-3-1944 న అరెస్టు అయ్యారు. కొన్ని నెలలు సబ్ జైలులో నిర్బంధంలో వున్నారు.

## తాతినేని రామశాస్త్రులు చౌదరి

తండ్రి వెంకన్న. జననం 1902 కైకలూరు తాలూకా వైవాక. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. తొమ్మిదిన్నర మాసాలు కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. జైలులో వుండగా ఉబ్బసం వ్యాధికి గురై, అదే వ్యాధితో 1952 లో కన్నుమూశారు.

## దాసరి వెంకటసుబ్బయ్య



తండ్రి రాయన్న. జన్మస్థలం కైకలూరు తాలూకా కలవపూడి. రైతు క్విట్ ఇండియా ఉద్యమంలో డి. ఐ. ఆర్. క్రింద అరెస్టు చేశారు. 29-12-42న ఆరు మాసాలు కఠిన శిక్షను, రు. 50/-ల జరిమానా విధించారు. అలీపురం క్యాంప్ జైలులో శిక్ష అనుభవించారు. ప్రస్తుత నివాసం ఉనికిలి శివారు కాంగ్రెసుపేట.

## దుక్కిపాటి రామనాథం

తండ్రి రంగయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా కలవపూడి. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాల పెరికివేత కేసులో 29-12-1942 న 7 నెలల కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## దుగ్గిరాల అమరయ్య

తండ్రి రామకృష్ణయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా పోలుకొండ. రైతు. శాసనోల్లంఘనంలో అరెస్టు అయ్యారు. సంవత్సరం కఠినశిక్షను 29-6-1932 నుంచి 10-4-1933 వరకు రాజమండ్రి జైలులో అనుభవించారు.

## నిమ్మగడ్డ సోమశేఖరరావు

తండ్రి మల్లికార్జునుడు. కైకలూరు తాలూకా ఉనికిలి వాస్తవ్యులు 26-1-40 న పునాదిపాడు హైస్కూలులో విద్యార్థుల సమ్మెను ప్రోత్సహించారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 22-12-41 న ఆరు నెలల కఠిన శిక్ష విధించబడింది. అలీపురం, బళ్ళారి జైళ్ళలో శిక్షను అనుభవించారు.

## నిమ్మగడ్డ నారాయణరావు



తండ్రి వెంకటరామయ్య. జననం 22-5-1909 కైకలూరు తాలూకా ఉనికిలి. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. సంవత్సరం కఠిన శిక్షను 29-6-1932 నుంచి 10-4-1933 వరకు రాజమండ్రి జైలులో అనుభవించారు. ప్రస్తుత నివాసం విజయవాడ వద్ద పటమట లంక.

## నెక్కలపూడి వెంకటరామయ్య

తండ్రి కోటయ్య. కైకలూరు తాలూకా పోలుకొండ వాస్తవ్యులు. రైతు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 29-6-32న సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్ష అనుభవించి 10-4-33న విడుదలయ్యారు.

## నెక్కలపూడి వీరరాఘవయ్య



తండ్రి రామయ్య. పోలుకొండ. క్విట్ ఇండియా ఉద్యమంలో పుట్లచెరువు వద్ద రైలు పట్టాలు పెరికివేత కేసులో ముద్దాయి. 18-10-1943 నుంచి ఆరు మాసాల కఠిన శిక్షను అలీపురం క్యాంప్ జైలులో అనుభవించారు.

## ఎన్. నాయుడమ్మ

కైకలూరు తాలూకా నివాసి. శాసనోల్లంఘనంలో 21-3-1932 న కైకలూరులో కల్లు పాకలముందు పికెటింగ్ చేసి, లాఠీదెబ్బలు తిన్నారు. అనంతరం అరెస్టు చేసి, దూరప్రాంతానికి తీసికెళ్ళి వదిలివేశారు.

## పర్వతనేని బసవశంకరరావు



తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా పోలుకొండ. రైతు. 1932 శాసనోల్లంఘనంలో కల్లు పాకల ముందు పికెటింగ్ చేశారు. హరిజనులకు దేవాలయం ప్రవేశం కల్పించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పుట్లచెరువు వద్ద రైలుపట్టాలు పెరికివేత కేసులో నిందితులు. ఆ కేసు విచారణ కాలంలో కైకలూరు, గుడివాడ సబ్ జైళ్ళలో ఆరుమాసాల పాటు నిర్బంధంలో వున్నారు.

## పిన్నమనేని శీతారామయ్య



తండ్రి రెడ్డెయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా పోలుకొండ. క్విట్ ఇండియా ఉద్యమంలో పుట్లచెరువు వద్ద రైలు పట్టాలు పీకివేత కేసులో ముద్దాయి. పదిహేడు మాసాల రహస్య జీవితం గడిపి, అరెస్టు అయ్యారు. కేసు విచారణ కాలంలో నాలుగు నెలలు కైకలూరు, గుడివాడ సబ్ జైళ్ళలో నిర్బంధంలో వున్నారు.

## పిన్నమనేని పున్నయ్య

తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా పోలుకొండ. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 18-10-1943 నుంచి ఆరుమాసాల కఠిన శిక్షను అలీపురం క్యాంపు జైలులో అనుభవించారు.

## పిన్నమనేని కనకయ్య



తండ్రి వెంకయ్య. జననం 1908 కైకలూరు తాలూకా పోలుకొండ రైతు. దేశం కోసం ప్రాణాన్ని అర్పించిన త్యాగమూర్తి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 18-10-1943న ఆరుమాసాల కఠిన శిక్ష విధించారు. అలీపురం క్యాంప్ జైలులో శిక్షను అనుభవిస్తూ, 27-12-1943 న అసువులు బాశారు.

## పిన్నమనేని సత్యనారాయణ



తండ్రి అచ్చయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా పోలుకొండ. బ్రిటీషు పాలనకు వ్యతిరేకంగా గ్రామాలలో రహస్య కరపత్రాలు పంచారు. శాసనోల్లంఘనంలో కల్లు పాకల ముందు పికెటింగ్ చేస్తూ, రెండుసార్లు లాఠీచార్జీలకు గురయ్యారు. 11-5-1932 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## పిన్నమనేని నాయుడమ్మ



తండ్రి బాపయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా పోలుకొండ పైలరువృత్తి. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలుపట్టాలు పెరికివేత కేసులో ముద్దాయి. 9 మాసాల కఠిన శిక్ష విధించారు. 18-10-1943 నుంచి అలీపురం క్యాంప్ జైలులో శిక్ష అనుభవించారు. అప్పీలులో యిచ్చిన తీర్పు ప్రకారం 25-11-1943 న విడుదలయ్యారు.

## పిన్నమనేని వీరరాఘవయ్య

తండ్రి వెంకటరామయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా పోలుకొండ. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 29-6-1932 నుంచి 10-4-1933 వరకు రాజమండ్రి జైలులో కఠినశిక్ష అనుభవించారు. తిరిగి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 9 మాసాలు కఠినశిక్ష విధించారు. 18-10-1943 నుంచి 25-11-1943 వరకు అలీపురం క్యాంప్ జైలులో శిక్షఅనుభవించారు. అప్పీలులో కేసును కొట్టివేసి నందున విడుదల చేశారు.

## పొట్లూరు సీతారామదాసు

కైకలూరు తాలూకా మొఖాసా కలవపూడి వాస్తవ్యులు. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాల మీద "హస్తమీరి నడిచారన్న" నేరానికి, రైలు పట్టాల పెరికివేతకు భారత రక్షణ చట్టం క్రింద శిక్షింపబడ్డారు.

## పొన్నాడ శ్రీరామచంద్రుడు



జననం 9-7-1913 గుంటూరు జిల్లా తెనాలి తాలూకా కఠెవరం. ప్రస్తుత నివాసం కైకలూరు తాలూకా వెంకటాపురం. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, విశాఖపట్నంలో అరెస్టు అయ్యారు. ఆరు మాసాల కఠిన శిక్ష విధించారు. 14-6-1930 నుంచి బరంపురం జైలులోను, 9-7-1930 నుంచి తిరుచునాపల్లి జైలులోను శిక్ష అనుభవించారు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, గుంటూరులో అరెస్టు అయ్యారు. సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. 1955 లో భూదాన యాత్రలో పాల్గొన్నారు.

## బొబ్బా నరసయ్య



తండ్రి వీరయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా మొఖాసా కలవపూడి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలుపట్టాలు పెరికివేసినందుకు డి. ఐ. ఆర్. కింద అరెస్టు చేశారు. 29-12-1942 న సంవత్సరం కఠిన శిక్ష, రు. 100/- జరిమానా విధించారు. అలీపురం క్యాంప్ జైలులో శిక్ష అనుభవిస్తుండగా, కృష్ణాజిల్లా సెషన్స్ కోర్టు కేసును కొట్టివేయడంతో 10-8-1943న విడుదలయ్యారు.

## బొబ్బా సీతారామయ్య



తండ్రి వీరయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా మొఖాసా కలవపూడి. రైతు. క్విట్ ఇండియా వుద్యమంలో రైలు పట్టాలు పెరికివేత తంతి తీగెల త్రెంచి వేత చర్యలకు గాను డి.ఐ.ఆర్. క్రింద అరెస్టు చేసి 29-12-1942న ఆరు మాసాల కఠిన శిక్ష. రు. 200/- జరిమానా విధించారు. జరిమానా చెల్లించ నిరాకరించి, మొత్తం 7 మాసాల జైలు శిక్షను అలీపురం జైలులో అనుభవించారు. ప్రస్తుత నివాసం గన్నవరం తాలూకా బుద్దవరం.

## మాగంటి సత్యనారాయణ

తండ్రి శ్రీరాములు. కైకలూరు నివాసి. రైతు. ఉప్పుసత్యాగ్రహ ఉద్యమంలో 6 నెలల కఠిక శిక్షను 8-7-30 నుండి రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## మాగంటి వెంకటకృష్ణయ్య



తండ్రి సుబ్రహ్మణ్యం. కైకలూరు తాలూకా గోపవరం వాస్తవ్యులు. రైతు శాసనోల్లంఘనోద్యమంలోపాల్గొన్నారు. 2-5-32 నుండి సంవత్సరం శిక్ష విధింపబడింది. రాజమండ్రి, కన్ననూరు జైళ్ళలో శిక్షననుభవించారు.

## మాగంటి నాయుడమ్మ

తండ్రి లక్ష్మీనరసయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా గోకవరం. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19-6-1930 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒప్పందంతో 14-3-31న విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని 20-4-1932న జరిగిన తీవ్రమైన లాఠీ చార్జీలో స్పృహను కోల్పోయారు. 11-5-1932 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. విడుదలైన కొద్ది రోజులకే కీర్తిశేషులయ్యారు.

## మామిడి శ్రీరామమూర్తి



తండ్రిపుల్లయ్య. కైకలూరులో 1902న జన్మించారు. ఖద్దరు వ్యాపారి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 8-7-30 న 6 మాసాలు కఠిన శిక్ష విధింపబడగా రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. విదేశీ వస్త్రాలు బహిష్కరించిన వారికి, ఖద్దరు వస్త్రాలు ఉచితంగా పంచిపెట్టి సుమారు 5 వేల రూపాయలు నష్టపోయారు. వీరు 1970 లో కీర్తిశేషులయ్యారు.

## మోటూరి సూర్యనారాయణ

తండ్రి వెంకట సుబ్బయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా మొఖాసా కలవపూడి. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలుపట్టాల పెరికివేత, తంతి తీగల త్రెంచి వేత చర్యలలో పాల్గొని, డి.ఐ.ఆర్. క్రింద అరెస్టు అయ్యారు. 29-12-1942 వ సంవత్సరం కఠిన శిక్ష రు. 200/- జరిమానా విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## యలమంచిలి సత్యనారాయణ



తండ్రి సీతారామయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా కలవపూడి రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో డి. ఐ. ఆర్. క్రింద అరెస్టు చేశారు. 29-12-1942 న ఆరు మాసాల కఠిన శిక్ష, రు. 50/-ల జరిమానా విధించారు. అలీపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవించారు.

## యలమంచిలి నాగేశ్వరరావు



తండ్రి హనుమయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా పోలుకొండ. రైతు 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని 15 మాసాలు రహస్య జీవితం గడిపారు. అనంతరం అరెస్టు అయి, నాలుగు నెలలు గుడివాడ సబ్ జైలులో నిర్బంధంలో వున్నారు ప్రస్తుత నివాసం నిజామాబాద్ జిల్లా తాడికొల్లు.

## రావెళ్ళ వెంకయ్య



తండ్రి వీరయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా చిగురుకోట. రైతు. శాసనోల్లంఘనంలో పికెటింగ్ చేసి 26-4-32న అరెస్టు అయ్యారు. 11-5-1932 నుంచి ఆరు మాసాల కఠినశిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. జైలులో రేషన్ తగ్గించినందుకు నిరసనగా నిరాహారదీక్షలో పాల్గొన్నారు.

## రుద్రరాజు నరసింహరాజు



తండ్రి సీతారామరాజు. జననం 15-2-1900 పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం తాలూకా జువ్వలపాలెం. ప్రస్తుత నివాసం కైకలూరు తాలూకా పోతుమర్రు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, భీమవరం సబ్ జైలులో నాలుగు వారాల శిక్ష అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని, లాఠీ చార్జీకి గురికాగా, ఎడమ చేతి బొటన వ్రేలు విరిగిపోయింది. ఆరువారాల జైలుశిక్షను భీమవరం సబ్ జైలులో అనుభవించారు.

## రుద్రరాజు సూర్యనారాయణరాజు



తండ్రి వెంకట్రాజు. జననం 1903 పశ్చిమ గోదావరి జిల్లా జువ్వలపాలెం. ప్రస్తుత నివాసం కైకలూరు తాలూకా భుజంగపట్నం. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. సంవత్సరం కఠిన శిక్ష విధించారు. 18-7-1930 నుంచి 5-3-1931 వరకు శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒప్పందంతో విడుదయ్యారు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. భీమవరం సబ్ జైలులో నెలరోజులు నిర్బంధంలో వున్నారు.

## వల్లభనేని వెంకయ్య

తండ్రి రామయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా చిగురుకోట. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని, విదేశీ వస్త్రాలయాలముందు పికెటింగ్‌చేసి అరెస్టు అయ్యారు. 29-6-1932 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 11-1-1933న విడుదలయ్యారు. కీర్తిశేషులయ్యారు.

## వల్లభనేని రాజారావు

జన్మస్థలం కైకలూరు తాలూకా కలవపూడి. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో రైలుపట్టాలు పెరికివేత, తంతితీగెల త్రెంచివేత చర్యలకుగాను అరెస్టు చేసి, డి. ఐ. ఆర్. క్రింద శిక్ష విధించారు. మైనరు అయినందున వదలివేశారు.

## వల్లభనేని సూర్యనారాయణ

తండ్రి వీరరాఘవయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా కలవపూడి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాలు పీకివేత. తంతితీగెల త్రెంచివేత చర్యలలో పాల్గొన్నందుకు, డి. ఐ. ఆర్ క్రింద అరెస్టుచేశారు. 29-12-1942 న ఆరుమాసాల కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## వల్లూరు వెంకటేశ్వరరావు



తండ్రి రత్తయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా ఉనికిలి. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. సంవత్సరం కఠినశిక్ష విధించారు. 29-6-1932 నుంచి 10-4-1933 వరకు రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## విన్నకోట వెంకటేశ్వరరావు



తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా కానుకొల్లు. హిందీప్రచారకుడు. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టు అయ్యారు. నాలుగు మాసాల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు. గాంధీజీ 76 వ జన్మదినోత్సవ సందర్భంలో కోటి గజాల ఖద్దరునూలు సేకరణ ఉద్యమంలో, రెండున్నర లక్షల గజాల నూలును సేకరించారు. ప్రస్తుతం హిందీప్రచార సభ ఆర్గనైజరుగా పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరులో పనిచేస్తున్నారు.

## సి. హెచ్. పేరయ్య

కైకలూరు తాలూకా నివాసి. శాసనోల్లంఘనములో 19-4-1932 న కైకలూరులో తీవ్రమైన లాఠీ ఛార్జికి గురయ్యారు స్పృహ లేని స్థితిలో పోలీసులు గుడివాడకు తీసుకుపోయి వదిలివేశారు.

## సూరపనేని వెంకటేశ్వరరావు

తండ్రి అచ్చయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా మొఖాసా కలవపూడి. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 29-12-1942 నుంచి సంవత్సరం ఒక మాసం కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## సూరపనేని శ్రీరంగనాయకులు

తండ్రి కృష్ణయ్య. కైకలూరు తాలూకా కలవపూడి వాస్తవ్యులు. రైతు. 29-12-42 న రైలుపట్టాల పెరికివేత, టెలిగ్రాఫ్ తీగల తెంచివేతకుగాను 7 నెలల కఠిన శిక్ష విధించబడింది. అలీపురం జైలులో శిక్షననుభవించారు.

# గుడివాడ తాలూకా
# గుడివాడ

## అట్లూరి రంగారావు



తండ్రి గోపాలకృష్ణయ్య గుడివాడ వాస్తవ్యులు. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టు చేసి బందరు, కైకలూరు సబ్ జైళ్ళలో వీరిని ఉంచారు. 19-4-43 న 9 నెలల శిక్ష, రు. 50 జరిమానా విధించారు. జరిమానా వసూలు చేయబడింది. అలీపురం క్యాంప్ జైల్లో శిక్షను అనుభవించారు. సంఘ సంస్కర్త.

## అనుమాలకొండ సుబ్బయ్య

గుడివాడ వాస్తవ్యులు. సహాయ నిరాకరణోద్యమంలో 6-2-1922 న 2 నెలల కఠినశిక్ష విధింపబడింది. రాజమండ్రి జైల్లో శిక్షను అనుభవించారు.

## అల్లు పైడయ్య

తండ్రి రామయ్య. జన్మస్థలం గుడివాడ. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, రాజమండ్రి జైలులో మూడు నెలల శిక్ష అనుభవించారు. తరువాత క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, అలీపురం జైలులో 2-9-1942 నుంచి 7 నెలల కఠిన శిక్ష అనుభవించారు.

## అల్లు అప్పలస్వామి

తండ్రి రామయ్య. జననం 1912 గుడివాడ. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. రు. 200/- జరిమానా, కోర్టు లేచేవరకు శిక్ష విధించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టు అయి, 31-8-1944 నుంచి 9 నెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## ఆచంట మధుసూదనరావు

తండ్రి నరసింహం. జన్మస్థలం గుడివాడ. మెట్రిక్యులేట్. ఇన్సూరెన్స్ కంపెనీలో ఉద్యోగం చేసి రిటైర్ అయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలుపట్టాలు పెరికివేత, తంతితీగెలు త్రెంచివేత కేసులో 24-8-1942న అరెస్టు చేశారు. సబ్ జైలులో కొన్నాళ్ళు నిర్బంధించారు. 29-5-1943న డి. ఐ. ఆర్. క్రింద రెండేళ్ళ కఠినశిక్ష విధించారు అలీపురం, వెల్లెస్లీ శానిటోరియం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గుడివాడ పట్టణ కాంగ్రెసు కార్యదర్శిగా పనిచేశారు.

## అండాళ్ళమ్మ

గుడివాడ. స్వాతంత్ర ఉద్యమంలో పాల్గొన్నారు. హరిజన హాస్టల్ నిర్వహించారు.

## ఓగిరాల రాఘవులు



తండ్రి కోటయ్య. గుడివాడ. క్విట్ ఇండియా ఉద్యమంలో ఆరు నెలల కఠిన శిక్ష విధించబడింది. 16-9-42 నుండి అలీపురము క్యాంప్ జైల్లో శిక్ష అనుభవించారు. కీర్తిశేషులయ్యారు.

## కాశిం బేగ్

గుడివాడ నివాసి. సహాయ నిరాకరణంలో పాల్గొని, 6-2-1922 నుంచి రెండు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## కురళ్ళ శశిధర సీతాపతిరావు

గుడివాడ వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నందుకు 6-2-1922 న రెండు నెలలు శిక్ష విధించబడి రాజమండ్రి జైల్లో శిక్షను అనుభవించారు. 1930 లో ఉప్పుసత్యాగ్రహంలో కూడా పాల్గొన్నారు.

## కురళ్ళ భుజంగభూషణరావు

తండ్రి సీతారామయ్య. జన్మస్థలం గుడివాడ. వ్యాపారి. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 10-1-1941 నాలుగు మాసాల కఠినశిక్ష, రు. 25/- జరిమానా విధించారు. వెల్లూరు అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో ఆరు నెలలు సబ్‌జైలులో నిర్బంధించారు. ఆ తరువాత 2-8-1943 న డి.ఐ ఆర్. క్రింద మూడు సంవత్సరాల కఠినశిక్ష విధించారు. అలీపురం, వెల్లెస్లీ శానిటోరియమ్ జైళ్ళలో శిక్ష అనుభవించారు. మున్సిపల్ కౌన్సిలర్ గా, పట్టణ అధ్యక్షులుగా ఎన్నికయ్యారు.

## కురళ్ళ మాధవరావు

జన్మస్థలం గుడివాడ. వ్యాపారి. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, రెండుసార్లు తీవ్రమైన లాఠీఛార్జీకి గురయ్యారు. రెండుసార్లు అరెస్టుచేసి వదిలివేశారు.

## కొడాలి రామకోటేశ్వరరావు

తండ్రి శ్రీరాములు. జన్మస్థలం గుడివాడ. వ్యాపారి. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, రైలు పట్టాలు పెరికివేత, తంతి తీగెలు త్రెంచివేత కేసులో 15 నెలల జైలు శిక్షను 29-5-1943 నుంచి అలీపురం జైలులో అనుభవించారు.

## కోసూరి శేషయ్య

గుడివాడ వాస్తవ్యులు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 25-3-40 నుండి రాజమండ్రి జైలులో డిటెయిన్ చేశారు.

## కేతవరపు లక్ష్మీ నరసింహారావు



తండ్రి సుబ్రహ్మణ్యం. గుడివాడలో 11-12-1896లో జన్మించారు. అడ్వకేట్. 1930 లో గుడివాడ పట్టణ కాంగ్రెస్ సంఘం నెలకొల్పారు. విదేశ వస్త్ర బహిష్కరణ, కల్లు దుకాణాల పికెటింగ్ ప్రచారం చేశారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1931 డిసెంబరులో గుడివాడ డిప్యూటీ మెజిస్ట్రేటు వీరిని గుడివాడ నుంచి 2 మాసాల వరకూ కదలరాదని నిషేధపు ఉత్తరువు జారీచేశారు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొనగా ఒక సంవత్సరం కఠిన శిక్ష 7-1-1932 నుండి విధించారు. రు. 200 లు జరిమానా విధించి వసూలుచేశారు. అలీపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవించారు. 1933 లో నూజివీడు మెజిస్ట్రేటు 4 నెలలశిక్ష విధించగా అపీలులో రు. 100 లు జరిమానాగా మార్చబడింది. జరిమానా చెల్లించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పోలీసు ఆఫీసర్లను తమ ఉద్యోగాలకు రాజీనామా యివ్వమని కోరగా రు. 200 జరిమానా, సంవత్సరం కఠినశిక్ష విధించారు. జరిమానా చెల్లించి. 31-8-1942 నుండి అలీపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవిస్తుండగా వీరి ప్లీడరు పట్టా రద్దు చేశారు. 1949 లో తిరిగి ప్లీడరు పట్టా యిచ్చినా ప్రాక్టీసు చేయలేదు. తూర్పు కృష్ణాజిల్లా హరిజన సేవా సంఘం అధ్యక్షుడుగా వున్నారు. కృష్ణాజిల్లా కస్తూరిబాయి స్మారక నిధికి కార్యదర్శిగా వుండి లక్ష 76 వేల రూ॥లు వసూలుచేశారు. గాంధీజీ మద్రాసు సభలో ప్రసంగిస్తూ కృష్ణాజిల్లా చాలా తక్కువ ఖర్చుచేసి, పెద్ద మొత్తం వసూలు చేసిందని ప్రశంసించారు. కీర్తిశేషులైరి.

## గుత్తా గోపాలకృష్ణయ్య



తండ్రి చినవెంకటరత్నం. 9-8-1919న బొమ్మలూరులో జననం. గుడివాడ నివాసి. క్విట్ ఇండియా వుద్యమంలో పాల్గొని 2 సంవత్సరముల కఠిన శిక్ష 29-5-1943 నుండి అలీపురం క్యాంప్ జైలులో అనుభవించారు

## గోనుగుంట్ల వెంకటసుబ్రహ్మణ్యగుప్త

తండ్రి నారాయణ. 1901 ప్రాంతంలో జన్మించారు. గుడివాడ వాస్తవ్యులు వర్తకులు. చమవుమాని స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్నారు. నీల్ విగ్రహ సత్యాగ్రహంలో పాల్గొని జైలుశిక్ష పొందారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 13-5-30న 9 నెలలు శిక్ష విధించబడింది. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష ననుభవించారు. శాసనోల్లంఘనోద్యమాన్ని నిర్వహించారు. వీరి ఇల్లు 5-1-32 న సోదా చేయబడింది 21-2-'32 న అరెస్టు చేసి 2-4-'32 న రెండేళ్ళ కఠినశిక్ష విధింపబడింది. రు. 500 జరిమానా, చెల్లించని పక్షంలో మరో మూడు నెలల కఠినశిక్ష కూడా విధించబడింది. 151 రూపాయల మూడున్నర అణాల జరిమానా చెల్లింపబడింది. రాజమండ్రి, బరంపురం బళ్లారి జైళ్ళలో శిక్ష ననుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనగా 29-5-43 న మూడేళ్ళ కఠినశిక్ష విధించబడింది. కోర్టులో శిక్ష రద్దుచేసిన తర్వాత 4-10-43న విడుదలయ్యారు. అప్పటివరకు అలీపురం జైలులో శిక్షననుభవించారు. గుడివాడకు మొట్టమొదటి కాంగ్రెస్ ఛైర్మన్‌గా మూడేళ్ళున్నారు 1948 నుండి మద్రాసు కార్పొరేషన్‌లో కొన్నాళ్ల సభ్యులుగా వున్నారు.

## గోనుగుంట్ల లక్ష్మీనరసమ్మ

వెంకటసుబ్రహ్మణ్య గుప్తగారి పత్ని. గుడివాడ వాస్తవ్యులు ప్రస్తుత నివాసం జగ్గయ్యపేట. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో సంవత్సరం శిక్ష 2-5-1932 నుండి వెల్లూరు, కన్ననూరు, జైళ్ళలో అనుభవించారు. వ్యష్టి సత్యాగ్రహంలో 18-6-41న రు. 50 జరిమానా లేక మూడునెలల శిక్ష విధింపబడింది. రైసుమిల్లు వర్తక సంఘం వారు జరిమానా చెల్లించగా 18-7-41న విడుదలయ్యారు తిరిగి సత్యాగ్రహం చేయగా 16-9-41న 6నెలలు శిక్ష విధింపబడింది. వెల్లూరు జైలులో శిక్ష అనుభవించి 11-12-41న విడుదలయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 13-8-42న సంవత్సరం శిక్ష విధింపబడగా 1-9-1942 నుండి వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు. మున్సిపల్ కౌన్సిలర్‌గా, గుడివాడ హరిజన విద్యార్థినుల హాస్టల్ మేనేజరుగా పనిచేశారు 1932 శాసనోల్లంఘనంలో పికెటింగ్ చేస్తూండగా పోలీసులు వీరిపై అనేకసార్లు రంగునీళ్ళు కొట్టి అరెస్టు చేసి దూరప్రాంతాలలో విడిచిపెట్టారు. వీరి భర్త, కుమారుడు కూడా జైలుకు వెళ్ళారు.

## గోనుగుంట్ల ఉపేంద్రనారాయణరావు

తండ్రి సుబ్రహ్మణ్యగుప్త. గుడివాడ వాస్తవ్యులు. వర్తకులు. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాలపీకివేత, టెలిగ్రాఫ్‌తీగెల తెంచివేతలలో పాల్గొన్నందుకుగాను 29-5-43 నుండి 15 నెలల శిక్షను అలీపురం క్యాంప్ జైల్లో అనుభవించారు.

## ఘంటసాల గంగయ్య



తండ్రి నాగభూషణం. గుడివాడ. 1919 ప్రాంతంలో జన్మించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో రెండు సంవత్సరాల కఠిన శిక్ష విధింపబడినది. 29-5-43 నుండి అలీపురం క్యాంప్ జైల్లో శిక్షను అనుభవించారు.

## చింతా వెంకట శేషాచలపతిరావు

తండ్రి రామయ్య. గుడివాడ వాస్తవ్యులు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 16-9-42 నుండి 21-9-42 వరకు అలీపురం క్యాంప్ జైలులో కఠిన శిక్ష ననుభవించారు.

## చింతా చలపతిరావు

జన్మస్థలం గుడివాడ. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 3 నెలల కఠిన శిక్ష అనుభవించారు.

## చిట్టాప్రగడ రంగారావు

తండ్రి వెంకట కృష్ణయ్య. జన్మస్థలం గుడివాడ. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 4-7-1930 నుంచి 6 నెలల కఠిన శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్లలో అనుభవించారు.

## చెరువు మల్లిఖార్జునుడు

తండ్రి వెంకటసుబ్బయ్య. జన్మస్థలం గుడివాడ శాసనోల్లంఘనంలో పాల్గొని, 17-6-1930 నుంచి 9 నెలల కఠినశిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## తిరుకోవళ్ళూరు వెంకటదాసు

తండ్రి కృష్ణదాసు. గుడివాడ వాస్తవ్యులు 1940-41 లో వ్యష్టి సత్యాగ్రహానికి గాంధీజీ ఎన్నిక చేసిన వారిలో ఒకరు మందపాడులో 19-1-41 న సత్యాగ్రహం చేశారు. 25-1-41 న రెండు నెలల కఠిన శిక్ష రు. 100 జరిమానా, చెల్లించని పక్షంలో మరొక నెల కఠిన శిక్ష విధించబడింది. జరిమానా చెల్లించారు. రాజమండ్రి జైల్లోశిక్షను అనుభవించారు.

## తుమ్మలపల్లి వెంకట కృష్ణయ్య

గుడివాడ వాస్తవ్యులు. 1920-21 సహాయ నిరాకరణోద్యమంలో గ్రామోద్యోగి పదవికి రాజీనామా ఇచ్చారు.

## దేవులపల్లి సోమనాథశాస్త్రి

తండ్రి లక్ష్మీనరసింహశాస్త్రి. గుడివాడ వాస్తవ్యులు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నందుకు 4-6-30 న సంవత్సరం కఠిన శిక్ష రు. 50 జరిమానా విధింపబడింది. జరిమానా చెల్లించని పక్షంలో మరో నాల్గు వారాల కఠిన శిక్ష. రాజమండ్రి, బళ్లారి సెంట్రల్ జైళ్లలో శిక్షను అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 11-3-31 న విడుదలయ్యారు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 14-3-32 న 14 నెలల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి. కన్ననూరు జైళ్లలో శిక్షను అనుభవించారు.

## పాపయ్య

గుడివాడ నివాసి. సహాయ నిరాకరణంలో పాల్గొని, 6-2-1922 నుంచి రెండునెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## పెండ్యాల కుమారస్వామి

తండ్రి రామచంద్రయ్య. జన్మస్థలం గుడివాడ, కాంపౌండరు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని. 12-9-1941 నుంచి ఆరు నెలల కఠినశిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## పి. కౌశల్యాదేవి

కృష్ణాజిల్లా నివాసి. 19-2-1932న గుడివాడలో శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. పోలీసులు ఆమె ముఖంపై రంగునీళ్లు చల్లి, పరాభవించి వదిలివేశారు.

## పూర్ణ తిలకమ్మ

భర్త రామకోటయ్య. స్వస్థలం గుడివాడ. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 3-3-1931 న ఆరు నెలల కఠినశిక్ష విధించారు వెల్లూరు జైలులో శిక్ష అనుభవిస్తుండగా గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 7-3-1931న విడుదలయ్యారు

## పోలగాని రామలింగం



తండ్రి వెంకటరెడ్డి. జననం 1900. గన్నవరం తాలూకా ఉయ్యూరు. రైతు. జాతీయోద్యమంలో పెక్కుసార్లు లాఠీ ఛార్జీలకు గురయ్యారు. శాసనోల్లంఘనంలో పాల్గొ

న్నారు. 20-4-1932న సంవత్సరం కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. రాజమండ్రి జైలులో భగత్‌సింగ్ సహచరుల నుంచి ఉత్తేజం పొంది, ఎర్రటోపి ధరించి తీవ్రమైన లాఠీచార్జీకి గురయ్యారు.

## భాగవతుల పూర్ణానందం



తండ్రి రామకోటయ్య. జన్మస్థలం గుడివాడ. "దేశంలో కుటుంబానికి ఒకరు చొప్పున స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనా"లన్న గాంధీజీ పిలుపుతో ఉత్తేజితులై చదువుకి స్వస్తిచెప్పి, ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు 17-6-1930న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు. జైలునుంచి విడుదలైన పిమ్మట, సినిమా ఆపరేటర్‌గా పని చేస్తూ జీవనం గడిపారు. కీర్తిశేషులైరి.

## బెడతంపల్లి సీతయ్య



తండ్రి రేలయ్య. జన్మస్థలం గుడివాడ. వ్యాపారి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 17-6-1930న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం, బళ్లారి జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## బేడతంపల్లి సత్తెయ్య



తండ్రి రేలయ్య. వర్తకులు. గుడివాడ వాస్తవ్యులు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. సంవత్సరం కఠిన శిక్ష విధింపబడింది. 17-6-'30 నుండి రాజమండ్రి తిరుచునాపల్లి, అలీపురం, బళ్ళారి జైళ్ళలో శిక్షను అనుభవించారు. 1972 జూన్‌లో కీర్తిశేషులయ్యారు.

## బొక్కా వెంకట చలపతిరావు



తండ్రి లక్ష్మీనరసింహం. 1916 డిసెంబరు 15న గుడివాడలో జన్మించారు ప్రస్తుత నివాసం విజయవాడ.

చిన్నతనంలో ఉప్పు సత్యాగ్రహం నందు పాల్గొన్నారు. 1940 మే లో నిషిద్ధ కరపత్రాలు పంచుతుండగా అరెస్టుచేసి, సబ్ జైలులో వుంచి వదలివేశారు. 17-1-1941న 5 నెలల కఠిన శిక్ష విధింపబడింది రాజమండ్రి జైలులో శిక్షను అనుభవించారు. 1942 లో రెండు కేసుల్లో 16 నెలల శిక్ష, రూ. 100 జరిమానా విధింపబడింది. ఆస్తి జప్తుచేసి జరిమానా వసూలుచేశారు అలీపురం క్యాంపు జైల్లో శిక్ష అనుభవించారు. సంఘ సంస్కర్త. హరిజనోద్యమంలో పనిచేశారు, హరిజన బాలిక వసతి గృహ కార్యదర్శిగా పనిచేశారు.

## బోలెం వెంకటేశ్వరరావు



తండ్రి గురయ్య. గుడివాడవాస్తవ్యులు. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాలు తొలగింపు, టెలిగ్రాఫ్ తీగెల త్రెంచివేత కేసు సందర్భంగా 1942 సెప్టెంబర్ 27 న అరెస్టు చేశారు సబ్ జైలులో వుంచారు 29-5-43 న గుడివాడలో మూడు సంవత్సరాల కఠిన శిక్ష విధించబడింది. అలీపురం, బళ్లారి శానిటోరియం జైళ్ళలో శిక్షను అనుభవించారు. అప్పీలులో శిక్ష తగ్గించబడి 1945లో విడుదలయ్యారు. 1971 డిసెంబర్ 16న కీర్తిశేషులయ్యారు.

## బొండపల్లి శ్రీరాములు

తండ్రి బోడెయ్య. గుడివాడ వాస్తవ్యులు. క్విట్ ఇండియా ఉద్యమంలో రైల్వే లైన్ల తొలగింపుకు, టెలిగ్రాఫ్ తీగెల తెంచివేతకు చట్ట విరుద్ధంగా సమావేశమైన నేరంపై 29-5-43న రెండేళ్ళ కఠిన శిక్ష విధించబడింది. అలీపురం, సేలం జైళ్ళలో శిక్షను అనుభవించారు.

## బొగ్గవరపు వెంకటకృష్ణయ్య

తండ్రి పున్నయ్య. గుడివాడ వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 7-7-30 న ఆరు నెలల కఠినశిక్ష, రు. 100 జరిమానా విధింపబడింది. జరిమానా చెల్లించారు. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష ననుభవించారు. 1944లో పక్షవాతంతో చనిపోయారు.

## మరీదు కోటేశ్వరరావు

తండ్రి వెంకటపతి. జన్మస్థలం గుడివాడ. ఫొటోగ్రాఫర్. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాలు పెరికివేత, తంతి తీగెల త్రెంచివేత కేసులో ముద్దాయి. ఆరు నెలలు సబ్ జైలులో రిమాండ్ చేసి, 16-11-1943 న 18 నెలల కఠిన శిక్షను విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. రెండుసార్లు మున్సిపల్ కౌన్సిలర్‌గా ఎన్నికయ్యారు.

## మల్లాది సుబ్బారావు

గుడివాడ వాస్తవ్యులు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. 6-2-1922 నుండి రెండు నెలల కఠినశిక్ష విధించబడింది.

## మునుగంటి వెంకటరావు

తండ్రి పట్టాభి రామారావు. గుడివాడ వాస్తవ్యులు. రైతు. 8-2-30 న బందరుకు మద్రాసు గవర్నర్ రాక సందర్భాన జరిపిన నల్లజెండాల ప్రదర్శనలో పాల్గొన్నారు. 15-3-30 నుండి 7-12-30 వరకు రాజమండ్రి సెంట్రల్ జైల్లో శిక్షననుభవించారు.

## మూడెడ్ల లక్ష్మయ్య

తండ్రి అప్పలనాయుడు. జననం 1908 గుడివాడ. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, డి. ఐ. ఆర్. క్రింద 29-5-1943 న అరెస్టు అయ్యారు. 15 నెలల కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు హైకోర్టులో కేసు కొట్టివేయడంతో 13-3-1944 న విడుదలయ్యారు.

## మూడెడ్ల రామారావు

తండ్రి అప్పలనాయుడు. జననం 1910 గుడివాడ. రైతు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. నాలుగు నెలల జైలుశిక్ష రు 50/- జరిమానా విధించారు. తిరిగి క్విట్ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. గుడివాడ స్పెషల్ మెజిస్ట్రేట్ 29-5-1943 న మూడేళ్ళ కఠినశిక్ష విధించారు. సెషన్స్ కోర్టులో కేసును కొట్టివేసినందున 4-10-1943న విడుదలయ్యారు. గుడివాడ పట్టణ కాంగ్రెస్ అధ్యక్షులుగాను, మున్సిపల్ చైర్మన్‌గాను పనిచేశారు.

## రేలంగి పోతరాజు

గుడివాడ నివాసి. సహాయ నిరాకరణంలో పాల్గొని, 6-2-1922 నుండి రెండు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

### విస్సంశెట్టి వెంకయ్య

జన్మస్థలం గుడివాడ. వ్యాపారి. మోతీలాల్ నెహ్రూ స్మృతి సందర్భంగా, 1934 లో గుడివాడలో జరిగిన హర్తాళ్‌లో తీవ్రమైన లాఠీ ఛార్జికి గురయ్యారు. 1941 ఉప్పు సత్యాగ్రహంలో కూడా పాల్గొన్నారు.

### శంభంగి రామస్వామి



తండ్రి అప్పలనాయుడు. గుడివాడ. 1916లో జననం. ప్రస్తుత నివాసం ఖమ్మం. 1942లో కోర్టు పికెటింగ్ సందర్భాన అరెస్టుచేసి, సబ్ జైలులో 20 రోజులు ఉంచారు. ఆరుమాసాల శిక్ష విధించబడింది 31-8-42 నుండి అలీపురం క్యాంప్ జైలులో శిక్షను అనుభవించారు. పురపాలక సంఘ సభ్యులుగా, కాలేజి మేనేజరుగా, వెనుకబడ్డ విద్యార్థుల హాస్టల్ మేనేజర్‌గా పనిచేశారు.

### సున్నం నరసింహం

తండ్రి ముత్తులింగం. జన్మస్థలం గుడివాడ. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 17-6-1930 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి, ఆలీపురం జైళ్ళలో అనుభవించారు.

## వెంట్రప్రగడ

### అప్పికట్ల జోసెఫ్

తండ్రి భూషణం. జననం 1919 గుడివాడ తాలూకా వెంట్రప్రగడ. హరిజన ఉపాధ్యాయుడు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 27-3-1943 న డి. ఐ. ఆర్. క్రింద నాలుగు నెలల కఠిన శిక్ష విధించారు అలీపురం జైలులో శిక్షను అనుభవించారు. 1950-52 రాజ్యసభ సభ్యులు. 1966 నుంచి 1972 వరకు ఆంధ్రప్రదేశ్ శాసన మండలి సభ్యులు ప్రస్తుత నివాసం విజయవాడ.

### కొసరాజు వెంకటసుబ్బయ్య

గుడివాడ తాలూకా వెంట్రప్రగడ వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలోపాల్గొన్నందుకు 9-2-32న తీవ్రంగా లాఠీచార్జీ చేయబడ్డారు. కీర్తిశేషులైరి.

### కొసరాజు నాగభూషణం



గుడివాడ తాలూకా వెంట్రప్రగడ తండ్రి వెంకయ్య. ప్రస్తుత నివాసం బందరు. ఉప్పు సత్యాగ్రహంలో 6 నెలల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి జైలులో శిక్షను అనుభవించారు. సాముదాయక జరిమానాలో వీరినుండి రు. 75 జరిమానా వసూలు చేశారు. అస్పృశ్యతా నివారణ, హరిజన సంక్షేమం కోసం పని చేశారు. కీర్తిశేషులైరి.

## కొసరాజు శేషయ్య



తండ్రి వెంకయ్య. జననం 16-3-1902 గుడివాడ తాలూకా వెంట్రప్రగడ. రైతు. 1921 సహాయనిరాకరణ కాలంలో విద్యకు స్వస్తి చెప్పారు. తిరిగి విద్యాభ్యాసం సాగించి, కలకత్తాలో బి. కాం. లో చేరారు. టెర్రరిస్టులతో పరిచయం ఏర్పడి. బెంగాల్‌లో పర్యటించారు. 1930 సత్యాగ్రహానికి మద్దతుగా కలకత్తా విద్యార్థులు జరిపిన ప్రదర్శనలో పాల్గొని అరెస్టు అయ్యారు. చదువుకు స్వస్తిచెప్పి. స్వగ్రామంవచ్చి. జాతీయోద్యమంలోకి దుమికారు. అనేక గ్రామాలలో వాలంటీర్లను సమీకరించి. కల్లు దుకాణాలముందు పికెటింగ్ జరిపారు. నాలుగుసార్లు లాఠీ చార్జీలకు గురయ్యారు. 28 1-1932న అరెస్టు చేసి 26-3-1932న విడుదల చేశారు. రహస్య పత్రిక 'రెడీ' పంచుతుండగా అరెస్టుచేసి. 23-5-1932న రెండేళ్ళ కఠినశిక్ష. రు. 200/- జరిమానా విధించారు. రాజమండ్రి. తిరుచునాపల్లి, జైళ్ళలో శిక్ష అనుభవించారు. యుద్ధ వ్యతిరేక ప్రచారం సాగించినందుకు 2[illegible]-3-1941 నుంచి డిటెన్యూగా 1945 వరకు వెల్లూరు, రాజమండ్రి,తంజావూరు. జైళ్ళలో నిర్బంధించారు. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ, కమ్యూనిస్టు పార్టీలలో ప్రముఖ పాత్ర వహించారు. ప్రజాశక్తి, విశాలాంధ్ర పత్రికలలో పనిచేశారు. అనేక నవలలు రచించారు.

## కొసరాజు బ్రహ్మయ్య

తండ్రి దేవయ్య. జననం 1-7-1912. గుడివాడ తాలూకా వెంట్రప్రగడ. రైతు. ప్రస్తుత నివాసం కర్నూలు జిల్లా ఆళ్ళగడ్డ తాలూకా జిల్లెల. శాసనోల్లంఘనంలో కల్లు పాకలు, విదేశీ వస్త్రాలయాల ముందు పికెటింగ్ జరిపి 9-2-1932, 28-4-1932 న లాఠీచార్జీకి గురయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని, 4-7-1932 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. రైతు, వ్యవసాయ కూలీల సంఘాలలో పని చేశారు.

## కొసరాజు బ్రహ్మయ్య



ఉరఫ్ పెద్ద బ్బాయి. తండ్రి రత్తయ్య. జననం 10-9-1920 గుడివాడ తాలూకా వెంట్రప్రగడ జాతీయోద్యమానికి అండగా నిలిచిన కుటుంబంలో పుట్టారు 1938-39లో మునగాల జమీందారు వ్యతిరేక రైతు పోరాటంలో పాల్గొన్నారు. 1941 వ్యష్టి సత్యాగ్రహ కాలంలో 14 రోజులు గుడివాడ సబ్ జైలులో నిర్బంధంలో వున్నారు.

## కొసరాజు సీతారామయ్య



జననం 1907 గుడివాడ తాలూకా వెంట్రప్రగడ వాస్తవ్యులు. రైతు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు 9-2-32 న తీవ్రంగా లాఠీ ఛార్జికి గురి అయ్యారు. పికెటింగ్ చేసినందులకు లాఠీఛార్జిచేసి 15-2-32 న గుడివాడలో అరెస్టుచేసి 26-3-32న విడుదల చేశారు. సామూహిక జరిమానా చెల్లించ నిరాకరించినందుకు ఇంటి తలుపులను ప్రభుత్వం జప్తుచేసింది.

## గరికిపాటి నాగభూషణందేవర



జన్మస్థలం గుడివాడ తాలూకా వెంట్రప్రగడ. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, ఆరు నెలల కఠినశిక్ష అనుభవించారు.

## గుళ్ళపల్లి గంగయ్య



జననం 1909. గుడివాడ తాలూకా వెంట్రప్రగడ. రైతు. స్వగ్రామం నుండి గుడివాడ వరకు చెట్లపై జాతీయ జెండాలు కట్టారు 'స్వరాజ్యం మన జన్మహక్కు' అన్న నినాదం వంతెనలపైన, గోడల పైన రాసి పోలీసులను వెర్రెత్తించారు. తాటి. ఈత గెలలు నరికే కార్యక్రమంలో రహస్య కరపత్రాలు పంచే కార్యక్రమంలో చురుకుగా పాల్గొన్నారు. పోలీసు లాఠీ దెబ్బలకు గురయ్యారు. మూడు రోజులు పోలీసు కష్టడిలో వుంచారు.

## చలసాని పూర్ణచంద్రరావు

తండ్రి కృష్ణారావు జన్మస్థలం గుడివాడ తాలూకా వెంట్రప్రగడ. యుద్ధ వ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొని, విద్యార్థి దశలో 25-3-1942 నుంచి 27-4 1942 వరకు అలీపురం, బళ్ళారి జైళ్ళలో కఠిన శిక్ష అనుభవించారు.

## చలసాని అంజనేయులు



తండ్రి రామయ్య. వెంట్రప్రగడలో 9-7-1897లో జన్మించారు. 1917 లో హోమ్‌రూల్ లీగ్‌లో చేరారు 1921 నుంచి 1931వరకూ స్వరాజ్య నిధి వసూలు విదేశీ వస్త్ర బహిష్కరణ, హరిజనోద్ధరణ, ఖాదీ ప్రచారం, మున్నగు కార్యక్రమాలు నిర్వహించారు 1930 ఉప్పు సత్యాగ్రహంలో మద్రాసునందు పాల్గొని, లాఠీ దెబ్బలకు గురయ్యారు. ఆరు నెలల కఠినశిక్ష అనుభవించారు. వెంట్రప్రగడలో హరిజనులకు రాత్రి పాఠశాలను నెలకొల్పారు. గ్రంథాలయోద్యమ ప్రచారం గావించారు.

## చలసాని వెంకట సుబ్బయ్య

తండ్రి నాగయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా వెంట్రప్రగడ. రైతు. ఉప్పు సత్యాగ్రహ కాలంలో గాంధీజీ పిలుపుతో ఉత్తేజితులై, తన సొంత పట్టు వస్త్రాలయాన్ని తగులబెట్టారు. 1932 శాసనోల్లంఘనంలో రెండు సార్లు అరెస్టు అయ్యారు 15-3-1932న గుడివాడలో అరెస్టు చేసి, 26-3-1932 న వదిలివేశారు. తిరిగి 20-6-1932 న నందివాడలో పికెటింగ్ చేస్తుండగా అరెస్టు చేసి, సంవత్సరం, కఠిన శిక్ష విధించారు రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు కీర్తిశేషులైరి.

## చాగర్లమూడి బ్రహ్మానందరావు



తండ్రి కోటయ్య జన్మస్థలం గుడివాడ తాలూకా వెంట్రప్రగడ, రైతు. 2391 శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 29-1-1932న తీవ్రమైన లాఠీచార్జీకి గుర

య్యారు. 4-7-1932 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## చాగర్లమూడి కామేశ్వరమ్మ

తండ్రి వెల్లంకి వెంకటరామయ్య. భర్త బ్రహ్మానందరావు. స్వగ్రామం గుడివాడ తాలూకా వెంట్రప్రగడ. శాసనోల్లంఘనంలో పాల్గొని, నందివాడలో 25-5-1932 న అరెస్టు అయ్యారు. 27-6-1932 న సంవత్సరం కఠినశిక్ష విధించారు. వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## దొంతంసెట్టి సూర్యభగవానులు

తండ్రి అప్పలనర్సు. గుడివాడ తాలూకా వెంట్రప్రగడ వాస్తవ్యులు. ఆయుర్వేద, హోమియో వైద్యులు. 1940 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు.

## పోలు రామయ్య



తండ్రి నరసయ్య. జననం 22-7-1897 గుడివాడ తాలూకా వెంట్రప్రగడ. రైతు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, ఆరుమాసాల కఠిన శిక్షను 4-7-1930 నుంచి రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. కీర్తిశేషులైరి

## బొబ్బా వెంకటసుబ్బయ్య

గుడివాడ తాలూకా వెంట్రప్రగడ వాస్తవ్యులు, 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 9-2-32 న తీవ్రంగా లాఠీఛార్జీకి గురిఅయ్యారు.

## బొబ్బా పాపారావు



నివాసం గుడివాడ తాలూకా వెంట్రప్రగడ 1932 శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 9-2-1932 న తీవ్రంగా లాఠీలతో కొట్టి వదిలి వేశారు.

## బోయపాటి వెంకటకృష్ణారావు

తండ్రి రామయ్య. 1899 జూలై 1 న గుడివాడ తాలూకా వెంట్రప్రగడలో జన్మించారు. జర్నలిస్టు. రచయిత. వందేమాతరం, హోంరూల్ ఉద్యమాల కాలంనుండి జాతీయోద్యమంలో ఉన్నారు. కాకినాడ కాంగ్రెస్ మహాసభకు హాజరయ్యారు. 1923 నుండి 42 వరకు తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులు. ఒకసారి నాల్గు మాసాలు, మరోసారి మూడు మాసాలు శిక్షననుభవించారు, ప్యూనిటివ్ పోలీసులు వీరి ఇంట్లో వస్తువులను చిందరవందర చేశారు. లాఠీఛార్జీకి గురిఅయ్యారు. "ఆంధ్రజనని" అనే దిన, వార పత్రికలను "నవకళ" అనే పత్రికను నిర్వహించారు ప్రస్తుతం విజయవాడ నివాసి.

## ముద్దుకూరి చంద్రశేఖరరావు



తండ్రి వెంకయ్య 28-3-1909 న గుడివాడ తాలూకా వెంట్రప్రగడలో జన్మించారు. జర్నలిస్టు. జాతీయోద్యమ ప్రభావానికి లోనై ఆంగ్ల విద్యకు స్వస్తి చెప్పి, ఆంధ్ర జాతీయ కళాశాలలో చేరారు. సైమన్ కమీషన్ బహిష్కరణోద్యమంలో యువకులను సమీకరించారు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, 3 నెలల శిక్ష రాజమండ్రి జైలులో అనుభవించారు.

శాసనోల్లంఘనకాలంలో రహస్య పత్రిక 'రెడీ' కొన్ని నెలలపాటు నడిపి, అనేకమంది యువకులను ఉత్తేజపర్చారు. వెంట్రప్రగడ ఫిర్కాలోని అన్ని గ్రామాలలోనూ, యువకులకు నాయకత్వం వహించి, తాటి గెలలు నరకటం, కల్లు పాకల వద్ద పికెటింగ్, విదేశీవస్త్ర బహిష్కరణ వంటి కార్యక్రమాలు పెద్ద ఎత్తున నిర్వహించారు. వీటన్నిటి ఫలితంగా వెంట్రప్రగడలో ప్యూనిటివ్ పోలీసు కేంద్రాన్ని పెట్టి, ప్యూనిటివ్ పన్ను వసూలు చేశారు. 28-4-1932 న అరెస్టుచేసి నెత్తురు కక్కేవరకూ తీవ్రంగా లాఠీలతో కొట్టారు. 18-5-1932 న రెండేళ్ళు కఠిన శిక్ష రు. 300 లు జరిమానా విధించారు. జరిమానా వసూలుకు ఇంటి తలుపులు, కుటుంబ ఆస్తి వేలం వేశారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించి, 3-7-1933 న విడుదలయ్యారు. నవశక్తి, స్వతంత్ర భారత్, ప్రజాశక్తి విశాలాంధ్ర సంపాదకులుగా పనిచేశారు కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలలో ఒకరు. తామ్రపత్రగ్రహీత, 26-6-1974 న కీర్తిశేషులైరి.

## మద్దుకూరి నాగేశ్వరరావు



తండ్రి వెంకయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా వెంట్రప్రగడ. రైతు. రహస్య పత్రిక 'స్వతంత్ర భారత్' పంపిణీలో పాత్ర వహించారు, 1941 సెప్టెంబర్ 16న అరెస్టు చేసి, గుడివాడ సబ్ జైలులో 15 రోజులు నిర్బంధించారు.

## యార్లగడ్డ వెంకటరత్నం

గుడివాడ తాలూకా వెంట్రప్రగడ వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నందుకు లాఠీఛార్జీ చేయబడ్డారు. 1941 లో వ్యష్టి సత్యాగ్రహంచేశారు నాల్గు నెలల కఠినశిక్ష, రు. 500 జరిమానా, చెల్లించని పక్షంలో మరో రెండు నెలల శిక్ష విధించబడింది.

## వీరపనేని శ్రీరంగం (శ్రీ రంగారావు)

తండ్రి వెంకట సుబ్బయ్య. నివాసం వెంట్రప్రగడ. రైతు. శాసనోల్లంఘన వుద్యమంలో పాల్గొన్నందుకు 29-1-1932న అరెస్టుచేసి, తీవ్రమైన లాఠీదెబ్బలకు గురిచేసి, మర్నాడు వదిలిపెట్టారు మళ్ళీ 9-8-1932 న అరెస్టుచేసి, లాఠీఛార్జీ చేశారు. 26-3-1933న విడుదల చేశారు. గుడివాడ దోనపాడుల మధ్య గొలుసు లాగి రైలును ఆపుచేసినందుకు 7 నెలలు కఠినశిక్ష విధించారు. 29-8-1932 నుండి రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్ష అనుభవించారు. కీర్తిశేషులైరి.

## వెంట్రప్రగడ బాలకృష్ణరావు



గుడివాడతాలూకా వెంట్రప్రగడ. తండ్రి గోవింద రామయ్య 1910 ఫిబ్రవరి 17న వెంట్రప్రగడలో జన్మించారు. ప్రస్తుత నివాసం విజయవాడ. జాతీయోద్యమప్రభావంతో 1927 లో హైస్కూలు విద్యకు స్వస్తి చెప్పారు. హిందీ చదివి, "హిందీ ప్రచారక్" అయ్యి, ఉపాధ్యాయులుగా పనిచేశారు. 1930 లో రాజభక్తుల సమావేశం జరగకుండా "అల్లరి చేసినందుకు అరెస్టు చేసి వారం రోజులు సబ్ జైలులో ఉంచారు. 1932లో తాటిగెలలు నరకటం, రహస్య బులిటెన్లు పంచడం మొదలగు కార్యక్రమాల్లో పాల్గొన్నారు. 2-2-1932న గుంటూరు జిల్లా మంగళగిరిలో అరెస్టయినారు. రెండు కేసుల్లో ఆరేసి మాసాల చొ॥ శిక్ష, రు. 100 జరిమానా విధింపబడింది. గ్రామంమీద సాముదాయికజరిమానాలో భాగంగా రు. 75 లను వారివద్ద వసూలుచేశారు. 3-2-1932 నుండి రాజమండ్రిలో శిక్షననుభవించారు. 1939 లో విజయవాడ పట్టణ కాంగ్రెస్ కార్యదర్శిగా పనిచేశారు. వితంతు వివాహం చేసికొన్న సంఘ సంస్కర్త.

# నందివాడ

## ఆచంట రామబ్రహ్మం

తండ్రి వెంకటసుబ్బయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా నందివాడ. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 20-6-1932న అరెస్టు చేసి, 2-7-1932న ఆరు నెలల కఠినశిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. తిరిగి 1941 వ్యష్టిసత్యాగ్రహంలో పాల్గొని, జైలు శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. 24-12-1942 న రెండు సంవత్సరాల కఠినశిక్ష, రు. 200/- జరిమానా, పది కొరడా దెబ్బల శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. 15-3-1943 న కొరడాదెబ్బల శిక్ష అమలుజరిపారు.

## ఆచంట పిచ్చయ్య



తండ్రి బ్రహ్మయ్య నందివాడలో 1899 లో జననం. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 24-12-42 నుండి ఒక ఏడాది ఆలీపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవించారు కీర్తిశేషులయ్యారు.

## ఆచంట రామచంద్రరావు



తండ్రి సీతయ్య, జన్మస్థలం గుడివాడ తాలూకా నందిగామ. రైతు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని తీవ్రమైన లాఠీఛార్జీకి గురయ్యారు. 'జయభేరి', 'ఢంకా' రహస్య పత్రికలను ప్రజలకు పంచారు. 1933 జనవరి 14న గుంటూరులో రాష్ట్రీ డిక్టేటర్ల మహాసభకు హాజరై, అరెస్టు అయ్యారు. ఏడాది కఠిన శిక్ష, రు 2000-/ జరిమానా విధించారు. 31-8-1933న విడుదలయ్యారు. తిరిగి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 24-12-1942 నుంచి రెండు సంవత్సరాల కఠినశిక్షను, 10 కొరడా దెబ్బల శిక్షను అలీపురం జైలులో అనుభవించారు. కీర్తిశేషులైరి.

## అడుసుమిల్లి శంకరరావు

గుడివాడ తాలూకా నందివాడ వాస్తవ్యులు. 1932 లో తన గ్రామంలోనేగాక, చుట్టుప్రక్కల గ్రామాల్లో శాసనోల్లంఘనోద్యమం గురించి ప్రచారం చేశారు.

## ఈడుపుగంటి లింగయ్య



తండ్రి సుబ్బయ్య. 1906లో గుడివాడ నందివాడలో జన్మించారు. తిలక్ చనిపోయినప్పుడు జరిగిన సభలో ఉపన్యాసాలు విని చదువు మానివేశారు. కాకినాడ జాతీయ కాంగ్రెస్ మహాసభలకు హాజరయ్యారు. 1927 మద్రాసు కాంగ్రెస్ మహాసభలో ఆంధ్ర వలంటీర్ల దళానికి కెప్టెన్‌గా పని చేశారు. 1931లో ఉప్పు తయారు చేశారు. 1932లో కల్లు దుకాణాలవద్ద పికెటింగ్, విదేశ వస్త్ర బహిష్కరణలలో పాల్గొన్నారు. లాఠీ చార్జీకి గురయ్యారు. నందివాడ నుంచి రహస్య బులిటెన్లు పంచుటలో పాల్గొన్నారు. 20-6-1932 న అరెస్టు చేసి 2-7-32 న 6 మాసాలు కఠిన శిక్ష విధించగా రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొనగా రు. 25

జరిమానా, 13 నెలల కఠిన శిక్ష విధింపబడింది. జరిమానా చెల్లించి రాజమండ్రి జైలులో 18-1-1941 నుంచి శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాలు పీకివేత, ప్రభుత్వ ఆఫీసులు పడగొట్టే కార్యక్రమానికి నాయకత్వం వహించారు. 3 నెలల 10 రోజులు సబ్ జైలులో వుంచి, 24-11-1942 న 3 సంవత్సరాల కఠిన శిక్ష, రు. 400 జరిమానా విధింపబడింది జుల్మానా చెల్లించి అలీపురం క్యాంప్ జైలులో శిక్ష అనుభవించి 1-8-1945 న విడుదలయ్యారు.

1936-39 నందివాడ పంచాయితీ ప్రెసిడెంట్‌గా వున్నారు; 1945 నుండి 1948 వరకూ గుడివాడ తాలూకా కాంగ్రెస్ అధ్యక్షులుగానూ, 1948 నుంచి 1951 వరకూ కృష్ణాజిల్లా బోర్డు మెంబరుగానూ వున్నారు.

## ఈడ్పుగంటి కోటేశ్వరరావు



గుడివాడ తాలూకా నందివాడవాస్తవ్యులు దోసపాడు వద్ద రైలు మార్గాల ధ్వంసం చేసిన సందర్భంగా అరెస్టు వారంటు పుట్టింది. పట్టుబడకుండా అజ్ఞాతవాసం గడిపారు. అరెస్టయిన తర్వాత నెలరోజులు సబ్ జైలులో ఉన్నారు.

## కొమ్మన శ్రీరాములు

నందివాడ వాస్తవ్యులు. 1932 లో శాసనోల్లంఘనోద్యమం గురించి తన గ్రామంలోనేగాక చుట్టు ప్రక్కల గ్రామాల్లో కూడా ప్రచారం చేశారు.

## కొండపల్లి నాగభూషణం

జన్మస్థలం గుడివాడ తాలూకా నందివాడ. 1932 శాసనోల్లంఘనోద్యమ కాలంలో తన గ్రామంలోను, చుట్టుప్రక్కల గ్రామాలలో విరివిగా ప్రచారం చేశారు

## కొండపల్లి పరశురామరెడ్డి



గుడివాడ తాలూకా నందిగామ వాస్తవ్యులు. 1932, 42 ఉద్యమాల్లో పాల్గొన్నారు. రహస్యంగా వెలువడ "జయభేరి" "రెడీ" పత్రికలు పంచారు. 1942 లో దోసపాడు వద్ద రైలు పట్టాల పీకివేత సందర్భంగా అరెస్టు అయ్యారు. గుడివాడ సబ్‌జైలులో ఒక మాసం వుండి తర్వాత విడుదలయ్యారు.

## గుళ్ళపల్లి శాస్త్రులు

గుడివాడ తాలూకా నందివాడ వాస్తవ్యులు. తన గ్రామంలోనే గాక, చుట్టుప్రక్కల గ్రామాలలో కూడా 1932 శాసనోల్లంఘనోద్యమం గురించిప్రచారంచేశారు.

## గోరుముచ్చు రామస్వామి



తండ్రి నారాయణ స్వామి. జన్మస్థలం గుడివాడ తాలూకా నందివాడ. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టు అయి, 24-12-1942 నుంచి 8 నెలల కఠిన శిక్ష అలీపురం జైలులో అనుభవించారు.

## చౌకాకు నక్షత్రం



తండ్రి వెంకయ్య నందివాడలో 15-11-1914 న జననం. క్విట్ ఇండియా వుద్యమంలోపాల్గొన్నారు. 24-12-1942న2సం. కఠినశిక్ష, 15 కొరడా

దెబ్బలు విధించారు. ఆలీపురం క్యాంపు జైలులో కొరడా దెబ్బలు,శిక్షఅనుభవించారు. జైలుఅడ్వయిజరీ బోర్డు సిఫారసు ప్రకారం 26-7-44 న విడుదల చేయబడ్డారు.

## చ్నాటగడ్డ వెంకటేసు



తండ్రికోదండం. నందివాడ. రైతు. 1898లో జన్మిం చారు.క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొ న్నందుకు 8 నెలల శిక్ష విధించగా 14-12-41 నుండి అలీపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవించారు. నందివాడ పంచాయితీ సభ్యులుగా పనిచేశారు. కీర్తిశేషులైరి.

## చ్నాటగడ్డ శామ్యూయేలు(శామ్యూలు)

తండ్రి గురునాయి అనే అబ్రహాం. నందివాడ నివాసి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని 24-12-1942 నుండి 8 నెలలు ఆలీపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవించారు. కీర్తిశేషులైరి.

## నందివాడ లక్ష్మినారాయణ

జన్మస్థలం గుడివాడ తాలూకా నందివాడ. 1920-21 సహాయ నిరాకరణోద్యమంలో తన గ్రామోద్యోగి పదవికి రాజీనామా చేశారు. సహాయ నిరాకరణోద్యమం గురించి గ్రామాలలో ప్రచారం చేశారు.

## పూనూరు వెంకారెడ్డి



తండ్రి పిచ్చిరెడ్డి 1902 లో నంది వాడలో జననం. రైతు 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని జైలుకు వెళ్ళారు. శాసనోల్లం ఘన ఉద్యమంలో పాల్గొనగా 25-6-1932 నుండి ఒక సం॥ శిక్షను విధించారు. రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్షను అనుభవించారు. 10-4-1933 న విడుదలయ్యారు. తిరిగి వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొనగా 18-2-1942న 2 మాసముల కఠినశిక్ష, రు. 10 జుల్మానా (జుల్మానా చెల్లించకపోతే మరో రెండు మాసాల శిక్ష) విధించారు. జుల్మానా చెల్లించి రాజమండ్రి జైల్లో శిక్ష అనుభ వించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నందుకు 3 సం॥ కఠిన శిక్ష 24-12-42నుండి అలీపురం క్యాంపు జైలులో అనుభవించారు. గుడివాడ తాలూకా కాంగ్రెస్ సంఘం ప్రసిడెంటుగా 3 సం॥ జిల్లా కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ మెంబరుగా 3 సం॥ పనిచేశారు కీర్తిశేషులయ్యారు.

## పూనూరు సుందరమ్మ



భర్త వెంకారెడ్డి. జననం 1909 గుడి వాడ తాలూకా నందివాడ. శాస నోల్లంఘనంలో పాల్గొని భర్తతో పాటు జైలు శిక్ష అనుభవించారు. 27-6-1932 న సంవత్సరం కఠినశిక్ష విధించారు. వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1960లో కీర్తిశేషులైరి.

## పెయ్యల వాగయ్య అనే సంతోషం

తండ్రి భీమయ్య. నందివాడలో 1901 న జననం. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనగా గుడివాడ సబ్ డివిజనల్ మేజిస్ట్రేటు 24-12-1942న ఒక సం॥ శిక్ష విధించారు. ఈ శిక్షను కృష్ణాజిల్లా సెషన్సు జడ్జి 8 మాసాలు తగ్గించారు. ఆలీపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవిస్తుండగా 13-4-1943న కీర్తిశేషులయ్యారు.

## యార్లగడ్డ వెంకటనారాయణ



తండ్రి పిచ్చయ్య నందివాడలో 1907లో జననం. 1933 గుంటూరు కాంగ్రెస్ సభలో అరెస్టు అయ్యారు. ఒక సంవత్సరం శిక్ష, రు. 2 వేలు జరిమానా విధించగా, రాజమండ్రి జైలులో పూర్తి శిక్ష అనుభవించారు.

1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనగా 2 సం॥ శిక్ష రు. 400 లు జరిమానా విధించబడింది. శిక్ష అలీపురం క్యాంపు జైలులో అనుభవించారు. 1950 లో కీర్తిశేషులయ్యారు.

## వల్లభనేని సుబ్రహ్మణ్యం



తండ్రి చలమయ్య. జననం 1910లో. నివాసం నందివాడ. రైతు. 1931లో నందివాడ, జనార్ధనపురములలో కల్లు దుకాణాల వద్ద పికెటింగ్ జరిపారు తన ఇంటి ఆవరణలో జాతీయ జెండాను పోలీసులు తీసివేసేటప్పుడు ప్రతిఘటించి లాఠీ దెబ్బలకి గురయ్యారు.

అన్నే అంజయ్యగారిచే నడుపబడిన రహస్య పత్రిక "రెడీ"కి మద్దుకూరి చంద్రశేఖరరావుగారితో వీరుకూడా ఎడిటరుగా ఉండి, 20 వారాలపాటు నడిపారు, విజయవాడ సామారంగ్‌చౌకు పికిటింగ్‌లో తీవ్రమైన లాఠీచార్జీకి గురయ్యారు. "జయభేరి" అనే మరో రహస్య పత్రికను మరి కొందరు మిత్రులతో కలసి 10 వారాలపాటు నడిపారు. 20-6-32 న వీరిపై లాఠీ చార్జి జరిపి 2-7-32 న 6 మాసాలు శిక్ష విధించగా రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

1933లో నిషేధింపబడిన కలకత్తా కాంగ్రెస్‌కు ప్రతినిధిగా వెళ్ళి అరెస్టయి, తర్వాత విడుదల చేయబడ్డారు. హరిపుర కాంగ్రెస్ ప్రతినిధి. 1942లో దోసపాడు వద్ద రైలు పట్టాలు పీకివేసిన సందర్భంలో 24-12-1942 న 2 సం॥ కఠిన శిక్ష, రు. 200 జరిమానా, 10 కొరడా దెబ్బల శిక్ష విధించారు. జరిమానా చెల్లించారు. 15-3-43 న అలీపురం క్యాంప్ జైలులో కొరడా దెబ్బల శిక్ష అమలు జరిపారు. పూర్తి శిక్ష అనుభవించి అలీపురం జైలు నుండి విడుదలయ్యారు.

## షేక్ మహబూబ్

తండ్రి కాజమియా. గుడివాడ తాలూకా నందివాడ వాస్తవ్యులు. వర్తకులు. తన గ్రామంలోనేగాక చుట్టుప్రక్కల గ్రామాలలో కూడా 1932 శాసనోల్లంఘనోద్యమం గురించి ప్రచారం చేశారు. 16-1-33న సంవత్సరం కఠినశిక్ష, రు 2000 జరిమానా చెల్లించనిచో మూడు నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి సెంట్రల్‌జైల్లో శిక్ష ననుభవించి 31-8-33న విడుదలయ్యారు.

# చౌటపల్లి

## అక్కినేని వెంకటప్పయ్య

గుడివాడ తాలూకా చౌటపల్లి వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో, కల్లు దుకాణాల ముందు పికెటింగ్ జరిపారు. 17 1-32 న తన గ్రామంలో తీవ్రమైన లాఠీచార్జికి గురిఅయ్యారు

## అట్లూరి గోపాలయ్య

తండ్రి రామస్వామి. ఉరిఫ్ మచ్చయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా చౌటపల్లి. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టు అయి, 19-4-1943 నుంచిమూడు నెలల కఠినశిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## అట్లూరి దూర్వాసులు

తండ్రి హనుమయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా చౌటపల్లి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. రు 50/- జరిమానా విధించారు. 19-4-1943 నుంచి 30-9-1943 వరకు అలీపురం జైలులో కఠినశిక్ష అనుభవించారు.

## అట్లూరి వెంకటేశ్వరరావు



తండ్రి శివయ్య. జననం చౌటపల్లెలో. 18సం॥ వయస్సులో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనగా 1 సం॥ ఆరుమాసాల జైలు శిక్ష, 10 కొరడా దెబ్బలు విధించారు. శిక్ష అలీపురం క్యాంపు జైలులో అనుభవించారు. కొంతకాలం వార్ధా ఆశ్రమంలో ఉన్నారు.

## అట్లూరి సీతారామాంజనేయులు

తండ్రి హరిపురుషోత్తం. గుడివాడ తాలూకా చౌటపల్లి వాస్తవ్యులు. రైతు భారత రక్షణ చట్టం క్రింద 19-4-43 న 1½ సంవత్సరాల కఠిన శిక్ష, 12 కొరడాదెబ్బల శిక్ష విధించబడింది. 17-5-43 న కొరడా దెబ్బల శిక్షను అమలుపరచారు. అలీపురం జైలులో శిక్షననుభవించారు.

## అట్లూరి సుబ్బయ్య



తండ్రి చలమయ్య. చౌటపల్లి నివాసి. రైతు. కల్లు దుకాణాల వద్ద పికెటింగ్ చేసి 17-1-1932 న తన గ్రామంలో తీవ్రమైన లాఠీ చార్జీకి గురయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, తీగెలు తెగగొట్టటం, రైలు పట్టాలు పీకివేయటం చేయగా 1½ సం॥ కఠిన శిక్ష. 12 కొరడా దెబ్బలు విధించబడ్డాయి. 19-4-1943 నుండి అలీపురంకాంపు జైలులో శిక్ష అనుభవించారు

## అట్లూరి మల్లిఖార్జునరావు



తండ్రి వీరరాఘవస్వామి. 1910 లో చౌటపల్లిలో జననం. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, గుడివాడ సబ్ జైలులో 7 నెలలు వున్నారు. శిక్ష విధించగా 19-4-1943 నుండి 3 మాసాలు కఠిన శిక్షను అలీపురం క్యాంప్ జైలులో అనుభవించారు.

## అట్లూరి లక్ష్మీనారాయణ

తండ్రి రామబ్రహ్మం. జన్మస్థలం గుడివాడ తాలూకా చౌటపల్లి. రైతు క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 19-4-43 న తొమ్మిది నెలల కఠిన శిక్ష, రు. 50లు జరిమానా విధించారు అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## అట్లూరి వెంకటనర్సయ్య

తండ్రి బలరామస్వామి. గుడివాడ తాలూకా చౌటపల్లి వాస్తవ్యులు. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాలు పీకినందుకు శిక్షింపబడ్డారు. 19-4-43 నుండి 20-11-43 వరకు అలీపురం కాంప్ జైల్లో వున్నారు.

## అట్లూరి విజేంద్రనాథ చౌదరి



తండ్రి సుబ్బారావు. జన్మస్థలం గుడివాడ తాలూకా చౌటపల్లి. ఉపాధ్యాయులు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 19-4-1943 నుంచి 20-11-1943 వరకు అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## అట్లూరి భాస్కరరావు



తండ్రి రామయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా చౌటపల్లి. విద్యార్థి దశలోనే క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని 30-11-1943 నుంచి అలీపురం జైలులో ఆరు నెలల కఠినశిక్ష అనుభవించారు.

## అట్లూరి బాలకృష్ణయ్య



తండ్రి కూర్మారాయుడు. గుడివాడ తాలూకా చౌటపల్లి వాస్తవ్యులు. 1931లో వీరిపై రెండు నెలల పాటు పోలీసు నిఘా వుంది. విదేశ వస్త్ర దుకాణాల ముందు కల్లుదుకాణాలముందు పికెటింగ్ చేశారు. 1932 జనవరి 17 న లాఠీఛార్జిలో తీవ్రంగా గాయపడ్డారు కుడికాలు మడమ విరిగింది. క్విట్ ఇండియా ఉద్యమంలో 15 రోజులు సబ్ జైలులో వున్నారు. హరిజనోద్యమంలో పనిచేశారు. 1930లోనూ 1960లోనూ జిల్లా కాంగ్రెస్ కమిటీ సభ్యులుగా వున్నారు.

## అట్లూరి సత్యనారాయణ



తండ్రి శివరామబ్రహ్మం. జన్మస్థలం గుడివాడ తాలూకా చౌటపల్లి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 19-4-1943 నుంచి 20-10-1943 వరకు ఆరు మాసాల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## అట్లూరి రామకృష్ణారావు



తండ్రి మల్లికార్జునుడు. జననం 1924. గుడివాడ తాలూకా చౌటపల్లి. రైతు. చిన్న వయస్సులోనే క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. తన గ్రామస్థులు 40 మందితో కలిసి, రైలు పట్టాలు పీకివేసిన కేసులో ముద్దాయి. కొన్ని నెలలు రహస్య జీవితం గడిపి, అరెస్టు అయ్యారు. 30-11 1943 న ఆరు మాసాల కఠినశిక్ష విధించారు. అలీపురం క్యాంప్ జైలులో శిక్ష అనుభవించారు.

## అన్నే రామకోటయ్య



తండ్రి రామయ్య. నివాసం చౌటపల్లి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని చౌటపల్లివద్ద రైలు పట్టాలు తొలగించటం, టెలిఫోన్ తీగలు తెంచడం వల్ల ఒక సంవత్సరం 6 మాసాలు కఠినశిక్ష 19 4 43 నుండి అలీపురం క్యాంపు జైలులో అనుభవించారు.

## కొత్తపల్లి కాకులయ్య



తండ్రిసూరయ్య జన్మస్థలం గుడివాడ తాలూకా చౌటపల్లి. క్విట్ ఇండియా ఉద్యమంలో ఆరు మాసాల కఠినశిక్షను 19-4-1943 నుంచి అలీపురం క్యాంప్ జైలులో

అనుభవించారు.

## కొత్తపల్లి కేశవనారాయణ



తండ్రి నాగయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా చౌటపల్లి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 19-4-1943న తొమ్మిదినెలల కఠిన శిక్ష. ఆరు కొరడా దెబ్బల శిక్ష విధించారు. అలీపురం జైలులో ఆ రెండు శిక్షలు అనుభవించారు.

## కొత్తపల్లి రామకోటేశ్వరరావు



తండ్రి పురుషోత్తం. జన్మస్థలం గుడివాడ తాలూకా చౌటపల్లి. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాలు పీకివేత, తంతితీగెల త్రెంచివేత చర్యలలో పాల్గొన్నందుకు, 19-4-1943 నుంచి ఆరు మాసాల కఠినశిక్షను అలీపురం క్యాంప్ జైలులో అనుభవించారు. ఆరు కొరడా దెబ్బల శిక్షను కూడా జైలులో అనుభవించారు.

## కొత్తపల్లి పురుషోత్తం

జన్మస్థలం గుడివాడ తాలూకా చౌటపల్లి. శాసనోల్లంఘన ఉద్యమంలో కల్లు దుకాణాల ముందు పికెటింగ్ చేసి, 17-1-1932న తీవ్రమైన లాఠీఛార్జీకి గురయ్యారు.

## కొత్తపల్లి బొజ్జయ్య

ఉరఫ్ వెంకట రామయ్య. తండ్రి బాపయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా చౌటపల్లి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. అలీపురం జైలులో 19-4-1943 నుంచి 30-9-1943 వరకు కారాగారవాసంతోపాటు, 17-5-1943న పదికొరడా దెబ్బలు శిక్షను కూడా అనుభవించారు.

## ఘంటసాల వెంకటేశ్వరరావు



తండ్రి సూరయ్య. జననం 4-12-1922 గుడివాడ తాలూకా చౌటపల్లి. విజయనగరం సంగీత కళాశాల నుంచి సంగీత డిప్లొమా పొందారు. సుప్రసిద్ధ గాయకులు. సినీ సంగీత దర్శకులు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 19-4-1943 నుంచి ఆరునెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు. 100 చలన చిత్రాలలో 10 వేల సినిమా పాటలు పాడారు. 'పద్మశ్రీ' బిరుదాంకితులు. తిరుపతి దేవస్థానం 'ఆస్థాన విద్వాన్'. 1970లో అమెరికా, ఐరోపా దేశాలలో గానకచేరీలు చేశారు. 11-2-1974న మద్రాసులో కీర్తిశేషులైరి.

## దాసరి రామశేషయ్య



తండ్రి రాఘవయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా చౌటపల్లి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 19-4-43న తొమ్మిది నెలల కఠిన శిక్షను, రు. 100/ జరిమానాను విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## పొట్లూరి సత్యనారాయణ

గుడివాడ తాలూకా చౌటపల్లి. తండ్రి వెంకటరత్నం. 1917 ఆగస్టు 17న జన్మించారు. ప్రస్తుత నివాసం హైదరాబాదు. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టయ్యారు. 22-9-42 నుండి 29-5-43 వరకు గుడివాడ, కైకలూరు, సబ్ జైళ్ళలో ఉన్నారు 1943 జనవరి 14 నుండి ఫిబ్రవరి 3 వరకు నిరాహారదీక్ష పూనారు. 29-5-43 నుండి అలీపురం క్యాంప్ జైల్లో 15 నెలలకఠినశిక్ష అనుభవించారు. గుడివాడ పట్టణ కాంగ్రెస్ కార్యదర్శిగా, పశ్చిమ కృష్ణా రాజకీయ బాధితుల కమిటీ కార్యదర్శిగా పనిచేశారు.

## పునుకొల్లు అర్జునరావు



గుడివాడ తాలూకా చౌటపల్లి. తండ్రి వెంకట సుబ్బయ్య. ప్రస్తుత నివాసం గుడివాడ. క్విట్ ఇండియా ఉద్యమంలో 19-4-43న సంవత్సరంన్నర కఠిన శిక్ష, పది కొరడా దెబ్బల శిక్ష విధింపబడింది. అలీపురం జైల్లో శిక్షను అనుభవించుతుండగా కొరడా దెబ్బల శిక్షను గూడ అమలుపరచారు.

## పునుకొల్లు రాంభొట్లు

తండ్రి వెంకటకృష్ణయ్య. చౌటపల్లి నివాసి. రైతు క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. రు. 100 లు జరిమానా, 9నెలల కఠిన శిక్ష విధించారు. జరిమానా చెల్లించి అలీపురం క్యాంప్ జైలులో శిక్షను 19-4-1943 నుండి అనుభవించారు. 1953లో కీర్తిశేషులైరి.

## రావి వెంకటరామయ్య

గుడివాడ తాలూకా చౌటపల్లి వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో కల్లు దుకాణాల ముందు పికెటింగ్ చేశారు. 17-1-32 న తన గ్రామంలో తీవ్రంగా లాఠీ ఛార్జీకి గురి అయ్యారు.

## యలవర్తి మల్లిఖార్జునరావు



తండ్రి రామబ్రహ్మం. 15-7-20న చౌటపల్లిలో జననం. ఉపాధ్యాయవృత్తి. 19-4-1943 నుంచి 20-11-1943వరకూ క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నందుకు అలీపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవించారు.

## ర్యాలి పిచ్చిరామయ్య అనే పిచ్చయ్య శాస్త్రి



తండ్రి వెంకటరామయ్య. చౌటపల్లిలో 4-3-1908న జన్మించారు. సంగీతం టీచరుగా పనిచేశారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని 6 మాసాల కఠిన శిక్ష 19-4-1943 నుండి అలీపురం క్యాంపు జైలులో అనుభవించారు. 19-12-75 న కీర్తిశేషులయ్యారు. వీరు సుప్రసిద్ధ సినీ గాయకులు ఘంటసాల వెంకటేశ్వరరావుగారి మేనమామ. రేడియో గాయకులు నాటక సమాజాలు నెలకొల్పి నాటకాలు వేయించారు. వీరు చాలామందికి సంగీతం నేర్పారు. తరంగ కళాప్రపూర్ణ మొదలైన బిరుదులు పొందారు. 'భక్త రఘునాథ్' సినిమాలో నటించారు.

## లగిశెట్టి చిన్నలింగయ్య

తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా చౌటపల్లి. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 19-4-1943న సంవత్సరం ఆరుమాసాల కారాగార వాసం, 10 కొరడాదెబ్బల శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. 17-5-1943 న కొరడా దెబ్బల శిక్ష అమలు జరిపారు.

## లగిశెట్టి బసవేశ్వర్లు



తండ్రి సుబ్బయ్య. చౌటపల్లి నివాసి. రైతు. క్విట్ ఇండియా వుద్యమంలో పాల్గొని రైలు పట్టాలు తొలగించినందుకు 19-4-1943 నుండి 1½ సం॥లు కఠినశిక్ష, 12 కొరడా దెబ్బలు విధించారు. అలీపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవించారు.

## లగిశెట్టి బ్రహ్మయ్యలింగం



తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా చౌటపల్లి. క్విట్ ఇండియా వుద్యమంలో పాల్గొన్నారు. 30-11-43 నుంచి ఆరు నెలల కఠినశిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## వీరమాచనేని సత్యనారాయణ

గుడివాడ తాలూకా చౌటపల్లి వాస్తవ్యులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆరునెలల కఠినశిక్ష విధించబడింది.

## సుంకర నాగభూషణం

జన్మస్థలం గుడివాడ తాలూకా చౌటపల్లి. శాసనోల్లంఘనంలో పాల్గొని కల్లుదుకాణాలముందు పికెటింగ్ చేసి, 17-1-1932 న తీవ్రమైన లాఠీఛార్జికి గురి అయ్యారు.

## సుంకర సుబ్బయ్య

తండ్రి గురయ్య. గుడివాడ తాలూకా చౌటపల్లి వాస్తవ్యులు. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 19-4-43న 9నెలల కఠినశిక్ష, రు. 100 జరిమానా విధించబడింది. జరిమానా చెల్లించబడింది. అలీపురం క్యాంప్ జైల్లో శిక్షను అనుభవించారు.

## సూరపనేని శ్రీరామదాసు



తండ్రి వీరయ్య. గుడివాడ తాలూకా చౌటపల్లివాస్తవ్యులు. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 17-5-43న అలీపురం క్యాంపు జైల్లో ఆరు కొరడాదెబ్బల శిక్షను అమలుపరచారు. అదే జైలులో 19-4-43 నుండి 30-9-43 వరకు శిక్షను అనుభవించారు.

## సూరపనేని భాస్కరరావు



గుడివాడ తాలూకా చౌటపల్లి. ఉపాధ్యాయులు. 1917మార్చి 14 న జన్మించారు. తండ్రి పుల్లయ్య. ప్రస్తుత నివాసం కైకలూరు. క్విట్ ఇండియా ఉద్యమంలో భీమవరం, గుడివాడ రైలుమార్గంలో ఫిష్ ప్లేట్లు తొలగించారు. స్లీపర్లను తగులపెట్టారు. 29-9-42న అరెస్టు చేసి గుడివాడ, బందరు, కైకలూరు సబ్ జైళ్ళలో ఏడుమాసాలు తిప్పారు. 19-4-43 న ఒక కేసులో సంవత్సరం, మరో కేసులో ఆరునెలల కఠిన శిక్ష ఆరుకొరడా దెబ్బల శిక్ష విధించబడింది. అలీపురం క్యాంప్ జైలులో 17-5-43 న కొరడా దెబ్బల శిక్ష అమలుపరచబడింది. అప్పీలులో శిక్ష తగ్గించగా, 30-9-43 న విడుదలయ్యారు. స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్నందున 32 నెలలు ఉద్యోగం పోయింది.

## సూరపనేని పరంధామయ్య

తండ్రి కోదండరామయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా చౌటపల్లి రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 19-4-1943 న ఆరు నెలల కఠినశిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

# కొత్తవరం

## కానూరి చిన్న వెంకట దాసయ్య



తండ్రి వెంకటాచలం. జన్మస్థలం గుడివాడ తాలూకా కొత్తవరం. శాసనోల్లంఘన కాలంలో గుడివాడలో నిషేధాజ్ఞలను ధిక్కరిస్తూ బహిరంగ సభ జరిపారు. 4-6-1930 న సంవత్సరం కఠిన శిక్ష, రు. 50/- జరిమానా విధించారు. రాజమండ్రి, కోయంబత్తూరు, ఆలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 13-3-1931 న విడుదలయ్యారు. 1931లో గుడివాడ తాలూకాలో అడుగు పెట్టరాదని ప్రభుత్వం నిషేధించింది. శాసనోల్లంఘనంలో పాల్గొని, 7-1-1932 నుంచి 6-1-1933 వరకు రాజమండ్రి, బళ్లారి జైళ్లలో కఠిన శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 11-5-1943 న రెండేళ్ళ కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. ఉప్పు సత్యాగ్రహ కాలంలో తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెసు అధ్యక్షులు. 1921లో విజయవాడ ఏ.ఐ.సి.సి. సమావేశానికి హాజరై, స్వయంగా వడికిన నూలుతో నేసిన ఖద్దరు వస్త్రాన్ని గాంధీజీకి బహూకరించారు. స్వగ్రామంలో ఖద్దరు ఉత్పత్తి కేంద్రాన్ని 400 రాట్నాలు, 40 మగ్గాలనూ నిర్వహించారు. 1921 స్వరాజ్య నిధికి గాంధీజీకి రు. 1116/- విరాళమిచ్చారు.

## కానూరి దామోదరయ్య



స్వస్థలం గుడివాడ తాలూకా కొత్తవరం. 1933సం॥లో ఒకనాడు రిజర్వు పోలీసులు వీరి యింటిపై దాడిచేసి, విప్లవ సాహిత్యం కొరకు వీరి యింటిని సోదా చేశారు. అడ్డు వచ్చిన వారిని లాఠీలతో మోదారు.

## కానూరి రామానంద చౌదరి



తండ్రి దామోదరయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా కొత్తవరం. ప్రస్తుత నివాసం హైదరాబాద్. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 23-6-1930న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవిస్తూ విప్లవకారులతో సంబంధాలు ఏర్పరచుకొన్నారు. మద్రాసు కుట్ర కేసులో ముద్దాయి. 1933లో మూడు సంవత్సరాల కఠిన శిక్ష విధించారు. మద్రాసు, కోయంబత్తూరు, వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు. జైలులో ఖైదీల పట్ల అధికారుల ప్రవర్తనకు నిరసనగా 15 రోజుల నిరాహార దీక్ష సాగించారు. గాంధీజీ దీక్ష విరమించమని విజ్ఞప్తి చేశారు. అయినా, కోర్కెలు అంగీకరించేంత వరకు దీక్ష విరమించలేదు.

## కానూరి వెంకటరత్నం



తండ్రి దామోదరయ్య. గుడివాడ తాలూకా కొత్తవరం వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నందుకు 19.6.30న సంవత్సరం కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష ననుభవించారు. గాంధి ఇర్విన్ ఒడంబడిక ననుసరించి, 12-3-31న విడుదలయారు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 16-1-33 న సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. రు. 2000 జరిమానా, చెల్లించని

పక్షంలో మరో మూడు నెలలు శిక్ష విధించబడింది. రాజమండ్రి సెంట్రల్ జైల్లో శిక్ష ననుభవించారు. 31-8-33 న విడుదలయ్యారు. 1932 సం॥లో రహస్య పత్రిక నిర్వాహణలో తోడ్పడ్డారు. 1932 లో ఢిల్లీలో జరిగిన ఆలిండియా కాంగ్రెసు సభకు హాజరయ్యారు. ఢిల్లీ పోలీసు కస్టడీలో 24 గంటలు వున్నారు. కీర్తిశేషులైరి.

## కానూరి వెంకట చలపతి



గుడివాడతాలూకా కొతవరం వాస్తవ్యులు. 1920-21 సహాయ నిరాకరణ ఉద్యమంలో కాంగ్రెస్ ఆదేశంమేరకు శాసనసభ అభ్యర్థిత్వాన్ని ఉపసంహరించుకున్నారు. 20వ శతాబ్దం ఆదిలోనే కృష్ణాజిల్లా రైతులను సంఘటిత పర్చి, నీటితీరువా వర్గీకరణకు వ్యతిరేకంగా ఒకేరోజున 2వేల పెటిగ్రాంలు యిప్పించిన ఫలితంగా, ఇరిగేషన్ బిల్లు తేబడింది. గొట్టిపాటి బ్రహ్మయ్య గారి రాజకీయ గురువులు. 1920లో పెదకళ్ళేపల్లిలో జరిగిన కృష్ణామండల రాజకీయ మహాసభకు అధ్యక్షులు. కీర్తిశేషులైరి.

## కానూరి బలరామయ్య



తండ్రిశేషయ్య. గుడివాడ తాటాకా కొతవరంలో 4-8-1908న జన్మించారు. రైతు. ఉప్పు సత్యాగ్రహములో పాల్గొని, 3-7-1930 నుంచి ఆరు నెలలు కఠినశిక్ష, రాజమండ్రి జైలులో అనుభవించారు. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. సంవత్సరం కఠినశిక్ష, వెయ్యిరూపాయలు జరిమానా విధించారు. 1932 లో ఢిల్లీలో జరిగిన నిషేదింపబడ్డ ఆలిండియా కాంగ్రెస్ సభకు ప్రతినిధిగా రహస్యంగా వెళ్ళారు. పోలీసులు అరెస్టుచేసి వీరిని 24 గంటలు కస్టడీలో వుంచారు. 1933 లో గ్రామం మీద దాడి చేసిన పోలీసులు, వీరిని నెత్తురు కారేటట్లు లాఠీలతో మోదారు. 1933 లో గుంటూరులో రహస్యంగా జరిగిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ డిక్టేటర్ల సభకు హాజరయ్యారు. అక్కడ అరెస్టుచేసి ఆరు నెలల శిక్ష, రెండువేలరూపాయలు జరిమానా విధించారు. జరిమానా చెల్లించకపోతే సంవత్సరం శిక్ష విధించారు. 16-1-1933 నుంచి రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. రాజమండ్రి జైల్లో బెంగాలీ టెర్రరిస్టులతో పరిచయం ఏర్పడింది. తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంఘ కార్యదర్శిగా పనిచేశారు: కమ్యూనిస్టుపార్టీలో చేరి, రైతు ఉద్యమం నిర్మించారు. 1935-54 మధ్య కాలంలో కృష్ణాజిల్లా రైతుసంఘం అధ్యక్షులు, మహబూబ్‌నగర్ జిల్లాలోని 'శాంతినగర్'లో స్థిరపడి అక్కడనే కీర్తిశేషులైరి.

## కానూరి రాజ్యలక్ష్మమ్మ

తండ్రి దేశభక్తుని సుబ్బయ్య. జన్మస్థలం గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా బేతపూడి. భర్త వెంకటసుబ్బారావు. గుడివాడ తాలూకా కొతవరం. శాసనోల్లంఘనంలో పాల్గొని, 28-1-1932 నుంచి సంవత్సరం కఠినశిక్షను వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు. గుడివాడ తాలూకా కాంగ్రెస్ కమిటీ ఉపాధ్యక్షులుగా పనిచేశారు. 19-5-1973న కీర్తిశేషులైరి.

## కానూరి రాఘవమ్మ

తండ్రి చిన్నదాసయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా కొతవరం. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. మేజిస్ట్రేట్ ముందు నిలబడి "ప్రభుత్వం మాది. రాజీనామా చేయండి" అని నినాదం చేయగా, 6-3-1943 నుంచి ఆరు నెలల కఠినశిక్షను విధించారు. వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు. కీర్తిశేషులైరి.

## కానూరి చలమయ్య

జన్మస్థలం గుడివాడ తాలూకా కొతవరం. 1895 నాటి రిసెటిల్‌మెంట్ సర్కిల్ ప్రకారం నీటి తీరువా రు. 4/ నుంచి రు. 5/ లకు పెంచినందుకు

నిరసనగా 'సాగుబంద్' ఉద్యమం నడిపారు. నెల రోజుల కఠిన శిక్ష అనుభవించారు.

## కొమ్మారెడ్డి వెంకట సుబ్బయ్య

తండ్రి కోటయ్య. గుడివాడ తాలూకా కొతవరం వాస్తవ్యులు. రైతు. కాంగ్రెస్ జెండాను కాపాడుటలో లాఠీ దెబ్బలకు గురయ్యారు. సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నందుకు 3-7-30 న 6 నెలల శిక్ష విధింపబడింది. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలోను, బళ్ళారి వెల్లెస్లి శానిటోరియంలోను శిక్ష అనుభవించారు.

## కొల్లి గంగాధరరావు



తండ్రి వెంకట్రామయ్య. జననం 1926 గుడివాడ తాలూకా కొతవరం. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో రహస్య కరపత్రాలుపంచారు. గోపురంపై కాంగ్రెసు జెండాకట్టి లాఠీవార్కికి గురయ్యారు. 26-11-1942 న అరెస్టయ్యారు. 21రోజులు సబ్ జెయిల్‌లో రిమాండ్‌లో వున్నారు.

## కొల్లి మాధవరావు



తండ్రి గోపాల కృష్ణయ్య. 1890 ప్రాంతంలో కొతవరంలో జననం. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా పామర్రులో 6 మాసముల కఠినశిక్ష విధింపబడింది. 3-7-1930 నుండి రాజమండ్రి, తిరుచునాపల్లి, కడలూరు, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. తామ్రపత్రగ్రహీత. 1974 లో కీర్తిశేషులైరి.

## కొల్లి సత్యానారాయణ

జన్మస్థలంగుడివాడతాలూకాకొతవరం. గుంటూరులో న్యాయవాద వృత్తి సాగించారు. ఉప్పుసత్యాగ్రహ కాలంలో గాంధీటోపి ధరించి కోర్టులో ప్రవేశించగా, కోర్టువారు కేసు పెటారు. దానిపై హైకోర్టులో అపీలు చేశారు. గాంధీ టోపీ ధరించటం నేరంకాదని హైకోర్టు తీర్పు చెప్పింది. 1933లో గుంటూరులో ఆయన ఇంట్లో బాంబులు తయారవుతున్నవన్న అనుమానంతో పోలీసులు దాడిచేసి, అరెస్టు చేశారు. స్థానిక న్యాయవాదుల ఆందోళనఫలితంగా విడుదల చేశారు.

## తాళ్ళూరి దుర్గాప్రసాద్‌రావు

తండ్రి నాగయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా కొతవరం. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. పోలీసులు కాంగ్రెస్ జెండా దింపడానికి ప్రయత్నించగా, వీరు నిరోధించి లాఠీ దెబ్బలకు గురయ్యారు. 23-6-1930న సంవత్సరం కఠిన శిక్ష విధించారు రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931 న విడుదలయ్యారు. 1937లో కీర్తిశేషులైరి.

## తాళ్ళూరి శ్రీరాములు

తండ్రి లక్ష్మీపతి. గుడివాడ తాలూకా కొతవరం వాస్తవ్యులు. వీరు హరిజనోద్ధరణకు కృషిచేశారు. ఒక పండుగనాడు తన హరిజన పాలేరుకు తన వంటగదిలో భోజనంపెట్టి, కొత్తబట్టలు కట్టబెట్టినందుకు కొంతకాలం వెలివేయబడ్డారు. 1922లో తన మాగాణిభూమిలో పాకలు వేయించి, వెయ్యిరూపాయల మూలధనంతో రాట్నాలు మగ్గాలు నెలకొల్పి ఖద్దరు వుత్పత్తి చేయించారు. వీరు 1951 లో కీర్తిశేషులైరి.

వీరి ధర్మపత్ని సుబ్బమ్మగారు తమకున్న పట్టు బట్టలతో సహా విదేశ వస్త్రాలను, ఆ గ్రామ రామాలయం ముందు గుట్టవేసి తగులబెట్టారు. ఆనాటి నుంచి ఆమె నగలు కూడా ధరించటం మానివేశారు.

## తాళ్ళూరి నారాయణమూర్తి



తండ్రినాగయ్య. జన్మస్థలంకొౌతవరం. 1921లో విజయ వాడలో జరిగిన కాంగ్రెస్ మహాసభల ప్రభావంవల్ల హైస్కూలువిద్యకు స్వస్తి చెప్పారు. ఖాదీ ఉద్యమ వ్యాప్తికి కృషి సల్పారు. 1913లో కాకి నాడలో జరిగిన మహాసభకు వలంటీరుగా వెళ్ళారు

## నార్ల వెంకటేశ్వరరావు



తండ్రి లక్ష్మణ రావు. జననం 1-12-1908 మధ్య ప్రదేశ్‌లోని జబల్ పూర్. స్వస్థలం గుడివాడ తాలూకా కౌతవరం. ప్రస్తుత నివాసం హైదరాబాదు. పట్టభద్రులు. సుప్రసిద్ధ జర్నలిస్టు. రచయిత. బ్రహ్మసమాజ ప్రభావానికి లోనై 'సోదరసమితి' అనే యువజన సంస్థను స్థాపించారు. చదువుకొనే రోజులలో, 1927 లో యువజన కాంగ్రెస్ మహాసభకు హాజరయ్యారు. చిన్నతనంనుంచి పత్రికలకు వ్యాసాలు వ్రాసేవారు. 1930 ఉప్పుసత్యాగ్రహ కాలంలో పోలీసులు స్వగృహంపై దాడిచేసి, జాతీయ వారపత్రిక "జన్మభూమి" పత్రికకు వ్రాసిన "తెల్ల అల్లుళ్ళు" "తెల్ల కోడళ్ళు" అనే వ్యాసప్రతులను స్వాధీనంచేసుకున్నారు. స్పృహ తప్పిపడిపోయే వరకు లాఠీలతో కొట్టారు. 7 నెలల శిక్ష విధించారు. తరువాత రెండు రోజులకుబెయిల్‌పై విడుదలయ్యారు స్వదేశ సంస్థానాలు, "నేటిరష్యా" మరి అనేక గ్రంథాలు రచించారు. 'జస్టిస్' 'స్వరాజ్య' 'జనవాణి' 'ప్రజామిత్ర' వంటి పత్రికలలో అనేక వ్యాసాలు ప్రచురించారు 'ఆంధ్ర ప్రభ' 'ఆంధ్రజ్యోతి' దినపత్రికలకు ఎడిటర్‌గా పనిచేశారు. 1958 నుంచి 70 వరకు రాజ్యసభ సభ్యులు అనేక దేశాలు సందర్శించి వచ్చారు. ప్రస్తుత నివాసం హైదరాబాద్.

## బొబ్బా ఆదినారాయణమూర్తి



తండ్రి శ్రీరాములు. జన్మస్థలం కౌతవరం. 1900 ప్రాంతంలో జననం. 1923లో కాకినాడ కాంగ్రెస్ సభలకు వలంటీరుగా వెళ్ళారు. బందరుకు మద్రాసు గవర్నరు రాక సందర్భంలో నల్ల జెండాలతో జరిపిన అసమ్మతి ప్రదర్శనలో పాల్గొని, అరెస్టు అయ్యారు. ఒక సం॥ 6 మాసాలు కఠిన శిక్ష విధించారు. 15-3-30 నుండి రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు. పతాకావిష్కరణోద్యమంలో లాఠీ దెబ్బలు తిన్నారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 5-4-1941 నుండి అలీపురం క్యాంప్ జైలులో 4 మాసాలు కఠిన శిక్ష అనుభవించారు. రు. 100 లు జరిమానా విధించి, వీరి నుండి వసూలు చేశారు

నూజెళ్ళ వద్ద రైలు పట్టాలు పెరికివేతలో పాల్గొన్నారు. రహస్యంగా కరపత్రాలు పంచుట ద్వారా క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని అరెస్టు అయ్యారు. 11-5-1943 న రెండేళ్ళ కఠిన శిక్ష, 12 కొరడా దెబ్బలు విధించారు. ఆ రెండు శిక్షలను అలీపురం జైలులో అనుభవించారు. 1948లో ఖమ్మంలో రజాకార్లు మెడలో వేప మండలు కట్టి ఊరేగించి చంపడానికి ప్రయత్నించారు. స్థానికుల జోక్యంవల్ల విడుదలయ్యారు.

## బొబ్బా పద్మనాభయ్య

జన్మస్థలం గుడివాడ తాలూకా కౌతవరం. 1907లో బిపిన్‌చంద్రపాల్ (బందరు) ప్రసంగాన్ని విని ఉత్తేజితులయ్యారు. "వందేమాతరం-మందేరాజ్యం" పోస్టర్లను అతికించారు. అప్పుడే ప్రారంభమైన జైళ్ళలో వందేమాతరం ఉద్యమానికివిరాళాలువసూలు చేశారు. ప్రభుత్వం రిజర్వు పోలీసులను కౌతవరానికి

పంపించడానికి కారకులయ్యారు. 1910లో 'ఆంధ్ర రాష్ట్ర కమ్మ మహాసభను కొతవరంలో విజయవం తంగా నిర్వహించి ఆ సంఘానికి కార్యదర్శిగా ఎన్ని కయ్యారు. బందరు జాతీయ కళాశాలకు ఒక ఎకరం భూమి దానమిచ్చారు. హిందూ సంఘ సంస్కార ప్రియులు గుడివాడ తాలూకా బోర్డు సభ్యులుగా పలు సార్లు ఎన్నికయ్యారు. 1534లో కీర్తిశేషులైరి.

## బొబ్బా వీరభద్రుడు



తండ్రి శ్రీరాములు. జన్మస్థలం గుడివాడ తాలూకా కొతవరం. రైతు. ఉప్పు సత్యాగ్రహ కాలంలో తిన సావిట్లో ఉప్పుతయారుచేశారు. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 16-7-1930 న సంవత్సరం కఠినశిక్ష, రు. 50/- జరిమానా విధించారు. రాజమండ్రి, అలీపురం, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 12-3-1931 న విడుదలయ్యారు. 16-9-77 న కీర్తిశేషులయ్యారు.

## బొబ్బా మధుసూదనరావు



తండ్రి వీరభద్రయ్య. కొతవరం నివాసి. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 7-12 1942నఅరెస్టు చేశారు. రెండు సం॥ కఠిన శిక్ష. 12కొరడా దెబ్బలు విధించగా 11-5-1943 నుండి అలీపురం క్యాంపు జైలులో ఆ శిక్ష అనుభవించారు.

## బొబ్బా వెంకటేశ్వరరావు



తండ్రి భూషయ్య జన్మస్థలం గుడివాడ తాలూకా కొతవరం. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో తంతి తీగెలు త్రెంచి, 8-12-1942 నుంచి 20-12-1942 వరకు రెండు వారాల జైలు శిక్షను గుడివాడ కైకలూరు సబ్ జైళ్ళలో అనుభవించారు.

## బొబ్బా రంగయ్య

తండ్రి వెంకటరామయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా కొతవరం. రైతు. 1930 లో అప్పటి మద్రాసు గవర్నరు బందరు రాకకు నిరసనగా నల్ల జెండాల ప్రదర్శనలో పాల్గొన్నారు. నాలుగు వారాల కఠిన శిక్ష విధించారు, తిరిగి ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా సంవత్సరం శిక్ష విధింపబడింది. 15-3-30 నుంచి 10 నెలలు శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## బొబ్బా వెంకట శేషయ్య



తండ్రి కృష్ణయ్య గుడివాడ తా॥ కొతవరం వాస్తవ్యులు. రైతు. తూర్పుకృష్ణా జిల్లా కాంగ్రెస్ కమిటీకి అధ్యక్షులుగా పనిచేశారు. 8.2.30న మద్రాసు గవర్నర్ బందరు వచ్చినపుడు జరిపిన నల్లజెండాల ప్రదర్శన కేసులో 15-3 30 న సంవత్సరం 4 వారాల కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, వెల్లూరు, మద్రాసు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 22-12-30న హైకోర్టు తీర్పు ననుసరించి విడుదలయ్యారు. ఈయనకు "దేశాభిమాని" అని శ్రీ చెరుకువాడ నరసింహం

పంతులుగారు బిరుదు నిచ్చారు. వీరి కుటుంబ సహాయార్థం, డి. వి. సుబ్బారావుగారి నాటక సమాజం గుడివాడలో ప్రదర్శింపదలచిన నాటకాన్ని ప్రభుత్వం మూడు నెలలు నిషేధించింది 1926 లో జరిగిన ఎన్నికలలో ఓటర్లను కొని, కొల్లిపర సూరయ్యగారిపై మీర్జాపురం జమీందారు గెలిచారనీ, ఆయన ఎన్నిక చెల్లదనీ. గొట్టిపాటి బ్రహ్మయ్యగారితో కలిసి వీరు దావా వేశారు అప్పుడు మీర్జాపురం రాజా 25 వేల రూపాయలు లంచం యిచ్చి లొంగదీయాలనుకున్న ప్రయత్నం విఫలమయింది. 2-10-1931 న కీర్తిశేషులైరి.

## బొబ్బా సీతారామయ్య

తండ్రి 'దేశాభిమాని' వెంకటశేషయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా కౌతవరం. ఇంగ్లీషు విద్యకు స్వస్తి చెప్పి, జాతీయ విద్యాలయంలో చేరారు. 1932 శాసనోల్లంఘనంలో, చిన్న వయస్సులోనే స్వగ్రామంలోని గుడిగోపురంపై జాతీయ జెండా ఎగుర వేసిన సందర్భంలో పోలీసులు వెంటబడి తరుముతూ రెండుతుపాకిగుళ్ళుప్రేల్చగాతప్పించుకున్నారు. 1933లో గుడివాడలో కాంగ్రెసుకరపత్రాలు పంచుతూ అరెస్టు అయి, పదిరోజులు సబ్ జైలు నిర్బంధంలో వున్నారు.

## బొబ్బా శేషగిరిరావు

తండ్రి వెంకటరత్నం. జన్మస్థలం గుడివాడ తాలూకా కౌతవరం. క్విట్ఇండియా ఉద్యమంలో పాల్గొని, 8-12-1942న అరెస్టు అయ్యి, 15 రోజులు గుడివాడ సబ్ జైలులో నిర్బంధంలోవున్నారు.

## వడ్డి అర్జునుడు



నివాసం గుడివాడ తాలూకా కౌతవరం. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, ఆరుమాసాల కఠిన శిక్షను బోర్‌స్టల్ స్కూలులో అనుభవించారు. ప్రస్తుత నివాసం తెలంగాణా ప్రాంతం.

## వడ్డి నారాయణమూర్తి

జన్మస్థలం గుడివాడ తాలూకా కౌతవరం. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, యుద్ధ వ్యతిరేక నినాదాలు చేశారు. నాలుగు నెలల కఠిన శిక్ష, రు. 200/- జరిమానా విధించారు.

## వడ్లమూడి సత్యనారాయణ

తండ్రి గంగయ్య. గుడివాడ తాలూకా కౌతవరం వాస్తవ్యులు. రైతు. పత్రికా రచయిత. ఆనాటి మద్రాసు గవర్నర్ బందరు వచ్చినపుడు నల్లజెండాలు చూపినందుకు 15-3-30 న 10 నెలల కఠినశిక్ష విధించబడింది. ప్రజాశక్తి దినపత్రిక, ఆంధ్రప్రభ పత్రికలలో పనిచేశారు. మద్రాసులో ఆంధ్రప్రభ పత్రికలో పనిచేస్తున్న కాలంలో కీర్తిశేషులయ్యారు

## వడ్లమూడి సుబ్బన్న

జన్మస్థలం గుడివాడ తాలూకా కౌతవరం. 1833-34 నందన సంవత్సరం కరువు ఫలితంగా గుడివాడ ఎస్టేట్ రైతులు శిస్తులు చెల్లించ నిరాకరించి, జరిపిన తిరుగుబాటుకు నాయకత్వం వహించారు ఈ కాటకం తరువాతనే కాటన్ దొర కృష్ణానదిపై ఆనకట్ట నిర్మించారు.

## వడ్లమూడి వెంకటరామయ్య



తండ్రి గంగయ్య. గుడివాడ తాలూకా కౌతవరం వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 23 6.30 న సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది రాజమండ్రి, తిరుచినాపల్లి, అలీపురం జైళ్ళల్లో శిక్ష ననుభవించారు. గాంధి ఇర్విన్ ఒడంబడిక ననుసరించి 14-3-31 న విడుదల అయ్యారు. కీర్తిశేషులు.

### వీరపనేని గోపాలకృష్ణయ్య



తండ్రి బసవయ్య. జననం 21-9-1900 గుడివాడ తాలూకా అడ్డాడ. నివాసం కౌతవరం. 1931 శాసనోల్లంఘన కాలంలో స్వగ్రామం వదిలి, గుడివాడ తాలూకాలో అడుగు పెట్టరాదని ప్రభుత్వం నిషేధించింది. 1932 లో రహస్య పత్రికను పంచారు. 23-1-1932 న కౌతవరంలో అరెస్టు చేసి, గుడివాడ సబ్ జైలుకి తీసుకుపోయారు. లాఠీలతో తీవ్రంగా చావమోదారు. సుమారు నూరు లాఠీదెబ్బలు కొట్టారు. ఒక చెవి క్రింది భాగం తెగిపోయింది. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. మూడు నెలల కఠిన శిక్ష. రు. 200/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 1942 ఆగష్టు ఉద్యమంలో పాల్గొన్నారు. కొంతకాలం కైకలూరు సబ్ జైలులో నిర్బంధించారు. 10 సం॥రాలు జిల్లా హరిజన సేవా సంఘానికి కార్యదర్శిగా వున్నారు. తూ॥కృ॥ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. 10-3-'80 న కీర్తిశేషులైరి.

### వడ్లమూడి శ్రీ కృష్ణమూర్తి



తండ్రి సీతారామస్వామి. గుడివాడ తాలూకా కౌతవరం వాస్తవ్యులు. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు 11-5-43న రెండేళ్ళ కఠినశిక్ష, 12 కొరడా దెబ్బలు విధింపబడ్డాయి. అలీపురం క్యాంప్ జైలులో కొరడా దెబ్బల శిక్షను 10-5-43న అమలు పరచారు. అలీపురంలో జైలుశిక్షను అనుభవించారు.

## అంగలూరు

### అక్కినేని లక్ష్మి పెరుమాళ్ళు

తండ్రి పుల్లయ్య. జననం 1905 గుడివాడ తాలూకా అంగలూరు. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని, 22-12-1930నుంచి మూడు నెలల రెండువారాల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

### ఆరెకపూడి నాగభూషణం



తండ్రి బ్రహ్మయ్య. అంగలూరు. 1902లో జన్మించారు. రైతు. 1920-21 జాతీయోద్యమంలో నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్నారుసహాయ నిరాకరణలో పాల్గొని అరెస్టయి కొన్నాళ్ళు సబ్ జైలులో వున్నారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో 9½ నెలల శిక్ష విధింపబడి 13-5-30నుంచి రాజమండ్రి. మద్రాసు, ఆలీపురం క్యాంపు జైళ్ళలో శిక్ష అనుభవించారు. తిరిగి 11-2-31 న ఆరునెలల శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒప్పందం వల్ల 11-3-31 న విడుదలయ్యారు. 1932 జనవరి 26 న స్వాతంత్ర్య దినం జరిపినందుకు తీవ్రమైన లాఠీ దెబ్బలకు గురయ్యారు. 1932 ఫిబ్రవరిలో ఆరునెలల శిక్ష విధించినా మార్చిలో విడుదల చేశారు. వీరి ఇల్లు సత్యాగ్రహ శిబిరంగా మారింది. భార్య ఉషామణి, ఇద్దరు సోదరీమణులు, తల్లి కూడా సత్యాగ్రహంలో పాల్గొన్నారు. తిరిగి 15-4-1932 న అరెస్టుచేసి 2-5-1932 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రిలో శిక్ష అనుభవించారు. హిందీ ప్రచారోద్యమంలోపాల్గొన్నారు.

## ఆరెకపూడి ఉషామణి



నాగభూషణంగారి పత్ని. అంగలూరు 1913లో జన్మించారు. 1929లో కాంగ్రెస్‌లో చేరారు. చిన్న వయస్సులోనే 1932 లో శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నారు. విదేశ వస్త్ర దుకాణాలముందు పికెటింగ్ చేయగా పోలీసుల లాఠీఛార్జికి స్పృహతప్పి పడిపోయారు. రెండునెలల పికెటింగ్ అనంతరం 2-5-1932 న సంవత్సరం శిక్ష విధింపబడింది. రాయవెల్లూరు, కన్ననూర్ జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## ఆరెకపూడి మాణిక్యమ్మ

భర్త బ్రహ్మయ్య అంగలూరు. 1870 ప్రాంతంలో జన్మించారు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 2-5-32 న ఒక సంవత్సరం కఠిన శిక్ష విధింపబడింది. వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు 1948 లో కీర్తిశేషులయ్యారు.

## ఆరెకపూడి సుగుణమణి



పుట్టినిల్లు గుడివాడ తాలూకా అంగలూరు. తండ్రి బ్రహ్మయ్య. తల్లి, అన్న, వదిన, అక్కలతో పాటు, శాసనోల్లంఘనంలో తన 12 వ ఏటనే పికెటింగ్‌లో పాల్గొన్నారు. 'చిన్నపిల్లవి వద్దు. వెళ్ళు' అని పోలీసు అధికారి నచ్చచెప్పినా వినకుండా ఉద్యమంలో పట్టుదలగా పాల్గొన్నారు. రెండేళ్ళ కఠిన శిక్ష విధించారు. మైనరు కావడంవల్ల మద్రాసు బోర్‌స్టల్ స్కూలులో శిక్ష అనుభవించారు. ప్రస్తుత నివాసం నిజామాబాద్ జిల్లా హెగ్డోలి.

## ఆరెకపూడి హరివాసులు

తండ్రి రామస్వామి. జన్మస్థలం గుడివాడ తాలూకా అంగలూరు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు 13-5-1930 న 9నెలల కఠినశిక్ష, రు. 50/- జరిమానా విధించారు. జరిమానాలో సగం వసూలు చేశారు. రాజమండ్రి, మద్రాసు, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## ఆరెకపూడి మహాలక్ష్మమ్మ

భర్త రామస్వామి. స్వగ్రామం గుడివాడ తాలూకా అంగలూరు శాసనోల్లంఘనోద్యమంలో 31-3-1932న గుడివాడలో విదేశ వస్త్రాలయాల ముందు పికెటింగ్ చేయగా, అరెస్టుచేసి, దూరప్రాంతానికి తీసుకెళ్ళి, వదిలివేశారు తిరిగి 2-5-1932 న పికెటింగ్ చేయగా సంవత్సరం కఠిన శిక్ష విధించారు. వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు.

## అరికపూడి కోటయ్య

తండ్రి బాపయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా అంగలూరు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 13-5-1930 న 9 నెలల కఠిన శిక్ష రు. 50/- జరిమానా విధించారు. శిక్షను రాజమండ్రి. మద్రాసు, అలీపురం జైళ్ళలో అనుభవించారు. జైలు నుంచి విడుదలైన వెంటనే తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 11-2-1931 న ఆరునెలల శిక్ష విధించారు. రామండ్రి జైలులో శిక్ష అనుభవిస్తుండగా, గాంధీ – ఇర్విన్ ఒప్పందంతో విడుదలయ్యారు.

## ఆరెకపూడి రామశాస్త్రిలు

తండ్రి సుందరయ్య గుడివాడ తాలూకా అంగలూరు. 1918 నుంచి జాతీయవాది. హరిజనుని పంచాయితీబోర్డు ప్రెసిడెంటుగా చేయాలని ప్రచారం చేసి గ్రామస్థుల వ్యతిరేకతకు గురిఅయ్యారు. స్కూళ్ళలో హరిజన ఉపాధ్యాయులను నియమించడానికి కృషి చేశారు. 3 ఎకరాల పొలం దానమిచ్చి జాతీయ పరిశ్రమలు స్థాపించారు. 1930లో సత్యాగ్రహ వలంటీ

ర్లను తమ గ్రామంనుండి బయటికి పంపించి వేయాలని పంచాయతీ ప్రెసిడెంటుగా ఉన్న వీరిపై కలెక్టర్ ఒత్తిడి చేశారు. గ్రామస్తులను బయటకు పొమ్మనే హక్కు తనకుగానీ, కలక్టర్‌కుగానీ లేదని జవాబిచ్చారు. గ్రామంలోని సత్యాగ్రహ శిబిరాన్ని పోలీసులు తొలగించిన తర్వాత, సత్యాగ్రహులకు ఆశ్రయమిచ్చినందుకు వీరిని లాఠీఛార్జిచేసి గుడివాడ సబ్‌జైలులో ఉంచారు. 2 సంవత్సరాల శిక్ష విధించి బి. క్లాసు ఇచ్చారు. రాజమండ్రి జైల్లో వ్యాధిగ్రస్తులు కాగా, మద్రాసు జైలుకు మార్చి ఆస్పత్రిలోచేర్చారు. ఆరుమాసాల పిదప విడుదల చేశారు. తర్వాత కొద్ది కాలానికే కీర్తిశేషులయ్యారు.

## ఆరెకపూడి సుందరరామయ్య



తండ్రి వీరయ్య. గుడివాడ తాలూకా అంగలూరు. ఉప్పు సత్యాగ్రహ దళంలో పాల్గొన్నారు. అంగలూరులో సత్యాగ్రహ శిబిరం స్థాపించి 50 గ్రామాలలో ప్రచారం చేశారు. తాటిగెలలు నరకుట, కల్లుదుకాణాల వద్ద పికెటింగ్‌లలో పాల్గొన్నారు 7-7-30 న ఆరుమాసాల శిక్ష విధించబడింది. రాజమండ్రి, రాయవెల్లూరులలో శిక్షను అనుభవించారు

## ఎర్నేని సుబ్రహ్మణ్యం



తండ్రి గంగయ్య. 1898 ప్రాంతంలో జన్మించారు. గుడివాడ తాలూకా అంగలూరు వాస్తవ్యులు. సర్వోదయ నాయకుడు సాధు సుబ్రహ్మణ్యం అని ప్రజలు పిలుస్తూ ఉండేవారు. ఉప్పు సత్యాగ్రహ సమయంలో గాంధీజీ వెంట దండి యాత్రలో పాల్గొన్నారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 23-5-1930 న ఒక సంవత్సరం శిక్ష విధింపబడింది. రాజమండ్రి, కోయంబత్తూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1931 లో 6 నెలల శిక్ష విధించబడింది. శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొనగా, సంవత్సరం ఆరువారాల కఠినశిక్ష విధించబడింది, 18-1-32 నుండి రాజమండ్రి సెంట్రల్ జైల్లో శిక్షననుభవించారు. ఉద్యమ కాలంలో ఆయన ఇంటినికూడా స్వాధీనం చేసుకున్నారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో 8 నెలల విడిఖైదు, రు. 100 జరిమానా, చెల్లించనిచో మరో రెండు మాసాల విడిఖైదు విధించబడింది. అలీపురం క్యాంపు జైలులో శిక్షననుభవించారు. కొమరవోలులో సత్యాగ్రహ ఆశ్రమం నెలకొల్పారు. "దరిద్ర నారాయణ" అనే పత్రిక నడిపారు. 1969 లో శాసన సభ్యులు. 1974 సెప్టెంబర్ 21న కీర్తిశేషులయ్యారు.

## ఎర్నేని లీలావతి



తండ్రి వల్లభనేని జానకిరామయ్య భర్త సుబ్రహ్మణ్యం. స్వగ్రామం గుడివాడ తాలూకా అంగలూరు. శాసనోల్లంఘనం లో పాల్గొన్నారు. 18-1-1932 న సంవత్సరం జైలు శిక్ష, రు. 100/- జరిమానా విధించారు. వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని 3-11-1942 నుంచి మూడునెలలశిక్షను వెలూరు జైలులో అనుభవించారు. తిరిగి 6-3-1943 నుంచి డి. ఐ. ఆర్. క్రింద ఆరునెలల శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. కడసారి 19-2-1944 నుంచి 17-2-1945 వరకు సంవత్సరం శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. హిందీ, మరాఠీ భాషలు అభ్యసించారు. వార్ధామహిళా ఆశ్రమంలో శిక్షణ పొందారు. కీర్తిశేషులయ్యారు.

## ఎర్నేని అమృతమ్మ



భర్త సూర్యనారాయణ. స్వగ్రామం గుడివాడ తాలూకా అంగలూరు. తండ్రి బొప్పన వెంకటాద్రి. శాసనోల్లంఘనం లో అరెస్టు అయ్యారు. 18-1-1932 న సంవత్సరం కఠినశిక్ష రు 100/- జరిమానా విధించారు. వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో మూడు సార్లు శిక్షలు అనుభవించారు. మొదటిసారి నెల పదిహేను రోజులు, రెండవసారి 5-2-1943 నుంచి ఆరు మాసాలు. మూడవసారి 21-8-1943 నుంచి 18 మాసాలు కఠిన శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు.

## ఎర్నేని పుల్లమ్మ



తండ్రి బొప్పన నరిసయ్య. భర్త రంగయ్య. స్వగ్రామం గుడివాడ తాలూకా అంగలూరు. ఎనభై యేళ్ళ వయసులో శాసనోల్లంఘనంలో పాల్గొని, అరెస్టయ్యారు. 18-1-1932న సంవత్సరం కఠినశిక్ష. రు. 100/- జరిమానా విధించారు. వెల్లూరు, కన్ననూరు, జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## ఎర్నేని బ్రహ్మయ్య

తండ్రి పిచ్చయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా అంగలూరు. రైతు. శాసనోల్లంఘనానికి 2-7-1930 న ఆరు నెలల కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. విడుదలైన తరువాత తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 11-2-1931 న ఆరు నెలలు కఠినశిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవిస్తుండగా గాంధీ ఇర్విన్ ఒప్పందంతో 11-3-1931న విడుదలయ్యారు.

## ఎర్నేని సూర్యనారాయణ



తండ్రి గంగయ్య. గుడివాడ తాలూకా అంగలూరు వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 2-6-30 న రెండేళ్ళ కఠిన శిక్ష విధింపబడింది. రాజమండ్రి, బళ్లారి జైళ్ళలో శిక్షను అనుభవించారు. గాంధి-ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 11-3-31 న విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొని 15-6-32 న ఆరునెలల శిక్ష పొందారు రాజమండ్రి జైలులో శిక్షను అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా 11-5-43 నుండి రెండేళ్ళ కఠిన శిక్షను అలీపురం క్యాంప్ జైలులో అనుభవించారు.

## గొట్టిపాటి సీతారామేశ చంద్రశేఖరరావు



తండ్రి నాగయ్య. అంగలూరు నివాసి. 1919లో జననం. 1942 క్విట్ ఇండియా వుద్యమంలో పాల్గొన్నందుకు 6-4-43 నుండి 2 సంవత్సరాలు శిక్ష, రు. 50 జరిమానా 10 కొరడా దెబ్బలు విధింపబడగా అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## గొట్టిపాటి వెంకటరత్నం

తండ్రి గంగయ్య. గుడివాడ తాలూకా అంగలూరు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 7-7-30

నుండి రాజమండ్రి, అలీపురం, జైళ్ళలో ఆరునెలల శిక్ష అనుభవించారు.

## గొట్టిపాటి వెంకటరత్నం

తండ్రి రామయ్య. గుడివాడ తాలూకా అంగలూరు వాస్తవ్యులు. రైతు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నందుకు, 3నెలల రెండువారాల కఠిన శిక్షను విధించారు. రాజమండ్రి సెంట్రల్ జైల్లో శిక్ష ననుభవించారు.

## గొట్టిపాటి శివాజీరావు



తండ్రి పెద్ద పున్నయ్య. గుడివాడ తాలూకా అంగలూరులో 1908 జూన్ 15న జన్మించారు. రైతు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నందుకు 17-6-30న ఒక సంవత్సరం కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష ననుభవించారు.

## గొట్టిపాటి రమేష్‌చంద్ర చౌదరి

జన్మస్థలం గుడివాడ తాలూకా అంగలూరు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 9 నెలల కఠినశిక్షను అనుభవించారు.

## గొట్టిపాటి చిన్న పున్నయ్య

తండ్రి రామకృష్ణయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా అంగలూరు. రైతు శాసనోల్లంఘనంలో పాల్గొని, 22-12-1930 నుంచి మూడునెలల రెండు వారాల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## గొట్టిపాటి శ్రీరాములు

తండ్రి వెంకబరాయుడు. గుడివాడ తాలూకా అంగలూరు. ఉప్పు సత్యాగ్రహంలో మూడు నెలల, రెండు వారాల కఠిన శిక్షను 22-12-30 నుండి రాజమండ్రి జైలులో అలుభవించారు.

## టి. రామకృష్ణయ్య

జన్మస్థలం గుడివాడ తాలూకా అంగలూరు. క్విట్ ఇండియా ఉద్యమంలో రవాణా సౌకర్యాలను భగ్నం చేసిన చర్యలకుగాను డి. ఐ. ఆర్. క్రింద అరెస్టు చేసి, శిక్ష విధించారు.

## చలసాని నాగభూషణం

తండ్రి హనుమయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా అంగలూరు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. తీవ్రమైన లాఠీచార్జికి గురయ్యారు. 4-6-30న సంవత్సరం కఠినశిక్ష, రు. 50/ జరిమానా విధించారు. రాజమండ్రి, కోరాపుట్, బరంపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. తిరిగి 1932 శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. గుడివాడ తాలూకా ఆఫీసువద్ద జరిగిన పోలీస్ లాఠీచార్జిలో స్పృహతప్పి పడిపోతే. ఆయనను సైడ్ కాల్వలోకి ఈడ్చారు. ఆయన చేతి గూడు జారిపోయింది. సంవత్సరం కఠినశిక్ష, రు. 100/- జరిమానా విధించారు. క్విట్ ఇండియా ఉద్యమకాలంలో 6-4-1943 నుంచి సంవత్సరం ఆరుమాసాల జైలు శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## చాపరాల సుబ్బారావు



తండ్రిరామయ్య. 1917లో జననం. అంగలూరులో నివాసం. క్విట్ ఇండియా వుద్యమంలో పాల్గొని 6-4-1943 నుండి 9 నెలలు అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## త్రిపురనేని రామకోటయ్య

తండ్రి భూషయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా అంగలూరు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 7-7-1930 నుంచి ఆరునెలల కఠినశిక్షను రాజమండ్రి వెల్లూరు జైళ్ళలో అనుభవించారు,

## తిపిర్నేని వెంకాయమ్మ



ఖమ్మం జిల్లా మధిర తాలూకా ఆల్లీనగరంలో జన్మించారు. వీరి అత్తవారి వూరు గుడివాడ తాలూకా అంగలూరు. తిపిర్నేని లక్ష్మీనారాయణగారి పత్ని. 1932 లో విదేశ వస్త్రాల షాపుల వద్ద పికెటింగ్ చేస్తూ కరపత్రాలు పంచిపెడుతుండగా గుత్తి సబ్‌జైలులో 15 రోజులు వుంచి విడుదల చేశారు. అప్పటికి వీరి వయసు 16 సంవత్సరాలు. ప్రస్తుత నివాసం పటమట, విజయవాడ.

## త్రిపురనేని రామశాస్త్రులు

తండ్రి రామస్వామి. జన్మస్థలం గుడివాడ తాలూకా అంగలూరు. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని 22-12-1930 నుంచి మూడున్నర నెలలు కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## త్రిపురనేని వరప్రసాదరావు

తండ్రి రామశాస్త్రులు. జన్మస్థలం గుడివాడ తాలూకా అంగలూరు. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 6-4-1943 న ఆరు నెలల కఠిన శిక్ష, రు. 100/- జరిమానా విధించారు అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## త్రిపురనేని హరిప్రసాదరావు

గుడివాడ తాలూకా అంగలూరు. తండ్రి వెంకటరత్నం. 1930-31 సంవత్సరాల్లో జాతీయోద్యమంలో శిక్షింపబడ్డారు. మొదటిసారి గుడివాడలో 6 నెలల శిక్ష, రు. 25/- జరిమానా విధించబడింది. 28-7-30 నుండి రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించారు. రెండవసారి 11-2-31 న ఆరునెలల శిక్ష విధించబడింది. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 11-3-31 న విడుదలయ్యారు. కీర్తిశేషులయ్యారు.

## త్రిపురనేని రాధాకృష్ణారావు



తండ్రి జానకి రామయ్య. అంగలూరు నివాసి. రైతు. తన 16వ ఏట ఫోర్తుఫారం చదువుతూ శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నారు 1932న 6మా॥ శిక్ష రాజమండ్రి సెంట్రల్ జైలులో అనుభవించారు. క్విట్ఇండియా ఉద్యమంలో వీరిపై 2 కేసులు పెట్టి 6-4-1943న సంవత్సరం నాలుగు నెలల కఠినశిక్ష 10 కొరడా దెబ్బలు, రు. 50 జరిమానా విధించారు. జరిమానా వసూలు చేశారు. అలీపురం, క్యాంపు జైలులో 1సం॥ 3మా॥ వుంచి తరువాత విడుదల చేశారు. ఏడుసార్లు లాఠీఛార్జీకి గురయ్యారు.

## త్రిపుర్నేని సుబ్రహ్మణ్యం



తండ్రినాగయ్య. అంగలూరు నివాసి. వీరు 1930 సం॥ నుండి కాంగ్రెస్ వుద్యమాల్లో పాల్గొన్నారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నందుకు 6-4-1943 న సంవత్సరం కఠిన శిక్ష 10 కొరడాదెబ్బలు విధించారు. హైకోర్టులో కేసు కొట్టివేసినందున 2-10-1943 న అలీపురం క్యాంపు జైలునుంచి విడుదలయ్యారు.

## త్రిపురనేని నాగభూషణం

తండ్రి వెంకట్రామయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా అంగలూరు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 4-6-1930 న సంవత్సరం కఠినశిక్ష రు. 50/- జరిమానా విధించారు. రాజమండ్రి, తిరుచునా

పల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931న విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 14-3-1932న సంవత్సరం కఠినశిక్షవిధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## త్రిపురనేని కౌసల్య

అంగలూరు. తండ్రి బ్రహ్మయ్య. భర్త అంజయ్య. 1930 ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నారు. సంవత్సరం కఠినశిక్ష, రు. 100/- జరిమానా, జరిమానా చెల్లించనిచో ఆరువారాల కఠినశిక్ష విధించారు. గుడివాడలో విదేశ వస్త్ర దుకాణాలముందు పికెటింగ్ చేయుచుండగా పోలీసుల లాఠీఛార్జికి గురియై స్పృహతప్పి పోయారు. 1932 ఏప్రిల్ 18న సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. రాయవెల్లూరు, కోయంబత్తూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. ఖాదీ, హరిజనోద్యమాలలో పనిచేశారు. అంగలూరు దేవాలయంలో హరిజనులకు ప్రవేశ మివ్వాలని కోరుతూ 20 రోజులు నిరాహార వ్రతంచేశారు. 1958 లో కీర్తిశేషులయ్యారు.

## దుగ్గిరాల వెంకటేశ్వరరావు



తండ్రినాగయ్య. అంగలూరులో 14-3-1921 న జననం. ప్రాథమికోపాధ్యాయుడి పని చేస్తూ క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 4-10-42 న అరెస్టు చేయబడ్డారు. అలీపురం క్యాంపు జైలులో 9 మాసాలు కఠినశిక్షను 6-4-43 నుంచి 12-4-43 వరకు అనుభవించారు. సబ్ జైలుతో సహా మొత్తం ఒక సంవత్సరం జైలుజీవితం గడిపారు.

## దుగ్గిరాల శివాజీరావు

గుడివాడ తాలూకా అంగలూరు వాస్తవ్యులు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా సబ్ జైలులో కొన్నాళ్ళుంచి రు. 400/- జరిమానా విధించారు.

## దుగ్గిరాల బలరామకృష్ణయ్య



తండ్రి అమరయ్య. జననం 1905 గుడివాడ తాలూకా అంగలూరు. రైతు. 1919 లో ఎస్. ఎస్. ఎల్. సి. చదువుతూ, ఆంగ్ల విద్యకు స్వస్తి చెప్పి, బందరు నేషనల్ కాలేజీలో చేరారు. సంస్కృతం, హిందీ, తెలుగు సాహిత్యాలు జీపోసన పట్టారు. గుజరాతీ, ఉర్దూ భాషలలో అనర్గళంగా ప్రసంగించగలరు. 1919 లో 'గాంధీ మహోదయ' 'తిలక్ విజయ' నాటకాలు ప్రదర్శించినందుకు అరెస్టు చేశారు. మూడేళ్ళు అలహాబాద్ హిందీ విద్యాపీఠంలో హిందీ అభ్యసించారు. 1921 లో అలహాబాద్ లో ప్రిన్స్ ఆఫ్ వేల్స్ రాకకు నిరసనగా నల్లజెండాల ప్రదర్శనలో పాల్గొని అరెస్టు అయ్యారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1-7-1930 న సంవత్సరం శిక్ష విధించారు. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. శాసనోల్లంఘనంలో పాల్గొని 9-10-1933 న అరెస్టు అయ్యారు. 21-11-1933 న 9 నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో 30-9-1942 నుంచి 9-12-1944 వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా వున్నారు. వితంతు వివాహాలను ప్రోత్సహించారు, అంటరానితనాన్ని వ్యతిరేకించారు 'బుద్ధ పురాణం' 'మానవ జీవితం' వంటి అనేక గ్రంథాలు రచించారు. గుజరాతీలో గాంధీజీ రచించిన 'అనాసక్త యోగం'ను తెలుగులోకి 'నిష్కామ యోగం' పేరుతో అనువదించారు. సర్వేపల్లి రాధాకృష్ణ అధ్యక్షతన ఆంధ్ర మహాసభ వారు "బౌద్ధ వాఙ్మయ బ్రహ్మ" బిరుదును 1927 లో ప్రదానం చేశారు. తూర్పు కృష్ణాజిల్లా అధ్యక్షులుగా పనిచేశారు. 8 సంవత్సరాలపాటు రాష్ట్ర కాంగ్రెసు సంయుక్త కార్యదర్శి.

అయిదేళ్ళపాటు ఎ. ఐ. సి. సి. సభ్యులు. ఒకసారి లోక్‌సభకు ఎన్నికయ్యారు.

## దుగ్గిరాల కమలమ్మ



తండ్రి త్రిపురనేని జానకిరామయ్య. జననం 1910 న గుడివాడ తాలూకా అంగలూరు భర్త బలరామ కృష్ణయ్య. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 27-1-1931 న నాలుగు నెలలు విడిఖైదు విధించారు. వెల్లూరు జైలులో శిక్ష అనుభవిస్తుండగా గాంధీ-ఇర్విన్ ఒప్పందం జరగడంతో విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని, 6-1-1932 నుంచి ఆరు నెలల విడిఖైదును వెల్లూరు జైలులో అనుభవించారు. అంటరానితనం నిర్మూలనం, లైబ్రరీఉద్యమం, మహిళా మండలి మున్నగు వాటి కొరకు కృషి చేశారు

## దుగ్గిరాల వెంకటసుబ్బయ్య

తండ్రి అమరయ్య. గుడివాడ తాలూకా అంగలూరు వాస్తవ్యులు. రైతు, శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 22-12-30 నుండి 3½ నెలల శిక్షను రాజమండ్రి జైల్లో అనుభవించారు.

## దుగ్గిరాల అమరప్రసాదరావు



తండ్రి సూర్యనారాయణ. జన్మస్థలం గుడివాడ తాలూకాఅంగలూరు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. ఆరు నెలల కఠిన శిక్ష, రు. 50/- జరిమానా విధించారు. 13-5-1930 న రాజమండ్రి, వెల్లూరు, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## దుగ్గిరాల వరప్రసాదరావు

గుడివాడ తాలూకా అంగలూరు వాస్తవ్యులు. 1930 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 9 నెలల కఠిన శిక్ష విధించబడింది.

## దుగ్గిరాల రాఘవచంద్రయ్య (సచ్ఛాస్త్రి)

తండ్రి పురుషోత్తం. జననం 19-5-1892 గుడివాడ తాలూకా అంగలూరు. వందేమాతరం ఉద్యమంతో ఉత్తేజితులై జాతీయోద్యమంలో ప్రవేశించారు. 1920-24 మధ్యకాలంలో తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెసు సంఘ సంయుక్త కార్యదర్శి. స్వగ్రామంలో "జాతీయ పరిశ్రమాలయ" స్థాపకులలో ఒకరు. 1922లో విజయవాడలో స్వరాజ్య ప్రెస్సును ఏర్పాటు చేసి "స్వరాజ్య" పత్రిక నడిపారు. 1923 కాకినాడ కాంగ్రెసు సందర్భంలో 'స్వరాజ్య' ప్రత్యేకసంచికను ప్రచురించారు. ఎ. ఐ. సి. సి. సభ్యులుగా ఎన్నికైరి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 15-5-1930 నుంచి సంవత్సరం కఠినశిక్షను కన్ననూరు జైలులో అనుభవించారు. బ్రాహ్మణేతరులు వేదపఠనానికి అర్హులా అన్న అంశంపై జైలులో కొందరు కాంగ్రెసు నాయకులతో విభేదాలు ఏర్పడ్డాయి. వ్యష్టి సత్యాగ్రహ కాలంలో డి.ఐ.ఆర్. క్రింద అరెస్టు అయి, 22-4-1941 నుంచి 7 నెలల కఠినశిక్షను అలీపురం జైలులో అనుభవించారు. 1914లో "విజయనగర సామ్రాజ్యం" నవల రచించి 'విజ్ఞాన చంద్రికా మండలి' వారు నిర్వహించిన పోటీకి పంపారు. ఆ పోటీలో ఆగ్రంథానికి రు. 500/- నగదు బహుమతి, బంగారు పతకం లభించాయి. ఆంధ్ర యూనివర్శిటీ 'విజయనగర సామ్రాజ్యం' నవలను ఇంటర్ పాఠ్యాంశంగా నిర్ణయించింది ఇంకా అనేక గ్రంథాలను రచించి, రచయితగా పేరుపొందారు. 25-5-1977 న విజయవాడలో కీర్తిశేషులైరి.

## దుగ్గిరాల నాగయ్య

తండ్రి పెరుమాళ్ళు. జన్మస్థలం గుడివాడ తాలూకా అంగలూరు. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని, 22-12-1930 నుంచి మూడున్నర నెలల కఠినశిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## పోతరాజు రాధా మనోహరం



తండ్రి యెర్నేని సూర్యనారాయణ. భర్త వెంకట సుబ్బయ్య. స్వస్థలం గుడివాడ తాలూకా అంగలూరు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని మొత్తం నాలుగు సార్లు అరెస్టు అయ్యారు. మొదటిసారి 10-2-1943 నుంచి ఆరునెలల కఠిన శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. 1944 లో రెండు దఫాలు అరెస్టయి, సబ్ జైలులో రిమాండ్‌లో వున్నారు. తిరిగి 19-2-1944 డి. ఐ. ఆర్. క్రింద సంవత్సరం కఠిన శిక్ష విధించారు. వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు. హిందీ, ఖాదీ ప్రచారం పట్ల ఆసక్తి కలవారు.

## బందా రామచంద్రరావు



తండ్రి వెంకయ్య. జననం 17-1-1921. గుడివాడ తాలూకా అంగలూరు. టీచరు. క్విట్ ఇండియా ఉద్యమంలో డి. ఐ. ఆర్. క్రింద అరెస్టు చేశారు. 17-5-1943 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## బొప్పన రంగారావు

తండ్రి శ్రీరాములు. జన్మస్థలం గుడివాడ తాలూకా అంగలూరు. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 6-4-1943 నుంచి పది నెలల కఠిన శిక్షను అలీపురం జైల్లో అనుభవించారు.

## మూల్పూరి కోటేశ్వరరావు



తండ్రి దశరథ రామయ్య. జననం 1-5-1926. గుడివాడ తాలూకా అంగలూరు. పదహారేళ్ళ వయస్సులో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 3-10-1942 న అరెస్టు అయ్యారు. 4-4-1943 వరకు సబ్ జైలులో నిర్బంధం. 4-4-1943న రు. 80/- జరిమానా విధించారు. ప్రస్తుత నివాసం అదిలాబాద్ జిల్లా లక్సెట్టిపేట తాలూకా వేనిమడుగు.

## వీరమాచనేని కోటేశ్వరరావు

తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా అంగలూరు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 6-4-1943న సంవత్సరం నాలుగు మాసాల కఠిన శిక్ష, 10 కొరడా దెబ్బల శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. 15-5-1943 న కొరడా దెబ్బల శిక్ష అమలుజరిపారు.

## వీరపనేని సోమశేఖరరావు



తండ్రి సుబ్బయ్య. 1923న అంగలూరులో జననం. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 6-4-1943 నుండి 9 మాసాల శిక్ష రు. 50/- జరిమానా విధించారు. అలీపురం జైలులో శిక్షఅనుభవించారు.

## సూరపనేని ప్రభాకరరావు



తండ్రి పద్మనాభం. చింతమర్రిలో జననం. విద్యార్థిగా వుండగా ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 17-6-1930 నుండి 21 మాసములు శిక్ష విధింపబడింది. రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు. కల్లు దుకాణాల వద్ద పికెటింగ్ జరుపుతుండగా గుడివాడలో లాఠీఛార్జీకి గురయ్యారు.

## ఎస్. దశరథరామయ్య

తండ్రి అంజయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా అంగలూరు. వ్యాపారి. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 6-4-1943 న సంవత్సరం కఠిన శిక్ష. 10 కొరడా దెబ్బల శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. అనారోగ్య కారణాలపై కొరడా దెబ్బల శిక్షను అమలు జరపలేదు. 2-10-1943 న ప్రభుత్వం విడుదల చేసింది.

# గుడివాడ తాలూకా వివిధ గ్రామాలు

## అట్లూరి జయరామయ్య



తండ్రి మల్లయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా వానపాముల. రైతు. శాసనోల్లంఘనంలో రెండుసార్లు లాఠీఛార్జీలకు గురయ్యారు. 10-8-32న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 13-6-1933 న విడుదలయ్యారు. ప్రస్తుతం వ్యాపారం నిమిత్తం బొంబాయిలో నివాసం.

## అట్లూరి కామేశ్వరమ్మ

తండ్రి చలసాని కృష్ణయ్య. భర్త మల్లికార్జునరావు. స్వస్థలం గుడివాడ తాలూకా నూజెళ్ళ. శాసనోల్లంఘనంలో పాల్గొని అరెస్టు అయ్యారు. 18-1-1932న సంవత్సరం కఠినశిక్ష. రు. 100/- జరిమానా విధించారు. వెల్లూరు, మద్రాసు జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## అట్లూరి వెంకట రంగయ్య



తండ్రి సుబ్బయ్య. జననం 1908. గుడివాడ తాలూకా పెదపారుపూడి. రైతు. హిందీ సాహిత్యరత్న. 19-5-1939 న గుడివాడలో 144 సెక్షన్ ధిక్కరించి, బహిరంగసభ జరిపినప్పుడు, పోలీసులతో ఘర్షణపడి, అరెస్టు అయ్యారు. 17-6-1930 న 20 మాసాల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం, బళ్లారి జైళ్లలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో మిగతా సత్యాగ్రహులను విడుదల చేసినప్పటికి, పోలీసులపై దౌర్జన్యంజరిపారన్న కారణంతో విడుదల చేయడానికి ప్రభుత్వం నిరాకరించింది. వ్యష్టి సత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమాలలో కూడా పాల్గొన్నారు. నిరంతరం హిందీ ప్రచారం సాగిస్తున్నారు.

## అట్లూరి శ్రీరామదాసు



తండ్రి గోపాల కృష్ణయ్య. గుడివాడ తాలూకా పెరిశేపల్లిలో 28-7-1910 లో జన్మించారు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో స్వగ్రామంలో కల్లు చెట్ల గెలలు నరకుతుండగా అరెస్టు చేశారు. 12-7-1930 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## అడుసుమిల్లి లక్ష్మీపెరుమాళ్ళు



తండ్రి వీరయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా గండేపూడి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో రాష్ట్రీయ యువజన కాంగ్రెసు నాయకుల శిబిరాన్ని నిర్వహించి ఆరుమాసాల కఠినశిక్షను 18-10-1943 నుంచి అలీపురం జైలులో అనుభవించారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## అడుసుమిల్లి కృష్ణమూర్తి



గుడివాడ తాలూకా గండేపూడి. తండ్రి వీరయ్య. ప్రస్తుత నివాసం హైదరాబాదు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. యువజన కాంగ్రెస్ రాష్ట్రీ నాయకుల రహస్య శిబిరాన్ని నిర్వహించుటలో 1942 డిసెంబర్‌లో తమ అన్నగారితో కలిసి పనిచేశారు. 1943 జనవరి 26 న శాసనోల్లంఘనం చేశారు. 27-1-43 న అరెస్టుచేసి 9 నెలలు సబ్‌జైలులో వుంచి 18-10-43 న ఆరునెలల శిక్ష విధించారు. అలీపూర్ క్యాంప్‌జైల్లో శిక్ష ననుభవించారు.

## అడుసుమిల్లి కోటేశ్వరరావు



జన్మస్థలం గుడివాడ తాలూకా గండేపూడి. 1942 క్విట్ ఇండియాఉద్యమంలో పాల్గొని శిక్ష అనుభవించారు.

## అడుసుమిల్లి సీతారామయ్య



తండ్రి శేషయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా నిమ్మకూరు. రైతు.నివాసం గుడివాడ. బందరు కోనేరు సెంటరులో 6-5-1930న జరిగిన జాతీయ జెండా ఆవిష్కరణ సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 17-6-1930 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931 న విడుదలయ్యారు.

## అన్నె వెంకట శివుడు

గుడివాడ తాలూకా బొమ్మలూరు వాస్తవ్యులు. బస్సు డ్రైవర్. 1930 ఉప్పు సత్యాగ్రహోద్యమ కాలంలో చిన్నాపురం ఉప్పు సత్యాగ్రహ శిబిరానికి వలంటీర్లను బస్సులో తీసుకువెళ్ళినందుకుగాను వీరికి నాల్గునెలల కఠినశిక్ష విధింపబడింది.

## అన్నే రామబ్రహ్మం

తండ్రి బ్రహ్మయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా బొమ్మలూరు. రైతు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని అరెస్టు అయ్యారు. మూడున్నర నెలల జైలు శిక్ష, రు. 20/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## అన్నే వెంకటరత్నం

తండ్రి పున్నయ్య. గుడివాడ తాలూకా గుడ్లవల్లేరులో 1907 న జన్మించారు. హిందీ పండితులు. హిందీ మాస్టరు ఉద్యోగం మానేసి స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్నారు. అప్పటి మద్రాసుగవర్నరు బందరు రాక సందర్భంగా నల్లజెండాల ప్రదర్శనలో పాల్గొన్నందుకు సంవత్సరం 6 వారాలు శిక్ష 15-3-1930 న విధించారు. రాజమండ్రి, మద్రాసు జైళ్ళలో శిక్ష ననుభవించారు. 20-12-1930 న విడుదలయ్యారు. 1960 లో కీర్తిశేషులైరి.

## ఆదిరాజు అమృతేశ్వరరావు



తండ్రి వెంకటప్పయ్య. పెయ్యేరులో 23-11-1907 లో జననం. కైకలూరు తాలూకా పోలుకొండలో కాంగ్రెసు ప్రచారం చేస్తుండగా 11-5-32 న ఒక సంవత్సరం శిక్షపడగా రాజమండ్రి సెంట్రల్ జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో రహస్య బులిటెన్లు తూర్పు కృష్ణాజిల్లాలో పంచిపెట్టారు.

## ఆత్మూరి నాగేశ్వరరావు

తండ్రి వెంకన్న. జననం 1898 గుడివాడ తాలూకా నిమ్మలూరు. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని, 1-8-1930 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్లలో అనుభవించారు. తిరిగి 1932 శాసనోల్లంఘనోద్యమంలో కూడా పాల్గొన్నారు. తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెసు అధ్యక్షులుగా పని చేశారు.

## అదూరి సోమ సూర్యప్రకాశరావు



గుడివాడ తాలూకా తటివర్రు. 10-11-1884 లో జన్మించారు. గ్రామోద్యోగి. 1920-21 సహాయ నిరాకరణ ఉద్యమంలో తన కరణీకం వదులుకున్నారు. ఖద్దరు మొదలైన నిర్మాణ కార్యక్రమాలలో తీవ్రంగా కృషి చేశారు. 30-6-1965 లో కీర్తిశేషులయ్యారు.

## అరికెపూడి కోటయ్య

తండ్రి రామస్వామి. జన్మస్థలం గుడివాడ తాలూకా కోమరవోలు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 1-5-1930 నుంచి ఆరునెలల కఠిన శిక్షను రాజమండ్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు.

## ఈడ్పుగంటి సత్యనారాయణ

గుడివాడ తాలూకా గుడ్లవల్లేరు వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘన ఉద్యమ కాలంలో కాంగ్రెస్ జెండాను తమ గ్రామ కేంద్రంలో పోలీసులు తొలగించినపుడు ప్రతిఘటించి లాఠీ ఛార్జికి గురి అయ్యారు.

## ఈడ్పుగంటి వెంకటనారాయణ

తండ్రి సుబ్బయ్య. గుడివాడ తాలూకా పెదమద్దాలి వాస్తవ్యులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 16-6-30 న ఆరు నెలల కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్షననుభవించారు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నందుకు పోలీసులు 1-2-32న లాఠీఛార్జీచేసి సంవత్సరం కఠినశిక్ష విధించారు.

## ఈదర వాగన్న



తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా పెదపాల పర్రు. 1930 ఉప్పు సత్యాగ్రహం; 1932 శాసనోల్లంఘన ఉద్యమాలలో పాల్గొని, లాఠీఛార్జీకి గురై, కొద్దిరోజులు సబ్‌జైళ్ళలో నిర్బంధంలో వున్నారు.

## ఉప్పలపాటి వెంకట గోపాలుడు

తండ్రి గోపన్న. గుడివాడ తాలూకా గురజ వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నారు. 11-7-1930 న 6 నెలల శిక్ష, రు. 25 జరిమానా విధించబడింది. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష ననుభవించారు.

## ఎలకుర్రు శాస్త్రులు

గుడివాడ తాలూకా ఎలకుర్రు వాస్తవ్యులు. 1920-21 సహాయ నిరాకరణోద్యమంలో గ్రామోద్యోగ పదవికి రాజీనామా చేశారు.

## ఐనంపూడి వెంకట సుబ్బారావు



తండ్రి సీతారామయ్య. గుడివాడ తాలూకా ఐనంపూడి. 1904 ప్రాంతంలో జన్మించారు. ప్రస్తుత నివాసం జమీగొల్వేపల్లి. 1930 మే 19న గుడివాడ గాంధీ పార్కులో జరిగిన బ్రహ్మాండమైన సభలో పోలీసులు లాఠీచార్జీ చేసి, తుపాకులు పేల్చి, సభను చెదరగొట్ట ప్రయత్నించారు. ఆ సమయంలో లాఠీదెబ్బలకు వీరి తలకు పెద్ద దెబ్బ తగిలింది. వీరిని మరో 14 గురిని 3 అడుగుల వెడల్పు, 5 అడుగుల పొడవు గల గదిలో నిర్బంధించారు. కొందరికి తేళ్ళుకుట్టాయి. మరునాడు ప్రభుత్వ వైద్యాధికారి చీవాట్లు పెట్టగా వారిని మూడు వేర్వేరు గదులలోకి పంపారు. సబ్ జైలుకు భోజనం తెచ్చిన వారినికూడా అరెస్టు చేశారు. నెలరోజులు గుడివాడ, కైకలూరు సబ్ జైళ్ళలో ఉన్నారు 1930 జూన్‌లో 21 నెలల శిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచినాపల్లి, అలీపురం క్యాంప్, బళ్ళారి జైళ్ళలో శిక్షను అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒడంబడిక ప్రకారంకూడా వీరిని విడుదల చేయలేదు. గాంధీజీతో సహా నాయకులెందరో ప్రయత్నించినా విడుదల చేయలేదు. చివరకు 24-12-31న విడుదలయ్యారు. 11-2-81న కీర్తిశేషులయ్యారు.

## ఐనంపూడి శ్రీనివాసులు

తండ్రి ముకుందరామయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా ఐనంపూడి. రైతు. ఇంటర్ చదువుతూ, జాతీయోద్యమంలోకి దుమికారు. మద్రాసు సర్వ సేవా సంఘంలో పని చేశారు. మొత్తం ఆరుసార్లు జైలు శిక్షలు అనుభవించారు. విధించిన జరిమానా చెల్లించ నిరాకరించిన కారణంగా ఇంటిని వేలం వేశారు. అయితే ఎవరూ పాడలేదు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 9-7-1930 నుంచి ఆరు మాసాల కఠిన శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. బందరులో 29-3-1932 న విదేశ వస్త్రాలయాల ముందు పికెటింగ్ చేయగా రు. 500/- ల జరిమానా విధించారు. జరిమానా చెల్లించనందున ఆరు వారాల శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. తిరిగి 22-6-1932 నుంచి ఆరు మాసాలు కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. గుంటూరు రాజకీయ మహాసభకు హాజరై 3-10-1933 నుంచి పది రోజులు రిమాండ్‌లో వున్నారు. 1-12-1933 న రెండేళ్ళ కఠిన శిక్ష విధించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. రు. 15 ల జరిమానా, ఆరు మాసాల కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. 1969 ఫిబ్రవరిలో కీర్తిశేషులైరి

## కఠారి చిట్టెయ్య అనే వెంకటస్వామి



తండ్రి రామయ్య. గండేపూడి నివాసి. రైతు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 9 మాసముల శిక్ష అలీపురం జైలులో అనుభవించారు.

## కనకమేడల వెంకటసుందరం

తండ్రి కోటయ్య. గుడివాడ తాలూకా ఎలకుర్రు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19-6-30న సంవత్సరం శిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచినాపల్లి, అలీపురం క్యాంప్ జైళ్ళలో శిక్షను అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ననుసరించి 14-3-31 న విడుదలయ్యారు 1932 33 లో అనేక దఫాలు లాఠీఛార్జికి గురిఅయ్యారు. కీర్తిశేషులైరి.

## కనుమూరి రామిరెడ్డి



తండ్రి గంగిరెడ్డి. దోకిపర్రులో 1908 లో జననం. రైతు. 8 వ తరగతి వరకూ చదువుకున్నారు. శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొనగా 22-2-1932 న తీవ్రమైన లాఠీ ఛార్జికి గురయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 18-5-1943 న అలీపురం జైలులో 12 కొరడా దెబ్బలకుగురయ్యారు. అక్కడే 11-5-1943 నుండి 27-8-1943 వరకూ కఠిన శిక్ష అనుభవించారు.

## కన్నెగంటి నాగరత్నమ్మ



భర్త సుబ్బయ్య. గుడివాడ తాలూకా తమిరిశ. 1908 లో జననం. శాసనోల్లంఘనోద్యమంలో విదేశీ వస్త్ర దుకాణాల ముందు పికెటింగ్ చేశారు. అనేకసార్లు పోలీసుల హింసకు గురి అయ్యారు. 31-3-32న అరెస్టు చేసి దూరంగా తీసుకువెళ్ళి విడిచిపెట్టారు. 2-5-32 న తిరిగి అరెస్టుచేసి సంవత్సరం కఠినశిక్ష విధించారు. రాయవెల్లూరు, కన్ననూరు జైళ్ళలో శిక్షను అనుభవించారు

## కాజ బుచ్చిరంగయ్య



తండ్రి బుల్లి పిచ్చయ్య. పసుమర్రులో 12ఆగస్టు 1908 న జననం. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా 14-6-1930 న ఒక సంవత్సరం కఠినశిక్ష విధించారు. తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 14-3-1931 న విడుదలయ్యారు.

## కాజ బసవయ్య చౌదరి



తండ్రి రామయ్య. గుడివాడ తాలూకా నూజెళ్ళ వాస్తవ్యులు. శాసనోల్లంఘన ఉద్యమకాలంలో 1931 లో గుడివాడలో ప్రవేశించరాదని వీరిని నిషేధించారు లాఠీఛార్జీకి

గురి అయ్యారు. 18-1 32 నుండి రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో సంవత్సరం జైలు శిక్షను అనుభవించారు. తాలూకా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులుగా పనిచేశారు. కీర్తిశేషులైరి.

## కాజ వెంకటరత్నం



తండ్రి సీతయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా అప్పికట్ల. 1932 శాసనోల్లంఘనంలో రహస్య పత్రికలు పంచుతూ అరెస్టు అయ్యారు. తీవ్రమైన లాఠీఛార్జీకి గురయ్యారు. 16-1-1933 న ఆరు నెలలు కఠిన శిక్ష, రు. 1000/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 31-8-1933 న విడుదలయ్యారు.

## కామినేని సుబ్బారావు



తండ్రి కృష్ణయ్య పెనుమత్స గ్రామంలో 1901లో జననం. నివాసం కొరిమర్ల. 1921 నుండి కాంగ్రెస్ ఆశయాలు, నిర్మాణ కార్యక్రమం గురించి ప్రచారంచేశారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని 6-2-1941 నుంచి 4 మాసాలు రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 1942 లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనగా 6 నెలల శిక్ష, రు. 100 జరిమానా (జరిమానా చెల్లించకపోతే మరో 2 నెలలు శిక్ష) విధించారు. అలీపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవించారు.

## కామినేని వెంకట రామారావు

తండ్రి కొండయ్య. గుడివాడ తాలూకా ఎలమర్రు వాస్తవ్యులు. రైతు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. రాజమండ్రి సెంట్రల్ జైల్లో 12-7-30 నుండి ఆరు నెలల, మూడు వారాల కఠిన శిక్షను అనుభవించారు.

## కాశీనాధుని నాగేశ్వరరావు



తండ్రి బుచ్చియ్యారాధ్యులు. జననం 15-5-1867 గుడివాడ తాలూకా ఎలకుర్రు. మద్రాసులో చదివి, పట్టభద్రులైరి జీవితంలో అనేక విధాల ప్రయత్నించి, చివరకు బొంబాయిలోని విలియమ్ అండ్ కంపెనీలో చేరారు. అక్కడనే 'అమృతాంజనం' ఔషధం రూపొందించారు. 1908 లో బొంబాయి నుంచి 'ఆంధ్ర పత్రిక' వారపత్రికను ప్రారంభించారు. దానిని 1914 లో మద్రాసుకు తరలించి, దినపత్రికగా మార్చారు. సాహిత్యాభిరుచులను పెంపొందించే నిమిత్తం 1924 లో 'భారతి' మాసపత్రికను ప్రారంభించారు. 'అమృతాంజనం' వల్ల వచ్చే లాభాలను అనేక ధర్మకార్యాలకు వినియోగించారు. 'దేశోద్ధారక' 'విశ్వదాత' గా పేరు గాంచారు. 'ఆంధ్రపత్రిక' ద్వారా 1920 సహాయ నిరాకరణోద్యమానికి తెలుగునాడునుంచి వూపుతెచ్చారు 1934 లో కేంద్ర శాసనసభా సభ్యులు. 12 సంవత్సరాలపాటు ఎ.ఐ.సి.సి సభ్యులు. మద్రాసులో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, లాఠీదెబ్బలకు గురయ్యారు. 21-4-1930 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను మద్రాసు తిరుచునాపల్లి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 16-1-1932 న ఆరునెలల కఠిన శిక్ష, రు 250/- జరిమానా విధించారు. మద్రాసు, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. ఆంధ్రా యూనివర్శిటీ నుంచి 'కళాప్రపూర్ణ' గౌరవ పట్టాను అందుకొన్నారు. తెలుగు సాహిత్యానికి ఎనలేని సేవ చేశారు. 11-4-1938 న కీర్తిశేషులైరి.

## కాసంశెట్టి వెంకటేశ్వర్లు

తండ్రి లక్ష్మయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా రావులపాడు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, కల్లు పాకల ముందు పికెటింగ్ చేయగా, 6-8-1932 న అరెస్టుచేసి, పోలీసు స్టేషన్‌కి తీసుకెళ్ళి వదిలివేశారు. తిరిగి 16-1-1933 న అరెస్టు చేసి, సంవత్సరం మూడు నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్షఅనుభవించారు.

## కుదరవల్లి వెంకటరత్నం



తండ్రి నరసయ్య. నిమ్మకూరు గ్రామ నివాసి. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా 17-6-30 నుండి ఒక సంవత్సరం కఠిన శిక్ష రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో అనుభవిసుండగా గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 15-3-1931 న విడుదలయ్యారు.

## కూనిరెడ్డి కనకయ్య



తండ్రి సన్యాసి. మెరక వౌనుకుమూడు గ్రామంలో జన్మించారు. గుడివాడ తాలూకా గండేపూడి వాస్తవ్యులు. క్విట్ ఇండియా వుద్యమంలో పాల్గొని పుట్ల చెరువు వద్ద రైలుపట్టాలు పెరికివేశారు. 18-10-43న 6మాసాల కఠినశిక్ష విధించగా అలీపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవించారు. కీర్తిశేషులైరి.

## కూనిరెడ్డి సీతారాములు



తండ్రి రామన్న. గండేపూడిలో జననం. రైతు. క్విట్ ఇండియా వుద్యమ సందర్భాన పుట్ల చెరువు వద్ద రైలు పట్టాలు తొలగించటంలో పాల్గొన్నారు. గుడివాడ కలెక్టర్ 9 మాసాలు శిక్ష విధించారు. కాని వీరు అప్పటికే మైనరు కావడంవల్ల, వీరి తండ్రిగారి నుండి రు. 300 లకు బాండు తీసుకుని వదిలివేశారు. 1942 జనవరిలో రాష్ట్ర విప్లవ వీరుల రహస్య సమావేశానికి తోడ్పడ్డారు. 12-7-1960 న కీర్తిశేషులయ్యారు.

## కొండా అప్పలరాజు



తండ్రి నరసింహరాజు. పెదవిరివాడ నివాసి. రైతు వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, 27-2-41 నుండి 3 మాసాలు, రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 1942 లో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనగా, 24-12-1942 న 2 సంవత్సరాలు కఠిన శిక్ష, 15 కొరడాదెబ్బలు శిక్ష విధించారు. శిక్షలను అలీపురం క్యాంపు జైలులో అనుభవించారు.

## కొమరాపు రామకోటేశ్వరరావు



తండ్రిలక్ష్మయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా కనుమూరు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, అజ్ఞాతవాసంలో గడిపారు. 1944 ఏప్రిల్ రెండవ వారంలో

రహస్య కరపత్రాలు వేసి బందరులో పోలీసులకు పట్టుబడ్డారు. 14-4-1944 న 15 రోజుల జైలు శిక్ష విధించారు.

## కొమ్ము సత్యనారాయణ



తండ్రి లక్ష్మయ్య. కొమరవోలు నివాసి. 1930 న ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, కల్లు దుకాణాల వద్ద పికెటింగ్ జరిపారు. 1930 వ సంవత్సరంలో ఆరు మాసాలు కఠినశిక్ష రాజమండ్రి సెంట్రల్ జైలులో అనుభవించారు.

## కొల్లి రామస్వామి



గుడివాడ తాలూకా పసుమర్రు. తండ్రి నాగయ్య. 1914 నవంబర్ 29 న పసుమర్రులో జన్మించారు. ప్రస్తుత నివాసం నిజామాబాద్ జిల్లా షెంటు ఖర్దు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19-6-30న రెండుసంవత్సరాల కఠిన శిక్ష విధించబడింది. మైనర్ ఐనందున చెంగల్పట్టు జైలులోని సీనియర్ సర్టిఫైడ్ స్కూలుకు పంపారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 1931లో విడుదలయ్యారు. కొమరవోలులో తీవ్రమైన లాఠీచార్జీకి గురి అయ్యారు. 18-1-32 న సంవత్సరం కఠినశిక్ష రు. 100 జరిమానా విధించబడింది. నిర్బంధంగా జరిమానా వసూలు చేశారు. 30-1-32 నుండి రాజమండ్రి జైల్లో శిక్ష అనుభవించారు.

## కొల్లి పూర్ణచంద్రరావు

తండ్రి భద్రయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా అప్పికట్ల. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని 25-4-1944 నుంచి ఆరు నెలలు కఠినశిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## కొల్లి శ్రీరాములు అనే రామకుమార వర్మ



తండ్రి రత్తయ్య. గుడివాడ తాలూకా కనుమూరు. రైతు. 1932 శాసనోల్లంఘనోద్యమంలోనాలుగు సార్లులాఠీచార్జీ చేయబడ్డారు. 6-9-32 న సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి జైలులో నిర్బంధింపబడ్డారు. 13-6-33 న విడుదలయ్యారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు. కీర్తిశేషులైరి.

## కొల్లి సుబ్బారావు

తండ్రి పకీరయ్య. గుడివాడ తాలూకా చంద్రాల వాస్తవ్యులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 7-5-'30న ఆరు నెలల కఠినశిక్షను, రు. 20 జరిమానా చెల్లించని పక్షంలో మరో 15 రోజులు కఠినశిక్ష విధింపబడింది రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్షననుభవించారు.

## కొల్లి శ్రీమన్నారాయణ

తండ్రి రామయ్య. గుడివాడ తాలూకా దింటకుర్రు వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నారు. 18-7-30 న ఆరునెలల కఠిన శిక్షను, రు. 25 జరిమానాను విధించారు. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించారు.

## కొల్లిపర కుటుంబయ్య



గుడివాడ తాలూకా యలకుర్రు. తండ్రి గోపయ్య. 1907 లో మొవ్వలో జన్మించారు. ఉప్పుసత్యాగ్రహోద్యమంలో ఆరు నెలల కఠిన శిక్ష విధించబడింది. 12-7-30 నుండి రాజమండ్రి జైల్లో శిక్షను అనుభవించారు. 1932 లో విదేశీ వస్త్ర బహిష్కరణ ఉద్యమంలో పికెటింగ్ చేస్తున్నప్పుడు లాఠీఛార్జీకి గురిఅయ్యారు. రాజమండ్రి జైల్లో, ఆహారం సరిగాలేనందున ఆహారంతీసుకోనని నిరాకరించగా తిరిగి లాఠీఛార్జీకి గురిఅయ్యారు.

## కొడాలి వెంకట్రామయ్య

15-12-1910 న జన్మించారు. గుడివాడ తాలూకా చినపారుపూడి వాస్తవ్యులు. 1927 లో మద్రాసు కాంగ్రెస్ మహాసభకు డెలిగేట్‌గా వెళ్ళారు. 1930లో బందరు పరాసుపేట, మంగినపూడి శిబిరాలకు వెళ్ళి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1931 మే 20 న చినపారుపూడిలో కాంగ్రెసు నాయకులతో సభ జరిగినప్పుడు, పోలీసులు వీరినీ, కోనేరు రామదాసునూ అరెస్టు చేసి గుడివాడ సబ్‌జైలులో రెండురోజులు వుంచి వదిలివేశారు. హరిజన, ఖాదీ కార్యక్రమాల్లో పాల్గొన్నారు. 1942 ఉద్యమంలో 'భూషణ గుళ్ళ' వారి వద్ద రైలు పట్టాలు పీకివేతలో పాల్గొన్నారు.

## కొడాలి నాగభూషణం

తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా కుచ్చికాయలపూడి. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 7-7-1930 నుంచి ఆరు నెలల కఠినశిక్షను రాజమండ్రి వెల్లూరు జైళ్ళలో అనుభవించారు.

## కొసరాజు జిన్నయ్య

జన్మస్థలం గుడివాడ తాలూకా గుడ్లవల్లేరు. 1932 శాసనోల్లంఘనంలో తన గ్రామంలో ఎగురవేసిన జాతీయ జెండాను పోలీసులు తొలగించ ప్రయత్నించినప్పుడు, ప్రతిఘటించి తీవ్రమైన లాఠీఛార్జీకి గురయ్యారు.

## కోగంటి గోపాలకృష్ణయ్య



తండ్రి అచ్యుత రామయ్య. 1922 వ సంవత్సరంలో గుడివాడ తాలూకా బొమ్ములూరులో జన్మించారు. విద్యార్థి దశలోనే యుద్ధ వ్యతిరేకప్రచారంలో పాల్గొన్నారు. 30-4-1942 న 9 నెలల కఠిన శిక్ష విధించారు. బళ్ళారి జైలులో శిక్ష అనుభవించారు. ప్రభుత్వం ఆదేశం మేరకు 27-7-1942 న విడుదల అయ్యారు. కమ్యూనిస్టుపార్టీలో చేరారు. ప్రజానాట్య మండలి రాష్ట్రదళంలో ప్రముఖపాత్ర వహించారు. కవి. అనేక జానపద కళారూపాలకు అనువైన గీతాలు రచించి, వాటిని పునరుద్ధరించడానికి తోడ్పడ్డారు. రాష్ట్ర ప్రజానాట్యమండలి ఉపాధ్యక్షులు. 1978 అక్టోబరు, నవంబరు నెలల్లో ఇస్కస్ ప్రతినిధిగా సోవియట్ రష్యా జకోస్లొవేకియా, పోలెండ్, జర్మనీ, ఇంగ్లాండ్ ఫ్రాన్సు, స్విట్జర్‌లాండ్, ఇటలీ మున్నగు దేశాలు పర్యటించారు

## కోడిబోయిన కోటయ్యనాయుడు

జన్మస్థలం గుడివాడ తాలూకా ఉరుటూరు. 1920-27 సహాయ నిరాకరణోద్యమ కాలంలో తన గ్రామోద్యోగి పదవికి రాజీనామా చేశారు.

## కోడూరి వెంకట రామయ్య

తండ్రి సుబ్బయ్య. గుడివాడ తాలూకా ముదినేపల్లి వాస్తవ్యులు. రైతు. శాసనోల్లంఘనోద్యమ కాలంలో పాల్గొన్నందుకు 7-7-30న ఆరునెలల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష ననుభవించారు. వామపక్షాల అభిమాని. ప్రస్తుత నివాసం హైదరాబాదు.

## కోడూరి వెంకట శేషయ్య

తండ్రి శ్రీరాములు. గుడివాడ తాలూకా ముదినేపల్లి వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 7-7-30 న ఆరు నెలల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష ననుభవించారు.

## కోడే గోపాలకృష్ణయ్య

తండ్రి కోటయ్య. గుడివాడ తాలూకా ఎలకుర్రు. 1904 అక్టోబరులో జననం. 1930లో బందరులో ఉప్పు సత్యాగ్రహ శిబిరాధిపతిగా వున్నారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా ఆరునెలల కఠినశిక్ష, రు. 100 జరిమానా విధించబడింది. 10-6-30 నుండి రాజమండ్రి, బళ్లారి జైళ్ళలో శిక్షను అనుభవించారు. 1932 లో ఎలకుర్రులో స్మృతి తప్పిపోయే వరకు వీరిని పోలీసులు లాఠీచార్జీ చేశారు. ఇంట్లో జొరబడి ఆస్తి, సామగ్రి నష్టం చేశారు. 1966 ప్రాంతంలో కీర్తిశేషులయ్యారు.

## కోనేరు భారతమ్మ

తండ్రి త్రిపురనేని దూర్వాసులు. భర్త వీర రాఘవయ్య. స్వస్థలం గుడివాడ తాలూకా తమిరిశ. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. సంవత్సరం కఠిన శిక్ష, రు. 100/- జరిమానా విధించారు. జైలులోనే ప్రసవించారు. తిరిగి శాసనోల్లంఘన కాలంలో గుడివాడలో విదేశీ వస్త్రాలయాల ముందు పికెటింగ్ చేస్తుండగా 31-3-1932 న అరెస్టు చేసి, దూరప్రాంతానికి తీసుకెళ్ళి వదిలివేశారు తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొనగా, 2-5-1932 న సంవత్సరం కఠినశిక్ష విధించారు. వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## కోనేరు వీరరాఘవయ్య

తండ్రి గోపాలకృష్ణయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా తమిరిశ. రైతు. 31-3-1932న గుడివాడలో విదేశీ వస్త్రాలయాల ముందు పికెటింగ్‌లో పాల్గొని అరెస్టు అయ్యారు 2-5-1932న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు

## కోనేరు రఘురామయ్య

తండ్రి గోపాల కృష్ణయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా తమిరిశ. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని, 2-5-1932 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## గడియారం సాంబయ్య

తండ్రి అచ్చయ్య. పామర్రులో 19-12-1892 న జననం. కలెక్టరు ఆఫీసులో క్లర్కుగా పనిచేస్తూ రాజీనామా చేశారు. 1920-21 లో సహాయనిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. ఖాదీ ప్రచారం చేశారు 1930లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని 7-7-1930 నుండి 6 నెలల శిక్ష రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. రు. 20 జరిమానా విధించగా చెల్లించారు. పామర్రులో తిలక్ జాతీయ పాఠశాల నెలకొల్పి, హిందీ, ఉరుదు. నూలువడకుట నేతపని విద్యార్థులకు నేర్పించారు. 1958 లో కీర్తిశేషులయ్యారు.

## గద్దె లింగయ్య



తండ్రి రామయ్య. గుడివాడ తాలూకా ఎలమర్రు జన్మస్థలం. రైతు. ఉర్దూ, హిందీ, బెంగాలీ, ఆంగ్లభాషలలో మంచి ప్రవేశం వుంది. జర్నలిస్టు, రచయిత, ప్రచురణకర్త, 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీచార్జీకి గురయ్యారు. 2-5-1932 న ఆరునెలలు కఠినశిక్ష, రు. 200 జరిమానా విధించారు. రాజమండ్రి,కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. ప్రభ, నవయుగ పత్రికల సంపాదకులు. ప్రభను నిషేధించారు. కమ్యూనిస్టుపార్టీ ఆర్గనైజర్‌గా పనిచేశారు. ఆదర్శ గ్రంథ మండలి స్థాపించి "అమ్మ" "విప్లవయుగం" వంటి గ్రంథాలు ప్రచురించి, విప్లవ భావాలు వ్యాపింపచేశారు. ఆరెండు గ్రంథాలు ప్రభుత్వం నిషేధించింది. రహస్య జీవితం గడిపారు. 25-5-1941 నుంచి

27-11-1941 వరకూ డి. ఐ. ఆర్. క్రింద వెల్లూరు జైలులో డిటెన్యూగా వున్నారు. క్విట్ ఇండియా ఉద్యమకాలంలో 17-8-1942 నుంచి 3-12-1943 వరకు బళ్ళారి, ఆలీపురం జైళ్ళలో కఠినశిక్ష అనుభవించారు. 1963 లో కీర్తిశేషులైరి.

## గాదిరెడ్డి పుట్లమ్మ



తండ్రి కొండపల్లి వెంకారెడ్డి. భర్త రాఘవరెడ్డి. 11-9-1911లో జనార్ధనపురంలో జననం. నందివాడలో నివాసం. 1931-32 మధ్య కాలంలో కాంగ్రెస్ బులెటిన్లు పంచుతుండగా రావులపాడులో పట్టుబడ్డారు. 6 మాసాలు పోలీసు నిఘాలో వుంచారు. గుంటూరులో స్త్రీల డిక్టేటరు మహాసభలో పాల్గొనగా 16-3-1933న 10 మాసాల కఠినశిక్ష విధించి వెల్లూరు జైలుకు పంపారు. అక్కడ నుంచి కన్ననూరు జైలుకు మార్చబడ్డారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 31-8-1933 నవిడుదలయ్యారు.

## గుమ్మడి వెంకమ్మ

గుడివాడ తాలూకా జమీగొల్వేపల్లి వాస్తవ్యులు. 1930-32 శాసనోల్లంఘనోద్యమకాలంలో పికెటింగ్‌లో పాల్గొన్నారు.

## గుమ్మడి సూర్యప్రకాశరావు

తండ్రి వెంకయ్య. గుడివాడ తాలూకా దోసపాడు వాస్తవ్యులు. రైతు. శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నందుకు 11-2-31 న రెండు నెలల కఠినశిక్ష విధించబడింది. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 11-3-31 న విడుదలయ్యారు.

## గుళ్ళపల్లి బాపయ్య



తండ్రి వెంకయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా కురుమద్దాలి. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆరు నెలల కఠినశిక్ష, రు 50 జరిమానా విధించారు 22-7-1930 నుంచి రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు

## గుళ్ళపల్లి రామబ్రహ్మం

తండ్రి వెంకటరత్నం. జన్మస్థలం గుడివాడ తాలూకా కురుమద్దాలి. రైతు. ఉప్పుసత్యాగ్రహం మొదలు క్విట్ ఇండియా ఉద్యమం వరకు నాలుగు పోరాటాలలో పాల్గొన్నారు. 7-5-1930 న ఆరునెలల కఠినశిక్ష, రు. 20/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొనగా, 27-1-1931 న మూడు నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవిస్తుండగా గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 11-3-1931 న విడుదలయ్యారు. పికెటింగ్‌లో పాల్గొని మూడవసారి అరెస్టు అయ్యారు. 7-1-1932 నుంచి సంవత్సరం రెండు మాసాల కఠిన శిక్షను రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు. యుద్ధ వ్యతిరేక చర్యలకుగాను 31-8-1941 న గుడివాడ సబ్ డివిజనల్ మేజిస్ట్రేట్ 18 నెలల కఠిన శిక్ష విధించారు. అలీపురం క్యాంప్ జైలులో శిక్ష అనుభవించారు. 18-12-1941న విడుదల చేశారు. తిరిగి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనగా, రు. 100/- జరిమానా, ఆరు నెలల కఠిన శిక్ష విధించారు. ఆలీపురంజైలులో శిక్ష అనుభవించారు. నాలుగు అయిదు ఏళ్ళ క్రితం వీరు అదృశ్యమయ్యారు. తరువాత వీరి జాడ తెలియలేదు.

## గుళ్ళపల్లి బాపయ్య

తండ్రి తాతయ్య. ఉరఫ్ వెంకట్రామయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా కురుమద్దాలి. ఉప్పు సత్యా

గ్రహంలో పాల్గొన్నారు. ఆరు నెలల కఠినశిక్ష, రు. 20/- జరిమానా విధించారు. 7-5-1930 నుంచి రాజమండ్రి, వెల్లూరు, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## గుళ్ళపల్లి శ్రీరాములు



తండ్రి తాతయ్య. ఉరఫ్ వెంకటరామయ్య. గుడివాడ తాలూకా కురుమద్దాలి వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహం నందు పాల్గొన్నారు. 7-7-30 న ఆరు నెలల కఠిన శిక్ష, రు. 30 జరిమానా, చెల్లించని పక్షంలో మరోనెల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, ఆలీపురం జైళ్ళలో 7 నెలల శిక్ష అనుభవించారు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో కూడా పాల్గొన్నారు. కీర్తిశేషులయ్యారు.

## గుళ్ళపల్లి శివరావు (ఉరఫ్ శివుడు)



తండ్రి అప్పన్న. జననం 26-5-1919 గుడివాడ తాలూకా గండేపూడి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పుట్లచెరువు వద్ద రైలు పట్టాలు పెరికివేత కేసులో 27-1-1943న అరెస్టు అయ్యారు. తొమ్మిది నెలలు సబ్ జైళ్ళలో వున్నారు. 18-10-1943 న ఆరుమాసాల కఠినశిక్ష విధించారు. ఆలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## గూడూరి వెంకటాచలం



తండ్రి నరసింహారావు. వ్యవసాయ శాస్త్ర పట్టభద్రులు 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. వెల్లూరు సెంట్రల్ జైల్లో శిక్ష ననుభవించారు. కధానికా రచయిత. వ్యవసాయ శాస్త్రంలో నిపుణులు. కేంద్ర ప్రభుత్వంలో ఉన్నతాధికార పదవులు నిర్వహించి, రిటైర్ అయ్యారు. కీర్తిశేషులైరి.

## గొట్టిపాటి సూర్యనారాయణ



తండ్రి సోమయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా పెరిశేపల్లి. స్వగ్రామంలో కల్లుగీత చెట్లగెలలు నరికినందుకు, 13-7-1930 న ఆరు మాసాల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్షఅనుభవిస్తూ. నిరాహార దీక్షలో పాల్గొన్నందుకు అదనంగా మరొక 16 రోజులు జైలు శిక్ష విధించారు.

## ఘంటా వీరరాఘవయ్య



తండ్రి రామయ్య. జననం 1904 గుడివాడ తాలూకా తమిరిశ. 1932 శాసనోల్లంఘనంలో గుడివాడ విదేశీ వస్త్రాలయాల ముందు సకుటుంబంగా, భార్య, ఎనిమిది మాసాల పసిబిడ్డతో, పికెటింగ్ చేశారు. ముక్కువెంట

నోటివెంట రక్తం కారేటంత తీవ్రమైన లాఠీఛార్జీకి గురయ్యారు. 2-5-1932 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## ఘంటా మల్లికాంబ



తండ్రి యలమంచిలి కోటయ్య. జననం 1911. దివి తాలూకా భట్లపెనుమర్రు. భర్త వీరరాఘవయ్య. తమిరిశ. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. సంవత్సరం కఠినశిక్ష. రు 100/-ల జరిమానా విధించారు. తిరిగి 1932 శాసనోల్లంఘనంలో తన ఎనిమిది మాసాల పసిబిడ్డను చంక నిడుకొని భర్తతో కలిసి, గుడివాడ విదేశీ వస్త్రాలయాల ముందు పికెటింగ్ చేశారు. స్త్రీ వాలంటీర్లందరినీ రోజూ పదిమైళ్ల దూరం తీసుకుపోయి వదిలివేస్తుండేవారు. స్త్రీ వలంటీర్లు ఆ పదిమైళ్ళు కాలినడకన అష్టకష్టాలు పడుతూ గుడివాడ చేరి, మరునటిరోజు పికెటింగ్‌లో పాల్గొంటూ వుండేవారు. ఎనిమిది మాసాల పసిబిడ్డతో అష్టకష్టాలు పడుతూ 2-5-1932 నుంచి సంవత్సరం కఠినశిక్షను వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు.

## ఘంటా రామమోహనరావు



తల్లిదండ్రులు వీర దంపతులు వీరరాఘవయ్య, మల్లికాంబ. జననం 1931 గుడివాడ తాలూకా తమిరిశ. ఎనిమిది మాసాలవయస్సులో తల్లితోపాటు జైలుకెళ్ళి, సంవత్సరకాలం జైలు జీవితం అనుభవించారు.

## చలసాని చంద్రయ్య



తండ్రి కోటయ్య. జననం 10-8-1908 గుడివాడ తాలూకా శేరీకల్వపూడి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలుపట్టాలు పీకివేత చర్యలలో పాల్గొన్నందుకు, డి.ఐ. ఆర్. క్రింద అరెస్టు చేశారు. 29-12-1942 న సంవత్సరం కఠిన శిక్ష రు. 100/- జరిమానా విధించారు. అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించారు. సెషన్స్ కోర్టులో కేసును కొట్టివేయటంతో 10-8-1943 న విడుదలయ్యారు

## చలసాని సాంబయ్య

గుడివాడ తాలూకా శేరీకల్వపూడి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 4-8-30 నుండి 8-11-30 వరకు రాజమండ్రి, అలీపురం జైళ్ళలో కఠినశిక్షను అనుభవించారు. రు. 25 జరిమానాను చెల్లించారు.

## చలసాని వెంకట బాపయ్య



జన్మస్థలం గుడివాడ తాలూకా కురుమద్దాలి. 1938-39లో తాలూకా కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులు. 1938 సూరత్ కాంగ్రెసు మహాసభకు హాజరయ్యారు. 1940 లో సి. పి. గవర్నరు ఈడ్పుగంటి రాఘవేంద్రరావు రాక సందర్భంలో అరెస్టు చేసి, 16-9-1940 నుంచి 5-10-1940 వరకు గుడివాడ సబ్ జైలులో నిర్బంధించబడ్డారు. అనంతరం రాజమండ్రి సబ్ జైలుకు తరలించి, అక్కడ 22 రోజుల అనంతరం విడుదల చేశారు.

## చలసాని నాగభూషణం

తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా సెరీకల్వపూడి. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, 4-7-1930 నుంచి ఆరు నెలల కఠినశిక్షను రాజమండ్రి అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## చలసాని సత్యనారాయణ



తండ్రి కోటయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా సేరీకల్వపూడి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. సంవత్సరం ఆరు మాసాల కఠినశిక్ష. రు 100/- జరిమానా విధించారు. 6-4-1943 నుంచి 28-2-1944 వరకు అలీపురం క్యాంప్ జైలులో శిక్ష అనుభవించారు.

## చాపరాల జగన్మోహనరావు

తండ్రి సుబ్బారావు జననం. 2-10-1935 గుడివాడ తాలూకా దొండపాడు. స్టూడెంట్ కాంగ్రెసు కార్యకర్త. విజయవాడలో ఇంటర్ చదువుతూ, 1955 లో పోర్చుగీస్ వలసయైన గోవా విముక్తికోసం అసువులు అర్పించిన యోధుడు. 1955 ఆగస్టు 15 న ఇతర సత్యాగ్రహులతోపాటు, గోవా భూభాగంలో ప్రవేశిసుండగా, పోర్చుగీసు పోలీసులుకాల్చి చంపారు. శవాన్ని ఎత్తుకుపోయారు. తరువాత కొద్ది రోజులకు ఆ శవాన్ని భారత ప్రభుత్వానికి అప్పగించారు. ఆ శవానికి బెల్గాంలో దహన సంస్కారాలు జరిపారు.

## చిట్టా శ్రీమన్నారాయణమూర్తి

తండ్రి సుబ్బారావు. గుడివాడ తాలూకా నివాసి. 1909 ప్రాంతంలో జన్మించారు. ఉపాధ్యాయులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 4-6-30 న ఒక సంవత్సరం కఠిన శిక్ష, రు. 50 జరిమానా చెల్లించనిచో నాలుగు వారాల శిక్ష విధించబడింది. రాజమండ్రి, కోయంబత్తూరు, వెల్లూరు జైళ్ళలో నిర్బంధిపబడ్డారు. గాంధీ-ఇర్విన్ సంధి ప్రకారం 12-3-31 న విడుదలయ్యారు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో ఆరు నెలల కఠినశిక్ష విధింపబడింది. క్విట్ ఇండియా ఉద్యమంలో 1-9-42 నుండి 7 నెలల కఠిన శిక్ష పొంది అలీపురం క్యాంప్ జైల్లో శిక్ష ననుభవించారు. విడుదలయ్యాక తిరిగి ఉద్యమంలో పాల్గొన్నందుకు 31-8-44 నుండి తొమ్మిది నెలల శిక్షను అలీపురం క్యాంప్ జైల్లో అనుభవించారు.

## చిట్టా సుబ్రహ్మణ్యా దీక్షితులు

తండ్రి సీతారామస్వామి. గుడివాడ తాలూకా వేలూప్రు. సిద్ధాంతం వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 14-6-30 నుండి ఆరువెలల కఠిన శిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## చింతపల్లి అంకినీడు

తండ్రి వెంకటాద్రి. జన్మస్థలం గుడివాడ తాలూకా ముదినేపల్లి. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయి, 7-7-1930 నుంచి రాజమండ్రి, అలీపురం జైళ్ళలో ఆరు నెలల కఠినశిక్ష అనుభవించారు.

## చింతపల్లి హరిశ్చంద్రుడు

జన్మస్థలం గుడివాడ తాలూకా ముదినేపల్లి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, ఆరు నెలల కఠినశిక్షను అనుభవించారు.

## చింతపల్లి అర్జునుడు ఉరఫ్ రామజోగి

నివాసం గుడివాడ తాలూకా ముదినేపల్లి. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, ఆరునెలల కఠిన శిక్ష అనుభవించారు.

## చెరుకూరి వెంకటసుబ్బయ్య

తండ్రి పిచ్చయ్య. గుడివాడ తాలూకా జమీగొల్వేపల్లి వాస్తవ్యులు. 1930 ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో తెనాలిలో 9 మాసముల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రిలో జైలు శిక్ష ననుభవించారు. క్షయ వ్యాధితో 12-4-34 న కీర్తిశేషులయ్యారు.

## చెరుకూరి సౌభాగ్యమ్మ



బాపయ్యగారి పత్ని. గుడివాడ తాలూకా జమీగొల్వేపల్లి వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 2-5-32న ఒక సంవత్సరం కఠిన శిక్ష విధింపబడింది. వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో శిక్ష ననుభవించారు. జిల్లా కాంగ్రెస్ సభ్యురాలు. మహిళా సంఘాల్లో పనిచేశారు.

## చెరుకూరి కృష్ణవేణమ్మ

భర్త శేషయ్య. స్వగ్రామం గుడివాడ తాలూకా తమిరిశ. శాసనోల్లంఘనంలో పాల్గొని, 25-6-1932 నుంచి సంవత్సరం కఠిన శిక్షను వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు.

## చెరుకూరి చంద్రమౌళి



తండ్రి సుబ్రహ్మణ్యం. గుడివాడ తాలూకా పెరిశేపల్లి. ప్రస్తుత నివాసం గుడివాడ. ఉప్పు సత్యాగ్రహకాలంలో కొంతకాలం కేసు నడిపి వదిలివేశారు. తర్వాత తాటిగెలలు నరికినందుకు ఆరు మాసాల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి జైల్లో శిక్షను అనుభవించారు.

## చెరుకూరి నాగేశ్వరరావు

తండ్రి కోటయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా ఎలమర్రు. యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసి, అరెస్టు అయ్యారు. 9-5-1942 న ఆరునెలల కఠిన శిక్ష విధించారు. బళ్ళారి జైలులో శిక్ష అనుభవించారు. ప్రభుత్వ ఉత్తర్వు మేరకు 27-7-1942 న విడుదల అయ్యారు.

## చెరుకూరి లక్ష్మణస్వామి



తండ్రిరామయ్య. పెరిసేపల్లి నివాసి. రైతు. చిన్నాపురంలోఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నందుకు12-7-30 నుండి 6 మాసాలు కఠినశిక్ష రాజమండ్రి జైల్లోఅనుభవించారు.

## చెరుకూరి వెంకటేశ్వరరావు

తండ్రి కోటయ్య. గుడివాడ తాలూకా ఎలమర్రు వాస్తవ్యులు. యుద్ధ వ్యతిరేక ప్రచారానికిగాను 9-5-42 న ఆరు నెలల కఠిన శిక్ష విధించబడింది. బళ్ళారి జైల్లో శిక్ష ననుభవించి 27-7-42 న విడుదలయ్యారు.

## జాస్తి వెంకటరామయ్య

తండ్రి సుబ్బయ్య. గుడివాడ తాలూకా వానపాముల వాస్తవ్యులు. రైతు. శాసనోల్లంఘనోద్యమకాలంలో పాల్గొన్నారు. లాఠీఛార్జీకి గురి అయ్యారు. 10-8-32న సంవత్సరం కఠినశిక్ష, రు. 25 జరిమానా, చెల్లించని పక్షంలో మరో ఆరునెలలు కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి జైలులో శిక్షననుభవించారు. 13-6-33న విడుదలయ్యారు.

## జొన్నలగడ్డ పట్టాభి రామయ్య

జన్మస్థలం గుడివాడ తాలూకా డోకిపర్రు. శాసనోల్లంఘనంలో 27-3-1932 న బందరులో విదేశీ వస్త్రాలయాల ముందు పికెటింగ్ చేస్తుండగా, అరెస్టు చేసి, పోలీసు స్టేషన్‌కు తీసుకువెళ్ళి, ఆ రాత్రి వదిలివేశారు.

## తమ్మా నాగిరెడ్డి

తండ్రి వెంకటరెడ్డి. జన్మస్థలం గుడివాడ తాలూకా పామర్రు. రైతు. వ్యష్టి సత్యాగ్రహంలో అరెస్టుఅయి, 11-1-1941 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను వెల్లూరు, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## తమ్మారెడ్డి సుందరరామయ్య

తండ్రి కృష్ణయ్య. గుడివాడ తాలూకా బలిపర్రు వాస్తవ్యులు. రైతు. ఉప్పుసత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు. ఆరు నెలల కఠిన శిక్షను 12-7-30 నుండి రాజమండ్రి సెంట్రల్ జైల్లో అనుభవించారు.

## తాడికొండ వీరభద్రయ్య



తండ్రి మల్లిఖార్జున అయ్యావారు ఏలకుర్రులో 2-10-1904 లో జననం. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 13-5-30 నుండి 9 మాసములు రాజమండ్రి వెల్లూరు, కడలూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. కైకలూరులో 9-1-32న కాంగ్రెస్ జెండా ఎగురవేసినందుకు స్పృహ కోల్పోయే వరకూ లాఠీలతో పోలీసులు కొట్టారు. 13-1-1932 నుండి ఒక సంవత్సరం రాజమండ్రి, కడలూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## తోట వెంకటాద్రి



తండ్రి నాగయ్య. గుడివాడ తాలూకా రావులపాడు. 1896 జనవరి 10న జననం. సత్యాగ్రహ ఉద్యమ కాలంలో రహస్య బులిటెన్లను పంచి పెట్టారు. 1933 జనవరి 16 న గుంటూరులో అరెస్టయ్యారు. 9 నెలల కఠిన శిక్ష, రు. 2000 జరిమానా. చెల్లించని పక్షంలో 3 నెలల కఠిన శిక్ష విధించబడింది. 16-1-33 నుండి రాజమండ్రి జైల్లో శిక్షను అనుభవించి 31-8-33 న విడుదలయ్యారు.

## దావులూరి సూర్యనారాయణ



తండ్రి సుబ్బయ్య గుడివాడ తాలూకా పసుమర్రు రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 17-6-30న సంవత్సరం కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష ననుభవించారు. కీర్తిశేషులైరి.

## దావులూరి తులశమ్మ

ప్రకాశరావుగారి పత్ని. గుడివాడ తాలూకా పసుమర్రు వాస్తవ్యులు. 20-1-1932 న దివితాలూకా నాగాయతిప్పలో వీరి ఆధిపత్యమున సభ జరుగుతుండగా తీవ్రమైన లాఠీఛార్జి జరిగింది 27-1-1932 న బందరు వీధులలో కరపత్రాలను పంచిపెట్టారు. వీరిపై పోలీసులు రంగు నీళ్ళు కొట్టారు. అరెస్టు చేసి రాత్రి వేళ వదిలారు. పసుమర్రులో కూడ వీరి అధ్యక్షతన సభ జరిగింది. బొంబాయి కాంగ్రెస్ మహాసభకు వెళ్ళారు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు.

## దాసరి వెంకట చలపతి

గుడివాడ తాలూకా దొండపాడు వాస్తవ్యులు. 1930 జూన్‌లో గుడివాడలో కాంగ్రెస్ సమావేశాన్ని 144 సెక్షన్ విధించి నిషేధించి పోలీసులు కాల్పులు జరపగా, వీరి తొడలో తుపాకి గుండు దూసుకుపోయి, గాయపడ్డారు.

## డాక్టర్ దాసు-రామస్వామి

గుడివాడ తాలూకా నాగవరప్పాడు. తండ్రి వెంకట

స్వామి. 15-7-23న నాగవరప్పాడులో జన్మించారు. బి.యస్.సి (మద్రాసు) యం. యస్. పి. హెచ్. డి. (ఇలినోయిస్-అమెరికా) ప్రస్తుత నివాసం బొంబాయి. క్విట్ ఇండియా ఉద్యమంలో 27-3-43 నుండి అలీ పురం క్యాంప్ జైల్లో పదినెలల శిక్ష అనుభవించారు.

## దివ్వెల పిచ్చయ్య



తండ్రి వెంచయ్య జననం 10-12-1918 నెల్లూరు జిల్లా పొదిలి తాలూకా మాదాలవారి పాలెం. నివాసం గుడివాడ తాలూకా పౌణకుమూడు. క్విట్ ఇండియా ఉద్యమంలో పుట్లచెరువు వద్ద రైలు పట్టాలు పెరికివేసి, అరెస్టు అయ్యారు. 18-10-1943 నుంచి సంవత్సరం కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## దుక్కిపాటి నాగేశ్వరరావు



తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా పెయ్యేరు. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 23-1-1932 న అరెస్టు చేసి, గుడివాడ సబ్ జైలులో నిర్బంధించారు రాత్రిపూట విడుదలై మరుసటి రోజు ఉదయాన్నే కాంగ్రెసు బులెటిన్లు పంచుతూ వుండగా తిరిగి అరెస్టు చేశారు. లాకప్‌లో పెట్టి, స్పృహ తప్పిపోయే వరకు లాఠీలతో చావమోదారు. తిరిగి వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. రు. 200/- జరిమానా, నాలుగు నెలల కఠిన శిక్ష విధించారు. 18-3-1941 నుంచి ఆలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## దుగ్గిరాల రామచంద్రయ్య

గుడివాడ తాలూకా అంగలూరు నివాసి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. 15-5-1930 న సంవత్సరం జైలుశిక్ష విధించారు. రాజమండ్రి, కోయంబత్తూరు జైళ్ళలో శిక్ష అనుభ వించారు.

## ధూళిపూడి వీరరాఘవయ్య



తండ్రి లక్ష్మయ్య. 1901లో గుడివాడ తాలూకా రావుల పాడులో జన్మిం చారు. రైతు. శాస నోల్లంఘనంలో పాల్గొన్నారు. 16-1-1933న సంవ త్సరం కఠినశిక్ష, రు 200/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 31-8-33న విడుదలయ్యారు. 1938-40 మధ్యకాలంలో గన్నవరం తాలూకా కేసరపల్లిలో మీర్జాపూర్ జమిందారు ఉద్యో గిగా వున్నారు. ఆ వుద్యోగానికి రాజీనామా చేసి, రహస్య పత్రిక "స్వతంత్ర భారత్" నడుపుటలో సహకరించారు 1936లో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ లోను. ఆ తరవాత కమ్యూనిస్టుపార్టీలోను చేరి పని చేశారు. 5-9-1969లో కీర్తిశేషులైరి.

## దోనె తాతయ్య



తండ్రి కోటయ్య. గుడివాడ తాలూకా గుర్విందగుంట అగ్ర హారం. 8-12-1915న జననం. క్విట్ ఇండియా ఉద్య మంలో పాల్గొన్నారు. 27-3-43 నుండి 4 నెలల శిక్షను అలీపురం క్యాంప్ జైల్లో అనుభ వించారు. తిరిగి 28-1-44 నుండి 6 నెలల కఠిన

శిక్షను అనుభవించారు. హరిజన ఉద్యమంలో పని చేశారు. కుల రహిత సమష్టిభోజన విందులు ఏర్పాటు చేశారు. కీర్తిశేషులు

## నందిపాటి వెంకటరెడ్డి

తండ్రి పద్మారెడ్డి. గుడివాడ తాలూకా పామర్రు వాస్తవ్యులు. రైతు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 26-2-41 నుండి 3 నెలల కఠిన శిక్షను రాజమండ్రి సెంట్రల్ జైలులో అనుభవించారు. తిరిగి 9-8-41న తన గ్రామంలో యుద్ధవ్యతిరేక నినాదాలను చేశారు. ఆరోజే 9 నెలల కఠిన శిక్ష విధించబడింది. అలీపురంలో జైలు శిక్ష ననుభవించి 20-12-41 న విడుదలయ్యారు. తిరిగి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 16-10-42 న ఆరు నెలల శిక్ష రు. 100 జరిమానా, చెల్లించనిచో రెండు నెలల శిక్ష విధించబడింది. జరిమానా చెల్లించలేదు. అలీపురం క్యాంప్ జైలులో మొత్తం ఎనిమిది నెలల శిక్ష ననుభవించారు.

## నందిపాటి చలమారెడ్డి



తండ్రి రామస్వామి. 9-10-1915 న పామర్రులో జన్మించారు. వ్యష్టి సత్యాగ్రహంలో 6 మాసాలు కఠిన శిక్ష విధించగా 19-3-41 నుండి 5 మాసాలు రాజమండ్రిజైలులో అనుభవించి విడుదలయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమానికి పూర్వం రహస్య కరపత్రాలు తయారుచేసి పంచిపెట్టారు. 1942 అక్టోబరులో అరెస్టుచేయబడి, 8మాసాల శిక్ష, రు. 100 జరిమానాకు గురయ్యారు. జరిమానా చెల్లించ నిరాకరించి, అలీపురం క్యాంపు జైలులో మొత్తం 10 మాసాలు శిక్ష అనుభవించారు. మద్రాసులో అరెస్టుచేసి, రెండు సెక్షన్లక్రింద ఆరేసిమాసాల చొప్పున శిక్ష విధించి ఏక కాలంలో శిక్షననుభవించాలని తీర్పు చెప్పారు. 28-1-1944 నుండి 6 మాసాలు కఠినశిక్షననుభవించారు. కులరహిత సమిష్టి భోజనాలు ఏర్పాటుచేశారు. యువజన, విద్యార్థి సంఘాలలో పనిచేశారు.

## నందివాడ ఆదినారాయణమూర్తి

జన్మస్థలం గుడివాడ తాలూకా నూతలపాడు. 1921 సహాయనిరాకరణోద్యమంలో తమ గ్రామాధికారి పదవికి రాజీనామా చేశారు.

## నన్నపనేని పున్నయ్య

తండ్రి వెంకయ్య. జమీగొల్వేపల్లి నివాసి. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందున 6 మాసముల శిక్ష, రు 20 జరిమానా విధించారు. 7-5-1930 నుండి రాజమండ్రి. మద్రాసు, ఆలీపురం క్యాంపు జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## నిభానుపూడి భాస్కరరావు

తండ్రి ఆదెయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా నిమ్మలూరు. ఉపాధ్యాయుడు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19-6-1930న సంవత్సరం కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## నిభానుపూడి ప్రకాశరావు



జన్మస్థలం గుడివాడ తాలూకా నిమ్మలూరు 1920-21 సహాయ నిరాకరణోద్యమంలో తన గ్రామోద్యోగి పదవికి రాజీనామా చేశారు.

## నిమ్మగడ్డ వెంకట కృష్ణారావు



తండ్రి రత్తయ్య. గుడివాడ తాలూకా డోకిపర్రు వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19-6-30న సంవత్సరం శిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష ననుభవించారు. జిల్లా కాంగ్రెస్ సంఘ కార్యాలయ కార్యదర్శిగా పనిచేశారు. శాసనోల్లంఘనంలో 11-1-1932న కాంగ్రెస్ కరపత్రాలు పంచుతుండగా అరెస్టు చేసి పోలీసుస్టేషన్‌లో దారుణంగా లాఠీచార్జీ చేశారు. కాంగ్రెస్ రికార్డును పోలీసుల వశంకాకుండా అర్ధరాత్రికి అర్ధరాత్రి సురక్షితమైన చోటుకి తరలించారు. 1942 క్విట్ఇండియా ఉద్యమంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. పామర్రు సబ్ జైలులో నిర్బంధించారు. జాతీయ ఉద్యమంలో పెక్కు సంవత్సరాలు ప్రముఖ పాత్ర వహించారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## నూతక్కి గోపాలకృష్ణయ్య

తండ్రి వెంకయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా కొమరవోలు. రైతు. శాసనోల్లంఘనంలోపాల్గొన్నారు. 30-6-1932 న సంవత్సరం ఆరు మాసాలు కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష ననుభవించారు. 10-4-1933 న విడుదలయ్యారు.

## నూతక్కి సీతారామమ్మ

గోపాల కృష్ణయ్యగారి పత్ని. 1914 లో జననం. గుడివాడ తాలూకా కొమరవోలు వాస్తవ్యులు. శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నారు. 25-5-32 న అరెస్టయ్యారు. 27-6-32 న సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో శిక్షను అనుభవించారు. జైలులోనే ప్రసవించి వ్యాధి గ్రస్తులయ్యారు. 17-4-33 న విడుదలయ్యారు. బిడ్డతో సహా 1934లో మృతిచెందారు.

## నెక్కలమూడి శివరామకృష్ణయ్య

గుడివాడ తాలూకా కనుమూరు వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో 18-1-32 న అరెస్టు చేశారు. వీరిని పోలీసులు విజయవాడ పోలీసు స్టేషన్‌కు తీసుకువెళ్ళి, అక్కడ తీవ్రంగా లాఠీ చార్జీ చేశారు.

## శ్రీ పండితారాధ్యాయుల శరభయ్యశర్మ

తండ్రి వీరభద్రయ్య. గుడివాడతాలూకా ఎలకుర్రు వాస్తవ్యులు. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో 19-6-30 నుండి ఒక సంవత్సరం కఠిన శిక్షను, రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒడంబడిక ననుసరించి 14-3-31 న విడుదలయ్యారు.

## పరసా రామలింగం

గుడివాడ నివాసి. శాసనోల్లంఘనంలోపాల్గొన్నారు. 6-2-1932 న గుడివాడలో కల్లు దుకాణాలముందు పికెటింగ్ చేసి, తీవ్రమైన లాఠీదెబ్బలకు గురయ్యారు.

## పర్వతనేని భూషయ్య

జన్మసలం గుడివాడ తాలూకా నూజెళ్ళ. ఉప్పు సత్యాగ్రహంలో గాంధీజీ అరెస్టుకు నిరసనగా తన లెజిస్లేటివ్‌కౌన్సిలు సభ్యత్వానికి రాజీనామా యిచ్చారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## పామిరెడ్డి వెంకటసుబ్బారెడ్డి



తండ్రి రామశేషయ్య. డోకిపర్రు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు19-6-30న ఒక సంవత్సరం శిక్ష విధింపబడింది. రాజమండ్రి, రాయవెల్లూరులలో శిక్ష అనుభవించారు. వలంటీర్లను సమీకరించినందుకు 11-1-32 న గుడివాడలో తీవ్రంగా లాఠీ చార్జీ చేశారు. 14-1-32 న దివితాలూకా కాజలో అరెస్టు చేసి 18-1-32 న రెండేళ్ళు కఠిన శిక్ష

విధించారు. రు. 1000 జరిమానా వేసి, జరిమానా క్రింద ఇంటి తలుపులు, పందిరిమంచం, తల్లి కాళ్ళ కడియాలు, పినతల్లి మెడలోని బంగారపు పట్టెడ నిర్బంధంగా స్వాధీనం చేసుకొన్నారు. రాజమండ్రి బళ్ళారిలలో శిక్ష అనుభవించారు. 3-7-33 న విడుదలయ్యారు. వ్యష్టి సత్యాగ్రహంలో 27-1-41 న పాల్గొన్నారు. 29 వ తేదీన 4 నెలల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## పామిరెడ్డి సత్యనారాయణరెడ్డి



తండ్రి రామశాస్త్రులు. జననం 1920 గుడివాడ తాలూకా డోకిపర్రు. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 11-5-1943న రెండు సంవత్సరాల కఠిన శిక్షను, 12 కొరడా దెబ్బల శిక్షను విధించారు. అలీపురంజైలులో శిక్ష అనుభవించారు. 18-5-1943 న కొరడా దెబ్బల శిక్షను అమలు జరిపారు.

## పామిరెడ్డి శేషారెడ్డి

తండ్రి రామయ్య. గుడివాడ తాలూకా డోకిపర్రు వాస్తవ్యులు రైతు. ఉప్పుసత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నందుకు 16-7-30న ఆరునెలల కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష ననుభవించారు. బందరులో శాసనోల్లంఘన ఉద్యమకాలంలో పికెటింగ్ చేశారు. 17-3-32న లాఠీ చార్జీకి గురయ్యారు.

## పామిరెడ్డి ఘంటారెడ్డి

తండ్రి గంగయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా డోకిపర్రు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19-6-1930 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931 న విడుదలయ్యారు. 27-3-1932 న బందరులో విదేశీ వస్త్రాలయాల ముందు పికెటింగ్ చేసి, తీవ్రమైన లాఠీ ఛార్జీకి గురయ్యారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 26-4-1941 న మూడు నెలల కఠిన శిక్ష, రు. 100/- జరిమానా విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## పారేపల్లి వెంకటరామారావుగుప్త

తండ్రి రత్నం. గుడివాడ తాలూకా జనార్థనపురం వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 4-6-30 న సంవత్సరం కఠినశిక్ష, రు. 50 జరిమానా చెల్లించని పక్షంలో మరో నాల్గు వారాల కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష ననుభవించారు.

## పింగళి కుటుంబరావు

జన్మస్థలం గుడివాడ తాలూకా పెదలింగాల. 1920-21 సహాయ నిరాకరణంలో తన గ్రామోద్యోగానికి రాజీనామా చేశారు.

## పిన్నమనేని కోటేశ్వరరావు

తండ్రి లక్ష్మయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా కురుమద్దాలి. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 17-1-1933 న ఎనిమిది నెలల కఠినశిక్ష, రు. 1000/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 29-8-1933 న ప్రభుత్వం ఉత్తర్వు మేరకు విడుదలయ్యారు.

## పిన్నమనేని పట్టాభిరామయ్య

తండ్రి ఇన్నయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా కురుమద్దాలి. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని 23-3-1932న అరెస్టు అయ్యారు. 28-3-1932న రు. 500/- జరిమానా విధించారు. జరిమానా చెల్లించక 45 రోజుల కఠినశిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. తిరిగి 2-7-1932న గుంటూరులో జరిగిన ఆంధ్ర రాజకీయ మహాసభకు హాజరై అరెస్టు అయ్యారు. కీర్తిశేషులైరి.

## పిన్నమనేని వీరయ్య



తండ్రి నాగయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా కురుమద్దాలి. వ్యాపారి 8-2-1930న అప్పటి మద్రాసు గవర్నర్ బందరు రాకకు నిరసనగా నల్ల జెండాల ప్రదర్శనలో పాల్గొని, ఆరు వారాల కఠినశిక్ష అనుభవించారు. తిరిగి ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా 7-5-30 న ఆరు నెలల కఠినశిక్ష, రు. 20 జరిమానా విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. పన్నుల నిరాకరణ ప్రచారం చేయరాదని 7-1-1932న ప్రభుత్వం ఆదేశం జారీచేసింది. గుంటూరులో జరిగిన రాష్ట్ర రాజకీయ మహాసభకు హాజరై, 2-7-1932 న అరెస్టు అయ్యారు. కీర్తిశేషులైరి.

## పిన్నమనేని వెంకటకృష్ణయ్య

గుడివాడ తాలూకా నూజెళ్ళ వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొని, అరెస్టయ్యారు.

## పుట్టగుంట వెంకటసుందరరామయ్య

తండ్రి కొండయ్య. గుడివాడ తాలూకా కురుమద్దాలి వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 7-5-'30 న ఆరు నెలల కఠిన శిక్ష విధించబడింది. రు. 20 జరిమానా, చెల్లించని పక్షంలో మరో 15 రోజుల కఠిన శిక్ష విధించబడింది. 20-5-'30 వరకు రాజమండ్రి జైలులో వుంచారు. జామీనుపై విడుదలయ్యారు.

## పునుకొల్లు వెంకటేశ్వర్లు



తండ్రి సీతయ్య. పెదపారుపూడి గ్రామంలో 1912 లో జననం. తన 18 వ ఏట ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. గుడివాడలో జరిగిన కాంగ్రెస్ సభలో వలంటీరుగా పనిచేశారు. లాఠీ దెబ్బలకు గురయ్యారు. 17-6-1930 న అరెస్టు చేసి. రెండు సంవత్సరాల కఠిన శిక్ష విధించి తంజావూరు బోర్‌స్టల్ స్కూలుకు పంపారు అక్కడ నుంచి రాజమండ్రి జైలుకి మార్చగా గాంధీ ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 8 నెలల అనంతరం విడుదలయ్యారు. తరువాత వీరు రెండేళ్ళు అలహాబాదులో సాహిత్య విశారద పరీక్షకు చదివారు. హిందీ వ్యాప్తికి కృషి చేశారు.

## పొట్లూరి పున్నమ్మ

తండ్రి చిగురుపాటి శేషయ్య. భర్త పేరయ్య. సుమారు 1900 సం॥లో జన్మించారు. జమీగొల్వేపల్లి నివాసం. శాసనోల్లంఘన వుద్యమంలో పాల్గొన్నందుకు ఒక సంవత్సరం శిక్ష. రు. 200 జరిమానా విధించారు. ఆమె ఇంటి తలుపులు వేలంవేసి జరిమానా వసూలు చేసుకున్నారు. 26-6-1932 నుండి శిక్షను వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు.

## పొట్లూరి యశోదమ్మ

గుడివాడ తాలూకా నివాసి. శాసనోల్లంఘనంలో పాల్గొని, 23-5-1932 న గుడివాడలో అరెస్టు అయ్యారు.

## పొట్లూరి గణపతిరావు

తండ్రి సూర్యనారాయణ. జననం 1925 గుడివాడ తాలూకా జమీగొల్వేపల్లి. హిందీ పండితులు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు.

పోలీసులు రెండుసార్లు ఇంటిపై దాడి చేశారు. అరెస్టు కాకుండా అజ్ఞాతవాసం గడిపారు.

## పొట్లూరి అంజనేయులు

తండ్రి సుబ్బయ్య. కొమరవోలు నివాసి. మద్రాసులో సైమన్ కమిషన్‌కు నిరసనగా నల్ల జెండాల ప్రదర్శనలో పాల్గొన్నారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని 9-7-1930 నుండి 6 నెలలు రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొనగా 18-1-1932న ఒక సంవత్సరం కఠిన శిక్ష రు. 100 లు జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొనగా 5-4-1941 న 13 మాసములు కఠిన శిక్ష, రు 100 జరిమానా విధించారు. రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్ష అనుభవించారు. జరిమానా చెల్లించనందున విడుదలయ్యాక రు. 200 చెల్లించమన్నారు. చెల్లించనందున వారికి గల ఎకరం మాగాణి భూమి వేలంవేసి డబ్బు వసూలు చేసుకున్నారు.

## పొట్లూరి కృష్ణయ్య

తండ్రి నాగయ్య. గుడివాడ తాలూకా కొమరవోలు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. 17-6-30 నుండి రాజమండ్రి, తిరుచునాపల్లి, ఆలీపురం క్యాంప్ జైళ్ళలో శిక్షను అనుభవించారు. గాంధి-ఇర్విన్ ఒడంబడిక ననుసరించి 14-3-31 న విడుదలయ్యారు. 1960 ప్రాంతంలో కీర్తిశేషులయ్యారు.

## పొట్లూరి సీతారామయ్య



తండ్రి కోదండరామయ్య. గుడివాడ తాలూకా కొమరవోలు వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 9-7-30 నుండి ఆరు నెలలు కఠిన శిక్ష విధింపబడింది, రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష ననుభవించారు. 23-12-30న విడుదలయ్యారు.

## పొట్లూరి గోపాలరావు

తండ్రి వీరయ్య. గుడిగుంట. 1932 శాసనోల్లంఘనోద్యమంలో విదేశ వస్త్ర బహిష్కరణ, కల్లు దుకాణాల పికెటింగులలో పాల్గొన్నారు. గుడివాడలో సంవత్సరం శిక్ష, రు. 200 జరిమానా విధించారు. 10-8-32 నుండి 13-6-33 వరకు రాజమండ్రిలో జైలు శిక్షను అనుభవించారు.

## పొట్లూరి వెంకటాచార్యులు



తండ్రి లక్ష్మీపతి. గుడివాడ తాలూకా కుచ్చకాయలపాడు వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1930 జూలై 28న ఆరునెలల కఠిన శిక్ష, రు. 50 జరిమానా విధించబడింది. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించారు. కీర్తిశేషులు.

## పోలవరపు రామారావు



తండ్రి పున్నయ్య. జననం 1904 గుడివాడ తాలూకా డోకిపర్రు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. రు. 30 లు జరిమానా విధించారు. 12-7-1930 నుంచి ఆరు నెలలు కఠిన శిక్షను రాజమండ్రి. అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## పోలవరపు గోపాలకృష్ణయ్య

తండ్రి రామయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా డోకిపర్రు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 7-5-1930 న ఆరు నెలల కఠిన శిక్ష,

రు. 20/- జరిమానా విధించారు. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## బల్సు విశ్వేశ్వరరావు



తండ్రి లక్ష్మయ్య. 19-7-1913 లో పెంజెండ్రలో జన్మించారు. 1932 - 34 మధ్య కాలంలో కాంగ్రెస్ బులెటన్లు సుమారు 12 గ్రామాల్లో పంచారు. గుడివాడ కాంగ్రెస్ సభలో లాఠీ దెబ్బలకు గురయ్యారు. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 4 మాసాలశిక్ష, రు 250 జరిమానా విధింపబడింది. జరిమానా చెల్లించి రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని గుడివాడ, నూజివీడు సబ్ జైళ్ళలో రిమాండులో వున్నారు. "స్వతంత్ర సమర భేరి" అనే కాంగ్రెస్ బులెటిన్ 1942-44 మధ్య కాలంలో నడిపారు. 1939 నుండి 1946 వరకూ గుడివాడ తాలూకా కాంగ్రెస్ సంఘ అధ్యక్షులుగా వున్నారు. 1946-1948 మధ్యకాలంలో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సభ్యులుగానూ 1948-50 మధ్యకాలంలో రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ కార్యనిర్వాహక సభ్యులుగానూ వున్నారు.

## బాదర్వాడ సూరమ్మ

జన్మస్థలం గుడివాడ తాలూకా పెదవిరివాడ. భర్త సుబ్బరాజు. చిన్నతనంలోనే వైధవ్యం ప్రాప్తించి, సోదరులు కొండు విజయరామరాజు వద్దనే వుంటూ, 1932 శాసనోల్లంఘనంలో పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరులో విదేశీ వస్త్రాలయాల ముందు పికెటింగ్‌చేసి, సంవత్సరం కఠిన శిక్షను వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు. జైలులో అనారోగ్యానికి గురై, విడుదలైన సంవత్సరం లోపనే కన్ను మూశారు.

## భూపతి కోటేశ్వరరావు

తండ్రి వెంకటేశ్వరరావు. జన్మస్థలం గుడివాడ తాలూకా మోటూరు. రైతు. చిన్న వయస్సులోనే వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. నిషిద్ధ సాహిత్యం కల్గి వున్నందుకు 27-11-1940 న అరెస్టు చేశారు. డి.ఐ.ఆర్. క్రింద శిక్షించారు. తిరిగి 17-4-1941 న వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, ఏడు నెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో రహస్య వుద్యమం నడుపుతూ, 27-10-1943 న డి.ఐ.ఆర్. క్రింద అరెస్టయ్యి, 27-10-1944 వరకు కన్ననూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధించారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## బొప్పన వెంకటపూర్ణ మాణిక్యారావు



తండ్రి వెంకటరత్నం. జననం 1913 గుడివాడ తాలూకా పెంజెండ్ర. వ్యష్టి సత్యాగ్రహం లోను, క్విట్ ఇండియా ఉద్యమంలోను పాల్గొన్నారు. 24-2-1943న డి.ఐ.ఆర్. క్రింద అరెస్టు అయి, ఆరు మాసాల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## బొప్పన వెంకట సుబ్బయ్య

తండ్రి వెంకటచలం. గుడివాడ తాలూకా చిరిచింతల వాస్తవ్యులు రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 4-6-30 న సంవత్సరం కఠినశిక్ష రు. 50 జరిమానా, చెల్లించని పక్షంలో మరో నెలశిక్ష విధించబడింది. రాజమండ్రి, కోయంబత్తూరు, అలీపురం, కడలూరు జైళ్ళలో శిక్ష ననుభవించారు.

## బొమ్మారెడ్డి కోటిరెడ్డి

తండ్రి అప్పిరెడ్డి. జన్మస్థలం గుడివాడ తాలూకా పామర్రు. రైతు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1-3-1941 న మూడు నెలల కఠినశిక్ష

రు. 50/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## బొడ్డపాటి వెంకటేశ్వరరావు

గుడివాడ తాలూకా రామన్నపూడి వాస్తవ్యులు. 1920-21 సహాయ నిరాకరణోద్యమంలో గ్రామోద్యోగి పదవికి రాజీనామా చేశారు.

## బెజవాడ వెంకట సుబ్బారావు



తండ్రి వెంకట కృష్ణయ్య. 1921 లో జన్మించారు. గుడివాడ తాలూకా మర్రివాడ వాస్తవ్యులు. వర్తకులు. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలుపట్టాల పెరికివేతకు, టెలిగ్రాఫ్ తీగల తెంచివేతకు, చట్టవిరుద్ధంగా సమావేశమయ్యారనే ఆరోపణపై 29-5-1943 న 15 నెలల శిక్ష విధించారు. ఆలీపురం క్యాంపు జైలులోశిక్షఅనుభవించారు. 1972 లో కీర్తిశేషులయ్యారు.

## బెల్లపు వెంకయ్య



తండ్రి చిన అయోధ్య రామయ్య. రావులపాడులో 1907 లో జననం. 1932 శాసనోల్లంఘన వుద్యమంలో గుడివాడ - దోసపాడుమధ్య రైలు గొలుసు లాగినందుకు 29-8-1932 న 6 నెలలు శిక్ష, రు. 100 జరిమానా విధింపబడింది. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## బొప్పన సీతారామయ్య

తండ్రి వీరయ్య. గుడివాడ తాలూకా పసుమర్రు వాస్తవ్యులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19-6-30 నుండి ఒక సంవత్సరం కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి తిరుచునాపల్లి జైళ్ళలో శిక్షను అనుభవించారు.

## బోయపాటి వీరభద్రయ్య

తండ్రి ఆనందయ్య. జన్మస్థలం గుడివాడతాలూకా దోసపాడు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19-6-1930 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931 న విడుదలయ్యారు.

## మంగళగిరి రామదాసు

తండ్రి వెంకటకృష్ణదాసు. జన్మస్థలం గుడివాడ తాలూకా అడ్డాడ. రైతు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. గుడివాడ సబ్ డివిజనల్ మెజిస్ట్రేట్ రెండు నెలల కఠిన శిక్ష విధించారు. 24-3-1941 నుంచి 23-5-1941 వరకు రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## మండవ గోపాలకృష్ణయ్య

తండ్రి కోటయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా శేరీకలవపూడి రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 4-8-1930 న ఆరు నెలలు కఠిన శిక్ష, రు25/ జరిమానా విధించారు. జరిమానా చెల్లించ నిరాకరించి, అదనంగా ఒక నెలజైలు శిక్షతో సహా మొత్తం 7 నెలల శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. క్విట్ ఇండియాఉద్యమంలో పాల్గొన్నారు. రు.200/-జరిమానా విధించారు. 6-4-1943 నుంచి 15 నెలలకఠిన శిక్షను కూడా అలీపురం జైలులో అనుభవించారు.

## మద్దాలి వెంకట గోపాలకృష్ణయ్య



తండ్రి వెంకట సుబ్బయ్య. జననం 5-8-1909 గన్నవరం తాలూకా మానికొండ. రైతు. నివాసంగుడివాడ తాలూకా రామాపురం. బందరు నేషనల్ కాలేజీ విద్యార్థి. 1940 లో టీచరు

మేనేజరు పదవికి రాజీనామా చేశారు. హరిజన సేవ, సంఘసేవ ప్రారంభించారు. ఆంగ్ల, ఆంధ్ర, హిందీ భాషలు మూడింటిని సులభంగా నేర్చుకొనడానికి అనువైన నిఘంటువు తయారు చేశారు. 1941 లో మునిపల్లెలో దరిద్ర నారాయణ బేసిక్ పాఠశాలను స్థాపించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో రెండు సార్లు 16-9-1942 నుంచి ఆరుమాసాలు జైలు శిక్షను, 25-4-1944 నుంచి మరొక 6నెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## మద్దాలి రాజేశ్వరి



తండ్రి గోవింద రాజుల వెంకటకృష్ణయ్య జననం 1926 గుడివాడ తాలూకా రామాపురం భర్త వెంకట గోపాల కృష్ణయ్య, భర్తతో పాటు క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, ఆరు మాసాల కఠిన శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. 30-7 1967 న మంగళగిరి క్షయ ఆసుపత్రిలో చనిపోయారు.

## మద్దిపట్ల వెంకట లక్ష్మీ నరసింహమూర్తి



తండ్రి వెంకట నర్సయ్య. గుడివాడ తాలూకా పసుమర్రు. 1906 జూన్ 1 న జననం. సంగీతోపాధ్యాయుడు. ప్రస్తుత చిరునామా దివితాలూకా ఘంటసాల.

1921 సహాయ నిరాకరణ ఉద్యమంలో వలంటీరుగా ఉన్నారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. లాఠీఛార్జీకి గురి అయ్యారు. విదేశ వస్త్ర దుకాణాలవద్ద, కల్లు దుకాణాలవద్ద పికెటింగ్ చేయగా ఆరు నెలల కఠిన శిక్ష విధించబడింది. 12-7-30 నుండి రాజమండ్రి సెంట్రల్ జైల్లో శిక్షను అనుభవించారు.

## మల్లిరెడ్డి అన్నపూర్ణమ్మ



తండ్రి గాదిరెడ్డి లక్ష్మిరెడ్డి. భర్త రాఘవ రెడ్డి. జనార్ధనపురం. నివాసం. జననం 1909 సం॥న. గుంటూరులో స్త్రీల డిక్టేటర్ల మహాసభకు అధ్యక్షురాలుగా వున్నారు. 16-3-1933 న 10 మాసాలశిక్షవిధించారు. రాయవెల్లూరు, కన్ననూరు జైళ్ళలోశిక్షను అనుభవించారు.

## మాగంటి అంకినీడు



తండ్రి వెంకట రామదాసు. జననం 1-1-1915 గుడివాడ తాలూకా తమిరిశ, రైతు. ఇంటర్ వరకు చదివారు. వ్యష్టి సత్యాగ్రహంలో అరెస్టయి, 24 రోజులు సబ్ జైలులో వున్నారు, 28-1-1941 న నాలుగు నెలల కఠినశిక్ష, రు. 750/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో రెండుసార్లు నిర్బంధింపబడ్డారు. 1946-50 మధ్య కాలంలో కృష్ణా జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు. 1962లో జిల్లా పరిషత్ అధ్యక్షులు, లోకసభకు నాలుగు సార్లు ఎన్నికయ్యారు.

## మానికొండ వెంకటరామయ్య

గుడివాడ తాలూకా ఉరుటూరు వాస్తవ్యులు. గ్రామోద్యోగి. 1920-21 సహాయ నిరాకరణోద్యమంలో తన పదవికి రాజీనామా యిచ్చారు.

## మానికొండ సత్యనారాయణశాస్త్రి



తండ్రి లక్ష్మీ నరసింహం. 1895 జూలై 7వ తేదీన గుడివాడ తాలూకా ఉరుటూరులో జన్మించారు. ప్రస్తుత నివాసం హైదరాబాదు. బి ఎ బియల్. ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు. 1921 సహాయ నిరాకరణ ఉద్యమ కాలంలో లా కాలేజి వదలి పెట్టారు. ఐతే 1939 లో లా డిగ్రీ పొందారు కాని ప్రాక్టీసు పెట్టలేదు. 1921-22 లో జాతీయ పాఠశాలకు హెడ్మాష్టరుగా వున్నారు. సహాయ నిరాకరణోద్యమంలో 26-4-22 నుండి 25-1-1923 వరకు రాజమండ్రి కడలూరు జైళ్ళలో 9 నెలల కఠిన శిక్ష ననుభవించారు. ఉప్పు సత్యాగ్రహంలో 13-5-30 నుండి 9 నెలల కఠిన శిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. విడుదలైన తర్వాత తిరిగి 28-1-31 న శాసనోల్లంఘనోద్యమంలో ఆరు నెలల శిక్ష విధించబడింది. రాజమండ్రి, అలీపురం క్యాంప్ జైళ్ళలో శిక్ష ననుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ననుసరించి 13-3-31న విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనోద్యమంలో 1-2-32 నుండి రెండేళ్ళ మూడు నెలల కఠిన శిక్షను కడలూరు, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 8-9-42 నుండి ఒక సంవత్సరం రెండు నెలల కఠిన శిక్షను అలీపురం క్యాంప్ జైల్లో అనుభవించారు. శిక్ష ముగిసిన వెంటనే డిటెన్ చేయబడి 8-7-1945 వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా వున్నారు. 1922-23 లో తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి. 1936-37 లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ ఆర్గనైజింగ్ సెక్రటరీ. కృష్ణాజిల్లా కోపరేటివ్ సెంట్రల్ బ్యాంక్‌కు 8 ఏళ్ళు కార్యదర్శిగా ఉన్నారు. "సత్యాగ్రహి", "గ్రామ స్వరాజ్య" వారపత్రికల సంపాదకులు. ఇంగ్లీషు, తెలుగు భాషలలో అనేక గ్రంథాలు రచించారు. "బ్రిటిషు మహాయుగము", "తెలుగు వాల్మీకము", "బాలగంగాధర తిలక్ ఉపన్యాసాలు" మొదలైనవి అందులో కొన్ని. భారత ప్రభుత్వం నుండి రు. 100 సాహిత్య పెన్షన్ పొందుతున్నారు. "తూర్పు కృష్ణాజిల్లా జాతీయోద్యమ చరిత్ర" సంపాదకులు. అన్ని స్వాతంత్ర్య ఉద్యమాల్లో పాల్గొన్న వృద్ధ స్వాతంత్ర్య యోధులలో ఒకరు.

## మాద్రి రామయ్య



తండ్రి కామయ్య. జననం 16-8-1916 గుడివాడ తాలూకా కొండిపర్రు. రైతు. ఆంగ్ల విద్యాభ్యాసానికి స్వస్తి చెప్పి, జాతీయోద్యమంలో చేరారు. కాంగ్రెసు కార్యకర్తల దళంతో 1000 మైళ్ళు కాలినడకను హరిపుర కాంగ్రెస్ మహాసభకు వెళ్ళారు. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో నిత్యం స్వగ్రామంలో సైక్లొస్టయిల్ పై రహస్య కరపత్రాలు ముద్రించి, నాలుగు తాలూకాలకు, రెండు మున్సిపాలిటీలకు పంపిణీ చేశారు. 16-10-1942 నుంచి ఆరు మాసాల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## మిక్కిలినేని రామకోటయ్య

తండ్రి సోమయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా పెదమద్దాలి. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 17-6-1930 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 19- -1932 న సంవత్సరం కఠిన శిక్ష, రు. 100 జరిమానా విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## మిక్కిలినేని వెంకట సుబ్బయ్య

తండ్రి శ్రీరాములు ఎలకుర్రు వాస్తవ్యులు. రైతు. 1893 ప్రాంతంలో కొరిమెర్లలో జన్మించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆరు నెలల మూడు వారాల కఠిన శిక్ష విధించబడింది. 12-7-30

నుండి రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. కీర్తిశేషులయ్యారు.

## ఎమ్. చిన్న శేషయ్య

జన్మస్థలం దండమూడి. 1907 వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్న కారణంగా, రాజమండ్రి ఆర్ట్సు కాలేజి నుంచి బహిష్కృతులయ్యారు.

## ముసునూరి కస్తూరిదేవి



తండ్రి ఎర్నేని సుబ్రహ్మణ్యం భర్త భాస్కరరావు. 18-4-1929న గుడివాడ తాలూకా గుడ్లవల్లేరులో జన్మించారు. హిందీ రాష్ట్రభాషలో ఉత్తీర్ణులయ్యారు. చిన్న వయస్సులోనే క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. గుడివాడ సబ్ డివిజనల్ మేజిస్ట్రేట్ ఆఫీసులోకి ప్రవేశించి, రాజీనామా చేయవలసినదని కోరి, అరెస్టు అయ్యారు. కోర్టు లేచే వరకు శిక్ష విధించారు. తరువాత బ్రిటిష్ వ్యతిరేక నినాదాలు చేసినందుకు అరెస్టు చేసి, పోలీసు కస్టడీలో వుంచి విడుదల చేశారు. వినోభా ఆంధ్ర పర్యటన సందర్భంలో తండ్రితోపాటు భూదానోద్యమంలో పాల్గొన్నారు. 1967 లో శాసనసభకు ఎన్నికయ్యారు. 18.7.1969న కీర్తిశేషులైరి. ఈ రెండేళ్ళ కాలంలో తన నియోజకవర్గంలోని సమస్యల పరిష్కారానికి కృషి చేశారు.

## ముక్తేవి కేశవాచార్యులు



తండ్రి చలమాచార్యులు. కురుమద్దాలి వాస్తవ్యులు. 1919లో చెరుకువాడ నరసింహం గారు త్రివిధ బహిష్కరణల గురించి ఇచ్చిన ఉపన్యాసాలతో రాజకీయాల వైపు మొగ్గారు. వృత్తిరీత్యా అర్చకులైనా, తమ దేవాలయంమీద "శాసనసభలను బహిష్కరించండి, ఓట్లు ఇవ్వవద్దు" అని రాశారు. విజయవాడ కాంగ్రెస్ ఎ. ఐ. సి. సి. కి హాజరయ్యారు.

1930 లో చిన్నాపురంలో ఉప్పు తయారు చేశారు. ఉప్పుసత్యాగ్రహంలో 7-5-1930 న ఆరు మాసాల శిక్ష విధించబడింది. 20 రూపాయల జరిమానా విధించబడింది. రాజమండ్రి, మద్రాసు, అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించారు. మద్రాసు జైల్లో గానుగ లాగ నిరాకరించినందుకు ఒక నెల నిలువు బేడీలు వేశారు.

కురుమద్దాలి, బందరు, విజయవాడలలో సత్యాగ్రహం, పికెటింగుల సందర్భంగా అనేకసార్లు లాఠీ చార్జీకి గురిఅయ్యారు.

విజయవాడలో విదేశ వస్త్రదుకాణాలముందు పికెటింగ్ జరిపినపుడు 72 దెబ్బలుకొట్టి, బండిలో వేసుకవెళ్ళి కృష్ణఒడ్డున నుడివేశారు. "పేపుల్స్ ఆసుపత్రి"లో చికిత్స పొందారు. 1938 లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. యజుర్వేదం 82 పన్నాలు క్రమాంతర అధ్యయనం చేసిన వీరు కాలానుగుణంగా రాజకీయ ప్రభావాలకు లోనయ్యారు.

## ముక్తేవి మాధవాచార్యులు



తండ్రి చలమాచారి. జన్మస్థలం గుడివాడ తాలూకా కురుమద్దాలి. పూజారి. 1932 డిసెంబరు 15న కాంగ్రెసు రహస్య పత్రికలు పోస్టుచేస్తూ విజయవాడలో అరెస్టు అయ్యారు. ఆయన ఇంటిని సోదా చేశారు. 'జయభారత్', 'రెడీ' రహస్య పత్రికల ప్రతులు. "విదేశీ వస్తువులు బహిష్కరించండి" అన్న రబ్బరుస్టాంప్ స్వాధీనం చేసుకొన్నారు. 20-12-1932 న సంవత్సరం కఠిన శిక్ష రు. 50/- జరిమానా విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. రాజకీయ ఖైదీలచేత కఠినమైన పనులు చేయిస్తున్నందుకు కొడాలి ఆంజనేయులు, చలసాని జగన్నాధరావులతో

కలిసి తీవ్ర అభ్యంతరం తెలుపగా, బళ్లారి జైలు అధికారులు ఆ ముగ్గురిని తీవ్రంగా కొట్టి కాళ్ళకు, చేతులకు బేడీలు వేశారు. వారు విడుదలయ్యేవరకు బేడీలు తీసివేయనేలేదు. 29-8-1933 న విడుదలయ్యారు. అనంతరం కమ్యూనిస్టు పార్టీలో చేరారు. ప్రస్తుత నివాసం గుంటూరుజిల్లా తెనాలి.

## ముదునూరి గుర్రాజు



జననం 1896. గుడివాడ తాలూకా, గుడివాడ పట్టణం, వైద్యవృత్తి. రెండు చేతులా ఆర్జనచేస్తున్న వైద్యవృత్తిని విరమించి, జాతీయోద్యమంలోకి దిగారు. గుడవాడ తాలూకాలో అడుగుపెట్టరాదని ప్రభుత్వం 1931 లో నిషేధాజ్ఞలు జారీచేసింది. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. సంవత్సరం కఠిన శిక్ష, రు. 400/- జరిమానా విధించారు. గుడివాడ పట్టణ కాంగ్రెసు సంఘ అధ్యక్షులు. జైలునుంచి విడుదలైన పిమ్మట, అమెరికావెళ్ళి హోమియోవైద్యం అభ్యసించారు గుడివాడ హోమియో కాలేజీ స్థాపకులు. 25-11-1963 న కీర్తిశేషులైరి.

## మూల్పూరు సుబ్బారావు

తండ్రి పున్నయ్య. గుడివాడ తాలూకా దోసపాడు వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 11-2-31 న రెండు నెలల కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రిలో శిక్ష అనుభవించారు. 11-3-31 న గాంధి ఇర్విన్ ఒడంబడికను అనుసరించి విడుదలయ్యారు.

## మేడూరి వెంకటేశ్వరరావు

తండ్రి యజ్ఞనారాయణ. జన్మస్థలం పశ్చిమ గోదావరిజిల్లా కొప్పాక. ఆయుర్వేద వైద్యుడు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నాడు. గుడివాడ సబ్ జైలులో నాలుగు నెలలు నిర్బంధించి, 29-5-1943 న సంవత్సరం మూడు నెలలు కఠినశిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. 1954 లో కీర్తిశేషులైరి.

## మోటూరి సత్యనారాయణ



తండ్రి పెద్ద పిచ్చయ్య. గుడివాడ తాలూకా దొండపాడులో 1902 లో జననం. ప్రస్తుత నివాసం మద్రాసు. బందరు జాతీయ కళాశాలలో విద్యాభ్యాసం. 1921 సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. నిర్మాణ కార్యక్రమంలో ముఖ్యంగా హిందీ ప్రచారానికి కృషిచేశారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 1942 సెప్టెంబరు 22 నుండి 1944 ఏప్రిల్ 20 వరకు మద్రాసు, వెల్లూరు జైళ్ళలో డెటిన్యూగా ఉన్నారు. అనేక హిందీ పత్రికలకు సంపాదకులు. పలు హిందీ ప్రచార సంస్థల వ్యవస్థాపకులు. తెలుగు భాషాసమితి వ్యవస్థాపక కార్యదర్శి. రాజ్యాంగ నిర్ణయసభ (1948-50) సభ్యులు, తాత్కాలిక పార్లమెంటుసభ (1951-52) సభ్యులు. '1952-'54 లో లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులు. రాజ్యసభ (1954-66) సభ్యులు. పద్మశ్రీ, పద్మభూషణ్ బిరుదులు పొందారు. హిందీ, తెలుగు భాషా రంగాలల్లో పెక్కు అధికార అనధికార పదవులు నిర్వహించారు.

## మొక్కపాటి రామకేశవశర్మ



జన్మస్థలం గండేపూడి. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాలు పెరికివేత కేసులో ముద్దాయి. 27-1-1943న అరెస్టు చేశారు. సబ్ జైలులో నిర్బంధించారు. 18-10-1943న 9 నెలలు శిక్ష విధించారు. మైనరు అయినందున, తండ్రి

వద్ద నుంచి రు 300/-లకు పూచీకత్తు తీసుకొని, విడుదల చేశారు.

## మోటూరి వెంకట చలపతిరావు



తండ్రి చంద్రయ్య. గుడివాడ తాలూకా జమీ గొల్వేపల్లి వాస్తవ్యులు రైతు. 1930 ఉప్పు సత్యాగ్రహంలోపాల్గొన్నందుకు 6 నెలల శిక్ష విధించబడింది. విడుదలతర్వాత తిరిగి ఉద్యమంలో చేరగా 3-1-31న ఆరు నెలల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి అలీపురం జైళ్ళలో శిక్ష ననుభవించారు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నందుకు 7-6-1932న అరెస్టయారు.

## యర్రపత్ని వెంకట్రావు



తండ్రిబుచ్చయ్య గుడివాడ తాలూకా మోపర్రువాస్తవ్యులు. రైతు-హిందీ విశారద పాసై, దక్షిణ భారత హిందీ ప్రచారసభ తరపున పశ్చిమగోదావరి జిల్లా 'పండిత విల్లూరు' లో 1935-1936 మధ్య కాలంలో హిందీ స్కూలు నడిపారు. 1938 సం॥లో కృష్ణాజిల్లా కాంగ్రెస్ కమిటీమెంబరుగా పనిచేశారు. 1939 సం॥లో కమ్యూనిస్టుపార్టీ లో చేరారు. రెండేళ్ళు అజ్ఞాతవాసంలో గడిపి 1942లో బైటకు రాగానే డి. ఐ. ఆర్. కింద అరెస్టుచేశారు. 17-9-1942న 9 మాసాలు కఠిన శిక్ష విధించారు. అలీపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవించారు. చాలా సంవత్సరాలు బుడమేటి రైతుసంఘ కార్యదర్శిగాను, గుడివాడ తాలూకా రైతు సంఘ ప్రెసిడెంటుగాను పనిచేశారు. ప్రస్తుతం కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం జాయింటు కార్యదర్శిగానూ, కృష్ణాజిల్లా రైతు సంఘ ప్రెసిడెంటుగాను పని చేస్తున్నారు.

## యలమంచిలి వెంకయ్య



తండ్రి సీతయ్య అనే రామయ్య. 1906 ప్రాంతంలో గుడివాడ తాలూకా పసుమర్రులో జననం ప్రస్తుత నివాసం నిజామాబాద్ జిల్లా షెంటు ఖుర్దు. ఉప్పుసత్యాగ్రహ ఉద్యమంలో 14-6 30 న ఆరు నెలల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచునాపల్లి, బళ్ళారి, అలీపురం క్యాంపు జైళ్ళలో శిక్షను అనుభవించారు.

## యలమంచిలి కృష్ణారావు



తండ్రి నాగయ్య. స్వస్థలం గుడివాడ తాలూకా కనుమూరు. 1932 శాసనోల్లంఘనంలోపాల్గొన్నారు. 14-10-1933 నుంచి 28-10-1933 వరకు గుడివాడసబ్ జైలులో నిర్బంధించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు.

## యలమంచిలి రామకోటయ్య



తండ్రి వెంకటరత్నం. జన్మస్థలం గుడివాడ తాలూకా కనుమూరు. 1930 చిన్నాపురం ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు శాసనోల్లంఘనంలో పామర్రులో లాఠీ

ఛార్జీకి గురయ్యారు. 15-10-1933 నుంచి 29-10-33 వరకు గుడివాడ సబ్‌జైలులో నిర్బంధంలో వున్నారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు.

## యార్లగడ్డ సూర్యనారాయణ

తండ్రి వెంకటప్పయ్య. గుడివాడ తాలూకా వానపాముల వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నందుకు 16-5-30 న తొమ్మిది నెలల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్ష ననుభవించారు.

## యార్లగడ్డ హనుమయ్య

తండ్రి వెంకట్రామయ్య. గుడివాడ తాలూకా దొండపాడు వాస్తవ్యులు. ఉప్పు సత్యాగ్రహంలో 19-5-30న గుడివాడలో అరెస్టు చేసి 21-6-30 న సంవత్సరం శిక్ష విధించారు. తంజావూరు బోర్‌స్టల్ స్కూలులో శిక్ష ననుభవించారు.

## రావూరి అర్జునరావు

తండ్రి గరటయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా వానపాముల. ఖాదీ, గ్రామీణ పరిశ్రమల కమీషన్‌లో గుమాస్తా. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టు అయి, 27-3-1943 నుంచి అలీపురం జైలులో పది నెలల కఠినశిక్ష అనుభవించారు.

## రాళ్ళబండి దుర్గానాగేశ్వరరావు



తండ్రి సుబ్రహ్మణ్యశాస్త్రి. కొమరవోలులో 10-8-1908 లో జననం. మెట్రిక్యులేషను చదువుతూ సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. 1930, 1932 సంవత్సరాలలో మొత్తం రెండేళ్ళు కఠినశిక్ష అనుభవించారు. జైలులో వున్నపుడు "మాకొద్దు ఈ తెల్ల దొరతనం" పాటపాడి చీకటి వారులో వుంచబడి ఆరోగ్యం కోల్పోయారు. 1930లో పట్టుబట్టలు దహనం చేశారు. బ్రాహ్మణీకం తెలిపే తనపేరు చివర "శాస్త్రి" తీసివేసి "రావు"అని పెట్టుకున్నారు. కొమరవోలులో గ్రంథాలయం స్థాపించారు. ఖద్దరు మూట నెత్తిన పెట్టుకుని అమ్ముతూ ఖద్దరు ప్రచారం చేశారు. ఆంగ్లవిద్య వదలి హిందీలో పట్టభద్రులయారు. తాటిగెలలు నరికారు. కల్లుపాకల వద్ద పికెటింగ్ చేశారు. లాఠీదెబ్బలకు గురయ్యారు. క్షయవ్యాధితో 19-4-1963 లో కీర్తిశేషులయ్యారు.

## వల్లభనేని రామబ్రహ్మం



తండ్రి వెంకటరత్నం గుడివాడ తా॥ జమీకుగొల్వేపల్లిలో 17 సెప్టెంబరు 1907 న జన్మించారు. రైతు, హైస్కూలు విద్యకు స్వస్తి చెప్పి, సహాయ నిరాకరణంలో పాల్గొన్నారు స్వగ్రామంలో 400 రాట్నాలు, 20 ఖాదీ నేత మగ్గాలతో ఖద్దరు ఉద్యమం నిర్వహించారు. కాకినాడ కాంగ్రెస్ మహాసభకు హాజరయ్యారు. 1929 లో గాంధీజీ ఖద్దరు యాత్రలో భాగంగా కృష్ణాజిల్లాలో పర్యటించినపుడు, తన సొంతకారులో స్వయంగా కారునడుపుతూ జిల్లా అంతటా తిప్పారు. ఉప్పుసత్యాగ్రహ దళాధిపతియై, తన సొంత బస్సులో కాంగ్రెస్ వలంటీర్లను చిన్నాపురం చేరవేసి నందుకు ప్రభుత్వం రు.500 జరిమానా విధించింది. ఆ బస్సు డ్రయివరు అన్నె వెంకట శివయ్యకు 4 నెలలు కఠిన శిక్ష విధించారు. బస్సు లైసెన్సు రద్దు చేశారు. కల్లుపాకల ముందు పికిటింగ్ చేసి, కల్లుగీత చెట్ల గెలలు నరికి, అరెస్టు అయ్యారు. ఆరునెలల శిక్ష విధించారు. శిక్ష అనుభవించి, విడుదలైనంతనే 1931 జనవరి 26 న బహిరంగ సభజరిపి, లాఠీచార్జికి గురయ్యారు. మూడు నెలల కఠినశిక్ష విధించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 11-3-1931 న రాజమండ్రి జైలు నుంచి విడుదలయ్యారు. శాసనోల్లంఘనంలో వివిధ గ్రామాలలో కాంగ్రెస్ ప్రచారం చేస్తూ, 11-1-1932 న తీవ్రమైన లాఠీ దెబ్బలకు గురయ్యారు. 1-2-1932 న రెండు సంవత్సరాల ఆరు నెలల కఠిన శిక్ష రు. 1000/-జరిమానా విధించారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19-3-1941 న ఆరు నెలల కఠిన శిక్ష, రు. 400/-

జరిమానా విధించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 28-9-1942 నుంచి 8-7-1945 వరకు డెటిన్యూగా వున్నారు. మొత్తం ఆరున్నర సంవత్సరాలు జైలు శిక్ష అనుభవించారు. తామ్రపత్ర గ్రహీత. తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంఘ అధ్యక్షులు, కొంతకాలం కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో పనిచేశారు. ప్రస్తుతం కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం చైర్మన్.

## వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ



రామబ్రహ్మం గారి పత్ని. జమీగొల్వేపల్లి. 12-1-1910 న గుడ్లవల్లేరులో జన్మించారు. 1930 ఉప్పు సత్యాగ్రహం గురించి స్త్రీలలో ప్రచారం చేస్తున్నప్పుడు, గుడివాడ పోలీసులు వీరిపై నిఘా వేశారు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో గుడివాడ కేంద్రంగా మహిళా వాలంటీర్లకు నాయకత్వ వహించి గ్రామాల్లో ప్రచారం చేశారు. గుడివాడలో 144 సెక్షను వుల్లంఘించి, విదేశ వస్తు, వస్త్ర దుకాణాల ముందు కల్లు దుకాణాల ముందు పికెటింగ్ జరిపారు. పోలీసులు కారపునీళ్ళు, బురదనీళ్ళు, రంగునీళ్ళు పిచికారీలతో కళ్ళల్లో ముక్కుల్లో కొట్టేవారు. కొందరు మహిళా వలంటీర్లు స్పృహ తప్పి పడిపోయేవారు. అరెస్టు చేసి నిర్జన ప్రదేశాల్లో విడిచి పెట్టేవారు. అయినా ప్రతిరోజూ గుడివాడ చేరి, వీరి దళంతో పికెటింగ్ చేస్తుండేవారు. ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు నడుపుతున్న గాంధీ ఆశ్రమం పోలీసులు సీలు వేయగా, వీరి దళం తాళాలు పగులకొట్టి ఆశ్రమాన్ని స్వాధీనం చేసుకున్నారు. నాలుగు మాసాలు ఇలా సత్యాగ్రహ పోరాటం జరిగింది. 2-5-1932 న వీరికి సంవత్సరం కఠినశిక్ష విధింపబడింది. వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో శిక్షననుభవించారు. 11-4-33 న విడుదలయ్యారు. వ్యష్టి సత్యాగ్రహంలో 19-3-1941 న కోర్టు లేచే వరకూ శిక్ష. రు. 300 జరిమానా, చెల్లించనిచో 3 నెలలు విడి ఖైదు విధింపబడింది. వెల్లూరు జైలులో శిక్షననుభవించారు. జిల్లా మహిళా సంఘాధ్యక్షురాలుగా, జిల్లా కాంగ్రెస్ కార్యవర్గ సభ్యురాలుగా వున్నారు. జిల్లా బోర్డు సభ్యులుగా వున్నారు. కాంగ్రెస్ సోషలిష్టు పార్టీలో కూడా కార్యవర్గ సభ్యులుగా వున్నారు. 1046-52 మధ్యకాలంలో శాసన సభ సభ్యురాలు. హరిజన బలహీన వర్గాల సంక్షేమానికి కృషి చేస్తున్నారు.

## వల్లభనేని రఘురామయ్య

తండ్రి వెంకట సుబ్బయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా జమీగొల్వేపల్లి. వ్యాపారి. క్విట్ ఇండియా ఉద్యమంలో తీవ్రంగా కృషి చేసి, 9-1-1943 నుంచి మూడేళ్ళ కఠినశిక్ష 18-5-1943 న 12 కొరడా దెబ్బల శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## వల్లభనేని వెంకటకృష్ణయ్య

తండ్రి బసవయ్య. జమీగొల్వేపల్లి నివాసి. రైతు మొదటి ప్రపంచ యుద్ధంలో సిపాయిగా పనిచేశారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనుటవల్ల 6 మాసముల కఠినశిక్ష 1-5-1930 నుండి రాజమండ్రి వెల్లూరు, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## వల్లభనేని కృష్ణయ్య



తండ్రి వెంకట్రామయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా జమీగొల్వేపల్లి. రైతు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో తంతి తీగెలు త్రెంచి, నెల రోజులు అజ్ఞాతవాసం గడిపారు. అనంతరం పోలీసులు అరెస్టుచేసి, కొన్ని రోజులుగుడివాడ, కైకలూరు సబ్ జైళ్ళలో నిర్బంధించారు. సాక్ష్యాధారాలు లేక విడుదల చేశారు.

## వల్లభనేని వెంకటశేషయ్య



తండ్రి పిచ్చయ్య. గుడ్లవల్లేరులో 1908 లో జననం. విదేశ వస్త్ర దహనం ఖాదీ ప్రచారం గావించారు. 1930 లో గుడ్లవల్లే రులో కాంగ్రెసుజెండా ప్రతిష్ఠాపన చేసినం దుకు లాఠీ దెబ్బలకు గురయ్యారు. చినాపురంలో ఉప్పు తయారు చేయగా అరెస్టయి బళ్ళారి జైలులో 6 మాసాలుశిక్ష అనుభవించారు. జైలులో క్షయవ్యాధి రాగా 1936 లో కీర్తిశేషులయ్యారు.

## వంగపాటి రంగారెడ్డి



తండ్రి శివారెడ్డి. జనార్ధనపురంలో 1906 లో జననం. రైతు. గుడివాడ, బందరు లలో చదివారు. గుం టూరు రాష్ట్రకాంగ్రెస్ మహాసభలకు హాజ రయినందుకు అరెస్టు చేశారు. 16-1-1933న ఒక సంవత్సరం జైలుశిక్ష, రు. 2 వేలు జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవిస్తుం డగా 31-8-1933 న విడుదలయ్యారు. 1934 నుండి 1938 వరకూ గుడివాడ తాలూకా కాంగ్రెస్ అధ్యక్షులుగా ఉన్నారు. 1939, 1942 సంవత్సరాలలో తిరిగి అరెస్టు అయ్యారు. కమ్యూనిస్టుపార్టీలో చేరారు. రైతు ఉద్యమాలలో ప్రముఖ పాత్ర వహించారు. సంఘ సంస్కరణాభిలాషి, 1948 లో తన ప్రథమ పుత్రికకు వర్ణాంతర వివాహం చేశారు. కొద్దికాలం క్యాన్సర్‌తో బాధపడి 4-1-1971 న కీర్తిశేషు లయ్యారు.

## విడియాల కాళహస్తి లింగం



తండ్రి వీరభద్ర య్య. జననం 1906 గుడివాడ తాలూకా డోకిపర్రు. రైలరు. ఉప్పు సత్యాగ్రహ ములో పాల్గొని, ఆరు నెలలు కఠిన శిక్షను 28-7-1930 నుంచి రాజమండ్రి. అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## వీరపనేని పెదనారాయణ



తండ్రి నాగయ్య. జననం 1908 గుడి వాడ తాలూకా కొమర వోలు. రైతు. క్విట్ ఇండియాఉద్యమంలో పాల్గొని, 14-10-44 నుంచి ఆరు నెలల కఠినశిక్షను అలీపురం జైలులో అనుభవిం చారు.

## వుల్పు సుబ్బారావు



తండ్రి వెంకయ్య. గుడివాడ తాలూకా గండేపూడి. 1918 ప్రాంతంలో జననం. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా గండేపూడిలో జరిగిన రాష్ట్రవ్యాపిత రహస్య కార్యకర్తల సమావేశా

నికి తోడ్పడ్డారు. రైలు పట్టాల పీకివేత, టెలిఫోన్ తీగెల తెంచివేత కేసులలో 1943 జనవరి 27 న అరెస్టయారు. గుడివాడ, బందరు కైకలూరు సబ్ జైళ్ళల్లో 9 మాసాలున్నారు. గుడివాడ పోలీసు స్టేషన్‌లో దెబ్బలు తిన్నారు. 18-10-43 న శిక్ష విధించారు. 22-10-43 నుండి ఆరు మాసాలు అలీపురం క్యాంప్ జైల్లో శిక్ష అనుభవించి విడుదలయ్యారు.

## వేములపల్లి గోపాలకృష్ణమూర్తి



తండ్రి మల్లయ్య. జననం 23-6-1920 గుడివాడ తాలూకా వానపాముల. విద్యార్థి దశలోనే యుద్ధ వ్యతిరేక ప్రచారంచేసి, 25-3-1942 నుంచి 27-4-1942 వరకు అలీపురం, బళ్ళారి జైళ్ళలో కఠినశిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 8-8-1944 న 8 నెలల కఠినశిక్షను, రు. 100/- జరిమానాను విధించారు. రాజమండ్రి. అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. వ్యాయామ రంగంలో గణనీయమైన కృషిచేసి, వెయిట్‌లిఫ్టింగ్‌లో కొత్త రికార్డు సృష్టించి, బహుమతులు అందుకొన్నారు.

## వేముల కూర్మయ్య

తండ్రి వెంగళయ్య జననం 1903 గుడివాడ తాలూకా మల్లవరం. బి.ఎ.ఎల్.ఎల్.బి. 1921 సహాయ నిరాకరణంలో చదువుకు స్వస్తి చెప్పారు. తరువాత విజయవాడ గాంధీ నేషనల్ స్కూలులో చేరారు. 1925-27 మధ్యకాలంలో సబర్మతి ఆశ్రమంలో గాంధీ సారథ్యంలో నూలు వడుకుట, నేత నేర్చుకున్నారు. బెనారస్ హిందూ యూనివర్శిటీలో న్యాయవాద పట్టా పొందారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. అనేకసార్లు అరెస్టు అయ్యారు. లాఠీచార్జీలకు గురయ్యారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని 9-12-1940 నుంచి ఆరునెలలు కఠినశిక్షను వెల్లూరు. తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. 1932లో ఆంధ్ర హరిజనసేవక్ సంఘం కార్యదర్శి. 1937, 1946, 1955 సంవత్సరాలలో శాసనసభకు ఎన్నికయ్యారు. 1946-49 మధ్య కాలంలో మద్రాసు రాష్ట్ర ప్రభుత్వంలో మంత్రిగా పనిచేశారు. 5-6-1970 న కీర్తిశేషులైరి.

## శింగవరపు అప్పారావు



తండ్రి కోటయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా కొమరవోలు. రైతు. ఉప్పుసత్యాగ్రహ కాలంలో తూర్పుగోదావరి జిల్లా సీతానగరం సత్యాగ్రహం ఆశ్రమంలో వాలంటీరుగా శిక్షణ పొందారు. మద్రాసులో విదేశీ వస్త్రాలయాలముందు పికెటింగ్ చేశారు. బందరులో సత్యాగ్రహ శిబిరంలో వాలంటీర్లకు శిక్షణ గరపుతుండగా అరెస్టు చేశారు. 19-5-1930 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు.

## శిరిపురపు కృష్ణమూర్తి

తండ్రి వెంకయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా ఎలమర్రు. రైతు. యుద్ధవ్యతిరేక ప్రచారం సాగించినందుకు అరెస్టుచేసి, 16-4-1942 న 9 నెలల కఠిన

శిక్ష విధించారు. బళ్లారి జైలులో శిక్ష అనుభవించారు. ప్రభుత్వ ఉత్తర్వు మేరకు 27-7-1942 న విడుదలయ్యారు.

## శివలెంక మల్లిఖార్జునరావు



తండ్రి శివ బ్రహ్మం. జననం 13-1-1894 గుడివాడ తాలూకా ఎలకుర్రు. బందరులో హైస్కూలు, కాలేజీ విద్య పూర్తి చేసి, హైద్రాబాద్ వైద్య విద్యాలయం నుంచి ఎల్.ఎమ్.ఎస్. డిప్లొమా పొందారు. విద్యార్థి దశలో బందరులో బిపిన్‌చంద్రపాల్ ప్రసంగం విన్నారు. 1926 లో విజయవాడలో వైద్యవృత్తిని ప్రారంభించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 21-6-1930 న రెండేళ్ళు కఠిన శిక్ష, రు. 200/- జరిమానా విధించారు. గాంధీ, ఇర్విన్ ఒప్పందంతో 12-3-1931 న విడుదలయ్యారు. విజయవాడలో పీపుల్స్ హాస్పిటల్ స్థాపించి, 1932 శాసనోల్లంఘనంలో లాఠీచార్జీలకు గాయపడిన అనేకమంది స్వాతంత్ర్య సమర యోధులకు చికిత్స చేశారు.

## శెట్టిపల్లి వెంకటరత్నం

తండ్రి సీతయ్య. గుడివాడ తాలూకా దొండపాడు. రైతు. ఉప్పుసత్యాగ్రహ ఉద్యమంలో గుడివాడలో నిషేధ ఉత్తరువులను ఉల్లంఘించి సభ జరిపారు. 17-6-'30 నుండి రెండేళ్ళ కఠిన శిక్షను రాజమండ్రి, తంజావూరు, తిరుచినాపల్లి, అలీపురం, బళ్ళారి జైళ్ళలో శిక్షను అనుభవించారు. జాతీయ కవి. జమీందారీ వ్యతిరేక గేయాలు రచించారు. అనేక గ్రామాలలో జాతీయ గేయాలు పాడుతూ జాతీయోద్యమం, జమీందారీ వ్యతిరేక ప్రచారం చేశారు. కీర్తిశేషులు.

## సప్పా యల్లయ్య



తండ్రి అక్కన్న. గుడివాడ తాలూకా గండేపూడివాస్తవ్యులు. వ్యవసాయ కార్మికులు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 27-1-43 న అరెస్టు చేసి కైకలూరు, బందరు సబ్ జైళ్ళలో 10 నెలలు ఉంచారు. 18-10-43 న 9 నెలల శిక్ష విధించబడింది. హైకోర్టులో కేసు కొట్టివేయగా 25-11-43 న విడుదలయ్యారు.

## సప్పా రాములు



తండ్రి పాపన్న. సుమారు 1906 లో ఈదుర మద్దాలి గ్రామంలో జన్మించారు. నివాసం గండేపూడి (గుడివాడ తా॥) రైతు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భాన పుట్లచెరువువద్ద రైలు పట్టాలు తొలగించటంలో పాల్గొన్నారు. 29-1 1946న 9 మాసములు కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవిస్తుండగా కృష్ణాజిల్లా సెషన్సు జడ్జి వుత్తరవు ప్రకారం 9-2-1946 న బెయిలుపై విడుదలయ్యారు. కీర్తిశేషులైరి.

## సింగారపు యశోదమ్మ

తండ్రి వల్లభనేని వెంకటరత్నం. భర్త రామశాస్త్రులు. జన్మస్థలం గుడివాడ తాలూకా జమిగొల్వేపల్లి. శాసనోల్లంఘనంలో పాల్గొని 25 6 1932 నుంచి సంవత్సరం కఠిన శిక్షను వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు.

## సింహాద్రి బసవలింగాచారి

తండ్రి భోజయ్య. జన్మస్థలం గుడివాడ తాలూకా మోపర్రు. స్వర్ణకారులు. హరికథకుడు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 31-8-1942 నుంచి 14 నెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## సుబ్బయ్య

గుడివాడ తాలూకా పురుటూరు వాస్తవ్యులు. గ్రామోద్యోగి. 1920-21 సహాయ నిరాకరణోద్యమ ఫలితంగా తన వెట్టి ఉద్యోగానికి రాజీనామా ఇచ్చారు.

## సూరపనేని వెంకటేశ్వరరావు

తండ్రి రామకృష్ణయ్య. జననం 1917 గుడివాడ తాలూకా కురుమద్దాలి. రైతు. వ్యష్టిసత్యాగ్రహంలో పాల్గొని, 17-1-1941 నుంచి మూడునెలలకఠినశిక్షను వెల్లూరు, అలీపురం, జైళ్ళలో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో బందరు-విజయవాడ రోడ్డుకు గండి కొట్టడంలో పాల్గొన్నారు

## సూరపనేని రామచంద్రరావు

తండ్రి రాఘవయ్య. జన్మస్థలం కైకలూరు తాలూకా కలవపూడి. నివాసం గుడివాడ తాలూకా కొమరవోలు. రైతు. పిన్నవయస్సులోనే క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. రైలుపట్టాలు పెరికివేత కేసులో ముద్దాయి. డి. ఐ. ఆర్. క్రింద అరెస్టు చేశారు. సంవత్సరం కఠినశిక్ష విధించారు. మైనరు కావటంవల్ల రు. 1000/-లు బాండుపై విడుదల చేశారు.

## సూరపనేని వెంకటేశ్వరరావు



గుడివాడ తాలూకా కొరిమర్ల వాస్తవ్యులు. 1941లో వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు రాయవెల్లూరు, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1942లో విజయవాడ బందరురోడ్డులో మల్లాపహరికాల్వకుగండికొట్టిరాకపోకలు స్తంభింపచేయగా, కొరిమర్ల గ్రామానికి రు. 1600 సాముదాయక జరిమానా విధించబడింది. 1949లో ఈ జరిమానాను కాంగ్రెస్ మంత్రివర్గం వాపసు యిచ్చింది. జిల్లా కాంగ్రెస్ కమిటీకి సంయుక్త కార్యదర్శిగా పని చేశారు. ప్రస్తుతం కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమర యోధుల కార్యనిర్వాహక సంఘ సభ్యులు.

## సూరపనేని గోపాలకృష్ణయ్య



తండ్రి చలమయ్య జన్మస్థలం గుడివాడ తాలూకా పాములపాడు. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో అరెస్టు అయి, 4-7-30 నుంచి ఆరునెలల కఠిన శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. శాసనోల్లంఘన కాలంలో మహిళా వాలంటీర్లకు భోజనం పెట్టినందుకు రు. 1000/- లు జరిమానా విధించారు. 22-6-1932 నుంచి 6 నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. తూర్పు కృష్ణా కాంగ్రెస్ సంఘ కార్యదర్శిగా పని చేశారు.

## సూరపనేని వెంకట సుబ్బమ్మ



గోపాల కృష్ణయ్య గారి పత్ని. 1912లో జననం. గుడివాడ తా॥ పాములపాడు వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 25-5-32న నందివాడలో అరెస్టు అయారు. 27-6-32న సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. వెల్లూరు, కన్ననూర్ జైళ్ళలో శిక్ష ననుభవించారు.

## సూరి పెద్ది కృష్ణమూర్తి

జన్మస్థలం గుడివాడ తాలూకా బేతవోలు. 1930-31 శాసనోల్లంఘనంలో పాల్గొని, రెండు నెలల కఠిన శిక్ష అనుభవించారు.

# గన్నవరం తాలూకా

## ముదునూరు

### అన్నె మల్లిఖార్జునుడు



తండ్రి వీరభద్రయ్య. గన్నవరం తాలూకా ముదునూరు గ్రామ నివాసి. రైతు. 1920-21 లో రామదండులో పనిచేశారు. హరిజనుల వద్ద మంచి నీళ్ళు తాగగా వీరి పెద్దలు బంగారంతో నాలుక కాల్చి శుద్ధి చేశారు. 1930 ఉప్పు సత్యాగ్రహం సందర్భాన ఉప్పు పొట్లం వేలం వేయగా, వీరు రు. 4 లకు ఉప్పు పొట్లం కొన్నారు. అలా ఉప్పు పొట్లం కొనడం అప్పుడు నేరం. తాటి గెలలు నరికివేత కార్యక్రమంలో ఒకే రోజున 70 తాటి గెలలు నరికారు. రెడీ రహస్య పత్రిక నిర్వహణకు తోడ్పడ్డారు. 7-8-1930 న 6 మాసాలు కఠినశిక్ష విధింపబడింది. రాజమండ్రి, బరంపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. 15-6-32 న 6 మాసముల శిక్ష రు. 200 జరిమానా విధింపబడింది. జరిమానా వసూలుకు జప్తుకు రాగా ఎవరూ పాట పాడలేదు. సహకార సంఘాలలో పనిచేశారు. తామ్రపత్ర గ్రహీత. జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘ కార్యవర్గ సభ్యులు. వీరు జిల్లాలోని ప్రతి అభ్యుదయ కార్యక్రమంలోనూ పాల్గొన్నారు. 16-6-1981 న కీర్తిశేషులయ్యారు.

### అన్నె సత్యనారాయణ

తండ్రి కోటయ్య. గన్నవరం తాలూకా ముదునూరు వాస్తవ్యులు. 1930-32 శాసనోల్లంఘన ఉద్యమ కాలంలో రహస్య పత్రిక "రెడీ" నడుపుటకు సహాయపడ్డారు.

### అన్నె అంజయ్య



తండ్రి వెంకటాద్రి. జననం 1905 గన్నవరం తాలూకా ముదునూరు. 1920 సహాయ నిరాకరణోద్యమంలో వాలంటీరుగా చేరి, వాలంటీర్ల శిక్షణ కోసం 'వాల్మీకి ఆశ్రమం' స్థాపించారు. గాంధీజీ ఆదేశానుసారం మాజీ హైదరాబాద్ సంస్థానంలో ఖాదీ ప్రచారానికి అనేక కేంద్రాలు స్థాపించారు. ఉప్పు సత్యాగ్రహంలో ఒక దళానికి నాయకత్వం వహించి అరెస్టు అయ్యారు. ఆరు నెలల కఠినశిక్ష, రు 1000/- జరిమానా విధించారు. చరాస్తిని వేలం వేసి, జరిమానాను రాబట్టుకొన్నారు. 1932 శాసనోల్లంఘనంలో అరెస్టు అయ్యారు. ఆరు నెలల కఠిన శిక్ష, రు 1000 జరిమానా విధించారు. హరిజనోద్ధరణకు విశేషంగా కృషి చేశారు. 1940 లో వయోజన విజ్ఞాన పాఠశాల స్థాపించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమానికి వాలంటీర్లను తయారుచేశారు. 1941 ఉద్యమ కాలంలో రహస్య జీవితం గడిపారు. 1932 లో "రెడీ" రహస్య పత్రికను, క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో "కాంగ్రెస్" రహస్య పత్రికను నడిపారు. 24-12-1942 న డి. ఐ. ఆర్. క్రింద అరెస్టు చేసి, 4-9-1945 వరకు దామో, అమరోతి, వెల్లూరు జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధించారు. సుభాస్ చంద్రబోస్ స్థాపించిన ఫార్వర్డు బ్లాక్ ఆంధ్ర శాఖకు అధ్యక్షులు. "మాతృభూమి" పత్రికకు మూడేళ్ళు సంపాదకులు. కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘానికి 1974-75 సంవత్సరంలో ఛైర్మన్. 22-6-1975 న హైదరాబాద్‌లో కీర్తిశేషులైరి.

## అన్నె కేశవర్య శాస్త్రి



తండ్రి నాగయ్య. జననం 16-10-1910 గన్నవరం తాలూకా ముదునూరు. హిందీ, ఆంధ్ర, సంస్కృత భాషలలో పండితులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని. 21-5-1930 నుంచి తొమ్మిది నెలల కఠిన శిక్షను రాజమండ్రి, వెల్లూరు, అలీపురం జైళ్ళలో అనుభవించారు. 1932 లో ఉత్తరప్రదేశ్‌లో శాసనోల్లంఘనంలో పాల్గొని 1932 జనవరి నుంచి 13 నెలల కఠిన శిక్షను ఫైజాబాద్, లక్నో, ఇటావా జైళ్ళలో అనుభవించారు. మాజీ నైజాం సంస్థానంలో 1938 లో ఆర్య సమాజ్ సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ప్రస్తుత నివాసం హైదరాబాద్.

## అన్నె సుబ్రహ్మణ్యం



తండ్రి వెంకట కృష్ణయ్య. ముదునూరులో 22-8-1896 లో జననం.

1916 లో "హోంరూల్" ఉద్యమం వల్ల ప్రభావితు లయ్యారు. 1919 లో రౌలట్ చట్ట వ్యతిరేక ఉద్యమంలో వుపన్యాసాలిచ్చారు. 1921 లో విజయవాడ కాంగ్రెసు సభలకు హాజరయ్యారు. కాంగ్రెస్ వుద్యమాలలో పాల్గొంటున్నందుకు వీరి మాగాణి భూమిని మెట్టగా మార్చడానికి ప్రభుత్వం ప్రయత్నించింది. అరెస్టు వారెంటు కూడా సిద్ధం చేసింది. చౌరీ చౌరా సంఘటన వల్ల గాంధీజీ ఉద్యమ విరమణతో ప్రభుత్వం వీరిపై చర్య తీసుకోలేదు.

అన్నె అంజయ్యగారి నాయకత్వాన "వాల్మీకి ఆశ్రమం"లో నెలకొల్పిన జితేంద్ర గ్రంథాలయ కార్యదర్శిగా రాజకీయ ప్రచారం చేసినందుకు ప్రభుత్వం ఆ గ్రంథాలయాన్ని నిషేధించి తాళం వేశారు.

1932 లో రహస్య పత్రిక "రెడీ"కి వ్యాసాలు రాశారు. 1932 జూన్‌లో సత్యాగ్రహం చేసినందుకు 12 నెలలు శిక్ష, రు. 400 జరిమానా విధించబడింది. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. జరిమానా వసూలుకొరకు జప్తు తేగా, ఎవరూ వీరి భూములను కొనలేదు. అనేక సార్లు లాఠీ దెబ్బలకు గురయ్యారు. 1925 లో అంటరానితనం పోగొట్టేందుకు కృషి చేశారు. 1930 లో తన బావులలో నీళ్ళని హరిజనులను వాడుకోనిచ్చారు. 16-12-1933 న ముదునూరు గాంధీజీ విచ్చేసిన సందర్భంగా హరిజన దేవాలయ ప్రవేశం జరిగింది. అన్నె అంజయ్యగారితో పాటు వీరు కూడా ఇందుకు కృషి చేశారు. 1940 లో తన ఇంట గోరా గారిచే నాస్తికోపన్యాసా లిప్పించారు. తన కుమార్తెకు వర్ణాంతర వివాహం చేశారు. ప్రకృతి చికిత్సలో కృషి చేశారు. 21-3-1980 న ప్రమాదవశాత్తున మృతి చెందిరి.

## అన్నె పరమానందం



తండ్రి సుబ్రహ్మణ్యం. జననం 1919 గన్నవరం తాలూకా ముదునూరు. రైతు. చిన్నవయస్సులోనే గోడలపై జాతీయ నినాదాలు రాయడం, కల్లు గీత చెట్ల గెలలు నరకడంలో పాల్గొన్నారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో రైలుపట్టాలు పెరికివేత, తంతితీగెల త్రెంచివేత కార్యక్రమాలలో పాల్గొన్నారు. 1943 మార్చిలో కడపజిల్లా పులివెందులలో రైతులను, యువకులను సమీకరిస్తూ అరెస్టు అయ్యారు. 15 రోజులు పులివెందుల సబ్‌జైలులో నిర్బంధంలో వున్నారు. కడపజిల్లానుంచి ప్రభుత్వం బహిష్కరించగా, తిరిగి కృష్ణాజిల్లాకు వచ్చారు.

## ఆదం బూస్



గుడివాడ తాలూకా నివాసి. క్విట్ ఇండియా ఉద్యమంలో 1943లో గన్నవరం తాలూకా ముదునూరులో సత్యాగ్రహం చేసి అరెస్టు అయ్యారు. తీవ్రమైన లాఠీ చార్జీకి గురయ్యారు.

## కంభంపాటి వెంకటేశ్వరరావు

తండ్రి భీమయ్య. జన్మస్థలం గన్నవరం. రైతు. 13-4-1932 న జరిగిన జలియన్‌వాలాబాగ్ సంస్మరణ దినం పాటించి, లాఠీచార్జీకి గురయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 26-7-1932 న ఆరు నెలల కఠినశిక్ష, రు 50/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## కలపాల సూర్యప్రకాశరావు



తండ్రి రత్తయ్య. ముదునూరులో 1912 లో జన్మించారు రైతు. 1932-33 శాసనోల్లంఘన వుద్యమంలో పాల్గొన్నారు. 1942 క్విట్ ఇండియా వుద్యమంలో పాల్గొని, అరెస్టు కాకుండా తప్పించుకున్నారు. తర్వాత అరెస్టుచేసి విడుదల చేశారు. కాంగ్రెసు సంస్థలో అనేక పదవులు నిర్వహించాదు. జిల్లా హరిజన సేవక్ సంఘానికి అధ్యక్షులుగానూ, భారత సేవక్ సమాజ్ కన్వీనరుగాను పని చేశారు. గ్రంథాలయోద్యమంలో పనిచేశారు. 1-7-70 నుండి ఆరేళ్ళపాటు ఆంధ్రప్రదేశ్ శాసన మండలి సభ్యులుగా వున్నారు.

## కుర్రా పుల్లయ్య



తండ్రి వీరయ్య. ముదునూరు నివాసి. రైతు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నందుకు 7-8-30 న ఒక సంవత్సరం కఠిన శిక్ష విధింపబడింది. రాజమండ్రి, బరంపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## కుర్రా వెంకటరత్నం



తండ్రి కృష్ణయ్య. ముదునూరులో 1908 లో జననం. కల్లు దుకాణాల వద్ద పికిటింగ్, తాటిగెలలు నరికినందుకు 21-5-30 న 9 నెలలు కఠినశిక్ష విధింపబడింది. రాజమండ్రి. కోయంబత్తూరు, అలిపురం క్యాంపు జైళ్ళలో శిక్ష అనుభవించారు. రహస్య పత్రిక "రెడీ" నిర్వహణలో తోడ్పడ్డారు. శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొనగా 13-6-1932న ఒక సంవత్సరం కఠిన శిక్ష రు. 1000 జరిమానా విధింపబడింది. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో అజ్ఞాతంగా వుండి రహస్య పత్రిక "కాంగ్రెస్" నిర్వహణకు తీవ్ర కృషి చేశారు. 7-7-1964 న కీర్తిశేషులయ్యారు.

## కుర్ర వెంకట రామయ్య



తండ్రి భీమయ్య. గన్నవరం తాలూకా ముదునూరులో 1910లో జన్మించారు. రైతు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 7-8-30 న ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది.

రాజమండ్రి, బరంపురం జైళ్ళలో శిక్ష ననుభవించారు. ఆ తరువాత నిర్మాణ కార్యక్రమంలో పనిచేశారు. 1953 లో కీర్తిశేషులైరి.

## కొల్లి వెంకటదాసు

గన్నవరం తాలూకా మునునూరు వాస్తవ్యులు. 1930-32 శాసనోల్లంఘన ఉద్యమ కాలంలో వెలువడిన రహస్య పత్రిక "రెడీ" నడుపుటలో సహాయ పడ్డారు. 1942 ఉద్యమంలో విజయవాడ సబ్‌జైలు నుంచి తప్పించుకు వచ్చిన క్విట్ ఇండియా ఉద్యమ ఆర్గనైజర్ కులకర్ణికి ఆశ్రయ మిచ్చారు.

## కొల్లి విమలాదేవి



తండ్రి వి.తారక బ్రహ్మం. ముదునూరులో జననం. నూజివీడులో నివాసం. వెంకటదాసుగారి పత్ని. 1932 శాసనోల్లంఘన వుద్యమంలో పాల్గొని పలుసార్లు అరెస్టయ్యి సబ్ జైలులో వున్నారు.

## కొమ్మూరి నరసయ్య



తండ్రిరామస్వామి ముదునూరులో 16-10-1913 లో జన్మించారు, 1930లో తాటిగెలలు నరుకుట, కల్లుదుకాణాల పికెటింగ్, విదేశ వస్త్ర బహిష్కరణ ఉద్యమాల్లో పాల్గొన్నారు.
1931 లో ముదునూరు కాంగ్రెస్ శిబిరం బాధ్యత వహించారు. రహస్య పత్రిక "రెడీ" నిర్వహణకు, పంపకానికి తోడ్పడ్డారు. 1932 లో 7 సార్లు లాఠీ ఛార్జికి గురయ్యారు. 13-4-1932 న జాతీయ వారోత్సవ సందర్భంగా విజయవాడ వినాయకుని గుడివద్ద యూరోపియన్ సార్జెంటు ప్రత్యేకదళం జరిపిన లాఠీ ఛార్జీలో వీరు స్పృహతప్పి పడిపోగా రైవస్ కాలువ గట్టున పడవేసి పోయారు. పీపుల్సు హాస్పటల్‌లో చేర్చగా 3 రోజులకు స్పృహ వచ్చింది. చాలాకాలం వరకూ కాళ్ళు స్వాధీనానికి రాలేదు. పోలీసుల స్వాధీనంలో వున్న కాంగ్రెస్ ఆఫీసు "ఆంధ్రరత్న భవన్" తాళం బద్దలుకొట్టి స్వాధీన పర్చుకోడానికి ప్రయత్నించిన దళంలో వీరు వున్నారు. 6-9-1932 లో ఒక సంవత్సరం కఠిన శిక్ష రు. 75 జరిమానా విధించారు. 6-9-1932 నుండి 13-6-33 వరకూ రాజమండ్రిలో శిక్ష అనుభవించారు.

## కాశే నాగేశ్వరరావు (ఉరఫ్ కానా)



తండ్రి ప్రకాశం. 20-2-1920 న ముదునూరులో జన్మించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో మొదటిసారి 10మాసాల శిక్ష 27-3-43 నుండి అలీపురం క్యాంపు జైలులో అనుభవించారు. రెండవసారి 5-4-44 నుండి 6మాసాలు కఠిన శిక్ష అదే జైలులో అనుభవించారు. భూస్వామ్య వ్యతిరేక ఉద్యమం రిపోర్టు సేకరించుటకు తెలంగాణాలో పర్యటించారు. 1945 నుండి 1947 వరకూ గాంధీ ఆశ్రమంలో ఉన్నారు. 1947 నుండి 1948 తెలంగాణాలో స్టేట్ కాంగ్రెస్ ఆధ్వర్యాన నిజాం వ్యతిరేక ఆందోళనలో పాల్గొన్నారు. కాందిశీకుల సమస్యపై నివేదిక ఎ. ఐ. సి. సి. కి, హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌కు సమర్పించారు. ప్రస్తుత నివాసం నల్లగొండజిల్లా సూర్యాపేట.

## గుత్తా వెంకటగిరిరావు



తండ్రి లక్ష్మయ్య. 1892 లో జన్మించారు. గన్నవరం తాలూకా ముదునూరు వాస్తవ్యులు. 1930లో ఆబ్కారీ పికెటింగ్‌లో పాల్గొనగా అరెస్టు చేసి వదలివేశారు. అస్పృశ్యతా నివారణ, హరిజనులతో సహ పంక్తి భోజనం, హరిజనులను బావులలో నీరు తోడుకో నివ్వడంవంటి సంస్కరణోద్యమాలలో పాల్గొన్నారు. వీరి ఇంటనే "రెడి" అనే రహస్య సైక్లోస్టైయిల్ పత్రికముద్రించబడేది. ఆ పత్రిక పంపిణీలో పాల్గొన్నారు. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టు అయి, గన్నవరం సబ్‌జైలులో కొన్నాళ్ళు నిర్బంధంలో వున్నారు. 1942 లో వారంట్ జారీ చేయడంతో 8 మాసములు రహస్య జీవితం గడుపుతూ ఉద్యమానికి తోడ్పడ్డారు.

## గుత్తా రాజారామమోహన్‌రాయ్



తండ్రి వెంకట గిరిరావు. గన్నవరం తాలూకా ముదునూరు. 1930, 1932 ఉద్యమాలలో 11 సంవత్సరముల వయస్సులోనే రహస్య పత్రిక "రెడి" ని చుట్టుప్రక్కల గ్రామాలకు తీసుకువెళ్ళి అక్కడ పంచారు. 1940, 1942 ఉద్యమాలలో "స్వతంత్ర భారత్" రహస్య పత్రికను పంపకం చేయడమేగాక గ్రామాలు తిరిగి,యుద్ధానికి బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రచారం చేశారు. ఆ సందర్భంలో 1942 న ముదునూరుగ్రామంలోవీరినితీవ్రంగాలాఠీలతోమోదారు. 1940 సం॥లో రాయలసీమకు వెళ్ళి అక్కడ రైతు యువజన, కూలి సంఘాలను ఏర్పాటు చేశారు. ఆ సందర్భంలో రాజంపేటలో 5-6-1943 న డి.ఐ.ఆర్ క్రింద వీరిని అరెస్టుచేసి, 25 రోజులపాటు రాజంపేట సబ్‌జైలులో వుంచారు. ఆ తరవాత కూడా స్వరాజ్యం వచ్చేవరకూ బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా వీరు పని చేశారు.

## చాపరాల వెంకట నారాయణ



తండ్రి సుబ్రహ్మణ్యం. ముదునూరులో 14-7-1909లో జన్మించారు. బ్రహ్మచారి. ఉపాధ్యాయ ఉద్యోగానికిరాజీనామాచేసి,శాసనోల్లంఘన ఉద్యమ కాలంలో విజయవాడలోని ఆంధ్రరత్న భవనం పోలీసుల స్వాధీనం నుంచి విముక్తికి జరిపిన సత్యాగ్రహంలో మరో 5గురితోపాటు పాల్గొనగా తీవ్రమైన లాఠీ దెబ్బలకు గురయ్యారు. 6-9-1932 న వివిధ సెక్షన్ల క్రింద మొత్తం ఒక సంవత్సరం కఠినశిక్ష రు. 75 లు జరిమానా విధింపబడింది. రాజమండ్రి జైలులో, లాహోరు కుట్ర కేసు స్వాతంత్ర్య యోధులు శివకుమారశర్మ, జయదేవకుమార్, విజయకుమార్ సిన్హాలు నిరసన వ్రతం చేసిన సమయంలో వారికి సేవ చేసినందుకు, ఇతర విధాల సాయపడినందుకు 15 రోజుల చొప్పున 4 సార్లు కాళ్ళకు ఇనుప బేడీలు, గొలుసులు వేశారు. శిక్షా కాలంలోని రెమిషన్ రద్దు చేశారు. తన సహచరులంతా ముందు విడుదల కాగా 24-8-33 న వీరిని విడుదల చేశారు.

## చుండూరు నాగేంద్రాచారి

జన్మస్థలం గన్నవరం తాలూకా ముదునూరు. 1930 శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు.

## చుండూరు నాగభూషణం



తండ్రి పుల్లయ్య. ముదునూరు. 1930_32 ఉద్యమాలలో పాల్గొన్నారు. రహస్య బులిటెన్లు పంచినందుకు గాను అరెస్టు చేసి 1932 ఆగస్టు 8 న ఒక సంవత్సరం కఠిన శిక్ష, రు. 100 లు జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష ననుభవించారు. 13_6_1933 న విడుదలయ్యారు.

## తుమ్మల సత్యవతమ్మ



తండ్రి బొప్పన గంగయ్య. భర్త రామకృష్ణయ్య. 1902 న గన్నవరం తాలూకా తిమిరశలో జననం. 1930 నుండి రాజకీయాలలో పాల్గొన్నారు. బందరులో ఉప్పు పండించినపుడు అరెస్టుచేసి దూరంగా వదిలేశారు. విజయవాడలో విదేశవస్త్ర బహిష్కరణోద్యమంలో 20 రోజులు పికెటింగ్ చేయగా అరెస్టుచేసి వదలిపెట్టారు. ఓసారి పోలీసులు రంగునీళ్ళు చల్లారు. మరోసారి పగలంతా ఎండలో నిలబెట్టి భోజనం లేకుండా చేశారు. ఏకవస్త్రను చేశారు. దుర్గగుడిమీద రెండురోజులుంచి వదిలారు. తాడేపల్లిలో వీరు పికెటింగ్ చేయగా, భోజనం, మంచినీళ్ళు లేకుండా చేశారు. యలమర్రులో విదేశ వస్త్రాలను తగలబెట్టగా, 2_5_32 న ఒక సంవత్సరం కఠినశిక్ష రు. 100 జరిమానా విధింపబడింది. (జరిమానా చెల్లించకపోతే ఒక నెల శిక్ష అదనం) రాయవెల్లూరులో 6 మాసాలు, కన్ననూరులో 6 మాసాలు శిక్ష అనుభవించారు.

## తుమ్మల సీతారామయ్య

గన్నవరం తాలూకా ముదునూరు వాస్తవ్యులు. 1930 ఉద్యమంలో పాల్గొన్నందుకు ఆరు నెలల శిక్ష, రు. 100 జరిమానా విధింపబడింది.

## తుమ్మల రామచంద్రరావు



తండ్రి బ్రహ్మయ్య జననం 27_7_1920 గన్నవరం తాలూకా ముదునూరు. రైతు. చిన్నతనంలోనే గోడలపై జాతీయ నినాదాలు రాసే కార్యక్రమంలో పాల్గొన్నారు. 1939 లో కాంగ్రెస్‌లోని అతివాద యువక నాయకులు ఏర్పాటుచేసిన, స్వచ్ఛంద సేవాదళ శిక్షణా శిబిరంలో శిక్షణ పొంది అనేకమంది యువకులకు శిక్షణ గరిపారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 11_10_1942 న అరెస్టు అయ్యారు. కొన్నిరోజులు గన్నవరం సబ్ జైలులో నిర్బంధంలో వున్నారు. ప్రస్తుతం హైదరాబాద్‌లో వుంటున్నారు.

## తుమ్మల శ్రీ రాజ వెంకట నారాయణరావు

తండ్రి నాగభూషణం. గన్నవరం తాలూకా ముదునూరు వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. రు. 200 జరిమానా వసూలు చేయబడింది. 14_7_32 నుండి ఆరు నెలల కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి జైలులో శిక్షననుభవించారు.

## తుమ్మల కోటయ్య

తండ్రి శోభనాద్రి. జననం 15_7_1900 న గన్నవరం తాలూకా ముదునూరు. రైతు. కవి. తామ్రపత్ర గ్రహీత. 1921 సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని 21_5_1930 నుంచి 9 నెలల కఠిన శిక్ష రాజమండ్రి, వెల్లూరు, అలీపురం జైళ్ళలో అనుభవించారు. 1932

శాసనోల్లంఘన కాలంలో ప్రజలను ఎంతగానో ప్రభావితం చేసిన రహస్య పత్రిక "రెడీ"లో అనేక వ్యాసాలు, ఉత్తేజకరమైన గేయాలు ప్రచురించారు. 26-7-32న రెండేళ్ళ కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. 29-8-1933 న ప్రభుత్వం ఉత్తర్వు మేరకు విడుదలయ్యారు. తిరిగి క్విట్ ఇండియా ఉద్యమంలో పోలీసు నిఘా నుంచి తప్పించుకుని మద్రాసుకెళ్ళి తిరిగి రాగా. 30-4-1943 నుంచి మూడు నెలల పాటు అలీపురం జైలులో నిర్బంధించారు. పోలీస్ ఆఫీసర్ ను బ్రిటిష్ ప్రభుత్వం డిస్మిస్ చేసింది. 18-12-1976 న కీర్తిశేషులైరి.

## తుమ్మల చెల్లయ్య



తండ్రి బ్రహ్మయ్య. జననం1920 గన్నవరం తాలూకా ముదునూరు. సంఘ సేవకుడు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 27-3-1943 నుంచి అలీపురం జైలులో 10 మాసాలు కఠిన శిక్ష అనుభవించారు. జైలు నుంచి విడుదలయిన వెంటనే, డి. ఐ. ఆర్. క్రింద మద్రాసులో అరెస్టు చేసి, ఎగ్మూర్ చీఫ్ ప్రెసిడెన్సీ మేజిస్ట్రేట్ ఆరు నెలల కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. అనంతరం కమ్యూనిస్టు పార్టీలో చేరారు.

## తుమ్మల పెద సత్యనారాయణ



తండ్రి వెంకటాద్రి. ముదునూరు నివాసం. రైతు. జననం 18-1-1898. 1930 ఉద్యమంలో కాంగ్రెస్ వలంటీరుగా చేరారు. నందమూరులో కొందరితో కలసి తాటి గెలలు నరకబోగా "తాటి గెలలు నరికితే వలంటీర్లను నరుకుతాం" అని పాటదార్లు బెదిరించారు. వీరు సాహసించి గాంధీజీ ఉద్దేశాలను వివరించి తన ప్రాణాన్ని ఒడ్డు తానని గెలలు నరకడానికి పూనుకున్నారు. గెలలు నరకవద్దని పాటదార్లు సత్యాగ్రహం ప్రారంభించారు. గ్రామ పెద్దలు వారికి నష్టపరిహారమిచ్చి గెలలు నరకడానికి తోడ్పడ్డారు. 500 మంది రిజర్వు పోలీసులతో సర్కిల్ ఇనస్పెక్టర్ ముదునూరును చుట్టుముట్టాలని ప్రయత్నించగా కాంగ్రెస్ వలంటీర్లు స్వచ్ఛందంగా సర్కిల్‌వద్దకు వెళ్ళి అరెస్టుకు సిద్ధమయ్యారు. ఆసందర్భంలో గ్రామస్థులు వీరిని ఊరేగించి వీడ్కోలిచ్చి జైలుకు పంపారు. 21-5-30 న అలా అరెస్టయిన వలంటీర్లలో వీరొకరు. వీరికి రెండు సెక్షన్ల క్రింద 9మాసాల శిక్షవిధింపబడింది. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## తుమ్మల సీతారామ చౌదరి

తండ్రి శేషయ్య. గన్నవరం తాలూకా ముదునూరు వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొని 20-8-30 న 6 నెలల శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## తుమ్మల వెంకట సుబ్బయ్య



తండ్రి శేషయ్య. ముదునూరులో 1896 లో జన్మించారు. రహస్య పత్రిక 'రెడీ'ని గ్రామాలలో పంచారు. 13-4-1932 న జలియన్ వాలాబాగ్ దినం సందర్భంగా విజయవాడ అన్సారీ పార్కులో జెండా ప్రతిష్టాపన చేసినందుకు తీవ్రంగా పోలీసులు లాఠీఛార్జి చేశారు. వీరి ఎడమ చేయి, ఎడమ కాలు విరిగింది. ఆస్పత్రిలో కోలుకుని తిరిగి సత్యాగ్రహం జరిపినందుకు 30-2-32 న 6 మాసాలు శిక్ష, రు. 200 జరిమానా విధించారు. రాజమండ్రిలో శిక్ష అనుభవించారు. తామ్రపత్ర గ్రహీత.

## త్రిపురనేని వెంకయ్య



తండ్రి నాగయ్య, గన్నవరం తాలూకా ముదునూరు వాస్తవ్యులు. ప్రస్తుత నివాసం బోధన తాలూకా నాగేంద్రపురం. రైతు. తమ ఉపాధ్యాయుని ద్వారా జాతీయ భావాలు అలవరచుకున్నారు. బెజవాడ ఎ. ఐ. సి. సి., మద్రాసు కాంగ్రెస్ మహాసభలకు హాజరయ్యారు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమ కాలంలో బెజవాడలో వలంటీరుగా ఉన్నారు. గన్నవరంలో కల్లుపాకల పికెటింగ్ చేసినపుడు అరెస్టు చేసి 7-8 30 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, బరంపురంలలో జైలు శిక్షను అనుభవించారు. గాంధి-ఇర్విన్ సంధి ననుసరించి విడుదలయ్యారు.

## తెన్నేరు నరసయ్య

జన్మస్థలం గన్నవరం తాలూకా ముదునూరు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొని, లాఠీచార్జికి గురయ్యారు.

## ధూమాటి నందేశ్వర శర్మ

జన్మస్థలం గన్నవరం తాలూకా ముదునూరు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని లాఠీచార్జికి గురయ్యారు.

## నాదెళ్ళ అప్పయ్య

ముదునూరు ఖాదీపరిశ్రమ నడిపారు. స్వాతంత్ర్య వుద్యమాలు అన్నిటిలో పాల్గొన్నారు.

## నాదెళ్ళ మహాలక్ష్మమ్మ

అప్పయ్యగారి పత్ని. జననం 1900. స్వగ్రామం గన్నవరం తాలూకా ముదునూరు. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 2-5-1932 న ఆరు నెలల కఠిన శిక్ష, రు. 100/- జరిమానా విధించారు. జరిమానా చెల్లించ నిరాకరించి, మొత్తం 7 నెలల శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు.

## నాదెళ్ళ సౌంచారమ్మ

తండ్రి నాదెళ్ళ అప్పయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా ముదునూరు. తన 11 వ ఏటనే 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని అరెస్టు అయ్యారు. కొద్దిరోజులపాటు సబ్‌జైలు రిమాండులో వున్నారు.

## నాగులాపల్లి సీతారామయ్య



తండ్రి తిరుపతయ్య. 7-10-17 లో ముదునూరులో జన్మించారు. 1942 క్విట్ ఇండియా వుద్యమంలో రహస్యంగా పని చేశారు. సోషలిస్టు నాయకులు శ్రీ కులకర్ణితో రహస్యంగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు ఆ వుత్తరాలు పట్టుబడగా 28-2-43 న పోసులీలు అరెస్టు చేశారు. నూజివీడు, బందరు సబ్‌జైళ్ళలో నిర్బంధింపబడ్డారు. గ్రంథాలయ హరిజనోద్యమాలలో పని చేశారు.

## వల్లపోతు భగవానులు

తండ్రి గంగయ్య. విజయవాడలో ఆంధ్రరత్న భవనం పోలీసుల స్వాధీనంనుంచి, విముక్తం చేయ డానికి జరిపిన సత్యాగ్రహంలో పాల్గొనగా 6-9-1932న సంవత్సరం కఠినశిక్ష రు. 75 జరిమానా విధింపబడింది. రాజమండ్రి సెంట్రల్ జైల్లో శిక్ష అనుభవించి 13-6-1933 న విడుదల చేయబడ్డారు. 1972 మే నెలలో కీర్తిశేషులయ్యారు.

## పువ్వుల సుబ్బారావు



తండ్రి సూర్య ప్రకాశరావు. 15-8-1926న బందరు తాలూకా జింజేరులో జన్మించారు. గాయకుడు. గన్నవరం తాలూకా ముదునూరు వాస్తవ్యులు. తన 16వ ఏట క్విట్ ఇండియా వుద్యమంలో పాల్గొన్నారు. శారిపురం గ్రామంలో చెట్టుమీద కాంగ్రెస్ జెండా కడుతుడంగా, గ్రామాధికారులు చెట్టుమీదనుంచి వీరిని త్రోసివేశారు. పోలీసులు వీరిని అరెస్టుచేసి, కంకిపాడు, గన్నవరం, నూజివీడు, బందరు సబ్ జైళ్ళలో మూడు నెలలు వుంచారు. 30-4-1943 న బందరులో 3 మాసాల శిక్ష విధించగా ఆలీపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవించారు.

## పువ్వుల భక్తవత్సలుడు



తల్లి వెంకట సుబ్బమ్మ 15-8-1908 న జననం. గన్నవరం తాలూకా ముదునూరు వాస్తవ్యులు.

1930-32 జాతీయ ఉద్యమాల్లో పాల్గొన్నారు. అజ్ఞాతవాసంలో "రెడీ" అనే రహస్య పత్రిక ముద్రణ, పంపిణీలో పాల్గొన్నారు. పికెటింగ్‌లోను, తాటిగెలల నరికే ఉద్యమంలోను పాల్గొన్నారు. తీవ్రమైన లాఠీచార్జి వల్ల ముంజేయి బాగా దెబ్బతిని చచ్చుబడిపోయింది. గాంధీజీ ముదునూరు వచ్చినపుడు తక్లీపై స్వయంగా వడికిన నూలు సమర్పించారు. ఆరోగ్యం క్షీణించి 1934 లో చనిపోయారు.

## పొట్లూరి వెంకటేశ్వరరావు



తండ్రి సూరయ్య. గన్నవరం తాలూకా ముదునూరు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని 26-1-1943న అరెస్టు అయ్యారు. పోలీసు లాకప్‌లో వుంచి, అదే రోజున విడుదల చేశారు.

## పొట్లూరి వెంకట సుబ్బారావు

(ఉరఫ్ వెంకటేశ్వరరావు)

తండ్రి వీరయ్య. గన్నవరంతాలూకా ముదునూరు వాస్తవ్యులు. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నందుకు 30-4-43న 3నెలల కఠినశిక్ష విధించబడింది. అలీపురం క్యాంప్ జైలులో శిక్ష ననుభవించారు.

## బేతపూడి వెంకటసుబ్బయ్య



తండ్రి నరసయ్య. 15-7-1917 లో వీరంకిలో జన్మించారు. ముదునూరు నివాసి. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో ప్రచారం చేస్తుండగా, అరెస్టు చేసి, నూజివీడు సబ్ జైలులో కొన్నాళ్ళు వుంచి వదలి వేశారు. మళ్ళీ టెలిఫోను తీగలు తెంపి, చెర్చిల్ బొమ్మ తగులబెట్టగా 10 మాసాలకఠిన శిక్ష విధింప బడింది. 27-3-1943 నుండి అలీపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవించారు.

## మనోరమ

తండ్రి గోపరాజు రామచంద్రరావు. జననం 1928. గన్నవరం తాలూకా ముదునూరు. భర్త అర్జునరావు. చిన్న వయస్సులోనే క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 25-4 1944 నుంచి ఆరు నెలల కఠినశిక్షను

వెల్లూరు జైలులో అనుభవించారు. గుడివాడ హరిజన గరల్స్ హాస్టల్ మేనేజరు. హరిజన యువకుని వివాహమాడిన మహిళ.

## మండెం నాగయ్య



కృష్ణాజిల్లా నివాసి. క్విట్ ఇండియా ఉద్యమంలో 1943లో గన్నవరం తాలూకా ముదునూరులో సత్యాగ్రహం చేశారు. తీవ్రమైన లాఠీఛార్జీకి గురై అరెస్టయ్యారు.

## మామిళ్ళపల్లి సూర్యప్రకాశరావు

తండ్రి పున్నయ్య. గన్నవరం తాలూకా ముదునూరు వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నందుకు 20-4-32న ఆరు నెలల కఠిన శిక్ష విధించ బడింది. రాజమండ్రి జైలులో శిక్షను అనుభవించారు.

## ముదునూరు సూర్యప్రకాశరావు



తండ్రి నరసింహారావు. 6-6-1916న ముదునూరులో జన్మించారు. సంఘసేవకులు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసి చర్చిల్ బొమ్మ తగుల బెట్టారు. 10 మాసాలు కఠిన శిక్షవిధింపబడింది. 27-3-1943 నుండి 22 12-43 వరకూ అలీపురం క్యాంపు జైలులో శిక్షఅనుభవించారు. కరణం ఉద్యోగం నుంచి డిస్మిస్ చేయబడ్డారు.

హరిజనులతో పంక్తి భోజనాలు చేయడం, హరిజన వాడలలో వీధులు వూడ్చడం, రోడ్లు వేయటం వంటి కార్యక్రమాల్లో పాల్గొన్నారు. 11-8-969 లో కీర్తి శేషులయ్యారు.

## మొవ్వ సత్యనారాయణ



తండ్రి లింగయ్య. 1906లో జన్మించారు. ముదునూరు నివాసం. 1930 వుద్యమంలో విజయవాడ సత్యాగ్రహ శిబిరంలో 5 మాసాలు వలంటీరుగా వున్నారు. 20-8-30న 6 మా॥ కఠిన శిక్ష రు.50 జరిమానా, చెల్లించక పోతే 6 వారాల శిక్షవిధించారు. రాజమండ్రిలో శిక్ష అనుభవించారు. అక్కడ జైలు సంచులు అల్లడానికి నిరాకరించగా 12 గంటలు నిలబెట్టారు. రెమిషన్ రద్దు చేశారు. గాంధీ ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 1931 మార్చిలో విడుదల చేయబడ్డారు. రహస్య పత్రిక 'రెడీ' నిర్వహణకు తోడ్పడ్డారు. 1932 ఉద్యమంలో పాల్గొన్నారు. ముదునూరులో పోలీసులు తీవ్రంగా లాఠీ ఛార్జీ చేశారు. సంవత్సరం కఠిన శిక్ష విధింప బడింది. రాజమండ్రిలో శిక్షను అనుభవించారు. 1942లో రహస్య పత్రిక "కాంగ్రెస్" నిర్వహణకు తోడ్పడ్డారు. స్పెషల్ పోలీసులు అరెస్టు చేసి తీవ్రంగా కొట్టారు. హరిజనులతో కలిసి భోజనం చెయ్యటం వంటి కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

## మొవ్వ రామకోటయ్య

తండ్రి వెంకయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా ముదునూరు. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని, 6-9-1932 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. 13-6-1933న విడుదలయ్యారు.

## మొవ్వ రామయ్య

జన్మస్థలం గన్నవరం తాలూకా ముదునూరు. 1931-32 శాసనోల్లంఘనంలో రహస్య పత్రిక 'రెడీ' ప్రచురణ, నిర్వహణలో పాల్గొన్నారు.

## మొవ్వ వెంకటప్పయ్య

ముదునూరు. విజయవాడలో ఆంధ్రరత్న భవనం స్వాధీనపర్చుకో బోగా లాఠీఛార్జీకి గురయ్యారు

25-8-1932 న అరెస్టుచేసి 6-9-1932 న ఒక సంవత్సరం శిక్ష రు 75/- జరిమానా విధించగా, రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 13-6-33న విడుదలయ్యారు. ఆ తర్వాత మూడు సంవత్సరాలకు చనిపోయారు.

### మొవ్వ రాజవెంకట అప్పారావు

తండ్రి బసవయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా ముదునూరు రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 6-9-1932 న సంవత్సరం కఠినశిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 13-6-1933 న విడుదలయ్యారు.

### మేడేపల్లి అంజయ్య

తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా ముదునూరు. 1930 ఉద్యమ కాలం నుంచి జాతీయోద్యమాలతో సంబంధం కలిగివున్నారు. 'రెడీ' 'కాంగ్రెస్' రహస్యపత్రికలపంపిణీ బాధ్యతలు నిర్వహించారు. కల్లుగీత గెలలు నరికారు. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో, అరెస్టు అయి వారం రోజులు గన్నవరంసబ్ జైలు నిర్బంధంలోవున్నారు.

### రామినేని వియ్యమ్మ

స్వస్థలం గన్నవరంతాలూకా కొమ్మమూరు.1930 శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు.

### రాచర్ల సామ్రాజ్యం

తండ్రి గోపరాజు వెంకట సుబ్బారావు. నివాసం గన్నవరం తాలూకా ముదునూరు. భర్త రామచంద్ర రావు. క్విట్ ఇండియా ఉద్యమంలో 13-4-1944న అరెస్టుఅయి, ఆరు నెలల కఠిన శిక్ష అనుభవించారు.

### వాసం రామకోటయ్య

తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా ముదునూరు రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టుఅయి, 30-4-1943 నుంచి మూడు నెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

### వి. చిన్న

జన్మస్థలం గన్నవరం తాలూకా ముదునూరు. 1932 శాసనోల్లంఘనంలో లాఠీఛార్జీకి గురయ్యారు.

### సుంకర దుర్గమ్మ

తండ్రి అన్నె కోటయ్య. భర్త సూర్యనారాయణ. జన్మస్థలం గన్నవరం తాలూకా ముదునూరు. పదేళ్ళ వయస్సులోనే 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, 10 రోజులు సబ్ జైలు రిమాండులో వున్నారు.

## కపిలేశ్వరపురం

### కాకర్ల పెదకోటయ్య



తండ్రి శేషయ్య 1905 న గన్నవరం తాలూకా కపిలేశ్వర పురంలో జన్మిం చారు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని బందరులో ఉప్పు తయారు చేస్తుండగా అరెస్టు అయ్యారు. 8-7-1930 నుంచి ఆరునెలల రెండు వారాల కఠినశిక్షను రాజమండ్రి అలీపురం జైళ్ళలో అనుభవించారు. తామ్రపత్ర గ్రహీత. 2-6-1979 లో కీర్తిశేషులైరి.

### కొల్లివర సూరయ్య

తండ్రి రత్నం. 1899 ప్రాంతంలో జన్మించారు. గన్నవరం తాలూకా కపిలేశ్వరపురం వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో 23-5-1930 నుండి 9 నెలల కఠినశిక్ష రాజమండ్రి, బళ్ళారి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. రు. 50 లు జరిమానా విధించగా చెల్లించారు. 7-1-1932 న పన్నుల నిరాకరణోద్యమ ప్రచారాన్ని నిషేధిస్తూ వుత్తర్వు జారీ చేయబడింది. 14-1-1932 న అరెస్టుఅయ్యారు. 15-1-1932 న రెండేళ్ళు కఠినశిక్ష వెయ్యి రూపా యలు జరిమానా, చెల్లించకపోతే మరో 4 నెలలు కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, బళ్ళారి, మధురై, కడలూరు, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభ వించారు. వ్యష్టి సత్యాగ్రహంలో 27-2-41 న నూజి

వీడులో రెండు నెలల కఠినశిక్ష రు. 200 జరిమానా, చెల్లించనిచో మరో రెండు నెలల కఠినశిక్ష విధించ బడింది. జరిమానా వసూలు చేయబడింది. రాజమండ్రి జైల్లో శిక్షను అనుభవించారు. తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులుగా పనిచేశారు. 1946–1951 లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో శాసన సభ్యులు "సాహితి" పత్రిక పోషకులు. 1975 ఏప్రిల్ 25 న కీర్తిశేషులయ్యారు.

## చివులూరి సూర్యనారాయణ

తండ్రి వెంకటప్పయ్య. గన్నవరం తాలూకా కపిలేశ్వరంపురం వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో 19–6–30 న ఒక సంవత్సరం కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష ననుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ఫలితంగా 14–3–1931 న విడుదలయ్యారు.

## చిగురుపాటి కుటుంబయ్య

తండ్రి బాపయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా కపిలేశ్వరపురం. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 23–5–1930 న 9 నెలల కఠిన శిక్ష. రు. 50/- జరిమానా విధించారు. రాజమండ్రి, బళ్ళారి, వెల్లూరు జైళ్ళలోశిక్ష అనుభవించారు, విదేశవస్త్ర బహిష్కరణ ప్రచారం చేయబోతున్నట్టు జిల్లా కలెక్టరుకు నోటీసు యిచ్చి, 30–8–1933న అరెస్టు అయ్యారు.

## చిగురుపాటి శివనారాయణ

తండ్రి రత్తయ్య. గన్నవరం తాలూకా కపిలేశ్వరపురం వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నందుకు 23–5–1930 న 9 నెలల కఠినశిక్ష, రు. 50 జరిమానా, చెల్లించని పక్షంలో మరో 15 రోజుల కఠినశిక్ష విధించబడింది. జరిమానా చెల్లించలేదు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష ననుభవించారు.

## తాతినేని కోటయ్య

తండ్రి రంగయ్య. జన్మస్థలం గన్నవరంతాలూకా కపిలేశ్వరపురం. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 9–7–1930 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## తాతినేని వెంకట సుబ్బయ్య (దొర)



తండ్రి చిన్న కోటయ్య. కపిలేశ్వరపురం నివాసి. 12–9–1912న జననం. లండన్‌లో ఇంజనీరింగ్ చదువుతూ విరమించారు. 1941 లో వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొనగా 4 మాసాల శిక్ష, రు 100 జరిమానా విధించారు. జరిమానా చెల్లించకపోతే మరో నెలరోజులు శిక్ష అనుభవించాలని తీర్పు చెప్పారు. 16–4–41 నుంచి 1–9–41 వరకూ రాజమండ్రి జైలులో జరిమానా శిక్షను కూడా అనుభవించినప్పటికీ, జరిమానా కూడా వసూలు చేశారు. క్విట్ ఇండియా వుద్యమంలో పాల్గొన్నందుకు 25–4–1944 నుండి 4 మాసాల కఠిన శిక్ష, రు. 200 జరిమానా విధించారు. జరిమానా చెల్లించకపోతే మరో 2 నెలలు శిక్ష, మొత్తం 6 మాసాల శిక్ష అలీపురం క్యాంపు జైలులో అనుభవించి 4–10–1944 న విడుదలయ్యారు.

## తాతినేని కుటుంబయ్య

తండ్రి లక్ష్మయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా కపిలేశ్వరపురం. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 14–6–1930 న సంవత్సరం కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ – ఇర్విన్ ఒప్పందంతో 11–3–1931 న విడుదలయ్యారు.

## తాతినేని వీరరాఘవయ్య

తండ్రి రామయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా కపిలేశ్వరపురం. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19–6–1930 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ – ఇర్విన్ ఒప్పందంతో 14–3–1931 న విడుదలయ్యారు.

## లంక శేషయ్య

తండ్రి పున్నయ్య. గన్నవరం తాలూకా కపిలేశ్వరపురం. రైతు. ఉప్పుసత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నందుకు 8-7-30 న ఆరు నెలల కఠిన శిక్ష, రు. 20 జరిమానా చెల్లించని పక్షంలో రెండు వారాల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, అలీపురం క్యాంపు జైళ్ళలో శిక్షను అనుభవించారు.

## మాగంటి రామచంద్రరావు

తండ్రి వెంకట సుబ్బయ్య. కపిలేశ్వరపురంలో 10-10-1904 న జన్మించారు. రైతు. 1922 నుండి ఖాదీవుద్యమంలో పాల్గొన్నారు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొనగా 19-6-1930 న ఒక సంవత్సరం కఠిన శిక్ష విధింపబడింది. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష ననుభవించారు గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 14-3-1931 న విడుదల చేయబడ్డారు.

## మిక్కిలినేని వరలక్ష్మమ్మ



తండ్రి చిగులూరు రత్తయ్య. కపిలేశ్వరపురంలో 1910 వ సం॥లో జన్మించారు. భర్త వెంకట సుబ్బయ్య. శాసనోల్లంఘన వుద్యమంలో పాల్గొని గుడివాడలో అరెస్టు అయ్యారు. 6 మాసాల కఠిన శిక్ష, రు. 100 లు జరిమానా, (జరిమానా చెల్లించకపోతే మరో నెల శిక్ష) విధింపబడగా మొత్తం 7 నెలల కఠిన శిక్ష రాయవెల్లూరు జైలులో అనుభవించారు.

# కాటూరు

## కడియాల గోపాలరావు



జన్మస్థలం గన్నవరం తాలూకా కాటూరు. రైతు. బందరులో విద్య నభ్యసిస్తూ, జాతీయోద్యమ ప్రభావానికి లోనై, 1928లో చదువుకు స్వస్తి చెప్పారు. 1930 ఉప్పుసత్యాగ్రహం కాలంలో ఆంధ్రరత్న భవనం నుంచి బయలుదేరిన అయిదుగురు కాంగ్రెస్ ప్రచారకుల దళానికి నాయకత్వం వహించి దాదాపు 30 గ్రామాలలో కాంగ్రెసు ప్రచారంచేస్తూ, ఆకిరిపల్లి, నూజివీడులలో రెండుసార్లు అరెస్టుఅయి, విడుదల చేయబడ్డారు. ప్రచారం ముగించుకొని, స్వగ్రామం చేరిన పిమ్మట తిరిగి అరెస్టుచేసి, గన్నవరం సబ్ జైలులో నిర్బంధించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో శిక్ష విధించకుండానే విడుదల చేశారు. అనంతరం అల్లాబాద్ విద్యాపీఠంలో హిందీ భాష అభ్యసించారు. 1937-38 లో రాష్ట్ర కాంగ్రెస్‌కమిటీ సభ్యులు. 1937 న కొత్తపట్నం స్కూలులో అరెస్టు అయి, 3 వారాలపాటు తెనాలి సబ్ జైలులో నిర్బంధంలో వున్నారు. యువజన రైతు ఉద్యమాల నిర్మాణంలో, కమ్యూనిస్టుపార్టీ నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించారు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో యుద్ధ వ్యతిరేక ప్రచారంచేస్తూ, మూడేళ్ళు అజ్ఞాత వాసంలో వున్నారు. ప్రస్తుతం హైదరాబాదులో వుంటున్నారు.

## కాటూరి వెంకటేశ్వరరావు



తండ్రి కొండయ్య. జననం 15-10-1895 గన్నవరం తాలూకా కాటూరు. కవి. రచయిత. 'సౌందర్య నందనం' 'గుడిగంటలు' రచించారు. బి. ఏ. చదువుతూ, 1921 సహాయ నిరా

కరణోద్యమంలో చదువు మానేశారు. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 28-1-1931 న ఆరునెలల కఠిన శిక్ష, రు. 50/ జరిమానా విధించారు. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 15-3-1931 న విడుదల చేశారు. కీర్తిశేషులైరి.

## గూడూరి వీరభద్రరావు ఉరఫ్ బుర్రయ్య

తండ్రి వెంకటస్వామి. జన్మస్థలం గన్నవరం తాలూకా కాటూరు. 1932 నవంబరు 14 వ తేదీన విజయవాడలోని ఆంధ్రరత్న భవనాన్ని రిజర్వు పోలీసుల స్వాధీనంనుంచి పునరాక్రమించడానికి ప్రయత్నించిన కాంగ్రెస్ కార్యకర్తల దళంలో చేరి, తీవ్రమైన లాఠీఛార్జీకి గురయ్యారు. అనంతరం అరెస్టు చేసి, ఆరు నెలల కఠినశిక్ష విధించారు. బళ్ళారి జైలులో శిక్ష అనుభవించారు.

## తోటకూర వెంకటేశ్వరరావు

తండ్రి వెంకటప్పయ్య జన్మస్థలం గన్నవరం తాలూకా కాటూరు. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 3-12-1932న సంవత్సరం రెండున్నరనెలలకఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్షఅనుభవించారు. 25-2-1933 న విడుదలయ్యారు.

## వార్ల సీతారామయ్య

తండ్రి సుబ్బయ్య. గన్నవరం తాలూకా కాటూరు వాస్తవ్యులు రైతు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొనగా లాఠీచార్జీకి గురి అయ్యారు. 3-12-32 న ఒక సంవత్సరం రెండున్నరమాసాలు కఠినశిక్ష విధింపబడింది. రాజమండ్రి, బళ్ళారి జైలులో శిక్ష ననుభవించారు 17-6-33 న విడుదలయ్యారు.

## వాదెళ్ళ కుటుంబయ్య

తండ్రి అప్పయ్య కాటూరులో జన్మించారు. రైతు. విదేశవస్త్ర బహిష్కరణ, మద్యపాన నిషేధ ఉద్యమాల్లో పాల్గొని లాఠీ దెబ్బలకు గురయ్యారు 3-12-1932 న ఒక సంవత్సరం రెండున్నర మాసాలు కఠినశిక్ష విధింపబడగా రాజమండ్రి, బళ్లారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 17-6-1931 న విడుదల చేయబడ్డారు. 1971 లో తన 60 వ ఏట కీర్తిశేషు అయ్యారు.

## వాదెళ్ళ వెంకటప్పయ్య

గన్నవరం తాలూకా కాటూరు వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నందుకు లాఠీచార్జీకి గురయ్యారు.

## వాదెళ్ళ పూర్ణానందం

జన్మస్థలం గన్నవరం తాలూకా కాటూరు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని లాఠీఛార్జీకి గురయ్యారు.

## వెలగా బసవపూర్ణయ్య

తండ్రి కిష్టయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా కాటూరు. 1930 మే నెలలో 50 మంది విద్యార్థుల దళంలో చేరి, స్వగ్రామంలో తాటికల్లు గెలలు నరికి, అరెస్టు అయ్యారు. రు. 100/- జరిమానా విధించారు. ప్రస్తుత నివాసం ఖమ్మం జిల్లా భద్రాచలం.

## వేములపల్లి వెంకట సుబ్బయ్య

తండ్రి నాగయ్య. గన్నవరం తాలూకా కాటూరు వాస్తవ్యులు. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 7-6-'30 న 7 నెలల శిక్ష విధించబడింది. రాజమండ్రి, కోరాపుట్టి జైళ్ళలో శిక్షను అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 3 12-32 న సంవత్సరం రెండున్నర మాసాల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్షను అనుభవించారు. 28-8-'33న విడుదలయ్యారు.

## మన్నె వీరయ్య



తండ్రి పెద కిష్టయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా కాటూరు. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని, 12-11-30 నుంచి ఆరునెలల కఠిన శిక్షను రాజమండ్రి. బరంపురం జైళ్ళలో అనుభవించారు.

## మన్నే కనకయ్య



తండ్రి నరసింహయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా కాటూరు. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని లాఠీచార్జీకి గురయ్యారు 3-12-1932 న సంవత్సరం రెండున్నర మాసాల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. 17-6-1933 న విడుదలయ్యారు.

## మాకినేని వీరరాఘవయ్య

తండ్రి కోటయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా కాటూరు. 1930 మే నెలలో 50 మంది విద్యార్థుల దళంలో చేరి, తాటికల్లు గెలలను నరికి అరెస్టు అయ్యారు. రు. 100/- జరిమానా విధించారు.

## యార్లగడ్డ లక్ష్మయ్య

స్వగ్రామం గన్నవరం తాలూకా కాటూరు. 1930 మే మాసంలో 50 మంది విద్యార్థుల దళంలో చేరి, స్వగ్రామంలో తాటికల్లు గెలలు నరికి అరెస్టు అయ్యారు. రు 100/- జరిమానా విధించారు.

## రావులపల్లి సత్యనారాయణ

తండ్రి కోటయ్య గన్నవరం తాలూకా కాటూరు వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నందుకు 7-6-30 న ఏడు నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, కోరాపుట్టి జైళ్ళలో శిక్షను అనుభవించారు.

## వెల్లంకి నరసింహారావు



తండ్రి వీరయ్య. స్వగ్రామం కాటూరు. 1916 లో జన్మించారు. రైతు. విజయవాడలోని ఆంధ్రరత్న భవనాన్ని పోలీసులు స్వాధీనం నుంచి విముక్తి చేయడానికి జరిపిన సత్యాగ్రహంలో పాల్గొని లాఠీ దెబ్బలకు గురయ్యారు. 3-12-1932 న ఒక సంవత్సరం కఠిన శిక్ష రు. 125 లు జరిమానా విధించబడింది. 14-12-1932న ఇంటికి సీలువేసి వీరి తండ్రిగారి వద్ద రు. 125 లు నిర్బంధంగా వసూలు చేశారు. 3-12-1932 నుంచి రాజమండ్రి, బళ్ళారి సెంట్రల్ జైళ్ళలో శిక్ష అనుభవించారు. 17-6-1933 న విడుదల చేయబడ్డారు. జైలు జీవితం కారణంగా ఆరోగ్యం చెడి, మదనపల్లి శానిటోరియంలో కొన్నాళ్ళు చికిత్స పొందారు.

# గన్నవరం తాలూకా వివిధ గ్రామాలు

## అట్లూరి బ్రహ్మానందం

తండ్రిహరయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా ఆత్కూరు. చిన్న వయస్సులోనే ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 16-6-1930 న రెండేళ్ళ కఠిన శిక్ష విధింపబడింది. తంజావూరు బోర్‌స్టల్ స్కూలులో శిక్ష అనుభవించారు. 18-2-1931 న విడుదలయ్యారు.

## అట్లూరు వెంకట సుబ్బారావు

తండ్రి కృష్ణయ్య. 1913 డిసెంబరు 6 న గన్నవరం తాలూకా ఆత్కూరులో జన్మించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు.

## అన్నం నరసయ్య

తండ్రి వెంకటస్వామి. జన్మసలం గన్నవరం తాలూకా మానికొండ. రైతు. నిజాం ప్రభుత్వం నిషేధించిన 'ఆంధ్రప్రభ' పత్రిక ప్రతిని కల్గి

వున్నందుకు, 1947-48 నిజాం వ్యతిరేక పోరాట కాలంలో మాజీ హైదరాబాద్ సంస్థానంలో అరెస్టు చేసి, డి హెచ్. ఆర్. క్రింద ఒక నెల జైలుశిక్ష విధించారు.

## అయాచితుల సీతారామస్వామి

తండ్రి వెంకట గోపాలశాస్త్రి. గన్నవరం తాలూకా పెదవుటపల్లి వాస్తవ్యులు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొనగా 3-3-41 నుండి ఐదున్నర నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. రు 5 జరిమానా కూడా వీరివద్ద వసూలు చేశారు.

## అరుమళ్ళ సుబ్బారెడ్డి

తండ్రి కోటిరెడ్డి. తేలప్రోలులో 15-8-1909లో జన్మించారు. 1932 లో శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొని 6 మాసాలు జైలు శిక్ష అనుభవించారు. హరిజనోద్ధరణకు, గ్రంథాలయ ఉద్యమ ప్రచారానికి పాటుపడ్డారు. 1933 లో జిల్లా కాంగ్రెస్ సంఘ సభ్యులుగా వున్నారు. కలికాల వేదాంతం, హిందూ జాతి పతన కారణాలు అనే పుస్తకాలు రచించారు ప్రస్తుత నివాసం గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా గణపవరం.

## ఆరెకపూడి వెంకటరామయ్య

గన్నవరం తాలూకా వుయ్యూరు వాస్తవ్యులు. "హిందూ" పత్రిక విలేకరి. 1940-41 వ్యష్టి సత్యాగ్రహ ఉద్యమ కాలంలో ప్రభుత్వోద్యోగులను రాజీనామా చెయ్యవలసిందిగా కోరుతూ ఉన్న పత్రాలు ఉన్నందుకు డి. ఐ. ఆర్ క్రింద శిక్షింపబడ్డారు.

## ఆరెకపూడి రమేష్ చౌదరి

తండ్రి వెంకట్రామచౌదరి. జన్మస్థలం గన్నవరం తాలూకా కొడవకల్లు. జర్నలిస్టు. సుప్రసిద్ధ హిందీ నవలా రచయిత. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో హిందీ, ఇంగ్లీషు భాషలలో తిరుగుబాటు చేయమని పురిగొల్పే బ్రిటిష్ వ్యతిరేక కరపత్రాలు కలిగి వున్నందుకు 1-10-1942 న అరెస్టు చేసి, శిక్ష విధించారు. తిరిగి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 25-2-1943 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## ఇందుపల్లి ఆశీర్వాదం



గన్నవరం తాలూకా మానికొండ గ్రామ వాస్తవ్యులు. 1942 లో నౌకా దళంలో చేరారు. 1946 ఫిబ్రవరి లో బొంబాయి, కొచ్చిన్, విశాఖపట్టణం నౌకా కేంద్రాలలో తిరుగుబాట్లు జరిగాయి. విశాఖలో నౌకపై వున్న బ్రిటిష్ జెండా దించి, కాంగ్రెస్ జెండా ఎగురవేశారు. 600 మంది నావికులు ఊరేగింపు జరుపుతూ, కనబడిన బ్రిటిష్ ఆఫీసర్ల చే టోపీ తీయించి, జైహింద్ అనిపించారు. తరువాత వాల్తేరు రైల్వేస్టేషను ఆవరణను దుర్గంగా చేసుకొన్నారు. తెల్లవారుఝామున నావికులు బైటకు రాగానే మిలటరీ చుట్టుముట్టి, విశాఖపట్టణం సెంట్రల్ జైలులో వుంచి, తిరుగుబాటు అణచివేసి, మూడురోజుల తర్వాత వీరిని వదలివేశారు. ఆ తిరుగుబాటులో ఇందుపల్లి ఆశీర్వాదం పాల్గొన్నారు.

## ఇవటూరి సానందరావు

గన్నవరం తాలూకా పెడిముక్కల వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొని లాఠీ దెబ్బలకు గురయ్యారు. 1932 జనవరిలో జాతీయ పతాక వందనోత్సవం జరుపగా, వీరిని పోలీసులు బెత్తాలతో కొట్టి, వీరి యిల్లు సోదా చేశారు.

## ఈడుప్పగంటి రామకోటయ్య

జన్మస్థలం గన్నవరం తాలూకా నందమూరు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని అరెస్టు అయ్యారు. 26-6 1930 న రెండు సంవత్సరాల కఠిన శిక్ష విధించారు. శాసనోల్లంఘనోద్యమంలో 4-7-1932న తీవ్రమయిన లాఠీచార్జీకి గురయ్యారు. 1932లో గుంటూర్లో జరిగిన ఆంధ్ర రాజకీయ మహాసభలో పాల్గొన్నారు.

## కంఠంనేని వెంకట కృష్ణయ్య

తండ్రి సూరయ్య. గన్నవరం తాలూకా పెడిముక్కల వాస్తవ్యులు. రైతు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 23-3-1932 న అరెస్టు అయ్యారు. 24-3-1932 న రు. 500 జరిమానా, చెల్లించకపోతే 45 రోజులు కఠిన శిక్ష విధింపబడింది. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. బెజవాడలో గాంధీజయంతి సందర్భంగా లాఠీఛార్జీకి గురయ్యారు.

## కానూరి వెంకట సుబ్బారావు

తండ్రి సుందరరామయ్య. గన్నవరం తాలూకా ఆత్కూరులో 1901 ఫిబ్రవరిలో జన్మించారు. గుడివాడ తాలూకా, కొత్తవరం వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు.

## కాకాని వెంకటరత్నం



తండ్రి తాతయ్య. గన్నవరం తాలూకా ఆకునూరులో 1900 ఆగస్టు 3న జన్మించారు. రైతు. 1323లో కాకినాడలో జరిగిన ఆలిండియా కాంగ్రెస్ సమావేశంలో కాంగ్రెస్ వలంటీరుగా పాల్గొన్నారు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నందుకు 27-6-30న రెండేళ్ళ కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒడంబడికననుసరించి 14-3-31 న విడుదలయ్యారు. 1932లో శాసనోల్లంఘనోద్యమ కాలంలో "3వ డిక్టేటర్"గా నియమించబడ్డారు. ఆరు నెలల కఠిన శిక్ష, రు. 200 జరిమానా విధించబడింది. రాజమండ్రి జైల్లో శిక్షననుభవించారు. హరిజన దేవాలయ ప్రవేశం, మునగాల లింగగిరి పరగణాలలో జమీందారీ రైతు ఉద్యమంలో పాల్గొన్నారు. పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ కార్యదర్శిగాను, అధ్యక్షులుగాను పనిచేశారు. 1941 - 42 లో గ్రామాల్లో యుద్ధ వ్యతిరేక ప్రచారం చేశారు. క్విట్ ఇండియా ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. 10-9-42 నుండి 4-9-45 వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డెటిన్యూగాఉన్నారు. జిల్లా బోర్డు అధ్యక్షులుగా పనిచేశారు. ఏ. పి. ఆర్. టి. సి. నేషనల్ వర్కర్స్ యూనియన్‌కు అధ్యక్షులుగా, ఏడు జిల్లాల భారత సేవక్ సమాజ్ కన్వీనర్‌గా వుండేవారు. 1955, 1962, 1968, 1972లలో శాసనసభకు ఎన్నికయ్యారు. రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శిగాను, అధ్యక్షులుగాను పనిచేశారు. బ్రహ్మానందరెడ్డి, పి. వి. నరసింహారావు మంత్రివర్గాలలో వ్యవసాయ మంత్రిగా వున్నారు. "ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర ఉద్యమం" నడుపుతున్న సందర్భంలో విజయవాడలో గుండెపోటుతో 1972 డిసెంబరు 25 న కీర్తిశేషులయ్యారు.

## కారుమూడి సుబ్బారెడ్డి

తండ్రి పరశురామయ్య. గన్నవరం తాలూకా తేలప్రోలు వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. ఆరు నెలల శిక్ష రు. 50 జరిమానా విధింపబడింది. రాజమండ్రి జైల్లో శిక్షను అనుభవించారు.

## కొడాలి శ్రీరాములు



తండ్రి వెంకటరత్నం. నివాసం మర్రివాడ. రైతు. ఉప్పు సత్యాగ్రహం, శాసనోల్లంఘన ఉద్యమాలలో పాల్గొన్నారు. 23-6-30 నుంచి 4 మాసాలు రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 22-10-30న విడుదలయ్యారు. 23-2-32 నుండి ఆరు నెలల ఆరు వారాలు రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 4-10-32 న విడుదలయ్యారు.

## కొల్లిపర లక్ష్మీకాంతమ్మ

తండ్రి తాతినేని చిన్నకోటయ్య. కుమ్మమూరు. భర్త వీరయ్య. కాకినాడ కాంగ్రెసుకు మహిళా వలంటీరుగా వెళ్లారు. గాంధీజీ ఆంధ్రరాష్ట్ర పర్యటన చేసినపుడు

జత బంగారు గాజులు (3 నవర్సులు) ఇచ్చారు. 1932 లో బందరులో ఒక వారం సబ్ జైలులో వున్నారు. కల్లు దుకాణాల వద్ద పికిటింగు చేస్తూ ముదునూరులో 1-4-32 న అరెస్టు చేయబడ్డారు. 2-5-1932 నుంచి6మాసాలుశిక్షరాయవెల్లూరుజైలులో అనుభవించారు. 1-11-32 న విడుదలయ్యారు. 1933-35 మధ్య కాలంలో జిల్లా కాంగ్రెస్ సంఘ సభ్యులు 1940, 1942 కాంగ్రెస్ వుద్యమాలలో కూడా పాల్గొన్నారు. శిక్ష అనుభవించారు మహిళా సంఘాలలో పని చేశారు.

## కోగంటి లక్ష్మమ్మ

తండ్రి కంఠంనేని సూరయ్య. సుబ్బయ్యగారి పత్ని. స్వగ్రామం గన్నవరం తాలూకా పమిడి ముక్కల. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొని ఆడ పోలీసులచే మోదబడ్డారు 26-4-1932 న ఆరు నెలల శిక్ష. రు. 200 జరిమానా విధించబడింది. జరిమానా వసూలు కానందున ఇల్లు స్వాధీనం చేసుకొని తిరిగి యిచ్చివేశారు. మొత్తం ఆరు నెలల ఆరువారాల కఠిన శిక్ష వెల్లూరు జైలులో అనుభవించారు.

## కోగంటి రాఘవమ్మ

స్వస్థలం గన్నవరం తాలూకా పమిడిముక్కల. శాసనోల్లంఘనోద్యమంలో కాంగ్రెస్ కరపత్రాలు పంచుతుండగా, 12-4-1932 న ఆడ పోలీసులు జరిపిన లాఠీఛార్జీకి గురయ్యారు.

## కోనేటి అనసూయ

తండ్రి వెంకట్రామయ్య. జన్మస్థలం తేలప్రోలు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొని, 22-1-1932 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు.

## గుంటక పుల్లారెడ్డి



తండ్రి మల్లారెడ్డి. జననం 25-10-1915 గన్నవరం తాలూకా తేలప్రోలు. తన 15వ ఏట ఉప్పుసత్యాగ్రహ కాలంలో తయారు చేసిన ఉప్పు కొనడం ద్వారా రాజకీయాలలో ప్రవేశించారు. గాంధీజీ ప్రభావానికిలోనై ఖాదీఅమ్మకం, హరిజనసేవా కార్యక్రమాలలోపాల్గొన్నారు. 1938హరిపురకాంగ్రెసుమహాసభ ప్రతినిధి. 1938-39 లో రాష్ట్ర కాంగ్రెసు సంఘ సభ్యులు. నిషిద్ధ సాహిత్యం కలిగి వున్నారన్న కారణంపై 5-3-1942 న అరెస్టు చేసి, ఆరు నెలల కఠిన శిక్షను విధించారు. అలీపురం, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. అతివాద రాజకీయాలవైపు మొగ్గి, కమ్యూనిస్టుపార్టీలో చేరి, ప్రజా సంఘాల నిర్మాణంలో చురుకుగా పాల్గొన్నారు. ప్రస్తుతం మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ సభ్యులు. జిల్లాస్వాతంత్ర్య సమర యోధుల సంఘం కార్యవర్గ సభ్యులు.

## గద్దె రామకోటేశ్వరరావు

తండ్రి పాపయ్య. జన్మస్థలం గన్నవరంతాలూకా ఇందుపల్లి. విశాఖపట్నంలో వైద్య విద్య నభ్యసిస్తుండగా డి. ఐ. ఆర్ క్రింద అరెస్టు అయ్యారు. 23-1-1941 నుంచి 25-7-1941 వరకు వెల్లూరు జైలులోను, అనంతరం రాజమండ్రి జైలులోను డిటెన్యూగా వున్నారు.

## గారపాటి రామశాస్త్రులు

తండ్రి నాగభూషణం. జన్మస్థలం గన్నవరం తాలూకా ఆరుగొలను. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో డి.ఐ.ఆర్. క్రింద అరెస్టుఅయి, 20-1-1943 నుంచి 13-3-1944 వరకు వెల్లూరు. తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా వున్నారు.

## గాదె సుబ్బమ్మ



భర్త సూరారెడ్డి. 20-8-1908లో జన్మించారు. జన్మస్థలం యాకమూరు. 1931 లో సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనగా, గుంటూరులో అరెస్టు చేయబడి సబ్‌జైలులో 10 రోజులు వున్నారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ఫలితంగా విడుదల చేయబడ్డారు. 1932 లో విదేశ వస్త్ర బహిష్కరణ, కల్లు దుకాణాల వద్ద పికెటింగ్‌లలో నెలరోజులు పాల్గొన్నారు. కొమ్మమూరులో అరెస్టుచేసి విజయవాడలో ఒకసంవత్సరం కఠిన శిక్ష విధించగా రాయవెల్లూరు, మద్రాసు సెంట్రల్ జైళ్ళలో శిక్ష అనుభవించి 22-1-1933 న విడుదలయ్యారు.

## గుత్తికొండ రామయ్య

తండ్రి కంఠంనేని సోమయ్య. బ్రహ్మయ్యగారి పత్ని. స్వగ్రామం గన్నవరం తాలూకా వమిడి ముక్కల. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 25-4-1932 న ఆరు నెలల కఠిన శిక్ష. రు. 200/- జరిమానా విధించబడింది. వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు.

## గుళ్లపల్లి నాగయ్య

తండ్రి వెంకయ్య. జన్మస్థలం గన్నవరంతాలూకా మేడూరు. రైతు. 1920 నుంచి కాంగ్రెస్‌కార్యకర్తగా పనిచేశారు. దేశ సేవలో ప్రాణాలర్పించిన యోధులు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 17-6-1930న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి.తిరుచునాపల్లి జైళ్ళ లో శిక్ష అనుభవించారు. తిరుచునాపల్లి జైలులో శిక్ష అనుభవిస్తూనే, అక్కడే అసువులు కోల్పోయారు. విదేశీ వస్తు బహిష్కరణకూ, వయోజన విద్యా వ్యాప్తికి పాటుబడ్డారు. మేడూరులో గ్రంథాలయం నెలకొల్పారు.

## గుళ్లపల్లి సుబ్రహ్మణ్యం

తండ్రి రామయ్య. గన్నవరం తాలూకా మేడూరు వాస్తవ్యులు. శాసనోల్లంఘన ఉద్యమం సందర్భంగా కరపత్రాలు పంచి నందుకు 13-4-1932న లాఠీఛార్జీకి గురి అయ్యారు విజయవాడ, జుఝువరంలలో శాసనోల్లంఘనోద్యమకాలంలో తీవ్రంగా లాఠీచార్జీకి గురి అయ్యారు. కాంగ్రెస్ జెండా మేడూరులో కట్టినందుకు లాఠీ దెబ్బలకు గురయ్యారు.

## గూడపాటి వెంకట సుబ్బయ్య



తండ్రి పున్నయ్య. పొట్టిపాడులో 1900 సం॥లో జన్మించారు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా 7-8-1930 తేదీన ఒక సంవత్సరం శిక్ష విధింపబడింది. రాజమండ్రి, బరంపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## చలమలశెట్టి కోటేశ్వరరావు

తండ్రి రామయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా కానుమోలు. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని అరెస్టు అయ్యారు. 2-7-1930 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. సంవత్సరం కఠిన శిక్ష, రు 100/- జరిమానా విధించారు.

## చింతమనేని శ్రీరాములు



తండ్రి కోటయ్య. గన్నవరం తాలూకా ఎలుకపాడు వాస్తవ్యులు. విద్యార్థిగా ఉన్నపుడే ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 26-6-1930 నరెండేళ్ళ కఠిన శిక్ష విధించబడింది. తంజావూర్

బోర్‌స్టల్‌స్కూలు, రాజమండ్రి జైళ్ళలో శిక్ష ననుభవించారు. 18-2-31 న విడుదలయ్యారు

## చెరుకూరి కాళహస్తేశ్వరశర్మ



తండ్రి త్రియంబకం. జన్మస్థలం గన్నవరం తాలూకా పెడి కొండల పాలెం. రైతు. ఉప్పు సత్యాగ్రహంలోపాల్గొన్నారు 19-6 1930 న సంవత్సరం కఠిన శిక్షవిధించారు రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ – ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931 న విడుదలయ్యారు

## జంధ్యాల రాధాకృష్ణమూర్తి

తండ్రి వెంకట సూర్యనారాయణ. జన్మస్థలం గన్నవరం తాలూకా బాచిమంచివారిపాలెం. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు.

## జాలాది సత్యనారాయణ

తండ్రి పిచ్చయ్య. గన్నవరం తాలూకా ఇందుపల్లి వాస్తవ్యులు. ఉప్పుసత్యాగ్రహ ఉద్యమంలో 7-8-30న సంవత్సరం కఠిన శిక్ష విధింపబడింది. రాజమండ్రి, బరంపురం జైళ్ళలో శిక్ష ననుభవించారు.

## జాలాది పార్థసారథి ఉరఫ్ పార్థుడు

తండ్రి వెంకటప్పయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా ఇందుపల్లి. యుద్ధవ్యతిరేక కమ్యూనిస్టుపార్టీ సాహిత్యం కలిగివున్నందుకు గుంతకల్లులో అరెస్టు చేశారు. 24 9-1941 న గుత్తి సబ్ డివిజనల్ మేజస్ట్రేట్ రెండేళ్ళు కఠిన శిక్ష విధించారు. అలీపురం, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. 2-7-1942 న విడుదలయ్యారు.

## తలశిల గోపాలరావు

తండ్రి నారయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా నందమూరు. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, 22-5-1930 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు.

## దండమూడి పట్టాభిరామయ్య

గన్నవరం తాలూకా పెనుమత్స. బందరులో 8-1-1930 న అప్పటి మద్రాసు గవర్నరు రాకకు నిరసనగా నల్లజెండాల ప్రదర్శనలో పాల్గొని అరెస్టు అయ్యారు.

## దండమూడి పూర్ణయ్య చౌదరి



తండ్రి నాగయ్య. గన్నవరం తాలూకా పెనుమత్స నివాసి. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. తాటిచెట్లు నరికినందుకు 10-7-30 నుంచి 6 నెలల 2 వారాల కఠిన శిక్ష రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## దొనవల్లి సూర్యనారాయణ

తండ్రి వెంకటరత్నం. గన్నవరం తాలూకా నందమూరు వాస్తవ్యులు. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 22-5-30 న ఆరు నెలల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, కోరాపుట్టి జైళ్ళలో శిక్షను అనుభవించారు.

## దోనేపూడి వెంకట సుబ్బయ్య



తండ్రి వెంకయ్య. 1916 ప్రాంతంలో జననం. గన్నవరం తాలూకా కొయ్యగూరపాడు వాస్తవ్యులు. రైతు క్విట్ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 31-5-43 నుండి 18 నెలల శిక్షను అలీపురం క్యాంపు జైల్లో అనుభవించారు.

## ఎస్. ఆదినారాయణశర్మ

తండ్రి వెంకటేశ్వర్లు. జన్మస్థలం గన్నవరం తాలూకా ఉయ్యూరు. విద్యార్థి దశలో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 22-2-1943 నుంచి రెండు నెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## నంబూరు శ్రీనివాసరావు

తండ్రి లక్ష్మయ్య. గన్నవరం తాలూకా బండారు గూడెం వాస్తవ్యులు. బ్రిటిష్‌లో యుద్ధ ప్రయత్నాలకు, డబ్బుగానీ, మనుష్యుల్నిగానీ పంపి సహాయ పడవలదని, వేల్పూరు, పెడికొండలపాలెంలలో హరికథల ద్వారా ప్రచారం చేసినందుకు 20-3-41 న సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. 11-2'-42 న విడుదలయ్యారు. తిరిగి 14-2-42 న భారత రక్షణ నిబంధనల క్రింద డిటెన్ చేయబడ్డారు. వెల్లూరు, రాజమండ్రిలలో డిటెన్యూగా వున్నారు. ఒకసారి శాసనసభకు ఎన్నికయ్యారు.

## నండూరి ప్రసాదరావు

తండ్రి జానకిరామయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా ఆరుగొలను. యుద్ధ వ్యతిరేక చర్యలలో పాల్గొని 8-1-1941 న అరెస్టయ్యారు. విజయవాడ జాయింట్ మెజిస్ట్రేటు ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించారు. అలీపురం, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. బెనారస్ హిందూ యూనివర్శిటీలో చదువు తున్నప్పుడు కమ్యూనిస్టు భావాలు అలవర్చుకున్నారు. రైతు, కార్మిక, వ్యవసాయ కార్మిక సంఘాల నిర్మాణానికి గణనీయమైన కృషి చేశారు. మునగాల రైతు ఉద్యమ నిర్మాతలలో ఒకరు. పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ కమిటీ నియమించిన, మునగాల జమీన్ రైతుల విచారణ కమిటీలో సభ్యులు. 1939 లో మునగాల జమీందారు వ్యతిరేక సత్యాగ్రహ దళాన్ని నడిపారు. ఈ సందర్భంగా 1939 లో ఒక సంవత్సరం కఠిన శిక్ష విధింపబడింది. తెలంగాణా నిజాం వ్యతిరేక పోరాటం లో పాల్గొన్నారు. ప్రజా సమస్యలపై అనేక గ్రంథాలు రచించారు. మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథాలను అనువదించారు. రాష్ట్ర రైతు సంఘ కార్యదర్శిగా పని చేశారు. అఖిల భారత కిసాన్ సభ కార్యకలాపాల్లో ప్రముఖ పాత్ర వహించారు. ప్రస్తుతం కార్మిక సంస్థ C. I. T. U. రాష్ట్ర కార్యదర్శిగా పని చేస్తున్నారు.

## నూతల వీరరాఘవయ్య (ఉరఫ్ శ్రీమతే)



తండ్రి శ్రీరాములు. జన్మస్థలం గన్నవరం తాలూకా కొనుమోలు. జననం 5-6-1894. 1921 సహాయ నిరాకరణంలో తన గ్రామోద్యోగి పదవికి రాజీనామా యిచ్చారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 26-5-1930 న సంవత్సరం కఠిన శిక్ష, రు. 150/- జరిమానా విధించారు. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. రాజమండ్రి జైలులో 15-6-1930న తీవ్రమైన లాఠీచార్జీకి గురయ్యారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 12-3-1931 న విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని, 9-1-1932 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, బళ్ళారి, మద్రాసు జైళ్ళలో అనుభవించారు. ఒక పర్యాయం శాసనసభకు ఎన్నికయ్యారు. 18-2-1978 లో కీర్తి శేషులైరి.

## పాకలపాటి వెంకటరత్నం



తండ్రి వెంకయ్య. నివాసం పొట్టిపాడు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. కల్లు దుకాణాల వద్ద పికెటింగు చేస్తుండగా అరెస్టు అయ్యారు. 7-8-30 న ఒక సంవత్సరంకఠిన శిక్ష విధింపబడగా రాజమండ్రి,బరంపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## పాలడుగు సుబ్బారాయ చౌదరి

తండ్రి వెంకట కృష్ణయ్య. గన్నవరం తాలూకా గురజాడ వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష ననుభవిస్తుండగా గాంధీ-ఇర్విన్ ఒడంబడికను అనుసరించి 14-3-1931 న విడుదలయ్యారు.

## పాలడుగు సుబ్బారావు



తండ్రి వెంకట కృష్ణయ్య. 1893 లో జన్మించారు. గన్నవరం తాలూకా గురజాడ వాస్తవ్యులు. "హోమ్ రూల్ లీగ్" ఉద్యమంలో పాల్గొన్నందుకు 1914 లో లాఠీ దెబ్బలకు గురయ్యారు. పాఠశాల నుండి సస్పెండ్ చేయబడ్డారు. 1920 లో కాంగ్రెస్‌లో చేరారు. 1922 లో రాయలసీమలో లాఠీ దెబ్బలకు గురి అయ్యారు. కొన్నాళ్ళు పోలీస్ కష్టడీలో వున్నారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో సంవత్సరం శిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచునాపల్లి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1932 లో "రెడి" అనే రహస్య సైక్లోస్టయిల్ పత్రిక ముద్రణ, పంపిణీ లో పాల్గొన్నారు. కలకత్తా కాంగ్రెసుకు వెళ్ళినపుడు కొన్నాళ్ళు డిటెన్షన్‌లో వుంచారు. ఉపాధ్యాయుడు. నాటక రచయిత. నటుడు. 1961 లో కేంద్ర హోం మంత్రి శ్రీ గోవింద వల్లభపంత్ నుండి రు 500 బహుమతి పొందారు. "ఆత్మార్పణ" గ్రంథ రచయిత. 1966 లో కీర్తిశేషులయ్యారు.

## పాలడుగు సూర్యనారాయణ



తండ్రి వెంకట కృష్ణయ్య. గన్నవరం తాలూకా గురజాడ వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 16-5-30 నుండి తొమ్మిదిన్నర నెలల కఠినశిక్ష విధింపబడింది. రాజమండ్రి, వెల్లూరు, అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించారు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో లాఠీచార్జీకి గురి అయ్యారు.

## పాలడుగు వరలక్ష్మమ్మ



తండ్రి చిగులూరు వెంకయ్య. భర్త వెంకట సుబ్బారావు. జననం 1905 లో. నివాసం గన్నవరం తాలూకా గురజాడ. 1931 లో విదేశ వస్త్ర దహనంలో పాల్గొన్నారు. విదేశ వస్త్రాల దుకాణాలముందు పికెటింగు చేస్తుండగా రంగునీళ్ళు బురదనీళ్ళు కొట్టగా స్పృహతప్పి పడిపోయారు. 27-3-32 న ఉయ్యూరులో అరెస్టుచేసి బందరు తీసుకువెళ్ళి లాకప్‌లో వుంచారు. అక్కడ ఆడ పోలీసులచేత సోదా చేయించి, ఆమెవద్ద డబ్బు లేకుండాచేసి రాత్రివేళ వదిలేశారు. ముదునూరు తిరునాళ్ళలో కాంగ్రెస్ జెండా ప్రతిష్ఠాపన చేసినందుకు అరెస్టుచేసి నూజివీడులో వదిలేశారు. ఆ తరువాత అరెస్టుచేసి గుడివాడ సబ్‌జైలులో 4 రోజులు, కైకలూరు సబ్‌జైలులో 45 రోజులు వుంచి ఆరు మాసాల గర్భిణిగా వున్న ఈమెకు 6 మాసాల కఠిన శిక్ష, రు. 100 లు జుల్మానా (జుల్మానా చెల్లించకపోతే మరో నెల శిక్ష) విధించారు. జుల్మానా చెల్లించనందున మొత్తం 7 మాసాలు కఠిన శిక్ష 2-5-1932 నుంచి రాయవెల్లూరు జైలులో అనుభ

వించారు. శిక్ష కాలంలో ఆడపిల్లను ప్రసవించారు. (ఆ బిడ్డే ఇప్పటి యలమంచిలి వెంకాయమ్మగారు) వరలక్ష్మమ్మగారు 1948 లో కీర్తిశేషులయ్యారు.

## పాలడుగు సత్యనారాయణ

గన్నవరం తాలూకా గురజాడ వాస్తవ్యులు. శాసనోల్లంఘన ఉద్యమ కాలంలో అఖిలభారత ఖైదీల దినోత్సవం జరిపినందుకు వీరిని 4-7-32 న స్మృతి తప్పేవరకు లాఠీచార్జి చేశారు.

## పిడికెటి పూర్ణచంద్రరావు



తండ్రి రామయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా కొయ్యగూరపాడు. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు. 31-5-1943 న డి. ఐ. ఆర్. క్రింద 18 నెలల కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## పెండ్యాల వెంకటేశ్వరరావు



తండ్రి కోటయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా ముస్తాబాదా. రైతు. చదువుకున్న స్త్రీ చెప్పే జాతీయోద్యమంలో ప్రవేశించారు. కాంగ్రెసుకార్యకర్తగా కృషి చేస్తూ, రైతు సంఘాలను నిర్మించారు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘసభ్యులుగా ఎన్నికయ్యారు. కృష్ణాజిల్లా ఫార్వార్డుబ్లాక్ కార్యదర్శిగా పనిచేశారు. యుద్ధవ్యతిరేక కాలంలో పోలీసులు దాడిచేసి,ఆయన ఇంటిని సోదా చేశారు. 15 రోజులు సబ్ జైలు నిర్బంధంలో వున్నారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో రహస్య జీవితం గడిపారు.

## పొట్లూరు గోపాలరావు



తండ్రి వీరయ్య. గన్నవరం తాలూకా గుడిగుంటపాలెం వాస్తవ్యులు. తన 17వ ఏట విజయవాడలో కల్లు పాకల వద్ద పికెటింగ్ చేశారు. గుంటూరులో పికెటింగ్ చేసినపుడు లాటి దెబ్బలకు గురయ్యారు. 10-8-1932 నుండి 13-6-1933 వరకూ రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## పోతినేని చిన్న వెంకటేశ్వరరావు

తండ్రి బ్రహ్మయ్య. జన్మస్థలం కొయ్యగూరపాడు. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టుఅయి 31-5-1943 నుంచి 4-10-1943 వరకు అలీపురం జైలులో కఠిన శిక్ష అనుభవించారు.

## పోలిమెట్ల వెంకట రామశేషయ్య



తండ్రి వెంకటరామయ్య. జననం. 1919 గన్నవరం తాలూకా ఎలుకపాడు. బొంబాయిలో 1941 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొనగా, థాణా జైలులో అయిదు నెలలపాటు డిటైన్ చేశారు. 1943 ఫిబ్రవరి 10 న గాంధీజీ ప్రారంభించిన నిరాహారదీక్ష సందర్భంలో పూనాలో తిరిగి అరెస్టు అయి, 3 నెలల శిక్ష అనుభవించారు.

## పోలవరపు వెంకట సుబ్బారావు



తండ్రి శోభనాద్రి. గన్నవరం తాలూకా చోరగుడి వాస్తవ్యులు. ఆయుర్వేద వైద్యులు. క్విట్ ఇండియా ఉద్యమంలో బ్రిటిష్ ప్రభుత్వ వ్యతిరేక చర్యలు సాగించవలసిందిగా ఉద్బోధించారు. శాసనోల్లంఘనోద్యమాన్ని బలపరచే కాంగ్రెసు ఆశయాల గురించి ప్రచారం చేశారు. 31-10-42 నుండి సంవత్సరం కఠిన శిక్షను అలీపురం క్యాంప్ జైలులో అనుభవించారు.

## బెజవాడ వెంకట సుబ్బారావు

తండ్రి వెంకట కృష్ణయ్య. మద్రివాడలో 17-7-1917 లో జన్మించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని రైలు పట్టాలు తొలగించినందుకు 29-5-1943 లో శిక్షపడి 15 మాసాలు ఆలీపూర్ క్యాంపు జైలులో శిక్ష అనుభవించారు.

## మల్లాది రామచంద్రశాస్త్రి

తండ్రి దక్షిణామూర్తిశాస్త్రి. జన్మస్థలం గన్నవరం తాలూకా కనకవల్లి విద్యార్థి దశలోనే ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 26-6-1930 న రెండు సంవత్సరాల కఠిన శిక్ష విధించారు. తంజావూరు బోర్‌స్టల్ స్కూలులోను, రాజమండ్రిలోను శిక్ష అనుభవించారు. 18-2-1931 న ప్రభుత్వం విడుదల చేసింది. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, శిక్ష అనుభవించారు.

## మల్లాది సూర్యనారాయణశాస్త్రి

తండ్రి దక్షిణామూర్తి శాస్త్రి. గన్నవరంతాలూకా కనకవల్లి వాస్తవ్యులు. 1940 - 41 యుద్ధ వ్యతిరేక ఉద్యమంలో పన్నులు చెల్లించవద్దని ప్రజలను రెచ్చగొట్టే ఉపన్యాసాలిచ్చారంటూ డి. ఐ. ఆర్. క్రింద శిక్షించబడ్డారు. 40 సంవత్సరాల పైగా నాటక రంగంలో వివిధ ప్రాంతాలలో నటించి ప్రఖ్యాతి పొందారు. వీరి ప్రసిద్ధ పాత్రలు హరిశ్చంద్ర, రావణుడు, చారుదత్తుడు, అశ్వత్థామ మున్నగునవి.

## మారేపల్లి రామచంద్రశాస్త్రి (కవిగారు)



తండ్రి శ్రీరాములు. గన్నవరం తాలూకా కనకవల్లిలో 1874 న జన్మించారు. విశాఖపట్నంలో F.A. ఆరు మాసాలుచదివాక,బానిస కొలువు కోసం పట్టభద్రులు కావటం హీనమనుకుని, కాలేజీ చదువుకి స్వస్తి చెప్పారు. కాలేజీ వార్షికోత్సవంలో శాస్త్రిగారు చదివిన పద్యాలకు మెచ్చుకున్న, అప్పటి ప్రిన్సిపాల్ ఆయనకు 'కవి' బిరుదు నిచ్చారు.

శాఖపట్టణంలో 'ధర్మాశ్రమం' స్థాపించారు. అందులో ఒక గ్రంథాలయం, 1877లో జల చికిత్స శాల నెలకొల్పారు. భయంకరమయిన క్షయ, కుష్టు రోగాల్ని నీటి వైద్యంతో నయం చేసేవారు. ఆశ్రమంలో మగ్గాలు పెట్టించి నేతబట్టలు నేయించారు. దంతంతో వస్తువుల్ని తయారుచేయించి బొంబాయి, కలకత్తాలకు ఎగుమతి చేయించారు.

జనసామాన్యంలో విజ్ఞాన బీజాలు వెదజల్లేందుకు సుమారు వంద గ్రంథాలు రచించారు. నాటకాలు రచించి ప్రదర్శించడమేకాక, తను కూడా నటించి 'బాల షేక్స్పియర్' అని ప్రశంసలు పొందారు.

సంఘసంస్కర్తగా బాల్యవివాహాలు,వరకట్నాలు, కన్యాశుల్కాలు మాన్పించేందుకు కృషి చేశారు. హేయమయిన పడుపువృత్తి మాన్పించేందుకు,విశాఖలోని వేశ్యాంగనలతో 1902లో 'సంగీతమానినీ సమాజం' నెలకొల్పారు. నాటకాలు ఆడటం నేర్పి వారికి బ్రతుకు తెరువు కల్పించారు. అంటరానితనం నిర్మూలనకు కృషిచేశారు.

రాజకీయరంగంలో వీరు ప్రవేశించాక. బెజవాడలో 1914న జరిగిన ఆంధ్ర మహాసభకు హాజరయ్యారు. అనిబిసెంట్‌గారి 'హోమ్ రూల్ లీగ్' పక్షమున విశాఖలో 'స్వరాజ్య సమితి' ఏర్పరచి, కార్యదర్శిగా వుండి ప్రజలలో గొప్ప చైతన్యం కలిగిం

చారు. 1920 సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని, కాలినడకన పల్లె పల్లెకు పోయికాంగ్రెస్ సందేశాన్ని చాటారు. 1922లో గయా కాంగ్రెస్‌కు ప్రతినిధిగా వెళ్ళారు. విశాఖ జిల్లా కాంగ్రెస్ ఏర్పడ్డాక, మొదట కొన్నేళ్ళు ఉపాధ్యక్షులుగా, తరవాత అధ్యక్షులుగా వున్నారు. 1928లో అఖిలభారత చరఖాసంఘంవారి ఆదేశానుసారం గంజాం, విశాఖపట్నం, తూర్పు గోదావరి జిల్లాల్లో 9నెలలు పల్లెలు, పట్టణాలు తిరిగి ఖద్దరు ప్రచారం చేశారు. ఖద్దరు వస్త్రాలను భుజాలపై మోస్తూ అమ్మారు.

విశాఖ సముద్రతీరంలో ఉప్పు తయారుచేయగా, ఆంగ్లప్రభుత్వంవీరికిఆరు నెలలు శిక్షవిధించింది.విశాఖ జిల్లాకు మళ్ళీనియంతగా ఉండి, కాంగ్రెస్ కార్యక్రమం కొనసాగించుతుండగా 1932 ఫిబ్రవరిలో వీరిని ఎలమంచిలిలో ప్రభుత్వం అరెస్టుచేసి, ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించింది. విశాఖపట్నంలో స్థాపించిన 'కవితా సమితి'కి అధ్యక్షులుగా వున్నారు. వీరు పండిత కవి. అష్టావధాని. గృహస్త సన్యాసి. కవిగారు దేశసేవ, తెలుగుభాష సేవచేస్తూ1951లో ఉయ్యూరులో కీర్తిశేషులయ్యారు.

## మల్లాది శివరామశాస్త్రి



తండ్రి దక్షిణామూర్తి శాస్త్రి. 1921 లో జన్మించారు. క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంగాటెలిగ్రాఫ్ తీగలు తెంచమనీ, రైలు పట్టాలుపీకివేయమనీ, యుద్ధ ప్రయత్నాలకు తోడ్పడవద్దనీ ప్రచారం చేసినందుకు ఒక సంవత్సరం కఠినశిక్ష విధించబడింది. 20-10-1942 నుండి అలీపురం క్యాంపుజైలులో శిక్ష అనుభవించారు. హిందీ ప్రచారం, హరిజనసేవ, సంస్కరణ వివాహాలు గావించారు. బహు గ్రంథకర్త. వీరు రచించిన "రామాయణ సౌరభం" అముద్రితం.

## మెరుగు దేవయ్య

జన్మస్థలం గన్నవరం తాలూకా మంటాడ. శాసనోల్లఘనంలో 4-7-1932 న తీవ్రమైన లాఠీచార్జీకి గురయ్యారు.

## మైనేని వెంకట సుబ్బయ్య



తండ్రి రామయ్య. గన్నవరం తాలూకా కుమ్మమూరు. రైతు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నపుడు లాఠీచార్జీకి గురి అయ్యారు 21-5-1930 నుండి 9 నెలల కఠిన శిక్షను అనుభవించారు. రాజమండ్రి, కోయంబత్తూరు, అలీపురం జైళ్ళలో శిక్షననుభవించారు. తిరిగి శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 15-6-32న ఒక సంవత్సరం శిక్ష విధించబడింది. రాజమండ్రి సెంట్రల్ జైల్లో శిక్షను అనుభవించారు.

## మైనేని శ్రీరామాయమ్మ

వెంకట సుబ్బయ్యగారిపత్ని. గన్నవరంతాలూకా కుమ్మమూరు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 23-1-'32 న ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. పసి బిడ్డతో సహా వెల్లూరు,కన్ననూరు జైళ్ళలో శిక్షననుభవించారు.

## మైనేని సీతారామయ్య

గన్నవరం తాలూకా పెదిగుంటలపాలెం. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. అరెస్టుచేసి కొన్నాళ్ళు జైలులో వుంచారు. 26-3-'32 న విడుదలయ్యారు. కీర్తిశేషులు.

## యలమంచి కృష్ణయ్య



తండ్రి అంకప్ప చౌదరి. జన్మస్థలం గన్నవరం తాలూకా మేడూరు. శాసనోల్లంఘనంలో 13-4-1932న కరపత్రాలు పంచుతూండగా పోలీసులు తీవ్రమైనలాఠీచార్జీకిగురిచేశారు. బెజవాడలోపికెటింగ్‌చేస్తూండగా, పోలీసులులాఠీలతో స్పృహతప్పేవరకు చావమోది, బందరు కాల్వవద్దకు ఈడ్చివేసి, వదిలారు. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో అరెస్టు అయి, కొద్ది రోజులు సబ్‌జైలు నిర్బంధంలో వున్నారు. కమ్యూనిస్టు పార్టీలో చేరారు. రైతుకూలీలను సంఘటితపర్చి, జమీందారీ వ్యతిరేక పోరాటం సాగించారు. స్త్రీలు, పేద పిల్లల పురోభివృద్ధికి కృషి చేశారు. 1949 లో పోలీసులచే కాల్చి చంపబడ్డారు.

## యలమంచి దశరథరామయ్య



తండ్రి సర్వయ్య. గన్నవరం తాలూకా మేడూరులో21-1-'16లో జన్మించారు. శాసనోల్లంఘన కాలంలో కరపత్రాలు పంచుతుండగా 13-4-1932న లాఠీచార్జీకి గురయ్యారు. కల్లుపాకల వద్ద పికెటింగ్ చేయుటకు పెడిముక్కల గ్రామానికి వస్తూవుండగా మేడూరు సరిహద్దువద్ద పోలీసులు చుట్టుముట్టి 83 లాఠీ దెబ్బలు కొట్టారు. ఈ దెబ్బలకు ఒక కన్ను నరాలుతెగి, చూపుపోయింది.

## లక్కరాజు సత్యనారాయణ

గన్నవరం తాలూకా ఆత్కూరు వాస్తవ్యులు. సహాయ నిరాకరణోద్యమంలో 4-2-1922న శిక్షించబడి రాజమండ్రి జైల్లో శిక్షను అనుభవించారు.

## లోళ్ళ పేరిశాస్త్రి

తండ్రి ఎల్. వి. నరసింహం. జన్మస్థలం గన్నవరం తాలూకా పెన్నూతల. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు, 3-7-1930న ఆరునెలల కఠిన శిక్ష. రు. 50/- ల జరిమానా విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించారు.

## వల్లభనేని వెంకటరావు

తండ్రి రత్తయ్య. రైతు. గండిగుంట వాస్తవ్యులు. 1920-21 సహాయ నిరాకరణోద్యమంలో రెండు నెలల శిక్ష విధించబడింది. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 21-5-30నుండి రాజమండ్రి వెల్లూరు, అలీపురం జైళ్ళలో 9నెలల కఠినశిక్ష ననుభవించారు. 28-1-'32 న ఆరు నెలల కఠినశిక్ష, రు.100 జరిమానా చెల్లించనిచో మరో ఆరు వారాల కఠిన శిక్ష విధించబడింది. జరిమానా వసూలు చేయబడినది. రాజమండ్రి సెంట్రల్‌జైల్లో శిక్షననుభవించారు.

## వంగల బుచ్చన్న దీక్షితులు

జన్మస్థలం గన్నవరం తాలూకా ఉయ్యూరు. 1920 సహాయ నిరాకరణంలో పాల్గొన్నారు. ఒక నెల జైలుశిక్ష, రు. 50/-జరిమానా విధించబడినది.

## వీరమాచనేని వెంకటప్పయ్య

తండ్రి కోటయ్య, జననం 15-5-1916 గన్నవరం తాలూకా పెదికొండలపాలెం. రైతు. హిందీ ప్రచారకులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 19-6-1930 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి. తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. ప్రస్తుత నివాసం కైకలూరు తాలూకా చిగురుకోట.

## వెనిగండ్ల లక్ష్మీకాంతమ్మ

జననం 1899 గన్నవర తాలూకా కుమ్మమూరు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నారు. 1941 లో కీర్తిశేషులైరి.

## వెలగల నరసయ్య



తండ్రి సీతయ్య. నివాసం ఎలుకపాడు. జననం 15-9-1908. చిన్నాపురంలో ఉప్పు పండించినందుకు సంవత్సరం కఠిన శిక్ష విధించి 26-6-30న రాజమండ్రి జైలుకు పంపారు. జైలులో ఆహారం పురుగులతో వుండటంతో నిరాహార దీక్షకు పూనుకున్నారు. అప్పుడు ఈయనను తిరుచునాపల్లి జైలుకు పంపారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ప్రకారం రెండు నెలలు ముందుగా విడుదల చేయబడ్డారు. 30-3-32 న తిరిగి అరెస్టు చేయబడి విడుదలయ్యారు. హిందీ పండితునిగా పనిచేశారు.

## వెలగపూడి సూర్యనారాయణ



తండ్రి వెంకటరత్నం. గన్నవరం తాలూకా బాహుబవేంద్ర గూడెం అగ్రహారంలో 1911 సంవత్సరంలో జన్మించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందున 6-6-1930 న 2 సంవత్సరాల శిక్షవేసి తంజావూరు బోర్స్టల్ స్కూలుకు పంపారు. రాజమండ్రి జైలు నుంచి 18-2-1931 న విడుదలయ్యారు.

## వెల్లంకి పూర్ణ చంద్రరావు

తండ్రి బాపయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా కలవపాముల. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 26-5-1930 న 18 నెలల కఠిన శిక్ష విధింపబడింది. రాజమండ్రి, వెల్లూరు, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 14-3-1931న విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని, అరెస్టు అయ్యారు 28-1-1932 న ఆరు నెలల కఠిన శిక్ష, రు 100/- జరిమానా విధించబడింది. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. మరొకమారు పికెటింగ్‌లో పాల్గొన్నారు 10-8-1932 న సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 2-6-1933 న విడుదలయ్యారు.

## వెల్లంకి సుబ్బరాయ చౌదరి



తండ్రి రత్తయ్య. 1906 అక్టోబరు 20 న గన్నవరం తాలూకా కల్వపాములలో జన్మించారు. ప్రస్తుత నివాసం ఖమ్మం జిల్లా సత్తుపల్లి. హిందీ ప్రచారకులుగా పని చేశారు. 1921 లో సహాయ నిరాకరణోద్యమం ఆదేశానుసారం 9వ తరగతి చదువుతూ చదువుకు స్వస్తి చెప్పారు. గుంటూరు జిల్లా ఉప్పు సత్యాగ్రహ శిబిరంలో వలంటీరుగా చేరారు. కరవది వద్ద జాతీయ జండా ఎగురవేస్తున్నపుడు తీవ్రంగా లాఠీచార్జికి గురికాగా ఎడమ మోచేయి శాశ్వతంగా దెబ్బతినిపోయింది. 3-7-30 న తెనాలిలో సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో జైలు జీవితం గడిపారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడికను అనుసరించి 15-3-31 న విడుదలయ్యారు. గ్రామ పంచాయితీ బోర్డు సభ్యులుగా పనిచేశారు. 1968 జూలై 23 న కీర్తిశేషులయ్యారు.

## వేములపల్లి వామనరావు



తండ్రి పెదరామయ్య. గన్నవరం తాలూకా మర్రివాడ వాస్తవ్యులు. విద్యార్థిగా ఉన్న రోజుల్లోనే యుద్ధ వ్యతిరేక కార్యకలాపాల్లో పాల్గొన్నారు. 25-3-42 నుండి 27-4-'42 వరకు అలీపురం, బళ్ళారి జైళ్ళలో నిర్బంధింపబడ్డారు.

## వేలూరి యజ్ఞనారాయణ శాస్త్రి



తండ్రి వెంకటేశ్వర అవధానులు. జన్మస్థలం గన్నవరం తాలూకా చిరివాడు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 26.5.1930న సంవత్సరం కఠిన శిక్ష, రు 150/- జరిమానా విధించారు. రాజమండ్రి, వెల్లూరు, జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 12-3-1931 న విడుదలయారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, 18-4-1941 న అరెస్టు అయ్యారు. నూజివీడు సబ్ డివిజనల్ మేజిస్ట్రేట్ 24-4-1941 న నాలుగు నెలల కఠిన శిక్ష, రు 200/- జరిమానా విధించారు జరిమానా చెల్లించ నిరాకరించి, మొత్తం ఆరు నెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## వెంపటి రాధాకృష్ణ



తండ్రి సూరి సోమయాజులు. జననం 8-3-1923 గన్నవరం తాలూకా కనకవల్లి. ఎస్. ఎస్. ఎల్. సి. చదువుతూ, కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోచేరి. చదువుకు స్వస్తి చెప్పారు. 1941 నుంచి 1942 ఆగస్టు వరకు రహస్యజీవితం గడిపారు. 1942 ఆగస్టులో అరెస్టు అయ్యారు. 8 సంవత్సరాల కఠిన శిక్ష విధించబడింది. 44 మాసాలు జైలుజీవితం అనుభవించారు. జైలులో విపరీతమైన లాఠీ దెబ్బలు తిన్నారు. జైలునుంచి విడుదలైన పిమ్మట కమ్యూనిస్టు పార్టీలో పనిచేశారు. ప్రజానాట్యమండలి రాష్ట్ర దళంలో సభ్యులై, అనేక వైజ్ఞానిక ప్రదర్శన లిచ్చారు. తామ్రపత్ర గ్రహీత. 1964 లో ఆలిండియా రేడియో స్టాఫ్ ఆర్టిస్టుగాచేరి పనిచేస్తూ 1989 అక్టోబరు 28 న కీర్తిశేషులైరి.

## వీరపనేని రామదాసు



తండ్రి రామయ్య. కొయ్యగురపాడులో జన్మించారు. రైతు. క్విట్ఇండియా వుద్యమంలో పాల్గొన్నారు. 31-5-1943 తేదీన 18 మాసాలు కఠిన శిక్ష పడగా అలీపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవించారు.

## సుంకర కృష్ణమూర్తి

తండ్రి వీరభద్రయ్య. జననం 1915 లో గన్నవరం తాలూకా ఇందుపల్లి. చదువుకు స్వస్తి చెప్పి శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. మద్రాసులో విదేశీ వస్త్రాలయాలముందు పికెటింగ్ చేస్తుండగా, 1932 మార్చిలో రెండుసార్లు తీవ్రమైన లాఠీచార్జీకి గురయ్యారు. 1932 ఏప్రిల్‌లో విజయవాడలో పికెటింగ్‌చేసి, అరెస్టు అయ్యారు. ఆరు నెలల కఠిన శిక్ష, రు. 300/- జరిమానా విధించబడింది. గన్నవరం సబ్‌జైలులో రెండు మాసాలు రిమాండులో వున్నారు. శాసనోల్లంఘ నోద్యమంతో సంబంధం కలదన్న కారణంపై 1932 నవంబరులో రు. 50/- జరిమానా విధింపబడింది.

## సుంకర సూర్యనారాయణ



జన్మస్థలం గన్నవరం తాలూకా మేడూరు. 1936 లో రెవెన్యూ శాఖలో తన ప్రభుత్యోద్యోగానికి రాజీనామాచేసి, జాతీయోద్యమంలో చేరారు. హరిపుర కాంగ్రెసు మహాసభకు ప్రతినిధిగా

హాజరయ్యారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో రహస్య కార్యకలాపాలు నిర్వహించారు. కృష్ణాజిల్లా రైతు ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించారు.

### సుంకర అంజయ్య

తండ్రి రామయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా వెంకునూడు. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని, 23-6-1932 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

### సూరి సీతారామం

తండ్రి శోభనాచలపతి. 1937 జూలై 10 వ తేదీన గన్నవరం తాలూకా వుయ్యూరులో జన్మించారు ఇద్యార్థి కాంగ్రెసు కార్యకర్త. విజయవాడలో ఇంటర్మీడియెట్ రెండవ సంవత్సరం చదువుతుండగా. పిన్నవయసులోనే మరో 8 విద్యార్థులతో కలిసి గోవా విమోచన సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన దానికి వెళ్ళారు. గోవాలో ప్రవేశించుతూ ఉండగానే పోర్చుగీసు పోలీసులు ఆయనను 15-8-55 న కాల్చి చంపారు. ఆయన మృతదేహాన్ని తోటి సత్యాగ్రహులు బెల్గాం తీసుకువచ్చి అంత్యక్రియలు జరిపారు.

# నూజివీడు తాలూకా

## నూజివీడు

### అమామ్ రంగయ్య

తండ్రి లక్ష్మీనారాయణ. 25-5-1914న నూజివీడు తాలూకా సగ్గూరులో జననం. ప్రస్తుత నివాసం నూజివీడు వ్యక్తి సత్యాగ్రహంలో ఒక నెల శిక్ష, రు. 50 జరిమానా విధింపబడి, నూజివీడు, గన్నవరం జైళ్ళలో శిక్షను అనుభవించారు. హరిజనోద్యమంలో పనిచేశారు. తాలూకా, జిల్లా కాంగ్రెస్ సభ్యులు.

### కంతేటి రామజోగయ్య



నూజివీడు నివాసి. సహాయనిరాకరణంలో పాల్గొని, 20-8-1921 నుంచి నాలుగు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

### అరేపల్లి చెన్నయ్య



నూజివీడువాస్తవ్యులు క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. మూడు నెలల కఠిన శిక్ష, రు. 100/- ల జరిమానా విధించారు.

### కందుకూరి ఆదినారాయణ

తండ్రి ఆంజనేయులు. వ్యాపారి. జన్మస్థలం నూజివీడు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 18-6-1930 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను వెల్లూరు, అలీపురం, మద్రాస్ జైళ్ళలో అనుభవించారు.

### కురెళ్ళ సత్యనారాయణమూర్తి

తండ్రి సుబ్బయ్య. నూజివీడు వాస్తవ్యులు. ప్రయివేటు ఉద్యోగి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొ

న్నారు. 10-6-30 నుండి రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో 9 నెలల శిక్ష ననుభవించారు.

## కోసూరి నరసింహమూర్తి



తండ్రి వెంకటస్వామి. 1914 లో నూజివీడులో జన్మించారు. ఆర్ టి సి. కండక్టర్‌గా రిటైరయ్యారు. ప్రస్తుత నివాసం నూజివీడు. ఉప్పు సత్యాగ్రహంలో 10-6-30 న పాల్గొన్నారు. 9మాసాల కఠిన శిక్ష విధించబడి రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్షను అనుభవించారు. 9-2-31 న విడుదలయ్యారు. 11-6-41 న వ్యష్టి సత్యాగ్రహంలో మద్రాసులో రెండుమాసాల శిక్ష పొంది, మద్రాసు జైలులో శిక్ష ననుభవించి 9-8-41న విడుదలయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 4-9-42 న రెండేళ్ళ కఠిన శిక్ష విధింపబడి అలీపూర్ క్యాంప్‌జైలు, బళ్ళారి జైళ్ళలో శిక్షను అనుభవించారు. 25-5-45 న విడుదలయ్యారు.

## కూనపులి సుబ్రహ్మణ్యం



తండ్రి పూర్ణయ్యశాస్త్రి, నూజివీడులో 13-11-1910న జననం. ప్రస్తుత నివాసం నూజివీడు. బి ఏ చదువుతూ ఉండగా నర్సాపురం ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. సిద్ధాపురం వద్ద 31-5-30 న అరెస్టయ్యారు. 9 మాసాల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష ననుభవించారు. దివితాలూకా గొల్లపాలెంలో 1952 లో రాజకీయ బాధితులకిచ్చిన 5 ఎకరాల భూమిని బీదలకు వదలి, పట్టాలను కలెక్టర్‌కు తిరిగి ఇచ్చివేశారు. ఎం.ఏ. బి.ఇడి. విద్వాన్ పట్టాలు పొందిన వీరు నూజివీడు ధర్మ అప్పారావు కాలేజీలో వైస్ ప్రిన్సిపాల్‌గా పనిచేశారు.

## కొత్వాల్ మహమ్మద్ హుస్సేన్

తండ్రి కొత్వాల్ అబ్బాస్ అలీ. జన్మస్థలం నూజివీడు. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని లాఠీచార్జీకి గురయ్యారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో కూడా పాల్గొన్నారు.

## కొత్వాల్ అబ్బాస్ అలీసాహెబ్

తండ్రి మహమ్మద్ హుస్సేన్. నూజివీడు వాస్తవ్యులు. 1921 లో సహాయ నిరాకరణ, పికెటింగ్ ఉద్యమాల్లో పాల్గొన్నారు. 20-1-22 న తొమ్మిది నెలల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్షను అనుభవించారు. లోధియన్ కమిటీ విజయవాడ వచ్చినపుడు లాఠీచార్జీకి గురి అయ్యారు. రాష్ట్ర కాంగ్రెస్ సభ్యులుగాను, జిల్లా బోర్డు సభ్యులుగాను పనిచేశారు. 1929 ఏప్రిల్ 11 న గాంధీజీ నూజివీడు వచ్చినపుడు వీరు ఆహ్వాన సంఘాధ్యక్షులు. 14-1-1958 న కీర్తిశేషులయ్యారు.

## గరికిపర్తి నాగభూషణం



తండ్రి గణపతిలింగం. నూజివీడు వాస్తవ్యులు. బస్ కండక్టర్. 1921 లో సహాయ నిరాకరణ, పికెటింగ్, విదేశవస్త్ర దహనం మొదలగు ఉద్యమాల్లో పాల్గొని లాఠీచార్జీకి గురి అయ్యారు. 20-8-21 న ఆరు నెలల కఠిన శిక్ష విధింపబడింది. రాజమండ్రి జైల్లో శిక్షను అనుభవించారు. కీర్తిశేషులు.

## గొల్లపల్లి రత్తయ్య

నూజివీడు వాస్తవ్యులు. కుట్టుపనివారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు.

## చలమాల నారాయణ

తండ్రి నాయుడమ్మ. 1901 ప్రాంతంలో నూజివీడులో జన్మించారు. ప్రస్తుత నివాసం నూజివీడు.

గ్రంథాలయోద్యోగి. 1921 సహాయ నిరాకరణోద్య మంలో పాల్గొన్నారు. 20-8-1921 న ఆరు నెలల కఠినశిక్ష విధించబడి, రాజమండ్రి జైలులో శిక్షను అనుభవించారు.

## చలమాల కోటయ్య



నూజివీడు నివాసి. సహాయ నిరాకరణంలో పాల్గొని 20-8-1921 నుంచి రాజమండ్రి జైలులో నాలుగు నెలల కఠిన శిక్షను అనుభవించారు.

## చెరుకూరి వెంకటశేషయ్య



తండ్రి వెంకట కృష్ణయ్య. 1905 ప్రాంతంలో బాపట్ల తాలూకా గుడిపాడు అగ్రహారంలో జన్మించారు. ప్రస్తుతం నూజివీడు వాస్తవ్యులు. ధర్మసత్రం గుమాస్తా. ఉప్పు సత్యాగ్రహంలో బాపట్లలో 7-5-30 న ఆరు నెలల శిక్ష విధించబడింది. రాజమండ్రి, వెల్లూరు సెంట్రల్ జైళ్ళలో శిక్షను అనుభవించారు

## జాదం బాలాజీ

జన్మస్థలం నూజివీడు. 1921 సహాయ నిరాకరణంలో జైలుశిక్ష అనుభవించారు. కీర్తిశేషులు.

## జుజ్జూరి నాగేశ్వరరావు

స్వస్థలం నూజివీడు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు.

## తటవర్తి రంగయ్య

తండ్రి సర్వేశం. వర్తకులు. నూజివీడు వాస్తవ్యులు. కీర్తిశేషులు. 1921 నుండి 32 వరకు జాతీయోద్యమాలలో ప్రముఖ పాత్ర వహించారు. వీరి నాయకత్వాన సుమారు 30 మంది కాంగ్రెస్ కార్యకర్తలు పనిచేశారు. జమీందారీ నౌకర్ల బాధలను నిర్భీతితో ఎదిరించారు. కాంగ్రెస్ సభలకు చాటింపు వేయడానికి డప్పులవాళ్ళు నిరాకరించినపుడు తానూ ఇతర కాంగ్రెస్‌వాదులతోపాటు డప్పు మెడకు తగిలించుకుని చాటింపు వేశారు. వీరి సభలను భగ్నం చేయడానికి కొందరు డప్పులు వాయించేవారు. ఐనా చలించలేదు. 1921 డిసెంబర్, 1922 జనవరిలో గన్నవరం సబ్ జైలులో 40 రోజులు నిర్బంధంలో ఉన్నారు. తర్వాత 9 నెలల కఠిన శిక్ష విధింపబడింది. 20-1-22 నుండి 19-10-22 వరకు రాజమండ్రి, కోగాపుట్టి జైళ్ళలో శిక్ష అనుభవించారు. ఉప్పు సత్యాగ్రహంలో 9 నెలల కఠిన శిక్షను బళ్ళారిలో అనుభవించారు.

## తాడంకి ఏసురత్నం



జన్మస్థలం నూజివీడు. హరిజనుడు. 1940 లో సైన్యంలో చేరి, పశ్చిమాసియా ప్రాంతంలో యుద్ధం చేస్తూ 1942 లో జర్మనీ సైన్యానికి ఖైదీగా చిక్కారు. అనంతరం జర్మనీలో ఏర్పడిన ఆజాద్ హింద్ ఫౌజ్‌లో చేరి, తూర్పు ఆసియా రంగానికి తరలి వచ్చారు. జపాన్‌లో తిరిగి బ్రిటిష్ సైన్యానికి ఖైదీగా చిక్కారు. 1946 లో జబల్‌పూర్ శిబిరం నుండి విడుదలయ్యారు.

## తిరుమలశెట్టి పుల్లయ్య

నూజివీడు నివాసి. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. తిరువూరులో అరెస్టు అయ్యారు. మూడు రోజులు రిమాండ్‌లో వున్నారు. కీర్తిశేషులు.

## దశిక సూర్యప్రకాశరావు

తండ్రి వెంకట సుబ్బారాయుడు. 1898 ఏప్రిల్ 10 న రాజమండ్రిలో జననం. హిందీ అధ్యాపకులు. విశారద (హిందీ) ప్యాసయ్యారు. "బి.ఏ." చదువుతూ మానివేశారు. ప్రస్తుత నివాసం రాజమండ్రి. 1921లో సహాయ నిరాకరణోద్యమంలో ప్రవేశించినది మొదలు అనేక సార్లు జైలుశిక్ష అనుభవించారు. సుమారు 40 మాసాల జైలు జీవితం గడిపారు. 20-1-22 నుండి రాజమండ్రి, కడలూరు లలో 9 నెలల కఠిన శిక్ష, ఉప్పు సత్యాగ్రహంలో 10-6-30 నుండి రాజమండ్రి, బళ్ళారి సెంట్రల్ జైళ్ళలో 9 నెలల కఠిన శిక్ష, 1932 లో 7 నెలల కఠిన శిక్ష. క్విట్ ఇండియా ఉద్యమంలో 5-9-42 నుండి 15 నెలల కఠిన శిక్షను అలీపురం క్యాంప్ జైలు, బళ్ళారి సెంట్రల్ జైళ్ళలో అనుభవించారు. తేలప్రోలు జమీందారీ నౌకర్లు పెట్టిన బాధలకు గురి అయ్యారు. కాంగ్రెస్ మీటింగుల గురించి చాటింపు వేయకుండా చేసినపుడు, స్వయంగా డప్పులు వాయించిన కాంగ్రెస్ వాదులలో ఒకరు. కల్లు దుకాణాల ముందు పికెటింగ్ చేయగా, త్రాగేవారు లేక ఇజారాదారు సారా పారబోసుకోవలసి వచ్చింది. 1921 నుంచి 1944 వరకూ పట్టణ కాంగ్రెస్ అధ్యక్షులు.

## దిగువ నారాయణరావు



తండ్రి చల్లాసింగ్. రాజపుత్ర వంశీకులు 11-9-1909 న జన్మించారు. మాతృభాష హిందీ. 19-3-41 న 18 నెలల కఠినశిక్ష విధింపబడింది. 21-3-41 నుండి రాజమండ్రి, అలీపురం, మద్రాస్ జైళ్ళలో శిక్షను అనుభవించారు. జైల్లో అనారోగ్యవంతులై 18-12-41 న విడుదలయ్యారు. ముఖాసా రైతుల్లో పనిచేశారు. 11-10-68న కీర్తిశేషులయ్యారు.

## నంబూరు వెంకటబుల్లియ్య



తండ్రి వెంకట రామయ్య. నూజివీడు వాస్తవ్యులు. 1942 ఆగస్టు ఉద్యమంతో టెలిగ్రాఫ్ తీగల తెంచివేతకు గాను నూజివీడులో 3 మాసాలశిక్ష 100 రూపాయల జరిమానా విధించబడింది. జరిమానా చెల్లించని పక్షంలో నెలరోజుల శిక్ష. మొత్తం నాల్గు నెలల శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## పసుపులేటి వెంకట నీలాచలం

నూజివీడు నివాసి. సహాయనిరాకరణంలో పాల్గొని 20-8-1921 నుంచి నాలుగు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## పరిమిశెట్టి వెంకట నీలాచలం



తండ్రి రాజయ్య. 1898లో నూజివీడులో జననం. 1921 లో స్వాతంత్ర్య ఉద్యమంలో చేరి చదువుకు స్వస్తిచెప్పారు. కల్లు పాకలవద్ద పికెటింగ్‌కు గాను 20-8-21 న నాలుగు మాసాల శిక్ష విధించబడింది. యువజనులకు వ్యాయామం, రాజకీయాలు బోధించుతూ స్వాతంత్ర్య ఉద్యమంలోకి తీసుకువచ్చారు. ఉప్పు సత్యాగ్రహంలో బందరు సత్యాగ్రహ యాత్రలో పాల్గొనగా నూజివీడు వచ్చిన తర్వాత వీరిని అరెస్టు చేసి, 10-6-30 న తొమ్మిది

నెలల కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, కోరాపుట్ జైళ్ళలో శిక్ష ననుభవించారు. పంచాయతీ బోర్డు అధ్యక్షులుగా పనిచేశారు. కీర్తిశేషులైరి.

## పల్లగాని గోపాలస్వామి

నివాసం నూజివీడు. టైలర్. వ్యష్టిసత్యాగ్రహంలో పాల్గొన్నారు. పదిహేను రోజుల జైలుశిక్ష, రు. 5/- జరిమానా విధించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో కూడా పాల్గొని, అరెస్టు అయ్యారు. నూజివీడు పట్టణ కాంగ్రెస్ అధ్యక్షులు. 1965 లో కీర్తిశేషులయ్యారు.

## పిల్లి సర్వయ్య



తండ్రి శోభనాద్రి. 1-7-1902 న నూజివీడులో జననం. 1921లో సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. విదేశ వస్త్ర దహనం, పన్నుల నిరాకరణ, పికెటింగ్ లలో పాల్గొన్నారు. ఆరుమాసాల శిక్ష విధింపబడింది. 20-8-21 నుండి రాజమండ్రి జైల్లో శిక్షననుభవించారు. 1930 - 32 ఉద్యమాల్లో లాఠీచార్జీకి గురి అయ్యారు. అరెస్టు చేసి వదలిపెట్టారు.

## భట్లర్ వెంకట కృష్ణమాచార్యులు

తండ్రి వెంకటాచార్యులు. 1903 సెప్టెంబర్ 16న నూజివీడులో జన్మించారు. రైతు, 1921 సహాయ నిరాకరణోద్యమంలో స్కూలును బహిష్కరించారు. ఖాదీ, హరిజనోద్ధరణ ఉద్యమాల్లో పాల్గొన్నారు. శాసనోల్లంఘనోద్యమంలో; పాల్గొన్నందుకు 1932 జనవరిలో 6 నెలల కఠిన శిక్ష, రు. 50 జరిమానా, చెల్లించని పక్షంలో మరో ఆరు వారాల శిక్ష విధించబడింది. రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్ష ననుభవించారు.

## భాగవతుల లక్ష్మీనారాయణ

జన్మస్థలం నూజివీడు. 1907 లో వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్నందుకు రాజమండ్రి ఆర్ట్స్ కాలేజీ నుంచి బహిష్కరించారు.

## బి. రామయ్య

నూజివీడు నివాసి. 1907 లో వందేమాతరం ఉద్యమంలో పాల్గొని, రాజమండ్రి ఆర్ట్స్ కాలేజీ నుండి బహిష్కృతులయ్యారు.

## బైసాని సుబ్బారాయుడు

నూజివీడు వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. లాఠీఛార్జీకి గురి అయ్యారు.

## భట్టు వెంకోజీ

తండ్రి స్వామి. జన్మస్థలం నూజివీడు. వ్యాపారి. సహాయ నిరాకరణంలో పాల్గొని, 20-1-922 నుంచి 9 నెలల కఠినశిక్షను రాజమండ్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు. క్షయ వ్యాధితో 1929లో చనిపోయారు.

## భట్టు గోవిందరాజులు



తండ్రి స్వామి. 1890లో నూజివీడులో జననం. వర్తకులు. 1920 లో సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. 20.8.21 నుండి రాజమండ్రి జైలులోనాలుగుమాసాల శిక్ష ననుభవించారు. ఉప్పుసత్యాగ్రహంలో 9 మాసముల శిక్ష విధించబడింది. 10-6-30 నుండి, రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్షను అనుభవించారు. వీరు జిల్లా బోర్డు సభ్యులుగా ఉన్నపుడు, 1939 లో యుద్ధ నిధికి డబ్బు ఇవ్వరాదని బోర్డు తీర్మానించింది. అందుకు ప్రభుత్వం ఆ బోర్డును రద్దుచేసింది.

## మల్లిశెట్టి లక్ష్మీనారాయణ.



తండ్రిసుబ్బయ్య ప్రస్తుత నివాసం నూజివీడు. క్విట్ ఇండియా ఉద్యమంలో లాఠీచార్జీకి గురి అయ్యారు. యువజన సంఘానికి కార్యదర్శిగా పని చేశారు.

## మల్లెల నాగయ్య



తండ్రి కోటయ్య. 1924జనవరి 1న నూజివీడులో జన్మించారు. కుట్టుపనివారు. 1940 లో వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1942 లో లాఠీచార్జీకి గురి అయ్యారు. కొన్ని రోజులు రిమాండ్ లో వుంచి వదలి వేశారు. టెలిగ్రాఫ్ తీగల తెంచివేత కార్యక్రమంలో పాల్గొన్నారు. పట్టణ యువజన కాంగ్రెస్ కార్యదర్శిగా పనిచేశారు.

## మల్లెల రామయ్య



తండ్రి కోటయ్య. 1906 నవంబర్ 5 న జననం. వర్తకులు. ప్రస్తుతం నూజివీడు నివాసి. 1930 జూన్ లో కాంగ్రెస్‌పతాకను ఎగరవేయగా సబిన్‌స్పెక్టర్ జెండాను తీసివేశాడు. వీరు అపుడు కాంగ్రెస్ జెండాతో ఊరేగింపు జరిపారు. లాఠీచార్జీ చేసి 10-6-30న 9 నెలల శిక్ష విధింపబడింది. రాజమండ్రి, కోరాపుట్టి జైళ్ళలో శిక్షననుభవించిరి. 9-2-31 న విడుదలయ్యారు.

## మరింగంటి వెంకట నరసింహాచార్యులు.

నూజివీడు వాస్తవ్యులు. 20-8-1921 నుండి నాల్గు నెలల కఠిన శిక్షను సహాయనిరాకరణ ఉద్యమ కాలంలో రాజమండ్రి జైలులో అనుభవించారు. ఏలూరు తాలూకా పోతునూరులో వుంటూ కీర్తి శేషులైరి.

## మాండిగ సత్యనారాయణ



తండ్రి పుల్లాజీ. నూజివీడువాస్తవ్యులు. క్విట్ ఇండియా ఉద్యమంలో రహస్యంగా పనిచేశారు. పట్టణ యువజన కాంగ్రెస్ అధ్యక్షులుగా పని చేశారు. టెలిగ్రాఫ్ తీగెల తెంచివేతలో పాల్గొన్నారు.

## మారేపల్లి వెంకయ్య

జన్మస్థలం నూజివీడు. సహాయ నిరాకరణంలో పాల్గొని, 20-8-1921 నుంచి నాలుగు నెలల జైలు శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## మేకా వెంకటాద్రి అప్పారావు

తండ్రి రంగయ్య అప్పారావు. 1893లో జన్మించారు. గన్నవరం తాలూకా పుయ్యూరు జమీందారు. నూజివీడు వాస్తవ్యులు. పట్టభద్రులు. 1928 లో ఖాదీ ఉద్యమ ప్రచార సందర్భంగా గాంధీజీ ఆంధ్రదేశం వచ్చినపుడు వారిని తన అతిథిగా ఆహ్వానించారు. ప్రభుత్వ అధికారులకు ఆగ్రహం కల్గింది. స్వాతంత్ర్య సమరయోధులకు ఆర్థిక సహాయం చేశారు. ఖాదీ ప్రచారం చేశారు.

యప్.ఆర్.ఆర్. అండ్ సి.వి.ఆర్. కాలేజీ వ్యవస్థాపకులు. 1974 డిసెంబర్ 19 న కీర్తిశేషులయ్యారు. కళాప్రపూర్ణ బిరుదును ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు యిచ్చారు. 1913 లో ఆంధ్ర మహాసభ అధ్యక్షులు. బహుభాషావేత్త-ఆంధ్ర సారస్వత పరిషత్తుకు అధ్యక్షులు. కవి. శిల్పి.

## మేకల రాములు



తండ్రి రామాను జం. 22-7-1906 న నూజివీడులో జననం. ఉప్పు సత్యాగ్రహంలో శిక్షపడి 10-6-30 నుండి 9-2-31 వరకు కోరాపుట్టి జైలులో శిక్షను అనుభవించారు. 1933 లో కలకత్తా కాంగ్రెస్‌కు హాజరై లాఠీచార్జికి గురిఅయ్యారు. పంచాయతీ బోర్డు సభ్యులుగా పనిచేశారు 1968 లో కీర్తిశేషులైరి.

## మురారి విజయసారథి



తండ్రి కోటయ్యనాయుడు. 1910 జూన్ 21 న నూజివీడులో జననం. ప్రస్తుతం మద్రాసులో నివాసం. వ్యవసాయ శాస్త్ర విద్యాధికులు. చెరుకు పరిశోధనా నిపుణులు. అంతర్జాతీయ సంస్థలలో పని చేశారు. పశ్చిమ గోదావరి సిద్ధాపురంలో ఉప్పు సత్యాగ్రహ సందర్భంగా అరెస్టయారు. రెండు కేసుల్లో మొత్తం 9 నెలల శిక్ష విధించబడింది. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. సిద్ధాపురం నుండి కోర్టుకు తీసుకువెళ్ళినపుడు ఊడ్చుకు పోయినందున స్పృహతప్పిపోయారు. 15-6-31 న రాజమండ్రి నుండి వెల్లూరుకు మార్చినపుడు గేటువద్ద లాఠీ ఛార్జికి గురి ఐన ఛాక్టర్ వెలిదండ్ల హనుమంతరావు మున్నగు వారిలో వీరూ ఒకరు.

## మొహిద్దీన్ బేగ్

నూజివీడు నివాసి. సహాయ నిరాకరణంలో పాల్గొని, 20-8-1921 నుంచి నాలుగు నెలలు కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## యరజర్ల వెంకయ్య

నూజివీడువాస్తవ్యులు. 1942 ఆగస్టు ఉద్యమంలో నూజివీడులో మూడు మాసాలశిక్ష, 100 రూపాయల జరిమానావిధింపబడింది. జరిమానాచెల్లించనందున నాల్గు వారాల శిక్షను కూడా అనుభవించారు. మొత్తం నాల్గు నెలలు శిక్షను అనుభవించారు. కీర్తిశేషులు.

## రామిశెట్టి వీరాస్వామి



తండ్రి సీతయ్య. ప్రస్తుత నివాసం నూజివీడు. 1916 ప్రాంతంలో జననం. వర్తకులు. 1940, 1942 ఉద్యమాలల్లో పాల్గొన్నారు.

## వల్లూరు వెంకట శ్రీరామరావు

తండ్రి లక్ష్మీనరసింహం. నూజివీడు వాస్తవ్యులు. సహాయ నిరాకరణోద్యమంలో 20-1-22 నుండి 9 నెలల శిక్షను రాజమండ్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు.

## వలివేటి రామకోటయ్య

తండ్రి శరభయ్య, నివాసం నూజివీడు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 10-6-1930 నుంచి 9 నెలల కఠిన శిక్షను రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు.

### సముద్రాల సత్యనారాయణ



తండ్రి శేషయ్య. 1896 ప్రాంతంలో జన్మించారు. నూజివీడు, ఖాదీవస్త్ర విక్రేత. 1920 నుండి జాతీయోద్యమంలో ఉన్నారు. ఉప్పు సత్యాగ్రహంలో 9 మాసాల కఠిన శిక్షవిధిం చబడింది. 10-6-'30 నుండి 9-2-31 వరకు జైలు శిక్షననుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాలు పీకివేత సందర్భంగా 4 నెలలు గన్నవరంలో ఉంచి వదలి వేశారు. పట్టణ కాంగ్రెస్ కార్యదర్శిగా పని చేశారు.

### సిరికొండ వల్లభరావు

తండ్రి వెంకటప్పయ్య. నూజివీడు వాస్తవ్యులు. వర్తకులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 9 నెలల శిక్షననుభవించారు. వ్యష్టి సత్యాగ్రహంలో 17-1-41 న ఒక సంవత్సరం కఠిన శిక్ష, రు. 50 జరిమానా, చెల్లించని పక్షంలో మరో నెల కఠిన శిక్ష విధింపబడినది. జరిమానా చెల్లించలేదు. వెల్లూరు, అల్లీపురంజైళ్ళలో శిక్షను అనుభవించారు. 13-12-41న ప్రభుత్వం వీరిని విడుదల చేసింది.

### షేక్ నూరుల్లా సాహెబ్



తండ్రి షేక్ మొహిద్దీన్ సాహెబ్. ప్రస్తుత నివాసం నూజివీడు. 1942 ఆగస్టు ఉద్యమంలో 3మాసాల కఠిన శిక్ష రు. 100 జరిమానా, చెల్లించనిచో నాల్గు వారాల కఠినశిక్ష వీరికి విధించ బడింది. పూర్తి శిక్ష అనుభవించి విడుదల అయ్యారు. టెలిగ్రాఫ్ తీగెల తెంపివేతలో పాల్గొన్నారు.

## నూజివీడు తాలూకా వివిధ గ్రామాలు

### ఆకుల బసవయ్య



స్వస్థలం నూజివీడు తాలూకా ఆకిరిపల్లి. సహాయ నిరాకరణంలో పాల్గొని, 14-2-1922 నుంచి రాజమండ్రి జైలులో ఆరు నెలల కఠిన శిక్ష అనుభవించారు.

### అక్కినేని అచ్యుతరామయ్య

జననం 1914 నూజివీడు తాలూకా పోతురెడ్డిపల్లి. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. నూజివీడు తాలూకా కాంగ్రెస్ కార్యదర్శి.

### ఆలపాటి సత్యనారాయణ



తండ్రి వెంకట్రామయ్య, 16-6-1916న నూజివీడు తాలూకా సూరవరంలో జననం. ప్రస్తుతం హనుమాన్ జంక్షన్ నివాసి. దువ్వ గ్రామంలో వ్యష్టిసత్యాగ్రహంలోపాల్గొన్నారు బెజవాడ సబ్ కలెక్టరు గెలిటీ తీర్పు ననుసరించి విడుదల కాబడ్డారు. యుద్ధ వ్యతిరేక ప్రచారం చేస్తూ ఢిల్లీ యాత్ర సాగించారు. ఆంధ్ర జిల్లాలు దాటి ఒరిస్సా చేరిన తరువాత 19-4-41 న అరెస్టు చేయబడ్డారు. కోరాపుట్టి జైలులో

నాల్గు మాసాలశిక్షను అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పట్టాల పీకివేతకు గాను గన్న వరం సబ్‌జైలులో 4 మాసాలు నిర్బంధంలో ఉన్నారు.

## అలపాటి లక్ష్మయ్య



తండ్రి వెంకట్రామయ్య. జన్మస్థలం నూజివీడు తాలూకా సూరవరం. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని, 19-1-1932 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమర యోధుల సంఘ కార్యవర్గ సభ్యులు. సంఘం కార్య కలాపాలలో ప్రముఖపాత్ర వహిస్తున్న వారిలో వీరు ఒకరు.

## ఉద్భుగంటి వెంకటేశ్వరరావు

తండ్రి వెంకటసుబ్బయ్య. జన్మస్థలం నూజివీడు తాలూకా ముక్కొళ్ళపాడు. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, 14-6-1930 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు. తిరిగి వ్యష్టిసత్యాగ్రహంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. 24-1-1941 న నాలుగు నెలల కఠినశిక్ష, రు. 200/- జరిమానా విధించారు. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు

## కేతేపల్లి సుబ్బారావు

నూజివీడు తాలూకా ఆకిరిపల్లి వాస్తవ్యులు. సహాయ నిరాకరణ ఉద్యమంలో 14-2-1922 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను అనుభవించారు.

## కొత్తపల్లి వెంకట లక్ష్మీనారాయణశర్మ

తండ్రి సూర్యనారాయణ. నూజివీడు తాలూకా క్రొయ్యూరులో 1901 జూలై 29 న జన్మించారు. 1921 సహాయ నిరాకరణోద్యమ ఆదేశానుసారం చదువుకు స్వస్తిచెప్పారు. గ్రంథాలయోద్యమంలో పాల్గొన్నారు. తెలుగు సాహిత్యంలో మంచి ప్రవేశం ఉంది.

## చలమశెట్టి రాఘవయ్య

తండ్రి బ్రహ్మానందం. 4-2-1906 న నూజివీడు తాలూకా సూరవరంలో జన్మించారు శాసనోల్లంఘన ఉద్యమంలో 19-1-32 న వీరిని, మరో నల్గురిని అరెస్టు చేశారు. రెండు సెక్షన్లక్రింద ఆరేసి మాసాల చొప్పున సంవత్సరం కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్షను అనుభవించి 8-12-'32 న విడుదలయ్యారు 1958 ప్రాంతంలో కీర్తిశేషులైరి.

## చలసాని రాజగోపాలరావు



తండ్రి వెంకట్రామయ్య. నూజివీడు తాలూకా అన్నవరంలో జన్మించారు. లోథియన్ కమిషన్ విజయవాడ వచ్చినప్పుడు వ్యతిరేక ప్రదర్శనల్లో పాల్గొన్నారు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నందుకు 18-8-32 న రూ. 25 లు జరిమానా, చెల్లించనిచో ఆరు వారాల కఠినశిక్ష. మరో కేసులో 22-8-32 న ఆరు నెలల కఠిన శిక్ష, రు. 100 లు జరిమానా, జరిమానా చెల్లించనిచో 6 వారాల కఠినశిక్ష విధించబడింది. రైతు, కార్మిక సంఘాలలో పనిచేశారు. తాలూకా రైతు సంఘాధ్యక్షులుగా పనిచేశారు. తిరువూరు తాలూకాలో జమీందారీ రైతుల పోరాటాన్ని నడిపారు. 1949 చివరిలో భూస్వామ్య గూండాలు, పోలీసులు వీరిని హత్య చేశారు.

## తాడిగడప పుల్లయ్య

తండ్రి పిచ్చయ్య. 1890 లో నూజివీడు తాలూకా ఆగిరిపల్లిలో జన్మించారు. 1938 లో కీర్తిశేషులయ్యారు. రైతు వర్తకులు. 1922 లో కల్లు

దుకాణాలవద్ద పికెటింగ్ చేసినందుకు ఆరు మాసాల కఠిన శిక్షను నూజివీడులో విధించారు. 14-2-1922 నుండి రాజమండ్రిలో శిక్షను అనుభవించారు. అనేక సార్లు జాతీయోద్యమాల సందర్భంగా రిమాండ్‌లో ఉంచారు.

## దాసరి రామయ్య

నూజివీడు తాలూకా నివాసి. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. పోలీసు లాకప్‌నుంచి విడుదలయ్యారు.

## దేవినేని జగన్నాధరావు



తండ్రి సూర్యనారాయణ. 1922 లో ఏలూరు తాలూకా సానిగూడెంలో జననం. రైతు. ప్రస్తుత నివాసం నూజివీడు తాలూకా దిగవల్లి. క్విట్ ఇండియా ఉద్యమంలో 31-10-'42 న ఆరు మాసాల కఠినశిక్ష విధించబడి అలీపురం క్యాంప్ జైలులో శిక్షను అనుభవించారు. 10-4-43 న విడుదలయ్యారు. చరకా, హరిజన, భూదాన ఉద్యమాల్లోనూ పొట్టి శ్రీరాములుగారు ప్రారంభించిన ఆంధ్రరాష్ట్ర ఉద్యమంలోనూ పాల్గొన్నారు.

## నందిగం కనకసీతారామయ్య



తండ్రి కృష్ణయ్య. జన్మస్థలం నూజివీడు తాలూకా వేలేరు. ప్రస్తుత నివాసం విజయవాడ. 1930 ఉప్పు సత్యాగ్రహ కాలంలో గుడివాడలో లాఠీ చార్జీకి గురయ్యారు. కేంద్ర ప్రభుత్వ పెన్షన్ పొందుతున్నారు.

## పారేపల్లి లక్ష్మీనారాయణ

జననం నూజివీడు తాలూకా ఆకిరిపల్లి. సహాయ నిరాకరణంలో పాల్గొని 14-2-1922 నుంచి ఆరు మాసాలు కఠిన శిక్ష రాజమండ్రి జైలులో అనుభవించారు.

## పోలాప్రగడ లక్ష్మీనరసింహారావు

తండ్రి జగ్గరాజు. జన్మస్థలం నూజివీడు తాలూకా ఎనమదల. రైతు. వ్యష్టి సత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. 25-1-1941 న సంవత్సరం కఠిన శిక్ష, రు. 300/- జరిమానా విధించారు. అలీపురంజైలులో శిక్ష అనుభవించారు.

## బొమ్మికంటి రామకృష్ణయ్య

తండ్రి సుబ్బారాయుడు. జన్మస్థలం నూజివీడు తాలూకా సూరవరం. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని, 19-1-1932 నుంచి సంవత్సరం జైలు శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## ముత్యాల శ్రీనివాసులు



తల్లి లక్ష్మీతులసి. 1901 ప్రాంతంలో జననం. 1942 క్విట్ ఇండియా వుద్యమంలో పాల్గొన్నారు.

## రాళ్ళపల్లి సత్యనారాయణ

తండ్రి రత్తయ్య. నూజివీడు తాలూకా సూరవరం వాస్తవ్యులు. రైతు. శాసనోల్లంఘన ఉద్యమంలో ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. 19.1.32 నుండి రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష ననుభవించారు.

### లింగం లక్ష్మీనారాయణ



తండ్రి భూషయ్య (ఉరఫ్ బుచ్చయ్య) గన్నవరం తాలూకా ముదునూరులో జననం ప్రస్తుతనివాసం నూజివీడు తాలూకా పోనసానపల్లి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో 27-3-43 న గుడివాడలో పది మాసాల కఠిన శిక్ష విధింపబడింది. అలీపురం క్యాంప్, వెల్లెస్లీ శానిటోరియం (బళ్లారి) జైళ్ళలో శిక్ష ననుభవించారు. సబ్ జైలులో పోలీసులు రక్తం కక్కేటట్లు కొట్టారు. మంగళగిరి ఆస్పత్రిలో చేర్చబడ్డారు. విడుదల అనంతరం కూడా దీనివల్ల ఆరోగ్యం కోలుకోలేదు.

# తిరువూరు తాలూకా

## గంపలగూడెం

### ఊటుకూరి రామకృష్ణారావు

జన్మస్థలం తిరువూరు తాలూకా గంపలగూడెం. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు 12.6-1930 న రోలుపడె గ్రామంలో అరెస్టయ్యారు. జైలుశిక్ష విధించి, మైనరైనందున తంజావూరు బోర్‌స్టల్ స్కూలుకు పంపారు. కీర్తిశేషులయ్యారు.

### ఊటుకూరు లక్ష్మీనరసింహారావు



తండ్రి వెంకట సుబ్బారాయుడు. జన్మస్థలం తిరువూరు తాలూకా గంపలగూడెం. పోస్టుమాస్టర్ ఉద్యోగానికి రాజీనామా చేసి, ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 24-6-30 న 18 నెలల కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, వెల్లూరు, కడలూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు గాంధీ ఇర్విన్ ఒప్పందంతో 9-3-1931 న విడుదలయ్యారు. కీర్తిశేషులు.

### ఊటుకూరు వెంకటప్పయ్య



తిరువూరు తాలూకా గంపలగూడెం వాస్తవ్యులు 1921సహాయ నిరాకరణ ఉద్యమంలో అంటే త్రివిధ బహిష్కార ఉద్యమంలో పాల్గొన్నారు ఆరు నెలల శిక్ష విధించబడింది. ఉద్యమంలో పాల్గొన్నందుకు గ్రామ మున్సబు పదవినుండి డిస్మిస్ చేయబడ్డారు గాంధీ- ఇర్విన్ ఒడంబడిక తర్వాత తిరిగి మున్సబుగా నియమింప బడ్డారు. 1965 లో కీర్తిశేషులయ్యారు.

## కఠారు రంగనాయకులు



తండ్రి జగన్నాథరావు. తిరువూరు తాలూకా గంపలగూడెంలో 15-2-1904న జన్మించారు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు రోలుపడె గ్రామంలో 12-6-30న అరెస్టయ్యారు. 14 6-1930 న రెండు సంవత్సరాలు కఠినశిక్ష విధించగా, బళ్ళారి, రాజమండ్రి జైళ్ళలో శిక్ష అనుభవించి 13-1-1931 న విడుదలయ్యారు.

## కఠారు వీరాస్వామి



తండ్రి సోమయ్య. 1900 లో జననం. తిరువూరు తాలూకా గంపలగూడెం గ్రామ కరణం ఉద్యోగానికి రాజీనామా యిచ్చారు. గంపలగూడెం కుమార రాజాగారి నాయకత్వాన తిరువూరు తాలూకాలో అనేక ఉద్యమాలు నడిపారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, మంగినపూడి, చిన్నాపురంలలో ఉప్పు తయారు చేశారు. 12-6-30 న అరెస్టయ్యారు. విజయవాడలో 14-6-30 న రెండేళ్ళ శిక్ష విధించగా రాజమండ్రి, బళ్ళారి సెంట్రలు జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 11-3-31 న విడుదలయ్యారు. ప్రభుత్వం తిరిగి కరిణీకం యిచ్చింది. జిల్లా కాంగ్రెస్ సభ్యునిగా 10 ఏళ్ళు వున్నారు. 1978 లో కీర్తి శేషులయ్యారు.

## కఠారు గోవిందరావు



తల్లి కోటమ్మ. తిరువూరు తాలూకా గంపలగూడెం నివాసి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 12-6-30 న రోలుపడె గ్రామంలో అరెస్టయ్యారు. 14-6 1930 నుంచి 2 ఏండ్ల కఠినశిక్ష పడగా రాజమండ్రి, బళ్ళారి సెంట్రల్ జైళ్ళలో వున్నారు. గాంధీ ఇర్విన్ ఒడంబడిక వల్ల 11-3-1931న విడుదలయ్యారు.

## కాసులనాటి వెంకటేశ్వర్లు

జన్మస్థలం తిరువూరు తాలూకా గంపలగూడెం. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 20 6 30 న అరెస్టుచేసి విజయవాడలో రెండేళ్ళ శిక్ష విధించారు మైనరైనందున తంజావూరు బోర్‌స్టల్ స్కూలు (జైలు)కు పంపారు. కీర్తి శేషులు.

## కోటగిరి వెంకట కృష్ణారావు



తండ్రి జగన్నాధ రాయణిలు, జననం 1891 న తిరువూరు తాలూకా గంపల గూడెం జమీందారు. జమిందారీ కుటుంబంలో జన్మించినా, జాతీయ భావంతో ఉద్దీప్తులై దేశసేవకు జీవితాన్ని అంకితం చేశారు. గాంధీజీ ఆదేశం ప్రకారం తన శాసనసభా సభ్యత్వానికి రాజీనామా చేశారు. 1920-21 ప్రాంతాలలో బరంపురంలో జరిగిన ప్రత్యేకాంధ్ర రాష్ట్ర మహాసభలకు అధ్యక్షులు. సభలను దిగ్విజయంగా నడిపించారు. ఆ సభల అనంతరం సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని 29-9-1921 నుంచి సంవత్సరం జైలుశిక్ష కడలూరు జైలులో అనుభవించారు. బెజవాడనుంచి బయలుదేరిన మొదటి

ఉప్పుసత్యాగ్రహ దళానికి నాయకత్వం వహించగా 30-4-1930 నుంచి సంవత్సరం జైలు శిక్ష రాజమండ్రి, మద్రాసు, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1929 లో ఖద్దరు నిధికి రు 1116 లు. విరాళమిచ్చారు. 1931 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. ఆంధ్రరాష్ట్రం కోసం తీవ్రంగా కృషి చేశారు. గ్రంథాలయ ఉద్యమ వ్యాప్తికి కృషి చేశారు. అభినవ పాండవీయం, పాదుషా పరాభవం, బెబ్బులి, ప్రణయావర్శం, వేదవతి - ఇంకాకొన్ని నాటకాలు రచించారు. సత్యాగ్రహోద్యమ కాలంలో చాలా పాటలు రచించారు. బెబ్బులి నాటకాన్ని ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు కొంత కాలం బి. ఏ. తెలుగు పాఠ్య గ్రంథంగా పెట్టారు. వీరికి ప్రజలు "ఆంధ్రసింహ" "నాటక కళాప్రపూర్ణ" బిరుదుల నిచ్చారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు "కళాప్రపూర్ణ" బిరుదు నిచ్చారు.

## కోటగిరి పార్థసారథి



తండ్రి నరసయ్య. తిరువూరు తాలూకా గంపలగూడెం లో 15-3 1911లో జన్మించారు. విద్యార్థి దశలోనే ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా 20-6-1930న అరెస్టు అయ్యారు. విజయవాడలో 2-7 1930 న 2 ఏండ్ల కఠిన శిక్ష విధింపబడి రాజమండ్రి జైలులోను, తంజావూరు బోస్టల్ స్కూలులోను శిక్ష అనుభవించారు. 18-2-31 న విడుదల చేయబడ్డారు.

## కోటగిరి సూర్యప్రకాశరావు



తండ్రి నరసయ్య తిరువూరు తాలూకా గంపలగూడెం నివాసి 15-11-1906 లో నూజివీడులో జననం. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 12-6-30న రోలుపడె గ్రామంలో అరెస్టయ్యారు. విజయవాడ సబ్ కలెక్టర్ చే 2 ఏండ్ల కఠినశిక్ష విధింపబడింది. 14-6-1930 నుంచి రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించి గాంధీ ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 11-3 31 న విడుదలయ్యారు. గ్రామకాంగ్రెస్ అధ్యక్షులుగా చాలా కాలం వున్నారు.

## కోటగిరి మంగతాయారమ్మ



తిరువూరు తాలూకా గంపలగూడెం సమీపంలోని సొబ్బాల గ్రామ నివాసిని 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా నెట్టారులో అరెస్టు చేసి ఆరు నెలల శిక్ష విధించారు. రాయవెల్లూరులో శిక్ష అనుభవించారు. కీర్తిశేషులైరి.

## చలంశెట్టి సుబ్బయ్య

తిరువూరు తాలూకా గంపలగూడెం వాస్తవ్యులు. 1921 సహాయ నిరాకరణోద్యమంలో. పాల్గొని జైలు శిక్ష ననుభవించారు. కీర్తిశేషులైరి.

## చారుగుండ్ల సీతారామయ్యగుప్త



తిరువూరు తాలూకా గంపలగూడెం వాస్తవ్యులు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 12-6-30 న రోలుపడె గ్రామంలో అరెస్టయ్యారు. 14.6-30 న విజయవాడలో రెండేళ్ళ శిక్ష విధించబడింది. మైనరైనందున తంజావూరు బోర్‌స్టల్ స్కూలు (జైలు)కు పంపారు. కీర్తిశేషులు.

## పేట బాపయ్య



తండ్రి కోటయ్య జన్మస్థలం తిరువూరు తాలూకా గంపలగూడెం. నివాసం విజయవాడ. రైతు. ఎస్‌ఎస్.ఎల్‌సి.వరకు చదివారు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసువారి ఆదేశానుసారం అహమ్మదాబాద్ సబర్మతి ఆశ్రమంలో 1921 లో శిక్షణ పొందారు. 1920-21 సహాయ నిరాకరణంలో పాల్గొని ఆరు నెలల శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు ఉప్పు సత్యాగ్రహంలో ప్రముఖ పాత్ర వహించారు. 15-5-1930 నుంచి 18 మాసాల శిక్షను రాజమండ్రి, మద్రాసు, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒప్పందంతో 13 3-1931 న విడుదలయ్యారు. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 12-1-1932 న సంవత్సరం కఠిన శిక్ష రు. 200/- జరిమానా విధించారు రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1937 లో జమిందారీ వ్యతిరేక రైతు ఉద్యమంలో ఒక నెల జైలుశిక్ష అనుభవించారు. క్విట్ ఇండియాఉద్యమంలో 17-6.1942 నుంచి 4-9-1945 వరకు కన్ననూరు, బళ్ళారి, వెల్లెస్లీ శానిటోరియమ్ జైళ్ళలో డెడిన్యూగా వున్నారు. ఆంధ్రరాష్ట్ర ఫార్వర్డ్ బ్లాకు ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. ఆంధ్రప్రదేశ్ శాసనసభకు ఒకసారి ఎన్నికయ్యారు. పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ అధ్యక్షులుగా, కార్యదర్శిగా అనేక సంవత్సరాలు పనిచేశారు జిల్లా కాంగ్రెస్ అభివృద్ధికి విశేషంగా పాటుపడ్డారు. సహకారోద్యమంలో కూడ పనిచేశారు ప్రజలు వీరికి "సర్దార్" బిరుదునిచ్చారు. తిరువూరు తాలూకా హరిజన సంఘాధ్యక్షులుగాకూడా ఉన్నారు. ఆంధ్రరాష్ట్ర. ఆంధ్రప్రదేశ్ కార్యవర్గ సభ్యులుగా పనిచేశారు. కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘానికి పేట్రన్‌గా వున్నారు.

## మురుకుంట్ల వెంకటప్పయ్య



తండ్రి నరసింహయ్య. 1912 ఆగస్టు 9న జన్మించారు. తిరువూరు తాలూకా గంపలగూడెం వాస్తవ్యులు. విద్యార్థి దశలోనే ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు 12-6 30 న రోలుపడె గ్రామంలో అరెస్టయ్యారు. విజయవాడలో 14.6-30 న రెండేళ్ళ కఠిన శిక్ష విధించబడింది, తంజావూర్ బోర్‌స్టల్ స్కూలు (జైలు) లోను. రాజమండ్రి జైలులోను శిక్ష ననుభవించారు. 18-2-31 న విడుదలయ్యారు తిరిగి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. ఆగస్టు 12 న అరస్టయ్యారు. 9-9-42 నుండి అలీపురం జైలులోను వెల్లెస్లీ శానిటోరియం జైలు (బళ్ళారి) లోను 9 నెలల శిక్షను అనుభవించారు. తాలూకా కాంగెసు అధ్యక్షులుగా పనిచేశారు. తాలూకా హరిజనసేవక్ కార్యదర్శిగా పనిచేశారు. శ్రీకృష్ణరాయ శుద్ధ ఖద్దరు ఉత్పత్తి సంఘ కార్యదర్శిగా పనిచేశారు. తాలూకా జమీన్ రైతు సంఘ కార్యదర్శిగా పనిచేశారు. రెండు దఫాలు జిల్లా బోర్డు సభ్యులుగా పనిచేశారు.

### రాఘవరపు వెంకయ్య

తండ్రి కోటయ్య. జన్మస్థలం తిరువూరు తాలూకా గంపలగూడెం. 1920-21 సహాయ నిరాకరణంలో పాల్గొని, ఆరు నెలల కఠిన శిక్ష అనుభవించారు. తిరిగి ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 14-6-1930 న రెండు సంవత్సరాల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష ననుభవించారు. 5-11-1930 న విడుదలయ్యారు. కీర్తిశేషులు.

### సంతపురి నారాయణరావు



జన్మస్థలం తిరువూరు తాలూకా గంపలగూడెం. 1920-21 సహాయ నిరాకరణంలో పాల్గొని, ఆరు నెలల కఠిన శిక్షను అనుభవించారు. 1966 లో కీర్తిశేషులైరి.

### సువారపు వెంకయ్య



తండ్రి నరసయ్య. 1904 ప్రాంతంలో గంపలగూడెంలో జన్మించారు. 1921 సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్నందుకు 6 నెలల కఠిన శిక్ష, రు. 25 లు జరిమానా విధింపబడింది. 13-8-1921 నుంచి రాజమండ్రిలో శిక్ష అనుభవించారు. 1930 లో అరెస్టు చేయబడి కొద్ది రోజులు పోలీసు కస్టడీలో వున్నారు. 1969 లో కీర్తిశేషులయ్యారు.

## తిరువూరు తాలూకా వివిధ గ్రామాలు

### అనుమర్లపూడి వెంకట సీతారామారావు



తిరువూరుతాలూకా కోడూరులో 1905 న జన్మించారు. 1932 శాసనోల్లంఘనంలో తాటి గెలలు నరికే కార్యక్రమం నిర్వహించి, లాఠీచార్జీకి గురయ్యారు. అనంతరం 1933 లో నైజాం సంస్థానంలో పి. డబ్లు. డి. సూపర్‌వైజర్‌గా పనిచేస్తూ, ఖమ్మం జిల్లా వైరాలో హరిజన దేవాలయ ప్రవేశం చేయించారు. అందుకు శిక్షగా నిజాం ప్రభుత్వం నిజామాబాద్‌కు బదిలీ చేసింది. అక్కడ కూడా హరిజన దేవాలయ ప్రవేశం జరిపించడంతో ఉద్యోగం నుంచి బర్తరఫ్ అయ్యారు. స్వస్థలం తిరిగి వచ్చి, రైతు ఉద్యమం నిర్మించి జమీందారీ వ్యతిరేక పోరాటం సాగించారు. కమ్యూనిస్టు పార్టీలో చేరి, రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో రహస్య జీవితం గడిపారు. పట్టి యిచ్చిన వారికి బహుమానాన్ని ప్రభుత్వం ప్రకటించింది. పోలీసులు ఆయన ఇంటిని స్వాధీనం చేసుకొన్నారు. 1949 లో కడలూరు జైలులో డిటెన్యూలపై పోలీసులు జరిపిన కాల్పులలో మృతి చెందారు.

### అల్లు సత్తిరెడ్డి

తిరువూరు తాలూకా రెడ్డిగూడెం వాస్తవ్యులు. 1940-41 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని జైలుశిక్ష ననుభవించారు. కీర్తిశేషులు.

## కాశీ సోమయ్య

తిరువూరు తాలూకా విస్సన్నపేట నివాసి. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు.

## కొండపర్తి కోదండరామయ్య

తండ్రి రామయ్య జన్మస్థలం తిరువూరు తాలూకా ముష్టికుంట్ల. స్వర్ణకారులు నైజాం వ్యతిరేక పోరాట కాలంలో 7-9-1947 నుంచి 19-1-1948 వరకు వరంగల్లు సెంట్రల్ జైలులో డిటెన్యూగా వున్నారు.

## గద్దె రంగయ్యనాయుడు



తండ్రి రామయ్య. జననం 1870 తిరువూరు తాలూకా ముష్టికుంట్ల. 1913 లో రైల్వే ఉద్యోగానికి రాజీనామా చేశారు. 1919 నుంచి చాలా సంవత్సరాల పాటు మద్రాసు-ఆంధ్ర జిల్లా కాంగ్రెసు సంఘ కార్యదర్శిగా, అధ్యక్షులుగా పనిచేశారు. ఎ ఐ సి సి. సభ్యులు. 1921 22 సహాయ నిరాకరణంలో పాల్గొన్నారు తిరిగి ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 21-4-1930 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను మద్రాసు, తిరుచునాపల్లి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు శాసనోల్లంఘనంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. 30-6 1932 న సంవత్సరం కఠిన శిక్ష, రు. 300/- జరిమానా విధించారు. మద్రాసు, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. వ్యష్టి సత్యాగ్రహ కాలంలో 19-12-1940 నుంచి 1-11-1941 వరకు వెల్లూరు జైలులో డిటెన్యూగా వున్నారు. మద్రాసు కార్పొరేషన్ సభ్యులుగా 1937 లో మద్రాసు శాసనసభ సభ్యులుగా ఎన్నికయ్యారు.

## గంగు సత్యనారాయణ ఉరఫ్ సత్యం



తండ్రి వెంకటకృష్ణయ్య. 26-9-1928 న తిరువూరులో జననం. విద్యార్థి దశలో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని జిల్లా పరిషత్ హైస్కూలు పాకకు నిప్పు అంటించారు. 30-8-1942 న అరెస్టు చేశారు. కొండపల్లి, విజయవాడ, నందిగామ గ్రామాల్లో విచారణకు వాయిదాలువేసి తిప్పారు. నందిగామ మకాంలో, తిరువూరు తాలూకా ఆఫీసు వద్ద రెండుచేతులు కట్టివేసి, సబ్‌కలెక్టర్ 32 కొరడా దెబ్బల శిక్షవిధించారు. విజయవాడలో శిక్షను అమలు పరచారు. "సత్యం, గంగు" పేరుతో పుస్తకాలు రచించారు కులాంతర కంతు వివాహం చేసుకొన్న సంఘ సంస్కర్త.

## చిలుకూరి సత్తిరెడ్డి



తండ్రి అప్పిరెడ్డి జన్మస్థలం తిరువూరు తాలూకా రెడ్డిగూడెం. రైతు. 1941లో వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు, 4 నెలల 15 రోజులు రిమాండ్‌లో వుంచి తర్వాత 4 నెలల 15 రోజులు కఠిన శిక్ష, రు. 750/-లు జరిమానా విధించారు. జైలులో వుండగా ఆస్తి జప్తుచేసి జరిమానా వసూలు చేశారు. 21-3-1941 నుంచి రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించారు. కీర్తిశేషులు.

## జగన్నాధాచారి

జన్మస్థలం తిరువూరు తాలూకా విస్సన్నపేట. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, జైలు శిక్ష అనుభవించారు.

### పొట్లూరి రామస్వామి

జన్మస్థలం తిరువూరు తాలూకా పార్వతీపురం, 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీచార్జీకి గురయ్యారు.

### వి.వి.కె. సుబ్రహ్మణ్యం

తిరువూరు వాస్తవ్యులు. 1907 వందేమాతరం ఉద్యమంలోపాల్గొన్నందుకు రాజమండ్రిలోని గవర్న మెంట్ ఆర్ట్సుకాలేజీ నుండి బహిష్కరించబడ్డారు.

### వేదాంతం శంభుశాస్త్రి

తండ్రి శేషావధానులు. తిరువూరు తాలూకా మద్దులపర్వ వాస్తవ్యులు. రైతు. సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్నారు. 2-2-1922 నుండి 1-2-1923 వరకు రాజమండ్రి,కడలూరు జైళ్ళలోశిక్ష ననుభవించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 23-5-30 న రెండేళ్ళ కఠినశిక్ష విధింపబడి, రాజమండ్రి వెల్లూరు, అలీపురం జైళ్ళలో నిర్బంధించబడ్డారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ననుసరించి13 3-1931 న విడుదలయ్యారు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో వీరికి ఆరు నెలల కఠిన శిక్ష రు. 100 జరిమానా విధించబడింది.

### వేదాంతం వెంకటసుబ్రహ్మణ్య శర్మ

తండ్రి శంభుశాస్త్రి. తిరువూరు తాలూకా మద్దుల పర్వ వాస్తవ్యులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు రెండేళ్ళ కఠిన శిక్ష విధించబడింది. తంజావూరు బోర్‌స్టల్ స్కూలులోను, రాజమండ్రి సెంట్రల్ జైలులోను శిక్ష ననుభవించారు. 18-2-1931 న విడుదలయ్యారు.

### సయ్యద్ సాలార్

తండ్రి సయ్యద్ ఖాశిం. 1914 జూన్‌లో జననం. నాటక, సినీ రంగాలలో నటుడు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో నవంబర్‌లో తిరువూరు తాలూకా విస్సన్నపేట ట్రావెలర్స్ బంగళా తగుల బెట్టిన కేసులో అరస్టయారు. విజయవాడ సబ్‌జైలులో ఆరు నెలల పైబడి వున్నారు సబ్ కలెక్టర్ కేసు విచారించి కొట్టివేశారు. రైతుకూలీ సంఘాలలో పని చేశారు.

### సుబ్బయ్యనాయుడు

తిరువూరు తాలూకా విస్సన్నపేట వాస్తవ్యులు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నందుకు జైలుశిక్ష ననుభవించారు. కీర్తిశేషులు.

# నందిగామ తాలూకా

## జగ్గయ్యపేట

### అమరవాది శ్రీరామమూర్తి

తండ్రి యజ్ఞనారాయణ. 1915 జనవరి 5 న జగ్గయ్యపేటలో జన్మించారు. రైతు. ప్రస్తుత నివాసం సికింద్రాబాద్. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. బాంబు కేసులో 17-4-1943 న 8 నెలల కఠిన శిక్ష విధించారు. అలీపురం క్యాంపు జైలు నుండి జామీన్‌పై 16-9-1943 న విడుదలయ్యారు. ఆ తరువాత మద్రాసు హైకోర్టులో కేసు కొట్టివేశారు.

### కట్టమూరి సత్యనారాయణ



తండ్రి మల్లిఖార్జున రావు. జననం 1920 నందిగామ తాలూకా జగ్గయ్యపేట. 1938 నుంచి 1942 వరకు ఖాదీ ప్రచారం చేశారు. 1938లో శ్రీ బాలమిత్ర బ్రహ్మనంద నాట్య మండలిని స్థాపించి, 'తెలుగు తల్లి', 'నవభారత్' వంటి జాతీయ నాటకాలు

ప్రదర్శించాడు. క్విట్ ఇండియా ఉద్యమంలో జగ్గయ్యపేట బాంబు కేసులో ఈ నాట్యమండలికి చెందిన ముగ్గురు శిక్షలు పొందారు.

## డా|| కలవకొలను శోభనాద్రి



తండ్రి పూర్ణయ్య. జననం 1907 గన్నవరం తాలూకా మొండూరు. మద్రాసులో ఎల్.ఎమ్.పి. డిప్లొమా పొంది, 1934 లో జగ్గయ్యపేటలో ప్రాక్టీసు ప్రారంభించారు. వైద్య సేవద్వారా ప్రజల అభిమానం చూరగొన్నారు. క్విట్ ఇండియా ఉద్యమంలో జగ్గయ్యపేట బాంబు కేసులో ప్రథమ ముద్దాయి. విజయవాడలో పోలీసు కస్టడీ నుంచి తప్పించుకొని, పరారై, కొంతకాలం రహస్య జీవితం గడిపారు. పిమ్మట తనకుతానుగా పోలీసులకు పట్టుబడ్డారు. బాంబు కేసులో 13-2-1943న నాలుగున్నర సంవత్సరముల కఠిన శిక్ష విధించారు. శిక్షా కాలం పూర్తికాక మునుపే, కేంద్రంలో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడటంతో విడుదలయ్యారు.

## కాటుబోయిన పన్నారు



తండ్రి వెంకయ్య. జననం 1923 నందిగామ తాలూకా జగ్గయ్యపేట. గుమాస్తా. క్విట్ ఇండియా ఉద్యమంలో కల్లుచెట్ల గెలలు నరికి, తంతి తీగెలను కత్తిరించే కార్యక్రమంలో పాల్గొన్నారు. జగ్గయ్యపేటలో జిల్లా కలెక్టరుపై బాంబులు విసిరిన ఇద్దరిలో ఒకరు. అనంతరం అజ్ఞాతవాసంలో వుంటూ, పోలీసులకు పట్టుబడకుండా తప్పించుకొన్నారు 3-10-78 న కీర్తిశేషులైరి.

## చౌడవరపు బాపనయ్య



తండ్రి మల్లయ్య. జననం 20-11-1917 నందిగామ తాలూకా జగ్గయ్యపేట. క్విట్ ఇండియా ఉద్యమంలో జగ్గయ్యపేట బాంబుకేసులో అనుమానంపై పోలీసులు అరెస్టు చేసి, 15 రోజులు సబ్ జైలులో వుంచి అనంతరం విడుదలచేశారు.

## తూమాటి యోగానందాచార్యులు



తండ్రి వెంకటాచార్యులు 1920 లో జగ్గయ్యపేటలో జననం. క్విట్ ఇండియా ఉద్యమంలో 17-4-1943న ప్రేలుడు పదార్థాల చట్టం క్రింద విజయవాడ స్పెషల్ మేజిస్ట్రేటు 7 సంవత్సరాలు కఠిన శిక్ష విధించారు. జగ్గయ్యపేట, విజయవాడ, గుడివాడ సబ్ జైళ్ళలోను, అలీపురం, వెల్లెస్లీ శానిటోరియమ్, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. 30-3-1946 న ప్రభుత్వ ఉత్తర్వు మేరకు విడుదలయ్యారు. తామ్రపత్రగ్రహీత.

## దివ్వెల విశ్వనాథం



తండ్రి నరసయ్య. జన్మస్థలం జగ్గయ్యపేట. క్విట్ ఇండియా ఉద్యమంలో జగ్గయ్యపేట బాంబు కేసులో ముద్దాయి. ఆరేళ్ళ కఠిన శిక్ష విధించారు. 17-4-1943 నుంచి 30-3-1946 వరకు అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. 1946 లో

కేంద్రంలో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడటంతో, రాజకీయ ఖైదీల సామూహిక విడుదలలో భాగంగా విడుదలయ్యారు.

## ధూళిపాళ వెంకటేశ్వర్లు



తండ్రి లక్ష్మీనారాయణ. జననం 7-10-1912 గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా అంబాపురం. నివాసం నందిగామ తాలూకా జగ్గయ్యపేట. క్విట్ ఇండియా ఉద్యమంలో, చేతి బాంబులు తయారు చేయించి, తన ఇంటిలో భద్రపర్చి, 20-9-1942 రాత్రి జిల్లా కలెక్టరు మహంతిపై ప్రేల్చే ఏర్పాట్లు చేశారు. ఆ కేసు సందర్భంలో రహస్య జీవితం గడిపారు.

## పారేపల్లి వెంకటేశ్వర్లు



దత్తత తండ్రి లక్ష్మీనారాయణ అనే దాసు. జన్మస్థలం నందిగామ తాలూకా జగ్గయ్యపేట. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, లాఠీదెబ్బలు తిన్నారు. అరెస్టు చేసి, కేసు పెట్టకుండా వదిలి వేశారు. క్విట్ ఇండియా ఉద్యమంలో, జగ్గయ్యపేట బాంబు కేసు సందర్భంలో అరెస్టు చేశారు. కొద్దికాలం సబ్ జైలులో నిర్బంధించి వదిలివేశారు.

## పెద్దాపురపు నాగభూషణం



తండ్రి బాలయ్య. జననం 12-8-1914 నందిగామ తాలూకా జగ్గయ్యపేట. వ్యాపారి. క్విట్ ఇండియా ఉద్యమంలో, జగ్గయ్యపేట బాంబు కేసులో ముద్దాయి. 8 నెలల కఠిన శిక్ష విధించారు 17-4-1943 నుంచి 16-9-1943 వరకు అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. హైకోర్టు కేసును కొట్టివేయడంతో విడుదలయ్యారు. తామ్రపత్రగ్రహీత.

## పెద్దాపురపు వెంకట నారాయణ



తండ్రి బాలయ్య. జననం 5-8-1917 నందిగామ తాలూకా జగ్గయ్యపేట వ్యాపారి. క్విట్ ఇండియా ఉద్యమంలో 1942 ఆగస్టు 15 న జగ్గయ్యపేటలో ప్రథమ సత్యాగ్రహి. రెండు వారాల శిక్ష విధించారు. నైజాం వ్యతిరేక పోరాటంలో 7 నెలల 15 రోజుల జైలు శిక్ష అనుభవించారు. ప్రస్తుత నివాసం నల్లగొండజిల్లా సూర్యాపేట.

## పిల్లలమర్రి వెంకటేశ్వర్లు



తండ్రి లక్ష్మీకాంతం. జననం 1912 గుంటూరుజిల్లా తెనాలి తాలూకా మంచల. ప్రస్తుత నివాసం కృష్ణా జిల్లా జగ్గయ్యపేట. సైమన్ కమిషన్ బహిష్కరణలో పాల్గొన్నారు. ఆంధ్రలో కార్మికోద్యమ నిర్మాతలలో ఒకరు. రాష్ట్రీ ట్రేడ్

యూనియన్ కాంగ్రెసు మొదటి అధ్యక్షులు. యుద్ధ వ్యతిరేక చర్యలకుగాను 13-11-1940 న రెండేళ్ళ కఠిన శిక్ష విధించారు. నెల్లూరు, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. 2-7-1942 న ప్రభుత్వం విడుదల చేసింది. శాసనసభకు 1946 నుంచి 1967 వరకు మొత్తం 5 సార్లు వరుసగా ఎన్నికయ్యారు. 1962-67 మధ్య కాలంలో రాష్ట్రశాసనసభలో ప్రతిపక్ష నాయకులు.

## పోతురాజు లింగయ్య



తండ్రి వెంకట నరసయ్య. జననం 15-5-1919 నల్లగొండ జిల్లా సూర్యాపేట. నివాసం నందిగామ తాలూకా జగ్గయ్యపేట. స్వాతంత్ర్య పోరాటంలో బాంబులు తయారు చేస్తుండగా ప్రమాదం సంభవించి కుడిచేయి పూర్తిగాను, ఎడమ చేతివ్రేళ్ళు రెండు తెగిపోయాయి. వరంగల్లు, మానుకోట జైళ్ళలో 15 రోజులు నిర్బంధంలో వున్నారు.

## బాలెడు మోతరామ్

తండ్రి వెంకోసా. జననం 1922 జగ్గయ్యపేట. జగ్గయ్యపేటలో బాంబు తయారుచేసి, దానిని ప్రయోగించిన జట్టులో ఒకరు. అనంతరం అజ్ఞాతవాసంగడిపారు.

## బాలిన రాములు



తండ్రి వెంకయ్య. జననం 1920 నంది గామ తాలూకా జగ్గయ్యపేట. క్విట్ ఇండియా ఉద్యమంలో తంతితీగెలు త్రెంచివేత, కల్లుగీతచెట్లు గెలల నరికివేత, కల్లు పాకల దహనం వంటి చర్యలలో పాల్గొన్నారు. జగ్గయ్యపేటలో బాంబులను తయారు చేయడంలో పాత్ర వహించారు.

## బాలిన సత్యనారాయణ



తండ్రి సోమయ్య. జననం 1919 నంది గామ తాలూకా జగ్గయ్య పేట. క్విట్ ఇండియా ఉద్యమంలో జగ్గయ్య పేట బాంబు కేసులో పాత్ర వహించారు. తంతితీగెలు త్రెంచివేత, కల్లుగీత చెట్లు గెలలు నరికివేత చర్యలలో పాల్గొన్నారు.

## మళ్ళ నాగయ్య



తండ్రి పురుషోత్తం. నందిగామ తాలూకా జగ్గయ్య పేటలో 1916 లో జన్మించారు. స్వర్ణకారులు. క్విట్ ఇండియా ఉద్యమంలో జగ్గయ్యపేట బాంబు కేసులో ముద్దాయి. జగ్గయ్యపేట, నందిగామ, విజయవాడ, బందరు, కైకలూరు, అవనిగడ్డ జైళ్ళలో చాలాకాలం నిర్బంధింపబడ్డారు. 7 సంవత్సరాల కఠిన శిక్ష విధించబడింది. 17-4-1943 నుంచి 30-3-1946 వరకు అలీపురం జైలులోను, వెల్లెస్లీ శానిటోరియమ్ జైలులోను శిక్ష అనుభవించారు. కేంద్రంలో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడిన తరవాత 30-3-1946 న విడుదలయ్యారు. తామ్రపత్ర గ్రహీత.

## రాచర్ల నిత్యానందశర్మ

తండ్రి కృష్ణమూర్తి. జననం జగ్గయ్యపేట. 1930 లో కాంగ్రెసు ప్రచారం చేస్తూ, విజయవాడలో లాఠీఛార్జికి గురయ్యారు.

## మానిగ వెంకయ్య



తండ్రి నరసింహం. జననం 1907 నంది గామ తాలూకా జగ్గయ్య పేట. క్విట్ ఇండియా ఉద్యమంలో విప్లవ కారులకు కత్తులు, బల్లె ములు, చేతి బాంబులు వంటివి తయారు చేసి. తోడ్పడ్డారు. జగ్గయ్య పేట బాంబు కేసులో అరెస్టు వారెంటు జారీ కాగా. 7 నెలలు అజ్ఞాతవాసంలో గడిపారు.

## డా॥ మొరిశెట్టి బసవరాజు



తండ్రి రామనాథం. జన్మస్థలం జగ్గయ్య పేట. వ్యాపారి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొ న్నారు. 14 6-1930న రెండేళ్ల కఠిన శిక్ష విధించారు రాజమండ్రి బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 11 3 1931 న విడుదలయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 20-9-1942 న జగ్గయ్యపేట బాంబుల కేసుతో సంబంధంలేకున్నా కొన్నాళ్లు సబ్ జైలునిర్బం ధంలో వుంచారు. కవి. డాక్టర్. హిందీ ప్రచారం చేశారు, గ్రంథాలయం స్థాపించారు.

## వ్యాసం చిన్నకృష్ణదాసు

తండ్రి వెంగళయ్య. జన్మస్థలం నందిగామ తాలూకా జగ్గయ్య పేట. హరిదాసు. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. లాఠీఛార్జీకి గుర య్యారు. అరెస్టు చేసి వదిలివేశారు. నైజాం వ్యతిరేక పోరాటంలో పాల్గొని 1-8-1947 నుంచి 7-10-1948 వరకు వరంగల్లు సెంట్రల్ జైలులో డిటెన్యూగా వున్నారు.

## వీరగంటి అప్పారావు



తండ్రిరామస్వామి. జననం 15-4-1921 నందిగామ తాలూకా జగ్గయ్యపేట క్విట్ ఇండియా ఉద్యమంలో తంతి తీగెలు త్రెంచి వేత, కల్లుగీత చెట్లు గెలల నరికివేత చర్య లలో పాల్గొన్నారు. జగ్గయ్యపేటలో పేల్చిన చేతి బాంబుల తయారీలో పాత్ర వహించారు.

## సాధు రామకృష్ణయ్య



దత్తత తండ్రి కోదండరామయ్య. జన నం 1902 గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా చామర్తి. నివాసం నందిగామ తాలూకా జగ్గయ్యపేట. 1920-21 సహాయ నిరా కరణలో పాల్గొన్నారు. ఖాదీ ప్రచారం, హరిజనుల దేవాలయప్రవేశం, మద్య పాన వ్యతిరేక ప్రచారం, విదేశీవస్తు బహిష్కరణ వంటి కార్యక్రమాలు నిర్వహించారు. కన్నెవీడు, జుజ్జూరు గ్రామాలలో పన్నుల నిరాకరణ ఉద్యమం నడిపారు. 1930 లో అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు నాయకత్వంలో బందరువెళ్ళిన ఉప్పు సత్యా గ్రహ దళ సభ్యులు. క్విట్ ఇండియా ఉద్యమంలో, 17-8-1942 న అరెస్టు అయి. ఆరువారాల కారాగార వాస శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

# కొణకంచి

## అనుమల రామగోవిందశర్మ



తండ్రి కోటయ్య. జననం 1903 నందిగామ తాలూకా కొణకంచి. 1927 మద్రాసుకాంగ్రెసు మహాసభవాలంటీరు. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టుచేసి రెండున్నర సంవత్సరాలకఠినశిక్ష, రు 100 జరిమానా విధించారు. 14-6-1930నుంచి రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 11-3-1931 న విడుదలయ్యారు. 1936-37 ఎన్నికలలో కాంగ్రెసు ప్రచారబాధ్యతలు నిర్వహించారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆరు మాసాలు కఠినశిక్ష. రు. 200/-ల జరిమానా విధించారు. 31-1-'41 నుంచి రాజమండ్రి, బళ్లారి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో లాఠీ ఛార్జీకి గురయ్యారు హరిజన సేవా సంఘంలో పని చేశారు.

## ఎర్రం చిన్నరాఘవయ్య

జన్మస్థలం నందిగామ తాలూకా కొణకంచి. క్విట్ ఇండియా వుద్యమంలో పాల్గొన్నారు. పదిహేను రోజులు సబ్ జైలులో నిర్బంధంలో వున్నారు.

## ఐనంపూడి రాముడు



జన్మస్థలం నందిగామ తాలూకా కొణకంచి. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు.

## కాకుమాను పిచ్చయ్య

తండ్రి రామయ్య. జననం 1886 నందిగామ తాలూకా కొణకంచి. గ్రామ మునసబు. 1928-29 లో నందిగామ తాలూకాబోర్డు అధ్యక్షులు. 1930 ఉప్పు సత్యాగ్రహ కాలంలో, సత్యాగ్రహులను ప్రోత్సహిస్తూ, స్వగ్రామంలో ప్రభుత్వ సిబ్బందికి అన్న పానీయాలు, ఇతర వసతులు కల్పించకుండా గ్రామస్తులను పురిగొల్పి బాయ్‌కాట్ చేయించారన్న ఆరోపణపై మునసబు పదవినుంచి సంవత్సరంపాటు సస్పెండ్ చేశారు. నందిగామ తాలూకాలో ప్రాథమిక విద్యా వ్యాప్తికి విశేషంగా కృషి చేశారు. 1936 లో కీర్తిశేషులయ్యారు.

## కొణకంచి వెంకటేశ్వరరావు



నందిగామ తాలూకా కొణకంచి గ్రామంలో 18-1-1910 లో జన్మించారు. విద్యార్థి దశలోనే జాతీయోద్యమంలో పాల్గొన్నారు. బ్రిటిష్ ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శిస్తూ వువన్యసించినందుకు 1930 లో అరెస్టు వారెంట్ జారీ చేయబడగా ఒక సంవత్సరం పైగా అజ్ఞాతవాసంలో గడిపారు. చాలామంది కార్యకర్తల్ని ప్రోత్సహించి 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనేలాగ చేశారు

## కొత్తపల్లి శేషయ్య

నందిగామ తాలూకా కొణకంచి వాస్తవ్యులు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. కీర్తిశేషులు.

## కోడిగంటి సత్యనారాయణరావు

నందిగామ తాలూకా కొణకంచి వాస్తవ్యులు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు.

## కోడిగంటి వీరభద్రరావు



తండ్రి బలరామయ్య. జననం 18-7-1923 నందిగామ తాలూకా కొణకంచి. వైద్యవృత్తి క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో కల్లు, సారా పాటలకు ఆటంకం కల్పించి, రెండుసార్లు అరెస్టు అయ్యారు. మూడు నెలల జైలుశిక్ష అనుభవించారు.

## కోయ వెంకటనరసమ్మ



భర్త వెంకటరామయ్య. జననం 2-6-1895 నందిగామ తాలూకా కొణకంచి. క్విట్ ఇండియా ఉద్యమంలో కల్లుదుకాణాల ముందు పికెటింగ్ చేసి కరపత్రాలు పంచి అరెస్టు అయ్యారు. సబ్ జైలులో 15 రోజులు నిర్బంధించారు.

వీరి కుమారులు ఇద్దరూ 1941, 42 ఉద్యమాలలో పాల్గొని జైలుకు వెళ్ళారు.

## కోయ రంగనాయకులు



తండ్రి వెంకటరామయ్య. జననం 1-4-1911 నందిగామ తాలూకా కొణకంచి. రైతు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. 6-1-1941 న ఒక మాసం కఠిన శిక్ష, రు. 50 లు జరిమానా విధించారు. జరిమానా చెల్లించ నిరాకరించి, మొత్తం రెండు నెలల శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. క్విట్ఇండియా ఉద్యమంలో పాల్గొని, తిరిగి అరెస్టు అయ్యారు. 6-4-1943 న రెండున్నర సంవత్సరాల కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవిస్తుండగా, జిల్లా సెషన్స్ కోర్టు శిక్షను రద్దుచేయడంతో విడుదలయ్యారు.

## కోయ వెంకట జగన్నాథ దాసు



తండ్రి వెంకట్రామయ్య. జననం 1912 నందిగామ తాలూకా కొణకంచి. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని 16 రోజులు సబ్ జైలులో నిర్బంధంలో వున్నారు.

## గుగ్గిళ్ళ రామనాథం



జన్మస్థలం నందిగామ తాలూకా కొణకంచి. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు.

## తిరునగరి గోపయ్య

జన్మస్థలం నందిగామ తాలూకా కొణకంచి. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో 9-10-1942 న అరెస్టు చేసి, 15 రోజులపాటు సబ్ జైలులో రిమాండ్‌లో ఉంచారు.

## నకిరికంటి కృష్ణమూర్తి



తండ్రి చంద్రయ్య జననం 1914 నందిగామ తాలూకా కొణకంచి. వ్యాపారి. క్విట్ ఇండియా ఉద్యమంలో జగ్గయ్యపేట బాంబు కేసులో 21-9-42 న అరెస్టు చేశారు. వివిధ సబ్ జైళ్ళలో ఏడు మాసాలున్నారు. 1-4-43 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. 17-4-1943 నుంచి 16-9-1943 వరకు అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. జాతీయ భావ ప్రచారానికై బాలమిత్ర బ్రహ్మానంద నాట్య మండలి స్థాపించి "నవభారత" మొదలగు నాటకాలు ప్రదర్శించారు. దాని కార్యదర్శిగా పనిచేశారు. తామ్రపత్ర గ్రహీత.

## నారమట్టు సత్యనారాయణ



తండ్రి వీరాస్వామి. జన్మస్థలం నందిగామ తాలూకా కొణకంచి. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, సంవత్సరం కఠిన శిక్ష 6-4-1943 నుంచి అలీపురం జైలులో అనుభవించారు.

## నారమట్టు నారాయణ

జన్మస్థలం నందిగామ తాలూకా కొణకంచి, క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. సంవత్సరం కఠిన శిక్ష అనుభవించారు.

## పసుమర్తి అప్పయ్యశాస్త్రి

తండ్రి వెంకటప్పయ్య. జననం 1898 గుంటూరు జిల్లా తెనాలి తాలూకా శృంగారపు అగ్రహారం. నివాసం నందిగామ తాలూకా కొణకంచి, క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. విజయవాడ, నందిగామ సబ్ జైళ్ళలో ఆరునెలలు నిర్బంధంలో వుంచి, వదలివేశారు.

## మండడపు తిరుపతయ్య

నందిగామ తాలూకా కొణకంచి వాస్తవ్యులు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు.

## మండడపు బాల వీరరాఘవయ్య

తండ్రి చంద్రయ్య. జననం 1907 నందిగామ తాలూకా కొణకంచి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. ఆరుమాసాల కఠిన శిక్ష రు 30ల జరిమానా విధించారు. 6-10-1930 నుంచి 13-3-1931 వరకు రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒప్పందంతో విడుదలయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు కీర్తిశేషులైరి.

## మాదల పరంధామయ్య



తండ్రి నరసయ్య. జననం 1922 నందిగామ తాలూకా కొణకంచి, క్విట్ ఇండియా ఉద్యమంలో తంతి తీగెల త్రెంచివేత, కల్లుగీత చెట్ల గెలల నరికివేత చర్యలకు గాను అరెస్టుచేసి, 15 రోజులు సబ్ జైలులో నిర్బంధించారు.

## మాదల రంగయ్య



తండ్రి నరసయ్య. జననం 1922 నందిగామ తాలూకా కొణకంచి. క్విట్ ఇండియా ఉద్యమంలో తంతి తీగెల త్రెంచివేత, కల్లుగీత చెట్ల నరికివేత చర్యలకుగాను అరెస్టు చేసి, 15 రోజులు సబ్ జైలులో నిర్బంధించారు.

## రేపాలబుచ్చిరామ శేషయ్యశ్రేష్ఠి



తండ్రి పెద బిచ్చమయ్య. జననం 10-10-1910 న నంది గామ తాలూకా కొణ కంచి. ఉప్పు సత్యా గ్రహంలోపాల్గొన్నారు 6-10-1930 న ఆరు నెలల కఠిన శిక్ష రు. 30 జరిమానా విధించారు. రాజమండ్రి వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభ వించారు. 1932 శాసనోల్లంఘనంలో నందిగామ తాలూ కాలో తాటి, ఈత గెలలు నరికించడంలో ప్రముఖ పాత్ర వహించారు. 1932లో పోలీసులు దాడిచేసి యింట్లో గల భగత్ సింగ్ మొదలైన జాతీయ నాయ కుల ఫోటోలను ధ్వంసం చేశారు. క్విట్ఇండియా ఉద్యమంలో మూడుసార్లు 21-1-1943, 5-8-1943, 25-1-44 న అరెస్టు చేసి, పదేసి రోజుల చొప్పున సబ్ జైళ్ళలో నిర్బంధించారు. చేత్తో కాగితం తయారు చేసే నరిశ్రమను, నేత పరిశ్రమను స్థాపించారు. హరి జన సేవ, గ్రంథాలయోద్యమం, వయోజన విద్య మున్నగు కార్యక్రమాలు నిర్వహించారు తాలూకా కాంగ్రెస్ అధ్యక్షులుగా, జిల్లాబోర్డు సభ్యులుగా, పని చేశారు. 1967 లో శాసన సభ్యులుగా ఎన్నికయ్యారు. ప్రస్తుత నివాసం బండిపాలెం.

## లావు వీరయ్య

జన్మస్థలం నందిగామ తాలూకా కొణకంచి. 1941 లో యుద్ధ వ్యతిరేకోద్యమంలో కొండపల్లి రైల్వే స్టేషన్‌లో సిగ్నల్ తీగెలు తెంచి, ఆరు మాసాల కఠినశిక్ష అనుభవించారు. తిరిగి క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో మూడేళ్ళ జైలుశిక్ష అనుభవిం చారు.

## లింగగిరి శేషయ్య



తండ్రి పిచ్చయ్య. జననం 1930 నంది గామ తాలూకా కొణ కంచి. క్విట్ఇండియా ఉద్యమంలో తంతి తీగెలు తెంచివేత, కల్లుగీత చెట్ల గెలల నరికివేత చర్యలకు గాను అరెస్టుచేసి, 15 రోజులు సబ్ జైలులో నిర్బంధించారు.

## లింగగిరి రాములు



తండ్రి పిచ్చయ్య జననం 1916 నంది గామ తాలూకా కొణ కంచి. వ్యష్టి సత్యా గ్రహంలో పాల్గొని, కొద్ది రోజులు శిక్ష అనుభవించారు క్విట్ ఇండియా ఉద్యమంలో తంతితీగలు తెంచి, ఈత చెట్ల గెలలు నరికి, పోలీసులు వెంటాడగా రేపాల బుచ్చిరామయ్యశ్రేష్ఠితో పాటు ఏటిలోకి దూకి, తప్పించుకు పారిపోయారు. తరువాత అరెస్టు అయి, కొద్ది రోజులు నందిగామ, విజయవాడ సబ్‌జైళ్ళలో నిర్బంధంలో వున్నారు.

## షేక్ ఫకీర్ మహమ్మద్

నందిగామ తాలూకా కొణకంచి వాస్తవ్యులు. గ్రామోద్యోగి. క్విట్ ఇండియా ఉద్యమంలో 21 8-42 న తన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చారు

## షేక్ ఫకీర్ సాహెబ్

తండ్రి బికారు సాహెబ్. జననం 10 1-1896 నందిగామ తాలూకా కొణకంచి క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో బ్రిటిషు ప్రభుత్వం అమలుజరిపిన దమనకాండకు నిరసనగా తన తలారీ ఉద్యోగానికి

1942 లో రాజీనామా చేశారు. 1950 లో కీర్తిశేషులయ్యారు.

### షేక్ బికారు సాహెబ్

తండ్రి కాసిం సాహెబ్. జననం 1910 నందిగామ తాలూకా కొణకంచి. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో బ్రిటిషు ప్రభుత్వం అవలంబించిన దమన నీతికి నిరసనగా తన తలారి ఉద్యోగానికి రాజీనామా ఇచ్చారు. 10-6-1965 న కీర్తిశేషులయ్యారు.

### షేక్ సర్దార్ సాహెబ్

తండ్రి దస్తగిరి సాహెబ్. జననం 1-3-895 నందిగామ తాలూకా కొణకంచి. వ్యష్టి సత్యాగ్రహంలో రెండు సార్లు—17 1 1941 న, 5-8-41 న పాల్గొన్నారు. క్విట్ ఇండియా ఉద్యమంలో కల్లు పాటలకు ఆటంకం కల్గిస్తూ పికెటింగ్ చేసి, అరెస్టు అయ్యారు. సబ్ జైలులో 15 రోజులు నిర్బంధించారు.

### సాతులూరి రాఘవయ్య



తండ్రి అప్పయ్య. జననం 1922 నందిగామ తాలూకా కొణకంచి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో రహస్య బులిటెనులు గ్రామాలలో పంచుతూ, రెండు సార్లు అరెస్టు అయి, పోలీసు కస్టడీలో వున్నారు.

## నందిగామ తాలూకా వివిధ గ్రామాలు

### అయ్యదేవర బాలత్రిపుర సుందరమ్మ

జననం 1904 నందిగామ. 1931 లో విదేశీ వస్తు బహిష్కరణోద్యమంలో పాల్గొన్నారు. తన ఉద్యోగానికి రాజీనామా చేశారు. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో కూడా పాల్గొన్నారు. ఖాదీ ప్రచారం చేశారు.

### అడుసుమిల్లి కోటయ్య



జననం 1920 నందిగామ తాలూకా బండిపాలెం. క్విట్ ఇండియా ఉద్యమంలో బ్రిటిషు వ్యతిరేక కరపత్రాలు పంచినందుకు అరెస్టుచేసి, నెల రోజులు జగ్గయ్యపేట, నందిగామ సబ్ జైళ్లలో నిర్బంధించి, వదిలివేశారు.

### అనుమల వెంకట రామశర్మ

తండ్రి గురవయ్య. జన్మస్థలం నందిగామ తాలూకా పెనుగంచిప్రోలు. 17.1.1941 న యుద్ధ వ్యతిరేక నినాదాలతో వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు మూడు మాసాల కఠిన శిక్ష, రు. 250/ల జరిమానా విధించారు రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

### ఆదినారాయణ

తండ్రి రామయ్య. నందిగామ తాలూకా నివాసి. నైజాం వ్యతిరేక పోరాటంలో 27-11-1947 నుంచి 25.1.1948 వరకు వరంగల్లు జైయిలో శిక్ష అనుభవించారు.

## కొత్త రాములు



తండ్రి పాపయ్య. జననం 15.7.1917 నందిగామ తాలూకా కోనాయపాలెం. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో నందిగామ, విజయవాడ, బందరు సబ్ జైళ్ళలో మూడు మాసాలు నిర్బంధంలో వున్నారు. మరో మూడు మాసాలు రాజమండ్రి జైలులో శిక్షను అనుభవించారు.

## కొమ్మరాజు లక్ష్మణరావు



తండ్రి వెంకటప్పయ్య. జననం 1877 నందిగామ తాలూకా పెనుగంచిప్రోలు. కలకత్తా యూనివర్శిటీ ఎమ్.ఎ. మునగాల ఎస్టేట్ దివాన్. ప్రసిద్ధ రచయిత. సంఘ సంస్కర్త 1905లో వందేమాతరం ఉద్యమ కాలంలో మద్రాసులో స్వదేశీ ఉద్యమ నిధి వసూలు చేయాలని నిర్ణయించిన మొదటి సమావేశానికి హాజరైన విద్యార్థులలో ఒకరు. సాహిత్యం ద్వారా సమాజానికి ఎనలేని సేవ చేయవచ్చుననీ, గతకాలపు ప్రాభవాన్ని ప్రజల దృష్టికి తేవడంద్వారా ఉత్తేజం కల్గించవచ్చుననే విశ్వాసంతో 'విజ్ఞాన చంద్రిక గ్రంథ మండలి' ని మద్రాసులో స్థాపించారు. హైదరాబాద్‌లో 'కృష్ణదేవ రాయ ఆంధ్ర భాషా నిలయం" సంస్థను ప్రారంభించారు. 'హిందూ మహాయుగం' 'రాయచూరు యుద్ధం' "ఆంధ్ర భాషా సర్వస్వం" వంటి గ్రంథాలు రచించారు. తెలుగులో విజ్ఞాన సర్వస్వం ప్రారంభించిన మొదటివారు. 13.7.1923 లో కీర్తిశేషులైరి. డాక్టర్ అచ్చమాంబ ఆయన కుమార్తె.

## కోమటి వీరయ్య

తండ్రి సాంబయ్య. జన్మస్థలం నందిగామ తాలూకా చెవిటికల్లు. రైతు. నైజాం వ్యతిరేక పోరాట కాలంలో 13.2.1948 నుంచి 21.9 1948 వరకు వరంగల్లు జైలులో శిక్ష అనుభవించారు.

## చాగర్లమూడి వెంకటరామయ్య



తండ్రి రామశేషయ్య. జననం 8-9-1908 నందిగామ తాలూకా వీరులపాడు నివాసి. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. సంవత్సరం 12 వారాల కఠిన శిక్ష విధించారు. 2-7-1930 నుంచి రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931 న విడుదలయ్యారు. పోలీసుల ఆక్రమణ నుంచి విజయవాడలో ఆంధ్రరత్న భవనాన్ని విముక్తం చేయడానికి జరిపిన సత్యాగ్రహంలో లాఠీ దెబ్బలు తిన్నారు. పొట్టివాడైన ఇంగ్లీష్ సార్జంట్ ఆజానుబాహుడైన ఈ సత్యాగ్రహిని ఎగిరి చెంపదెబ్బ కొట్టవలసి వచ్చింది రెండవచెంప చూపగా, ఆ సార్జెంట్ నవ్వి మిన్నకుండిపోయాడు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, సంవత్సరం పన్నెండు వారాల కఠిన శిక్షను రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు.

## చాగర్లమూడి హనుమాయమ్మ



తండ్రి పాటిబండ్ల వెంకటరామయ్య. నందిగామ తాలూకా వీరులపాడులో 1910సం॥లో జన్మించారు. భర్త వెంకటరామయ్య 1932 శాసనోల్లంఘన కాలంలో రెండునెలలు గ్రామాలలో ప్రచారం చేసిన తరువాత విదేశీ వస్త్రాల

యాల ముందు పికెటింగ్ చేసి అరెస్టు అయ్యారు. 15 రోజులు సబ్‌జైలులో వుంచాక ఆరు నెలలు కఠిన శిక్షవిధించారు. 24-3-1932 నుంచి వెల్లూరు, మద్రాసు సెంట్రల్ జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1939లో కృష్ణాజిల్లాబోర్డు ఉపాధ్యక్షులుగా ఎన్నికయ్యారు.

## చావలమడుగు సూర్యనారాయణ



తండ్రి కొండయ్య. జననం 9-7-1920 నందిగామ తాలూకా కమ్మవారి పాలెం. రైతు. క్విట్ఇండియా ఉద్యమంలో పాల్గొని, విజయవాడలో అరెస్టు అయ్యారు. 12-8-'42 నుండి 12-9-1942 వరకు సబ్‌జైలు నిర్బంధంలో వున్నారు.

## చిమిరాల చెన్న బసవయ్య



తండ్రి సోమయ్య. జననం 11-4-1908 గన్నవరం తాలూకా తరిగొప్పుల. నివాసం నందిగామ తాలూకా జుజ్జూరు. 1932 శాసనోల్లంఘనంలో కల్లు దుకాణాల ముందు పికెటింగ్ చేశారు. క్విట్ ఇండియా ఉద్యమంలో ఉప్పలూరు రైల్వేస్టేషన్ తగులపెట్టడంలో పాల్గొన్నారు.

## చిరుమామిళ్ళ శేషాద్రి నాయుడు



జననం 1909 నందిగామ తాలూకా కోనాయపాలెం. వైద్యుడు. 1930 నుంచి నందిగామ తాలూకా పెనుగంచి ప్రోలులో డాక్టరుగా పనిచేస్తూ, కాంగ్రెసు ఉద్యమాభివృద్ధికి విశేషంగా కృషి చేశారు. 1946-47 లో నైజాంలో రజాకార్లకు వ్యతిరేకంగా సాగిన పోరాటసందర్భంలో రావి నారాయణరెడ్డికి ఒకపిస్టల్ బహూకరించారు. అనంతరం ఆకారణంపై ఆయనను పోలీసులు అరెస్టు చేశారు. కొన్నాళ్ళునిర్బంధంలో వుంచారు. ప్రస్తుతనివాసం విజయవాడ.

## తుటారపు భద్రయ్య



తండ్రిరమణయ్య. జననం 20-4-1920 నందిగామ తాలూకా నవాబ్‌పేట. హిందీ విశారద. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. సంవత్సరం కఠినశిక్ష విధించారు 6-4-1943నుంచి అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. ప్రస్తుత నివాసం ఖమ్మంజిల్లా బూర్గుంపహాడ్.

## పమిడి మర్రి నరసింహారావు



తండ్రి నారాయణ. జననం 15-10-1908 నందిగామ తాలూకా జుజ్జూరు. 1932 లో విదేశీ వస్తు బహిష్కరణకై పికెటింగ్‌లో పాల్గొన్నారు. క్విట్ ఇండియా ఉద్యమంలో లాఠీదెబ్బలు తిన్నారు. కొన్నాళ్లు పోలీసుల నిర్బంధంలో వున్నారు.

## పాటిబండ్ల వెంకయ్య

తండ్రి సుబ్బయ్య. జననం 1900 నందిగామ తాలూకా కొడవటిగల్లు 1930 లో స్వంత పనిమీద బొంబాయి వెళ్ళినప్పుడు, అక్కడ జరుగుతున్న ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, ఎరవాడ సెంట్రల్ జైలులో సంవత్సరం కఠిన శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో విడుదల అయ్యారు. 1970లో కీర్తిశేషులయ్యారు.

## పాటిబండ్ల వెంకటసుబ్బయ్యా చౌదరి



జననం 1910 నందిగామ తాలూకా వీరులపాడు. గాంధీజీ ప్రబోధ ప్రభావానికి లోనై 1925 లో హిందీ భాషాభ్యాసం. 1927 లో ఖద్దరు వస్త్రధారణ, జంతు బలుల నివారణోద్యమం నిర్వహించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఏడాది కఠిన శిక్ష, రు. 80 ల జరిమానా విధించారు. 3-9-1930 నుంచి రాజమండ్రి, బరంపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. 'దయాధర్మము' గ్రంథ రచయిత.

## పోపూరి భద్రయ్య



తండ్రి అప్పయ్య. జననం 1922 నందిగామ తాలూకా నవాబ్‌పేట. క్విట్ ఇండియా ఉద్యమంలో తంతి తీగెల త్రెంచివేత, తాటి, ఈత గెలల నరికివేత చర్యలలో చురుకుగా పాల్గొన్నారు. ఆ సందర్భంలో దాదాపు 8 నెలలు రహస్య జీవితం గడిపారు. 6-4-1943 న అరెస్టు చేసి, రెండు నెలల శిక్ష విధించారు. విజయవాడ సబ్‌జైలులో శిక్ష అనుభవించారు.

## పోచంపల్లి వెంకట సుబ్రహ్మణ్యం

జననం 11-6-1915 నందిగామ తాలూకా నవాబ్‌పేట. పోచంపల్లి కరణీకం చేస్తూ, క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో బాధ్యతలను సక్రమంగా నిర్వహించ లేదన్న ఆరోపణపై ప్రభుత్వం 28-10-1943న ఉద్యోగం నుంచి బర్తరఫ్ చేసింది.

## బండారు వీరమల్లు ప్రసాద్

తండ్రి వీర రాజేశ్వర్లు. జన్మస్థలం నందిగామ తాలూకా వేములపల్లి అధ్యాపకులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు 25-6-1930 న రెండేళ్ళు కఠిన శిక్ష విధించారు రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931 న విడుదలయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో కూడా పాల్గొన్నారు.

## బండి ముత్తయ్యా చౌదరి



తండ్రి వెంకటయ్య జననం 15-5-1918 నందిగామ తాలూకా బండిపాలెం. క్విట్ ఇండియా ఉద్యమంలో డి.ఐ.ఆర్. క్రింద అరెస్టు అయి, కొన్నాళ్ళు సబ్ జైలులో వున్నారు. ఆరు మాసాల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు. ప్రస్తుత నివాసం నందిగామ తాలూకా పెనుగంచిప్రోలు.

## బండి తిరుపతయ్య



తండ్రి భూషయ్య. నందిగామ తాలూకా బండిపాలెం వాస్తవ్యులు. రైతు. రైతు ఉద్యమంలో సహకార ఉద్యమంలో పాల్గొన్నారు. వ్యష్టి సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నారు. 18-8-11 నుండి అలీపురం క్యాంపు జైల్లోనాల్గు నెలల శిక్షను అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 4-5-43 నుండి సంవత్సరం శిక్షను అలీపురం క్యాంప్ జైల్లో అనుభవించారు.

## డాక్టరు బుద్ధిరాజు సుబ్బారావు



దత్తత తండ్రి వీరభద్రరావు. నందిగామలో 1-10-1899 న జన్మించారు. వైద్య వృత్తి 1920 సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. వైద్య విద్యార్థులలో సహాయ నిరాకరణోద్యమం గురించి ప్రచారం చేశారు. 1926 లో గాంధీజీ ఆశ్రమంలో వున్నారు. 1930 లో మద్రాసు రాష్ట్ర యువజన సంఘ కార్యదర్శి. రాజగోపాలాచారిగారి నాయకత్వాన తిరుచునాపల్లి నుంచి వేదారణ్యం వరకూ జరిగిన పాదయాత్రలో పాల్గొన్నారు. 1930 లో మద్రాసులో 144 సెక్షన్ ధిక్కరించి, ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 9-5-1930 న ఆరునెలల కఠిన శిక్ష విధించారు. మద్రాసు, తిరుచునాపల్లి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు తిరిగి శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొని అరెస్టయ్యారు. 6-2-1932 న ఆరు మాసాల కఠిన శిక్ష రు. 30/- జరిమానా విధించారు రాజమండ్రి, కడలూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. ప్రస్తుత నివాసం నందిగామ తాలూకా కంచికచర్ల.

## మక్కెన వెంకట నర్సయ్య



3-2-1922 న నందిగామ తాలూకా బండిపాలెంలో జన్మించారు. క్విట్ ఇండియా వుద్యమంలో పాల్గొనగా నందిగామ, జగ్గయ్యపేట సబ్ జైళ్ళలో 25 రోజులు నిర్బంధింపబడ్డారు.

## మల్లెల వీరయ్య

తండ్రి అప్పయ్య. జన్మస్థలం నందిగామ తాలూకా పెద్దాపురం. రైతు. నైజాం వ్యతిరేక పోరాట కాలంలో మధిరలో అరెస్టు చేశారు. 13-2-1948 నుండి 21-9-1948 వరకు వరంగల్లు జైలులో శిక్ష అనుభవించారు.

## ముక్కపాటి గోపయ్య



తండ్రి పకీరయ్య. జననం 1919 నందిగామ తాలూకా కేతవీరునిపాడు. ఎస్.ఎస్.ఎల్.సి. చదువుతూ స్వాతంత్ర్య పోరాటంలోకిదుమికారు. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 5-3-1941న డి.ఐ.ఆర్. క్రింద అరెస్టు చేశారు. రెండు నెలల కఠినశిక్ష రు 350/- జరిమాన విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు

## ముత్తనేని నాగయ్య

జన్మస్థలం నందిగామ తాలూకా చిల్లకొల్లు. గ్రామ మునసబు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో 16-9-1942 న తన గ్రామోద్యోగి పదవికి రాజీనామా చేశారు.

## ములసా నాగయ్య

తండ్రి వెంకయ్య. జననం 6-5-1919 నందిగామ తాలూకా బండిపాలెం. క్విట్ఇండియా ఉద్యమంలో అరెస్టుఅయి, 15 రోజులు సబ్ జైలులో నిర్బంధంలో వున్నారు.

## మొక్కపాటి కామయ్య

తండ్రి లక్ష్మయ్య. జననం 1906 విజయవాడ తాలూకా చోడవరం. నివాసం నందిగామ తాలూకా పొక్కునూరు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. నెల రోజుల జైలు శిక్ష, రు. 5/-ల జరిమానా విధించారు.

## మేదరమెట్ల గోపయ్య



తండ్రి నారాయణ. నందిగామ తాలూకా వేములపర్తి. నైజాం వ్యతిరేక పోరాట కాలంలో 10-4-1948 నుంచి 21-10-1948 వరకు వరంగల్లు సెంట్రల్ జైలులో నిర్బంధంలో వున్నారు.

## రావిరాల గోపాలకృష్ణమూర్తి



తండ్రి బుచ్చిరాజు. జననం 9-7-1900 నందిగామ తాలూకా తోటరావులపాడు. కరణం. క్విట్ ఇండియా ఉద్యమంలో బ్రిటిష ప్రభుత్వం దమనకాండకు నిరసనగా కరిణీకానికి రాజీనామా చేశారు. రాజీనామాను ఆమోదించకుండా ఆర్. డి. ఓ. ఆయనను ఉద్యోగంనుంచి డిస్మిస్ చేశారు.

## రావూరు వెంకటేశ్వర్లు



తండ్రి పెద్ద అప్పయ్య. జననం 1922 నందిగామ తాలూకా ముప్పాళ. యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసినందుకు 21-2-1941 న అరెస్టు చేసి, మూడు నెలల శిక్ష, రు. 150/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## లచ్చా సీతారామయ్య

తండ్రి వెంకయ్య. నందిగామ తాలూకా వాసవ్యులు. రైతు. "హైదరాబాద్ స్టేట్ భారత యూనియన్‌లో విలీనం కావాలి" అనే ఉద్యమంలో వరంగల్ సెంట్రల్ జైలులో 13-2-'48 నుండి 21-9-'48 వరకు శిక్ష ననుభవించారు.

## వాసిరెడ్డి సదాశివేశ్వరప్రసాద్



తండ్రి వెంకటాద్రి నాయుడు. జననం 11-4-1899 నందిగామ తాలూకా జయంతిపురం. జమీందారు. తెలుగు, సంస్కృతం, హిందీ సాహిత్యాలలో మంచి ప్రవేశం ఉంది. 1921 లో కాంగ్రెసులో చేరి, తన స్వగ్రామంలో ఖాదీ ఉత్పత్తి కేంద్రం ప్రారంభించారు. సహాయ నిరాకరణ కాలంలో కాంగ్రెసు వాలంటీర్లకు ఆశ్రయమిచ్చారు. 1930-31 శాసనోల్లంఘన కాలంలో రహస్య సైక్లోస్టైల్ పత్రిక 'కాంగ్రెసు' నిర్వహణకు తోడ్పడ్డారు. ఆయన ఇంటిపై పోలీసులు దాడి జరిపి గ్రంథాలు, రికార్డులు ధ్వంసం చేశారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 5-12-1940 న మూడు నెలల శిక్ష, రు. 750/- జరిమానా విధించారు. వెల్లూరు, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంతో కూడా సంబంధం వుంది. 1947-48 నైజాం వ్యతిరేక పోరాట కాలంలో అనేకమంది తెలంగాణా కాందిశీకులకు ఆశ్రయమిచ్చారు. ఖాదీ, హరిజనోద్ధరణ, మద్యపాన నిషేధం కొరకు తీవ్ర కృషి చేశారు. 1934 లో నందిగామ తాలూకా బోర్డు అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. 1937 లో మద్రాసు శాసనసభకు ఎన్నికయ్యారు. 'ధమ్మపథం' తెలుగులోకి అనువదించారు, అనేక గ్రంథాలు వ్యాసాలు రచించారు.

## శెట్టిపల్లి సంగిరెడ్డి

తండ్రి నరసారెడ్డి. జన్మస్థలం నందిగామ తాలూకా అల్లూరు. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. డి.ఐ.ఆర్. క్రింద అరెస్టు అయ్యారు. 6-4-1943 న సంవత్సరం కఠిన శిక్షను విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. సెషన్స్ కోర్టులో కేసును కొట్టివేయగా, 17-9-1943 న విడుదలయ్యారు. నైజాం వ్యతిరేక పోరాటంలో పాల్గొని, 16-2 1948 నుంచి మూడేళ్ళ కారాగారవాస శిక్షను వరంగల్లు, నిజామాబాద్ జైళ్ళలో అనుభవించారు ప్రస్తుతం తెలంగాణాలో నివాసం.

## సన్నిధానం కృష్ణమూర్తి

తండ్రి వెంకయ్య జననం 30-8-1916నందిగామ తాలూకా పునవిల్లి. వ్యాపారి. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, 7-1-1941 నుంచి రెండు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. తిరిగి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 2-11-1942 నుంచి రెండు సంవత్సరాల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## డాక్టరు సుంకర సుబ్బారావు



తండ్రి నరసింహం. జననం 1916 నందిగామ. వైద్యవృత్తి 1930 ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. హరిజన సేవా సంఘంలో పని చేశారు.

## సూర్యదేవర కృష్ణయ్య

తండ్రి సంగయ్య. జననం 1905 నందిగామ తాలూకా వీరులపాడు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 6 నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 1932 లో గుంటూరు జిల్లా గోవాడ తిరునాళ్ళలో విదేశీవస్తు బహిష్కరణ ఉద్యమం సాగించి, అరెస్టు అయ్యారు. మరొక ఆరు నెలల కఠినశిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు వితంతువుని వివాహమాడారు. జీవనాధారంకోసం ఉపాధ్యాయ వృత్తి చేపట్టి, కొంతకాలం ఖమ్మం జిల్లాలోను, తరువాత గుంటూరు జిల్లాలోను పనిచేశారు. పక్షవాతానికి గురై 1961 లో కీర్తిశేషులైరి.

## సూర్యదేవర అన్నపూర్ణమ్మ



తండ్రి వాసిరెడ్డి నాగయ్య. జననం 15-6-1908 దివి తాలూకా వేములపల్లి. భర్త వెంకటప్పయ్య. నందిగామ తాలూకా వీరులపాడు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. తిరిగి 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. 26-1-1932 న సంవత్సరం జైలు శిక్ష, రు 50 ల జరిమానా విధించారు. వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1940, 1942 ఉద్యమాలలో కూడా పాల్గొన్నారు. నైజాం వ్యతిరేక పోరాట కాలంలో, ఖమ్మం జిల్లా ఎర్రపాలెంలో అరెస్టు అయ్యారు. మధిర సబ్ జైలులోను వరంగల్ సెంట్రల్ జైలులోను నిర్బంధంలో వున్నారు. నందిగామ తాలూకాలోని వీరులపాడు, రంగనాయకునిపాలెంలలో ఆడపిల్లలకు ఉచిత విద్య బోధనా వసతులు కల్పించారు. హిందీ ప్రచారం లైబ్రరీ ఉద్యమాలలో పాల్గొన్నారు. 1943లో మహిళా సేవాదళ్ శిబిరం నిర్వహించారు. మహిళా సంఘాల నిర్మాణ, నిర్వహణలో ప్రముఖ పాత్ర వహించారు. కృష్ణాజిల్లా బోర్డు సభ్యులుగాను, జిల్లాపరిషత్ ఉపాధ్యక్ష, అధ్యక్షులుగాను పనిచేశారు.

## వాసిరెడ్డి వీరయ్య

తండ్రి వెంకయ్య. జన్మస్థలం నందిగామ తాలూకా వీరులపాడు. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, నాలుగు నెలల కఠిన శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

# విజయవాడ తాలూకా

## విజయవాడ

### అయ్యదేవర కాళేశ్వరరావు



తండ్రి లక్ష్మయ్య. జననం 21-1-1881 నందిగామ. నివాసం విజయవాడ. న్యాయవాది. ఆంధ్ర దేశంలో జాతీయోద్యమ నైతాశికులలో ఒకరు. రెండు చేతులా ఆర్జిస్తున్న న్యాయవాద వృత్తికి స్వస్తి చెప్పి, దేశ సేవకు జీవితాన్ని అంకితం చేసిన త్యాగమూర్తి. వందేమాతరం ఉద్యమంతో ఉత్తేజితులై, స్వదేశీ ఉద్యమంలో పాల్గొన్నారు. వందేమాతరం. హోమ్‌రూల్ ఆంధ్రోద్యమాలలో ముఖ్యపాత్ర వహించారు. కాంగ్రెస్ నిర్వహించిన అన్ని ఉద్యమాలలోను పాల్గొని, మొత్తం ఆరు సంవత్సరాలు జైలు జీవితం అనుభవించారు. సహాయ నిరాకరణోద్యమంలో 4-2-1922 నుంచి ఒక ఏడాది జైలు శిక్షను. ఉప్పు సత్యాగ్రహ దళానికి నాయకత్వం వహించి, 21-4-1930 నుంచి ఒక ఏడాది శిక్షను, శాసనోల్లంఘనంలో 9-1-1932 నుంచి ఒక ఏడాది శిక్షను, తిరిగి 4-12-1933 నుంచి ఒక ఏడాది శిక్షను. వ్యష్టి సత్యాగ్రహంలో 5-12-1940 నుంచి ఒక ఏడాది శిక్షను, క్విట్ ఇండియా ఉద్యమంలో ఒక ఏడాది శిక్షను-మొత్తం ఆరుసార్లు అరెస్టు అయి, ఆరు సంవత్సరాల కారాగార వాస శిక్షను రాజమండ్రి, కడలూరు, తిరుచునాపల్లి, వెల్లూరు, నాగపూర్ జైళ్ళలో అనుభవించారు. 1925-30 సంవత్సరాలలో బెజవాడ మునిసిపల్ ఛైర్మన్‌గా పని చేశారు. 1926-29 మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులు, 1937-39, 1946-51 మద్రాస్ రాష్ట్రశాసనసభసభ్యులు. 1956-62 ఆంధ్రప్రదేశ్ శాసనసభ స్పీకరు. విజ్ఞాన చంద్రిక మండలి స్థాపకులలో ఒకరు. లైబ్రరీ ఉద్యమం, జాతీయ విద్య, సాంఘిక సంస్కరణలు, హరిజన సేవ వంటి బహుముఖ కార్యక్రమాలలో పాల్గొన్నారు. 1923-35 రాష్ట్రకాంగ్రెస్ కార్యదర్శి పదవి,1937-39 మద్రాస్ కాంగ్రెస్ శాసనసభాపార్టీ చీఫ్ విప్. ప్రధాన పార్లమెంటరీ కార్యదర్శి పదవులను నిర్వహించారు. నైజాం వ్యతిరేక పోరాటానికి అనేక విధాల సహాయ సంపత్తులు అందజేశారు. "నా జీవిత కథ" తురుష్క ప్రజాస్వామ్యం తదితర గ్రంథాలు రచించారు. 1962 శాసనసభ ఎన్నికలలో కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేసి, పోలింగ్ జరిగిన నాటి రాత్రి 26-2-1962 న కీర్తి శేషులైరి. మరునటి రోజు ఓట్లు లెక్కింపులో శాసనసభకు ఎన్నికైనట్లు ప్రకటించారు.

### అడ్డూరి అప్పలస్వామి



తండ్రి లక్ష్మన్న. 1914 సం॥లో విజయవాడలో జన్మించారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, 5-2-1941 అరెస్టయ్యారు. 18-2-1941 న కోర్టు ముగిసే వరకు శిక్ష, రు. 200/- జరిమానా విధించారు. తిరిగి మద్రాసులో వ్యష్టి సత్యాగ్రహంలో రెండవసారి పాల్గొని, పది వారాల కఠిన శిక్షను 11-6-1941 నుంచి మద్రాసు జైలులో అనుభవించారు. 1957న కీర్తిశేషులయ్యారు.

### అద్దేపల్లి రామకృష్ణశాస్త్రి

తండ్రి లక్ష్మీనరసింహం. జన్మస్థలం విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా, 11-6-1930 న 18 నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 11-3-1931 న విడుదలయ్యారు.

## అద్దేపల్లి వెంకట గురునాథ రామ శేషయ్య

తండ్రి మల్లయ్య. విజయవాడ వాస్తవ్యులు. వర్తకులు. సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్నారు. 4-2-1922 నుండి 3-2-1923 వరకు రాజమండ్రి, కడలూరు జైళ్ళలో శిక్షననుభవించారు. ఖాదీ ప్రచారం తీవ్రంగా చేశారు.

## అన్నవరపు సుబ్బారావు గుప్త

తండ్రి పున్నయ్య. విజయవాడ వాస్తవ్యులు. వర్తకులు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నారు. 11-6-30 నుండి 5-11-30 వరకు రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో కఠిన శిక్షను అనుభవించారు.

## అవనిగడ్డ శేషయ్య

తండ్రి పిచ్చయ్య. విజయవాడ వాస్తవ్యులు. వడ్రంగి. శాసనోల్లంఘన ఉద్యమంలో 11-2-31 న ఆరు నెలల కఠిన శిక్ష విధింప బడింది. రాజమండ్రి జైలులో శిక్షననుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ననుసరించి 11-3-1931 న విడుదలయ్యారు

## అవటపల్లి భగవంతరావు

తండ్రి రామయ్య. జన్మస్థలం గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా పెదపులివర్రు. నివాసం విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. 16-6-1930 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు. 28-6-1969 న కీర్తిశేషులయ్యారు.

## ఆకుల పున్నయ్య

విజయవాడ నివాసి. సహాయ నిరాకరణంలో పాల్గొన్నారు. 30-6-1922 న శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## అలపాటి రాధాకృష్ణమూర్తి

విజయవాడ నివాసి. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీఛార్జీకి గురయ్యారు.

## ఆదిమధ్యం కరివరదరాజస్వామి

తండ్రి భావన్నారాయణస్వామి. జన్మస్థలం విజయవాడ. డ్రైవరు. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టుఅయి, ఆరు నెలల ఆరు వారాల కఠినశిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## ఇంటూరి వెంకటేశ్వరరావు



తండ్రి నరసింహం. జననం 1-7-1909గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా చంద్రరాజుపాలెం. స్వస్థలం విజయవాడ. ప్రస్తుత నివాసం మద్రాసు. జర్నలిస్టు, సినీ రచయిత. ట్రేడ్‌యూనియనిస్టు. గాంధీజీ పిలుపు ననుసరించి, బి.ఎ. చదువుతూ, 1930 ఉప్పు సత్యాగ్రహోద్యమ కాలంలో చదువు మానివేశారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 3-7-1930 న ఆరు నెలల కఠినశిక్ష, రు 50/- జరిమానా విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. 19-3-1932 న రెండున్నర సంవత్సరాల కఠినశిక్ష, రు. 300/- జరిమానా విధించారు. రాజమండ్రి, కన్ననూరు, కోయంబత్తూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. జైలులో రాజకీయ ఖైదీల హక్కులకోసం పోరాడి, నిరాహారదీక్షలు సాగించి, కొరడాదెబ్బలు, లాఠీదెబ్బలు, చేతులకు బేడీలు వంటి శిక్షలు అనుభవించారు. విజయవాడ పట్టణ కాంగ్రెస్ కార్యదర్శిగా పని చేశారు. ఆంధ్ర దేశంలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీవ్యవస్థాపకులలో ఒకరు.ఆపార్టీ కార్యవర్గ సభ్యులుగా పనిచేశారు. 'స్వరాజ్య' బొంబే క్రానికల్' వంటి ఇంగ్లీషు దిన పత్రికలకు ప్రత్యేకవిలేఖరిగా పనిచేశారు సినిమా పత్రికలు నడిపారు 'నాటకరంగం' పత్రికను స్థాపించి కొన్నాళ్ళు నిర్వహించారు 14తెలుగు,తమిళ చలనచిత్రాలకు అసోసియేట్ డైరెక్టరుగా, రచయితగా పనిచేశారు. మద్రాసు సినీ వర్కర్స్ యూని

యన్ నిర్మించారు. వివిధ సాంస్కృతిక సంస్థల సన్మానాన్ని పొందారు. మద్రాసు నగర స్వాతంత్ర్య సమర యోధుల సంఘం అధ్యక్షులు.

## ఇవటూరి కోటేశ్వరరావు



తండ్రివీ భద్రయ్య జననం 4-2-1914 పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరు.నివాసం విజయ వాడ. పట్టభద్రులు. చిన్న వయస్సు లోనే ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 2-6-1930 నుంచి ఆరు మాసాల కఠినశిక్షను బరంపురం, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. 1932 శాసనోల్లంఘనంలో లాఠీఛార్జీ చేసి, సబ్ జైలులో నిర్బంధించి వదలి వేశారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో రహస్యంగా పనిచేశారు. ఆంధ్ర సిమెంట్ కంపెనీలో కెమిస్టుగా పనిచేసి రిటైర్ అయ్యారు. కీర్తిశేషులు.

## ఇమిడిసెట్టి తిరుపతి వెంకన్న

విజయవాడ వాస్తవ్యులు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నందుకు 30-6-22 న ఒక సంవత్సరం కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి జైలులో శిక్షను అనుభవించారు.

## ఈమని వెంకట రాజరత్నశర్మ

తండ్రి మాధవబ్రహ్మం. గుంటూరుజిల్లా కొల్లిపరలో 1914 లో జన్మించారు. ప్రస్తుత నివాసం విజయవాడ. రైతు. చదువుకు స్వస్తి చెప్పి ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 6-8-30 న ఆరు నెలల కఠినశిక్ష రు.50-జరిమానా, చెల్లించని పక్షంలో మరో ఆరు వారాల విడిఖైదు విధించారు. రాజమండ్రి సెంట్రల్ జైల్లో శిక్ష అనుభవించారు. 1932 శాసనోల్లంఘనోద్యమకాలంలో అనేకసార్లు లాఠీ ఛార్జికి గురి అయ్యారు. 7 1/2 నెలల కఠినశిక్ష విధింపబడింది. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో అండర్‌గ్రౌండ్‌లో పనిచేశారు. 'ఆంధ్రరత్నభవనం' కాంగ్రెస్ ఆఫీసు కార్యదర్శిగా పనిచేశారు.

## ఉప్పల షోలింగర్



స్విట్జర్లాండు లోని జ్యూరిచ్ పట్టణంలో 1898 న సంపన్న కుటుంబంలో జన్మించారు. తండ్రివ్యాపారం దెబ్బతినడంతో మెడిసిన్ మూడో సంవత్సరం చదువుతూ మానివేశారు. రోమా రోలాం రచించిన 'గాంధీజీ జీవితం' చదివారు. దాంతో భారతదేశం సందర్శించాలని అభిలాష కలుగగా 1929లో ఇండియా వచ్చారు 1930లో గాంధీజీ సబర్మతి ఆశ్రమంలో సుమారు సంవత్సరంపాటు వున్నారు.

ఈమె ఉప్పల లక్ష్మణరావుగారి పత్ని. లక్ష్మణ రావుగారు 1898 లో బరంపురంలో జన్మించారు. బరంపురం, మద్రాసు, కలకత్తాలలో చదివి Bsc, Hons డిగ్రీ సంపాదించారు. ఆ తరవాత జర్మనీ లోని జుబింగర్ విశ్వవిద్యాలయంలో 1924 న ప్లాంటు ఫిజియాలజీలో డాక్టరేట్ డిగ్రీ సంపాదించారు. జర్మనీలో వున్నప్పుడు లక్ష్మణరావుగారితో షోలింగర్‌కు పరిచయం ఏర్పడింది. ఆ తరువాత 1937 లో మాస్కోలో వీరిద్దరికి వివాహం జరిగింది. మాస్కో ప్రగతి ప్రచురణాలయంలో ప్రధాన అనువాదకులుగా వుండి ఈయన అనేక మార్క్సిస్టు గ్రంథాలు తెనిగించారు. ఈయన రచించిన తెలుగు నవల 'అతడు-ఆమె' కు మంచి పేరు వచ్చింది.

షోలింగర్ 'శ్రీకాకుళం'లో సన్ననూలు సెంటర్ లో 4 సం॥లు లక్ష్మణరావుగారితో కలిసి సన్ననూలు ఖాదీ పరిశ్రమకు సంబంధించిన పరిశోధనలు చేశారు. ఈ పరిశోధిత వ్యాసాలు భారతి లో ప్రచురితమయ్యాయి. కొంతకాలం విజయవాడలో ఈమె వున్నారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని 27-3-41 నుంచి మూడు నెలలు శిక్ష వెల్లూరు జైలులో అనుభవించారు తిరిగి డి.ఐ ఆర్.కింద 21 8-1941 న ఆరు నెలల విడిఖైదు విధించారు. వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు. తిరిగి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 2-11-1942 న రెండు

ఏండ్లు కఠినశిక్ష, రు. 750-లు జరిమానా విధించారు. జరిమానా చెల్లించకపోతే, అదనంగా మరో ఆరు నెలల కఠినశిక్ష అనుభవించాలని ఆదేశించారు. వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు. కీర్తిశేషులు.

## ఉప్పల సుబ్బారావు

విజయావాడ వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘ నోద్యమంలో పాల్గొన్నారు. లాఠీఛార్జికి గురి అయ్యారు.

## కటినేని లక్ష్మయ్య

తండ్రి రామయ్య. జన్మస్థలం విజయవాడ. వ్యాపారి. శాసనోల్లంఘనంలో పాల్గొని, 9-1-1932 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, బళ్లారి, మదురై జైళ్ళలో అనుభవించారు.

## కంచుపిళ్ళ పద్మనాభం



తండ్రి నారాయణ. జననం 1914 విజయవాడ. వ్యాపారి. వ్యష్టి సత్యాగ్రహంలో మొత్తం మూడుసార్లు అరెస్టు అయి, శిక్షలు అనుభవించారు. మొదటిసారి విజయవాడలో అరెస్టు అయి, 17-1-1941 నుంచి నెల రోజుల కఠిన శిక్షను రాజమండ్రి జైలులోను, రెండవసారి మద్రాసులో 11-6-1941 న అరెస్టు అయి, రెండు నెలల కఠిన శిక్షను మద్రాసు జైలులోను, మూడవసారి మద్రాసులో 5-9-1941 న అరెస్టు అయి, తొమ్మిది నెలల కఠిన శిక్షను అలీపురం జైలులోను అనుభవించారు. తిరిగి క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో, 2-11-1942 నుంచి 14 నెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## కస్తూరి సీతారామ్



తండ్రి లక్ష్మయ్య. జననం 13-4-1910 విజయనగరం. నివాసం విజయవాడ. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, లాఠీఛార్జికి గురయ్యారు. 2-10-1942 నుండి 31-12-42 వరకు విజయవాడ సబ్ జైలులో శిక్ష అనుభవించారు. సొంతంగా సుభాసుబోస్ విగ్రహం చేయించి, ప్రతిష్ఠింప చేశారు.

## కంభంపాటి సత్యనారాయణ



తండ్రి సోమనాథం. జననం 2-8-1908. తూర్పుగోదావరి జిల్లా రాజోలు తాలూకా దొడ్డవరం. మద్రాసు యూనివర్శిటీ ఎమ్.ఎ. జర్నలిస్టు చరిత్ర పరిశోధకులు. బహు గ్రంథ రచయిత. సహాయ నిరాకరణోద్యమ కాలంలో జాతీయ భావాల ప్రభావానికి లోనయ్యారు. సైమన్‌కమిషన్ బహిష్కరణలో పాల్గొని, విద్యార్థి సమ్మె, ప్రదర్శన నడిపారు. మద్రాసులో ఎమ్.ఎ. చదువుతూ, పశ్చిమ గోదావరి జిల్లా భీమవరంలో శాసనోల్లంఘనంలో పాల్గొనగా 27-1-1931 న ఆరు నెలల శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో విడుదలయ్యారు. కరాచీ కాంగ్రెసు మహాసభకు హాజరై, చర్చలలో పాల్గొన్నారు. అతివాద రాజకీయాలవైపు మొగ్గి, టెర్రరిస్టు గ్రూపుతో సంబంధాలు ఏర్పరచుకొన్నారు. అనంతరం కమ్యూనిస్టుపార్టీలో చేరారు.

శాసనోల్లంఘన కాలంలో "రణదుందుభి" "వీరభారతి" రహస్య పత్రికలు ప్రచురించారు.

24-4-1933 న ఆరు నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. జైలులో కాళ్ళకు నిలువు బేడీలు వేశారు. వర్గ పోరాటాన్ని ప్రోద్బలపర్చే 'ధనప్రభావం' నాటికను పంచినందుకు 10-12-1935 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను మద్రాసు, కడలూరు జైళ్ళలో అనుభవించారు. తూర్పుగోదావరి జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యదర్శిగా పనిచేశారు కొత్తపట్నం వేసవి రాజకీయ పాఠశాల అధ్యాపకులుగా లాఠీ చార్జికి గురై, 17-6 1937 నుంచి 1-8-1937 వరకు జైలు జీవితం అనుభవించారు. 1939 లో యుద్ధ వ్యతిరేక చర్యలకుగాను తునిలో ఇంటర్న్ చేశారు. అనంతరం 24-5-1940 న ఆరునెలల శిక్ష రు. 50లు జరిమానా విధించారు. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. సందేశం, నవశక్తి, ప్రజాశక్తి, విశాలాంధ్ర పత్రికల సంపాదకులు, ఆంధ్రప్రదేశ్ అధికారభాషా సంఘం సభ్యులు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## కంభంపాటి మాణిక్యాంబ



భర్త సత్యనారాయణ. జననం 1917 తూర్పుగోదావరిజిల్లా అమలాపురంతాలూకా తొండవరం. ప్రస్తుత నివాసం విజయవాడ. భర్త ప్రోత్సాహంతో తన 16 వ ఏట శాసనోల్లంఘనంలో పాల్గొని, రెండుసార్లు భీమవరం, ఏలూరు సబ్ జైళ్ళలో 15 రోజుల చొప్పున రిమాండులోవున్నారు. గుంటూరు జిల్లా కూచిపూడిలో అరెస్టు అయి, 23-8-1932 నుంచి ఆరునెలల కఠిన శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు. అనంతరం కమ్యూనిస్టు పార్టీ, మహిళా సంఘాలలో పనిచేశారు.

## కాశీనాధుని శరభయ్య



తండ్రి కాళహస్తి లింగయ్య. జననం 1912 గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా పెద పులివర్రు. నివాసం విజయవాడ. 1930 ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, ఆరుమాసాల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. జైలులో 2 వేల మంది స్వాతంత్ర్య సమరయోధులతోపాటు 8రోజులు నిరాహార దీక్షలో పాల్గొన్నారు.

## కాట్రగడ్డ రాజగోపాలరావు



తండ్రి వెంకటసుబ్బయ్య. జననం 22-5-1918 గుడివాడ తాలూకా జమీగొల్వేపల్లి. జర్నలిస్టు. ప్రస్తుత నివాసం విజయవాడ. సంస్కృత 'విద్యాప్రవీణ' పట్టాను ఆంధ్ర యూనివర్శిటీ నుంచి అందుకొన్నారు. చిన్న వయస్సులోనే జాతీయోద్యమంలో చేరారు. కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో పనిచేశారు. 1931-41 వరకు జిల్లా కాంగ్రెసు సంఘ సభ్యులు. 1939-41 వరకు గుడివాడ తాలూకా కాంగ్రెసు కార్యదర్శి. 1937 లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. 'ప్రజాశక్తి' 'విశాలాంధ్ర' సంపాదకులుగా పనిచేశారు. 1952 లో గుడివాడ నియోజకవర్గం నుంచి శాసనసభకు ఎన్నికయ్యారు. 1969 లో కమ్యూనిస్టుపార్టీ నుంచి వైదొలగి, తిరిగి కాంగ్రెసులో చేరారు.

## కాకుమాను లక్ష్మయ్య

తండ్రి రామయ్య. స్వస్థలం విజయవాడ. వ్యాపారి. పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు నెహ్రూ కమిటీ

గుంటూరుకు వచ్చిన సందర్భంలో అరెస్టు అయ్యారు. మూడు రోజులు రిమాండు, రు 25/-ల జరిమానా విధించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 30-4-1930 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, వెల్లూరు, మద్రాసు, కడలూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 9-3-1931 న విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని, 9-1-32 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, మధురై, కడలూరు జైళ్ళలో అనుభవించారు. వ్యష్టి సత్యాగ్రహంలో 17-5-1941 న అరెస్టు అయ్యారు. తొమ్మిది నెలల కఠిన శిక్ష, రు. 800/- జరిమానా విధించారు. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. 13-1?-1941 ప్రభుత్వ ఉత్తర్వు మేరకు విడుదలయ్యారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో తన 60 వ ఏట రైల్వేలను ధ్వంసం చేయాలని ఉద్బోధించే కరపత్రాలు పంచుతూ 17-10 1942 న అరెస్టు అయ్యారు. 25-11-1942న పద్దెనిమిది నెలలు కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించుచుండగా అస్వస్థులు కావడంతో 11-6 1943 న విడుదల చేయబడ్డారు. ఎ. ఐ. సి. సి. సభ్యులుగా పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు అధ్యక్షులుగా పనిచేశారు. కీర్తిశేషులు.

## కాకర్లపూడి సుబ్బరాజు

తండ్రి వెంకటరాజు. ఒంగోలు తాలూకా మర్లపాడులో 1909 జూలై 6 న జన్మించారు. ప్రస్తుత నివాసం విజయవాడ తాలూకా తాడేపల్లి. గ్రాడ్యుయేట్. బెనారస్ యూనివర్శిటీ నుండి 'లా' డిగ్రీ పొందారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా శిక్షింపబడ్డారు. ప్రభుత్వ ఉద్యోగాలకు అనర్హుడని ప్రకటించారు. 1937 నుంచి వివిధ రంగాలలో గ్రామీణులకు సేవ చేస్తున్నారు. తాడేపల్లి పంచాయితీ బోర్డు సర్పంచ్‌గాను, తాలూకా విద్యా సలహా సంఘ సభ్యులుగాను పనిచేశారు.

## కాలింగి వెంకట రత్నమాంబ

విజయవాడ వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో, విదేశ వస్త్ర బహిష్కరణోద్యమంలో పికెటింగులో పాల్గొన్నారు. అరెస్టు చేసి విడుదల చేశారు.

## కాంతి మానయ్య

తండ్రి వీరయ్య. జన్మస్థలం విజయవాడ. నైజాం వ్యతిరేక పోరాటంలో 14-12-1947 నుంచి 9-6-1948 వరకు వరంగల్లు, నిజామాబాద్ జైళ్ళలో నిర్బంధించబడ్డారు.

## కొనకళ్ళ వీరభద్రం



తండ్రి రామయ్య. జననం పశ్చిమ గోదావరి జిల్లా చింతలపూడి. ప్రస్తుత నివాసం విజయవాడ. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని అరెస్టు అయి, 15-8-1942 నుంచి 18-8-1942 వరకు చింతలపూడి సబ్‌జైలులో నిర్బంధంలో వున్నారు.

## కొవ్వలి కాశీవిశ్వనాధరావు



తండ్రి గున్నయ్య. జన్మస్థలం పశ్చిమ గోదావరి జిల్లా తణుకు. కృష్ణాజిల్లాలో ఉపాధ్యాయులుగా 20 సంవత్సరాలు పనిచేసి రిటైర్ అయ్యారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని తంజావూరు జైలులో 11 నెలలు, రాజమండ్రి జైలులో 15 రోజులు శిక్ష అనుభవించారు. కొంతకాలం న్యాయవాద వృత్తి, సాగించారు క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. కొంతకాలం దేవాదాయ ధర్మాదాయ శాఖలో ఉద్యోగిగా పనిచేశారు. 1969 లో కీర్తిశేషులైరి.

## కొవ్వలి శివరామచంద్రరావు

తండ్రి గున్నయ్య. జన్మస్థలం పశ్చిమ గోదావరి జిల్లా తణుకు. వందేమాతరం ఉద్యమ సందర్భంలో చదువుకు స్వస్తి చెప్పారు. పత్రికా రచన సాగించారు. 1930-32 ఉద్యమంలో రెండు సార్లు లాఠీచార్జీకి గురయ్యారు, హైదరాలీ, రాజపుత్ర స్త్రీ ఔన్నత్యం గ్రంథాలు రచించారు. 1958 లో కృష్ణాజిల్లా విస్సన్న పేటలో కీర్తిశేషులైరి.

## కొల్లిపర వెంకటరత్నం

తండ్రి వెంకట రామచంద్రయ్య. విజయవాడ వాస్తవ్యులు. వర్తకులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 11-6-30 న రెండేళ్ళ శిక్ష విధించ బడింది. తంజావూరు బోర్టస్టల్ స్కూలులోను, రాజమండ్రి జైలులోను శిక్ష ననుభవించారు. 18 2-'31 న విడుదలయ్యారు.

## కోట వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రి



తండ్రి వెంకటప్పయ్య. జన్మస్థలం ప్రకాశం జిల్లా అద్దంకి తాలూకా కలవకూరు. 1931 శాసనోల్లంఘనంలో చీరాలలో లాఠీ చార్జీకి గురయ్యారు, సబ్ జైలులో నెల రోజులు రిమాండ్‌లో వున్నారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## కృత్తివెంటి సీతారామయ్య



తండ్రి లింగరాజు. 1903 నవంబరులో జన్మించారు. విజయవాడ వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో 31-5-'32న ఒక సంవత్సరం శిక్ష విధింపబడింది, రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్షననుభవించారు. 10-4-'33 న విడుదలయ్యారు. కీర్తి శేషులు.

## కృత్తివెంటి కుటుంబరావు



తండ్రి లింగరాజు. స్వస్థలం విజయవాడ. సంఘ సేవకులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 28-5-1930 న 18 నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, వెల్లూరు అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒప్పందంతో 13-3-1931 న విడుదలయ్యారు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. సంవత్సరం కఠినశిక్ష, రు. 100 - జరిమానా విధించారు. రాజమండ్రిజైలులో శిక్ష అనుభవించారు. విజయవాడలో వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయ స్థాపకులలో ఒకరు. కమ్యూనిస్టుపార్టీలో చేరారు. మున్సిపల్ కౌన్సిలర్‌గా ఎన్నికయ్యారు.

## కృత్తివెంటి సుబ్బారావు

తండ్రి లింగరాజు. జననం 10.1.1910 విజయవాడ. 1930 ఉప్పు సత్యాగ్రహంలో ఒకసారి, 1932 శాసనోల్లంఘనంలో రెండు సార్లు, మార్చి 7, మార్చి 9, తేదీలలో లాఠీఛార్జీకి గురయ్యారు తల్లి, సోదరు లందరితో పాటు జాతీయోద్యమంలో పాల్గొన్నారు.

## కుప్పా సీతారామయ్య



తండ్రి వెంకటప్పయ్య. జననం 6-9-1903. గుంటూరు జిల్లా తెనాలి తాలూకా అనంతవరం. రైతు. ప్రస్తుతనివాసం విజయవాడ. 1921 సహాయ నిరాకరణ, 1930 ఉప్పు సత్యాగ్రహ

ఉద్యమాలలో పాల్గొన్నారు. 23.7.1930 నుంచి ఆరు మాసాల కఠిన శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## కొండేపూడి లక్ష్మీనారాయణ



తండ్రి నాగభూషణం. జననం 1918. పశ్చిమగోదావరి జిల్లా బొండాడ. విజయవాడ వాస్తవ్యులు ప్రస్తుత నివాసం విజయవాడ. జర్నలిస్టు. చిన్నతనంలోనే రాత్రివేళల చెట్లపై కాంగ్రెసు జెండాలు ఎగురవేసి, పోలీసులకు చికాకు కల్గించారు. తాటి చెట్లపై కల్లు కుండలను పగులగొట్టారు. విద్యార్థి దశలో 'వీర భారతి' అనే రహస్య పత్రికను భీమవరంలో పంచారు. పోలీసు లాఠీఛార్జీలకు నిరసనగా భీమవరంలో జరిపిన విద్యార్థుల సమ్మెకు నాయకత్వం వహించారు. కాకినాడలో కాలేజీ విద్యార్థిగా 'స్వదేశీ ఎంపోరియమ్ సరుకులను బజారులలో విక్రయించారు. మద్రాసులో జరిగిన రాడికల్ యూత్ కాన్ఫరెన్సుకు హాజరై కమ్యూనిస్టు ప్రముఖులతో సంబంధాలు ఏర్పరచుకొన్నారు. చదువుకు స్వస్తి చెప్పి, ఏలూరులో కూలీ రక్షణ సమితిలో పని చేశారు. 1937-39 లో 'నవశక్తి' పత్రిక మేనేజరుగా పని చేశారు. రహస్య పత్రిక 'స్వతంత్ర భారత్' నిర్వహణలో ప్రముఖ పాత్ర వహించారు. 'స్వతంత్ర భారత్' పత్రికా ప్రతులతో 1941 సెప్టెంబరు 30న బందరులో లంకా జోగారావుతో సహా అరెస్టు అయ్యారు. వారం రోజులపాటు పోలీసులు చెప్పనలవికాని చిత్రహింసలు పెట్టారు. చివరకు కేసు పెట్టి, 1941 బందరులో 9 నెలల శిక్ష విధించారు. రాజమండ్రి, అలీపురం, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1942 లో విడుదలై ప్రజాశక్తి పత్రికలో పనిచేశారు. నైజాం వ్యతిరేక పోరాటకాలంలో తెలంగాణాలో "ప్రజాశక్తి" ప్రత్యేక ఏజెంటుగా పని చేశారు. 1953-63 మధ్య కాలంలో సినిమారంగంలోనూ, అనంతరం 'సోవియట్ భూమి' ప్రగతి ప్రచురణాలయంలో అనువాదకులుగా పని చేస్తూ, నాల్గున్నర సంవత్సరాలు మాస్కోలో ఉన్నారు.

## కొప్పు రావూరి సత్యనారాయణ



తండ్రి కాశీపతి. జననం 22.3.1913 గుంటూరు జిల్లా పెనుమూలి వ్యాపారి. నివాసం విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 6.6.1930 న రెండేళ్ళ కఠిన శిక్ష విధించారు. వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయ నిర్మాణంలోను, కె. బి. యన్. కాలేజీ స్థాపనలోను ప్రముఖ పాత్ర వహించారు. రాష్ట్రంలో స్టాప్ ఎంప్లాయీస్ యూనియన్ నిర్మాత. 'కవి పాదుషా' బిరుదాంకితులు.

## కోరుకొండ అప్పారావు



తండ్రి పెంటయ్య. జన్మస్థలం విజయవాడ. వడ్రంగి. వ్యష్టి సత్యాగ్రహంలో 5.8.1941న నూజివీడులో అరెస్టు అయ్యారు. 11-8-1941 న నెల రోజుల కఠిన శిక్ష, రు. 50/- జరిమానా విధించారు. జరిమానా చెల్లించకపోతే మరొక రెండు మాసాలు జైలు శిక్ష అనుభవించాలని ఆదేశించారు. తిరిగి వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, 16.10.1941 నుంచి ఆరునెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## కోకా నాగేంద్రరావు



తండ్రి కోటయ్య. జననం 10.10.1901 విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. 2.7.1930 న సంవత్సరం పన్నెండు వారాల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి. తిరుచునాపల్లి అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14.3.1931 న విడుదల అయ్యారు.

## కె. కామయ్య

విజయవాడ నివాసి. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. 30-6-1922 న సంవత్సరం కఠినశిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## కె. లక్ష్మీనరసింహం

తండ్రి పట్టాభిరామయ్య. జన్మస్థలం విజయవాడ. సుప్రసిద్ధ కార్మిక నాయకులు. వ్యష్టి సత్యాగ్రహ కాలంలో డి. ఐ ఆర్. క్రింద అరెస్టయి 5-10-1940 నుంచి 25-6-1942 వరకు వెల్లూరు జైలులో డిటెన్యూగా వున్నారు. గుంటూరు జిల్లాలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలలో ఒకరు. రాజ్య సభకు ఎన్నికయ్యారు. కీర్తిశేషులైరి.

## గంటి మహదేవన్



తండ్రి శంకరయ్య పంతులు. జననం 2-5-1919 శ్రీకాకుళం జిల్లా శ్రీకాకుళం. ప్రస్తుత నివాసం విజయవాడ. జర్నలిస్టు. ఎమ్. ఏ. పట్టభద్రులు విద్యార్థి దశలో జాతీయోద్యమంలో పాల్గొని, విద్యార్థుల సమ్మెకు నాయకత్వం వహించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో డి. ఐ. ఆర్. క్రింద అరెస్టుచేసి, ఆరు నెలల కఠినశిక్ష విధించారు, అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. విద్యార్థి-యువజన, రైతుసంఘాలలోనూ కొంతకాలం ఆచార్య రంగా ఆంతరంగిక కార్యదర్శిగాను పనిచేశారు. 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' స్టాఫ్ రిపోర్టరుగా పనిచేసి రిటైర్ అయ్యారు.

## గవ్వా సూర్యనారాయణ

తండ్రి అప్పలనారాయణ. విజయవాడ వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. లాఠీచార్జీకి గురి అయ్యారు. ఆరునెలల, 12 వారాల శిక్షను 24-9-32 నుండి రాజమండ్రి జైలులో అనుభవించారు.

## గర్రె సత్యనారాయణ



తండ్రి రామన్న. జననం 1906నవిజయవాడ. వ్యష్టి సత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. సంవత్సరంకఠినశిక్ష, రు.25/ల జరిమానా విధించారు. 10 10-1940 నుంచి వెల్లూరు, కోయంబత్తూరు, అలీపురం, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. ప్రస్తుత నివాసం గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా దాచేపల్లి.

## గార్లపాటి సుబ్రహ్మణ్యం

తండ్రి అప్పయ్యశాస్త్రి. విజయవాడ వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 7-6-1930 నుండి 1 1/2 సంవత్సరాల కఠిన శిక్షను పొందారు. కోరాపుట్టి, రాజమండ్రి బరంపురం, జైళ్ళలో శిక్షను అనుభవించారు.

## గాయత్రి అనంతరామయ్య



తండ్రి కృష్ణశాస్త్రి. జన్మస్థలం గన్నవరం తాలూకా ఉయ్యూరు. నివాసం విజయవాడ. 1921 సహాయ నిరాకరణోద్యమంలో అరెస్టు అయ్యారు. నెలజైలుశిక్ష,రు.50లు జరిమానా విధించారు. కీర్తిశేషులైరి.

## గుడివాడ వెంకటేశ్వర్లు



తండ్రి వీరయ్య. జన్మస్థలం విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో వెలిదండ్ల హనుమంత రాయ దళంలో చిన్నాపురం వెళ్ళి ఉప్పు తయారు చేశారు. 11-6-1930 న అరెస్టు చేసి, రెండు సంవత్సరాల కఠినశిక్ష విధించారు. మైనరు కావడం వల్ల తంజావూరు బోర్‌స్టల్ స్కూలుకు పంపారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందం అనంతరం రాజమండ్రి జైలుకు తరలించి మూడు నెలలు వుంచి, 18-2-1931 విడుదల చేశారు. తిరిగి శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. పలుమార్లు లాఠీఛార్జీలకు గురయ్యారు.

## గుంటూరి సత్యనారాయణ



విజయవాడ వాస్తవ్యులు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. 30-6-1922 నుండి నాలుగు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, 8 రోజులు బాపట్ల సబ్‌జైలులో రిమాండ్‌లో వున్నారు. 1935 లో మంగళగిరి రథోత్సవంలో జాతీయ జెండా ఎగురవేసి లాఠీచార్జీకి గురయ్యారు. 5 రోజులు పోలీసుల కస్టడీలో వున్నారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో దుగ్గిరాల రైల్వే స్టేషన్ తగులబెట్టి, 9 రోజులు పోలీసు కస్టడీలో వున్నారు.

## గుంటుపల్లి రాజగోపాలరావు



తండ్రి కోటయ్య విజయవాడ నివాసి. ఖమ్మం హిందీమహా విద్యాలయ ప్రిన్సిపాల్. శాసనోల్లంఘనంలో పాల్గొని, 12-10-1933 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. తిరిగి వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 8-10-1940 న ఒక సంవత్సరం 6 వారాలు కఠినశిక్ష, రు. 25/-లు జరిమానావిధించారు. నెల్లూరు, కోయంబత్తూరు, అలీపురం, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. తామ్రపత్ర గ్రహీత.

## గుడిపాటి రామకృష్ణరావు

తండ్రి సర్వేశ్వరరావు. జననం 1920, విజయవాడ గుమాస్తా. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 19-10-1944 నుంచి 8 నెలల కఠిన శిక్షను అలీపురం, వెల్లెస్లీ శానిటోరియమ్ జైళ్ళలో అనుభవించారు.

## గుజ్జూరి నారాయణ

తండ్రి పెంటయ్య. జన్మస్థలం విజయవాడ. తాపీ కార్మికుడు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 27-5-1930 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి, బళ్ళారి, జైళ్ళలో అనుభవించారు.

## గుళ్ళపల్లి వీరరాఘవయ్య

జన్మస్థలం విజయవాడ. 1922 శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీచార్జీకి గురయ్యారు.

## గులాం మొహిద్దీన్ సాహెబ్

జన్మస్థలం విజయవాడ. 1921 సహాయ నిరాకరణంలో ఆనరరీ మేజిస్ట్రేట్ పదవికి రాజీనామా చేశారు.

## గూడ జగన్నాధశాస్త్రి

జన్మస్థలం విజయవాడ. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని లాఠీచార్జీకి గురయ్యారు.

## గూడూరు వెంకట రామారావు

తండ్రి వెంకట నరసింహారావు. విజయవాడ వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 12-4-32 నుండి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి సెంట్రల్ జైలులో అనుభవించారు.

## గొర్రెల రాములు



తండ్రి అప్పన్న. జననం 1913 పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరు. కార్మికుడు. ఉప్పు సత్యాగ్రహంలో ఏలూరులోసత్యాగ్రహులకు, పోలీసులకు మధ్య జరిగిన ఘర్షణలో పాల్గొన్నారు. ఆ ఘర్షణలో ఒక వ్యక్తి మృతి చెందారు. అనంతరం విశాఖపట్నంలో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, ఆరు నెలల కఠిన శిక్షను బరంపురం, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## గోపరాజు బ్రహ్మానందం



తండ్రి నరసింహం. జననం 1880 గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకా చిరుమామిళ్ళ. నివాసం విజయవాడ. జర్నలిస్టు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19-8-1930 న ఆరుమాసాల కఠిన శిక్ష. రూ 100/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. ఖాదీ, లైబ్రరీ ఉద్యమాలలో పాల్గొన్నారు. 30-9-1945 న కీర్తిశేషులైరి.

## గోపరాజు వెంకట రమణరావు



తండ్రి బ్రహ్మనందం. జననం 13-5-1924. విజయవాడ, జర్నలిస్టు. క్విట్ ఇండియా ఉద్యమంలో 1-10-1942 న అరెస్టు అయ్యారు 3-11-1942 న సంవత్సరం కఠిన శిక్ష రు. 150/జరిమానా విధించారు. అలీపురంజైలులో శిక్షను అనుభవించారు.

## ఘంటా ఆది అప్పలస్వామి

తండ్రి లక్ష్మయ్య. జన్మస్థలం విజయవాడ. వడ్రంగి. వ్యష్టి సత్యాగ్రహంలో అరెస్టుఅయి, 11-8-1941 నుంచి రాజమండ్రి జైలులో నెల పదిహేను రోజుల కఠినశిక్ష అనుభవించారు.

## ఘంటసాల సీతారామశర్మ

తండ్రి పేర్రాజు. నివాసం విజయవాడ. చిన్నా బ్రహ్మయ్యగారి దత్తత కుమారులు. 1892 ప్రాంతంలో దివితాలూకా ఘంటసాలలో జన్మించారు. డాక్టర్. బందరులో విద్యార్థిగా ఉన్నపుడు 1907 లో బిపిన్‌చంద్రపాల్ ఉపన్యాసాలకు హాజరయ్యారు.

కలకత్తాలో నేషనల్ మెడికల్ కాలేజినుండి యల్.సి.పి. అండ్ యస్. డిప్లొమా పొందారు. విజయవాడలో 1918 లో ప్రాక్టీస్ పెట్టారు. 1921 సహాయ నిరాకరణోద్యమంలో విదేశవస్త్రధారణ త్యజించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 28-5-30 న 18 నెలల కఠినశిక్ష పొందారు. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్షననుభవించారు. గాంధి ఇర్విన్ ఒడంబడిక ననుసరించి 12-3 1931 న విడుదలయ్యారు. రాజమండ్రి జైలులో ఉండగా 15-6-30 న తీవ్రంగా లాఠీచార్జికి గురి అయ్యారు. కార్మిక, సాంఘిక, సంక్షేమ, ఇతర ధర్మసంస్థలతో సంబంధం వుంది. 10 ఏండ్లు మున్సిపల్ కౌన్సిలర్. హరిజన సేవక్ సంఘ కార్యదర్శిగా పనిచేశారు. జిల్లా కాంగ్రెస్ కమిటీ సభ్యుడు. ఖాదీ, గ్రామీణ పరిశ్రమల ప్రదర్శనలను నిర్వహించారు. 1953 జూన్ 17 న కీర్తిశేషులయ్యారు.

## చల్లా లక్ష్మీనారాయణ

తండ్రి సుబ్బారాయుడు. విజయవాడ నివాసి. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 16-6-30 నుంచి రాజమండ్రి, అలీపురం జైళ్ళలో ఆరు నెలల కఠినశిక్ష అనుభవించారు.

## చిగురుపాటి వేణుగోపాల్



తండ్రి శంకర శాస్త్రి. జననం 14-3-1914 విజయవాడ. మెట్రిక్యులేట్. ఆంధ్ర సిమెంట్ కంపెనీ ఉద్యోగిగా. రిటైర్ అయ్యారు. బ్రిటిష్ సైన్యంలో గుమాస్తాగా చేరి సింగపూర్‌లో జపాన్ సైన్యానికి యుద్ధఖైదీగా చిక్కారు. 1943 లో ఆజాద్ హింద్ ఫౌజ్‌లో చేరారు. 1945 లో బ్రిటిష్ సైన్యానికి లొంగిపోయారు. 1945 డిసెంబరు వరకు ముల్తాన్ డిటెన్షన్ శిబిరంలో ఖైదీగా వున్నారు. అనంతరం సైనిక సర్వీసు నుండి బర్తరఫ్ చేశారు.

## చిట్టూరి నాగభూషణం

విజయవాడ నివాసి. సహాయ నిరాకరణంలో పాల్గొని, 30-6-1922 నుంచి మూడు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## చిట్టి పూర్ణానందశాస్త్రి

తండ్రి వెంకట నరసావధానులు. జననం 30-10-1909 గుంటూరు జిల్లా రేపల్లె. ప్రస్తుతం విజయవాడలో నివాసం. ఉపాధ్యాయుడు. బి. ఎ. చదువుతూ, సహాయ నిరాకరణోద్యమంలో చదువుకు స్వస్తి చెప్పారు. పేముబెత్తంతో దెబ్బలు తిన్నారు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు 24-7-1930 న సంవత్సరం కఠిన శిక్షను విధించారు. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 13-3-1931 న విడుదలయ్యారు.

## చిత్తజల్లు వెంకటాచలపతి



జననం 1922 గుడివాడ తాలూకా కొత్తవరం. చెరకువాడ వెంకట నరసింహం పంతులు నిర్వహించిన జాతీయ విద్యాలయం విద్యార్థి. సహాయ నిరాకరణ కాలంలో చెరుకువాడ వెంకట నరసింహం పంతులు అరెస్టుకు నిరసనగా, గుడివాడ తాలూకా ఆఫీసులో తన ఉద్యోగానికి రాజీనామాను 'గురుదక్షిణ'గా యిచ్చారు. ఎందరు ఎంతగా నచ్చజెప్పినా, తన రాజీనామాను ఉపసంహరించుకోలేదు. వేరే ఆధారమేమీ లేని కారణాన, ఉద్యోగం కోల్పోయిన అనంతరం అనేక అవస్థలను అనుభవించారు. తామ్రపత్ర గ్రహీత. ప్రస్తుత నివాసం విజయవాడ.

## చిప్పిళ్ళ సింహాచలం



తండ్రి నరసింహం. జననం 1916. విజయవాడ. వడ్రంగి. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో అరెస్టు అయి, మూడు వారాల కఠిన శిక్షను అనుభవించారు.

## జీపి రాములు



తండ్రి రామస్వామి. ఫ్యాక్టరీ కార్మికుడు. 1932 శాసనోల్లంఘనంలో రెండు సార్లు తీవ్రమైన లాఠీచార్జీకి గురయ్యారు. లాఠీ దెబ్బలకు ఎడమ చేయి గూడు జారిపోయింది. 24-9-1932 నుంచి ఆరు మాసాల, పన్నెండు వారాలు జైలు శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## చివుకుల శ్రీరాములు

తండ్రి రామకృష్ణయ్య. విజయవాడ వాస్తవ్యులు. రైతు. సహాయ నిరాకరణోద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. ఒక సంవత్సరం విడి ఖైదు 14-10-1921 నుండి వెల్లూరు, కడలూరు జైళ్ళలో అనుభవించారు.

## జొన్నలగడ్డ రామలింగయ్య



తండ్రి కోటయ్య. జననం 21-2-1912 గుంటూరు జిల్లా జొన్నలగడ్డ. 1921 లో ఇంటర్మీడియేట్ చదువుతూ చదువుకు స్వస్తి చెప్పి, జాతీయోద్యమంలోకి దుమికారు. 1928 సైమన్ కమిషన్ బహిష్కరణలో పాల్గొన్నారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలోను, 1932 శాసనోల్లంఘనంలోను, 1940 వ్యష్టి సత్యాగ్రహంలోను, క్విట్ ఇండియా ఉద్యమంలోను, 1935, 1944 సంవత్సరాలలోను మరి రెండు సందర్భాలలోను మొత్తం ఆరుసార్లు అరెస్టు అయి, మొత్తం మూడు సంవత్సరాల 8 మాసాల జైలు శిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు. రాష్ట్రంలో సోషలిస్టు పార్టీ నిర్మాతలలో ఒకరు. తరువాత కొంత కాలం కమ్యూనిస్టు పార్టీలో పని చేశారు. 1979 లో కీర్తిశేషులైరి.

## జగుపిళ్ళ చిన్నారావు



తండ్రి సోమయ్య. జన్మస్థలం విజయవాడ. 1941లో నూజివీడులో బ్రిటిషు వ్యతిరేక ప్రచారం చేసి, మూడు వారాలు జైలు జీవితం గడిపారు. అనంతరం మద్రాసులో వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, తొమ్మిది నెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## జొన్నలగడ్డ సీతారామయ్య

విజయవాడ వాస్తవ్యులు. 1923 లో నాగపూర్ జెండా సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు ఆరు నెలల శిక్షను అనుభవించారు.

## జోశ్యభట్ల సత్యనారాయణ



తండ్రి సుబ్బయ్య. జననం 7-9-1916. తూర్పు గోదావరిజిల్లా ముమ్మిడివరం. మెట్రిక్యులేట్. రాష్ట్రంలో ట్రేడ్ యూనియన్ నిర్మాత, ప్రముఖ ప్రదేశ్ ట్రేడ్ యూనియన్ నాయకులు. మైనరుగా వున్నప్పుడే ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1937 లో కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోను, 1938 సంవత్సరంలో కమ్యూనిస్టు పార్టీలోను చేరారు. పశ్చిమకృష్ణా కాంగ్రెసుసంఘం, కమ్యూనిస్టులు కలిసి 1939 లో నిర్వహించిన మునగాల రైతు పోరాటంలో పాల్గొన్నారు. 11 నెలల జైలు శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. ప్రభుత్వం నిషేధించిన 'స్వతంత్ర భారత్' పత్రిక కల్గి వున్నందుకు, గుడివాడలోనే అరెస్టుచేసి, 10 మంది విద్యార్థులతో కలిపి కుట్రకేసు బనాయించారు. ఆ సందర్భంలో నాలుగు నెలలు సబ్‌జైలులో నిర్బంధించారు. రాష్ట్ర ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుకు ఉపాధ్యక్షులు. కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘానికి ప్రధాన కార్యదర్శి. రాష్ట్ర ప్రభుత్వం నుంచి సన్మానం పొందిన కొద్దిమంది కార్మిక నాయకులలో ఒకరు. కేంద్ర ప్రభుత్వ స్వాతంత్ర్య సమరయోధుల విషయంలో రాష్ట్ర ప్రభుత్వంచే నియమించబడ్డ ప్రదేశ్ సలహాసంఘ సభ్యులుగా పనిచేశారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## తటవర్తి వెంకటేశ్వరరావు



తండ్రి రామమూర్తి. జననం 27-11-1919. గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా కనగాల. విద్యార్థిదశలోనే డి. ఐ. ఆర్. క్రింద అరెస్టు అయ్యారు. వ్యష్టి సత్యాగ్రహంలో 26-2-1941 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. మునగాల రైతు పోరాటంలో ప్రముఖపాత్ర వహించారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## తమ్మిన నరసింహం



తండ్రి అప్పలస్వామి. జన్మస్థలం విజయవాడ. 1923 లో నాగపూర్‌లో జరిగిన జాతీయజెండా సత్యాగ్రహంలో పాల్గొని, అరెస్టయిన ఆంధ్రులలో ఒకరు. ఆరునెలల కఠిన శిక్ష విధించారు. తిరిగి ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొనారు. 14-6-1930న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931 న విడుదల అయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టు అయ్యారు. 31-12-1942 న 18 మాసాల కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించి, అనారోగ్య కారణాలపై 13-11-1943 న విడుదల అయ్యారు.

## తమ్మిన పోతరాజు

జన్మస్థలం విజయవాడ. విదేశీవస్తు బహిష్కరణోద్యమంలో క్రియాశీలమైన పాత్ర వహించారు. 1940 లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. కార్మిక

సంఘాల నిర్మాత. 1952, 1962 లలో శాసనసభకు ఎన్నికయ్యారు.

## తంగిరాల రామమూర్తి

తండ్రి పెద్ద ఆంజనేయులు. జననం 1902. గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా భట్టిప్రోలు. రైతు. నివాసం విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 13.8.1930 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. కీర్తిశేషులైరి.

## తాడేపల్లి వాసుదేవరావు

విజయవాడ వాస్తవ్యులు. 13.3.1941 న వ్యష్టి సత్యాగ్రహం చేశారు. రెండు వారాల కఠిన శిక్ష విధించబడింది.

## తాడేపల్లి వేణుగోపాలరావు

తండ్రి వెంకట రామారావు. జన్మస్థలం విజయవాడ. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 3.7.1930 న ఆరు నెలల కఠిన శిక్ష రు. 100/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## తాడికొండ పార్వతీశం

విజయవాడ నివాసి. 1923 నాగపూర్ జాతీయ జెండా సత్యాగ్రహంలో పాల్గొని, ఆరు నెలల శిక్ష అనుభవించారు.

## తుమ్మల వెంకట రామయ్య



తండ్రి లక్ష్మీనారాయణ. జననం 6.10.1914 గుంటూరు జిల్లా తెనాలి తాలూకా కొల్లూరు ప్రస్తుత నివాసం విజయవాడ. రచయిత, జర్నలిస్టు. కొల్లూరు జాతీయ పాఠశాలలో తెలుగు, హిందీ, సంస్కృతభాషాభ్యాసం. తరువాత హైస్కూలువిద్య పూర్తిచేశారు. 1934-35 కాశీవిద్యాపీఠంలో 'శాస్త్రి' కోర్సులో చేరారు. అతివాద రాజకీయాలతో ప్రభావితమై, చదువుకు స్వస్తిచెప్పి స్వరాష్ట్రం తిరిగివచ్చి, అనంతవరంలో కార్మికసంఘ ప్రచురణలో పాల్గొన్నారు. గోర్కీ 'మదర్'ను 'మాతృహృదయం' పేరుతో తెలుగులో వ్రాసి ప్రచురించారు. గుంటూరుజిల్లా 'కూలీ రక్షణ సమితి'లో పనిచేశారు. 1937 లో మద్రాసులో కమ్యూనిస్టు ఇన్ఫర్మేషన్ బ్యూరోలో పనిచేశారు. నవశక్తి సంపాదక వర్గ సభ్యులుగా పనిచేసి, మూడు వారాలపాటు సబ్‌జైలులో గడిపారు. అనంతరం అజ్ఞాతవాసంలో వుంటూ 'స్వతంత్ర భారత్' అనే రహస్యపత్రిక సంపాదక వర్గ సభ్యులుగా పనిచేశారు. 'ప్రజాశక్తి' 'విశాలాంధ్ర' 'అభ్యుదయ' పత్రికల సంపాదకులుగా పనిచేశారు. అభ్యుదయ రచయితల నిర్మాతలలో ఒకరు. 'ఎర్రజెండా' 'చెల్లీ' వంటి ప్రసిద్ధ గేయాలు, రచించారు. పాలస్తైయిన్ మాప్లా తిరుగుబాటు వంటి స్వతంత్ర రచనలు చేశారు. అనేక గ్రంథాలు అనువదించారు.

## తూములూరి వెంకటేశ్వరశాస్త్రి



తండ్రి శంకరరావు. జననం 21-10-1907 గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా భట్టిప్రోలు. నివాసం విజయవాడ. నటుడు. 1930జులైలో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, ఆరు నెలల కఠిన శిక్ష అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘనంలో అరెస్టు అయ్యారు. 15-1-1932 నుంచి 14-1-1933 వరకు సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు.

## తూములూరు రాఘవయ్య

విజయవాడ నివాసి. సహాయ నిరాకరణంలో పాల్గొని, 30-6-1922 నుంచి నాలుగు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## దాట్ల కృష్ణంరాజు

తండ్రి రామరాజు. జననం 1920. విజయవాడ ముత్యాలంపాడు. సినిమాహాలులో ఉద్యోగి. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 14-10-1944న పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వూరు సబ్ డివిజనల్ మేజిస్ట్రేటు కోర్టులో సంవత్సరం కఠిన శిక్ష విధించారు. అటు తర్వాత సెషన్స్ కోర్టులో ఆ శిక్షను ఆరు నెలలకు తగ్గించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. కీర్తిశేషులైరి.

## దాసు మధుసూదనరావు

నివాసం విజయవాడ. 1921 లో కాంగ్రెసు తీర్మానానుసారం ఒక సంవత్సరంపాటు తన న్యాయవాద వృత్తిని బహిష్కరించారు. పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు సంఘాధ్యక్షులుగా పనిచేశారు.

## దివి వీరబ్రహ్మం

తండ్రి రత్తయ్య. జన్మస్థలం విజయవాడ తాలూకా చోడవరం. స్వర్ణకారులు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, 9-4-1941 న నూజివీడులో అరెస్టు అయ్యారు. నాలుగు వారాల జైలుశిక్ష విధించారు. తిరిగి మద్రాసులో యుద్ధ వ్యతిరేక నినాదాలు చేసి, 5-7-1941 నుంచి ఆరు నెలల కఠినశిక్షను అలీపురం జైలులో అనుభవించారు. 15-12-1941 న విడుదలయ్యారు.

## దిగవల్లి వెంకటశివరావు, బి.ఎ.బి.యల్.



తండ్రి వెంకటరత్నం పంతులు. 1898 ఫిబ్రవరి 14 న కాకినాడలో జన్మించారు. చరిత్ర పరిశోధకులు. 1930-32 శాసనోల్లంఘనోద్యమ కాలంలో పశ్చిమ కృష్ణా కాంగ్రెస్ కమిటీ ప్రచురణశాఖ బాధ్యులు. "సత్యాగ్రహ చరిత్ర", "నిర్భాగ్య భారతము", "బార్డోలీ సత్యాగ్రహ విజయము", బ్రిటిషు వస్తు బహిష్కారము" "దరిద్ర నారాయణీయము" మొదలైన పుస్తకాలను ప్రభుత్వం నిషేధించింది. 25-8-30 న ఈ పుస్తకాల ప్రచురణకుగాను కేసు పెట్టారు, కాని ప్రభుత్వం కేసు పెట్టడానికి అనుమతించనందున వదలిపెట్టబడ్డారు. తర్వాత ప్రభుత్వానుమతితో రాజద్రోహ నేరం మోపబడింది. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ననుసరించి కేసు ఉపసంహరించుకోబడింది. పరోక్షంగా స్వాతంత్ర్య సంగ్రామానికి సహాయపడ్డారు. ఈయన రచనలు కాంగ్రెసు వలంటీర్లను ఉత్తేజపరచేవి. 50 పుస్తకాలు పైగా రాశారు. అనేక పరిశోధక వ్యాసాలు రాశారు "స్వరాజ్య" పత్రిక ప్రత్యేక విలేకరిగాకూడా పనిచేశారు. విజ్ఞాన చంద్రికా మండలి పాలకవర్గ సభ్యులుగా పనిచేశారు. పలు విద్యా విషయక కమిటీలలోను, సంఘాలలోను, అధికార అనధికార విద్యా విషయక సంఘాలలోను సభ్యులు.

## దువ్వు వీరాస్వామి



తండ్రి పెదయ్య. జననం 1908 విజయవాడ ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 7 నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1941 లో యుద్ధ వ్యతిరేక నినాదాలు చేసి, అరెస్టు అయ్యారు. తిరిగి వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, 21-6-1941 నుంచి పదివారాలు కఠిన శిక్షను మద్రాసు జైలులో అనుభవించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. బండ్ల కార్మిక సంఘ నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించారు. కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం ఉపాధ్యక్షులు.

## దుక్కా ఎల్లయ్య



తండ్రి తాతయ్య జన్మస్థలం విజయవాడ. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, డి. ఐ. ఆర్. క్రింద అరెస్టు అయి, 8-2-1941 నుంచి 8 వారాల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## దుక్కా కనకయ్య



తండ్రి నరసింహం. జన్మస్థలం విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆరు నెలల కఠిన శిక్ష, రు. 10/- జరిమానా విధించారు. 2-6-1930 నుంచి 2-12-1930 వరకు రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## దోర్బల శేషాద్రి శాస్త్రి

విజయవాడ వాస్తవ్యులు. 1921 లో సహాయ నిరాకరణోద్యమ కాలంలో ఒక సంవత్సరం న్యాయ వాద వృత్తిని వదులుకొన్నారు.

## నందిరాజు అమరేశ్వరరావు



తండ్రి లింగయ్య. జననం 1922 గుంటూరు జిల్లా తెనాలి తాలూకా వేమూరు. ప్రస్తుత నివాసం విజయవాడ వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1942 డిసెంబరులో ఆంధ్ర యూనివర్శిటీ స్నాతకోత్సవానికి హాజరైన గవర్నరు ఆర్థర్ హోప్ రాకకు నిరసనగా నల్లజెండాల ప్రదర్శనలో పాల్గొని, తీవ్రమైన లాఠీచార్జికి గురయ్యారు. అనంతరం 19-12-1942 న క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. 31-12-1942న తెనాలి మేజిస్ట్రేట్ 9 నెలల కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## నండూరి వెంకటేశ్వరరావు



తండ్రి వెంకటప్పయ్య. జననం 1-4-1910 గన్నవరం తాలూకా జక్కుల నెక్కలం. నివాసం విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టుఅయ్యారు. 11-6-1930 న రెండేళ్ళ కఠిన శిక్ష విధించారు. మైనరు కావటంవల్ల తంజావూరులోని బోర్స్టల్ స్కూలుకు పంపారు. తరువాత రాజమండ్రి జైలుకి బదిలీ చేశారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 18-2-1931 న విడుదల అయ్యారు. శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీ దెబ్బలు తిన్నారు 4-5 1932 న సంవత్సరం జైలు శిక్ష విధించారు. రాజమండ్రి, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు 1-4-1973 న కీర్తిశేషులైరి.

## నండూరి వెంకట రంగాచారి

తండ్రి పురుషోత్తమాచారి. విజయవాడ వాస్తవ్యులు. జర్నలిస్టు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 14-6-30 న రెండున్నర సంవత్సరాలు కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష ననుభవించారు. 23-12-31 న విడుదల అయ్యారు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొనన్నందుకు గాను తిరిగి 12-4-1932 నుండి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి సెంట్రల్ జైలులో అనుభవించారు.

## నిట్టల రామకృష్ణ బ్రహ్మం

తండ్రి నరసింహం. నివాసం విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 12-6-1930 న

రెండు సంవత్సరాల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 11.3.1931 న విడుదలయ్యారు.

## పరకాల పట్టాభి రామారావు



తండ్రి వెంకట సూర్య నారాయణ. 1920 లో పశ్చిమ గోదావరి జిల్లా కవిటంలో జన్మించారు. విజయవాడ వాస్తవ్యులు. భగత్ సింగ్ ఉరి తీయబడినప్పుడు మా ఊరులో జరిగిన విద్యార్థుల సమ్మెలో బాల్యంలోనే పాల్గొన్నారు. 1939 లో యుద్ధం ప్రారంభం కాగానే కాకినాడలో జరిగిన యుద్ధ వ్యతిరేక విద్యార్థి సమ్మెలో ప్రముఖ పాత్ర వహించారు యుద్ధ వ్యతిరేక కరపత్రాలు పంచినందుకు ప్రభుత్వ నిర్బంధ విధానానికి గురియై అజ్ఞాతవాస జీవితం ప్రారంభించారు. కాకినాడ కాంగ్రెసు ఆఫీసు నుండి రహస్య కరపత్రాలు తయారు చేయడంలో పాల్గొన్నారు. 1942 లో వీరి ఇల్లును, గుడివాడలో అత్తవారిల్లును సోదా చేశారు. అరెస్టు వారెంటు జారీ చేశారు 1943 జనవరి 20 వ తేదీన తణుకులో అరెస్టు చేశారు. 1946 జనవరి 26 వ తేదీన స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా మళ్ళీ అరెస్టయ్యారు కోయ రైతుల జమీందారీ వ్యతిరేక పోరాటంలో 1946_47 ప్రాంతంలో గోపాలపురంలో అరెస్టయ్యారు. తూ. గో. జిల్లా విద్యార్థి ఉద్యమ నిర్మాతల్లో ఒకరు. 1939 లో కాకినాడలో సుభాస్ చంద్రబోస్ ప్రారంభకులుగా జరిగిన 16 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ ఆహ్వాన సంఘ ప్రధాన కార్యదర్శి. 1952 నుండి విశాలాంధ్ర పత్రికలో ఉప సంపాదకులుగాను, ఇపుడు సంపాదక వర్గ సభ్యులుగాను ఉన్నారు.

## పరిటాల రంగనాయకులు



తండ్రి వెంకటపతి. జననం 1901 ప్రకాశం జిల్లా ఒంగోలు. వ్యాపారి. ప్రస్తుత నివాసం విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయి, 21-7-1930 నుంచి 10 12-1930 వరకు రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## పంచాంగం వెంకట సత్యనారాయణాచార్యులు



తండ్రి కృష్ణమాచారి. తూర్పు గోదావరి జిల్లా రాజోలు వాస్తవ్యులు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని 22.6.1932 నుండి 8.12.1932 వరకూ కఠిన శిక్ష మద్రాసు సెంట్రల్ జైలులో అనుభవించారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## పసుపులేటి కేశవరావునాయుడు



తండ్రి వెంకట రాజారావు నాయుడు. జననం 2.8 1900 తమిళనాడు కుంభకోణం. పట్టభద్రులు. పోస్టల్ ఉద్యోగి. ప్రస్తుత నివాసం విజయవాడ. 1941 లో పోస్టల్ ఉద్యోగిగా బందరు నుంచి సింగపూర్‌కు బదిలీ అయ్యారు. 1942 ఫిబ్రవరి 15 న జపాను సైన్యానికి బందీగా చిక్కారు.

సుభాసు చంద్రబోసు ఏర్పాటు చేసిన ఆజాద్ హింద్ ఫౌజ్‌లో చేరి, అనేక ముఖ్యమైన పదవులు నిర్వహించారు. 1945 లో రంగూన్‌లో బ్రిటిషు సైన్యానికి ఖైదీగా చిక్కారు. 1946 జనవరి 24 వ తేదీ వరకు బ్రిటిషు ప్రభుత్వ నిర్బంధంలో వున్నారు. కేంద్రంలో తాత్కాలిక జాతీయ ప్రభుత్వం ఏర్పడిన అనంతరం విడుదలై, 1947 మే 1 నుంచి తిరిగి పోస్టల్ శాఖలో ఉద్యోగిగా చేరారు. రిటైర్ అయ్యారు.

## పాంచాలవరపు నరసింహారావు

తండ్రి సుబ్బారావు. జన్మస్థలం విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 16.6.1930 న సంవత్సరం ఎనిమిది రోజుల కఠిన శిక్ష విధించారు. తిరుచునాపల్లి, అలీపురం, కడలూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒప్పందంతో 9.3.1931 న విడుదలయ్యారు.

## పాతూరి నాగభూషణం



తండ్రి బుర్రయ్య. జననం 20.8.1907 గుంటూరు జిల్లా తెనాలి తాలూకా పెదపాలెం. ఇంటర్మీడియట్ చదివి, లైబ్రరీ సైన్స్‌లో డిప్లమా పొందారు. 1928 సైమన్ బహిష్కరణలో పాల్గొన్నారు. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయి, 3.8.1930 న సంవత్సరం కఠిన శిక్ష విధించగా రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14.3.1931 న విడుదలయ్యారు. శాసనోల్లంఘనంలో అరెస్టు అయి, ఆరు నెలల కఠిన శిక్షను 23.8.1932 నుంచి రాజమండ్రి జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. లైబ్రరీ ఉద్యమ రథసారధులలో ఒకరు. 'కళా ప్రపూర్ణ' బిరుదాంకితులు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## పాశం దుర్గయ్య

జన్మస్థలం విజయవాడ. సహాయ నిరాకరణంలో పాల్గొని, 30.6.1922 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## పిడికిటి నారాయణమూర్తి



స్వగ్రామం గుంటూరుజిల్లా గుండిమెడ. నివాసం విజయవాడ. రైతు. పిన్న వయస్సులోనే బుద్ధుని జీవకారుణ్య వాదంతో ప్రాభావితుడై, అనంతరం వీర సావర్కార్, అల్లూరి సీతారామరాజు, తిలక్, భగత్‌సింగ్ వంటి వారి ఆదర్శ ప్రాయ జీవితాలతో ఉత్తేజితులై, జాతీయోద్యమంలోకి దుమికారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1932 శాసనోల్లంఘనంలో తిరిగి పాల్గొన్నారు. సంవత్సరం కఠిన శిక్ష, రు.250 జరిమానా విధించారు. తదాదిగా 68 అభ్యుదయ ఉద్యమాలకు చేదోడు వాదోడుగా వుంటూ, సామ్యవాద వ్యవస్థ స్థాపన ఒక్కటే శరణ్యమన్న నమ్మకం ఏర్పరచుకొన్నారు.

## పిల్లి గురవయ్య



తండ్రి చెన్నయ్య. జననం నెల్లూరు జిల్లా (ఇప్పటి ప్రకాశం జిల్లా) పొదిలి తాలూకా కొనకలమెట్ల. నివాసం విజయవాడ. హరిజనుడు. 1941 లో మద్రాసులో వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని రెండుసార్లు అరెస్టుఅయ్యారు. 14.6.1941న రెండు మాసాల కఠిన శిక్ష విధించారు. మద్రాసు జైలులో శిక్ష అనుభవించారు. మద్రాషు మింట్ వీధిలో

యుద్ధ వ్యతిరేక నినాదాలు చేసినందుకు, 16.10.1941 న డి. ఐ. ఆర్. క్రింద అరెస్టు చేసి, ఆరు మాసాల కఠిన శిక్ష విధించారు. అలీపురంజైలులో శిక్షనుఅనుభ వించారు. 16.12.1941 న విడుదలయ్యారు.

## పింగళి లక్ష్మీనారాయణ ఉరఫ్ నారాయణానంద సరస్వతి

తండ్రి వెంకన్న. జన్మస్థలం దివి తాలూకా యార్లగడ్డ. ఉపాధ్యాయులు. స్వదేశీ ఉద్యమంలో పాల్గొన్నారు. 1908 సెప్టెంబరు 15 న అరెస్టు అయ్యారు. 1909 లో మరొకసారి అరెస్టు అయ్యారు. 1905 సెప్టెంబరులో "ది కృష్ణా స్వదేశీ ట్రేడింగ్ కంపెనీ"ని స్థాపించి, స్వదేశీ ఉద్యమ వ్యాప్తికి కృషి చేశారు. స్వదేశీ వస్తువులను మాత్రమే ఆ సంస్థ విక్రయించింది. 1907లో తెలుగు పత్రిక 'స్వరాజ్య' ప్రచురించారు. 1908-12 మధ్య కాలంలో ఫ్రెంచి ఇండియాలో ప్రవాస జీవితం గడిపారు. 1921 సహాయ నిరాకరణంలో కొండపల్లిలో సారా దుకాణాలముందు పికెటింగ్ చేశారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 21.4.1930 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, వెల్లూరు, మద్రాసు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు. జైలు నుంచి విడుదలైన తరువాత, సికింద్రాబాద్ కల్లు దుకాణాల ముందు పికెటింగ్ చేశారు. ఆనాటి నైజాం ప్రభుత్వం హైదరాబాద్ సంస్థానం నుంచి 24 గంటలలో వెళ్ళిపోవాలని బహిష్కరించింది. కర్నూలు వెళ్ళి, అక్కడ పికెటింగ్ చేసి, అరెస్టు అయి శిక్ష అనుభవించారు. శాసనోల్లంఘనంలో 8.1.1932 న ఊరేగింపునకు నాయకత్వం వహించి, నాలుగు మాసాల కఠిన శిక్షను బళ్ళారి జైలులో అనుభవించారు. తిరిగి 12.6.1932 న అరెస్టు అయి, ఆరు నెలల కఠిన శిక్షను బళ్ళారి జైలులో అనుభ వించారు. మరొకసారి శాసనోల్లంఘనంలో పాల్గొని అరెస్టు అయ్యారు. 18.9.1933 న ఆరు నెలల కఠిన శిక్ష రు. 75/- జరిమానా విధించారు. బళ్ళారిజైలులో శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో 24.8.1942 నుంచి 18 2 1944 వరకు వెల్లూరు, తంజావూరు జైళ్ళలో డిటెన్యూగా వున్నారు. 1938 లో ఎ. ఐ. సి. సి. సభ్యులు. అంటరానితనం నిర్మూలనకు, హరిజనోద్ధరణకు కృషి చేశారు.

## పింగళి వెంకటేశ్వరరావు



తండ్రి సుబ్బారావు. జననం 1913 గుంటూరుజిల్లా తెనాలి తాలూకా చావలి. నివాసం విజయవాడ. మునిసిపల్ లైబ్రేరియన్‌గాపని చేసిరిటైర్ అయ్యారు. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. 18.5.1930 న సంవత్సరం కఠిన శిక్ష, రు 45/- జరిమానా విధించారు. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14.3.1931 న విడుదలయ్యారు.

## పింగళి పానకాలరావు



తండ్రి సుబ్బారావు. జననం 1916 గుంటూరుజిల్లా తెనాలి తాలూకా చావలి. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టు అయి, 2.11.1942 నుంచి రెండు సంవత్సరాల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## పిళ్ళా కనకయ్య



తండ్రి కనకయ్య. జన్మస్థలం విజయవాడ. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 8-10-1940 న సంవత్సరం కఠిన శిక్షను, రు. 25ల జరిమానాను విధించారు. వెల్లూరు, కోయంబత్తూరు, అలీ

పురం, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. కీర్తి శేషులైరి.

## పిళ్ళా నారాయణమూర్తి



తండ్రి దాలెప్ప. జన్మస్థలం విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 27-5-1930 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి, వెల్లూరు, అలీపురం జైళ్ళలో అనుభవించారు. కీర్తిశేషులైరి.

## పిళ్ళా రాములు



తండ్రియరకయ్య. జననం 1915 విజయవాడ. వడ్రంగి. వ్యష్టి సత్యాగ్రహంలో విజయవాడలో ఒకసారి, మద్రాసులో రెండుసార్లు పాల్గొన్నారు. 18-1-1941 నుంచి నాలుగువారాల కఠిన శిక్షను రాజమండ్రి జైలులోను, 11-6-1941 నుంచి 3 మాసాల కఠిన శిక్షను మద్రాసు జైలులోను, 5-9-1941 నుంచి 9 నెలల కఠిన శిక్షను అలీపురం జైలులోను అనుభవించారు.

## పిళ్ళా కొండలరావు



తండ్రి నరసింహం. జననం 23-6-1923 విజయవాడ, మున్సిపల్ లారీ క్లీనర్. వ్యష్టి సత్యాగ్రహంలో 13-2-1941న అరెస్టు అయ్యారు 19-2-41న విజయవాడ జాయింట్ మేజిస్ట్రేట్ వారం రోజుల కఠిన శిక్ష విధించారు. తిరిగి వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, 14-6-1941 నుంచి పదివారాల కఠిన శిక్షను మద్రాసు జైలులో అనుభవించారు.

## పిళ్ళా సన్యాసి

తండ్రి అప్పలస్వామి. బెజవాడ వాస్తవ్యులు. శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నారు. 24-9-32 నుండి రాజమండ్రి జైల్లో ఆరు నెలలు అదనంగా 12 వారాల శిక్ష ననుభవించారు.

## పీసపాటి వెంకట సుబ్బారావు

తండ్రి వెంకటకృష్ణయ్య. విజయవాడవాస్తవ్యులు. ఉపాధ్యాయులు కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమాలన్నిటిలో పాల్గొన్నారు. హిందీ ప్రచారంలో ఎక్కువ ఆసక్తి చూపారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు 6-8-30 నుండి 6 నెలల 6 వారాల శిక్ష రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## పీసపాటి మన్మథరావు

విజయవాడ నివాసి 1923 నాగపూర్ జాతీయ జెండా సత్యాగ్రహంలో పాల్గొని, ఆరు నెలల జైలు శిక్ష అనుభవించారు.

## పీసపాటి వెంకటేశ్వర్లు

విజయవాడ నివాసి. 1907 లో వందేమాతరం ఉద్యమంలో పాల్గొని, రాజమండ్రి ఆర్ట్సు కాలేజీ నుంచి బహిష్కృతులయ్యారు.

## పుచ్చలపల్లి సుందరయ్య



1-5-1913 న నెల్లూరు జిల్లా అలగానిపాడులో జన్మించారు. తండ్రి వెంకటరామరెడ్డి. తిరువళ్ళూరు, ఏలూరు, రాజమండ్రి, మద్రాసు, బెంగుళూరులలో విద్యాభ్యాసం. 14 వ ఏట మద్రాసు కాంగ్రెసు మహాసభకు హాజరయ్యారు

సైమన్ కమిషన్ బహిష్కరణ హర్తాళ్, ప్రదర్శనలలో పాల్గొన్నారు. 1930 లో మద్రాసు లయోలా కాలేజీలో చదువుతూ 'సోదర సమితి' స్థాపించారు. 1930 జనవరి 26 న వందలాది విద్యార్థులతో జరిగిన స్వాతంత్ర్య దినోత్సవం నిర్వహణలో ప్రముఖ పాత్ర వహించారు. ఏప్రిల్‌లో చదువుకు స్వస్తి చెప్పి, పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం ఉప్పు సత్యాగ్రహ శిబిరంలోచేరి, అరెస్టు అయ్యారు. రెండేళ్ళ కఠిన శిక్ష విధించి, మైనారిటీ వెళ్ళనందున, తంజావూరు బోర్‌స్టల్ స్కూలుకు పంపారు. 9నెలల శిక్ష అనుభవించిన తర్వాత గాంధీ–ఇర్విన్ ఒప్పందం ఫలితంగా జైలు నుంచి విడుదలయ్యారు. వ్యవసాయ కూలీలను సంఘటితం చేస్తూ, హరిజనోద్ధరణకు కృషి చేశారు. నెల్లూరు జిల్లాలో సత్యాగ్రహ శిబిరాలను నిర్వహించారు. 1930 నుండి కమ్యూనిస్టుపార్టీలో సభ్యులు. కూలీ రక్షణ సమితి. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించారు. పి.సి.సి., ఎ.ఐ.సి.సి. సభ్యులుగా 1934 నుంచి 1938 మధ్య కాలంలో ఎన్నికయ్యారు. దక్షిణ భారతంలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించారు. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ప్రభుత్వం అరెస్టు వారెంటు జారీ చేయగా, 1939 సెప్టెంబరు నుండి 1942 జూలై వరకు అజ్ఞాత వాసం గడిపారు. రహస్యంగా ఉంటూనే కమ్యూనిస్టు ఉద్యమాన్ని నిర్మించారు. లోండాలో ఒకసారి పోలీసులకు పట్టుబడి, తప్పించుకొని పారిపోయారు. రాజ్యసభలో కమ్యూనిస్టుపక్ష నాయకులుగా కొంత కాలం, ఆంధ్రప్రదేశ్ శాసనసభలో ప్రతిపక్ష నాయకులుగా కొంతకాలం పనిచేశారు. కమ్యూనిస్టు పార్టీ చీలిక అనంతరం భారత మార్క్సిస్టు కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. ప్రస్తుతం రాష్ట్ర శాసన సభకు కృష్ణాజిల్లా గన్నవరం నియోజక వర్గం నుంచి ఎన్నికై, మార్క్సిస్టు కమ్యూనిస్టు పక్ష నాయకులుగా పనిచేస్తున్నారు. నవశక్తి, ప్రజాశక్తి పత్రికల సంపాదక వర్గ సభ్యులు. 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం', "వీర తెలంగాణా విప్లవ పోరాటం, గుణపాఠాలు" అనే గ్రంథాలు రచించారు. విశాలాంధ్ర రాష్ట్రం ఏర్పాటుకు దోహదం చేశారు. తెలంగాణా సాయుధ పోరాటానికి నాయకత్వం వహించిన వారిలో ఒకరు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## పులివెందల తిరుమలరావు

తండ్రి అన్నాజీరావు. విజయవాడ వాస్తవ్యులు. రిటైరయిన రైల్వే ఉద్యోగి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 14-6-'30 న ఆరు నెలల కఠిన శిక్ష, రు. 100 జరిమానా విధించబడింది. జరిమానా చెల్లించారు రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో నిర్బంధింపబడ్డారు.

## పుచ్చా కుటుంబరావు



తండ్రి వెంకటేశ్వర్లు జననం 1913 గుంటూరు జిల్లా తెనాలి తాలూకా పెదకొండూరు. గుమాస్తా. నివాసం విజయవాడ. 1930 ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. రెండు సంవత్సరాల కఠిన శిక్ష విధించారు. తంజావూరు జైలులో శిక్ష అనుభవించారు. ఖద్దరు ఉద్యమంలో పాల్గొన్నారు. ప్రస్తుతం ఆదిలాబాద్ జిల్లాబెల్లంపల్లిలో గుమాస్తాగా పనిచేస్తున్నారు.

## పుసునూరి అంజనేయులు

తండ్రి వీరాస్వామి. జన్మస్థలం విజయవాడ. కాఫీ హోటల్ గుమాస్తా. వ్యష్టి సత్యాగ్రహంలో 16-1-1941 న అరెస్టు అయ్యారు. 1-2-1941 న విజయవాడ జాయింట్ మేజిస్ట్రేట్ డి. ఎ. ఆర్. క్రింద మూడు వారాల కఠిన శిక్ష విధించారు. తిరిగి మద్రాసులో సత్యాగ్రహం జరిపి, 14-6-1941 నుంచి నాలుగు నెలల కఠిన శిక్షను మద్రాసు, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## పూతిగ ముఖ్య ప్రాణారావు

తండ్రి శ్రీనివాసరావు. జన్మస్థలం విజయవాడ. విద్యార్థిగా క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని,

8-10-1942 నుంచి రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## పొన్నూరు వీరరాఘవరావు గుప్త



తండ్రి కొండయ్య శెట్టి. జన్మస్థలం విజయవాడ. వ్యాపారి. విద్యార్థి దశలోనే ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 15-5-1930 నుంచి సంవత్సరం జైలు శిక్షను రాజమండ్రి, వెల్లూరు, మద్రాసు జైళ్ళలో అనుభవించారు. 1932 లో తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని, రాజమండ్రి జైలులో సంవత్సరం శిక్ష అనుభవించారు. 2 సార్లు లాఠీచార్జీకి గురి అయ్యారు. 1956 అక్టోబర్‌లో కీర్తిశేషులయ్యారు.

## పొత్తూరు సత్యనారాయణ

తండ్రి లక్ష్మీపతిరాజు. జననం 8-5-1928 విజయవాడ. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టు అయి, నాలుగు నెలల 10 రోజులు సబ్‌జైలు నిర్బంధంలో వున్నారు.

## పొణుకుపాటి వెంకట నాగభూషణం

తండ్రి కాంతయ్య. విజయవాడ వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నారు. 7-8-30 న ఆరు నెలల కఠిన శిక్ష రు. 100 జరిమానా విధించబడింది. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష ననుభవించారు.

## పోతిన చిన అప్పలస్వామి



తండ్రి తమ్మయ్య జననం 1902 విజయవాడ. వ్యష్టి సత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. 11-2-41న ఆయిదు నెలల కఠిన శిక్ష. రు. 5/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## పోతిన వెంకన్న



తండ్రి జోగన్న. జననం 7-7-1919 విజయవాడ. వ్యష్టి సత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. 28-1-1941 న పది వారాల జైలు శిక్షను. రు. 100/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## పోతిన రాములు



తండ్రి బిక్షాలు. జన్మస్థలం విజయవాడ. వ్యాపారి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 27-5-1930 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు. తిరిగి 1941 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. రెండు వారాల కఠిన శిక్ష, రు 250/-ల జరిమానా విధించారు.

## పోతిన కనకయ్య

జన్మస్థలం విజయవాడ. 1940-41 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. కోర్టు లేచే వరకు జైలు శిక్ష విధించారు.

## పోతిన ఎర్రయ్య

విజయవాడ నివాసి. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీచార్జీకి గురయ్యారు.

## పోలవరపు జగన్నాథరావు



తండ్రి రామస్వామి. జననం 24.6.1916. గుడివాడ తాలూకా పెయ్యేరు. ప్రస్తుత నివాసం విజయవాడ. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని అరెస్టు అయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో, ఉప్పులూరు రైలు స్టేషన్ను తగులబెట్టిన కేసులో అరెస్టు అయ్యారు.

## పోలూరి సీతారామయ్య



తండ్రి కేశవయ్య. జన్మస్థలం గుంటూరు జిల్లా చిలకలూరిపేట తాలూకా పోలూరు. ఉప్పుసత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. 14.6.1930 న రెండేళ్ళ కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 11.3.1931 న విడుదలయ్యారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## పేరంబూదూరి అనందరావు



తండ్రి రామానుజరావు. జననం 1914 శ్రీకాకుళం జిల్లా శ్రీకాకుళం. స్వస్థలం పశ్చిమ గోదావరిజిల్లా తణుకు తాలూకా మల్లిపూడి. ప్రసుత నివాసం విజయవాడ. సైమన్ కమిషన్ బహిష్కరణ సందర్భంలో జరిగిన బరంపురం విద్యార్థుల సమ్మెలో పాల్గొన్నారు. ఉప్పు సత్యాగ్రహంలో న్యాయపతి నారాయణమూర్తి నాయకత్వంలోని దళంలో పాల్గొన్నారు. శాసనోల్లంఘన కాలంలో రహస్య పత్రిక 'వీర భారతి' పంపిణీ బాధ్యతలు నిర్వహించారు. తణుకు తాలూకా కాంగ్రెస్ ఆర్గనైజర్గా, తాలూకా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యదర్శిగా పని చేశారు. 1936 లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో వ్యష్టి సత్యాగ్రహానికి సన్నాహాలుచేస్తూ అరెస్టు అయ్యారు. 22.11.1940 నుంచి 25.6.1942 వరకు వెల్లూరు జైలులో డిటెన్యూగా ఉన్నారు. జైలులో 20రోజులు నిరాహార దీక్షలో పాల్గొన్నారు. 1946 జనవరి 26 వ తేదీన స్వాతంత్ర్య దినోత్సవం జరుపగా ఆరు నెలల కఠిన శిక్ష విధించారు. అనంతరం అప్పీలులో ఆ కేసు కొట్టివేశారు. 1946 నుంచి విజయవాడలో 'ప్రజాశక్తి' 'జనత' 'విశాలాంధ్ర' పత్రికలకార్యాలయాలలో పని చేసి, రిటైర్ అయ్యారు. 1972 లో కేంద్ర ప్రభుత్వం అందజేసిన 'తామ్రపత్ర' గ్రహీత.

## పైడిపాటి పోతన్న పాత్రుడు



తండ్రి వెంకటస్వామి. జననం 15.8.1907 విజయవాడ. వ్యష్టి సత్యాగ్రహంలో మూడుసార్లు పాల్గొని, అరెస్టు అయ్యారు. మొదటిసారి విజయవాడలో అరెస్టు అయి, 15రోజులు గన్నవరం సబ్ జైలులోను, రెండవసారి ఆగిరిపల్లిలో అరెస్టు అయి నెల రోజులు నూజివీడు సబ్జైలులోను, మూడవసారి మద్రాసులో అరెస్టు అయి మూడు నెలలు మద్రాసు, అలీపురం జైళ్ళలోను శిక్షలు అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు.

## పేరిరుపు వెంకటరామయ్య

తండ్రి అప్పయ్య. విజయవాడ వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా 11.6.1930 న రెండేళ్ళ కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి

బళ్ళారి జైళ్ళలో శిక్ష ననుభవించారు. గాంధీ ఇర్విన్ ఒడంబడిక ననుసరించి 11.3.1931 న విడుద అయ్యారు. శాసనోల్లంఘనోద్యమంతో సంబంధం ఉండటంవల్ల తిరిగి 31.5.1932 న సంవత్సరం కఠిన శిక్షవిధించబడింది. రాజమండ్రి, కన్ననూరు జైళ్ళలో శిక్ష ననుభవించారు. స్వాతంత్ర్య సమరంలో వివిధ ప్రాంతాలలో ఆరుసార్లు లాఠీఛార్జీకి గురి అయ్యారు.

## బంకా అచ్చయ్య పాత్రుడు



తండ్రి రామన్న పాత్రుడు. జన్మస్థలం విజయవాడ. చిన్న వయస్సులోనే, 1923 నాగపూర్ జాతీయ జెండా సత్యాగ్రహంలో, పాల్గొని, ఆరుమాసాల కఠిన శిక్షను నాగపూర్ జైలులోఅనుభవించారు కీర్తి శేషులైరి.

## బంకా గోవిందరాజులు

తండ్రి వెంకటస్వామి. జన్మస్థలం విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 7-6-1930 నుంచి ఏడు నెలల కఠిన శిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో అనుభవించారు.

## బంకా కొండలు

విజయవాడ నివాసి. 10.2.1941 న నూజివీడులో వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. 11.2.1941 న 25 రోజుల కఠిన శిక్ష, రూపాయ జరిమానా విధించారు.

## బడిత అప్పలస్వామి

నివాసం విజయవాడ. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. కోర్టు లేచేవరకు శిక్ష విధించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టు అయి, నెలా పదిహేనురోజులు జైలుశిక్ష అనుభవించారు.

## బసవరాజు వెంకట శ్రీరంగశాయి

తండ్రి రామచంద్రరావు. విజయవాడ వాస్తవ్యులు. పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు కమిటీ స్పెషల్ ఆఫీసరుగా పని చేశారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19.5.1930 న సంవత్సరం విడి ఖైదు విధింపబడింది. రాజమండ్రి, వెల్లూరు, మద్రాసు అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించారు గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ప్రకారం 14-3-31 న విడుదలయ్యారు. శాసనోల్లంఘనోద్యమంలో 8.1.32 నుండి ఏడు నెలల కఠిన శిక్షను, రాజమండ్రి, కడలూరు జైళ్ళలో అనుభవించారు. ఈ శిక్షతోపాటు రు. 15/- జరిమానాను చెల్లించారు. 15.11.32 నుంచి తిరిగి 7½మాసాల కఠిన శిక్షను రాజమండ్రి, మధురై, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు. వ్యక్తి సత్యాగ్రహ ఉద్యమంతో సంబంధం కల్గి వున్నారు. 15.1.41 న ఆరు నెలల కఠిన శిక్ష రు. 200 జరిమానా, చెల్లించని పక్షంలో మరో రెండు నెలల కఠిన శిక్ష విధింపబడింది. రాజమండ్రి, తిరుచునాపల్లి, మద్రాసు జైళ్ళలో శిక్షను అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా 7.11.42 నుండి 8.7.45 వరకు వెల్లూరు, తంజావూర్ జైళ్ళలో శిక్ష ననుభవించారు. కీర్తిశేషులు.

## బసవరాజు వెంకట సుబ్బారావు



తండ్రిరామచంద్రరావు. జననం 14-6-1898 పశ్చిమ గోదావరిజిల్లాఏలూరు. నివాసం విజయవాడ. ఉపాధ్యాయులు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. రిటైర్డ్ మునిసిపల్ టీచరు. నాటక రంగంలో కృషి చేశారు.

## బసవరాజు రామచంద్రయ్య

విజయవాడ నివాసి. స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నారు.

## బసవా వెంకటరమణయ్య

విజయవాడ వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొనగా లాఠీచార్జీకి గురి అయ్యారు.

## బాయన అప్పలస్వామి



తండ్రి కనకయ్య. జన్మస్థలంవిజయవాడ. గుమస్తా. 24-1-41న వ్యష్టి సత్యాగ్రహం చేసి, అరెస్టుఅయ్యారు 4-2-1941 న కోర్టు ముగిసేవరకు శిక్ష విధించి. వదలివేశారు. తిరిగి మద్రాసులో రెండుసార్లు వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 11-6-1941 న రెండు మాసాల కఠిన శిక్ష విధించారు. మద్రాసు జైలులో ఆ శిక్ష అనుభవించారు. 16-10-1941 న ఆరు మాసాల కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించి, విడుదలైన పిమ్మట కీర్తిశేషులైరి.

## బాయన పాపయ్య పాత్రుడు

తండ్రి గురవయ్య పాత్రుడు. జననం 1901 విజయవాడ. వ్యష్టి సత్యాగ్రహంలో విజయవాడలో ఒకసారి, మద్రాసులో రెండుసార్లు, మొత్తం మూడు సార్లు అరెస్టు అయ్యారు. 24-1-1941 నుంచి మూడు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులోను, 11-6-1941 నుంచి రెండునెలల కఠినశిక్షను మద్రాసు జైలులోను 15-8-1941 నుంచి 8 మాసాల కఠిన శిక్షను అలీపురం జైలులోను అనుభవించారు. కీర్తిశేషులైరి.

## బాయన రాములు



తండ్రిరామ్మూర్తి జన్మస్థలంవిజయవాడ. వడ్రంగి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 5-6-1930 నుంచి 4-12-1930 వరకు రాజమండ్రి జైలులో కఠిన శిక్ష అనుభవించారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, లాఠీచార్జీకి గురయ్యారు. కోర్టు లేచే వరకు శిక్ష విధించారు.

## బాయని సుబ్బారావు

తండ్రి రాఘవయ్య. విజయవాడ వాస్తవ్యులు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 12-2-41 నుండి రాజమండ్రి సెంట్రల్ జైలులో 8 వారాల కఠిన శిక్షను అనుభవించారు. ఇండియన్ యూనియన్‌లో అప్పటి హైదరాబాద్ స్టేట్ విలీనం గావాలని సాగించిన ఉద్యమంలో 4-7-48 న నాల్గేండ్ల శిక్ష విధించబడింది; ఔరంగాబాద్, గుల్బర్గా జైళ్ళలో శిక్షలను అనుభవించారు.

## బి. దుర్గయ్య

జన్మస్థలం విజయవాడ. సహాయ నిరాకరణంలో పాల్గొని, 30-9-1922 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## బొమ్మిడి నరసింహం

తండ్రి సోమయ్య. జన్మస్థలం విజయవాడ. 1932 శాసనోల్లంఘనంలో అరెస్టు అయి, 4-5-1932 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు. కీర్తిశేషులైరి.

## బూరాడ వెంకట రమణయ్య



తండ్రి గంగన్న పాత్రుడు. జననం 1913. విజయవాడ. వ్యష్టిసత్యాగ్రహంలో అరెస్టుఅయి 8-10-40 నుంచి ఏడాది కఠిన శిక్షను వెల్లూరు, అలీపురం, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు.

## బైపిళ్ళ సన్నయ్య పాత్రుడు



తండ్రి నరసింహం పాత్రుడు జననం 17-5-1912 విజయవాడ. వడ్రంగి. ఉప్పుసత్యాగ్రహంలో అరెస్టు అయి, 27-5-1930 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. తిరిగి వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, 24.6.1941 నుంచి రెండు నెలల కఠిన శిక్షను మద్రాసు జైలులో అనుభవించారు.

## బైపిళ్ళ అప్పలస్వామి



తండ్రి అప్పన్న. జననం 1902 విజయవాడ. మరుపిళ్ళ చిట్టి నాయకత్వంలో 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని లాఠీ చార్జీకి గురయ్యారు. వ్యష్టి సత్యాగ్రహంలో అరెస్టు అయి, నూజివీడు సబ్‌జైలులో నెలరోజుల శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో పట్టణ కాంగ్రెస్ అధ్యక్షులుగా వుండి, అరెస్టు అయి, నూజివీడు సబ్ జైలులో 3 నెలల శిక్ష అనుభవించారు. రు. 150 లు జరిమానా చెల్లించారు.

## బైపిళ్ళ నారాయణరావు



తండ్రి నరసింహం జన్మస్థలంవిజయవాడ. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టు అయి, 10 రోజుల జైలు శిక్ష అనుభవించారు.

## బైపిళ్ళ సూర్యనారాయణ

విజయవాడ వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. లాఠీచార్జీకి గురి అయ్యారు.

## భట్టు సీతారామయ్య

విజయవాడ వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో లాఠీచార్జికి గురయ్యారు.

## భవనవిడియాల నాగభూషణం

తండ్రి సుబ్బయ్య. విజయవాడ నివాసి. అంధుడైకూడా, ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 17.6 1930 న రెండు సంవత్సరాల శిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒప్పందంతో, 11.3.1931 న విడుదల అయ్యారు. 13.3.1932 న జాతీయ జెండా ధరించి, వూరేగింపులో పాల్గొని, తీవ్రమైన లాఠీఛార్జీకి గురయ్యారు. తిరిగి 10.8.1932 నుంచి 16.9.1932వరకు రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## భమిడి విశ్వేశ్వరశర్మ



తండ్రి విశ్వపతి శాస్త్రిలు. జననం 18.8.1922 తూర్పు గోదావరిజిల్లా కుంగండ జర్నలిస్టు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. ఆరు మాసాల కఠిన శిక్ష, రు. 50 ల జరిమానా విధించారు. జరిమానా చెల్లించ నిరాకరించి, అదనంగా ఆరు వారాల జైలుశిక్ష అలీపురం జైలులో అనుభవించారు. 'విశాలాంధ్ర' సంపాదక శాఖలో పని చేసి, రిటైర్ అయ్యారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## భాగవతుల సుబ్బరామయ్య



తండ్రి వెంకట ప్పయ్య. జననం 1889 విశాఖపట్నం జిల్లా అనకాపల్లి తాలూకా కశింకోట. నివాసం విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 27.6.1930 న రెండేళ్ళ కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14.3.1931 న విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనలో పాల్గొన్నారు. 30.2.1932 న అరెస్టు చేసి, వదిలివేశారు.

## భీమవరపు రామచంద్రరావు

విజయవాడ నివాసి. 'సత్యాగ్రహ' పత్రిక సంపాదకులు. ప్రచురణకర్త. 1932 శాసనోల్లంఘనంలో కాంగ్రెసు కరపత్రాలు పంచుతుండగా, రక్తం కక్కే వరకు పోలీసులు లాఠీఛార్జీ చేశారు.

## మరుపిళ్ళ చిట్టి వురఫ్ అప్పలస్వామి



తండ్రి సన్యాసి పాత్రుడు. జననం 27.11.1898 విజయవాడ. సుప్రసిద్ధజాతీయవాది. 'సర్దార్'గా ప్రసిద్ధిచెందారు. స్వాతంత్ర్యసమరంలో ప్రముఖ పాత్రవహించారు. అనేక కార్మిక సంఘాలను, స్థాపించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, ఐదు నెలల కఠిన శిక్షను అనుభవించారు. శాసనోల్లంఘనంలో పాల్గొని, సబ్ జైలులో అయిదు రోజులు నిర్బంధంలో వున్నారు. నూజివీడులో వ్యష్టి సత్యాగ్రహం జరిపారు. 18.8.1941 న 18 నెలల కఠిన శిక్ష, రు. 500 జరిమానా విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. 13.12.1941 న ప్రభుత్వం ఆదేశం మేరకు విడుదలయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో, డి. ఐ. ఆర్. క్రింద అరెస్టు చేసి, 11.8.1942 నుంచి 30.12.1944 వరకు వెల్లూరు, నాగపూర్, అమరావతి జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధించారు. మూడుసార్లు శాసనసభకు ఎన్నికయ్యారు. 20 సంవత్సరాలు విజయవాడ పట్టణ కాంగ్రెసు అధ్యక్షులుగా, 1962 లో కృష్ణాజిల్లా కాంగ్రెసు అధ్యక్షులుగా పని చేశారు. 18.7.1971 న కీర్తిశేషులైరి.

## మరుపిళ్ళ భ్రమరాంబ



భర్త సుప్రసిద్ధ జాతీయవాది మరుపిళ్ళ చిట్టి అనే అప్పలస్వామి. తండ్రి పోతిన నారాయణస్వామి. స్వస్థలం విజయవాడ. 15.1.1941 న వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. రు. 500 జరిమానా, కోర్టు లేచే వరకు జైలుశిక్ష విధించారు. జరిమానా చెల్లించ నిరాకరించి, నెల రోజుల జైలు శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు.

## మరుపిళ్ళ అప్పలస్వామి



తండ్రి అప్పలస్వామి. జననం 7.9.1917. పట్టభద్రుడు. చిన్నతనంలోనే జాతీయ భావాల ప్రభావానికి లోనై, శాసనోల్లంఘనకాలంలో కల్లుకుండలు బద్దలు కొట్టిన బాలబృందంలో చేరారు. 1937-38 సంవత్సరంలో బందరు హిందూ కాలేజీ విద్యార్థుల సమ్మెకు నాయకత్వం వహించి, కాలేజీ నుంచి బహిష్కృతులయ్యారు. విజయవాడ సిటీ సెంట్రల్ లేబరు లీగ్ కార్యదర్శిగా పని చేస్తున్న రోజులలో, పోలీసులు ఆయన ఇంటిపై దాడి చేసి, సోదా చేశారు

## మరుపిళ్ళ రామస్వామి



తండ్రి భగవానులు. వడ్రంగి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 27.5.1930 నుంచి 26.11.1930 వరకు ఆరు మాసాల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. కీర్తిశేషులు.

## మహీధర రామమోహనరావు



తండ్రి సూర్యనారాయణరావు తూర్పుగోదావరి జిల్లా ముంగండలో 1909 లో జన్మించారు. 1946 నుంచి విజయవాడ వాస్తవ్యులు. ప్రస్తుత నివాసం హైద్రాబాద్. పదవ యేట నుండీ జాతీయ ఉద్యమ ప్రభావంతో పని చేశారు. యుద్ధ వ్యతిరేక కార్యకలాపాలకు గాను 5.5.41 నుండి మూడేళ్ళకు పైగా డిటెన్ చేయబడ్డారు. వెల్లూరు, రాజమండ్రి జైళ్ళలో నిర్బంధింపబడ్డారు. అనేక సంవత్సరాలు రహస్య జీవితం గడిపారు. ప్రజాశక్తి, విశాలాంధ్ర దినపత్రికలలో సహాయ సంపాదకులుగా పని చేశారు. సామాజిక, రాజకీయ, ఆర్థిక పరిణామాలు ఇతివృత్తంగా అనేక నవలలు రాశారు. 1961 లో విశాలాంధ్ర నవలల పోటీలోను, 1972 లో తెలుగు నవలా శతాబ్ది సందర్భంగా సాహిత్య అకాడమి స్పెషల్ అవార్డును పొందారు.

## మజ్జి గున్నారావు

తండ్రి రామన్న. జన్మస్థలం విజయవాడ. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, 25.7.1941 నుంచి నాలుగు నెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## మఠం బాలసుబ్రహ్మణ్యగుప్త



తండ్రి పుట్టయ్య. జన్మస్థలం విజయవాడ. తన ఇరవయ్యోయేట సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. 1921 లో "రాజద్రోహ" నేరానికి సంవత్సరం న్నర జైలు శిక్ష విధించారు. 1923 నాగపూర్ జాతీయ జెండా సత్యాగ్రహంలో ఆరు నెలల కఠిన శిక్ష విధించారు. అదే సంవత్సరం మరొక సంవత్సరం కఠిన శిక్ష విధించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా, 1.5.1930 న సంవత్సరం జైలు శిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి, మద్రాసు జైళ్ళలో శిక్ష అనుభవించారు. మంచి వక్త. గుంటూరు, కృష్ణా, ఉభయ గోదావరి జిల్లాలలో ప్రజలను తన ప్రసంగాలతో ఉత్తేజితులను చేశారు 1932 శాసనోల్లంఘనంలో కూడా జైలు శిక్ష అనుభవించారు.

## మహ్మద్ నస్రుల్లాఖాన్

విజయవాడ నివాసి. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని, 30.6.1922 నుంచి నాలుగు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## మహ్మద్ పెంటు

కృష్ణాజిల్లా నివాసి. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని లాఠీచార్జీకి గురయ్యారు.

## మంగళంపల్లి రాజేశ్వరరావు



తండ్రి కామయ్య. జననం 23.11.1918. బందరు. నివాసం విజయవాడ. ఆయుర్వేద వైద్యులు. 1920 సహాయ నిరాకరణంలో రు. 3 వేలు విలువ చేసే, తన విదేశీ వస్త్రాలను దగ్ధం

చేశారు. తిలక్ స్వరాజ్యనిధి వసూలు చేశారు. ఖాదీ ప్రచారం గావించారు. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయి, 12 8 1930 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో అనుభవించారు.

## మామిళ్ళపల్లి వెంకటరావు

తండ్రి సీతారామమూర్తి జననం 1912 పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరు నివాసం విజయవాడ. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. సంవత్సరం కఠిన శిక్ష విధించారు. బళ్ళారి జైలులో శిక్ష అనుభవిస్తూ, క్షయవ్యాధి గ్రస్తుడు కావడంతో వెల్లెస్లీ శానిటోరియమ్ జైలుకు తరలించారు. గాంధీ–ఇర్విన్ ఒప్పందంతో విడుదలయ్యారు.

## మారం కనకయ్య

జన్మస్థలం విజయవాడ. రెండుసార్లు వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. మొదటిసారి విజయవాడలో 17 2 1941 న అరెస్టు అయ్యారు 18.2.1941 న జాయింట్ మేజస్ట్రేట్ కోర్టువారు కోర్టులేచేవరకు శిక్ష విధించారు. రెండవసారి నూజివీడు సబ్‌డివిజనల్ మేజస్ట్రేట్ కోర్టులో 25 రోజులు జైలు శిక్ష, రూపాయి జరిమానా విధించారు.

## ముదిలి వెంకటేశ్వరరావు



తండ్రి జగన్నాథం. జననం 9.8.1916. విజయవాడ. వ్యాపారి. సంఘసేవకులు. క్విట్ ఇండియా ఉద్యమంతో సంబంధంవుంది. పట్టణ కాంగ్రెసు ఉపాధ్యక్షులుగా, రాష్ట్రీ కిసాన్ మజ్దూర్ పార్టీ ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. అనేక కార్మిక సంఘాలను నిర్మించారు. 1949 లో హైదరాబాద్ సంస్థానం నుంచి వచ్చిన కాందిశీకుల సహాయకసంఘం ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. హరిజన, బలహీనవర్గాల ఉద్ధరణకు కృషిచేశారు.

## మేదర చింతయ్య



తండ్రి గోపయ్య. జన్మస్థలం విజయవాడ. హరిజనుడు. వ్యష్టి సత్యాగ్రహంలో మొత్తం మూడుసార్లు విజయవాడలో ఒకసారి, మద్రాసులో రెండుసార్లు అరెస్టు అయ్యారు 24.6 1941 నుంచి పది వారాల కఠిన శిక్షను మద్రాసు జైలులోను, 5-9-1941 నుంచి ఆరు మాసాల కఠిన శిక్షను అలీపురం జైలులోను అనుభవించారు.

## మోటూరి హనుమంతరావు



జన్మస్థలం గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా వెల్లటూరు. ఆంధ్రలో విద్యార్థి ఉద్యమం పుట్టుటకు దారితీసిన గుంటూరు ఎ సి. కాలేజీ విద్యార్థుల సమ్మెలో ప్రముఖ పాత్ర వహించారు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో అరెస్టు వారంటు జారీకాగా 1940 నుంచి రెండు సంవత్సరాలపాటు రహస్య జీవితం గడిపారు. కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణంలో ముఖ్యపాత్ర వహించారు. 1952 లో మద్రాసు శాసనసభకు ఎన్నికయ్యారు. ప్రస్తుతం ఆంధ్ర ప్రదేశ్ శాసనమండలి సభ్యులు. కొంతకాలం "విశాలాంధ్ర" దినపత్రిక సంపాదకులు. ఆంధ్ర ప్రదేశ్ మార్క్సిస్టు కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శి. ప్రస్తుత నివాసం విజయవాడ.

## యడ్లపాటి శివరామయ్య ఉరఫ్ శివాజీ



తండ్రి సుబ్బారాయుడు. జననం 16.3.1919 గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా యాజలి. ప్రస్తుత నివాసం విజయవాడ. సంఘ సేవకులు. మొదటినుంచి అతివాద రాజకీయాలలో ప్రముఖ పాత్ర వహించారు. కార్మిక సంఘాలలో పనిచేశారు. వ్యష్టి సత్యాగ్రహ కాలంలో, 26.2.1941 న అరెస్టు అయ్యారు. విజయవాడ జాయింట్ మేజిస్ట్రేట్ డి. ఐ. ఆర్. క్రింద 9 నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## రాచర్ల నిత్యానంద శర్మ

విజయవాడ నివాసి. శాసనోల్లంఘనంలో పాల్గొని, 11.1.1932 న అరెస్టు అయ్యారు. ఆరు నెలల కఠిన శిక్ష విధించారు.

## రావర్ల వెంకట నర్సింహారావు

తండ్రి సీతారామయ్య. విజయవాడ వాస్తవ్యులు. ఈనామ్‌దారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 3.7.30 నుండి ఆరు నెలల ఆరు వారాల శిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## రాయప్రోలు సీతారామయ్య

తండ్రి లక్ష్మీనరసింహశాస్త్రి. 1896 లో విజయవాడలో జన్మించారు. మద్రాసు యూనివర్సిటీ నుండి యల్. యం. యస్. డిగ్రీ పొందారు. వైద్యులు. ఉప్పు సత్యాగ్రహంలో మైలవరంలో అరెస్టయ్యారు. 28.5.30 న సంవత్సరం కఠిన శిక్ష విధింపబడి, రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్షను అనుభవించారు. 31.6.30 న రాజమండ్రి జైలులో తీవ్రమైన లాఠీ చార్జికి గురి అయ్యారు. 27.5.31 న పూర్తి శిక్ష ననుభవించి విడుదలయ్యారు. 1944 లో కీర్తిశేషులయ్యారు.

## రాయప్రోలు సీతారామాంజనేయ శాస్త్రి

తండ్రి బ్రహ్మానంద శాస్త్రి. విజయవాడ వాస్తవ్యులు. హిందీ ఉపాధ్యాయులు. మద్రాసు హిందీ ప్రచార సభ కార్యాలయం ముందు 7.11.41 న యుద్ధ వ్యతిరేక నినాదాలిచ్చారు. 8వ తేదీన నాలుగు నెలల కఠిన శిక్ష విధింపబడి అలీపురం క్యాంప్ జైలులో శిక్ష ననుభవించారు. 7.12.41 న విడుదలయ్యారు.

## రాయని రాములు



తండ్రి సోమన్న. జననం 10.6.1907 విజయవాడ. వ్యాపారి. వ్యష్టి సత్యాగ్రహంలో 23.7.1941 అరెస్టు అయి, నాలుగు నెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## రాయని సుబ్బారావు

విజయవాడ వాస్తవ్యులు. 10.2.41 న వ్యష్టి సత్యాగ్రహం చేశారు. 12.2.41 న 8 వారాల కఠిన శిక్ష విధించబడింది.

## రాయపరపు నాగేశ్వరరావు

తండ్రి వెంకయ్య. జననం 10.5.1919 విజయవాడ. మున్సిపల్ కాంట్రాక్టర్. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 30.1.1941 న మూడు నెలల కఠిన శిక్ష, రు. 200/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 1940-41 లో విజయవాడ పట్టణ కాంగ్రెసు కార్యదర్శి. 12.7.1971 న కీర్తిశేషులైరి.

## రావూరి నరసింహారావు

తండ్రి నారాయణ. జన్మస్థలం గుంటూరు జిల్లా తెనాలి తాలూకా పెదరావూరు. రైతు. ప్రస్తుత నివాసం విజయవాడ. చదువుకి స్వస్తి చెప్పి, ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 6.6.1930 న 18 మాసాల కఠిన శిక్ష విధించారు రాజమండ్రి బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధి-ఇర్విన్ ఒప్పందంతో 11.3.1931 న విడుదలయ్యారు. వ్యష్టి సత్యాగ్రహంలో అరెస్టు అయి, 7.3 1941 నుంచి మూడు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## రాంపిళ్ళ నాగేశ్వరరావు



తండ్రి కనకయ్య. జననం 1913 మార్చి విజయవాడ. తాపీ కార్మికుడు. వ్యష్టి సత్యాగ్రహంలో 14.6.1941 నుంచి మూడు మాసాల కఠిన శిక్షను మద్రాసు జైలులో అనుభవించారు. అంతకు ముందు వ్యష్టి సత్యాగ్రహం జరిపి అరెస్టు అయ్యారు. కోర్టు లేచే వరకూ శిక్ష, రు 150/- లు జరిమానా విధించారు.

## రాంపిళ్ళ లక్ష్మణరావు

తండ్రి వెంకటస్వామి, జన్మస్థలం విజయవాడ. వస్త్రతంగి. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 11.8.1941 నుంచి నెలా పదిహేను రోజుల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. తిరిగి మద్రాసులో వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, 16.10.1941 న డి.ఐ.ఆర్. క్రింద అరెస్టు అయ్యారు. 9 మాసాల కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## లంకా జోగారావు

తండ్రి రామస్వామి. జననం 1922 పశ్చిమ గోదావరి జిల్లా. ప్రెస్ వర్కర్. రహస్య పత్రిక "స్వతంత్ర భారత్" ప్రచురణ, పంపిణీలో ప్రముఖ పాత్ర వహిస్తూ, 1941 సెప్టెంబరు 30 న బందరులో కొండేపూడి లక్ష్మీనారాయణతోపాటు అరెస్టు అయ్యారు. వారం రోజులపాటు పోలీసులు వీరిని చిత్రహింసలు పెట్టినా, రహస్యాలు చెప్ప నిరాకరించారు. 1941 డిసెంబరులో 9 నెలల శిక్ష విధించారు. రాజమండ్రి, అలీపురం, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. అనంతరం ప్రజాశక్తి, విశాలాంధ్ర పత్రికల ప్రెస్సులలో పనిచేశారు. ప్రెస్సు వర్కర్ల సంఘ నిర్మాతలలో ఒకరు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## వడపల్లి సుబ్బారావు

తండ్రి వెంకటస్వామి, విజయవాడ వాస్తవ్యులు. తాపీ కార్మికుడు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 7.6.30 న 10 నెలల కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించారు. 28.11.30 న విడుదలయ్యారు.

## వడిసిన మరిడయ్య



తండ్రి అప్పన్న. జన్మస్థలం విజయవాడ. క్విట్ ఇండియా ఉద్యమంలో 18.7.1944 నుంచి 23.8.1944 వరకు రాజమండ్రి, అలీపురం జైళ్ళలో నిర్బంధితులుగా వున్నారు.

## వడ్లమూడి నాగేశ్వరరావు

తండ్రి కాంతయ్య. జననం 21.6.1917. గుంటూరు జిల్లా పెదవడ్లపూడి. నివాసం విజయవాడ. బుర్రకథలు చెప్పి జాతీయోద్యమ ప్రచారం చేశారు. క్విట్ ఇండియా ఉద్యమంలో శిక్ష అనుభవించారు.

## వారణాసి అప్పలస్వామి



తండ్రి సోములు. జన్మస్థలం విజయవాడ. వర్తకం. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 5.6.1930 నుంచి ఆరుమాసాల కఠిన శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. 15.2 1941 న వ్యష్టి సత్యాగ్రహంలో అరెస్టయ్యారు. 17.2 1941న 25 రోజుల కఠినశిక్ష రు. 2/ జరిమానా విధించారు.

## వారణాసి కృష్ణమూర్తి

తండ్రి వెంకటేశం. జన్మస్థలం విజయవాడ కర్మాగారంలో ఫిట్టర్. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 21.5 1930 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను బరంపురం, రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## వి. లక్ష్మణరావు

జన్మస్థలం విజయవాడ. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 27.3 1941 న డి ఐ. ఆర్ క్రింద అరెస్టుచేసి, విజయవాడ జాయింట్ మేజిస్ట్రేట్ కోర్టులో శిక్ష విధించారు. రు 100/లు జరిమానా విధించారు.

## వి. వి. నరసింహం

జన్మస్థలం విజయవాడ. 1940-41 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. విజయవాడ జాయింట్ మేజిస్ట్రేట్ కోర్టులో డి.ఐ.ఆర్ క్రింద ఆరు నెలల కఠిన శిక్ష, రు 50 జరిమానా విధించారు. తిరుచునాపల్లి జైలులో శిక్ష అనుభవించారు.

## వి. వెంకటరామశాస్త్రి

తండ్రి రఘురామశాస్త్రి. అడ్వొకేట్ 30.12.40 నుండి 15.12 41 వరకు యుద్ధ వ్యతిరేక కార్యకలాపాలకు గాను డిటైన్ చేయబడ్డారు. వెల్లూరు, జైలులో డిటెన్యూగా ఉన్నారు. అనంతరం మరి కొంతకాలం పాటు వెల్లెస్లీ శానిటోరియం జైలులో డిటెన్యూగా నిర్బంధించారు.

## వి. సదానందం

తండ్రి యజ్ఞనారాయణ. బెజవాడ వాస్తవ్యులు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 2.9.42 నుండి అలీపురం క్యాంప్ జైలులో 6 నెలల 4 వారాలు కఠిన శిక్షననుభవించారు.

## వెల్లంకి విశ్వేశ్వరరావు



తండ్రి బసవయ్య. జన్మస్థలం గన్నవరం తాలూకా కలవపాముల. నివాసం విజయవాడ. రైతు. మెట్రిక్యులేట్. 1934లో కాంగ్రెసులో చేరారు. యుద్ధ వ్యతిరేక చర్యలకు గాను 1940 జనవరిలో కలవపాముల నుంచి కదలరాదని ప్రభుత్వం ఆంక్ష విధించింది డి. ఐ. ఆర్. క్రింద 5.10.1940 నుంచి 11.8.1942 వరకు వెల్లూరు జైలులో డిటెన్యూగా వున్నారు. జైలులో 19 రోజులు నిరాహారదీక్ష సాగించారు. పి. సి. సి సభ్యులుగా పశ్చిమ కృష్ణా కాంగ్రెసు సంఘ సంయుక్త కార్యదర్శిగా ఎన్నికయ్యారు మునగాల, కళింగపట్నం జమిందారీ రైతు పోరాటాలలో పాల్గొన్నారు. కృష్ణా జిల్లా రైతు సంఘం అధ్యక్షులుగా పనిచేశారు. రజాకార్లకు వ్యతిరేకంగా నైజాం సరిహద్దు గ్రామాలలో సాయుధ దళాలను సమీకరించడానికి సహాయపడ్డారు. కమ్యూనిస్టు అభ్యర్థిగా రెండుసార్లు రాష్ట్ర శాసన సభకు ఎన్నికయ్యారు.

## వెల్లంకి వీరరాఘవయ్య

తండ్రి వెంకటరత్నం. స్వగ్రామం గన్నవరం తాలూకా కలవపాముల. ప్రస్తుత నివాసం విజయవాడ. మున్సిపల్ ఉపాధ్యాయుడుగా పనిచేసి, రిటైర్ అయ్యారు. దివితాలూకా శ్రీకాకుళంలో 14.5.1932 న కల్లుపాకల ముందు పికెటింగ్ చేసి, తీవ్రమైన లాఠీ చార్జీకి గురయ్యారు 22.6.1932 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. ఉపాధ్యాయ ఉద్యమంలో పని చేశారు.

## వేదాంతం శివసుబ్రహ్మణ్యశాస్త్రి

విజయవాడ వాస్తవ్యులు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో 13.6.30 న రెండుసంవత్సరాల కఠిన శిక్ష విధించబడింది.

## శిరిపురపు కోటేశ్వరరావు



తండ్రి కుటుంబ రావు. జననం15.8 21 గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా పాలడుగు. పెంపక తండ్రి వెంకట రమణయ్య. నివాసం విజయవాడ. క్విట్ ఇండియా ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు. 2.11.1942 నుంచి రెండేళ్ళ కఠిన శిక్షను అలీపురం క్యాంప్ జైలులో అనుభవించారు. ఖాదీ ప్రచారం, వయోజన విద్యా కేంద్రాలు నిర్వహించారు. పలుమార్లు మునిసిపల్ కౌన్సిలర్‌గా ఎన్నికయ్యారు.

## శీరం కృష్ణమూర్తి



తండ్రి నారాయణ స్వామి. జన్మస్థలం విజయవాడ. కాంట్రాక్టరు. వ్యష్టి సత్యాగ్రహంలో రెండుసార్లు అరెస్టు అయ్యారు. మొదటిసారి 14-6-1941 నుంచి రెండు నెలలు మద్రాసు జైలులో శిక్ష అనుభవించారు. రెండవసారి 15-8-1941 నుంచి అలీపురం జైలులో ఆరు నెలల కఠిన శిక్ష అనుభవించారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 2.11.1942 నుంచి రెండు ఏండ్ల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు

## శీరం రామమూర్తి



తండ్రి నారాయణ. జన్మస్థలం విజయవాడ. కార్మికుడు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, ఆరుమాసాల కఠిన శిక్షను 27-5-1930 నుంచి రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో అనుభవించారు. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో అరెస్టు అయి, మరొక ఆరు నెలల జైలు శిక్ష అనుభవించారు. కీర్తిశేషులైరి.

## శ్రీపురపు వీరభద్రరావు

తండ్రి నరసరాజు. జన్మస్థలం విజయవాడ. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని, 19-7-1930 నుంచి ఆరు నెలల ఆరు వారాల కఠిన శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## సయ్యద్ హబీబుల్లాసాహెబ్

తండ్రి మహమ్మద్ అజీజుల్లా. విజయవాడ వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు.

10-8-32 న ఒక సంవత్సరం కఠిన శిక్ష, రు. 25 లు జరిమానా విధించబడింది. జరిమానా చెల్లించారు. రాజమండ్రిజైల్లో నిర్బంధింపబడ్డారు. 22 10-32 న విడుదలయ్యారు.

## సత్తిరాజు రామ్మూర్తి



తండ్రి సోమసుందరం. జననం 1890. పశ్చిమ గోదావరి జిల్లా తాడేపల్లిగూడెం పడమటి విప్పర్రు. ప్రస్తుత నివాసం విజయవాడ. 1923 నుంచి 1942 వరకు అన్ని ఉద్యమాలలోను పాల్గొని, అరెస్టు అయ్యారు. 1923 నాగపూర్ జెండా సత్యాగ్రహంలో పాల్గొని, జైలుశిక్ష అనుభవించారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయి, అలీపురం జైలులోను 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని వెల్లూరు జైలులోను, వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, వెల్లూరు జైలులోను, 1942 క్విట్ ఇండియాఉద్యమ కాలంలో డిటెన్యూగా వెల్లూరు, కోయంబత్తూరుజైళ్ళలోను మొత్తం తొమ్మిది సంవత్సరాల జైలుశిక్ష అనుభవించారు. పశ్చిమగోదావరి జిల్లా కాంగ్రెసు సంఘ కార్యదర్శిగా పనిచేశారు.

## సత్తిరాజు మంగమ్మ

భర్త రామ్మూర్తి. జననం 1894. స్వస్థలం పశ్చిమగోదావరి జిల్లా పడమటి విప్పర్రు. ప్రస్తుత నివాసం విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, 9నెలల కఠిన శిక్షను వెలూరు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు. మరొకమారు అరెస్టు అయి, నెలరోజులు సబ్ జైలు నిర్బంధంలో ఉన్నారు.

## సంపత్కుమార వెంకట రంగనాథాచార్యులు



తండ్రి పెదవేంకట రంగాచార్య అయ్యంగారు. జననం 19-4-1901. కాకినాడ పెద్దాపురంజమీందారుకుటుంబ గురువులు. నివాసం విజయవాడ. జలియన్ వాలాబాగ్ దురంతాలకు నిరసనగా పెద్దాపురం స్కూలు విద్యార్థుల సమ్మెకు నాయకత్వం వహించారు. 1921 లో గాంధీజీ రాక సందర్భంలో వాలంటీరుగా పనిచేశారు. అల్లూరి సీతారామరాజు సహాధ్యాయి. మన్యం పితూరికి అవసరమైన సహాయ. సహకారాలు అందించారు. తామ్రపత్ర గ్రహీత.

## సాగి గోపాలకృష్ణమూర్తి

తండ్రి రామసోమయాజులు. నివాసం విజయవాడ. వ్యాపారి. 15-2-1941 న విజయవాడలో వ్యష్టి సత్యాగ్రహం చేసి, అరెస్టు అయ్యారు. తిరిగి 11-6-1941 మద్రాసులో వ్యష్టి సత్యాగ్రహం చేసి, మూడు నెలల కఠిన శిక్షను మద్రాసు జైలులో అనుభవించారు.

## సి. మహబీర్ సింగ్

నివాసం విజయవాడ. సహాయ నిరాకరణంలో పాల్గొని, 30-6-1922 నుంచి నాలుగు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## సుందర వెంకటరామయ్య

తండ్రి నాగభూషణం. విజయవాడ వాస్తవ్యులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష ననుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ననుసరించి 14-3-31న విడుదలయ్యారు. డా॥ శివలెంక మల్లికార్జునరావుగారితో కలిసి "పీపుల్స్ హాస్పిటల్"ను స్థాపించారు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో తీవ్రంగా గాయపడినవారికి వైద్య సహాయం చేశారు.

## సీతంరాజు సుబ్బారావు



తండ్రి వెంకట చలపతి. జననం 20.4.1910 గన్నవరం తాలూకా కలవపాముల. నివాసం విజయవాడ. 1930 ఉప్పు సత్యాగ్రహం లోను, 1932 శాసనోల్లంఘనంలోను పాల్గొన్నారు. క్విట్ ఇండియా ఉద్యమంలో నూజివీడు, విజయవాడ సబ్ జైళ్ళలో నిర్బంధించబడ్డారు. పశ్చిమ కృష్ణా కాంగ్రెసు సంఘ కార్యదర్శిగాను హిందూ సేవక్ సమాజ్‌లోను పనిచేశారు.

## సీతంరాజు సీతారావమ్మ

భర్త సుబ్బారావు. తండ్రి ముళ్ళపూడి వెంకటేశ్వరరావు. జననం 3-3-1920 గుడివాడ తాలూకా వెంట్రప్రగడ. నివాసం విజయవాడ. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. నాలుగు నెలల కఠినశిక్ష రు. 200/- లు జరిమానా విధించారు. జరిమానా చెల్లించ నిరాకరించి, మొత్తం ఆరు మాసాల శిక్షను, వెల్లూరు జైలులో అనుభవించారు.

## సేలం సుందరం



సేలం జిల్లా నామగిరి పేటలో 1-7 1925న జననం. ప్రస్తుత నివాసం విజయవాడ. 17 సం॥ రాల వయస్సులోనే హైస్కూల్ విద్యార్థిగా 1942 క్విట్ ఇండియా ఉద్యమంలోచేరారు బళ్ళారి, హగరితాలూకాలలో పదిరోజులు స్వాతంత్ర్య ఉద్యమ ప్రచారం చేసిన తర్వాత 19-10-42 న 12 మంది యువకులతో కలిసి శాసన ధిక్కారం చేసి బళ్ళారిలో ఊరేగింపు జరిపారు. పోలీసులు అరెస్టు చేశారు. 21 వ తేదీన మూడు మాసాల కఠిన శిక్ష, 50 రూపాయల జరిమానా లేక 15 రోజుల అదనపు శిక్ష విధించబడింది. జరిమానా చెల్లించ నిరాకరించారు. బళ్ళారి జైల్లో శిక్ష అనుభవించి 23-1-43 న విడుదలయ్యారు. 1943 - 44 విద్యా సంవత్సరం ఆఖరివరకు చదువు నుండి డిబార్ చేయబడ్డారు. తర్వాత తిరిగి విద్యాభ్యాసం కొనసాగించి, హిందీలో రాష్ట్ర భాష విశారద, కాశీ హిందీ విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. ఎల్. ఎల్. బి. పట్టా పుచ్చుకొన్నారు విజయవాడ కాకరపర్తి భావనారాయణ కళాశాల ప్రిన్సిపాల్. "అనంతపురంజిల్లా స్వాతంత్ర్య సమర చరిత్ర" రచనకు వీరిని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నియమించింది.

## హేమాద్రి వెంకట మురళీధర శర్మ

తండ్రి హెచ్. జె. నరసింహం. విజయవాడ వాస్తవ్యులు. ఇనాందారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 3-7 30 న ఆరు నెలల కఠిన శిక్ష, రు. 50/- లు జరిమానా, చెల్లించని పక్షంలో ఆరు వారాల కఠిన శిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష ననుభవించారు.

## ఉద్దరాజు రామం



తండ్రి పద్మరాజు. పశ్చిమగోదావరి జిల్లా వాలమర్రు గ్రామంలో 1911న జన్మించారు; 1929లో సైమన్ కమిషన్ ఘటనలు, జలియన్ వాలా భాగ్ దారుణ మారణకాండ విని దేశభక్తి ప్రపూరితులయ్యారు. ఆంగ్లవిద్యకి స్వస్తిచెప్పి హిందీని అభ్యసించారు. 1930లో ఉప్పు సత్యాగ్రహ దళంలో చేరారు. విదేశవస్త్ర దుకాణాలు, కల్లు దుకాణాలవద్ద పికెటింగ్ చేశారు. ఆ రోజుల్లో ఆంగ్లప్రభుత్వం కాంగ్రెస్ వలంటీర్లకు అన్నం పెట్టినవార్ని శిక్షించేది అందుచేత మొగలితుర్రు గ్రామంలో వీరు మాదాకవళ

ఎత్తి మిగతా వలంటీర్లతో కలిసి పంచుకు తిన్నారు. 1930 మేలో వీరిని భీమవరం తాలూకా సిద్ధాపురంలో అరెస్టుచేసి 9 నెలలు శిక్ష విధించారు. రాజమండ్రి, రాయవెల్లూరు, జైళ్ళలో శిక్ష అనుభవించారు. రాజమండ్రి జైలులో భగత్‌సింగ్ సహచరులు విజయకుమార్‌సిన్హా, జయదేవ్‌కపూర్, శివవర్మలతో సాన్నిహిత్యం ఏర్పడి వీరికి విప్లవభావాలు కలిగాయి. కాశీపట్నపు కొండయ్యగారి సంపాదకత్వాన వెలువడిన రహస్య పత్రిక "వీరభారత్" పంపకం ఏర్పాట్లు చూసేవారు. 1933లో కలకత్తా కాంగ్రెసుకు వెళ్ళగా, అక్కడ అరెస్టు చేయబడి కొన్నాళ్ళు ఆలీపూర్, డమ్ డమ్ జైళ్ళలో వున్నారు. 1934లో కమ్యూనిస్టు ఉద్యమం వైపు మొగ్గారు. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో చేరారు. మార్క్సిజం ప్రబోధించారు. నర్సాపురం తాలూకా కాంగ్రెస్ అధ్యక్షులుగాను, కార్యదర్శిగాను చాలాకాలం పనిచేశారు. 1938లో కాశీపట్నం జమిందారీ వ్యతిరేక పోరాటానికి రైతులను సమీకరించారు. రెండో ప్రపంచయుద్ధ కాలంలో జిల్లా కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శిగా వుండి, రహస్య జీవితం గడుపుతూ యుద్ధ వ్యతిరేక ఉద్యమ నిర్మాణానికి కృషిచేశారు. 1943లో వీరిని అరెస్టుచేసి, రాయవెల్లూరు, తంజావూరు, జైళ్ళలో 1944 వరకు డిటెన్యూగా వుంచారు. 1948లో తెలంగాణా వుద్యమంలో రహస్యంగా వుండి పనిచేశారు. 1957లో నర్సాపురం నియోజక వర్గంనుంచి పార్లమెంటు సభ్యులుగా ఎన్నికయ్యారు. 1962 వరకూ సభ్యులుగా వున్నారు. వీరు ప్రజాసంఘాల నిర్మాణంలోనూ, రైతు ఉద్యమంలోనూ పనిచేస్తున్నారు. ప్రస్తుతం నివాసం విజయవాడ.

## ఉద్దరాజు మాణిక్యాంబ



తండ్రి నడింపల్లి బాపిరాజు. వీరిగ్రామం తూర్పు గోదావరి జిల్లా అమలాపురం తాలూకా పన్నెచింతలపూడి. ఉద్దరాజు రామం గారి పత్ని. 1930 నుండి భర్త రామంగారితో పాటు జాతీయ ఉద్యమంలో పాల్గొన్నారు. 1931 లో విదేశ వస్త్రాలయాల వద్ద, కల్లు దుకాణాల వద్ద పికెటింగ్ చేశారు. 1932 లో భీమవరం డిప్యూటీ కలెక్టర్ కార్యాలయంపై జండా ప్రతిష్ఠ చేయగా, 10 మాసాలు శిక్ష విధించబడింది. రాయవెల్లూరు, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1938 లో కాశీపట్నం జమిందారీ వ్యతిరేక ఉద్యమంలో వందలాది మహిళలతో సత్యాగ్రహం జరిపారు. అరెస్టు చేసి కొద్ది రోజుల తరవాత విడుదల చేశారు. 1940 లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. మహిళా సంఘాలలో పని చేశారు.

## కోట నాగభూషణం



తండ్రి రామన్న. జన్మస్థలం విజయవాడ. వ్యాపారి. 1923 నాగపూర్ జాతీయ జెండా సత్యాగ్రహంలో పాల్గొని, మూడు నెలల కఠిన శిక్ష అనుభవించారు. ఉప్పు సత్యాగ్రహంలో కూడా పాల్గొన్నారు. ఆరు నెలల కఠిన శిక్ష, రు. 50/- జరిమానా విధించారు. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## కోడూరు సీతారామాంజనేయులు



తండ్రి రాంభొట్లు. జననం 15-3-1914 దివి తాలూకా సంగిగడ్డ. ప్రస్తుతనివాసం విజయవాడ, చిన్నాపురం. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1932 లో బందరు తిలక్ చౌక్‌లో జరిగిన కాంగ్రెస్ బహిరంగ సభకు హాజరై, లాఠీఛార్జికి గురయ్యారు. విదేశీ వస్త్రాలయాల ముందు, కల్లు దుకాణాల ముందు పికె

టింగ్‌లలో పాల్గొని. లాఠీ దెబ్బలు తిన్నారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో మల్లవోలు వద్ద తంతి తీగెలు త్రెంచి. కొన్ని రోజులు రహస్యం జీవితం గడిపి 1943 లో అరెస్టు అయ్యారు. కొన్నాళ్ళు సబ్ జైలు నిర్బంధంలో వున్నారు. ఖద్దరు ప్రచారం, హిందీ ప్రచారం సాగించారు.

## తమ్మిన ముత్యాలు



తండ్రి అప్పల స్వామి. జననం 1910 విజయవాడ. పద్రంగి. వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని 24-6-1941 నుంచి పది వారాలు కఠిన శిక్షను మద్రాసు జైలులో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో ప్రముఖపాత్ర వహిస్తూ, అజ్ఞాతవాసంలో గడిపారు. గాంధీజీ ఆదేశానుసారం 1944 అక్టోబరులో తనకు తానుగా పోలీసులకు లొంగిపోయారు. 22-3-1945 న జిల్లా సెషన్స్ కోర్టు అయిదు సంవత్సరాల కఠిన శిక్ష విధించి, అండమాన్ జైలులో శిక్ష అనుభవించాలని ఆదేశించింది. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవిస్తుండగా, 4-8-1945 న హైకోర్టులో కేసును కొట్టివేయడంతో విడుదలయ్యారు.

## తలగడదీవి సుబ్రహ్మణ్యం



అనాధ జననం 12-7-1912 దివి తాలూకా అవనిగడ్డ. 1921 లో గాంధీజీ నిజామాబాదు వచ్చినప్పుడు, ఈ అనాధ బాలుడు మంచిచెడ్డలు చూసే బాధ్యతను కీర్తిశేషులు కాశీనాధుని నాగేశ్వరరావు, అయ్యదేవర కాళేశ్వరరావులకు అప్పగించారు.

వారి సహాయంతో ఎల్. ఇ. ఇ. చదివి, ఐ. టి. ఐ ప్రిన్సిపాల్‌గా పనిచేసి, రిటైర్ అయ్యారు. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టయి, ఆరుమాసాల కఠినశిక్ష అనుభవించారు. 1946 నావికా తిరుగుబాటులోకూడా పాల్గొన్నారు.

## పోతిన గణపతిరావు పాత్రుడు



తండ్రి నారాయణ స్వామి పాత్రుడు. జననం 1902 విజయవాడ. వ్యాపారం. 1921 సహాయ నిరాకరణ కాలంనుంచి విజయవాడలో జాతీయోద్యమాభివృద్ధికి కృషి చేసిన ప్రముఖులలో ఒకరు. మొత్తం అయిదుసార్లు జైలుకెళ్ళారు. 1923 నాగపూర్ జాతీయజెండా సత్యాగ్రహంలో అరెస్టు అయి, 6 నెలల జైలుశిక్ష అనుభవించారు. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. ఆరు నెలల కఠిన శిక్ష, రు. 50 జరిమానా విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 6-1-1941 న ఆరువారాల కఠినశిక్షను, రు. 700/లు జరిమానాను విధించారు. జరిమానా చెల్లించకపోతే ఆరు మాసాల జైలు శిక్ష అనుభవించాలని శాసించారు. రాజమండ్రీ, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 17-5-1941 నుంచి 22-12-1941 వరకు డి. ఐ. ఆర్. క్రింద వెల్లూరు జైలులో డిటెన్యూగా వున్నారు. క్విట్ ఇండియా వుద్యమ కాలంలో 11-8-1942 నుంచి వెల్లూరు, నాగపూర్ జైళ్ళలో డిటెన్యూగా నిర్బంధించారు. విజయవాడ మున్సిపల్ చైర్మన్‌గా పట్టణాభివృద్ధికి ఎంతగానో తోడ్పడ్డారు. కీర్తిశేషులైరి.

## పొన్నూరు వీరరాఘవగుప్త



తండ్రి కోటేశ్వరరావు. విజయవాడ నివాసి. వ్యాపారి. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 7-9-1942న ఆరు నెలల కఠినశిక్ష విధించారు. అలీపురం జైలులో నిరాహారదీక్ష వహించినందుకు అదనంగా నూరు రోజుల జైలు శిక్ష విధించారు. 18-2-1943 న బెయిల్ పై విడుదలయ్యారు.

## శ్రీ పెరంబూధూరి సుభద్రమ్మ



బుచ్చయ్యాచార్యులు గారి పత్ని. 1912 లో జన్మించారు. విజయవాడ వాస్తవ్యులు. మద్రాసు సేవా సదన్ సూపర్నెంటుగా పనిచేశారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 13-6-30 నుండి ఆరు నెలల జైలు శిక్షను వెల్లూరు జైల్లో అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించబడింది. జైలులో ఉండగానే ప్రయివేటుగా పరీక్షలకు కూర్చుని గ్రాడ్యుయేట్ అయ్యారు.

## పైడిపాటి అప్పలస్వామి



తండ్రి వెంకటస్వామి. జననం 1903 విజయవాడ. వస్తాదు. ఉప్పు సత్యాగ్రహ సమయంలో గాంధీ పార్కులో జరిగిన కాంగ్రెసు బహిరంగ సభను భగ్నపరచమని పోలీసులు ప్రలోభపెట్ట ప్రయత్నించగా తిరగబడి జాతీయోద్యమంలో చేరారు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని ఆరుమాసాల కఠినశిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. తిరిగి 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీదెబ్బలు తిన్నారు. వ్యష్టి సత్యాగ్రహంలో 25-1-1941న అరెస్టుచేయబడి 10రోజులు శిక్ష, రు. 10/-లు జరిమానా విధించగా విజయవాడ సబ్‌జైలులో శిక్ష అనుభవించారు. తిరిగి 1941లో వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు అరెస్టుచేసి, 19.2 1941న మూడు వారాల జైలుశిక్ష విధించారు. క్విట్ఇండియా ఉద్యమంలో రహస్య జీవితం గడుపుతూ బ్రిటిష్ వ్యతిరేక ప్రచారం సాగించారు. 15-8-1972న కేంద్రప్రభుత్వం జారీచేసిన 'తామ్రపత్ర' గ్రహీత.

## మల్లెల శ్రీరామమూర్తి



తండ్రి శేషయ్య. తెనాలి తాలూకా పెదపర్రులో 1907 జూలై 25 న జన్మించారు. నివాసం విజయవాడ. పాత్రికేయులు. ఉప్పు సత్యాగ్రహంలో 6 నెలల 6 వారాల కఠిన శిక్షనురాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. క్విట్ఇండియా ఉద్యమంలో అండర్ గ్రౌండ్‌కు వెళ్ళారు. ఇల్లు రెండు సార్లు సోదాచేశారు. "విజయవాణి" వారపత్రికకు 1948 నుండి సంపాదకులు. పట్టణ, రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సభ్యులు.

## బండి శీతారామ్



తండ్రి నరసయ్య. జననం 1914 నల్లగొండ జిల్లా మిర్యాలగూడెం తాలూకా ముప్పారం ప్రస్తుత నివాసం విజయవాడ. నైజాం వ్యతిరేక పోరాటంలో రజాకార్ల దౌర్జన్య

కొండ ప్రతిఘటనకు ఏర్పడిన సాయుధ దళానికి నాయకత్వం వహించారు. 20-1-1948 నుండి 9-3-1948 వరకు నల్లగొండ, హైదరాబాద్ జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## బొలిశెట్టి సత్యనారాయణ



తండ్రి శ్రీరాములు. విజయవాడలో జన్మించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 11-6-1930న రెండేళ్ళకఠిన శిక్ష విధించారు గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 1931 మార్చిలో విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలో అరెస్టు అయి, సంవత్సరం కఠిన శిక్ష 31-5-1932 నుంచి రాజమండ్రి జైలులో అనుభవించారు.

## బొడ్డుపల్లి కృష్ణమూర్తి



తండ్రి నరసయ్య. రైతు, బాపట్ల తాలూకా. ప్రస్తుత నివాసం విజయవాడ. శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నారు. 25-6-1932 నుంచి 24-12-1932 వరకూ రాజమండ్రి సెంట్రల్ జైలులో 6 నెలలు శిక్ష అనుభవించారు.

## రాంపిళ్ళ తాతయ్య



తండ్రి సన్యాసి. జన్మస్థలం విజయవాడ. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. 2-6-30 నుంచి 2-12-1930 వరకు రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో ఆరుమాసాల కఠినశిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో కూడా పాల్గొన్నారు.

# విజయవాడ తాలూకా వివిధ గ్రామాలు

## అన్నె సూర్యనారాయణ

విజయవాడ తాలూకా ఉప్పలూరు వాస్తవ్యులు. విద్యార్థి నాయకులు. యుద్ధ వ్యతిరేక కార్యకలాపాల్లో పాల్గొన్నారు. 25-3-42 నుండి, 27-4-42 వరకు అలీపురం, బళ్ళారి జైళ్ళలో నిర్బంధింపబడ్డారు. 1942 ఆగస్టులో ఉప్పలూరు రైల్వేస్టేషన్‌పై చేసిన దాడిలో పాల్గొన్నారు. అరెస్టు చేసి సబ్‌జైలులో ఆరు నెలలు వుంచారు.

## అనుమోలు కోటేశ్వరరావు

తండ్రి వెంకటప్పయ్య. జన్మస్థలం విజయవాడ తాలూకా పునాదిపాడు. రైతు. 22-3-1941 న వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. నూజివీడుసబ్‌డివిజనల్

మేజిస్ట్రేట్ 9-4-1941 న మూడు వారాల కఠినశిక్ష, రు. 15/- జరిమానా విధించారు. 24-6-1941 న మద్రాసులో వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని మూడు నెలల కఠినశిక్షను మద్రాసు, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## ఈడ్పుగంటి వెంకట రత్నమాంబ

పెనమకూరు. వేముల దశరథరామయ్యగారి పుత్రిక కోదండరామయ్యగారి పత్ని. 1943 లో ఉద్యమంలో పాల్గొని సుమారు నెల రోజులు జైలు శిక్ష అనుభవించారు. ఈమె ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ అసెంబ్లీ కార్యవర్గ సభ్యురాలిగా పని చేశారు. ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘ ఉపాధ్యక్షురాలుగాను, ఆంధ్ర మహాజన సభ కార్యవర్గ సభ్యురాలుగానూ, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యవర్గ సభ్యురాలుగానూ, ఆంధ్రరాష్ట్ర మహిళా సంఘ కార్యవర్గ సభ్యురాలుగానూ, కృష్ణా జిల్లా మహిళా సంఘ కార్యదర్శిగానూ, పెనమకూరు గ్రామ పంచాయితీ సంఘాధ్యక్షురాలుగానూ పనిచేశారు. పెనమకూరు గ్రామాభివృద్ధికి పాటు పడ్డారు. కీర్తి శేషులు.

## ఈడ్పుగంటి శివమూర్తి

విజయవాడ తాలూకా పెనమకూరు వాస్తవ్యులు. ఎం. ఏ. యల్. యల్. బి. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొని జైలుశిక్షను అనుభవించారు.

## ఉప్పలపాటి వెంకటశేషగిరిరావు

తండ్రి అప్పయ్య. విజయవాడ తాలూకా చోడవరం వాస్తవ్యులు. రైతు. 4-4-41 న వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొనగా 9-4-41 న 15 రోజుల కఠిన శిక్ష రూ. 50 జరిమానా, చెల్లించని పక్షంలో మరో 15 రోజుల కఠిన శిక్ష విధించారు. తిరిగి సత్యాగ్రహం చేశారు. 11-8-41 న 8 నెలల కఠిన శిక్ష, రు. 200 జరిమానా విధింపబడినది. జరిమానా చెల్లించారు. అలీపురం క్యాంప్ జైలులో శిక్ష ననుభవించి 20-12-41 న విడుదలయ్యారు.

## ఊటుకూరి నరసింహారావు



తండ్రి వెంకట నారాయణరావు. 6-2-1915 లో కృష్ణా జిల్లా గోసవీడు గ్రామంలో జన్మించారు. హిందీలో సాహిత్యరత్న పట్టా పొందారు. తూ॥గోదావరి అనపర్తిలో హిందీ ఉపాధ్యాయుడుగా పనిచేశారు. 1941 వ్యష్టి సత్యాగ్రహం లోపాల్గొన్నారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. ఒక సంవత్సరం కఠినశిక్ష 12 కొరడా దెబ్బలు విధింపబడ్డాయి. అలిపురం క్యాంపు జైలులో శిక్ష అనుభవించారు. 12 సంవత్సరాలు హిందీ ప్రచారం చేశారు.

## ఏవూరి కోటయ్య

తండ్రి వెంకయ్య. జన్మస్థలం విజయవాడ తాలూకా మెలవరం. టైలర్. 1923 లో సహాయనిరాకరణోద్యమంలో పాల్గొని, శిక్ష ననుభవించారు.

## కంఠంనేని శివరామయ్య

తండ్రి రామకోటయ్య. విజయవాడ తాలూకా వణుకూరు వాస్తవ్యులు. 1923 ప్రాంతంలో జన్మించారు. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంతో సంబంధం ఉన్నది. భారత రక్షణ చట్టం క్రింద శిక్షించబడ్డారు. రు. 100 జరిమానా చెల్లించారు. 28-4-45నుండి రెండు నెలల కఠిన శిక్షను అలీపురం క్యాంప్ జైలులో అనుభవించారు.

## కంభంపాటి వెంకటరత్నం

బెజవాడ తాలూకా ఈడ్పుగల్లు వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 4-7-32 న వీరిని స్పృహ తప్పిపోయే వరకు పోలీసులు లాఠీచార్జీ చేశారు.

## కలపాల దశరథరామయ్య

తండ్రి లక్ష్మయ్య. జన్మస్థలం విజయవాడ తాలూకా చోడవరం. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 2-7-1930న సంవత్సరంపన్నెండు వారాల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## కవలమూడి వెంకటసుబ్బయ్య

తండ్రి నాగయ్య. విజయవాడ తాలూకా చోడవరం వాస్తవ్యులు. రైతు వ్యష్టి సత్యాగ్రహం చేశారు. రు. 400 జరిమానా విధించి వసూలు చేశారు. 25-1-41 నుండి నాలుగు నెలల శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## కవులూరి వెంకటేశ్వరరావు

తండ్రి లక్ష్మీనారాయణరావు. జననం 1920 విజయవాడ తాలూకా వేల్పూరు. ప్రయివేట్ టీచరు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని రెండు సార్లు 16-9-1942 నుంచి రెండేళ్ళ కఠినశిక్షను అలీపురం, కడలూరు జైళ్ళలోను, తిరిగి 29-3-1945 నుంచి మూడు నెలలు కఠిన శిక్షను అలీపురం జైలులోను అనుభవించారు.

## కన్నయ్య

జన్మస్థలం బెజవాడ తాలూకా కొండపల్లి 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో కొండపల్లి. రైల్వేస్టేషన్ సిగ్నలింగ్ తీగెలను త్రెంచి అరెస్టు అయ్యారు. జైలు శిక్ష అనుభవించారు.

## కాసరినేని జనార్థనరావు

జననం 1907 విజయవాడ తాలూకా కాసరినేని వారి పాలెం. నివాసం కంకిపాడు. 1932 లో కాంగ్రెసులో చేరారు. క్విట్ ఇండియా ఉద్యమంలో రహస్య జీవితం గడుపుతూ పనిచేశారు. 1947 లో జిల్లా కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులు.

## కావూరి రామకోటయ్య



తండ్రి కొండయ్య. జననం 22-6-1912 విజయవాడ తాలూకా నిడమానూరు. రైతు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, 27-1-1932న అరెస్టు అయి, ఆరు మాసాల కఠినశిక్ష అనుభవించారు. యాభై రూపాయల జరిమానా వసూలు చేశారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు.

## కానుకొల్లు వెంకటేశ్వరరావు

జన్మస్థలం విజయవాడ తాలూకా పునాదిపాడు. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. డి.ఐ.ఆర్. క్రింద విజయవాడ జాయింట్ మేజిస్ట్రేట్ కోర్టు లేచేవరకు శిక్ష విధించారు.

## కూనపులి వెంకటేశ్వర శర్మ



తండ్రి శ్రీరాములు జననం 1903 విజయవాడ తాలూకా గొడవర్రు. 1920-21 సహాయ నిరాకరణంలో నెలరోజులు జైలుశిక్ష, రు. 50/- జరిమానా విధించారు. లాఠీదెబ్బలు తిన్నారు. కీర్తిశేషులైరి.

## కొసరాజు సత్యనారాయణ



తండ్రి బాపయ్య. జననం 1906 గుడివాడ తాలూకా అంగలూరు. రైతు. ప్రస్తుత నివాసం విజయవాడ తాలూకా ఎనికేపాడు. ఉప్పు సత్యాగ్రహంలో

పాల్గొని, 2-7-1930 నుంచి ఆరు నెలల కఠినశిక్షను రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. అంగలూరులో జాతీయజెండా ఎగురవేయగా, 11-2-1931 న ఆరు మాసాల కఠినశిక్ష విధించారు. గాంధీజీ-ఇర్విన్ ఒప్పందంతో 11-3-1931 న రాజమండ్రి జైలునుంచి విడుదలయ్యారు. 1932 జనవరి 26 న స్వాతంత్ర్య దినోత్సవం జరిపి, లాఠీఛార్జికి గురయ్యారు.

## కొమ్ము బసవలింగం

జన్మస్థలం విజయవాడ శివారు పటమటలంక. 1932 శాసనోల్లంఘనంలో లాఠీచార్జికి గురయ్యారు.

## కోగంటి చలపతిరావు

తండ్రి రామయ్య. జన్మస్థలం విజయవాడ తాలూకా గుంటుపల్లి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టు అయి, 29-3-1945 నుంచి అలీపురం జైలులో మూడు నెలల కఠిన శిక్ష అనుభవించారు.

## గంగరాజు వెంకటనరసింహారావు

విజయవాడ తాలూకా కంకిపాడు వాస్తవ్యులు. రాజమండ్రి ఆర్ట్సు కాలేజీ నుండి 1907 వందేమాతరం ఉద్యమంలో బహిష్కరించబడ్డారు.

## గన్నే గంగాధరరావు

తండ్రి రత్తయ్య. జన్మస్థలం విజయవాడ తాలూకా తోట్లవల్లూరు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 31-7-1930 న ఆరు నెలల కఠినశిక్ష, రు. 50/- జరిమానా విధించారు. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1941 వ్యక్తి సత్యాగ్రహ కాలంలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలను రెచ్చగొడుతూ, కల్లూరులో గోడలపై రాతలు రాసినందుకు డి.ఐ.ఆర్. క్రింద శిక్ష విధించారు. క్విట్ ఇండియా వుద్యమంలో 18-1-1943 న సంవత్సరం కఠినశిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవిస్తుండగా హైకోర్టులో కేసును కొట్టివేయడంతో 1-3-1943 న విడుదలయ్యారు.

## గన్నే భాస్కరరావు



తండ్రి కుటుంబరావు. జన్మస్థలం విజయవాడ తాలూకా తోట్లవల్లూరు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని మూడు మాసాలు రహస్య జీవితం గడిపారు. ఏడు మాసాలు సబ్ జైలు నిర్బంధంలో వున్నారు.

## గన్నే వెంకటరత్నం



తండ్రి యజ్ఞయ్య. జన్మస్థలం పెనమలూరు. క్విట్ ఇండియా ఉద్యమంలో తంతి తీగెలు త్రెంచిన కేసులో ముద్దాయి. విజయవాడ, బందరు సబ్ జైళ్ళలో రెండు నెలలు రిమాండ్ లో వున్నారు. కేసు విచారణ సంవత్సరం ఆరుమాసాలు సాగింది. కేసు రుజువుకాక, వదిలివేశారు. రైతు ఉద్యమంలో పాల్గొన్నారు.

## గరికపాటి సత్యనారాయణ

విజయవాడ శివారు పటమట వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. మూడుసార్లు లాఠీచార్జికి గురి అయ్యారు.

## గరిమెళ్ళ శ్రీరామశాస్త్రి

తండ్రి వెంకటరామయ్య. విజయవాడ తాలూకా గొడవర్రు వాస్తవ్యులు. 1924 ప్రాంతంలో జన్మించారు. విద్యార్థిగా ఉన్నపుడే క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 25-4-44 న నాల్గు నెలల కఠిన శిక్ష, రు. 200 జరిమానా, చెల్లించనిచో మరో రెండు నెలల కఠిన శిక్ష విధింపబడింది. జరిమానా

చెల్లించనందున అలీపురం క్యాంప్ జైల్లో 6 మాసాల శిక్షను అనుభవించారు.

## గాదిరాజు వెంకటేశ్వరరావు



తండ్రి వెంకట ప్పయ్య. జననం 15-6-1896 విజయ వాడ తాలూకా పోరంకి. 1921 సహాయ నిరాకరణం లో గ్రామ మునసబు పదవికి రాజీనామా చేశారు. వైద్యుడు. 1924 లో స్థాపితమైన విజయవాడ పట్టణ కాంగ్రెసు మొదటి అధ్యక్షులు. హరిజన సేవ, ఖాదీ ప్రచారం కావించారు. కాశీనాథుని నాగేశ్వరరావు గారి అంతరంగిక కార్యదర్శిగా పనిచేశారు. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయి, 2-7-1930 నుంచి ఆరుమాసాల కఠిన శిక్ష రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. 1932 లో శాసనోల్లంఘనకాలంలో లాఠీ దెబ్బలు తిన్న దేశ భక్తులకు చికిత్స చేసే నిమిత్తం డాక్టరు శివలెంక మల్లిఖార్జునరావుతో కలసి ప్రజావైద్యశాల స్థాపించారు. 24-11-1932 నుంచి ఆరు నెలల కఠినశిక్షను రాజ మండ్రి జైలులో అనుభవించారు. 1-1-1968 న కీర్తి శేషులైరి.

## గారపాటి శ్రీనివాసరావు



తండ్రి వెంకట నారాయణ. జననం 1-6-1929 విజయ వాడ తాలూకా గుంటు పల్లి. రైతు. పిన్న వయస్సులోనే క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని డి.ఐ.ఆర్. క్రింద అరెస్టు అయ్యారు. 29-7-1945 నుంచి మూడుమాసాలు కఠినశిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## గుళ్ళపల్లి బసవపున్నయ్య

తండ్రి శ్రీరాములు. జన్మస్థలం విజయవాడ తాలూకా గొడవర్రు. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు 7-8-1930 న సంవత్సరం కఠినశిక్ష విధించారు. రాజమండ్రి అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931 న విడుదలయ్యారు.

## గుళ్ళపల్లి సీతారామమ్మ

తండ్రి వెంకయ్య. విజయవాడతాలూకా గొడవర్రు వాస్తవ్యులు. వ్యష్టి సత్యాగ్రహంలో 23-7-41 నుండి 3 నెలల శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు.

## గుళ్ళపల్లి వెంకటసుబ్బయ్య



తండ్రిరామస్వామి జననం 1910 విజయ వాడ తాలూకా గొడ వర్రు. రైతు. 1932 లో గాంధీ జన్మ దినోత్సవ సందర్భం లో కాట్రగడ్డ శ్రీని వాసరావు తదితరు లంతా కలిసి ఊరేగింపు జరుపుతుండగా, రైవస్‌కాలువ వంతెన మీద తీవ్రమైన లాఠీ ఛార్జి జరిపారు. ఆ లాఠీ ఛార్జిలో ఎడమచెయ్యి విరిగిపోయింది. పీపుల్స్ ఆసుపత్రిలో చికిత్స పొందారు. విదేశీ వస్త్రాలయాల ముందు పికెటింగ్ జరుపగా, మరొకసారి లాఠీ ఛార్జీకి గురయ్యారు. కలకత్తా కాంగ్రెసు మహా సభకు హాజరై, కొన్ని రోజులు హౌరా జైలులోను, మరికొన్ని రోజులు డమ్‌డమ్ జైలులోను నిర్బంధంలో వున్నారు. ఆంధ్రరత్న భవనాన్ని పోలీసుల అధీనం నుంచి విముక్తం చేయడానికి జరిపిన సత్యాగ్రహంలో అరెస్టు అయి, పదిరోజులు రిమాండ్‌లో వున్నారు. ప్రస్తుత నివాసం గాజులదిన్నెప్రాజెక్టు, కర్నూలుజిల్లా.

## గుళ్ళపల్లి లక్ష్మయ్య

జన్మస్థలం విజయవాడ తాలూకా గొడవర్రు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆరునెలల కఠినశిక్ష విధించారు. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో

కూడా పాల్గొన్నారు. రెండువారాల కఠినశిక్ష, రు 150/- జరిమానా విధించారు.

## గొడవర్తి వెంకట కోటయ్య

తండ్రి బసవయ్య. విజయవాడ తాలూకా పణుకూరు వాస్తవ్యులు. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో 17-3-1943 న 5 నెలల కఠిన శిక్ష విధించబడింది. అలీపురం క్యాంప్ జైలులో శిక్షననుభవించారు. తిరిగి ఉద్యమంలో పాల్గొనగా, రెండు నెలల ఆరువారాల కఠిన శిక్ష విధించారు. అలీపురం క్యాంప్ జైలులో 28-4-45 నుండి శిక్ష ననుభవించారు.

## గొంది కోటేశ్వరరావు

జన్మస్థలం విజయవాడ తాలూకా తెన్నేరు. క్విట్ ఇండియా ఉద్యమంలో ఉప్పులూరు స్టేషన్‌ను దగ్ధం చేయడంలో పాల్గొన్నారు. అరెస్టు చేసి, ఆరునెలలు సబ్ జైలులో నిర్బంధించారు.

## గోపరాజు రామచంద్రవు (గోరా)



తండ్రి వెంకట సుబ్బారావు. జననం 15.11.1902ఒరిస్సా రాష్ట్రం ఛత్రపూర్. విజయవాడ శివారు పటమట నివాసి. ఎమ్. ఎస్. సి. పట్టభద్రులు. శ్రీలంక, దక్షిణభారత్ దేశంలోని వివిధ కాలేజీలలో 15 సంవత్సరాలపాటు 1940 వరకు లెక్చరర్‌గా పనిచేశారు. స్వాతంత్ర్యదినోత్సవం జరిపిన కారణంగా 30-4-1943న బందరు సబ్‌డివిజనల్ మేజిస్ట్రేట్ మూడు నెలల కఠినశిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. తరువాత రెండుసార్లు వారం రోజుల చొప్పున సబ్‌జైలులో నిర్బంధించారు. నాస్తికవాదం ప్రచారకుడు. అంటరానితనం నిర్మూలనకు కృషిచేశారు. సంఘసంస్కర్త. కులాంతర వివాహాలను ప్రోత్సహించారు. 'సంఘం' "ది ఎతిస్టు" పత్రికల సంపాదకులు. 1970లో బోస్టన్‌లో జరిగిన ప్రపంచ హ్యూమనిస్టు మహాసభలకు హాజరయ్యారు. సర్వోదయ ఉద్యమంతో సన్నిహిత సంబంధం కలవారు. 26-7-1975 కీర్తిశేషులైరి. హరిజనులతో వియ్యం పొందారు. ఆదర్శ సంస్కర్తగా ప్రసిద్ధి పొందారు.

## గోపరాజు సరస్వతి



రామచంద్రరావు (గోరా) గారి పత్ని. 1912 లో జననం. విజయవాడ పటమట ప్రస్తుత నివాసం. క్విట్ ఇండియా ఉద్యమంలో 1944 ఏప్రిల్ 13 న సత్యాగ్రహం చేశారు. 25-4-44న నాల్గునెలల కఠిన శిక్ష, రు. 200 జరిమానా, చెల్లించనిచో మరో రెండు నెలల కఠిన శిక్ష విధించారు. వెల్లూరు జైలులో రెండేళ్ళకుమారునితోపాటుఆరునెలలశిక్షఅనుభవించారు.

## గోపరాజు లవణం



తండ్రి రామచంద్రరావు. జననం 1930 గన్నవరం తాలూకా ముదునూరు. నివాసం విజయవాడ శివారు పటమట. క్విట్ ఇండియా ఉద్యమంలో, తండ్రితో పాటు 26-1-1943 న అరెస్టు అయ్యారు. మైనరు కావటంవల్ల పోలీసు లాకప్‌నుంచి విడుదల చేశారు.

## చలసాని రామచంద్రరావు

తండ్రి శ్రీరాములు. జన్మస్థలం విజయవాడ తాలూకా నెప్పల్లి. రైతు. 7-3-1932 న ఈడుపుగల్లులో కల్లు పాకల ముందు పికిటింగ్ చేసి, తీవ్రమైన లాఠీచార్జికి గురయ్యారు. 13-5-1932 న సంవత్సరం కఠినశిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## చల్లపల్లి వెంకటసుబ్బయ్య

విజయవాడ తాలూకా గొడవర్రు వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో లాఠీచార్జికి గురి అయ్యారు.

## చల్లా రామస్వామి



తండ్రి పిచ్చయ్య. జననం 1890 గుంటూరు జిల్లా తెనాలి తాలూకా హనుమానుల పాలెం. రైతు. ప్రస్తుతనివాసం విజయవాడ శివారు ప్రసాదంపాడు. క్విట్ ఇండియా ఉద్యమంలో తంతి తీగెలు త్రెంచివేత, టెలిఫోన్ స్థంభాల పెరికివేత చర్యలకు గాను అరెస్టుచేసి, 18 నెలల కఠిన శిక్ష విధించారు. 21-12-1942 నుంచి అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. జైలులో తిన్న లాఠీ దెబ్బలవల్ల నడుం విరిగిపోయింది.

## చీమలపాటి సుందరరామయ్య



విజయవాడ తాలూకా చీమలపాడు వాస్తవ్యులు. 1920-21 సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నందుకు ఆరు నెలల శిక్ష విధించబడింది. కీర్తిశేషులైరి.

## చిమటా మల్లిఖార్జునుడు

జన్మస్థలం విజయవాడ తాలూకా నెప్పల్లి. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీచార్జికి గురయ్యారు.

## చెన్నుపాటి రాజబాబయ్య



విజయవాడ శివారు పటమటలంక నివాసి. 1932 శాసనోల్లంఘనోద్యమంలో రెండుసార్లు లాఠీచార్జిలకు గురయ్యారు.

## చెన్నుపాటి సూర్యనారాయణ

విజయవాడ శివారు పటమటలంక వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నందుకు లాఠీఛార్జికి గురి అయ్యారు.

## చెన్నుపాటి మురహరిరావు



తండ్రి వెంకట కృష్ణయ్య. జననం 31-3-1912 విజయవాడ తాలూకా పటమటలంక. రైతు. హిందీ విశారద. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 2-7-1930 న సంవత్సరం కఠిన శిక్ష, రు. 1000/- జరిమానా విధించారు. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒప్పందంతో 12-3-1931 న విడుదలయ్యారు. శాసనోల్లంఘనంలో తీవ్రమైన లాఠీచార్జికి గురయ్యారు. 26-5-1932 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## చొప్పదండి భద్రయ్య



తండ్రి నాగయ్య. జన్మస్థలం విజయవాడ తాలూకా మైలవరం. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 21-6-1930న రెండేళ్ళ కఠిన శిక్ష విధించారు రాజమండ్రి తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. 29-1-1931 న ప్రభుత్వం ఉత్తర్వుపై విడుదలయ్యారు. కీర్తిశేషులైరి.

## చెరుకూరి వియ్యమ్మ



తండ్రి పల్లెంపాటి పేరయ్య. భర్త లక్ష్మీపతి. స్వస్థలం విజయవాడ తాలూకా గరికిపర్రు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొని సంవత్సరం జైలుశిక్ష అనుభవించారు. 27-3-1932న ఉయ్యూరులో పికెటింగ్ చేయగా, అరెస్టుచేసి, విజయవాడలో వదలి వేశారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని, 19-4-1932 నుంచి ఆరునెలల కఠినశిక్షను వెల్లూరు, మద్రాసు జైళ్ళలో అనుభవించారు.

## జాస్తి సూర్యనారాయణ



తండ్రి రామస్వామి. జన్మస్థలం విజయవాడ తాలూకా పటమట లంక. రైతు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయి, జైలు శిక్ష అనుభవించారు. 1932 శాసనోల్లంఘనంలో మూడు సార్లు లాఠీచార్జీలకు గురయ్యారు.

## జొన్నవిత్తుల కుటుంబసుబ్బారావు



తండ్రి వెంకటరామయ్య. జననం 1907 విజయవాడ తాలూకా గొడవర్రు. 1920-21 సహాయ నిరాకరణంలో పచ్చ గడ్డి పాటలను బహిష్కరించమని ప్రచారం చేసినందుకు ఒక నెల కఠిన శిక్ష, రు. 50/- జరిమానావిధించారు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. రెండు సంవత్సరాల కఠిన శిక్షను, రు. 500/- జరిమానాను విధించారు. భార్య నగలు అమ్మి జరిమానా చెల్లించారు. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒప్పందంతో 12-3-1931న విడుదలయ్యారు. గొట్టిపాటి బ్రహ్మయ్య సారథ్యంలో వెంకటగిరి సంస్థానంలో జమీందారీ రైతు ఉద్యమంలో పాల్గొన్నారు. కీర్తిశేషులైరి.

## జొన్నవిత్తుల వెంకట నరసింహశాస్త్రి



తండ్రి వెంకట్రామయ్య. జననం 16-10-1906 విజయవాడ తాలూకా గొడవర్రు. సహాయ నిరాకరణోద్యమంలో కాలువగట్ల గడ్డిపాటలకు వ్యతిరేకంగా పికెటింగ్ జరిపి, అరెస్టు అయ్యారు. పదిరోజులు విజయవాడ సబ్‌జైలు నిర్బంధంలో వున్నారు. మైనరు కావటంవల్ల విడుదల చేశారు. 25-8-1939న కీర్తిశేషులైరి.

## తలశిల వెంకటేశ్వరరావు



తండ్రి వెంకట సుబ్బయ్య. జన్మస్థలం విజయవాడ తాలూకా పెనమలూరు. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, తంతి తీగెలు త్రెంచే కార్యక్రమంనిర్వహించారు. 1943 లో అరెస్టుచేసి, విజయవాడ, బందరు సబ్ జైళ్ళలో రెండు నెలలు రిమాండ్‌లో ఉంచారు. కేసు విచారణ సంవత్సరం ఆరు మాసాలు సాగింది. కేసు రుజువుకాక, వదిలి వేశారు. ప్రజానాట్యమండలి సభ్యుడు, నటుడు. అనేక సాంస్కృతిక ప్రదర్శనలలో పాల్గొన్నారు.

## తాతినేని వెంకటేశ్వరరావు



తండ్రికోటయ్య. జన్మస్థలం విజయవాడ తాలూకా కుందేరు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 16-6-1930 నుంచి ఆరునెలలు కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీచార్జికి గురై, 16-7-1932 నుంచి ఆరునెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులోనే అనుభవించారు.

## తాతినేని రామచంద్రయ్య

తండ్రి కోటయ్య. జన్మస్థలం విజయవాడ తాలూకా తెన్నేరు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 3-7-1930న ఆరు నెలల కఠినశిక్ష రు. 30/- జరిమానా విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. తిరిగి 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీఛార్జికి గురయ్యారు.

## తుమ్మల సత్యనారాయణ

విజయవాడ తాలూకా కోలవెన్ను వాస్తవ్యులు. 18-2-41 న వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 19 వ తేదీన, కోర్టు లేచే వరకు ఖైదు, రు. 200 జరిమానా, చెల్లించనిచో మూడు వారాల కఠిన శిక్ష విధించారు.

## దుర్భా వెంకట కృష్ణమూర్తి



తండ్రి వెంకటరత్నం. స్వస్థలం నందిగామ తాలూకా గొట్టుముక్కల. చిన్న వయస్సులోనే జాతీయోద్యమంలో ప్రవేశించారు. ఉప్పు సత్యాగ్రహంలో అయ్యదేవర కాళేశ్వరరావు దళంలో పాల్గొని, తీవ్రమైన లాఠీఛార్జికి గురయ్యారు. 3-7-1930న మూడు సంవత్సరాల కఠిన శిక్ష విధించారు. తంజావూరు బోరస్టల్ స్కూలు, రాజమండ్రి జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒప్పందంతో 18-2-1931 న విడుదలయ్యారు. కరాచీ కాంగ్రెస్‌కు హాజరయ్యారు. శాసనోల్లంఘనంలో పాల్గొని 30-3-1932 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. సతీసమేతంగా రెండు సంవత్సరాలు గాంధీ వార్ధా ఆశ్రమంలో గడుపుతూ, అక్కడే జయప్రకాశ్ నారాయణ, లోహియా, వంటి అతివాద నాయకులతో పరిచయ మేర్పరచుకొన్నారు. అనంతరం ఆంధ్రకు వచ్చి 'కూలీ రక్షణ సమితి'లో చేరి పని చేశారు. 'ధన ప్రభావం' నాటిక రచించినందుకు 30-12-1935 నుంచి ఆరు నెలల శిక్ష అనుభవించారు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో 28-9-1939 నుంచి మద్రాసు ప్రభుత్వం సంవత్సర కాలం గుంటూరు జిల్లా సత్తెనపల్లె తాలూకా పాలేమర్రు గ్రామంలో ఇంటర్న్ చేసింది. 29-11-40 నుంచి సంవత్సరం 9 నెలలు వెల్లూరు జైలులో డిటెన్యూగా వున్నారు క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో 23-10-1944 నుంచి రెండు నెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు. ప్రస్తుతం మద్రాసులో నివాసం.

## నల్లూరి పాపయ్య

తండ్రి హనుమయ్య. జన్మస్థలం విజయవాడ శివారు పటమట. రైతు. నెహ్రూ కమిటీ గుంటూరు రాక సందర్భంలో అరెస్టుఅయి మూడు రోజులు రిమాండ్‌లో వున్నారు. రు. 15 జరిమానా విధించారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 26-6-1630 న రెండేళ్ళ కఠినశిక్ష, రు. 200 జరిమానా విధించారు. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒప్పందంతో 12-3-1931 న విడుదలయ్యారు.

## నాదెళ్ళ రామసుబ్బయ్య

జన్మస్థలం విజయవాడ తాలూకా ఈడుప్పుగల్లు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీఛార్జీకి గురయ్యారు.

## నిమ్మగడ్డ లక్ష్మీనరసింహం



తండ్రి వెంకటప్పయ్య. జననం 1893 విజయవాడ తాలూకా గొడవర్రు 1920-21 సహాయ నిరాకరణోద్యమంలో అరెస్టు అయ్యారు. ఒక నెల జైలు శిక్ష రు. 50/- జరిమానా విధించారు.

## పర్వతనేని వీరరాఘవయ్య



జన్మస్థలం విజయవాడ తాలూకా నెప్పల్లి. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, చాలాసార్లు లాఠీ ఛార్జికి గురయ్యారు 1932 లో రహస్య పత్రిక "రెడీ" పంపిణీ చేస్తుండగా పోలీసులు అరెస్టు చేయబోయారు. పోలీసు నిఘా నుంచి తప్పించుకుని 7 మాసాలు అజ్ఞాత వాసంలో వుండి కాంగ్రెస్ వుద్యమానికి తోడ్పడ్డారు. విజయవాడలో ఆంధ్ర రత్న భవనం పోలీసుల నుంచి స్వాధీనం చేసుకునే వుద్యమంలో పాల్గొనగా లాఠీలతో కొట్టి, 10 రోజులు పోలీసు లాకప్‌లో వుంచారు. 1942 ఉద్యమంలో పాల్గొనగా, అరెస్టు వారంట్ తప్పించుకుని, ఒక సంవత్సరం 6 మాసాలు రహస్య జీవితం గడుపుతూ వుద్యమానికి తోడ్పడ్డారు. చివరికి 1944 ఏప్రిల్‌లో అరెస్టు చేయబడి బందరు సబ్ జైలులో 15 రోజులు నిర్బంధంలో వున్నారు.

## పర్వతనేని వెంకయ్య

తండ్రి రామయ్య. జన్మస్థలం విజయవాడ తాలూకా నెప్పల్లి. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని, 16-7-1932 నుంచి ఆరునెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## పాలడుగు శేషాచలాచార్యులు



స్వస్థలం విజయవాడ తాలూకా కుందేరు. కాశీలో వేద, హిందీ పఠనం. 1927 లో కుందేరు సమీపంలో బ్రహ్మచర్యాశ్రమంస్థాపన. 1930, 1932, 1933, 1942 స్వాతంత్ర్య పోరాటాలలో ఈ ఆశ్రమం స్వాతంత్ర్య సమరయోధులకు కేంద్రంగా ఉపకరించింది. పోలీసులు ఈఆశ్రమాన్ని 1943లో ధ్వంసం చేశారు. 'ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం', 'సిపాయి తిరుగుబాటు', 'విప్లవాగ్ని' వంటి గ్రంథాలు ప్రచురించారు. 1978 లో కీర్తిశేషులైరి.

## పిడికిటి మాధవరావు

తండ్రి సుబ్రహ్మణ్యం. జన్మస్థలం విజయవాడ తాలూకా పునాదిపాడు. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 2-7-1930 న సంవత్సరం కఠినశిక్ష. రు. 80/- జరిమానా విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931 న విడుదలయ్యారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 17-10-1941 న 9 నెలలు శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవిస్తుండగా మరొక కేసు విచారణ సందర్భంలో 28-11-1941 న గుడివాడ సబ్‌జైలుకి మార్చారు. ఆ సబ్ జైలునుంచి విడుదలయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 17-8-1942 న రు 100/- జరిమానా, సంవత్సరం కఠినశిక్ష విధించారు. బళ్ళారి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## పిడికిటి రామకోటయ్య



తం॥ రామకోటయ్య. జన్మస్థలం విజయవాడ తాలూ పునాదిపాడు. రైతు, ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. 27-6-1930 న రెండేళ్ల కఠిన శిక్ష, రు. 500 జరిమానా విధించా . రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒప్పందంతో 12-3-1931 న విడుదల అయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 20-4-1932 న రు. 1000/- జరిమానా విధించారు.

## పెదర్ల వెంకట సుబ్బయ్య



తండ్రి అప్పయ్య. జననం 21-12-1900 విజయవాడ తాలూకా గుంటుపల్లి. రైతు. నెహ్రూ కమిటీ గుంటూరు రాక సందర్భంలో అరెస్టుఅయి మూడు రోజులు సబ్ జైలు నిర్బంధంలో వున్నారు. రు. 15/- జరిమానా చెల్లించారు. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. ఆరునెలల కఠినశిక్ష, రు. 100/- జరిమానా విధించారు. రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. సహకార ఉద్యమంలో కృషిచేసి ఉన్నత పదవులు అలంకరించారు. జిల్లా కాంగ్రెస్ సంఘంలో అనేక బాధ్యతలు నిర్వహించారు.

## పెదర్ల వేణుగోపాలరావు

తండ్రి వెంకట సుబ్బయ్య. జననం 1925 విజయవాడ తాలూకా గుంటుపల్లి. రైతు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని, 29-3-1945 నుంచి మూడు నెలలు కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## పెదర్ల ఆదినారాయణ మూర్తి

తండ్రి వెంకట నారాయణ. జన్మస్థలం విజయవాడ తాలూకా గుంటుపల్లి. రైతు. 1931-32 ఉద్యమాలలో మొత్తం మూడుసార్లు అరెస్టు అయ్యారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు, 3-7-1930 న ఆరు మాసాల శిక్ష, రు. 50/- జరిమానా విధించారు. రాజమండ్రి, తిరుచినాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. శాసనోల్లంఘనంలో అరెస్టు చేసి, 15-1-1932 న నాలుగునెలల కఠిన శిక్ష, రు. 25/- జరిమానా విధించారు. తిరిగి 22-8-1932 న ఆరునెలల కఠిన శిక్ష, రు. 100/- జరిమానా విధించారు.

## పొన్నలూరి రాధాకృష్ణమూర్తి



తండ్రి శ్రీరామయ్య. జననం 1906 విజయవాడ తాలూకా పటమట. ఉపాధ్యాయులు ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. 14-6-1930న రెండేళ్ల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒప్పందంతో 11-3-1931 న విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొని, 16-6-1932 నుంచి సంవత్సరం కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. స్వాతంత్ర్య పోరాటంలో అనేకసార్లు లాఠీ ఛార్జీలకు గురయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 21-3-1944 నుంచి మూడు మాసాల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు. అల్లూరి సీతారామరాజు జీవిత చరిత్రను "మన్యంలో తిరుగుబాటు" పేరున రచించారు. ఆగ్రంథాన్ని బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది. "తిరువూరు తాలూకాలో జమిందారీ దురంతాలు", "ఆసి" అనే గ్రంథాలు రచించారు. ఖమ్మంజిల్లా మధిరలో స్థిరపడి, అక్కడనే కీర్తిశేషులైరి.

## బసవరాజు అప్పారావు

13-12-1894 లో జన్మించారు. స్వరాజ్య ఉద్యమంతో సంబంధం ఉండేది. జాతీయ గీతాలు రచించారు. "కొల్లాయిగట్టితేనేమీ మా గాంధీ" అన్న గేయం బాగా ప్రచారం పొందింది. కొంతకాలం ఆంధ్ర పత్రిక, భారతి, సహాయ సంపాదకులుగా పనిచేశారు. కీర్తిశేషులు.

## బసవరాజు రాజ్యలక్ష్మి (సౌదామిని)



విజయవాడ శివారు పటమటలో 6-8-1902లో జన్మించారు. బసవరాజు అప్పారావుగారి పత్ని. వార్ధా మహిళా ఆశ్రమంలో మూడు ఏండ్ల పాటు శిక్షణ పొందారు. ఉన్నవ లక్ష్మీనారాయణగారు స్థాపించిన 'శారదా నికేతన్'లో 14 సంవత్సరాలు మేనేజరుగా పని చేశారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 3-2-1941 నుంచి 2-5-1941 వరకు మూడు మాసాలు జైలుశిక్ష అనుభవించారు. అరవం, కన్నడం, హిందీ, గుజరాతి, బెంగాలీ, మహారాష్ట్రి భాషల్లో పరిచయం వుంది. సౌదామిని కలం పేరుతో కొన్ని గేయాలు తెలుగులో రచించారు.

## బుర్రా శివరామకృష్ణశాస్త్రి



విజయవాడ తాలూకా వేల్పూరు. తండ్రి వెంకటశాస్త్రి. ప్రస్తుతం గుడివాడ వాస్తవ్యులు. విద్యార్థి దశలోనే ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 10-6-30 న 10 నెలల కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచినాపల్లి, జైళ్ళలో శిక్షను అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 31-12-42 న విజయవాడలో రెండేళ్ళ కఠినశిక్ష విధించబడింది. సెషన్సు కోర్టులో శిక్ష తగ్గించగా 2-8-43 న విడుదలయ్యారు. ఖాదీ గ్రామోద్యోగ పరిశ్రమ బోర్డులో పనిచేశారు.

## బెండపూడి నరసింహారావు

జన్మస్థలం విజయవాడ తాలూకా వల్లూరు. 1907 వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్నారు. రాజమండ్రి ఆర్ట్సు కాలేజీనుంచి బహిష్కృతులయ్యారు.

## బొప్పన లక్ష్మీకాంతమ్మ

స్వగ్రామం విజయవాడ తాలూకా గనికపుడు. ఉప్పు సత్యాగ్రహంలో విజయవాడ తాలూకా నెప్పల్లిలో ఉప్పు తయారుచేసి, అరెస్టయ్యారు. శిక్ష అనుభవించారు.

## మద్దాలి వెంకటేశ్వరరావు



తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం విజయవాడ తాలూకా చోడవరం. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, 11.1.1941 నుండి ఆరు నెలలు కఠిన శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. జైలు నుంచి విడుదలైన పిమ్మట తిరిగి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 5-7-1941 న 9 నెలల కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు. 15-12-1941 న ప్రభుత్వం విడుదల చేసింది. 1942 ఆగస్టు ఉద్యమంలో ఉప్పులూరు రైల్వేస్టేషన్‌పై జరిగిన దాడిలో పాల్గొని అరెస్టు అయ్యారు. ఆరు నెలల పాటు సబ్ జైలులో రిమాండ్‌లో వున్నారు. 17-3-1943 న నాలుగు నెలల కఠిన శిక్ష విధించారు. అలీపురం జైలులో శిక్ష అనుభవించారు.

## మద్దాలి వెంకటసుబ్బమ్మ



వెంకటేశ్వరరావు గారి పత్ని. విజయవాడ తాలూకా చోడవరం వాస్తవ్యులు. గర్భవతి ఐనా క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 25-4-1944 నుండి వెల్లూరు జైలులో 4 నెలల శిక్ష అనుభవించారు. రు. 200 జరిమానా విధింపబడింది జైలులో ప్రసవించారు. ఈమె భర్తకూడా నాల్గుసార్లు జైలుశిక్షను అనుభవించారు.

## మద్దాలి చలమయ్య



తండ్రి సుబ్బయ్య. జన్మస్థలం విజయవాడ తాలూకా చోడవరం. రైతు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, 22-2-1941 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. విజయవాడ తాలూకా కాంగ్రెసు అధ్యక్షులుగా పని చేశారు.

## మద్దాలి జగన్నాధం

తండ్రి వెంకటరత్నం. జన్మస్థలం విజయవాడ తాలూకా పునాదిపాడు. రైతు. యుద్ధ వ్యతిరేక నినాదాలు చేసి, 25-1-1941 న అరెస్టు అయ్యారు. నాలుగు నెలల కఠిన శిక్ష, రు. 100/- జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. తిరిగి క్విట్ ఇండియా ఉద్యమంలో 28-8-1942 నుంచి వెల్లూరు జైలులో డిటెన్యూగా నిర్బంధింపబడ్డారు.

## మద్దూరి శ్రీరామమూర్తి

తండ్రి చెన్నకేశవరావు. విజయవాడ తాలూకా గొడవర్రు వాస్తవ్యులు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని 26-1-1922 నుండి నాల్గు నెలల కఠినశిక్షను రాజమండ్రి సెంట్రల్ జైల్లో అనుభవించారు.

## మన్నె వెంకట సుబ్బారావు

తండ్రి పెద్ద రత్తయ్య. విజయవాడ తాలూకా చోడవరం వాస్తవ్యులు. యుద్ధ వ్యతిరేక ఉద్యమంలో పాల్గొన్నారు. 22-1-41 న నాల్గు నెలల కఠిన శిక్ష రు. 650 జరిమానా విధించబడింది. జరిమానా చెల్లింపబడింది. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించారు. జిల్లా కాంగ్రెస్ కమిటీ సభ్యులుగా పని చేశారు.

## మాగులూరి రామచంద్రరావు

తండ్రి బసవయ్య, జన్మస్థలం విజయవాడ తాలూకా తెన్నేరు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 6-6-1930 న సంవత్సరంన్నర కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, కోరాపుట్ జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## మారేపల్లి రామచంద్ర శాస్త్రి

విజయవాడ తాలూకా గొడవర్రు వాస్తవ్యులు. 1920-21 సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. ఒక నెల శిక్ష రు. 50/- జరిమానా విధింపబడింది.

## మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి



జననం 1916 విజయవాడ తాలూకా కోలవెన్ను. వెటర్నరీ సైన్స్‌లో డిప్లొమా పొందారు. క్విట్ ఇండియా ఉద్యమంలో ఉప్పులూరు రైల్వే స్టేషన్ పై దాడిలోను, పునాదిపాడు హైస్కూలు తగలబెట్టడంలోను పాల్గొని, అరెస్టు అయ్యారు. కోమటిగుంటవద్ద తంతి తీగెలు త్రెంచిన కేసులో ముద్దాయి. విజయవాడ, తిరువూరు సబ్ జైళ్ళలో మొత్తం రెండు మాసాలు రిమాండ్‌లో వున్నారు. అనంతరము

కమ్యూనిస్టుపార్టీలో చేరి, ప్రజా నాట్యమండలిలో పని చేశారు. ప్రస్తుతం మద్రాసులో సినిమా రంగంలో వున్నారు.

## ముష్టి లక్ష్మీనారాయణ

తండ్రి రామకృష్ణయ్య. నాటి కృష్ణాజిల్లా ఇప్పటి పశ్చిమ గోదావరి జిల్లాకు చెందిన భీమవరంలో 20-6-1891 న జన్మించారు. ప్రస్తుత నివాసం సికింద్రాబాద్. ప్లీడరు వృత్తి మాని పలుగు, పార పట్టిన శ్రమ జీవి. 1906 నుండి వందేమాతరం, స్వదేశీ ఉద్యమం, విదేశీ వస్తు, వస్త్ర బహిష్కరణ ఉద్యమాల్లో పాల్గొన్నారు. బందరు జాతీయ విద్యాలయ స్థాపనకు డాక్టర్ పట్టాభి, కోపల్లె హనుమంతరావు, ముట్నూరు కృష్ణారావులతో కలిసి, మూలధనం వసూలు చేశారు. విదేశీ వస్త్ర దహన ఉద్యమంలో పాల్గొన్నారు. 1910-11 లో గాంధీజీ దక్షిణాఫ్రికా సత్యాగ్రహ ఫండుకు డబ్బు వసూలు చేశారు. 1914 మద్రాసు కాంగ్రెసుకు వలంటీరుగా వెళ్ళారు. 1920-21 కాంగ్రెస్‌లలో వలంటీరుగా పనిచేశారు. గయ, బెల్గాం, కాకినాడ కాంగ్రెస్‌లకు ప్రతినిధిగా హాజరయ్యారు. 1921 లో ప్లీడర్ వృత్తి విడిచిపెట్టేరు. తిరిగి 1924 - 30 వరకు ప్రాక్టీస్ చేశారు. 1931 - 32 లో ఒక సంవత్సరం రాజమండ్రి, వెల్లూరు జైళ్ళలో శిక్ష ననుభవించారు. 1932 - 33 లో మరొక సంవత్సరం రాజమండ్రి, కడలూరులో శిక్ష అనుభవించారు. సర్వోదయ కార్యకర్త. 1930-34 లో జిల్లా కాంగ్రెస్ కార్యదర్శిగా పనిచేశారు.

## ముప్పవరపు లక్ష్మీపతి

తండ్రి తిరుపతయ్య. జన్మస్థలం విజయవాడ తాలూకా ఎనమలకుదురు. రైతు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 2-7-1930 న సంవత్సరం కఠినశిక్ష, రు. 80/- జరిమానా విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931 న విడుదలయ్యారు.

## ముప్పాళ ధర్మారావు

తండ్రి వెంకయ్య జన్మస్థలం విజయవాడ తాలూకా ముద్దూరు. రైతు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆరునెలల శిక్ష, రు. 250/- జరిమానా విధించారు. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## యలమంచిలి లక్ష్మయ్య

తండ్రి కామయ్య జన్మస్థలం విజయవాడ తాలూకా గొడవర్రు. రైతు. శాసనోల్లంఘనంలో పాల్గొని, 7-8-1930 నుంచి ఆరునెలల కఠిన శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## యలమంచిలి వెంకటరత్నం

తండ్రి సర్సయ్య విజయవాడ తాలూకా గొడవర్రు వాస్తవ్యులు. రైతు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొనగా 22-2-41 న నాల్గునెలల కఠిన శిక్ష, రు. 500 జరిమానా విధించారు. జరిమానా చెల్లించబడింది. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష ననుభవించారు

## యం. వెంకట సుబ్బారావు

విజయవాడ తాలూకా గొడవర్రు వాస్తవ్యులు. 1940-41 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. రు. 300 జరిమానా, చెల్లించని పక్షంలో ఒక నెల కఠిన శిక్ష విధించబడింది.

## యలమంచిలి వెంకట రామయ్య



తండ్రి రామబ్రహ్మం. జననం 1919 విజయవాడ తాలూకా చోడవరం. రైతు. వ్యష్టి సత్యాగ్రహంలో రెండు సార్లు పాల్గొ అరెస్టు అయా 14-2-1941 న ఆరు వారాల కఠిన శిక్ష, రు. 10 జరిమానా విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అ[illegible]వించారు. తిరిగి 11-8-1941 న నెల 15 రోజుల [illegible] శిక్ష విధించారు. ఆ శిక్షను కూడా రాజమండ్రి జైలోనే అనుభవించారు.

## యలమంచిలి కోటయ్య

జన్మస్థలం విజయవాడ తాలూకా కోలవెన్ను. 18-2-1941 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. 19-2-1941 న విజయవాడ జాయింట్ మెజిస్ట్రేట్ రు. 250/- జరిమానా కోర్టు లేచేవరకు జైలుశిక్ష విధించారు. 1942 లో ఉప్పలూరు రైలు స్టేషన్‌ను దగ్ధంచేసే కార్యక్రమంలో పాల్గొన్నారు. అరెస్టు చేసి, ఆరు నెలలు సబ్ జైలులో నిర్బంధించారు.

## యలవర్తి తిరుపతిరాయుడు



తండ్రి శేషయ్య. గుంటూరు జిల్లా కూచిపూడిలో 1905 లో జన్మించారు. ప్రస్తుత నివాసం విజయవాడ తాలూకా తాడిగడప. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. ఆరు నెలల కఠిన శిక్షను 25-7-30 నుండి రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు. తిరిగి 23-8-32 నుండి ఆరునెలల కఠిన శిక్షను రాజమండ్రి సెంట్రల్ జైల్లో అనుభవించారు. లైబ్రరీ, హరిజన ఉద్యమాలపట్ల ఆసక్తి చూపారు. సహకార సంఘం, పంచాయితీ బోర్డులకు అధ్యక్షులుగా పనిచేశారు.

## యెండూరి వీరరాఘవయ్య



తండ్రి పేరయ్య. జననం 31-8-1902 పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు. లైబ్రేరియన్. 1930 లో గూడవల్లి గ్రామములో కల్లు పాకల ముందు పికెటింగ్ జరిపి, అరెస్టు అయ్యారు. 17-6-1930 న నాలుగు నెలల కఠినశిక్ష, రు. 40/- జరిమానా విధించారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, ఆరు మాసాల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## రాయల గోపాలరావు



తండ్రి వెంకటరామయ్య. జననం 20-8-1925 న గుంటూరు జిల్లా తెనాలి తాలూకా జూపూడి. నివాసం విజయవాడ తాలూకా వల్లూరిపాలెం రైతు సవశక్తి పత్రికకు చందాదారుడై, ఇతరులచేత ఆ పత్రికను చదివించి, సోషలిస్టు భావాల వ్యాప్తికి కృషి చేశారు. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టు అయి, 6-11-1942 నుంచి సంవత్సరం కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## రామినేని రాజమ్మ



తండ్రి పొట్లూరి వెంకయ్య. భర్త బ్రహ్మయ్య. స్వగ్రామం విజయవాడ తాలూకా గరికపర్రు. 1930-31 ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. గుంటూరు సబ్‌జైలు నుంచి గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో విడుదలయ్యారు. తిరిగి 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని 23-1-1932 నుంచి సంవత్సరం కఠిన శిక్షను, వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు.

## రామినేని రాఘవయ్య



తండ్రి రత్తయ్య. జన్మస్థలం విజయవాడ శివారు పటమట. రైతు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 2-7-30. సంవత్సరం కఠినశిక్షన రు. 80/- జరిమానా విధించారు. రాజమండ్రి. తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931 న విడుదల అయ్యారు.

## రామినేని కోటయ్య



తండ్రి కృష్ణయ్య. జన్మస్థలం విజయవాడ తాలూకా వేణుగోపాలపురం. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. 25-1-1932 న ఆరు నెలల కఠినశిక్ష. రు 200/- జరిమానా విధించారు రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు.

## రాయప్పారు అచ్యుతరామయ్య



తండ్రి వెంకట కృష్ణారావు. జననం 1900. విజయవాడ తాలూకా చినపులిపాక. కరణం. విద్యార్థిదశలోనే బందరులో ప్రిన్స్ ఆఫ్ వేల్స్ రాకకు నిరసనగా జరిగిన ప్రదర్శనలో పాల్గొన్నారు. సహాయ నిరాకరణంలో అరెస్టు అయి, 24-3-1922 నుంచి ఆరు నెలల కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## వల్లభనేని అన్నపూర్ణమ్మ



భర్త అంజయ్య. గుడివాడ తాలూకా ఉరుటూరు. జననం 1900 విజయవాడ తాలూకా గొడవర్రు. శాసనోల్లంఘనంలో పాల్గొని, 31-8-1932 నుంచి సంవత్సరం కఠిన శిక్షను వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు. కీర్తిశేషులయ్యారు.

## వల్లభనేని సోమయ్య

తండ్రి కోటయ్య. బెజవాడ తాలూకా తోట్లవల్లూరు వాస్తవ్యులు. రైతు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 17-6-30 న సంవత్సరం కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి, తిరుచినాపల్లి జైళ్ళలో శిక్షను అనుభవించారు.

## వీరమాచనేని వెంకటరామయ్య

ఈడుపుగల్లు వాస్తవ్యులు 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నందుకు రెండుసార్లు లాఠీఛార్జికి గురిఅయ్యారు.

## వీరమాచనేని రామకోటయ్య

తండ్రి సుబ్బయ్య. జననం 9-10-1907 విజయవాడ తాలూకా ఈడుపుగల్లు. 1930 లో చిన్నాపురం ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, పలుమార్లు తీవ్రమైన లాఠీఛార్జీలకు గురయ్యారు. 4-6-1932 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించి, 10-4-1933 న విడుదలయ్యారు. కీర్తిశేషులయ్యారు.

## వీరమాచనేని మధుసూదనరావు

తండ్రి రామభద్రం జన్మస్థలం విజయవాడ తాలూకా ఈడుపుగల్లు సుప్రసిద్ధ చలనచిత్ర దర్శకులు.

ప్రస్తుత నివాసం మద్రాసు. విద్యార్థి యువజన ఉద్యమాలలో పాల్గొన్నారు. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసినందుకు శిక్ష విధించారు 25-3-1942 నుంచి 27-4-1942 వరకు అలీపురం, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు.

## వెనిగళ్ళ లక్ష్మమ్మ

స్వస్థలం విజయవాడ తాలూకా గరికిపర్రు. 1932 శాసనోల్లంఘనంలో తన గ్రామంలోని సారాదుకాణం ముందు పికెటింగ్ చేశారు. పోలీసులు అరెస్టు చేసి, దూర ప్రాంతానికి తీసుకువెళ్ళి రాత్రివేళ విడిచిపెట్టారు.

## వెంకటపతిరాజు

తండ్రి నీలాద్రిరాజు. విజయవాడ తాలూకా మైలవరం వాస్తవ్యులు. ఇండియన్ యూనియన్‌లో హైదరాబాద్ స్టేట్‌ను విలీనం చేయాలనే ఉద్యమ సందర్భంగా 25-1-48 నుండి 8-4-48 వరకు వరంగల్ సెంట్రల్ జైలులో డిటెన్యూగా ఉన్నారు.

## వెంకటప్పరెడ్డి

విజయవాడ తాలూకా బొడ్డపాడు వాస్తవ్యులు. 1920-21 సహాయనిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. నాల్గు నెలల శిక్ష ననుభవించారు.

## శంకర హనుమంతరావు

తండ్రి రామయ్య. జన్మస్థలం విజయవాడ తాలూకా మూలపాడు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, 16-6-1930 నుంచి ఆరునెలల కఠిన శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## శనగవరపు సుబ్బయ్య



తండ్రి పల్లయ్య. విజయవాడ తాలూకా కొండూరు వాస్తవ్యులు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. 29-10-21 నుండి 9 నెలల శిక్షను రాజమండ్రి జైల్లో అనుభవించారు. తిరిగి ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నారు. 15-5-30 న 18 నెలల కఠినశిక్ష విధించబడింది. రాజమండ్రి మద్రాసు, అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒడంబడిక ననుసరించి 13-3-31 న విడుదలయ్యారు.

## శనగవరపు ఆంజనేయశాస్త్రి

జన్మస్థలం విజయవాడ తాలూకా కొండూరు. 1920-21 సహాయ నిరాకరణోద్యమంలో అరెస్టు అయి, 29-10-1921 నుంచి ఆరుమాసాల శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## సనకా నిత్యానందం



తండ్రి చెన్నయ్య. జన్మస్థలంగుంటూరు. నివాసం విజయవాడ తాలూకా కొండపల్లి. చిన్న వయస్సులోనే ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 3-7-1930 న రెండు ఏళ్ళు కఠినశిక్ష విధించారు. తంజావూరు బోర్స్టల్ స్కూలు, తంజావూరు, రాజమండ్రి జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ - ఇర్విన్ ఒప్పందంతో 11-3-1931 న విడుదలయ్యారు.

## సుంకర సత్యనారాయణ



తండ్రి రామచంద్రుడు. 23-3-1909 న విజయవాడ తాలూకా ఈడుపుగల్లులో జన్మించారు. రైతు. అభ్యుదయ కవి. గంపలగూడెం కుమార రాజా నాయకత్వంలో బెజవాడ నుండి చిన్నాపురం వెళ్ళిన ఉప్పు

సత్యాగ్రహ దళంలో సభ్యులు. 8-6-1930న, రెండు కేసులలో మొత్తం మూడు సంవత్సరాల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931 న విడుదలయ్యారు. రహస్య పత్రిక 'రెడీ'కొరియర్‌గా పని చేశారు. ఆంధ్ర రత్న భవనాన్ని పోలీసుల అధీనం నుంచి విముక్తం చేయడానికి జరిపిన సత్యాగ్రహంలో తీవ్రమైన లాఠీఛార్జీకి గురయ్యారు. 9-6-1932 నుంచి సంవత్సరం కఠిన శిక్ష విధించారు. తెలుగు దేశాన్ని ఉర్రూత లూగించిన జానపద గేయాలను, బుర్రకథలను రచించారు. వీటిలో 'కష్టజీవి' 'అల్లూరి సీతారామరాజు' బహుళ ప్రచారం పొందాయి. కీ॥శే॥ వాసిరెడ్డి భాస్కరరావుతో కలిసి, సర్వజన ప్రశంసలుపొందిన 'మాభూమి' 'ముందడుగు' వంటి నాటకాలను, 'పల్లెటూరు, పుట్టిల్లు'వంటి సినిమా కథలను రచించి ప్రజా కవిగా పేరు పొందారు. 9-9-1975 న కీర్తిశేషులయ్యారు.

## సుంకర వీరభద్రరావు



తండ్రి రామచంద్రుడు. విజయవాడ తాలూకా ఈడుప్పగల్లులో 24-11-1911 న జన్మించారు. ప్రస్తుత నివాసం తిరువూరు. రైతు. హిందీవిశారద. బాల్య దశలోనే స్వగ్రామంలోని పిల్లలను సమీకరించి, జాతీయ నాయకుల ఫొటోలు చేబూని వూరేగింపులు నిర్వహించారు. కొంత కాలం రహస్య పత్రిక 'రెడీ'కొరియర్‌గా పని చేశారు. 'ఆంధ్రరత్నభవన్'ను పోలీసుల అధీనం నుంచి విముక్తం చేయడానికి జరిపిన సత్యాగ్రహంలోను, 1932 శాసనోల్లంఘనంలోను మొత్తం అయిదు సార్లు తీవ్రమైన లాఠీఛార్జీలకు గురయ్యారు. గుంటూరులో రాజకీయమహాసభకు హాజరై 11రోజులు పోలీసుల కస్టడీలో వున్నారు. ఇచ్ఛాపురం నుంచి మద్రాసువెళ్ళిన రైతురక్షణ యాత్రలో పాల్గొన్నారు. 1938 లో తెలంగాణా సరిహద్దు గ్రామాలనుండి జరిపిన స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహాలకు సాయపడ్డారు. 1939 లో తిరువూరు తాలూకా తునికిపాడులో నిజామాంధ్ర రైతాంగ విద్యాలయాన్ని నిర్వహించారు. ఖమ్మం పట్టణంలో వుంటూ, నిజాం వ్యతిరేక ఉద్యమంలో పనిచేస్తూ, 1941 లో మధిరలో అరెస్టు అయ్యారు. 1942లో 6 మాసాలు శిక్ష విధింపబడింది. వరంగల్ సెంట్రల్‌జైలులో మొత్తం 10 నెలలు శిక్ష అనుభవించారు. 1940 నుంచి కమ్యూనిస్టు. తిరువూరు తాలూకా కమ్యూనిస్టుసమితి కార్యదర్శిగా పని చేశారు.

## సుంకర సుబ్బారావు



తండ్రి రామచంద్రుడు. జననం 1914. విజయవాడ తాలూకా ఈడుప్పగల్లు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో కరపత్రాలు పంచుతూ, లాఠీఛార్జీకి గురయ్యారు. 1931 లో విదేశీ వస్త్రాలయాల ముందు పికెటింగ్ చేస్తూ లాఠీ దెబ్బలు తిన్నారు. 1932 శాసనోల్లంఘనంలో అరెస్టు అయి, ఆరు నెలల కఠిన శిక్ష అనుభవించారు. విజయవాడ తాలూకా కోర్టు ఆక్రమణ ప్రయత్నంలో కోర్టులో చొరబడి స్వాతంత్ర్య నినాదాలుచేస్తూ, కరపత్రాలు వెదజల్లి, అరెస్టు అయ్యారు. మునగాల జమీందారుకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో పాల్గొన్నారు.

## సుంకర వెంకటసుబ్బారావు



తండ్రి కోటయ్య జననం 1-7-1909 విజయవాడ తాలూకా ఈడుప్పగల్లు. రైతు. మంచి క్రీడాకారుడు. విద్యార్థి దశలోనే జాతీయోద్యమంలోకి దుమికిన యోధుడు. బందరు కోనేరు సెంటరులో జెండావీరుడు తోట

నరసయ్యతో పాటు తీవ్రమైన లాఠీ దెబ్బలు తిని, రక్తం కక్కారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనగా, 14-6-1930 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి జైళ్ళలో శిక్ష అనుభవించారు. పోలీసుల ఆక్రమణ నుంచి విజయవాడ ఆంధ్ర రత్నభవనాన్ని విముక్తం చేయడానికి జరిపిన సత్యాగ్రహంలో తీవ్రమైన లాఠీఛార్జికి గురయ్యారు. 10-8-1932న సంవత్సరంపాటు కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, వెల్లెస్లీ శానిటోరియమ్, బళ్ళారి జైళ్ళలో శిక్ష అనుభవించారు. జైలులో క్షయవ్యాధి పీడితులై, విడుదలైన కొద్దిరోజులకే 1935 లో కీర్తిశేషులయ్యారు.

## సుంకర బలరామకృష్ణయ్య

స్వగ్రామం విజయవాడ తాలూకా ఈడ్పుగల్లు. 1932 శాసనోల్లంఘనంలో లాఠీఛార్జికి గురయ్యారు.

## సుంకర సుబ్బారావు

తండ్రి కుమారస్వామి. విజయవాడ తాలూకా వణుకూరు వాస్తవ్యులు. రైతు. క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంగా 21-3-44నుండి మూడు నెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు.

## సూరంపూడి వెంకటరత్నం

తండ్రి వెంకటసుబ్బయ్య. విజయవాడ తాలూకా గుంటుపల్లి వాస్తవ్యులు. క్విట్ఇండియా ఉద్యమంలో పాల్గొని 3 నెలల కఠినశిక్షను అలీపురం క్యాంప్ జైలులో 29-3-45 నుండి అనుభవించారు.

## కడియాల పిచ్చయ్య



తండ్రి శ్రీరాములు. జన్మస్థలం గన్నవరం తాలూకా కాటూరు. రైతు. చిన్న వయస్సులోనే జాతీయోద్యమంలోకి దూకారు. ఉప్పు సత్యాగ్రహ కాలంలో స్వగ్రామంలో బాలలకు నాయకత్వం వహించి, తాటి గెలలు నరికే కార్యక్రమం నిర్వహించారు. విజయవాడలోని ఆంధ్రరత్న భవనాన్ని పోలీస్ ఆక్రమణ నుంచి విముక్తం చేయడానికి జరిపిన సత్యాగ్రహంలో పాల్గొని, లాఠీఛార్జికి గురయ్యారు. 3-12-1932 న సంవత్సరం ఆరు వారాల కఠినశిక్ష విధించారు. రాజమండ్రి జైలులో శిక్ష అనుభవించారు. 13-6-1933 న విడుదలయ్యారు. అనంతరం కమ్యూనిస్టు పార్టీలో చేరారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## కడియాల కాశీవిశ్వనాథం



జననం 24-10-1917 గన్నవరం తాలూకా కాటూరు. ప్రస్తుతం విజయవాడ నివాసి. బాల్యం నుండి జాతీయోద్యమ ప్రభావానికి గురి అయ్యారు. 1937 లో ఎన్నికల్లో కాంగ్రెస్ అభ్యర్థుల విజయానికి కృషి చేశారు. యువజన, రైతు ఉద్యమాలలో కార్యకర్తగా ఉన్నారు. యుద్ధ కాలంలో సబ్ జైలులో ఉన్నారు. తర్వాత రహస్య జీవితం గడిపారు. భారతదేశంలో నైజాంను విలీనం చేయాలనే ఉద్యమానికి సాయపడ్డారు.

## కడియాల కోటేశ్వరరావు



తండ్రి శ్రీరాములు. జననం 16-1-1920. గన్నవరం తాలూకా కాటూరు. ప్రస్తుత నివాసం విజయవాడ. బాల్యం నుండి స్వాతంత్ర్య ఉద్యమంతో సంబంధం వుంది. 1932 లో ఆంగ్ల విద్యకు స్వస్తి చెప్పారు. 1937 ఎన్నికల్లో కాంగ్రెస్ అభ్యర్థుల విజయానికి కృషి చేశారు. యుద్ధ కాలంలో "స్వతంత్ర భారత్" పత్రికను గన్నవరం తాలూకాలో పంపిణీ బాధ్యతను స్వీకరించారు. 41 లోను 42 లోను అరెస్టయి సబ్ జైలులో ఉన్నారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. కొన్నాళ్ల

రహస్య జీవితం గడిపారు. యువజన, రైతు కార్మిక సంఘాల్లోపనిచేశారు. 1945 విశాఖ జిల్లాలో కరువు బాధితులకు సహాయకంగా వలంటీరుగా పనిచేశారు.

## వెలిదండ్ల హనుమంతరావు



తండ్రి దాసయ్య పంతులు. జననం 1899. గుడివాడ. మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో పట్టభద్రులై మెడికల్ కాలేజీలో చేరారు. బెజవాడలో వైద్యవృత్తి ప్రారంభించి 1922–30 మధ్య కాలంలో ప్రముఖ డాక్టరుగా ప్రసిద్ధి చెందారు. ఉప్పు సత్యాగ్రహంలో బెజవాడనుంచి బయలుదేరిన రెండవ దళానికి నాయకత్వం వహించారు. 26–5–1930న బెజవాడ జాయింట్ మేజిస్ట్రేట్ సంవత్సరం ఆరుమాసాలు కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, వెల్లూరుజైళ్ళలోశిక్ష అనుభవించారు. రాజమండ్రి జైలులో 15–6–1930న తీవ్రమైన లాఠీఛార్జీకి గురయ్యారు. ఆ లాఠీ దెబ్బల వల్ల ఆరోగ్యం క్షీణించి, క్షయవ్యాధిగ్రస్తులైనారు. గాంధీ – ఇర్విన్ ఒప్పందంతో 12–3–1931 న విడుదలయ్యారు. క్షయవ్యాధితో 21.12–1931 న మైసూరు శానిటోరియమ్‌లో కన్నుమూశారు. ఈ త్యాగమూర్తి పేరిట విజయవాడలో మున్సిపల్ కమర్షియల్ కాంప్లెక్స్, ఒక గ్రంథాలయభవనం వెలిశాయి.

## గెల్లి రాజగోపాలం



తండ్రి నరసయ్య. విజయవాడలో 27–3–1911లో జన్మించారు వ్యాపారి. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 26–6–30న 18 నెలలు కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, కోయంబత్తూరు, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ–ఇర్విన్ ఒప్పందంతో 13–3–1931 న విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలోపాల్గొని ప్రభుత్వ నిషేధాలను ధిక్కరిస్తూ బహిరంగసభ జరిపి6–1–32న తీవ్రమైన లాఠీఛార్జికి గురయ్యారు. ఆ ఉద్యమంలో పాల్గొన్న కారణంపై. 4–5–1932 న సంవత్సరం కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, కడలూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. స్వాతంత్ర్య సమరయోధులు వెలిదండ్ల హనుమంతరావు పేరిట స్థాపితమైన లైబ్రరీ నిర్మాతలలో ఒకరు. 21–12–1977 న కీర్తిశేషులయ్యారు.

## డాక్టర్ తెన్నేటి వెంకట శేషాచలపతిరావు



1911 అక్టోబర్ 15న విజయవాడ తాలూకా తెన్నేరులో జన్మించారు. తండ్రి రామచంద్రయ్య పంతులు. విద్యార్థిగా ఉన్నపుడే 1929 లో రాయపురం మెడికల్ హాస్టల్‌లో విదేశవస్త్ర బహిష్కరణలో పాల్గొన్నారు. ప్రభుత్వం రూపాయి న్నర జరిమానా విధించింది. కాంగ్రెస్ నాయకుల అరెస్టుకు నిరసనగా 1942ఆగస్టులో మున్సిపల్ కౌన్సిలర్ సభ్యత్వానికి రాజీనామాచేశారు. క్విట్ఇండియాఉద్యమ కాలంలో "కాంగ్రెస్" అనే రహస్యపత్రిక నడపడానికి, రాష్ట్రమంతా పంచడానికి సహాయపడ్డారు. "అండర్ గ్రౌండ్ వర్క్" చేశారు. బొంబాయినుండి వచ్చే రహస్య పత్రికల పంపిణీ ఆర్థిక కమిటీకి బాధ్యత వహించారు. నాటుబాంబులను, డైనమైట్లను కాంగ్రెస్ వర్కర్లకు సప్లయి చేశారు. కార్యకర్తలకు ఆర్థిక సహాయం చేశారు. రెండుసార్లు మున్సిపల్ ఛైర్మన్‌గా పనిచేశారు. 1962–67 లో విజయవాడ నుండి శాసన సభ్యులు - కీర్తిశేషులు.

## పొదర్తి సుందరమ్మ



తండ్రి మద్ది లక్ష్మీనరసింహం. జననం 21-12-1902. గుంటూరు జిల్లా బ్రాహ్మణ కోడూరు. భర్త వెంకటసుబ్బయ్య. విజయవాడలో ఖాదీ ప్రచారం విదేశీ వస్తు బహిష్కరణ పెద్ద ఎత్తున సాగించారు. సత్యాగ్రహోద్యమాలలోకి స్త్రీలను హెచ్చు సంఖ్యలో సమీకరించడంలో ప్రత్యేక శ్రద్ధ వహించారు. ఉప్పుసత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. 26-8-1930 న ఆరు నెలలు కఠినశిక్ష విధించగా వెల్లూరు జైలులో శిక్ష అనుభవించారు. 1931 లో గాంధీజీ, తదితర జాతీయ నాయకుల అరెస్టుకు నిరసనగా సమ్మె చేయాలని గుంటూరు ఎ.సి. కాలేజీ విద్యార్థులను ఉద్బోధించినందుకు గుంటూరు సబ్ జైలులో 17 రోజులు శిక్ష అనుభవించారు. మద్రాసు, నాగపూర్ కాంగ్రెసు మహాసభలకు హాజరయ్యారు. శాసనోల్లంఘనంలో అరెస్టు అయ్యారు. 2-2-1932 న ఏడున్నర మాసాల కఠినశిక్ష, రు. 500/-లు జరిమానా విధించారు. జరిమానా చెల్లించలేదు. గాంధీజీ ఆదేశం మేరకు విజయవాడలో స్వదేశీ వస్తు విక్రయశాలను స్థాపించారు. విజయవాడలో బాలికల ఉన్నత పాఠశాలను కూడా స్థాపించారు. ప్రస్తుత నివాసం గుంటూరు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘ సభ్యురాలుగాను, పట్టణ కాంగ్రెస్ కార్యనిర్వాహక వర్గ సభ్యురాలుగాను, జిల్లా కాంగ్రెసు సంఘ సభ్యురాలుగాను పనిచేశారు. హరిజన హాస్టల్ పాలక సంఘ సభ్యురాలుగాను, స్థానిక మహిళా సంఘ సభ్యురాలుగాను సేవచేశారు.

## జంధ్యాల వెంకట పూర్ణయ్యశాస్త్రి

తండ్రి వెంకటశాస్త్రి. జననం 19-5-1907. గన్నవరం తాలూకా చినఓగిరాల. నివాసం విజయవాడ. ఎస్.ఎస్.ఎల్.సి. వరకూ చదివారు. వైద్యులు. ఉప్పుసత్యాగ్రహంలో అరెస్టు అయి, రాజమండ్రి జైలులో 9 మాసాలు కఠినశిక్ష అనుభవించారు. విజయవాడ పట్టణ కాంగ్రెసు కార్యదర్శిగా పని చేశారు.

## ఏటుకూరు బలరామమూర్తి



తండ్రి సీతారామయ్య, 23-8-1918 న గుంటూరు జిల్లా ఏటుకూరు గ్రామంలో జన్మించారు. 1937లో ఎ.సి. కాలేజీలో బి.ఎ. పాసై రెండేళ్ళు ఆర్. యం. యస్. సర్వీసులో ఉద్యోగం చేశారు. ఉద్యోగం చెస్తూనే స్వతంత్ర భారత్ పత్రిక రవాణా, ప్రచారం చేశారు. ప్రభుత్వ నిర్బంధ విధానికి గురియై 1940 లో ప్రభుత్వ ఉద్యోగం వదిలివేసి, కమ్యూనిస్టు పార్టీలో పూర్తికాలం కార్యకర్తగా చేరారు. 1952-72 వరకూ విశాలాంధ్ర దినపత్రిక సంపాదకులు. 1972 నుంచి నేటివరకూ విశాలాంధ్ర ప్రచురణాలయం సంపాదకులుగా వుంటున్నారు. వీరి అభిమాన విషయం-మార్క్సిస్టు సిద్ధాంతం, భారతీయ చరిత్ర, తత్వశాస్త్రాలు. మంచి రచయిత. పెక్కు చారిత్రక, తాత్విక, సాహిత్య వ్యాసాలు రచించారు. వీరి ప్రధాన గ్రంథాలు-ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర (రష్యన్ భాషలోకి అనువదింపబడింది), భారతీయ తత్వశాస్త్రం, మన చరిత్ర.

## వేములపల్లి హనుమంతరావు



తండ్రి సుబ్బయ్య. 1931 న గుడివాడ తాలూకా పెదమద్దాలి గ్రామంలో జననం. ఎఫ్.ఏ వరకూ చదివారు. 1913 లో ఖద్దరు ధరించి గుడివాడ విద్యార్థుల సమ్మెకు నాయ

కత్వం వహించగా, వీరిని పోలీసులు కొట్టి చొక్కా-చించివేశారు. ఆ ఏడాదే మిత్రులతో కలసి గుడివాడ డెప్యూటీ కలెక్టర్ ఆఫీసుకు నిప్పుపెట్టారు. టెలిఫోన్ తీగలు తెంచివేశారు. 1935-36 లలో వీరు ఏలూరులో కాంగ్రెస్ సోషలిస్టులతో కలిసి వివిధ కార్మిక, యువజన సంఘాల నిర్మాణంలో పాల్గొన్నారు. పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ నాయకత్వాన మునగాల జమీందారీ వ్యతిరేక రైతు పోరాటంలో పాల్గొన్నారు. 1937 లో వీరు మద్రాసులో మేరీ అనే ఒక తమిళ క్రిస్టియన్ టీచరును పెళ్ళి చేసుకున్నారు. సంస్కర్త. మూఢ నమ్మకాలకు వ్యతిరేకి. హరిజన దేవాలయ ప్రవేశం జరిపించారు. 1939 న మద్రాసు వెళ్ళి అక్కడ కామ్రేడ్సుతో కలిసి ఇంగ్లీషు, తమిళ భాషలలో "కమ్యూనిస్టు" అనే పత్రికను రహస్యంగా నడిపారు. మద్రాసు కమ్యూనిస్టు కుట్రకేసులో 4 ఏండ్లు శిక్ష విధించారు. మద్రాసు నుంచి బళ్ళారి సెంట్రల్ జైలుకు బదిలీ చేస్తుండగా వీరు రైలులోంచి దూకి పారిపోయారు. మొదటి భార్య చనిపోగా 1944 లో వితంతువైన విమలాదేవిగారిని పెళ్ళి చేసుకున్నారు. 1947 లో రాయవెల్లూరు జైలులో డిటెన్యూగా వున్నారు. 1949 తెలంగాణా రైతు పోరాటంలో అరెస్టు చేశారు. జైలుతిండి, నిరాహారదీక్ష, లాఠీఛార్జీల వల్ల క్షయ వ్యాధికి గురయ్యారు. వీరు మొత్తం 6 ఏళ్ళు జైలు జీవితమూ, 6 ఏళ్ళు రహస్య జీవితమూ గడిపారు.

## తాడిపత్రి శ్రీకృష్ణారావు



తండ్రి వెంకటరత్నం. జననం 1924. గుంటూరు జిల్లా, తెనాలితాలూకా క్రాప గ్రామ వాస్తవ్యులు. జాతీయోద్యమలో పని చేశారు. 26 జనవరి 1943 న స్వాతంత్ర్య దినోత్సవ సందర్భాన ఊరేగింపు జరపగా అరెస్టు చేశారు. తెనాలి సబ్ మేజిస్ట్రేటుచే డి.ఐ.ఆర్ క్రింద ఆరు మాసాలు కఠిన శిక్ష విధించి, ఆలీపురం జైలుకు పంపబడారు. విడుదల అనంతరం కూడా స్వాతంత్ర్య ఉద్యమంలో పనిచేశారు. విజయవాడలో వుంటున్నారు.

## కాశీనాథుని కాళహస్తి లింగయ్య

తండ్రి వీరన్నయ్యశాస్త్రి. జన్మస్థలం గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా పెదపులివర్రు. ఉప్పుసత్యాగ్రహ దళ సభ్యులకు తన ఇంటిలో అన్నం పెట్టినందుకు రేపల్లె మేజిస్ట్రేటు కోర్టులో ఆరు నెలల కఠిన శిక్ష విధించారు. క్షమాపణ పత్రంపై సంతకం చేసే జైలుశిక్ష రద్దుచేస్తానని మేజిస్ట్రేట్ చేసిన సూచనను తిరస్కరించారు. 1930 ఆగస్టు 13 నుంచి మరో మాసం కఠిన శిక్షను రాజమండ్రి, అలీపురం జైళ్ళలో అనుభవించారు.

## మంతెన వెంకటరామరాజు



తండ్రి బాపిరాజు. జన్మస్థలం గుంటూరు జిల్లా బాపట్లతాలూకా ఖాజీపాలెం. రైతు. నివాసం విజయవాడ. 1932 శాసనోల్లంఘనంలో అరెస్టు అయి, ఆరు మాసాలు కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు.

## కేశిరెడ్డి సూర్యనారాయణ

తండ్రి అప్పన్న. జన్మస్థలం విజయవాడ. వ్యాపారి. శాసనోల్లంఘనంలో రెండుసార్లు లాఠీఛార్జీకి గురయ్యారు. 4-5-1932 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, 7-1-1941 నుంచి అయిదు వారాలు జైలు శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. 23-8-1970 న కీర్తిశేషులయ్యారు.

# మొగల్రాజపురం

## కాట్రగడ్డ రామసీతమ్మ



తండ్రి నూతక్కి కొండల నాయుడు. జననం 1883. గుంటూరు తాలూకా మందడం. భర్త కాట్రగడ్డ నరసయ్య. సంతానం కలుగనందున కాట్రగడ్డ మధుసూదనరావును దత్తత చేసుకొన్నారు. దత్తత కుమారునితోపాటు స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నారు. 1932 శాసనోల్లంఘనంలో పోలీసు లాఠీఛార్జీలకు గురై గాయపడిన స్వాతంత్ర్య సమరయోధులకు తన ఇంట్లో ఆశ్రయమిచ్చి సేవ చేసినందుకు 28-1-1932 న సంవత్సరం కఠిన శిక్ష, రు. 400/- జరిమానా విధించారు. జరిమానా చెల్లించ నిరాకరించినందున ఇంట్లో సామాను మొత్తం చివరకు అట్లపెనముతో సహా వేలం వేశారు జరిమానా మొత్తం రాలేదని చేతిగాజులు కూడా లాగుకొన్నారు. వెల్లూరు జైలులో శిక్ష అనుభవిస్తూ, పక్షవాతానికి గురయ్యారు. బ్రతుకుందనే ఆశలేక మూడు రోజులు శవాల గదిలోనే పడవేసి వుంచారు. అనంతరం కోలుకొని, జైలుశిక్ష పూర్తిగా అనుభవించి విడుదలయ్యారు. హరిజన నిధికి బంగారు గాజులు, ఉంగరంతో సహా రు 1300/-లు నగదును గాంధీజీకి స్వయంగా సమర్పించారు. 1933 లో దత్తత పుత్రుడు మధుసూదనరావు హరిజన, సవర్ణ సహపంక్తి భోజనాలను ఏర్పాటుచేసినప్పుడు బంధువుల బహిష్కారాన్ని లక్ష్యపెట్టక దత్తత కుమారుని పక్షాన ధైర్యంగా నిలబడ్డారు. దేశభక్తి, గల ఆదర్శ మహిళగా 4-9-1973 న కీర్తిశేషులైరి.

## కాట్రగడ్డ రఘురామయ్య



తండ్రి గంగయ్య జన్మస్థలం విజయవాడ మొగల్రాజపురం. జాతీయకుటుంబానికి పట్టుగొమ్మయైన కాట్రగడ్డ వారి కుటుంబంలో జన్మించారు నెహ్రూకమిటీ గుంటూరు రాక సందర్భంలో అరెస్టు అయ్యారు. మూడురోజులు రిమాండ్‌లో వుంచారు. రూ. 15/- జరిమానా విధించారు. టోల్‌గేట్ పన్నుకు వ్యతిరేకంగా ప్రభుత్వంతో పోరాడారు. అభ్యుదయ ఉద్యమాలకు అండగా నిలబడ్డారు. లయోలా కాలేజీ వంటి విద్యాసంస్థల స్థాపనకు సహాయపడ్డారు.

## కాట్రగడ్డ మధుసూదనరావు



దత్తత తండ్రి నరసయ్య. జనక తండ్రి గంగయ్య. 15-8-1902 విజయవాడ శివారు మొగల్రాజపురంలో జన్మించారు. రైతు. జాతీయోద్యమంలో ప్రముఖపాత్ర వహించిన కాట్రగడ్డవారి కుటుంబంలో జన్మించారు. పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ నిర్మాణంలో ముఖ్యమైన పాత్ర వహించారు. సత్యాగ్రహుల శిబిరాలను నిర్వహించారు. ఈడుపుగల్లులో సేవాశ్రమం స్థాపించి దానిని నిర్వహించారు. సంఘ సేవకులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 28-5-1930 న సంవత్సరన్నర కఠినశిక్ష విధించారు. రాజమండ్రి, వెల్లూరు, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 13-3-1931 న విడుదలయ్యారు. తిరిగి శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు 9-1-1932 న

సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, బళ్ళారి, మదురై జైళ్ళలో శిక్ష అనుభవించారు. 6-1-1933 న విడుదలయ్యారు. ఆదినుంచి అతివాద, అభ్యుదయ ఉద్యమాలకి బాసటగా నిలిచారు. చాలా కాలం పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ కార్యదర్శిగా పనిచేశారు. స్వాతంత్ర్య సమరంలో చేసిన సేవలకు కేంద్ర ప్రభుత్వం జారీచేసిన "తామ్రపత్ర" గ్రహీత. కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం అధ్యక్షులు.

## కాట్రగడ్డ భవానీ శంకరరావు



తండ్రిగంగయ్య. జన్మస్థలం విజయవాడ శివారు మొగల్రాజపురం. రైతు. జాతీయోద్యమానికి పట్టుగొమ్మయైన కాట్రగడ్డ సోదరులలో ఒకరు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 2-7-1930 న సంవత్సరం కఠిన శిక్ష, రు. 80/- జరిమానా విధించారు. రాజమండ్రి, తిరుచునాపల్లి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందంతో 14-3-1931 న విడుదలయ్యారు. కీర్తిశేషులయ్యారు.

## కాట్రగడ్డ వెంకట నారాయణరావు



తండ్రి గంగయ్య. జననం 1907. విజయవాడ శివారు మొగల్రాజపురం. బెనారస్ యూనివర్శిటీలో ఉన్నత విద్యాభ్యాసం, ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొనగా 7-6-30 న 18 నెలల కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, కోరాపుట్ జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1932 లో బెనారస్ దశాశ్వమేధ్ ఘాట్ వద్ద జరిగిన లాఠీచార్జిలో గాయపడ్డారు. అనంతరం ఆంధ్రప్రాంతంలో శాసనోల్లంఘనంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. 16-3-1932 న సంవత్సరం కఠిన శిక్ష, రు 500/- జరిమానా విధించారు. రాజమండ్రి, కన్ననూరు జైళ్ళలో శిక్ష అనుభవించారు. 1937 లో మద్రాసు శాసనసభకు ఎన్నికయ్యారు. ఆంధ్రరాష్ట్ర యువజనసంఘం అధ్యక్షులుగా పనిచేశారు. మునగాల రైతు ఉద్యమంలో పాల్గొన్నారు. ఆదినుంచి కమ్యూనిస్టు ఉద్యమాభిమాని. సమాజంలో అట్టడుగు వర్గాల ఉన్నతికి ఇండిపెండెంట్‌గా వామపక్షాల సహకారంతో కృషిచేస్తున్నారు.

## కాట్రగడ్డ శ్రీనివాసరావు



తండ్రి గంగయ్య. చలనచిత్ర పరిశ్రమ ప్రముఖులు. విజయవాడ వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. రెండుసార్లు లాఠీచార్జికి గురి అయ్యారు. లోధియన్ కమిటీ రాక సందర్భంగా విజయవాడ రైల్వే స్టేషన్‌లో నల్ల జెండాలు చూపారు. గాంధీ జన్మదినోత్సవం సందర్భంగా ఊరేగింపు జరుపుతుండగా రవీస్ కాల్వ వంతెనపై లాఠీచార్జీకి గురిఅయ్యారు. 1932లో ఢిల్లీ రహస్య ఐ.సి.సి. సమావేశానికి హాజరై తిరిగి వస్తుండగా పోలీసులు అరెస్టు చేసి సబ్‌జైల్‌లో ఉంచారు. రాజ్యసభ సభ్యులుగా ఉన్నారు. భారత - జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్ మైత్రి పెంపుదల కృషికి గాను జి. డి. ఆర్. బంగారు పతకం పొందారు.



# ఉద్యమంలో పాల్గొన్న మరికొందరు

## కూచిభొట్ల సీతారామశర్మ

తండ్రి రామకృష్ణశాస్త్రి. విజయవాడలో 13-2-14న జన్మించారు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నందుకు 21-6-30 న రెండేళ్ళ కఠిన శిక్ష విధించబడింది. బోర్‌స్టల్ జైలులోను, రాజమండ్రి సెంట్రల్ జైలు లోను శిక్షను అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒడం బడిక ననుసరించి 1931 మార్చిలో విడుదలయ్యారు.

## మండవ నాగభూషయ్య



కృష్ణా జిల్లా దివి తాలూకా నాగయలంక గ్రామంలో1912లో జన్మించారు. తండ్రి పిచ్చయ్య. 1929 నుండి కాంగ్రెసు సభ్యుడుగా వుండి జాతీయోద్యమాలలో పని చేశారు. ఆంధ్రపత్రికను ఆంగ్ల ప్రభుత్వం నిషేధించి నపుడు ఈయన, మరికొందరు కలిసి తెనాలి తాలూకా కఠివరం వద్ద రైల్వే టెలిగ్రామ్ తీగెలను నరికి వేశారు.

1930 లో ఈయన, ఉప్పల పూర్ణయ్య నాగాయలంకలో కాంగ్రెసు జెండాను ప్రభుత్వ నిషేధాజ్ఞను ఉల్లంఘించి కట్టారు. అందువల్ల ఆంగ్ల ప్రభుత్వం ఈయనమీద ఆరుమాసాల వరకు గ్రామం విడచి బయటకు వెళ్ళటానికి వీలులేదని నిషేధాజ్ఞను జారీ చేసింది.

1932 ప్రాంతంలో చీరాలలోనూ, తెనాలిలోనూ విదేశీ వస్త్రముల దుకాణాలవద్ద పికెటింగు చేశారు. హరిజనోద్యమంలో కూడ పని చేశారు.

## గుత్తావారి ఆదర్శ కుటుంబం

గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా గుత్తావారి పాలెం వాస్తవ్యులు గుత్తా చలమయ్య, రామా నుజయ్య, వీరరాఘవయ్య, శ్రీమతి సుందరమ్మగార్లు 1932 సత్యాగ్రహ ఉద్యమంలోను, 1942 క్విట్ ఇండియా ఉద్యమంలోను పాల్గొన్నారు. వీరంతా ఒకే కుటుంబ సభ్యులు. మంచి వ్యవసాయదారులు. వారి గృహం జాతీయవాదులందరికీ ఒక సత్రంగా ఉండేది.

వీరి కుటుంబ సభ్యులు 1939 నుండి సంప్రదాయ పద్ధతులనుఎదిరించిసంస్కరణవివాహాలను గావించారు. కులాంతర, మతాంతర, దేశాంతర(చైనా) వివాహాలు గావించుకొన్నారు. బ్రాహ్మణులతో, హరిజనులతో, క్రిస్టియనతో. దేవదాసిలతో, తదితర కులాలవారితో వియ్యమందారు. వీరి ఆడపడచు హలం చైనా యువ కుణ్ణి వివాహమాడింది.

## కోడంచ నారాయణరావు



బందరులో స్థిరపడ్డ. కన్నడిగులు. జననం 1893. మరణం 1976.

1925-26 ప్రాంతంలో బందరులో హోటల్ పెట్టారు. 1930 జనవరిలో స్వాతంత్ర్య సమరానికి దేశం సన్నద్ధ మౌతున్న సమయంలో, మద్రాసు రాష్ట్ర గవర్నర్ బందరు వచ్చాడు. గవర్నర్ రాకకు నిరసనగా శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య తదితర స్వాతంత్ర్య సమరయోధులు అనేకమంది నల్ల జెండాలతో "గో బాక్ గవర్నర్" అంటూ నినాదాలిచ్చి నిరసన ప్రదర్శన చేశారు. వారందరినీ పోలీసులు నిర్బంధించారు. ఆ రోజుల్లో కాంగ్రెస్ ఖైదీలకు ఆహారం ఇవ్వకూడదని ప్రభుత్వం బెదరించుతున్నప్పటికీ లెక్కచేయకుండా, కేసు పూరి అయి శిక్ష విధించేవరకూ వారికి భోజనం, ఫలహారం తదితర సదుపాయాలు కలుగచేశారు నారాయణరావుగారు. ఆనాటినుండి జీవితాంతం ఆయన ఖద్దరు ధరించారు. గాంధీటోపీ పెట్టుకొనేవారు. ఆ విధంగా తన దేశ భక్తిని ప్రదర్శించిన నారాయణరావుగారిని డాక్టర్ పట్టాభిసీతారామయ్య మున్నగు నాయకులు ప్రశంసించేవారు.

## కాట్రగడ్డ పిచ్చయ్య



తండ్రి గంగయ్య జననం 1898లో విజయవాడ శివారు మొగల్రాజపురం స్వాతంత్ర్యోద్యమానికి అనేకవిధాల అండదండగా పని చేసినందుకు, బ్రిటీషు ప్రభుత్వం తుపాకీ లైసెన్సు రద్దు చేసింది. 1934, 1940 లలో పిచ్చయ్యగారు మున్సిపల్ కౌన్సిల్‌కు ఎన్నికయ్యారు. 1965లో కీర్తిశేషులైరి.

## కాట్రగడ్డ గంగయ్య



తండ్రి పిచ్చయ్య. జననం 1927. విజయవాడ శివారు మొగల్రాజపురం. జాతీయ కుటుంబంగా పేరొందిన కాట్రగడ్డ కుటుంబంలో జన్మించి క్విట్ ఇండియా ఉద్యమంలో మద్రాసు లయోలా విద్యార్థుల సమ్మెలో పాల్గొన్నారు. అనంతరం గిండి ఇంజనీరింగ్ కాలేజీలో చేరి, యూనియన్ పతాకావిష్కరణకు వ్యతిరేకంగా జరిపిన అసమ్మతి ప్రదర్శనలో ప్రముఖ పాత్రవహించారు. 1946లో వియత్నామ్ స్వాతంత్ర్య పోరాటానికి సంఘీ భావంగా మద్రాసులో జరిగిన విద్యార్థి ప్రదర్శనలో పాల్గొని,లాఠీ చార్జికి గురి అయ్యారు.ఉదయం అరెస్టు చేసి, సాయంత్రం వదిలేశారు. తూర్పు జర్మనీలో ఉన్నత విద్య నభ్యసించారు. ఇండో - జి. డి. ఆర్. స్నేహ సంఘం ప్రధాన కార్యదర్శిగా పని చేశారు. ప్రస్తుత నివాసం కాకినాడ.

## పిన్నమనేని పున్నయ్య



తండ్రి వెంకయ్య. విజయవాడ తాలూకా నెప్పల్లి గ్రామ వాస్తవ్యులు. తాలూకా బోర్డు వైస్ ప్రెసిడెంటుగా చాలాకాలం పనిచేశారు 14-4-1930 న ఉప్పు సత్యాగ్రహానికై వెళుతున్న పశ్చిమ కృష్ణాజిల్లా మొదటి దళాన్ని నెప్పల్లి గ్రామంలో సన్మానించి, వారి స్వగృహంలో వారికి భోజనాలు ఏర్పాటు చేసినందుకుగాను, బ్రిటిష్ ప్రభుత్వం వీరి తుపాకి లైసెన్సు రద్దుచేసి తుపాకి లాక్కున్నది.

## యలమంచిలి వెంకటప్పయ్య



తండ్రి అంకప్ప. జననం 2-2-1900 గుడివాడ తాలూకా కనుమూరు. హిందీ సాహిత్య రత్న. ప్రస్తుత నివాసం విజయవాడ. హైస్కూలు విద్యార్థిగావున్న రోజులలో సహాయ నిరాకరణ కాలంలో కాలవగట్టు పాటలకు వ్యతిరేకంగా ప్రచారం చేసి, అరెస్టు అయి, ఆరు మాసాలు కఠిన శిక్షను రాజమండ్రి జైలులో అనుభవించారు. ఉప్పు సత్యాగ్రహం అరెస్టు అయ్యారు. 11-5 1930న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. గుంటూరు జిల్లా రేపల్లె తాలూకాలో శాసనోల్లంఘన కాలంలో పోలీసు నిఘావుండటం వల్ల, పోలీసులు ఎవరినీ భోజనం పెట్టనివ్వకుండా చేసినందున నాలుగు మాసాల పాటు గ్రామ గ్రామాన తిరుగుతూ ఇంటింటికి పోయి ముద్ద చొప్పున మాదాకవళం సేకరిస్తూ,స్వాతంత్ర్య

సందేశం వ్యాపింప చేశారు. మైనేనివారిపాలెంలో కల్లు పాకల ముందు పికెటింగ్ చేయగా, వివస్త్ర కావించి, పోలీసులు తీవ్రమైన లాఠీ ఛార్జీ జరపగా కొన్ని గంటలపాటు స్పృహతప్పిపోయారు. 29-3-1932 నుంచి ఆరు మాసాలు కఠిన శిక్షను రాజమండ్రి జైల్లో అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో సంవత్సరం కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు. 1929-65 మధ్యకాలంలో హిందీ ప్రచారం విస్తృతంగా చేశారు. గుంటూరుజిల్లా పర్యటనలో గాంధీజీ ప్రసంగాలను తెలుగులోకి అనువదించారు. హిందీలోనూ, తెలుగులోనూ రచనలు చేశారు.

## యలమంచిలి బసవమ్మదేవి



భర్త వెంకటప్పయ్య. తండ్రి బొబ్బా బసవయ్య. జననం 1916 గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా మైనేనివారిపాలెం. హిందీ ప్రచారం శాసనోల్లంఘనంలో భర్తతోపాటు పాల్గొని, 16-1-1932 నుంచి ఆరు మాసాలు కఠిన శిక్షను వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు. 1976 ఫిబ్రవరిలో కీర్తిశేషులైరి.

## బొబ్బా సత్యనారాయణరావు



తండ్రి బసవయ్య. జన్మస్థలం దివితాలూకా యడ్లంకలో జననం. యలమంచిలి వెంకటప్పయ్యగారి బావమరిది. హిందీ సాహిత్య రత్న. కృష్ణాజిల్లాలో ఉపాధ్యాయులుగా పని చేశారు. క్విట్ ఇండియా ఉద్యమంలో 31-12-1942న అరెస్టు అయి, 9 నెలల కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు. 1948 లో కీర్తిశేషులైరి.

## కొత్తపల్లి వెంకటకృష్ణవర్మ



తండ్రి లక్ష్మినారాయణ. జన్మస్థలం గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా మైనేనివారిపాలెం. యలమంచిలి వెంకటప్పయ్య గారి బావమరిది. ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టు అయ్యారు. 9-7-1930 న సంవత్సరం కఠిన శిక్ష విధించారు. రాజమండ్రి, అలీపురం జైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒప్పందంపై 13-3-31న విడుదలయ్యారు. తిరిగి 1932 శాసనోల్లంఘనంలో ఆరు మాసాలు కఠిన శిక్ష అనుభవించారు. వెంకటప్పయ్యగారితోపాటు రెండు సార్లు లాఠీఛార్జీకి గురై, నాలుగు మాసాలు గ్రామాలలో పూదా కవళం అడుగుతూ తిరిగాడు.

## కొత్తపల్లి సరళకుమారి



భర్త వెంకటకృష్ణవర్మ. తండ్రి యలమంచిలి అంకప్ప. జననం గుడివాడ తాలూకా కనుమూరు. యలమంచిలి వెంకటప్పయ్య గారి సోదరి. 16-1-1932న శాసనోల్లంఘనంలో అరెస్టు అయి. ఆరు మాసాల కఠిన శిక్షను వెల్లూరు కన్ననూరు జైళ్ళలో అనుభవించారు.

వార్ధాలో హిందీ శిక్షణ పొందారు. కస్తూరిబాయి ట్రస్టు తరఫున ఉపాధ్యాయినిగా 30ఏండ్లు పనిచేసి రిటైరయ్యారు.

## మైనేని బసవ పూర్ణమ్మాదేవి



తండ్రి కొత్తపల్లి కుటుంబయ్య. జననం 1908 గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా చాట్రగడ్డ. భర్త కోటయ్య. స్వగ్రామం రేపల్లె తాలూకా మైనేనివారిపాలెం. శాసనోల్లంఘనంలో పాల్గొని, 16-1-1932 నుంచి 6 నెలల కఠిన శిక్షను వెల్లూరు, కన్ననూరు జైళ్ళలో అనుభవించారు. తామ్రపత్ర గ్రహీత. ప్రస్తుత నివాసం విజయవాడ.

## చుక్కపల్లి మాణిక్యమ్మ



తండ్రి బొల్లినేని కోటయ్య; జననం 1919 గుంటూరు జిల్లా తెనాలితాలూకా కంచర్లపాలెం భర్త కోటయ్య. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని: 30-1-1941 నుంచి మూడు నెలల శిక్షను వెల్లూరు. కడలూరు జైళ్ళలో అనుభవించారు. తిరిగిక్విట్ ఇండియా ఉద్యమంలో గుంటూరులో పికెటింగ్ జరిపి, అరెస్టు అయ్యారు. 20 వారాలు సబ్ జైలులో నిర్బంధంలో వున్నారు, 30-9-1942 న మూడు నెలల కఠిన శిక్ష విధించారు. వెల్లూరులో జైలులో శిక్ష అనుభవించారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## మొవ్వ నాగయ్య



తండ్రి రామచంద్రయ్య. జననం 1916 గుంటూరుజిల్లా తెనాలి తాలూకాజంపని. 1933 జనవరి 26 న 144 సెక్షన్‌ను ఉల్లంఘించి, గుంటూరులో కరపత్రాలు పంచుతుండగా, పోలీసులు లాఠీఛార్జి జరిపి, అరెస్టు చేశారు, రు. 500 లు జరిమానా, 4 నెలల కఠిన శిక్ష విధించారు. జరిమానా చెల్లించ నిరాకరించి, అదనంగా యింకొక నెల – మొత్తం అయిదు నెలల కఠిన శిక్ష అనుభవించారు. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో, కాంగ్రెసు ప్రచారం చేస్తూ, ఢిల్లీ కి బయలుదేరి, నెలరోజులు కాలి నడకను ఒరిస్సాలోని రాయగడ్ వరకు వెళ్ళారు. క్విట్ ఇండియా ఉద్యమంలో, కోర్టుముందు పికెటింగ్ జరిపారు; [illegible]-11-1942 న సంవత్సరం ఆరుమాసాలు, కఠిన శిక్షను అలీపురం జైలులో అనుభవించారు. ప్రస్తుత నివాసం విజయవాడ.

## మహ్మద్ ఇస్మాయిల్



తండ్రి షేక్ మస్తాన్ సాహెబ్. తెనాలి వాస్తవ్యులు. ఖద్దరు వ్యాపారి. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. 24-6-1930 న 18 నెలలు కఠినశిక్ష విధించగా రాజమండ్రి, తిరుచిరాపల్లి, అలీపురంజైళ్ళలో శిక్ష అనుభవించారు. గాంధీ ఇర్విన్ ఒప్పందంతో 14-3-31 న విడుదల అయ్యారు. తిరిగి1932 శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొనగా 21-2-1941 నుంచి 3 నెలల శిక్ష, రు. 150 జరిమానా విధించారు, జరిమానా వసూలు చేశారు. రాజమండ్రి సెంట్రల్ జైలులో శిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నందుకు 3-9-1942 నుంచి 9-10-1943 వరకూ వెల్లూరు సెంట్రల్ జైలులో డిటెన్యూగా వున్నారు. 1948 లో కీర్తిశేషులయ్యారు. కొంతకాలంవిజయవాడలోవున్నారు

విచారణలో వున్న ఖైదీగా వున్నారు. ఇండియన్ యూనియన్‌లో హైద్రాబాద్ స్టేట్ విలీనం కావాలనే ఉద్యమంలో పాల్గొన్నందున 1-12-47న సంవత్సరం న్నర శిక్ష విధింపబడింది. వరంగల్, నిజామాబాద్ జైళ్ళలో శిక్ష ననుభవించారు.

## గుత్తికొండ లక్ష్మమ్మ

కృష్ణాజిల్లా నివాసి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆరునెలల శిక్ష, రు. 200/- జరిమానా విధించారు.

## గొట్టిపాటి వెంకటేశ్వరరావు

కృష్ణాజిల్లా నివాసి. 1932 న శాసనోల్లంఘ నోద్యమంలో పాల్గొని అరెస్టు అయ్యారు 19-2-1932 న గుడివాడ పోలీసు స్టేషన్‌లో లాఠీదెబ్బలకు గురయ్యారు.

## గొర్రెపాటి వెంకటరామయ్య

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. 8-2-1930 న బందరుకు మద్రాస్ గవర్నర్ వచ్చినపుడు నల్లజెండాల ప్రదర్శనలో పాల్గొన్నారు. అరెస్టయ్యారు.

## చలమలశెట్టి చెన్నయ్య

కృష్ణాజిల్లా నివాసి. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీఛార్జీకి గురయ్యారు

## చావ రామూర్తి

కృష్ణాజిల్లా నివాసి. 1932 శాసనోల్లంఘనంలో పాల్గొని, లాఠీఛార్జీకి గురయ్యారు.

## చిలుకూరి పుల్లయ్య

కృష్ణాజిల్లా నివాసి. క్విట్ ఇండియా ఉద్యమంలో రైలు పటాల పీకివేత చర్యకు గాను అరెస్టు అయి, శిక్ష అనుభవించారు.

## చోడవరపు విశ్వేశ్వరరావు

కృష్ణాజిల్లా నివాసి. 1921 నాగపూర్ కాంగ్రెస్ తీర్మానానుసారం సంవత్సరంపాటు తన న్యాయవాద వృత్తిని విసర్జించారు

## జి. ఆదినారాయణ

కృష్ణాజిల్లా నివాసి. 8-2-1930 న బందరులో అప్పటి మద్రాసు గవర్నరు రాక సందర్భంగా జరిపిన అసమ్మతి ప్రదర్శనలో పాల్గొని. అరెస్టు అయి, జైలులో నిర్బంధించబడ్డారు.

## టి. అంజనేయులు

కృష్ణాజిల్లా నివాసి. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. డి ఐ.ఆర్. క్రింద కోర్టు లేచే వరకు శిక్ష విధించారు.

## టి. ఎస్. రామకృష్ణారెడ్డి

కృష్ణాజిల్లా నివాసి. 1941 వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆరునెలల కఠినశిక్ష విధించారు.

## టి. ఎస్. వి. నారాయణ

కృష్ణాజిల్లా నివాసి. శాసనోల్లంఘనంలో పాల్గొన్నారు. లాఠీఛార్జికి గురయ్యారు. ఆరునెలల కఠిన శిక్ష, రు. 200 జరిమానా విధించారు

## తుర్లపాటి సత్యనారాయణ

కృష్ణాజిల్లా నివాసి. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నందుకు 17-5-30 న నాల్గు నెలల కఠిన శిక్ష విధించబడింది వ్యష్టి సత్యాగ్రహం చేశారు. 1941లో కో లేచే వరకు శిక్ష. రు. 200 జరిమానా, జరిమానా చె ంచని పక్షంలో మూడువారాల కఠిన శిక్ష విధించ బ ంది.

## తొట్టాది శ్రీరాములు

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. 1930 ఉప్పుసత్యాగ్రహంలో 5 నెలల శిక్ష ననుభవించారు.

## వర్జి రాములు

కృష్ణాజిల్లా నివాసి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, 10-6-1930 నుంచి తొమ్మిది నెలల కఠిన శిక్షను అనుభవించారు.

## దర్మాల నరసయ్య

తండ్రి కోటయ్య. కృష్ణాజిల్లా నివాసి. రైతు. నైజాం వ్యతిరేక పోరాట కాలంలో, 13-2-1948 నుంచి 21-9-1948 వరకు వరంగల్లు సెంట్రల్ జైలులో కఠిన శిక్ష అనుభవించారు.

### దండిప్రోలు సన్యాసి

కృష్ణాజిల్లానివాసి. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొని లాఠీచార్జీ చేయబడ్డారు.

### దండిప్రోలు సోమయ్య

కృష్ణాజిల్లా నివాసి. 1932 శాసనోల్లంఘనోద్య మంలో పాల్గొన్నారు లాఠీఛార్జీకి గురిఅయ్యారు

### వెందుకూరి శ్రీరామమూర్తి

కృష్ణాజిల్లా నివాసి ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 21-6-30 న రెండేళ్ళ కఠిన శిక్ష విధించ బడింది.

### దేసిరాజు వెంకటలక్ష్మీ నరసింహారావు

తండ్రి శోభనాద్రి. గుడివాడ తాలూకాలో జన్మిం చారు. నటుడు. 1921 సహాయ నిరాకరణోద్యమ కాలంలో ఇంటర్మీడియట్ చదువుకు స్వస్తి చెప్పారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొన్నారు: 7-3-41 నుండి 4 నెలల కఠినశిక్షను అనుభవించారు. రు 100 జరి మానాను చెల్లించారు. రాజమండ్రి. అలీపురం జైళ్ళలో శిక్షను అనుభవించారు. 1942 క్విట్ ఇండియా ఉద్య మంలో పాల్గొన్నారు. కీర్తిశేషులు.

### ధనికొండ వెంకట సుబ్బారావు

శ్రీరంగపురం వాస్తవ్యులు. 1920-21 సహాయ నిరాకరణోద్యమంలో గ్రామోద్యోగి పదవికి రాజీనామా చేశారు.

### పండ్రాజు జగన్మోహనరావు

కృష్ణాజిల్లా నివాసి. 1942 క్విట్ ఇండియా ఉద్య మంలో రైలు పట్టాల పీకివేత తంతి తీగెల త్రెంచి వేత కార్యకలాపాలలో పాల్గొన్నందుకు అరెస్టుచేసి, శిక్ష విధించారు.

### ప్రసంగి వెంకట రంగయ్య

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో మద్యపాన నిషేధ ప్రచారాన్ని తీవ్రంగా సాగించారు.

### పిరాట్ల వెంకట రామారావు

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 14-6-30 న రెండేళ్ళ కఠిన శిక్ష విధించబడింది.

### పిల్లలమర్రి సుబ్రహ్మణ్యం

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. 1921 సహాయ నిరాకరణ ఉద్యమంలో ప్రభుత్వ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చారు.

### పెద్దిభొట్ల సీతారామశర్మ

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. ఉప్పు సత్యాగ్రహ సంద ర్భంగా 26-6-30న ఒక సంవత్సరం కఠినశిక్ష విధించ బడింది

### పెనుమచ్చ రత్నమ్మ

1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు.

### పైనూరి సుబ్రహ్మణ్యం

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నందుకు 14-6-1930 న రెండేళ్ల కఠిన శిక్ష విధించబడింది.

### బి. వెంకటప్ప

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. యుద్ధ వ్యతిరేక ప్రచార పత్రాలను కలిగి వున్నందుకుగాను 1941 లో 9 నెలల కఠిన శిక్ష విధించబడింది.

### బి. జోసెఫ్

కృష్ణాజిల్లా నివాసి. మాజీ హైదరాబాద్ సంస్థానంలో నైజాం వ్యతిరేక పోరాట కాలంలో నిషేధించబడిన 'జన్మభూమి' పత్రిక ప్రతిని కల్గి వున్నందుకు 1947-48 మధ్య డి. హెచ్ ఆర్. క్రింద నెల రోజుల శిక్షను విధించారు.

### బులుసు లక్ష్మీపతి

కృష్ణాజిల్లా నివాసి. 1930-32 సత్యాగ్రహ వుద్యమంలో అరెస్టు అయి శిక్ష అనుభవించారు.

### భైరవభొట్ల వెంకట సుబ్బారావు

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. 1920-21 సహాయ నిరా కరణోద్యమంలో న్యాయవాద వృత్తిని వదలి వేశారు.

## ముక్తేవి సీతారామానుజాచార్యులు

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. బందరులో మద్రాసు గవర్నరు రాక సందర్భంగా 8-2-31న నల్లజెండాలు చూపినందుకు అరెస్టు చేయబడ్డాడు.

## మూల్పూరి లక్ష్మయ్య

కృష్ణాజిల్లా నివాసి. శాసనోల్లంఘనంలో 17-3-32న బందరులో పికెటింగ్ చేసి లాఠీ దెబ్బలు తిని. అరెస్టు అయ్యారు.

## మొండెం రాజారావు

కృష్ణాజిల్లా నివాసి. 194' క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు.

## మేదరమెట్ల సీతారామయ్య

తండ్రి లక్ష్మయ్య. పిన్న వయస్సులోనే శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 11-6-30న రెండేళ్ల కఠిన శిక్ష విధించబడింది. తంజావూర్ బోర్స్టల్ స్కూలులోను. రాజమండ్రి జైలులోను శిక్షననుభవించారు. 18-2-1931 విడుదలయ్యారు.

## యల్. వెంగయ్య

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. 26-10-42 న విజయవాడలో మూడేండ్ల శిక్ష విధించబడింది. చిలకలపూడి సెషన్స్ జడ్జి రెండేళ్లకు శిక్షను తగ్గించారు. అలీపురం క్యాంప్ జైల్లో శిక్షను అనుభవించారు

## యస్. వెంకట రామిరెడ్డి

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొనగా. లాఠీఛార్జీకి గురిఅయ్యారు.

## యస్. వెంకటరామయ్య

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్నారు. 19-4-32న కైకలూరులో పోలీసులు తీవ్రంగా లాఠీఛార్జిచేసి స్పృహతప్పి వున్న స్థితిలో గుడివాడ వద్ద వదలిపెట్టి వెళ్ళారు.

## యలమంచిలి సత్యవతమ్మ

కృష్ణాజిల్లా నివాసి. 1932 శాసనోల్లంఘనోద్యమంలో ఎలమర్రులో విదేశీ వస్త్రాలను పోగుచేసి తగులపెట్టారు. గుడివాడలో అరెస్టు చేసి శిక్ష విధించారు.

## యక్కల పూర్ణమ్మ

కృష్ణాజిల్లా నివాసి. శాసనోల్లంఘనోద్యమంలో 1-3-1932 న పికెటింగ్‌లో పాల్గొని. అరెస్టు అయ్యారు. దూర ప్రాంతానికి తీసుకువెళ్ళి. వదిలివేశారు.

## యెల్లే పెద్ది సుబ్రహ్మణ్యం

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. శాసనోల్లంఘన ఉద్యమంలో 20-4-32న బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా కరపత్రాలు పంచారు. అరెస్టు అయ్యారు. తీవ్రంగా లాఠీఛార్జికి గురయ్యారు

## రుద్రరాజు సూరపరాజు

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో లాఠీచార్జికి గురిఅయ్యారు.

## రుద్రరాజు వెంకట కృష్ణంరాజు

కృష్ణాజిల్లా నివాసి. జాతీయ పోరాటంలో పాల్గొన్నారు. లాఠీఛార్జికి గురిఅయ్యారు సంవత్సరం కఠిన శిక్ష రు. 100 జరిమానా విధించబడింది.

## వల్లభనేని లక్ష్మణరావు

కృష్ణాజిల్లా నివాసి. శాసనోల్లంఘన కాలంలో. 19-3-1932 న బందరులో విదేశీ వస్త్రాలయాల ముందు పికెటింగ్‌చేసి. లాఠీదెబ్బలు తిని అరెస్టు అయ్యారు.

## వారణాసి సూర్యనారాయణ

కృష్ణాజిల్లా నివాసి. 1932 శాసనోల్లంఘనోద్యమంలో లాఠీ ఛార్జీకి గురిఅయ్యారు.

## వారణాసి సీతమ్మ

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. 1932 శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొన్నారు. 3 నెలల శిక్ష ననుభవించారు.

## విశ్వనాథుని లక్ష్మీ నరసింహశర్మ

కృష్ణాజిల్లా నివాసి ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు 28-5-1930 న 18 నెలల కఠిన శిక్ష విధించారు

## వుప్పలూరి వెంకటకృష్ణయ్య

కృష్ణాజిల్లా వాస్తవ్యులు విరివిగా ఖాదీ ప్రచారం చేశారు. గుణదల ఖాదీ సంస్థకు రు. 21 000 దానమిచ్చారు.

## వేమా వెంకట దుర్గామల్లిఖార్జునశర్మ

తండ్రి వెంకటరాయుడు. రైతు. విద్యార్థి దశలోనే సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నారు. రాజమండ్రి, కోయంబత్తూరు, అలీపురం జైళ్ళలో 26-5-30నుండి 1-11-1930 వరకు శిక్ష ననుభవించారు.

## వేములపల్లి అంజనేయులు ఉరఫ్ హనుమంతరావు

కృష్ణాజిల్లా నివాసి. రైతు. మునగాల జమీందారీ వ్యతిరేక పోరాటంలో ప్రముఖపాత్ర వహించి. అరెస్టు అయ్యారు. సంవత్సరం శిక్ష విధించి, మూడు నెలల అనంతరం విడుదల చేశారు మద్రాను కుట్ర కేసులో అరెస్టుఅయి, పోలీసు కస్టడీ నుంచి తప్పించుకొని, హనుమంతరావు పేరుతో అజ్ఞాత వాసం గడిపారు. కమ్యూనిస్టు పార్టీలో చేరారు.

## వేమూరి శివరామకృష్ణారావు

కృష్ణాజిల్లా వాస్తవ్యులు. 8-2-30 న బందరుకు గవర్నరు రాక సందర్భంగా నిరసనగా నల్లజెండాలను ప్రదర్శించారు. వీరిని రోడ్డుమీదనే పోలీసులు ఆపివేశారు.

## వెంట్రప్రగడ మాధవరావు

కృష్ణాజిల్లా నివాసి. 1932 శాసనోల్లంఘనంలో లాఠీ దెబ్బలు తిన్నారు.

## వై. మధుసూదనరావు

కృష్ణాజిల్లా నివాసి. 1941లో యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసి, డి.ఐ.ఆర్. క్రింద అరెస్టు అయ్యారు. రు. 50/- జరిమానా విధించారు.

## సారంగపాణి

తండ్రి నల్లపరెడ్డి. కృష్ణాజిల్లా నివాసి. అనాటి హైదరాబాద్ స్టేట్‌లో పౌరహక్కుల ఉద్యమంలో పాల్గొన్నందుకుగాను 2-4-1939 నుండి 16-8-39 వరకు గుల్బర్గా జైలులో శిక్షననుభవించారు.

## సి.హెచ్. రాఘవయ్య

కృష్ణాజిల్లా నివాసి. 1930-32 శాసనోల్లంఘనోద్యమంలో ఆరు నెలల జైలు శిక్ష అనుభవించారు.

## తోట రామలింగేశ్వరరావు



తండ్రి వీరరాఘవయ్య. జన్మస్థలం బందరు తాలూకా చిలకలపూడి క్విట్ ఇండియా ఉద్యమంలోపాల్గొన్నారు. 29-4-1944న రెండు వారాల శిక్ష. రు 100/- జరిమానా విధించారు. జరిమానా చెల్లించ నిరాకరించి. మొత్తం మూడువారాలు 29-4-1944 నుంచి 20-5-1944 వరకు బందరు సబ్ జైలులో శిక్ష అనుభవించారు.

## గుడిసేవ వెంకటసుబ్బారావు



తండ్రి శీతయ్య. జన్మస్థలం బందరు తాలూకాచిలకలపూడి వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని, అరెస్టు అయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమంలోపాల్గొన్నారు. రెండువారాల జైలుశిక్ష, రు 100/-జరిమానా విధించారు. జరిమానా చెల్లించ నిరాకరించి, మొత్తం మూడువారాలు 29-4-1944 నుంచి 20-5-1944 వరకు బందరు సబ్ జైలులో శిక్ష అనుభవించారు.

## సూరంపూడి కనకరాజు

కృష్ణాజిల్లా నివాసి. 1920-21 సహాయ నిరాకరణంలో తన ఉపాధ్యాయ పదవికి రాజీనామా చేశారు.

## శ్రీరాముల వెంకటేశ్వరరావు

తండ్రి అప్పలస్వామి. విద్యార్థి దశలోనే ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని 11-6-1930 నుంచి 3-12-1930 వరకు రాజమండ్రి, బళ్ళారి జైళ్ళలో కఠినశిక్ష అనుభవించారు.

---

సవరణ : 208పేజీ ఒకటవ కాలంలోని 3వ పేరును శ్రీ పెరంబుధూరి ఆనందరావుగా చదువుకోవాలి.

## మండలి వెంకట కృష్ణారావు



1926 ఆగస్టు 4 న కైకలూరు తాలూకా 'పల్లెవాడ' గ్రామంలో జన్మించారు. తండ్రి వెంకట్రామయ్య. పల్లెవాడ, భావదేవరపల్లి, అవనిగడ్డ పాఠశాలలో చదువుకున్నారు. 1941 వ్యష్టి సత్యాగ్రహ సమయంలో హైస్కూలు విద్యార్థిగా వుండగా రాజకీయాలలో ప్రవేశించారు. 1942 లో జాతీయ విద్యార్థి సంఘం అవనిగడ్డ శాఖకు అధ్యక్షులుగా వుండి, విద్యార్థులలో జాతీయ భావాలను పెంపొందించారు. అజ్ఞాత కార్యక్రమాలకు తోడ్పడ్డారు. 1944 లో కాంగ్రెస్‌పై ఆంక్షలు విధించినపుడు, దివితాలూకా కాంగ్రెస్ సమితి సంచాలకునిగా గ్రామ గ్రామాన ప్రచారం చేశారు. 1945 లో జిల్లా విద్యార్థి కాంగ్రెస్ కార్యనిర్వాహక కార్యదర్శిగా వుండి, విద్యార్థులను సమీకరించారు. ఆచార్య రంగాగారి అధ్వర్యాన ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి కాంగ్రెస్ పౌరసత్వ కళాశాల నడిపారు. డిచెన్షన్ వ్యతిరేకోద్యమానికి నాయకత్వం వహించిలాఠీచార్జీకి గురయ్యారు. 1957-62 లలో లోక్‌సభ సభ్యులు. శ్రీ పి. వి. నరసింహారావు మంత్రి మండలిలో సాంఘిక సంక్షేమ మంత్రిగాను, శ్రీ జలగం వెంగళరావు మంత్రిమండలిలో విద్యా సాంస్కృతిక వ్యవహారాల మంత్రిగానూ పనిచేశారు.

## అట్లూరి వెంకట సుబ్బారావు

జననం 1913 లో. తండ్రి కృష్ణయ్యగారు గన్నవరం తాలూకా ఆత్కూరు గ్రామ మున్సబ్. గాంధీజీ 1923 లో ఆంధ్రలో పర్యటించిన సందర్భంగా, ఆయనకు తండ్రికి తెలియకుండా పూలమాల వేశారు. అందుకు ప్రభుత్వం వీరి తండ్రిని మందలించింది. గాంధీజీ ప్రబోధాన్ని అనుసరించి హైస్కూలు విద్యకు స్వస్తి చెప్పారు. ఉప్పు సత్యాగ్రహ కాలంలోను, క్విట్ ఇండియా ఉద్యమ కాలంలోను ఉద్యమంలో పనిచేశారు. 42లో రహస్య జీవితం గడిపారు.

వీరి తల్లి వెంకాయమ్మగారి జ్ఞాపకార్థం 1977 లో కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘానికి రు 2,116 లు విరాళంగా ఇచ్చారు. ఇదిగాక ఏటా రు 1116 ల చొప్పున ఐదేండ్లుగా రు 5580 లు ఈ సంఘానికి విరాళంగా ఇచ్చారు. కృష్ణాజిల్లా స్వాతంత్ర్య సమర యోధులసంఘ శాశ్వత సభ్యులు. ఈ సంఘంద్వారా తుఫాను నిధికి రు 500 ఇచ్చారు.

## సూరపనేని అన్నపూర్ణమ్మ

తండ్రి పొట్లూరి వెంకయ్య. భర్త నాగయ్య. స్వగ్రామం విజయవాడ తాలూకా గరికపర్రు. శాసనోల్లంఘనంలో పాల్గొని,23-5-1932 నుంచి ఏడున్నర మాసాలు కఠిన శిక్షను వెల్లూరు జైలులో అనుభవించారు.

## పెర్నా శ్రీరామమూర్తి



కంచికచర్ల తాలూకా కంచల వాస్తవ్యులు. జననం 1923 ఆగస్టు 1. తండ్రి ఆ గ్రామంలోనే ప్రథమ ఉపాధ్యాయుడైన నరసింహం పంతులు.

విద్యార్థిగా ఉండగానే 1937 ఎన్నికల్లో కాంగ్రెస్ వలంటీరుగా పనిచేశారు. 1942 క్విట్‌ఇండియా ఉద్యమ కాలంలో బ్రిటిష్ వ్యతిరేక చర్యలకు అరెస్టు కావింపబడ్డారు. ఈ కారణంగా వీరి మెరిట్ స్కాలర్‌షిప్ రదుచేయబడింది. బందరులో విద్యార్థుల సభ ఏర్పాటు చేసినందుకు అరెస్టు చేయబడి అండర్‌ట్రయల్ ప్రిజనర్‌గా ఉన్నారు. తర్వాత రహస్య జీవితం గడిపారు. స్వాతంత్ర్యానంతరం ఉపాధ్యాయ ఉద్యమంలో బహుముఖ సేవలు గావించారు. తెలంగాణా పోరాట కాలంలో అప్పట్లో నిజాం ఆధీనంలో వున్న పరిటాల పోలీసు స్టేషనుపై దాడిచేసి ఆయుధాలు స్వాధీనం చేసుకొన్న జట్టులో వీరొకరు.

## పిన్నమనేని వెంకట నారాయణరావు



కృష్ణా జిల్లా విజయవాడ తాలూకా నెప్పల్లి గ్రామస్తులు. తండ్రి నరసయ్య. 1920, 21 సహాయ నిరాకరణోద్యమం సందర్భంగా ఆయన స్కూల్ ఫైనల్ చదువుతూ, చదువుకు స్వస్తిచెప్పారు.

1923 లో గాంధీజీ విజయవాడ వచ్చినప్పుడు జరిగిన సమావేశంలో పాల్గొన్నారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో వాలంటీరు. కృష్ణాజిల్లా ప్రథమ ఉప్పు సత్యాగ్రహ దళం గంపలగూడెం శ్రీ కుమార రాజాగారి నాయకత్వాన బందరు వెళ్ళినప్పుడు, ఆ దళానికి నెప్పల్లిలో వీరి పినతండ్రి పున్నయ్య గారితోబాటు భోజనాలుపెట్టి సత్కరించారు.

1929 లో గాంధీజీ ఆంధ్రదేశ పర్యటన సందర్భంగా నెప్పల్లి గ్రామంలో సభ జరిపి రు. 400/-లు విరాళం యిచ్చారు. కొద్దికాలం జిల్లా కాంగ్రెస్ సంఘ కార్యదర్శిగా పనిచేశారు. 1942 క్విట్ఇండియా ఉద్యమ సందర్భంగా రహస్యంగా పనిచేశారు. పలుసార్లు లాఠీఛార్జీలకు గురయ్యారు. రాష్ట్ర కాంగ్రెస్ సంఘం వీరికి రాజకీయ బాధితునిగా ధృవపత్రం ఇచ్చింది.

## మోదుమూడి శ్రీహరిరావు



తండ్రి సూర్య ప్రకాశరావు. దివి తాలూకా మోదుమూడి శివారు రామచంద్రాపురం. చిన్న వయసులోనే రాజకీయాల్లో ఆకర్షితులయ్యారు. 1939లో యుద్ధ వ్యతిరేక చర్యలకుగాను నూజివీడులో అరెస్టుచేసి బందరు సబ్‌జైల్లో పెట్టారు. అప్పటి జిల్లాకలెక్టర్ విచారించి వార్నింగ్ ఇచ్చి వదలిపెట్టారు. యుద్ధకాలంలో రహస్య జీవితం సాగించారు. కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగిన తర్వాత రాజకీయ జీవితాన్ని కొనసాగించారు. విద్యార్థి, కార్మిక ఉద్యమాలను నడిపారు.

## శ్రీ అట్లూరి సీతారామారావు



విజయవాడ తాలూకా కోలవెన్ను గ్రామంలో 26-9-1924లో జన్మించారు. హైస్కూలులో చదువుకొనే రోజుల్లోనే కాంగ్రెస్ వాలంటీరుగా పనిచేశారు. హైస్కూలు విద్యార్థి సంఘానికి కార్యదర్శిగా పనిచేశారు. 1940-41 సంవత్సరాలలో గుంటూరు హిందూ కాలేజి స్టూడెంట్ యూనియన్‌కు కార్యదర్శిగా వున్నారు.

జాతీయ నాయకున్ని అరెస్టు చేసినపుడల్లా, నిరసన సూచకంగా కాలేజీలను బహిష్కరించారు. 1937 ఎన్నికలలో కాంగ్రెస్ విజయానికి కృషి చేశారు.

పూనా లా కాలేజిలో చదువుతుండగా, 1942 క్విట్ఇండియా ఉద్యమం ఆరంభమయింది. అప్పుడు ఆయన చదువుకి స్వస్తిచెప్పి, రాజకీయ రంగంలోకి దుమికారు.

పాంచగనిలో గాంధీజీ ఉపవాసంచేస్తూ జీవన్మరణ స్థితిలో వుండగా, పూనాలో జరిగిన బ్రహ్మాండమైన నిరసన ప్రదర్శనలో పాల్గొన్నారు. తుపాకిగుండు పక్కకి దూసుకుపోగా ప్రాణాపాయం తప్పింది.

క్విట్ఇండియా ఉద్యమంలో రహస్యంగా పనిచేసి అన్నే అంజయ్యగారికి తోడ్పడ్డారు. (కృ. జి. స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర 50వ పేజీ చూడండి)

## మాగంటి మాధవరావు



పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు తా॥ చాటపర్రు గ్రామస్థులు. మాగంటి పెద సుబ్రహ్మణ్యం గారి కుమార్డు మాధవారావు. విద్యార్థిగా ఉండగా 1930 సత్యాగ్రహంలో పాల్గొన్నారు. వీరిని అరెస్టు చేసి 5-7-1930 తేదీన 3 సంవత్సరములు శిక్ష విధించి తంజావూరు బోర్స్టల్ స్కూలులోను రాజమంద్రి సెంట్రల్ జైలులోను ఉంచారు. వీరు 5-2-1931 తేదీన విడుదల చేయబడ్డారు. వీరు విజయవాడలో నివసించుచున్నారు.

## గారపాటి వెంకటేశ్వరరావు



15-1-1914 నగుడ్లవల్లేరులో పేదరైతు కుటుంబంలో జన్మించారు. విజయవాడలో స్థిరపడ్డారు. మద్రాసు కుట్రకేసులో నిందితుడైన కానూరి రామానంద చౌదరిగారికి రహస్య ఉద్యమంలో సహాయపడ్డారు.

## వీరమాచినేని మధుసూదనరావు

(జీవిత చరిత్రలు 239 వ పేజీ చూడండి)



## కాకుమాను లక్ష్మయ్య



(సమరయోధుల జీవిత చరిత్రలు 189 వ పేజీ చూడండి)

## కూనల పూర్ణచంద్రరావు



1929 లో గాంధీజీ ఆంధ్రలో పర్యటించినప్పుడు ఖద్దరు నిధికి వీరు రు.1116 ఇచ్చి గాంధీజీని తమ ఇంటికి తీసుకువెళ్లారు వివాహ సందర్భంగా గాంధీజీ ఆశీస్సులను పొందారు.

## అన్నె అంజయ్యగారి తల్లి రమణమ్మ



(స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర [తాలూకాల విశిష్టత.] లో 91 వ పేజీ చూడండి)

## వెల్లంకి పూర్ణచంద్రరావు



(జీవిత చరిత్రలలో 151 వ పేజీ చూడండి)

## చాపల వెంకటేశ్వరరావు



చాపల వెంకటేశ్వరరావు మొగల్‌రాజపురం (విజయవాడ) వాస్తవ్యులు. బెజవాడ ప్రెస్ వర్కర్స్ యూనియన్ ప్రథమ కార్యదర్శి. ఆంధ్రరాష్ట్ర ప్రెస్ వర్కర్స్ యూనియన్ కోశాధికారి, 1940లో యుద్ధ వ్యతిరేకంగా అఖిలభారత కమ్యూనిస్టు పార్టీచే రహస్య ముద్రాలయం స్థాపించబడింది. అందులో బ్రిటిష్ వ్యతిరేక సాహిత్యం ముద్రించబడింది. రహస్య స్థావరంలోనే వెంకటేశ్వరరావుగారు 1941 నవంబర్ 4వ తేదీన 32వ ఏట చనిపోయారు. గాలపింగ్ టి. బి. కి గురియై, వైద్య సహాయం చేసినా కోలుకోలేక మృతిచెందారు.

## గోళ్ళ రాధాకృష్ణమూర్తి

గోళ్ళ రాధాకృష్ణమూర్తి తండ్రి నారాయణరావు. వయస్సు 70 సంవత్సరాలు. బి. ఎ. బి. ఎల్. నివాసం విజయవాడ. మద్రాస్‌లో 1937 నుండి విద్యార్థి ఉద్యమంలో పని చేశారు. 1938–39 సంవత్సరాలలో మద్రాస్ సాహుకార్ పేట కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులుగా పనిచేశారు. 1939లో 2 వ ప్రపంచ యుద్ధకాలంలో యుద్ధానికి వ్యతిరేకంగా రహస్యంగా ఉండి పని చేశారు. 1940లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. మద్రాస్‌లో 1942లో అరెస్టు చేసి వెల్లూరు జైలులో డిటెన్యూగా ఉంచబడ్డారు. కొద్ది నెలల తరువాత విడుదలయ్యారు. విడుదల అనంతరం ప్రజాశక్తి దినపత్రిక జనరల్ మేనేజరుగా పనిచేశారు. 1946లో తిరిగి అరెస్టుచేసి డిటెన్యూగా జైలుకు పంపబడ్డారు. 6 మాసములు జైల్లో ఉన్నారు. 1948–1949లలో తెలంగాణా ఉద్యమంలో పనిచేస్తూ రహస్య జీవితం గడిపారు.

## వాసిరెడ్డి శివలింగ ప్రసాద్



గుంటూరు జిల్లా చినపాలెం వాస్తవ్యులు. కొన్నేళ్ళుగా కృష్ణాజిల్లా నందిగామలో ఉంటున్నారు. తండ్రి సీతారామయ్య.

1937లో రెడ్డినాయుడు ప్రభుత్వం నిషేధించిన కొత్తపట్నం రాజకీయ పాఠశాలకు పబ్లిసిటీ ఆఫీసరు. రాజద్రోహ ఉపన్యాసం ఇచ్చారని ఒక సంవత్సరం శిక్ష విధించారు. రాజగోపాలాచారి మంత్రివర్గం ఏర్పడిన తర్వాత విడుదలయ్యారు. యుద్ధకాలంలో 5–10–40 నుండి 25–6–42 వరకు వెల్లూరు జైలులో డిటెన్యూగా ఉన్నారు. రైతు ఉద్యమంలో కృషి చేశారు.